

సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజీ
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి
గురు వివేకానంద
గురు సాయి బాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళస్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

నన్ను "నేను" తెలుసుకోవటానికి
నన్ను "నేను" మార్చుకోవటానికి
"నేను" గా ఉండటానికి
మరియు అత్యుత్తమ జీవన విధానానికి
కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదవిజ్ఞానం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్ధం మహానుభావులైన మొదలి వెంకట సుబ్రహ్మణ్యం గారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
2) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
3) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement
4) ఆండ్రాయిడ్ మొబైల్ ఆప్ : https://play.google.com/store/apps/details?id=free.telugu.bhakti.books

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో మొదలి వెంకట సుబ్రహ్మణ్యం గారి సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, ఓజసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# BhagavadGita

in

Telugu by



Sri. M.V.Subrahmanyam,B.A.,B.G.L.,
Former Registrar AP High Court,
2-31 Chaitanyapuri Colony,
Hyderabad 500060
South India
Phone No.24048104
Mobile: 9866140619

# భగవద్గీత

( సరళమైన తెలుగులో)



రచన:


మొదలి వెంకట సుబ్రహ్మణ్యం

రిటైర్డు రిజిస్ట్రార్ ఆంధ్రప్రదేశ్ హైకోర్టు

2-31, చైతన్యపురి, హైదరాబాద్ 500060

లాండ్‌లైన్ 040-24048104 సెల్ 9866140619

# తొలిపలుకు

భగవద్గీత అందరూ  అనుకుంటున్నట్టు హిందూ మతానికి మాత్రమే చెందిన గ్రంథము కాదు. అది లోకైక మతగ్రంథము. సమస్తమానవాళి అనుసరించ వలసిన నియమములు గురించి చెప్పిన మహత్ గ్రంథము. సర్వకాలములయందు, సర్వఅవస్థలయందు సకల ప్రాంతముల యందు ఆచరించవలసిన నియమ నిబంధనల గురించి బోధించిన అమూల్య గ్రంథము. భగవద్గీత ఏ ఒక్క దేశానికో, ప్రాంతానికో పరిమితం కాదు. మానవాళి అందరూ ఆచరించవలసిన నియమావళి.

ఎటువంటి దు:ఖములో ఉన్నా, ఆ దు:ఖము నన్ను అంటకుండా ఉండటానికి కారణము భగవద్గీత అని అన్నారు మహాత్మాగాంధీ.

ప్రపంచ సాహిత్యంలో భగవద్గీతకు సాటిరాగల గ్రంధము మరొకటి లేదు. అని అన్నారు బాలగంగాధర తిలక్.

సంసార సాగరమును దాటడానికి ఒక నావ వంటిది భగవద్గీత అని అన్నారు. పూజ్యులు మళయాళ స్వామి వారు.

విశ్వవాఙ్మయంలో భగవద్గీతను పోలిన గొప్ప గ్రంధము మరొకటి లేదు అని అన్నారు స్వామి శివానంద సరస్వతి.

ఇటువంటి గ్రంధరాజము మన భారత దేశమునకు చెందినది కావడం మన అదృష్టం. ఎడ్విన్ ఆర్నాల్డు అనే పాశ్చాత్య పండితుడు గీత పట్ల ఆకర్షితులై దానిని ఆంగ్లంలోకి అనువదించాడు.

గీత సాక్షాత్తు పరమాత్మ అవతారమగు శ్రీకృష్ణుడు అర్జునునకు ఉపదేశించిన యోగశాస్త్రము, ఉపనిషత్ సారము. శ్రీకృష్ణుని వంటి గురువు, అర్జునుని వంటి శిష్యుడు ఈ అనంత విశ్వంలో మరొకరు లేరు అనడంలో అతిశయోక్తిలేదు. వీరి సంభాషణను వ్యాసమునీంద్రులు అక్షరబద్ధం చేసి మనకు అందించారు.

గీతలు ఎన్నో ఉన్నాయి. అష్టావక్రగీత, అవధూతగీత, ఋభుగీత, వసిష్టగీత, హనుమద్గీత,

శివగీత, హంసగీత, కపిలగీత, ఇంకా ఎన్నో గీతలు ఉన్నాయి. కానీ భగవద్గీతకు ఉన్న ప్రాశస్త్యము ఆ గీతలకు లేదు. గీత ఉపనిషత్తుల సారము. ఉపనిషత్తులు ఆధ్యాత్మిక వాఙ్మయములో విశిష్ఠస్థానమును సంపాదించుకొన్నాయి. వేదములు అనే చెట్టుకు కాచిన ఫలములే ఉపనిషత్తులు. ఆ ఉపనిషత్తుల సారమును తెలుసుకొనవలెనని ప్రతి ముముక్షువు కోరుకుంటాడు. కాని ఉపనిషత్తులను చదవడం అర్థంచేసుకోవడం చాలా కష్టము. ఈ ఉపనిషత్తులు సారమంతటినీ భగవద్గీతలో నింపి మనకు అందించాడు వ్యాసుడు. ఉపనిషత్తులు గోవులు అయితే అర్జునుడు ఆవు దూడ. గోపాలుడు అయిన శ్రీకృష్ణుడు ఆవుపాలు అనే గీతను పిదికి మనకు అందించాడు. అందుకే గీతామృతము అని అన్నారు.

ఉపనిషత్తులు, భగవద్గీత, బ్రహ్మసూత్రములు, ఈ మూడు ప్రస్థాన త్రయము అని అంటారు. భగవద్గీతలో ఎన్నో ఆధ్మాత్మిక విషయములు, ధర్మసూక్ష్మములు ఇమిడి ఉన్నందున ఇది ప్రస్థాన త్రయములో ఒకటిగా వెలుగుతూ ఉంది.

ఈ గీత ద్వాపర యుగాంతంలో అంటే కలియుగ ప్రారంభం కాక ముందు చెప్పబడింది. కలియుగంలో ధర్మము క్షీణిస్తుందనీ, ఒంటి పాదంతో నడుస్తుందనీ తెలిసి, రాబోవు కలియుగంలో మానవులను ఉద్ధరించడానికి భగవానుడు గీతను అర్జునుడికి ఉపదేశించాడు. లేకపోతే ఎన్నో అవతారములను ఎత్తిన పరమాత్మ గీతను, కృతయుగములోనో, త్రేతాయుగములోనో లేక ద్వాపర యుగం మధ్యలోనో ఉపదేశించి ఉండేవాడు. అలా చేయకుండా మానవాళిని ఉద్ధరించడానికి గాను కలియుగ ప్రారంభంలో గీతమృతమును లోకానికి అందిచాడు పరమాత్మ. కలియుగములో మానవులకు కలగబోయే శోకమును అంతమొందించడానికి గీత ఎంతగానో ఉపయోగపడుతుంది. గీతను ఎవరెవరు చదవాలి అనే సందేహము వచ్చినపుడు, ఈ సంసార సాగరంలో ఈదులాడుతున్న ప్రతివారూ చదువ తగినది గీత అని చెప్పవచ్చును. సంసార సాగరంలో మునిగిపోతున్న మానవులకు గీత ఒక నావలాగా ఉపయోగపడి వారిని ఒడ్డుకు చేరుస్తుంది.

ఆధునిక శాస్త్ర విజ్ఞానం మనకు ఎన్నోసౌకర్యాలు కలిగించింది. సుఖంగా జీవనం గడపడానికి ఎన్నో వసతులు చేకూర్చింది. వేగంగా ప్రయాణం చేయడానికి, సుఖంగా ప్రయాణం చేయడానికి సాధనాలు సమకూర్చింది. ఇన్ని సుఖాలు, భోగభాగ్యాలు ఉన్నా మానవుడు నిరంతరం ఏదో వెలితితో బాధపడుతున్నాడు. ఉన్నది చాలదు, ఈ సుఖం కాదు, ఇంకా ఏదో కావాలి అనే మోహంలో పడుతున్నాడు. తన మనస్సు అల్లకల్లోలం చేసుకుంటున్నాడు. ఈ రోజుల్లో ఎంతో ధనం, హెూదా, భోగభాగ్యాలు ఉన్నా మానసిక శాంతి లేక, ప్రశాంతత లేక ఎంతోమంది బాధపడుతున్నారు. దానికి కారణం వారి అవిద్య. ఈ అవిద్య పోవాలంటే ఉపనిషత్తుల సారం అయిన భగవద్గీతను అధ్యయనం చేయడం ఒకటే మార్గం. మరొక మార్గం లేదు.

ఈ లోకంలో కేవలం కర్మయోగులు, జ్ఞానయోగులు, భక్తిని నమ్ముకున్నవారు, యోగమార్గమును అవలంబించినవారు, ఎంతో మంది ఉన్నారు. వారందరూ తాము అనుసరించే మార్గము మాత్రమే మంచిది అనీ, గొప్పది అనీ, మిగిలిన మార్గములు చెడ్డవి అనుసరించరానివి అనీ వాదిస్తుంటారు. వారి వారి వాదములకు బలం చేకూర్చడానికి ఎన్నో ప్రమాణాలు చూపిస్తుంటారు. కానీ భగవద్గీతలో అన్ని మార్గములను సమన్వయం చేసి, ఆ మార్గాలన్నీ మంచివే, ఏ మార్గం అనుసరించినా పరమాత్మను చేరుకోవడమే అంతిమలక్ష్యం అని నిరూపించాడు పరమాత్మ.

గీతను కేవలం అధ్యయనం చేయడమే కాదు, దానిని ఆచరించాలి అని అందరూ తెలుసుకోవాలి. చిత్తములో రజోగుణము, తమోగుణము పేరుకొనిపోయి ఉంటే, ఎన్ని పూజలు, వ్రతాలు, యజ్ఞాయాగాలు చేసినా ప్రయోజనము లేదు, ముందు చిత్తములోని రజో,తమోగుణములను నాశనము చేసి సత్వగుణ ప్రధానం చేసుకోవాలి. తరువాత దానికూడా వదిలిపెట్టి పరమాత్మ తత్వము అయిన నిర్గుణత్వాన్ని అలవరచుకోవాలి అని బోధిస్తుంది గీత.

కేవలము భగవంతుని మీద భక్తి ఉంటే చాలదు. సాటి మానవుల మీద, సాటి ప్రాణుల మీద జాలి దయ, కరుణ కలిగి ఉండాలి అని బోధిస్తుంది గీత. అన్ని ప్రాణులలో పరమాత్మ ఆత్మస్వరూపుడుగా ఉన్నాడు, సాటి మానవులను ద్వేషిస్తే, సాటి ప్రాణులను హింసిస్తే, అది పరమాత్మను ద్వేషించినట్టు, హింసించినట్టు అవుతుంది అని నొక్కి చెప్పింది గీత.

మనస్సును ఎల్లప్పుడూ నిర్మలంగా ఉంచుకోవాలి. అప్పుడే లోపల ఉన్న ఆత్మసాక్షాత్కారం అవుతుంది అని గీతాబోధ. ద్వంద్వముల యందు సమాన దృష్టి కలిగి ఉండాలి. సుఖదు:ఖములను, జయాపజయములను, లాభనష్టములను సమంగా చూడగలిగి ఉండాలి. అప్పుడే మనసు ప్రశాంతంగా ఉంటుంది. నిర్మలంగా ఉంటుంది. మానవులలో ఉన్న అహంకారము, భేదభావము అన్ని అనర్థములకు మూలము. సమత్వమే ప్రశాంతతకు మూలము అని బోధిస్తుంది గీత.

ఈ విశ్వమంతా భగవంతుని స్వరూపము. పరమాత్మ అంతటా నిండి ఉన్నాడు. అన్ని ప్రాణులలో ఆత్మస్వరూపుడుగా చైతన్యస్వరూపుడుగా వెలుగుతున్నాడు. ఆ సత్యం తెలుసుకోలేని మానవుడు సాటి మానవుల మధ్య భేదభావము కల్పిస్తున్నాడు. రాగద్వేషములతో సతమతమౌ తున్నాడు. అదే అజ్ఞానము. ఆ అజ్ఞానమే అన్ని దు:ఖములకు మూలము. ఈ సత్యాన్ని బోధించినదే గీత.

భగవద్గీత మహాభారత ఇతిహాసములో భీష్మపర్వములో 25వ అధ్యాయము నుండి 42వ అధ్యాయము వరకు చెప్పబడింది. మహాభారతము 18 పర్వములు. భగవద్గీతలో ఉన్నవి 18 అధ్యాయములు. మహాభారత యుద్ధము జరిగినది 18 రోజులు. అందులో పాల్గొన్న సైన్యము

18 అక్షౌహిణీలు. ఒక అక్షౌహిణి అంటే

21870 ఏనుగులు (అన్నీ కూడితే 2+1+8+7+0=18)
21870 రథములు (అన్నీ కూడితే 2+1+8+7+0=18)
65610 గుర్రములు (6+5+6+1+0=18)
109350 సైనికులు (1+0+9+3+5+0=18)
మన దేహములో పది ఇంద్రియములు, ఐదు ప్రాణములు, మనస్సు, బుద్ధి, అహంకారము=18.
భగవద్గీతలో 700 శ్లోకాలు ఉన్నాయి. వాటిలో శ్రీకృష్ణుడు చెప్పినవి 574, అర్జునుడుచెప్పినవి 84, సంజయుడు చెప్పినవి 41, ధృతరాష్ట్రుడు చెప్పినది 1 మొత్తము 700. కొన్ని ప్రతులలో 701 ఉన్నాయి.

భగవద్గీతను కృష్ణుడు అర్జునుడికి ఎప్పుడు, ఏం సందర్భంలో, ఎక్కడ, ఏ సమయంలో, ఏమి ఆశించి చెప్పాడో తెలుసుకుందాము.

కృష్ణుడు తృప్తిగా భోజనం చేసిన తరువాత, తాంబూలం సేవిస్తూ, "అర్జునా! కులాసాగా భగవద్గీత చెప్పుకుందామా!" అని చెప్పలేదు. లేక వాహ్యాళికి వెళ్లినపుడు, తీరిక సమయంలో చెప్పలేదు. ధర్మానికి ప్రతిరూపం అయిన ధర్మరాజుకు చెప్పలేదు. పితామహుడు భీష్ముడికి చెప్పలేదు. నీతికోవిదుడు విదురుడికి చెప్పలేదు. కేవలం అర్జునుడికి మాత్రమే చెప్పాడు. అదీ యుద్ధం ఇంకాసేపట్లో జరగబోతుంది అనగా చెప్పాడు. అర్జునుడి మనసు సంఘర్షణలతో క్షుభితం అయినపుడు చెప్పాడు. తాను యుద్ధం చేయను అనే నిర్వేదం అర్జునుడిని ఆవహించినపుడు చెప్పాడు. "నాకు ఏమీ తోచడం లేదు. ఏ నిర్ణయమూ తీసుకునే శక్తి నాకు లేదు. నన్ను నీ శిష్యుడిగా స్వీకరించి నాకు కర్తవ్యం ఉపదేశించు" అని అర్జునుడు పూర్తి శరణాగతి అయిన తరువాత చెప్పాడు. "నానుశోచంతి" అనే పదంతో మొదలుపెట్టి "మాశుచ:" అనే పదంతో పూర్తిచేసాడు. అంటే ఏడవవద్దు అని అర్జునుడి కన్నీళ్లు తుడిచాడు.

మనలో కూడా అనునిత్యం మంచి చెడుల మధ్య జరిగే సంఘర్షణే భారతయుద్ధం. మంచి పాండవులు అయితే చెడు కౌరవులు. మనలో సంఘర్షణ తలెత్తినపుడు నివారణోపాయము చూపేది భగవద్గీత. మన కన్నీళ్లు తుడిచి ఏడవకు, ధైర్యంగా ఉండు అని వీపుతట్టి ప్రోత్సహించేది భగవద్గీత. భగవద్గీత పూజలో పెట్టుకొని పూజించే గ్రంధం కాదు. భగవద్గీత చదివితే పుణ్యం వస్తుందనీ, స్వర్గసుఖాలు ప్రాప్తిస్తాయనీ, సరాసరి మోక్షం వస్తుందనీ చదవకూడదు. భగవద్గీత కేవలం మోక్షానికి మార్గం చూపుతుంది. ఆ మార్గంలో నడవాల్సింది మనం. అందుకని విద్యార్థి దశనుండి భగవద్గీతను పాఠశాలలో ఒక పాఠ్యాంశంగా ప్రవేశ పెట్టాలి. కాలేజీలలో డిబెట్‌లు పెట్టాలి. ఒక పరిశోధనా అంశంగా పరిగణించాలి. ప్రతి విద్యార్థికీ ఒక పాఠ్యాంశంగా చేర్చి బోధించతగ్గది

భగవద్గీత. ప్రతి వాడిలో ధైర్యాన్ని, సైర్థాన్నినింపి వెన్నుతట్టి నిలబెట్టేది, ప్రోత్సహించేది భగవద్గీత.

కాని నేడు జరుగుతున్నది ఏమిటి. భగవద్గీతను ఘంటసాల గారు మృదుమధురంగా గానం చేస్తే దానిని శవాల దగ్గరా, శ్మశానాలలో పెడుతున్నారు. భగవద్గీత వినబడితే చాలు ఎవరో పోయినట్టు భావన కలిగిస్తున్నారు. ఈ దౌర్భాగ్యస్థితినుండి మనం బయట పడాలి. అందుకే ఈ చిన్ని ప్రయత్నం.

ఇప్పుడు మనం భగవద్గీత పూర్వాపరాలు పరిశీలిద్దాం. భరత వంశంలో ధృతరాష్ట్రుడు, పాండురాజు అనే ఇద్దరు అన్నదమ్ములు ఉన్నారు. వారు హస్తినాపురానికి అధిపతులు. పెద్దవాడు ధృతరాష్ట్రుడు పుట్టుగుడ్డి. ఆయన భార్య గాంధారి. పాండురాజు వీరుడు. అందుకే పాండురాజు హస్తినకు రాజయ్యాడు. పాండు రాజుకు ఇద్దరు భార్యలు, కుంతి,మాద్రి. పాండురాజు శాపవశాత్తు భార్యాసంగమానికి దూరం అయ్యాడు. భార్యలతో సహా అడవులకువెళ్లాడు. దుర్వాసుని మంత్రప్రభావంతో కుంతికి యుధిష్ఠిరుడు, భీముడు, అర్జునుడు అనే పుత్రులు, మాద్రికి నకుల సహదేవులు అనే కుమారులు కలిగారు. హస్తినలో గాంధారికి సుయోధనుడు, దుశ్శాసనుడు సహా నూర్గురు కుమారులు కలిగారు.

పాండవులు సత్వగుణ సంపన్నులు. సహనశీలురు. ధర్మపరులు. నలుగురు తమ్ములు అన్నమాట జవదాటరు. తల్లిమాటకు కట్టుబడి వారు ఐదుగురు పాంచాల రాజకుమారి ద్రౌపదిని వివాహం చేసుకున్నారు. దుర్యోధన, దుశ్శాసనులు మొదలగు కౌరవులు మొదటి నుండి తమ దాయాదులు పాండవుల మీద ద్వేషం పెంచుకున్నారు. దుర్యోధనుడు పరమలోభి. ఎదుటి వారి ఉన్నతిని చూచి సహించలేడు. అసూయ, ద్వేషము, దురభిమానము, గర్వము అతని సహజ లక్షణములు. తన మాటే చెల్లాలనే తత్వం. అంతా నాకే కావాలనే దురాశ.

సహజంగానే దాయాదుల మధ్య రాజ్యాధిపత్యం కోసం పోరు మొదలయింది. రాజ్యవిభజన జరిగింది. పాండవులకు ఎందుకూ పనికిరాని ఖాండవప్రస్థం ఇచ్చారు. వారు దానిని ఇంద్రప్రస్థంగా మార్చుకున్నారు. రాజసూయ యాగం చేసారు. ధర్మరాజు చక్రవర్తి అయ్యాడు. అది చూచి ఓర్వలేకపోయాడు సుయోధనుడు. వారి రాజ్యం ఎలాగైనా కాజేయాలని అనుకున్నాడు. దానికి తన మేనమామ, కుటిలుడు, అయిన శకుని సాయం తీసుకున్నాడు. ద్యూత క్రీడకు పాండవులను ఆహ్వానించాడు. ఓడించాడు, అవమానించాడు, వారినే కాదు వారి భార్య ద్రౌపదిని కూడా నిండు సభలో అవమానించాడు. రాజ్యం అపహరించి అడవులకు పంపించాడు.

అరణ్యవాసానంతరము పాండవులు తిరిగివచ్చి తమ రాజ్యం తమకు ఇమ్మని అడిగారు. ద్రుపద పురోహితుని, శ్రీకృష్ణుని, రాయబారం పంపారు. అటునుండి సంజయుని, ఉలూకుని రాయబారం పంపారు. ఎవరి వాదన వారిది. చేతనైతే యుద్ధం చేసి తీసుకోండి కానీ సూదిమొన

మోపినంత కూడా ఇవ్వను అని ఖరాఖండిగా చెప్పాడు దుర్యోధనుడు. ఆ విధంగా యుద్ధం అనివార్యం అయింది. శ్రీకృష్ణుని సేనలు దుర్యోధనుడికి, శ్రీకృష్ణుడు అర్జునుడికి దక్కారు. అర్జునుడికి సారథిగా ఉండటానికి అంగీకరించాడు శ్రీకృష్ణుడు.

లోకంలో ఉన్న రాజులంతా రెండు పక్షాలుగా విడిపోయారు. పాండవులు వారి మిత్రపక్ష రాజుల సైన్యం ఏడు అక్షౌహిణీలు అయితే, కౌరవులు వారి మిత్రరాజుల సైన్యం పదకొండు అక్షౌహిణీలు. కురుపాండవులకు యుద్ధం జరగబోతోంది అని తెలిసి వ్యాసుడు ధృతరాష్ట్రుని వద్దకు వచ్చాడు. యుద్ధం చూస్తావా, దివ్యదృష్టి ఇస్తాను అని అడిగాడు వ్యాసుడు. ఇక్కడ మరొక చిక్కుకూడా ఉంది. ధృతరాష్ట్రుడు పుట్టు గుడ్డి. అతడు తన కుమారులనే గుర్తుపట్టలేడు. ఇంక పాండుకుమారులను ఎలా గుర్తు పట్టగలడు. ఎవరు ఎవరిని చంపుతున్నారో తెలియదు. కాబట్టి ధృతరాష్ట్రునికి దివ్యదృష్టి ఇచ్చినా ప్రయోజనం లేదు. ఈ విషయం దాచి పెట్టి, అన్నదమ్ములపోరు, వారి చావులు చూచి తట్టుకోలేను అన్నాడు గుడ్డిరాజు. యుద్ధ విశేషాలు చెబితే వినాలని ఉంది అని అన్నాడు. వ్యాసుడు ఆ పనికి సంజయుని నియమించాడు. సంజయునికి ఇతరుల మనసులలోకి దూరి వారి మనోభావాలు తెలుసుకునే శక్తి, ఎక్కడికైనా మనోవేగంతో పోయే శక్తి, యుద్ధరంగంలో తిరుగుతున్నా ఎటువంటి అస్త్రశస్త్రములు తగలకుండా ఉండే శక్తిని ప్రసాదించాడు. యుద్ధం అంతా చూచి వచ్చి ధృతరాష్ట్రునికి చెప్పమని ఆదేశించాడు. సంజయుడు శిరసావహించాడు.

సంజయుడు వెంటనే యుద్ధభూమికి వెళ్లాడు. పది రోజుల యుద్ధం చూచాడు. భీష్ముడు అంపశయ్యమీద పడి పోయాడు. ఆ విషయం చెబుదామని వ్యాసుడు ఇచ్చిన శక్తితో యుద్ధభూమి నుండి క్షణంలో హస్తినకు వచ్చాడు. ధృతరాష్ట్రునికి భీష్ముని అంపశయ్య గురించి చెప్పాడు. పెదతండ్రి పతనం వార్త విన్న ధృతరాష్ట్రుడు మూర్ఛపోయాడు. తేరుకున్నాడు. అసలు ఇదంతా ఎలా జరిగింది అని అడిగాడు. ఆ అడగడంతోనే భగవద్గీత ప్రారంభం అవుతుంది. ధృతరాష్ట్రుని ప్రశ్న గీతలో మొట్టమొదటి శ్లోకం.

మనం అంతా కూడా గుడ్డివాళ్లమే. అజ్ఞానం అనే అంధకారంలో పడి గుడ్డివాళ్ల మాదిరి కొట్టుకుంటున్నాము. ఏం జరిగింది, ఏం జరుగుతోంది మనం ఇలా ఎందుకు ఉన్నాము మనకు మనమే ప్రశ్నించుకోవాలి. అప్పుడే మనకు గీత చదవాలని, వినాలని జిజ్ఞాస కలుగుతుంది. గీతను కృష్ణుడు అర్జునుడికి బోధిస్తే, అర్జునుడితో పాటు విన్న సంజయుడు, ధృతరాష్ట్రుడికి తాను విన్న గీతను పూసగుచ్చినట్టు చెప్పాడు. మనం అందరం కూడా సంజయుడి లాంటి గురువు వద్దనుండి గీతామృతాన్ని వీనులవిందుగా పానం చేద్దాం. ఇంక భగవద్గీతలోకి ప్రవేశిద్దాము.

భగవద్గీతలో మొదటి అధ్యాయము పేరు అర్జున విషాద యోగము. ఈ అధ్యాయములో మనకు రెండు విషయాల గురించి చెప్పాడు వ్యాసులవారు. భగవద్గీత మహాభారతంలో అంతర్భాగం

అని మనకు తెలుసు. కేవలం భారతం చదివినప్పుడే కాకుండా గీతను ప్రధాన గ్రంధంగా కూడా చదువుకోవచ్చు. అందుకే భగవద్గీత మనకు ప్రత్యేక పుస్తకంగా దొరుకుతూ ఉంది. కాని, గీతను ప్రత్యేకంగా చదివితే, భారతంలో ఉన్న పాత్రల గురించి మనకు అర్థం కాకపోవచ్చు. అందుకే వ్యాసుల వారు భగవద్గీతలో 1వ శ్లోకం నుండి 23వ శ్లోకం దాకా, భారతంలోని ముఖ్యమైన పాత్రలు, గీత చెప్పినప్పటి సన్నివేశము మొదలగు వాటి గురించి చెప్పాడు. 24వ శ్లోకం నుండి అర్జునునికి విషాదము ఎందుకు కలిగింది అనే విషయాన్ని వివరించాడు. ఇప్పుడు మొదటి భాగం గురించి తెలుసుకుందాము.

1వ శ్లోకంలో ధృతరాష్ట్రుడు సంజయుని అడుగుతున్నట్టు ఉంది. ధర్మక్షేత్రము అయిన కురుక్షేత్రములో యుద్ధము చేయడానికి కోరిక కలిగిన నా వాళ్లు, పాండురాజ కుమారులు ఏమి చేసారు అని అడిగాడు. ఈ శ్లోకంలో ఒక యుద్ధం జరుగుతూ ఉందనీ, ఆ యుద్ధము కురు భూములలో జరుగుతూ ఉందనీ, ఆ కురుభూములు ధర్మము వెల్లివిరిసే క్షేత్రాలనీ, ఇప్పుడు యుద్ధ క్షేత్రము అయిందనీ, ఆ యుద్ధములో ధృతరాష్ట్రుని సంతతి, పాండురాజు సంతతి యుద్ధమునకు సన్నద్ధము అయ్యారనీ మనకు తెలియజేసాడు వ్యాసులవారు.

రెండవ శ్లోకంలో దుర్యోధనుడు రాజు అనీ, ఆయన గురువు ద్రోణుడు అనీ, పాండవ సైన్యము ఎదురుగా మోహరించి ఉందనీ తెలియజేసాడు. మూడవ శ్లోకంలో పాండవ సైన్యానికి ద్రుపదుని కుమారుడు (ధృష్టద్యుమ్నుడు అనేవాడు) సైన్యాధి పతి అనీ, ఆ ద్రుపదుని కుమారుడు ద్రోణుని శిష్యుడు అనీ వ్యాసులవారు తెలియజేసారు. అంటే అన్నదమ్ములే కాకుండా గురుశిష్యులు కూడా ఎదురు ఎదురుగా యుద్ధం చేయడానికి నిలబడ్డారు అని తెలుస్తూఉంది.

నాలుగు నుండి ఆరు శ్లోకాలలో పాండవ పక్షాన ఉన్న వీరులను పరిచయం చేసారు వ్యాసుల వారు. భీముడు, అర్జునుడు, యుయుధానుడు, విరాటుడు, ద్రుపదుడు మొదలగు మహారథులు, ధృష్టకేతుడు, కాశీరాజు మొదలగు వీరులు, పురుజిత్తు, కుంతిభోజుడు, శైబ్యుడు మొదలగు రాజులు, యుధామన్యుడు, విక్రాంతుడు, ఉత్తమౌజుడు మొదలగు వీరులు, సుభద్ర కుమారుడు (అభిమన్యుడు), ద్రౌపది కుమారులు(ఉపపాండవులు). వీరంతా మహారథులు అని భారతంలోని పాండవ పక్షాన మోహరించి ఉన్న ముఖ్యపాత్రలను పరిచయం చేసారు వ్యాసులవారు.

తరువాత 8వ శ్లోకంలో దుర్యోధనుడు తన పక్షాన ఉన్న వీరుల గురించి చెప్పాడు. భీష్ముడు, ద్రోణుడు, కర్ణుడు, కృపాచార్యులు, అశ్వత్థామ, వికర్ణుడు, సోమదత్తుని కుమారుడు (భూరిశ్రవసుడు) మొదలగు వారిని పరిచయం చేసాడు. ఈ సైన్యాలకు అధిపతుల గురించి 10 వ శ్లోకంలో చెప్పాడు. కురుసేనలకు భీష్ముడు, పాండవ సేనలకు భీముడు అధిపతులు. ఆ రోజులలో, యుద్ధములలో మోగించే వాద్యవిశేషముల గురించి 13వ శ్లోకంలో పరిచయం చేసారు వ్యాసుల

వారు. శంఖములు, భేరీ, పణవానకము, గోముఖము మొదలగు వాద్యములు.

తరువాత మరొక విషయాన్ని కూడా ప్రస్తావించారు వ్యాసులవారు. యుద్ధము విశాలమైన కురుభూములలో జరుగుతూఉంది. అందరూ దూర దూరంగా ఉంటారు. కంటికి కనపడరు. ఎవరు ఎక్కడ ఉన్నదీ తెలుసుకోడానికి యుద్ధంలో ఉపయోగించే పరికరము శంఖము. ఒక్కొక్కరి శంఖము ఒకొక్కవిధమైన శబ్దం వెలువరిస్తుంది. పైగా శంఖము ఊదే వైఖరి, అంటే ఆగి ఆగి ఊదడం, సాఫీగా ఊదడం, ఉధృతంగా ఊదడం ద్వారా అక్కడ ఏం జరుగుతూ ఉందో తన వాళ్లకు తెలియజేయవచ్చు. అందుకనీ ఒక్కొక్క వీరునికి ఒక్కొక్క విధమైన శంఖము దానికో పేరు ఉంటుంది. హృషీకేశుడు అయిన కృష్ణుడికి పాంచజన్యము, ధనంజయుడు అయిన అర్జునుడికి దేవదత్తము, వృకోదరుడు అయిన భీమునికి పౌండ్రము, యుధిష్టిరునికి అనంత విజయము, నకులునికి సుఘోషము, సహదేవునికి మణిపుష్పకము అనే శంఖాలు ఉన్నాయి అని మచ్చుకు కొన్ని వివరించారు వ్యాసులవారు.

21వ శ్లోకంలో అర్జునుడు కృష్ణునితో, కృష్ణా! నా రథము ఉభయసేనలమధ్య నిలుపు అని ఆజ్ఞాపించాడు. దీనిని బట్టి అర్జునుడికి రథసారథిగా కృష్ణుడు నియమింపబడ్డాడు అని వ్యాసుల వారు తెలియజేసారు. 23వ శ్లోకంలో దుర్యోధనుడు దుర్బుద్ధితో ఈ యుద్ధానికి తలపడ్డాడు అని తెలియజేసారు వ్యాసుల వారు.

ఇప్పటికి యుద్ధం సీను వివరించడం పూర్తి అయింది. ఇంక అర్జునునికి విషాదం ఎందుకుకలిగింది అనే విషయాన్ని తరువాతి శ్లోకాలలో వివరించారు వ్యాసుల వారు. ఒక మానవునికి విషాదం కలగడానికి మూడుకారణాలు. రాగం, శోకం, మోహం. రాగం అంటే అటాచ్ మెంట్. అనుబంధం. మనిషిపుట్టగానే తల్లి, తండ్రి, అక్కలు. అన్నలు, తండ్రి పక్క బంధువులు, తల్లి పక్క బంధువులు. వీరితో అనుబంధం పెంచుకుంటాడు. తరువాత చదువుకునేటప్పుడు గురువుతోనూ, స్నేహితులతోనూ అనుబంధం కలుగుతుంది. తరువాత వివాహము. దానితో భార్య, భార్య పక్క బంధువులు, పిల్లలు. ఇదీ సంసారము. ఈ అనుబంధాల వలన కలిగే శోకం రెండు రకాలు. ఉన్న వాళ్లకు ఏమైనా కష్టం కలిగితే కలిగే శోకం మొదటిది.. భవిష్యత్తులో ఏమన్నా కష్టం కలుగుతుందేమో అన్న భావనతో కలిగే శోకం రెండవది. ఇప్పుడు అర్జునుడికి కలిగింది రెండవ రకం శోకం. అదేవిషాదము.

దాయాదులు తమ వద్ద నుండి అక్రమంగా లాక్కున్న అర్థ రాజ్యం తిరిగి ఇమ్మని అడిగారు పాండవులు. ఇవ్వను పొమ్మన్నాడు దుర్యోధనుడు చేతనైతే యుద్ధం చేసి గెల్చుకో అన్నాడు. యుద్ధం అనివార్యంఅయింది. ఇరుపక్షాల సైన్యాలు యుద్ధానికి సన్నద్ధం అయ్యాయి. ఇంకా యుద్ధం మొదలు కాలేదు. ఎవరూచావలేదు. కాని అర్జునుడికి ఎదుటి పక్షంలోని వీరులను, సైనికులను,

ముఖ్యంగా తాత భీష్ముని, గురువు ద్రోణుని, కృపాచార్యులవారిని చూచి విపరీతమైన శోకం పట్టుకుంది. నేను యుద్ధం చేస్తే, నా చేతుల్లో వీళ్లంతా చస్తే, వీళ్ల గతేంటి. ఇరుపక్షాలసైన్యంలో ఉన్న మగాళ్లు అందరూ చస్తే, వాళ్ల భార్యలు ఏమౌతారు. వాళ్లు చెడుతిరుగుళ్లు తిరిగితే, ఆ చెడుతిరుగుళ్ల వల్ల వారికి అక్రమ సంతానం కలిగితే, వర్ణసంకరం అవుతుంది. చచ్చిన వాళ్లకు పిండ ప్రదానం, జలతర్పణం ఎవరు చేస్తారు. అవి చెయ్యకపోతే అందరూ నరకానికి పోతారు కదా!

అయినా చిన్నప్పటినుండి పెంచి పెద్ద చేసిన తాతగారిని, చదువు చెప్పిన గురువు కృపాచార్యుని, విలువిద్యలో మెళుకువలు నేర్పిన ద్రోణాచార్యుని, మిత్రుడు అశ్వత్థామను ఎలా చంపాలి. మామగారు ద్రుపదుడు, బావమరిది ధృష్టద్యుమ్నుడు, మేనమామ శల్యుడు, బావగారు కృష్ణుడు, శిష్యుడు సాత్యకి వీళ్లంతా యుద్ధంలో చస్తారుకదా! ఇదంతా నేను యుద్ధం చేయడం వల్ల కదా! అందుకని నేను యుద్ధం చేయను. సన్యాసం పుచ్చుకొని, బిక్షాటన చేసి బతుకుతాను. ఇదీ అర్జునుడి విషాదానికి కారణం. అప్పటికి యుద్ధం అసలే మొదలవ లేదు. ఎవరూ ఎవరినీ చంపలేదు. ఎవరూ చావలేదు. అందరూ బతికే ఉన్నారు. అంటే ఏమీ జరగని దానికి ఏదో జరుగుతుందని, జరగబోతోందని విషాదం పొందాడు అర్జునుడు. ఈ విషాదాన్ని అంతం చేయడానికి కృష్ణుడు చేసిన బోధ భగవద్గీత.

ఇంక ఒక్కొక్క శ్లోకం వివరంగా అధ్యయనం చేద్దాం. ముందు ప్రార్థన.

--:0:--

## ప్రార్థన

ఓం నమో భగవతే వాసుదేవాయ

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజం।
ప్రసన్న వదనం ధ్యాయేత్ సర్వ విఘ్నోపశాంతయే॥

పార్థాయ ప్రతిబోధితాం భగవతా నారాయణేన స్వయం।
వ్యాసేన గ్రథితాం పురాణమునినా మధ్యేమహాభారతమ్।
అద్వైతామృత వర్షిణీం భగవతీమష్టాదశాధ్యాయినీం।
అంబ త్వామనుసందధామి భగవద్గీతే భవద్వేషిణీమ్॥

నమోస్తుతే వ్యాస విశాలబుద్ధే పుల్లారవిందాయత పత్ర నేత్ర।
యేన త్వయా భారత తైలపూర్ణ: ప్రజ్వాలితో జ్ఞానమయ ప్రదీప:॥

ప్రపన్న పారిజాతాయ తోత్రవేత్రైక పాణయే।
జ్ఞానముద్రాయ కృష్ణాయ గీతామృత దుహేనమ:॥

కృష్ణాయ వాసుదేవాయ హరమే పరమాత్మనే।
ప్రణతక్లేశనాశాయ గోవిందాయ నమోనమ:॥

మూకం కరోతి వాచాలం పంగుం లంఘయతే గిరిమ్।
యత్కృపా తమహం వందే పరమానంద మాధవమ్॥

వ్యాసం వసిష్ఠనప్తారం శక్తే: పౌత్రమకల్మషమ్।
పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్॥
వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే।
నమోవై బ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమోనమ:॥
అవికారాయ శుద్ధాయ నిత్యాయ పరమాత్మనే।
సదైకరూపరూపాయ విష్ణవే సర్వజిష్ణవే।
యస్యస్మరణ మాత్రేణ జన్మసంసారబంధనాత్।
విముచ్యతే నమస్తస్మై విష్ణవే ప్రభవిష్ణవే।

॥హరిఓం తత్సత్॥

# భగవద్గీత

## మొదటి అధ్యాయము

## అర్జున విషాదయోగము.

ధృతరాష్ట్ర ఉవాచ:

### 1.ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః।
### మామకాః పాణ్డవాశ్చైవ కిమకుర్వత సంజయ॥

ఓ సంజయా! ఈ ధర్మక్షేత్రమైన కురుక్షేత్రమునందు యుద్ధము చేయవలెనని కోరిక బలంగా కలిగిన వాళ్లు అయిన నా కుమారులు, మరియు నా తమ్ముడు పాండురాజు కుమారులు, ఏమి చేస్తున్నారు. వివరంగా చెప్పు అని ధృతరాష్ట్రుడు సంజయుని అడగడంతో గీతాశాస్త్రము ప్రారంభం అవుతుంది.

వ్యాసుల వారు భగవద్గీతను ధర్మ అనే పదంతో మొదలుపెట్టారు. ధర్మము అందరూ ఆచరించవలసినది. ధర్మాచరణము అందరికీ అత్యంత ఆవశ్యకము. ధర్మం రక్షింపబడిన నాడు ఆ ధర్మం మనలను రక్షిస్తుంది. అందుకే ధర్మోరక్షతి రక్షితః అని ఆర్యోక్తి. గీతలో కృష్ణపరమాత్మ ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే అని ఉద్ఘాటించారు. ధర్మమును స్థాపించడానికి ప్రతియుగంలో నేను జన్మిస్తాను అని చెప్పారు. కాబట్టి ధర్మము మానవాళికి అత్యంత ముఖ్యమైన సంపద. అందుకే ఈ భరతభూమి ధర్మక్షేత్రమై విలసిల్లింది. అటువంటి భరతభూమిలో కురుక్షేత్రము ఉంది. కురు మహారాజు పేరిట కురువంశము వర్ధిల్లింది. ఆ కురుమహారాజు యజ్ఞం చేయడానికి ఆ క్షేత్రమును దున్ని చదునుచేసాడు. అందుకని ఈ ప్రదేశమునకు కురుక్షేత్రము అని పేరు వచ్చింది అని చెబుతారు. క్షత్రియ కులమును సమూలంగా నిర్మూలించిన పరశురాముడు, వారి రక్తముతో ఇక్కడే తన తండ్రికి తర్పణము విడిచాడనీ, ఆ క్షత్రియుల రక్తం ఐదుపాయలుగా పారిందనీ, దాని పేరే శమంతక పంచకము అనీ అది ఈ కురుక్షేత్రములో ఉందని చెబుతారు. అటువంటి కురుక్షేత్రములో పాండవులు, కౌరవులు రాజ్యం కోసం యుద్ధం చేయడానికి సన్నద్ధులయ్యారు.

ఈ శ్లోకం ధృతరాష్ట్రుడు సంజయుని అడగడంతో మొదలవుతుంది. ధృతరాష్ట్రుడు అంటే రాష్ట్రమును ధరించిన వాడు. అంటే కురు సామ్రాజ్యమునకు రాజు. ఈ కురు సామ్రాజ్యము ధృతరాష్ట్రుడు సంపాదించలేదు. అది అతని పిత్రార్జితము. తనది కాని దానిని తనది అనుకునే

స్వభావము కలవాడు. ఈ గుణము మనలో చాలా మందికి ఉంది. మనం పుట్టక ముందు ఈ భూమి ఉంది. మనం పోయిన తరువాత కూడా ఈ భూమి ఉంటుంది. కాని మనం ఈ భూమి మీద బతికిన 100 సంవత్సరాల పాటు ఈ భూమి నాది అని అనుకుంటున్నాము. మనది కాని భూమి మీద విపరీతమైన మమకారము పెంచుకుంటాము. ఉన్న భూమిని కాపాడుకోడానికి, లేని భూమిని ఆక్రమించడానికి నానా తంటాలు పడుతుంటాము. అనేకమైన అడ్డదార్లు తొక్కుతుంటాము. సెంటు భూమి కొరకు అయిన వారిని కూడా కడతేర్చేవాళ్లు ఉండటం మనం చూస్తున్నాము. వింటున్నాము. అదే అజ్ఞానము. ఈ అజ్ఞానము పోగొట్టేదే భగవద్గీత.

ఇంక సంజయుడు ధృతరాష్ట్రునికి సారథి, అంతరంగికుడు, జ్ఞాని. సమ్యక్ జయతి సంజయ: అని అంటారు. అంటే ఇంద్రియములను మనసును జయించిన వాడు. నువ్వు, నేను అనే భేదబుద్ధిలేని వాడు. ఉన్నది ఉన్నట్టు చెప్పగలిగిన ధైర్యశాలి. వ్యాసుని అనుగ్రహమును పొందిన వాడు. అందుకే సంజయునికి శ్రీకృష్ణుని ముఖతా గీతను వినే మహద్భాగ్యం కలిగింది. విశ్వరూపదర్శనమును పొందగలిగాడు.

కురుక్షేత్రము అంటే కురు రాజుల యొక్క అధీనంలో ఉన్న విశాలమైన కురుభూమి. అక్కడ ఎంతో మంది మునులు, ఋషులు తమ ఆశ్రమాలు నిర్మించుకొని తపస్సు చేసుకుంటున్నారు. పూర్వము బ్రహ్మగారు, ఇంద్రుడు, అగ్ని ఇక్కడ తపస్సు చేసారనీ, కురు వంశ మూల పురుషుడు అయిన కురుమహారాజు ఈ ప్రదేశములో ఎన్నో ధర్మకార్యాలు చేసాడనీ ప్రతీతి. ( ప్రస్తుతము ఇది పంజాబురాష్ట్రంలో ఉంది.)

ఇప్పుడు పాండవులు, కౌరవులు, వారి మిత్రపక్షరాజులు అందరూ కలిసి యుద్ధం చేయడానికి ధర్మక్షేత్రము అయిన కురుక్షేత్రంలో సిద్ధం అయ్యారు. వారి సైన్యములు అంతా కలిపి 18 అక్షౌహిణీలు. ఒక అక్షౌహిణి అంటే 21,870 రథములు, 21,870 ఏనుగులు, 65,610 గుర్రములు, 1,09,350 సైనికులు వీరంతా కలిసి ఒక అక్షౌహిణి అంటారు. ఇటువంటి అక్షౌహిణీలు పాండవుల పక్షాన 7, కౌరవుల పక్షాన 11 నిలిచిఉన్నాయి.మరి ఇన్ని లక్షల మంది యుద్ధం చేయాలంటే విశాలమైన భూమి కావాలి కదా. దాని కొరకు ఈ కురుభూమిని ఎన్నుకున్నారు. అప్పటివరకు హోమ ధూమముతోనూ, వేదఘోషలతోనూ, పర్ణకుటీరములతోనూ శోభిల్లిన కురుభూమి యుద్ధఘోషలతో, ఆయుధ విన్యాసాలతో, అస్త్రశస్త్రప్రయోగాలతో, సైనికుల అరుపులతో కురుక్షేత్రంగా మారి పోయింది.

మన శరీరం కూడా ఒక కురుక్షేత్రమే. అందులో మంచి ఆలోచనలు పాండవుల సైన్యం అయితే, దుర్మార్గముతో కూడిన ఆలోచనలు కౌరవ సేనలు. వాటిమధ్య జరిగే ఘర్షణే కురుక్షేత్ర సంగ్రామము.

అసలు మనిషి పుట్టగానే అతడి లేక ఆమె మనసు నిర్మలంగా, ప్రశాంతంగా, అమాయకంగా ఉంటుంది. పెరిగి పెద్ద అయ్యేకొద్దీ ఇది నాది, అది నీది అనే స్వార్ధము, నీవు వేరు నేను వేరు అనే భేదబుద్ధి, ఇది అంతా నాకే కావాలి, నీకు ఇవ్వను అనే లోభత్వము, నువ్వంటే నాకు పడదు అనే ద్వేషము, నీకు అంత ఉంది, నాకు ఇంతే ఉంది అనే అసూయ క్రమక్రమంగా మన మనసులను, బుద్ధిని కురుక్షేత్రంగా మారుస్తాయి. ఈ మంచి చెడుల మధ్య నిత్యం ఘర్షణ జరుగుతూ ఉంటుంది. ఒక్కోసారి మంచి గెలుస్తుంది. మరో సారి చెడు గెలుస్తుంది. దాని వలన సుఖము దు:ఖము ఒకదాని వెంట ఒకటి వస్తుంటాయి. ఇదే సంసారము అనే సాగరము. ఈ సాగరము నుండి బయటపడాలంటే ఒక గట్టి పడవ కావాలి. అదే భగవద్గీత. దానికి చుక్కాని పట్టేది గురువు. భగవద్గీత అనే పడవ ఎక్కి, శ్రీకృష్ణుడు అనే గురువు సాయంతో ఈ సంసారము అనే సముద్రమును దాటవచ్చు.

ధృతరాష్ట్రుడు పుట్టు గుడ్డి. పాండురాజు అరణ్యములకు పోయినప్పటి నుండి తానే రాజు. అయినా రాజ్యకాంక్ష తగ్గలేదు. తన తరువాత తన కుమారులైన కౌరవులకు రాజ్యం కట్టబెట్టాలనే కోరిక బలంగా ఉంది. నిజానికి పాండవులు, కౌరవులు ఇద్దరూ తన కుమారులే. కాని ధృతరాష్ట్రుని భేదబుద్ధి వారిని సమానంగా చూడనివ్వదు. అందుకే నా వాళ్లు, పాండవులు ఏమి చేస్తున్నారు అనే భేదబుద్ధి చూపించాడు. ధృతరాష్ట్రుడు అడిగిన ప్రశ్నకు సంజయుడు ఈ విధంగా సమాధానం చెప్పాడు.

సంజయ ఉవాచ:

### 2. దృష్ట్వా తు పాణ్డవానీకం వ్యూఢం దుర్యోధనస్తదా। ఆచార్యముపసంగమ్య రాజా వచనమబ్రవీత్॥

ఓ ధృతరాష్ట్ర మహారాజా! నీ కుమారుడు అయిన దుర్యోధనుడు, యుద్ధం చేయడానికి ఉరకలు వేస్తున్న, తన సైన్యాన్ని, పాండవుల సైన్యాన్ని ఒక్కసారి తేరి పార చూచాడు. తన బలం ఎంతో ఎదుటి బలం ఎంతో అంచనా వేసుకున్నాడు. తన సైన్యం ఏయే వ్యూహములు రచించారో, పాండవుల సైన్యముల యొక్క వ్యూహరచనను గమనించాడు. వెంటనే తన రథమును తన గురువుగారు ద్రోణాచార్యుల వద్దకు పోనిమ్మన్నాడు. ద్రోణునితో ఇలా అన్నాడు.

కౌరవుల సైన్యాధ్యక్షుడు భీష్ముడు. యుద్ధము గురించి, అందులో అనుసరించ వలసిన వ్యూహములు ప్రతి వ్యూహములు గురించి చర్చించాలంటే దుర్యోధనుడు భీష్ముని వద్దకుపోవాలి. కాని కేవలం తన ఉప్పుతింటున్న కారణంగా తన పక్షాన యుద్ధం చేయడానికి వచ్చిన ద్రోణాచార్యుల

వద్దకు ఎందుకు వెళ్లాడు? భీష్ముని మీద నమ్మకం లేదా! భీష్ముడు, పాండవులు తన మనుమలు అనే మమకారంతో, సరిగా యుద్ధం చేయడు అనే సందేహం కలిగిందా! లేక భీష్ముని కంటే ఆచార్య ద్రోణుడు పరాక్రమవంతుడా! ఇది అందరి మనసులో తొలిచే ప్రశ్న. ఇక్కడ మరొక విశేషం కూడా ఉంది. "పాండవులు నా మనుమలు. నేను పాండవులను తప్ప అందరినీ చంపుతాను" అని ఇదివరకే ప్రకటించాడు భీష్ముడు. ద్రోణుడికి అటువంటి నియమం లేదు. ఎందుకంటే ద్రోణుడికి అందరూ శిష్యులే! ఎవరి మీదా అధిక ప్రేమ లేదు. కాకపోతే అర్జునుడు అంటే ప్రత్యేకమైన అభిమానము. అంతవరకే. ఆ కారణం చేత ద్రోణుని పాండవుల మీదికి రెచ్చగొడదామని వెళ్లి ఉండవచ్చు. దుర్యోధనుడిది కుటిల బుద్ధి. ఎప్పుడూ సక్రమంగా ఆలోచించడు. వక్రంగానే ఆలోచిస్తాడు.

పాండవుల సైన్యాధ్యక్షుడు ధృష్టద్యుమ్నుడు. అతడు పాండవుల భార్య ద్రౌపదికి అన్నగారు. అతడి తండ్రి ద్రుపదుడు ద్రోణాచార్యుని అవమాన పరిచాడు. దానికి అర్జునుడి ద్వారా ప్రతీకారం తీర్చుకున్నాడు ద్రోణుడు. ద్రోణుని చంపే కుమారుడు కావాలని తపస్సు చేసాడు ద్రుపదుడు. దాని ఫలితంగా ధృష్టద్యుమ్నుడు అగ్నిలోనుండి జన్మించాడు. కాబట్టి ధృష్టద్యుమ్నుడు కేవలం ద్రోణుని చంపడానికే పుట్టాడు అన్నది అందరికీ తెలుసు. ఈ విషయం తెలిసి కూడా ద్రోణుడు ధృష్టద్యుమ్నుడుకి విలువిద్య నేర్పించాడు. అస్త్రశస్త్రముల ప్రయోగ ఉపసంహారములు నేర్పించాడు. కాబట్టి ఎదుటి పక్షాన సైన్యాధ్యక్షుడుగా ఉన్న ధృష్టద్యుమ్నుడు ద్రోణుడికి శిష్యుడు.

తనను చంపడానికే పుట్టిన ధృష్టద్యుమ్నుడిని ద్రోణుడు చంపుతాడా? లేక శిష్యుడు అని ఉపేక్ష వహిస్తాడా అన్న సందేహము దుర్యోధనుడిలో మొలకెత్తింది. ఈ విషయం తేల్చుకోడానికే నేరుగా ద్రోణాచార్యుల వద్దకు వెళ్లి ఇలా అంటున్నాడు.

### 3. పశ్యైతాం పాండుపుత్రాణా మాచార్య మహతీం చమూమ్।
### వ్యూఢాం ద్రుపద పుత్రేణ తవ శిష్యేణ ధీమతా॥

గురువుగారూ! నమస్కారం. ఒక్కసారి పాండవుల వైపు ఉన్న సేనాసముద్రాన్ని చూడండి. ఆ సైన్యం ముందు ఠీవిగా నిలబడి ఉన్న పాండవుల సర్వసైన్యాధ్యక్షుడు ధృష్టద్యుమ్నుని చూడండి. ఆయన ఎవరో కాదు! తమరి శిష్యుడే. తమరే అతనికి విలువిద్య నేర్పించారు. తమరే ధృష్టద్యుమ్నుని మహా బుద్ధిమంతుడు అని పొగిడేవారు. కాని ఆచార్య! ఆయన మీ బద్ధశత్రువు ద్రుపదుని కుమారుడు అని మరిచిపోకండి. మీరు తనకు చేసిన అవమానాన్ని భరించలేక, కేవలం మిమ్ముల్ని చంపడానికే తపస్సుచేసి, ధృష్టద్యుమ్నుని కుమారుడిగా పొందాడు. ధృష్టద్యుమ్నుడు మీ శిష్యుడు, బుద్ధి మంతుడు అని ఉపేక్షచేస్తారో, మీ బద్ధశత్రువు ద్రుపదుని కుమారుడనీ, మిమ్ముల్ని

చంపడానికే పుట్టాడనీ అతని పట్ల కఠినంగా వ్యవహరిస్తారో, మీ ఇష్టం అనే అర్థం వచ్చేటట్టు నర్మగర్భంగా మాట్లాడాడు దుర్యోధనుడు. తన రాజకీయ చతురత నంతా ఇక్కడ మాటల్లో చూపించాడు దుర్యోధనుడు.

దుర్యోధనుని పక్షాన 11 అక్షౌహిణీల సైన్యం ఉంది. పాండవుల పక్షాన కేవలం 7అక్షౌహిణీల సైన్యంమాత్రమే ఉంది. కాని పాండవుల పక్షాన ధర్మము, ధర్మానికి ప్రతినిధి అయిన శ్రీకృష్ణుడు ఉన్నాడు. కాని దుర్యోధనుడి పక్షాన అధర్మం ఉంది. భీముడికి బాలుడుగా ఉండగానే విషం పెట్టాడు. వారిని లక్క ఇంట్లో పెట్టి సజీవదహనం చేయాలని చూచాడు. అక్రమంగా పాండవుల రాజ్యం లాక్కోవడమే కాక, వారి భార్యను అవమానించాడు. అడవులకు పంపాడు. తిరిగి వచ్చి వారు తమ రాజ్యం తమకు ఇమ్మని అడిగితే సూదిమొన మోపినంత భూమికూడా ఇవ్వను అన్నాడు. ఇవన్నీ అధర్మాలనీ, అధర్మం తన పక్షాన ఉందనీ దుర్యోధనుడికి తెలుసు. అందుకే దుర్యోధనుడు అభద్రతా భావంతోఉన్నాడు. తమ కంటే చిన్నదైన పాండవుల సైన్యం పేద్దభూతంలాగా కనపడుతూ ఉంది. అందుకే "మహతీంచమూమ్" అంటే గొప్పదైన పాండవుల సైన్యం చూడండి అని అన్నాడు. మనలో కూడా ఎంత ఎక్కువ ధనం, ఆస్తి, పదవులు ఉంటే అంత అభద్రతా భావం ఉంటుంది. ముందు వెనుక సెక్యూరిటీ గార్డులను పెట్టుకుంటారు. ప్రతి చిన్న విషయానికీ భయపడతాడు. ఏమీ లేని వాడు నిర్భయంగా, హాయిగా కులాసాగా ఒంటరిగా తిరుగుతాడు. అందుకనే ఎక్కువ సైన్యం ఉన్నప్పటికీ సుయోధనుడికి అభద్రతాభావం పోలేదు.

దుర్యోధనుని మాటలతో ఒళ్లుమండింది ద్రోణుడికి. దుర్యోధనుని వంక తీక్షణంగా చూచాడు. దుర్యోధనుడు సర్దుకున్నాడు. అందరి మాదిరే ధృష్టద్యుమ్నుని గురించి కూడా అడిగాననే అర్థం వచ్చేటట్టు ఇతర వీరుల గురించి ఇలా అన్నాడు.

4. అత్ర శూరా మహేష్వాసా భీమార్జున సమా యుధి।
యుయుధానో విరాటశ్చ ద్రుపదశ్చ మహారథః॥
5. ధృష్టకేతు శ్చేకితానః కాశిరాజశ్చ వీర్యవాన్।
పురుజిత్ కుంతిభోజశ్చ శైబ్యశ్చ నరపుంగవః॥
6. యుధామన్యుశ్చ విక్రాన్త ఉత్తమౌజాశ్చ వీర్యవాన్।
సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వ ఏవ మహారథాః॥

తనలో తాను సర్దుకున్న దుర్యోధనుడు ద్రోణాచార్యులతో ఇలా అన్నాడు. "ఆచార్యవర్యా! ముందు కేవలం పాండవ సైన్యాధ్యక్షుని గురించి చెప్పాను అంతే. అయినా తమరికి తెలియనిది కాదు. ఏదో నా తృప్తి కొరకు పాండవుల సైన్యములో ఉన్న మహారథుల గురించి చెబుతున్నాను. శ్రీకృష్ణుడు తమ్ముడు సాత్యకి, మహారథి అనే పేరుగాంచిన విరాట మహారాజు, ధృష్టకేతుడు, చేకితానుడు, మహా పరాక్రమశాలి అయిన కాశీరాజు, పురుజిత్తు, కుంతిభోజుడు, శైబ్యుడు, మహాపరాక్రమ వంతుడైన యుధామన్యుడు, మహావీరుడు అభిమన్యుడు, ఇంక ద్రౌపదీ కుమారులైన ఉపపాండవులు, వీరంతా మహారథులు. వీరి ధనుస్సులు చాలా పటిష్ఠమైనవి. వీరందరూ ధనుర్విద్యాపారంగతులు. వీరంతా భీముడు, అర్జునుడితో సమానంగా యుద్ధం చేయగల సమర్థులు. (మహారథి అంటే ఒకే సమయంలో పదివేల మంది సైనికులతో యుద్ధం చేయగల సామర్థ్యం ఉన్న వాడు అని ఒక అర్థం. వేరు వేరు చోట్ల వేరు అర్థాలు ఉన్నాయి.) మరి వీళ్ల సంగతి ద్రోణుడికి తెలియదా! తెలుసు. కానీ ఎదుటి బలమును, తన బలమును అంచనా వేయడం యుద్ధనీతి. అందుకే ఈ వివరాలు చెప్పాడు. ఇంక తన పక్షానున్న వీరుల గురించి కూడా చెబుతున్నాడు దుర్యోధనుడు.

## 7.అస్మాకం తు విశిష్టా యే తాన్నిబోధ ద్విజోత్తమ।
## నాయకా మమ సైన్యస్య సంజ్ఞార్థం తాన్ బ్రవీమి తే॥

ఆచార్యవర్యా! తమకు తెలియదు అని కాదు. మన పక్షంలోఉన్న మహా రథుల గురించి కూడా చెప్పకుంటే నా మనసుకు కొంచెం ధైర్యంగా ఉంటుంది కదా! అందుకని కేవలం తమరి గుర్తుకోసం మన వైపు ఉన్న యోధానుయోధుల గురించి చెబుతాను వినండి.

ఈ శ్లోకంలో ద్విజోత్తమ అని గురువుగారు ద్రోణాచార్యుని సంబోధించాడు దుర్యోధనుడు. ద్విజోత్తమ అంటే బ్రాహ్మణోత్తమా! అనిఅర్థం. బ్రాహ్మణుడు గురువుగా తన శిష్యులకు సమస్త విద్యలు నేర్పవచ్చు. విద్య అంటే ధనుర్విద్య, యుద్ధవిద్యకూడా వస్తాయి. కాబట్టి యుద్ధవిద్యలు బ్రాహ్మణుడు నేర్పవచ్చు కానీ యుద్ధం చేయకూడదు. ఎందుకంటే యుద్ధం హింసతో కూడుకున్నది. బ్రాహ్మణుడికి హింస చేయడం ధర్మం కాదు. అందుకని వ్యాసులవారు ఎత్తిపొడుపుగా ఈపదం వాడి ఉండవచ్చు. కాని దుర్యోధనుడికి ఆ భావన ఉన్నట్టు కనిపించదు.

8. భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితింజయః।
అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తి స్తథైవ చ॥
9. అన్యే చ బహవశ్శూరా మదర్థే త్యక్తజీవితాః।
నానాశస్త్రప్రహరణా స్సర్వే యుద్ధవిశారదాః॥

గురువర్యా! మా పక్షాన తమరు ఉన్నారు. ఇంక మాకేం భయం. అదీకాకుండా పితామహులు భీష్ములవారు, మహారథి కర్ణుడు, అపజయం అంటే ఏమిటో ఎరుగని కృపాచార్యులు, తమరి కుమారుడు అశ్వత్థామ, వికర్ణుడు, సోమదత్తుడు వీళ్లంతా మన పక్షాన ఉన్నారు ఆచార్యా! వీళ్లే కాదు ఇంకా ఎంతో మంది వీరులు, శూరులు నా కోసం తమ ప్రాణాలు ఇవ్వడానికి సిద్ధంగా ఉన్నారు. నా గురించి, నా గెలుపు గురించి తమ ప్రాణాలు పణంగా పెట్టి యుద్ధం చేయడానికి ఎంతో మంది యుద్ధవిద్యలో నైపుణ్యం కలిగిన వారు, పలురకములైన అస్త్రములను, శస్త్రములను ప్రయోగించడంలో నిపుణులు, మన వైపు యుద్ధం చేయడానికి ఉరకలు వేస్తున్నారు. " అని ధీమా వ్యక్తం చేసాడు దుర్యోధనుడు.

ఇక్కడ ఒక విషయం మనం గమనించాలి. ఎంతో మంది వీరులు, పరాక్రమ వంతులు నా కోసం యుద్ధం చేయడానికి వచ్చారు అంటే బాగుండేదేమో కానీ దుర్యోధనుని నోటి వెంట వీరంతా నా కోసం తమ ప్రాణాలను విడుస్తారు అనే మాటలు వెలువడ్డాయి. . ఆఖరుకు జరిగింది అదేకదా! రాబోయే అపజయాన్ని సూచించే మాటలు దుర్యోధనుని నోటి వెంట రావడం దైవసంకల్పంగానే భావించాలి.

10.అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితమ్।
పర్యాప్తం త్విదమేతేషాం బలం భీమాభిరక్షితమ్॥

గురువుగారూ! మన సేనలు అపరిమితమైనవి. పైగా మన సేనలు మహారథి భీష్ముని వలన రక్షింపబడుతున్నాయి. పాండవుల సైన్యములు పరిమితములు. కాని అవి భీముని చేత రక్షింపబడుతున్నాయి.

కౌరవుల సేనలు 11 అక్షౌహిణీలు. పాండవుల సేనలు 7 అక్షౌహిణీలు. అంటే దాదాపు కౌరవ సేనలు పాండవుల సేనల కన్నా ఒకటిన్నర రెట్లు ఎక్కువ. ఆ మాత్రానికే దుర్యోధనుడు తనకు అపార సేనావాహిని కలదని తనకు తాను ధైర్యచెప్పకుంటున్నాడు. అదీ కాకుండా మన సైన్యాధ్యక్షుడు భీష్ముడు. అది కూడా ఒక అనుకూల అంశము అని ధైర్యము. అంతలోనే అధైర్యపడుతున్నాడు

దుర్యోధనుడు. పాండవ సేనలు భీమునిచేత రక్షింపబడుతున్నాయి అని అన్నాడు. పాండవ సేనానాయకుడు ధృష్టద్యుమ్నుడు. భీముడు ఒక మహారథి. కాని భీముని గురించిన, ఆ భీముని బలాపరాక్రమాల గురించిన గుబులు దుర్యోధనుడికి మనసులో తొలుస్తూనే ఉంది. తన తొడలు విరగగొడతాననీ, దుశ్శాసనుడి గుండెలు చీల్చి రక్తం తాగుతాననీ, గాంధారేయులను నూర్గురను తానే చంపుతాననీ భీముడు నిండు సభలో చేసిన శపథం దుర్యోధనుడికి గుర్తుకొస్తూ ఉంది. అందుకే పాండవ సేనలు భీమునిచేత రక్షింపబడుతున్నాయి అని కాస్తంత అధైర్యపడ్డా, అయినా పర్వాలేదు మనకు భీష్ముడు ఉన్నాడు కదా అని తనకు తాను సర్దిచెప్పుకున్నాడు. అదీకాకుండా పాండవులు మొదటి రోజు వజ్రవ్యూహమును పన్నారు. ఆ వజ్రవ్యూహమునకు నాయకుడు భీముడు. అందుకే భీముడు వ్యూహము మొదట్లో నిలబడి ఉన్నాడు. భీముడు విజృంభిస్తే యుద్ధము మొదటి రోజే సమాప్తం కాదుకదా అనే శంక కూడా దుర్యోధనుని మనసులో ఏదో ఒకమూల బాధిస్తూ ఉన్నట్టుంది. అందుకే ఇక్కడ భీముని ప్రస్తావన తెచ్చాడు దుర్యోధనుడు.

ఈ శ్లోకాన్ని మరింత వివరంగా అర్థం చేసుకోడానికి ప్రయత్నం చేద్దాము. తమకు ధనుర్విద్యను నేర్పిన గురువుగారు ద్రోణాచార్యుల వారితో ఇలా అంటున్నాడు దుర్యోధనుడు. "ఆచార్యా! భీష్ముల వారి రక్షణలో ఉన్న మన సైన్యం గొప్పదే కాని భీముని చేత రక్షింపబడుతున్న పాండవుల సైన్యం ముందు చాలదేమో అనిపిస్తూఉంది. ఎందుకంటే ధర్మం, ధర్మానికి ప్రతిరూపము అయిన శ్రీకృష్ణుడు వారి పక్షాన ఉన్నాడు. మనం గెలుస్తామంటారా!" అనే సందేహం వెలిబుచ్చాడు. అంటే దుర్యోధనుడి లోలోపల ఉన్న మనస్థైర్యము దెబ్బతిన్నది అని అర్థం. ఈ నాడు కూడా ధనము, ఆస్తులు, పదవులు, చుట్టు జనం ఉన్నా, చాలామందికి మానసిక స్థైర్యము ఉండదు. తాను చేసిన, చేస్తున్న అక్రమాలకు, అన్యాయాలకు, అధర్మాలకు ఒళ్లు మండి, ఎవడొచ్చి చంపుతాడో అని తమ చుట్టు గన్‌మెన్లను పెట్టుకొని తిరుగుతుంటారు కొందరు. ధర్మం తమ పక్షానుంటే ఎటువంటి అంగబలం అర్థబలం అక్కరలేదు. ధర్మబలం లేని నాడు, ఎంత అర్థబలం, అంగ బలం ఉన్నా వృధా. అంటే అంగబలం, అర్థబలం కన్నా ధర్మబలం గొప్పది. ధర్మం ఎవరి పక్షాన ఉంటుందో వారికే విజయం లభిస్తుంది అన్న మూలసూత్రం దుర్యోధనుడి మనసులో ఏదో ఒక మూల తలెత్తి, ఒక విధమైన అపనమ్మకం కలిగిస్తూ ఉంది. అందుకే ఈ మాటలు అన్నాడు అని కూడా అర్థం చేసుకోవచ్చు. అంతలోనే తేరుకొని కర్తవ్యమును గురువుగారికి వివరించాడు దుర్యోధనుడు.

## 11. అయనేషు చ సర్వేషు యథాభాగమవస్థితాః।
## భీష్మ మేవాభి రక్షన్తు భవన్తస్సర్వ ఏవ హి॥

అందుకే గురువర్యా! ఈ సమయంలో మనం అందరం కలిసి మా తాత గారు, మన సర్వసైన్యాధ్యక్షుడు అయిన భీష్ముని రక్షించుకోవాలి. కాబట్టి మనం అందరం మన మన స్థానములలో

నిలిచి అప్రమత్తంగా ఉండి సదా భీష్ముని రక్షించుకోవాలి. మీరు కూడా భీష్ముని రక్షించడానికి ఎల్లప్పుడూ ప్రయత్నించండి. అని అన్నాడు.

భీష్ముడు మహారథి. తనను తాను రక్షించుకోగలడు. అందులో సందేహము లేదు. కాని దుర్యోధనుని సందేహం అంతా ఒక వేళ మొదటిరోజే భీష్ముడుపడిపోతే తన పని అయిపోతుందని, తనలో ఉన్న ఆ కాస్తంత మనోధైర్యము, స్థైర్యము దెబ్బతింటుందనీ భయపడుతున్నాడు. అంటే ద్రోణుడి పరాక్రమం మీద కూడా దుర్యోధనుడికి నమ్మకం ఉన్నట్టు లేదు. అందుకని నర్మగర్భంగా మనందరం భీష్ముని రక్షించుకుందాము అని ద్రోణుడితో అన్నాడు. దుర్యోధనుడు రారాజు, ఏమన్నా పడాలి. అందుకని ద్రోణుడు ఏమీ మాట్లాడలేదు.

## 12. తస్య సంజనయన్ హర్షం కురువృద్ధ: పితామహ:
## సింహనాదం వినద్యోచ్చై: శంఖం దధ్మౌ ప్రతాపవాన్॥

ఈ మాటలు అన్నీ విన్నాడు భీష్ముడు. ఆ మాటలలో అంతరార్థం గ్రహించాడు. ఏనాడూ తన మాట వినని, తన మాట లక్ష్య పెట్టని దుర్యోధనుడు, ఈ నాడు తనను మాత్రం అందరూ రక్షించాలని తన మీద అమితమైన శ్రద్ధ చూపిస్తున్నాడు అంటే సుయోధనుడి మనసులో యుద్ధభయం ప్రవేశించింది అని తెలుసుకున్నాడు. దుర్యోధనుడిని ఉత్సాహపరచడానికి వాడిలో ధైర్యం కలిగించడానికి భీష్ముడు సింహంలా గర్జించాడు. తన శంఖాన్ని గట్టిగా పూరించాడు. యుద్ధమునకు సన్నద్ధంకండి అనే సూచన ఇవ్వడానికి గుర్తుగా సైన్యాధ్యక్షుడు తన శంఖం పూరించాడు.

## 13. తతశ్శంఖాశ్చ భేర్యశ్చ పణవానక గోముఖా:।
## సహసైవాభ్యహన్యన్త స శబ్దస్తుములో2భవత్॥

(చిన్న గమనిక. ఈ శ్లోకం నుండి తరువాతి శ్లోకాలలో 2 ఉన్న చోట అవగ్రహ అని చదువుకోవాలి. అవగ్రహ నా సిస్టమ్ లో లేనందు వలన, అదే మాదిరి ఉన్న 2 ను వాడాను. అవగ్రహ అంటే అక్కడ అ కారాన్ని చదువుకోవాలి.)

తమ సైన్యాధ్యక్షుడు అయిన భీష్ముడు యుద్ధం ఆరంభానికి గుర్తుగా శంఖం పూరించగానే కౌరవ సేనలలో ఉత్సాహం పెల్లుబికింది. కౌరవసేనలకు అధిపతులు అందరూ తమ

తమ శంఖములను గట్టిగా పూరించారు. సైనికులు వివిధములైన వాద్యములను, అంటే నగారాలు, తప్పెట్లు, మృదంగములు, గోముఖములు అనే వాద్యములు మొదలగు వాద్యములను గట్టిగా మోగించారు. ఆ భయంకరమైన ధ్వనులతో భూమి ఆకాశము దద్దరిల్లాయి.

### 14. తతశ్శ్వేతైర్హయైర్యుక్తే మహతి స్యన్దనే స్థితౌ।
### మాధవ: పాణ్డవశ్చైవ దివ్యౌ శంఖౌ ప్రదధ్మతు:॥

తరువాత తెల్ల గుర్రములను పూన్చిన రథము మీద ఉన్న అర్జునుడు, సారథి కృష్ణుడు తమ తమ శంఖములను పూరించారు. సాధారణంగా ముందు సైన్యాధ్యక్షుడు తన శంఖం పూరించాలి. కాని కృష్ణుని మీద ఉన్న గౌరవం చేత, ముందు కృష్ణుడు శంఖం పూరించిన తరువాత మిగిలిన వారు తమ తమ శంఖములను పూరించారు. ఇక్కడ ఒక విషయం గమనించాలి. కృష్ణుడు కేవలం అర్జునుడి రథ సారథి. కాని ఆయన చేస్తున్న పనిని బట్టి కాకుండా వ్యక్తిగా ఆయనకున్న జ్ఞానాన్ని, పరిణతిని, గౌరవాన్ని, గొప్పతనాన్ని గుర్తించారు పాండవులు. అందుకే రాజసూయ యాగంలో ఆయనకు అగ్రపూజ చేసారు. ఇక్కడ కూడా యుద్ధ ప్రారంభ సూచికగా మొట్ట మొదట శంఖం పూరించే గౌరవం కృష్ణుడికి ఇచ్చారు. కాబట్టి మన వ్యక్తిత్వం, మన గుణగణాలు, మంచి ప్రవర్తన మనకు గౌరవం తెచ్చిపెడతాయి కానీ మనం చేస్తున్న ఉద్యోగం, పదవి, సంపదలు కాదు అని అందరూ తెలుసుకోవాలి. ఈ శ్లోకంలో కృష్ణుని మాధవుడు అని సంబోధించాడు వ్యాసుడు. మా అంటే లక్ష్మీదేవి ధవుడు అంటే భర్త. మాధవుడు అంటే లక్ష్మీదేవి భర్త. లక్ష్మీదేవి విజయానికి గుర్తు. విజయలక్ష్మి ఆమె. కాబట్టి మాధవుడు విజయ శంఖం పూరించాడు అంటే పాండవుల విజయం తథ్యం అనే సంకేతాన్ని ముందే మనకు ఇచ్చాడు వ్యాసుడు.

### 15. పాంచజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయ:।
### పౌండ్రం దధ్మౌ మహాశంఖం భీమకర్మా వృకోదర:॥
### 16. అనంత విజయం రాజా కుంతీపుత్రో యుధిష్ఠిర:।
### నకుల: సహదేవశ్చ సుఘోష మణిపుష్పకౌ॥
### 17. కాశ్యశ్చ పరమేష్వాసశ్శిఖణ్డీ చ మహారథ:।
### ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకిశ్చాపరాజిత:॥
### 18. ద్రుపదో ద్రౌపదేయాశ్చ సర్వశ: పృథివీపతే।
### సౌభద్రశ్చ మహాబాహు: శంఖాన్ దధ్ము: పృథక్ పృథక్॥

ఇక్కడ వ్యాసుడు, పాండవులు, కృష్ణుడు ఉపయోగించే శంఖాల పేర్లు చెప్పాడు. మిగిలిన వీరుల శంఖాలకు కూడా పేర్లు ఉంటాయి. అవి చేసే ధ్వనులు కూడా వేరువేరుగా ఉంటాయి. యుద్ధభూమి విశాలంగా కొన్ని మైళ్లు విస్తరించి ఉంటుంది. ఎక్కడ ఏమి జరుగుతూ ఉందో కంటితో చూడలేము. ఎవరైనా ఆపదలో ఉన్నప్పుడు కానీ, విజయం సిద్ధించినప్పుడు కానీ శంఖం ఊది తెలియజేస్తారు. శంఖధ్వనిని బట్టి, తీరును బట్టి, ఆగిఆగి ఊదడం బట్టి, ఆ వీరుడు తన పరిస్థితిని తన మిత్రులకు తెలియజేస్తాడు. ఆ శంఖధ్వనిని విని, అక్కడి పరిస్థితిని బట్టి, ఆయా వీరులకు సాయం అందుతూ ఉంటుంది. ఇది యుద్ధఘట్టాలలో మనకు కనపడుతుంది. ఆ కారణం చేత పాండవులు, కృష్ణుడు యొక్క శంఖముల పేర్లను ఇక్కడ ప్రస్తావించాడు వ్యాసుడు.

శ్రీకృష్ణుడు పాంచజన్యము అనే శంఖమును, అర్జునుడు దేవదత్తము అనే శంఖమును, భీముడు పౌండ్రము అనే శంఖమును, యుధిష్ఠిరుడు అనంత విజయము అనే శంఖమును, నకులుడు సుఘోషము అనే శంఖమును, సహదేవుడు మణిపుష్పకము అనే శంఖమును పూరించారు. అలాగే పాండవుల మిత్రరాజులైన కాశీరాజు, మహారథి శిఖండి (ద్రుపదుని కుమారుడు), ధృష్టద్యుమ్నుడు, విరాటరాజు, సాత్యకి, ద్రుపదుడు, ద్రౌపదీ పుత్రులు అయిన ఉపపాండవులు, సుభద్రకుమారుడు అభిమన్యుడు, తమ తమ శంఖములను వేరు వేరు గా పూరించారు.

ఈ శ్లోకంలో వ్యాసుల వారు రెండుపదాలు వాడారు. ఒకటి హృషీకేశో అంటే శ్రీకృష్ణుడు. హృషీకములు అంటే ఇంద్రియములు. ఈశుడు అంటే వాటికి అధిపతి. జయించిన వాడు. అంటే శ్రీకృష్ణునికి ఇంద్రియ లోలత్వము లేదు. మనం మన ఇంద్రియములతో పనులు చేస్తున్నాము అంటే ఆ పనులు ఇంద్రియములు చేయడం లేదు. వాటి వెనుక ఉన్న చైతన్యం చేయిస్తూ ఉంది. ఆ చైతన్యం పోతే అంటే మరణిస్తే, ఇంద్రియములు అన్నీఉన్నా ఏమీ చేయలేవు.ఆ చైతన్య స్వరూపమే కృష్ణుడు. రెండవది ధనంజయ: అంటే ధనమును జయించినవాడు, సంపాదించిన వాడు. ధర్మరాజు రాజసూయయాగము చేస్తే నలుదిక్కులకు పోయి రాజులను ఓడించి వారి నుండి అపార ధనరాసులను తీసుకొని వచ్చాడు అర్జునుడు. అందుకని ఆయనకు ధనంజయుడు అనే పేరు సార్థకము అయింది. అటువంటి అపార ధనము, సంపదలు కలిగిన అర్జునుడు కూడా విషాదానికి లోనయ్యాడు. సన్యాసం పుచ్చుకుంటాను అని ధనుర్బాణాలు కింద పెట్టాడు. అంటే మనకు ఎంత ధనం, ఆస్తులు, సంపదలు ఉన్నా ఏదో ఒక సందర్భంలో విషాదం తప్పదు. ధనంతో ఏమైనా కొనవచ్చు, ఏమైనా చేయవచ్చు, నిరంతర సంతోషాన్ని పొందవచ్చు, ఆనందంగా జీవితం గడపవచ్చు  అని అనుకోవడం పొరపాటు అని మనకు సూచనప్రాయంగా తెలియజేసాడు వ్యాసులవారు.

## 19. స ఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్।
## నభశ్చ పృథివీం చైవ తుములో వ్యనునాదయన్॥

శ్రీకృష్ణుడు, పాండవులు, వారి మిత్రపక్షరాజులు చేసిన శంఖనాదములు భూమి ఆకాశములలో ప్రతిధ్వనించాయి. పాండవ వీరుల శంఖనాదములు విని కౌరవ వీరుల హృదయాలు బద్దలయ్యాయి. పాండవ వీరుల శంఖనాదాలే ఇంత భయంకరంగా ఉన్నాయి ఇంక వీరి యుద్ధం, అస్త్ర శస్త్ర విన్యాసము ఎలా ఉంటుందో అని మనసులో గుబులు పడ్డారు కౌరవ వీరులు. ఈ శ్లోకంలో ధార్తరాష్ట్రాన్ అనే పదం వాడారు. ఎందుకంటే కౌరవులు అంటే కురు వంశమునకు చెందిన వారు. పాండవులు కూడా కురు వంశమునకు చెందిన వారు కాబట్టి కౌరవులే. కాని ధార్తరాష్ట్రాన్ అంటే ధృతరాష్ట్రుని సంతతి, వారి సైన్యము అని వాడి నందువలన పాండవులు వారి సైన్యము చేసిన శంఖనాదములు, వాద్యఘోషను విని ధృతరాష్ట్రుని పుత్రులు వారి అనుయాయులు, సైన్యము, భయంతో కంపించి పోయారు అని వ్యాసుల వారు చమత్కరించారు.

## 20. అథ వ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః।
## ప్రవృత్తే శస్త్ర సమ్పాతే ధనురుద్యమ్య పాండవః॥

## 21. హృషీకేశం తదా వాక్యమ్ ఇదమాహ మహీపతే।

ఓ ధృతరాష్ట్ర మహారాజా! ఆ తరువాత ఏం జరిగిందంటే.......... ఈ ప్రకారంగా కౌరవుల సేనలు, పాండవుల సేనలు యుద్ధానికి సర్వ సన్నద్ధులై తమ తమ శంఖములు, భేరీమృదంగాలు వాయించి తమ ఉత్సాహాన్ని వీరత్వాన్ని, పరాక్రమాన్ని ప్రకటించారు. అర్జునుడి రథం మీద కపిధ్వజము ఎగురుతూ ఉంది. అంటే ఆంజనేయస్వామి వారు సాక్షాత్తు అర్జునుడు రథం మీద ఉండి యుద్ధరీతులను పరికిస్తున్నాడా అన్నట్టు ఉంది. అటువంటి రథంలో ఉన్న అర్జునుడు తన అస్త్ర శస్త్రములను సిద్ధం చేసుకున్నాడు. యుద్ధం చేయడానికి సన్నద్ధుడయ్యాడు. అప్పుడు అర్జునుడికి ఒక ఆలోచన వచ్చింది. ఇంతకూ తను ఎవరితో యుద్ధం చేయాలి. ఎవరెవరు యుద్ధభూమిలో ఉన్నారు. ఒక్కసారి చూస్తే బాగుంటుంది కదా అని అనుకున్నాడు. ఈ ఆలోచనే అర్జునుడికి రాకపోతే, నేరుగా యుద్ధంచేయడానికి ఉపక్రమిస్తే మనకు భగవద్గీత అనే యోగశాస్త్రము దక్కేది కాదు. కాబట్టి అటువంటి ఆలోచన వచ్చినందుకు మనం అర్జునుడిని అభినందించాలి. వెంటనే తన రథ సారథి అయిన శ్రీకృష్ణుని చూచి ఇలా అన్నాడు.

అర్జున ఉవాచ:

సేనయోరుభయోర్మధ్యే రథం స్థాపయ మే 2 చ్యుత॥

22. యావదేతాన్ నిరీక్షే2హం యోద్ధుకామానవస్థితాన్।
కైర్మయా సహ యోద్ధవ్యమస్మిన్ రణసముద్యమే॥
23. యోత్స్యమానానవేక్షే2హం య ఏతే2త్ర సమాగతాః।
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధేర్యుద్ధే ప్రియచికీర్షవః॥

అచ్యుతా! (పతనము లేని వాడా! ఓటమి ఎరుగని వాడా! అని శ్రీకృష్ణుని సంబోధించాడు అర్జునుడు.) నేను ఎవరెవరితో యుద్ధం చేయాలో ఒక్కసారి చూడాలని ఉందయ్యా! మన రథం సేనల మధ్యకు పోనిచ్చి అక్కడ నిలుపు. అందరినీ ఒక్కసారి తేరిపార చూస్తాను. కృష్ణా! ఈ యుద్ధానికి ఎవరెవరు వచ్చారో, ఎవరెవరితో నేను యుద్ధం చేయాలో, వారి వారి యుద్ధనైపుణ్యం ఏమిటో నేను పూర్తిగా తెలుసుకునేవరకు, మన రథాన్ని రెండు సేనల మధ్యలో నిలిపి ఉంచు. (యుద్ధము ఎప్పుడూ సరిసమానుల మధ్యనే జరుగుతుంది. మహారథి మరొక మహారథితోనే యుద్ధం చేయాలి. అంతేకానీ, మహారథి అర్ధరథితో యుద్ధం చేయకూడదు. అందుకని అర్జునుడు కౌరవ సేనలలో ఏయే మహారథులు యుద్ధానికి వచ్చారో చూడాలని అనుకున్నాడు. అందుకని తాను అందరినీ తేరి పార చూచేవరకు తమ రథాన్ని ఉభయసేనల మధ్య నిలబెట్టి ఉంచమన్నాడు అర్జునుడు.)

కృష్ణా! ఈ దుర్యోధనుడే ఒక దుర్మార్గుడు. వీడికి సాయంగా వచ్చిన వాళ్లు ఇంకెంత దుర్మార్గులో! వాళ్లందరినీ ఒక సారి చూడాలని ఉంది. ఎందుకంటే మంచి వాడు, ధర్మాత్ముడు, నీతిమంతుడు దుర్యోధనుని పక్షాన యుద్ధం చేయడు కదా! అందుకని దుర్యోధనుడికి సాయంగా వచ్చిన అధర్మపరులైన రాజులను ఒక్కసారి చూడనీ!" అని అన్నాడు అర్జునుడు.

సంజయ ఉవాచ:

24. ఏవ ముక్తో హృషీకేశో గుడాకేశేన భారత।
సేనయోరుభయోర్మధ్యే స్థాపయిత్వా రథోత్తమమ్॥
25. భీష్మ ద్రోణ ప్రముఖతస్సర్వేషాం చ మహీక్షితామ్।
ఉవాచ పార్థ పశ్యైతాన్ సమవేతాన్ కురూనితి॥.

అర్జునుడు రథికుడు. కృష్ణుడు సారథి అంటే డ్రైవర్. డ్రైవర్ యజమాని మాట వినాలి. రథం ఎలా పోనిమ్మంటే అలా పోనివ్వాలి. ఇప్పుడెందుకయ్యా చూడ్డం అంతా తెలిసిన వాళ్లే కదా అని అనలేదు కృష్ణుడు . అర్జునుడు చెప్పగానే బుద్ధిగా రథాన్ని ఇరుసైన్యముల మధ్య నిలిపాడు. అక్కడి నుండి కౌరవ సేనలు, కౌరవ సైన్యంలో ఉన్న ప్రముఖులు అనగా భీష్ముడు, ద్రోణుడు, కృపాచార్యుడు, అశ్వత్థామ అందరూ చక్కగా కనపడుతున్నారు. అర్జునా! నువ్వు కోరినట్టు రథం తీసుకొచ్చి ఇరుపక్షముల సేనల మధ్యలో నిలిపాను. అందరినీ తేరిపారచూడు. కౌరవపక్షంలో ఎవరెవరు వీరులు ఉన్నారో నీవు ఎవరెవరితో ప్రాధాన్య క్రమంలో యుద్ధం చేయాలో నిర్ణయించుకో. నువ్వు ఎవరిమీదికి రథం పోనిమ్మంటే వారి మీదికి రథం పోనిస్తాను. నీ ఇష్టం అని అన్నాడు కృష్ణుడు. గుడాకేశ అంటే నిద్రను జయించిన వాడు. అనగా తమస్సును జయించినవాడు అని అర్థం. ఇప్పటివరకు అర్జునుడు రజోగుణసంపన్నుడు కానీ కాసేపట్లో తమస్సులో పడబోతున్నాడు అని వ్యాసులవారు సూచిస్తున్నారు.

ఇక్కడ అర్జునుడు నరుడు. కృష్ణుడు నారాయణుడు. అర్జునుడిలో కూడా పరమాత్మ ఆత్మస్వరూపుడుగా ఉన్నాడు కాని ఆ విషయం ఆయనకు తెలియదు. కృష్ణుడికి తాను పరమాత్మ అంశ అని తెలుసు. ఇదే వారి ఇద్దరి మధ్య భేదం. మనం కూడా ఇంతే. మనం అందరం ఆత్మస్వరూపులము అని తెలుసుకుంటే చిక్కేలేదు. మనలను పుట్టించే వరకే పరమాత్మ బాధ్యత. ఈ భూమి మీద పడ్డ తరువాత మన ఇష్టం. పరమాత్మ ఏమీ జోక్యం కలిగించుకోడు. ఎంత కాలం ఉండాలో అంతకాలం ఉంచుతాడు. తరువాత మృత్యురూపంలో కబళిస్తాడు. అలాగే కృష్ణుడు కూడా అర్జునుడికి స్వేచ్ఛ ఇచ్చాడు. పరమాత్మ మనలో ఆత్మస్వరూపుడుగాఉండి ఎలా సాక్షీభూతుడుగా చూస్తున్నాడో, అలాగే కృష్ణుడు కూడా అర్జునుడికి సారథిగా ఉండి, కేవలం ఒకసాక్షిగా చూస్తున్నాడు. యుద్ధం చేయడం చేయక పోవడం అర్జునుడి ఇష్టం. అవసరం వచ్చినపుడు కర్తవ్యబోధ చేయడం ఆయన కర్తవ్యం.

## 26. తత్రాపశ్యత్స్థితాన్ పార్థ: పితౄనథ పితామహాన్।
## ఆచార్యాన్ మాతులాన్ భ్రాతౄన్ పుత్రాన్ పౌత్రాన్ సఖీంస్తథా॥
## 27. శ్వశురాన్ సుహృదశ్చైవ సేనయోరుభయోరపి।
## తాన్సమీక్ష్య స కౌంతేయ: సర్వాన్ బంధూనవస్థితాన్॥

యుద్ధరంగంలో అర్జునుడు తన ఎదురుగా ఉన్న ఇరు పక్షముల సైన్యములను చూచాడు. తమ సైన్యములోనూ, కౌరవ సైన్యంలోనూ ఉన్న, తన తండ్రుల వంటివారలను, తాతలను, పెద తండ్రులను, పినతండ్రులను, చదువు చెప్పిన గురువులను, అన్నదమ్ములను, మేనమామలను, కుమారులు, మనుమలను, చిన్ననాటి స్నేహితులను, మామగార్లను, ఆత్మీయులను చూచాడు. అంటే

అర్జునుడి ఎదురుగా అతని సమీప బంధువర్గం అంతా నిలబడి ఉంది. తాను వాళ్లను చంపాలి. లేక వాళ్ల చేతుల్లో చావాలి. రెండే మార్గాలు. ఒక్కసారి వీళ్ల పేర్లు, బంధుత్వాలు తెలుసుకుందాము.

తాతగారు: భీష్ముడు, ఆయన వయసు వాళ్లు. బాహ్లికుడు అందరి కంటే పెద్దవాడు.

గురువు: ద్రోణాచార్యుడు, కృపాచార్యుడు.

అన్నదమ్ములు: సుయోధనుడు అతని నూరుగురు తమ్ములు. తన పక్షాన ధర్మరాజు, భీముడు, నకుల సహదేవులు.

కుమారులు: సుయోధనుడు అతని నూరుగురుతమ్ముల కుమారులు. భీమార్జునులకుమారులు.

స్నేహితులు: అశ్వత్థామ మొదలగువారు

మామలు: ద్రుపదుడు, మొదలగువారు

తమ హితం కోరేవారు కృతవర్మ మొదలగు వారు.

మేనమామలు శల్యుడు మొదలైన వారు.

అర్జునుడు తన చిన్నప్పుడు తాత భీష్ముని ఒడిలోకూర్చుని చిట్టిపొట్టికబుర్లు చెప్పాడు. విల్లుపట్టుకోవడం నేర్పింది కృపాచార్యుడు. అస్త్రశస్త్రప్రయోగం నేర్పింది ద్రోణుడు. కూతురుని ఇచ్చింది ద్రుపదుడు. సాత్యకి తన శిష్యుడు. అశ్వత్థామ చిన్ననాటి స్నేహితుడు. ఎంత వెదికినా వీరిలో తనకు శత్రువు అనే వాడు కనిపించలేదు. తనకు వారితో శత్రుత్వము ఉంటేగదా వారిని చంపడానికి. శత్రుత్వము లేకుండా వారిని ఎలా చంపగలడు. ఎక్కడ చూచినా, ఎటు చూచినా తనకు ఏదో ఒక విధంగా బంధుత్వము ఉన్నవారే కనపడుతున్నారు కానీ కనీసం ఒక్కడు కూడా పరాయి వాడు అన్న వాడు కనిపించడం లేదు. యుద్ధం అంటూ జరిగితే వీళ్లంతా తన చేతిలో చస్తారు. ఒక్కరూ మిగలరు. ఇప్పుడు ఎలాగ?

ఆ ఆలోచన రాగానే అర్జునుడిలో భయం కలిగింది. వణుకుపుట్టింది. శరీరం గగుర్పొడిచింది. కరుణ, జాలి, దు:ఖముఅన్నీ ఒకేసారి కలిగాయి.

## 28.కృపయా పరయా22విష్టో విషీదన్నిదమబ్రవీత్।

మరలా ఒక సారి అందరినీ తేరిపారచూచాడు. దు:ఖం ఆగలేదు. మనసంతా కరుణ, జాలి, దు:ఖము, విషాదంతో నిండి పోయింది. తాను వీళ్లందరినీ చంపాలి అనే ఆలోచన రాగానే గుండె బరువెక్కింది. ఇరు పక్షాలలో లక్షల కొద్దీ సైనికులు ఉన్నారు. వాళ్లెవరో కూడా తనకు తెలియదు. కేవలం పొట్టకూటి కోసం సైనికులుగా చేరారు. అయ్యో వీళ్లందరూ ఏం పాపం చేసారని వీళ్లను నేను చంపాలి, వీళ్లంతా ఈ యుద్ధంలో చస్తే వీళ్ల భార్యాబిడ్డలు, వృద్ధులైన తల్లి తండ్రుల గతేమిటి? అనే కరుణ దయ జాలి మనసంతా నిండి పోయింది. తన భావాలు ఎవరితో చెప్పుకోవాలి. ఎదురుగా కృష్ణుడు ఉన్నాడు. తల ఎత్తి కృష్ణుడిని చూచి ఇలా అన్నాడు.

అర్జున ఉవాచ:

దృష్ట్వేమం స్వజనం కృష్ణ యుయుత్సుం సముపస్థితమ్॥

29. సీదన్తి మమ గాత్రాణి ముఖం చ పరిశుష్యతి।
వేపథుశ్చ శరీరే మే రోమహర్షశ్చ జాయతే॥

30. గాండీవం స్రంసతే హస్తాత్త్వక్చైవ పరిదహ్యతే।
న చ శక్నోమ్యవస్థాతుం భ్రమతీవ చ మే మనః॥

కృష్ణా! అందరినీ చూచానయ్యా! నా సైన్యాన్ని చూచాను. కౌరవ సైన్యాన్ని చూచాను. నా వాళ్లను చూచాను. ఎదుటి పక్షంలోని వాళ్లను చూచాను. ఇంకాసేపటిలో యుద్ధం మొదలవుతుంది. వీళ్లంతా ఒకరితో ఒకరు కొట్టుకొని చస్తారు. లేకపోతే నా చేతిలో చస్తారు. ఇదంతా అవసరమంటావా! నా తాతలు, గురువులు, స్నేహితులు, తండ్రులు, కుమారులు నా చేతిలో చస్తారు అనే మాట తలచుకుంటేనే ఒళ్లంతా చెమటలుపడుతున్నాయి. భయంతో వణికిపోతున్నాను. నోరు ఎండి పోతూ ఉంది. నిలబడలేకపోతున్నాను. కళ్లు తిరుగుతున్నాయి.

కృష్ణా! ఇదేంటయ్యా..... నా గాండీవం కూడా చేతిలో నిలవడం లేదు. జారిపోతూ ఉంది. అస్త్రములు గుర్తుకురావడం లేదు. నాకు ఏమయింది. ఏదో భ్రమ కలుగుతూ ఉంది. చర్మం అంతా వణుకుతూ ఉంది. మనస్సు నిలకడగా ఉండటం లేదు. పిచ్చి పిచ్చి ఆలోచనలతో మనసంతా వికలమైపోతూ ఉంది. ఇంక నా వల్ల కాదు. నా కాళ్లు వణుకుతున్నాయి. నిలబడలేకపోతున్నాను. అన్నీ దుశ్శకునాలు కనపడుతున్నాయి. ఈ యుద్ధంలో మనకు విజయం కలిగే సూచనలు కనపడటం లేదు. విజయం కలగనపుడు ఇంతటి మారణ హోమం అవసరమా అనిపిస్తూ ఉంది. నావాళ్లు అందరూ చావడం తప్పనిసరి అనిపిస్తూ ఉంది. ఇది అంతా నేను భరించలేను. ఈ యుద్ధం మనకు ఏ విధంగా కూడా శ్రేయస్సును కలిగిస్తుంది అన్న నమ్మకం నాకు కలగడం లేదు. శ్రేయస్సుకలగని పని చేయడం వృథా కదా!

ఈ శ్లోకాలు అర్జునుని మానసిక స్థితిని, శారీరక స్థితిని, తెలుపుతున్నాయి. దీని కంతా కారణం స్వజనం దృష్ట్వా తన వాళ్లను చూచి, వాళ్లంతా తన చేతిలో చస్తారేమో అనే మోహం, భ్రమ. మనలో కూడా సాధారణంగా పక్కింటి వాడికి కానీ, పక్కవీధిలో వాడికికానీ ఏదన్నా జరిగితే అయ్యోపాపం అని ఊరుకుంటాము. అదే మనకు, మన కుటుంబీకులకు కానీ ఇసుమంత జరిగితే మూడులోకాలు ఒకటి చేస్తాము. నానాహడావిడీ చేస్తాము. మానసికంగా

ఆందోళన చెందుతాము. డాక్టర్ల వెంట లాయర్ల వెంట అధికారుల వెంట, పరుగులు పెడతాము. నానాయాగీ చేస్తాము. ఇదంతా దేని వలన జరిగింది అంటే ఒకటే జవాబు. నావాళ్లు. స్వజనం. ఇదే మనలనందరినీ మోహంలో పడవేస్తుంది. అదే మోహంలో ఉన్నాడు అర్జునుడు. తన వాళ్లకు ఏమో జరిగిపోతుంది అని విషాదంలో మునిగిపోయాడు.

ప్రాణం ఉన్న ప్రతి వాడికీ భావోద్రేకాలు, కోరికలు, ఆశాపాశాలు, అనుబంధాలు ఉంటాయి తప్పవు. కాని అవి మితిమీరితేనే ప్రమాదం. బుద్ధి, విచక్షణా జ్ఞానం ఉపయోగించి వాటిని అదుపులో ఉంచుకోవాలి. అవి అదుపులో ఉంటే మానసిక సంఘర్షణ, మానసిక క్షోభ కలుగదు. అదుపులో ఉంచుకోవడం మానవునికి సాధ్యం కాదు. సాధ్యం కాకపోగా ఆ మానసిక క్షోభ శరీరం అంతా పాకుతుంది. దీని పర్యవసానమే బిపి, షుగర్ లెవల్సు పెరగడం. ఒళ్లంతా చెమటలు. వణుకు, దడ, కళ్లు బైర్లుకమ్మడం, నిలబడలేకపోవడం. సరిగ్గా ఇదే పరిస్థితిలో ఉన్నాడు అర్జునుడు. పోనీ అక్కడ ఏమన్నా జరిగిందా అంటే ఏమీ జరగలేదు. ఇంకా యుద్ధం మొదలవలేదు. ఎవరూ చావలేదు. అంతా క్షేమంగా ఉన్నారు. యుద్ధం జరిగితే, నేను భయంకరంగా యుద్ధం చేస్తే, నా వాళ్లు, నా బంధువులు మిత్రులు అందరూ చస్తే అమ్మో! ఇంకేమన్నా ఉందా! ఇదీ అర్జునుడి భయానికి విషాదానికి కారణం. దీనికి మన వాళ్లు ఒక అందమైన సామెత చెబుతారు. కీడెంచి మేలెంచు. ఇది ఒక వ్యర్థమైన సామెత. రైలు, బస్సు ఎక్కేముందు ఈ రైలు బస్సుకు ప్రమాదం జరిగితే అనే శంక కలిగితే ఎవరూ ప్రయాణాలుచెయ్యరు. అలాగే అర్జునుడు కూడా ఇక్కడ జరగబోయే కీడును గురించి దు:ఖపడుతున్నాడు. పోనీ అర్జునుడు ఏమన్నా పిరికి వాడు, దుర్బలుడా అంటే అదీ కాదు. మహా వీరుడు. అత్యుత్తమ ధనుర్ధారి. మహారథుడు. ఒకే సమయంలో పదివేల మందిని నిలువరించగల మహావీరుడు. కాబట్టి శారీరక బలం ఎంత ఉన్నా, మానసికంగా దుర్బలుడు అయితే, ఒక విధమైన భ్రమ అతనిని ఆవహిస్తే, శారీరక బలం ఎందుకూ పనికిరాదు. అదే అర్జునుడి విషయంలో జరిగింది. తనవాళ్లంతా తన చేతిలో చస్తారేమో అనే భ్రమలో ఉన్నాడు అర్జునుడు.

## 31. నిమిత్తాని చ పశ్యామి విపరీతాని కేశవ।
## న చ శ్రేయో2నుపశ్యామి హత్వా స్వజనమాహవే॥

మనసు ఆందోళనలతో నిండి ఉన్నపుడు అన్నీ విపరీతంగానే కనిపిస్తాయి. తాడే పాముగా భయపెడుతుంది. ఇంక శకునాల సంగతి సరేసరి. మనోదౌర్బల్యానికి గుర్తు అపశకునాలు. గాలి గట్టిగా వీచి దీపం కానీ, హారతి గానీ ఆరిపోతే అదో పేద్ద అపశకునం. ఒకప్పుడు ముత్తయిదువుగా తిరిగిన ఒక ఇల్లాలు, కాల వశాత్తు భర్తను పోగొట్టుకుంటే, ఆమె ఎదురువస్తే అది అపశకునం. కుక్క పిల్లి నీళ్ల కుండ ఎదురు రావడం, కాకులు అటు ఇటు తిరగడం ఇవన్నీ శకునాలను సూచిస్తాయి. ధైర్యంగా ముందుకు దూకే వాడికి ఇవి పట్టవు. సందేహాజీవులు, ప్రతిదీ

అనుమానించేవారికే ఇవన్నీ పట్టింపులు. వీరుడైన అర్జునుడు యుద్ధానికి ముందు శకునం చూచుకొని బయలుదేరాడో లేదో తెలియదు కానీ, ప్రస్తుతం మనోదౌర్బల్యానికి లోనయ్యాడు కాబట్టి అపశకునాల మాట ఎత్తాడు.

ఈ శ్లోకంలో కూడా మరలా స్వజనం హత్వాఅనే మాట వాడారు వ్యాసులవారు. . నా వాళ్లందరినీ చంపి. దుర్మార్గులను చంపి ధర్మం నిలబెట్టడం అనే పవిత్రమైన ఆశయంతో అర్జునుడు యుద్ధానికివచ్చాడు, కానీ, ఎదురుగా స్వజనం అనగా తన వాళ్లు కనపడేటప్పటికి జావగారిపోయాడు. నా వాళ్లందరినీ చంపితే నాకే లాభం అనే స్థితికి దిగజారాడు.

## 32. న కాంక్షే విజయం కృష్ణ న చ రాజ్యం సుఖాని చ।
## కిం నో రాజ్యేన గోవింద కిం భోగైర్జీవితేన వా॥

ఇంతెందుకయ్యా బావా! నాకు ఈయుద్ధమూ వద్దు. ఈ విజయమూవద్దు. ఈ రాజ్యమూ వద్దు. రాజభోగాలు, సుఖాలుఅసలే వద్దు. పన్నెండేళ్లు అడవులలో ఉన్నాము. ఏం సుఖాలు అనుభవించాము చెప్పు. కృష్ణా! ఈ యుద్ధం చేసి, ఇంత మందిని చంపి, మారణ హోమం సృష్టించి రాజ్యాన్ని గెలుచుకుంటే ఒరిగేదేముంది. ఈ రాజభోగాల వలనా సుఖమయ జీవితం వలనా ఏం ప్రయోజనం? ప్రయోజనం లేని పని చేయడం ఎందుకు? అసలు ఈ జీవితం ఎందుకు? అన్నీ వృథా!

అర్జునుడు రాజ్యాలు, సుఖాలు, భోగాలు వీటితో కూడిన విలాసవంతమైన జీవితం, ఏదో వీటి మీద వైరాగ్యం పుట్టి వద్దనడం లేదు. తన వారు, తన బంధు మిత్రులు లేకుండా, ఇవన్నీ ఎందుకు అంటున్నాడు. అంటే తనవారందరూ ఉంటే, తన వారు, తనకున్న రాజ్యము సంపదలు భోగభాగ్యాలు తాను అనుభవించడం చూస్తూ ఉంటే, ఈరాజ్యమే కాదు ఇంకా ఇతర రాజ్యాలు ఉన్నా ఇబ్బందిలేదు. కాబట్టి ఇక్కడ ఉన్న మూలం ఏమిటంటే తన వారులేని ఈ సుఖాలు భోగాలు, సుఖజీవితం నాకు వద్దు అనే తాత్కాలిక వైరాగ్యంలో ఉన్నాడు అర్జునుడు. (చెప్పుకుంటే బాగోదు కానీ, చాలా మంది తమకు ఉన్న ఖరీదైన బట్టలు, ఆభరణాలు ఇతరులు చూడాలనే బయటకు వెళ్లినప్పుడు మాత్రమే ధరిస్తుంటారు. ఇంట్లో లుంగీలలో, నైటీలలో ఉంటారు. భార్యకు అందంగా కనపడాలని భర్త భర్తకు అందంగా కనపడాలని భార్య ఎప్పుడూ అనుకోరు.)

ఇదీ ప్రస్తుత అర్జునుడి మానసిక పరిస్థితి. ఇప్పటిదాకా కౌరవసభలో జరిగిన అవమానానికి ప్రతీకారం తీర్చుకోవాలి, యుద్ధం చేయాలి సర్వనాశనం చేయాలి అని ఊగిన అర్జునుడు ఎదురుగా తన వాళ్లు కనపడేసరికి ఒక్కసారిగా మానసిక ఆందోళనకు గురిఅయ్యాడు.

పదమూడేళ్లు రాజ్యసుఖాలకు దూరంగా ఉండి ఎప్పుడెప్పుడు యుద్ధం చేసి, రాజ్యం గెలుచుకొని పూర్వవైభవాలు అనుభవిద్దామా అని ఉవ్విళ్లూరిన అర్జునుడు ఇప్పుడు తన వాళ్లందరూ చస్తారు అనే ఆలోచన రాగానే ఆ రాజ్యభోగాలు తుచ్ఛంగా తోచాయి. దీని కంతా మనస్సే కారణం. ఒకప్పుడు కావాలి అనుకున్నది మరొకప్పుడు వద్దు అనిపిస్తుంది. ఒకప్పుడు ధర్మం మరొకప్పుడు అధర్మంగా తోస్తుంది. ఇదంతా సమస్యను తన కోణం నుండి చూడటం వలననే జరుగుతుంది. నేను యుద్ధం చేయాలి. నా చేతిలో వీళ్లంతా చస్తారు. అనే భావన రాగానే అర్జునుడి మనసు వికలం అయింది. వికలమైన మనస్సుకు అన్నీ విపరీతంగానే కనపడతాయి. ఇంకా ఇలా అంటున్నాడు అర్జునుడు.

### 33. యేషామర్థే కాంక్షితం నో రాజ్యం భోగా: సుఖానిచ।
### త ఇమే2వస్థితా యుద్ధే ప్రాణాంస్త్యక్త్వా ధనానిచ॥
### 34. ఆచార్యా: పితర: పుత్రాస్తథైవ చ పితామహా:।
### మాతులా: శ్వశురా: పౌత్రా: శ్యాలా: సంబంధినస్తథా॥

కృష్ణా! ఈ యుద్ధం ఎందుకు చేస్తున్నాను, ఎవరికోసం చేస్తున్నాను. కేవలం నేను నా అన్నదమ్ములు సుఖపడాలని కాదు కదా. నా బంధువులు, మిత్రులు, ప్రజలు సుఖపడాలని కదా! ఆ బంధువులు, మిత్రులు, ప్రజలు నాపక్షాన, శత్రువులరూపంలో నా ఎదురుగా నిలబడి ఉన్నారు. ఒకరితో ఒకరు యుద్ధం చేసుకోడానికి సిద్ధంగా ఉన్నారు. వీరంతా వారి వారి భార్య బిడ్డల మీదా, రాజ్యముమీదా, సంపదల మీదా తుదకు ప్రాణముల మీదా ఆశలు వదులుకొని చావడానికిసిద్ధ పడి ఈ యుద్ధరంగంలో నిలబడి ఉన్నారు. వీరేకాదు నా తాతలు, తండ్రులు, అన్నదమ్ములు, పుత్రులు, మామగార్లు, మేనమామలు, మనుమలు, బావలు, బావమరుదులు, ఇంకా అనేక మంది బంధు మిత్రులు ఇక్కడ వారి వారి రాజ్యములను, సంపదలను వదులుకొని చివరకు చావడానికి సిద్ధపడి ఈ యుద్ధరంగంలో నిలబడి ఉన్నారు. యుద్ధమే కనుక జరిగితే వీరంతా మరణించడం తథ్యం. ఎవరూ లేకపోయిన తరువాత వీరందరి చితాభస్మంతో పేర్చిన భస్మసింహాసనం మీద కూర్చుని నేను ఒక్కడినే రాజ్యం ఏలుకోవాలా! రాజ్యము అంటే ప్రజలు. ఆ ప్రజలే లేకపోయిన తరువాత ఇంక రాజ్యం ఎక్కడిది. ఆ ప్రజలు లేని రాజ్యాన్ని నేను ఎలా పాలించేది. ఇంత మారణ హోమం తరువాత లభించే రాజ్యము నాకు నా అన్నదమ్ములకు సంతోషాన్ని కలిగిస్తుందా చెప్పు! ఏం కృష్ణా! మాట్లాడవు!

### 35. ఏతాన్న హన్తుమిచ్ఛామి ఘ్నతో2పి మధుసూదన।
### అపి త్రైలోక్యరాజ్యస్య హేతు: కి ను మహీకృతే॥

కృష్ణా! ఇప్పుడేచెబుతున్నాను. నేను ఈ యుద్ధం చేస్తే కేవలం కురు సామ్రాజ్యమే కాదు, భూలోకము, భువర్లోకము, సువర్లోకము నాకు లభించినా, ఈ మూడు లోకములకు నన్ను పట్టాభిషిక్తుడిని చేస్తాను అన్నా, నేను యుద్ధం చేయను. ఇదే నా తుది నిర్ణయం. కృష్ణా! నీవు ఒక మాట అనవచ్చు. "నువ్వుయుద్ధం చేయకపోతే ఎదుటి వాళ్లు ఊరుకుంటారా! వాళ్లను నీవు ఒప్పించగలవా! వాళ్ల పాటికి వాళ్లు యుద్ధం చేస్తారు. ఆ యుద్ధంలో వాళ్లు నిన్నుచంపవచ్చు" అని నువ్వు అనవచ్చు. దానికీ నేను భయపడను. వాళ్ల పాటికి వాళ్లను యుద్ధం చెయ్యనీ. ఆ యుద్ధంలో నిరాయుధిడిని అయిన నన్ను చంపనీ. నేను మాత్రం ఎవరిమీదా ఆయుధం ప్రయోగించను. ఎవరినీ చంపను. వారితో యుద్ధం చేయను. అంతే.

ఈ శ్లోకంలో అర్జునుడు కృష్ణుని మధుసూదనా! అని సంబోధించాడు. మధుసూదనా అంటే మధు అనే రాక్షసుని సంహరించిన వాడా! అని అర్థం. అంటే ఓ కృష్ణా! నువ్వు మధువు అనే వాడిని రాక్షసుడు కాబట్టి సంహరించావు. వీడినే కాదు ఎంతో మంది రాక్షసులను సంహరించావు. కాని నా ఎదురుగా నిలబడ్డవాళ్లు రాక్షసులు కాదు. సాక్షాత్తు నా తాతలు, తమ్ములు, కొడుకులు బంధువులు. వీళ్లను ఎలా సంహరించాలి! అనే అర్థంతో వ్యాసుల వారు ఈ పదం వాడారు అని పెద్దలు చెబుతారు.

## 36. నిహత్య ధార్తరాష్ట్రాన్నః కా ప్రీతిస్స్యాజ్జనార్దన। పాపమేవాశ్రయేదస్మాన్ హత్వైతానాతతాయినః॥

అర్జునుడిలో మోహం అంతకంతకూ ఎక్కువ అవుతూ ఉంది. ధర్మాన్ని అధర్మంగానూ, అధర్మాన్ని ధర్మంగానూ భావిస్తున్నాడు. దుర్మార్గులను శిక్షించి సన్మార్గులను రక్షించడం క్షత్రియ ధర్మం. కాని దానిని మరిచిపోయి, వాళ్లు అధర్మం చేసారని మనమూ అదే పని చేస్తామా. వారిని చంపుతామా! అని అంటున్నాడు.

ఓ జనార్దనా! నాకు తెలియక అడుగుతాను. అసలు ఈయుద్ధం ఎందుకుచేయాలి. ఈ యుద్ధంలో కౌరవులను చంపి నేను బావుకునేదేముంది. వీళ్లను చంపితే మనకు సుఖం, ఆనందం కలుగుతుందా! లేక పుణ్యంవస్తుందా! కేవలం వీళ్లమీద ఉన్న పగ ప్రతీకారం కోసం వీళ్లను చంపాలా! వీళ్లను చంపి ఆ పాపం మూటగట్టుకోవాలా! అది సరేనయ్యా! కౌరవులు దుర్మార్గులు. ఆతతాయిలు. ఎన్నోపాపాలు చేసారు. వాళ్లు పాపాలు చేసారని మనం చేస్తామా! వాళ్లు లక్కఇంట్లో మమ్మల్ని ఉంచి తగలబెట్టారు. మా భార్యను బట్టలూడదీసి అవమానించారు. మా ధనాన్ని అపహరించారు. మా రాజ్యాన్ని అక్రమంగా లాక్కున్నారు. మమ్మల్ని శారీరకంగా మానసికంగా హింసించారు. మాకు విషం పెట్టి చంపడానికి ప్రయత్నించారు. నిజమే! ఇవన్నీ చేసారు. వీటి వలన

మాకు ఎంతో నష్టం, మనస్తాపం కలిగాయి. మాలో పగ,ప్రతీకారం ప్రజ్వరిల్లింది. అంతమాత్రం చేత వీళ్లందరినీ చంపాలా! పాపం మూటగట్టుకోవాలా! ఈ పాపులను చంపితే మనకు పాపమే కానీ పుణ్యం రాదు కదా! ఏమంటావు? అని కృష్ణుడిని నిలదీసాడు అర్జునుడు. అధర్మాన్ని అణచ వలసిన క్షత్రియుడు పోనీ పాపం అంటున్నాడు. ఇది పిరికితనం లక్షణం. ఈ పిరికితనం అర్జునుడిలో ప్రవేశించింది. తాత్కాలికంగా తన క్షత్రియ ధర్మం మరిచిపోయేటట్టు చేసింది.

ఆ రోజుల్లో ఆతతాయిలు అంటే ఆరు రకములైన నేరములు చేసిన వారిని కఠినంగా దండించాలి. లేకపోతే పాపము అని ధర్మశాస్త్రము చెబుతూ ఉంది. అర్జునుడు క్షత్రియుడు. ధర్మశాస్త్రమును అమలు చేయవలసిన వాడు. దుర్మార్గులను శిక్షించవలసిన వాడు. అలా దుర్మార్గులను శిక్షించడం వలన పుణ్యమే కాని పాపంరాదు, దుర్మార్గులను కఠినంగా శిక్షించకపోతేనే పాపం వస్తుంది అని తెలిసినవాడు. కాని ప్రస్తుతము ఒక విధమైన మోహములో పడి ఉండటం వలన తాను చదువుకున్న ధర్మశాస్త్రములు అన్నీ తాత్కాలికంగా మరిచిపోయాడు. వాళ్లు దుర్మార్గులు, ఆతతాయిలు అయినా వాళ్లను చంపుతామా! చంపి పాపము మూటగట్టుకుంటామా! అనే వితండ వాదం చేస్తున్నాడు. పాపం కృష్ణుడు ఓపిగ్గా వింటున్నాడు.

(ఆతతాయిలు అంటే అల్లరి చిల్లరిగా తిరిగే వాళ్లు అని సాధారణ అర్థం. ఆతతాయిలు అంటే ఆరుమందిని అంటారు.

1.ఇతరుల ఇళ్లకు నిప్పుపెట్టేవాళ్లు.

2.ఇతరులకు విషం ప్రయోగంచేసేవాళ్లు.

3.ఆయుధములతో తిరుగుతూ నిరాయుధులైన ఇతరులను హింసించేవాళ్లు.

4.ఇతరుల ధనాన్ని, ఆస్తులను లాక్కునేవాళ్లు.

5.ఇతరుల భూములను ఆక్రమించుకునేవాళ్లు

6.ఇతరుల భార్యలను అపహరించేవాళ్లు.

మనుస్మృతి ప్రకారం ఇటువంటి నేరాలకు మరణశిక్ష విధించేవాళ్లు.

కొంచెం ఆలోచిస్తే ఇలాంటి వాళ్లు ఈ రోజుల్లో మన మధ్యనే పెద్దమనుషుల్లా, రాజకీయ నాయకుల్లాగా, రౌడీలుగా, కబ్జాదారులుగా చలామణీ అవుతున్నారు. వీళ్లు చట్టాలకు, పోలీసులకు అతీతులు. )

## 37. తస్మాన్నార్హా వయం హన్తుం ధార్తరాష్ట్రాన్ స్వబాంధవాన్।
## స్వజనం హి కథం హత్వా సుఖినస్స్యామ మాధవ॥

కాబట్టి ఓ మాధవా! కృష్ణా! నేను చెప్పేది ఏంటంటే ధృతరాష్ట్రుని కుమారులు నా సోదరులు. నాకు కావాల్సినవాళ్లు. నాకు దగ్గర బంధువులు. వీళ్లను చంపడం న్యాయమా చెప్పు. అయినా స్వంత వారిని, దగ్గర బంధువులను చంపుకుంటే మనకేం సుఖం లభిస్తుంది. ఏ సుఖమైనా పది మందితో పంచుకుంటేనే కదా సార్ధకత. ఏమంటావు? అని అన్నాడు అర్జునుడు.

ఇక్కడ అర్జునుడు రెండు సార్లు స్వజనమ్, స్వబాంధవాన్ అని వాడాడు. అంటే మొట్టమొదట స్వజనం అనే పదంతోనే మొదలెట్టాడు. ఇప్పుడు కూడా అదే పాటపాడుతున్నాడు. ఇంత క్రితం దుర్యోధనాదులను దుర్మార్గులు అన్న వాడు, ఇప్పుడు వారు కూడా నా బంధువులే అనే స్థాయికి వచ్చాడు. ధార్తరాష్ట్రులు మొదలగు నా యొక్క బంధువులు అని అంటున్నాడు. అంటే నేను, నాది, నావాళ్లు అనే మమకారం, రాగానుబంధం అర్జునుడిలో బాగా పాతుకుపోయింది. ఈ అహంకార మమకారాలే బంధ హేతువులు. అవి ఉన్నంత వరకు మోక్షమార్గం మనకు కనిపించదు. నేను వేరు ఈ దేహము వేరు అనుకుంటేనే ఆత్మసాక్షాత్కారం అవుతుంది. నేనే ఈ దేహము, వీళ్లంతా నా వాళ్లు, నా బంధువులు అనుకున్నంత కాలం ఆత్మ మనకు కనపడదు. ప్రస్తుతం ఈ అహంకార మమకారములతో కొట్టుమిట్టాడుతున్నాడు అర్జునుడు అన్న విషయం గమనించాడు కృష్ణుడు.

అర్జునుడు క్షత్రియుడు. న్యాయం, ధర్మం పాటించవలసిన వాడు. తప్పుచేసిన వాడిని దండించడం క్షత్రియ ధర్మం. ఆ ధర్మ నిర్వహణలో తన,మన అనే బంధాలకు తావు లేదు. కాని ఇక్కడ అర్జునుడు ఒక పక్క కౌరవులు, ఆతతాయిలు, వారు మరణదండనకు అర్హమైన తప్పులు నేరాలు చేసారు, వారు క్షమార్హులు కారు అని అంగీకరిస్తూనే, మరొక పక్క వాళ్లు నా వాళ్లు కాబట్టి వాళ్లను చంపడం అధర్మం అంటున్నాడు. అంటే ధర్మనిర్వహణలో తనవాళ్లు పరాయివాళ్లు అనే భేదం పాటిస్తున్నాడు. ఇది క్షత్రియ లక్షణం, న్యాయాధికారి లక్షణం కాదు. అధర్మ లక్షణం. పైగా నా వాళ్లను చంపుకున్నందు వలన నాకేం సుఖం లభిస్తుంది అని అంటున్నాడు అర్జునుడు. అంటే అర్జునుడికి ధర్మనిర్వహణ కన్నా తన సుఖమే ముఖ్యం అనిపించింది.

(ముద్దాయిలను విచారించి, వారు నేరం చేసారని ఋజువు అయితే వారిని శిక్షించడం న్యాయాధికారి ధర్మం. కాని అదే న్యాయాధి కారి తనకు సుఖం, లాభం కలుగుతుందని, కొంత ధనం(లంచంగా) తీసుకొని శిక్షపడవలసిన ముద్దాయిని శిక్షించకుండా వదిలేస్తే ఎలా ఉంటుందో ఇదీ అలాగే!)

### 38. యద్యప్యేతే న పశ్యంతి లోభోపహతచేతసః।
### కులక్షయకృతం దోషం మిత్రద్రోహే చ పాతకమ్॥

## 39. కథం న జ్ఞేయమస్మాభి: పాపాదస్మాన్నివర్తితుమ్।
## కులక్షయకృతం దోషం ప్రపశ్యద్భిర్జనార్దన॥

కృష్ణా! ఈ దుర్యోధనుడు, దుశ్శాసనుడు పరమ లోభులు. వారికి రాజ్యకాంక్ష, పదవీ కాంక్ష రాజ్యసుఖాలు తప్ప మరొకటి తెలియదు. వీళ్ల మనసులు భ్రష్టుపట్టాయి. వీరు బంధువులకే కాదు తమ మిత్రులకు కూడా ద్రోహం చేస్తున్నారు. ఎక్కడెక్కడి రాజులనో పిలిపించి ఈ యుద్ధంలో చచ్చేటట్లు చేస్తున్నారు. ఈ పాపాత్ములకు తాము చేస్తున్నది తప్పు, ద్రోహము, పాపము అని తెలియదు. ఈ యుద్ధం జరిగితే కలిగే వినాశనాన్ని వీళ్లు చూడలేరు. అది అటుండనీ! మనకు అన్నీ తెలుసు కదా! ఈ యుద్ధం జరిగితే అందరూ మరణిస్తారు. మగవాడు అంటూ మిగలడు. దానితో కులక్షయం అవుతుంది. కుటుంబాలకు కుటుంబాలు, వంశాలకు వంశాలు నాశనం అవుతాయి అని మనకు బాగా తెలుసు. వంశక్షయం వలన మహాపాపం చుట్టుకుంటుంది అని దుర్యోధనాదులకు తెలియకపోవచ్చు కానీ మనకు తెలుసు కదా! తెలిసి తెలిసీ ఈ మహా పాపం ఎలా చెయ్యమంటావు చెప్పు. కనీసం మనం అన్నా ఈ యుద్ధం నివారించడానికి ప్రయత్నం చేయవచ్చు కదా! నీవు రాయబారానికి వెళ్లి నీవు చేయాల్సిన ప్రయత్నం నీవు చేసావు. ఇప్పుడు కూడా దుర్యోధనుడికి నచ్చచెప్పి ఈ యుద్ధం ఆపించవచ్చు కదా! ఈ పాపం చేయకుండా నన్ను మరలించవచ్చుకదా! దుర్యోధనాదులు ఎటూ యుద్ధం విరమించుకోరు. కనీసం మనం అన్నా ఈ కులక్షయము అనే పాపం నుండి విముక్తులం కావచ్చు కదా! ఏమిటో! కులక్షయం అనే ఈ పాపం నుండి ఎలా విముక్తికావాలో అర్థం కావడం లేదు. అని నిర్వేదంగా అన్నాడు అర్జునుడు.

ఇప్పటి దాకా తన గురించి తన బంధువులు ఈ యుద్ధంలో చస్తారు అన్న అర్జునుడు ఇప్పుడు సమాజం గురించి, వంశక్షయం, కులక్షయము గురించి కూడా బాధపడుతున్నాడు.

## 40. కులక్షయే ప్రణశ్యంతి కులధర్మా: సనాతనా:।
## ధర్మే నష్టే కులం కృత్స్నమ్ అధర్మో2భిభవత్యుత॥

ఇప్పటి దాకా అర్జునుడు కేవలం తాను, తన వాళ్లు, తన బంధు మిత్రులు చనిపోతారు అది పాపం అని అన్నాడు. ఇప్పుడు కులం గురించి సమాజంగురించి ధర్మాల గురించి చెబుతున్నాడు. తన వాదనకు బలం చేకూర్చుకోవడానికి తాను అప్పటి వరకు చదివిన శాస్త్రములలోని విషయముల యొక్క, ధర్మం యొక్క సాయం కూడా తీసుకుంటున్నాడు. తాను కేవలం ఉబుసుపోకకు చెప్పడం లేదు. తాను చెప్పేది ధర్మసమ్మతము అని తనను తాను సమర్థించుకుంటున్నాడు.

వివాహము అనేది ఒక కులధర్మము. గృహస్థధర్మనిర్వహణ కొరకే వివాహము. అందుకే భార్యను ధర్మపత్ని అని అన్నారు. వేదములలో శాస్త్రములలో చెప్పబడిన అగ్నికార్యము, యజ్ఞయాగములు, వ్రతములు ఆచరించడానికి పక్కన భార్య ఉంటేనే కాని సాధ్యం కాదు. భార్యలేనిదే వేదవిహిత కర్మలు గృహస్థుచేయలేడు. ఈ ధర్మాన్ని ఆసరాగా తీసుకున్నాడు అర్జునుడు. ఈ యుద్ధం జరిగి యుద్ధంలో పురుషులంతా అంటే భర్తలు అంతా మరణిస్తే ఈ కులధర్మం, గృహస్థ ధర్మం దెబ్బతింటుంది అని అర్జునుడి వాదన. కృష్ణా! ఈ యుద్ధంలో అందరూ మరణిస్తే, మగాళ్లు అంటూ లేకపోతే, ఏనాటి నుండో మన సమాజంలో వేళ్లూకుని ఉన్న కులాలు, వాటి ధర్మాలు, గృహస్థ ధర్మాలు అన్నీ నశించిపోతాయి కదా! కులధర్మాలు నశిస్తే, పాపం వృద్ధిచెందుతుంది కదా! ఈ కులవ్యవస్థ నాశనం కావడానికి, కులధర్మాలు దెబ్బతినడానికి, తద్వారా పాపం వృద్ధిచెందడానికి ఈ యుద్ధమే కదా కారణము. ఇంతటి వినాశనానికి కారణమైన ఈ యుద్ధం నేను చేయాలా! అది అవసరమా! అని అన్నాడు అర్జునుడు.

## 41. అధర్మాభిభవాత్ కృష్ణ ప్రదుష్యంతి కులస్త్రియః।
## స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః॥

ఓ కృష్ణా! కాస్త నామాట వినవయ్యా! ఈ యుద్ధంలో మగాళ్లంతా మరణిస్తే, కులధర్మాలు నశిస్తే, అధర్మం పెచ్చరిల్లితే, విధవరాండ్రు అయిన స్త్రీలు స్వేచ్ఛగా తిరుగుతారయ్యా! వారు చేయకూడని పనులు చేసి దూషితలు అవుతారు. అప్పుడుఏం జరుగుతుందో తెలుసా! ఓ వృష్ణివంశంలో పుట్టిన మహానుభావా! వర్ణసంకరం జరుగుతుంది. ఎవరు ఎవరికి పుట్టారో, ఎవరు ఏ వర్ణమో, ఏ కులమో తెలియకుండా పోతుంది. ఈ వంశాలు ఎటుపోతాయో తెలియదు. ఇది నా వంశము అని గర్వంగా ఎవరూ చెప్పుకోలేరు. ఈ యుద్ధం వల్ల ఎంత అనర్థం దాపురిస్తుందో ఆలోచించు. అంతటితో ఆగదు కృష్ణా!

ఈ శ్లోకంలో అ ధర్మాభిభవాత్ అని అన్నారు వ్యాసులవారు. అంటే అధర్మము వృద్ధి చెందినపుడు అని అర్థం. అధర్మం అంటే ఏమిటి. పురుషార్థాలు నాలుగు. ధర్మ, అర్థ, కామ, మోక్షములు. ధర్మం అంటే ఎదుటివాడు మనసా, వాచా, కర్మణా, తనకు ఏమి చేస్తే అది తనకు బాధ కలుగుతుందో ఆ పని చేయకపోవడం. ఇతరులకు ఉపకారం చేయడం. ఇదీ సాధారణ ధర్మం. ఆ సాధారణ ధర్మమును అనుసరించి ధనం, సంపదలు సంపాదించడం, ధర్మబద్ధమయిన కామములు అంటే కోరికలు కోరుకోవడం, ఈ సంపదలు, ధనము, కర్మలు, కోరికలు వీటి అన్నిటి ఫలితములను వదిలిపెట్టడం.. అదే మోక్షము. ఇంక అధర్మము అంటే ధర్మము అనే మాటను పైవాటి నుండి తొలగించడం. అంటే ఏదో విధంగా ధనము, సంపదలు సంపాదించడం, అడ్డమైన కోరికలు అన్నీ

కోరుకోవడం వాటిని తీర్చుకోవడానికి అడ్డదారులు తొక్కడం. ఈ రెండింటిలోనే సుఖము, సంతోషము ఉందనుకోవడం. ఇదే అధర్మము. ఇక్కడ అధర్మం వృద్ధి పొందుతుంది అంటే భర్తలు లేని భార్యలు అంటే కుల స్త్రీలు కామమునకు, కోరికలకు లోనై దూషితలు అవుతారు. దాని వలన వర్ణ సంకరం ఏర్పడుతుంది.

### 42. సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్యచ।
### పతంతి పితరో హ్యేషాం లుప్తపిండోదక క్రియా॥

కృష్ణా! ఈ ప్రకారంగా కులస్త్రీలు స్వేచ్ఛగా తిరిగితే, వర్ణ సంకరం జరిగితే, కులవ్యవస్థ నాశనం అయితే, దీనికి కారణం అయిన వాళ్లంతా కులఘాతకులు అవుతారు. అటువంటి వాళ్లు నరకానికి పోతారు. అటువంటప్పుడు ఈ యుద్ధంలో చచ్చిన వాళ్లకు జల తర్పణాలు ఎవరు విడుస్తారు, పిండప్రదానం ఎవరు చేస్తారు, వారిని ఉత్తమలోకాలకు ఎవరు పంపిస్తారు. ఈ యుద్ధంలో మరణించిన వాళ్లకు అంత్యక్రియలు, శ్రాద్ధకర్మలు, జలతర్పణాలు,పిండప్రదానాలు లేకపోతే, వారంతా అధోగతి పాలు అవుతారు కదా! తలచుకుంటేనే అంతా అయోమయంగా ఉంది. దీని కంతా ఈ యుద్ధమే కారణం కాదా! ఆలోచించు.

### 43. దోషైరేతై: కులఘ్నానాం వర్ణసంకరకారకై:।
### ఉత్సాద్యంతే జాతిధర్మా: కులధర్మాశ్చ శాశ్వతా:॥

### 44. ఉత్సన్న కులధర్మాణాం మనుష్యాణాం జనార్దన।
### నరకే2నియతంవాసో భవతీత్యనుశుశ్రుమ॥

అంతేకాదు కృష్ణా! అక్షౌహిణీలకొద్దీ సైన్యం చావడానికి, దాని వలన కలిగే వర్ణసంకరానికి, కులక్షయానికి, కులధర్మాలు నాశనం కావడానికీ, జాతి ధర్మాలు అన్నీ శాశ్వతంగా నాశనం కావడానికీ ఈ యుద్ధమే కారణము. అందులో సందేహము లేదు. ఈ యుద్ధంలో మరణించిన వారికీ, వారి భార్యలకు, సంతానానికీ, యుద్ధం చేసి కులధర్మాలు, వర్ణసంకరాలు, జాతిధర్మాలు నాశనం కావడానికి కారణం అయిన ఈ యుద్ధం చేసిన వారికి కూడా శాశ్వత నరకలోకం ప్రాప్తిస్తుందని పెద్దలు చెప్పగా విన్నాను. నిజం కాదంటావా! ఇన్ని అనర్థాలకు మూలం అయిన ఈ యుద్ధం నేను చేయడం అవసరమంటావా!

## 45. అహో బత మహత్పాపం కర్తుం వ్యవసితా వయమ్।
## యద్రాజ్యసుఖలోభేన హంతుం స్వజనముద్యతాః॥

కృష్ణా! మరలా చెబుతున్నాను. దుర్యోధనాదులు సరే వెధవలు, ఆతతాయిలు. దుర్మార్గులు, దుష్టులు. వారి బుద్ధి పనిచేయడంలేదు. అందుకే యుద్ధానికి సన్నద్ధం అయ్యారు. మనం బుద్ధిమంతులం కదా! ఇంత దారుణాన్ని, మహాపాపాన్ని చేయడానికి ఎలా సిద్ధపడ్డామో అర్థంకాకుండా ఉంది. ఇదంతా దేనికి? రాజ్యం కోసం, రాజభోగాలు అనుభవించడం కోసం. అంతే కదా! ఈ తుచ్ఛమైన రాజ్యానికి, రాజ్యభోగాలకు ఆశపడి, బంధువులను, మిత్రులను చంపి, ఘోరమైన పాపం చేసి, చచ్చిన వాళ్లకు కర్మకాండలు, జలతర్పణాలు, పిండప్రదానాలు లేకుండా చేసి, అధర్మానికి ఒడిగట్టి, శాశ్వతనరకలోక వాసం కొని తెచ్చుకోమంటావా! ఇది ఎంత ఘోరమో, దారుణమో నీకు తెలుసా! దీని గురించి ఎప్పుడైనా ఆలోచించావా!

## 46. యది మామప్రతీకారమశస్త్రం శస్త్రపాణయః।
## ధార్తరాష్ట్రా రణే హన్యుః తన్మే క్షేమతరం భవేత్॥

కృష్ణా! ఇన్ని మహాపాపాలు చేసి, నరకంలో శాశ్వతంగా నివాసం ఏర్పరచుకోడం కంటే, గాండీవం వదిలిపెట్టి, అస్త్రసన్యాసం చేయడం మేలు. యుద్ధం చేయకుండా ఉండటం ఉత్తమం. ఒకవేళ శత్రువులు నన్ను చంపినా బాధలేదు. వీరస్వర్గానికిపోతాను. అంతే కానీ నరకానికి పోను. అదే నాకు క్షేమం అని తలుస్తాను. ఈ యుద్ధంచేసి, అందరినీ చంపి, వాళ్ల భార్యలను దూషితలుగా చేసి, వర్ణసంకరం, కులక్షయం చేసి, వీళ్లకు కనీసం పిండాలు పెట్టే దిక్కు కూడా లేకుండా చేసి, ఘోరపాపాలు మూటగట్టుకొని శాశ్వతంలో నరకంలో పడేకంటే, నిరాయుధుడనై శత్రువులచేతిలో చచ్చి స్వర్గానికి పోవడం మేలు కదా! ఏమంటావు కృష్ణా!

అని అర్జునుడు తానే అన్నీ చేస్తున్నట్టు, తన వల్లే అన్నీ జరుగుతున్నట్టు జరగబోయే పరిణామాలకు అన్నిటికీ తానే బాధ్యుడు అయినట్టు ఊహించుకుంటూ, ఊహాలోకాల్లో తేలిపోతూ, తెగ బాధపడిపోయాడు. విషాదంలో మునిగిపోయాడు. దుఃఖంతో కుంగి పోయాడు.

ఇది అర్జునుడి మానసిక స్థితి. శారీరకంగా ఎలా ఉన్నాడో సంజయుడు చెబుతున్నాడు.

సంజయ ఉవాచ:

### 47. ఏవముక్త్వా ర్జున సంఖ్యే రథోపస్థ ఉపావిశత్।
### విసృజ్య సశరం చాపం శోకసంవిగ్నమానసః॥

ఇప్పుడుసంజయుడు ధృతరాష్ట్రునితో ఇలా అన్నాడు. "మహారాజా! ఆ ప్రకారంగా అర్జునుడు, మనసంతా శోకంతో, శత్రువుల మీద దయతో, జాలిలో, కరుణతో నిండిన వాడై, తాను యుద్ధం చేస్తే పాపం వస్తుందనీ, యుద్ధం చేసి పాపం మూటకట్టుకోడం కంటే శత్రువులచేతిలో చావడం మేలు అని తలంచి, తన గాండీవమును, అస్త్ర, శస్త్రములను కిందపెట్టి, రథం వెనుక భాగాన ఏమీ చేతకాని వాడి వలె కింద కూర్చున్నాడు.

ఇక్కడ ధనుర్బాణములను వదిలిపెట్టడం అంటే తన స్వధర్మము అయిన క్షాత్రధర్మమును వదిలిపెట్టాడు అని అర్థం. ఇంక కృష్ణుడికి మిగిలిన అవకాశాలు రెండే. ఒకటి రథం వెనక్కుతిప్పుకొని వెళ్లిపోవడం. రెండవది అర్జునుడికి ధైర్యం చెప్పి యుద్ధము చేయడానికి ప్రోత్సహించడం. కృష్ణుడు రెండవ మార్గాన్ని ఎన్నుకున్నాడు. అదేమిటో రెండవ అధ్యాయం నుండి తెలుసుకుందాము.

ఉపనిషత్తులయొక్క, బ్రహ్మవిద్యయొక్క, యోగశాస్త్రము యొక్క సారమయిన భగవద్గీతలో,
అర్జున విషాద యోగము అను మొదటి అధ్యాయము సంపూర్ణము.
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# భగవద్గీత

## రెండవ అధ్యాయము

## సాంఖ్యయోగము

సంజయ ఉవాచ:

1. తం తథా కృపయావిష్టమ్ అశ్రుపూర్ణాకులేక్షణమ్।
విషీదంతమిదం వాక్యమ్ ఉవాచ మధుసూదన॥

సంజయుడు ధృతరాష్ట్రునితో, విషాదంలో మునిగిపోయిన అర్జునుడితో కృష్ణుడు ఇలా అన్నాడు, అని చెప్పడంతో ఈ అధ్యాయం ప్రారంభం అవుతుంది.

"ఓ మహారాజా! ఆ ప్రకారంగా అర్జునుడు శోకంతో కుమిలిపోతున్నాడు. అతని మనస్సు అంతా దు:ఖంతో, కరుణ, జాలితో నిండి పోయింది. కళ్లనిండా నీళ్లు తిరుగుతున్నాయి. అర్జునుని చిత్తము వ్యాకులంగా ఉంది. ఏమీ తోచడం లేదు. దు:ఖం పెల్లుబుకుతూ ఉంది. పెద్దగా ఏడవడం లేదు కానీ అంతపనీ చేస్తున్నాడు. ఆ స్థితిలో అస్త్రశస్త్రములను, గాండీవమును పక్కన పెట్టి, రథం వెనుక భాగాన చతికిల పడ్డ అర్జునుని చూచి కృష్ణుడు ఇలా అన్నాడు.

ఇప్పుడు అర్జునుని మానసిక స్థితి ఏమిటి? అర్జునుడు అజ్ఞానంతో ఉన్నాడు. లేనిది ఉన్నట్టు, జరగనిది జరిగినట్టు ఊహించుకుంటున్నాడు. వీటిలో పడి తన స్వధర్మాన్ని మరిచి పోయి పరధర్మాన్ని ఆశ్రయించడానికి ప్రయత్నిస్తున్నాడు. అర్జునునిలో చెలరేగిన అజ్ఞానమును అంతము చేసి అతనిని జ్ఞానవంతుని చేయడమే కృష్ణుని ప్రస్తుత కర్తవ్యము. కాని ప్రస్తుతము అర్జునుడు తీవ్రమైన విషాదంలో ఉన్నాడు. తనకు ఇటువంటి విషాదము ఎందుకు కలిగింది అనే విషయం తెలుసుకోలేని స్థితిలో ఉన్నాడు. తాను ఉన్న విషాద స్థితి సరి అయినదా కాదా అనే సందేహము ముందు అర్జునుడిలో కలగాలి. అటువంటి సందేహము కలిగిన తరువాత అతడిలో ఒక విధమైన నిస్సహాయత చోటుచేసుకుంటుంది. దిక్కుతోచని స్థితి. ఆ స్థితిలో అర్జునుడు గురువును ఆశ్రయించాలి. తనకు జ్ఞానము ప్రసాదించమని అడగాలి. అప్పుడు చేసిన ఉపదేశము ఫలవంతము అవుతుంది. అందుకని కృష్ణుడు అర్జునుని ఒకటి రెండు ప్రశ్నలతో 'కృష్ణా! నాకు నీవే దిక్కు. నాకు సరి అయిన మార్గం ఉపదేశించు' అనే స్థితికి అర్జునుని తీసుకురావడానికి ప్రయత్నం చేస్తున్నాడు.

తరువాత అసలైన గీతా బోధ ప్రారంభం అవుతుంది. ఆ ప్రశ్నలేమిటో చూద్దాం.

## 2. కుతస్త్వా కశ్మలమిదం విషమే సముపస్థితమ్।
## అనార్యజుష్టమస్వర్గ్యమ్ అకీర్తికరమర్జున॥

అర్జునా! ఒక పక్క సాధారణ సైనికులు కూడా యుద్ధం చేయడానికి ఉరకలు వేస్తుంటే, నువ్వు తీరిగ్గా కూర్చుని ధనుర్బాణాలు పక్కన బెట్టి ఏడవడానికి ఇదా సమయం! నీకు ఈ శోకము మోహము దు:ఖము మనోదౌర్బల్యము ఎలా దాపురించాయి? నీ లాంటి వీరులు,పరాక్రమవంతులు, సర్వశ్రేష్ఠధనుర్ధరులు ఇలా చేస్తారా అదీ ఈ సమయంలో! నువ్వుతప్ప ఎవరూ ఈ పని చేయరు తెలుసా! యుద్ధం చేయకపోతే నీకు స్వర్గం వస్తుందా! రాజ్యం వస్తుందా! కీర్తి ప్రతిష్టలు వస్తాయా! ఏదీ రాదు. ఘోరమైన అవమానం తప్ప. ఆ విషయం తెలుసుకో! అని సున్నితంగా మందలించాడు కృష్ణుడు.

ఏపని చేయడానికైనా సమయం సందర్భం ఉంటాయి. ఉత్తిపుణ్యానికి ఏడుస్తూ కూర్చుంటే చిరాకు పుడుతుంది. అటువంటి చిరాకే కృష్ణుడికి పుట్టింది. ఇంకా యుద్ధం మొదలు కాలేదు. ఎవ్వరూ చావలేదు. ఎవ్వరూ ఓడలేదు గెలవ లేదు. ఏవేవో ఊహించుకొని అర్జునుడు ఏడుస్తున్నాడు. పరీక్ష రాసిన విద్యార్థి, తాను పరీక్షలో పాసవుతానోలేదో, ఒకవేళ ఫెయిల్ అయితే ఆ దు:ఖం తట్టుకుంటానో లేదో అని ముందే ఆత్మహత్య చేసుకున్నాడట. ఆఖరుకు వాడు పాసయ్యాడు. అంటే జీవితంలో తప్పుడు నిర్ణయం తీసుకున్నాడు. సమస్యను ఎదుర్కోవడం మానేసి, పిరికి వాడిలా జీవితం నుండి పారిపోయాడు. ఇలా ఉంది అర్జునుడి వ్యవహారం. సమయం సందర్భం లేకుండా ఏవేవో ఊహించుకొని, ఉత్తిపుణ్యానికి ఏడుస్తున్నాడు అర్జునుడు. నేను యుద్ధం చేయను అనే తప్పుడు నిర్ణయం తీసుకున్నాడు. దుర్యోధనుడికి సమజోడీ భీముడు. కర్ణుడికి సమజోడీ అర్జునుడు. భీమార్జునులను నమ్ముకొని మిత్రరాజులందరూ యుద్ధానికి సన్నద్ధం అయ్యారు. ఇప్పుడు అర్జునుడు ఏవేవో ఊహించుకొని, మోహావేశంలో యుద్ధం చేయను అంటే వాళ్ల గతేం కావాలి. అదీ కృష్ణుడి సందేహం. పోనీ ఇటువంటి పని ఇదివరలో ఎవరైనా చేసారా అంటే అటువంటి సంఘటనలు లేవు. అందరు వీరులూ శక్తికొద్ది పోరాడి మరణించి వీరస్వర్గం పొందారే కానీ, ఎవరూయుద్ధం నుండి పారి పోలేదు. కానీ అర్జునుడు కొత్త ఒరవడి పెట్టినట్టున్నాడు. పోనీ దీనివల్ల అర్జునుడికి పేరు ప్రతిష్టలు వస్తాయా అంటే అదీ లేదు. క్షత్రియ ధర్మం అయిన యుద్ధం నుండి పారిపోయినాడన్న అవమానం మిగులుతుంది. పోనీ స్వర్గం వస్తుందా అంటే, యుద్ధంలో మరణించిన వారికే కానీ యుద్ధం నుండి పారి పోయిన వారికి వీరస్వర్గం ప్రాప్తించదు. మరి ఎందుకు అర్జునుడు తన స్వధర్మము, క్షత్రియ ధర్మము అయిన యుద్ధమునుండి విముఖుడు అవుతున్నాడు. ఇదే ప్రశ్న కృష్ణుడు అర్జునుడిని సూటిగా అడిగాడు.

## 2. క్లైబ్యం మా స్మ గమః పార్థ నైతత్త్వయ్యుపపద్యతే।
## క్షుద్రం హృదయ దౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప॥

ఈ శ్లోకంలో కృష్ణుడు అర్జునుడిని పరంతప అంటే శత్రువులను తపింపజేసేవాడా, శత్రువుల గుండెల్లో నిద్రపోయేవాడా అని అర్థం.అటువంటి వాడివి ఇలా ఎందుకు ఏడుస్తున్నావు అని వ్యగ్యంగా అన్నట్టు పరంతపా! అని సంబోధించాడు.

ఓ పరంతపా! శత్రువులకు గుండెల్లో గుబులు పుట్టించేవాడా! ఈ పిరికితనం ఏమిటయ్యా!నీలో ఎన్నడూచూడలేదు. మీ ఇంటా వంటా లేదు. అసలు ఈ పిరికితనం నీకు ఎలా వచ్చింది. క్షత్రియుడిగా పుట్టిన నీకు ఇలా పిరికితనంతో పారిపోవడం ఉచితమా! నువ్వు అనవసరంగా ఏవేవో ఊహించుకుంటున్నావు. అవన్నీ నిజాలు కావు. నీ ఊహలు అపోహలు మాత్రమే. నా మాట విని నీ హృదయ దౌర్బల్యాన్ని వదిలిపెట్టు. గుండె నిబ్బరంతో ఉండు. నీ కర్తవ్యం నీవు నిర్వర్తించు. ఇంకా అలా కూర్చున్నావెందుకు లే! ధనుర్బాణాలు తీసుకో! యుద్ధానికి సన్నద్ధం కా! అందరూ శంఖాలు పూరిస్తున్నారు. ఇంకాసేపట్లో యుద్ధం మొదలవుతుంది. అని సున్నితంగా అర్జునుని యుద్ధానికి పురికొల్పాడు కృష్ణుడు. అర్జునుడికి ఈ మోతాదు సరిపోయినట్టు లేదు. అలాగే కూర్చున్నాడు. తల పైకెత్తాడు. కృష్ణుడి వంక చూచి విషాదంతో తన పాత పాట అందుకున్నాడు.

అర్జున ఉవాచ:

## 4. కథం భీష్మమహం సంఖ్యే ద్రోణం చ మధుసూదన।
## ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హావరిసూదన॥

ఇక్కడ అర్జునుని కృష్ణుడు రెండు పదాలతో సంబోధించాడు. మధుసూదనా! అరి సూదనా! అంటే మధువు అనే రాక్షసుని చంపిన వాడా. నీ శత్రువులను దయాదాక్షిణ్యాలు లేకుండా చంపిన వాడా! అని అర్థం. అంటే అర్జునుడు కూడా కృష్ణుని వ్యంగ్యంగా సంబోధించాడు. నీవు అందరినీ చంపావని నన్ను చంపమంటావా అనే ధోరణిలో అన్నట్టున్నాడు. మధువుఅనే వాడు రాక్షసుడు. నీ మేనమామ కంసుడు నీకు శత్రువు. నిన్ను చంపాలని చూపాడు అందుకని చంపావు. కాని, ఇక్కడున్నది నా తాత భీష్ముడు. నా గురువు ద్రోణుడు. వారు ఇద్దరూ పూజింప తగిన వారు. అలాంటి వారిమీద అస్త్రప్రయోగం ఎలా చేయను. చిన్నప్పుడు ఎత్తుకొని లాలించి బుజ్జగించిన తాత గారు, బాణంఎలాపట్టుకోవాలో నేర్పిన కృపాచార్యుడు, అస్త్రశస్త్రములను నేర్పుతో ఎలా ప్రయోగించాలో నేర్పిన ద్రోణుడు ఎదురుగా ఉన్నారు. వారికి పాదాభివందనం చేసి పూజించి తరించ వలసిన నేను, వారి మీద అస్త్ర శస్త్ర ప్రయోగం చేయమంటావా? వారిని చంపమంటావా!

ఇది ఎంత దారుణం. వీళ్లు ఏమన్నా మధువు, కంసుడు లాంటి దుర్మార్గులు కాదు కదా! అని ఎదురు ప్రశ్నవేసాడు అర్జునుడు.

## 5.గురూ నహత్వా హి మహానుభావాన్ శ్రేయోభోక్తుం భైక్ష్యమపీహ లోకే। హత్వార్థకామాంస్తు గురూనిహైవ భుంజీయ భోగాన్ రుధిరప్రదిగ్ధాన్॥

పూజింప తగ్గవారు అయిన తాతగారిని, గురువులను చంపడం కన్నా, పాపం మూటగట్టుకొని, నరకానికి పోవడం కన్నా, నాలుగిళ్లు భిక్ష అడుక్కొని జీవించడం మంచిది. ఈ లోకంలోఅంతకన్నా శ్రేయస్సు మరొకటి లేదు. తాతలను, తండ్రులను, గురువులను బంధువులను స్నేహితులను చంపి వారి రక్తంతో తడిసిన రాజ్యభోగములు అనుభవించడం కన్నా పవిత్రమైన భిక్షాన్నము మేలు కదా కృష్ణా! యుద్ధం చేస్తే తుదకు నాకు దక్కేది రక్తపు కూడు మాత్రమే. భస్మసింహాసనము మాత్రమే. నా అన్న వాళ్లు ఎవరూ లేకుండా ఈ శ్మశానాన్ని ఎలా పరి పాలించమంటావు. ఈ రక్తసిక్తమైన ఈ రాజ్యసుఖాలు ఎలా అనుభవించమంటావు. దీని కన్నా నాలుగు ఇళ్లు భిక్షాటన చేసి జీవించడం మేలు అని అన్నాడు అర్జునుడు. అంటే అర్జునుడు అప్పుడే తాను అందరినీ ఓడించి, చంపి, తానే గెలిచినట్టు అనుకుంటున్నాడు కానీ జయాపజయాలు తన చేతుల్లో లేవు అనే సందేహము ఒక పక్క మనసులో తొలుస్తూ నే ఉంది.

## 6. నచైతద్విద్మ: కతరన్నో గరియో యద్వా జయేమ యది వానో జయేయు:। యానేవ హత్వా న జిజీవిషామ స్తే2వస్థితా: ప్రముఖే ధార్తరాష్ట్రా:॥

ఇప్పుడు అర్జునుడు పెద్దసందిగ్ధంలో పడ్డాడు. ఇంతకూ యుద్ధం చేయాలా! వద్దా! యుద్ధం చేస్తే మంచిదా చేయకుండా ఉంటే మంచిదా! ఏది తెలియకుండాఉంది. అప్పుడు అసలు నిజం తెలిసి వచ్చింది అర్జునుడికి. ఇంతకూ యుద్ధంలో మేము జయిస్తామా లేక వాళ్లు జయిస్తారా! ఏ విషయము ఇప్పుడు ఎలా తెలుస్తుంది. ఏమిటో అంతా అయోమయంగాఉంది. ఏది తేల్చుకోలేక పోతున్నాను. ఎదుటి పక్షంలో తాతగారు, గురువు, అన్నదమ్ములు ఉన్నారు. వారిని మేమే జయించామనుకో! అందరినీ చంపి మేము ఐదుగురము జీవించి ప్రయోజనం ఏముంది? నా సుఖాలను ఎవరితో పంచుకోవాలి. పోనీ యుద్ధం నుండి విరమించుకొని వెళ్లి పోతే ఏం చేయాలి. అడవులకు వెళ్లాలి. లేక సన్యాసం తీసుకోవాలి. అప్పుడు ఎలా జీవించాలి? భిక్షాటన చేసి జీవించాలి. క్షత్రియుడికి భిక్షాటన నిషిద్ధము. మరి జీవనం గడిచేదెలాగ! " ఇలా ఆలోచిస్తున్నాడు అర్జునుడు.

అంతే కాదు, ఇప్పటిదాకా నేను అందరినీ చంపుతాను అందరూ నా చేతిలో చస్తారు అన్న అర్జునుడు ఇప్పుడు జయాపజయములు మన చేతుల్లో లేవు. మేమన్నా గెలవవచ్చు లేక వారన్నా గెలవ వచ్చు అనే అభిప్రాయానికివచ్చాడు. ఈ విషయం తన తెలివితేటలతో తేలేది కాదు అని అనుకున్నాడు. కృష్ణుడు ఏదో చెప్పబోతుంటే తానే అడ్డుతగిలి ఏదేదో అన్నాడు. ఇప్పుడు తన వల్ల ఏమీ కాదనుకున్నాడు. అందుకే కృష్ణుని శరణు వేడుతున్నాడు.

ఓ కృష్ణా! నాలో కృపణత్వము అనే స్వభావము ప్రవేశించింది. యుద్ధం చేసి నా వాళ్లందరినీ చంపుకోవాలా లేక యుద్ధం విరమించి భిక్షాటనతో జీవించాలా...ఎటూ తేల్చుకోలేకపోతున్నాను. నా ఆలోచన మందగించింది. కాబట్టి నేను నీ శిష్యుడను. నిన్ను శరణు కోరుతున్నాను. నీవే బాగా ఆలోచించి, నిశ్చయించి, నాకు ఏదో ఒక మార్గము చూపించు. ఈ మార్గంలో నడువు అని నన్ను శాసించు. నీ ఆజ్ఞలకు నేను బద్ధుడను. అని సంపూర్ణ శరణాగతి పొందాడు అర్జునుడు.

అంటే యుద్ధం చేయను అని చతికిల పడ్డ స్థితి నుండి, నేను ఏం చేయాలి అనే సందేహస్థితిలోకి ప్రవేశించి, అక్కడి నుండి శరణాగత స్థితికి వచ్చాడు అర్జునుడు.

## 7. కార్పణ్యదోషోపహతస్వభావ: పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢచేతా:। యచ్ఛ్రేయ: స్యాన్నిశ్చితం బ్రూహితన్మే శిష్యస్తే2హం శాధి మాం త్వాం ప్రసన్నమ్॥

కృష్ణా! ఇంక లాభం లేదయ్యా! పిరికితనం నన్ను బాగా ఆవహించింది. నా స్వభావసిద్ధమైన క్షాత్రధర్మాన్ని నా పిరికితనం కప్పివేసింది. నా మనసు దయ జాలి కరుణ పిరికితనం అనే క్షత్రియ విరుద్ధమైన ధర్మాలతో గిలా గిలా కొట్టుకుంటూఉంది. ధర్మం ఏదో, అధర్మం ఏదో, ఏది చేయాలో ఏది చేయకూడదో, ఏది మంచిదో ఏది చెడ్డదో ఏమీ తేల్చుకోలేక పోతున్నాను. అంతా అయోమయంగా ఉంది. మనసంతా వికలమయింది. నా బుద్ధి పనిచేయడం మానివేసింది. నా బుద్ధికి ఆలోచించి నిర్ణయం తీసుకునే శక్తి నశించింది. ఈ సమయంలో నీవే నాకు దిక్కు. నన్ను నీ శిష్యుడిగా భావించి నాకు ఏది శ్రేయస్కరమో ముందు నీవు నిశ్చయం చేసుకొని తరువాత ఆ మార్గం నాకు చూపించు. నేను నీ మాట జవదాటను. నీవు చెప్పినట్టు చేస్తాను. నేను నీ శరణు వేడుతున్నాను. నీకు పూర్తిగా శరణాగతుడను అయ్యాను. నాకు కర్తవ్యం ఉపదేశించి. ఈ సందిగ్ధం నుండి బయట పడెయ్యి. అని అన్నాడు అర్జునుడు.

ఇప్పటి దాకా అర్జునుడు తనకు అంతా తెలుసు అన్నట్టు మాట్లాడాడు. కృష్ణుడు ఆ మాటలను ఖండించలేదు. మౌనంగా విన్నాడు. ఎందుకంటే అర్జునుడు అడగంది తాను చెప్పడం

ఎందుకని మౌనం పాటించాడు. తాను ఎంత చెప్పినా కృష్ణుడు ఒక్కమాట కూడా మాట్లాడలేదు. తనకు కర్తవ్యం ఉపదేశించ లేదు. ఇంక ఇలా లాభంలేదు అనుకొన్న అర్జునుడు నీవే తప్ప నిత:పరం బెరుగ అనే రీతిలో కృష్ణుని శరణాగతి పొందాడు.

ఎవరికైనా ఎటువంటి విపత్కర పరిస్థితులలో ఉన్నా పరమాత్మను శరణాగతి పొందితే మనశ్శాంతి లభిస్తుంది. ప్రశాంతంగా ఆలోచిస్తే ఏ సమస్య కైనా వెంటనే పరిష్కారం దొరుకుతుంది. అర్జునుడు తన శరణాగతిని పొంది తనకు కర్తవ్యమును ఉపదేశించు అని వేడగానే కృష్ణుడు గురుస్థానం వహించి మాట్లాడటం మొదలు పెట్టాడు. దానికి మూలం ముందు అర్జునుడు నన్ను నీ శిష్యునిగా అంగీకరించి నాకు కర్తవ్యబోధ చెయ్యి అని వేడుకోవడమే. అంటే శిష్యుడు గురువు దగ్గరకుచేరి తనకు జ్ఞానబోధ చేయమని అడగాలి. అప్పుడే గురువు శిష్యుని ఆదరిస్తాడు. జ్ఞానబోధ చేస్తాడు. కృష్ణుడు అదే పని చేసాడు.

ఈ శ్లోకంలో ఉపహత స్వభావ: అని వాడారు. అంటే ప్రతి మనిషికి స్వభావసిద్ధంగా కొన్ని గుణాలు ఉంటాయి. అర్జునుడికి క్షత్రియగుణం స్వభావసిద్ధము. ఆ స్వభావసిద్ధమైన గుణములను అజ్ఞానం కప్పివేస్తుంది. ఇక్కడ అర్జునుడికి స్వభావ సిద్ధమైన క్షాత్రమును, తానే అందరినీ జయిస్తాను అన్న అహంకారము. తనవలన అందరూ చస్తారు అన్న దీనత్వము, కృపణత్వము, యుద్ధం చేయడం కన్నా అడుక్కుతినడం మేలు అన్న పిరికితనము, తన వల్ల అందరూ నరకానికి పోతారు అన్న భయము, అనే అజ్ఞానము కప్పివేసింది. ఆ అజ్ఞానమును తొలగించి తిరిగి అర్జుననకు తన కర్తవ్యమును బోధించాడు కృష్ణుడు.

ఇదీ గురుశిష్యుల బంధము. శిష్యుడు తనకు ఏమీ తెలియదు అనే భావనతో గురువును ఆశ్రయించాలి. అంతేకానీ ఈయనకే తెలియదు నాకే చెబుతాడు అనే భావనతో గురువును ఆశ్రయించకూడదు. ఈ నాటి విద్యార్థులు ఈ విషయం తెలుసుకోవాలి. “ఆ లెక్చరర్ బాగా చెప్పడురా బాబూ. ఆయనకే రాదు మనకేం చెబుతాడు. ఆయన క్లాసుకు వెళ్లడం దండగ” అని అనుకోవడం మనం వింటూ ఉంటాము. అది తప్పు. తనకు ఏమీ తెలియదు. గురువు దగ్గర నేర్చుకోవాలి అనే భావన ఉండాలి తప్ప, గురువుకే ఏం రాదు అనే భావన ఉంటే, ఆయన చెప్పేది ఉండదు. ఈయన నేర్చుకునేది ఉండదు. ప్రస్తుతం అర్జునుడు శిష్యుడు. కృష్ణుడు గురువు. కృష్ణుడు అర్జునుడికే కాదు ఈ జగత్తుకే గురువు జగద్గురువు. ఈ గురువు చేసిన ఉపదేశమే భగవద్గీత. అందరికీ ఆచరణీయము అనుసరణీయము.

## 8. న హి ప్రపశ్యామి మమాపనుద్యాద్యచ్ఛోకముచ్ఛోషణమింద్రియాణామ్।
## అవాప్య భూమావసపత్నమృద్ధం రాజ్యం సురాణామపి చాధిపత్యమ్॥

పై శ్లోకంలో అర్జునుడు కృష్ణుడికి శరణాగతుడు అయ్యాడు. ఇప్పుడు తన పరిస్థితిని గురించి వివరిస్తున్నాడు.

కృష్ణా! నాలో కలిగిన ఈ శోకము, దు:ఖము, పిరికితనము నా మనసును, ఇంద్రియాలను దహించి వేస్తూ ఉంది. ఈ దు:ఖము ఎలా పోతుందో అర్థం కావడంలేదు. ఎన్ని సిరి సంపదలు, భోగభాగ్యాలు, దుర్భిక్షము అంటే ఎరుగని, శత్రువులు అంటూ లేని రాజ్యాధికారము, దేవేంద్రలోకాధిపత్యము(ఇంద్రపదవి), స్వర్గసుఖాలు, ఏమి లభించినా ఈ శోకాగ్ని చల్లారేటట్టు లేదు. కాబట్టి నీవే ఏదో ఒక ఉపాయంతో నాలో రగులుతున్న శోకాగ్నిని చల్లార్చు. నాకు కర్తవ్యబోధ చెయ్యి. నాకు ఆత్మజ్ఞానాన్ని బోధించు. నా మనసుకు శాంతి చేకూర్చు అని వేడుకున్నాడు.

ఈ పరిస్థితి నాటి అర్జునుడికే కాదు. ధనము భోగభాగ్యాలు, పదవి, హెూదా అన్నీఉన్నా మనశ్శాంతి లేకుండా బాధపడుతున్న అందరిదీ. మనశ్శాంతి కోసం ఎంతో డబ్బు ఖర్చుపెడతారు. ఎంతమందినో ఆశ్రయిస్తారు. మనశ్శాంతి ఎక్కడో లేదు. మనలోనే ఉంది. మన మనసులోనే ఉంది. మనలో కలిగిన అశాంతికి ఔషధం ఆత్మజ్ఞానమే. అదే చెప్పాడు భగవానుడు గీతలో.

సంజయ ఉవాచ:

## 9. ఏవముక్త్వా హృషీకేశం గుడాకేశ: పరన్తప
## న యోత్స్యఇతి గోవిన్ద ముక్త్వా తూష్ణీం బభూవ హ.

ఇప్పుడు సంజయుడు ధృతరాష్ట్రునితో ఇలా అన్నాడు. ఓ ధృతరాష్ట్ర మహారాజా! ఈ ప్రకారంగా అర్జునుడు కృష్ణుని తనకు జ్ఞానబోధ, కర్తవ్యబోధ చేయమని శరణువేడిన తరువాత, "ఓ కృష్ణా! నేను నీకు శిష్యుడను. గురువుగా నీవు నాకు కర్తవ్యబోధ చేసేంత వరకు నేను ఆయుధము పట్టను, యుద్ధము చేయను. నువ్వు ఏం చెయ్యమంటే అదే చేస్తాను. నీ వాక్కు నాకు శిరోధార్యము" అని గాండీవము అస్త్రశస్త్రములు కిందపెట్టి మౌనంగా కూర్చున్నాడు.

## 10.తమువాచ హృషీకేశ: ప్రహసన్నివ భారత
## సేనయోరుభయోర్మధ్యే విషీదన్తమిదం వచ:॥

అర్జునుడి పరిస్థితి చూచి, అర్జునుడి మాటలు విని, కృష్ణుడు తనలో తాను నవ్వు కున్నాడు. అన్నీ తెలిసిన అర్జునుడు ఇంత అమాయకంగా ఎలా మాట్లాడుతున్నాడా అని నవ్వుకున్నాడు. చుట్టు చూచాడు. ఇరుపక్షాల సైన్యం మధ్యలో తాము ఉన్నారు. ఇంకా యుద్ధం మొదలు కాలేదు. యుద్ధానికి ముందు జరిగే యుద్ధ నియమాలు నిర్ణయించడం మొదలగు లాంఛనాలు జరుగుతున్నాయి. ఈ లోపల అర్జునుడి మనసులో అంతులేని విషాదం మొదలయింది. యుద్ధం చేయను అని ధనుర్బాణాలు కిందపెట్టాడు. రథం మీద చతికిలపడ్డాడు. విపరీతంగా దు:ఖిస్తున్నాడు. కళ్లలో నుండి నీరు కారుతూ ఉంది. ముందు అర్జునుడిని ఈ శోకం, విషాదం నుండి బయట పడెయ్యాలి. లేకపోతే యుద్ధం ఆగిపోతుంది. కాబట్టి యుద్ధం మొదలు పెట్టే లోపల తాను అర్జునుడికి నాలుగు మంచి మాటలు చెప్పి, యుద్ధానికి సన్నద్ధుడిని చేయవచ్చు అని అనుకున్నాడు కృష్ణుడు. అర్జునుడి భుజం తట్టి చిరునవ్వుతో ఈ విధంగా అన్నాడు. అర్జునుడు బాధపడుతుంటే కృష్ణుడు నవ్వుతున్నాడు. కారణం అర్జునుడిలో అజ్ఞానం పేరుకు పోయి ఉంది. అందుకే విషాదం. కృష్ణునిలో జ్ఞానం అపరిమితంగా ఉంది. అందుకే చిరునవ్వు.

అర్జునునిలో ఉన్న అజ్ఞానాన్ని చూచి కృష్ణుడు తనలో తాను నవ్వుకున్నాడు అని కూడా పెద్దలు చెబుతారు. అది హేళన చేసినట్టు కాదు. అయ్యో ఇతడు ఇంత అమాయకుడా అనే జాలితో కూడిన చిరునవ్వు. ఒక సారి హైదరాబాద్ ఎగ్జిబిషన్ గ్రౌండ్సులో స్వామి చిన్మయానంద గారి గీతాజ్ఞాన యజ్ఞం జరిగింది. యజ్ఞం మొదటి రోజున నేను వెళ్లాను. ముందు వరసలో కూర్చున్నాను. ఆ గీతాజ్ఞానయజ్ఞానికి ఒక రాజకీయనాయకుడిని (ముఖ్యమంత్రి హోదా కలవాడిని) అధ్యక్షుడిగా పిలిచారు. అధ్యక్షుని తొలిపలుకులో ఆయన గీత గురించి చెప్పడం మొదలు పెట్టాడు. గీతను కూలంకషంగా ఆపోసన పట్టిన స్వామీజివారు, గీత గురించి ఆ రాజకీయనాయకుడు తెలిసీ తెలియకుండా మాట్లాడుతున్న మాటలకు తనలో తాను నవ్వుకోవడం నేను స్పష్టంగా గమనించాను. అప్పుడు నాకు ఈ శ్లోకం గుర్తుకు వచ్చింది.

అందుకే ఎవరు కూడా తమకు అంతా తెలుసని గొప్పలు చెప్పుకోకూడదు. తెలిసీ తెలియని ఊకదంపుడు మాటలు అసలే మాట్లాడకూడదు. పెద్దల ఎదుట అంతా తమకు తెలుసని పోజుకొట్టకుండా, వినయంగా, విధేయతగా ఉండటం సత్పురుషుల లక్షణం. అర్జునుడు అహంకారంతో, పిరికితనంతో, అజ్ఞానంతో అంతా తనకు తెలుసు అన్నట్టు మాట్లాడిన మాటలకు సర్వజ్ఞుడు, పరమాత్మ స్వరూపుడైన కృష్ణుడికి నవ్వురావడంలో వింత ఏమీ లేదు కదా!

ఇక్కడి నుండి పరమాత్మ యొక్క గీతాబోధ ప్రారంభం అవుతుంది. అర్జునుడు తన క్షత్రియ ధర్మము అయిన యుద్ధం చేయకుండా అంతులేని దు:ఖంలో, భ్రమలో మునిగిపోయాడు. ఈ దు:ఖము, భ్రమ అనేవి అర్జునుడికి తన తాతలు, తండ్రులు, బంధువులు, మిత్రులు వారి పట్ల తనకు కల అనుబంధము, వారి మీద తనకు ఉన్న ప్రేమ, మమకారము, తాను యుద్ధం చేస్తే వారు చనిపోతే, వారు తనను వదిలిపోతారేమో అనే భ్రాంతి తప్ప వేరు కాదు. ఈ భ్రమ, భ్రాంతి ఎందుకు కలిగిందంటే "వీళ్లంతా నా వాళ్లు, నాకు ప్రియం చేకూర్చేవాళ్లు" అనే భావన అర్జునుడిలో కలగడమే. ఈ భ్రమ అర్జునునిలోని వివేచనా శక్తిని, విచక్షణా జ్ఞానాన్ని హరించి వేసింది.

అర్జునుడు తన క్షత్రియ ధర్మం నెరవేర్చడానికి, యుద్ధం చేయడానికి యుద్ధభూమికి వచ్చాడు. కాని తన వాళ్లందరినీ చూచిన తరువాత, వాళ్లంతా యుద్ధంలో చనిపోతారేమో అనే భ్రమలో పడి, తాను సన్యాసిగా మారి భిక్షం ఎత్తుకొనిజీవిస్తాను కానీ యుద్ధం చేయను అనే నిశ్చయానికి వచ్చాడు. ఈ పరిస్థితి ఒక్క అర్జునుడికే కాదు అందరికీ వస్తుంది. ఎవరి విచక్షణాజ్ఞానమును, వివేచనాశక్తిని, అతనిలోని ప్రేమ మమకారాలు, హరించి వేస్తాయో అతడు తన కర్తవ్యాన్ని మరిచిపోతాడు. చేయకూడని పనులు చేయడానికి సిద్ధపడతాడు.(రాజకీయాలలో, వ్యాపారాలలో కొడుకుల మూలంగా "సన్ స్ట్రోక్స్", అల్లుళ్ల మూలంగా "సన్ ఇన్ లా స్ట్రోక్స్" తో బాధపడ్డ వాళ్లను మనం చూస్తూనే ఉన్నాము). ఒక వేళ వారు తాము చేయవలసిన పనులు చేయడానికి సిద్ధపడ్డా వారిమాటల్లో కానీ, చేతల్లో కానీ అహంకారం, కర్తృత్వభావన స్పష్టంగా కనిపిస్తుంది. తాము చేసే పనులకు ఏదో ఒక ఫలితం రావాలని ఆశిస్తారు. ఫలితం ఆశించకుండా ఏ పనీ చేయరు. అటువంటి వారిలో మంచి, చెడు, ధర్మము అధర్మము, వీటి గురించి నిత్యం సంఘర్షణ జరుగుతూనే ఉంటుంది. వారు నిరంతరం సుఖదు:ఖాలకు లోనవుతూ ఉంటారు.

అజ్ఞానము అంటే ఉన్నది లేనట్టుగా, లేనిది ఉన్నట్టుగా భావించడం, అవే సంసారానికి, బంధనాలకు మూలములు. వారిలో ఆత్మజ్ఞానము కలగనంతవరకూ ఈ అజ్ఞానము, దాని వలన కలిగే దు:ఖము, భ్రమ తొలగిపోవు. ఆ కారణం చేతనే కృష్ణ పరమాత్మ అర్జునుడికి చెబుతున్నట్టుగా, ఈ లోకానికి ఆత్మజ్ఞానం పొందడం ఎలా అనే మార్గాన్ని ఉపదేశించాడు.

శ్రీభగవానువాచ:

11. అశోచ్యానన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే।
గతాసూనగతాసూంశ్చ నానుశోచంతి పండితా:॥

ఓఅర్జునా! ఎవరి కోసం అయితే శోకించడం తగదో వారి గురించి నీవు శోకిస్తున్నావు. పైగా అన్నీ తెలిసిన పండితుని వలె నీవు మాట్లాడుతూ, నీ చర్యలను సమర్ధించుకుంటున్నావు. నీకో

విషయం తెలుసో లేదో! నిజంగా పండితులు, జ్ఞానులు, అన్నీ తెలిసిన వారు, ఇంకా ప్రాణములు పోని వారి గురించి గానీ, ఇంతకు ముందే ప్రాణములు పోయిన వారి గురించిగానీ ఎన్నడూ శోకించరు.

ఈ శ్లోకంలో మొట్టమొదటి మాటగా అన్వశోచ: అని వాడాడు వ్యాసుడు. అన్వశోచ: అంటే శోకించవద్దు. దు:ఖించవద్దు. ఇదే మాదిరి గీతను ముగించిన తరువాత ఆఖరు శ్లోకంలో ఆఖరు మాటగా మాశుచ: అంటే శోకించవద్దు అని అన్నాడు. అంటే గీతయొక్క ముఖ్య ఉద్దేశ్యము ఎవరూ శోకించకూడదు. అందరూ ఆనందంగా సంతోషంగా ఉండాలి. ఎందుకంటే ఆనందం మన అసలు లక్షణం. శోకం, దు:ఖం మనం తెచ్చిపెట్టుకుంటున్నాము. ఇక్కడ అర్జునుడు కూడా లేనిపోని దు:ఖాన్ని తెచ్చిపెట్టుకున్నాడు. ఏవేవో ఊహించుకుంటున్నాడు. బాధపడుతున్నాడు. కన్నీళ్లు కారుస్తున్నాడు. శోకించడం నీ లక్షణం కాదు అని పరమాత్మ అర్జునుడికి చెప్పాడు. అదే గీతాబోధ.

ఇక్కడ మరొక పదం ఉంది. ప్రజ్ఞావాందాంశ్చ భాషసే అంటే పెద్ద అన్నీతెలిసిన వాడి మాదిరి మాట్లాడుతున్నావు అని అన్నాడు కృష్ణుడు. నిజానికి అర్జునుడు బాగా చదువుకున్నవాడు. కాని ఆ చదువువల్ల వచ్చిన జ్ఞానం పరిమితం. ఆత్మజ్ఞానం అనంతం. ఆత్మజ్ఞానం అర్జునుడికి లేదు. కాని తనకు అన్నీ తెలిసినట్టు మాట్లాడుతున్నాడు. అదే అవివేకము.

మనలో కూడా బాగా పెద్ద పెద్ద చదువులు చదివి పెద్ద పెద్ద ఉద్యోగాలు చేస్తున్న వారుకూడా అత్యంత మూర్ఖంగా ప్రవర్తిస్తుంటారు. తమకు తెలియని దాని గురించి తమకు అంతా తెలిసినట్టు లెక్చర్లు ఇస్తుంటారు. పెద్ద పెద్ద చదువులు చదివినంత మాత్రాన అతడు జ్ఞాని కాలేడు. ఆ చదువులు అన్నీ ధనార్జనకు పనికి వస్తాయి కానీ జ్ఞానం ఇవ్వలేవు. ఆత్మజ్ఞానాన్ని ప్రసాదించేదే నిజమైన విద్య.

ఈ శ్లోకంలో మరొక మాట కూడా అన్నాడు. నానుశోచన్తి పణ్డితా: అంటే పండితులు, బాగా తెలిసిన వాళ్లు, ఆత్మజ్ఞానం పొందిన వాళ్లు, మరణించిన వారి గురించి గానీ, మరణించబోయే వారి గురించి కానీ శోకించరు. కాబట్టి శోకం నుండి మనం బయటపడాలంటే ఆత్మజ్ఞానం కావాలి. ఆత్మ తత్వం తెలుసుకోవాలి. దానినే బోధిస్తున్నాడు కృష్ణుడు. ఆత్మజ్ఞానము, ఆత్మతత్వము గురించి తెలిసినవాడే పండితుడు అనిపించుకుంటాడు కానీ కావ్యాలు, పుస్తకాలురాసినంత మాత్రాన పండితుడు కాడు. పండితుడి లక్షణం ఆత్మ అనాత్మ జ్ఞానం కలిగి ఉండటం అని స్పష్టంగా చెప్పాడు పరమాత్మ. ఆత్మ జ్ఞానం గురించి తెలిస్తే ఎవరూ దేని గురించీ దు:ఖించరు. ముఖ్యంగా చచ్చిన వారి గురించి గానీ, చావబోయే వారి గురించి గానీ, ఉన్న దాని గురించి గానీ, రాబోయే దాని గురించి గానీ, దు:ఖించరు. అంటే పండితులు దు:ఖించరు. నీవు దు:ఖిస్తున్నావు కాబట్టి నీవు

పండితుడివికావు. కాబట్టి నేను చెప్పింది శ్రద్ధగా విను అని తన బోధను మొదలు పెట్టాడు కృ ష్ణుడు.

ఓ అర్జునా! నీ దు:ఖానికి కారణం నీ అజ్ఞానమే. నీవు స్వర్గసుఖములు, రాజ్యభోగములు ఇచ్చినా ఏ దు:ఖము పోదు అని నీవు అనుకుంటున్నావో అదే అజ్ఞానము. ఆ అజ్ఞానము నుండి సంసారము పుడుతుంది. వెలుగురాగానే చీకటి పోయినట్టు, ఆత్మజ్ఞానం కలిగితే అజ్ఞానం దానంతట అదే అంతరిస్తుంది. దానితో సంసారబంధనములు కూడా నశిస్తాయి అని అన్నాడు కృష్ణుడు.

గీతలో చెప్పబడిన కర్మయోగము, జ్ఞానయోగము ధ్యానయోగము అన్నీ దీనికి అనుగుణంగానే ఉంటాయి. గీతలో పూర్తిగా జ్ఞానం గురించి చెప్పబడింది. జ్ఞానాన్ని మించిన వస్తువు మరొకటి లేదు అని కృష్ణుడే చెప్పాడు. కాబట్టి జ్ఞానమును మూలాధారంగా చేసుకొని మిగిలిన అన్ని యోగములు చెప్పబడ్డాయి. పండితుడు, జ్ఞాని, తెలిసిన వాడు, ఏడవడు. నిరాశకు నిస్పృహకు లోను కాడు. అది అతని మొదటి లక్షణం. ప్రతి దానికీ శోకించడం జ్ఞాని లక్షణం కాదు. నీవు ఏడుస్తున్నావు అంటే నీవు పండితుడివి జ్ఞానివి, తెలిసిన వాడివి కావు అని అర్థం. నీవు ఏంచెయ్యాలో తెలియని సందిగ్ధంలో ఉన్నావు. కంఫ్యూజన్‌లో ఉన్నావు. ముందు దాని నుండి బయటపడు. దానికోసం నీకు జ్ఞానం కావాలి. ఆ జ్ఞానాన్నినేను నీకు బోధిస్తాను శ్రద్ధగా విను.

పండితుడు అయిన వాడు పోయిన వాళ్ల కొరకు కానీ, పోబోయే వాళ్ల గురించి కానీ శోకించడు అంటే పండితుడికి గతంతో కానీ, భవిష్యత్తుతో కానీ సంబంధం లేదు. కారణం పండితుడికి ఎవరితోనూ సంబంధం ఉండదు. దేని మీదా ఆసక్తి ఉండదు. నీవు ఎవరి కొరకు దు:ఖించకూడదో వారి కొరకు దు:ఖిస్తున్నావు. క్షత్రియుడుగా యుద్ధం చేయడం, దాని వలన ధర్మమును కాపాడటం నీ కర్తవ్యం . వీరు అధర్మ యుద్ధం చేయడానికి వచ్చారు. నీవు వీరితో యుద్ధం చేస్తే వీరు చస్తారు అని అనుకోవడం నీ అజ్ఞానం. అలా అని నీవు ఊరుకోవడం లేదు. అన్నీ నీకు తెలిసినట్టు మాట్లాడుతున్నావు. అదీ నీ అజ్ఞానమే అని అంటున్నాడు కృష్ణుడు.

ఇప్పుడు శ్రీకృష్ణుడి ముందుఉన్న లక్ష్యాలు రెండు. ఒకటి అర్జునుడిని యుద్ధం చేయడానికి సన్నద్ధం చేయడం. రెండవది అర్జునుడికి జ్ఞానోపదేశం చేయడం. అందుకు గాను కృష్ణుడు అర్జునుడికి ధర్మ శాస్త్రము, లౌక్యము, తత్వశాస్త్రము ఈ మూడింటిని బేస్ గా చేసుకొని జ్ఞానబోధ చేసాడు. దానికి గాను రాబోయే శ్లోకములలో తత్వశాస్త్రమును బోధించాడు కృష్ణుడు. రాబోయే శ్లోకాలు అర్థం కావాలంటే తత్వము గురించి క్లుప్తంగా తెలుసుకోవడం అవసరం.

ప్రతి మానవుడు చేతనత్వము అంటే కాంషస్‌నెస్ కలిగిఉన్నాడు. చైతన్యము దేహము కన్నా వేరైనది. దేహముయొక్క భాగము కాదు. దేహము యొక్క ధర్మము కాదు. దేహములోనుండి

పుట్టినది కాదు. చైతన్యం వేరు దేహము వేరు. చైతన్యం లేకపోతే దేహం పడిపోతుంది. ఉదాహరణకు ఒక లైట్, ఫాన్, ఎసి, కూలర్ ఇవన్నీ మనకు కనిపించే వస్తువులు. ఇవి వాటంతట అని పనిచేయవు. వాటిలోకి చైతన్యం అంటే కరెంట్ ప్రవహిస్తే అని పనిచేస్తాయి. ఈ వస్తువులకు ఉనికిని ఇచ్చి అవి పనిచేసేటట్టు చేసేది మనకు కనిపించని కరెంట్ అదే చైతన్యము. ఈ చైతన్యానికి దేహము యొక్క అవలక్షణాలు ఏవీఅంటవు. మంచి లక్షణాలు కూడా అంటవు. సాక్షీభూతంగాఉంటుంది.

కాబట్టి మానవుడు తనను తాను ఆత్మగా అనుకోవాలి కానీ శరీరంగా కాదు. ఎందుకంటే శరీరం పడిపోయినా ఆత్మ ఉంటుంది కాబట్టి. ఆత్మ శాశ్వతము. శరీరం అశాశ్వతము. ఈ విషయం తెలియక అందరూ ఈ దేహమే నేను నేనే ఈ దేహము అని భ్రమలో ఉంటారు. ఈ దేహముతో సుఖము దు:ఖము అనుభవిస్తుంటారు. అయ్యో చచ్చిపోతానేమో అని భయపడు తుంటారు. చావు అంటే వినకూడని మాట అనుకుంటారు. దీనిని బేస్‌గా చేసుకొని పరమాత్మ అర్జునుడికి తత్వబోధ చేసాడు.

నేను ఈ శరీరం కాదు. నేను వేరే శరీరం వేరే అని తెలుసుకోవడమే ఆధ్యాత్మికత. అంతే కానీ గుడికి వెళ్లడం అభిషేకాలు చేయించడం ఓ స్పిరిట్యుయాలిటీ కాదు. నాకు తెలిసింది నేను చూచేది నేను కాదు. నేను ఫీల్ అయ్యేది నేను కాదు. నేను ఆలోచించేది నాకు తెలుస్తూ ఉంది కాబట్టి అదీ నేను కాదు. నా ఊహలకు అందనిదీ, నాకు కనపడనిది అదే నేను అని తెలుసుకోవడమే ఆధ్యాత్మికత. ఇది ఆలోచిస్తేకానీ అర్థం కాదు. దీనినే నేతి నేతి అనుకుంటూ ఒకటి ఒకటి తీసివేసుకుంటూ పోతే చివరకు మిగిలేది ఆత్మ. అదే పరబ్రహ్మము.

ఆత్మ లక్షణాలు. అప్రమేయ: చూడటానికి వీలు కానిది. మనకు రెండింటిని గురించి తెలుసు. ఒకటి చూచేది. రెండు చూడబడేది. చూచేది ఆత్మ అయితే చూడబడేది అనాత్మ అంటే ప్రాపంచిక వస్తువులు.  దేనినైతే మనం చూస్తున్నామో అది ఆత్మకాదు. ఏదైతే చూస్తూ ఉందో, దానిని మనం చూడలేము. అందుకే ఆత్మను అప్రమేయము అని అన్నారు.  కాని ఆత్మ అనేది ఒకటి ఉన్నది అని శాస్త్రజ్ఞానము చేత  తెలుసుకుంటాము. కాబట్టి తెలుసుకోబడేది మాత్రమే ఆత్మ.  నిత్యం అంటే ఎల్లప్పుడూ ఉండేది. అంటే నాశము లేనిది, మార్పులేనిది. ఒకప్పుడు ఉండి మరొకప్పుడు లేకుండా పోయేది కాదు. ఉదాహరణకు మన శరీరం ఉంది.  అది కొంత మేం స్పేస్ ఆక్రమించి ఉంది. అలాగే శరీరానికి కొంత కాల పరిమితి ఉంది. శతాయు: అంటే వంద సంవత్సరాలు. ఆ తరువాత ఈ శరీరం ఉండకుండా పోతుంది. కాని శరీరంలో ఉన్న ఆత్మ కు ఈ ధర్మాలు లేవు. ఆత్మ నిత్యము. ఎల్లప్పుడూ ఉంటుంది.  సర్వగతం...అవధులు లేనిది. సర్వవ్యాపకత్వము కలది.  అందుకే పరమాత్మను  విష్ణువు అంటారు  వ్యాపక శీలత్వాత్ విష్ణు:. సర్వం వ్యాపించి ఉన్న దానికి అంతటా నిండి ఉన్నదానికి కదలిక ఉండదు.అకర్త:, ఏ పనీ చేయనిది. అభోక్తా:, దేనిని అనుభవించనిది. ఈ ఆత్మస్వరూపాన్ని గురించి మనం అందరం తెలుసుకుంటే రాబోయే శ్లోకాలు చక్కగా అర్థం అవుతాయి.

## 12. న త్వేవాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపా:।
## న చైవ న భవిష్యామ: సర్వే వయమత: పరమ్॥

ఓ అర్జునా! నేను కానీ, నువ్వుకానీ, ఈ రాజులు కానీ, సైనికులు కానీ, నువ్వు అంటున్నావే నా తాతలు, తండ్రులు, సోదరులు, కుమారులు, మనుమలు, మేనమామలు అని, వీళ్లందరూ కూడా ఇప్పటి వరకు లేకుండా ఉండని కాలము లేదు. భవిష్యత్ కాలములో ఉండబోరు అనే మాట కూడా లేదు. అంటే మనం అందరం గతంలో ఉన్నాము, ఇప్పుడూ ఉంటున్నాము, భవిష్యత్తులో కూడా ఉంటాము. కాబట్టి ఈ రోజు ఉన్నాము రేపు ఉండము అన్న ప్రసక్తి లేదు.

ఇదీ కృష్ణుడు మొట్టమొదటి పాఠము. ఈ ఒక్కపాఠం చక్కగా అర్థం చేసుకుంటే గీత అంతా అర్థం అయినట్టే. గీత పూర్తిగా ఇదే సిద్ధాంతం మీద ఆధారపడి ఉంది. ఈ శ్లోకంలో ఒక పదం వాడాడు వ్యాసుడు. వయం సర్వమ్ అంటే మనం అందరం. అంటే కృష్ణుడు కూడా మనలాంటి వాడే. కాకపోతే ఆయనకు ఆత్మజ్ఞానము ఉంది. మనకు లేదు. ఇక్కడ మనం అందరం అంటే కృష్ణుని శరీరము, నా శరీరము, నీ శరీరము అని కాదు. శరీరములో ఉండే ఆత్మస్వరూపము. అది ఒకటే. శరీరాలు వేరు. అందరిలో ఉన్న ఆత్మ ఒకటే. ఒకే ముద్దగా ఉన్న బంగారంలో నుండి ఎన్నో ఆభరణాలు తయారవుతాయి. మరలా ఆ ఆభరణాలు అన్నీ కరిగిస్తే, వాటిలోని మకిల పోయి స్వచ్ఛమైన బంగారం ముద్ద అవుతుంది. పరమాత్మ అన్నీ జీవరాసులలో ఆత్మస్వరూపుడుగా ఉన్నాడు. ఆ ఆత్మ ప్రాపంచిక విషయములలో తగులుకొని జీవాత్మగా మారుతుంది. వాసనలు మూటగట్టుకుంటుంది. జనన మరణ చక్రంలో తిరుగుతూ ఉంటుంది. ఆ వాసనలు పోగానే, అంటే బంగారములో ఉన్న మకిల పోగానే స్వచ్ఛమైన బంగారంగా మారి ముద్ద అవుతుంది. బంగారము అగ్నిలో వేస్తే శుద్ధిఅవుతుంది. జీవాత్మ ఆత్మజ్ఞానము అనే అగ్నిలో కాలిస్తే పరిశుద్ధ ఆత్మఅవుతుంది. పరమాత్మలో లీనం అవుతుంది. కాబట్టి బంగారం ఎల్లప్పుడూ ఉంటుంది. ఆభరణాలు మారుతూ ఉంటాయి. మట్టి ఒక్కటే. రకరకాల కుండలు తయారవుతుంటాయి. అలాగే పరమాత్మ ఒక్కడే. శరీరాలు మారుతూ ఉంటాయి.

1.ఆత్మ నిత్యము

2.ఆత్మ అందరిలో ఉంది.

3.ఆత్మ కు నాశనము లేదు.

4. ఆత్మ దేహము కాదు.

5.దేహము నశిస్తుంది కానీ ఆత్మ కాదు.

ఈ ముఖ్యసూత్రాలు మొట్ట మొదటగా వివరించాడు పరమాత్మ. ఈ సూత్రాలను అవగాహన చేసుకుంటే జీవుడికి దు:ఖము అనేది ఉండదు. తన మరణము గురించి గానీ, ఎదుటి వారి మరణము గురించి గానీ బాధపడడు. శోకించడు. ప్రస్తుతము అర్జునుడు చేస్తున్న పని అదే. ఈ సూత్రము తనకే కాదు అర్జునుడికేకాదు అందరికీ వర్తిస్తుంది అని చెప్పాడు కృష్ణుడు. ఈ మొదటి పాఠంలోనే మనకు ఆత్మజ్ఞానము గురించి అవగాహన కల్పించాడు పరమాత్మ.

ఆత్మ సత్యం. సత్యం అంటే ఎప్పటికీ మూడుకాలములలో మార్పులేకుండా ఉండేది. మార్పుకు లోనయ్యేదికాదు. నేను, నీవు, అందరూ, లేను అనే స్థితి లో ఎప్పుడూ లేము. అందరం ఇదివరకు ఉన్నాము. ఇప్పుడు ఉంటున్నాము. ఇక ముందూ ఉంటాము. కేవలం ఈ శరీరాలు మాత్రమే మారుతుంటాయి. నీచేత చంపబడతారు అని నీవు అనుకుంటున్న ఈ రాజులందరూ ఇదివరకూ ఉన్నారు. ఇంక ముందూ ఉంటారు. ఆ మాటకొస్తే ఎల్లప్పుడూ ఉన్నారు, ఉంటారు. భవిష్యత్తులో కూడా ఉంటారు. కాకపోతే ఆత్మస్వరూపంలో ఉంటారు. శరీరాలను దుస్తులు మార్చినట్టు మారుస్తుంటారు. . అర్జునా! ఈ దేహం లేకుండా పోయినా నీవు నేను అందరం ఉంటాము. ఈ పేర్లు, రూపములు అన్నీ నిజం కాదు. కాబట్టి ఈ రోజు ఉండి రేపు ఉండని శరీరాల గురించి చింతించడం అవివేకము.

## 13. దేహినో2స్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా।
## తథా దేహాంతర ప్రాప్తి: ధీరస్తత్ర న ముహ్యతి.

పైన చెప్పిన విషయాన్ని ఇంకొంచెం వివరంగా చెప్పాడు పరమాత్మ. ప్రతి మనిషి పుట్టినప్పటి నుండి మరణించే దాకా ఎన్నోదశలను అనుభవిస్తుంటాడు. మొదట వెల్లకిలా పడుకుంటాడు. తరువాత బోర్లాపడతాడు. లేచి కూర్చుంటాడు. పట్టుకొని నిలబడతాడు. తప్పటడుగులు వేస్తాడు. సరిగ్గా నడుస్తాడు. గబగబా నడుస్తాడు. పరుగెత్తుతాడు. జీవితం అంతా అర్థం పర్థంలేని కోరికల వెంట పరుగెడుతూనే ఉంటాడు. బాల్యం, కౌమారం, యవ్వనం, వృద్ధాప్యం, మరణం ఇలా ఒకదాని వెంట ఒకటి వస్తూనే ఉంటాయి. వీటిని ఎవరూ ఆపలేరు. అలాగే మరణం తరువాత ఈ దేహం పోతే మరొక దేహం వస్తుంది. దానినీ ఎవరూ ఆపలేరు.

ఈ దేహము శాశ్వతము కాదు. దహన యోగ్యమైనది కాబట్టే దానిని దేహము అని అన్నారు. నూరు సంవత్సరాలు జీవించినా, ఎప్పుడో ఒక రోజు ఈ దేహము పడిపోతుంది. ఆ తరువాత ఒక్కరోజు కూడా ఉంచము. దహనం చేస్తాము. కాబట్టి ఈ దేహము విషయంలో ఎవరూ మోహం చెందకూడదు. అంటే ఈ దేహమే నిత్యము. ఈ దేహము పోతే మనం సర్వనాశనము అవుతాము అని అనుకోవడం, మన కళ్లెదుట ఎంతోమంది చస్తున్నా, మనం మాత్రం కలకాలం జీవించి

ఉండాలనుకోవడం, పుడితే పండుగ జరుపుకోవడం, చస్తే ఏడవడం, ఇదే మోహము. ప్రతి వాడూ ఈ మోహము నుండి బయటపడాలి. ఇది కృష్ణుని రెండవ పాఠము.

ఇక్కడ దేహి అని వాడాడు వ్యాసుడు. దేహి అంటే దేహము కలవాడు, దేహము ధరించిన వాడు. సంపద కలవాడు సంపన్నుడు. సంపద వేరు. అది కలిగిన వాడు వేరు. అలాగే దేహము వేరు దేహము ధరించిన వాడు వేరు. దేహమునకు బాల్యము, యవ్వనము, వృద్ధాప్యము, మరణము కలుగుతాయి కానీ దేహము ధరించిన వాడికి కాదు. ఈ విషయం ప్రతి వాడూ తెలుసుకోవాలి. ఇది తెలుసుకుంటే ఏ దు:ఖమూ ఉండదు. ఎందుకంటే బాల్యము నుండి యవ్వనంలోకి వచ్చినపుడు, యవ్వనంలోనుండి వృద్ధాప్యమునకు వచ్చినపుడు ప్రతి సంవత్సరం పుట్టినరోజు పండుగలు జరుపుకుంటూ ఆనందిస్తున్నాము. వృద్ధాప్యము నుండి మరణం సంభవించినపుడు మాత్రం ఏడుస్తున్నాము. ఇదీ ఒక పరిణామము అని అనుకోవడం లేదు. ఇదే అజ్ఞానము. అవివేకము. మోహము. మాయ. ఏ పేరుతో పిలిచినా ఒకటే. బాల్యం నుండి యవ్వనంలోకి రావడం ఎంత సహజమో, వృద్ధాప్యమునుండి మరణంలోకి జారుకోవడం అంతే సహజం. అప్పటికే శిథిలమై పోయిన శరీరాన్ని విడిచిపెట్టి మరలా కొత్త శరీరాన్ని ధరించడం అత్యంత సహజ పరిణామము. ఈ రహస్యాన్ని అందరూ తెలుసుకుంటే ఎవరూ మరణించినపుడు దు:ఖించరు. ధీరుడుగా ఉంటాడు. ధైర్యంగా ఉంటాడు. ఇన్నాళ్లు మన మధ్య తిరిగిన శరీరం ఒక్కసారిగా ఉండదు అనుకుంటే కొంచెం బాధగా ఉంటుంది. ఇండియాలో ఉండి, యం.యస్ చదవడానికి అమెరికా వెళ్లి అక్కడ ఉద్యోగం సంపాదించి సెటిల్ అయిన వాడి గురించి మనం ఏడవడం లేదు. పైగా శుభాకాంక్షలు చెబుతున్నాము. మనమధ్య తిరిగినవాడు అమెరికా వెళ్లినా కనపడడు. మరణించినా కనపడడు. అమెరికా వెళ్లిన వాడి గురించి సంతోషిస్తాము. మరణించిన వాడి గురించి దు:ఖిస్తాము. ఇదే అజ్ఞానము.

ఈ శ్లోకంలో కృష్ణుడు పునర్జన్మ సిద్ధాంతాన్ని చూచాయగా చెప్పాడు. ఉపాధ్యాయుడు కూడా ఒక గంభీరమైన విషయాన్ని చెప్పబోయే ముందు దాని గురించి విద్యార్థి కి సూచన ప్రాయంగా తెలియజేస్తాడు. తరువాత విపులంగా చెబుతాడు. ఇక్కడ కృష్ణుడు అదే పని చేస్తున్నాడు. అందుకే కృష్ణుడు జగద్గురువు అయ్యాడు.

నాడు అర్జునుడు, నేడు మానవులు. అందరూ ఈ దేహమే నేను అనుకుంటున్నారు. ఈ నాడు ఉండి రేపు మట్టిలో కలిసిపోయే ఈ దేహం కోసరం బాధపడటం అవివేకము. శరీరం పంచభూతములతో ఏర్పడింది. దాని కాలం తీరగానే విడిపోతుంది. దేహము అంటే దహన యోగ్యము అయినది.. ఒక రోజు కాల్చబడేది దేహము. దేహము నిరంతరం మార్పుకు లోనవుతూ ఉంది. ప్రతిక్షణం లక్షలాది కణాలు పుడుతున్నాయి, మరణిస్తున్నాయి. మనదేహంలో ప్రతి 12 సంవత్సరాలకు పూర్తి మార్పువస్తుంది అని బయాలజీ చెపుతుంది. అందుకే ఈ దేహానికి బాల్యం, కౌమారం, యవ్వనం,

ముసలి తనము అనే నాలుగు అవస్థలు ఉన్నాయి కదా. చిన్నప్పటి ఫోటో చూపిస్తే ఎవరూ గుర్తుపట్టరు. కాని అది నేను అంటారు. అ ఫోటోలో ఉన్నది 2 అడుగుల మనిషి ఇప్పుడు ఆరడగుల బుల్లెట్. కాని అదే నేను అంటాడు ఆ బుల్లెట్. ఇది ఎలా సాధ్యం అంటే ఆనాడూ ఈ నాడూ రేపూ ఆ దేహంలో ఉండేది ఆత్మ. అదే నువ్వు. దేహము మార్పుకు లోనయింది. అలాగే మానవులు ఈ దేహములు వదిలిపెట్టడం అనివార్యం. ఈ పరిణామాన్ని ఎవరూ తప్పించలేరు. ఈ దేహం విడిచిపెట్టిన తరువాత మరొక దేహం వస్తుంది. అది వేరే దేహం కావచ్చు.

అర్జునుడికి చిన్నప్పుడు ఎత్తుకొని ముద్దలు తినిపించిన భీష్ముడు ఇలా లేడు కదా. అర్జునుడికి చిన్నప్పుడు విల్లు పట్టడం నేర్పిన కృపాచార్యుడు ఇలా లేడు కదా అలాగే ద్రోణుడు. వాళ్లు వేరు వీళ్లు వేరు. కాని వీళ్లలో ఉండే ఆత్మ ఒకటే. అది వీళ్లు మరణించిన తరువాత కూడా ఉంటుంది. ఎక్కడకూ పోదు. ఈ సత్యాన్నే కృష్ణుడు అర్జునుడికి వివరించాడు. కాని అర్జునుడు మాత్రం వారి దేహములే శాశ్వతము అనుకుంటున్నాడు.

ఈదేహంలో ప్రాణం ఇలాగే ఉండాలి. ఎల్లప్పుడూ ఈ దేహంతో భోగాలు అనుభవిస్తుండాలి అనుకునే వాడిని అసురుడు అంటారు. అందుకే అసురులు తపస్సులు చేసి మోక్షం కోరలేదు. చావు లేకుండా వరం కోరుకున్నారు, ఎవరి చేతిలోనూ చావు లేకుండా, తాను చేయిబెడితే ఎదుటి వాడు చావాలనీ కోరుకుంటారు. అందుకే వారిని అసురులు అని అన్నారు. ఈ దేహము కాలమునకు అధీనము. కాలం తీరగానే దేహం పడిపోవడం అత్యంత సహజము. దానినే మృత్యువు అని అంటాము. పుట్టడం ఎంత సహజమో మృత్యువు కూడా అంతే సహజం. కాబట్టి తాను యుద్ధం చేస్తే వీళ్లంతా నా చేతిలో చస్తారు అనడం అర్జునుడి అవివేకము. "అర్జునా! యుద్ధంలో నీవు వీరిని చంపకపోయినా కాలం తీరగానే వీరంతా చావడం తప్పదు. మరలా వీరంతా కొత్త దేహములు ధరించడం కూడా తప్పదు. కాబట్టి ఈ అజ్ఞానమును పారదోలి, యుద్ధానికి సన్నద్ధం కా!" అని బోధించాడు కృష్ణుడు.

## 14. మాత్రా స్పర్శాస్తు కౌన్తేయ శీతోష్ణ సుఖదు:ఖదా:
## ఆగమాపాయినో2నిత్యాస్తాం స్తితిక్షస్వ భారత॥

కృష్ణుడు మరి కొంత విపులంగా చెబుతున్నాడు. అర్జునా! మనకు పది ఇంద్రియములు ఉన్నాయి కదా! వాటికి శబ్ద,స్పర్శ,రస,రూప,గంధములు లక్షణములు. శరీరములో ఉన్న జ్ఞానేంద్రియములు ఈ లక్షణములతో కలిసినపుడు, సుఖము(మనకు అనుకూలంగా జరిగితే),

దు:ఖము (మనకు ప్రతికూలంగా జరిగితే), ఉష్ణము(వేసవి కాలంలో), శీతలము (విపరీతమైన చలికాలంలో), మనకు వస్తూ పోతూ ఉంటాయి. కంటికి కొన్ని ఇంపుగా, మరి కొన్ని అసహ్యంగా కనిపిస్తాయి. అలాగే చెవులకు కొన్ని మాటలు వీనుల విందుగా, మరి కొన్ని మాటలు కంటకంగా వినిపిస్తాయి. అలాగే మంచి వాసనలు, చెడు వాసనలు. ఇంక చర్మం అసలైనది. శీతోష్ణములను భరించేది అదే. ఎండ కాస్తే ఉక్క, వానాకాలంలో చిత్తడి, శీతాకాలంలో చలి వీటిని తిట్టుకోవడం. కాని ఎండాకాలం పోగానే శీతాకాలం వస్తుంది. శీతాకాలం పోగానే ఎండా కాలం వస్తుంది. అలాగే సుఖము పోగానే దు:ఖము, దు:ఖము పోగానే సుఖము వస్తుంటాయి. ఇలా వస్తూ పోతూ ఉంటే పరిణామాలకు, అనిత్యమైన పరిణామాలకు, ఓర్చుకోవాలే గానీ, శోకించకూడదు అనే జ్ఞానం ఉంటే శీతోష్ణాలు ఏమీ చేయవు. అన్నీ సంతోషంగానే అనిపిస్తాయి. కాబట్టి అన్నిటినీ సమదృష్టితో చూడాలి. సహించడం నేర్చుకోవాలి. ఓర్పువహించాలి. ధైర్యంగా ఎదుర్కోవాలి. అలాగే వృద్ధాప్యం తరువాత వచ్చే మరణానికి కూడా శోకించకూడదు. ఎందుకంటే మరణం కూడా శరీరానికి కలిగే ఒక అనివార్యమైన పరిణామము. అది శరీరానికే కానీ ఆత్మకు కాదు. భీష్ముడు మొదలగు వారు వృద్ధులు. వారు యుద్ధం జరిగినా జరగకపోయినా, చావడం తప్పదు. వారి మరణం కోసం శోకించడం తగదు అని కృష్ణుని బోధ.

ఓ అర్జునా! మన దేహములో ఉండే అవయవములు బయట ప్రపంచంలో వాతావరణ మార్పులకు అనుగుణంగా స్పందిస్తుంటాయి. ఎండ, వాన, చలి కలిగిస్తుంటాయి. వాటి వలన సుఖము దు:ఖము కలుగుతుంటాయి. వాతావరణమార్పులు కానీ, సుఖ దు:ఖములు కానీ ఎల్లకాలము ఉండవు. మారుతూనే ఉంటాయి. ఒకదాని వెంట ఒకటి వస్తూ పోతూ ఉంటాయి. చక్రంలో మాదిరి తిరుగుతూ ఉంటాయి. కాబట్టి వాటికోసం దు:ఖించడం అవివేకము. వాతావరణంలో కలిగే మార్పులను సుఖదు:ఖములను సహించడమే విజ్ఞుల లక్షణము. వాటి గురించి ఆలోచంచక పోవడం, పట్టించుకోకపోవడం ఉత్తమం. శీతాకాలంలో చలిగా ఉండటం, ఎండా కాలంలో వేడిగా ఉండటం వాటి సహజ లక్షణాలు. మనకు అసౌకర్యంగాఉందని అవి తమ సహజ లక్షణాలు మార్చుకోవు. మనమే వాటికి అనుగుణంగా మనలను మనం మార్చుకోవాలి. అంటే వాటిని సహించాలి. అలాగే యుద్ధం చేయడం క్షత్రియుని సహజ లక్షణం. అది ఎన్నటికీ పోదు. యుద్ధంలో హింస కూడా సహజమే. యుద్ధానికి, హింసకు తగ్గట్టు నీవు మారాలి. అంతే కాని యుద్ధంలో హింస జరుగుతుంది కదా అని అస్త్ర శస్త్రములకు మారుగా పూలు చల్లుకోరు. కాబట్టి అర్జునా! బయట ఉన్న సహజ లక్షణములకు నిన్ను నీవు అనుకూలంగా మార్చుకోవాలి కాని అవి మారవు కాబట్టి వాటిని ఓర్పుతో సహించడం నేర్చుకోవాలి. దానినే తితిక్ష అని అంటారు. మంచి చెడు, సుఖము దు:ఖము, శీతోష్ణాలు, జయాపజయాలు వస్తూ పోతూ ఉంటాయి. వాటిని ఏ మాత్రం ద్వేషం లేకుండా, సంతోషంగా సహించడమే విజ్ఞుల లక్షణము. అంటే సుఖం వచ్చినపుడు ఎగిరి గంతెయ్యడం, దు:ఖం వచ్చినపుడు కుంగిపోవడం, శోకించడం పనికిరాదు, అని బోధించాడు కృష్ణుడు.

## 15. యం హి న వ్యథయన్త్యేతే పురుషం పురుషర్షభ।
## సమదు:ఖసుఖం ధీరం సో2మృతత్వాయ కల్పతే॥

ఏ వ్యక్తిని అయితే బయట ప్రపంచంలో ఉన్న ఆకర్షణలు, వాటి వలన కలిగే సుఖ దు:ఖములు ఎటువంటి బాధను కలిగించవో, ఎవరైతే సుఖము దు:ఖము పట్ల సమభావము కలిగి ఉంటాడో, అటువంటి ధీరుడికి అమృతత్వము లభిస్తుంది.

బయట ప్రపంచంలో లభించే విషయముల వలనా, రకరకాలుగా మోహింపజేసే వివిధములైన వస్తువుల వలనా, అవి కావాలి, వాటిని అనుభవించాలి అనే కోరికలు పుడతాయి. ఆ కోరికలు తీరితే సుఖం కలుగుతుంది. తీరకపోతే దు:ఖం కలుగుతుంది. ఇది సహజము. ధీరుడు అంటే బలము, పరాక్రమము కలవాడు అనే కాదు. ప్రాపంచిక విషయములకు, విషయ సుఖాలకు, కామకోరికలకు చలించని వాడు. వాటి వైపు ఆకర్షింపబడని వాడు. ప్రాపంచిక విషయముల వెంట పరుగెత్తని వాడు. వాడే నిజమైన ధీరుడు. అటువంటి వాడికి కోరిక తీరినందువలన సుఖము లేదు కోరిక తీరనందువలన దు:ఖము లేదు. సుఖ దు:ఖములను సమానంగా చూడగలడు. సుఖ దు:ఖములు మనో వికారములు అనీ, అవి ఒకదాని వెంట ఒకటి వస్తూ పోతూ ఉంటాయనీ, వాటి కోసం పొంగి పోవడం, కుంగి పోవడం అవివేకమనీ తెలిసిన వాడు. అటువంటి ధీరులు మోక్షము పొందడానికి అర్హులు.

ఈ శ్లోకంలో ఒక జాతిని కానీ, ఒక వర్ణముగానీ, ఒకమతము కానీ అనలేదు. అందరూ మోక్షానికి అర్హులే. కాకపోతే వారు సుఖ దు:ఖములను సమానంగే చూడగలిగే ధీరత్వము కలిగి ఉండాలి. ప్రకృతి లక్షణాలకు అనుగుణంగా తనను తాను మార్చుకోగలిగిన ధీరత్వము కలిగి ఉండాలి. దేనికీ భయపడకూడదు, బాధపడకూడదు. సుఖము వచ్చినా దు:ఖము వచ్చినా సమంగా అనుభవించగలిగిన ఓర్పు, నేర్పు కలిగి ఉండాలి. అటువంటి వాడు మోక్షమునకు అర్హుడు. ఈ శ్లోకంలో అమృతత్వము అనే పదం వాడారు. అమృతము అంటే మృతము లేనిది. చావు లేనిది. అంతము లేనిది, నాశము లేనిది. మార్పుచెందనిది. అని అర్థము. శరీరానికి పై చెప్పిన లక్షణాలు అన్నీ ఉన్నాయి. కాబట్టి సుఖదు:ఖాలు సమానంగా భావించే ధీరుడికి శరీరం ధరించే అవసరం ఉండదు. అంటే ఈ జనన మరణ చక్రం నుండి విముక్తి పొందుతాడు. పరమాత్మలో లీనం అవుతాడు. అదే మోక్షము.

## 16. నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః।
## ఉభయోరపి దృష్టోఽన్తస్త్వ నయోస్త త్త్వదర్శిభిః॥

ఓ అర్జునా! అసత్తు అంటే లేని దానికి ఉనికి లేదు. సత్ అంటే ఉన్నదానికి, లేకుండా పోవడం అంటూ ఉండదు. సత్, అసత్ ఈ రెండింటి యొక్కనిజస్వరూపాలను తెలుసుకున్న వాడు తత్వజ్ఞాని. కేవలం తత్వము గురించి జ్ఞానము కల వాడికే ఈ రెండింటి యొక్క స్వరూప, స్వభావాలు తెలుస్తాయి.

ఈ అనంత విశ్వంలో రెండే పదార్థాలు ఉన్నాయి. సత్, అసత్. సత్ అనే పదార్థానికి ఎన్నటికీ నాశనము లేదు. ఏ పరిస్థితిలో కూడా సత్ పదార్థము నాశనము కాదు. ఎటువంటి మార్పు చెందదు. కాని అసత్ పదార్థమునకు ఈ విశ్వంలో శాశ్వతమైన ఉనికి లేదు. అది ఎప్పుడూ శాశ్వతంగా ఉండదు. నిరంతరం మార్పుచెందుతూ ఉంటుంది. సత్, అసత్ పదార్థముల నిజమైన, యదార్థమైన స్వరూపమును తెలుసుకున్నవాడే తత్త్వజ్ఞాని అనిపించుకుంటాడు.

ఈ శ్లోకంలో కృష్ణుడు రెండు పదార్థాల గురించిచెప్పాడు. ఒకటి సత్ పదార్థము. అంటే ఎప్పటికీ ఎటువంటి మార్పు లేకుండా నిలిచి ఉండేది. అదే విశ్వచైతన్యము. పరమాత్మ స్వరూపము. ఈ అనంత విశ్వంలోని గ్రహాలు, నక్షత్రాలు, గెలాక్సీలు అన్నీ కోట్ల కోట్లసంవత్సరాల నుండి నియమం తప్పకుండా తిరుగుతున్నాయి. ఏదో ఒక అజ్ఞాత శక్తి వాటిని నడిపిస్తూ ఉంది. ఆ శక్తిని విశ్వచైతన్యము, పరమాత్మ అంటాము. అదే సత్ పదార్థము. ఆ గ్రహాల మీద, నక్షత్రాల మీద ఉన్న అన్ని పదార్థాలు అసత్ పదార్థాలు. అంటే నాశనం అయ్యేవి. మార్పుచెందేవి. బ్రహ్మసత్యం జగన్మిధ్య అని అన్నారు. అంటే జగత్తు లేదని కాదు. అది ఉంది. ఎదురుగా కనపడుతూ ఉంది. కాని నిరంతరం మార్పుచెందుతూ ఉంటుంది. ఏదో ఒకరోజు కనపడకుండా పోతుంది. మరలా మరొక రూపంలో ఉద్భవిస్తుంది. జగత్తు అనే పదంలోనే దాని అర్థం ఇమిడి ఉంది. జ అంటే పుట్టడం (జలజ అంటే జలము నుండి జ పుట్టినది పద్మము. పంకజ..పంక అంటే బురదలో నుండి జ పుట్టినది పద్మము) గ అంటే పోవడం.(గచ్ఛతి అంటే పోవడం. ఇంగ్లీషులో కూడా గో అంటే పోవడం) గతి మంతము. జగత్తు అంటే జ..రావడం గ...పోవడం ఈ రెండు లక్షణములు కలది జగత్తు అని అర్థం. జగత్తును గురించి లోతుగా పరిశీలిస్తే గానీ ఇది అర్థం కాదు. జగత్తు మిధ్య, అంటే స్థిరంగా, సత్యంగా ఉండదు, నిరంతరం మార్పుచెందుతూ ఉంటుంది అని అర్థం.

ఉదాహరణకు అగ్ని ఉంది. దాని మీద ఒక గిన్నెపెట్టాము. గిన్నె వేడెక్కింది. దానిలో నీరు పోసాము. అవి వేడెక్కాయి. అందులో కూరగాయలు వేసాము. అవి వేడెక్కి ఉడికాయి. గిన్నె, నీరు, కూరగాయలు అంతకు ముందు వేడిగా లేవు. తరువాత వేడిగా ఉండవు. కేవలం

అగ్నిసంయోగం చేత వేడిగా ఉన్నాయి. కాని అగ్ని మాత్రము సర్వకాల సర్వ అవస్థల యందు తన వేడి తత్వాన్ని కోల్పోదు., గిన్నె, నీరు, కూరగాయలు మధ్యలోనే వేడిగా ఉంటున్నాయి. వేడిగా మార్పుచెందుతున్నాయి. మరలా తమ స్వత:సిద్ధమైన చల్లదనాన్ని కలిగి ఉంటున్నాయి. కాని అగ్ని మాత్రము ఒకప్పుడు వేడిగా ఉండటం, మరొకప్పుడు చల్లగాఉండటం లేదు. ఎప్పుడూ వేడిగానే ఉంటుంది. ఎందుకంటే అది దాని స్వభావము. వేడిగాఉండటం అగ్ని స్వాభావిక ధర్మము. గిన్నె వేడెక్కడం, కూరగాయలు ఉడకడం ఆగంతుక ధర్మము అంటే తెచ్చిపెట్టుకున్న ధర్మము. అలాగే మార్పుచెందే స్వభావం కల వాటిని ఎంత పట్టుకున్నా మార్పుచెందక మానవు. ఎందుకంటే మార్పుచెందడం వాటి స్వాభావిక ధర్మము. కాబట్టి మార్పుచెందనిది సత్ అయితే మార్పుచెందేది అసత్ అని మనం తెలుసుకోవచ్చు. ఈ ప్రపంచంలో మనకు కనపడే వస్తువులు అన్నీ అసత్ పదార్థాలే. ఉదాహరణకు, మన ఎదురుగా ఒక టేబుల్ ఉంది. దానిని కాల్చాము. బూడిద అయింది. అది మట్టిలో కలిసిపోయింది. ఆ మట్టిలో ఒక మొలక మొలిచింది. మట్టిలోని సారాన్ని ఆ మొక్క పీల్చుకుంది. ఎదిగింది. పెద్ద చెట్టుఅయింది. ఆ చెట్టును కొడితే కలప వచ్చింది. దానితో మరొక టేబుల్ తయారయింది. అంటే ఒక వస్తువు నిరంతరం మార్పుచెందుతుంది. సత్యంగా ఉండదు. దీనిని అసత్ పదార్థము అని అంటారు.

అలాగే మనిషి. ఆడ మగ కలిసినందువలన, మగలో ఉన్న వీర్య కణము, ఆడలో ఉన్న శోణిత కణము కలిసి అండం తయారవుతుంది. అది పిండంగా మారి రూపు సంతరించు కుంటుంది. మాతృగర్భం నుండి బయటకు వచ్చి దిన దిన ప్రవర్థమానమవుతుంది. బాల్య, కౌమార, యవ్వన, వృద్ధాప్యములు గడుస్తాయి. నూరేళ్లు నిండుతాయి. శరీరం శిథిలం కాగానే పడిపోతుంది. అప్పటి దాకా ఒకటిగా ఉన్న పదార్థాలు వేటికవి విడిపోతాయి. (దీనినే డికంపోజింగ్ అంటారు). గాలి గాలిలో, పదార్థం మట్టిలో కలిసిపోతుంది. ఆ మట్టిలోనుండి మొలకలు, దానిలో నుండి ఆహారపదార్థాలు లభిస్తాయి. వాటిని మానవులు తింటారు. మగవారిలో శుక్లము, ఆడవారిలో శోణితము తయారవుతాయి. అవి రెండు కలిస్తే మరలా అండము, పిండము, బ్రహ్మాండము. కాబట్టి మానవులు, జంతువులు, వృక్షములు అన్ని పదార్థములు కూడా నిరంతరము మార్పుచెందు తుంటాయి. అజ్ఞానులు ఇది తెలుసుకోలేక ఈ శరీరమే నేను ఈ శరీరం శాశ్వతంగా ఉంటుంది అనే భ్రమలో ఉంటారు. ఈ శరీరం అసత్ పదార్థము, ఈ శరీరంలో ఉండే ఆత్మ పదార్థము సత్ పదార్థము అని తెలుసుకోవడమే ఆత్మజ్ఞానము.

ఇంకొంచెం వివరంగా తెలుసుకుందాము. ఉదాహరణకు..... ఒక కుండ ఉంది. మన కళ్లకు కుండ కనపడుతుంది. నిజానికి అది కుండ ఆకారంలో ఉన్న మట్టి మాత్రమే. కాబట్టి కుండ అసత్ పదార్థము. ఎందుకంటే కుండ తయారు కాకముందు కుండ లేదు. కుండ మట్టిలో కలిసిపోయిన తరువాత కుండ లేదు. మధ్యలో మాత్రమే కుండ ఉంది. మట్టి మార్పుచెంది కుండగా మారింది. మరలా మట్టిగా మార్పుచెందింది. సత్ అసత్తుల మధ్య తారతమ్యాన్ని మనలో ఉన్న బుద్ధి

నిర్ణయిస్తుంది. కుండ, వస్త్రము మనకు కళ్లఎదుట కనపడుతున్నాయి. కనపడుతున్నాయి కాబట్టి అవి సత్ పదార్థములు కావు. కుండకు మూలము మట్టి. వస్త్రమునకు మూలము దారముపోగులు, దానికి మూలము పత్తి, దానికి మూలము పత్తిచెట్టు ఇలా ఒకదానిలో నుండి ఒకటి వస్తున్నాయి. కాబట్టి మనకు కళ్లకు కనిపించేది నిజం కాదు. అన్నీ అసత్ పదార్థములే. కుండ, వస్త్రము ఇవి అన్నీ మన మనసులో నుండి పుట్టినవే. నిజానికి కుండలేదు. కుండ అని మనం అనుకుంటున్నాము. నిజానికి మట్టి మాత్రమే ఉంది. మట్టి మార్పు చెంది కుండ అయింది. కొంత కాలం తరువాత కుండ పగిలిపోయి మట్టిలో కలిసిపోయింది. (ఇది కేవలం ఉదాహరణ మాత్రమే) సత్ పదార్థము ఎప్పటికీ నిలిచి ఉంటుంది. అసత్ పదార్థము నిరంతరం మార్పుచెందుతూ ఉంటుంది. సత్ అసత్ మధ్య ఉన్న భేదము తెలుసుకోవడమే అసలైన జ్ఞానము. కాబట్టి అసత్ ను వదిలి సత్ పదార్థమును పొందడానికి నిరంతరం ప్రయత్నం చేయాలి. దానికి చేయాల్సిన పని మనలో ఉన్న మోహమును, భ్రమను, శోకమును వదిలిపెట్టాలి. నిజం తెలుసుకోవడానికి ప్రయత్నంచేయాలి.

## 17. అవినాశి తు తద్విద్ధి యేన సర్వమిదం తతమ్।
## వినాశమవ్యయస్యాస్య న కశ్చిత్ కర్తుమర్హతి॥

అర్జునా! పైన చెప్పబడిన సత్, అసత్ పదార్థములలో, సత్ అనే పదార్థము ఎక్కడో ఒక చోటలేదు. ఈ అనంత విశ్వం అంతా చైతన్యరూపంలో వ్యాపించి ఉంది. దానిని అఖండ చైతన్యము, విశ్వచైతన్యము అంటారు. అది శాశ్వతము. అది నాశము కాదు. ఎవ్వరూ దానిని నాశముచేయలేరు. (విష్ణువు అంటే సర్వవ్యాపి).

ఈ శ్లోకంలో కృష్ణుడు పరమాత్మ యొక్క సత్ రూపమును సూక్ష్మంగా వివరించాడు. సర్వము వ్యాపించి ఉన్న పరమాత్మ స్వరూపము ప్రతి జీవిలోనూ ఆత్మస్వరూపంగా వెలుగుతూ ఉంది. పరమాత్మ విశ్వచైతన్యం అయితే, ఆత్మ పరిమిత చైతన్యము. జీవులు మరణించగానే వాటిలో ఉన్న పరిమిత చైతన్యం విశ్వచైతన్యంలో కలిసిపోతుంది. ఎక్కడి నుండి వచ్చామో అక్కడికే వెళతాము. ఇదే మోక్షము.

ఈ అనంత విశ్వము అంతటా వ్యాపించి ఉన్న అఖండ చైతన్యమునకు నాశనము లేదు. దానిని నాశనం చేయడానికి ఎవడికీ సాధ్యముకాదు ఎందుకంటే సత్ పదార్థము కంటే వేరైన పదార్థము మరొకటి లేదు. అంతా అదే అయినపుడు నాశనం చేసేవాడు ఎవడుంటాడు. ఇదే రహస్యము. ఈ రహస్యం తెలుసుకోవడమే ఆత్మజ్ఞానము. కుండను పగులగొట్ట వచ్చు. కాని మట్టిని పగులగొట్టలేము. అలాగే ఈ దేహమును కొట్టి చంపవచ్చు. కాని దేహములో ఉన్న ఆత్మను

కొట్టి చంపలేము. ఎందుకంటే అది నిత్యము, సత్యము. భీష్ముడు, ద్రోణుడు వీళ్ల శరీరములు యుద్ధములో పడిపోయినా, వారి శరీరములలో ఉన్న ఆత్మస్వరూపాలు శాశ్వతంగా ఉంటాయి.

పరమాత్మ తత్వము అంటే అఖండ చైతన్యము విశ్వం అంతా వ్యాపించి ఉంది అని తెలుసుకున్నాము కదా! దీనినే బ్రహ్మము అని కూడా అంటారు. ఈ బ్రహ్మమునకు ఎదుగుదల తరుగుదల అంటూ ఉండవు. నిత్యము సత్యము. మార్పు ఉండదు. మన శరీరం మాదిరి ఇతర జీవరాసుల శరీరముల మాదిరి బ్రహ్మమునకు ఆకారము లేదు. పరిమితి లేదు. చావు పుట్టుకలు లేవు. వృద్ధి క్షీణతలు లేవు. పుట్టుక ఉంటే చావు ఉంటుంది. పుట్టుక అంటూ లేకపోతే చావు కూడా లేదు. అందుకని దీనిని ఎవరూ నాశనము చేయలేరు. అంతటా వ్యాపించి ఉన్న దానిని నాశనం చేయడానికి మరొక పదార్థము అంటూ ఏదీ ఉండదు కనుక. అందుకే దీనిని సత్ అనిఅన్నారు.

ఈ శ్లోకంలో వ్యాసుల వారు ఒక మాట వాడారు. తత్ విద్ధి అంటే దానిని తెలుసుకో. అంటే పరమాత్మ స్వరూపాన్ని చూడలేము, తాకలేము, వినలేము, ఇలా ఉంటుంది అని ఊహించలేము. కాని దానిని గురించి తెలుసుకోగలము. అందుకే తెలుసుకో అని వ్యాసులవారు చెప్పారు. పరమాత్మ గురించి తెలుసుకోడానికి ఆధారాలు, గురువు, గురువు ముఖతా నేర్చుకునే శాస్త్ర పరిజ్ఞానము. ఇవి రెండే పరమాత్మను తెలుసుకోడానికి మార్గాలు.

18. అన్తవన్త ఇమే దేహా నిత్యస్యోక్తాశ్శరీరిణః।
అనాశినో2ప్రమేయస్య తస్మాద్యుధ్యస్వ భారత॥

ఈ శరీరాలు అన్నీ నశించి పోయేవే. కాని ఆత్మ మాత్రము నాశనము కాదు. ఎందుకంటే ఆత్మ అవినాశి, అప్రమేయము, నిత్యము. ఈ విషయం తెలుసుకొని నువ్వు యుద్ధం చెయ్యి.

ఈ శ్లోకంలో కృష్ణుడు ఆత్మస్వరూపమును గురించి చెబుతున్నాడు. పరమాత్మ అంశయే ఆత్మ. ఇది అన్ని జీవరాసులలో వ్యాపించి ఉంటుంది. పరమాత్మ మాదిరి ఆత్మ కూడా నాశము లేనిది. నిత్యము, నాశరహితము. కాని ఏ దేహములో ఈ ఆత్మ ఉంటుందో ఆ దేహము అనిత్యము. నాశనమవుతుంది. దేహము నశించినా ఆత్మ నశించదు. కాబట్టి నశించే దేహము గురించి శోకించడం తగదు. భీష్మ,ద్రోణ,అశ్వత్థామల యొక్క, బంధుమిత్రులయొక్క దేహములు నశించినా వారిలోని ఆత్మ నాశనము కాదు. అశాశ్వతములైన దేహముల గురించి శోకించకుండా యుద్ధము చెయ్యి అని అన్నాడు కృష్ణుడు.

ఈ శ్లోకంలో అన్తవన్త ఇమే దేహా అని అన్నాడు. అంటే ఈ దేహములు అంతము కలిగినవి, నాశనము కలవిగా చెప్పబడ్డాయి. ఆ సంగతి మనకందరికీ తెలుసు. మన దేహములకు ఒక కాల పరిమితి ఉంటుంది. ఉదాహరణకు నూరేళ్లు. ఇంకా కొంత స్పేస్ ఆక్రమించుకుంటుంది. పొడవు 2, వెడల్పు రెండు, ఎత్తు 6 మొత్తం 24 ఘనపు అడుగులు. ఈ ప్రకారంగా టైమ్ ఎండ్ స్పేస్ కు పరిమితమైనది నాశము కాక తప్పదు. పుట్టినది చావక తప్పదు. అలాగే కంపోజ్ అయినది డికంపోజ్ అవక తప్పదు. ఇది సత్యం అని తెలిసికూడా దీనిని అంగీకరించడానికి మన మనసు ఒప్పుకోదు. మన కళ్లముందే మన తండ్రులు, తాతలు చనిపోయారు. వాళ్లను దహనం చేయడం మనం చూచాము. ఈ నిజం మనం కళ్లారాచూస్తున్నా, మనం మాత్రం కలకాలం బతకాలనీ భోగాలు అనుభవించాలనీ అనుకుంటాము. ఎన్నో అకృత్యాలు చేస్తుంటాము. అదే అజ్ఞానము. ఈ దేహము నేను కాదు. నేను వేరు దేహము వేరు అని తెలుసుకోవడమే జ్ఞానము. ఈ విషయంలో పండితులు జ్ఞానులు ఏమి చెబుతున్నారంటే, ఆత్మ శాశ్వతము, నాశము లేనిది, అవ్యక్తము. కానీ ఈ ఆత్మ ఏ శరీరంలో ఉంటుంతో ఆ శరీరము మార్పుచెందుతుంది, నాశనము అవుతుంది. కాబట్టి ఓ అర్జునా! మీతాతలు, తండ్రులు, గురువులు అంతా ఆత్మస్వరూపులే, వారి శరీరములు పోయినా, ఆత్మస్వరూపులుగా ఉంటారు, ఈ విషయం తెలుసుకొని, లేచి యుద్ధం చెయ్యి. నీ కర్తవ్యం నెరవేర్చు. అని అన్నాడు కృష్ణుడు.

## 19. య ఏనం వేత్తి హన్తారం యశ్చైనం మన్యతే హతమ్।
## ఉభౌ తౌ న విజానీతో నాయం హంతి న హన్యతే॥

ఈ ఆత్మ ఇతరులను చంపుతుంది అని అనుకొనేవాడు, ఈ ఆత్మ ఇతరులచేత చంపబడుతుంది అని అనుకొనేవాడు, ఈ ఇద్దరూ అజ్ఞానులే. ఎందుకంటే ఆత్మ ఎవరినీ చంపదు, ఎవరి చేతిలోనూ చావదు.

ఎవరైతే ఈ ఆత్మే శరీరము అనీ, ఈ శరీరమే అందరినీ చంపుతుంది అని భావిస్తారో, అలాగే ఈ ఆత్మకు శరీరమునకు భేదము లేదు, శరీరముతో పాటు ఆత్మ కూడా చంపబడుతుంది అని భావిస్తారో, వాళ్లు అజ్ఞానులు, అవివేకులు. ఎందుకంటే, ఇదివరకు చెప్పినట్టు ఆత్మ శరీరం ఒకటి కాదు. ఆత్మ ఎవరినీ చంపదు. తాను ఎవరి చేతిలోనూ చావదు. ఆత్మ ఒక సత్ పదార్థము. ఆత్మకు రూపము, నామము, ఆకారము, కాల పరిమితి లేవు. శరీరము అసత్ పదార్థము. శరీరమునకు ఒక ఆకారము, పేరు, కాల పరిమితి ఉన్నాయి. కాబట్టి ప్రతి మనిషీ తాను వేరు, తన శరీరం వేరు అని భావించాలి. అలా కాకుండా, చంపడం అనే ప్రక్రియలో నేను చంపుతున్నాను అని కానీ, నేను చంపబడుతున్నాను అని కానీ భావిస్తాడో, అతనిలో ఆత్మజ్ఞానం లేనట్టే. అతడికి ఆత్మ గురించి ఏమీ తెలియదు. ఎందుకంటే నేను అనే అహంకారము అతనిలోని జ్ఞానాన్ని కప్పివేసి, అన్నీ

తానే చేస్తున్నాను అనే భ్రమను కలుగజేస్తుంది. ఆ భ్రమయే అవిద్య. ఆ భ్రమను పోగొట్టుకుంటే, ఆత్మజ్ఞానం దానంతట అదే కలుగుతుంది.

చిన్న ఉదాహరణతో ఇది అర్థం అవుతుంది. ఒక లైట్ వెలుగుతూ ఉంది. ఆ లైటు వెలుగులో మనం మంచి పనులు చేయవచ్చు, చెడ్డ పనులు చేయవచ్చు. మనం చేసే పనులతో లైటుకు నుండి వచ్చే ప్రకాశానికి ఎటువంటిసంబంధము లేదు. దాని పాటికి అది వెలుగుతూ ఉంటుంది. అలాగే ఆత్మ కూడా ప్రతిశరీరంలో వెలుగుతూఉంటుంది. ఈ శరీరము, మనో బుద్ధి అహంకారాలు, ఇంద్రియములతో చేసే ఏ పనికీ దానికి సంబంధము లేదు. సాక్షిగా చూస్తూ ఉంటుంది. అలాగే రాత్రి నేను బాగా నిద్రపోయాను. సుఖంగా నిద్రపోయాను అని అంటూ ఉంటారు. అంటే నిద్రపోయింది శరీరమా! శరీరం కళ్లుమూసుకుంటుంది. అంతే... శరీరంలో ఉన్న మరొకడు సుఖంగా నిద్రపోయాడు. నిద్రలో ఆ సుఖం అనుభవించాడు. మరలా కళ్లు తెరవగానే శరీరం లేచి కూర్చుంటుంది. అలాగే సుబ్బారావు చనిపోయాడు అని అంటారు. ఎవడు, ఎక్కడకు పోయాడు. సుబ్బారావు శరీరం చలనం లేకుండా మన ఎదురుగానే ఉంది. మరి పోయింది ఎవరు అని ప్రశ్నించుకుంటే అదే ఆత్మ అని అర్థం అవుతుంది. కాబట్టి శరీరం వేరు, శరీరంలో ఉన్న ఆత్మ వేరు. ఆత్మ ఏ పనీ చేయదు. ఎవరినీ చంపదు. ఎవరిచేతిలోనూ చావదు. అదే ఈ శ్లోకంలో కృష్ణుడు అర్జునుడికి చెప్పాడు.

20. న జాయతే మ్రియతే వా కదాచిన్నాయం
భూత్వా భవితా వా న భూయః।
అజో నిత్యశ్శాశ్వతో2అయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే॥

ఆత్మ ఎన్నడూ పుట్టలేదు. పుట్టలేదు కాబట్టి చావలేదు. పుట్టుక లేదు కాబట్టి ఉండటం, ఉండకపోవడం అంటూ కూడా లేదు. అంటే ఆత్మకు పుట్టుక, ఉండటం, పెరుగుదల, మార్పు, తరుగుదల,చావు, ఈ ఆరు వికారములు ఏవీ లేవు.ఈ శరీరం మరణించినా ఆత్మ మరణించదు.
ఈ శ్లోకం చిన్న పదాల మార్పుతో యథాతథంగా కఠోపనిషత్ లో నుండి తీసుకోబడింది..

అర్జునా! సత్ పదార్థము అయిన ఆత్మ ఏ కాలములోనూ జన్మించలేదు. ఏకాలములోనూ మరణించలేదు. ఆత్మ ఒకప్పుడు ఉన్నది లేదు. అలా అని మరొకప్పుడు లేదు అన్నదీ లేదు. అంటే ఆత్మకు అస్తిత్వము లేదు. నాశము లేదు. ఈ ఆత్మకు జనన, మరణములు, వృద్ధి

క్షయములు లేవు. ఈ ఆత్మ స్వరూపానికి కాలపరిమితి లేదు. ఈ కాలము స్పేస్‌ను ఆక్రమించదు. అంటే ఆత్మకు టైమ్ ఎండ్ స్పేస్ నిమిత్తం లేదు. ఉన్నచోటనే ఉంటూ మార్పుచెందుతుందా అంటే అదీ లేదు. ఎన్నాళ్లు ఉన్నా ఎటువంటి మార్పులేకుండా ఉండేది. ఈ ఆత్మ శాశ్వతమైనది. ఈ రోజు ఉండి రేపు పోయేది కాదు. పురాణమైనది అంటే ఎల్లప్పుడూ కొత్తగా ఉండేది. దీనికి పాతబడటం అంటూ లేదు. సనాతనమైనది. ఊహకు అందనిది. ఏ శరీరంలో ఆత్మ ఉంటుందో, ఆ శరీరం మరణించినా, అందులో ఉన్న ఆత్మ మరణించదు. ఆత్మ సనాతనమైనది. అది ఒకప్పుడు పుట్టలేదు. పుట్టలేదు కాబట్టి చావు అనే వికారము కూడా ఆత్మకు లేదు.

ఈ శ్లోకంలో ఆత్మకు ఎటువంటి వికారము లేదు అని కృష్ణుడు చెప్పాడు. వికారములు అంటే మార్పులు. ప్రపంచంలో ఉన్న ఏ వస్తువుకు అయినా ఆరు వికారములు తప్పవు. ఉదాహరణకు మన శరీరాన్నే తీసుకుందాము. 1. తల్లి గర్భంలోనుండి బయటకు రావడం(పుట్టడం), 2. ఉండటం, 3.పెరగడం, 4.అవయవాలు మార్పుచెందడం, 5. క్షీణించడం,6. మరణించడం అనేవి శరీరమునకు కలిగే ఆరు విధములైన వికారములు అంటే మార్పులు. ఆ మార్పులు ఆత్మకు లేవు. ఏదైనా వస్తువు ఒకప్పుడు ఉనికిలోకి వస్తే, అది తరువాత లేకుండా పోతుంది. శరీరం కూడా తల్లి గర్భంలోనుండి వస్తుంది. మార్పులు చెందుతుంది. తరువాత భూగర్భంలో కలిసిపోతుంది. కాని ఆత్మ ఎక్కడి నుండీ రాదు. ఎక్కడికీ పోదు. అలాగే పుట్టినప్పుడు శరీరం చిన్నదిగా ఉంటుంది. కాలం గడిచేకొద్దీ పెరుగుతుంది. మరలా క్షీణిస్తుంది. తుదకు మరణిస్తుంది.

ఉదాహరణకు మనం మన ఫామిలీ ఆల్బం చూస్తున్నాము. అందులో మీ చిన్నప్పటి ఫోటో చూపించి ఇది ఎవరు అని అడిగితే ఎవరూ చెప్పలేరు. ఇది నేనే అని మీరే చెప్పాలి. కాని ఆ ఫోటోలో ఉన్న చిన్ని పాపాయి శరీరానికి ఇప్పటి మీ ఆరడుగుల శరీరానికి ఎంతో తేడా ఉంది. అసలు పోలికే లేదు. కాని అది నేను అంటున్నారు. అంటే ఈ నేను ఎవరు. అంటే ఈ శరీరం నేను కాదు అని మీకు తెలుసు. కాని దైనందిన జీవితంలో ఈ సత్యాన్ని ఒప్పుకోవడానికి మీ మనసు అంగీకరించదు. ఇది అంతా నాది ఎవ్వరికీ ఇవ్వను అనే అహంకారము, లోభము మనలోని జ్ఞానాన్ని కప్పివేస్తాయి. అజ్ఞానంలో పడవేస్తాయి. అజ్ఞానం పోవాలంటే జ్ఞానం కావాలి. ఆత్మస్వరూపం గురించి అవగాహన పెంచుకోవాలి. ఈ పెరుగుదల, తరుగుదల అంటే వృద్ధి, క్షీణతలు ఆత్మకు లేవు. ఆత్మ ఎల్లప్పుడూ ఒకేవిధంగా ఉంటుంది. ఎందుకంటే దానికి ఎటువంటి ఆకారము లేదు. శరీరం మార్పు చెందినపుడు ఆత్మ మార్పు చెందదు కాబట్టి, శరీరం మరణించినప్పుడు ఆత్మ మరణించదు అని అర్థం చేసుకోవాలి. మరణం అనేది బాల్యము, యవ్వనము, వృద్ధాప్యము మాదిరి శరీరానికి కలిగే ఒక పరిణామము అంటే మార్పు మాత్రమే అనే అవగాహన కలిగిన నాడు, జీవితంలో విషాదానికి చోటులేదు. అంతా ఆనందమే.

ఈ విషయాన్నే కృష్ణుడు అర్జునుడికి వివరిస్తున్నాడు. శరీరానికే కాదు, ప్రతి వస్తువుకు కూడా ఆరు వికారములు అంటే మార్పులు ఉంటాయి. పుట్టడం, ఉండటం, పెరగడం, మార్పు చెందడం, క్షీణత, నాశనం కావడం. ఈ మార్పులు ప్రతి దేహానికి ఉంటాయి. కానీ ఈ మార్పులు ఆత్మకు లేవు. ఆత్మ పుట్టదు,చావదు. దానికి ఆది అంతము లేదు. ఆత్మ ఎల్లప్పుడూ ఉండేది. చావు లేనిది. దానికి కాలము, దూరము లేదు. అది శాశ్వతము. మార్పు చెందనిది. క్షీణత లేనిది. శరీరం మరణించినా ఆత్మ చావదు. ఆత్మకు ఏ వికారము లేదు. శరీరములు మార్పు చెందుతాయి. ఆత్మకు మార్పులేదు. కాబట్టి ఓ అర్జునా! ఈ భీష్ముడు, ద్రోణుడు, నీవు నేను అందరూ ఆత్మస్వరూపాలే. ఈ శరీరాలు కాదు. ఈ శరీరాలు అశాశ్వతాలు. శరీరాలలో ఉండే ఆత్మ శాశ్వతమైనది. కేవలం శరీరాలు నశిస్తాయే కానీ ఆత్మ కాదు. కాబట్టి నీతాత, నీ గురువులు, నీ బంధువులు శరీరాలు పోతాయే గానీ వారు చావరు కాబట్టి వీరు మరణిస్తారేమో అని నీవు దు:ఖించడం నీ అవివేకము అని బోధించాడు కృష్ణుడు. దీని వలన మనం తెలుసుకోవలసింది ఏమిటంటే మన కళ్లముందు సహజంగా జరిగే పరిణామాలకు అమితంగా దు:ఖించడం, కుంగి పోవడం, కర్తవ్య నిష్ఠను వదిలిపెట్టడం అవివేకము అని తెలుసుకోవాలి.

## 21. వేదావినాశినం నిత్యం య ఏవమజమవ్యయమ్.
## కథం స: పురుష: పార్థ కం ఘాతయతి హన్తి కమ్॥

ఓ అర్జునా! ఎవరైతే ఈ ఆత్మను సత్యమైనదిగా, నాశనము లేనిదిగా, నిత్యమైనదిగా, జన్మలేనిదిగానూ, మార్పులేనిదిగానూ, మరణము లేనిదిగానూ తెలుసుకుంటాడో, అటువంటి వాడు ఎవరిని చంపిస్తాడు, ఎవరిని ఎందుకు చంపుతాడు? ఎలా చంపుతాడు. కాబట్టి ఎవరూ ఎవరిని చంపరు, చంపించరు.

ఇప్పటి దాకా ఆత్మ నిత్యము అది చావదు అని చెప్పిన కృష్ణుడు, ఇప్పుడు ఆ ఆత్మ ఎవరినీ చంపదు, ఎవరినీ చంపించదు అంటే ఎవరి చావుకూ కారణం కాదు అని అంటున్నాడు. ే అర్జునా! నీలో ఉన్న ఆత్మస్వరూపము, భీష్మ,ద్రోణ,కృపాచార్యులలోనూ ఇతర రాజులు, సైనికులలోనూ ఉన్న ఆత్మస్వరూపాలను చంపదు. వారిలో ఉన్న ఆత్మలు చావడానికి నీలో ఉన్న ఆత్మ కారణం కూడా కాదు. నీవే అందరినీ చంపుతున్నాను అని అనుకోవడం నీ భ్రమ.

ఆత్మజ్ఞానం కలిగి ఉండటమే ఆధ్యాత్మికత. కాని మనలో ఉన్న నేను అనే అహంకారము, ఈ శరీరమే నేను అనే భ్రమను కలుగచేస్తుంది. నేనే ఈ శరీరము, అంతా నేనే చేస్తున్నాను అన్న భ్రమలో ఉన్నంత కాలము, ఆత్మతత్వము అర్థం కాదు. ఆత్మ అవినాశి అనీ, నిత్యం అనీ అవ్యయం అనీ తెలుసుకోవాలి.

మనం అందరం నేను నేను అంటున్నాము. నేను అంటేనే ఆత్మ. నా పేరు సుబ్బారావు, నాకు ఆకలి వేసింది, నాకు కోపం వచ్చింది. అంటే మనకు తెలియకుండానే "నేను అంటే ఈ శరీరం కాదు, నాలో ఉన్న ఆత్మ స్వరూపము" అనే జ్ఞానం మనకు సహజంగానే ఉంది. కాని దానిని గురించి మనం ఆలోచించము. ఆచరించము.  మనం ఏది "నేను" అని  అనుకుంటున్నామో ఆ "నేను" అనే దాని స్వభావం మనకు తెలియదు. అంటే నేను అంటే మనకు తెలుసు. కాని దాని స్వభావం మాత్రం తెలియదు.

ఈ "నేను" అనే ఆలోచన జంతువులకు పక్షులకు లేదు. అవి "నేను" గురించి ఆలోచించవు.  ఆహారం తినడం, ఎద వచ్చినప్పుడు కలవడం, నిద్రవస్తే నిద్రపోవడం వాటి సహజలక్షణం, వాటి నేచర్. వాటికి ఆలోచించే శక్తి లేదు. కాని మనకు ఆ శక్తిని ఇచ్చాడు భగవంతుడు. ఒక డిన్నర్ జరుగుతూ ఉంది. ఒక ఆవు ఒక పులి వచ్చాయి. అవి వాటి సహజమైన ఆహారం దగ్గరకు వెళతాయి అంటే ఆవు విజిటేరియన్, పులి నాన్ విజ్. కాని మానవుడు అటు ఇటు చూస్తాడు. తెలిసిన వాళ్లుంటే విజ్ లేకపోతే నాన్ విజ్ కు జంప్. అంటే జంతువులు తమ స్వభావాన్ని పట్టి పనులు చేస్తాయి. మనిషి ఆలోచించి చేస్తాడు. అవకాశాన్ని బట్టి చేస్తాడు.

ఈ "నేను" అనే అహంభావం మనిషిలో కలగడం వలన  "నేను అందరి కంటే గొప్ప వాడిని, వాడు నా కంటే తక్కువ" అనే భావన కలుగుతుంది. జంతువులకు ఈ భావన కలుగదు. అవి తాము అన్నీ ఒకటే అనే భావనతో ఉంటాయి. కాబట్టి ప్రతిమనిషికి నేను అంటే ఏమిటో తెలుసు కాని దాని స్వభావం తెలియదు. ఈ శరీరమే నేను అనుకుంటూ ఉంటాడు. అలాగే మనకు  నేను అంటే ఏమిటో తెలుసు.  నేను అనే దాని స్వభావం మనకు తెలియదు కాబట్టి కనపడే ఈ శరీరమే నేను అనుకుంటున్నాము. మన కంఫ్యూజన్ అంతా ఇక్కడే ఉంది. నేనే ఈ శరీరం ఈ శరీరమే నేను అనుకోవడం, నేను స్వభావం గురించి తెలుసుకోక పోవడమే అసలు సమస్య. కాబట్టి సాధకుడు తెలుసుకోవలసిందేమిటంటే " నేను ఈ శరీరం కాదు. నేను ఆత్మస్వరూపుడను" అని తెలుసుకోవాలి. అప్పుడు ఆత్మ అవినాశి, అజం, సత్యం, అవ్యయం అని తెలుసుకునే అవకాశం ఉంది. లేకపోతే వీటి అర్థాలు తెలియవు.

కాబట్టి ఆత్మజ్ఞానం రెండు దశలుగా తెలుసుకోవాలి. ముందు ఆత్మ యొక్క స్వభావం తెలుసుకోవాలి. అదే మొదటి పాదంలో చెప్పారు. ఆత్మ అవినాశి, నిత్యం, అజం, అవ్యయం అని. ఇంక రెండవ దశ ఆ ఆత్మ నేనే. నేనే ఆత్మను అని తెలియాలి. కాబట్టి రెండు దశల్లో ఆత్మజ్ఞానం సంపాదించాలి. కాని మనం అంతా ఈ శ్లోకం చదివి ఆత్మ ఇలా ఉంటుంది అని తెలుసుకుంటాము. కనిపించని ఆత్మ కొరకు వెదుకుతుంటాము. ఆత్మ కొరకు శోధిస్తున్నాను అని చెప్పుకుంటాము.  కానీ నేను ఆత్మను అని మాత్రం అంగీకరించరు. మనలో ఉన్న ఆత్మ కొరకు బయట ఎక్కడెక్కడో

వెదుకుతుంటాము. అదే అజ్ఞానము. దానికి కావాల్సినవి శ్రవణం అంటే ఆత్మ గురించి శాస్త్రముల ద్వారా వినడం. తరువాతది మననం. విన్నదానిని మననం చేయడం. ఆత్మస్వరూపం గురించి తెలుసుకోవడానికి ప్రయత్నం చేయడం. దాని గురించి ఏవైనా సందేహాలు ఉంటే గురువుద్వారా నివృత్తి చేసుకోవడం. మూడవది నిధి ధ్యాస. అంటే ఆత్మ ఎవరో కాదు నేనే. నేనే ఆత్మను. నేను ఈ శరీరం కాదు అనే జ్ఞానం కలగడం. అప్పటిదాకా నేనే దేహము, ఈ దేహంతో అన్ని పనులు చేస్తున్నాను. అమ్మో! ఈదేహం మరణిస్తుంది అని భయపడ్డ వాడు, ఆత్మజ్ఞానం కలగగానే, మరణించేది నేను కాదు, నా శరీరం మాత్రమే. నేను ఆత్మస్వరూపుడను నాకు మరణంలేదు...... అని నిశ్చింతగా ఉంటాడు. పైగా మరణాన్ని ఆనందంగా ఆహ్వానిస్తాడు.

కాబట్టి అర్జునా! నీవు దేహానివి కాదు. వీళ్లందరూ దేహాలు కాదు ఆత్మస్వరూపులు. దేహాలు వేరు వీళ్లు వేరు. నీవు చంపితే దేహాలు పోతాయి కానీ వాళ్లు ఎక్కడకూ పోరు. నీవు చంపడం వాళ్లు చావడం అంతా నీ భ్రమ. మిథ్య. చంపేవాళ్లు లేరు. చంపించేవాళ్లు లేరు. ఆత్మస్వరూపము ఎవరినీ చంపదు, ఎవరినీ చంపించదు. అలా అనుకోవడం నీ అవివేకము అని బోధించాడు కృష్ణుడు.

## 22. వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోఽపరాణి। తథా శరీరాణి విహాయ జీర్ణాన్యన్యాని సంయాతి నవాని దేహీ॥

ఓ అర్జునా! ఏ విధంగా నైతే మానవుడు చినిగిపోయిన వస్త్రములను విడిచిపెట్టి, కొత్త వస్త్రములను ధరిస్తాడో, అలాగే ఈ శరీరములలో ఉండే ఆత్మ ముసలి తనముతో కృశించి పోయి ఇంక తిరగడానికి కూడా పనికిరాని శరీరములను విడిచిపెట్టి, కొత్త దేహమును ధరిస్తుంది.

ఇక్కడ కృష్ణుడు మరణము, పునర్జన్మ వీటి గురించి సోదాహరణంగా వివరిస్తున్నాడు. మనిషి మరణించిన తరువాత ఏమవుతాడు అనే ప్రశ్న అర్జునుడి మనసులో మెదిలింది అని గ్రహించాడు కృష్ణుడు. మరణం అంటే కేవలం దుస్తులు మార్చుకోవడం లాంటిది. మనం కొత్త బట్టలు వేసుకుంటాము. కొన్నాళ్లకు ఆ దుస్తులు చినిగిపోతాయి. చినిగిపోయిన దుస్తులు వేసుకోము కదా. అందుకని చినిగిపోయిన బట్టలు వదిలిపెట్టి కొత్త బట్టలు ధరిస్తాము. ఇదివరకు ఒక రంగు బట్టలు వేసుకున్నాము. ఇప్పుడు మరొక రంగు బట్టలు వేసుకున్నాము. వాటికి ఒక బ్రాండెడ్ నేమ్ ఉంటుంది. ఆ పేరుతో పిలుస్తాము. అలాగని మనం మారలేదు. మన రంగు మారలేదు. మనం యథాప్రకారమే ఉన్నాము. కేవలం మనం వేసుకునే దుస్తులు, వాటి రంగు, వాటి బ్రాండ్ నేమ్ మారాయి. మనలో ఉన్న ఆత్మస్వరూపాన్ని దేహీ అని కూడా అంటారు. దేహీ అంటే దేహమును ధరించిన వాడు. ఈ దేహీ శరీరము అనే దుస్తులు మార్చుకుంటూ ఉంటాడు. ఒక శరీరము

శిథిలము అయిపోయినపుడు ఆ శరీరమును వదిలిపెట్టి మరొక శరీరమును ధరిస్తాడు.

ఇది వరకు మనం అనుకున్నట్టు ఈ శరీరం పంచభూతముల కలయికతో ఏర్పడింది. కొన్నాళ్లకు ఈ శరీరం ముసలదయిపోతుంది. దేహి ఆ దేహములో ఉండటానికి ఇష్టపడడు. అందుకని ఆ దేహమును వదిలిపెట్టి మరొక దేహములో ప్రవేశిస్తాడు. పంచభూతములతో ఏర్పడిన ఈ శరీరం దేనికది విడిపోతుంది. గాలి గాలిలో, శరీరం మట్టిలో కలిసిపోతుంది. ఈ విషయాన్ని జ్ఞాని అయిన వాడు అర్థం చేసుకుంటాడు. అందుకని ఈ దేహం వదిలిపెట్టడానికి ఏ మాత్రం సంకోచించడు. పైగా కొత్త దేహం వస్తున్నందుకు సంతోషిస్తాడు మనం కొత్త బట్టలు వస్తే ఎలా సంతోషిస్తామో అలాగ. కాని అజ్ఞాని "అయ్యో ఈ దేహం వదలాల్సివచ్చిందే" అని దు:ఖపడతాడు. ఓ పట్టాన ఈ దేహం వదలడానికి ఒప్పుకోడు. అదే చావుకు భయపడటం.

ఉదాహరణకు మన స్నేహితుడు ఒకాయన చనిపోయాడు అనుకుందాము. అది తెలియక ఒకాయన వచ్చి "ఏమండీ సుబ్బారావుగారు ఉన్నారా?" అని అడిగితే "ఇంకెక్కడ సుబ్బారావండీ..... ఆయన నిన్ననే పోయాడు. ఇవ్వాళే కార్యక్రమాలు జరుగుతున్నాయి" అంటాడు. లోపలకు వెళితే సుబ్బారావు డెడ్ బాడీ కనిపిస్తుంది. "అయ్యో సుబ్బారావు అప్పుడే వెళ్లిపోయావా!" అంటాడు కానీ, "అదేమిటండీ సుబ్బారావు లక్షణంగా పడుకొని ఉంటే వెళ్లిపోయాడు అంటారేమిటీ!" అని అనడు కదా. సుబ్బారావు శరీరం అక్కడే ఉంది. కాని సుబ్బారావు అనే ఆయన లేడు. సుబ్బారావు వెళ్లిపోయాడు. అంటేసుబ్బారావు లో ఉన్న ఆత్మ వెళ్లిపోయింది కాని సుబ్బారావు శరీరం కాదు అని అర్థం. ఈ సంగతి అందరికీ తెలుసు. కానీ తెలియనట్టే ఉంటాము. ఎందుకంటే ఆ భావన మనకు నచ్చదు కనుక.

మన సంస్కృతిలో ఏమీ తెలియని వాడికి కూడా దేహము వేరు, లోపల ఉండే ఆత్మస్వరూపము వేరు అని తెలుసు. వచ్చినచిక్కల్లా దానిని ఆచరించం. మరలా మోహంలో పడిపోతుంటాము. ఇంకొక విషయం ఈ దేహం లో నుండి జీవుడు బయటకు వెళ్లడానికి ఇష్టపడడు. చాలా యాతనపడతాడు. కాని బలవంతంగా బయటకు వెళతాడు. ఇంకా ఆ దేహాన్ని అంటిపెట్టుకొని దాని వెంటనే వెళతాడు. అంత్యక్రియలు జరిగేటప్పుడు అక్కడే ఉంటాడు. ఈ విషయాన్ని ఊహించిన మన ఋషులు ఒక కార్యక్రమం పెట్టారు. ఒకవేళ జీవుడు మరలా పొరపాటున తన శరీరంలో దూరుతాడేమో అని దింపుడు కళ్లం అని మూడు సార్లు దింపుతారు. తరువాత అంత్యక్రియలప్పుడు ఒక కుండలో నీరు పోసి దానిని తీసుకొని శరీరం చుట్టు తిరుగుతాడు. దానికి మూడు రంధ్రాలు చేస్తారు. తుదకు వెనక్కు విసిరేసి పగల గొడతాడు. దీని అర్థం ఏమిటంటే శరీరంలో నుండి బయటకు వచ్చిన జీవుడు అంతకాలం అంటిపెట్టుకున్న శరీరాన్ని వదలలేక అక్కడే తిరుగుతుంటాడు. ఈ చర్య ద్వారా, బాబూ ఈ శరీరం ఒక కుండలాంటిది, అందులో ఉన్న నీరు ప్రాణాలు, అవి కుండలో నీరు మాదిరి చిల్లుల గుండా బయటకు వెళ్లిపోయాయి. కుండ పగిలిపోయింది.

ఇంకదీనిని కాలుస్తాము. ఇంక ఈ శరీరం ఉండదు. నీవు వెళ్లిపో అని జీవాత్మకు మనం ఇచ్చే సంకేతము. ఇంకా కర్మ కాండ ఉందనుకోండి అది ప్రస్తుతం అనవసరం.

కాబట్టి మృత్యువు అంటే కేవలం దుస్తులు మార్చడం లాంటిదని అనుకోవాలి. దాని గురించి భయపడకూడదు. స్వేచ్ఛగా ప్రాణాలు వదలగలిగి ఉండాలి. విభూతి ముఖాన ధరించేకారణం ఇదే. విభూతి అంటే ఈశ్వరుడు ధరించే శ్మశాన బూడిద. తుదకు ఈ శరీరం బూడిద కావాల్సిందే ఈ శరీరం గురించి ఆవేదన చెందవద్దు అనే సంకేతం మనకు అనునిత్యం ఇస్తుంది విభూతి ధారణ. (విభూతి అంటే ఐశ్వర్యం, ప్రకృష్టమైనది అని కూడా అర్థం.)

## 23. నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః।
## న చైనం క్లేదయంత్యాపో నశోషయతి మారుతః॥

ఓ అర్జునా! ఈ ఆత్మను ఎటువంటి అస్త్ర, శస్త్రములు ఛేదించలేవు. అగ్ని దహించలేదు. ఇది నీటిలో నానిపోయి చెడిపోదు. అలాగే గాలి వీచినప్పుడు ఎగిరిపోదు. గాలికి ఎండకు ఎండి పోదు. ఎటువంటి పరిస్థితులలో కూడా నిశ్చలంగా ఏమీ అంటనట్టు ఉంటుంది.

మనందరికీ తెలుసు. ఈ ఆత్మ దేహంతో మమేకం అయి ఉంటుంది. అన్ని కర్మలు చేయడం చూస్తూ ఉంటుంది. కాని దేహానికి తగిలేదెబ్బలు, కలిగే బాధలు ఆత్మకు కలుగవు అని చెప్పడమే ఈ శ్లోకం ఉద్దేశ్యం. మనదేహము పంచభూతములతో చేయబడింది అని చెప్పుకున్నాము కదా. ఈ పంచభూతములలో ఒక్క ఆకాశము తప్ప మిగిలిన నాలుగు దేహానికి హాని కలిగించేవే. ఎలాగంటే అగ్ని అంటుకుంటే తగలబడి పోతాము. ఎవరైనా నీళ్లలో మునిగితే ఊపిరాడక చస్తాడు. అలాగే గాలి ఆడకపోతే ఊపిరి ఆగిపోతుంది. భూకంపాల లాంటివి వస్తే సామూహిక ఖననం తప్పదు. ఇలాగా నాలుగు భూతాలు మన మరణానికి కారణం అవుతున్నాయి. ఇంక లౌక్యంగా చూస్తే కత్తులతో శరీరాన్ని నరక వచ్చు. బాణాలతో కొట్టవచ్చు. ఈ కత్తులు, బాణాలు, అస్త్రములు, శస్త్రములు అన్నీ వివిధ రకములైన లోహములతో తయారు చేయబడ్డాయి. ఈ లోహములు అన్నీ భూమి నుండి వచ్చాయి. అందుకని పంచభూతములలో ఒకటి అయిన భూమి ఆత్మను ఏమీ చేయలేదు. తరువాతది అగ్ని. అగ్ని లక్షణం దహనం. కాబట్టి, అగ్నితో దహించవచ్చు. కాని ఆత్మ అగ్నితో దహింపబడదు. తరువాతది జలము. జలము లక్షణం ముంచడం, నానబెట్టడం. నీటితో నానబెట్టవచ్చు, ముంచెయ్యవచ్చు. ఆత్మ నీటిలో నానదు, మునగదు. తరువాతది వాయువు అంటే గాలి. గాలి లక్షణం శుష్కింప చేయడం, ఎండింపచేయడం. వాయువు ఆత్మను ఎండింపజేయలేదు. శుష్కింప చేయలేదు. కాబట్టి పంచభూతములలో నాలుగు భూతములు ఆత్మను ఏమీ చేయలేవు.

పంచభూతములలో నాలుగు బలమైనవి ఏమీ చేయలేని ఆత్మను నీవేదో చేస్తాను, నా చేతిలో వీరంతా చస్తారు అని అనుకోవడం నీ మూర్ఖత్వం, అవివేకం. కాబట్టి ఆ మూర్ఖత్వాన్ని విడిచిపెట్టు. అని అన్నాడు కృష్ణుడు.

## 24. అచ్ఛేద్యో2యమదాహ్యో2యమక్లేద్యో2శోష్య ఏవచ। నిత్యస్సర్వగత: స్థాణు:రచలో2యం సనాతన:॥

ఓ అర్జునా! ఈ ఆత్మ ఛేదించబడదు. దహింపబడదు. తడప బడదు. ఎండకు, గాలికి శోషించిపోదు. ఎందుకంటే ఇది నిత్యమైనది, సత్యమైనది. అన్ని ప్రాణులలో అంతర్యామిగా వెలుగుతుండేది. చలనము లేనిది. స్థిరంగా ఉండేది. అన్నిటి కంటే సనాతనమైనది. ఇది ఎప్పటి నుండి ఉందో ఎవరూ చెప్పలేరు.

ఈ శ్లోకం మొదటి పాదము పై శ్లోకానికి పునరుక్తి. అంటే పైశ్లోకంలో చెప్పిన మాదిరే ఆత్మ ఛేదింపబడదు, దహించబడదు, తడపబడదు, ఎండకు గాలికి శుష్కించి పోదు. కాబట్టి ఇది నిత్యము.

నిత్యము అంటే ఎప్పటికీ నిలిచి ఉండేది అని అర్థం. మీరు ఎవరినన్నా దీవించాల్సి వస్తే శతమానం భవతి అని గానీ చిరంజీవి అని కానీ దీవిస్తారు. అంటే కలకాలం జీవించు అని అంతేకాని ఉన్నంత కాలం సుఖంగా ఉండు అని ఎవరూ అనరు. ఎందుకంటే ప్రతి వాడికీ చాలాకాలం జీవించాలని కోరిక బలంగా ఉంటుంది. ఇంకా సర్వగత: అంటే సర్వత్రా నిండి ఉండేది. అక్కడ ఉంది ఇక్కడ లేదు అనే ప్రశ్నలేదు. స్థాణు: అంటే కదలకుండా ఉన్నావు అనికాదు. ఈశ్వరుడి నామాలలో స్థాణువు అని కూడా ఉంది. అంటే కదలకుండా ఒక చోట కూర్చున్నాడు అని అర్థం కాదు. అన్ని కాలాలలోనూ, అన్ని చోట్లా స్థిరంగా ఎటువంటి మార్పులేకుండా నిలిచి ఉండే దానిని స్థాణువు అంటారు. పరమ శివునికి స్థాణువు అని పేరు. సర్వగత: అన్నా స్థాణువు అన్నా ఒకటే. ఇంకా అచల: అంటే చలనము లేనిది. ఇది కూడా పై శబ్దాలకు పర్యాయపదమే. ఒక చోట ఖాళీ ఉంటే ఇక్కడ నుండి అక్కడకు చలనం కలుగుతుంది. అంతటా నిండి ఉంటే ఇంక కదలడానికి, పక్కకు జరగడానికి చోటు ఎక్కడుంది. ఒక డబ్బాలో బియ్యం నిండుగా పోసాము. గట్టిగా మూత పెట్టాము. అటు ఇటు ఆడించాము. లోపల బియ్యం కదలవు. ఎందుకంటే వాటికి కదలడానికి జరగడానికి లోపల స్థలం లేదు. డబ్బాఅంతటా బియ్యం నిండుగా ఉన్నాయి. అలాగే పరమాత్మ అంతటా నిండి ఉన్నాడు. జరగడానికి స్పేస్ లేదు. కాబట్టి చలనం లేదు. అందుకే అచల: అన్నారు. సనాతన: అంటే అతి పురాతనమైనా నిత్యం కొత్తగా ఉండేది. ఈ గుణములు, లక్షణములు కలిగిన ఆత్మ నీలోనూ నాలోనూ,

అందరిలోనూ ఉంది. అని అన్నాడు కృష్ణుడు. ఆత్మ శాశ్వతము అయితే అనాత్మ అయిన శరీరం అశాశ్వతము అనే అర్థం.

ఇక్కడ శాస్త్రము ఒక ప్రశ్న వేస్తుంది. మానవుడు తన శరీరము అశాశ్వతము అని ఎందుకు గుర్తించలేకపోతున్నాడు అని. దానికి ఒకే జవాబు. మానవుడికి అలా అనుకోవడం నచ్చదు. నచ్చని పని ఎవరూ చేయరు. మరణం అనే పదం మనకు నచ్చదు. అందుకని ఈ శరీరము అశాశ్వతము అనే ఆలోచనను కూడా మనం మనసులోకి రానీయము. ఎందుకంటే శరీరము అశాశ్వతము అని అనుకోవడం మన స్వభావం కాదు. చిరకాలం జీవించడం మన స్వభావము. దానికి విరుద్ధమైన భావాన్ని మనం అంగీకరించము. అలాగే మనకంతా తెలుసు అన్నది మన స్వభావము. ఎవరినన్నా నీకు తెలియదు అంటే వాడు మన మీదికి పోట్లాటకు వస్తాడు. ఎల్లప్పుడూ సుఖంగా ఉండాలి అని అనుకోవడం మన స్వభావము అందుకే దేవుడిని "నాలుగు కాలాల పాటు సుఖంగా ఉండేటట్టు చూడు స్వామీ" అని మొక్కుకుంటాము. అంతే కానీ నాకు దు:ఖము ప్రసాదించు స్వామీ అని మొక్కము. కాబట్టి మన స్వభావ విరుద్ధంగా మనము ఏమి మాట్లాడము, ఏదీ చెయ్యము. అందుకే కృష్ణుడు అర్జునునితో నీ స్వభావము యుద్ధం చేయడం. శరీరం స్వభావము నాశనం కావడం. ఆత్మ స్వభావము నిత్యంగా ఉండటం. నిత్యమైన ఆత్మ ఎప్పటికీ నశించి పోదు. అశాశ్వతమైన శరీరం నీవు చంపకపోయినా చస్తుంది. కాబట్టి నీ స్వభావాన్ని అనుసరించి యుద్ధం చెయ్యి. అని బోధించాడు కృష్ణుడు.

## 25. అవ్యక్తో2యమచిన్త్యో2యమవికార్యో2యముచ్యతే।
## తస్మాదేవం విదిత్వైనం నానుశోచితు మర్హసి॥

అర్జునా! ఇంకా ఈ ఆత్మ ఎటువంటిదంటే, అది ఎవరికీ కనపడదు. వినపడదు. అంటే ఇంద్రియ గోచరము కాదు. పోనీ మనస్సుతో ఆలోచిద్దామా అంటే ఆలోచనలకు అందనిది. ఈ ఆత్మకు ఎటువంటి వికారములు మార్పులు లేనిది. కాబట్టి అర్జునా! ఆత్మ ఇలా ఉంటుంది అని ఎవరూ తెలుసుకోలేదు చెప్పలేదు. చెప్పగా వినలేదు. ఈ విషయాలన్నీ తెలిసి కూడా నీవు ఈ ప్రకారంగా ఆత్మస్వరూపులైన నీ శత్రువుల గురించి శోకించడం మంచిదేనా! కాబట్టి నీ శోకము మాని యుద్ధముచేయడానికి సంసిద్ధుడవు కా!

ఆత్మను గురించి బోధించడంలో ఇది చివరి శ్లోకం. కృష్ణుడు ఆత్మ తత్వమును గురించి అర్జునుడితో ఇలా అంటున్నాడు. అవ్యక్తము అంటే వ్యక్తము కానిది. కనిపించనిది. కళ్లకు కనిపించదు. చెవులకు వినిపించదు. ఇంకా ఆత్మను గురించి మనసుతో ఆలోచించి తెలుసుకోలేము. ఆలోచించడం అనేపనిని మనం మనసు బుద్ధి తోనే చేస్తాము. ఏదైనా ఒక విషయం గురించి

తెలిస్తే దాని గురించి ఆలోచిస్తాము. అసలు ఆత్మ కనపడదు వినపడదు, తాక బడదు. అటువంటి దానిని గురించి ఏమి ఆలోచిస్తాము. కాబట్టి ఆలోచనలకు కూడా అందనిది ఆత్మ. ఇవి ఆత్మ లక్షణములు. శాశ్వతము, కనపడని ఆత్మగురించి, అశాశ్వతమైన కనపడే ఈ శరీరం గురించి శోకించడం వ్యర్థము. నువ్వు ఏమి చెప్పావు. నువ్వు నా శిష్యుడివి అని అన్నావు. అందుకే ఇంతదూరం చెబుతున్నాను. నా మాటవిని, ఈ అనవసరమైన శోకం మాని లేచి యుద్ధం చెయ్యి అని బోధించాడు కృష్ణుడు.

ఇంకా వివరంగా చెప్పాలంటే ఆత్మ దృశ్యవస్తువు కాదు. కళ్లతో చూడలేము. దాని గురించి చెవులతో వినలేము. ఎవరూ దాని గురించి చెప్పలేరు. జ్ఞానేంద్రియములకు అతీతమైనది. అతి సూక్ష్మంగా ఉంటుంది. దీనిని చూడాలంటే ఒకటే మార్గము. ముందు మనసును, ఇంద్రియములను స్వాధీనపరచుకోవాలి. దానికి మార్గము నిష్కామ కర్మ, వైరాగ్యము, అచంచలమైన, ఏకాగ్రమైన భక్తి, భగవంతుని ధ్యానించడం. వీటి ద్వారా మనస్సు శుద్ధిఅవుతుంది. శుద్ధిఅయిన మనస్సు ఆత్మలో లీనం అవుతుంది. అప్పుడు ఆత్మ ఒకటే మిగులుతుంది. మనసు విడిగా ఉన్నంత కాలం, మనసు, అహంకారంతో కలిసి, ప్రాపంచిక విషయములలో తిరుగుతున్నంత కాలం, ఎవరికీ ఆత్మగురించి తెలిసే అవకాశం లేదు. ఇది చాలా కష్టం కాబట్టి ఎవరూ తెలుసుకోవడం లేదు. కనీసం తెలుసుకోవడానికి ప్రయత్నించడం లేదు.

## 26. అథ చైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతమ్
## తథాపి త్వం మహాబాహో నైనం శోచితు మర్హసి.

అర్జునా! నీకు నా మాట మీద నమ్మకం లేకపోతే, ఆత్మకు కూడా పుట్టుక, చావు ఉంటాయని నీవు నమ్ముతుంటే, ఆవిధంగా కూడా నీవు ఈ విధంగా ఏడవడానికి వీలు లేదు. నీవు అనుకుంటున్నట్టు ఈ శరీరమే ప్రధానము అనేది నిజమైతే కూడా నీవు శోకించడానికి అర్హుడవు కావు.

ఈ శ్లోకంలో కృష్ణుడు ఒక ఊహాజనితమైన వాదన వినిపిస్తున్నాడు. ఈ పదాలను మామూలుగా కోర్టులలో వాడుతుంటారు. "అజ్యూమింగ్ ఫార్ ఎ మూమెంట్", అనీ "ఫార్ ఆర్గ్యుమెంట్ సేక్" అనీ అంటూ ఉంటారు. ఒక వేళ ఇలా జరిగింది అని అనుకుంటే కూడా అది సరికాదు అని చెప్పడం. అలాగే కృష్ణుడు కూడా అర్జునుడిని ఊహించమంటున్నాడు. ఎందుకంటే హిందూధర్మంలో అసలు విషయం అన్నికోణాల నుండి చెబుతారు. నమ్మడం నమ్మకపోవడం నీ ఇష్టం. ఇది నువ్వు నమ్మాలి అని ఖచ్చితంగా చెప్పదు. అందుకని కృష్ణుడు ఇన్ని విధాల అర్జునుడిని కన్విన్స్ చెయ్యడానికి ప్రయత్నిస్తున్నాడు.

కృష్ణుడు చెప్పినట్టు ఆత్మ నిత్యం సత్యం అవ్యక్తం అచింత్యం అవికారం, అని మనం నమ్మడంలేదనుకో. ఏం ఇబ్బంది లేదు. చాలా మంది దేవుడు ఉన్నాడని నమ్మరు. ఇంకా వేదములను నమ్మరు. వేదాంతం అంతా చెత్త అనేవాళ్లు ఉన్నారు. చార్వాకుడు ఒక మతాన్ని కనిపెట్టాడు. చార్వాకమతం. ఆత్మ కనిపించదు కాబట్టి ఆత్మ లేదు. దేవుడు కనిపించడు కాబట్టి దేవుడు లేడు. శరీరం కనిపిస్తుంది కాబట్టి శరీరం మాత్రమే ఉంది. అని అంటారు చార్వాకులు. కాబట్టి కృష్ణుడు అంటున్నాడు "అర్జునా! నీవు శరీరమే ఆత్మ అనుకున్నప్పటికీ, ఆత్మ కూడా శరీరంతో పాటు పుడుతూ చస్తూ ఉంటుంది అని నీవు అనుకుంటే కూడా, నీవు ఈ విధంగా శోకించడానికి అర్హుడవు కావు. నీవు యుద్ధం చెయ్యాల్సిందే. తప్పదు." అని అన్నాడు. దానికి కారణం తరువాతి శ్లోకంలో వివరిస్తున్నాడు.

## 27. జాతస్య హి ధ్రువో మృత్యుర్ధ్రువం జన్మ మృతస్యచ।
## తస్మాదపరిహార్యేऽర్థే న త్వం శోచితు మర్హసి.॥

అర్జునా నేను చెప్పిన ఆత్మజ్ఞానమును పక్కన పెట్టి భౌతికంగా ఆలోచించినా, నీవు నీ బుద్ధితో ఆలోచించినా, నీకు ఒక విషయం మనసులో తట్టి ఉండాలి. అదేమిటంటే, పుట్టిన ప్రతివాడూ చావడం తప్పదు కదా. నీవు చూస్తూనే ఉన్నావు కదా. పుట్టిన ప్రతి జీవి మరణించక తప్పదు అలాగే మరణించిన ప్రతిజీవి మరలా పుట్టక తప్పదు. అది ప్రకృతి సహజం. దీనిని ఎవరూ తప్పించలేరు. మార్చడానికి సాధ్యముకాని ప్రకృతి స్వభావమును మార్చడం ఎవరితరమూ కాదు. కాబట్టి వీళ్లంతా ఇప్పుడు యుద్ధంలో మరణించినా మరలా పుడతారు. పుట్టినప్పుడు సంతోషించాలి గానీ, వీరి గురించి శోకించడం వ్యర్థం.

ఇంకా వివరంగా చెబుతున్నాడు కృష్ణుడు. ఈ శరీరంతో పుట్టినవాడు శాశ్వతంగా ఈ భూమి మీద ఉండడు కదా! అలా ఉండగలిగితే నీ తండ్రి పాండురాజు, నీ తాత విచిత్రవీర్యుడు, ముత్తాత శంతనుడు కూడా ఉండాలి. కాని వారు ఎవరూ లేరు కదా. అందుకని పుట్టిన ప్రతి వాడూ చావక తప్పదు. మరణించిన వారికి మరలా పుట్టడం తప్పదు. మరణించిన వాడు అటే పోతే, పుట్టే వాళ్లు ఎలా పుడుతున్నారు. కాబట్టి చావడం, పుట్టడం, మరలాచావడం ప్రకృతి సహజం. దీనిని ఎవరూ మార్చలేరు. నివారించలేరు. నివారించలేని మరణాల గురించి నీవు శోకించడం తగదు కదా!

ఈ భీష్ముడు, ద్రోణుడు, కృపుడు నీవు చంపక పోయినా, చావక తప్పదు. కాకపోతే ఇంట్లో ముసలితనంతో మరణించే బదులు యుద్ధంలో అనాయాసంగా మరణిస్తున్నారు. అంతే. మరణం తప్పనప్పుడు, తప్పించుకోలేని మరణం కోసరం చింతించడం, శోకించడం అవివేకము కదా!

ఈ విషయాన్ని మనకు అన్వయించుకుంటే పుట్టినవాడు చావక తప్పదు అన్న సూత్రాన్ని అందరికీ అన్వయిస్తాము కానీ మనకు మన భార్యాబిడ్డలకు, మనకు కావాల్సిన వాళ్లకు మాత్రం అన్వయించుకోము. అదే మాయ. ఇతరులను మాత్రం "పుట్టడం చావడం సహజం ఊరుకోండి ఏడవకండి. ఎల్లకాలం ఉంటాడా. కాలం తీరింది పోయాడు" అని ఓదారుస్తాము. ఇది ఈ నాటిది కాదు. మానవుడి పుట్టినప్పటి నుండి మొదలయింది. ఇదే మనకు యక్షప్రశ్నలలో కనపడుతుంది. యక్షుడు ధర్మరాజును ఒక ప్రశ్న వేసాడు. ఈ ప్రపంచంలో అత్యంత ఆశ్చర్యకరమైనది ఏది అంటే ధర్మరాజు అంటాడు ప్రతిరోజూ తమ కళ్ల ఎదుట ఎంతో మంది చనిపోతున్నా, తాము మాత్రం శాశ్వతంగా ఉంటాము అని అనుకుంటూ ఉంటారు. అని. ఎందుకంటే ప్రతిమనిషీ తాను కలకాలం జీవించాలని అనుకుంటాడు అది అతని స్వభావము. దానికి విరుద్ధంగా మనిషి ఆలోచించలేడు, ప్రవర్తించలేడు.

కాబట్టి అర్జునా పుట్టిన ప్రతివాడూ చావక తప్పదు అది ప్రకృతి సహజం. అందుకని ఈ భీష్ముడు ద్రోణుడు నీ చేతిలో మరణిస్తారు అని వారి కోసం శోకించడం అవివేకము. ఒకనాటికి నువ్వు నేను కూడా పొయ్యేవాళ్లమే! మనకు కూడా ఈ ధర్మం వర్తిస్తుంది.

ఎవడికైనా ఒక ధర్మము, ఒక శాస్త్రము ఒకవిషయం అర్థం అయింది అంటే దాని అర్థం ఆ విషయాన్ని అందరి మాదిరి తనకూ అన్వయిస్తుంది అని అర్థం చేసుకున్న నాడే అతనికి పూర్తిగా అర్థం అయినట్టు. లేకపోతే అతడికి ఆ ధర్మం అర్థం కానట్టే. అర్థం అయినట్టు ఒక భ్రమలో ఉంటాడు. పుట్టడం చావడం ఎవరి చేతిలో లేదు. మానవుడు తన ఇష్టం వచ్చినట్టు, ఇష్టంవచ్చినవారి ఇంట్లో, ఇష్టం వచ్చిన రోజు పుట్టే అవకాశం లేదు. అలాగే ఇష్టం వచ్చిన మాదిరి, ఇష్టం వచ్చిన రోజున మరణించే అవకాశం లేదు. పుట్టడం చావడం మన చేతుల్లో లేదు కాబట్టి జరిగినదానిని, జరుగుతున్నదానిని అంగీకరించడమే మానవ లక్షణం. ఇది తెలుసుకుంటే చాలు. కాని ఈ విషయాన్ని మనం అందరికీ చెబుతాము కానీ మనకు మాత్రం అన్వయించుకోము. అదే మాయ.

కాబట్టి అర్జునా! నీవు చంపుతాను అన్న వాళ్లందరూ నీ చేతిలో మరణించినా మరలా పుడతారు. అది వాళ్ల ధర్మం. దానిని నీవు ఆపలేవు. మరలా పుట్టే వాళ్ల గురించి చింతించడం అవివేకము అని అన్నాడు కృష్ణుడు.

## 28. అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత।
## అవ్యక్త నిధనాన్యేవ తత్ర కా పరిదేవనా॥

ఓ అర్జునా! ఈ ప్రాణులన్నీ పుట్టక ముందు ఎవరికీ కనపడవు. మరణించిన తరువాత ఎవరికీ కనపడవు. శరీరంలో ఉన్నప్పుడు మాత్రమే కనపడతాయి. పుట్టుక, చావు ఈ మధ్యనే అదీ శరీరం ఉంది కాబట్టి శరీరాల ద్వారా మనందరికళ్లకు కనపడుతున్నాయి. భీష్ముడు ద్రోణుడు వీళ్లను కూడా పుట్టక ముందు నువ్వు చూడలేదు. చనిపోయిన తరువాత చూడబోవు. ఇప్పటికే వీళ్లు వృద్ధులు అయ్యారు. వీళ్లను ఈ శిథిలమైన శరీరములనుండి విముక్తి కలిగించకుండా, వీళ్లు మరణిస్తారే అని శోకించడం తెలివితక్కువ తనం కదా!

మనం ప్రతిరోజూ ఒక విషయం చూస్తుంటాము. లేబర్ రూములోకి గర్భవతిని తీసుకెళతారు. అక్కడ డాక్టర్ నర్సు ఉంటారు. మొత్తం ముగ్గురు. కాని కాసేపటికి కేర్ మనే కేక. నలుగురు బయటకు వస్తారు. అంటే ఆ నాలుగో జీవి అంతకు ముందు మన కళ్లకు కనపడ లేదు. ఇప్పుడు మనకళ్లకు కనపడింది. అలాగే శ్మశానానికి నలుగురు మోసే వాళ్లు, ఒకడు కుండ పట్టుకొని, ఒక శరీరాన్ని పాడెమీద తీసుకెళతారు. అంటేమొత్తం ఆరుగురు. కాని తిరిగి అయిదుగురే వస్తారు. పాడె మీదున్నవాడు రాడు. ఈ పాడె మీదున్న వాడు అంతకు ముందు కొన్ని సంవత్సరాల క్రితం ఒక రోజు ప్రసూతి గృహములో ప్రత్యక్షం అయిన వాడే. అప్పుడు ప్రసూతి గృహములో ప్రత్యక్షం అయ్యాడు. ఇప్పుడు శ్మశానంలో అంతర్థానం అయ్యాడు. ఈ మధ్యలో తెల్లటి, నల్లటి, చామన చాయతో, అందంగా లేక వికృతంగా, పొడుగ్గా, పొట్టిగా, లావుగా, సన్నంగా, ఒక సుబ్బారావుగానో, వెంకట్రావుగానో, ఒక ఆఫీసరుగానో, బంట్రోతుగానో, వ్యాపారవేత్తగానో, రాజకీయనాయకుడిగానో కొంతకాలం చలామణీ అయ్యాడు. తుదకు కనపడకుండా పోయాడు. అంతకు ముందు లేనిదీ, కొంతకాలం తరువాత ఉండనిదీ మధ్యలో మాత్రమే కనపడేది, దీనిని మిథ్య, భ్రాంతి అని అనాలి. ఎలాగంటే మనం స్వప్నంలో ఎంతమందినో చూస్తుంటాము. కల ఉన్నంత సేపూ వాళ్లు ఉంటారు. మనం నిజం అని నమ్ముతాము. కల చెదిరిపోగానే వాళ్లు కనపడరు. కలలో కనపడ్డ వాళ్లు కలకు ముందులేరు, కల చెదిరిన తరువాత ఉండరు. అలాగే ఇంతకు ముందు లేని వాళ్లు, కొంత కాలం తరువాత ఉండని వాళ్లు కూడా కలలో కనపడ్డవాళ్ల మాదిరి భ్రాంతి కదా! కేవలం భ్రాంతి కొరకు ఏడవడం వృథా కదా! ఇదే విషయాన్ని కృష్ణుడు అర్జునుడికి చెప్పాడు.

## 29.ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేనమాశ్చర్యవద్వదతి తథైవ చాన్యః।
## ఆశ్చర్య వచ్చైనమన్యశ్శృణోతి శ్రుత్వాప్యేనం వేద న చైవ కశ్చిత్॥

అర్జునా! ఇదంతా ఆశ్చర్యంగా ఉంది కదూ! ఈఆత్మ ఏమిటి! శరీరంఏమిటి! శరీరం చావడం ఏమిటి! ఆత్మ చావకపోవడం ఏమిటి! అందుకే కొంతమంది ఈ ఆత్మను ఆశ్చర్యంగా చూస్తారు! మరి కొంతమంది ఈ ఆత్మను గురించి ఆశ్చర్యకరంగా మాట్లాడుకుంటారు. ఇంకా మరి కొంత మంది ఈ ఆత్మ గురించి ఎవరైన చెబుతుంటే వింటూ ఆశ్చర్యపోతుంటారు. కాని

కొంత మంది దీనిని గురించి విన్నా, చూచినా, చెప్పినా సరిగా అర్థంచేసుకోలేరు. ఎందుకంటే...ఆత్మను వాళ్లకు తెలియదు. ఒకరు చెబితే వినరు.

ఆత్మజ్ఞానం అందరికీ ఆశ్చర్యకరంగా ఉండటం, ఎవరికీ అర్థం కాకపోవడానికి ఒకటే కారణం అది అర్జునుడి గురించి అంటే మన గురించి, చెబుతున్నాడు కాబట్టి. మనం అందరం ఆత్మస్వరూపులము, ఆనందస్వరూపులము అనే విషయం మనకు తెలియదు కాబట్టి. మనం అందరం ఆనందం గురించి బయట వెతుక్కుంటున్నాము. అంటే మన గురించి మనమే వెతుక్కుంటున్నాము.(చంకలో బిడ్డను పెట్టుకొని ఊరంతా వెతికినట్టు) ఇదే ఆశ్చర్యం.

ఆధ్యాత్మిక విద్య కేవలం వినడం తోనే సరిపోదు. దానిని ఆచరణలో పెట్టినపుడే పూర్తిగా అవగతమౌతుంది. దానికికావాల్సింది పూర్వజన్మ కర్మల ఫలము, ఈ జన్మలో అలవడిన సంస్కారము, మానసిక నిర్మలత్వము, ప్రాపంచిక వాసనలు వదిలిపెట్టడం. కర్తృత్వ భావనలు లేకుండా కర్మలు చేయడం. ఇంద్రియ నిగ్రహము మనోనిగ్రహము అలవరచుకోవడం. అప్పుడే ఆత్మజ్ఞానము పరిపూర్ణంగా అర్థం అవుతుంది. దానికి కావాల్సింది సత్వగుణము ఎక్కువగా ఉండటం. తెల్లటి బట్టకు ఏ రంగు వేసినా చక్కగా అంటుతుంది. అలాగే సారవంతమైన భూమిలో ఏ విత్తనమైనా మొలకెత్తుతుంది. సాత్వికమైన హృదయంలో ఆధ్యాత్మికత తొందరగా నాటుకుంటుంది.

ఆత్మ అనేది అవ్యక్తము. కనపడదు, వినపడదు. తాకబడదు. ఇంద్రియములకు, మనసుకు అతీతమైనది. సూక్ష్మమైనది. ఆత్మ దర్శనం కావాలంటే ముందు హృదయం నిర్మలంగా ఉండాలి. ఆత్మగురించి విచారణ చేయాలి. ఇవన్నీ కష్టం కాబట్టి ఆత్మానుభూతిని పొందిన వారు చాలా అరుదుగా ఉంటారు అని అన్నాడు కృష్ణుడు. అందుకే కృష్ణుడు అర్జునుడితో అంటున్నాడు 'ఓ అర్జునా! ఇప్పటి దాకా నేను చెప్పింది నీకు అర్థం కాకపోయినా పెద్దగా ఆశ్చర్యపడవలసిన పని లేదు. ఎందుకంటే ఈ ఆత్మజ్ఞానము అంత సులభంగా పట్టుబడేది కాదు. చాలా క్లిష్టమైనది. ఒక యం.ఏ. చదివిన టీచర్ 5వ తరగతి కుర్రాడికి తన లెవల్ లో ఫిజిక్సుపాఠాలు చెబితే వాడికి ఏమీ అర్థంకాదు. వాడికి అర్థం కాలేదు అన్నది ఆశ్చర్యకరమైన విషయంకాదు. అప్పటి దాకా ప్రాపంచిక విషయాలలో మునిగితేలి, ఎలాగైనా యుద్ధం చేసి,రాజ్యం సంపాదించాలి అని యుద్ధానికిసిద్ధమై, ఎదురుగా తన తాతలను, గురువులను చూచి భోరున ఏడుస్తున్న అర్జునుడికి కృష్ణుడు చేస్తున్న తత్వబోధ ఓ పట్టాన అర్థం కాకపోవడంలో కూడా ఆశ్చర్యం ఏమి లేదు. మన విషయమూ అంతే. మనకు ఆత్మ తత్వము అంతా తెలిసినట్టే ఉంటుంది. కాని అర్థం కాదు. అంటే ఆత్మబోధ మన తత్వానికి సరిపడదు. మనం దానిని అంగీకరించలేము. ఎందుకంటే మనం నిత్యం ప్రాపంచికసుఖాలకోసం, కోరికలు తీరడం కోసం పాకులాడుతున్నాము కాబట్టి. ఆ విషయాన్నే ఇక్కడ వివరంగా చెబుతున్నాడు పరమాత్మ. ఆత్మ అనేది ఒక ఆశ్చర్యకరమైన విషయం. ఎందుకంటే దానికి రూపం లేదు, గుణం లేదు, వికారం లేదు. నాశనం లేదు. మార్పులేదు. కనపడదు, వినపడదు, చూడబడదు. ఇటువంటి దాని గురించి

తెలుసుకోవడం చాలా కష్టం. కాని అత్యంత సులభం. ఎందుకంటే ఆ ఆత్మ అంటే ఎవరో కాదు. నీవే. నీవు శరీరం కాదు ఆత్మ అని తెలుసుకోవడమే ఆత్మజ్ఞానం. ఇలా అనుకోవడానికి మన మనసు ఒప్పుకోదు. అదే అజ్ఞానం. ఈ అజ్ఞానం తొలగితే కానీ ఆత్మ తత్వం అర్థం కాదు. అర్జునుడు ఇంకా ఆ అజ్ఞానంలోనే ఉన్నాడు.

మనం దేవుడి గురించి పుణ్యక్షేత్రాలకు వెళతాము. ఎక్కడెక్కడో వెదుకుతాము. అదే అజ్ఞాన దశ. భగవంతుడు నాలోనే ఉన్నాడు అని భావించడం... ఇది మధ్యమ దశ. భగవంతుడు నేనుగా ఉన్నాడు భగవంతుడు అన్నిటిలో ఉన్నాడు. ఇది ఉత్తమ దశ. సంతోషం, దు:ఖం ఎక్కడో బయట లేదు. అలా అని లోపలా లేదు. మనం సుఖాన్ని సుఖంగానూ, దు:ఖాన్ని దు:ఖం గానూ చూస్తున్నాము. ఆయా అనుభూతులను అనుభవిస్తున్నాము. అలా కాకుండా నేనే ఆనంద స్వరూపుడిని అనుకున్న నాడు సుఖం గానీ, దు:ఖం గానీ మనలను ఏమీ చేయలేదు. రాత్రిపూట అన్ని మరిచిపోయి, హాయిగా నిద్రపోయినపుడు, మనసు ఆత్మలో లీనం అవుతుంది. అప్పుడే మనకు అంతులేని సుఖం లభిస్తుంది. మరలా నిద్రలేవగానే నిన్నటి సుఖదు:ఖాలు ఆవరిస్తాయి. అందుకని అందరూ సుఖంగా నిద్రపోవడానికి ఇష్టపడతారు. నిద్రనుండి లేవడానికి ఇష్టపడరు. ఎందుకని. గాఢనిద్రలో, సుషుప్తావస్థలో ఆత్మలో రమిస్తూ, పరమమైన ఆనందం పొందుతుంటాడు కాబట్టి. మెలుకువగా ఉండగానే, నిరంతరం అటువంటి ఆత్మానందాన్ని అనుభవించడమే జీవన్ముక్తి, మోక్షం. ఇదే అర్థంకాని విషయం. అందుకనే మానవుడు ఆనందం కోసం బయట వెతుకుతుంటాడు. ప్రాపంచిక విషయాలలో, విషయ వాంఛలలో మునిగి తేలుతుంటాడు. సు:ఖదుఖాలలో, లాభనష్టాలలో మునిగితేలుతుంటాడు. గమ్యం చేరడానికి ప్రయత్నించడు.

ఆత్మ గురించి ఎంతమంది ఎన్నిసార్లు ఎలా చెప్పినా ఎవరికీ అర్థం కాదు. చాలా మంది అర్థం అయినట్టు నటిస్తారు. మాకు అంతా తెలుసంటారు. మాకు ఆత్మజ్ఞానం కలిగిందంటారు. మేము సిద్ధయోగులము అంటారు. ఆత్మజ్ఞానం గురించి అందరికీ చెబుతారు. ఉపన్యాసాలు ఇస్తారు. వాళ్లు మాత్రం ఆత్మానందాన్ని కాకుండా, ప్రపంచంలో దొరికే తాత్కాలికసుఖాల కోసం నిరంతరం ప్రయత్నిస్తుంటారు. ఇదే ఆశ్చర్యకరమైన విషయం.

## 30. దేహీ నిత్యమవధ్యో2యం దేహే సర్వస్య భారత। తస్మాత్సర్వాణి భూతాని న త్వం శోచితు మర్హసి॥

అర్జునా! ప్రతి దేహములో ఆత్మ ఉంటుంది. దేహములో ఉండే ఆత్మ చంపడానికి వీలుకానిది. కాబట్టి నువ్వు ఎవరినీ చంపడం లేదు. ఎవరూ చావడం లేదు. కాబట్టి నువ్వు ఎవరి గురించీ శోకించడానికి అర్హుడవు కావు.

అర్జునా! మరలా చెబుతున్నాను వినవయ్యా! కాస్త నా మాట చెవిలో వేసుకో! ఈ ఆత్మ ప్రతి దేహంలో ఉంటుందయ్యా! దేహాన్ని వధించవచ్చు కానీ, ఆత్మను వధించలేరు. కాబట్టి నీ తాత భీష్ముని గురించి కానీ, నీ గురువులు ద్రోణ, కృపాచార్యుల దురించి గానీ, నీసోదరుల గురించి గానీ, బంధుమిత్రుల గురించి గానీ, ఆమాటకొస్తే ఈ 18 అక్షౌహిణుల సైనికుల గురించిగానీ, నీవు శోకించనవసరం లేదు. ఎందుకంటే ఎవరి ఆత్మలూ చావవు. కేవలం శరీరాలు మాత్రమే నశిస్తాయి. ఈ ఆత్మలు మరలా శరీరాలు ధరిస్తాయి. శోకించడం నీ లక్షణం కాదు. నీవు ఆత్మస్వరూపుడవు. ఆనంద స్వరూపుడవు. శోకించడానికి నీకు అర్హత లేదు. కాబట్టి నీవు ఎవరికోసం దేని కోసం శోకించవద్దు. నీ కర్తవ్యమును, నీ క్షత్రియ ధర్మమును నీవు నిర్వర్తించు. అని బోధించాడు కృష్ణుడు.

31. స్వధర్మమపి చావేక్ష్య న వికమ్పితుమర్హసి।
ధర్మ్యా ద్ధి యుద్ధాచ్ఛ్రేయోన2న్యత్ క్షత్రియస్య న విద్యతే॥

అర్జునా! నీ స్వధర్మము అయిన క్షాత్రధర్మమును నిర్వర్తించడానికి నీవు భయపడ నక్కరలేదు. ఎందుకంటే క్షత్రియుడికి ధర్మయుద్ధమును మించినట్టి శ్రేయస్కరమైన ధర్మము మరొకటి లేదు.

ఓ అర్జునా! నీవు క్షత్రియుడవు. యుద్ధం చేయడం నీ ధర్మం, నీ ధర్మాన్ని నీవు నిర్వర్తిండానికి నీవు భయపడతావెందుకు. అసలు క్షత్రియుడికి భయం అంటే ఏమిటో తెలియదు. ఈ భయం నీకు ఎక్కడి నుండి దాపురించింది. క్షత్రియుడికి యుద్ధము చేయడమే పరమ ధర్మము. యుద్ధం చేయడం తప్ప మరేపనీ క్షత్రియుడికి శ్రేయస్సును ఇవ్వదు. ఇందకా ఏదో భిక్షాటన చేస్తాను అన్నావు అది నీ ధర్మం కాదు. అది బ్రాహ్మణ ధర్మము. నీ వలననే వర్ణసంకరం జరిగేటట్టు ఉంది. కాబట్టి నీ ధర్మం నీవు నెరవేర్చు. విల్లు పట్టు.యుద్ధంచెయ్యి.

కృష్ణుడు ఇప్పటి వరకు తాత్విక దృష్టితో చెప్పాడు. ఇప్పుడు ధర్మము అనేకోణంలో నుండి చెబుతున్నాడు. మరలా మొదలు పెట్టాడు. ఎందుకంటే వేదాంతము అందరికీ అర్థంకాదు. ముందు ప్రిపరేషన్ కావాలి. లేకపోతే వేదాంతాన్ని అపార్థం చేసుకుంటాడు. ఎవడూ నాకు అర్థం కాలేదు అని అనడు. అయితే అర్థం చేసుకుంటాడు లేకపోతే అపార్థం చేసుకుంటాడు. అందుకని ధర్మంగురించి కూడా భగవానుడు చెబుతున్నాడు. స్వధర్మము అనేకోణం నుండి చూచినా నీవు యుద్ధం చేయక తప్పదు అని అర్జునుడికి విశదీకరించాడు.

ధర్మము రెండు రకాలు సామాన్య ధర్మము, విశేష దర్మము. సామాన్య ధర్మము మానవులకు అందరికీ ఒకటే. యూనివర్సల్. ఆడ, మగ, కుల, మత, జాతి, ప్రాంతియ భేదం లేకుండా అందరికీ వర్తించేది సామాన్య ధర్మము. మనిషిగా పుట్టి, సమాజంలో జీవిస్తున్న ప్రతి వాడు సామాన్య ధర్మాన్ని పాటించాలి. ఈ సామాన్య ధర్మములను 10 గా విభజించారు. వాటిని యమ, నియమములు అని అంటారు. ఇవి ఏ దేశంలో ఉన్నా ఏకాలంలో ఉన్నా ప్రతి జీవి అనుసరించాలి. ఇవి కేవలం భారతీయులకు, హిందువులకు మాత్రమే అనుసరించవలసినవి కావు. అందరూ ఆచరించవలసిన ధర్మములు. తరువాతది విశేష ధర్మము. అంటే వాడి వర్ణమును బట్టి చేసే పనిని బట్టి, ఉండే ప్రదేశాన్ని బట్టి వాడి అర్హతను బట్టి, స్థితిని బట్టి, గుణమును బట్టి ఆచరించేది. అది ప్రతి మనిషికి వేరు వేరుగా ఉంటుంది. ఉదాహరణకు బ్రాహ్మణులు వేదములు శాస్త్రములు చదవాలి, అధ్యయనం చేయాలి, ఇతరుల చేత చదివించాలి. తాను చదివింది ఇతరులకు అర్థం అయేటట్టు చెప్పాలి. అది బ్రాహ్మణుల ధర్మం. అంతే కాని యుద్ధం చేయడం, వ్యవసాయం చేయడం, వ్యాపారంచేయడం, ఉద్యోగం చేయడం బ్రాహ్మణ ధర్మం కాదు. అలాగే క్షత్రియులు రాజ్యపాలన చేయాలి, ప్రజలను కాపాడాలి. అవసరమైతే ధర్మయుద్ధం చేయాలి అంతే కానీ బ్రాహ్మణ ధర్మంపాటించకూడదు. ఇదే విశేష ధర్మము.

యమము, నియమము అనేవి పది ధర్మాలు. ఇది సామాన్య ధర్మాలు. అందరూ పాటించవలసినవి.

1.అహింస ... ఇతరులు నాకు ఏమి చేస్తే నా శరీరానికి, మనసుకు బాధ కలుగుతుందో అది నేను ఇతరుల పట్ల చేయకూడదు.

2.సత్యం ...అంటే ఉన్నది ఉన్నట్టు చెప్పడం. పరమాత్మ ఒక్కడే సత్యం అని తెలుసుకోవడం.

3అస్తేయం.... ఒకరి వస్తువు తీసుకోకూడదు. తనకు ఉన్నదానితో తృప్తిపడటం.

4.బ్రహ్మచర..నిరంతరం పవిత్రమైన జీవితం గడపాలి. త్రికరణములు శుద్ధిగా ఉంచుకోవాలి.

5అపరిగ్రహం ...ఎంత అవసరమో అంతే తీసుకోవడం.

6.శౌచం. ... శారీరక, మానసిక పరిశుభ్రత. పరిసరాల పరిశుభ్రతను పాటించడం. శరీరము మాదిరే మనసును కూడా ఎల్లప్పుడే నిర్మలంగా శుభ్రంగా ఉంచుకోవడం.

7. సంతోషము... ఉన్నదానితో తృప్తిపడటం. అసూయ,ద్వేషము ఉండకూడదు.

8.తపస్సు. ... స్వీయ క్రమశిక్షణ. ప్రతి పనిని శ్రద్ధగా ఏకాగ్రతతో, నిష్కామబుద్ధితో, కర్తృత్వ భావన లేకుండా చేయడం.

9. స్వాధ్యాయము..... శాస్త్రములు చదువుతూఉండాలి. ఏదో ఒకటి చదవాలి.

10.ఈశ్వర ప్రణిధానము: .... చేసే ప్రతి పనీ భగవంతుడికి సమర్పించుకోవాలి. తనను తాను పరమాత్మకు అర్పించుకోవాలి. పరమాత్మకు శరణాగతుడు కావాలి.

విశేషధర్మములు. ఎవరి ధర్మం వారు చేయాలి. ప్రతివాడికీ ఒక ధర్మం ఉంటుంది. అందరూ అన్ని పనులు చేస్తే ఏ పనీ కాదు. ఆ నాటికాలంలో వర్ణవ్యవస్థ ఉండేది. దానికి ఒక ప్రత్యేకత ఉంది. దానికే స్వధర్మము వర్ణధర్మము అనిపేరు. నీకు కేటాయించిన ధర్మం నీవు చెయ్యాలి.

నీది క్షత్రియ ధర్మము. అధర్మం నుండి ప్రజలను రక్షించేవాడు క్షత్రియుడు. క్షత్రియుడు అహింస అంటే కుదరదు. సత్యం అయినా ప్రమాదం పరిస్థితులలో చెప్పకూడదు. హింసతో కూడినది అని నీ ధర్మము అయిన యుద్ధం చేయకపోవడం తప్పు. నీవు క్షత్రియుడివి కాబట్టి నీ స్వధర్మం యుద్ధం కాబట్టి నీవుయుద్ధం చేయక తప్పదు. ఇది హింస కాదు. దీని వలన నీకు పాపం రాదు. ఇది ధర్మయుద్ధం కాబట్టి ఇది నీకు శ్రేయస్కరమైన కార్యము.

## 32. యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వారమపావృతమ్।
## సుఖిన: క్షత్రియా: పార్థ లభంతే యుద్ధమీదృశమ్॥

ఓ అర్జునా! నీకో విషయం తెలుసా! ధర్మ రక్షణకోసం, సమాజం కోసం యుద్ధం చేసి, ఆ యుద్ధంలో ప్రాణాలు అర్పించడం ఎంతో శ్రేయోదాయకము. అటువంటి అవకాశము నీకు యాదృచ్ఛికంగా, అయాచితంగా అంటే నీవు కోరుకోకుండానే నీకు లభించింది. యుద్ధంలో మరణించడం అంటే స్వర్గద్వారములు తెరుచుకోవడమే. ధర్మయుద్ధంలో చావడం అందరికీ లభించేది కాదు. అది అదృష్ట వంతులైన క్షత్రియులకే లభిస్తుంది. ఆ అదృష్టం ఇప్పుడు ఈ యుద్ధం రూపంలో నీకు లభించింది. అసలు ధర్మ యుద్ధము అంటే స్వర్గమునకు తెరువబడిన ద్వారం వంటిది. గెలిస్తే రాజ్యసుఖాలు, మరణిస్తే స్వర్గలోకసుఖాలు నీకు సిద్ధంగా ఉన్నాయి.

అర్జునా! ధర్మం కొరకు చేయబడే యుద్ధంలో మరణిస్తే స్వర్గలోకం ద్వారాలు వాటంతట అవే తెరుచుకుంటాయి. యుద్ధంలో మరణించిన వారు సరాసరి స్వర్గానికి వెళతారు. ఎన్నో యజ్ఞాలు, యాగాలు, దానాలు,ధర్మాలు చేస్తే గానీ లభించని స్వర్గం యుద్దంలో మరణించిన వారికి సునాయాసంగా ఏ ప్రయత్నం లేకుండానే లభిస్తుంది. యుద్ధంలో మరణించిన క్షత్రియులు ఎంతో అదృష్టవంతులు. యుద్ధమంటే స్వర్గానికి తెరిచిన ద్వారం వంటిది. నీవు యుద్ధం చేయడం మానేస్తే భీష్మ,ద్రోణ,కృపాచార్యులు, నీ బంధుమిత్రులు ఈ సైనికులు స్వర్గసుఖాలు అనుభవించే అవకాశాన్ని జారవిడుచుకుంటారు. నీకోసరం కాకపోయినా వాళ్ల కోసం అయినా నీవు యుద్ధం చేయాలి తప్పదు.

స్వధర్మం అనుసరిస్తూ ధర్మరక్షణ కొరకు యుద్దంలో ప్రాణాలు అర్పించడం క్షత్రియ ధర్మం. వాడికి స్వర్గలోకాలు తెరిచిపెట్టి ఉంటాయి. నీవు చాలా అదృష్టవంతుడివి. ధర్మం కొరకు జరిగే యుద్దంలో ప్రాణాలు అర్పించడం నీకు వచ్చిన గొప్ప అవకాశం. ఇటువంటి అవకాశం ఎంతో పుణ్యం చేసుకుంటేనే గానీ దొరకదు. నీకు స్వర్గం లభిస్తుంది. అంటే నీ క్షత్రియ జీవితం సాఫల్యం చెందుతుంది. అనుకున్నది చేయడంలో ప్రతిమనిషికీ సంతోషం ఉంటుంది. అదే స్వర్గం. ఈ యుద్ధం నీకు స్వర్గ ద్వారము తెరిచినట్టు కనిపిస్తూ ఉంది. యుద్ధం స్వర్గానికి ద్వారం లాంటిది.

అదీకాకుండా అపావృత స్వర్గ ద్వారము అంటే ఎల్లప్పుడూ తెరిచే ఉంటుంది. ఇటువంటి అవకాశం ఎంతోఅదృష్టం చేసిన క్షత్రియుడికే దొరుకుతుంది. ఇటువంటి అవకాశం అపూరూపంగా లభిస్తుంది కాబట్టి ఈ అవకాశాన్ని చేజేతులా జారవిడుచుకోకు అని కృష్ణుడు అర్జునుడికి బోధించాడు.

## 33. అథచేత్త్వమిమం ధర్మ్యం సంగ్రామం న కరిశ్యసి।
## తతస్స్వధర్మం కీర్తిం చ హిత్వా పాపమవాప్స్యసి॥

ఓ అర్జునా! ఇది ధర్మయుద్ధము. ధర్మరక్షణ కోసం చేయబడుతున్న యుద్ధము. నీ స్వధర్మము యుద్ధం చేయడం. నీవు ఈ యుద్ధం చేయకపోతే, నీవు నీ స్వధర్మము నుండి పారిపోయినవాడవు అవుతావు. దానివలన నీవు ఇప్పటి దాకా సంపాదించుకున్న కీర్తి అంతా పోయి, అంతులేని అపకీర్తి వస్తుంది. పైగా మహాపాపం చుట్టుకుంటుంది.

కృష్ణుడికి మానవుల గురించి బాగా తెలుసు. ఆయనే సృష్టికర్త కాబట్టి మన మనసు గురించి బుద్ధి గురించి బాగాతెలుసు. ఇంత చెప్పినా అర్జునుడు ఇంకా ఏదో సందేహం లేవదీసేటట్టు ఉన్నాడు. ఎలాగంటే "ధర్మయుద్దం చేస్తే స్వర్గం వస్తుంది అన్నావు కదా. ఇందాకనే చెప్పాను. నాకు స్వర్గం వద్దు. త్రిలోకాధి పత్యము వద్దు అని అన్నాను కదా. ఇంకా ఈ స్వర్గం టాపిక్ ఎందుకు" అని అర్జునుడు అడిగే అవకాశం ఉంది. పైగా అర్జునుడు స్వర్గానికి నరకానికి భయపడేవాడుకాదు, పైగా నాకు స్వర్గం, స్వర్గ సుఖాలు వద్దు అవంటే నాకు ఇష్టం లేదు అని కుండబద్దలు కొట్టినట్టు ఇదివరకే చెప్పాడు కాబట్టి ఇక్కడి నుండి భగవానుడు కొంచెం లౌకిక దృష్టితో అర్జునుడికి బోధ చేస్తున్నాడు. అంటే కొంత భయపెడుతున్నాడు. అందుకని స్వధర్మం ఆచరించక పోతే ఈ ధర్మ యుద్ధం చేయక పోతే, ధర్మం రక్షించకపోతే ఏం జరుగుతుందో కూడా వెంటనే చెప్పేసాడు.

శాస్త్రంలో రెండు రకాల దోషాలు చెప్పారు. అవేమిటంటే చెయ్యవలసిన దానిని చెయ్యకపోవడం. చేయకూడని పని చేయడం. ఈరెండూ పాపాలే. నీవు యుద్ధం చేయకపోతే చెయ్యవలసిన పని చేయని వాడివి అవుతావు. నీ స్వధర్మాన్ని వదిలివేసిన వాడివి అవుతావు. అప్పుడు నీకుపాపం వస్తుంది. నువ్వు నరకానికి పోవాల్సి వస్తుంది. నరకం అంటే సుఖంగా లేకపోవడం. అంటే నీ శేష జీవితం తీరని దు:ఖంతో గడపడం అని కూడా చెప్పవచ్చు. ఇప్పటి దాకా నీవు సంపాదించుకున్న కీర్తి పోతుంది. ఇప్పటి దాకా నిన్ను అత్యుత్తమ ధనుర్ధారి అంటున్నారు. విజయుడు అంటున్నారు. ఈ కీర్తి అంతా గంగలో కలుస్తుంది. పిరికివాడు అనే అపకీర్తి మూటకట్టుకుంటావు. అని హెచ్చరిస్తున్నాడు కృష్ణుడు.

34. అకీర్తిం చాపి భూతాని కథయిష్యంతి తే2వ్యయామ్
సంభావితస్య చాకీర్తి: మరణాదతిరిచ్యతే॥

అర్జునా! నీకు ఇంకో విషయం తెలుసో లేదో. నీకు వచ్చిన అపకీర్తి గురించి, నీ పిరికితనం గురించి నీవు చనిపోయిన తరువాత కూడా, లోకంలో ఉన్న వారందరూ చాలా కాలం దాకా చిలవలు పలవలుగా కల్పించి చెప్పుకుంటారు. నీవంటి వీరుడు, పరాక్రమవంతుడు, అత్యుత్తమ ధనుర్ధరుడు, విజయుడు అని పేరుగాంచిన వాడు, ఈ ప్రకారంగా అపకీర్తితో బాధపడటం కన్నా యుద్ధంలో చావడం మేలు కదా! ఆలోచించు.

అర్జునుడు తన మూర్ఖత్వం విడువడు అన్న ఉద్దేశ్యంతో కృష్ణుడు ఇలా అంటున్నాడు. అర్జునా! నీకు చెప్పాల్సింది అంతా చెప్పాను. నీవు యుద్ధం చేస్తే చెయ్యి లేకపోతే మానెయ్యి. కాని ఇంకొక విషయం మాత్రం చెప్పక తప్పదు. నా శిష్యుడివి అన్నావు కాబట్టి చెబుతున్నాను. ఏంటంటే...ఈ లోకంలో ఈ సమాజంలో నీకు ఉన్న పరువు, ప్రతిష్ట, వీరుడు, విజయుడు, విఖ్యాత ధనుర్ధరుడు అనే కీర్తి, పేరు, ప్రతిష్ట అన్నీ సర్వనాశనం అయిపోతాయి. లోకులంతా నిన్ను ఒట్టి పిరికివాడు అంటారు. నీ ఇష్టం ఆలోచించుకో అని హెచ్చరించాడు కృష్ణుడు.

అర్జునా నీవు యుద్ధానికి రాకపోతే బాధ లేదు. యుద్ధం చేస్తానని ప్రగల్భాలు పలికి యుద్ధ రంగం దాకా వచ్చి ఇప్పుడు శత్రుసైన్యాన్ని చూచి భయపడి, పిరికితనంతో, ప్రాణం మీద తీపితో పారి పోతే లోకులు నీ గురించి పిరికిపింద అనుకుంటారు. నీ పిరికితనం గురించి కథలు కథలుగా చెప్పుకుంటారు. ఉత్తమ క్షత్రియుడవైన నీకు ఇది ఎంతటి అప్రతిష్ట కలిగిస్తుందో ఆలోచించు. అంటూ కృష్ణుడు అర్జునుడి అహం మీద కొట్టాడు.

మనకు రెండు శరీరాలు ఉన్నాయి. ఒకటి భౌతిక కాయము అంటే పది ఇంద్రియములతో కూడిన శరీరము. రెండవది కీర్తి కాయము. మనం సంపాదించుకున్న మంచి పేరు అనే శరీరము. మనం ఎన్ని జాగ్రత్తలు తీసుకున్నా ఈ భౌతిక కాయము మరణిస్తుంది. తప్పదు. కాని కీర్తి అనే శరీరానికి మరణం లేదు. అది ఆచంద్రార్కము అంటే సూర్యుడు చంద్రుడు ఉన్నంత వరకు నిలిచి ఉంటుంది. అందరూ ఆయన మంచి తనం గురించి గొప్పగా చెప్పుకుంటారు. చని పోయిన వారిని కీర్తిశేషులు అంటారు. కీర్తి మాత్రమే మిగిలిన వారు. ఆనాడు కానీ ఈ నాడు కానీ ప్రతి వాడూ తన కోసరం బతకడం లేదు. ఇతరుల కోసరం బతుకుతున్నాడు. పేరు ప్రతిష్టల కోసం పాకులాడుతున్నాడు. చాలా మంది ఇతరులు మనగురించి ఏమనుకుంటారో అని మధన పడుతుంటారు. ఇతరుల దృష్టిలో మంచి వాడు అనిపించుకోవాలని తపన పడుతుంటాడు. అందుకే కృష్ణుడు అంటున్నాడు. అర్జునా! సాధారణంగా గొప్ప గొప్ప పనులు చేసిన వారికి ఈ శరీరం

పోయినా వారి కీర్తి శరీరం కలకాలం నిలిచి ఉంటుంది. అలాగే నీ కీర్తి కలకాలం నిలిచి ఉండాలంటే లేచి యుద్ధం చెయ్యి. యుద్ధం చేయకుండా పారిపోతే, ఆ అపకీర్తి  ఈ జన్మతో పోయేది కాదు. రాబోయే తరాల వారుకూడా నీకు వచ్చిన అప్రతిష్టగురించి రకరకాలుగా చెప్పుకుంటారు. సాక్షాత్తు ఇంద్రుడి అర్ధ సింహాసనం మీద కూర్చున్న నీవు ఇంతటి అవమానాన్ని భరించగలవా.  అయినా నీ వంటి వాడు ప్రాణం పోయినా తట్టుకోగలడుకానీ మానం పోతే తట్టుకోలేడు కదా ఆలోచించు. ఇటువంటి అపకీర్తిని మూటకట్టుకోవడం మరణం కంటే హీనమైనది. అంటూ అర్జునుడిలోని అహాన్ని మరింత రెచ్చగొట్టాడు.

అర్జునుడి  అపకీర్తి ఎలా ఏ విధంగా వ్యాప్తిచెందుతుందో  తరువాతి శ్లోకంలో చెప్పబోతున్నాడు కృష్ణుడు.

## 35.భయాద్రణాదుపరతం మంస్యంతే త్వాం మహారథాః। యేషాం చ త్వం బహుమతో భూత్వా యాస్యసి లాఘవమ్॥

ఓ అర్జునా! ప్రస్తుతము మన పక్షములోని, ఎదుటి పక్షములోని మహారథులందరూ నీవు గొప్పవాడివి, అత్యుత్తమ ధనుర్ధరుడివి అనుకుంటున్నారు. ఇప్పుడు నువ్వు యుద్ధం చేయకుండా పారిపోతే, వారి అందరి దృష్టిలో నీవు చులకన అవుతావు కదా!  ఇరు పక్షములలోని మహారథులందరూ నీవు యుద్ధం చేయలేక పిరికితనంతో పారిపోయావు అని హేళన చేస్తారు.

అర్జునా! నీకు ఎలా అవమానం జరుగుతుందో చెబుతాను. నీవు ఇప్పుడు యుద్ధం చేయను అని ఎందుకు అనుకుంటున్నావు. నీకు భీష్ముని మీద ఉన్న ప్రేమ, గౌరవం. ద్రోణుడిమీద కృపుడి మీద ఉన్న గురుభక్తి, నీ బంధువుల మీద మిత్రుల మీద ఉన్న ప్రేమ, అభిమానము. సైనికుల మీద ఉన్న జాలి, వర్ణసంకరం అవుతుందేమోఅన్న భయం. వీటి వలన నీవు యుద్ధం చేయను అని అంటున్నావు. ఈ విషయం నీకు నాకు తప్ప ఎవరికీ తెలియదు. నేను ఈ కారణాల వల్ల యుద్ధం చేయడం లేదు అని  ఎంతమందికి చెబుతావు. లోకులందరికీ చెప్పలేవు కదా! ప్రతివాడినీ పిలిచి నేను ఈ కారణం చేత యుద్ధం చేయడం లేదు. నాకు భయం లేదు. నేను పిరికి వాడిని కాదు. భయంతో పిరికి తనంతో పారిపోలేదు  అని అందరికీ చెప్పలేవు కదా! ఒక వేళ నీవు నీ బంధు మిత్రుల మీద ప్రేమతో పారిపోయినా జనం అలా అనుకోరు. నీ గురించి చెడ్డగానే అనుకుంటారు. అర్జునుడు భయంతో పిరికితనంతో పారిపోయాడు అని అనుకుంటారు. ఇది నిజం కాకపోవచ్చు కాని జనం అదే నిజం అని నమ్ముతారు. నాది భయం కాదు, పిరికితనం కాదు అని  నువ్వు ఎంత మొత్తుకున్నా ఎవరూ వినరు. ఎందుకంటే నీవు యుద్ధం చేయడంలేదనే విషయం మాత్రమే వాళ్లకు

తెలుసు కానీ మిగిలినవిషయాలు వాళ్లకు తెలియవు. ఇంద్రుడి అర్ధ సింహాసనం అధిష్ఠించిన వాడివి ఇటువంటి అప్రతిష్టను ఎలా సహించగలవో ఆలోచించు.

అర్జునా! లోకుల సంగతి కూడా కొంచెం ఆలోచించు. ఇక్కడ యుద్ధం చేయడానికి వచ్చిన అతి రథులు మహా రథులు అందరూ నీవు భయంతో పారిపోయావు అనుకుంటారు కానీ నీలో మెదిలే భావాలు ఎవరూ అర్ధం చేసుకోరు. అంతెందుకు ఎవరు అన్నా అనకపోయినా కర్ణుడు మాత్రం ఊరుకోడు. అవకాశం కోసం ఎదురు చూస్తున్నాడు. వచ్చిన అవకాశం సద్వినియోగం చేసుకుంటాడు నీ పేరు ప్రతిష్టలు సర్వనాశనం చేస్తాడు. కర్ణుడే కాదు కర్ణుడులాంటి వాళ్లు ఎదుటి వాళ్ల ఉన్నతిని సహించలేని వాళ్లు ఇంకా చాలామంది ఉన్నారు. వాళ్లందరూ నీ పేరు ప్రతిష్టలకు భంగంకలిగిస్తారు. వాళ్లే కాదు నీ బంధు మిత్రులు కూడా, నీ మీద అత్యంత గౌరవం కలిగినవాళ్లు కూడా, నీ పేరు ప్రఖ్యాతులమీద నమ్మకలిగిన వాళ్లు కూడా, నీవు యుద్ధం చేయకపోవడం చూచి, పర్వతము మాదిరి ఉన్న నీ గొప్ప తనాన్ని అణుమాత్రం చేసేస్తారు. అంటే నిన్ను చులకన చేసి మాట్లాడతారు. ఇంకా కొంతమంది ఔత్సాహికులు ఒక అడుగు ముందుకు వేసి అర్జునుడు నన్ను చూడగానే పారిపోయాడు అని కల్పించి ప్రచారం చేస్తారు. ఇంకొకడు నేను అలా బాణం వేసానో లేదో అర్జునుడు ఇలా పారిపోయాడు అని అంటాడు. నోటికొచ్చినట్టు అంటారు. కాబట్టి యుద్ధం చేస్తావో లేక పారిపోయి లోకుల దృష్టిలో అప్రదిష్టపాలవుతావో నీ ఇష్టం. ఆలోచించుకో! అని అన్నాడు కృష్ణుడు.

## 36. అవాచ్యవాదాంశ్చ బహూన్ వదిష్యన్తి తవాహితాః। నిన్దన్తస్తవ సామర్థ్యం తతో దుఃఖతరం ను కిమ్॥

అర్జునా! నీ శత్రువులు నీ పరాక్రమాన్ని నీ సామర్థ్యాన్ని కించపరుస్తూ నీ గురించి అనేక అపవాదులు, అనరాని మాటలు అంటూ లోకమంతా ప్రచారం చేస్తుంటే, అంతకంటే ఘోరమైన, దుఃఖతరమైన విషయం ఇంకోటి ఏముంటుంది చెప్పు!

కృష్ణుడికి ఎలాగైనా అర్జునుడిని యుద్ధం వైపుకు మళ్లించాలని కోరిక. అందుకని మరలా ఇలా అంటున్నాడు. అర్జునా! నీ శత్రువులు నీవు అంటే గిట్టని వాళ్లు, నీ ఉన్నతని చూచి ఓర్వలేని వాళ్లు, అసూయాపరులు నీ మీద లేని పోని పుకార్లు పుట్టిస్తారు. అనకూడని మాటలు అంటారు. అలా ఒకసారి అని ఊరుకోరు. నీవు జీవించి ఉన్నంత కాలం అలా అంటూనే ఉంటారు. కనిపించిన ప్రతివాడికీ చెబుతారు. లోకం అంతా నీ గురించి దుష్ప్రచారం చేస్తారు. నీ కీర్తిని గొప్పతనాన్ని అవమానిస్తారు. అది నీవు తట్టుకోగలవా! ఆలోచించు! అని అనునయంగా చెప్పాడు కృష్ణుడు.

## 37.హతో వా ప్రాప్స్యసే స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్।
## తస్మాదుత్తిష్ఠ కౌంతేయ యుద్ధాయ కృతనిశ్చయః॥

అర్జునా! నీవు ఈ యుద్ధంలో గెలిస్తే రాజ్యసుఖాలుఅనుభవిస్తావు. యుద్ధంలో మరణిస్తే స్వర్గసుఖాలుఅనుభవిస్తావు. రెండూ నీకు లాభదాయకమే. కాబట్టి వెంటనే లేచి యుద్ధమునకు సిద్ధంగా! యుద్ధం చేయడానికి నిశ్చయం చేసుకో!

కృష్ణుడు ఇప్పటి దాకా చెప్పిందంతా ఒక ముక్కలో వివరించాడు.
అర్జునా! ఇన్ని మాటలెందుకు యుద్ధంలో జరిగే పరిణామాలు రెండు. గెలుపు, ఓటమి. నీవు చావడం. లేదా వాళ్లు నీచేతిలో చావడం. యుద్ధంలో నీవు చస్తే నీకు వీరస్వర్గం వస్తుంది. నీవు గెలిస్తే నీవు రాజ్యభోగాలు అనుభవిస్తావు. రెండూ నీకు అనుకూలమైనవే కాబట్టి నీ శోకము, విషాదము మాని, పైకి లే. లేచి యుద్ధం చెయ్యి. శత్రువులతో పోరాడు. నీఈ క్షత్రియ ధర్మం నిలబెట్టు. అని ప్రబోధించాడు కృష్ణుడు.

ఇక్కడితో లౌక్యంగా కూడా చెప్పడం అయి పోయింది. కాని అర్జునుడిలో ఎలాంటి చలనము లేదు. అర్జునుడు కదలలేదు. మెదల లేదు. స్థబ్ధుగా కూర్చున్నాడు. ఈ పాచికా పారలేదని గ్రహించిన కృష్ణుడు, ఇక్కడి నుండి కర్మ గురించి ఎలా కర్మచేయాలో అర్జునుడికి చెబుతున్నాడు కృష్ణుడు.

## 38. సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ।
## తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాపమవాప్స్యసి॥

అర్జునా! జయాపజయములను, లాభనష్టములను, సుఖదుఃఖములను సమానంగా భావించి నీవు నీ కర్తవ్య కర్మఅయిన ఈ యుద్ధం చెయ్యి. అప్పుడు నీకు ఈ యుద్ధం చేసిన పాపం అంటదు.

ఈ శ్లోకంలో కృష్ణుడు కర్మలు చేసినా ఆ కర్మల వాసనలు ఎలా అంటుకోకుండా ఉంటాయి అనే విషయాన్ని చెబుతున్నాడు. దానినే సమభావము అంటారు. దానికి కావాల్సింది నిశ్చయాత్మక బుద్ధి. సుఖము, దుఃఖము, లాభము, నష్టము, జయము అపజయము ఇవి

ద్వంద్వములు. వీటి పట్ల సమభావం కలిగి ఉంటే, ఆ కర్మల వలన ఉత్పన్నమయే వాసనలు మనకు అంటవు. కాబట్టి సుఖము, లాభము, జయము కలిగినపుడు పొంగి పోవడం, దానికి వ్యతిరేకంగా జరిగితే కుంగి పోవడం మంచిది కాదు. ఒక కర్మచేస్తే ఏదో ఒకఫలితం వస్తుంది. తప్పదు. అది ముందు మనకు తెలియదు. వచ్చిన తరువాత అనుభవించడమే మన కర్తవ్యము. కాబట్టి వాటి పట్ల సమభావం ఉంటే మనస్సు శాంతిగా,సుఖంగా ఉంటుంది. ఈ విషయం గురించి ఇంకొంచెం వివరంగా తెలుసుకుందాము.

కర్తవ్యములు అంటే చేయవలసిన పనులు. ఇవి రెండు రకాలు. ఒకటి సంతోషంతో చేయవలసినపని. అంటే మనకు ఇష్టమైన, మనం ఇష్టంతో చేసే పని. రెండవది మనకు ఇష్టం లేకపోయినా బలవంతంగా చేసే పని. దు:ఖమును కలిగించే పని. మొదటిది మనకు ఇష్టమైన పని కాబట్టి ఇష్టంగా చేస్తాము. రెండవది ఇష్టం లేని పని కాబట్టి ఏడుస్తూ చెయ్యాల్సివచ్చిందే అనిచేస్తాము. కాని రెండు చేయవలసిన పనులే. తప్పించుకొనేవి కావు. కాబట్టి వీటియందు సమత్వం పాటిస్తే ఏ చిక్కు ఉండదు అని చెబుతున్నాడు భగవానుడు. హిమాలయాలలో, ఎవరూ లేని చోట, సమత్వంపాటించడం గొప్ప కాదు. అక్కడ ఎవరూ లేరు కాబట్టి సమత్వం దానంతట అదే వస్తుంది. కాని, ప్రాపంచిక విషయములు అనుభవిస్తూ ప్రపంచంలో తిరుగుతూ సమత్వము పాటించడమే ఒక యోగము అని భగవానుడు అంటాడు.

మనస్సులో సమత్వం లేకపోతే అది ఆలోచించలేదు. మనస్సు పనిచేయడం మానేస్తుంది. అంతేకానీ దేవుడు గొప్పవాళ్లకు ఎక్కువ తెలివితేటలు ఇచ్చాడు నాకు తక్కువ తెలివి ఇచ్చాడు అని అనడం వివేకంకాదు. పరమాత్మ అందరికీ ఒకే విధమైన మెదడు, బుద్ధి, ఆలోచనా శక్తి ఇచ్చాడు. కాని దానిని మనం సక్రమంగా వినియోగించడం లేదు. కొంత మంది అసలు వినియోగించరు. మన ఆలోచనలన్నీ ధనం సంపాదించడం, సుఖాలు అనుభవించడం వీటి చుట్టుతిరుగుతుంటాయి. ముఖ్యంగా స్త్రీలు టివి సీరియళ్లు చూచి ఆ సీరియళ్ల గురించి ఆలోచిస్తూ ఆ కష్టాలన్నీ తాము మానసికంగా అనుభవిస్తూ మానసిక ఆందోళనకు గురి అవుతుంటారు. దానివలన మనసు ఎప్పుడూ ఆందోళనకు గురి అవుతూ ఉంటుంది. నేటి యువతరం కూడా ఎక్కువగా సినిమాలు చూస్తూ, ప్రేమ వ్యవహారాలలో, రాజకీయాలలో మునిగితేలుతూ వాటి గురించే ఆలోచిస్తూ, చదువు మీద ఏకాగ్రతను కోల్పోతున్నారు. సుఖం వచ్చినపుడు ఎగిరెగిరిపడటం ఆనంద పడటం, దు:ఖం వచ్చినపుడు కుంగి పోవడం చాలామందికి ఒక అలవాటుగా మారిపోయింది. దీనికి విరుగుడు సమత్వం. సుఖదు:ఖాలను సమంగా భావిస్తే మనస్సు ప్రశాంతంగా ఉంటుంది. ఆలోచించే శక్తి పెరుగుతుంది. ఏకాగ్రత పెరుగుతుంది. విద్యలో గానీ, వ్యాపారంలోగానీ, ఉద్యోగంలో కానీ, ఇంటి విషయాలలో కానీ, రాణించగలడు.

ప్రస్తుతం అర్జునుడు బాగా డిస్టర్బ్ అయి ఉన్నాడు. అందువలన అర్జునుడి ఆలోచనా శక్తి పనిచేయడం లేదు. అర్జునుడిలో ఉన్న ఎమోషన్సు బాలెన్సు చేయగలిగితే, అతను మామూలు స్థితికివస్తాడు. ఈ మెంటల్ ఇమ్బాలెన్స్ జీవితంలో ప్రతి మానవుడికీ ఉంటుంది. అప్పుడు మానసిక ప్రశాంతత దెబ్బతింటుంది. ఏ విషయాన్ని సక్రమంగా ఆలోచించలేడు. ఎప్పుడూ మనసు అల్లకల్లోలంగా ఉంటుంది. సరి అయిన నిర్ణయం తీసుకోలేడు. అప్పుడు కావాల్సింది మానసిక ప్రశాంతత. దానికి మార్గం సుఖదు:ఖములలో సమంగా ప్రవర్తించడం. ఎందుకంటే ఎల్లప్పుడూ సుఖం ఉండదు. ఎల్లప్పుడూ దు:ఖం ఉండదు. సుఖం దు:ఖం ఒకదాని వెంట వస్తూ పోతూ ఉంటాయి. ఇది అనివార్యం అని సాక్షాత్తు భగవంతుడే చెప్పాడు. కాని మనంమాత్రం మాకు ఎల్లప్పుడూ సుఖమే కలగాలని రోజూ భగవంతుడిని ప్రార్థిస్తాము. ఇంకా కొంతమంది మేము ఆ దేవుడిని కొలిస్తే అనుకున్నవి అనుకున్నట్టు జరుగుతాయి అని అంటూ ఉంటారు. ఇది అసాధ్యము అని తెలుసుకోవడమే వివేకము. అందుకే సుఖము దు:ఖము మధ్య సమత్వము సాధించాలని భగవానుడు చెప్పాడు. సుఖదు:ఖములను సమంగా చూచినప్పుడే మనస్సు ప్రశాంతంగా నిర్మలంగా నిశ్చలంగా ఉంటుంది. అందుకని కృష్ణుడు అంటున్నాడు.

అర్జునా! నీవు నీ కర్తవ్యమును నిర్వర్తించు అంటే చేయాల్సిన పని చెయ్యి. దాని వలన సుఖం వస్తుందా దు:ఖం వస్తుందా, లాభం వస్తుందా, నష్టం వస్తుందా, జయం కలుగుతుందా, అపజయం కలుగుతుందా అని ఆలోచించకు. బాధపడకు. కంగారు పడకు. నీ కర్తవ్యం నీవు నిర్వర్తించు. నీ కర్తవ్యం నీవు నిర్వర్తిస్తే నీకు పాపం రాదు. అంటే ద్వంద్వాల వలన నీ మనసు కలత చెందదు. ప్రశాంతంగా, సంతోషంగా ఉంటుంది. అన్ని ద్వంద్వాలను సమంగా అనుభవిస్తుంది. ఆలోచనా శక్తిని పెంపొందించుకుంటుంది. కాబట్టి ఎప్పుడూచిరునవ్వుతో ఉండు. సంతోషము వచ్చినపుడు పొంగిపోకు, దు:ఖము వచ్చినప్పుడు కుంగి పోకు. శోకించకు. ఎల్లప్పుడూ మనసును ప్రశాంతంగాఉంచుకో. లేచి యుద్ధం చెయ్యి అని కృష్ణుడు బోధించాడు.

## 39. ఏషా తే2భిహితా సాంఖ్యే బుద్ధిర్యోగే త్విమాం శృణు।
## బుద్ధ్యా యుక్తో యయా పార్థ కర్మబన్ధం ప్రహాస్యసి॥

అర్జునా! ఈ సమత్వభావనను ఇప్పటి వరకు నీకు సాంఖ్యయోగము ఆధారంగా అంటే జ్ఞానము ఆధారంగా చెప్పాను. యోగము అంటే కర్మను కేవలం యాంత్రికంగా ఒక కర్మగా కాకుండా ఒక యోగంగా ఆచరిస్తే అదే కర్మయోగము అవుతుంది. ఆ కర్మయోగము ఆధారంగా ఈ సమత్వభావనను ఎలా ఆచరించవచ్చో చెబుతాను విను. ఇది తెలుసుకుంటే నీవు నీ కర్మబంధనములను దూరంగా నెట్టివేయగలవు. దాని వలన నీకు జ్ఞానం కలుగుతుంది. అని

చెప్పాడు కృష్ణుడు.

(ఇక్కడ సాంఖ్యము అంటే ఉపనిషత్తులలో చెప్పబడిన ఆత్మజ్ఞానమును గురించి చెప్పబడే తత్త్వము, జ్ఞానయోగము అని అర్థం చేసుకోవాలి. )

అర్జునా! ఇప్పటి దాకా నీకు జ్ఞానయోగము గురించి, ఆత్మ జ్ఞానము గురించి చెప్పాను. అంటే సాంఖ్యము గురించి చెప్పాను. ఇక్కడి నుండి కర్మయోగము గురించి క్లుప్తంగా చెబుతాను. అని అన్నాడు. ఇక్కడ మీకు ఒకసందేహము రావచ్చు. అన్నీ జ్ఞానముతోనే సంక్రమిస్తాయి; జ్ఞానమే ముఖ్యము; జ్ఞానముతోనే ఆత్మతత్వము బోధపడుతుంది అని తెలుసుకున్నాము కదా! ఇప్పుడు ఈ కర్మయోగం ఎందుకు అని సందేహం వస్తుంది. ఎందుకంటే అందరూ ఒకే విధంగా ఉండరు. కొందరికి పరిమిత జ్ఞానము ఉంటుంది. మరి కొందరికి విశేష జ్ఞానము ఉంటుంది. కొంత మంది కర్మలను కేవలం యాంత్రికంగా చేస్తుంటారు. మరి కొంత మంది అపరిమీతమైన ఆసక్తితో చేస్తుంటారు. మరి కొంత మంది నిష్కామంగా, కర్మలను ఒక యోగంగా ఆచరిస్తారు. ఎవరైనా సరే ముందు కర్మయోగము అవలంబించిన తరువాత జ్ఞానయోగానికి వెళ్లాలి. పరిమిత జ్ఞానము కలవారు మొదట కర్మయోగము అవలంబించి కొంత జ్ఞానముసంపాదించి తరువాత మెట్టు ఎక్కవలసి ఉంటుంది. కాబట్టి కర్మయోగము మొదటి మెట్టు అయితే జ్ఞానయోగము రెండవ మెట్టు అని అనుకోవచ్చు.

కలియుగంలో జ్ఞాన సముపార్జన కష్టం. కానీ మోక్షము జ్ఞానముతోనే కలుగుతుంది. జ్ఞానం కలగాలంటే మొదట కర్మయోగం అభ్యసించి తరువాత జ్ఞానయోగము అనే మెట్టు ఎక్కాలి. కాని మనకు ఒక అపోహ ఉంది. కలియుగంలో కేవలం రామనామ స్మరణకానీ పరమాత్మ నామ స్మరణ కానీ చేస్తే మోక్షం వస్తుంది అని. మనస్సును శుద్ధి పరచుకోడానికీ, గతజన్మపాపఫలముల నుండి విముక్తి పొందడానికీ, కొత్తగా కర్మలు చేసి ఆ ఫలములు మూటకట్టుకోకుండా ఉండటానికి పరమాత్మ నామ స్కరణ ఉపయోగపడుతుంది కానీ కేవలం నామ స్మరణతో మోక్షం రావడానికి అవకాశం లేదు. అందుకే కృష్ణుడు అర్జునుడితో ఇలా అన్నాడు.

అర్జునా! నీకు అన్ని విషయాలను సమంగా చూడాలని ఉపదేశించాను కదా. ఆ సమత్వం జ్ఞాన పరం గానే కాక కర్మ పరంగా కూడా చేయవచ్చు అది ఎలాగో నీకు వివరిస్తాను. ఆ కర్మయోగ సారాంశమును నీవు బాగా వంటబట్టించుకొని ఈ కర్మబంధనముల నుండి విముక్తుడివి కా. అంటూ తరువాతి శ్లోకంలో ఇప్పుడు చెప్పిన దానిని విపులీకరించి చెప్పాడు కృష్ణుడు.

## 40. నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే।
## స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్॥

ఏ కర్మనైనా నిష్కామంగా, ఒక యోగంగా చేస్తే, దానికి ఎప్పటికీ అపజయము ఉండదు. విపరీత ఫలితములు ఉండవు. అన్నీ మంచి ఫలితములే కలుగుతాయి. పైగా ఈ నిష్కామ కర్మ యోగమును పూర్తిగా ఆచరించక పోయినా పర్వాలేదు. ఎంత చేస్తే అంతవరకే ఫలితం ఇస్తుంది. ఏ కొంచెం సాధన చేసినా అది మనలను మృత్యు భయం నుండి కాపాడుతుంది.

ఒక విషయం చెప్పే ముందు దాని గురించి గొప్పగా చెప్పాలి. అప్పుడే చెప్పబోయే విషయం చక్కగా అర్థం అవుతుంది. దానినే భగవానుడు ఇక్కడ చేస్తున్నాడు. కర్మయోగము అంటే మానవ జీవన విధానము. బయట మనం ఎంతో ఉన్నతిని ప్రగతిని సాధిస్తాము. కాని లోపల అంతా కల్మషంగా ఉంటుంది. కాని లోపల కూడా అంతరంగం కూడా శుభ్రంగా ఉంచుకోమని చెప్పేదే ఈ జ్ఞాన, కర్మయోగములు. చాలా మందికి ఎంతో ఐశ్వర్యం సంపదలు చుట్టు జనం ఉంటారు. కాని ఒంటరి తనం ఫీల్ అవుతుంటాడు. ఏదో తెలియని వెలితి. ఏదో కావాలని తపన. మనశ్శాంతి కొరకు పరితపిస్తుంటారు. ఆ మనశ్శాంతి ఇదిగో ఈ జ్ఞాన కర్మయోగములు ఆచరిస్తే దొరుకుతుంది అని భగవానుడు చెబుతున్నాడు. ప్రస్తుతం అర్జునుడు అదే అశాంతితో బాధపడుతున్నాడు. ఏదో జరిగిపోతుంది అని ఆవేదన చెందుతున్నాడు. దానిని పోగొట్టడమే కృష్ణుడి కర్తవ్యము. మనశ్శాంతి మనయొక్క మానసిక ప్రవర్తన వల్ల కలుగుతుందేకానీ, మనకు ఉన్న సిరి సంపదల వల్ల కాదు అని కర్మయోగం బోధిస్తుంది. సుఖం ఎక్కడో లేదు. మనకు ఉన్న ధనము, ఆస్తి, పదవి, సంపాదన వీటిలో లేదు. ఇవి ఎన్ని ఉన్నా నిరంతరం దు:ఖంతో బాధపడేవాళ్లు ఉన్నారు. సుఖం మనలో ఉంది. మన ఫీలింగ్ లో ఉంది. మన మనసులో ఉంది. కాని మనం దానిని నమ్మము. మనకు అంగబలం అర్థ బలం ఉంటే చాలు అన్నీ ఉన్నట్టే అనే అపోహలో ఉంటాము. ధనం కానీ, బంగారం కానీ, ఆస్తి కానీ ఒక మేరకు ఉంటే పర్వాలేదు. అమితంగా ఉంటే అదే అన్ని దు:ఖములకు కారణం అవుతుంది. కాబట్టి ధనము, ఆస్తి, బంగారము, అంగ బలము శారీరక సుఖాన్ని ఇస్తాయోమో కానీ, మానసిక సుఖాన్ని మానసిక ఆనందాన్ని ఇవ్వవు.

ఈ కర్మయోగం అనుష్ఠానం చేస్తే ఎవరికీ అపజయమే ఉండదు. చేసిన కర్మలకు విపరీత ఫలితములు కూడా రావు. సక్రమమైన ఫలితములే వస్తాయి. ఎలాగంటే మనం కర్మలను మెటీరియలిస్టిక్ గా చేస్తాము కర్మను కర్మగానే చేస్తాము. కాని కర్మను ఒక యోగంగాచేస్తే అంటే పరిశుద్ధమైన చిత్తముతో చేస్తే దాని వలన అపజయం కాని, విపరీత పరిణామాలు కానీ ఉండవు. ఏవేవో కోరికలు కోరుకుంటూ కర్మలు చేస్తే, ఆ కోరికలు తీరక పోతే విపరీత పరిణామాలు సంభవిస్తాయి కానీ నా ధర్మం నేను చేస్తున్నాను, ఏం ఫలితం వచ్చినా సంతోషంగా స్వీకరిస్తాను,

పరమాత్మ ప్రసాదం అనుకుంటాను  అని కర్మను ఒక యోగంగా చేస్తే, విపరీత పరిణామలు అంటూ ఏమీ ఉండదు. పైగా ప్రతి అపజయం నుండి తిరిగి జయం పొందడానికి కావలసిన పాఠాలు నేర్చుకుంటాడు.

ఈ కర్మయోగము పూర్తిగా ఆచరించవలసిన అవసరం లేదు. కొంచెం ఆచరించినా చాలు  ఆ జనన మరణ భయం నుండి విముక్తి పొందవచ్చు. ఎందుకంటే,  ప్రాపంచిక మైన కర్మలు పూర్తిగా చేస్తేనే కానీ నీకు ఫలితం దక్కదు. కానీ ఈ కర్మయోగము చిత్త శుద్ధితో నిష్కామంగా చేస్తే, కొద్దిగా ఆచరించినా పూర్తి ఫలితం ఇస్తుంది. ఒక కోటీశ్వరుడు ఏదో పుణ్యం వస్తుందని కోటి రూపాయలుదానం చేస్తే వచ్చే ఫలం, ఒక సామాన్యుడు  ఆకలితో ఉన్న వాడికి కడుపు నిండా అన్నం పెడితే వచ్చే ఫలితం కన్నా తక్కువే. క్లుప్తంగా చెప్పాలంటే కర్మను కోరికతో చేస్తే బంధనములు కలిగిస్తుంది. అశాంతిని కలిగిస్తుంది. కర్మను కోరికలేకుండా చేస్తే శాంతిని కలిగిస్తుంది. కర్మ బంధనముల నుండి మోక్షమును కలిగిస్తుంది.

## 41. వ్యవసాయాత్మికా బుద్ధిరేకేహ కురునన్దన।
## బహుశాఖా హ్యనన్తాశ్చ బుద్ధయో2వ్యవసాయినామ్॥

ఈ నిష్కామ కర్మ యోగమును అవలంబించిన వాడి బుద్ధి ఏకాగ్రంగా, నిశ్చయంగా ఉంటుంది. అలా కాకుండా ఏదో ఒక కోరిక మనసులో పెట్టుకొని దాని కొరకు కర్మచేస్తే వాడి బుద్ధి పరి పరి విధాల పోతుంది. కుదురుగా నిశ్చయంగా ఉండదు.

ఆధ్యాత్మికంగా చెప్పాలంటే మానవులకు దైవము మీద నిశ్చయమైన బుద్ధి ఉండాలి. ఆ దేవుడు మంచి వాడు, ఈ దేవుడు మనకు కోరిన వరాలివ్వడు అనే భేదభావము ఉండకూడదు. అలాగే నిశ్చయమైన బుద్ధి కలవాడు ఏ పని చేసినా సక్రమంగా, విజయవంతంగా చేస్తాడు. ఏ పని చేస్తున్నా మనసు దైవము మీద నిలిపి ఉంచుతాడు. ప్రాపంచిక విషయములను ఎక్కువగా పట్టించుకోడు. ఒక లక్ష్యము అంటూ లేని వాడి బుద్ధి శాఖోపశాఖలుగా విస్తరిస్తుంది. ముళ్లపొద మీద తీగ పాకినట్టు అడ్డదిడ్డంగా పాకుతుంది. ప్రపంచంలో దొరికే అన్ని వస్తువులమీదికి మనసు పోతుంది. వాటి కోసం వెంపర్లాడుతుంది. ఉదాహరణకు సూర్యకిరణములను భూత అద్దంలో నుండి ప్రసరింపజేస్తే, అవి ఏకాగ్రత చెంది దేనినైనా భస్మం చేస్తాయి. అదే సూర్యకిరణములు విడి విడిగాఉంటే ఆ పని చేయలేవు. కాబట్టి మానవునికి ఏకాగ్రబుద్ధి అవసరము.

వ్యవసాయాత్మికా బుద్ధి అంటే బుద్ధిని నిలకడగా ఉంచుకోవడం. స్థిరంగా ఉంచుకోవడం. ఎవరికైనా బుద్ధి స్థిరంగా, నిశ్చయం లేకుండా, చంచలంగా ఉంటే వాడు ఏ పనీ సక్రమంగా చేయలేడు. కాబట్టి ఏ కర్మ చేయడానికైనా నిశ్చయమైన బుద్ధి అవసరము. అంటే మన మనసును, బుద్ధిని ఏకాగ్రం చేయాలి. చేసే పని మీదనేఉంచాలి. అటుఇటుపోనివ్వకూడదు. మనం ఏం చెయ్యాలి. ఏం సాధించాలి. మన జీవిత లక్ష్యం ఏమిటి అని ముందునిర్ణయించుకోవాలి. తరువాత నిష్కామ కర్మ మొదలు పెట్టాలి. అంతే కానీ ముందు ఏదో ఒక కర్మ మొదలు పెట్టి దాని మీద మనసుపెట్ట కుండా చేసి తుదకు విపరీతమైన ఫలితములను అనుభవించవలసి వస్తుంది. కాబట్టి ఏ పని చేయడానికైనా నిశ్చయాత్మకమైన బుద్ధి అవసరము. అలా కాకుండా ఒక నిశ్చయం, లక్ష్యం అంటూ లేని వారి బుద్ధి అటు ఇటు పరుగెడుతూ ఉంటుంది. ఏ పనిమీదా ధ్యాస ఉండదు. అన్ని పనులు మొదలు పెడతాడు. ఏ పనీ పూర్తిగా చేయడు. తుదకు అభాసుపాలవుతాడు.

ఏ మానవుడి కైనా జీవితాశయము ఒకటి ఉండాలి. దానిని బట్టి అతని జీవన విధానము ఉంటుది. ఉన్నతమైన ఆశయములు కలవారి జీవన విధానము కూడా ఉన్నతంగా ఉంటుంది. అతడు ఉన్నత శిఖరములు ఎక్కడానికి ప్రయత్నం చేస్తాడు. అలా కాకుండా అల్ప బుద్ధి కలవారికి ఆశయములు కూడా చిన్నవిగానే ఉంటాయి. వారి జీవితాలు కూడా అల్పంగానే ఉంటాయి. కొంతమంది ఈ జీవితం అశాశ్వతము, క్షణికము అని దీని గురించి ఆలోచించరు. చచ్చిన తరువాత స్వర్గలోక సుఖముల గురించి ఆలోచిస్తారు. కాని ఆ స్వర్గలోకము కూడా శాశ్వతము కాదు అని వారికి తెలియదు. మరి కొంతమంది ఇవేమీ కాదు మోక్షమే అసలైన పరమ పదము అక్కడికి పోతే తిరిగి జన్మ ఉండదు అని ఆ మార్గం అనుసరిస్తారు. ఈ విధంగా వివిధములైన మానవులు వివిధములైన ప్రవృత్తులుకలిగి ఉంటారు.

అందుకని మానవులను రెండు విధములుగా విభజించాడు కృష్ణుడు. వ్యవసాయాత్మికా బుద్ధి కలవారు, అవ్యవసాయాత్మికా బుద్ధి కలవారు. వ్యవసాయాత్మికా బుద్ధి అంటే నిశ్చయమైన బుద్ధి. ఏకా భవతి అంటే ఆ బుద్ధి ఎల్లప్పుడూ ఒకటిగానే ఉంటుంది. మార్పు చెందదు. స్థిరంగా ఉంటుంది. అవ్యవసాయినామ్ అంటే స్థిరమైన బుద్ది లేని వాళ్లు. వారి బుద్ధి బహుశాఖా: అంటే శాఖోపశాఖలుగా విస్తరిస్తుంది. అనంతంగా ఉంటుంది అంటే అంతు లేకుండా విస్తరిస్తుంది. ఏ ఒక్కదాని మీదా బుద్ధినిలువదు. మనలో ఎక్కువగా ఈ రెండవ రకం వారే ఎక్కువగా కనపడుతుంటారు. ఏపనీ నిలకడగా చెయ్యరు. పూర్తి చెయ్యరు. ఎవరు ఏది చెబితే దానిని నమ్ముతారు. మనం ఆధ్యాత్మికంగా చెప్పుకుంటున్నాము కాబట్టి వారి బుద్ధి ఏ దేవుడి మీదా నిలకడగా ఉండదు. దేవుళ్లలో భేదబుద్ధిని కల్పిస్తాడు. ఆ దేవుడు గొప్ప ఈ దేవుడు గొప్ప అంటే దేవుళ్లను మారుస్తుంటాడు. స్థిరమైన బుద్ధి కలిగి ఉండడు. పరమాత్మ ఒక్కడే అని తెలిసినా, దాని మీద నిశ్చయమైన బుద్ధి ఉండదు. ఎవరు ఏది చెబితే దానిని ఆచరిస్తాడు. అటువంటి వారు ఎలా ఉంటారో మనకు రాబోవు శ్లోకాలలో కృష్ణుడు వివరిస్తున్నాడు.

42.యామిమాం పుష్పితాం వాచం ప్రవదన్త్య విపశ్చిత:।
వేదవాదరతా: పార్థ నాన్యదస్తీతి వాదిన:॥

43.కామాత్మాన: స్వర్గపరా జన్మకర్మఫలప్రదామ్।
క్రియావిశేష బహులాం భోగైశ్వర్యగతిం ప్రతి॥

44.భోగైశ్వర్య ప్రసక్తానాం తయా2పహృతచేతసామ్।
వ్యవసాయాత్మికా బుద్ధిస్సమాధౌ న విధీయతే॥

ఓ అర్జునా! వివేకము లేని మానవులు ప్రాపంచిక సుఖముల కోసం మాత్రమే పాకులాడు తుంటారు. అటువంటి వారు వేదములలో చెప్పబడిన విషయములను వాటి పైపైఅర్థములతో తీసుకుంటారు. ఎందుకంటే అవి కర్మలను, వాటి వలన వచ్చే ఫలముల గురించి చెబుతాయి. వేదములలో చెప్పబడిన విషయముల యొక్క అంతరార్థముల జోలికి పోరు. అటువంటి వారు యజ్ఞములు, యాగములు చేస్తే స్వర్గసుఖాలు లభిస్తాయని, స్వర్గసుఖములకు మించిన సుఖము లేదనీ అనుకుంటూ ఉంటారు.అవే కాకుండా, ప్రాపంచిక సుఖములను, కోరికలను పొందడానికి అవసరమైన వ్రతాలు మొదలగు సకామ కర్మలను ఆచరిస్తారు. పండితులు కూడా ఈ సకామ కర్మలు వేదములలో చెప్పబడ్డాయి అని ప్రచారం చేస్తారు. తియ్యగా ప్రవచనాలు చేస్తారు. ఈ తియ్యటి కబుర్లు నమ్మిన మానవులు ఎల్లప్పుడు స్వర్గసుఖముల మీద, ఈ లోకంలో లభించే భోగముల మీదా, సంపదల మీద ఆసక్తితో ఉంటారు. వారి బుద్ధులు పరమాత్మయందు నిశ్చయంగా లగ్నం కావు. వారి బుద్ధికూడా స్థిరంగా ఉండదు.

ఈ శ్లోకములలో పుష్పితాం వాచం అంటే అందమైన పూల వంటి మాటలు. ఈ పూలు ఫలములుగా రూపొందవు. అలాగే ఈ మాటలు కూడా ఫలప్రదములు కావు. ఇటువంటి అందమైన తీయటి మాటలను, వేదములను సరిగా, లోతుగా అర్థం చేసుకోని వారు పలుకుతుంటారు. పైపై అర్థములను మాత్రమే చెబుతుంటారు. ఇటువంటి మాటలను అవిపశ్చిత: అంటే అజ్ఞానులు, తెలివి లేని వారు నమ్ముతుంటారు. ఎందుకంటే వారికి కోరికలు ఎక్కువ. ఆ కోరికలు తీరడానికే కర్మలు చేస్తుంటారు. స్వర్గం లో లభించే సుఖముల కోసం వేదములలో చెప్పబడిన యజ్ఞయాగములు చేస్తుంటారు. అటువంటి వారు ఎంతటి పండితుడైనా, వేదములు అధ్యయనం చేసిన వాడైనా, ఏదో ఒక కోరికతో కర్మలు చేసేవాడు అవివేకి కిందనే పరిగణింపబడతాడు. అటువంటి వారి

గురించి ఈ శ్లోకాలు చెప్పాడు పరమాత్మ.

వేదవాదరతా: అంటే వేదములలో చెప్పబడిన విషయముల గురించి కొంతమంది వాదోపవాదములు చేస్తుంటారు. ఈ యాగం చేస్తే స్వర్గంలో ఈ ఫలం కలుగుతుంది. అని ప్రచారం చేస్తుంటారు. వేదములలో యజ్ఞయాగములు గురించే కాదు. నిరాకారుడు, అవ్యయుడు, సర్వాంతర్యామి అయిన పరమాత్మను తెలుసుకోడానికి ఎన్నోమార్గాలు ఉన్నాయి. ఈ వేద పండితులు వాటి గురించి చెప్పరు. కేవలం సుఖాలు ఇచ్చే వాటి గురించే చెబుతుంటారు.

వేదములలో మూడు విభాగాలు ఉన్నాయి. 1. కర్మకాండ 2. ఉపాసనా కాండ 3. జ్ఞాన కాండ. ఈ వేదముల గురించి వాదించే వాళ్లు మొదటిది అయిన కర్మకాండల దగ్గరే ఆగిపోతారు. ఇటువంటి వారిని కామాత్మాన: అంటే కోరికలే పరమావధిగా కలవారు అని అనవచ్చు. వీరికి తన భార్య, పిల్లలు, బంధువులు, తన ధనము, ఆస్తి, ఇల్లు తన సుఖం, తనవారి సుఖం .... ఇవే వారికి కావాల్సింది. వారి మనసులలో ఎల్లప్పుడూ వీటి గురించే ఆలోచిస్తారు కానీ, భగవంతుని గురించి శాశ్వతమైన ఆనందం గురించి ఆలోచించరు.

స్వర్గపరా: అంటే వీరంతా తాము మరణించిన తరువాత స్వర్గానికి పోతామని అనుకుంటారు. ఎల్లప్పుడూ స్వర్గసుఖముల గురించి ఆలోచిస్తారు. కాని ఆధ్యాత్మిక దృష్టితో చూస్తే స్వర్గమునకు ఎటువంటి విలువలేదు. పరమాత్మను చేరుకోవడమే మానవుల అంతిమ లక్ష్యము. అవివేకుల దృష్టిలో స్వర్గసుఖములే వారికి మోక్షముతో సమానము కానీ జ్ఞానుల దృష్టిలో పరమాత్మలో ఐక్యం కావడమే అంతిమ లక్ష్యం. కేవలం తాత్కాలిక సుఖాలను ఇచ్చే ఈ లోక సంపదలు, స్వర్గసుఖాలు శాశ్వతం కావు అని తెలుసుకోవాలి. అదే జ్ఞానము.

తరువాత జన్మ కర్మ ఫలప్రదామ్ అని అన్నారు. అంటే కోరికలతో కూడిన కర్మలు మోక్షమును ఇవ్వలేవు పైగా బంధనములను కలుగజేస్తాయి. జనన మరణ చక్రంలో పడేస్తాయి. కాబట్టి కోరికలతో చేసే కర్మల కన్నా నిష్కామంగా చేసే కర్మలే ముఖ్యము.

క్రియావిశేషబహులాం భోగైశ్వర్యగతిం ప్రతి అంటే స్వర్గంలో లభించే భోగముల గురించి, ఈ లోకంలో లభించే ఐశ్వర్యముల గురించి ఎన్నో కర్మలు చేస్తుంటారు. కర్మకాండలు చేయడంలో తమ జీవితం అంతా వృధా చేసుకుంటారు. కాని వారికి దక్కేది తాత్కాలికసుఖమే కాని శాశ్వత సుఖం కాదు. తయా2పహృతచేతసామ్ అంటే వేద పండితులు, తాము జ్ఞానులము అనుకొనే వాళ్లు చెప్పే ఈ తియ్యటి మాటలకు మానవుల మనసులు ఆకర్షింపబడుతున్నాయి. అటువైపు లాగబడుతున్నాయి. ఆ మాటలు విని సామాన్యజనులు మోసపోతున్నారు. కర్మకాండలవైపు మళ్లుతున్నారు. శాశ్వత ఆనందం కోసం ప్రయత్నించడం లేదు. అటువంటి మాటలను వినవద్దని

కృష్ణుడు హెచ్చరిస్తున్నాడు.

వ్యవసాయాత్మికా బుద్ధి: సమాధౌ న విధీయతే అంటే పైన చెప్పబడినట్లు పండితులు చెప్పే తియ్యటి మాటలు విని కర్మకాండలవైపే బుద్ధి నిలిపితే, అటువంటి వారికి బుద్ధి నిలకడగా ఉండదు. చంచలంగా ఉంటుంది. భగవంతుని మీద మనసు నిలువదు. వారి బుద్ధి ఎల్లప్పుడూ ఈ లోకంలో దొరికే సుఖముల మీదా, స్వర్గంలో లభించే సుఖముల మీదా లగ్నం అయి ఉంటుంది. కాబట్టి మోక్షం కావాలనుకొనే వాళ్లు వేదములలోని అసలైన అర్థము గ్రహించాలి. మోక్షమునకు మార్గము ధ్యానము అని నమ్మాలి. ఆ ధ్యానానికి అవరోధం కలిగించే ఈ కర్మకాండల వైపు, ఈలోకములోనూ స్వర్గములోనూ లభించే సుఖముల గురించి ఆలోచించకూడదు. అని బోధించాడు పరమాత్మ.

ఈ మూడు శ్లోకములు ఎటువంటి క్లారిటీ లేకుండా, కంఫ్యూజన్లలో ఉన్న వాళ్ల గురించి చెప్పబడ్డాయి. ఎందుకంటే అర్జునుడు ప్రస్తుతం అటువంటి కంఫ్యూజన్‌లో ఉన్నాడు. మనం అనుదినం చేసే కర్మలు మూడు విధాలుగా విభజింపబడ్డాయి. వాటి పేర్లు.... సాత్విక, రాజసిక, తామసిక కర్మలు. ఈ మూడు విధములైన కర్మల వలన మనం ఉన్నత స్థితికి కానీ అధోగతికి కానీ వెళతాము. సాత్విక కర్మ అంటే బాహ్య కర్మలను చేస్తూ మానసికమైన అభివృద్ధిని సాధించేది. మానసిక ప్రశాంతతకు, మానసిక ఔన్నత్యానికి దోహదం చేసేది. అది సాత్విక కర్మ. అలా కాకుండా, నాకు మానసిక అభివృద్ధి అక్కరలేదు, నాకు బాహ్యసుఖాలు, సంతోషాలు మాత్రమే కావాలి, నేను బాగు పడటమే నాకు కావాలి. దానికి ఏమైనా చేస్తాను. దాని వలన సుఖం వచ్చినా దు:ఖం వచ్చినా భరిస్తాను. అంటే బాహ్యంగా నేను అభివృద్ధి చెందాలి దాని వలన నాకు మనశ్శాంతి లేకపోయినా పరవాలేదు అనేది రాజసిక కర్మ. నేను బాగు పడాలి. నేను బాగుపడటానికి పక్కవాడు సమాజం నాశనం అయి పోయినా నాకు పట్టదు. నేను బాగుపడటమే నాకు ప్రధానం. ఎవరెటుపోయినా నాకు అక్కరలేదు. హింసకైనా పాలుపడి నేను బాగుపడతాను. నాస్వార్థం నేను చూసుకుంటాను. అటువంటి వాడు మానవుడి నుండి దానవుడిగా మారి పోతాడు. దీనిని తామసికకర్మ అంటారు.

మనం సాధారణంగా మనకు కావాల్సిన వస్తువులు ధనము సంపద ఆస్తులు ఉంటే శాంతి దానంతట అదే వస్తుంది అని అనుకుంటాము. అది సరికాదు. మనం మనస్సును ప్రశాంతంగా ఉంచుకోవాలి. దానికి మానసికమైన అభివృద్ధి కావాలి. దానికి సాత్వికమైన కర్మలుమాత్రమే చేయాలి. రాజసిక, తామసిక కర్మల వలన మనశ్శాంతి లభించదు అని భగవానుడుచెప్పాడు. ఇందులో మరొక విశేషం కూడా ఉంది. కర్మలన్నీ ఒకటిగానే ఉంటాయి. మనం ఏ భావనతో చేస్తామో దానిని బట్టి అది సాత్వికమా, రాజసికమా, తామసికమా అని నిర్ణయింపబడుతుంది. ఒకే సంఘటన, ఒకే సన్నివేశము గురించి ఒకడు పాజిటివ్‌గా స్పందిస్తే,

మరొకడు నెగటివ్‌గా స్పందిస్తాడు. అలా స్పందించడం వారి వారి మానసిక అభివృద్ధి మీద ఆధారపడి ఉంటుంది. ధనం సంపాదించడం అందరికీ కామన్. ఒకడు ధర్మంగా సంపాదిస్తాడు. మరొకడు అడ్డదారుల్లో సంపాదిస్తాడు. మరొకడు ఇంకొకడిని కొట్టి దోచుకుంటాడు. మూడింటిలో కర్మ ఒకటే కాని విధానాలు వేరు.

ఇప్పుడు రాజస తామస కర్మలు చేసేవారి గురించి చెబుతున్నాడు ఈ శ్లోకాలలో. తెలివిలేని వాళ్లు వివేక హీనులు గురించి చెబుతున్నాడు. అంటే మానసిక అభివృద్ధి లేని వాడు కేవలం ప్రాపంచిక విషయముల గురించి ఆలోచిస్తాడు కానీ మానసికమైన, మానసిక అభివృద్ధికి సంబంధించిన వాటి గురించి ఆలోచించడు. బయట ప్రపంచంలో పనులు చేసేటప్పుడు ఎప్పుడూ పూర్తిగా విజయం సాధించలేడు. వచ్చిన దానితో తృప్తి పొందలేడు. ఎల్లప్పుడూ దేనికో ఒక దానికి పాకులాడుతుంటాడు. అటువంటి వాడికి మనశ్శాంతి కరువవుతుంది. తీవ్రమైన అశాంతితో బాధపడుతుంటాడు. మానసిక శాంతి కొరకు అటు ఇటు పరుగెడుతుంటాడు.

పైగా ఈ ప్రాపంచిక విషయములలో పడ్డ వాడు కుటుంబాన్ని, తన ఆరోగ్యాన్ని లెక్క చెయ్యడు. వాటి గురించి మరిచిపోతాడు. ఎన్నో అనుభూతులను పోగొట్టుకుంటాడు. మనశ్శాంతికి దూరం అవుతాడు. ప్రాపంచిక విషయాల వెంట పిచ్చివాడిలా పరుగెడుతుంటాడు. అప్పటికి కూడా ఏమీ సాధించలేడు. ఇంకా ఏదో సాధించాలని తపనపడుతుంటాడు. అటువంటి వాడు అవివేకి. ఇటువంటి వారు సమాజంలో తక్కువేమీ కాదు. వారు కూడా బాగా చదువుకున్న వాళ్లు. వేదములను అనుసరిస్తారు. కానీ వేదములను చెప్పిన కర్మకాండలను మాత్రమే ఆచరిస్తారు. ఆ కర్మల ఫలితముల గురించి పాకులాడుతారు. యజ్ఞములు యాగములు చేసి స్వర్గ సుఖములు పొందాలని అనుకుంటారు. ఈ యజ్ఞము, యాగము చేస్తే ఏయే కోరికలు నెరవేరుతాయి. ఇంకా ఏమేమి హెూమాలు చేస్తే మనకు లాభం వస్తుంది అని అనుకుంటారు.

ఇంకొందరు శారీరక సుఖాల వెంట పరుగెత్తుతారు. దేవుడికి పూజలు, వ్రతాలుచేసినా, సంకల్పంలో తనకు ధనము, ధాన్యము, ఐశ్వర్యములు, ఇష్టకామ్యార్థసిద్ధ్యర్థం అంటూ కోరికల లిస్టుచదువుతారు. చచ్చిన తరువాత కూడా స్వర్గసుఖాలు కావాలని కోరుకుంటాడు. ఆ స్వర్గసుఖాల కొరకు యజ్ఞయాగాలు చేస్తుంటారు. ఈ సిద్ధాంతాలు వీళ్లు ఆచరించడమే కాకుండా వీటిని అందరికీ ప్రచారం చేస్తారు. అందరిచేతా ఆచరింపచేస్తారు. కోరికలు తీరడం కోసం యజ్ఞాలు యాగాలు, కామ్య కర్మలు చేయిస్తారు. కోరికలు తీరడానికి యంత్రాలు, తాయెత్తులు, చక్రాలు ఉన్నాయి అంటూ ప్రచారం చేస్తుంటారు. వాళ్లు చెప్పే మాటలు చాలా ఆకర్షణీయంగా ఉంటాయి. అతిసులభంగా ఆచరించ తగ్గవిగా ఉంటాయి. అరిచేతిలో స్వర్గంచూపిస్తాయి. ప్రాపంచిక సుఖాలుపొందడం ఇంత సులభమా! అని అనుకుటేటట్టు ఉంటాయి. అంత తియ్యగా చెబుతారు. వారు తాము చెప్పే మాటలతో భోగములు, ఐశ్వర్యములు, వీటి యందు ఆశపుట్టిస్తారు. సులభంగా

ధనం సంపాదించడం, భోగములు అనుభవించడం గురించి చెబుతారు. ఇటువంటి వారికి నిశ్చయాత్మకమైన బుద్ధి ఉండదు. వారికి మనస్సు అంతా అల్లకల్లోలంగా ఉంటుంది. తమకు ఏది తోస్తే అది చెబుతుంటారు. ఎవరేమి చెప్పినా అది చేస్తుంటారు. ప్రాపంచిక విషయముల వెంట పరుగెడుతుంటారు. మనశ్శాంతి కొరకు మానసిక అభివృద్ధి కొరకుపాటుపడరు. అటువంటి వారు అధార్మిక దృష్టికలవారు అవివేకులు. అటువంటి వారు ప్రాపంచిక బంధనముల నుండి విముక్తి పొందలేరు. కాబట్టి అర్జునా! నీవు ఇటువంటి అజ్ఞానంలో పడకు అని బోధించాడు కృష్ణుడు.

## 45. త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున।
## నిర్ద్వన్ద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్॥

వేదముల యొక్క పూర్వభాగములో కర్మకాండలు, స్తోత్రములు వీటి గురించి చెప్పబడ్డాయి. సత్వ,రజస్తమోగుణములు, వాటి కలయిక వలన చేయబడే కార్యములు, వాటి వలన లభించే భోగములు, సుఖములు, ఆ భోగములు సుఖములు పొందడానికి కావలసిన సాధనములు, వీటి గురించి వివరంగా వేదములలో చెప్పబడ్డాయి. ఓ అర్జునా! వేదములలో చెప్పబడ్డ కర్మకాండలు, కేవలము మూడు గుణములలో అనునిత్యము వర్తించేవారికే గానీ నీకు కాదు. నీవు మాత్రం వాటి గురించి పట్టించుకోకు. వాటిని విడిచిపెట్టు. సుఖదు:ఖాలకు, జయాపజయాలకు అతీతంగాఉండు. నీ మనస్సును పరమాత్మయందు లగ్నం చెయ్యి. నీ యోగక్షేమముల గురించి ఆరాట పడవద్దు. నీ కర్తవ్యమును నీవు నిర్వర్తించు.

పైన చెప్పబడినమూడు శ్లోకములలో కేవలము కర్మల గురించి వేదములలో చెప్పబడినట్టు తెలుసుకున్నాము. రజస్తమోగుణముల వారికి మాత్రమే అవి వర్తిస్తాయి. వేదములలో జ్ఞాన కాండ గురించి కూడా చెప్పబడింది. కాని దాని గురించి ఎవరూ పట్టించుకోరు. స్వర్గసుఖాలకు సంబంధించిన కర్మకాండల గురించే అందరూ చెబుతారు. అదే వేదము అనుకుంటారు. కాబట్టి ఓ అర్జునా! నీవు ఈ రజోగుణము తమోగుణము వదిలిపెట్టు. సత్వమును ఆశ్రయించు. ఆత్మ తత్వము గురించి తెలుసుకో. నీ గురించి నీ యోగక్షేమముల గురించి ఆలోచించవద్దు. నీకర్తవ్యకర్మలను నిర్వర్తించు. అని జ్ఞానబోధ చేసాడు కృష్ణుడు.

కర్మలు అందరూ చేస్తారు. కాని కర్మలను ఒక యోగంగా చేసే వాడిని కర్మయోగి అంటారు. వేదములలో కూడా ఈ సత్వ,రజస్,తమో గుణముల గురించి వాటితో చేయబడే కర్మల గురించి చెప్పాయి. మూడు గుణములతో చేసే కర్మలు అన్నీ ప్రాకృతిక కర్మలు. అంటే ఏవేవో కోరికలు తీరడానికి చేయబడే కర్మలు. ఈ లోకంలో భోగభాగ్యములను, పరలోకంలో స్వర్గసుఖాలను

కోరి చేసే కర్మలు. అవేయజ్ఞయాగములు. వాటి గురించి కూడా వేదములలో చెప్పబడ్డాయి. ఎందుకు చెప్పబడ్డాయి అంటే వేదములు కేవలం మేధావులకు జ్ఞాన వంతులకు మాత్రమే చెప్పబడలేదు. సామాన్య మానవుని కూడా దృష్టిలో పెట్టుకొని చెప్పబడింది. సామాన్య మానవునికీ, ఈ కర్మకు ఈ ఫలం వస్తుంది అని చెబితే కానీ చెయ్యడు. అందుకే స్వర్గ సుఖములు, భోగభాగ్యములు, కోరిన కోరికలు తీరడం ఇలాంటి తాయిలాలు ప్రకటించింది. కాని, మానవులు అక్కడే ఆగి పోతున్నారు. వేదములలో చెప్పబడిన యజ్ఞయాగములు చేయడం, కోరికలు తీర్చుకోవడం, స్వర్గ సుఖములు అనుభవించడం, మరలా జన్మ ఎత్తడం, జనన మరణ చక్రంలో తిరగడం. దీనితోనే జీవితాలు గడిచిపోతున్నాయి.

మరి కర్మలు ఎలా చేయాలి అనే ప్రశ్న వస్తుంది. అదే కర్మయోగము. వేదములలో చెప్పబడిన యజ్ఞయాగములను, కర్మలను ఆసక్తి లేకుండా చేయడం నేర్చుకోవాలి. ఎటువంటి హర్షము, శోకము లేకుండా కర్మలు చేయాలి. ఈ కర్మ ఫలించింది అని సంతోషము ఫలించలేదని దు:ఖము చెందకూడదు. కర్మలను ఒక యోగంగా చేయాలి. ముఖ్యంగా వేదములలో చెప్పబడిన కర్మలను, ప్రాపంచిక కర్మలను అన్నిటిని కూడా వాటి మీద ఎటువంటి ఆసక్తిలేకుండా చెయ్యాలి. ఏదో ఒక ఫలమును ఆశించి చేయకూడదు. ధనం సంపాదించడం జీవితంలో అవసరమే కానీ ధన సంపాదనే జీవితం కాకూడదు. అ లాగే స్త్రీపురుషులు జీవిత భాగస్వాములు అంతే కానీ వారే జీవితం అనుకుంటే తుదకు దు:ఖం మిగులుతుంది. అలాగే సుఖములు అనుభవించడం జీవితంలో అవసరమే కానీ ఎప్పుడూ సుఖాలు కావాలని కోరుకుంటే తుదకు దు:ఖమే మిగులుతుంది. కాబట్టి దేని మీద కూడా ఎక్కువ ఆసక్తి ఉండకూడదు. ద్వంద్వములను సహించే ఓర్పు ఉండాలి.

మనకు వచ్చే కష్టాలు, మన ప్రారబ్ధ కర్మచేత వస్తాయి అని తెలిసినా దానిని అంగీకరించము. ఎందు కంటే మనకు కష్టాలు అంటే ఇష్టం లేదు. ఎల్లప్పుడూ జీవితంలో సుఖాలే రావాలి. ధనం రావాలి. లాభాలు రావాలి. ఇవే కోరుకుంటాము. కాని అలా జరగదు కదా. సుఖాలతో పాటు కష్టాలుకూడా వస్తుంటాయి. సుఖాలు వచ్చినపుడు ఆనందంగా అనుభవించిన వాడు, జీవితంలో ఏ చిన్న సమస్య వచ్చినా మనసు అల్లకల్లోలం చేసుకుంటాడు. ముందు జ్యోతిష్కుడు, తరువాత వాస్తు, ఆ తరువాత స్వామీజిలు ఎవరినో ఒకరిని ఆశ్రయిస్తాడు. మరింత దు:ఖాన్ని కొని తెచ్చుకుంటాడు. అంతేకానీ ఇది నా పూర్వజన్మ ఫలం వల్ల వచ్చింది. తొందరలోనే పోతుంది, సుఖం తరువాత దు:ఖం రావడం సహజం అని ఎవరూ అనుకోడు. పైగా, దానికి సవాలక్ష కారణాలు వెతుకుతాడు.

అలా కాకుండా ఉండాలంటే నిత్య సత్వస్థ: అంటే ఎల్లప్పుడూ సత్వగుణ సంపన్నుడవై ఉండాలి. మానసిక ప్రశాంత కలిగి ఉండాలి. ప్రతి చిన్న విషయానికీ కుంగి పోకూడదు. ధైర్యంగా ఎదుర్కోవాలి. ఓర్పుకలిగి ఉండాలి. సత్వగుణము ఎక్కువగా ఉంటే బుద్ధి చురుకుగా పని చేస్తుంది.

మంచి చెడు వివేచన ఉంటుంది. ఆలోచనా శక్తి పెరుగుతుంది. మనసు చంచలంగా ఉండదు. కోపం, అలసత్వము ఉండవు. ఎప్పుడూ యాక్టివ్ గా ఉంటాడు. యోగ క్షేమముల మీద ఎక్కువ ఆసక్తి ఉండకూడదు. యోగము అంటే లేనిది మనకు రావడం. క్షేమము అంటే వచ్చిన దాన్ని భద్రంగా దాచుకోవడం కాపాడుకోవడం. ఈ రెండింటి యందు ఎక్కువ ఆసక్తి ఉండకూడదు. వస్తుంటాయి పోతుంటాయి. అనే దృష్టితో ఉండాలి.

తరువాత ఆత్మవాన్ భవ అంటే ఎల్లప్పుడూ అప్రమత్తుడుగా ఉండాలి. జీవితం యాంత్రికంగా కాకుండా అప్రమత్తంగా జీవించు. బతకడం వేరు. జీవించడం వేరు. తిండి నిద్ర ఉంటే ఎవడైనా బతక గలడు. జీవించడం అంటే జీవితాన్ని ఆస్వాదించడం. అప్రమత్తంగా ఉండటం. ఎవరైనా ఒక అందమైన గులాబీని చూపించి చూడండి ఎంత అందంగా ఉందో అంటే దానిని సరిగా చూడకుండానే మెకానికల్ గా అవునండి అందంగా ఉంది అంటాడు కానీ ఆ అందాన్ని ఆస్వాదించి అనడు. ప్రతిరోజూ సూర్యోదయం ఎంతో ఆనందంగా ఉంటుంది. కాని ఎంతమంది ఆ ఆనందాన్ని అనుభవిస్తున్నారు. నేర్చుకోదలచుకుంటే ప్రకృతి నేర్పే పాఠాలు ఎవరూ నేర్పలేరు అని దత్తాత్రేయ అవధూత అంటారు. కాబట్టి మనం జీవించడం నేర్చుకోవాలి కాని బతకడం కాదు. జీవించడానికి మన అంత:కరణ పరిశుద్ధంగా ఉండాలి. అప్పుడే ప్రకృతిని ఆస్వాదించగలం. చిన్న పిల్లవాడు ఎల్లప్పుడూ సంతోషంగా ఉండగలడు ఎందుకంటే వాడు మెకానికల్‌కాదు. మనం మెకానికల్. దేనినీ ఆస్వాదించలేని పరిస్థితి.

కాబట్టి అర్జునా నీవు నిశ్చయాత్మక బుద్ధి కలిగి ఉండాలి. మెకానికల్ గా ఉండకూడదు. ఆలోచించి నిర్ణయాలు తీసుకోవాలి. ద్వంద్వాలకు అతీతంగా ఉండాలి. అన్ని కర్మలు ఒక యోగంగా చేయాలి. వాటి మీద ఎక్కువ ఆసక్తి పెంచుకోకూడదు. యోగక్షేమాల మీద ఎక్కువ ఆసక్తి ఉండకూడదు. అని భగవానుడు చెప్పాడు.

## 46. యావానర్థ ఉదపానే సర్వతస్సంప్లుతోదకే।
## తావాన్సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానత:॥

స్నాన,పానములకు ఉపయోగించే చిన్న చిన్న జలాశయముల వలన ఎంతటి ప్రయోజనం ఉంటుందో, అదే ప్రయోజనము పెద్ద పెద్ద జలాశయముల వలన కూడా ఉంటుంది. అలాగే వేదములు, శాస్త్రములు చదివిన వాడికి, వాటిలో చెప్పబడిన అనేకములైన కర్మకాండలు ఆచరించేవాడికి ఎంతటి ప్రయోజనం ఉంటుందో, బ్రహ్మజ్ఞానికి కూడా అదే ప్రయోజనం లభిస్తుంది.

వేదములలో కర్మకాండల గురించి చెప్పారు. బ్రహ్మజ్ఞానము గురించి కూడా చెప్పారు.

వేదములు చదవకుండానే బ్రహ్మజ్ఞానము సంపాదించిన వాడికి వేదములు చదవ వలసిన పని ఏముంటుంది. వేదములలో ఏం ఉంటుందో దానిని బ్రహ్మజ్ఞాని గ్రహించాడు. దానికి చక్కని ఉదాహరణ గంగానది పక్కన ఉన్న వాడికి చిన్న జలాశయములో పని ఏముంటుంది. ఆత్మజ్ఞానము బ్రహ్మజ్ఞానము గంగానది అయితే వేదజ్ఞానము చిన్న సరోవరము లాంటిది. కాబట్టి అందరూ ఆత్మజ్ఞానము, ఆత్మతత్వము, బ్రహ్మజ్ఞానము కొరకు ప్రయత్నించాలే కానీ వేదములు చదివి అందులో చెప్పబడిన కర్మకాండల గురించి ఆలోచిస్తూ, స్వర్గసుఖాల కోసం పాకులాడటం సరికాదు.

మనం కర్మలు చేస్తుంటాము. వాటికి తగిన ఫలితములు వస్తుంటాయి. ఆనందం కలుగుతూ ఉంటుంది. కాని ఆ సుఖములు, ఆనందం కేవలం పరిమితం. అపరిమితం కాదు. పెళ్లి చేసుకోవడం, మంచి ఉద్యోగం, పిల్లలు, ధన సంపాదన, ఆస్తి కూడబెట్టడం ఇవన్నీ పరిమితమైన సుఖాలను ఇస్తాయి. ఇవే కొంత మందికి దు:ఖాలను కూడా కలుగజేస్తాయి. ఇవన్నీ కేవలం సుఖాలను ఇస్తాయి అని అనుకున్నా అవి పరిమితమైన సుఖాలే. ఈరోజు ఉండి రేపు పొయ్యేవే. ధనం వస్తే సుఖం. పోతే దు:ఖం. పెళ్లిలో కొంతమందికి సుఖం. విడాకులలో కొంతమందికి సుఖం. అలాగే పిల్లలు పుడితే పండుగ. పోతే ఏడుపు. ఇలా అన్నీ పరిమిత సుఖాలు. సుఖాలన్నీ దు:ఖాలతో అంతం అవుతాయి. ఈ సుఖాలన్నిటికీ అతీతమైనది ఆత్మానందము. అక్కడు దు:ఖానికి తావు లేదు. కేవలం సుఖమే ఉంటుంది. అటువంటి సుఖం ముందు ఈ చిన్ని చిన్ని కర్మలతో కలిగే సుఖాలు గంగానదిపక్కన ఉన్న వాడికి చిన్న జలాశయం ఉన్నట్టు ఉంటుంది. ఆత్మ తత్వముతెలిసిన బ్రహ్మ జ్ఞాని ఆత్మానందానికి విలువ ఇస్తాడు కానీ, కర్మకాండల వలన లభించే చిన్న చిన్న సుఖాలకు విలువ ఇవ్వడు. ఎందుకంటే ఈ కర్మకాండల వలన లభించే సుఖాలన్నీ అనంత మైన ఆత్మానందంలో ఇమిడి ఉన్నాయి. ఒక పెద్ద వృత్తంలో చిన్న వృత్తాలు అనేకం ఉండవచ్చు. కాని చిన్న వృత్తంలో పెద్దవృత్తం ఇమడ్చలేము. అలాగే ఆత్మానందంలో కర్మకాండల వలన కలిగే సుఖాలు అన్నీ ఇమిడి ఉన్నాయి కాబట్టి బ్రహ్మజ్ఞాని అయిన వాడు ఆత్మానందం కోసం పరమసుఖం పొందడం కోసం, పరమాత్మను చేరుకోడానికి ప్రయత్నిస్తాడు కానీ వేదాలు చదివి అందులో చెప్పబడిన కర్మకాండలు ఆచరించి వాటి వలన కలిగే స్వర్గసుఖాలు, ఇహలోకసుఖాల కోసం ప్రయత్నం చేయడు. అటువంటి బ్రహ్మజ్ఞానికి వేదములలో చెప్పబడిన కర్మకాండలు ఆచరించడం వలన పరిమిత ప్రయోజనమే కానీ అపరిమితమైన ప్రయోజనం లభించదు. ఎలాగంటే కోట్లు మూలుగుతున్న వాడికి పదిరూపాయలు ఇచ్చి అనుభవించమంటే ఎలా ఉంటుందో బ్రహ్మజ్ఞాని వేదములలో చెప్పబడిన కర్మకాండలు చేయడం దాని ద్వారా స్వర్గసుఖాలుపొందడం అలా ఉంటుంది. ఎందుకంటే అటువంటి పది రూపాల నోట్లు కోటీశ్వరుడి దగ్గర అపరిమితంగా ఉన్నాయి. ఇహలోక సుఖాలు, స్వర్గలోకసుఖాలు ఆత్మానందంలో అనంతంగా ఇమిడి ఉన్నాయి. అని కృష్ణుడు అర్జునుడికి ఆత్మానందం యొక్క విశిష్టతను గురించి బోధించాడు.

## 47. కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన।
## మా కర్మఫలహేతుర్భూర్మాతే సంగోऽస్త్వకర్మణి॥

ఓ అర్జునా! కర్తవ్యకర్మలను ఆచరించుటయందే నీకు అధికారము కలదు. దాని ఫలితముల యందు నీకు అధికారము లేదు. ఏకర్మకు ఏ ఫలం రావాలనే దానికి నీవు కారణం కాదు. అలా అని కర్మలు చేయకుండా ఉండటం యందు ఆసక్తి చూపించకూడదు. ఎటువంటి ఫలితాన్ని ఆశించకుండా కేవలం కర్మలు చేయడమే నీ కర్తవ్యము.

కర్మలు ఎలా చెయ్యాలి అనే విషయం ఇక్కడ విపులంగా చెబుతున్నాడు కృష్ణుడు. పుట్టిన తరువాత ప్రతిజీవీ ఏదో ఒక కర్మచేయక తప్పదు. కాబట్టి కర్మలు చేయడమే మానవుని వంతు. ఆ కర్మకు ఎటువంటి ఫలితం రావాలో నిర్ణయించే అధికారము మానవునికి లేదు. ఏ ఫలితం వచ్చినా స్వీకరించవలసినదే కానీ, నేను ఈ పని చేసాను కాబట్టి నాకు ఈ ఫలితమే రావాలి, ఆ ఫలితానికి నేనే కారణము అనే అధికారము ఎవరికీ లేదు. ఏ ఫలితానికి ఎవరూ కారణం కాదు. చేసే ప్రతి కర్మా నిష్కామంగా చేయాలి. చేసిన కర్మను, దాని ఫలితమును పరమాత్మకు అర్పించాలి. కర్తృత్వ భావన కలిగి ఉండకూడదు. ఏ పరిస్థితులలో కూడా చేసిన కర్మకు ఫలితం ఆశించకూడదు. ఎందుకంటే ఏదో ఒక ఫలితము కోరి కర్మచేస్తే, ఆ కర్మను శ్రద్ధతో, మనస్ఫూర్తిగా చేయలేము. ఫలితం వస్తుందో రాదో అనే వ్యాకులతతో చేస్తాము.

కర్మఫలము మీద అధికారము లేనపుడు కర్మలు చేయడం ఎందుకు దండగ అని మానేయకూడదు. ఏ పనీ చేయక పోవడం తమోగుణ లక్షణము అయిన సోమరి తనము. సోమరితనము విపరీత పరిణామాలకు దారి తీస్తుంది. కాబట్టి పుట్టిన ప్రతిమానవుడు సత్కర్మలు చేయాలి. నిష్కామంగా చేయాలి. ఫలితం కోసం ఆశించకూడదు. కర్మ ఫలితములకు తాను కారణం కాకూడదు. అటువంటప్పుడు కర్మలు చేయడం వృథా అని కర్మలు చేయకుండా ఉండకూడదు.

కర్మయోగం వెనక ఉన్న సిద్ధాంతాన్ని ఏమిటంటే, ముందు కర్మయోగం అంటే ఏమిటో బాగా అర్థం చేసుకోవాలి. కర్మఫలం నుండి బయటపడాలి. ఏ కర్మ చేస్తే ఏం ఫలితం వస్తుందో అని భవిష్యత్తు గురించి ఆలోచించేవాడు, కర్మను సరిగా చేయలేడు. సంవత్సరం అంతా శ్రద్ధగా చదివి పరీక్ష రాయడం విద్యార్థి కర్తవ్యము. అంతేకాని, సరిగా చదవకుండానే, నేను పరీక్ష పాసవుతానో లేదో అని ఆలోచించేవాడు పరీక్షసరిగా రాయలేడు. అంటే నీకు కర్మచేయడంలోనే అధికారం ఉంది. దాని ఫలితం మీద కాదు. కాని జంతువులు ఏమిచేసినా అది వాటి సహజ లక్షణం. వాటికి ఏది చెయ్యాలో ఏది చెయ్యకూడదో, వీడు నావాడు వాడుపరాయి వాడు, వీడిని తన్న వచ్చు వాడిని తన్నకూడదు అనే బుద్ధిలేదు. ఎవరైనా వాటికి అపకారం చేస్తారని అనుకుంటే

స్వీయరక్షణ కోసరం అది పొడుస్తుంది, తంతుంది, కరుస్తుంది. దానివలన మనకు బాధ కలుగుతుంది. తను కరిస్తే మనిషి చనిపోతాడు అన్న విషయం పాముకు తెలియదు. ఆత్మరక్షణార్థము కరవడమే దానికి తెలిసిన పని.

కాని మనిషి అలాకాదు. ఎదుటి వాడు మనకు అపకారం చేసినా మనం ఉపకారం చెయ్యాలి అనే మంచి గుణం మనకు ఉంది. విచక్షణ ఉంది. మంచి చెడు జ్ఞానం ఉంది. అందుకని మనం ఏ కర్మ చేయాలి ఏదిచెయ్యకూడదు అనేజ్ఞానం మనకు ఉంది. ఆ స్వేచ్ఛ మనకు ఇచ్చాడు భగవంతుడు. కాబట్టి అర్జునా! నీ పని నీవు చెయ్యి. చేయాల్సిన కర్తవ్యమును మాన వద్దు. కాని నీవు చేసే పనికి ఏ ఫలం వస్తుందో నిర్ణయించే అధికారము నీకు లేదు. ఎందుకంటే ఈ యుద్ధము నీకు కోరుకున్నది కాదు. ఈ యుద్ధానికి ఎన్నో కారణాలు ఉన్నాయి. యుద్ధం చేయడానికి నేనే కారణం అనుకోకు. నీవు కేవలం నిమిత్తమాత్రుడివి. ఎందుకంటే, ఎవరు ఏ పని చేసినా అది ఆ ఒక్కడి వల్లనే అవడం లేదు. ఎంతో మంది ఎన్నోపనులు చేస్తే ఒకపని పూర్తి అవదు. వ్యవసాయానికి భూమి, భూసారము మంచి విత్తనములు, ఎండలు, నీరు, సకాలంలో వర్షాలు ఎరువులు ఇవన్నీ కలిస్తే పంట చేతికొస్తుంది. ఇందులో ఏ ఒక్కటి తప్పినా పంటసరిగా రాదు. ఒక వేళ పంట బాగా పండి, చేతికి రాబోయే సమయానికి రాత్రికి రాత్రి అకాల వర్షాలు వచ్చి పంట నాశనం కావచ్చు. అన్ని సక్రమంగా జరిగితే, నేను పండించాను, అంతా నా మహిమ అని చెప్పకుంటాడు. ఏదైనా అపశృతి కలిగితే దేవుడి మీదికి నెట్టేస్తాడు. కాబట్టి ఏ పని చేసినా ఆ ఫలితం నీఒక్కడిది కాదు సమిష్టిగా ఉంటుంది అని తెలుసుకోవాలి.

ఈ పనికి ఈ ఫలితం వస్తుంది, ఇంతఫలితం వస్తుంది అని చెప్పడానికి ఎవరికీ అధికారము లేదు. ఏ కర్మ అయినా కానీ ఎవరూ ఒక్కడుగా చేయలేడు. ఇది సమిష్టి కృషి. కాబట్టి ఫలితం కూడా సమిష్టిగానే ఉంటుంది కానీ వ్యక్తిగతంగా ఉండదు. కాబట్టి కర్మచేయడం వరకు మాత్రమే నీ అధికారం. ఫలం విషయంలో పూర్తి అధికారం నీకు లేదు. ఉండదు కూడా. ఫలితం మీద కూడా నాకే అధికారం ఉంది ఇదంతా నా వల్లనేజరుగుతూ ఉంది అంతా నేనే చేసాను అని అనుకుంటే అది అవివేకమే అవుతుంది. కాబట్టి నీ పని నీవు చెయ్యి. ఫలితం కోరకు ఎదురుచూడకు. ఆ అధికారము నీకు లేదు.

దాని తరువాత రెండవ పాదంలో మరొక విషయం చెబుతున్నాడు. ఫలితం మీద నాకు అధికారము లేనప్పుడు ఆ పనిచేయడం ఎందుకు దండుగ అని చెప్పి నిరాశా వాదం పనికిరాదు. ఏ ఫలితం వచ్చినా సిద్ధంగా ఆనందంగా స్వీకరించగలిగే ధైర్యం కావాలి. ఎటూ మంచి ఫలితం రాదుకదా ఫలితం మీద నాకు అధికారం లేదు కదా నేనెందుకు చెయ్యాలి అని చేతులు ముడుచుకొని కూర్చోకూడదు. అది సోమరితనానికి దారితీస్తుంది. తమోగుణం పెరుగుతుంది.

కర్మఫలము మీద అపరిమితమైన ఆసక్తి పెరిగితే సుఖం ఉండదు. ఎంత వచ్చినా వాడికి తృప్తి ఉండదు. ఇంకా కావాలి అని ఉంటుంది. అలా కాకుండా ఫలితంమీద ఆసక్తి లేకపోతే అంతా ఆనందమే. ఉదాహరణకు ఒక వ్యాపారంలో ఒకడు ఈ సంవత్సరం పదిలక్షలు లాభం వస్తుంది అని ఊహించాడు కాని ఐదు లక్షలే లాభం వచ్చింది. వీడు భోరున ఏడుస్తున్నాడు. వచ్చిన 5 లక్షల కొరకు సంతోషించడం లేదు రావాల్సిన 5 లక్షలు నష్టపోయానే అని ఏడుస్తున్నాడు. ఫలితంమీద అపరిమితమైన ఆసక్తి ఉంటే ఇలాంటి కష్టాలే వస్తాయి. మరొకడు బియ్యం ధర పెరుగుతుందని సంవత్సరం మొత్తానికి కెజీ 40 చొప్పున 20 బస్తాలు కొని పెట్టుకున్నాడు. ఇంతలో కెజీ 5 రూపాయలు తగ్గింది. భోరున ఏడుస్తున్నాడు. కారణం.... 100 రూపాయలు నష్టంవచ్చిందని. ఫలితాన్ని ఆశిస్తే వచ్చే బాధ ఇదే. కాబట్టి కర్మయోగమును అనుష్టించేవాడు, కర్మను ఒక యోగంగా చేసేవాడు తానుచెయ్యాల్సిన కర్మలను శ్రద్ధతో చెయ్యాలి. ఫలితం కోసం ఆశించ కూడదు. మంచి వచ్చినా చెడు వచ్చినా సమంగా అనుభవించాలి. అప్పుడే సుఖంగా ఉండగలడు. ఇప్పుడు కర్మలను ఎలా చెయ్యాలి అని చెబుతున్నాడు కృష్ణుడు.

## 48. యోగస్థ: కురు కర్మాణి సఙ్గం త్యక్త్వా ధనంజయ।
## సిద్ధ్య సిద్ధ్యో: సమో భూత్వా సమత్వం యోగ ఉచ్చతే॥

ప్రతి వాడు తాను చేయవలసిన కర్మలు తప్పకుండా చేయాలి. ఆ కర్మలను ఒక యోగంగా చేయాలి. చేయబోయే పని మీద ఆసక్తిని వదిలిపెట్టాలి. ఆ పని జరుగుతుందా జరగదా అనే అనుమానం వదిలిపెట్టాలి. చేసే పని శ్రద్ధగా చేయాలి. లాభము, నష్టముల మీద సమభావన కలిగి ఉండాలి. ఆ సమత్వమే ఒక యోగము.

ఈ శ్లోకంలో యోగస్థ: కురు కర్మాణి అని అన్నారు. అంటే కర్మలను ఒక యోగంగా చేయాలి. ఇక్కడ యోగం అంటే ఫలితం ఆశించకుండా కర్మచేయడం. కర్మలు మంచి ఫలితాలను ఇచ్చినా విపరీత ఫలితాలను ఇచ్చినా సమంగా చూడటం. ఇదే యోగము. ఇది ఎలా సమకూరుతుంది అంటే మనో నిగ్రహం ఉన్నప్పుడు కలుగుతుంది. మనో నిగ్రహం కలిగినపుడు మనసు ప్రాపంచిక విషయములలో కాకుండా ఆత్మవైపు చూస్తుంది. మనసు ఆత్మలో లీనమైనపుడు అంతులేని ప్రశాంతత కలుగుతుంది. ఏ పని చేస్తున్నాము దాని ఫలితం ఏమిటి అనే దాని మీద ఆసక్తి ఉండదు. చేసే పని శ్రద్ధగా చేస్తాడు. ఫలితం పరమాత్మ పరం చేస్తాడు. ఫలితం గురించి ఆందోళన పడకుండా నిర్వికారంగా ఉండటమే సమత్వం అనే యోగము. దీనికి మూలం అటాచ్ మెంట్ అంటే సంగమాన్ని విడిచిపెట్టడం. ఏ పని చేసినా శ్రద్ధతో ఒక యోగం లాగా చేయడం. ముఖ్యంగా విద్యార్థులకు, వ్యాపారస్థులకు ఇది ముఖ్యం. బాగా చదివి పరీక్ష రాస్తే మంచి ఫలితాలు తప్పకుండా వస్తాయి.

వ్యాపార మెళుకువలు తెలిసి ధర్మంగా వ్యాపారం చేస్తే తగిన లాభాలు వస్తాయి. అంతే కానీ ఈ పరీక్ష రాస్తానా లేదా, పాసవుతానా లేదా, లాభాలు వస్తాయా లేదా అనే వ్యాకుల చిత్తంతో పరీక్ష రాసినా, వ్యాపారం చేసినా, విపరీత ఫలితాలువస్తాయి. అంతే కాకుండా అపరిమితమైన ఆశకుపోతే కన్నీళ్లే మిగులుతాయి. కాబట్టి ఒక పని అవుతుందా కాదా అనే అనుమానం వదిలిపెట్టి, శ్రద్ధతో పని చేయాలి. లాభ నష్టా ల మీద సమత్వ బుద్ధి కలిగి ఉండాలి. అదే నిష్కామ కర్మ.

ఒక పని చేసినప్పుడు అది సిద్ధిస్తుంది. లేక సిద్దించదు. చేసిన పని వృధా అవుతుంది. ఒక్కోసారి గెలుస్తాము.మరోసారి ఓడిపోతాము. లాభం వస్తుంది నష్టం వస్తుంది. పంటకోసి కుప్ప వేయంగానే భోరున నాలుగు రోజులు వాన. పంట నాశనం అవుతుంది. ఇలాంటివి జరుగుతాయి.మరి పంట నాశనం అయితే, నష్టం వస్తే ఏడవకుండా ఎలా ఉండటం అని ఎదురు ప్రశ్నవేయవచ్చు. ఏడిస్తే పోయిన పంట తిరిగి వస్తుందా! వచ్చిన నష్టం లాభంగా మారుతుందా! అలా అయితే నష్టం వచ్చిన ప్రతి వాడూ భోరున ఏడుస్తాడు. కాని అలా జరగడం లేదు. నష్టం ఎందుకు వచ్చిందో తెలుసుకొని అలా రాకుండా చూసుకోవడం బుద్ధి మంతుల లక్షణం. ఏడవడం అవివేకుల లక్షణం. బుద్ధిమంతుడు అయిన వాడు లాభం వస్తేపొంగి పోవడం నష్టం వస్తే కుంగి పోవడం పనికిరాదు. డిప్రెషన్‌లోకి జారిపోకూడదు. కిందపడ్డా పైకి లేవడానికి ప్రయత్నం చేయాలి. ఇదివరకే ఈ సమత్వ బుద్ధి గురించి చెప్పాము మరలా చెబుతున్నాడు భగవానుడు. కాబట్టి మనం చెయ్యవలసిన కర్మ, కర్తవ్యము చేయడమే మనపని. ఫలితం మనది కాదు. ఫలితం గురించి ఆలోచించకూడదు. ఫలితం మీద ఆసక్తి లేకుండా చెయ్యాల్సిన పనిని శ్రద్ధతో చెయ్యి. మంచి ఫలితం దానంతట అదే వస్తుంది. సమత్వబుద్ధితో చేసేదే కర్మయోగము.

## 49. దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగాద్ధనంజయ। బుద్ధౌ శరణమన్విచ్ఛ కృపణా: ఫలహేతవ:॥

ధనంజయా! నీకు అన్నిటా సమత్వం పాటించాలని చెప్పానుకదా! సమత్వబుద్ధితో చేసే కర్మల కన్నా, ఏవేవో కోరికలు తీరాలని కర్మలు చేయడం అంటే సకామ కర్మలు చేయడం చాలా తక్కువ స్థాయికి చెందినవి. ఈ యుద్ధంలో జయం వస్తుందా లేక అపజయం కలుగుతుందా లేక ఈ యుద్ధం చేస్తే పాపం వస్తుందా, పుణ్యం వస్తుందా అనే ఆలోచనలను పక్కన బెట్టి సమభావంతో యుద్ధం చెయ్యి. ఎందుకంటే ఏదో ఒక కోరికతో కర్మలు చేసే వాళ్లు కృపణులు, దీనులు, ఆశావహులు. అటువంటి వారికి దు:ఖమే మిగులుతుంది.

కర్మను మామూలుగా చేయడం అంటే మంచి ఫలితంవస్తే ఎగిరి గంతులేయడం, చెడు ఫలితం వస్తే భోరుమని ఏడవడం. కర్మను ఒక యోగంగా చేయడం అంటే కర్మ ఫలితాన్ని

ఆశించకకుండా కర్మలు చేయడం. మంచి ఫలితం వచ్చినా చెడుఫలితం వచ్చినా సమానంగా చూడటం. ఇదీ కర్మయోగం.

ఇక్కడ బుద్ధి యోగం అని మరొక కాన్సెప్ట్ వచ్చింది. అంటే కర్మను సమత్వబుద్ధితో చేయడం బుద్ధి యోగము అని అర్థం. సమత్వ బుద్ధితో చేసే కర్మతో పోలిస్తే, కోరికలతో కూడిన కర్మ, ఫలితాన్ని ఆశించి చేసే కర్మ, చాలా చిన్నది. సమత్వబుద్ధితో చేసే కర్మలో ఉన్న ఉన్నతి దీనిలో లేదు. నువ్వు గొప్పవాడివి. క్షత్రియుడివి అన్నీ తెలిసినవాడివి. నీకు అల్పమైన ఆ సకామ కర్మలు పనికిరావు. నీకు సమత్వబుద్ధితో చేసే కర్మయోగమే తగినది. కాబట్టి ఈ యుద్ధం కూడా ఫలితమును ఆశించకుండా. ఎవరు గెలుస్తారు ఎవరు ఓడతారు అని ఫలితాన్ని ఊహించకుండా, ఎవరు చస్తారు ఎవరు బతుకుతారు అని అనుకోకుండా, వీళ్లు పోతే నా గతిఏమిటి అని కుంగి పోకుండా. వీళ్లంతా నావాళ్లు అనే మమత మమకారం విడిచిపెట్టి నీ క్షత్రియ ధర్మం ప్రకారం యుద్ధం చెయ్యి. నేను ఇంత చెప్పినా నేను యుద్ధం చేయను అని నీవు చతికిలబడితే, నీ వంటి అదృష్ట హీనుడు మరొకడు ఉండదు. నీ వంటి వారిని కృపణులు, దీనులు, దౌర్భాగ్యులు అని అంటారు. నీవు ధీరుడవు అనిపించుకుంటావో కృపణుడు అని పించుకుంటావో నీ ఇష్టం. అని అన్నాడు కృష్ణుడు.

## 50. బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృతదుష్కృతే।
## తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగ: కర్మసు కౌశలమ్॥

ఓ అర్జునా! సమత్వ బుద్ధి కలవాడు తనకు వచ్చిన పుణ్యమును, పాపమును ఈ లోకములోనే విడిచిపెట్టేస్తాడు. కర్మఫలములు అతనికి అంటవు. కాబట్టి నీవు కూడా సమత్వ బుద్ధిని ఆశ్రయించి యుద్ధం చెయ్యి. కర్మలు చేయడంలో ఇది చాలా కుశలమైన మార్గము. దీని వలన ఈ యుద్ధము చేయడం వలన వచ్చే కర్మ బంధనములు నీకు అంటవు.

ఈ శ్లోకంలో బుద్ధియుక్తుడు అని వాడారు. బుద్ధియుక్తుడు అంటే తన బుద్ధిని ఉపయోగించి కర్మలు చేసేవాడు. అటువంటి వాడు ఏవేవో కోరికల కోసం కర్మలు చేసి ఆ కర్మబంధనములలో చిక్కుకోడు. అనాసక్తంగా, నిష్కామంగా కర్మలు చేస్తాడు. అటువంటి వాడికి వాడు చేసే కర్మల వలన కలిగే పుణ్య పాపములు అంటవు. ఎందుకంటే ఆసక్తితో, కోరికలతో కర్మలు చేస్తేనే ఆ కర్మల పుణ్యపాపములు కర్మలు చేసిన వాడికి అంటుతాయి. కాబట్టి బుద్ధియుక్తులు అయిన వాళ్లు, నిష్కామ కర్మలను ఎటువంటి ఆసక్తి లేకుండా చేస్తారు.

ఇక్కడ ఇంకొక విశేషం కూడా ఉంది. బుద్ధిని ఉపయోగించి కర్మలు చేయడం అలవాటు అయితే, అతడు ఎటువంటి అధర్మ కార్యములను చేయడు. కేవలం పుణ్య కార్యములు

ధర్మకార్యములు చేస్తాడు. బుద్ధి ఉపయోగించకుండా, కేవలం మనసు చెప్పినట్టు చేసేవాడు, తన కోరికలు విషయ వాంఛలు తీరడం కోసం పాపపు పనులు కూడా చేసే అవకాశం ఉంది. ఆత్మజ్ఞానం సంపాదించడం కూడా బుద్ధితో చేసే కార్యమే. ఆత్మజ్ఞానం కోసం ప్రయత్నించేవాడు ఇతరములైన కార్యముల యందు ఆసక్తి చూపడు. ఒక వేళ ఏపని అయినా చేయాల్సివస్తే దానిని నిరాసక్తంగా, ఏకోరికా లేకుండా చేస్తాడు. అటువంటి కార్యముల యొక్కపుణ్యపాపములు అతనికి అంటవు. ఇక్కడ సు కౌశలమ్ అనే మాట వాడారు. కుశలత్వంతో అంటే నేర్పుగా, పుణ్య పాపములు అంటకుండా కర్మలుచేయడం. బుద్ధిని ఉపయోగించి, మంచి చెడులను విచారించి కర్మలు చేయడం. కేవలం మంచి కర్మలు పుణ్య కర్మలు మాత్రమే చేయడం. చెడు కర్మల జోలికి పోకపోవడం. దీనినే కౌశలమ్ అంటారు. సుకౌశలమ్ అంటే ఇంకా అత్యంత నేర్పుతో కర్మలు చేయడం.

కృష్ణుడు ఇప్పటి దాకా కర్మలను నిష్కామంగా ఏ విధమైన ఫలాపేక్ష లేకుండా, చేయాలి. నిశ్చయాత్మకమైన బుద్ధితో చేయాలి. సమత్వ బుద్ధితో చేయాలి అంటే ఆకర్మకు మంచి ఫలం వచ్చినా చెడ్డ ఫలం వచ్చినా ఒకే విధంగా స్పందించాలి. చేయ బోయే కర్మ సిద్ధిస్తుందో సిద్ధించదో అనే సందేహము పనికిరాదు. చిత్తశుద్ధితో కర్మలను చేయాలి అని చెప్పాడు. ఇప్పుడు మరొక విషయం చెబుతున్నాడు. పైన చెప్పిన,విధంగా కర్మలను చేస్తే వాడికి జ్ఞానం కూడా కలుగుతుంది. వాడిలో ఉన్న అజ్ఞానం అవివేకము తొలగిపోతుంది. అది ఎలా జరుగుతుంది అంటే ఈ ప్రకారంగా నిష్కామ కర్మలను చేయడం వలన వాడికి పాపము అంటదు. పుణ్యము రాదు. వాడిలో సుకృతము ఉండదు. దుష్కృతము ఉండదు. సమంగా ఉంటాడు. ఈ సమత్వ బుద్ధి కలిగి ఉండటమే జ్ఞానము. అంటే వాడికి తాను చేసిన కర్మలవలన అటు పాపమూ రాదు ఇటు పుణ్యమురాదు. ఎందుకంటే నిష్కామంగా పనులు చేసినపుడు ఈ పని నేను చేస్తున్నాను అనే కర్తృత్వభావము ఉండదు. అహంకారము ఉండదు. ఏ పని అయినా నీవు చేసినట్టు పైకి కనిపించినా ఆపని నీవు చేయడం లేదు. అందరి సమిష్టికృషి అని తెలుసుకోగలుగుతావు. అటువంటప్పుడు నేను చేసాను అనే అహంకారము కర్తృత్వ భావన ఉండదు కాబట్టి ఆ కర్మకు సంబంధించిన పాప పుణ్యములను నావి అని అనుకోడు. అందువలన వాడికి ఆ కర్మ తాలూకు పాపపుణ్యములు అంటవు. ఎలాగంటే, నీవు ఆ పని చేయాలి కాబట్టి ఆ పని చేయడం నీ ధర్మం కాబట్టి, శ్రద్ధాభక్తులతో ఆపని చేస్తావు. కాని నీవు పుణ్యపాపములకు అతీతంగా ఉంటావు. అదే జ్ఞానము. అందుచేత నీవు మామూలుగా కాకుండా యోగదృష్టితో అంటే సమత్వభావంతో యుద్ధం చేయాలి. ఇప్పటిదాకా నేను యుద్ధం చేస్తున్నాను, నేనే వీళ్లందరినీ చంపుతున్నాను అని అనుకుంటున్నావు. ఇప్పుడు నీవు కర్తవు కావు అనుకొని యుద్ధం చేయాలి. అటువంటి కర్మనే మంచి కుశలమైన కర్మ అంటారు. నేర్పుగల కర్మ అంటారు. బంధనములను కలిగించని కర్మ అంటారు. పాపపుణ్యములకకు అతీతమైన కర్మ అని అంటారు.

ఇక్కడ వ్యాసుల వారు కర్మ సుకౌశలమ్ అంటే కుశలమైన కర్మ అని వాడారు. కుశల కర్మ అంటే కర్మలు చేయడంలో ఎక్స్‌పర్ట్ అని కాదు. మామూలుగా మనం వాడే ఎక్స్‌పర్ట్

వేరు. ఎక్కువదినములు ఆ కర్మ చేయడం వల్ల ఎక్స్‌పర్టిజమ్ వస్తుంది కాని ఆ కర్మలో వాడికి కుశలత్వము రాదు. ఇక్కడ కుశలత్వము అంటే మానవుడు, తనను బంధించే కర్మలను, ఆ కర్మలనుండి విముక్తుడు కావడానికి, అంటే మోక్షం పొందడానికి ఉపయోగించుకొనే తెలివికలిగి ఉండటాన్ని కుశలత్వముఅంటారు. అంటే మనకు వ్యతిరేక పరిస్థితులను కూడా అనుకూలంగా మలచుకోవడాన్నే కుశలత్వము, నేర్పు అని అంటారు. కాబట్టి మనం చేసే కర్మలను చిత్తశుద్ధితో ఎటువంటి ఫలాపేక్ష లేకుండా, కర్తృత్వ బుద్ధి లేకుండా చేస్తే ఆ కర్మ మనకు బంధనములను కలిగించకపోగా జ్ఞానము కలిగిస్తుంది. తద్వారా మోక్షం వస్తుంది. ఎలాగంటే తాచు పాము విషము ప్రాణం తీస్తుంది. దానినే ఔషధంగా వాడితే ప్రాణం పోస్తుంది. కాబట్టి అర్జునా కర్మలను మనలను బంధించకుండా చేయడమే కర్మ సు కౌశలమ్ అంటే నేర్పుగా కర్మలనుచేయడం అని చెప్పాడు కృష్ణుడు.

## 51. కర్మజం బుద్ధి యుక్తా హి ఫలం త్యక్త్వా మనీషిణః।
## జన్మబన్ధవినిర్ముక్తాః పదం గచ్ఛన్త్యనామయమ్॥

సమత్వ బుద్ధి కల వారు, తాము కర్మలుచేసినా ఆ కర్మఫలములను విడిచి పెడతారు. అటువంటి వారు జనన మరణ చక్రము నుండి విడివడతారు. శాశ్వతసుఖమును ఇచ్చే మోక్షమును పొందుతారు.

ఈ శ్లోకంలో మనీషి అని వాడారు. మనిషి వేరు మనీషి వేరు. వివేకము, జ్ఞానము, కౌశలము, అసాధారణ ప్రజ్ఞ, సమత్వబుద్ధికలవారిని మనీషి అంటారు. ఇటువంటి వారు కర్మఫలముల మీద ఆసక్తిచూపరు. వాటిని విడిచిపెడతారు. కాబట్టి ఏ పని చేయాలన్నా వివేకంతో కౌశలంతో చేయాలి గానీ ఏదోచేసామంటే చేసాము అని చేయకూడదు. సకామ కర్మ, నిష్కామ కర్మ, వీటిలో భేదము, ఇవి ఆచరించినందువలన కలిగే సుఖదు:ఖములు ఆలోచించి కర్మలనుచేయాలి. సంగమంతో పనులు చేస్తే ఎటువంటి ఫలితములు వస్తాయి. సంగమం లేకుండా చేస్తే ఎలా ఉంటుంది అని ఆలోచించి కర్మచేయాలి. అటువంటి కుశలురు, వివేకవంతులు, సమబుద్ధికలవారు మాత్రమే కర్మఫలములను వదిలిపెట్టగలరు. నిష్కామ కర్మలు చేస్తే చిత్తము శుద్ధి అవుతుంది. నిర్మలమైన చిత్తములో జ్ఞానం కలుగుతుంది. జ్ఞానం కలిగితే బంధనములనుండి విముక్తి లభిస్తుంది. తరువాత మోక్షము లభిస్తుంది. కాబట్టి కర్మయోగము అవలంబించినా మోక్షము పొందవచ్చు అని ఇక్కడ నిరూపించాడు పరమాత్మ. చాలా మందికి ఈ కర్మ బంధనములు ఎలా తొలగిపోతాయా అని సందేహము. దానికి ఇక్కడ ఒక అద్భుతమైన మార్గము సూచించారు. కర్మలను నిష్కామంగా, సంగమం లేకుండా నేర్పుతో ఆచరించడం. ఆ కర్మల ఫలితములను పరమాత్మకు అర్పించడం. ఇంతే! ఈ రెండూ చేస్తే కర్మబంధనములు అంటనే అంటవు.

ఎవరు పరమ శాంతిని పొందుతారు అనే విషయంలో పరమాత్మ ఇక్కడ కొంత మందిని గురించి చెప్పాడు. బుద్ధియుక్తులు అంటే సమ బుద్ధి కలవారు. జ్ఞానులు వివేకులు. మానసిక ఎదుగుదలను సాధించిన వారు, కుశలత్వంతో కర్మలనుచేసేవారు. కర్మలను శ్రద్ధతో చేసేవారు. ఎటువంటి ఆసక్తితో చేయని వారు. కర్మఫలముల మీద ఆసక్తి లేని వారు. అటువంటి వారు ఎల్లప్పుడూ శాంతితో ఉంటారు. వారికి సుఖము దు:ఖము ఉండవు. అటువంటి వారికి జనన మరణ బంధనములు కూడా ఉండవు. కర్మఫలముల వలన బంధనములు, వాటి వలన వాసనలు, వాసనల వలన పునర్జన్మ కలుగుతాయి. అసలు కర్మ బంధనములు లేని వాడికి ఇవన్నీ ఉండవు. మరణానంతరము అతడు పరమ పదము చేరుకుంటాడు. ఇంకమరలా వెనక్కు రావడం ఉండదు. పరమాత్మలో ఐక్యం అవుతాడు.

## 52. యదా తే మోహ కలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి।
## తదా గంతాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్యచ॥

ఓ అర్జునా! ప్రతి వాడిని మోహం ఆవహించి ఉంటుంది. ఈ మోహము ఒక ఊబి వంటిది. ఈ మోహము నుండి బయట పడిన వాడే ఈ లోకములో ఉండే సుఖములు, దు:ఖములకు సంబంధించిన బంధనములు, అలాగే పరలోకములో లభించే సుఖముల యొక్క బంధనములు, వీటి నుండి విడివడతాడు. అప్పుడే మనిషికి వైరాగ్యము వస్తుంది.

ఈ శ్లోకంలో మోహము అనే పదం వాడారు. మోహము అంటే తెలియని తనం. అజ్ఞానము. అవివేకము. ఒక విషయాన్ని తప్పుగా అర్థం చేసుకోవడం. దీనినే మాయ అని కూడా అంటారు. వాడు దాని మాయలో పడ్డాడు. దాని మోహంలో పడ్డాడు అని అనడం మనం వింటూ ఉంటాము. మానవునికి, పరమాత్మకు అడ్డుగా ఉన్నది ఈ మోహమే. దీనిని దాటితే పరమాత్మను చేరుకోవచ్చు. కాని దీనిని దాటడం చాలా కష్టం. మరి ఈ మోహమును దాటడానికి వీలు లేదా అంటే ఉంది. నిష్కామ కర్మ చేయడం. నేను చేస్తున్నాను. అంతా నా వలననే జరుగుతూ ఉంది అనే అహంకారము లేకుండా కర్మలు చేయడం. భగవంతుని గూర్చి చదవడం, వినడం, అధ్యయనం చేయడం, ఆత్మ విచారణ చేయడం. అప్పుడే మానవుడు ఈ అజ్ఞానము నుండి, మాయ నుండి బయట పడగలుగుతాడు.

ఇక్కడ నిర్వేదము అనే పదం వాడారు. నిర్వేదము అంటే వైరాగ్యము. వైరాగ్యము అంటే అన్నీ విడిచిపెట్టి సన్యాసం పుచ్చుకోవడం కాదు. ఏవస్తువు ఉపయోగము ఎంత వరకు

ఉందో తెలుసుకొని అంతవరకే దానిని సంపాదించడం, ఉపయోగించడం. అనవసరమైన వస్తువుల జోలికి పోకపోవడం. ఇదే వైరాగ్యము. అన్నీ నాకే కావాలి. అన్నీ నేనే అనుభవించాలి, ఇంకా ఇంకా సుఖపడాలి, ఇక్కడి సుఖాలే కాదు స్వర్గసుఖాలుకూడా అనుభవించాలి అని అనుకోవడమే మోహము.

చిన్న ఉదాహరణ. నోట్లోకి వెళ్లేంత వరకే ఆకారము, రంగు, రుచి, వాసనలలో తర తమ భేదాలు. గొంతు దిగిన తరువాత అంతా ఒకటే. ఇదీ తెలుసుకోవలసిన సత్యం. నోట్లో పోసుకోవడం వరకే మన పని. అది మంచినీళ్లు అయినా, కూల్ డ్రింక్ అయినా, ఇంకా కాస్ట్లీ డ్రింక్ అయినా, మద్యం అయినా, చిన్న హెూటల్ భోజనం అయినా, ఫైవ్‌స్టార్ భోజనం అయినా, గొంతు దిగేవరకే వీటి మధ్య తర తమ భేదాలు. గొంతు దిగిన తరువాత అంతా ఒకటే. కాబట్టి శబ్దము (మంచి సంగీతము), స్పర్శ (ఎవరిని తాకినా ఒకటే స్పందన--ఒకటే ఆనందం, ఒకటే స్పర్శసుఖం, ఇంతకంటే ఎక్కువ చెప్పడం సభ్యతకాదు), రూపము (కళ్లతో అందమైన వస్తువులను చూడటం) రసం (రుచికరమైన పదార్థములను తినడం, తాగడం), గంధము (సువాసనలు వెదజల్లే ఖరీదైన వస్తువులను వాసన చూడటం) మానవుడికి ఏసుఖం అయినా ఈ ఐదింటి వలననే కలుగుతుంది. కాకపోతే ఈ సుఖాలుదొరికే స్థలం బట్టి, మనుషులను బట్టి, వస్తువులను బట్టి సుఖం మారుతూ ఉంటుంది. వీటి అసలు స్వరూపం తెలుసుకుంటే ఎప్పుడైనా ఎక్కడైనా ఎవరితోనైనా అనుభవించే సుఖం ఒకటే అనే భావన కలుగుతుంది. వైరాగ్యం దానంతట అదే వస్తుంది. కాబట్టి అసలు స్వరూపం తెలుసుకోకుండా ఇవన్నీ అనుభవించాలి అని అనుకోవడం మోహం. వాటి అసలు స్వరూపం తెలుసుకోవడం వైరాగ్యం.

### 53. శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా।
### సమాధావచలా బుద్ధిస్తదా యోగమవాప్స్యసి॥

అనేకములైన విషయములు, తత్వములు వినడం వలన బుద్ధి చలించి పోతుంది. బుద్ధి నిశ్చలంగా ఉన్నప్పుడే పరమాత్మ యందు నిలపగలరు. అప్పుడే సమత్వబుద్ధి అనే యోగము సిద్ధిస్తుంది. సమత్వ బుద్ధి యోగము సిద్ధించిన నాడు ఆత్మ పరమాత్మలో లీనం అవుతుంది. అదే మోక్షము.

వేదములలో, శాస్త్రములలో ఈ లోకంలో కానీ, పరలోకంలో గానీ, సుఖాలు అనుభవించడానికి, పరమాత్మను చేరుకోడానికి వివిధములైన మార్గముల గురించి చెప్పబడ్డాయి. ఈ కర్మచేస్తే ఈ ఫలం వస్తుంది అని చెప్పబడింది. ఇవన్నీ చదివి, విని, అర్థం చేసుకొన్న మానవుడు, ఏది ఆచరించాలో తెలియక అయోమయంలో పడిపోతుంటాడు. అటువంటి వాడి బుద్ధి స్థిరంగా

ఉండదు. ఏవేవో సందేహాలతో సతమతమౌతుంటాడు. తుదకు ఏదీ చేయకుండా ఉండి పోతాడు. కాబట్టి ఆత్మతత్త్వ విచారణను మించిన యోగము మరొకటి లేదు. మనలో ఉన్న అజ్ఞానం పోవాలంటే ముందు ఫలాపేక్ష వదిలిపెట్టాలి. ఈ యాగం చేస్తే ఈ ఫలం వస్తుంది, ఆ వ్రతం చేస్తే ఆ ఫలం వస్తుంది అనే విషయాల నుండి మనసును నిష్కామ కర్మ వైపు మళ్లించాలి. పరమాత్మను ధ్యానించడంలోనే మనసు లగ్నం చేయాలి. అప్పుడు స్థిరమైన బుద్ధి కలుగుతుంది. ఆత్మసాక్షాత్కారము కలుగుతుంది. మోక్ష ప్రాప్తి కలుగుతుంది. ప్రాపంచిక విషయములలో లీనం అయిన జీవుడు, తన అసలు స్వరూపము అయిన ఆత్మస్వరూపమును గురించి తెలుసుకొని, పరమాత్మలో లీనం కావడమే యోగము. అనవసరమైన బోధనలు చదవడం, వినడం, వాదించడం మాని, సందేహాలను విడిచిపెట్టి, ఈ యోగము గురించి తెలుసుకోవాలి. వేదములు శాస్త్రములు చదివి, విని, బుద్ధిని వివిధమార్గములలో పోనీయకూడదు. స్థిరంగా ఉంచుకోవాలి. ఆత్మ సాక్షాత్కారము ఎప్పుడు కలుగుతుంది అంటే దానికి కాలపరిమితి లేదు. బుద్ధి చలించకుండా, పరమాత్మ ధ్యానంలో లీనం అయితే, ఆత్మసాక్షాత్కారము అనే యోగం సిద్ధిస్తుంది. అది నిరంతర అభ్యాసము వలననే సాధ్యం అవుతుంది. అప్పుడే మానవుడు జీవన్ముక్తుడు అవుతాడు. అనగా జీవించి ఉండగానే మోక్షం సిద్ధిస్తుంది.

ఇదంతా విన్న తరువాత ప్రతి వ్యక్తికీ ఒక సందేహం వస్తుంది. వేదములలో శాస్త్రములలో చెప్పినవి తప్పా! ఆచరించకూడదా! అనే సందేహం తలెత్తుతుంది. వేదములను సరిగా, లోతుగా అర్థం చేసుకుంటే ఈ సందేహం రాదు. వేదములలో అన్ని విషయాలు చెప్పారు. సగుణోపాసన గురించి చెప్పారు. నిర్గుణోపాసన గురించి చెప్పారు. యజ్ఞయాగముల గురించి చెప్పారు. ఆత్మజ్ఞానం గురించి చెప్పారు. అందరూ మానవులు ఒకే విధమైన బుద్ధి జ్ఞానము వివేకము కలిగి ఉండరు కాబట్టి, వారిని ఆత్మజ్ఞానం వైపు మళ్లించడానికి వివిధములైన మార్గముల గురించి చెప్పారు. ముందు సగుణో పాసన తరువాత నిర్గుణో పాసన. భగవంతుని గురించి తెలుసుకోడానికి, భగవంతుని తత్వము వైపు బుద్ధి మళ్లించడానికి, యజ్ఞయాగములు చేయమని చెప్పారు. యజ్ఞయాగములు చేస్తే స్వర్గసుఖాలు కలుగుతాయి అని ఆశచూపించారు. కానీ అక్కడే ఉండిపొమ్మని చెప్పలేదు. తరువాత ఆత్మజ్ఞానం తెలుసుకోవడం గురించి కూడా చెప్పారు. ఈ మాదిరి ఒకదాని తరువాత ఒకటి ఆచరిస్తూ తుదకు పరమాత్మలో ఐక్యం కమ్మని బోధించారు. కాని మానవులు స్వర్గసుఖాలకోసం మాత్రమే యజ్ఞయాగములు చేస్తూ ఆత్మతత్వాన్ని తెలుసుకోవడం గురించి మరిచిపోతున్నారు. దాని గురించే ఇక్కడ చెప్పాడు పరమాత్మ. ఇహలోక భోగాలు, స్వర్గసుఖాలు అనే మోహం లో పడి పోయి బుద్ధిని చలింపచేయవద్దు. బుద్ధిని స్థిరపరచుకొని, పరమాత్మవైపు మళ్లించాలి, బుద్ధి స్థిరంగా ఉన్నప్పుడే ఆత్మతత్వము అర్థం అవుతుంది అని బోధించాడు కృష్ణుడు.

అర్జున ఉవాచ:

53. స్థితప్రజ్ఞస్య కా భాషా సమాధిస్థస్య కేశవ।
స్థితధీ: కి ప్రభాషేత కిమాసీత వ్రజేత కిమ్॥

ఇదంతా విన్న తరువాత అర్జునుడు కృష్ణుడిని ఈ ప్రశ్న వేసాడు. కేశవా! నిశ్చల మైన, అచలమైన, సమాధిస్థితిని పొందిన మానవుడు, తన మనస్సును ఆత్మలో లీనం చేసిన మానవుడు, అంటే స్థితప్రజ్ఞుడు, జీవన్ముక్తుడు అయిన మానవుడు ఎలా ఉంటాడు? అతడి లక్షణములు ఎలా ఉంటాయి? అతని భాష ఎలా ఉంటుంది? అతను ఎలా ప్రవర్తిస్తాడు? అటువంటి వాడిని గుర్తించడం ఎలాగా! వివరంగా చెప్పు అని అడిగాడు అర్జునుడు.

ఇక్కడ అర్జునుడు స్థితప్రజ్ఞుడు అనే మాట వాడాడు. స్థితప్రజ్ఞుడు అంటే సమాధి నిష్ట యందు ఉన్న యోగి అని అనవచ్చు. ఆత్మజ్ఞానము కలవాడు. జీవన్ముక్తుడు. ఇటువంటి వారిని స్థితప్రజ్ఞుడు అని అంటారు. కొంత మంది తాము ఆత్మజ్ఞానము కలవారము అని అనుకుంటూ ఉంటారు. మరి కొందరు తాము సమాధి నిష్టలో ఉన్నాము అని ఇతరులు అనుకోవాలని నటిస్తుంటారు. కాబట్టి అసలైన స్థితప్రజ్ఞుడు ఎవరో లేక డాంబికంగా తాను ఆత్మయోగిని అని తనను తాను ప్రకటించుకొనే వాళ్లు ఎవరో, తెలుసుకోవాలంటే ఏం చెయ్యాలి అని అడిగాడు అర్జునుడు. అటువంటి స్థితప్రజ్ఞుని వాక్కు, నడవడిక, అతను ఉండే ప్రదేశము ఎలా ఉంటాయి అని అడిగాడు.

సాధారణంగా ప్రతి మనిషిలోనూ రజోగుణము, తమోగుణము అహంకార రూపంలో ప్రత్యేకంగా కనపడుతూ ఉంటాయి. సత్వ గుణము ఏదో ఒక మూల ఉంటుంది. అటువంటి వారి నుండి స్థితప్రజ్ఞుడిని గుర్తించాలంటే ఏం చెయ్యాలి అని అడిగాడు అర్జునుడు. మనం స్థితప్రజ్ఞులము కాకపోయినా, అంత ఎత్తుకు ఎదగలేకపోయినా, ఈ లక్షణాలు తెలుసుకుంటే, వాటిలో కనీసం ఒకటీ అరా అయినా ఆచరించగలిగితే, మనం ప్రశాంత జీవనం గడపవచ్చు. కొంత మందికి తాము జ్ఞానులము అని అహంకారము ఉంటుంది. తాము జ్ఞానులము, తమకు యోగము సిద్ధించింది అని ప్రచారం చేసుకుంటూ ఉంటారు. మరి కొంత మందికి తాము జ్ఞానులము అయ్యామేమో అనే సందేహము కలుగుతుంది. నిజంగా యోగం సిద్ధించిన వాడు ఎటువంటి ప్రచారాన్ని ఆశించడు. జ్ఞాని అయిన వాడికి తాను జ్ఞాని అవునా కాదా అనే సందేహము అసలే రాదు. కాబట్టి వీళ్లంతా జ్ఞానులు కాదు అని అర్థం అవుతుంది. మరి అసలు జ్ఞాని, స్థితప్రజ్ఞుడు ఎవరో ఎలా ఉంటాడో అని అర్జునుడి ప్రశ్న.

ఈ శ్లోకంలో సమాధిస్థస్య అని వాడారు. సమాధి అంటే మనకు తెలిసిన ఒకే అర్థం ఏదో మైకంలో ఉన్నట్టు ఉండటం. అసలు అర్థం ఏమిటంటే మన మనస్సును బుద్ధిని ఏకోన్ముఖం చేసి ఆత్మలో కలపడం. అప్పుడు మనసు అటు ఇటు పోదు. ఇతర విషయాల గురించి ఆలోచించదు. ఒక అనిర్వచనీయమైన ఆనందానుభవాన్ని పొందుతుంది. అదే సమాధిస్థితి.

శ్రీభగవానువాచ:

## 54. ప్రజహాతి యదా కామాన్ సర్వాన్ పార్థ మనోగతాన్ ఆత్మన్యేవాత్మనా తుష్ట: స్థితప్రజ్ఞస్తదోచ్యతే॥

ఓ అర్జునా! స్థిత ప్రజ్ఞుడు అనే వాడికి కోరికలు ఉండవు. కోరికలు అనేవి మనసులో నుండి తొలగిపోతాయి. మనసును ఆత్మయందు లగ్నం చేసి అనిర్వచనీయమైన ఆనందాన్ని పొందుతుంటాడు. ఆత్మను పరమాత్మతో సంయోగించి సంతుష్టుడై ఉంటాడు. ప్రాపంచిక విషయముల వలన కలిగిన ఆనందం కంటే అటువంటి ఆనందము గొప్పది అనే అనుభూతిని పొందుతాడు. అటువంటి వాడిని స్థితప్రజ్ఞుడు అని అంటారు.

చాలా మందికి ఒకసందేహము వస్తుంది. వేదాలలో, శాస్త్రాలలో మోక్షం గురించి చెబుతుంటారు కదా అది ఎప్పుడు ఎలా వస్తుంది అని సందేహము. అది ఎవరి చేతుల్లో లేదు. ఎవరికి వారు పొందవలసిందేకానీ మోక్షం ఒకరు ఇచ్చేది కాదు. నిరంతర సాధన వలన వచ్చేదే కానీ, పైపైవిషయాలు తెలుసుకున్నందువలన రాదు. ఎన్ని పూజలు వ్రతాలు చేసినా మాకు అనుకున్నది జరగడం లేదు, మాకు ముక్తి రావడం లేదు అని దేవుళ్లను, శాస్త్రములను విమర్శించడం అవివేకము. పరమాత్మ మొట్టమొదట "ప్రజహాతి యదా కామాన్ సర్వాన్" అంటే ముక్తి కానీ, మోక్షం కానీ, ఆత్మజ్ఞానం కానీ, కలగాలంటే ముందు అన్ని కోరికలు వదిలిపెట్టాలి అని చెప్పాడు పరమాత్మ. ఒకటీ అరా కోరికలు వదిలిపెట్టడం కాదు సర్వాన్ అంటే అన్ని కోరికలు అన్నీ వదిలిపెట్టాలి. అప్పటికే మనసులో కోరికలు ఉంటే వాటిని కూడా వదిలిపెట్టాలి.

కోరికలలో రెండు రకాలు ఉంటాయి. కొన్ని కోరికలు ధర్మసమ్మతంగా, మరి కొన్ని అధర్మసమ్మతంగా ఉంటాయి. ఇక్కడ కోరికలు అంటే అధర్మపరమైన కోరికలు అని అర్థం చేసుకోవాలి. ధర్మపరమైన కోరికలు కూడా పరిమితంగా ఉండాలి. అప్పుడే మనసు నిర్మలంగా నిశ్చలంగా ఉంటుంది.. ఎందుకంటే మనకు తెలియకుండానే మనలో కొన్ని దుష్టమైన కోరికలు అంతర్గతంగా దాగుకొని ఉంటాయి. అందుకనే మనోగతాన్ అనే పదం వాడారు. మనసు పొరల్లో కొన్ని అధర్మమైన కోరికలు దాగుకొని ఉంటాయి. వాటినే పూర్వజన్మవాసనలు అంటారు. అవి బయటకు కనపడవు.

సూక్ష్మరూపంలో ఉంటాయి. ఎప్పుడో ఒకప్పుడు బయట పడతాయి. వాటిని కూడా వదిలిపెట్టాలి. వెతికి వెతికి పట్టుకొని బయటకు పారదోలాలి. ఇది మొదటి మెట్టు.

ఇంక రెండవ మెట్టు. ఆత్మన్యేవాత్మనాతుష్ట: అంటే ఆనందం, సంతోషం ఎక్కడో లేదు నీలోనే, నీ ఆత్మలోనే ఉంది. బయట వస్తువులను అనుభవించడం వలన వచ్చేది ఆనందం కాదు. అది సుఖముతో కూడిన దు:ఖము. మనస్సు నిర్మలంగా ఉన్నప్పుడు ఆనందం దానంతట అదే కలుగుతుంది. ఒక మంచి పని చేసినపుడు మనసు హాయిగా ఆనందంగా ఉంటుంది. అహంకారమును వదిలిపెట్టి, మనస్సును లోపలకు మళ్లించి, ఆత్మలో లీనం చేస్తే, కలిగే ఆనందం పేరు బ్రహ్మానందము. ఆ ఆనందానికి ఏదీ సాటి రాదు. ఆ ఆత్మానందం పొందిన తరువాత ఇంక పొందవలసిన ఆనందం ఏదీ ఉండదు. ఈ ప్రకారంగా తనలో తాను ఆనందించడం, రమించడమే స్థితప్రజ్ఞుని లక్షణము. ఈ విషయాలనే ఇంకా వివరంగా చెప్పుకోవచ్చు. ఎందుకంటే ఇది మూల శ్లోకము. మిగిలిన శ్లోకములు దీనికి వాఖ్యానాలు మాత్రమే.

ఎవరికి వారు నేను స్థితప్రజ్ఞుడిని అవునా కాదా నేను జ్ఞానిని అవునా కాదా అన్న విషయం తనకు తానుగా తెలుసుకోవచ్చు మరొకరిని అడగనవసరం లేదు. అలా తెలుసుకోడానికి ముందు జ్ఞానం కావాలి. జ్ఞానము అనేది మూడు విధాలుగా ఉంటుంది.

1. వినడం ద్వారా జ్ఞానం సంపాదించడం. శాస్త్రవిషయముల గురించి వినడం. అర్థం చేసుకోవడం. సాధారణంగా మనం ఎదుటి వాడి గురించి తెలుసుకోగలం. మన గురించి మనం తెలుసుకోలేము. ఎవడి గురించి వాడు తెలుసుకోవడం ముఖ్యం. ఎవడి ముఖం వాడు చూసుకోవాలంటే అద్దం సాయం కావాలి. అలాగే ఎవడి స్వభావం గురించి వాడు తెలుసుకోవాలంటే గురు ముఖతా శాస్త్ర పరిజ్ఞానం కావాలి.

2. మననం. శ్రవణంలో సందేహాలు వస్తాయి. పూర్తిగా విన్న తరువాత ఆ విన్న దానిని మననం చేసుకుంటూ ఉంటే సందేహాలు రావడం సహజం. వాటిని గురువు ద్వారా తీర్చుకోవాలి. అప్పుడే విన్నదానికి సార్థకత. దీనినే మననం అంటారు. విన్న దానిని అర్థం చేసుకోవడం, దాని గురించి ఆలోచించడం. ఎంత వరకు ఆచరణయోగ్యమా అని నిర్ణయించుకోవడం. ఆచరించడానికి ప్రయత్నం చేయడం.

3. నిధిధ్యాసనం. అంటే విన్నదాన్ని మననం చేసుకొని, అర్థం చేసుకొని, ఏమైనా సందేహాలు ఉంటే నివృత్తి చేసుకొని, ఆ జ్ఞానాన్ని నిజజీవితంలో ఆచరించడం. అంటే శ్రవణం, మననం వలన కలిగిన జ్ఞానమును, ప్రజ్ఞను మనలో స్థిరపరచుకోవాలి. కేవలం వినడం వలన ప్రయోజనం లేదు కదా. ఈ మూడు స్థితులు దాటితేనే వాడు స్థితప్రజ్ఞుడు అవుతాడు. మొదటి రెండూ ఎవరైనా చేయగలరు అంటే వినడం, సందేహాలు అడగడం చాలా సులభం. విన్న దాన్ని ఆచరించడం అత్యతంత కష్టం, దీనికి సంబంధించిన విషయాలను పరమాత్మ మనకు చెప్పబోతున్నాడు.

మనం సాధారణంగా బయట వస్తువులనుండి, బంధుమిత్రులనుండి, సంతోషాన్ని ఆనందాన్ని పొందుతుంటాము. అలా కాకుండా, మరొక ఆనందం ఉంది. మనస్సును ప్రాపంచిక విషయముల నుండి వెనక్కులాగి ఆత్మయందు నిలిపి దాని వలన ఆనందాన్ని పొందడం. దీనినే ఆత్మానందము అంటారు. మనలో మనమే ఆనందించాలి. దానికి బయట వస్తువులు కారణం కాకూడదు. బయట వస్తువులను అనుభవించడం వలన కలిగే ఆనందం నిజమైన ఆనందం కాదు. ఏ కారణం లేకుండా తనలో తాను ఆనందించడమే నిజమైన ఆనందం. ఈ విషయాన్నే ఒక యోగిని అడిగారనుకోండి. స్వామీజీ మీరు సంతోషంగా ఎలా ఉండగలుగుతున్నారు అంటే నేను సంతోషంగా ఉన్నాను కాబట్టి సంతోషంగా ఉండగలుగుతున్నాను అని అంటాడు. అంటే అతని సహజ లక్షణం సంతోషంగా ఉండటం. మన సంతోషం ఒక వస్తువు లభించడం వలన కలిగితే ఆ వస్తువు పోయినపుడు ఆ సంతోషం కూడా పోతుంది. మన ఆనందం దేని మీదా ఆధారపడకుండా సహజంగా కలిగితే ఆ ఆనందం ఎల్లప్పుడూ ఉంటుంది. ఇదే ఇందులో రహస్యం. కాబట్టి స్థితప్రజ్ఞుడి మొదటి లక్షణం నిరంతర సంతోషం. ఆత్మానందం కలిగి ఉండటం. ఎందుకంటే ఆనందం ఆయన సహజలక్షణం కాబట్టి.

తరువాత సర్వ కామ త్యాగ: అంటే సకలమైన కోరికలను వదిలిపెట్టడం. ఇది ఎలా సాధ్యం అని, సాధ్యం కాదు అని మనకు తెలుసు. కాబట్టి స్తితప్రజ్ఞత మనకు కాదు అని పురిట్లోనే సంధి కొట్టేస్తాము. అలా అని అనుకోకూడదు. త్యజించడం అంటే పూర్తిగా వదలడం కాదు. కోరికల మీద ఆధార పడి మన ఆనందం ఉండకూడదు. కోరికలు తీరినా తీరకపోయినా మనం ఆనందంగా ఉండాలి. కోరికలు మన ఆనందానికి మూలకారణం కాకూడదు అని భావము. కోరిక అంటే మనదగ్గర లేని వస్తువు మనకు కావాలి అనే భావన . అంటే ఆ వస్తువు నా వద్ద లేకపోతేనే కదా నేను ఆ వస్తువు కావాలి అని కోరుకునేది. అంటే నేను పూర్ణుడిని కాదు. ఆ పూర్ణత్వం కొరకు ప్రయత్నించాలి. పూర్ణత్వం అంటే ఏమీలేదు. ఉన్నదానితో తృప్తి చెందడం. లేని దాని కొరకు ఆరాటపడకపోవడం. అటువంటి పూర్ణత్వం సిద్ధిస్తే ఇంక కావాల్సింది ఏమీ ఉండదు అప్పుడు కోరికలు అనేవి ఉండవు. ఒక వేళ కోరికలు మనసులో మెదిలినా, అవి తీరినా తీరకపోయినా అతడు చింతించడు. నిరంతరం ఆనందంలో ఉంటాడు.

ఇక్కడ ఒక పదం ఉంది. మనోగతాన్ కామాన్ అంటే మనసులో ఉన్న కోరికలను ప్రజహాతి జయించినవాడు అంటే కోరికలను అణగదొక్కమని కాదు. జయించడం అంటే అణగదొక్కడం కాదు. జయించడం అంటే వదిలిపెట్టడం. వాటి గురించి ఆలోచించకపోవడం. పట్టించుకోకపోవడం ఆసక్తి లేకపోవడం. కోరికలు అంటే మనం ఇలా చెప్పుకోవాలి. కోరికలు ఒక స్థాయివరకు ఉండవచ్చు ఉదాహరణకు షుగర్. షుగర్ మామూలుగా 120 లోపల ఉండాలి. అది మించితే షుగర్ ఉన్నట్టు. 90 దిగితే షుగర్ డౌన్ అయినట్టు. కాబట్టి షుగర్ ఉండాలి. కాని

మోతాదులో ఉండాలి. అలాగే కోరికలు ఉండాలి కాని మోతాదులో ఉండాలి. మరి ఈ మోతాదు తెలుసుకోనేది ఎలా అంటే ఏ కోరిక ధర్మసమ్మతంగా ఉంటుందో అది ఉండవచ్చు. ధర్మవిరుద్ధమైన కోరిక ఉండకూడదు. ఈ విధంగా విభజించవచ్చు. ధర్మసమ్మతమైన కోరికలు కూడా మితంగా ఒక పరిమితికి లోబడి ఉండాలి. అప్పుడే అవి అదుపులో ఉంటాయి. అవి ధర్మసమ్మతమైన కోరికలు అయినప్పటికినీ వాటి మీద విపరీతమైన వ్యామోహం పెంచుకోకూడదు. అవి నిన్ను బంధించేవిగా ఉండకూడదు. ఆ కోరికల ఫలిములను నీవు ఆశించకూడదు. దీని కంతటికీ మానసిక పరిపక్వత కావాలి. బుద్ధిని ఉపయోగించాలి. విచక్షణ ఉపయోగించాలి. అప్పుడే ఈ యోగము సాధ్యము. కాబట్టి కోరికలు ధర్మ సమ్మతంగా ఉండాలి. మితంగా ఉండాలి. బంధనములు కలిగించేవిగా కాకూడదు. అటువంటి వాటిని పరిశుద్ధమైన కోరికలు అని అంటారు. వాటి వలన ఎటువంటి హానీ కలుగదు. అలా కాకుండా అధర్మము, అపరిమితము, బంధకము అనే లక్షణములు ఉన్న కోరికలు జయించాలి. వదిలెయ్యాలి. కాబట్టి ఈ శ్లోకంలో సర్వాన్ కామాన్ అంటే సకలమైన అధర్మముతో కూడిన, అశుద్ధమైన, అపరిమితమైన, అసంబద్ధమైన, బంధనము కలిగించే కోరికలు, అని అర్థం చెప్పుకోవాలి.. అటువంటి కోరికలు వదిలిపెట్టిన వాడు స్థితప్రజ్ఞుడు అని చెప్పబడతాడు అని భగవానుడు అన్నాడు.

## 56. దు:ఖేష్వనుద్విగ్నమనా: సుఖేషు విగతస్పృహ:।
## వీతరాగభయక్రోధ: స్థిధీర్మునిరుచ్యతే॥

దు:ఖము సంభవించినపుడు కుంగిపోనివాడు, సుఖములు సంప్రాప్తించినపుడు పొంగిపోనివాడు, రాగమును, భయమును, క్రోధమును వదిలిపెట్టినవాడు అయిన ధీరుడిని స్థితప్రజ్ఞుడు అని అంటారు.

స్థితప్రజ్ఞుడు ఎలా ఉంటాడో ఇక్కడ రెండు మూడు లక్షణాలు వివరించాడు పరమాత్మ. అన్నిటికంటే ముఖ్యమైన లక్షణము సుఖం వచ్చినపుడు పొంగి పోకుండా, దు:ఖం వచ్చినపుడు కుంగి పోకుండా, మనస్సును స్థిరంగా ఉంచుకోగలగడం. దీనికి మూలం తన మనస్సును, బుద్ధిని ప్రాపంచిక విషయముల నుండి వెనక్కులాగి, ఆత్మయందు స్థిరంగా ఉంచగలగాలి. అటువంటి వాడు స్థిత ప్రజ్ఞుడు అని పిలువబడతాడు. ఇది జరగాలంటే కొన్ని ముందు జాగ్రత్తలు తీసుకోవాలి. దు:ఖము వచ్చినపుడు మనసు క్షోభపడకూడదు. కలత చెందకూడదు. ఈ శరీరమే నేను అనే భావన కలిగినపుడే ఇలా జరుగుతుంది. ఈ శరీరము నేను కాదు, నేను ఆత్మస్వరూపుడను అని తెలుసుకుంటే సుఖదు:ఖములు అతనిని బాధించవు. ఎందుకంటే సుఖము కానీ, దు:ఖము కానీ మనసుకు కలిగే వికారములు మాత్రమే. ఒకదాని వెంట ఒకటి వస్తూపోతూ ఉంటాయి. తానే ఆత్మ అనుకున్నవాడిని ఈ మనోవికారములు ఏమీ ప్రభావితం చేయలేవు.

ఇంకా రాగము అంటే ఆసక్తి, భయము, కోపము ఇవి విడిచిపెట్టాలి. ఇవి కూడా మనోవికారాలే. మనసులో ఆసక్తి కలుగుతుంది. అది కోరికగా మారుతుంది. ఆ కోరిక తీరుతుందో లేదో అనే భయం కలుగుతుంది. ఆ కోరిక తీరకపోతే కోపం వస్తుంది. ఇవి ఒకదాని తరువాత ఒకటిగా వచ్చే వికారాలు. వీటికి స్థితప్రజ్ఞుడు ప్రభావితుడు కాడు. కోరికలను ఆసక్తి స్థాయిలోనే తుంచి వేస్తాడు. మనన శీలుడిని ముని అని అంటారు. ఎల్లప్పుడు భగవంతుని గురించిన విషయములను మననం చేసుకుంటూ ఉంటే, రాగము, భయము, క్రోధము అతనిని ప్రభావితం చేయలేవు. అటువంటి మునిని స్థితప్రజ్ఞుడు అని అంటారు.

స్థితప్రజ్ఞుడు తనకు ప్రతికూలమైన పరిస్తితులలో కూడా ఎలా ఉంటాడు ఎలా వ్యవహరిస్తాడు. అని చెబుతున్నాడు పరమాత్మ. ఎందుకంటే స్థితప్రజ్ఞుడు కూడా సుఖదు:ఖములకు అతీతుడు కాదు. అతడికీ పూర్వజన్మకర్మ వాసలను ఉంటాయి. వాటిని అనుభవించక తప్పదు. ఆ వాసనలు పుణ్యము పాపము తో కలిసి ఉంటాయి. అవి సుఖము దు:ఖము రూపంలో ఈ జన్మలో వెంటాడుతుంటాయి. వాటిని తప్పించుకోవడం ఎవరి తరమూ కాదు. అటువంటి సుఖము దు:ఖము వచ్చినపుడు స్థితప్రజ్ఞుడు ఎలా ఉంటాడంటే, దు:ఖము వచ్చినప్పుడు అతని మనస్సు ఉద్విగ్నత చెందదు. అంటే ఎక్షైట్ మెంట్ కు లోనుకాదు. సుఖము కలిగినపుడు ఒళ్లు మరిచిపోయి ఆనందలోకాల్లో విహరించదు. ఎందుకంటే వాళ్ల మనసులు నిశ్చలత్వాన్ని ధృఢత్వాన్ని సంతరించుకున్నాయి. వారికి నిశ్చయాత్మకమైన బుద్ధి ఉంటుంది. స్థితప్రజ్ఞులు ఈ ప్రాపంచికసుఖ దు:ఖముల మీద ఆధారపడరు. దేనికీ అతిగా స్పందించరు. నిశ్చలంగా ఉంటారు. ఒక్కమాటలో చెప్పాలంటే మైండ్ సెట్ ధృడంగా ఉంచుకోవడమే స్తితప్రజ్ఞుడి లక్షణము.

రాగము అంటే సంగమము అంటే అటాచ్‌మెంట్. మనకు లేని ధనము, ఆస్తి, పదవి మనకు లభించడం. కొత్త కొత్త బంధుత్వాలు స్నేహాలు లభించడం. సంగమం ఉన్న ప్రతిచోట భయం ఉంటుంది. ఎందుకంటే లేనిది రావడం, వచ్చింది పోవడం సహజం. కాబట్టి లేనిది రావాలనే కోరిక, వచ్చింది పోతుందోమో అని భయం ప్రతివాడికీ ఉంటుంది. కోట్లు సంపాదించినా అతనికి సెక్యూరిటీ ఉండదు. భయం పెరుగుతుంది.. ఎక్కువ ధనం ఉంటే ఎక్కువ భయం. దానిని కాపాడలేక భయం. కొడుకుల వల్ల, కూతుళ్ల వల్ల, బంధువుల వల్ల భయం. వాళ్లు తన ఆస్తిని కాజేస్తారేమో అనే భయం. నిరంతరం భయంతోనే బతుకుతుంటాడు. అటువంటివి స్థితప్రజ్ఞుడికి ఉండవు. ఎందుకంటే అతడికి సంగమమే ఉండదు. ఇంక భయానికి ఆస్కారం లేదు.

తరువాతది క్రోధము. క్రోధము అంటే అనవసరమైన ప్రతిస్పందనలు కలిగి ఉండడం . కొంతమందికి ఊరికినే కోపం వస్తుంది. ఎందుకు వస్తుందో అతనికే తెలియదు. ఎదుటి వాడు ఏ చిన్న మాట అన్నా, ఏ చిన్న ప్రతికూల విషయం సంభవించినా, అంతర్గతంగా అతనిలో విపరీతమైన

ప్రతిస్పందనలు కలుగుతాయి. అవి కోపంగా బయటకు వస్తాయి. అప్పుడు అవయవాలు అతని స్వాధీనంలో ఉండవు. ఏం మాట్లాడతాడో, ఏం చేస్తాడో అతనికే తెలియదు. పూర్వము మహాఋషులు అయిన విశ్వామిత్రుడు, దుర్వాసుడు కూడా కోపాన్ని అదుపులో పెట్టుకోలేకపోయారు. శాపాలు ఇచ్చేవాళ్లు. కాబట్టి క్రోధమును అదుపులో పెట్టుకున్నవాడే స్థితప్రజ్ఞుడు. రాగము, భయము, క్రోధము ఒకటి వెంట ఒకటి వస్తాయి కాబట్టి, ఇవి లేకపోవడమే స్థితప్రజ్ఞుని లక్షణాలుగా చెప్పబడ్డాయి.

## 57. యస్సర్వత్రానభిస్నేహ స్తత్తత్ప్రాప్య శుభాశుభమ్।
## నాభినన్దతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా।

దేనిమీదా, ఎవరిమీదా ఎక్కువగా మమతానురాగములు లేని వాడు, శుభమును, అశుభమును సమానంగా చూచేవాడు, ఒకరిని అభినందించడం, మరొకరిని ద్వేషించడం చేయనివాడు, అటువంటి వానిలో ప్రజ్ఞ అంటే బుద్ధి చక్కగా ప్రతిష్ఠితమై ఉంటుంది.

ఈ శ్లోకంలో య: అని వాడారు. య: అంటే ఎవరైతే అని అర్థం. అంటే స్థితప్రజ్ఞుని లక్షణాలు ఒకరి సొత్తుకావు. ఆడవారు, మగవారు, ఉన్నత కులస్థులు, నీచకులస్థులు ఎవరైనా స్థిత ప్రజ్ఞుని లక్షణములు కలిగి ఉండవచ్చు అని పరమాత్మ ఉద్దేశ్యము. కిందటి శ్లోకంలో చెప్పినట్టు, అతడు ఈ జన్మలో జ్ఞానం కలిగి ఉండవచ్చు. కాని ఇంతకు ముందు జన్మల వాసనలు అతనిని అంటిపెట్టుకొని ఉంటాయి. వాటి ప్రభావం చేత అతనిలో ప్రాపంచిక విషయముల మీద అభిమానము, స్నేహము, సంగము కలిగే అవకాశం ఉంది. కాని ఈ జన్మలో అతని బుద్ధి స్థిరంగా ఉండటం వలన, అటువంటి ప్రలోభాలకు లోను కాడు. స్థిరంగా, నిశ్చలంగా ఉంటాడు. శుభం కలిగినా అశుభం కలిగినా అతడు చలించడు. అతడు ఎవరినీ ద్వేషించడు అలాగని ఎవరినీ పూజించడు. సర్వులయందు సమత్వభావము కలిగి ఉంటాడు. ఎందు కంటే అతని బుద్ధి, ప్రజ్ఞ ఈ జన్మలో నిశ్చలంగా ఉంటుంది. ఎటువంటి ప్రలోభాలకు లోను కాదు.

ఈ శ్లోకంలో అభిస్నేహము అనే పదం వాడారు. స్నేహము అంటే ఫ్రెండ్‌షిప్. అభిస్నేహము అంటే గాఢమైన స్నేహము... డీప్ ఫ్రెండ్‌షిప్. మనం అందరితో స్నేహంగా ఉన్నా కొంతమందితో మాత్రమే ఫ్రీగా ఉంటాము. కొంత మందితో అయితే, అతడు లేకపోతే నేను బతకలేను అనే విధంగా ఉంటాము. మరి కొంత మందితో అంటీ ముట్టనట్టు ఉంటాము. కాని స్థితప్రజ్ఞుడు అందరినీ ఇష్టపడతాడు, కాని ఎవరూ లేకపోయినా ఏమీ అనుకోడు. ఎందుకంటే అతడు ఎవరి మీదా ఆధారపడి లేడు. మనం ఇతరులతో స్నేహం చేస్తున్నాము అంటే వారి స్నేహం కోసం వారి మీద ఆధారపడుతున్నాము అని అర్థం. కాని స్థితప్రజ్ఞుడు అయిన వాడు అందరితో స్నేహంగా ఉంటాడు కానీ అతనిది ఎవరి మీద ఆధారపడే స్నేహం కాదు. ఎల్లప్పుడూ స్వతంత్రంగా ఉంటాడు. ఎవరిమీదా

ఆధారపడడు. అనుకూలము ప్రతికూలము ఏది వచ్చినా సుఖము దు:ఖము పొందడు. అన్నిటినీ సమంగా చూస్తాడు. దేనికీ అనవసరంగా స్పందించడు. అనవసరమైన పనులను చేయడు. అవసరమైన పనులనే చేస్తాడు. ఏ పని చేసినా బాగా ఆలోచించి చేస్తాడు. ఏ విధమైన వికారములకు లోను కాడు. అటువంటి వ్యక్తి యొక్క ప్రజ్ఞ, జ్ఞానము స్థిరంగా, అచలంగా, ఉంటుంది.

## 58. యదా సంహరతే చాయం కూర్మో2ఙ్గానీవ సర్వశః। ఇంద్రియాణీంద్రియార్థేభ్య: తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥

తనకు ఏదైనా ఆపద సంభవిస్తుంది అని తెలిసినపుడు, ఎలాగైతే తాబేలు తన తలను, నాలుగు కాళ్లను తన డిప్పలోపలకు లాక్కుంటుందో అదే ప్రకారంగా జ్ఞాని అయిన వాడు బయట ప్రపంచములో ఉన్న శబ్ద,స్పర్శ,రస,రూప,గంధముల ప్రభావం నుండి తన ఐదు జ్ఞానేంద్రియములను బయట ప్రపంచంలో ఉన్న విషయముల నుండి వెనక్కులాక్కుంటాడు. అటువంటి వాడి ప్రజ్ఞ స్థిరంగా ఉంటుంది.

ఈ శ్లోకంలో వ్యాసుల వారు చక్కటి ఉపమానము ఒకటి చెప్పారు. తాబేలు తనను తాను రక్షించుకోడానికి దాని మీద ఒక ధృఢమైన కవచం లాంటి డిప్ప ఒకటి సహజంగా అమర్చబడి ఉంది. తాబేలు తనకు బయట నుండి ఏదైనా ఆపద సంభవిస్తుంది అని తెలిసినపుడు తన తలను మిగిలిన అంగములను ఆ డిప్పలోకి లాక్కుంటుంది. అప్పుడు దానికి రక్షణ కలుగుతుంది. అలాగే స్థిత ప్రజ్ఞుడు బయట ప్రపంచంలో ఉన్న విషయవాంఛల నుండి తనను తాను రక్షించుకోడానికి తన ఇంద్రియములను వెనక్కు లాక్కుంటాడు. ఇది అర్థం కావాలంటే మనము ఆచరించ వలసిన సాధనల గురించి ముందు తెలుసుకుందాము.

1. ఇంద్రియ నిగ్రహము అంటే ఇంద్రియములను అదుపులో ఉంచుకోవడం. నిగ్రహము అంటే ఇంద్రియములను అణగతొక్కడం అని అర్థం తీసుకోకూడదు. విపరీతంగా ఇంద్రియములతో స్పందించకూడదు. దేహమును అంటే ఇంద్రియములను నియంత్రించాలి. సాధకుడికి ఇదిముఖ్యం. దీనినే దమము అని అంటారు. ఎందుకంటే ప్రాపంచిక విషయములకు ఇంద్రియములు విపరీతంగా స్పందిస్తుంటే నిరంతరం వాటి ప్రభావానికి లోనవుతాడు కానీ అతడికి ఉన్నతస్థితి లభించే అవకాశమే లేదు. ఇంద్రియములనే ఎందుకు నియంత్రించాలి ముందు మనసును నియంత్రించవచ్చు కదా అంటే ముందు బయటకు కనపడే ఇంద్రియములను నియంత్రించ గలిగితే మనసును నియంత్రించడం సులభం అవుతుంది. అందుకే ముందు ఇంద్రియ నిగ్రహముతో మొదలు పెట్టాలి. సాధారణంగా ఇళ్లకు తలుపులు పెట్టుకుంటాము. ఎందుకు. అనవసరమైన వాళ్లు ఇంట్లోకి రాకుండా ముందు జాగ్రత్త. ఇంకా కొంత మంది. అనుమతి లేనిదే లోపలకు రాకూడదు అని బోర్డుకూడా

పెడతారు. మన ఇంటికే ఇన్ని జాగ్రత్తలు తీసుకుంటున్నాము కదా. మన శరీరంలోకి ఇంద్రియముల ద్వారా ఎన్ని అనవసరవిషయాలు ప్రవేశిస్తాయో తెలుసుకోవద్దా! వాటిని నిరోధించడానికి తలుపులు పెట్టుకోవాలి కదా. లేకపోతే మన శరీరం ఒక పబ్లిక్ టాయిలెట్ అయిపోతుంది అని అంటారు స్వామి చిన్మయానంద. పబ్లిక్ టాయిలెట్ కు తలుపులు ఉండవు. ఎవరైనా వచ్చి పని కానిచ్చి పోవచ్చు. కాని వాళ్లు వదిలిన తాలూకు వాసనలు అక్కడే ఉంటాయి. అలాగే మన శరీరం తలుపులు తెరిచిపెడితే, బయట ప్రపంచంలో ఉన్న శబ్ద,స్పర్శ,రస,రూప,గంధములు అన్నీ యధేచ్ఛగా లోపలకు ప్రవేశిస్తాయి. వెళ్లిపోతాయి. కాని వాటి వాసనలు మాత్రం మనలను వదలవు. కాబట్టి ఇంద్రియ నిగ్రహము అనే తలుపులు మనం అమర్చుకోవాలి.

2. మనోనిగ్రహము. శమము. మనసును అనవసరంగా ఆలోచనలతో నింపెయ్యడం. ఎవడన్నా ఒకడు మరొకడిని ఏదో ఒక మాట అన్నాడు అనుకుందాము. రెండవ వాడు "వీడు నన్ను తిట్టాడు." అనే నిర్ణయానికి వస్తాడు. దాంతో వదిలిపెట్టడు. ఏమేమి పదాలతో తిట్టాడు? ఎలా తిట్టాడు? దానికి నేనేం ప్రతీకారం చెయ్యాలి? ఇలా ఆలోచిస్తుంటాడు. పొరపాటున వాడు ఎక్కడన్నా కనపడితే మెంటల్లీ అప్‌సెట్ అవుతాడు. ఇలా కాకుండా ఎక్కడిదక్కడ వదిలేస్తే హాయిగా ఉండవచ్చు. కొంత మంది చిన్న చిన్న విషయాలను కూడా సంవత్సరాల తరబడి మనసులో పెట్టుకొని బాధపడుతుంటారు. మరి కొంతమందిలో కక్షలు తరతరాలు ఉండటం మనం చూస్తున్నాము. ఇదంతా మనసును నిగ్రహించుకోలేకపోవడమే. మనసు మన అధీనంలో లేకపోవడమే. ఉదాహరణకు ఎవరన్నా నీకేం తెలియదు నోరుమూసుకో అన్నాడనుకోండి. వెంటనే విపరీతంగా స్పందించకుండా కాసేపు మనసును నిగ్రహించాలి. నిజాయితీగా ఆలోచించాలి. వాడు నన్ను "నీకేం తెలియదు" అన్నాడు. ఈ విషయం నిజంగానే నాకు తెలియదు కదా. ఆ మాటే వాడు అన్నాడు. దానికి నేనెందుకు కోప్పడాలి అని అనుకుంటే సరిపోతుంది. ఒక వేళ మీకు బాగా తెలిసిన విషయాన్ని ఎవడో "నీకేం తెలియదు" అన్నాడనుకోండి. "పాపం. నాకు ఆ విషయం తెలుసు అన్న విషయం వాడికి తెలియదు. ఏం చేస్తాం. అది వాడి అజ్ఞానం" అని అనుకుంటే సరిపోతుంది. అలా కాకుండా "ఆహా! నాకు తెలియదంటావా!" అంటూ వాడి మీదికి పోతే మాటల యుద్ధం మొదలవుతుంది. ఇదే మనోనిగ్రహం.

జ్ఞానేంద్రియములు ఎప్పుడూ బయట ప్రపంచంలో విహరిస్తుంటాయి.అప్పుడు ప్రాపంచిక విషయముల ప్రభావము వాటి మీద పడే అవకాశము ఎక్కువగా ఉంది. వీటి యొక్క తీవ్రమైన ప్రభావము తమ మీద పడినప్పుడు, బుద్ధిమంతుడు తన జ్ఞానేంద్రియములు వాటి వల్ల ప్రభావితం కాకుండా తనలోకిలాక్కోవాలి. తాబేలును ఉదాహరణగా చెప్పారు. తాబేలు చిన్నగా నడుస్తుంది. ఆపద వచ్చినపుడు పరుగెత్తలేదు. ఎవరినీ పొడవడానికి పొడుగాటి ముక్కులేదు. కరవడానికి పళ్లులేవు. అందుకని దీనికి రక్షణగా దాని శరీరం మీద ఒక ధృఢమైన డిప్పను ఏర్పాటు చేసాడు పరమాత్మ. తనకు ఏదైనా ఆపద సంభవిస్తుంది అనే భావన రాగానే తాబేలు తన నాలుగు

కాళ్లు, తల తన డిప్పలోకి లాక్కుంటుంది. సురక్షితంగా ఉంటుంది. అలాగే బయట నుండి ఏదైనా అనవసరమైన విషయం లోపలకు వస్తుంది అని తెలియగానే మనం కూడా మన ఐదు ఇంద్రియములను తాబేలు మాదిరి లోపలకు లాక్కోవాలి. (తాబేలు తనకు ఉన్న ఒక తల నాలుగు కాళ్లు లోపలకు లాక్కుంటుంది. అలాగే మనం కూడా మన ఐదు ఇంద్రియములను లోపలకు లాక్కోవాలి అని తాబేలును ఉదాహరణగా చెప్పారు.) ఇక్కడ సర్వశం అంటే అన్ని ఇంద్రియములను అని అర్థం. ఏదో ఒక ఇంద్రియము అంటే కళ్లు మూసుకోవడమో, చెవులు మూసుకోడమో కాదు. గాంధీగారి మూడు కోతుల కథ మీకు తెలుసు. అవి కళ్లు, చెవులు, నోరు మూసుకొని ఉంటాయి. చర్మము మూసుకోలేదు. ముక్కు మూసుకుంటే ఊపిరాడక చనిపోతాడు. అందుకనీ కళ్లు చెవులు నోరు మూసుకుంటే బయట విషయాలు లోపలకు వచ్చే అవకాశం లేదు అని మూడుకోతుల కథ మనకు బోధిస్తుంది. అదే ఇక్కడ తాబేలు ఉదాహరణతో చెప్పారు. అలా చేసిన వాడి జ్ఞానం ధృఢంగా ఉంటుంది. చలించదు. ప్రాపంచిక విషయాల వెంట పరుగెత్తదు. తనకు ఏం కావాలో అంతవరకే తీసుకుంటుంది. అనవసర విషయాల జోలికి పోదు.

## 59. విషయా వినివర్తన్తే నిరాహారస్య దేహినః।
## రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే॥

సాధనలో కొంత పురోభివృద్ధి సాధించిన వారు తమ తమ ఇంద్రియముల ద్వారా ప్రాపంచిక విషయములను లోపలకు స్వీకరించరు కాబట్టి వారి నుండి ఇంద్రియార్థములు అంటే శబ్ద,స్పర్శ,రస,రూప,గంధముల వలన కలిగిన వాసనలు తొలగిపోతాయి. కాని లోపల ఉన్న మనస్సుకు మాత్రం వాటి మీద ఆసక్తి పోదు. కాని స్థితప్రజ్ఞుడు అయిన వాడి మనస్సు పరమాత్మలో లీనం అవుతుంది కాబట్టి, అటువంటి ఆసక్తి కూడా ఉండదు.

మనకు ఇంద్రియములు ఉన్నాయి. వాటికి ఆహారము బయట ఉన్న ప్రాపంచిక విషయములు. ప్రతిరోజూ ఇంద్రియములు వాటిని ఆస్వాదిస్తూ ఉంటాయి. ఒకడికి ఆఫీసుకుపోకపోతే తోచదు. ఆదివారం రోజు ఆఫీసు ఉండదు. వాడికి ఏదోగాఉంటుంది. మరొకడికి పేకాట ఆడకపోతే నిగ్రపట్టదు. అన్నం తినకపోయినా ఉండగలడు గానీ పేకాట లేనిది ఉండలేడు. ఇలాగా ఇంద్రియములు, వాటి శబ్ద,స్పర్శమొదలగు అర్థములు బయట విషయాలను స్వీకరిస్తూ ఉంటాయి. ఎవరైనా బలవంతాన మనసును నిగ్రహించుకొని, ఇంద్రియములను కట్టడిచేసి ఒక చోట కూర్చున్నాడు అనుకుందాము. కాని వాడిలోని వాసనలు అటువేపు లాగుతుంటాయి. పేకాట ఆడేవాడు కొన్నాళ్లు ఆడకపోయినా, వాడిలో పేకాట వ్యసనము అనే వాసన వాడిని విడిచిపెట్టి పోదు. యుధిష్ఠిరుడు చేసిన పని అదే కదా! జూదం మీద ఉన్న వ్యామోహము, వాసన పాండవులను

అడవులపాలు చేసింది. కాని స్థితప్రజ్ఞుడు అయిన వాడికి ఈ వాసనలు కూడా ఉండవు. పూర్తిగా నశించిపోతాయి. కేవలం ఇంద్రియములను, మనస్సును నిగ్రహించడమే కాకుండా, వాసనలు కూడా లేకుండా పూర్తిగా నిర్మూలిస్తేగానీ స్థితప్రజ్ఞుడు కాలేడు అని కూడా చెప్పవచ్చు.

ఇక్కడ సాధకుడి మానసిక పరిస్థితిని గురించి వివరించాడు. పట్టుదల పట్టి, విషయముల నుండి ఇంద్రియములను నిగ్రహించ వచ్చును కానీ మానసికంగా వాటి నుండి దూరం కాలేము. ఆసక్తిని వదులుకోలేము. ఎప్పుడూ మనస్సు వాటి గురించి ఆలోచిస్తూనే ఉంటుంది. ఈ ఆలోచనల నుండి దూరం కావడానికి శాస్త్ర పఠనం. సత్సంగము నిరంతరం చేయాలి. వీటి వలన ప్రాపంచికసుఖాల మీద ఆసక్తి పోతుంది. ప్రాపంచిక సుఖములు కేవలం పరిమిత సుఖాన్ని ఇస్తాయి. కాని స్థితప్రజ్ఞుడు తన మనసును ఆత్మలో నిలిపి పరమానందాన్ని పొందుతాడు. అటువంటి వాడు ఈ తాత్కాలిక సుఖాల కొరకు ఆశించడు. కిందటి శ్లోకంలో చెప్పినట్టు, తాబేలు ఆపద వచ్చినపుడు తన అంగములను డిప్పలోకి లాక్కున్నట్టు, మానవుడు ప్రాపంచిక విషయముల నుండి ఇంద్రియములను వెనక్కు లాక్కోవడమే కాకుండా, మనసులో కూడా ప్రాపంచిక విషయముల గురించి వాసనలను పూర్తిగా తుడిచి వేయాలి. అప్పుడే అతడు స్థితప్రజ్ఞుడు కాగలడు. కాబట్టి స్థితప్రజ్ఞుడు కావాలంటే ఇంద్రియ నిగ్రహము, మనో నిగ్రహము మాత్రమే కాకుండా వాటి తాలూకు ఆసక్తి, వాసనలు నాశనం కావడం ముఖ్యము అని చెప్పాడు పరమాత్మ.

## 60. యతతో హ్యపి కౌన్తేయ పురుషస్య విపశ్చితః। ఇన్ద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః॥

ఇంద్రియములు చాలా శక్తి మంతమైనవి. అవి జ్ఞానులు, వివేకవంతులు అయిన పురుషుల యొక్క మనసులను కూడా చిలుకుతుంటాయి. క్షోభింపచేస్తుంటాయి. బలాత్కారముగా తమ వైపుకు లాగుతుంటాయి.

మనము సాధారణంగా మనసు బలమైనది అని అనుకుంటూ ఉంటాము. మనసే కాదు ఇంద్రియములు కూడా చాలా బలమైనవి. అవి మనసును కూడా క్షోభింపచేసి తమ వైపుకు బలవంతంగా లాక్కుంటాయి అనే విషయాన్ని ఈ శ్లోకంలో వివరించాడు వ్యాసులవారు. ఇంద్రియములు నిరంతరం ప్రాపంచిక విషయముల మీద, విషయ వాంఛల మీదకుపరుగెడుతూ, మనసును కవ్వంతో మజ్జిగ చిలికినట్టు చిలుకుతుంటాయి. క్షోభను కలుగచేస్తుంటాయి. ఇంద్రియములు చాలా బలవత్తరమైనవి. అవి మనసును తమ వెంట లాగుకొని వెళతాయి. దీనికి గొప్ప పేద, చదువురాని వాడు, విద్వాంసుడు అనే తేడా లేదు. అందుకే విపశ్చితః అని అన్నారు. అంటే పెద్ద పెద్ద విద్వాంసులు కూడా ఈ ఇంద్రియముల ప్రభావము నుండి తప్పించుకోలేరు. విద్వాంసుల

పరిస్థితి ఇలా ఉంటే ఇంక ఏమీ తెలియని పామరుల సంగతి చెప్పేదేముంది. ఉదాహరణకు పేకాట ఆడేవాడు బలవంతాన ఇంట్లో ఉన్నా, వాడి చేతులు వేళ్లు పేకముక్కలు పట్టుకున్నట్టు వాటిని చూస్తున్నట్టు చేస్తుంటాయి. ఇంక తట్టుకోలేక అటు ఇటు చూసి ఏదో ఒక అబద్ధం చెప్పి, పేకాట ఆడే చోటికి కాళ్లు పరుగెడతాయి. ఇంద్రియములు అంత బలవత్తరమైనవి. అందుకే ఇంద్రియ నిగ్రహం మనం అనుకున్నంత సులభమేమీ కాదు. ఇది చాలా కష్టము. అని భగవంతుడే చెబుతున్నాడు. భగవంతుడే సులభంకాదు అని అన్నాడు కదా! దాని గురించి మనం దేనికి కష్టపడాలి అని అనుకోకూడదు. నిరంతరం ఇంద్రియములను నిగ్రహించడానికి ప్రయత్నం చేయాలి. ప్రయత్నం చేసి ఫెయిల్ అయితే నిరుత్సాహం ఉండకూడదు. మరలా మరలా ప్రయత్నించాలి అంతే కాని కుంగిపోకూడదు. ఇంద్రియములు కవ్వంలాంటివి. ఇవి మనసును చిలుకుతాయి. వాటిని సహించకలగాలి. ఇవి బుద్ధిమంతుల మనసులను కూడా వికలం చేస్తాయి. కాబట్టి చాలా జాగ్రత్తగా ఉండాలి. వాటి జోలికి పోకూడదు. ఏక్షణం అయినా అవి మనలను ముంచుతాయి. విశ్వామిత్రుడు ఎంతటి తపస్వి, జ్ఞాని అయినా మేనకను చూడగానే అతని కాళ్లు ఆమెవెంట వెళ్లాయి. కాని ఆయన తన ప్రయత్నం మానలేదు. చివరకు బ్రహ్మర్షిఅనిపించుకున్నాడు. వేదకర్త అయ్యాడు. రెండవ ఉదాహరణ సీత. సీత కూడా బంగారు జింకను చూచింది. ఆశపడింది. ఎన్నో కష్టాలపాలయింది. బంగారు లేడిని కళ్లతో చూచి, చిన్న కోరిక మనసులో మెదిలిన కారణంగా దాదాపు ఒక సంవత్సరం అవస్థపడింది. కాబట్టి ఎంతో గొప్ప వాళ్లను కూడా ఈ ఇంద్రియములు బుట్టలో పడేస్తాయి. వాటిని అదుపులో పెట్టాలి. ఇది సాధకుడికి ఒక సూచన.

## 61. తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః।
## వశే హి యస్యేన్ద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥

ఇంద్రియములను తన వశంలో ఉంచుకున్న సాధకుడు తన మనస్సును ఆత్మయందు నిలిపి ఉంచాలి. పరమాత్మయందే ఆసక్తి కలిగి ఉండాలి. ఇంద్రియములు, మనస్సు స్వాధీనంలో ఉన్న వాడి జ్ఞానం స్థిరంగా ఉంటుంది.

ఈ శ్లోకంలో రెండు విషయాలు చెప్పారు. ఒకటి ఇంద్రియ నిగ్రహము. రెండవది మనస్సును ఆత్మయందు లగ్నం చేయడం. మొదటిది బాహ్యంగా చేయవలసినది. రెండవది అంతర్గతంగా చేయాల్సిన పని. ముందు ఇంద్రియములను అదుపులో ఉంచుకుంటే బుద్ధి కూడా స్థిరంగా ఉంటుంది. బయట ఇంద్రియములను నిగ్రహిస్తే సరిపోదు లోపల మనసును కూడా ఆత్మయందు లగ్నం చేస్తేనే గానీ, బుద్ధి స్థిరంగా ఉండదు అని అర్థము. కాబట్టి ఇంద్రియములు అదుపులో ఉండాలి, వాసనలు పోవాలి, బుద్ధి స్థిరంగా ఉండాలి, మనస్సు ఆత్మయందు లగ్నం

కావాలి. అప్పుడే వాడు స్థితప్రజ్ఞుడు అవుతాడు. ఇంద్రియ నిగ్రహము నిరంతర సాధన, శాస్త్రజ్ఞానము, సత్సంగము వీటితో వస్తుంది. ఇవి సాధిస్తే బుద్ధి స్థిరంగా ఉంటుంది. మనస్సు ఆత్మలో లీనం అవుతుంది. అప్పుడే పరమానందం కలుగుతుంది. కాబట్టి అన్నింటికంటే ఇంద్రియ నిగ్రహము ముఖ్యము అని చెబుతున్నాడు పరమాత్మ. ఎందుకంటే, ఈ ఇంద్రియములు బాగా శాస్త్రజ్ఞానము, బుద్ధికల వాడిని కూడా పడగొడతాయి. ఇంద్రియములు రథానికి కట్టిన గుర్రాల వంటివి. గుర్రాలు తమ దారిన తాము రథాన్ని లాక్కుపోతుంటే, రథం గోతుల్లో ప్రయాణం చేస్తుంది. ప్రమాదానికి గురి అవుతుంది. అలాగే ఇంద్రియాలు బుద్ధి చెప్పినట్టు వినకుండా తమ దారిన తాము పోతుంటే, వాడు ఎన్నటికీ పరమాత్మను తెలుసుకోలేడు. ఇంద్రియములను వశంలో ఉంచుకుంటే వాడి ప్రజ్ఞ స్థిరంగా ఉంటుంది. కాబట్టి సాధకుడు ఇంద్రియములను తన వశంలో ఉంచుకోవాలి. అవి తాను చెప్పినట్టు నడుచుకునేలా చేయాలి.

ఇది సాధించడానికి ఏమి చెయ్యాలి. ధ్యానం చేయాలి. ముందు మనస్సు పరమాత్మ యందు ఉంచాలి. పరమాత్మ గురించి ఆలోచించాలి. ముందు సగుణారాధనతో మొదలుపెట్టి. ఏదో ఒక రూపంలో ఉన్న విగ్రహమును పూజించి, ఆ తరువాత ఆ విగ్రహమును కూడా వదిలిపెట్టి నిర్గుణ ఆరాధన చెయ్యాలి. దానిని ధ్యానం అంటారు. ధ్యానంలో కూర్చున్నప్పుడు మనసును పరమాత్మయందు లగ్నం చేయాలి. అప్పుడు మోక్షప్రాప్తి కలుగుతుంది అని బోధించాడు పరమాత్మ.

### 62. ధ్యాయతో విషయాన్ పుంస: సంగస్తేషూపజాయతే।
### సఙ్గాత్సంజాయతే కామ: కామాత్క్రోధో2భిజాయతే॥
### 63. క్రోధాద్భవతి సమ్మోహ: సమ్మోహాత్స్మృతి విభ్రమ:।
### స్మృతిభ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి॥.

ఎప్పుడూ ప్రాపంచికవిషయములలో తిరుగుతూ, విషయవాంఛల గురించి ఆలోచించే వాడికి ఆ విషయముల యందు సహజంగానే సంగము, ఆసక్తి కలుగుతుంది. ఆ ఆసక్తి కోరికలుగా మారుతుంది. కోరికలుతీరితే ఆనందం కలుగుతుంది. కోరికలు తీరకపోతే విపరీతమైన దు:ఖం కలుగుతుంది. ఆ దు:ఖంలోనుండి కోపం వస్తుంది. ఆ కోపం ఎక్కువయితే ఒక విధమైన మోహంలో పడిపోతాము. ఆ మోహం ఎక్కువయితే మనం ఏంచేస్తున్నామో మనకే తెలియదు. కోపంతో ఊగిపోతుంటాము. అప్పుడు బుద్ధి పనిచేయదు. మంచి చెడు విచక్షణ కోల్పోతాము. చేయకూడని పనులు చేస్తాము. దాని వలన సర్వనాశనం జరుగుతుంది.

ప్రాపంచిక విషయములతో అటాచ్‌మెంట్ తో మొదలయినది చివరకు మనిషి పతనానికి దారితీస్తుంది. మొట్ట మొదట అంతా బాగానే ఉన్నట్టు అనిపిస్తుంది. లోపలకు చేరిన తరువాత దాని పని అది చేస్తుంది. ఒక వస్తువును చూచిఊరుకుంటే ఇబ్బంది లేదు. దానితో సంగం అంటే అటాచ్ మెంట్ పెట్టుకోవడం వలననే అసలు కథ మొదలవుతుంది. ఆ అటాచ్ మెంట్ కోరికగా మారుతుంది. ఇంట్లోకి పాము దూరితే ఎంత హడావిడి చేస్తుందో ఈ సంగం కూడా మనసులో చేరితే అంత హడావిడి చేస్తుంది. మనసును నిలువనీయదు. అల్లకల్లోలం చేస్తుంది. పామును బయటకు తరమడం కానీ, చంపడం కానీ చేస్తాము. అలాగే కోరికగా ఉన్నప్పుడే దానిని నిర్మూలించడం ఉత్తమం. ఎందుకంటే కోరిక పుట్టగానే అది తీరాలనే తపన మొదలవుతుంది. కోరిక తీరకపోతే కోపం వస్తుంది. కోపంలో ఏంచేస్తామో ఏం మాట్లాడతామో తెలియదు. విచక్షణ నశిస్తుంది. బుద్ధి పనిచేయడం మానేస్తుంది. ఒళ్లు తెలియదు. కోపంతో ఊగిపోతుంటాడు. యుక్తాయుక్తజ్ఞానము నశిస్తుంది. ఎదుటగా ఎవరున్నారు ఎవరితో మాట్లాడుతున్నాము అనే విషయం మరిచిపోతాడు. ఒక విధమైన మోహం ఆవహిస్తుంది. బుద్ధి మందగిస్తుంది. బుద్ధి పనిచేయడం మానేస్తుంది. అతడి పతనం మొదలవుతుంది. దీని కంతా కారణం ప్రాపంచిక వస్తువులతో సంగం. ఆ సంగం వలన పుట్టిన కోరిక.

ఈ శ్లోకంలో ఒక తమాషా అయిన పదం వాడారు. ధ్యాయాతో విషయాన్ అంటే మానవుడు విషయముల గురించి ధ్యానంచేస్తుంటాడు. సాధారణంగా పరమాత్మను గురించి చేసేది ధ్యానం. కాని మానవుడు పరమాత్మను మరిచిపోయి ప్రాపంచిక విషయముల గురించి, విషయ వాంఛల గురించి ధ్యానం చేస్తుంటాడు. కాబట్టి మనం ప్రాపంచిక విషయాలను ధ్యానం చేయడం మాని, పరమాత్మను గురించి ధ్యానం చేయడం మొదలు పెడితే అన్ని చక్కపడతాయి. కోపము మొదలగు విపరీత పరిణామాలు సంభవించవు.

సాధారణంగా మానవుడు ఎల్లప్పుడూ ప్రాపంచిక విషయాల గురించి ధ్యానం చేస్తుంటాడు కాని శాస్త్రవిషయములు వినడానికి విముఖత చూపిస్తుంటాడు. కారణం అతడికి దాని మీద ఆసక్తి లేకపోవడమే. శాస్త్ర విషయములు వింటూ ఉంటే ప్రజ్ఞ వస్తుంది. ఆ ప్రజ్ఞను స్థిరంగా ఆచరణలో పెడితో దానిని స్థిత ప్రజ్ఞ అంటారు. ఏదో విన్నాంలే అన్ని చేస్తామా ఏమన్నానా అంటూ దానిని అక్కడే వదిలేస్తే అది గత ప్రజ్ఞ అవుతుంది. ఇప్పుడు విన్న దానిని ఆచరణలో పెట్టకపోతే ఏమవుతుందో భగవానుడు చెబుతున్నాడు.

మనసులో ఒక థాట్ వస్తుంది. దానిని మనం అలానే ఉంచం. అలా అలా పెంచుతాము. దాని గురించి విపరీతంగా ఆలోచిస్తాము. మథిస్తాము. దానిని ఇది వరకు వచ్చిన ఆలోచనలతో ముడిపెడతాము. మనం భగవంతుడిని గురించి క్షణం కూడా ఆలోచించము కానీ

మనలో చెలరేగే భావాల గురించి తదేకంగా ధ్యానం చేస్తుంటాము. భగవంతుడి గురించిచేసే ధ్యానం మంచి ఫలితాలను ఇస్తే, విషయ వాంఛల గురించి చేసే ధ్యానం దుష్ఫలితాలను ఇస్తుంది. మనకు భగవంతుని మీద ధ్యానం కుదరడం లేదంటే దాని అర్థం మనకు విషయ వాంఛల మీద ఉన్న ఆసక్తి ఈశ్వరుడిమీద లేదు.

ఆ ప్రకారంగా విషయ వాంఛల గురించి, ప్రాపంచిక విషయముల గురించి ఎక్కువగా ఆలోచించే వాడికి, వాటి మీద అటాచ్ మెంట్ అంటే సంగమము అంటే ఆసక్తి పెరుగుతుంది. మనం ఏ విషయం మీద నైనా ఎక్కువగా ఆలోచిస్తే ఆ విషయం మీద ఆసక్తి, సంగమం పెరుగుతుంది. దానికి అతుక్కుపోతారు. అదేలోకంగా ఉంటారు. దీనికి ముఖ్య ఉదాహరణ ప్రకటనలు. చూడంగా చూడంగా వినంగా వినంగా దానికి అతుక్కుపోయి అది కొంటే కానీ నిద్రపట్టని స్థితికి చేరుకుంటారు. ఈ ప్రకారంగా ఒక విషయాన్ని గురించి ఆలోచించి ఆలోచించి, దాని మీద ఆసక్తి పెంచుకొని, తుదకు ఆ వస్తువు నాకు ఎంతో ఆనందాన్ని ఇస్తుంది, అది లేకపోతే నేను సుఖంగా ఉండలేను, ఎలాగైనా ఆ వస్తువు నాకు కావాలి అనే నిశ్చయానికి వస్తారు. దానినే కోరిక అంటారు.

ఆ కోరిక ఎలాంటిదంటే ఆ వస్తువు మీ దగ్గర ఉన్నట్టే ఊహించుకుంటారు. అది మన ఇంట్లోనే ఉన్నట్టు దాని వలన ఎంతో ఆనందం పొందుతున్నట్టు ఊహల్లో తేలిపోతారు. ఎలాగైనా ఏం చేసైనా సరే ఆ వస్తువు నాకు కావాలి నా కోరిక తీరాలి అనే స్థితికి చేరుకుంటారు. బాగా ఉన్నవాళ్ల పిల్లలు కూడా చిన్న చిన్న దొంగతనాలు చేస్తుంటారు. బైకులు దొంగిలిస్తుంటారు. కొంతమంది తమ గరల్ ఫ్రెండును పబ్ కు తీసుకువెళ్లడానికి దొంగతనాలు చెయ్యడానికి కూడా వెను కాడరు. ఇది మనం వింటూనే ఉంటాము. ఇది ఒక విపరీత స్థితి. ఈ స్తితికి చేరుకున్న తరువాత ఆ కోరిక అలా అలా పెరిగిపోతూ ఉంటుంది. ఆ కోరిక తీరకపోతే నేను సుఖంగా ఉండలేను, బతకలేను అనే స్తితికి చేరుకుంటారు.

అనుకున్నవి అనుకున్నట్టు జరిగితే చెప్పేదేముంది. అంతా మంచే జరుగుతుంది. కాని కోరికలు అన్నీ తీరవు కదా. తీరని కోరికలే ఎక్కువ. ఆ ప్రకారంగా విపరీతంగా ఊహించుకున్న కోరికలు తీరక పోతే విపరీతమైన కోపం వస్తుంది. ఒక వేళ ఆ కోరిక తీరిందనుకుందాము. దాని వెంట మరొక కోరిక పుట్టుకొస్తుంది. ఎందుకంటే దొరికినదానితో తృప్తి చెందడం మానవ లక్షణం కాదు. ఉన్నదానిని పక్కన బెట్టి లేనిదాని కోసం పాకులాడటం మనకు పుట్టుకతో వచ్చిన గుణం. కాబట్టి కోరికలు ఒకదాని వెంట ఒకటి వస్తూనే ఉంటాయి. అవి తీరకపోతే కోపం రావడం సహజం. ఆ కోపం మనమీద కాదు. ఎవరిమీదనో కోపం. వాడి వల్ల నాకు ఇలా జరిగింది. వీడి వల్ల నాకు ఇలా జరిగింది. అని వాడి మీదా వీడిమీద కోపం వస్తుంది. కొంతమందికి అకారణ కోపం. దానికి

ఒక కారణం ఉండదు. చిరుబురులాడుతుంటాడు. అసహనంగా ఉంటాడు పలకరిస్తే కస్సుమంటాడు. చేతిలో ఏది ఉంటే అది విసిరికోడతాడు. కోపం అంటూ వేరే ఏమీ లేదు. అనుకున్న కోరిక తీరకపోతే, అనుకున్నది జరగకపోతే, తాను అనుకున్నట్లు కాకుండా వ్యతిరేకంగా జరిగితే, తనకు నచ్చని వాడిని చూస్తే, కలిగే స్థితి కోపము. ఒక ప్రవాహం పోతూ ఉంటుంది. అది ప్రశాంతంగా ఉంటుంది. దానికి ఏదైనా అడ్డుతగిలితే ఎగిసిపడుతుంది. అలాగే అనుకున్నది నెరవేరకపోతే, మనకు నచ్చనిది జరిగితే, కోపం వస్తుంది.

క్రోధం వచ్చిన తరువాత జరిగే పరిణామము...మానవుడు తాత్కాలికంగా వివేచనా శక్తి కోల్పోతాడు. విచక్షణ ఉండదు. మంచి చెడు గుర్తించడు. ఎవరిని తిడుతున్నాడో ఏం తిడుతున్నాడో చూడడు. నోటికి ఎంతవస్తే అంత అనేస్తాడు. దానినే మోహము అంటారు. అంటే ఆ కోపానికి వశుడు అవుతాడు. ఆవేశానికి లోను అవుతాడు. పిచ్చి పట్టినట్లు ప్రవర్తిస్తాడు. శంకరుల వారు కోపం వచ్చినవాడి గురించి చెబుతూ అటువంటి వాడు గురువునుకూడా ఆక్షేపిస్తాడు నీకేం తెలుసు అంటాడు. తల్లిని కూడా కొట్టడానికి పోతాడు.

ఇటువంటి స్తితికి చేరుకున్నప్పుడు మానవుడికి బాహ్య స్మృతి ఉండదు. ఒకవిధమైన ట్రాన్స్‌లో ఉంటాడు ఊగి పోతుంటాడు. అంటే మంచి చెడు తెలుసుకొనే స్మృతి అంటే జ్ఞాపక శక్తి పోతుంది. తాను ఎవరితో మాట్లాడుతున్నాడో మరిచిపోతాడు. నువ్వెంత అంటే నువ్వెంత అని అంటాడు. వాడు నా యజమాని వాడు నా తండ్రి, నా అన్న నా బంధువు, నా భార్య అనే స్పృహ (జ్ఞాపకం) కూడా ఉండదు. ఎవరినీ లెక్కచేయడు. ఆ స్థితి నుండి మానవుడు ఇంకా దిగజారి తన బుద్ధిని కోల్పోతాడు. ఏది చేయాలి ఏది చేయకూడదు అని నిర్ణయించేది బుద్ధి. ఆ బుద్ధి కూడా పని చేయదు. పక్కకు తొలిగి ఉంటుంది. ఎందుకంటే చెప్పినా వినే స్థితిలో లేడు.

బుద్ధి ఎప్పుడైతే పనిచేయడం మానేసిందో వాడి పతనం ప్రారంభం అవుతుంది. అప్పుడు మానసిక పతనం శారీరక పతనం కింద మారుతుంది. కొట్టడం తిట్టడం, చంపడం నరకడం లాంటివి చోటుచేసుకుంటాయి. దానితో పోలీసుస్టేషన్లు జైళ్లు పరువుబోవడం, అంటే మానవుని పతనం మొదలవుతుంది. ఇదీ సంగంతో మొదలయి తుదకు సర్వనాశన స్థితికి చేరుకున్న మానవుని పతనావస్థ.

ఈ పతనావస్థను తప్పించుకోవాలంటే ఏం చెయ్యాలి అనేవిషయం తరువాత రెండు శ్లోకాలలోచెబుతున్నాడు భగవానుడు.

64. రాగద్వేషవియుక్తైస్తు విషయానిన్ద్రియైశ్చరన్।
ఆత్మవశ్యైర్విధేయాత్మా ప్రసాదమధిగచ్ఛతి॥
65. ప్రసాదే సర్వదు:ఖానాం హానిరస్యోపజాయతే।
ప్రసన్నచేతసో హ్యాశు బుద్ధి: పర్యవతిష్ఠతి॥

రాగద్వేషములు లేకుండా తన స్వాధీనంలో మనస్సు, ఇంద్రియములు ఉన్న మానవుడు, బయట ప్రపంచంలో తిరుగుతున్నా, బయట ప్రపంచంలో ఉన్న సుఖములు అనుభవిస్తున్నా, తానుమాత్రం పరమ శాంతంగా ఉంటాడు. అటువంటి శాంతిని పొందిన మానవుడికి దు:ఖములు అంటూ ఏమీ ఉండవు. అతడి చిత్తము ప్రశాంతంగా ఉంటుంది. అతడి బుద్ధి ఎల్లప్పుడూ పరమాత్మయందే లగ్నం అయి ఉంటుంది.

మనస్సులో రాగద్వేషములు లేని వాడు, ఇంద్రియ నిగ్రహము, మనోనిగ్రహము కలవాడు, పరమ శాంతిని పొందుతాడు. అతడి మనస్సుఎల్లప్పుడూ నిర్మలంగా ఉంటుంది. అటువంటి వాడు బయట ప్రపంచంలో తిరుగుతున్నా అతడి మనసు ఎటువంటి వికారములకు లోనుకాదు. విషయ వాంఛలలో లగ్నం కాదు. దేనితోనూ ఎటువంటి సంగమము పెట్టుకోదు. అతడి శరీరం అనే రథం ఎటువంటి ఒడుదుడుకులు లేకుండా నడుస్తుంది. దీనికంతా మూలకారణం అతని మనసు, ఇంద్రియములు, రాగద్వేషములను వదిలిపెట్టి అతని స్వాధీనంలో ఉండడమే.
కాని ప్రపంచంలో ఎక్కువ మంది ఇంద్రియములకు, మనసుకు దాసులై, తమ ఇష్టంవచ్చినట్టు ప్రవర్తిస్తుంటారు. ఇంద్రియములను మనసును స్వాధీనంలో ఉంచుకుంటే కలిగే ఫలితం దు:ఖరాహిత్యము. పరమ శాంతి. పరమానందప్రాప్తి. సర్వదు:ఖానాం అని అన్నారు. అంటే ఏదో ఒక దు:ఖం కాకుండా సకల దు:ఖాలు నశించిపోతాయి. ఎప్పుడైతే సకల దు:ఖాలునశిస్తాయో, అప్పుడు అతడి బుద్ధి స్థిరంగా ఉంటుంది. అతని మనసు ఆత్మయందు లీనం అవుతుంది. అపుడు కలిగేదే పరమానందము, బ్రహ్మానందము. శాశ్వత సుఖము. పరమశాంతి. ఇప్పుడు ఈ విషయాలను కాస్త లోతుగా పరిశీలిద్దాము.

కిందటి శ్లోకములలో చెప్పబడిన పతనావస్థకు కారణం ఏమిటి? మొట్ట మొదట చూడండి. ప్రాపంచిక విషయముల గురించి విషయ వాంఛల గురించి ఆలోచించడం. ఈ స్థితి నుండి పతనావస్థకు అంచెలంచలుగా చేరుకున్నాడు మానవుడు. కాని మొట్ట మొదట అంటే ప్రాపంచిక విషయముల గురించి ఆలోచించేటప్పుడే చిన్న జాగ్రత్త తీసుకొని ఉంటే ఈ పతనావస్త దాపురించదు అని భగవానుడు అంటున్నాడు. అదేమిటంటే ప్రాపంచిక విషయములు, కామ వాంఛలు, విషయ వాంఛలు, మానవులను ప్రలోభ పెడతాయి. అది సహజం. ఆ ప్రలోభాలు వచ్చినపుడు మానవుడు బుద్ధిని ఉపయోగించి ఆలోచించాలి. ఇది నాకు ఇష్టం అది నాకు ఇష్టం లేదు. ఇది

నాకు చాలా ఇష్టం అనే ఆలోచనలను అదుపులో పెట్టుకోవాలి. ఈ వస్తువు మనకు ఉపయోగపడుతుందా లేదా అన్న విషయం బుద్ధితో ఆలోచించాలి. దానికి మనసును మన స్వాధీనంలో ఉంచుకోవాలి. అప్పుడు బయట ఉన్న ప్రాపంచిక విషయములు మనలను ఎంత ప్రలోభ పెట్టినా దానికి వశులము కాము. చిరునవ్వుతో చూస్తూ ఉంటాము కానీ మనశ్శాంతిని కోల్పోము. అది కావాలి ఇది వద్దు అనే ద్వంద్వాలకు అతీతంగా ఉంటాము.

రాగము అంటే ఇది నాకు సంతోషాన్ని ఇస్తుంది అనే భావన. ఇది నాకు చాలా ఇష్టం అనే భావన. ద్వేషము అంటే ఇది నాకు ఇష్టంలేదు. దీని వలన నాకు ఎటువంటి సంతోషము కలుగదు. పైగా దు:ఖం వస్తుంది. కాబట్టి ఇదంటే నాకు ద్వేషము అనే భావన ఈ రెండూచెడ్డవే. ఇవి దూరంగా పెడితే మనశ్శాంతి దానంతట అదే కలుగుతుంది. ఎవరైతే రాగద్వేషములకు లోనుకాకుండా, మనసును బుద్ధిని అదుపులో పెట్టుకొని ఉంటాడో, అటువంటి వాడు ప్రాపంచిక విషయములలో మునిగితేలుతున్నా, వాటికి అంటకుండా, వాటితో ఎటువంటి సంగము లేకుండా, ప్రశాంతంగా ఉంటాడు. తామరాకు మీద నీటి బొట్టు వలె అటు ఇటు తిరుగుతుంటాడు కానీ దేనికీ అంటుకోడు. అటువంటి వాడి ఇంద్రియములు, మనస్సు అతనిస్వాధీనంలో ఉంటాయి. అతడు చెప్పినట్టు నడుచుకుంటాయి. స్వామీజి అంటే అర్థం ఇదే. ఎవరైతే తన మనస్సును ఇంద్రియములను తన వశంలో ఉంచుకుంటాడో, వాటికి తానేయజమాని అంటే స్వామి అవుతాడో ఆయనే స్వామీజి. అంతే కానీ సిల్కు కాషాయాలు కట్టుకొని విలాసవంతమైన ఆశ్రమాలలో ఉండేవాళ్లు కాదు.

ఇంక రెండవ శ్లోకంలో ఈ ప్రసన్నత, మనశ్శాంతి ఎలా ఉంటుంది అంటే సకల దు:ఖములను నాశనం చేస్తుంది. మనలో అడ్డదిడ్డంగా చెలరేగే ఆలోచనలు మన ప్రశాంతతను నాశనం చేస్తే. ఈ ప్రసన్నత మనలో ఉన్న దు:ఖాలను నాశనం చేస్తుంది. దు:ఖాలు నశిస్తే కలిగే స్థితి నిశ్చలానంద స్థితి. బ్రహ్మానందస్థితి. మనకు ఎక్కడ చూచినా ఆనందం తాండవిస్తుంది. అటువంటి వాడు శ్మశానంలో ఉన్నా ఆనందంగా ఉంటాడు. ఎటువంటి విపత్కరపరిస్థితులలో కూడా సంయమనము కోల్పోడు. ఇది బయట జరిగే పరిణామము. ఈ ప్రసన్నత, ప్రశాంతత ఉంటే బుద్ధి స్థిరంగా ఉంటుంది. మనస్సు ఖచ్చితమైన మార్గంలో ప్రయాణం చేస్తుంది. మంచి నిర్ణయాలు తీసుకుంటుంది. భగవంతుని మీద ఏకాగ్రబుద్ధి ఉంటుంది. ప్రాపంచిక విషయముల యందు పరుగెట్టదు. ఏది మంచి ఏది చెడు తెలుసుకుంటుంది. అప్పుడు వాడు కర్మయోగి అవుతాడు. అతని మనస్సు పరమాత్మయందు స్థిరంగా లగ్నం అవుతుంది.

## 66. నాస్తి బుద్ధిరయుక్తస్య న చాయుక్తస్య భావనా।
## న చాభావయత: శాన్తిరశాన్తస్య కుత: సుఖమ్॥

ఇంద్రియములు, మనస్సు వశంలో లేని వాడికి బుద్ధికూడా నిశ్చయంగా ఉండదు. అటువంటి వాడి మనసులో పరమాత్మ గురించి ఎటువంటి ఆలోచనా కలుగదు. ఎప్పుడూ ప్రాపంచిక విషయముల గురించి ఆలోచిస్తుంటాడు. అటువంటి వాడికి మానసిక శాంతి కరువవుతుంది. అటువంటి వాడికి సుఖం, శాంతి ఎలా లభిస్తుంది?

ప్రతి వాడూ నేను సుఖంగా, ప్రశంతంగా ఉండాలి, ఆనందంగా ఉండాలి అని కోరుకుంటాడు. కానీ ఆ సుఖం ఆనందం ఎక్కడ ఉందో ఎలా లభిస్తుందో వాడికి తెలియదు. వాడు బయట ప్రపంచంలో లభించే సుఖం, ఆనందం అని అనుకుంటున్నది నిజంగా సుఖం, ఆనందం కాదు అన్న విషయం వాడికి తెలియదు. సంసారమే సుఖదు:ఖాల సమ్మేళనము. సుఖదు:ఖాలు ఒకదాని వెంట ఒకటి వస్తూపోతూ ఉంటాయి. మనసును ప్రాపంచిక విషయముల నుండి మరలించి ఆత్మయందు ఉంచితే అదే శాశ్వతసుఖము. దాని కోసం ఎవరూ ప్రయత్నించరు. తాత్కాలిక సుఖాల కోసం పాకులాడుతుంటారు. ఎల్లప్పుడూ ప్రాపంచిక విషయాల గురించి విషయ వాంఛల గురించి ఆలోచిస్తూ, పరమాత్మ గురించి ఆలోచించని వాడికి శాశ్వతమైనసుఖము, ఆనందము, శాంతి ఎలా లభిస్తాయి అని పరమాత్మ ప్రశ్నిస్తున్నాడు.

చాలా మంది ఊరికే టెన్షన్ పడిపోతూ ఉంటారు. కారణం ఉండదు. ధరలుపెరగక ముందే పెరుగుతాయేమో అని టెన్షన్. పెరిగిన తరువాత మరొక టెన్షన్. పదిమంది గుమిగూడి ఉంటే వాళ్లలో వాళ్లు కొట్టుకుంటారేమో, మత కలహాల లాంటివి జరుగుతాయేమో అని టెన్షన్. వాళ్లకు ఎక్కడో అలాంటిది జరిగి ఉంటుంది. దాని జ్ఞాపకాలతో సతమతమౌతుంటారు. కొంత మంది అవసరమైన విషయాలను వదిలిపెట్టి అనవసరమైన విషయాల గురించి ఆలోచిస్తుంటారు. దేవాలయానికి పరమాత్మను దర్శించడానికి, ధ్యానం చేయడానికి వెళతాము. కాని అక్కడ మూలవిరాట్టుకు, ఉత్సవిగ్రహాలకు చేసిన అలంకారాలు, వితరణ చేసే ప్రసాదాలు, దేవాలయానికి అమర్చిన రంగురంగుల దీపాలు వీటి మీదనే దృష్టి పెడతాము తప్ప పరమాత్మ గురించి తలచుకోము. ఒకొక్కక్కడు దేవాలయంలో తనకు తగిన గౌరవం, ప్రాధాన్యత ఇవ్వలేదని, తనపూజ ముందు జరగలేదనీ, తనకు హారతి ముందు ఇవ్వలేదనీ, అందరి మీదా కోపపడతాడు. ఇటువంటి వాడి మనసు ప్రతి చిన్న విషయానికి కూడా చలిస్తూఉంటుంది. బుద్ధినిశ్చలంగా ఉండదు. కాబట్టి ఇంద్రియ నిగ్రహము, మనో నిగ్రహము చాలా ముఖ్యము. ఇంద్రియములను, మనసును మన స్వాధీనంలో ఉంచుకోవాలి. మనం చెప్పినట్టు నడిచేటట్టు చేసుకోవాలి. అటువంటి వాడిని యుక్త పురుషుడు అని అంటారు. ఇంద్రియ నిగ్రహము, మనో నిగ్రహము లేని వాడు అయుక్త పురుషుడు. అయుక్త

పురుషుడికి బుద్ధి నిశ్చయంగా ఉండదు. ప్రజ్ఞలభించదు. పరమాత్మను గురించిన ఆలోచనలు వాడికి రావు. అటువంటి వాడికి పరమాత్మ భావనే ఉండదు. పరమాత్మ భావన లేనివాడికి శాంతి లభించదు. ఎల్లప్పుడూ అశాంతితో బాధపడుతుంటాడు. నిరంతరం అశాంతితో ఉన్న వాడికి సుఖం ఎలా లభిస్తుంది? అని ప్రశ్నిస్తున్నాడు పరమాత్మ. కాబట్టి అశాంతి పోవాలంటే, సుఖం కావాలంటే ఇంద్రియ నిగ్రహము, మనో నిగ్రహము (శమ,దమములు) ముఖ్యము. ("శాంతము లేక సౌఖ్యము లేదు" అనే త్యాగరాజుల వారి కీర్తన కూడా ఈ విషయాన్నే ప్రతిపాదిస్తుంది అన్న విషయం ఒక సారి గుర్తుచేసుకుందాము).

67. ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽను విధీయతే।
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివామ్భసి॥
68. తస్మాద్యస్య మహాబాహో! నిగృహీతాని సర్వశః।
ఇంద్రియాణీన్ద్రియార్థేభ్యస్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా॥

ఓ అర్జునా! ఎల్లప్పుడూ ప్రాపంచిక విషయములలో, విషయవాంఛలలో మునిగి తేలేవాడి మనస్సు ప్రచండమైన గాలిలో నీటిపై తేలుతున్న నావ మాదిరి అటు ఇటు ఊగుతుంటుంది. నిగ్రహము లేని ఇంద్రియములు మానవుని బుద్ధిని అంటే విచక్షణా శక్తిని హరించివేస్తాయి. అలా కాకుండా ఇంద్రియములను, మనసును అదుపులో ఉంచుకున్న వాడి బుద్ధి, జ్ఞానము, నిశ్చయంగా, స్థిరంగా ఉంటుంది.

సాధకుడు అయిన వాడు తన ఇంద్రియములను మనస్సును ప్రాపంచిక విషయములు, విషయ వాంఛల వైపుకు పోకుండా జాగ్రత్త పడాలి. అలా కాకుండా ఇంద్రియములు, మనసు ఎటు బడితే అటు పోతుంటే, అంతులేని దు:ఖము కలుగుతుంది. ఇంకా ఎక్కువగా సంసారము అనే బావిలో కూరుకుపోతాడు. అది ఎలా అంటే సముద్రములో ఒక నావ ఉంది. దాని ఇష్టం వచ్చినట్టు దానిని పోనిస్తే, గాలి ఎటు వీస్తే అటు కొట్టుకుపోతుంది. అలా కాకుండా నావను చుక్కానితో నడిపితే సక్రమ మార్గంలో నడుస్తుంది. సరి అయిన గమ్యం చేరుకుంటుంది. అలాగే మన మనసు బుద్ధి నిశ్చలంగా ఉండాలంటే ఇంద్రియములను మనసును అదుపులో ఉంచుకోవడమే. దానికి కావాల్సింది వివేకము, జ్ఞానము. చాలా మంది తమకు వివేకము, జ్ఞానము ఉందనుకుంటారు. కాని వారి మనసు, ఇంద్రియములు అప్పుడప్పుడు వారి స్వాధీనములో ఉండకుండా విషయవాంఛలవైపు పరుగెడుతుంటాయి. దీనికి విశ్వామిత్రుడు ఒక మంచి ఉదాహరణ. కాబట్టి వివేకము, జ్ఞానముతో పాటు వైరాగ్యము కూడా అలవరచుకోవాలి. ఎల్లప్పుడు

మనసు ఇంద్రియములను, విషయములలో దూరకుండా చాలా జాగ్రత్తగా ఉండాలి. అటువంటి వాడి జ్ఞానము స్థిరంగా ఉంటుంది. వాడి బుద్ధి ఆత్మయందు నిశ్చలంగా ఉంటుంది. మానవులు సాధారణంగా "మాకు దు:ఖములు పోవాలి, సంసార బంధనములు తొలగాలి. మోక్షము రావాలి" అని దేవుడిని కోరుకుంటూ ఉంటారు. ఇది ఎవరికి వారు చేసుకోవాలి కానీ దేవుడేం చేస్తాడు. మానవుని బుద్ధి స్థిరంగా ఉంటే దు:ఖాలు రావు. అన్నీ సుఖాలే. సంసార బంధనములు ఉండవు. మోక్షము దానంతట అదే వస్తుంది. అని పరమాత్మ బోధించాడు.

సాధారణంగా మనస్సు ఏం చెబితే ఆ మాట ఇంద్రియాలు వినాలి. కాని కొంత మందికి ఇంద్రియాలు మనసును శాసిస్తుంటాయి. ఇంద్రియాలు ఎటుబోతే మనసును కూడా తమవైపు లాక్కుపోతుంటాయి. అటువంటి వాడి మనస్సు ఎలా ఉంటుంది అంటే ఒక పడవ నీటిలో తేలుతూ ఉంది. పెద్దగా గాలి వీచింది ఆ పడవ అటు ఇటుఊగుతుంటుంది. ఎటో దిక్కుగా వెళుతుంది. తుదకు మునిగి పోతుంది. నిశ్చలంగా ఉండదు. ఇంద్రియములు ఎటు పోతుందో మనసు అటే పోతుంది. ఇంద్రియములు మనసుకు ఉన్న శక్తిని కూడా హరిస్తాయి. అప్పుడు బుద్ధి కూడా పని చేయదు. విచక్షణా శక్తి సన్నగిల్లుతుంది. చేయకూడనిపనులు చేసి కష్టాలలో పడతాడు. కాబట్టి మనసును ఇంద్రియములను అదుపులో పెట్టుకోవాలి. అలా అదుపులో పెట్టుకోలేని వాడి బుద్ధి పనిచేయదు. అలా కాకుండా, ఇంద్రియములను ప్రాపంచిక విషయముల నుండి వెనక్కులాగి తన అధీనంలో ఉంచుకుంటే, మనసును అటు ఇటుపోకుండా నిగ్రహిస్తే, అతని బుద్ధి స్థిరంగా ఉంటుంది.

కాబట్టి ఓ అర్జునా! నీ ఇంద్రియములు కూడా నీ స్వాధీనంలో ఉన్నట్టు కనపడటం లేదు. చేతులు వణుకుతున్నాయి. చెమటలుపడుతున్నాయి. గొంతు ఎండిపోతోంది. గాండీవం కిందపడిపోతోంది. అని అన్నావు కదా! నీ ఇంద్రియములు చేసే పనులకు నీవు లొంగి పోయి యుద్ధం చేయను అని అనవద్దు. నీ ఇంద్రియములను నీ స్వాధీనంలో ఉంచుకో. ఇంద్రియములు చెప్పినట్టు చేస్తే అపకీర్తి పాలవుతావు. కాబట్టి నీ మనసును, బుద్ధిని నిశ్చయం చేసుకో. ప్రజ్ఞతో, వివేకంతో ఆలోచించు. యుద్ధం చేయడానికి సిద్ధంకా! అని కృష్ణుడు అర్జునుడికి బోధించాడు.

## 69. యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ।
## యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునే:॥

అందరూ నిద్రపోతున్న సమయంలో, ద్వంద్వాలను సమానంగా చూచేవాడు అయిన సంయమీంద్రుడు అంటే స్థితప్రజ్ఞుడు, మేల్కొని ఉంటాడు. అలాగే అందరూ మేలుకొని ఉన్న సమయంలో ముని అయిన వాడు నిద్రపోతాడు.

ఇక్కడి నుండి పరమాత్మ మరొక విషయం గురించి చెప్పడం మొదలు పెట్టాడు. అదే బ్రాహ్మీస్థితి. అలౌకిక స్థితి. సిద్ధపురుషుడి స్థితి. ఈ శ్లోకాలను చిక్కుముడి శ్లోకాలు అని అంటారు. ఓ పట్టాన అర్థం కావు. నిశితంగా పరిశీలిస్తే గానీ బోధపడవు. ఇందులో చెప్పింది ఏమిటంటే అజ్ఞానులకు ఏది రాత్రి అయితే అది జ్ఞానులకు పగలు. జ్ఞానులకు రాత్రి అజ్ఞానులకు పగలు. ఇది కూడా అర్థం చేసుకోవడం కొంచెం కష్టంగానే ఉంటుంది. వివరంగా చెప్పాలంటే, ఎల్లప్పుడూ ప్రాపంచిక విషయాలలో మునిగి తేలేవాడికి పరమాత్మగురించి గానీ, ఆత్మజ్ఞానము గురించి గానీ తెలియదు. దాని గురించి ఎప్పుడు కూడా ఆలోచించడు. ఎప్పుడూ ధనం సంపాదించడం, కోరికలుతీర్చుకోవడం, భార్య పిల్లలు బంధువులు, మిత్రులు, సంసారము, ఆస్తిపాస్తులు వీటి గురించే ఆలోచిస్తుంటాడు. ఆత్మతత్వము గురించి తెలుసుకోవాలనే కోరిక కూడా ఉండదు. ప్రయత్నం కూడా చేయడు. అటువంటి వారి దృష్టికి ఆత్మజ్ఞానము అనేది కనిపించదు. రాత్రి పూట మనకు వస్తువులు కనిపించనట్టే, సంసారంలో మునిగిన వాడికి ఆధ్యాత్మికత, ఆత్మజ్ఞానము కనిపించవు. ఆధ్యాత్మికత, ఆత్మజ్ఞానము పరంగా వారు చీకట్లో ఉన్నట్టే లెక్క. అంటే వారికి అది రాత్రి. ఆధ్యాత్మికత, ఆత్మజ్ఞానము విషయంలో వారు నిద్రపోతుంటారు.

కాని సంయమీంద్రులు, జ్ఞానులు, వివేకము కలవారు, వీరు మాత్రము ఆధ్యాత్మికత, ఆత్మజ్ఞానము గురించి నిరంతరము ఆలోచిస్తుంటారు. మెలుకువగా ఉంటారు. అంటే వారికి నివృత్తి మార్గం ఎల్లప్పుడూ వెలుగుతో నిండి ఉంటుంది. ఆధ్యాత్మికత పరంగా వారికి అది పగలు. ప్రాపంచిక విసయాలు, విషయసుఖాలు, వీటి విషయంలో వారికి ఆసక్తి ఉండదు. వాటి వంక చూడరు. అవి ఉన్నా వారికి లేనట్టే. అసలు వారి కంటికి విషయవాంఛలు కనపడవు. అంటే ప్రాపంచిక విషయాలు, విషయవాంఛల పరంగా వారు చీకటిలో అంటే రాత్రి లో ఉన్నట్టు లెక్క.

ఇదే ఈ శ్లోకంలో వివరించాడు పరమాత్మ. చిన్న ఉదాహరణ చెప్పుకోవాలంటే కొన్ని జంతువులు పగలు చూడలేవు. వాటికి రాత్రిళ్లు మాత్రమే కళ్లు కనపడతాయి. గుడ్లగూబ, పిల్లి మొదలైనవి. మానవులుకూడా కొంత మంది రాత్రిళ్లు పబ్బులలో, క్లబ్బులో తెల్లవార్లుమేలుకొని, పగలంతా నిద్రపోతారు. మరి కొందరు ధనసంపాదనలో మునిగితేలుతూ జీవితం అంతా రాత్రిళ్లు పనిచేస్తూ పగలు నిద్రపోతారు. అటువంటి వారు ధనసంపాదనకు, శరీరసుఖాలకు ప్రాధాన్యత ఇస్తారు. అటువంటి వారు ఆధ్యాత్మికత దృష్ట్యా రాత్రిలో అంటే చీకటిలో ఉన్నట్టే లేక్క.

పైన చెప్పినట్టు అజ్ఞాని గుడ్లగూబతో సమానము. అది రాత్రి మాత్రమే చూస్తుంది. అది సూర్యుని వెలుగు చూడలేదు. రాత్రేసర్వస్వం అనుకుంటుంది. ఇప్పుడు కూడా చాలామంది రాత్రి 2,3 గంటల దాకా పబ్బులు క్లబ్బులలో గడుపుతారు. తెల్లవారి 9 కూడా లేవరు. వారికిసూర్యోదయం ఎలా ఉంటుందో తెలియదు. పైగా ఎల్లప్పుడూ ఎసి. పగలుకూడా సూర్యరశ్మిని చూడలేరు. . అలాగే జ్ఞాని ఆత్మను, ఆత్మసుఖాన్ని చూడగలడు. అజ్ఞాని కేవలం ప్రాపంచిక సుఖములు

మాత్రమే చూడగలడు. జ్ఞానికి కనిపించేది అజ్ఞానికి కనిపించదు. అజ్ఞాని చూచేది అనుభవించేది జ్ఞానికి కనిపించదు. జ్ఞానికి ప్రాపంచిక విషయాల మీద ఆసక్తి ఉండదు. కాబట్టి జ్ఞాని, అజ్ఞాని, వేరు వేరు దారులలో ప్రయాణం చేస్తుంటారు. దానిని వర్ణించడానికి వ్యాసుల వారు అజ్ఞానికి పగలు జ్ఞానికి రాత్రి అనీ, జ్ఞానికి పగలు, అజ్ఞానికి రాత్రి అని నిర్వచించాడు.

సత్యం కనుక్కోడానికి జ్ఞాని మేలుకొని ఉంటాడు. ప్రాపంచిక విషయాలను అనుభవించడానికి అజ్ఞాని మేలుకొని ఉంటాడు. ప్రపంచం నిద్రపోయినపుడు అజ్ఞాని నిద్రపోతాడు. జ్ఞాని నిశ్చలంగా ఆత్మానందాన్ని అనుభవిస్తుంటాడు. ఇంకా విపులంగా చెప్పాలంటే సాదారణంగా మానవులు అజ్ఞానంలో ఉంటారు. అజ్ఞానము అంటే చీకటి. వెలుగు కనపడదు. అందుకే అజ్ఞానాంధకారము అని వాడుతుంటారు. ఆచీకట్లో వారు ఆత్మను చూడలేరు. ఆత్మ అంటే ఏమిటో తెలుసుకోవడానికి ప్రయత్నించరు. చీకటి జీవితం అంటే ప్రాపంచిక విషయములలోమునిగి తేలుతుంటారు. అదే వెలుగు అనుకుంటారు. అంటే ఆత్మ విద్య పరంగా వారు నిద్రపోతుంటారు. ప్రాపంచిక విషయముల గురించి మేలుకొని ఉంటారు.

చిన్నఉదాహరణ. టీచరుపాఠాలు చెబుతుంటే అంటే జ్ఞానబోధ చేస్తుంటే విద్యార్థులు తూలుతుంటారు. అదే సినిమా కథ చెబుతుంటే ఉత్సాహంగా వింటారు. జ్ఞానం వారికి చీకటి. ప్రాపంచిక విషయాలు వెలుగు. అదే జ్ఞానికి ఆత్మజ్ఞానం వెలుగు. ప్రాపంచిక విషయములు చీకటి. ప్రాపంచిక విషయములు వచ్చినపుడు జ్ఞాని నిద్రలోకి జారుకుంటాడు. మానవుడు మెలుకువగా వాటిని అనుభవిస్తుంటాడు. జ్ఞాని అజ్ఞాని పరస్పర విరుద్ధమైన పరిస్థితులతో ఉంటారు.

## 70. ఆపూర్యమాణమచలప్రతిష్ఠమ్ సముద్రమాప: ప్రవిశంతి యద్వత్।
## తద్వత్కామా యం ప్రవిశన్తి సర్వే సశాన్తి మాప్నోతి న కామకామీ॥

ప్రపంచంలో ఎక్కడో ఒక చోట ఎల్లప్పుడూ వర్షం కురుస్తూనే ఉంటుంది. భూమి మీద పడ్డ నీరు అంతా అన్ని దిక్కులనుండి వచ్చి నదులలోకి చేరుతుంటుంది. ఆ నదులన్నీ సముద్రంలో కలుస్తుంటాయి. ఇది నిరంతరం జరిగే ప్రక్రియ. కాని సముద్రం ఎప్పటికీ పొంగి పొరలిపోదు. నిశ్చలంగా ఉంటుంది. అలాగే స్థితప్రజ్ఞుడి చుట్టు ప్రాపంచికవిషయాలు, విషయభోగాలు ఎన్ని ఉన్నా, అవన్నీ అతడిని వివిధ ప్రలోభాలకు గురి చేస్తున్నా, అతడు మాత్రం సముద్రము మాదిరి నిశ్చలంగా ఉంటాడు. ఈ ప్రాపంచిక విషయాలు అతనిలో ఎటువంటి వికారములను కలిగించవు. అటువంటి స్థితప్రజ్ఞుడు పరమ శాంతిని పొందుతాడు. ఎల్లప్పుడూ ప్రాపంచిక విషయములలో తేలియాడేవాడు చిన్న నది వంటి వాడు. ఏ మాత్రం ఎక్కువ నీరు వచ్చి చేరినా ఆ నది

పొంగిపొరలుతుంది. గట్లు తెంచుకొని ప్రవహిస్తుంది. అలాగే సాధారణ మానవునిలో ఈ ప్రాపంచిక విషయాలు అలజడిని క్షోభను కలిగిస్తాయి. అతని శాంతిని హరించివేస్తాయి.

ఈ శ్లోకంలో శాంతిని ఎవరు పొందుతారు, ఎవరు పొందరు అనే విషయాన్ని చిన్న ఉదాహరణతో వివరించాడు పరమాత్మ. జ్ఞానిని సముద్రముతో పోల్చారు. ఎండాకాలంలో నదులలోనుండి జలం రాదు. పైగా సూర్యరశ్మికి సముద్రము నీరు ఆవిరయి పైకిపోతుంది. మేఘాల రూపంలో ఉంటుంది. వర్షాకాలంలో వర్షం రూపంలో భూమి మీద పడుతుంది. ఆ వర్షం నీరంతా నదులలోకి, నదులలోనుండి సముద్రములోకి వచ్చి చేరుతుంది. అటు ఎండా కాలంలో కానీ, ఇటు వానాకాలంలో కానీ, సముద్రము నిశ్చలంగా ఉంటుంది. పొంగదు, కుంగదు. అలాగే స్థితప్రజ్ఞుడు, జ్ఞాని అయిన వాడు ఇంద్రియములు, మనసు, బయట విషయములను నిరంతరము గ్రహిస్తున్నా, ఎటువంటి వికారములకు లోనుకాడు. అతనిలో విషయముల పట్ల ఆసక్తి ఉండదు. నిర్వికారంగా ఉంటాడు.

సముద్రంలో ఎప్పుడూ నీరు ఉంటుంది. సముద్రం ఎండి పోవడం అంటూ జరగదు. నదీనాం సాగరో గచ్ఛతి అని అంటారు. అంటే నది ఎక్కడ పుట్టినా సముద్రం వైపుకు ప్రవహించి తుదకు సముద్రంలో కలుస్తుంది. మనకు వర్షాకాలము నాలుగునెలలు. అవే కాకుండా అకాల వర్షాలు, తుఫానులు వస్తాయి. అప్పుడు నదులకు విపరీతంగా వరదలు వస్తాయి. ఎక్కువగా నీరు సముద్రంలోకి చేరుతుంది. కాని సముద్రం నిశ్చలంగా ఉంటుంది. నదులు ఎండి పోతాయి కానీ సముద్రం ఎండి పోదు. సముద్రం దేని మీదా ఆధారపడదు. నదుల నుండి నీరు వస్తేనే నీరు లేకపోతే లేదు అనేపరిస్థితి ఉండదు. ఎల్లప్పుడు నీటితో కలకలలాడుతూ ఉంటుంది. ఇది కేవలం ఉదాహరణమాత్రమే. అలాగే స్థితప్రజ్ఞుడు సముద్రము మాదిరి నిశ్చలంగా ఉంటాడు. వృద్ధిక్షయములు ఉండవు. అటువంటివాడు ప్రాపంచిక విషయములలో సంచరిస్తున్నా, వాటిని అనుభవిస్తున్నా, వాటి మీద ఆసక్తి ఉండదు. జ్ఞాని మనసుమాత్రం నిశ్చలంగా ఉంటుంది. మనసు కలత చెందదు. వాసనలు అంటవు. కోరికలు ఉండవు. అది కావాలి ఇది వద్దు అని ప్రాపంచిక విషయముల వెంట పరుగెత్తడు. ఎల్లప్పుడూనిశ్చలంగా ఉంటాడు.

ఇంతకూ జ్ఞానికి మనస్సు ఉంటుందా ఉండదా అన్న సందేహం అందరికీ వస్తుంది. మనస్సు లేకపోతే ఇంద్రియములకు సూచనలు ఎవరుఇస్తారు. ప్రపంచంలో వ్యవహరించాలి అంటే మనసు ఉండి తీరాలి. కాబట్టి జ్ఞానికి మనస్సు ఉండి తీరుతుంది. కాని జ్ఞాని దానిని తన అదుపులో ఉంచుకుంటాడు. మనసును ఎక్కువగా బరువులతో నింపడు. అనవసరమైన ఆలోచనలతో నింపడు. చాలా తేలికగా ఉంచుకుంటాడు. ఏది అవసరమో దానినే ఆలోచిస్తాడు. తరువాత ఆ ఆలోచలను మనసులోనుండి తుడిచేస్తాడు. మనసును ఎల్లప్పుడూ నిర్మలంగా ఉంచుకుంటాడు. జ్ఞాని మనసు అత్యంత తేలికగా దూది పింజమాదిరి ఉంటుంది. కాబట్టి ఉన్నట్టు లేనట్టు ఉంటుంది. కాబట్టి జ్ఞానికి

ఎక్కువగా ఫీలింగ్స్ ఉండవు. సుఖదు:ఖములను అతడు పట్టించుకోడు. అన్ని భోగములు కోరికలు అతనిలో ప్రవేశించగానే అతనిలో లీనమై పోతాయి. శాంతంగా ఉంటాయి. ఎటువంటి అలజడి ఉండదు. ఎలాగైతే సముద్రంలో కలవగానే నదుల అస్తిత్వం పోతుందో, యోగిలో చేరగానే కోరికల అస్తిత్వం కూడా పోతుంది. అటువంటి స్థితిలో యోగి పరమ శాంతిని పొందుతాడు. ఎల్లప్పుడూ ఇంద్రియ విషయముల మీద, రాగద్వేషముల మీద ఆధారపడేవాడికి, కోరికలతో సతమతమయ్యే వాడికి ఎప్పుడూ శాంతి ఉండదు.

## 71. విహాయ కామాన్ యస్సర్వాన్ పుమాంశ్చరతి ని:స్పృహ:। నిర్మమో నిరహంకార: స శాన్తిమధిగచ్ఛతి॥

కోరికలను వదిలిపెట్టి, మమత, అహంకారము, ప్రాపంచిక విషయముల మీద ఆసక్తి వదిలిపెట్టి, తిరిగే వాడు నిరంతర శాంతిని పొందుతాడు.

శాంతిని సుఖాన్ని పొందాలంటే కింద చెప్పబడిన నాలుగు సూత్రములను పాటించాలి. 1. సమస్తకోరికలను, వాటి మీద ఆసక్తి ని వదిలిపెట్టాలి. 2. శబ్ద,స్పర్శ, రస,రూప,గంధాలను మనసులోకి రానీయకూడదు. 3.నేను, నాది అనే అహంకారము వదిలిపెట్టాలి. 4. నా వాళ్లు, నా ధనం, నా ఆస్తి అనే మమకారములు వదిలిపెట్టాలి. అంటే దీని అర్థం ఏ కోరికా లేకుండా మనసు నిర్మలంగా ఉంచుకోవాలి. ఏ ఒక్క కోరిక ఉన్నా అది మనసును అల్లకల్లోలం చేస్తుంది. నేను ఆత్మస్వరూపుడను. నేను ఈ శరీరం కాదు అనే భావనతో ఉండాలి. ఈ శరీరమే తనది కానపుడు శరీర సంబంధమైన కోరికలకు ఎందుకు బానిస కావాలి అనే భావన కలిగి ఉండాలి. అటువంటి వాడిని ఏ సమస్య బాధించదు. నిశ్చలంగా ఉంటాడు.

స్థితప్రజ్ఞుడు ఎన్ని భోగముల మధ్య ఉన్నప్పటికినీ, ఆ భోగములు ప్రాపంచిక విషయములు విషయభోగములు ఆయనమీద ఎటువంటి ప్రభావమును చూపలేవు. పైగా ఆ విషయము లన్నీ నదులు సముద్రములో కలిసినట్టు ఆయనలో లీనం అయిపోతాయి. తమ అస్తిత్వాన్ని కోల్పోతాయి. ఆయన మాత్రము నిశ్చలంగా ఉంటాడు. పరమ శాంతిని పొందుతాడు. కాని భోగముల మీద, ప్రాపంచిక విషయముల మీద విపరీతమైన ఆసక్తి కలవారు అటువంటి శాంతిని పొందలేరు. నిరంతరము అశాంతిలో సతమతమౌతుంటారు. దు:ఖములో మునిగితేలుతుంటారు అని తెలుసుకున్నాము. ఈ శ్లోకంలో కూడా అదే విషయాన్ని మరలా చెబుతున్నాడు. శాంతి పొందాలంటే కావాల్సిన అర్హతలను మరలా చెబుతున్నాడు. కోరికలను వదిలిపెట్టడం, ప్రాపంచిక విషయముల మీద ఆసక్తిలేకుండా ఉండటం, మమత, అహంకారము వదిలిపెట్టడం. అహంకారము అంటే ఈ దేహమే నేను అనే భావన. ఈ దేహముతో నేనుసుఖాలు అనుభవిస్తాను. అనుభవించడానికి

నాకు సుఖాలు కావాలి. అనే భావన కలిగిఉండటం. ఆ భావనే అహంకారము. దానిని వదిలిపెట్టాలి. ప్రాపంచిక విషయముల మీద ఆసక్తి లేకపోవడం. ఇటువంటి గుణములు కలిగిన పురుషుడు పరమ శాంతిని పొందుతాడు అని మరలా ఘంటా పథంగా చెప్పాడు భగవానుడు.

మనం సాధారణంగా మోక్షం అనే పదాన్ని వింటూ ఉంటాము. మోక్షము అంటే వదిలివేయడం. అంతేకానీ మరణించిన తరువాత దేవదూతలు వచ్చి విమానంలో మనలను మోక్షానికి తీసుకుపోతారనీ, మోక్షంఅంటే అది ఒక ప్రదేశము అనీ అనుకోకూడదు. మోక్షము అంటే మనం జీవించి ఉండగానే ప్రాపంచిక విషయముల మీద ఆసక్తిని వదిలిపెట్టి, ఇంద్రియ నిగ్రహము, మనోనిగ్రహముసాధించి, రాగద్వేషములను వదిలిపెట్టి, ప్రశాంతంగా జీవించడం ఇదే మోక్షము. మోక్షము అంటే ఒకరు ఇచ్చేది కాదు. తనకు తానుగా సంపాదించుకోతగ్గది. ఎవరైనా "నేను మీకు మోక్షము ఇస్తాను" అని అంటే అతనికి ఏమీ తెలియదు అని మనం అనుకోవాల్సివస్తుంది. కాబట్టి మోక్షం అంటే జీవించి ఉండగానే పరమ శాంతిని పొందడం అంటే జీవన్ముక్తిని పొందడం అని అర్థం. జీవించి ఉండగానే అన్నిటి నుండి విముక్తిని పొందడం. ఈ విముక్తినే పరమశాంతి అని అంటారు.

ఈ శ్లోకంలో య: అని వాడారు. య: అంటే ఎవరైతే అని అర్థం. అంటే స్థితప్రజ్ఞత కలగడానికి కుల, వర్ణ, మత, జాతి, ఆడ, మగ, ధనిక, పేద, వివక్షత లేదు. పైలక్షణములు ఉన్న వారు ఎవరైనా స్థితప్రజ్ఞులు కావచ్చు అని చెప్పారు భగవాన్ శ్రీకృష్ణుడు.

ఈ విధంగా ప్రతి మానవుడు ఎలా పరమ శాంతిని పొందుతాడో ఎలా మోక్షమును పొందుతాడో వివరించాడు భగవానుడు.

## 72. ఏషా బ్రాహ్మీస్థితి: పార్థ నైనాం ప్రాప్య విముహ్యతి।
## స్థిత్వాఽస్యా మన్తకాలేఽపి బ్రహ్మనిర్వాణమృచ్ఛతి॥

ఓ పార్థా! దీనినే బ్రాహ్మీస్థితి అని అంటారు. ఈ బ్రాహ్మీస్థితిని పొందిన వాడు మోహములో పడడు. అతడు తన అంత్యకాలములో కూడా ఈ బ్రాహ్మీస్థితిలో స్థిరంగా ఉంటాడు. పరమ సుఖాన్ని, పరమ శాంతిని పొందుతాడు.

స్థితప్రజ్ఞుడు పొందే ఈ స్థితిని బ్రాహ్మీస్థితి అని అన్నాడు వ్యాసుడు. ఈ స్థితి ఒక రోజు ఉండి మరురోజు పోయేది కాదు. మరణించే దాకా ఉంటుంది. అతడు మరణానికి భయపడడు. ఆనందంగా ఈ శరీరాన్ని విడిచిపెడతాడు. కాని కొంత మంది జీవితంఅంతా ప్రాపంచికసుఖాలతో

గడిపి, అంత్యకాలంలో భగవంతుని సేవించి, బ్రాహ్మీస్థితిని పొందవచ్చు అని అనుకుంటారు. అది పొరపాటు. నిరంతర అభ్యాసము చేత గానీ ఈ బ్రాహ్మీస్థితి సిద్ధించదు. కాబట్టి అంత్యకాలము సమీపించినపుడు లేక 60 దాటాక చూచుకుందాములే అని కాకుండా ఇప్పుడే ఈ క్షణము నుండి ప్రతి వాడూ ఈ బ్రాహ్మీస్థితి లక్షణములను పొందడానికి ప్రయత్నం మొదలు పెట్టాలి.

వేదాంత జ్ఞానము చేత ఎటువంటి నిశ్చయాత్మక బుద్ధి కలిగిందో దానినే బ్రాహ్మీస్థితి అంటే బ్రహ్మస్థితి అనిఅంటారు. నది సముద్రములో కలిస్తే ఇంకనది ఉండదు. సముద్రమే ఉంటుంది. పాలలో నీళ్లుపోస్తే అవి పాలు అవుతాయి నీళ్లు కనిపించవు. అలాగే ఒక వ్యక్తి స్థిత ప్రజ్ఞుడైతే అతడు బ్రాహ్మీస్థితిని పొందుతాడు. అతనిలో ఉన్న అవలక్షణాలు మచ్చుకైనా కనపడవు. ఈ బ్రాహ్మీస్థితిని పొందిన తరువాత ఎవరూ మోహములో పడరు. కోరికలు ఉండవు. ఏదీ కావాలని కోరుకోడు. ఇది నాది అది నీది అనే భ్రమలో పడడు. ఈ ప్రపంచం అంతా నాటకం. అందులో నేను ఒక పాత్రను అని నటిస్తాడు కానీ అందులో లీనం కాడు. చిన్నప్పుడు బొమ్మలతో ఆడుకుంటాము. పెద్ద అయిన తరువాత బొమ్మల మొహం కూడా చూడము. ఎందుకంటే మన స్థితి మారి పోయింది. చిన్నప్పుడు మనకు బొమ్మల మీద ఆసక్తి ఉంటుంది. పెద్ద అయిన తరువాత ఆ ఆసక్తి ఉండదు. అలాగే బ్రాహ్మీస్థితిని చేరుకున్న తరువాత సాధకుడు నిశ్చలంగా ఉంటాడు. ఎవరైతే జీవిత కాలంలో ఈ బ్రాహ్మీస్థితి చేరుకున్నాడో, అతడు బ్రహ్మానందమును పొందుతాడు. జనన మరణ చక్రము నుండి విముక్తి పొందుతాడు. అతడే జీవన్ముక్తుడు. తుదకు పరమాత్మలో ఐక్యం అవుతాడు.

దీనితో రెండు అధ్యాయాలుపూర్తి అయ్యాయి. ఇప్పుడు ఒక సారి సింహావలోకనం చేసుకుందాము. సంజయుడు ధృతరాష్ట్రుడికి కురుక్షేత్ర యుద్ధవిశేషాలు చెబుతున్నాడు. ధృతరాష్ట్రుడు సంజయునితో, యుద్ధమునకు సన్నద్ధము అయిన నా వాళ్లు, పాండవులు ధర్మక్షేత్రమైన కురుక్షేత్రంలో ఏమి చేస్తున్నారు అని అడగడంతో భగవద్గీత మొదలవుతుంది. అప్పుడు సంజయుడు ఇలా అన్నాడు. ముందు సుయోధనుడు ద్రోణుని వద్దకు పోయి ఇరుపక్షముల వీరులను పరిచయం చేసాడు. అప్పుడు భీష్ముడు, అతని పక్షమువారు, కృష్ణార్జునులు అతని పక్షమువారు శంఖములు పూరించుకున్నారు. అర్జునుడు తన రథ సారథి అయిన కృష్ణునితో రథమును ఇరు పక్షముల మధ్యలో నిలబెట్ట మన్నాడు. కృష్ణుడు రథమును ఇరుసైన్యముల మధ్యలో నిలబెట్టాడు. అర్జునుడు తన పక్షము వారిని, ఎదుటి పక్షములో ఉన్నతాత భీష్ముడు, గురువు ద్రోణకృపాచార్యులను, అశ్వత్థామను తన సోదరులను, బంధుమిత్రులను చూచాడు. అతనికి దు:ఖం ముంచుకొచ్చింది, చేతులు వణికాయి. అవయవములు పట్టుతప్పాయి. నోరు ఎండిపోయంది. శరీరం గగుర్పాటు చెందింది. గాండీవము చేతులో నుండి జారి పోయింది. రథం మీద నిలబడలేకపోయాడు.

అప్పుడు కృష్ణుని తో ఇలా అన్నాడు. "కృష్ణా!ఈ యుద్ధములో నా బంధువులను గురువులను మిత్రులను చంపడంనాకు ఇష్టం లేదు. నాకు ఈ రాజ్యము, విజయముఅక్కరలేదు. వీరందరినీ చంపి నేను సుఖములను ఎలా అనుభవించాలి. కాబట్టి నాకు మూడులోకములు ఆధిపత్యము వచ్చినా సరే ఈ యుద్ధము చేయను. వీరందరూ ఆతతాయిలు దుర్మార్గులు అయినా సరే వీళ్లను చంపి నేను పాపం మూటకట్టుకోలేను. వీళ్లందరూ మరణిస్తే వీళ్ల కులములలో మగాళ్లు ఉండరు. అప్పుడు వర్ణసంకరం జరగడానికి అవకాశం ఉంది. వర్ణసంకరం జరిగితే వీళ్ల పితృదేవతలకు పిండప్రదానము చేసేవారుఉండరు. ఆ విధంగా సనాతన ధర్మములు, కుల ధర్మములు నాశనమైపోతాయి. అటువంటివారికి నరకం వస్తుంది. శాస్త్ర పరిజ్ఞానము కలిగిన నేను ఈ ఘోరానికి పాల్పడలేను. అందుకని నేను అస్త్రసన్యాసము చేస్తాను. వీళ్లు నన్ను చంపినా సరే నాకు క్షేమమే అవుతుంది." అని ధనుర్బాణములను రథం మీదపెట్టి చతికిల పడ్డాడు.

కళ్లతో నీళ్లతో కరుణతో కూడిన హృదయంతో, శోకిస్తున్న అర్జునుని చూచి కృష్ణుడు జాలి పడి ఇలా అన్నాడు. "అర్జునా నీవు మహా వీరుడవు. అత్యుత్తమ ధనార్ధారివి. నీకు ఈ పిరికితనము, నపుంసకత్వము ఎక్కడి నుండి దాపురించాయి. ఇది నీకు ఉచితము కాదు. కాబట్టి ఈ దుర్బలత్వము వదిలి యుద్ధం చేయి" అని అన్నాడు.

అప్పుడు అర్జునుడు ఇలా అన్నాడు. "కృష్ణా! ఎదురుగా ఎవరున్నారో చూచావా! మా తాత భీష్ముడు, విద్య నేర్పిన గురువులు, గురు పుత్రులు, సోదరులు, మేనమామలు, బంధువులు, మిత్రులు వీరిని నేను ఎలా చంపగలను అని అనుకుంటున్నావు. వీళ్లను చంపి రాజభోగాలు అనుభవించడం కంటే అడుక్కుతినడం మేలు. ఈ నెత్తురు కూడు నేను తినలేను. అయినా ఈ యుద్ధంలో జయాపజయములుఎవరిని వరిస్తాయో ఎవరికి తెలుసు. వాళ్లే జయించవచ్చు. మనమే జయించవచ్చు. ఈమాత్రం దానికి ఇంతమందిని చంపాలా! అయినా కృష్ణా! నా మనసు వ్యాకులమై ఉంది. ఏది మంచో, ఏది చెడో, ఏది చెయ్యాలో, ఏది చెయ్యకూడదో, తెలియడం లేదు. కాబట్టి నన్ను నీ శిష్యుడిగా స్వీకరించి, నాకు కర్తవ్యమును ఉపదేశించు." అని ప్రార్థించాడు.

అప్పుడు కృష్ణుడు ఈ విధంగా అన్నాడు. "అర్జునా! ఎవరి కోసరం శోకించడం తగదో వారి గురించి శోకిస్తున్నావు. పైగా బాగా తెలిసిన వాడి మాదిరి మాట్లాడుతున్నావు. పండితులు అయిన వారు చచ్చిన వారి గురించి కానీ, చావబోయే వారి గురించి గానీ చింతించరు. నువ్వు నేను వీరందరూ ఇది వరకూ ఉన్నారు. ఇప్పుడు ఉన్నారు. ముందు కూడా ఉంటారు. మనందరిలో పరమాత్మ ఆత్మస్వరూపుడుగా ఉన్నాడు. ఆత్మ శాశ్వతము. ఈ శరీరములలో బాల్య, యౌవన, వృద్ధాప్యములు ఎంత సహజమో మరణమూ అంతే సహజం. శరీరం మరణిస్తుంది కానీ ఆత్మకాదు. ఆత్మ శాశ్వతము. ఈ శరీరము ప్రాపంచిక విషయములతో సంయోగం పెట్టుకొనడం వలన సుఖదు:ఖములు కలుగుతున్నాయి. జ్ఞాని అయిన వాడు సుఖదు:ఖములను సమానం గా చూస్తాడు.

వాడేమోక్షమును పొందుతాడు.

అసత్యమైన శరీరములు నశిస్తాయి. సత్యమైన ఆత్మ నశించదు. ఈ ఆత్మను ఎవరూ నాశనం చేయలేరు. ఆత్మ ఎవరినీ చంపదు. ఎవరి చేతిలోనూ చావదు. అలా భావించే వాడు అజ్ఞాని. ఎందుకంటే ఆత్మకు చావు పుట్టుకలు, వృద్ధిక్షయములు, ఉండటం ఉండకపోవడం లేవు. ఈ విషయం తెలుసుకున్న జ్ఞాని ఆత్మ మరణిస్తుంది అని ఎలా అనుకుంటాడు? మానవుడు చినిగిన వస్త్రములను వదిలిపెట్టి కొత్త వస్త్రములను ఎలా ధరిస్తాడో, జీవుడు కూడా శిథిలమైన ఈ శరీరమును వదిలిపెట్టి కొత్త శరీరమును ధరిస్తాడు. ఈ ఆత్మను కత్తులు, బాణములు, అస్త్ర శస్త్రములు ఏమీ చేయలేవు. నీరు, అగ్ని, వాయువు క్షయింప జేయలేదు. ఆత్మను ఎవరూ కళ్లతో చూడలేరు. చేతితో తాకలేరు. మనసుతో చింతించలేరు.

పోనీ, నీవు అనుకున్నట్టు, ఈ ఆత్మకు జనన మరణములు ఉన్నాయని నీవు అనుకున్నా దానికీ చింతించనవసరం లేదు. పుట్టినవాడు చావడం, చచ్చిన వాడు పుట్టడం సహజమైన ప్రక్రియ. దీని కోసరం ఏడవడం ఎందుకు. ఎందుకంటే ఈ దేహములు పుట్టకముందు, చచ్చిన తరువాత ఎవరికీ కనపడవు. కేవలం జనన మరణముల మధ్య మాత్రమే ఏదో ఒక ఆకారంలో అందరికీ కనపడతాయి. కాబట్టి అశాశ్వతములైన ఈ శరీరముల కొరకు శోకించడం వృధా! కొంతమంది ఈ ఆత్మ తత్వమును ఆశ్చర్యంగా చూస్తారు. మరి కొంత మంది వివిధరకాలుగా వర్ణిస్తారు. వింతగా వింటారు. కాని చాలామందికి ఈ ఆత్మ గురించి ఏమీ తెలియదు. చెప్పినా అర్థం కాదు. కాబట్టి అర్జునా! అన్ని జీవులలో ఉన్న ఈ ఆత్మను గురించి శోకించడం అర్థంలేని పని. కాబట్టి, నీ స్వధర్మము ధర్మంగా యుద్ధము చెయ్యడం. అది చెయ్యి. ఎందుకంటే స్వధర్మ ఆచరణను మించిన ధర్మం మరొకటి లేదు. ధర్మయుద్ధం అంటే స్వర్గమునకు తెరిచిన ద్వారము వంటిది. ధర్మయుద్ధములో మరణించినవారికి స్వర్గము ప్రాప్తిస్తుంది. ఈ అదృష్టము ఒక్క క్షత్రియులకే పరిమితము. ఆ అదృష్టాన్ని వదులుకోకు. యుద్ధములో చస్తే వీరస్వర్గము. పారి పోతే పిరికిపంద అనే అప్రతిష్ట. పైగా నరకానికి పోతావు. పైగా యుద్ధంలో పారిపోయిన పిరికిపందవని లోకులు నీగురించి కథలు కథలుగా చెప్పుకుంటారు. నీ శత్రువులు నిన్ను హేళన చేస్తారు. దానికన్నా చావడం నయం. నీ వంటి వీరుడు శూరుడు ఇటువంటి అపకీర్తిపాలు కావడం తగునా!

అర్జునా! యుద్ధములో చస్తే వీరస్వర్గము, బతికితే రాజ్యభోగములు. కాబట్టి యుద్ధం చెయ్యి. జయాపజయములు, లాభనష్టములు, సుఖదు:ఖములను సమానంగా భావించి యుద్ధం చెయ్యి. నీకు ఎటువంటి పాపమూ రాదు. అర్జునా! ఈ సమత్వ బుద్ధిని ఇప్పటి వరకూ జ్ఞాన దృష్టితో చెప్పాను. ఇప్పుడు కర్మదృష్టితో చెబుతాను. దీనినే నిష్కామ కర్మ అంటారు. ఈ నిష్కామ కర్మ పూర్తిగా చేయనవసరం లేదు. ఎంత చేస్తే అంతే ఫలితం వస్తుంది. ఈ నిష్కామ కర్మలో నిశ్చయమైన బుద్ధి ఉంటుంది. ఇతరులలో ఇది ఉండదు. వారు ప్రాపంచిక విషయముల వెంట పరుగెడుతుంటారు.

వారు వేదములలో చెప్పబడిన యజ్ఞయాగములు చేస్తూ స్వర్గసుఖముల కొరకు పాకులాడుతుంటారు. శాశ్వతమైన ఆనందము నిచ్చే ఆత్మతత్వమును తెలుసుకోడానికి ప్రయత్నించరు. వేదములలో సత్వ,రజస్తమోగుణములతో చేసే యజ్ఞయాగముల గురించి చెప్పబడింది. నీవు వాటి మీద ఆసక్తి చూపవద్దు. పరమాత్మయందు నీ మనసు లగ్నం చెయ్యి. పెద్ద జలాశయము నిండా నీరు ఉండగా, చిన్న గుంటలో ఉన్న నీటితో ఏమి లాభము. బ్రహ్మజ్ఞానముతో పోలిస్తే వేదవిజ్ఞానము అత్యంత స్వల్పము. వేదములలో చెప్పబడిన విషయములను అర్థం చేసుకొని ఆచరించాలి కానీ అజ్ఞానంతో ఆచరించకూడదు.

అర్జునా! నీకు నీ కర్తవ్య కర్మచేయడానికే అధికారం ఉంది. దానిఫలితములయందు అధికారములేదు. అలాగని కర్మలు చేయడం మానకూడదు. కాకపోతే ఆ కర్మలను ఫలాపేక్ష లేకుండా నిష్కామంగా చేయాలి. ద్వంద్వముల యందు సమత్వం కలిగి ఉండాలి. దీనినే యోగము అంటారు. ఈ సమత్వ బుద్ధి ఉన్నవాడు పుణ్యపాపములు ఈ లోకములోనే వదిలేస్తాడు. వాడికి ఎటువంటి కర్మఫలములు అంటవు. ముక్తికి ఇదే మార్గము. కాబట్టి అర్జునా! మోహం వదిలిపెట్టు. ద్వంద్వములను సమానంగా చూడు. మనస్సును, ఇంద్రియములను అదుపులోపెట్టుకో. మనస్సును ఆత్మయందు లగ్నం చెయ్యి. పరమానందం పొందు. ఇటువంటి వాడిని స్థితప్రజ్ఞుడుఅంటారు. అటువంటి వాడు దు:ఖములకు కుంగి పోడు సుఖములకు పొంగిపోడు. వాడికి దేనిమీదా ఆసక్తి ఉండదు. భయము, కోపము ఉండవు. దేని మీద మమత మమకారం ఉండదు. అనుకూల, ప్రతికూల పరిస్థితులలో సమంగా ఉంటాడు. దేనికీ చలించడు. అతడికి రాగద్వేషములు ఉండవు.అతడే స్థితప్రజ్ఞుడు. అతడుబయట ప్రపంచములో తిరుగుతున్నపుడు తాబేలు తన అంగములను తనలోకి ముడుచుకున్నట్టు, ఇంద్రియములను, మనస్సును తన స్వాధీనంలో ఉంచుకుంటాడు. పరమాత్మ యందు తప్ప దేని మీదా ఆసక్తి చూపడు.

అర్జునా! ఇది అందరికీ సాధ్యం కాదు. ఇంద్రియములను, మనసును అదుపులో పెట్టుకోవడం చాలా కష్టం. ప్రాపంచిక విషయములు, కామవాంఛలు ఇంద్రియములను తమ వంకకు లాగుతాయి. మనసు ఇంద్రియముల వెంట వెళుతుంది. బుద్ధి నిస్సహాయంగా మిగిలి పోతుంది. దీనికి ఒకటే మార్గము. ధ్యానంలో కూర్చుంటే ఇంద్రియములను, మనసును నిగ్రహించ వచ్చును. అప్పుడు అతని బుద్ధి స్థిరంగా ఉంటుంది. సాధారణంగా బయట ప్రపంచములో తిరుగుతున్నపుడు ఎన్నో వస్తువులను, విషయాలను, మనుషులను చూస్తుంటాము. మనసు వాటి మీద లగ్నం అవుతుంది. ఆ ఆసక్తి కోరికగా మారుతుంది. ఆ కోరికలు తీరకపోతే కోపం వస్తుంది. కోపంలో ఏమి చేస్తున్నాడో తెలియని మోహం ఆవరిస్తుంది. అప్పుడు మానవుడు విచక్షనా జ్ఞానం కోల్పోతాడు. బుద్ధి పనిచెయ్యడం మాని వేస్తుంది. సర్వనాశనం అవుతుంది. అదే మనసును మన వశంలో ఉంచుకుంటే ఈ విపరీతపరిణామములు సంభవించవు. మనస్సు ప్రసన్నంగా ఉంటుంది. మనస్సు ప్రసన్నంగా ఉంటే దు:ఖములు నశిస్తాయి. అప్పుడు బుద్ధి పరమాత్మయందు లగ్నం

అవుతుంది. మనస్సు ప్రసన్నంగా లేకపోతే బుద్ధి నిశ్చయంగా ఉండదు. అటువంటి వాడికి శాంతి, సుఖము ఎలా కలుగుతాయి. ఎందుకంటే, బుద్ధి అనే చుక్కాని లేకపోతే పడవ అనే మనస్సు గాలి వాటుకు కొట్టుకొని పోతుంది. కాబట్టి మనస్సు స్థిరంగా ఉంటే, బుద్ధి స్థిరంగా ఉంటుంది. ఆత్మసాక్షాత్కారం పొందిన యోగి మనస్సు ఎల్లప్పుడూ వెలుగులో ఉంటుంది. అటువంటి వాడికి ప్రాపంచిక విషయములు అంధకారంతో సమానము. ప్రాపంచిక విషయములలో తిరిగే వ్యక్తికి ఆత్మజ్ఞానము అర్థం కాక, అంధకారంలో ఉన్నట్టు ఉంటుంది. ఎలాగైతే ఎన్ని నదులు సముద్రంలో కలిసినా, సముద్రము నిశ్చలంగా ఉంటుందో, స్తితప్రజ్ఞునికి బయట ప్రపంచంలో తిరుగుతున్నా, ప్రాపంచిక విషయములు అతనిలో ప్రవేశించినా అతని మనస్సు, బుద్ధి నిశ్చలంగా ఉంటాయి. ఏకోరికలూ అతనిని ప్రభావితం చేయలేవు. కోరికలు విడిచిపెట్టినవాడు, శాంతిని పొందుతాడు. అలా శాంతిని పొందడమే బ్రాహ్మీస్థితి అంటారు. మరణించే సమయంలో ఈ బ్రాహ్మీస్థితిలో ఉన్న వాడికి మరలా జన్మ లేదు.అతడు మోక్షమును పొందుతాడు.

ఇది ఇప్పటి వరకు మనం చదువుకున్న అర్జున విషాద యోగ, సాంఖ్య యోగముల సారాంశము. ఇంక కర్మయోగములోనికి ప్రవేశిద్దాము.

**ఉపనిషత్తులయొక్క, బ్రహ్మవిద్యయొక్క,**

**యోగశాస్త్రము యొక్క సారమయిన భగవద్గీతలో,**

**సాంఖ్య యోగము అను రెండవ అధ్యాయము సంపూర్ణము.**

**ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్**

# భగవద్గీత

## మూడవ అధ్యాయము

## కర్మయోగము

అర్జున ఉవాచ:

1. జ్యాయసీ చేత్ కర్మణస్తే మతా బుద్ధిర్జనార్దన।
తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ॥

ఓ కేశవా! నీవుచెప్పిన దానిని బట్టి కర్మకంటే జ్ఞానమే మంచిది అనేది నీ మతం అని తెలుసుకున్నాను. అలాగైతే నన్ను ఈ భయంకరమైన, హింసతో కూడిన, సర్వనాశన హేతువైన, ఈ యుద్ధం చేయమని నన్ను ఎందుకు పురికొల్పుతున్నావు? అని అడిగాడు అర్జునుడు.

ఇప్పటి దాకా పరమాత్మ జ్ఞానయోగం గురించి చెప్పాడు. అదే మంచిది అని అభిప్రాయపడ్డాడు. కర్మకంటే జ్ఞానము గొప్పది అన్న కృష్ణుడు నన్ను యుద్ధం చేయమని ఎందుకు నియోగిస్తున్నాడు అని అర్జునుని సందేహము.

అర్జునుడు ఇలాంటి ప్రశ్న వేస్తాడు అని అనుకోలేదు కృష్ణుడు. ఇప్పటి దాకా కృష్ణుడు అర్జునుడికి ఆత్మతత్వము, జ్ఞానబోధ గురించి చెబుతూ, అక్కడక్కడ కర్మయోగం గురించి కూడా చెప్పాడు. అంటే అటు ఇటు జ్ఞానము మధ్యలో కర్మగురించి చెప్పాడు. అర్జునుడికి కొస్త అర్థం అయి ఉంటుంది అని అనుకొని కొంచెం ఊపిరి తీసుకుందాము అని అనుకకునే లోపల అర్జునుడు బాణం లాంటి ప్రశ్న సంధించాడు. కృష్ణుడు ఇంత విశదంగా, వివరంగా, చెప్పినా అర్జునుడికి ఇటువంటి సందేహం తలెత్తింది అంటే అర్జునుడు సరిగా వినలేదు, ఒకవేళ విన్నా దానిని సరిగా అర్థం చేసుకోలేదు అని అనుకోవచ్చు. లేకపోతే కృష్ణుడు చెప్పిన కర్మ సంబంధమైన విషయాలు అర్జునుడికి ఇష్టం లేకపోవచ్చు. ఎందుకంటే అర్జునుడు ఎప్పుడెప్పుడు యుద్ధం చేయడం మానేద్దామా అని ఆలోచిస్తున్నాడు. అటువంటప్పుడు యుద్ధం చెయ్యి అన్న కృష్ణుడి మాటలు అర్జునుడి చెవికి ఎక్కలేదు. అందుకని జ్ఞానయోగమును, కర్మను ఒకదానితో ఒకటి పోలుస్తున్నాడు.

రెండు వస్తువులను పోల్చాలంటే ఆ రెండు వస్తువులు సమాన ధర్మములు కలిగి ఉండాలి. ఇక్కడ జ్ఞానము వేరు కర్మవేరు. కర్మవల్ల జ్ఞానం కలుగుతుంది. కర్మలను ఆచరించడం జ్ఞానం సంపాదించడానికి తొలిమెట్టు. ఇది సరిగా అర్థం చేసుకోలేదు అర్జునుడు

జనార్దనా! అంటే సమస్త జనులు తమ కోరికలు తీరడానికి ఎవరిని ఆశ్రయిస్తారో, యాచిస్తారో, ప్రార్థిస్తారో, అతనే జనార్దనుడు.

రెండవ అధ్యాయంలో కృష్ణుడు జ్ఞానం గురించి అద్భుతంగా చెప్పాడు. స్థిత ప్రజ్ఞుడి గురించి కూడా చెప్పాడు అటువంటి వాడు తుదకు బ్రహ్మనిర్వాణం పొందుతాడు అనికూడా అన్నాడు. అంతే కాదు జ్ఞానం కలిగి ఉండటమే అన్ని దు:ఖములకు అంతము అనీ, జ్ఞానం ఉంటే దు:ఖము ఉండదు అనీ, జ్ఞానమే అన్ని దు:ఖములకు పరిష్కారము అనీ, అన్నాడు. మధ్యలో ఒక సారి కర్మను గురించి కర్మ నిష్టను గురించి చెప్పాడు. అంటే ఈ కర్మయోగము మధ్యలో ఇరుక్కుపోయింది. ఇప్పుడు జ్ఞానం గొప్పదా, కర్మ గొప్పదా అనే సందేహం కలిగింది అర్జునుడికి. ఎటూ యుద్ధం చేయడం అర్జునుడికి ఇష్టం లేదు కాబట్టి ఈ సాకుతో తప్పించుకోవచ్చని ఈ ప్రశ్న అడిగాడు.

కృష్ణా! నువ్వు నన్ను చాలా కన్‌ఫ్యూజ్ చేస్తున్నావు. ఒక పక్క జ్ఞానం అన్నిటికన్నా గొప్పది అని చెప్పి మరలా ఈ పాపపు కర్మ అయిన యుద్ధం చేయమని నన్ను ఎందుకు పురికొల్పుతున్నావు. ఇదేం బాగాలేదు అని అన్నాడు. నిజానికి కృష్ణుడు చాలా స్పష్టంగా చెప్పాడు. కాని అర్జునుడి మనసులో యుద్ధం వలన అనేక అనర్థాలు కలుగుతాయి కాబట్టి యుద్ధం మానెయ్యాలని ఉంది. అందుకే తనకు అనుకూలమైన జ్ఞానయోగం మాత్రమే తీసుకున్నాడు. అందుకనే ఈ ప్రశ్నవేసాడు.

కృష్ణుడు చెప్పింది ఏమిటంటే జ్ఞానయోగం పొందడానికి కర్మయోగము ఒక సాధనము అని చెప్పాడు కానీ ఒకదానితో ఒకటి పోల్చలేదు. ఇక్కడ అర్జునుడు జ్ఞాన యోగము కర్మయోగము ఒకదానితో ఒకటి పోల్చుకుంటున్నాడు. అదీ అర్జునుడు చేస్తున్న పొరపాటు. ఒక వస్తువు మరొక వస్తువును కంపేర్ చెయ్యాలంటే రెండు వస్తువులకు కొన్ని సమాన లక్షణాలు ఉండాలి. ఇక్కడ జ్ఞానం వేరు కర్మ వేరు. ఎలా పోలుస్తాడు. అది అర్జునుడికి అర్థం కాలేదు. కృష్ణుడు చెప్పింది ఏమిటంటే.... 'బాబూ ముందు నువ్వు నిష్కామ కర్మ చేయడం అలవాటు చేసుకో దానితో మనస్సు, ఇంద్రియములు నీ అధీనంలో ఉంటాయి. చిత్త శుద్ధి వస్తుంది. తరువాత జ్ఞానం కలుగుతుంది. అప్పుడు నువ్వు స్థితప్రజ్ఞుడివి అవుతావు' అని చెప్పాడు. ఇది అర్థం కాక అర్జునుడు ఈ సందేహం లేవదీసాడు.

ఈ లక్షణం మనలో చాలా మందికి ఉంది. అర్జునుడు రెండింటినీ ఒకదానితో ఒకటి పోలుస్తున్నాడు.. ఉదాహరణకు చెయ్యికడుక్కొని భోజనం చేయి అన్నామనుకోండి. చెయ్యికడుక్కోవడం, భోజనం చేయడం ఒకటి కాదు. రెండింటినీ ఒకదానితో ఒకలి పోల్చకూడదు. చెయ్యి కడుక్కుంటే చేతులు శుభ్రపడతాయి. అప్పుడు భోజనం చేయడానికి అనుకూలంగా ఉంటాయి. అలాగే కర్మల వలన మనసు నిర్మలం అవుతుంది. అప్పుడు జ్ఞానం సంపాదించడానికి అర్హత వస్తుంది. ఇదీ కృష్ణుడు చెప్పింది. ఇది సరిగా అర్థం చేసుకోలేని అర్జునుడు ఈ సందేహము లేవనెత్తాడు.

సాధారణంగా మనము మన మనసుకు ఏది నచ్చుతుందో దానినే వింటాము. దానిని మనకు అన్వయించుకుంటాము. ఇతరములు మంచివి అయినా వాటి గురించి పట్టించుకోము. అందుకే వినేటప్పుడు జాగ్రత్తగా శ్రద్ధగా వినాలి, అన్నిటినీ సమబుద్ధితో స్వీకరించాలి అని అంటారు. మనకు అనుకూలమైన మాటలు విని, దానికి మన అరకొర జ్ఞానమును జోడించి దానిని మనకు అన్వయించుకుంటే అది దుష్పరిణామాలకు దారి తీస్తుంది.

## 2. వ్యామిశ్రేణేవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే।
## తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయో2హమాప్నుయామ్॥

కృష్ణా! నీ మాటలు అన్నీ చాలా తికమకగా ఉన్నాయి. నీ మాటలతో నా బుద్ధి ఒక విధమైన భ్రమకు లోనవుతూ ఉంది. కాబట్టి ఏదో ఒక మార్గం చెప్పు. జ్ఞానం సంపాదించడానికి గురుకులానికి వెళ్లమంటావా లేక కర్మ మార్గం అనుసరించి యుద్ధం చేయమంటావా! ఏదో ఒకటి ముందు నువ్వు నిశ్చయం చేసుకొని తరువాత నాకు చెప్పు. అని అడిగాడు.

స్వామీ! నేను ఇప్పటికే చాలా కన్ఫ్యూజ్ గా ఉన్నాను. నీవు చెప్పిన ఒకదానితో ఒకటిసంబంధంలేని మాటల వలన ఇంకా కన్ఫ్యూజ్ అయ్యాను. మీరు కన్ఫ్యూజ్ చేసారనికాదు. మీ మాటలు నాకు అలా అనిపించాయి. కాబట్టి ముందు ఏదో ఒక మార్గము మీరు నిశ్చయం చేసుకొని, నాకు ఏది శ్రేయస్సు కలుగజేస్తుందో నాకు ఏది మనశ్శాంతిని ఇస్తుందో, ఆ మాటలు నాకు చెప్పండి. అంతే కానీ ఏదో ఒకటి నన్ను నిశ్చయం చేసుకోమని మాత్రం చెప్పకండి. మీరు చెప్పింది ఆచరించడమే నాకు తెలుసు కానీ రెండింటి మధ్య మంచి చెడులను నిర్ధారించడం నాకు తెలియదు. కాబట్టి నాకు ఏది మంచిదో మీరే నిశ్చయం చేసుకొని నాకు తెలపండి. అని అన్నాడు అర్జునుడు

అర్జునుడు ఇలా అడిగినా కృష్ణుడు ఏ మాత్రం కోపం తెచ్చుకోలేదు. తనను తాను

సమర్థించుకోలేదు. ఒక సారి చెప్పాను కదా ఎన్నిసార్లు చెప్పాలి అని విసుక్కోలేదు. అర్జునుడికి నచ్చచెప్పడానికి ప్రయత్నించాడు. అందుకే ఆయన జగద్గురువు అయ్యాడు. గురువులందరికీ మార్గదర్శకుడయ్యాడు. భగవానుడు అర్జునుడికి రెండవ అధ్యాయంలో క్లుప్తంగా చెప్పిన కర్మయోగానికి పూర్తి వివరణ మూడవ అధ్యాయంలో ఇస్తున్నాడు.

## 3. లోకే2స్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయానఘ।
## జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్॥

ఓ అర్జునా! ఈ లోకంలో రెండు నిష్టలు అనగా జీవన విధానములు ఉన్నాయని నీకు ఇంతకు ముందే చెప్పాను కదా! సాంఖ్యయోగులు అంటే జ్ఞానయోగులకు సాంఖ్యయోగము, సాధారణ యోగము అభ్యసించేవారికి కర్మయోగము నిర్దేశింపబడ్డాయి. ఎవరెవరు ఏయే యోగము నందు ఆసక్తి ఉందో వారు ఆయాయోగములను అనుసరించవచ్చు.

అంటే జీవుల మనస్తత్వములను బట్టి, రెండు మార్గాలను నిర్దేశించాడు పరమాత్మ. అందరికీ ఒకే మార్గం చూపడం హిందూధర్మంలో లేదు. ఎవరికి తోచిన మార్గము వారు అనుసరించవచ్చు. కొంత మందికి తత్వవిచారణ మీద ఆసక్తి ఉంటుంది. వారికి సాంఖ్యయోగము నిర్దేశించారు. మరి కొందరు కర్మలు చేయడానికే ఆసక్తి చూపుతుంటారు. వారికి జ్ఞానము ఓ పట్టాన బోధ పడదు. అటువంటి వారికి కర్మయోగము నిర్దేశించారు. అలాకాకుండా బలవంతంగా ఏదో ఒక యోగము అందరి మీదా రుద్దితే, అది వారికి అర్థం కాకపోవచ్చు లేదా అసలు ఆచరించకుండా మానవచ్చు. అందుకని పరమాత్మ ఎవరెవరికి ఇష్టము, అనుసరణీయము అయిన యోగములను వారివారికి ఉపదేశించాడు.

ఇక్కడి నుండి చెప్పబోయే శ్లోకాలలో వేదాలలో, ఉపనిషత్తులలో అక్కడక్కడ ఉన్న విషయాలన్నీ ఒకచోటికి తెచ్చి క్రోడీకరించి మనకు ఈ అధ్యాయంలో అందించాడు వ్యాసుడు. వేదము అంటే తెలుసుకోతగినది. తెలియజేసేది. ఎవరు ఎవరికి తెలియజేస్తారు? తెలియని వాడికి తెలిసిన వారు తెలియజేస్తారు. కాబట్టి మనకు ఏమీ తెలియదు అనే భావనతో వేదం మొదలవుతుంది. ఈ వేదం కూడా రెండు భాగాలుగా విభజింపబడింది. పూర్వభాగము అంతా దేవతలను స్తోత్రములు చేయడంతో పాటు, యజ్ఞయాగాదులు గురించి చెప్పారు. ఉత్తర భాగంలో ఆత్మ జ్ఞానం, పరమాత్మ స్వరూపం గురించి చెప్పారు. మనకు ఆత్మజ్ఞానం గురించి తెలియదు కాబట్టి, దానిని మనకు తెలియజేస్తుంది వేదము.

కాబట్టి ఆత్మజ్ఞానం తెలుసుకునే ముందు కర్మ ఎలా చెయ్యాలో తెలుసుకోవాలి. ఇది మామూలు వాళ్ల విషయం. కొంతమంది ఈ కర్మ యోగమును అంతకు ముందే దాటిన వాళ్లు ఉంటారు. వారు సరాసరి జ్ఞానయోగానికి వెళ్లవచ్చు. భోజనం చేసే ముందు కాళ్లు చేతులు శుభ్రంగా కడుక్కోవాలి అనేది జీవన విధానము. కొంత మందికి కాళ్లు చేతులు ఎల్లప్పుడు శుభ్రంగానే ఉంటాయి. వారు నేరుగా భోజనం చేయవచ్చు. అలాగే ఆత్మజ్ఞానము తెలియని వారు మొదట కర్మయోగంతో మొదలుపెట్టి మనసు, ఇంద్రియములు శుద్ధి అయిన తరువాత జ్ఞానయోగమునకు వెళ్లవచ్చు. మరి కొంత మంది పూర్వజన్మ వాసనలనుబట్టి జ్ఞానవంతులుగానే పుడతారు. వారు అంతకు ముందు జన్మలలో కర్మయోగం అవలంబించి, పరిశుద్ధులై ఉంటారు. అటువంటి వారు మరలా కర్మయోగంతో మొదలు పెట్టనవసరం లేదు. నేరుగా జ్ఞానయోగముతో ప్రారంభించవచ్చు. కాబట్టి ఈ లోకంలో రెండు విధములైన జీవిత విధానములు అంటే నిష్టలు ప్రతిపాదించబడ్డాయి అని పరమాత్మ చెబుతున్నాడు.

అస్మిన్ లోకే.. అంటే ఈ లోకము నందు, ద్వివిధా నిష్ఠా అంటే రెండు రకములైన నిష్ఠలు, అంటే జీవన విధానాలు, పురా, ప్రోక్తా... అంటే ఈ విషయం నీకు ఇంతకు ముందే చెప్పాను. గుర్తుకు తెచ్చుకో. ఇందులో మరియొక అర్థం కూడా ఉంది. అత్యంత పురాతనంగా ఈ విషయం నా చేత ఈ లోకంలో ఉన్న మానవులకు చెప్పబడింది. కాలానుగుణంగా వారు మరిచిపోయారు కాబట్టి మరలా చెబుతున్నాను అని అర్థం చేసుకోవచ్చు.

కాబట్టి రెండూ నిష్ఠలూ సరి అయినవే. ఈ రెండు నిష్ఠలలో ఒకటి కర్మయోగము. ఇది యోగులకు పరిమితము అయింది. దీనినే ప్రపంచంలో క్రియాశీలకంగా ఉండే విధానము. దీనినే ప్రవృత్తి మార్గము అని కూడా అంటారు. అంటే ప్రాపంచికవిషయములలో ఉండటం. అర్థము కామము వీటి కోసం ప్రయత్నించడం. రెండవ విధానము జ్ఞాన యోగము. వీరికి ప్రాపంచిక విషయముల మీద ఆసక్తి ఉండదు. ఎల్లప్పుడూ మనసును ఆత్మతో అనుసంధానం చేసి, ఆత్మజ్ఞానం కొరకు ప్రయత్నిస్తుంటారు. ఇది సాంఖ్యయోగులకు పరిమితమైనది. దీనిని నివృత్తి మార్గము అంటారు. ఎందుకంటే వీరు ఇదివరకే ప్రవృత్తి మార్గాన్ని దాటారు. అటువంటి వారికి ప్రాపంచిక విషయములలో, విషయ వాంఛలలో ఎటువంటి ఆసక్తి ఉండదు. నిర్లిప్తంగా ఉంటారు. దేని గురించి పట్టించుకోరు. ఆత్మగురించి ఆలోచిస్తుంటారు.

ఈ రెండింటినీ దృష్టిలో పెట్టుకొని జీవన విధానములను రెండు విధములుగా విభజించవచ్చు.

మొదటిది గృహస్థుగా ఉండి, నిష్కామ కర్మలు చేస్తూ, కర్మఫలముల మీద ఎటువంటి ఆసక్తి లేకుండా, మనసును శుద్ధి చేసుకొని, తరువాత వానప్రస్థమునకు వెళ్లి చివరకు సన్యాసము

స్వీకరించి, ముక్తిని పొందడం. దీనిని ప్రవృత్తి మార్గము అని అనవచ్చు. ఆ రోజుల్లో అయితే గృహస్థాశ్రమం కాగానే, కొడుకులకు బాధ్యతలు అప్పగించి, వానప్రస్థమునకు అంటే అడవులకు పోవడం తుదకు సన్యాసం స్వీకరించడం జరిగేది. దానిని ఈ రోజులకు అన్వయించుకుంటే, ఉద్యోగస్థులు కానీ, వ్యాపారవేత్తలు కానీ, రాజకీయ నాయకులు కానీ, 60 ఏళ్లు నిండగానే తమతమ వృత్తుల నుండి రిటైర్ అయి, ప్రాపంచిక విషయముల మీద ఆసక్తిని, అర్థ కామములను వదిలిపెట్టాలి.(మనకు ఈ విషయాన్ని గుర్తు చేయడానికే షష్ఠిపూర్తి మహోత్సవం ఏర్పాటు చేసారు.) దైవధ్యానం, పూజలు, వ్రతాలు చేయాలి. ప్రాపంచిక విషయాలలో ఆసక్తి వదిలిపెట్టాలి. నివృత్తి మార్గాన్ని అవలంబించాలి. మోక్షానికి బాటలు వేసుకోవాలి. కాని ఈ రోజులో ఆ పని ఎవరూ చేయరు, చేయడం లేదు. కొడుకులు, కూతుళ్లు, మనుమళ్లు, మనుమరాళ్లు వాళ్ల కోసం కూడా సంపాదించడం, వారికి సేవలు చేయడం, వారందరూ బయటకు షికార్లకు పోగానే, ఇంటికి కాపలాగా ఉండటం, వారు ఏమి చేసినా ఏమీ అనలేక మనసులోనే కుమిలిపోవడం, తన మాట ఎవరూ వినడం లేదని లేక పెద్దగా అరిచి బిపి పెంచుకోవడం, వీటితోనే సరి పోతుంది. (రిటైర్ మెంట్ తరువాత కూడా ఉద్యోగాలు చేసి సంపాదించే వాళ్లను మనం చూస్తూనే ఉన్నాము.) ఇంక వానప్రస్థము సన్యాసము ఎక్కడ. జీవితంలో ప్రశాంతత ఎక్కడ! కాబట్టి 60 తరువాత గృహస్తుగానే ఉండి నివృత్తి మార్గము అవలంబించాలి. అన్నిటినీ వదిలెయ్యాలి. అంటే అడవులకు పోకుండా కాషాయములుకట్టకుండా, నివృత్తి మార్గము అవలంబించడం అన్నమాట. అంటే ప్రాపంచిక విషయాలలో తిరుగుతూ కూడా అంటీ ముట్టనట్టు ఉండటం. తామరాకు మీద నీటిబొట్టు మాదిరి ప్రపంచంలో వ్యవహరించడం.

ఇంక రెండవ మార్గము...నివృత్తి మార్గము. బ్రహ్మచర్యము తరువాత గృహస్థ ఆశ్రమములోకి వానప్రస్థములోకి పోకుండా నేరుగా సన్యసించడం. ఇటువంటి వారు గత జన్మలలోనే ప్రవృత్తి మార్గంలో ఉండి, తమ ఆత్మలను పరిశుద్ధం చేసుకున్న వారు. అటువంటి వారికి తిరిగి గృహస్థ ఆశ్రమంతో పనిలేదు. ఈ విధంగా నివృత్తిమార్గంలోఉన్న సన్యాసి ప్రాపంచిక విషయములలో ఉండకూడదు. పట్టణములలోకి రాకూడదు. దేవాలయములలోనే ఉండాలి. ఇవి సన్యాసి మార్గములు.

ఇదే విషయాన్ని కృష్ణుడు మానవులు ఆచరించ వలసిన రెండు నిష్టలుగా చెప్పాడు. ఒకటి జ్ఞానయోగము సాంఖ్యయోగులకు, అంటే జ్ఞానముతో అనుసంధానింప బడ్డవారు. ఎవరైతే జ్ఞానము కావాలని కోరుకుంటారో, ఎవరుజ్ఞానము నందు రతులై ఉంటారో, ఎవరైతే సన్యాసము పుచ్చుకుంటారో, వారికి సాంఖ్యము చెప్పబడింది. దానిని నివృత్తిమార్గము అని పైనచెప్పుకున్నాము. రెండు కర్మయోగము యోగులకు చెప్పబడింది. యోగులు అంటే కర్మచేయదగిన వారు. కర్మలతో అనుసంధానింపబడ్డవారు. వీరింకా జ్ఞాన సాధనకు అర్హత సంపాదించలేదు. ముందు కర్మలు చేసి తరువాత జ్ఞానులు కావాలి. వీరికి ధనము మీద, కోరికల మీద ఆసక్తి పూర్తిగా పోదు. మనసు అటువైపు లాగుతూ ఉంటుంది. వారికికర్మయోగం చెప్పబడింది. నిష్కామంగా కర్మలు చేయడం,

శాస్త్ర శ్రవణం, ఇంద్రియనిగ్రహం మనోనిగ్రహం ఇలా పైపైకి ఎదగాలి. దీని తరువాత కర్మయోగము ఆవశ్యకత గురించి చెబుతున్నాడు పరమాత్మ.

## 4. న కర్మణా మనారంభా న్నైష్కర్మ్యం పురుషో2శ్నుతే। న చ సన్న్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి॥

పురుషుడు కర్మలు చేయకుండా అతనికి నైష్కర్మ్య సిద్ధి, ఆత్మజ్ఞానము లభించదు. అతనికి జ్ఞానముకూడా కలుగదు. కేవలం కర్మసన్యాసము వలన ఆత్మ జ్ఞానము, మోక్షసిద్ధి కలుగదు. కాబట్టి కర్మలుచేయడం ప్రతి మానవునికీ ఆవశ్యకము.

ప్రతి వాడూ తనకు విధింపబడిన కర్మలు చేయాలి. లేకపోతే అతనికి చిత్తశుద్ధి కలుగదు. కర్మలను వదిలిపెట్టి కేవలం జ్ఞాన మార్గమును అవలంబించినా ప్రయోజనము లేదు. కర్మలు చేయకపోవడం వలన జ్ఞాన సిద్ధి కలుగదు. మోక్షము లభించదు. నిష్కామ కర్మలు చేస్తూ మనస్సును పరిశుద్ధం చేసుకోవాలి. అప్పుడు శాస్త్రజ్ఞానము సంపాదించాలి. తరువాత మోక్షం కొరకు ప్రయత్నించాలి. కాబట్టి కేవలం కర్మలు వదిలిపెట్టి సన్యాసిగా మారి, సోమరిగా ఉన్నందు వలన ప్రయోజనము లేదు.

ప్రతి వాడూ తనకు విధింప బడిన కర్మలుచేయాలి కానీ ఆ కర్మలను ధర్మంగా, నిష్కామంగా చేయాలి. శ్రద్ధతో చేయాలి. ఎటువంటి ఆసక్తితో చేయకూడదు. అంటే ఈ పని నేనే చేయాలి, నా వలననే ఈ పని అవుతుంది, ఈ పనిచేస్తే నాకు ఇంత లాభం వస్తుంది అనే చింత ఉండకూడదు. అప్పుడే చిత్తశుద్ధి కలుగుతుంది. మనసు నిర్మలంగా లేకపోతే చిత్తము పరిశు ద్ధంగా లేకపోతే జ్ఞానము వంటబట్టదు. జ్ఞానము లేకపోతే మోక్షము లభించదు. కాబట్టి ప్రతి మానవుడు మొదట కర్మయోగముతోనే మొదలుపెట్టాలి. కర్మలు వదిలిపెట్టి సోమరులుగా ఉన్నందు వలన ప్రయోజనము లేదు. అటువంటి వారు ఇటు ప్రపంచానికి అంటే సమాజానికి పనికి రారు. అటు మోక్షమునకు పనికి రారు. రెండింటికి చెడ్డ రేవడ లాగా తయారవుతారు.

ప్రతి మానవుడు సత్వ, రజస్, తమో గుణములు అనే మూడుగుణములతో పుడతాడు. కాని కొందరిలో రజస్తమోగుణములు ఎక్కువగా ఉంటాయి. అటువంటి వారికి, నిష్కామ కర్మలు ఆచరించి నందువలన రజోగుణము, తమోగుణము నుండి నెమ్మది నెమ్మదిగా సత్వగుణము అలవడుతుంది. అక్కడి నుండి పరమాత్మ లక్షణమైన శుద్ధ సత్వగుణము అలవడుతుంది. అదే మోక్షమునకు మార్గము. కాబట్టి ప్రతి మానవునికి కర్మాచరణ చాలా ముఖ్యమైనది. కర్మలు చేసావా, విడిచిపెట్టావా అన్నది ముఖ్యం కాదు. నీ మనసు పరిశుద్ధం అయినదా లేదా అన్నది ముఖ్యము.

అప్పుడు జ్ఞానము సంపాదించడానికి అర్హత లభిస్తుంది. కాబట్టి ప్రతి మానవుడు తనకు విధించబడిన విద్యుక్తధర్మమును చిత్తశుద్ధితో ఆచరించాలి. అని భగవానుడు బోధించాడు.

ఈ శ్లోకంలో అనారంభాత్ అంటే ఏ కర్మనూ ఆరంభించకుండా ఉంటే అని అర్థం. అంటే ఏ పనీ చేయకుండా సోమరిగా ఉంటే అని భావము. అంటే చేయవలసిన పని చేయకుండా, చిత్తశుద్ధితో చేయకుండా, శాస్త్రములలో చెప్పబడిన వాక్యములను అడ్డుపెట్టుకొని అంతా భగవంతుడే చూసుకుంటాడు నేనేం చేయక్కరలేదు అంటూ వేదాంతాన్ని అడ్డుపెట్టుకొని  పనిదొంగ అవుతాడో వాడికి ఈ లోకంలో సుఖం ఉండదు. పరలోకంలో మోక్షమూ రాదు. అతడు నైష్కర్మ్య స్థితి అంటే స్థితప్రజ్ఞుడి స్థితి పొంద లేడు. కాబట్టి కేవలం కాషాయగుడ్డలు కట్టి సన్యాసము స్వీకరించినంత మాత్రాన, ప్రయోజనము లేదు. జ్ఞానము రాదు.  మోక్షము లభించదు అని పరమాత్మ అర్జునుడికి ఉపదేశించాడు.

కర్మలను చేయకకుండా వదిలిపెట్టి నంత మాత్రాన, కేవలం శాస్త్రములు చదివినంత మాత్రాన ఎవరికీ సిద్ధి లభించదు.  కర్మలను వదిలిపెట్టడం మంచిది కాదు. చెయ్యవలసిన కర్మలు అంటే కర్తవ్య కర్మలను చేస్తూ ఆత్మతత్వమును తెలుసుకోవాలి కానీ అన్నిటినీ వదిలిపెట్టి ముక్కుమూసుకొని కూర్చుంటే, కర్మలను వదిలి పారిపోతే కుదరదు. ధ్యానంలో కూర్చున్నా శరీరం ఇక్కడే ఉంటుంది.  మనసు ఎటోవెళ్లి పోతుంది. నిష్టకుదరదు. అంతేకాదు ఏకర్మ చేయకుండా, ఏ కర్మను ఆరంభించకుండా,  ఏ కర్మను ఆచరించకుండా, సోమరిగా కూర్చుంటే, ఏ పనీ చేయలేడు. అంతేకాదు,  తరువాతి స్థితి అయిన నివృత్తి మార్గమును కూడా చేరుకోలేడు. (కాషాయాలు ధరించి, స్వామీజీలుగా ఉంటూ, పాదపూజలకు, ప్రవచనాలకూ రేట్లుపెట్టి ధనం సంపాదిస్తూ, అనేక విమర్శలకు గురి అవుతున్న నేటి సన్యాసుల గురించి చెప్పేదేముంది. మీరే ఆలోచించుకోవాలి.)

కాబట్టి ముందు కర్మలు చేయాలి. అవీ నిష్కామంగా చేయాలి. ఇంద్రియనిగ్రహం మనోనిగ్రహం అలవరచుకోవాలి. శాస్త్రజ్ఞానము సంపాదించాలి. అప్పుడే నివృత్తిమార్గములో అడుగుపెట్టడానికి అనుమతి లభిస్తుంది. అంతే కానీ చెయ్యవలసిన కర్తవ్య కర్మలు మాని వేసి సన్యాసం తీసుకుంటే ఎవరూ సిద్ధిని పొందలేరు. ఎందుకు కర్మను వదిలిపెట్టకూడదు అనే దానికి సమాధానం తరువాతి శ్లోకంలో భగవానుడు ఇస్తున్నాడు.

## 5. న హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్।
## కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః॥

ఈ భూమిమీద పుట్టిన ప్రాణి ఏదైనా క్షణ కాలం కూడా కర్మచేయకుండా ఉండలేదు. ఇందులో ఎలాంటి సందేహము లేదు. మానవులు సత్వ,రజస్,తమోగుణములకు వశులై ఆ మూడు గుణములకు లోబడి కర్మలు చేయడం వారి విధి. కాబట్టి ప్రతి మానవుడు ప్రకృతి ధర్మములను అనుసరించి కర్మచేయక తప్పదు. కర్మలు చేయకుండా ఉండే స్వతంత్రత మానవునికి లేదు. మానవుడు కర్మలకు వశుడై ఉండాలి.

ఇక్కడ కర్మ అంటే మనం కాళ్లు చేతులు నోటితో చేసే కర్మలే కాదు. మనకు తెలియకుండానే గాలి పీలుస్తున్నాము. ఆకలి వేస్తే ఆహారం తింటున్నాము. దాహం వేస్తే నీరు తాగుతున్నాము. నడుస్తున్నాము. మాట్లాడుతున్నాము. ఏదో ఒక కర్మ చేస్తూనే ఉన్నాము. అందరూ సత్త్వ,రజస్తమోగుణములకు లోబడి కర్మలు చేస్తూనే ఉన్నారు. కాబట్టి కర్మలు చేయడం ప్రతి మానవుడి కర్తవ్యము. కానీ ఆ కర్మలు నిష్కామంగా చేస్తే వాటి ఫలితములు అతనిని అంటవు. దాని వలన మనస్సు, చిత్తము పరిశుద్ధము అవుతుంది. పూర్వజన్మవాసనలు తొలగి పోతాయి. మోక్షమునకు మార్గము దొరుకుతుంది.

ప్రకృతి జైర్గుణైః అంటే ప్రకృతి లో నుండి పుట్టిన సత్వ, రజస్తమోగుణముల వలన, ప్రతి వాడూ, అవశః అంటే వాటికి లోబడి, వాటికి వశుడై, కర్మ కార్యతే కర్మలు చేస్తున్నాడు. నేను ఏమీ చేయను అని కూర్చున్నా వాడి సహజ గుణములు వాడిని ఏదో కర్మచేయమని ప్రేరేపిస్తుంటాయి. టేబుల్ దగ్గర కూర్చుంటే పేపర్ వెయిట్ తిప్పడం, పెన్ నోట్లోపెట్టుకొని కొరకడం, షర్టు గుండీలు సర్దుకోవడం, టేబుల్ మీద వేళ్లతో కొట్టడం, లాన్‌లోకూర్చుంటే గడ్డిపీకడం, నోట్లోపెట్టుకొని కొరకడం, గోళ్లుకొరకడం, చేతులు నలుపుకోవడం ఇవన్నీ మానవుని స్వతస్సిద్ధ కర్మలు. వాటి వలన ఎలాంటి ప్రయోజనం ఉండదు కాని చేస్తుంటాము. ఇవి చిన్న చిన్న ఉదాహరణలు మాత్రమే. ఇది వరకు రాజులు ఏమీ తోచకపోతే వేటకు వెళ్లేవాళ్లు. లేకపోతే ఇతర రాజుల మీదికి యుద్ధానికి వెళ్లే వాళ్లు. వారిలో ఉన్న రజో తమోగుణములు ఎవరినీ ఊరికే ఉండనీయవు. ఏదో ఒక కర్మ చేయమని ప్రేరేపిస్తుంటాయి. కాబట్టి కర్మచేయకుండా ఉండటం ఎవరికీ సాధ్యం కాదు.

సత్వ, రజస్తమోగుణాలు ప్రకృతి నుండి పుట్టాయి. మానవుడు కూడా ఈ ప్రకృతి లోనుండి పుట్టాడు. కాబట్టి ఈ గుణాలు మానవులను ఆకర్షించి, వారిని కర్మలు చేయడానికి ప్రేరేపిస్తాయి. ఈ గుణాలు మానవునిలో ఉన్నంత వరకూ ప్రతి మానవుడూ కర్మలు చేస్తూ ఉండవలసిందే. ఎవరూ కర్మ చేయకుండా ఉండలేడు. కర్మలు చేయడం ప్రతి మానవుని సహజ

లక్షణం. మానవునికి ఇష్టం ఉన్నా లేక పోయినా, మానవుడు ఏదో ఒక కర్మ చేస్తూనే ఉండాలి కానీ ఏ కర్మాచేయకుండా ఉండటం అసాధ్యం.

ఈ శ్లోకంలో చెప్పబడిన కశ్చిత్ అంటే ఏ మనుష్యుడైనా అంటే సాధారణ మానవుడు, అజ్ఞానంలో ఉన్నవాడు, ఆత్మతత్వము తెలియని వాడు అని అర్థం. ఇక్కడ సాంఖ్యులు అంటే జ్ఞానులు జితేంద్రియులు అని అర్థం. యోగులు అంటే కర్మలను చేస్తూ ఉండే వాళ్లు. కర్మలు చేయడంలో నిమగ్నమై ఉండే వాళ్లు. జ్ఞానులను గుణములు ప్రభావితం చేయలేవు. వారు ప్రపంచంలో సంచరిస్తున్నా గుణములు వారిని అంటవు. అటువంటి వారికి కర్మయోగము అవసరం లేదు. నేరుగా సన్యాసము స్వీకరించి ముక్తిని పొందుతారు. కాని ఆత్మజ్ఞానము లేని వానికి, కర్మయోగము తప్పని సరి. అటువంటి వారు కర్మలను చేస్తూ ఉండాలి. వారు కర్మలు చేయకుండా ఒక్కక్షణం కూడా ఉండలేరు.

## 6. కర్మేన్ద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్।
## ఇన్ద్రియార్థాన్విమూఢాత్మా మిథ్యాచార స్స ఉచ్యతే॥

కొంత మంది బలవంతంగా ఇంద్రియములను నిగ్రహించి, ధ్యానంలో కూర్చుంటారు. కాని మనసు మాత్రం తన ఇష్టం వచ్చినట్టు తిరుగుతూ ఉంటుంది. అనేక విషయముల గురించి ఆలోచిస్తూ ఉంటుంది. అటువంటి వారు విమూఢాత్ములు. వారు చేసేది మిథ్యాచారము. ధ్యానము కాదు.

కేవలము బయట వాళ్లు తాను ధ్యానం చేస్తున్నాను అని అనుకోవాలని కొంత మంది ధ్యానం చేస్తుంటారు. కాని లోపల మనసుతో అన్ని రకాల విషయాల గురించి ఆలోచిస్తుంటారు. వారి మనసు భగవంతుని మీద నిలువదు. అటువంటి వారిది కృత్రిమ ధ్యానము. వారు మిథ్యాచారులు. మూఢులు. డాంబికులు. ఇతరుల మెప్పుకోసం ధ్యానం చేస్తున్నట్టు నటిస్తుంటారు.

ఇంద్రియములు మనసుతో కూడి నపుడే కర్మలు చేస్తుంటాయి. తమంతట తాము ఏమీ చేయలేవు. కాబట్టి కేవలం ఇంద్రియములను కట్టడి చేసినందువలన ప్రయోజనము లేదు. మనసును కూడా నిగ్రహించాలి. అప్పుడే ధ్యానం కుదురుతుంది. మనసును నిగ్రహించాలి అంటే ముందు మనం చేసే కర్మలు ధర్మబద్ధంగా, న్యాయబద్ధంగా, ఎటువంటి ఫలాపేక్షలేకుండా, కర్తృత్వ భావన లేకుండా చేయాలి. అప్పుడు మనసు నిర్మలంగా ఉంటుంది. అలా కాకుండా కేవలం

కాళ్లు చేతులు కదలకుండా కూర్చుంటే, మనసును దాని ఇష్టం వచ్చినట్లు తిరగనిస్తే, అది మిథ్యాచారము, డంబాచారము అవుతుందే కానీ ధ్యానము కాదు.

కొంతమంది ఉంటారు. మేము సన్యాసులము సన్యాసం స్వీకరించాము అని అంటారు. కాషాయములను కడతారు. ఇంద్రియములను నిగ్రహించి ధ్యానం చేస్తున్నట్టు నటిస్తారు. తాము యోగులము అంటారు. కాని వారి మనసు మాత్రం ప్రాపంచిక విషయములలో సంచరిస్తూ ఉంటుంది. అటువంటి వారిని మిథ్యాచారి డాంబికుడు అంటారే కానీ జ్ఞాని అనరు. ఇటువంటి వారు మనకు తరచు కనపడుతుంటారు. వారిని వేల కొద్దీ జనం అనుసరిస్తుంటారు. ఇటువంటి వారు బయట ప్రపంచంలో విరాగుల వలె, యోగుల వలె నటిస్తుంటారు. యతి వేషము సన్యాసుల వేషము వేసుకుంటారు. వారు పైకి సన్యాసుల వలె కనపడతారే కానీ వారి మనసులు మాత్రము విషయ వాసనలతోనూ, కామ వాంఛలతోనూ నిండి ఉంటుంది. ఇది పైకి తెలియకుండా సన్యాసి వేషం వేస్తారు, ఇంద్రియ నిగ్రహం ఉన్నట్టు నటిస్తారు. ఇటువంటి వారు తమను తాము మోసం చేసుకోవడమే కాకుండా ప్రజలను కూడా మోసగిస్తారు. దీని వలన ఎన్నో మానసికవ్యాధులు వస్తాయని మనస్తత్వశాస్త్రము తెలిసిన వారు చెబుతారు. కాని వీరి కపట వ్యాపారము ఎప్పుడో ఒకప్పుడు బయటపడక తప్పదు. ఇటువంటి వారికి ఎన్నటికి కూడా ఆత్మతత్వము బోధపడదు. వారికి ముక్తి ఎన్నటికీ రాదు. కాబట్టి ఈ శ్లోకంలో భగవానుడు బాహ్యఇంద్రియములను నిగ్రహించడమే కాదు, మనస్సు నిర్మలంగా ఉండటం, మనస్సును నిగ్రహించడం కూడా ప్రధానము అని చెప్పాడు.

## 7. యస్త్వి న్ద్రియాణి మనసా నియమ్యారభతేऽర్జున।
## కర్మేన్ద్రియై: కర్మయోగమసక్తస్స విశిష్యతే॥

కాబట్టి ఓ అర్జునా! ఎవరైతే తన ఇంద్రియములను మనస్సుతో నిగ్రహించి, ఆ నిగ్రహింపబడిన జ్ఞానేంద్రియ, కర్మేంద్రియములతో కర్మయోగమును ఎటువంటి ఆసక్తి లేకుండా ఆచరిస్తాడో, అతడిని విశిష్ఠపురుషుడు అని అంటారు.

అర్జునా! శరీరము, శరీర అవయవములనే కాదు, మనసును కూడా స్వాధీనంలో ఉంచుకోవాలి. ఇంద్రియములు మనసు చెప్పినట్టు వినాలి కానీ, ఇంద్రియములు చెప్పినట్టు మనసు వినకూడదు. అటువంటి నిగ్రహింపబడిన ఇంద్రియములతో నిష్కామ కర్మలు చేయాలి. చేస్తున్న పనికి ఫలితం ఆశించకూడదు. అప్పుడు ఆ కర్మ బంధనములు అతనిని అంటవు. కర్మల పట్ల ఆసక్తి, విషయవాంఛలు, మనసులో నుండి బయటకు నెట్టాలి. నిష్కామంగా, ఏ కోరికా లేకుండా, ఫలం

ఆశించకుండా, నేను చేస్తున్నాను అనే అహం లేకుండా ఏ పని చేసినా, ఆ కర్మలు అతనిని బంధించవు. అటువంటి కర్మలు చేసేవాడు విశిష్యతే అంటే శ్రేష్ఠమైనవాడు అని పిలువబడతాడు. నేను జ్ఞానిని, నేను ధ్యానం చేస్తున్నాను అంటూ కాషాయాలు కట్టుకొని, కళ్లు మూసుకొని కూర్చుని, మనసులో విషయవాంఛల గురించి ఆలోచించేవారి కంటే, తనకు విధింపబడిన కర్మలను, తనచే నిగ్రహింపబడిన ఇంద్రియములతో, నిష్కామంగా, ఫలాపేక్ష లేకుండా, అహంకారంలేకుండా చేసే వాడు ఎంతో ఉత్తముడు.

ఒకడు అజ్ఞాని. వాడికి ఏమీ తెలియదు. శాస్త్ర జ్ఞానము లేదు. వాడు ఈ ప్రపంచంలో తిరుగుతుంటాడు. కర్మలు చేస్తుంటాడు. కాని వాడి మనసు వాడి అధీనంలో ఉంటుంది. బుద్ధి చెప్పిన మాట వింటుంది. చేసే కర్మల ఫలితం ఆశించకుండా కర్మలు చేస్తాడు. అటువంటి వాడు, అన్ని శాస్త్రములు చదువుకొన్నప్పటికీ, మనసును అదుపులో ఉంచుకోలేని సన్యాసి కన్నా గొప్పవాడు. ఎందుకంటే, మన అవయవములు అంటే ఇంద్రియములు జడపదార్థములు. అవి మనసు ఎలా చెబితే అలా చేస్తాయి. మనస్సు యొక్క ఆజ్ఞలను పాటించడమే వాటి పని. మనసు బుద్ధి అలా కాదు. వాటికి ఆలోచించే శక్తి ఉంది. మంచి చెడు విచక్షణ ఉంది. ఇంద్రియముల చేత మంచి పనులు చేయించే బాధ్యత మనసుది. అదే పెడదారి పడితే మానవుడు ఎన్ని శాస్త్రములు చదువుకున్నా, పతితుడవుతాడు. దానికి మనసు చేయవలసిన పని, ఇంద్రియములను అదుపులో పెట్టడం, నిష్కామంగా కర్మ చేయడం, ఫలితాన్ని ఆశించకుండా కర్మచేయడం. నేను ఈ పని చేస్తున్నాను అనే భావన లేకుండా అంటే కర్తృత్వభావన లేకుండా కర్మచేయాలి. కాని ఇప్పటి సన్యాసులు మాత్రం అంతా తమ మీదనే నడుస్తూ ఉందని ఫీల్ అవుతుంటారు. అన్నిటికీ తామే కర్త కర్మ క్రియ గా వ్యవహరిస్తుంటారు. వీరు పేరుకే సన్యాసులు కాని విశిష్ఠ వ్యక్తులు కారు. పై శ్లోకంలో చెప్పినట్టు వీరంతా దంభాచారులు, కపటులు. అసలు కర్మయోగి ఎవరంటే మనసుతో ఇంద్రియములను అదుపులో ఉంచుకొని, ఆ అదుపులో ఉన్న ఇంద్రియములతో కర్మలు చేసేవాడు. కర్మఫలమును ఆశించని వాడు. ఎల్లప్పుడూ తన మనసును భగవంతుని యందే లగ్నం చేసే వాడు. అటువంటి వాడు సంసారి అయినా, సన్యాసి అయినా ఒకటే. ఈ ప్రపంచంలో తిరుగుతూ కర్మలు చేస్తున్నా, తామరాకు మీది నీటి బొట్టు మాదిరి సంచరిస్తుంటాడు. అతడే శ్రేష్ఠుడు.

### 8. నియతం కురు కర్మత్వం కర్మ జ్యాయో హ్యకర్మణః
### శరీరయాత్రాపి చ తే న ప్రసిద్ధ్యేదకర్మణః॥

అర్జునా! నీవు శాస్త్రములో చెప్పబడిన కర్మలను, నీవు చేయతగ్గ కర్మలను, నిర్వర్తించు. కర్మలు చేయకుండా ఊరికే సోమరిగా ఉండటం కన్నా కర్మలు చేయడమే ఉత్తమము. కనీసం నీ శరీర నిర్వహణ కోసమన్నా నీవు కర్మలు చేయక తప్పదు.

వేదాంత పరంగా చెప్పాలంటే, కర్మ అంటే కేవలం చేతులు కాళ్లు కదుపుతూ చేసే యాంత్రికమైన పని కర్మ కాదు. సక్రమంగా చేసే పని కర్మ అంటారు. సక్రమము అంటే సత్వగుణ ప్రధానము. ఏ కర్మ అయితే భౌతికమైన ఫలితం తో పాటు ఆధ్యాత్మికంగా మనకు లాభం చేకూరుస్తుందో, ఏకర్మ వ్యక్తిగత శ్రేయస్తే కాకుండా, సమాజ శ్రేయస్సుకూడా కలిగిస్తుందో, ఏ కర్మలో ధర్మముతో కూడిన అర్థము, కామము ఎక్కువగా ఉంటాయో, అదే సత్వగుణ ప్రధానమైన సాత్విక కర్మ. ఈ సాత్విక కర్మను, సాత్వికమైన బుద్ధితో ఆచరించడమే యోగము. అంటే ఏ పని చేసినా నేను చేస్తున్నాను అని కాకుండా, పరమాత్మ కొరకు ఈ పని చేస్తున్నాను అనే భావనతో చేయడం. చేసే ప్రతి పని దేవుని పూజ (వర్క్ ఈజ్ వర్షిప్) అనుకుంటూ చేయడం. ఆ కర్మయొక్క ఫలితాన్ని పరమాత్మకు అర్పించడం. దానినే కర్మయోగము అంటారు. అప్పుడు మనస్సు ప్రశాంతంగా ఉంటుంది. ఏ బంధనములు అంటవు. సాధారణంగా పూజలు, వ్రతాలు, సత్కర్మలు చేసిన తరువాత ఆఖరున ఈ కింది మంత్రమును చదువుతాము.

కాయేన వాచా మనసేంద్రియైర్వా బుద్ధ్యా22త్మానా వా ప్రకృతే స్వభావాత్
కరోమి యద్యత్ సకలం పరస్మై నారాయణాయేతి సమర్పయామి.

నేను నా శరీరముతో కానీ, మాటలతో కానీ, మనసుతో కానీ, బుద్ధితో కానీ, ప్రకృతి స్వభావంగా గానీ, ఏ కర్మచేసినా ఆ కర్మలన్నీ నారాయణుడికి సమర్పిస్తున్నాను.

ఈ శ్లోకం మనం సంధ్యావందనంలో కూడా ఆఖరున చదువుకుంటాము. కానీ అర్థం తెలియదు. ఆ శ్లోకము యొక్క అర్థమే భగవద్గీతలో భగవానుడు చెబుతున్నాడు. అప్పుడు మనం చేసిన కర్మకు ఎటువంటి ఫలితం వచ్చినా దానిని భగవంతుని ప్రసాదంగా స్వీకరిస్తాము. సుఖము దు:ఖము సమానంగా అనుభవిస్తాము ఎందుకంటే అది భగవంతుని ప్రసాదం కాబట్టి. ఈ నేపథ్యంలో మనం రాబోయే శ్లోకాలు అర్థం చేసుకోవాలి.

ప్రతి వాడికీ తాను ఏమి చేయాలో తనకు తెలియదు. అందుకని శాస్త్రములను ఆశ్రయించాలి. అందులో చెప్పినట్టు చేయాలి. అందుకని కృష్ణుడు ఇలా అన్నాడు. "అర్జునా! నేను యుద్ధము చేయను, భిక్షాన్నము తింటాను, సన్యాసం తీసుకుంటాను అని నీవు అన్నావు. కాని అవి క్షత్రియధర్మములు కావు. శాస్త్రసమ్మతములు కావు. నీకు నియమింపబడిన కర్మ యుద్ధం చేయడం. ఏ కర్మాచేయకుండా సన్యాసము తీసుకోడం కంటే నీ స్వధర్మమయిన యుద్ధం చేయడం ఎంతో మేలు. నీవు యుద్ధం చేయపోతే నీకు తోచదు. నీవు ప్రశాంతంగా జీవించలేవు. నేను చేస్తున్నాను అనే అహంకారం లేకుండా, నిష్కామంగా,సమాజహితం కోరి, ఈ యుద్ధంచెయ్యి. నా వాళ్లందరూ మరణిస్తారు అనే ఫలాపేక్షలేకుండా, యుద్ధం చెయ్యి. ఫలితం పరమాత్మకు అర్పించు. నీ కర్తవ్యం నీవు నిర్వర్తించు. ఇక్కడ యుద్ధం జరుగుతుంటే నీవు నీ మందిరంలో చేతులు ముడుచుకొని

కూర్చోలేవు. అది నీ తరం కాదు. నీ దేహం నీకు సహకరించదు. ఎందుకంటే యుద్ధం చేయడం నీ ధర్మం. నీ కర్తవ్యకర్మనుండి నీవు తప్పించుకోలేవు. నీ కర్తవ్య కర్మ ఏమిటో అది శాస్త్రమే నిర్ణయం చేస్తుంది. వాటిని నీవు ఆచరిస్తే చాలు. వేదములు, శాస్త్రములు క్షత్రియునకు యుద్ధము కర్తవ్య కర్మగా విధించింది. ఆ కర్తవ్య కర్మను నీవు నిర్వర్తించు. ఫలితాన్ని నీవు స్వీకరించకు. పరమాత్మకు అర్పించు. పరమాత్మకు అర్పించింది ప్రసాదము అవుతుంది. దానిని నీవు స్వీకరించినా తప్పులేదు. నీకు ఏదోషమూ అంటదు." అని బోధించాడు పరమాత్మ.

.

. చేయాల్సిన కర్మ అంటే విహితకర్మ. ఈ విహిత కర్మను చేయకపోవడం కూడా పాపమే. శరీరం నిర్వహణ చక్కగా సాగాలంటే కర్మలు చేయాల్సిందే. ఏ మనిషికైనా కర్మలు చేయకుండా ఉండటం సాధ్యమయ్యే పనికాదు. ఏ కర్మాచేయకుండా ఉండటం కంటే నీవు ఏది చేయాలో దానిని చేయడం నీ ధర్మం. ఏ పనీ చేయకుండా సోమరిగా ఉండటం కూడా పాపమే అని అర్థం వచ్చేటట్టు చెబుతున్నాడు కృష్ణుడు.

ప్రతి వ్యక్తి కొన్ని కర్మలు చేయక తప్పదు. వాటినే నిత్య కర్మలు, నైమిత్తిక కర్మలు అని అంటారు. నిత్య కర్మలు అంటే కాలకృత్యాలు తీర్చుకోవడం, స్నానం చేయడం, సంధ్యావందనం చేయడం, వ్యాయామం చేయడం, దేవతారాధన చేయడం, మనకు అప్పగించిన ఉద్యోగం చేయడం, తీరికవేళల్లో శాస్త్రపఠనం, సత్సంగము, వేళకు భోజనం చేయడం, వేళకు నిద్ర పోవడం. వీటినే నిత్య కర్మలు అంటారు. ఇంక నైమిత్తిక కర్మలు అంటే ఏదో ఒక నిమిత్తం అంటే కారణంతో చేసేవి, పండుగలు జరుపుకోవడం, శివరాత్రి, కార్తీకమాసం, మాఘస్నానాలు, సత్యనారాయణ స్వామి వ్రతాలు, గణపతిపూజలు, నవరాత్రిపూజలు, పితృకార్యములు, ఇలాంటివి. ఇవి అన్నీ ప్రతి వ్యక్తి చేయవలసినవి. సమాజంలో బతుకుతున్న ప్రతి వ్యక్తి వీటిని చేయకుండా తప్పించుకోవడం ఎవరికీ సాధ్యం కాదు. కాబట్టి కర్మలు చేయకుండా ఎవరూ ఉండలేరు.

మానవులలో మూడు గుణాలుఉన్నాయి ఆ గుణాలను బట్టి కర్మలు చేస్తుంటారు. సాత్విక గుణం ఎక్కువగా కలవారు తాము చేయవలసిన కర్మలను చేస్తారు. అనవసరమైనకర్మలు, చేయకూడని కర్మలు చేయరు. లోకంలో సంచరిస్తూ కూడా అంటీ అంటనట్టు కర్మలు చేస్తుంటారు. తాము చేసే కర్మల వలన తమకే కాకుండా సమాజానికి కూడా లాభం కలగాలి అని ఆలోచిస్తారు. రెండవ రకం వారు రజోగుణప్రదానులు. ఇటువంటి వారు ఏ పనీ చేయకుండా ఉండలేరు. ఏదో ఒకపని చేస్తారు. అది సకామకర్మగానీ, నిష్కామ కర్మగానీ, మంచి పని గానీ, చెడ్డ పనీ గానీ, ఏదో ఒక పని చేస్తుంటారు. కాని, ఆ కర్మను తమ స్వార్థం కోసమే చేస్తారు. ఇతరుల గురించి, సమాజం గురించి పట్టించుకోరు. ఇంక మూడవ రకం తమోగుణ ప్రధానులు. తాము చేయవలసిన పనులు తప్ప ఇతర పనులలో ఆసక్తి కలిగిఉంటారు. ఇతరులు ఏమైనా పర్వాలేదు, తాము మాత్రం బాగుపడాలి అని కోరుకుంటారు. కొన్నిసార్లు ఏపనీ చేయరు. పని అంటే గిట్టదు. తమకు పనిగండం

ఉందంటారు సోమరిగా తిరుగుతుంటారు. తేలికగా ధనం సంపాదించడం, సుఖాలు అనుభవించడం వీరి అభిమతం. ఇటువంటి వారు మనకు తరచు కనిపిస్తారు.

కాబట్టి, చేయ వలసిన పనులు చేయడం, చేయకూడని పనులు చేయకపోవడం, ఏ పని చేసినా దానిని శ్రద్ధతో, ఫలితం ఆశించకుండా చేయడం, అత్యంత శ్రేష్టము. కాని కొంతమంది ఏ పని చేయడానికి ఇష్టం లేక, ఒక వితండ వాదం చేస్తుంటారు. పనులు చేస్తే బంధనములు కలుగుతాయి. కాబట్టి ఏ పనీ చేయకుండా ఉంటే బంధనములు, వాసనలు కలుగవు కదా అని వాదిస్తుంటారు. అటువంటి వితండ వాదుల కోసమే ఈ శ్లోకము చెప్పబడింది. మానవుడు ఏ పనీ చేయకుండా ఉండలేడు. కాకపోతే చేసే కర్మలు స్వార్థబుద్ధితో కాకుండా, నిష్కామంగా, కర్తృత్వభావన లేకుండా చేస్తే, చేసిన కర్మలయొక్క ఫలములు పరమాత్మకు అర్పిస్తే, ఆ కర్మలయొక్క బంధనములు అంటవు అని చెప్పాడు పరమాత్మ

## 9. యజ్ఞార్థాత్కర్మణో2న్యత్ర లోకో2యం కర్మబన్ధనః। తదర్థం కర్మ కౌన్తేయ ముక్తసఙ్గస్సమాచర॥

యజ్ఞార్థము(ఇతరుల కొరకు, సమాజం కొరకు, ఎటువంటి ఫలాపేక్ష, సంగము లేకుండా, నిష్కామంగా) చేసే కర్మలు కాకుండా ఇతర కర్మలనే చేయడం వలన మానవులు కర్మబంధనములలో చిక్కుకుంటారు. కాబట్టి ఓ అర్జునా! నీవు కూడా ఎటువంటి ఆసక్తి, అనురక్తి లేకుండా నీ విధిని నీవు నిర్వర్తించు. అప్పుడు నీకు కూడా ఎటువంటి బంధనములు అంటవు.

ఈ శ్లోకంలో యజ్ఞము అంటే మనం సామాన్యం గా వాడుకొనే అర్థం కాదు. మనం యజ్ఞము అంటే అగ్నిహోత్రము, దాని చుట్టు ఋత్విక్కులు కూర్చుని అందులో సమిధలు వేయడం, వేదమంత్రములు వల్లించడం, ఆహుతులు సమర్పించడం, దానిని ఒక క్రియగా చేయడం. కాని ఇక్కడ యజ్ఞము అంటే ఏ కర్మ అయినా లోక హితము కొరకు, స్వార్థమును వదిలిపెట్టి, శ్రద్ధతో, భక్తితో, నిష్కామంగా, ఒక భగవతారాధనగా చేస్తే దానిని కూడా యజ్ఞము అని అంటారు. పైన చెప్పబడిన యజ్ఞయాగములు చాలా వ్యయముతో కూడినవి. కాని ఈ యజ్ఞమునకు ఎటువంటి ఖర్చులేదు. ఎవరైనా చేయవచ్చు. పైన చెప్పినట్టు, ఏ కర్మ చేసినా దానికి లభించే ఫలము బంధనములు కలుగజేస్తుంది అని అందరూ అనుకుంటారు. ఎందుకంటే సాధారణంగా మానవులు పూజ చేసినా, వ్రతము చేసినా, ఏదో ఒక ఫలితం కోరుకుంటూనే చేస్తారు కానీ ఊరికే చేయరు. ఆ కర్మల వలన పుణ్యం వస్తుంది కానీ ఆ పుణ్య ఫలములను అనుభవించడానికి మరొక జన్మ తప్పదు. అందుకని అసలు పూజలు వ్రతాలు చేయకుండా ఉంటే సరి అని కొందరు అనుకుంటూ

ఉంటారు. అది తప్పు అని చెప్పాడు పరమాత్మ. సకామంగా, ఫలమునుకోరి చేస్తేనే, ఆ కర్మ బంధనములు కలుగచేస్తుంది. నిష్కామంగా, పరహితం, సమాజహితం కోరి చేసే కర్మ, ఏ పని చేసినా అది పరమాత్మకు చేసే పూజ అనే భావనతో చేసే కర్మ, ఎటువంటి బంధనములు కలుగజేయదు. క్లుప్తంగా చెప్పాలంటే ఆసక్తితో ఫలము కోరిచేసే కర్మ బంధనములు కలుగజేస్తే, నిరాసక్తంగా, ఏ ఫలము కోరకుండా, వచ్చిన ఫలములు పరమాత్మకు అర్పిస్తే ఆ కర్మ అతనికి ఎటువంటి బంధనములు కలిగించదు. కర్మయోగంలో ఈ యుక్తిని పాటిస్తే ఏ కర్మచేసినా ఎటువంటి బంధనములు కలుగవు. అప్పుడు ఏ కర్మ చేసినా అది భగవంతుని ఆరాధన అవుతుందేతప్ప బంధనము కాదు. అటువంటి కర్మలు మనసును నిర్మలం చేసి మోక్షానికి మార్గం చూపుతాయి.

ఇంకా వివరంగా చెప్పుకోవాలంటే మనం ఏ పని చేసినా, అది చదువుకానీ, ఉద్యోగం కానీ, వ్యాపారం కానీ, రాజకీయం కానీ ఏది చేసినా ఒక యజ్ఞంలాగా చేయాలి. యజ్ఞము అంటే శ్రద్ధతో చేసే కర్మ, భగవంతుని పరంగా చేసే కర్మ. దీనిని యజ్ఞము అని అంటారు. కాబట్టి ఏ పని చేసినా శ్రద్ధతో, భగవంతుని పరంగా, ఫలితాన్ని ఆశించ కుండా, ఆ పని నేను చేస్తున్నాను అని ఆసక్తి లేకుండా, సమాజహితంకోరి చేస్తే ఆ కర్మ యజ్ఞముతో సమానము. దానివలన ఎటువంటి బంధనములు కలుగవు. అలా కాకుండా ఈ పని చేస్తే ఈ ఫలితం వస్తుంది, ఇది నేనే చేస్తున్నాను. ఈ పని నేను తప్పవేరే ఎవరూచేయలేరు.ఈ పనికి కర్త కర్మ క్రియ అంతా నేను అనే అహంకారంతో చేస్తే ఆ పని తప్పకుండా బంధనాలను కలుగజేస్తుంది. ఆ పని చేసిన మానవుడు బంధనములలో చిక్కుకుంటాడు. కాబట్టి అర్జునా నీ కర్తవ్య కర్మను, ఎటువంటి ఫలాపేక్ష లేకుండా, కర్తవ్యనిష్టతో. ఫలితం భగవంతునికి అర్పించి చేస్తే ఆ కర్మ ఎటువంటి బంధనములను కలుగచేయదు అని హామీ ఇచ్చాడు భగవానుడు.

ఇక్కడ ఆసక్తి, సంగమము అంటే ఈ పని నేను చేస్తున్నాను, ఈ ఫలితం నాది అనే భావన. యజ్ఞము అంటే శ్రద్ధతో చేసే ఏపని అయినా యజ్ఞమే. ఏ పని చేసినా త్యాగబుద్ధితో చేయాలి కానీ స్వార్ధ బుద్ధితో చేయకూడదు. స్వార్ధ బుద్ధితో చేస్తే బంధనములు తప్పవు. కాబట్టి మానవుడు ఏపనీ చేయకుండా ఉండటం కన్నా, అన్ని పనులు నిస్వార్ధంగా, కర్తవ్యతా బుద్ధిలేకుండా, నిష్కామంగా భగవంతుని పరంగా చేస్తే అతనికి ఏ బంధనాలు కలుగవు.

ఇందులో మరొక సూక్ష్మం కూడాఉంది. చూడటానికి ఒకటే కర్మ లాగా కనిపించినా, ఆ కర్మ సంగరహితంగా, ఫలాపేక్ష లేకుండా, భగవంతుని పరంగా, ఉపకార బుద్ధితో, సమాజశ్రేయస్సు గురించి చేస్తే బంధములను కలిగించదు. అదే కర్మ స్వార్ధం కోసం, ఫలితాన్ని ఆశిస్తూ ఆసక్తితో, చేస్తే అది బంధనములను కలుగజేస్తుంది. కాబట్టి మానవులు తాము చేయబోయే కర్మల యొక్క

స్వభావమును తెలుసుకొని కర్మలు చేయాలి. కేవలం భగవంతుని కొరకు, ఎటువంటి ఫలాపేక్ష లేకుండా, సమాజ హితము కొరకు, ఉద్దేశింప బడిన కర్మలే శ్రేష్ఠములు. ఆ కర్మలు ఎంత చిన్నవైనా, పెద్దవైనా, ఏ ఫలితం ఆశించకుండా, వాటిని భగవతారాధనగా చేస్తే అదే ఒక మహాయజ్ఞంగా మారిపోతుంది. చేసిన వారికి శ్రేయస్సును కలుగజేస్తుంది. అదే స్వార్థబుద్ధితో చేసే కర్మలు బంధనకారకములు. అందుకే మనం ఏ పని చేసినా దానిని పరమాత్మకు అర్పించాలి. ఆ పనికి ఏ ఫలితం వచ్చినా దానిని పరమాత్మ యొక్క ప్రసాదంగా స్వీకరించాలి. ఇలా చేస్తే ఏ చిక్కు ఉండదు. మనసు ప్రశాంతంగా ఉంటుంది. అందుకే కృష్ణుడు అర్జునునితో ఎటువంటి ఫలాపేక్ష లేకుండా, నేను చేస్తున్నాను అనే భావనను విడిచిపెట్టి, అది తన విద్యుక్తధర్మము అని యుద్ధం చేయమన్నాడు కానీ హింసచేయమనలేదు.

## 10. సహ యజ్ఞా: ప్రజాస్సృష్ట్వా పురోవాచ ప్రజాపతి:।<br>అనేన ప్రసవిష్యధ్వమేషవో2స్త్విష్టకామధుక్॥

కల్పాదియందు బ్రహ్మదేవుడు యజ్ఞసహితముగ ప్రజలను సృష్టించి, మీరు ఈ యజ్ఞములద్వారా వృద్ధిచెందుడు. ఈ యజ్ఞములు మీకు కామధేనువు వలె కోరిన కోర్కెలనెల్ల తీర్చును అని చెప్పాడు.

ఈ సృష్టి ఆరంభంలో బ్రహ్మగారు ప్రజలను సృష్టించాడు. వెంటనే వారు చేయవలసిన కర్మలను సృష్టించాడు. వాటినే యజ్ఞములు అన్నారు. ఈ యజ్ఞముల ద్వారా అంటే కర్మల ద్వారా వృద్ధిచెందండి అని ప్రజలను ఆదేశించాడు. ఈ యజ్ఞములు మీకు సకలమైన కోరికలు తీరుస్తాయి. ఈ యజ్ఞములు కామధేనువు లాంటివి అని చెప్పాడు. దీనికి సాధారణంగా అర్థం చెప్పుకోవాలంటే ఏ వ్యక్తి అయినా, పుట్టగానే వాడు చేయవలసిన కర్మ కూడా పుడుతుంది. అది మంచి కర్మ కావచ్చు చెడు కర్మ కావచ్చు. ఆ వ్యక్తి తనలో ఉన్న గుణములను బట్టి ఆ కర్మలు చేస్తాడు. ఆ కర్మలు అతనికి కామ ధేనువు వలే తగిన ఫలితములను (మంచి గానీ, చెడు గానీ) ఇస్తాయి. చేసే కర్మలను ఒక దేవతారాధన మాదిరి, ఫలితం ఆశించకుండా చేస్తే ఆనందం, శాంతి కలుగుతుంది. అలా కాకుండా తమ ఇష్టం వచ్చినట్టు చేస్తే సుఖము, దు:ఖము, బంధనములు కలుగుతాయి.

మానవులు సృష్టించబడి నపుడు వారి వెంట వారు చేయవలసిన కర్మలు కూడా సృష్టించబడ్డాయి. కర్మలు చేస్తే ఫలములు వస్తాయి. ఆ కర్మఫలములు బంధనములను కలిగిస్తాయి. ఆ కర్మ బంధనములలో చిక్కుకోకుండా ఉండే సాధనములు కూడా వేదములలో శాస్త్రములలో వివరించబడ్డాయి. ఆ సాధనములే యజ్ఞములు. ఆ రోజుల్లో యజ్ఞములను వేదములలో చెప్పబడిన కర్మకాండల ననుసరించి చేసేవారు. కాని ఈ రోజుల్లో యజ్ఞము అంటే సాటి ప్రజలకు ఉపయోగపడే

స్వార్ధరహితమైన కర్మ అని అర్థం చెప్పుకోవచ్చు. ఆ కర్మ కూడా భగవంతుని పరంగా చేయాలి. పరోపకారం కొరకు చేయాలి. నిష్కామంగా చేయాలి. నేను చేస్తున్నాను అనే కర్తృత్వ భావన లేకుండా చేయాలి. ఇటువంటి కర్మలు కామ ధేనువుల వంటివి. కామధేనువు అంటే కోలిన కోరికలు తీర్చేది. అలాగే ఇటువంటి కర్మలు మంచి ఫలితములను ఇస్తాయి. ఇటువంటి పనులు చేయడం వలన ఆత్మ సంతృప్తి కలుగుతుంది. అనేక దు:ఖముల నుండి విముక్తి కలుగుతుంది. మానవునిలో నైతిక విలువలుపెరుగుతాయి. ఆధ్యాత్మికత పెరుగుతుంది. ముఖ్యంగా మనసుకు శాంతి కలుగుతుంది.

ఈ రోజుల్లో ఎంత ఆస్తి, అంతస్తు, హెూదా, పదవి ఉన్నా, ప్రతి వాడికీ మనశ్శాంతి కరువవుతూ ఉంది. అనేక అక్రమాలు చేసి, అవస్థలు పడి సంపాదించిన ధనం అంతా మనశ్శాంతి కోసం ఖర్చుపెడుతున్నారు. ధర్మపరంగా నిష్కామ కర్మలు, ఫలాపేక్షలేకుండా, కర్తృత్వభావన లేకుండా చేస్తే మనశ్శాంతి దానంతట అదే లభిస్తుంది. మనశ్శాంతి కోసం ఎక్కడెక్కడో బతికిన బాబాల చుట్టు తిరగ నవసరం లేదు. ఇక్కడ కర్మలు, యజ్ఞములు అంటే ఇది వరకు అధ్యాయములలో చెప్పబడిన నిష్కామ కర్మ, నిస్వార్థకర్మ, కర్తృత్వభావనలేని కర్మ, అని అర్థం చేసుకోవాలి.

## 11. దేవాన్భావయతానేన తే దేవా భావయన్తు వ:।
## పరస్పరం భావయన్త: శ్రేయ: పరమవాప్స్యథ॥

యజ్ఞముల ద్వారా మీరు దేవతలను తృప్తిపరచుడు. ఆ దేవతలు మీకు మేలు చేస్తారు. ఈ విధంగా మీరు పరస్పరము సంతృప్తిపరచుకొనుచు పరమ శ్రేయస్సును పొందగలరు.

ఈ శ్లోకంలో దేవతలు అనే పదం వాడారు పరమాత్మ. దేవతలు అంటే మంచి వాళ్లు. ధర్మపరులు అని కూడా అర్థం. సాత్విక గుణం కలవారందరూ దేవతలే. అందరిలో పరమాత్మ ఆత్మస్వరూపుడుగా వెలుగుతున్నాడు. సాత్విక గుణం కల దేవతలలో ఇంకా ప్రకృష్టంగా ప్రకటితమౌతుంటాడు. దేవతలు ఎక్కడో ఉన్నారు అని అనుకుంటే సకలదేవనమస్కార: కేశవం ప్రతిగచ్ఛతి అని వేదవాక్యము. కాబట్టి మనం ఏ దేవుడిని ఏ దేవతలను ఆరాధించిన అది పరమాత్మను ఆరాధించినట్టే. ఏయే దేవతలను ఆరాధిస్తే, ఆయా ఫలములు మనకు లభిస్తాయి. దేవతారాధన కూడా ఒక యజ్ఞమే. ముందు శ్లోకంలో చెప్పినట్టు ఏ యజ్ఞము కానీ, కర్మ కానీ స్వార్థబుద్ధితో కాకుండా సమాజహితం కొరకు చేస్తే, అది కూడా దేవతారాధన కిందికే వస్తుంది. మంచి ఫలితములను ఇస్తుంది. దాని ద్వారా జ్ఞానం కలుగుతుంది. ఆ జ్ఞానం మోక్షానికి దారితీస్తుంది. కాబట్టి పరమాత్మ పరంగా చేసే ఏ పని అయినా అది యజ్ఞమే.

ఇది వరకు యజ్ఞములు చేసే వారు అని చెప్పుకున్నాము కదా. ఆ యజ్ఞములలో వివిధములైన సమిధలను, ఓషధులను వేసే వారు. ఆ ఓషధులు కాలి వాటినుండి ధూమము పైకి లేచేది. ఆ ధూమముపైన ఉన్న మేఘములతో చేరి, మనకు వర్షములు కురిసేటట్టు చేసేది. ఆషాఢ,శ్రావణ,భాద్రపద,ఆశ్వయుజ మాసములు యతులు, మునులు అందరూ చాతుర్మాస్య వ్రతం చేసేవారు. అప్పుడు ప్రతిరోజూ హెూమము చేసేవారు. యజ్ఞములు చేసేవారు. యజ్ఞకుండములో ఎన్నో ఓషధులను, నేతిని, సమిధలను వేసేవారు. వాటి నుండి వెలువడిన ధూమం పైకి లేచి ఎక్కడెక్కడో ఉన్న మేఘములను ఒక చోటకు చేర్చి వర్షములు కురిపించేవి. అందుకే ఆ నెలలలో వర్షములు కురిసేవి. పంటలు పండేవి. ధన,ధాన్యములు సమృద్ధిగా సమకూరేవి. మరి ఇవన్నీ దేవతలు మనకు ఇచ్చిన వరాలు కాదా! ఈ రోజుల్లో యజ్ఞయాగాలు లేవు కానీ మేఘమధనాలు జరుగుతున్నాయి. మేఘాలను ప్రార్థించి, ఆవాహన చేస్తే వర్షాలు కురుస్తాయి కానీ మథిస్తే వర్షాలు కురుస్తాయా. అందుకే మేఘమథనాలు సత్ఫలితాలు ఇవ్వడం లేదు.

ఈ శ్లోకంలో దేవాన్ అని వాడారు. దేవాన్ అంటే దేవతలు. అంటే ప్రకృతి శక్తులు. దివ్ అనే ధాతువునుండి దేవత, దైవము అనే మాటలు వచ్చాయి. దివ్ అంటే ప్రకాశము, ప్రకాశించేది. మన జీవితాలను ఐదుగురు దేవతలు ప్రకాశింపచేస్తున్నాయి. వారే భూమి, గాలి, నీరు, అగ్ని, ఆకాశము. వీటిని మనం దైవీభావనతో దేవతలుగా పూజిస్తాము. భూదేవి, వాయు దేవుడు, అగ్నిదేవుడు, వరుణదేవుడు, ఆకాశమే విష్ణుస్వరూపము అంటే ఆకాశము అనంతము, సర్వవ్యాపి. భూమి నుండి మనకు లభించని పదార్థము లేదు. మనం తినే ఆహారము, కట్టుకునే బట్టలు, ధరించే ఆభరణాలు అన్నీ భూమాత ఇచ్చినవే. ఇంతెందుకు మనం నిలబడాలంటే భూదేవి ఆధారము. అలాగే వాయువు. కాసేపు గాలి ఆడకపోతే చచ్చిఊరుకుంటాము. కాస్త ఎక్కువగా గాలి కొడితే చెట్లు,స్తంభాలు పడి జనజీవనం అస్తవ్యస్తము అవుతుంది. అగ్ని మన శరీరంలో ఉండే వేడి, జఠరాగ్ని. టెంపరేచరు హెచ్చినా తగ్గినా మరణం తథ్యం. అలాగే ఆహారం తయారు చేసుకోడానికి, వెలుగుకొరకు, ఇంకా ఇతర అవసరాలకు అగ్ని అవసరము. వరుణుడు వానలు సకాలంలో కురవకపోయినా, అకాలంలోకురిసినా, ఎక్కువకురిస్తే పంటలు నాశనం, తక్కువ కురిస్తే పంటలు ఎండి పోతాయి. అలాగే ఆకాశము. అంటే స్పేస్ మన ఊపిరితిత్తులలో ఖాళీలేకపోతే ఊపిరి లోపలకు పోదు. పొట్టలో ఖాళీలేకపోతే అన్నం లోపలకు పోదు. ఆకాశం లేకపోతే మనిషిలో కదలికే లేదు. కాబట్టి ఈ శక్తులన్నీ తమ తమ శక్తులతో, ప్రకాశంతో మన జీవితాలను సుఖమయం చేస్తున్నాయి. అందుకే మనం ప్రకృతిని దేవతా రూపంలో ఆరాధించమని మనకు శాస్త్రములు ఉపదేశించాయి.

దేవా భావయంతువ: అంటే ఆ ప్రకృతి దేవతలు మీకు నిరంతరం మేలు చేస్తాయి. అంటే ఈ ప్రకృతి శక్తులన్నీ మనలను మన జీవితాలను సక్రమమైన మార్గంలో నడిపిస్తున్నాయి. దానికి మనం ఏం చేయాలి. మనం కూడా వాటి మీద కృతజ్ఞతాభావంతో వాటిని ఆరాధించాలి. కాని మనం మాత్రం ప్రకృతి శక్తులను ఆరాధించకపోగా, శాయశక్తులా ప్రకృతి శక్తులకు హాని

చేస్తున్నాము. జలాన్ని, వాయువును కలుషితం చేస్తున్నాము. చెట్లను నరుకుతున్నాము. భూమికి చిల్లులు పొడుస్తున్నాము. ఆకాశం అంతా పొగతో, ధూళితో, కలుషిత పదార్థములతో నింపుతున్నాము. దీని ఫలితంగా వర్షాలు సకాలంలో కురవడం లేదు. భూగర్భజలాలు ఎండిపోతున్నాయి. ఉన్నా కలుషితం అవుతున్నాయి.

కాబట్టి మనం ప్రకృతిని ప్రకృతి దేవతలను ఆరాధించడం నేర్చుకోవాలి. ఎలా అంటే ప్రకృతి శక్తులు ఏ భావనతో మనకు అన్నీ సమకూరుస్తున్నాయో, అదే భావన మనమూ కలిగి ఉండాలి. అంటే ప్రకృతి శక్తులు మనల నుండి ఎటువంటి ప్రత్యుపకారము ఆశించకుండా మనకు ఉపకారము చేస్తున్నాయి. మనకు కావలసినవి అన్నీ సమకూరుస్తున్నాయి. మనం కూడా అదే భావనతో ఉండాలి. మనం చేసే కర్మలు అన్నింటినీ సమాజ హితం కొరకు, పరోపకారం కొరకు ప్రత్యుపకారము ఆశించకుండా, ఒక యజ్ఞంలాగా చేయాలి. అదే మనం ప్రకృతి శక్తులను ఆరాధించే విధానము.

ఆ ప్రకృతి శక్తులు ఏ భావనతో ఉన్నాయో అదే భావనతో మనం కూడా ఉంటే మనం ప్రకృతిని, ప్రకృతి దేవతలను పూజించినట్టే. ప్రకృతి శక్తుల భావన ఏమిటి అని ప్రశ్నించుకుంటే అవి మానవాళికి ప్రతిఫలం కోరకుండా నిరంతరం ఉపకారం చేస్తున్నాయి. వాయుదేవుడు మనకు ప్రాణవాయువు ఇస్తున్నాడు. వరుణ దేవుడు వర్షాలు కురిపించి పంటలు పండిస్తున్నాడు. దాహం తీరుస్తున్నాడు. అగ్నిదేవుడు సముద్రము నీటిని ఆవిరిగా మార్చి, మనకు వర్షాలు కురిపిస్తున్నాడు. మనం తినడానికి ఆహారం పచనం చేస్తున్నాడు. మనం బతకడానికి శరీరంలో కావాల్సిన ఉష్ణోగ్రత సమకూరుస్తున్నాడు. భూదేవి మనకు ఖనిజముల రూపంలోసంపదలను ఇస్తూ ఉంది. పంటలు పండిస్తూ ఉంది. మనం నిలవడానికి స్థలంఇస్తూ ఉంది. ఆకాశం ఇటు మనకు అటు మేఘాలకు ఆవాసం కల్పిస్తూ ఉంది. మన శరీరంలో కూడా ఊపిరితిత్తులలో, పొట్టలో ఖాళీరూపంలో మనం జీవించడానికి దోహదంచేస్తూ ఉంది. కాని ఈ శక్తులు మననుండి ఏమీ కోరడం లేదు. కేవలం పరోపకార బుద్ధితో చేస్తున్నాయి. మనం కూడా అదే భావనతో అంటే పరోపకార బుద్ధితో సమాజానికి హితం కోరే పనులు నిస్వార్థంగా చేస్తే, ప్రకృతి దేవతలను ఆరాధించినట్టే. కాబట్టి మనం అందరం పరోపకార బుద్ధిని అలవరచుకోవాలి. మంచి పనులను యజ్ఞంలాగా చేయాలి. ప్రకృతికి హాని చేయకుండా ఉండాలి. అప్పుడు ప్రకృతి దేవతలు మన కోరికలన్నీ కామధేనువు మాదిరి తీరుస్తాయి.

ఇటీవల మేము ప్రకృతిని జయించాము అనే మాట వినిపిస్తూ ఉంది. అది చాలా తప్పు. చిన్న తుఫాను వస్తే, శేషాచలం కొండల్లో నిప్పు అంటుకుంటే, గట్టిగా గాలి వీస్తే , చిన్నపాటి భూకంపం వస్తే, ఓజోన్ పొరకు చిన్న చిల్లుపడితే, మనం తట్టుకోలేము. అల్లల్లాడిపోతున్నాము. మానవ జీవితం ఛిన్నాభిన్నం అవుతుంది. అటువంటి మనం ప్రకృతిని జయించాము అని

అనుకోవడం సిగ్గుచేటు. ప్రకృతి దేవతలను ఆరాధించడం పోయి ప్రకృతిని జయించాము అని గొప్పలు చెప్పుకోవడం అవివేకము.

## 12. ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యన్తే యజ్ఞభావితాః। తైర్దత్తా న ప్రదాయైభ్యో యో భుంక్తే స్తేన ఏవ సః॥

యజ్ఞముల వలన దేవతలు తృప్తిచెందుతారు. వారు మానవులకు కోరకుండానే వరాలు ప్రసాదిస్తారు. దేవతలు ప్రసాదించిన వరములను అనుభవిస్తూ కూడా, ఆ వరముల ద్వారా వచ్చిన ఫలములను దేవతలకు కృతజ్ఞతా భావంతో ఎవరు నివేదించకుండా తానే అనుభవిస్తాడో, వారు దొంగలతో సమానము.

యజ్ఞయాగములు చేస్తే వర్షములు కురుస్తాయి. పంటలు పండుతాయి. ధాన్యం సమృద్ధిగా ఉంటుంది. పండ్లు ఫలములు కాయకూరలు దుంపలు అన్నీ సమృద్ధిగా లభిస్తాయి. వాటిని మానవులు తృప్తిగా అనుభవిస్తారు. ఆ అనుభవించేటప్పుడు, ఆరగించేటప్పుడు కనీసం తాను తినబోయే పదార్థమును ఆ దేవతలకు నివేదించకపోతే, వారు దొంగలతో సమానము అంటున్నాడు పరమాత్మ. తగిన మూల్యం చెల్లించకుండా ఊరికే లాక్కునేవాడిని మనం దొంగ అంటాము. ఇక్కడ కూడా అంతే. ఈ భూమి మనది కాదు. మనం పుట్టక ముందు ఈ భూమి ఉంది. మనం చచ్చిన తరువాత కూడా ఉంటుంది. ఆ భూమిలో పండిన ధాన్యము, పండ్లు మనవి కావు. సూర్యరశ్మి, వర్షము(నీరు), గాలి, నేల మొదలగు దేవతలు ఇచ్చినవి. వారు ఇచ్చిన వాటిని వారికి నివేదించడం మానవుని కనీస ధర్మము. కృతజ్ఞతాభావంతో తాను తినబోయేదానిని భగవంతునికి, దేవతలకు నివేదించడమే మనము దేవతలకు చెల్లించే మూల్యము. ఒక్క భగవంతునికే కాదు, సాటి మానవులకు, జంతువులకు, పక్షులకు, చిన్ని చిన్ని కీటకములకు కూడా పెట్టాలి. ఎందుకంటే సకల ప్రాణులలో పరమాత్మ ఆత్మస్వరూపుడుగా ఉన్నాడు కాబట్టి. దానినే భూతదయ అని అంటారు. అన్నం వండుకున్న తరువాత భగవంతునికి నివేదించడం, అతిథులకు అన్నం పెట్టడం, మనము తినేదాంట్లో ఒక ముద్ద తీసి పక్కనపెట్టడం దీని కిందికే వస్తాయి. కాబట్టి మనకు సమస్త ఐశ్వర్యములను ప్రసాదించిన పరమాత్మకు, ప్రకృతి దేవతలకు కృతజ్ఞత చూపించడం మానవుని కనీస కర్తవ్యము.

ఎవరైతే యజ్ఞముల ద్వారా దేవతలను తృప్తి పరుస్తాడో, భగవంతుడు అతనికి అంతులేని ఐశ్వర్యములను ప్రసాదిస్తాడు. ఎవరైతే భగవంతుడు ఇచ్చిన దానిని అనుభవిస్తూ, తిరిగి దానిని భగవంతునికి నివేదించకుండా తింటాడో వాడు దొంగతో సమానము. మానవులు యజ్ఞములు చేస్తారు. మంచి కర్మలు చేస్తారు. వారికి భగవంతుడు కోరిన కోరికలు ప్రసాదిస్తాడు. అటువంటి మానవుడు భగవంతుని పట్ల కృతజ్ఞతాభావం కలిగి ఉండాలి. భగవంతుడు తనకు

ఇచ్చిన దానిని తిరిగి భగవంతునికి నివేదించాలి. భగవంతునికి నివేదించడం అంటే సాటి ప్రాణులకు పెట్టడం. అతిథులకు పెట్టడం. జంతువులకు పెట్టడం. వృక్షములను నీరుపోయడం లాంటివి. ఇవే పంచమహాయజ్ఞములు అని అంటారు.(దేవ యజ్ఞము, ఋషి యజ్ఞము, పితృయజ్ఞము, భూత యజ్ఞము, మానుష యజ్ఞము) ఇవి చేయని వాడు భగవంతుని సొత్తును దొంగిలించిన వాడవుతాడు.

ఇక్కడ దొంగ అంటే ఒక వస్తువును ఊరికే తీసుకురావడం. మనకు అన్నము మొదలగు ఆహార పదార్థములు, వర్షములు కురిపించి, భూమిని సారవంతము చేసి, పంట మొక్కలలో జీవమును నింపి, భగవంతుడు ఇస్తున్నాడు. దానికి గాను మనం ఏమి చేయాలి. ఓ భగవాన్ నీ దయవలన నేను ఆహారం తింటున్నాను అని తాను తినే ఆహారమును పరమాత్మకు సమర్పించి తరువాత తాను తినాలి. అలాగే పితృదేవతలకు, సాటి మానవులకు, జంతువులకు, పెట్టాలి. ఇలా పెట్టకుండా అంతా తానే ఆరగించేవాడు దొంగ. ఈ రోజుల్లో ప్రతిరోజూ దేవునికి దీపారాధన చేసి, వండిన పదార్థములను దేవునికి నివేదించి, కొంత భూతములకు పెట్టి, తరువాత తినే వాళ్లు ఎంతమంది ఉన్నారు. తాను తినేముందు పరమాత్మకు నివేదించకుండా తినేవాడు, ఎంత విద్వాంసుడైనా ధనవంతుడైనా, గొప్పవాడైనా రాజైనా, భగవంతుని దృష్టిలో అతడు దొంగతో సమానము. మరి దొంగకు శిక్ష పడాలి కదా. ఈ రోజుల్లో సంభవించే అతివృష్టి, అనావృష్టి, అగ్నిప్రమాదాలు భూకంపాలు, తుఫానులు ఇటువంటివి అన్నీ శిక్షలే. కాబట్టి మనకు ఉన్నది ఈశ్వరునికి అర్పించడం, అతిథులకు అన్నం పెట్టడం, పేదవారికి, లేని వారికి ఉన్నంతలో సాయం చేయడం, సాటిజంతువులకు ఆహారం పెట్టడం, చెట్లను సంరక్షించడం, ప్రకృతిని ఆరాధించడం, భగవంతుని మీద భక్తి కలిగి ఉండటం, పరోపకార దృష్టి అలవరచుకోవడం ఇవన్నీ భగవంతునికి మనం చూపే కృతజ్ఞతాభావము. ఏ దోషమునకైనా, నేరానికైనా, పరిహారం ఉంటుంది. చివరకు హత్య పాతకానికి కూడా పరిహారం ఉంటుంది కానీ కృతఘ్నుడికి అంటే చేసిన మేలు మరిచిపోయేవాడికి, పరిహారం అంటూ ఏమీ లేదు. కాబట్టి మనం ఆ పరమాత్మకు, ఏప్రతిఫలాపేక్ష లేకుండా మనకు అన్నీ సమకూర్చే పంచభూతములకు, వాటి అధిష్ఠానదేవతలకు, సతతం కృతజ్ఞతాభావంతో ఉండాలి. ఆ కృతజ్ఞతను ఎలా చూపించాలి అనే విషయం తరువాతి శ్లోకంలో వివరిస్తున్నారు.

### 13. యజ్ఞశిష్టాశినస్సన్తో ముచ్యన్తే సర్వకిల్బిషైః। భుఞ్జతే తే త్వఘం పాపా యే పచన్త్యాత్మకారణాత్॥

యజ్ఞశిష్టమైన ఆహారమును అంటే పరమాత్మకు నివేదించిన ఆహారమును తినే వారికి సకల పాపములు తొలగిపోతాయి. కేవలము తమ శరీరపోషణకు మాత్రమే ఆహారం వండుకొని తినే వారు పాపములు తింటున్నట్టు లెక్క.

మనం చేసే కర్మ మన శరీరాన్నే కాకుండా, మన మనస్సును, బుద్ధిని కూడా పవిత్రం చేయాలి. దానికి నిర్దేశింపబడినవే పూజలు, వ్రతాలు, యజ్ఞాలు, మొదలైన పవిత్ర కర్మలు. పరమాత్మను మనకు ఇష్టమైన ఒక రూపంతో పూజించడం, అర్చించడం, ఆరాధించడం, మనం వండుకున్నది నివేదించడం, దానిని ప్రసాదంగా భుజించడం. భగవంతుని ఆరాధించి, దేవతలకు కృతజ్ఞతలు చెప్పి, తాను వండుకున్న ఆహారమును భగవంతునికి దేవతలకు నివేదించి, సాటి మానవులకు, భూతములకు కొంచెం పెట్టి మిగిలింది తినే వాడు సకలపాపముల నుండి విముక్తుడు అవుతాడు. సర్వకిల్బిషైః అన్నారు అంటే ఏదో ఒకటి రెండుపాపములు కాదు సకలపాపములనుండి విముక్తి లభిస్తుంది. అటువంటి వాడు అసలు పాపాలే చెయ్యడు. ఇంక విముక్తి ప్రసక్తేలేదు అని అనుకోవాలి. కాబట్టి మనం ఆరగించే ఏ పదార్థము అయినా ముందు భగవంతునికి నివేదించి ఆరగించడం మంచిది. అలాగేసాటి జంతువులకు, కీటకములకు కూడా కొంచెం పెట్టాలి. అతిథులకు పెట్టాలి. ఏద్దైనా తన శక్తి కొలది మాత్రమే చేయవచ్చు. అలా కాకుండా కేవలం తన కోసమే ఆహారమును తయారు చేసుకొని తినేవాడు పాపమును తింటున్నట్టే లెక్క.

ఇంతకు ముందు శ్లోకంలో అలా చేసిన వాడిని దొంగ అన్నారు. ఈ శ్లోకంలో అలా దొంగవస్తువును తినేవాడు పాపమును తింటున్నాడు అని అన్నారు. అటువంటి పాపమును తిన్న వాడికి శరీరం అంతా దుష్టభావనలతో నిండి పోతుంది. అతడి పతనం అతడే కొని తెచ్చుకుంటాడు. కాబట్టి స్వార్థపరులు, కృతఘ్నులు పాపమును మూటగట్టుకుంటారు. పాపమును తింటుంటారు. అందుకే పంచ మహా యజ్ఞములు ఏర్పడ్డాయి.

1. దేవ యజ్ఞము అంటే దేవతలను ఆరాధించడం.

2. పితృయజ్ఞము చని పోయిన పూర్వీకులకు జలతర్పణములు, పిండ ప్రదానములు అంటే శ్రాద్ధకర్మలు చేయడం.

3. మనుష్య యజ్ఞము అంటే సాటి మానవులకు తనకు ఉన్నదానిలో పెట్టడం అంటే అతిథులకు అన్నం పెట్టడం.

4. బ్రహ్మయజ్ఞము అంటే వేదములను శాస్త్రములను శక్తికొద్ది అధ్యయనం చేయడం, ఇతరులకు చెప్పడం, ఇతరులు చెప్పే ప్రవచనములు వినడం, వాటిని ఆచరించడం.

5. భూతయజ్ఞము అంటే సాటి జంతువులకు, క్రిమి కీటకములకు ఆహారం ఇవ్వడం. మనం తినే అన్నంలో ఒక ముద్ద పక్కన పెడితే అది చిన్ని చిన్ని చీములు, పక్షులు, కుక్కలు మొదలగు పెంపుడు జంతువులు మొదలగునవి తింటాయి. పచ్చని చెట్లను నరకకుండా, వాటిని నీరు పోసి పెంచి పోషించడం.

ఇదీ మనం ప్రకృతి దేవతలకు కృతజ్ఞత తెలియజేసే విధానము. అలా చేసిన వారికి పాపము అంటదు. కేవలం తాను మాత్రమే తింటే, అంటే ప్రకృతిని తన స్వార్ధానికి

ఉపయోగించుకుంటే, వారు పాపమును తింటున్నట్టు అవుతుంది.

ఎవరైతే ఆహార పదార్థములను ముందు భగవంతునికి నివేదించి తరువాత తాను తింటాడో, అతడు సకల పాపముల నుండి విముక్తి పొందుతాడు అని చెప్పుకున్నాము. అందుకే భగవంతుని ప్రసాదమునకు మనం అంత విలువ ఇస్తాము. అది ఏదైనా కానీ భగవంతుని ప్రసాదం అంటే కళ్లకు అద్దుకొని ఆరగిస్తాము. అలాకాకుండా కేవలం తన కోసరం మాత్రమే వండుకుంటూ తనే తినేవాడు, పాపమును తింటున్నట్టు లెక్క. పాపమును మూటకట్టుకుంటాడు. ఈ సందర్భంగా శంకరాచార్యుల వారు ఏమన్నారంటే ఎవరైతే భగవంతుని పూజించి, భగవంతునికి నివేదించిన పదార్థములను తింటాడో అది అతనికి అమృతముతో సమానము అవుతుంది. అతడు అన్ని పాపముల నుండి విముక్తుడవుతాడు. అలా కాకుండా కేవలం తన స్వార్థమును చూచుకుంటూ, తన కోసమే వండుకొని తినేవాడు, పాపమును తింటున్నట్టు. వాడు పాపం చేస్తున్నట్టు.

ఇక్కడ రెండు విషయములను మనం గమనించాలి. మొదటిది భగవంతుని పూజ. ఎందుకుంటే భగవంతుడు మనకు అన్నీ ఇచ్చాడు. తినడానికి తిండి, కట్టడానికి బట్ట, ఉండటానికి ఇల్లు గాలి వెలుతురు, నీరు అన్నీ ఇచ్చాడు. భగవంతునికి కనీసం కృతజ్ఞత చూపవలసిన భాధ్యత మనమీద ఉంది. దానిని పూజ అంటారు. పూజ తరువాత భగవంతుడు మనకు ఇచ్చిన దానిని తినేముందు భగవంతునికి అర్పించి తినడం మన కనీస ధర్మం. భగవంతునికి అర్పించడం అంటే భగవంతుని స్వరూపాలైన సాటి మానవులు, సాటి జంతువులు, పితృదేవతలు, వృక్షములు. అవి కూడా మనకు ఎటువంటి స్వార్థము లేకుండా  ఎంతోసాయం చేస్తున్నాయి. అందుకే పంచ మహాయజ్ఞములు చేయమన్నారు. వాటి గురించిమనంపైన చెప్పుకున్నాము. అటువంటి వారికి భగవంతుడు పరమశ్రేయస్సు కలుగజేస్తాడు.

ఏమిటా శ్రేయస్సు అది ఎలా కలుగుతుంది అని మనకో ప్రశ్న ఉదయిస్తుంది. మనం తినే ఆహారాన్ని భగవంతునికి, దేవతలకు అర్పిస్తే అది ప్రసాదం అవుతుంది. ఆ ప్రసాదాన్ని ఆరగిస్తే అది మన శరీరాన్ని మనస్సును పవిత్రం చేస్తుంది. మనసు పవిత్రం అయితే పాపాలు నశించి పోతాయి. పాపాలు నశిస్తే మనసు ఆత్మవైపు తిరుగుతుంది. మనసు ఆత్మవైపు తిరిగి, ఆత్మలో లీనం అవుతుంది. దాని ద్వారా మోక్షానికి మార్గం సులభం అవుతుంది. అదే మనకు కలిగే శ్రేయస్సు. ఇలా చేయకపోతే, మనం వండుకున్నది మనమే తింటే, ఎల్లప్పుడూ స్వార్థబుద్ధితో ఉంటే, మనం పాపం తింటున్నట్టు అవుతుంది అంటే ఉన్న పాపాలకు తోడు మరి కొన్ని పాపాలు వచ్చి చేరుతాయి. దానితో మనసు మలినం అవుతుంది. అది ఎప్పుడూ ప్రాపంచిక విషయములలో, విషయ వాంఛల వైపు తిరుగుతుంది కానీ ఆత్మవైపు ప్రయాణించదు. వాడికి మోక్ష మార్గము కనపడదు. పాప మార్గంలో పడి కొట్టుకుంటూ, చావు పుట్టుకల మధ్య పడి సతమతమౌతుంటాడు.

కాబట్టి భగవంతునికి కృతజ్ఞతాభావనతో ఉండటం ఎంతో శ్రేయస్కరము.

ఈ విషయాన్నే మనం మరొక కోణంలో కూడా అధ్యయనం చేయవచ్చు. మనం కర్మలు చేస్తున్నాము. ఎందుకంటే కర్మలు చేయకుండా ఎవరూ ఉండలేరు. మనం చేసే కర్మలు అన్నీ ఏదో ఒకఫలమును ఇస్తాయి. అది మంచి ఫలం కావచ్చు, చెడు ఫలం కావచ్చు. దానిని మనం అనుభవించాలి. అది మనకు సుఖాన్ని కానీ దు:ఖాన్ని కానీ కలుగజేస్తుంది. సుఖం వస్తే సంతోషిస్తాం. దు:ఖం వస్తే ఏడుస్తాము. అదే కర్మలు పరమాత్మ పరంగా, ఒక యజ్ఞంలాగా, శ్రద్ధతో, ఎటువంటి ప్రతిఫలాపేక్ష, స్వార్థ బుద్ధి లేకుండా చేసి, చేయగా వచ్చిన ఫలములను పరమాత్మకు అర్పించి, వాటిని పరమాత్మ ప్రసాదంగా స్వీకరిస్తే, ఆ ఫలం నాది కాదు పరమాత్మ ఇచ్చింది అనుకుంటే, సుఖమూ ఉండదు, దు:ఖము ఉండదు, మనసు ప్రశాంతంగా ఉంటుంది. మనసు ప్రశాతంగా ఉంటే మనలో ఉన్న పాపాలు నశించి పోతాయి. కాని అదే కర్మఫలాలను ఈ పని నేను చేసాను, ఈ ఫలితం నావలననే వచ్చింది అనే కర్తృత్వభావనతో స్వార్థ బుద్ధితో స్వీకరిస్తే, చివరకు దు:ఖమే మిగులుతుంది. మనస్సు వికలమౌతుంది. ప్రశాంతత కరువవుతుంది. ఏది కావాలో మనమే తేల్చుకోవాలి.

14. అన్నాద్భవంతి భూతాని పర్జన్యాదన్నసంభవ:।
యజ్ఞాద్భవతి పర్జన్యో యజ్ఞ: కర్మ పముద్భవ:॥
15. కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షరసముద్భవమ్।
తస్మాత్ సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్॥

ప్రాణులన్నీ అన్నము నుండి జన్మిస్తున్నాయి. అన్నము వర్షము వలన ఉత్పత్తి అవుతూ ఉంది. వర్షములు యజ్ఞములు చేయడం వలన కురుస్తున్నాయి. చేయవలసిన పనులు అంటే హోమములు మొదలగు కర్మలు యజ్ఞములకు మూలము. ఆ చేయవలసిన పనులు అన్నీ వేదములలో చెప్పబడ్డాయి. వేదములకు మూలము పరమాత్మ. ఆ పరమాత్మ సర్వవ్యాపి. అందరిలోనూ ఉన్నాడు. మానవుడు చేసే అన్ని కర్మలలోనూ స్థిరంగా ఉన్నాడు. ఇది ఒక చక్రము. నిరంతరము తిరుగుతూ ఉంటుంది.

ప్రాణులన్నీ అన్నము వలన జన్మిస్తున్నాయి అంటే అన్ని ప్రాణులు అన్నము అంటే వివిధములైన ఆహారములను తింటాయి. ఆ అన్నము జీర్ణమై, రక్తముగా, శక్తిగా మారుతుంది. ఆ రక్తము వీర్యముగా మారుతుంది. ఆ వీర్యములో జీవకణములు ఉంటాయి. మగవాడి వీర్యములో ఉత్పత్తి అయిన జీవకణములు స్త్రీనుండి విడుదలఅయిన అండముతో కలిసి పిండముగా మారుతుంది.

తొమ్మిది నెలలు శిశువుగా తయారవుతుంది. అంటే అన్నము నుండి ప్రాణులు జన్మిస్తాయి. ఈ అన్నము(ఆహారము) ఎలా వచ్చింది? మనకు పంటలు పండటం వలన వస్తుంది. పంటలు ఎలా పండుతాయి? వర్షాలు కురిస్తే పంటలు పండుతాయి. వర్షములు ఎలా కురుస్తాయి? వర్షములు యజ్ఞములు వలన కురుస్తున్నాయి. దీని గురించి మనుస్మృతిలో ఇలా చెప్పబడింది. "మనం హోమంలో వేసే ఓషధులు ధూమంగా మారి పైకి లేచి ఆకాశంలో ఉన్న మేఘములను తాకి వర్షం కురిపిస్తాయి. ఆ వర్షం వలన అన్నం లభ్యం అవుతుంది. అన్నంవలన జీవులు పుడుతున్నాయి." ఇక్కడ యజ్ఞము అంటే హోమము. నిత్య అగ్నిహోత్రము. ఎక్కడో ఒక చోట యజ్ఞ చేయడం కాదు. ప్రతి ఇంట్లో ఆ రోజుల్లో హోమాగ్ని వెలిగేది. ప్రతి ఇంట్లో ఉన్న అగ్నిలో వేసే ఓషధుల వలన రేగిన ధూమము ఆకాశంలోకి చేరి మనకు వర్షాలు కురిపించేవి. (ఇప్పుడు ఫాక్టరీల పొగ చేరి కాలుష్యం పెరుగుతూ ఉంది. వర్షాలను అడ్డుకుంటూ ఉంది.) ఈ ప్రక్రియ యజుర్వేదంలో కూడా చెప్పబడింది. కాబట్టి వేదాలలో చెప్పబడినట్టు ప్రతిరోజూ దేవతలను ఆహ్వానించడానికి హోమం చేస్తూ, ఓషధులను అగ్నిలో వేస్తే అవి ధూమంగా మారి మేఘాలను చేరి వర్షాలను కురిపిస్తే, వాటి వలన ఆహారం లభిస్తే, అది తిని సృష్టి అభివృద్ధి చెందితే, ఆ పుట్టినవాళ్లు మరలా హోమాలు చేస్తారు. ఇదీ ఆహార సైకిల్. ఈ హోమములలో పరమాత్మ ఉన్నాడు. ఈ సైకిల్ మొత్తం సమర్థవంతంగా నడిపిస్తున్నాడు. అందుకే విష్ణువును యజ్ఞస్వరూపుడు అన్నారు. హోమం చేయడం, ఆ హోమంలో ఓషధులు వేయడం కూడా పరమాత్మను పూజించడమే. అగ్నిని హవ్యవాహనుడు అన్నారు. మనం అగ్నిలో వేషే ఓషధులు ధూమ రూపంలో పర్జన్యుడికి అందుతాయి. దానికి ప్రతిగా ఆయన వర్షాలు కురిపిస్తాడు. అంటే మనం వరుణ దేవుడిని పూజిస్తే మనకు సకాలంలో వర్షాలు కురుస్తాయి కానీ మేఘమథనం వలన కాదు. సూర్యుడిని సూర్యనారాయణుడు అన్నారు అంటే సూర్యుడు కూడా నారాయణ స్వరూపము. ఇక్కడ అగ్నితో చేసే హోమం అంటే యజ్ఞం కూడా నారాయణ స్వరూపము. ఇప్పుడు హోమాలు లేవు. యజ్ఞాలు లేవు. అందుకే అతి వృష్టి అనావృష్టి. మేఘాలను అదుపులో ఉంచే హోమాలను మనం చేయడంలేదు. అక్కడక్కడా చేస్తున్నారు కాబట్టి ఈ మాత్రం వర్షపాతం ఉంది.

దీనినే ప్రకృతి ధర్మము, ఆహార చక్రం అని అంటారు. ధర్మము అంటే సమతుల్యము పాటించడం. అన్నిటినీ ధరించి ఉన్నది ధర్మము. ఏది ఎలా ఉండాలో నిర్దేశించేది ధర్మము. ప్రకృతి సమతుల్యంగా ఉండాలి. అది ప్రకృతి ధర్మము. మనం చేసే కర్మలు కూడా ప్రకృతి ధర్మాన్ని పరిరక్షించే విధంగాఉండాలి కానీ ప్రకృతి ధర్మాన్ని విచ్ఛిన్నం చేసేవిగా ఉండకూడదు. ఉదాహరణకు జీవకోటి జీవించాలి అంటే ప్రాణవాయువు అంటే ఆక్సిజన్ కావాలి. ప్రాణవాయువు పీల్చుకుంటేనే మనం జీవించగలుగుతాము. ఆ పీల్చుకున్న ప్రాణవాయువు మరలా కార్బన్‌డయాక్సైడ్ గా మారి బయటకు వస్తుంది. అది ఏమవుతుంది. ఎవరు పీల్చుకోవాలి. చెట్లు, చెట్లకు ఉన్న పచ్చటి ఆకులు పీల్చుకుంటాయి. ఆ చెట్లు, చెట్ల ఆకులు మరలా మనకు ఆక్సిజన్ విడుదల చేస్తాయి. ఆ ఆక్సిజన్ మనం పీల్చుకుంటాము. ఇది ఒక సైకిల్. ప్రకృతి ధర్మము. ఈ ధర్మాన్ని మనం కూడా కాపాడాలి. కాని మనం ఏం చేస్తున్నాము.

చెట్లు అడవులు అన్నీ నరికేసి ప్రకృతి ధర్మాన్ని విచ్ఛిన్నంచేస్తున్నాము. అందుకే ప్రకృతిని మనం కాపాడితే ప్రకృతి మనలను కాపాడుతుంది అనే నినాదం వచ్చింది.

కాబట్టి మనం సుఖంగా క్షేమంగా ఆరోగ్యంగా బతకాలంటే మనకు ఆక్సిజన్ కావాలి. ఆక్సిజన్ కావాలంటే చెట్లు ఉండాలి. ఇదీ ప్రకృతి ధర్మము. అలాగే మనకు ఆహారం కావాలంటే వర్షము, వర్షానికి మేఘాలు, మేఘాలు కావాలంటే యజ్ఞములు, ఆ యజ్ఞములు వేదాలలో చెప్పబడ్డాయి. ఆ వేదములే పరమాత్మ స్వరూపాలు. కాబట్టి మనం ప్రకృతి సమతుల్యం పాటించాలి. అదే యజ్ఞము. ఆ యజ్ఞం ఈశ్వరస్వరూపము. యజ్ఞం చేయడం ఈశ్వరుని ఆరాదించడమే. యజ్ఞము అంటే ప్రకృతిని పరిరక్షించడం. ప్రకృతి సమతుల్యం పాటించడం. కాబట్టి ఈ ప్రకృతిలో అన్నీ ఒకదానితో ఒకటి సంబంధం కలిగి ఉన్నాయి. ఇందులో ఏ ఒక్కటి దెబ్బతిన్నా సమతుల్యం దెబ్బతింటుంది అని గ్రహించాలి.

మనం చేసే కర్మలు వేదవిహితంగా ఉండాలి. వేదము అంటే ఏమిటి? తెలుసుకోతగినది. తెలుసుకోవలసినది. వేదము ఏదో ఒక ఋషి తాను అనుకున్నది చెప్పినది కాదు. ఋషులు ప్రకృతిని పరిశీలించి, వాటికి తమ అనుభవాలను జోడించి, ధర్మాలను అంటే మానవులు ఆచరించవలసిన కర్మలను నిర్దేశించారు. వాటినే వేదములు అని అన్నారు. ఆ వేదములలో చెప్పబడిన విషయములను ఆచరించడమే ప్రతి వాడి కర్తవ్యము. వేదవిహితములైన కర్మలు చేస్తే పరమాత్మను ఆరాధించినట్టే. " తస్మాత్ సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్" అంటే ఈ చరాచర జగత్తు అంతటా తానే అయి ఉన్న బ్రహ్మ, మనం చేసే యజ్ఞములలో అంటే వేదవిహితమైన కర్మలలో ప్రతిష్ఠితుడై ఉన్నాడు. అంటే మనం చేసే ప్రతి మంచి కర్మా ఒక యజ్ఞమే. ఆ కర్మలో దైవం ఉన్నాడు. పనియే దైవము. వర్క్ ఈజ్ వర్షిప్ అన్నారు. కాబట్టి మనం వేద విహిత కర్మలే చేయాలి. ప్రకృతికి కానీ, సాటి ప్రాణికోటికి హాని కలిగించే కర్మలు చేయకూడదు. ప్రకృతి సమతుల్యాన్ని మనం పాటిస్తే ప్రకృతి మనలను రక్షిస్తుంది.

## 16. ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః।
## అఘాయురిన్ద్రియారామో మోఘం పార్థ స జీవతి.॥

ఎవరైతే పై శ్లోకంలో చెప్పబడిన విధంగా సాగుతున్న సృష్టి చక్రమునకు అనుకూలంగా ప్రవర్తించరో, అటువంటి వాడు తన కర్తవ్య కర్మలను అంటే చేయవలసిన కర్మలను చేయకుండా, ఇంద్రియలోలుడై పాపము చేస్తున్నాడు. అటువంటి వాడి జీవితము వ్యర్థము.

ఎవరైతే ఈ జీవన చక్రాన్ని అనుసరించకకుండా, అంటే హెూమములు, పంచమహా యజ్ఞములను చేయకుండా, తాను చేసే కర్మలను ఒక యజ్ఞము మాదిరి ఆచరించకుండా, ప్రకృతి దేవతలను తృప్తి పరచకకుండా, ప్రకృతి దేవతల పట్ల కృతజ్ఞతాభావన లేకుండా, కేవలం తన కోసరమే తింటుంటాడో, స్వార్ధబుద్ధితో జీవిస్తుంటాడో, వాడు పాపాత్ముడు. వాడి జీవితము పాపభూయిష్టము. కేవలం ఇంద్రియములకు వశుడై, ఇంద్రియసుఖములను అనుభవిస్తూ జీవితం వృధాగా గడుపుతున్నాడు.

ప్రతిరోజూ ప్రతి గృహస్థు హెూమం చేయ్యడం అందులో ఓషధులు వేల్చడం, వాటిని దేవతలకు అందచెయ్యడం మానవ ధర్మము. దాని వలన వర్షాలు కురుస్తున్నాయి. మానవులు వర్షముల వలన నీరు పొందుతున్నారు. నీటిని ఉపయోగించి ఆహార ధాన్యాలు పండించు కుంటున్నాడు. ఫలవృక్షముల నుండి ఫలములు పొందుతున్నాడు. కాని ప్రతిగా ఏమీ చేయడం లేదు.(దేవుడు ఇచ్చిన నీటి కోసం రెండు రాష్ట్రాలు కొట్టుకుంటున్నాయి.) ఊరికినే ఇతరుల సంపదను తినేవాడు పాపాత్ముడు. ఇటువంటి వారిని పరాన్నభుక్కులు అంటారు. ఇతరులు తెచ్చిపెడితే తినే రకాలు. ఆత్మజ్ఞానం సరిగా తెలియని వారి గురించి కర్మయోగము నిర్దేశింపబడింది. . మానవులు ముందుగా కర్మయోగము అవలంబించి, కర్మలను ఆచరించి తద్వారా జ్ఞానము సంపాదించి, ముక్తులవుతారు. కాబట్టి ఆత్మతత్వము తెలుసుకునే వరకు ఎవరెవరుచేయవలసిన కర్మలు వారు చేయవలసినదే. కర్మలు మానరాదు. పైగా ఈ కర్మలు అంటే నిత్యాగ్ని హెూమములు, పంచ మహాయజ్ఞములు, యజ్ఞయాగములు మొదలగు కర్మలు సమాజ హితం కోరి చేస్తున్నారు. అందరికీ ఆహారం సమృద్ధిగా సమకూరాలని చేస్తున్నారు. అది నిష్కామ కర్మ. పరోపకారము గురించి చేసే కర్మ. ప్రతిఫలమును ఆశించకుండా చేసే కర్మ. దీని వలన జ్ఞానము కలుగుతుందే కానీ బంధము కలుగదు.

ఇప్పుడు ఒక సందేహము కలిగే అవకాశం ఉంది. ఈ పంచ మహా యజ్ఞములు హెూమములు ఏమీ తెలియని వారికేనా లేక ఆత్మతత్వమును తెలుసుకున్న వారు కూడా చేయాలా అనే సందేహము రావచ్చు. కొంతమంది క్రితం జన్మలోనే యజ్ఞములు హెూమములు పరోపకారములు, నిష్కామ కర్మలు చేసి ఆత్తతత్వమును తెలుసుకొని కేవలం పరమాత్మను చేరుకోడానికే ఈ భూమితో అవతరిస్తుంటారు. అటువంటి జీవన్ముక్తులకు ఎటువంటి కర్మలు చేయనవసరం లేదు. కానీ వారు కూడా సమాజ హితం కోరి చేస్తున్నారు. ఒకవేళ వారు చేయకపోయినా, సర్వసంగ పరిత్యాగులు, జీవన్ముక్తులు చేయడం లేదు కదా మనం చేయడం ఎందుకని మానకూడదు. ఈవిధంగా హెూమాలు పంచ మహా యజ్ఞాలు చేయని వారు, పరోపకారం కోసం సమాజహితం కొరకు పాటుపడని వారు, కేవలం తమ స్వార్థాన్ని మాత్రమే చూచుకొనే వారు పాపాత్ములు అని చెప్పబడ్డారు. వారిని అఘాయులు అని అన్నారు భగవానులు. అటువంటి

వారు ఇంద్రియారాములు అంటే కేవలం ఇంద్రియములకు వశులై, ఇంద్రియ సుఖములు మాత్రమే అనుభవిస్తుంటారు. ఇతరుల గురించి పట్టించుకోరు. స్వార్ధపరులు. వారి జీవితములు వ్యర్ధములు. వారిని జీవచ్ఛవాలు అనికూడ అనవచ్చు.

ఈ శ్లోకంలో ఒకపదం వాడారు. ఇంద్రియారామ: అంటేఎల్లప్పుడూ ఇంద్రియములు ఎలా చెబితే అలా చేసేవాడు. కేవలం ప్రాపంచిక విషయములలో, విషయ భోగముల యందు ఆసక్తి కలిగి ఉన్న వాడు. వాడు ఏం చేస్తున్నాడో వాడికే తెలియదు. యాంత్రికంగా చేస్తుంటాడు. బతకాలి కాబట్టి బతుకుతుంటాడు. ఎందుకు జీవిస్తున్నాడో వాడికే తెలియదు. ఎవరు ఏం చెబితే అది చేస్తాడు. కంటితో చూచింది, చెవులతో విన్నది నమ్ముతాడు. విచక్షణా జ్ఞానం, ఆత్మజ్ఞానం ఉండదు. అటువంటి వాడు పాపాత్ముడు. వాడు ఎందుకు బతుకుతున్నాడో వాడికే తెలియదు. అటువంటి వాడి జీవితం వ్యర్ధము. అని కృష్ణుడు ఖండితంగా చెప్పాడు.

17. యస్త్వాత్మరతిరేవ స్యాదాత్మతృప్తశ్చ మానవ:।
ఆత్మన్యేవ చ సంతుష్టస్తస్య కార్యం న విద్యతే॥
18.నైవ తస్య కృతేనార్థో నాకృతేనేహ కశ్చన।
న చాస్య సర్వభూతేషు కశ్చిదర్థవ్యపాశ్రయ:॥

ఎవరైతే తనలో తాను అంటే తన ఆత్మలో తాను రమిస్తూ ఉంటాడో, దొరికిన దానితో తృప్తి చెందుతుంటాడో, అతడు నిత్యము సంతుష్టిగా ఉంటాడు. అటువంటి సాధకుడికి చేయవలసిన కర్మ అంటూ ఏదీ ఉండదు. అటువంటి వారికి ఈ ప్రపంచములో కర్మల చేయడం వలనకానీ, చేయకుండా ఉండటం వలన గానీ, ఎటువంటి ప్రయోజనము లేదు. అటువంటి సాధకుడికి స్వార్థబుద్ధి కానీ, బాహ్యప్రపంచముతో సంబంధము కానీ ఉండదు.

పై శ్లోకములలో అందరూ కర్మలు చేయాలి. కర్మ చేయకుండా ఎవరూ తప్పించుకో లేరు అని చెప్పి ఈ శ్లోకంలో జీవన్ముక్తుల గురించి చెబుతున్నాడు. తమ మనస్సును పరమాత్మయందు చక్కగా ఉంచిన వారు. మనస్సును ఆత్మయందు కలిపి రమించేవారు, తమలో తాము ఆత్మానందాన్ని అనుభవించేవారు, ఉన్నదానితో తృప్తిగా జీవించేవారు, సాంఖ్యులు, జ్ఞానులు అంటే ఆత్మజ్ఞానము కలవారు, బయట ప్రపంచంలో తిరుగుతున్నా ప్రాపంచిక విషయములచేత ప్రభావితం కాని వారు, ఇంద్రియములను మనసును నిగ్రహించిన వారు, అటువంటి వారు జీవన్ముక్తులు. ఒకసారి ఆత్మసాక్షాత్కారము కలిగిన తరువాత అటువంటి వారికి ఈ ప్రపంచంలో చేయవలసినపని అంటూ ఏమీ ఉండదు. అటువంటి వారు కర్మలు చేసినా ఒకటే చేయకపోయినా ఒకటే. చేయడం వలన

ప్రయోజనం కానీ, చేయక పోవడం వలన నష్టం కానీ ఏమీ ఉండవు. అటువంటి జీవన్ముక్తుడు నిర్వికారంగాఉంటాడు. ఎందుకంటే అతడు ఆత్మయందే తృప్తిని పొందుతున్నాడు. అతడికి కావాల్సింది అంటూ ఏమీ లేదు. కొత్తగా సాధించేది ఏమీ లేదు.  లోకోపకారార్థం కర్మలు చేస్తాడు. లేకపోతే లేదు. అతడికి కర్మలు చేయాలి అన్న నిబంధన ఏమీ లేదు. అటువంటి వాడు ఈ ప్రపంచములో ఎవరినీ ఆశ్రయించడు. ఎవరి ఆశ్రయమూ అతడికి అక్కరలేదు. అతడు ఎవరి మీదా ఆధారపడడు.

సామాన్య మానవులు ప్రాపంచిక విషయములు కావాలని కోరుకుంటూ,వాటి కోసం కర్మలు చేస్తూ, అవి దొరికితే తృప్తిపడుతుంటారు. జీవన్ముక్తులు కేవలం తమలో తాము తృప్తిపడుతుంటారు. ప్రాపంచిక విషయముల యందు ఏ మాత్రము ఆసక్తి చూపరు. అటువంటి స్థితప్రజ్ఞుడికి జీవన్ముక్తుడికి ఈ ప్రపంచంలో చేయవలసిన పని అంటూ ఏమీ ఉండదు. అటువంటి వారు కోటికి ఒకరు ఉంటారు. మిగిలిన వారందరూ తమకు విధించిన కర్మలు చేయవలసినదే. ఆత్మయందే రమించేవారు, ఆత్మయందు తృప్తి పొందేవారు, ఏ కర్మలను చేసినా చేయనట్టే ఉంటారు. కాని వారిని చూచి సామాన్య జనులు కూడా వారిలా ఉందామని అనుకోవడం చాలా పొరపాటు. ఎలాగంటే, ఒక ఉపాధ్యాయుడు జీవితాంతం విద్యార్థులకు పాఠాలు చెప్పి, వారిని సన్మార్గంలో పెట్టి, ప్రయోజకులను చేస్తాడు. తుదకు వయసు మీదపడగానే రిటయిర్ అవుతాడు. పెన్షన్ తీసుకుంటూ సుఖంగా జీవిస్తాడు. అటువంటి వారిని చూచి, ఆయన ఊరికే పెన్షన్ తీసుకుంటూ హాయిగా ఉన్నాడు, మేముకూడా అలాగే పనీపాటా లేకుండా సుఖపడతాము అని విద్యార్థులు యువకులు అనుకుంటే వారి జీవితం కష్టాలపాలవుతుంది. రిటయిర్ అయిన తరువాత కూడా కొంతమంది ఉపాధ్యాయులు విద్యార్థులకు సాయం చేయాలనే కోరికతో ఉచితంగా విద్యాబోధన చేస్తుంటారు. దాని వలన వారికి ఎటువంటి బంధములు అంటవు.

కాబట్టి అందరూ కర్మలు ఆచరించాలి. కర్మలు వదిలిపెట్టకూడదు. నిష్కామ కర్మలు ఆచరించడం ద్వారా జ్ఞానము సంసాదించి దాని తరువాత మోక్షమునకు అర్హులవుతారు. ఆ స్థితిని పొందిన తరువాత,  వారు కర్మలు చేసినా చేయకపోయినా ఒకటే. ఎటువంటి స్వార్థబుద్ధిలేకుండా, లోక కల్యాణం కొరకు వారు చేసే కర్మలను తప్పుపట్టకూడదు. కాని ఈ రోజుల్లో ఎక్కువ మంది ప్రాపంచిక విషయములలోనూ, విషయవాంఛలలోనూ మునిగి తేలుతున్నారు. చేయవలసిన కర్మలను వదిలిపెట్టి చేయకూడని కర్మలు చేస్తున్నారు. తాము చేసిన కర్మలతో కూడా వారు తృప్తి చెందకుండా, ఇంకా ఏదో కావాలని నిరంతరం ఆరాటపడుతుంటారు.. దాని వలన వారికి ఏ లాభమూ లేకపోగా బంధనములు వాసనలు చుట్టుకుంటాయి. ఎవరైతే  బాహ్య ప్రపంచములో లభించే సుఖములు నిజం కావు నిజమైన సుఖం ఆత్మానందమే అని అనుకుంటారో అప్పుడే వారికి విముక్తి. అప్పటి వరకూ విద్యుక్త కర్మలు ఇతరులకు ఉపయోగించే కర్మలు నిష్కామకర్మలు చేయాల్సిందే.

ఆ కారణం చేతనే కృష్ణుడు అర్జునుడితో ఇలా అన్నాడు. అర్జునా! పైన చెప్పిన ఆత్మారాములు కర్మ చేసినా కర్మ చేయకపోయినా వారికి వచ్చే లాభం కానీ జరిగే నష్టంకానీ ఏమీ లేదు. వారు పూర్ణకాములు అనగా అన్ని కోరికలు తీరినవారు. కోరడానికి ఆ కోరికలు తీరడానికి వారికి ఏమీ మిగలలేదు. వారు కర్మలు చేయకపోయినా నష్టం లేదు. అతనికి అన్నీ సమానమే. నిరంతరము ఆత్మయందు రమించే వాడికి బాహ్య కర్మల వలన ఏం ప్రయోజనం చేకూరుతుంది. అటువంటి జీవన్ముక్తుడు కావాలంటే కర్మలు చేయగలడు. లేకపోతే మానగలడు. ఇది చేయాలి అన్న నియమం లేదు. వారు చేసే కర్మలన్నీ లోక క్షేమము కొరకే కానీ వారి స్వార్థమునకు కాదు. స్వార్థం కోరి వారు ఏ కర్మాచేయరు. అటువంటివారు ఎవరినీ ఆశ్రయించరు. ఎవరి మీదా ఆధారపడరు. వారికి ఏ భయమూ లేదు. ఎవరి అవసరమూలేదు ఎవరికీ భయపడడు.

## 19. తస్మాదసక్తస్సతతం కార్యం కర్మ సమాచర।
## అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః॥

ఆ కారణం చేత ఓ అర్జునా! నీవు కూడా ప్రాపంచిక విషయముల మీద ఆసక్తి లేకుండా నీ కర్తవ్య కర్మ అయిన యుద్ధముచెయ్యి. ఆసక్తిలేకుండా యుద్ధం చేస్తే ఆ యుద్ధం వలన వచ్చే బంధనములు నిన్ను అంటవు. నీకు మోక్షం కూడా వస్తుంది.

కర్మ దాని లక్షణాలు, ఎవరు కర్మలు చేయాలి, ఎవరు కర్మలు చేయకుండా ఉండవచ్చు అనే విషయాలను చెప్పిన తరువాత కృష్ణుడితో ఇలా అన్నాడు. అర్జునా! నీ విద్యుక్త ధర్మము నీ క్షత్రియ ధర్మము నీవు నెరవేర్చు. ఏ కోరికా లేకుండా యుద్ధం చెయ్యి. ఎవరికో ఏదో జరుగుతుందని బాధపడకుండా యుద్ధం చెయ్యి. నిష్కామంగా యుద్ధం చెయ్యి. ఏ సంగమం లేకుండా యుద్ధం చెయ్యి. ఎదురుగా ఉన్న వాళ్లు నీ బంధు మిత్రులు అన్న భావన లేకుండా యుద్ధం చెయ్యి. నేను యుద్ధం చేస్తే ఏమవుతుందో! అలా జరుగుతుందో! ఇలా జరుగుతుందో! నావల్లే అంతా జరుగుతోంది.... అనే ఆలోచనలు లేకుండా యుద్ధం చెయ్యి. నీ ఒక్కడి వల్ల ఏమీ కాదని తెలుసుకొని యుద్ధం చెయ్యి. మనస్సును నిర్మలంగా ఉంచుకొని యుద్ధం చెయ్యి. అప్పుడు నీకు ఎటువంటి పాపము అంటదు. కర్మ చేయకుండా ఉండటానికి నీవు ఇంకా ఆత్మజ్ఞానివి కాలేదు. జీవన్ముక్తుడువి కాలేదు. ఇంకా కర్మలు చేసే దశలోనే ఉన్నావు. నీకు ఆత్మజ్ఞానం ఇంకా అలవడలేదు. ఇప్పుడే సన్యాసం తీసుకుంటాను అంటేకుదరదు. నేనేం నిన్ను చేయకూడని పని చేయమనడం లేదు. నీ కర్తవ్యం నిర్వర్తించమంటున్నాను. నీవు క్షత్రియుడివి కాబట్టి నీ ధర్మం నిర్వర్తించమంటున్నాను. కాకపోతే నిష్కామంగా, ఆసక్తి లేకుండా, ఫలా పేక్ష లేకుండా, ధర్మం కొరకు యుద్ధం చేయమంటున్నాను. అలా చేస్తే నీకు ఎటువంటి బంధనములు అంటవు. అప్పుడు నీ అంతరంగము శుద్ధి అవుతుంది. తరువాత జ్ఞానం వస్తుంది. తరువాత మోక్షం లభిస్తుంది. కాబట్టియుద్ధం చెయ్యి.

ఎటువంటి సంగము అంటే అటాచ్‌మెంట్ లేకుండా, ఆసక్తి లేకుండా ఫలాపేక్ష లేకుండా, నిష్కామంగా కర్మలు చేస్తే దాని వలన సుఖదు:ఖములు, బంధములు రావు. మనసు ప్రశాంతంగా ఉంటుంది. నిర్మలంగా ఉంటుంది. అటువంటప్పుడు పరమాత్మను ధ్యానించడానికి ఆత్మదర్శనం కలగడానికి అవకాశం ఉంటుంది. ఇదే కర్మలు చేయడంలో రహస్యము. కాబట్టి కర్మలు చేస్తూ కూడా ఆత్మసాక్షాత్కారము పొందవచ్చు. మనసును ఆత్మలో లీనం చేయవచ్చు. పరమశాంతిని పొందవచ్చు. కేవలం వేదములు శాస్త్రములు చదివి జ్ఞానం సంపాదించడమే కాదు. కర్మలు ఆచరిస్తూ కూడా ఆత్మజ్ఞానం పొందవచ్చు. చివరకు మోక్షం కూడా పొందవచ్చు. ఇదే గీతాబోధ.

## 20. కర్మణైవ హి సంసిద్ధిమాస్థితా జనకాదయః।
## లోకసంగ్రహమేవాపి సంపశ్యన్ కర్తుమర్హసి॥

పూర్వము జనకుడు మొదలగు జ్ఞానులు కూడా ఆసక్తి రహితముగా కర్మలను చేయడం వలన సిద్ధిపొందారు. కావున నీవు కూడా స్వార్థం వదిలిపెట్టి లోకహితము కొరకు కర్మలు చేయడానికి మాత్రమే నీకు అర్హత ఉన్నది.

ఇప్పుడు కృష్ణుడు ఒక ఉదాహరణ చెబుతున్నాడు. జనకుడు, అశ్వపతి మొదలగు మహారాజులు ఎటువంటి ఆసక్తి లేకుండా నిష్కామంగా కర్మలు ఆచరించి సిద్ధి పొందారు. అని అన్నాడు. ఇక్కడ జనకుడు మొదలగు వారిగురించి చెప్పడంలో అర్థం వారు ఋషులు కారు, మునులు కారు, సన్యాసులు కారు, సర్వసంగ పరిత్యాగులు కారు. వారు కూడా అర్జునుడి మాదిరి క్షత్రియులు, రాజ్యపాలన చేసారు. అటువంటి వారు కూడా ఆసక్తి లేకుండా, నిష్కామంగా, ఎటువంటి ఫలాపేక్ష లేకుండా, కర్మలు చేసి సిద్ధిని పొందారు. వారి మాదిరే అర్జునుడిని కూడా తన విద్యుక్త కర్మ అయిన యుద్ధము చేయమని కృష్ణుడు బోధించాడు.

జనకుడు, అశ్వపతి, ఇక్ష్వాకువు, ప్రహ్లాదుడు, అంబరీషుడు మొదలగు చక్రవర్తులు ఈ కోవలోకి వస్తారు. వారికి ఈ ప్రపంచంలో చేయవలసినది అంటూ ఏదీ లేదు. కాని లోకంకొరకు తమ కర్తవ్య కర్మలు నిర్వర్తించారు. కర్తృత్వ భావం లేకుండా, నిష్కామంగా కర్మలు చేసారు. అలా చేసి వారు ముక్తిని పొందారు. వారందరూ కర్తవ్య కర్మలు చేసి ముక్తిని పొందిన వారే! కాబట్టి ఓ అర్జునా! వారి మాదిరి నీవు కూడా సంగముక్తుడివి, జీవన్ముక్తుడివి అని నీవు అనుకుంటే కూడా, లోకం కోసమన్నా, నీ కర్తవ్యమును నీవు నిర్వర్తించు. జనకుని మాదిరి నీ కర్తవ్య కర్మలను

చెయ్యి. ఏ విధమైన సంగం లేకుండా యుద్ధం చెయ్యి. పోనీ, జనకుడు, అశ్వపతి జ్ఞానులు, జీవన్ముక్తులు కారు అని అనుకొందాము. నీమాదిరి మామూలు మానవులు అనుకొందాము. అలాంటప్పుడు కూడా వారు నిష్కామంగా కర్మలు చేసి జ్ఞానమును సంపాదించి, చివరకు ముక్తిని పొందారు కాబట్టి, అదే పని నీవూ చెయ్యి ఇందులో తప్పేముంది. ఎలా చూచినా నీవు నీ కర్తవ్య కర్మ చేయక తప్పదు కదా!

నీవు జీవన్ముక్తుడివి, నీకు అన్నీ తెలుసు నీకు కర్మచేయనవసరం లేదు అని నీవు అనుకున్నాకూడా, నీ కోసం కాకపోయినా జనం కోసం అయినా, వారిని మంచి దారిలో పెట్టడానికైనా నీవు కర్మలు చేయాలి కదా. అర్జునుడే యుద్ధం చేయలేదు మేం మాత్రం ఎందుకు యుద్ధం చేయాలి అని నీ సైనికులు అనుకుంటే మిగిలిన వీరుల గతేం కావాలి. కాబట్టి ఇతరులకు మార్గదర్శకంగా ఉండటానికైనా నీవు యుద్ధం చేయక తప్పదు.

ఇదీ కృష్ణుడి ఆర్గ్యుమెంటు. జనకుడు, అశ్వపతి, ఇక్ష్వాకువు, ప్రహ్లాదుడు, అంబరీషుడు, భగీరథుడు మొదలగు చక్రవర్తులందరూ జీవన్ముక్తులే కానీ కర్మలు చేసారు. ఎవరి కోసం? ఇతరుల కోసం, ఇతరులను మంచి మార్గంలో పెట్టడం, ఇతరులకు మార్గదర్శకంగా ఉండటం కోసం చేసారు. ఈ నిష్కామయోగం ఏమీ కొత్తది కాదు. అంతకు ముందు చాలామంది చక్రవర్తులు దీనిని ఆచరిరంచి ముక్తిని పొందారు. ఒక పక్కరాజ్యం చేస్తూ, రాజ్యం కొరకుయుద్ధాలు చేస్తూ కూడా మోక్షం పొందడం సాధ్యమా అని అర్జునుడు అడగక ముందే కృష్ణుడు జనకుడు మొదలగు రాజుల గురించి చెప్పి వారు కూడా కర్తవ్య కర్మలను ఆచరిస్తూనే ముక్తిని పొందారు అని చెప్పాడు. చేయవలసిన కర్మ, చేయదగ్గ కర్మ నిష్కామంగా, ప్రజలకొరకు, నిర్మలమైన మనసుతో చేస్తే దాని వలన జ్ఞానం కలుగుతుంది. జ్ఞానం కలిగితే మోక్షానికి దారి ఏర్పడుతుంది. పైన చెప్పిన మహారాజులు చక్రవర్తులు నిష్కామ కర్మలు చేసి జ్ఞానమును సంపాదించి ముక్తిని పొందారు.

అంతే కాదు. పెద్ద వాళ్లను చూచి ఇతరులు నేర్చుకుంటారు. మేము జీవన్ముక్తులము మేము ఏమీ కర్మచేయ నవసరం లేదు అని కూర్చోకుండా వారి వారి కర్తవ్య కర్మలు చేస్తే వారిని చూచి ఇతరులు ధర్మమార్గమును ఆచరిస్తారు. అప్పుడు లోకకల్యాణం జరుగుతుంది. ఒక్కడు బాగుపడినా బాగుపడినట్టే. కాబట్టి అర్జునా! నీవు ఇతర సైనికులకు ఆదర్శంగా నిలిచి యుద్ధం చేయి అని భగవానుడు చెప్పాడు.

## 21. యద్యదాచరతి శ్రేష్ఠస్తత్తదేవేతరో జనః।
## స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే॥

శ్రేష్ఠులు అయిన వారు ఆచరించిన దానిని ఇతరులుకూడా అనుసరిస్తారు. అతడు ఆచరించిన ప్రమాణాలనే ఇతరులు కూడా పాటిస్తారు.

యథారాజా తథా ప్రజా అనే మాటకు ఇది అన్వయం. పెద్దవాళ్లు ఏది ఆచరిస్తారో, వారిని చూచి చిన్నవాళ్లు అదే ఆచరిస్తారు. కాబట్టి చిన్నవాళ్లను మంచి దారిలో పెట్టడానికి పెద్దలు వారికి నిర్దేశించిన కర్మలను చేయక తప్పదు. మామూలు ప్రాపంచిక విషయములలో కానీ, ఆధ్యాత్మిక విషయములలో గానీ, పెద్దలు పిన్నలకు మార్గదర్శకంగా ఉండాలి. పెద్దలే తప్పుచేస్తే పిల్లలు ఆ మార్గాన్ని అనుసరిస్తారు. కాబట్టి పెద్దలు కర్మలు చేసేటప్పుడు చాలా జాగ్రత్తగా ఉండాలి. ఎందుకంటే చిన్న పిల్లలు ఎప్పుడూ పెద్దలను రోల్ మాడల్‌గా ఊహించుకుంటారు. పెద్దలు శాస్త్ర విరుద్ధముగా ప్రవర్తించకూడదు.

అర్జునుడు విషయానికే వద్దాము. అర్జునుడు శౌర్యవంతుడు, ధీరుడు, పరాక్రమ వంతుడు, ఎంతో పేరు ప్రఖ్యాతులు గడించాడు ఇంద్రుని అర్థసింహాసనము మీద కూర్చున్నాడు. అటువంటివాడు ఈ ప్రకారంగా దౌర్బల్యస్థితిలో యుద్ధం చేయనంటే ఇతరులు కూడా దానినే అనుసరిస్తారు. అందరూ విల్లు అమ్ములు కిందపడేసి ఇంటికి పోతారు. అలా కాకుండా అర్జునుడు క్షత్రియ ధర్మమును ఆచరిస్తూ, తన బల పరాక్రమములు ప్రదర్శిస్తూ యుద్ధం చేస్తే, యువకులు కూడా ఆయననే అనుసరిస్తారు. కాబట్టి పెద్దవారు దేనిని ప్రమాణంగా తీసుకుంటారో పిల్లలు దానినే ప్రమాణంగా తీసుకుంటారు. పెద్దవారు వేదమునే ప్రమాణంగా పాటిస్తే, పిల్లలు కూడా వారిని అనుసరిస్తారు. ఆ కారణం చేతనే వేదవిద్య, సనాతన ధర్మములు పరంపరానుగతంగా, ఒకరి నుండి ఒకరికి సంక్రమిస్తూ ఈ నాటికి కూడా మనకు అందుబాటులో ఉన్నాయి.

కాబట్టి జీవన్ముక్తులు, జ్ఞానులు, ఆత్మసాక్షాత్కారంపొందిన వారుకూడా, వారికి ఏ కర్మ చేయవలసిన అవసరం లేకపోయినా, లోక కల్యాణం కొరకు కర్మలు చేస్తుంటారు. వారిని అనుసరించడం మన విధి. జగద్గురువు శంకరాచార్యుల వారు జీవన్ముక్తుడు. కాని ఆయన దేశం అంతా కాలి నడకన తిరిగారు. ధర్మప్రచారం చేసారు. మానవులకు ఉపయోగించే ఎన్నోగ్రంధాలు రాసారు. ఎందుకు. తన కోసం కాదు. లోక కల్యాణం కోసం. అవి నేడు మనకు మార్గదర్శకాలు అవుతున్నాయి. కేవలము వేదములు శాస్త్రములు చదివినంతనే ప్రయోజనము లేదు. వాటిలో ఉన్న ధర్మములను పెద్దలు తాము ఆచరించి చూపించి, భావి తరాలకు మార్గదర్శకం కావాలి.

ఇందులో ప్రమాణము అని వాడారు. ప్రమ అంటే ఉన్నది ఉన్నట్టు చూసే బుద్ధి. దానికి వికృతి భ్రమ. అంటే లేనిది ఉన్నట్టుగా ఊహించుకునే బుద్ధి. మనం అంతా ఎల్లప్పుడూ భ్రమలో ఉంటాము. తాడును చూసి పాము అనుకుంటూ ఉంటాము. ప్రాపంచిక సుఖములు సత్యములు శాశ్వతములు అనే భ్రమలో వాటి వెంట పరుగెడుతుంటాము. కాబట్టి ఉన్నది ఉన్నట్టు తెలియజేసేదానిని ప్రమాణము అని అంటారు.

అన్ని ధర్మములకు ప్రమాణము వేదము. వేదములు ఒకరు రాయలేదు. మహా ఋషులు తమ సమకాలీన జీవితంలో వివిధములైన విషయములను, ఆచారాలను, వ్యవహారాలను, కర్మలను దర్శించి, అందులో మానవాళికి ఉపయుక్తమైన వాటిని, మానవులు ఆచరించవలసిన వాటిని, తమ బుద్ధిని జ్ఞానమును జోడించి, మనకు తెలియజేసారు. వేదములను ఋషులు దర్శించారు కానీ సృష్టించలేదు. అందుకే వారు వేద ద్రష్టలు. స్రష్టలు కాదు. సకల ధర్మములను వేదములు మనకు తెలియజేస్తాయి. కాబట్టి వేదములు అంటే శృతులు మనకు మొదటి ప్రమాణము.

వేదములు మానవాళికి సులభంగా అర్థం అయ్యేవి కావు. పైగా వేదములలో ధర్మములు అక్కడక్కడా పొందుపరచబడి ఉన్నాయి. వేదములు అన్నీ పూర్తిగా చదవడానికి మానవులకు జీవిత కాలం సరిపోదు. ఆ కారణం చేత మరి కొంతమంది ఋషులు ఆ వేదములను సంపూర్ణంగా అధ్యయనం చేసి, వాటిలో ఉన్న సారమును, ధర్మములను అన్నిటినీ ఒక చోటచేర్చి మనకు అందించారు. వాటినే స్మృతులు అంటారు. స్మృతులు మనకు రెండవ ప్రమాణము. మనుస్మృతి, పరాశర స్మృతి , యాజ్ఞవల్క్యస్మృతి మొదలగునవి. వీటిలో మానవులు దైనందిన జీవితంలో ఆచరించవలసిన ధర్మములను, విధులను, కర్మలను వివరంగా పొందుపరిచారు. శృతి అంటే వేదములు, తండ్రి చెప్పినట్టు అంటే శాసించినట్టు చెబితే, స్మృతి తల్లి చెప్పినట్టు వివరంగా, చిన్న చిన్న కథలరూపంలో లాలించి, బుజ్జగించి, అర్థం అయ్యేటట్టు చెబుతుంది.

శృతులు కానీ, స్మృతులు కానీ అందుబాటులో లేని వారికి, అవి చదివినా అర్థం కాని వారికి, మూడవ ప్రమాణం శిష్టాచారం. అంటే శ్రేష్ఠులు అయిన వారు ఏమేమి ఆచరిస్తారో వాటిని మనం ఆచరించాలి. జ్ఞానులు, బుద్ధిమంతులు అయిన పెద్దలు ఏమి చేసారో వాటిని ప్రమాణంగా స్వీకరించాలి. మానవులకు ఎక్కడెక్కడ దేని గురించి అయినా సందేహాలు వస్తే, వారి ఇష్టం వచ్చినట్టు చేయకుండా జ్ఞానులు అయిన పురోహితులు చెప్పినట్టు చేయడం మంచిది.

పాండవులు ఒక అర్ధరాత్రి పూట ఒక గంధర్వునితో తగాదా పెట్టుకున్నారు. అప్పుడు ఆ గంధర్వుడు వారికి ఒక సలహా ఇచ్చాడు. “అయ్యా! మీరు అన్నీ తెలిసిన వారే కావచ్చు కానీ మీరు ఒక పురోహితుని మీ ముందు ఉంచుకోండి. ఆయన మీకు తగినసమయంలో ధర్మబోధ చేస్తాడు. పురోహితుడు లేకుండా మీరు ఎక్కడకు వెళ్లవద్దు.” అని చెప్పాడు. అప్పటి నుండి వారు ధౌమ్యుడిని

తమ పురోహితునిగా పెట్టుకున్నారు.

కాబట్టి మానవులు ధర్మం గురించి తెలుసుకోవాలంటే వారి పురోహితులను, పెద్దలను, జ్ఞానులను ఆశ్రయించాలి. వారి ఆచార వ్యవహారములను అనుసరించాలి. ఇదే మూడవ ప్రమాణము. ఈ మూడు ప్రమాణములలో ఆఖరిది అయిన శిష్టాచారమే సామాన్య మానవులకు, చాలా ప్రముఖమైనది, ఆచరించతగ్గది. ఎందుకంటే శ్రుతులు, స్మృతులు కేవలం బోధిస్తాయి. కాని శిష్టాచారము పెద్దలు ఏం చేస్తున్నారో చూచే అవకాశం కల్పిస్తుంది. అదే చూచి నేర్చుకోవడం. పెద్దవారు, బుద్ధిమంతులు తాము ఆచరించి ఇతరులకు చూపిస్తారు. పెద్దలు చేసిన మంచి పనులను చూసి పిల్లలు నేర్చుకుంటారు. వారు అనుసరించిన ధర్మమార్గమునే అనుసరిస్తారు. వారిని చూచి వారి పిల్లలు కూడా అదే ధర్మమార్తమును అనుసరిస్తారు. అది వాళ్ల ఆచారంగా, ఒక ప్రమాణంగా తరతరాలకు సంక్రమిస్తుంది.

ఈ శిష్టాచారము ఎవరి వద్దనుండి నేర్చుకోవాలి అంటే మనకు నలుగురు గురువులు అంటే శ్రేష్ఠులు ఉన్నారు. వారిలో మొదటిది తల్లి. తల్లి మనకు మొదటి పాఠం చెబుతుంది. చెయ్యాల్సినవి చేయకూడనివి నేర్పుతుంది. అది ఆమె బాధ్యత. రెండవ శిష్ఠుడు తండ్రి. తండ్రి తాను మంచి పనులను ఆచరించి తన పిల్లలుకూడా ఆచరించేటట్టు చేయాలి. మూడవ శిష్ఠుడు గురువు. గురువు కేవలం పిల్లలకు పాఠాలు చెప్పడమే కాదు. ఆ ధర్మాలను తాను ముందు ఆచరించి, తనను చూసి పిల్లలు నేర్చుకునేటట్టు చేయాలి. తరువాతి శిష్ఠుడు రాజు. రాజు ధర్మాత్ముడు అయితే ప్రజలుకూడా ధర్మం ఆచరిస్తారు.రాజు లంచగొండి అయితే ప్రజలు అదేమార్గాన్ని అనుసరిస్తారు. అందుకే యథారాజా తథా ప్రజా అనే సూక్తి వచ్చింది. ఎవరికైతే తల్లి తండ్రి గురువు రాజు ధర్మాచరణలో తమ పిల్లలకు, శిష్యులకు, ప్రజలకు రోల్ మోడల్సుగా ఉంటారు, అతడు తప్పకుండా ధర్మాత్ముడు అవుతాడు. ఆ రాజ్యం రామరాజ్యం అవుతుంది.
(ఈ సూత్రం ఈ నాటికి అన్వయించుకుంటే, మన మంత్రులు పాలకులు నీతిగా ఉంటే వారి కింది అధికారులు ప్రజలు నీతిగా ఉంటారు. మంత్రులే అవినీతికి పాల్పడితే, కింది అధికారులు కూడా అవినీతికి పాల్పడతారు. కాబట్టి పెద్దలైన వారు, అవినీతి అంతం చేస్తాము అని ప్రగల్భాలు పలకడం మాని, ముందు వారు ఆచరించి, ఇతరులకు మార్గదర్శకం కావాలి.)

ఈ శ్లోకంలో ఆఖరు ప్రమాణం అయిన శిష్టాచారం గురించి చెప్పాడు పరమాత్మ. ఓ అర్జునా! శ్రేష్ఠులు అయిన వారు ఏమేమి ధర్మములను ఆచరిస్తారో, సామాన్యులు కూడా ఆయా ధర్మాలను అనుసరిస్తారు. ఎందుకంటే సామాన్యమానవులు సాధారణంగా ఆలోచించరు. తమ తల్లి తండ్రులు, గురువులు, పెద్దలు, రాజు ఏమి చేస్తే దానిని అనుసరిస్తారు. నువ్వు రాజువు. పరాక్రమవంతుడివి. వీరుడివి. ఈ యుద్ధంలో నిన్ను నీ పరాక్రమాన్ని, వీరత్వాన్ని నమ్ముకొని అందరు రాజులూ యుద్ధానికి సన్నద్ధం అయ్యారు. అటువంటి నీవే నేను యుద్ధం చేయను అంటే ఇతర

రాజులు కూడా నిన్నే అనుసరిస్తారు. ఎందుకంటే సాధారణంగా మానవులను మంచి కంటే చెడు లక్షణాలు తొందరగా ఆకర్షిస్తాయి. నీలో ఎన్ని మంచిలక్షణాలు ఉన్నా ఈ తాత్కాలిక పిరికితనము, పారిపోయే గుణము, తప్పించుకు తిరిగే గుణము అనే చెడు మాత్రమే తొందరగా అందరినీ ఆకర్షిస్తుంది. కాబట్టి ఓ అర్జునా! నీవు అందరికీ ఆదర్శంగా నిలబడి, ముందు నిలబడి యుద్ధం చేస్తే, ఇతర రాజులు నిన్ను అనుసరిస్తారు. నీవే పిరికివాడుగా పారిపోతే ఇతర రాజులు కూడా నిన్ను అనుసరిస్తారు అని ధర్మబోధ చేసాడు కృష్ణుడు.

22. న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన।
నానవాప్త మవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి॥

అర్జునా! మూడులోకాలలో నేను చేయవలసిన కర్తవ్యం అంటూ కొంచెం కూడా ఏమీ లేదు. అలాగే నేను కోరుకోదగ్గది, పొంద తగినది, నేను పొందలేనిది ఏదీ లేదు. ఐనప్పటికినీ నేను అనునిత్యం కర్మలు చేస్తూనే ఉన్నాను.

ఇప్పటి దాకా కృష్ణుడు అందరి గురించీ చెప్పాడు. అర్జునుడిలో ఏమీ చలనం లేదు. ఇంక లాభం లేదని, ఇప్పుడు కృష్ణుడు తన గురించి తాను చెప్పుకుంటున్నాడు. అర్జునా! నాకు ఈమూడులోకాలలో చేయతగినపని కానీ, చేయవలసిన పని కానీ లేదు. నాకు కావాల్సింది ఏదీ లేదు. కోరతగినది ఏదీ లేదు. అలాగే నేను కోరుకుంటే పొందలేనిది అంటూ ఏమీ లేదు. అయినా నేను కర్మలు చేస్తూనే ఉన్నాను. నీకు సారథిగా కూడా పని చేయడానికి ఒప్పుకున్నాను. కారణం నాకు అన్నీ తెలుసు నేను గొప్పవాడిని అని ఎప్పుడూ అనుకోలేదు. ఏ చిన్న పని చేయడానికీ వెనుకాడలేదు." అని తన గురించి తాను చెప్పుకున్నాడు.

ఒకవిధంగా కృష్ణుడు, నేను ఆత్మసాక్షాత్కారం పొందిన వాడిని, స్థితప్రజ్ఞుడిని అని నర్మగర్భంగా చెబుతున్నాడు. కృష్ణుడు సాక్షాత్తు పరమాత్మ అవతారము. నిర్గుణుడు, నిరాకారుడు, నిర్మలమైన మనస్సు కలవాడు. త్రిగుణములకు అతీతుడు. ఆ ఉద్దేశంలో అనుకుంటే కృష్ణుడికి చేయవలసిన కర్మ అంటూ ఏమీ లేదు. తీరవలసిన కోరికలు అంటూ ఏమీ లేవు. ఆయన కోరుకుంటే తీరని కోరిక అంటూ ఏదీ లేదు. రెండవ ఉద్దేశం కృష్ణుడు జ్ఞాని. అన్నీ తెలిసిన వాడు. అన్నిటికీ అతీతుడు. మాయ గురించి తెలిసిన వాడు. స్థితప్రజ్ఞుడు. అలా చూచినా కూడా కృష్ణుడికి చేయవలసిన కర్మ, తీర వలసిన కోరిక అంటూ కూడా ఏమీ లేదు.

అందుకే అంటున్నాడు......అయినా నేను లోకం కొరకు కర్మలు చేస్తూనే ఉన్నాను. ఎందుకు? ప్రజలు నన్ను చూచి, వారూ అలాగే ఆచరించాలి. ధర్మమార్గంలో నడవాలి. అంతే కానీ నా కోసం

కాదు. నాకు రూపం లేదు. అయినా ఒక రూపం ధరించాను. ఎక్కడో పుట్టాను ఎక్కడో పెరిగాను. చిన్నప్పుడే ఎన్నో కష్టాలు ఎదుర్కొన్నాను. ఒకసామాన్యుడు ఏమేమి చేయాలో అన్నీ చేసాను. వీలున్నంతవరకు ప్రజలకు ధర్మమార్గంలో నడవమని బోధించాను.

ఇంతెందుకు ఇప్పుడు నీకు సారథిగా ఉన్నాను. ఎంతో ఉత్సాహంగా నీకు సారధ్యం చేస్తున్నాను. నీ ఆజ్ఞలు పాలిస్తున్నాను. నీవు రథం ఎటు పోనిమ్మంటే అటు పోనిస్తున్నాను. ఒక విధంగా నీకు సేవచేస్తున్నాను. ఈ విధంగా నీకు సారధ్యం చేసి నందు వలన నాకు వచ్చే లాభం అంటూ ఏమీ లేదు. పైగా నష్టం ఎక్కువ. ఎందుకంటే, నీ మీదికి సంధించిన ప్రతి బాణము నాకు తగిలే అవకాశం ఉంది. కొంత మంది ముందు సారథిని చంపుతారు. కాబట్టి యుద్ధంలో నీకంటే ముందు నేనే మరణించవచ్చు. నాకే ప్రమాదము ఎక్కువ. అయినా ఈ పనికి నేను సంతోషంగా ఒప్పుకున్నాను. కారణం ఇది నా కర్తవ్యం. నేనుచేయాలి. ప్రతివాడూ చిన్న పని, పెద్ద పని అనే తేడా లేకుండా అన్ని పనులు చేయడానికి సిద్ధంగా ఉండాలి అనే ప్రమాణాన్ని నెలకొల్పడానికి నీకు సారథిగా ఉన్నాను.

నాకు పెద్దపని చిన్న పని అంటూ లేదు. గొప్ప బీద తేడా లేదు. నా చిన్ననాటి మిత్రుడు సుదాముడు పరమ బీదవాడు, కుచేలుడు, ఆయన వచ్చినపుడు నేను ఆయన కాళ్లు కడిగాను. ఎందుకు. ఆయన సద్బ్రాహ్మణుడు. వేదములు చదువుకున్న వాడు. జ్ఞాని. నిష్కామ కర్మలు ఆచరించిన వాడు. అటువంటి బ్రాహ్మణులు నాకు దైవంతో సమానము. పైగా ఆయన నాకు అతిథి. అందుకే ఆయనకు నేను, నా భార్యలు అతిథి సత్కారాలు, సేవలు చేసాము. నేను గొప్పవాడిని, నేను జ్ఞానిని, నాకు అన్నీ తెలుసు అని గర్వంతో విర్రవీగలేదు. ఈ ప్రకారంగా అన్ని తెలిసిన నేను నా కర్తవ్య కర్మ నేను చేస్తుంటే నీవు చేయడానికేమి? నీవే కాదు జీవన్ముక్తులు అనే వారు కూడా కర్మలు చేయాలి. వారు చేసి లోకానికి ఆచరించమని బోధించాలి. ప్రజల చేత ఆచరించేటట్టు చేయాలి. అదీ నిష్కామంగా చేయాలి ఎటువంటి ఫలితములను ఆశించి చేయరాదు. సన్యాసులు జీవన్ముక్తులు కూడా సమాజ శ్రేయస్సు కోరి ధర్మకార్యాలు ఆచరించాలి. అందరూ ఆచరించేటట్టు చేయాలి. స్వార్థరహితంగా చేయాలి. అప్పుడే సమాజం బాగుపడుతుంది. అని చెప్పి దానికి కారణం కూడా చెబుతున్నాడు పరమాత్మ.

## 23. యది హ్యహం న వర్తేయం జాతు కర్మణ్యతన్ద్రితః। మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః॥

ఓ పార్థా! నేను కనుక నా కర్తవ్య కర్మలు అత్యంత శ్రద్ధతో ఎటువంటి సోమరితనం లేకుండా నెరవేర్చకపోతే ఇతరులు కూడా నన్నే అనుసరిస్తారు. కృష్ణుడే చేయలేదు మేమెందుకు

చేయాలి అంటూ ఎవరూ ఏపనీ చేయరు. అంతా గందరగోళంగా తయారవుతుంది. అందరూ అధర్మపరులవుతారు. మానవులు అందరూ నన్నే అనుసరిస్తారు కాబట్టి నేను నా కర్తవ్యకర్మలను చేయక తప్పదు.

ఇక్కడ కృష్ణుడు రెండు పదాలు వాడాడు. అతన్ద్రిత:. అంటే సోమరి తనం లేకుండా ఉండటం. తంద్రత అంటే సోమరి తనము. తందరపాటు అని మనం అంటూ ఉంటాము. ఆ తందరపాటు లేకుండా, ఎటువంటి కన్ఫ్యూజన్ లేకుండా, సోమరి తనం లేకుండా నేను కర్మలు చేస్తున్నాను. అత్యంత జాకరూకతతో చేస్తున్నాను. నాకు ఏ కర్మా చేయవలసిన అవసరం లేకపోయినా అత్యంత శ్రద్ధాభక్తులతో జాగరూకతతో కర్మలు చేస్తున్నాను. ఎందుకంటే నన్ను అనుసరించి నేను చేసినట్టు కర్మలు చేసేవాళ్లు చాలా మంది ఉంటారు. వాళ్ల కోసం నేను నా విద్యుక్తధర్మములను నిర్వర్తిస్తున్నాను. నాకెందుకులే అని నేను ఊరుకుంటే, జనులు నన్నే అనుసరిస్తారు. నేను ఏమీ చేయలేదు కాబట్టి వారు కూడా ఏమీ చేయరు. సోమరులు అవుతారు. నేనే కాదు జీవన్ముక్తులు, జితేంద్రియులు, స్థిరప్రజ్ఞులు అనే వారు కూడా వారి వారి కర్తవ్యకర్మలు నిత్య కర్మలు, నైమిత్తిక కర్మలు పంచ మహా యజ్ఞాలు చేస్తూ ఇతరులకు ఆదర్శంగా నిలవాలి. అంతేకానీ నేను ముక్తి పొందాను ఇతరుల సంగతి లోకం సంగతి నాకు అనవసరం అని అనుకోకూడదు అని పరమాత్మ అందరికీ ఒక హెచ్చరిక చేస్తున్నాడు.

ఇందాక చెప్పిన పదం అతన్ద్రిత: అనే పదం మనకే ఒక హెచ్చరిక. ఏ పని చేసినా తందరపాటు లేకుండా జాగరూకతతో శ్రద్ధగా చేయాలి. అజాగ్రత్త పనికిరాదు. సోమరి తనము పనికిరాదు.

ఈసందర్భంలో జగద్గురు శంకరాచార్యుల వారు వివేకచూడామణిలో ఇలా అన్నారు.
ప్రమాదో బ్రహ్మనిష్ఠాయాం న కర్తవ్య: కదాచన।
ప్రమాదో మృత్యురిత్యాహ భగవాన్ బ్రహ్మణస్సుత:॥
ఇక్కడ ప్రమాదము అంటే ప్రమత్తత. సోమరి తనము. నిర్లక్ష్యము అని అర్థము. బ్రహ్మనిష్టయందు సోమరి తనము, అజాగ్రత్త, నిర్లక్ష్యము పనికిరాదు. ఎల్లప్పుడూ అప్రమత్తంగా ఉండాలి. సోమరితనము, నిర్లక్ష్యము మృత్యువుతోసమానము అని బ్రహ్మమానసపుత్రులు అయిన సనత్కుమారుడు చెప్పాడు. (సేకరణ: గీతా మకరందము).

ఇక్కడ ప్రమాదో అంటే నిర్లక్ష్యము, అజాగ్రత్త, మృత్యువుతో సమానము. ఈనాడు నిత్యం జరిగే రోడ్డు ప్రమాదాలు, రైలుప్రమాదాలకు నిర్లక్ష్యము, అజాగ్రత్త ప్రధానకారణాలు అని మనకు తెలుసు. (సెక్షన్ 304-ఎ ఐపిసి లో ముఖ్యమైన అంశము రాష్ అండ్ నెగ్లిజంట్ డ్రైవింగ్ ఆర్ ఆక్ట్). ఇక్కడ కృష్ణపరమాత్మ కూడా ఒక రథసారథి (డ్రైవర్). నేను, చావడానికి కూడా సిద్ధపడి, నీకు

రథసారథిగా ఉండటానికి ఒప్పుకొని, నా ధర్మం ప్రకారం ఇంత జాగ్రత్తగా రథం నడుపుతుంటే, నీ ధర్మము, క్షత్రియ ధర్మము అయిన యుద్ధం చేయడానికి నీకేం (మాయరోగం) అనే మాట అనలేదు కానీ ఆ అర్థం వచ్చేట్టు అన్నాడు.

అన్నీ తెలిసిన పరమాత్మే తన కర్తవ్య నిర్వహణ పట్ల ఇన్ని జాగ్రత్తలు తీసుకుంటూ ఉంటే ఇంక మనం ఎంత అని అనుకొని మనం కూడా అన్ని కర్మలను ఎటువంటి తొందరపాటు లేకుండా, జాగ్రత్తగా చేయాలి.

ఇలాచేయకపోతే ఏమవుతుంది అనే దానికి తరువాతి శ్లోకంలో వివరిస్తున్నాడు పరమాత్మ.

## 24. ఉత్సీదేయురిమే లోకా న కుర్యాం కర్మ చేదహమ్।
## సంకరస్య చ కర్తా స్యాముపహన్యామిమా: ప్రజా:॥

ఓ అర్జునా! నేను కర్మలనుచేయకుండా మానేస్తే ఈ లోకములు అన్నీ నశించిపోతాయి. అల్లకల్లోలము అవుతాయి. ప్రజలకు నష్టం కలుగుతుంది. వీటి కంతా నేను కారకుడను అవుతాను కాబట్టి నేను నిరంతరముకర్మలు చేస్తూనే ఉంటాను.

అర్జునా! నేను కూడా ఏ పనీ చేయకుండా సన్యాసిలాగా ఉంటే, ఈ ప్రపంచం కూడా నన్నే అనుసరిస్తుంది. లోకమంతా నిర్వీర్యం అవుతుంది. కాబట్టి నేను కూడా సామాన్య మానవుని వలె కర్మలు చేస్తున్నాను. అలా చేయకపోతే నన్ను అనుసరించే వాళ్లు కూడా చేయవలసిన కర్మలు చేయకుండా సోమరులు అవుతారు. ఆ కారణంగా ఈ లోకములు నిర్వీర్యం కావడానికి నేనే కారణం అవుతాను. నా వలననే ఈ లోకంలో ఉన్న మానవులు సందిగ్ధంలో పడి కర్మలు మానివేసి పతితులవుతారు. లోకంలో అశాంతి ఏర్పడుతుంది. ప్రజలు అన్యాయాన్ని, అధర్మాన్ని ఆశ్రయిస్తారు. దాని ఫలితంగా ఉత్పాతాలు ఉపద్రవాలుసంభవిస్తాయి. ఈ విధంగా నేను లోకులయొక్క వినాశనానికి కారణం అవుతాను. లోకులను చెడగొట్టినవాడిని అవుతాను. కాబట్టి లోక క్షేమం గోరి నేను కర్మలు చేస్తున్నాను. నేను లోకం క్షేమం చూడాలి కానీ లోకాలను సంక్షోభంలోకి నెట్టకూడదు. ఇదే విధంగా జీవన్ముక్తులు అయిన వారు కూడా లోక కల్యాణం కొరకు సాటి మానవుల క్షేమం కొరకు కర్మలు చేయక తప్పదు. ఎందుకంటే పుట్టిన ప్రతవాడూ కర్మలు చేయడం అతని సహజ ధర్మం. కాబట్టి నీవు కూడా నీ విద్యుక్త కర్మ అయిన యుద్ధం చెయ్యి. అని కృష్ణుడు తననే ఉదాహరణగా చెప్పకుంటూ అర్జునుడికి శతవిధాలా బోధించడానికి ప్రయత్నం చేస్తున్నాడు.

(ఇంతకు ముందు అర్జునుడు మాట్లాడినప్పుడు తాను యుద్ధం చేస్తే, ఆ యుద్ధంలో అందరూ చనిపోతే, వర్ణసంకరం అవుతుంది అని అంటే ఇప్పుడు కృష్ణుడు, ఎవరి ధర్మం వారు నిర్వర్తించకపోతే అంటే నా ధర్మం నేను నిర్వర్తించకపోతే కూడా సంకరం అవుతుంది అని మాటకు మాట బదులు చెప్పాడు.)

ఈ శ్లోకంలో సంకరం అనేమాట వాడారు. అంటే ఏం చెయ్యాలో ఏం చెయ్యకూడదో అనే స్థితి.(కన్ఫ్యూజన్) అప్పుడు చేయకూడని పనులే సాధారణంగా చేస్తారు. చేయాల్సిన పనులు చేయరు. సాధారణంగా వర్ణసంకరము, జాతి సంకరము అని వింటూ ఉంటాము. వాటి గురించి చిన్న వివరణ. మనిషి పుట్టిన తరువాత, ఆడ కానీ మగ కానీ ఏదో ఒకపని చేయాలి. ఏ పని చేయాలో ఎవరికి వారు ఎన్నుకోవాలి. అది వారి వారి సామర్థ్యము, అర్హత, అభిరుచి అంటే ఆసక్తి వీటి మీద ఆధారపడి ఉంటుంది. దీనినే ఎవరి గుణములను బట్టి వారు కర్మలుచేయడం అంటారు. ఎందుకంటే ఎవరైతే ఆసక్తితో పని చేస్తారో వారు ఆ పని చేయడంలో ఆనందం అనుభవిస్తారు. ఇష్టం లేని పని, ఆసక్తి లేని పని ఏడుస్తూ చేస్తారు. ఇది ప్రాథమిక సూత్రము. ఈ సూత్రము ఆధారంచేసుకొని వర్ణవ్యవస్థ(ఈ నాటి భాషలో చెప్పుకోవాలంటే కులవ్యవస్థ) ఏర్పడింది. ఈ వ్యవస్థలో మంచి చెడు రెండూ ఉన్నాయి. అది నిర్వివాదాంశము. అందరికీ అన్ని పనులు చేసే సామర్థ్యము, ఆ పనులలో ఆసక్తి ఉండటం కుదరదు కాబట్టి పూర్వీకులు మానవులను నాలుగు భాగాలుగా విభజించి ఒక్కో భాగానికి ఒక్కో వర్ణము అని పేరు పెట్టారు. సమాజం ఆయా వర్ణముల వారికి కొన్ని కొన్ని పనులు అప్పగించింది. ఆ పనులు వారే చేయాలని నిర్దేశించింది. కానీ కొంత మందికి మినహాయింపు కూడా ఇచ్చింది. ఒక వర్ణములో పుట్టినవాడు మరొక వర్ణముల వారు చేసే పనుల మీద ఆసక్తి,నైపుణ్యం ఉంటే ఆ వర్ణములోకి మారవచ్చును అని మినహాయింపు ఇచ్చింది కాని కొన్ని నిబంధనలకు లోబడి ఆ మినహాయింపు వర్తిస్తుంది. క్షత్రియుడుగా పుట్టి బ్రాహ్మణులు అయిన వారు, బ్రాహ్మణులుగా పుట్టి క్షాత్రము అవలంబించిన వారు మనకు పురాణాలలో ఇతిహాసాలలో కనపడతారు. ఈ వర్ణవ్యవస్థలేకపోతే అందరూ అన్ని పనులు చేసి ఏదీ సరిగా చేయకుండా అంతా అభాసుపాలయ్యే ప్రమాదం ఉంది. అందుకే వర్ణవ్యవస్థ అందరూ విధిగా పాటించాలి అని నిర్దేశించింది.

ఇది ఒక్క భారతదేశానికే పరిమితం అని చాలామంది అపోహ పడుతుంటారు. కాని ఇది ప్రపంచవ్యాప్తంగా ఉంది. మనం బ్రాహ్మణ వర్ణము అంటే ఇతర దేశములలో వారు ప్రీస్ట్ క్లాస్ అంటారు. మనం క్షత్రియులు అంటే వారు వారియర్స్ క్లాస్ అంటారు. మనం వైశ్యులు అంటే వారు బిజినెస్ క్లాస్ అంటారు. మనం శూద్రులు అంటే వారు వర్కింగ్ క్లాస్ అంటారు. పేరు భేదం కానీ వ్యవస్థ ఒకటే. అంత దాకా ఎందుకు మనలో కూడా డాక్టర్ కొడుకులు కూతుళ్లు డాక్టర్లు అవుతున్నారు. అలాగే లాయర్ కొడుకు లాయర్. ఐఏయస్ ఐపియస్ ఆఫీసర్ల సంతానం అలాగే అవుతున్నారు. ఇంక రాజకీయనాయకుల సంగతి, సినీ హీరోల సంగతి చెప్పనక్కరలేదు. ఇవన్నీ

తల్లి తండ్రులనుండి పరంపరానుగతంగా సంక్రమించే వ్యవస్థలు. అలాగే వర్ణవ్యవస్థకూడా జన్మను బట్టికాకుండా వారి వారి అభిరుచులను బట్టి, గుణములను బట్టి, వారు చేసే కర్మలను బట్టి పెంపొందింది. కాని అది ఈనాడు మానవుల స్వార్థముతో రాజకీకయంతో పెనవేసుకొని వెర్రితలలు వేసింది. ఈ వర్ణవ్యవస్థలో కూడా కొంత మందికి వారి వారి ఆసక్తి నైపుణ్యమును బట్టి ఆయాపనులు వారికి అప్పగించింది. అందుకే చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణ కర్మ విభాగయో: అన్నాడు పరమాత్మ. వారి వారి గుణములు, వారు చేసే కర్మలు, అందులో వారు చూపే ఆసక్తి నైపుణ్యమును బట్టి వర్ణములుగా విభజింపబడ్డారు కానీ ఒకరు ఎక్కువ మరొకరు తక్కువ అని కాదు. వర్ణవ్యవస్థను ఈ విధంగా అర్థం చేసుకుంటే ఏ ఇబ్బందీ ఉండదు.

ఈ వర్ణవ్యవస్థను సరిగా పాటించకపోతే సంకరం అంటే కంఫ్యూజన్ అవుతుంది. పెద్దలు వర్ణవ్యస్థను, కర్తవ్యకర్మలను సరిగా పాటిస్తేవారిని చూచి తరువాతి తరం వారు నేర్చుకుంటారు. సమాజం సక్రమంగా నడుస్తుంది. లేకపోతే అందరూ అన్ని కర్మలు చేయడం మొదలుపెడితే సంకరం (కన్ఫ్యూజన్) అవుతుంది. మరి ఈ కర్మలు ఎలా చేయాలో తరువాతి శ్లోకంలో వివరిస్తున్నాడు పరమాత్మ.

### 25. సక్తా: కర్మణ్యవిద్వాంసో యథా కుర్వంతి భారత।
### కుర్యాద్విద్వాంస్తథాసక్త: చికీర్షుర్లోక సంగ్రహమ్॥

ఎలాగైతే అజ్ఞానులు ఎక్కువగా ప్రాపంచిక కర్మలయందు ఆసక్తి కలిగి ఉండి, వాటినే ఆచరిస్తుంటారో, అలాగే జ్ఞానులు కూడా ఎక్కువగా లోకహితము కొరకు, ఎటువంటి ఆసక్తి, స్వార్థబుద్ధి లేకుండా, కర్మలు చేస్తుంటారు.

అర్జునా! నీకుఇంకా వివరంగా చెబుతాను విను. ఏమీ తెలియని అజ్ఞానులు కేవలం తమ కోరికలు తీరడానికి ఫలితములను ఆశించి, ఏవిధంగా కర్మలు చేస్తుంటారో అలాగే జ్ఞానులు కూడా, తమకు ఏ కర్మచేయవలసిన అవసరం లేకపోయినప్పటికినీ, లోక కల్యాణము కొరకు, లోకంలో ఉన్న జనులు మంచి మార్గంలో నడవడం కొరకు, తాము కూడా నిష్కామ కర్మలు ఎటువంటి కర్తృత్వభావన లేకుండా, పరోపకారం కొరకు కర్మలు చేస్తుంటారు. ఇక్కడ ఒకటే తేడా. అజ్ఞాని తన కోరికలు తీరడానికి ఫలితం ఆశించి, తన స్వార్థం కోసరం కర్మలు చేస్తున్నాడు. జ్ఞాని ఎటువంటి కోరికలు కోరకుండా ఫలితం ఆశించకుండా ఇతరుల బాగుకోసరం, సమాజ శ్రేయస్సుకొరకు కర్మలు చేస్తున్నాడు. ఇంతే తేడా.

ఈ శ్లోకంలో భగవానుడు జ్ఞానికి అజ్ఞానికి తేడా చూపించాడు. అజ్ఞానులు, జ్ఞానులు ఇరువురు ఈ లోకంలో పుట్టారు కాబట్టి కర్మచేయక తప్పదు. అజ్ఞానులు ఫలాసక్తితో చేస్తారు. జ్ఞానులు ఫలం కోరకుండా చేస్తారు. అజ్ఞాని కర్మయందు ఆసక్తితో నేను చేస్తున్నాను అన్న కర్తృత్వబుద్ధితో చేస్తాడు. జ్ఞానులు ఇది నా ధర్మము అనుకుంటూచేస్తాడు. అజ్ఞాని తన ఆనందం కొరకు,తన సంతోషం కొరకుపని చేస్తాడు. జ్ఞాని సమాజం శ్రేయస్సుకొరకు, ఆనందంతో, సంతోషంతో పని చేస్తాడు. అజ్ఞానిలో స్వార్ధం ఉంటుంది. జ్ఞానిలో పరోపకారం, సమాజ శ్రేయస్సు ఉంటుంది. అజ్ఞాని ఆసక్తితో చేస్తాడు. జ్ఞాని అనాసక్తంగా చేస్తాడు. అజ్ఞానికి తాను చేసే కర్మలు బంధనాలు కలిగిస్తే, జ్ఞానికి అవే కర్మలు మోక్షానికి దారిచూపుతాయి. కాబట్టి కర్మలు చేయడం ఇద్దరికీ సమానమే కానీ భావనలో మాత్రమే తేడా. అగ్నిని మంచికీ ఉపయోగించవచ్చు చెడుకు ఉపయోగించవచ్చు. కర్మ స్వార్ధానికీ ఉపయోగించవచ్చు సమాజ శ్రేయస్సుకు ఉపయోగించవచ్చు. కాబట్టి కర్మ స్వభావమును తెలుసుకొని కర్మచేయాలి. కాబట్టి భగవానుడు వ్యక్తి స్వార్ధము కన్నా సమాజశ్రేయస్సుకు ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చాడు. కాబట్టి సకామ కర్మ కన్నా నిష్కామకర్మ మంచిది. అజ్ఞానంతో స్వార్ధబుద్ధితో చేసే కర్మ కన్నా జ్ఞానం కలిగి సమాజ శ్రేయస్సు కొరకు చేసే కర్మ మంచిది.

## 26. న బుద్ధిభేదం జనయేదజ్ఞానాం కర్మసఙ్గినామ్।
## జోషయేత్సర్వకర్మాణి విద్వాన్యుక్తః సమాచరన్॥

ఈ లోకంలో ఎంతో మంది ఆత్మజ్ఞానము కలిగిన వారు ఉన్నారు. ఏమీ తెలియని అజ్ఞానులు ఉన్నారు. అజ్ఞానులు కామ్యకర్మలను ఆసక్తితో చేస్తుంటారు. వివిధరూపములతో, నామములతో, దేవుళ్లను పూజిస్తుంటారు. అటువంటి వారిని చూచి జ్ఞానులు వారు సక్రమ మార్గంలో లేరని చెప్పకూడదు. అలా చేస్తే వారు చేసే కర్మలనుకూడా చేయకుండా సోమరులుగా మారిపోతారు. జ్ఞానులు అయిన వాళ్లు తాము కర్మలు ఎలా చేయాలో ముందు తాము చేసి, అజ్ఞానులకు చూపించి, వారికి నచ్చచెప్పి, వారితో నిష్కామ కర్మలను చేయించాలి. వారికి మార్గదర్శకులు కావాలి.

ఇక్కడ పరమాత్మ మరొక ముఖ్య విషయాన్ని ప్రస్తావించాడు. ఇందాక చెప్పినట్టు లోకంలో జ్ఞానులు అంటే అన్నీ తెలిసిన వారే కాదు, అజ్ఞానులు అంటే ఏమీ తెలియని వారు, తెలిసీ తెలియని వారు కూడా ఉంటారు. అజ్ఞానులు సాధారణంగా ఏదో ఒక ఫలితాన్ని ఆశించి కర్మలు చేయడం యందే నిమగ్నం అయి ఉంటారు. అటువంటప్పుడు, జ్ఞాని అయిన వాడు అజ్ఞానుల నమ్మకాలను పాడు చేయకూడదు. వారి నమ్మకాలను మూఢనమ్మకాలని కొట్టి పారేయకూడదు. క్రమక్రమంగా వారికి నచ్చచెప్పాలి. వారిని సక్రమమైన మార్గంలో పెట్టాలి. అలాకాకుండా, ఒక్కసారిగా

వారు చేసేది తప్పు అని ఖండిస్తే వారు దిక్కుతోచని వారైపోతారు. ఎందుకంటే ప్రతి వాడు కూడా నేను ఈ పని చేస్తే ఈ ఫలితం వస్తుంది. ఆ ఫలితం నేను అనుభవిస్తాను అనే నమ్మకంతోనే కర్మలు చేస్తాడు. జ్ఞాని అయిన వాడు వెంటనే నీవు చేసేది తప్పు అని ఖండించకూడదు. వాడి నమ్మకాన్ని వమ్ముచేయకూడదు. మరి ఏం చేయాలి. అంటే అజ్ఞాని చేసే కర్మలనే జ్ఞాని ఫలాపేక్షరహితంగా, స్వార్థరహితంగా ముందు తాను చేస్తూ, అజ్ఞానిని కూడా ఆ విధంగా చేయమని ప్రోత్సహించాలి. అప్పుడు అజ్ఞాని కూడా సమాజహితం కోరుతూ స్వార్థం లేకుండా కర్మలు చేస్తాడు.

దీనిని ఇంకొంచెం వివరంగా చెప్పుకోవాలంటే.... అజ్ఞానులు నిష్కామ కర్మ తత్వము తెలియక, తాము చేసేది మంచిది అనే భావనతో, శ్రద్ధతో, ఎంతో కొంత ప్రతిఫలం ఆశించి, కర్మలు చేస్తుంటారు. అన్నీ తెలిసిన వాడు వెంటనే "నీవు చేసేది తప్పు. నీకు పాపం వస్తుంది" అని మొహం మీద చెప్పకూడదు. చెబితే అజ్ఞానులు "నీకేం తెలియదు పో!" అని వారు కూడా మొహం మీదనే అంటారు. మరి కొందరు అసలు కర్మలు చేయడమే మాని వేస్తారు. మరి కొందరు రెచ్చిపోయి ఇంకా స్వార్ధపూరిత కర్మలు చేస్తారు. దానితో అంతా రసాభాస అవుతుంది. కాబట్టి జ్ఞాని అయిన వాడు అలా చేయకూడదు. తాను మాత్రము ఇంద్రియములను, మనస్సును నిగ్రహించి, శ్రద్ధతో, ఓర్పుతో వారికి నచ్చచెప్పడానికి ప్రయత్నించాలి. వారు చేసే కర్మలనే తాను అనాసక్తంగా, స్వార్థరహితంగా, ఫలం ఆశించ కుండా చేసి, దాని వలన కలిగే లాభాలను వారికి తెలియబరచి, వారిని కూడా ఆ విధంగా చేయడానికి ప్రోత్సహించాలి. జ్ఞానులు చేసే కర్మలను చూచి, దాని వలన వచ్చే మంచి ఫలితములను గ్రహించి, అజ్ఞానులు కూడా ఆ విధంగా చేయడానికి ప్రయత్నిస్తారు. మంచి మార్గంలో నడుస్తారు. కృష్ణ పరమాత్మ ఇక్కడ ఒక విషయం స్పష్టం చేసాడు. కేవలం ఉపన్యాసాలు ఇచ్చి తెలియని వారి మనసులు పాడుచేయకుండా, తాను ఆచరించి ఇతరులచేత ఆచరింపజేయడం మంచిది అని స్పష్టంగా చెప్పాడు.

మరి ఉపన్యాసాలు ఇచ్చేవాళ్లు తత్వమును బోధించే వాళ్లు ఇలాఎందుకు చెబుతున్నారు. వాళ్లకు తెలియదా అంటే అన్నీ తెలుసు. కానీ, ఎవరికి ఏది ఏసమయంలో ఎలా బోధించాలో తెలియదు అంతే. మన వేదాలలో శాస్త్రాలలో అన్నీ చెప్పారు. విగ్రహారాధన, పూజలు, వ్రతాలు, యజ్ఞాలు, యాగాలు క్రతువులు అన్నీ చెప్పారు. ఆత్మతత్వము, నిర్గుణ బ్రహ్మము, నిర్గుణారాధన, మానసిక పూజ, ఓంకారము, ధ్యానము, మనసును ఆత్మలో సంయోగం చేయడం ఇవి కూడా చెప్పారు. ఇవన్నీ నిర్దిష్టమైన పద్ధతిలో చేయాలి. ఒకటి వెంబడి ఒకటిగా చేయాలి. మనకు చదువు ఒకటో క్లాసునుండి పదవ తరగతి వరకు వివిధ విషయాలు చెబుతారు. ఇంటర్‌లో ఇటు స్కూలు విద్య, అటు కాలేజీ విద్యకు అనుసంధానంగా పాఠాలు చెబుతారు. తరువాత కాలేజీ విద్య చెబుతారు. తరువాత మాస్టర్ విద్యచెబుతారు. ఇలా అంశాల వారీగా చెబుతారు అంతేకానీ ఒకే సారి యం.ఏ. పిహెచ్.డి విద్య పదేళ్ల వయసులో చెప్పరు. అలాగే ఎం.ఏ పాసయిన వాడు, రెండో తరగతి విద్యార్థికి పాఠం చెప్పేటప్పుడు తన ఎం.ఏ విద్యను ప్రదర్శించకూడా. రెండో తరగతి విద్యార్థి స్థాయికి తగ్గట్టు

చెప్పి క్రమక్రమంగా వాడిని వృద్ధిలోకి తీసుకురావాలి. అలాగే ముందు మనసు నిలవడానికి విగ్రహారాధన, సంధ్యావందనము, పూజలు, వ్రతాలు, దేవాలయాలు ఉత్సవాలు చేయమన్నారు. ఏమీ తెలియని వారిని అలాగే చేయమనాలి. అప్పుడు వారికి దైవం అంటే ఏమిటో తెలుస్తుంది. వారి మనసు దైవం మీదికి మళ్లుతుంది. మనసు దైవం మీద నిలకడగా ఉంటుంది. అప్పుడు నిర్గుణారాధన, మానసిక పూజ, ఆత్మను గురించి బోధించాలి. తరువాత మోక్షం కొరకు ప్రయత్నించాలి. ఇది కూడా జ్ఞానులు ముందు తాము మనస్ఫూర్తిగా, యుక్తమైన మనసుతో శ్రద్ధగా, ఆచరించి ఇతరులు కూడా తాము చేసిన విధంగా చేయమని ప్రోత్సహించాలి. అంతేకానీ విగ్రహారాధన పనికిరాదు, పూజలు వ్రతాలు దండగ అని మొదలుపెడితే వాళ్లు అటు పూజలు చెయ్యడం మానేస్తారు. ఇటు ధ్యానం చేయడం చేత కాదు. రెండింటికి చెడ్డవారు అవుతారు. అదే ఈ శ్లోకంలో వివరించాడు పరమాత్మ.

(కానీ ఈ నాటి స్వామీజీలు తాము విలాసవంతమైన జీవితం గడుపుతూ, అనేక వివాదాలలో ఇరుక్కుంటూ, ప్రజలకు మాత్రం ఆత్మ జ్ఞానం గురించి బోధిస్తుంటారు. అటువంటి స్వామీజీల వెంట వేల మంది శిష్యులు ఉంటారు. అదే మాయ).

27. ప్రకృతే: క్రియ మాణాని గుణై: కర్మాణి సర్వశః।
అహంకార విమూఢాత్మా కర్తాహమితి మన్యతే॥
28. తత్త్వవిత్తు మహాబాహో గుణకర్మవిభాగయోః।
గుణాగుణేషు వర్తంత ఇతి మత్వా న సజ్జతే॥

ఓఅర్జునా! మానవులు చేసే కర్మలు అన్నీ ప్రకృతిలో ఉన్న సత్వ రజస్తమోగుణముల మీదనే ఆధారపడి ఉన్నాయి. ఆ మూడుగుణముల ప్రభావంతోనే మానవుడు అన్ని కర్మలు చేస్తున్నాడు. కానీ అహంకారంపూరితుడైన మానవుడు ఈ కర్మలు అన్నీ నేనే చేస్తున్నాను, నా వలననే అంతా జరుగుతూ ఉంది అని భావిస్తుంటాడు. కాని గుణముల యొక్క తత్వమును కర్మల యొక్క స్వభావమును తెలిసిన జ్ఞాని, ప్రకృతిలో ఉన్న మూడు గుణములు తనలో ఉన్న మూడు గుణములతోనే ప్రవర్తిస్తున్నాయి అని తెలుసుకొని, ఆ గుణముల యందు, వాటి ప్రభావమునందు ఎటువంటి ఆసక్తి చూపించడు. నిర్లిప్తతగా ఉంటాడు.

ఈ శ్లోకంలో పరమాత్మ జ్ఞానికి అజ్ఞానికి భేదం వివరిస్తూ, అసలు అజ్ఞాని ఈ విధంగా కామ్య కర్మలు, సకామ కర్మలు, స్వార్థముతో కూడిన కర్మలు చేయడానికి కారణం ఏమిటి అనే విషయం చెబుతున్నాడు. ఈ ప్రకృతి సత్వ, రజస్, తమోగుణములతో నిండి ఉంది. మానవుడు కూడా ఈ ప్రకృతిలో ఒక భాగమే కాబట్టి మానవునిలో కూడా ఈ మూడు గుణములు ఉన్నాయి.

అందువలన మానవుడు ఈ మూడుగుణముల కలయికతో కూడిన ప్రభావంతో సమస్త కర్మలు చేస్తున్నాడు. అలా కర్మలు చేస్తూ ఈ కర్మలు అన్నీ నేనే చేస్తున్నాను అని అనుకుంటున్నాడు. ఎందుకంటే ఈ శరీరమే నేను. ఈ కర్మలు అన్నీ నేను, నా కోసం చేస్తున్నాను అనే అహంకారంతో కర్మలు చేస్తున్నాడు. ఎవరి అంతఃకరణ అయితే ఇటువంటి అహంకారంతో నిండి ఉందో, అటువంటి వాడు, 'ఈ శరీరమే నేను, నేనే ఈ శరీరం, నేనే ఈ కర్మలు చేస్తున్నాను ఈ కర్మలఫలితం నేను అనుభవిస్తున్నాను, నాకు ఈ కర్మల వలన సుఖం ఆనందం కలుగుతూ ఉంది' అనే భ్రమలో పడి కర్మలు చేస్తున్నాడు. నేను ఈ కర్మలు అన్నీ చేస్తున్నాను అనే అహంకారం అతనిలో పాతుకుపోతుంది. వాడిని వేదాంత పరిభాషలో అజ్ఞాని, ఏమీ తెలియని వాడు అని అంటారు.

దీనిని కొంచెం వివరంగా తెలుసుకుందాము. ఈ ప్రకృతిలో ఇరవైనాలుగు తత్వాలు ఉన్నాయి. పంచ భూతములు, పంచ తన్మాత్రలు, పది ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, అహంకారము, చిత్తము. ఈ ఇరవై నాలుగు తత్వములు, ప్రకృతిలో ఉన్న మూడు గుణములకు లోబడి పనిచేస్తుంటాయి. మనకు కనపడే ప్రపంచము, మన దేహము, మనస్సు బుద్ధి, సమస్తము ప్రకృతి నుండి పుట్టినవే. ప్రకృతి నుండి పుట్టిన ఈ దేహము, ఈ రూపము, ఇంద్రియములు, మనస్సు వీటి ద్వారానే అన్ని కర్మలు జరుగుతున్నాయి. వీటన్నిటినీ లోపల ఉన్న ఆత్మ సాక్షిగా చూస్తున్నాడు. ఆత్మ ఏ కర్మాచేయదు. చేయవలసిన అవసరం లేదు. అది చైతన్యస్వరూపము. కాబట్టి ఈ కర్మలకు అన్నింటికీ దేహము, ఇంద్రియములు, మనస్సు, కారణము. ఇక్కడే ఒక చిక్కు. ఎప్పుడైతే మానవుడు నేనే ఈ దేహము అని అనుకుంటున్నాడో, ఈ కర్మలు అన్నీ నేనే చేస్తున్నాను నేనే వీటికి కర్తను అనే భ్రమలో ఉంటాడో, అప్పుడు ఆ కర్మల వలన లభించిన ఫలితములను అనుభవిస్తున్నాడు. వాసనలను మూటగట్టుకుంటున్నాడు. మరొక జన్మ ఎత్తుతున్నాడు. ఇది అజ్ఞానము యొక్క లక్షణము. సూక్ష్మంగా చెప్పాలంటే ఈ దేహమే నేను ఈ కర్మలు నేనే చేస్తున్నాను అనడం అజ్ఞానలక్షణం. జ్ఞానికి అజ్ఞానికి తేడా ఇక్కడే ఉంది. అజ్ఞాని అన్నీ తానే చేస్తున్నాను అని అనుకుంటాడు. దాని వలన వచ్చే సుఖదుఃఖాలను అనుభవిస్తుంటాడు. జ్ఞాని తాను ఆత్మ స్వరూపుడను, ఈ దేహం నాది కాదు, ఈ కర్మ దేహం చేస్తూ ఉంది నేను కాదు అన్నసత్యాన్ని తెలుసుకుంటాడు. కర్మల వలన లభించే సుఖదుఃఖాలకు అతీతంగా, నిరంతరం ఆనందంలో ఉంటాడు.

ఇంకొంచెం వివరంగా చెప్పుకుందాము. మనకు బయటకు పది ఇంద్రియములు కనిపిస్తున్నాయి. కాని కనిపించకుండా మనసు, బుద్ధి ఉన్నాయి. ఈ రెండు కలిసి అహంకారము అని అంటారు. ఇది మనకు కనిపించదు కానీ మన వ్యక్తిత్వం ద్వారా వ్యక్తం అవుతుంది. దీని కన్నా శ్రేష్టమైనది మరొకటి ఉంది. అదే మన అసలైన తత్వము. ఆత్మ తత్వము. దానినే చైతన్యము అని కూడా అంటాము. ఈ ఆత్మకు దేహానికి ఎటువంటి సంబంధము లేదు. ఈ ఆత్మ మనలో ఉన్న మనస్సుకు, బుద్ధికి, ఈ రెండింటితో కూడిన అహంకారానికి, పంచ తన్మాత్రలకు, పది

ఇంద్రియములకు చైతన్య శక్తిని ఇస్తుంది. అన్నీ పనిచేసేటట్టు చేస్తుంది. ఉదాహరణకు, మనం ఒక దీపం వెలుగులో ఎన్నో వస్తువులను చూస్తుంటాము. దీపం వెలుగు వస్తువుల మీద పడి వాటిని సమానంగా ప్రకాశింపచేస్తుంది. కాని దీపానికి వస్తువులకు ఎటువంటి సంబంధము లేదు. దీపము మంచి వస్తువులను, చెడ్డ వస్తువులను రెండింటినీ సమానంగా ప్రకాశింపచేస్తుంది. ఆ దీపము వెలుగులో మంచి పని చేసినా, చెడ్డ పని చేసినా, అక్రమాలు, అన్యాయాలు, నేరాలు చేసినా, తన ప్రకాశాన్ని ఇస్తూనే ఉంటుంది. అలాగే ఆత్మకూడా. దేహము, ఇంద్రియములు, మనస్సు తమ పనులు తాము నిర్వర్తించడానికి ప్రాణశక్తిగా ఉపయోగపడుతుంది కానీ వాటితో ఎటువంటి సంబంధము పెట్టుకోదు. విలక్షణంగా ఉంటుంది. సత్ స్వరూపము ఆత్మ అయితే అసత్ స్వరూపము మనస్సు, బుద్ధి, శరీరాలు.

మనోబుద్ధిఅహంకారాలు నశిస్తే అసలైన తత్వము ప్రకాశిస్తుంది. ఈ మనో బుద్ధి అహంకారాలు అడ్డం ఉన్నంతవరకు మన అసలు స్వరూపము మనకు తెలియదు. ఈ అహంకారము మనలను ఆవరించి ఉన్నంతవరకు అన్నీ నేనే చేస్తున్నాను అనే భావన మనలో కలుగుతుంది. ఈ దేహమే నేను అని అనుకుంటాడు. దేహానికే ప్రాధాన్యత ఇస్తాడు. ఇతరుల దేహాలతో మిత్రత్వము శత్రుత్వము పెంచుకుంటాడు. సుఖము దు:ఖము అనుభవిస్తుంటాడు. సంసార సాగరంలో పడి మునుగుతూ తేలుతూ ఉంటాడు. వాడిని అహంకార విమూఢుడు అని అన్నాడు పరమాత్మ. అంటే మూర్ఖులలో పరమ మూర్ఖుడు అని అర్థము. ఈ మూఢత్వము, అహంకారము అంతరిస్తే, ఆత్మజ్ఞానము కలుగుతుంది.

ఆత్మ తత్వము తెలిసిన జ్ఞానికి గుణములు వాటి ద్వారా చేసే కర్మల యొక్క విభజన స్వభావము బాగుగా తెలుసు. జ్ఞానికి కూడా శరీరము, మనస్సు బుద్ధి ఈ మూడింటి వలన వచ్చే నేను అనే అహంకారము ఉంటాయి. కాని అది సాత్వికాహంకారము. ఆ సాత్వికాహంకారము జ్ఞానికి అలంకార ప్రాయంగా ఉంటుంది కానీ జ్ఞానిని మోహంలో ముంచదు. పాములు ఈశ్వరుడికి అలంకారము. వేయిపడగల పాము విష్ణువుకు పడక. అదే విధంగా భయంకరమైన మోహాన్నికలిగించే అహంకారము జ్ఞానికి అలంకారంగా శోభనిస్తుంది. ఆ జ్ఞానిలోపల ఉన్న సత్వ,రజస్తమోగుణములు ప్రకృతిలో ఉన్న సత్వరజస్తమోగుణములతో ప్రవర్తిస్తుంటాయి. కాని, జ్ఞాని ఆ గుణముల వలన కానీ, ఆ గుణముల చేత చేయబడే కర్మల వలన గానీ ప్రభావితుడు కాదు.

ఇక్కడ ఒక విషయం గమనించాలి. చూపు వేరు చూచే వస్తువు వేరు చూచే శక్తి వేరు. కేవలం కళ్లు ఉన్నంత మాత్రాన చూడలేడు. లోపల చూచే శక్తి ఉండాలి. అది చూడు అనే ప్రేరణ ఉండాలి. ఆ ప్రేరణ గుణముల వలనకలుగుతుంది. అందువలన చూడాలనే ప్రేరణ, చూచేశక్తి, కళ్లు, కలిసి పనిచేస్తేనే ఒక వస్తువును చూడగలము. దానికి ఆత్మకు ఎటువంటి సంబంధము లేదు. ఈ విషయం తెలుసుకోవాలి. చూచేది శరీరము. చూడబడేది ప్రకృతి లో ఉండే వస్తువు.

ఇవి అన్నీ వేరు. నేను కాదు. అని తెలుసుకున్న వాడు ఆ కార్యమునకు లోబడడు. ఆ చూచిన వస్తువును కోరుకోడు. దానితో సంగమముపెట్టుకోడు, అనాసక్తంగా నిర్వికారంగా చూస్తుంటాడు. కాని అజ్ఞాని ఆ వస్తువు మీద మమకారంతో ఆసక్తితో చూస్తుంటాడు అదే తేడా. ఆ సంగమము మమకారమే లేకపోతే ఆత్మజ్ఞానము దానంతట అదే వస్తుంది. అలా కాకుండా దేహమే నేను, అన్నీ నేనే చేస్తున్నాను నేను చూస్తున్నాను, అది బాగుంది, అది నాకు కావాలి అనే ఆసక్తి కల వాడు సంసారములో పడి కొట్టుకుంటూ ఉంటాడు.

కాబట్టి ప్రపంచములో కనపడే ప్రతి వస్తువు మీద మమకారము ఆసక్తిని వదిలాలి. ఎంత వరకు అవసరమో అంతవరకే సమకూర్చుకోవాలి. అనవసరమైన వాటి జోలికి పోకూడదు. ఇది చాలదు, ఇంకా కావాలి అనే బుద్ధి వదిలిపెట్టాలి. ఉన్నదానితో తృప్తిపడటం నేర్చుకోవాలి. తనలో ఉన్న గుణములు బయట ప్రకృతిలో ఉన్న గుణములతోకూడి విహరిస్తున్నా, బాహ్యప్రపంచములో ఉన్న విషయములు ఎంత ప్రలోభపెడుతున్నా, వాటి ప్రలోభాలకు లోను కాకూడదు. దానికి ఇంద్రియ నిగ్రహము మనో నిగ్రహము కావాలి. ఈసంసార చక్రము నుండి బయట పడటానికి ఇదే చక్కటి ఉపాయము.

## 29. ప్రకృతేర్గుణసమ్మూఢా: సజ్జన్తే గుణకర్మసు।
## తానకృత్స్నవిదో మన్దాన్కృత్స్నవిన్న విచాలయేత్॥

ప్రకృతి గుణములయొక్క మోహములోపడ్డ వారు ఆ ప్రకృతి గుణములలోనూ ఆగుణముల ప్రభావంతో చేసే కర్మలలోనూ ఆసక్తి కలిగి ఉంటారు. అటువంటి వారిని, ఏమీ తెలియని అజ్ఞానులను, మందబుద్ధి కలవారిని, అన్నీ తెలిసి ఆత్మజ్ఞానము పొందిన జ్ఞానులు, తమ బోధనలతో మోహమునకు గురిచేయకూడదు.

ఎవరైతే ప్రకృతి గుణములతో అంటే శరీరము, మనసు, బుద్ధి అహంకారము వీటి వలన జనించిన మూఢత్వములో పడి ఉన్నాడో, వాడినే సమ్మూఢుడు అని అన్నాడు పరమాత్మ, ఆధ్యాత్మికంగా, మానవులు చేసే కర్మలకు అతనిలో ఉన్న ఆత్మకు ఎటువంటి సంబంధము లేదు. ఆత్మ కేవలము చైతన్య స్వరూపము. మానవుడు చేసే కర్మలకు ప్రాణశక్తిని, క్రియాశక్తిని ఇస్తుంది. కాబట్టి ఆత్మవేరు శరీరం వేరు. ఇది సత్యము. నేనే ఈ శరీరము అని అనుకోవడం మూఢత్వము. శరీరంతో మమేకం అయి పోయి దేహభావన మిక్కుటంగా కలిగి ఉన్నవారిని సమ్మూఢులు అని అంటారు. అటువంటి వారు ఈ శరీరము, మనసు, బుద్ధి వీటితో కూడిన అహంకారముతో అన్నీ నేనే చేస్తున్నాను అని అనుకుంటారు. ఈ ప్రకృతిలో కనపడే వస్తువులు అన్నీ నిజమని నమ్ముతుంటారు. ఈ దేహమే నేను, అంతా నా వల్లనే జరుగుతూ ఉంది, నేను లేకపోతే ఈ లోకం అంతా ఏమైపోతుందో

అనే దేహాభిమానంతో  భ్రమలో ఉంటారు. ఆ భ్రమలోనే ఏవేవో ఫలితములను ఆశించి కర్మలు చేస్తుంటారు. అన్ని కర్మలు తమ స్వార్థం కోసమే చేస్తుంటారు. అహంకారంతో చేస్తుంటారు.

ఇటువంటి వారు తెలిసీ తెలియని వారు. ఏమీ తెలియకపోతే ఏ చిక్కు లేదు. అన్ని తెలిసిన వాడు జ్ఞాని. కాని తెలిసీ తెలియని వారితోనే చిక్కంతా వస్తుంది. అటువంటి వారికి ఆత్మ అంటే ఏమిటో తెలుసు. శరీరం అంటే ఏమిటో తెలుసు. పరమాత్మ అంటే ఏమిటో తెలుసు. కాని తానే ఆత్మస్వరూపుడను అని తెలియదు. పరమాత్మ కొరకు ఎక్కడెక్కడో వెతుకుతుంటాడు. పరమాత్మ తనలోనే ఆత్మస్వరూపుడుగా ఉన్నాడని తెలుసుకోలేడు.  అటువంటి తెలిసీ తెలియని వారిని, అన్నీ తెలిసిన  జ్ఞానులు తమకు తెలిసిన ఆత్మతత్వం గురించిన విషయాలన్నీ ఒక్కసారిగా బోధించి చలింప చేయకూడదు. ఈ విషయం ఇదివరకు చెప్పిందే మరలా చెబుతున్నాడు పరమాత్మ. . అటువంటి వారికి, ఒక్కసారిగా జ్ఞానోప దేశము చేసి, వారు అప్పటి వరకు ఆచరిస్తున్నవి తప్పు అని చెప్పి, వారి మనస్సులు చలింప చేయకుండా, ముందు నిష్కామ కర్మలు తాము ఆచరించి దాని ఫలితములను వారికి చూపించి వారిని నెమ్మదిగా నిష్కామ కర్మల వైపుకు మళ్లించాలి. అప్పుడు వారు ఆత్మస్వరూపాన్ని గురించి గ్రహించగలుగుతారు.  చంచల మైన ప్రాపంచిక సుఖములను వదిలిపెట్టి శాశ్వతమైన ఆత్మానందము వైపుకు మళ్లుతారు. ఎందుకంటే వారు సామాన్యులు కారు. బాగా చదువుకున్నవారు. పండితులు. కాని ఈ ప్రపంచమే సత్యము, దేహమే నేను అనే అజ్ఞానంలో ఉంటారు. ప్రాపంచిక సుఖములకు దాసులై  ఉంటారు. అటువంటి వారికి జ్ఞానులు నిష్కామ కర్మను నిదానంగా బోధించాలి.  తాము ఆచరించి చూపాలి. వారు నెమ్మదిగా నచ్చచెబితే వింటారు.

ఇక్కడ పరమాత్మ కృత్స్నవిత్ అనే పదం వాడాడు. దానికి అర్థం ఏది తెలిస్తే ఇంక తెలుసుకోదగ్గది ఏమీ ఉండదో అది తెలుసుకోవడం. అదే ఆత్మ తత్వము. ఆత్మ తత్వము తెలిసిన వాడే కృత్స్నవిదుడు. అటువంటి కృత్స్నవిదుడు తాను ఆచరించి ఇతరులకు చూపాలి కాని అకృత్స్నవిదులను చలింపచేయకూడదు. అతని మార్గంలో అతనిని నడవనివ్వాలి. నెమ్మదిగా అతనికి సరిఅయిన మార్గం బోధించాలి. ముందు తను ఆచరించి, అతనితో ఆచరింపజేయాలి. లేకపోతే అతడు తాను చేసేది చేయడు, నువ్వు చెప్పేది చేయడం చేతకాదు. రెండింటికీ కొరగాకుండా పోతాడు. కాబట్టి తెలిసీ తెలియని వాడి బుద్ధిని, అన్నీతెలిసినవారు చలింపచేయకూడదు అని స్పష్టంగా చెబుతున్నాడు పరమాత్మ.

## 30. మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మ చేతసా।
## నిరాశీర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః॥

ఓ అర్జునా! నీ చిత్తమును పరమాత్మయందు నిలిపి, కర్మలను అన్నిటినీ అధ్యాత్మ చిత్తముతో ఆ పరమాత్మకు అర్పించి, ఆశ, మమకారము, మమత, అనురాగము మొదలగు ఆశాపాశములను వదిలిపెట్టి, క్షత్రియ ధర్మము అయిన యుద్ధం చెయ్యి.

ఇందులో అధ్యాత్మచేతసా అనే పదం వాడారు. అంటే మనసు ఆత్మయందు నిలపాలి. ఆత్మయందు నిలిపిన మనసుతో అంటే భగవంతుని మీద నిలపబడిన మనసుతో అని అర్థం. నిర్మలమైన మనస్సు ఎల్లప్పుడూ భగవంతుని మీద నిలిచి ఉంటుంది అని అర్థం. ఎందుకంటే మానవులు సాధారణంగా ప్రాపంచిక విషయములనే ఆలోచిస్తుంటారు. వాటి యందే ప్రవర్తిస్తుంటారు. ఎన్నో విషయాలను చూస్తుంటారు, వింటుంటారు, తాకుతుంటారు. వాటి యందు ఆసక్తి కలిగి ఉంటారు. అటువంటి మనసును పరమాత్మయం దు నిలపడం చాలా కష్టం. మనసు ప్రాపంచిక విషయములలో లీనం కావడం వలన మలినమైన చిత్తమును ఆధ్యాత్మిక మైన చిత్తముగా మార్చడం అంటే మనస్సు భగవంతుని మీద నిలపడం, మనసును నిగ్రహించడం ప్రతి సాధకుడి కర్తవ్యం. కాబట్టి ప్రతిరోజూ కొంచెం సేపు అయినా ప్రాపంచిక విషయములను వదిలిపెట్టి, భగవంతుని ముందు కూర్చుని కళ్లు మూసుకొని మనస్సును నిగ్రహించి భగవంతుని మీద నిలపడం మానవుని కర్తవ్యం. ఎల్లప్పుడూ మనస్సు పరమాత్మ భావముతో నిండి ఉండాలి. మమత, మమకారమములను, ఆశలను, సంతాపములను దూరంగా ఉంచాలి. దానినే ఆధ్యాత్మ చిత్తము అని అంటారు.

సర్వాణి కర్మాణి అనే పదం కూడా వాడారు. అంటే ఏదో ఒక కర్మ అని కాకుండా అన్ని కర్మలను పరమాత్మ పరంగా చేయాలి. అన్ని కర్మలను పరమాత్మకు అర్పించాలి. నిరాశీ నిర్మమో అంటే ఆశ లేకుండా, మమత మమకారములు లేకుండా కర్మలు చేయాలి. ఒక్క మాటలో చెప్పాలంటే పరమాత్మ అనే మాట తప్ప మరొక మాటకు మన మనసులో చోటు ఉండకూడదు అని భావన. ఎందుకంటే ఈ ప్రపంచంలో ఆత్మ ఒకటే సత్యము మిగిలినవి అన్నీ అసత్యములు, కల్పితములు, అశ్వరములు. అటువంటి ప్రాపంచిక విషయముల మీద ఎవరైనా ఆశ మమకారము ఎందుకు ఉంచాలి అని భగవానుడు అడుగుతున్నాడు. కాబట్టి మన మనసులలో నుండి ఆశ మమకారము బయటకు నెట్టెయ్యాలి.

ఇక్కడ మరొక మాట కూడా వాడారు. విగత జ్వరః జ్వరము అంటే తాపము. సంతాపము, ఎందుకంటే జ్వరం వస్తే మనకు ఒళ్లువేడెక్కి తాపం ఎక్కువ అవుతుంది. ఇది పైకి వచ్చే జ్వరము. మరి లోపల జ్వరము. అంటే ప్రాపంచిక విషయముల మీద మమకారము, మమత

కలిగి, వాటికి ఆటంకము కలిగితే తాపం ఎక్కువ అవుతుంది. అటువంటి తాపమును పోగొట్టుకోవాలి. కాబట్టి మానవునికి ఉండవలసిన నాలుగు లక్షణాలు భగవంతుడు చెబుతున్నాడు. 1.ఎల్లప్పుడు అధ్యాత్మ చిత్తము కలిగి ఉండటం, 2. నిర్మల చిత్తముతో కర్మలు చేయడం, ఆ కర్మల ఫలితములను పరమాత్మకు అర్పించడం. 3.ఆశాపాశములను వదిలిపెట్టడం. 4. ప్రాపంచిక విషయముల మీద మమకారము వదిలిపెట్టడం. మనలో కలిగిన ఈ ఆశలు, మమతా మమకారాలు అనే జ్వరానికి పైన చెప్పిన నాలుగు మందు గుళికలను సేవిస్తే జ్వరము తగ్గిపోతుంది. కాబట్టి అర్జునా! నీవు కూడా నేను, నా వాళ్లు, నా బంధువులు, తాత, తండ్రులు, అన్నదమ్ములు అనే మమత అనురాగము, ఆశ, మోహము అనే జ్వరమును వదిలిపెట్టి యుద్ధము చెయ్యి అంటున్నాడు పరమాత్మ.

ఇంకొంచెం వివరంగా చెప్పుకోవాలంటే ఈ శ్లోకంలో పరమాత్మ కర్మయోగ సారాన్ని వివరించాడు. కర్మయోగము అంటే ప్రత్యేకంగా ఏమీ లేదు. మనం కర్మచేసే విధానమునే కర్మయోగము అంటారు. యోగము అంటే కలపడం అని చెప్పుకున్నాము. కర్మలను జ్ఞానంతో కలపడం. జ్ఞానయుక్తంగా అంటే విహితంగా, చేయవలసిన పద్ధతిలో, చేయవలసిన విధానంలో కర్మలు చేయడం. దానికి మొదటి లక్షణం అధ్యాత్మచేతసుడు అయి ఉండాలి. అంటే వివేకముతో కూడిన బుద్ధికలిగి ఉండాలి. విచక్షణా జ్ఞానం కలిగి ఉండాలి. ఆధ్యాత్మికంగా ఉన్నతిని సాధించడమే లక్ష్యంగా కలిగి ఉండాలి. అంతే కానీ గొప్ప ధనవంతుడు, ఆస్తిపరుడు, గొప్ప వ్యాపారవేత్త కావడం కాదు. శరీరం నిలబడడానికి ఆహారం తీసుకోవాలి. దానికి కర్మ చేయాలి. శరీరంతో శ్రవణం, మననం, ధ్యానం చేయాలి. ఆత్మతత్వాన్ని తెలుసుకోవాలి. దీనినే అధ్యాత్మచేతస అని అంటారు. అంతేకానీ నాకు, నా పిల్లలకు, వారి సంతానానికి, వారి వారి సంతానానికి సంపాదించడం కూడబెట్టడం కాదు. ఇది జీవన విధానం కాదు. ఎంతవరకు అవసరమో అంటే సంపాదించుకోవాలి, దొరికిన దానితో తృప్తి చెందాలి అని చెప్పాడు పరమాత్మ.

మానవులు ఏ కర్మచేసినా దాని ఫలితాన్ని పరమాత్మకు అర్పించాలి. అన్ని కర్మలు పరమాత్మకోసమే చేయాలి. కర్తృత్వభావన ఉండకూడదు. నేను ఈకర్మ చేస్తున్నాను అనే అహంకారము ఉండకూడదు. నీవు సమర్పించినా సమర్పించకపోయినా అన్ని కర్మల ఫలములు భగవంతునికే చెందుతాయి. కాని మనం అర్పిస్తే మన బరువు తగ్గుతుంది. మనసు ప్రశాంతంగా ఉంటుంది. లేకపోతే ఆ కర్మల ఫలములు మన మనసుకు దు:ఖమును కలిగిస్తాయి. ఇదే ఇందులో రహస్యం.

ఆశ, మమకారము, ప్రతి వాడికీ ఉంటాయి. ఆశ లేనివాడు బతకలేడు అని మనందరికీ తెలుసు. కాకపోతే ఆశతో పని చేయాలి. చేసే పని మీద మమకారం ఉండాలి. కాని ఆ ఆశ, మమకారము శృతి మించకూడదు. పరిమితంగా ఉండాలి. దాని గురించి తాపత్రయపడకూడదు. అందరూ నా మాట వినాలి. నేను చెప్పినట్టు చేయాలి నేను చేసిన కర్మలకు మంచి ఫలితాలు

రావాలి అని అనుకోకూడదు. ఎందుకంటే కోరుకున్న ఫలితాలు రాకపోతే నిరాశ చెందవలసి వస్తుంది. నిర్మమో అంటే మమ అనే భావన లేకుండా కర్మ చెయ్యాలి. 'మమ' అంటే నేనే ఈ పని చేస్తున్నాను, నా వలననే ఈ పని జరుగుతూ ఉంది అనే భావనతో చెయ్యడం. అందుకే కర్మచెయ్యి. ఆ కర్మను పరమాత్మ పరంగా చెయ్యి ఆ కర్మ ఫలితం ఆశించకు. సక్సెస్ వస్తే సంతోషపడు అంతే కానీ నా వలననే వచ్చింది అని విర్రవీగకు. ఎందుకంటే ఆ ఫలితం ఏ ఒక్కరిదీ కాదు. అందరిదీ. అందరూ కలిసి పనిచేస్తేనే ఆ విజయం దక్కింది అని తెలుసుకోవాలి.

తరువాత మనలను పట్టి పీడించేది మరొకటి ఉంది. అదే మానసిక జ్వరము. శరీరానికి జ్వరం వస్తే మందు వేసుకోవచ్చు. మనస్సుకు జ్వరం వస్తే శాంతి ఉండదు. టెన్షన్, వరీ, కంగారు, ఏం చేయ్యాలో తోచదు. కోపం వస్తుంది. ఇదంతా మానసికంగా ఏదో జరుగుతోంది అనే సూచన. నచ్చని పని చేయడం, చేసిన పనినచ్చకపోవడం, నచ్చినఫలితం రాకపోవడం, వచ్చిన ఫలితం నచ్చకపోవడం ఇలాంటివి మానసిక అశాంతికికారణాలు. అలా కాకుండా ఈ ఫలితం నాది కాదు ఏ ఫలితం వచ్చినా అది పరమాత్మ ప్రసాదము అని అనుకుంటే ఎటువంటి అశాంతి ఉండదు. వచ్చిన ఫలితాన్ని పరమాత్మకు అర్పిస్తే ఏ చిక్కు ఉండదు. దానినే విగతజ్వర: అని అన్నారు పరమాత్మ. కాబట్టి నీ లో చెలరేగిన ఆశాపాశాలు మమతా మమకారాలు అనే జ్వరాన్ని విడిచిపెట్టి యుద్ధం చెయ్యి అని బోధించాడు.

## 31. యే మే మతమిదం నిత్యమనుతిష్ఠన్తి మానవా:।
## శ్రద్ధావన్తో2నసూయన్తో ముచ్యన్తో తే2పి కర్మభి:॥

ఎటువంటి అసూయ లేకుండా, పైన చెప్పబడిన తనకు నిర్దేశింపబడిన విహిత కర్మలను అత్యంత శ్రద్ధతో ఆచరించేవారు సకల కర్మల యొక్క బంధనముల నుండి విముక్తిని పొందుతారు.

పరమాత్మ పైశ్లోకాలలో మానవుడు ఏమేమి విడిచిపెట్టాలి అని చెప్పాడు. అంటే నిష్కామ కర్మ ఎలా చెయ్యాలి అని చెప్పాడు. అలా చేస్తే కలిగే ఫలితం ఇక్కడ చెప్పాడు. కర్మయోగము ద్వారానే జ్ఞానము, జ్ఞానముతో కర్మ బంధనముల నుండి విముక్తి పొందవచ్చు అని చెప్పబడింది. అనాసక్తంగా, నిష్కామంగా, కర్తృత్వభావన లేకుండా, కర్మలు చేయడం ద్వారా, కర్మల ఫలములను పరమాత్మకు అర్పించడం ద్వారా, కర్మయోగులు కూడా జ్ఞాన యోగుల మాదిరి కర్మబంధనములను తొలగించుకోగలరు అని పరమాత్మ ఉద్దేశ్యము. దాని కోసం పైన ఒక సూత్రం చెప్పాడు. దానిని మతం అని అంటున్నాడు. యే మే మతం నాయొక్క అభిప్రాయము అనగా నిష్కామ కర్మ, కర్తృత్వభావన లేని కర్మ, అనే నా అభిప్రాయమును అనుసరిస్తే ముక్తిని పొందగలరు.

ఈ అనుసరించడం కూడా నిత్యమ్ అంటున్నాడు. అంటే ఏ దో ఒక సారి బుద్ధిపుట్టినప్పుడు కాకుండా అను నిత్యము అనుసరించాలి. నిత్యం అనుతిష్టన్తి అంటే ప్రతిరోజూ అనుష్ఠానం చెయ్యాలి. అంటే ప్రతి రోజూ మనం చేసే పనులు అన్నిటినీ ఫలితం ఆశించకుండా, మమతానురాగములు లేకుండా, ఈ కర్మను చెయ్యాలి కాబట్టి చేస్తున్నాను అంతే కానీ నాకుగా నేను చెయ్యడం లేదు అని అనుకుంటూ చెయ్యాలి. ఆ చేయడం కూడా శ్రద్ధావన్తో, అనసూయన్తో అంటే అత్యంత శ్రద్ధతోనూ, ఎటువంటి అసూయ లేకుండా చేయాలి. అన్ని కర్మలను శ్రద్ధతో చేస్తూ, కర్మఫలములను భగవంతునికి అర్పిస్తూ చెయ్యాలి. అటువంటప్పుడు ఆ కర్మలు మనకు అంటుకోవు. నిత్యం సుఖంగా సంతోషంగా ఉంటాము. మానవునిలో ఉండకూడని లక్షణము అసూయ. కాబట్టి ఈ శ్లోకంలో పరమాత్మ ఉండవలసిన లక్షణము శ్రద్ధ అనీ, ఉండకూడని లక్షణము అసూయ అనీ స్పష్టంగా చెబుతున్నాడు.

సాధారణంగా మనుషులు నాలుగు పనులు చేస్తుంటారు. ఆహారం తినడం, నిద్రపోవడం, పురుషుడు స్త్రీతో, స్త్రీ పురుషునితో సుఖం అనుభవించడం. ప్రతిదానికీ భయపడటం. ఇక్కడ మానవా: అంటే స్త్రీలు పురుషులు ఇరువురు అని అర్థం. పైన చెప్పిన నాలుగు పనులు జంతువులుచేస్తాయి మనుషులు చేస్తారు. తేడా ఏమీ లేదు. కాకపోతే ఆహార,నిద్రా,మైథునాలు జంతువులు క్రమబద్ధంగా చేస్తాయి, మనుషులు తమ ఇష్టం వచ్చినట్టు చేస్తారు. అంటే ఇష్టం వచ్చినట్టు తింటారు, తాగుతారు, అర్ధరాత్రి దాకా మేల్కొని ఎప్పుడో పడుకొని ఉదయం 9గంటలకు లేస్తారు. కర్రకు చీర చుట్టినట్టు కనపడినా ఆబగా పరుగెడుతారు. మైథునానికి ఒక కాలము, ప్రదేశము, పద్ధతి అంటూ ఉండదు.(అందుకే నిర్భయ చట్టం అవసరమయింది.)

జంతువులు ఆపద వచ్చినపుడు మాత్రమే భయపడితే, మనిషి లేనిది రాదేమో అనీ, ఉన్నది పోతుందేమో అని అనుక్షణం భయపడుతూనే ఉంటాడు. కాబట్టి మనుషులను జంతువులతో కూడా పోల్చలేము. అందుకని ఇక్కడ మానవులు అని వాడారు. మానవుడు అంటే మానవత్వం కలవాడు. పద్ధతి ప్రకారం నడుచుకొనేవాడు. మనసును, ఇంద్రియములను అదుపులో ఉంచుకున్నవాడు. విచక్షణా బుద్ధి కలవాడు. అటువంటి వారి గురించి చెబుతున్నాడు పరమాత్మ. అటువంటి మానవులు, మే మతం ఇదం అంటే పైన చెప్పబడిన నా మతమును.... అంటే నా అభిప్రాయమును నిత్యం అనుష్ఠిస్తారో.... అని అన్నాడు. ఇక్కడ నా అభిప్రాయము అంటే కృష్ణుడి స్వంత అభిప్రాయము అని కాదు. అందరిలో ఆత్మస్వరూపుడుగా వెలుగుతున్న పరమాత్మ అభిప్రాయము అని అర్థం చేసుకోవాలి. పరమాత్మ అభిప్రాయము వేదముల ద్వారా, శాస్త్రముల ద్వారా, గురువుల ద్వారా ప్రకటితమౌతుంది. ఇక్కడ కృష్ణుడు అర్జునుడికి చెప్పిన అభిప్రాయం కూడా అదే.

ఆ అభిప్రాయమును ఎలా ఆచరించాలి అంటే దానికి రెండుసూత్రాలు చెప్పాడు పరమాత్మ. శ్రద్ధతో చేయాలి. అంటే చేసే పని మీద నమ్మకంతో చేయాలి. ఎటువంటి సందేహమునకు

ఆస్కారం లేకుండాచేయాలి. ఏకాగ్రతతో చేయాలి. నిత్యం అంటే నిరంతరము చేయాలి. అనసూయంతో అంటే ఎటువంటి అసూయలేకుండా చేయాలి.

ఇక్కడ అసూయ అంటే తాను చేసే పనిలో తప్పులు వెదకడం. తాను చేస్తున్న పని మీద నమ్మకం లేకపోవడం. కాబట్టి తాను చేస్తున్న పని మంచిది, తన శ్రేయస్సుకొరకు, సమాజ శ్రేయస్సు కొరకు చేస్తున్నాను అనే నమ్మకంతో చేయాలి కానీ ఇదేంటి 'ఇలా ఉందే ఇలా ఉంటే ఎలా అవుతుంది, ఇలా కాదు అలా చేస్తే బాగుంటుంది' అంటూ అపనమ్మకంతో మొదలు పెడితే ఆ పని ఎన్నటికీ పూర్తి కాదు. మంచి ఫలితములను ఇవ్వదు. కాబట్టి అసూయ అంటే లోపాలు వెదకకుండా, నమ్మకంతో చేయాలి. ఒక వేళ లోపాలు ఉన్నా వాటిని వదిలిపెట్టి మంచినే గ్రహించాలి కానీ లోపాలు వెదుకుతూ కూర్చోకూడదు దీనిని అనసూయ బుద్ధి అంటారు. ప్రతి మానవుడు ఇటువంటి బుద్ధి తో కర్మలు చేస్తే, కర్మబంధనముల నుండి విముక్తుడు అవుతాడు. అటువంటి వారిని మనం జీవన్ముక్తులు అని అంటాము. సూక్ష్మంగా చెప్పాలంటే నిష్కామంగా, శ్రద్ధతో, ఎటువంటి కర్తృత్వభావన, అసూయ లేకుండా చేసే కర్మల వలన చిత్తశుద్ధి, దానివలన జ్ఞానం, జ్ఞానం వలన మోక్షం లభిస్తుంది. ఈ శ్లోకంలో తన అభిప్రాయమును అనుసరిస్తే వారు కర్మబంధనముల నుండి ముక్తిని పొందుతారు అని చెప్పి, తన మతమును విశ్వసించకపోతే ఏం జరుగుతుంది అనే విషయాన్ని తరువాతి శ్లోకంలో వివరిస్తున్నాడు పరమాత్మ.

## 32. యే త్వేతదభ్యసూయన్తో నానుతిష్ఠన్తి మే మతమ్।
## సర్వజ్ఞానవిమూఢాంస్తాన్ విద్ధి నష్టానచేతసః॥

అలా కాకుండా ఎల్లప్పుడూ నా మీద దోషారోపణ చేస్తూ, నా చేత చెప్పబడిన మతమును విశ్వసించని వారు అచేతసులు అంటే బుద్ధిహీనులు, సర్వజ్ఞానవిమూఢులు అంటే ఏ మాత్రము జ్ఞానము లేని మూఢులు, నష్టాన్ అంటే అన్ని విధములా నష్టపోయినవారు అవుతారు.

భగవానుడు పైన చెప్పబడిన శ్లోకాలలో ఆధ్యాత్మ మార్గము, నిష్కామ కర్మ బోధించాడు. వాటిని శ్రద్ధతో ఆచరించమన్నాడు. అసూయను, అనుమానాలను దగ్గరకు రానివ్వవద్దు అని అన్నాడు. అటువంటి వారు సమస్త కర్మబంధనముల నుండి విముక్తులు అవుతారు అని అన్నాడు. అలా కాకుండా, ఎవరైతే పైన చెప్పిన మతమును ద్వేషిస్తారో, తృణీకరిస్తారో, అనుసరించరో వారు బుద్ధిహీనులు, అజ్ఞానులు, విమూఢులు, మతి లేని వాళ్లు అని తెలుసుకోమంటున్నాడు. ఎందుకంటే వారికి ఈ ఆధ్యాత్మికత మీద ఆసక్తి ఉండదు. ఎల్లప్పుడూ ప్రాపంచిక కర్మల యందే ఆసక్తి కలిగి ఉంటారు. ధనం సంపాదించడం, దాచుకోవడం, సంసారములో పడి ఉండటం, తన భార్య, పిల్లలు, బంధువులు వీరి కోసమే జీవిస్తుంటారు. ఎల్లప్పుడూ దుఃఖము అనుభవిస్తుంటారు. వీరికి ఆధ్యాత్మికత

అంటే విముఖత. దేవుడు, దైవం, భగవద్గీత ఇప్పుడెందుకులే దానికి ఇంకా చాలా టైముంది అని అంటుంటారు. అటువంటి వారికి ఈ లోకంలో సుఖం ఉండదు. పరలోకంలో సుఖం ఎటూ ఉండదు. జనన మరణ చక్రంలో తిరుగుతూ ఉంటారు. వీళ్లంతా బాగా చదువుకున్న వాళ్లు అంటే ఉదర పోషణార్థము ధనం సంపాదించడానికి తగిన చదువు చదువుకున్నారు. మహాపండితులు, మరి కొందరు వేదములు వల్లెవేస్తుంటారు. పూజలు చేస్తుంటారు. అన్నీ ఫలితాన్ని ఆశించి మాత్రమే చేస్తుంటారు. వీరికి భగవంతుని ఎడల భక్తి శ్రద్ధ ఉండవు. చేసే పనుల మీద నిష్కామ భావన ఉండదు. ఇటువంటి వారికి ఆత్మజ్ఞానము అసలే ఉండదు. వీరినే పరమాత్మ అజ్ఞానులు, నష్టజాతకులు విమూఢులు, అని అన్నాడు. పాజిటివ్ గా చెప్పాలంటే కర్మలను, భక్తిశ్రద్ధలతో, నిష్కామంగా ఆచరించాలి. అసూయ ద్వేషములను వదిలిపెట్టాలి. లేకపోతే నష్టం సంభవిస్తుంది. అని పరమాత్మ భావన.

ఈ విషయాన్ని కొంచెం లౌక్యంగా చెప్పుకోవాలంటే క్రమశిక్షణతో పని చేయడం చాలా కష్టం. ఎగ్గొట్టడం చాలా సులభం. 10.30 కు ఆఫీసుకు వెళ్లాలి. 5 దాకా శ్రద్ధతో పనిచేయాలి. ఇది నియమం, క్రమశిక్షణ. కాని కొన్ని ఆఫీసులలో మొదటి 15 నిమిషాలు ఎక్స్‌క్యూజ్, ఒక గంట లేట్ పర్మిషన్, అప్పుడైనా రాగానే సంతకం పెట్టి కాంటీన్‌కు వెళ్లడం, అరగంట తరువాత రావడం ఇలా ఎవరికివారు నియమాలను ఏర్పరచుకుంటారు. అంటే ఎవరికీ ఠంచనుగా 10.30 కు ఆఫీసులో ఉండాలి అన్న నియమం ఎవరూ పాటించరు. వీరికి తెలియదా అంటే అంతా తెలుసు. అంతా మేధావులే. పని తెలిసిన వాళ్లే. కాని శ్రద్ధ లేదు. ఇంకొంతమంది తాముచేసేపనిలో లోపాలు వెదుకుతూ ఉంటారు. వాళ్లకళ్లకు మంచి కనిపించదు. ఏ ఫైల్ తీసుకున్నా దానిని ఎలా తిరగ్గొడదామా అని తమ మేధాశక్తి నంతా వినియోగిస్తారు. ఫైల్ పుటప్ చేయడానికి నోట్ రాయాలి. తిరగ్గొట్టడం తేలిక. అలాగే కొంతమంది న్యాయాధికారులు ఉంటారు. ఏ కేసు వచ్చినా అందులో నేరస్తుడిని ఎలా నిర్దోషిగా నిరూపిద్దామా అని చూస్తుంటారు. దోషిగా నిరూపించడం కష్టం. నిర్దోషిగా నిరూపించడం సులభం. వారిని అక్విటల్‌టైప్ అంటారు. అంటే కేసు పూర్వాపరాల బట్టి కాకుండా, తమ మనస్తత్వం బట్టి పని చేసేవాళ్లు. అలాగే, సూర్యోదయానికి ముందు లేచి స్నానం చేసి ఉదయించే సూర్యుడికినమస్కరించి, సంధ్యావందనం చేసి భగవంతుని ధ్యానం చేయడం మంచి పని. ఇది చాలా కష్టం. తొమ్మిది గంటలకు లేవడం చాలా తేలిక. పైగా ఎందుకు లేవడం లేదో లక్షకారణాలు చెబుతారు. ఇటువంటి వారి గురించి పరమాత్మ ఈ శ్లోకంలో చెబుతున్నాడు. అటువంటి సోమరులు, తప్పులు వెదికే వారు, పని ఎగ్గొట్టేవారు, వారు బాగా చదువుకున్నా, తెలివి గలవారైనా, మూర్ఖులు, విమూఢులుగా పరిగణింపబడతారు. వారికి అన్నీ తెలిసినా ఏమీ తెలియనట్టే ఉంటారు. అటువంటి వాడికి విచక్షణా జ్ఞానం ఉండదు. ధర్మానికి అధర్మానికి తేడా తెలియదు. చేయాల్సిన పని చేయకూడని పని తేడా తెలియదు. తనకు తెలిసిందే వేదం అనుకుంటూ ఉంటాడు. అటువంటి తెలిసీ తెలియని విమూఢుల గురించి ఈ శ్లోకంలో వివరించాడు పరమాత్మ.

## 33. సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేర్జ్ఞానవానపి।
## ప్రకృతిం యాన్తి భూతాని నిగ్రహః కిం కరిష్యతి॥

ఎవరు ఎంతటి చదువు చదివినా, ఎంతటి జ్ఞానం సంపాదించినా, వాడు తన ప్రకృతి సహజమైన గుణములకు అనుగుణంగానే ప్రవర్తిస్తాడు. మానవులే కాదు సకల ప్రాణులు కూడా ప్రకృతి నియమములను అనుసరించి ప్రవర్తిస్తున్నాయి. అటువంటప్పుడు మానవునికి సహజగుణములను నిగ్రహించడం వలన, ప్రకృతి స్వభావాలకు విరుద్ధంగా ప్రవర్తించడం వలన మానవుడు ఏమి చేయగలడు? అని ఒక ప్రశ్నవేసాడు పరమాత్మ.

ఈ శ్లోకంలో జ్ఞానవానపి అంటే మానవులు తమ తమ శక్తిసామర్థ్యాలను అనుసరించి, తెలివి తేటలను అనుసరించి విద్యాభ్యాసంచేస్తారు. పెద్ద పెద్ద డిగ్రీలు పొందుతారు. గొప్ప గొప్ప విద్యావేత్తలు, జ్ఞానులు అనిపించుకుంటారు. ఇక్కడ లౌకిక విద్యలు అంటే ధనసంపాదనకు పనికి వచ్చే విద్యలను అభ్యసించి, వాటిలో నిష్ణాతులు అనిపించుకున్న వారే జ్ఞానులు అని అర్థం. ఎంతటి పండితుడైనా, ఎన్ని చదువులు చదివినా, ఎంత జ్ఞానం సంపాదించినా, కర్మల విషయాలకు వచ్చేటప్పటికి ప్రకృతి సహజంగానే ప్రవర్తిస్తూ ఉంటాడు. తన పూర్వజన్మ సంస్కారములను వదిలిపెట్టడు. బాగా చదువుకొని, పెద్ద పెద్ద పదవులలో ఉన్న వారు, స్త్రీలోలురుగా ఉండటం, ఏమీ చదువుకోని వాడు, కటిక పేదవాడు, నీతిమంతుడుగా ఉండటం మనం చూస్తూనే ఉన్నాము. కాబట్టి అందరూ తమ తమ పూర్వజన్మసంస్కారములను బట్టి, ప్రకృతి స్వభావములను బట్టి ప్రవర్తిస్తుంటారు. ఆ ప్రకృతి లక్షణాలను స్వభావాలను నిగ్రహించడం అంటే అణిచిపెట్టడం ఎవరికీ సాధ్యం కాదు. ఆ కారణం చేత నీ ప్రకృతి సహజ లక్షణమైన క్షాత్రాన్ని అణిచిపెట్టడం నీకూ సాధ్యం కాదు. దాని వలన నీకు అశాంతి తప్ప వేరేమీ మిగలదు.

ఈ శ్లోకం మనస్తత్వశాస్త్రమునకు సంబంధించినదిగా చెప్పుకోవచ్చు. ఈ ప్రకృతిలో ప్రతి జీవికీ ఒక ప్రాథమికమైన తత్వము ఉంటుంది. అది సత్వ, రజస్,తమో గుణముల కలగలుపుగా అయిఉంటుంది. ప్రతి జీవీ దానికి లోబడి ప్రవర్తించాలి. అది ప్రకృతి ధర్మము. దానిని ఎవరూ మార్చలేరు. (చాలా మంది తమలో ఉన్న అసలు లక్షణాలను దాచి పెట్టి, పైకి మాత్రం మంచి వారుగా, నీతిమంతులుగా కృత్రిమంగా నటిస్తుంటారు.) మానవుడు పైకి ఎంత కృత్రిమంగా ప్రవర్తించినా, అతని సహజలక్షణం మాత్రం అంతర్లీనంగా ఉంటుంది.

మానవుడు తన సహజ లక్షణములను అనుసరించి ప్రవర్తిస్తే అతని జీవితం తృప్తిగా నడుస్తుంది. ఆ దిశగానే అతని పూర్వజన్మసంస్కారాలు కూడా నడుస్తాయి. కాని ఎవరైనా తన సహజలక్షణాలకు విరుద్ధంగా ప్రవర్తిస్తే, అతని జీవితంలో ఏదో వెలితి. ఈ వెలితి అతని అంతరంగంలో

నిక్షిప్తమై ఉంటుంది. అప్పుడప్పుడు ఒంటరిగా ఉన్నప్పుడు నిర్వేదం రూపంలో బయట పడుతుంది. అది తీవ్రమైతే ఆత్మహత్యలకు కూడా  దారి తీస్తుంది. దీనిని ఇక్కడ అర్జునుడికి అన్వయిస్తున్నాడు కృష్ణుడు.

అర్జునుడి స్వభావము రజోగుణముతో కూడినది. అంటే క్షాత్రము. యుద్ధం చేయడం ధర్మాన్ని కాపాడడం, ప్రజలను కాపాడడం క్షత్రియుని ధర్మం. అర్జునా! నీ ధర్మం నీవు చేస్తే నీ జీవితంలో పరిపూర్ణత లభిస్తుంది. దానిని వదిలిపెట్టి నీవు అన్నట్టు భిక్షాటన చేస్తాను సన్యాసిని అవుతాను అంటే అది నీ ప్రకృతి సహజ లక్షణాలకు విరుద్ధము. నీలో ఉన్న క్షాత్రము నిన్ను ఆ పని చేయనివ్వదు. ఒకవేళ నీవు చేసినా, నీకు అశాంతి తప్పదు. ప్రకృతి సిద్ధమైన లక్షణాలు ఇలా ఉంటే, నేను నా ప్రకృతి లక్షణాలను నిగ్రహిస్తాను అంటే ఏమి ప్రయోజనము? దాని వలన నీకు ఏం లాభం. నీ క్షాత్రాన్ని నిగ్రహించి, వేరే లక్షణాలు అవలంబించి నందువలన, నీకు అశాంతి తప్ప మరేమీ మిగలదు. కాబట్టి నీ ప్రకృతి సహజమైన లక్షణాలను అణిచిపెట్టడానికి ప్రయత్నించవద్దు. అని బోధించాడు కృష్ణుడు.

కాని ఇక్కడ అందరికీ ఒక సందేహము వచ్చే అవకాశం ఉంది. అది ఏంటంటే, ప్రతి వ్యక్తి, అతడు జ్ఞాని అయినా సరే, అజ్ఞాని అయినా సరే, తన సహజ లక్షణములను అనుసరించి, సత్వ రజస్తమోగుణములను అనుసరించి, పూర్వజన్మ వాసనలను అనుసరించి ప్రవర్తించవలసిందే కానీ, వేరే మార్గంఏమీలేదు అంటున్నారు.మరి చెడు లక్షణములు ఉన్న వాడు బాగుపడే అవకాశమే లేదా! వాడు జన్మజన్మలకు అలా ఉండి పోవలసిందేనా!అని అందరికీ సందేహమురావచ్చు దానికి సమాధానమే ఈ కింది శ్లోకము.

### 34. ఇన్ద్రియస్యేన్ద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ।
### తయోర్న  వశమాగచ్ఛేత్తౌ హ్యస్య పరిపన్థినౌ॥

ఇంద్రియములకు, వాటి విషయములకు అంటే శబ్దము,స్పర్శ,రూప,రస,గంధములకు, సంబంధించి రాగద్వేషములు ఉంటాయి. అంటే ఇది నాకు ఇష్టము ఇది ఇష్టము లేదు అని. ఆ రాగద్వేషములకు లోబడితే బంధనములు తప్పవు. మానవుడు రాగద్వేషములకు లోను కాకూడదు. ఎందుకంటే రాగద్వేషములు మానవునికి శత్రువులు.

పైశ్లోకంలో ప్రతి మానవుడు ప్రకృతి గుణములకు, స్వభావమునకు, పూర్వజన్మ సంస్కారమునకు లోబడి ప్రవర్తించాలి. అంతకు తప్పమరొక మార్గము లేదు అని చెప్పాడు. అలా ప్రవర్తించేటప్పుడు మానవుడికి ఎన్నో ఆలోచనలు వస్తుంటాయి. మంచి ఆలోచనలు చెడ్డ ఆలోచనలు

కూడా వస్తాయి. అంటే రాగద్వేషములు. ఇష్టాఅయిష్టాలు. ఇది కావాలి అది వద్దు. వీడు నావాడు వాడు పరాయి వాడు అనే ద్వంద్వాలు. అవి ప్రతి వాడికీ సహజం. కాని అవి కార్యరూపం దాల్చకముందే వాటిని మనసులో నుండి నెట్టివేయాలి. అంతే కానీ ఆ ఆలోచనలను పెంచి పోషిస్తే అవి వికృత రూపం దాల్చి విపరీత పరిణామాలకు దారి తీస్తాయి. బంధనములను కలుగచేస్తాయి. అటువంటి ఆలోచనలను మనసులో నుండి మొగ్గలోనే తుంచి వేస్తే, మానవునికి శ్రేయస్సు కలుగుతుంది.

ఇలా రాగద్వేషములను ఇష్టా అయిష్టాలను తుంచి వేయాలంటే జ్ఞానం కావాలి. అది మంచి గురువు నుండి మాత్రమే లభిస్తుంది. ఆయన వలన ఆత్మ విచారము, భక్తి, వైరాగ్యము, శాస్త్రములను అధ్యయనం, నిష్కామ కర్మ మొదలగునవి నేర్చుకోవాలి. లేకపోతే రాగద్వేషముల ప్రభావానికి లోబడి కర్మలు చేస్తాము. కష్టాలపాలవుతాము. పూర్వజన్మ సంస్కారము చెడ్డదిగా ఉన్నా ఈ జన్మలో మంచి పనులు చేయడం ద్వారా వాటి ప్రభావమును తగ్గించుకోవచ్చు. ఒక్కోసారి పూర్తిగా నివారించవచ్చు. అది అతని సాధనా శక్తి మీద ఆధారపడి ఉంటుంది. కాబట్టి నా ఖర్మ ఇంతే, నేనేమీ చేయలేను, నా ప్రారబ్ధం నన్ను ఇలా చేస్తోంది అని బాధపడేకంటే, వాటి నుండి బయట పడటానికి ప్రయత్నించడం మంచిది. దానికి మూలం దుష్టఆలోచలను పెంచి పోషించకుండా మొగ్గలోనే తుంచి వేయడం ఉత్తమం.

ఎవరికైనా వారి వారి ప్రకృతి స్వభావాన్ని అనుసరించి ఇష్టము అయిష్టము అనేవి రెండు కలుగుతాయి. వాటినే రాగద్వేషములు అని అంటారు. ఇవి ఇంద్రియములు, వాటి గుణములు అయిన శబ్ద,స్పర్శ,రూప,రస,గంధములు ప్రాపంచిక విషయములతో కూడి ప్రవర్తించేదాన్ని బట్టి కలుగుతాయి. కొంత మందికి మెలోడీ సంగీతం ఇష్టం. మరొకరికి రణగొణధ్వనులతో కూడిన సంగీతం ఇష్టం. కొంత మందికి తీపి ఇష్టం. మరొకరికి కారం ఇష్టం. ఒకడికి ఎదుటి వాడు సంతోషంగా ఆనందంగా ఉంటే ఇష్టం. మరొకడికి ఎదుటి వాడు బాధపడుతుంటే ఇష్టం. ఎదుటి వాడిని బాధపెట్టి మరీ ఆనందిస్తాడు. ఇలాగా ప్రతి వాడికీ ఇష్టాఇష్టాలు మారుతూ ఉంటాయి. ఈ స్వభావాలను బట్టి మనసులో ఆలోచనలు కలుగుతాయి. అది మొదటి మెట్టు. ఆ ఆలోచనలు కోరికలుగా మారడం రెండవ మెట్టు. ఆ కోరికలను తీర్చుకోవడం కొరకు కర్మలు చేయడం మూడవ మెట్టు. ఇలా ఇష్టాఅయిష్టాలు ఏర్పడతాయి.

మొట్ట మొదటిగా మనలో మెదిలే ఆలోచనలను ఎవరూ ఆపలేరు. ఎందుకంటే అది మానవుని ప్రకృతి స్వభావాన్ని బట్టి పూర్వజన్మ సంస్కారాన్ని బట్టి కలుగుతుంది. ఈ ఆలోచనలను మొదటి మెట్టు అంటే మనసులో దాని గురించి ఆలోచన మొలకెత్తగానే, దాని మంచి చెడ్డలు విచక్షణా బుద్ధితో విచారించి, దానిని నివారించగలిగితే వాడు ధన్యుడు అవుతాడు. అలాకాకుండా దానిని పెంచి పోషించి, కర్మల దాకా తెచ్చుకుంటే, సుఖం కానీ దు:ఖం కానీ రెండూ కానీ కలుగుతాయి. బంధనములు కలుగుతాయి. జ్ఞాని కైనా, అజ్ఞాని కైనా, బాగా చదువుకున్నవాకైనా,

ఉన్నతపదవులలో ఉన్న వారికైనా వారి వారి ప్రకృతి స్వభావాలను బట్టి, పూర్వజన్మసంస్కారాలను బట్టి, ప్రాపంచిక విషయములలో ప్రవర్తించినపుడు వివిధ రకములైన ఆలోచనలు వస్తుంటాయి. అవి మంచివా కాదా, ఆచరించతగ్గవా, కాదా అనే విచక్షణా బుద్ధితో నిర్ణయం తీసుకోవాలి. అలా కాకుండా ఆలోచన వచ్చింది కదా అని దాని మీద మోహము కోరిక పెంచుకొని ఆ కోరిక తీరడం కోసం కర్మలు చేస్తే బంధనములు తప్పవు. వీటి కంతామూలము ఈ రాగద్వేషములు అనే దొంగలు. శత్రువులు. ఈదొంగలను, శత్రువులను మొగ్గలోనే మనం అదుపులో పెట్టుకోవాలి. అవి పెరిగి పూవు, కాయ, పండు దశలకు చేరుకుంటే ప్రమాదం.

## 35. శ్రేయాన్ స్వధర్మో విగుణ: పరధర్మాత్స్వనుష్ఠితాత్। స్వధర్మేనిధనం శ్రేయ: పరధర్మో భయావహ:॥

చక్కగా ఆచరించబడిన పరధర్మము కంటే, గుణము లేనిదైనను స్వధర్మమే మేలు. స్వధర్మాచరణములో మరణించినా శ్రేయస్కరమే. ఎందుకంటే పరధర్మము చాలా భయంకరమైనది.

ఈ శ్లోకంలో స్వధర్మము, పరధర్మము గురించి చెబుతున్నాడు. అర్జునుడి స్వధర్మము యుద్ధంచేయడం. పరధర్మము సన్యసించి, బిక్షాటనతో జీవించడం. వీటి రెండింటి మధ్య తేడా చక్కగా వివరించాడు పరమాత్మ. ఓ అర్జునా! ఎంత చక్కగా ఆచరించినా పరధర్మము ఆచరణీయము కాదు. ఎందుకంటే అది భయానకమైనది. ఆచరణకు అసాధ్యమైనా స్వధర్మమును ఆచరించడమే మంచిది. ఎందుకంటే స్వధర్మము ఎల్లప్పుడూ శ్రేయస్సును కలిగిస్తుంది. కాబట్టి నీవు నీ పరధర్మము అయిన భిక్షాటన చేస్తూ సుఖపడేకంటే, స్వధర్మము అయిన యుద్ధం చేస్తూమరణించడమే నీకు శ్రేయస్సును, వీరస్వర్గమును ఇస్తుంది. నీ కీర్తి ఇనుమడిస్తుంది.

అర్జునుడు పరంగా చెప్పాలంటే అర్జునుడు క్షత్రియుడు. అతని స్వధర్మము యుద్ధము చేయడం, రాజ్యపాలన చేయడం, ప్రజలను రక్షించడం. పరధర్మము, యుద్ధమునుండి పారిపోవడం, సన్యాసముస్వీకరించడం, భిక్షాటన చేయడం. ప్రస్తుతానికి యుద్ధంనుండి పారిపోవడం బాగా ఉంటుంది అనిపించినా, తరువాత అందరూ పిరికివాడని హేళన చేసి గేలిచేస్తుంటే అప్పుడు తెలుస్తుంది ఆబాధ. అందుకే స్వధర్మ ఆచరణే మంచిదని కృష్ణుని అభిప్రాయము.

ఇందులో మరొక విషయం కూడా దాగి ఉంది. స్వధర్మము అంటే ఆత్మ సంబంధమైన ధర్మము. ప్రతిమానవుని స్వధర్మము ఏమిటంటే తనను గూర్చి తాను తెలుసుకోవడం. తాను ఎవరో ఎక్కడి నుండి వచ్చాడో, తన కర్తవ్యం ఏమిటో తెలుసుకోవాలి. తాను ఆత్మస్వరూపుడు అని గ్రహించాలి.

అది చాలా కష్టం. పరధర్మము ఏమిటంటే ఈ దేహమే ఆత్మ అనుకోవడం. ప్రపంచంలో తాను చూసినవి, విన్నవి, తాకినవి శాశ్వతము అనుకోవడం. వాటి కోసరం మోహంలో పడటం. తుదకు దు:ఖము చెందడం. కాబట్టి కష్టమైనా ఆత్మజ్ఞానము సంపాదించడమే ప్రతి మానవుని స్వధర్మము. ప్రాపంచిక విషయములలో మునిగిలేలడం, సంసారంలో పడి కొట్టుకుంటూ ఉండటం పరధర్మము. స్వధర్మము మీద విరక్తి పరధర్మము మీద మోహము ఎందుకు కలుగుతూ ఉందంటే అది కేవలంమాయ.

ప్రపంచంలో దొరికే వస్తువులు అన్నీ మనలను మాయలో పడేస్తుంటాయి. ఆ మాయనుండి బయట పడాలి. దానికి మార్గములే సత్సంగము, భగవతారాధన, మనో నిగ్రహము, ఇంద్రియ నిగ్రహము. ఈ మాదిరి ఆత్మచింతన కొనసాగిస్తూ ఉంటే. మరణ సమయంలో కూడా ఇదే చింతనతో ఈ దేహమును వదిలి మరొక పుణ్యదేహమును పొందే అవకాశముఉంది. అలా కాకుండా ఎల్లప్పుడూ ప్రాపంచిక విషయములలో మునిగితేలుతుంటే మరణ సమయంలో కూడా ఈ ప్రాపంచిక విషయములు వదలలేక, వాటి గురించి ఆలోచిస్తూ, ఆవేదన చెందుతూ, మరు జన్మలో కూడా ఆ చింతనలకు సంబంధించిన దేహమే వస్తుంది. కాబట్టి పరధర్మమైన ప్రాపంచిక విషయముల మీద మనసు నిలపకుండా, స్వధర్మమైన ఆత్మచింతన మీద మనసు నిలపమని పరమాత్మ బోధిస్తున్నాడు.

ఈ విషయాన్ని మనం లౌక్యంగా ఆలోచిస్తే, విద్యార్థుల స్వధర్మం స్కూలుకు, కాలేజీకి వెళ్లి చదువుకోవడం. ఇది కొంచెం కష్టం అయిన పని. పరధర్మం స్కూలు కాలేజీ ఎగ్గొట్టి మాటనీలకు పోవడం, అమ్మాయిలను ఏడిపించడం, లవ్అఫెయిర్సులో మునిగితేలడం. ఇది చాలా సులభం, ఆనందం కలిగించే పని. కష్టం అయినా స్వధర్మం ఆచరిస్తే మంచి మార్కులతో పాసవుతాడు. మంచి ఉద్యోగం వస్తుంది. సుఖంగా జీవిస్తాడు. తాత్కాలికంగా సులభంగా ఆనందం కలిగించే పరధర్మంపాటిస్తే, ఫెయిల్ అవుతాడు. అవమానం భరించలేక ఆత్మహత్యకు పాల్పడతాడు. ఇలాగే ఉపాధ్యాయులు. విద్యాలయాలకు వెళ్లి పాఠాలు చెప్పడం. విద్యార్థులను వృద్ధిలోకి తేవడం ఉపాధ్యాయుల స్వధర్మము. ఇది కొంచెం కష్టమే. ముందు తాను చదివి మరునాడు విద్యార్థులకు చెప్పాలి. దీని వలన ఎంతో మంది విద్యావంతులు తయారవుతారు. పెద్దపెద్ద పదవులు అలంకరిస్తారు. తమ గురువు గురించి గొప్పగా చెప్పుకుంటారు. కాని ఉపాధ్యాయుడు పరధర్మం పాటిస్తే అంటే విద్యాలయాలకు వెళ్లకుండా, జీతం మాత్రం తీసుకుంటూ, ఇతర వ్యాపకాలలో మునిగితేలడం. రాజకీయాలలో పాల్గొనడం, లేక ధనం కోసం ఇతరులకు ఊడిగం చేయడం. ఇది ప్రస్తుతానికి సులభంగానే ఆనందంగానే ఉంటుంది. కాని దాని వలన దీర్ఘకాలంలో ఎన్నో ఇబ్బందులు, ఉద్యోగం ఊడటం, సంఘంలో చెడ్డపేరు, మానసిక అశాంతి కలుగుతుంది. అలాగే ఉద్యోగస్థులు కూడా తమ తమ కార్యాలయాలకు సకాలంలో వెళ్లి తమకు కేటాయించిన సమయం వరకు పని చేయడం, అవినీతికి పాల్పడకుండా ఉండటం స్వధర్మము. అలా చేస్తే, చక్కని జీతం, మంచి

ప్రోత్సాహకాలు, ఉన్నతాధికారులతో ప్రశంసలు, పదోన్నతులు లభిస్తాయి. కాని అలా కాకుండా, ఆఫీసులో సంతకం పెట్టి ఇతర వ్యాపకాలలో మునిగితేలుతూ, చేయాల్సిన పని ఎగ్గొట్టి, ఇతరత్రా కాలక్షేపం చేయడం, అవినీతికి పాల్పడటం ఇది పరధర్మం. ఇలా చేస్తే, ఉన్న ఉద్యోగం ఊడుతుంది. భార్యాపిల్లలు వీధినపడతారు, తుదకు అధోగతి పాలవుతాడు. వ్యాపారస్థుల విషయం తీసుకుంటే ధర్మంగా, న్యాయంగా, నీతిగా వ్యాపారం చేసి అందులో వచ్చే లాభనష్టాలను సంతోషంగా స్వీకరించడం వ్యాపారస్థుని స్వధర్మం, ఇది కొంచెం కష్టంఅయినా అమితమైన శ్రేయస్సును, మానసిక శాంతిని కలుగజేస్తుంది. ఉదాహరణకు ఇన్ఫోసిస్ నారాయణమూర్తి. అదే వ్యాపారాన్ని అధర్మంగా, అవినీతికి పాల్పడి, అక్రమాలు చేసి, లాభాలు గడించడం పరధర్మము. ఆ లాభాలు ఆనందం కలిగించకపోగా, తుదకు కష్టాల పాలుచేస్తాయి. ఉదాహరణ సత్యం అధినేత. రెండూ అత్యంత ప్రతిష్ఠాత్మకమైన వ్యాపారాలే. ఒకరు స్వధర్మం పాటిస్తే,మరొకరు పరధర్మాన్ని ఆశ్రయించారు. కాబట్టి మన నిజజీవితంలో కూడా స్వధర్మపాలన మొదట్లో కష్టంగా కనిపించినా అదే ఉత్తమం. పరధర్మం ఎప్పటికీ భయానకమే.

## అర్జున ఉవాచ:

### 36. అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః।
### అనిచ్ఛన్నపి వార్ష్ణేయ బలాదివ నియోజితః॥

కృష్ణా! ఎవరూ కావాలని పాపాలు చెడ్డపనులు చేయరు కదా. మరి ప్రతిరోజూ మానవులు ఏదో ఒక చెడ్డపని చేస్తూనే ఉన్నారు. దీనికి కారణం ఏమిటి. ఏ శక్తి మానవుని చేత చెడ్డపనులు దుర్మార్గాలు చేయిస్తూ ఉంది. అనిఅడిగాడు అర్జునుడు.

మనలో చాలా మంది అంటుంటారు. “ఇది తప్పని తెలుసయ్యా కాని ఎందుకో చేయాలని అనిపిస్తుంది.” అని అంటుంటారు. కోపంఅన్ని అనర్థాలకు మూలం అని అందరికీ తెలుసు. కాని కోపం అందరికీ వస్తుంది. అనరాని మాటలు అంటారు. తరువాత బాధపడతారు. అలాగే స్మోకింగ్ ఆరోగ్యానికి హానికరము అని తెలిసీ ప్రభుత్వం సిగరెట్లను నిషేధించదు. అలాగే మద్యం కూడా. కారణం ధనం. చాలామందికి తాము చేసే పనులు తప్పు అని తెలుసు కాని చేస్తూ నే ఉంటారు. మానలేరు. జంక్ ఫుడ్ హాని చేస్తుంది అని అందరికీ తెలుసు కాని అందరూ అదే తింటారు. లంచం తీసుకోవడం తప్పు, జైలుకు పోతాము అని తెలుసు కానీ తీసుకుంటున్నారు. (ఇటీవల లంచం తీసుకునేవాళ్లను విచారించి, శిక్షలు విధించే జడ్జిగారే 3 కోట్ల లంచం తీసుకొని జైలుకెళ్లాడు. ఉద్యోగం పోయింది. ఇది ఆయనకు తెలియదా. తెలుసు. కానీ చేసాడు. ఎవరో చెప్పినట్టు చేసాడు.) దొంగతనం పాపం అనీ, శిక్షపడుతుందనీ తెలుసు అందుకే ఎవరూ చూడకుండా దొంగతనాలు చేస్తుంటారు. ప్రజాధనం కొల్లగొట్టడం తప్పు, పాపం, నేరం అని అందరికీ తెలుసు

కానీ రాజకీయనాయకులు, పెద్దపెద్ద పదవులలో ఉన్నవాళ్లు కోట్లకోట్లీ ధనం కొల్లగొడుతున్నారు. అవే స్కాములు. అంతెందుకు. వందల మంది ముందు ఈ అమ్మాయి నా సహధర్మచారిణి, నా అర్థాంగి అని అంగీకరించి తాళి కట్టిన భర్త ఆమెను చిత్రహింసలు పెట్టడం, ఒక్కోసారి అంతమొందించడం చూస్తూనే ఉన్నాము. ఏ ఫామిలీ కోర్టుకుపోయినా అంతులేని కథలు వినిపిస్తాయి.. అంతెందుకు. ఒక మహా మేధావి. ప్రధాన మంత్రి పదవిలో ఉన్న మహోన్నత వ్యక్తి కోల్ స్కామ్‌లో ఇరుక్కున్నాడు. దీని కంతా కారణం ఏమిటి? ఈ దుర్మార్గాలు మానవులు ఎందుకు చేస్తున్నారు?తనకు ఇష్టం లేకపోయినా, ఎవరో బలవంతపెట్టినట్టు, ఎవరో చేయిస్తున్నట్టు అధర్మం చేస్తున్నారు. దీనికి కారణం ఏమిటి? ఇదీ అర్జునుడి ప్రశ్న.

కాబట్టి మానవునిలో అనుకూల శక్తి కన్నా ప్రతికూల శక్తి ఎంతబలంగా ఉంటుందో ఆలోచించుకోండి. ఇక్కడ ఒకపదం వాడారు. బలాదివ నియోజిత: అంటే ఎవరో బలవంతం చేసినట్టు ఎవరో ప్రేరేపించినట్టు, ఆజ్ఞాపించినట్టు మానవులు పాపం చేస్తున్నారు. అంటే మానవులు పాపం చెయ్యాలి అనే సంకల్పం లేకపోయినా, ఎవరో చేయించినట్టు పాపం చేస్తున్నారు అని భావన ఇది ఎందు వల్ల జరుగుతూ ఉంది అని అర్జునుని సందేహము.

మనం సాధారణంగా గమనిస్తే మానవులు మూడు విధాలుగాఉంటారు. కొంత మంది ఎప్పుడు కూడా ఏ పరిస్థితులలో కూడా పాపం చేయరు. అటువంటి ఆలోచన కూడా చేయరు. రెండవ రకం వారు. పాపం చేయడం తమకు ఇష్టం లేకపోయినా, ఎవరో లోపల నుండి ప్రోద్బలం చేసినట్టు పాపం చేస్తుంటారు. మూడవ రకం కావాలని పాపం చేస్తుంటారు. మొదటి తరగతి వారు జీవన్ముక్తులు. రెండవ రకం వారు దైవ చింతన కలవారు. మూడవ రకం వారు పాపాత్ములు. అర్జునుడు ఇక్కడ ఈ రెండవ రకం వారిని గురించి అడుగుతున్నాడు. మానవులు మూడో తరగతిలో అస్సలు ప్రవేశించకూడదు. రెండవ తరగతి నుండి మొదటి తరగతిలోనికి ప్రవేశించడానికిప్రయత్నించాలి. అలా కాకుండా మానవులు తాము పాపాలుచేస్తూ ఆ పాపాలను ఇతరుల మీదకు తోసేస్తుంటారు. ఎలా అంటే, చాలా మంది మానవులు ఇది శని ప్రభావం అండీ. ఏలిన నాటి శని నన్ను పట్టి పీడిస్తూ ఉంది అని శని మీదికి తోస్తారు. మరి కొంత మంది సాతాను నా నెత్తిమీద ఎక్కినాట్యం చేస్తున్నాడండీ అందుకని ఇలా జరిగింది అని కనపడని సాతాను మీదికి తోసేస్తారు. మరి కొంత మంది శనిపెద్దమ్మ, ఇనప గజ్జెల తల్లి నా నెత్తిమీద తాండవం చేస్తూ ఉందండీ అని అంటారు. కానీ పరమాత్మ మాత్రం శని అనలేదు. సాతాను అనలేదు. శనిపెద్దమ్మ, అని అసలే అనలేదు. మనం చెడ్డ పనులు చేయడానికి పాపాలు చేయడానికి కారణం ఏమిటో క్రింది శ్లోకాలలో నిర్మొహమాటంగా వివరిస్తున్నాడు.

శ్రీభగవానువాచ:

37. కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః।
మహాశనో మహాపాప్మా విద్ధ్యేనమిహ వైరిణమ్॥

రజోగుణము వలన పుట్టిన కామము, క్రోధము మనకు శత్రువులు. కోరికలు ఎన్ని తీరినా ఇంకా కోరికలు మిగిలే ఉంటాయి. కామదాహమునకు అంతు లేదు. ఈ కామములు తీరకపోతే అవి మనకు శత్రువులుగా పరిణమించి, అనేక మహాపాపములకు కారణం అవుతూ ఉంటాయి అని తెలుసుకో!

ఓ అర్జునా! ఎవరో చెప్పినట్టు అందరూ పాపాలు ఎందుకుచేస్తున్నారో తెలుసా! దానికి మూలం రజోగుణము వలన పుట్టిన కోరికలు. అవి తీరకపోతే వచ్చే కోపం. ఈ కోరికలు ఎంత అనుభవించినా వాటి ఆకలి, దాహం తీరదు. ఇంకా కావాలి ఇంకా కావాలి అంటుంటాయి. కోరికలకు తృప్తి లేదు. ఈ కామము, క్రోధము మానవునికి ప్రబల శత్రువులు. అన్ని అనర్థాలకు ఇవే మూలము. అని కృష్ణుడు అర్జునునితో చెప్పాడు.

మూడు లోకములలో ఉన్న మానవులను పట్టి పీడిస్తున్న జాడ్యము ఒకటే ఉంది. అదే కామము. కోరిక, ఒక వస్తువు కావాలని ఆరాటం. ఈ కామము రజోగుణము నుండి పుడుతుంది. వాడి కోరిక తీరడానికి ఎవరు కానీ, ఏది కానీ అడ్డుతగిలితే పిచ్చికోపం వస్తుంది. కాబట్టి కోరిక కోపము పక్క పక్కనే ఉంటాయి. రజోగుణము నుండి కోరిక పుడుతుంది. ఆ కోరిక తీరడానికి కర్మచేస్తాడు. అది మంచి కర్మ కావచ్చు, చెడ్డ కర్మ కావచ్చు, చేయకూడని కర్మ కావచ్చు. పుణ్యం కావచ్చు, పాపం కావచ్చు. ఏదైనా ఆలోచించకుండా చేసేస్తాడు. చేసిన తరువాత మంచి జరిగితే ఎగిరి గంతేస్తాడు. చెడు జరిగితే ఎందుకు చేసానా అని ఏడుస్తాడు. ఫలానా వాడు చెబితే చేసాను అని పక్కవాడి మీద తోసేస్తాడు. యజమాని చెబితే చేసాను అని అంటాడు.

ఎవరు ఎన్ని చెప్పినా అసలు పాపం చేయడానికి మూలం కామము, కోరిక. ఆ కోరిక మానవునికి ఇష్టం లేకపోయినా బలవంతంగా అతని చేత పాపం చేయిస్తుంది. కోరిక అంత శక్తివంతమైనది. ఆ కోరిక తీరక పోతే కోపం వస్తుంది. కామము, క్రోధము ఇద్దరూ అన్నదమ్ములు. అందుకనే అరిషడ్వర్గములలో కామ,క్రోధములకు మొదటి రెండు స్థానములు కేటాయించారు. కామము నాయకుడు అయితే క్రోధము ఉపనాయకుడు. ఆత్మను గురించి తెలుసుకోవాలి అనుకొనే వారికి ఈ ఇద్దరూ ప్రబలశత్రువులు. ఈ కామము నకు ఆకలి ఎక్కువ.

ఎంత తిన్నా దీనికి ఆకలెక్కువ. (మాన్ ఈజ్ ఎ బండిల్ ఆఫ్ వాంట్స్. ఎన్ని కోరికలు తీరినా ఇంకా కొన్ని కోరికలు మిగిలిఉంటాయి.) అమ్మయ్య అన్ని కోరికలు తీరాయి అన్న మాట ఎవరి నోటా రాదు. అగ్నిలో నెయ్యి పోస్తే భగ్గుమన్నట్టు ఈ కామము ఎప్పుడూమండుతూనే ఉంటుంది. అగ్నిలో నెయ్యి సమిధలు వేయకపోతే అగ్ని చల్లారి పోతుంది. అలాగే ఈ కామాగ్నిలో తత్వవిచారణ ద్వారా కోరికలను అదుపు చేస్తే, కామం దానంతట అదే చల్లారిపోతుంది.

ఈ శ్లోకంలో పరమాత్మ మహాపాప్మా అనే పదం వాడాడు. ఈ కామము మహా పాపములకు కారణమైనది అని అంటారు. ఈ కామం వలననే మానవులకు పుణ్యాలు తగ్గి పాపాలు పెరుగుతుంటాయి. ఈ కామము మానవునికి శత్రువు వంటిది. బయట ప్రపంచంలో శత్రువులు దూరంగా ఉంటారు. కాని ఈ కామము అనే శత్రువు మన వెంటనే ఉండి, మనలను సర్వనాశనం చేస్తుంటుంది. ప్రతివాడి మనసులో తిష్టవేసుకొని కూర్చుని ఉంటుంది. పోనీ ఈ కామము ఒక జన్మతో పోయేది కాదు. జన్మ జన్మల నుండి వేధిస్తూ మన పాపపు వాసనలను పెంచుతూ జన్మ జన్మలకు మన వెంట వస్తూ ఉంటుంది. ఈ కామము మనిషిని శాంతంగా ఉండనివ్వదు. మానవుడిని తన బానిసగా చేసుకుంటుంది. (వాడు కోరికలకు బానిస అయ్యాడు, వ్యసనాలకు బానిస అయ్యాడు  అని మనం అంటూఉంటాము.) ఆ ప్రకారంగా కామము మనలను బానిసలుగా చేసుకుంటుంది. తనే అధికారము చెలాయిస్తుంది. ఈ కామము తన మిత్రులైన క్రోధము, లోభములను కూడా పిలుచుకొని వచ్చి తన వెంట ఉంచుకుంటుంది. అవసరమైనపుడు వాటి సాయం తీసుకుంటుంది.  వాటిని మనమీద ప్రయోగిస్తుంది. ఇంట్లో పాము ఉంటే ఎలా మనం శాంతిగా ఉండలేమో, అలాగే ఈ కామ క్రోధములు మనసులో చేరితో ప్రశాంతంగా బతకలేము. నిత్యం అశాంతితో అల్లాడుతుంటాము.

ఇంకా వివరంగా చెప్పుకోవాలంటే మనలో ఉన్న అజ్ఞానమే దీని కంతటికీ కారణము. మానవునిలో ఉన్న అజ్ఞానము, కామము, క్రోధము రూపంలో ప్రకటితమౌతూ ఉంటుంది.  ఇవి రెండుగా కనిపించినా నిజానికి ఒకటే. కామము తీరకపోతే క్రోధం పుడుతుంది. కామం లేకపోతే క్రోధం లేదు. ఈ కామము క్రోధము కంటికి కనిపించకపోయినా భావనా రూపంలో అనుభవరూపంలో ప్రకటితమౌతుంటాయి. కాబట్టి కామము అంటే కోరికల గురించి అవి తీరకపోతే వచ్చే కోపము గురించి తెలియని వాడు అంటూ ఎవరూ లేరు. ఈ కామమునకు కోపమునకు మూలస్థానము మనలో సహజంగా ఉన్న రజోగుణము. మనలో ఉన్న రజోగుణము నుండి ఇవి పుట్టాయి. వీటికి ఆకలి ఎక్కువ. ఈ ఆకలి ఎంత తిన్నా తీరేది కాదు. కోరికలు తీరుతూ ఉంటే కొత్తవి పుడుతూ ఉంటాయి. అగ్నిలో నెయ్యిపోస్తే భగ్గుమన్నట్టు ఈ కామం కూడా ప్రజ్వరిల్లుతూనే ఉంటుంది. ఈ కామముతీరకపోతే క్రోధంగా మారి మానవుల చేత మహాపాపాలు చేయిస్తుంది. కాబట్టి ఈ కామము దాని వలన పుట్టే క్రోధము మానవునికి ప్రబల శత్రువులు అని ప్రతివాడూ తెలుసుకోవాలి.

ఈ కామ క్రోధ లోభములు అనే శత్రువులను బయటకు తరిమెయ్యాలంటే మనం వివేకము, వైరాగ్యము అనే వారి సాయం తీసుకోవాలి. చాలామంది అంటుంటారు నేను కోరికలను అదుపులో ఉంచుకుంటాను అని. అది పొరపాటు. కామము అనే బీజం ఉన్నంతవరకు కోరికలు పుడుతూనే ఉంటాయి. కాబట్టి కామము అనే మూలాన్ని నాశనం చేయాలి. ఈ కామము ఎలా ఉంటుంది, దాని స్వరూపము, స్వభావము ఏమిటి అనే విషయం తరువాతి శ్లోకాలలో వివరిస్తున్నాడు పరమాత్మ.

### 38. ధూమేనావ్రియతే వహ్నిర్యథా22దర్శో మలేనచ।
### యథోల్బేనావృతో గర్భస్తథా తేనేదమావృతమ్॥

పొగచేత అగ్ని, మురికిచేత అద్దము, మావిచేత గర్భంలో ఉన్న శిశువు కప్పబడి ఉన్నట్టు, ఈ కామము దాని వలనపుట్టే క్రోధము, మనలో ఉన్న ఆత్మజ్ఞానమును కప్పిఉంచుతుంది.

ప్రతి జీవిలో ఆత్మ జ్యోతి మాదిరి వెలుగుతూ ఉంటుంది. ఆ జ్యోతి ప్రాపంచిక విషయములతో చేరితే జీవాత్మ, పరమాత్మ వైపు తిరిగితే తన స్వస్వరూపము అయిన ఆత్మ స్వరూపము అని తెలుసుకున్నాము. ఈ జీవాత్మకు కామము, క్రోధము ఒక పొరవలె ఏర్పడి కప్పి ఉంచుతాయి. ఎలా గంటే అద్దం ఉంది. దానికి మురికి పడితే అద్దంలో మన ముఖం కనపడదు. ఆ మురికిని తుడిచి వేస్తే అద్దం నిర్మలంగా ఉంటుంది. అలాగే నిప్పు ఉంది, పొగ రావడం మొదలయితే అగ్ని కనిపించదు. ఊదితో మండుతుంది అప్పుడు పొగ ఉండదు. ఈ కామము క్రోధము అనే పొరలు మనకు మనం సృష్టించుకున్నవి కానీ, ఎక్కడి నుండి రావు. ఈ కామము క్రోధము అనే పొగ, మురికి పోగానే జీవాత్మ స్వచ్ఛంగా ప్రకాశిస్తూ ఉంటుంది. ఈ తుడవడమే సత్సాంగత్యము, నిష్కామ కర్మ ఆచరించడం, జ్ఞానము సంపాదించడం, కర్తృత్వ భావన లేకుండా కర్మలు చేయడం. దీనితో జీవాత్మకు పట్టిన మురికి తొలగి పోతుంది.

ఇక్కడ ఇంకొక విషయం కూడా ఉంది. పొగతో కప్పబడి నప్పుడు అగ్నికి గానీ, మురికితో కప్పబడినప్పుడు అద్దానికి కానీ, మావితో కప్పబడినపుడు శిశువుకు గానీ ఎటువంటి హానీ జరగదు. అవి తమ తమ స్వస్వరూపాలతోనే ఉంటాయి. కేవలం పొగ, మురికి మాత్రమే వాటిని కప్పి ఉంచుతుంది. ఆ మురికి తీసేస్తే వాటి నిజమైన స్వరూపాలు ప్రకటితమౌతాయి. దీని వలన మనకు తెలిందేమిటంటే మనం ఆనంద స్వరూపులము. మనలో ఉన్న ఆత్మ ఎల్లప్పుడు ఆనందంతోనే ఉంటుంది. కాని మనం కామము, కోరికలు, అవి తీరకపోతే కోపము అనే వాటితో ఆ ఆనందాన్ని దూరం చేసుకుంటున్నాము. అవి తీసేస్తే మరలా ఆనంద స్వరూపులము అవుతాము. మనం అందరం శివస్వరూపులము శివ అంటే ఆనందము. అంటే మనం అందరం ఆనంద

స్వరూపులము. అని తెలుసుకుంటే మనకు మనం మసి పూసుకోము. చాలా మంది నా జీవితం ఇంతే నేనింతే నాకు సుఖం లేదు ఈ జీవితానికి సుఖం లేదు అని అనుకుంటూ తమలో తాము బాధపడుతుంటారు. అది తప్పు. అందరూ ఆనంద స్వరూపులే. మనం ఆ ఆనందాన్ని చేచేతులా నాశనం చేసుకొని ఏడుస్తున్నాము అంతే. కాబట్టి ఆ పొగను మురికిని తొలగిస్తే నిత్యం ఆనందంగా ఉంటాము.

పోనీ ఇదేమన్నా కష్టమా అంటే అదీ లేదు. కాస్త విసిరితే పొగపోయి మంట వస్తుంది. కాస్త నీటిలో తడిపి తుడిస్తే అద్దం స్వచ్ఛంగా ప్రకాశిస్తుంది. వైద్యులు మావి తొలగించి శిశువును బయటకు తీస్తారు. ఇవన్నీ దైవయత్నాలు కాదు. పురుష ప్రయత్నాలు. ఈ కామము క్రోధమును తొలగించుకోడానికి మన వంతు ప్రయత్నం మనం చేయాలి కానీ నా ఖర్మ ఇంతే అని ఏడుస్తూ కూర్చోకూడదు. సోమరి తనం పనికి రాదు. కాస్త ప్రయత్నం చేస్తే ఈ కామ క్రోధములను జయించడం అంత కష్టమేమీ కాదు అని భగవానుడు మనకు భరోసా ఇస్తున్నాడు.

కామము మానవునిలో ఉన్న ఆలోచనా శక్తిని, వివేచనా శక్తిని తగ్గిస్తుంది. అంధకారంలో పడేస్తుంది. అందుకే కామాంధుడు అని కూడా మనం అంటూ ఉంటాము. కామంతో కళ్లు మూసుకుపోయినవాడు. ఇక్కడ కామము అంటే కేవలం స్త్రీవాంఛ అనే అర్థంలో వాడినా, కామము అంటే కోరిక అని అర్థం చేసుకోవాలి. కామము అంటే మనలో ఉన్న తీరని కోరికలు అని అర్థం. ఈ శ్లోకంలో అగ్ని, అద్దము, శిశువు అనే మూడు ఉదాహరణలు చెప్పాడు పరమాత్మ. ఈ మూడు ఉదాహరణలు కూడా చాలా ముఖ్యమైనవి.

అగ్నినుండి పొగ వస్తుంటే, ఊదితే పొగ పోయి అగ్ని మండుతుంది. అలాగే కొన్ని కోరికలు ఉఫ్‌మని ఊదితే చాలు ఎగిరిపోతాయి. ఎక్కువ శ్రమపడనక్కరలేదు. కాని మరి కొన్ని కోరికలు ఉంటాయి. చాలా బలంగా ఉంటాయి. అవి అద్దానికి పట్టిన మురికిలాంటివి. అద్దానికి పట్టిన మురికిని బట్టతీసుకొని నీటిలో తడిపి అద్దం మీద రుద్దాలి. అప్పటికీ పోకపోతే డిటర్జెంట్ వాడి క్లీన్ చేయాలి. అంటే కొంత శ్రమతో కూడిన పని. అలాగే మరి కొన్ని కోరికలు చాలా బలంగా ఉండి, ఎప్పటికీ తీరవు. ఎంతో శ్రమపడితేనే గానీ ఆ కోరికల ప్రభావం నుండి బయట పడలేము. ఆ కోరికల ప్రభావంనుండి బయట పడటానికి కొంత కాలము వేచి ఉండాలి. ఓపికగా ఉండాలి. ఎలాగంటే శిశువుకు కప్పిన మాయను వెంటనే తీసివేయలేము. తొమ్మిది నెలలు నిండి శిశువు బయటకు వస్తేనే గానీ, ఆ మాయను తీసివేయలేము. అలాగే కొన్ని కోరికలు కాలక్రమేణా పోవలసిందేకానీ, మన ప్రయత్నం వలన పోవు. కాబట్టి మనలో ఉన్న జ్ఞానాన్ని కప్పిఉంచిన ఈ కామాన్ని ముందు తొలగించుకోవాలి.

## 39. ఆవృతం జ్ఞానమేతేన జ్ఞానినో నిత్యవైరిణా।
## కామరూపేణ కౌన్తేయ దుష్పూరేణానలేన చ॥

ఈ కామము ఎన్నటికీ తీరదు. అన్ని కోరికలు తీరాయి అనే మాట ఎవడి నోటా రాదు. కామాగ్ని, అగ్నిమాదిరి ఎప్పుడూ మండుతూ ఉంటుందే కానీ ఆరిపోదు. ఇది సాధకునికి ప్రబలశత్రువు. ఎందుకంటే ఈ కామము సాధకునిలోని జ్ఞానమును కప్పిఉంచుతుంది. జ్ఞానులు సాధకుల సంగతే ఇలా ఉంటే, ఇంక సాధారణ మానవుల సంగతి చెప్పేదేముంది.

ఈ శ్లోకంలో సాధకుల గురించి చెబుతున్నాడు. జ్ఞానిన: అంటే జ్ఞానులకు, సాధకులకు అని అర్థము. సాధకులకు ఈ కామము నిత్యవైరి. మామూలు శత్రువులు అయితే కొంత కాలానికి మిత్రులు అవుతారు. కాని ఈ కామము సాధకునికి జన్మశత్రువు. అనుక్షణం జ్ఞానిని ప్రాపంచిక విషయాలవైపు లాగి అథ:పతితుడిని చేయడానికి ప్రయత్నిస్తూ ఉంటుంది. సాధకులనే కాదు, ఈ కామము పండితులను, రాజులను, చక్రవర్తులను, ఋషులను, బలవంతులను, ఇంద్రుడిని ఎవరినైనా తన ప్రభావంతో పడగొడుతుంది. ఆధ్యాత్మసాధనలో ఎంతో సాధించిన వారిని కూడా ఈ కామము తన ప్రభావంతో పడగొట్టిన సందర్భాలు అనేకంఉన్నాయి. ఈ కామము వాటి సంబంధమైన కోరికలు పైపైన తీరినట్టు కనిపించినా, లోలోపల సూక్ష్మరూపంలో పొంచి ఉంటాయి. అదును చూసుకొని దెబ్బతీస్తాయి. వివేకము చేత, ఆత్మ విచారము చేతనే ఈ కామమును జయింపవలెనే కానీ ఇతరత్రా సాధ్యము కాదు.

కాస్త తెలివి జ్ఞానం ఉన్న మనిషికి, వాడు పిచ్చివాడు కాకపోతే, తాను ఏ పని చేయబోతున్నాడో, ఆ పనికి ఫలితం ఎలా ఉంటుందో బాగా తెలుస్తుంది. కొంత మంది, ఆ పని వల్ల దు:ఖం వస్తుందని తెలిసీ ఆ పనే చేస్తాడు. లాటరీ తీసుకుందాము. ఛాన్సు ఒకటికి లక్ష అని అందరికీ తెలుసు కానీ లాటరీ కొంటాము. రాకపోతే దు:ఖము కలుగుతుంది. ఆ దు:ఖము కోపంగా పరిణమించి దానిని ఇంట్లోవాళ్లమీద చూపిస్తాము.. ప్రాపంచిక వస్తువులు కావాలి అని కోరుకుంటున్నప్పుడు ఆ కోరికలు చాలా మంచివిగా, అద్భుతంగా కనపడతాయి. తీరా అవి తీరకపోయేసరికి, వ్యతిరేక ఫలితాలు వచ్చేసరికి కోపం ముంచుకొస్తుంది. తనను అందరూ మోసం చేసారు అని ఏడుస్తాడు. ఈ కోరికలు కొంపముంచాయి అని బాధ పడతాడు. ఈ తెలివి ముందే ఉంటే ఈ దు:ఖము ఉండదు కదా! కాబట్టి ప్రతి తెలివికలవాడు తెలుసుకోవలసినది ఏమిటంటే కామము అంటే అలవిమాలిన కోరికలు. మనకు ప్రబల శత్రువులు. దానిని దూరంగా ఉంచాలి. దాని జోలికిపోకూడదు. ఒక వేళ పోయినా అతి జాగ్రత్తగా ఉండాలి. అని తెలుసుకోవాలి. ఎందుకంటే కోరికలకు అంతు లేదు. అగ్నిలో ఆజ్యం పోసినట్టు కోరికలు తీరేకొద్దీ పెరుగుతూనే ఉంటాయి. వాటికి అంతం లేదు. కాబట్టి ఈ కామాన్ని మొదట్లోనే తుంచాలి.

మనకు ఒక శత్రువు ఉన్నాడు. వాడు ఎంత బలవంతుడో, వాడి దగ్గర ఏయే ఆయుదాలు ఉన్నాయో, వాడి వెనక ఎంత మంది బలగం ఉన్నారో తెలిస్తేనే కదా వాడితో పోరాడగలిగేది. అలాగే ఈ కామము మనకు నిత్య శత్రువు. ఈ శత్రువు ఈరోజు ఉంటాడు రేపు ఉండడు అని లేదు. ఇది ప్రచండ మైన అగ్ని లాంటిది. ఎన్ని ఆహుతులు వేసినా తనివి తీరదు. వేసే కొద్దీ ప్రజ్వరిల్లుతుంటుంది. ఇప్పుడు మనం యోగపరంగా విచారిస్తే నిత్య వైరిణా అంటే ఈ కామము జీవుని జన్మ జన్మలను వెంటాడి వేధిస్తూ ఉంటుంది. చివరకు ముక్తి కలిగే వరకూ దీని బాధ తప్పదు. అందుకే దీనిని నిత్య శత్రువు అని అన్నారు.

రాజకీయాలలో నిత్య శత్రువులు కానీ శాశ్వత మిత్రులు కానీ ఉండరని నానుడి. మనకు ఇతరులతో ఉన్న శత్రుత్వము కూడా కొద్ది కాలానికి మాసి పోతుంది. కానీ ఈ కామము అనే శత్రుత్వము జన్మజన్మలకూ మాసి పోదు. దినదినప్రవర్ధమానమౌతూ ఉంటుంది. ప్రతిక్షణం కూడా జీవుని పడగొట్టడానికి తన వంతు ప్రయత్నం చేస్తూనే ఉంటుంది. ఈ కామము సామాన్య మానవులనే కాదు ఋషులను, పండితులను, జ్ఞానులను, రాజులను, యతులను, స్వామీజీలను ఎవరైనా సరే ఇట్టే పడగొట్టే శక్తి కలిగింది ఈ కామము. ఆధ్యాత్మిక సాధన చేస్తూ కాస్త ఆదమరిస్తే చాలు, ఈ కామము వాడిని అమాంతం కబళిస్తుంది. భరతుని కథ దీనికి ఉదాహరణ.

కొంత మంది అంటుంటారు మేము కోరికలను జయించాము మాకు ఏ కోరికలు లేవు మేము నిస్సంగులము అని అంటుంటారు. నిజమే. కాని ఏదో ఒక బలహీన క్షణంలో వారిని ఈ కామము పడగొట్టేస్తుంది. పతనం చేస్తుంది. (ఉదా: పిరమిడ్ ధ్యానపీఠఅధినేత పత్రి మహాశయులు). కాబట్టి ఈ కామము క్రోధము అనే శత్రువుల గురించి చాలా జాగ్రత్తగా ఉండటం చాలా అవసరం. వివేకము, వైరాగ్యము అనే ఆయుధములతో ఈ కామము అనే శత్రువును సమూలంగా నాశనం చేసిన నాడే మానవుడు ముక్తి పొందుతాడు.

ఈ కామమునకు తృప్తి లేదు అని చెప్పడానికి రెండు ఉదాహరణలు ఇచ్చాడు. సముద్రం ఉంది. మీరు ఎన్ని బిందెలతో నీళ్లు తెచ్చి పోసినా చాలు ఇంక నిండింది అనదు. అలాగే అగ్నిలో ఎంత నెయ్యి పోసినా సమిధలు వేసినా, ఇంక చాలు అనదు. వేసినవి అన్నీ స్వాహా చేస్తుంది. ఇంకా కావాలి అని భగభగ మండుతుంది. తృప్తి అనే పదానికి అర్థం తెలియనిది కామము. కొంత మంది అంటారు కామములు అన్నీ అనుభవిస్తుంటే ఆ కామములు కొన్నాళ్లకు అయిపోతాయి కదా అని. అది శుద్ధ తప్పు. అనుభవించే కొద్దీ కామజ్వాలలు ప్రజ్వరిల్లుతాయే కానీ చల్లారవు. అగ్నిని ఆర్పాలంటే సమిధలు వేయడం ఆపి, నీళ్లు పోయాలి అప్పుడే ఆరి పోతుంది. ఇక్కడ కూడా వివేకము వైరాగ్యము అనే నీటితో కామాగ్నిని ఆర్పాలి కానీ, అనుభవిస్తే కామం చల్లారుతుంది అనేది ఒట్టి మాట.

జ్ఞానినా నిత్య వైరిణా అని ఎందుకు అన్నారంటే, జ్ఞానులకు ముముక్షువులకు మోక్ష మార్గం లో ఉండే వారికి అది ప్రబల శత్రువు, నిరంతర శత్రువు. అందుకే జ్ఞానులకు శత్రువు అని వాడాడు పరమాత్మ. అటువంటి జ్ఞానులనే బుట్టలో వేయగల కామము సామాన్యమానవులను బుట్టలో వేయదని నమ్మకం ఏముంటుంది. కాబట్టి కామము సామాన్యులకు ముందు మిత్రుడుగా పరిచయం అయి, తరువాత శత్రువుగా మారుతుంది. జ్ఞానులకు మొట్టమొదటి నుండి శత్రువు.

పాము ఇంట్లోకి దూరింది. అది ఎక్కడ ఉండేది తెలిస్తేనే కదా దానిని కొట్టడానికి. ఈ కామము ఎక్కడుండేదీ తెలిస్తే దానిని నిర్మూలించవచ్చు .కామం ఎక్కడెక్కడ ఉండేదీ, ఆ శత్రువు ఉండే స్థావరాలు ఏమిటి? అనే విషయాలను తరువాతి శ్లోకంలో వివరిస్తున్నాడు పరమాత్మ.

## 40. ఇన్ద్రియాణి మనోబుద్ధిరస్యాధిష్ఠానముచ్యతే।
## ఏతైర్విమోహయత్యేష జ్ఞానమావృత్య దేహినమ్॥

ఈ కామము (అంటే చూచినది, విన్నది, తాకినది, రుచి చూసిన ప్రతిదీ కావాలి అనే తత్త్వము) మానవుని దేహములో ఉన్న ఇంద్రియములను, మనస్సును, బుద్ధిని ఆశ్రయించుకొని ఉంటుంది. మానవుని లో ఉన్న మనో, బుద్ధి, ఇంద్రియాలు, తనలో చెలరేగిన కామాలను అన్నిటినీ తీర్చడానికి శతథా ప్రయత్నం చేస్తుంటాయి. అప్పుడు లోపల ఉన్న ఆత్మజ్ఞానము కప్పబడి పోతుంది. అప్పుడు మానవుడు తీవ్రమైన మోహంలో పడిపోతాడు.

ఈ సన్నివేశాన్ని కృష్ణుడు యుద్ధ సన్నివేశంతో పోల్చాడు. ఎందుకంటే అర్జునుడు యుద్ధభూమిలో ఉన్నాడు. ఆయనకు అటువంటి ఉదాహరణ ఇస్తేకానీ అర్థం కాదని యుద్ధము అని అర్థం వచ్చేటట్టు చెబుతున్నాడు. ఒక రాజును జయించాలంటే ముందు వాడి కోటను వశపరచుకోవాలి. దానికి కోటచుట్టు స్థావరాలు ఏర్పరచుకోవాలి. ఈ కామము కూడా ఆత్మను జయించడానికి ముందు స్థావరాలు ఏర్పరచుకుంటుంది. ఆ స్థావరాలు ఏవంటే ఇంద్రియములు, మనస్సు, బుద్ధి. వీటన్నిటికీ లీడర్ అహంకారము. కామము ఎల్లప్పుడూ వీటిని ఆశ్రయించుకొని ఉంటుంది. . ఈ కామము ముందు ఇంద్రియములను ఉసిగొలుపుతుంది. ప్రపంచంలో ఉన్న విషయాలను చూడటం, వినడం, తాకడం, వాసన చూడటం చేస్తుంది. అవన్నీ నాకు కావాలనే కోరిక కలుగజేస్తుంది. లోపల ఉన్న మనసు ఈ విషయాలను, అవి కావాలి అనే కోరికలను అన్నిటినీ రికార్డుచేస్తుంది. అలా చేస్తూనే ఉంటుంది. మనం తీరికగా కూర్చున్నపుడు, ధ్యానంలో కూర్చున్నపుడు, ఆ రికార్డు ప్లేచేస్తుంది.
(మనం దేవుడి ముందు కూర్చుని కళ్లు మూసుకున్నప్పుడు ప్రపంచంలో ఉన్న పనికిమాలిన విషయాలు అన్నీ గుర్తురావడానికి ఇదే కారణం).

అప్పుడే మనకు అన్నికోరికలు గుర్తుకు వస్తాయి. మనసు, శరీరము, విషయాలను కావాలి అని కోరుకుంటున్నపుడు బుద్ధికూడా వాటికి వంతపాడుతుంది. ఇప్పుడు మనకు ఒక అనుమానం వస్తుంది. బుద్ధి మంచిది కదండీ మరి బుద్ధి కామానికి ఎందుకు వంత పాడుతుంది అనిమీరు అనవచ్చు. బుద్ధి నిర్మలంగా ఉంటుంది. శాస్త్రములు చదివి, గురువును ఆశ్రయించి, మంచి విషయాలను నేర్చుకొని ఉంటే, బుద్ధి తన పనితాను చేస్తుంది. ఇది మంచిది కాదు అని చెబుతుంది. అదే బుద్ధిని చిన్నప్పటి నుండి కోరికలతో, చెడు సహవాసాలతో, చెడ్డ తలంపులతో నింపితే, ఆ బుద్ధి కూడాతన పని తానుచేయడంమానేసి, విచక్షణా శక్తిని కోల్పోయి, మనసుకు ఇంద్రియాలకు వంతపాడుతుంది.

ఈ ప్రకారంగా, కామము ఈ మూడింటినీ వశపరచుకొని, లోపల ఉన్న ఆత్మస్వరూపాన్ని ముట్టడిస్తుంది. అంటే కప్పుతుంది. ఆత్మ ఎప్పుడైతే కప్పబడిపోయిందో, ఇంక కామం విజృంభిస్తుంది. మనస్సును బుద్ధిని తీవ్రమైన మోహంలో పడేస్తుంది. విమోహయతి అంటే మోహంలో పడేయడం. కామము ఇంద్రియములను, మనోబుద్ధులను వశపరచుకొని, వాటిని మోహపరవశు లను చేస్తుంది. ఆ మోహంలో పడ్డ వాడు ఓ పట్టాన బయటకు రాలేడు. ఆ ప్రకారంగా మోహము జీవుని వశం చేసుకొని వాడిని పడగొట్టేస్తుంది. తనకు దాసునిగా చేసుకుంటుంది.

మరి ఈ శత్రువును ఎలా జయించాలి అంటే ముందు శత్రువు ఏర్పరచుకున్న ఆశ్రయాలను (స్థావరాలను) వశపరచుకోవాలి. మనోబుద్ధిఇంద్రియములను ఆశ్రయించుకున్న మోహమును నాశనం చెయ్యాలంటే దాని వశంలో ఉన్న మనస్సును, ఇంద్రియములను మన స్వాధీనంలోకి తెచ్చుకోవాలి. దానినే మనో నిగ్రహము ఇంద్రియ నిగ్రహము అంటారు. అప్పుడు బుద్ధి కూడా మనవైపు వస్తుంది. అప్పుడు కామమునకు నిలువ నీడ ఉండదు. దానంతట అది పారిపోతుంది. కామాన్ని జయించి నిరంతర ఆనందం పొందడానికి ఇదే తరుణోపాయము. ఈ విషయాన్నే తరువాతి శ్లోకాలలో చెప్పాడు పరమాత్మ.

## 41.తస్మాత్త్వమిన్ద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ।
## పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాన నాశనమ్॥

ఓ అర్జునా! అత్యంత పాపభూయిష్ఠమైనదీ, మానవునిలో ఉన్న జ్ఞానమును విజ్ఞానమును నాశనం చేసేదీ అయిన ఈ కామాన్ని జయించాలంటే, ముందు నీ ఇంద్రియములను, వాటి విషయగ్రహణశక్తిని అదుపులో పెట్టుకో. తరువాత కామాన్ని జయించు.

మనం ఇంత వరకు కామం అంటే కోరికల గురించి మాట్లాడుకున్నాము. మరి కామాన్ని జయించడానికి మార్గం ఏమిటి అనే విషయం చర్చిద్దాము. కామమునకు ఆశ్రయం ఇంద్రియములు. కాబట్టి ముందు ఇంద్రియములను కట్టడి చేయాలి. ఎందుకంటే ఇంతకు ముందు కామమునకు మూలము మనస్సు బుద్ధి ఇంద్రియములు అని చెప్పుకున్నాము. మన కు కనపడేవి ఇంద్రియములు. ముందు ఇంద్రియ నిగ్రహం అలవరచు కుంటే, కామానికి ఒక ఆసరా తొలగి పోతుంది. తరువాతది మనస్సు మనస్సును నిగ్రహిస్తే, ఇంక కామము ఏమీ చేయలేదు. ఇంద్రియములు మనస్సు మన వశంలో ఉంటే బుద్ధి కూడా మన వశంలో ఉంటుంది. అప్పుడు కామము ఒంటరిదై పోతుంది. ఏమీ చేయలేక నశించి పోతుంది. కాబట్టి పరమాత్మ ముందుగా ఇంద్రియములను వశంలో ఉంచుకోమని మనకు చెప్పాడు. ఇంద్రియములను వశంలో ఉంచుకోవడం మామూలు మానవులకే కాదు ముముక్షువులతో సహా అందరికీ అవసరమే. ఎందుకంటే ఏ క్షణంలో అయినా కామము ఇంద్రియములను ఆకర్షించి, వశపరచుకుంటుంది. కాబట్టి ఇంద్రియముల విషయంలో అనుక్షణం అప్రత్తతతో ఉండాలి. ఇంద్రియములను అభ్యాసము చేతా, వైరాగ్యము చేతా, మనం చేయబోయే పని మంచిదా కాదా అనే విచారణ చేతా ఇంద్రియములను కట్టడి చేయవచ్చును.

భగవానుడు పాప్మానమ్ అనే పదం వాడాడు. అంటే కామము పాపభూయిష్టమైనది. మానవులను పాపకూపంలో పడవేస్తుంది అని పరమాత్మ భావన. అందుకే మనలను హెచ్చరిస్తున్నాడు. ఇటీవలి కాలంలో కామానికి బానిస అయిన వాళ్లు ఎన్నెన్ని ఘోరాలు చేస్తున్నారో మనం చూస్తూనే ఉన్నాము. కామము మనిషిలోని జ్ఞానాన్ని నాశనం చేస్తుంది. పతితుడిని చేస్తుంది. ఎంతో మంది పండితులు, జ్ఞానులు, అనుభవజ్ఞులు కూడా ఈ కామం బారిన పడిపోతున్నారు. కాబట్టి ఈ కామాన్ని అరికట్టడం ప్రతివాడి కర్తవ్యము. దానికి వివేకము, వైరాగ్యము, ముఖ్యమైన ఆయుధములు అని ముందే చెప్పుకున్నాము. కాబట్టి అర్జునా నువ్వు కూడా వీళ్లందరిమాదిరి కామానికి లోను కాకుండా, దాని మోహంలో పడిపోకుండా, నిశ్చయాత్మకబుద్ధితో యుద్ధం చెయ్యి అని పరమాత్మ బోధించాడు.

ఈ కామమునకు మూడు ఆశ్రయాలు అంటే మూడుస్థావరాలు అని చెప్పుకున్నాము కదా. ఆ స్థావరాలను ముందునాశనం చేయాలి. మొట్ట మొదటి స్థావరము. శరీరము, అంటే ఇంద్రియములు. ఇంద్రియములు అంటే వాటి శక్తులు. చూచే శక్తి, తాకే శక్తి, వినే శక్తి, రుచి చూచే శక్తి. ఇవే కొంప ముంచేవి. స్త్రీలోలత్వం, స్త్రీసుఖం, చూచే శక్తి, తాకే శక్తి వలననే కలుగుతుంది. శరీరాన్ని నిగ్రహించడం అంటే ఇంద్రియ నిగ్రహం పాటించడం. తరువాత ఈ ఇంద్రియముల ద్వారా లోపలకు వెళ్లి మనసు రికార్డుచేసిన విషయాలను తొలగించడం. అటువంటి విషయాలు లోపలకు వెళ్లకుండా నిరోధించడం. దానినే మనోనిగ్రహం అంటారు. ఈ రెండూ నిగ్రహించగలిగితే బుద్ధి దానంతటు అదే నిగ్రహింపబడుతుంది. ఇవన్నీ ఎందుకు నిగ్రహించాలి అంటే ఇవి కామానికి స్థావరాలు. ఈ కామము మనలో ఉన్న జ్ఞానమును, విజ్ఞానమును నాశనం చేస్తుంది కాబట్టి

కామాన్ని నిరోధించే ప్రక్రియలో దాని స్థావరాలను నాశనం చేయాలి. ఆ ప్రక్రియలో మొదటగా ఇంద్రియములను నిగ్రహించాలి అని బోధించాడు పరమాత్మ.

## 42. ఇన్ద్రియాణి పరాణ్యాహురిన్ద్రియేభ్య: పరం మన:।
## మనసస్తు పరా బుద్ధిర్యో బుద్ధే: పరతస్తు స:॥

ఇంద్రియములు గొప్పవి. ఇంద్రియముల కన్నా మనసు గొప్పది. మనసు కంటే బుద్ధి గొప్పది. ఈ మూడింటి కంటే గొప్పది ఆత్మ. ఇది పెద్దల అభిప్రాయము.

పరమాత్మ ఇప్పటి దాకా ఇంద్రియములు, మనస్సు బుద్ధి గురించి చెప్పాడు. ఇప్పుడు వాటిలో తర తమ బేధములు తెలియజేస్తున్నాడు. ఇంద్రియముల కన్నా మనస్సు గొప్పది. మనస్సు కన్నా బుద్ధి గొప్పది. బుద్ధి కన్నా ఆత్మ గొప్పది. కిందటి శ్లోకంలో ఇంద్రియములను నిగ్రహించడం ముఖ్యం అని చెప్పాడు. మరి ఇంద్రియములను దేనితో నిగ్రహించాలి. దానికన్నా పవర్ ఉన్న దానితో నిగ్రహించాలి. ఒక అధికారి మాట వినకపోతే యంయల్ఏ చేత చెప్పిస్తాము. అక్కడ పని కాకపోతే మంత్రి, అతనివల్ల కూడా కాకపోతే, ముఖ్య మంత్రి. అలాగా ఇంద్రియములను కట్టడి చేయాలంటే దానికన్నా గొప్పదైన మనస్సుతో కట్టడి చేయాలి. మరి ఇంద్రియములను మనస్సును కట్టడి చేయాలంటే బుద్ధి జోక్యం చేసుకోవాలి. అందుకే దేహము రథము, మనస్సు గుర్రాలు, బుద్ధి సారథి అన్నారు. సారథి గుర్రాలను తద్వారా రథాన్ని సక్రమమైన మార్గంలో నడపగలడు. ఈ మూడు కూడా మాట వినకపోతే ఆత్మజ్ఞానమే ముఖ్యం. ఆత్మజ్ఞానం కలిగితే ఈ మూడు మాటవింటాయి. కాబట్టి మనసును బుద్ధిని ఆత్మయందు నిలిపితే, ఇంద్రియాలు చచ్చినట్టు మాట వింటాయి. కాబట్టి మనసును బుద్ధిని ఆత్మయందు నిలిపి ఆత్మయందు రమించాలి. అదే శాశ్వత సుఖాన్ని కలుగజేస్తుంది. కాబట్టి ఇంద్రియములను, మనోబుద్ధులను నిగ్రహిస్తే, కామము దానంతట అది చచ్చిపోతుంది అని పరమాత్మ బోధించాడు.

ఈ శ్లోకంలో మరొక విశేషం కూడా ఉంది. ఒకదాని కంటే మరొకటి గొప్పది అని నిరూపిస్తున్నాడు పరమాత్మ. ఒక గీత ఉంది. దానిని పెద్దది చేయాలంటే దాని పక్కన మరొక చిన్న గీత గీస్తే చాలు. ముందు గీత పెద్దదిగా కనిపిస్తుంది. అలాగే ముందు గీత పక్కన ఇంకొక పెద్ద గీత గీస్తే చాలు. ఈ గీత చిన్నది అయిపోతుంది. కాబట్టి ప్రతి దానికీ చిన్న పెద్ద తారతమ్యాలు ఉంటాయి. మామూలుగా స్థూల ప్రపంచంలో చిన్న దాని కంటే పెద్దది శక్తివంతంగా కనిపిస్తుంది. కానీ స్థూల సూక్ష్మవస్తువుల విషయంలో స్థూల వస్తువు కంటే సూక్ష్మ వస్తువు చాలా పవర్‌ఫుల్. కనపడే ఫాన్ కంటే కనపడని కరెంట్ చాలా పవర్‌ఫుల్. కనపడని కరెంట్ లేకపోతే కనపడే ఫాన్ తిరగదు. దీనినే మనం ఈ సృష్టికి అన్వయించుకోవచ్చు. అణోరణీయం మహతో మహీయాన్ అంటే పరమాత్మ

అణువుకంటే సూక్ష్మాతి సూక్ష్మంగా ఉన్నవాడు అని అర్థం. అందుకే పరమాత్మ మనకు కనపడడు కాని అంతటా నిండి ఉన్నాడు. అన్నిటి కంటే బలవంతుడు, శక్తివంతుడు. ఆకాశం మనకు కనపడదు కానీ పరమాత్మ కంటే కొంచెం స్థూలం. దానికి ఒక గుణం ఉంది. అదే శబ్దము. హెూరు. అనంతమైన ఆకాశంనుండి పుట్టిన శబ్దం. ఆకాశంకంటే స్థూలము వాయువు. అదీ అంతటా నిండి ఉంటుంది. దానికీ శబ్దం ఉంది. దానితో పాటు స్పర్శ ఉంది. దాని కన్నా స్థూలం అగ్ని. ఇది కనపడుతుంది. శబ్దం చేస్తుంది. స్పర్శ ఉంది వాటితో పాటు రూపం కూడా ఉంది. గాలి మాదిరి ఎక్కడ అంటే అక్కడ ఉండదు. పరిమితంగానే ఉంటుంది కానీ వ్యాపిస్తుంది. దాని కన్నా స్థూలం జలం. దీనికి శబ్దము, రూపము, స్పర్శ ఉన్నాయి వీటితో పాటు రుచి కూడా ఉంది. ఇది అగ్ని మాదిరి పైకి ఎగరలేదు. అంతటా వ్యాపించలేదు. నేలబారుగా ప్రవహిస్తుంది. దీని కన్నా స్థూలము భూమి. ఇది ఘనీభవించిన పదార్థము. దీనికి శబ్ద,స్పర్శ,రస,రూపములు ఉన్నాయి. వాటితో పాటు వాసన కూడా ఉంది. ఈ ఐదు పంచభూతముల కంటే శక్తి వంతమైనది అతి సూక్ష్మమైనది పరమాణు స్వరూపమైన ఆత్మ. కాబట్టి స్థూలము కంటే సూక్ష్మశక్తి బలమైనది. దానినే ఈ శ్లోకంలో వివరించాడు పరమాత్మ.

ముందు శరీరము, అవయవములు. ఇవి స్థూలములు. ప్రాపంచిక విషయములను గ్రహిస్తాయి. చూస్తాయి, వింటాయి. తాకుతాయి. దీని కన్నా సూక్ష్మమైనది మనసు. సంకల్పములు, వికల్పాలు చేస్తుంది. ఈ పని చెయ్యాలా వద్దా అని తర్కిస్తుంది. అలాగే మనసు మనిషిని భావోద్వేగాలకు గురి చేస్తుంది. మనసు చేసే పనులకు విచక్షణా జ్ఞానము పరిమితులు ఉండవు. మనసు చెప్పినట్టు ఇంద్రియాలు స్పందిస్తుంటాయి. ఈ మనసు చేసే సంకల్పవికల్పాలను, భావోద్వేగాలను, బుద్ధి, తనలో ఉన్న సంస్కారాన్ని విచక్షణాజ్ఞానాన్ని ఉపయోగించి అదుపు చేస్తుంది. ఆ బుద్ధికి శాస్త్రముల ద్వారా సంస్కారము, విచక్షణాజ్ఞానము, అలవడలేదనుకోండి. అప్పుడు బుద్ధి కూడా మనసును అనుసరిస్తుంది. అందుకే బుద్ధి: కర్మానుసారిణీ అనే సామెత వచ్చింది. ఈ ప్రకారంగా శరీరము, మనస్సు, బుద్ధి ఒకదానిని మించి ఒకటి, ఒకదాని కంటే ఒకటి శక్తివంతంగా పనిచేస్తుంటాయి. వీటన్నింటి కంటే పరమైనది మరొకటి ఉంది. అదే ఆత్మ. అది మనస్సు బుద్ధి కంటే సూక్ష్మము. కాని వీటన్నిటికంటే బలమైనది. కానీ ఏమి చేయదు. అన్నిటినీ సాక్షీభూతంగా చూస్తూ ఉంటుంది. మనలో ఒకదానికంటే మరొకటి శక్తివంతంగా బలంగా పనిచేసే నాలుగు తత్వాలగురించి వివరంగా తెలుసుకున్నాము.

## 43. ఏవం బుద్ధే: పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మానమాత్మనా। జహి శత్రుం మహాబాహెూ కామరూపం దురాసదమ్॥

కిందటి శ్లోకంలో నాలుగు తత్వాల గురించి చెప్పిన పరమాత్మ ఈ శ్లోకంలో బుద్ధి, ఆత్మ వీటి రెండింటి గురించి వివరిస్తున్నాడు. అర్జునా! బుద్ధి కంటే ఆత్మ బలమైనది పరమైనది అని

చెప్పానుకదా! ఆత్మ తరువాత బుద్ధి బలమైనదిగా తెలుసుకొని, బుద్ధితో మనసును, ఇంద్రియములను జయించి, (శమము, దమము పాటించి) ఈ రెండింటిని తన స్థావరములుగా ఏర్పరచుకొన్న జయించడానికి కష్టతరమైన, కామము అనే శత్రువును జయించు అని బోధించాడు.

. ఇంతకు ముందు మనం నేర్చుకున్నాము. ఆత్మ ఒక్కటే. రెండు కాదు. ఆత్మ ప్రాపంచిక విషయములలో పడి తానెవరో తాను మరిచిపోయి, జీవాత్మగా మారి విషయ వాంఛలలో, కామ సుఖాలలో పడి కొట్టుకుంటూ ఉంటుంది. అప్పుడు జీవుని లోని అహంకారము ఈ శరీరమే తాను అని భ్రమలో ఉంటుంది. కామానికి బానిస అవుతుంది. సుఖ దు:ఖములు అనుభవిస్తూ ఉంటుంది. కాబట్టి ఈ శరీరమే నేను అనుకోవడం, ఇదంతా నేనే చేస్తున్నాను, ఇదంతా నావల్లనే జరుగుతూ ఉంది, అన్నిటికీ నేనే కర్తను అని అనుకోవడమే సకల దు:ఖములకు మూలము. ఈ కామము ఎటువంటిది అంటే దురాసదము అయినది. జయించడానికి వీలుకానిది. అత్యంత బలమైనది. ఇంతకు ముందు శ్లోకంలో ఈ కామము అత్యంత పాపభూయిష్టమైనది, మనలో ఉన్న జ్ఞానాన్ని కూడా నాశనం చేసేది అని తెలుసుకున్నాము. అటువంటి కామము మనలో ఉన్న బుద్ధిని కూడా వశం చేసుకొని జీవుడిని తన వైపుకు లాగుతూ ఉంటుంది. దీని కంతటికీ కారణం జీవుని అజ్ఞానము తాను ఎవరో తాను తెలుసుకోలేకపోవడం. జీవాత్మ తాను ఎవరో తాను తెలుసుకున్న నాడు ఇంద్రియములు, మనస్సు బుద్ధి చెప్పినట్టు వింటాయి. అలా కాకపోతే అవిద్య అజ్ఞానము వలన జీవుడు ప్రాపంచిక విషయములలో మునిగి పోయి, దానితో విడరాని బంధం పెంచుకుంటాడు. ఓ పట్టాన ఆ ముడి విడివడదు. ఎప్పుడైతే జీవాత్మ ప్రాపంచిక బంధనములు వదిలించుకొని పరమాత్మవైపు చూస్తాడో, తన స్వసరూపమైన ఆత్మ స్వరూపాన్ని పొందుతాడు. అప్పుడు ఇంద్రియములు మనస్సు ఇవన్నీ ఏమీ చేయలేవు.

నిజానికి దేహమునకు, ఇంద్రియములకు, మనస్సుకు, బుద్ధికి చైతన్యమును కలిగించేది ఈ ఆత్మస్వరూపమే. ఈ ఆత్మ నుండి మనసు బుద్ధి శరీరము చైతన్యశక్తిని గ్రహిస్తున్నాయి. ఆత్మనుండి చైతన్య శక్తిని గ్రహిస్తున్న ఈ మూడు, విజృంభించి, ఆత్మనే శాసించే స్థితికి చేరుకుంటున్నాయి. దీని కంతా కారణం మనలో ఉన్న అజ్ఞానము. నేను ఆత్మస్వరూపాన్ని అనే సత్యాన్ని మరిచిపోయి ఈ దేహమే నేను అనే భ్రాంతిలో పడటం. ఆత్మజ్ఞానం కలిగిన మరుక్షణమే ఈ భ్రాంతి నశిస్తుంది.

దీనికి ఒకే ఒక ఉపాయం కూడా ఉంది. మనస్సును ఆత్మకు అనుసంధానం చేస్తే, చాలు. అప్పుడు ఇంద్రియములు నిర్వీర్యం అయిపోతాయి. కామం దానంతట అది నశించిపోతుంది. దీనికి ఒక చిన్న ఉదాహరణ చాలా పొడవుగా ఉన్న రైలు ఏమీ చేసినా ఆగదు. చిన్న బ్రేక్ వేస్తే ఆగిపోతుంది. అలాగే బలవంతమైన కామము, ఇంద్రియములు, మనస్సు కేవలం ఆత్మజ్ఞానము, తాత్విక జ్ఞానము అనే బ్రేక్ వేస్తే చాలు అన్నీ వాటంతట అవి ఆగిపోతాయి. ఒక్కొక్క ఇంద్రియమును

అదుపుచేసేకంటే, లేక మనసును అదుపు చేసేకంటే, అన్నిటి కంటే పరమైన ఆత్మజ్ఞానం సంపాదిస్తే చాలు, బుద్ధి మనసు ఇంద్రియములు వాటంతట అవే అదుపులో ఉంటాయి. ఇదే పరమాత్మ ఈ అధ్యాయంలో మనకు విశదం చేసాడు. కాబట్టి శోకము అనే సాగరమును దాటతలచిన వారు, కామమును జయించ దలచిన వారు, ముక్తిని పొంద దలచిన వారు, ముందు తాను దేహము కాదు. నేను వేరు దేహము వేరు అనే భావన అలవరచుకోవాలి.అది నిష్కామ కర్మ వలననే సాధ్యం అవుతుంది. నిష్కామ కర్మ వలన చిత్తశుద్ధి కలుగుతుంది. ఆత్మజ్ఞానము అలవడుతుంది. అప్పుడు మనసు ఆత్మలో లీనం అవుతుంది. అప్పుడు కామము ఏమీ చేయలేదు. అని పరమాత్మ బోధించాడు.

దీనితో కర్మయోగం ముగిసింది. సూక్ష్మంగా చెప్పుకోవాలంటే ప్రతి మానవుడు తాను ఈ దేహము కాదు ఆత్మస్వరూపం అని తెలుసుకోవాలి. మనసును బయటకు పోకుండా ఆపి వెనకు తిప్పి ఆత్మలో స్థిరంగా నిలపాలి. అప్పుడు బుద్ధి కూడా మనసును అనుసరిస్తుంది. మనస్సు బుద్ధి సాయం లేకపోతే ఇంద్రియములు వాటంతట అవి ఏమీ చేయలేవు. అప్పుడు కామము నిర్వీర్యము అవుతుంది. కాబట్టి ప్రతి మానవుడు నేను ఈ శరీరం కాదు, నేను ఈ మనసు కాదు. నేను ఆత్మస్వరూపుడను అనే జ్ఞానం కలిగి ఉండాలి. మనసు, ఇంద్రియములు చేసే పనులను చూస్తూ ఉండాలి కానీ వాటిలో లీనం కాకూడదు. ఇదే ఆత్మజ్ఞానము. మోక్షానికి దారి. ఈ సందేశంతో పరమాత్మ కర్మయోగాన్ని సంపూర్ణం చేసాడు.

**ఉపనిషత్తులయొక్క, బ్రహ్మవిద్యయొక్క,**
**యోగశాస్త్రము యొక్క సారమయిన భగవద్గీతలో,**
**కర్మ యోగము అను మూడవ అధ్యాయము సంపూర్ణము.**
**ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్**

# శ్రీమద్భగవద్గీత

## నాలుగవ అధ్యాయము

## జ్ఞాన యోగము.

ఇప్పటి దాకా కృష్ణుడు అర్జునుడికి సాంఖ్యయోగము, కర్మయోగము బోధించాడు. మొదట కర్మయోగము అంటే నిష్కామ కర్మయోగము అనుసరించమన్నాడు. దానితో చిత్తము నిర్మలము అవుతుంది. జ్ఞానము ఉదయిస్తుంది. కర్మయోగములో అనుసరించవలసిన పద్ధతులు, చిత్తశుద్ధికి కావలసిన కర్మాచరణము అన్నీ చక్కగా చెప్పాడు. అంటే జ్ఞానము సంపాదించడానికి పునాది వేసాడు భగవానుడు. ఇప్పుడు జ్ఞానయోగాన్ని బోధిస్తున్నాడు. ఈ అధ్యాయంలో జ్ఞానం గురించి ఎక్కువగా చెప్పబడినా అక్కడక్కడా కర్మయోగం గురించి కూడా చెప్పబడింది. ఈ విషయాలన్నీ చెప్పబోయే ముందు కృష్ణుడు అర్జునుడి మనసును కాస్తంత దారి మళ్లించాడు. ఎందుకంటే 2,3 అధ్యాయాలు చాలా క్లిష్టమైనవి. ఇంకా అదే మాదిరి చెప్పుకుంటూ పోతే అర్జునుడికి విసుగు రావచ్చు అందుకని చిన్న డైవర్షన్. అది కూడాఅర్థవంతమైన డైవర్షన్. ఈ జ్ఞాన కర్మయోగములు ఇప్పటివి కావనీ అతి ప్రాచీనమైనవనీ, కాల వశాత్తు కాలగర్భంలో కలిసిపోగా ఇప్పుడు తాను మరలా దానిని అర్జునుడి ద్వారా లోకానికి తెలియబరుస్తున్నాను అని పలికాడు భగవానుడు. ఆమాట అనగానే అర్జునుడికి చిన్న సందేహం కలిగింది. అదేమిటో చూద్దాం.

శ్రీభగవానువాచ:

### 1. ఇమం వివస్వతే యోగం ప్రోక్తవానహమవ్యయమ్।
### వివస్వాన్ మనవే ప్రాహ మనురిక్ష్వాకవే2బ్రవీత్॥

అర్జునా! పైన చెప్పబడిన యోగమును నేను ఇంతకు ముందు సూర్యునికి ఉపదేశించాను. సూర్యుడు దానిని మనువుకు ఉపదేశించాడు. మనువు ఆ యోగమును ఇక్ష్వాకువుకు చెప్పాడు.

. ఇప్పటి దాకా చెప్పబడిన సాంఖ్యయోగము, కర్మయోగము ఈ నాటిది కాదు. నేను ఈ నాడు నీకోసం చెబుతున్నది కాదు. ఈ జ్ఞానం పరంపరగా వస్తూ ఉంది. ఈ జ్ఞానాన్ని నేను ఏనాడో సూర్యునికి చెప్పాను. దానిని సూర్యుడు వైవస్వత మనువునకు ఉపదేశించాడు. మనువు ఇక్ష్వాకువునకు బోధించాడు. (ఈ ఇక్ష్వాకువు శ్రీరామచంద్రుని వంశకర్త. ఆయన సూర్యవంశ క్షత్రియుడు. అందుకే ఇనకుల తిలకా అని కూడా అంటారు.) ఆ ప్రకారంగా ఈ యోగము

లోకములో విస్తరించింది. కాలానుగుణంగా ఆ జ్ఞానం నశించిపోయింది. అందుకే ఇప్పుడు నీకు ఈ జ్ఞానాన్ని బోధిస్తున్నాను. అని అన్నాడు కృష్ణుడు. ఈ యోగమును అభ్యాసము చేసిన వారందరూ ఋషులు. రాజర్షులు. వైవస్వత మనువు, ఇక్ష్వాకువు ఇద్దరూ క్షత్రియులు. చక్రవర్తులు. అర్జునుడు కూడా క్షత్రియుడే. కాబట్టి ఈ యోగమును ఆచరించడానికీ, ఋషి కావడానికి కులముతో వర్ణముతో సంబంధము లేదు. బ్రాహ్మణులైనా క్షత్రియులైనా వారు ఋషిత్వము పొందవచ్చు. క్షత్రియుడు అయిన విశ్వామిత్రుడు బ్రహ్మజ్ఞానము పొంది బ్రహ్మర్షి అనిపించుకున్నాడు అని మనకు తెలుసు. కాబట్టి ఈ యోగమును ఆచరిస్తే వారందరూ ఋషులు అవుతారు అని అన్నాడు భగవానుడు.

## 2. ఏవం పరమ్పరాప్రాప్తమిమం రాజర్షయో విదుః।
## స కాలేనేహ మహతా యోగో నష్టః పరన్తప॥

ఈ ప్రకారంగా సూర్యుని నుండి వైవస్వత మనువుకు, ఆయన నుండి ఇక్ష్వాకు మహారాజు ఆయన నుండి ఆయన కుమారులు, శిష్యులకు పరంపరాగతంగా లభించింది. వారందరూ ఈయోగమును భక్తి శ్రద్ధలతో ఆచరించి రాజర్షులు అయ్యారు. ఈ యోగము ఈ ప్రకారంగా పరంపరానుగతంగా లోకానికి సంక్రమించింది. కాలం గడిచేకొద్దీ, ఈ యోగము అంతరించి పోయింది. ఎవరికీ తెలియకుండా పోయింది.

ఈ యోగము మొట్టమొదట రాజర్షులకు ఉపదేశించబడింది. రాజర్షి అంటే ఎవరు. క్షత్రియుడిగా జన్మ ఎత్తి తరువాత ఋషిగా మారిన వాడు రాజర్షి అని పిలువబడతాడు. విశ్వామిత్రుడు రాజర్షి అని పలువబడతాడు. (తరువాత బ్రహ్మర్షి అయ్యాడు). పుట్టుకతో రాజుగా పుట్టినా ఆధ్యాత్మ విద్యయందు ఆసక్తి కలిగి ఉంటే అతడు రాజర్షి అవుతాడు. అంటే క్షత్రియత్వము, ఋషిత్వము రెండూ కలిగి ఉంటే వాడు రాజర్షి. ఋషి అనేది ఒక బిరుదు. నిష్కామ కర్మయోగము అవలంబించడం ద్వారా ఆ బిరుదు ఎవరైనా పొందవచ్చును. సామాన్య మానవుడు కూడా మహర్షి కాగలడు. దానికి కావలసిన లక్షణములు ఏవంటే నిష్కామకర్మ, ఇంద్రియ నిగ్రహము మనోనిగ్రహము, చిత్తము స్వాధీనములో ఉంచుకోవడం, కామ,క్రోధములు లోభములు విడిచిపెట్టి, ఆత్మలో మనసును ఐక్యం చేసిన వాడే ఋషి అని పిలువబడతాడు కానీ కేవలం మహర్షి అని పేరు పెట్టుకున్నంత మాత్రాన ఋషి కాలేడు. పూర్వ కాలంలో ఎందరో రాజులు ఋషులుగా మారారు. ముక్తిని పొందారు.

కొంత మంది తాము దైనందిన వ్యవహారములలో మునిగి తేలుతున్నామనీ ఈ యోగము ఆచరించడానికి సమయం లేదనీ అది కేవలము సన్యాసులకే సాధ్యమనీ అంటుంటారు. అది పొరపాటు. నిష్కామ కర్మ ఎవరైనా ఆచరించవచ్చును. పరిపాలనా కార్యక్రములు నిర్వహిస్తూ,

ఈ యోగము రాజులు అవలంబించగా లేనిది సామాన్యమానవులు అవలంబించడం పెద్ద పని కాదు. రాజులు తెలుసుకొని ఆచరించగలిగిన నిష్కామ కర్మ, ఆత్మజ్ఞానము సామాన్యులకు ఎందుకు సాధ్యపడదు. ఇప్పుడు కూడా అర్జునుడు క్షత్రియుడు కాబట్టి ఆ జ్ఞానమును అర్జునుడి ద్వారా లోకానికి అందించాడు భగవానుడు. కాలానుగతంగా ఈ యోగము నష్టము అయింది అని అన్నారు. అంటే నశించి పోయింది అని కాదు. ఒక సారి పరశురాముడు క్షత్రియులు అందరినీ నాశనం చేసాడు. మిగిలిన ఒకరిద్దరు క్షత్రియులకు ఈ యోగము తెలిసి ఉండదు. ఆ కారణం చేత ఈ యోగము అంతరించి పోయి ఉండవచ్చు. ఇప్పుడు కృష్ణుడు అర్జునుడికి బోధించడం ద్వారా వ్యాప్తిలోనికి వచ్చింది.

దీనినే మరొక విధంగా కూడా చెబుతారు. కాలక్రమేణా ఈ యోగమును ఆచరించే వాళ్లు తక్కువై, కాలానుగుణంగా ఎవరూ ఆచరించని కారణంగా నష్టమైపోయింది. ఈ యోగం ఒకటి ఉన్నది అనీ కూడా ఎవరికీ తెలియని పరిస్థితి వచ్చింది. ఇప్పుడు కృష్ణుడు అర్జునుడికి చెప్పడం ద్వారా మరలా వెలుగులోకి వచ్చింది అని అనుకోవచ్చు.

( ఇది కృష్ణుడి స్వంతము కాదు. పరంపరానుగతంగా వచ్చింది అని ఘంటాపథంగా కృష్ణుడు చెబితే, భగవద్గీతలో కృష్ణుడు హింసాకాండను, ఉగ్రవాదాన్ని ప్రోత్సహించాడు, అని ఇటీవల ఎక్కడో దావా కూడా వేసారు. అలాగే, ఘంటసాల గారు పవిత్రహృదయంతో మృదుమధురంగా ఆలపించిన భగవద్గీత, ఎవరైనా మరణించినపుడు రేడియోలలో, టివిలలో, శ్మశానాలలో పెడుతున్నారు. ఇదంతా ఈ నాటి మానవుల అజ్ఞానానికి నిదర్శనం).

## 3. స ఏవాయం మయా తే2ద్య యోగ: ప్రోక్త: పురాతన:।
## భక్తో2సి మే సఖా చేతి రహస్యం హ్యేతదుత్తమమ్॥

ఇప్పుడు కూడా నేను నీకు ఎందుకు చెబుతున్నాను అంటే నీవు నాకు బంధువు, మిత్రుడవు, భక్తుడవు. పైగా ఇప్పుడే నన్ను గురువుగా స్వీకరించావు. ఆ కారణం చేత పురాతనమైన ఈ యోగమును నేను నీకు చెప్పాను. ఈ యోగము అతి రహస్యమైనది, అతి ముఖ్యమైనది, ఎవరికీ తెలియనిది అని తెలుసుకో. ఇందులో పురాతనము అనే పదం వాడబడింది. పురాతనము అంటే చాలా కాలం నుండి అమలులో ఉన్నది ప్రస్తుతం నష్టం అయింది అంతే కానీ పాతబడి పోయింది, పనికిరానిది, ఈ నవయుగానికి ఆచరణయోగ్యం కానిది అని అర్థం చేసుకోకూడదు. పురాతనము అంటే మరొక విధంగా కూడా చెప్పవచ్చు. ఇది కాల పరీక్షకు నిలిచిన యోగము. పురాతనమైనా ఎప్పటికీ నవీనంగా, కొత్తగా అనిపించేది. పైగా ఎంతో మంది రాజర్షులు ఆచరించి

ముక్తిపొందినది కాబట్టి ఈ యోగము అందరికీ ఆచరణయోగ్యము. ఈ యోగము పనిచేస్తుందా లేదా అని ఎవరూ సందేహపడవలసిన పని లేదు. ఎందుకంటే ఎంతోమంది రాజర్షులు దీనిని అనుసరించారు. మంచి ఫలితములను పొందారు. కాబట్టి మనం అందరం కూడా ఆచరించవచ్చు.

మరి అందరినీ వదిలిపెట్టి అర్జునుడికే ఎందుకు చెప్పవలసి వచ్చింది అనే ప్రశ్న మనందరికీ రావచ్చు. ఆ సందర్భాన్ని అర్జునుడే కల్పించుకున్నాడు. మామూలుగా అందరూ శంఖాలు పూరించగానే యుద్ధం మొదలు అయి ఉంటే కృష్ణుడికి భగవద్గీత చెప్పేఅవకాశం వచ్చి ఉండేది కాదు. తన సైన్యాన్ని, ఎదుటి సైన్యాన్ని చూచి అర్జునుడు మోహంలో పడి పోవడం, విషాదం చెందడం, కాళ్లు చేతులు వణుకుతుంటే, కళ్లనుండి నీరు కారుతుంటే ధనుర్బాణాలు కిందపడేసి చలికిలపడితే, నీవే తప్ప నితం బెరుగ అనే రీతిలో నేను ఏది మంచి ఏది చెడు నిర్ణయించుకోలేక పోతున్నాను, నన్ను నీ శిష్యునిగా స్వీకరించి నాకు తత్వబోధ చెయ్యి అని అర్జునుడు ప్రాధేయపడితే, అప్పుడు చెప్పాడు కృష్ణుడు. అదీ కూడా అర్జునుడు తనకు మిత్రుడు. తనను గురువుగా స్వీకరించాడు. తన మీద భక్తి శ్రద్ధ కలిగి ఉన్నాడు. అందుకని అర్జునుడు భగవద్గీతను వినడానికి యోగ్యుడు అని తలంచి చెప్పాడు కానీ ధర్మరాజుకు కానీ, విదురుడికి కానీ, ఎవరికంటే వారికి బోధించలేదు.

అర్జున ఉవాచ:

### 4.అపరం భవతో జన్మ పరం జన్మ వివస్వతః।
### కథమేతద్విజానీయాం త్వమాదౌ ప్రోక్తవానితి॥

ఇప్పుడు అర్జుననికి ఒక సందేహం కలిగింది. దానిని మెల్లగా బయట పెట్టాడు. ఓ కృష్ణా! నీవు పుట్టింది, పెరిగింది నాకూ తెలుసు, అందరికీ తెలుసు. నీవు ఈ కాలంనాటి వాడివి. మరి సూర్యుడు, ఆయన కుమారుడు చాలా పురాతనులు. ఈ కాలంలో పుట్టిన నీవు, ఎప్పుడో పుట్టిన సూర్యునికి ఈ యోగమును ఉపదేశించడం ఎలా సాధ్యం అయింది. కొంచెం వివరించు. అని అడిగాడు.

ఇటువంటి సందేహము సహజంగా ఎవరికైనా వస్తుంది. ఎవరైనా మన దగ్గరికి వచ్చి నువ్వు చాలా గొప్పవాడివి, మీ తాతగారు, మీ ముత్తాతగారు నీ గురించి చాలాగొప్పగా చెబుతుంటారు అని అన్నారనుకోండి. లేదా నేను చాలా తెలివికలవాడిని మా తాతకు, ముత్తాతకు కూడా సలహాలు ఇచ్చేవాడిని అని ఎవరన్నా అన్నారనుకోండి. మనం నవ్వుకుంటాము. ఎందుకంటే నా ముత్తాత కాలంలో నేను ఉండే అవకాశం లేదు. నాకు మా తాతగారే సరిగా తెలియదు. మరి ముత్తాత నా గురింగి గొప్పగా చెప్పడం ఏమిటి? అలాగే వాడికి కూడా వాడి తాతగారే సరిగా

తెలియదు. ఇంక ముత్తాతకు సలహాలు ఏం ఇస్తాడు. ఈ సందేహం చాలా సహజం. అటువంటి సందేహమే అర్జునుడికి వచ్చింది. తన ఎదురుగా నిలబడి ఉన్న తన వయసు వాడైన కృష్ణుడు సనాతనుడు అయిన సూర్యునికి ఈ యోగం గురించి చెప్పడం ఏమిటి హాస్యాస్పదం కాకపోతే: అని అనుకున్నాడు. అదే ప్రశ్న అడిగేసాడు. అప్పుడు కృష్ణుడు అర్జునుడికి ఆత్మ తత్వమును ఉపదేశించాడు.

శ్రీభగవానువాచ:

### 5. బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున।
### తాన్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరన్తప॥

అర్జునా! నీవు, నేను, ఈ నాటి వాళ్లము కాము. నీకు నాకు ఎన్నో జన్మలు గడిచిపోయాయి. కాని గడిచిపోయిన జన్మల గురించి నాకు తెలుసు. నీకు తెలియదు అంతే తేడా.

ఆత్మ, జీవాత్మ రెండూ ఒక్కటే. ఆత్మ పరమాత్మస్వరూపము. ఆత్మ దేహంలో ప్రవేశించగానే, ఆదేహములో ఉన్న మనోబుద్ధి అహంకారాలను బట్టి ప్రవర్తిసుంది. అదే మాయ. మాయతో కప్పబడిన ఆత్మ జీవాత్మగా పిలువబడుతుంది. పరమాత్మ అధీనంలో మాయ ఉంటుంది. మాయతో కప్పబడి ఉంటుంది జీవాత్మ. పరమాత్మ మాయను ఆధారంగా చేసుకొని ఎన్నో అవతారములను ధరిస్తుంటాడు. పరమాత్మకు ఆయన ఇదివరకు ఎత్తిన జన్మలు అన్నీ బాగా తెలుసు. జీవాత్మకు పూర్వ జన్మ జ్ఞానము ఉండదు. ఎందుకంటే జీవుడు మాయతో, అజ్ఞానముతో కప్పబడి ఉంటాడు. కాబట్టి ఏ శరీరంలో ఉన్నాడో ఆ విషయములే జ్ఞాపకం ఉంటాయి కానీ అంతకు ముందు జన్మలు గుర్తుండవు. పరమాత్మ తాను కోరుకున్న జన్మఎత్తగలడు. జీవుడు తన పురాకృత పాపపుణ్యాలను అనుసరించి మాత్రమే జన్మ ఎత్తగలడు. పరమాత్మకు స్వతంత్రత ఉంది. జీవాత్మకు లేదు. నిజానికి ప్రతి జీవికి కొన్ని కోట్లజన్మలు గడిచిపోయాయి. ఎందరో తల్లులు తండ్రులు ఉన్నారు. కానీ ఏదీ గుర్తు ఉండదు. ప్రస్తుతం మనం మానవ జన్మలో ఉన్నాము. ఈ జన్మలో విషయాలే గుర్తుంటాయి. ఇంతకు ముందు జన్మ విశేషములు గుర్తుండవు.

పుట్టడం వేరు అవతరించడం వేరు. పుట్టడంలో మన ఇష్టం అంటూ ఏమీ లేదు. మన పూర్వజన్మవాసనలను బట్టి వివిధములైన యోనులలో పుడుతూ ఉంటాము. కాని పరమాత్మ అవతరిస్తాడు. తాను ఎక్కడపుట్టాలో ఏమి చేయాలో తనకు తానుగా నిర్ణయించుకొని ఆ యోనిలో జన్మిస్తాడు. అవతరించడం పరమాత్మ ఇష్టం మేరకు జరుగుతూఉంటుంది. సాధారణ మానవుడికి

ఆ స్వతంత్రత లేదు. మానవునికి తాను ఉన్న జన్మగురించే తెలుసు. పరమాత్మకు అంతకు ముందు ఎత్తిన అన్ని అవతారముల గురించి తెలుసు. అందుకే కృష్ణుడు అవతరించాడు. అర్జునుడు పుట్టాడు అని అంటారు. అవతార పురుషుడు అయిన కృష్ణుడికి తాను ఇంతకు ముందు ఎత్తిన అన్ని జన్మల గురించి క్షుణ్ణంగా తెలుసు. కాని అర్జునుడు సామాన్యమానవుడు కాబట్టి కేవలం అర్జునుడుగా పుట్టిన జన్మగురించి మాత్రమే తెలుసు. అంతకు ముందుజన్మల గురించి అర్జునుడికి తెలియదు.

ఇంకొంచెం వివరంగా చెప్పాలంటే పరమాత్మ అవతరించడానికి కారణము లోక కల్యాణము, ధర్మ సంస్థాపన. జీవాత్మ దేహం పొందడానికి అంటే జన్మించడానికి కారణం అతని ప్రారబ్ధ కర్మ. ఆ కర్మలు అనుభవించడానికే జన్మిస్తాడు. పరమాత్మ తన ఇష్టం వచ్చిన రూపంలో, ఇష్టం వచ్చిన చోట జన్మించగలడు. కాని జీవాత్మ తన ప్రారబ్ధ కర్మలను అనుసరించి ఎక్కడ జన్మించాలని ఉంటే ఆ దేహము పొందుతాడు. పరమాత్మ ఈ లోకములోకి వచ్చిన తరువాత, ఆయనకు ఈ ప్రాపంచిక విషయములు ఏవీ అంటవు. కేవలం సాక్షిగా చూస్తుంటాడు. కానీ జీవాత్మ దేహం ధరించిన తరువాత ప్రాపంచిక విషయాలలో, సంసారంలో కూరుకుపోతాడు. ఇదే అవతారానికి, జన్మించడానికి ఉన్న భేదము.

## 6. అజో2పి సన్నవ్యయాత్మా భూతానామీశ్వరో2పి సన్
## ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మమాయయా॥

నేను ఈ అనంత విశ్వమునకు అధిపతిని. నాకు పుట్టుక చావు లేదు. ఈ ప్రకృతి నా స్వాధీనంలో ఉంది. అయినా నా మాయాశక్తితో నేను పుడుతున్నాను. మరణిస్తున్నాను.

ఇంతకు ముందు శ్లోకంలో నాకు కూడా ఎన్నో జన్మలు గడిచాయి అని కృష్ణుడు తన గురించి తాను చెప్పుకున్నాడు. దానిని గురించి వివరిస్తున్నాడు. నాకు పుట్టుక లేదు. నాకు చావు లేదు. నేను అందరికీ ఈశ్వరుడను. నేను ఎవరి అధీనములో లేను. ప్రకృతి నా అధీనములో ఉంది. మాయ నా అధీనంలో ఉంది. నా మాయతో నేను నాకు కావలసిన చోట కావలసిన విధంగా అవతరిస్తుంటాను. అని స్పష్టంగా చెప్పాడు పరమాత్మ. దీని వలన మనం తెలుసుకోవలసినది మన పుట్టుక, చావు మన చేతుల్లో లేవు. పరమాత్మకు మన మాదిరి పుట్టుక చావు లేదు. వయసుతో వచ్చే మార్పులు లేవు. ఆయన ఇష్టం వచ్చినట్టు పుడతాడు. వచ్చినపని అయిపోగానే వెళ్లిపోతాడు. మనకు ఆస్వతంత్రత లేదు. మన చావు పుట్టుకలు మన ప్రారబ్ధాన్ని బట్టి వస్తున్నాయి. ఇదే ఆయనకు మనకు ఉన్న తేడా. నరనారాయణులకు ఉన్న తేడా. కాబట్టి కృష్ణుడు వసుదేవుని కుమారుడు, నందుని ఇంట్లోపెరిగాడు, గోపికలతో రాసలీలలు చేసాడు, 8 మందిని పెళ్లిచేసుకున్నాడు అని మాత్రమే మనం తెలుసుకుంటాము. కాని కృష్ణుడు జగద్గురువు. వేదములు ఉపనిషత్తులు, యోగవిద్య

సారమంతా భగవద్గీతగా మనకు బోధించాడు అని గుర్తుపెట్టుకోవాలి కానీ ఆయన చేసిన మహిమలు లీలలు కాదు.

ఇక్కడ మరొక విషయం గురించి చెప్పారు. ప్రకృతిం స్వాం అధిష్ఠాయ అంటే ప్రకృతి అంటే మాయ నా అధీనంలో ఉంది. సాధారణంగా దొంగ పోలీసు అధీనంలో ఉంటాడు. అందుకని పోలీసులు దొంగకు ఇటు అటు ఉండి పట్టుకొని తీసుకెళ్తారు. అదే ఒక ముఖ్యమంత్రి చుట్టు పోలీసులు ఉంటారు. అంటే ఆయన గొప్ప దొంగ అని కాదు. ఆ పోలీసులు అందరూ ముఖ్యమంత్రి అధీనంలో ఉంటారు. అలాగే మనం అందరం మాయ అధీనంలో ఉన్నాము. కాని మాయ పరమాత్మ అధీనంలో ఉంది. అంతే తేడా. కాబట్టి మనం మాయ అధీనంలో ఉండి పుడుతూ చస్తూ ఉంటాము. కాని పరమాత్మ మాయను తన అధీనంలో ఉంచుకొని, తన ఇష్టం వచ్చిన చోట, ఇష్టమైన రూపంలో అవతరిస్తుంటాడు. మరి ఈ పరమాత్మకు వేరు పనిలేదా. ఎందుకు అవతరిస్తున్నాడు. ఎందుకు వెళ్లిపోతున్నాడు. అని మనకు సందేహం రావచ్చు. దానికి సమాధానమే ఈ శ్లోకము.

7. యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత।
అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్॥

ఎప్పుడెప్పుడు ధర్మమునకు హాని కలుగుతుందో, ఎప్పుడెప్పడు అధర్మము తల ఎగరేస్తుందో, అప్పుడప్పుడు నన్ను నేనే సృష్టించుకుంటాను. ఇదీ పరమాత్మ భూలోకమునకు రావడానికి కారణం.

సాధారణ ధర్మం, అందరూ ఆచరించవలసిన ధర్మం ఏమిటంటే, ఇతరులు తన పట్ల ఏ పని చేస్తే తనకు కానీ, తన శరీరానికి కానీ బాధ, హాని కలుగుతుందో, ఆ పని తాను ఇతరుల పట్ల చేయకుండా ఉండటం. దీనినే సాధారణ ధర్మం అంటారు. ఆధ్యాత్మికంగా చెప్పుకోవాలంటే అంటే ఎవరి పనులు వాళ్లు చేయడం. చేయవలసిన పనులు చేయడం, చేయకూడని పనులు చేయక పోవడం, చేసే పనులు నిష్కామంగా, కర్తృత్వభావన లేకుండా, స్వార్థబుద్ధితో కాకుండా, సమాజ శ్రేయస్సును దృష్టిలో పెట్టుకొని, చేయడం. ధర్మం అంటే సాక్షాత్తు పరమాత్మ స్వరూపము. ఇంక, అధర్మం అంటే చేయవలసిన పనులు చేయకపోగా, చేయకూడని పనులు చేయడం. ఇతరులకు హాని చేయడం. తన చేతల వలన సమాజానికి హాని కలిగించడం. పరమాత్మను మరిచిపోవడం.

(ఇదే ఎవరూ చేయలేని పని)

ఈ లక్షణములతో కర్మ చేస్తే ఆ కర్మల బంధనములు మనకు అంటవు.

అలా కాకుండా మలినమైన మనస్సుతో, కోరికలతో, ఫలితం ఆశించి, నేను చేస్తున్నాను అంటూ కర్తృత్వ భావనతో, ఇంద్రియ నిగ్రహం లేకుండా కర్మలు చేస్తే, ఆ కర్మల ఫలములు ఆ జీవుని బంధిస్తాయి.

ఎవరి మనస్సు, బుద్ధి, అంత:కరణము వాసనలతో కూడి మలినమై ఉంటుందో, అతడు చేసే కర్మలు కూడా మలినంగానే ఉంటాయి. నేను వేరు నీవు వేరు అనే భేదభావన ఉంటే ఒకరికి ఒకరు మోసం చేసుకోవడం, కొట్టుకోవడం, చంపుకోవడం చేసుకుంటారు. భేదభావము ఉన్నంత వరకు ప్రేమ, కరుణ, దయ, జాలి, వీటికి చోటు ఉండదు. ఇవి లేనపుడు దుర్మార్గము మనసులో తిష్ట వేస్తుంది. పైకి తియ్యగా మాట్లాడుతున్నా లోపల విషం చిమ్ముతుంటారు. వారి కర్మలు కూడా విషపూరితంగానే ఉంటాయి. కాబట్టి తనలో ఉన్న ఆత్మ అందరిలోనూ ఉంది, అందరూ ఆత్మస్వరూపులే, అందరూ సమానమే, భేదభావము అనేది మనమనసులోనే ఉంది అన్న భావన కలుగని నాడు మానవుడికి జ్ఞానం కలుగదు. దానికి తోడు ఇంద్రియ నిగ్రహము, మనోనిగ్రహము, సత్యనిష్ట, అవసరము. ఇవి లేకుండా కర్మలు చేస్తే ఆ కర్మలు జీవుని బంధిస్తాయి, మరుజన్మకు కారణం అవుతాయి.

ఈ శ్లోకంలో మొట్టమొదటి పదం యోగయుక్త: దీనికి వివరణ కావాలంటే మనం మూడవ అధ్యాయం 30 వ శ్లోకం చూడాలి. అందులో యోగయుక్తుని లక్షణాలు గురించి చెప్పబడింది. అవేమిటంటే, ప్రతి వాడూ తాను చేసే కర్మలను పరమాత్మకు అర్పించాలి. పరమాత్మ పరంగా చేయాలి. ఆశాపాశములు వదిలిపెట్టాలి. అహంకారము, మమకారము లేకుండా ఉండాలి. ఎటువంటి తాపత్రయములు లేకుండా ఉండాలి. అటువంటి వాడు యోగయుక్తుడు. అటువంటి వాడు చేసే కర్మలు నిష్కామంగాఉంటాయి. ఇక్కడ కూడా యోగయుక్తుడు అంటే నిష్కామ కర్మలు ఆచరించేవాడు. కర్తృత్వభావన లేకుండా కర్మలు చేసేవాడు. స్వార్థం వదిలిపెట్టి, సమాజహితం కోరేవాడు. ఉన్నదానితో తృప్తిచెందేవాడు.

ఈ రోజుల్లో మనం భౌతికంగా ఎంతో ఎత్తుకు ఎదిగాము. ఎన్నోపరిశోధనలు చేసి ఎన్నో విషయాలు కనుక్కున్నాము. జీవితం సుఖమయం చేసుకున్నాము. టివి, ఫ్రిజ్ మొదలైన గృహోపకరణాలు, ఎసి, కంప్యూటర్, సెల్, ఇంటర్‌నెట్, విమానయానాలు, గ్రహాంతర యానాలు, ఎన్నో ఎన్నెన్నో కనుక్కున్నాము. అనుభవిస్తున్నాము. కాని తృప్తి లేదు. ఇంకా ఏదో కావాలని కోరిక. ఎందుకంటే మనం భౌతికంగా ఎదిగామే కానీ ఆధ్యాత్మికంగా ఎదగలేదు. నిరంతరం అసంతృప్తితో అలమటిస్తున్నాము. దానికి నిష్కామ యోగమే సులభమైన మార్గము. ఏ కోరికా లేకుండా, సంగం లేకుండా కర్మలు చేస్తే, ఏ బంధనములు అంటవు. పరమ శాంతి లభిస్తుంది.

తరువాత ప్రతి వాడూ తన మనస్సును అంత:కరణను పరిశుద్ధంగాఉంచుకోవాలి. చెడు ఆలోచనలను మనసులోకి రానీయకూడదు. ప్రతి మానవుడికీ రెండు రకములైన సంపదలు ఉంటాయి. అవే దైవీ సంపద, ఆసురీ సంపద, మానవుడు బయట ప్రపంచంలో దొరికే భౌతిక సంపదలతో పాటు, మనసులో దైవీ సంపదలను కూడా పెంచుకుంటే, ఆసురీ సంపద నశించిపోతుంది. చెడు ఆలోచనలు రావు. రాగద్వేషాలు పరిమితంగా ఉంటాయి. అహంకారము ఉండదు. మనసు నిర్మలంగా పరిశుద్ధంగా ఉంటుంది. దాని ఫలితంగా పరిపూర్ణమైన మనశ్శాంతి లభిస్తుంది.

తరువాత ఇదివరకు చెప్పుకున్నవే ఇంద్రియ నిగ్రహము. మనో నిగ్రహము. ఒక చోట కూర్చుని ధ్యానం చేయాలంటే ఇంద్రియములను అదుపులో పెట్టుకోవాలి. అలాకూర్చునపుడు ఏకాగ్రత కావాలంటే మనస్సు అటు ఇటు పోకుండా మన అధీనంలో ఉండాలి. అదే ఇంద్రియ నిగ్రహము, మనో నిగ్రహము రెండూ అలవడాలి. దీని వలన మనము మన మనస్సును ఇంద్రియములను సక్రమమార్గంలో వినియోగించుకునే అవకాశం ఉంది.

ఇలా చేస్తే ఆత్మజ్ఞానం కలుగుతుంది. ఆత్మజ్ఞానం కలిగిన దానికి ఫలితం రెండు విషయాలు తెలుస్తాయి. ఒకటి ఈ దేహము వేరు నేను వేరు. నేను ఈ దేహము కాదు. నేను నా చైతన్యముతో ఈ దేహమును నడిపిస్తున్నాను. రెండవది నాలో ఉన్న ఆత్మ అనే చైతన్యము అందరిలో ఉన్న ఆత్మ అనే చైతన్యము ఒకటే వేరు కాదు. అప్పుడు అందరి ఎడల సమానత్వము కలుగుతుంది. అటువంటి వాడు ఏ కర్మలు చేస్తున్నా, ఆ కర్మబంధనములు అతనిని అంటవు.

**8.నైవ కించిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్।**
**పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్నశ్నన్ గచ్ఛన్ స్వపన్ శ్వసన్॥**
**9.ప్రలపన్ విసృజన్ గృహ్ణన్నున్మిషన్నిమిషన్నపి।**
**ఇన్ద్రియాణీన్ద్రియార్థేషు వర్తన్త ఇతి ధారయన్॥**

యుక్తుడు అయిన వాడు అంటే యోగయుక్తుడు, ఆత్మజ్ఞానము ఎరిగినవాడు, జ్ఞాని అయినవాడు, తాను ఈ ప్రపంచంలో ఏమి చేస్తున్నా అంటే దేనినైనా చూచినా, విన్నా, తాకినా, వాసనచూచినా, తినినా, కాళ్లతో నడిచినా, నిద్రించినా, ఊపిరి పీల్చినా, వదిలినా, ఎవరితోనైనా మాట్లాడుతున్నా, దేనినైనా లేక ఎవరినైనా వదిలిపెట్టినా, దేనినైనా తీసుకున్నా, ఎవరిని కలిసినా, కళ్లుతెరిచినా, మూసినా, ఇంకా ఇంద్రియములతో ఏ పని చేస్తున్నా, ఆ పనులన్నీ ఇంద్రియములు

చేస్తున్నాయి, నేను కాదు, నేను ఏ పనీ చేయడం లేదు. నాలో ఉన్న ఇంద్రియములు ఇంద్రియములకు కావలసిన విషయములలో ప్రవర్తిస్తున్నాయి, వాటి ప్రవర్తనతో నాకు ఎటువంటి సంబంధము లేదు అనే భావనతో ఉంటాడు.

మనం ఇదివరకే చెప్పుకున్నాము. ఆత్మ దేహములో ఉండే ఇంద్రియములకంటే భిన్నమైనది. ఇంద్రియములు చేసే పనులను కేవలం సాక్షీభూతంగా చూస్తూ ఉంటుంది. తనకు తానుగా ఏ పనీ చెయ్యమనదు. చెయ్యదు. చేయమని ప్రేరేపించదు. ఏ పని అయినా చేసే స్వేచ్ఛను జీవుడికి ఇచ్చింది. కాబట్టి ఏ పనికీ ఆత్మ కర్త కాదు. జీవుడు తాను ఎవరో మరిచి పోయి, తాను ఈ లోకానికి ఎందుకు వచ్చాడో మరిచి పోయి, దేహమే నేను అనుకుంటూ, ప్రాపంచిక విషయములలో, విషయ వాంఛలకు దాసుడై, తన ఇష్టం వచ్చిన పనులు చేస్తున్నాడు. బంధనములు కొని తెచ్చుకుంటున్నాడు. ఇదంతా తెలియని తనం అంటే అవిద్య కారణంగా జరుగుతూ ఉంది.ఈ అవిద్య ఆవహించిన వాడికి ఆత్మస్వరూపము తెలియదు. ఆత్మే దేహము అనుకుంటాడు. అంతా నేనే చేస్తున్నాను అని కర్తృత్వభావము ఆరోపించుకుంటాడు. రాగద్వేషములను, సుఖదు:ఖములను పొందుతుంటాడు. సుఖాల కంటే దు:ఖాలే ఎక్కువ.

అదే ఆత్మ తత్వము తెలుసుకున్న వాడు, ఈ శరీరం వేరు, నేను వేరు, నేను ఆత్మ స్వరూపుడను అని అనుకుంటాడు. మనస్సు ఇంద్రియములు మాత్రమే బాహ్య ప్రపంచంలో తిరుగుతున్నాయి. వాటికి నాకు సంబంధం లేదు. నేను కేవలం సాక్షిని మాత్రమే. నేను ఏమీ చేయడం లేదు. వాటి వలన కలిగే సుఖదు:ఖములతో నాకు సంబంధము లేదు. ఈ ప్రకారంగా అనుకుంటూ ఎటువంటి వికారములు లేకుండా నిశ్చలంగా ఉంటాడు. ఇంద్రియముల వలన, విషయ వాంఛల వలన కలిగే సుఖదు:ఖములకు లోనుగాడు. ఆత్మానందాన్ని అనుభవిసూ నిత్యం సంతోషంగా ఉంటాడు.

కాని కొంతమంది వేదాంతులు ఉంటారు. వారికి ఆత్మజ్ఞానము గురించి తెలియదు. కేవలము వేదములు శాస్త్రములు చదువుకొని ఉంటారు. వారిలో అవిద్య కరుడుకట్టుకొని ఉంటుంది. ప్రాపంచిక విషయములలో తిరుగుతూ ఉంటారు. విషయ వాంఛలకు లోబడి ఉంటారు. పైకి వేదాంతము చెబుతుంటారు. నాకు వేటి మీద మోజు లేదు. కేవలము నేను ఈ సుఖములను సాక్షీభూతంగా చూస్తున్నాను అని పలుకుతుంటారు. ఇటువంటి వారు మనకు చాలా మంది కనిపిస్తారు. అవిద్య నశించి ఆత్మజ్ఞానము కలుగనిదే అటువంటి స్థితి కలుగదు అని పరమాత్మ చెబుతున్నాడు. ఈ ప్రపంచం అంతా మాయ అంతా అనిత్యము అనే భావన కలిగితేనే గానీ అవిద్య పోదు. అప్పుడే ఆత్మసాక్షి అనే మాటకు అర్థం తెలుస్తుంది. ఒకపక్క ప్రపంచములోని విషయములు చూస్తూ, అనుభవిస్తూ, సుఖ సంతోషాలు పొందుతూ, అబ్బే అదేంలేదు నేను ఆత్మను,

కేవలం సాక్షిగా చూస్తున్నాను అంటే అది ఆత్మవంచన అవుతుంది.

మానవులు మూడు గుణములకు అంటే సత్వ,రజస్తమోగుణములకు లోబడి ప్రవర్తిస్తుంటారు. తమోగుణములో ఉన్న వారు, రజోగుణములోకి, తరువాత సత్వగుణములోకి, ఆ పైన శుద్ధ సత్వగుణములోకి చేరుకుంటారు. ఆ స్థితికి చేరుకున్న వారు మరలా రజోగుణము, తమోగుణములోకి దిగజారరు. భోగములు, విలాసములు, స్త్రీసుఖముల కొరకు ప్రయత్నించరు. మజ్జిగ చిలికితే వెన్న వస్తుంది. ఆ వెన్న మజ్జిగలో తేలుతుందే కానీ అందులో మునిగిపోదు. అలాగే బాగా మథించి, తపస్సు చేసి, ఇంద్రియనిగ్రహము మనోనిగ్రహము అలవాటుచేసుకొని సత్వగుణము పొందిన వారు మరలా కిందికి దిగజారరు. వారు అలా ప్రవర్తించారంటే వారు ఇంకా రజోగుణము తమోగుణములోనే ఉన్నారన్నమాట.

తత్వవేత్త అయిన వాడు కూడా చూడటం, వినడం, తాకడం, వాసన చూడటం, రుచి చూడటం, శ్వాసించడం మొదలగు జ్ఞానేంద్రియ, కర్మేంద్రియములతో చేసే అన్ని పనులు చేస్తుంటాడు. కానీ, వాడిలో అవిద్య ఉండదు. ప్రాపంచిక దృశ్యములు, విషయ వాంఛలు అతనిని ఏమీ ప్రభావితం చేయలేవు. అటువంటి వాడు బయట ప్రపంచంలో ఉన్న వస్తువులను, మనుషులను చూస్తున్నా, ఎవరితోనైనా మాట్లాడుతున్నా, లేక వారు చెప్పేది వింటున్నా, ఎవరినైనా కానీ, దేనినైనా కానీ తాకుతున్నా, వాసన చూస్తున్నా, ఏమి తింటున్నా, తాగుతున్నా, కాళ్లతో నడుస్తున్నా, నిద్రపోతున్నా, ఊపిరి తీస్తున్నా, కళ్లు తెరిచినా మూసినా, ఏదైనా వస్తువును కానీ విషయాన్ని కానీ గ్రహిస్తున్నా లేక విడిచిపెడుతున్నా, ఇంకా ఇంద్రియములతో ఏమేమి చేసినా, అవన్నీ ఇంద్రియములు తమ తమ పనులు చేస్తున్నాయి; తనలో ఉన్న ఇంద్రియములు ఇంద్రియములకు కావలసిన వాటితో ప్రవర్తిస్తున్నాయి; వాటి ప్రవర్తనతో నాకు ఎటువంటి సంబంధము లేదు; తాను ఏమీ చేయడం లేదు; నేను కేవలం సాక్షిని మాత్రమే, ఆ పనులతో నాకు ఎలాంటి సంబంధము, సంగము లేదు అని అనుకుంటూ ఉంటాడు. అప్పుడు అతని ఇంద్రియములకు, మనసుకు, ఈ విషయ వాంఛలు అంటవు. అటువంటి వాడు ఏమీ చేసినా లోకోపకారమునకే చేస్తాడు. తన స్వార్థం కోసం ఏమీ చేసుకోడు. కేవలం దేహము నిలబడటానికే పనులు చేస్తాడు కానీ తన సుఖం కోసం ఏమీ చేయడు. అతనికి ఎటువంటి కర్తృత్వభావన ఉండదు. నేను నాది అనే భావన ఉండదు. నువ్వు నేను అనే భేదభావము ఉండదు.

ఇటువంటి స్థితికి రావాలంటే ముందు నిష్కామ కర్మతో మొదలెట్టాలి. తరువాత భక్తి. ధ్యానము, సాధన, వీటి ద్వారా మనసును శుద్ధిచేసుకోవాలి. నేను వేరు, ఆత్మ వేరు, అనే విషయం అవగాహన చేసుకోవాలి. అప్పుడు అతడు ఏమి చేసినా ఆ బంధనములు అతనిని అంటవు. అతడు తాను చేసే పనులకు కేవలము సాక్షీభూతంగా ఉంటాడు. తనలో ఉన్న ఇంద్రియములు ఇంద్రియములకు కావలసిన వాటితో ప్రవర్తిస్తున్నాయి, వాటి ప్రవర్తనతో నాకు ఎటువంటి సంబంధము

లేదు అనే భావనతో ఉంటాడు. అటువంటి వాడు చేసే పనులు ధర్మబద్ధంగానే ఉంటాయి కానీ ధర్మవిరుద్ధంగా చేయడు. తాను ఆత్మజ్ఞానిని అని చెప్పుకుంటూ, ధర్మవిరుద్ధమైన పనులు చేస్తే అతనికి ఇంకా ఆత్మజ్ఞానము అలవడలేదు అని అర్థం చేసుకోవాలి. కాబట్టి ఆత్మజ్ఞానము పొందాలంటే ఇంతకు ముందు చెప్పిన ఐదు లక్షణములు అలవరచుకోవాలి. అప్పుడే అతడు తత్వవేత్త కాగలడు. ఈ జగన్నాటకమును కేవలము సాక్షీగా చూడగలిగే శక్తి వస్తుంది.

10. బ్రహ్మణ్యాధాయ కర్మాణి సఙ్గం త్యక్త్వా కరోతి యః।
లిప్యతే న స పాపేన పద్మపత్రమివామ్భసా॥

ఎవరైతే తాను చేసే సమస్త కర్మలను పరమాత్మకు అర్పించి, వాటితో ఎటువంటి సంగమును పెట్టుకోకుండా, పరమాత్మ భావనతో, పరమాత్మ పరంగా కర్మలను చేస్తున్నాడో, అటువంటి వాడు తామరాకు మీద నీటి బొట్టు మాదిరి ఉంటాడు కానీ, దేనికీ అంటుకోడు. అతనికి ఏ బంధనము అంటదు.

ఈ శ్లోకంలో పరమాత్మ కర్మలు ఇంకా ఎలా చేయాలో వివరిస్తున్నాడు. ఈ ప్రపంచంలో మనం ప్రతి దానికీ ఎవరిమీదనో ఒకరి మీద ఆధారపడతాము. ప్రతి వాడూ అంతే. స్వతంత్రంగా జీవిస్తున్నాము అని అనుకున్నా, అది ఒట్టి భ్రమ. దేని మీదనో ఒక దాని మీద, ఎవరి మీదనో ఒకరి మీద నిత్యం ఆధారపడకతప్పదు. ఆ ఆధారపడ్డవాళ్లు మనలను కాపాడవచ్చు. కాపాడలేకపోవచ్చు. కాని పరమాత్మ మీద ఆధారపడితే ఆయన మనలను అనుక్షణం కాపాడతాడు. అటువంటప్పుడు వాళ్ల మీద వీళ్ల మీద ఆధారపడటం కన్నా పరమాత్మ మీద ఆధారపడటం మేలు కదా. పరమాత్మ మీద ఆధార పడటం అంటే మనం ఏ పని చేసినా ఆ కర్మ ఫలాన్ని పరమాత్మకు అర్పించడం.

ఇది ఎలాగ అంటే మనము ప్రతిరోజూ ఏదో ఒక దేవుడిని, దేవతను విగ్రహ రూపంలో పూజిస్తాము కదా! ఈ విగ్రహములనే దైవీభావనతో పూజిస్తాము. కాబట్టి మనం చేసే కర్మలన్నీ వాళ్ల పరంగా చేస్తూ, మన కర్మఫలములను వారికి అర్పిస్తే చాలు. అలా చేసి చేసి క్రమక్రమంగా నిర్గుణ పరబ్రహ్మను ఆరాధించే స్థితికి చేరుకోవచ్చు. ఇలా చేయడానికి ముందు రామాయణ భాగవతాలు చదవడం ముఖ్యం. అందులో అవతార పురుషులైన రామ, కృష్ణుల గురించి మనకు తెలుస్తుంది. అలా చదివినపుడు వారి మీద ఆరాధనా భావం పెరిగి వారిని ఆశ్రయిస్తాము. వారి ప్రతిమలను పూజిస్తాము. వారికి మన కర్మఫలములను అర్పిస్తాము. మన భారమంతా వారి మీద వేసి నిశ్చింతగా ఉంటాము. అప్పుడు జీవితం తామరాకు మీది నీటిబొట్టు లాగా ఉంటుంది. ఇవన్నీ చేయాలంటే దైవము మీద భక్తి, శ్రద్ధ, ఏకాగ్రత కలిగి ఉండటం ముఖ్యం. అంతే కానీ ఏదో ప్రతిరోజూ యాంత్రికంగా అన్ని దేవాలయాలకు వెళ్లి ప్రదక్షిణాలు చేయడం కాదు.

మనం నిత్యజీవితంలో కృష్ణార్పణం, రామార్పణం, భగవదార్పణం అనే మాటలు మనం వినే ఉంటాము. అంటే ఈ కర్మ ఫలితమునాది కాదు భగవంతునిది. దీనితో నాకు ఎలాంటి సంబంధము లేదు అనే భావన కలగడం. అహంభావము లేకుండా ఉండటం. నేను చేస్తున్నాను అనే కర్తృత్వ బుద్ధిని వదిలిపెట్టడం, ఆసక్తి బుద్ది లేకపోవడం, (నాన్ అటాచ్‌మెంటు) ఈ లక్షణాలతో కర్మలు చేస్తే ఆ కర్మబంధనములు అతనిని అంటవు. అంటే తామరాకు మీద నీటి బొట్టు మాదిరి ఉండాలి. ఆత్మజ్ఞానము కలిగిన వాడు తామరాకు మాదిరి ఉంటాడు. తామరాకు మీద నీరు పోస్తే అది బొట్టు బొట్టుగా దానిమీద ఆడుతూ ఉంటుంది. కాని దానికి అంటదు. జారిపోతుంది. తామరాకును నీటిలో ముంచి తీసినా, తామరాకుకు నీటి తడి కూడా అంటదు. అలాగే, అతడు ఏ కర్మ చేసినా అతనికి ఆ కర్మఫలము అంటదు. దీనినే కర్మసన్యాసము అని అనవచ్చు.

కాబట్టి జీవన్ముక్తులు అయిన వాళ్లు తాము తరించినప్పటికినీ, మానవులను తరింపచేయడానికి కర్మలు చేస్తుంటారు. కాని ఆ కర్మఫలముల మీద ఆసక్తి చూపరు. కర్మసన్యాసం అంటే ఇదే, అంతే కానీ కర్మలు చేయకుండా సోమరిగా ఉండటం కాదు. ఫలాపేక్ష లేకుండా, చేసిన కర్మలను ఈశ్వరునికి అర్పిస్తూ, ఆసక్తి లేకుండా కర్మలు చేస్తే ఆ కర్మబంధములు అతడికి అంటే ప్రసక్తి లేదు.

కర్మ మనలను బంధించడానికి కారణము, మనము చేసే పని మీదా దాని ఫలితము మీదా మనకు అంతులేని ఆసక్తి కలిగి ఉండటమే. కర్తృత్వ బుద్ధి, అటాచ్‌మెంట్‌లేకపోతే బంధనములు అంటవు. ఈ శ్లోకంలో బ్రహ్మణ్యాధాయ కర్మాణి అంటే మనం చేసే కర్మలను పరమాత్మకు సమర్పించాలి అని అర్థం. ఏదైనా వస్తువు అయితే సమర్పించవచ్చు కానీ కర్మలను ఎలా సమర్పిస్తాము అనే సందేహము రావచ్చు. అంటే ఏ పని చేసినా పరమాత్మభావనతోనే చేయాలి. మనం చేసే ప్రతి పనీ పరమాత్మ చూస్తున్నాడు, గమనిస్తున్నాడు అనే భావనతో చేయాలి. తప్పుచేస్తే శిక్షతప్పదు అనే విషయం గుర్తుపెట్టుకొని చేయాలి. నేను చేసే కర్మల వలన మంచి జరిగినా, చెడు జరిగినా ఈ కర్మఫలం నాది కాదు. పరమాత్మది. దీనితో నాకు ఎటువంటి సంబంధము లేదు అనే భావనతో చేయాలి. మనం చేసే అన్ని కర్మలను పరమాత్మ పరంగా చేయాలి. పరమాత్మ మీద ప్రేమతో, భక్తితో, శ్రద్ధతో చేయాలి. దాని వలన వచ్చే ఫలములను(మంచైనా, చెడైనా) పరమాత్మ ప్రసాదంగా స్వీకరించాలి.

ఇదే మనం చేసే కర్మలను పరమాత్మకు అర్పించడం. అప్పుడు ఆ కర్మఫలములు, కర్మబంధనములు మనకు అంటవు. మనం అను నిత్యం బయట ప్రపంచంలో తిరుగుతున్నా, ఏ పని చేస్తున్నా,(ఉద్యోగం కానీ, వ్యాపారం కానీ, వృత్తివిద్యకానీ, రాజకీయం కానీ) ఆ కర్మలు కానీ కర్మల ఫలములు కానీ మనలను బంధించవు. మనము తామరాకు మీది నీటి బొట్టు మాదిరి కర్మలకు అంటకుండా ప్రశాంతంగా ఉంటాము. మానసిక ప్రశాంతత కొరకు ఏ ఆశ్రమాలకు

పోయి ఎవరినీ ఆశ్రయించవలసిన అవసరం లేదు. మనం ఏ దేవుడిని కొలుస్తున్నామో ఆ దేవుడిని, దేవతను ఆశ్రయిస్తే చాలు ప్రశాంతత దానంతట అదే వస్తుంది. ప్రశాంతంగా ఉండటం మన చేతిలో పని.

## 11. కాయేన మనసా బుద్ధ్యా కేవలైరిన్ద్రియైరపి।
## యోగిన: కర్మ కుర్వన్తి సఙ్గం త్యక్త్వా22త్మశుద్ధయే॥

యోగులు అయిన వారు కేవలము శరీరము చేతా, మనస్సుచేతా, బుద్ధి చేతా, ఇంద్రియముల చేతా కర్మలు చేస్తున్నారు కాని ఆ కర్మలను ఫలాపేక్ష లేకుండా, ఎటువంటి సంగం లేకుండా చేస్తున్నారు.

ఇప్పుడు ఈ శ్లోకంలో పరమాత్మ యోగులు కర్మలు చేసే స్థితిని తెలుపుతున్నాడు. ఇదే నిష్కామ కర్మ. కర్మయోగమునకు తొలి మెట్టు. నిష్కామ కర్మచేతనే చిత్త శుద్ధి కలుగుతుంది. ఈచిత్తశుద్ధిని పొందడానికే సాధకులు, నిష్కామ కర్మలు, కర్తృత్వ భావన లేకుండా, ఫలాసక్తి లేకుండా, మమత మమకారములు లేకుండా, రాగద్వేషములు లేకుండా, కర్మలు చేస్తున్నారు. ఇక్కడ "కేవల" అనే పదం వాడారు. అంటే కేవలము ఇంద్రియములతోనే అని అర్థము. అంటే కేవలం ఇంద్రియములతోనే చేస్తున్నాడు అని అర్థం. ఎందుకంటే ఇంద్రియములు జడములు. వాటంతట అవి ఏ పనీ చేయలేవు. మనసు, బుద్ధి, అహంకారము తోడైతేనే గానీ ఏ పనీ చేయలేవు. కాబట్టి చేసే కర్మల మీద ఎటువంటి సంగము లేకుండా, మమతానురాగాలు లేకుండా, ఫలాపేక్ష లేకుండా, నిష్కామంగా కర్మలు చేస్తే చిత్తము నిర్మలంగా ఉంటుంది. జ్ఞానము కలుగుతుంది. మోక్షమునకు మార్గం సులువు అవుతుంది. ఇలా కర్మలు చేసినా అవి చేసినట్టు కావు. మలినమైన మనస్సుతో కర్మలు చేస్తే అవి జ్ఞానమును కలిగించవు. ఒకసారి జ్ఞానం కలిగితే, ఇంక వారు ఇంద్రియములతో ఏ ధర్మకార్యములు చేసినా అవి చేయనట్టే. కాబట్టి దీనినే కర్మసన్యాసము అని అనవచ్చు. కాబట్టి మోక్షము కావాలి అని కోరుకునే వాడు, ఫలాసక్తిని వదిలిపెట్టి, రాగద్వేషములు వదిలిపెట్టి, కర్తృత్వభావన లేకుండా, కర్మలు చేసి జ్ఞాని కావాలి.

దీనినే నిష్కామ కర్మ అని మనం తెలుసుకున్నాము. నిష్కామ కర్మ ఆచరిస్తే చిత్తము శుద్ధి అవుతుంది. యోగులు సాధకులు అయిన వాళ్లు తమ మనసు, చిత్తము పరిశుద్ధంగా ఉండటానికి గాను ఫలాన్ని ఆశించకుండా సమాజ శ్రేయస్సుకు కర్మలు చేస్తుంటారు. కేవలం ఇంద్రియములతోనే కాదు, బుద్ధితో, మనసుతో కూడా అటువంటి ఆలోచనలు చేస్తుంటారు. చాలా మంది పైకి సమాజ సేవచేస్తున్నట్టు కనిపించినా, లోలోప ఎంతో కొంత లాభం పొందాలనే ఆశతోనే

కర్మలు చేస్తుంటారు. కేవలం ఇంద్రియములతోనే కాదు మనసులో కలిగే ఆలోచనలు, బుద్ధితో చేసే నిర్ణయాలు అన్నీ పరోపకారానికి సమాజశ్రేయస్సు కొరకే చేయాలి. మనోబుద్ధి అహంకారములలో కూడా స్వార్థము ఉండకూడదు. మమత అభిమానము ఉండకూడదు. అందుకే పరమాత్మ కేవల ఇంద్రియైరపి అని వాడాడు. అంటే కేవలము ఇంద్రియములతోనే కాకుండా మనసు, బుద్ధి కూడా నిష్కామ కర్మ చేయడం గురించి ఆలోచించాలి. ఆచరణలో పెట్టాలి. ఇలా చేసినట్టయితే మనసు, చిత్తము కూడా నిర్మలత్వము పొందుతుంది. దాని వలన జ్ఞానము కలుగుతుంది. అప్పుడు మోక్షమార్గములో ప్రయాణం చేస్తాము.

కాబట్టి జ్ఞానం కావాలంటే మనస్సు బుద్ధి నిర్మలంగా ఉండాలి. ఎందుకంటే ఈ మనోబుద్ధులు అటు ఇంద్రియములకు ఇటు ఆత్మకు మధ్య అనుసంధానంగా ఉంటాయి. చేసే పనులు మంచిగా ఉన్నా, మనోబుద్ధులు మలినంగా ఉంటే జ్ఞానం రాదు. ఒక సారి ఆత్మజ్ఞానము కలిగితే ఇంక మనోబుద్ధులతో పని లేదు. ఎందుకంటే నేను వేరు శరీరం వేరు అనే భావన కలుగుతుంది. దానికి అనుగుణంగానే మనోబుద్ధులు ప్రవర్తిస్తుంటాయి. కాబట్టి ఇంద్రియములతోనే మంచి పనులు చేయడం కాదు, మనోబుద్ధులు కూడా నిర్మలంగా ఉండాలి. లోకోపకారం కొరకు పాటుపడాలి. అప్పుడే జ్ఞానోదయం అవుతుంది.

ఇదంతా సాధకుల కొరకు చెప్పారు. మా కోసం కాదు. అయినా మాకు చదువు, ఉద్యోగము, వ్యాపారాలతోనే సరిపోతుంది. ఇంక సాధన చేయడం ఎక్కడ? అది కుదరదు అని చాలా మంది అంటుంటారు. ఎందుకంటే కష్టమైన పనిని ఎగవేయడానికి ఎప్పుడూ మానవులు ఇష్టపడుతుంటారు. కాని పరమాత్మ అలా అనలేదు. మీకు శరీరంతో భగవంతుని పూజించడం, ధ్యానించడం కుదరకపోతే మనసుతో చేయండి. మానసిక పూజ చేయండి. మనసుతోనే అన్ని పుణ్యక్షేత్రాలు దర్శించండి. మీ మనసును పరమాత్మకు అర్పించండి. అన్ని పనులు పరమాత్మ పరంగా చేయండి. అదే మానసిక పూజ. అదీ కుదరకపోతే ఏదో ఒక పుస్తకము భగవద్గీత కాని, రామాయణము లాంటి గ్రంథములు కానీ పక్కన పెట్టుకొని పని మధ్యలో నాలుగు పేజీలు బుద్ధిగా చదవండి. మీకూ రిలాక్సేషన్‌గా ఉంటుంది. జ్ఞానం వస్తుంది. ఈ విధంగా కేవలం శరీరంతోనే కాకుండా, మనస్సుతో కూడా, బుద్ధితో కూడా పరమాత్మను పూజించవచ్చు. అర్చించవచ్చు అని పరమాత్మ మనకు తెలియజేస్తున్నాడు. అయితే ఈ మానసిక పూజ కానీ, గ్రంథ పఠనం కానీ ఏదో ఒక ఫలితాన్ని ఆశించి చేయకూడదు. అందుకే సంగం త్యక్త్వా అని అన్నారు. నిష్కామంగా చేయాలి. అలా చేస్తే మనకు వచ్చే ఫలితమే ఆత్మశుద్ధి. అంటే మనసు శుద్ధిఅవుతుంది. మనసు నిర్మలంగా ఉంటుంది. ఎటువంటి టెన్షన్లు ఉండవు. బిపి షుగర్ ఉండవు. ఆరోగ్యంగా ఉంటాము.

12. యుక్త: కర్మఫలం త్యక్త్వా శాన్తిమాప్నోతి నైష్ఠికీమ్।
అయుక్త: కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే॥

యుక్తుడు అయిన వాడు కర్మఫలములను వదిలిపెట్టి, పరమ శాంతిని పొందుతాడు. యుక్తుడు కాని వాడు కోరికలు తీరడం కోసం కర్మలు చేస్తూ, ఆ కర్మఫలముల మీద ఆసక్తితో బంధనములకు లోనవుతున్నాడు.

కర్మఫలాన్ని వదిలిపెడితే ఏం జరుగుతుంది. కర్మఫలాన్ని ఆశిస్తే ఏం జరుగుతుంది అనే విషయాన్ని ఈ శ్లోకంలో చెప్పాడు పరమాత్మ. బంధనములకు కారణం ఆశ. మోక్షమునకు కారణం ఆశ లేకుండా ఉండటం. ఆశను వదిలిపెడితే బంధనములు ఉండవు. జ్ఞానం, ఆత్మ శాంతి కలుగుతుంది. ఆశతో కర్మలు చేస్తే బంధనాలు, దు:ఖము, పతనము కలుగుతుంది. ఆశగానీ ప్రతిఫలాపేక్ష గానీ లేకుండా కర్మలు చేస్తే చిత్తము నిర్మలంగా ఉంటుంది. అప్పుడు ఆత్మ గురించి ఆలోచిస్తాడు. శాంతినిపొందుతాడు. కాబట్టి కర్మయోగమైనా జ్ఞాన యోగమైనా పొందేది శాంతి. కాని కర్మయోగంతో కలిగే శాంతి తాత్కాలికము. జ్ఞాన యోగంతో కలిగే శాంతి శాశ్వతము అందుకే దానిని ప్రశాంతి అంటే ప్రకృష్టమైన శాంతి అని అన్నారు.

కాబట్టి యుక్తుడు అంటే నిశ్చయాత్మక బుద్ధి కలిగిన వాడు, ఏ కర్మచేసినా ఈ పని నేను చేస్తున్నాను అనే కర్తృత్వభావనతో కాకుండా, ఈ పని నా స్వలాభం కోసం చేస్తున్నాను అని కాకుండా, ఈ పని భగవంతుని పరంగా చేస్తున్నాను, దీని ఫలితం భగవంతునికే అర్పిస్తున్నాను అనే భావనతో చేయాలి. అలా చేస్తే ముందు మనసు నిర్మలం అవుతుంది. తరువాత ఆత్మజ్ఞానం కలుగుతుంది. ఆఖరున ఆత్మసాక్షాత్కారం పొందుతాడు. అయుక్తుడు అంటే నిశ్చయాత్మక బుద్ధి లేని వాడు ఏ పని చేసినా తన స్వలాభం కొరకే చేస్తాడు. కర్మబంధనములలో చిక్కుకుంటాడు. తీవ్రమైన అశాంతికి గురి అవుతాడు. కాబట్టి ఆర్జించే ధనము, సిరిసంపదలు, పదవులు శాంతిని ఇవ్వలేవు. పైగా అవి పోతాయేమో అనే నిరంతర భయంతో అశాంతికి గురి అవుతాడు.

ఈ శ్లోకంలో నిభధ్యతే అని వాడాడు. అంటే ఆశతో ప్రతిఫలాపేక్షతో కర్మలు చేస్తే బంధనములు తప్పవు అని నిర్ద్వంద్వంగా చెప్పాడు. కాబట్టి ముందు ఆశ, ప్రతిఫలాపేక్ష వదిలిపెట్టాలి అని తెలుస్తూ ఉంది. ఈ శ్లోకంలో పరమాత్మ పరమ శాంతి కలగడానికి మార్గం ఏమిటి అనేది స్పష్టంగా చెప్పాడు. ఎందుకంటే ఈ రోజుల్లో ప్రతి మానవుడూ మనశ్శాంతిని వెదుక్కున్నాడు. మనశ్శాంతి కొరకు బాబాలను, దేవుళ్లను, తీర్థయాత్రలను ఆశ్రయిస్తున్నాడు. కాని మనశ్శాంతి తన చేతిలోనో ఉందని తెలుసుకోలేకపోతున్నాడు. అదే అజ్ఞానము అవిద్య. కేవలం, మనసులో నుండి ఆశను దూరం చేసి, ఫలితం ఆశించకుండా కర్మలు చేస్తే మనశ్శాంతి దానంతట అదే వస్తుంది.

ఇదే ఇందులో రహస్యం.

అలా కాకుండా ఆశతో ఫలితం ఆశించి పనులు చేస్తే దు:ఖం వస్తుంది. ఆ దు:ఖాలను తాత్కాలికంగా మరిచిపోవడానికి సాయంత్రం బార్లను, డ్రగ్సను ఆశ్రయిస్తున్నారు. చేయవలసిన పని చేయడం లేదు. చేయకూడని పని చేస్తున్నారు. అదే 'నాకంతా తెలుసు' అని అహంకారము, 'ఏమీ తెలియని తనం' అంటే అవిద్య. కేవలము మనస్సును ఇటు నుండి అటు మళ్లిస్తే సరిపోయేదానికి రోజూ వందలు వేలు తగలేస్తున్నారు. అప్పులపాలై ఆ అప్పులు తీర్చలేక, దు:ఖంతో మరలా అదే వ్యసనానికి బానిస అవుతున్నారు.

కాబట్టి ముందు మనలో ఉన్న తెలియనితనాన్ని అంటే అవిద్య పోగొట్టుకుంటే, బుద్ధి సక్రమంగా పని చేస్తుంది. విచక్షణా జ్ఞానం వస్తుంది. ఏ పని చేయాలో ఏపని చేయకూడదో, చేసే పని ఎలా చేయాలో అనే విషయంతెలుస్తుంది. మనస్సు ప్రాపంచిక విషయాల నుండి నివృత్తి మార్గంలోకి మళ్లుతుంది. అదే ముక్తిమార్గానికి తొలిమెట్టు.

## 13. సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖం వశీ।
## నవద్వారే పురే దేహీ నైవ కుర్వన్నకారయన్॥

సర్వ కర్మలను మనసులో సన్యసించే వాడు సుఖంగా ఉంటాడు. అటువంటి దేహి ఈ తొమ్మిది ద్వారములు కల పురములో ఉన్నా, ఏ కర్మ చేస్తున్నా, ఏ మీచేయని వాడుగా, ఏమీ చేయించనివాడుగా ఉంటాడు.

దేహి అంటే దేహములో నివసించువాడు. ఈ దేహమునకు తొమ్మిది ద్వారాలు ఉన్నాయి. రెండు కళ్లు, రెండు చెవులు, రెండు ముక్కు రంధ్రాలు, ఒక నోరు, మూత్ర ద్వారము, మలద్వారము, మొత్తము తొమ్మిది. తొమ్మిది ద్వారములు గల ఈ దేహము ఒక పురము. ఈ పురములో నివసించే వాడిని దేహి, పురుషుడు అని అంటారు. ఆత్మ స్వరూపుడు పురుషుడు. దేహములో అంటే శరీరంకల ఆడ, మగ అందరూ పురుషులే. పురుషుడు అంటే స్త్రీలు కారు అని అర్థం కాదు. ఈ పురంలో నివశించే వాడు ఎటువంటి అలజడి లేకుండా, బందులు హర్తాళ్లు లేకుండా, ఫైరింగులు లేకుండా నివసించాలంటే ఏం చేయాలి. లా అండ్ ఆర్డర్ కంట్రోల్ లో పెట్టుకోవాలి. అంటే ఇంద్రియములను కంట్రోల్ చేయాలి. తన వశంలో ఉంచుకోవాలి. లా అండ్ ఆర్డర్ వశంలో లేకపోతే అంతా అల్లకల్లోలమే కదా! లా అండ్ ఆర్డర్ వశంలో ఉండాలంటే మనసు వశంలో ఉండాలి. అప్పుడు చక్కని నిర్ణయాలు తీసుకోవచ్చు. తప్పుడు నిర్ణయాలు తీసుకుంటే లా అండ్ ఆర్డర్ వశం తప్పుతుంది. దు:ఖం వస్తుంది. సింపిల్ గా ఇదే మనం నేర్చుకోవాలి.

పురములో ఉండే పురుషుడు సంయమనంతో ఉండాలి. మనసును కంట్రోల్ లో ఉంచుకోవాలి. మంచి సంకల్పములు చేయాలి. ఆ మంచి సంకల్పములు మంచి పనులుగా మారాలి. ఏదీ స్వలాభం కొరకు చేయకూడదు. కర్మఫలముల కొరకు ఆశించకూడదు. సమాజ శ్రేయస్సును దృష్టిలో పెట్టుకోవాలి. అప్పుడు అంతా ప్రశాంతంగా ఉంటుంది. కేవలము ఇంద్రియములనే కాదు మనస్సు కూడా కంట్రోల్ లో ఉండాలి. అందుకే మనసా అని వాడాడు. కాబట్టి మనసును కూడా కంట్రోల్ లో ఉంచుకోవాలి. ఏదీ అదుపుతప్పకూడదు.

కొంత మంది ఉంటారు. పైకి ఏమీ చేయనట్టే ఉంటారు. మంచిగా బుద్ధిగా ఉంటారు. మనసులో క్రూరంగా ఆలోచిస్తూ దుర్మార్గాలు చేయిస్తుంటారు. ఈ రోజుల్లో ఆర్గనైజ్డ్ క్రైమ్సు ఇలాంటివే. జైళ్లలో ఉండి కూడా సెల్ ఫోన్లతో దందాలు నడిపిస్తుంటారు. వారి శరీరం కంట్రోల్ లో పెట్టబడినా, మనసు బుద్ధి మలినంగా ఉంటాయి. వారికి ఎక్కడున్నా శాంతి లభించదు. నిరంతరం భయంతో, అశాంతితో బాధపడుతుంటారు. కాబట్టి కేవలం ఇంద్రియములనే కాదు మనసును కూడా నిగ్రహించిన నాడే శాంతి అనే పదానికి అర్థం దొరుకుతుంది.

ఇక్కడ ఇంకో మాట కూడా అన్నాడు. సర్వకర్మాణి అంటే ఏదో ఒక కర్మ మనసావాచా కర్మణా బాగా చేస్తాను అంటే కుదరదు. సర్వకర్మలు ధర్మంగా న్యాయంగా ఇతరులకు హాని కలిగించకుండా చేయాలి. ఆ కర్మల ఫలితములను ఆశించకుండా చేయాలి అప్పుడే మనశ్శాంతి కలుగుతుంది. కాబట్టి ఈ నవద్వారపురంలో ఉండే పురుషుడు ఇంద్రియములను మనస్సును నిగ్రహించి, నిష్కామంగా కర్మలు చేస్తే, మనశ్శాంతి దానంతట అదే కలుగుతుంది. ఏ బాబాలను ఆశ్రయించ నవసరం లేదు. వేలకు వేలు ధనం వ్యయం చేయనవసరం లేదు. పురుషుడు అయిన వాడు మనస్సును ఆత్మయందు నిలిపి ఇంద్రియములతో పనులు చేస్తుంటే కూడా మనశ్శాంతి లభిస్తుంది.

ప్రతి పనికీ సంకల్పం అనేది ముఖ్యం. సంకల్పం చేయడానికి మనసు కారణము. ఆ మనస్సు ఆత్మలో లగ్నం అయితే ఇంద్రియములు ఏమీ చేయలేవు. తమ తమ నియమిత కర్మలను మాత్రమే చేస్తాయి. అటువంటి వాడు ఈ దేహములో ఉండి ఏ కర్మచేసినా, ఏమీ చేయనట్టే, ఏమీ చేయించనట్టే అవుతుంది.

మనం మనస్సుతో, బుద్ధితో, ఇంద్రియములతో కర్మలు చేస్తుంటాము. పుట్టిన వాడు కర్మలు చేయక తప్పదు. కాని సాధకుడు ఏ కర్మలు చేసినా "అవి నేనే చేయడం లేదు. ఈ శరీరం మనసు చేస్తున్నాయి" అనే భావనతో ఉంటాడు. అంటే నేను చేయడం లేదు కాబట్టి ఈ కర్మఫలం నాది కాదు అని అనుకుంటాడు. దానినే మనస్సుతో కర్మలనుసన్యసించడం అంటారు. ఆ ప్రకారంగా

సర్వకర్మలను మనఃపూర్వకంగా సన్యసిస్తే అతడు సుఖంగా ఉంటాడు. అటువంటి వాడు ఈ దేహములో ఆత్మస్వరూపుడుగా నివసిస్తున్నాడు. ఆ దేహి, ఈ దేహముతో, ఇంద్రియములతో ఏకర్మచేసినా తాను ఏమీ చేయనట్టు, ఏమీ చేయించనట్టు ఉంటాడు. కేవలం సాక్షీభూతుడుగా ఉంటాడు.

## 14. నకర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః। న కర్మఫలసంయోగం స్వభావస్తు ప్రవర్తతే॥

మానవునిలో ఉన్న ఆత్మ, ఎటువంటి కర్మలను గానీ, ఆ కర్మలు నేను చేస్తున్నాను అనే కర్తృత్వమును గానీ, ఆ కర్మలు చేసే లభించే ఫలములను గానీ సృష్టించలేదు. ప్రతి మానవుడు తన యొక్కస్వభావమును, అతని పూర్వజన్మ సంస్కారమును బట్టి ప్రవర్తిస్తున్నాడు. మానవుడు చేసే కర్మలకు అతనిలో ఉన్న ఆత్మకు ఎటువంటి సంబంధము లేదు.

ప్రభువు అంటే ఈ దేహములో ఉన్న దేహి అనబడే ఆత్మ. ఈ ఆత్మస్వరూపము మనం చేసే కర్మలను గానీ, మనం మనసుతో చేసే ఆలోచనలను గానీ, వాటి వలన కలిగే ఫలితములను గానీ, సృష్టించలేదు. పుట్టినప్పటి నుండి మరణించేదాకా, మానవునికి సంపూర్ణ స్వాతంత్ర్యము ఇచ్చాడు. మరి ఈ బాహ్యప్రపంచంలో కర్మలు ఎవరు చేస్తున్నారు, ఎవరు చేయిస్తున్నారు అంటే ప్రతి మానవుడు తన స్వభావములను బట్టి కర్మలను చేస్తున్నాడు. ఈ స్వభావములు ఆ మానవుని సంస్కారముల వలన కలుగుతాయి. సంస్కారములు పూర్వజన్మ వాసనల వలన కలుగుతాయి. అంటే మానవుడు కిందటి జన్మలో ఏం చేస్తే అది ఈ జన్మలో అతని స్వభావంగా మారుతుంది. ఈ స్వభావానికి, లోపల ఉన్న దేహికి, ఎటువంటి సంబంధము లేదు మానవులు వారి వారి స్వభావాలను బట్టి ప్రవర్తిస్తూ ఉంటారు.

ఉదాహరణకు మనకు వెలుగు ఉంది. అది సూర్యుని వెలుగు కావచ్చు, లేక రాత్రిళ్లు మనం వెలిగించుకునే దీపాల వెలుగు కావచ్చు. ఆ వెలుతురులో మనం అన్నిరకాలైన పనులు చేస్తాము. చేయవలసినవి, చేయకూడనివి పనులు చేస్తుంటాము. అంటే మనం వెలుతురు మీద ఆధారపడతాము. కాని అ వెలుగు మన మీద ఆధారపడదు. మనం ఏం చేసినా చేయకపోయినా, మంచి పనులు చేసినా, చెడ్డ పనులుచేసినా దానికి సంబంధము లేదు. కేవలము మనకు వెలుగును ఇస్తూఉంటుంది. అలాగే విద్యుత్తు కూడా మనం రకరకాల వస్తువులను పనిచేయించడానికి ఉపయోగిస్తుంది. అది ఎసి, ఫ్రిజ్, కంప్యూటర్,టివి, ఐరన్‌బాక్స్ ఏదైనా కావచ్చు. లేక అసాంఘిక కార్యాలకు ఉపయోగించవచ్చు. ఆ వస్తువులు ఏవైనా కానీ, విద్యుత్తు ఆ వస్తువులు

నడపడానికి కావలసిన శక్తిని ఇస్తుంది. ఆ వస్తువులతో కానీ, ఆ వస్తువులు చేసే పనులతో గానీ విద్యుత్తుకు ఎటువంటి సంబంధము లేదు. ఎలా అంటే విద్యుత్తు ఐరన్ బాక్స్‌లో చేరి వేడిని ఇస్తే, ఫ్రిజ్‌లో చేరి చల్లదనాన్ని ఇస్తుంది. రెండింటిలోనూ ఒకటే విద్యుత్తు ఉంది కానీ ఆయా వస్తువుల స్వభావాన్ని బట్టి ఆయా ఫలితాలను ఇస్తుంది.

ఇదేవిధంగా మనలో ఉన్న ఆత్మ కూడా మనకు కర్మలు చేయడానికి కావలసిన చైతన్యాన్ని ఇస్తుంది. మనలో ఉన్న ఆత్మ, మన స్వభావాలను బట్టి బయట ప్రపంచంలో ప్రవర్తిస్తూ, దానికి తగిన ఫలితాలను ఇస్తూ ఉంటుంది కానీ, వాటితో ఆత్మకు ఎటువంటి సంబంధము లేదు. అంటే మనలో ఉన్న ఆత్మకు మనం చేసే కర్మలతో కానీ ఆ కర్మల ఫలితాలతో కానీ ఎటువంటి సంబంధము లేదు. మనం ఏ కర్మ చేస్తే ఆ ఫలితం వస్తుంది. ఆ కర్మలను ఎవరి స్వభావాన్ని బట్టి వారు చేస్తుంటారు. ఈ స్వభావం ఎలా ఏర్పడుతుంది అంటే ఈ జన్మలో ఏం చేస్తే అది మరుజన్మలో మన స్వభావము అవుతుంది. మనం ఏ విత్తనం వేస్తే ఆ చెట్టు మొలుస్తుంది. ఆ పండే పండుతుంది. వేపవిత్తనం చేసి మామిడి పండు రమ్మంటే రాదు. క్రితం జన్మలో మన కర్మలు, సంస్కారాలు పాపములతో నిండి ఉంటే ఈ జన్మలో మనది పాపపు స్వభావమే అవుతుంది. అందుకే అన్నీ పాపపు పనులు చేసి దు:ఖం అనుభవిస్తాము. క్రితం జన్మలో మంచి పనులు చేస్తే ఈ జన్మలో కూడా మంచి పనులు చేసి సుఖాలు అనుభవిస్తాము.

మరి దీనిని మార్చుకునే మార్గమే లేదా అంటే ఉంది. పూర్వజన్మ వాసనలు పాపభూయిష్టమైనా ఈ జన్మలో వాటిని వదిలిపెట్టి పుణ్యమార్గం అవలంబిస్తే, ఆ స్వభావాల నుండి బయటపడవచ్చు. రాబోయే జన్మ అన్నా సుఖంగాఉంటుంది. అంతే కానీ, నా ఖర్మ ఇంతే దేవుడు నా మొహాన ఇలా రాసాడు అని ఏడుస్తూ కూర్చోకుండా, కనీసం ఈ జన్మలో అన్నా మంచి పనులు చేస్తే సుఖం దానంతట అదే వస్తుంది. కాబట్టి మనిషి తనను తాను ఉద్ధరించుకోవాలన్నా, పతనావస్థకు చేరుకోవాలన్నా తానే కారకుడు కానీ భగవంతుడు కాడు. కాబట్టి అరుదుగా లభించిన ఈ మానవ జన్మను మానవుడు సద్వినియోగం చేసుకోవాలి అనిపరమాత్మ చెబుతున్నాడు.

## 15. నా దత్తే కస్యచిత్పాపం నచైవ సుకృతం విభు:।
## అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవ:॥

పరమాత్మ ఎవరి పాప పుణ్యములను తాను తీసుకోడు. ఎవరి పాప పుణ్యములతో పరమాత్మకు సంబంధము లేదు. కాని మనలో సహజంగా ఉన్న జ్ఞానము, అజ్ఞానంతో కప్పబడి ఉంది కాబట్టి మానవులు అంతా భ్రమలో ఉన్నారు. మనం చేసే పాప పుణ్యాలకు పరమాత్మయే

కారణం అనీ, మన పాపాలు అన్నీ పరమాత్మ తీసుకుంటాడనీ, ఆయనే మోస్తాడనీ భ్రమచెందుతున్నారు. అది నిజంకాదు.

ఈ శ్లోకంలో పరమాత్మ ఒక సత్యాన్ని లోకానికి బోధిస్తున్నాడు. ఎవరు చేసిన పుణ్యంతో గానీ, పాపంతో గానీ పరమాత్మకు సంబంధం లేదు. ఎవరి పుణ్యపాపములకు వారే బాధ్యులు. పరమాత్మ ఏ విధంగానూ బాధ్యుడు కాదు. ఎవరి పుణ్యపాపములను పరమాత్మ స్వీకరించడు. పరమాత్మ కేవలం సాక్షి. పరమాత్మ అంటే అన్ని ప్రాణులలో ఉన్న ఆత్మస్వరూపుడు. చైతన్య స్వరూపుడు. కానీ మానవులు ఈ విషయంలో మోహంలో పడి ఉన్నారు. దేవుడి వలననే మనకు కష్టాలు వస్తున్నాయి. మనం దేవుడిని నమ్మితే, ఆ దేవుడు మన పాపాలు తీసుకుంటాడు అని ప్రచారాలు జరుగుతున్నాయి. అవి అపోహ మాత్రమే. మానవులు అజ్ఞానంతో అవిద్యతో ఈ అపోహలో ఉన్నారు. ఈ దేహమే నేను అనే భావన వలననే ఈ అపోహ కలుగుతూ ఉంది. ప్రపంచంలో తిరుగుతూ, ప్రపంచంలో ఉండే వస్తువులను అనుభవిస్తూ, వాటి మోహమునకు లోనై , కర్మలు చేసేది మానవుడు. మరి ఆ కర్మఫలములకు దేవుడు ఎలా బాధ్యుడవుతాడు? ఈ విషయం తెలియని మూర్ఖులు, మానవులు.

మానవుడు చేసిన పాపములు పోవడానికి ఒకటే మార్గము. అదే నిష్కామ కర్మయోగము దాని వలన వచ్చేదే జ్ఞానయోగము. ఇంక ఏ విధంగా కూడా మానవుడు చేసిన పాపములు పోవు. జ్ఞానము అంటే నేను వేరు శరీరం వేరు అనే భావన కలగడం. కాబట్టి ముందు తనలో ఉన్న వాసనలను పోగొట్టు కోవడానికి ప్రయత్నించాలే కానీ దేవుడు నా పాపాలు మోస్తాడు అని అనడం అవివేకము.

ఇంకా వివరంగా చెప్పాలంటే మానవుడు తన పుణ్య పాపములను తానే సంపాదించుకుంటాడు. అనుభవిస్తుంటాడు. మరలా జన్మ పొందుతుంటాడు. ఇందులో ఎవరి ప్రమేయము లేదు. భగవంతుడు ఎవరి పుణ్యపాపములను స్వీకరించడు. కాబట్టి నిష్కామకర్మతో కర్తృత్వభావన లేకుండా కర్మలు చేసి జ్ఞానము పొంది పాపముల నుండి విముక్తి కావాలి కానీ దేవుడి మీద తోసెయ్యడం సరి కాదు. ఎవరు కర్మ చేస్తారో వారే ఆ కర్మఫలం అనుభవించాలి. అంతే కానీ ఒకరు కర్మ చేస్తే మరొకరు ఫలితం అనుభవించరు. కాబట్టి ఒకరి కర్మఫలములకు మరొకరు కారణం కాదు. మానవులు పాపాలు చేసి, పాప ఫలం అనుభవిస్తూ, దేవుడు నాకు కష్టాలు తెచ్చిపెట్టాడు అని భావించడం తప్పు.

మానవుల కష్టాలకు సుఖాలకు దేవుడు ఏ విధంగానూ బాధ్యుడు కానప్పుడు మరి ఎవరు బాధ్యుడు అంటే మనలో ఉన్న సూక్ష్మశరీరము, దానిని అంటిపెట్టుకున్న గతజన్మల వాసనలు అనే సమాధానం వస్తుంది. మనలో ఉన్న మనో బుద్ధి అహంకారాల సముదాయమే సూక్ష్మశరీరము.

ఆ సూక్ష్మశరీరము ఒక దేహము నుండి మరొక దేహానికి ప్రయాణం చేస్తూ ఉంటుంది. పోతూ పోతూ ఆయా దేహాలతో చేసే కర్మల వాసలను తనతో మోసుకుపోతూ ఉంటుంది. మరుజన్మలో ఆ వాసనలు స్వభావాలుగా మారతాయి. ఆయా స్వభావాలకు అనుగుణంగా, ఏ దేహంలో ఉంటాడో, ఆ దేహము మీద విపరీతమైన అభిమానముతో, కర్మలు చేస్తూ, వాటికి తగ్గ ఫలితాలను పొందుతుంటాడు మానవుడు. ఈ కర్మలు చేయడానికి శక్తి కావాలి కదా! మనలో ఉన్న ఆత్మ చైతన్యము, మనలో ఉన్న మనో బుద్ధి అహంకారాలకు, ఇంద్రియ తన్మాత్రలకు తగిన శక్తిని మాత్రమే ఇస్తుంది . ఆ శక్తితో వాడు ఏం చేస్తాడో ఆత్మకు అనవసరం. కేవలం సాక్షిగా చూస్తూ ఉంటుంది.

ఇది తెలుసుకోవడమే ఆత్మజ్ఞానము అని అంటారు. మానవ సహజమైన ఈ ఆత్మ జ్ఞానము అజ్ఞానముతో కప్పబడి ఉంది. ఆ కారణం చేత ఈ మానవులు మోహంలో పడిపోతున్నారు. ఇక్కడ జన్తవ: అని వాడారు. మామూలుగా జన్తవ: అంటే జంతువులు అని అర్థం. కాని ఇక్కడ మరలా మరలా పుడుతూ చస్తూ, అజ్ఞానంలో పడి అలమటించే ప్రాణులు అని అర్థం చెప్పుకోవాలి.

(జంతువులకు జ్ఞానం ఉండదు. అవి కర్మజీవులు. జంతు అంటే పుట్టిన ప్రాణి. పుట్టిన ప్రతి ప్రాణీ జంతువు అయితే, మానవత్వం ఉన్న వాడు మాత్రం మానవుడు అనిపించుకుంటాడు. మనిషి, మనీషి అవుతాడు. అందుకే ఎవరైనా దుర్మార్గుణ్ణి తిట్టాల్సివస్తే ఒరే కుక్కా, గాడిదా, పశువా, దున్నపోతా అని తిడతాము. నీకంటే అవే నయంరా! అని కూడా అంటాము. అంటే వాడిలో మానవత్వం నశించి, పశుత్వం ప్రబలింది అన్నమాట.)

మనలో అజ్ఞానం, దాని వలన పుట్టిన మోహం, దేహాభిమానం ఉన్నంత కాలం ఈ జనన మరణ చక్రంలో తిరుగుతూ ఉండటం తప్పదు. మరి ఈ అజ్ఞానం పోవాలంటే ఏం చేయాలో తరువాతి శ్లోకంలో వివరించాడు పరమాత్మ.

## 16. జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశితమాత్మనః।
## తేషామాదిత్యవజ్ఞానం ప్రకాశయతి తత్పరమ్॥

జ్ఞానము చేత ఎవరి అజ్ఞానము నాశనం అవుతుందో, అటువంటి వారి జ్ఞానము సూర్యుని వలె అతనిలో ఉన్న పరమాత్మ స్వరూపమును ప్రకాశింపచేస్తూ ఉంటుంది.

దీపం వెలిగించగానే చీకటి పోతుంది. జ్ఞానం కలగగానే అజ్ఞానం తొలగి పోతుంది. మందు వేసుకుంటే రోగం నయమవుతుంది. ఇది ప్రాథమిక సూత్రము. మానవునికి కలిగే దు:ఖములు పాపములు పోవాలంటే జ్ఞానమే దానికి తగిన మందు. జ్ఞానము అంటే తత్వ

విచారణ. ఆత్మ తత్వము తెలుసుకోవడం. ఆత్మజ్ఞానము కలగడం. మనమెవరో మనం తెలుసుకోవడం. అప్పుడు మనలో ఉన్న అజ్ఞానం పటపంచలయిపోతుంది. జ్ఞానోదయం అవుతుంది. ఆ జ్ఞానం అనే సూర్యుని వెలుగులో పరమాత్మ సాక్షాత్కారం అవుతుంది.

దీనికి ఒక మంచి ఉదాహరణ. సూర్యుడు మేఘాలతో కప్పబడి ఉంటే మనకు వెలుతురు వేడి ఉండదు. చీకటి గా ఉంటుంది. అదే మేఘాలు అడ్డం తొలగితే లోకం వెలుగుతో నిండి పోతుంది. మన జీవాత్మను అజ్ఞానం ఆవరించి ఉన్నంత కాలం మనం మోహంలో ఉంటాము. దు:ఖములో ఉంటాము. అజ్ఞానం అనే మేఘాలు తొలగిపోతే జ్ఞానం అనే వెలుగు విస్తరిస్తుంది. మనందరినీ అజ్ఞానము అనే మేఘాలు ఆవరించి ఉన్నాయి. అందువలన సంసారంలో పడి కొట్టుకుంటున్నాము. ప్రాపంచిక సుఖములే నిజం అని నమ్ముతున్నాము.
అజ్ఞానం అనే చీకట్లో నడుస్తున్న మనకు ఏది ఎక్కడ ఉందో తెలియడం లేదు. చెట్టుకు, స్తంభాలకు గుద్దుకుంటున్నాము. దెబ్బలు తగిలించుకుంటున్నాము. అదే వెలుగు ఉంటే చూచి నడుస్తాము. దెబ్బలు తగలవు. అలాగే అజ్ఞానం అనే చీకట్లో నడుస్తూ ఈ సంసారము అనే అడవిలో తిరుగుతూ, ఏవేవో కర్మలు చేస్తూ దు:ఖాలు అనే దెబ్బలు తగిలించుకుంటున్నాము. ఈ అజ్ఞానము అనే చీకటిని జ్ఞానము అనే సూర్యుడి వెలుగులో నాశనం చేసి, జ్ఞానప్రకాశంలో ప్రయాణం చేస్తే నిరంతరం సుఖం అనుభవించవచ్చు. పరమాత్మను చేరుకోవచ్చు.

ఇక్కడ మీకో అనుమానం వస్తుంది. జ్ఞానమే ఆత్మను ప్రకాశింపచేస్తుందా అని సందేహం రావచ్చు అది తప్పు. సూర్యుడు ఎలా గైతే స్వయంప్రకాశకుడో అలాగే ఆత్మ కూడా స్వయంగా ప్రకాశిస్తుంది. సూర్యుని ప్రకాశంలో మనం ప్రపంచంలో ఉన్న సమస్త వస్తువులను ఎలా చూడగలమో అలాగే జ్ఞానంతో మనం స్వయంప్రకాశకుడైన ఆత్మస్వరూపాన్ని దర్శించగలము. కాని ఆ జ్ఞానము అనే సూర్యుడికి మేఘములు అనే అజ్ఞానం అడ్డు పడింది అంతే. అజ్ఞానం అనే మేఘం తొలగితే స్వయంప్రకాశమైన ఆత్మ ప్రకాశిస్తుంది. జ్ఞానం కలిగితే అజ్ఞానం అనే మేఘం తొలగి పోతుంది. అప్పుడు ఆత్మ తన స్వస్వరూపంలో ప్రకాశిస్తుంది. అంతే కానీ జ్ఞానము ఆత్మను ప్రకాశింపచేస్తుంది అనడం నిజం కాదు. సూర్యుడి వెలుగులో మనం అన్ని వస్తువులను ఎలా చూడగలమో అలాగే జ్ఞానము అనే వెలుగులో మనము ఆత్మను దర్శించగలము. అప్పుడు మనకు ఈ ప్రాపంచిక విషయాలు అన్నీ తమ నిజస్వరూపాలతో కనిపిస్తాయి. మనలో ఉన్న మోహము అనే భ్రమ తొలగి పోతుంది.

కాబట్టి జీవులు మోహము, అజ్ఞానము, ఆశ, కామము, వీటి నుండి బయటకు రావాలంటే జ్ఞానము అవసరము. జ్ఞానము వస్తే అజ్ఞానము దానంతట అదే తొలగి పోతుంది. అప్పుడు ఆత్మ తన స్వప్రకాశంలో ఉంటుంది. ఇదీ ఈ శ్లోకము అర్థము. బయట సూర్యుడు ఎలా వెలుగుతున్నాడో అలాగే మనలో కూడా ఆత్మ అనే సూర్యుడు ప్రకాశిస్తున్నాడు. ఆత్మ అనే సూర్యునికి

ఈ ప్రాపంచిక సుఖములు అనే అజ్ఞానము అడ్డుతూ ఉంది. దానిని అడ్డు తొలగిస్తే ప్రతి వాడి హృదయంలో ఆత్మ ప్రకాశిస్తుంది. జ్ఞానం ఎలా వస్తుంది అంటే నిష్కామ కర్మ, భక్తి, ధ్యానము వైరాగ్యము మొదలగునవి సాధించాలి. కనీసం ప్రయత్నం చేయాలి.

ఈ శ్లోకంలో యేషామ్ అని అన్నాడు. అంటే ఎవరికైనా అని అర్థం. అంటే ఏ కులం, మతం, జాతి, ధనిక, పేద వాడైనా ఈ సూత్రం వర్తిస్తుంది. అంతేకానీ కొంతమంది కే కాదు. అంటే ప్రతి జీవిలో ఆత్మ ఉంటుంది. అది అజ్ఞానంతో కప్పబడి ఉంటుంది. ఆ కప్పు తీసేస్తే ఆత్మ వెలుగు కనపడుతుంది.

## 17. తద్బుద్ధయ స్తదాత్మాన స్తన్నిష్ఠా స్తత్పరాయణాః।
## గచ్ఛన్త్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూత కల్మషాః॥

ఆ పరమాత్మయందే నిశ్చయాత్మక బుద్ధి కలవారు, పరమాత్మయందే మనసు నిలిపినవారు, పరమాత్మయందే నిష్ఠ కలవారు, పరమాత్మను శరణాగతి పొందిన వారు, తాము సంపాదించిన జ్ఞానముతో, తమలోని కల్మషములను దూది పింజల మాదిరి ఎగురగొట్టి, ఈ జనన మరణ చక్రము నుండి విముక్తి పొందగలరు.

ఈ శ్లోకంలో ఆత్మజ్ఞానం కలగడానికి మార్గం చెప్పాడు. ఆత్మజ్ఞానము, మోక్షము అంటే మాటలు కాదు. తీవ్రమైన సాధన, అభ్యాసము చెయ్యాలి. దానికి మొదటి సూత్రము. మనం చేసే ఏ పని అయినా శ్రద్ధ, ఏకాగ్రత, తదేక చింతన, ధ్యాస పెట్టి చేయాలి. అలాగే ఆత్మజ్ఞానం కావాలంటే ఆత్మయందే బుద్ధి కలిగి ఉండాలి. ఆత్మయందు మనసును ఉంచాలి. అటు ఇటు పోనీయకూడదు. ఆత్మనిష్ఠ కలిగి ఉండాలి. ఇలా చేస్తే ఆత్మకు అనుసంధానము అవుతాము. ఇక్కడ భ్రమరకీటక న్యాయం వర్తిస్తుంది. అంటే భ్రమరం చుట్టు తిరుగుతుంటే పురుగు కూడా భ్రమరం అయిపోతుంది. అలాగే ఎల్లప్పుడూ ఆత్మయందే ధ్యాస ఉంటే తానే ఆత్మస్వరూపుడు అయిపోయే అవకాశం ఉంది.

ఎలాగంటే మనస్సు ఎల్లప్పుడూ దేని గురించి ధ్యానిస్తుంటుందో, దానిలో తన్మయం అవుతుంటుందో, అదే స్థితిని పొందుతుంది. ఇది భౌతిక సిద్ధాంతము. పూర్వకాలంలో ఋషులు ఇటువంటి తపస్సులు చేసి సిద్ధిపొందారు. కాబట్టి మనం కూడా కొంచెం కొంచెం ప్రయత్నం చేయాలి. మనకు ఉన్న సమయంలో కొంత సమయం ప్రాపంచిక విషయములలో, కొంత సమయం దైవధ్యానంలో గడిపితే, నిదానంగా జ్ఞానం వస్తుంది. పూర్తిగా దైవధ్యానంలో గడిపితే, తొందరగా

జ్ఞానము సిద్ధిస్తుంది. కాబట్టి నిదానంగా నైనా మనం ఆ స్థితికి చేరుకోడానికి ప్రయత్నం చేయాలి.

జ్ఞానం కలిగితే ఏం జరుగుతుంది అంటే గచ్ఛన్త్యపునరావృత్తిం అంటే పునరావృత్తి కలుగదు. మరు జన్మ ఉండదు అని అర్థం. అటువంటి స్థితి ఎవరికి కలుగుతుంది అంటే మనసులో కల్మషం లేని వారికి, పాపములు నశించిన వారికి, అజ్ఞానము, అవిద్య లేని వారికి. ఆ కల్మషం ఎలా పోతుంది అంటే జ్ఞానం కలిగితే నశిస్తుంది. జీవునిలో పాపము మాలిన్యము ఉన్నంతవరకు ఆత్మజ్ఞానము కలుగదు. దానికి కావాలిసింది నిరంతర భగవంతుని చింతన, ఆత్మనిష్ఠ, ఆత్మను నమ్ముకోవడం.

ఇవన్నీ కావాలంటే సోమరి తనం ఉండకూడదు. నిరంతర సాధన, దానికి ప్రయత్నం అవసరం. మనం అశాశ్వతములైన ప్రాపంచిక వస్తువులను సంపాదించడం కోసరం రేయిం బగళ్లు కష్టపడుతున్నాము. ఆ శ్రమలో సగం ఆత్మజ్ఞానం సంపాదించడంలో పెడితే శాశ్వత సుఖం లభిస్తుంది. అటువంటి శాశ్వత సుఖం కోసం, శాంతి కోసం మనం ఎందుకు ప్రయత్నం చేయకూడదు. దీనికి పెద్దగా శ్రమపడనవసరం లేదు. మనం ప్రాపంచిక విషయములలో చూపే శక్తి, యుక్తి, బలము, నిష్ఠ, అటు నుండి ఇటు వైపుకు అంటే ఆత్మవైపుకు తిప్పితే చాలు జ్ఞానం వస్తుంది. మోక్షం వస్తుంది. కాబట్టి ఈ రోజునుండి ఆత్మయందు ప్రేమ, శ్రద్ధ, తదేక నిష్ఠ కలిగి ఆత్మజ్ఞానము సంపాదించమని భగవానుడు మనకు ఈ శ్లోకం ద్వారా తెలియజేస్తున్నాడు.

తత్పరాయణా: తత్పరత అంటే ఆత్మయందు కమిట్‌మెంట్. నేను ఈ శరీరం కాదు నేను ఆత్మస్వరూపుడను అనే భావన కలిగి ఉండాలి. మనం ఏ పని చేస్తున్నా మనసులో పరమాత్మ గురించిన ధ్యానము, స్మరణ మరిచిపోకూడదు. ఎందుకంటే ప్రాపంచిక విషయాలలో దు:ఖం తప్ప సుఖం లేదు. పరమాత్మ యందు నిష్ఠ కలిగి ఉంటే సుఖమే సుఖము, దు:ఖమునకు తావు ఉండదు.

తద్బుద్ధయ: అంటే కేవలం పరమాత్మయందు కమిట్ మెంట్ ఉంటే సరిపోదు. ఆ కమిట్‌మెంట్ కార్యరూపం దాల్చాలి. భగవద్గీత చదవాలి అని గాఢమైన కోరిక ఉంటే సరిపోదు. ఆ పుస్తకం కొనాలి. 701 శ్లోకాలు పూర్తిగా చదవాలి. అప్పుడే కోరిక కార్యరూపం దాలుస్తుంది. అంటే మన సంకల్పాన్ని కార్యరూపంలో పెట్టాలి అనే బుద్ధికూడా ఉండాలి.

తదాత్మాన: ఇక్కడ ఆత్మ అంటే మనసు. అంటే కేవలం చదివితే సరిపోదు. దాని మీద మనసు లగ్నం చేయాలి. చాలా మంది పైపైన చదువుతారు. మనసుపెట్టి చదవరు అందుకే అది అర్థంకాదు. శాస్త్రము అర్థం అయిందీ అంటే నేను వేరు ఈ శరీరం వేరు అనే భావన కలగాలి. నేనే ఈ శరీరము అనే భావన మనకు పూర్వజన్మవాసనల నుండి సంక్రమించింది. దానిని

పోగొట్టుకోవాలంటే శాస్త్రమును మనసు పెట్టి శ్రద్ధతో అధ్యయనం చేయాలి. చదివిన దానిని మనసు పెట్టి ఆచరించాలి.

తన్నిష్ఠా: అంటే కేవలం శాస్త్రజ్ఞానం ఉంటే సరిపోదు. దాని మీద నిష్ఠ కలిగి ఉండాలి. దానిని పరిపూర్ణంగా నమ్మాలి. దానిని సర్వకాల సర్వావస్థలయందు అనుసరించాలి. ఆచరించాలి. అందులో లీనం అవ్వాలి. తాదాత్మ్యం చెందాలి. మనకు కష్టం వచ్చినా, సుఖం వచ్చినా, ఆ జ్ఞాననిష్ఠలో ఉండాలి. సుఖదు:ఖాలను సమంగా చూడగలగాలి.

అటువంటి వారి జ్ఞానముతో, అతనిలో ఉన్న రాగద్వేషములు అనే కల్మషములన్నీ దూది పింజల వలె ఎగురగొట్టబడతాయి. అప్పుడు అతడు జీవన్ముక్తుడు అవుతాడు. జనన మరణ చక్రం నుండి విడివడతాడు.

## 18. విద్యావినయ సంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని।
## శుని చైవ శ్వపాకే చ పణ్డితా: సమదర్శిన:॥

పైన చెప్పబడిన జీవన్ముక్తుడు ఎలా ఉంటాడు అనే విషయం ఈ శ్లోకంలో వివరించాడు. అటువంటి జీవన్ముక్తుడు విద్య, వినయము పుష్కలంగా కలిగి ఉన్న బ్రాహ్మణుని యందు, కుక్కమాంసమును తినే వారి యందు, గోవు , ఏనుగు, కుక్క మొదలగు చిన్న పెద్ద జంతువులయందు, సమమైన దృష్టి కలిగి ఉంటాడు.

ఈ శ్లోకంలో పరమాత్మ మనకు ఒక విషయం చెప్పాడు. మానవుల మధ్య తర తమ భేదములు ఉండరాదు. సమానత్వము ఉండాలి. అంటే నేటి సోషలిజం ఆనాడే పరమాత్మ చెప్పాడు అనుకోవచ్చు. పరమాత్మ దీనిని ఒక్క జ్ఞానులకే పరిమితం చేసాడు. కానీ ఈ సూత్రం మానవులందరికీ ఆచరణీయము. పరమాత్మ ఈ సోషలిజాన్ని ఆత్మ పరంగా చెప్పాడు. జ్ఞానులు ఈ చరా చరసృష్టిలో ఉన్న జీవరాసులను అన్నిటినీ సమానంగా చూస్తారు. అన్ని ప్రాణులలో ఉన్న ఆత్మను చూస్తారు కానీ శరీరాలనుకాదు. అన్నిటి మీదా సమభావము కలిగి, ప్రేమ, దయ, కరుణ కలిగి ఉంటారు. ఎవరినీ ద్వేషించరు. మనం మానవులం కాబట్టి మానవుల దృష్టాంతాన్ని తీసుకున్నాడు పరమాత్మ. తరువాత మనతో పాటు తిరిగా జంతువులను కూడా ఉదాహరణలు గా తీసుకున్నాడు.

మానవులలో అసలు తప్పుచేయని వాడు, తప్పు చేయడానికి అర్హత లేని వాడు, వేదములను, శాస్త్రములను చదువుకున్న వాడు, వినయము కలవాడు మొదలగు లక్షణములు కలవాడిని బ్రాహ్మణుడు అని అంటారు (అంతే కానీ పుట్టుకతోనే ఎవరూ బ్రాహ్మణులు కారు). విద్య,

వినయము బ్రాహ్మణునికి తప్పనిసరిగా ఉండవలసిన లక్షణములు. అందుకే అతనిని ఉదాహరణగా తీసుకొని చెబుతున్నాడు. బ్రాహ్మణుడే అలా ఉంటే ఇంక సామాన్య మానవుల మాట చెప్పాలా చెప్పండి. ఇంక అజ్ఞానులలో ఛండాలుడిని ప్రాతిపదికగా తీసుకున్నాడు. (ఇక్కడ ఛండాలుడు అంటే ఒక కులానికి చెందిన వాడు కాదు. ఏమీ తెలియని వాడు, అజ్ఞాని, దుర్మార్గుడు, నీచుడు, సంస్కారహీనుడు అని అర్థం చేసుకోవాలి.) వీళ్లు ఇద్దరూ, తాము ఆచరించే వృత్తులలో, ఉన్నతత్వానికి, అధమత్వానికి ప్రతీక(అంటే రెండు ఎక్స్‌ట్రీమ్స్) బ్రాహ్మణుడి కన్నా పై వాడు లేడు. ఛండాలుడి కంటే తక్కువ వాడు లేడు. అందుకే వీరిద్దరినీ సంఘంలో ఉత్తమ అధమ జన్మలకు ప్రతినిధులుగా ఎన్నుకున్నాడు.

అలాగే జంతువులలో కూడా గోవును మనం పూజిస్తాము. దానిని ఉత్తమమైన, సాధు జంతువుగా పేర్కొన్నాడు. తరువాత ఏనుగు మన మధ్య ఉండదు. అడవులలో తిరుగుతూ ఉంటుంది. అన్ని జంతువులకంటే భారీశరీరం కలది కానీ, పూజనీయము కాదు. కాబట్టి దానిని మధ్యమ జాతిగా ఎన్నుకొన్నాడు. తరువాత కుక్క పెంపుడు జంతువు. కుక్క తినకూడని పదార్థాలు కూడా తింటుంది. కుక్క మాంసము తినడం నిషిద్ధము. ఈ ప్రకారంగా ఉత్తమ, మధ్య, అధమ జాతికి చెందిన మూడు రకములైన జంతువులను ఉదాహరణకు తీసుకున్నాడు. ఇంక పరమాత్మ ఏం చెప్పాడో చూద్దాము.

వేదశాస్త్రములు చదువుకొని జ్ఞాని అయిన వాడిని, ఏమీతెలియని ఛండాలుడిని, పవిత్రమైన గోవును, అడవులలో తిరిగే ఏనుగును, సర్వభక్షణ అయిన కుక్కను వీటి అన్నిటిలో కూడా పరమాత్మ ఆత్మస్వరూపుడుగా వెలుగుతున్నాడు. కాబట్టి అన్నిటినీ సమంగా చూడాలి. అన్నీ ఆ పరమాత్మస్వరూపాలే. ఒకరు ఎక్కువ మరొకరు తక్కువ కాదు. సృష్టిలోని అన్ని జీవరాసులను సమానంగా ఆదరించే వాడు జ్ఞాని కానీ, చదువుకున్న వాడు కాదు అని పరమాత్మ సందేశము. వేదములు శాస్త్రములు చదువుకొని ఉంటారు. కానీ నన్ను అంటవద్దు నువ్వు అంటరాని వాడివి అని చీదరించుకుంటారు. అటువంటి వారు ఎంత చదువుకున్నా అజ్ఞానులే. ఏమీ చదువుకోక పోయినా, అందరినీ సమానంగా చూచేవాడు అందరిలో ఆత్మను దర్శించే వాడు జ్ఞాని.

మానవులు సాధారణంగా పైపై వేషభాషలు చూస్తారు. కొందరు అతని మనసు మంచిదా కాదా అని చూస్తారు. మరి కొందరు అందరిలో ఆత్మస్వరూపుడు అయిన భగవంతుని చూస్తారు. మొదటి రకం వారు అధములు. వారికి దేహ సౌందర్యము ముఖ్యం. పొడుగు లావు అందము ఐశ్వర్యము అతని చదువు, వేషభాషలు ఇవే కనపడతాయి. వారికి కావాల్సింది ఇవే. వాడు మంత్రి కొడుకా, వాడికి ఎంత ఆస్తి ఉంది. ఇవే ఆలోచనలు. మరి కొందరు మనో సౌందర్యము చూస్తారు. వారు కొంచెం బెటర్. వీరు ఎదుటి వాడి మానసిక స్థితి, అతని జ్ఞానము, సంస్కారము, చూస్తారు. పై వేషభాషలు ఎలా ఉన్నా ఆత్మసౌందర్యము ముఖ్యము అని తలుస్తారు. వీరు మధ్యములు.

ఇంక ఉత్తములు ఎవరు అంటే అన్ని జీవరాసులలోనూ పరమాత్మను దర్శించేవారు. వారు ఆత్మజ్ఞానము తెలిసినవారు. అటువంటి వారు సమస్త జీవరాసులయందు సమభావం కలిగి ఉంటారు. ఎవరి మీద కోపము ద్వేషము ఉండదు. మనలో ఎక్కువ మంది బాహ్య సౌందర్యానికి ప్రాధాన్యత ఇస్తే, అతి తక్కువ మంది మానసిక సౌందర్యానికి విలువ ఇస్తారు. ఉత్తములు అయిన వాళ్లు చాలా అరుదు. అట్టి వారి గురించి పరమాత్మ ఈ శ్లోకంలో వివరించాడు. మనం అందరం ఆ స్థితికి చేరుకోవాలని పరమాత్మ ఆశ.

లవ్ ఈజ్ గాడ్. ప్రేమే దైవము అని మనం చదువుకున్నాము. కాని ఆచరించము. ఈ ప్రేమ మనుషులకే కాదు సమస్త జీవరాసులకు చెందినది. మానవత్వము కలిగిన మానవుడు తన ప్రేమను సమస్త జీవరాసుల మీద చూపించాలి. కాని నేడు మానవుడు మానవత్వము మరిచిపోయాడు. సాటి మానవులనే హింసిస్తున్నాడు. చంపుతున్నాడు. తన ఆహారం కోసం, వినోదం కోసం ఎన్నోజీవాలను చంపుతున్నాడు. విశాల భావము, ఆత్మ దృష్టి మానవునిలో మచ్చుకైనా కనిపించడం లేదు. ఎప్పుడైతే మానవుడు బాహ్యసౌందర్యాన్ని కాకుండా అతనిలోని ఆత్మస్వరూపాన్ని చూస్తాడో అతడే జ్ఞాని. అటువంటి వాడు ఏ శాస్త్రము పురాణము చదవనక్కరలేదు. అన్నీ చదివినా భేదబుద్ధి కలవాడు మూర్ఖుడు కాని జ్ఞాని కాడు. అందుకే సర్వమానవ సౌభ్రాతృత్వము అని చెప్పారు. ముందు అది అలవరచుకుంటే తరువాత పైపెట్టు ఎక్కవచ్చు. దీనినే విశ్వజనీనమైన ప్రేమ అంటారు.

మనశరీరంలో ఉన్న అన్ని అవయవములను మనం ఎలా ప్రేమిస్తామో కాపాడు కుంటామో అలాగే మన చుట్లు ఉన్న జీవరాసులను కూడా అలాగే ప్రేమించాలి అని ఈ శ్లోకము అంతరార్థము. మన శరీరానికి ఏదైనా దెబ్బ తగిలితే ఎలా బాధ పడతామో అదే బాధ ఎదుటి జీవులకు ఉంటుందని గ్రహించాలి. అదే మానవత. ఒకడు జ్ఞాని అవునా కాదా అని తెలుసుకోడానికి ఇదే గీటురాయి.

మనం సాటి వారిని ప్రేమిస్తాము. పెంపుడు జంతువులను  ప్రేమిస్తాము. ఆవును, పూజిస్తాము. గజేంద్రమోక్షము భక్తితో చదువుతాము.  కాని మానవుల మధ్య కులము, జాతి భేదాలు కల్పించి, కొంత మందిని నీచంగా చూస్తాము. అది జ్ఞానవంతుల లక్షణంకాదు అని అంటున్నాడు పరమాత్మ. అందరినీ ఉత్తమ, మధ్య, నీచకులములుగా విభజించకుండా అందరి పట్ల సమభావం, విశాల దృష్టి  కలిగి ఉండాలి. అటువంటి వాడే జ్ఞాని, ముముక్షువు. మేము జ్ఞానులము అంటూ సాటి మానవులను దూరంగా ఉంచేవారు, అంటరాని వారుగా పరిగణించేవారు జ్ఞానులు కారు. మనం పలికే సర్వమానవ సౌభ్రాతృత్వము కన్నా పరమాత్మ ఒక మెట్టు పైకిపోయి కేవలం ఆ భావన సర్వమానవులకే కాదు, సకల జీవరాసులకు వర్తింపచేయాలి అని బోధించాడు పరమాత్మ.

కాని ఇక్కడే ఒక చిక్కు ఉంది. పెంపుడు కుక్కను బెడ్ రూములోకి రానిస్తాము. ఆవును షెడ్ లోనే కట్టేస్తాము. ఏనుగును అడవిలోనే ఉంచుతాము. వాటి వాటి సహజ లక్షణాలను బట్టి ప్రాకృతికంగా వాటితో వ్యవహరించాలి. కాని మానసికంగా వాటి మధ్య భేదభావన చూపకూడదు. అలాగే మూర్ఖుడికి వేదాంతం బోధిస్తే, వాడు మరుక్షణం లేచి పోతాడు. కాబట్టి వ్యావహారికంగా వాడితో ఎలా ప్రవర్తించాలో అలాగే ప్రవర్తించాలి. కాని మానసికంగా వాడిని కూడా సాటి మానవునిలాగే చూడాలి. ఇదీ ఈ శ్లోకం అంతరార్థం.

## 19. ఇహైవ తైర్జిత: సర్గో యేషాం సామ్యే స్థితం మన:।
## నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణి తే స్థితా:॥

ఎవరి మనసులో అయితే సకల ప్రాణుల పట్ల, జీవరాసుల పట్ల సమభావం స్థిరంగా నిలిచి ఉంటుందో, అటువంటి వారు ఈ జనన మరణ చక్రము నుండి విడివడతారు. అటువంటివారు జీవించి ఉండగానే నిర్మలమైన నిష్కల్మషమైన బ్రహ్మ పదమును పొందుతారు. ఆ బ్రహ్మలోనే స్థిరంగా ఉంటారు.

ఈ జన్మలోనే మోక్షము పొందేది ఎలాగ అనే విషయాన్ని పరమాత్మ ఇక్కడ బోధిస్తున్నాడు. జననము మరణము అనేవి ఒకదాని వెంట ఒకటి వస్తూ పోతూ ఉంటాయి. దీనికి బంధనములే కారణము. ఈ బంధనములకు కారణము మనస్సు. మనస్సు స్థిరంగా లేకపోతే బంధనాలు కలిగిస్తుంది. స్థిరంగా ఉంటే మోక్షము కలిగిస్తుంది. కాబట్టి ఇంద్రియ నిగ్రహము, మనోనిగ్రహము, సకల భూతముల యందు సమభావన, నిష్కామకర్మాచరణ ముఖ్యము.

పరమాత్మనిర్గుణుడు, నిర్వికారుడు. పరమాత్మను చేరాలంటే ఈ గుణాలు మనలో ఉండాలి. ఎందుకంటే ఒక వస్తువు మరొక వస్తువులో సంయోగం చెందాలంటే రెండు వస్తువుల గుణాలు, ధర్మాలు ఒకటిగా ఉండాలి. నీటిలో పాలు, నీరు కలుస్తాయి కాని నూనె కలవదు. అలాగే పరమాత్మలో అంటే విశ్వ చైతన్యంలో ఐక్యం అవ్వాలంటే మనం కూడా పరమాత్మ ధర్మాలు కలిగి ఉండాలి. పరబ్రహ్మ లక్షణాలను మనం సంతరించుకోవాలి. అవే దోషములు లేకుండా ఉండటం, సమత్వభావన నిర్గుణత్వము. ఇవి అలవడితే మోక్షమార్గంలో మనం ప్రయాణం చేయవచ్చు. పతంజలి మహర్షి తన యోగశాస్త్రంలో ఈ విధంగా చెప్పాడు.

సత్వపురుషయో: శుద్ధిసామ్యే కైవల్యం అంటే శుద్ధ సత్వ గుణ సంపన్నులు, అన్నిటిని సమదృష్టితో చూచేవారే కైవల్యానికి అర్హులు. బ్రహ్మకు ఈ గుణాలు ఉన్నాయి. ఆ గుణాలను మనం

సంతరించుకోవాలి.

మనలో చాలా మందికి ఒక అపోహ ఉంది. మోక్షము అంటే ఈ జన్మలో వచ్చేది కాదు. బతికి ఉండగా వచ్చేది కాదు. ఎన్నో జన్మల తరువాత కాని రాదు. అని అనుకుంటూ ఉంటారు. కాని మన సనాతన ధర్మంలో మోక్షము అంటే ఇక్కడే ఈ లోకంలోనే బతికి ఉండగానే వస్తుంది అని చెప్పింది. వారినే జీవన్ముక్తులు అని అంటారు.

వశిష్ఠుల వారు తమ వశిష్ఠగీతలో ఈ విధంగా అన్నారు.

నమోక్షో నభస: పృష్ఠే పాతాలే న చ భూతలే
మోక్షో హి చేతో విమలం సమ్యగ్జ్ఞానవిబోధితమ్.

మోక్షము అనేది ఆకాశంలో లేదు. పాతాళంలో లేదు. భూమి మీద అసలే లేదు. నిర్మలమైన చిత్తములోనూ, సమ్యక్ జ్ఞానమువలన కలిగే నిర్మల చిత్తమే మోక్షం (సేకరణ: గీతామకరందము).

కాబట్టి ప్రతి మానవుడు తమ మనస్సులను నిర్మలంగా ఉంచుకోవాలి. అటు ఇటు పోనీయకూడదు. చంచలంగా ఉంచకూడదు. నిశ్చయాత్మక బుద్ధి కలిగి ఉండాలి. అన్ని జీవుల పట్ల సమభావన కలిగి ఉండాలి. జనన మరణములు కేవలం ఒక పరిణామము మాత్రమే, అవి వస్తూ పోతూ ఉంటాయి, వాటి గురించి చింతించకూడదు అనే భావన కలిగిఉండాలి.. మనస్సును ప్రాపంచిక విషయముల నుండి లోపలికి మళ్లించి, ఆత్మలో స్థిరంగా, నిశ్చలంగా ఉంచాలి. అదే మోక్షము.

ఈ శ్లోకంలో ఇహైవ అంటే ఇక్కడే ఈ జన్మలోనే మనం మోక్షం కోసం ప్రయత్నం చేయాలి. ఆ మనకు వస్తుందా! ఏమన్నానా ! అనే నిరాశ పడనక్కరలేదు. ముందు ప్రయత్నం చేయాలి. ఎందుకంటే మోక్షము పొందడానికి కాలము, స్థలము తో నిమిత్తము లేదు. ఇంట్లో ఉండి కూడా మోక్షము పొందడానికి ప్రయత్నం చేయవచ్చును. కావాల్సింది అల్లా సమ్యక్ దృష్టి. అందరినీ సమానంగా చూడటం అన్ని జీవులలో పరమాత్మ ఉన్నాడని నమ్మడం, దేహములను బట్టి, వేషభాషలను బట్టి, భేదభావము చూపకుండా ఉండటం. మనస్సును నిర్మలంగా, నిశ్చలంగా ఉంచుకోవడం, ముక్తికి మార్గాలు. దీనికే వ్యాసుడు సామ్యేస్థితమ్ అనే పదం వాడాడు. అంటే సామ్యస్థితిలో ఉండటం. సకల భూతములను సమంగా చూడటం. చిత్తములో కల్లోలము లేకుండా ఉండటం. నిశ్చలంగా ఉండటం. యేషాం అంటే జాతి కుల వర్ణ భేదములు స్త్రీపురుష భేదములు లేకుండా అందరూ మోక్షమునకు అర్హులు అని చెప్పాడు పరమాత్మ.

## 20. న ప్రహృష్యేత్ప్రియం ప్రాప్య నోద్విజేత్ప్రాప్య చాప్రియమ్।
## స్థిరబుద్ధిరసమ్మూఢో బ్రహ్మవిద్బ్రహ్మణి స్థితః॥

పైశ్లోకములో చెప్పబడినటువంటి స్థిరబుద్ధి కలవాడు, మూర్ఖత్వము, మూఢత్వము లేని వాడు, తన మనస్సును ఆత్మయందు నిశ్చలంగా ఉంచిన వాడు అయిన బ్రహ్మజ్ఞాని కి ఇష్టము అయినది లభించినపుడు సంతోషము, ఇష్టము లేనిది లభించినపుడు దు:ఖము కలుగవు.

సాధారణంగా మానవులు ఏపని చేసినా ఆ పనిచేసిన దానికి ఏదో ఒక ఫలితం కలుగుతుంది. అది సుఖము కావచ్చు, దు:ఖము కావచ్చు, రెండూ మిళితమైనది కావచ్చు. కాని బ్రహ్మజ్ఞాని ఆ ఫలితములకు ప్రభావితుడు కాదు. బ్రహ్మజ్ఞానము పొందిన తరువాత సాధకుడు ఎలా ఉంటాడు అనే దానికి కొన్ని గుర్తులు చెప్పాడు పరమాత్మ. బ్రహ్మ జ్ఞానము కలిగితే బుద్ధి స్థిరంగా ఉంటుంది. మోహము ఉండదు. మనస్సు నిలకడగా ఉంటుంది. అతనికి సంతోషము దు:ఖము సమంగా ఉంటాయి. జ్ఞానము పొందని అజ్ఞానికి ఈ అవలక్షణాలు అన్నీ ఉంటాయి. బ్రహ్మజ్ఞానము పొందిన సాధకునికి ఈ ప్రపంచము అంతా మాయగా కనపడుతుంది. ఇందులో ఏదీ సత్యము కాదు అని తెలుసుకుంటాడు. మాయలో పడడు. ఈ మాయా ప్రపంచములో సుఖదు:ఖములు వస్తు పోతుంటాయి. వాటికి మనం పొంగి పోవడం బాధపడటం వృధా అని తెలుసుకుంటాడు. నిశ్చలంగా ఉంటాడు. అలా కాకుండా మనకుకనపడేవన్నీ సత్యము అనుకొనే వాడికి సుఖదు:ఖములు కలిగిస్తాయి.

దీనికంతా మూలము మనస్సు. మనస్సు నిగ్రహించుకోకపోవడం వలన ఇవన్నీ జరుగుతాయి. బ్రహ్మజ్ఞానము పొందినవాడి బుద్ధి స్థిరంగా ఉంటుంది. అజ్ఞాని బుద్ధి కామము మొదలగు వాటితో చంచలంగా ఉంటుంది. వెలుగులో ఉన్న వాడికి చీకటి అంటే ఏమిటో తెలియదు. అలాగే జ్ఞానము కలవానికి అజ్ఞానము అంటే ఏమిటో తెలియదు. అతనికి సందేహహములు కలుగవు. మోహంలో పడడు. ప్రాపంచిక వస్తువులు అన్నీ ఎండమావులు అని తెలుసుకొని వాటి మోహములో పడడు. ఇది తెలియని అజ్ఞానులు మాత్రమే ఎండమావుల వెంట పరుగెత్తి అక్కడ ఏమీ లేకపోతే దు:ఖపడుతుంటారు. కాబట్టి స్థిరబుద్ధి, సమత్వము కలిగి, మోహము లేకపోవడం జ్ఞాని లక్షణములు.

ఇక్కడ మనకు ఒక సందేహము వస్తుంది. జీవన్ముక్తుడికి కర్మలు చేయవలసిన అవసరం ఆ ఫలితములను అనుభవించవలసిన అవసరం ఏముంది అని అనుకుంటూ ఉంటారు. పైశ్లోకంలో మోక్షము అనేది ఎక్కడో లేదు ఇక్కడే ఈ జన్మలోనే వస్తుంది అని చెప్పుకున్నాము. ఈ జన్మలోనే మోక్షము కలిగినా, మరణించేదాకా ఈ దేహము ఉంటుంది. దేహం ఉన్నప్పుడు ఆకలి

దప్పులు, ఎండ, చలి, ఉంటాయి. మనసు ఉంటుంది. బయట ప్రపంచంలో తిరుగుతూ ఉండాలి. వీటిని ఎవరూ ఆపలేరు. జ్ఞాని కూడా దేశము, కాలము వీటి ప్రభావానికి అతీతుడు కాడు. కాకపోతే జ్ఞానికి వీటి ప్రభావానికి లోనుకాడు.. అజ్ఞాని వీటి ప్రభావానికి లోనవుతుంటాడు. జ్ఞాని ఏదివచ్చినా ఆనందిస్తుంటాడు. దేనినీ పట్టించుకోడు. అజ్ఞాని ప్రతి దానికీ స్పందిస్తుంటాడు. భావోద్వేగాలు పొందుతుంటాడు. జ్ఞానికి తనకు అనుకూల పరిస్థితులలో సంతోషిస్తాడు. కాని పొంగిపోడు. ఎగిరి గంతెయ్యడు. ఎందుకంటే అతని మనసు నిశ్చలంగా ఉంటుంది. ప్రతికూల పరిస్థితులు వచ్చినపుడు కుంగి పోడు. దు:ఖమునకు లోను కాడు. దానిని కూడా సుఖాలు గానే భావిస్తాడు.

మూఢత్వము అంటే తాను నమ్మిందే వేదం. ఇతరులు ఏం చెప్పినా వినకపోవడం. ప్రతి దానికీ సందేహించడం. ప్రతి దానినీ "ఇదిమన వల్ల కాదు, ఇది అయ్యే పని కాదు" అనే వ్యతిరేకభావంతో ఉండటం. ఆత్మజ్ఞానిలో ఈ మూఢత్వము మచ్చుకైనా కనిపించదు. అతని మనసు నిర్మలంగా ఉంటుంది. ఇదంతా ఆత్మజ్ఞానం వలన వస్తుంది. ఆత్మజ్ఞానం కలిగితే ఈ జన్మలోనే ఇక్కడే ముక్తిలభిస్తుంది.

## 21. బాహ్య స్పర్శేష్వసక్తాత్మా విన్దత్యాత్మని యత్సుఖమ్।
## స బ్రహ్మయోగయుక్తాత్మా సుఖమక్షయమశ్నుతే॥

ప్రాపంచిక విషయముల యందు, విషయభోగముల యందు ఆసక్తి అనురక్తి లేని వాడు, తన మనసును ఆత్మయందు చేర్చి అనంతమైన సుఖాన్ని పొందుతున్నాడు. అటువంటి వాడు ఎల్లప్పుడూ బ్రహ్మనిష్ఠయందే ఉంటూ అంతులేని ఆనందాన్ని పొందుతాడు.

మనసును ఆత్మయందు స్థిరంగా ఉంచాలి అని మనం చెప్పుకున్నాము. మనసు ఎల్లప్పుడూ బాహ్య ప్రపంచంలో సంచరిస్తూ ఉంటుంది. దానిని లాక్కొచ్చి ఆత్మలో ఉంచాలి. అది చెయ్యాలంటే శబ్దము, స్పర్శ, వాసన మొదలగు ప్రాపంచిక విషయముల యందు, విషయవాంఛల యందు ఆసక్తిని తగ్గించుకోవాలి. అప్పుడు మనస్సు ఆత్మయందు స్థిరంగా ఉంటుంది. మనస్సు అలౌకికమైన ఆనందాన్ని అనుభవిస్తుంది. ఆ ఆనందం ఇలా ఉంటుంది అని చెప్పనలవి కాదు. ఆ సుఖము ఆనందము ఎన్నటికీ తగ్గిపోదు. అక్షయంగా ఉంటుంది. అక్కడ దు:ఖమునకు తావు లేదు. నిరంతరం సుఖమే. అదే స్వర్గము అని అనుకోవచ్చు.

ప్రాపంచికవిషయముల వలన కలిగే సుఖము క్షయము. ప్రారంభంలో సుఖము కలుగుతుంది మరలా అంతలోనే దు:ఖము ముంచుకొస్తుంది.. మనస్సు ఆత్మయందు లగ్నం చేస్తే అనిర్వచనీయమైన ఆనందము కలుగుతుంది. అసలు సుఖం ఎక్కడ ఉంది అంటే బయట

ప్రపంచంలో లేదు. మన లోపలే ఉంది. సుఖానికి రాజధాని మనసు. ఆ మనసును ఆత్మయందు లగ్నం చేస్తే సుఖమే సుఖం. ఈ నిజాన్ని తెలుసుకోలేక మానవులు సుఖంకోసం బయట పాకులాడుతుంటారు. కొందరు ధనంలోనూ, మరి కొందరు పదవులలోనూ, ఇంకా కొంత మంది స్త్రీలవద్ద, మద్యమాంసములు సేవించడంలోనూ సుఖం ఉందనుకుంటారు. అవి అశాశ్వతములు. నిజం కావు అని తెలుసుకోలేరు. కాబట్టి జ్ఞానులు అయిన వాళ్లు బాహ్యవిషయములలో ఆసక్తి లేకుండా, ఆత్మసుఖం కోసం ప్రయత్నిస్తుంటారు.

ఒకటి వదిలితే కానీ మరొకటి రాదు. అలాగే బాహ్య సుఖములు వదిలితేగానీ అంత:సుఖము రాదు. కాబట్టి ముందు బాహ్యవిషయములందు ఆసక్తి విడిచిపెట్టాలి. ప్రాపంచికవిషయములలో విరక్తిని పెంచుకోవాలి. కాబట్టి ఆత్మసుఖం కావాలంటే బాహ్య విషయములమీద ఆసక్తిని వదిలిపెట్టాలి. ఎక్కువ సుఖంకోసం తక్కువ సుఖం వదులుకోడంలో తప్పేముంది. ఇది ఎలా ఉంటుంది అంటే ప్రభుత్వము వారు డూప్లెక్సుభవనాలు నిర్మించి అక్కడకు పొమ్మంటే నేను పూరి గుడిసెలోనే ఉంటాను అన్నట్టు ఉంటుంది.

ప్రపంచంలో అందరికీ సుఖము కావాలి. కాని అది ఎలా వస్తుందో ఎవరికీ తెలియదు. కొందరికి అన్నీ ఉంటాయి. మనశ్శాంతి ఉండదు. తమకు సుఖాన్ని శాంతిని కలుగజేయమని స్వామీజిలను ఆశ్రయిస్తారు. ప్రస్తుత కాలంలో స్వామీజీలు, బాబాలు, కూడా అశాశ్వతములైన ప్రాపంచిక సుఖములలో మునిగి తేలుతుంటారు. అదే సుఖం అనుకుంటూ ఉంటారు. కాబట్టి వారు తమ వద్దకు వచ్చేవారికి సరి అయిన ఆధ్యాత్మిక మార్గమును చూపలేరు. అందుకే భగవద్గీతను సరిగా చదివి, అర్థం చేసుకొని, ఆచరించాలి. అదే సరిఅయిన మార్గము

## 22. యే హి సంస్పర్శజా భోగా దు:ఖయోనయ ఏవ తే।
## ఆద్యన్తవన్త: కౌన్తేయ న తేషు రమతే బుధ:॥

బయట ప్రపంచంలో ఉన్న విషయముల వలన కలిగే భోగములు అన్నీ దు:ఖము రావడానికి కారణాలు. ఒకవేళ సుఖాలు వచ్చినా అవి కొద్దికాలమే. ఉంటాయి కానీ కలకాలము నిలువవు. కాబట్టి జ్ఞానిఅయిన వాడు ప్రాపంచిక విషయముల వైపు కన్నెత్తి కూడా చూడడు.

ప్రాపంచిక విషయములు, విషయ సుఖముల మీద విరక్తి కలిగి ఉండాలి అని కిందటి శ్లోకంలో చదువుకున్నాము. అలా ఎందుకు విరక్తి కలిగి ఉండాలి. హాయిగా అనుభవించవచ్చు కదా అని మనం అనుకోవచ్చు. దానికి కారణం చెబుతున్నాడు పరమాత్మ. మనము

ప్రతిరోజూ, ప్రతి క్షణం  బయట ప్రపంచములోని వస్తువులతోనూ, మనుషులతోనూ సంగమం పెట్టుకుంటాము. దాని వలన కొంత ఆనందం కలుగుతుంది. కాని ఆ ఆనందం శాశ్వతం కాదు. ఆ వస్తువులు, మనుషులు మనకు దూరం కాగానే వెంటనే దు:ఖం వస్తుంది. మనకు కావాలిసింది నిరంతర ఆనందం కానీ కొంచెం ఆనందం ఎక్కువ దు:ఖము కాదుకదా! ఈవిషయంలో పెద్దలు ఏమి చెబుతారంటే మనకు రవ్వంత సుఖం కలిగితేచాలు పుట్టెడు దు:ఖం దాని వెనువెంటనే ఉంటుంది. కాబట్టి ప్రాపంచిక విషయములు, కామ కోరికలు తీరడం వలన వచ్చే సుఖములు క్షణికములు ఎప్పటికీ నిలిచి ఉండవు అని తెలుస్తూ ఉంది. మనం సుఖం అనుభవిస్తున్నాము అంటే దాని వెను వెంట వచ్చేదు:ఖమును కూడా అనుభవించడానికి సిద్ధంగా ఉండాలి అంతే కానీ సుఖం వచ్చినపుడు నవ్వడం, దు:ఖం వచ్చి నపుడు కుంగి పోవడం ఆత్మహత్యలు చేసుకోవడం మంచిది కాదు.

కాబట్టి ప్రాపంచిక విషయముల మీద ఎక్కువ ఆసక్తి చూపించకుండా ఉంటే చాలు, ఈ సుఖదు:ఖములు మనలను అంటవు. మనకు ఎక్స్‌రే తీసినపుడు మనకు బాహ్య శరీరం కనపడదు. లోపల ఉన్న ఎముకలు కనపడతాయి. అలాగే మనం ఏ వస్తువుతో కానీ, స్త్రీపురుషులతో గానీ సంగమం పెట్టుకునేముందు, మనలో ఉన్న వివేకము, జ్ఞానము అనే ఎక్స్‌రే కిరణాలను వాటి మీద ప్రసరింపజేసి, వాటి నిజస్వరూపం తెలుసుకొని ప్రవర్తించాలి.  ప్రాపంచిక విషయములు మనకు తాత్కాలికంగా సుఖాన్ని కలుగచేసినా, దాని వెనుక ఉన్న దు:ఖాన్నికూడా పసిగట్టి అటువంటి వాటికి దూరంగా ఉండడం మంచిది. కాబట్టి ఏ విషయమును కానీ, వస్తువును కానీ, పైపై న చూడకుండా విచక్షణ తో అంతరాంతరముల లోకి  చూచి వివేచనతో ప్రవర్తిస్తే దు:ఖం కలుగదు.

ఈ శ్లోకములో పరమాత్మ మనకు రెండు విషయాలు తెలియజేసాడు.

1.ప్రతి సుఖం వెనుక ఎంతో కొంత దు:ఖం ఉంటుంది.
2. సుఖము కానీ దు:ఖము కానీ శాశ్వతములు కావు, వస్తూ పోతూ ఉంటాయి.

కాబట్టి వీటి కొరకు ఆరాట పడటం మంచిది కాదు. ఆత్మసుఖము శాశ్వతము, ఎన్నటికీ నశించదు. మనస్సును బాహ్య వస్తువుల మీది కన్నా లోపల ఉన్న ఆత్మతో అనుసంధానం చేస్తే కలిగే సుఖం శాశ్వతము. విషయ వాంఛలు, ప్రాపంచిక సుఖములు, చిన్ని దీపం అయితే ఆత్మ సుఖము సూర్యుని వెలుగు లాంటిది. కాని దీపము వద్దకు పురుగు చేరినట్టు మానవులు దీపం దగ్గరకు చేరి మాడి పోతున్నారు. ఇదే అజ్ఞానము. అందుకే జ్ఞానులు, తెలివిగలవారు, సూర్యరశ్మిని ఆశ్రయించి వేడిని, వెలుగును, ఆరోగ్యమును పొందుతున్నారు. కాబట్టి జ్ఞానికి  ప్రాపంచిక విషయములలోనూ,  విషయ వాంఛలయందు రక్తి, అనురక్తి ఉండకూడదు (విరక్తి ఉండాలి) అని బోధిస్తుంటారు.

ధనం, పదవి, ఆస్తి, విద్య, అధికారము ఉండవచ్చు. కానీ విషయ వాంఛల వెంట పరుగెడితే అనర్థం చుట్టు కుంటుంది. ఉదాహరణకు అత్యంత ఉన్నత స్థానము అధిరోహించిన ఉన్నతాధికారులు, రాజకీయనాయకులు, అవినీతి కుంభకోణాలలోనూ, లైంగిక వేధింపుల కేసులలో ఇరుక్కోవడం ఏమిటి? వారి చదువు, హోదా, పదవి, సంపద, జ్ఞానము ఏమయ్యాయి? వారు కూడా దీపం దగ్గర చేరిన పురుగులే కదా! ఆలోచించండి.

ఈ శ్లోకంలో సంస్పర్శజా భోగా అని వాడారు. సం స్పర్శ అంటే బాగా తాకడం అని మామూలు అర్థం. బయట ప్రపంచంలో ఎన్నో శబ్దాలు, దృశ్యాలు, రుచులు, తాకితే సుఖం కలిగించేవి, తాకితే ఒళ్లు పులకరించేవి, చక్కని సువాసనలు, ఎన్నోఉన్నాయి. ఇవి అన్నీ కూడా బయట ఉంటే ప్రయోజనం లేదు. మన జ్ఞానేంద్రియములు వాటిని తాకాలి, వాటితో సంయోగం చెందాలి. అప్పుడే వాటి వలన కలిగే సుఖదు:ఖాలు మనము అనుభవించగలము. అటువంటి స్పర్శవలన, సంయోగమువలన మొదట్లో కొంత సుఖం కలిగిగినా, సాధారణంగా దు:ఖము కలుగుతుంటుంది. అందుకే దు:ఖయోనయ అని అన్నారు. అంటే ఈ స్పర్శలు, సంయోగములు అన్నీ దు:ఖములను కలిగించేవే. మొదట్లో కొంత సుఖం కలిగినా, చివరకు అన్నీ దు:ఖంతో అంతం అవుతాయి.

మొదట్లో చక్కెరతో చేసిన మిఠాయి తియ్యగా ఉంటుంది. అతిగా తింటే వెగటు పుడుతుంది. తినగ తినగ గారెలు చేదు అనే సామెత ఉంది కదా! మరి ఇవి ఎందుకు నిరంతరం ఆనందాన్ని ఇవ్వవు అంటే ఇవి ఆద్యన్తవన్త: అంటే వీటికి మొదలు, ఆఖరు అనేవి ఉన్నాయి. కొన్ని వస్తువులు, కొందరు మనుషులు, ధనం, బంగారం, ఆస్తి మన దగ్గరకు వస్తే సుఖంగా ఉంటుంది. ఆనందంగా ఉంటుంది. అవి పోతే అంతులేని దు:ఖం. రావడం, పోవడం వాటి లక్షణం కాబట్టి, అవి వచ్చినప్పుడు సుఖం, పోయినపుడు దు:ఖం తప్పదు. ఒకే విషయం, ఒకరికి ఆనందం కలిగిస్తే మరొకరికి దు:ఖంకలిగిస్తుంది. భార్య పక్క చుట్టాలు వస్తే, భార్యకు ఆనందం, మొగుడు మొహం మొటమొట లాడుతుంది. అదే భర్త పక్క వారు వస్తే భార్య ముఖం ముడుచుకుంటుంది భర్త ముఖం ఆనందంతో వెలిగిపోతుంది. కాబట్టి మనకు శాశ్వతమైన ఆనందం ఏదీ ఇవ్వలేదు.

దీనికి సులభమైన మార్గం ఏదంటే, సుఖాలు అన్నీ దు:ఖాలతో అంతం అవుతాయి అని తెలుసుకోవాలి. రెండింటికీ సిద్ధపడి ఉండాలి. ప్రాపంచిక విషయాలు అనుభవించేటప్పుడు సుఖం వచ్చినా దు:ఖం వచ్చినా తట్టుకోగలగాలి. సుఖదు:ఖాలకు అతీతంగాఉండాలి. సమాన స్థితి అలవరచుకోవాలి. ఇది మొదటి మెట్టు.

రెండవ మెట్టు ప్రాపంచిక విషయాలను, విషయ వాంఛలను పూర్తిగా వదిలిపెట్టాలి. మనసులో కూడా వాటి గురించి ఆలోచన, సంకల్ప వికల్పాలు కలుగ కూడదు. ఇది చాలాకష్టము.

ఎవరికీ సాధ్యంకాదు. పైపైన వదిలిపెట్టామని అనుకున్నా, లోలోపల అయ్యో ఇవన్నీ అనుభవించలేక పోయామే అనే దిగులు, దు:ఖం, ఎదుటి వాడు అనుభవిస్తున్నాడే అనే అసూయ మనసును వేధిస్తుంటాయి. కాని, ఆత్మజ్ఞానం కలిగిన జ్ఞానికి రెండూ సాధ్యమే. కాబట్టి ముందు ఆత్మజ్ఞానం అలవరచుకోవాలి. తరువాత పైన చెప్పిన వాటిలో ఏదో ఒకటి ఎంచుకోవచ్చు. అప్పుడు దు:ఖము లేని అనంతమైన ఆనందాన్ని పొందవచ్చు.

## 23. శక్నోతీహైవ యస్సోఢుం ప్రాక్శరీరవిమోక్షణాత్।
## కామక్రోధోద్భవం వేగం స యుక్త: స సుఖీ నర:॥

మానవుడు మరణించే లోపల కామమును, క్రోధమును విడిచిపెట్టగలిగితే, లేక వాటి ప్రభావాన్ని అదుపుచేయగలిగితే అతడే యుక్తుడు, సుఖమును పొందినవాడు అవుతాడు.

ఇంతకు ముందు శ్లోకంలో మనం చెప్పుకున్నాము. మోక్షము ఎక్కడో లేదు. ఎప్పుడో రాదు. ఇక్కడే ఇప్పుడే ఈ జన్మలోనే వస్తుంది. దానికి కావాల్సిన సామగ్రి ఇక్కడే దొరుకుతుంది. ఆ సామగ్రిని మనం సమకూర్చుకోడంలోనే మన విజ్ఞత చూపాలి. ఎందుకంటే భూలోకము కర్మభూమి. ధ్యాన,యోగ,సమాధులకు, ఇదే అనువైన లోకము. స్వర్గంలోకం (అంటూ ఒకటి ఉంటే) అనుభవానికే కానీ ఆచరణకు పనికిరాదు. నరకం కూడా అనుభవించడానికే పరిమితం. కాబట్టి ఈ జన్మలోనే ఆధ్యాత్మిక సాధన చేయాలి అని భగవానుడు చెబుతున్నాడు. అదీ కూడా ఈ శరీరం వదలక పూర్వమే అని స్పష్టంగా చెబుతున్నాడు. మరణం రాక పూర్వమే మనం కామ క్రోధములను వదిలిపెట్టాలి. వాటి ప్రభావానికి లోనుకాకుండా, వాటిని అదుపుచేయగలగాలి. అందరి ఎడల సమభావం కలిగి ఉండాలి. మనస్సును పరమాత్మలో లగ్నం చేయాలి. మోక్షమార్గాన్ని చేరుకోవాలి.

మనం ఈ జన్మలో మానవులుగా పుట్టాము. కానీ మరు జన్మ కూడా మానవ జన్మ వస్తుంది అని నమ్మకం లేదు. ఏజన్మ వస్తుందో తెలియదు. కాబట్టి దీపం ఉండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలి అన్నట్టు ఈ జన్మలోనే మోక్ష సాధనకు ప్రయత్నం చేయాలి. ఈ శరీరం ఎప్పుడు రాలి పోతుందో తెలియదు. నిండు నూరేళ్లు జీవిస్తాము అన్న నమ్మకం కూడా లేదు. ఈ శరీరం ఎప్పటి దాకా పటుత్వంగా ఉంటుందో తెలియదు. "ఇప్పుడేం తొందర... తరువాత... అదీ రిటైర్ అయిన తరువాత... చూద్దాంలే ....ఇప్పుడు చక్కగా అనుభవిద్దాము" అని చాలా మంది అనుకుంటూ ఉంటారు. అలా అనుకోవడం అవివేకము అజ్ఞానము. కాబట్టి శరీరంలో శక్తి ఉన్నప్పుడు, ఈ శరీరం పడిపోకముందే సాధన చెయ్యాలి. మన అదృష్టం కొద్దీ అరుదుగా వచ్చిన మానవ జన్మను సార్థకం చేసుకోవాలి.

ఈ శ్లోకంలో పరమాత్మ కామము క్రోధము ఈ రెండింటి గురించే చెప్పాడు. కామములు అంటే కోరికలు. అవి తీరకపోతే వచ్చేది కోపం. కోపం అన్ని అనర్థాలకు మూలం అని ఇంతకుముందే తెలుసుకున్నాము. కాబట్టి కామ క్రోధములతో పుట్టే వేగమును అంటే వాటి ప్రభావాన్ని తగ్గించాలి అన్నాడు. వేగముతగ్గించడం అంటే కోపం వచ్చినపుడు పది లెక్క పెట్ట మంటారు. అంటే దాదాపు 10 సెకన్లు. అది చాలు మనలో పుట్టిన కోపం యొక్క ప్రభావం శాంతిస్తుంది. అలాగే కోరిక కలిగినపుడు, ఈ కోరిక సరి అయినదా కాదా అని బుద్ధిని ఉపయోగించి ఆలోచిస్తేచాలు. అదే కామక్రోధముల వేగాన్ని తగ్గించడం. ఎందుకంటే లోభము, మోహము, మదము, మాత్సర్యము ఇవి అన్నీ కూడా కామ క్రోధముల నుండి పుడతాయి. ముందు కామక్రోధముల వేగాన్ని తగ్గిస్తే మిగిలినవి వాటంతట అవే తగ్గిపోతాయి.

ఇక్కడ ఒక సందేహము వస్తుంది. ఈ కామక్రోధముల ప్రభావాన్ని మనమే ఎందుకు అదుపు చేయాలి దేవుడు చేయవచ్చు కదా! కాబట్టి ఓ దేవా! నాలో ఉన్న కామములను, క్రోధములను తగ్గించు అని ప్రార్థిస్తాను అని మీరు అనవచ్చు. అది కుదరదు. ఎందుకంటే కామ క్రోధములు మానవ సృష్టి. దేవుని సృష్టి కాదు. కామ క్రోధములను మనం పెంచి పోషిస్తున్నాము. కామము క్రోధము దేవుడి సృష్టిఅయితే అందరికీ ఒకే విషయంలో కామక్రోధాలు ఉండాలి. కాని అలా జరగడం లేదు. నాకు ఒకటి కావాల్సి ఉంటే, అదే మరొకరికి వద్దు అనిపిస్తుంది. ఒకడికి సుఖాన్నిచ్చే విషయం మరొకరికి దు:ఖం కలిగిస్తుంది. ఒకరికి ఒక విషయంలో కోపం వస్తే, అదే విషయం మరొకరికి సంతోషం కలిగిస్తుంది. కాబట్టి కామక్రోధాలు ఎవరెవరి ఇష్టాఇష్టాలను బట్టి, వారి వారి ప్రవృత్తులను బట్టి కలుగుతుంటాయి. మనం చేయాల్సింది అల్లా వాటిని అదుపులో పెట్టుకోవడమే. మన వశంలో ఉంచుకోవడమే. అన్నీ నాకే కావాలని కోరుకోవడం, చీటికి మాటికీ కోపం తెచ్చుకోవడం మంచిది కాదు.

కాబట్టి మనలో కామము అంటే కోరికలు, క్రోధము అంటే కోపము పెరగ కుండా అదుపు తప్పకుండా ఎప్పుడూ అప్రమత్తంగా ఉండాలి. అంతేకానీ కోరికలను, కోపాన్ని అణిచి పెట్టకూడదు. మీరు ఎంతగా అణిచిపెడితే అవి అంతకంటే రెట్టింపు వేగంతో పైకి లేస్తాయి. కాబట్టి కోరికలను, కోపాన్ని అదుపులో ఉంచుకోవాలి. దానికి ఒకటే మార్గము. మనసును ప్రాపంచిక విషయాల నుండి ఆధ్యాత్మికత వైపు మళ్లించడం.

ఆధ్యాత్మిక మార్గంలో ప్రయాణం చేసే వాడు కోరికలు కోరుకోవడం, అవి తీరకపోతే కోపం రావడం వీటితో కాలం వృథా చేయకూడదు. ఎప్పుడో వృద్ధాప్యంలో చూసుకోవచ్చులే అనే అలసత్వము అంటే సోమరి తనము పనికి రాదు. ఎందుకంటే ప్రతిక్షణం మానవుడు మృత్యువుకు దగ్గర అవుతున్నాడు. అందుకే కాలము విలువైనది. కోట్లు ఖర్చుపెట్టినా పోయిన కాలము తిరిగిరాదు అంటారు. కాబట్టి మనము మన జీవితమును సద్వినియోగం చేసుకోవాలి. జీవిత కాలంలోనే

కామ క్రోధములను అదుపుచేసి, వాటి ప్రభావానికి లోనుకాకుండా ఉన్నవాడు యుక్తుడు అంటే సరి అయిన వాడు. స సుఖీ నర:అంటే అతడే సుఖపురుషుడు అని పరమాత్మ బోధించాడు.

## 24. యోఽన్త: సుఖోఽన్తరారామ స్తథాన్తర్జ్యోతిరేవ య:। స యోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోఽధిగచ్ఛతి॥

ఎవరైతే తన ఆత్మలో తాను ఉంటూ, ఆత్మసుఖాన్ని అనుభవిస్తూ, ఆత్మలో సంచరిస్తూ ఉంటాడో, అటువంటి యోగి బ్రహ్మనిర్వాణం పొందుతాడు. తానే బ్రహ్మగా మారుతాడు. తానే బ్రహ్మఅవుతాడు.

జీవిత కాలము విలువైనది దానిని వృధా చేయరాదు అని చెప్పిన పరమాత్మ ఆత్మసుఖం ఎలా ఉంటుందో, మోక్షం పొందడానికి మార్గం ఏమిటో ఈ శ్లోకంలో వివరిస్తున్నాడు. ప్రయత్నం చేస్తే బ్రహ్మ పదమును అందరూ పొందగలరు. కాకపోతే దానికి కఠోర శ్రమచేయాలి. ఇంద్రియములను, మనస్సును నిగ్రహించాలి. మన చూపును బయట వస్తువుల మీద కాకుండా లోపలకు మళ్లించాలి. మనసును ఆత్మలో స్థిరంగా ఉంచాలి. మనం ప్రాపంచిక విషయములను ఎలా అనుభవిస్తామో అలాగే ఆత్మ సంయోగమును అనుభవించాలి.

ఈ శ్లోకంలో సుఖము అనే మాట వాడాడు. మనము సాధారణంగా సుఖాన్ని బయట ప్రపంచంలో వెదుక్కుంటాము. కొద్దిపాటి సుఖం కలిగినా దానినే గొప్పగా అనుకుంటాము. ఆలోచిస్తే మనం అనుభవించే సుఖం బయట లేదు. మన మనసులో ఉంది. ఒకే వస్తువు, ఒకే సంఘటన ఒకే విషయం ఒకరికి సుఖాన్ని ఇస్తే, మరొకరికి దు:ఖం తెచ్చిపెడుతుంది. కాబట్టి సుఖం అనే దానికి కేంద్రం మన అంతారత్మ. అక్కడ కలిగే సుఖమే శాశ్వతమైన సుఖం. బాహ్యసుఖము క్షణికము. దు:ఖంతో కూడి ఉంటుంది. కాబట్టి మనం మనస్సును అంతర్ముఖం చేసి, ఆత్మతో అనుసంధానం చేస్తే కలిగే సుఖం అనంతం. క్షణికం కాదు.

అంతర్ ఆరామ: అంటే ఆత్మయందు రమించడం, క్రీడించడం. మానవులు సాధారణంగా బయట కనపడే వస్తువులతో, స్త్రీపురుషులతో, ధనంతో, ఆస్తులతో ఆడుకుంటూ ఉంటారు. వాటి యందే రమిస్తుంటారు. వాటి యందే లీనమై వాటిని పట్టుకొని వేళ్లాడుతుంటారు. ఇది మానవ నైజం. ఇవి ఎక్కడ తమను విడిచి పెట్టి వెళ్లిపోతాయో అని నిరంతరం భయపడుతూ వేదన చెందుతుంటారు. ఇది సుఖదు:ఖాల మయం. అదే ఆత్మలో మనసును ఉంచి క్రీడిస్తే, రమిస్తే, శాశ్వతానందము కలుగుతుంది. కాబట్టి మనం వాస్తవాన్ని గ్రహించాలి.

అన్తర్ జ్యోతి అంటే లోపల వెలిగే జ్యోతి. అదే ఆత్మజ్యోతి. సూర్యుడు, దాని వెలుగు పడి ప్రతిబింబంగా ప్రకాశించే చంద్రుడు, జ్యోతులు ఇవి మనకు కనపడే వెలుగు. కాని ప్రతివాడిలో ఆత్మ జ్యోతిలాగా వెలుగు తుంటుంది. సూర్యుడు ప్రపంచంలోని వస్తువులను ప్రకాశింపచేస్తే ఆత్మజ్యోతి బుద్ధిని ప్రకాశింపచేస్తుంది. సూర్యుని వెలుగులో మనం వస్తువులను, మనుషులను చూడాలంటే మనకు కళ్లు కావాలి. ఆ కళ్లకు చూచే శక్తి కావాలి.ఆ శక్తి మనలో ఉన్నచైతన్యం వలన కలుగుతుంది. ఆ చైతన్యమే ఆత్మస్వరూపము. ఆ ఆత్మ స్వరూపము మనలో జ్యోతిలాగా వెలుగుతుంటుంది. మనలోని ఆ వెలిగే జ్యోతిని ఆశ్రయించాలి. దీపం దగ్గరకు పురుగు చేరితే మాడి పోతుంది. ఆత్మజ్యోతి దగ్గరకు మనసు చేరితో మాడి పోదు. పైగా ప్రకాశం సంతరించుకుంటుంది. ఆనందంతో నిండి పోతుంది. కాబట్టి మనం ప్రాపంచిక విషయముల మీద, బంధుమిత్రుల మీదా, ధనము, ఆస్తులు, పదవుల మీద వ్యామోహమును వదలిపెట్టి, ఆత్మలోనే సుఖాన్ని అనుభవిస్తూ, ఆత్మలోనే రమిస్తూ, నిరంతర ఆత్మానందం కోసమే ప్రయత్నం చేయాలి. అదే మానవ కర్తవ్యము. దీనినే బ్రహ్మనిర్వాణము అని అంటారు.

## 25. లభన్తే బ్రహ్మనిర్వాణమృషయ: క్షీణకల్మషా:।
## ఛిన్నద్వైధా యతాత్మాన: సర్వభూతహితేరతా:॥

అటువంటి బ్రహ్మనిర్వాణం లభించిన జ్ఞానికి తన లోపల ఉన్న పాపములు అన్నీ నశించిపోతాయి. అతనికి ఎటువంటి సందేహములు కానీ, భేదబుద్ధి కానీ ఉండదు. తన మనస్సును ఇంద్రియములను తన స్వాధీనంలో ఉంచుకుంటాడు. సకల భూతములను ప్రేమగా, హితంగా చూస్తాడు.

సాధారణంగా ఋషులు, మునులు, సాధకులు మోక్షమును పొందుతారు అని మనం అనుకుంటూ ఉంటాము. ఋషులు అంటే ఎవరు అని ప్రశ్న వేసుకుంటే ఇంద్రియములను, మనసును జయించి, మనసును ఆత్మయందు లీనం చేసి శాశ్వతసుఖములు అనుభవించే వాడే ఋషి. దానిని మనం కూడా పొందవచ్చు. కాకపోతే నిరంతర ప్రయత్నం సాధన ముఖ్యం. మనం మన పొట్టకూటికి, ధనం సంపాదించడానికి, సుఖాలు అనుభవించడానికి ఉపయోగపడే చదువుల కోసం దాదాపు 20 సంవత్సరాలు పాటుపడుతున్నాము. కనీసం అన్ని సంవత్సరాలు ఈ శాశ్వత సుఖం కోసం పాటు పడితే 30 నుండి 50 ఏళ్ల కు మనం కూడా ఋషిత్వము పొందవచ్చు. అందరూ అతనిని పూజిస్తారు. దాని కోసం సంసారము భార్య బిడ్డలను వదల నవసరం లేదు. కాకపోతే ప్రాపంచిక విషయాల మీద ఆసక్తి విడిచిపెట్టాలి. దైవధ్యానంలో గడపాలి. ఈ సాధనకు కావాల్సిన ముడి సామగ్రి ముందు మనం సమకూర్చుకోవాలి.

వాటిలో మొదటిది పాపములు పోగొట్టుకోవడం. ఈజన్మలో కాకపోయినా పోయిన జన్మలలో చేసిన  పాపాలు మన వెంట వస్తూనే ఉంటాయి. మనసు పాపంతో నిండి ఉంటే జ్ఞానం రాదు. కాబట్టి ముందు ఆ పాపాలను పోగొట్టుకోవాలి. పాపాలు పోవాలంటే పుణ్యకార్యములు చేయడం, సత్సాంగత్యము, ఇంద్రియ, మనో నిగ్రహము, నిష్కామకర్మ,భక్తి, ధ్యానము ఇవి ఆచరించాలి. మనసును నిర్మలంగా ఉంచుకోవాలి.

రెండవది సందేహాలను వదిలిపెట్టాలి. నాకు ఈ భక్తి అబ్బుతుందా అబ్బదా. దేవుడు ఉన్నాడా లేడా. ఉంటే ఏ దేవుడిని కొలవాలి. ఏ దేవుడు మంచి వాడు. ఏ దేవుడిని కొలిస్తే అనుకున్న పనులు అనుకున్నట్టు జరుగుతాయి అవీ మనకు వచ్చే సందేహాలు. ఈ సందేహాలను వదిలిపెట్టాలి. దేవుడు ఒక్కడే అని నమ్మాలి.

మూడవది ఇంద్రియ నిగ్రహము మనోనిగ్రహము: మనస్సు ఇంద్రియములు ప్రాపంచిక వస్తువుల మీదికి, విషయ వాంఛల మీదికి, కామకోరికల మీదికి పరుగులెడతూ ఉంటాయి. వాటిని కట్టడి చేయాలి. మన స్వాధీనంలో ఉంచుకోవాలి. వాటిని ఆత్మవైపు మళ్లించాలి. ఇది ప్రాధమిక విద్య. ఇది లేకుండా ఒక్క అడుగు కూడా ముందుకుసాగలేము.

నాలుగవది సకల భూత హితేరతా: అంటే సకల భూతముల యందు, సాటి ప్రాణులయందు దయ, సహ అనుభూతి, ప్రేమ కలిగిఉండాలి.

భాగవతములో ఒక పద్యం ఉంది.

భగవంతుడిని ముందు ఒక కోరిక కోరాడు ఒక భక్తుడు.

నీ పాద కమల సేవయు..... అది ఈ రోజుల్లో సాధ్యం కావడం లేదు. ఎందుకంటే గర్భగుడిలోకి ఎవరినీ రానివ్వడం లేదు.

నీ పాదార్చకులతోడి నెయ్యమును. అదీ కుదరడం లేదు. పాదార్చకులే పాపాలు చేస్తున్నారు. వారితో స్నేహం చేసి ప్రయోజనం లేదు.

ఆఖరుది.. నితాంత అపార భూతదయయును,

తాపసమందార నాకు దయసేయగదే అని అడిగాడు.

అన్నిటి కన్నా ఇది ముఖ్యం. ఇది ఒకరు ఇచ్చేది కాదు, ఇతరులు ఇస్తే తీసుకొనేది కాదు. ఎవరికి వారు ఆచరించాలి. సాటి ప్రాణుల మీద దయకలిగి ఉండాలి. సాటి మానవుడిని మనిషిగా చూడాలి. తర తమ భేదములు ఉండకూడదు. అందరిలో పరమాత్మ ఆత్మస్వరూపుడుగా వెలుగుతున్నాడు అని గుర్తించాలి. ఎవరినీ దూషించకూడదు. ద్వేషించకూడదు. అపకారము అసలు చేయకూడదు. అందరూసమానమే అనే భావన కలిగి ఉండాలి. చేతనైతే సాటి వారికి సాయం చేయాలి. అదీ

చేతకాక పోతే సదా ఇతరుల మేలు కోరుకోవాలి. అందరికీ మేలుచేయమని భగవంతుని ప్రార్థించాలి.

అన్నిప్రాణులలో పరమాత్మను చూచేవాడు ఎవరికీ అపకారము చేయడు. తనలో ఉన్న ఆత్మ, అన్ని ప్రాణులలో ఉన్న ఆత్మ ఒకటే అని భావిస్తే, ఇతర ప్రాణులకు అపకారం చేస్తే తనకు తాను అపకారం చేసుకున్నట్టే కదా! ప్రతి మానవుడికీ ఈ జ్ఞానం రావాలి. ఎవరికైనా ఆత్మజ్ఞానం కలిగిందా లేదా అనే దానికి ఇది ఒక గీటురాయి. ఇతరులను దూషించేవాడు, ద్వేషించేవాడు ఎన్నటికీ జ్ఞాని కాలేడు. మనలో ఉన్న భవరోగములకు ధ్యానము, అనుష్ఠానము మందులు అయితే సర్వభూత దయ పథ్యము వంటిది. ఎన్ని మందులు వేసుకున్నా సరిగా పథ్యము చేయకపోతే రోగం మరలా తిరగబెట్టే అవకాశంఉంది. అందుకే సర్వభూతహితే రతా: అని అన్నాడు పరమాత్మ.

ఈ నాటి మాటల్లో చెప్పుకోవాలంటే మానవుడు తన స్వార్థం వదిలిపెట్టి, సమాజశ్రేయస్సు కోసంపాటు పడాలి. "స్వంత లాభం కొంత మానుకు పొరుగువారికి తోడుపడవోయ్....దేశమంటే మట్టికాదోయ్ దేశమంటే మనుషులోయ్...." అని ఎలుగెత్తి చాటాడు నాటి గురజాడ. కాబట్టి మనిషి స్వార్థం కోసం కాకుండా పరార్థం కోసం పాటుపడాలి. దానినే మానవత అని అంటారు. మనిషి మనీషిగా బతికిన నాడే అతడు ఉన్నతస్థాయిని చేరుకోగలడు. దానినే ధార్మికజీవితం అని కూడా అంటారు. ప్రతి మానవుడు ధర్మంగా, న్యాయంగా జీవించడం నేర్చుకోవాలి. తాను ఏపని చేస్తే, ఏ మాట అంటే, ఎదుటి వాడికి కష్టం, నష్టం కలుగుతుందో తెలుసుకొని, ఆ పని తాను చేయకుండా ఉండటమే సామాజిక ధర్మం. ఈ ధర్మం పాటించినప్పుడే అతడు సుఖంగా, సంతోషంగా ఉండగలడు. ఇతరులను సంతోషంగా ఉంచగలడు.

కాబట్టి ఋషిత్వము సిద్ధించాలంటే పైన చెప్పిన నాలుగు లక్షణములను అలవరచుకోవాలి. అటువంటి వారే బ్రహ్మ నిర్వాణము పొందగలరు అని ఈ శ్లోకంలో వివరించారు.

## 26. కామక్రోధవియుక్తానాం యతీనాం యతచేతసామ్।
## అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విదితాత్మనామ్॥

ఎవరైతే కామమును, క్రోధమును విడిచిపెడతారో, ఎవరైతే తమ ఇంద్రియములను, మనసును అదుపులో పెట్టుకుంటారో, ఎవరైతే ఆత్మను గురించిన జ్ఞానమును కలిగి ఉంటారో అటువంటి యతులు అంటే సాధకులు, బ్రహ్మనిర్వాణం పొందడానికి ఎల్లప్పుడూ అర్హులు.

బ్రహ్మనిర్వాణం పొందడానికి ఇంకా మార్గాలు సూచిస్తున్నాడు పరమాత్మ.

1. కామమును అంటే కోరికలను విడిచిపెట్టాలి.  అవి తీరకపోతే వచ్చే కోపమును విడిచిపెట్టాలి.
2.మనస్సు ఇంద్రియములు మన స్వాధీనంలో ఉండాలి.
3.ఆత్మ తత్వము గురించి తెలుసుకోవాలి.

ఈ మూడు లక్షణములు కలిగి ఉంటే మోక్షము మీ వెంటే ఉంటుంది. మూడూ కష్టం ఏమీ కావు. మొదటి దానిని ఆచరిస్తే తరువాతది దానికదే కలుగుతుంది. కోరికలను, అవి తీరకపోతే కోపమును విడిచిపెడితే, చిత్తము మన స్వాధీనంలో ఉంటుంది. చిత్తము స్వాధీనంలో ఉంటే ఆత్మ తత్వము దానంతట అదే తెలుస్తుంది. కాబట్టి మనం ముందు ప్రాధమిక విద్య అయిన కోరికలు, కోపము విడిచిపెట్టాలి. తరువాత సెకండరీ విద్య అయిన చిత్తము స్వాధీనంలో ఉంచుకోవాలి తరువాత ఉన్నత విద్య అయిన ఆత్మజ్ఞానము పొందాలి. ఇవి అన్నీ కష్టపడి చదివితేనే పాస్ అవుతాము. ఊరికే గుళ్లుగోపురాలు,పుణ్యతీర్థములు తిరిగితేరావు. అలా అని దేవాలయాలకు, పుణ్యతీర్థములకు వెళ్లకూడదని కాదు. కాకపోతే ఇవి పరమాత్మ గురించి తెలుసుకోడానికి  మార్గాలు మాత్రమే.

జ్ఞానులకు కామ క్రోధాలు ఉండవా అంటే ఉంటాయి. కాని జ్ఞానులు తమలో ఉన్న కామ క్రోధములను తమ అదుపులో పెట్టుకోగలరు, వాటిని అవసరం వచ్చినపుడే ప్రదర్శించగలరు. కాని సామాన్య మానవుడికి కోరికలు, అవితీరకపోతే వచ్చే కోపము అతని అదుపులో ఉండవు. విచ్చలవిడిగా ఎక్కడంటే అక్కడ ఎప్పుడంటే అప్పుడు ప్రదర్శిస్తూ ఉంటాడు. పైగా అజ్ఞాని ఎప్పుడూ తన యోగక్షేమాల గురించే ఆలోచిస్తుంటాడు. యోగము అంటే తాను పొందినది. క్షేమము అంటే పొందిన దానిని జాగ్రత్తపెట్టుకొనేది. అజ్ఞాని ఎల్లప్పుడూ ధనం, ఆస్తులు, పదవులు, సంపాదించడం ఎలాగా అని ఆలోచిస్తుంటాడు.  అవి తనకు లభించడం ఒక యోగంగా భావిస్తాడు. లభించిన ధనాన్ని, ఆస్తిని, పదవిని కాపాడుకోవడానికి, తాను ఎల్లప్పుడూ క్షేమంగా ఉండటానికి ప్రయత్నిస్తుంటాడు.  సామాన్య మానవుడు ఈరెండింటితో సతమతమౌతూ ఉంటాడు. కాని జ్ఞాని తన యోగక్షేమాల గురించి పట్టించుకోడు. సమాజము యొక్క సాటి వారి యొక్క యోగక్షేమాల గురించి ఆలోచిస్తుంటాడు.  అదే జ్ఞానికి అజ్ఞానికీ, సామాన్యుడికీ, సాధకుడికీ ఉన్న తేడా.

ఇక్కడ యతీనాం అనేపదం వాడాడు పరమాత్మ. యతులు అంటే ప్రయత్న పూర్వకంగా సాధన చేసేవారు అని అర్థం. ప్రయత్నం చేస్తే సాధించలేనిది ఏదీ లేదు. కోరికలు, కోపము పోవాలంటే ముందు బయట ప్రపంచములో దొరికే ధనం, ఆస్తులు, పదవులు, ఇవన్నీ శాశ్వతములు కావు వాటి గురించి తాపత్రయ పడటం వృధా అనే భావన కలగాలి. అప్పుడు వాటి మీద కోరికలు ఉండవు. కోరికలు లేకపోతే కోపం ఉండదు.

రెండవది యతచేతసాం స్థిరమైన మనసు కలిగిఉండటం అంటే మనసును అదుపులో పెట్టుకోవడం. మనసును చంచలంగా ఉంచకూడదు. క్షణక్షణం మనసు మార్చుకోకూడదు. నిశ్చయాత్మక బుద్ధి కలిగి ఉండాలి. ఏకాగ్రత అలవవచుకోవాలి. త్రికరణ శుద్ధి అలవరచుకోవాలి. అంటే మనసులో ఉన్న మాట బయటకు చెప్పడం. చెప్పింది చేయడం. అంతే కానీ మనసులో ఒకటి బయటకు మరొకటి మాట్లాడకూడదు. ఈ రెండింటికీ పొంతన లేకుండా పనులు చేయకూడదు. ఆ ఏకాగ్రత రావాలంటే మనలో ఉన్న రజోగుణము తమోగుణము తగ్గించుకోవాలి. సాత్విక ఆహారం తీసుకోవాలి. సత్సాంగత్యము చేయాలి. భగవంతుని గురించి తెలుసుకోవాలి. అప్పుడు ఇంద్రియములు, మనసు మన స్వాధీనంలో ఉంటాయి. మన స్వాధీనంలో ఉన్న మనసును, బలవంతంగానైనా ఆత్మయందు నిలపడానికి ప్రయత్నం చేయాలి.

మూడవది. ఆత్మజ్ఞానము. అన్నిజీవులలో పరమాత్మ ఆత్మస్వరూపుడుగా ఉన్నాడు అని తెలుసుకోవడం, అలాగే ఆత్మ నిత్యము, దేహము అనిత్యము. దేహము నశిస్తుంది, ఆత్మకు నాశనము లేదు అని తెలుసుకోవడం. ఇదే ఆత్మజ్ఞానము. ఇది అందరికీ తెలుసు. కానీ అంగీకరించడమే కష్టం. అలా అంగీకరిస్తేనే సమభావన కలుగుతుంది. లేకపోతే భేదభావము కలుగుతుంది. ఆత్మజ్ఞానం రావాలంటే శాస్త్ర జ్ఞానం ఉండాలి. శాస్త్ర అధ్యయనం చేయాలి. శాస్త్రములలో ఉన్న విషయములను కూలంకషంగా గ్రహించాలి. అలా చేసే సాధకులను యతీనాం అంటే యతులు అని అంటారు. అంటే నిరంతరం ప్రయత్నం చేసేవారు. ఏమాత్రం అలసత్వం లేని వారు అని అర్థము.

ఈమూడు లక్షణాలను మనం అలవరచుకుంటే మనసు నిర్మలంగా ఉంటుంది, భగవంతుడు మన వెంటనే ఉంటాడు. మోక్షం ఎక్కడో ఆకాశంలో లేదు మన అరిచేతిలో ఉంటుంది అనడంలో సందేహము లేదు. వారే బ్రహ్మనిర్వాణం పొందుతారు. ఎప్పుడు పొందుతారు అంటే ఎల్లప్పుడూ పొందుతారు. జీవించి ఉండగానే పొందవచ్చు, మరణించిన తరువాత పొందవచ్చు ఎప్పుడైనా పొందవచ్చు. ఆత్మ పరమాత్మలో కలవడానికి ఒక సమయం, ప్రదేశం లేవు. ఒకే దిక్కునుండి కలవాలని లేదు. ఏ దిక్కునుండి అయినా కలవవచ్చు. ఎందుకంటే పరమాత్మ సర్వత్రా వ్యాపించి ఉన్నాడు. కాని జీవాత్మ పరమాత్మలో కలవడానికి కావాల్సింది కేవలం అర్హతలు మాత్రమే. ఆ అర్హతలు అన్నీ పైన చెప్పబడ్డాయి. ఈ అర్హతలు అన్నీ ఉంటే జీవాత్మ పరమాత్మలో లీనం అవుతుంది అనడంలో సందేహం లేదు.

27. స్పర్శాన్ కృత్వా బహిర్బాహ్యాంశ్చక్షుశ్చైవాన్తరే భ్రువోః।
ప్రాణాపానౌ సమౌ కృత్వా నాసాభ్యన్తరచారిణౌ॥
28.యతేన్ద్రియ మనోబుద్ధిర్మునిర్మోక్షపరాయణః।
విగతేచ్ఛాభయక్రోధో యస్సదాముక్త ఏవ సః॥

ఎవరైతే బయట ప్రపంచంలో ఉండే శబ్ద,స్పర్శ,రస,రూప,గంధములను తన లోపలకు రానీయకుండా అడ్డుకుంటూ ఉంటాడో, ఎవరైతే ఇంద్రియములను అదుపులో పెట్టుకుంటాడో, ఎవరైతో తనలో ఉన్న కోరికలను, భయమును, కోపమును వదిలిపెడతాడో, ఎవరైతే తన చూపును నొసటి భాగంలో నిలుపుతాడో, ఎవరైతే ప్రాణవాయువును, అపాన వాయువును (పీల్చేగాలి, వదిలేగాలి) సమం చేస్తాడో (ప్రాణాయామం చేస్తాడో), ఎవరైతే తన మనసును, బుద్ధిని నిశ్చలంగా ఉంచుకుంటాడో, ఎవరైతే ఈ ప్రాపంచిక బంధనముల నుండి మోక్షం కావాలని గాఢంగా కోరుకుంటాడో, అటువంటి వాడు ఎల్లప్పుడూ ముక్తుడే అవుతాడు. వాడినే జీవన్ముక్తుడు అని కూడా అంటారు.

సాధకుడు ఎన్నో గ్రంధాలు చదువుతుంటాడు. కాని వాటిని అర్థం చేసుకోని, ఆచరణలో పెట్టలేడు. అలా చేయడానికి, తాను చదివిన దానిని సరిగా అర్థం చేసుకోని, మనసుకు పట్టించుకోడానికి, ముందు మనసు నిర్మలంగా ఉండాలి. మనసు ప్రాపంచిక విషయాలతో మకిల పట్టి ఉండకూడదు. తెల్లగా, శుభ్రంగా ఉన్న వస్త్రానికి, ఏ రంగు వేసినా చక్కగా అతుకుతుంది. అదే మురికి పట్టిన వస్త్రానికి ఎంత మంచి రంగు వేసినా అంటదు. అలాగే మనసు నిర్మలంగా లేకపోతే, ఎన్ని గ్రంథాలు చదివినా మనసుకు పట్టవు. మనసు నిర్మలంగా, తెల్లగా, స్వచ్ఛంగా ఉండటానికి ఏమేంచేయాలో ఈ శ్లోకాలలో వివరించాడు పరమాత్మ.

మనకు బయట ప్రపంచములో నుండి వీనుల విందైన శబ్దములు, కఠోర శబ్దములు వినిపిస్తుంటాయి. అలాగే సుందరదృశ్యములు కనిపిస్తుంటాయి. బయట ప్రపంచములోని వస్తువులను తాకితే స్పర్శ సుఖము, తింటే రుచి కలుగుతాయి. ఇవన్నీ బాహ్య ప్రపంచములో నుండి మనలోపలికి ప్రవేశించేవే.

మనం తలుపు బార్లా తెరిచిపెడితే దొంగలు, కుక్కలు, అన్నీ లోపలకు బాహాటంగా ప్రవేశిస్తాయి. అదే తలుపు మూసి ఉంచితే, మనకు ఇష్టమైన వాళ్లు, మన వాళ్లు మాత్రమే ఇంట్లోకి వస్తారు. దొంగలు, కుక్కలు, పిల్లులు వస్తే కొడతాము. తరిమేస్తాము. అలాగే మన మనసు ద్వారాలను కూడా బార్లా తెరిచిపెడితే అవసరమైనవి, అవసరం లేనివి అన్ని విషయములు మనసులోకి తోసుకొని

వస్తాయి. అదే మనసును మన అదుపులో ఉంచుకుంటే మనకు కావాల్సిన వాటిని మాత్రమే మనసులోకి అనుమతించవచ్చు. ఒక వేళ ఏవైనా బలవంతాన లోపలకు తోసుకొని రావడానికి ప్రయత్నిస్తే బుద్ధి అనే కర్రతో వాటిని కొట్టి బయటకు గెంటవచ్చు. అలా కాకుండా అన్నిటినీ లోపలకు రానిస్తే చెడు అలవాట్లు అన్నీ మొదట అమాయకంగా మనసు లోపలకు వచ్చి అక్కడే తిష్టవేసుకొని కూర్చుంటాయి. ఓ పట్టాన వదలవు. మనషిని నాశనం చేస్తాయి. కాబట్టి ముందే నో అడ్మిషన్ బోర్డు పెట్టాలి. ఏ విషయములను అంటే వాటిని మనసు లోపలకు రానీయకుండా కట్టడి చేయాలి. ఇది మన కనీస కర్తవ్యం. ఈ విషయం చెప్పడానికే స్పర్శాన్ కృత్వా బహిర్బాహ్యాన్. అని వాడాడు పరమాత్మ.

చక్షుశ్చైవాన్తరేభ్రువో: అని కూడా అన్నాడు. అబ్బే ! నేను వినను, తాకను, రుచిచూడను కానీ ఊరికే చూస్తూ ఉంటాను అంటే లాభం లేదు. కళ్లు కూడా చెడువిషయములను లోపలకు చేరవేస్తాయి. కాబట్టి చూపును కూడా మనం స్వాధీనంలో ఉంచుకోవాలి. అందుకే ధ్యానం చేసేటప్పుడు చూపును రెండు కనుబొమల మధ్య అంటే ఆజ్ఞాచక్రంలో నిలపాలి. పూర్తిగా కళ్లు మూసుకుంటే తమోగుణము ఆవరించి నిద్రవస్తుంది. అలా కాకుండా మెలుకువగానే ఉండి చూపును నొసలు దగ్గర కేంద్రికరిస్తే మనసు నిలకడగా ఉంటుంది. మనకు అదీ చేతకాకపోతే, కనీసం దేవుడి ముందు కూర్చున్నపుడు దిక్కులు చూడకుండా, దృష్టిని ఎదురుగా ఉన్న విగ్రహం మీద, ఆ విగ్రహంలో అంతర్లీనంగా వెలుగుతున్న పరమాత్మ మీద కేంద్రీకరించాలి. చుట్టుపక్కల ఏం జరుగుతున్నా అటు వైపు చూడకుండా ఏకాగ్రదృష్టి కలిగి ఉండాలి.

నాసాభ్యన్తర చారిణౌ అంటే నాసిక నుండి (ముక్కులోనుండి) లోపలకు బయటకు చరించే గాలి. అంటే మనం పీల్చేగాలి, వదిలే గాలి. ప్రాణాపానౌ సమౌ కృత్వా.....వాటిని సమం చేయాలి. దీనినే ప్రాణాయామము అని అంటారు. మనం ఊపిరి ఎక్కువగా తీస్తాము. తక్కువగా వదులుతాము. అప్పుడు లోపల అపానము ఎక్కువగా పేరుకుపోతుంది. కాబట్టి పీల్చేవాయువు, వదిలే వాయువు సమానంగా ఉండాలి. అందుకే ప్రాణాపానౌ సమౌకృత్వా అని అన్నారు. అప్పుడు మనసు ప్రశాంతంగా ఉంటుంది. ఏకాగ్రత కుదురుతుంది. ఇంద్రియములను, మనస్సును బుద్ధిని స్వాధీనంలో ఉంచుకోవాలి అని పైన చెప్పబడింది. కానీ, సాధారణంగా మానవులు మనస్సు చెప్పినట్టు నడుస్తుంటారు. అలా కాకుండా మనం చెప్పినట్టు అవి నడవాలి అనే భావన కలిగి ఉండాలి. ఎందుకంటే మనం పీల్చే ప్రాణవాయువుకు, మనలో అంతర్లీనంగా ఉండే మనసుకు చాలా దగ్గర సంబంధం ఉంది. మనసును కంట్రోల్ చేయాలంటే ప్రాణాయామం చేయడం ఒకటే మార్గము. కాబట్టి మనో నిగ్రహం కేవలం ప్రాణాయామము, ధ్యానం వలన సిద్ధిస్తుంది అని తెలుసుకోవాలి.

యతేంద్రియ మనో బుద్ధి: అంటే ఇంద్రియములు, మనస్సు, బుద్ధి మన స్వాధీనంలో ఉంచుకోవాలి. వాటిని ఏకాగ్రం చేయాలి. అటు ఇటు పోనీయకూడదు. దీనినే ఇంద్రియ నిగ్రహము,

మనో నిగ్రహము అని అనవచ్చు.

విగతేచ్ఛాభయక్రోధోఅని అన్నారు. వీటినే మానసిక వికారాలు అని అంటారు. వాటిని ముందు అదుపులో ఉంచుకోవాలి. ఇచ్ఛ అంటే కోరికలు, భయము అంటే కోరికలు తీరతాయోలేదో, ఒక వేళ తీరితే అవి తనను విడిచిపోతాయేమో అన్న భయము, కోరికలు తీరకపోతే వచ్చే కోపము, ఇవన్నీ పూర్తిగా వదిలిపెట్టాలి. లేకపోతే కనీసం అదుపులో ఉంచుకోవాలి.

ఉదాహరణకు మన ఇంట్లో చిన్న గొడవ. భార్యాభర్తలు ఏదో విషయంలో కోపంతో గొడవ పడ్డారు. అప్పుడు ఆ భర్త కానీ, భార్యకానీ దేవుడి ముందు ప్రశాంతంగా కూర్చోలేరు. మనసంతా అలజడిగా ఉంటుంది. ఏకాగ్రత కుదరదు. ఏదో ఆందోళన. ఈ చిన్న గొడవ ఇంత అలజడిని సృష్టిస్తే, ఇంక పెద్ద పెద్ద విషయాల గురించి చెప్పేదేముంది. కాబట్టి ఈ మానసిక వికారాలను అదుపులో ఉంచుకోవాలి. అప్పుడే మనసు పరిశుద్ధంగా ఉంటుంది.

కామము, క్రోధము, భయము ఇవే అన్ని దుర్గుణాల సంఘాలకు వరుసగా, అధ్యక్షుడు, కార్యదర్శి, కోశాధికారి. ముందు ఈ నాయకుల పని బడితే, తక్కిన దుర్గుణాలు చిటికలో పారిపోతాయి. అప్పుడు మనసుకు పట్టిన మకిల తొలగి పోతుంది. ఆత్మ ప్రకాశిస్తుంది. అదే జ్ఞానము. అదే మోక్షమునకు దారి.

పైన చెప్పినవి పాటిస్తే మోక్షమునకు మార్గం సులువు అవుతుంది. మోక్ష పరాయణ: అంటే మోక్షం కోరుకునేవారు ఈ పద్ధతులు పాటించాలి. మోక్షం కొరకు పరితపించాలి. అదే ధ్యాసగా ఉండాలి. అంతే గానీ భోగపరాయణులుగా ఉండకూడదు. ఎప్పుడెప్పుడు ఈ భవబంధములు తొలగి పోతాయా అని తపన చెందాలి. అటువంటి వారికి మోక్షము సులభంగా దొరుకుతుంది. అటువంటి వాడు సదా ముక్త: అంటే ఎల్లప్పుడూ ముక్తుడే. వానినే జీవన్ముక్తుడు అని అంటారు. కాబట్టి మోక్షము కొరకు ఈ లోకములోనే ఈ జన్మలోనే, ఈ దేహముతోనే సాధన చేయడం కుదురుతుంది. కాబట్టి ఈ రోజే, ఇప్పుడే మనం సాధన మొదలుపెట్టాలి అని పరమాత్మ బోధ.

## 29. భోక్తారం యజ్ఞ తపసాం సర్వలోకమహేశ్వరమ్।
## సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాన్తిమృచ్ఛతి॥

మనం ఏ యజ్ఞం చేసినా, ఏ యాగం చేసినా, ఏ తపస్సు చేసినా, క్రతువులు, వ్రతాలు, పుణ్యకార్యాలు చేసినా, అవి అన్నీ ఆ పరమాత్మకే చెందుతాయి. వాటికి భోక్త ఆ పరమాత్మయే.

ఆయనే సకల లోకములకు అధిపతి. ఆయనే సకల భూతములకు, జీవరాసులకు మేలు చేకూర్చేవాడు. ఈవిషయాలు అవగాహన చేసుకున్నవాడు జీవితంలో పరమ శాంతిని పొందుతాడు.

ఇక్కడ పరమాత్మ యొక్క లక్షణములు చెప్పి, మనం ఏం చేయాలో చెప్పి ఈ అధ్యాయము ముగించాడు కృష్ణుడు. మనము యజ్ఞములు అంటే శ్రద్ధతో చేసే కార్యములు ఎన్నో చేస్తుంటాము. మునులు తపస్సు చేస్తుంటారు. మనం కూడా కొన్ని పనులు తపస్సు మాదిరి చేస్తుంటాము. వీటి ఫలములన్నీ ఈశ్వరునికే చెందుతాయి. మనం ఈ కర్మల ఫలములను ఈశ్వరునికి అర్పించాలి. అప్పుడు మనకు బంధనములు అంటవు.

లౌకికంగా చెప్పాలంటే మనం పూజలు, వ్రతాలు చేస్తుంటాము. ఆఖరున బ్రహ్మార్పణమస్తు అని అంటాము. మనం వండుకున్న పదార్థాలు పరమాత్మకు నివేదన పెడతాము. తరువాత వాటిని ప్రసాదంగా స్వీకరిస్తాము. ఇవన్నీ వాటి అర్థం మనకు తెలియకుండానే చేస్తుంటాము. ఇక్కడ వాటి గురించి తెలియజేసాడు పరమాత్మ. మనం ఏ పని చేసినా కృష్ణార్పణం, రామార్పణం, భగవదర్పణం అనే భావనతో చేయాలి. ఆ కర్మల ఫలితములను పరమాత్మకు అర్పించాలి. మనం ఇచ్చేవన్నీ తీసుకుంటాడు కాబట్టి ఆయనను భోక్త అని అన్నారు.

తరువాత ఈ పరమాత్మ సకల లోకములను పాలించే ఈశ్వరుడు. ఆయన ఎవరికీ అపకారము చేయడు. అందరి క్షేమము కోరుతుంటాడు. ఈవిషయం తెలుసుకున్న మానవులు పరమ శాంతిని పొందుతారు. అలా కాకుండా ఈ పనులన్నీ నేనే చేస్తున్నాను ఈ కర్మఫలములన్నీ నావే అని అనుకొనే వాడు ఆ కర్మల యొక్క బంధనములను పొందుతాడు. అతడికి శాంతి కరువవుతుంది. నిత్యము సుఖదు:ఖములతో సతమతమౌతుంటాడు. ఎక్కువ సుఖం ఉన్నా శాంతి ఉండదు అని మనం గమనించాలి.

ఈ శ్లోకంలో మనకు మూడు విషయాలను చెప్పాడు పరమాత్మ.

మొదటిది..... సమస్త కర్మలు యజ్ఞములు తపస్సుల యొక్క కర్మఫలములు నేను అనుభవిస్తున్నాను. ఎందుకంటే పరమాత్మ మన అందరిలో ఉన్నాడు. మనం చేసే కర్మలు కూడా ఆయనే అనుభవిస్తున్నాడు. ఇంక రెండవది ఆయన సకల లోకములకు ప్రభువు. ఆయనను మించిన శక్తి మరొకటి లేదు. కాని మానవుడు అంతా నేనే, నన్ను మించిన వాడు లేడు. అని అనుకుంటున్నాడు. అదే అజ్ఞానము ఆ అజ్ఞానము పోవాలనే పరమాత్మ ఈ విషయం తెలియజేసాడు. మూడవది పరమాత్మను నమ్మితే ఆయన మనలను సదారక్షిస్తుంటాడు. సామాన్యంగా ప్రభువుకు నిరంకుశత్వం ఉంటుంది. నన్ను మించిన వాడు లేడని విర్రవీగుతాడు. కాని ఈ సకల లోకములకు ప్రభువు అయిన పరమాత్మ శుద్ధసత్వగుణ సంపన్నుడు. అందరి క్షేమము సదా కోరుతుంటాడు. ఎవరికీ

అపకారం చేయడు. మనల నందరినీ సంసార సాగరము నుండి ఉద్ధరించడానికి గీతోపదేశం చేసాడు. పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృ తాం అని ప్రతిజ్ఞకూడా చేసాడు. అటువంటి పరమాత్మను నిరంతరము ధ్యానిస్తే పూజిస్తే ఆరాధిస్తే అతనికి పరమ శాంతి లభిస్తుంది. పరమాత్మ తత్వము తెలుసుకోని వారికి శాంతి కాదు కదా దు:ఖములు అనుభవిస్తాడు.

ఇప్పటి దాకా ఈ అధ్యాయములో ఇంద్రియ నిగ్రహము, మనో నిగ్రహము, తత్వ విచారణ, మొదలగు విషయములు చెప్పబడ్డాయి. అధ్యాయము ఆఖరున అన్ని ఫలములు తనకు అర్పించి పరమ శాంతిని పొందమని పరమాత్మ మనకు అభయం ఇచ్చాడు. మనం కష్టపడి సంపాదించిన ధనం బాంకులో దాచుకుంటున్నాము అంటే ఆ బాంకు మీద మనకు ఉన్న అపారమైన నమ్మకం. అలాగే అన్ని కర్మఫలములు ఆయనకు అర్పించడం అంటే ఆయన మీద మనకు ఉన్న అచంచలమైన భక్తి విశ్వాసములు, ఆయన మనలను రక్షిస్తాడు అనే నమ్మకం కలిగి ఉండడం అని అర్థం. అలా చేస్తే ఎల్లప్పుడు భగవంతుడు మన వెంటనే ఉంటాడు. మనలను కాపాడుతూ ఉంటాడు అని ఈ శ్లోకం వివరించింది.

ఉపనిషత్తులయొక్క, బ్రహ్మవిద్యయొక్క,
యోగశాస్త్రము యొక్క సారమయిన భగవద్గీతలో,
కర్మసన్న్యాస యోగము అను ఐదవ అధ్యాయము సంపూర్ణము.
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# భగవద్గీత

## ఆరవ అధ్యాయము

## ఆత్మ సంయమ యోగము

ఈ అధ్యాయము పేరు ఆత్మసంయమయోగము. దీనినే ధ్యాన యోగము అని కూడా అంటారు. ఆత్మ అంటే మనస్సు, బుద్ధి, హృదయము, చిత్తము అని కూడా అర్థాలు ఉన్నాయి. వీటిని అన్నిటినీ సంయమించడం, అంటే సరి అయిన స్థితిలో ఉంచడం గురించి ఈ అధ్యాయములో చెప్పబడింది. 5వ అధ్యాయము ప్రారంభంలో, కర్మ సన్యాసము మంచిదా లేక కర్మయోగము గొప్పదా అని అడిగిన ప్రశ్నకు రెండూ అవసరమే కాని కర్మయోగము కన్నా జ్ఞానయోగము గొప్పది అని చెప్పబడింది. ఇప్పుడు చెప్పబోయే ఆత్మ సంయమ యోగము పైనచెప్పబడిన రెండు యోగములకు సహాయంగా ఉంటుంది అని చెప్పాడు పరమాత్మ. ధ్యానము అంటే ఏమిటో మనకు ఎంతో కొంత తెలుసు.

ఇక్కడ ఉపనిషత్తుల ప్రకారంగా ధ్యానం అంటే ఏమిటో తెలియజేసాడు వ్యాసుడు. ధ్యానము అనేది మోక్షం పొందడానికి మార్గం కాదు. మోక్షం అనేది ఎవరో ఇచ్చేది కాదు. దేనివల్లో వచ్చేది కాదు. మోక్షం మన సహజలక్షణం. మనం రకరకాల కర్మలు చేస్తూ ఫలితాలను అనుభవిస్తూ, బంధనాలు కలిగించుకుంటూ ఆ మోక్షద్వారాన్ని మనకు మనమే మూసివేసుకున్నాము. ధ్యానము కూడా ఒక కర్మ కాబట్టి దాని వలన కూడా ఏదో ఒకఫలితం వస్తుంది, అది కూడా బంధనము కలిగిస్తుంది. కర్మ చేయడం వలన వచ్చే ఫలితం శాశ్వతం కాదు. పైగా బంధనము కలిగిస్తుంది అశాశ్వతము, బంధన హేతువు అయిన ధ్యానం శాశ్వతమైన మోక్షమును ఇవ్వలేదు. కాబట్టి, ధ్యానం మోక్షానికి మార్గం కాదు. మోక్షం అనేది తెలుసుకోవలసినదే కానీ, పొందేది కాదు ఎందుకంటే మోక్షం అనేది సహజంగా మనలోనే ఉన్న స్వభావము. కాకపోతే మనలోనే మోక్షం ఉన్న సంగతి మనకు తెలియదు. అందుకని దాని కోసం పాకులాడుతుంటాము. మన సహజ స్వభావం మోక్షము అని జ్ఞానంతోనే తెలుసుకోవాలి.

పోనీ ధ్యానంవలన జ్ఞానం కలుగుతుందా అంటే అదీ సాధ్యంకాదు. జ్ఞానం పొందడానికి వేద ప్రమాణము, శాస్త్ర ప్రమాణము కావాలి. వేదములను, శాస్త్రములను చదివి అర్థంచేసుకోవడం ద్వారా జ్ఞానం వస్తుంది కానీ ధ్యానం వలన కాదు. మరి ధ్యానం వలన ఏదో ఒక ప్రయోజనం ఉండాలి కదా. అదేమిటంటే ధ్యానం మన మనసును ఆధ్యాత్మిక చింతన కొరకు

సిద్ధం చేస్తుంది. సమాయత్తం చేస్తుంది. ఎలాగైతే రైతు పంటలు పండించడానికి ముందు నేలను దున్ని సిద్ధం చేస్తాడో అలాగ. కేవలం నేలను దున్నడంతోనే పంటలు పండవు. విత్తనాలు వేయాలి, కలుపు తీయాలి, నీరు పెట్టాలి, చీడపీడల నుండి కాపాడాలి, ఇలా ఎన్నో చేయాలి. ఇదే మాదిరి, మనము వేదములను, శాస్త్రములను గురువు ముఖతా అధ్యయనంచేయడానికి ముందు, ధ్యానం మనలను, మనసును సమాయత్త పరుస్తుంది. కాబట్టి ధ్యానం మనకు ఏకాగ్రతను కలిగిస్తుంది. ఏకాగ్రత కొరకు ఒక దేవతా మూర్తిని ఎదురుగా పెట్టుకొని ధ్యానం చేయడం మంచిది. ఆ ప్రకారంగా ధ్యానం చేస్తూ ఏకాగ్రతను, దైవము మీద భక్తిని పెంపొందించుకోవాలి. తరువాత మంచి గురువును ఆశ్రయించి వేదములు శాస్త్రములు అధ్యయనం చేయాలి. అధ్యయనం చేసిన వాటిని మననం చేయాలి. తరువాత ఆచరించాలి. అప్పుడే జ్ఞానం వస్తుంది.

కాని కొంత మందికి ఎన్నిచదివినా అధ్యయనం చేసినా శాంతి కలగదు. ఏదో అశాంతితో బాధపడుతుంటారు. అలాంటి వారి మనసులో ఏదో విపరీతమైన భావన లేక వ్యతిరేక భావన ఉంది అని అర్థం. ఈ విపరీత భావన మనలో ఉన్న అలవాట్ల వలన కలుగుతుంటుంది. ప్రతి దానికీ సందేహించడం. అనుమానపడటం. అధైర్యపడటం. నిరుత్సాహపడటం. ఇటువంటి వ్యతిరేక భావనలతో చదివింది అర్థం కాదు, ఏం చేయాలో తోచదు, చేయాల్సింది చేయలేము. కాబట్టి మనలో కరుడు కట్టి ఉన్న ఆ వ్యతిరేక భావనలను ముందు తీసివేయాలి. ఈ వ్యతిరేక భావనలు పోవాలంటే అనుకూల భావనలు పెంపొందించుకోవాలి. దానినే పాజిటివ్ తింకింగ్ అని అంటారు. ఎల్లప్పుడూ జాగరూకతతో ఉండాలి. సోమరి తనం పనికిరాదు. ఆ విధంగా మన మనసులో నుండి ఈ వ్యతిరేక భావనలను తీసివేసిన తరువాత చేసే ధ్యానం మనసును నిర్మలంగా ఉంచుతుంది. మనం ఎవరో మనం తెలుసుకోవడానికి ఉపయోగపడుతుంది. అంటే ఆత్మజ్ఞానం కలుగజేస్తుంది. .

ఈ ధ్యానం చేయడానికి కావాల్సిన మొదటి లక్షణం ధార్మిక జీవనం. ధర్మంగా జీవనం గడపడం. అన్యాయంగా అధర్మంగా ధనము, ఆస్తులు సంపాదించకూడదు. ఎల్లప్పుడూ పరమాత్మయందు భక్తి కలిగి ఉండాలి. రెండవది ధ్యానం చేయడానికి ముందు మనలను మనం ఎలా సమాయత్త పరచుకోవాలి. మూడవది దేని గురించి ధ్యానంచేయాలి. నాలుగవది ధ్యానం చేసేటప్పుడు మనకు ఏమేమి అవాంతరాలు, అడ్డంకులు వస్తాయి, వాటిని ఎలా పరిహరించుకోవాలి. ఐదవది.. ఈ ధ్యానం చేస్తే ఏం ఫలం కలుగుతుంది. వీటి గురించి మనకు ఈ ఆరవ అధ్యాయం తెలియజేస్తుంది. ఐదవ అధ్యాయం ఆఖరున ఉన్న మూడు శ్లోకములకు వివరణే ఈ ఆరవ అధ్యాయము అని పెద్దలు చెబుతారు.

## 1. అనాశ్రిత: కర్మఫలం కార్యం కర్మ కరోతి యః।
## స సన్యాసీ చ యోగీ చ న నిరగ్నిర్నచాక్రియః॥

తాను చేసిన కర్మల వలన లభించే ఫలములను ఎవరు ఆశించడో, ఎవరైతే తాను చేయవలసిన కర్మలను మాత్రమే చేస్తున్నాడో, అతడే నిజమైన యోగి, సన్యాసి. అంతేగానీ అగ్ని హొత్రం వదిలిపెట్టడం, ఏ పనీ చేయకుండా సోమరిగా ఉండేవాడు సన్యాసి కాడు యోగి అంతకంటే కాడు.

సన్యాసి అంటే అన్నీ వదిలేసి అడవులలో ముక్కు మూసుకొని ఉన్న వాడనీ, కాషాయ గుడ్డలు కట్టి దండము చేతబట్టినవాడనీ, గృహస్థులు చేయవలసిన నిత్యాగ్నిహొత్రము మొదలగు కర్మలను వదిలిన వాడనీ మనకు రూఢి అర్థము. యోగి అంటే ప్రపంచమును వదిలిపెట్టి కొండ గుహలలో ఉన్నవాడని అర్థం. ఇవి అన్నీ పైకి కనపడే వేషాలు. కాషాయాలు కడితే సన్యాసులు, కొండగుహలలో ఉంటే యోగులు కారు. మనసులో ఉన్న కల్మషము, వాసనలు నశించిన వాడు, దేని మీదా సంగము అంటే అటాచ్‌మెంట్ లేని వాడు, ఫలాపేక్ష వదిలిపెట్టినవాడు, లోపలా బయటా శుచిగా ఉన్నవాడు, ఇటువంటి వారు ఎక్కడ ఉన్నా ఏ వేషంలో ఉన్నా వారు సన్యాసులే, యోగులే.

చేయతగ్గ కర్మలు మాత్రమే చేసేవాడు, చేసిన కర్మలకు ఫలితం ఆశించని వాడు, వాడే నిజమైన సన్యాసి. అదేసన్యాసి లక్షణము. మేము సన్యాసులమని చెప్పి కాషాయాలు కట్టి, సోమరిపోతుల్లా తిరిగే వారు అసలు సన్యాసులే కాదు.. కర్మఫల త్యాగము, సంగము వదిలిపెట్టడం సన్యాసులకు, యతులకు గుర్తు. వీడు సన్యాసి అవునా కాదా అని పరీక్షించడానికి వాడు చేయతగిన కర్మను చేస్తున్నాడా, ఆ కర్మను ఫలాపేక్షలేకుండా చేస్తున్నాడా అని చూడాలి. సన్యాసి అయిన వాడు అధర్మ కార్యములను, శాస్త్రవిరుద్ధకార్యములను, పాపకార్యములను చేయకూడదు. ఇతరులకు ఉపయోగపడే పనులనే చేయాలి. అదీ ఫలాపేక్షలేకుండా చేయాలి. వాడే నిజమైన సన్యాసి. అటువంటి వాడు గృహస్థుడైనా వాడు సన్యాసితో సమానమే. అటువంటి వాడు ఏ జాతి, ఏకులము ఏవర్ణము వాడు అనీ భేదములేదు. ఎవరైనా సన్యాసి కావచ్చును.

అనాశ్రిత: కర్మఫలం అంటే బయట ప్రపంచంలో మనంచేసే పనులకు వచ్చే ఫలితముల మీద ఎక్కువ ఆసక్తి చూపకూడదు. వాటి గురించి ఎక్కువగా ఆలోచించకూడదు. కార్యం కర్మ కరోతి య: అంటే ఎవరైనా సరే, వాళ్లు ఏజాతి, మతం, కులానికి చెందిన వాళ్లు అయినా, ఆడగానీ, మగగానీ, ఎవరైనా సరే, శాస్త్ర సమ్మతమైన కర్మలనే చేయాలి. అవినీతి కరమైన, అసాంఘికమైన, శాస్త్రవిరుద్ధమైన పనులు చేయకూడదు. దానినే ధార్మిక జీవనం అని పైన చెప్పుకున్నాము. ప్రతి

వాడూ ధర్మంగా జీవించాలి.

స సన్యాసీచ యోగీ చ అంటే అటువంటి వాడిని సన్యాసి, యోగి అని అంటారు. సన్యాసి అంటే కాషాయాలుకట్టుకోనవసరం లేదు. దండం పట్టుకోనవసరం లేదు. హిమాలయాలకు పోనవసరం లేదు. గృహస్థ జీవితం గడుపుతూనే పైలక్షణాలు కలిగి ఉంటే వాడిని సన్యాసి యోగి అని అనవచ్చు. అటువంటి గృహస్థ గతాన్ని గురించి కానీ, భవిష్యత్తు గురించి కానీ ఆలోచించడు. ఎప్పుడూ ప్రశాంతంగా ఉంటాడు. సన్యాసికి, యోగికి ఎటువంటి మనశ్శాంతి దొరుకుతుందో, అదే మనశ్శాంతి గృహస్థుకు దొరుకుతుంది.

న నిరగ్నిర్నచా క్రియ: అంటే కేవలం గృహస్థుకు విధింపబడిన అగ్నికార్యములు, యజ్ఞయాగములు వదిలినంత మాత్రాన, కాషాయములు కట్టి, దండము చేత బట్టినంత మాత్రాన సన్యాసి కాడు. ఎందుకంటే వాడి వేషం, క్రియలు సన్యాసికి తగినవి అయినా, మనసులో మాత్రం వాడు గృహస్థుగానే ఉంటాడు. అటువంటి వాడిని మిథ్యాచార: అని ఇంతకు ముందే చెప్పారు.

## 2. యం సన్న్యాసమితి ప్రాహుర్యోగం తం విద్ధిపాణ్డవ।
## న హ్యసన్న్యస్తసంకల్పో యోగీ భవతి కశ్చన॥

దేనిని అయితే సన్న్యాసము అని పెద్దలు చెబుతారో, ఓ అర్జునా! దానినే యోగము అని తెలుసుకో! ఎందుకంటే తనలోని సంకల్పములను వాటి ద్వారా పుట్టే కోరికలను సన్న్యసించనివాడు అంటే వదిలి పెట్టని వాడు, యోగి కాలేడు.

ఇక్కడ పరమాత్మ సన్యాసికి యోగికి భేదము లేదు అని చెబుతున్నాడు. సన్యాసము అని దేనిని అంటారో దానినే యోగము అని కూడా అంటారు. కామ కోరికలు, వాటి కోసం సంకల్పములు చేసే వాడు యోగి కాలేడు. యోగి అయినవాడు ఆత్మ, శరీరము వీటి భేదం తెలుసుకుంటాడు. మనసును ఆత్మలో నిలుపుతాడు. ఆత్మానందాన్ని పొందుతాడు. ప్రాపంచిక విషయములు కావాలని, వాటి పొందడానికి కోరికలు కోరుకోవాలని, ఎటువంటి సంకల్పము చేయడు. ఏ పని చేసినా నేను చేస్తున్నాను అనే అహంకారముతో చేయడు. అన్ని కార్యములు పరమాత్మ పరంగానే చేస్తాడు. ఆ కర్మఫలములను పరమాత్మకే అర్పిస్తాడు. ఎల్లప్పుడూ మనసును అంతర్ముఖం చేసి దైవధ్యానం చేస్తుంటాడు.

ఏ యోగము అభ్యాసము చేసినా, ప్రాపంచిక విషయముల యందు ఆసక్తిని వదిలిపెట్టడం, వాటిని కోరుకోకపోవడం, కోరికలు తీరాలని సంకల్పించకపోవడం అనేవి

ముఖ్యలక్షణములు. బయట ప్రపంచముతో సంబంధము కలవాడు, నిత్యము ఏదో ఒక సంకల్పము చేసేవాడు, కోరికలు కోరుకునేవాడు, యోగి కాడు. కాబట్టి సంకల్పత్యాగమే యోగియొక్క, సన్యాసి యొక్క ముఖ్య లక్షణము .

ఇంకా వివరంగా చెప్పాలంటే పైపై వేషధారణ వలన సన్యాసి, యోగి కాలేడు. మానసికంగా కూడా అతనికి సన్యాసి యోగి లక్షణాలు ఉండాలి. హిమాలయాలకు వెళ్లినా, ఇంటి మీద ధ్యాస, ఉన్న వూరి మీద ధ్యాస, బంధుమిత్రుల మీద ధ్యాస ఉంటే సన్యాసి కాలేడు. ఇంట్లో ఉండి కూడా నిర్మలమైన మనసుతో, నిష్కామ కర్మలు చేసేవాడు, నిరంతరం పరమాత్మయందే మనసును లగ్నం చేసిన వాడు నిజమైన సన్యాసి.

3. ఆరురుక్షోర్మునేర్యోగం కర్మ కారణముచ్యతే।
యోగారూఢస్య తస్యైవ శమ: కారణముచ్యతే॥

యోగమును అభ్యాసము చేయదలచిన మునికి కర్మలు చేయడం ఒక సాధనంగా ఉపయోగపడుతుంది. అలాగే యోగమును చక్కగా అభ్యసించిన తరువాత అంటే యోగారూఢుడు అయిన తరువాత, ఆ కర్మలను వదిలివేయడం కూడా ఒక ముఖ్యమైన సాధనము.

మనం ఇంతకు ముందే నేర్చుకున్నాము. జ్ఞాన యోగం కానీ, ధ్యానయోగం కానీ అభ్యాసం చేయడానికి ముందు నిష్కామ కర్మయోగం అవలంబించాలి. ధ్యానంలో మనసు కుదిరిన తరువాత, కొంచెం జ్ఞానము అలవడిన తరువాత ఆ కర్మచేయడం కూడా వదిలిపెట్టాలి. దానినే శమము అంటారు. కాబట్టి ధ్యానయోగములోకి ప్రవేశించే ముందు మనసు శుద్ధిచేసుకోవాలి. దానికి ఉపయోగించేదే నిష్కామకర్మ. ధ్యానములో నిలకడ కుదిరిన తరువాత క్రమక్రమంగా కర్మలు చేయడం తగ్గించాలి.

సాధారణంగా మానవులు ఏదో ఒకటి ఆచరిస్తుంటారు. కొంతమంది జీవితాంతం కర్మలే చేస్తుంటారు. అంతకు మించి పైకి పోరు. మరి కొంతమంది మొదటి నుండి కర్మలను విడిచిపెట్టి తాము సన్యాసులము అని చెప్పుకుంటూ ఉంటారు. ఏమీ చేయరు. సోమరులుగా ఉంటారు. ఈ రెండూ ఆచరణీయం కాదు. కాబట్టి ఎవరైనా సరే ముందు నిష్కామ కర్మలు చేయడంతో మొదలుపెట్టాలి. అందుకే ముందు గృహస్థాశ్రమము తరువాత వానప్రస్థము ఆఖరున సన్యాసము అని నిర్ణయించారు. గృహస్థుగా ఉండి నిష్కామ కర్మలతో మొదలు పెట్టాలి ఎందుకంటే నిష్కామ కర్మ చిత్తశుద్ధిని కలిగిస్తుంది. అతనిని ధ్యానయోగము దాకా తీసుకొని వెళుతుంది. అక్కడ నిలిచిపోతుంది. ధ్యానంలో సాధకుడు శాంతినిపొందుతాడు. తరువాత ఆ పై స్థితిని

చేరుకుంటాడు. మనసును అంతర్ముఖం చేస్తాడు. మనసును ఆత్మలో నిలుపుతాడు. ఈ ప్రక్రియ సాధకునికి ధ్యానములో సిద్ధిని కలుగజేస్తుంది. అతనిని యోగారూఢుడు అని అంటారు.

తరువాత స్థితి ఆత్మానుభవము. పరమాత్మలో ఐక్యము. కాబట్టి ఆధ్యాత్మ రంగంలో ప్రవేశించాలంటే, యోగారూఢుడు కావాలంటే, ముందు నిష్కామ కర్మ, పుణ్యకార్యాలు చేయడం, మొదటి మెట్టు. లేకపోతే మనిషి సోమరిపోతు అవుతాడు. తమోగుణమునకు దాసుడు అవుతాడు. అప్పుడు అతనికి ధ్యానము కుదరదు. మనసు నిలకడ ఉండదు. నిష్కామ కర్మల ద్వారా ధ్యానయోగము అభ్యసిస్తే, క్రమక్రమంగా అతడు కర్మలను విడిచి ధ్యానములోనే ఎక్కువ కాలము గడుపుతాడు.

కాబట్టి యోగి, సన్యాసి కాదలచిన వాడు నేరుగా కాషాయాలు కట్టి దండము పట్టుకొని నేను సన్యాసిని అని ప్రకటించుకోకుండా ముందు నిస్కామకర్మ, పుణ్యకార్యములు, సత్సంగము తరువాత ధ్యానము, తరువాత కర్మ త్యాగము చేయాలి. ఇదే సరి అయినమార్గము అంతే కానీ నేను సన్యాసిని అని పాదపూజలు చేయించుకుంటూ  ఇతరుల మీద ఆధారపడి బతకడం కాదు.

ఈ శ్లోకంలో ఇద్దరి గురించి చెప్పబడింది. 1.ఆరురుక్షువు అంటే ప్రాథమిక స్థితి. ప్రాథమిక విద్య నేర్చుకోవడం. 2. యోగారూఢుడు అంటే యోగమును పూర్తిగా అభ్యసించడం అంటే పట్టభద్రుడు కావడం. ముందు నిష్కామ కర్మయోగంతో మొదలుపెట్టి, చివరకు ఆ కర్మలను కూడా వదిలి పెట్టి మోక్షానికి మార్గం సుగమం చేసుకోవాలి. యోగారూఢుడు అంటే ఎవరో మనం యోగారూఢులము అయ్యామో లేదో ఎలా తెలిసేది అంటే యోగారూఢుడు ఎలా ఉంటాడు, అతని లక్షణములు ఏమిటి, అతనిని ఎలా గుర్తించాలి అనే విషయాలు ఈ కింది శ్లోకంలో వివరించబడ్డాయి.

## 4. యదా హి నేన్ద్రియార్థేషు న కర్మస్వనుషజ్జతే।
## సర్వసంకల్పసన్న్యాసీ యోగారూఢ స్తదోచ్యతే॥

యోగారుఢుడు అని తెలుసుకోవాలంటే మూడు లక్షణాలు ఉండాలి.

1. ఇంద్రియార్థములు అంటే బయట ప్రపంచంలో ఉండే శబ్ద, స్పర్శ, రస, రూప, గంధముల మీద ఆసక్తిని వదిలిపెట్టాలి.

2. వాటిని సంపాదించడానికి కర్మలు చేయడంలో ఆసక్తిని వదిలిపెట్టాలి.

3.మనస్సుతో చేసే సమస్త సంకల్పములు వదిలిపెట్టాలి.

అటువంటి వాడిని యోగారూఢుడు అంటే యోగమును చక్కగా అభ్యసించిన వాడు, యోగములో మాస్టర్ అయిన వాడు అని చెప్పవచ్చు.

ముందు శ్లోకంలో యోగారూఢుడుని గురించి చెప్పాడు పరమాత్మ. ఈ శ్లోకంలో యోగారూఢుని లక్షణాలు చెబుతున్నాడు. బయటనుండి వచ్చే దృశ్యములయందు, శబ్దములయందు, స్పర్శసుఖములయందు, ప్రాపంచిక విషయముల యందు, కోరికల యందు, కర్మలయందు ఎవరైతే ఆసక్తిని వదిలిపెడతారో, ఆ మాటకు వస్తే సమస్త కర్మలకు మూలకారణమైన అన్ని సంకల్పములను వదిలిపెడాతాడో అతడే యోగారూఢుడు. యోగారూఢుడు కావాలంటే మూడు ముఖ్యలక్షణములు చెప్పారు.

1. ఇంద్రియములకు సంబంధించిన విషయములయందు ఆసక్తి లేకపోవడం.
2. కర్మల యందు ఆసక్తి లేకపోవడం,
3. కర్మలకు మూల కారణమైన సమస్త సంకల్పములను వదిలిపెట్టడం.

ఒక వ్యక్తి యోగి లేక యోగారూఢుడు అవునాకాదా అని తెలుసుకోడానికి ఈ పరీక్షలు చాలును.

బయట ప్రపంచంలో జరిగే సంఘటనల మీద ఆసక్తి ఉన్న వాడికి మనస్సు నిలకడగా ఉండదు. ధ్యానంలో కూర్చుంటే ఏకాగ్రత ఉండదు. మనస్సు బయటకు పరుగెత్తకుండా ఉండాలంటే, బాహ్య విషయములమీద ఆసక్తి వదలాలి. అప్పుడు మనస్సు బయటనుండి లోపలకు వస్తుంది. ఆత్మవైపు చూస్తుంది. సాధకుడు ఈ స్థితికి చేరుకుంటే కర్మల మీద కర్మఫలముల మీద ఆసక్తి ఉండదు. అలా కాకుండా మరలా మొదటకు వస్తే, ధ్యానం కూడా మొదటికి వస్తుంది.

దీని అర్థం బయట ప్రపంచంలో ఉండే శబ్ద,స్పర్శ,రస,రూప,గంధముల పట్ల విముఖత పెంచుకోమనికాదు. ఎందుకంటే అవి అనునిత్యము నీ ఇంద్రియములను తాకుతూ ఆకర్షిస్తుంటాయి. వాటి ఆకర్షణకు లోనుకాకూడదు. వాటి మీద ఆసక్తి చూపకూడదు. వాటిని మనకు ఎంతవరకు అవసరమో అంతవరకే ఉపయోగించుకోవాలి. ఉదాహరణకు ధనం, ఆస్తి మనకు ఎంత కావాలో అంతే సంపాదించాలి అంతేకానీ అన్యాయాలకు, అక్రమాలకు పాల్పడి, రాబోయే తరాలకు కూడా మనమే సంపాదించకూడదు. ఇంక రెండవది. ఈ ఇంద్రియార్థములను పొందడానికి కర్మలు చేయాలి. కాని ఆ కర్మల పట్ల ఆసక్తి బంధము కలిగి ఉండకూడదు. శ్రద్ధతో చేయాలి కానీ ఆసక్తితో కాదు. చేసే కర్మమీద ఆసక్తి ఉంటే దాని ఫలం మీద కూడా ఆసక్తి పెరుగుతుంది. అది బంధనాలకు కారణం అవుతుంది. కాబట్టి మనం చేసే కర్మల మీద అనవసరమైన ఆసక్తి, అటాచ్ మెంట్ కలిగి ఉండకూడదు. కోరికలు కలగడానికి గానీ, వాటినితీర్చుకోడానికి తగిన కర్మలుచేయడానికి గానీ, మూలము మనసులో సంకల్పము కలగాలి. ఏ కోరికనైనా సంకల్పము గా ఉండగానే నాశనం చేస్తే కోరిక గానీ, కర్మగానీ, కర్మఫలములు గానీ ఉండవు. కాబట్టి సాధకుడు మొదట సంకల్పముల స్థాయిలోనే వాటినివదిలి పెట్టడానికి దృష్టిపెట్టాలి.

మనము మనసుతో చేసేసంకల్పాలు మూడు విధాలుగా ఉంటాయి.

1.మలినమైన సంకల్పము. దానినే దుష్టసంకల్పము. ఎప్పుడూ సాటివాడికి అపకారం చేయాలనే సంకల్పము. సమాజానికి హాని చేయాలనే సంకల్పము. అంతా తనకే రావాలి. ఎదుటి వాడు నాశనం అయిన పర్వాలేదు అనే సంకల్పము. ఇటువంటి వాటిని దుష్టసంకల్పములు అని అంటారు.

2. శుద్ధ సంకల్పము. అంటే సాత్వికమైనసంకల్పములు. సాటివాడికి మేలు చేయడం, సాధ్యమైనంత వరకు ఇతరులకు అపకారంచేయకుండా ఉండటం, చేతనైతే ఇతరులకు ఉపకారం చేయడం, సమాజ హితం కోరడం, సమాజ శ్రేయస్సుకొరకు పాటుపడటం, స్వార్ధాని కంటే పరార్థమునకే ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వడం. ఇవీ శుద్ధ సంకల్పాలు.

3. అసలు సంకల్పమే చేయకపోవడం. దీనినే సంకల్పరాహిత్యము అంటారు. అసలే సంకల్పములు చేయకపోవడం.

కాబట్టి మొట్ట మొదట మనలో ఉన్న దుష్టసంకల్పములను పూర్తిగా తుడిచిపెట్టాలి. తరువాత శుద్ధమైన, సత్వగుణసంపన్నమైన సంకల్పములనే చేయడం అలవాటు చేసుకోవాలి.. తుదకు అసలు సంకల్పములే చేయకుండా ఉండే స్థితికి చేరుకోవాలి. అప్పుడు చిత్తము నిర్మలంగా ఉంటుంది. ఆత్మలో రమిస్తూ ఉంటుంది. దీనినే యోగారూఢస్థితి అంటారు.

## 5. ఉద్ధరేదాత్మనా22త్మానం నాత్మానమవసాదయేత్। ఆత్మైవ హ్యాత్మనో బన్ధురాత్మైవ రిపురాత్మనః॥

ఎవరిని వారే ఉద్ధరించుకోవాలి. ఎవరూ తనకు తాను అధోగతిపాలు కాకూడదు. ఎందుకంటే తనకు తానే మిత్రుడు, తనకు తానే శత్రువు.

మూడుముక్కలలో చెప్పినా ముఖ్యమైన విషయం చెప్పాడుపరమాత్మ. ఎవడిని వాడు ఉద్ధరించుకోవాలి కానీ ఎవరూ వచ్చి ఉద్ధరించరు. స్వామీజీలు, బాబాలు మార్గం చూపిస్తారు కానీ, ఎవరూ మిమ్మల్ని ఉద్ధరించరు. మిమ్మల్ని మీరే ఉద్ధరించుకోవాలి. ఎవరో ఏదో చేస్తారని ఆశపడవద్దు. మీకు మీరే మిత్రుడు. మీకు మీరే శత్రువు. మీరు చెడిపోవడానికి మీరే కారణము కాని ఎవరో కాదు. అన్న పరమ సత్యాన్ని బోధించాడు పరమాత్మ.

ఈ లోకంలో ప్రతి వాడుకూడా తాను ఉన్నత స్థితికి రావాలని కోరుకుంటాడు. దాని కొరకు మంచి వారితో స్నేహం చేస్తాడు. ప్రతి వాడు కూడా తనను తాను ఉద్ధరించుకోడానికి ప్రయత్నించాలి. గురువు బోధిస్తాడు. మంచి మార్గము చూపుతాడు. ఆ మార్గంలో పోవాల్సింది

మానవుడే . కృషితో నాస్తి దుర్భిక్షమ్ అని అన్నారు. నీ పని నీవు సక్రమంగా చేస్తే దేవుడు కూడా సాయం చేస్తాడు. ఏమీ చదవకుండా, స్వామీ నన్ను పాస్ చెయ్యి అని రోజూశివాలయం వెళ్లినా, సాయిబాబాకు మొక్కినా, ఏమీ ప్రయోజనం లేదు. అందుకే నిన్ను నీవు ఉద్ధరించుకోవాలి అని చెప్పాడు పరమాత్మ. మనకు ఉన్న దు:ఖములు పోవాలన్నా, మోక్షం పొందాలన్నా, జనన మరణచక్రము నుండి తప్పుకోవాలన్నా, ముందు మన కృషి, ప్రయత్నము ఉండాలి.

"నారు పోసిన వాడు నీరు పోయకపోతాడా....ఎలా జరగాలంటే అలా జరుగుతుంది. మనం ఏ చేసీ లాభం లేదు......అంతా దేవుడి దయ ఎలా రాసి పెడితే అలా జరుగుతుంది.......శివుడి ఆజ్ఞలేనిదే చీమ అయినా కుట్టదు" ఇటువంటి శుష్కవేదాంతం వల్లిస్తూ సోమరితనంగా ఉండటం, ఏమీ చేయకపోవడం వలన ఏమీ సాధ్యం కాదు. దేనికైనా మానవ ప్రయత్నం ముఖ్యం. మన కర్తవ్యం మనం నెరవేరిస్తే, భగవంతుడు మనకు తన వంతు సాయంఅందిస్తాడు.

ఈ సముద్రం దాటడం నావల్లకాదని హనుమంతుడు చేతులు ముడుచుకొని కూర్చుంటే సీతాన్వేషణ సాధ్యం అయ్యేది కాదు. కష్టపడితేనే ఫలితం దక్కుతుంది. యోగమును అభ్యసించాలంటే సాధన, ఇంద్రియ నిగ్రహము, తృప్తి, నిష్కామకర్మ మొదలగు వాటి వలననే అది సాధ్యం అవుతుంది. పూర్వకాలములో ఋషులు ఎన్నోకష్టములకు ఓర్చుకొని తపస్సులు చేసారు. సాధన చేసారు. ఇంద్రియ నిగ్రహము మనో నిగ్రహము సాధించారు. తుదకు సిద్ధి పొందారు. ఇంద్రియ నిగ్రహము మనోనిగ్రహము లేని విశ్వామిత్రుడు చాలా కాలం వరకు బ్రహ్మర్షి కాలేకపోయాడు.

గురువు శిష్యునకు ఉపదేశిస్తాడు. ఆచరించ వలసిన ధర్మం శిష్యునిది. ఎవరికి ఆకలి అయితే వారే తినాలి, ఎవరికి రోగం వస్తే వారే మందు వేసుకోవాలి, ఎవరిని వారే ఉద్ధరించుకోవాలి. మరి ఎవరిని వారు ఉద్ధరించుకోవాలంటే ఏం చేయాలి. మనలను మనం సంస్కరించుకోవాలి. మన మనస్సును, బుద్ధిని, ఇంద్రియములను ఒకదానితో ఒకటి సమన్వయపరచుకోవాలి. దీనినే త్రికరణ శుద్ధి అంటారు. మనసులో అనుకున్నది మాట్లాడటం, మాట్లాడింది ఆచరించడం. ఒకటి అనుకొని, మరొకటి మాట్లాడుతూ, మరొకటి చేస్తుంటే దానిని ఉద్ధరించుకోవడం అనరు. దిగజారడం అంటారు. కాబట్టి ముందు మనలను మనం ఉద్ధరించుకోవాలంటే మనలో ఉన్న మనో బుద్ధి ఇంద్రియాలను సమన్వయపరచుకోవాలి. మనలో ఉన్న మనోబుద్ధి ఇంద్రియాలు ఎలా పనిచేస్తున్నాయో, సమన్వయం పాటిస్తున్నాయో లేదో అని అనునిత్యం పరీక్షించుకుంటూ ఉండాలి. ఈ పరీక్షలు ఎవరో వచ్చి చేయరు. మనకు మనమే చేసుకోవాలి. మనలను మనమే ఉద్ధరించుకోవాలి. బుద్ధితో మనసును, మనసుతో ఇంద్రియాలను ఒకదానితో ఒకటి సమన్వయపరచుకోవాలి. అన్నీ సక్రమంగా పనిచేసే విధంగా చూసుకోవాలి. ఉన్నతమైన స్థానాలకు ఎదగడానికి అనునిత్యం ప్రయత్నం చేస్తుండాలి. అంతే కానీ మనలో ఉన్న

మనో, బుద్ధి, ఇంద్రియాలను సోమరులుగా చేసి పనికిరాని వాటిగా చేయవద్దు. బుద్ధి పని చేయకుండా మనసు పనిచేయడం, బుద్ధి మనసుతో సంబంధం లేకుండా ఇంద్రియాలు పనిచేయడం, ఇలా ఒకదానితో ఒకటి సమన్వయం లేకుండా, దేని ఇష్టం వచ్చినట్టు అది ప్రవర్తిస్తే, అవి తప్పుదారిపడతాయి. మానవుని అధోగతి పాలు చేస్తాయి.

పరమాత్మ ఇంకో మాట కూడా ఉన్నాడు. ఎవరికి వారే మిత్రులు ఎవరికి వారే శత్రువులు. తనకు తానే మిత్రుడు అయి తనను తాను ఉద్ధరించుకోవాలి. పరిశుద్ధమైన మనసే తన మిత్రుడు. కల్మషమైన మనసు తన శత్రువు అని అనుకోవాలి. ప్రతి వాడికీ మనసు ఉంటుంది. అది రెండుగా పని చేస్తుంది. ఒకటి మంచి గానూ మరొకటి చెడ్డగానూ. ఇది ప్రతివాడిలో ఉంటుంది. వాటి మధ్య అనునిత్యం జరిగే సంఘర్షణే మహాభారతయుద్ధం. కాబట్టి మంచి చెడుల కలయికే మనస్సు . మంచి మనసు మనకు మిత్రుడయితే, చెడ్డ మనసు మనకు శత్రువు. ప్రతివాడూ తనలోని చెడును జయించి మనసును మంచి మార్గంలోకి మళ్లించాలి. శత్రువును జయించి మిత్రుడుగా చేసుకోవాలి. ఈ పని చేస్తేనే తనను తాను ఉద్ధరించుకోగలడు. అలా కాకుండా మనసును కల్మషాలతో నింపుకుంటే తన మనసే తనకు శత్రువుగా మారి, అతనిని అధోగతి పాలు చేస్తుంది.

### 6. బన్ధురాత్మాత్మనస్తస్య యేనాత్మైవాత్మనా జితః।
### అనాత్మనస్తు శత్రుత్వే వర్తేతాత్మైవ శత్రువత్॥

ఎవరైతో తన మనసును అదుపులో ఉంచుకుంటాడో, ఆ మనసే వాడికి బంధువు అవుతుంది. ఎవరైతే మన మనస్సును అదుపులో ఉంచుకోకుండా దాని ఇష్టం వచ్చినట్టు ప్రవర్తింపజేస్తాడో, ఆ మనసే వాడికి శత్రువు అవుతుంది.

ప్రతి మనిషి యొక్క కర్తవ్యము తన మనసును జయించడం అంటే అదుపులో ఉంచుకోవడం. ఆ ప్రకారంగా జయింపబడిన మనసే అతని మిత్రుడు. జయింప బడిన మనసు జీవుని ఈ సంసార బంధనముల నుండి ఉద్ధరిస్తుంది. పరమ శాంతిని కలుగజేస్తుంది. ఈ ప్రకారంగా జయింప బడిన మనసు ఒక మంచి మిత్రుని వలె ఉపకారిగా ఉంటుంది. బయట ప్రపంచములో మనకు మిత్రులు ఉంటారు. వారు కేవలము తమ శక్తిని బట్టి ఉపకారము చేస్తారు. ఆధ్యాత్మిక విషయములలో ఏమీ చేయలేరు. పైగా మానవుడు ఆధ్యాత్మికంగా ఎదగడానికి ఈ బంధువులు, మిత్రులు అడ్డుగా ఉంటారు. బంధువుల మీద, స్నేహితుల మీద ఉన్న అధికమైన ప్రేమ, మమత, మమకారము ఇవి బంధనములు కలుగజేసి, మోక్షమార్గానికి అడ్డుగా నిలుస్తాయి. కాని జయింప బడిన మనసు అలా కాదు. మోక్ష ప్రాప్తికి సహకరిస్తుంది. శాశ్వతమైన ఆనందాన్ని

కలుగజేస్తుంది. తన ఇష్టం వచ్చినట్టు తిరిగే మనసు అతని శత్రువులాగా వ్యవహరిస్తుంది. కామము, క్రోధము మొదలగు వాటికి వశమై, జీవుని ప్రాపంచిక బంధనముల వైపు నడిపిస్తుంది. పునర్జన్మకు కారణమౌతుంది. కాబట్టి జీవుడు ఎల్లప్పుడూ మనసును తన అధీనంలో ఉంచుకొని తన మిత్రుని మాదిరి చేసుకోవాలి. ఆ జయింపబడిన మనస్సు ద్వారా ముక్తి మార్గములో ప్రయాణం చేయాలి.

ఈ శ్లోకాన్ని మరొక విధంగా కూడా అర్థం చేసుకోవచ్చు. మనలో ఉన్న మనస్సు మనకు మిత్రుడూ కాదు, శత్రువూ కాదు. అది ఒక బలమైన శక్తి. దానిని మనం సక్రమంగా ఉపయోగించుకుంటే అది మనకు మిత్రుడులా సాయం చేస్తుంది. దానిని దుర్వినియోగ పరిస్తే ఆ మనసే మనకు శత్రువులాగా పరిణమిస్తుంది. ఉదాహరణకు అగ్ని మనకు వంట చేసుకోడానికి దీపారాధన చేసుకోడానికి, హోమం చేసుకోడానికి ఉపకరిస్తుంది. అదే అగ్ని ఇళ్లు తగలబెట్టి నష్టం కూడా చేస్తుంది. ఈ నాటికి పోల్చుకుంటే విద్యుచ్ఛక్తి మనము సక్రమంగా వినియోగించుకుంటే అది మనకు ఎన్నోరకాలుగా ఉపయోగపడుతుంది. కాసేపు కరెంటు లేకపోతే విలవిలలాడిపోయే పరిస్థితి కల్పిస్తుంది. అదేకరెంటు షార్టుసర్క్యూట్ అయితే మనకు అపారమైన నష్టం కలుగజేస్తుంది. అదే మాదిరి మన మనసు కూడా ధార్మికంగా ఉపయోగిస్తే అది మనకు మిత్రుడులా వ్యవహరిస్తుంది. మానవుని ఉన్నతికి తోడ్పడుతుంది. అదే మనసును అడ్డు అదుపు లేకుండా దాని ఇష్టం వచ్చినట్టు ప్రవర్తిల్లజేస్తే, మానవుడు కష్టాలలో కూరుకుపోతాడు. కాబట్టి మానవుడు ఎప్పుడు మనస్సును తన అదుపులో పెట్టుకొని ధార్మిక జీవనం గడపడానికి ప్రయత్నించాలి.

ఈ శ్లోకంలో కానీ రాబోయే శ్లోకములలో కానీ ఆత్మ అంటే మనస్సు అని కూడా అర్థం చెప్పుకోవాలి. తరువాతి శ్లోకంలో కూడా జితాత్మ అంటే జయింపబడిన మనసు కలవాడు అనే అర్థం వచ్చేటట్టు ఆత్మ అనే పదం వాడబడింది.

## 7. జితాత్మన: ప్రశాన్తస్య పరమాత్మా సమాహిత:।
## శీతోష్ణ సుఖదు:ఖేషు తథా మానావమానయో:॥

ఎవడైతే తన మనసును అదుపులో పెట్టుకుంటాడో, అటువంటి వాడు ఎల్లప్పుడు ప్రశాంతంగా ఉంటాడు. అటువంటి వాడికి చలి, వేడి, సుఖము, దు:ఖము, సన్మానము, అవమానము అన్నీ పరమాత్మ అనుగ్రహాలుగానే కనిపిస్తాయి. అన్నిటినీ సమానంగా చూచే శక్తి లభిస్తుంది.

మానవులు సామాన్యంగా ద్వంద్వములకు లోనవుతుంటారు. సుఖదు:ఖములు, లాభనష్టములు, రాగద్వేషములు, మానావమానములు, శీతోష్ణములు మొదలగు ద్వంద్వములకు లోబడి ప్రవర్తిస్తుంటారు. పైన చెప్పబడిన ద్వంద్వములను సమంగా చూడటం ఎవరికీ సాధ్యం

కాదు. సుఖం కలిగినపుడు పొంగి పోవడం, దు:ఖము వచ్చినపుడు కుంగి పోవడం మానవ లక్షణము. ఎవరైనా తనను పొగిడితే పొంగి పోవడం, ఎవరైనా తిడితే కోపపడటం, దిగులు పడటం, కుంగి పోవడం సామాన్యంగా జరిగేదే. ఎవడైనా మనకు సన్మానం చేసి పొగిడితే పొంగిపోతాము. అదేసభలో ఎవడైనా తిడితే కుంగి పోతాము. వేసవి కాలంలో ఎండను తిట్టుకుంటాము. వానాకాలంలో చిత్తడిని తిట్టుకుంటాము. చలికాలంలో చలిని తిట్టుకుంటాము. వాటి వల్ల వచ్చే రోగాలను తిట్టుకుంటాము. వాతావరణం ఆహ్లాదంగా ఉంటే పిక్‌నిక్కులకు వెళ్లి ఎంజాయి చేస్తాం. ఇలా ద్వంద్వాలకు లోబడి ప్రవర్తించడం మానవ లక్షణం.

ఈ ప్రకారంగా ద్వంద్వాలకు లోబడిన మనసు ఎల్లప్పుడూ అశాంతితో చంచలంగా ఉంటుంది. నిలకడ ఉండదు. అలా కాకుండా మనసును జయించిన వాడు, మనస్సును నిలకడగా ఉంచుకోగలిగినవాడు, ఎల్లప్పుడూ ప్రశాంతంగా ఉంటాడు. అతనిని శీతోష్ణములు, సుఖదుఖములు, మానము అవమానము ఏమీ ప్రభావితం చేయలేవు. సర్వకాల సర్వావస్థలయందు నిర్వికారంగా సంతోషంగా ప్రశాంతంగా ఉంటాడు. పెద్ద పర్వతమును ఎంతటి గాలి అయినా చలింపచేయలేదు అలాగే మనస్సును జయించిన వాడికి ఈ ద్వంద్వములు ఏమీ చేయలేవు. అతడు నిశ్చలంగా ద్వంద్వాలకు అతీతంగా పరమ శాంతితో ఉంటాడు.

కాబట్టి ప్రతి వాడూ అభ్యాసము చేతా, వైరాగ్యము చేతా, వివేకము చేతా మనసును తన అదుపులో పెట్టుకోడానికి ప్రయత్నం చేయాలి. అందుకే పరమాత్మా సమాహిత: అన్నారు అంటే మన మనసును పరమాత్మయందు లగ్నం చేయాలి. అంటే మనకు సుఖము వచ్చినా, దు:ఖము వచ్చినా దానిని పరమాత్మకు అర్పించాలి. ఆ సుఖదు:ఖాలను పరమాత్మ ప్రసాదంగా స్వీకరించాలి. అప్పుడే మనసు అదుపులో ఉంటుంది. ప్రశాంతత లభిస్తుంది. బయట ప్రపంచంలో ఉన్న శీతోష్ణములు, సుఖదు:ఖములు, సన్మానము అవమానము అతనిని బాధించవు. అన్నిటినీ సమానంగా చూచే శక్తి లభిస్తుంది.

### 8. జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా కూటస్థో విజితేన్ద్రియ:।
### యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మ కాంచన:॥

శాస్త్రములను చదివి సంపాదించిన జ్ఞానముతోనూ, ఆ జ్ఞానమును ఆచరించి ఆర్జించిన విజ్ఞానముతోనూ తృప్తి చెందిన మనసు కల వాడు, చలించని మనసు కలవాడు, ఇంద్రియములను తన అదుపులో ఉంచుకున్నవాడు, తన ఎదురుగా కనపడుతున్న బంగారము, రాయి, మట్టి బెడ్డ లను ఒకేవిధంగా భావిస్తాడు. అటువంటి వాడిని యుక్తుడు అయిన యోగి అని అంటారు.

ఇక్కడ యోగి అనే పదం వాడారు. యోగి అంటే ప్రాపంచిక విషయములలో మునిగి ఉన్న జీవాత్మను వెనుకకు మళ్లించి, తన నిజస్వరూపమైన ఆత్మ స్వరూపముతో, పరమాత్మలో కలపడానికి ప్రయత్నించే వాడు యోగి. యోగము అంటే కలయిక. మనకు యోగులు చాలామంది కనపడతారు. కాని యోగులలో యోగయుక్తులు కొంతమందే ఉంటారు. అటువంటి వారి లక్షణములు ఇక్కడ వివరిస్తున్నాడు.

యోగులు వేదములు, శాస్త్రములు అధ్యయనము చేసి అపారమైన జ్ఞానము సంపాదిస్తారు. ఆ జ్ఞానమును ఆచరణలో పెడతారు. దానినే విజ్ఞానము అంటారు. ఆ జ్ఞానవిజ్ఞానముల చేత తృప్తి పొందుతారు. జ్ఞానము అంటే వేదములు, శాస్త్రములు, పురాణములు చదివి సంపాదించినది, గురువుల వలన ఉపదేశము పొందినది, పెద్దల ద్వారా వినినది, జ్ఞానము. విజ్ఞానము అంటే తానుపొందిన జ్ఞానమును ఆచరణలో పెట్టడం. కొంత మంది శాస్త్రములు వేదములు చదివి తమకు అంతా తెలుసు అనుకుంటారు. అది తప్పు. నేర్చుకున్న జ్ఞానమును ఆచరణలో పెట్టినపుడే అది విజ్ఞానము అవుతుంది. పుస్తకములు చూచి, తన తల్లి, అత్తగారు, ఇంకా ఇతర పెద్దవారు చేస్తూ ఉండగా చూచి వంట చేయడం నేర్చుకోవడం జ్ఞానం. తానే స్వయంగా వంటచేసి, అందరికీ వడ్డించడం విజ్ఞానము. రెండూ అవసరమే. అలాగే ముందు పరమాత్మ గురించి, ఆయన తత్వము గురించి, ఆయనను పొందే మార్గము గురించి తెలసుకోవడం జ్ఞానం. తెలుసుకున్న జ్ఞానమును ఆచరించి పరమాత్మలో ఐక్యం కావడం విజ్ఞానము. వీటివలన ఆత్మ తత్వాన్ని తెలుసుకొని తృప్తిపడిన వాడు యోగయుక్తుడు. ఇక్కడ తృప్తి అంటే తనకు లభించిన దానితో తృప్తి చెందడం. లేని దాని కొరకు ఆరాటపడకపోవడం.

కొంత మంది వేదములు, శాస్త్రములు, పురాణములు, ఉపనిషత్తులు, భగవద్గీత చదువుతూనే ఉంటారు. వల్లెవేస్తుంటారు. వారికి తృప్తి అంటూ ఉండదు. కాని వాటిని ఆచరణలో పెట్టడం శూన్యం. వారికి కేవలం శాస్త్ర జ్ఞానము తప్ప వేరే ఉండదు. తృప్తి అనేది అసలే ఉండదు. తృప్తి లేని వాడికి ఎంత జ్ఞానము ఉన్నా ఏం లాభం లేదు. పైగా చదివింది చాలదు, ఇంకా ఇంకా చదవాలి అని నిరంతర అశాంతితో బాధపడుతుంటాడు. అలా కాకుండా తాను ఆర్జించిన జ్ఞానమును, ఆచరణలోపెట్టిన వాడే అసలైన జ్ఞాని. అటువంటి వాడు తనకు ఉన్న దానితో తృప్తి చెందుతాడు. లేని దాని కొరకు పాకులాడడు. తనకు ఎంత కావాలో అంతే సంపాదించుకుంటాడు. జీవితం తృప్తిగా, ప్రశాంతంగా గడుపుతాడు.

రెండవ లక్షణము కూటస్థుడు. అంటే ఎవరేమన్నా ఏ విధమైన వికారము చెందని వాడు. కూటము అంటే కమ్మరి వాడి దిమ్మె. దానిని సుత్తితో ఎంత కొట్టినా చలించదు. దాని మీద బంగారం పెట్టి కొట్టినా, రాగి పెట్టి కొట్టినా, ఇనుము పెట్టి కొట్టినా అది చలించదు. అలాగే బయట

ఉన్న విషయములు తనను ఎంతప్రలోభపెట్టినా  చలించని వాడు, నిర్వికారుడు, కూటస్థుడు అనబడతాడు. సుఖదు:ఖములు, లాభనష్టములు, మానావమానములను సమంగా భరించేవాడే కూటస్థుడు. అట్టివాడే యోగయుక్తుడు.

ఇంక మూడవ లక్షణము విజితేంద్రియ: అంటే జయింపబడిన ఇంద్రియములు కలవాడు. అంటే ఇంద్రియ నిగ్రహము  కలవాడు. సాధారణంగా జితేంద్రియ: అంటారు కాని ఇక్కడ విజితేంద్రియ: అన్నారు అంటే బాగుగా, ప్రకృష్టంగా, అని అర్థం. ఏ మాత్రం సందేహం లేకుండా ఇంద్రియములను జయించిన వాడు అని అర్థం. అంటే ఏది కనపడితే అది కావాలిన కోరుకోవడం, దానికొరకు ఆరాటపడటం, స్పర్శ సుఖం కోసం పరితపించడం, దాని కొరకు చెయ్యకూడని పనులు చేయడం. ఇవన్నీ ఇంద్రియములు మన అధీనంలో లేకపోవడం వలనజరుగుతుంది. కాబట్టి ఇంద్రియములను ఎల్లప్పుడూ మన అదుపులో ఉంచుకోవాలి.

ఇంక నాల్గవ లక్షణము సమదృష్టి. ఇక్కడ ఒక ఉదాహరణ కూడా చెప్పాడు పరమాత్మ. సమలోష్టాశ్మ కాంచన:  లోష్టము అంటే మట్టి బెడ్డ,  మట్టి గట్టిబడితే  అశ్మము అంటే రాయి, కాంచనము అంటే బంగారము, అది కూడా మట్టి నుండే వస్తుంది.  ఈ మూడింటినీ సమానంగా చూచేవాడు అని అర్థం. మనం బంగారాన్ని దాచిపెట్టుకుంటాము. రాయిని, మట్టిని బయట పారవేస్తాము. వాటి వాటి విలువలను బట్టి ప్రవర్తిస్తాము. కాని యోగి అలాకాదు. మూడింటినీ సమానంగా చూస్తాడు. దాని అర్థం మట్టిని బీరువాలో దాస్తాడు అని కాదు. నిర్వికారంగా ఉంటాడు. దేనికీ ఆశపడడు. బంగారము విలువ కలది అది రేర్ మెటల్. కాని రాయి ఎక్కడైనా దొరుకుతుంది. అది మన మానసిక కల్పన. యోగికి బంగారం ఇచ్చినా ఏమీచేసుకోలేడు. అందుకే అతనికి బంగారము రాయితో సమానము. మనం అవసరం ఉన్నా లేకపోయినా, గొప్పకోసం, మా దగ్గర ఇంత బంగారము ఉంది అని చెప్పకోడానికి, విపరీతంగా బంగారము కొని దానిని దాచుకొని, దానిని ఎక్కడ దొంగలు ఎత్తుకుపోతారేమో అని నిరంతరం భయపడుతూ నిద్రలేని రాత్రులు గడుపుతుంటాము. ప్రశాంతతను కోల్పోతాము. అశాంతిని కొనితెచ్చుకుంటాము.

ఇక్కడ మనం ఒక విషయం గమనించాలి. ఈ లోకంలో ఉన్న సమస్త పదార్థాలు పంచభూతాత్మకములు. అంటే ఐదు ధాతువుల వలననే  ఏర్పడ్డాయి. పర్వతములు, చెట్టు,పుట్ట, ఈ దేహము, రాయి, బంగారము, వెండి ఇనుము ఇతర లోహములు అన్నీ పంచభూతముల నుండి ఏర్పడ్డాయి. ఈ విషయం తెలిసిన వాడికి ఏ వస్తువు చూచినా ఒకటిగానే కనపడుతుంది కానీ వేరుగా కనపడదు, అటువంటి వాడు అన్నింటిలోనూ సమత్వాన్ని చూస్తాడు.

ఒక వస్తువుకు ఉన్న విలువను మన మనస్సు నిర్ణయిస్తుంది. అంతే కానీ ఆ వస్తువు కాదు. రాళ్లు మట్టి అధికంగా లభిస్తాయి. కాని బంగారము అరుదుగా లభిస్తుంది. టన్ను మట్టి

నుండి ఔన్సు బంగారము దొరుకుతుంది. అందుకనే దానికి విలువ ఎక్కువ. చిన్న పిల్లవాడి ముందు బంగారము పెట్టినా మట్టిబెడ్డ పెట్టినా వాడికి ఒకటే. పైగా వాడు మట్టిబెడ్డ తీసుకొని నోట్లోపెట్టుకుంటాడు. కాబట్టి వస్తువులలోని హెచ్చుతగ్గులను, విలువలను మన మనస్సు నిర్ణయిస్తుంది. తన ఆఫీసరును చూచి తండ్రి గడగడవణుకుతాడు కాని కొడుకు ఆ ఆఫీసరును అస్సలు లక్ష్యపెట్టడు. పైగా ఆయన నీకు ఆఫీసరు నాకు కాదు అని ఎదురు చెబుతాడు. ఎందుకంటే కొడుకు దృష్టిలో ఆ వ్యక్తికి విలువలేదు. కొడుకు గౌరవించే వాడిని తండ్రి లక్ష్యపెట్టడు. దీనికంతా మన మనసే కారణము. కాబట్టి జ్ఞానము, విజ్ఞానములతో తృప్తి పొందిన సాధకుడికి ఈ ప్రపంచం అంతా పంచభూతాత్మకంగానే కనపడుతుంది కానీ వేరుగా కనిపించదు. అటువంటి వాడిని యుక్తుడు, యోగి అని అంటారు.

## 9. సుహృన్మిత్రార్యుదాసీన మధ్యస్థ ద్వేష్య బన్ధుషు।
## సాధుష్వపి చ పాపేషు సమబుద్ధి ర్విశిష్యతే॥

సుహృత్తులు అంటే ఎటువంటి ప్రతిఫలము కోరకుండా ఇతరులకు ఉపకారం చేసేవాళ్లు, మిత్రులు అంటే ఏదో ఒక ప్రతిఫలము కోరి ఉపకారం చేసే వాళ్లు, అరి అంటే అకారణంగా శత్రుత్వము వహించేవాళ్లు, ఉదాసీన అంటే ఎవరు ఎలా బోతే మనకెందుకులే మనం బాగుంటే చాలు అనుకొనే వాళ్లు, మధ్యస్థ అంటే అటు ఉపకారము కానీఇటు అపకారము కానీ చేయకుండా మధ్యలో ఉండి మధ్యవర్తిత్వము నడిపేవారు, ద్వేష్య అంటే మనం ద్వేషించేవారు, బంధువులు అంటే మన రక్తసంబంధీకులై మన మేలు కోరేవారు, సాధుష అంటే ఎల్లప్పుడూ సాత్వికగుణంతో ఉండేవారు, పాపేషు అంటే ఎల్లప్పుడూ పాపములు చేస్తూ ఉండేవారు, సాధకుడు అయిన వాడు పైచెప్పబడిన అందరి యందు సమబుద్ధి కలిగి ఉండాలి. అందరినీ సమానంగా ఆదరించాలి, గౌరవించాలి. అటువంటివాడిని శ్రేష్ఠుడు, గొప్పవాడు అని అంటారు.

ఇంతకు ముందు శ్లోకంలో బంగారము, మట్టి బెడ్డ, రాయి అనే ప్రాణములేని వస్తువుల గురించి చెప్పబడింది.. ఈ శ్లోకంలో వివిధ రకములైన మనస్తత్వములు గల మనుష్యుల గురించి చెప్పాడు పరమాత్మ. మానవ జీవితంలో ఇంట్లో కానీ, బయట కానీ, బంధువర్గంలో కానీ, మిత్రులలోకానీ, బయటవాళ్లలోకానీ, రకరకాల మనస్తత్వాల వాళ్లు తారసపడుతుంటారు. అందరితోనూ సమాన భావంతో ఉండటం ఎవరికీ సాధ్యం కాదు. కొందరితో మిత్రత్వం మరికొందరితో శత్రుత్వం తప్పదు. అజాత శత్రువుగా ఉండటం సాధ్యం కాదు. ఇది కొంత మంది అభిప్రాయము.

సాధన చేస్తే ఇదేమీ కష్టతరమైన విషయం కాదు. సాత్వికబుద్ధితో అందరితో మంచిగా ఉండటం ఎందుకు సాధ్యం కాదు అని మనకు మనమే ప్రశ్నించుకుంటే, సాధ్యం అవుతుంది అనే జవాబు లభిస్తుంది. మిత్రత్వానికి గానీ, శత్రుత్వానికి కానీ మన మనసే కారణం అని ఇంతకు ముందే తెలుసుకున్నాము. ఆ మనసును సంయమనం చేస్తే ఏదీ అసాధ్యం కాదు. తరతరాల నుండి మనకు శత్రుత్వం ఉన్న ఒక ఇంటికి వెళ్లి మన శత్రువులను ఆప్యాయంగా పలకరించి కుశల ప్రశ్నలు వేసి, అతని యోగక్షేమాలు కనుక్కోవడం అంత కష్టం కాదు కానీ మనసును సమాధానపరచుకోవడమే కొంచెం కష్టం. అలా చేయగలిగిన నాడు, ఎవరికీ శత్రువులు అనే వారు ఉండరు. ఈ శ్లోకంలో మానవులు ఎన్ని రకాలు వారు ఎలా ఉంటారు వారితో మనం ఎలా ప్రవర్తించాలి అనే విషయాన్ని వివరించాడు.

మొదటి వాడు సుహృత్. అతని స్వభావము అందరికీ మేలు కోరడం. తన చుట్టు ఉన్న సమాజము అంతా బాగా ఉండాలి, అంతా క్షేమంగా ఉండాలి అని అనుకుంటాడు. అటువంటి వాడు అందరికీ మేలు చేస్తాడు. తిరిగి ఎటువంటి ఫలము కానీ, ప్రత్యుపకారము కానీ ఆశించడు. రెండవ వాడు మిత్రుడు. కేవలం మిత్రత్వం వలన మిత్రుడి మేలు కోరుతుంటాడు. ఒక వేళ ఆ మిత్రత్వం పోతే, మిత్రుడే శత్రువు అవుతాడు. కాబట్టి మిత్రుడు కోరే మేలు షరతులతో కూడినది. మిత్రుడుగా ఉన్నంతకాలమే మేలు చేస్తాడు.

మూడవ వాడు అరి అంటే శత్రువు. మనం ఎవరి గురించి అతని ఎదుట కానీ, పరోక్షంలో కానీ, చెడ్డగా మాట్లాడతామో అతడే శత్రువు. మనకు శత్రువులు చాలా మంది ఉంటారు. ఎల్లప్పుడూ మనకు అపకారం చేయడానికే ప్రయత్నం చేయడానికి ప్రయత్నిస్తుంటారు. తరువాతి వాడు ఉదాశీనుడు. ఎవరి పక్షాన ఉండడు. తటస్థంగా ఉంటాడు. వాడు ఎవరికీ మేలు చెయ్యడు. కీడు చెయ్యడు. వాళ్లు మనకు అపకారం చెయ్యరు. అలాగని ఉపకారం చెయ్యరు. ఏది జరిగినా చూస్తూ ఉంటారు. తరువాతి వాడు మధ్యస్తుడు. ఇద్దరు తగాదా పడుతుంటే, వారి మధ్య తగాదా తీర్చేవాడు. ఎవరి పక్షాన నిలవ కుండా, నిష్పక్షపాతంగా ప్రవర్తించేవాడు. ఇరుపక్షాల హితము కోరేవాడు. అటువంటి వాడి మీద ఇరు పక్షాలకు నమ్మకం ఉంటుంది.

తువాతి రకం వాళ్లు ఉన్నారు. వాళ్లకు పనీ పాటా ఉండదు. అందరి గురించి ద్వేషం పెంచుకుంటారు. ఎప్పుడూ ఎవరికో ఒకరికి అపకారం చేయడానికి ప్రయత్నం చేస్తుంటారు. తేలుకొండి మాదిరి కుడుతూ ఉంటారు. ఇతరుల గురించి ఏ కారణం లేకుండా చెడు ప్రచారం చేస్తుంటారు. ఎదురు పడితే మొహామొహాలు చూచుకోరు. తిట్టుకుంటూ, కొట్టుకుంటూ, చంపుకుంటూ ఉంటారు.

తరువాత వాళ్లు బంధువులు. బంధనము కల వాళ్లు బంధువులు. ఇందులో రెండు రకాలు. మొదటి రకం రక్తసంబంధీకులు, దాయాదులు. రెండవ రకం భార్యద్వారా కలిసిన వాళ్లు. ఈ బంధువులలో కొంత మంది మంచి వాళ్లుంటారు, మరి కొంత మంది చెడ్డ వాళ్లుంటారు. లోపల ఇష్టం లేకపోయినా బయటికి మాత్రం బంధుత్వం పాటించక తప్పదు. అత్త కోడలికి, అత్త అల్లుడికి, మామా అల్లుళ్లకు పడదు. కాని పైకి ప్రేమలు నటిస్తుంటారు. సాధారణంగా దాయాదుల మధ్య శత్రుత్వం ఉంటుంది. ఈరోజుల్లో దగ్గరి బంధువులు కూడా ఒకరినిఒకరు ద్వేషించుకోవడం సర్వసాధారణం అయి పోయింది. తల్లిని చంపిన తనయుడు, తండ్రిని చంపిన కొడుకు, భార్యను చంపిన భర్త, కూతురిని చెరిచిన తండ్రి ఇలాగా బంధుత్వాలు కూడా కలుషితం అవుతున్నాయి.

తరువాతి రకం వాళ్లు సాధు: అంటే సాధుస్వభావము కలవాళ్లు. ఎల్లప్పుడూ ధార్మిక జీవనం గడిపేవాళ్లు. ఎవరికీ అపకారం చేయని వాళ్లు. అందరి మంచి కోరేవాళ్లు. ఇతరులకు చేతనైన సాయం చేసేవాళ్లు. ఎవరినీ పరుషంగా మాట్లాడరు. సాధ్యమైనంత వరకు మౌనంగా ఉంటారు. తరువాతి రకం పాపేషు. సాధువులకు వ్యతిరేకం పాపులు. సాధువులు ధార్మికులు అయితే పాపులు అధర్మవర్తనులు. వీరికి న్యాయం ధర్మం అంటే ఇష్టం ఉండదు. వీరి ఆలోచలను ఎల్లప్పుడూ ఎవరికి అపకారం,హాని తలపెడదామా అని సాగుతుంటాయి. వీరినే అసాంఘిక వ్యక్తులు అని కూడా అంటారు.

ఇన్ని రకముల మానవుల మధ్య మనం నిత్యం తిరుగుతున్నాము. ఎవరైతే వీరందరినీ సమభావంతో చూస్తాడో వాడే శ్రేష్టుడు. సమబుద్ధికలవాడు. ఉత్తముడు. పాపులతోనూ, శత్రువులతోనూ, మంచి వారితోనూ సమబుద్ధి కలిగి ఉండటం సాధ్యమా అని మనకు ఒక సందేహం రావచ్చు. కాని ఈ శ్లోకాన్ని తాత్విక బుద్ధితో అర్థం చేసుకుంటే సాధ్యమే అనిపిస్తుంది. ఎందుకంటే స్వభావసిద్ధంగా ప్రతి మానవుడూ సాత్వికుడే. మంచి వాడే. ఎందుకంటే ప్రతి మానవుడిలోనూ పరమాత్మ ఆత్మస్వరూపుడుగా ఉన్నాడు. వాడిలోని దుష్టత్వము వాడి సహజలక్షణం కాదు. పరిసరాల ప్రభావము, పెరిగిన వాతావరణం, పూర్వజన్మ సంస్కారము వీటి వలన వచ్చింది.

ఉదాహరణకు శ్రీగంధము చెక్కను తీసుకోండి. దాని సహజ లక్షణం సువాసనలు వెదజల్లడం. కాని ఆ గంధపు చక్కను వాడకుండా మూల పడేస్తే, దానికి దుమ్ము పట్టి మకిల పట్టి, అది దుర్వాసన వేస్తుంది. ఆ గంధపు చెక్కను తీసుకొని శుభ్రంగా రుద్ది కడిగి, సాన రాయి మీద పెట్టి రుద్దితే, ఆ గంధపుచెక్కనుండి సువాసన కలిగిన గంధం వస్తుంది. అలాగే పూర్వజన్మవాసనలు, పరిసర ప్రభావాలు మానవునిలోని ధార్మికతను మంచి తనాన్ని కప్పినపుడు, గంధపు చెక్కను మంచి నీటితో కడిగినట్టు, మన మంచితనంతో ఆ దుర్మార్గుడిని కూడా సన్మార్గుడిగా మార్చవచ్చు. ఈప్రక్రియలో ఆ దుర్మార్గుడిని శిక్షించవచ్చు ఆ శిక్ష ద్వేషంతో కాకుండా ప్రేమతో, ఆ దుర్మార్గుడిని

సన్మార్గుడిగా మార్చాలి అనే సద్బుద్ధితో అయి ఉండాలి. తల్లి,తండ్రులు పిల్లలను దండించడం, గురువులు శిష్యులను దండించడం, ప్రభుత్వం నేరస్థులను దండించడం ఇలాంటిదే.

అలాగే సాధువులు కూడా తమ సాధు ప్రవర్తనతో దుర్మార్గులను, పాపులను కూడా తమ ప్రేమతో సన్మార్గులుగా మార్చిన సంఘటనలు మన పురాణాలలో అక్కడక్కడా కనిపిస్తాయి. అందుకే సాధువులు అందరి పట్ల సమభావన కలిగి ఉండాలి. అంటే రాగద్వేషములు లేకుండా ఉండాలి. ఎవరి పట్ల శత్రుత్వము, ద్వేషభావన పెంచుకోకూడదు. ఈ దేహము మీద అభిమానము తగ్గించుకోవాలి. మనసును నిర్మలంగా ఉంచుకోవాలి అని పరమాత్మ బోధిస్తున్నాడు.

## 10. యోగీ యుఞ్జీత సతతమాత్మానం రహసి స్థితః।
## ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీరపరిగ్రహః॥

యోగి అయిన వాడు ఎల్లప్పుడు తన మనస్సును, బుద్ధిని తన అదుపులో ఉంచుకోవాలి. తన మనసును ఆత్మయందు నిలిపి ఉంచాలి. సాధ్యమైనంత వరకు ఒంటరిగా ఏకాంత ప్రదేశములో ఉండాలి. బయట ప్రపంచములో దొరికే ప్రతి వస్తువు కావాలని ఆశపడకూడదు. ఊరికే ఇస్తున్నారు కదా అని ఇతరుల నుండి ఏమీ ఉచితంగా తీసుకోకూడదు. సాధకుడు అయినవాడు ఈ లక్షణములు కలిగి ఉండాలి.

ఈ శ్లోకంలో పరమాత్మ యోగి ఎలా ఉండాలో వివరించాడు. దీనినే ధ్యానము చేయడానికి ముందు తీసుకోవలసిన జాగ్రత్తలు అని కూడా అనవచ్చు. దీనినే ఆంతరంగిక సాధన అని కూడా అనవచ్చు. ధ్యానం ఒంటరిగా చేయాలి. పది మందిలో చేయకూడదు. ఎందుకంటే ఏకాగ్రత కుదరదు. కాబట్టి ధ్యానం చేయాలంటే ఏకాంత ప్రదేశములో కూర్చోవాలి. బహిరంగ ప్రదేశం కాకుండా రహసి స్థితః అంటే రహస్య ప్రదేశములో కూర్చోవాలి. అంటే ఎవరికీ కనపడకుండా అనికాదు. ఎటువంటి శబ్దములు వినపడకుండా, ధ్యానమునకు, ఏకాగ్రతము భంగము, ఆటంకము కలుగని చోట అని అర్థం. ఏకాకీ అంటే ఒంటరిగా కూర్చోవాలి. యత చిత్తాత్మా అంటే చిత్తమును అంటే మనోబుద్ధులను, ఇంద్రియములను నిగ్రహించాలి. అటు ఇటు పోకుండా నియమించాలి. నిరాశీ అంటే ఈ ధ్యానం చేస్తే నాకు అది వస్తుంది ఇది వస్తుంది, శక్తులు వస్తాయి అనే ఆశ లేకుండా ధ్యానం చేయాలి.

అపరిగ్రహః అంటే స్వాముల వారు ధ్యానం చేస్తున్నారని, తన భక్తులు తనకు కానుకలు తేవాలని, పాద పూజ చేయాలనీ అనుకోకూడదు. ఇంకా భక్తులు రాలేదే కానుకలు తేలేదే

అంటూ ఓరకంటితో చూస్తూ ధ్యానం చేయకూడదు. కాబట్టి ధ్యానము బహిరంగ స్థలములో చేయకూడదు. ఇతరులు మెచ్చుకోడం కోసం ధ్యానం చేయకూడదు. ఇతరులు చూస్తున్నారా లేదా అని చేయకూడదు.

ధ్యానము, భగవంతునికి భక్తునికి అనుసంధానం చేసే ప్రక్రియ, ఇందులో ఇతరుల ప్రమేయం ఉండకూడదు. పూర్వము ఋషులు, మునులు అరణ్యములకు పోయి కుటీరములు నిర్మించుకొని అక్కడ తపస్సు చేసుకొనే వారు. గృహస్థులు కూడా అటువంటి ఏకాంత ప్రదేశములలో ఇళ్లు కట్టుకొని ధ్యానం చేసేవారు. ఈ రోజుల్లో అది కుదరదు కాబట్టి, ఇంట్లోనే ఒక మూల ఏకాంతమైన గదిలో ధ్యానం చేయడానికి ఏర్పాటు చేసుకోవాలి. అంతే గానీ మా పూజగది చూడండి ఎలా అలంకరించామో అని చెప్పుకోడానికి కాదు. తరువాత ఏకాంతంలో ఉండాలి. పది మందిలో ధ్యానం కుదరదు. పది మందిలో వాడు ఏంచేస్తున్నాడు వీడు ఏం చేస్తున్నాడు అనే ధ్యాస ఉంటుంది. ఇంద్రియ నిగ్రహము మనో నిగ్రహము మనకు తెలిసిందే. మితాహారం తీసుకోవాలి. మనసును కట్టడి చేయాలి. తాను చేసే ధ్యానం గురించి ప్రచారం చేసుకొని దాని వలన లబ్ధిపొందకూడదు. ఎటువంటి కానుకలు తీసుకోకూడదు.

ధ్యానం అనేది ఉదయం పూట సూర్యుడుఉదయించే కాలంలో బ్రాహ్మీముహూర్తంలో చేయాలి అని పెద్దలు చెప్పారు. ఎందుకంటే ఉదయం సత్వగుణము అధికంగా ఉంటుంది. శరీరము, మనసు ఉల్లాసంగా ఉత్తేజంగా ఉంటాయి. వాతావరణం ప్రశాంతంగా ఉంటుంది. అందుకని ఉదయం ధ్యానమునకు యోగ్యమైనది. సాయంత్రం రజోగుణము తగ్గుతూ తమోగుణము హెచ్చుతుంటుంది. శరీరం విశ్రాంతిని కోరుకుంటూ ఉంటుంది. అందుకని ధ్యానమునకు ఉదయం కాలం శ్రేష్ఠమైనది అనినిర్ణయించారు. ఈ నియమములు పాటించి ధ్యానం చేయాలి. మరి ఈ ధ్యానం ఎన్నిరోజులు చేయాలి అనే సందేహం కూడా వస్తుంది. అందుకే సతతం అని అన్నారు. ప్రతి దినము క్రమం తప్పకుండా నియమిత కాలంపాటు చేయాలి. అంతేకానీ మనకు ఇష్టం వచ్చిన రోజుల్లో, పండుగలలో పర్వదినాలలో మాత్రమే చేయకూడదు. తరువాతి శ్లోకంలో ఏకాంత ప్రదేశంలో ఎలా కూర్చోవాలి, ఎలా ధ్యానం చేయాలి అనే విషయాలు చెప్పాడు పరమాత్మ.

## 11.శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసనమాత్మనః।
## నాత్యుచ్ఛ్రితం నాతి నీచం చేలాజినకుశోత్తరమ్॥

ధ్యానం చేయడానికి శుభ్రమైన ప్రదేశంలో కూర్చోవాలి. స్థిరమైన ఆసనం, కదలకుండా ఉండే ఆసనం ఏర్పాటుచేసుకోవాలి. ఆ ఆసనం ఎక్కువ ఎత్తుగానూ, మరీ తగ్గుగానూ ఉండకూడదు. కూర్చోడానికి సుఖంగా, అనువుగా ఉండాలి. ఆ ఆసనం మీద దర్భలతో చేసిన చాప వేసుకోవాలి.

దాని మీద ఏదో ఒక జంతువు చర్మము పరవాలి. దాని మీద ఒక వస్త్రము పరవాలి.

ధ్యానం చేసే టప్పుడు ఎక్కడ కూర్చోవాలో, ఎలా కోర్చోవాలో, ఏం చెయ్యాలో ఆ పద్ధతి అంతా వివరంగా విపులంగా చెప్పాడు. అతి చిన్న విషయం నుండి అతి పెద్ద విషయం వరకూ చెప్పబడింది గీతలో.

శుచౌదేశే అంటే పరిశుద్ధమైన ప్రదేశములో కూర్చోవాలి. ధ్యానము చేయడం కోసం ఎక్కడికో వెళ్లనక్కర లేదు. హిమాలయాలకో, అరణ్యములకో వెళ్లనక్కరలేదు. మన ఇంట్లోనే శుభ్రమైన ప్రదేశము ఉంటే చాలు. కాకపోతే ఎటువంటి డిస్టర్బన్సె ఉండకూడదు.

(ఈ రోజుల్లో మానవుడి ఏకాగ్రతను దెబ్బతీసే ఏకైక సాధనం స్మార్ట్‌ఫోన్. దానిని ఆఫ్ చేస్తే సగం ప్రశాంతత లభిస్తుంది.)

అందుకని రహసి అంటే ఏకాంత ప్రదేశము అని కిందటి శ్లోకంలోనే చెప్పబడింది. ఆ ప్రదేశము చెత్త చెదారంతో కాకుండా పరిశుభ్రంగా ఉండాలి అంటే పరిసరాలు పరిశుభ్రంగా లేకపోతే ధ్యానం కుదరదు. చాలా మంది ప్రదేశం ఎక్కడైతే నేమి మనస్సు పరిశుభ్రంగా ఉంటే చాలు కదా అని అంటుంటారు. అది తప్పు. కూర్చునే ప్రదేశము, పరిసరాలు పరిశుభ్రంగా ఉంటేనే ధ్యానం ఏకాగ్రంగా సాగుతుంది అని నొక్కి చెబుతున్నాడు భగవంతుడు. చుట్టు పరిశుభ్రంగా ఉన్నపుడే పరిశుద్ధమైన భావాలు కలుగుతాయి. చుట్టు ఉన్న మలినాలు, దుర్వాసనలు మనసు ను కూడా ప్రభావితం చేస్తాయి. కాబట్టి మనస్సు వాక్కు శరీరము నిర్మలంగా ఉండాలంటే తాను ఉన్న ప్రదేశము కూడా పరిశుద్ధముగా ఉండాలి.

తరువాత ఆసనము అంటే కూర్చునే పీట. స్థిరంగా ఉండాలి. హెచ్చుతగ్గులు ఉండకూడదు. అటు ఇటు ఊగుతుంటే ధ్యానం కుదరదు. ఎక్కువ ఎత్తు గానీ, మరీ తగ్గుగా గానీ ఉండకూడదు. అందుకే 2,3 అంగుళాలు ఎత్తు పీటలు మనం వాడుతుంటాము. సాధారణంగా ధ్యానంలో కూర్చుంటే నిద్రవచ్చే అవకాశం ఉంది. అలా నిద్రవస్తే, కూర్చున్న పీట ఎత్తుగాఉంటే, దాని మీది నుండి కిందపడే ప్రమాదంఉంది. అలాగని కింద కూర్చుంటే, చీమలు, క్రిమికీటకములు మన శరీరం మీదికిపాకే అవకాశం ఉంది. (ఇప్పుడు రకరకాల ఫ్లోరింగులు ఉన్నాయి కానీ, దాదాపు 60 ఏళ్ల కిందటిదాకా మేము నివసించిన ఇళ్లలో మట్టినేల మాత్రమే ఉండేది. వారం వారం దానిని ఆవుపేడతో అలికి శుభ్రంగా ఉంచేవాళ్లు.)

అంత ఎత్తుగానీ, మరీ అంత తగ్గది కానీ కాకుండా ఉంటే ఆసనం ఏర్పాటు చేసుకున్న తరువాత దాని మీద ఏమి వెయ్యాలి అంటే ముందు దర్భలతో చేసిన చాప వేయాలి. దాని మీద జింకచర్మం పరవాలి.(ప్రస్తుత కాలంలో అది నిషిద్ధం) దాని మీద మెత్తని గుడ్డ పరవాలి. ఇది కేవలము సౌకర్యంగా ఇబ్బందిలేకుండా కూర్చోడానికి అనువుగా ఉండటానికి మాత్రమేగానీ, సుఖానికి కాదు. అంతే కాకుండా మనం ధ్యానం చేసేటప్పుడు మనలో నుండి వెలువడే ధ్యానతరంగాలు భూమిలోకి ఆకర్షింపబడకుండా ఉండాలి. అలా అయితే మనం చేస్తున్న ధ్యానం వృధా అవుతుంది. కాబట్టి ఈ దర్భాసనము, జింక చర్మము, వస్త్రము మనకు ఇన్సులేషన్‌గా అంటే ఒక తొడుగుగా ఉపయోగపడతాయి. అటువంటి ఆసనము స్థిరంగా అటు ఇటు ఊగకుండా ఉండాలి. ఎందుకంటే, కూర్చున్న ఆసనం అటు ఇటు ఊగుతూ కదులుతూ ఉంటే, శరీరం కూడా కదులుతుంది. మనసు ధ్యాస దాని మీదనే ఉంటుంది కానీ ధ్యానం మీద ఉండదు. కాబట్టి మనం కూర్చునే ఆసనం అటు ఇటు ఊగకుండా స్థిరంగా ఉండే విధంగా ఏర్పాటు చేసుకోవాలి.

ఇప్పుడు ఎలా కూర్చోవాలి. స్థిరమైన ఆసనంలో కూర్చోవాలి. పద్మాసనము కానీ సుఖాసనము కానీ వేసుకొని కూర్చోవాలి. ధ్యాన సమయంలో ఇబ్బంది కరం కాని ఏ ఆసనమైనా వేయవచ్చు. కాకపోతే స్థిరంగా సుఖంగా ఉండాలి అని మాత్రమే చెప్పారు.

ఈ శ్లోకంలో చెప్పబడిన దర్భాసనం, జింక చర్మం అనేవి ఆ రోజులలో దొరుకుతాయి కాబట్టి చెప్పారు. ఈ రోజుల్లో జింక చర్మాలు, దర్భాసనాలు దొరకవు. పైగా జింక చర్మాలు నిషిద్ధం. కాబట్టి వాటి కోసం ప్రయత్నించకండి. కాని జింకచర్మాలు, దర్భాసనాలు దొరకలేదని ధ్యానం చేయడం మానకూడదు. మనకు దొరికిన వాటితో మనకు అనుకూలమైన ఆసనాన్ని ఏర్పాటు చేసుకొని దాని మీద సుఖాసనంలో కూర్చోవాలి. ఈ రోజులను బట్టి చెప్పాలంటే బజారులో దొరికే పీట ఒకటి కొనుక్కొని , దాని మీద మెత్తటి షాల్ లాంటిది పరిచి, దాని మీద ఒక శుభ్రమైన తెల్లటి తుండు గుడ్డ వేసుకుంటే చాలు. ధ్యానం చేయడానికి ఆసనం ఏర్పాటు అయినట్టే. కూర్చుని ఏం చెయ్యాలి అనేది తరువాతి శ్లోకంలో చెప్పబడింది.

### 12. తత్రైకాగ్రం మన: కృత్వా యతచిత్తేన్ద్రియక్రియ:।
### ఉపవిశ్యాసనే యుఞ్జ్యాద్యోగ మాత్మవిశుద్ధయే॥

ఆ ప్రకారంగా స్థిరమైన సుఖమైన ఆసనంలో కూర్చున్న తరువాత మనసును ఏకాగ్రం చేయాలి. చిత్తమును, ఇంద్రియములను కట్టడి చేయాలి. ఇప్పుడు మనలో ఉన్న మనసును శుద్ధిచేసుకోడానికి పరమాత్మను గురించి ధ్యానం చేయాలి.

కదలకుండా స్థిరమైన ఆసనం మీద సుఖంగా కూర్చున్న తరువాత మనసును, ఇంద్రియములను స్వాధీనంలో ఉంచుకోవాలి. ఒక చోట స్థిరంగా కూర్చుంటే చేతులు, కాళ్లు, కళ్లు మన స్వాధీనంలో ఉంటాయి. కాని ఏ చిన్ని శబ్దం వినబడ్డా అటు ఇటు తిరగడం, కళ్లు తెరిచి అటువైపు చూడటం, శరీరం మీద ఏద్దైనా పాకితే చెయ్యితో తాకడం ఇటువంటి పనులు చేస్తుంటాము. ఆ పనులను కూడా సాధ్యమైనంత వరకు చేయకూడదు. దానినే ఇంద్రియ నిగ్రహం అంటారు. పైన చెప్పినట్టు ఏకాంత ప్రదేశంలో, శుభ్రమైనప్రదేశంలో కూర్చుంటే ఇటువంటివి జరగవు.

తరువాత మనసు. ఇంద్రియాలు మన స్వాధీనంలో ఉన్నా, మనసు మాత్రం సాధారణంగా అటు ఇటు పరుగెడుతుంటుంది. దానిని కూడా స్వాధీనంలో ఉంచుకోవాలి. అటు ఇటు పోయినా తిరిగి లాక్కొచ్చి మనస్వాధీనంలో పెట్టుకోవాలి. క్లుప్తంగా చెప్పాలంటే ధ్యానం చేసే ఆ కాసేపు మీ కోసం మీరు జీవించండి. బయట విషయాలను మనసులోకి రానీయవద్దు. పనికిమాలిన విషయాలు గురించి ఆలోచించకుండా మనసును కట్టడి చేయాలి. ఎందుకు కట్టడి చేయాలి. ధ్యానం చేస్తున్నామని మనసుకు తెలియదా అని మనం అనుకోవచ్చు. మనసు యొక్క స్వభావము అటు ఇటు చంచలంగా పరుగెత్తడం. అందుకే మనోవేగము అని అన్నారు. ఆ వేగవంతమైన మనస్సుయొక్క స్వభావాన్ని మనం కాసేపు కట్టడి చేయాలి కానీ మనసే తనంతట తాను నిశ్చలంగా ఉండాలనుకోవడం మన పొరపాటు. కట్టడి చేయడం అంటే పూర్తిగా ఏపనీ చేయకుండాఉండటం కాదు. మనసును దాని స్వభావాన్ని బట్టి అన్ని విషయముల మీదికి పోకుండా, ఒకే విషయం అంటే దైవం మీద నిలపాలి. దానినే ఏకాగ్రత అని అంటారు.

ఆ ప్రకారంగా మనసును ఏకాగ్ర పరచాలి. దైవం మీదనే నిలపాలి. అప్పుడు అఖండ మైన శక్తి పుడుతుంది. ఎలాగంటే సూర్యకిరణం మామూలుగానే ఉంటుంది. దానిని భూతద్దంలో నుండి ప్రసరింపచేస్తే అమితమైన వేడి పుట్టి ఏ పదార్థాన్నైనా కాలుస్తుంది. అలాగే ఏకాగ్రమైన మనస్సు విపరీతమైన శక్తిని సంతరించుకుంటుంది. ఆ వేడికి మనలో ఉన్న అజ్ఞానము మాడి పోతుంది. మనం సాధించలేనిది అంటూ ఏమీ ఉండదు. అందుకే మన పెద్దవాళ్లు విద్యార్థులను, “మనసు పెట్టి చదవరా అదే అర్థం అవుతుంది” అని అంటూ ఉంటారు. మనసు పెట్టి చదవడం అంటే ఏకాగ్రతతో చదవడంఅన్న మాట. ఈ ప్రకారంగా సుఖమైన ఆసనంలో కూర్చుని, ఇంద్రియములను, మనసును నిగ్రహించి ఏకాగ్రం చేస్తే, హృదయం నిర్మలంగా ఉంటుంది. ధ్యానం కుదురుతుంది.

మరి ఈ ధ్యానము అంతా దేనికోసం అంటే ఆత్మ విశుద్ధయే అంటే ఆత్మపరిశు ద్ధంగా ఉండటం కోసం అని చెప్పాడు పరమాత్మ. దానినే అంత:కరణ శుద్ధి అని అంటారు. మనసు, బుద్ధి, చిత్తము, ఆత్మ, అంత:కరణ ఏ పేరుతో పిలిచినా, అవి పరిశుద్ధం కావడానికి ధ్యానం ఉపయోగపడుతుంది.

## 13. సమం కాయశిరోగ్రీవం ధారయన్నచలం స్థిరః।
## సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చానవలోకయన్॥

శరీరము, తల, మెడ నిటారుగా ఉండేటట్టు కదలకుండా కూర్చోవాలి. చూపును అటు ఇటు తిప్పకుండా ముక్కు కొసన చూపును నిలపాలి. అంటే ఏ శబ్దం వినిపించినా దిక్కులు చూడకూడదు. చూపు నిశ్చలంగా ముక్కుకొసన ఉండాలి.

పైశ్లోకంలో కూర్చున్న దాకా చెప్పాడు కదా. ఆ కూర్చోవడం కూడా ఎలా కూర్చోవాలి అన్న విషయం ఇక్కడ వివరిస్తున్నాడు. నిటారుగా కూర్చోవాలి. వంగకూడదు. అటు ఇటు ఊగకూడదు. శరీరము, మెడ, తల ఒకే లంబరేఖలో ఉండాలి. యోగ పరంగా చెప్పాలంటే ధ్యానంలో కుండలినీ శక్తి మేల్కొని సుషుమ్నా నాడి ద్వారా సహస్రారము వరకు వెళుతుంది. దానికి అనువుగా శరీరం నిటారుగా ఉండాలి. అప్పుడే సాధకునకు అపూర్వమైన అనుభూతులు కలుగుతాయి. అందుకే అచలమ్ స్థిరం అనే మాటలు వాడారు. కదలకుండా, స్థిరంగా ఉండాలి అని. అంటే ఏ శబ్దం విన్నా లేవకూడదు. ధ్యానం పూర్తి అయ్యేదాకా ఎటువంటి కదలిక ఉండకూడదు. మనసు స్థిరంగా ఏకాగ్రంగా ఉండాలి. అటు ఇటు చూడకూడదు అన్నారు. కాని ఎటు చూడాలి అంటే దృష్టిని ముక్కు కొసన నొసటి దగ్గర నిలపాలి. పూర్తిగా కళ్లు మూసుకుంటే నిద్రవస్తుంది. కాబట్టి అర్ధనిమీలత నేత్రాలతో అంటే సగం మూసి సగం తెరిచిన కళ్లతో, నొసటి భాగంలో చూపు నిలపాలి. అప్పుడు చూపు మనసు నిశ్చలంగా ఉంటాయి. భగవానుడు మన సంగతి తెలిసి మరొక జాగ్రత్తకూడా చెప్పాడు. దిశశ్చానవలోకయన్ ఏ శబ్దం విన్నా దిక్కులు చూడకూడదు అని.

ఉదాహరణకు సెల్ ఫోన్లు మోగుతాయి. డోర్ బెల్ మోగుతుంది. ఎవరో అరుస్తారు. పిలుస్తారు. పక్కింటి నుండి కేకలు వినబడతాయి. ముందు మనం చేసే పని ఏమిటంటే, వెంటనే కళ్లు తెరుస్తాము. అది ఎక్కడ మోగుతో ఉందో అనీ, ఎవరు వచ్చారో, ఆ శబ్దం ఏమిటో అనీ ఆ వైపుకు చూస్తాము. దాంతో ధ్యానం ఆగిపోతుంది. ఏకాగ్రత దెబ్బతింటుంది. కాబట్టి ఇటువంటి శబ్దాలు వినబడని స్థలం ఎన్నుకోవాలి అని ముందు శ్లోకములలో చెప్పారు. ఒక వేళ వినబడ్డా, దాని గురించి పట్టించుకోకూడదు. దిక్కులు చూడకూడదు. అని ఈ శ్లోకంలో చెప్పాడు.

## 14. ప్రశాన్తాత్మా విగతభీ ర్బ్రహ్మచారివ్రతే స్థితః।
## మనస్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః॥

ధ్యానంలో కూర్చున్న వాడి మనసు ప్రశాంతంగా ఉండాలి. ఎటువంటి భయము, భీతి, ఆందోళన ఉండకూడదు. మనసును బ్రహ్మయందు అంటే పరమాత్మయందు నిలపాలి. చరింపచేయాలి. అలా చేయాలంటే మనసును సంయమింప చేయాలి. నిలకడగా ఉంచాలి. పరమాత్మను తప్ప వేరే ఏ విషయాన్ని గురించి ఆలోచించకూడదు. ఈ ధ్యానం అంతా నాకు పరమ గతి కలగడం కోసమే చేస్తున్నాను అనే ధృఢమైన నమ్మకంతో, విశ్వాసంతో చేయాలి.

ప్రశాంతాత్మా అంటే మనసును, చిత్తమును ప్రశాంతంగా ఉంచుకోవాలి. ఎటువంటి ఆలోచనలు ఆందోళనలు ఉండకూడదు. చాలా ప్రశాంతంగా ఉండాలి. అంటే మనము ధ్యానంలో కూర్చోగానే ఇదివరకు చూచినవి, విన్నవి, తాకినవి, జరిగినవి విషయాలు అన్నీ గుర్తుకు వస్తాయి. ఎక్కడెక్కడో ఎప్పుడో జరిగిన విషయాలు అన్నీ అప్పుడే గుర్తుకొస్తాయి. వాటి వలన బాధ, భయము సంతోషము కలుగుతాయి. అటువంటి గతకాలపు ఆలోచనలు మనసులోకి రాకుండా అరి కట్టి మనసును ప్రశాంతంగా ఉంచుకోవాలి.

విగతభీ అంటే భయం ఉండకూడదు. గతించిన విషయాలు గుర్తుకొస్తాయి అని పైన చెప్పుకున్నాము కదా. అలాగే రాబోయే విషయాల గురించి, జరగబోయే విషయాల గురించి కూడా ఆలోచనలు వస్తాయి. ఆ ఆలోచనల వల్ల భయం కూడా కలిగే అవకాశం ఉంది. అంతేకాదు, ఎవరైనా ఏమన్నా అనుకుంటారేమో, ఏమన్నా అంటారేమో అన్న భయం ఉంటుంది. దేనికీ భయపడకూడదు. మనసులో గుబులు ఉండకూడదు. ఈ టైములో ఆ పని చేద్దామనుకున్నాను. కాని చేయలేకపోయాను. ఇక్కడ కూర్చున్నాను. అక్కడ నేను లేకపోతే ఏం జరుగుతుందో ఏమో అనే చింత విడిచిపెట్టాలి. బయట ఏం జరిగినా నిశ్చలంగా ఉండాలి. అన్నీ భగవంతునికి అర్పించి మనసును నిర్మలంగా నిశ్చలంగా ఉంచుకోవాలి. ఇది కష్టమే అయినా అభ్యాసంతో సులభమే అవుతుంది.

తరువాతది బ్రహ్మచర్యము పాటించాలి. అంటే మనసు కామ వాంఛల వైపు వెళ్లకూడదు. స్త్రీసంబంధమైన ఆలోచనలు రాకూడదు. స్త్రీలు ధ్యానంలోకూర్చుంటే పురుష సంబంధమైన ఆలోచనలు రాకూడదు. అటువంటి సంకల్పములు కూడా రాకూడదు. అసలు సాంసారిక సంబంధమైన ఆలోచనలే మనసులోకి రానీయకూడదు. ఇది అందరూ ఆచరించ వలసిన విషయము. బ్రహ్మ చర్యము అంటే కేవలం శరీరమే కాదు, మనసులో కూడా అటువంటి ఆలోచనలు

రాకూడదు. మాటలు కూడా అటువంటి మాటలు మాట్లాడకూడదు. అప్పుడే మనసు పరిశుద్ధంగా ఉంటుంది. ఇది బ్రహ్మచర్యమునకు మనం లౌకికంగా చెప్పుకునే అర్థము.

బ్రహ్మ అంటే శబ్దబ్రహ్మ అని అంటారు. శబ్దము అంటే వేదములు. శాస్త్రములు. వేదములు, శాస్త్రములు బ్రహ్మస్వరూపాలు. అటువంటి వేదములను, శాస్త్రములను శ్రద్ధతో అధ్యయనం చేయడం కూడా బ్రహ్మచర్యమే. గురుకులంలో బ్రహ్మచారులు చేసే పని అదే కదా! దానినే బ్రహ్మచర్యము అంటారు. ధ్యానమునకు ముందు వేదాధ్యయనము, శాస్త్ర అధ్యయనము చేసి ఉండాలి అని భావము. అప్పుడు ఆత్మ వేరు శరీరము వేరు అనే జ్ఞానము కలుగుతుంది. గురువు నుండి వేదాంతవిషయాలు, శాస్త్రములకు సంబంధించిన విషయాలు తెలుసుకోవడం కూడా బ్రహ్మచర్యమే అవుతుంది. కాబట్టి ధ్యానం చేసేటప్పుడు మనసులో తాను శాస్త్రముల ద్వారాగానీ, గురువునుంచి కానీ ఆర్జించిన జ్ఞానము మాత్రమే గుర్తుకు రావాలి కానీ, ప్రాపంచిక విషయాలు గుర్తుకు రాకూడదు. తల్లి, తండ్రి, బంధువులు గుర్తుకు రాకూడదు. ఒక్క మాటలో చెప్పాలంటే మనసును కల్లోలపరిచే ఏ విషయమూ గుర్తుకు రాకూడదు. దానినే బ్రహ్మచారి వ్రతే స్థిత: అని ఇక్కడ చెప్పారు.

తరువాత మనస్సంయమ్య అంటే మనసును స్థిరంగాఉంచుకోవాలి. ఇప్పటి దాకా చేసిన పనులు అంటే మనసును ప్రశాంతంగా ఉంచుకోవడం, మనలో గతం గురించి, భవిష్యత్తు గురించి ఉన్న భయము ఆందోళనలను పక్కన పెట్టడం, తరువాత కామసంబంధమైన ఆలోచలను మనసులోకి రానీయకుండా కట్టడి చేయడం, తాను వేదములను, శాస్త్రములను, గురుముఖతా ఆర్జించిన జ్ఞానమును మననం చేసుకోవడం...ఇవన్నీ చేస్తే మనస్సు సంయమింపబడుతుంది. అంటే మన మనసు మన అదుపులో ఉంటుంది. అటు ఇటు పోదు. చంచలంగా ఉండదు. స్థిరంగా ఉంటుంది. అటువంటి మనసును ఆత్మయందు స్థిరంగా నిలపాలి.

తరువాత ఎవరిని చింతించాలి అంటే మచ్చిత్తో అంటే భగవంతుని చిత్తములో నిలుపుకోవాలి. మత్పర: అంటే భగవంతుడు తక్క నాకు మరొక దిక్కు లేదు అని నమ్మాలి. అప్పుడే యుక్త: అంటే ధ్యానములో యుక్తుడు అవుతాడు. నిమగ్నమౌతాడు.

## 15. యుఞ్జన్నేవం సదా22త్మానం యోగీ నియత మానస:।
## శాన్తిం నిర్వాణపరమాం మత్సంస్థా మధిగచ్ఛతి॥

నిగ్రహింపబడిన, నియమింపబడిన మనస్సు కల యోగి, తన మనస్సును ఎల్లప్పుడూ ధ్యానమునందే లగ్నం చేస్తాడు. నా స్వరూపము, నా స్వభావము, మోక్షమునకు

ప్రతిరూపము అయిన పరమ శాంతిని పొందుతాడు. అంటే ధ్యానంలో లభించేది పరమ శాంతి.

ఈ ప్రకారంగా ధ్యానం చేసే యోగికి ఎటువంటి ఫలితం కలుగుతుంది అంటే పరమ శాంతి కలుగుతుంది. మనందరికి లేనిది, మనమందరం వెతికేది ఆ శాంతి కోసమే కదా! శాంతి కోసం వెతుక్కుంటూ ఎన్నో ప్రదేశాలు తిరుగుతుంటారు. ఎంతో ధనం వ్యయం చేస్తారు. వివిధములైన మాదక ద్రవ్యాలను ఆశ్రయిస్తుంటారు. కానీ అది తమ చిత్తంలోనే ఉందని ఎవరికీ తెలియదు. మనసును ఆత్మయందు నిలిపితే, శాంతి దానంతట అదే వస్తుంది. ఈ శాంతి స్వరూపుడే భగవానుడు. శాంతి ఎక్కడో లేదు. భగవంతుని యందు శాంతి ఉంది. బయట ప్రదేశములలో, ప్రపంచములో దొరికే వస్తువుల ద్వారా దొరికే శాంతి క్షణికము అశాశ్వతము.

కాబట్టి తెలిసిన వారు, వివేకులు, జ్ఞానులు శాంతి కొరకు బయట వెతకరు. అంతర్ముఖులు అవుతారు. అక్కడే వారికి శాంతి దొరుకుతుంది. ఆ శాంతి కావాలంటే మనో నిగ్రహము, నిరంతర అభ్యాసము ఇవే మార్గములు. అందుకే సదాయుఞ్జన్ అంటే ఎల్లప్పుడూ అభ్యాసం చేయాలి. ఒకరోజు చేస్తే రాదు అని అర్థము. ప్రాపంచిక విషయముల మీద విముఖత, భగవంతుని మీద భక్తి శ్రద్ధ, ఏకాగ్రమైన మనసు, నిరంతర అభ్యాసము, మనసును అంతర్ముఖం చేయడం, మనసును ఆత్మలో నిలపడం ఇదే ధ్యానము. ఈ ధ్యానముతోనే పరమశాంతి లభిస్తుంది. కాబట్టి "ఈ జీవితానికి నాకు శాంతి లేదు భగవంతుడా!" అని దేవుడి ముందు ఏడవకుండా ఈ మార్గం అవలంబించాలి అని భగవంతుడు వేల సంవత్సరాల కిందటనే చెప్పాడు. కాని దీనిని గురించి మనం తెలుసుకోడానికి ఎటువంటి ఆసక్తి చూపడం లేదు.

## 16. నాత్యశ్నతస్తు యోగో2స్తి నచైకాన్తమనశ్నతః। న చాతిస్వప్నశీలస్య జాగ్రతోనైవచార్జున॥

ఎక్కువగా అంటే కడుపునిండా తిన్నవాడికీ, లేక అసలు తినకుండా ఉపవాసం పేరుతో కడుపు మాడ్చుకునేవాడికి, జాగారం పేరుతో నిద్రమేలుకొనే వాడికి, తినగానే గుర్రుపెట్టి నిద్రపోయేవాడికి ఈ ధ్యానయోగం చేయడం కుదరదు.

ఈ ధ్యాన యోగం అవలంబించే వాళ్లు ఎప్పుడెప్పుడు భోజనం చేయాలి అనే విషయం ఇక్కడ చెప్పాడు భగవానుడు. కాని ఈ శ్లోకంలో యోగో2స్తి అన్నాడు కాబట్టి యోగము అభ్యసించేవారికి అని అర్థం. ఏ యోగమును అభ్యసించినా, ఈ ఆహార నియమాలు పాటించాలి. ప్రతి మనిషి మూడు పనులతోనే తన పూర్తి జీవితం గడిపేస్తున్నాడు. అవి ఆహారము, నిద్ర, మైధునాలు.(మైధునము అంటే స్త్రీపురుషులు కలిస్తేకలిగే సుఖం). మొదటి రెండు తనకు తానుగా

అనుభవించేవి. మూడవది రెండవ మనిషి సహకారంతో చేసేది. ఈ మూడు పనులు మానవులు చేస్తున్నారు. జంతువులు చేస్తున్నాయి. కాకపోతే జంతువులు ఒక నియమం ప్రకారం చేస్తున్నాయి. మానవులు ఏ నియమమూ పాటించకుండా ఆహార, నిద్ర మైథునాలు అపరిమితంగా అనుభవిస్తున్నారు.

(వేళాపాళలేకుండా, అర్ధరాత్రి దాకా తాగుతున్నాడు, తింటున్నాడు. నిద్రపోవాల్సిన సమయంలో మేల్కొని, పగలంగా నిద్రపోతున్నాడు. ఆఫీసులో నిద్రపోవడం ఇదే. ఇంకమైథునం సంగతి అందరికీ తెలిసిందే! ఒక నియమం లేదు. ఒక సమయం లేదు. అందుకే నిర్భయ చట్టం చేయాల్సి వచ్చింది.)

అందుకే ఈ శ్లోకంలో మొదటి రెండు అయిన ఆహారము, నిద్రగురించి వివరించాడు. న అతి అశ్నతస్తు అంటే ఎక్కువగా మితిమీరి తినకూడదు. అంటే మితంగా తినాలి. కడుపు నిండా భోజనం చేసి ధ్యానమునకు కూర్చోకూడదు అనికూడా అర్థం. గొంతుదాకా మెక్కిన తిండి లోపల ఊరుకోదు కదా. దాని పని అది చేస్తుంది. కడుపులో గడబిడ. వికారము, లేక త్రేపులు. ఇలాగా. వీటితో సతమతమౌతుంటే ఇంక ధ్యానం ఏం కుదురుతుంది. కాబట్టి అధికంగా తినకూడదు. ధ్యానానికే కాదు ఆరోగ్యరీత్యా కూడా మితంగా తినాలి. మితాహారము తింటే శరీరం తేలికగా ఉంటుంది. అదేవిధంగా న చ ఏకాన్తమ్ అనశ్నత: అంటే అసలు ఆహారం తీసుకోకపోవడం కూడా మంచిది కాదు. అంటే కటిక ఉపవాసం ఉన్నాకూడా శరీరంలో శక్తి ఉండదు. ధ్యానం కుదరదు. శరీరములోని అవయవములుఅన్నీ సక్రమంగా పని చేయడానికి మితాహారము అవసరము. ఆహారం లేకపోతే అవయవములు క్షీణించిపోతాయి. ఆహారము, మితంగా ఉంటేనే మంచిది.

ఇక్కడ మనం ఒక ఆహార సూత్రం గురించి చెప్పుకుందాము. ఆహారం ఎలా తినాలి అంటే, మనం కడపును నాలుగు భాగాలుగా, ఊహామాత్రంగా విభజించుకోవాలి. అందులో రెండు భాగాలను ఆహారంతో నింపాలి. ఒక భాగం నీటితో నింపాలి. నాలుగవ భాగం ఖాళీగా ఉంచాలి. ఎందుకంటే మనం తిన్న ఆహారం, నీరు కలిసి, చిలకడానికి, జీర్ణం కావడానికి కాస్త స్థలం కావాలి కదా. అందుకని నాలుగవ వంతు ఖాళీగా ఉంచాలి. అంతే కానీ, ఇష్టమైన పదార్థాలు ఉన్నాయి కదా అని గొంతుదాకా దట్టించకూడదు. కాబట్టి ఎక్కువ ఆహారం తినడం కానీ అసలు తినకపోవడం కాని ధ్యానయోగమునకు మంచిది కాదు.

ఇంక నిద్రా విషయానికి వస్తే అతి నిద్ర అసలే మంచిది కాదు. సోమరితనమును కలుగజేస్తుంది. సాధకుడు ఎల్లప్పుడూ జాగరూకుడై ఉండాలి. పగలంగా పని చేసిన తరువాత

శరీరానికి తగినంత విశ్రాంతిని ఇవ్వాలి. అది అవసరం. (కానీ అదేపనిగా ఉదయం తొమ్మిది గంటలదాకా ముసుగుతన్ని పడుకోవడం సోమరితనం కలుగచేస్తుంది. చురుకుదనం దూరం చేస్తుంది.)

ఇక్కడ ఇంకొక విషయం కూడా ఉంది. తిండికి, నిద్రకు అవినాభావ సంబంధం ఉంది. అతిగా తింటే నిద్రవచ్చే ప్రమాదం ఉంది. కళ్లు మూసుకోగానే నిద్రలోకి జారుకుంటే ఇంక ధ్యానం ఏం చేస్తాడు. . న చ అతి స్వప్నశీలస్య అన్నాడు. అంటే అతిగా నిద్రపోయేవాడు, ఆ నిద్రలో కలలు కనేవాడు. వీడికి కళ్లుమూసుకోగానే నిద్రలోకి జారుకొని ఆ నిద్రలో పిచ్చి పిచ్చి కలలు కంటుంటే ఇంక ధ్యానము ఏం నిలుస్తుంది. కలలలో తేలియాడుతుంటాడు. అలాగని అస్సలు నిద్రపోకుండా ఉంటేకూడా కళ్లు మూసుకోగానే నిద్ర ఆవహిస్తుంది. అంటేపుణ్యం వస్తుందని అతిగా ఉపవాసాలు చేయడం, (ఉపవాసం పేరుతో అతిగా తినడం), జాగారం చేయడం(ఒకే టిక్కట్టు మీద మూడు సినిమాలు చూడటం, రాత్రంతా టివికి అతుక్కుపోవడం) కూడా పనికి రాదు.

కాబట్టి ధ్యానం చేయడానికి గానీ, ఏయోగమును అవలంబించడానికి కానీ, మితాహారము, మితమైన నిద్ర అవసరము. ఏదీ అతిగా ఉండకూడదు.

ఈ శ్లోకంలో అంతర్లీనంగా చెప్పబడిన ఒక విషయం మనం గమనించాలి. అతి సర్వత్రవర్జయేత్ అంటే ఏదీ అతిగా ఉండకూడదు. మితంగా ఉండాలి. ఈ శ్లోకంలో కేవలం ఆహారము నిద్ర గురించి చెప్పాడు కానీ మనం దానికి మానవుల మూడోలక్షణమైన మైథునానికి కూడా అన్వయించుకోవచ్చు . ఆమాటకొస్తే ప్రతి విషయానికీ ఈ సూత్రం వర్తిస్తుంది. అతిగా ప్రవర్తించేవారికి ధ్యానం ఆమడ దూరంలో ఉంటుంది. ఏవి చేయకూడదో చెప్పిన పరమాత్మ, ధ్యానం చేయడానికి ఏవేవి అవసరమో తరువాతి శ్లోకంలో వివరించారు.

## 17. యుక్తాహార విహారస్య యుక్తచేష్టస్య కర్మసు।
## యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దు:ఖహా॥

ఆహారము, విహారము, పనులు, ప్రవర్తన, నిద్ర, మేలుకోవడం మొదలగునవి యుక్తంగా అంటే ఎంత వరకు అవసరమో అంతవరకే చేసేవాడికి అవే యోగము గా పిలువబడతాయి. ఆహార, విహారములను, నిద్రను ఎంతవరకు అవసరమో అంతవరకే అనుభవించే యోగికి దు:ఖము అనేది ఉండదు.

పై శ్లోకంలో అతిగా ఆహారం తీసుకోవడం, అతిగా నిద్ర పోవడం,అలాగని కఠోర ఉపవాసాలు, తీవ్రమైనజాగరణలు చేయడం ధ్యానం చేయడానికి అవరోధాలు అని చెప్పిన పరమాత్మ, ఈ శ్లోకంలో అసలు యోగం అంటే ఏమిటో వివరించాడు.

ఎల్లప్పుడూ విహిత కర్మలు అంటే మంచి కర్మలే చేయాలి. ఆ కర్మలు కూడా నిష్కామంగా, ఎటువంటి కోరికలు తీరడానికి కాకుండా అంటే స్వార్థానికి కాకుండా, కేవలం సమాజ శ్రేయస్సుకొరకే చేయాలి. రోజుకు రెండుపూట్లా మితంగా ఆహారం తీసుకోవాలి. వేళకు మితంగా నిద్ర పోవాలి. ఎక్కువ జాగరణలు చేయకూడదు. ఎవరితోనూ అతిగా ప్రవర్తించకూడదు. అలా చేస్తే, దానినే యోగము అని అంటారు. అటువంటి యోగం అవలంబిస్తే సకల దు:ఖముల నుండి విముక్తికలుగుతుంది.

నా ఇష్టం వచ్చినట్టు తింటాను, తిరుగుతాను, నా ఇష్టం వచ్చిన పనులు చేస్తాను, అర్థరాత్రి దాకా మేలుకొని ఉంటాను, ఉదయం తొమ్మిది దాకా ముసుగు తియ్యను అని చాలా మంది అంటుంటారు. అలా చేయడం గొప్పగా అనుకుంటూ ఉంటారు. కాని పై నియమాలు పాటించకపోతే ఒక్క ధ్యానయోగమే కాదు ఏ యోగమూ కుదరదు. ఒక వేళ బలవంతంగా ధ్యానంలో కూర్చున్నా తగిన ఫలితములు లభించవు. ధ్యానమే కాదు, రోగానికి మందు వేసుకున్నా, ఆ మందు తగిన మోతాదులో వేసుకుంటేనే పని చేస్తుంది కానీ, ఇష్టం వచ్చినట్టు వేళాపాళా లేకుండా వేసుకుంటే పని చేయకపోగా వికటిస్తుంది. కొంతమంది ఆవేశంగా ధ్యానయోగం మొదలు పెట్టి నిద్రాహారాలు మాని, అదే పనిగా ధ్యానం చేస్తారు. అది వికటించి రోగాల పాలవుతారు. నెపం ధ్యానయోగం మీదికి నెడతారు. ధ్యానయోగం చేయడం వలన నాకు ఈ రోగం వచ్చింది అని ప్రచారం చేస్తారు. యోగము సక్రమంగా చేస్తే దు:ఖములు పోగొడుతుంది కానీ దు:ఖములు కలిగించదు. అందుకే యుక్త అనే పదం వాడారు. ఏ పని చేసినా, ఏఆహారం తీసుకున్నా యుక్తంగా అంటే తగినంతగా, సరిపోయినంతగా, మితంగాఉండాలి. అప్పుడే మనము అన్ని దు:ఖముల నుండి విముక్తి పొందుతాము.

ఇక్కడ మరొక విషయం కూడా మనం గమనించాలి. యుక్త అంటే కేవలం ఆహారము శరీర పోషణకే కాదు మనసును కూడా ప్రశాంతంగా ఉంచేదిగా ఉండాలి. దానినే సాత్వికాహారము అని అంటారు. సాత్వికాహారం తీసుకుంటే మనసు, ఆ మనసుతో చేసే ఆలోచనలు ఆ ఆలోచనలకు అనుగుణంగా చేసే కర్మలు కూడా సాత్వికంగానే ఉంటాయి. అటువంటి ఆహారము ఎలా ఉండాలో ఏమేమి తినాలో, ఎంత తినాలో, ఏ యే వేళల్లో తినలో, ఎవరికి వారు నిర్ణయించుకోవాలి. విహారము అంటే మన ప్రవర్తన. మన ప్రవర్తన మన శరీరాన్ని, మనసును కానీ, ఇతరుల శరీరాన్ని, మనసును కానీ, ఇబ్బంది పెట్టే విధంగా ఉండకూడదు. సాత్వికంగా ఉండాలి. ఎక్కడకు వెళ్లాలి, ఎక్కడకు వెళ్లకూడదు, ఎవరితో స్నేహం చేయాలి, ఎవరి స్నేహాన్ని

వదులుకోవాలి, ఇవన్నీ ఎవరికి వారు, తమ మంచికోరి, సమాజం మంచి కోరి, నిర్ణయించుకోవాలి. అలాగే మనం చేసే పనులు కూడా ఎంతవరకు అవసరమో అంతవరకే చేయాలి. అతి పనికిరాదు. చాలా మంది అధికంగా ధనం సంపాదించాలనే ఆశతో ఓవర్ టైములు చేస్తుంటారు. ఆరోగ్యం పాడుచేసుకొని ఆ సంపాదించిన అధిక ధనం వైద్యులకు ఇస్తుంటారు. ఇది కూడా పనికి రాదు. పగలంతా పని చేసిన తరువాత శరీరానికి విశ్రాంతి అవసరం. దానికి ఉపకరించేది నిద్ర. వేళకు నిద్ర పోవాలి. అధికంగా మేలుకోకూడదు. శరీరానికి ఎంత నిద్ర అవసరమో అంతవరకే నిద్రపోవాలి. లేకపోతే సోమరితనం అలవడుతుంది.

పైనియమాలు అవలంబించిన వాడికి ధ్యానయోగం అలవడుతుంది. ఆ యోగం అతని దు:ఖములను పోగొడుతుంది. అలా కాకుండా పైనియమములను పాటించకుండా ధ్యానయోగం అవలంబిస్తే ఉన్న దు:ఖాలకు తోడు కొత్త దు:ఖాలు వచ్చి కూర్చుంటాయి. కాబట్టి ఒక్క ధ్యానయోగమేకాదు ఏ యోగం అవలంబించినా పైన చెప్పబడిన నియమములు అవలంబించడం అవసరం అప్పుడే ఆ యోగం మన దు:ఖములను నివృత్తి చేస్తుంది. మనసుకు పరమ శాంతిని చేకూరుస్తుంది.

## 18. యదా వినియతం చిత్తమాత్మన్యేవావతిష్ఠతే।
## నిస్స్పృహస్సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా॥

ఎప్పుడైతే మనసు నిశ్చలంగా ఉండి ఆత్మయందు స్థిరంగా నిలిచి ఉంటుందో, ఎప్పుడైతే సాధకుడు తన కోరికలను అన్నిటినీ విడిచిపెడతాడో, అప్పుడే అతను యోగములో యుక్తుడు అంటే యోగము సిద్ధించిన వాడు అవుతాడు.

ఈ ధ్యానయోగము అవలంబిస్తే ఏం జరుగుతుంది అని పరమాత్మ వివరిస్తున్నాడు. ధ్యానయోగం వలన జరిగేది, ఇంద్రియ నిగ్రహం, మనో నిగ్రహం, మనస్సు ఆత్మయందు నిలపడం. దాని వలన సుఖము శాంతి పొందడం. అప్పుడు అతడు మోక్షమార్గములో ప్రయాణం చేస్తాడు. దానికి మార్గాలు చిత్తము ఆత్మలో నిలిచి ఉండటం, సర్వకామేభ్యో నిస్పృహ అంటే సకల కోరికల యందు స్పృహ లేకుండా ఉండటం. అంటే ఒక రకంగా వైరాగ్యము కలిగి ఉండటం. ఇవి సాధిస్తే గానీ యోగసిద్ధిని పొందలేడు. కోరికలు అంటే ఏవో ఒకటి రెండు వదిలిపెట్టి నాకు వైరాగ్యం కలిగింది అంటే కుదరదు. సర్వకామేభ్యో అన్నాడు. అంటే సకలమైన కామములు అంటే కోరికలు. ఒక్కటి కూడా మిగల కూడదు. అంటే సంపూర్ణ వైరాగ్యము కలగాలి. కోరికలు మనసు నిండుగా ఉంటే మనసు చంచలంగా ఉంటుంది. అటు ఇటు పరుగెడుతుంటుంది. ధ్యానము కుదరదు.

అసలు కోరికలే లేకపోతే మనసు నిర్మలంగా ఉంటుంది. ఏది దొరికితే ఇంక దొరకవలసినది ఏమీ ఉండదో అదే దొరుకుతుంది. అదే సుఖము శాంతి. మానవులు ఏ కోరిక కోరినా దాని వలన లభించేది సుఖము శాంతి. దీనికి కావాల్సింది.... సత్ అసత్ పదార్థములు.....వీటి మధ్య ఉన్న భేదమును తెలుసుకోగలిగే వివేకము. దాని వలన కలిగే వైరాగ్యము.

ఇలా అన్ని కోరికలను మనసు లో నుండి తీసి వేస్తే జరిగే పరిణామము వినియతం చిత్తం అంటే చిత్తము మనం చెప్పినట్టు వింటుంది. అటు ఇటు పోదు. చంచలంగా ఉండదు. దీని వలన కలిగే పరిణామము ఆత్మన్యేవావతిష్ఠతే అంటే చిత్తము ఆత్మలో స్థిరంగాఉంటుంది. అదే మోక్ష మార్గము. ఆనంద మార్గము. శాంతి మార్గము. దీనిని పొందడానికే ధ్యానయోగము ఉపయోగపడుతుంది. దీనికి చెప్పబడిన మార్గములగురించి వివరంగా తెలుసుకుందాము.

మొదటిది వినియతం చిత్తం. అంటే మనసును ప్రాపంచిక విషయముల నుండి వెనుకకు తీసుకురావాలి. శరీరం ఒకచోట ఉంటే మనసు మరొక చోట ఉంటుంది. దానినే అన్యమనస్కంగా ఉన్నాడు అని అంటారు. కాబట్టి మనం ఎక్కడ ఉన్నామో మనసు కూడా అక్కడే ఉండాలి. మనసు మన అధీనంలో ఉండాలి. మనం ఏపని చేస్తున్నామో మనసు కూడా దాని మీదనే ఉండాలి. అంటే మనసు ఎక్కడకో పోతుంది అని కాదు. మనసు మన దగ్గరే ఉంటుంది. కాని మనం చేసే పని గురించి కాకుండా వేరేదాని గురించి ఆలోచిస్తూ ఉంటుంది. దానినే మనసు నిలకడలేకపోవడం అని అంటాము. అంటే మనసు మనం ఏ పని చేస్తున్నామో దాని గురించి తప్ప మరొక దాని గురించి ఆలోచించకూడదు.

ఉదాహరణకు మనం ధ్యానానికి కూర్చున్నాము. మనసు కూడా ధ్యానం చేయడం మీదనే ఉండాలి కానీ వేరే చోట ఉండకూడదు. వేరు ఆలోచనలు ఉండకూడదు. ఎదురుగా మనం ఏ విగ్రహం ముందు కానీ, పటం ముందు కానీ కూర్చున్నామో ఆ దేవతా మూర్తి స్వరూపమే మనసులో నిలుపుకోవాలి. ఒక్కమాటలో చెప్పాలంటే మనం ధ్యానంచేసే ఆ పది నిమిషాలో, ఇరవై నిమిషాల సేపు, మన మనసులో దేవుని గురించి తప్ప వేరే ఆలోచనలు అంటే ప్రాపంచిక విషయముల సంబంధమైన, కుటుంబ సంబంధమైన, మనం చేసే వృత్తి సంబంధమైన ఆలోచనలు ఏవీ మనసులో ఉండకూడదు. దానినే మనోనిగ్రహం అంటారు.

ఈ మనోనిగ్రహం కలగాలంటే నిస్స్పృహస్సర్వకామేభ్యో అంటే ధ్యానం చేసే ఆ కాసేపు అన్ని రకములైన కోరికల పట్ల స్పృహ ఉండకూడదు. కోరికల గురించిన ఆలోచనలు ఉండకూడదు. అప్పుడు ఏంజరుగుతుంది అంటే ఆత్మన్యేవ అవతిష్ఠతే అంటే మన మనసు ఆత్మలో నిలకడగా నిలిచి ఉంటుంది. ఇప్పుడు మనకు ఒక ప్రశ్న వస్తుంది. మనసు అనేది ఒక వస్తువు కాదు. దానికిరూపం ఆకారం లేదు. అలాగే ఆత్మ అనేది ఒక ప్రదేశం కాదు. ఆత్మ సర్వవ్యాపి.

అటుంటప్పుడు మనసును ఆత్మలో ఉంచడం ఎలా సాధ్యం అనే సందేహం రావచ్చు. ఆత్మ అంతటా ఉంది కాబట్టి, మనం మనసును ఏకోరికలు లేకుండా నిర్మలంగా ఉంచుకుంటే, అది ఆత్మలో స్థిరంగా ఉన్నట్టే లెక్క. అంతేకానీ మనం మనసును ప్రత్యేకంగా ఆత్మలో ఉంచనవసరం లేదు.

ఈ ప్రకారంగా మనసును నిర్మలంగా, నిశ్చలంగా ఏ కోరికలూ లేకుండా ఉంచుకోవడమే ధ్యానము అని అనవచ్చు. ఈ ధ్యానమును ప్రతిరోజూ సాధన చేస్తే మొదట్లో కష్టం అనిపించినా, కొంత కాలానికి అది చాలా సులభం అవుతుంది. ఈ ప్రకారంగా ధ్యానం చేస్తే మన స్థితి ఎలా ఉంటుంది అన్నది తరువాత శ్లోకంలో వివరించాడు పరమాత్మ.

**19. యథా దీపో నివాతస్థో నేఙ్గతే సోపమా స్మృతా।**
**యోగినో యతచిత్తస్య యుఞ్జతో యోగమాత్మనః॥**

ఎక్కువగా గాలి లేని చోట దీపం ఏ ప్రకారంగా నిశ్చలంగా, కదలకుండా వెలుగుతుంటుందో, అలాగే ధ్యానములో ఉన్న యోగి అదుపులో ఉన్న మనసు ఎటువంటి వికారములు లేకుండా నిశ్చలంగా నిర్మలంగా ఉంటుంది.

ఈ ప్రకారంగా చిత్తమును ఆత్మయందు స్థిరంగా ఉంచి ధ్యానము చేస్తున్న యోగి చిత్తము ఎలా ఉంటుంది అంటే ఎక్కువగా గాలి లేని చోట పెట్టిన దీపం ఏ ప్రకారంగా నిశ్చలంగా వెలుగుతూ ప్రకాశిస్తూ ఉంటుందో, అలాగే యోగి చిత్తము ఎటువంటి వికారములు లేకుండా, ప్రాపంచిక విషయముల వెంట పరుగెత్తకుండా, నిశ్చలంగా, నిర్మలంగా ఉంటుంది. ఇక్కడ దీపం గురించి ఎందుకు చెప్పాడు అంటే దీపం యొక్క గుణం అటు ఇటు ఊగడం. అంటే దీపం ఊగుతుందని కాదు. దీప కళిక గాలి ఉన్నప్పుడు వేగంగా అటు ఇటు ఊగుతుంది. గాలి ఎక్కువగా ఉన్నప్పుడు ఆరి పోతుంది. అలాగేకోరికలు ఎక్కువగా ఉన్న మనసు మన స్వాధీనంలో ఉండదు. అటు ఇటు ఊగుతుంటుంది. ప్రాపంచిక విషయముల వెంట, కోరికల వెంట, పరుగెడుతుంటుంది. వాటి గురించే ఆలోచిస్తూ ఉంటుంది. ఆ మనస్సే ఆత్మయందు స్థిరంగా ఉంచినపుడు గాలిలేని చోట ఉన్న దీపంమాదిరి నిశ్చలంగా ఉంటుంది. కాబట్టి ముందు మనసును మన స్వాధీనంలో ఉంచుకోవాలి. బయట నుండి విషయములు లోనికి ప్రవేశించకుండా ఇంద్రియములను అదుపుచేయాలి. మనసుకు ఉన్న అన్ని ద్వారములు మూసివేయాలి. అప్పుడు బయట విషయములు లోపలకు రావు.

కాని అప్పటికే మన మనసులో ఉన్న విషయముల సంగతి ఏమిటి? సాధారణంగా రెండు లక్షణాలు అందరిలో ఉంటాయి. జరిగిన దాని గురించి బాధపడటం, జరగబోయేదాని

గురించి భయపడటం. ఇవి మనము తెచ్చిపెట్టుకున్నవి. ధ్యానంలో కూర్చోగానే ఎప్పుడెప్పుడో జరిగిన విషయాలు గుర్తుకు వచ్చి అలాఎందుకు జరిగిందో అని బాధపడటం, రేపు ఏం జరుగబోతోందో అని భయపడటం జరుగుతూ ఉంటుంది. రేపు మనకు మంచి జరగవచ్చు కదా అని ఆలోచించడు. కీడెంచి మేలెంచమన్నారు అనే దరిద్రపు సిద్ధాంతాన్ని అవలంబిస్తాడు. ఎప్పుడూ తనకు ఏదో అపకారం జరగబోతోంది అని బాధపడుతూ ఉంటాడు. అప్పుడు మనసులో అనవసరమైన అలజడి రేగుతుంది. దీనికి ఉపాయం మనసులో అదుపులో ఉంచుకోవడం. అటువంటి ఆలోచనలను రాకుండా కట్టడిచేయడం. భవిష్యత్తులో కూడా మంచే జరుగుతుంది అనే పాజిటివ్ తింకింగ్ అలవాటు చేసుకోవడం, అలా కాకపోతే జరిగేది జరుగుతుంది ఇప్పటి నుండే బాధపడటం ఎందుకు అని వైరాగ్యంతో ఉండటం. ఈ విధంగా ఆలోచిస్తే భవిష్యత్తు గురించి భయం ఉండదు.

కాబట్టి, ముందు బయట విషయాలు మనసు లోపలకు రాకుండా, లోపల ఉన్న విషయాలు మనలను డిస్టర్బ్ చేయకుండా చూసుకోవాలి. ఇలా చేయాలంటే ఏం చేయాలి? సాధారణంగా మనం బలహీనులము. అందుకని మనకన్నా బలవంతులను, అధికారం కలవారిని ఆశ్రయిస్తాము. అలాగే మనం అందరం మనకన్నా బలవంతుడు, సర్వశక్తిమంతుడు అయిన పరమాత్మను ఆశ్రయించడము ఒకటే మార్గము. అంటే భగవంతుని మీద భక్తి, శరణాగతి అలవరచుకోవాలి. నీవే తప్ప నిత: పరం బెరుగ అనే భావన అలవరచుకోవాలి. అప్పుడు మనకు జరిగిన దాని గురించి చింత, జరగబోయే దాని గురించి భయం ఉండదు. మనసు ప్రశాంతంగా, నిర్మలంగా ఎటువంటి అలజడికి లోనుకాకుండా ఉంటుంది. అప్పుడు మనసును ఆత్మలో నిలపాలి ఈ రెండు క్రియలకు ధ్యానం అవసరం. ఆ ధ్యానం ఎలా చేయాలో వివరంగా చెప్పాడు పరమాత్మ.

20. యత్రో పరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా
యత్ర చైవాత్మనా22త్మానం పశ్యన్నాత్మని తుష్యతి॥

పై చెప్పిన విధంగా ధ్యానయోగాభ్యాసము చేసిన యోగి మనస్సును నిగ్రహించి దాని వలన పరమ శాంతిని పొందుతాడు. అతని నిర్మలమైన, అలజడిలేని, పరిశుద్ధమైన మనసుతో తనయొక్క అసలు స్వరూపమైన ఆత్మస్వరూపమును చూడగలడు. తనలో తనే అపరిమితమైన ఆనందమును పొందగలడు.

ఈ ధ్యానయోగము వలన సాధకుడికి కలిగే ప్రయోజనాల గురించి ఈ నాలుగు శ్లోకాలలో వివరించాడు పరమాత్మ. మొదటి శ్లోకంలో....పైన చెప్పిన విధంగా జ్ఞానయోగం అవలంబించిన యోగికి ఆత్మసాక్షాత్కారము కలుగుతుంది. ధ్యానం చేయడం వలన మనసు నిగ్రహింపబడుతుంది. దాని వలన మనసు శుద్ధి పొంది తన అసలు రూపమైన ఆత్మను దర్శిస్తుంది.

. అప్పుడు యోగికి పరమ శాంతి, సుఖము కలుగుతాయి. అదే మానవ జీవిత లక్ష్యము. నిగ్రహించ బడ్డ మనసు అంటే విషయవాంఛలు లేకుండా, వాసనలు లేకుండా ఉన్న మనసే ఆత్మను దర్శించగలుగుతుంది. మరి ఈ మనసును నిగ్రహించడం ఎలాగా అంటే యోగ సేవయా అన్నాడు. అంటే యోగమును అభ్యసించడం వలన అంటే నిరంతర అభ్యాసము, సాధన వలననే కలుగుతుంది. అభ్యాసము, వైరాగ్యము ఈ రెండింటి వలననే మనసును నిగ్రహించగలము. కాబట్టి యోగమును చేయాలి. మనము ప్రాపంచిక విషయములను ఎంత శ్రద్ధగా చేస్తామో, అలాగే యోగ సేవకూడా అంతే శ్రద్ధతో చేయాలి. ప్రాపంచిక సేవను దైవ సేవగా మార్చాలి. కాబట్టి యోగమును అంటే ఇటు నిష్కామ కర్మయోగమును, అటు ధ్యానయోగమును అభ్యాసము చేసి, నిర్మలమైన మనసుతో ఆత్మను దర్శించాలి. పరమ సుఖమును పొందాలి.

కేవలము నిర్మలమైన పరిశుద్ధమైన మనసు ఉంటే చాలదు. దానికి తోడు జ్ఞానము కూడా అలవడాలి. అంతకు ముందు శాస్త్రములను చదివి, గురువుల బోధనలను విని ఆర్జించిన జ్ఞానమును నిర్మలమైన ప్రశాంతమైన మనసుకు బోధించాలి. అప్పుడే మనసు జ్ఞానమును చక్కగా అలవరచుకుంటుంది. మనసు, బుద్ధి ఒకటౌతాయి. జ్ఞానవంతమౌతాయి. అలా కాకుండా ప్రాపంచిక విషయములలో మునిగి తేలుతున్న సమయంలో మనసుకు జ్ఞానబోధ చేస్తే, అది వినదు. ఒకవేళ విన్నా సగం వింటుంది, సగం వినదు.

ఉదాహరణకు...... మనము భగవద్గీత జ్ఞానయజ్ఞములో ఉన్నా, సత్సంగములో ఉన్నా, మన మనసు మాత్రం ఎక్కడో విహరిస్తుంటుంది. ఇంటి విషయాల గురించో, ఆఫీసు విషయాల గురించో లేక మనకు ఇష్టమైనవిషయాల గురించో ఆలోచిస్తూ ఉంటుంది. (బాడీ ప్రెజంట్ మైండ్ ఆబ్సెంట్). గీతోపన్యాసములుచెవులు వింటాయే గానీ మనసుకు ఎక్కవు. అక్కడక్కడా విన్నా అర్థం కావు. ఇదే విషయం విద్యార్థులకు కూడా అన్వయించుకోవచ్చు. విద్యార్థులకు చదువు వంటబట్టడంలేదు అంటే వారు క్లాసులో ఉపాధ్యాయుడు చెప్పిన పాఠం శ్రద్ధగా మనసు పెట్టి వినడం లేదు, శరీరం క్లాసురూములో ఉంటే, మనసు మరోచోట ఉంది అని అర్థం. కాబట్టి మంచి మార్కులు తెచ్చుకొని వృద్ధిలోకి రావాలంటే, క్లాసులో ఉపాధ్యాయుడు చెప్పిన పాఠాలను శ్రద్ధగా వినాలి. ఇంటికి వచ్చి ప్రశాంతంగా కూర్చుని క్లాసులో విన్న పాఠాలను మనసుకు హత్తుకునేటట్టు చదవాలి. అప్పుడు ఆ పాఠాల సారాంశము చక్కగా మనసుకు పడుతుంది. అవి ఎన్నటికీ మరిచిపోరు. పరీక్షలలో చక్కగా జ్ఞాపకం వస్తాయి.

కాబట్టి మనసు నిర్మలంగా, నిశ్చలంగా ఉన్నప్పుడే దానికి జ్ఞానబోధ చేయాలి. అంటే ముందు మనము గురువులు చేసే జ్ఞానబోధనలను శ్రద్ధగావిని, ఇంటికి పోయి, మనసు ప్రశాంతంగా ఉన్నప్పుడు మనసుకు ఎక్కించాలి. అంటే మననం చేయాలి. అప్పుడు మనం నేర్చుకున్న జ్ఞానం మనసుకు పడుతుంది. తరువాత మనసుతో ఆత్మను దర్శించాలి.

మనసంటే ఎలా ఉంటుందో మనకు తెలుసు. మరి ఆత్మ ఎక్కడ ఉంది. దానిని మనసుతో ఎలా దర్శించాలి అన్న ప్రశ్న వస్తుంది. ఆత్మ ఎక్కడో లేదు. మనలోనే అంతర్లీనంగా ఉంది. మనసును అంటిపెట్టుకొని ఉంది. అంతర్ముఖులు అయితే చాలు ఆత్మ కనపడుతుంది. మనం ఎప్పుడూ బయట ప్రపంచాన్నే చూస్తాము కానీ మనలోపలకు మనం చూడము. మనం ఎవరో తెలుసుకోడానికి ప్రయత్నం చేయము. ఆత్మను నిరంతర అభ్యాసము, సాధన చేత శోధించి తెలుసుకోవాలి. ఆత్మ ఎక్కడో లేదు. మనలోనే ఉంది. కాని మనం చూడటంలేదు. బయట ప్రపంచపు రణగొణధ్వనులలో మనకు సూక్ష్మమైన గోడ గడియారం టిక్ టిక్ చప్పుడు వినపడనట్టు, ప్రాపంచిక విషయములు, విషయ సుఖములలో మునిగి తేలుతున్న మనకు, మనలో ఉన్న ఆత్మ అనుభవంలోకి రాదు. కాబట్టి ముందు మనసును నిశ్చలంగా, అలజడి లేకుండా, ప్రశాంతంగా ఉంచుకుంటే , అంతకు ముందు శాస్త్రములు చదివి, గురువుల వలన విని ఆర్జించిన జ్ఞానం వలన మనలోనే ఉన్న ఆత్మను దర్శించగలుగుతాము. దర్శించడం అంటే మన కళ్లతోచూచినట్టు చూడ్డంకాదు. అది ఒక అలౌకిక మైన అనుభవం. ఆ అనుభవం కలిగితే ఇంక ఆనందమే ఆనందం బ్రహ్మానందం. అందుకే తుష్యతి అంటే తుష్టి కలుగుతుంది. తృప్తితో కూడిన ఆనందం కలుగుతుంది.

## 21. సుఖమాత్యన్తికం యత్తద్బుద్ధిగ్రాహ్యమతీన్ద్రియమ్
## వేత్తి యత్ర న చైవాయం స్థితశ్చలతి తత్త్వతః॥

ఆత్మ దర్శనం కలిగితే అనుభవానికి వచ్చే సుఖం ఆత్యన్తికం అంటే దానికి మొదలు తుది లేదు. ఆ సుఖం ఇంద్రియములకు అందదు. అంటే ఆ సుఖాన్ని అనుభవించాలే గానీ కళ్లతో చూడలేము, చెవులతో ఆ సుఖం గురించి వినలేము. బుద్ధితో కూడా ఆ సుఖం ఇలా ఉంటుంది అని నిర్వచించలేము. మాటలకందని సుఖమది. ఆ సుఖానుభవము నుండి చలించడానికి అంటే బయటకు రావడానికి యోగి ఇష్టపడడు. ఆ సుఖంతో కూడిన అనుభవం ఇంకా ఇంకా కావాలని కోరుకుంటాడు. ఆ అలౌకిక స్థితిలోనే ఉండిపోవడానికి ఇష్టపడతాడు.

బాహ్య సుఖాలు ఇంద్రియములతో అనుభవిస్తాము ఈ సుఖం మనసుతో అనుభవిస్తాము. నిర్మలమైన బుద్ధితో అనుభవిస్తాము. మనస్సు బుద్ధి నిర్మలంగా ఉంటే, పరమానందం అనుభవించడానికి యోగ్యములు అవుతాయి. కాబట్టి ఈ సుఖము బుద్ధినుండి కలిగేది అంటే బుద్ధిగ్రాహ్యము అని చెప్పారు. బుద్ధి అంటే జ్ఞానము అని కూడా అర్థము. అంటే ఈ సుఖము బయట ప్రపంచములో దొరికే వస్తువుల వలన, మనుషుల వలన కాకుండా, మనలో ఉన్న ఆత్మజ్ఞానం వలన కలుగుతుంది అని అర్థం. అతీంద్రియమ్ అంటే ఇంద్రియములకు అతీతమైనది. ఇంద్రియసుఖముల కంటే గొప్పది. అంటే మనకు ఇష్టం వచ్చినవి తినడం వలనా, ఇష్టం వచ్చినవి

చూడటం వలనా, వినడంవలనా, తాకడం వలనా,మాట్లాడటం వలనా కలిగే ఆనందం కేవలం క్షణికానందము. ఎల్లప్పుడూ ఇంద్రియ సుఖములతో కాలక్షేపం చేసేవారికి ఈ ఆత్మానందం గురించి తెలిసే అవకాశం లేదు.

ఈ సుఖము ఆత్యన్తికం అని కూడా అన్నారు అంటే ఈ సుఖమునకు ఆది లేదు, అంతము లేదు. బాహ్య సుఖముల మాదిరి ఈ రోజు ఉండి రేపు పోదు. ఎప్పటికీ తరిగి పోదు. ఎటర్నల్ అని చెప్పవచ్చు. ఇటువంటి ఆత్మానందాన్ని పొందిన యోగి అచ్చట నుండి కదలడు. అంటే సాధకుడు ఒక సారి ధ్యానయోగంలో ఉన్న సుఖానికి అలవాటు పడితే అక్కడ నుండి కదలడు. ఎప్పుడూ అదే కావాలని కోరుకుంటాడు. అమృతం తాగడానికి అలవాటు పడ్డవాడు ఆ అమృతాన్ని వదలడు. ఇంకా ఇంకా కావాలంటాడు. అనంతమైన ఆనందాన్ని పొందిన వాడు తాత్కాలికమైన విషయసుఖముల కొరకు పాకులాడడు. అటువంటి వాడు ఉద్యోగం చేస్తున్నా, వ్యాపారం చేస్తున్నా, విద్యాభ్యాసం చేస్తున్నా ఏపని చేస్తున్నా అతని మనసు బుద్ధి ఆత్మానందాన్ని అనుభవిస్తూ ఉంటుంది. కాబట్టి ఆ ఆనందాన్ని గురించి మనం అందరం వేత్తి అంటే తెలుసుకోవలసిన ఆవశ్యకత ఎంతో ఉంది.

## 22. యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తత:।
## యస్మిన్ స్థితో న దు:ఖేన గురుణాపి విచాల్యతే॥

ఏ లాభాన్నిపొందితే ఇతర లాభాలు ఎన్ని కలిగినా, ఆ పొందిన లాభం కంటే అధికం కాదో, ఏలాభాన్ని పొందితే ఇతరములైన దు:ఖములు ఎన్ని కలిగినా, ఆ దు:ఖములకు చలించడో, అటువంటి లాభాన్ని, దు:ఖరహిత స్థితిని, ఆత్మానందం కలుగజేస్తుంది.

ఈ బయట ప్రపంచంలో వ్యవహరించేటప్పుడు ప్రతి వాడూ ఈ పని చేస్తే నాకు లాభమా, నష్టమా, ఏ పని చేస్తే ఎక్కువ లాభం వస్తుంది, ఏ పని చేస్తే నష్టము పరిమితం చేసుకోవచ్చు అని లాభనష్టాల లెక్కలు వేసుకుంటాడు. అటువంటి వారి మనస్తత్వమును అనుసరించే ఈ శ్లోకం చెప్పబడింది. ఆత్మానందము అనే ఈ లాభం పొందిన వాడు ఇతర లాభముల కొరకు పాకులాడడు. ఇదే సర్వోత్తమమైన లాభము అని తెలుసుకుంటాడు. ప్రాపంచిక విషయముల వలన కలిగిన లాభములు కొద్దికాలంలో నశించిపోతాయి. ఒక్కోసారి ఆ లాభాలను అనుభవించడానికి మనం ఈ లోకంలో ఉండము. కాని ఈ లాభము ఇహలోకంలోనే కాదు, పరలోకంలో కూడా మనకు పరమ శాంతిని చేకూరుస్తుంది. ఇటువంటి ఆత్మానందాన్ని పొందిన వాడికి ఎటువంటి భయంకరమైన దు:ఖము వచ్చినా ఏమాత్రము చలించడు. కాబట్టి సకల దు:ఖములుపోగొట్టేది ఈ ఆత్మానందమే అని తెలుస్తూ ఉంది.

స్వప్నంలో మనం ఎన్నో కష్టాలు పడ్డట్టు కల గంటాము. మెలుకువ వచ్చి చూస్తే అవేవీ ఉండవు. అదే మాదిరి ఆత్మానందం పొందిన వాడికి ఒక వేళ కష్టాలు వచ్చినా అవి స్వప్నంలో వచ్చిన కష్టాల మాదిరే చెదిరి పోతాయి. అదే ప్రాపంచిక విషయముల వలన కష్టాలు వస్తే, చిన్న కష్టమైనా, దానిని పెద్దదిగా ఊహించుకొని తలకిందులౌతాడు. కాని ఒక సారి ఆత్మానందం అనుభవంలోకి వస్తే, ఇటువంటి దు:ఖములు ఎన్ని వచ్చినా యోగి అనేవాడు ఏ మాత్రం చలించడు. అతని బుద్ధి, మనసు నిశ్చలంగా, నిర్మలంగా ఉంటుంది. ఇటువంటి ఆత్మసుఖము కేవలము ధ్యానంయోగంతోనే లభిస్తుంది. ఆ స్థితిలో దు:ఖము కానీ, పూర్వజన్మ వాసనలు కానీ, ఉండవు. సకల దు:ఖ నివారిణి ఆత్మానందము.

## 23. తం విద్యాద్దు:ఖసంయోగవియోగం యోగసంజ్ఞితమ్।
## స నిశ్చయేన యోక్తవ్యో యోగో2నిర్విణ్ణచేతసా॥

దు:ఖములు కలగడం, ఆ దు:ఖములనుండి విముక్తి కలగడం.... ఈ స్థితి నుండి బయట పడడం, ఆత్మానందము కలగడం ఇవి రెండూ కేవలము ధ్యానయోగము వలననే లభిస్తాయి. ఆ ధ్యానయోగము నిర్మలమైన మనస్సు, నిశ్చయమైనబుద్ధి, సాధించవలెననే పట్టుదల ఉంటేనే సాధ్యము అవుతుంది.

మనం సహజంగా ఆనంద స్వరూపులం. కాని ఈ ప్రాపంచిక విషయములలో లీనమై వివిధములైన దు:ఖములను కొనితెచ్చుకుంటున్నాము. అంటే ధనము కానీ, ఆస్తికానీ, పదవి కానీ రావడం, పోవడం, బంధువుల జనన మరుణములు, వాటి వలన సుఖము, దు:ఖములు కలగడం మరలా ఆ సుఖములు, దు:ఖములు పోవడం. ఇవి ప్రపంచంలో సామాన్యంగా జరుగుతుంటాయి. కాని ఒక సారి ఆత్మదర్శనం కలిగితే, దు:ఖములు రావడం పోవడం అనే మాట కూడా వినిపించదు. అది ఒక అలౌకిక స్థితి. ఇటువంటి స్థితి ఎవరికి దక్కుతుంది అంటే అనిర్విణ్ణ చేతసా అంటే కలత చెందని మనసు కలవాడు, ధీరోదాత్తుడు, నిశ్చయాత్మకబుద్ధి కలవాడు. పట్టుదల కలవాడు, అభ్యాసం చేసేటప్పుటు ఎన్ని ఆటంకములు వచ్చినా పట్టిన పట్టు వీడని వాడు, నిరాశా, నిస్పృహలు లేనివాడు, నిరాశావాదం వదిలిపెట్టినవాడు, వీడికే దక్కుతుంది. ఒకవేళ ఆటంకములు వచ్చినా వాటిని భగవంతునికి వదిలిపెట్టి, సాధన కొనసాగించాలి. అప్పుడే సాధన పరిపూర్ణమౌతుంది.

## 24. సంకల్ప ప్రభవాన్ కామాంస్త్యక్త్వా సర్వానశేషతః।
## మనసైవేన్ద్రియగ్రామం వినియమ్య సమన్తతః॥

మన మనసులలో కలిగే సంకల్పముల వలన పుట్టే కోరికలను అన్నిటినీ పూర్తిగా, ఏ మాత్రం మిగలకుండా, విడిచిపెట్టి, ఆ మనసుచేతనే ఇంద్రియములను బాహ్యప్రపంచములో నుండి వెనక్కు మరల్చి, తన అధీనంలో ఉంచుకొని, బుద్ధిని ధైర్యంతో బలోపేతం చేసి, మెల్ల మెల్లగా శాంతిని పొందాలి. మనసులో ఆత్మను తప్ప మరొక విషయమును తలంచకూడదు. అలా చేస్తేనే మనస్సు ఆత్మను దర్శించగలుగుతుంది.

సంకల్ప ప్రభవాన్ కామాన్ ... కోరికలు సంకల్పము నుండి ప్రభవిస్తాయి అంటే పుడతాయి. మనలో చెలరేగే కోరికలు అనే మొక్కలకు మనసులో మెదిలే సంకల్పములు విత్తనముల వంటివి. కాబట్టి మొట్ట మొదట సంకల్పములు అనే విత్తనములను నాశనం చేయాలి. ఇది ఎలాగా అంటే మన మనసులో ఒక ఆలోచన మెదలగానే దాని గురించి పట్టించుకుంటే అది కోరికగా మారుతుంది. ఆ ఆలోచనను మనం పట్టించుకోకపోతే, ఆ ఆలోచన క్రమక్రమంగా ఆవిరైపోతుంది. మరలా అదే ఆలోచన వస్తుంది. ఈ సారి కూడా దాని మొహం చూడకుండా ఉంటే చాలు. దానంతట అదే పోతుంది. అలా కాకుండా మనసులో మెదిలే ప్రతి ఆలోచననూ మనం పట్టించుకుంటే ఆ ఆలోచనలు కోరికలై ఆ కోరికలు తీరేదాకా మనసును అల్లకల్లోలం చేస్తాయి. మనసులో మెదిలే సంకల్పములను పట్టించుకోకుండా ఉండాలంటే వివేకము వైరాగ్యము కావాలి. ఇవి సంకల్పముల స్థితిలోనే కోరికలను తుంచివేస్తాయి.

(దీనికి సరి అయిన ఉదాహరణ మన కంప్యూటర్‌లో ఉన్న మైల్ బాక్స్. మన మైల్ బాక్స్‌లోకి పనికిమాలిన, అనవసరమైన ప్రమాదభరితమైన మైల్సుఎన్నో వస్తుంటాయి. వాటిని అన్నిటినీ ఓపన్ చేస్తే ప్రపంచంలో ఉన్న వైరస్ అంతా మన కంప్యూటర్‌లోకి వచ్చి చేరుతుంది. కంప్యూటర్ క్రాష్ అవుతుంది. ఇంకా ఎన్నో అనర్థాలు జరుగుతాయి. అలా కాకుండా మనకు తెలియని మైల్స్‌అన్నీ ఏ మాత్రం పట్టించుకోకుండా, అవేమిటో తెలుసుకుందామనే కోరికతో ఓపన్ చెయ్యకుండా, నిర్దాక్షిణ్యంగా డిలీట్ చేస్తే, కంప్యూటర్ సురక్షితంగా ఉంటుంది. అలాగే మన మనసులో సంకల్పం పుట్టగానే దాని గురించి పట్టించుకోకుండా, సంకల్పంగా ఉండగానే దానిని సమూలంగా తుడిచివేయాలి.)

సర్వాన్ అశేషత: అంటే మనం సంకల్పించే అన్ని కోరికలను ఏమాత్రం శేషం మిగలకుండా నాశనం చేయాలి. ఏవో నాలుగు కోరికలు మాత్రం వదిలిపెడతాము అంటే కుదరదు అందుకే సర్వాన్, అశేషత: అని రెండు విశేషణములు వాడాడు. అంటే సకలమైన కోరికలు,

ఏ మాత్రం శేషం లేకుండా అని అర్థం. తరువాత మనసును ప్రాపంచిక విషయముల నుండి లోపలకు మరల్చాలి. వినియమ్య అన్నాడు. సాధారణంగా నియమ్య అంటే నియమించడం అంటే ఇంద్రియములను మనసును నియమించాలి అని అర్థం. కాని వినియమ్య అంటే బాగుగా, చక్కగా, అని అర్థం. సమన్త: అంటే అన్ని వైపుల నుండి మనసును ఇంద్రియములను లాగుకొని వచ్చి చక్కగా నియమించాలి.

ఈ పని చేయడానికి బుద్ధి కావాలి. ఆ బుద్ధికి ధైర్యం ఉండాలి. మనసుకు లొంగి పోకూడదు. వివేకము, శాస్త్రజ్ఞానము లేని వాళ్లలో మనసు చెప్పినట్టు బుద్ధి వింటుంది. అదే వివేకం కల వాళ్లలో, బుద్ధి చెప్పినట్టు మనసు వింటుంది. బుధ్యా ధృతి గృహీతయా అన్నాడు అంటే ధైర్యముతో కూడిన బుద్ధితో మనసును నిగ్రహించాలి. కాబట్టి సాధకుడి యొక్క బుద్ధి, అతడి మనసు మీద అధికారం కలిగి ఉండాలి. ఇక్కడ బుద్ధి అంటే శాస్త్ర జ్ఞానము అని కూడా చెప్పుకోవచ్చు. ఆత్మ, మనసు, బుద్ధి, చిత్తము వీటి గురించిన పరిజ్ఞానము లేకుండా ధ్యానం చేయడం కష్టం. కాబట్టి ముందు శాస్త్రజ్ఞానము అవసరము. శాస్త్రజ్ఞానముతో కూడిన బుద్ధి మనసును చక్కగా అదుపులో పెట్టగలుగుతుంది. బుద్ధి మనసును ఎలా అదుపులో పెట్టగలుగుతుంది అనే విషయాన్ని తరువాతి శ్లోకంలో వివరించారు పరమాత్మ.

25. శనై: శనైరుపరమేద్బుద్ధ్యా ధృతిగృహీతయా।
ఆత్మసంస్థం మన: కృత్వా న కించిదపి చిన్తయేత్॥

పై శ్లోకంలో బుద్ధి మనసును తన అధీనంలో ఉంచుకోవాలి. తాను చెప్పినట్టు మనసు నడచుకునేటట్టు చేయాలి. అని చెప్పారు కదా. మరి ఈ పనంతా ఎలా చేయాలి అంటే గబగబా చేయకూడదు. నెమ్మదిగా నిదానంగా చేయాలి. శనైశ్శనై అంటే మెల్లమెల్లగా చేయాలి. తనకు అధికారం ఉంది కదా అని ఆఫీసరుగారు, బంట్రోతును చీటికి మాటికి తిడితే వాడు ఆ పని చేయకుండా వెళ్లిపోతాడు. అలా కాకుండా, నెమ్మదిగా బుజ్జగించి చెబితే, ఎంత కష్టమైన పనైనా చేస్తాడు. అదే ఇక్కడ చెప్పాడు. బుద్ధి కూడా మనసును ఇంద్రియములను మెల్ల మెల్లగా బుజ్జగించి తన దారిలోకి తెచ్చుకోవాలి. చిన్న పిల్లవాడికి చెప్పినట్టు చెప్పి దారిలోకి తెచ్చుకోవాలి. అలా కాకుండా బలవంతంగా మనసును ఇంద్రియములను దారిలో పెట్టాలంటే అవి మాట వినవు సరికదా బుద్ధిని కూడా తమతో లాక్కుపోతాయి. అగ్నిహెూత్రం వెలగాలంటే ముందు చిన్న కర్పూరం బిళ్ల అంటించి, దాని మీద చిన్న చిన్నచితుకులుపెట్టి, ఊది, మంటపెద్దదిగా చేసి అప్పుడు పెద్ద పెద్ద సమిధలు వేయాలి. అంతే కానీ కర్పూరం బిళ్ల అంటించగానే, ఆ చిన్ని మంటలో పెద్ద పెద్ద సమిధలు వేస్తే ఆరిపోతుంది. అందుకే శనై: శనై: అంటే మెల్ల మెల్లగా, మనసును బుద్ధితో లాలించి, బుజ్జగించి, దారిలోకి తెచ్చుకోవాలి.

అలా దారిలోకి తెచ్చుకున్న మనసును అలాగే వదిలేస్తే మరలా పారిపోతుంది. అలా పారిపోకుండా వెంటనే ఆత్మలో పెట్టెయ్యాలి. అంటే మరలా మనసు అటు ఇటు పారి పోకుండా "ఆత్మ చింతన" అనే తాయిలాలు దానికి రుచి చూపించాలి. ఒకసారి ఆత్మలో లీనమైన మనసు ఇంక అక్కడి నుండి కదలదు. స్థిరంగా ఉంటుంది. ఇదంతా ఎలా చేయాలి అంటే ధృతి గృహీతయా అంటే ధైర్యంగా చేయాలి. బుద్ధితో, జ్ఞానంతో చేయాలి. మనం చదువుకున్న శాస్త్ర పరిజ్ఞానంతో చేయాలి కాని ఏమీ తెలియకుండా చేయకూడదు. ఆత్మ అంటే ఏమిటో, ఆత్మ స్థితి అంటే ఏమిటో తెలియకుండా మనసును ఆత్మలో కలపడం సాధ్యం కాదు. కాబట్టి దీనికి మనం సంపాదించుకున్న శాస్త్రజ్ఞానమును వినియోగించుకోవాలి.

ఒకసారి ఆత్మను మనసులో లీనం చేసాము కదా అని ఏమనుపాటుగా ఉంటే, ప్రాపంచికవిషయములలో తల దూరిస్తే, మనసు కూడా అటు తొంగి చూస్తుంది. అందుకనే న కించిదపి చిన్తయేత్ అన్నారు. అంటే ఒక సారి ఆత్మసాక్షాత్కారం పొందడానికి ధ్యానంలో కూర్చున్న తరువాత, ఇంక ఇతర విషయముల వంక చూడకూడదు. చింతించకూడదు. ఆలోచించకూడదు. అందుకే "ఆత్మసంస్థం మన: కృత్వా న కించిదపి చిన్తయేత్" అంటే ఆత్మయందు మనసును నిలిపిన తరువాత, ఇతరములైన వేటి గురించి కూడా ఆలోచించకూడదు. ధ్యానంలో ఉన్నప్పుడు మనసులో ఏ పరమాత్మ ఉన్నాడో లేక ఎదురుగా ఏ దేవతా మూర్తి ఉన్నదో, దానిని తప్ప మరి ఏ విషయం కూడా మనసులోకి రానీయకూడదు. అప్పుడే ఆత్మసాక్షాత్కారం పొందే అవకాశం ఉంది.

## 26. యతో యతో నిశ్చరతి మనశ్చఞ్చలమస్థిరమ్।
## తతస్తతో నియమ్యైతదాత్మన్యేవ వశం నయేత్॥

ఈ అస్థిరమైన, చంచలమైన మనస్సు ఎక్కడెక్కడకు పోతుందో అక్కడక్కడనుండి ఆ మనసును లాగుకొని వచ్చి ఆత్మ యొక్క అధీనంలో ఉంచవలెను.

ఈ శ్లోకంలో పరమాత్మ మరొక విషయం స్పష్టంగా చెబుతున్నాడు. మనసు చంచల మైనది. అది ఒక చోట నిలువదు. అటు ఇటు తిరుగుతూ ఉంటుంది. ధ్యానంలో కూర్చున్న మరుక్షణం ప్రపంచంలో ఉన్న అన్ని పనికిమాలిన, వ్యర్థ ఆలోచనలు అన్నీ మనకే వస్తాయి. మరి ఎలాగ? నా గతి ఇంతేనా! నేను ధ్యానం చేయలేనా! నేను భగవంతుని మీద మనసు నిలుపలేనా! బాగుపడలేనా! అని చాలా మంది వాపోతుంటారు. వారి ప్రశ్నలకు ఈ శ్లోకంలో సమాధానం ఇస్తున్నాడు పరమాత్మ.

చంచలంగా ఉండటం, నిలకడలేకపోవడం, అటు ఇటు తిరగడం మనస్సు యొక్క సహజ గుణం. దానికి మనం ఏమీ చేయలేము. నీళ్లు ఒలికితే పారి పోతాయి. పారడం నీటి యొక్క సహజ గుణం. గ్లాసులోనో, కుండలోనో, పాత్రలోనో పోయడం ద్వారా, నదులకు ఆనకట్టలు కట్టడం ద్వారా, నీటిని పారి పోకుండా నిలువరిస్తాము. అలాగే మనసును నిలువరించడానికి కూడా మార్గాలు ఉన్నాయి.

మనం ధ్యానంలో కూర్చున్నప్పుడు పారిపోతే, మనకు చిక్కకుండా అటు ఇటు తిరుగుతుంటే, చంచలంగా ఉంటే ఏమి చేయాలి అనేది ఈ శ్లోకంలో వివరిస్తున్నాడు. చిన్న ఉదాహరణ చెప్పుకోవాలంటే మన ఇంట్లో ఒక 3 ఏళ్ల పసివాడు ఉన్నాడు అనుకుందాము. వాడు చాలా అల్లరివాడు. వాడికి అన్నం తినిపించాలంటే తల్లి పెద్ద కసరత్తు చేయాలి. తల్లి ఎంత చెప్పినా మాట వినడు. అటు ఇటు తిరుగుతుంటాడు. ఇటు పోతే అటు, అటు పోతే ఇటు పరుగెడుతుంటాడు. తల్లి చేతికి చిక్కడు. చిక్కినట్టే చిక్కి, పారిపోతుంటాడు. అటువంటి అల్లరి వాడిని తల్లి పట్టుకొని చంకలో ఇరికించుకొని, మంచి మాటలు చెబుతూ చందమామను చూపిస్తూ, బుజ్జగిస్తూ, అన్నం తినిపిస్తుంది. ఇదే మాదిరి ఎప్పుడెప్పుడైతే మన మనసు మన మాట వినకుండా ప్రాపంచిక విషయాల వంక, విషయవాంఛల వంక, కోరికల వెంట పరుగెడుతూ ఉంటుందో, అప్పుడప్పుడు, మనసును మంచి మాటలతో లాలించి బుజ్జగించి, పట్టుకొని తీసుకొని వచ్చి ఆత్మలో కూర్చోపెట్టాలి.

ఇది ఒకసారి చేస్తే కుదిరే పని కాదు. అందుకే యతో యతో అంటే ఎప్పుడెప్పుడైతే మనసు బయటకు పరుగెడుతుందో, తత: తత: అంటే అప్పుడప్పుడు ఆ మనసును లాక్కొచ్చి ఆత్మలో లీనం చేయాలి అని అర్థం. ఎందుకంటే మనసు అతి చంచల మైనది. ఒక చోట నిలకడగా ఉండదు. అది అందరూ ఒప్పుకుంటారు. ధ్యానంలో కూర్చున్న తరువాత, మనసును నెమ్మదిగాపట్టుకొని వచ్చి ఒక చోట కూర్చోపెట్టినా, మరలాఅది అటో ఇటో పారిపోతుంది. అనవసరవిషయాల మీదికి మళ్లుతుంది. లాలించి బుజ్జగించి మరలా తీసుకొని వస్తే, ఏదో సందుచూచుకొని పారిపోతుంది.

.

అజ్ఞాని అయినవాడు ఆ మనసు ఎటు బోతే దాని వెంట పరుగెడుతుంటాడు. మనసు ఎలా చెబితే అలా ఆడుతుంటాడు. తనలోని విచక్షణా బుద్ధిని ఉపయోగించడు. దీనికి ఒకటే మార్గం. అనవసర విషయాల మీదికి మనసును లగ్నం చేయక పోవడం. అప్పుడు కొన్ని విషయాల మీదనే మనసు లగ్నం అవుతుంది. వాటి నుండి మనసును మళ్లించడం తేలిక. రెండవ మార్గం ఏమిటంటే బయట ప్రపంచంలోని వస్తువుల సంగమంతో దొరికే సుఖం తాత్కాలికము అనేభావన కలగాలి. అప్పుడు తాత్కాలికంగా వైరాగ్యం కలిగే అవకాశం ఉంది. అప్పుడు మనసును తేలిగ్గా మరల్చవచ్చు. వివేక వంతుడు మనసును ఆత్మయందు లగ్నం చేసి అమితమైన ఆనందాన్ని శాంతిని పొందవచ్చు.

ఆత్మన్యేవ వశం నయేత్ అన్నారు. అంటే మనసు ఆత్మ వశంలో ఉండాలి. ఏదో సందు చూచుకొని పారిపోకూడదు. మనం ధ్యానం చేసేటప్పుడు మనసు మనఅధీనంలో ఉండదు. కళ్లు మూసుకోగానే అనవసరమైన విషయాలన్నీ ఆలోచిస్తుంది. ఎక్కడెక్కడి విషయాలో గుర్తుకు వస్తాయి. అంటే ఇంద్రియములను కట్టి పడేసినా మనసు మాత్రం దాని ఇష్టం వచ్చినట్టు అటు ఇటు పరుగెడుతుంటుంది. స్థిరంగా ఉండదు. చంచలంగా ఉంటుందిఅని భగవానుడే చెబుతున్నాడు. ఇది సర్వసాధారణం. అంతమాత్రం చేత నాకు ధ్యానం కుదరదు అని నిరుత్సాహపడకూడదు. మన ప్రయత్నం మనం చేయాలి. పారిపోతున్న మనసును పట్టుకొచ్చి ధ్యానంలో నిలపాలి. మరలా పారిపోతుంది. అది దాని లక్షణం. అధైర్యపడకుండా మరలా దానిని లాక్కొచ్చి కూర్చోపెట్టాలి.

దానికి కావాల్సింది ప్రాపంచిక విషయముల మీద ఎక్కువగా సంగమం లేకపోవడం. వాటి గురించిన అనవసరమైన ఆలోచనలుపెట్టుకోకపోవడం. అనవసరమైన ఆలోచనలు లేని మనసు మనం చెప్పినట్టు వింటుంది. మన అధీనంలో ఉంటుంది. ఈ ప్రక్రియ అంతా నిరంతర సాధనతోనే సాధ్యం అవుతుంది.

## 27. ప్రశాన్తమనసం హ్యేనం యోగినం సుఖముత్తమమ్।
## ఉపైతి శాన్తరజసం బ్రహ్మభూతమకల్మషమ్॥

ప్రశాంతమైన మనసు కలవాడు, మనసులో ఎటువంటి దురాలోచనలు, కల్మషములు లేని వాడు, రజోగుణముతో కలిగే వికారములు లేని వాడు, ఆత్మసాక్షాత్కారము పొందినవాడు, అయినటువంటి యోగి, ఉత్తమమైన సుఖమును పొందుతున్నాడు.

ధ్యానయోగం వలన కలిగే లాభం మరొకసారి చెబుతున్నాడు పరమాత్మ. మనం లాభం లేనిది ఏపనీ చేయము. అందుకని ఈ ధ్యానయోగం చేస్తే నాకేంటి? అనే వాళ్లకు సమాధానం ఈ శ్లోకం. ఏదో ఒక పని చేస్తే కాస్త సుఖం కలుగుతుంది. అది అనుభవించగానే ఆ సుఖం దు:ఖంగా మారుతుంది. ఒక్కోసారి ఆ సుఖం మొహం మొత్తుతుంది. ఇంకా ఏదో కావాలని అనిపిస్తుంది. అది ఏమిటో తెలియదు. అది దొరకదు. అన్నీ ఉన్నా ఏదో అశాంతి, ఆవేదన. ఇదీ నేటి యువతలో ఉండే డిప్రెషన్ కు కారణం. చేతినిండా డబ్బు ఉండి కూడా చుట్టు ఎన్నో సుఖాలు ఉండి కూడా ఇంకా ఏదో కావాలి అని కనిపించని సుఖం కోసం తాపత్రయ పడుతుంటారు. మాదక ద్రవ్యాలను సేవిస్తుంటారు. తమ వద్ద ఏవేవో మహిమలు ఉన్నాయని ప్రచారం చేసుకుంటున్న బాబాలను స్వామీజిలను ఆశ్రయిస్తుంటారు.

కాని, తాము ఏ సుఖం కోసం, ఏ ప్రశాంతత కోసం పాకులాడుతున్నామో, ఆ సుఖం, ఆ ప్రశాంతత, తమలోనే తమ ఆత్మలోనే ఉందని వారికి తెలియదు. దానినే అజ్ఞానము అని అంటారు. అంటే బయట ప్రపంచంలో దొరికే వస్తువుల నుండి, బంధుమిత్రులనుండి, ధనము,ఆస్తి, పదవుల నుండి పొందే సుఖం శాశ్వతం కాదు. ఆ సుఖం ఈ రోజు ఉండి రేపు పోతుంది. అసలైన సుఖం మనలోనే ఉంది అని తెలుసుకోలేక పోవడం మన అజ్ఞానం. ఈ అజ్ఞానంలో పడి మనం చేయవలసిన పనులు మనం చేయక పోగా, అవసరం లేని విషయాలలో తలదూర్చి కష్టాలు కొనితెచ్చుకుంటున్నాము. అందుకే ఉత్తమమైన సుఖం కలగడానికి మార్గం చెబుతున్నాడు పరమాత్మ.

మొదటిది..... ప్రశాంత మనసం...అంటే మనసును ఎల్లప్పుడూ ఏదో ఒక ఆలోచనతో కాకుండా ప్రశాంతంగా ఉంచుకోవాలి. మనసు ప్రశాంతంగా ఉండాలంటే సాత్విక గుణం పెంపొందించు కోవాలి. అప్పుడే మనసు ఏ ఒడిదుడుకులు లేకుండా ప్రశాంతంగా ఉంటుంది. అటువంటి ప్రశాంతమైన మనసును ఆత్మలో లగ్నం చేయాలి. అదే యోగము. రెండవది.... శాంత రజసం అంటే రజోగుణమును శాంత పరచాలి. మనలో ఉన్న రజోగుణమును బలవంతంగా శాంత పరచడం వీలుకాదు. మనలో సత్వగుణాన్ని ఎక్కువచేసుకుంటే, రజోగుణము దానంతట అదే శాంత పడుతుంది. ఎలాగంటే పాలు, నీరు చెరిసగం ఉన్న పాత్రలో, ఇంకా ఎక్కువ పాలు పోస్తే పాల శాతం ఎక్కువయి నీటి శాతం తగ్గిపోతుంది. పాల చిక్కదనం ఎక్కువవుతుంది. అలాగే మనలో సత్వగుణం ఎక్కువగా నింపుకుంటే, రజోగుణము, తమోగుణము వాటంతట అవే తగ్గిపోతాయి. దానికి తోడు రజోగుణ ప్రధానములైన కోరికలను, కోపమును, అదుపులో పెట్టుకోవాలి.
మూడవది...అకల్మషమ్...అంటే మనసు కల్మషం లేకుండా ఉండాలి. మనసులో ఎవరి మీద కోపము, ద్వేషము లేకుండా చూచుకోవాలి. అప్పుడే యోగి పరమ శాంతిని పొందుతాడు. అతనికి ఎక్కడా దొరకని సుఖము శాంతి లభిస్తాయి. అటువంటి సుఖము సుఖం ఉత్తమమ్ అని అన్నారు.

ఇది ప్రతి వాళ్లకూ సాధ్యమే. ఇంత వివరంగా చెప్పినా మానవులు దాని జోలికిపోరు. ముందుగా అకల్మషమ్ అనేపదాన్ని మనం ఆచరించాలి. మనసులో ఉన్న కల్మషములను తొలగించుకోవాలి. ఈ జన్మలోవేకాదు ఇంతకు ముందు జన్మలలో ఉన్న కల్మషాలు కూడా మన మనసులో నాటుకొని పోయి, పేరుకుపోయి ఉంటాయి. వాటినన్నిటినీ తీసివేయాలి. అద్దం మకిలిగా ఉంటే అద్దంలో మన ముఖం కనపడదు. అందుకని అద్దాన్ని శుభ్రంగా తుడవాలి.అలాగే జన్మజన్మల నుండి మనలో పేరుకుపోయిన మలినములను, కల్మషములను మనము ఆర్జించిన జ్ఞానముతో, విచక్షణతో, ప్రాపంచిక విషయముల మీద వైరాగ్యముతో, సమూలంగా నాశనం చేయాలి. ఎందుకంటే, మనస్సు కల్మషంగా ఉంటే మనమెవరో మనం తెలుసుకోలేము.

పరమాత్మ తన మొట్టమొదటి మాటలోనే ప్రశాన్త మనసం అంటూ సాధ్యమైనంత వరకు ఎల్లప్పుడూ మనసును ప్రశాంతంగా ఉంచుకోవాలి. అనవసర విషయాలలో తలదూర్చవద్దు ఆలోచించవద్దు. అందరినీ సమంగా చూడాలి. నిశ్చలంగా ఉండాలి. ఎటువంటి మాలిన్యమును మనసుకు అంటనీయవద్దు అని బోధించాడు. ఇవన్నీ మనం తేలిగ్గా ఆచరించవచ్చు. కాకపోతే ప్రయత్నించాలి. మనం అందరం శివస్వరూపులం. శివ అంటే ఆనందం. శవ అంటే ఆ ఆనందం లేకపోవడం. మనం ఎల్లప్పుడూ శివ స్వరూపులుగా ఉండాలి. అప్పుడు ఆనందం కొరకు శాంతి కొరకు ఎక్కడా వెతక నక్కరలేదు. ఎందుకంటే అది మనలోనే ఉంది కాబట్టి.

పరమ శాంతి పొందిన తరువాత కలిగే పరిణామమే బ్రహ్మభూతమ్ అంటే తానే బ్రహ్మస్వరూపము అనే భావన పొందుతాడు. సాక్షాత్తు బ్రహ్మస్వరూపుడు అవుతాడు.

## 28. యుఞ్జన్నేవం సదా౽౽త్మానం యోగీ విగతకల్మషః। సుఖేన బ్రహ్మసంస్పర్శమత్యన్తం సుఖమశ్నుతే॥

పైన చెప్పిన విధంగా మన మనసులో ఉన్న అన్ని కల్మషములను తొలగించుకొని ఆత్మను దర్శిస్తే, మనసును ఆత్మలో లీనం చేస్తే అటువంటి యోగి అంతము లేని, పరమమైన సుఖమును అత్యంత సులభంగా పొందుతాడు.

ఇంత కష్టపడి మనసులో నుండి కల్మషములను అన్నీ తొలగించి, దానిని విగత కల్మషం చేసి, మరలా లాలించి బుజ్జగించి పటుకొని వచ్చి ఆత్మలో నిలిపితే ఏమవుతుంది అంటే బ్రహ్మ సంస్పర్శ కలుగుతుంది. అది అత్యన్తమ్ సుఖం అంటే అంతములేని సుఖం కలిగిస్తుంది. అంటే బ్రహ్మానందము సులభంగా లభించే ఉపాయం ఇది అని స్పష్టంగా చెప్పాడు భగవానుడు.

మొట్ట మొదట మనసును కల్మష రహితంగా చేయాలి. అంటే మనసులో ఉండే దుర్గుణములను, పాప ఆలోచనలను, కోరికలను, మనలో చెలరేగే విపరీత భావనలను వాటి వలన కలిగే రాగద్వేషములను, కోపమును సమూలంగా పోగొట్టుకోవాలి. ఇవన్నీ రజోగుణము, తమోగుణము వలన వచ్చేవి. కాని ఆత్మ తత్వము సత్వగుణ ప్రధానము. సత్వగుణం ఎక్కువగా ఉంటేనే కానీ ఆత్మ సాక్షాత్కారం కలుగదు. ఆత్మను అంటే బ్రహ్మను దర్శించాలంటే సత్వగుణం అలవరచుకోవాలి. ప్రశాంత చిత్తంతో ఉండాలి. అప్పుడు ధ్యానయోగంలో కూర్చుని ఆ మనసును ఆత్మలో నిలపాలి. ఈ ప్రయత్నం ఏదో ఒక రోజు కానీ ఒక నెల కానీ, ఒక సంవత్సరం కానీ చేస్తే చాలదు. సదా అంటే ఎల్లప్పుడూ చేస్తూనే ఉండాలి. అప్పుడే అతని చిత్తము బ్రహ్మకు చేరువవుతుంది.

బ్రహ్మ అంటే నాలుగు తలల బ్రహ్మ కాదు. ఆత్మస్వరూపుడైన పరబ్రహ్మ, పరమాత్మ, అని అర్థం. సాధన చేసే వారికి ఇది సులువుగా దొరుకుతుంది. అనాయాసంగా, ఎటువంటి ఖర్చు లేకుండా. ఏ బాబాలను, స్వామీజిలను సేవించకుండా వారి పాదపూజలకు ధనం వ్యయం చేయకుండా, ఏ మాత్రం కష్టపడకుండా దొరుకుతుంది. కాక పోతే సాధన చేయాలి. సాధన చేయని వారికి ఈ సుఖం, శాంతి ఎన్నటికీ దొరకదు. బ్రహ్మ సంస్పర్శ పొందడం సామాన్యం కాదు. అది కనపడదు. కేవలం చిత్తములోనే దర్శించాలి. బ్రహ్మ సంస్పర్శ కలిగింది అనే దానికి తార్కాణం మనకు అనంతమైన సుఖము శాంతి లభించడమే. అదే గుర్తు.

## 29. సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని। ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః॥

ఇటువంటి సాధన చేసి పరమ సుఖమును పొందిన యోగి, ఈ అనంత విశ్వంలో ఉండే చరాచర జీవరాసులయందు సమదృష్టి కలిగి ఉంటాడు. ఈ సమస్త ప్రపంచమును తనలో, తనను సమస్త భూతములలోనూ చూచుకుంటాడు.

బ్రహ్మ సంస్పర్శ కలిగిన యోగి ఎలా ప్రవర్తిస్తాడు అనే విషయాన్ని ఇక్కడ చెబుతున్నాడు పరమాత్మ. ఈ శ్లోకంలో యోగయుక్తాత్మా అని వాడారు. అంటే యోగముతో యుక్తమైన మనసు కలవాడు. అంటే మనస్సును ఆత్మతో ఐక్యం చేసిన వాడు. అటువంటి వాడు ఎలా ఉండాలి అంటే అతడు సకల జీవరాసులలో పరమాత్మను దర్శిస్తాడు. తనలోనే అన్ని జీవరాసులను దర్శిస్తాడు. అందరినీ సమంగా చూస్తాడు. భేదబుద్ధి ఉండదు. ఇది ఎలా కలుగుతుంది.

మనం బయట ప్రపంచాన్ని కళ్లతో చూస్తున్నాము. చర్మంతో తాకుతున్నాము. చెవులతో వింటున్నాము. నాలుకతో రుచి చూస్తున్నాము. మంచి వాసనలను ముక్కుతో ఆస్వాదిస్తున్నాము. ఈ ఐదింటి వలన బయట ప్రపంచం మన లోపలకు వెళుతూ ఉంది. కాని ఈ ఇంద్రియములు జడములు. వీటి వెనక మనసు ఉండి నడిపిస్తూ ఉంది. మరణించిన తరువాత కూడా ఈ ఇంద్రియములు ఉంటాయి కానీ అవి ఆయాపనులు చేయలేవు. కాబట్టి బయట ఉన్న ప్రపంచం అంతా మనస్సు యొక్క సృష్టి. మనసు చేసే పనులన్నీ ఆత్మ సాక్షీభూతంగా చూస్తూ ఉంటుంది.

కాబట్టి ఈ దేహము వేరు అందులో ఉన్న ఆత్మ తత్వము వేరు. అన్నిజీవులలో ఉన్న ఆత్మ ఒకటే. దేహములు, వాటి ఆకారములు, పేర్లు, వేరుగా ఉంటాయి. మనకు దేహములు, వాటి ఆకారములు, వాటి పేర్లు కనపడతాయి కానీ అన్నిదేహములలో అంతర్లీనంగా వెలుగుతున్న ఆత్మ

చైతన్యం కనపడదు. ఎలాగంటే పెద్ద పూలమాల ఉంది. అందులో రకరకాల పూలు ఉన్నాయి. ఆ పూలు అందంగాఉన్నాయి. వాటికి రకరకాల పేర్లు ఉన్నాయి. కాని ఆ పూలను అన్నిటినీ అందంగా కనపడేటట్టు కట్టి ఉంచిన దారం మనకు కనపడదు. మనం కేవలం పూలను వాటి అందాలను, సువాసనలను మాత్రమే చూస్తాము, ఆస్వాదిస్తాము. లోపల ఉన్న దారం గురించి తెలుసుకోము. అలాగే ఈ చరాచర జగత్తులో ఉన్న అన్ని జీవరాసులలో పరమాత్మ ఆత్మస్వరూపంగా అంతర్లీనంగా ఉన్నాడు అని తెలుసుకోవడమే జ్ఞానము.

ఇక్కడ ఒక విషయం ప్రస్తావించుకుందాము. మనకు రెండు కళ్లు ఉన్నాయి. శివుడికి మూడోకన్ను ఉంది. అది తెరిస్తే ఈ లోకాలన్నీ భస్మంఅయి పోతాయి అని మనకు తెలుసు. దీని అర్థం ఏమిటి. మనకు ఉన్న రెండు కళ్లతో ఈ లోకాన్ని ఈ లోకంలో ఉన్న మనుషులను, జంతువులను, పక్షులను, చెట్లు, కొండలు,పర్వతములు చూస్తున్నాము. ఈ కళ్లు మూసుకుంటే మనలో ఉన్న మూడవ నేత్రం అంటే మనో నేత్రం అంటే జ్ఞాన నేత్రం తెరుచుకుంటుంది. అప్పుడు మనకు బయట ప్రపంచం కనపడదు. అంటే బయట ప్రపంచం, అందులోని విషయ వాంఛలు అన్నీ భస్మం అయి పోతాయి. మూడవ నేత్రంతో మనం ఆత్మను దర్శించగలము. అప్పుడు అంతులేని ప్రశాంతత అనంతమైన సుఖము కలుగుతాయి. అందుకే శివుడిని ఆనంద స్వరూపుడు అని అన్నారు. త్రినేత్రుడిని ఇలా అర్థంచేసుకోవాలి.

విశ్వం అంతటా వ్యాపించి ఉన్నది అఖండ చైతన్యం అయితే ప్రతి జీవిలో ఉండేది పరిమిత చైతన్యము. కాబట్టి ఈ దేహమే నేను అనే స్థితి నుండి నేను వేరు, దేహము వేరు అనే స్థితికి రావాలి. మనస్సు ఆత్మతో కలిస్తే ఆ స్థితి వస్తుంది. జ్ఞాన నేత్రంతోనే ఆత్మను దర్శించగలము. అప్పుడు ఆ యోగి ఈ ప్రపంచాన్ని తనలో చూసుకుంటాడు. తనను అన్ని జీవులలో చూసుకుంటాడు. అదే యోగయుక్తుని లక్షణము. అదే సమదర్శనము. అతడే యోగయుక్తాత్ముడు.

మనం ఒకరికి ఒకరికి మధ్య బేధభావముచూపిస్తాము. యోగి అందరినీ సమంగా చూస్తాడు. బంగారాన్ని రాయిని ఒకటిగా చూస్తాడు. మనం గ్రాము బంగారాన్ని దాచిపెట్టుకుంటాము. కిలో బరువు ఉన్న రాయిని వీధిలోకి విసిరేస్తాము. మనలో ఉన్న ఈ భేదబుద్ధి మనలో అశాంతికి కారణం అవుతూ ఉంది. ఈ భేదబుద్ధి మనుషుల మధ్య ద్వేషమునకు కారణం అవుతూ ఉంది. ఈ భేదబుద్ధి వన్యప్రాణులను వేటాడటానికి కారణం అవుతూ ఉంది. అడవులలో ఉన్న చెట్లలో పరమాత్మను చూచేవాడు చెట్టనుకొట్టడు. జీవులను చంపడు. ప్రకృతి సమతుల్యం దెబ్బతినదు. కాబట్టి ఈ శ్లోకంలో చెప్పబడిన సమదర్శనము, అంటే అన్నిటిలో భగవంతుని చూడగలగడం, తనలోనే అన్నిటినీ చూడగలగడం అలవాటు చేసుకోవాలి. అతడే యోగ యుక్తుడు.

ఈ భావన కేవలము ఆధ్యాత్మికమే కాదు. మనలో నైతిక విలువలు పెంపొందించు కోడానికి, ప్రకృతి సమతుల్యాన్ని పరిరక్షించడానికి , వన్యప్రాణుల సంరక్షణకు కూడా ఆస్కారం కలిగిస్తుంది.

## 30. యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి।
## తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి॥

ఎవరైతే సకల భూతములలో నన్ను, నా యందు సకల భూతములను చూచుచున్నాడో, అటువంటివాడికి నేను కనపడకుండా బోను. అతడు నాకు కనపడకుండా బోడు.

ఈ శ్లోకం పైశ్లోకం లో చెప్పబడిన అర్థం తెలియజేస్తుంది కానీ, చిన్న మెలిక ఉంది. నాటి కృతయుగం నాటి హిరణ్యకశిపుని దగ్గర నుండి నేటి హేతువాదుల వరకు ఒకటే మాట. దేవుడు ఏడీ! ఎక్కడ ఉన్నాడు! ఉంటే కనపడడేం. నీకు కనపడితే చూపించు అని అడుగుతుంటారు. మరి కొందరు భక్తులు, స్వామీజిలను, బాబాలను, వాళ్లే దేవుళ్లుగా భావించి మొక్కుతుంటారు. కాని దేవుడు ఎవరికి కనిపిస్తాడు. దేవుడిని ఎవరు చూడగలరు అన్న విషయం ఇక్కడ చెప్పాడు భగవానుడు. ఎవడైతే సకల చరాచర భూతములలో నన్ను చూస్తున్నాడో, నాయందే ఈ చరాచరజగత్తును దర్శిస్తున్నాడో, వాడికి నేను కనపడతాను, వాడు నాకు కనపడతాడు. కాబట్టి దేవుడిని చూడాలంటే ఈ స్థితికి చేరుకోవాలి.

రాష్ట్రపతిని చూడాలంటే ఢిల్లివెళ్లాలి, రాష్ట్రపతి భవన్‌కు వెళ్లాలి, ముందస్తుగా ఎన్నో అనుమతులు తీసుకోవాలి. ఇంత తతంగం ఉంది. మన ఇంట్లో కూర్చుని "రాష్ట్రపతి ఏడీ! ఎక్కడున్నాడు! ఉంటే నాకు కనపడమను!" అంటే ఎలా ఉంటుందో ఇదీ అలాగే ఉంటుంది. . ప్రతి దానికీ ఒక అర్హత ఉంటుంది. దేవుడిని దర్శించడానికీ ఒక అర్హత ఉంటుంది. ఆ అర్హత సంపాదించడానికే మొదటి ప్రయత్నంగా, దేవుడిని గురించిన భావనను మన మనసులలో నింపడానికి దేవాలయాలు ఆవిర్భవించాయి. దేవాలయంలో దేవుడు ఉన్నాడు అని ప్రతిపాదించాయి.

కాని మనం ఆ దేవాలయాల దగ్గర ఆ విగ్రహాల దగ్గర ఆ విగ్రహాలకు చేసిన అలంకారాల దగ్గర ఆగిపోతున్నాము. దేవుడు అనే వాడు ఒకడున్నాడు వాడి కోసరం ప్రయత్నం చేయాలి అని బోధించడమే దేవాలయాల పరమార్థం. దేవుడు అనేది చూచే వస్తువు కాదు. దేవాలయములోని విగ్రహం కాదు. అదిఒక అనుభూతి. భగవంతుని అనుభవించాలి. తాదాత్మ్యం చెందాలి. అందుకే భాగవతంలో "నితాంత అపార భూతదయ" ను నాకు ప్రసాదించమని ఒక భక్తుడు భగవంతుని కోరాడు. అన్నిజీవులలో భగవంతుని చూడగలగాలి. పరమాత్మ లోనే అన్ని

జీవరాసులను చూడగలగాలి. అంటే ఈ సృష్టి అంతా పరమాత్మ మయంఅనే భావనకు రావాలి. ఈ ప్రపంచంలో వివిధ ఆకారములతో, పేర్లతో, రంగులతో, మానవులు, జంతువులు, పక్షులు తిరుగుతున్నాయి. కాని అన్నిటిలో అంతర్లీనంగా ఒక చైతన్యం ఉంది. యోగి అయిన వాడు పైపై ఆకారాలు, పేర్లు, రంగు కాకుండా లోపల ఉన్న ఆత్మస్వరూపాన్ని దర్శించాలి. సముద్రంలో వివిధములైన ఆకారాలలో అలలు వస్తుంటాయి. కాని ఆ అలలలో ఉన్నది అంతా నీరే అనే భావన రావాలి. తస్య అంటే అతనికి, అలా చూచేవాడికి, భావించేవాడికి, అహం నేను న ప్రణశ్యామి కనపడకుండా పోను అంటే తప్పకుండా కనపడతాను అని అర్థం.

దేవుడిని దర్శించడానికి సాటి మానవులను మానవులుగా చూడటం, కేవలం మానవులలోనే కాకుండా, పక్షువులు, జంతువులు, పక్షులు అన్ని జీవరాసులలో.... అందరిలో పరమాత్మను దర్శించడం ముఖ్యం. కాని మానవత్వం మచ్చుకైనా కనిపించని ఈ లోకంలో దేవుడు ఎలా కనపడతాడు అని మనలను మనం ప్రశ్నించుకోవాలి. కాబట్టి దేవుడిని చూడాలంటే భేదభావం పోవాలి. సమానత్వం కావాలి. దానికి నిష్కామ కర్మ ఆచరించాలి. రాగద్వేషములు పోవాలి. ధ్యానయోగం కావాలి. ఇవే దేవుడిని చూడటానికి మార్గాలు.

చాలా మంది ఈ మార్గాలను వదిలిపెట్టి, దేవుడు అక్కడ ఉన్నాడు, ఇక్కడ ఉన్నాడు, ఆ దేవుడు చాలా పవర్‌ఫుల్, ఈదేవుడిని నమ్ముకుంటే లాభం లేదు, ఆ స్వామీజి చాలా మహిమలు కలవాడు, ఆయనే దేవుడు అనే సంకుచిత భావాలతో అక్కడే ఉండి పోతున్నారు. ఈ రకం దేవుళ్లు మీరు వారి దగ్గరకు వెళితేనే కనపడతారు లేకపోతే కనపడరు. కాని ఈ శ్లోకంలో చెప్పబడిన దేవుడు అంతటా ఉన్నాడు. అందరిలో ఉన్నాడు. నీదగ్గరే ఉన్నాడు. నీతోనే ఉన్నాడు. నిన్ను చూస్తున్నాడు. కాబట్టి మనం దేవుడు ఎక్కడో ఒకచోటనే ఉన్నాడు అనే స్థాయి నుండి దేవుడు అంతటా నిండి ఉన్నాడు అనే స్థాయికి ఎదగాలి. దానికి “ఇందుగలడందులేడని సందేహము వలదు చక్రి సర్వోపగతుండు, ఎందెందు వెదకి చూచిన అందందే గలడు” అనే పద్యాన్ని సతతం మననం చేసుకోవాలి. ఆచరించాలి. ఈవిషయం తరువాతి శ్లోకంలో వివరించబడింది.

ఈ శ్లోకంలో మరొక విషయం కూడా చెప్పబడింది. సకల జీవరాసులలో ఆత్మస్వరూపుడైన పరమాత్మను చూడటమే కాదు, విశ్వచైతన్య స్వరూపుడైన పరమాత్మలో సకల జీవరాసులను చూడగలగాలి. ఇది ఎలా అంటే మనం భూమి మీద ఉన్నాము. ఈ భూమి లాంటి గ్రహాలు తొమ్మిది ఉన్నాయి. ఇవన్నీ సూర్యుడు అనే నక్షత్రం చుట్టు తిరుగుతున్నాయి. సూర్యుడు లాంటి నక్షత్రాలు లక్షల కొద్దీ ఈ పాలపుంతలో అంటే గెలాక్సీ లో ఉన్నాయి. ఇటువంటి గెలాక్సీలు ఈ అనంత విశ్వంలో లక్షలు, కోట్లు ఉన్నాయి. ఇవన్నీ ఈ అనంత విశ్వంలో ఒక నియమం ప్రకారం సంచరిస్తున్నాయి.(దీనినే ఎక్స్‌పాండింగ్ యూనివర్స్ అని మన ఖగోళ శాస్త్రవేత్తలు అంటారు. దీని వివరణ ఈ పేరగ్రాఫ్ చివర చూడండి) అంటే ఈ గ్రహాలు,నక్షత్రాలు, గెలాక్సీలు అన్నీ ఈ అనంత

విశ్వంలో ఉన్నాయి. ఈ అనంత విశ్వమే విశ్వచైతన్యము, పరమాత్మ స్వరూపము. అందుకే సర్వవ్యాపి అయిన విష్ణువును, విశ్వాకారం (అంటే విశ్వమే ఆకారముగా కలిగినవాడు), గగన సదృశం (అంటే ఈ గగనము, ఆకాశము (స్పేస్)మాదిరి కనిపించేవాడు), మేఘవర్ణం (అంటే ఆకాశం మనకు నీలంగా కనపడుతుంది అందుకని నీలమేఘచ్ఛాయ కలవాడా) అని విష్ణువును స్తుతిస్తాము. కాబట్టి ఆ పరమాత్మ స్వరూపమైన విశ్వచైతన్యంలో మనం అంతా ఉన్నాము, మనందరిలో పరమాత్మ ఆత్మస్వరూపుడుగా ఉన్నాడు. ఈ శ్లోకం ఇలా అర్థం చేసుకోవాలి.

(Or, in other words, the farther a galaxy is, the faster it is moving away! And that meant that the universe could not be static, as everyone previously had thought, but is in fact expanding; the distance between the different galaxies is growing all the time. The discovery that the universe is expanding was one of the great intellectual revolutions of the twentieth century....
(A Brief History of Time by Stephen Hawking).

### 31. సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః।
### సర్వథా వర్తమానోऽపి స యోగీ మయి వర్తతే॥

ఎవరైతే సకలభూతములలో ఉన్న నన్ను భేదబుద్ధి లేకుండా, చూస్తాడో అటువంటి యోగి ఎక్కడ, ఏ కాలంలో, ఏవిధంగా ప్రవర్తించినా, అతడి మనసు మాత్రం ఎల్లప్పుడు నాయందే లగ్నం అయి ఉంటుంది.

దేవుడు ఎక్కడ ఉన్నాడు? భగవంతుని చూడటం ఎలాగ? అనే విషయాలు కిందటి శ్లోకంలో తెలుసుకున్నాము. ఇక్కడ ఇంకొంచెం వివరంగా తెలుసుకుంటాము. దేవుడు ఎక్కడ ఉన్నాడు అనే సందేహము ప్రతి వాడికి కలుగుతుంది ఎందుకంటే దేవుడు కనపడడు కాబట్టి. అందుకే పోతన గారు ఒకఆణిముత్యం లాంటి పద్యం మనకు అందించాడు.

"ఇందుకలడందులేడని సందేహము వలదు చక్రి సర్వోపగతుండు
ఎందెందు వెదకి చూచిన అందందే కలడు దానవాగ్రణి వింటే॥"

భగవంతుడు ఇక్కడ ఉన్నాడు అక్కడు లేడు అనేసందేహము వదిలిపెట్టాలి. భగవంతుని కోసం వెదకాలి. దానికి మార్గము ధ్యానమార్గము. ఇక్కడ ఇంకో మాటకూడా అన్నారు. చక్రి సర్వోపగతుండు. దేవుడు అంతటా ఉన్నాడు. చక్రి అని వాడటంలో అర్థం చక్రానికి అంచులు లేవు. విస్తరించుకుంటూ పోతుంది. అంతం ఉండదు. అలాగే భగవంతుడుసర్వవ్యాపి. అంతం లేదు. ఎక్కడెక్కడ వెదికితే

అక్కడక్కడే ఉన్నాడు.

కాకపోతే మనకు ఉండవలసిన లక్షణం మనకన్నా పెద్దలు, గురువులు, శాస్త్రములు చెప్పింది వినడం. మనకు లేని లక్షణం అదే! ప్రతి వాడూ నాకు అంతా తెలుసు అనుకుంటాడు. వాడికి ఏమీ తెలియదు అన్న విషయం వాడికి తెలియదు. అదే అజ్ఞానము. వినదగు నెవ్వరు చెప్పిన అనే మాట అందుకే వచ్చింది. కాబట్టి భగవంతుడు అన్నిచోట్లా ఉన్నాడు అని గ్రహించాలి. పాలలో వెన్న లాగా, కట్టెలో నిప్పులాగా, నువ్వులలో నూనె లాగా దాగి ఉన్నాడు. మథిస్తే కనపడతాడు. ఎన్ని ఆభరణములు ఉన్నా అందులో ఉండే మూలపదార్థము బంగారము. రకరకాల కుండలుఉన్నా అందులో ఉండే మూలపదార్థము మట్టే. అలాగే అన్ని జీవరాసులలో ఉండే వాడు పరమాత్మ ఒక్కడే. ఆ పరమాత్మలో అందరూ ఉన్నారు.

కాబట్టి సమస్త జీవరాసులు పరమాత్మ స్వరూపాలే అని భావించాలి. ఎవరికీ, దేనికీ అపకారం చేయకూడదు. ద్వేషించకూడదు. ఇతర మానవుల పట్ల, జీవరాసుల పట్ల దయ, కరుణ కలిగి ఉండాలి. అన్ని జీవరాసులయందు ఏకత్వ బుద్ధి కలిగి ఉంటే, పరమాత్మ మనకు కనపడతాడు. దానినే ఏకాత్మ బుద్ధి అని అంటారు. జీవులలో భేదము చూడకూడదు. ఆ ప్రకారంగా జీవులలో బేధ బుద్ధి లేకుండా ప్రవర్తించేవాడు, బయట ప్రపంచంలో తిరుగుతున్నా వాడి మనసు మాత్రము ఎల్లప్పుడూ పరమాత్మయందే లగ్నం అయి ఉంటుంది. అతడు సమాధి స్థితిలో ఉన్నా, ప్రాపంచిక వ్యవహారాలుచక్కబెడుతున్నా ఒక్కటే. దిక్సూచిలో ముల్లు ఎల్లప్పుడూ ఉత్తర దిక్కునే చూపిస్తుంది అలాగే జ్ఞాని మనసు ఎల్లప్పుడూ భగవంతుని వైపు తిరిగి ఉంటుంది.

సర్వథా వర్తమానోపి అని వాడారు. అంటే వర్తమాన కాలంలో ఎవరు ఏ ఆశ్రమంలో ఉన్నా అని అర్థం చెప్పుకోవచ్చు. అతడు బ్రహ్మచర్యము, గృహస్థు, వానప్రస్థము, సన్యాసము ఏ ఆశ్రమంలో ఉన్నా, మనసు మాత్రం పరమాత్మయందే లగ్నం అయి ఉంటుంది. అంతే కానీ, ఏ విధంగా ప్రవర్తించినా, మన ఇష్టం వచ్చిన పనులు చేసినా, అని విపరీతార్థము తీయకూడదు. అంటే నేను జ్ఞానిని కదా నా ఇష్టం వచ్చినట్టు ప్రవర్తించవచ్చు కదా అని అనుకోకూడదు. అలా ప్రవర్తిస్తే అంత ఎత్తు శిఖరం నుండి కిందపడతాడు. (ఉదాహరణకు పత్రిజీ. ధ్యానయోగంలో ఉన్నత శిఖరాలను అధిరోహించిన ఆయన ఒకే ఒక సంఘటనతో అధఃపాతాళానికి జారిపోయాడు. వివరణ అనవసరం.)

ఇక్కడ ఇంకొక విషయం కూడా మనం గమనించాలి. మనసును ఆత్మలో ఉంచిన యోగి మరలా రజోగుణము తమోగుణము వంక మళ్లడం చాలా అరుదు. ఒక వేళ మళ్లితే అతనికి జ్ఞానం ఇంకా రాలేదు అని అర్థం. అలా చెప్పకుంటున్నాడు అని అనుకోవచ్చు. ఆత్మజ్ఞానం పొందిన వాడు మరలా ప్రాపంచిక సుఖముల వంక మళ్లడు. కాబట్టి ఆత్మజ్ఞానము పొందిన వాడు, మరలా అధోగతి పాలు కాకుండా చాలా జాగ్రత్త పడాలి. బయట ప్రపంచములో

తిరుగుతున్నా మనసు మాత్రము పరమాత్మయందే లగ్నం చేయాలి. అతడే నిజమైన జ్ఞాని అనిపించుకుంటాడు.

## 32. ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున।
## సుఖం వా యది వా దు:ఖం స యోగీ పరమో మత:॥

ఈ లోకంలో ఉన్న సమస్త ప్రాణుల సుఖములను, దు:ఖములను తనకు కలిగినట్టే భావిస్తూ, వాటిని సమానంగా ఎవరైతే చూస్తాడో, వాడే యోగులలో శ్రేష్టుడు అని చెప్పబడతాడు.

ఇప్పటి దాకా జ్ఞానము గురించి చెప్పాడు పరమాత్మ. ఈ శ్లోకంలో విజ్ఞానము అంటే తాను తెలుసుకున్న జ్ఞానమును ఎలా ఆచరణలో పెట్టాలి అన్న విషయం చెబుతున్నాడు. ఒక విధంగా దీనిని ఆచరణ వేదాంతము అంటే ప్రాక్టికల్ వేదాంతా అని అనవచ్చు. పైకి మాత్రము అందరిలో పరమాత్మ ఉన్నాడు అంటూ ఇంట్లో ఉన్న తల్లి తండ్రులను, భార్యను, పనివాళ్లను, మానసికంగా శారీరకంగా బాధించేవాడు, హింసించేవాడు శుష్కవేదాంతి. విన్న దానిని, తెలుసుకున్న దానిని, ఆచరణలో పెట్టిన నాడే ఆ జ్ఞానము విజ్ఞానము అవుతుంది. ప్రతి జీవిలోనూ పరమాత్మ ఆత్మస్వరూపుడుగా ఉన్నాడు అని తెలుసుకున్న వాడు ఇతరుల పట్ల దయ, జాలి, కరుణ, ప్రేమ, కలిగి ఉండాలి కానీ ద్వేషము, కోపము, క్రూరత్వము కలిగి ఉండకూడదు. అపకారికి కూడా ఉపకారము చేసే నేర్పుకలిగి ఉండాలి. దీనినేఆత్మౌపమ్యేన అంటే ఇతరులు తనను హింసిస్తే తనకు ఎంత బాధ కలుగుతుందో ఆ బాధే తన వల్ల ఇతరులకు కలుగుతుంది అని తెలుసుకోవడం. ఈ స్థితికి అందరూ చేరుకోవాలి. అటువంటివాడు యోగులలో పరమయోగిఅని పిలువబడతాడు.

ప్రస్తుత ప్రపంచంలో ప్రతి వాడూ ఎదుటి వాడిని మోసగించేవాడే. ఎదుటి వాడి సొమ్ములాక్కోవడానికి ప్రయత్నించేవాడే. ఇతరుల ఆస్తులను కొల్లకొట్టే వాడే. కానీ వాడే తీర్థయాత్రలు చేస్తాడు. గుడులకు వెళతాడు. మెడనిండా రుద్రాక్ష మాలలు ధరిస్తారు. నేను దైవభక్తుడిని అని చాటుకుంటాడు. దేవుడికి బంగారు కిరీటాలు చేయిస్తాడు. స్వార్థం కరుడుగట్టిన అటువంటి వాడు పైకి భక్తుడుగా కేవలం నటిస్తుంటాడు. ప్రజల ధనాన్ని నిరంతరం అపహరిస్తూ, దేవుడికి వజ్రాల కిరీటాలు, బంగారు తొడుపులు చేయించేవారు ఈ కోవలోకి వస్తారు. వారు తమను తాము మోసం చేసుకుంటున్నారు. అటువంటి వారిని దైవద్రోహి అంటారు కానీ దైవభక్తుడు అనరు.

ఎవడినైనా మంచి వాడు అని అంటే అది వాడి ప్రవర్తన మీద ఆధారపడి ఉంటుంది. అన్ని ప్రాణులను సమంగా చూడడం ఆచరణలో పెట్టిన వాడు, అందరిలోనూ ఆత్మ స్వరూపుడైన పరమాత్మను చూడగలిగిన వాడు, పరమయోగి. వాడే నిజమైన భక్తుడు. అంతే కానీ మాటలలో వేదాంతము, చేతలలో దుర్మార్గము, ఉంటే వాడు వేదాంతి కాడు.

పాశ్చాత్యదేశాలలో, ఆశియా దేశాలలో ఉన్న మతములు సర్వమానవసౌభ్రాతృత్వమును చాటుతున్నాయి. అందరూ వాటిని ప్రవచిస్తుంటారు. చేతలలో మాత్రం శూన్యం. ఒక పక్క శాంతి మంత్రాలు వల్లిస్తూ, మరొక పక్క ఆయుధాలు ఉత్పత్తి చేస్తారు. ఆ ఆయుధాలు అమ్ముకోడానికి యుద్ధాలు సృష్టిస్తారు. యుద్ధాలు యధావిధిగా జరుపుతారు. ఆయాదేశాలు ప్రవచించే సర్వమానవ సౌభ్రాతృత్వము చేతలలో కూడా ఉంటే, ఇంత సైనిక శక్తి అవసరం లేదు. సరిహద్దుల కాపలా కాయడానికి, సైనిక శక్తిని పెంచుకోవడానికి, ఒక దేశాన్ని మించి మరొక దేశం, వేల కోట్ల ధనం ఖర్చుపెట్ట నవసరం లేదు. ఆ ధనం పేదరిక నిర్మూలనకు ఉపయోగించవచ్చు.

కాబట్టి వేదాంతము మాటలలోనే కాకుండా చేతలలో కూడా చూపించాలి. అదే విజ్ఞానము. అటువంటి యోగి సయోగీ పరమో మత: అంటే యోగులలో శ్రేష్టుడు అనిపించుకుంటాడు. ఇదంతా ఎందుకు చెబుతున్నాడు అంటే ఇంత విన్నా అర్జునుడికి నేను వేరు, నా తాతలు తండ్రులు గురువు వేరు అనే భేదబుద్ధి ఇంకా పోలేదు. నేను వాళ్లను చంపాల్సివస్తుంది అని యుద్ధం మానుకుంటున్నాడు. అలాగే మనందరికి కూడా తన యొక్క నిశ్చితమైన అభిప్రాయమును, ఇది నా మతము అంటే ఇది నా అభిప్రాయము అని పరమాత్మ స్పష్టంగా చెబుతున్నాడు.

కాబట్టి పరమాత్మయొక్క మతము ఏదంటే .....సకల ప్రాణులను సమంగా చూడటం; అందరి కష్టసుఖములను తనవిగాభావించడం; ఇతరులు ఏ పని చేస్తే తన మనసుకు, శరీరానికి దు:ఖం, కష్టం, బాధ కలుగుతాయో, ఆ పనులను ఇతరుల పట్ల చేయకుండా ఉండటం. మనం కూడా ఆ మతాన్ని అవలంబించాలి, అనుసరించాలి, ఆచరించాలి. అప్పుడే మనకు శాంతి, ఇతరులకు శాంతి, ప్రపంచానికి శాంతి కలుగుతుంది.

అర్జున ఉవాచ:

**33.యోஉయం యోగస్త్వయా ప్రోక్తస్సామ్యేన మధుసూదన।**
**ఏతస్యాహం న పశ్యామి చఞ్చలత్వాత్స్థితిం స్థిరామ్॥**

**34.చఞ్చలం హి మన: కృష్ణ ప్రమాథి బలవద్దృఢమ్।**
**తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్॥**

కృష్ణా! అందరినీ సమంగా చూడాలని అదే యోగమనీ నీవు చెప్పావు కదా! దానికి స్థిరమైన మనస్సు ఉండాలి కదా! కాని నా మనసు చంచలంగా ఉండటం చేత, అటువంటి స్థితిని నేనుపొందలేకపోతున్నాను. ఎందుకంటే ఈ మనస్సు అనేది చాలా చంచలమైనది, బలమైనది, ధృఢమైనది. ఈ మనసును నిగ్రహించడం అంటే గాలిని ఒక చోట బంధించడమే అవుతుంది. ఈ పని చాలా కష్టం కదా! అని అన్నాడు అర్జునుడు.

ఇక్కడి దాకా చెప్పి పరమాత్మ అర్జునుడి ముఖం వంక చూచాడు. అర్జునుడి ముఖంలో ఏదో సందేహం. ఏదో అడగాలనుకుంటున్నాడు. కృష్ణుడు కాస్త ఆపి ఊపిరి పీల్చుకున్నాడు. అర్జునుడికి సందు దొరికింది. వెంటనే తన మనసులోని సందేహాన్ని బయట పెట్టాడు.

"కృష్ణా! ఇప్పటి దాకా ఎన్నో చెప్పావు. అందరినీ సమంగా చూడాలన్నావు. మనసును నిగ్రహించాలన్నావు. నేను విన్నాను. దీని సారమంతా చూస్తే ప్రతివాడూ మనస్సును అదుపులో పెట్టుకోవాలి అని అర్థం అవుతూ ఉంది. కాని అదిసాధ్యం కాదు కదా! ఎందుకంటే, మనస్సు ఎల్లప్పుడూ చంచలంగా ఉంటుంది కదా! మరి మనోనిగ్రహము ఎలా కలుగుతుంది. అంతెందుకు. నా మనస్సు కూడా నిరంతరం చలిస్తూ నే ఉంది దాని వలన నేను నీవు చెప్పిన ఈ సమానత్వము, అందరినీ సమంగా చూడటం, అందరిలో నిన్ను చూడటం, నీలో అందరినీచూడటం అనే యోగమును సరిగా తెలుసుకోలేకపోతున్నాను. అదికాదు కృష్ణా! నీకు తెలియనిది ఏముంది. ఈ మనసు మహా చంచలమైనదయ్యా! చాలాప్రమాదమైనది. చాలా బలమైనది. ధృఢమైనది. ఈ మనస్సును నిగ్రహించడం, చాలా కష్టం. గాలిని పట్టుకొని బంధించడం ఎంత కష్టమో మనసును ఒక చోట బంధించడం కూడా అంతే కష్టం." అని మరలా మొదటికి వచ్చాడు అర్జునుడు.

ఇదీ ఒకందుకు మంచిదే. ఏదో అర్థం అయినట్టు ముఖం పెట్టి, ఏదీ అర్థం కాకుండా ఉండేకంటే, బాబూ నీవు చెప్పింది నాకు ఏమీ అర్థం కావడం లేదు ఎందుకంటే నా మనస్సు కూడా చంచల స్వభావంతో ఊరికే చలిస్తూ ఉంది. కాబట్టి ఈ మనస్సును ఎలా అదుపుచేయాలో కాస్త వివరంగా చెప్పు అని అడిగాడు అర్జునుడు.

ఇప్పటి దాకా నోరు విప్పని అర్జునుడు, మనసును నిగ్రహించమని మాటి మాటికీ కృష్ణుడు చెబుతుంటే ఉండబట్టలేక ఆపాడు. అందుకే మొట్ట మొదటగా ఈ మాట అన్నాడు. కృష్ణా! ఇతరుల సంగతి దేముడెరుగు. నా మనస్సే చాలా చంచలంగా ఉంది. అది నా మాట వినడం లేదు. ఇంక ధ్యానయోగము, సమత్వము నాకు ఎలా కలుగుతుంది. అని అన్నాడు. అంటే అర్జునుడికే ఏకాగ్రమైన మనస్సు లేదు. నిశ్చయాత్మక బుద్ధి లేదు. అందరి ఎడల సమదృష్టి లేదు. అందుకే నిర్మోహమాటంగా అంటున్నాడు.

'కృష్ణా! ఈ మనస్సు చాలతా చంచలమైనదయ్యా. పైగా చాలా ప్రమాదమైనది. ఎంతో క్షోభకలుగజేస్తుంది. అంతే కాదు ఎంతో బలమైనది, ధృడమైనది. దీనిని నిగ్రహించడం ఎవరి వల్లాకాదు. గాలిని అన్నా ఒకచోట బంధించవచ్చేమోగానీ, ఈ మనసును బంధించడం ఎవరి వల్లా కాదు. ఇది చాలా కష్టం కాబట్టి ఈ పని నా వల్ల కాదు." అని చేతులెత్తేసాడు.

ఈ ప్రశ్నలను అర్జునుడు మనందరి బదులు తనే అడిగాడు. మానవుల పరిస్థితి కూడా అంతే. పట్టుబట్టి ధ్యానంలో కూర్చుంటే మనసు అలా అలా షికారుకు వెళుతుంది. దానిని తెచ్చి ఒకచోట నిలబెడితో మరలా ఇటు పోతుంది. మనసును కట్టడి చేయడం తోనే పుణ్యకాలం గడిచిపోతుంది. ఇంక ధ్యానం చేసేదెప్పుడు. అందుకే మనసును నిగ్రహించడం అంటే సుదుష్కరం అంటే చాలా దుష్కరము అంటే చాలా కష్టమైన పని, ఎవరి వల్లకాదు.

అసలు ఈ మనసు ఇలా ఎందుకు చంచలంగా ఉంటుంది అని విచారిస్తే, మనసులో ఈజన్మ వాసనలే కాకుండా, క్రితం జన్మల వాసనలు, సంస్కారములు  కూడా నిక్షిప్తం అయి ఉంటాయి. వాటి ప్రభావం ఈ జన్మలో మనసు మీద పడుతుంది. వాటికి అనుగుణంగా మనసు నిరంతరం దేనినో ఒక దాని గురించి ఆలోచిస్తూ ఉంటుంది. అలజడిగా, చంచలంగా ఉంటుంది. అటువంటి మనసును నిగ్రహించడం ఓ పట్టానసాధ్యం కాదు. ధ్యానంలో కూర్చున్నపుడు ఈ మనసు విపరీతంగా చలిస్తూ ఉంటుంది. ఇంద్రియములు కదలకుండా ఉన్నా మనస్సు మాత్రం అటు ఇటు పరుగెడుతూ ఉంటుంది. ఇది వరకు ఎప్పుడూ రాని ఆలోచనలు, ఎందుకూ కొరగాని ఆలోచనలన్నీ అప్పుడే వస్తాయి. ధ్యానంలో కూర్చున్నపుడు మన మనసు అటు ఇటుపరుగెత్తడమే కాదు ఇంకా కొన్ని ఇబ్బందులు కూడా వస్తాయి.

మొదటిది.... ధ్యానంలో కూర్చోగానే అంటే కళ్లు మూసుకోగానే నిద్రముంచుకొస్తుంది. నిద్ర తమోగుణ లక్షణము. అలా కళ్లు మూసుకోగానే నిద్రవచ్చిందంటే మనలో తమోగుణము ఎక్కువగా ఉందని అర్థం చేసుకోవాలి.(దీనికి విరుగుడు మితాహారము, సాత్వికాహారము తీసుకోవడం. వేళకు నిద్రపోవడం) ఎప్పుడైతే శరీరం నిద్రలోకి జారుకుంటుందో, మనస్సు రజోగుణము సంతరించుకుంటుంది. తన ఇష్టం వచ్చినట్టు అటు ఇటుపరుగెడుతుంది. దిక్కుమాలిన ఆలోచనలు అన్నీ చేస్తుంటుంది. అక్కరలేని విషయాలను గుర్తుకు తెచ్చుకుంటుంది.

అలాఆలోచించి ఆలోచించి కొంత సేపటికి స్తబ్దుగా మారి పోతుంది. మైండ్ బ్లాంక్ అయి పోతుంది. ఏ ఆలోచనా ఉండదు. దీనినే చాలా మంది ధ్యానసమాధి అని పొరబడుతుంటారు. కాని ఇది మనసు ఎక్కువగా ఆలోచించి పొందిన స్తబ్ధత తప్ప వేరు కాదు.(దీనికి విరుగుడు కోరికలను అదుపులో ఉంచడం. చూచిందల్లా కావాలని కోరుకోకూడదు. అది మనకు అవసరమా లేదా అని బుద్ధితో ఆలోచించాలి.)  ఆ స్తబ్ధత లోనుండి ఒక విధమైన ప్రశాంతత కలుగుతుంది.

మనస్సుకు హాయిగా ఉంటుంది. గాఢనిద్రలో మనం అనుభవించే హాయి ఇటువంటిదే. అబ్బా ఎంతో హాయిగా నిద్రపోయాను అని అంటూ ఉంటారు కదా. అలాంటి హాయి. ఇటువంటి హాయి మెలుకువ రాగానే పోతుంది. అలాగే ధ్యానంలోనుండి లేవగానే పోతుంది.(దీనికి విరుగుడు అటువంటి ఆనందాన్ని తాత్కాలిక ఆనందం అని తెలుసుకోవాలి కానీ అదే ఆత్మానందం అని భ్రమపడకూడదు.)

కాసేపు ఉండి తరువాత పోయేది ఆత్మానందం, శాశ్వతానందం కాదు. కాని మనసును నిగ్రహించి ఆత్మలో ఉంచితే కలిగే ఆనందం శాశ్వతమైనది. దానికి అంతము లేదు. పైన చెప్పబడిన ఆనందం, కేవలం శరీరం నిద్రలోకి జారుకోవడం, మనస్సు విచ్చలవిడిగా సంచరించడం తరువాత స్తబ్ధత వహించడం వల్ల వచ్చిన ఫలితాలే. అవి ధ్యానంలో నుండి లేవగానే పోతాయి.

ఇక్కడ అర్జునుడికి వచ్చిన సమస్య ఏమిటంటే, కృష్ణుడు చెప్పింది అంతా వింటున్నాడు. కానీ ఏవీ మనసుకు పట్టడం లేదు. ఈ చెవితో విని ఆ చెవితో వదిలేస్తున్నాడు. అర్జునుడిలో రజోగుణం ఎక్కువగా ఉంది కాబట్టి మనసులో స్థిరంగా నిలవడం లేదు. నిరంతరం అటు ఇటు పరుగెడుతూ ఉంది. ఏవేవో ఆలోచనలతో సతమతమౌతూ ఉంది. అందుకే, మనసును నిగ్రహించడం ముఖ్యం కాని అది చాలా కష్టం. దానిని ఎలా నిగ్రహించడం అనేది అర్జునుడి ప్రశ్న. ఎందుకంటే మనసు చాలా చంచలమైనది. విపరీతమైన క్షోభకు గురిఅవుతూ ఉంటుంది. ఇది చాలా బలమైనది. ధృఢమైనది. ఓ పట్టాన దేనికీ లొంగనిది. మనసును నిగ్రహించడం చాలా కష్టం. గాలిని ఒక చోట బంధించడం, నిలిపి ఉంచడం ఎంత కష్టమో, మనసును నిలకడగా ఒక చోట నిలిపి ఉంచడం అంతకన్నా కష్టము. ఇదీ నా సమస్య. దీనికి ఏమైనా పరిష్కారం ఉందా! ఉంటే అది నాకు చెప్పు! అని అర్జునుడు అడిగిన ప్రశ్నలకు కృష్ణుడు ఏమి సమాధానం చెప్పాడో ఈ కింది శ్లోకాలలో వివరించబడింది.

## 35. అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలమ్।
## అభ్యాసేన తు కౌన్తేయ వైరాగ్యేణ చ గృహ్యతే॥

ఓ అర్జునా!చంచలమైన ఈ మనస్సును నిగ్రహించడం చాలా కష్టము. అందులో మాత్రం సందేహము లేదు. కానీ, అభ్యాసము చేత, వైరాగ్యము చేతా, మనసును నిగ్రహించే అవకాశం ఉంది.

"అసంశయం" అనే పదంతో ఈ శ్లోకం మొదలు పెట్టారు వ్యాసుల వారు. ఎదుటి వారు చెప్పింది సరి అయినదే అని ఒప్పుకుంటూ, అసలు విషయాన్ని వివరంగా, విపులంగా చెప్పడం గురువు యొక్క నైపుణ్యం. అందుకే, అర్జునా! నీవు చెప్పిన దాంట్లో ఏమాత్రం సందేహం లేదు అంటూ అర్జునుడు చెప్పిన విషయాన్ని కృష్ణుడు ఆమోదించాడు. ఇప్పుడు అర్జునుడికి తన మీద తనకు విశ్వాసం పెరిగింది. అమ్మయ్య! నేను చెప్పింది సరి అయినది అని కృష్ణుడు ఒప్పుకున్నాడు అనే ధీమా ఏర్పడింది. అర్జునుడి ముఖంలో ఆనందం వెల్లివిరిసింది. ఇప్పుడు అసలు విషయం బయట పెట్టాడు కృష్ణుడు.

సందేహం లేదయ్యా అర్జునా! నువ్వు చెప్పింది నూటికి నూరు శాతం సరిఅయినదే. నువ్వు చెప్పినట్టు చంచలమైన ఈ మనసును నిగ్రహించడం చాలా కష్టం. ఇది నీ ఒక్కడి సమస్య కాదు. ఇది లోకంలో ఉన్న అందరి మానవుల సమస్య నీవేం బాధపడక్కరలేదు అని ఒప్పుకున్నాడు. అమ్మయ్య! నేను ఒక్కడి నే కాదన్నమాట. అందరూ ఈ జబ్బుతో బాధపడుతున్నారన్నమాట అని అర్జునుడు శాంతపడ్డాడు.

ఎవరైనా ఒక విద్యార్థి తన సందేహమును గురించి అడిగితే తెలివైన ఉపాధ్యాయుడు అతని సందేహము సరి అయినది అని చెబితే ఆ విద్యార్థి సంతోషిస్తాడు. తరువాత ఆ సందేహము తీరే ఉపాయమును మెల్లగా బోధిస్తాడు. ఇది ఉత్తముడైన గురువు లక్షణము. అలా కాకుండా విద్యార్థిని "బుర్రలేని వెధవా! ఇంతసేపు చెప్పింది అర్థం కాలేదా! నీకు ఎంత చెప్పినా అర్థం కాదు. నోరుమూసుకొని కూర్చో!" అంటే ఆ విద్యార్థి చిన్నబుచ్చుకుంటాడు. అప్పటిదాకా నేర్చుకున్నది కూడా మర్చిపోతాడు. ఇది ఉత్తమ ఉపాధ్యాయుడి లక్షణం కాదు. అందుచేత కృష్ణుడు మొట్టమొదట నీవు చెప్పింది కరెక్టు అందులో ఎటువంటి సందేహము లేదు. ఇది నీ ఒక్కడి సమస్య కాదు. లోకంలో అందరి సమస్య అని చెప్పాడు. ఆ మాటలకు అర్జునుడు సంతోషించాడు. కృష్ణుడు వెంటనే దానికి ఓ చక్కటి ఉపాయం కూడా చెప్పాడు. అభ్యాసము, వైరాగ్యము ఈ రెండింటితో మనసును జయించవచ్చు లోబరచుకోవచ్చు స్వాధీనములో ఉంచుకోవచ్చు అని అన్నాడు.

ఈ మనసు చాలా బలమైనది ధృడమైనది దానిని కట్టడి చేయడం, అదుపు చేయడం కష్టం అని అర్జునుడి సందేహము. జంతువులలో ధృడమైనది ఏనుగు. కాని దానిని మావటి చిన్న అంకుశంతో తన స్వాధీనంలో ఉంచుకుంటాడు తన ఇష్టం వచ్చినట్టు నడిపిస్తాడు. సింహము, పెద్దపులి చాలా క్రూరజంతువులు, బలమైనవి. కాని వాటిని ఆడించేవాడు చిన్న చర్నాకోలతో వాటిని కట్టడి చేస్తాడు. అలాగే బలమైన ధృఢమైన మనసు కూడా అభ్యాసము, వైరాగ్యము అనే అంకుశములతో చర్నాకోలతో స్వాధీనం అవుతుంది అనిపరమాత్మ చెప్పాడు.

ఈ విషయం తెలియక కొంత మంది, తెలిసినా అర్థం కాక మరి కొంతమంది, అర్థం అయినా ఆచరణలో పెట్టడం ఇష్టం లేక చాలా మంది, అర్జునుడు దగ్గర నుండి నేటి పండితుల వరకు "మనసు మన మాట వినదు" అనే నిశ్చయానికి వచ్చారు. దానికి పరమాత్మ చెప్పిన ఉపాయము అయిన అభ్యాస వైరాగ్యములను ఎవరూ ఆచరించరు. ఈ విషయాన్నే పతంజలి తన యోగశాస్త్రంలో కూడా వివరించాడు. "అభ్యాసవైరాగ్యాభ్యాం తన్నిరోధ:" అంటే అభ్యాస వైరాగ్యములతో మనసును నిరోధించవచ్చు అని. పతంజలి యోగశాస్త్రము, భగవద్గీత ఈనాటివి కావు. వేల సంవత్సరముల కిందట రాయబడ్డాయి. కాని ఈ నాటికి కూడా మానవులు అభ్యాస వైరాగ్యములను అనుసరించి మనసును స్వాధీన పరచుకోలేకపోతున్నారు.

వైరాగ్యము అంటే వి రాగము అంటే ప్రాపంచిక విషయముల యందు రాగము అంటే కోరిక, ఆసక్తి లేకుండా ఉండటం. (ఈ రోజుల్లో కోరిక, ఆసక్తి లేకుండా ఎవరుంటారు అని మీకు సందేహం రావచ్చు! కాని, ఇక్కడ కోరిక ఆసక్తి అంటే మితిమీరిన కోరిక, ఆసక్తి అని ఈ నాటికి అన్వయించుకోవచ్చు). ఈ ప్రపంచములో ఉన్న వస్తువులతో, మనుషులతో కలిగే సంగమం వలన మనకు లభించే ఆనందము శాశ్వతమైనది కాదు. అది ఈ రోజు ఉండి రేపు పోతుంది. ఆత్మానందమే శాశ్వతమైన సుఖం అని తెలుసుకోవాలి. ప్రపంచములో ఉన్న అనవసర విషయములలో తలదూర్చకుండా ఉండాలి. అనవసర విషయాల గురించి ఆలోచించడం. అనవసర వస్తువులను సేకరించడం. అనవసర విషయాల గురించి మాట్లాడటం, ఎక్కువగా బాధపడటం మానెయ్యాలి..

(దీనికి ఉదాహరణగా టివీలో వచ్చే పనికిమాలిన సీరియల్సుగురించి చెప్పుకోవచ్చు. అందులో నటీనటులు, రచయిత రాసిన డైలాగులను, దర్శకుడు చెప్పినట్టు పలుకుతూ, డబ్బుతీసుకొని, మరీ నటిస్తారు. ఆ నటన నిజం అనుకొని, కొంతమంది, పనులన్నీ మానుకొని, డబ్బు ఇచ్చి చూస్తూ తెగ బాధపడిపోతారు. తరువాతి భాగంలో ఏం జరుగుతుందో అని తెగ ఆరాటపడిపోతారు. ఇదే అనవసర విషయాల గురించి అధికంగా బాధపడటం.)

అనవసరమైన విషయాల గురించి ఆలోచించకుండా ఉంటే, మనసు బయట ప్రపంచములో విహరించకుండా నిలకడగా, నిశ్చలంగా ఉంటుంది. దీనికి అభ్యాసము కావాలి. ఏమీ చేయకుండా మనసును కట్టడి చేయాలంటే సాధ్యం కాదు. నిరంతర అభ్యాసము అంటే ప్రతిరోజూ అభ్యాసము చేయాలి. ఏదో నాలుగు రోజులు చేసి నా మనసు నా స్వాధీనములో ఉందని సంతృప్తి పడకూడదు. అందుకే నిరంతరము ధ్యానము చేయాలి. ధ్యాన సమయములో మనసును అటు ఇటు పోకుండా కట్టడి చేయాలి. అభ్యాసముతో సాధ్యపడనిది ఏదీ లేదు. దీనినే పతంజలి యోగశాస్త్రములో కూడా చెప్పబడింది. "సతు దీర్ఘకాలనైరన్తర్యసత్కారసేవితో ధృఢభూమి:" అంటే దీర్ఘకాలము అభ్యాసము చేస్తే మనో నిగ్రహము సాధ్యమే.

అసలు మొదలు పెట్టకుండా "అబ్బే ఇది మనవలన కాదండీ శుద్ధ దండగ. ఏవేవో చెబుతుంటారు. అవన్నీ మనకు సాధ్యపడతాయా ఏమన్నానా!" అని దీర్ఘం తీస్తూ కొట్టిపారేయడం విజ్ఞతకాదు. ఆరంభించరు నీచమానవులు అనే వాక్యము ఇక్కడ వర్తిస్తుంది. ముందు ఆరంభించి కొంత కాలము చేసి అప్పటి కీ సాధ్యపడకపోతే అప్పుడు ఆలోచించాలి కానీ, అసలు మొదలు పెట్టకుండా ఇది మనవల్ల కాదు అనడం అవివేకము. మామూలుగానే చిన్న పరీక్ష పాసు కావాలన్నా కష్టపడి చదవాలి. సంగీతం నృత్యం నటన రావాలంటే అభ్యాసము చేయాలి. కేవలం లౌకిక విషయాలు నేర్చుకోవాలంటేనే అభ్యాసము అవసరమైనపుడు, బలమైన చంచలమైన మనసును నిగ్రహించడానికి ఎంతటి అభ్యాసం అవసరమో ఆలోచించండి. కాబట్టి బాహ్యప్రపంచములోని విషయముల మీద అనవసరమైన ఆసక్తిని వదిలిపెట్టి, నిరంతర అభ్యాసము చేస్తే మనసు స్వాధీనం అవుతుంది అనే విషయాన్ని పరమాత్మ ఇక్కడ స్పష్టం చేసాడు.

ఇక్కడ ఒక చిన్న రహస్యం కూడా ఉంది. మీరు గమనించారో లేదో, మన మనసు మనకు బాగా ఇష్టం అయిన దానిమీద ఎక్కువసేపు లగ్నం అయి ఉంటుంది. దాని గురించే ఆలోచిస్తుంది. చింతిస్తుంది. అదే కావాలంటుంది. మనం ఎటువంటి ప్రయత్నం చేయకుండానే, మన మనసు మనకు ఇష్టం అయిన దానిమీదకు మాటిమాటి కీ పోతుంటుంది..

ఉదాహరణకు మనకు ఇష్టం అయిన సినిమా గానీ, సీరియల్ గానీ, క్రికెట్ మాచ్ గానీ, టివిలో వస్తూ ఉంది అని అనుకుందాము. మన మనసు దాని మీద పూర్తిగా లగ్నం అవుతుంది. ఆకలి, దప్పిక, ఆఫీసు, కాలేజీ, ఇల్లు, అన్ని మరిచిపోతాము. ఇది మనసుకు సహజ లక్షణం. అదే విధంగా మన మనసును ఆత్మ దర్శనం మీద లగ్నం చేస్తే ఎలా ఉంటుంది. దానికి మనం చేయాల్సిన పని, ప్రాపంచిక విషయాల మీద కాకుండా, ఆత్మ మీద పరమాత్మ మీద ఆసక్తిని, అనురక్తిని, ఇష్టాన్ని, పెంచుకోవాలి. అప్పుడు మన మనసు కూడా ఆత్మయందు నిలకడగా ఉంటుంది. దానినే వైరాగ్యము అంటారు అంటే ప్రాపంచిక విషయాల మీద ఆసక్తిని తగ్గించుకొని ఆత్మ తత్వము మీద ఆసక్తిని పెంచుకోవడం. దానికి నిరంతర అభ్యాసం కావాలి. (వైరాగ్యము అంటే సన్యాసులలో కలవడం కాదు అని తెలుసుకోవాలి.)

ఇక్కడ అర్జునుడిని కృష్ణుడు చేసిన సంబోధన చక్కగా ఉంది. మహాబాహో అన్నాడు. మనసు బలమైనది, ధృఢమైనది, దానిని కట్టడి చేయడం నా వల్ల కాదు అని చేతులెత్తేసాడు అర్జునుడు. దానికి సమాధానంగా, ఇంతటి వీరుడివి, బాహుబలం కలవాడివి అత్యుత్తమ ధనుర్ధారివి, ఇంత చిన్న విషయం నీకో లెక్కలోనిది కాదు. అభ్యాసంతో ప్రయత్నించు అని ధైర్యం చెప్పాడు కృష్ణుడు.

36. అసంయాతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః।
వశ్యాత్మనా తు యతతా శక్యోऽవాప్తుముపాయతః॥

అర్జునా!ఎవని మనస్సైతే నిగ్రహింపబడదో, వాడికి యోగము(మనసును ఆత్మలో ఉంచడం) సాధ్యం కాదు. ఇది నా అభిప్రాయము. ఎవరైతే తన మనస్సును తన అధీనంలో ఉంచుకుంటాడో వారికే అది ఉపాయం చేత సాధ్యము అవుతుంది.

ఎవని మనస్సైతే నిరంతరము ప్రాపంచిక విషయములలో మునిగి తేలుతూ ఉంటుందో, తన ఇష్టం వచ్చినట్టు విహరిస్తూ ఉంటుందో, అనవసర విషయాలలో తలదూరుస్తూ ఉంటుందో అటువంటి వారి మనసు ఎన్నటికీ నిగ్రహింపబడదు. మనసును నిగ్రహించలేని వాడు తన మనసును ఆత్మలో నిలుపలేడు. కాబట్టి వాడికి ఎన్నటికీ ఆత్మసాక్షాత్కారము ఆత్మజ్ఞానము కలుగదు. కేవలము మనసును నిగ్రహించిన వాడికే అది సాధ్యము అని తేల్చేశాడు పరమాత్మ.

కాని, ఎవని మనసు అతని వశంలో ఉంటుందో అంటే నిరంతర అభ్యాసము, ప్రాపంచిక విషయములలో వైరాగ్యము అనే ఉపాయముల చేత యోగి తన మనసును నిగ్రహించి ఆత్మలోనిలపగలడు. శాశ్వతమైన ఆత్మానందాన్ని పొందగలడు. కాబట్టి ఈ జనన మరణ చక్రం నుండి విముక్తి పొందాలంటే, అభ్యాస వైరాగ్యములతో మొదట మనసును స్వాధీనం చేసుకోవాలి. మనసు తన ఇష్టం వచ్చినట్టు తిరుగుతుంటే ధ్యానం కుదరదు. అది కుదరాలంటే నిరంతర అభ్యాసము అవసరము. ఇది ఒక్క రోజుతోనే నెలతోనో సంవత్సరముతోనో అయ్యేపని కాదు. నిరంతర అభ్యాసము కావాలి. కాబట్టి నిరంతర ప్రయత్నం చేసే వారికే కానీ సోమరులకు ఇది సాధ్యంకాదు అనిస్పష్టంగా తెలుస్తూ ఉంది.

ఏ ప్రయత్నమూ చేయని సోమరి, ఏ పనీసక్రమంగా చేయలేడు. ఇది మనవల్ల కాదులే అని చేతులు ముడుచుకొని కూర్చోవడమే అతనికి చేతనైన పని. ఈ ప్రయత్నం కూడా ఉపాయంతో చేయాలి. అందుకే ఉపాయతః అని చెప్పాడు. ఉపాయం లేని వాడిని ఊరువెళ్లగొట్టమని సామెత. కాబట్టి ఏ పని చేయడానికైనా ఉపాయము, కౌశలము, నేర్పు, ముఖ్యము. మనసును నిగ్రహించడానికి కూడా ఈ నేర్పు ముఖ్యము అని పరమాత్మ తెలియచేస్తున్నాడు. వైరాగ్యంతో, అభ్యాసంతో, నేర్పుతో చేస్తే మనో నిగ్రహము, ఆత్మసాక్షాత్కారము ఈ జన్మలోనే సాధించవచ్చు అని పరమాత్మ చెబుతున్నాడు.

అర్జున ఉవాచ:

37. అయతి శ్రద్ధయోపేతో యోగాచ్చలితమానసః।
అప్రాప్య యోగ సంసిద్ధిం కాం గతిం కృష్ణ గచ్ఛతి॥

కృష్ణా! ఒకడు బాగా శ్రద్ధతో యోగం చేస్తున్నాడు. కాని అతడి మనస్సు అతడి స్వాధీనంలో లేదు. అటువంటి వాడు ఏదో కారణం చేత మనస్సు చలించి తాను చేస్తున్న యోగమును మధ్యలో ఆపేసి, ఆ యోగసిద్ధిని పొందలేకపోతే, అతడి పరిస్థితి ఏమిటి? అతడికి ఎటువంటి గతులు కలుగుతాయి?

అర్జునుడు వేసిన ప్రశ్నకు కృష్ణుడు సమాధానం చెబుతూ ఉంటే, అంతలోనే మరలా అర్జునుడికి కొన్ని సందేహాలు కలిగాయి. వెంటనే కృష్ణుడి వాక్ ప్రవాహాన్ని ఆపాడు.
కృష్ణా! ఆగవయ్యా. కాస్త ఆగు. నీవు చెప్పింది బాగానే ఉంది. వైరాగ్యము, అభ్యాసము, నేర్పు, ఉపాయములో మనసును స్వాధినం చేసుకోవచ్చు అన్నావు. బాగానేఉంది. చాలామందికి నీవు చెప్పినట్టు చేయాలనే కోరికా, శ్రద్ధ ఉంటాయి అని అనుకుందాము. ఆ కోరికతో, శ్రద్ధతో, కొంత కాలం యోగం అభ్యాసం చేస్తాడు. కాని ఏదో కారణం వలన మనసును ఎక్కువ కాలం నిగ్రహించలేక ఆ యోగం నుండి పతనం అయి పోతాడు. ఆ జన్మలో వాడికి యోగ సిద్ధి లభించదు. మరి వీడి సంగతి ఎలాగ. మనసును నిగ్రహించకుండానే మరణించిన వాడి గతి ఏమిటి. వాడు ఏలోకాలకు వెళతాడు. వివరంగా చెప్పు అని అడిగాడు.

కాబట్టి మనకు యోగం చేయాలనే శ్రద్ధ, భక్తి, కోరిక ఉంటే చాలదు. ఇంద్రియ నిగ్రహం మనో నిగ్రహం కూడా ఉండాలి. దానికే ఈ సాధన అంతా. కాకపోతే, అర్జునుడి సందేహం ఏమిటంటే, ఈ మనో నిగ్రహం ఎంత కాలం ఉంటుంది. కొంత కాలం మనో నిగ్రహం పాటించి, ఏదో కారణం చేత విచలితుడు అయితే అంటే జారిపోతే వాడి గతి ఏమిటి? అలా కాకుండా యోగం చేస్తూ మధ్యలో ఏ కారణం చేతనైనా మరణిస్తే వాడి గతి ఏమిటి? అప్పటి దాకా వాడు చేసిన సాధన అంతా వృథా అవుతుందా! అలా ఏ జన్మలో చేసిన సాధన ఆ జన్మకే పరిమితం అవుతుంటే ఇంక సాధన చేయడం ఎందుకు. పరిపూర్ణత్వము సిద్ధించడానికి ఒక జన్మకాలం చాలదు కదా! అని ప్రశ్న పరంపరను కురిపించాడు అర్జునుడు.
(ఎంతటి గొప్ప వారికి కూడా మనసు చలించడం సహజం. విశ్వామిత్రుడు గొప్పతపస్సు చేసి కూడా మేనక వ్యామోహంలో పడ్డాడు. భరతుడు రాజ్యాన్ని, సంపదలను, భార్యపిల్లలను వదిలిపెట్టి అరణ్యంలో ఆశ్రమం నిర్మించుకొని తపస్సు చేసుకుంటూ కూడా చిన్న జింకపిల్ల ను రక్షించి దాని వ్యామోహంలో పడ్డాడు. అతని తపస్సు ఆగిపోయింది. మరుజన్మలో జింకగా పుట్టాడు.)

38. కచ్చిన్నోభయవిభ్రష్టశ్ఛిన్నాభ్రమివ నశ్యతి।
అప్రతిష్ఠో మహాబాహో విమూఢో బ్రహ్మణ: పథి॥

39. ఏతం మే సంశయం కృష్ణ ఛేత్తుమర్హస్యశేషత:।
త్వదన్య: సంశయస్యాస్య ఛేత్తా న హ్యుపపద్యతే॥

ఓ కృష్ణా! పైచెప్పిన విధంగా మనస్సుస్వాధీనంలో లేక, మోక్ష మార్గమును పూర్తిగా సాధించ లేక, ఈ లోకములోనూ, పరలోకములోనూ ఎందుకూ పనికిరాకుండా ఉభయభ్రష్టత్వము పొందితే, అటువంటి మూఢుడు చెల్లాచెదరైన మేఘముల వలె నశించి పోతాడు కదా!

ఓ కృష్ణా! నా సందేహములను పూర్తిగా తీర్చడానికి నీవేసమర్ధుడవు ఆ అర్హత నీకే ఉంది. నీవు తప్ప నాకు కలిగిన సందేహములను వేరే ఎవరూ తీర్చలేరు.

అర్జునుడు తన ప్రశ్నల పరంపరను కొనసాగిస్తున్నాడు. కృష్ణా! అదీ కాకుండా ఎవరైనా ధ్యానయోగం అవలంబించి, అందులో స్థిరత్వం లేకుండా, ఇటు ఈ లోకాలలో సుఖాలు అనుభవించకుండా, అటు మోక్ష మార్గమునుసాధించకుండా, ఉభయ భ్రష్టత్వము చెందితే వాడి గతి ఏమిటి? వాడు ఏ ఫలితము లేకుండా నశించి పోతాడా లేక తాను చేసినకొద్ది సాధనకు ఫలితం పొందుతాడా! కృష్ణా నా సందేహములను తీర్చడానికి నీవే తగిన వాడవు. కాబట్టి నా సందేహములను తీర్చి ముందుకు కదులు అని నిష్కర్షగా చెప్పాడు అర్జునుడు.

దీనిని కొంచెం వివరంగా చెప్పుకోవాలంటే ఒకడికి యోగంలోనూ, ధ్యానంలోనూ, గురువులు చేసిన ఉపదేశములలోనూ భక్తి శ్రద్ధ ఉన్నాయి.సాధన మొదలు పెట్టాడు. చేస్తున్నాడు. ఎంత చేసినా అతనికి ఏకాగ్రత కుదరడం లేదు. మనసు నిలకడగా నిలవడం లేదు. ఇది అతనికే కాదు చాలా మందికి జరుగుతుంది. చాలా మంది ధ్యానయోగము కర్మయోగము అవలంబిస్తారు. కాని పూర్తిగా సిద్ధిపొందలేరు. ఈలోగా మరణం సంభవిస్తుంది. అప్పుడు వాడి గతి ఏమిటి? ఇదే అర్జునుని ప్రశ్న.

అర్జునుడు మరొక ప్రశ్నకూడా అడిగాడు. కొంత మంది ధ్యానయోగమును, కర్మమార్గమును అవలంబిస్తారు. కాని మధ్యలోనే జారి పోతారు. మరలా ప్రాపంచిక విషయములలో ప్రవేశిస్తారు. ఛ! ఇదేమిటి నేను ఇలా అయ్యాను అనుకుంటూ మరలా ఆధ్యాత్మ మార్గంలో ప్రవేశిస్తారు.

కాని నిలకడ లేని కారణంగా అప్రయత్నంగా సాంసారిక జీవితంలోకి దూకుతారు. అటువంటి వారికి ఇటు ధ్యాన యోగము కుదరదు. అనవసరంగా ఈ యోగం అవలంబించి నందు వలన ప్రాపంచిక సుఖములు అనుభవించకుండా జీవితం వృథా చేసుకుంటున్నానే! అని బాధపడుతుంటాడు. ఇటు ప్రాపంచికసుఖాలు అనుభవించకుండా, విషయ వాంఛలను తీర్చుకోకుండా, అటు ధ్యానయోగంలో సిద్ధిని పొందకుండా, దేనికీ కొరగాకుండా ఉభయ భ్రష్టత్వం పొందుతారు. రెంటికి చెడ్డ రేవడ లాగా తయారవుతారు. వారి గతి ఏమిటి? వారికి ఏ లోకాలు లభిస్తాయి? ఇది అర్జునుని రెండవ ప్రశ్న.

మూడవ శ్లోకంలో నా సందేహాలు తీర్చడానికి నీవే సమర్థుడవు. నీవు తప్ప ఈ సందేహము మరెవ్వరూ తీర్చలేరు అని అన్నాడు. సాధారణంగా వచ్చే సందేహాలను సాధారణ మానవులు తీర్చగలరు. సాటి మానవులు, గురువులు, జననం నుండి మరణం వరకు కలిగే పరిణామాల గురించి వచ్చే సందేహాలను మాత్రమే తీర్చగలరు. ఇప్పుడు అర్జునుడు కృష్ణుని మరణానంతరం కలిగే పరిణామాలను గురించి కూడా అడుగుతున్నాడు. ఈ సందేహాలు సాధారణ మానవులు తీర్చలేరు. కేవలం మూడు కాలముల గురించిన జ్ఞానము కల పరమాత్మ అంశతో అవతరించిన కృష్ణుడే తీర్చగలడు. అందుకే అర్జునుడు తనకు వచ్చిన సందేహాలను పూర్తిగా తీర్చమని కోరాడు.

శిష్యుడికి గురువు మీద ఇటువంటి విశ్వాసం ఉండాలి అంతే కానీ ఈ టీచరుకు ఏం తెలియదు. ఆయనకే రాదు మనకేం చెబుతాడు అని మొదలుపెడితే అసలుకే మునిగిపోతాడు. ఈ కాలం విద్యార్థులు చాలా మంది ఇదే భావనలో ఉన్నారు. కాబట్టి ప్రతి విద్యార్థి అర్జునుడి మాదిరి గురువు మీద సంపూర్ణ విశ్వాసం కలిగి ఉండాలి. అలాగే ప్రతి గురువు కృష్ణుడి మాదిరి విద్యార్థులయొక్క సందేహములను తీర్చడానికి ఆసక్తి కలిగి ఉండాలి. అప్పుడు గురుశిష్యుల సంబంధం సజావుగా కొనసాగుతుంది.

(ఎంత చెప్పినా ఈ వెధవకు తలకెక్కదు అని గురువు, అసలు ఈయనకు వస్తే కదా మనకు చెప్పడానికి అని విద్యార్థి భావిస్తే, ఆ విద్య ఎన్నటికీ పూర్తికాదు. గురువుగారికి నెలా నెలా జీతం వస్తుంది కానీ శిష్యుడికి సంవత్సరం చదివినా ఒక్కముక్క రాదు.)

శ్రీ భగవాన్ ఉవాచ:

## 40. పార్థనైవేహ నా ముత్రవినాశస్తస్య విద్యతే।
## న హి కల్యాణ కృత్కశ్చిద్దుర్గతిం తాత గచ్ఛతి॥

ఓ అర్జునా! పూర్తిగా సిద్ధి పొందకుండా, ఏ కారణం చేతనైనా, మధ్యలో యోగము అభ్యాసం చేయడం విరమించిన వారిని యోగభ్రష్టులు అని అంటారు. అటువంటి వారికి ఎటువంటి వినాశము అంటే నష్టము ఉండదు. మంచి పనులు చేసే వాడికి ఎప్పుడు కూడా దుర్గతి కలుగదు.

అర్జునుడు అడిగిన రెండు ప్రశ్నలకు కృష్ణుడు ఈ విధంగా సమాధానం చెప్పాడు. ఒక విధంగా యోగులకు, సాధకులకు, ధ్యానయోగం చేసేవారికి ఇది పరమాత్మ ఇస్తున్న అభయం. యోగాభ్యాసము, ధ్యానము చేసే వారు మధ్యలో జారి పోయినా, విధివశాత్తు మరణించినా వారికి ఎటువంటి దుర్గతి పట్టదు. చాలామందికి ఒక సందేహం. ఏదైనా వ్రతం కానీ, పుణ్యకార్యం కానీ, ధ్యానం కానీ మధ్యలో ఆపితే పాపం వస్తుంది అని భయపడుతుంటారు. (ఏపూజ చేసినా, వ్రతం చేసినా, దేవుడి మీద భక్తితో చేయాలి కానీ, భయంతో కాదు)

అటువంటిది ఏమీలేదు అని పరమాత్మ స్పష్టం చేస్తున్నాడు. ఈ లోకంలోనే కాదు పరలోకంలో కూడా అతడికి ఎటువంటి దుర్గతి సంభవించదు. అంటే దీని భావము మనం ఎటువంటి పుణ్యకార్యము చేసినా దానికి తగిన ఫలం వస్తుంది. ఎంత చేస్తే అంతే వస్తుంది. అంతేకానీ ఎటువంటి చెడు ఫలితము రాదు. చేసేది మంచి పని కాబట్టి ఎంత చేసినా దానికి ఫలితం వస్తుంది కానీ ఎటువంటి దుర్గతి కలుగదు. ఈ శ్లోకంలో కల్యాణ కృత్ అని వాడారు. అంటే మంచి పనులు. కల్యాణమైన పనులు. లోకకల్యాణము అని వాడుతూ ఉంటారు. అంటే లోకానికి మంచి చేయడం. ఇతరులకు సాయ పడటం. శాస్త్రములను చదివి ఇతరులకు బోధించడం. సమాజ సేవ చేయడం. ఉన్నదాంట్లో ఇతరులకు సాయపడటం. సాటి వారిని బాధ, హింస పెట్టకుండా, ఇతరుల క్షేమమును కోరుకోవడం. ఇవీ మంచి పనులు. ఇవి ఎంత చేస్తే అంతఫలం మన కాతాకు చేరుతుంది. దానికి తగ్గఫలం ఈ లోకంలో కానీ పరలోకంలో గానీ లభిస్తుంది. ఇదీ పరమాత్మ మనకు చేసిన వాగ్దానం.

ఇందులో మరొక అర్థం అంతర్గతంగా దాగి ఉంది. ఎటువంటి పుణ్యకార్యములు, ధ్యానము చేయని వారికి దుర్గతులు కలుగుతాయి. వారు చేసిన పాపపుపనులకు తగిన ఫలం అనుభవిస్తారు అని భావార్థము. పాపం చేసే వారికి ఈ లోకంలోనే కాదు పరలోకంలో కూడా

అంటే మరుజన్మలో కూడా వారి పాపాలకు ఫలితం అనుభవించక తప్పదు. ఎంత చిన్న పుణ్యకార్యం చేసినా దానికి తగిన ఫలం ఈ జన్మలో కానీ మరుజన్మలో కానీ దక్కినట్టే, ఎంత చిన్న పాపం చేసినా దాని ఫలితం ఎప్పుడైనా అనుభవించక తప్పదు.

ఈ జన్మలో ఎవరికైనా అన్నదానం చేస్తే దానికి ఫలితం అంటే ఆ దానం చేసిన వ్యక్తి ఆకలితో ఉన్నప్పుడు, దిక్కుతోచనప్పుడు, దైవం మానుషరూపంలో వచ్చి ఆదుకుంటాడు. ఇది నా స్వానుభవం అంటే నేను స్వయంగా అనుభవించిన విషయం.

## 41. ప్రాప్య పుణ్యకృతాం లోకానుషిత్వా శాశ్వతీ: సమా:। శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే॥

యోగభ్రష్టుడు అయిన వాడు ముందు పుణ్యలోకములను పొందుతాడు. పుణ్యలోకములలో చాలా కాలం నివసించిన తరువాత మరుజన్మలో శుచిమంతులు, శ్రీమంతులు అయిన వారి గృహంలో జన్మిస్తారు. అంటేమంచి జన్మలభిస్తుంది.

తరువాత అర్జునుడి రెండవ ప్రశ్నకు సమాధానంగా పరమాత్మ ఈ విధంగా అన్నాడు. యోగమును కొంత కాలము చేసి, ఏదోకారణము చేత మాని వేసిన వాడు అంటే యోగము నుండి దిగజారిన వాడు, సరిగా యోగం పూర్తిచేయలేకపోయిన వాడు, మధ్యలో మరణం సంభవించినవాడు, తాను ముందు జన్మలో ఎంత పుణ్యం చేసాడో అంత పుణ్యమునకు సరిపడా పుణ్యలోకాలను పొందుతాడు. అక్కడ చాలా కాలం ఉంటాడు. తాను చేసిన పుణ్యములకు తగిన సుఖములను అనుభవిస్తాడు. తరువాత మరు జన్మలో ఆచార పరులు, శుచిమంతులు అంటే సంస్కారవంతులు, పుష్కలంగా ధనం ఉన్న వారు, అయిన పుణ్యాత్ముల ఇంట్లో జన్మించి తను పూర్వజన్మలో విడిచిపెట్టిన యోగమును కొనసాగిస్తాడు. తాను చేయబోయే యోగమునకు అడ్డంకులైన దారిద్ర్యము, ఈతిబాధలు, వ్యాధులు మొదలగు బాధలు లేకుండా నిరాటంకంగా తన యోగమును కొనసాగిస్తాడు.

ఇక్కడ శ్రీమంతుల ఇల్లు అంటే వ్యాపారస్థులు, పారిశ్రామికవేత్తలు అని కాదు. తినడానికి తిండికి లోటు లేకుండా, అవసరానికి మించి ధనసంపాదన చేయని ఇల్లు ఉన్నదానితో తృప్తిగా జీవించే వాళ్లు ఉన్న గృహము అని అర్థం చేసుకోవాలి. ఎందుకంటే మితిమీరిన ధనం ఉన్నా అతడు తన ధ్యానమును కొనసాగించలేడు. భోగలాలసలో పడిపోతాడు. అన్ని మరిచి పోతాడు. కాని ఈ యోగభ్రష్టుడు, క్రితం జన్మలో కొంత వరకు ధ్యానము మొదలగు యోగములను సాధన చేసాడు కాబట్టి భోగలాలసత్వమునకు బానిస కాకుండా, పరమాత్మవైపు తన దృష్టిని మళ్లిస్తాడు.

కాబట్టి యోగభ్రష్టునకు సద్గతులే లభిస్తాయి.

ఈ శ్లోకంలో శుచీనామ్, శ్రీమతామ్ అనే పదాలు వాడారు. ఆచారవంతులు, శ్రీమంతులు అయిన గృహంలో పుడతాడు. కొంత మంది సదాచార సంపన్నులు అయి ఉంటారు కాని దారిద్యంతో బాధపడుతుంటారు. అటువంటి ఇంట్లో జన్మిస్తే సాధకుడు తన సాధన కొనసాగించలేడు. అలాగే ధనం ఉండీ, సదాచారం లేకపోతే, అన్నిరకములైన చెడుఅలవాట్లకు బానిసై ఇదివరకు చేసిన సాధన కూడా ఆవిరై పోతుంది. అందుకే శ్రీమంతులు, సదాచారసంపన్నుల గృహంలో పుడతారు అని స్పష్టంగా చెప్పాడుపరమాత్మ. కాబట్టి మనం ఎంతో సాధన చేసి, మధ్యలో ఆపినా, మరలా కొనసాగించినా, మధ్యలో మరణించినా, చేసిన సాధన వృధా పోదు. చేసినంత వరకు పుణ్యలోకాలు లభిస్తాయి. తరువాతి మంచి జన్మ లభిస్తుంది. కాబట్టి మనం ఎల్లప్పుడు ధ్యానము చేయడం, వేదములు, శాస్త్రములు చదవడం, జ్ఞానం సంపాదించడం, నిష్కామ కర్మ, కర్తృత్వభావన లేని కర్మలు చేయడం మొదలగు యోగములను శ్రద్ధతో, భక్తితో నిరంతరం చేస్తూ ఉండాలి. మనం ఆచరించిన యోగము ఎన్నటికీ వృథా కాదు. ఇది పరమాత్మ మనకు ఇచ్చిన అభయం.

## 42. అథవా యోగినామేవ కులే భవతి ధీమతామ్।
## ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మయదీదృశమ్॥

పైన చెప్పిన వారే కాకుండా, ఇంకా ఎక్కువ యోగం చేసిన వారు, ఉత్తమ తరగతి యోగులు అయిన వాళ్లు, అర్ధాంతరంగా మరణిస్తే, అటువంటి వారు, వారి వారి పుణ్యఫలములను బట్టి, సంస్కారవంతులు, ధనవంతులు, శుచిమంతులు అయిన గృహాలలోనే కాదు, మంచి యోగము చేసిన వారు, జ్ఞానవంతులు, అయిన గృహములలో కూడా జన్మిస్తారు. కాని అటువంటి గృహములలో పుట్టడం చాలా కష్టం.

ఇప్పటి దాకా పరమాత్మ యోగము నుండి జారిన వాళ్ల గురించి చెప్పాడు. ఈ శ్లోకంలో ఎవరైతే ప్రాపంచిక విషయముల వంక చూడకుండా, బాగా సాధన చేసి, సాధన పూర్తి కాకుండా మరణించిన వాళ్ల గురించి చెబుతున్నాడు. అటువంటి వారు ధీమంతులు, యోగులు పుట్టిన కులంలో జన్మిస్తారు. అటువంటిజన్మ సామాన్యులకు చాలా కష్టము. ఇటువంటి జన్మ సులభంగా లభించదు. యోగులు, జ్ఞానుల ఇంట్లో పుట్టడం చాలా అరుదుగా లభిస్తుంది. ఇటువంటి గృహములలో ధనమునకు ప్రాధాన్యత ఉండదు. అటువంటి వారు ధనమును ఐశ్వర్యమును లెక్కచేయరు. వారి జ్ఞానమే వారికి ధనము. శుచి శుభ్రత సంస్కారము వారికిపుట్టుక నుండే అబ్బుతాయి. కాబట్టి, అటువంటి వారి ఇంట్లో జన్మించి యోగులు తమ సాధన కొనసాగిస్తారు.

అంటే ఈ జన్మలో నూటికి 80 మార్కులు తెచ్చుకొని మరుజన్మలో మిగిలిన 20 కొరకు ఇంప్రూవ్ మెంట్ రాస్తారన్నమాట. ఆ ఇంట్లో వారికి వంశపారంపర్య సంస్కారము, అనుభవము లభిస్తుంది. మంచి మార్గదర్శకత్వము దొరుకుతుంది. పుట్టుక నుండి జ్ఞాన, వైరాగ్యములు కలుగుతాయి. ఇంట్లో ప్రతిరోజూ దేవతార్చన, దీపారాధన, సంధ్యావందనము జరుగుతాయి కాబట్టి వాటికి అలవాటు పడతాడు. చిన్నప్పటి నుండి ఆధ్యాత్మ విచారణ, యోగసాధన, నియమ నిష్టలు, మంచి గ్రంథములు చదవడం అబ్బుతాయి. కాబట్టి క్రితం జన్మలో ఎక్కడ వదిలిపెట్టాడో అక్కడినుండి సాధన మొదలుపెడతాడు.

లోకంలో ధనవంతులుగా పుట్టడం గొప్ప కాదు. సంస్కారవంతులుగా పుట్టడమే గొప్ప. ధీమంతులు అయిన యోగుల జన్మ గొప్పది. అది సామాన్యులకు లభ్యం కాదు. అటువంటి జన్మ చాలా అరుదు అని ఎందుకు అన్నారంటే, లోకంలో జ్ఞానులు ఉండటమే అరుదు. జ్ఞానులు అయిన వాళ్లు సాధారణంగా గృహస్థాశ్రమము స్వీకరించరు. యోగులలో గృహస్థాశ్రమము స్వీకరించే వాళ్లు చాలా అరుదు. కాబట్టి అటువంటి యోగుల గృహములలో పుట్టడం చాలా చాలా అరుదు, కష్టము. అందుకే "ఏ తద్ధి దుర్లభతరం" అని వాడారు వ్యాసుల వారు.

## 43. తత్ర తం బుద్ధి సంయోగం లభతే పౌర్వదైహికమ్। యతతే చ తతో భూయస్సంసిద్ధౌ కురునన్దన॥

పూర్వజన్మలో యోగమును పూర్తిగా అభ్యసించకుండా, ఏ కొంచెమో మిగిలిపోతే, తిరిగి మరుజన్మలో యోగుల ఇంట్లో జన్మించిన వాడు, తాను పూర్వజన్మలో అభ్యసించిన యోగమును కొనసాగిస్తాడు. ఆ ప్రకారంగా అతడు మోక్షమును పొందడానికి తీవ్రమైన ప్రయత్నం చేస్తాడు.

ముందు జన్మలో యోగమును అభ్యసించి మధ్యలో మరణించిన వారు మరుజన్మలో శుచి మంతులు, శ్రీమంతులు, జ్ఞానవంతులు, యోగులు అయిన వారి గృహములలో పుడతారు అని చెప్పిన తరువాత, అలా పుట్టిన వారు ఏం చేస్తారు. మరలా ఒకటో క్లాసునుండి మొదలు పెడతారా! లేక చదువు ఎక్కడ ఆపారో అక్కడి నుండి మొదలు పెడతారా! అనే విషయాన్ని ఈ శ్లోకంలో స్పష్టం చేస్తున్నాడు పరమాత్మ.

ఓ అర్జునా! మధ్యలో యోగాభ్యాసము ఆపిన యోగి మరుజన్మలో శ్రీమంతులు, శు చిమంతులు, జ్ఞానులు, యోగుల ఇంట్లోపుడతాడు అని చెప్పాము కదా. అటువంటి జన్మపొందిన

తరువాత, అతడు, కిందటి జన్మలో, తాను ఎక్కడ యోగాభ్యాసము ఆపాడో అక్కడి నుండి మొదలుపెడతాడు. ఎందుకంటే అతని వెంట అతని వాసనలు అంటే బుద్ధి, సంస్కారము అతని వెంటే వస్తాయి. అంతకు ముందు జన్మలో ధ్యానం అభ్యాసము చేసాడు కాబట్టి మరు జన్మలో కూడా అదే ధ్యానము కొనసాగిస్తాడు. జ్ఞాన సిద్ధికి, యోగం సంపూర్ణంగా సిద్ధించడానికి ప్రయత్నం చేస్తాడు. అందుకే సంసిద్ధో అని వాడారు. సంసిద్ధుడు అవుతాడు. యోగుల వంశంలో జన్మించడం వలన అతని చుట్టు ఆధ్యాత్మిక వాతావరణం ఉంటుంది.

కాబట్టి మనం ఈ జన్మలోనే ధ్యాన యోగము అవలంబించాలి. ఎంత వరకు చేయగలమో అంతవరకు అభ్యాసము చేయాలి. ఆ అభ్యాసము మరు జన్మకు కారీఫార్వర్డు అవుతుంది. మంచి జన్మ లభిస్తుంది. ఆధ్యాత్మిక బుద్ధి పుడుతుంది. మనం ధరించినది స్థూల దేహము అయితే మనలో ఉన్న మనోబుద్ధిఅహంకారములు సూక్ష్మదేహము. మనం చేసే పాపపుణ్యాలు ఈ సూక్ష్మదేహమును అంటి పెట్టుకొని ఉంటాయి. స్థూల దేహము మరణించిన తరువాత, ఈ సూక్ష్మదేహం, ఆ జన్మలవాసనలను తనతో కూడా అంటి పెట్టుకొని వెళుతుంది. మరుజన్మలో తన అభ్యాసమును కొనసాగిస్తుంది అని పరమాత్మ ఇక్కడ స్పష్టం చేస్తున్నాడు.

కాబట్టి మనము మరణించిన తరువాత మనతోబాటు వచ్చేవి మనం చేసే మంచి పనులు, పుణ్యకార్యముల ఫలములు, పాపంచేస్తే ఆ పాపఫలములు. అంతేకానీ, మనం సంపాదించిన ధనం, ఆస్తులు, బంధుమిత్రులు మన వెంట రారు. అన్నదమ్ములు, సంతానము, బంధువులు మనం సంపాదించిన ధనం, ఆస్తి కోసం కొట్లాడుకుంటారే కానీ, మనగురించి పట్టించుకోరు. మరణించిన తరువాత, అప్పటి వరకు సంపాదించిన ధనం బాంకులో కానీ, అటక మీద బస్తాలలో కానీ మూలుగుతుంటుంది. పొలాలు, ఇళ్లస్థలాలు, ఇళ్లు ఉన్నచోటనే ఉంటాయి. బంధుమిత్రులు శ్మశానం దాకా వస్తారు. తరువాత చేయాల్సింది ఒంటరి ప్రయాణం. అప్పుడు సూక్ష్మరూపంలో అంటే వాసనల రూపంలో మన వెంట వచ్చేది మనం చేసుకున్న పుణ్యం లేక పాపం.

కాబట్టి ప్రతి వాడూ బంధువుల మీద, ఆస్తి, ధనము మీద మమకారం తగ్గించుకోవాలి. ఈ ప్రపంచమే సర్వస్వము, సుఖమయము అనే అజ్ఞానమును వదిలిపెట్టి, నేను వేరు ఈ దేహము వేరు అనే భావన కలిగి ఉండాలి. ఆత్మను గురించిన జ్ఞానమును పెంపొందించుకోవాలి. ధ్యానము, భగవన్నామస్మరణ, శాస్త్రపఠనము చేయాలి. పరోపకారము చేయాలి. సమాజసేవ చేయాలి. మనం ఎంత చేస్తే అంత పుణ్యము మనకు వస్తుంది. అది మరుజన్మకు కూడా సంక్రమిస్తుంది. కాబట్టి ఈ జన్మలోనే అంతా చేయగలమా లేదా అనే సంశయం వదిలిపెట్టి, చేయగలిగినంత చేయడానికి ప్రయత్నం చేయాలి. ఇదే ప్రతి మానవుని కర్తవ్యం.

44. పూర్వాభ్యాసేన తే నైవ హ్రియతే హ్యవశోऽపి సః।
జిజ్ఞాసురపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే॥

పైరెండు శ్లోకములలో చెప్పబడినట్టు అంతకు ముందు జన్మలో యోగాభ్యాసము చేసి పూర్తికాకముందే మధ్యలో మరణించిన యోగి, తాను పూర్వజన్మలో అభ్యసించిన యోగము యొక్క బలము చేత, మరుజన్మలో కూడా, అతని ప్రమేయం ఏమీ లేకుండానే యోగాభ్యాసము వైపుకు లాగబడుతున్నాడు. ఇది అంతా అతని పూర్వజన్మసంస్కారము వలన జరుగుతూ ఉంది.

ఇక్కడ మరొక సందేహమునకు కూడా సమాధానం ఇస్తున్నాడు పరమాత్మ. అదేమిటంటే శ్రీమంతుల ఇంట్లోపుడితే, అతనికి ఉన్న ధన బలము, అతని స్నేహితులు, చుట్టుపక్కల ఉన్న వాతావరణం అతనిని చెడు అలవాట్లవైపు లాగుతుంది కదా! మరి, అతనికి యోగాభ్యాసం చేయడానికి ఎలా వీలు కుదురుతుంది. అని ప్రతి వాడికీ సందేహము కలుగుతుంది. దానికి పరమాత్మ ఇచ్చిన సమాధానమే ఈ శ్లోకము.

పూర్వజన్మలో యోగాభ్యాసము చేసి, అది పూర్తి కాకుండానే మరణించిన యోగి, మరుజన్మలో శ్రీమంతులు, ఆచారవంతులు అయిన వారి గృహములో జన్మిస్తాడు అని చెప్పాను కదా! అతనికి ఉన్న ధనము, పరిసరాలు అతడిని చెడు అలవాట్లవైపు లాగినా, ఈ యోగభ్రష్టుడు వాటి వంక చూడడు. ఆధ్యాత్మికతే వైపే మొగ్గు చూపుతాడు. అతడి పూర్వజన్మ సంస్కార బలం అటువంటిది. కాబట్టి మనం ఏచిన్న పుణ్యకార్యము చేసినా అది మనకు తరువాతి జన్మలో ఎంతో ఉ పయోగకరంగా ఉంటుంది. అదే విధంగా పాపం చేసినా అది మరుజన్మలో పాపకార్యముల వంక లాగుతూనే ఉంటుంది. పుణ్యకార్యములు, ధ్యానము, మంచి బుద్ధిని కలిగిస్తే, పాపపు పనులు పాపబుద్ధిని కలిగిస్తాయి.

ఇప్పటికీ మనం అక్కడక్కడా చూస్తుంటాము. ముమ్మిడి వరం బాలయోగి, రమణ మహర్షి, కంచి పరమాచార్య, త్యాగరాజు మొదలగు వారు. ఇంకా మనకు తెలియని వారు ఎంతోమంది ఉన్నారు. వారందరూ ముందు జన్మలో ఆధ్యాత్మికతలో మునిగి తేలిన వారు కాబట్టి, మరుజన్మలో కూడా వారు చిన్నప్పటి నుండి ఆధ్యాత్మిక బుద్ధి కలిగి ఉంటారు. ఆధ్యాత్మికతవైపుకే లాగబడతారు. వారిని ప్రాపంచిక విషయాలు ప్రలోభపెట్టలేవు. అంటే, ముందు జన్మలో యోగాభ్యాసము ఆధ్యాత్మికత పెంపొందించుకున్నవాడు, మరు జన్మలోకూడా ఆ వైపుకు బలవంతంగానైనా లాగబడతాడు.

రెండవ పాదంలో, అటువంటి యోగి ఎటువంటి గతులు పొందుతాడో వివరిస్తున్నాడు పరమాత్మ. అటువంటి జిజ్ఞాసువు, తిరిగి వేదములు, శాస్త్రములు, వాటిలో ఉన్న కర్మకాండల వంక చూడకుండా, కేవలము పరమాత్మను తెలుసుకోడానికి ప్రయత్నం చేస్తాడు. ఎందుకంటే అతడు పూర్వజన్మలో ఈ కర్మకాండల స్థితిని దాటి, నిర్గుణపరబ్రహ్మను ఉపాసించే స్థితికి చేరుకున్నాడు. కాని కాలం తీరడం వలన మరణించాడు. మరుజన్మలో అతడు చెడు అలవాట్ల వైపు లాగబడకుండా, మరలా కర్మకాండల వంక, ప్రాపంచిక సుఖముల వంక పరుగెత్తకుండా, ఆత్మజ్ఞానం కొరకు ప్రయత్నం చేస్తాడు. పరమ సుఖమును, శాంతిని పొందుతాడు. తుదకు పరమాత్మలో ఐక్యం అవుతాడు. అటువంటి వాడికి మరుజన్మ ఉండదు.

## 45. ప్రయత్నాద్యత మానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః। అనేకజన్మ సంసిద్ధస్తతో యాతి పరాం గతిమ్॥

ఈ ప్రకారంగా ప్రయత్నపూర్వకంగా యోగమును అభ్యసించే వాడు, తన పాపములను పోగొట్టుకుంటాడు. పరిశుద్ధుడు అవుతాడు. తన పూర్వజన్మలలో చేసిన యోగాభ్యాసము వలన కలిగిన సంస్కారములతో అతడి యోగము సిద్ధిస్తుంది. దాని ఫలితంగా ఉత్తమ గతులను పొందుతాడు.

తన పూర్వజన్మలలో పట్టుదలతో, ప్రయత్నపూర్వకంగా యోగమును అభ్యసించి, సిద్ధిపొందకుండానే దేహమును విడిచిపెట్టిన యోగి, మరుజన్మలో సకల పాపములనుండి విముక్తి పొంది, పరిశుద్ధమనస్కుడై, శుద్ధసత్వగుణ సంపన్నుడై, నిరంతర అభ్యాసముతో యోగసిద్ధిని పొందుతాడు. తరువాత మోక్షమును పొందుతాడు.

కాబట్టి యోగ సిద్ధిని పొందడానికి మూడు ముఖ్యలక్షణములు కలిగి ఉండాలి. 1.ప్రయత్నము, పట్టుదల. 2. అనేక జన్మలలో చేసిన అభ్యాసము. 3.చేసిన పాపములు పోగొట్టుకోవడం, కొత్త పాపాలు చేయకపోవడం.. కాబట్టి ఏకార్యము తలపెట్టినా దానికి పట్టుదల, ధృఢ సంకల్పము, అత్యవసరము. ఈ రెండు ఉంటే సాధారణమైన పనులే కాదు ఆధ్యాత్మిక కార్యములు కూడా చక్కగా సిద్ధిస్తాయి. పట్టుదల, ప్రయత్నం లేని వాడు ఏ కార్యము చేయలేడు. ఈపట్టుదల ప్రయత్నము పూర్వ జన్మలలో చేసిన అభ్యాసం వలన కలుగుతుంది. మోక్షము పొందాలనే కోరిక, దాని మీద ఇష్టము కలుగుతాయి. అటువంటి యోగి మరుజన్మలో తన ప్రమేయం ఏమీ లేకుండానే ఆధ్యాత్మికతవైపుకు మళ్లుతాడు. నేరుగా యోగాభ్యాసము చేస్తాడు.

ఇదంతావిన్న తరువాత, మోక్షం కావాలంటే ఎన్నోజన్మలు ఎత్తాలోఅని సందేహం రావచ్చు. పట్టుదల, ప్రయత్నము, అభ్యాసము ఇవి చక్కగా ఉంటే ఒకటి రెండు జన్మలలోనే మోక్షస్థితిని పొందవచ్చు. దీని కన్నా ముందు ఇంతవరకు మనం తెలిసో తెలియకో చేసిన పాపములను పోగొట్టుకోవాలి. ఇది ధ్యానము, నిష్కామకర్మలు, భక్తి వీటి వలన సాధ్యం అవుతుంది. అప్పుడు మనసు నిర్మలంగా ఉంటుంది. ధ్యానం కుదురుతుంది. ఇదంతాచేస్తే వచ్చే ఫలితము పరాంగతిమ్ అని అన్నాడు పరమాత్మ అంటే పరమ గతి. అంటే తిరిగి రాని స్థితి పునర్జన్మ లేని స్థితి. జీవాత్మ పరమాత్మలో కలిసే స్థితి. బ్రహ్మానుభూతి. ఇవిఅన్నీ పరమగతులే. వాటి కోసం మనం నిరంతరం ప్రయత్నించాలి.

46. తపస్విభ్యో2ధికో యోగీ జ్ఞానిభ్యో2పి మతో2ధికః।
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున॥

ఓ అర్జునా! యోగాభ్యాసము చక్కగా చేసి సిద్ధి పొందిన వాడు, తపస్సు చేసేవారి కంటే, శాస్త్రములను అధ్యయనం చేసిన వారి కంటే, కర్మయోగమును అవలంబించిన వారి కంటే, అధికుడు అని చెప్పబడుతున్నాడు.

ఈ శ్లోకంలో యోగులు ఎన్ని విధాలుగా ఉంటారో చెప్పాడు పరమాత్మ. మొదటి తరగతి వారు తపస్సు చేసే వాళ్లు. అంటే దైవాన్ని సగుణోపాసన చేసే వాళ్లు. వీరు భక్తులు అని కూడా అనవచ్చు. రెండవ తరగతి వారు శాస్త్రములను చదవడం, వినడం, మననం చేయడం, మననం చేసిన దానిని చక్కగా అర్థం చేసుకోవడం, దాని ద్వారా జ్ఞానం సంపాదించడం. వీరిని జ్ఞానులు అని అంటారు. మూడవ తరగతి వారు కర్మిభ్యః అంటే యజ్ఞములు, యాగములు, క్రతువులు, వ్రతములు, పూజలు మొదలగు కర్మలు చేసేవాళ్లు. తరువాతి తరగతి వారు యోగులు. ఈ యోగులు ఎవరంటే, పైన చెప్పిన తరగతులు అన్నీ దాటి, వాటిలో చెప్పినవి అన్నీ చేసి, ఇంద్రియ నిగ్రహము, మనో నిగ్రహము పాటించి, ధ్యానము లో కూర్చుని, మనసును ఆత్మయందు నిలిపిన వాడు యోగి. ఈ యోగి పైన చెప్పబడిన యోగులందరికంటే అధికుడు.

మనకు తపోధనులు, పండితులు, వేదములు, శాస్త్రములు అధ్యయనం చేసిన వారు, అగ్నిహోత్రము, యజ్ఞములు, యాగములు మొదలగు కర్మలు చేసినవారు, సాధారణంగా కనపడుతుంటారు. వీరందరి కంటే యోగి గొప్పవాడు. యోగి అంటే యోగమును అభ్యసించిన వాడు, యోగము అంటే ధ్యానయోగము. మనసును ఆత్మలో నిలపడం. ఆత్మదర్శనం చేయడం. ఆత్మానందాన్ని పొందడం. దీనినే యోగం అని తెలుసుకున్నాము. ఈ యోగము అవలంబించిన వాడే ఉత్తముడు, సర్వశ్రేష్టుడు. శ్రద్ధ భక్తితో ధ్యానం చేసి, మనసును నిగ్రహించి ఆ మనసును

ఆత్మలో లయం చేసే వాడే యోగి. వాడే అందరి కంటే గొప్పవాడు. అంటే తపస్సు చేసే తాపసులు, శాస్త్రములను అధ్యయనం చేసే జ్ఞానయోగులు, కర్మలను చేసే కర్మయోగులు తక్కువ వారు అని అర్థం కాదు. వీరిలో ఒకరికంటే ఒకరు గొప్పవారు. కర్మ, జ్ఞానము, తపస్సు, వీటి కంటే ధ్యానము, ఆత్మదర్శనము చేసినయోగి మోక్షానికి దగ్గరగా ఉంటాడు అని భావము. అంతే కానీ అవేమీ తక్కువ కాదు. చేయకూడనివి కాదు.

ఇదంతా చెప్పిన తరువాత కృష్ణుడు అర్జునుడికి ఒక ఉచిత సలహా ఇచ్చాడు. తస్మాత్ యోగీ భవ అర్జున అంటే "ఓ అర్జునా! నువ్వు కూడా యోగం చెయ్యి. యోగివి కా! బాగుపడతావు" అని అర్జునుడికి చెప్పాడు. దీని అర్థం యుద్ధం మానేసి యోగం చేయమని కాదు. ఆత్మజ్ఞానమును సంపాదించు. నీవు వేరు ఈ శరీరము వేరు. ఈ శరీరం కొరకు చింతించకు. ఆత్మదర్శనం చెయ్యి. నీ కర్తవ్యమును నీవు నిర్వర్తించు. దాని ఫలం గురించి ఆలోచించకు అని బోధించాడు.

ఈవిషయం కృష్ణుడు మనందరికీ చెప్పినట్టు భావించాలి. యోగి అంటే ఎవరో యోగము అంటే ఏమిటో దానిని ఆచరిస్తే ఏమవుతుందో, ఆచరించకపోతే ఏమవుతుందో, ప్రాపంచిక విషయముల నుండి ముక్తి పొందడానికి ధ్యానయోగము ఎలా ఉపయోగపడుతుందో, అనే విషయాలను కృష్ణుడు మనకు వివరంగా చెప్పి మనల నందరినీ యోగాభ్యాసము అంటే ధ్యానయోగము అవలంబించమని సూచించాడు.

యోగులు అంటే కాషాయాలు ధరించి, జడలు కట్టుకొని దండం పట్టుకొని ఊళ్లమ్మట తిరగడమో లేక మఠాలుస్థాపించడమో కాదు. ఎవరైనా ఎక్కడైనా, ఇంట్లో నైనా ఎక్కడైనా యోగము చేయవచ్చును, ఆత్మదర్శనం పొందవచ్చు అని నిరూపించాడు కృష్ణుడు. మనస్సును ప్రాపంచిక విషయముల నుండి మరలించి ఆత్మలో స్థిరంగా ఉంచడమే యోగము అని వివరంగా చెప్పాడు. నిరతంరము భగవంతుని మననం చేయువాడే యోగి అని చెప్పాడు. కాబట్టి ఆ యోగమును ఆచరించడం మన ధర్మం.

## 47. యోగినామపి సర్వేషాం మద్గతేనాన్తరాత్మనా।
## శ్రద్ధావాన్ భజతే యో మాం స మే యుక్తతమో మతః॥

తపస్సు చేసే వారు, జ్ఞానము సంపాదించిన వారు, కర్మలు చేసే వారి కంటే యోగి ఉత్తముడు అని చెప్పిన తరువాత, ఆ యోగులందరిలో పరమాత్మ యందు మనస్సు నిలిపి నిరంతరం పరమాత్మను శ్రద్ధతో ధ్యానించేవాడు ఆ యోగులందరి కంటే యుక్తులందరి కంటే ఉత్తముడు.

ఇది ఈ అధ్యాయంలో ఆఖరి శ్లోకం. ఈఅధ్యాయం సారం ఇందులో ఇమిడ్చాడు. సకల యోగులలో కల్లా, నా యందు మనసు నిలిపినవాడు, ఎల్లప్పుడూ నన్ను తలంచుకొనే వాడు, నన్ను మననం చేసేవాడు, శ్రద్ధతో,భక్తితో భజించేవాడు, అట్టివాడు యుక్తులలో ఉత్తముడు అని నా అభిప్రాయము. అంటే ఎవరంటే తనకు ఇష్టమో ఈ శ్లోకంలో స్పష్టంగా తెలియజేసాడు పరమాత్మ.

కృష్ణుడు ఇక్కడ ఒక విషయం ప్రస్తావించాడు. ఏ యోగము చేసినా ఏ కర్మ చేసినా శర్ధ, భక్తి. ఈ రెండు ముఖ్యము. సాయిబాబా అవధూత కూడా శ్రద్ధ సబురు అని ఉపదేశించాడు. మనం సాయిబాబా ఉపదేశాలు పాటించము. ఆయన ఏ మతం వాడు అని వాదోపవాదాలకు దిగుతాము. వివాదాస్పద వ్యాఖ్యలు చేసి వార్తలలోకి ఎక్కుతాము. ఆయనకు శాలువాలు కప్పుదామా, కిరీటాలు, పల్లకీ సేవలు చేయిద్దామా, ఇదంతా చేస్తే ఆయన మనకేం ఇస్తాడు అని ఆలోచిస్తుంటాము. ఇదే భక్తి అనుకుంటాము. కాని అది మన అజ్ఞానము అని తెలుసుకోలేము.

కాబట్టి ఎవరైతే ధ్యానయోగమును శ్రద్ధాభక్తులతో ఆచరిస్తారో, వారే నాకు ఇష్టులు, యుక్తతములు అని పరమాత్మ చెప్పాడు. ఇంకా పరమాత్మ మద్గతేనాన్తరాత్మనా అని స్పష్టంగా చెప్పాడు. మద్గతేన అంటే నీ మనసును నాలో నిలుపు. నా యందు నిలుపు. అంటే ముందు నన్ను అంటే కృష్ణుడిని సగుణోపాసన చేసి అంటే విగ్రహ రూపంలో పూజించి తరువాత నిర్గుణోపాసనలోకి వెళ్లాలి. ధ్యానయోగం ద్వారా మనసును ఆత్మయందు నిలుపాలి. అప్పుడే ఆత్మదర్శనం అవుతుంది. అంతర్లీనంగా నిరంతరం నా యందు భక్తి కలిగి ఉండు అని చెబుతున్నాడు కృష్ణుడు.

చేసేది పూజ అయినా, తపస్సు అయినా, ధ్యానం అయినా, యజ్ఞయాగములు, వ్రతాలు క్రతువులు అయినా, ఏది చేసినా నాయందు భక్తితో శ్రద్ధతో చెయ్యి. వాటి ఫలితములు నాకు అర్పించు. మనసును నిర్మలంగా ఉంచుకో. నిశ్చింతగాఉండు. ఇదే పరమాత్మ బోధ. (మానవులు అన్నీ చేస్తారు కానీ మైనస్ భక్తి, శ్రద్ధ. ఈ రెండూ తప్ప అన్నీ ఉంటాయి.).

ఈ బోధలో చెప్పిన విషయములను మరొక సారి స్మరించుకుందాము. శ్రద్ధ, భక్తి, పట్టుదల, ఏకాగ్రత, మనసును నిర్మలంగా ఉంచుకోవడం, ఆ నిర్మల మనస్సును కృష్ణునియందు లగ్నం చేయడం, కృష్ణుని నిరంతరం ధ్యానించడం. ఇలా చేస్తే కృష్ణుడు ఇష్టపడతాడు. వాడే యోగులలో ఉత్తముడు. ఇది నా మతము. నా అభిప్రాయము అని శ్రీకృష్ణుడే స్వయంగా చెప్పినపుడు మనం వాటినిపాటించక తప్పదు. కాబట్టి, మనందరం పైన చెప్పినలక్షణములను పాటించి భగవంతుని కృపకు పాత్రులు అవుదాము. దీనితో ఆత్మ సంయమ యోగము అను ఆరవ అధ్యాయము సంపూర్ణము.

ఉపనిషత్తులయొక్క, బ్రహ్మవిద్యయొక్క,
యోగశాస్త్రము యొక్క సారమయిన భగవద్గీతలో,
ఆత్మసంయమ యోగము అను ఆరవ అధ్యాయము సంపూర్ణము.
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# భగవద్గీత

## ఏడవ అధ్యాయము

# విజ్ఞానయోగము

జ్ఞానము, విజ్ఞానము అని ఇదివరకు మనం చదువుకున్నాము. జ్ఞానము అంటే గురువుల నుండి, పెద్దల నుండి విన్నది, వేద,శాస్త్ర,పురాణములు చదవడం ద్వారా సంపాదించినది. ఈ జ్ఞానాన్ని ఆచరణలో పెట్టడమే విజ్ఞానము. మనం ఇప్పటి దాకా ఆరు అధ్యాయములలో ఎంతో కొంత జ్ఞానం నేర్చుకున్నాము. ఇప్పుడు ఆ జ్ఞానం ఎలా ఆచరణలోకి వస్తుంది అనే విషయం నేర్చుకుంటాము.

ఈ అధ్యాయంలో పరా ప్రకృతి, అపరా ప్రకృతి, సృష్టిలో ఉన్న అన్ని వస్తువులలో, జీవరాసులలో పరమాత్మ యొక్క ఉనికి, దైవీశక్తులు, ఆసురి శక్తులు, దేవతల ఉపాసన, పరమాత్మ గురించి తెలిసిన వారు, తెలియని వారు ఎలా ప్రవర్తిస్తారు మొదలగు విషయాలను గురించి తెలుసుకుంటాము.

కిందటి అధ్యాయంలో సాధకుడు పరమాత్మను శ్రద్ధాభక్తులతో ధ్యానం చేస్తే ఎటువంటి సద్గతులు పొందుతారు అనే విషయాన్ని తెలుసుకున్నాము. పరమాత్మ స్వరూప స్వభావాలను కూడా చక్కగా తెలుసుకుంటే ధ్యానయోగం మరింత సమర్ధవంతంగా చేసుకునే అవకాశం ఉంది. అదేమిటో ఇప్పుడు తెలుసుకుందాము.

### 1. మయ్యాసక్త మనా: పార్థ యోగం యుఞ్జన్మదాశ్రయః।
### అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి తచ్ఛృణు॥

ఓ పార్థా! నీతో సహా, నాయందు ఆసక్తి కలిగినవారు, నా యందు మనస్సు నిలిపిన వారు, నన్నే ఆశ్రయించిన వారు, యోగమును అభ్యసించిన వారు, నన్ను ఎటువంటి సందేహమునకు తావు లేకుండా, సమగ్రంగా ఎలా తెలుసుకోగలరో, ఈ విషయమముల గురించి వివరిస్తాను. శ్రద్ధగావిను.

మనందరికీ ఒకటి తెలుసు. నేను, నీవు. నేను అంటే నా శరీరము, నా శరీరం పుట్టగానే దానికి పెట్టిన పేరు, అది పెరిగి పెద్దది అయి ఒక రూపం సంతరించుకుంటుంది. ఆ రూపము. కాబట్టి నేను అంటే నా పేరు, నా రూపము అని మన భావన. నీవు అంటే నీ శరీరము, ఆ శరీరానికి ఉన్న పేరు, ఆ శరీరానికి ఉన్న ఆకారము అని భావన. నేను అంటే ఈ శరీరము కాదు, నాలో ఉన్న ఆత్మ అని తెలుసుకోవడమే జ్ఞానము. అందుకే మాం జ్ఞాస్యసి అన్నారు కృష్ణపరమాత్మ. అంటే నా గురించి తెలుసుకో. ఆత్మ గురించి తెలుసుకో అని అర్థం. అలాగే నేను అంటే నా పేరు, నా శరీరం అనే భావన అంటే ప్రాకృతిక స్వభావము కలిగి ఉండటం. నేను ఈ శరీరం కాదు, నేను ఆత్మ స్వరూపుడను అని తెలుసుకోవడమే పరాప్రకృతిని గురించి తెలుసుకోవడం. అలాగే నేను దేవుడిని పూజిస్తున్నాను అంటే నేను వేరు దేవుడు వేరు అని అనుకోవడం సగుణోపాసన. నేను, పరమాత్మ వేరు కాదు, పరమాత్మ నాలో ఆత్మస్వరూపుడుగా ఉన్నాడు. నేను ఆత్మస్వరూపుడను కాని ఈ శరీరం కాదు అని తెలుసుకోవడమే నిర్గుణోపాసన. ఈ రెండింటి గురించి తెలుసుకోవడమే జ్ఞానము. తెలుసుకున్న జ్ఞానమును ఆచరించడమే విజ్ఞానము. ఈ రెండింటి గురించి ఈ అధ్యాయంలో మనం తెలుసుకుందాము.

మనలో భగవంతుని మీద ఆసక్తి కలిగిన మనసు కలవారు, పూర్తిగా పరమాత్మను ఆశ్రయించిన వారు, కనీసం పరమాత్మ గూర్చి తెలుసుకున్న వారు చాలా తక్కువ. భగవంతుని గురించి ఎటువంటి సందేహములు లేకుండా తెలుసుకున్న వారు ఇంకా తక్కువ. కేవలం గర్భగుడిలో ఉండే విగ్రహాలే దేవుళ్లు అని నమ్మేవారు, వాటికి అలంకారాలు చేస్తూ, ఊరేగిస్తూ తృప్తి పడే వాళ్లు కొందరు. యజ్ఞములు, యాగములు, పూజలు, వ్రతాలు చేయడమే భక్తి అని నమ్మే వాళ్లు కొందరు. బాబాలు, స్వామీజీలు మాత్రమే దేవుళ్లు అని నమ్మేవాళ్లు ఎంతో మంది ఉన్నారు. ఇవన్నీ తప్పుకాదు. అన్నీ కావాల్సినవే కానీ ఇవన్నీ ప్రాథమిక విద్యలు. అంటే ఎలిమెంటరీ విద్యలు. వీటి నుండి మానవులు మాధ్యమిక విద్య, తరువాత ఉన్నత విద్య వైపు మళ్లాలి. అంటే సగుణోపాసన నుండి నిర్గుణోపాసనకు మళ్లాలి. అందుకే మొదటి పదంలోనే మయ్యాసక్త మనా: అంటే నా గురించి తెలుసుకోవాలనే ఆసక్తి, కోరిక కలిగి ఉండాలి. తరువాత అభ్యాసము చేసి పరమాత్మ తత్వమును తెలుసుకోవాలి. ఈ తెలుసుకోవడంలో సందేహానికి తావు ఉండకూడదు. ఎటువంటి సందేహమునకు తావు లేకుండా అసలైన భగవత్తత్వముతెలుసుకున్న వారు చాలా తక్కువ. అందుకే భగవంతుని తెలుసుకోడానికి కావలసిన అర్హతలు ఏమిటి అనేవి ముందు చెప్పాడు.

1.భగవంతుని గురించి తెలుసుకోవాలి అనే ఆసక్తి కల మనసును కలిగి ఉండాలి.
2. భగవంతుని గురించి సందేహము లేకుండా తెలుసుకోడానికి తగిన యోగమును అభ్యసించాలి. అంటే ఆత్మసాక్షాత్కారానికి అవసరమైన అన్ని ప్రయత్నములు చేయాలి.
3. పూర్తిగా భగవంతునే ఆశ్రయించాలి.

మానవ ప్రయత్నాలు ఎన్ని చేసినా, భగవంతుని అనుగ్రహం లేనిది అవి సఫలం కావు. కాబట్టి ప్రతిమానవుడు ఆత్మ దర్శనం చేయడానికి తన వంతు ప్రయత్నం చేస్తూ, పరమాత్మ అనుగ్రహంకూడా పొందాలి. దానికి ఒకటే మార్గము. నేను చేస్తున్నాను అనే అహంకారమును పూర్తిగా వదిలిపెట్టి పరమాత్మను ఆశ్రయించడం.

భగవంతుని గురించి తెలుసుకోవడానికి, భగవంతుని మీద ఆసక్తి కలగడానికే మనకు దేవాలయాలు ఆవిర్భవించాయి. వివిధ రకములైన దేవాతారాధనలు ప్రాచుర్యంలోకి వచ్చాయి. పరమాత్మను గురించి తెలుసుకోడానికి పరమాత్మను అర్చించడానికి ఆవిర్భవించిన ఆలయాలను మనం ఆర్భాటాలకు నిలయాలుగా చేసాము. మన గొప్పలు ప్రదర్శించుకోడానికి ఉపయోగించు కుంటున్నాము. ఆలయాలలో ప్రశాంతత, దైవదర్శనం కూడా లభించడం లేదు.

మనకు మనస్సు ప్రధానమైనది అని చెప్పకున్నాము కదా. అది ఒక టార్చిలైట్ వంటిది. దానిని మనం ప్రాపంచిక విషయాల వైపు తిప్పితే కేవలం ప్రపంచంలో ఉన్న విషయాలే కనపడతాయి. దాని వెనక ఉన్న మనం, మనలో ఉన్న ఆత్మ స్వరూపుడుగా ఉన్న పరమాత్మకనపడడు. ఆ టార్చిలైటు మనవైపుకు తిప్పకుంటే మనం, మనలో ఉన్న ఆత్మ స్వరూపం  కనపడుతుంది. ఇదే ఇందులో ఉన్న రహస్యం. మనం అందరం మనసు అనే టార్చిని మన వైపు కు తిప్పకొని పైన చెప్పబడిన మూడు విషయాలు పాటిస్తే పరమాత్మను చేరుకోవచ్చు.

మనస్సుకు ఒక గుణం ఉంది. మనం దేని మీద ఆసక్తి చూపిస్తామో దానిగురించే ఎక్కువగా ఆలోచిస్తుంది. మనం అందరం ఎక్కువగా ప్రాపంచిక విషయాల మీద, అనవసరమైన విషయాల మీద ఎక్కువ ఆసక్తి చూపిస్తాము. మనసు కూడా వాటి గురించి ఎక్కువగా ఆలోచిస్తూ, చింతిస్తూ, విశ్లేషిస్తూ ఉంటుంది. పండితులు, విజ్ఞులు అయినవాళ్లు ఎల్లప్పడూ భగవంతుని మీద ఆసక్తి కలిగి ఉంటారు. అటువంటి వాళ్ల మనసుకూడా భగవంతుని పూజిస్తూ, కీర్తిస్తూ, భజిస్తూ, ధ్యానిస్తూ ఉండడంమీద ఆసక్తి చూపిస్తుంది.  అందుకనే ఈ శ్లోకాన్ని మయ్యాసక్త మనా: పార్థ అని మొదలు పెట్టాడు.

మయ్యాసక్త మనా: పార్థ! అంటే ఓ అర్జునా! నా యందు ఆసక్తి కలిగి ఉన్న మనసు కలవారు,  యోగం యుఞ్జన్ యోగమును అంటే ధ్యానయోగమును అభ్యాసం చేస్తూ, మదాశ్రయ: నన్నే ఆశ్రయించుకొని ఉంటారు. కాబట్టి ఇక్కడ ధ్యానము, భగవంతుని మీద ఆసక్తి, భక్తి  అవసరము అని చెప్పాడు పరమాత్మ. అటువంటి వారు అసంశయం అంటే ఎటువంటి సందేహము లేకుండా, సమగ్రం  అంటే పూర్తిగా, మాం యథా జ్ఞాస్యసి ఎలాగైతే నన్ను తెలుసుకుంటారో, దానిని గురించి తచ్ఛృణు వివరంగా చెబుతాను శ్రద్ధగా విను.

కాబట్టి భగవంతుని తెలుసుకోవాలంటే భగవంతుని మీద ఆసక్తి కలిగి ఉండాలి, భగవంతుని ఆశ్రయించాలి అంటే నీవే తప్ప నిత: పరం బెరుగ అని పూర్తిగా సరెండర్ అవ్వాలి. భగవంతుని ధ్యానయోగంతో ధ్యానం చేస్తూ మనసును ఆత్మలో నిలపాలి. ఈ మూడు చేస్తే ఆత్మదర్శనం కలుగుతుంది. భగవంతుడు ఎక్కడో లేడు, మనలోనే ఉన్నాడు అనే జ్ఞానం కలుగుతుంది.

## 2. జ్ఞానం తే2హం సవిజ్ఞానమిదం వక్ష్యామ్యశేషత:।
## యజ్ఞాత్వా నేహ భూయో2న్యజ్ఞాతవ్య వమశిష్యతే॥

ఈ అనంత విశ్వంలో ఏది తెలుసుకుంటే ఇంక తెలుసుకోవలసినది అంటూ ఏమీ ఉండదో, అట్టి విజ్ఞానమును సంపూర్ణంగా ఏ మాత్రం మిగలకుండా, నేను నీకు బోధిస్తాను.

ప్రపంచంలో తెలుసుకోవలసిన విషయాలు కోకొల్లలుగా ఉన్నాయి. కొంత మంది తమకు అన్నీ తెలుసు అనుకుంటారు. అది వారి అజ్ఞానము. ఎంత తెలుసుకున్నా ఇంకా తెలుసుకోవలసినది ఎంతో ఉంటుంది. కాని భగవంతుని గూర్చి తెలుసుకుంటే, ఇంక తెలుసుకోవలసినది ఏమీ మిగలదు అని పరమాత్మ ఇక్కడ స్పష్టం చేస్తున్నాడు. దేనిని తెలుసుకుంటే సమస్తము తెలుసుకున్నట్టు అవుతుందో, ఏదైతే సకల శాస్త్రముల సారమో, అట్టి ఆత్మ తత్వము తెలుసుకుంటే చాలు. ఇంక తెలుసుకోవలసింది ఏమీ ఉండదు.

చెట్టుకు నీళ్లు పొయ్యాలంటే చెట్టు మొదటనీరు పోస్తే చిట్ట చివరి రెమ్మకు కూడా ఆ నీరు అందుతుంది. అంతే కానీ చెట్టు ఎక్కి అన్ని కొమ్మలను రెమ్మలను తడపనక్కరలేదు. అలాగే ఆత్మతత్వము తెలుసుకుంటే, సమస్తము తెలుసుకున్నట్టే. ఎందుకంటే మానవుని ఆయుష్షు నూరు సంవత్సరాలు అనుకుంటే అందులో సగం నిద్రలోనే పోతుంది. మిగిలింది 50 ఏళ్లు. అందులో ఉదర పోషణం కోసరం 30 ఏళ్లు కాలం గడిచిపోతుంది. ఇతక వ్యాపకాలలో మరోపదేళ్లు కాలం. మిగిలించి పదేళ్లు. ఈ పదేళ్లలో ఎన్ని శాస్త్రములు గ్రందాలు చదువుతాడు ఎంత జ్ఞానం వస్తుంది. కాబట్టి ధ్యానయోగం చేస్తే ఆత్మ తత్వము అర్థం అవుతుంది. ఆత్మ తత్వము అర్థం అయితే సమస్తశాస్త్రజ్ఞానము కలిగినట్టే అని పరమాత్మ ఇక్కడ స్పష్టం చేసాడు.

ఇదమ్ సవిజ్ఞానమ్.... అటువంటి అనుభవ సహితమైన జ్ఞానమును
అశేషత: అంటే పూర్తిగా శేషం లేకుండా, ఇంకా తెలుసుకోవలసినది ఏమీ మిగలకుండా,
తే నీకు
వక్ష్యామి= నీకు చెబుతాను.

ఈ శ్లోకంలో జ్ఞానం, విజ్ఞానం అనే రెండు పదాలు చెప్పబడ్డాయి. జ్ఞానం అంటే వేదములు, శాస్త్రములు చదివినందువలన కలిగే జ్ఞానము., గురుముఖతా నేర్చుకున్న జ్ఞానము అంటే సగుణ ప్రధానమైనది. అంటే నేను వేరు దేవుడు వేరు అనే భావన. నేను దేవాలయానికి వెళ్లి దేవుడిని పూజిస్తున్నాను అనే భావన. అంటే భేద భావన. విజ్ఞానం అంటే పరమాత్మ గురించిన అనుభవజ్ఞానము. అంటే నిర్గుణ ప్రధానము. నేనే ఆత్మస్వరూపుడను అనే స్థితి. దేవుడు ఎక్కడో లేడు. నాలోనే ఉన్నాడు. ఆత్మస్వరూపుడుగా ఉన్నాడు. అనే భావన. దీనినే అభేద భావన. నాకు పరమాత్మకు భేదం లేదు అనే భావన. పరమాత్మను ఎలా తెలుసుకోవాలి, దు:ఖము ఎలా పోగొట్టుకోవాలి, పరమ శాంతి, సుఖము ఎలా కలుగుతాయి, ఇవన్నీ ఏం చేస్తే సాధ్యం అవుతాయి అనే విషయాలు విజ్ఞాన సంబంధమైనవి. ఓ అర్జునా! ఈ విషయాలన్నీ నీకు అశేషత: అంటే ఏమీ మిగల్చకుండా చెబుతాను. అన్ని విషయాలు కూలంకషంగా చెబుతాను. అని అంటున్నాడు కృష్ణుడు.

ఇప్పుడు మనకో సందేహం రావచ్చు. మరి ఇవన్నీ తెలుసుకుంటే నాకేం లాభం అని మీరు అనుకోవచ్చు. జీవుడు తరించాలంటే జ్ఞానము విజ్ఞానము రెండూకావాలి. వాటి వలన ఆధ్యాత్మిక జ్ఞానము వస్తుంది. ఆధ్యాత్మిక జ్ఞానము వలన పరమాత్మను తెలుసుకోవచ్చు. పరమాత్మను తెలుసుకుంటే సమస్తము తెలుస్తాయి అంటే మనం చదువుకొనే ఫిజిక్సు కెమిస్ట్రీ అన్నీ తెలుస్తాయి అని కాదు. అవన్నీ ప్రాపంచిక విషయాలు. ఉదరపోషణార్థం, ధనసంపాదన కొరకు నేర్చుకునేవి. కాని ఆత్మజ్ఞానము తెలుసుకుంటే ఇక ఆధ్యాత్మికరంగంలో తెలుసుకోవలసింది అంటూ ఏమీ మిగలదు. అన్నిటిలో పరమాత్మను చూస్తాడు. సమత్వం సిద్ధిస్తుంది. భేదబుద్ధినశిస్తుంది. అని అర్థం. అటువంటి జ్ఞాన, విజ్ఞానములు కలిగిన వారు చాలా అరుదు.

### 3. మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే।
### యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వత:॥

అనేక వేల మంది మనుష్యులలో ఒక్కడు మాత్రమే మోక్షసిద్ధి కొరకు ప్రయత్నం చేస్తున్నాడు. అటువంటి సాధకులలో ఒకే ఒక్కడు మాత్రమే నా గురించి అంటే ఆత్మతత్త్వమును గురించి తెలుసుకోగలుగుతున్నాడు.

మానవ లోకంలో ఎంతో మంది మానవులు ఉన్నారు. వారిలో వేలలో ఒకడు మోక్షము కావాలి అని కోరుకుంటాడు. దాని కొరకు ప్రయత్నం చేస్తాడు. ఆ ప్రయత్నం చేసిన వారిలో ఒకానొకడు మాత్రమే మోక్షమును పొందుతున్నాడు. సాధారణ మానవులలో నూటికి తొంభైతొమ్మిది మంది ప్రాపంచికసుఖముల గురించి పాకులాడే వారే. అప్పుడప్పుడు దేవాలయాలకు వెళుతూ తమకూ

భక్తి ఉందని అందరూ అనుకోవాలని తాపత్రయపడుతుంటారు. దేవాలయాలకు వెళ్లినా, పూజలు, అలంకారాల దగ్గరే ఆగిపోతున్నారు.

(తిరుమలలో స్వామి వారి ఆర్జితసేవల టిక్కట్లను బ్లాకులో అమ్ముతున్నారు అన్న వార్త మనం చూచాము. మేము అంతంత ఖరీదు పెట్టి దేవుడికి సేవలు చేయించాము అని గొప్పలు చెప్పుకోడానికే ప్రాధాన్యత ఇస్తున్నారు కాని భగవంతుని మీద భక్తితో కాదు.)

మనం దర్శించే దేవుడి విగ్రహంలో పరమాత్మను దర్శించే వాళ్లు అరుదుగా ఉంటారు. కొంత మంది మరి కొంచెం ముందుకెళ్లి శివ కేశవులకు మధ్య అంటే దేవుళ్ల మధ్య భేదభావం కల్పిస్తున్నారు. ఇవన్నీ మనలో ఉన్న అజ్ఞానాన్ని తెలియజేస్తాయి. ఇంకా కొందరు ఉంటారు. భక్తికి అప్పుడే ఏం తొందర. రిటైర్ మెంట్ తరువాత చూసుకోవచ్చు అని అనుకుంటారు. రిటైర్ మెంట్ తరువాత సర్వీసు పొడిగించుకునేవాళ్లు కొందరయితే, మరి కొందరు ఓపిక ఉంది కదా అని సంపాదన కోసం మరొక ఉద్యోగంలో చేరుతారు. ఏమీ లేకపోతే ఇంట్లోకూర్చుంటారు. అలాకూర్చున్నవాళ్లకు, ఇంట్లో ఉన్న వాళ్లు అన్ని రకాల పనులు అప్పచెబుతారు. కనీసం అందరూ బయటకు వెళితే ఇంటికి కాపలాగా ఉండమంటారు. వాటితోనే జీవితం సరిపోతుంది. కాబట్టి రిటైర్ మెంటు తరువాత, 60 ఏళ్లతరువాత పరమాత్మ గురించిఆలోచిద్దాము అన్న భావన సరికాదు.

కొంత మందికి ఏదో చెయ్యాలని ఉంటుంది కానీ సరి అయిన మార్గం చూపే గురువు దొరకడు. దొరికిన గురువు పాదపూజలుచేయించుకుంటాడు కానీ ఆత్మదర్శనం కలిగే మార్గం చూపించడు. మరి కొంత మందికి మంచి గురువు దొరుకుతాడు. కానీ ఆ గురువు చెప్పేది వీళ్లు పాటించరు. అంటే గురువు మీద, తాను చేసే పని మీద శ్రద్ధ, నమ్మకం ఉండదు. ఏదో షార్టుకట్‌లో ఆత్మదర్శనం కలిగే మార్గం కొరకు వెతుకుతుంటారు. వేలలో ఒకడు మాత్రమే మంచిగురువు దగ్గర జ్ఞానం పొంది, ఆత్మదర్శనం కొరకు ప్రయత్నం చేస్తాడు. వారిలో ఎవరో ఒకరు మాత్రమే పరమాత్మను గురించి తెలుసుకోగలుగుతారు.

అందరిలో పరమాత్మ ఆత్మస్వరూపుడుగా ఉన్నాడు అని తెలుసుకోవడమే జ్ఞానము. ఆ జ్ఞానము కొంతమందిలోనే ఉంటుంది. ఆ జ్ఞానము కల వారిలో వేలలో ఒకడు మాత్రమే మోక్షము పొందడానికి ప్రయత్నం చేస్తాడు. ఆ ప్రకారంగా మోక్షము కొరకు ప్రయత్నించే వారిలో వేలలో ఒకడు మాత్రము పరమాత్మ గురించిన పూర్తి జ్ఞానము కలిగి ఉంటాడు. మోక్షమునకు అర్హుడవుతాడు.

అదీ కాకుండా, పూర్వజన్మ సంస్కారము ఉంటేనే భగవంతుని గురించి చింతన చేయాలి అనే ఆసక్తి కలుగుతుంది. అటువంటి ఆసక్తి ఉన్నవారిలో ముక్తిని కోరేవారు వేలలో ఒకడు. వారిలో కూడా ఒకానొకడు మాత్రమే ముక్తి పొందుతాడు. ఇది అంతా జరగాలంటే ప్రయత్నము,

సత్సంకల్పము, పట్టుదల, ప్రాపంచిక సుఖములు వదిలిపెట్టడం, ఏకాగ్రత,ఇంద్రియ నిగ్రహము మనో నిగ్రహము, ధ్యానము, సమాధి ఇన్ని దాటుకొని చేరుకోవాలంటే కష్టమే. కాని అభ్యాసం చేస్తే తప్పక జరుగుతుంది. అని పరమాత్మ చెబుతున్నాడు.

## 4. భూమిరాపో2నలో వాయు: ఖం మనో బుద్ధిరేవచ। అహంకార ఇతియం మే భిన్నా ప్రకృతిరష్టధా॥

భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారము అని ప్రకృతి ఎనిమిది విధాలుగా విభజింపబడింది.

ఈ శ్లోకంలో  పరమాత్మ తత్వం గురించి, ప్రకృతి అంటే ఏమిటి అనే విషయం గురించి వివరింపబడింది. పరమాత్మ అంటే ఎవరు? ఎక్కడ ఉంటాడు? గర్భగుడిలో ఉంటాడా? పుణ్యక్షేత్రాలలో మాత్రమే ఉంటాడా? కైలాసమా? వైకుంఠమా! ఎక్కడుంటాడు. ఈ విషయాలు అన్నీ ఉపనిషత్తులలో చెప్పబడ్డాయి. అన్ని ఉపనిషత్తులలో ఒకటే విషయం చెప్పబడింది. ఈ అనంత విశ్వం అంతటికీ కారకుడు పరమాత్మ. ఈ అనంతవిశ్వంలో ఉన్న ప్రతి వస్తువుకు రెండు కారణాలు ఉంటాయి. ఉదాహరణకు మట్టి, కుండ. కుండకు కారణం మట్టి(మెటీరియల్). కాబట్టి మట్టి ఉపాదాన కారణము. మట్టి కుండగా తయారవ్వాలంటే దానంతట అది తయారు కాదు. అది తయారు చేయడానికి కొంత తెలివి, శక్తి, నేర్పు కావాలి. దానినే నిమిత్త కారణం అంటారు.

అలాగే ఈ అనంత విశ్వానికి కూడా రెండు కారణాలు ఉన్నాయి అని చెప్పవచ్చు. ఈ అనంత విశ్వం పంచభూతములతో తయారయింది. అంటే ఈ అనంత విశ్వంలో ఆకాశము, గాలి, అగ్ని, నీరు, భూమి. ఈ ఐదింటితో తయారయింది. వీటిని ఉపాదాన కారణాలు అనుకుంటే వీటిని తయారుచేయడానికి ఒక శక్తి, నేర్పు అంటే నిమిత్త కారణం ఒకటి ఉండాలి. ఆ నిమిత్త కారణమే ఈశ్వరుడు,పరమాత్మ,భగవంతుడు, మీ ఇష్టం ఏదైనా అనుకోవచ్చు.

ఇక్కడ మనకు ఒక సందేహం వస్తుంది. కుమ్మరి ముందు మట్టిని, సారెను సమకూర్చుకున్నట్టు భగవంతుడు ఈ పంచభూతాలనుఎక్కడి నుండి తెచ్చుకున్నాడు అని మనం అనుకోవచ్చు. ఈ పంచభూతాలు ఎక్కడి నుండో రాలేదు. ఆయనలోనుండే వచ్చాయి. దీనికి ఉదాహరణ మన ఇంట్లో గూడుకట్టుకునే సాలీడు. సాలెపురుగు తన లాలాజలంతో దారాలు అల్లి గూడు కట్టుకుంటుంది.మరలా ఆ లాలాజలాన్ని తనలోకి లాక్కుంటుంది. ఆ గూడు సాలీడులోకి వెళ్లిపోతుంది. అలాగే ఈ అనంత విశ్వం నిరాకారుడు అయిన పరమాత్మ లోనుండి వచ్చింది. మరలా ఆయనలో లీనం అవుతుంది.   అదే మహా ప్రళయము. అప్పుడుపరమాత్మ ఒక్కడే ఉంటాడు.

నిజానికి పరమాత్మ, ప్రకృతి రెండూ ఒకటే. ఎందుకంటే పరమాత్మలోనుండి ప్రకృతి ఆవిర్భవించింది. మరలా ఈ ప్రకృతి పరమాత్మలో లీనం అవుతుంది.

(ఈనాటి శాస్త్రవిజ్ఞానం ప్రకారం మొట్టమొదట ఏమీ లేదు. శూన్యము. ఆ శూన్యములో నుండి ఒక పెద్ద విస్ఫోటం. అదే బిగ్ బాంగ్. అందులో నుండి అనంత విశ్వం ఆవిర్భవించింది. బిగ్ బాంగ్ ఎక్కడినుండి పుట్టిందో అదే ఈశ్వరుడు, పరమాత్మ, నిరాకారుడు. మరలా ఈ విశ్వం అంతా ఆయనలోకి చేరుతుంది. అప్పుడు పరమాత్మ ఒక్కడే ఉంటాడు.)

పంచభూతములతో ఏర్పడిన ఈ అనంత విశ్వం, దీనిని సృష్టించిన పరమాత్మ ఈ ఇద్దరి గురించి ఇప్పుడు మనము తెలుసుకుందాము. ఈశ్వరుడు ఒకడే. అతడే సత్యము అని తెలుసుకున్నాము కదా. అద్వైతుడుగా ఉన్న ఈశ్వరుడు రెండు అయ్యాడు. దానినే పరాప్రకృతి, అపరా ప్రకృతి అని పిలుస్తాము. పరాప్రకృతి అంటే ఈశ్వరుడు. అపరా ప్రకృతి అంటే ఆ ఈశ్వరుడి లోనుండి వచ్చిన పంచభూతాత్మకము అయిన ఈ అనంత విశ్వము. దీనినే మనము అర్థనారీశ్వర తత్వము అని పిలుచుకుంటాము. ఈశ్వరుడు పరమాత్మ అయితే అంబ ప్రకృతి. నిజానికి ఇద్దరూ ఒకరే. కాని మనకు రెండుగా కనపడుతున్నారు.

మొట్ట మొదట ఒకటిగా ఉన్న పరమాత్మ రెండుగా అయ్యాడు. ఆ రెండింటి పేర్లు పరాప్రకృతి. అపరా ప్రకృతి.

పరా ప్రకృతి, అపరాప్రకృతి... వీటి గురించి వివరిస్తున్నాడు కృష్ణుడు. పరాప్రకృతి చైతన్య వంతమైనది. దానికి ఎటువంటి గుణములు లేవు. గుణరహితము. నిర్గుణము. ఇది ఎటువంటి మార్పుచెందదు అంటే నిర్వికారమైనది. స్వతంత్రమైనది. దేని మీదా ఆదారపడనిది. నిత్యము, సత్యము. అందుకే బ్రహ్మసత్యం జగన్మిథ్య అన్నారు.

అపరా ప్రకృతి అచేతనము, జడము. దీనికి గుణములు ఉన్నాయి. సగుణాత్మకము. వికారములు కలిగినది అంటే నిరంతరం మార్పుచెందుతూ ఉంటుంది. దీనికి స్వతంత్రత లేదు మరొక దాని మీద ఆధారపడి ఉంటుంది. మిథ్యఅంటే లేదు అని కాదు అర్థం. ఇప్పుడు ఉన్న స్థితిలో మరుక్షణం ఉండదు. నిరంతరం మార్పుచెందుతూ ఉంటుంది అని అర్థం.

పరాప్రకృతి, సత్యము, నిరాకార, నిర్గుణ మైన విశ్వచైతన్యము అయితే అపరా ప్రకృతి అంటే ఏమిటి ? అవి ఏవి? అనే విషయం చెబుతున్నాడు కృష్ణుడు. అపరాప్రకృతి తనకు తానుగా ఎనిమిది విధాలుగా విభజించుకుంది. అవే.....భూమి, ఆకాశము, అగ్ని, వాయువు, నీరు ఇవి ఐదు పంచభూతములు. ఇవి మొట్ట మొదట సూక్ష్మరూపంలో తత్వాలుగా ఉన్నాయి. ఆకాశ తత్వం,

వాయుతత్వం, జలతత్వము, అగ్నితత్వము, భూమి తత్వము. ఈ తత్వాలు ఒక్కసారిగా ఆవిర్భవించలేదు. ఒకదానిలో నుండి మరొకటి వచ్చాయి. ఆకాశం నుండి వాయువు, వాయువు నుండి అగ్ని, అగ్ని నుండి జలము, జలము నుండి భూమి. ఇలాగా ఒక దానిలో నుండి మరొకటి ఉద్భవించాయి. మనసు, బుద్ధి, అహంకారము కూడా సూక్ష్మ తత్వాలే. ఈ సూక్ష్మతత్వాలు పరిణామ క్రమంలో స్థూల రూపాలు సంతరించుకున్నాయి. ఒక్క ఆకాశం, అందులో నుండి వచ్చిన వాయువు తప్ప మిగిలిన మూడు తత్వాలు కంటికి కనిపించే రూపాలు సంతరించుకున్నాయి. ఇవి కాక మరో మూడు తత్వాలు ఉన్నాయి. మనస్సు, బుద్ధి అహంకారము. ఈ మూడు సూక్ష్మ తత్వాలు. కంటికి కనిపించవు. ఈ విధంగా అపరా ప్రకృతి ఎనిమిది విధాలుగా ప్రకటింపబడింది.

## 5. అపరేయమితస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్।
## జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్॥

అర్జునా! ఈ ఎనిమిది విధములైన అపరమైన ప్రకృతి కంటే భిన్నమైనది,నీ సమస్త విశ్వమును తనలో ధరించి ఉన్నది, సమస్త ప్రాణికోటిలో జీవంగా వెలుగుతున్నది అయిన మరొక ప్రకృతి ఉన్నది. అది నా యొక్క ప్రకృతి. ఈ ప్రకృతిని, పైన చెప్పబడిన ఎనిమిది విధములైన అపరా ప్రకృతి కంటే మేలైనదిగా తెలుసుకో.

ఈ శ్లోకంలో పరమాత్మ, భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, మనోబుద్ధి అహంకారాలు ఈ ఎనిమిదితో కూడినది అపరా ప్రకృతి అనీ, వీటన్నిటి కంటే భిన్న మైనది, శ్రేష్టమైనది, పరమైనది అయిన పరమాత్మ ప్రకృతి మరొకటి ఉంది, దానినే పరా ప్రకృతి అనీ తెలుసుకో మంటున్నాడు. ఈ పరాప్రకృతి ఈ జగత్తుకు ఆధారంగా ఉంటూ ఉంది. ఈ జగత్తును చైతన్యవంతం చేస్తూ ఉంది. ఈ జగత్తులో ఉండే జీవరాసులు అన్నిటిలో జీవరూపంగా ఉంది. అందుకే ఈ పరాప్రకృతి అపరాప్రకృతి కంటే శ్రేష్టమైనది అని పరమాత్మ చెప్పాడు.

అపరా ప్రకృతి అంటే పంచభూతాలు, మనో,బుద్ధి,అహంకారాలు. ఇవి నిరంతరం మార్పు చెందుతుంటాయి. మార్పు వీటి సహజ లక్షణము. కాని ఈ ఎనిమిది ఇలా నిరంతరం మార్పుచెందుతున్నాయి అని తెలుసుకునేది వేరొకటి ఉండాలి కదా. అప్పుడే కదా ఇవి మార్పుచెందుతున్నాయి అని తెలిసేది. పైగా అది మార్పు లేనిది, మార్పు చెందనిది అయి ఉండాలి. దానినే పరాప్రకృతి అని అంటారు. పరా ప్రకృతి అంటే సకల జీవరాసులలో వెలుగుతున్న ఆత్మస్వరూపము. ఈ పరాప్రకృతి, అపరా ప్రకృతి కంటే భిన్నమైనది, బలమైనది, శ్రేష్టమైనది, మార్పుచెందనిది. కనిపించే ఈ అపరా ప్రకృతి కన్నా ఈ పరాప్రకృతి గొప్పది అని తెలుసుకో.

సులభంగా చెప్పాలంటే నేను పరాప్రకృతి. పంచ భూతాత్మకము అయిన నా శరీరము, నా మనస్సు, నా బుద్ధి, నాలోఉన్న అహంకారము అన్నీ అపరా ప్రకృతి. సాధారణంగా మనం అందరం "నా శరీరము, నా మనస్సు, నా బుద్ధి" అని వాడుతూ ఉంటాము. "నా మనస్సు చికాకుగా ఉంది. నా బుద్ధి పనిచేయడం లేదు. నా శరీరం నా మాట వినడం లేదు" అని అంటూ ఉంటాము. అంటే నీవు వేరు, నీ మనో బుద్ధి అహంకారాలతో కూడిన శరీరం వేరు. నీ మనసు నీ మాట వినండలేదు, నీ శరీరం నలతగా ఉంది అనే విషయం తెలుసుకునే వాడు వేరొకడు ఉన్నాడు. ఆ "నేను" అనే తత్వమే పరాప్రకృతి. దీనికి కాలము, రూపము లేదు. నీవు 10 ఏళ్లప్పుడు ఈ "నేను" అనే తత్వము ఉంది. నీవు 40 ఏళ్లప్పుడు ఉంది. 70 ఏళ్లప్పుడు ఉంది. వయసు వచ్చేకొద్దీ కాలాను గుణంగా నీ శరీరం మార్పుచెందిందే కానీ, నీలో ఉన్న "నేను" అనే తత్వము మార్పుచెందలేదు. ఈ విషయం మనందరికీ తెలుసు. కానీ మనం దానిని అంగీకరించము.

చిన్న ఉదాహరణగా చెప్పుకోవాలంటే ఒక కుండ ఉంది. అందులో నీరు ఉంది. ఆ నీటిలో సూర్యుడు ప్రతిఫలిస్తున్నాడు. ఇప్పుడు కుండ దేహము. అందులో ఉన్న జలము మనస్సు. అందులో ప్రతిఫలించే సూర్యుడు ఆత్మ. ఆకాశంలో వెలిగే సూర్యుడు పరమాత్మ. కుండ, నీరు, అపరాప్రకృతి. అందులో ప్రతిఫలించే సూర్యబింబము పరాప్రకృతి అయితే ఆకాశంలో వెలిగే సూర్యుడు, పురుషుడు, భగవానుడు, పరమాత్మ. సూర్యుడు ఎలాగైతే కుండలో ఉన్న నీటితో సంయోగం చెంది ప్రతిఫలిస్తున్నాడో, అలాగే పరమఆత్మ కూడా ఈ దేహములో ఆత్మస్వరూపంగా చేరి, మనసుతో కూడి, ప్రాపంచిక విషయములలో సూర్య బింబము ప్రతిఫలించినట్టు తేలియాడుతూ ఉంది. నీరు కదిలినపుడు సూర్యబింబము కూడా కదులుతూ ఉంది. కుండను ఆడించినపుడు నీరు, అందులో ఉన్న సూర్యబింబము తదనుగుణంగా ఆడుతూ ఉంది. కాని ఈ కదలికలు సూర్యునివి కావు. కేవలం జలం కదులుతుంటే అందులో ఉన్న ప్రతిబింబం కదులుతున్నట్టు మనకు అనిపిస్తూఉంది. అది మన భ్రమ. ఆభాస. కాని బింబం నిజంగా కదలడం లేదు. ఎందుకంటే జలం నిశ్చలంగా ఉంటే సూర్య ప్రతి బింబం కూడానిశ్చలంగా ఉంటుంది. అలాగే మన మనసు ఎటువంటి వికారాలు లేకుండా నిశ్చలంగా ఉంటే మనకు నిశ్చలము, నిర్వికారము అయిన ఆత్మదర్శనం కలుగుతుంది. కాబట్టి మోక్షము కోరువాడు ఈ రెండు ప్రకృతులను దాటి ఆత్మస్వరూపుడైన పరమాత్మ కొరకు ప్రయత్నం చేయాలి.

6. ఏతద్యోనీని భూతాని సర్వాణీత్యుపధారయ।
అహం కృత్స్నస్య జగత: ప్రభవ: ప్రలయస్తథా॥

ఈ చర అచర జగత్తు అంటా ఈ పరాప్రకృతి, అపరా ప్రకృతితో కూడి ఉన్నాయి అని తెలుసుకో. ఈ చరాచర జగత్తు ఉత్పత్తి కావడానికి కారణం నేనే. అదే ప్రకారంగా ఈ చరాచర జగత్తు యొక్క ప్రళయానికి కూడా కారణం నేనే.

ఇది వరకు చెప్పిన సూక్ష్మరూపంలో ఉన్న పంచభూతాలు పరిణామ క్రమంలో స్థూల రూపం ధరించాయి. అవే మనం చూచే ప్రకృతిలో ఉన్న కదలనివి, కదిలేవి అనే పదార్థాలు. వాటినే జడములు, చేతనములు అని అంటారు. ఈ జడ,చేతనములు అన్నిటికీ పరా ప్రకృతి, అపరా ప్రకృతి కారణము. అంటే పరమాత్మ తాను రెండుగా విడిపోయాడు. అవే పరా ప్రకృతి, అపరా ప్రకృతి. ఈ రెండు ప్రకృతులే ఈ సృష్టికి కారణము. అంటే ఈ సృష్టికి కారణ భూతుడు పరమాత్మ. సమస్త జీవ జాతులు ఆ పరమాత్మ నుండి ఉద్భవించాయి. అలాగే ఈ సృష్టిని అంతమొందించేదీ పరమాత్మ. బ్రహ్మగా సృష్టించి, విష్ణువుగా పోషించి, శివుడుగా లయం చేస్తున్నాడు. పుట్టడం చావడం..... ఈ మధ్య కాలంలో జీవజాతులు అన్నీ ప్రకృతిలో ఆడుకుంటున్నారు. సముద్రంలో అలలు ఉవ్వెత్తున ఎగిసి పడుతుంటాయి. ఒక అల చాలా ఎత్తుగా లేస్తుంది. మరొకటి చిన్నగా ఉంటుంది. ఆ అలలు కాసేపు ఉంటాయి. మరలా సముద్రంలో కలిసి పోతాయి. మరలా ఉవ్వెత్తున లేస్తాయి. కొంతసేపు ఉంటాయి. మరలా సముద్రంలో లీనం అవుతాయి. అలాగే జీవజాతులు కూడా పుడతాయి, కొంతకాలం జీవిస్తాయి, మరలా లయం అవుతాయి. ఇదే జీవన నాటకము. ఈ నాటకానికి సూత్రధారి పరమాత్మ.

7. మత్త: పరతరం నాన్యత్కించిదస్తి ధనంజయ।
మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ॥

నాకంటే (అంటే పరమాత్మ కంటే) ఇతరమైనది, శ్రేష్ఠమైనది మరొకటి లేదు. దారము మణులన్నిటినీ కూర్చి, ఒక హారంగా చేసినట్లు, ఈ సమస్త జగత్తు నా చేత ఒక హారంగా కూర్చబడినది.

ఈ చరాచర జగత్తు అంతా పరమాత్మ నిండి ఉన్నాడు. ఆయన లేని చోటు లేదు. కాబట్టి పరమాత్మ ఎక్కడ ఉన్నాడు అనే ప్రశ్న లేదు. ఎక్కడ లేడు అనే సమాధానము వస్తుంది. మట్టి నుండి కుండ వచ్చింది. మట్టి ఎక్కడ ఉంది అంటే కుండ అంతటా మట్టి ఉంది. కాని

మనకు కనపడేది కుండ మాత్రమే. అలాగే బంగారు ఆభరణంలో అంతటా బంగారం ఉంది కాని మనకు అది ఒక ఆభరణం రూపంలో కనపడుతూ ఉంది. బంగారం తీసేస్తే ఆభరణం లేదు. మట్టి లేకపోతే కుండ లేదు. అలాగే ఈ జగత్తు అంతా పరమాత్మ అంతర్లీనంగా వ్యాపించి ఉన్నాడు. కంటికి కనిపించని పరమాత్మ లేకపోతే ఈ మన కంటికి కనిపించే ఈ జగత్తు లేదు. దానికి ఒక మంచి ఉదాహరణ చెప్పాడు పరమాత్మ.

మణులతో కూర్చిన మాలలో కనపడకుండా దారం ఉంటుంది. అలాగే పూలమాలలో కూడా కనపడకుండా దారం ఉంటుంది. మణులు, పూలు బయటకు కనపడుతుంటాయి. వాటిని అన్నిటినీ కూర్చి ఒకటిగా చేసిన దారం బయటకు కనపడదు. అలాగే ఈ సృష్టికి మూలకారణమైన పరమాత్మ ఎవరికీ కనిపించడు. దారం లేకపోతే మణులు కానీ పూలు కానీ నిలువవు. ఎన్ని రకాల మణులు ఉన్నా, ఎన్నిరకాల పూలు ఉన్నా అందులో ఉండే దారం ఒక్కటే.ఆ దారమే మణులకు, పూలకు ఆధారము. అలాగే జీవులలో ఆత్మ స్వరూపుడుగా ఉండే పరమాత్మ ఒక్కడే. భేదభావము మనం కల్పించుకుంటున్నాము. పూలలో దారం లేకపోతే పూలు నిలువవు, అలాగే మణిమాలలో దారం లేకపోతే మణిమాల నిలువదు అని తెలుసుకోవడమే ఆత్మజ్ఞానము. ఆ దృష్టితో అంటే జ్ఞానదృష్టితో చూస్తేనే పరమాత్మ ఉనికి మనకు గోచరిస్తుంది కానీ మామూలు కళ్లకు కనపడదు.

కాని కొందరు మానవులు దేవుడు ఏడీ! ఉంటే మాకు ఎందుకు కనిపించడు కాబట్టి దేవుడు లేడు అని వితండంగా వాదిస్తుంటారు. పూలలో దారం లేదు అని అంటే వాడిని పిచ్చివాడంటారు కానీ దేవుడు లేడు అనే వాడు గొప్పవాడు, శాస్త్రవేత్త. ఇదే మన అజ్ఞానం. కాబట్టి పరమాత్మ ఈ అనంత విశ్వం అంతా చైతన్యరూపంలో ఆవరించి ఉన్నా, మన కంటికి కనిపించడు కాబట్టి దేవుడు లేడు అనడం అజ్ఞానం.

ఈనాటి సైన్సు ప్రకారం ఈ సృష్టిలో ప్రతి వస్తువూ అనేకానేక పరమాణువులతో ఏర్పడింది. ప్రతి పరమాణువులో ప్రోటాన్లు, న్యూట్రాన్లు ఎలక్ట్రాన్లు ఒకదాని చుట్టు ఒకటి తిరుగుతుంటాయి. నిరంతరం చలిస్తుంటాయి. కాబట్టి జడ పదార్థాలలో కూడా చైతన్యం ఉంది అని నేటి శాస్త్రజ్ఞులు నిరూపించారు. పరమాణువులు మనకు కనిపించడం లేదు కాబట్టి అవి లేవు అనలేము కదా!

పరమాణు స్వరూపాన్ని కనిపెట్టడానికి ప్రత్యేక సాధనాలు ఎలా అవసరమో అలాగే మణిమాలలో దారంలా ఉన్న పరమాత్మను చూడటానికి జ్ఞానదృష్టి అవసరము. ఎందుకంటే మన కళ్లతో చూడటం అంటే మనకంటి చూపు పరిమితం. కొంత వరకే వెళుతుంది. 40 ఏళ్లుదాటితే కళ్లజోడు లేకుండా మామూలు వస్తువులనే మనము చూడలేము. మైక్రోస్కోప్ సాయం లేకుండా సూక్ష్మపదార్థాలను మనం చూడలేము. అటువంటిది పరమాత్మను ఎలా చూడగలము. దానికి

అంతర్ దృష్టి అవసరము. కేవలం కళ్లతో చూచి నమ్మేవాడు అధముడు. చూచిన దానిని మానసిక దృష్టితో విశ్లేషించి తెలుసుకొనేవాడు మధ్యముడు. జ్ఞాన దృష్టితో చూచేవాడు ఉత్తముడు. దేహము, మనస్సు, బుద్ధి అన్నీ జడములు. ఆత్మ ఒక్కటే చైతన్య స్వరూపము. చైతన్యం లేక పోతే దేహము అందులో ఉన్న మనస్సు బుద్ధి పనిచేయవు.

ఈ సందర్భంలో జగద్గురువు శంకరాచార్యుల వారి ఆత్మబోధ లో ఒక శ్లోకం మనం చదువుకుందాము

సర్వగం సచ్చిదానందం జ్ఞానచక్షుర్నిరీక్షతే
అజ్ఞానచక్షుర్నేక్షేత భాస్వన్తం భానుమన్ధవత్

సర్వవ్యాపకుడుఅయిన పరమాత్మను జ్ఞాన నేత్రముతోనే దర్శించాలి. సూర్యుని గుడ్డివాడు చూడలేడు. అలాగే అజ్ఞాని పరమాత్మను చూడలేడు. అందుకని దేవుడు లేడు అని అంటుంటాడు.

పైన చెప్పిన ఉదాహరణలో ఉన్న పోలికలను చూద్దాము. పూలు, మణులు మన కంటికి కనపడతాయి. లోపల ఉన్న దారము కంటికి కనపడదు. అలాగే శరీరములు మాత్రమే కంటికికనపడతాయి. లోపల ఉన్న ఆత్మ స్వరూపము కనపడదు. దారము లేనిదే మణులు పూలునిలువవు. అలాగే పరమాత్మ లేనిదే ఈ సృష్టి లేదు. మన సాధారణ కంటికి దారం కనిపించనట్టే, అజ్ఞానములో ఉన్న వాడికి పరమాత్మ కనిపించడు. దారము లేకపోతే పూలు, మణులు నిలువవు అనే తెలివి ఉంటేనే లోపల దారం ఉన్న సంగతి తెలుస్తుంది. అలాగే ప్రతి జీవిలోనూ పరమాత్మ ఆత్మస్వరూపుడుగా ఉన్నాడు అనే జ్ఞానం కలిగితేనే, ఆత్మ దర్శనం కలుగుతుంది.

## 8. రసోఽహమప్సు కౌన్తేయ ప్రభాస్మి శశిసూర్యయోః। ప్రణవః సర్వవేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు॥

కుంతీకుమారుడవైన ఓ అర్జునా! జలంలో ఉన్న రుచి, సూర్యచంద్రులలో ఉన్న ప్రకాశము, వేదములలో, శాస్త్రములలో అంతర్లీనంగా ఉన్న ఓం కారము, ఆకాశంలో నుండి ఉద్భవించే శబ్దము, మానవులలో ఉన్న అహంకారము, ఇవన్నీ నేనే.

ఈ శ్లోకంలో పరమాత్మ తాను ఈ ప్రకృతిలో ఎలా వ్యాపించి ఉన్నాడో సోదాహరణంగా తెలియజేస్తున్నాడు. మానవులకు ఒక సహజలక్షణంఉంది. దేవుడు ఎక్కడో ఉన్నాడు అని అనుకోవడం. శైవులకు శ్రీశైలంలో, కాశీలో, వైష్ణవులకు శ్రీరంగంలో, రామభక్తులకు అయోధ్యలో,శాక్తేయులకు కంచి కామాక్షి, మధుర మీనాక్షి ఇలాగా ఎవరి ఇష్టదైవం ఎక్కడో ఒకచోట ఉన్నారు అని

అనుకోవడం అక్కడకు వెళ్లడం అక్కడ కూడా నాకు అది కావాలి, ఇది కావాలి అని మొక్కుకోవడం, ఆ మొక్కులు తీర్చుకోవడం, తాను ఆర్జించిన అన్యాయార్జితంలో కొంత దేవుడికి సమర్పించడం దీనినే భక్తి అనుకుంటున్నాము. అటువంటి వాళ్లకు శ్రీకృష్ణుడు తాను ఎక్కడెక్కడ ఉన్నాడు అన్న విషయం చిన్ని చిన్ని ఉదాహరణలతో ఈ శ్లోకంలో చెప్పాడు. అత్యంత వివరంగా రాబోయే విభూతి యోగంలో వివరించాడు. ఈ శ్లోకంలో ఉదాహరణకు కొన్నిటిని గురించి చెప్పాడు.

నీటిలో రుచి, సూర్యుడు, చంద్రుడు వీటిలో ఉన్న ప్రకాశము, వేదములలో ఓంకారము, ఆకాశంలో శబ్దము, మనుష్యులలో అహంకారము, పరాక్రమము, వీరత్వము, పౌరుషము, ఇవి అన్నీ కూడా పరమాత్మ స్వరూపాలే. అంటే ఏ వస్తువుకు ఏ లక్షణం ఉంటుందో ఆ లక్షణములు అన్నీ పరమాత్మే. అన్నీ ఆ చైతన్యమే. పరమాత్మ సర్వవ్యాపకుడు అని తెలుసుకోవడానికి ఇవి కొన్ని ఉదాహరణలు. వీటిని పరిశీలిస్తే మనకు పంచభూతములు కనపడతాయి. ఆకాశము లోనుండి శబ్దము, రసమునకు జలము, ఓంకారము వాయుస్వరూపము, ప్రకాశము అగ్ని, మానవ శరీరము భూమి. అంటే పంచభూతములలో నేనే అంతర్లీనంగా ఉన్నాను. ఈ లక్షణములను విడదీయలేము. సూర్యచంద్రులు వేరు, వాటి ప్రకాశమువేరు కాదు. అలాగే జలము వాటి రుచి వేరు కాదు. వేద శాస్త్రములలో ప్రతి మంత్రము ఓం తో మొదలవుతుంది. ఓం లేనిదే మంత్రమే లేదు. వేదశాస్త్రములను చదవలేని వారు, కనీసం ఓంకారము జపిస్తే చాలు అని పెద్దలు చెబుతారు. దానికి ఉదాహరణ పై శ్లోకంలోనే వివరించాడు. మణిహారంలో దారంలాగా నేను అన్నిటిలో అంతర్లీనంగా ఉన్నాను అని ప్రకటించాడు. దారం లేకపోతే హారం స్వరూపమే ఉండదు.

మనం మానవుల కాబట్టి మన లక్షణం గురించి కూడా చెప్పుకోవాలి. మానవునికి అహంకారము,(సాత్వికాహంకారము), పౌరుషం, పరాక్రమము. వీరత్వము, వీటన్నికీ మించి మానవత్వము సహజలక్షణాలు. కాని కొంతమంది దీనికి వ్యతిరేకంగా ప్రవర్తిస్తుంటారు. మానవులు మానవులుగా బతకడం మానుకున్నారు. మానవత్వం మరిచిపోయారు. అమానవీయత సహజలక్షణంగా మారిపోయింది. మానవులు మానవత్వం మరిచి క్రూరత్వం అవలంబించడం ఎంత అసహజమో, మానవులకు దీనత్వము కూడా అంతే అసహజలక్షణము. మానవులకు దీనత్వము, దైన్యము పనికి రాదు. ఎంత కష్టము వచ్చినా, ధైర్యంగా ఎదుర్కోవాలి. నీరసపడి పోకూడదు. సుఖదు:ఖములు సమానంగా చూడాలి. చిరునవ్వుతో భరించాలి. ఎల్లప్పుడూ ధైర్యంగా ఉత్సాహంగా ఉండాలి. అంతేకానీ ఏడుపు ముఖంతో ఉండకూడదు. మానసిక స్థైర్యం పోగొట్టుకోకూడదు. అతి చిన్న కారణాలకు ఆత్మహత్యాప్రయత్నాలు మానుకోవాలి. అందుకే పౌరుషం నృషు అంటే నరులలో పౌరుషం నేను అని పరమాత్మ ప్రకటించాడు. ధైర్యంగా పౌరుషంగా ఉండటం పరమాత్మ లక్షణము. ఆ లక్షణం మనం కష్టసమయములలో విడిచిపెట్టకూడదు.

9. పుణ్యో గన్ధః పృథివ్యాం చ తేజశ్చాస్మి విభావసౌ।
జీవనం సర్వభూతేషు తమశ్చాస్మి తపస్విషు॥

పృథా దేవి(కుంతీ దేవి) కుమారుడవైన ఓ పార్థా! భూమిలో నుండి వెలువడే మంచి వాసనను, అగ్నియందు ప్రకాశమును, సర్వభూతములలో ఉన్న జీవము (ప్రాణశక్తి), తాపసులు చేసే తపస్సు, అన్నీ నేనే అయి ఉన్నాను.

పైశ్లోకంలో చెప్పిన విధంగానే ఈ శ్లోకంలో కూడా మరి కొన్నిటిలో కూడా నేను ఉన్నాను అని చెబుతూ ఈ భూమిలో ఉన్న సువాసన నేనే. అగ్నిలో వెలుగు, తపస్సు చేసే వారిలో తపశ్శక్తి, సమస్త జీవరాసులలో జీవము నేనే. అంటే ప్రతి జీవిలో ఉండే వైటల్ పవర్ పరమాత్మ. చైతన్యం పరమాత్మ. దాదాపు 100 సంవత్సరాలు మన శరీరంలో రక్తం ప్రసరించడం, గుండె కొట్టుకోవడం, ఆహారం జీర్ణంకావడం మొదలగు పనులకు, ఎటువంటి బాటరీ శక్తిఅవసరం లేకుండా, కావలసిన శక్తి, చైతన్యం, నిలకడగా శరీర ఉష్ణోగ్రత, లభిస్తున్నాయి అంటే ఇవన్నీ ఆ పరమాత్మ స్వరూపమే.

కాని మనం మాత్రం అన్నీ నేనే, నా వల్లే జరుగుతున్నాయి అని అనుకుంటూ ఉంటాము. అలా అనుకోవడం పొరపాటు. లోపల ఉన్న ఆ చైతన్యం లేకపోతే అమెరికా ప్రెసిడెంటు అయినా అమలాపురం అప్పలస్వామి అయినా కాటికి పోవలసిన వాడే. ఆ చైతన్యం లేకపోతే, ఒక్కక్షణం కూడా మనుషులు వారిని తమ మధ్య ఉంచుకోరు. ఊరేగింపుగా తీసుకెళ్లి దహనం చేస్తారు. ఘనంగా సమాధులు కట్టిస్తారు. కాబట్టి మనిషికి అహంకారము పనికిరాదు. వినయం ముఖ్యం. అన్నిటిలో ఆ పరమాత్మ ఉన్నాడు, ఆ పరమాత్మే తనలో కూడా ఆత్మస్వరూపుడుగా ఉన్నాడు అనితెలుసుకోవడమే జ్ఞానం.

ఈ శ్లోకంలో అగ్ని యందు ప్రకాశం మనకు తెలుసు. మనిషిలోని జీవం మనకు తెలుసు. కాని భూమి నుండి వచ్చే సువాసన మనకు తెలియదు. ఎందుకంటే నగరాలలో అంతా తారు రోడ్లు, సిమెంటు రోడ్లు. మట్టి నేల కనపడదు. కాని పల్లెలకు వెళితే, ఎండా కాలం తరువాత తొలకరి వానలు పడి నపుడు ఒక విధమైన ఆహ్లాదకరమైన వాసన వస్తుంది. అది భూమి నుండి వస్తుంది. అది భూమి సహజగుణము. ఇంతెందుకు భూమిలోనుండి పూలమొక్కలు వస్తాయి. ఆ మొక్కలకు పూచే పూలకు ఉన్న సువాసన భూమి నుండి వచ్చేదే. కాబట్టి భూమి లక్షణం సువాసనలు వెదజల్లడం. అదీ కూడా పుణ్యోగంధ: అంటే చక్కటి సువాసన. మనం భూమి మీద అన్ని వ్యర్థాలు వేసి మురికిచేస్తున్నాము కానీ, భూమి లక్షణం సువాసనలు వెదజల్లడం. ఆ సువాసనలు కూడా ఆ పరమాత్మ స్వరూపమే.

ఈ శ్లోకంలో ఆఖరున తపశ్చాస్మి తపస్విషు అని కూడా అన్నాడు పరమాత్మ. తాపసులలో తపశ్శక్తిని నేనే. తపస్సు అంటే ఇదివరకే చెప్పుకున్నాము. ఏకాగ్రతతో, భక్తి, శ్రద్ధతో చేసే ఏ పని అయినా తపస్సే. ఆ ఏకాగ్రత, శ్రద్ధ నేను అంటున్నాడు పరమాత్మ. కాబట్టి మనం కూడా ఏ పని చేసినా శ్రద్ధతో, ఏకాగ్రతతో చేస్తే, పరమాత్మ ఆ పని సఫలం చేస్తాడు. ముఖ్యంగా విద్యార్థులు సంవత్సరం అంతా ఏకాగ్రతతో, శ్రద్ధతో చదివితే, క్వశ్చన్ బాంకుల పని ఉండదు. ప్రశ్నాపత్రాలలో ఉన్న ప్రశ్నలు అన్నీ తెలిసినట్టే కనిపిస్తాయి. అలా కాకుండా, కేవలం పరీక్షల సమయంలో ముక్కున పెట్టి చదివితే, ఆ ప్రశ్నలు రాకపోతే, అబ్బా పేపర్ చాలా హార్డ్ గా ఇచ్చారండీ అని ఇతరుల మీదికి తప్పు నెట్టేస్తాము. మనలో శ్రద్ధ, ఏకాగ్రత లేదని ఒప్పుకోము. మన అజ్ఞానానికి నవ్వుకోడం తప్ప పరమాత్మ కూడా ఏం చేయలేడు. ఒక్క విద్యార్థులకే కాదు, ఉద్యోగస్థులకు, వాపారస్థులకు ఇది వర్తిస్తుంది. కాబట్టి పరమాత్మ స్వరూపాలైన ఏకాగ్రత, శ్రద్ధ, తపశ్శక్తి అందరూ అలవరచుకోవాలి.

## 10. బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ సనాతనమ్।
## బుద్ధిర్బుద్ధిమతామస్మి తేజస్తేజస్వినామహమ్॥

ఓ పార్థా! సర్వభూతములలో బీజ రూపంలో నేనే ఉన్నాను అని తెలుసుకో. అలాగే బుద్ధిమంతులలో ఉన్న బుద్ధి, ధీరులలో ఉన్న ధీరత్వము, ధైర్యము నేనే.

పై శ్లోకం మాదిరే ఈ శ్లోకంలో కూడా కృష్ణుడు, మరి కొన్ని గుణాల గురించి చెప్పాడు. బుద్ధి గుణము బుద్ధిమంతులలో ఉంటుంది. తేజస్సు అనే గుణము ధీరులలో ఉంటుంది. బుద్ధి గుణము ఎక్కువగా ఉంటే బుద్ధిమంతుడు అని అంటారు. అలాగే ధీరత్వము, ధైర్యము, వీరత్వము, పరాక్రమము. వీటన్నిటి వలన లభించే ఒకవిధమైన తేజస్సు ఉంటే వారిని తేజస్వినులు అని అంటారు. కొంత మంది తేజస్విని అని పేరు పెట్టుకుంటారు కాని ఊసురోమంటుంటారు. తేజో గుణం ఉంటేనే వారుసార్థకనామధేయులు అవుతారు.

తరువాత మొదటి పాదంలో మరొక ముఖ్యమైన విషయం తెలియజేస్తున్నాడు కృష్ణుడు. ఇప్పటి దాకా పరమాత్మ నేను సర్వభూతములలో ఉన్నాను అని చెప్పాడు. ఇప్పుడు బీజంమాం సర్వభూతానాం అంటే ఈ చరాచర సృష్టిలో ఉన్న సర్వభూతములకు మూలకారణమైన బీజమును నేనే అనిఅంటున్నాడు. అంటే నా నుండి ఈ అనంత విశ్వం ఆవిర్భవించింది అని అర్థం. ఒక్కసారి బిగ్ బాంగ్ థియరీ గుర్తుచేసుకోండి. పరమాణు రూపంలో ఉన్న పదార్థం విస్ఫోటం చెంది ఈ అనంత విశ్వం ఆవిర్భవించింది అని నేటి శాస్త్రజ్ఞులు చెబుతున్నారు. ఈరెండింటికీ సరి పోయింది

కదా. విష్ణువు బొడ్డులోనుండి పద్మము అంటే విశ్వం ఆవిర్భవించింది. ఆ పద్మంలో నుండి బ్రహ్మ ఆవిర్భవించాడు అంటే సృష్టి మొదలయింది. అంటే ఈ సృష్టికి మూలం పరమాత్మ. అదే బీజం మాం సర్వభూతానాం అనే పదాలకు అర్ధం. అంతేకానీ, సముద్రము, ఆదిశేషువు, దాని మీద విష్ణువు, ఆయన బొడ్డు, అందులో నుండి తామర కాడ, దానికో పువ్వు, అందులో బ్రహ్మ ఇలా సగుణాకారంగా చూస్తే ఏమీ అర్థం కాదు. దాని లోపల ఉన్న అర్థం గ్రహించడానికి ప్రయత్నం చేయాలి.

ఇక్కడ మనం ఒక విషయం గురించి చెప్పుకోవాలి. కారణాలు రెండు ఉంటాయి. ఒకటి అనాది కారణం. మూల కారణం. అదే పరమాత్మ. అంటే ఏవీ లేనపుడు ఎవడు ఉన్నాడో వాడే మూల కారణము. నిమిత్త కారణము అంటే తాత్కాలికకారణం. ఒక విత్తనం వేస్తే చెట్టు మొలిచింది. పురుషుడి వీర్యం స్త్రీశోణితంలో కలిసి మానవుడుజన్మించాడు. అలాగే పశువులు, పక్షులు మొదలగునవి పుడుతున్నాయి. ఇది మనకు కనపడే కారణం. అసలు మూలకారణం ఒక్కడే. నిర్వికారుడు నిర్గుణుడు, నిరాకారుడు అయిన పరమాత్మ. దీనిని తెలుసుకోవడమే జ్ఞానము.

అందరూ ఆ పరమాత్మలోనుండి ఉద్భవించినపుడు, వాడు ఎక్కువ వీడు తక్కువ అనే భేదము ఉండకూడదు. అంతా సమానమే. ఎక్కువ కులం, తక్కువకులం, ధనిక,పేద, అనే భేదము మరిచిపోవాలి. ఎందుకంటే అందరికీ బీజము ఆ పరమాత్మ. మామిడి విత్తనము వేస్తే మామిడి పండు వస్తుంది. అలాగే ఆ పరమాత్మ బీజము నుండి పరమాత్మ స్వరూపులే ఉద్భవిస్తారు. మనం అందరం పరమాత్మ స్వరూపులమే. ఈ ఎక్కువ తక్కువలు మనం కల్పించుకున్నవి. కేవలం మనలో ఉన్న తెలియని తనం అంటే అవిద్య వలన ఏర్పడ్డాయి. శాస్త్రజ్ఞానముతో అవిద్యను తొలగించుకోవాలి. ఇదే ప్రాక్టికల్ జ్ఞానము, విజ్ఞానము. ఈ విషయాన్ని అందరిలోనూ కలిగించాలి. ఎప్పుడైతే ఎక్కువ కులము వాడు, తక్కువ కులం వాడు, ధనవంతుడు, దరిద్రుడు, దీనుడు, వీళ్లందరూ తన యొక్క మూలము పరమాత్మ, తానుపరమాత్మ అంశ అని తెలుసుకుంటాడో అప్పుడు ధైర్యంగా బతకగలడు.

మనం ఇతర మతములలో చెప్పినట్టు పాపులం కాదు. భగవంతుని అంశలో నుండి పుట్టాం అన్న గొప్ప తత్వం అలవరచుకోవాలి. మహాసముద్రంలో చిన్ని చిన్ని అలలు, ఉవ్వెత్తున అల్లంత ఎత్తున ఎగిసి పడే అలలు వస్తుంటాయి. చిన్ని అలలకు పేద్ద అలలకు బీజం అంటే మూలం సముద్రమే.

ఈ రోజుల్లో ఎక్కువగా మానవులు డిప్రషన్ లో ఉంటున్నారు. ప్రతి చిన్న విషయానికీ మానసికంగా కుంగిపోతున్నారు, బలహీనులవుతున్నారు. పైగా కులాల మధ్య, ధనిక పేదల మధ్య అంతరాలు మానవుని కుంగదీస్తున్నాయి. నేనెందుకు ఇలా పుట్టాను, నా బతుకు ఇలా ఎందుకు అయింది అనే కుంగుబాటుకు లోనవుతున్నారు. ఇలాంటి పరిస్థితులలో, ఇటువంటి బోధనలు

మానవులలో ఉత్తేజాన్ని కలుగజేస్తాయి. నేనూ పరమాత్మ అంశలో పుట్టాను. నేనూ గొప్పవాడినే అనే భావన వారిని ఆ కుంగుబాటు నుండి విముక్తిని కలిగిస్తుంది. మంచి మార్గంలో నడిపిస్తుంది.

ఇంకా బుద్ధిమంతులలో బుద్ధిని నేనే. ధీరులలో ధీరత్వమును తేజస్సును నేనే. అంటే పరమాత్మ మనందరిలో ఉన్న అన్ని లక్షణములలో వ్యాపించి ఉన్నాడు. ఆ లక్షణములను చక్కగా అలవరచు కోవడమే మన కర్తవ్యం. బుద్ధి, శ్రద్ధ, విద్య, జ్ఞానము మనం అలవరచుకుంటే భగవంతుడు ఆయా లక్షణములలో ప్రవేశించి మనకు ప్రతి ప్రయత్నంలో విజయం కలుగజేస్తాడు. మరి కేవలం మంచి లక్షణములలోనే పరమాత్మ ఉంటాడా, చెడ్డ లక్షణములలో ఉండడా అంటే అంతటా ఉంటాడు అనే జవాబు వస్తుంది. మానవునిలో మంచి, చెడు రెండూ కలిసి ఉంటాయి. మంచి లేకపోవడమే చెడు. వెలుగు లేకపోవడమే చీకటి. వెలుగును అడ్డుకుంటే చీకటి. మనలో స్వతహాగా మంచి, మానవత్వం ఉన్నాయి. అవి లేకపోవడమే చెడ్డ గుణము, అమానవత్వము.

మరి ఇక్కడ కేవలం మంచి గురించే ఎందుకు చెప్పాడు అంటే మానవులు చెడుకు సులభంగా ఆకర్షితులు అవుతారు. చెడ్డ గుణములలో కూడా నేనే ఉన్నాను అని చెబితే, మానవులు అవే అలవరచుకొని చెడ్డవాళ్లు అయ్యే ప్రమాదం ఉంది. అందుకనే కేవలం మంచి లక్షణాల గురించే చెప్పారు. కాబట్టి మనలో ఉన్న అన్ని లక్షణాలలో, గుణాలలో, ప్రవర్తనలో, అన్నిటిలో కూడా పరమాత్మ ఉన్నాడు. పరమాత్మ సర్వాంతర్యామి అని చెప్పడానికే ఇన్ని ఉదాహరణలు చెప్పాడు కృష్ణుడు. కాబట్టి ఎదుటి వాడిలో ఐశ్వర్యం, బుద్ధిబలం, విద్య ఉన్నాయని అసూయపడకుండా, ఆ గుణాలు పరమాత్మ స్వరూపాలు అని భావిస్తే, వాడిలో ఉన్న ఐశ్వర్యానికి బుద్ధికి విద్యకు మనం నమస్కరిస్తాము. ఈ జ్ఞానం లేకపోతే అసూయ, ద్వేషము ప్రబలుతాయి. కాబట్టి అందరిలోనూ, వారి గుణములలోనూ, వారి బల పరాక్రమములలోనూ పరమాత్మ శక్తి అంతర్లీనంగా ఉంది అని తెలుసుకోవాలి.

## 11. బలం బలవతాం చాహం కామరాగవివర్జితమ్।
## ధర్మావిరుద్ధో భూతేషు కామో2స్మి భరతర్షభ॥

ఓ అర్జునా! నేను కామముతో కానీ, రాగముతో కానీ సంబంధములేని బలాన్ని, అలాగే ధర్మవిరుద్ధమైన పనులు చేయని వారియొక్క కోరికలు కూడా నేనే అయి ఉన్నాను.

ఈ శ్లోకంలో నెగటివ్ మీనింగ్ వచ్చేపదాలు వాడారు వ్యాసులవారు. స్థూలంగా చెప్పాలంటే అధర్మముతో కూడిన పనులు చేసే వారి కోరికలలో, రాగము(సంగము--అటాచ్‌మెంట్)

తో కూడిన కోరికలు  ఉన్న వారిలో నేను ఉండను అని భావము.

బలవంతుడు అని ఎప్పుడు అంటాము. వాడికి బాగా బలం ఉంటే అంటాము. ఆ బలం నేనే అంటున్నాడు పరమాత్మ. బలం అనేది ఒకటే. మానవునిలో ఉన్న శక్తి. ఆ బలం మంచి పనులకు ఉపయోగపడితే అది ధార్మికమైన బలం. ఆ బలాన్నే అసాంఘిక కార్యక్రమాలకు, ధర్మవిరుద్ధమైన కార్యాలకు వినియోగిస్తే అది రాక్షస బలం అంటారు. రాముడు బలవంతుడు. రావణుడు కూడా బలవంతుడే. రాముడు తన బలాన్ని ధర్మరక్షణకు, దుష్టశిక్షణకు వినియోగించాడు. రావణుడు తన బలాన్ని రాక్షసప్రవృత్తులకు వినియోగించాడు. రాముని బలంలో దైవత్వం ఉంది. రావణుని బలంలో దైవత్వం లోపించింది.  అందుకే రాముడి బలం ముందు రావణుని బలం నిలువలేకపోయింది.  కాబట్టి, మనలో ఉన్న బలం ధర్మబద్ధంగా ఉండాలి. పరోపకారానికి వినియోగపడాలి. ధర్మవిరుద్ధమైన పనులు చేయడానికి, తన స్వార్ధపూరితమైన కోరికలు తీర్చుకోడానికి ఉపయోగించబడకూడదు. స్థూలంగా చెప్పాలంటే భగవత్స్వరూపమైన బలాన్ని దుర్వినియోగం చేయకూడదు..

అలాగే కోరికలు కూడా ధర్మబద్ధంగానేఉండాలి. ఇతరులకు హాని కలిగించేవిగా ఉండకూడదు.  మానవునికి ఉన్న బలం, తనలో చెలరేగే పనికిమాలిన, ఇతరులకు హాని కలిగించే కోరికలు తీర్చుకోడానికి, తనలో ఉన్న ఇష్టాఇష్టాలకు సంబంధించి ప్రవర్తించడానికి అయి ఉండకూడదు.  తనలో ఉన్న బలాన్ని ఉపయోగించి ఒకడిని అనవసరంగా కొట్టాలి అనే కోరిక ఉండకూడదు.  వీడు నావాడు, వాడు పరాయివాడు, వాడిని చితక బాదాలి, నా వాడు వెధవ, దుర్మార్గుడు, నీచుడు అయినప్పటికినీ, వాడిని రక్షించాలి అనే రాగద్వేషములు లేకుండా ఉండాలి. అంతే కాకుండా, బలవంతుడు, ధైర్యవంతుడు అయి నందుకు, బలహీనులను రక్షించడమే కర్తవ్యంగా పెట్టుకోవాలి.

మన సినిమాలలో హీరోలను బలవంతులుగానూ, ధైర్యవంతులుగానూ, ఆపదలలో ఉన్న వారినీ, అబలలనూ రక్షించేవారిని గానూ చిత్రీకరించడంలో ఉన్న అంతరార్థం ఇదే.  కనీసం తమ అభిమాన హీరోలను చూచైనా అటువంటి మంచి లక్షణాలు అలవరచుకుంటారనేదే సినిమాలు తీసేవారి ఆశ. (ఈ రోజుల్లో దానికి భిన్నంగా జరుగుతూ ఉంది. ఈనాడు ఇడియట్, పోకిరి, డాన్, ఖతర్నాక్, ఖల్నాయక్, మన్మధుడు.... వీళ్లు మన హీరోలు. నేటి యువత వీరినే అనుకరిస్తున్నారు.)అందుకనే పరమాత్మ,   సత్పురుషుడిలో ఉన్న  ఉన్న బలం నేనే అని అన్నాడు.

అలాగే కోరికలు కూడా నేనే కానీ ఆ కోరికలు ధర్మబద్ధమై ఉండాలి. ధర్మం గా కలిగే కోరికలు నేనే అని అన్నాడు పరమాత్మ. కాబట్టి మనలో ఉండే బలం, కోరికలు, ప్రతాపం, వీరత్వం అన్నీ ధర్మబద్ధంగా ఉంటే భగవంతుని సాయం తప్పక ఉంటుంది. ఆయన పక్కన ఉండి

నడిపిస్తాడు. తాత్కాలికంగా అధర్మం పైచెయి అయినా ధర్మమే గెలుస్తుంది. ధర్మమేవ జయతే అని అందుకే అన్నారు.

లోకంలో అన్ని రకాల కోరికలు ఉంటాయి. మంచి కోరికలు చెడ్డ కోరికలు రెండూ ఉంటాయి. ఏది కావాలో కోరుకోవడం మన విచక్షణ మీద ఆధారపడి ఉంటుంది. ఏది ధర్మానికి అనుకూలంగా ఉంటుందో, ఏది ధర్మవిరుద్ధం కాదో ఆ కోరికలనే కోరుకోవాలి. అంటే సంకల్ప స్థితిలోనే ధర్మవిరుద్ధం కాని కోరికలు కావాలని సంకల్పించాలి. ఇతరులకు పరోపకారం చేయడం, భగవంతుని ధ్యానం చేయాలని అనుకోవడం, మంచి పనులు చేయాలని కోరుకోవడం, పుణ్యకార్యములు చేయాలని కోరుకోవడం, ఇవీ ధర్మబద్ధమైన కోరికలు. ఇతరులకు అపకారం చేయడం, ఇతరులను మోసం చేయడం, వారికి నష్టం కలిగించడం మొదలగునవి అధర్మబద్ధమైన కోరికలు. మనలో ఉన్న విచక్షణ ఉపయోగించి ధర్మబద్ధమైన కోరికలు కోరుకుంటే భగవంతుడు ఆ కోరికలను తీరుస్తాడు. ఆ కోరికలలోనే తాను ఉంటాడు. క్రమక్రమంగా ఆ కోరికలను కూడా వదిలిపెట్టి పరమాత్మను చేరుకోవచ్చు.

## 12. యే చైవ సాత్త్వికా భావా రాజసా స్తామసాశ్చయే।
## మత్త ఏవేతి తాన్విద్ధి న త్వహం తేషు తే మయి॥

మానవులలో సాత్విక, రాజసిక, తామసిక భావాలు ఉన్నాయి. వాటిని నేనే కలిగిస్తున్నాను. కాని ఆ భావాలు నాలో నుండి వచ్చినా, ఆ భావాలలో నేను లేను.

ఇప్పటి దాకా కృష్ణుడు బాహ్య ప్రపంచంలో అంటే పంచభూతములతో నిర్మితమైన ప్రకృతిలో  ఉండే విషయాలు అంటే సూర్యచంద్రులు,  అగ్ని వాటి తేజస్సు, జలము, వేదములు, ఓంకారము, పౌరుషము, భూమి, తపస్సు,  మొదలగు బాహ్య ప్రపంచములో ఉన్న వస్తువులలో నేను ఉన్నాను అని చెప్పి, ఇప్పుడు అంతరంగ ప్రపంచంలో అంటే మనలో ఉండే సూక్ష్మ ప్రపంచము వాటిలో ఉండే విషయాల గురించి వివరిస్తున్నాడు.

ప్రకృతిలో మూడు గుణాలు ఉన్నాయి. అవే మనలో కూడా ఉన్నాయి. వాటి పేర్లు సత్వ, రజస్ తమో గుణాలు. ఈ గుణాలను బట్టి మనం ఈ ప్రపంచంలో కర్మలు చేస్తుంటాము. ఈ మూడు గుణాలతో కూడిన భావాలను కూడా నేనే అని అంటున్నాడు పరమాత్మ. మూడుగుణాలు దైవస్వరూపాలే. కాని ఏ గుణం ఎంచుకోవాలో తేల్చుకోవాల్సింది మానవుడు. మనం ఏ గుణం ఎంచుకుంటే దానికి అనుగుణంగానే మనలో భావాలు కలుగుతాయి. ఆ భావాలకు అనుగుణంగా కర్మలు చేస్తాము. ఆ కర్మలకు తగిన  ఫలితం వస్తుంది.

ఈ మూడు గుణాలు తనలో నుండి వచ్చినా, ఆ గుణములలో నేను లేను అని మెలిక పెట్టాడు పరమాత్మ. అంటే ఆ మూడు గుణాలు పరమాత్మలో ఉన్నాయి. పరమాత్మ నుండి ప్రకృతి ఆవిర్భవించినపుడు, ఆ గుణాలు కూడా ప్రకృతిలో ప్రవేశించాయి. అవే గుణాలు ప్రకృతిలో ఒక భాగమైన మానవునిలో కూడా ప్రవేశించాయి. ఈ మూడు గుణములకు కారణం మాత్రము పరమాత్మ అయినా, ఆ మూడు గుణములు పరమాత్మలో నుండి వచ్చినవే అయినా, ఆ గుణములలో తాను లేడు అంటే ఆ మూడు గుణముల ప్రభావం పరమాత్మ మీద లేదు. కాని ఆ మూడు గుణములతో మానవులు ఏమి సంకల్పించినా, ఏమిచేసినా, ఆ కర్మలతో, కర్మఫలములతో తనకు సంబంధము లేదు, తాను బాధ్యుడు కాడు అని స్పష్టంగా వివరించాడు.

తనకు అవసరమైన వస్తువు కావాలి అనుకోవడం సాత్విక భావము. ఉన్నవన్నీ నాకే కావాలి అని అనుకోవడం రాజసికభావము. అవి లేకపోతే నేను బతకలేను అనే మోహంలోపడటం తామసిక భావము. ఈ మూడు భావాలకు అనుగుణంగా మానవులు ప్రవర్తిస్తుంటారు. ఉదాహరణకు రజోగుణము బలపరాక్రమములు వీరత్వము, సూచిస్తుంది. అవి కూడాపరమాత్మ తత్వములే అని తన బలపరాక్రమాన్ని ఇతరుల మీద చూపించి చితక బాదితే, పోలీసులు కేసుపెడతారు. "అదేవిటండీ! ఇవి అన్నీ పరమాత్మ విభూతులు అండీ, నేను ఆ పరమాత్మ విభూతి అనుసరించి వాడిని కొట్టాను. నన్నెందుకు పట్టుకున్నారు" అంటే అందరూ నవ్వుతారు. ఇంకా నాలుగు తంతారు. అదే రాజసిక ప్రవృత్తితో బలహీనులను, దీనులను రక్షించవచ్చు వారికి అండగా నిలువ వచ్చు. వారికి సాయం చేయవచ్చు. తనకు ఉన్న బలపరాక్రమాలతో, వీరత్వంతో, వారిని ఆదుకోవచ్చు. అలా చేసిన వాడిని జనం అంతా పొగుడుతారు. ఆకాశానికి ఎత్తుతారు. కాబట్టి రాజసిక ప్రవృత్తి, రాజసిక భావాలు పరమాత్ముడిలో నుండి వచ్చినా, వాటిని ఎలా ఉపయోగించాలి అన్నది మానవుల విచక్షణమీద ఆధారపడి ఉంటుంది. ఒక సారి సత్వ,రజస్,తమోగుణములు పరమాత్మలో నుండి వెలువడిన తరువాత, వాటిని సద్వినియోగం చేసుకోవడమో, దుర్వినియోగం చేసుకోవడమో మానవుల ఇష్టం. అందుకే వాటిలో నేను లేను అని పరమాత్మ ముందే సూచించాడు.

## 13. త్రిభిర్గుణమయైర్భావైరేభిస్సర్వమిదం జగత్।
## మోహితం నాభిజానాతి మామేభ్యం పరమవ్యయమ్॥

సత్వ,రజస్తమోగుణముల యొక్క భావములతో ఈ ప్రపంచం అంతా మోహములో చిక్కుకుపోయి ఉంది. ఈ మూడుగుణముల యొక్క భావముల ప్రభావములో పడ్డ మానవులు మూడుగుణములకు అతీతుడనైన నా గురించి తెలుసుకోలేకపోతున్నారు.

ఈ అనంత విశ్వం, ఈ విశ్వంలో భాగమైన ఈ భూమి, ఈ ప్రకృతి, ఆ ప్రకృతిలో నుండి పుట్టిన  మానవులు అంతా ఈశ్వరమయమైనపుడు, ఈ మానవులకు రకరకాల బాధలు, సుఖదు:ఖాలు ఎందుకుకలుగుతున్నాయి. ఈశ్వరుడు ఆనందస్వరూపుడు అయినపుడు అందరూ సుఖంగానే ఉండాలికదా మరి చాలా మంది దీనంగా, ఏడుస్తూ, కష్టాలు అనుభవిస్తూ, దు:ఖిస్తూ ఎందుకు కాలం గడుపుతున్నారు. దీనికి కారణం ఏమి? అని ప్రతి వాడిలో ఒక ప్రశ్న ఉదయిస్తుంది. దానికి సమాధానమే ఈ శ్లోకము.

వానాకాలం. ఆకాశం అంతా మబ్బు పట్టి ఉంది. ముసురు. సూర్యుడు కనపడటం లేదు. అంటే సూర్యుడు లేడా! ఉన్నాడు. కానీ మబ్బులు కప్పినందువలన మనకు కనిపించడం లేదు.  అలాగే మనందరిలో ఈ మూడు గుణములు కప్పిన అంత:కరణ ఉంది. ఈ గుణముల ప్రభావంలో పడిపోయిన మనకు భగవంతుడు కనిపించడు. మబ్బులు విడి పోతే సూర్యుడు కనిపించినట్టు, మన అంత:కరణ పరిశుద్ధంగా ఉంటే భగవానుడు స్పష్టంగా కనిపిస్తాడు. ఆ మేఘాలు తొలగి పోవాలంటే మామూలు గాలి పనికిరాదు. ఝంఝామారుతం కావాలి. అప్పుడు మనలను ఆవరించిన మాయామేఘాలు చెల్లాచెదరు అయి పోతాయి.

కాబట్టి ప్రతి వాడూ తన గురించి తాను తెలుసుకోవాలి. తాను ఎవరు? ఈ మాయ ఏంటి? ఈ మూడు గుణాలు ఏంటి? ఈమూడు గుణాలకు తను ఎందుకు, ఎలా లోబడి పోతున్నాడు?  వీటి నుండి ఎలా విడివడాలి? ఈ విషయాలన్నీ క్షుణ్ణంగా ఆలోచించాలి. అంతే కానీ తాను జైల్లో ఉన్న సంగతే తెలియని వాడు బైలు కోసం ఎందుకు ప్రయత్నం చేస్తాడు. మనకు కూడా మనలను ఈ మూడుగుణములు అనే మాయ ఆవరించి ఉన్నట్టు తెలియదు. అంతగా వాటిలో కూరుకుపోయాము. అందుకని ఈ బంధిఖానాలో పడికొట్టుకుంటున్నాము. వీళ్లంతా అవివేకులు ఏమీ తెలియని వాళ్లు అని అనుకోకండి. ధనవంతులు, చదువుకున్న వాళ్లు, బలవంతులు, అందగాళ్లు, అందరూ ఉన్నారు. ఎవరి గుణం వారిది.

కాబట్టి ఈ బంధనముల లో నుండి బయటకు రావడానికి ప్రతివారూ ప్రయత్నం చేయాలి. తెర తీస్తే గాని పెళ్లి కూతురు కనపడదు. అలాగే ఈ మూడు గుణములు అనే తెర తీస్తే గానీ, భగవానుడు కనపడడు. దీనికి కావాల్సింది భక్తి, శ్రద్ధ, వైరాగ్యము,నిష్కామకర్మ, సమత్వము, పరోపకారము, ధ్యానము మొదలగునవి. కాబట్టి నాకు భగవంతుడు ఎందుకు కనపడటం లేదు అనే వాళ్ల ప్రశ్నకు ఇదే సమాధానము. ముందు తనలో ఉన్న మూడుగుణముల యొక్క ప్రభావము అనే తెర తొలగించుకోవాలి. ఈ మోహంలో పడి ఉన్నంత వరకు ఆ తెర తొలగదు. దీనికి ఎవరికి వారు ప్రయత్నించాలి. భగవంతునిచూడటానికి ఇదే మార్గము.

ఈ విషయాన్ని ఇంకొంచెం వివరంగా తెలుసుకోవడానికి ప్రయత్నం చేద్దాము. పరమాత్మ తాను రెండు విధాలుగా ప్రకటింపబడుతున్నాడు. ఒకటి పరా ప్రకృతి. రెండవది అపరా ప్రకృతి. పరా ప్రకృతి మామూలు కంటికి కనపడదు. ఎందుకంటే అది నిరాకారము, నిర్గుణము, నిర్వికల్పము. ఇంక అపరా ప్రకృతి మన ఎదుట కనపడుతూ ఉంటుంది. ఇది మూడుగుణముల సమ్మేళనము. మన కంటికి కనపడుతూ ఉంటుంది. ఈ అపరా ప్రకృతినే సంసారము అని కూడా అంటారు. తెలియని దాన్నిపట్టుకోడం కంటే తెలిసిన దాన్ని పట్టుకోడం సులభం కదా! కనపడని దాని గురించి ఆలోచించేకంటే, కనపడే దానిని అనుభవించడం మంచిది కదా! ఇలా ఆలోచించి, అందరూ అపరా ప్రకృతిలో మునిగిపోతుంటారు. సంసారంలో మునిగి తేలుతుంటారు. సుఖదు:ఖాలు, లాభనష్టాలు, ధనవంతుడు, పేదవాడు అనే ద్వంద్వాలకు లోనవుతున్నారు. ఎందుకంటే ఈ అపరా ప్రకృతి మానవులను తనమోహంలో, ఆకర్షణలో పడేస్తుంది. ఆ మోహంలో నుండి ఆకర్షణలో నుండి బయట పడటం చాలా కష్టం.

ఈ విషయం అర్థం కావడానికి మనకు ఒక కథ ఉంది. అదేమోహిని అవతారము. అమృతం కోసం దేవతలు, దానవులు క్షీరసాగరమధనం చేసారు. అమృతం వచ్చింది. దానవులు దానిని తన్నుకుపోయారు. దేవతలు విష్ణువును శరణు వేడారు. విష్ణువు మోహినీ అవతారంలో దానవులను తన ఆకర్షణలో, మోహములో పడవేసి ఆ అమృత కలశమును దానవుల వద్ద నుండి లాక్కున్నాడు. అమృతాన్ని దేవతలకు దానవులకు సమానంగా పంచుతానని అంతా దేవతలకే ఇచ్చాడు. ఈ కథలో మనకు తెలిసిందేమిటి. దానవులు మోహిని ఆకర్షణలో, మోహంలో పడి మోహిని నిజంగా అందమైన స్త్రీ అనుకున్నారు. కాని దేవతలకు ఆమె నిజస్వరూపము విష్ణువు అని తెలుసు. అందుకని వారు ఆమె మోహంలో పడలేదు.

అలాగే మానవులు కంటికి కనిపించే ఈ అపరా ప్రకృతి నిజము, సత్యము ఎల్లప్పుడు ఉండేది అని నమ్మి, దాని మోహంలో, ఆకర్షణలో పడుతున్నారు. దానినే అజ్ఞానము అంటారు. కాని ఈ నిజం తెలిసిన వాళ్లు (జ్ఞానులు, దేవతలు), ఈ అపరా ప్రకృతి మిథ్య, అసత్యము, నిరంతరం మార్పుచెందుతుంది, అసలైనది, సత్యమైనది, మార్పులేనిది పరా ప్రకృతి అని తెలుసుకోగలుగుతారు. ఇలా తెలుసుకోవడమే జ్ఞానము. దానవులకు అమృతము అంటే పరమ సుఖము, అంతము లేని సుఖము దొరకలేదు. అదే దేవతలకు అమృతము దొరికింది. మనం కూడా ఈ అపరా ప్రకృతి మాయలో ఆకర్షణలో మోహంలో పడకుండా, పరా ప్రకృతి వైపుకు అంటే నివృత్తి మార్గంలో ప్రయాణం చేయాలి. అప్పుడే అనంతమైన సుఖం లభిస్తుంది.

మరి అపరా ప్రకృతి వైపుకు మానవులు ఎందుకు ఆకర్షితులు, మోహితులు అవుతారు అంటే అది త్రిగుణాత్మకము అయినది కాబట్టి. ఈ మూడు గుణములు మానవులను మోహంలో,

మాయలో పడవేస్తాయి. ఈ మూడు గుణములతో కూడిన మాయతో కప్పబడినదే ఈ జగత్తు. ఈ సంసారం యొక్క మోహంలో పడ్డ మానవుడు, నాశము లేనిది, గుణములకు అతీతమైనది, పరమమైనది, శాశ్వతమైనది అయిన పరా ప్రకృతి గురించి తెలుసుకోలేకపోతున్నాడు, కనీసం ప్రయత్నం కూడా చేయలేక పోతున్నాడు.

మనం ఎటూ జీవిత కాలం అంతా అపరా ప్రకృతిలో అంటే సంసారంలో మునిగి పోయి, ధనం, భార్య, పిల్లలు, ఆస్తులు పదవులు, కోరికలు, అవి తీరడానికి పూజలు, వ్రతాలు, ఆ కోరికలు తీరకపోతే అసంతృప్తి, అశాంతి, కోపము, దు:ఖము, నిర్వేదము......ఎన్ని ఉన్నా ఇంకా ఏదో కావాలని ఆశ.........ఉన్న ఆస్తిని, ధనాన్ని కాపాడుకోవడం, లేని దాని కోసం ప్రాకులాడటం........... వీటితోనే జీవితంలో సగ భాగం గడిపేసాము కాబట్టి, ఇంకమీదటనైనా నాకు తెలియని, నేను ఆలోచించని, నా ఆలోచనలకు అందని, నాకు లభించని పరా ప్రకృతిని గురించిన జ్ఞానమును నాకు అనుగ్రహించు, ఆ మార్గంలో నన్ను నడిపించు. నాకు పరమశాంతిని, పరమ సుఖాన్ని ప్రసాదించు. అపరాప్రకృతిని ఆశ్రయించిన నాకు ఏ పరమ సుఖం శాంతి దొరకలేదో, దానిని నాకు కలుగజెయ్యి, అని భగవంతుని కోరుకోవడమే మన కర్తవ్యము.

అలా కోరుకుంటే ఏమవుతుంది. మనకేం లాభం అని అనుకుంటే దానికి సమాధానం వెంటనే లభిస్తుంది. మనము అపరాప్రకృతి వైపుకు నిరంతరం ఆకర్షింపబడుతున్నాము. అపరా ప్రకృతిలోని విషయాలను అనుభవించడానికి నానా తంటాలు పడుతున్నాము. కాని అలా అనుభవిస్తే బంధనాలు కలుగుతాయని భయపడుతున్నాము. దీనికి ఒకటే మార్గము. హరిద్వార్‌లో గంగానదీ వేగము ఎక్కువగా ఉంటుంది. తెలియకుండా దిగితే నేరుగా మోక్షమే. అలా జరగకుండా నది ఒడ్డున ఇనుప స్తంభాలు పాతి, గొలుసులు వేలాడదీస్తారు. మనం ఆ గొలుసును పట్టుకొని ఎంత సేపైనా గంగానదిలో స్నానం చేయవచ్చు. ఏమీకాదు. అలాగే మనం, దైనందిన జీవితంలో ఏ పని చేస్తున్నా అంటే ఉద్యోగము, వ్యాపారము, రాజకీయము, వృత్తి విద్య, ఏ పని చేస్తున్నాసరే, మన మనసును, అంత:కరణను మాత్రం పరమాత్మ అనే గొలుసుతో లగ్నం చేసి అంటే పట్టుకొని, ఈ అపరా ప్రకృతిలో మనం ఇష్టం వచ్చినట్టు విహరించవచ్చు. పరమాత్మ అనే గొలుసు మాత్రం వదలకూడదు. వదిలితే ఈ అపరాప్రకృతి మోహంలో పడి కొట్టుకుపోతాము అనే విషయం గ్రహించాలి.

అందుకే పరమాత్మ యందు ఏకాగ్రత, భక్తి, శ్రద్ధ నమ్మకం కలిగి ఉండాలి. నా కర్తవ్యం నేను నిర్వర్తిస్తున్నాను, ఫలితం ఆ పరమాత్మదే అనే భావన కలిగి ఉండాలి. అప్పుడు మనం ఈ అపరా ప్రకృతిలో ఎంతసేపు విహరించినా, ఆ కర్మబంధనములు మనకు అంటవు. నిశ్చింతగా ఉంటాము. పరమానందాన్ని పొందుతాము. మరి ఆ పరమాత్మను పొందే స్థితి ఎలా లభిస్తుందో తరువాతి శ్లోకంలో తెలియజేస్తున్నాడు కృష్ణుడు.

## 14. దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా।
## మామేవ యే ప్రపద్యన్తే మాయామేతాం తరన్తితే॥

దైవ సంబంధమైన, మూడు గుణములతో కూడి ఉన్న నా యొక్క మాయను దాటడం చాలా కష్టం. కాని నన్ను శరణు జొచ్చినవారు, వారు ఈ మాయను సులభంగా దాటగలరు.

పరమాత్మకు, మనకు మధ్య, మూడుగుణములతో కూడిన మాయ అనే తెర ఉందని మనం కిందటి శ్లోకంలో చెప్పుకున్నాము. అది ఉన్నంత కాలం మనకు పరమాత్మ కనపడడు. మరి ఆ తెరను ఎలా తొలగించాలి అంటే ఒకటే మార్గము. నన్ను అంటే పరమాత్మను శరణు వేడటమే. శరణాగతి కోరడమే. అప్పుడు ఈ మాయను దాటగలడు. ఇప్పుడు మాయ అంటే ఏమిటి దాని లక్షణములు ఏవి అనే విషయాన్ని గురించి తెలుసుకుందాము.

మొట్ట మొదటి లక్షణము. మాయ దైవికము. మానవసంబంధం కాదు. దీనికి ఎక్కువ శక్తి సామర్థ్యములు ఉన్నాయి. ఇది అలౌకికమైనది. ఓ పట్టాన వదలదు. ఈ మాయ పెద్ద పెద్ద మేధా సంపన్నులను, రాజాధిరాజులను, బలవంతులను, కూడా లోబరచు కుంటుంది. వారిని కప్పేస్తుంది. మన తెలివితేటలు మాయ ముందు పనిచేయవు. దైవసంబంధమైనది కాబట్టి దైవ సంబంధ కార్యములతోనే అది తొలగించబడుతుంది.

రెండవ లక్షణము... గుణ మయీ అంటే ఈ మాయ మూడు గుణములతో కూడి ఉన్నది. ఈ మాయ సత్వ రజస్తమోగుణముల రూపంలో మనలను ఆవరించి ఉంది. దీనికి ప్రత్యేక ఆకారం లేదు. ఈ మూడు గుణాలే దాని ఆకారము. కాబట్టి మనలో నుండి ఒక్కొక్క గుణాన్ని తొలగిస్తే మాయ దానంతట అదే తొలగి పోతుంది. గుణాలతో కూడిన ఈ మాయ మనలను ఆవరించి ఉన్నంతవరకూ మనకు భగవద్దర్శనం కాదు.

మమ మాయా అంటే ఈ మాయ ఎవరిదో కాదు బాబూ నాదే అని స్పష్టంగా చెబుతున్నాడు పరమాత్మ. ఈ మాయ నా పెట్ డాగ్. దానిని సరదాగా మీమీదికి ఉసిగొలుపుతాను. మీరు దానికి లొంగి పోతారు. లొంగకుండా ఉంటే నా దగ్గరకు వస్తారు. లేకపోతే దాని దగ్గరే కూర్చుని దాని చేష్టలకు అందాలకు మురిసిపోతూ దానితోనే కాలక్షేపం చేస్తారు. ఒక్కొక్కప్పుడు అది మిమ్మల్ని ముప్పుతిప్పలు పెడుతుంది. అప్పుడు దు:ఖము, కష్టము తప్పదు. ఈ మాయలో పడ్డవారు నా గురించి పట్టించుకోరు. ఈ మాయ మనలను ఒక ఆటాడిస్తుంది కానీ తన యజమాని అయిన పరమాత్మ దగ్గర అణగి మణిగి ఉంటుంది.

ఆ మాయ ఎంటువంటిది అంటే దురత్యయా. దానిని దాటుకొని రావడం చాలా కష్టసాధ్యము. ఇంటి ముందు కుక్క ఉన్నది అని బోర్డుపెడతారు. మిమ్మల్నిచూడగానే ఆ కుక్క అరుస్తుంది. మీమీదికి దూకుతుంది. యజమాని వచ్చి దానిని అదుపులో పెడితేగానీ మీరు లోపలకు వెళ్లలేరు. మనం కుక్క దగ్గరకు పోయి "ఏమే కుక్కా! నన్ను కరవకే తల్లీ నీకు దండంపెడతాను" అని అంటామా. అనము కదా. ఆ కుక్క యజమాని దగ్గరకు పోయి "అయ్యా! మీ కుక్కను కాస్త పక్కకు లాగండి. మీతో ఒక్క మాట మాట్లాడాలి" అని అంటాము. కాబట్టి మాయను అదుపుచేయాలంటే దాని యజమాని అయిన పరమాత్మను మనం శరణువేడటం అవసరము. ఎందుకంటే అది నీ మాట వినదు. పైగా నిన్ను బుట్టలో వేసుకుంటుంది. నిన్ను నీ మనసును, ఇంద్రియములను, బుద్ధిని తన అదుపులో పెట్టుకొని నిన్ను ఆడిస్తుంది. లేకపోతే నీ మీద పడి పీకుతుంది. నానాకష్టాలపాలు చేస్తుంది.

మామేవ యే ప్రపద్యన్తే అంటే నన్ను శరణు వేడిన వారు మాత్రమే మాయామేతా తరన్తి ఈ మాయను దాటగలరు. కాబట్టి ఈ మాయను జయించాలంటే దాని యజమాని అయిన పరమాత్మ శరణు జొచ్చాలి.

దీనినే శంకరాచార్యుల వారు ఒక శ్లోకంలో చక్కగా విశదీకరించారు.
ఒక శిష్యుడు గురువును అడిగాడు.
శిష్యుడు: అపార సంసార సముద్రమధ్యే సమ్మజ్జతో మే శరణం కిమస్తి।
గురువు:
గురుకృపాళో కృపయావదైత ద్విశ్వేశ పాదామ్బుజదీర్ఘనైకా॥

గురువుగారూ నేను సంసారము అనే ఈ అంతులేని సముద్రము మధ్యలో మునిగిపోతున్నాను. నాకు మార్గము ఏది. నన్ను రక్షించండి. నేను మీ శరణు వేడుతున్నాను. అని అడిగాడు. అప్పుడు గురువుగారు శిష్యుని మీద అంతులేని కృపతో ఈ విధంగా సమాధానం చెప్పాడు.
ఈ విశ్వమునకు అంతటికీ ఈశ్వరుడైన ఆ పరమాత్మ పాదపద్మములు అనే విశాలమైన పొడవైన నౌక ఒక్కటే ఈ సంసార సముద్రమును తరించడానికి సరిఅయిన మార్గము అని చెప్పాడు.

ఇక్కడ కూడా అదే మాట చెబుతున్నాడు. మాయామేతాం తరన్తితే ఈ మాయనుండి తరించాలంటే మామేవ యే ప్రపద్యన్తే నన్ను శరణు వేడటం తప్ప మరొక మార్గం లేదు.

కాని మానవులు అపరా ప్రకృతి మీద అంటే ప్రాపంచిక విషయాల మీద, విషయ వాంఛల మీద చూపిన, చూపిస్తున్న ప్రేమ, అభిమానము, ఆసక్తి, పరాప్రకృతి మీద అంటే పరమాత్మను

తెలుసుకోవడం మీదచూపించడం లేదు. అపరాప్రకృతి వ్యవహారాలలో అంటే సాంసారిక విషయములలో మునిగి తేలుతున్నారు. మానవుడు ఒక వేళ దేవాలయానికి వెళ్లి, దేవుడి ముందు నిలబడినా, అప్పుడుకూడా, ప్రపంచ సంబంధమైన అంటే ధనము, ఆస్తి, బంధుమిత్రులు, పదవులు, వీటి గురించి కోరికలు కోరడంతోనే తృప్తి చెందుతాడు. అంటే భగవంతుడిని తన కోరికలు తీర్చుకోడానికి ఒక సాధనంగా వాడుకుంటున్నాడు. అంతే కానీ భగవంతుడి మీద ఏకాగ్ర భక్తి, ప్రపత్తితో కాదు. అంటే తాను వేరు, పరమాత్మ వేరు అనే భేదభావంతో ఉంటున్నాడు. తనను గురించి కానీ, పరమాత్మగురించి కానీ, తనకు పరమాత్మకు భేదం లేదని కానీ, తెలుసుకోడానికి ప్రయత్నించడు. ఎందుకంటే ఈ ప్రాపంచిక విషయాలలో అంతగా మునిగి పోయి ఉన్నాడు కాబట్టి. మరి పరమాత్మ ఇంత క్లియర్‌గా చెబుతున్నప్పుడు మానవులకు ఎందుకు అర్థం కావడం లేదంటే ఆ విషయాన్ని ఈ కింది శ్లోకంలో వివరించాడు.

15. న మాం దుష్కృతినో మూఢా: ప్రపద్యన్తే నరాధమా:।
మాయయా2పహృతజ్ఞానా ఆసురం భావమాశ్రితా:॥

దుష్కృతులు, మూఢులు, నరులలో అధములు, నామాయతో కప్పబడిన జ్ఞానము కలవారు, ఆసురీ భావమును ఆశ్రయించినవారు, ఇటువంటివారు నన్ను ఆశ్రయించలేరు. నన్ను పొందలేరు.

ఎటువంటి వారు పరమాత్మను పొందడం లేరు. పరమాత్మ గురించి తెలుసుకోవడం లేదు అంటే దుష్కృతులు, మూఢులు, నరాధములు, మాయచేత వారిలో ఉన్న జ్ఞానము కప్పబడిన వారు, ఆసురీ భవం కలవారు. వీరంతా నా గురించి తెలుసుకోలేరు. నన్ను పొందలేరు. పైన చెప్ప బడిన లక్షణములు అన్నీ రజస్తమోగుణముల వలన వృద్ధిపొందుతాయి. ఈ రెండు గుణములు మానవులను దానవులుగా, అసురులుగా మార్చి వేస్తాయి. వారు దుష్కృతులు అంటే చెడ్డపనులు, చేయకూడని పనులు చేసేవారు. అటువంటి వారు చేయవలసిన పనులు చేయరు.

కొంత మంది, పరమాత్మ అసలు స్వరూపం తెలుసుకోకుండా, కేవలం దేవాలయాలకు వెళ్లడం, పూజలు చేయడం, నివేదనలు అర్పించడం, దానికి మించిన కోరికలు కోరడం, ఆ కోరికలు తీరకపోతే ఈ దేవుడికి మహిమ లేదనుకోవడం, అక్కడితో ఆగిపోవడం. తనను గురించి కానీ, పరమాత్మగురించి కానీ తెలుసుకోకపోవడం. ఇటువంటి వారు దేవుడిని కేవలం తమ కోరికలు తీర్చుకోడానికి అంటే తమ స్వార్థానికి వాడుకుంటారు తప్ప భక్తితోకాదు. కాని వీరు తమను తాము భగవద్భక్తులము అని చెప్పుకుంటారు. ఆడంబరంతో, ఆర్భాటాలతో, ఇతరుల మెప్పు కొరకు పూజలు చేస్తారు.

ఇంక మూఢులు అంటే వాళ్లకు తెలియదు. ఒకరు చెప్పింది వినరు. వారికి తెలియదు అన్న విషయం వారికి తెలియదు. నాలుగు గ్రంధాలు చదివిన వాడు నాకు అంతా తెలుసు అనుకుంటాడు. అక్కడే ఆగి పోతాడు. మాయలో పడి పోతాడు. సన్మానాలు సత్కారాలు, పొగడ్తలు వీటి మాయలో పడి పోతాడు. తాను ఏం చెబితే అదే వేదం అనుకుంటాడు. అంటే లేనిది ఉన్నట్టు భ్రమించేవాడు. అశాశ్వతమైన ప్రాపంచిక సుఖాలు శాశ్వతము అని భావించి వాటి కోసం పాకులాడేవాడు.

ఇంకా కొంత మంది ఉన్నారు. వారు నరాధమా: అంటే నరులలో అధములు. అధోగతిలో ఉన్నవారు. నరాధములు అంటే తాము మానవులము అనీ, మానవత్వం మన లక్షణము అనీ మరిచిపోతారు. హింసలో మునిగి తేలుతుంటారు. తినడం, తాగడం, స్త్రీసుఖాలు అనుభవించడం, ఇతరులను హింసించడం, మత్తులో నిద్రపోవడం. ఇవే వీరి లక్షణాలు.

ఆసురీభావమాశ్రితా: అంటే ఆసురీ భావము కలవారు. తన ఎదుట అందరూ మరణిస్తున్నా తాను మాత్రం కలకాలం జీవించి ఉంటాను అనే భావన కలవారు. అందుకే అసురుడు ఎవరు తపస్సు చేసినా, తనకు ఎవరి వలనా, దేనివలనా చావు రాకూడదు అనే కోరుకున్నారు కానీ, ఈ జననమరణ చక్రం నుండి విముక్తిని కోరుకోలేదు. కాబట్టి అసురులు అంటే తాము కలకాలం జీవిస్తూ, విషయవాంఛలలోమునిగి తేలాలి అని అనుకునేవారు. వారు విషయారాములు, ఆత్మారాములు కారు. వారికి కామవాంఛలే కానీ, పరమాత్మను గురించి పట్టదు.

ఇలా ఎందుకు జరుగుతుంది. వీరంతా ఇలా ఎందుకు అవుతున్నారు అంటే ఒకే ఒక జవాబు. వారిలో ఉన్న విచక్షణాజ్ఞానమును మాయ కప్పివేసింది. అంటే ప్రతి మానవుడికీ విచక్షణ అంటే మంచి చెడు వివేచన అనే జ్ఞానంఉంది. కాని ఈ రజస్తమోగుణములతోకూడిన మాయ వారి జ్ఞానమును హరించి వేస్తుంది, లేక కప్పివేస్తుంది. మాయ కప్పినపుడు, వారు దుష్కృతులు, మూఢులు, నరాధములు, ఆసురీ భావం కలవారు అవుతారు.

వీరు ఎవ్వరూ మాయ అనే తెరను తొలగించడానికి ప్రయత్నం చేయరు. ఈ మాయను దాటాలంటే శాస్త్రజ్ఞానము, వివేకము, వైరాగ్యము, భగవంతుని మీద భక్తి, శ్రద్ధ, శరణాగతి, భగవంతుని ఆశ్రయించడం కావాలి. దీని కంతా కావాల్సింది శాస్త్ర జ్ఞానము. గురువు దగ్గర నేర్చుకోవడం. సత్యము ఏదో అసత్యము ఏదో తెలుసుకోవడం. అప్పుడు మనను ఆవరించిన మాయ తొలగి పోతుంది. కొంత మంది శాస్త్రములు చదువుతారు జ్ఞానం సంపాదిస్తారు కానీ, రజోగుణము, తమోగుణములతో కూడిన మాయ వారి జ్ఞానమును కప్పివేస్తుంది. దాని ఫలితంగా అంతా తమకు తెలుసు, తమనుమించిన వాడు లేడనుకుంటారు. అందుకే వాళ్లకు దేవుడు కనపడటం లేదు.

## 16. చతుర్విధా భజన్తే మాం జనాస్సుకృతినోऽర్జున।
## ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ॥

ఓ అర్జునా! ఈ లోకంలో ఉన్న సుకృత్తులు(పుణ్యాత్ములు) అయిన మానవులు నన్ను నాలుగు విధాలుగా భజిస్తున్నారు. వారు ఆర్తులు, జిజ్ఞాసువులు, కోరికలు కోరుకునేవారు, జ్ఞానులు,

దుష్కృతులు, మూఢులు, నరాధములు, అసురులు ఏ కాలంలో కూడా భగవంతుని తలచుకోరు. ఒక వేళ తలచుకున్నా వారి భక్తి అంతా తమ స్వార్థంగురించి తప్ప లోక కల్యాణం గురించి కాదు. వారి సంగతి వదిలేస్తే, పుణ్యాత్ములు అయిన వారు భగవంతుని భక్తితో సేవిస్తారు కొలుస్తారు ప్రార్థిస్తారు. కీర్తిస్తారు. వారిలో ఎన్నిరకాలు అనే విషయం ఇక్కడ చెప్పాడుపరమాత్మ. పరమాత్మను ప్రార్థించే వారు నాలుగు రకాలు గా విభజింపబడ్డారు.

1.ఆర్తులు 2. జిజ్ఞాసువు. 3.ధనార్థి. 4. జ్ఞాని.

వీరంతా సుకృతులు, మంచి పనులు చేసేవాళ్లు. వీరి మార్గములలో భేదము ఉన్నప్పటికినీ వీరంతా భగవంతుని ప్రార్థిస్తున్నారు. మొదటి వాడు. ఆర్తుడు. ఎవరికైనా ఏదైనా ఆపద సంభవిస్తే రోగం వస్తే, ఉన్న డబ్బు పోతే, ఎవరి నుండి అయినా ఆపద వస్తుంది అని తెలిస్తే, అప్పుడు భగవంతుడు గుర్తుకు వస్తాడు. అప్పుడు మొక్కులు మొక్కుతారు. పూజలు వ్రతాలు చేస్తామంటారు. ముడుపులు కడతారు. ఈ ఆపద తీరితే నీ వద్దకు వచ్చి మొక్కు తీర్చుకుంటాము అని మొక్కుకుంటారు. ఇటువంటి వారికి భగవంతుడు ఆపదలలోనే గుర్తుకు వస్తాడు. పరమాత్మతో బేరం పెడతారు. నాకు ఈ లాభం కలిగితే, ఈ రోగం తగ్గితే, ఈసుఖం కలిగితే నీకు తలనీలాలు ఇస్తాను, నివేదనలు పెడతాను, మతం మారి పోతాను ఇలాగా. ఈ తరహా జనం మనకు చాలా మంది కనిపిస్తుంటారు. వీరికి ఆపదలు తీరినా కూడా, వేల్పుల మొక్కులు వేయేళ్లు అంటూ దాట వేస్తారు. మొక్కులు తీర్చుకోరు. మరలా ఆపద వస్తే మొక్కులు మొక్కుతారు. ఈ ప్రకారంగా వాళ్ల దగ్గర ముడుపులు చాలా చేరతాయి. ఇటు వంటి వారిని ఆర్తులు అని అంటారు. వీరూ భక్తులే కానీ అవకాశ భక్తులు.

అర్థార్థి అంటే తనకు ధనం రావాలని, సంపదలు రావాలని, తాను కోటీశ్వరుడు కావాలనీ, అందరి ధనం తనకే చెందాలని, అన్ని సుఖాలు తనకే కలగాలనీ, తాను ఎల్లప్పుడూ సుఖంగా, ఆనందంగా ఉండాలనీ, దేవుని నిరంతరము ప్రార్థిస్తుంటాడు. తనకు వచ్చిన లాభాలలో దేవుడికి వాటా కూడా ఇస్తానని బేరం పెడతాడు. వజ్రకిరీటాలు, బంగారు తొడుపులు

చేయిస్తాను అంటాడు. శాలువాలు కప్పుతాను అంటాడు. ఇటువంటి వారు కేవలము ప్రాపంచిక విషయములు, వస్తువులు వీటి గురించి మాత్రమే ఆలోచిస్తూ వాటి కొరకు దేవుని పూజిస్తారు.

పైన చెప్పిన రెండు రకాల భక్తులు సకామ భక్తులు. కోరికల కోసం పరమాత్మను భజించేవారు. మొదటిరకం భక్తులు తమకు ఉన్న కష్టాలు, దు:ఖాలు, రోగాలు పోవాలని పరమాత్మను కోరుకుంటే, రెండవ రకం భక్తులు తమకు లేని ఐశ్వర్యం, సంపదలు, పదవులు రావాలని కోరుకుంటారు.

మూడవ వాడు జిజ్ఞాసువు. ఇతడు భగవంతుని గురించి ఆయన తత్వము గురించి తెలుసుకోడానికి నిత్యం ప్రయత్నం చేస్తుంటాడు. ఇటువంటి వారు చాలా అరుదుగా కనిపిస్తారు. మానవులలో 90 మందికి బయట ప్రపంచంలో కనిపించే వస్తువుల మీద దృశ్యముల మీదా, ఎక్కువ ఆసక్తి ఉంటుంది. కాని లోపల ఉన్న ఆత్మ మీద ఎటువంటి ఆసక్తి ఉండదు. ఈ శరీరమే నేను అనుకుంటూ ఉంటారు. ధన సంపాద. సుఖములు అనుభవించడం, పనికిమాలిన పనులు చేయడం, అనవసర విషయాలను చర్చించడం చేస్తుంటాడు. కాని జిజ్ఞాసువు మాత్రము నేను వేరు ఈ దేహము వేరు అనే భావనతో ఆత్మతత్వము తెలుసుకోడానికి ప్రయత్నం చేస్తాడు. ప్రాపంచిక సుఖాల కోసం దేవుడిని భజించడు. ఎల్లప్పుడు తాను ఎవరు, ఈ లోకానికి ఎందుకు వచ్చాడు. పరమాత్మను ఎలా చేరుకోవాలి? ఇటువంటి ఆలోచనలతోనే ఉంటాడు. ఈ భావన పూర్వజన్మ వాసనల వలననే కలుగుతుంది. ఇటువంటి వారికి కోరికలు ఉంటాయి కానీ ఆ కోరికలు తీరడానికి భగవంతుని ప్రార్థించరు. వారు తమ కోరికలు తీరడానికి భగవంతుని వాడుకోరు. భగవంతుని గురించి తెలుసుకోడానికి ప్రయత్నిస్తారు.

నాలుగవ వాడు జ్ఞాని. ఇతని భక్తి ఉత్తమమైన భక్తి. ఇతడు వేదములు, శాస్త్రములు, పురాణములు బాగా చదువుతాడు. ఉపన్యాసాలు వింటాడు. గురువు దగ్గర చేరి జ్ఞానం సంపాదిస్తాడు. భగవంతుని తత్వము బాగా తెలిసిన వాడు. ఆత్మ శరీరము వీటి గురించి ఎల్లప్పుడూ చింతించేవాడు. ఆత్మయే నిత్యము సత్యము అని నమ్మేవాడు. ఈ శరీరము, ప్రాపంచిక వస్తువులు విషయ వాంఛలు శాశ్వతములు కావు అని నమ్మేవాడు. ఇతనికి ఎటువంటి కోరికలు ఉండవు. కోరికల కొరకు భగవంతుని ప్రార్థించడు. తనకు పరమాత్మకు భేదం లేదు అనే భావనతో ఉన్న వాడు. అందరినీ సమదృష్టితో చూచేవాడు. అందరిలో పరమాత్మను దర్శించేవాడు.

ఈ నాలుగు విధములైన భక్తులు ఏదో విధంగా భగవంతుని స్మరిస్తారు పూజిస్తారు ధ్యానిస్తారు. కొంచెం ఆలోచించి చూస్తే ఈ నాలుగురకములైన భక్తులు ప్రతివాడిలోనూ ఉన్నారు. మొదట తనకు ఉన్న కష్టములను, దు:ఖములను పోవాలని ప్రార్థిస్తారు. కష్టాలు పోగానే సుఖాలమీదికి మనసు మళ్లుతుంది. స్వామీ నాకు సుఖాలు, ధనం, సంసారం ప్రసాదించు అని

ప్రార్థిస్తారు. అవీ లభిస్తాయి. కొంత కాలానికి ఆ సుఖం ముఖం మొత్తుతుంది. ఈ ప్రాపంచికసుఖాలు శాశ్వతములు కావుఅని భావించి, శాశ్వతసుఖం పొందడానికి ప్రయత్నం చేస్తాడు. తుదకు అందరిలో పరమాత్మను, పరమాత్మలో అందరిని చూచే స్థితికి చేరుకుంటాడు. మనసును ఆత్మలో లీనం చేసి ఆత్మానందాన్ని, పరమ శాంతిని పొందుతాడు. ఈ నాలుగు రకములైన భక్తి అందరిలో ఉండటం అసాధ్యం కాని ఉండే అవకాశం ఉంది. వేమనయోగిని ఉదాహరణగా చెప్పుకోవచ్చు. ఈనాలుగు రకములైన భక్తిలో ఏది మంచిది ఏది తక్కువది అనే విషయాన్ని తరువాతి శ్లోకంలో వివరించాడు కృష్ణుడు.

## 17. తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే।
## ప్రియో హి జ్ఞానినో2త్యర్థమహం స చ మమ ప్రియః॥

పైన చెప్పబడిన భక్తులలో ఎల్లప్పుడూ యుక్తుడుగా ఉండేవాడు, పరమాత్మ యందు ఏకాగ్రభక్తి కలిగి ఉండేవాడు, అయిన జ్ఞానికి నేనంటే ఎక్కువ ఇష్టం. అటువంటి జ్ఞాని అంటే నాకూ ఇష్టమే.

పైన చెప్పబడిన నలుగురు భక్తులలో జ్ఞాని ఉత్తముడు అని అంటున్నాడు పరమాత్మ. ఎందుకంటే జ్ఞానిలో పైన చెప్పబడిన ముగ్గురిలో అంటే ఆర్తి, అర్థార్థి, జిజ్ఞాసువులలో లేని గుణాలు ఉన్నాయి.
అవి 1. నిత్య యుక్త, 2. ఏక భక్తి.

నిత్య యుక్తత్వము అంటే నిరంతరము పరమాత్మతో కూడి ఉండటం. పరమాత్మతో సంబంధము పెట్టుకోవడం. ఇతరముల గురించి ఆలోచించకపోవడం. అంటే ఎల్లప్పుడూ ధ్యానంలో ఉంటూ మనసును ఆత్మలో లీనం చేసి ఆత్మానందాన్ని పొందుతుంటాడు. మొదటి ఇద్దరూ కేవలం అవసరం ఉన్నప్పుడు భగవంతుని స్మరిస్తారు. తరువాత తమ తమ కార్యములలో లీనం అవుతారు. మరలా అవసరం వచ్చినప్పుడే భగవంతుడు వారికి గుర్తుకు వస్తాడు. అంటే పార్ట్ టైమ్ అన్నమాట. వారిని అనిత్య యుక్తులు అంటారు. అటువంటి వారు ప్రాపంచిక విషయములలో లీనం అయి ఉన్నప్పుడు వారిలో అజ్ఞానం చేరే అవకాశంఉంది.

కాని జ్ఞాని ఫుల్ టైమ్ వర్కర్. సర్వకాల సర్వావస్థలయందు ఆత్మతో అనుసంధానము అయి ఉంటాడు. ఆత్మానందంలో మునిగితేలుతుంటాడు. అతడికి ఏ సమయంలో కూడా అజ్ఞానం ఆవహించే అవకాశం లేదు. అందుకే జ్ఞానిని నిత్యయుక్తుడు అని అన్నారు. అనిత్య యుక్తులుగా ఉన్నవారు కూడా మొదట కేవలము కోరికల కోసం భగవంతుని స్మరించినా, క్రమక్రమంగా

భగవంతుని మీద ఆసక్తి పెంచుకొని జ్ఞానులు అయ్యే అవకాశం ఉంది. కాని వారు ఆ దిశగా ప్రయత్నం చేయాలి. రోజూ ధ్యానం చేయాలి. మనస్సును ప్రాపంచిక విషయముల నుండి క్రమక్రమంగా భగవంతుని వైపు మళ్లించాలి. అంతే కానీ ఇది నా వల్లకాదు అని నిరాశ పడకూడదు. ప్రయత్నం అన్ని విధాలా మంచిది.

ఇంక జ్ఞాని రెండవ లక్షణం ఏకభక్తి. ఏకాగ్రత. ఒకే పరమాత్మ. రోజుకో దేవుడిని ప్రార్థించడు. అతని లక్ష్యం ఆత్మానందాన్ని పొందడమే. ఒక్క పరమాత్మను తప్ప వేరే ఎవరినీ పూజించడు. అదే ఏకాగ్రభక్తి. కాని 90మందికి ఇది సాధ్యంకాదు. కొంతమందికి ధనం మీద, పదవుల మీద, అధికారము మీదా, సుఖాల మీద, వాటిని తనకు ప్రసాదించే దేవతల మీదా, భార్యసంతానము మీదా, బంధుమిత్రుల మీదా, వారి వారి అవసరానికి పనికివచ్చే దేవుళ్ల మీదా భక్తి ఉంటుంది. ఎప్పటికప్పుడు అవసరానికి తగ్గట్టు భక్తి మారిపోతూ ఉంటుంది. వారి మనస్సు చంచలంగా ఉంటుంది. ఎక్కడా, దేని మీదా నిలువదు. గెంతుతూ ఉంటుంది. దానిని ఏకాగ్రభక్తి అనరు. ధ్యానం చేయడానికి ఇటువంటి భక్తి పనికిరాదు. జ్ఞాని అయినవాడు పరమాత్మయందే దృష్టి పెట్టాలి. అతని దృష్టిచెదిరి పోకూడదు. ఏకాగ్రంగా ఉండాలి. అందుకే జ్ఞానిని ఉత్తముడు అని అన్నాడు.

చాలా మందికి ఒక దురభిప్రాయం ఉంది. కలియుగంలో కేవలం హరినామ స్మరణ చేస్తే చాలు. అదే భక్తి. ఇంక ఏమీ అక్కరలేదు. దానికి ఉదాహరణగా గోపికలను చెబుతారు. శ్రీహరినామ స్మరణ చేయడం, కీర్తించడం, పాటలు పాడటం, ఇదే భక్తి అనుకుంటారు. కాని ఇది భక్తి కి మార్గమే కానీ ఏకాగ్రభక్తి కాదు. అంటే జ్ఞానికి ఇది ప్రాధమిక విద్య మాత్రమే. తరువాత సెకండరీ విద్య, తరువాత ఉన్నత విద్య కూడా ఉన్నాయి. అప్పుడే అతడు జ్ఞాని అవుతాడు. అంటే, అంతకు ముందు పాప జీవనం గడిపినవాడు, పాపాలు చేయడమే వృత్తిగా కలవాడు, పైన చెప్పిన పనులు అంటే భజనలు చేయడం, కీర్తనలు పాడటం, నృత్యం చేయడం, పూజలు, వ్రతాలు చేయడం ఇత్యాదులు చేస్తే వాడికి ఆ పాపపుపనుల నుండి విముక్తి లభించి, మనసు భగవంతుని మీదికి మళ్లుతుంది. మంచి గురువును ఆశ్రయిస్తాడు. శాస్త్రములు చదువుతాడు. జ్ఞానం సంపాదిస్తాడు. క్రమక్రమంగా అతడి మనసు ధ్యానం మీదికి మళ్లుతుంది. అది ఒక జన్మలో కాదు. ఎన్నో జన్మలు కావాలి. ఒక జన్మలో చేసింది మరుజన్మలో కొనసాగించాలి. దీనిని తెలుసుకోకుండా కేవలం భజలనుచేసి కీర్తనలు పాడితే మోక్షం వస్తుంది అని, అదే ఏకాగ్రభక్తి అని అనుకోవడము పొరపాటు. అటువంటి భక్తికూడా అవసరమే కానీ అది జ్ఞానికి తొలిమెట్టు మాత్రమే.

అందుకే పరమాత్మ ఈ శ్లోకంలో స్పష్టంగా పైనచెప్పబడిన లక్షణములు ఉన్న జ్ఞానికి అంటే నిత్యయుక్తుడు అయిన జ్ఞానికి, అంటే ఎల్లప్పుడు పరమాత్మలో మనసును లీనం చేసి ఆత్మానందాన్ని అనుభవిస్తున్న జ్ఞానికి, నేను ఎంతో ఇష్టుడను అని చెప్పాడు.

చాలా మంది నేను దేవుడిని పూజిస్తున్నాను, భగవంతుని కొలుస్తున్నాను. పరమాత్మను ధ్యానిస్తున్నాను, నాకు దేవుడి మీద చాలా భక్తి అని అంటూ ఉంటారు. అంటే వారి దృష్టిలో దేవుడు వేరు, భక్తుడు వేరు అని భావన. ఆ భావన ఉన్నంత వరకు అతడు జ్ఞాని కాలేడు. నాకు పరమాత్మకు భేదం లేదు. అహం బ్రహ్మాస్మి అనే స్థితికి వస్తేకాని అతడు జ్ఞాని కాలేడు. అటువంటి జ్ఞానికి నేనంటే ఎంతో ఇష్టం. ఆ జ్ఞాని కూడా నాకు ఎంతో ఇష్టుడు అని చెప్పాడు కృష్ణుడు.

## 18. ఉదారా: సర్వ ఏవైతే జ్ఞానీత్వాత్మైవ మే మతమ్।
## ఆస్థిత: స హి యుక్తాత్మా మామేవానుత్తమాం గతిమ్॥

ఆర్తులు, అర్థార్థులు, జిజ్ఞాసువులు, జ్ఞానులు అనే నాలుగు విధములైన భక్తులు అందరూ ఉదారులే అంటే మంచివారే అని నా అభిప్రాయము. కానీ, వారిలో జ్ఞాని అయిన వాడు, ఎల్లప్పుడూ నాయందే మనసు నిలిపి, నా యందు యుక్తుడై, నాగురించే ధ్యానిస్తూ, నన్ను పొందడానికే నిరంతరము తపిస్తుంటాడు. నన్నే ఉత్తమ గతిగా ఆశ్రయించుకొని ఉంటాడు. అతడే యుక్తమైన స్థిరమైన మనస్సు, బుద్ధి కలవాడు. అతనికి నాకు భేదములేదు.

పరమాత్మ పైన చెప్పబడిన నాలుగు రకాల భక్తులలో జ్ఞాని అనే వాడు ఉత్తముడు. ఆ జ్ఞానిలో నేను ఉన్నాను. అతడే నేను. ఎందుకంటే అతని చిత్తము ఎల్లప్పుడూ నాయందే నిలిచి ఉంటుంది. అతనికి నాకు భేదము లేదు. అంటే మిగిలిన వారు ఎందుకూ పనికిరాని వారు కాదని అర్థం. ఏదో విధంగా వారు కూడా భగవంతుని పూజిస్తున్నారు ధ్యానిస్తున్నారు. వారికి కూడా అంతో ఇంతో ఫలితం లభిస్తుంది. అందుకే ఉదారా: సర్వ ఏవైతే అంటే వారు అందరూ ఉదారులే. మంచి వారే. భక్తులే. కాని జ్ఞానీతు ఆత్మ ఏవ మే మతమ్ వారిలో జ్ఞాని అనే వాడు నేనే అని నా అభిప్రాయము. ఎందుకంటే మిగిలిన వారు ఎల్లప్పుడూ బయట ప్రపంచంలో తిరుగుతూ తానెవరో తెలుసుకోలేకపోతున్నారు. జ్ఞాని బయట ప్రపంచాన్ని విడిచిపెట్టి ఆత్మావలోకనం చేసుకుంటూ తన చిత్తమును ఆత్మలో లగ్నం చేస్తున్నాడు. తానే బ్రహ్మ స్వరూపుడు అవుతున్నాడు. నాలో లీనం అవుతున్నాడు. కాబట్టి అతడే నేను అని అంటున్నాడు పరమాత్మ. అందుకే యుక్తాత్మా అంటే నా యందే తన మనసును నిలిపినవాడు కాబట్టి అతడు ఉత్తమగతులను పొందుతాడు.

నాలుకు రకాలైన భక్తులు నాకు ఇష్టమే కానీ వారిలో జ్ఞాని అంటే నాకు చాలా ఇష్టం అన్నాడు పరమాత్మ. మనకు కూడా నాలుగు విధములైన విద్యలు ఉన్నాయి. ప్రాథమిక విద్య. మాధ్యమిక విద్య, ఉన్నత విద్య, అత్యున్నత అంటే పరిశోధనా విద్య.(పిహెచ్.డి). ఇవి అన్నీ అవసరమే. ఒకటి చదివితే కానీ మరొకటి రాదు. ఒకేసారి ఉన్నత విద్యకు, పరిశోధనా విద్యకు ఎగబాకలేము. ముందు ప్రాథమిక విద్యతో మొదలు పెట్టి, తరువాత ఒక్కొక్కమెట్టు పైకి ఎక్కాలి. తండ్రికి యల్‌కేజీ బాలుడు

ఎంత ముద్దువస్తాడో, పిహెచ్.డీ చదివిన కొడుకూ అంతే ముద్దువస్తాడు. కాకపోతే కాస్త ఎక్కువ. ప్రతి తండ్రి తన కుమారుడు పిహెచ్.డీ కావాలని కోరుకుంటాడు. (గమనిక...కొడుకు అంటే కూతురు అని కూడా అర్థం చేసుకోవాలి.) అదే పరమాత్మ చెబుతున్నాడు. ఈ నాలుగురకములైన భక్తులు నాకు ఇష్టమే కానీ జ్ఞాని అంటే నాకు ఎంతో ఇష్టం. అందరూ జ్ఞానులు కావడానికి ప్రయత్నం చేయండి అని బోధిస్తున్నాడు.

ఈ శ్లోకంలో రెండు రకాల భక్తి గురించి చెప్పబడింది. కొందరు ప్రాపంచిక విషయాలలో ఉంటూ భగవంతుని ధ్యానిస్తుంటారు. కోరికలు కోరుతుంటారు. వారి దృష్టిలో వారు వేరు భగవంతుడు వేరు. వారికి భగవంతుడు కేవలం కోరికలు తీర్చడానికే పరిమితం. మరికొందరు భగవంతుని కోరికలు కోరరు. భగవంతునే కోరుకుంటారు. తానే భగవంతుడు అని అనుకుంటారు. భగవంతుని యందే తన చిత్తమును లగ్నం చేస్తారు. తానే భగవంతుడిగా మారి పోతారు. నాలుగు పురుషార్థములలో ధర్మఅర్థకామములను వదిలిపెట్టి ఆఖరుది అయిన మోక్షమునే కోరుకుంటారు. పరమాత్మలో లీనం అయి పోతారు. ఇదే అద్వైత స్థితి. తనకు పరమాత్మకు తేడాలేదు అనే భావన. వారే జీవన్ముక్తులు. కర్మ,భక్తి,ధ్యానము తుదకు సాధకుని ఈ స్థితికి తీసుకొని వెళతాయి. మరి ఈ స్తితి ఎలా కలుగుతుందో ఈ కింది శ్లోకంలో వివరిస్తున్నాడు.

### 19. బహూనాం జన్మనామన్తే జ్ఞానవాన్మాం ప్రపద్యతే।
### వాసుదేవస్సర్వమితి స మహాత్మా సుదుర్లభః॥

జ్ఞాని కావాలంటే ఒక జన్మ సరిపోదు. ఎన్నో జన్మల తరువాత కానీ జ్ఞాని కాలేడు. అటువంటి జ్ఞానికి ఈ ప్రపంచం అంతా వాసుదేవ మయం అవుతుంది. అటువంటి వాళ్లు ఉండటం చాలా దుర్లభం. అరుదుగా ఉంటారు.

మనం ఇంతకు ముందు ఎన్నో జన్మలు ఎత్తి ఉంటాము. ఆ జన్మల పుణ్య ఫలితంగా మానవ జన్మ వచ్చింది. కాని ఎవరూ మరలా జన్మ లేకుండా ముక్తి కొరకు ప్రయత్నం చేయడం లేదు. కొంత మంది ఇహలోక సుఖాలు, భోగాలు అనుభవించడం కొరకు ఆరాటపడుతుంటే, మరి కొంత మంది స్వర్గలోక సుఖాల కొరకు యజ్ఞములు, యాగములు చేస్తున్నారు. ఇంకా కొందరు వచ్చేజన్మ మంచి రావాలని మరో మంచి జన్మకోసం ఆరాటపడుతున్నారు. ఈ మానవులలో అతి కొద్ది మంది మాత్రమే ఈ జనన మరణ చక్రం నుండి ముక్తి కొరకు ప్రయత్నం చేస్తున్నారు. ఒక్కొ జన్మలో కొద్ది కొద్దిగా పుణ్యం సంపాదించుకుంటూ, పోగుచేసుకుంటూ, జ్ఞానం సంపాదించుకొని, గతజన్మ వాసనలనుపోగొట్టు కుంటూ తుదకు పరమాత్మకు తనకు భేదం లేదు అనే స్థితికి చేరుకుంటున్నారు. అప్పుడు సర్వం పరమాత్మ మయంగా కనిపిస్తుంది.

కాబట్టి ఆత్మ జ్ఞానం రావడానికి ఎన్నోజన్మలు ఎత్తాలి. ఆయాజన్మలలో కొద్ది కొద్దిగా జ్ఞానం సంపాదించుకోవాలి. పురుష ప్రయత్నం చేయాలి. సాధన చేయాలి. అప్పుడే ముక్తి వస్తుంది. అటువంటి వాళ్ల ఎక్కడో ఒక్కరు ఉంటారు. కాబట్టి అందరూ ప్రయత్నం చేయాలి. లక్షల్లో ఒకడికి వచ్చే లాటరీ టిక్కట్టును, ఆ లాటరీ తనకే తగులుతుంది అనే ఆశతో కొనంగా లేనిది, ఆ ముక్తి నాకే వస్తుంది అని ముక్తి కొరకు ఎందుకు ప్రయత్నించకూడదు. ఆ ముక్తి మనకే వస్తుంది అని ఎందుకు అనుకోకూడదు.

ఇక్కడ ఒక చిన్న సందేహము వస్తుంది. అబ్బో! ఎన్నో జన్మల తరువాత వచ్చే ముక్తి కోసం ఇప్పటి నుండే ఎందుకు తాపత్రయపడటం దండగ అని చేతులుముడుచుకొని కూచోకూడదు. ఎందుకంటే, ఎప్పుడో 21 ఏళ్ల తరువాత వచ్చే ఇంజనీరింగ్ డిగ్రీకి ఇప్పటి నుండే చదవడం ఎందుకు అని ఊరికే కూర్చోవడంలేదుగా! 5వ ఏటనుండి ఎబిసిడి లతో చదువు మొదలు పెడుతున్నాము కదా! (పైగా ఒకటో క్లాసునుండి ఐఐటి కోచింగులు ఇచ్చే స్కూళ్లు కూడా వెలిసాయి.) ఇదీ అలాగే అనుకోవాలి. ఇప్పటి వరకు ఎన్ని జన్మలు గడిచిపోయాయో! ఏమో! ఇదే ఆఖరుజన్మేమో. ఎవరు చూచారు. కాబట్టి ఇప్పుడే ఈ రోజునుండే ప్రయత్నం మొదలెట్టాలి.

సరే! ప్రయత్నం చేసాము. మరి మనకు జ్ఞానం వచ్చిందా లేదా అని ఎలా తెలిసేది అనే సందేహము. దానికి ఒక చిన్న పరీక్ష పెట్టాడు భగవానుడు. అటువంటి జ్ఞానికి వాసుదేవస్సర్వమితి అంటే సర్వము వాసుదేవ మయంగా కనపడుతుంది. వాసుదేవుడు అంటే వసుదేవుని కుమారుడు, కృష్ణుడు అని చాలామంది చెబుతారు. అది నిజమే. ఇక్కడ వాసుదేవుడు అంటే "వాసనాత్ వాసుదేవస్య వాసితంతే జగత్రయం, సకల భూత నివాసోసి శ్రీ వాసుదేవ నమోస్తుతే" అంటే ఈ మూడు లోకములు అంతా నిండి ఉన్నవాడు, మూడులోకములలో నివసించేవాడు, సకల భూతములలో ఆత్మస్వరూపంగా ఉన్నవాడు అని అర్థం. ఈ భావన మనకు కలిగినపుడు మనం జ్ఞానులము అయినట్టు లెక్క. కాబట్టి రాగద్వేషములను, భేదభావములను వదిలిపెట్టి అందరిలో పరమాత్మను ఆత్మస్వరూపుడుగా చూడగలిగితే మనం కూడా జన్మరాహిత్యానికి క్వాలిఫై అయినట్టే. అది ఈ జన్మలోనే కావచ్చు.

కాబట్టి అందరం ఈ పోటీ పరీక్షకు ప్రిపేర్ అవుదాము. మొదట్లో భక్తుడు, దేవుడు గుడిలోనే ఉన్నాడు అని అనుకుంటాడు. తరువాత దేవుడు అంతటా ఉన్నాడనుకుంటాడు. తరువాత దేవుడు అందరిలో ఉన్నాడనుకుంటాడు. తరువాత దేవుడు తనలోనూ, అందరిలోనూ ఉన్నాడనుకుంటాడు. ఆఖరున నేనే బ్రహ్మను అని అనుకుంటాడు. అంతా బ్రహ్మమే అనే స్థితికి వస్తాడు. అ స్థితి మనకు ఇప్పుడే కలగవచ్చు. ఈ జన్మలోనే కలుగవచ్చు. మనకు ఎన్నోజన్మల తరువాత కలుగుతుంది అనబడే ఈ జ్ఞానం ఇప్పుడు ఈ జన్మలో కలుగుతుందేమో! ప్రయత్నిద్దాము!

అటువంటి వారిని మహాత్ముడు, జ్ఞాని అని అన్నాడు పరమాత్మ. ఈ స్థితికి రావడం చాలా కష్టము, దుర్లభము అయినా మనందరం ఈ జన్మలోనే మహాత్ములు, జ్ఞానులు కావడానికి ప్రయత్నం చేద్దాము.

ఇక్కడి నుండి కృష్ణపరమాత్మ భక్తిలో ఉన్న రకాల గురించి చెబుతున్నాడు. భక్తి రెండు రకాలు అని మనం తెలుసుకున్నాము. ఒకటి సకామ భక్తి. రెండవది నిష్కామ భక్తి. సకామ భక్తి అంటే దేవుడిని మన కోరికలు తీరడానికి ఉపయోగించుకోవడం. దేవుడితో బేరాలు ఆడటం. నాకు అది చేస్తే నీకు ఇది చేస్తా అని మొక్కడం. అప్పుడు నేను వేరు దేవుడు వేరు అనే భేదభావంతో ఉంటాడు మానవుడు. రెండవది నిష్కామ భక్తి. ఇది దేవుని కొరకు భక్తి. నీవే తప్ప ఇతఃపరం బెరుగ. నాకు నువ్వు తప్ప ఈ ప్రాపంచిక సుఖాలు అక్కరలేదు అనే భక్తి. ఆఖరు భక్తి నేను పరమాత్మ ఒకటే వేరు వేరుకాదు అహం బ్రహ్మోస్మి అనే తాదాత్మ్యభక్తి. మొదట సకామ భక్తి గురించి తెలుసుకుందాము.

## 20. కామైస్తైస్తైర్హృత జ్ఞానా: ప్రపద్యన్తేఽన్యదేవతాః।
## తం తం నియమమాస్థాయ ప్రకృత్యా నియతాస్స్వయా॥

మానవులు తమ తమ సంస్కారములను అనుసరించి, తమ మనసులో పుట్టిన ఆయా కోరికలు తీరడానికోసం, తమ వివేకమును మరిచిపోయి, పరమాత్మను తప్ప, ఆయా రకములైన ఇతర దేవతలను, వారి కొరకు నియమింపబడిన ఆయా పూజా విధానములను అనుసరించి పూజిస్తుంటారు.

ఇప్పుడు ఒక ప్రశ్న వస్తుంది. పరమాత్మ ఎవరు. ఇతర దేవతలు ఎవరు. విష్ణుపురాణంలో విష్ణువునే పూజించమన్నారు. దేవతా గణములకు ఏ సమస్య వచ్చినా అందరూ విష్ణువు దగ్గరకే వెళతారు. ఆయనను సలహా అడుగుతారు. శివపురాణంలో శివుడిని పూజించమన్నారు. అందరూ ఆయన దగ్గరకే వెళ్లి ఆయన చెప్పిన ప్రకారం చేస్తారు. ఇంకా కొందరు దేవీ పురాణం చదివి దేవీ పరాశక్తిని ముఖ్య దేవతగా భావిస్తారు. ఆ పరాశక్తి నుండి బ్రహ్మవిష్ణుమహేశ్వరులు ఉద్భవించారు అని నమ్ముతారు. భాగవత పురాణం చదివి శ్రీకృష్ణుడే అసలైన దైవం అని కొందరు నమ్ముతారు. ఈ విధంగా ఇన్నిపురాణాలలో ఇన్ని దేవతల గురించి ఎందుకు చెప్పబడింది.

ఇక్కడ ఒక్క విషయంమనం గమనించాలి. ఈ పురాణాలు అన్నీ రాసింది ఒకరే. ఆయనే వ్యాసుడు. మరి వ్యాసుడు ఇన్ని పురాణాలు రాసి ఇంతటి సందిగ్ధతను ఎందుకు పెట్టాడు అని మనకు ఒక సందేహం రావచ్చు. మానవులంతా ఒకేరకంగా లేరు. సత్వ, రజస్తమోగుణముల

కలయికతో ఉన్నారు. ఒక్కొక్కరి భావజాలం ఒక్కొక్కవిధంగా ఉంటుంది. ఆ కారణంచేత ఎవరికి తగ్గట్టు వారికి పురాణాలు రాసి పెట్టాడు వ్యాసుడు. అసలు ఉద్దేశ్యం ఏమిటంటే నిరాకారుడు, నిర్గుణుడు, నిర్వికారుడు అయిన పరమాత్మను గురించి తెలుసుకోవడానికి వివిధములైన మార్గాలు సూచించడమే కానీ, ఆ దేవుడు గొప్ప, ఈ దేవుడు గొప్ప అని భేదభావాలు పెంచుకొని, కొట్టుకోడానికి కాదు అని మనం అర్థం చేసుకోవాలి. ఈ నేపథ్యంలో ఈ కింది శ్లోకాలు అర్థం చేసుకోవడానికి ప్రయత్నం చేద్దాము.

ఇక్కడి నుండి వ్యాసుడు, కృష్ణుడు అర్జునుడికి చెప్పినట్టు, భక్తి గురించి చెప్పడం ప్రారంభించాడు. భక్తి అంటే రెండు రకాలైన భక్తి అని ఇదివరకే తెలుసుకున్నాము. మొదటిది.... ప్రాపంచిక విషయాల గురించి మనం కోరుకునే వివిధములైన కోరికలు తీరడానికి భగవంతుడిని వేడుకునే, వాడుకునే భక్తి. దీనినే సకామ భక్తి అని అంటారు. రెండవది..... ఎటువంటి కోరికలు లేకుండా, కేవలం భగవంతుడిని పొందడం కోసం భగవంతుడిని అనునిత్యం స్మరిస్తూ, భగవంతుని మీద భక్తి కలిగి ఉండటం. ఇది నిష్కామ భక్తి.

సాధారణంగా మానవులలో ఎక్కువ మంది ఎల్లప్పుడూ ఏదో ఒక కోరిక కోరుకుంటూనే ఉంటారు. ఆ కోరికలు తీరడానికి వివిధములైన దేవుళ్లను దేవతలను పూజిస్తూ ఉంటారు. అన్ని ఇచ్చే పరమాత్మను వదిలి పెట్టి, కేవలం ప్రాపంచిక మైన కోరికలు తీరడం కొరకు రకరకాల దేవతలను, వారి వారికి నిర్ణయించబడిన విధానాలతో పూజించడం మొదలుపెడతారు. (ఉదాహరణకు రుద్రాభిషేకం, సత్యనారాయణవ్రతం, వరలక్ష్మీవ్రతం, వినాయక వ్రతం, షోడశోపచార పూజలు ప్రత్యంగిరాదేవి హెూమం, సాయిబాబా హారతులుచ నిర్ణీత సంఖ్యలో ప్రదక్షిణాలు, మొదలైనవి) ఇవన్నీ చేసి, ప్రాపంచిక సంబంధమైన రకరకాలైన కోరికలు కోరుతుంటారు. ఆయా దేవతలు కూడా వారి శక్తిమేరకు వారి కోరికలు తీరుస్తూ ఉంటారు. అవి తీరగానే కొత్త కోరికలు పుట్టుకొస్తాయి. ఆ ప్రకారంగా కేవలం తమ కోరికలు తీర్చుకోవడం కోసమే దేవుడి మీద భక్తి కలిగి ఉంటారు.

అందుకే అపహృతజ్ఞానా: అన్నాడు వ్యాసుడు. అంటే వారిలో ఉన్న విచక్షణా జ్ఞానము ప్రాపంచికమైన కోరికలతో అపహరింపబడింది అని అర్థం. అంటే ఈ కోరికలు దొంగల వంటివి. ఈ దొంగలు మన మనసులో ప్రవేశించి సర్వవ్యాపకుడు అయిన పరమాత్మ ఒక్కడే అనే జ్ఞానమును అపహరించి, మన మనసును తమ వైపుకు తిప్పుకుంటాయి. అక్కడ దేవుడికి మహిమ ఉందంటే అక్కడకు, ఈ దేవుడికి మహిమ ఉందంటే ఈ దేవుడి వద్దకు పరుగులు పెడుతుంటాయి. ఆ యా దేవతలకు సంబంధించిన పూజలు వ్రతములు చేస్తుంటారు. ఆ కారణంగా వారిలో ఉన్న ఆత్మను గురించిన జ్ఞానము హరించుకుపోతుంది.

ఇక్కడ ఇంకొక మాట కూడా అన్నాడు వ్యాసుడు. తం తం నియమమాస్థాయ ... ఈ సకామ భక్తులు అంటే ఏవేవో కోరికలు తీరడానికి వివిధములైన దేవతలను పూజించేవారికి ఎన్నో నియమాలు ఉంటాయి. మూడు, ఐదు, ఏడు, తొమ్మిది, పదకొండు రకాల పిండి వంటలు నివేదనపెట్టాలి. ఇన్ని సార్లు ఇన్ని మంత్రాలు చదవాలి. ఇన్ని ప్రదక్షిణాలు చేయాలి. ఇన్ని సార్లు జపం చేయాలి. ఇంకొంత మంది తాము జపాలు చేయడానికి బద్ధకిస్తారు. వారికి తీరిక ఓపిక ఉండవు. ఇతరులను పెట్టి జపాలు చేయిస్తారు. మేము ఇంతమందిని పెట్టి జపాలు చేయించాము అని గొప్పలు చెప్పుకుంటారు. మరి కొందరి ఇళ్లలో ప్రతి మాస శివరాత్రికి రుద్రాభిషేకం చేయిస్తారు. ఆ సమయంలో అయ్యగారు ఆఫీసులో ఉంటారు. అమ్మగారు టివి సీరియల్ చూస్తుంటారు. పురోహితుడు రుద్రాభిషేకం చేస్తుంటాడు. ఈ ప్రకారంగా ఏదో నియమం కోసం చేయడం తప్పితే, శ్రద్ధ భక్తి ఉండవు.

కాని పరమాత్మను సేవించడానికి ఇటువంటి నియమాలు ఏమీ లేవు. కేవలం పరమాత్మ మీద భక్తి, ఏకాగ్రత, శ్రద్ధ ఉంటేచాలు. అనిచెప్పిపూజలు, వ్రతాలు, రుద్రాభిషేకాలు చేయకూడదని తప్పుగా అర్థం చేసుకోకూడదు. అవి అన్నీ చేయాల్సిందే. కాకపోతే ఆర్భాటంగా కాకుండా, స్వయంగా, భక్తితో, శ్రద్ధతో, ఏకాగ్రతతో చేయాలి. అప్పుడే దానికి తగిన ఫలితం లభిస్తుంది.

ఎందుకంటే, ప్రాథమిక దశలో ఇవన్నీ అవసరమే. పూజలు, వ్రతాలు, సగుణోపాసన మంచివే. ఇవన్నీ కావాల్సిందే. కాని శ్రద్ధ, భక్తి, ఏకాగ్రతలతో, సగుణోపాసన చేసుకుంటూ క్రమ క్రమంగా పైకి ఎదగాలే కానీ, అక్కడే ఉండిపోకూడదు. ఒకటో క్లాసు చాలా బాగుందని, అక్కడ బొమ్మల పుస్తకాలు ఉంటాయనీ, బొమ్మలు చూపిస్తూ, కథలు చెబుతుంటారనీ అక్కడే ఉండి పోము కదా. క్రమక్రమంగా ఎదుగుతూ, ఒకటో క్లాసు నుండి పిజి దాకా వెళతాము. అలాగే మానవుడు సగుణోపాసన నుండి నిర్గుణోపాసనకు ఎదగాలి. అక్కడి నుండి ధ్యానం ద్వారా మనసును ఆత్మలో నిలపాలి. ఆత్మ పరమాత్మలో లీనం కావాలి.

కాని సామాన్య మానవుల యొక్క భక్తి, పూజలు వ్రతములు ఆరాధనల యొక్క లక్ష్యము కేవలం వారి కోరికలు నెరవేరడమే కాని మోక్షము కాదు. సామాన్య మానవులు, అవివేకులు అయిన వారు, ఈ ప్రకారంగా చేస్తుంటారు. కానీ కేవలము మోక్షము కావాలని సాధన చేసే వారు నిర్గుణుడు, నిరాకారుడు, నిర్వికల్పుడు, అవ్యయుడు అయిన పరమాత్మను తక్క ఇతరము లైన దేవతలను ఆరాధించరు. ఎందుకంటే వారికి కోరికలు ఉండవు. కోరికలు ఉంటేనే కదా! ఆ కోరికలు తీరడానికి ఈ విధంగా వివిధములైన దేవతలను పూజించేది! మోక్షము కావాలంటే కోరికలను విడిచిపెట్టాలి. అప్పుడు ఇటువంటి కోరికలతో కూడిన పూజలకు ఆస్కారం ఉండదు. ఆత్మజ్ఞానము కలిగిన వారు, ఏ పూజ చేసినా ఏ దేవుడిని ఉపాసించినా, అది కేవలం పరమాత్మలో ఐక్యంకావడానికే కాని వేరు కాదు.

మానవుడు ప్రాపంచిక విషయములలో, విషయ వాంఛలలో మునిగి తేలుతుంటే, అటువంటి వారి కోరికలు మనిషిలోని జ్ఞానమును హరిస్తాయి. అజ్ఞానంలో పడవేస్తాయి. ఆ అజ్ఞానంలో పడకుండా సాధకుడు తగుజాగ్రత్త వహించాలి.

## 21. యో యో యాం యాం తనుం భక్త: శ్రద్ధయార్చితుమిచ్ఛతి
## తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహమ్॥

ఏయే భక్తులు ఏయే దేవతలను, ఏయే విధంగా ఆరాధించినా, వారి వారికి ఆయాదేవతల మీద భక్తి, శ్రద్ధ స్థిరంగా ఉండేటట్టు నేను చేస్తున్నాను.

ఈ శ్లోకంలో అజ్ఞానంలో ఉన్న వారు, వివిధములైన దేవతలను, వారి కోరికలు తీరడం కొరకు ఆరాధించేవారి గురించి చెబుతున్నాడు పరమాత్మ. అటువంటి వారు ఒక దేవుడితోనూ, ఒక దేవతతోనూ తృప్తి పడరు. వారి శ్రద్ధ, భక్తి, ఒక దేవుడి నుండి మరొక దేవుడికి మారుతుంటుంది. కొంత కాలం ఒక దేవుడు, ఆయనకు మహిమ లేదని, ఆ దేవుడు తన కోరికలు తీర్చడం లేదని తెలిసి మరొక దేవుడు, ఆ తరువాత మరొకరు ఇలాగా నిలకడ లేకుండా తమ తమ కోరికలు తీరడానికి వివిధములైన దేవతలను ప్రార్థిస్తూ ఉంటారు.

ఉదాహరణకు అమెరికా వీసా కావాలంటే చిలుకూరు బాలాజీని పూజించాలి. ఆయనకు ఏకంగా వీసాల వేంకటేశ్వరస్వామి అని పేరు కూడా పెట్టారు. అమెరికా వీసా కావాలంటే వారు పెట్టు నిబంధనలను అనుసరిస్తే చాలు. దానికి చిలుకూరు బాలాజీకి ఏమి సంబంధం అని ఆలోచించరు. ఎవడో ఒకడికి వచ్చింది కాబట్టి నాకూ వస్తుంది అనే భావన. ఈ ప్రకారంగా తమ తమ కోరికలు తీరడానికి వివిధములైన దేవతలను మార్చిమార్చి ఆరాధిస్తుంటారు. ఎక్కడ ఏ దేవుడికి మహిమ ఉందని చెబితే అక్కడకు పరుగులు తీస్తుంటారు.

కాని, ఈ ప్రకారంగా కేవలము తమ కోరికలు తీరడానికి వివిధములైన దేవతలను ఆరాధించినప్పటికినీ, ఆ యా దేవతలను శ్రద్ధతో, భక్తితో, విశ్వాసంతో, ఏకాగ్రతతో కొలిస్తే, వారు కూడా పరమాత్మ దయకు అర్హులే. వారు చేసిన వ్రతములకు, పూజలకు తగిన ఫలితములు మాత్రమే వారికి దక్కుతాయి. కాకపోతే వారి కోరికలు ధర్మబద్ధము అయి ఉండాలి. అక్రమము, అసాంఘికము, ఇతరులకు హాని చేసే కోరికలు ఏ దేవుడిని పూజించినా తీరవు.

కాని ఈపూజలు వ్రతాలు ఎలా చేయాలి అనే విషయం ఇక్కడ స్పష్టంగా చెప్పాడు. శ్రద్ధయార్చితు మిచ్ఛతి. ఏ యే దేవతలను శ్రద్ధతో అర్చిస్తాడో అని అన్నాడు. అంటే ఏ దేవతను

పూజించినా ఏ వ్రతము చేసినా, ఎలా ఆరాధించినా వాటిలో శ్రద్ధ భక్తి ఏకాగ్రత ఉండాలి. మనం చేసే పూజలలో వ్రతాలలో ఆ శ్రద్ధ, భక్తి, ఏకాగ్రత లోపిస్తుంది. అందుకే మనకు తగిన ఫలితములు రావడం లేదు. మనం ఏ దేవతను పూజించినా, తగిన శ్రద్ధతో పూజిస్తే, ఆయాదేవతల మీద మనలో ఉన్న శ్రద్ధను పరమాత్మ ఇంకా ఎక్కువ చేస్తాడు. తస్య తస్యాచలాం శ్రద్ధాం వారి వారికి తగిన శ్రద్ధలను అచలాం చలింపకుండా ధృఢంగా చేస్తాడు. ఆ శ్రద్ధను స్థిరంగా ఉంచుతాడు. కాబట్టి మనం ఏ పూజచేసినా, వ్రతం చేసినా భక్తి శ్రద్ధలతో చేయాలి.

ఇక్కడ ఒక మాట చెప్పుకోవాలి. వివేకానందుల వారు ఒక మాట అన్నారు. మనం బట్టల షాపుకు వెళ్లి నీవు కోరిన షర్టుతీసుకోవచ్చు ఆ స్వేచ్ఛ హిందువులకు ఉంది. కాని ఇతర మతస్థులకు ఆ స్వేచ్ఛలేదు. అక్కడ ఒకే షర్టు ఉంటుంది. నీకు పట్టినా పట్టకపోయినా అదే షర్టు తొడుక్కోవాలి. అదే పట్టించుకోవాలి. హిందువులు తమ ఇష్టం వచ్చిన దేవుడిని దేవతను ఆరాధించవచ్చు ఆ స్వేచ్ఛ వారికి ఉంది. కాని ఇతర మతములలో ఒకే దేవుడు. మరొక ఛాయిస్ లేదు. హిందూ మతంలో ఒక దాని వెంట ఒకటి అనే సూత్రం ఉంది. అంటే ముందు ఇష్టం వచ్చిన దేవతను ఆరాధించడం. పూజలు, వ్రతములు, క్రతువుల ద్వారా సగుణోపాసన చేయడం. క్రమక్రమంగా నిర్గుణబ్రహ్మ ఆరాధనకు చేరుకోవడం. కాని ఇతర మతములలో ఒకే సారి నిర్గుణ బ్రహ్మను చేరుకోవడం. ఇదే తేడా.

అందుకే సర్వదేవ నమస్కార: కేశవం ప్రతి గచ్ఛతి అని అన్నారు. ఏదేవతలను పూజించినా ఆరాధించినా, అవన్నీ ఆ పరమాత్మకు చెందుతాయి. కాకపోతే కావలసిందల్లా భక్తి శ్రద్ధ. అందుకే శ్రద్ధతో ఏ దేవుడిని పూజించినా, ఆ శ్రద్ధను ధృఢంగా చేస్తాను. వారిని నా వైపుకు నడిపిస్తాను అని పరమాత్మ హామీ ఇచ్చాడు. మానవుడు తనకు తోచిన మార్గమును అనుసరించడానికి, తనకు ఇష్టమైన దేవుడిని ఆరాధించడానికి తగిన స్వేచ్ఛ ఇచ్చాడు పరమాత్మ. కాబట్టి భక్తి శ్రద్ధలతో ఏ దేవుడిని పూజించినా దానికి తగిన ఫలములు దొరుకుతాయి. క్రమక్రమంగా అతడు పరమాత్మ వైపుకు ఆకర్షితుడు అవుతాడు. మోక్షమును పొందుతాడు. శ్రద్ధ భక్తి లేకుండా ఏ పూజలు వ్రతాలు చేసినా ఏమీ ఫలితం లేదు.

## 22. స తయా శ్రద్ధయా యుక్తస్తస్యారాధనమీహతే।
## లభతూ చ తత: కామాన్ మయైవ విహితాన్ హి తాన్॥

కేవలం వివిధములైన దేవతల మీద భక్తి శ్రద్ధ ఉన్న భక్తులు, ఆయా దేవతలను ఆరాధించి వారి భక్తికి, శ్రద్ధకు అనుగుణమైన ఫలితములను పొందుతున్నారు.

పైశ్లోకంలో భావాన్ని మరలా చెబుతున్నాడు. చిత్తశుద్ధిలేని శివపూజలేలరా అని వేమనగారు చెప్పారు. ఏ యే కోరికలు కోరుతూ, "తయా శ్రద్ధయా"అంటే అటువంటి శ్రద్ధతో ఏ దేవతను పూజించినా, వారికి ఆయా కోరికలు మాత్రమే నెరవేరుతాయి. అంతకంటే ఎక్కువ రావు. ఎందుకంటే ఏ దేవతను పూజిస్తాడో ఆ దేవత తన పరిధిలోని కోరికలను మాత్రమే తీర్చగలదు. చిన్న పాత్ర తీసుకొని గంగానదికి వెళితే, ఆ చిన్ని పాత్ర నీరే వస్తుంది కానీ, గంగానది మన వెంటరాదు కదా! అలాగే మనం ఏ దేవుడిని పూజిస్తే, ఆ దేవుడు ఆయన శక్తి మేరకు మన కోరికలు తీరుస్తాడు. కాక పోతే ఆ దేవుడి మీద శ్రద్ధ కావాలి. ఆ దేవత మీద అనన్య భక్తి కలిగి ఉండాలి. అప్పుడు భగవంతుడు కూడా తగిన సాయం చేస్తాడు. మనలో ఉన్న ఆ శ్రద్ధను ఇనుమడింపచేస్తాడు. ఆయాకోరికలు తీరేట్లు చేస్తాడు.

అన్ని ఫలితములు ఆ పరమాత్మ నుండి వచ్చేవే కాకపోతే త్రూ ప్రాపర్ చానల్. అంటే ఏ దేవతను ఆరాధిస్తాడో ఆ దేవత ద్వారా వస్తాయి. అన్ని కోరికలు తీర్చేది ఆ పరమాత్మయే. ఎవరికి ఏ దేవత ఇష్టమో ఆ దేవతను ఆరాధించి, ఆ దేవత ద్వారా పరమాత్మకు నివేదించి తమ కోరికలు సాధించుకుంటారు. కోరికలు తీరుతూ ఉంటాయి కాబట్టి ఆ దేవుడిని, దేవతను ఇంకా ఇంకా శ్రద్ధాభక్తులతో ఆరాధిస్తుంటాడు. కొంత కాలానికి అతనిలో ఉన్న సగుణోపాసన నిర్గుణోపాసనగా మారి పోతుంది. నేను ఏ దేవతను పూజించినా, అన్నీ ఆ భగవంతుడే ఇస్తున్నాడు అనే భావన కలుగుతుంది. తుదకు నిర్గుణ పరబ్రహ్మ తత్వమును గురించి తెలుసుకుంటాడు. అలా కాకుండా, కేవలం జీవితం అంతా మన కోరికలు తీరడం కోసం ఆయా దేవతలను ఆరాధిస్తుంటే, ఆయాపూజలకు తగిన ఫలములు మాత్రమే పొందుతూ అక్కడే ఉండి పోతాము. పైకి ఎక్కలేము. మోక్షమార్గమును అనుసరించలేము. ఎందుకంటే, మనకోరికలు ఆయాదేవతలే తీరుస్తున్నారు అనే భ్రమలో ఉంటాము. మనలో ఉన్న జ్ఞానాన్ని ఈ విషయవాంఛలు హరించివేస్తాయి. మనలను అజ్ఞానంలో పడవేస్తాయి.

## 23. అన్తవత్తు ఫలం తేషాం తద్భవత్యల్పమేధసామ్।
## దేవాన్ దేవయజో యాన్తి మద్భక్తా యాన్తి మామపి॥

అల్పమైన బుద్ధి కల మానవులు ఏయేదేవతలను పూజిస్తున్నారో అంతవరకే ఫలములను పొందుతారు. ఆ విధంగా పొందిన పరిమితమైన ఫలములు అశాశ్వతమైనవి. అలా కాకుండా నిరాకారుడు, నిర్గుణుడు అయిన పరమేశ్వరుని గురించి ధ్యానించే భక్తులు, పరమమైన శాశ్వతమైన ఫలములను, శాంతిని పొందుతారు. తుదకు నాలోనే ఐక్యం అవుతారు.

ఈ శ్లోకంలో పరమాత్మ చిన్న విశ్లేషణ ఇచ్చాడు. మానవులు వివిధ దేవతలను ఆరాధించి ఆయాకోరికలు తీర్చుకుంటారు కదా! ఆ యా కోరికలను పరమాత్మ ఆయా దేవతల ద్వారా తీరుస్తాడు అని చెప్పాము కదా. కాని మనం కోరే కోరికలు, పరమాత్మ ఇచ్చే ఫలితములు అన్నీ ప్రాపంచికమైనవే. తాత్కాలికమైనవే. ప్రాపంచికమైన కోరికలు, వాటి ఫలితములు పూర్తిగా నిలిచేవి కావు. ఈ నాడు ఒక కోరిక కోరిక కోరుతాము. అది తీరగానే మరొక దేవతను మరొక కోరిక కోరుతాము. అది తీరగానే మరలా మరొక దేవత. ఇలా కోరికలు కోరుతూనే ఉంటాము. ఆ కోరికలు తీరుతూనే ఉంటాయి. మానవుడు ఇంకా ఇంకా కోరుతూనే ఉంటాడు. ఎందుకంటే మానవునికి తృప్తి ఉండదు. పైగా ఆ ఫలితములు తాత్కాలికములు. నశించిపోతాయి.

మరొకవిషయం ఏమిటంటే ఈ కోరికలు మనకు బంధనం అంటే అటాచ్‌మెంటు కలిగిస్తాయి. ఆ కోరిక తీరకపోతే బతకలేను అనే భావన కలిగిస్తాయి. ఉన్నది పోతే నా జీవితమే సర్వనాశనం అవుతుంది అనే భావాన్ని కలిగిస్తాయి. ఇవన్నీకోరికలు తీరడం వలన కలిగే బంధనాలు. అంటే ఈ కోరికలు మనకు మూడు విధములైన నష్టములను కలిగిస్తాయి. ఒకటి. ఆ ఫలితములు అన్నీ తాత్కాలికములు. నిలిచి ఉండేవి కావు. అన్ని తుదకు దు:ఖముతో అంతం అవుతాయి. ఎలాగంటే, ధనము, ఆస్తి, పదవి సంపాదించడానికి చాలా కష్టపడాలి. సంపాదించిన తరువాత దానిని నిలబెట్టుకోడానికి, ఎవరూ కొట్టెయ్యకుండా కాపాడుకోవడానికి నానా అవస్థలు పడాలి. ఆ వచ్చిన ధనము, ఆస్తి, పదవి పోతే తీరని దు:ఖం. కాబట్టి ఇవన్నీ దు:ఖమును కలిగించేవే.

రెండు. ఎన్ని కోరికలు తీరినా తృప్తి ఉండదు. ఇంకా కావాలనిపిస్తుంది. దాని కొరకు నానాయాతన పడటం. ఇంకా ఇంకా కావాలని ఆరాటపడటం. దీనితో దు:ఖం కలుగుతుంది. మూడు. ఈ కోరికలు బంధనములు కలుగజేస్తాయి. అంటే మనుషులతోనూ, వస్తువులతోనూ పెనవేసుకున్న అనుబంధం. అది ఇల్లు కావచ్చు, భార్య కావచ్చు, సంతానము కావచ్చు, బంధువులు కావచ్చు. ధనం కావచ్చు. అవి నానుండి విడివడితే నాకు అనంతమైన దు:ఖం కలుగుతుంది అనే భావనే ఈ బంధనము. ఆ బంధనములు దు:ఖమునకు కారణం అవుతాయి.

కాని పరమాత్మను ధ్యానిస్తే శాశ్వతానందము కలుగుతుంది. పరమ శాంతి కలుగుతుంది. కాబట్టి వివిధములైన దేవతలను వివిధములైన కోరికల కొరకు ఆరాధించి ఆయా కోరికల ఫలములను పొందడం కన్నా, పరమాత్మను ఆరాధించి ధ్యానించి శాశ్వత సుఖమును, శాంతిని పొందడం మంచిది.

ఈ విషయాలు అందరికీ తెలుసు కానీ కోరికలు తీర్చుకోడానికి వివిధములైన దేవతలను ఆరాధించడానికే ప్రయత్నం చేస్తున్నారు. కారణం "అల్ప మేధసామ్" అంటే మన యొక్క బుద్ధి, మేధస్సు అల్పంగా ఉండటమే. పెరగక పోవడమే. సరిగా ఆలోచించకపోవడమే. లేకపోతే

శాశ్వతసుఖము, శాంతి, మోక్షము ఇచ్చే మార్గమును వదిలిపెట్టి చిన్ని చిన్ని కోరికలను తీర్చడానికే అర్హత గల చిన్ని చిన్ని దేవతలను ఎందుకు ఆరాధిస్తారు. అందరికంటే గొప్పవాడు అయిన పరమాత్మను మరిచిపోవడం మన అల్పమేధస్సుకు గుర్తు, గంగానదిలో ఉన్న నీటిని వదిలిపెట్టి పక్కనే ఉన్న బావిలో నీరు తోడుకున్నట్టు ఉంటుంది. కల్పవృక్షము ను వదిలిపెట్టి చిన్న మొక్కను కోరినట్టు ఉంటుంది.

దీనికికారణం ఏమిటి? మానవులకు తాత్కాలిక ఫలముల మీద ఉన్న మోజు శాశ్వత ఫలితముల మీద ఉండదు. వెంటనే ఫలితం కావాలి. రాత్రికి రాత్రే కోటీశ్వరుడు కావాలి. లోకంలో ఉన్నవన్నీ వెంట వెంటనే తన ఇంట్లో చేరిపోవాలి.

(ఆ రోజుల్లో ఇద్దరు రాజకుమారులు ఉండేవారు. వారికి ఎటువంటి అనుభవం లేదు. ఒకరు అప్పటి వరకు అసెంబ్లీలో అడుగుపెట్టలేదు. కాని చీఫ్ మినిష్టరు అవ్వాలని అనుకుంటున్నాడు. మరొకరు పార్లమెంటులో పెదవి విప్పలేదు. కాని ప్రైమ్ మినిష్టరు అవడానికి ఆతురత పడుతున్నారు. చివరకు ఇద్దరికీ నిరాశ మిగిలింది. ఒకరికి ఉన్నది పోయింది. మరొకరికి జైలుజీవితం మిగిలింది.)

ఇవన్నీ అల్పమేధస్సుకలవాళ్లు చేసే పనులు. ఈ తాత్కాలిక భోగములు పదవులు సంపదలు నశించిపోయేవే. ఏవీ శాశ్వతములు కావు. అన్న విషయం వారికి తెలియదు. కాబట్టి శాశ్వతానందము కొరకు ప్రయత్నం చేయాలి. రాక్షసులను ఆరాధిస్తే రాక్షస ప్రవృత్తి కల కోరికలే పొందుతారు. దేవతలను ఆరాధిస్తే సాత్వికమైన కోరికలను పొందుతారు. బంధనములు కలిగించే తాత్కాలికమైన కోరికల కోసం చిన్న చిన్న దేవతలను ఆరాధిస్తారా, లేక శాశ్వత సుఖం కోసం పరమాత్మను ఆరాధిస్తారు అంతా మన చేతుల్లోనే ఉంది. మనకు ఆ స్వేచ్ఛ ఇచ్చాడు పరమాత్మ. కాబట్టి మనము అల్పమేధస్సుతో కాకుండా విజ్ఞతతో ఆలోచించి తగునిర్ణయంతీసుకోవాలి. నీవుఅనన్యమైన భక్తితో, శ్రద్ధతో ఏం చేసినా పరమాత్మ కాదనడు. నీవు చేసిన దానికి తగిన ఫలితములను ఇస్తూనేఉంటాడు.

## 24. అవ్యక్తం వ్యక్తిమాపన్నం మన్యన్తే మామబుద్ధయః।
## పరం భావమజానన్తో మమావ్యయమనుత్తమమ్॥

నిరాకారుడిని, నిర్గుణుడిని, నాశము లేనివాడిని, అన్నిటికంటే ఉత్తమమైన వాడిని, కనపడే ప్రకృతి కంటే విలక్షణమైన వాడిని అయిన నా గురించి పూర్తిగా

తెలియని వారు, నన్ను వారి మాదిరే సామాన్యమానవునిగా, ఒక వ్యక్తిగా, శరీరము కలవానిగా, భావిస్తూ ఉంటారు.

ఈ శ్లోకంలో పరమాత్మ తన కృష్ణావతారం గురించి చెబుతున్నాడు. ముందు పరమాత్మ తత్వము గురించి చెప్పాడు. అవ్యక్తం, అవ్యయం, అనుత్తమమ్, అంటే ఎవరికీ కనపడనిదీ అంటే మన మామూలు కంటికి కనపడనిది, మనసుకు అందనిదీ, నాశనము లేనిదీ, ఉత్తమమైనది. ఇది పరమాత్మ స్వరూపము. ఇటువంటి నేను సాధారణ మానవునిగా కృష్ణుడిగా అవతరించాను. నా ఈ రూపమును, నేను చేసే కర్మలను చూచి మానవులు నన్ను తమ తోటిమానవుడిగా అనుకుంటున్నారు. దేవకీ గర్భంలోపుట్టాను. యశోద వద్ద పెరిగాను. వెన్న దొంగిలించాను. గోపికలతో ఆడాను. గోపికాలోలుడను అయ్యాను అని అందరూ అనుకుంటూ ఉంటారు. అది వారి బుద్ధిహీనత. వారి బుద్ధిహీనత వలన నా పరమాత్మభావమును తెలుసుకోలేక పోతున్నారు. అటువంటి వారిని అబుద్ధయ: అంటే అవివేకులు, మూఢులు, సత్యం తెలుసుకోలేని వారు అని అంటున్నాడు పరమాత్మ.

కేవలం ధర్మ రక్షణ కొరకు పరమాత్మ అప్పుడప్పుడు అవసరమైనపుడు మానవుడిగా అవతరిస్తుంటాడు. మానవుడిగానే ప్రవర్తిస్తుంటాడు. వ్యవహరిస్తుంటాడు. ఆ కార్యము పూర్తికాగానే మరలా తన స్వస్వరూపమైన నిరాకార తత్వమును పొందుతాడు. పరాప్రకృతి అయిన పరమాత్మ కూడా ఈ అపరా ప్రకృతిలో జన్మించి సంచరిస్తుంటాడు. మనందరం కూడా పరమాత్మ స్వరూపులమే. కాకపోతే ఆయనకు తాను ఎవరోతనకు తెలుసు. మనం సత్వరజస్తమోగుణముల మాయలోపడి మనం ఎవరో మనం తెలుసుకోలేకపోతున్నాము. పరమాత్మ తనకు ఇష్టమైన దేహంతో అవతరించగలడు. మనకు ఆ స్వతంత్రత లేదు. మన పూర్వజన్మ సంస్కారములను బట్టి మనకు జన్మలు వస్తుంటాయి. పరమాత్మకు ఏ దేహంలో ఉన్నా పూర్వజన్మల స్మృతి ఉంటుంది. మనకు ఏ దేహములో స్మృతి ఆ దేహమునకే పరిమితము. అంతే తేడా!

ఇంక పరమాత్మ లక్షణములు ఏమిటి అని పరిశీలిద్దాము. అవ్యక్తము. ఆత్మ అవ్యక్తము. మన శరీరము మాత్రమే వ్యక్తము. అవ్యయము అంటే నశించి పోనిది. ఆత్మకుకూడా నాశనము లేదు. కేవలము శరీరము మాత్రమే నశించి పోతుంది. ఉత్తమము. ఆత్మ అన్నిటికంటే ఉత్తమమైనది. దానికి రాగద్వేషములు, సుఖదు:ఖములు, కోపతాపములులేవు. నిశ్చలంగా నిర్మలంగా ఉంటుంది. ఈ ఆత్మతత్వమును తెలుసుకోలేని వారు, పరమాత్మను ఒక సాధారణమానవునిగా పూజిస్తారు. ఆయనను అనుకరిస్తారు. దానినే సగుణారాధన అంటారు. (ఈ రోజుల్లో ఇది మరీ మించి పోయి ముదిరిపోయి, వీరావేశంలో రాజకీయ నాయకులకు, సినీ తారలకు కూడా గుళ్లు కడుతున్నారు. విగ్రహాలుపెట్టి పూజిస్తున్నారు. ఇప్పుడు నాలుగు రోడ్ల మధ్యలో పెట్టబడిన విగ్రహములు వచ్చేతరంలో గుళ్లలోకి చేరవు అని నమ్మకం లేదు.)

కాబట్టి, ఆకారములు, విగ్రహములు కాకుండా వాటి వెనుక ఉన్న తత్వము తెలుసుకోవాలి. అసెంబ్లీ బయట ఉన్న గాంధీ విగ్రహానికి పూలమాల వేసి లోపలకు పోయి ఒకరిని ఒకరు కొట్టుకుంటూ, తిట్టుకుంటూ, మైకులు విరగ్గొట్టుకుంటుంటే అది గాంధీని అవమానించడమే. అలాగే దేవాలయానికి వెళ్లి భగవంతుడి విగ్రహాలను ఆరాధించి, బయటకు వచ్చి దర్శనం టిక్కట్లను బ్లాకులో అమ్ముకొని సొమ్ముచేసుకుంటుంటే దేవుడు క్షమించడు. కాబట్టి పరమాత్మ ఏదో ఒక విగ్రహంలో కాదు అంతటా ఉన్నాడు అన్న భావన రావాలి. ముందు సగుణోపాసనతో మొదలుపెట్టి అక్కడే ఉండిపోకుండా, క్రమక్రమంగా నిర్గుణోపాసన చేయాలి.అంటే పరమాత్మ యొక్క సగుణ తత్వమును, నిర్గుణ తత్వమును బాగా తెలిసి ఉండాలి. శ్రీకృష్ణుడు కేవలం మానుష విగ్రహుడు కాడు, నిర్గుణుడు, నిరాకారుడు, అవ్యయుడు అయిన పరమాత్మ అని తెలుసుకోవాలి. అప్పుడే ఆత్మ దర్శనం అవుతుంది. భగవంతుని చేరుకోగలము. పరమ శాంతిని పొందగలము.

## 25. నాహం ప్రకాశ: సర్వస్య యోగమాయాసమావృత:।
## మూఢో2యం నాభిజానాతి లోకో మామజమవ్యయమ్။

ఈ లోకంలో ఉన్న మానవులు అందరూ నా యోగమాయ చేత కప్పబడి ఉన్నారు కాబట్టి, వారు నన్ను చూడలేరు. తెలుసుకోలేరు. యోగమాయ చేతకప్పబడి తమ వివేకమును పోగొట్టుకున్న మానవులు, నన్ను పుట్టుకలేనివాడిగానూ, నాశము లేని వాడిగానూ తెలుసుకోలేరు. ఇంతకు ముందు శ్లోకంలో పరమాత్మ నేను అవ్యక్తుడను అని అన్నాడు. అంటే నేను మామూలు మానవుల కళ్లకు కనిపించను. మనసులోని భావనలకు అందను అని అర్థం. అలా ఎందుకు జరుగుతుంది అనే విషయాన్ని ఈ శ్లోకంలో వివరించాడు.

చాలామంది అంటుంటారు. పరమాత్మ అంతటా ఉన్నాడు అని అంటారు కదా. అంతటా ఉంటే మాకు ఎందుకు కనిపించడు అని. ఇది నాటి హిరణ్యకశిపుని నుండి నేటి జనవిజ్ఞానవేదిక వారి దాకా వేస్తున్న ప్రశ్న. ఇంకా కొంత మంది నాకు భగవంతుడు ఎప్పుడు దర్శనం ఇస్తాడో, ఆయనతో నేను ఎప్పుడు మాట్లాడతానో, ఆయనతో ఎప్పుడు ఆడుకుంటానో అని అనుకుంటూ ఉంటారు. ఇంకా కొంత మంది నాకు ప్రతిరోజూ తెల్లవారు జామున సాయిబాబా వచ్చి నాపక్కన కూర్చుని నాతో మాట్లాడతాడు అని అంటారు. మరి కొందరు నేను దేవీ ఉపాసకుడిని నాతో అమ్మవారు ప్రతిరోజూ మాట్లాడుతుంది అంటుంటారు. ఇంకా కొంతమంది ఆంజనేయస్వామి వారితో మేము స్వయంగా మాట్లాడతాము అని అంటుంటారు.

వీరందరూ మూఢోయం అంటే మూఢులు అంటే పరమాత్మ నిరాకారుడు, నిర్గుణుడు, అవ్యయుడు అని తెలుసుకోలేని వారు అని చెప్పాడు. మరి ఇలా ఎందుకు

అనుకుంటున్నారు అంటే వారందరూ యోగమాయాసమావృత: అంటే వారందరినీ యోగ మాయ ఆవహించిఉంది అందుకే అలా అనుకుంటున్నారు.

మరి ఈ యోగమాయఅంటే ఏమిటి? సత్వ, రజస్,తమగుణములు ఈ ప్రకృతిని ఆవరించి ఉన్నాయి. వాటి కలయిక నుండి మాయ ఆవిర్భవించింది. మాయ అంటే ఉన్నది లేనట్టు, లేనిది ఉన్నట్టు భ్రమచెందడం. ప్రతి విషయాన్ని తప్పుగా అర్థం చేసుకోవడం. అంతా తనకే తెలుసు అనుకోవడం. ఇవన్నీ కలిస్తే మాయ అవుతుంది. దీనినే అజ్ఞానము అని కూడా అంటారు. ఆ మాయ పరమాత్మకు, మానవులకు మధ్య ఒక అడ్డు గోడగా ఏర్పడింది. దానిని ఛేదిస్తే తప్ప పరమాత్మ నిజ స్వరూపము తెలియదు. దానిని ఛేదించాలంటే ఎవరి వల్లా కాదు. ఆ మాయను ఎవరు కల్పించారో వారి దయతోనే ఆమాయ ఛేదింపబడుతుంది.

ఆ మాయను పరమాత్మ కల్పించాడు కాబట్టి ఆయనను ఆశ్రయిస్తేనే ఆ మాయను ఛేదించగలము. దానికి కావాల్సింది భక్తి, జ్ఞాన, వైరాగ్యములు. విచారణ, సాధన, అప్పుడే మనకు పరమాత్మ సాక్షాత్కారం కలుగుతుంది. ఇదితెలియని వాళ్లు దేవుడు ఏడీ మాకు కనపడడే అనుకుంటూ ఉంటారు. ఇలా అనుకునే వాళ్లు మూఢోయం అంటే మూఢులు అని అన్నాడు పరమాత్మ. ఈ మూఢులు మాయలో పడి కొట్టుకుంటున్నారు. ఇంకా ఇంకా దానిని పెంచుకుంటున్నారు. వారిలో ఉన్న విషయ వాంఛలు, దుర్వ్యసనములు, భోగముల పట్ల ఆసక్తి, కామము, ఉద్రేకము ఇవి అన్నీ ఆ మాయను ఇంకా ఎక్కువ చేస్తాయి. చుట్టు సాలెగూడులాగ అల్లుకుంటాయి. ఈ మూఢులు ఆ మాయ అనే తెరను ఎన్నటికీ ఛేదించలేరు. అది ఛేదిస్తేనే గానీ పరమాత్మ దర్శనం కాదు.

దేవాలయాలలో మూడు ప్రాకారాలు ఉంటాయి అవే సత్వ,రజస్తమోగుణములు, ఇవి దాటితేనే కానీ దైవదర్శనం కాదు. అలాగే దట్టంగా మేఘాలు కమ్ముకుంటే సూర్యుడుకనిపించడు. ఆ మేఘాలు విడిపోతేగానీ, సూర్యుడు కనిపించడు. అందుకే అహమ్ నేను సర్వస్య అందరికీ ప్రకాశ: న అంటే కనపడను. అని స్పష్టంగా చెప్పాడు.

అటువంటి వాళ్లకు మరొక లక్షణంగా కూడా ఉంది. వాళ్లు కృష్ణుని సామాన్య మానవునిగానే అనుకుంటారు. నిజమే. శ్రీకృష్ణుడు కూడామన మాదిరేపుట్టాడు. పెరిగాడు. ఎన్నో కష్టాలను ఎదుర్కొన్నాడు. కాని ఆయనకు మనకు ఎంతో తేడా ఉంది. ఆయనకు ఆత్మజ్ఞానం ఉంది మనకు లేదు. ఆయనకు తన పూర్వజన్మల గురించి తెలుసు. మనకు తెలియదు. ఆయన తనకు ఇష్టమైన శరీరం ధరించగలడు. మనకు ఆ స్వతంత్రత లేదు. మన కర్మఫలాలను బట్టి మనకు శరీరం వస్తుంది. కృష్ణుడు ఈ శరీరం వేరు, ఆత్మ వేరు అని తెలుసుకున్నవాడు.మనము ఈ శరీరమే నేను అనుకుంటున్నవాళ్లము. కృష్ణుడికి తాను పరమాత్మ స్వరూపుడు అని తెలుసు. కాని మనం మాత్రం పరమాత్మకు పుట్టుక, చావు, నాశనము లేదు అని తెలుసుకోలేము. ఇంకా

చెప్పాలంటే కృష్ణుడు అర్జునుడికి, ఇంకాసేపట్లో భయంకరమైన యుద్ధం జరగబోతోన్న సమయంలో, ప్రశాంతంగా భగవద్గీత బోధించాడు.. మనకు గీత సరిగా చదవడం కూడారాదు. పైగా వీథిలో ఏ చిన్న కొట్లాట జరుగుతున్నా మనకెందుకులే అని అక్కడి నుండి పారిపోతాము. పరిసరాల్లో ఉండము. తనకు అన్నీ ఉండి కూడా అర్జునుడికి రథసారథి అయ్యాడు. గుర్రాలు కడిగాడు. వాటికి దాణా పెట్టాడు. మనకు ఇంట్లో పని చేసుకోడానికే బద్ధకం. మన బండి కడగడానికి కూడా పనిమనిషులను పెట్టుకుంటాము. కృష్ణుడికి మనకు ఇదే తేడా. కాని మనం అందరం కృష్ణుడికి కూడా మన మాదిరే పుట్టుకా,చావు ఉందనుకుంటాము. దాని వెనుక ఉన్న నిజాన్ని తెలుసుకోలేము.

దీని కంతా కారణం యోగమాయా సమావృత: అందరినీ యోగ మాయ కప్పి ఉంచడమే. ఈ యోగ మాయతో అంటే అజ్ఞానంతో, అహంకారంతో కప్పబడిన వాళ్లందరూ మూఢులు, అజ్ఞానులు, అవివేకులు. వారికి నాహం ప్రకాశ: అంటేనేను వారికి వ్యక్తం కాను. ఎందుకంటే వారు నాభి జానాతి నన్ను తెలుసుకోడానికి ప్రయత్నం చేయడం లేదు. ఏమని తెలుసుకోడానికి ప్రయత్నించడం లేదు "మామ్ అజమ్ అవ్యయమ్" నాకు పుట్టుక లేదు, చావులేదు అని తెలుసుకోడానికి ప్రయత్నించడం లేదు. అంటే నన్నుకూడా వారిమాదిరే పుట్టుక చావుఉన్న వారిగాతెలుసుకుంటున్నారు. ఇదంతా వారి మూఢత్వం వలన జరుగుతూఉంది. ఇదీ పరమాత్మ అభిప్రాయము.

## 26. వేదాహం సమతీతాని వర్తమానానిచార్జున।
## భవిష్యాణి చ భూతాని మాం తు వేద న కశ్చన॥

ఓ అర్జునా! నేను భూత భవిష్యత్ వర్తమాన కాలాలలో, ఇదివరకు ఉన్నటువంటి, ఇప్పుడు ఉంటున్నటువంటి, రాబోయే కాలంలో ఉండబోయేటటువంటి సకల ప్రాణుల గురించి తెలుసుకోగలను. కాని నా గురించి ఎవరూ తెలుసుకోలేరు.

ఈ శ్లోకంలో ఒక సత్యాన్ని ఆవిష్కరించాడు పరమాత్మ. వేదాహం అంటే నాకు అన్నీ తెలుసు. సమతీతాని అంటే ఇప్పటి వరకు ఏమేమి జరిగాయో అన్నీ నాకు తెలుసు. వర్తమానాని అంటే ఇప్పుడు ఏం జరుగుతూ ఉందో అదీ తెలుసు. భవిష్యాణి అంటే ముందు ముందు ఏం జరగబోతూ ఉందో అదీ తెలుసు. ఈ యుద్ధం ఎందుకు వచ్చిందో, ఎలా జరుగుతూ ఉందో, ఎలా ముగుస్తుందో అన్నీ నాకు తెలుసు. ఈ జీవకోటి అంతా నాకు తెలుసు. అంటే ఎల్లప్పుడు నేను ఉన్నాను. నేను లేని కాలము అంటూ లేదు. అందరిలో ఉంటాను.అందరికీ దగ్గరగా ఉంటాను. కాని ఎవ్వరూ నన్ను తెలుసుకోలేరు.కనీసం నన్ను తెలుసుకోడానికి ప్రయత్నం కూడాచేయడం

లేదు. అని అన్నాడు పరమాత్మ. దీనినే ఇంకొంచెం వివరంగా తెలుసుకుందాము.

పరమాత్మ ఒక్కడే. ఆయన ఆత్మస్వరూపుడుగా ప్రతి జీవిలో ఉన్నాడు అని చెప్పుకున్నాము. అటువంటప్పుడుపరమాత్మకు ఉండే లక్షణాలు అన్నీ మనకు రావాలి కదా. బంగారము యొక్క లక్షణాలు బంగారు ఆభరణాలలో ఉన్నట్టు, మనలో కూడా పరమాత్మ లక్షణాలు ఉండాలి. కాని ఆ బంగారంలో రాగి కలిపితే దాని లక్షణం మారి పోతుంది. అలాగే ఆత్మ ప్రాపంచిక విషయాలలో చేరి జీవాత్మగా మారి పోతుంది. అనవసర విషయాలకు ప్రాధాన్యత ఇస్తుంది. తాను ఆత్మస్వరూపుడను అనే విషయం మరిచిపోతుంది. జీవితం అంతా ఏదో ఒక సమస్యతో బాధ పడుతూ ఉంటుంది. ఇవన్నీ చేరి మానవునికి పూర్వజన్మ స్మృతి లేకుండా చేస్తాయి. కాని స్వచ్ఛంగా ఉన్న ఆత్మకు పూర్వజన్మ స్మృతి ఉంటుంది. ఆ విషయాన్నే ఈ శ్లోకంలో వివరించాడు పరమాత్మ.

ఇంకా చెప్పాలంటే జీవుడు కాలానికి కట్టుబడి ఉంటాడు. కాలంతోపాటు మారుతూ ఉంటాడు. పరమాత్మకు మార్పులేదు. అవ్యయుడు, త్రికాలవేది. మనకు ఈ జన్మలో ఏం జరిగిందో కూడా మనకు సరిగా జ్ఞాపకం ఉండదు. ఇంక పూర్వజన్మ స్మృతి ఎలా ఉంటుంది. కాని  మనసును నిర్మలంగాఉంచుకుంటే అది సాధ్యమౌతుంది. అందుకే కృష్ణుడు అంటున్నాడు నాకు ఇంతకు ముందు ఎన్ని జన్మలలో ఏమేమి చేసానో అన్నీ తెలుసు. రాబోయే జన్మల గురించి కూడా తెలుసు.  నా జన్మల గురించే కాదు అందరి జన్మల గురించి తెలుసు. పరమాత్మ కాలమునకు అతీతమైనవాడు.

కంప్యూటర్‌లో లక్షల, కోట్ల మందికి సంబంధించిన  సమాచారం నిక్షిప్తమై ఉంటుంది. ఆ కంప్యూటర్ క్రాష్ అయితే ఆ సమాచారం అంతా తుడిచిపెట్టుకొని పోతుంది. మన పరిస్థితి అంతే. మనం ఈ ప్రాపంచిక విషయాలలో పడి అనవసరమైన వాటిగురించి ఆలోచించి అవసరమైనవి గుర్తుపెట్టుకోవడం లేదు. అందుకే మతి మరుపు అనబడే క్రాష్ జరుగుతూ ఉంది.

ఆధ్యాత్మికంగా చెప్పుకోవాలంటే. మానవుడు పరిమిత జ్ఞానము కలవాడు. పరమాత్మ అపరిమితమైన జ్ఞానం కలవాడు. సర్వజ్ఞుడు. పరమాత్మ కాలస్వరూపుడు. మానవుడు కాలమునకు లోబడి ప్రవర్తించేవాడు.  మానవుడు ఈ జన్మలో పరమాత్మ దయ వలన, పూర్వజన్మసంస్కారము వలన లభించిన భోగభాగ్యములను, సంపదలను, పదవులను చూచి అంతా నా మహిమ అని విర్రవీగుతున్నాడు. గర్వంతో మదంతో కళ్లుమూసుకుపోయి అసలు విషయాలను మరిచిపోతున్నాడు. అందుకే మాం తు వేద న కశ్చన అన్నాడు. అంటే నన్నుఎవరూతెలుసుకోలేరు అని అర్థం. అంతా నేనే అంతా నా వల్లే జరుగుతూ ఉంది అనే గర్వంతో ఉన్న వాడికి ఇవన్నీ ఏం తెలుస్తాయి. ఇవి తెలియాలంటే ఆత్మజ్ఞానము, పరమాత్మ యందు శ్రద్ధ కావాలి.

ఇంక జన్మల సంగతికి వస్తే నేల మీద నడిచేవాడు తన చుట్టు పక్కల, తనకన్ను చూడగలిగినంత మేర చూడగలడు. వెనక్కు తిరిగితే గానీ వెనక ఏం జరుగుతుందో తెలియదు. అలాగే తన వీపు తను చూడలేడు. కాని పరమాత్మ ఏడవ అంతస్తులో ఉన్నాడు. కింద ఉన్న వాడు ఎక్కడి నుండి బయలుదేరాడో ఎక్కడకు వెళుతున్నాడో. వాడి ముందు వెనక ఎవరున్నారో అన్నీ తెలుస్తుంది. కాబట్టి నేల మీద ఉన్న వాడికి తెలియని విషయాలు పైన ఉన్నవాడికి తెలుస్తాయి. అందుకే మనం అన్నీ పైవాడికి తెలుసు అని అంటూ ఉంటాము. కాబట్టి మనందరము కాస్త లోపలకు చూచి మనం ఎవరో తెలుసుకుంటే చాలు. మనకు ఆత్మజ్ఞానం కలుగుతుంది. పరమాత్మ గురించి తెలుసుకోగలము.

## 27. ఇచ్ఛాద్వేష సముత్థేన ద్వన్ద్వమోహేన భారత। సర్వభూతాని సమ్మోహం సర్గే యాన్తి పరంతప॥

మానవులు పుట్టుకతోనే ఇది కావాలి, అది వద్దు అనే రాగద్వేషములతో పుడుతున్నారు. వీటి వ్యామోహములో పడి మానవుడు తన విజక్షణా జ్ఞానము కోల్పోతున్నాడు. అజ్ఞానములో పడిపోతున్నాడు. రాగద్వేషముల వలన కలిగే సుఖములను దు:ఖములను అనుభవిస్తున్నాడు.

పై శ్లోకానికి ఇది వివరణ. మానవులకు పుట్టుకతోనే రాగద్వేషములు, ఇష్టాఇష్టాలు, సుఖదు:ఖాలు సంక్రమిస్తాయి. ఇవి అన్నీ ప్రకృతిలో ఉన్న సత్వ, రజస్, తమో గుణముల సమ్మేళనమే. ఇవి అన్నీ చేరి ఆత్మకు, మనసుకు మధ్య అడ్డుగోడలా నిలుస్తాయి. దానినే వ్యామోహము, మాయ, అజ్ఞానము, తెలియని తనము అంటారు. ఆ కారణం చేత మానవులు తమ జీవితమంతా ఈ ద్వంద్వాలలో పడి కొట్టుకుంటూ, తమలో ఉన్న ఆత్మస్వరూపమును గురించి తెలుసుకోలేక పోతున్నారు. తమలో ఉన్న ఆత్మానందాన్ని విడిచిపెట్టి, సుఖం కోసం, ఆనందం కోసం బయట వెతుక్కుంటూ ఉంటారు.

సామాన్య మానవుడు ధనంలో, ఆస్తిలో, బంధువులలో, పరాయి స్త్రీలసంగమంలో, పదవిలో, ఇలా రకరకాలుగా బయట ఉన్న ఆనందాని కొరకు నిరంతరం వెతుకుతూనే ఉంటాడు. వాటి కోసం నానాపాట్లు పడుతుంటాడు. సుఖంకోసం పరుగు. దు:ఖాన్నుండి తప్పించుకోడానికి పరుగు. పదవి కోసం పరుగు. నిరంతరం పరుగెడుతూనే ఉంటాడు. ఈ పరుగులో పడి పరమాత్మను తెలుసుకోలేక పోతున్నాడు. దీనినే "ద్వన్ద్వమోహేన" అంటే ద్వంద్వాల వల్ల కలిగే మోహం. ఇది సామాన్యమైన మోహం కాదు. దట్టమైన మోహం. ఈ మోహానికి తగ్గట్టు అన్నీ నేనే చేస్తున్నాను అనే అహంకారం ఒకటి. దీనితో పాటు లెక్కలేనన్ని కోరికలు. వాటిని తీర్చుకోడానికి అడ్డమైన పనులు చేయడం. అవితీరకపోతే కోపం. ద్వేషం, పగ. మనసు అల్లకల్లోలం కావడం. అటువంటప్పుడు

ఏకాగ్రత ఎలా కలుగుతుంది. ఏకాగ్రత లేనిదే ధ్యానం కుదరదు. ధ్యానం చేస్తేనే కానీ ఆత్మస్వరూపం అర్థం కాదు. కాబట్టి చూచిందల్లా నాదవ్వాలి అనే ఇచ్ఛను, కోరికలను వదిలిపెట్టాలి.

దీని తరువాత వచ్చేది ద్వేషము. తనకు ఇష్టం లేని వస్తువుల మీద, మనుషుల మీద ద్వేషం పెంచుకోవడం. ఆ ద్వేషము కోపంగా మారుతుంది. ఆ కోపంతో కలిగే విషపరిణామాలు మనం చెప్పుకున్నాము. కోపం వలన సమ్మోహము, దానివలన స్మృతి విభ్రమము కలుగుతుంది. దాని వలన బుద్ధినాశనం అవుతుంది. తుదకు జరిగేది సర్వనాశనం. అందుకే ఇచ్ఛాద్వేషములు అనే ద్వంద్వములను వదులుకోవాలి అని పరమాత్మ చెప్పాడు. ఇవన్నీ కూడా పుట్టుకతోనే వస్తాయి. మధ్యలోరావు. పూర్వజన్మ సంస్కారం వలన వస్తాయి. వాటిని అధిగమించడానికి ప్రయత్నించాలి కానీ వాటి వ్యామోహంలో పడి పోకూడదు. వివేకం పెంపొందించుకోవాలి.

## 28. యేషాం త్వన్తగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్।
## తే ద్వన్ద్వ మోహనిర్ముక్తా భజన్తే మాం ధృఢవ్రతాః॥

ఈ జన్మలో గానీ, ఇంతకు ముందు జన్మలలో గానీ చేసిన పాపములు అన్నీ నాశనం అయిన పుణ్యాత్ములు, సుఖదు:ఖములు మొదలగు ద్వంద్వముల వలన కలిగే మోహము నుండి విముక్తి పొందెదరు. తుదకు నిశ్చలము, ధృఢమైన సంకల్పంతో నన్నేసేవిస్తారు.

ఈ ఇచ్ఛాద్వేషాలు, సుఖదు:ఖాలు, అనే ద్వంద్వాలు పుట్టుకతోనే వస్తాయి. వాటిని మనం పోగొట్టుకుంటే వాటి వ్యామోహంనుండి బయట పడటానికి ప్రయత్నం చేస్తే మనకు పరమాత్మమీద ధృఢమైన భక్తి కలుగుతుంది. అంటే చాలా మంది ఈ ద్వంద్వాల మోహంలో పడి కొట్టుకుంటున్నా, మరి కొంతమంది ఈ ద్వంద్వాల మోహంలో నుండి బయట పడి పరమాత్మను గురించి తెలుసుకోడానికి ప్రయత్నం చేస్తుంటారు. ఎందుకంటే, వారు పుణ్య కర్మలు అంటే నిష్కామ కర్మలు చేయడం వలన వారిలో ఉన్న పాపాలు తొలగి పోతాయి. అప్పుడు వారిలో విచక్షణా జ్ఞానం పెరుగుతుంది. ఏది సత్యము, ఏది అసత్యము తెలుసుకోగలుగుతాడు. ఆత్మానందం కోసం ప్రయత్నిస్తాడు కానీ, అశాశ్వతములైన ప్రాపంచిక సుఖముల కోసం పాకులాడడు.

ఒకడు తన కారు అమ్ముతున్నాడు. అదే కారు మరొకడు కొంటున్నాడు. కారు కారుగానే ఉంది కానీ అమ్మడం వల్ల ఒకరికి సుఖం. కొనడం వల్ల మరొకరికి సుఖం. సుఖం ఎక్కడ ఉంది? కారులో లేదు. అమ్మేవాడు ఇది నాది కాదు అనుకోడం వల్ల సుఖపడుతున్నాడు. కొనేవాడు ఇది నాది అని అనుకోడంవల్ల సుఖపడుతున్నాడు. కొన్న మర్నాడు ఆ కారుకు ఆక్సిడెంట్ అయింది. అంటే కారు అలాగే ఉంది కానీ కేవలం రూపం మాత్రం మారింది. అప్పుడు కొన్న వాడు దు:ఖిస్తాడు.

అమ్మినవాడు దాని గురించి ఆలోచించడు. కాబట్టి సుఖం, దు:ఖం మన ఆలోచనలో మనభావనలో ఉంది కానీ కారులో లేదు. ఇలా ఆలోచించడమే విచక్షణా జ్ఞానం కలిగి ఉండటం. దాని ఫలితంగా అతడు ద్వంద్వముల వలన కలిగిన మోహము నుండి విముక్తి పొందుతాడు. అప్పుడు అతని మనసు తనలో ఉన్న ఆత్మవైపు మళ్లుతుంది. ఆత్మదర్శనం కోసం ప్రయత్నిస్తాడు.

ఏ పని చేయాలన్నా భక్తి శ్రద్ధ ముఖ్యము. అవి లేనిదే ఏ కార్యము చేయలేరు. వ్రతములు, పూజలు, నియమాలు, మౌనవ్రతాలు, ఉపవాస దీక్షలు, బ్రహ్మచర్యం పాటించడం, వేదాలు, శాస్త్రములు చదవడం, ఇవి ఏవి చేసినా శ్రద్ధాభక్తులతో చేయకపోతే వాటిమీద ధృఢత్వము రాదు. వాటి మీద మనస్సు నిలువదు. దానికి కారణం మనకు పుట్టుకతోనే వచ్చిన రాగద్వేషములు (ఒక దాని మీద కోరిక, మరొక దాని మీద ద్వేషము, సుఖము దు:ఖము, లాభము నష్టము) మొదలగు ద్వంద్వములు. అటువంటి వారు ఏ పుణ్యకార్యాలు చేసినా, వారి దుష్టసంస్కారాలు వారిని అటు వేపు లాగుతుంటాయి. పరమాత్మయందు మనసు నిలువదు. దానికి మార్గం కూడా పరమాత్మచెప్పాడు. ద్వంద్వమోహ నిర్ముక్తా: అంటే ఇచ్ఛాద్వేషములు అనే ద్వంద్వంముల నుండి విముక్తుడు కావాలి. అంటే ముందు మనసుకు పట్టిన మురికిని తుడిచివేయాలి.

ఇదిఎలా సాధ్యము అంటే పుణ్యకర్మణామ్ అంటే పుణ్యకార్యములు చేయడం. మొదటిది నిష్కామ కర్మ. దీనితో కోరికలు పోతాయి. అందరినీ సమానం చూడటం. దీనితో ద్వేషభావం నశించి పోతుంది. కర్తృత్వ భావన వదలడం. దీనితో అహంకారం పోతుంది. ఇప్పుడు ఏ పూజలు వ్రతాలు చేసినా మనసు నిలకడగా ధృఢంగా ఉంటుంది. అతనికి ఏ బంధనములు అంటవు. మనసు నిర్మలంగా ఉంటుంది. ఎటువంటి దుర్గతి కలుగదు. ధృఢమైన చిత్తము కలిగి ఉంటాడు. అప్పుడు వారిని ఆవహించిన మోహం తొలగి పోతుంది. ఆత్మసాక్షాత్కారం అవుతుంది.

29. జరామరణ మోక్షాయ మామాశ్రిత్య యతన్తి యే।
తే బ్రహ్మ తద్విదు: కృత్స్నమధ్యాత్మం కర్మ చాఖిలమ్॥

ఎవరైతే వార్ధక్యము, మరణముల నుండి విముక్తి కొరకు నన్ను ఆశ్రయిస్తారో, వారు సకలము ఆ పరబ్రహ్మ స్వరూపము, సకల కర్మలస్వరూపము ఆ పరబ్రహ్మ అని తెలుసుకుంటారు.

మాతృగర్భం నుండి భూగర్భంవరకు మనం చేసే ప్రయాణమే జీవితం. ఇది అన్ని జీవులకూ ఒకటే. తేడా లేదు. దీనిలో ఆయా జీవుల ఆయు:ప్రమాణమును బట్టి ముసలితనము, మరణము సంభవిస్తుంటాయి. మరలా జన్మ. మరలా ముసలి తనము మరణము. ఇదే జనన మరణ చక్రము. దీని నుండి విడివడడమే మోక్షము. ఇది ఎలా వస్తుంది అంటే పరమాత్మను ఆశ్రయిస్తే వస్తుంది. ఆ పరమాత్మ ఎవరు. సర్వశక్తి మంతుడు. సర్వవ్యాపి. బ్రహ్మము. దానికి మార్గము

ఆధ్యాత్మిక సాధనలు. వారు చేసే ఆధ్యాత్మికసాధనలు అన్నీ ఆ బ్రహ్మమే. అంటే అర్థం ఈ ప్రపంచం అంతా బ్రహ్మ మయం. ఇటువంటి అనుభూతి అందరికీ కలుగుతుందా! అంటే కలుగుతుంది. కాకపోతే దానికి కావలసినసాధన, అభ్యాసము, ధ్యానము చేయాలి. అప్పుడు సాధకుడికీ బ్రహ్మకు తేడా ఉండదు. తానే బ్రహ్మ అయిపోతాడు. అదే అహంబ్రహ్మాస్మి అనే తత్వము. ఇదంతా ప్రయత్నం వలన సిద్ధించాల్సిందే కానీ ఏ దేవుడూ ఇచ్చేది కాదు, ఎవరూ పుచ్చుకునేదికాదు. కేవలము భగవంతుని ఆశ్రయించడం వలననే సిద్ధిస్తుంది.

ఈ శ్లోకంలో వ్యాసుల వారు మూడు పదాలు వాడారు. బ్రహ్మ, అధ్యాత్మమ్, అఖిలం కర్మచ. తరువాతి శ్లోకంలో ఇంకా కొన్ని కొత్త పదాలు వాడారు. వీటి గురించి ఇచ్చే వివరణే తరువాతి అధ్యాయము.

## 30. సాధి భూతాధి దైవం మాం సాధియజ్ఞం చ యే విదుః।
## ప్రయాణకాలే2పి చ మాం తే విదుర్యుక్త చేతసః॥

అధిభూతము, అధిదైవము, అధియజ్ఞము అన్నీ నేనే అని ఎవరు తెలుసుకుంటారో అటువంటి వారు, వారి అంత్యకాలములో, నిశ్చలమైన, యుక్తమైన మనసుతో నన్ను తెలుసుకోగలరు.

ఇది ఈ అధ్యాయంలో ఆఖరి శ్లోకం. ఇందులో ఇప్పటి వరకు చెప్పబడని మూడు అంశాల గురించి ప్రస్తావించారు పరమాత్మ. అవే అధిభూతము. అధి దైవము. అధి యజ్ఞము. ఈ మూడు పరమాత్మ లో ఉన్నాయి. ఈ మూడింటి గురించి తెలుసుకొన్న సాధకులు అవసాన సమయములో నిలకడ కలిగిన మనసుతో, నాగురించి తెలుసుకుంటారు. నన్నే స్మరిస్తారు.నన్నే ధ్యానిస్తారు. ఈ మూడింటి గురించి పరమాత్మ రాబోయే అధ్యాయంలో వివరిస్తాడు.

అధిభూతము. అధి దైవము. అధి యజ్ఞము. ఈ మూడింటి గురించి తెలుసుకున్న సాధకుని మనసు నిలకడగా, నిర్మలంగా ఉంటుంది. భగవంతుని యందే లగ్నం అయి ఉంటుంది. అటువంటి వాడు అవసాన దశలో ప్రాపంచిక విషయముల గురించి ఆలోచించకుండా పరమాత్మ గురించి ఆలోచిస్తాడు. పరమాత్మను తెలుసుకుంటాడు. అవసాన కాలంలో పరమాత్మను ధ్యానించాలంటే ఒకేసారిగా అయ్యేపనికాదు. ఎల్లప్పుడూ నిరంతరము పరమాత్మను ధ్యానిస్తుంటే అవసానదశలో కూడా పరమాత్మయందు మనసు నిలకడగా ఉంటుంది. ఈ లోకం అంతా బ్రహ్మమయం అని తెలుసుకుంటాడు.

మరి ఆ స్థితికి చేరుకోవాలంటే యుక్తచేతస: అంటే మనస్సును నిగ్రహించాలి. మనస్సును జయించాలి. మనసును ఆత్మలో నిలపాలి. ప్రాణం పోయేటప్పుడుకూడా ప్రాపంచిక విషయముల మీద దృష్టి ఉంటే, పరమాత్మ గురించి చింతించే అవకాశమే లేదు. కాబట్టి మనోనిగ్రహము ముఖ్యము. ఇక్కడ ఒక విషయం గ్రహించాలి. ప్రయాణకాలేపి చ అంటే అంత్యకాలమందు కూడా అని అర్థం కానీ కేవలం అవసానకాలంలో మాత్రమే అని చెప్పలేదు. కాబట్టి ఆరోగ్యము బాగా ఉన్నప్పడే దేహములో శక్తి ఉన్నప్పడే, సమస్తసాధనలు చేయాలి. ఆత్మను అనుసంధానం చేసుకోవాలి. ఎప్పడో చేద్దాములే అని అనుకోకూడదు. ఎందుకంటే అప్పటికప్పడు భగవంతుని స్మరించడం అంటే కాని పని. అప్పడు పరిస్థితి ఎలాఉంటుందో భగవన్నామము కనీసం పలకడానికైనా వీలుపడుతుందోలేదో మనసులో అయిన తలచుకోడానికి వీలులేకుండా కోమాలో ఉంటామేమో ఆలోచించాలి. ఊరి ప్రయాణానికి ముందే కావలసిన వస్తువులు అన్నీ ఎలా సర్దుకుంటామో అలాగే మనం ఆఖరి ప్రయాణానికి ఇప్పటినుండే సిద్ధం కావాలి. యౌవనం నుండే సిద్ధం అయితే ఇంకా మంచిది.

ఇక్కడ ఇంకొక విషయం కూడాచెప్పాడు భగవంతుడు. జీవితకాలంలో నన్నుఎవరు బాగా తెలుసుకుంటారో అంత్యకాలంలో కూడా వారు నా గురించి బాగా తెలుసుకుంటారు అని అన్నాడు. అంటే జీవిత కాలం అంతా భగవన్నామస్మరణ తప్పకుండా చేయాలి అని పరమాత్మ మనకు బోధిస్తున్నాడు. కాబట్టి అంత్యకాలములో ఒక్కసారి నారాయణ అంటే మోక్షంవస్తుంది అనడం ఒట్టి మాట అని తెలుస్తూ ఉంది. ఆధ్యాత్మరంగంలో సోమరితనానికి చోటులేదు. జీవితం అంతా వ్యర్థంగా గడిపి అవసాన దశలో భగవన్నామ స్మరణ చేస్తే ముక్తి వస్తుంది అనడం సోమరితనమును ప్రోత్సహించడమే కాని వేరు కాదు. కాబట్టి అందరూ జీవిత కాలంలో భగవంతుని గురించి ధ్యానించాలి పూజించాలి స్మరించాలి ఆరాధించాలి. ఆ అలవాటే అంత్యకాలంలోకూడా వస్తుంది అనడం నిర్వివాదాంశం.

దీనితో ఈ అధ్యాయం పూర్తి అయింది. తరువాతి అధ్యాయం అక్షర పరబ్రహ్మయోగము. అందులో ఏమేమి చెప్పాలో ఈ అధ్యాయం ఆఖరి రెండు శ్లోకాలలో వివరించాడు వ్యాసుడు. ఆ పదలే బ్రహ్మ, అధ్యాత్మం, కర్మచ అఖిలం, అధిభూతము, అధి దైవము, అధి యజ్ఞం. వీటి వివరణే తరువాతి అధ్యాయము.

ఉపనిషత్తులయొక్క, బ్రహ్మవిద్యయొక్క,

యోగశాస్త్రము యొక్క సారమయిన భగవద్గీతలో,

ఆత్మసంయమ యోగము అను ఏడవ అధ్యాయము సంపూర్ణము.

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# భగవద్గీత

## ఎనిమిదవ అధ్యాయము

## అక్షరపరబ్రహ్మయోగము.

కృష్ణుడు క్రిందటి అధ్యాయాన్ని ముగిస్తూ కొన్ని కొత్త పదాలు వాడాడు అని చెప్పుకున్నాము కదా. అసలే అర్జునుడు, కృష్ణుడు చెప్పేది సరిగా అర్థం కాక, సతమతమౌతున్నాడు. దానికి తోడు ఈ కొత్త పదాలు అర్జునుడిని ఇంకా తికమకపెట్టాయి. అందుకే ఈ అధ్యాయంలో అర్జునుడు మొదటి రెండు శ్లోకాలలో ఆ పదాల గురించి వివరించమని కృష్ణుడిని అడిగాడు.

1. కిం తద్బ్రహ్మ కిమధ్యాత్మం కిం కర్మ పురుషోత్తమ
అధిభూతం చ కిం ప్రోక్తమధిదైవం కిముచ్యతే॥

2. అధియజ్ఞ: కథం కో2త్ర దేహే2స్మిన్మధుసూదన।
ప్రయాణకాలే చ కథం జ్ఞేయో2సి నియతాత్మభి:॥

1.బ్రహ్మ ఎవరు; 2.అధ్యాత్మం ఎవరు?3. కర్మ అంటే ఏమిటి; 4.అధిభూతము అంటే ఏమిటి? 5.అధిదైవమ్ అంటే ఏమిటి? 6.అధియజ్ఞము అంటేఏమిటి?7. వీటిని గురించి ఎలా తెలుసుకోవాలి? 8. అంత్యకాలంలో నీ మీద మనసు నిలిపిన మానవుల చేత నీవు ఎలా తెలుసుకోబడతాడవు? అని గబగబా అడిగేసాడు. ఈ ప్రశ్నలకు ఒకటి ఒకటిగా సమాధానాలు చెప్పాడుపరమాత్మ.

గురువు అయిన కృష్ణుడు చెప్పిన మాటలు అర్థంకాక అర్జునుడు వాటి గురించి వివరాలు అడుగుతున్నాడు. కృష్ణా! కాస్త ఆగవయ్యా! నీ పాటికి నీవు చెప్పకుంటూ పోతుంటే నాకు అర్థం కావాలి కదా! ఇప్పుడు ఏవేవో నాకు అర్థం కాని మాటలు చెప్పావు. వాటి అర్థం ఏమిటో కాస్త వివరించు. అర్థం చేసుకోవడానికిప్రయత్నం చేస్తాను.

కిం తద్రహ్మ అంటే ఆ బ్రహ్మ ఎవరు?
అధ్యాత్మం కిం అంటే అధ్యాత్మ అంటే ఏమిటి? నేను ఈపదం ఎప్పుడూ వినలేదు.
కిం కర్మ అంటే కర్మ అంటే ఏమిటి? సాధారణ కర్మ అంటే ఏమిటో నాకు తెలుసు కానీ ఇప్పుడు ఈ

సందర్భంలో నీవు ఆ పదం ఎందుకు వాడావో నాకు తెలిసేటట్టు చెప్పు.

అధిభూతం చ కిం ప్రోక్తం అంటే అధిభూతం అని మీరు దేనిని అంటున్నారు. అదేమిటో వివరంగా చెప్పు.

ఇంకా

అధిదైవం కి ముచ్యతే అంటే ఏది అధిదైవం అని చెప్పబడుతూ ఉంది.

తరువాత

అధియజ్ఞ: కథం కో2త్ర దేహే2స్మిన్ అంటే ఈ అధియజ్ఞుడు ఎవరు? ఈ దేహంలో ఆ అధియజ్ఞుడు అనే వాడు ఎక్కడ ఉంటాడు? ఈ అధియజ్ఞుని గురించి ఎలా తెలుసుకోవాలి?

ప్రయాణకాలే చ కథం జ్ఞేయో2సి అంటే ఇంతకు ముందు శ్లోకంలో మానవుని అంత్యకాలంలో పరమాత్మను గురించి స్మరణ చేయాలి అన్నావు. అది ఎలాగ? అసలేవాడు చస్తుంటే, ,చుట్టు భార్యా పిల్లలు, బంధువులు చేరి ఏడుస్తుంటే, గొంతులోనుండి గుర గుర శబ్దం వస్తుంటే, మాటకూడా సరిగా రాకపోతే, అటువంటి వాడు పరమాత్మ గురించి ఎలా తెలుసుకోగలడు. అప్పుడు వాడి మనసు నీ యందు ఎలా నియమించబడుతుంది. మనోనిగ్రహం కలవారు మరణ సమయంలో పరమాత్మ గురించి ఎలా తెలుసుకోగలరు?

కృష్ణా! ఈ ప్రశ్నలకన్నిటికీ, ఏ ఒక్కటీ మిగల్చకుండా సమాధానం చెప్పు అని అడిగాడు అర్జునుడు. కృష్ణుడు సర్వము తెలిసిన వాడు. అర్జునుడు అమాయకంగా అడిగిన ప్రశ్నలకు అలవోకగా సమాధానాలు చెప్పాడు.

## 3. అక్షరం బ్రహ్మ పరమం స్వభావో2ధ్యాత్మముచ్యతే
## భూతభావోద్భవకరో విసర్గ: కర్మ సంజ్ఞిత:॥

అన్నిటికంటే ఉత్తమమైనది, నాశనము, మార్పులేనిది అయిన దానిని బ్రహ్మము అని అంటారు. ఆ బ్రహ్మ యొక్క స్వభావమే అధ్యాత్మము అని చెప్పబడుతుంది. ప్రాణులను ఉత్పత్తి చేయాలని భావించడం, వాటినిఉత్పత్తి చేయడం అనే వాటిని కర్మ అని అంటారు.

బ్రహ్మ అంటే అక్షరము అంటే క్షరము కానిది....నాశనము లేనిది. అది పరమ మైనది అంటే అన్నిటి కంటే గొప్పది. అంతకంటే పెద్దది, గొప్పది, ఉత్తమమైనది మరొకటి లేదు. మనం ఈ ప్రపంచంలో చూసేవాటన్నిటికీ ఒక రూపం, పేరు ఉంటుంది. అవి పరిమిత కాలం మాత్రమే ఉంటాయి. తరువాత అవి అన్నీ ఏదో ఒక రోజు నశించిపోతాయి లేక మార్పు చెందుతాయి. కాని ఏ రూపము, నామము లేకుండా, ఎటువంటి మార్పుచెందకుండా, నాశనం లేకుండా ఉండేది బ్రహ్మము, దీనినే మనం పరాప్రకృతి అని కూడా అనవచ్చు.

2.అధ్యాత్మము అంటే స్వభావము. తియ్యగా ఉండటం చక్కెర స్వభావము. చక్కెర ప్రతి కణంలోనూ తీపిదనం ఉంటుంది. అలాగే కాల్చడం అగ్నిస్వభావము. చిన్న నిప్పు రవ్వఅయినా, పేద్ద దావానలము అయినా కాల్చడం దాని స్వభావము. ఈ స్వభావము కంటికి కనపడదు. అనుభవంతోనే తెలుసుకోవాలి. అలాగే శరీరంలో ఉండే చైతన్యం కూడా దాని స్వభావమే. చైతన్యం శరీరంలోనే కాదు బయట కూడాఉంది. కాని శరీరంలో ఉండేచైతన్యము శరీరము యొక్క స్వభావము. ఈ స్వభావము అంతటా విస్తరించి ఉంటే దానిని బ్రహ్మ అంటారు. పరిమితంగా శరీరంలో ఉంటే దానిని పరిమిత చైతన్యము అని అంటారు. దానినే అధ్యాత్మ, జీవాత్మ అని కూడా అంటారు.

విసర్గ: అంటే మనం మనసుతో సంకల్పించి, ఆ సంకల్పములో నుండి పుట్టే పనులను కర్మలు అంటారు. ఈ కర్మలే సృష్టికి మూలము, బీజము. ఉదాహరణకు నేలలో విత్తనం వేస్తే మొక్క మొలుస్తుంది. విడి విడిగా ఉన్న ఆడ మగ ఇద్దరు తాము ఒకరితో ఒకరు కలవాలని సంకల్పించి, దానిని కార్యరూపంలో పెడితే, అది మరొకరిని సృష్టిస్తుంది. మానవులు తమ మనసులో సంకల్పించి ఎన్నో వస్తువులకు రూపకల్పన చేస్తున్నారు. ఈ సృష్టికార్యములు సృష్టిని నిరంతరం కొనసాగిస్తున్నాయి. ప్రపంచాన్ని జీవజాలంతో నింపుతున్నాయి. అంటే ఒకజీవి మరొక జీవిని కానీ, మరొక వస్తువును కానీ సంకల్పించి, సృష్టించే పనిని, కర్మ అని అంటారు.

ఈ అధ్యాయం అక్షర బ్రహ్మ అనేపదాలతో మొదలయింది. అందుకే ఈఅధ్యాయానికి అక్షర బ్రహ్మ యోగము అని పేరు. కాబట్టి ఈ అక్షర బ్రహ్మ గురించి, స్వభావం గురించి ఇంకొంచెం వివరంగాతెలుసుకుందాము. అన్ని జీవరాసులలో అంతర్లీనంగా ఉండేది ఆత్మస్వరూపము. కాని మానవులు ఈ ఆత్మస్వరూపమును తెలుసుకోలేక ఈ శరీరమే నేను అని అనుకుంటున్నారు. అదే వారి స్వరూపము అని అనుకుంటున్నారు. కాని మానవుల స్వరూపము ఆత్మ. దేహము కాదు. ఆత్మ పరమాత్మ స్వభావంతో అన్ని జీవరాసులలో వెలుగుతూ ఉంది. ఆత్మ స్వరూపాన్ని అంటే స్వభావాన్ని తెలుసుకోనంత కాలము జీవుడు ప్రాపంచిక సుఖముల కోసం పాకులాడుతుంటాడు. అదే నిజము, సత్యము అనుకుంటాడు. అవన్నీ క్షరములు అంటే నశించేవి, మార్పు చెందేవి అని తెలుసుకోలేరు. కాబట్టి ప్రతి మానవుడూ తన స్వభావము ఆత్మ అనీ, శరీరము కాదనీ, ప్రాపంచిక వస్తువులు కావనీ తెలుసుకోవాలి.

కర్మ అంటే ఈ సృష్టిని కొనసాగించడానికి అవసరమైన పనులే కర్మలు. మానవుల మంచి కోసం మనుగడ కోసం చేసే పనులే కర్మలు. ఒక పని చేయాలిన అనుకొని అంటే సంకల్పించి చేసే పనులే కర్మలు. అనుకోకుండా జరిగే కర్మలు వేరే ఉన్నాయి. శ్వాసపీల్చడం, జీర్ణక్రియ ఇవన్నీ అంతర్గత కర్మలు. ఇవి మనం చేయాలని అనుకోకున్నా జరిగిపోతుంటాయి. కాబట్టి మనం చేయాలని అనుకొని చేసేవే కర్మలు. ఆ కర్మలు సృష్టికి కారణం అవుతాయి. యజ్ఞయాగములు, పూజలు

వ్రతములు ఆరాధనలు, ధ్యానము, నిష్కామ యోగములు, దానములు, సృష్టికార్యము, ఇవన్నీ కర్మలు. ఇవి మానవుల సుఖసంతోషాలను వర్ధిల్లచేసేవి. వీటినే సత్కర్మలు అని కూడా అంటారు. సత్కర్మలు కానివి దుష్కర్మలు. వాటి వలన దు:ఖము కలుగుతుంది.

## 4. అధిభూతం క్షరో భావ: పురుషశ్చాధి దైవతమ్।
## అధియజ్ఞో2హమేవాత్ర దేహే దేహభృతాం వర॥

క్షరము అంటే నశించేది, మార్పుచెందేది, నశించేభావము కలది. మార్పుచెందే గుణము కలది. దీనినే అధిభూతము అని అంటారు. పురుషుడు అంటే ఈ దేహము అనే పురములో నివసించేవాడిని అధిదైవతము అని అంటారు. ఈ అధిదైవతము అన్ని దేహములలో ఆత్మస్వరూపంగా నిలిచి ఉంది. ఈ ప్రకృతి అందులో ఉండే సకల జీవరాసులు, ఆ జీవరాసులలో నిక్షిప్తంగా ఉండే ఆత్మస్వరూపము, ఇవి అన్నీ కలిపి విరాట్ స్వరూపము, విరాట్ పురుషుడు అని అంటారు. సమస్తజీవరాసుల దేహములలో ఆత్మస్వరూపుడుగా వెలుగుతున్న యజ్ఞ స్వరూపమును అధియజ్ఞము అని అంటారు.

అధిభూతము అంటే ఈ ప్రకృతి అందులో ఉన్న శరీరములు, వస్తువులు. ఇవన్నీ క్షరములు. నశించేవి. మార్పుచెందేవి. శాశ్వతములు కావు. సుఖములను ఇవ్వవు. ఇచ్చినా అవి తాత్కాలికమే. ఈ అధిభూతముల లక్షణము నశించి పోవడం. అంటే నశించేవన్నీ అధిభూతములు.

అధిదైవతమ్ అంటే ప్రతి పురుషునిలో ఆత్మ స్వరూపంగా ఉండేవాడు. పురుషుడు అంటే దేహము అనే ఈ పురములో నివసించేవాడు. ఆత్మస్వరూపుడు. ఈ ప్రకృతి అంతా జీవరాసులతో నిండి ఉంది. ఆ జీవరాసులన్నింటిలో పరమాత్మ ఆత్మ స్వరూపంగా వెలుగుతున్నాడు. దీనినే విరాట్ స్వరూపము, పురుషుడు అని అంటారు. పురుషుడు అంటే ఎవరో ఒక మగవాడు అని అర్థం కాదు. ఈ సమస్త ప్రకృతిలోని జీవరాసులలో అంతర్లీనంగా ఉన్న ఆత్మస్వరూపుడు అని అర్థం. దీనినే హిరణ్యగర్భతత్వము అని అంటారు.

అధి యజ్ఞం అంటే ఒక్కొక్క ప్రాణిలో ఉన్న చైతన్య స్వరూపము. జీవశక్తి, ప్రాణశక్తి. ఆ జీవశక్తి శరీరము, అందులో ఉన్న మనోబుద్ధిఅహంకారములతో చేరి జీవాత్మగా పరిగణింప బడుతుంది. పరమాత్మయే ఒక్కొక్క శరీరములో ప్రాణశక్తిగా ప్రకటితమౌతున్నాడు. ప్రాణశక్తి లేకపోతే శరీరం పడిపోతుంది. కాబట్టి ఒక్కొక్క ప్రాణిలో పరిమితంగా ఉన్న ప్రాణశక్తి, విశ్వచైతన్యమును అధియజ్ఞం అంటారు. అది నేనే. నేనే యజ్ఞస్వరూపుడను. అందరి దేహములలో ఆత్మస్వరూపంగా నిలిచి ఉన్నాను. అని అంటున్నాడు శ్రీకృష్ణుడు.

5. అన్తకాలే చ మామేవ స్మరన్ముక్త్వా కలేబరమ్।
యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః॥

ఎవరైతే తన అంత్యకాలములో కూడా అంటే మరణించే సమయంలో కూడా నన్నే స్మరిస్తూ దేహాన్ని విడిచిపెడతారో, అతడు నా భావాన్నే పొందుతున్నాడు. ఇందులో ఎటువంటి సందేహము లేదు.

అర్జునుడు అడిగిన ప్రశ్నలలో ఆఖరుది, అసలుది అయిన (లాస్ట్ బట్ నాట్ ది లీస్ట్) విషయానికి వస్తున్నాడు పరమాత్మ. ఇది అర్జునుని ఆఖరు ప్రశ్న. దానికి సమాధానం ఇస్తూ పరమాత్మ ఈ కింది పదం వాడాడు. ఈ శ్లోకంలో వాడిన అన్తకాలే చ = అంటే అంత్యకాలములో కూడా అని అర్థం. కేవలం అంత్యకాలములోనే అని అర్థం చేసుకోకూడదు. మరణ సమయంలో కూడా ఎవరైతే పరమాత్మను స్మరిస్తూ ఈ శరీరాన్ని వదిలిపెడతాడో, వాడు ఆ పరమాత్మ స్వరూపాన్నే పొందే అవకాశం ఉంది.

పరమాత్మను మానవులు రెండు విధాలుగా స్మరిస్తారు. ఒకటి సగుణోపాసన. రెండవది నిర్గుణోపాసన. సగుణోపాసన అంటే ఏదో ఒక మూర్తిని, విగ్రహాన్ని ఎదురుగా పెట్టుకొని, ఆ మూర్తిని ఉపాసించడం. లేక ఆ మూర్తిని మనసులో నిలుపుకొని ఉపాసించడం. ఈ సగుణో పాసన కూడా రెండు రకాలు. మొదటిది సకామ ఉపాసన. రెండవది నిష్కామ ఉపాసన. సకామ ఉపాసన అంటే ఏదో ఒక కోరిక కోరుకొని, ఆ కోరిక తీరడం కొరకు పరమాత్మను ఉపాసించడం. రెండవది ఏ కోరికా లేకుండా, కేవలం పరమాత్మను పొందడం కొరకే ఉపాసించడం.

ఇంక నిర్గుణోపాసన అంటే ఇదివరకే తెలుసుకున్నాము. నిరాకారుడు, నిర్గుణుడు అయిన పరమాత్మను ధ్యానము, సమాధి ద్వారా ఉపాసించడం. ఇంద్రియములను, మనసును నిగ్రహించి, మనసును ఆత్మలో లీనం చేసి, ఆత్మజ్ఞానం పొందడం.అప్పుడు సాధకుడు ఈ ప్రపంచం అంతా పరమాత్మ నిండి ఉన్నాడు. ఆ పరమాత్మలోనే నేను ఉన్నాను. నాలో ఆత్మ స్వరూపంగా పరమాత్మ ఉన్నాడు. తనకు పరమాత్మకు భేదం లేదు. చివరకు నేనే పరమాత్మ అనే స్థితికి వస్తాడు. మద్భావం యాతి అంటే నా భావాన్నే పొందుతున్నాడు అని అర్థం. ఈ నేపథ్యంలో ఈ శ్లోకాన్ని అర్థం చేసుకుందాము.

"ఎవరైతే" అంటే ఎవరైతే జీవితం అంతా నిష్కామ కర్మలు చేస్తారో, ఎటువంటి కోరికలు కోరకుండా, కేవలం భగవంతుని కొరకు మాత్రమే ఉపాసన చేస్తారో, అని అర్థం. ఎప్పుడూ

ఏవేవో కోరికలు కోరుతూ వివిధ దేవతలను ఉపాసించే వారు కాదు. వారందరూ ఆయాదేవతలతో బేరం ఆడుతుంటారు. నాకు ఇది చేస్తే నీకు ఇది చేస్తా అని కోరికలు కోరుతూ ఉంటారు. ఇక్కడ వాడిన 'చ' అంటే 'కూడా' అని అర్థం. జీవిత కాలం అంతా భగవంతుని స్మరిస్తూ అంత్యకాలంలో కూడా స్మరించిన వాడు పరమాత్మ స్వరూపాన్ని పొందుతాడు. ఇలా ఎందుకు చెప్పారంటే జీవిత కాలం అంతా పరమాత్మను స్మరిస్తూ ఉంటే అదే అలవాటు ప్రకారము అంత్యకాలంలో కూడా పరమాత్మను స్మరిస్తాడు అని కృష్ణుని భావన.

ఒక పని చేయాలన్నా ఒక పరీక్ష పాసు కావాలన్నా, కొంత కాలం పాటు అభ్యాసము, సాధన అవసరము సంవత్సరం అంతా కష్టపడి చదివితే పరీక్షలసమయంలో అన్నీచక్కగా గుర్తుకు వస్తాయి. తేలికగా ఉత్తీర్ణుడు కాగలడు. అంతే కానీ అప్పటికప్పుడు చదివితే ఏ పరీక్షలో ఉత్తీర్ణుడు కాలేడు. కొంత అభ్యాసం లేకుండా ఏపనీ చేయలేడు కదా. అంత్యకాలంలో భగవంతుడు గుర్తుకు రావాలంటే జీవిత కాలం అంతా కూడా భగవంతుని స్మరించడం ముఖ్యం. జీవితం అంతా దుష్ట ఆలోచనలు, పనికిరాని ఆలోచనలు, కామ సంబంధమైన ఆలోచనలు వీటితో గడిపితే అంత్య కాలంలో కూడా అవే గుర్తుకు వస్తాయి కానీపరమాత్మ గుర్తుకు రాడు. కాబట్టి అంత్యకాలంలోకూడా పరమాత్మ స్మరణకు రావాలంటే, నిరంతరము భగవంతుని ఆలోచన, చింతన, స్మరణ, ధ్యానము ముఖ్యము.

ఇక్కడ ఇంకొక విషయం మనం గమనించాలి. జీవితం అంతా ధ్యానం చేస్తూ, కాస్త రిలాక్స్ అయి, ఇంతకాలం చేసాము కాసేపు కులాసాగా గడుపుదాము బాగానే ఉన్నాము కదా అప్పుడే చస్తామా ఏమన్నానా అని కాస్త కులాసా జీవితం గడిపితే, అప్పుడే మృత్యువురావచ్చు. ఇంతకాలం చేసిన శ్రమ వృధా కావచ్చు. అన్నిమెట్లు జాగ్రత్తగా ఎక్కి, ఇంక ఒక మెట్టే కదా అని అజాగ్రత్తగా ఉంటే, ఆ మెట్టు మీది నుండి జారి, కిందికి వచ్చి పడతాడు. నడుము విరుగుతుంది. చివరకు మొదటి మెట్టు కూడా ఎక్కలేక మంచం ఎక్కుతాడు. మనం మేడ ఎక్కేవిషయంలోనే ఇంత జాగ్రత్త అవసరం అయితే, జీవితం అనే మేడ మెట్లు ఎక్కాలంటే ఎంత జాగ్రత్త అవసరమో ఆలోచించుకోవాలి. కాబట్టి అంత్య కాలం దాకా, వదలకుండా భగవంతుని స్మరించాలి. ఏమరుపాటు పనికిరాదు. ఒకసారి మోహంలో పడితే, ఆ మోహం మనలను అధః పాతాళానికి తొక్కేస్తుంది. మరలా పరమాత్మ వైపుకు వెళ్లనీయదు అనే సత్యాన్ని గుర్తుంచుకోవాలి.

అవసాన కాలంలో మనకు జరిగేవి ఏమిటో పరమాత్మ ఆనాడే ఊహించి ఉంటాడు. బంధువులు మిత్రులు చుట్టు ఉంటారు. అవి ఇవి అడుగుతుంటారు. ప్రాపంచిక విషయాల గురించి గుర్తు చేస్తుంటారు. ఆస్తులు, ధనము, బంగారము వీటి గురించే ఎక్కువ అడుగుతుంటారు. ఈ సమయంలో పరమాత్మ గురించి ధ్యానం చేసే అవకాశం ఉండదు. మనసు వీటి మీదనే లగ్నం

అయి ఉంటుంది. ఒక్కోసారి స్పృహ కూడా లేకపోవచ్చు. కాబట్టి జీవితం అంతా సాధకుడి మనసు పరమాత్మయందు లగ్నం అయి ఉంటే అవసాన కాలంలో కూడా మనసు అటు ఇటు చెదరకుండా ఎవరెన్ని విధాలుగా ప్రయత్నించినా చలించకుండా పరమాత్మయందు లగ్నం అయి ఉంటుంది.

ఇంత చేస్తే మనకేం ఫలితం కలుగుతుంది అని మనకు సందేహం కలుగుతుంది. దానికి పరమాత్మ స్పష్టమైన సమాధానం ఇస్తున్నాడు. ఎవరైతే నన్నే స్మరిస్తూ ఈ దేహం విడిచిపెడతాడో వాడు నన్నే పొందుతాడు. అని చెప్పాడు. నన్నేపొందడం అంటే ఈ జననమరణచక్రం నుండి విడివడి, శాశ్వతమైన సుఖాన్ని, శాంతిని పొందుతాడు. పైగా మనకు ఒక హామీ కూడా ఇస్తున్నాడు. "నాస్త్యత్ర సంశయ:" అంటే అత్ర ఈ విషయంలో సంశయ: ఎటువంటి సందేహము న లేదు. అని నిశ్చయంగా చెబుతున్నాడు. కాబట్టి మనం కూడా ఇప్పటి నుండే అనుక్షణం పరమాత్మ ను ధ్యానిస్తూ ఉంటే ఆఖరి క్షణాలలో కూడా పరమాత్మను స్మరిస్తూ ఈ దేహము వదలవచ్చును. మరు జన్మలేకుండా పరమాత్మలో కలిసిపోవచ్చు. ఇందులో సందేహము లేదు.

## 6. యం యం వాపి స్మరన్ భావం త్యజత్యన్తే కలేబరమ్।
## తం తమేవైతి కౌన్తేయ సదా తద్భావభావిత:॥

ఎవరైతే తాను మరణించే సమయంలో ఏయే భావంతో, ఏయేకోరికలతో, ఎటువంటి రూపాలను తలచుకుంటూ, శరీరాన్ని వదిలిపెడతారో, వారు అటువంటి భావములకు, కోరికలకు, రూపాలకు అనువైన శరీరములనే పొందుతారు.

ఈ శ్లోకంలో మరొక ట్విస్టు. ఇంతకు ముందు శ్లోకంలో ఎవరైతే అవసాన దశలో నన్నే స్మరిస్తూ ఈ శరీరాన్ని వదిలిపెడతారో వారు నన్నే పొందుతారు ఇందులో సందేహము లేదు అన్న కృష్ణుడు మరొక మాట కూడా అన్నాడు. అందరికీ అవసానకాలంలో పరమాత్మను స్మరిస్తూ శరీరాన్ని వదలడం సాధ్యం కాకపోవచ్చు. మరి మానవుడు ఈ శరీరాన్ని వదిలేటప్పుడు పరమాత్మను కాకుండా వేరే వాటి గురించి ఆలోచిస్తుంటే, అప్పుడు ఏమవుతుంది అంటే దానికి సమాధానంగా మానవుడు శరీరం విడిచిపెట్టేటప్పుడు ఎవరి గురించి, దేని గురించి, ఏ రూపం గురించి తలుస్తాడో, స్మరిస్తాడో, దానినే పొందుతాడు అని చెప్పాడు కృష్ణుడు.

అంటే, ఛాయిస్ మనకే ఇచ్చేసాడు పరమాత్మ. సాధారణంగా మానవులు నిరంతరము దేనిగురించి ఆలోచిస్తుంటారో, తలచుకుంటూ ఉంటారో, వారిలో అటువంటి సంస్కారమే ఏర్పడుతుంది. అది వాసనలుగా సూక్ష్మరూపంలో మనసుకు అంటిపెట్టుకొనిఉంటుంది. మరణించేటప్పుడు సూక్ష్మశరీరంతో పాటు ఈ వాసనలు కూడా అంటిపెట్టుకొని వెళతాయి.

మరుజన్మలో ఆ వాసనలకు అనుగుణమైన శరీరాన్నే పొందడానికి అవకాశం ఉంది. జడభరతుడు మహా తపస్సంపన్నుడు. కానీ అంత్యకాలంలో ఒక జింకపిల్లను గురించి ఆరాట పడుతూ మరణించి, జింకగా పుట్టాడు. యద్భావం తద్భవతి అని ఏ భావంతో శరీరం వదిలితే మరుసటి జన్మలో అటువంటి శరీరమే వస్తుంది.

ఇంకొక విషయం కూడా ఉంది. మనం జీవితకాలంలో దేని గురించి ఎక్కువగా ఆలోచిస్తామో, భావిస్తామో, ఆరాటపడతామో, మరణ కాలంలో కూడా అదే జ్ఞాపకానికి, స్మరణకు వస్తుంది. ధనం గురించి, ఆస్తుల గురించి, కుమారులు, మనుమలు, వారి పెళ్లిల్లు, వారి జీవితాలు ఎలా గడుస్తాయో,అనే దిగులు, లేకపోతే ఇతర అక్రమ సంబంధాల గురించి దిగులు, బంధువుల బాగోగులు, ఎల్లప్పుడూ వీటి గురించే జీవితాంతం చింతిస్తూ ఉంటే, అవసాన కాలంలో కూడా ఇవే గుర్తుకు వస్తాయి. వీటి గురించి ఆలోచిస్తూ మరణిస్తే ఆ ఆలోచనలే అతని మరుజన్మకు హేతువు అవుతాయి.

అలాకాకుండా జీవితకాలం అంతా భగవన్నామస్మరణలో గడిపితే అతడు అవసాన కాలంలో కూడా భగవంతుని గురించి స్మరిస్తూ, ఉత్తమ గతులు పొందుతాడు. కాబట్టి ఎప్పుడో 60 ఏళ్ల తరువాత చూద్దాంలే అని అనుకోకుండా శరీరంలో శక్తి ఉన్నప్పుడే భగవన్నామ స్మరణ మొదలు పెట్టాలి. నిరంతర సాధన చెయ్యాలి. ఉత్తమమైన సంస్కారములు కలిగి ఉండాలి. మరణించేటప్పుడు మనకు కనీసం భగవన్నామ స్మరణ చేసే అవకాశం కూడా ఉండకపోవచ్చు. నోటి మాట పడిపోవచ్చు. కోమాలోకి జారుకోవచ్చు. చుట్టు ఉన్నవారు ఏవేవో ప్రశ్నలతో కంగారుపెట్టవచ్చు. మరణ సమయంలో నిశ్చలమైన మనసుతో భగవంతుని స్మరించాలంటే, జీవిత కాలం సాధన అవసరము. మనకు మంచి జన్మ రావాలన్నా, నీచ జన్మ రావాలన్నా దానికి మనమే కారణము. దేవుడు కాదు. మనము ఏ జన్మఎత్తినా అది మన పూర్వజన్మ సంస్కార, వాసనా ప్రభావమే కాని వేరు కాదు. ఈ విషయం ప్రతి ఒక్కరూ గ్రహించాలి.

## 7. తస్మాత్సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్యచ।
## మయ్యర్పితమనోబుద్ధిర్మామేవైష్యస్యసంశయః॥

అర్జునా! ఇప్పుడు నీ కర్తవ్యం యుద్ధం చేయడం. ఆ యుద్ధం నన్ను తలచుకుంటూ, నన్నేస్మరిస్తూ చెయ్యి. నీ కర్తవ్యం నిర్వర్తించు. ఒక వేళ ఈ యుద్ధంలో నీవు మరణిస్తే, మరణించే సమయంలో కూడా నన్నే స్మరిస్తున్నావు కాబట్టి, నీ మనస్సును, బుద్ధిని నాకే అర్పించావు కాబట్టి, నన్నే పొందగలవు. ఇందులో ఎటువంటి సందేహము లేదు.

ఈ శ్లోకం అర్జునుడిని ఉద్దేశించి చెప్పాడు కాబట్టి యుద్ధం చేయమన్నాడు. మనం కూడా ఈ సంసారము అనే యుద్ధం చేసేటప్పుడు కూడా నిరంతరం పరమాత్మను మనస్సులో, బుద్ధిలో నిలుపుకొని, దైనందిన కార్యములు నిర్వర్తించాలి. మనం ఈ ప్రపంచంలో తిరుగుతూ ఏ పని చేస్తున్నా, మనసు మాత్రం పరమాత్మయందే లగ్నం చేయాలి. ఇలా చేస్తే అవసాన కాలంలో కూడా మన మనసు బుద్ధి పరమాత్మయం లగ్నం అయి ఉంటుంది. ఎందుకంటే, ప్రాణం పోయేటప్పుడు చుట్టు బంధుమిత్రులు చేరతారు కాబట్టి సర్వేషు కాలేషు సర్వకాల సర్వావస్థలయందు మామ్ అనుస్మర నన్నే స్మరించు అని చెప్పాడు కృష్ణుడు.

అలా చెబుతూ అర్జునుడిని ఉద్దేశించి మరొక మాట కూడా అన్నాడు పరమాత్మ యుధ్యచ అంటేయుద్ధం చెయ్యి. నీమనస్సును బుద్ధిని నా యందు ఉంచి, యుద్ధం చేస్తే నన్నే పొందుతావు అని మామూలు అర్థం. యుద్దం ఎంత సేపు చేస్తాడు. కొద్ది రోజులు. మరి సర్వేషుకాలేషు అనడం ఎందుకు. పైగా కృష్ణుడు జ్ఞాన బోధ చేస్తూ ఉన్నట్టుండి యుద్ధం మాటెందుకు ఎత్తుతాడు. ఈ రెండు పదాలకు పొంతన కుదరడం లేదు. కాబట్టి వాటిని ఈ విధంగా సమన్వయం చేస్తే సరిపోతుంది. ఇక్కడ యుద్ధము అంటే మామూలుయుద్ధం కాదు. జీవిత యుద్ధం. ప్రతిరోజూ మానవుడు చేసే యుద్ధం. సంసారయుద్ధం. ఇప్పుడు ఒక సందేహం వస్తుంది. ఎప్పుడూ దైవధ్యానం చేస్తుంటే మరి ఉద్యోగం ఎలా చేయాలి వ్యాపారం ఎలా చేయాలి. రాజకీయాలు ఎలా చేయాలి. కూలి నాలి ఎలా చేయాలి. పొట్ట ఎలా పోషించుకోవాలి అనే ప్రశ్న కూడా వస్తుంది. దానికి సమాధానమే ఈ శ్లోకము.

ఈ దైనందిన యుద్ధంలో ఎవరు ఏపని చేస్తున్నా, సర్వేషుకాలేషు అన్ని కాలములలో నన్ను ధ్యానిస్తే చాలు. అంటే పని చేసుకుంటూ భగవంతుని మీద మనసు నిలుపవచ్చు. భగవంతుని స్మరించుకోవచ్చు. భగవంతుని మరిచిపోకుండా మనసులో నిలుపుకోవచ్చు. అలా చేస్తే పని పాటికి పనీ జరుగుతుంది భగవంతుని స్మరణా జరుగుతుంది. ఇదే ఈ శ్లోకంలో అంతరార్థం. మనం నగర జీవనంలో పడి అన్ని మరిచిపోయాము కానీ, పల్లెలలో కూలీలు కూలి పని చేసుకుంటూ కీర్తనలు, భగవంతుని మీదపాటలు పాడుకుంటూ పని చేసేవారు. తల్లులు పిల్లలను నిద్రపుచ్చేటప్పుడు జోఅచ్యుతానంద జోజోముకుందా అని పరమాత్మను నిద్రపుచ్చుతున్నట్టు అనుభూతి చెందేవారు. మామ్మలు, బామ్మలు కూడా ఇంట్లో పనులు చేసుకుంటూ దేవుడి పాటలు కీర్తనలు పాడుకుంటూ పనులు చేసుకునేవారు. ఈ కాలంలో మనకు అన్నీ తెలుసు అనే అపోహలో పడి ఇటువంటి మంచి పనులు చేయడం మరిచిపోయాము. అర్థం పర్థం లేని టివి సీరియల్సు చూస్తూ కాలం గడుపుతున్నాము.

ఈ శ్లోకంలో కృష్ణుడు "యుద్ధం" అనే మాట అన్నాడు. దానికి మనం ఏవేవో అర్థాలు తీస్తున్నాము అని అనుకుంటే, మనం కృష్ణుడు అన్న యుద్ధం అనే మాటను అలాగే

అన్వయించుకుంటే...... అర్జునుడు యుద్ధం చేస్తూ కూడా పరమాత్మను మనసులో స్మరిస్తూ ఉంటే, ఒక వేళ యుద్ధంలో మరణిస్తే, చివరి క్షణాలలో పరమాత్మను తలుచుకుంటున్నాడు కాబట్టి, అదే భావనలో ఉండి, పరమాత్మలో లీనం అవుతాడు అని కూడా అర్థం. భయంకరమైన యుద్ధం చేస్తున్నప్పుడే అర్జునుడు భగవంతుని స్మరిస్తూ యుద్ధం చేస్తే, ఇంక మనం మామూలు పనులు చేస్తూ పరమాత్మను ఎందుకు స్మరించుకోకూడదు.

ఇక్కడ ఒక సందేహం తలెత్తుతుంది. మనకు ఉన్నది ఒకే మనసు. మనసు పెట్టి పనులు చేయాలి. కాబట్టి ఒకే సారి మన మనసును, ఇటు చేసే పనిమీదా, అటు పరమాత్మ మీద ఎలా లగ్నం చేయగలము. కానిమనము ఒకవిషయం మరిచిపోతున్నాము. మనకు రెండుమనసులు ఉన్నాయి. ఒకటి బాహ్యప్రపంచంలో పనిచేసే మనసు. దానినే కాన్షస్ మైండ్ అంటాము. రెండవది సబ్ కాన్షస్ మైండ్. మనం ఆఫీసులోకానీ, ఫాక్టరిలోకానీ పని చేస్తున్నా, మన సబ్ కాన్షస్ మైండ్ లో ఏవేవో ఆలోచనలు మెదులుతుంటాయి. (ఆఫీసులో పని చేస్తూ కూడా, క్రికెట్ గురించి ఆలోచించేవాళ్లు, క్లాసురూములో పాఠాలు వింటూ ఉంటూ కూడా కొత్తగా రిలీజు అయిన సినిమా గురించి ఆలోచించేవాళ్లు కొత్తగా పెళ్లి అయిన దంపతులు, ఆఫీసులో పనిచేస్తున్నా మనసు మాత్రం లైఫ్‌పార్టనర్ మీద పెట్టే వాళ్లు, ఎంతమంది లేరు.) కాబట్టి, సబ్ కాన్షస్ మైండ్‌తో పనికిమాలిన ఆలోచనలు చేయకుండా దానిని పరమాత్మ మీదికి మళ్లించాలి. అప్పుడు మనం ఏపని చేస్తున్నా మన అంత: కరణలో పరమాత్మ ధ్యానం జరుగుతూ ఉంటుంది. దీనికి నిరంతర అభ్యాసం కావాలి.

దానికి ఒక సులభ ఉపాయం కూడా చెప్పాడు పరమాత్మ. మయ్యర్పిత మనో బుద్ధి అన్నాడు. అంటే నీ మనస్సు బుద్ధి నాకు అర్పించు. నీ సంగతి నేను చూచుకుంటాను. మరలా అంటున్నాడు. అ సంశయ: సందేహం లేకుండా నన్నే పొందుతావు. నీ సంగతినాకు వదిలిపెట్టు అని ఖచ్చితంగా చెబుతున్నాడు పరమాత్మ.

## 8. అభ్యాస యోగ యుక్తేన చేతసా నాన్యగామినా।
## పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచిన్తయన్॥

సాధకుడు నిరంతర అభ్యాసము చేత తన మనసును అటు ఇటు పోకుండా నిగ్రహించినవాడై, దివ్యమైన వాడు, పరమ పురుషుడు అయిన పరమాత్మను ధ్యానిస్తున్నాడు.

ఇప్పుడ మనందరం కృష్ణుని నిలదీయవచ్చు. "ఏమయ్యా ఏదేదో చెబుతున్నావో ఇదంతా జరిగే పనేనా!" అంటే దానికి ఠక్కున సమాధానం మొదటి పదంలోనే ఇచ్చాడు. అభ్యాసయోగేన అంటే అభ్యాసము అనే యోగంతోసాధించవచ్చు అని. నిజానికి అభ్యాసము ఒక యోగం కాదు.

కాని కృష్ణుడు అభ్యాసానికి కూడా యోగము అనే స్టేటస్ కల్పించాడు. ఎందుకంటే ఏ యోగమైనా అభ్యాసము లేనిదే అలవడదు అని ఇంతకు ముందే చెప్పుకున్నాము. ఇంద్రియములను మనస్సును నిగ్రహించడానికి అభ్యాసయోగమే అవసరము. ధ్యానం కూడా అభ్యాసం చేయాలి. (అను చిన్తయన్ అంటే నిరంతర అభ్యాసము అంటే కాన్స్టెంట్ ప్రాక్టీస్). అలాగే ఏ పని చేస్తున్నా, దైనందిన కార్యములలో ఊపిరిసలపకుండా ఉన్నా లోపల అంటే అంతరాత్మలో ఇతరముల గురించి ఆలోచించకుండా, దైవధ్యానం చేసుకుంటూ ఉంటే చాలు. ఇది అభ్యాసంతోనే వస్తుంది. దీనికి ముఖ్యంగా కావాల్సింది మనసును పరమాత్మయందు నిలపడం. అందుకే "చేతసా న అన్య గామినా" మనస్సు అటు ఇటు పోకుండా పరమాత్మయందు లగ్నం చేయాలి. అప్పుడు చేసేపని మీద ఏకాగ్రత కుదురుతుంది. చేసే పని కూడా సక్రమంగా నేర్పుగా కుదురుతుంది. ఇదంతా అభ్యాసం వలననే సాధ్యం అవుతుంది.

దీని వలన ఏం జరుగుతుంది. పరమం అంటే విశ్వచైతన్య స్వరూపుడు, దివ్యం అంటే ప్రకాశమే తన స్వరూపముగా కలవాడు, పురుషం అంటే అన్ని జీవరాసుల యందు ఆత్మస్వరూపుడుగా ఉన్న ఆ పరమాత్మను, తన మనసులో, తనకు ఇష్టమైన రూపంలో అంటే విష్ణువుగానో, శివుడుగానో లేక ఇంకా ఇతర దేవతా స్వరూపాలుగానో నిలుపుకొని, ధ్యానిస్తాడు. దీనికంతా మూలం అభ్యాసయోగము కాబట్టి, నిరంతర అభ్యాసం చేయాలి అని పరమాత్మ మనకు బోధించాడు.

## 9. కవిం పురాణమనుశాసితారమణోరణీయాంసమనుస్మరేద్యః సర్వస్య ధాతారమచిన్త్యరూప మాదిత్యవర్ణం తమసః పరస్తాత్॥

అన్నీ తెలిసిన వాడు, ఆది అంతము లేని వాడు, ఈ అనంత విశ్వాన్ని శాసించేవాడు, అణువుకంటే సూక్ష్మమైన వాడు, ఈ అనంత విశ్వానికి ఆధారభూతమైనవాడు, మనసులో కానీ బుద్ధితో కానీ తెలియని రూపము కలవాడు, సూర్యునితో సమానమైన ప్రకాశము కలవాడు, మానవులలోని అజ్ఞానము అనే అంధకారానికి అవతల నిలిచి ఉండేవాడు (అంటే జ్ఞానస్వరూపుడు) (అయిన పరమాత్మను అంత్యకాలంలో స్మరించాలి).

సాధకుడు సాధన చేయాలంటే ఆ పరమాత్మ స్వరూపం స్వభావం లక్షణం తెలిసి ఉండాలి కదా. అందుకే మొట్ట మొదట పరమాత్మ స్వరూపము గురించి వివరిస్తున్నాడు.

| | |
|---|---|
| కవి | = అన్నీ తెలిసినవాడు, సర్వజ్ఞుడు, |
| పురాణం | = చాలా సనాతనుడు, ఎంతో కాలం నుండి ఉన్న నాడు, ఆది అంతములు లేని వాడు, |

అనుశాసితారం = అందరినీ శాసించకలగిన శక్తి కలవాడు, అందరినీ నియమించేవాడు,

అణో: = అణువు కంటే

అణీయం = పరమాణువు కంటూ సూక్ష్మమైన వాడు,

సర్వస్వ = సమస్త విశ్వమునకు

ధాతారమ్ = ఆధారభూతమైన వాడు,

అచిన్త్య రూపం = మనసుకు, బుద్ధికి, ఆలోచనలకు అందని వాడు,

ఆదిత్యవర్ణమ్ = సూర్యకాంతితో సమానమైనవాడు,

తమస: = అంధకారమునకు అంటే మనలో ఉన్న అజ్ఞానము అనే చీకటికి,

పరస్తాత్ = అవతల ఉండేవాడు, చీకటిని మించిన వాడు,

పురుషమ్ = విరాట్ స్వరూపుడు, (సహస్రశీర్షా పురుష:)

ఇవీ పరమాత్మ లక్షణాలు.

ఇంతకు ముందు శ్లోకంలో క్లుప్తంగా చెప్పిన విషయాన్ని ఇక్కడ వివరించాడు. ఈ శ్లోకంలో పరమాత్మ ఎవరు, అతని స్వరూపము ఎట్టిదిఅనే విషయాన్ని తెలిపాడు. పరమాత్మ ఎవరో ఎలా ఉంటాడో తెలిస్తేనే కదా ఆయనను స్మరిస్తాము. పరమాత్మ స్వరూపము ఆయన స్వభావము, మహిమ తెలియనిది ఆయనను ఆరాధించలేము కదా!

1.ఆయన కవి అంటే అన్నీ తెలిసిన వాడు. సర్వజ్ఞుడు. ఆయనకు తెలియనిది అంటూ లేదు. ఆయనకు తెలుసుకోవలసినది అంటూ ఇంక ఏమీ మిగలదు. అటువంటి వారిని కవి అంటారు కానీ మన కవులు కాదు.

2.పురాణ పురుషుడు వయస్సులో పెద్దవాడు అని కాదు. అంటే ఆది అంతములు లేని వాడు. ఈ ప్రపంచంలో కనిపించే అన్ని వస్తువులకు, జీవ రాసులకు పుట్టుక చావు, మొదలు, తుది ఉన్నాయి. కాని పరమాత్మకకు అవి లేవు. ఆయన పుట్టలేదు. ఆయనకు మార్పులేదు. ఈ సృష్టికి ముందు నుండి ఉన్న వాడు. సృష్టి అంతం అయిన తరువాత కూడా ఉండేవాడు.

3. పరమాత్మ అందరినీ శాసించేవాడు. ఆయన శాసనమునకు లోబడి గ్రహాలు నక్షత్రాలు అన్నీ తమ తమ పరిధిలో తిరుగుతున్నాయి. ఏ మాత్రం అటు ఇటు అయినా లోకాలు తలకిందులు అవుతాయి.

4. అణువుకన్నా సూక్ష్మమైన వాడు. అంటే పరమాణు స్వరూపుడు. ఇప్పుడు అణువును కూడా మనవాళ్లు చూడగలుగుతున్నారు. కానీ అణువు కన్నా సూక్ష్మమైనవాడు అంటే కంటి తో కానీ, కంటితో చూడగలిగే ఇతర సాధనములతో కానీ, మనసుతో కానీ, బుద్ధిలో కానీ చూడబడని వాడు, తెలియబడని వాడు. సూక్ష్మాతి సూక్ష్మము అయినవాడు.

5. ఈ అనంత విశ్వంకంటే మించిన వాడు. ఈ అనంత విశ్వానికి ఆధారభూతమైన వాడు, అంటే ఈ సృష్టిని పెంచి పోషించేవాడు

6. మనసుకు, బుద్ధికి అందని వాడు అంటే ఆలోచనలకు అందని వాడు, ఇంద్రియములతో తెలియబడని వాడు.అంటే ఇంద్రియములు, మనసు ఎప్పుడూ మలినం అయి ఉంటాయి. సత్వరజస్తమోగుణములతో కూడి మోహముతో కప్పబడిఉంటాయి. అటువంటి మనసుతో తెలుసుకోలేము. ఆ మనసు పరిశుద్ధం అయినపుడే తెలుసుకోగలము.

7. సూర్యుని మాదిరి స్వయం ప్రకాశము కలవాడు. సూర్యుడు తనకు తానుగానే ప్రకాశిస్తుంటాడు. సూర్యునికి ప్రకాశం ఎక్కడి నుండో రాదు.అలాగే పరమాత్మ కూడా తనకు తానుగా ప్రకాశిస్తూ, జీవుల శరీరములలో ఉండి ఆత్మస్వరూపంగా ప్రకాశిస్తుంటాడు. వాటికి చేతనత్వం కలిగిస్తుంటాడు. జీవశక్తిని ప్రసాదిస్తుంటాడు.

8. చీకటికి ఆవల ఉండేవాడు. అంటే చీకటి అంటే తెలియని వాడు. ప్రకాశం ఉన్న చోట చీకటి ఉండదు కదా. చీకటి ఉంది అంటే అక్కడ ప్రకాశం లేనట్టే. మనలో ఉన్న అజ్ఞానము అనే చీకట్లు తొలగించి జ్ఞానజ్యోతిని వెలిగించేవాడు.

ఇవీ పరమాత్మ లక్షణాలు. ఇటువంటి లక్షణములు కల పరమాత్మను సాధకుడు అనుస్మరేత్ అంటే నిరంతరము, ఏ మాత్రం విరామం, విసుగు లేకుండా స్మరిస్తూ ఉంటాడు. ధ్యానిస్తూ ఉంటాడు.

## 10. ప్రయాణకాలే మనసా2చలేన భక్త్యా యుక్తో యోగబలేన చైవ। భ్రువోర్మధ్యే ప్రాణమావేశ్య సమ్యక్ స తం పరం పురుషముపైతి దివ్యమ్॥

సాధకుడు, తన మరణ సమయంలో, నిశ్చలమైన మనసుతో, తన యొక్క యోగబలము చేత కూడుకున్నవాడై, అచంచలమైన భక్తితో, తన ప్రాణములను భ్రూమధ్యమున చక్కగా నిలిపి, పైశ్లోకములో చెప్పబడిన లక్షణములు కల పురుషోత్తముని ధ్యానించి ఆయననే పొందుతున్నాడు.

సాధకుడు, పై శ్లోకములో చెప్పబడిన లక్షణములు కలిగిన పరమాత్మ స్వరూపమును ఎప్పుడు, ఎలా పొందగలడో ఈ శ్లోకములో వివరించాడు.

ప్రయాణ కాలే = ఈ శరీరమును వదిలిపెట్టే సమయంలో

భక్త్యా యుక్తో =నాయందు భక్తి కలవాడు, యుక్తుడు,

యోగబలేన = తాను అప్పటి దాకా చేసిన ధ్యానము, సమాధి మొదలగుయోగముల బలముతో,

భ్రువోర్మధ్యే = కనుబొమల మధ్య

సమ్యక్ = చక్కగా

ప్రాణమావేశ్య = ప్రాణములను నిలిపి,

అచలేన మనసా = మనసును నిశ్చలంగా అటు ఇటు పోకుండా ఉంచుకొని,

అనుస్మరాత్ = నన్ను ఏకాగ్రమైన మనసుతో చింతిస్తాడో, స్మరిస్తాడో,

స =అతడు

దివ్యమ్ = దివ్యమైన

పరమ్ = పరమాత్ముడు

తమ్ ఏవ = అయిన నన్ను

ఉపైతి = పొందుతున్నాడు.

పైశ్లోకంలో చెప్పబడ్డ లక్షణములు కల పరమాత్మను ఈ శరీరాన్ని విడిచిపెట్టేటప్పుడు సాధకుడు, భక్తుడు ఎలా ధ్యానించాలి అనే విషయాన్ని ఇక్కడ వివరిస్తున్నాడు.

మనం జీవిత కాలంలో ఒక చోటి నుండి మరొక చోటికి ఈ శరీరంతో ప్రయాణం చేస్తుంటాము. విదేశాలకు కూడా వెళుతుంటాము. కాని మరలా వస్తుంటాము. ఎందుకంటే మన వీసా కాలం తీరిపోగానే, అక్కడ నుండి వాళ్లు తరిమేస్తారు. చుట్టాలు మూడురోజులకంటే ఎక్కువ పెట్టరు. విదేశాలలో మూడునెలలకంటే ఎక్కువకాలం ఉంచరు. ఇవి అన్నీ తాత్కాలిక ప్రయాణాలు. ఈ ప్రయాణాలలో ఈ శరీరం మన వెంట వస్తుంది. కాని ఆఖరి ప్రయాణంలో మాత్రం ఈ శరీరం ఇక్కడే ఉండి పోతుంది. సూక్ష్మశరీరం మాత్రం వెళ్లి పోతుంది. అదే ఆఖరి ప్రయాణం.

సాధారణంగా, ఈ శరీరంతో చేసే ప్రయాణాలు చేసేటప్పుడు, శరీరానికి అవసరమయ్యే దుస్తులు, అలంకరణ వస్తువులు ఆహార పదార్థాలు తీసుకొని వెళతాము. ఆఖరి ప్రయాణంలో శరీరం మనవెంటరాదు. కాబట్టి అవన్నీ అనవసరం. ఈ ఆఖరి ప్రయాణ సమయంలో సాధకుడు ఏం చేయాలి అనే దానికి వివరణ కృష్ణుడు ఇస్తున్నాడు. ముందు మనసును అటు ఇటు పోకుండా నిశ్చలంగా ఉంచుకోవాలి. అచంచలమైన భక్తి కలిగి ఉండాలి. అప్పటి వరకు తానుచేసిన యోగముల యొక్క బలమునంతా సమీకరించుకోవాలి. తన ప్రాణములను అన్నిటినీ హృదయం గుండా, సుషుమ్నా నాడి గుండా బ్రహ్మరంధ్రము వైపుకు తీసుకొని వెళ్లాలి. మరి భ్రువోర్మధ్యే అని

ఎందుకుఅన్నారు అంటే ఈ సుషుమ్నానాడి భ్రూమధ్యకు అంటేనొసటి భాగానికి సమాంతరంగా ఉంటుంది. మనకు కనిపించేది నొసటిభాగం కాబట్టి ఆ పదం వాడారు అని అనుకోవచ్చు. అప్పుడు బ్రహ్మరంధ్రమును ఛేదించుకొని ప్రాణాలు ఉత్తమగతులు చేరుకుంటాయి. దీనినే మనవాళ్లు కపాలమోక్షము అని కూడా పిలుస్తుంటారు. ఇది సాధకులు యోగులు అనుసరించే ప్రక్రియ. దీనికి కావాల్సింది యోగబలము. నిష్కామయోగ బలము,ధ్యానయోగ బలము ఇవన్నీ ఈ ప్రక్రియకు తోడు కావాలి. అప్పుడే ఇది సాధ్యము అవుతుంది.

అవసాన కాలంలో మనసుస్థిరంగా అటు ఇటు పోకుండా ఉండాలి. ప్రాపంచిక విషయముల గురించి ఆలోచించకూడదు. అంతేకాకుండా ఆ సాధకుడు జీవితం అంతా పరమాత్మ ఎడల నిష్కామ భక్తి కలిగి ఉన్నాడు కాబట్టి మరణ సమయంలో కూడా అతడు అచంచలమైన భక్తితో పరమాత్మనే స్మరిస్తూ ఉంటాడు. ఆఖరి ప్రయాణానికి కావాల్సిందల్లా ఏకాగ్రమైన మనస్సు, అచంచలమైన భక్తి, యోగబలము, పరమాత్మ స్మరణ. కాబట్టి ఆఖరు ప్రయాణంలో ప్రాపంచిక విషయములకు ప్రాధాన్యత ఇవ్వకుండా కేవలము భగవంతుని చింతనలో గడిపితే మరుజన్మ మంచిది దొరుకుతుంది. ఆఖరు ప్రయాణసమయంలో కష్టం కాబట్టి జీవితం అంతా భగవంతుని ధ్యానిస్తుంటే ఆఖరు క్షణాలలో కూడా అదే భావనలో ఉండే అవకాశం ఉంది.

మీకు సుషుమ్నా నాడి, బ్రహ్మరంధ్రము, భ్రూమధ్యము, ఆజ్ఞాచక్రము అనే మాటలు వచ్చాయి. ఆ సుషుమ్నా నాడి, ఆజ్ఞాచక్రము, భ్రూమధ్యము సమాంతరంగా ఉండటం కింద ఇవ్వబడిన పటం చూచి గమనించండి. మన నొసటి భాగానికి సమాంతరంగా ఆజ్ఞాచక్రం ఉంది. దానినే సుషుమ్న అని కూడా అంటారు.

THE RELEASE OF KUNDALINI SHAKTI

## Major Chakras and Nadis
for Kundalini Risings




Figure 21, Major Chakras and Nadis for Kundalini Risings

91

మీకు సుషుమ్నా నాడి, బ్రహ్మరంధ్రము, భ్రూమధ్యము, ఆజ్ఞాచక్రము అనే మాటలు వచ్చాయి. ఆ సుషుమ్నా నాడి, ఆజ్ఞాచక్రము, భ్రూమధ్యము సమాంతరంగా ఉండటం పైపటం చూచి గమనించండి.

11. యదక్షరం వేదవిదో వదన్తి విశన్తి యద్యతయో వీతరాగాః।
యదిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి తత్తేపదం సంగ్రహేణ ప్రవక్ష్యే॥

వేదాధ్యయనము చేసిన వారు దేనిని అయితే నాశము లేనిదిగా తెలుసుకుంటున్నారో, రాగద్వేషములను వదిలిపెట్టినవారు, బాగా యోగాభ్యాసము చేసిన వారు ఏ పరమ పదమును చేరుకుంటారో, చక్కగా బ్రహ్మచర్యమును అవలంబించిన వారు అంటే బ్రహ్మ యందే తమ మనసును నిలిపిన వారు దేనిని చేరుకోవాలని నిరంతరం కోరుకుంటూ ఉంటారో, ఆ పరమపదం గురించి ఇప్పుడు నీకు సంగ్రహంగా అంటే క్లుప్తంగా తెలియజేస్తాను. శ్రద్ధగా విను.

ఇక్కడ మూడు పనులు వాటి ఫలితములు గురించి చెప్పాడు కృష్ణుడు. వేదాధ్యయనము చేస్తే ఆత్మజ్ఞానము కలుగుతుంది. ఆత్మ, పరమాత్మ ఆది అంతము లేనిది గానూ, నాశము లేనిది గానూ తెలుసుకుంటారు. రెండవది. రాగద్వేషములు వదిలిపెట్టిన వారు పరమాత్మను చేరుకుంటారు. మూడవది నిరంతరం బ్రహ్మలో చరించేవారు ఎల్లప్పుడు పరమాత్మను చేరుకోవాలని కోరుకుంటారు. ఆ పరమపదము గురించి సంగ్రహంగా తెలియ జేస్తాను అని అంటున్నాడు కృష్ణుడు.

దాదాపుగా ఇదే శ్లోకం కఠోపనిషత్తులో ఉంది. దానినే ఇక్కడ వివరిస్తున్నారు వ్యాసుల వారు. అందుకే గీతను ఉపనిషత్ సారము అని అన్నారు. ఆ శ్లోకం ఇప్పుడు చదువుదాము.

సర్వవేదా యత్పదమామనన్తి తపాంసి సర్వాణి చ యద్వదన్తి।
యగిచ్ఛన్తో బ్రహ్మచర్యం చరన్తి తత్తే పదం సంగ్రహేణ బ్రవీమి ఓమిత్యేతత్॥
(కఠోపనిషత్ రెండవ వల్లి 15వ శ్లోకం)

అన్ని వేదములు ఏ పదము గురించి ఉపదేశిస్తున్నాయో, తపస్సు చేసేవారు దేనిని గురించి చెబుతుంటారో, దేని కొరకు సాధకులు బ్రహ్మచర్యం పాటిస్తుంటారో, "ఓం" అనే ఆ పదము గురించి నీకు సంగ్రహంగా వివరిస్తాను.

పరమ పదము అంటే ఏమిటి? దాని గురించి ఇక్కడ చెప్పబోతున్నాడు కృష్ణుడు. ఈ పరమ పదాన్ని వేదమును చదువుకున్న వాళ్లు నాశనము లేనిదిగా తెలుసుకుంటారు. ఇక్కడకు వెళ్లాలంటే కోరికలు ఉండకూడదు. రాగద్వేషములు ఉండకూడదు. సుఖదు:ఖములు మొదలగు ద్వంద్వములకు దూరంగా ఉండాలి. ఆ పరమ పదము పొందడానికి ఎంతో మంది బ్రహ్మచర్యము అంటే బ్రహ్మను అనుష్ఠానము చేస్తుంటారు. బ్రహపదము గురించి ఎంత చెప్పినా ఇంకా మిగిలే ఉంటుంది. మోక్షము కొరకు ప్రయత్నం చేసే వారు ఈ బ్రహ్మ పదము గురించి తెలుసుకుంటూ ఉంటారు. దాని లక్షణాలు కృష్ణుడు ఇక్కడ చెబుతున్నాడు.

వేదములు అధ్యయనం చేసిన వారు ఈ బ్రహ్మపదమును నాశరహితంగా వర్ణించారు. బాహ్యప్రపంచంలోని అన్ని పదార్థాలు ఎప్పుడో ఒకప్పుడు నాశనం అయ్యేవే. అంటే మార్పుచెందేవే. నాశము, మార్పులేనిది, ఎల్లప్పుడూ నిలిచి ఉండేది పరమాత్మ తత్వము ఒక్కటే. దానినే బ్రహ్మ పదము అని అంటారు. ఈ బ్రహ్మ పదమును గురించి తెలుసుకుంటే ఇంక తెలుసుకోవలసింది అంటూ ఏమీ మిగలదు. ఇక్కడ అనంత మైన సుఖం శాంతి లభిస్తాయి. ఈ బ్రహ్మ తత్వమే ఓం అనే ప్రణవము అందుకే ఇది వరకు అక్షరాభ్యాసములో ఓం తో మొదలు పెట్టే వాళ్లు. ఓం గురించి బాల్యంలోనే పరిచయం చేసేవాళ్లు. ఎందుకంటే ఓం అనేది అక్షరము. నాశము లేనిది. ఓం కారమే పరబ్రహ్మము.

(ఇప్పుడు అక్షరాభ్యాస సమయంలో ఎబిసిడిలు రాయిస్తున్నారు. ఎబిసిడిలు వస్తే అన్నీ వచ్చినట్టే అనే భావన. ఎంసెట్ లో కానీ, ఇతర ఆబ్జెక్టివ్‌టెస్టులు రాయాలంటే ఎబిసిడిలు వస్తే చాలు కదా! ఏదో ఒకటి కరెక్టు అవుతుంది..... కానీ ఇంతకు ముందు అక్షరాభ్యాససమయంలో ఉపాధ్యాయుడు బాలుడిని ఒడిలో కూర్చోపెట్టుకొని బాలుడి చేయి పట్టుకొని ఓ నమ: శివాయ సిద్ధం నమ: అని మూడు పంక్తులలో రాయించేవారు. ఈ మాటలలో  ఓం కారంతో పాటు, గుణింతం, ద్విత్వం, పూర్ణానుస్వారం, విసర్గ, మ, య మధ్య ఉన్న తేడా, ఇవన్నీ కూడా బాలుడికి పరిచయం చేసినట్టు అవుతుంది.)

మరి అటువంటి బ్రహ్మ పదమును చేరుకోవాలంటే ఎలాగ? ముందు రాగ ద్వేషములు సుఖదు:ఖాలు, కామక్రోధములు,  వదిలిపెట్టాలి. అప్పుడే బ్రహ్మపదము ప్రవేశించడానికి పాస్ పోర్టు లభిస్తుంది. కాబట్టి కోరికలు ఉన్నవారు, రాగద్వేషములు ఉన్నవారికి బ్రహ్మపదములోనికి ప్రవేశము లేదు. చాలా మంది నాకు ఇంకా ఎందుకు మోక్షం రాలేదు అని అంటుంటారు కాని వారిలో ఉన్న రాగద్వేషముల సంగతి వారికి తెలియదు.

దాని తరువాత బ్రహ్మపదమును పొందడానికి నిరంతర ప్రయత్నము,  అభ్యాసము చేయాలి. మనసును ఇంద్రియములను అదుపులో పెట్టుకోవాలి. ధ్యానం చేయాలి. సోమరి తనముపనికి రాదు. అలసత్వము పనికిరాదు.

తరువాతది బ్రహ్మచర్యము. అంటే మనకు విపరీత అర్థాలు వస్తాయి. బ్రహ్మచర్యము అంటే స్త్రీల సంపర్కమే కాదు. మనసుతో కానీ, వాక్కుతో కానీ, శరీరముతో కానీ ప్రాపంచిక విషయములతో సంపర్కము పెట్టుకోకూడదు. ఎల్లప్పుడూ తన మనసును ఆత్మయందు లగ్నం చేయాలి. ఇతర విషయముల గురించి ఆలోచించకూడదు. ఎల్లప్పుడూ నిష్టతో, నియమంతో వేదాధ్యాయనము, శాస్త్ర అధ్యయనము చేయాలి. గురువుల వద్ద శ్రద్ధగా విద్య నేర్చుకోవాలి. ఈ

సమయంలో వేరే ఆలోచనలు ఉండకూడదు. అదే బ్రహ్మచర్యము. అంతే కానీ పెళ్లి చేసుకోనంత మాత్రాన ఎవరూ బ్రహ్మచారి కాలేడు.

12.సర్వద్వారాణి సంయమ్య మనోహృది నిరుధ్యచ।
మూర్ధ్న్యాధాయాత్మన: ప్రాణమాస్థితో యోగధారణమ్॥
13.ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మామనుస్మరన్।
యం ప్రయాతి త్యజన్దేహం స యాతి పరమాం గతిమ్॥

ఎవరైతే ఇంద్రియములు యొక్క ద్వారములను (కళ్లు, చెవులు, ముక్కు, నాలుక, చర్మము..ఈ ద్వారముల గుండా విషయములు లోపలకు ప్రవేశిస్తాయి.) సంయమిస్తారో అంటే నిగ్రహిస్తారో అంటే అదుపులో పెట్టుకుంటారో, మనస్సును ఆత్మలో స్థిరంగా నిలుపుతారో, యోగాభ్యాసము చేత ప్రాణములను బ్రహ్మరంధ్రము వద్దకు తీసుకొని వస్తారో, నిరంతరము ఓం కారమును జపిస్తూఉంటారో, ఈ పనులు చేస్తూ ఎవరైతే తమ దేహమును వదిలిపెడతారో, అటువంటి వారు, పరమ గతిని చేరుకుంటారు.

పరమ గతి, బ్రహ్మపదము, మోక్షము వీటిని పొందడానికి ప్రాక్టికల్ నాలెడ్జి ఇక్కడ చెబుతున్నాడు కృష్ణుడు. ఇప్పటి దాకా అంత్యకాలములో చేయవలసినవి చెప్పాడు. ఇది కూడా అంత్యకాలములోనే చేయాలి అని కాదు. జీవితాంతం నిరంతరం అవిరామంగా అభ్యాసము చేయాలి అని అర్థం.

1.ఇంద్రియ ద్వారములను మూసివేయడం.
2.మనసును ఆత్మయందు నిలపడం
3.ప్రాణములను పైపైకి తీసుకొని వెళ్లడం. నొసటి గుండా అంటే సుషుమ్నానాడి గుండా బ్రహ్మరంధ్రం దగ్గర నిలపడం.
ఓంకారాన్ని జపించడం. ధ్యానించడం.
ఈ నాలుగు మార్గాల ద్వారా బ్రహ్మపదము పొందవచ్చును.

1.ఇంద్రియ ద్వారములు మూసివేయడం. అంటే బయట నుండి ప్రాపంచిక విషయములను, విషయ వాంఛలను, కామ సంబంధమైన విషయములను, లోపలకు రాకుండా చేయడం. కళ్లు మూసుకుంటాము. చెవులు ముక్కు చర్మము వీటిని మూయలేము కదా. అన్నిటి కంటే నాలుక గొప్పది. అనేక రుచులు కావాలని ఆరాటపడుతుంది. జిహ్వాచాపల్యము అరికట్టలేము. అందుకని వాటిని బయట విషయాలు వినకుండా, తాకకుండా నియంత్రించాలి. ఇక్కడ

సర్వేంద్రియాణి అని అన్నారు. అన్ని ఇంద్రియములను నియంత్రించాలి. కళ్లు మూసుకున్నాను అంటే లాభం లేదు. కమ్మటి వాసన రాగానే నోరు ఊరుతుంది. నాలుక దురద పెడుతుంది. అదేదో రుచి చూడాలని మనసు ఉవ్విళ్లూరుతుంది. కాళ్ల గజ్జెల చప్పుడు, చేతి గాజుల చప్పుడు, కిలా కిలా నవ్వులు వినగానే మనసు అటువైపు పరుగెడుతుంది. చల్లని గాలి ఒంటి తగలగానే ఒళ్లు జివ్వుమంటుంది. వీటి నన్నింటినీ నియంత్రించాలి.

తరువాత మనసును ఆత్మలో నిలపాలి. అంటే మనసును అటు ఇటు పోనీయకుండా ఆత్మదగ్గరకు చేర్చాలి. దీనికి చాలా శ్రమ పడాలి. ఇంద్రియాలైనా మాట వింటాయేమో గానీ మనసు మాట వినదు. తరువాత ప్రాణములను అంటే ప్రాణవాయువులను భ్రుకుటి స్థానం అంటే సుషుమ్నానాడి గుండా బ్రహ్మరంధ్రవద్దకు తీసుకొని వెళ్లాలి. ఇవి యోగులకే సాధ్యం. ఇదంతా అయిన తరువాత ఏం మంత్రం జపించాలి అంటే ఒకటే మంత్రం ఓంకారము. దానినే ప్రణవము అంటారు. ఈ ఓంకారాన్ని ఉచ్ఛరించాలి. దీనికి లెక్కపెట్టనవసరం లేదు 108, 58 లేక 10 ఇలా లెక్కలు లేవు. మామనుస్మరన్ మాటిమాటి కీ జపం చేయాలి. ఓంకారము అర్థం తెలుసుకోవాలి. దానిని అనుసరించాలి. ఈ విధంగా చేస్తే పరమ పదమును చేరుకొనే అవకాశం ఉంది. అని ఈ రెండు శ్లోకములలో చెప్పాడు పరమాత్మ.

ఈ శ్లోకంలో మనకు ఒక కొత్త పదం పరిచయంచేసాడు వ్యాసుడు. "ఓం ఇతిఏకాక్షరం బ్రహ్మ" అంటే ఓం అనే ఒకే ఒక అక్షరం బ్రహ్మ స్వరూపము. ఈ ఓంకారము నకు ఆకారము లేదు. అది శబ్దము. అదే బ్రహ్మము కాబట్టి ఓంకారమును శబ్దబ్రహ్మము అనికూడా అంటారు. ఉపాసనలు రెండు రకాలు అని చెప్పుకున్నాము. అవే సగుణోపాసన. నిర్గుణో పాసన. సగుణోపాసనలో ఏకాగ్రత, లక్ష్యము కుదరడానికి మనము ఏదో ఒక మూర్తిని ఎదురుగా పెట్టుకొని ఉపాసిస్తాము. అది విష్ణువు కావచ్చు శివుడు కావచ్చు, లేక రాముడు, కృష్ణుడు, పద్మనాభుడు, రంగనాధుడు, నటరాజు, ఆంజనేయస్వామి, వినాయకుడు, దుర్గ, లక్ష్మీ, లలిత, ఏదైనా కావచ్చు. పురాణాలలో ఆయామూర్తులు ఎలాఉండాలి అనే విషయాన్ని స్పష్టంగా తెలియజేసారు. విష్ణువు పీతాంబరధారి, శంఖు చక్రములు, వనమాల, శ్రీవత్సము, కౌస్తుభం, తలమీద కిరీటం, పద్మపత్రనయనం ఇలాగా. కాకపోతే మనము ఉపాసించే దేవుళ్లు, దేవతలు మనకంటే గొప్పవాళ్లు, శక్తిమంతులు గా ఉండాలి కాబట్టి, మనకురెండు చేతులు ఉంటే వారికి నాలుగు చేతులు కల్పించాము. మనకు లేని ఆయుధాలు వారికి సమకూర్చాము. మనము చూస్తేనే భయపడే పులి, సింహము, గరుడుడు, మొదలగు వాటిని వారికి వాహనములుగా అమర్చాము. మనకంటేగొప్పవాళ్లు, శక్తిమంతులుగా మన దేవుళ్లను, దేవతలను తీర్చిదిద్దాము.

ఈ విగ్రహాలన్నీ రాతితో చేయబడ్డాయి. అంటే శిలావిగ్రహాలు. వాటిని దేవాలయాలలో ప్రతిష్టించి పూజలు నిర్వర్తించాము. దేవాలయాలలో దేవుడు, దేవతలు ఉన్నారని నమ్మకంతో

ప్రతిరోజూ వెళ్లి దేవతారాధనలు, ఉపాసనలు చేయడానికి అలవాటు పడ్డాము. అలా ప్రాథమిక స్థితిలో సగుణోపాసన చేయడం మొదలుపెట్టాము. (ఈ రోజుల్లో సగుణోపాసనలో విగ్రహారాధన, శివలింగ ఆరాధన రెండూ జరుగుతున్నాయి.)

ఏదేవతను, ఏ దేవుడిని విగ్రహ రూపంలో పూజించినా ఆ విగ్రహాలన్నీ రాతితో చేయబడ్డవే. వాటికి మూలము ఏ ఆకారము లేని రాయి అని గ్రహించారు కొందరు. అందరిలో పరమాత్మ ఆత్మస్వరూపుడుగా ఉన్నట్టు, ఎన్ని ఆభరణములు ఉన్నా అందులో ఉండే పదార్థము బంగారమే అన్న విషయాన్ని అర్థం చేసుకున్నాము. కాబట్టి శిలను ఏదో ఒక ఆకారములో మలిచి పూజించేకన్నా ఏ ఆకారము లేని శిలను పూజించడం మంచిది అని కొంత మంది తలవడం వలన సాలగ్రామ పూజ, శివలింగము ఆవిర్భవించాయి. శివ అంటే ఆనంద స్వరూపము. లింగము అంటే గుర్తు. ఆనందమునకు గుర్తు. అంటే పరమాత్మ ఆనందస్వరూపుడు. దానికి గుర్తు శివలింగము అనే భావనతో శివలింగమును పూజించడం మొదలయింది.

మానవుడు అక్కడి నుండి ఇంకా ఉన్నత స్థితికి చేరుకున్నాడు. జ్ఞానము ఇంకా ఇంకా పెంపొందింది. పరమాత్మ నిరాకారుడు, నిర్గుణుడు అనే స్థితికి చేరుకున్నాడు. పరమాత్మ తనలోనే ఆత్మస్వరూపుడుగా ఉన్నాడు అని తెలుసుకున్నాడు. కళ్లు మూసుకొని తనలో ఉన్న ఆత్మస్వరూపుడైన పరమాత్మను ధ్యానించడం ప్రారంభించాడు. ప్రాణాయామం అభ్యసించాడు. అలా చేయడానికి ప్రతిమను కానీ, లింగాకారమును కానీ కాకుండా, శబ్దమును ఆసరాగా తీసుకున్నాడు. అదే ఓం అనే శబ్దము. ఓం ఇతి ఏకాక్షరం బ్రహ్మ అంటే ఓం అనే అక్షరము బ్రహ్మ స్వరూపము అని తెలుసుకున్నాడు. ఆ పరబ్రహ్మ ఓంకారంగా ప్రకటితమౌతున్నాడు అని గ్రహించాడు. బ్రహ్మ స్వరూపము, శబ్దబ్రహ్మము అయిన ఓంకారమును ఉచ్ఛరిస్తూ సహజంగా ప్రాణాయామం చేయడం మొదలు పెట్టాడు.

అందుకే మన పూజలలో ప్రతి నామము ముందు ఓం అని చదువుతాము. గాయత్రీమంత్రము కూడా ఓం తో మొదలు అవుతుంది. ప్రతి మంత్రము ఓంతోనే ప్రారంభం అవుతుంది. ఒక విషయాన్ని "నేను అంగీకరించాను" (ఇంగ్లీషులో యస్ అనడం) అనడానికి ఓం అని పలకడం ప్రత్యామ్నాయంగా అంగీకరించారు. అవసాన దశలో ఏ నామము జపించే స్థితిలో లేకపోయినా, ఓంకారము సులభంగా జపించవచ్చు. ఓం అంటే అన్ని నామాలు అందులో ఇమిడి ఉన్నాయి. ఓం కారము బ్రహ్మస్వరూపము కాబట్టి ఓంకారము జపిస్తే అన్ని దేవుళ్లను ఉపాసించినట్టే. అందుకే ఓం కారమునకు అంతటి ప్రాముఖ్యము లభించింది.

ఆ ఓంకారము అనే పరబ్రహ్మ గురించి ఈ శ్లోకంలో వివరించాడు కృష్ణుడు. అటువంటి పరబ్రహ్మ స్వరూపమైన ఓంకారాన్ని ఏకాగ్రమైన మనస్సుతో స్మరిస్తూ, జపిస్తూ,

అంత్యకాలంలో ఈ శరీరాన్ని విడిచిపెడితే, అటువంటి సాధకుడు పరమ గతిని పొందుతాడు. అతడికి పునర్జన్మ ఉండదు అని పరమాత్మ వివరించాడు.

## 14. అనన్య చేతాస్సతతం యో మాం స్మరతి నిత్యశః। తస్యాహం సులభః పార్థ నిత్యయుక్తస్య యోగినః॥

ఓ పార్థా! ఎవరైతే తనచిత్తమును అటు ఇటు పోనీయకుండా నా యందే లగ్నం చేసి, నన్నే నిత్యము స్మరిస్తూ ఉంటాడో, అటువంటి యుక్తుడైన యోగికి నేను సులభంగా లభిస్తాను.

ఈ శ్లోకంలో పరమాత్మ తాను భక్తుడికి ఏపరిస్థితులలో వశం అవుతాడో తెలియజేస్తున్నాడు. మోక్షం పొందడం, భగవంతుని సాక్షాత్కారం కలగటం చాలా కష్టం అని మానవులు అనుకుంటూ ఉంటారు. కాని చేయవలసిన పద్ధతిలో చేస్తే అది కూడా సులభమే అంటున్నాడు పరమాత్మ. ఏదైనా మొట్ట మొదట కష్టంగా కనిపిస్తుంది. అభ్యాసంతో అది సులభము అవుతుంది. అందుకే అభ్యాసము కూడా ఒక యోగంగా అభివర్ణించాడు పరమాత్మ. ముందు భక్తుడు అనన్య చేతసా అంటే మనసులో ఇతరములైన కోరికలు, చింతనలు, పెట్టుకోకూడదు. మనసును భగవంతుని భావనలతో నింపి వెయ్యాలి. మనసంతా భగవంతుని భావనలతో నిండితే ఇతర చింతనలకు తావు వుండదు. మనసు "హౌస్ ఫుల్" బోర్డు పెడుతుంది. మనసు ఇతర విషయ వాంఛల మీదికి పరుగెట్టదు. కాని సాధారణ మానవుల మనసు ఎక్కువగా అన్య చిత్తము అవుతుంది అంటే ఇతర విషయాల మీదికి పరుగెడుతుంది కానీ అనన్య చిత్తము అంటే మనసు ఎల్లప్పుడూ ఒక్క భగవంతుని మీదనే లగ్నం అయిఉండాలి. ప్రతిరోజూ అభ్యాసం వలననే అది సాధ్యం అవుతుంది. .

కొందరు దేవుడి ముందుకూర్చుంటారు. కాసేపుపూజ చేస్తారు, ఇంతలో ఎవరో పిలుస్తారు. చటుక్కున లేచి వెళతాడు. మరలా వచ్చి కూర్చుంటాడు. మరలామరొక పిలుపు లేక సెల్ మోగుతుంది. కాసేపుమాట్లాడి మరలా పూజమొదలెడతాడు. ఇది కూడా అనన్య చిత్తము కాదు. అందుకే సతతం అని వాడాడు. ఎల్లప్పుడూ అని అర్థం. అనన్య చిత్తము కలవాడే భక్తుడు అంటే విభక్తము కాని వాడు. పరమాత్మనుండి వేరుకాని వాడు. తనకు పరమాత్మకు భేదము లేదు అని అనుకొనేవాడు. అహం బ్రహ్మాస్మిఅనుకుంటూ పరమాత్మలో మమేకం అయ్యేవాడు. అంతే కానీ రోజూ దేవాలయానికి వెళ్లి కొబ్బరికాయకొడితే భక్తుడు కాడు.

పరమాత్మ మరొక పదం కూడా వాడాడు. నిత్యశ: అంటే ఏదో ఒక రోజు చేయమని కాదు. నిత్యము చేయాలి. నిత్యము, ఎల్లప్పుడు మనసంతా భగవంతుని మీదనే లగ్నం చేయాలి. ఇతర విషయముల మీద లగ్నం చేయకూడదు. కాని ఒకే సారి ఇలా చేయడం కుదరదు కాబట్టి ప్రతిరోజూ కాసేపు ఈ విధంగా అభ్యాసం చేస్తే, చంచలమైన మనసు నిత్యము అంటే ఎల్లప్పుడూ భగవంతుని మీద లగ్నం అయ్యే అవకాశం ఉంది. అటువంటి సాధకుడికి భగవంతుడు మన వెంటనే ఉంటాడు. పరమ శాంతి కలుగుతుంది. దు:ఖమే ఉండదు. అందుకే తస్య అహం సులభ: అంటే అటువంటి సాధకుడికి నేను సులభంగా లభిస్తాను. అటువంటి సాధకుడు నన్ను పొందడం సులభం. పరమాత్మ ను పొందడం అత్యంత సులభం ఏమీ కష్టం కాదు అని పరమాత్మ మనకు హామీ ఇస్తున్నాడు.

ఇక్కడ ఇంకొక విషయం కూడా ఉంది. దేవతలు పక్కనే రాక్షసులు ఉంటారు. మంచి పక్కనే చెడు ఉంటుంది. రాముడి పక్కనే రావణాసురుడు ఉంటాడు. ఇది లోక సహజం. కాబట్టి కాసేపు మనసు పరమాత్మ మీద లగ్నం చేయగానే వెంటనే చెడు ఆలోచనలు ఇతర ఆలోచనలు మనసును చుట్టుముట్టి తమ వంక లాక్కుంటాయి. ఈ విషయంలో సాధకుడు చాలా జాగ్రత్తగా ఉండాలి. ఏ పని చేస్తున్నా మనసు పరమాత్మ యందు లగ్నం చేస్తే ఈ బాధ తప్పుతుంది. అందుకే నిత్యయుక్తస్య అని కూడా అన్నారు. నిత్యము యుక్తమైన మనసుతో పరమాత్మను ధ్యానం మననం చేయాలి. అప్పుడే భగవంతుని సులభంగా పొందగలము.

## 15. మాముపేత్య పునర్జన్మ దు:ఖాలయ మశాశ్వతమ్।
## నాప్నువన్తి మహాత్మానస్సంసిద్ధిం పరమాం గతా:॥

ఒక సారి పరమ గతిని పొందిన మహాత్ములు, దు:ఖములకు ఆలయమైన, అశాశ్వతము అయిన ఈ పునర్జన్మను మరలా మరలా పొందరు.

సాధకుడు తన నిరంరత సాధనల ఫలితంగా పరమాత్మను పొందగలిగాడు. తరువాత ఏం జరుగుతుంది అంటే ఒకే సమాధానం..... నిరంతర సుఖము, శాంతి కలుగుతుంది. దు:ఖభూయిష్టమైన పునర్జన్మ ఉండదు. ఎల్లప్పుడూ సుఖము, శాంతితో ఉంటాము. దైవసాక్షాత్కారము పొందనంతవరకు పుట్టడం చావడం, సుఖ దు:ఖాలు అనుభవించడం, సంసారము, అందులో బాధలు ఇవన్నీ అనుభవించాలి. మనకుపూర్వజన్మ స్మృతి లేకపోవడం మన అదృష్టం. లేకపోతే ఈ జన్మబాధలే కాకుండా పూర్వజన్మబాధలు కూడా భరించాల్సివచ్చేది.

కాని కొంతమందికి ఈ దు:ఖాలుసుఖాలు అనుభవించడంలోనే త్రిల్ ఉంటుంది. ఈ మానవ జన్మలో ఇన్ని సుఖాలు ఉన్నాయి కదా. హాయిగా అనుభవించక జన్మలేకపోవడం ఏమిటి! జన్మ, శరీరం ఉంటేనే కదా మరలా మరలా యవ్వనం వచ్చేది సుఖాలు అనుభవించేది అని అంటూ ఉంటారు. కాని ఇక్కడే ఒక చిక్కు ఉంది. మరు జన్మ అంటే ఎలా ఉంటుంది. మనం కోరినట్టు ఉండదు. దాని ఇష్టం వచ్చినట్టు వస్తుంది. వచ్చిన జన్మను అనుభవించాలి. అది మానవ జన్మ అని అనలేము కదా. ఏజన్మఅయినా కావచ్చు. కాబట్టి జన్మను దు:ఖాలయము అని అన్నాడు.

ఈ దు:ఖాలయము ఎక్కడ ఉంది? ఊళ్లోకానీ, ఊరి బయట గానీ శివాలయం, రామాలయం, విష్ణ్వాలయము, అమ్మవారి ఆలయము ఉంటాయని మనకు తెలుసు. కానీ ఈదు:ఖాలయము ఎక్కడ ఉందంటే అది మనశరీరమే అని కృష్ణుడుచెప్పాడు. ఈ శరీరంతో ఏం అనుభవించినా తుదకు అది దు:ఖంతోనే అంత్యం అవుతుంది. అందుకే ఈ జన్మను, జన్మతోవచ్చే శరీరాన్ని దు:ఖాలయం అని చెప్పాడు కృష్ణుడు.

పోనీ మంచి జన్మ వచ్చింది, మానవులలో మాంచి ధనవంతుల ఇంట్లో పుట్టాము అనుకుందాము. అది అశాశ్వతమ్ అంటున్నాడు కృష్ణుడు. ఎందుకంటే ధనం ఉంటే అహంకారము, మదము ఎక్కువ అవుతుంది. తనకు ఎదురులేదు అనుకుంటాడు. అంటే ఆ జన్మలో చేయరాని పనులు, చేయకూడని పనులు, అక్రమాలు, అన్యాయాలు చేస్తాడు. వాటి ఫలం అనుభవించడానికి మరలా మరోజన్మ. మరలా అదే జన్మ వస్తుందని నమ్మకం లేదు. ధనవంతుడిగా తాను చేసిన పాపకర్మల ఫలితంగా ఏదో ఒక నీచజన్మ వస్తుంది.

పోనీ ధనవంతుడిగా పుట్టి సుఖపడతాడా అంటే అదీ లేదే. నిరంతరం టెన్షన్లు. ఎంత మంది ధనవంతులు మనశ్శాంతి కోసం ఆరాటపడుతున్నారో మనం చూస్తున్నాము. (నిన్నజరిగిన విషయం. ప్రపంచంలోనే అత్యంత ప్రతిష్ఠాత్మకమైన సత్యం అధినేతకు, ఆయన చేసిన అన్యాయాలు, అక్రమాల ఫలితంగా, 7 ఏళ్లు జైలుశిక్ష వేసారు. అంతటి మేధావి, ధనవంతుడు తీవ్రమైన అశాంతికి గురి అయ్యాడు.) కాబట్టి ఏ జన్మఅయినా దు:ఖములతో కూడుకున్నది.

అశాశ్వతము అంటే ఆ జన్మలో వచ్చిన ధనము, ఆస్తులు అంతలోనే పోవచ్చు. అప్పుల్లో కూరుకుపోవచ్చు. ధనం శాశ్వతం కాదు కదా. చంచలమైనది. అప్పుడుకూడా దు:ఖములు తప్పవు. పోనీ ప్రాపంచిక సుఖములు స్త్రీసుఖములు శాశ్వతమా అంటే అవీ కావు. కాసేపు సుఖం నిరంతర దు:ఖంగా పరిణమిస్తుంటాయి. పోనీ పదవి శాశ్వతంగా ఉంటుందా అంటే అదీ లేదు. ఈ రోజు ఉన్న పదవి రేపు ఉదయానికి ఉంటుందో లేదో తెలియదు.

(ఇది వరకు ఒక సారి, ఒక ముఖ్యమంత్రి గారు, ఢిల్లీలో ఉన్నప్పుడు నీ ముఖ్యమంత్రి పదవికి ఢోకాలేదు అని అధిష్ఠానం హామీ ఇచ్చింది. ఆయన సాయంత్రం హైదరాబాద్‌లో విమానం దిగగానే

ముఖ్యమంత్రి పదవి నుండి తీసేసారు అనే వార్త వచ్చింది. తరువాత ఆయన వేరే పార్టీ పెట్టి రాష్ట్రాన్ని అల్లకల్లోలం చేసి, తరువాత మరలా ముఖ్య మంత్రి అయ్యాడు అది వేరేసంగతి. కాబట్టి పదవులు కూడా శాశ్వతములు కావు.)

కాబట్టి భగవానుడు జన్మను దు:ఖాలయము, అశాశ్వతము అని అన్నాడు. మరలా పునర్జన్మ లేకుండా ఉండటమే ఉత్తమం. కాబట్టి కాస్త కష్టమైనా భక్తి,జ్ఞాన,వైరాగ్యాలను అలవరచుకొని ధ్యాన యోగం అభ్యసించి మరలా జన్మలేకుండా చేసుకోవడమే ఉత్తమం.

అటువంటివారిని మహాత్ములు అని అన్నాడు పరమాత్మ. ఆ మహాత్ముల స్థితికి చేరుకోవడానికి అందరం ప్రయత్నించాలి. పూర్వకాలంలో ఎందరో ఈ మహాత్ముల స్థితికి చేరుకున్నారు. ఎవరైనా మహాత్ములు కావాలని కోరుకుంటారే కానీ అల్పుడు కావాలని కోరుకోరు కదా! ఒక వ్యక్తి మహాత్ముడు కావాలంటే అసత్యం వదిలి సత్యం పలకాలి. ప్రాపంచిక విషయములను వదిలిపెట్టి మనసు నిర్మలంగా ఉంచుకోవాలి. నిరంతరం దైవచింతన చేయాలి. మనసంతా భగవంతుని స్మరణతో నిండి పోవాలి. వాడే మహాత్ముడు. అటువంటి వారికి మరలా పునర్జన్మ ఉండదు. ఈ మహాత్మ పదము ఎవరికి వారు పొందాలి కానీ భారత రత్న మాదిరి ఒకరు ఇచ్చేదికాదు. కాబట్టి అందరూ అభ్యాసముతో జన్మరాహిత్యమును పొందాలి. అదే మానవుని పరమ లక్ష్యం.

## 16. ఆ బ్రహ్మభువనాల్లోకా: పునరావర్తినో2ర్జున।
## మాముపేత్య తు కౌన్తేయ పునర్జన్మ న విద్యతే॥

ఓ కౌంతేయా! మనము నివసించే భూలోకము నుండి, బ్రహ్మలోకము వరకు ఉన్న అన్ని లోకములు మహాప్రళయం కాలంలో నశించి పోయేవే. మరలా పుట్టేవే. ఏవీ శాశ్వతము కావు. పరమాత్మ తత్వము ఒక్కటే సత్యము. కాబట్టి ఆ పరమాత్మనుపొందితే తిరిగి జన్మ ఉండదు.

మనకు పునర్జన్మ అంటే ఈ భూమి మీద పుట్టడం అనే మనకు తెలుసు. పరమాత్మ ఇదే కాదు, ఏది కూడా శాశ్వతం కాదు. అన్నీ అశాశ్వతమే అని అంటున్నాడు. అదేమిటంటే... మనము మూడు లోకాల గురించే తెలుసుకున్నాము. అవి భూలోకము భువర్లోకము అంటే అంతరిక్షము సువర్లోకము అంటే స్వర్గలోకము. ఇవి కాక పైన ఆరు కింద ఆరు లోకాలు ఉన్నాయి. అవే భూలోక, భువర్లోక, సువర్లోక, మహర్లోకము, జనలోకము, తపోలోకము, సత్యలోకము. అలాగే కింద కూడా భూతలము, అతలము, వితలము, సుతలము, మహాతలము, రసాతలము, పాతాళము. భూలోకముతో కలిపి పైన ఏడు కింద ఏడు లోకాలు ఉన్నాయి. వీటిన్నటి కంటే ఉత్తమమైనది పరమ పదము.

ఈ పదునాలుగు లోకాలు కూడా అశాశ్వతములు. అంటే బ్రహ్మలోకము కూడా అశాశ్వతము అని ఈ శ్లోకంలో చెబుతున్నాడు. బ్రహ్మలోకము మొదలు కొని అన్ని లోకములు కూడా శాశ్వతములు కావు. ఏ లోకమునకు పోయినా మరలా పునర్జన్మ తప్పదు.

ఈ బ్రహ్మలోకముతో సహా ఈ లోకాలు అన్నీ దేశము (స్పేస్) కాలము(టైమ్) లకు లోబడి ఉంటాయి. దానినే "లిమిటెడ్ బై టైమ్ ఎండ్ స్పేస్"అని అంటారు. మనం అంతా కూడా దేశ కాలములకు లోబడిఉన్నాము. మనమునిలబడితే 2 అడుగులు పొడుగు, 2 అడుగులు వెడల్పు, 6 అడుగులు ఎత్తు మొత్తం 24 ఘనపు అడుగులు. ఎక్కడకు పోయినా మనం ఆక్రమించేది ఈ 24 ఘనపుఅడుగులే. మనం ఈ 24 ఘ.అ. గులకు పరిమితం అయిఉన్నాము. అలాగే మనం అందరం 100 ఏళ్లకన్నా ఎక్కువ కాలం బతకడంలేదు. ఎక్కడో ఒక చోట 100 ఏళ్లు దాటుతున్నారు కానీ సాధారణంగా మన కాలపరిమితి 100 ఏళ్లు. కాబట్టి మనం అందరం కాలమునకు, దేశమునకు పరిమితము. జన్మ ఎత్తిన అందరూ ఈ దేశకాలములకు లోబడిఉంటారు. కాని పరమ పదమును పొందిన వాడికి దేశకాలములతో నిమిత్తం లేదు. ఎందుకంటే వాడు మరలా జన్మ ఎత్తడు.

ఈ పదునాలుగు లోకములలో భూలోకము కర్మలోకము, మిగిలినవి అనుభవ లోకములు. అంటే కర్మలు చేయడం, వాటి ఫలములను అనుభవించడం, మరలా కర్మలు చేయడం. కర్మ అనుభవం రెండు లేని లోకము పరమ పదము. అక్కడ శాశ్వతానందము తప్ప మరొకటి లేదు. అటువంటి వాడికి పునర్జన్మ, దాని వలన కలిగే శరీరము, దేశము, కాలము, కర్మ, అనుభవము, అంటూ ఏమీ ఉండవు. అన్నిలోకాలు నశించిపోయినా పరమ పదము నశించదు. ఆ పరమపదము పొందితే మరలా జన్మ ఉండదు.

## 17. సహస్రయుగపర్యన్తమహర్యద్బ్రహ్మణో విదు:।
## రాత్రిం యుగసహస్రాన్తాం తే2హెూరాత్రవిదో జనా:॥

వేయి యుగములు గడిస్తే బ్రహ్మ కు ఒక పగలు, అలాగే వేయి యుగములు గడిస్తే బ్రహ్మకు ఒక రాత్రి. ఈ విధంగా కాలపరిమాణమును ఎవరు తెలుసుకుంటారో, వారు బ్రహ్మయొక్క రాత్రింబగళ్లు గురించి బాగా తెలుసుకోగలరు.

కిందటి శ్లోకంలో బ్రహ్మలోకం కూడా శాశ్వతం కాదు అని చెప్పిన కృష్ణుడు బ్రహ్మకు కూడా మన మాదిరే రాత్రి పగలు ఉన్నాయి అని తెలియజేసాడు. అంటే బ్రహ్మలోకంలో కూడా కాలము ప్రవర్తిస్తూ ఉంటుంది. కాలమునకు లోబడినది ఏదీ శాశ్వతము కాదు అని అంతరార్థము. దీని గురించి కొంచెం వివరంగాతెలుసుకుందాము.

క్రిందటి శ్లోకంలో బ్రహ్మ లోకము గురించి చెప్పాడు కాబట్టి దాని గురించి కాస్త వివరణ ఇస్తున్నాడు. ఈ బ్రహ్మలోకంలో అంటే సత్య లోకంలో బ్రహ్మగారు ఉంటారు. బ్రహ్మగారికి వేయి యుగములు గడిస్తే ఒక పగలు అవుతుంది. మరలా వేయి యుగములు గడిస్తే ఒక రాత్రి అవుతుంది. ఈ విధంగా రెండు వేల యుగములు కలిస్తే బ్రహ్మగారికి ఒక రోజు. బ్రహ్మ కాలమానము ఇది అని తెలుసుకోవాలి. ఇక్కడ ఒక వివరణ.

మనకు నాలుగు యుగములు ఉన్నాయి. అవి కృత యుగము, త్రేతాయుగము, ద్వాపర యుగము, కలి యుగము. ఇటువంటి యుగములు వేయియుగములు గడిస్తే బ్రహ్మగారికి ఒక పగలు, వేయి యుగములు గడిస్తే బ్రహ్మగారికి ఒక రాత్రి అని అర్థము. అంటే రెండు వేల యుగములు కలిస్తే బ్రహ్మగారికి ఒక రోజు అని అర్థం. అటువంటి రోజులు 360 అయితే బ్రహ్మకు ఒక సంవత్సరం. అటువంటి సంవత్సరములు 100 బ్రహ్మగారి ఆయుర్దాయము. అంటే ఏడు కోట్ల ఇరవై లక్షల యుగాలు అన్నమాట. యుగానికి ఎన్ని సంవత్సరాలు అనేది, అవి దేవ సంవత్సరాలా, లేక భూభ్రమణం బట్టి కలిగే సంవత్సరాలా అనే సందేహం వస్తుంది. ఎందుకంటే మనకు ఒక సంవత్సరం గడిస్తే దేవతా గణాలకు, పితృగణాలకు ఒక రోజుతో సమానము. (అందుకే మనం ప్రతి సంవత్సరం పితరులకు శ్రాద్ధం పెడతాము. అంటే వాళ్లకు ప్రతిరోజూ భోజనం పెట్టడం అన్నమాట!).

ఏది ఏమయినా బ్రహ్మ దేవుడు, బ్రహ్మలోకము కూడా శాశ్వతము కాదు, బ్రహ్మగారి ఆయుర్దాయము కూడా సంవత్సరముల లెక్కకు లోబడి ఉంది, బ్రహ్మగారు కూడా కాలమునకు అతీతుడు కాడు అని తెలుసుకుంటే చాలు. కాబట్టి బ్రహ్మకు కూడా ఆది అంతము ఉన్నాయి అని తెలుస్తూ ఉంది. బ్రహ్మలోకముకూడా కాలమునకు లోబడి ఉంటుంది. బ్రహ్మలోకమే కాలమునకు లోబడిఉన్నప్పుడు మిగిలిన లోకముల గురించి చెప్పపని లేదు. అన్నీ కాలమునకు లోబడిఉంటాయి. కాలమునకు లోబడి ఉన్న ప్రతిదీ పుట్టుక చావు కలిగి ఉంటాయి. పుట్టుక చావు ఉన్నవి శాశ్వతములు కావు. కాబట్టి బ్రహ్మలోకము కూడా శాశ్వతము కాదు. ఇంక ఈ బ్రహ్మలోకము ఎలా పని చేస్తుంది అన్న విషయం ఇక్కడ వివరిస్తున్నాడు.

### 18. అవ్యక్తాద్వ్యక్తయ: సర్వా: ప్రభవన్త్యహరాగమే।
### రాత్ర్యాగమే ప్రలీయన్తే తత్రైవావ్యక్తసంజ్ఞకే॥

బ్రహ్మదేవునికి పగలు ప్రారంభం అయినపుడు అవ్యక్తమైన ప్రకృతి వ్యక్తము అవుతుంది. బ్రహ్మదేవునికి రాత్రి కాగానే వ్యక్తమైన ప్రకృతి అంతా అవ్యక్తంగా మారి పోతుంది. బ్రహ్మలోనుండి బయటకు వచ్చిన సృష్టి మరలా ఆయనలోనే లీనం అవుతుంది.

బ్రహ్మ నిద్ర లేవగానే సృష్టి మొదలవుతుంది. బ్రహ్మ నిద్రపోగానే సృష్టి అంతా ఆయనలో లీనం అవుతుంది. మనం రాత్రి కాగానే కళ్లు మూసుకొని నిద్రపోతాము. మనం చూసే ఈ ప్రకృతి అంతా మనలో లీనం అయి పోతుంది. పొద్దుటే కళ్లు తెరవగానే మన ఎదుట కనపడుతుంది. అంటే పొద్దుటే కళ్లు తెరిస్తే సృష్టి, రాత్రి కళ్లు మూసుకుంటే లయము. మనకూ అంతే బ్రహ్మగారికీ అంతే. బ్రహ్మగారికి పగలు మొదలవగానే ప్రకృతి నుండి సర్వ ప్రాణులు పుడతాయి. రాత్రి కాగానే సర్వప్రాణులు ప్రకృతిలో లీనం అవుతున్నాయి.

## 19. భూత గ్రామస్స ఏవాయం భూత్వా భూత్వా ప్రలీయతే। రాత్ర్యాగమేఽవశః పార్థ ప్రభవత్యహరాగమే॥

ఓ అర్జునా! కర్మలతో కూడిన ఈ జీవకోటి బ్రహ్మయొక్క పగలు మొదలు కాగానే పుడుతున్నారు అంటే జన్మలెత్తుతున్నారు. బ్రహ్మకు రాత్రి కాగానే బ్రహ్మలో లీనం అవుతున్నారు. మరలా బ్రహ్మకు ఉదయం కాగానే మరలా సృష్టి మొదలవుతూ ఉంటుంది. జనన మరణాలు మొదలవుతాయి.

బ్రహ్మదేవుని పగలును ఒక కల్పము అంటారు. మనం శ్వేత వరాహ కల్పంలో ఉన్నాము. ఈ కల్పము 14 మన్వంతరములుగా విభజింపబడింది. మనం ఏడవ మన్వంతరము అనగా వైవస్వత మన్వంతరములో ఉన్నాము. బ్రహ్మకు రోజు మొదలవగానే సృష్టి మొదలవుతుంది. రాత్రి కాగానే బ్రహ్మలో లయం అవుతుంది. రాత్రి కాగానే లయం అయిన ప్రాణులే మరునాడు సృష్టించబడతాయి. వారి వారి కర్మలను, కర్మ వాసనలను బట్టి ప్రాణులు పుడుతూ చస్తూ ఉంటారు. ఇదే జనన మరణ చక్రము. అంటే కొత్తగా సృష్టి ఏమీ జరగదు. రాత్రి కాగానే ప్రాణులు అన్నీ బ్రహ్మలోకి లీనం అవుతాయి. పొద్దుట కాగానే అవి అన్నీ బ్రహ్మ లోనుండి బయటకు వస్తాయి. అంటే అన్ని ప్రాణులు తమ తమ స్థూల శరీరములను వదిలిపెట్టి సూక్ష్మశరీరాలతో ఉంటాయి. బీజరూపంలో ఉంటాయి. కంటికి కనిపించవు. అంటే మానవులుకూడా మరణించగానే స్థూల శరీరం కాలుస్తాము లేక పూడుస్తాము. కాని జీవుడు సూక్ష్మశరీరంగా ఉంటాడు. మరలా జన్మ ఎత్తినపుడు స్థూల శరీరంగా కనపడతాడు. ఈ రహస్యమే ఇక్కడ చెప్పబడింది.
(మా ఇంటి పక్కన పెద్ద ఖాళీస్థలం ఉంది. ఎండా కాలంలో ఆ స్థలంలో ఒక్క మొక్కకూడా ఉండదు. అంతా మట్టి దిబ్బలాగా ఉంటుంది. వానాకాలం రాగానే, వర్షాలు పడగానే, ఎవరూ విత్తనాలు వేయకుండానే, అనేక రకాలైన మొక్కలు మొలుస్తాయి. నిలువెత్తు చెట్లు అవుతాయి. మరలా మేనెలలో ఆ చెట్లు ఏమవుతాయో తెలియదు. మరలా మట్టిదిబ్బ గా మారిపోతుంది.. అంటే మండు వేసవిలో ఈ చెట్లన్నీ బీజరూపంలో అవ్యక్తంగా భూమిలో ఉన్నాయి. వానాకాలంలో మొక్కలు, చెట్ల రూపంలో వ్యక్తం అయ్యాయి. అలాగే ఈ ప్రకృతి కూడా. ఇది కేవలం చిన్ని ఉదాహరణ.)

ఈ వ్యక్త, అవ్యక్తములు, జనన మరణములు, జీవుని ఇష్ట ప్రకారం జరగదు. అతడు చేసిన కర్మల వాసనలను బట్టి జరుగుతూ ఉంటుంది. అందుకే అవశ: అని అన్నారు. ఈ జన్మ ఎత్తడం ఎవరి వశంలో లేదు. ఎవరి ఇష్టం బట్టి జరగదు. వారి వారి పూర్వజన్మవాసనలను బట్టి జరుగుతూ ఉంటుంది. అలా కాకపోతే అందరూ మంచి ధనవంతులు, విద్యావంతులు, సంస్కారవంతులు, ఆస్తిపరులు, మంచి పదవులు ఉన్న వారి ఇళ్లలోనే పుట్టడానికి ఇష్టపడతారు. అది మన చేతిలో లేదు కాబట్టి, కొంత మంది కటిక పేద వారి ఇంట్లో, మరి కొందరు ధనవంతుల ఇంట్లో పుడుతున్నారు. పుట్టిన తరువాత వారి వారి కర్మలకు తగ్గట్టు కష్టసుఖాలు అనుభవిస్తున్నారు. అదీ కూడా ఒక సారి కాదు. భూత్వా భూత్వా అంటే మరలా మరలా పుడుతూ చస్తూ ఉంటారు.

బ్రహ్మకు రాత్రి కాగానే జీవరాసులు ఆ రాత్రి అంతా సూక్ష్మశరీరంతోనే ఉంటారు. బ్రహ్మ నిద్రలేవగానే మరలా తన తన కర్మల వాసనలను బట్టి స్థూల శరీరం ధరిస్తారు. ఇదే సృష్టి రహస్యం.

## 20. పరస్తస్మాత్తు భావో2న్యో2వ్యక్తో2వ్యక్తాత్సనాతన:।
## యస్స సర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి॥

ఏదైతే ఈ ప్రకృతి కంటే వేరుగా ఉన్నదో, ఏదైతే ఇంద్రియములకు కనపడదో, దేనినైతే మనసుతో భావించలేమో, ఏదైతే సనాతనమైనదో, ఏదైతే అన్నిటి కంటే ఉత్తమమైనదో, ఆ పరమాత్మ తత్త్వము ఈ అనంత విశ్వము అంతా నశించి పోయినా, నశించకుండా స్వయంప్రకాశంతో వెలుగుతూ ఉంటుంది.

అవ్యక్తము అంటే వ్యక్తము కానిది అంటే కనపడనిది. అవ్యక్తము లోనుండి వ్యక్తము వస్తుంది. వ్యక్తమైనది మరలా అవ్యక్తంగామారి పోతుంది. మరలా వ్యక్తం అవుతుంది. స్త్రీపురుషుల కలయిక వలన, పురుషుని వీర్యము స్త్రీ శోణితములో కలవడం వలన ఒకఅండం తయారయి, పిండంగా మారి, శిశువుగా రూపుదిద్దుకొని, తల్లి గర్భంలోనుండి బయటకు వస్తుంది. కనపడని వీర్యకణాలలోనుండి అంటే అవ్యక్తంలో నుండి ఒక చిన్ని శరీరం వ్యక్తం అయింది. అది పెరిగి పెద్దది అయి తుదకు మరణించి కాలిస్తే బూడిద అవుతుంది, పూడిస్తే మట్టిఅవుతుంది. ఆ బూడిద కూడా మట్టిలో కలిసిపోతుంది. ఆ మట్టిలో నుండి ఆహారం వస్తుంది. ఆ ఆహారం తింటే రక్తంగా మారి, ఆ రక్తం వీర్యం గామారి, ఆ వీర్యకణాలు మరలా స్త్రీగర్భాశయంలోకి ప్రవేశించి, అండంగా, పిండంగా మారి శరీరం వ్యక్తం అవుతుంది. ఇదీ జనన మరణ చక్రము. అంటే అవ్యక్తంలో నుండి వ్యక్తం

పుడుతూ ఉంది. ఇదే క్రమం బీజము, మొక్క, చెట్టు, వృక్షము, ఆ వృక్షమునకు ఫలములు,ఆ ఫలములలో నుండి విత్తనములు అంటే బీజములు, ఆ బీజములలో నుండి మరలా మొలక, మొక్క, చెట్టు, పూలు, కాయలు, పండ్లు, విత్తనములు. ఇదే జీవపరిణామము. ఈ ప్రకృతి అంతా అవ్యక్తము లోనుండి వ్యక్తం అవుతూ మరలా అవ్యక్తములోనికి మారిపోతూ ఉంది. అంటూ మూల ప్రకృతి అవ్యక్తము, కంటికి కనిపించేది వ్యక్తము. ఈమూల ప్రకృతి అంటే అవ్యక్తము కంటే భిన్నమైన అవ్యక్తము మరొకటి ఉంది. అదే ఆత్మతత్వము. దానినే పరాప్రకృతి అని అంటారు. ఆ ఆత్మ తత్వము ఎప్పుడూ అవ్యక్తంగానేఉంటుంది. వ్యక్తం కాదు. కంటికి కనపడదు. మనసుకు గోచరం కాదు. అదే చైతన్యం. దానిగురించే కృష్ణుడు ఈ శ్లోకంలో వివరిస్తున్నాడు.

ఈ ప్రకృతిలోని జీవరాసులు జన్మిస్తూ, మరణిస్తూ, కాలానికి లోబడి ఉంటాయి. కానీ పరమాత్మ దీనికి అతీతుడు. ఎందుకంటే ఆయన ప్రకృతి కంటే వేరుగా ఉన్నాడు. ఆయనకు స్థూల సూక్ష్మశరీరములు లేవు. ఇంద్రియములకు మనసుకు గోచరించడు. బ్రహ్మ కంటే ముందు వాడు. కాబట్టి బ్రహ్మ సృష్టికి ఆయన వశుడు కాడు. బ్రహ్మ చేసిన సృష్టి నశించినా పరమాత్మ కు నాశనము లేదు. ఇదే పరమాత్మకు మూలప్రకృతికి ఉన్న భేదము. అందుకని సాధకుడు ఆత్మజ్ఞానం పొందాలి. ఆత్మ తత్వము తెలుసుకొని పరమాత్మలో ఐక్యం అవ్వాలి. ఈ శరీరమే నేను అని అనుకుంటూ ఉన్నంత కాలం ప్రకృతికి లోబడి పుడుతూ చస్తూ సూక్ష్మ స్థూల రూపములతో సంచరిస్తుంటాడు. కాని పరమాత్మతత్వము పరమైనది, మనసుకు ఇంద్రియములకు గోచరము కానిది, పురాతనమైనది, ఆది అంత్యము లేనిది, నాశనము లేనిది. దేశ కాలములకు అతీతమైనది. బ్రహ్మ చేసిన సృష్టి అంతరించినా అంతము కానిది. అటువంటి పరమాత్మలో ఐక్యం అవ్వాలంటే నిష్కామయోగము, ధ్యానము, అభ్యాసము, సత్సంగము, భగవధ్యానము, మొదలైనవి అవసరము.

### 21. అవ్యక్తో2క్షర ఇత్యుక్తస్తమాహు: పరమాం గతిమ్।<br>యం ప్రాప్య న నివర్తన్తే తద్ధామ పరమం మమ॥

ఏదైతే అవ్యక్తము, అక్షరము అని చెప్పబడినదో అదే పరమమైనగతి. ఏది పొందితే ఇంక పొంద వలసినది ఏమీ ఉండదో, అదే పరమ మైన ధామము చేరుకుంటే, తిరిగి రావడం ఉండదో ఆ పరంధామమే ఉత్తమగతి.

ఇక్కడ అవ్యక్తము అంటే పరాప్రకృతి అని అర్థం. ఈ అవ్యక్తము నాశములేనిది. ఏదైతే అవ్యక్తము, అక్షరము అని చెప్పబడినదో దానినే పరమగతి అని అంటారు. అవ్యక్తుడు, అక్షరుడు, అని పరమాత్మ గురించి చెప్పారు. ఆయన ఉండేది పరమ పదము. ఆ పరమపదమును చేరుకుంటే

మరలా తిరిగి రావడం ఉండదు. ఆ పరమ పదమే పరమాత్మ స్థావరము. మనం అందరం అక్కడకు చేరుకోవడానికి ప్రయత్నం చేయాలి. ఎందుకంటే ఈ ప్రపంచములో మనం చూచేవన్నీ నశించిపోయేవే. కాని అవన్నీ శాశ్వతమైనట్టు, ఎంతో కాలం ఉన్నట్టు కనపడతాయి. కాని ఏదో ఒక రోజు కాలగర్భంలో కలిసిపోతాయి. అలా కలవనిది పరమ పదము ఒక్కటే. దానినిగురించి మనం వెతకాలి తెలుసుకోవాలి. పొందాలి. ఆ పరమ పదమును పొందితే ఇంక పొందవలసినది ఏదీ ఉండదు. అక్కడకుపోతే మరలా జన్మించే పని ఉండదు. జన్మ లేకపోతే సంసారము సుఖదు:ఖములు ఉండవు. మాయ ఉండదు. మాయకు లోబడి కర్మలు చేయడం ఉండదు. పరమ సుఖం తప్ప మరేదీ ఉండదు.

ఈ శ్లోకంలో పరమ గతి, ధామము అనే రెండు పదాలు వాడారు. ధామమము అంటే ఇల్లు, ఆలయము, చోటు అని అర్థము. అలాగే గతి అంటే మార్గము, గమ్యము అని అర్థము. పరమాత్మ అంతటా ఉన్నప్పుడు ఈ ధామము, గతి వేరుగా ఉంటాయా అని మీకు ఒక సందేహము రావచ్చు. ఇవి పామరులు అర్థం చేసుకోడానికి చెప్పినమాటలు. వేదాంతము పూర్తిగా అర్థం అయితే ఈ మాటలు తేలిగ్గా అర్థం అవుతాయి. జ్ఞానము, విజ్ఞానము కలిగిఉండటం పరమగతి. అజ్ఞానములో ఉండటం అధోగతి. అధోగతి నుండి పరమగతికి చేరుకోవాలి. అంటే నెమ్మదిగా నెమ్మదిగా అజ్ఞానమును విడిచిపెట్టి జ్ఞానమార్గంలోకి ప్రవేశించాలి. పరమాత్మ అసలు తత్వాన్ని తెలుసుకోవాలి. పరమాత్మ ఎక్కడో లేడు నాలోనే ఉన్నాడు. నేను పరమాత్మలో ఉన్నాను అనే జ్ఞానం రావాలి. పరమాత్మ అంతటా ఉన్నాడు అని తెలుసుకోవాలి. ఆఖరుకు నేనే పరమాత్మను అనే పరమాత్మభావనలోకి వెళ్లాలి. అదే పరమ గతి. జీవన్ముక్తి. దీనినే పరమగతి, పరంధామము అని అంటారు. అంతే కానీ అది ఎక్కడో వైకుంఠంలో కైలాసంలో ఉందని అనుకోకూడదు.

## 22.పురుష: స పర: పార్థ భక్త్యా లభ్యస్త్వనన్యయా।
## యస్యాన్త:స్థాని భూతాని యేన సర్వమిదం తతమ్॥

ఈ సమస్త జీవరాసులు ఎవనిలో ఉన్నవో, ఎవరైతే ఈ సకల జగత్తులో వ్యాపించి ఉన్నాడో, అట్టి పరమ పురుషుడు కేవలము అనన్యమైన భక్తి చేతనే లభించగలడు.

"ఎవ్వని చేజనించు జగము ఎవ్వనిలోపల నుండు లీనమై ఎవ్వని యందు డిందు" అని గజేంద్రమోక్షములో ఒక పద్యం ఉంది. అందులో ఎవ్వనిలోపలనుండు లీనమై అంటే ఈ అనంత విశ్వం అంతా ఆ పరమాత్మలో లీనమై ఉంది. అంటే ఈ సృష్టికి ఆధారము పరమాత్మ. అటువంటి పరమాత్మను పొందడానికి మార్గము ఒకటి ఉంది. అదే భక్తి మార్గము. ఆ పరమ పుషుడిని కేవలము భక్తి చేతనే పొందగలడు కానీ ఇతరత్రాకాదు. ఆ భక్తి ఎటువంటిది అంటే

అనన్యయా అంటే సాటిలేని భక్తి. సామాన్యభక్తి కాదు. పూర్తిగా శరణాగతి పొందాలి. "నీవే తప్ప నిత: పరం బెరుగ" అనే స్థితికి రావాలి.

ప్రస్తుతం మనం భగవంతుని మీద చూపే భక్తి దీనితో పోలిస్తే అసలు భక్తి కాదు. మనది కోరికలతో కూడిన భక్తి. నా కోరిక తీరిస్తే నీకు మొక్కు తీరుస్తా అంటూ పరమాత్మతో బేరాలాడే భక్తి. మన కోరిక తీరక పోతే మరొక దేవుడి దగ్గరకుపోయే భక్తి. ఈ భక్తికేవలము కోరికలు తీర్చుకోవడానికే పనికి వస్తుంది. మోక్షం కావాలంటే, ఆ పరమ పురుషుడిలో ఐక్యంకావాలంటే, అనన్యభక్తి కావాలి. అటువంటి అనన్య భక్తి కలిగినపుడే సాయుజ్యం సాధ్యం అవుతుంది.

## 23. యత్ర కాలే త్వనావృత్తిమావృత్తిం చైవ యోగిన:। ప్రయాతా యాన్తి తం కాలం వక్ష్యామి భరతర్షభ॥

ఓ భరతర్షభ! ఏ కాలంలో ఈ దేహమును విడిచిపెట్టిన యోగులు తిరిగి జన్మ ఎత్తరో, ఏ కాలంలో ఈ దేహమును విడిచిపెట్టిన యోగులు తిరిగి జన్మను పొందుతారో, ఆ యాకాలముల గురించి నీకు వివరిస్తాను.

ఏ పని చేయాలన్నా, అంటే వివాహం, ఉపనయనం. నూతన గృహప్రవేశం, ఏదైనా శుభకార్యం చేయాలన్నా మంచి ముహూర్తము కోసం చూస్తాము. ఆ ముహూర్త కాలం అంటే 48 నిమిషముల కాలంలోనే ఆ పని పూర్తి చేస్తాము. మంచి ముహూర్తం కోసం నిరీక్షిస్తాము. కాని జనన మరణములు మనచేతిలో లేవు. జనన మరణాలకు మనం ముహూర్తాలు నిర్ణయించలేము. కానీ కొంతమంది ప్రబుద్ధులు, మంచి ముహూర్తం చూసి, ఆపరేషన్లు చేసి, ప్రసవాలు జరిపిస్తున్నారు. ఇది విపరీత ధోరణి. జననం సహజంగా జరగాలి. మాతృగర్భం నుండి సహజంగా బయటకు వచ్చిన వారికే ముహూర్తాలు వర్తిస్తాయి కానీ, ముహూర్తంపెట్టి ప్రసవం జరిపించిన వారికి కాదు.

జననాలకు అయితేముహూర్తాలు పెట్టిస్తున్నారు. కాని మరణాలు ఎవరి చేతిలోనూ లేవు. మరణాలకు కూడా ముహూర్తాలు పెట్టి మరణించే ప్రక్రియ ఇంకా రాలేదు. భవిష్యత్తులో వస్తుందేమోతెలియదు. మన పురాణాలలో యోగులు తమ ఇష్టం వచ్చినపుడు యోగ మార్గం ద్వారా ఈ శరీరాన్ని విడిచిపెట్టేవారని తెలుసుకున్నాము. దానికి భీష్ముడే ఉదాహరణ. ఆయనకు స్వచ్ఛంద మరణం అనే వరం ఉంది.(ఆత్మహత్యలు చేసుకోవడాన్ని స్వచ్ఛంద మరణం అనరు) ఈ స్వచ్ఛంద మరణం అందరికీ సాధ్యం కాదు. అందుకనే ఏ యే కాలాలలో ఈ దేహాన్ని విడిచిపెడితే

తిరిగి పునర్జన్మ ఉండదో, ఏయే కాలాలలో ఈ దేహాన్ని విడిచిపెడితే తిరిగి పునర్జన్మ ఉంటుందో, ఆ కాలాలగురించి తరువాతి శ్లోకాలలో వివరిస్తున్నాడు కృష్ణుడు.

24. అగ్నిర్జ్యోతిరహశ్శుక్ల షణ్మాసా ఉత్తరాయణమ్।
తత్ర ప్రయాతా గచ్ఛన్తి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః॥

అగ్ని వలె వెలుగుతూ ఉండేది, జ్యోతి మాదిరి ప్రకాశించేది, పగటిమాదిరి అన్ని కనపడుతూ ఉండేది, తెల్లటి స్వచ్ఛమయినది అయిన ఆరుమాసముల కాలమును ఉత్తర అయనము అని అంటారు. బ్రహ్మను గురించి తెలుసుకొన్న బ్రహ్మవిదులు ఈ శరీరమును విడిచిపెట్టిన తరువాత అటువంటి ప్రకాశవంతమైనమార్గములో ప్రయాణిస్తారు.

అగ్ని, జ్యోతి, పగలు, శుక్లపక్షము, ఉత్తరాయణము. ఈ పదాలు ఈశ్లోకంలో వాడారు. అగ్ని వెలుగుతూ వెలుతురును ఇస్తుంది. జ్యోతి కూడా తన ప్రకాశంతో మనకు చీకటిలో మార్గం చూపుతుంది. పగటి పూట సూర్యుడు వెలుగుతూ ఈ విశ్వాన్ని తన వెలుగులతో నింపుతుంటాడు. శుక్లపక్షంలో రాత్రి పూట చంద్రుడు ప్రకాశిస్తూ తన చల్లని వెన్నెలలతో ఆహ్లాదం కలిగిస్తుంటాడు. కాబట్టి ఇవి అన్నీ శుభాలను సూచిస్తాయి. ఉత్తరము మనలను ఉద్ధరిస్తుంది. ఉత్తరము ఎల్లప్పుడూ పైభాగాన ఉంటుంది. మనకు ఉత్తరాన హిమాలయాలు ఉన్నాయి.అక్కడే కైలాసములో శివుడు ఉంటాడని మన నమ్మకము. అన్నిటికి మించి ఉత్తరాయణంలో సూర్యరశ్మిబాగా ఉంటుంది. మేఘాలు ఉండవు. వర్షములు ఉండవు. పగలే చీకటి ఉండదు. ఆకాశం నిర్మలంగా ఉంటుంది. ఈ ఉత్తరాయణంలోనే వసంత ఋతువు వస్తుంది. అందుకే ఉత్తరాయణాన్ని ఉత్తమమైనదిగా చెప్పారు. ఇది కాలములలో మొదటి ఆరునెలలు అంటే జనవరి నుండి జులై వరకు ఉన్న కాలము.

జ్ఞానము అంటే ప్రకాశము. అజ్ఞానము అంటే చీకటి. ప్రకాశవంతమైన మార్గము అంటే జ్ఞానమార్గము. బ్రహ్మనుగురించి తెలుసుకున్న వాడు జీవితం అంతా బ్రహ్మలో చరిస్తూ ఉంటాడు కాబట్టి, ఈ దేహమును వదిలిన తరువాత కూడా జ్ఞానమార్గంలో ప్రయాణం చేస్తాడు. బ్రహ్మజ్ఞానము పొందిన తరువాత అజ్ఞానము అనే అంధకారము ఆవహించదు. అంతా వెలుగే. వెలుతురే. అందుకే వెలుగును ఇచ్చే అగ్ని, జ్యోతి, పగలు, శుక్లపక్షము వీటి గురించే చెప్పాడు కృష్ణుడు. ఈనాలుగులక్షణములు ఉన్న కాలమే ఉత్తర అయనము.

బ్రహ్మజ్ఞానముకలవారు అవసాన దశలో తమ ప్రాణములను నొసటికి సమాంతరంగా ఉన్న సుషుమ్నా నాడి ద్వారా బ్రహ్మ రంధ్రము వద్దకు చేర్చి, ఆ బ్రహ్మ రంధ్రము గుండా ప్రాణములను

వదిలిపెడతారు. అటువంటి వారు దారి తప్పకుండా నేరుగా పరమాత్మ చేరుకునేందుకు మంచి మార్గమును, ప్రకాశవంతమైనమార్గమును, చీకటి లేని మార్గమును ఏర్పరిచాడు పరమాత్మ. జీవితం అంతా నియమ నిష్ఠలతో,నిష్కామ కర్మలు చేస్తూ, అందరిపట్ల సమదృష్టి కలిగి ఉండి, బ్రహ్మలో చరిస్తూ గడిపేవారికి, పరమాత్మ కల్పించిన సౌకర్యం ఇది. ఎటువంటి అసౌకర్యానికి వీలులేకుండా, హాయిగా అంతిమ ప్రయాణం సాగేలా చేసిన ఏర్పాటు.

## 25. ధూమో రాత్రిస్తథా కృష్ణష్షణ్మాసా దక్షిణాయనమ్।
## తత్ర చాన్ద్రమసం జ్యోతిర్యోగీ ప్రాప్య నివర్తతే॥

పగటి పూట చీకట్లు కమ్ముకోవడం, పొగమంచు, చీకటి రాత్రి, కృష్ణపక్షము (చంద్రుడు లేని రోజులు) ఇవి ఆరుమాసాలు (జూలై నుండి డిసెంబరు). ఈ మార్గంలో సకామకర్మలు చేసినవారు, కేవలం తమ కోరికలు తీరడం కోసమే వివిధదేవుళ్లను పూజించేవారు ప్రయాణిస్తారు. వీరి ప్రయాణం చంద్రలోకం వరకే అంటే స్వర్గలోకం వరకే సాగుతుంది. అక్కడ వారి వారి పూజలకు తగిన ఫలములు అనుభవించి, తిరిగి పునర్జన్మలను పొందుతుంటారు.

ఇంక ధూమము అంటే పొగ, రాత్రి అంటే చీకటి, కృష్ణపక్షము అంటే చీకటి రాత్రులు, దక్షిణాయనమ్ అంటే జులైనుండి డిసంబరు వరకుఉంటే వర్షాకాలము, చలికాలము, అంటే ఈ కాలములో పగలు తక్కువ, రాత్రి ఎక్కువ, ఆ పగలు కూడా మేఘాలు ఆవరించి చీకటిగా ఉంటుంది. పొగ మంచుతో బారెడుపొద్దెక్కినా ఎదురుగా ఉన్న మనుషులు కనపడరు. అంతా అంధకార మయంగా ఉంటుంది.

ఉత్తరాయణములో అంటే ప్రకాశ వంతమైన కాలములో చని పోయిన వారు బ్రహ్మపదమును పొందుతారు అనీ, దక్షిణాయన కాలములో అంటే చీకటి రోజులలో చనిపోయిన వారు పునర్జన్మ పొందుతారు అనీ ఇక్కడ చెప్పారు. కాని ఎంతో మంది మహానుభావులు దక్షిణాయనంలో పరమపదించారు. అంటే అర్థం అది కాదన్నమాట. జ్ఞానమును ప్రకాశంతోనూ అంటే జ్ఞానప్రకాశము అనీ, అజ్ఞానమును అంధకారంతోనూ అంటే అజ్ఞానాంధకారం అనీ పోలుస్తారు. వెలుగు, ప్రకాశము జ్ఞానానికి ప్రతీక అయితే చీకటి పొగ అజ్ఞానానికి ప్రతీక. జ్ఞానం కలిగిన తరువాత మరణిస్తే పరమ పదము పొందుతారు అనీ, అజ్ఞానాంధకారంలో ఉన్నప్పుడు మరణిస్తే తిరిగి తిరిగి జన్మలు ఎత్తుతారనీ అంతరార్థము. కాబట్టిమనం ఎల్లప్పుడూ జ్ఞానం కొరకు ప్రయత్నం చేయాలి. జ్ఞానప్రకాశం కలిగి ఉన్నప్పుడే మరణించాలి. అజ్ఞానాంధకారంలో ఉన్నప్పుడు మరణించకూడదు. కనీసం జీవిత చరమాంకంలో నైనా జ్ఞానం సంపాదించి వెలుగులోకి రావడానికి ప్రయత్నం చేయాలి. ఇది ప్రతి మానవుడి కర్తవ్యము.

అజ్ఞానంలో ఉన్న వారు ఈ చీకటిమార్గంలో ప్రయాణిస్తారు అని తెలుసుకున్నాము. అజ్ఞానులు అంటేఎవరు? ఆత్మస్వరూపం తెలియనివారు. ప్రాపంచిక విషయములలో, విషయ వాంఛలలోమునిగి తేలేవారు. ప్రాపంచిక సంబంధమైన విషయముల గురించి కోరికలు కోరుకునేవారు. ఆ కోరికలు తీరడం కోసమే వివిధము లైన దేవతలను ఆరాధించేవారు. దేవతల మధ్య భేదభావముతో ఉండేవారు. వీరికి తమ కోరికలుతీరడం ముఖ్యం. ఆత్మజ్ఞానం ఉండదు. వీరికి కూడా తమ పూజలకు, ఉపాసనలకు తగిన ఫలితం లభిస్తుంది. ఎక్కడ అంటే చాన్ద్రమసం అంటే చంద్రలోకము, చంద్రుని ప్రకాశము, వెన్నెలలోకం. దీనిని వెన్నెల లోకం అని ఎందుకన్నారంటే పున్నమి చంద్రుని వెన్నెలలో కామకోరికలు విజృంభిస్తాయి. వెన్నెల చల్లగా, హాయిగా సుఖంగా ఉంటుంది. ప్రియురాలి ముఖాన్ని చంద్రబింబంతో పోలుస్తారు. ప్రియురాలి చిరునవ్వు పండువెన్నెలతో పోలుస్తారు. కాబట్టి చంద్రకాంతి, వెన్నెల, కామకోరికలకు ప్రతీక. ఈ చంద్రలోకంలో, వెన్నెలలోకంలో తాము చేసిన కొద్ది పుణ్యానికి తగిన సుఖాలు అనుభవిస్తారు. కాని పునర్జన్మ తప్పదు. వారు చేసుకున్నపుణ్య అయిపోగానే మరలా జన్మ ఎత్తుతారు. (క్షీణేపుణ్యేమర్త్యలోకం విశన్తి). వీరికి ఆత్మజ్ఞానం కలగనంతవరకు జనన మరణ చక్రం నుండి విముక్తి కలుగదు. ఇటువంటి మార్గమును దక్షిణ అయనము అంటే అధోమార్గము అంటారు.

మనకు మాప్ లో దక్షిణం కింద ఉంటుంది. ఉత్తరం పైన ఉంటుంది. ఈ శ్లోకాలకు అర్థం తెలుసుకునేటప్పుడు కేవలం జనవరి నుండి జూన్ లోపల మరణించేవారు ఉత్తమ లోకాలకు పోతారనీ, జులైనుండి డిసెంబరు దాకా మరణించేవారు అధోలోకాలకు పోతారనీ అర్థం తీసుకోకూడదు. ప్రకాశవంతమైన మార్గాలు, చీకటి మార్గాలు అలా వర్ణించారు. వీటిని జ్ఞాన మార్గము, అజ్ఞాన మార్గము అని చెప్పుకుంటే అర్థం సరిపోతుంది. ఎందుకంటే జ్ఞానమును ప్రకాశంతోనూ (జ్ఞాన ప్రకాశము) అజ్ఞానమును చీకటితోనూ (అజ్ఞానాంధకారము) మనం సాధారణంగా పోలుస్తుంటాము. ఈ శ్లోకాలను ఆ విధంగా అర్థం చేసుకోవడం సమంజసం. పరిమిత జ్ఞానం కలిగిన మనకే ఈ సందేహము వస్తే వ్యాసుల వారికి మనగురించి తెలియదా! కలియుగంలో మానవులు మందబుద్ధులు, విషయాలను తప్పుగా అర్థం చేసుకుంటారని ఆయనకు తెలుసు. అందుకే పైరెండు శ్లోకాలకు వివరణ ఈ క్రింది శ్లోకంలో ఇచ్చాడు.

### 26. శుక్లకృష్ణే గతీ హ్యేతే జగత: శాశ్వతే మతే।
### ఏకయా యాత్యనావృత్తిమన్యయా22వర్తతే పున:॥

పైన చెప్పబడిన శుక్ల మార్గము కృష్ణమార్గము ఈ జగత్తులో శాశ్వతంగా ఉంటాయి. శుక్లమార్గంలో పయనిస్తే జన్మఉండదు, కృష్ణమార్గంలో పయనిస్తే తిరిగి జన్మ ఉంటుంది.

అసలు విషయం ఈ శ్లోకంలో వివరించాడు. ఉత్తరాయనము దక్షిణాయనము రెండూ ఈ లోకంలో ఉన్నాయి. ఉత్తరాయనము ఆరునెలలు, దక్షిణాయనము ఆరు నెలలు. ప్రతి అయనంలోనూ, ప్రతి నెలలోనూ శుక్లపక్షము, కృష్ణపక్షము రెండు వస్తుంటాయి. అంటే ఉత్తరాయనము శుక్లపక్షంలో మరణిస్తే తిరిగి జన్మ ఉండదనీ, అలాగే ఉత్తరాయనము కృష్ణపక్షంలో మరణిస్తే తిరిగి జన్మిస్తాడనీ, అలాగే దక్షిణాయనము శుక్లపక్షంలో మరణిస్తే తిరిగి జన్మ ఉండదా! కృష్ణపక్షంలో మరణిస్తే జన్మ ఉంటుందా! అనే సందేహాలకు సమాధానమే ఈ శ్లోకము. వాడుకభాషలో ఉత్తరాయనము, దక్షిణాయనము, శుక్లపక్షము, కృష్ణపక్షము అంటే కాలానికి సంబంధించినవి. ఇక్కడ వాటిని అంటే జ్ఞానమార్గము, అజ్ఞానమార్గము అనే వాటికి అన్వయించుకోవచ్చు.

ఉత్తరాయనం అన్నా శుక్లపక్షం అన్నా జ్ఞానమార్గమనీ, దక్షిణాయనము అన్నా కృష్ణపక్షము అన్నా అది అజ్ఞానమార్గమనీ గ్రహించాలి. జ్ఞాన మార్గము అంటే శాస్త్రములు అధ్యయనం చేయడం, జ్ఞానం సంపాదించడం, దానిని ఆచరణలో పెట్టడం, నిష్కామ కర్మలు చేయడం, మనసును ఆత్మలో లీనం చేయడం, ఆత్మజ్ఞానం తెలుసుకోవడం. ఈ మార్గంలో ప్రయాణిస్తే మరలా జన్మఅంటూ ఉండదు. జన్మరాహిత్యం కలుగుతుంది. ఇంక అజ్ఞాన మార్గము అంటే కేవలం శ్రద్ధ, భక్తి లేకుండా ఆడంబరం కోసం, తన కోరికలు తీరడం కోసం భగవంతుని పూజించడం. అవసరాలకు మాత్రమే పరమాత్మ గుర్తుకు రావడం. ఆర్తులు, అర్థార్థులు అని ఇంతకు ముందే మనకు చెప్పాడు కృష్ణుడు. అటువంటి వారు అజ్ఞానంతో కర్మలు చేస్తూ, ఆ కర్మఫలములను అనుభవించడానికి మరలా మరలాజన్మలు ఎత్తుతుంటారు. ఇదే కృష్ణమార్గము.

జ్ఞానము ప్రకాశవంతమైన దారి. అజ్ఞానము చీకటి దారి. ఈ మార్గాలు ఎవరూ ఏర్పరచలేదు. "శాశ్వతే" అంటే అనాది నుండి ఈ రెండు మార్గాలు శాశ్వతంగా ఈ లోకంలో ఉన్నాయి. స్వతస్సిద్ధంగా ఏర్పాడ్డాయి. జ్ఞానమార్గం అనే ప్రకాశవంతమైన, వెలుగుతో కూడిన మార్గంలో ప్రయాణం చేసి ముక్తి పొందుతావో, అజ్ఞాన మార్గం అనే చీకటి మార్గమును ఆశ్రయించి పునర్జన్మలనుపొందుతావో నీ ఇష్టం. ఛాయిస్ మనకే వదిలేసాడు పరమాత్మ. ఇప్పుడు మనం మన తెలివిని ఉపయోగించి ముక్తిని కోరుకుంటామో మరలా జన్మలను కోరుకుంటామో మనమే నిర్ణయించుకోవాలి అంతే కానీ జీవితాంతం చేయకూడని పనులు చేసి ఉత్తరాయనం, శుక్లపక్షంలో పోతే మోక్షం రాదు. అలాగే జీవితాంతం పవిత్రంగా బతికి దక్షిణాయనం కృష్ణపక్షంలో పోతే పునర్జన్మరాదు.

జనన మరణాలు మనచేతిలో లేవు. కాబట్టి, మనం నిష్కామకర్మలు చేసి, శాస్త్రములను చదివి, విని, గురువుల వద్ద జ్ఞానం సంపాదించి, ప్రకాశవంతమైనమార్గంలో నడవాలేగానీ, ఎల్లప్పుడూ ప్రాపంచిక విషయములలో, విషయభోగములలో మునిగి తేలుతూ అజ్ఞానాంధకారంలో పడి పోయి చీకటి దారిలో ప్రయాణం చేయకూడదు.

## 27. నైతే సృతీ పార్థ జానన్యోగీ ముహ్యతి కశ్చన।
## తస్మాత్సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున॥

ఓ అర్జునా! పై శ్లోకములలో చెప్పబడిన రెండు మార్గముల గురించి ఎవరు చక్కగా తెలుసుకుంటారో, వారు ఈ ప్రాపంచిక మోహము, మాయలో పడరు. నీవు కూడా ఈ మోహంలో పడకుండా నీ కర్తవ్యమును నిర్వర్తించు.

ఉత్తరాయణం అంటే మనకు సంక్రాంతి పండగ, కోడి పందేలు, ఎడ్ల పందాలు, గాలిపటాలు, కనుమనాడు పంటికింద కటుక్కుమనిపించడానికి అంతులేని జీవహింస చేయడం, అక్కడి నుండి అబ్బో ఎండలు, పవర్ కట్ ఇదే కదా ఉత్తరాయణం. దక్షిణాయణం అంటే వినాయక చవితి విగ్రహాలు, అవి పెట్టడానికి చందాలు, నిమజ్జనాలు, బందోబస్తులు, శరన్నవరాత్రులు, దసరా అమ్మవారు, దీపావళి టపాకాయలు, ముక్కోటికి, జనవరి 1కి బ్లాకులో అన్నా టికట్ కొని తిరుమలేశు ని దర్శనం చేసుకొని పుణ్యం మూటకట్టేసుకోవడం ఇవే మనకు తెలిసింది. అలాగే శుక్లపక్షంలో వెన్నెల, కృష్ణపక్షంలో చీకటి. ఇది మనకు తెలిసిన జ్ఞానం.

భగవద్గీత అందుబాటులోకి వచ్చి వేల సంవత్సరాలు గడిచినా మనకు ఈ శ్లోకాలు అర్థం కావడం లేదు. అర్థం చేరుకోవడానికి కనీస ప్రయత్నం కూడా చేయడంలేదు. ఎదురుగా ప్రకాశవంతమైన మార్గం కనిపిస్తుంటే ఆ మార్గానపోకుండా నేను చీకటిదారిలోనే పోతాను అనే వాడిని మనం ఏమంటాము. మూర్ఖుడు అంటాము. అలాగే ఉత్తరాయనము, శుక్లపక్షము అనే ప్రకాశవంతమైన మార్గాలు మనకు ఏర్పరచి ఆ మార్గాన ప్రయాణం చేయమని మనకు పరమాత్మ నిర్దేశిస్తే, మనంమాత్రం దక్షిణాయనము, కృష్ణపక్షము అనే చీకటి మార్గాలను ఎంచుకుంటున్నాము. ఇప్పటికయినా మనం ప్రయాణించేమార్గం మంచిది కాదు అని గ్రహించి, ప్రకాశవంతమైన మార్గంలో ప్రయాణం చేయడానికి ప్రయత్నం చేయాలి.

అందుకే కృష్ణుడు అంటున్నాడు ఈ రెండు మార్గాలు తెలిసిన వాళ్లకు ఎటువంటి మోహము ఉండదు. యోగ యుక్తుడు అవుతాడు. అర్జునా నీవు కూడా ఈ రెండు మార్గాలగురించి తెలుసుకొని యోగయుక్తుడవు గాఅని అర్జునుడికి సలహా ఇచ్చాడు పరమాత్మ.

ఇది అర్జునుడికి మాత్రమే కాదు సకల ప్రపంచానికి, సమస్తమానవకోటికి ఇచ్చిన సలహా గా పరిగణించాలి. ప్రతివాడూ ఏది మంచిది ఏది చెడ్డది, ఏది అమృతము, ఏది విషము, ఏది చెయ్యాలి, ఏది చెయ్యకూడదు అని తన విచక్షణాజ్ఞానము ఉపయోగించి తెలుసుకోవాలి. అజ్ఞానంలో నుండి అంటే చీకట్లో నుండి బయట పడి జ్ఞానం వైపుకు అంటే ప్రకాశం వైపుకు తిరగాలి. ఆత్మ అనాత్మ గురించి తెలుసుకోవాలి. సుఖదు:ఖముల గురించి తెలుసుకోవాలి. భేదబుద్ధిని విడిచిపెట్టాలి. దీని కంతటికీ కావాల్సింది విచక్షణా జ్ఞానము. ముందు దానిని సంపాదించాలి. అప్పుడుపరమాత్మ గురించి తెలుస్తుంది. మోహము నుండి బయటపడేస్తుంది.

ఈ మార్గాలు ఎప్పటి నుండి ఉన్నాయి అంటే శాశ్వతే అంటే శాశ్వతంగా ఉన్నాయి. సృష్టిమొదలు అయినప్పటినుండిఉన్నాయి. ఎవరూఏర్పరచలేదు. స్వతసిద్ధంగా ఏర్పడ్డాయి. వాటిని అనుసరించడమే మన కర్తవ్యము. కాని ఎవరూ ఈ రెండు మార్గాల గురించి ఇన్నాళ్లు, ఇన్ని యుగాలు తెలుసుకోలేదు. కొంతమంది మాత్రం శుక్లమార్గంలో ప్రయాణం చేస్తే, చాలా మంది కృష్ణమార్గాన్నే ఎన్నుకున్నారు. కారణం వారిలో ఉన్న అజ్ఞానం. తెలియని తనం. మాయ. మరి కొంత మంది జీవితాంతం కృష్ణమార్గంలో ప్రయాణం చేసి, 60 ఏళ్ల తరువాత శుక్లమార్గం వైపు మళ్లుతారు. కానీ అంతలోనే జారిపోతారు. మరలా కృష్ణమార్గంలోకి ప్రవేశిస్తారు.

కాబట్టి, ప్రకాశవంతమైన శుక్లమార్గంలో ప్రయాణించడం అంటే ఒకరోజు, ఒక నెల, ఒక సంవత్సరంలో పూర్తిఅయ్యే "క్రాష్‌కోర్సు" కాదు. అన్ని కాలములలోనూ నిరంతరం అభ్యాసం చేయాలి. అందుకే సర్వేషుకాలేషుఅని అన్నారు. అప్పుడే సాధకుడు యోగ యుక్తుడు అవుతాడు. కనీసం కొన్నిజన్మల తరువాతన్నా మోక్షం రావడానికి ప్రయత్నం చేస్తాడు. అటువంటి ప్రయత్నం నీవు కూడా చెయ్యి అని కృష్ణుడు అర్జునుడికి జ్ఞానబోధ చేసాడు.

## 28.వేదేషు యజ్ఞేషు తప:సు చైవ దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టమ్।
## అత్యేతి తత్సర్వమిదం విదిత్వా యోగీ పరం స్థానముపైతి చాద్యమ్॥

ఎప్పుడైతే సాధకుడు ఉత్తరాయనము, శుక్లపక్షం గురించి చక్కగా తెలుసుకొని ఆ మార్గాలలో ప్రయాణం చేస్తూ ముక్తికోసం ప్రయత్నం చేస్తుంటాడో, అటువంటి యోగికి వేదములలో, శాస్త్రములలో చెప్పబడిన యజ్ఞయాగములు, వ్రతములు, పూజలు దానములు, తపస్సులు, వాటి వలన కలిగేపుణ్యఫలములు, వీటితో ఎటువంటి సంబంధము, వాటి పట్ల ఎటువంటి ఆసక్తి ఉండదు. అతడు నిరంతరము పరమ పదమును గురించి ధ్యానిస్తూ, దానినే పొందుతాడు.

పైవిధంగా చెప్పిన అభ్యాసయోగమును, ధ్యానయోగమును నిష్కామకర్మ యోగమును అభ్యసించి దాని ద్వారా జ్ఞానమును సంపాదించిన యోగికి వేదములలో చెప్పబడిన యజ్ఞములు యాగములు దానములు ధర్మములు, తపస్సులు చేయవలసిన అవసరము, దానివలనపుణ్యము సంపాదించవలసిన అవసరము లేదు. ఎందుకంటే అతడు అన్నిటినీ మించిన పరమపదమును పొందుతున్నాడు. వేదాలు చదువుతారు. యజ్ఞములు యాగములు చేస్తారు. తపస్సు చేస్తారు. దాన ధర్మాలు చేస్తారు. పుణ్యం సంపాదిస్తారు. కాని వీటి వలన కలిగే పుణ్యము కన్నా ఎన్నోరెట్లు ఎక్కువైనది పునర్జన్మలేని పరమ పదమును పొందడం. కాబట్టి పైన చెప్పబడిన కర్మకాండల కన్నా వాటి వలన కలిగే పుణ్యఫలముల కన్నా, ఎక్కువైనది పరమమైనది బ్రహ్మపదము.ఆ బ్రహ్మపదమే నిత్యముసత్యము. అ పరబ్రహ్మయోగము గురించి ఈ అధ్యాయంలో చెప్పాడు శ్రీకృష్ణుడు.

వేదములు శాస్త్రములు అధ్యయనం చేసినందువలన యజ్ఞయాగములు దానధర్మములు చేసినందువలన కొంత ఫలంలభిస్తుంది. అందులో సందేహము లేదు. కాని దాని వలన జన్మరాహిత్యము కలుగదు. సరికదా ఆ పుణ్యఫలము బంధనములు కలిగిస్తుంది. వాటిని అనుభవించడానికి మరోజన్మకు కారణం అవుతుంది. జన్మరాహిత్యము కోరుకునే యోగికి వీటివలన ప్రయోజనము లేదు. బ్రహ్మజ్ఞానంతో కలిగిన పుణ్యంతో పోలిస్తే వీటి వలన కలిగిన పుణ్యము చాలా చిన్నది. కాబట్టి విజ్ఞులు పరమ పదము కొరకు ప్రయత్నించాలి.

అందరూ వేదములు, శాస్త్రములు చదవలేకపోవచ్చు. వాటిలో ఉన్న జ్ఞానమును తెలుసుకోలేకపోవచ్చు. యజ్ఞయాగములు దాన ధర్మములు చేసే శక్తి లేకపోవచ్చు. మరి అటువంటి వారి సంగతి ఎలాగా అనే సందేహము అందరికీ వస్తుంది. పైన చెప్పినవి ఆచరించడానికి ధనం కావాలి. కాని ఏ ఖర్చు లేకుండా చేయగలిగింది. నిష్కామ కర్మ. అందరినీ సమానంగా చూడటం. సత్సంగము. ధ్యానము. మనస్సును నిర్మలంగా ఉంచుకోవడం. భగవంతుని పట్ల నిర్మలమైన భక్తి కలిగి ఉండటం. రాగద్వేషములు వదిలిపెట్టడం. కోపము లోభము వదిలిపెట్టడం. ఎల్లప్పుడు ప్రశాంతంగా సంతోషంగా ఉండటం. ఇవి ఆచరించడానికి ఎటువంటి ధనం అవసరం లేదు. వీటిని ఆచరిస్తే పరమపదము పొందవచ్చును. ఈ పరమ పదము అన్నిటికన్నా ఉత్కృష్టమైనది. దీనికి కావలసింది కేవలము భక్తి, శ్రద్ధ, నిరంతర అభ్యాసము. ఈ విషయాలను యుద్ధం చేయబోతున్న అర్జునుడికి కృష్ణుడు చెప్పాడు.

ఇంక మన విషయానికి వస్తే మనం చదువుకుంటాము, ఉద్యోగం చేస్తాము, వ్యాపారాలు చేస్తాము,,చిన్న పెద్ద పదవులు నిర్వహిస్తుంటాము, వివిధములైన పనులలో మునిగి తేలుతుంటాము. ఎవరు ఏపని, ఎక్కడ, ఏ విధంగా చేస్తున్నా, మనసు మాత్రం పరమాత్మయందు లగ్నం చేయాలి. అన్ని పనులు పరమాత్మకొరకే చేయాలి. అప్పుడు అధర్మానికి తావుండదు. అన్నీ పనులు ధర్మంగానే చేస్తాము. కర్తృత్వభావన లేకుండా, శ్రద్ధగా, నిష్కామ బుద్ధితో చేస్తాము.

ఏ ఫలితం వచ్చినా భగవదార్పణంచేస్తాము. మనసు నిష్కల్మషంగా ఉంచుకుంటాము. అప్పుడే ప్రకాశవంతమైన శుక్లగతిలో ప్రయాణం చేసే వీలుకలుగుతుంది. అంత్యకాలంలో కూడా పరమాత్మను ధ్యానిస్తూ ఈ శరీరం విడిచి పెడతాము. పరమగతిని పొందుతాము. ఇదే కృష్ణుడు మనందరికీ చేసిన జ్ఞానబోధ. దీనితో అక్షర పరబ్రహ్మయోగము సుసంపన్నం చేసాడు పరమాత్మ.

## ఉపనిషత్తులయొక్క, బ్రహ్మవిద్యయొక్క, యోగశాస్త్రము యొక్క సారమయిన భగవద్గీతలో, అక్షరపరబ్రహ్మ యోగము అను ఎనిమిదవ అధ్యాయము సంపూర్ణము.

## ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్

# భగవద్గీత

తొమ్మిదవ అధ్యాయము

# రాజవిద్యా రాజగుహ్యాయోగము

రాజు అంటే అందరికీ పెద్దవాడు ఉన్నతుడు గొప్పవాడు శ్రేష్టుడు. రాజవిద్య అంటే అన్ని విద్యలలోకీ శ్రేష్టమైనది. గుహ్యము అంటే రహస్యమైనది. రాజ గుహ్యము అంటే అన్నిటికంటే రహస్యమైనది. రహస్యము అంటే ఒక్కడికే తెలిసింది. మరొకడికి తెలియనిది. ఆ రహస్యము తెలిసిన వాడు మరొకడికి చెప్పనంత వరకు అది రహస్యమే. అంటే అది వాడి దగ్గర ఉన్నా లేనట్టే. అలాగే ఈ ఆత్మ జ్ఞానము అనే విద్య కూడా అందరికీ తెలుసు కాని ఎవరూ ఆచరించరు. ఆచరించడానికి ప్రయత్నించరు. అందరికీ చెబుతారు కానీ ఎవరూ ఆచరణలో పెట్టరు. అందుకే రహస్యము గా ఉంచమన్నారు. అంటే ఇది అందరికీ ఉపదేశించే విద్యకాదు. కేవలం ఆచరించ తగ్గవారికే ఉపదేశించ తగ్గది. అందుకే దీనిని రాజవిద్య రాజగుహ్యాయోగము అని అన్నారు. సగుణోపాసన చేసి క్రమక్రమంగా నిర్గుణోపాసన వైపు మళ్లడమే ఆత్మజ్ఞానం కలగడం. భక్తియోగమును ఆచరిస్తూ ఆత్మను గురించిన జ్ఞానమును పొందడం. దానినే రాజవిద్య అనీ, అత్యంత గుహ్యమైనదనీ చెబుతున్నాడు పరమాత్మ.

1. ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యామ్యనసూయవే।
జ్ఞానం విజ్ఞానసహితం యజ్ఞాత్వా మోక్ష్యసే2శుభాత్॥

అసూయ లేని ఓ అర్జునా! దేనినితెలుసుకుంటే మానవుడు సమస్త అశుభములు అంటే దు:ఖముల నుండి విముక్తి పొందుతాడో, అటువంటి గొప్పదైన, రహస్యమైన విజ్ఞాన సహితమైన అంటే అనుభవజ్ఞానము కలిగిన జ్ఞానమును నేను నీకు బోధిస్తున్నాను.

ఇక్కడ పరమాత్మ అర్జునుడిని అనసూయవే అని సంబోధించాడు. అంటే ఈ విద్యను తెలుసుకునే వాడికి అసూయ, ద్వేషము ఉండకూడదు. తమలో ఇతరుల పట్ల అసూయ ద్వేషము ఉన్నాయా లేవా అని ముందు తమకు తాము విచారణ చేసుకోవాలి. యోగము అభ్యసించేవాడికి అసూయ వేరు పురుగు వంటిది. మనకంటే ఎదుటి వాడు ఉన్నతంగా ఉన్నాడు అని భావించడమే

అసూయ. ఈ అసూయ అనే వేరు పురుగు మనసులో ప్రవేశిస్తే అది దినదినప్రవర్ధమానమై యోగి ఏకాగ్రతను దెబ్బతీస్తుంది. పండితులలో, జ్ఞానులలో, బాగా చదువుకున్నవారిలో ఈ అసూయ ఎక్కువగాఉంటుంది. అన్నీ నాకే తెలుసు ఎదుటి వాడికి ఏమీ తెలియదు అనే అహంకారం కూడా ఉంటుంది. తన కన్నా తెలిసిన వాడు, గొప్పవాడు తారసపడితే వాడి మీద అసూయ పెరుగుతుంది. అది ద్వేషంగా మారుతుంది. కాబట్టి అసూయను విడిచిపెట్టాలి అన్నాడు పరమాత్మ. ఎంతో సాధన చేసి ఉన్నత పదమునకు వెళ్లిన వారు కూడా ఈ అసూయబారిన పడితే సర్వనాశనం అవుతారు. ఎక్కువగా ఇది పండితులలో ఉంటుంది. ఒకరంటే ఒకరికి పడదు. పరోక్షంగా నిందించుకుంటూ ఉంటారు. ఇటువంటి వారు ఎన్నటికీ బాగుపడరు. బ్రహ్మవిద్యకు ఇది అవరోధము.

ఈ జ్ఞానమునకు కొన్ని లక్షణాలు చెప్పాడు కృష్ణుడు. దీనిని రాజవిద్య అంటారు. అంటే ఈ విద్య అన్నిటి కంటే గొప్పది. ఈ విద్య అత్యంత రహస్యమైనది. ఈ విద్య కేవలం జ్ఞానాన్నేకాదు, ఎలా ఆచరించాలో కూడా తెలియచేస్తుంది. అంటే అనుభవ జ్ఞానముకూడా కలిగిస్తుంది. ఈవిద్య నేర్చుకున్నందు వలన ఫలితం సమస్త అశుభాల నుండి విముక్తి కలుగుతుంది.

ఇదివరకు అధ్యాయంలో చెప్పినట్టు ఈ విద్యలో జ్ఞానము విజ్ఞానము రెండూ ఇమిడి ఉన్నాయి. జ్ఞానము అంటే శాస్త్రములు వేదములు అభ్యసించినందువలన కలిగిన జ్ఞానము. విజ్ఞానము ఆ జ్ఞానమును ఆచరణలో పెట్టడం. ఈ రెండూ ఈ విద్యలో ఉన్నాయి అని పరమాత్మ అంటున్నాడు. ఈ యోగము అభ్యసించి నందు వలన జనన మరణ చక్రము నుండి విముక్తి పొందడం. పునర్జన్మ దు:ఖాలయము అని కిందటి అధ్యాయములో వివరించారు. ఆ దు:ఖాలయము నుండి బయట పడేస్తుంది ఈ విద్య.

ఈ శ్లోకములో అశుభములు అనే పదం వాడాడు. జీవితంలో అశుభాలు అంటే దు:ఖాలు అని అర్థం. పుట్టుక, పెరగడం, భార్యపిల్లలు, సంసారంలో కష్టాలు, రోగాలు, ముసలితనం, మరణం ఇవన్నీ మానవుని జీవితంలో అశుభాలను అంటే కష్టాలను తెచ్చిపెట్టేవే. ఇవే కాకుండా మానసిక వ్యధలు కూడా మానవునికి అంతులేని దు:ఖాన్ని అశుభాన్ని కలుగజేస్తాయి. ఇంక శుభం అంటే ఏమిటంటే పునర్జన్మ లేకపోవడం. ఈ రాజవిద్య నేర్చుకుంటే పునర్జన్మ ఉండదు అని చెప్పాడు కృష్ణుడు. అశుభాన్ని ఎవరూ కోరుకోరు కదా. అందుకని శుభప్రదమైన ఈ రాజవిద్యను అభ్యాసం చేయమని బోధిస్తున్నాడు కృష్ణుడు.

## 2. రాజవిద్యా రాజగుహ్యం పవిత్రమితముత్తమమ్।
## ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తుమవ్యయమ్॥

ఈ రాజవిద్య, గుహ్యమైన విద్య. అత్యంత పవిత్రమైనది. ఉత్తమమైనది. ఈ విద్యను ప్రత్యక్షంగా తెలుసుకోవచ్చు. ఇది ధర్మయుక్తమైనది. ఈ విద్యను అనుష్ఠానము చేయడానికి చాలా వీలైనది. సులభమైనది. ఈ విద్య ఈరోజు ఉండి రేపు ఉండకుండా పోయేది కాదు. ఎల్లప్పుడూ ఉండేది. శాశ్వతమైనది.

ఈ శ్లోకంలో కృష్ణుడు ఈ రాజవిద్య యొక్క లక్షణాల గురించి వివరిస్తున్నాడు. ఓ అర్జునా! ఈ విద్య అన్ని విద్యల కంటే గొప్పది. అన్ని విద్యలకంటే రహస్యమైనది. పరమాత్మ యొక్క నిర్గుణ, సగుణ, తత్వము గురించి తెలిపే జ్ఞానము. అందరికీ ఉపదేశింపరానిది. కేవలము శ్రద్ధ ఉన్నవారికే ఉపదేశింపతగిన రహస్య జ్ఞానము. చక్కగా అభ్యాసం చేస్తే తగిన ఫలితములను ఇచ్చేది. ధర్మయుక్తమైనది. అందరూ సాధన చేయతగ్గది. అభ్యాసము, నిరంతర సాధన చేస్తే అత్యంత సులువైనది. నాశనము లేనిది, శాశ్వతమైనది అయిన ఈ విద్యను నీకు ఉపదేశిస్తాను.

ఈ లోకంలో ఎన్నో విద్యలు ఉన్నాయి. అవి ఏవీ మానవుని జనన మరణ చక్రము నుండి బయట పడవేయవు. ఆ శక్తి ఒక్క బ్రహ్మవిద్యకే ఉంది. అందుకే దానిని విద్యలలో కెల్లా శ్రేష్ఠమైనది అని అన్నారు. పైగా ఈ విద్య పరమాత్మ గురించి చెబుతుంది కాబట్టి ఇది అతి పవిత్రమైనది. ఈ విద్య ప్రత్యక్షావగమమ్ అంటే ఈ విద్యను ప్రత్యక్షంగా తెలుసుకోవచ్చు. అంటే ఎప్పటి అనుభవం అప్పుడే కలుగుతుంది. ఎంత వరకు చేస్తే అంతవరకు ఫలితం మనశ్శాంతి, పరమ శాంతి రూపంలో వెంటనే లభిస్తుంది. ఈ విద్య ధర్మ్యం అంటే ధర్మయుక్తమైనది. వేదప్రమాణము కలది. పూర్వపు మహాఋషులు తాము నేర్చుకొని, అభ్యసించి, ఆచరించి చూపించినది. అంటే టైమ్ టెస్టెడ్ అన్నమాట.

ఈ విద్య కర్తుం సుసుఖమ్ అని కూడా అన్నారు. అంటే ఈ విద్యను సుఖంగా, సులభంగా తేలికగా అభ్యసించవచ్చు. అందరికీ లభ్యం అవుతుంది. ఏ మాత్రం ధనం అక్కరలేదు. ఎక్కడికీ పోనక్కరలేదు. అందరికీ అందుబాటులో ఉంటుంది. కాకపోతే నిరంతర అభ్యాసం, శ్రద్ధ, భక్తి, ఏకాగ్రత కావాలి. ఈ విద్యను అభ్యసించడం వలన కలిగే ఫలితము అంటే సుఖం, శాంతి ఈ రోజు ఉండి రేపు పోయేవి కాదు. నిరతంరం నిలిచి ఉండేవి. నాశనము లేనివి. అవ్యయము అని అన్నాడు కృష్ణుడు.

## 3. అశ్రద్ధ దానా: పురుషా ధర్మస్యాస్య పరన్తప।
## అప్రాప్య మాం నివర్తన్తే మృత్యుసంసారవర్త్మని॥

ఓ పరంతపా! అర్జునా! అన్నిటికన్నా గుహ్యమైన ఈ రాజవిద్యయందు శ్రద్ధ, భక్తి, అభ్యాసము, ఆచరణ లేని వారు, పరమాత్మ ను పొందలేరు. అంతే కాకుండా మృత్యువుతో సమానమైన ఈ సంసారము అనే దు:ఖసాగరంలోనే మునిగి తేలుతుంటారు. ఎల్లప్పుడూ సంసారం మీదనే ఆసక్తి కలిగి ఉంటారు.

అర్జునా! ఈ ఉత్తమమైన గుహ్యమైన విద్యను అభ్యసించే వారు ముందుగా ధర్మమార్గంలో నమ్మకం, విశ్వాసము కలిగి ఉండాలి. ఈ విద్యమీద శ్రద్ధ,భక్తి లేని వారు ఈ విద్యను అభ్యసించడానికి అర్హులు కారు. పట్టుబట్టి అభ్యసించాలన్నా అభ్యసించలేరు. అటువంటి వారికి పరమ పదము ఎన్నటికీ లభించదు. వారు మృత్యువుతో సమానమైన ఈ సంసారము మీదనే ఎక్కువ ఆసక్తి కలిగి ఉండి, జనన మరణ చక్రములో తిరుగుతూ ఉంటారు.

మనం ఇదివరకే చెప్పుకున్నాము. మనం ఏ పని చేసినా, చేస్తున్నా శ్రద్ధ, భక్తి, చేసే పని మీద నమ్మకం ముఖ్యము. ఏ పనిగానీ శ్రద్ధతో చేస్తే ఆ పని చక్కటి ఫలితం ఇస్తుంది. అశ్రద్ధతో ఏ పని చేసినా అది ఫలించదు. చేసే పని మీదనే కాదు భగవంతుని మీద కూడా శ్రద్ధ భక్తి నమ్మకం ఉండాలి. బ్రహ్మజ్ఞానము సంపాదించడంలో శ్రద్ధ కనపరచాలి. కాబట్టి పరమాత్మ ఈ శ్లోకంలో అశ్రద్ధ పనికిరాదు అని పలికాడు. దానికి తోడు చేసే పని ధర్మంగా ఉండాలి. ఇతరులకు మేలుచేసేదిగా ఉండాలి. మేలు చేయకపోయినా ఇబ్బంది లేదు. కీడు మాత్రం చేయకూడదు. అదే సామాజిక ధర్మము. ఆ ధర్మము అందరూ అనుసరించాలి.

బ్రహ్మజ్ఞానము పొందక పోతే కలిగే నష్టం కూడా వివరించాడు పరమాత్మ. అటువంటి వారు మృత్యువుతో సమానమైన ఈ సంసారములో పడి కొట్టుకుంటారు. పైకి సంసారము సుఖప్రదంగా కనిపించినా, ఇది దు:ఖాలయము. పుట్టినప్పటి నుండి చచ్చేదాకా అన్నీ దు:ఖాలే, కష్టాలే. నేను సుఖంగా, సంతోషంగా, ఆనందంగా, ప్రశాంతంగా ఉన్నాను అని గుండెల మీద చెయ్యివేసుకొని మనస్ఫూర్తిగా చెప్పగలిగిన మానవులు ఈ లోకంలో చాలా కొద్దిమందే ఉంటారు. మానవునికి అన్నిటికంటే భయంకరమైనది, తప్పించుకోలేనిది మృత్యువు. అందుకే ఈ సంసారాన్ని మృత్యువుతోసమానము. ఇటువంటి మృత్యువుతో సమానమైన సంసారంలో మరలా మరలా పడుతున్నాడు మానవుడు. ఈ సంసారము నుండి విముక్తి కావాలంటే బ్రహ్మజ్ఞానము సంపాదించడమే మార్గము అని అన్నాడు కృష్ణుడు. .

## 4. మహా తతమిదం సర్వం జగదవ్యక్తమూర్తినా।
## మత్స్థాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః॥

ఈ సకల జగత్తు అంతా అవ్యక్తుడను (కంటికి కనపడని వాడను) అయిన నా చేత వ్యాపించబడి ఉంది. సర్వభూతములు, ప్రాణులు నా యందే ఉన్నాయి. కాని నేను వాటిలో లేను.

ఇక్కడి నుండి పరమాత్మ తన స్వరూప స్వభావములను గురించి చెబుతున్నాడు. పరమాత్మ అంటే అపరా ప్రకృతి యొక్క మొట్టమొదటి స్వభావము అవ్యక్తం. అంటే వ్యక్తముకానిది. కనపడనిది. అందుకే కృష్ణుడు "నేను అవ్యక్తుడను. ఎవరికీ గోచరము కాను. ఎవరి ఇంద్రియములకు గోచరించను. మనసుకు అందను." అని అన్నాడు. వ్యక్తము అంటే మన ఇంద్రియములతో చూడబడేది, వినబడేది, తాక కలిగేది, తెలుసుకోగలిగేది అని అర్థం. ఇంద్రియములతో తెలుసుకోబడనిది అవ్యక్తము. కేవలం అపరా ప్రకృతిని మాత్రమే మనం చూడగలం, వినగలం, తాకగలం. తెలుసుకోగలం.

రెండవ స్వభావము సర్వ వ్యాపకత్వము. "ఈ జగత్తు అంతటిలో నేనే ఉన్నాను. జగం అంతా వ్యాపించి ఉన్నాను. ఈ సమస్త జగత్తు అంతా నాయందే ఉంది." అంటే పరమాత్మ సత్యలోకంలో కానీ, వైకుంఠంలో కానీ కైలాసంలో గానీ,కాశీలో గానీ,రామేశ్వరంలో కానీ, ఏదో ఒక స్థలానికి పరిమితం కాలేదు. అంటే పైచెప్పిన స్థలాలలో లేడని కాదు. అక్కడ కూడా ఉన్నాడు. కాని అంతటా ఉన్నాడు. అంతటా వ్యాపించి ఉన్నాడు. పరమాత్మ లేని చోటు లేదు. "అందుగలడిందులేడని సందేహమువలదు. చక్రి సర్వోపగతుండు" అంటే పరమాత్మ అక్కడ ఉన్నాడు ఇక్కడ లేడు అనే సందేహము వద్దు. పరమాత్మ చక్రము మాదిరి అంతటా వ్యాపించి ఉన్నాడు.

మత్స్థాని సర్వభూతాని అంటే సర్వభూతములు నాయందే ఉన్నవి. అంటే ఈ సకల జగత్తుకు ఆధారము ఆపరమాత్మ. ఆయన ఎవరి మీదా ఆధారపడి లేడు. ఈ సకల జగత్తు పరమాత్మ మీద ఆధారపడిఉంది. ఈ ప్రకృతి అంతా పరమాత్మలోనే ఉంది. అంటే ఈ అనంత విశ్వంలో భూమి లాంటి గ్రహాలు, సూర్యుడి లాంటి నక్షత్రాలు, పాలపుంతల లాంటి గెలాక్సీలు, లక్షలు కోట్లు ఉన్నాయి. ఒకదానికి ఒకటి కోట్ల మైళ్లదూరంలో ఉన్నాయి. మనం ఇంకా కనుక్కోలేని నక్షత్రాలు ఎన్నో ఉన్నాయి. ఇవి అన్నీ ఈ విశ్వంలో ఉన్నాయి. ఈ విశ్వమే పరమాత్మ. అందుకే ఆయనను విశ్వాకారం, గగన సదృశం. విశ్వమే తన ఆకారముగా, ఆకాశము మాదిరి ఉన్నాడు.

నచాహం తేష్వవస్థిత: ఈ జగమంతా నా యందే ఉన్నా నేను వాటి యందు లేను. ఇది పరస్పర విరుద్ధంగా కనపడుతూ ఉంది. నిశితంగా చూస్తే అర్థం అవుతుంది. శంకరాచార్యులవారు బ్రహ్మసత్యం జగన్మిధ్య అని అన్నారు. మిధ్యారూపం అయిన ఈ జగత్తులో సత్య స్వరూపుడు అయిన భగవానుడు ఎలా ఉంటాడు. ఉండే అవకాశం లేదు. కాని ఈ జగత్తు అంతా పరమాత్మలో ఉంటే, అన్నిటా ఆయన ఉన్నట్టే కదా! మనం నిద్రలో కలలు కంటాము ఎన్నో చిత్రవిచిత్రవిషయాలు చూస్తాము. కాని వాటిలో మనం లేము. కాని మనం ఉన్నట్టు భ్రమ కలుగుతూ ఉంటుంది. ఇక్కడా అంతే. కాబట్టి ఈ జగత్తుకంతా ఆధారం పరమాత్మ కానీ, ఈ జగత్తు పరమాత్మకు ఆధారం కాదు.

ఇంకా వివరంగా చెప్పాలంటే ఈ అనంత విశ్వం అంతా పరమాత్మ వ్యాపించి ఉన్నాడు. అంటే ఆయన లేని చోటు లేదు. ప్రాకృతిక భావనలో చెప్పాలంటే కరెంటు అంతటా ఉంది. మన ఇంట్లో లేదు. మన ఇంట్లో లేదు కాబట్టి అంతటా లేదని కాదు. అలాగే మన ఇంట్లో ఎసి నడుస్తూ ఉంది. టివి పనిచేయడం లేదు. అంటే కరెంటు ఎసిలో ఉంది టివిలో లేదు. ఎందుకంటే టివి చెడిపోయింది. కాబట్టి మన కంటికి కనపడేవి అన్నీకూడా కంటికికనపడని కరెంటు మీద ఆధారపడి ఉన్నాయి కానీ కరెంటు వాటి మీద ఆధారపడలేదు. మన ఇంట్లో ఏదిఉంటే అది కరెంటుతో నడుస్తుంది. లేకపోతే లేదు. అలాగే ఈ సకల జగత్తుకు ఆధారం పరమాత్మకానీ పరమాత్మ జగత్తు మీద ఆధారపడలేదు.

## 5. న చ మత్స్థాని భూతాని పశ్య మే యోగమైశ్వరమ్।
## భూతభృన్న చ భూతస్థో మమాత్మా భూతభావన:॥

ఈ సమస్తభూతకోటి, ప్రాణికోటి నా యందు లేవు. అదే నా యోగమహిమ. నేను ఈ ప్రాణులను సృష్టిస్తున్నా, ఆ ప్రాణులను పోషిస్తున్నా, లయింపచేస్తున్నా, నేను వాటిలో లేను. ఇది కూడా పరస్పర విరుద్ధమైన శ్లోకము. ముందు శ్లోకంలో మయా తతం ఇదం సర్వమ్ అంటే అవ్యక్త మూర్తిని అయిన నాచేత ఈ జగత్తు అంతా వ్యాపించబడినది అని అన్నాడు. ఈ శ్లోకంలో న చ మత్స్థాని భూతాని అంటే ఈ భూతములు నా యందు ఉండేవి కావు అంటున్నాడు.

ఈ శ్లోకాన్ని ద్వైత దృష్టితో కాకకుండా అద్వైతముతో అన్వయించుకోవాలి. అంటే శంకరాచార్యులవారు చెప్పినట్టు బ్రహ్మ సత్యం జగన్మిధ్య. ఏకం ఇవ అద్వితీయం బ్రహ్మ అంటే సత్యపదార్థము అయిన బ్రహ్మ ఒక్కడే... రెండు కాదు..కంటికి కనపడే జగత్తు అంతా మిధ్య అంటే భ్రమ. ఈ అనంత విశ్వం అంతా ఆ బ్రహ్మ నిండి ఉన్నాడు. అంటే బ్రహ్మలేని చోటు లేదు. అటువంటప్పుడు బ్రహ్మ అన్నిటిలో ఉన్నాడు అని చెప్పడం కానీ దేనిలో లేడు అని చెప్పడం కానీ పొసగదు.

అంతే కాకుండా స్వప్నం తో కూడా పోల్చి చెప్పవచ్చు. స్వప్నంలో మనం ఉంటాము. మెలుకువ రాగానే స్వప్నం ఉండదు అందులో మనం ఉండము. అంతా మాయ. ఇక్కడా అంతే. కాకపోతే సృష్టిని బ్రహ్మగానూ స్తితిని విష్ణువు గానూ, లయం శివుడు గానూ నెరవేరుస్తూ, ఏవీ తనకుపట్టనట్టు ఉన్నాడు పరమాత్మ. అన్నీ చేస్తున్నాడు కానీ ఏమీ చేయడం లేదు. అన్నిటిలో చైతన్యస్వరూపుడుగా ఉన్నాడు. ఆ చైతన్యముతోనే అన్ని పనులు,అంటే సృష్టి, స్థితి, లయములు జరుగుతున్నాయి. ఇది ఆలోచించి విచారిస్తే కానీ అర్థం కాదు.

అలాగే ఎండమావులు. ఎండాకాలంలో మనకు దూరంగా తారురోడ్డు మీద నీరు ఉన్నట్టు కనిపిస్తుంది. నిజంగానే నీరు ఉందా అంటే లేదు. కాని ఉన్నట్టు భ్రమ. దగ్గరకుపోయి చూస్తేనేకాని అక్కడ నీరు లేదు అని తెలియదు. దూరంగా మెలికలు తిరిగిఉన్న తాడు ఉంటుంది. చీకటిలో దానినిపాము అని భ్రమపడి భయంతో వణికిపోతాము. దగ్గరకుపోయి చూస్తే కానీ, అది పాము కాదు, తాడు అని తెలియదు. అలాగే బంగారు ఆభరణాలు రకరకాలుఉంటాయి. వివిధ రూపాలలో ఉంటాయి. ధరించే వారికి అవి ఆభరణాలు. విలువ కట్టే వారికి అది బంగారము. అలాగే కంటికి కనిపించే ఈ అపరా ప్రకృతి కూడా మనకు వివిధ రూపాలలో, ఆకారాలలో, పేర్లతో, లక్షణాలతో, స్వభావాలతో కనిపిస్తుంది. నిజానికి ఈ ప్రకృతి అంతా పరమాణు మయం. కంటికి కనిపించని పరమాణువులతో నిండి ఉంది. అవి ఘనీభవించి, సాంద్రీకృతమై మనకు వివిధ ఆకారాలతోకనిపిస్తున్నాయి.

పరమాణువులు మనకు కనిపించవు. అందుకని ప్రకృతి లేదు అని అనలేము. మనకు వివిధ రూపాలలో కనిపిస్తూఉంది కాబట్టి ఉంది అని అనలేము. కుండచేయడానికి మట్టి ఆధారం కానీ మట్టికికుండ ఆధారం కాదు. కుండ లేకపోయినా మట్టి ఉంటుంది కానీ మట్టి లేకపోతే కుండ లేదు. అంటే పరమాత్మకు ఈ ప్రాణి కోటి ఆధారం కాదు. ఈ ప్రకృతి లేకపోయినా పరమాత్మ ఉంటాడు. అంటే పరమాత్మలో ప్రకృతి ఉన్నా లేకపోయినా, పరమాత్మ నిత్యము,సత్యము, అనంతము. అందుకే బ్రహ్మ సత్యం, జగన్మిధ్య అని అన్నారు.

ఈ శ్లోకంలో పరమాత్మ యోగమైశ్వరమ్ అని అన్నాడు. ఇది అంతా నా "యోగం ఐశ్వరం పశ్య" అని అన్నాడుపరమాత్మ అంటే ఈ విషయాన్ని నా యొక్క యోగ మహిమగా చూడాలి కానీ, మామూలు దృష్టితో చూడకూడదు. మామూలు దృష్టితోచూస్తే వివిధ రూపాలతో కనపడే అపరాప్రకృతి, విచారించి చూస్తే అంతా మిధ్య. అందుకే జగన్మిధ్య అని అన్నారు.

ఈ యోగమును రాజగుహ్యము అంటే బాగా వివరించి చెబితే గానీ అర్థం కాని యోగం అని అన్నారు. కొంచెం కొంచెంగా అర్థం చేసుకోవడానికి ప్రయత్నం చేద్దాము.

ఎలాగంటే మనం స్టీలు గిన్నెల షాపుకు వెళ్లాము. గిన్నెలు చూపించండి అన్నాము. ఆయన ఒకే పెద్ద గిన్నె తీసుకొని వస్తాడు. ఆ పెద్ద గిన్నెలో ఒకదానిలో ఒకటి పెట్టి ఉన్న అనేక చిన్న గిన్నెలు ఉంటాయి. మనకు ఏ సైజు నచ్చితే ఆ గిన్నె తీసుకుంటాము. ఇందులో ఉన్న సూక్ష్మం గ్రహించండి. ఒక పెద్ద గిన్నెలో అనేక చిన్న గిన్నెలు ఉన్నాయి. కాని ఏ చిన్న గిన్నెలో కూడా ఆ పెద్ద గిన్నె లేదు. అలాగే ఈ అనంత విశ్వంలో ఉన్న చరాచర జీవరాసులలో పరమాత్మ నిండి ఉన్నాడు. కాని ఆ అనంతుడైన పరమాత్మ ఈ చిన్న చిన్న చరాచర జీవరాసులలో లేడు. ఇలా అర్థం చేసుకుంటే ఈ విషయం సులభంగా అర్థం అయ్యే అవకాశం ఉంది.

## 6. యథా22కాశస్థితో నిత్యం వాయుస్సర్వత్రగో మహాన్।
## తథా సర్వాణి భూతాని మత్స్థానీత్యుపధారయ॥

ఏ ప్రకారంగా మహత్తరమైనది, అంతటా నిరంతరం సంచరించేది అయిన వాయువు, ఆకాశంలో స్థిరంగా ఉంటుందో, అలాగే ఈ జగత్తులోని సకల ప్రాణికోటి నా యందు స్థిరంగా ఉన్నాయి.

ఈ జగత్తుఅంతా పరమాత్మ నిండి ఉంటే లేక ఆ పరమాత్మలో నుండి ఈ జగత్తు ఉద్భవిస్తే, లేక ఈ జగత్తు అంతా పరమాత్మలోనే ఉంటే ఏవిధంగా అర్థం చేసుకున్నా కూడా, ఈ జగత్తులో ఉంటే సత్వరజస్తమోగుణాలు, వాటికి సంబంధించిన వికారములు పరమాత్మకు అంటవా! అంటే అవకాశం లేదా! మరి పరమాత్మను త్రిగుణాతీతుడు అని ఎందుకు అన్నారు అనే ప్రశ్నలు మనలో మెదులుతాయి. దానికి సమాధానమే ఈ శ్లోకం.

గాలి అన్ని చోట్లా ఉంటుంది. నేల మీదా ఆకాశంలోనూ మధ్యలోనూ ఉంటుంది. ఆకాశం అంతటా విస్తరించి ఉంటుంది. కాని ఆకాశం అనంతం. అందులో వాయువు ఒకభాగము మాత్రమే. పరమాత్మ ఆకాశం అయితే వాయువు ఈ ప్రకృతి. వాయువు ఆకాశంలో ఉన్నా వాయువు గుణాలు ఆకాశానికి ఎలా అంటవో అలాగే ప్రకృతిసహజమైన సత్వ,రజస్తమోగుణములు పరమాత్మకు అంటవు. ఆకాశం అనంతం. అంతటా వ్యాపించి ఉంటుంది. కంటికి కనపడదు. అలాగే పరమాత్మ అనంతుడు. సర్వవ్యాపి. కంటికి కనపడడు. అందుకేపరమాత్మను ఆకాశంతో పోల్చారు. పరమాత్మను స్తుతించేటప్పుడు "విశ్వాకారం, గగన సదృశం" అని అన్నారు. ఈ విశ్వం యొక్క ఆకారము ఆయనే. పరమాత్మ ఆకాశము మాదిరి ఉంటాడు అని అన్నారు.

అలాగే వాయువుకు వాసనలను మోసుకొచ్చే గుణం ఉంది. వాయువు తనతో పాటు సుగంధాన్ని, దుర్గంధాన్ని మోసుకుపోతూ ఉంటుంది. కాని ఈ వాయువు ఎక్కడ సంచరిస్తుందో

ఆ ఆకాశానికి ఆ సుగంధం కానీ, దుర్గంధం కానీ అంటదు. అలాగే పరమాత్మలో త్రిగుణాత్మకమైన ఈ ప్రకృతి, సకల భూతజాలము ఉన్నా, ప్రకృతి లక్షణాలైన సత్వ,రజస్తమోగుణములు, వాటి వికారములు పరమాత్మకు అంటవు. కాబట్టి పరమాత్మ త్రిగుణాతీతుడు, ఆయనకు ఎటువంటి మలినములు, వికారములు అంటవు అని తెలుసుకో అని కృష్ణుడు అర్జునుడికి బోధించాడు.

## 7. సర్వభూతాని కౌన్తేయ ప్రకృతిం యాన్తి మామికామ్।
## కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహమ్॥

ఓ కౌంతేయా! ఒక కల్పము అంతము అయిన తరువాత ఈ చరాచర భూతకోటి అన్నీ నాయొక్క మూల ప్రకృతిలో అవ్యక్తరూపంలో దాగిఉంటాయి. మరొక కల్పము మొదలుకాగానే, నాయొక్క ప్రకృతిలో అవ్యక్తముగా ఉన్న ఈ సృష్టి అంతా మరలా నా చేత ప్రకటింపబడుతుంది.

ఇదివరలో మనం కల్పం గురించి చెప్పుకున్నాము. కల్పం అంటే బ్రహ్మకు ఒక పగలు. అంటే వేయి మహాయుగాలు. అంతే సమయం రాత్రి. కల్పం అంతంలో ఈ సృష్టి అంతా పరమాత్మలో లీనం అవుతుంది. ఉదయం కాగానే మరలా పరమాత్మలోనుండి బయటకు వస్తుంది. ఇదీ ఈ శ్లోకంలో తెలియజేసాడు పరమాత్మ. ఈ ప్రకృతి ఎటువంటిది అంటే మామికామ్ అంటే నాది, నాకు లోబడి ఉంటుంది అన్నాడు. అంటే ఈ ప్రకృతి అంతా పరమాత్మ చేత సృష్టించబడినది, మూడుగుణములతో కూడిన మాయకు లోబడి ఉంది అని అర్థం. దీనినే ఆత్యంతిక ప్రళయము అంటారు. బ్రహ్మకు సాయంత్రం కాగానే ఎక్కడి సృష్టి అక్కడే బ్రహ్మలో లీనం అవుతుంది. అంటేసుషుప్తావస్థలో ఉంటుంది. మరలా ఉదయం కాగానే అదే సృష్టి చేతనావస్థకు వస్తుంది. మనం రాత్రి నిద్రలోకి జారుకోగానే ఈ ప్రపంచం అంతా మనలో లీనమై పోతుంది. కళ్లు తెరవగానే ప్రపంచం అంతా నిన్న మనం కళ్లు మూసుకున్నప్పుడు ఎలా ఉందో అలాగే మనకళ్లముందు ఉంటుంది. అందుకే ఒక మహాకవి అన్నాడు కళ్లు మూస్తే మరణం కళ్లు తెరిస్తే జననం అని.

దీని బట్టి మనకు అర్థం అయింది ఏమిటంటే ఏదీ నాశనం కాదు. సూక్ష్మరూపంలో మనకు కనపడకుండా అవ్యక్తంగా ఉంటుంది. అవ్యక్తంగాఉన్నది మరలా వ్యక్తమౌతుంది.. కొత్తగా జరిగేది ఏమీ లేదు. సూక్ష్మరూపంలో ఉన్నవి స్థూలరూపంలో కనపడుతున్నాయి. (క్రియేషన్ కాదు మానిఫెస్టేషన్). అత్యంత సూక్ష్మరూపంలో చిన్ని విత్తనంలో దాగి ఉన్న మర్రిచెట్టు ఆ విత్తనం నేలలో పడి,పెరిగి పెద్దదై, మనకు పెద్ద వటవృక్షంలా కనపడుతుంది. మరలా అనేక విత్తనాలలో ఇమిడిపోతుంది. అలాగే ఈ అనంత విశ్వం కూడా కల్పాంతంలో సూక్ష్మరూపంలో ఉంటుంది. కల్పం మొదట్లో మరలా స్థూలరూపం ధరిస్తుంది.

## 8. ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పున: పున:।
## భూతగ్రామమిమం కృత్స్నమవశం ప్రకృతేర్వశాత్॥

ఈ ప్రకృతి అంతా నా మాయకు లోబడి ఉన్నది. ఈ ప్రకృతిలో ఉన్న సమస్త భూతజాలము, జీవరాసులు, చరాచరములు అన్నీ వాటి ఇష్టం వచ్చినట్టు అవి జన్మ ఎత్తడం, జీవించడం, మరణించడం చేయలేవు. వాటి యొక్కపూర్వజన్మవాసనలను బట్టి జన్మఎత్తుతూ, జీవిస్తూ, మరణిస్తుంటాయి. నేను కేవలం దీనిని పర్యవేక్షిస్తుంటాను. కాని అందరికీ నేనే సృష్టిస్తున్నాను, పోషిస్తున్నాను, లయం చేస్తున్నాను అనే భ్రమకలిగిస్తున్నాను.

ఇక్కడ పరమాత్మ సృష్టిరహస్యాన్ని చెబుతున్నాడు. ప్రకృతిం ఈ ప్రకృతి ధర్మాలను అంటే పుట్టుక,చావు, అవష్టభ్య....అవలంబించి, మామ్ నేను, విసృజామి... సృష్టిస్తున్నాను. ఇక్కడ నేను సృష్టిస్తున్నాను అని అనడం లేదు. ప్రకృతి ధర్మాలను అనుసరించి అని అంటున్నాడు. ఇక్కడ జీవాత్మ పరమాత్మ గురించి చెప్పుకోవాలి. ఆత్మ ప్రకృతిలో లీనం అయితే జీవాత్మ అవుతాడు. ఈ జీవాత్మ ప్రకృతి అధీనంలో ఉంటాడు. ప్రకృతి ధర్మాలకు కట్టుబడి ఉంటాడు. పరమాత్మ అధీనంలో ప్రకృతి ఉంటుంది. ఈ ప్రకృతిని పరమాత్మ తన మాయతో కప్పి ఉంచుతాడు. కల్పం ఆఖరున మాయామయమైన ప్రకృతిని అందులోని జీవులను తన లోకి అంటే తన మాయలోకి లాక్కుంటాడు. ఉదయమే ఆ ప్రకృతిని మరలా బయటకు వదులుతాడు. ఇదంతా ప్రకృతి ధర్మాలు అంటే జీవుల పూర్వజన్మల కర్మలు, వాసనలు బట్టి జరుగుతూ ఉంటుంది. అంటే పూర్వజన్మ వాసనలను బట్టి మరలా మరలా జన్మలు తప్పవు.

ఈ లోకంలో ఎన్ని పదవులు ఉన్నా ధనం ఆస్తులు సంపదలు ఉన్నా ప్రకృతికి, వాసనలకు లోబడి ఉండాలి. దానికి తగిన జన్మలు పొందాలి. పరమాత్మ కేవలం చూస్తూ ప్రకృతి ధర్మములను పాటిస్తూ ఉంటాడు. పరమాత్మ బ్రహ్మగా సృష్టిస్తూ, విష్ణువుగా పోషిస్తూ, శివుడుగా లయం చేస్తున్నాడు అని మనం అనుకుంటున్నాము కానీ ఈ సృష్టి స్థితి లయములు ఒక నియమం ప్రకారం జరగుతున్నాయి. పరమాత్మ కేవలం సాక్షిగా చూస్తున్నాడు.

## 9. న చ మాం తాని కర్మాణి నిబధ్నన్తి ధనంజయ।
## ఉదాసీనవదాసీన మసక్తం తేషు కర్మసు॥

నేను సమస్తభూతకోటి చేసే కర్మలయందు ఆసక్తి లేని వాడనై, కేవలం ఉదాసీనంగా చూస్తూఉంటాను. అందుచేత వారు చేసే కర్మలు, వాటి ఫలములు నన్ను బంధించవు.

ఈ ప్రకారంగా నేను కల్పాంతంలో ఈ సృష్టిని అందులోని జీవరాసులను నాలోకి లాక్కుంటూ, మరలా కల్పం మొదట్లో మరలా సృష్టిస్తూ ఆ జీవరాసులలో ఉంటూ ఉన్నా, ఆ జీవులు చేసే కర్మలకు, ఆ కర్మల వలన కలిగే వాసనలకు నేను బద్ధుడను కాను. "న నిబధ్నంతి" అంటే ఆ కర్మలు, కర్మ వాసనలు నన్ను బంధించవు. ఈ సృష్టి, లయము ఈ కర్మలలో నేను కేవలం ఉదాసీనంగా, తటస్థునిగా, సాక్షిగానే ఉంటాను తప్ప వేటిలోనూ లీనం కాను. అవి నాకు అంటవు అని స్పష్టంగా చెప్పాడు. ఈ కర్మబంధాలు అన్ని తొలిగితే జీవుడు ఆత్మస్వరూపుడుగా మారి పరమాత్మలో ఐక్యం అవుతాడు.

బంగారం బాగా మకిల పట్టి, రాగి మొదలగు లోహాలతో కలిసి కల్తీగా తయారవుతుంది. ఆ కల్తీ బంగారంతోనే రకరకాల ఆభరణాలు తయారు చేస్తారు. ఎప్పుడైతే ఆ కల్తీబంగారాన్ని నిప్పులో వేసి కాల్చి ఆ బంగారంలో ఉన్న మకిలను ఇతర లోహాలను కరిగించి తీసివేస్తారో అప్పుడు స్వచ్ఛమైన బంగారం అవుతుంది. అంటే ఈ మకిల అంతా స్వచ్ఛమైన బంగారానికి అంటుకోలేదు. మనం అంటించాము. మనం అంటించిన మకిలను మనమే తొలగించుకోవాలి. పరమాత్మ, ఆత్మ, జీవాత్మ మూడూ ఒకటే. ప్రాపంచిక విషయములు, విషయవాంఛలతో కూడిన కర్మలు, వాటిఫలములు, వాసనలు అనే మకిలతోనూ, సత్వ,రజస్తమోగుణములుఅనే ఇతర లోహాలతో కూడిన బంగారం జీవాత్మ అయితే, ఆ మకిల, లోహములు అంతా కరిగిన తరువాత మిగిలే స్వచ్ఛమైన బంగారమే ఆత్మస్వరూపము. అప్పుడు పరిశుద్ధమైన ఆత్మ పరమాత్మలో లీనం కావడానికి అర్హత కలిగి ఉంటుంది. అదే ముక్తి, మోక్షము, పరమపదము.

ఇందులో ఉన్న రహస్యం ఏమిటంటే, మనంఅందరం కూడా కర్తృత్వభావన లేకుండా, నేను చేస్తున్నాను అనే భావన లేకుండా, ఆ కర్మల పట్ల ఆసక్తి లేకుండా, నిష్కామంగా కర్మలు చేస్తే ఆకర్మలఫలములు, వాటి తాలూకు వాసనలు మనకు అంటుకోవు. మనము పరమాత్మ మాదిరి ఉదాసీనంగా, తటస్థంగా, సాక్షీభూతంగా అన్నీచూస్తూఉంటే, ఈ కర్మఫలముల నుండి ముక్తి త్వరగా లభిస్తుంది. అప్పుడు మనలో ఉన్న ఆత్మ పరమాత్మలో కలిసి పోతుంది. పునర్జన్మ ఉండదు.

## 10. మయాऽధ్యక్షేణ ప్రకృతి: సూయతే సచరాచరమ్
## హేతునానేన కౌన్తేయ జగద్విపరివర్తతే॥

ఓ అర్జునా! ఈ జగత్తుకు అంతా నేను అధ్యక్షుడను. ఈ చరాచర ప్రకృతి, అందులోని సృష్టి నా ఆధ్వర్యములోనే జరుగుతున్నాయి. ఈ జగత్తు అంతా ఒక నియతి ప్రకారం ప్రవర్తిస్తూ ఉంది. నేను మాత్రం సాక్షిగానే ఉంటాను. ఏమీ చేయను.

ఒక సభ జరుగుతూ ఉందనుకోండి. ఆ సభలో అధ్యక్షుడు, అధ్యక్ష స్థానం అలంకరించి, సభను నడిపిస్తాడు. వక్తలు మాట్లాడతారు. సన్మానాలు సత్కారాలు జరుగుతుంటాయి. జరగవలసిన కార్యక్రమాలను, ఒకదాని తరువాత ఒకటిగా అధ్యక్షుడు చెబుతుంటాడు. కార్యనిర్వాహకులు చేస్తుంటారు. వక్తలు మాట్లాడే మాటలకు, కార్యనిర్వాహకులు చేసే పనులకు అధ్యక్షుడికి ఎటువంటి సంబంధము లేదు. అలాగే ఈ సృష్టి అనే సభకు పరమాత్మ అధ్యక్షుడు. ప్రకృతి అనే కార్యనిర్వాహకుడు సృష్టిని సాగిస్తున్నాడు. పోషిస్తున్నాడు. లయం చేస్తున్నాడు. అధ్యక్షుడు అయిన పరమాత్మ కేవలం సాక్షిగా చూస్తున్నాడు. ఈ ప్రకృతిలోని అవ్యక్తము లన్నీ కొన్నిటితో మరి కొన్ని కలవడం వలన వ్యక్తమవుతున్నాయి. కొంత కాలం వివిధ రూపాలలో ఉంటాయి. మరలా విడిపోవడం వలన అవ్యక్తంగా మారి పోతున్నాయి, మరలా కలుసుకుంటూ వ్యక్తము అవుతున్నాయి. ఈ వ్యక్త అవ్యక్త కార్యక్రమాలను సృష్టి స్థితి లయము అని అంటారు. ఈ కలయికలు, విడిపోవడాలు, అవ్యక్త, వ్యక్త అవస్థలు అన్నీ పరమాత్మ అధ్యక్ష స్థానంలో ఉండి, కేవలం సాక్షిగా చూస్తున్నాడు.

కాని మానవుడు ఏం చేస్తున్నాడు. తనకు సుఖం కలిగితే దేవుడిని పొగుడుతున్నాడు. దు:ఖం వస్తే దేవుడిని తిడుతున్నాడు. ఏం దేవుడండీ నాకు అన్నీ కష్టాలే తెచ్చిపెడుతున్నాడు. అని వాపోతుంటాడు. రకరకాల కోరికలు కోరుకుంటూ పూజలు చేస్తుంటాడు. ఆ కోరికలు తీరడానికి మొక్కులు మొక్కుతుంటాడు. దేవుడితో బేరం ఆడుతుంటాడు. తను అనుకున్న కోరికలు తీరితే తాను కొలిచినదేవుడిని పొగుడుతాడు. తీరకపోతే మరొక దేవుడికి ఆశ్రయిస్తాడు. నిజానికి సుఖం వచ్చినా, దు:ఖం వచ్చినా, తాను కోరుకున్న కోరికలు తీరినా, తీరకపోయినా, దేవుడికి ఎలాంటి సంబంధం లేదు. అదంతా మానవుడి ప్రారబ్ధ కర్మ వల్ల వచ్చిందే. ఈ విషయం తెలియక మానవుడు అజ్ఞానంలో పడుతున్నాడు. అన్నిటికీ దేవుడే కారణం అనుకుంటున్నాడు. అజ్ఞానంలో అంటే మాయలో పడి కొట్టుకుంటుంటాడు.

ఇక్కడ ఇంకొకవిషయం కూడా ఉంది. అందరు వక్తలువచ్చినా, కార్యనిర్వాహకులు అన్ని ఏర్పాట్లు చేసినా అధ్యక్షుడు రానిదే సభ జరగదు. అలాగే ఈ ప్రకృతిలో చైతన్యం రావాలంటే పరమాత్మ అందులో ప్రవేశించాలి. అప్పుడే చైతన్య వంతం అవుతుంది. ఆ చైతన్యమే అందరినీ నడిపిస్తుంది. సృష్టి, స్థితి, లయములను నిర్వహిస్తుంది. ఇక్కడ మనం మరొకటి గ్రహించాలి. మనం ఎల్లప్పుడూ సభలో జరిగే కార్యక్రమాల వంక చూస్తుంటాము, అందులో లీనం అవుతాము కానీ, అధ్యక్షుల వారి వంక చూడము. అలాగే మనం పరమాత్మ నడిపించే ఈ ప్రకృతిలోనూ ప్రపంచంలోనూ లీనం అవుతాము కానీ పరమాత్మ గురించి పట్టించుకోము. వక్తల ఉపన్యాసాలు సన్మానాలు వీటి మీదనే మనదృష్టి అంతా. అయితే ఈ సభ తాత్కాలికమనీ, కొంచెం సేపటికి అయిపోతుందనీ అందరికీ తెలుసు కానీ ఏమీ తెలియనట్టే ఉంటాము. అదే మాయ. ఈ మాయనుతెలుసుకోవాలంటే ఈ సభను నిర్వహిస్తున్న అధ్యక్షుడి గురించి తెలుసుకోవాలి. ఆయన గొప్పవాడు. ఆయన గురించి

అంటే పరమాత్మ గురించి తెలియాలంటే జ్ఞానము విజ్ఞానము కావాలి. పరమాత్మ మన స్థూలదృష్టికి, మనసుకు అందడు. కాబట్టి మనదృష్టి సభలో మాట్లాడే వక్తల మీద, జరిగే కార్యక్రమాల మీద కాకుండా సభాధ్యక్షుని మీద కేంద్రీకరిస్తే, ఆయనకు దగ్గరవుతాము. లేకపోతే సభలో అంటే ప్రకృతిలో లీనం అయిపోతాయి. ప్రకృతిలో సంభవించే చిత్రవిచిత్రాలు అనే సభాకార్యక్రమాలను చూస్తూ ఆనందిస్తూ మైమరచి పోతాము. మరలా మరలా ఇటువంటి సభలకు వస్తుంటాము పోతుంటాము. పునరపి జననం పునరపి మరణం. ఇదే మానవ జీవితం.

## 11. అవజానన్తి మాం మూఢా మానుషీం తనుమాశ్రితమ్।
## పరం భావ మజానన్తో మమ భూతమహేశ్వరమ్॥

నా పరమ తత్వమును తెలియని మూఢులైన మానవులు, నేను కేవలం కృష్ణుడు అనే శరీరం ధరించిన మానవుడననీ, నేనుకూడా వారి మాదిరే ఉంటాననీ నన్ను నానావిధములుగా అవమానిస్తున్నారు.

ఈ శ్లోకంలో కృష్ణుడు మూఢా: అనే పదం వాడారు. అంటే మూఢులు ఎవరు? దేవుడు నాకు అన్నీ కష్టాలే తెచ్చిపెట్టాడు. అందరూ సుఖపడుతున్నారు. నాకు ఒక్కడికే కష్టాలన్నీ ఇచ్చాడు అని వాపోతుంటాడు. వారు మూఢులు. దేవుడు ఎవరినీ కష్టపెట్టడు. ఆయన సుఖస్వరూపుడు. అందరికీ సుఖంకలిగిస్తాడు. కాని మనమే మనం చేసే కర్మలతో కష్టాలను తెచ్చిపెట్టుకుంటాము. దానికి దేవుడిని నిందిస్తాము. రెండవది. తనలోనే ఉన్న ఆత్మస్వరూపాన్ని వదిలిపెట్టి దేవుడి గురించి ఎక్కడెక్కడో వెదుకుతాము. ఇదీ మూఢత్వమే. మూడవది ఈ ప్రపంచంలో దొరికే అశాశ్వత వస్తువులలో శాశ్వతత్వము కొరకు పాకులాడుతాము.

ఒకడు ఇంటిని కడతాడు. అది శాశ్వతంగా ఉండాలని గట్టిగా కడతాడు. కాని పదేళ్లుకాగానే వాడే ఆ ఇంటిని కూలగొట్టి మరొక డిజైన్‌తో కడతాడు. ఈ లోపల వీడే పోతే ఆ పని వాడి వారసులు చేస్తారు. ఏదీ శాశ్వతము కాదు అని తెలిసి కూడా, అన్నీ శాశ్వతంగా ఉండాలి అని భావించడం మూఢత్వం. ఇటువంటి వారు మూఢులు. ఇటువంటి వారు తనను అంటే కృష్ణుడిని కేవలం మానవమాత్రుడుగా భావిస్తారు అని అన్నాడు. మూఢులు అంటే తెలిసీ తెలియని వారు. వారికి తెలియదు. ఒకరు చెబితే వినరు. తమ మూర్ఖత్వమే తమది.

ఇంతకు ముందు శ్లోకంలో అధ్యక్షుల వారి గురించి చెప్పుకున్నాము. కొంత మంది మూఢులు ఈయన నాకు తెలుసులేరా ఈయన అధ్యక్షుడు ఏంటి. మనలాంటి వాడే. వాడి కన్నా నాకే ఎక్కువ తెలుసు. అసలు వీడి కేం తెలుసని అధ్యక్ష స్థానంలో కూర్చోపెట్టారు అని విమర్శిస్తుంటారు.

అలాగే పరమాత్మ ఈ అనంత విశ్వానికి అధ్యక్షుడు. ఆయన కూడా ధర్మరక్షణ కొరకు మానవునిగా అవతరిస్తుంటాడు. అటువంటి అవతారమే కృష్ణావతారము. కాని కొంత మంది మూఢులు రాముని కృష్ణుని మానవులుగానే పరిగణిస్తారు. సామాన్యుడిగా అనుకుంటారు.ఆ అవతారంలో ఆచరించిన పనులను హేళన చేస్తుంటారు. ఇంత మంది భార్యలు ఉన్న వాడిని అస్ఖలిత బ్రహ్మచారి అని ఎలా అంటారు అని సందేహాలు. అమ్మో గోపికలతో రాసలీలలు, వాళ్ల బట్టలు ఎత్తుకుపోవడం, వెన్నలు దొంగిలించడం పైగా భగవద్గీత చెప్పాడట. అని అంటుంటారు. ఇవన్నీ వారి మూఢత్వానికి చిహ్నాలు.

కృష్ణుడిలో ఉన్న ఒక్క లక్షణం సహనం. శిశుపాలుడు ఎన్ని తిట్టినా ఒక్క మాట కూడా అనలేదు. ఎవడైనా ఒకడు, ఒక రాజకీయ నాయకుడి అవినీతి గురించి ప్రస్తావిస్తే నేను అవినీతి పరుడిని కాను అని నిరూపించుకోకపోగా, నేను ఒక్కడినేనా దొరికింది, వాడు అంత తిన్నాడు వీడు అంత తిన్నాడు నేను తింటే తప్పా అంటూ ఎదురు దాడికి దిగుతాడు. కాని కృష్ణుడు అటువంటి పని చేయలేదు. ఓర్పుతో అన్నీ సహించాడు. సత్రాజిత్తు స్యమంతక మణి గురించి అపవాదు వేసినా ఆ అపవాదు పోగొట్టుకోడానికి ప్రయత్నం చేసాడే తప్ప ఎదురు దాడికి దిగలేదు. తనను స్తుతించినప్పడుపొంగి పోలేదు. నిందించినపుడు కుంగిపోలేదు. అంతే కాకుండా, యుద్ధసమయంలో, ఇంక కొద్దిసేపట్లో యుద్ధం మొదలు కాబోతోందిఅనే సమయంలో, అర్జునుడికి గీతాబోధ చేసిన తత్వవేత్త కృష్ణుడు. ఒక సాధారణమానవుడు చేయలేని పని. అదీ కృష్ణతత్వము. అదీ పరమాత్మ లక్షణం.

అలాగే రాముడు కూడా. తెల్లవారి పట్టాభిషేకం అని ప్రకటించిన దశరథుడు, తెల్లవారగానే అడవులకు పొమ్మన్నాడు. చిరునవ్వుతో స్వీకరించాడు రాముడు. కట్టుకున్న భార్యను ఎవరో అపహరించాడు. కుంగి పోలేదు రాముడు. ఇవీ ఒక మానవుడికి రాకూడని కష్టాలు. కాని చిరునవ్వుతో భరించాడు రాముడు. ప్రజాభిప్రాయానికి తలవంచి కట్టుకున్న భార్యను కూడా వదిలేసాడు. అదీ రాముని వ్యక్తిత్వం. రాముడు, కృష్ణుడు మానవ రూపాలలో ఉన్న దేవతామూర్తులు. వారిలో ఉన్న మంచి లక్షణములు అలవరచుకోవాలే గానీ, రాముని కృష్ణుని సామాన్యమానవులు వాళ్లు ఏం చేసారు అని విమర్శించడం మూఢుల లక్షణం.

ఇంకా కొంత మంది మూఢులు ఉన్నారు. వారు రాముడు, కృష్ణుడే దేవుళ్లు అనుకుంటారు. మరి కొంత మంది శివుడు ఒక్కడే దేవుడు అంటాడు. వారందరూ పరమాత్మ స్వరూపాలే, ఆ పరమాత్మ ఇన్ని రూపాలుగా తనను తాను ప్రకటించుకుంటున్నాడు అని తెలుసుకోలేరు. పైగా వారి మధ్య భేదభావం పెంచుకుంటారు. అందుకే 'మమ భూతమహేశ్వరమ్ అజానన్త:'అని అన్నాడు వ్యాసుడు. నన్ను ఈ సకల చరాచర భూతకోటికి మహేశ్వరుడను అని తెలుసుకోలేరు. వీరు కూడా మూఢులే. అంతతో ఆగకుండా అవజానన్తి అంటే అవమానిస్తుంటారు. ఈయన కూడా మనలాంటి మానవుడే అనే చులకన భావంతో ఉంటారు. వీరంతా మూఢులు అని నిర్ ద్వంద్వంగా

చెప్పాడు వ్యాసుడు.

కాబట్టి సాధకులు, యోగమును అభ్యాసం చేసేవాళ్లు, భక్తులు అయిన వాళ్లు ముందు సహనం అలవరచుకోవాలి. ఇతరులను, ముఖ్యంగా దేవతా మూర్తులను విమర్శించడం మానుకోవాలి. అన్ని దేవతామూర్తులలో పరమాత్మ అంతర్లీనంగా ఉన్నాడు అని తెలుసుకోవాలి. తాను పూజించే దేవుడి మీద తప్ప ఇతర దేవతామూర్తుల మీద అసూయ పడటం, ద్వేషించడం వదిలిపెట్టాలి. ఆత్మ విమర్శచేసుకోవాలి. అదేవిజ్ఞుల లక్షణం.

(ఇటీవల ఒక స్వామీజి, అవధూత సాయిబాబా మీద అనుచిత వ్యాఖ్యలు చేసి వివాదం సృష్టించాడు. ఆయన దేవుడే కాదన్నాడు. నిజానికి సాయిబాబా ఎప్పుడూ తాను దేవుడిని అని చెప్పుకోలేదు. ఈ ప్రజలే ఆయనను దేవుడిని చేసారు. అతి సామాన్యంగా బతికిన సాయిబాబాకు పల్లకీ సేవలు, కిరీటాలు, శాలువలు కప్పి, అలా చేయకపోతే పాపం వస్తుందని ప్రచారం చేసారు. సాయిబాబా బోధించిన సహనం శ్రద్ధ అనే లక్షణాలను వంటపట్టించుకోకుండా, ఆయనకు అలంకారాలు చేయడంలో మునిగిపోతున్నారు. మరొక ప్రబుద్ధుడు వినాయకుడిని అతిగా విమర్శించి తరువాత సారీ చెప్పాడు. ఈ శ్లోకంలో పరమాత్మ చెప్పిన మూఢులకు వీరే ప్రత్యక్ష ఉదాహరణలు)

## 12. మోఘాశా మోఘ కర్మాణో మోఘజ్ఞానా విచేతసః।
## రాక్షసీమాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః॥

ఇటువంటి మూఢులు ఎలా ప్రవర్తిస్తారో ఈ శ్లోకంలో వివరించాడు కృష్ణుడు. ఇటువంటి వారికి పనికి మాలిన, వ్యర్థమైన ఆశలు, కోరికలు ఉంటాయి. ఇటువంటి వారికి బుద్ధిపనిచేయదు. వీరంతా మోహంలో పడి కొట్టుకుంటూఉంటారు. ఇటువంటి వారు రాక్షస భావాలు, అసుర భావాలు కలిగి ఉంటారు. రాక్షసుల మాదిరి అసురుల మాదిరి ప్రవర్తిస్తుంటారు. ప్రాపంచిక విషయాలు అనే మోహంలో పడి పోతుంటారు.

మనం చాలా సార్లు అబ్బా ఇది అమోఘంగా ఉంది. అని అంటూ ఉంటాము. అమోఘము అంటే మోఘము కానిది. మోఘము అంటే వ్యర్థమైనది, ఎందుకూ పనికిరానిది, పనికిమాలినది, ఉపయోగములేనిది. కృష్ణుడు మనం చేసే కర్మలను అన్నిటినీ ఇలాంటి పనికిమాలినవి అంటున్నాడు. మోఘాశా అంటే పనికి మాలిన వ్యర్థమైన ఆశలు, మోఘ కర్మాణో మనం చేసే పనులన్నీ వ్యర్థమైన, పనికిమాలిన పనులు, మోఘ జ్ఞానము అంటే ఈ ప్రపంచంలో మనం చదివేచదువులు, వాటివల్ల వచ్చే జ్ఞానము ఎందుకూ పనికి రాకుండా పోతోంది. అని అన్నాడు.

ఈ రోజుల్లో కూడా అందరూ ఉన్నత చదువులు చదువుతున్నారు. కాని వారి దృష్టి రాంకులమీదా, మార్కుల మీద ఉంటుంది తప్ప విషయ పరిజ్ఞానం మీద ఉండదు.. ఏదో విధంగా పాసు అవ్వాలి. మంచి మార్కులు రావాలి. రాంకులు తెచ్చుకోవాలి. కాపీ కొట్టినా, అడ్డదారులు తొక్కినా పర్లేదు. డబ్బు ఇచ్చి మార్కులు వేయించుకున్నా పర్లేదు అనే భావనతో ఉంటారు. మన రాష్ట్రంలో నుండి బిటెక్ పాస్ అయినవారికి, వారి సబ్జెక్టు మీద కనీస పరిజ్ఞానం కూడా లేదని చాలా వ్యాపార సంస్థలు తేల్చిచెప్పాయి. ఎవరు కూడా ఒక విషయాన్ని చదివి, తెలుసుకొని, అర్థం చేసుకోవడానికి ప్రయత్నించడం లేదు. తాత్కాలికంగా గుర్తుపెట్టుకొని మార్కులకోసం ప్రయత్నిస్తున్నారు. ఇటువంటి విద్య వ్యర్థము అని ఆనాడే చెప్పాడు పరమాత్మ.

మరి కొంత మంది ఉంటారు. వాళ్లు గొప్ప వేదాంతులు. బాగా చదువుకున్నవాళ్లు. శాస్త్ర పరిజ్ఞానం ఉంది. కాని వారి జీవితంలో ఏ చిన్న సమస్యవచ్చినా తట్టుకోలేరు. జ్యోతిషం అనీ, వాస్తు అనీ, హస్తసాముద్రికం అనీ అటు ఇటు పరుగెడుతుంటారు. వాళ్లు సంపాదించుకున్న జ్ఞానం వారికే పనికిరాదు. కేవలం అది పుస్తక పరిజ్ఞానం కిందనే మిగిలిపోతుంది. దానినే మోఘజ్ఞానా అంటే పనికిరాని పరిజ్ఞానము అని అంటున్నాడు కృష్ణుడు. వీళ్లను విచేతసులు అని అన్నాడు అంటే బుద్ధిలేని వాళ్లు. కనీస పరిజ్ఞానం లేని వాళ్లు, పరిజ్ఞానం ఉన్నా సక్రమంగా వినియోగించుకోలేని వాళ్లు.

ఇంకా కొంత మంది ఉంటారు. వారు చేసే అక్రమ వ్యాపారాలలో, వ్యవహారాలలో తనకు లాభం వచ్చేటట్టు చేస్తే దేవుడికి ఇంత వాటా ఇస్తామంటారు. దేవుడితో బేరాలాడతారు. ఇటువంటి వారి ఆలోచనలు వ్యర్థములు, పనికిమాలినవి. వీరంతా తమ ఆలోచనలకు తగ్గ కోరికలే భగవంతుని కోరుతుంటారు. ఉదాహరణకు హిరణ్యకశిపుడు ఘోర తపస్సు చేస్తే బ్రహ్మ ప్రత్యక్షం అయ్యాడు. బ్రహ్మప్రత్యక్షంఅయితే మోక్షం కోరుకోక తనకు త్రిలోకాధిపత్యము, చావులేని వరం కోరుకున్నాడు. ఎందుకంటే అతడు అసురుడు, రాక్షసుడు. ఇటువంటి ప్రాపంచిక సంబంధమైన కోరికలను కోరే మనం కూడా రాక్షసుల, అసురుల మనస్తత్వము కలిగి ఉన్నాము అనడంలో తప్పేముంది.

మరి ఇటువంటి మోహం ఎందుకు కలుగుతుంది అంటే దానికీ కారణం చెబుతున్నాడు పరమాత్మ. ప్రతి మనిషిలో రెండు గుణాలు, రెండు తత్వాలు ఉంటాయి. అవే దైవత్వము, అసురత్వము. అలాగే ఏ పని చేయడానికి అయినా మూడు మెట్లు ఉంటాయి. వాటిని జ్ఞాన శక్తి, ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి అని అంటారు. ఏ పని చేయాలన్నా ఆ పని గురించిన విషయాలు అంటే జ్ఞానము మనకు ఉండాలి. రెండవది. ఆ పని చేయాలనే కోరిక కూడా ఉండాలి. మూడవది ఆ పని చేయడానికి తగిన ప్రయత్నం చేయాలి. అప్పుడే ఏ పని అయినా చేయడం సాధ్యపడుతుంది.

పైన చెప్పబడిన మోఘాశులు, మోఘకర్ములు, మోఘజ్ఞానులు ఎల్లప్పుడూ పనికి మాలిన, వ్యర్థమైన ఆలోచలను చేస్తూ, పనికి మాలిన ప్రయత్నాలు చేస్తుంటారు. వారికి బుద్ధి పని చేయదు. వారిని ఎల్లప్పుడూ మోహము ఆవరించి ఉంటుంది. వారి ఆలోచనలు, ప్రయత్నాలు ఎల్లప్పుడూ ప్రాపంచిక విషయాలలోనూ ప్రాపంచిక సుఖాలలోనూ అవి ఎలా పొందాలో అనే ఆలోచనలలోనూ నిమగ్నం అయి ఉంటాయి.

పరమాత్మ ఈ మూఢుల గురించి చెబుతూ వారిది రాక్షస తత్వము అంటే రజోగుణప్రధానము, అసురతత్వము అంటే తమోగుణ ప్రధానము అని అన్నాడు. రాక్షసుడు అంటే రక్షించడానికి తగనివాడు. అసురుడు అంటే దైవత్వము లేని వాడు. అంటే వ్యతిరేక లక్షణములు కలవాడు అని అర్థం. ఒక విషయాన్ని చదివి అర్థం చేసుకొని జ్ఞాపకం పెట్టుకోవడం దైవీ లక్షణము. తాత్కాలికంగా చదివి వెంటనే మరిచిపోవడం, ఒకవేళ గుర్తున్నా దానిని అంగీకరించకపోవడం ఆసురీ లక్షణము. ఇది దైవీలక్షణానికి వ్యతిరేకలక్షణం. ఈ గుణములు రాజసిక, తామస లక్షణములు అంటారు. చాలా మంది పట్టంగడుపుకోవడం. అవసరం తీరగానే మరిచిపోవడం చేస్తుంటారు. వీరు తమ బుద్ధిని ఉపయోగించరు. అందుకే విచేతసులు అని అన్నారు.

కాబట్టి మానవులు తమలోని రాక్షస ప్రవృత్తిని, ఆసురీ ప్రవృత్తిని వదిలిపెట్టి, కామ క్రోధములను వదిలిపెట్టి, సమభావం కలిగి ఉండి, బుద్ధిని ఉపయోగిస్తూ, పరమాత్మ తత్వమును తెలుసుకోడానికి ప్రయత్నించాలి.

## 13. మహాత్మానస్తు మాం పార్థ దైవీం ప్రకృతిమాశ్రితాః।
## భజన్త్యనన్యమనసో జ్ఞాత్వా భూతాదిమవ్యయమ్॥

ఇంతకు ముందు శ్లోకంలో ఆసురీ ప్రవృత్తిని, రాక్షస ప్రవృత్తిని, విచేతసులను, మాయలో, మోహంలో పడినవారి గురించి వివరించాడు. ఇప్పుడు దానికి వ్యతిరేకమైన దైవీ సంపద గురించి వివరిస్తున్నాడు. ఈ దైవీ సంపద కలవారిని మహాత్ములు అని అన్నాడు కృష్ణుడు. ఈ ప్రకృతిలో దైవీ ప్రకృతి ఆసురీ ప్రకృతి అని రెండు ఉన్నాయి కదా. వాటిలో ఈ దైవీ ప్రకృతిని ఆశ్రయించిన వారు ఎల్లప్పుడూ సాత్వికగుణములనే కలిగి ఉంటారు. వారు ఎల్లప్పుడూ పరమాత్మనే భజిస్తారు. ఎలాంటి పరమాత్మ ను భజిస్తారంటే....... భూతాదిమ్ అంటే ఈ సమస్త భూతములకన్నా ముందు నుండి ఉన్నవాడు. అవ్యయమ్ అంటే నాశము లేని వాడు. ఇటువంటి పరమాత్మను ధ్యానిస్తారు. ఎలా ధ్యానిస్తారు అంటే 'అనన్య మనసో' ఇతరములైన ప్రాపంచిక విషయములలో లీనంకాని, ఏకాగ్రమైన మనసుతో ధ్యానిస్తారు. అంటే మనసు ఇతర విషయముల మీద లగ్నం కాకూడదు. భగవంతుని మీదనే లగ్నం కావాలి. దానినో అనన్య మనసు అనన్య భక్తి అని అంటారు.

కాబట్టి మానవుడు ఈ ప్రకృతిలో ఆసురి ప్రవృత్తి ఉన్నవి ఏవి, దైవీ ప్రకృతి ఉన్నవి ఏవి అని జ్ఞాత్వా అంటే తెలుసుకొని, ఆసురీ ప్రవృత్తిని వదిలిపెట్టి దైవీ ప్రవృత్తిని అనుసరించాలి. బుద్ధిని ఉపయోగించాలి. ఆసురీ ప్రవృత్తి ఉన్న వాళ్లకు కేవలం మనసు, ఇంద్రియాలు పనిచేస్తాయి. బుద్ధి పని చేయదు. విచక్షణా జ్ఞానం ఉండదు. ఏది తెలుసుకోవాలో దానిని తెలుసుకోరు. అనవసర విషయాలు, వ్యర్ధ విషయాల మీద శ్రద్ధచూపిస్తారు. ఏవి చెయ్యాలో అవి చెయ్యరు. చెయ్యకూడని పనులు చేస్తుంటారు. అలా కాకుండా కేవలం శాస్త్రములను అనుసరించి, చేయవలసిన కర్మలను మాత్రమే చేస్తూ, చేయకూడని కర్మలను చేయని వారిని, దైవీప్రవృత్తిని ఆశ్రయించిన వారిని మహాత్ములు అని అంటారు. వీరికి ఏది శాశ్వతము, ఏది అశాశ్వతము అనే విచక్షణా జ్ఞానం లభిస్తుంది. వీరు అశాశ్వతములైన అపరా ప్రకృతిలో లభించే ప్రాపంచిక విషయముల వంక చూడకుండా, పరాప్రకృతి వంక చూస్తుంటారు. అటువంటి వారు మాం..... జ్ఞాత్వా అంటే నా గురించి తెలుసుకోగలుగుతారు. అంటే ఆత్మతత్వాన్ని గురించి తెలుసుకుంటారు.

ఆ జ్ఞానం ఎలాంటిది అంటే పరమాత్మ ఈ సమస్తచరాచర భూతములకన్నా ముందు నుండి ఉన్న వాడు, నాశము, మార్పులేని వాడు అని తెలుసుకోవడమే జ్ఞానం. ఈ భౌతిక ప్రపంచం అందులో నుండి లభించే సుఖాలు శాశ్వతం కాదు. ఎప్పుడో ఒకప్పుడు అంతమైపోతాయి, దాని కన్నా మించిన పరమాత్మకు ఆది, అంతము,మార్పు,నాశము లేదు అనే జ్ఞానాన్ని సాధకుడు పొందుతాడు. తనకు కలిగే సుఖదు:ఖాలు తన ప్రారబ్ధ కర్మల వల్ల కలుగుతున్నాయి అని అనుకుంటాడు. అంతే కానీ దేవుడు తనకు దు:ఖం కలిగించాడు అని అనుకోడు. సుఖం వచ్చినా, దు:ఖం వచ్చినా, దానిని పరమాత్మ ప్రసాదంగా భావించి, ఆనందంతో అనుభవిస్తాడు.

ఇదంతా ఎలా కలుగుతుంది. ఏకాగ్రమైన మనస్సుతో, అచంచలమైన భక్తితో పరమాత్మను ఉపాసించాలి. పరమాత్మను తప్ప మరొక దానిని తలంచకూడదు. ఈ మహాత్ములు ఎవరైనా కావచ్చు. ఆడ, మగ, ఉన్నత కులము, నీచ కులము అనే భేదం లేదు. దైవీసంపద కలవారు ఎవరైనా మహాత్ములు కావచ్చు. అటువంటి మహాత్ములు తన దైనందిన జీవితంలో ఏమి చేస్తారో,ఎలా ప్రవర్తిస్తారో తరువాతి శ్లోకంలో వివరించాడు కృష్ణుడు.

## 14. సతతం కీర్తయన్తో మాం యతన్తశ్చ దృఢవ్రతా:।
## నమస్యన్తశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే॥

పైశ్లోకంలో చెప్పబడిన మహాత్ములు అయిన వారు ఎల్లప్పుడూ నన్నే కీర్తిస్తుంటారు. నాయందు దృఢమైన వ్రతమును, భక్తిని, విశ్వాసమును, నమ్మకమును కలిగి ఉంటారు. నాకే భక్తితో నమస్కరిస్తారు. వారి చిత్తము ఎల్లప్పుడూ నాయందే లగ్నం అయి ఉంటుంది.ఎల్లప్పుడు నన్నే ఉపాసిస్తూ ఉంటారు.

ఈ దైవీ సంపద కలవారు ఏంచేస్తారు అనే విషయాన్ని ఇక్కడ చెబుతున్నాడు పరమాత్మ. దైవీ సంపద కలిగిన వారు ఎల్లప్పుడూ నిరంతరం నన్నే ధ్యానిస్తారు, కీర్తిస్తారు. నా గురించి ధృఢంగా ప్రయత్నం చేస్తారు. నా మీద అనన్యభక్తి కలిగి ఉంటారు. నాకు నమస్కరిస్తారు. నిత్య యుక్తా అంటే నిత్యము ఎల్లప్పుడూ తమ చిత్తము నా యందే లగ్నం చేస్తారు. పైలక్షణాలతో నన్ను సేవిస్తారు. దైవీ సంపద కలవారు చేసే పనులన్ని పైన తెలిపారు. వాటిలో కొన్ని అన్నా మనం ఆచరిస్తే మనం కూడా దైవీసంపద కలిగి ఉన్న వాళ్లము అని అనుకోవచ్చు. మనం కూడా మహాత్ములము కావచ్చు. దీనిగురించి కొంచెం వివరంగా తెలుసుకుందాము.

సర్వకాల సర్వావస్థల యందు పరమాత్మను ధ్యానించాలి. వారిలో సాకారముగా పూజించే వారయితే భగవంతుని అర్చామూర్తిని పూజించడం, భగవంతుని నామమును స్మరించడం, ధ్యానించడం చేయాలి. పూజలు చేయాలి. నిరాకార భక్తి కలవారయితే భగవంతుని హృదయములో నిలుపుకొని ధ్యానించాలి. ఏమి చేసినా భక్తి, శ్రద్ధ, ఏకాగ్రత ముఖ్యం. భగవంతుని చేరుకోవడానికి నిరంతరం ప్రయత్నం చేస్తూ ఉండాలి. తనకు సుఖం వచ్చినా, దు:ఖం వచ్చినా అది భగవంతుని ప్రసాదంగా భావించాలి. ఏనాడు చేసుకున్న కర్మఫలమో ఈ నాడు అనుభవిస్తున్నాను అని అనుకోవాలి. అంతే కానీ భగవంతుడు నాకు కష్టాలు కలిగించాడు, నన్ను పరీక్షిస్తున్నాడు అని అనుకోకూడదు.

ఇంద్రియములను మనసును నిగ్రహించుకోవాలి. యతన్తశ్చ అంటే నిరంతరము పరమాత్మను చేరుకోడానికి ప్రయత్నం చేస్తూ ఉండాలి. మానవ ప్రయత్నంతో పాటు దైవానుగ్రహం కూడా సంపాదించాలి. కేవలం ప్రయత్నంతోనే కార్యము సిద్ధించదు. దానికితోడు దైవానుగ్రహం కూడా ఉండాలి. తరువాత ధృడమైన వ్రతము కలిగి ఉండాలి. ఎందుకంటే మన మనసు ఎన్నోజన్మల వాసనలతో కరుడు గట్టి ఉంటుంది. దానిని లొంగదీసుకోవాలంటే ధృడమైన సంకల్పం కావాలి. ఈ ధృడవ్రతములలో కొన్ని ఉపవాసము, మౌనవ్రతము, జపము, ధ్యానము, కామ వాంఛలు వదలడం మొదలగునవి. నియమ బద్ధమైన జీవితం గడపాలి. నియమాలు ఆచరించడంలో ధృఢంగా ఉండాలి. మధ్య మధ్య రిలాక్సేషన్ ఉండకూడదు. ఎప్పుడైనా కాస్త అలసత్వం కలిగితే ఈ మాయ మనలను లోబరచుకుంటుంది. అప్పుడు మధ్యలోనే సాధకుడు జారిపోతాడు. మరలా ప్రాపంచిక సుఖముల కోసం పాకులాడుతాడు. అందుకే ధృడమైన సంకల్పం ముఖ్యం. అందుకే నిత్య యుక్తా: అనీ, భక్తా: అనీ, రెండు పదాలు వాడారు. నిరంతరము ఏకాగ్రతతో

ఏమరిపాటులేకుండా ఉండాలి. భక్తి కలిగి ఉండాలి. ఈ ప్రకారంగా దైవీప్రకృతిని అవలంబిస్తే వారికి మోక్షము త్వరలో సిద్ధిస్తుంది.

### 15. జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజన్తో మాముపాసతే।
### ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతోముఖమ్॥

ఈ మహాత్ములలో కొందరు నన్ను జ్ఞానయజ్ఞంతో అంటే బ్రహ్మసత్యం జగన్మిధ్య అనే జ్ఞానంతో ఉపాసిస్తారు. మరి కొందరు నన్ను ఏకత్వభావంతో ఉపాసిస్తారు. మరి కొందరు వివిధములైన దేవతా రూపములలో నన్ను పూజిస్తారు. విశ్వమే నా రూపముగా కల నన్ను, వివిధ పద్ధతులలో, వివిధ రూపములతో ఉపాసిస్తుంటారు.

భగవంతుడిని మనం మూడు రకాలుగా భావిస్తాము. మొదటిది భగవంతుడు ఈ అనంత విశ్వాన్ని సృష్టించాడు. అంటే భగవంతుడు వేరు విశ్వం అంటే ప్రకృతి వేరు. రెండవ భావన భగవంతుడు సృష్టించడమే కాదు అంతటా ఆయనే అయి ఉన్నాడు. అన్నిటిలోనూ ఆయనే ఉన్నాడు. మూడవ భావన అసలు ఈ సృష్టి అంటూ ఏమీ లేదు.అంతా మిధ్య. ఆభాస, మనం కల్పించుకున్నది. ఉన్నది ఒక్క బ్రహ్మమే. అదేనేను. బ్రహ్మసత్యం జగన్మిధ్య. ఇదీ పరమాత్మ గురించి మన భావన.

భగవంతుని పూజించేవాళ్లు రెండు రకాలు. జ్ఞానయజ్ఞముతో పూజించేవాళ్లు. వారు అద్వైత భావమును ఆశ్రయిస్తారు. అలా కాకుండా కొంతమందిపరమాత్మ ఒక్కడే అన్నిటిలోనూ ఆత్మస్వరూపంతో వెలుగుతున్నాడు అని భావిస్తారు. మరి కొందరు, పరమాత్మ వివిధ దేవతా రూపములలో ఉన్నాడని భావించి, వివిధములైన దేవతా రూపములను పూజిస్తూ ఉంటారు. ఎవరి సంస్కారములనుబట్టి వారు పూజిస్తూ ధ్యానిస్తూ ఉంటారు. ఎవరు ఏ రకంగా పూజించినా ఆ పూజలన్నీ పరమాత్మకే చెందుతాయి.

జ్ఞాన యజ్ఞము అంటే బ్రహ్మ సత్యం జగన్ మిధ్య జీవో బ్రహ్మైవనా పర: అంటే బ్రహ్మ ఒకటే సత్యము మనకు కనిపించే జగత్తు అంతా మాయ,మిధ్య. ఈ ప్రాపంచిక విషయములలో సంచరించు జీవాత్మ కూడా వాస్తవానికి పరబ్రహ్మస్వరూపమే కాని వేరు కాదు. ఈ సత్యము తెలుసుకొని పరమాత్మను ఆరాధించడమే జ్ఞాన యజ్ఞము. దీనినే అద్వైత భావము అంటారు. ఈ జ్ఞాన యజ్ఞము ఆచరించే వాడు తానే బ్రహ్మ అనే భావనతో ఉంటాడు. అహం బ్రహ్మోస్మి అనే భావన అదే. ఆ భావన కలిగితే సాధకుడు ఏ చెడ్డ పనీ చేయడు.

అలా కాకుండా మరి కొంత మంది పరమాత్మ ఒక్కడే. ఆ పరమాత్మ ఆత్మస్వరూపుడుగా అన్ని జీవరాసులలోనూ ఉన్నాడు అని ఆత్మదర్శనం చేస్తారు. మరి కొందరు వివిధ రకములైన దేవతలను ఉపసిస్తుంటారు. బహుధా అంటే వివిధ రూపములతో, విశ్వతో ముఖమ్(విశ్వాకారం) అంటే ఈ విశ్వము అంతా నిండి ఉన్నవాడిని, అయిన నన్ను ఉపాసిస్తూ ఉంటారు. మొదట అద్వైత భావముతో కూడిన జ్ఞాన యోగమును చెప్పి తరువాత సాకార రూపముతో కూడిన వివిధ యజ్ఞముల గురించిచెప్పాడు కృష్ణుడు.

## 16. అహం క్రతు రహం యజ్ఞః స్వధాహమహమౌషధమ్।
## మన్త్రో2హమహమేవాజ్యమహమగ్నిరహం హుతమ్॥

ఓ అర్జునా! అన్ని క్రతువులునేనే. అన్ని యజ్ఞములు నేనే. స్వధా అంటూ పితృదేవతలకు అర్పించే పిండములు, జలతర్పణములునేనే. యజ్ఞయాగములలో అగ్నిలో అర్పించే హవ్యములు, హవిస్సులు నేనే. ఏ అగ్నిహోత్రములో అయితే హవ్యములు, కవ్యములు సమర్పిస్తారో ఆ అగ్నిహోత్రము నేనే. ఆ అగ్నిలో వేసే హవ్య, కవ్యములను హుతం చేసే కర్మను నేనే. ఆఖరుకు మనం తినే అన్నము మొదలగా ఆహారపదార్థములు నేనే. అన్నమునే ఓషధి అని అంటారు.
(ఒకసారి ఫలితం ఇచ్చి ఎండి పోయేది ఓషధి. వరి, గోధుమ, జొన్న మొదలైనవి. ఓషధులు అంటే ఆహారం తినడం వలన కానీ మరి ఏ విధంగా నైనా కానీ, శరీరానికి కలిగే రుగ్మతలను పోగొట్టేవి. ఈ ఓషధులు మొక్కల నుండి, వేళ్ల నుండి, చెట్లనుండి లభిస్తాయి. ఓషధుల నుండి వచ్చేది ఔషధము.) ఓషధులు మనకు ఆరోగ్యాన్ని ఆయువును ఇస్తాయి. అన్నము మొదలగు ఆహార పదార్థాలు మనకు శక్తిని ఇస్తాయి.

ఈ పరమాత్మ స్వరూపం గురించి వివరంగా తెలుసుకుందాము.

పరమాత్మను సాకారంగా పూజిస్తే ఏమవుతుంది అంటే దానికి జవాబు ఇక్కడ చెప్పాడు. అంతా నేనే అయినపుడు ఎవరిని ఎలా పూజిస్తే ఆ పూజలు అన్నీ నాకే చెందుతాయి అంటూ తను ఏమేమిగా ఉన్నాడో వివరిస్తున్నాడు పరమాత్మ. ఉదాహరణకు దేవతలను ఉద్దేశించి చేసే యజ్ఞము, పితృదేవతలను ఉద్దేశించి చేసే పిండప్రదానము, జలతర్పణము ఉదాహరణగా తీసుకున్నాడు కృష్ణుడు. ఇప్పుడు మనకు ఒకసందేహం వస్తుంది. యజ్ఞములు, యాగములు మాత్రమే ఎందుకు తీసుకోవాలి. పూజలు వ్రతాలు తీసుకోవచ్చుకదా! అని. నిజమే. అవీ కూడా తీసుకోవచ్చు. వేదములలో, ముఖ్యంగా యజుర్వేదంలో యజ్ఞయాగముల గురించి చెప్పారు. తరువాత వచ్చిన సూత్రాలలో, పురాణాలలో వ్రతములు, షోడశ ఉపచారములతో చేసే పూజల గురించి చెప్పారు. ఇవి అన్నీ ఒక దాని వెంట కాలానుగుణంగా పరిణామ క్రమంలో వచ్చాయి. ఈ

భగవద్గీత చెప్పబడిన రోజులలో ప్రధానంగా యజ్ఞ యాగములే పరమాత్మను అర్చించడానికి సాధనములుగా ఉండేవి. అంతేకాకుండా పరమాత్మకు యజ్ఞపురుషుడు అని కూడా ఒకపేరు. అందుకే యజ్ఞములను ఉదాహరణగా తీసుకున్నాడు కృష్ణుడు.

ఓ అర్జునా! మీరు చేసే యజ్ఞములు, యాగములు క్రతువులు నేనే. యజ్ఞములలో దేవతలకు అర్పించే హవిస్సును నేనే. పితృకార్యములలో చేసే పిండప్రదానము నేనే. మనం జఠరాగ్నిలో అంటే కడుపులో వేసే అన్నం, వివిధములైన ఆహారములు, అన్నీ నేనే. అందుకే అన్నం పరబ్రహ్మస్వరూపం అని అన్నారు. ఎందుకు అలా అన్నారు. మనం తినే అన్నం అంటే ఆహారం రక్తంగా మారుతుంది. రక్తం వీర్యంగా మారుతుంది. వీర్యం అండంగా మారుతుంది. ఆ అండమే పిండంగామారి సృష్టి జరుగుతుంది. సృష్టి చేసేది బ్రహ్మ. అంటే ఒక పిండం రావడానికి అన్నం కారణము అయినపుడు, అన్నము బ్రహ్మ స్వరూపమే కదా! అందుకే మనం అన్నం తినేటప్పుడు "ఈ అన్నము పరబ్రహ్మస్వరూపము, ఈ అన్నములో ఉండే రసము, రుచి, శక్తి అన్నీ విష్ణుస్వరూపము, ఈ అన్నమును జీర్ణంచేసి, అన్ని అవయవాలకు అందించే శక్తి ఈశ్వరుడు" అని తలచుకుంటూ భోజనం చేస్తే, మనం తినే అన్నం మనకు దైవీశక్తులను ప్రసాదిస్తుంది. అందుకే మనం తినే అన్నమును అమృతస్వరూపంగా భావించాలి. అందుకే భగవంతునికి నివేదించేముందు, మనం తినే ముందు అమృతమస్తు అని అంటాము. ఈ పదార్థములు అన్నీ అమృతస్వరూపము అగుగాక అని భావిస్తాము. ఈ అమృతస్వరూపము, పరబ్రహ్మస్వరూపము అయిన అన్నము మొదలగు ఓషధీ, ఓషధులు నేనే అని అంటున్నాడు పరమాత్మ.

యజ్ఞయాగములలో జ్వలింపజేసే అగ్ని నేనే. హెూమం చేయడం కూడా నేనే. ఆ హెూమములు చేసేటప్పుడు పఠించే వేదమంత్రములు నేనే. మనం తినే అన్నం నోటి గుండా తిన్నా, ఆ అన్నం జఠరాగ్నిద్వారా జీర్ణం అయి, శక్తిగా మారి, ఏ అవయవానికి ఎంతెంత శక్తిని ఇవ్వాలో ఆ శక్తిని అన్ని అవయవాలకుపంచి పెడుతుంది. అలాగే మనం హెూమంలో వేసే సమిధలు, ఆహుతులు, నెయ్యి మొదలగు హవ్యములను, అగ్నిదేవుడు, మనం ఏ మంత్రమును చదివి హెూమం చేస్తామో ఆయామంత్రములకు అధిష్ఠానదేవతలకు అందచేస్తాడు. అందుకే అగ్నిని హవ్యవాహనుడు అంటే హవ్యములను మోసుకొని పోయి ఆయాదేవతలకు అందించేవాడు అని అర్థం. హెూమం లో వేసే సమిధలను, హవ్య, కవ్యములను హుతం చేసే శక్తి కూడా నేనే. అన్నిటిలో నేనే ఉన్నాను అని స్పష్టంగా చెబుతున్నాడు పరమాత్మ.

## 17. పితా2హమస్య జగతో మాతా ధాతా పితామహః।
## వేద్యం పవిత్ర మోంకార ఋక్సామయజురేవచ॥

ఈ సకల జగత్తుకు తల్లి, తండ్రి, తాత, రక్షకుడు అన్నీ నేనే. ఈ జగత్తులో తెలుసుకోతగ్గది, పవిత్రమైనది అంతా నేనే. నేనేఓంకార స్వరూపుడను, వేదస్వరూపుడను. ఋగ్వేదము, సామవేదము, యజుర్వేదము అన్నీ నేనే. నేనుకానిది ఏదీ లేదు.

మనం ఎక్కువగా లౌకిక మైన సంబంధాలకు ప్రాధాన్యత ఇస్తుంటాము. ఈ బంధాలన్నీ ఈ స్థూల దేహము ఉన్నంతవరకే ఉంటాయి. తరువాత ఉండవు. ఈ జన్మలో తల్లి, తండ్రి, సోదరీసోదరులు, బంధువులందరూ మరుజన్మలో ఉండరు. కాని ఈ జగత్తుకు తల్లి తండ్రి ఒక్కడే. అందుకే పరమాత్మ ఇలా అంటున్నాడు.

ఈ జగత్తుకు తల్లిని, తండ్రిని, తాతను, నేనే. అంటే అర్థం పరమాత్మకు జన్మలేదు. అజుడు. అనాది. ఆయన కన్నా ముందు ఎవరూ లేరు. నిమిత్త కారణము ఆయనే. ఉపాదాన కారణము ఆయనే. ఆయన పుట్టడానికి కారణం అంటూ ఏదీ లేదు. అంతే కాదు ఈ జగత్తును పోషిస్తున్నది నేనే. ఎవరికి ఏంకావాలో వాటిని సమకూరుస్తున్నది నేనే. ఎవరు ఏ కర్మ చేసినా, ఆ కర్మలకు తగిన ఫలితములను పంచి పెట్టేది నేనే. అని కూడా అన్నాడు. కాబట్టి ఈ తాత్కాలికమైన తల్లి తండ్రుల కన్నా జగత్తుకు తల్లి తండ్రులైన పరమాత్మ గొప్ప అని తెలుసుకోవాలి.

ఇంక విద్య. ఎవరు ఏమైనా తెలుసుకోదలచుకుంటే ఆ తెలుసుకునే వస్తువును నేనే. కాబట్టి మనకు ధనం సంపాదించి పెట్టే ఈ లౌకిక విద్యలతో పాటు జ్ఞానవిద్యను కూడా నేర్చుకోవాలి. ఎందుకంటే లౌకిక విద్యలు నేర్చుకుంటే తాత్కాలిక సుఖాలు లభిస్తాయి కానీ జ్ఞానంసంపాదించుకుంటే అంతము లేని సుఖం అంటే పరమ సుఖం, శాంతి లభిస్తాయి. ఆ విద్య నేర్చుకుంటే ఇంక తెలుసుకోవలసింది ఏమీ ఉండదు. అంతే కాదు తెలుసుకోతగ్గవాడు అంటూ ఉంటే అది నేనే. అంటే ప్రతి వాడూ పరమాత్మను గురించి తెలుసుకోవాలి. ఆత్మజ్ఞానము కలిగి ఉండాలి.

తరువాత నాలుగు వేదములు నేనే. వేద మంత్రములలో ఉన్న ఓంకారము నేనే. అన్ని మంత్రముల కన్నా ఉచ్ఛరించడానికి తేలికైనది ఒకే అక్షరము కలది అయిన ఓంకారము నేనే అని పరమాత్మ చెప్పాడు. ఈశ్లోకంలో మూడు వేదాల గురించి మాత్రమే చెప్పారు. నాలుగో వేదం గురించి ఎందుకు చెప్పలేదు అని మనకు ఒక సందేహం రావచ్చు. మొదట్లో వేదములు అన్నీ ఒకే రాశిగా ఉండేది. ఛందస్సుకు అనుగుణంగా రాయబడిన వాటిని ఋక్కులు అని అన్నారు.

ఋక్కులు అన్నీ కలిపి ఋగ్వేదముగా రూపొందింది. తరువాత కర్మకాండలు, యజ్ఞములు, వాటి ప్రక్రియలు అన్నీ చాలా మటుకు గద్యరూపంలో ఉంటాయి. యజ్ఞముల గురించి చెప్పారు కాబట్టి దానిని యజుర్వేదము అని అన్నారు. ఈ రెండు వేదాలలో సామ్యంగా పాడుకోవడానికి వీలుగా ఉన్న సూక్తములను ఇంకా మరికొన్నింటిని కలిపి సామవేదంగా రూపొందించారు. లౌకిక విషయాలకు సంబంధించిన కర్మకాండలను అన్నీ కలిపి అధర్వణవేదంగా రూపొందించారు. ఆధ్యాత్మికత లో లౌకికానికి అంతగా ప్రాధాన్యతలేదు కాబట్టి సాధారణంగా మొదటి మూడు వేదాల గురించే చెబుతారు. అందుకే వేదవిద్యను త్రయీ విద్య అని అన్నారు. అంటే అధర్వణవేదం లేదని కాదు. దాని గురించి చెప్పలేదు అంతే. అలా అర్థం చేసుకోవాలి.

## 18. గతిర్భర్తా ప్రభుస్సాక్షీ నివాసశ్శరణం సుహృత్।
## ప్రభవ: ప్రలయ: స్థానం నిధానం బీజమవ్యయమ్॥

ఈ జగత్తుకు భర్త అంటే భరించేవాడు, ప్రభువు అంటే శాసించేవాడు, మనం చేసేపనులను అన్నిటినీసాక్షీభూతంగా చూస్తూ ఉండేవాడు, మనకందరికీ నివాసముగా ఉన్న వాడు, చరాచరప్రాణులు శరణు పొందతగినవాడు, అందరికీ మేలుచేసేవాడు, పుట్టుక, పోషణ, లయము మూడూ నిర్వహించేవాడు, అందరికీ క్షేమము కలిగించేవాడు, ఈ సమస్తజగత్తుకు మూలకారణము అయినవాడు, ఎవరో కాదు అర్జునా! నేనే!

ఈ శ్లోకంలో, పరమాత్మ తన గురించి తాను చెప్పుకుంటున్నాడు. అందరు అనుసరించవలసిన గతి అంటే మార్గము, భరించే వాడు, ప్రభువు, సాక్షి, నివాసము, శరణు, స్నేహితుడు, సృష్టి, స్థితి లయములు, అందరికీ ఆశ్రయము, సకల జగత్తుకు బీజము లాంటి వాడిని నేనే అన్నాడు పరమాత్మ.

గతి అంటే మనం ఏ మార్గంలో నడవాలో, శాశ్వతమైన పరమ గతిని ఎలా పొందాలో తెలిపిన వాడు పరమాత్మ. ఆత్మజ్ఞానము కలగడమే అందరికీ పరమగతి. అందరూ తుదకు చేరుకోవాల్సిన గతి నేనే. లౌకికంగా చెప్పుకోవాలంటే, సర్వకాల సర్వావస్థలయందు మన వెంట ఉండి నడిపించేవాడు పరమాత్మ. మన పూర్వజన్మ వాసనలను బట్టి మనకు కలిగే కష్టములను, సుఖములను మనకు కలిగించేవాడు పరమాత్మ. మనం చేసే కర్మలకు తగిన ఫలితములను ప్రసాదించేవాడు పరమాత్మ. ఈ విధంగా పరమాత్మను అర్థం చేసుకోవాలి.

అందరినీ భరించేవాడు (భర్త) పోషించేవాడు (స్థితి కారుడు) పరమాత్మ. భార్యను భరించేవాడు భర్త. మనల నందరినీ భరించేవాడు పరమాత్మ. అందుకే ఆయన మనకందరికీ

భర్త. మనందరినీ రక్షించే వాడు రాజు, ప్రభువు, ప్రభుత్వము. ఈ అనంతవిశ్వానికి ప్రభువే పరమాత్మ. సాక్షి. మనం చేసే పనులన్నీ సాక్షీభూతంగా చూస్తూ, మనం చేసే కర్మలకు తగిన ఫలితాలను ఇచ్చేవాడు పరమాత్మ. మనం అందరం నివసిస్తున్న ఈ జగత్ పరమాత్మ స్వరూపమే . ఈ జగత్తు అంతా నిండి ఉన్నాడు. మనం అందరం ఆయనలో నివాసం ఉంటున్నాము.

సాధారణంగా ఏదైన సమస్య కష్టం వచ్చినపుడు పెద్దవాళ్లను ఆశ్రయిస్తాము. సర్వజీవులకు శరణాగతి ఇచ్చే వాడు పరమాత్మ. రాజకీయ నాయకులు అధికారులు మన సమస్యలు తీరుస్తారో లేదో చెప్పలేము కానీ భగవంతుని నమ్ముకంటే ఆయనను శరణాగతి పొందితే మన అన్ని సమస్యలు తీరుతాయి. చక్కని పరిష్కారం లభిస్తుంది. అన్ని కష్టాల నుండి గట్టెక్కవచ్చు.

సుహృత్ అంటే స్నేహితుడు కంటే గొప్పవాడు. స్నేహితుడు తన తోటి స్నేహితులకు మాత్రమే సాయం చేస్తాడు. సుహృత్ అంటే స్నేహితుడు కాకపోయినా సాయం చేస్తాడు. అందుకే పరమాత్మను సుహృత్ అన్నారు. మనకు తల్లి తండ్రి బంధువుల కన్నా స్నేహితులు ఎక్కువ. అటువంటి మంచి స్నేహితుడు కన్నా గొప్పవాడు పరమాత్మ. కొంత మంది స్నేహితులు మోసం చేస్తారేమో కానీ పరమాత్మ లాంటి సుహృత్ ఎప్పటికీ మోసం చేయడు. మనలను మంచి మార్గంలో నడిపిస్తాడు.

తరువాత అసలు విషయం ఈ జగత్తును సృష్టించి పెంచి పోషించి లయం చేసే వాడిని నేనే. దీనికి వివరణ అనవసరం. మనం రోజూ చూస్తున్నది అదే

నిధానము అంటే మనకు ఏం కావాలో అవి అన్నీ ఆయనయందే ఉన్నాయి. ఎవరికి ఏం కావాలో అవీ తీసి ఇస్తుంటాడు. మనం నిత్యంఅనుభవించేవి అన్నీ పరమాత్మ ఇచ్చినవే. మనం సుఖంగా అనుభవించే ఫర్నీచర్‌కు మూలం కలప. దాని మూలం చెట్టు. అది సృష్టించింది పరమాత్మ. అలాగే బంగారం భూమిలోనుండి వస్తుంది. అదీ పరమాత్మ స్వరూపమే. ఇలా అన్ని వస్తువుల మూల పదార్థాలు ఈ ప్రకృతిలోనుండి వచ్చాయి. ఈ ప్రకృతి పరమాత్మ సృష్టి. పరమాత్మ సృష్టించిన వాటిని మనం అనుభవిస్తూ, అంతా నాకే కావాలి అని కొట్టుకుచస్తున్నాము. ఇదే అజ్ఞానము.

బీజమ్= ఈ సకల జగత్తు ప్రళయ కాలంలో సూక్ష్మరూపంలో అంటే బీజ రూపంలో ఉంటుంది. ఆ బీజరూపము కూడా నేనే. అంటే ప్రాణుల స్థూల సూక్ష్మరూపములు ఆ పరమాత్మ స్వరూపాలే. చెట్టు ఎండి పోతుంది. కాని ఆ చెట్టు బీజరూపంలో నిక్షిప్తం అయి ఉంటుంది. మరలా మరొక చోట చెట్టుగా పుడుతుంది. కనపడని బీజరూపము, కనపడే చెట్టురూపమూ అన్నీ ఆ పరమాత్మే.
ఆఖరుగా అవ్యయమ్ అంటే ఈ సకల జగత్తు నశించినా నేను మాత్రం ఉంటాను అని అన్నాడు పరమాత్మ. అంటే చెట్టు నశించినా బీజరూపంలో నాశము లేకుండా ఉంటుంది. మానవుడి శరీరం నశించినా, సూక్ష్మదేహంతో, వాసనలతో ఉంటాడు. మరలా మరొక దేహం పొందుతాడు. కాబట్టి

ఏదీ నాశనము కాదు. కేవలము మార్పుచెందుతుంది. నాశము, మార్పులేని వాడు పరమాత్మ.

## 19. తపామ్యహమహం వర్షం నిగృహ్ణామ్యుత్సృజామి చ।
## అమృతం చైవ మృత్యుశ్చ సదసచ్చాహమర్జున॥

ఓ అర్జునా! సూర్యకిరణముల చేత సముద్రములలోని నీటిని ఆవిరి చేసి, మేఘముల రూపంలో ఉంచి, అవసరం వచ్చినపుడు వర్షరూపంలో మంచి నీటిని అందిస్తున్నది నేనే. అవసరం లేనపుడు ఆ నీటిని నాలోనే ఉంచుకుంటున్నాను. మరణం రావాలన్నా, మరణం రాకూడదన్నా దానికి కారణం నేనే. ఈ చరాచర జగత్తులో నిత్యమైనవి, అనిత్యమైనవిఅన్నీ నేనే.

ఈ ప్రపచంలో ఉన్న అందరికీ ఏ ప్రయత్నము లేకుండా ప్రత్యక్షం అయ్యే దేవుడు సూర్యభగవానుడు. ఆ సూర్యుడు నేనే అంటున్నాడు. ఆయన మనకు వేడిని ఇస్తున్నాడు. నాలుగు రోజులు ముసురుపట్టి సూర్యుడు కనపడకపోతే అల్లాడిపోతాము. ఎందుకంటే మనకు జీవమును, శక్తిని ఇచ్చేది సూర్యుడు.

సూర్యరశ్మిలో డి విటమిన్ ఉందని మన వైద్యులు చెబుతారు. కొంత మంది మాత్రం శరీరానికి ఏమాత్రం సూర్యరశ్మితగలకుండా, సూటు,బూటు,సాక్సులు,టై కట్టుకొని, ఎసి రూములకే పరిమితం అవుతారు. డాక్టర్లను పోషిస్తుంటారు. అదే గొప్పఅనుకుంటారు. అది వాళ్ల ఖర్మ. మనమేం చేయలేము. మనకు వాటర్ సైకిల్ తెలుసు. సూర్యుని కిరణములచేత, తాపముచేత సముద్రములలో నీరు ఆవిరి అయి మేఘములుగా ఏర్పడి,వర్షముగా కురిసి మనకు దాహం తీరుస్తుంది. పంటలు పండిస్తుంది. మనకు జీవనాధారంగా ఉంటుంది. సముద్రంలో నీరు ఉప్పగా ఉండి ఎందుకూ పనికి రావు. అటువంటి పనికిరాని నీటిని ఉపయోగంలోకి తీసుకవచ్చే పెద్ద యంత్రం నేనే అంటున్నాడు పరమాత్మ.

అంతే కాకుండా, సముద్రంలో ఉన్న ఉప్పునీటిని తియ్యటి నీరుగా మార్చి, ఉప్పును మనకు మిగిల్చి, ఆ తియ్యటి నీటిని ఆవిరి రూపంలో పైపైకి తీసుకు వెళ్లి, మేఘాల రూపంలో నిక్షిప్తం చేసి, ఎప్పుడు వర్షం కురవాలో ఎప్పుడు వర్షం కురవకుండా చేయాలో తెలిసి, కావాల్సివచ్చినప్పుడే వర్షం కురిపిస్తున్నాడు. ఇదంతా ఒక నియమం ప్రకారం జరుగుతూ ఉంది. కాని మనం ఏం చేస్తున్నాము! మన శాయశక్తులా వాతావరణం కలుషితం చేసి ఆ నియమాన్ని, పరమాత్మ ఏర్పరచిన వాటర్ సైకిల్‌ను ఛిన్నాభిన్నం చేసాము. ఇంతకన్నా పెద్ద యంత్రం మనం కనిపెట్టలేదు. కనిపెట్టలేముకూడా! మనం చిన్న చిన్న యంత్రాలతో మేఘమధనాలు చేస్తుంటాము. ఏ ఇంధనము ఖర్చు లేకుండా ఈ మాదిరి ఉప్పునీటిని మంచినీటిగామార్చే యంత్రమును పనిచేయించే వాడు

ఆపరమాత్మ. ఆయన ఎంత శక్తి మంతుడో అర్థం చేసుకోవాలి.

అంతే కాకుండా మనకు మరణం కలిగించేవాడు, మరణం నుండి విముక్తి కలిగించే వాడు ఆ పరమాత్మ. మరణం నుండి విముక్తి అంటే అమృతత్వం అంటే మరణం లేకుండా చేయడం అంటే జనన మరణ చక్రము నుండి విముక్తి కలిగించేవాడు, పరమ పదమును ఇచ్చేవాడు ఆ పరమాత్మ. అంతే కాదు నిత్యము సత్యముఅయిన ఆత్మస్వరూపాన్ని నేనే, అనిత్యము అశాశ్వతము అయిన ఈ ప్రాపంచిక విషయాలు, వస్తువులు అన్నీ నేనే. నేను కానిది అంటూ ఏదీ లేదు అని అంటున్నాడు కృష్ణుడు.

## 20. త్రైవిద్యా మాం సోమపా: పూతపాపా యజ్ఞై రిష్ట్వా స్వర్గతిం ప్రార్థయన్తే। తే పుణ్యమాసాద్య సురేన్ద్ర లోక మశ్నన్తి దివ్యాన్దివి దేవభోగాన్॥

త్రయీ విద్య అనే వేదవిద్యను అధ్యయనము చేసినవారు, వేదములలో చెప్పబడిన యజ్ఞ యాగములు చేసి ఆ యజ్ఞములలో సోమపానము చేసినవారు, వారు చేసిన పాపములను అన్నీ సమూలంగా పోగొట్టుకున్నవారు, వారు చేసిన యజ్ఞముల ఫలంగా స్వర్గలోక సుఖములను మాత్రమే కోరుకుంటున్నారు. వాటి కోసమే యజ్ఞయాగములు చేస్తున్నారు. వారు చేసిన యజ్ఞయాగముల ఫలితంగా ఆర్జించుకున్న పుణ్యములకు కాను వారు స్వర్గలోకమునకువెళుతున్నారు. ఆ స్వర్గలోకములో దివ్యములైన దేవభోగములను అనుభవిస్తున్నారు.

కేవలము స్వర్గసుఖములను పొందవలెననే కోరికతో యజ్ఞయాగములు చేసినవారు, వారు చేసిన యజ్ఞయాగముల, సకామ కర్మల ఫలితంగా పుణ్యమును సంపాదించుకొని, స్వర్గము మొదలగు పుణ్యలోకములను పొందుతున్నారు. అక్కడ వారు చేసిన పుణ్యములకు తగ్గ ఫలములను అనుభవించిన తరువాత మరలా మానవులుగా జన్మిస్తారు. వీరందరూ పరమ పదము కొరకు ప్రయత్నించకుండా కేవలము స్వర్గసుఖముల కొరకు మాత్రమే సకామ కర్మలనుచేస్తుంటారు. ఒక్క పరమ పదము తప్ప మిగిలిన అన్ని లోకములు మరలా తిరిగి వచ్చే లోకములే కానీ శాశ్వతముగా పునర్జన్మలేకుండా చేసేవి కావు. అందుకే "ఆ బ్రహ్మభువనాల్లోకా: పునరావర్తినోఽర్జున" అంటే బ్రహ్మలోకముతో సహా ఏలోకమునకు కానీ వెళ్లినా, మరలా తిరిగి రాక తప్పదు. అంటే ఒక్కపరమ పదము తప్ప ఏలోకమూ శాశ్వతము కాదు. అని అర్థము. అలాగే ఈ స్వర్గలోక సుఖములు కూడా భూలోకములో మనము అనుభవించే సుఖముల కంటే కొంచెం గొప్పవి కాని శాశ్వతములు కావు.

కాని, అందరూ స్వర్గసుఖముల కొరకుపాకులాడుతున్నారు కానీ పరమపదము కొరకు ఎవరూ ప్రయత్నించడం లేదు. వేదములలో చెప్పబడిన యజ్ఞయాగములు కొరకు చేసే శ్రమ శాశ్వత సుఖము కొరకు చేస్తే పరమ పదము పొందవచ్చును కానీ ఆ జ్ఞానము వేదపండితులకు కూడా లేదు. కాబట్టిస్వర్గ సుఖములు ప్రసాదించే సకామ కర్మ కంటే నిష్కామ కర్మ శ్రేష్టమైనది.

ఈ శ్లోకంలో రెండు పదాలు వాడారు. మొదటిది పూతపాపా అంటే పాపముల నుండి పవిత్రుడు అవుతాడు. చేసిన పాపాలు చేసి, యజ్ఞయాగాలు చేస్తే పవిత్రులు అవుతారా అని మీరు అనుకోవచ్చు. పాపాలు అన్నీ ఒకే రకమైనవి కావు. కొన్నిచిన్న చిన్న పాపాలు ఉంటాయి. అవి పశ్చాత్తాపంతో, ప్రాయశ్చిత్తంతో నశించి పోతాయి. కొన్ని పాపాలు ఏమి చేసినా పోవు. తగిన శిక్ష అనుభవించవలసినదే. ఇక్కడ పూతపాపా అంటే తెలిసీ తెలియకుండా, పొరపాటున చేసిన పాపాలు అని అర్థం. ఎందుకంటే నిరంతరం పాపాలు చేసే వాడు యజ్ఞయాగాలు చెయ్యడు. దేవుడిని తలచుకోడు. వాడికి పాపచింతన ఉండదు. పశ్చాత్తాపం ఉండదు. వాడిది కరుడుకట్టిన నేరమనస్తత్వం. ఇక్కడ వాళ్ల గురించి చెప్పడం లేదు అని గుర్తించాలి.

ఉదాహరణకు, మానవులు ఎన్నోనేరాలు చేస్తుంటారు. వాటికి ఇండియన్ పీనల్ కోడ్ లో శిక్షలు ఉంటాయి. కాని కొన్ని నేరాలకు పశ్చాత్తాపం ఉంటుంది. నేరస్థుడు ఎవరి పట్ల నేరం చేసాడో వారు క్షమిస్తే, వాడు శిక్షనుండి విముక్తుడు అవుతాడు. దానికి క్రిమినల్ ప్రొసీజర్ కోడ్ లో ఒక సెక్షన్ ఉంది. సె.320 క్రిమినల్ ప్రొసీజర్ కోడ్. దాని ప్రకారం నేరస్తుడు తాను ఎవరి పట్ల నేరం చేసారో వారికి క్షమాపణ చెప్పి, వారితో రాజీ కుదుర్చుకోవచ్చు. నష్టపరిహారం చెల్లించి నేరము నుండి విముక్తి పొందవచ్చు. కాని ఇది కొన్ని నేరాలకు (కాంపౌండబుల్ అఫెన్సెస్ కు) మాత్రమే వర్తిస్తుంది. మర్డర్, రేప్ చేసి క్షమించమంటే ఎవరూ క్షమించరు.

అలాగే యజ్ఞయాగాల వలనా, ప్రాయశ్చిత్తం చేసుకోడం వలనా, కొన్ని చిన్న చిన్న పాపాలు, తెలియకుండా చేసిన పాపాలు నశించి పోతాయి అని ఇక్కడ అర్థం. మరొక మాట కూడా వాడారు. దేవభోగాన్ అంటే దేవలోకసుఖాలు అని అర్థం. మరి స్వర్గం నరకం అంటూ వేరే లేవు, అన్నీ ఇక్కడే ఉన్నాయి అని కొంత మంది వాదన. వారి వాదన ప్రకారం చూస్తే కూడా ఇది సరిఅయినదే. కొంత మంది మంచి శ్రీమంతుల ఇంట్లో పుడతారు. వారికి దేనికీ కొరత ఉండదు. అనుకున్న వెంటనే అన్నీ సమకూరుతాయి. అనుభవించడమే వారి పని. వీటినే దేవభోగములు అని అనుకోవచ్చు కదా! జీవితం తల్లకిందులయి ఆ సంపదలు హరించి పోతే రోడ్డునపడతాడు. అదీ సంభవమే. ఓడలు బండ్లు అవుతాయిఅనే సామెత ఇదే కదా! ఓడలు ఎలా బండ్లు అవుతాయో తరువాతి శ్లోకంలో వివరించారు.

## 21. తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం క్షీణేపుణ్యే మర్త్యలోకం విశన్తి।
## ఏవం త్రయీధర్మ మనుప్రపన్నా గతాగతం కామకామా లభన్తే॥

పైశ్లోకంలో చెప్పిన విధంగా పాపాలుపోగొట్టుకొని, పవిత్రులై, యజ్ఞయాగములు చేసి పుణ్యమును సంపాదించుకున్నవారు, విశాలమైన స్వర్గలోకములో సకల సుఖములు అనుభవించి, వారు చేసిన పుణ్యము అయిపోగానే, మరలా మానవ లోకములో పుడుతున్నారు. ఈ ప్రకారంగా వేదములలో చెప్పబడిన యజ్ఞయాగములు మొదలగు కర్మకాండలు కేవలం పూర్తిగా ప్రతిఫలాపేక్షతో, తమ తమ కోరికల తీరడం కోసమే చేసినవారు, కామ భోగములయందే ఆసక్తి కలవారు, వాటిని అనుభవించాలనే కోరిక కలవారు, ఈ ప్రకారంగా పుట్టడం, పుణ్యం సంపాదించడం, స్వర్గలోకానికి వెళ్లడం, తాను చేసిన పుణ్యానికి సరిపడా స్వర్గసుఖాలు అనుభవించడం, పుణ్యం అయి పోగానే మరలా మానవలోకంలోపుట్టడం, ఇలాగా జనన మరణ చక్రంలో తిరుగుతూ ఉంటారు.

ఇంతకు ముందు చెప్పబడిన శ్లోకంలో విషయాన్నే ఇక్కడ విపులంగా, ఇంకొంచెం వివరంగా చెబుతున్నాడు కృష్ణుడు. సకామ కర్మలు, కేవలం స్వర్గసుఖాల కోసమే. వేదములలో చెప్పబడిన యజ్ఞయాగాదులు చేసిన వారు, వారు చేసిన యజ్ఞయాగములను సరిపడా పుణ్యము సంపాదించి స్వర్గమునకు వెళతారు. అక్కడ స్వర్గ సుఖములు అనుభవిస్తారు. వారి పుణ్యం అయి పోగానే తిరిగి మర్త్యలోకమునకు తిరిగి వస్తారు. ఈ ప్రకారంగా సకామ కర్మలు చేసే వారు స్వర్గమునకు భూలోకమునకు రాకపోకలు సాగిస్తుంటారు. గతా గతమ్ అంటే వస్తూ పోతూ ఉంటారు.

ఆరునెలలు. భూలోక స్వర్గం అయిన అమెరికాలో సకల సుఖాలు అనుభవించి, చేతిలో డబ్బు, వీసా పరిమితి అయిపోగానే, తిరిగి ఇండియాకు వచ్చినట్టు స్వర్గానికి భూమికి రాకపోకలు సాగిస్తుంటారు. జనన మరణ చక్రంలో తిరుగుతుంటారు. బాంకులో బాలెన్సు తరిగిపోయినట్టు ఆర్జించిన పుణ్యం కూడా అనుభవిస్తుంటే తరిగిపోతుంది. స్వర్గలోకంలో తిరిగి పుణ్య కర్మలు చేసి పుణ్యం ఆర్జించే అవకాశం లేదు. స్వర్గంలో కేవలం అనుభవమే కానీ కర్మలు ఉండవు. పుణ్యకర్మలు చేయడానికిమరలా భూలోకం రాక తప్పదు.

అంత మాత్రం చేత సకామ కర్మ యజ్ఞయాగములు వేదాధ్యయనము మంచిది కాదు అని కాదు. అవి చేస్తూ నిష్కామ కర్మలు ఆచరించి పరమ పదము పొందడానికి ప్రయత్నం చేయాలి కానీ అక్కడే గిరా గిరా తిరుగుతూ ఉండకూడదు. అందుకే గతా గతం కామ కామే లభన్తే అని అన్నారు పరమాత్మ. అంటే ఈ కామసుఖములకు స్వర్గ సుఖములకు అలవాటు పడ్డ వాళ్లు వాటిని తిరిగి తిరిగి పొందడానికే ఇష్టపడుతుంటారు కానీ పరమ సుఖమును పొందడానికి

ప్రయత్నం చేయరు. కామ కామి అంటే కామములను కామించేవాడు. ఆ కామ కామి ఎల్లప్పుడూ స్వర్గానికి భూమికి రాకపోకలు సాగిస్తుంటాడు. భోగములు కోరుకుంటూ ఉంటాడు. కాబట్టి సాధకుడు కామకామి కాకూడదు. నిష్కామ కర్మలు ఆచరించాలి. పరమ పదముచేరుకోవడానికి ప్రయత్నం చేయాలి.

ఇక్కడ ఇంకొక విషయం కూడా ఉంది. మనం ఏ స్వర్గలోక సుఖాలు కోరుకుంటున్నామో, ఆ స్వర్గానికి అధిపతి ఇంద్రుడు. మనం అప్పుడప్పుడూ స్వర్గసుఖాలు అనుభవిస్తుంటాము. ఆయన ఎల్లప్పుడూ స్వర్గసుఖాలు అనుభవిస్తుంటాడు. అటువంటి ఇంద్రుడు ఒక సారి వృత్రుడు అనే బ్రాహ్మణుని చంపాడు. బ్రహ్మహత్యాపాతకం చుట్టుకుంది. స్వర్గాన్ని, సుఖాలను, భార్య శచీదేవిని వదిలిపెట్టి, అండర్‌గ్రౌండుకు వెళ్లాడు. వేయి సంవత్సరాలపాటు ఒక సరస్సులో ఉండే తామర తూడులో ఉన్న నాళంలో దాక్కున్నాడు. మనకు మర్డర్ కేసుకు అన్నీ రిమిషన్లుపోను, 14 ఏళ్లు జైలు శిక్ష, కాని ఇంద్రుడు వేయి సంవత్సరాల పాటు అన్ని భోగాలకు, సుఖాలకు దూరంగా ఏకాంత శిక్ష అనుభవించాడు. అంతే కాదు, ఆ ఇంద్రుడి పోస్టులోకి మరొకడు వచ్చాడు. వాడి పేరు నహుషుడు, మంచి ధార్మికుడు, శీలవంతుడు, గుణవంతుడు. కాని ఇంద్రుడి పదవి, స్వర్గలోక భోగాలు వాడికి మదం ఎక్కించాయి. కళ్లు మూసుపోయాయి. ఇంద్రుడు భార్య శచీదేవిని అనుభవించాలనే కోరిక పుట్టింది. అంతే! ఆ పాపఫలం కారణంగా అగస్త్యుడి శాపంవలన ద్వాపర యుగం వరకు కొండచిలువగా భూమి మీద పడి ఉన్నాడు. కాబట్టి ఎంతటి వారికైనా స్వర్గలోకం శాశ్వతం కాదు. మరలా భూమి మీదికి రావాల్సిందే!

ఇంక మనసంగతికి వస్తే, మంచి శ్రీమంతుల ఇండ్లలో పుట్టిన వాళ్లు, స్వర్గలోకముతో సమానమైన సుఖాలు, కోరుకున్న సుఖాలు అనుభవిస్తారు అని చెప్పుకున్నాము కదా. అవి ఎటువంటివి. ఎండ తగలకుండా నిరంతరం ఎసిరూపులు, ఖరీదైన ఎసికార్లు. సూటు,బూటు, నిరంతరం మద్యపానం, ధూమపానం. షుగర్,బిపి,ఒబేసిటీ. వీటి వలన ఆరోగ్యం సర్వనాశనం. డాక్టర్లచుట్టు తిరగడం. అన్నీ ఉన్నా ఏమీ తినలేకపోవడం. స్వర్గం నుండి జారిపడటం అంటే ఇదే. మరి కొందరు తమకు సంపదలుఉన్నాయి కదా అని ఇష్టంవచ్చిన వ్యాపారాలు చేసి, నష్టపోయి, ఐపి పెట్టివీధినపడేవాళ్లు ఉన్నారు. వీళ్లనే బతికిచెడ్డవాళ్లు అని అంటూఉంటారు. చలనచిత్రరంగంలో ఒక నాడు రాజభోగాలు అనుభవించినవారు, అవసానదశలో దిక్కులేని చావు చచ్చినవాళ్ల గురించి మనం విన్నాము. వీరంతా స్వర్గం నరకం ఈ లోకంలోనే అనుభవిస్తుంటారు.

యజ్ఞయాగాలు చేసి, పుణ్యం సంపాదించి, స్వర్గలోకానికి వెళ్లి, అక్కడ స్వర్గంలో సకల భోగాలు అనుభవించి, ఆర్జించిన పుణ్యం అయి పోగానే, స్వర్గలోకంనుండి గెంటబడి, మరలా మానవలోకంవచ్చి, మరలా స్వర్గసుఖాల మీద మోజుతో, యజ్ఞయాగాలు చేసి, పుణ్యాలు సంపాదించి, తిరిగి స్వర్గసుఖాల కోసం పాకులాడుతుంటారు కానీ శాశ్వతసుఖాన్ని కలిగించే పరమపదాన్ని

కోరుకోరు. ఆ శాశ్వతసుఖం కావాలని కోరుకునే వారికి ఒక అభయం ఇస్తున్నాడు కృష్ణుడు.

స్వర్గలోకం విశాలం అనే పదాలకు సరదాగా ఈ విధంగా అర్థం ఊహించవచ్చు. బాగా ధనము, సంపదలు ఉన్న వాడికి నూరుబెడ్ రూములు ఉన్న స్వర్గం తో సమానమైన భవనం ఉంటుంది. చుట్టు గార్డెన్ స్విమ్మింగ్ పూల్, బంగారు సింహాసనం మీద కూర్చుని, బంగారు ప్లేట్సులో భోజనాలు అన్నీ ఉంటాయి. ఆహా స్వర్గం ఇదే కదా అని మన ఇష్టం వచ్చినట్టు ప్రవర్తిస్తే, ఆ స్వర్గం కాస్తా నరకంగా మారి, విశాలమైన భవనాల్లో నుండి ఇరుకుగా ఉన్న జైలు గదుల్లోకి మారాల్సివస్తుంది. బంగారు పళ్లెలకు బదులు, సత్తు పళ్లెంలో భోజనం చేయాల్సివస్తుంది. ఇది మనం వింటున్నాంకదా! ఇది కేవలం ఉదాహరణ మాత్రమే! మరోలా భావించకండి. సరిగ్గా అర్థం చేసుకుంటే భగవద్గీత ఈనాటికే కాదు, ఏనాటికీ కూడా పనికివచ్చే మహత్తర గ్రంథము.

22. అనన్యాశ్చిన్తయన్తో మాం ఏ జనా: పర్యుపాసతే।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్॥

ఏ జనులైతే ఇతరములైన చింతలు లేకుండా, నన్నే ఎల్లప్పుడూ చింతిస్తూ ఉంటారో, నన్నే చక్కగా ఉపాసిస్తూ ఉంటారో, నా యందు, ఏకాగ్రమైన భక్తి, నిష్ఠ కలిగి ఉంటారో, అటువంటి వారి యొక్క యోగక్షేమములు నేను వహిస్తాను.

ఇది ఒక ప్రముఖమైన శ్లోకం. అందరి నోళ్లలో ఆడుతున్న శ్లోకం. ఏకంగా ఎల్ ఐ సి వారు యోగక్షేమం వహామ్యహం అని తమ స్లోగన్‌గా పెట్టుకున్నారు. గీతలో 18 అధ్యాయాలు ఉన్నాయి. వాటిలో మధ్యలో ఉన్న అంటే తొమ్మిదవ అధ్యాయంలో 22వ శ్లోకం గా ఉన్న ఈ శ్లోకం, గీతలో మధ్యలో ఉన్నందు వలన గీత అనే రత్నహారానికి మధ్యలో ఉన్న పతకం అంటే పెండెంట్ లాగా అందరి హృదయాలలో విరాజిల్లుతూఉంది. గీతా సారం అంతా ఇక్కడ పొందుపరిచారు అని అనుకోవచ్చు.

ముందుగా "అనన్యాశ్చిన్తయన్తో మాం యే జనా పర్యుపాసతే" అంటే ఎవరైతే ఇతరములైన ఆలోచనలు, చింతనలు, భావాలు మనసులో పెట్టుకోకుండా ఏకాగ్ర చిత్తంతో నన్ను నిరంతరము ధ్యానిస్తూ ఉంటారో... అని అర్థం. ఇది మనం అందరం చేయాల్సిన పని. దీనికి బదులుగా పరమాత్మ చేసే ప్రత్యుపకారం ఏమిటంటే తేషాం అటువంటి వారికి, ఎటువంటి వారికి అంటే మరలా చెబుతున్నాడు. నిత్యాభియుక్తానాం అంటే ఎల్లప్పుడూ నా యందే తమ మనసును చిత్తమును, లగ్నం చేసిన వారికి, పరమాత్మ ఏం చేస్తాడంటే, "యోగక్షేమం వహామ్యహమ్" వారి యోగము, క్షేమము నేను వహిస్తాను. యోగము అంటే లేని దానిని సమకూర్చుకోవడం. క్షేమము అంటే సమకూర్చుకున్న దానిని చక్కగా రక్షించుకోవడం. అంటే జీవితంలో సుఖం అంటూ లేని

వారికి నిత్యం సుఖం, సంతోషంగా ఉంటుంది. ఆ సుఖం, సంతోషం ఎప్పటికీ వారి వద్దనే క్షేమంగా ఉంటుంది. ఇంతకన్నా మానవుడికి కావాల్సింది ఏముంది. ఎందుకంటే సాధకుడి యోగక్షేమములకు పరమాత్మ బాధ్యత వహిస్తున్నాడు. బాంకు గారంటీ మాదిరి ఇస్తున్నాడు.

కాని పరమాత్మ మనకు ఈ సాయం చెయ్యాలంటే మనం ఏం చెయ్యాలి అనేది మొదటి పాదంలో స్పష్టంగా వివరంగా విపులంగా చెప్పాడు. అందులో మొదటి పదం అనన్య అంటే సాటి లేని, పోల్చలేని, భక్తి. భగవంతుని మీద తప్ప ఇంక ఇతరములైన ప్రాపంచిక వస్తువుల మీద ఆసక్తి లేకుండా ఉండటం. అప్పుడు మనసు పరమాత్మమీద లగ్నం అవుతుంది. ఏకాగ్రచిత్తముతో భగవంతుని ధ్యానం సాధ్యం అవుతుంది. ఈ శ్లోకాన్ని 21 శ్లోకం తరువాత చెప్పారు. ఆ శ్లోకంలో తాత్కాలిక సుఖములను ఆశించి వేదములలో చెప్పబడిన యజ్ఞయాగములను, క్రతువులను చేసేవారు తాత్కాలికమైన స్వర్గలోక సుఖములను పొందుతారు. ఈ శ్లోకంలో అలా కాకుండా పరమాత్మ మీద ఏకాగ్రచిత్తము కలిగి ఉండాలి అని చెబుతున్నాడు. వీటి మధ్య తేడా గ్రహించాలి. 21 శ్లోకంలో వాళ్లు సకామ కర్మలు, కోరికతో కూడిన కర్మలు చేస్తారు. పుణ్యం కోసం చేస్తారు. ఆపుణ్యఫలము అనుభవిస్తారు. ఈ శ్లోకంలో వాళ్లు అనంతమైన సుఖం కోసం పరమాత్మ మీద అనన్యమైన చింతన కలిగి ఉంటారు. ఇదే తేడా.

మానవులలో ఉన్న భక్తి మూడురకాలు అని ఇదివరకే చెప్పుకున్నాము. కొందరు తమకు ఆపద కలిగినపుడే, కష్టం కలిగినపుడే భగవంతుని ప్రార్థిస్తారు. వారిది ఆర్తి భక్తి. మరి కొందరికి ప్రాపంచిక విషయములు ధన సంపాదన, ఆ ధనముతో సుఖాలు అనుభవించడం. ఇటువంటి వారికి దేవుడి మీద భక్తి ఉంటుంది. కాని కోరికలు కోరుకోవడం వరకే. ఎవరు కోరికలు తీరిస్తే వారిని పూజిస్తారు. అదీ కాసేపుపూజ మరలా ప్రాపంచిక విషయాలు. కోరికలు తీరగానే భగవంతుని గురించి ఆలోచించరు. మరలా ఏదైనా కష్టంవచ్చినపుడు, కోరికలు తీరాలి అని అనుకున్నప్పుడు వారి ఇష్టదైవాన్ని పూజిస్తారు. వీరినే ఆర్తులు, అర్థార్థులు అని ఇంతకుముందు చెప్పారు. వీరిని అనన్య భక్తులు అనలేము.

మూడవ రకం వారు అనన్య భక్తులు. వీరికి పరమాత్మ తప్ప మరోఆలోచనుండదు. తనను తాను పూర్తిగా పరమాత్మకు అర్పించుకుంటాడు. అతడు ఎక్కడ ఏ పని చేస్తున్నా, మనసు మాత్రం పరమాత్మయందే లగ్నం అయి ఉంటుంది. ఈ రకం భక్తుల గురించి భగవానుడు ఈ శ్లోకం చెప్పాడు. కానీ ఆఖరు నాలుగు పదాలు చదివి అంతా భగవంతుడే చూసుకుంటాడు. నేనేం చెయ్యక్కర్లేదు అంటూ కాళ్లు పారజాపుకొని పడుకొనే వారినిగురించి కాదు. దీనికి ఉదాహరణగా కుచేలుడుగా పేరుగాంచిన సుదాముడు. అర్జునుడు చక్కని ఉదాహరణలు. కృష్ణుడు అర్జునుడికి సారథిగా ఉండటానికికూడా అంగీకరించాడు. ఆయన యోగక్షేమాలు తన మీద వేసుకున్నాడు. కుచేలుడు తాను కృష్ణుని వద్దకు వెళ్లి కూడా ఏమీ అడగకుండానే తిరిగి వచ్చేసాడు.

కాని కుచేలునికి సకల సంపదలు సమకూర్చాడు పరమాత్మ. అలాగే గజేంద్రుడు నీవే తప్ప నిత: పరంబెరుగ అంటూ ఎలుగెత్తి అరిచాడు. ప్రహ్లాదుడు శ్రీహరి కోసం తండ్రినే ఎదిరించి నిలిచాడు. చావుకు కూడా భయపడలేదు. అన్ని కష్టాలు ఆనందంగా భరించాడు. భక్తి అంటే అలా ఉండాలి. అటువంటి వారి గురించి ఈ శ్లోకం చెప్పబడింది.

ఇటువంటి భక్తుడు తన ప్రయత్నం తాను చేస్తాడు. ఇంక అతని వల్ల కానపుడు, పరమాత్మ అతని పక్కనే ఉండి అతడి యోగక్షేమాలు వహిస్తాడు. ఇదీ పరమాత్మ అనన్యభక్తులకు ఇచ్చిన హామీ. మరి ఈ అనన్యభక్తులు ఏ కులం, ఏ జాతి వారు అని సందేహం వస్తుంది. దానికి సమాధానమే యే జనా: అంటే ఏ జనులు అని సంబోధించాడు. అంటే కులము, జాతి ధనిక., పేద, ఆడ, మగ అని అనలేదు. ఎవరైనా సరే అని క్లీన్ చిట్ ఇచ్చాడు. కాబట్టి పరమాత్మ కొంతమందికే లభ్యం అవుతాడు, ధనం ఉన్నవారికే దైవం పలుకుతాడు అనడం తప్పు. అనన్య చిత్తము కలిగి ఎవరైతే పరమాత్మను ఉపాసిస్తారో వారందరి యోగక్షేమములను పరమాత్మ తానే వహిస్తాడు. దానికి అర్హత ఏమిటంటే నిత్యాభియుక్తానాం అంటే అను నిత్యము అంటే ఎల్లప్పుడూ నా యందే నిష్ఠ, శ్రద్ధ, భక్తి కలిగి ఉండాలి. "నీవే తప్ప నిత: పరం బెరుగ " అనే స్థితికి చేరుకోవాలి. అటువంటి వారి యొక్క యోగక్షేమములు నేను వహిస్తాను అని హామీ ఇచ్చాడు కృష్ణుడు. మనందరం కూడా ఆ స్థాయికి ఎదగడానికి ప్రయత్నం చేయాలి. మనం ఏ చేయాలో ముందు పాదంలో చెప్పి తాను ఏం చేస్తాడో తరువాతి పాదంలో చెప్పాడు పరమాత్మ.

## 23. యే2ప్యన్యదేవతాభక్తా యజన్తే శ్రద్ధయాన్వితా:।
## తే2పి మామేవ కౌన్తేయ యజన్త్యవిధిపూర్వకమ్॥

ఏ భక్తులైతే నన్ను కాకుండా ఇతర దేవతలను కేవలం శద్ధాభక్తులతో పూజిస్తూ ఉంటారో, అటువంటి వారు కూడా వేదములలో చెప్పబడిన విధివిధానాలతో నన్ను పూజించక పోయినా, ఏదోవిధంగా నన్ను పూజించినట్టే.

మనకు చాలామంది దేవుళ్లు దేవతలు ఉన్నారు. విష్ణుపురాణంలో విష్ణువు, శివపురాణంలో శివుడు, దేవీభాగవతంలో అమ్మవారు, భాగవతంలో కృష్ణుడు, రామాయణంలో రాముడు, ప్రస్తుత కాలంలో షిర్డిసాయిబాబా, ఈ ప్రకారంగా ఎవరి అభిరుచికితగ్గట్టు వారికి పురాణాలు, కావ్యాలు, చరిత్రలు రచింపబడ్డాయి. ఎవరికి ఏ దేవుడు ఇష్టం అయితే ఆ దేవుడిని పూజించవచ్చు, ఉపాసించవచ్చు. కాని మా దేవుడే గొప్ప, మీ దేవుడు అసలు దేవుడే కాదు అనడం తప్పు. ఈ భావన అసలు రాకూడదు. సర్వదేవనమస్కార: కేశవం ప్రతిగచ్ఛతి అంటే ఏ దేవుడికి నమస్కారం చేసినా, అది పరమాత్మకే చెందుతుంది. కాకపోతే భక్తులలో ఉండే భేదాలను బట్టి వారి వారి పూజావిధానాలు, పూజించే దేవతామూర్తులు మారుతూ ఉంటారు.

ఈ శ్లోకంలో పరమాత్మ రెండవ తరగతి భక్తుల గురించి చెబుతున్నాడు. ఈ రకం భక్తులకు ఒక దేవుడు అంటూ ఉండరు. కాని శ్రద్ధ,భక్తి ఉంటుంది. ఏ దేవుడు తన కోరికలు తీరుస్తాడు అనుకుంటే ఆ దేవుడిని ఉపాసిస్తారు. ఆ యజ్ఞాలు చేస్తారు. కోరికలు తీరడం కోసమే యజ్ఞయాగాలు క్రతువులు చేస్తారు. వారికీ భక్తి ఉంటుంది. అది అనన్య భక్తి కాదు. వారు ఇతర దేవతలకు శ్రద్ధతో చేసే ఆరాధనలు అన్నీ నాకే చెందినా, ఆ విషయం వారికి తెలియదు. తాము పూజించే దేవుడే గొప్ప అనే అజ్ఞానంలో ఉంటారు. అంటే అవిధి పూర్వకమ్ అంటే ఎటువంటి శాస్త్రపరిజ్ఞానం లేకుండా ఆరాధిస్తారు. పరమాత్మ ఆత్మస్వరూపుడుగా అందరిలోనూ, అన్ని దేవతామూర్తులలోనూ ఉన్నాడు అనే జ్ఞానం వీరికి ఉండదు. ఏ దేవతను, ఏ దేవుడిని పూజించినా, ఆ దేవత, ఆ దేవుడి రూపంలో వారి వారి కోరికలు తీర్చేది నేనే అనే జ్ఞానం వారికి ఉండదు. దేవతామూర్తుల మధ్యబేధభావంతో, అజ్ఞానంతో పూజిస్తారు.

వీరు పరమాత్మను సాకారంగా ఆరాధించే సకామ భక్తులు. ఇతర దేవతలను వివిధ నామ రూపాలతో ఆరాధిస్తారు. వారు ఏ దేవతలను దేవుళ్లను ఆరాధించినా వారు శ్రద్ధతో ఆరాధిస్తే, ఆ ఆరాధనలు అన్నీ పరమాత్మకే చెందుతాయి. సర్వదేవ నమస్కార: కేశవం ప్రతిగచ్ఛతి అని మనం చెప్పుకుంటాము. అంటే సకామభక్తులు తమయొక్క వివిధములైన కోరికలు తీరడానికి వివిధములైన దేవతామూర్తులను పూజించినా, ఆపూజలు అన్నీకూడా పరమాత్మకే చెందుతాయి., అలాగే నిష్కామభక్తులు మోక్షాన్నికోరుకుంటూ ఉపాసించే ఉపాసనలు కూడా నిరాకారుడైన పరమాత్మకే చెందుతాయి.

కాని కోరికల తీరడం కొరకు దేవతామూర్తులను ఆరాధించే భక్తులు అక్కడే ఆగి పోతున్నారు. ముందుకుసాగడం లేదు. కోరికలు కోరుకోవడం, అవి తీరగానే కొత్త కోరికలు కోరడం. వీరి భక్తి,శ్రద్ధ,పూజలు, వ్రతాలు, యాగములు, కోరికల వరకే పరిమితం అవుతున్నాయి. ఎందుకంటే ఈ సాకార రూప అర్చన, నామరూప అర్చన విధిపూర్వకము అయినది కాదు. అంటే మనం పెద్ద చదువులు చదవకుండా టెన్త్ క్లాసుతో ఆపేసి అదే గొప్ప చదువు అనుకున్నట్టు. అదే అజ్ఞానం. అందరూ సగుణోపాసన నుండి ముందుకుసాగి నిర్గుణ బ్రహ్మను ఆరాధించి పరమాత్మను చేరుకోవడానికి ఈ జనన మరణ చక్రం నుండి విముక్తి పొందడానికి ప్రయత్నం చేయాలి.

అవిధి పూర్వకం అని ఎందుకన్నారంటే వివిధ దేవతారాధనలు కేవలం ప్రాపంచిక కోరికలు తీరడానికి స్వర్గసుఖాల కోసం చేయబడుతున్నాయి. కోరికలు ఉన్నంతవరకు వాసనలు ఉంటాయి అవి ఉన్నంత వరకు పునర్జన్మ తప్పదు. జనన మరణ చక్రం నుండి విముక్తి పొందితే కానీ పరమాత్మ దర్శనం కాదు. వేదాలలో, శాస్త్రాలలో నిర్గుణబ్రహ్మను ఆరాధించడం గురించి చెప్పబడింది. అందుకని అది విధిపూర్వకం కాదు అని అన్నాడు కృష్ణుడు.

## 24. అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ।
## న తు మామభిజానన్తి తత్త్వేనాతశ్చ్యవన్తితే॥

మానవులు చేసే సకల కర్మలయొక్క, యజ్ఞముల యొక్క ఫలములను స్వీకరించే భోక్తను నేనే. ఆ యజ్ఞములకు, కర్మలకు తగిన ఫలములను ఇచ్చే ప్రభువును నేనే. కాని ఈ విషయం అందరికీ తెలియదు. తెలుసుకోడానికి ప్రయత్నం చేయరు. ఆ కారణంగా అన్నీ తామే చేస్తున్నామనే అజ్ఞానంలో ఉన్నారు. జ్ఞానమార్గంనుండి జారిపోతున్నారు.

యజ్ఞయాగములు, క్రతువులు, పూజలు, వ్రతాలు, కర్మలు ఏదో ఒక కోరికతో, ఎవరో ఒక దేవతను ఉద్దేశించి చేస్తారు. ఏ దేవతను ఉద్దేశించి చేస్తున్నారో ఆ దేవతా మూర్తిని భోక్త అని అంటారు. ఆ పూజలు, యజ్ఞయాగములు అన్నీ ఆ దేవతకే చెందుతాయి. కాని ఈ సకల చరాచర జగత్తుకు ప్రభువును నేను. అన్నింటిలో నేనే ఉన్నాను. కాబట్టి మానవులు చేసే యజ్ఞయాగములకు, క్రతువులకు ప్రభువు, భోక్త రెండూ నేనే. ఈ విషయం ఆ చేసేవాడికి తెలియదు అని అంటున్నాడు పరమాత్మ.

ఇక్కడ మనం యజ్ఞముల స్థానంలో మనం రోజూ చేసే పూజలు, వ్రతాలు, క్రతువులు, హెూమాలు చెప్పుకోవచ్చు. మనం కూడా ఈ పూజలు వ్రతాలు అన్నీ ఏదో ఒక దేవుడిని, దేవతను ఉ ద్దేశించి, ఏదో ఒక కోరికతో చేస్తాము. ఏ దేవత గురించి చేస్తున్నారో ఆ దేవత భోక్త అవుతాడు. యజ్ఞములు, యజ్ఞములు, అవి ఎవరిగురించి చేస్తున్నారో ఆ దేవతా స్వరూపము, ఈ రెండింటికీ ప్రభువును అంతా పరమాత్మయే. ఈ విషయం తెలియని అజ్ఞానులు వివిధ దేవతలకు వివిధ పేర్లతో పూజలు వ్రతాలు చేస్తున్నారు. అవన్నీ తనే చేస్తున్నాడు, ఆ ఫలములు తానే అనుభవిస్తున్నాడు అనే అజ్ఞానంలో ఉంటాడు. కాని, ప్రభువు, భోక్త రెండూ నేనే అనే సత్యాన్ని తెలుసుకుంటే పరమాత్మను పొందుతారు. కోరికలు ఉండవు. వాసనలు ఉండవు. పునర్జన్మ ఉండదు.

కాబట్టి మానవులందరూ పరమాత్మ గురించిన అసలు జ్ఞానమును అలవరచుకోవాలి. అన్ని దేవతా స్వరూపాలు పరమాత్మయే. మన అజ్ఞానం కొద్దీ దేవతలకు రకరకాల పేర్లు రూపాలు కల్పించి వారి మధ్య బేధభావమును కల్పిస్తున్నాము. కోరికలు కోరుతున్నాము. సంసారము అనే మాయలో పడి పోతున్నాము. పరమాత్మ సర్వాంతర్యామి, అన్ని దేవతలలోనూ, జీవరాసులలోనూ ఆత్మస్వరూపుడుగా ఉన్నాడు. ఇది తెలుసుకోవడమే జ్ఞానము. ఈ జ్ఞానం ఉన్నవారికి దేవతామూర్తులమధ్య ఎటువంటి భేధభావము ఉండదు. ఇవన్నీ నేనే చేస్తున్నాను, ఈ ఫలములు నాకే చెందాలి అనే అహంకారమూ ఉండదు. ఆ సమత్వాన్ని మనందరం అలవరచు కోవాలి.అలాకాకుండా వివిధ దేవతా మూర్తుల మధ్య బేధభావంతో, ఒకరిని పూజిస్తూ, మరొకరిని

ద్వేషిస్తూ, ఏవేవో కోరికలు కోరుకుంటూ, ఎంతో భక్తి, శ్రద్ధలతో వివిధములైన పూజలు, వ్రతాలు, యజ్ఞయాగాలు చేసినా, వారు నా గురించి ఏ మాత్రం తెలుసుకోలేరు. మరలా మరలా సంసారములో పడుతూ ఉంటారు. జనన మరణ చక్రంలో తిరుగుతూఉంటారు.

25. యాన్తి దేవవ్రతా దేవాన్ పితౄన్ యాన్తి పితృవ్రతాః।
భూతాని యాన్తి భూతేజ్యా యాన్తి మద్యాజినోఽపి మామ్॥

వివిధములైన దేవతా మూర్తులను పూజించేవారు ఆయాదేవతలను, పితృదేవతలను పూజించేవారు పితృదేవతలను, భూతములను పూజించేవారు, భూతములను, నన్ను పూజించేవారు నన్నుపొందుతున్నారు.

అందరూ దేవతలు, దేవుళ్లు ఒకటే అని చెప్పిన తరువాత పరమాత్మ ఇంకొక విషయం కూడా చెబుతున్నాడు. ఈ మానవులు మాయలో పడి ఉన్నారు. వీళ్లు మారరు అని ఆయనకు తెలుసు. అందుకే ఏయే దేవతలను పూజిస్తే ఏయే ఫలితాలు కలుగుతాయో క్లుప్తంగా వివరిస్తున్నాడు. దేవతలలో రకాలు తెలుసుకోవాలి. దేవతామూర్తులు, పితృదేవతలు, భూతములు అని వాడాడు. అశాశ్వతములైన దేవతామూర్తులను పూజిస్తే వారినే పొందుతారు. శాశ్వతుడు, అవ్యయుడు అయిన పరమాత్మనుపూజిస్తే ఆయననే పొందుతారు. కాబట్టి తాము పూజించే, అర్చించే, ఉపాసించే దేవతల స్వరూప స్వభావాలను తెలుసుకొని పూజించాలి. నిరాకారుడు, నిర్వికల్పుడు, సర్వాంతర్యామి, అవ్యయుడు, ఆదిమధ్యాంతరహితుడు, అజుడు, సనాతనుడు అయిన పరమాత్మను పూజిస్తే శాశ్వతమైన పరమపదమును పొందుతారు. అలాకాకుండా ఏదో ఒక కాలంలో పుట్టి, కాలానుగుణంగా మరణించిన ఇతరదేవతామూర్తులను పూజిస్తే, వారినే పొందుతారు. సాధకుడు ఈ తారతమ్యమును తెలుసుకోగలగాలి. ఎందుకంటే ఎవరుసాధన చేసినా శాశ్వతమైన సుఖాన్ని శాంతిని, పునరావృత్తి లేని శాశ్వతబ్రహ్మ పదమును కోరుకుంటారు కానీ జనన మరణ చక్రంలో పడి తిరుగుతూ ఉండాలని కోరుకోరు కదా! పరమ పదము, బ్రహ్మ పదము, మోక్షం అంటే ఒకరు ఇచ్చేది కాదు. పుచ్చుకునేది కాదు. పరమాత్మను గురించి తెలుసుకోవడమే, ఆత్మజ్ఞానంకలిగి ఉండటమే మోక్షం. ఉన్నది ఉన్నట్టు తెలుసుకోవడం. పరమాత్మను గురించిన జ్ఞానం కలిగి ఉండటం. ఇది ఎవరికి వారుసాధించాలి కానీ ఎవరూ ఇచ్చేది కాదు.

వివరంగా చెప్పుకోవాలంటే, మోక్షం కొరకు ఎవరూ ప్రయత్నించడం లేదు. కేవలం ప్రాపంచిక సుఖముల కొరకు ప్రయత్నం చేస్తున్నారు. వాటి కొరకు వివిధ దేవతలను ఆరాధిస్తున్నారు. ఏయే దేవతలను ఆరాధిస్తే వారు ఆయాదేవతలను చేరుకుంటారు. పితృదేవతలను ఆరాధిస్తే పితృదేవతలను చేరుకుంటారు. భూతములను అంటే వామాచార పద్ధతులలో మద్యమాంసములతో,

జంతుబలులతో, నరబలులతో, ఘోరరూపములతో ఉన్న దేవతామూర్తులను, గ్రామదేవతలను, పూజిస్తారో, ఆరాధిస్తారో, తమ శత్రువుల వినాశం కోరి అభిచార హోమములను చేస్తారో, అటువంటి వారు, వాటికిఅనుగుణములైన ఫలితములను పొందుతారు. పరమాత్మను ఆరాధిస్తే పరమాత్మను పొందుతారు. యద్భావం తద్భవతి అని చెబుతారు. అలాగే మనం ఏదేవతను ఏయే రూపంలో ఆరాధిస్తామో ఆయారూపాలనే పొందుతాము. కాబట్టి సాధకుడు, పరమాత్మను ముందు సాకారంగా సగుణంగా విగ్రహారాధనతో మొదలుపెట్టినా తుదకు నిర్గుణుడు అయిన పరమేశ్వరునే నమ్ముకోవాలి. నిర్గుణోపాసన చేసి పరమాత్మలో ఐక్యం అవడానికి ప్రయత్నం చేయాలి. మరలా జన్మ లేకుండా చూచుకోవాలి. అంతే కానీ వివిధ దేవతారాధనలు, కోరికలు.... ఇక్కడే ఆగి పోకూడదు.

ఈ విషయాన్ని మనం లౌక్యంగా చెప్పుకుంటే, పంచాయతీ బోర్డు సర్పంచ్, జడ్‌పీ ఛేర్‌మన్, యం ఎల్ ఏ, యంపి, మినిష్టర్, ఛీఫ్ మినిష్టర్ వీరందరినీ ఎంతో మంది ఆశ్రయిస్తుంటారు. వారు కూడా తమ తమ పరిధుల్లోనే సాయం చేయగలరు. అంతే కానీ, తమ శక్తికి మించి, అధికారానికి మించి సాయం చేయలేరు. అలాగే దేవతలు కూడా.

## 26. పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి। తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః॥

ఎవరైతే నాకు భక్తితో ఆకు కానీ, పువ్వుకానీ, ఫలము కానీ, నీరు కానీ నివేదిస్తాడో, అటువంటి భక్తుడు నాకు నివేదించిన వాటిని నేను ప్రీతితో స్వీకరిస్తాను.

ఇక్కడ మరొక ముఖ్యమైన విషయం ప్రస్తావిస్తున్నాడు పరమాత్మ. ఈ మానవులు ఎంత చెప్పినా వినరు అని తెలుసుకున్న పరమాత్మ మరొక విషయం చెబుతున్నాడు. పూజలు వ్రతాలు అన్నీ చేస్తారు. వివిధ రూపాలతో పేర్లతో పూజిస్తారు. షోడశ ఉపచారాలు చేస్తారు. అన్నీ తుదకు నైవేద్యంతో ముగుస్తాయి. నైవేద్య రూపంలో ఏం పెట్టాలి. ఇది అందరికీ ఒక చిక్కు ప్రశ్న.

ఆపువ్వు పనికి రాదు. ఈ నివేదన పనికిరాదు. అది స్వామికి ఇష్టం ఉండదు. ఆ నివేదన అంటే స్వామికి ప్రీతి. శివుడికి ఈ పూలు పెట్టాలి. విష్ణువుకు ఆ పూలు పెట్టాలి. ఇది మా గురువుగారు చెప్పారు. అదిమరొక స్వామీజీ చెప్పాడు. సాయిబాబా అలంకార ప్రియుడు. ఫలహారములు కూడా, 3, 9, 12, 21, 108 ఇలా పెట్టాలి. లేకపోతే దేవుడికి కోపం వస్తుంది. హారతులు కూడా రోజుకు ఇన్ని సార్లు ఇవ్వాలి. దీపారాధనలో ఇన్ని వత్తులు వెయ్యాలి. ఇటువంటి అపోహలతో కొట్టుకుంటున్న మానవులకు, వారి సందేహాలకు చక్కని సమాధానం ఈ శ్లోకం ద్వారా ఇచ్చాడుపరమాత్మ.

ఏదో ఒక ఆకు (తులసి దళం, బిల్వ పత్రం), పుష్పం (పారిజాత పుష్పం) ఫలం (నీ ఇష్టంవచ్చిన కాయ పండు), ఇవన్నీ దొరక్కపోతే తోయం అంటే కాసిని నీళ్లు ఇవి ఏవి ఇచ్చినానేను తృప్తిపడతాను. అని చెబుతూ ఇవి ఎలా సమర్పించాలి అని కూడా చెప్పాడు. ప్రయతాత్మన: అంటే ఇచ్చే వాడు నిర్మలమైన మనస్సుతో, పరిశుద్ధమైన అంత:కరణతో, ఇవ్వాలి. మరొక లక్షణం కూడా చెప్పాడు. భక్త్యుపహృతం అంటే భక్తితో ఇవ్వాలి. కాబట్టి భగవంతునికి ఏది ఇచ్చినా నిర్మలమైన మనసు, భక్తి ఈ రెండూ ముఖ్యము. ఆ ప్రకారంగా ఇచ్చినవి మాత్రమే నేను ప్రీతితో స్వీకరిస్తాను అని స్పష్టంగా చెప్పాడు పరమాత్మ.

భగవంతుడికి ఏమి నివేదన చెయ్యాలి. అనేది అందరి మనసులలో మెదిలే ప్రశ్న. పేదవాళ్లు ఉంటారు, ధనికులు ఉంటారు, పండితులు, పామరులు ఉంటారు. అందుకే అందరికీ అందుబాటులో ఉన్న వాటినే చెప్పాడు పరమాత్మ. కాబట్టి స్వామికి చక్ర పొంగలి, పులిహోర, దధ్యోజనం సమర్పించలేదు అనీ ఎవరూ దిగులు చెంద పని లేదు. అన్నీ ఆయనే మనకు ఇచ్చాడు కాబట్టి ఆయన ఇచ్చిన వాటిని తిరిగి మనం ఆయనకు ఇచ్చేదేమిటి. కాబట్టి భక్తిపూర్వకంగా నిర్మలమైన మనస్సుతో ఏమి ఇచ్చినా తీసుకుంటాడు పరమాత్మ. ఏవేవో కోరికలతో యజ్ఞయాగములు, పూజలు, వ్రతాలు చేసే వాళ్లు ఎన్నో నియమాలు పాటించాలి. వివిధ రకములైన పూలతో పూజలు చేయాలి. షోడశోపచారములు చేయాలి. మూడు, ఐదు, ఏడు, తొమ్మిది, పన్నెండు, పదునెనిమిది రకాల పిండి వంటలతో నివేదన చేయాలి. ఇందులో ఏ ఒక్కటి తప్పినా తన కోరిక సిద్ధించదు అని చేసేవాడి దిగులు. అంటే వీరి దృష్టి అంతా చేసే యజ్ఞం మీదా, నివేదించే ఫలహారాల మీదా, తీరని కోరికల మీదా. అంతే కాని పరమాత్మ మీద కాదు. కాని నిష్కామభక్తునికి ఇవేమీ అవసరం లేదు. ఎందుకంటే వాడికి ఏ కోరికా లేదు కాబట్టి. వాడు ఇన్ని రకాల పూజలు, నివేదనలు చేయనవసరం లేదు. చిన్ని ఆకు,పువ్వు,పండు లేక కాసిని నీళ్లు సమర్పించినా నేను సంతోషిస్తాను అన్నాడు పరమాత్మ.

అందుకే, పూర్వపురోజుల్లో దేవాలయాలు ఆగమ శాస్త్ర ప్రకారం కట్టబడేవి. దేవాలయాల పక్కన కోనేరు లేకపోతే పెద్ద బావి, విష్ణ్వాలయం అయితే పారిజాతం చెట్టు, ఇతర ఫల వృక్షాలు, శివాలయం అయితే మారేడు చెట్టు ఉండేవి. ఆలయంలోకి రాగానే కాళ్లు కడుక్కొని శుద్ధిఅయి, ఒక బిల్వమో లేక పారిజాత పుష్పమో కోసుకొని లోపలకు పోయి దేవుడికి భక్తితో అర్పించేవారు. ఈనాటికి కూడా వారణాసిలో పండు ముసలి వాళ్లు కూడా గంగానదిలో స్నానం చేసి, చిన్న రాగి చెంబుతో నీళ్లు తీసుకొని పోయి ఆ పరమశివుడి మీద పోసి నమస్కారం చేస్తారు. కాని మనకు మాత్రం టెంకాయ కొడితే కానీ తృప్తి ఉండటం లేదు. మనం ఎంత ఘనంగా ప్రసాదాలు పంచామో అనే లెక్కలు వేస్తున్నారు. ధనికులు ఏం చేసినా చెల్లుతుంది. ఏమీలేని వాడు

కూడా ఆ విధంగాచేయాలి అని అనుకోవడం అవివేకం.

అందుకే అందరికీ అందుబాటులో ఉండే వాటిని నాకు అర్పించమన్నాడు పరమాత్మ. వాటికి నిర్మలమైన మనస్సు, భక్తి జోడిస్తే, వాటిని నేను ప్రేమతో స్వీకరిస్తాను అని అన్నాడు. ఏవేవో కోరికలు కోరుకుంటూ ఈకోరికలు ఈ దేవుడు తీరుస్తాడా లేదా అనే సందేహంతో, మలినమైన మనస్సుతో వజ్రకిరీటాలు సమర్పించినా దేవుడు సంతోషించడు. పరిశుద్ధమైన మనసుతో చిన్ని పువ్వు, దళము కూడా స్వీకరిస్తాడు. ఇది అందరికీ తెలుసు కాని ఎవరూ చెయ్యరు. కాబట్టి మనం ఏమి నివేదన చేసాము అనేది కాదు ముఖ్యం. దానిని నిర్మలమైన భక్తితో ఇచ్చామా లేదా అనేది ముఖ్యం. మనం చేసే పూజలలో, వ్రతాలలో, కావాల్సింది ఆర్భాటం కాదు, నిర్మలమైన మనస్సు, భగవంతుని ఎడల భక్తి. ఈ రెండింటికీ ఎటువంటి ధనం అవసరం లేదు. ఏ పూజ చేసినా వ్రతం చేసినా నిర్మలమైన మనస్సు భక్తి లేకపోతే అవి వ్యర్థము. ఇవి పూజలకు కావాల్సిన అర్హతలు.

అందుకే ఇంతకు ముందు శ్లోకములలో అనన్య భక్తి శ్రద్ధ అని వాడారు. ఇక్కడ నిర్మలమైన అంత:కరణము, భక్తి అని వాడారు పరమాత్మ. మనం శ్రీకృష్ణతులాభారము నాటకం, సినిమా చూస్తాము. అందులో నటించిన నటీనటులు, వారుపాడినపాటలు పద్యాల గురించి, రాగాల గురించి పట్టించుకుంటాము కానీ ఆ నాటకంలోని అంతరార్థంమాత్రం గ్రహించడానికి ప్రయత్నం చేయము. అందులో శ్రీకృష్ణుని ధనముతో, బంగారముతో తూచాలని ప్రయత్నించి విఫలమైన సత్యభామది సకామభక్తి, కేవలం ఒక తులసీ దళంతో శ్రీకృష్ణుని తూచిన రుక్మిణిది నిష్కామభక్తి. అలాగే విదురుడు తన ఇంటికి వచ్చిన కృష్ణుడికి ఆతిథ్యము ఇస్తూ, శ్రీకృష్ణుని మీద భక్తి పారవశ్యముతో అరటి పండు ఒలిచి, పండు కింద పడేసి, తొక్కలను ఆయనకు ఇచ్చాడు. వాటిని కృష్ణుడు ప్రీతితో ఆరగించాడు. అలాగే కుచేలుడు తన చినిగిన పంచలో మూటకట్టిన పిడికెడు అటుకులను, కృష్ణుడు వెదికి తీసుకొని మరీ ఆరగించాడు. మనం వీటిని కథలుగానే చదువుతాము కానీ అంతరార్థం తెలుసుకోడానికి ప్రయత్నం చేయము. రుక్మిణి, విదురుడు, కుచేలుడు వీరి నిష్కామభక్తి, అనన్యభక్తి, నిర్మలమైన మనసు గురించి అర్థం చేసుకోము. ఇది అర్థం అయితే ఈ శ్లోకం కూడా చక్కగా అర్థం అవుతుంది.

భగవంతుని అనుగ్రహము మనం ఆయనకు ఏమి ఇచ్చామో అనేదాని మీద ఆధారపడి ఉండదు. ఇచ్చిన వాడి మనసు మీద ఆధారపడి ఉంటుంది. అతడి మనసులో నిర్మలమైన భక్తి, ఏకాగ్రమైన భక్తి, అనన్య భక్తి ఉంటే చాలు, అతడు ఏమి ఇచ్చినా పరమాత్మ ప్రీతితో స్వీకరిస్తాడు. పరమాత్మ అనుగ్రహం పొందడానికి ధనధాన్యములు, భోగభాగ్యములు శాస్త్ర పరిజ్ఞానము అవసరంలేదు, భక్తి, చిత్తశుద్ధి మాత్రమే అవసరం అని స్పష్టంగా చెప్పాడు కృష్ణుడు. చిత్తశుద్ధిలేని శివపూజలేలరా అని వేమన గారు అన్నారు కదా! అనన్యభక్తి, చిత్తశుద్ధి ఎంతటి పేదవాడికైనా సిద్ధిస్తుంది. ఇవి బయటదొరికే వస్తువులు కాదు. ప్రతివాడి లోపల ఉండేవి. కాకపోతే వాటిని

మనం సక్రమంగా వినియోగించుకోవడంలేదు. ఆర్భాటాలకు, ఆడంబరాలకు పోతున్నామే కానీ, అవసరమైన వాటి కోసం ప్రయత్నించడం లేదు. అందుకనే ప్రయతాత్మన: అని వాడారు. అంటే నిర్మలమైన మనస్సు, భక్తి, చిత్తశుద్ధి కొరకు ప్రయత్నించేవాడు అనిఅర్థం. అటువంటి ప్రయత్నం మనం కూడా చేయాలి. లేకపోతే మనం చేసే పూజలువ్రతాలు అన్నీ ఎందుకూ పనికిరాకుండా పోతాయి.

## 27. యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్।
## యత్తపస్యసి కౌన్తేయ తత్కురుష్వ మదర్పణమ్॥

అర్జునా! నువ్వు నాకు ఏమీ నివేదనలు చేయనక్కరలేదు. నీవు ఏది చేస్తావో, ఏది తింటావో, ఏ హోమం చేస్తావో, ఏ తపస్సు చేస్తావో, ఏ దానం చేస్తావో, నాకు అనవసరం. వాటిని అన్నిటినీ నాకు అర్పించు. చాలు. నేను తృప్తిగా స్వీకరిస్తాను.

ఇన్ని చెప్పిన తరువాత కూడా మానవులలో మార్పువస్తుందా అని పరమాత్మకు సందేహం కలిగినట్టుంది. అందుకే ఒక బ్లాంక్ చెక్ ఇచ్చాడు. పత్రాలు పుష్పాలు ఇవన్నీ ఎందుకుకానీ, ఒకే మాట చెబుతున్నాను జాగ్రత్తగా విను. నువ్వే ఏది చేసినా, ఏది తిన్నా, ఏ హోమం, యజ్ఞం, యాగం, వ్రతం చేసినా, ఏ దానం చేసినా, ఏ తపస్సు చేసినా, అవన్నీ నాకు నివేదనగా సమర్పించు. అని అన్నాడు. అంటే భగవంతుడికి ఏమి ఇవ్వాలో ఛాయిస్ మనకే వదిలేసాడు. అందుకే కన్నప్ప పెట్టిన మాంస ఖండములను కూడా అంగీకరించాడు మహాశివుడు. అంటే దీని అర్థం మనం ఏ పని చేసినా, ఏం తిన్నా రామార్పణం అనో, కృష్ణార్పణం అనో భగవదార్పణం అనో భావిస్తే, అవన్నీ ఆ పరమాత్మకు చెందుతాయి. వేరే నివేదనలు అక్కరలేదు. ఆ ప్రకారంగా చేస్తే మానవునికి ఆ యా కర్మల వలన కలిగే బంధనములు అంటుకోవు. కాబట్టి సమస్త కర్మలను భగవంతుని పరంగా చేయడం, భగవంతునికి అర్పించడం వలన ఆత్మ సాక్షాత్కారానికి మార్గం సులభము అవుతుంది. ఇక్కడ ఏది చేసినా, ఏది తిన్నా అంటే చేయకూడని పని అనికానీ, తినకూడని పదార్థము అని కానీ కాదు. హితమైన పని, హితమైన పదార్థము అని అర్థం. ఆ స్థితికి చేరుకున్న వాడు హితమైన పనులు మాత్రమే చేస్తాడు.

ఇదంతా ఎందుకు చెప్పారంటే ఈ ప్రపంచంలో ఎవరైనా సరే ఏదో ఒక కర్మ చేయక తప్పదు. ఏదో ఒకటి తినక తప్పదు. ఈ రెండూ నిత్యము చేస్తూ ఉంటారు. ఈ రెండింటినీ నిష్కామంగా చెయ్యి, ఆ కర్మలన్నీ నా పరంగా చెయ్యి. వాటి ఫలితములను నాకు అర్పించు. నీవు చేసే అన్ని కర్మలను, వాటి ఫలములను కృష్ణార్పణం, రామార్పణం, బ్రహ్మార్పణం చెయ్యి అంతే. దీని వలన రెండు లాభాలు కలుగుతాయి. అవి చేసినందువలన కలిగే బంధనములు, సుఖదు:ఖములు నీకు అంటవు. రెండవది భగవంతుని అనుగ్రహం నీమీద ఉంటుంది.

## 28. శుభాశుభఫలై రేవం మోక్ష్యసే కర్మబన్ధనైః।
## సన్న్యాసయోగయుక్తాత్మా విముక్తో మాముపైష్యసి॥

పైన చెప్పిన విధంగా నీవు ఏమి చేసినా, ఏమి తిన్నా, ఏమి తాగినా, వాటి వలన కలిగే శుభ, అశుభ ఫలములు నాకు అర్పిస్తే, ఆ కర్మ ఫలములు వాటి వలన కలిగే బంధనములు నీకు అంటవు. ఏకర్మబంధనములు, వాసనలు లేని నీవునన్ను సులభంగా పొందగలవు.

ఈ శ్లోకం పైన చెప్పబడిన శ్లోకానికి ఫలం ఎలా ఉంటుంది అని తెలియచేస్తుంది. మానవుడు ఏ పని చేసినా, ఏం తిన్నా దానికి శుభమో, అశుభమో ఏదో ఒక ఫలితం కలుగుతుంది. మంచి పని చేస్తే మంచి ఫలితం, తినకూడనిది తింటే అజీర్తి రోగము దాని వలన దు:ఖము కలుగడం సహజం. రామార్పణం, కృష్ణార్పణం అంటూ చేస్తే చేయకూడని పనులు చేయవు, తినకూడని పదార్థములు తినవు. తాగకూడని పానీయములు తాగవు. వాటి వలన కలిగే సుఖదు:ఖములు శుభము అశుభములు నీకు అంటవు. ఆ కర్మ బంధనములకు దూరంగా ఉంటావు. దీనినే మనం ఇదివరకు నిష్కామ కర్మ అని చెప్పుకున్నాము. ఇలా చేసేవారిని సన్న్యాసయోగ యుక్తులు అని అంటారు. అంటే కాషాయాలుకట్టుకొని దండం చేత పట్టుకోవడం కాదు. సన్న్యాస యోగ యుక్తులు అయిఉండాలి. అంటే మనసును చక్కగా ఆత్మయందు నిలిపి ఉంచాలి. అటువంటి వాడు ఈ కర్మ బంధనముల నుండి విడివడి మోక్షమార్గంలో ప్రయాణం చేస్తాడు.

ఈ శ్లోకంలో మోక్షము అనే మాట వాడాడు. అసలు మోక్షము అంటే ఏమిటి? బంధ విమోచనమే మోక్షము. బంధనములు అంటే మనం చేసే కర్మల వలన కలిగే ఫలితముల వలన ఏర్పడే బంధనములు. మనం చేసే అన్ని కర్మలు శుభమో అశుభమో ఏదో ఒకఫలము, బంధనము కలుగజేస్తాయి. ఆ కర్మ బంధనముల నుండి విడివడడమే మోక్షము. దీనికి సన్న్యాసము ముఖ్య సాధనము. సన్న్యాసము అంటే మనసును ఆత్మయందు చక్కగా ఉంచడం. సం న్యాసము అంటే చక్కగా ఉంచడం అని అర్థం. ఇదంతా కలిపి మనం ఇంతకు ముందునిష్కామ కర్మ యోగము అని చెప్పుకున్నాము.

ఇదంతా విన్న తరువాత కొంత మందికి ఒక సందేహం వస్తుంది. అశుభ ఫలం బంధనము కలుగజేస్తుంది. కాని శుభములు కూడా ఎలాబంధనాలు కలుగజేస్తాయి అని. ఒక ఫలితం శుభమో అశుభమో నిర్ణయించేది మనసు. రెండూ అనుభవాలే. రెండూ శాశ్వతాలు కావు. ఒకదాని వెంట ఒకటి వస్తుంటాయి. కాబట్టి రెండూబంధనాలు కలుగజేస్తాయి. బంధించడానికి బంగారుగొలుసు అయినా, ఇనపగొలుసు అయినా ఒకటే. చివరకు జరిగేది బంధనమే. ఈ శుభ

అశుభ ఫలములు నిష్కామ కర్మ చేస్తే కలుగవు. పైశ్లోకంలో చెప్పినట్టు మనం చేసే ప్రతి పనీ పరమాత్మకు అర్పిస్తే కూడా ఈ బంధనములు మనలను బంధించవు. ఒకవేళ బంధించినా వాటి నుండి విముక్తి పొందవచ్చు.

కాబట్టి మనం మన దైనందిన జీవితంలో చేసే ప్రతి కర్మ, పూజ, వ్రతము,దానము మొదలగు వాటిని భక్తితో కృష్ణార్పణం, భగవదార్పణంఅంటూ పరమాత్మకు అర్పిస్తే మనకు ఏ బంధనములు అంటవు. మనం సుఖంగా ఉండవచ్చు తుదకు పరమాత్మను చేరుకోవచ్చు. అదే ఈ శ్లోకంలో తెలియజేసాడు పరమాత్మ.

ఈ శ్లోకంలో సన్న్యాస యోగ యుక్తాత్మా అని వాడారు. సన్న్యాసము అంటే చక్కగా ఉంచడం అంటే మనసును ఆత్మలో ఉంచడం అని అర్థం చెప్పుకున్నాము. అంటేమనం చేసిన కర్మలను అన్నిటినీ పరమాత్మ యందుఉంచడం, పరమాత్మకు అర్పించడం అని అర్థం. లౌకికవిషయాలను, విషయవాంఛలను వదిలివేయడం అని కూడా మరొక అర్థం ఉంది. ఇక్కడ ఆ అర్థం కూడా తీసుకోవచ్చు. అంటే కాషాయాలుకట్టుకొని మఠాలు స్థాపిండంకాదు. హిమాలయాలకు వెళ్లి ముక్కు మూసుకోని కూర్చోవడం కాదు. ఉన్న ఊళ్లోనే, తన ఇంట్లోనే, గృహస్థుగా ఉంటూ కూడా, ప్రాపంచిక విషయాలలో తిరుగుతూ కూడా, ఎటువంటి ఆసక్తి లేకుండా కర్మలు చేయడం, కర్తృత్వభావన లేకుండా కర్మలు చేయడం, నిష్కామంగా కర్మలుచేయడం, చేసిన కర్మల ఫలములను పరమాత్మకు అర్పించడం. ఇది కూడా సన్న్యాసమే. అటువంటి సన్న్యాసయోగమునందు యుక్తుడు అయిన వాడు కర్మబంధనముల నుండి విముక్తుడు అవుతాడు. తుదకు నన్నేపొందుతాడు అని కృష్ణుడు తెలియజేసాడు.

## 29. సమో2హం సర్వభూతేషు న మే ద్వేష్యో2స్తి న ప్రియః।
## యే భజన్తి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్॥

ఓ అర్జునా! నేను (అంటే పరమాత్మ) అన్ని భూతములయందు సమత్వ దృష్టికలిగి ఉంటాను. నాకు ద్వేషింపతగినవాడు కానీ, ప్రియమైనవాడు కానీ ఎవరూ లేరు. అంతా నాకు సమానులే. ఎవరైతే నన్ను ఏకాగ్రభక్తి,అనన్యభక్తితో ఉపాసిస్తారో, నేనువారిలో ఉంటాను. వారు కూడా నాలోనే ఉంటారు.

ఇదివరకు చెప్పిన విషయాన్నే పరమాత్మ మరో కోణంలో వివరిస్తున్నాడు. పరమాత్మ అన్ని జీవులలోనూ ఆత్మస్వరూపంగా స్థితుడై ఉన్నాడు. ఆయనకు ఒకరు ఎక్కువ ఒకరు తక్కువ, ఒకరు ఇష్టుడు, ఒకరు అయిష్టుడు, ఒకరిమీద ప్రేమ మరొకరి మీద ద్వేషము అని లేదు. అందరూ

సమానమే. పరమాత్మ కు ఒకరి మీద ద్వేషము, మరొకరి మీద ఇష్టం కానీ లేవు. కాకపోతే ఎవరు పరమాత్మను భక్తితో సేవిస్తారో వారి వెంట ఉంటాడు. వారిని తనలో కలుపుకుంటాడు.

దీనికి కొంతమంది విపరీతార్థం తీసి పరమాత్మకు కూడా తనకు ఇష్టమైన వాళ్లమీద పక్షపాతం ఉంది అని అంటుంటారు. అందుకే మొదటి పాదంలో నాకు ఎవరి మీదా ఇష్టము అయిష్టము లేవు. నాకు అందరూసమానమే. నాకు దగ్గరగా వచ్చిన వాళ్లను నాలో చేర్చుకుంటాను. నేనూ వాళ్లకు దగ్గర అవుతాను. అని అన్నాడు. ఇది అందరికీ ఓపన్ ఆఫర్. పరమాత్మను ధ్యానించడం పరమాత్మకు దగ్గరవడం మనచేతిలో ఉంది. మనం దూర దూరంగా ఉంటూ ఆయనకు పక్షపాతం అంటే ఎలా. మనం కూడా పరమాత్మకు దగ్గరవడానికి ప్రయత్నం చేయాలి.

ఇక్కడ మన వాళ్లు మరొక వితండ వాదం లేవదీస్తారు. పరమాత్మకు అందరూ సమానమైనపుడు కొందరు ధనవంతులుగా పుట్టి సుఖాలు అనుభవిస్తుంటే మరి కొందరు దరిద్రులుగా దు:ఖం ఎందుకు అనుభవిస్తున్నారు అని వాదిస్తారు. మనం దీని గురించి ఇదివరకే చెప్పుకున్నాము. వారి వారి పూర్వజన్మ వాసనల ప్రకారం జన్మిస్తుంటారు. పూర్వజన్మల ఫలాలను బట్టి ఈ జన్మలో సుఖదు:ఖాలు కలుగుతుంటాయి. వారు చేసిన కర్మలకు అనుగుణంగా, ఎవరెవరికి ఏమేమి ఇవ్వాలో వాటిని సమానంగా పంచిపెడుతుంటాడు పరమాత్మ. అందులో ఎవరి మీదపక్షపాతం చూపించడు. ప్రాణులు పుణ్యకార్యాలు చేస్తే సుఖాలను, పాపకార్యాలను చేసే దు:ఖాలను పొందుతున్నారు. ఎవరి కర్మలను బట్టి వారికి తగిన ఫలం లభిస్తుంది.

ఇతరులకుమేలు చేసేవారు, భగవంతుని భక్తితో పూజించేవారు, మనసు నిర్మలంగా ఉంచుకునేవారు, ఎల్లప్పుడూ సుఖంగా ఉంటారు. అలా కాకుండా ఎప్పుడూ మనసును మలినంగా ఉంచుకునేవాళ్లు, ఇతరులకు హాని చేసేవాళ్లు, దేవుడి మీద నమ్మకం, భక్తి లేని వాళ్లు ఎప్పుడూ ఏదో ఒక సమస్యతో బాధపడుతూ దు:ఖిస్తూ ఉంటారు. మరి కొందరు ధనము, పదవి, ఆస్తి, అంతస్తు, కామసుఖం ఈ వ్యామోహాలలో పడి, వాటి పిచ్చిలో పడి, చేయకూడని పనులు చేసి, జీవితాలను దు:ఖమయం చేసుకుంటున్నారు. (కోటానుకోట్లు సంపాదించిన వారు కూడా జైలుజీవితం అనుభవించడం మనం చూస్తూనే ఉన్నాము.) ఇది ఒకరు చేసేది కాదు. ఎవరికి వారు చేసుకున్నది. ఇది ప్రకృతి నియమము. దీనిని ఎవరూ దాటలేరు.

కాబట్టి ప్రాణులు అనుభవించే సుఖ,దు:ఖాలకు పరమాత్మ ఎటువంటి బాధ్యత వహించడు. ఎవరి కర్మఫలం వారు అనుభవించాలి, తప్పదు. సూర్యకాంతి అన్నిటి మీదా సమానంగా ప్రసరిస్తూ ఉంటుంది. అలాగే పరమాత్మ ప్రేమకూడా అందరిమీదా సమానంగా ఉంటుంది. కాని అద్దంలో పడ్డ సూర్యకాంతి ప్రతిఫలిస్తుంది. మట్టిమీద పడ్డ సూర్యకాంతి ప్రతిఫలించదు. అలాగే సత్పురుషులలో ఉన్న ఆత్మ దివ్యమైన ప్రకాశాన్ని వెదజల్లితే, రజోగుణము, తమోగుణములో

సతమతమయ్యే వారిలో ఉన్న ఆత్మ ఎటువంటి ప్రకాశము లేక, రజస్తమోగుణములతో కప్పబడి ఉంటుంది.

నిర్మలమైన అద్దము మన ప్రతిబింబాన్ని చక్కగా ప్రకాశవంతంగా చూపిస్తుంది. పక్కనే ఉన్న మకిల పట్టిన అద్దములో అసలు మన ప్రతిబింబమే కనపడదు. ముందు మనం అద్దానికి పట్టిన మకిలను తుడిస్తే, ఆ అద్దం కూడా మన ప్రతిబింబాన్ని ప్రకాశవంతంగా చూపుతుంది. కాబట్టి ముందు మనం మన మనసుకు పట్టిన రజో,తమోగుణములతో, వివిధములైన మోహములతో పేరుకు పోయిన మకిలను శుభ్రంగా తుడవాలి. అప్పుడు మనసు అద్దంలాగా నిర్మలంగా ఉంటుంది. మనలో ఉన్న ఆత్మకూడా దివ్యమైన ప్రకాశాన్ని వెదజల్లుతుంది. ఈ సత్యం అర్థం చేసుకోవాలి. కాకపోతే ఎవరైనా మన ఇంటికి వస్తే వారిని లోపలకు రమ్మంటాము. వారికి మర్యాదలు చేస్తాము. అలాగే భగవంతుడు ఎవరు భక్తితో, శ్రద్ధతో, అనన్య భక్తితో తన దగ్గరకు వస్తే వారిని తన లోపలకు తీసుకుంటాడు. వారిలో తనూ ఉంటాడు. కాబట్టి అందరూ నిర్మలమైన హృదయంతో పరమాత్మకు దగ్గరవడానికి ప్రయత్నించాలి. అప్పుడే పరమాత్మ మనలో ఉంటాడు. మనలను తనలోకి లాక్కుంటాడు. అప్పుడు మనం నిరంతర సుఖము, శాంతి పొందుతాము.

## 30. అపి చేత్సుదురాచారో భజతే మామనన్యభాక్।
## సాధురేవ స మన్తవ్యస్సమ్యగ్వ్యవసితో హి సః॥

దుర్మార్గుడు, దురాచారుడు అయిన వాడు, నా మీద అనన్యభక్తితో, ఏకాగ్రభక్తితో, నన్నే ఉపాసిస్తే, వాడిని సత్పురుషునిగానే భావించాలి. ఎందుకంటే అతడికి నా మీద అనన్యభక్తి, నిర్మలమైన మనస్సు, ఏకాగ్రత ఉన్నాయి.

ఇక్కడ మరొక విశ్లేషణ చేస్తున్నాడు పరమాత్మ. ఒకడు దుర్మార్గుడు. ఎల్లప్పుడూ ఇతరులకు అపకారం చేస్తుంటాడు. వాడి సంగతి ఏమిటి? వాడు ఎప్పటికీ అలా దుర్మార్గుడుగా ఉండాల్సిందేనా? వాడికి మోక్షం లేదా! అంటే ఉంది అని అంటున్నాడు పరమాత్మ. ఎంతటి దుర్మార్గుడు అయినప్పటికినీ, సత్పురుషుల మాటలు వినడం ద్వారా, జ్ఞానం కలగడం ద్వారా మంచి వాడుగా మారితే వాడిని తప్పకుండా నాలో చేర్చుకుంటాను. వాడి వెంట ఉంటాను అని అభయం ఇస్తున్నాడుపరమాత్మ.

కాకపోతే అతడికి ఒక క్వాలిఫికేషన్ ఉండాలి అదేమిటంటే సమ్యక్ వ్యవసిత: అంటే స్థిరమైన మనోనిశ్చయం కలిగి ఉండాలి. ఎలాంటి మనో నిశ్చయం అంటే ఇంక మీదట సాధువుగా, సాధు స్వభావంతో ఉంటాను అని. అనన్యభాక్ అంటే సాటిలేని భక్తి శ్రద్ధలతో పరమాత్మను

ఆరాధించాలి అని. అలా చేయడం వలన అతడు అంతకు ముందు చేసిన పాపాలు కాలి భస్మం అయిపోతాయి. కాబట్టి మిక్కిలి దుర్మార్గుడు అయినప్పటికినీ, భగవద్గీత విని, సాధువుగా మారి, పరమాత్మయందు అనన్య భక్తితో, స్థిరమైనమనోనిశ్చయంతో ఉంటే, వాడిని పరమాత్మ తప్పకుండా తన అక్కున చేర్చుకుంటాడు. దుర్మార్గుడైన కుమారుడు సన్మార్గుడైతే ఏ తల్లి తండ్రి చేరదీయరు అలాగే భగవంతుడు కూడా. అలా కాకుండా మరలా వెనుకటి జీవితంమొదలు పెడితే వాడు అనన్యభాక్ కానీ సమ్యక్ వ్యవసితుడు, సాధువు కానీ కాలేడు. కాబట్టి పాపాత్ముడు ఎల్లప్పుడే పాపాత్ముడు కాదు. వాడికీ పుణ్యాత్ముడు అయ్యే అవకాశం ఉంది. దానికి మార్గం కూడా చూపించాడు పరమాత్మ.

అంతకు ముందు చేసిన పాపాలు పోవాలంటే ఆ పాపాలు నాశనం కావాలంటే ఏం చేయాలో పరమాత్మ స్పష్టంగా చెప్పాడు. అప్పటిదాకా పాపాలు, చేయకూడని పనులు చేసిన వారిలో గిల్టిమైండ్ ఉంటుంది. తప్పుచేసాము అనే భావన. (కొంత మందికి ఎన్ని దుర్మార్గాలు చేసినా ఆ గిల్టిమైండ్, పశ్చాత్తాపము ఏ కోశానా ఉండవు. వారి గురించి వదిలెయ్యండి.) మనషి మారడం ద్వారా ఆ గిల్టిమైండ్ అంటే అపరాధ భావనలు పోగొట్టుకోవచ్చు. దానికి కావాల్సింది అనన్యభాక్ అంటే అనన్యభక్తి, నిష్కామభక్తి, ఏకాగ్రభక్తి. ఇంకమీదట ఏ పాపాలు చెయ్యను దుర్మార్గాలు చెయ్యను అనే నిశ్చయాత్మక బుద్ధి. ఇవి కనుక ఉంటే అప్పటి వరకు చేసిన పాపాలు క్రమక్రమంగా క్షీణిస్తాయి. అతనిలో ఉన్న గిల్టిమైండ్ కూడా ఆధ్యాత్మిక వైపు మళ్లుతుంది. అటువంటి వాడు సాధురేవ అంటే సాధువు మాదిరిగా మారడానికి అవకాశం ఉంది. కాబట్టి పాపాత్ములు కూడా పుణ్యాత్ములు కావడానికి కృషిచేయాలి అని ఈ శ్లోకం వివరిస్తుంది.

ఇక్కడ సాధువు అని వాడారు. సాధువు అంటే సాధుస్వభావం కలవాడు సాధువు అంతే కానీ కాషాయాలుకట్టి జడలు పెంచుకున్నవాడు, కాషాయాల ముసుగులో అక్రమాలు చేసేవాడు సాధువు కాడు. సాధువు అంటే మంచి వాడు. మంచి పనులు చేసేవాడు. నిర్మలమైన మనసు కలవాడు. అనన్యభక్తి కలవాడు. అందుకే పరిత్రాణాయ సాధూనాం అని అన్నాడు పరమాత్మ. నేను సాధువులను ఎల్లప్పుడూ రక్షిస్తూ ఉంటాను అని హామీ ఇచ్చాడు. పరమ దుర్మార్గుడు కూడా, పరివర్తన చెంది, పరమాత్మయందు నిశ్చయాత్మక బుద్ధి, అనన్య భక్తి కలిగి ఉంటే, మరలా తన పాపజీవనము నందు ఆసక్తి లేకుండా ఉంటే, అటువంటి వారిని సాధువు అని అంటారు. అటువంటి సాధువులకు ఏం ఫలితం లభిస్తుంది అనే విషయం తరువాతి శ్లోకంలో వివరించాడు.

### 31. క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాన్తిం నిగచ్ఛతి।
### కౌన్తేయ ప్రతిజానీహి న మే భక్త: ప్రణశ్యతి॥

ఓ కౌంతేయా! అటువంటి  సాధువు తొందరలోనే ధర్మాత్ముడుగా మారతాడు. అతడికి శాశ్వతమైన శాంతి, సుఖములభిస్తాయి. అటువంటి భక్తుడు, సాధువు ఎన్నటికీ చెడిపోడు. ఇదే నా ప్రతిజ్ఞ.

కిందటి శ్లోకంలో పాపాత్ముడు కూడా భగవంతుని మీద అనన్యమైన, నిష్కామమైన, భక్తి శ్రద్ధ కలిగి ఉంటే భగవంతుడు అతడికి దగ్గరవుతాడు అని చెప్పాడు. ఈ శ్లోకంలో దానిని కొనసాగిస్తున్నాడు. వాడు ఎంతటి పాపాత్ముడైనప్పటికినీ, వాడిలో పరివర్తన లేక మార్పుకలిగి, మంచి మార్గంలోకి వస్తే, నా మీద భక్తి శ్రద్ధ పెంపొందించుకుంటే, వాడు తొందరలోనే ధర్మాత్ముడు, ధర్మబుద్ధి కలవాడు అవుతాడు. అటువంటి వాడికి కూడా పరమ శాంతిని శాశ్వతమైన సుఖాన్ని ప్రసాదిస్తాను. నన్ను నమ్మినవాడు ఎన్నటికీ చెడి పోడు అని ప్రతిజ్ఞచేసాడు పరమాత్మ.

కాబట్టి ఎటువంటి పాపాత్ములకు కూడా పరమాత్మ ఒక అవకాశం ఇస్తున్నాడు. కాని దానికి కావాల్సింది పరమాత్మ మీద అనన్య భక్తి, శ్రద్ధ. పరమాత్మ ఒక్కడే అనే నిజాన్ని నమ్మడం. తన పూర్వజీవితాన్ని పూర్తిగా వదిలిపెట్టి,  సాధు జీవనం గడపడం. నిష్కామ కర్మ, ధ్యానము మొదలగునవి ఆచరించడం. ఇవి ఆచరిస్తే, అతడు తప్పకుండా ధర్మబుద్ధికలవాడు అవుతాడు.  అటువంటి ధర్మబుద్ది కలవాడిని నేను వదిలిపెట్టను. ప్రతిజానీహి అంటే ఇదే నా ప్రతిజ్ఞ అని నమ్మకంగా చెబుతున్నాడు.

అంటే పరమాత్మ అన్నిరకముల మానవులకు చేరువ కావడానికి ఉపాయాలు చెబుతున్నాడు. ఇవన్నీ ఎటువంటి ధనం అవసరం లేనిఉపాయాలు. అన్ని కులాల వారికి మతాల వారికీ, జాతుల వారికీ, ధనిక, పేదలకు అందుబాటులో ఉన్న ఉపాయం. దీనికి  కావాల్సిందల్లా భక్తి శ్రద్ధ, ఏకాగ్రత, అనన్యభక్తి,  నిష్కామ కర్మ. ఇవి ప్రతివారూ ఆచరించతగినవి. ఇవి ఆచరిస్తే చాలు. భగవంతుడు మన పక్కనే ఉంటాడుఅనడంలో సందేహం లేదు.

## 32. మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః।
## స్త్రియో వైశ్యాస్తథా శూద్రాస్తేఽపి యాన్ని పరాంగతిమ్॥

ఓ పార్థా! కడజాతిలో పుట్టినవారైనా, స్త్రీలు, వైశ్యులు, శూద్రులు, ఎవరైనా సరే, వారందరూ నన్ను ఆశ్రయించి, పరమ పదమును పొందుతున్నారు.

పైన రెండు శ్లోకాలలో పాపాత్ముల గురించి చెప్పాడు. ఈ శ్లోకంలో వారూవీరూ అని లేకుండా అందరి గురించి చెప్పాడు.  పాప జన్ములు, నీచ కులంలో పుట్టినవారు అంటే సామాజికంగా వెనుక బడిన కులములలో పుట్టినవారు, స్త్రీలు, (కేవలం ఉన్నతకులంలో పుట్టిన బ్రాహ్మణ, క్షత్రియులే

కాకుండా) వైశ్య, శూద్రులు వీరందరూ కూడా పరమాత్మను ఆశ్రయిస్తే వారిని ఆయన తన అక్కున చేర్చుకుంటాడు అని స్పష్టం అవుతూ ఉంది.

ఆ రోజుల్లోనే కాదు ఈ రోజుల్లో కూడా ఈ ఉన్నత కులము నీచ కులము అనే భేదభావము ఉంది. అగ్రవర్ణాలవారి నరనరాలలో జీర్ణించుకుపోయిన అంటరాని తనం ఇంకా కొన్ని గ్రామాలలో ఉంది. స్త్రీలను కూడా వేదములు చదవరాదనీ, వినరాదనీ ఓంకారము జపించరాదనీ ఆంక్షలుపెట్టారు. కేవలము బ్రాహ్మణ, క్షత్రియులు మాత్రమే వేదాధ్యయనమునకు, యజ్ఞయాగాదులకు అర్హులు అనీ ఆంక్షలు విధించారు.

ఈ శ్లోకంలో వాటిని అన్నిటినీ పక్కకునెట్టాడు పరమాత్మ. మీకు వేదాలతో శాస్త్రాలతో పనిలేదు. యజ్ఞయాగములు అవసరం లేదు. పూజలు వ్రతాలతో పని లేదు. కావాల్సిందల్లా నిర్మలమైన మనస్సు, అనన్య భక్తి, చేసే పని మీద శ్రద్ధ ఇవి ఉంటే చాలు. భగవంతుడు మీ దగ్గరే ఉంటాడు అని అన్నాడు. ఈ రోజుల్లో మనవాళ్లు అందరికీ సమాన హక్కులు ఉన్నాయని చట్టాలు చేస్తున్నారు. రిమూవల్ ఆఫ్ అన్‌టచబులిటీ అని రాజ్యాంగంలో ఒక ఆర్టికల్ కూడా పెట్టారు. కాని వేల సంవత్సరాల కిందటే పరమాత్మ వీటి గురించి చెప్పాడు. వాడు ఏ కులము వాడుకానీ, జాతి వాడుకానీ, స్త్రీలుకానీ, ఎవరైనా సరే నా అనుగ్రహానికి ప్రేమకు పాత్రులే మోక్షానికి అందరూ అర్హులే అని ఘంటాపథంగా చెప్పాడు.

కాని మనం వినం. మన మనసు అంగీకరించదు. రామాయణ కర్త వాల్మీకి, రామాయణంలో గుహుడు, శబరి, ద్వాపరంలో గొల్లపడుచులు, వీరందరూ సమాజం దృష్టిలో నీచ కులములో పుట్టినవారే. కానీ వారందరికీ తన ప్రేమను పంచాడు పరమాత్మ. ఆయన ఆచరించి చూపించాడు. కృష్ణావతారంలో అయితే తాను అగ్రకులం అయిన క్షత్రియుడుగా పుట్టినా, గొల్లపల్లెలో పెరిగాడు. వారితో ఆడాడు పాడాడు. కాని మనం మాత్రం వారిని వేదాధ్యయనమునకు, యజ్ఞయాగాదులకు దూరంగా పెడుతున్నాము. మానవులలో ఈ భేదభావం పోనంత వరకు పరమాత్మ మనకు దూరంగానే ఉంటాడు.

ఆఖరున పరాంగతిమ్ అని వాడాడు. అంటే వీరందరుకూడా పరమ గతికి అర్హులే. ఎవరూ తక్కువ కాదు. కాకపోతే అందరూ ప్రయత్నం చేయాలి. ఆ స్థాయికి ఎదగడానికి ప్రయత్నం చేయాలి.

ఈ శ్లోకంలో చిన్న మెలిక ఉంది. రెండు పదాలు వాడారు. పాప యోనయ: అంటే పాపయోనులు ...తక్కువకులములో జన్మించినవారు... అని అన్నారు. తరువాత స్త్రీలు, వైశ్యులు, శూద్రులు అని అన్నారు. అంటే వీరంతా కూడా పాపయోనులు అంటే తక్కువకులము వారు అని

కాదు. తే అపి అంటే వారున్నూ, వీరున్నూ అని అర్థము. కాబట్టి పాపయోనులు అనే పదం స్త్రీలకు, వైశ్యులకు, శూద్రులకు పొరపాటున కూడా అన్వయించి అర్థంచేసుకోకూడదు. ఎందుకంటే అగ్రకులాల వారికి కానీ, తక్కువ కులము వారికి కానీ, వైశ్య, శూద్రులకు కానీ, జన్మను ఇచ్చేది స్త్రీలు మాత్రమే. వారు పాపయోనులు అయితే వారికి పుట్టిన అగ్రకులము వారందరు కూడా పాపయోనులు కావాలి. కాబట్టి అలా అర్థం చేసుకోకూడదు. మానవులు తమలో ఉన్న అజ్ఞానం వలన, వారు చేసే కర్మల వలన, అగ్రవర్ణములు, నిమ్నవర్ణములు అని విభజించారే కానీ, అందరూ ఒకటే. ఈ లోకంలో పుట్టిన వారందరూ పరమాత్మ కృపకు అర్హులే. అందరూ వేదాధ్యయనము నకు, యజ్ఞయాగములకు, శాస్త్ర పఠనమునకు అర్హులే. ఎవరినీ తక్కుచేయడానికివీలులేదు అని స్పష్టంగా చెప్పాడుకృష్ణుడు.

ఈ పదాలను మరొక విధంగా కూడా అర్థం చేసుకోవచ్చు. స్త్రీలు అంటే శారీరకంగా స్త్రీలు అని కాదు. స్త్రీల తత్వము అని అర్థము. స్త్రీలు ఎక్కువగా ఎమోషనల్‌గా ఉంటారు. ప్రతి విషయానికీ ఎక్కువగా స్పందిస్తుంటారు. ఎక్కువ సుఖం వచ్చినా, ఎక్కువ దు:ఖం వచ్చినా తట్టుకోలేరు. ఏడ్చేస్తారు. ఇటువంటి గుణములు కలవారు పురుషులైనా స్త్రీల తత్వము కలవారే. ఇంకా చెప్పాలంటే, కొంత మంది పురుషులు ఎక్కువగా స్త్రీల మధ్యనే ఉండటం, వారి మాటలలో పాలు పంచుకోవడం చేస్తుంటారు. కొంత మంది స్త్రీలు పురుషాహంకారాన్ని, పురుష లక్షణాలను ప్రదర్శిస్తుంటారు. ఇది వారి వారి మానసిక స్థితిని బట్టి ఉంటుంది. మనం సాధారణంగా శారీరక ఆకృతులను, అవయవాల అమరికను బట్టి స్త్రీలు, పురుషులు అని నిర్ణయిస్తుంటాము. కాబట్టి స్త్రీలు అంటే మానసికంగా స్త్రీలక్షణములు కలిగిన వారు అని కానీ, శారీరకంగా స్త్రీలు అని కాదు.

ఇంక వైశ్యులు, శూద్రులు అంటే పుట్టుకతో వైశ్యులు, శూద్రులు అని కాదు. వైశ్యుల గుణం రాజస,తామసములు కలిసి ఉంటుంది. శూద్రులు అంటే తామస రాజస గుణములు కలిసిన వారు. మానవులు ఎవరైనా ఈ గుణముల కలయికతో ఉన్న వారు అని అర్థం. అందుకే చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణ కర్మ విభాగయో: అని ఇదివరకే చదువుకున్నాము. గుణములను బట్టి, వారు చేసే కర్మలను బట్టి మానవులు నాలుగువర్ణములుగా విభజింపబడ్డారు అని అర్థం. వీరు ఎవరైనా కావచ్చు. ఆయాగుణములు కలిగిన వారు కూడా నా కృపకు పాత్రులే అని కృష్ణుడు చెప్పాడు అని అర్థం చేసుకోవాలి.

కాకపోతే వారికి ఉండాల్సిన అర్హత మామ్ నన్ను, వ్యపాశ్రిత్య ఆశ్రయించాలి. అంటే అనన్య భక్తి, నిష్కామ కర్మ, ఏకాగ్రమైన మనసు, ఏ పని చేసినా భగవంతుని పరంగా చేయడం, ఆ కర్మఫలమును పరమాత్మకు అర్పించడం, ఏ పని చేస్తున్నా, చిత్తం పరమాత్మయందు లగ్నం చేయడం. ఈ అర్హతలు ఉన్న ఎవరైనా సరే జాతి, కుల, స్త్రీ, పురుష. ధనిక, పేద, బేధం లేకుండా పరాంగతిమ్ పరమపదమునకు అర్హులే అని కుండబద్దలు కొట్టినట్టు చెప్పాడు కృష్ణుడు.

## 33. కిం పునర్బ్రాహ్మణా: పుణ్యా భక్తా రాజర్షయస్తథా।
## అనిత్యమసుఖం లోకమిమం ప్రాప్య భజస్వ మామ్॥

పైశ్లోకంలో బ్రాహ్మణ, క్షత్రియులు తప్ప తక్కిన వారి గురించి చెప్పాడు. ఈ శ్లోకంలో ఎల్లప్పుడూ ధర్మచింతన కలిగిన బ్రాహ్మణ, క్షత్రియుల గురించి చెబుతున్నాడు. ఓ అర్జునా! పాపయోనులు, స్త్రీలు, వైశ్య శూద్రుల గురించి చెప్పిన తరువాత, అగ్రవర్ణములైన బ్రాహ్మణ, క్షత్రియుల గురించి, క్షత్రియులుగా జన్మించి, ఋషులుగా మారిన వారి గురించి వేరే చెప్పనవసరం లేదు. నువ్వు క్షత్రియుడవు కాబట్టి, ఈ లోకంలో దొరికే అశాశ్వతములు, అనిత్యములు, ఏమాత్రం సుఖం, ఆనందం ఇవ్వనివాటి కోసం పాకులాడకుండా, నీవు కూడా నన్ను ఆశ్రయించి పరమపదమును పొందు.

పాపాత్ములగురించి నిమ్న కులములో పుట్టినవారి గురించి, స్త్రీల గురించి, వైశ్య, శూద్రుల గురించి చెప్పిన తరువాత బ్రాహ్మణ, క్షత్రియుల గురించి వేరే చెప్పేదేముంది. వారు కూడా ఇతరుల మాదిరే నన్ను పొందుతారు. పాపాత్ములు, నీచకులంలో పుట్టిన వారు, స్త్రీలు, వైశ్యులు, శూద్రులు భగవంతుని ఆశ్రయించవచ్చు, పరమ గతినిపొందవచ్చు. అదే ప్రకారంగా బ్రాహ్మణులు క్షత్రియులు కూడా పరమ గతిని పొందవచ్చు. కానీ, బ్రాహ్మణులైతే పుణ్యమూర్తులు, అనన్య భక్తి కలిగిన వారు అయిఉండాలి, క్షత్రియులు అయితే రాజర్షులు అయి ఉండాలి. అంటే అందరూ క్యూలో నిలబడాల్సిందే. కావాల్సిన క్వాలిఫికేషన్లు కలిగి ఉండాల్సిందే. కేవలం జన్మను బట్టి అంటే పుట్టుకను బట్టి బ్రాహ్మణులు, క్షత్రియులు అయినంత మాత్రాన వారికి పరమ పదం లభించదు అని చురక అంటించాడు.

కేవలం పుట్టుక వలన మోక్షం రాదు. దాని కొరకు అందరూ శ్రమపడాలి. కావాల్సిన అర్హతలు సంపాదించాలి. కేవలం పుట్టుకతో బ్రాహ్మణులు, క్షత్రియులు అయితే సరిపోదు. బ్రాహ్మణులు సత్వగుణము ప్రధానంగా కలిగి ఉండాలి. పుణ్యకార్యములు చేసి ఉండాలి. పరమాత్ముని మీద అనన్య భక్తి కలిగి ఉండాలి. క్షత్రియులైతే రజోగుణము, సత్వగుణము సమపాళ్లలో కలిగి ఉండాలి. రాజఋషులు కావాలి. ఋషి అంటే ఇంద్రియ నిగ్రహము, మనో నిగ్రహము పొందిన వాడు. అటువంటి వారు రాజ్యపాలన చేస్తున్నా, నిష్పక్షపాతంగా, ఇంద్రియములను మనస్సును నిగ్రహించి, ఎవరిమీదా రాగద్వేషములు లేకుండా రాజ్యపాలన చేయాలి. వారినే రాజర్షి అంటారు. జనక మహారాజు రాజర్షి.

కాబట్టి సామాన్య మానవులు కూడా సంసారంలో ఉంటూకూడా ఋషుల మాదిరి ఉండాలి. ఎందుకంటే ఈ ప్రపంచము, భోగభాగ్యములు, సిరి సంపదలు, ఆస్తులు, ధనము అనిత్యము

అంటే శాశ్వతము కాదు. క్షణికములు. ఈ క్షణం ఉన్న వారు మరుక్షణం ఉండరు. వాడి ధనం, ఆస్తి, ఈ క్షణం ఉన్నవి మరుక్షణం ఉండకపోవచ్చు. అందుకే మానవ జీవితాలు క్షణభంగురాలు అని అన్నారు. ప్రతి వ్యక్తి ఈవిషయం తెలుసుకోవాలి. నేను, నా ఆస్తిపాస్తులు, నా పదవి శాశ్వతము, ఇలాగే ఉంటాయి అని గర్వంతో విర్రవీగకూడదు. పరమాత్మ ఇచ్చే సుఖం ముందు శాంతి ముందు ఇవన్నీ అత్యల్పములు అని గ్రహించాలి. అని చెప్పి అర్జునుడికి బోధ చేస్తున్నాడు.

అర్జునా! నీవు కూడా అనిత్యము అశాశ్వతము అయిన ఈ లోకం గురించి ఈ లోకంలో దొరికే సుఖాల గురించి, నీ బంధు మిత్రుల గురించి, ఆచార్యుల గురించి ఎందుకు చింతిస్తావు. నీ కర్తవ్యమును నిర్వర్తించు అని బోధించాడు పరమాత్మ.

## 34. మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు।ం
## మామేవైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః॥

ఓ అర్జునా! నీవు నా యందు మనసు కలగి ఉండి, నాయందుభక్తి కలిగి ఉండి, నన్నే పూజిస్తూ, నాకే నమస్కరిస్తూ ఉండు. నీవుఈ ప్రకారంగా నీ మనస్సును నాకు అర్పించి, నన్ను శరణుగోరితే, నిశ్చయంగా నన్నేపొందుతావు.

ఇప్పుడు అసలు విషయానికి వచ్చాడు పరమాత్మ. మనం ఏం చేయాలి అనే విషయాన్ని విపులంగా చెబుతున్నాడు. ఈ శ్లోకం ఒక్క అర్జునుడికే కాదు, ఈ అనంత విశ్వంలో ఉన్న మానవులందరికీ సంబంధించినది అని అర్థంచేసుకోవాలి.

ముందుగా నీ మనసు నా యందు నిలుపు
నా మీద అనన్య భక్తి కలిగి ఉండు. అది సకామ భక్తికానీ, నిష్కామ భక్తి కానీ ముందు ఏదో ఒక భక్తి కలిగి ఉండు.
నన్నే పూజించు
నాకే నమస్కారం చెయ్యి
నీ మనస్సును నా యందు లగ్నం చెయ్యి.
నీలో ఉన్న అహంకారాన్ని వదిలిపెట్టి, నన్నే పరమ గతిగా భావించు.
అప్పుడే నన్ను పొందగలవు.
దీని కంతా కావాల్సింది ఏకాగ్రత, నిశ్చలమైన భక్తి, నిష్కామ కర్మ. నిరంతర సాధన.
త్రికరణ శుద్ధిగా పరమాత్మను ధ్యానించడం.

ఇవన్నీ ఎందుకు చెప్తాడంటే, మనం ఈ దృశ్యప్రపంచంలో ఉన్నాము. ఈ ప్రపంచంలోని వస్తువులు మనలను మోహంలో పడేస్తుంటాయి. వాటి మీదికి మన మనసును ఆకర్షిస్తుంటాయి. వాటిమీద కోరిక కలిగేటట్టు చేస్తుంటాయి. ఇదే మాయ. ఈ మాయలో పడని వారు ఉండరు. కాబట్టి మనసును దారి మళ్లించి పరమాత్మ వైపుకు తిప్పాలి. అది చాలా కష్టం. కేవలం సాధన, అభ్యాసము, అనన్య భక్తి వలననే సాధ్యం అవుతుంది.

ఇక్కడ మరొక విషయం గుర్తుపెట్టుకోవాలి. మనకు ఎదురుగా కనపడే వస్తువుల మీదకే మన మనస్సు లగ్నం అవుతుంది. అవి కావాలి అనే భావన కలుగుతుంది. యద్భావం తద్భవతి అని మనం దేనిని గురించి నిరంతరం భావిస్తుంటామో అదే కోరికగా మారి పోతుంది. అదేవిధంగా, మనం మన మనసును ప్రాపంచిక వస్తువుల మీదికీ, విషయ వాంఛల మీదికి కాకుండా, ఎల్లప్పుడూ భగవంతుని మీదికి మళ్లించి, పరమాత్మను ధ్యానిస్తుంటే, ఆ భావన భగవంతుని మీద భక్తిగా మారి పోతుంది. కాబట్టి మనం అందరం ప్రవృత్తి మార్గంలోకి కాకుండా నివృత్తి మార్గంలోకి మళ్లాలి. అదే మనం చేయాల్సిన పని. ఈపని మన దైనందిన కార్యక్రమాలు చేసుకుంటూకూడా చేయవచ్చు. వంట చేసుకుంటూ కూడా పరమాత్మ మీద మనసు లగ్నం చేయవచ్చు. విష్ణుసహస్రనామాలు చెప్పుకుంటూ వంట చేసుకోవచ్చు. వ్యాపారం చేస్తున్నా, ఉద్యోగం చేస్తున్నా, రామనామం మనసులో జపిస్తూ మన కార్యక్రమాలు నిర్వర్తించుకోవచ్చు. సంబోధనలు కూడా పరమాత్మ పరంగా చేయవచ్చు. శ్రీరామ్, సాయిరామ్, అని చాలా మంది అనడం మనం వింటుంటాము. ఇవేమీ మతపరమైనవి కావు. కేవలం పరమాత్మను స్మరించుకోవడమే.

దీనికి మనం చెయ్యాల్సింది నిరంతరం పరమాత్మ గురించి చింతన చేయడం, పరమాత్మ కథలు వినడం, వాటిగురించి ఒకరితో ఒకరు ముచ్చటించుకోవడం, అనవసరమైన విషయాలను మాట్లాడకపోవడం. చేసే పని, ఆలోచన, మాట్లాడే మాట పరమాత్మ గురించే అయి ఉండాలి. దీనినే సత్సంగము అని అంటారు.

కాబట్టి సాధకుడు తనను తాను ఇలా ప్రశ్నించుకోవాలి.

1. నా మనస్సు దేని మీదికి పోతూ ఉంది. దేని గురించి ఆలోచిస్తూ ఉంది.

దృశ్య వస్తువుల మీదా లేక పరమాత్మమీదా!

2. నాకు దేని మీద భక్తి ఉంది.

కనపడే దృశ్యము మీదా లేక కనపడని లోపల ఉన్న పరమాత్మమీదా!

3.నేను దేనిని ఆరాధిస్తున్నాను.

అశాశ్వతములైన ధనం, ఆస్తి పాస్తులు,భార్యాబిడ్డలు,బంధువులనా లేక శాశ్వతసుఖాన్ని ఇచ్చే పరమాత్మనా!

4. నేను ఎవరికి నమస్కారం చేస్తున్నాను?

గుడిలో కనపడే విగ్రహానికా లేక ఈ విగ్రహంలో అంతర్లీనంగా ఉన్న పరమాత్మకా!

5. నేను దేని యందు ఆసక్తిగా ఉన్నాను!

బయట కనపడే దృశ్యాలమీదనా లేక అంతర్లీనంగా ఉన్న పరమాత్మ మీదనా!

ఈ ప్రశ్నలకు సమాధానాలు ఎవరికి వారు చెప్పుకోవాలి. ఇవన్నీ పరమాత్మకు పాజిటివ్‌గా ఉంటే పర్లేదు. నెగటివ్‌గా ఉంటే సాధన అభ్యాసము అవసరము. అప్పుడే మోక్షమార్గములో ప్రయాణం చేయడంసాధ్యం అవుతుంది. తుదకు నన్నే చేరుకుంటారు. అని చెప్పి శ్రీకృష్ణపరమాత్మ ఈ అధ్యాయమును ముగించాడు.

**ఉపనిషత్తులయొక్క, బ్రహ్మవిద్యయొక్క,**

**యోగశాస్త్రము యొక్క సారమయిన భగవద్గీతలో,**

**రాజవిద్యా, రాజగుహ్యా యోగము అను తొమ్మిదవ అధ్యాయము**

**సంపూర్ణము.**

**ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.**

# భగవద్గీత

## పదవ అధ్యాయము

# విభూతి యోగము

విభూతి అంటే ఐశ్వర్యము. పరమాత్మ గురించి భావన చెయ్యడమే ఒక ఐశ్వర్యము. ఆ పరమాత్మయొక్క ఐశ్వర్యాన్ని అనేకవిధములుగా తెలుసుకోవడమే ఈ అధ్యాయంలో మనం చేయబోయేది. భగవంతుని ఐశ్వర్యములు ఎక్కడెక్కడ ఉన్నాయి అనే విషయాన్ని ఈ అధ్యాయంలో వివరించారు. తన యొక్క విభూతులు ఇంతకు ముందు అధ్యాయాలలో క్లుప్తంగా చెప్పాడు. కానీ అర్జునుడికి అర్థం అయినట్టు లేదని మరలా వివరంగా చెబుతున్నాడు.

ఇప్పటి దాకా పరమాత్మ ఎన్నో విషయాలు ఈ 9 అధ్యాయాలలో చెప్పాడు. కానీ అర్జునుడికి ఏవీ బుర్రకు ఎక్కినట్టు కానీ అర్థం అయినట్టు గానీ కనిపించలేదు. మనకు కూడా ఇన్ని అధ్యాయాలు విన్నా కొంత మందికి అంతా అయోమయంగా ఉన్నట్టు ఉంటుంది. వారి గురించి ఆ విషయాలనే మరో కొత్త కోణంలో మరలా వివరిస్తున్నాడు కృష్ణుడు. మరొక విషయం ఏమిటంటే, అసలు ఈ భగవంతుని విభూతులు మనం ఎందుకు దర్శించాలి? వీటివలన ప్రయోజనంఏమిటి? అని ప్రశ్నించుకుంటే, సర్వవ్యాపిఅయిన పరమాత్మ ఏయే పదార్థాలలో, ఏయే జీవులలో, ఏయే వస్తువులలో ఏ యే విధంగా ప్రకాశిస్తున్నాడు అని తెలుసుకుంటే మనం ఏమిటో మన అహంకారం ఏమిటో మనకు అర్థం అవుతుంది. దాని ద్వారా మనలో వినయం, విధేయత పెరుగుతాయి. వినయం తెచ్చిపెట్టుకుంటే వచ్చేది కాదు. అహంకారానికి వినయం వ్యతిరేకం. అహంకారం నశిస్తే వినయం దానంతట అదే వృద్ధిచెందుతుంది. భగవంతుని విభూతులు దర్శిస్తే మనలో అహంకారం నశించి వినయం పెరుగుతుంది. ఆ భగవద్విభూతి దర్శనమే ఈ అధ్యాయము యొక్క పరమార్థము.

1. భూయ ఏవ మహాబాహో శృణు మే పరమం వచః।
యత్తే2హం ప్రియమాణాయ వక్ష్యామి హితకామ్యయా॥

ఓ మహాబాహో! అర్జునా! ఇప్పటి వరకు నేను చెప్పిన విషయాలు శ్రద్ధగా వింటున్నావు. నాకు చాలా సంతోషంగా ఉంది.. నీకు హితం కలుగజేయాలనే ఉద్దేశంతో ఇంకా కొన్ని శ్రేష్ఠములు అయిన వాక్యములను మరలా చెబుతాను. వాటిని కూడా శ్రద్ధగా విను.

సాధారణంగా మానవులు మంచి గురువు కొరకు వెదుకుతూ ఉంటారు. అలాగే గురువు కూడా మంచి శిష్యుని గురించి ఎదురు చూస్తూ ఉంటాడు. ఈ నాడు కూడా పాఠశాలలలో, కళాశాలలలో విద్యార్థులు శ్రద్ధగా పాఠం వింటుంటే, టీచర్, లెక్చరర్ కూడా రెట్టించిన ఉత్సాహంతో తాను నేర్చుకున్న విషయాలను విద్యార్థులకు బోధిస్తాడు. అలాగే పూర్వకాలంలో గురువులు కూడా శిష్యుల శ్రద్ధ,భక్తి,అభిరుచిని బట్టి విద్యను బోధించేవాళ్లు. ఇక్కడ శ్రీకృష్ణుడు జగద్గురువు. ఆయనకు దొరికిన శిష్యుడు నరుడు అంటే అర్జునుడు. ఈ గురుశిష్యుల సంవాదము వలననే మనకు లోకోత్తరమైన వేదాంత గ్రంథము భగవద్గీత ఆవిర్భవించింది. అందుకే కృష్ణుడు ప్రీతితో, అర్జునుడి హితం కోరి, తాను చెప్పిన విషయాలను పదే పదే చెప్పి అర్జునుడికి అర్ధం అయ్యేటట్టు బోధిస్తున్నాడు.

భూయ అనే పదం మొట్ట మొదట వాడారు అంటే మరలా చెబుతున్నాను అని మొదలెట్టాడు. అంటే అర్జునుడికి అర్థం కాలేదని తెలుసు. కానీ, మనకు కూడా అర్థం అయ్యేఅవకాశంలేదని పరమాత్మకు తెలిసినట్టుంది. అందుకే మరలా చెబుతున్నాను అని అన్నాడు. నేను ఏదో ఆషామాషీగా చెప్పడం లేదు బాబూ పరమం వచ: అంటే శ్రేష్టమైన విషయాలు చెబుతున్నాను శ్రద్ధగా విను అని హెచ్చరిస్తున్నాడు పరమాత్మ. పరమమైన మాటలు అంటే భగవంతుని గురించి, భగవంతుని విభూతులను మనముందు ఆవిష్కరించే మాటలు అని అర్థం. మామూలు మాట అయినా పరమాత్మ గురించి చెబితే అది పరమమైన మాట అవుతుంది.

అంగడిలో ఉన్న అరటి పండ్లు, పూలు సాధారణంగా ఉంటాయి. వాటిని తీసుకొని వెళ్లి పరమాత్మకు అర్పిస్తే ప్రసాదం అవుతుంది. కళ్లకు అద్దుకుంటాము. ఆ పూలనే శవం మీద చల్లితే వాటిని కళ్లకు అద్దుకోము. కాళ్లతో తొక్కుకుంటూ వెళతాము. కాబట్టి మాటకానీ, వస్తువు కానీ, పరమాత్మతో సంయోగం చెందితే, పరమాత్మ గురించి చెబితే అది పరమము అవుతుంది. అటువంటి పరమమైన వచనములు ఎంతో శ్రద్ధాభక్తులతో వింటున్న అర్జునుడికి చెబుతున్నాడు కృష్ణుడు. అందుకే అర్జునుడు కృష్ణుడికి ప్రియమాణాయ అంటే అత్యంత ప్రియశిష్యుడు అయ్యాడు.

ఈ నాడు కూడా ఏ గురువుకైనా శ్రద్ధగా పాఠం వింటున్న విద్యార్థి అంటే ప్రేమ. ఇంకా ఇంకా చెప్పాలని తహతహలాడుతాడు. అటువంటి గురువు ఎల్లప్పుడూ శిష్యుడి హితం కోరుతుంటాడు. అందుకే హితకామ్యయా అంటే నీ హితం కోరి చెబుతున్నాను. నీ మంచికే చెబుతున్నాను శ్రద్ధగా వినరా బాబూ అంటూ మనలను కూడా బుజ్జగించి చెబుతున్నాడు. పరమాత్మ ఎల్లప్పుడూ మన మేలు కోరేవాడు. మనకు ఎటువంటి అపకారమూ చేయడు. మనకు మనమే అపకారం చేసుకుంటున్నాము. అనవసరమైన, పనికిమాలిన, ప్రాపంచిక విషయములను అన్నిటినీ మనసులో నింపుకొని, వాటి గురించి ఆలోచిస్తూ, మన మనసులు మనమే పాడు చేసుకుంటున్నాము. అందుకే పరమాత్మ మన హితం కోరి, తన గురించి తన ఐశ్వర్యముల గురించి చెప్పాలనుకున్నాడు.

## 2.న మే విదు: సురగణా: ప్రభవం న మహర్షయః।
## అహమాదిర్హి దేవానాం మహర్షీణాం చ సర్వశః॥

నేను ఎలా వచ్చానో ఈ దేవతా గణములకు కానీ, మహర్షులకు కానీ తెలియదు. ఎందుకంటే దేవతాగణములు మహర్షులు అందరికన్నా నేను ముందు ఉన్న వాడిని (అందుకే నా విభూతుల గురించి వారికితెలిసే అవకాశం లేదు).

ముందు తన గురించి తాను చెప్పుకుంటున్నాడు పరమాత్మ. నేను సనాతనుడను. అందరికంటే ముందుపుట్టాను. నా గురించి దేవతలు, మహర్షులు కూడా తెలుసుకోలేరు. ఎందుకంటే నేను వారందరి కంటే ముందుపుట్టాను. సూర్యకిరణాలు భూమి మీద ప్రసరించి మనకు వేడి, వెలుగు ఇస్తాయి. కాని అవి వెనక్కు పోయి సూర్యుడికి వేడి వెలుతురు ఇవ్వలేవు. అలాగే కాంతి కిరణాలు ఎప్పుడూ ముందుకే వెళతాయి కానీ వెనక్కు ప్రయాణం చేయలేవు. అది ప్రకృతి ధర్మము. తండ్రి గురించి కుమారుడికి తెలియదు. తండ్రి చెబితేనే గానీ తెలియదు. ఎందుకంటే తండ్రి పుట్టినప్పుడు కుమారుడు లేడు. అలాగే ఈ అనంత విశ్వం ఆవిర్భవించినపుడు ఎవరూ లేరు అవ్యక్తుడు అయిన పరమాత్మ తప్ప. తరువాతనే బ్రహ్మ, ఆయన నుండి మరీచులు, దేవతా గణములు పుట్టారు. వీళ్లందరి పుట్టుకకు కారణము పరమాత్మ. కాబట్టి పరమాత్మ విభూతి ఆయన చెబితేనే గానీ దేవతలకు మహర్షులకు కూడా తెలియదు. ఇంకమనమెంత. కాబట్టి ఆయన గురించి ఆయన నోటి నుండి వెలువడిన వాక్కులను బట్టి మనం తెలుసుకుందాము.

## 3. యో మామజమనాదిం చ వేత్తి లోకమహేశ్వరమ్।
## అసమ్మూఢస్స మర్త్యేషు సర్వపాపై: ప్రముచ్యతే॥

ఎవరైతే నన్ను పుట్టుక లేని వాడుగానూ, అనాది గానూ, లోకమునకు అంతా ఈశ్వరుడుగానూ తెలుసుకోగలుగుతున్నారో, ఆ మూర్ఖత్వము లేని మానవులు, సకల పాపముల నుండి విముక్తి పొందుతారు.

కాబట్టి ఓ అర్జునా! నాకు పుట్టుక లేదు. పుట్టుక లేదు కాబట్టిచావు లేదు. మీ అందరి కంటే ముందు నుండి ఉన్నాను. ఈ సమస్త లోకములు నా నుండి ఆవిర్భవించాయి. అన్నిటికీ కారణం నేనే. ఈ విషయం అందరూ తెలుసుకోవాలి. తెలియక పోతే అది వారి అజ్ఞానం తప్ప వేరు కాదు. నాగురించి తెలిసిన వాడికి జ్ఞానము కలుగుతుంది. ఈ జనన మరణ చక్రం నుండి విముక్తి కలుగుతుంది.

మన ఇంట్లో 3 నుండి 5 ఏళ్లపిల్లలను చూస్తుంటాము. వారికి అక్కరలేని విషయం లేదు. అదేమిటి, ఇదేమిటి, ఇది ఎందుకు, అది ఎలా వచ్చింది, అని అడుగుతుంటారు. వారికిసమాధానాలు చెప్పలేక విసుగు వస్తుంది. కాని అదే అసలైన జ్ఞానం. ఐదవ సంవత్సరం దాటగానే వాడు ప్రాపంచిక విషయములలో పడిపోయి నేను నాది అనుకుంటూ ఉంటాడు. తరువాత ఏది చదివినా, ఏమి చేసినా నాకేంటి, నాకేం లాభం అనే స్థాయికి చేరుకుంటాడు. ఏ చదువు చదివినా, దానిని ఎలా ధనంగా మార్చుకుందామా అనే ప్రయత్నిస్తాడు కానీ, దానికి సంబంధించిన జ్ఞానం సంపాదించడానికి ప్రయత్నించడు. ఏదోవిధంగా డిగ్రీలు సంపాదించడంలో ఉన్న ఆసక్తి విషయపరిజ్ఞానంలో ఉండటం లేదు. అలాగే మనలో నేను ఎవరు, ఈ లోకానికి ఎందుకు వచ్చాను, ఇక్కడి నుండి ఎక్కడకువెళతాను అనే విషయాల గురించి ఆత్మపరిశీలన చేసుకునే వారు చాలా తక్కువ. అలా ఆత్మజ్ఞానం గురించి తెలుసుకునేవాళ్లు మహాత్ములు అవుతారు.

ఈ సృష్టి అంతా ఒకే ఒక కణము నుండి వచ్చిందని అదే దైవ కణము అనీ, ఆ కణవిస్ఫోటం నుండి ఈ సకల విశ్వం ఆవిర్భవించింది అనీ నేటి కాస్మాలజీ చెబుతూ ఉంది. ఈ శ్లోకం నేటి సిద్ధాంతం ఒకటే కదా! ఆలోచించండి. ఈ విషయం కొన్ని వేల సంవత్సరాల కిందటే చెప్పబడింది. కాకపోతే మనకు అర్థం కాలేదు. ఈ సృష్టిరహస్యం అర్థం అయితే నేను, నాది, అన్నీ నేనే చేస్తున్నాను, నా కంటే మించిన వాడు లేడు, అనే అహంకారము నశిస్తుంది. అహంకారము లేకపోతే రాగద్వేషాలు ఉండవు. అదే మోక్షానికి మార్గము.

ఇంక ఆధ్యాత్మికంగా ఈ శ్లోకానికి అర్ధం తెలుసుకుందాము. జీవరాసులలో కెల్లా మానవ జన్మ ఉత్తమమైనది. ఎందుకంటే మనకు విచక్షణా శక్తి ఉంది. ఇతర జీవులకు లేదు. మానవులలో కెల్లా బుద్ధిని ఉపయోగించే వాడు గొప్పవాడు. ఆ బుద్ధితో జ్ఞానం సంపాదించేవాడు ఇంకా గొప్పవాడు. ఆ జ్ఞానమును విజ్ఞానంగా మార్చుకునేవాడు మహాత్ముడు. జ్ఞానం అంటే ఏమిటి. పరమాత్మ గురించి యదార్థము తెలుసుకోవడం. పరమాత్మ ఒక్కడే సత్యము. ఈ ప్రపంచం అందులోని వస్తువులు మాయ, మార్పుచెందేవి. నిలిచేవి కావు. వాటి కోసం ప్రయాస పడడం వ్యర్థం అని తెలుసుకోవడం. ఈ సత్యం తెలుసుకున్న వాడు నిష్కామ కర్మలు చేస్తాడు. అతడికి వాసనలు ఉండవు. వాసనలు లేకపోతే పునర్జన్మ లేదు.

కాని మానవుడు తనకు ఉన్న ధనం వలనా ఆస్తుల వలనా, పదవి వలనా తానే గొప్పవాడు, తనకు ఉన్న ఆస్తులు, ధనము, పదవి శాశ్వతము నిలిచి ఉంటాయి అనీ అనుకుంటున్నాడు. అదే అజ్ఞానము. ఎందుకంటే ఇవన్నీ సత్వ రజస్తమోగుణముల వలన ఏర్పడిన మాయ వలన కలిగిన అపోహలు. నిజాలు కావు. ఈ జగత్తు అంతా మిథ్య అని తెలుసుకోవడమే అసలైన జ్ఞానము. కాబట్టి మానవులు ఈ జ్ఞానము అలవరచుకోవాలి. అప్పుడే మానవుడు ఈ అజ్ఞానము నుండి జ్ఞానము వైపు అడుగులు వేయగలడు. చీకటి లోనుండి వెలుగులోకి రాగలడు. వెలుగు అంటే

జ్ఞానము. ఈ జ్ఞానం కలిగితే సర్వపాపై: ప్రముచ్యతే అన్ని పాపములు నాశనము అయి పోతాయి. అంటే కొత్తగాపాపాలుచేయడు. చేసినపాపాలు పోగొట్టు కోడానికి ప్రయత్నం చేస్తాడు.

4. బుద్ధిర్జ్ఞాన మసమ్మోహ: క్షమా సత్యం దమశ్శమ:।
సుఖం దు:ఖం భవో2భావో భయం చాభయమేవచ॥
5. అహింసా సమతా తుష్టిస్తపో దానం యశో2యశ:।
భవన్తి భావా భూతానాం మత్తఏవ పృథగ్విధా:॥

బుద్ధి, జ్ఞానము, మోహము లేకుండా ఉండటం, క్షమించే గుణము, మనో నిగ్రహము, ఇంద్రియ నిగ్రహము, సుఖము, దు:ఖము, ఉండటం, లేకపోవడం, (జనన మరణాలు), భయం, భయం లేకపోవడం, అహింస, అందరినీ సమంగా చూచేగుణము, ఉన్నదానితో తృప్తిచెందడం, ఏ పని చేసినా ఏకాగ్రతతో తపస్సులాగా చేయడం, ఉన్నదానిలో ఇతరులకు పెట్టడం, కీర్తి, అపకీర్తి, ఇవన్నీ మానవులలో కలిగి వివిధములైన భావములు, వికారములు. ఈ వికారములు, భావములు అన్నీ జీవులలో నేనే కలుగచేస్తున్నాను. నావలననే కలుగుతున్నాయి.

ఈ రెండు శ్లోకాలలో పరమాత్మ మనలో ఉన్న వికారాల గురించి చెప్పాడు. ప్రతి జీవికీ రెండు దేహాలు, రెండు ప్రపంచాలు ఉంటాయి. ఒకటి స్థూల దేహము. అంటే కనిపించే దేహము. ఈ దేహముతో కనిపించే ప్రపంచంలో విహరిస్తుంటాడు. రెండవది సూక్ష్మదేహము. మనస్సు, బుద్ధి, అహంకారాలతో కలిసి ఉంటుంది. దీనికి ఒక సూక్ష్మ దేహము అంటే అంతర్దేహము ఉంటుంది. అందులో అతని అహంకారమే రాజు. మనసు, బుద్ధి కలిసి నిర్ణయాలు తీసుకుంటూ ఉంటాయి. ఆ నిర్ణయాలు స్థూల దేహం అమలు చేస్తూ ఉంటుంది. ఇప్పుడు ఈ సూక్ష్మదేహంలో కలిగే వికారాలు, భావాల గురించి చెబుతున్నాడు కృష్ణుడు.

బుద్ధి అంటే నిశ్చయాత్మక బుద్ధి. ఏ విషయమైనా ఏ పని అయినా ఒక లక్ష్యంతో నిశ్చయంతో ఆచరించడం. అంతే కానీ సందేహంతో, అవుతుందా కాదా అనే ఊగిసలాటతో చేయకూడదు. ఇలా చేయాలంటే ఆ విషయం గురించి, పని గురించి సరి అయిన జ్ఞానము కావాలి. వాటి గురించి క్షుణ్ణంగా తెలుసుకోవాలి. అంతే కానీ అరకొర జ్ఞానంతో చేస్తే ఏ పనీ సక్రమంగా నడవదు. మోహం లేకపోవడం అంటే మనం చేసే పని మీద, నేర్చుకునే విద్యమీద ఒక విధమైన స్పష్టత, అవగాహన ఉండాలి. అదా, ఇదా, అనే ఏదిమంచిది, అనే ఊగిసలాట ఉండకూడదు. కాబట్టి దేనికైనా ఒక స్పష్టత అవసరం. ఈ స్పష్టత రావాలంటే ఓపిక, ఓర్పు, అవసరం. అంతే కానీ చిటికేస్తే దేనిమీదా క్లారిటీ రాదు. ఈ క్లారిటీ ఎలా వస్తుంది అంటే ఆ విషయం గురించి సరి

అయిన నిజాలు తెలియాలి. తెలుసుకున్న నిజం నిర్భయంగా చెప్పగలిగి ఉండాలి.

నిజం తెలుసుకోవడం, తెలుసుకున్న నిజాన్ని నిర్భయంగా చెప్పగలగడం ఒక గొప్ప లక్షణం. కొంత మంది తమకు ఏమీతెలియకపోయినా తెలిసినట్టు మాట్లాడుతుంటారు. తాము చూడని విషయాలు స్వయంగా చూచినట్టు చెబుతుంటారు. చాలా మందికి ఈ వికారం ఉంటుంది. దీని వలన ఎంతో మంది జీవితాలకు నష్టం కలుగుతుంటుంది కానీ వారి బుద్ధిమాత్రంమారదు. కాబట్టి నిజం చెప్పడం, తెలిసిన విషయం చెప్పడం ఒక మనోవికారము.

తరువాత ఇంద్రియ నిగ్రహము అంటే చూచిందల్లా నాది కావాలి అని అనుకోవడం, ఎవరు ఏది చెబితే, ఆ దోవన పోవడం, కంటికి బాగున్నదల్లా అడ్డు ఆపు లేకుండా తినెయ్యడం, స్పర్శసుఖం కోసం పాకులాడటం.. ఇవన్నీ ఇంద్రియములకు,మనసుకు ఉన్న లక్షణాలు. వీటిని అదుపులో పెట్టుకోవడమే ఇంద్రియ నిగ్రహము.

ఇంక మనో నిగ్రహము అంటే పైచెప్పిన వాటి గురించిన ఆలోచనలను లోపలకు రానీయకపోవడం. మనసును అటు ఇటు పోనీయకుండా నిగ్రహించుకోవడం. మనసు చంచలమైనది అని అందరికీ తెలుసు. మనసును అదుపులో పెట్టుకున్న వాడే మహాత్ముడు అని అన్నారు. కాబట్టి మనోనిగ్రహం అత్యంత ఆవశ్యకము.

తరువాతవి సుఖము దుఃఖము. తన వద్ద లేనిది తనకు లభిస్తే, తనకు ఇష్టమైనవి తన వద్దకు వస్తే కలిగే ఆనందమే సుఖం, ఉన్నది పోతే దుఃఖం. సుఖం వచ్చినా, దుఃఖం వచ్చినా శరీరంలో మార్పురాదు. సుఖదుఃఖాలను కేవలం మనసు మాత్రమే అనుభవిస్తుంది. భవః అంటేపుట్టడం. మన మనసులో అనుక్షణం ఎన్నో భావాలు, ఆలోచనలు సంకల్పాలు పుడుతుంటాయి. అవి కార్యరూపం దాల్చకముందే అభవః అంటే లేకుండా పోతుంటాయి. ఈ ప్రకారంగా మనసులో రకరకాల భావాలు ఆలోచనలు కలుగుతుంటాయి. అవి కొద్దిగా ఘనీభవిస్తే కోరికలు అవుతాయి. ఆ కోరికలు కార్యరూపం దాలిస్తే సుఖదుఃఖాలు కలుగుతాయి.

తరువాత భయం అభయం. భయం కూడా రెండురకాలు. లేనిది రాదేమో అనే భయం. ఉన్నది పోతుందేమో అనే భయం. లేనిది వస్తే అమ్మయ్యఅని భయం పోతుంది. ఉన్నది క్షేమంగా ఉంది అని తెలిస్తే కూడా అదే మాదిరి అభయం. ఎవరూ అండలేకపోతే భయం. మినిష్టరు అండగా ఉంటే అభయం. పరమాత్మను నమ్ముకుంటే భయమే ఉండదు. అంతా అభయమే. ఇది కూడాఒక మానసిక వికారమే.

అహింస అంటే ఎదుటి వారిని మాటలతో కానీ, చేతలతో కానీ, శారీరకంగా కానీ, మానసికంగా కానీ హింసించక పోవడం, బాధపెట్టకపోవడం. ఎదుటి వాడు తనకు ఏమి చేస్తే తన మనసుకు బాధకలుగుతుందో, ఆ పని చేయకపోవడం. సమత అంటే అందరినీ సమంగా చూడటం. మానవులకు లేని లక్షణాలలో ఇది ఒకటి. అందరినీ సమానంగా చూడటం ఎవరికీ నచ్చదు. తాను అందరికంటే గొప్పవాడు అనుకోవడమే అందరి లక్షణం. అందుకే కులము, ధనము, పదవి, హెూదా, మతము వీటి ప్రాతిపదిక మీద అసమానతలు ఏర్పడ్డాయి. (ఈ అసమానతలను తొలగించడానికే మన రాజ్యాంగంలో ఆర్టికల్ 14 పొందుపరిచారు).

ఎల్లప్పుడూ తృప్తిగా ఉండటం మానవులకు లేని లక్షణాలలో ఇది ప్రధానమైనది. ఉన్నదానితో తృప్తి చెందకపోవడం. లేనిది కావాలని కోరుకోవడం. ఉన్న దానితో తృప్తి చెందక పోతే ఆ అసంతృప్తి వాడిలోనే ఉంటుంది. కానీ అది ఎక్కువయితే, పక్కవాడిది లాగేసుకోవడం గా పరిణమిస్తుంది. పక్కవాడిది లాగేసుకోవడమే కాకుండా సమాజాన్ని దోచేసుకోవడంగా అభివృద్ధి చెందుతుంది. ఇది ప్రమాదకరం. దీనికి మూలకారణం ఉన్నదానితో తృప్తి చెందక పోవడం.

ప్రతి పనినీ ఒక తపస్సులాగా చేయడం. అంటే చేసే పని మీద శ్రద్ధ ఉండటం. ఇది కూడా చాలామందిలో ఉండదు. ఏదో చేసామంటే చేసామని చేస్తుంటారు. పరధ్యానంగా చేస్తుంటారు. అలా చేసిన పనులకు ఫలితం కూడా అదే మాదిరి ఉంటుంది. కాబట్టి విద్యాలయాలలో కానీ, కార్యాలయాలలో కానీ రాజకీయాలలో కానీ చేసే పనిని ఒక తపస్సులాగా చేయడం అలవాటు చేసుకోవాలి.

ఉన్నదానిలో ఇతరులకు దానం చేయాలి అని అనుకోవడం. ఎంత వచ్చినా చిన్ని నా బొజ్జ శ్రీరామరక్షగా ఉండాలి, ఇతరులు ఏమైనా పరవా లేదు, అని అనుకోకూడదు. మనకు కావాల్సినంతవరకు ఉంచుకొని, మిగిలినది ఇతరులతో పంచుకుంటే ఆ మానసిక ఆనందం వేరు. అందుకే పూర్వకాలంలో అతిథికి భోజనం పెట్టిన తరువాతనే తాను తినేవాడు గృహస్థు.

కీర్తి వచ్చినపుడు పొంగి పోవడం, అపకీర్తి వచ్చినపుడు కుంగిపోవడం కూడా మనోవికారాలే. కీర్తి అపకీర్తి దేహానికి సంబంధించినవి కావు. కేవలం మనసుకు, అహంకారానికి సంబంధించినవి. నాకు ఇంత కీర్తి ప్రతిష్ట ఉంది అని పొంగిపోతే మనసుకు ఆనందం కలుగుతుంది. అలాగే ఇతరులు తనను అపకీర్తి పాలు చేస్తే మానసికంగా కుంగి పోతాడు. శరీరం అలాగే ఉంటుంది. కాబట్టి ఈ ద్వంద్వాలను సహించడం ప్రతి మానవుడు నేర్చుకోవాలి.

ఇవన్నీ మానవులలో ఆయా సందర్భాలను బట్టి, వారు చేసే ఆలోచనలను, కర్మలను బట్టి, కలుగుతుంటాయి. ఇవన్నీ దేహానికి సంబంధించినవి కావు. సూక్ష్మదేహానికి సంబంధించినవి.

స్థూలదేహానికి ఉండటానికి ఇల్లు, కడుపునిండా అన్నం, కంటినిండి నిద్ర ఉంటే చాలు. కాని పైవికారాలన్నీ సూక్ష్మదేహంతో అనుభవించే వికారాలు మాత్రమే.  ఈ వికారములకన్నిటికీ నేనే కారణము అని అన్నాడు కృష్ణుడు.

ఇలా  చెప్పడంలో అంతరార్థం తెలుసుకోవాలి. మనలో కలిగే ఏ వికారమునకైనా మనసే కారణము. ఆ మనస్సు చైతన్యం కావాలంటే మనలో చైతన్యం ఉండాలి. ఆ చైతన్యస్వరూపమే ఆత్మ. ఆ ఆత్మ పరమాత్మ స్వరూపము. అందుకే వీటి కన్నిటికీ నేనే కారణము అని మూలానికి వెళ్లాడు పరమాత్మ. నిజానికి ఈ వికారములు అన్నీ ఎవరెవరి పూర్వజన్మ వాసనలను బట్టి, వారి ఆలోచనా సరళిని బట్టి, చేసే కర్మలను బట్టి  కలుగుతుంటాయి. ఎవరి వాసనలను బట్టి వారికి ఆయా ఫలాలను పరమాత్మ పంచిపెడుతుంటాడు. తాను మాత్రము సాక్షీభూతంగా చూస్తుంటాడు. మూలానికి వెళితే మనసుకు కూడా తానే కారణం కాబట్టి ఈ మనోజనితములైన వికారములకు అన్నిటికీ నేనే కారణము అని చెప్పాడు పరమాత్మ. అంతేకానీ ఇవన్నీ పరమాత్మ చేస్తున్నాడనీ, ఆయన ప్రేరణతోనే మనం చేస్తున్నామనీ కాదు. దీపం వెలుగులో మంచి పనులు చేయవచ్చు, మర్డర్లు, మానభంగాలు చేయవచ్చు. అన్నిటిమీదా దీపం వెలుగు సమానంగా ప్రసరిస్తుంది. దీపం వెలుగుకు వేటితో కూడా సంబంధం, ఆసక్తి ఉండదు. అలాగే మనలో ఉన్న చైతన్యశక్తికి కూడా మనం చేసే ఆలోచనలతో కానీ, పనులతో కానీ ఎటువంటి ఆసక్తి, సంబంధము ఉండదు. దీపం వెలుగు ఇచ్చినట్టు, ఆత్మ చైతన్యం ఇస్తుంది. అంతే.

### 6. మహర్షయస్సప్త పూర్వే చత్వారో మనవస్తథా।
### మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమా: ప్రజా:॥

ఈ లోకంలో ఉండే మానవులకు పూర్వీకులు ఎవరైతే ఉన్నారో ఆ మహా ఋషులు ఏడుగురు, వారే కాకుండా సనకుడు మొదలగు నలుగురు దేవ ఋషులు, మనువులు, వీరందరూ నన్నే భావిస్తుంటారు. నా గురించి ధ్యానిస్తుంటారు. వీరంతా కూడా నామానస పుత్రులే. నా సంకల్పము చేతపుట్టిన వారే.

మానవ లోకంలో ఉన్న మానవులకు గోత్రాలు ఉన్నాయి. వాటికి మూల పురుషులు సప్తఋషులు. ఉదాహరణకు కశ్యపుడి నుండి పుట్టిన వారు కాశ్యప గోత్రము వారు. వారి మూల పురుషులు, కశ్యపుడు, వత్సారుడు, నైద్రువుడు. ఇలాగా అన్ని గోత్రములకు మూల పురుషులు ఉన్నారు. అందుకే సగోత్రీకుల మధ్య వివాహములు చేయరు. ఎందుకంటే వీరి మూల పురుషులు (డి.యన్.ఏ లు) ఒకరే కాబట్టి, అన్నచెల్లి సంబంధం అవుతుంది, సంతానము బలహీనంగా ఉంటుంది అని భావన.

ఈ ఋషులు 7 మంది. వీరి పేర్లు, వశిష్టుడు, విశ్వామిత్రుడు, జమదగ్ని, గౌతముడు, భరద్వాజుడు, అగస్త్యుడు, కశ్యపుడు. (వీరి పేర్లు వివిధ పురాణాలలో వేరు వేరుగా ఉన్నాయి. కొన్నిటిలో భృగువు, పులహుడు,క్రతువు, మొదలగు వారి పేర్లుకూడా ఉన్నాయి. గమనించండి) దేవ ఋషులు నలుగురు...... వీరు సనక, సనంద, సనత్కుమార, సనత్సుజాతులు. ఇంక మనువులు గురించి తెలుసుకుందాము.

బ్రహ్మకు ఒక రోజులో 1000 మహా యుగములు గడుస్తాయి. అంటే 4000 యుగాలు. ఈ నాలుగు వేల యుగాలు 14 మన్వంతరాలుగా విభజింప బడ్డాయి. 14 మన్వంతరాలకు 14 మంది మనువులు పరిపాలకులుగా ఉన్నారు. వారి పేర్లు 1.స్వాయంభువ మన్వంతరము, 2. స్వారోచిష మన్వంతరము, 3.ఉత్తమ మన్వంతరము, 4. తామసమన్వంతరము. 5.రైవత మన్వంతరము. 6. చాక్షుష మన్వంతరము. 7. వైవస్వత మన్వంతరము. 8. సావర్ణి మన్వంతరము. 9.దక్షసావర్ణి మన్వంతరము.10. బ్రహ్మ సావర్ణి మన్వంతరము. 11. ధర్మసావర్ణిమన్వంతరము. 12.రుద్రసావర్ణి మన్వంతరము. 13. దేవసావర్ణి మన్వంతరము. 14. ఇంద్రసావర్ణి మన్వంతరము. మనం ప్రస్తుతం వైవస్వత మన్వంతరం అంటే ఏడవ మన్వంతరంలో ఉన్నాము. ఈ మనువుల సంతతిని మానవులు అని అంటారు. మను అనే పదమే ఇంగ్లీషులో మాన్ అయింది. మనసుతో ఆలోచించే వారు మానవులు ఎందుకంటే జంతువులకు, పక్షులకు ఆలోచించే శక్తి లేదు.

నలుగురు మహాఋషులు, 7 సప్తఋషులు, 14 మంది మనువులు..... వీరంతా కూడా ఆ పరమాత్మ యొక్క సంకల్పము నుండి ఉద్భవించిన వారు. ఈ సృష్టికి వీరే మూలపురుషులు. వీరందరికీ భగవంతుని మీద అనన్య భక్తి, ఆత్మజ్ఞానము పుష్కలంగాఉంది. మరి ఈ సృష్టి ఇలా ఎందుకు జరిగింది అని ప్రశ్నించుకుంటే, ఒకటే సమాధానం. మనకు రెండు మార్గాలుఉన్నాయి. ఒకటి ప్రవృత్తి మార్గము. అంటే ప్రాపంచిక విషయములలో లీనం అయ్యే మార్గము. రెండవది నివృత్తి మార్గము అంటే ప్రాపంచిక విషయములను వదిలి పరమాత్మ వైపు ప్రయాణించే మార్గము. నివృత్తిమార్గం సనకాదులు అనుసరిస్తే, సప్తఋషులు,మనువులు మనకు ప్రవృత్తి మార్గాన్ని అంటే గృహస్థాశ్రమాన్ని సూచించారు. ముందు ప్రవృత్తి మార్గాన్ని అనుసరించి తరువాత నివృత్తి మార్గాన్ని అనుసరించారు. మనకు కూడా ఇదే మార్గాన్ని సూచించారు.

పరమాత్మ సంకల్ప మాత్రం చేతనే సృష్టిని చేయగలడు. ఆమాటకొస్తే మానవులు కూడా ఏ పని చేయడానికైనా ముందు సంకల్పించాలి. తరువాత అది కార్యరూపం దాలుస్తుంది. సంకల్పం మనసులో ఉంటుంది. కార్యం ప్రకటితమౌతుంది. కేవలం స్త్రీపురుష సంయోగం చేతనే కాకుండా సంకల్పం చేత కూడా సృష్టి జరుగుతుంది అనే విషయాన్ని మనకు పరోక్షంగా తెలియజేస్తున్నాడు పరమాత్మ.

లౌకికంగా చూస్తే, ఒక ముఖ్య మంత్రి ఆరోగ్యశ్రీ ని సృష్టించాడు. జలయజ్ఞం గురించి ఆలోచించాడు. ఇవన్నీ ఆలోచనలే. ఆ ఆలోచనలనుండి వచ్చిన ఆచరణలే. వీటికి రూపం లేదు. ఇవి వ్యవస్థలు. (వీటిని ఫలానా ముఖ్యమంత్రి బ్రైన్ ఛైల్డ్ అని అంటుంటాము కదా!) అలాగే ఈ సనకాదులు, సప్తఋషులు, మనువులు, అవ్యక్తమైన వ్యవస్థలు. వీరికి స్థూలశరీరాలు ఉండవు. అందుకే బ్రహ్మమానస పుత్రులు అని అన్నారు.

మరి వీళ్లంతా ఎలా ఉంటారు అంటే మద్భావా: అంటే ఎల్లప్పుడు నన్నే భావిస్తుంటారు అని అర్థం. ఆత్మజ్ఞానము కలిగి ఉంటారు. కానీ ఆ మహర్షుల నుండి పుట్టిన మనం మాత్రం భగవద్భావన లేకుండా ఎప్పుడూ ప్రాపంచిక విషయముల గురించి పాకులాడుతున్నాము. 24 గంటలలో కొంచెం సమయం కూడా భగవంతుని ధ్యానించడానికి కేటాయించడం లేదు. కాబట్టి మనం కూడా కొంచెం భగవద్భావన అలవరచుకోవాలి. ఎందుకంటే మన వంశ ప్రతిష్టను నిలబెట్టవలసిన బాధ్యత మనమీదనే ఉంది. ఎప్పుడో ఉన్న పూర్వీకుల గురించి ఇప్పుడు ఎందుకు అనుకోవచ్చు. కానీ వివాహాలలో గోత్రం చూస్తున్నాము. పూజలలో గోత్రం చెబుతున్నాము. కాని వారిని మరిచిపోతున్నాము. వారి గోత్రంలో ఎంత మంది ఋషులు ఉన్నారో చాలామందికి గుర్తులేదు. మన పూర్వీకులనుస్మరించుకోవడం మన కనీస కర్తవ్యం అని అందరూ భావించాలి.

మరొక విషయం ఏమిటంటే మనం అందరం ఆ మహాఋషుల నుండి పుట్టాము కాబట్టి మనం కూడా వారి మాదిరి గొప్పవాళ్లమే. తక్కువ వాళ్లము కాదు కానీ మనలను మనం తక్కువచేసుకుంటున్నాము. కులాల పేరిట అడ్డుగోడలు నిర్మించుకుంటున్నాము. జాతి, మత, కుల వివక్ష లేకుండా అందరం ఈ మహాఋషుల సంతానమే. ఎవరైనా మీ పూర్వీకులు ఎవరు అంటే తాత ముత్తాతల పేర్లుకాకుండా, నేను ఫలానా ఋషి సంతతి వాడిని అని గర్వంగా చెప్పాలి. (పూర్వకాలంలో తమను తాము పరిచయం చేసుకోడానికి ప్రవర చెప్పుకునేవాళ్లు. అందులో గోత్రనామాలు ఉండేవి.) నేను అంతటివాటిని అని మానసికంగా భావించాలి. అందరమూ వాళ్లంతటి గొప్ప వాళ్లం కావడానికి ప్రయత్నించాలి.

సప్తఋషులు మన జన్మలకు మూల కారకులు అయితే, సనకాదులు మనకు మోక్షమార్గమును బోధించారు. మనువులు మనకు ధర్మమార్గాన్ని బోధించారు. మనుధర్మశాస్త్రము ఈనాటికీ మనము అనుసరిస్తున్నాము. సప్తఋషులు మనకు వంశ పరంపరను, సనకాదులు మనకు గురు పరంపరను, మనువు మనకు ధర్మపరంపరను ఇచ్చారు. అందుకే పరమాత్మ ఈ ముగ్గురుని గురించి ప్రస్తావించారు.

## 7. ఏతాం విభూతిం యోగం చ మమ యో వేత్తి తత్త్వతః।
## సోऽవికమ్పేన యోగేన యుజ్యతే నాత్ర సంశయః॥

ఎవరైతే నా విభూతుల గురించిన యోగమును తెలుసు కోగలుగుతున్నాడో, అతడి యోగము, నిష్ఠ అచలమైనది. చలించనిది. ఇందులో ఎటువంటి సందేహము లేదు.

ఇక్కడ రెండుపదాలు వాడారు. ఒకటి యోగము రెండు విభూతి. యోగము అంటే ఒక అర్థము కలయిక. ఒకదానితో ఒకటి కలవడం. రెండుగా ఉన్నవి ఒకటి కావడం. మరొక అర్థము..... యోగము అంటే ఒక వస్తువు తన అవ్యక్తరూపంలో ఉండటం. అంటే సూక్ష్మరూపంలో ఉండటం. విభూతి అంటే ఆ సూక్ష్మరూపం స్థూలరూపంగా వ్యక్తం కావడం. విత్తనంఉంది. అందులో మొక్క, చెట్టు, మహావృక్షము అవ్యక్తంగా ఉంది. దానిని భూమిలో నాటడం మొదలగు ప్రక్రియల వలన అది వ్యక్తం అయింది.

విత్తనరూపంలో దాగి ఉన్న వృక్షము యోగము అయితే అది ప్రకటితం కావడం విభూతి. పాలలో వెన్న, వెన్నలో నెయ్యి ఉన్నాయి. పాలలో తోడు పెడితే పెరుగు, పెరుగును చిలికితే వెన్న, వెన్న అగ్నితో సంయోగం చెందితే నెయ్యి. ఇలా కొన్ని మార్పుల వలన అవి ప్రకటితం అవుతున్నాయి. ఎక్కడో అమ్మాయి. మరొక చోట అబ్బాయి. వారిద్దరినీ వివాహము అనే బంధము కలుపుతుది. అప్పటిదాకా అవ్యక్తంగా ఉన్న సూక్ష్మశరీరము వారు తీసుకునే ఆహారం ద్వారా వారిలో ప్రవేశించి అండంగా, పిండంగా, శిశువుగా, మనిషిగా మారుతున్నాడు. వ్యక్తం అవుతున్నాడు. దీనినే విభూతి అంటారు. గురువుగారిలో ఉన్న జ్ఞానము యోగ రూపంలో ఉంటుంది. అది శిష్యుడికి చెప్పినపుడు విభూతి రూపంలో ఆయన లో నుండి బయటకు వస్తుంది. అలాగే ఈ చరాచర జగత్తు అంతా పరమాత్మలో అవ్యక్తంగా యోగ రూపంలో ఉండి, విభూతులుగా ప్రకటితము అవుతూ ఉంటుంది.

ఈ వ్యక్త, అవ్యక్తముల గురించిన జ్ఞానము తెలిస్తే, పరమాత్మగురించి తెలిసినట్టే. అందుకే నా విభూతిని అంటే నా ఐశ్వర్యమును, నా మహిమను గురించి ఎవరు తెలుసుకుంటారో, నాతో ఎవరు సంయోగము చెందడానికి ప్రయత్నిస్తారో, అతనికి అవికంపేన యోగేన అంటే ఎలాంటి ప్రకంపనలు అంటే ఒడిదుడుకులు లేని యోగము సిద్ధిస్తుంది. ఇందులో సందేహము లేదు అని ఘంటాపథంగా చెబుతున్నాడు పరమాత్మ. అంటే ఈ అనంత విశ్వం అంతా అతనికి యోగరూపంలో తనలోనే కనపడుతుంది. అతడు ఎక్కడికీ వెళ్లనక్కరలేదు. ఎక్కడ ఉన్నా తాను అనేక పుణ్యక్షేత్రములలో ఉన్న భావన కలుగుతుంది. ఎందుకంటే అతనికి నిశ్చలమైన యోగం సిద్ధించింది. అతడు ఈ ప్రపంచాన్ని స్థూలదృష్టితో కాకుండా యోగదృష్టితో చూస్తాడు.

మనం పరమాత్మను చేరుకోవాలంటే ముందు పరమాత్మను గురించి ఆయన యొక్క అవ్యక్తరూపం గురించి అంటే యోగము గురించి తెలుసుకోవాలి. అలా తెలుసుకుంటే మోక్షమార్గము సులభము అవుతుంది. ఏమీ తెలియకుండా ఏమి చెయ్యాలో తెలియకుండా ఏమి చేస్తాము. ఆ విషయమే ఇక్కడ చెబుతున్నాడు పరమాత్మ. పరమాత్మ యొక్క మహిమను ఐశ్వర్యాన్ని ఈ జగత్తు ఎలా ఆవిర్భవించింది అనే విషయాన్ని ఎవరైతే తెలుసుకుంటారో, అతడికి నిశ్చలమైన యోగము, ధ్యానము,నిష్ట అలవడతాయి. అతడికి జ్ఞానం సిద్ధిస్తుంది. అహం బ్రహ్మాస్మి అనే స్థితికి చేరుకుంటాడు. ఇందులో సందేహము లేదు. అని పరమాత్మ స్పష్టం చేసాడు.

8. అహం సర్వస్య ప్రభవో మత్తః సర్వం ప్రవర్తతే।
ఇతి మత్వా భజన్తే మాం బుధా భావసమన్వితాః॥

ఓ అర్జునా! నేనే ఈ సకల జగత్తు ఉత్పత్తికి కారకుడను. ఈ సకల జగత్తు నావలననే నడుస్తూఉంది. ఈ విషయం తెలుసుకున్న సాధకుడు నా యందు భక్తిభావంతో నన్నేపూజిస్తాడు.

అసలు మనం పరమాత్మను గురించి ఎందుకు తెలుసుకోవాలి? ఆయనతో మనకేం పని? అని కొంత మంది అనవచ్చు. భౌతిక వాదులు ఇలా ఆలోచిస్తుంటారు. ఇది ఎలా ఉంటుందంటే తల్లి తండ్రి వారి సుఖం కోరి కలుసుకున్నారు. వారికి నేను పుట్టాను. వారితో నాకేం పని. వేళకు అన్నం పెట్టడానికి అమ్మ, అడిగినప్పుడల్లా డబ్బులు ఇవ్వడానికి నాన్న. తరువాత వాళ్లతో నాకేం పని లేదు. వృద్ధాశ్రమానికి పంపేద్దాం. ఇదీ నేటి ధోరణి. అలాగే కోరినకోరికలు తీర్చడానికి, నివేదన కాగానే ప్రసాదం పెట్టడానికి దేవుడు, దేవాలయాలు. కోరిన కోరికలు తీరితే మరలా దేవాలయం. కోరికలు తీరకపోతే మరొక దేవుడు. అదీకాకపోతే నాస్తికత్వం. ఇదీ నేటి ధోరణి. దానికి సమాధానంగా ఈ శ్లోకం చెప్పాడు పరమాత్మ.

ఈ సమస్త జగత్తు పుట్టడానికి నేనే కారణము. నాలోనుండి జగత్తు ఆవిర్భవించింది. ఆవిర్భవించిన తరువాత నేనే దానిని నడిపిస్తున్నాను. ఆఖరుకు నాలోనే లయం చేసుకుంటాను. అని అన్నాడు. మనలో చాలా మంది దైవము మీద భక్తి కలిగి ఉంటారు. కాని భగవంతుని మీద ఏకాగ్రభక్తి, శ్రద్ధ, నిష్ట కలిగిన వారు కొద్దిమందేఉంటారు. అటువంటి వారికి ఏకాగ్రభక్తి, నిష్ఠ ఎలా కలుగుతుంది అంటే పరమాత్మను గురించి క్షుణ్ణంగా తెలుసుకున్న తరువాత కలుగుతుంది. లేకపోతే దేవుడు అంటే మనం కోరుకున్న కోరికలు తీర్చేవాడుగానే మనకు తెలుస్తుంది. కాబట్టి ఈ జగత్తు కంతటికీ మూలాధారము పరమాత్మ, ఆయనే ఈ జగత్తును సృష్టించి, పెంచి పోషించి, లయం చేస్తున్నాడు, మనం నిమిత్తమాత్రులం అని తెలుసుకోవాలి. అప్పుడేపరమాత్మ మీద అచంచలమైన, ఏకాగ్రమైన భక్తి శ్రద్ధ కలుగుతాయి. అందుకే భావసమన్వితాః అంటే భగవంతుని గురించిన

భావముతో నిండి ఉండాలి. మరొక భావన, మరొక ఆలోచన ఉండకూడదు. అటువంటి వారికి భగవంతుడు సులభంగా ప్రాప్తిస్తాడు.

ఈ నాటి శాస్త్రజ్ఞులు కూడా ఇదే చెబుతున్నారు. దైవకణంలో నుండి బిగ్ బాంగ్ ద్వారా ఈ విశ్వం ఆవిర్భవించింది. విస్తరిస్తూ ఉంది. తుదకు అంతా ఆ దైవకణంలోకి చేరుతుంది. ఈ దైవకణాన్ని మనం దేవుడు పరమాత్మ అని అంటున్నాము. శాస్త్రజ్ఞులు ఈ దైవకణం ఏమిటా అని ఎడతెగని పరిశోధనలు జరుపుతున్నారు. కానీ అంతుచిక్కడం లేదు. అలాగే మనం కూడా పరమాత్మ గురించి తెలుసుకోవాలని, పరమాత్మ మీద భక్తి కలిగి ఉండాలనీ భగవద్గీతలో కృష్ణుడు చెబుతున్నాడు.

మరొక విషయం కూడా ఆలోచించండి. ఈ విశ్వం అంతా పరమాణువుల మయం. ఈ విశ్వంలో మనం అందరం ఉన్నాము. మనం మన శరీరాలు కూడా పరమాణువుల మయం. దీనికి మూలం దైవకణం అంటే ఒక పరమాణువు. అంటే పరమాత్మ ఒక్కడే. మన శరీరం, సమస్త విశ్వం దైవకణాలతో నిండి ఉన్నప్పుడు, ఆ పరమాత్మ ఈ సమస్త జీవరాసులలో ఆత్మస్వరూపంగా ఉన్నాడు అన్న మాట సబబే కదా. ఆలోచించండి.

## 9. మచ్చిత్తా మద్గత ప్రాణా బోధయన్త: పరస్పరమ్।
## కథయన్తశ్చ మాం నిత్యం తుష్యన్తి చ రమన్తి చ॥

నా యందే చిత్తము నిలిపిన వారు, నా మీదనే ప్రాణములు నిలుపుకొని ఉన్నవారు, ఇద్దరు ఒక చోట చేరితో, నా గురించే మాట్లాడుకునేవారు, బోధించుకునేవారు, అటువంటి వారు అనునిత్యము తృప్తిగా జీవితం గడుపుతారు. వారి ఆనందానికి అవధులు లేవు.

పరమాత్మయందు అచంచలమైన భక్తి శ్రద్ధ కలవారు ఎలా ఉంటారు, వారి అనుభూతులు ఎలా ఉంటాయో ఇక్కడ చెప్పాడు పరమాత్మ. సామాన్య మానవుల మనసు, బుద్ధి ఎప్పుడూ ప్రాపంచిక విషయములలో తిరుగాడుతూ ఉంటుంది. వారికి ఈ బాహ్యప్రపంచమే స్వర్గతుల్యము. కాని పరమాత్మ యందు భక్తి కలిగిన వారి చిత్తము ఎల్లప్పుడూ పరమాత్మయందు లగ్నం అయి ఉంటుంది. వారు తమ ప్రాణాలన్నీ పరమాత్మయందు నిలుపుకొని బతుకుతుంటారు. అంటే ఈ ప్రాణములు సంచరించే జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు,మనోబుద్ధిఅహంకారములు ఎల్లప్పుడూ పరమాత్మయందే నిలిచి ఉంటాయి. వారు ఏది చూచినా,విన్నా అంతా వారికి పరమాత్మమయంగా ఉంటుంది. అటువంటి వారికి అశాశ్వతములైన ప్రాపంచిక విషయముల మీద ఆసక్తి ఉండదు.

సాధారణంగా నలుగురు క్రికెట్ ప్రియులు కలిసినపుడు క్రికెట్ గురించే మాట్లాడుకుంటారు. ఎందుకంటే వారి మనసులు క్రికెట్ యందు లగ్నం అయి ఉంటాయి. అలాగే ఒక హీరో అభిమానులు ఒక చోట చేరితే ఆ హీరో సినిమాల గురించి ఫైట్ల గురించి పాటల గురించి చర్చించుకుంటారు. ఎందుకంటే వారి ప్రాణాలన్నీ ఆయన మీదనే పెట్టుకొని బతుకుతుంటారు. కాని పరమాత్మయందే చిత్తము లగ్నం చేసి, సకల ఇంద్రియములలో ఆయనను చూస్తూ ఆయన గురించి వింటూ, ఆయన గురించే ఆలోచించేవారు, వారు నలుగురు కలిసినపుడు వారు ఇతర విషయముల గురించిమాట్లాడుకోరు. పరమాత్మ గురించి మాట్లాడుకుంటారు. పరమాత్మ కథలను ఒకరికి ఒకరు చెప్పుకుంటారు. విన్న వాటిని మననం చేసుకుంటారు. ఎందుకంటే వారి మనసు ఎల్లప్పుడూ పరమాత్మయందు లగ్నం అయి ఉంటుంది. వారు ఏది మాట్లాడినా, ఆలోచించినా, ఏది చేసినా దైవసంబంధంగానే ఉంటుంది. వారి మనసులు ఎల్లప్పుడూ ఆనందంగా ఉంటాయి. వారు ఎల్లప్పుడూ తృప్తిగా జీవిస్తారు. వారి ఆనందానికి, సంతోషానికి అవధులు ఉండవు. శోకము, దు:ఖము, కష్టము వారి దగ్గరకు రావడానికి భయపడతాయి.

ఈ స్థితి రావడానికి కావాల్సిన అర్హత ఏమిటి అంటే ఎవరైతే పరమాత్మ యందు మనసు కలవారో అంటే మనం ఇదివరకు చెప్పినట్టు మనసును ఆత్మలో నిలిపినవారు, నామీదనే ప్రాణములు పెట్టుకున్న వారు. ఈ విధంగా నన్ను పొందడానికి అర్హులు అని పరమాత్మ చెప్పాడు. సాధారణంగా సామాన్య జనులు ప్రపంచంలోని విషయాల మీద మనసు లగ్నం చేస్తారు. వారి మనసు,చిత్తము, ప్రాణములు, ఇంద్రియములు అన్నీ ప్రాపంచిక విషయముల మీదనే లగ్నం అయి ఉంటాయి. కాని భగవంతుని మీద భక్తి కలవారు, తమ మనసు భగవంతుని మీద లగ్నం చేసిన వారు, తమ ప్రాణములు అన్నీ భగవంతుని మీదనే పెట్టుకొని బతుకుతున్న వారు వేరే ఉంటారు.

మన మనసంతా బయట కనపడే వస్తువులమీదా వాటిని ఎలా పొందాలా అనే విషయాలమీదా ఉంటుంది. ఎల్లప్పుడు వాటి గురించే ఆలోచిస్తూ ఉంటుంది. కాని భక్తులు, జ్ఞానులు, భగవంతుని గురించే ఆలోచిస్తారు. ఆయన కథలు వినడంలో ఆసక్తి చూపుతారు, భగవంతుని కథలను ఒకరికి ఒకరు బోధించుకుంటూ ఉంటారు. పరమాత్మ విషయం తప్ప వారు ఇంక దేని గురించీ మాట్లాడరు. చర్చించరు. ఈ విధంగా అభ్యాసము చేస్తే ఆఖరుకు వారు పరమాత్మలో లీనం అవుతారు. పరమాత్మ విషయాలు కేవలం చదవడమా, వినడమా ఏది మంచిది అనే విషయం గురించి ఈ శ్లోకంలో వివరించారు.

ఎవరికి వారు చదవడం కన్నా ఒకరికి ఒకరు బోధించుకోవడం మంచిది. ఒకరికి

తెలియని విషయాలు మరొకరు చెప్పే వీలుంటుంది. అందరూ అన్నీ విషయాలు తెలుసుకునే వీలుంది. ఇలా చేసినందువలన అన్ని విషయాలు మనకు తెలుసు అనే తృప్తి కలుగుతుంది. ఈ తృప్తి జీవితంలో కూడా అలవడుతుంది.

ఇటువంటి వారు తమ ప్రాణములు అన్నీ పరమాత్మ యందే పెట్టుకొని ఆయనతోడిదే లోకంగా ఉంటారు. మనం సాధారణంగా 'నా ప్రాణాలన్నీ నీ మీదనే పెట్టుకొని బతుకుతున్నాను' అని అనడం వింటుంటాము. మనం మనపిల్లల మీదా, భార్యాభర్తలు ఒకరి మీద ఒకరు ప్రాణాలు పెట్టుకొని బతకుతుంటారు. మరి కొందరు ధనము, ఆస్తుల మీద ప్రాణాలుపెట్టుకొని ఉంటారు. మరి కొంతమందికి పదవి మీద ప్రాణము. కాని కొంతమంది మాత్రం, మన అందరికీ తల్లి తండ్రి దైవము, అన్ని సంపదలు ఇచ్చిన వాడు అయిన పరమాత్మ యందు ప్రాణాలుపెట్టుకొని బతకడం ఆశ్చర్యం ఏముంది. అంటే దీని అర్థం ప్రాపంచిక విషయముల కన్నా, మన అందరికీ భగవంతుని ఎడల నిశ్చయమైన భక్తి శ్రద్ధ ఉండాలి. దీనిని పాటించిన వాడికి తృప్తి, సుఖం, ఆనందం అతని వెంటే ఉంటాయి.

## 10. తేషాం సతత యుక్తానాం భజతాం ప్రీతి పూర్వకమ్।
## దదామి బుద్ధియోగం తం యేన మాముపయాన్తిమే॥

ఎల్లప్పుడూ నా యందు మనస్సును నిలిపి, నన్ను ప్రీతితో భజిస్తారో, అటువంటి వారికి, నన్నుపొందగలిగే మార్గమైన బుద్ధియోగమును ఇస్తాను.

ఇక్కడ బుద్ధి యోగము అంటే జ్ఞానము, విచక్షణా జ్ఞానము, ఆత్మ అనాత్మ వివేకము, సత్య అసత్య విచారము అని అర్థం చేసుకోవచ్చు. అటువంటి బుద్ధియోగం మనకు పరమాత్మ ఇవ్వాలంటే పైశ్లోకంలో చెప్పబడిన లక్షణాలు ఉండాలి.

పరమాత్మ యందు ప్రాణాలునిలుపుకొని, ఆయననే పూజిస్తూ, భజిస్తూ, ఆయన గురించి మాట్లాడుకుంటూ బోధించుకుంటూ, చర్చించుకుంటూ ఉంటే ఏమి వస్తుంది అంటే బుద్ధియోగం దదామి మంచి బుద్ధిని అంటే జ్ఞానాన్ని ప్రసాదిస్తాను. అని హామీ ఇస్తున్నాడు కృష్ణుడు. మనకు అంతకంటే కావాల్సింది ఏముంది. ఈ జ్ఞానయోగము ద్వారా మోక్షము పొందడానికి వీలు ఉంది. మరి ఆ జ్ఞానముపొందడానికి కొన్ని షరతులు విధించాడు పరమాత్మ. అవేమిటంటే ఇది వరకు చెప్పినవే మరలా చెబుతున్నాడు. ఎందుకంటే మనకు ఎంత చెప్పినా విని అర్థం చేసుకునే శక్తి లేదు. అర్థం చేసుకున్నా వాటిని మన మనసు అంగీకరించదు. అందుకే మరలా మరలా చెబుతున్నాడు.

మొదటిది... తేషాం సతత యుక్తానాం అంటే ఎల్లప్పుడు పరమాత్మ యందు మనసు లగ్నం అయి ఉండాలి. మరి సాకారంగానో నిరాకారంగానో పరమాత్మను ఎలా, ఎప్పుడు పూజించాలి అనే సందేహం వస్తుంది. దానికి సమాధానమే సతత యుక్తానాం అంటే ఎల్లప్పుడూ నా యందే యుక్తుడు అయి ఉండాలి. ఏదో కాసేపు దేవుడి ముందు కూర్చోవడం కాదు. ఏ పని చేస్తున్నా, మనసు మాత్రం పరమాత్మయందు లగ్నం అయి ఉండాలి. తల్లి బిడ్డను ఉయ్యాలలో పడుకోబెట్టి నిద్రబుచ్చి ఇంటి పనులు చేసుకుంటూ ఉంటుంది. కాని బిడ్డలో చిన్న కదలిక కలిగినా, పరుగు పరుగున ఉయ్యాల వద్దకు వస్తుంది. అంటే ఆమె ఏ పని చేస్తున్నా, మనసు మాత్రం బిడ్డ మీదనే ఉంటుంది. అలాగే మనం కూడా మన దైనందిన కార్యములలో ఏ పని చేస్తున్నా, మన మనసు మాత్రం భగవంతుని మీద లగ్నం అయి ఉంటే చాలు, ఎటువంటి అధర్మము, చేయకూడని పనీచేయము. సముద్రంలో ఎన్నో అలలు ఉంటాయి. అన్నిటికీ సముద్రమే మూలము. అలలు వస్తుంటాయి. పోతుంటాయి. అవన్నీ క్షణికములు, సముద్రము శాశ్వతము. అలాగే ఈ దేహములు అనిత్యములు. పరమాత్మ నిత్యము, శాశ్వతము, అవ్యయము. అందుకే మనం ఏపని చేస్తున్నా, నిరంతరం మన మనసు మాత్రం పరమాత్మయందు లగ్నం అయి ఉండాలి. ఎన్ని జన్మలు ఎత్తినా తుదకు చేరుకోవాల్సింది పరమాత్మ వద్దకే అనే జ్ఞానం కలిగి ఉండాలి.

రెండవది భజతాం ప్రీతి పూర్వకమ్ నా మీద ప్రేమతో, ప్రీతితో నన్ను భజించాలి. ఇక్కడ ప్రీతి అంటే ఇష్టముకాదు భక్తి, శ్రద్ధ, ఏకాగ్రత, నిష్కామభక్తి అని అర్థం చేసుకోవాలి. ఏవేవో కోరికలు మనసులో పెట్టుకొని అవి తీరుతాయో లేదో,ఈ దేవుడు నా కోరికలు తీరుస్తాడో లేదో అనే అనుమానంతో పూజలు చేయకూడదు. ఈ విగ్రహాలకు ఏమేం అలంకారాలు చేయాలి. ఏమేం నివేదనలు సమర్పించాలి అనే ధ్యాసతో పూజలు చేయకూడదు. నిర్మలమైన మనస్సుతో ఏకాగ్రతతో, నిష్కామంగా ప్రీతి పూర్వకంగాపూజించాలి. మరి దానికి ఫలితం ఏమిటంటే.......

ఇటువంటి వారికి నేను బుద్ధిని జ్ఞానాన్ని ప్రసాదిస్తాను.
బుద్ధి అంటే ఏమిటి? విచారణ. మంచి చెడు. సత్యము అసత్యము. ఆత్మ అనాత్మ  వీటి గురించి విచారించేది బుద్ధి. ఆత్మ వేరు శరీరము వేరు అని తెలియజెప్పేది బుద్ధి. ఈ బుద్ధి మనకు ఉంటే ఈ ప్రపంచంలో ఉన్న వస్తువులను, మనలను మోహంలో ముంచే వస్తువుల యొక్క  వాస్తవ రూపములను తెలుసుకొని కావాల్సిన వాటినే తీసుకొని మిగిలినవి వదిలివేస్తాము. అన్నీ నాకే కావాలి. అన్నీ నా వద్దనే ఉండాలి. ఎవరికీ దక్కకూడదు... అనే స్వార్థబుద్ధి నశిస్తుంది.

ఈ ప్రపంచంలో ఎన్నో కోట్ల మంది జీవులు ఉన్నా ఈ రకమైన బుద్ధి కలవారు చాలా తక్కువ. భగవంతుని మీద భక్తి విశ్వాసము ఏకాగ్రత శ్రద్ధ ఉంటేనే ఈ బుద్ధి లభిస్తుంది.
చాలా మంది అంటుంటారు మేము ప్రతిరోజూ దేవుడిని పూజిస్తుంటాము. దేవాలయములకు వెళు

తుంటాము. కాని మాకు అటువంటి బుద్ధి ఎందుకు కలగడం లేదు అని అంటారు.
మేము దేవుడిని విగ్రహములలోనే చూస్తుంటాము. కాని మాకు ఆత్మ దృష్టి ఎప్పుడు కలుగుతుంది అని మరి కొంతమంది అంటారు.
సాకార ఉపాసన నుండి నిరాకార పూజవైపుకు ఎప్పుడు వెళతాము అని మరి కొందరు అంటుంటారు.
మేము ఏవేవో కోరికల కొరకు దేవాలయములలో ఉన్న విగ్రహములను పూజిస్తున్నాము. మరి మాకు మోక్షం ఎప్పుడు కలుగుతుంది అని మరి కొందరి ప్రశ్న. దీని కంతటికీ ఈ శ్లోకమే సమాధానము.
మీరు ఏ విధంగా పూజించినా అంటే సాకారంగానో, నిరాకారంగానో, లేక వివిధ దేవతా రూపములతోనూ పూజించినా, ఆ పూజలు ముందు కొనసాగించాలి. అంటే ఇది ప్రధమ స్థాయి. కాని ఈ స్థాయిలో చేసే పూజలు భక్తి, శ్రద్ధ, ఏకాగ్రత, ప్రేమ వీటితో కూడుకొని ఉండాలి. ఈ సాకార పూజలతో తృప్తి చెందిన పరమాత్మ నిర్గుణోపాసన అంటే నిరాకారంగా పూజించే బుద్ధిని జ్ఞానాన్ని ప్రసాదిస్తాడు. దాని ద్వారా మానవుడు మోక్షమార్గమును చేరుకోగలడు. ఎప్పుడైతే జీవుడికి ఈ బుద్ధి జ్ఞానము కలిగిందో, అతని పూజలు నిరాకారుడైన పరమాత్మవైపు మళ్లుతాయి. ఇది ఎప్పుడు వస్తుందో తెలియదు. బుద్ధుడికి బోధి వృక్షము కింద జ్ఞానోదయము అయింది. అలాగే మనకూ హటాత్తుగా జ్ఞానం కలిగే అవకాశం ఉంది.

ఈ సమయంలో భక్తి కావాలా జ్ఞానం కావాలా దేనిని కోరుకోవాలి అనే ప్రశ్న రాదు. ముందు అనన్య భక్తి. దాని వలన జ్ఞానం కలుగుతుంది. జ్ఞానం అంటే పరమాత్మ గురించిన జ్ఞానం. అవి శ్రవణం, మననం, నిధిధ్యాసనం వల్ల కలుగుతాయి. మంచి గురువు మనలను వెదుక్కుంటూ వస్తాడు. జ్ఞాన బోధ చేస్తాడు. కాబట్టి సాకార పూజ ప్రాధమిక స్థాయి. కాని అక్కడే ఉండి పోకుండా, సాకార పూజనుండి నిరాకార పూజవైపుకు మళ్లాలి. దేవుని మీద భక్తి, శ్రద్ధ, ఏకాగ్రత కలగడానికే సాకార పూజ ఉపయోగిస్తుంది. ఈ విషయం తెలుసుకోవడమే విచక్షణా బుద్ధి. అందుకే భక్తితో నన్ను సాకారంగా పూజిస్తే నీకు అటువంటి బుద్ధిని జ్ఞానమును ప్రసాదిస్తాను అని చెబుతున్నాడు పరమాత్మ.

ఆ బుద్ధి ఎటువంటిది అంటే యేన మామ్ ఉపయన్తి. ఆ బుద్ధియోగము వలన నన్ను చేరుకోవచ్చు. ఈ జనన మరణ చక్రము నుండి విముక్తి పొందవచ్చు అని కృష్ణుడు పరమాత్మను చేరుకోవడానికి ఉపయోగపడే బుద్ధియోగమును తానే ఇస్తాను, దాని కోసం ఎక్కడెక్కడో తిరగనవసరం లేదు, వెదకనవసరం లేదు. అని నొక్కి చెబుతున్నాడు.

11. తేషామేవానుకమ్పార్థ మహమజ్ఞానజం తమః।
నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా॥

పైశ్లోకములో చెప్పబడిన బుద్ధియోగమును ప్రసాదించిన తరువాత, అటువంటి భక్తుల మీద దయచూపడానికి, నేను వారి మనసులలో నిలిచి ఉంటాను. వారిలో జ్ఞానజ్యోతిని వెలిగిస్తాను. నేను ప్రసాదించిన జ్ఞానప్రకాశముతో వారిలో ఉన్న అజ్ఞానము అనే చీకటిని నశింపచేస్తాను.

ఈ శ్లోకాలలో పరమాత్మకు తన భక్తుల ఎడల ఉన్న ప్రేమ, కరుణ, వాత్సల్యము స్పష్టంగా తెలుస్తూ ఉంది. బుద్ధియోగం ఇచ్చాను నీ ఇష్టం అని వదిలెయ్యకుండా, మన మనసులలో నిలిచి, మనలో జ్ఞానజ్యోతిని వెలిగించి, ఆ జ్ఞానజ్యోతి ప్రకాశములో మనలో ఉన్న అజ్ఞానము అనే చీకటిని అంతమొందిస్తాను అని కూడా మనకు అభయం ఇస్తున్నాడు. ఏ భక్తుడికైనా ఇంతకన్నా కావాల్సింది ఏముంటుంది.

పైశ్లోకంలో కృష్ణుడు, ప్రేమతో భక్తితో ఏకాగ్రతతో నన్నుసేవించే వారికి బుద్ధి జ్ఞానము ప్రసాదిస్తాను అని అన్నాడు. ఈ శ్లోకంలో ఆ బుద్ధి జ్ఞానము మానవునికి ఎందుకుఉపయోగ పడతాయో విశధం చేస్తున్నాడు. భగవంతుని సాక్షాత్కారము కావాలంటే, శాశ్వత ఆనందము, శాంతి కావాలంటే ముందు బుద్ధి, జ్ఞానము అవసరము. దాని వలన ఆత్మ తత్వ విచారణ అలవడుతుంది. కటిక చీకటిలో చిన్న దీపం వెలిగించినా ఆ చీకటి పూర్తిగా తొలగి పోతుంది. అలాగే అజ్ఞానము అనే అంధకారంలో కొట్టుకుంటున్న మనకు జ్ఞానము, బుద్ధి, అనేచిన్ని దీపము మన చీకటిని తొలగిస్తుంది. మనము పెట్టే దీపము కొద్ది దూరం మాత్రమే చీకటిని పోగొడుతుంది. కాని ఈ జ్ఞానదీపము మనలో ఉన్న అజ్ఞానము అనే అంధకారమును పూర్తిగా తొలగిస్తుంది. అజ్ఞానం పోతే మోహం పోతుంది. అహంకారం పోతుంది. కోపం పోతుంది. నిజాన్ని నిజంగానే చూచే విచక్షణ అలవడుతుంది.

మరి ఈ బుద్ధి జ్ఞానము ఒకరు ఇచ్చేది కాదు. ఆ భగవంతుడే ఇవ్వాలి. అందరిలో భగవంతుడు ఉన్నాడు. కాని వారికి బుద్ధి జ్ఞానము ఉండదు. కారణం వారు భగవంతుని నమ్మరు. ఆయన గురించి తెలుసుకోరు. పైగా వితండ వాదాలు చేస్తుంటారు. అంతా నేనే అంతా నా వలననే జరుగుతుంది అని అహంకరిస్తుంటారు. అదే అజ్ఞానం. ఆ అజ్ఞానం అనే చీకటి పోవాలంటే భగవంతుని పూజించాలి. అలా పూజిస్తేనే జ్ఞానం, బుద్ధి, భగవంతుడు మనకు ఇస్తాడు. కాబట్టి ప్రతీ వాడూ మొట్ట మొదట సాకారంగానో నిరాకారంగానో నిర్మలమైన మనస్సుతో ఏకాగ్రతతో భగవంతుని పూజించడం మొదలు పెట్టాలి. అప్పుడు నేను వారి వెంటనే ఉంటాను. వారిలో నిలిచి ఉంటాను అని చెబుతున్నాడు పరమాత్మ.

ఆత్మభావస్థ అంటే వారి ఆత్మలలో నిలిచి ఉంటాను అని అంటున్నాడు. మనం చేసే ఏసంకల్పం అయినా, పని అయినా, భగవంతుడు మన వెంట ఉండి, అది మంచిదా చెడ్డదా అనే విచక్షణ మనకు కలిగిస్తుంటాడు. కాబట్టి ఎవరూ చెడుసంకల్పములు చేయరు. దుర్మార్గములు చెయ్యరు. హింసచేయరు ఎందుకంటే భగవంతుడే మనలను లోపల ఉండి నడిపిస్తున్నాడు. తమ: నాశయామి అంటే మనలో ఉన్న అజ్ఞానము అనే చీకటిని నాశనం చేస్తాడు. మనం చేయాల్సిందల్లా ఆయనను నిష్కల్మషమైన మనసుతో పూజించడం. ఆరాధించడం, భజించడం, సేవించడం, ధ్యానించడం. మిగిలింది ఆయన చూసుకుంటాడు.

అర్జున ఉవాచ:

12. పరం బ్రహ్మ పరం ధామ పవిత్రం పరమం భవాన్।
పురుషం శాశ్వతం దివ్యమాదిదేవమజం విభుమ్॥

13. ఆహుస్త్వాం ఋషయస్సర్వే దేవర్షిర్నారదస్తథా।
అసితో దేవలో వ్యాసస్స్వయం చైవ బ్రవీషిమే॥

ఓ కృష్ణా! నీవు పరం బ్రహ్మవు, పరంధాముడవు, పవిత్రుడవు, అందరికంటే శ్రేష్ఠుడవు. నీవు అన్ని శరీరములలో వెలుగుతున్న పురుషుడవు. శాశ్వతుడవు. దివ్యుడవు. ఆదిదేవుడవు. పుట్టుకలేని వాడికి. అందరికీ ప్రభువు. నీ గురించి పూర్వము ఋషులందరూ చెప్పారు. ముఖ్యంగా దేవ ఋషి అయిన నారదుడు, అసితుడు, దేవలుడు, వ్యాసుడు చెప్పారు. ఇప్పుడు నీవు స్వయంగా నీ గురించి చెప్పావు.

ఇక్కడి దాకా విన్న అర్జునుడికి మామూలుగా కొన్ని సందేహాలు కలిగాయి. ఇన్ని విన్న తరువాత ఇంకా సందేహాలు ఉన్నాయి అంటే కృష్ణుడు కోప్పడతాడేమో. అసలే యుద్ధానికి సమయం అయింది. మరి తన సందేహాలు తీరేదెలా? అయితే అర్జునుడికి తన ఎదురుగా ఉన్న కృష్ణుడు సామాన్యుడు కాడు అని అర్థం అయింది. అందుచేత ముందు కృష్ణుడిని కాస్త పొగిడి, తరువాత తన సందేహాల చిట్టా విప్పవచ్చు అని అనుకున్నాడు. అందుకే అర్జునుడు కృష్ణుడి గురించి పొగడటం మొదలెట్టాడు.

కృష్ణా! నువ్వు సామాన్యుడివి కాదు అని అర్థం అయింది. నీవు సాక్షాత్తు పరబ్రహ్మ స్వరూపుడవు. పరమునే ధామముగా కలిగిన వాడవు. పవిత్రుడవు. నీవు పరమ పురుషుడవు. అన్ని జీవరాసులలో ఆత్మస్వరూపంగా ఉన్న వాడివి. శాశ్వతుడవు అంటే జనన మరణములు, మార్పులేని వాడివి. దివ్యుడవు, ఆది దేవుడవు. నీకు పుట్టుక లేదు. అందరికీ వైభవం చేకూర్చేవాడివి. ఇవన్నీ నాకు తెలుసు అనుకుంటావేమో. అదేమీ లేదు. ఇదివరకు, నీ గురించి నేను గొప్ప గొప్ప మహాఋషుల నుండి, దేవర్షులు అయిన నారదుడు, అసితుడు దేవలుడు వ్యాసుడు మొదలగు వారి నుండి స్వయంగా విన్నాను. ఇప్పుడు నువ్వు కూడా నాకు చెప్పావు. నేను అన్నీ శ్రద్ధగా విన్నాను.అందుకే నాకు నువ్వు సామాన్యుడివి కాదు అని పూర్తిగా అర్థం అయింది.

## 14. సర్వమేతదృతం మన్యే యన్మాం వదసి కేశవ।
## న హి తే భగవన్ వ్యక్తిం విదుర్దేవా న దానవాః॥

ఓ కేశవా! ఇప్పటి దాకా నువ్వు నాకు చెప్పిన విషయాలన్నీ నిజమే. అందులో ఆవంతయినా అబద్ధంలేదని నమ్ముతున్నాను. కాని నీ గురించి, నీ స్వరూపము గురించి దేవతలు కానీ, రాక్షసులు కానీ తెలుసుకోలేరు కదా!

ఓ కేశవా! మీరు చెప్పినది అంతా సత్యమే అని అనుకుంటున్నాను. మీ గురించి నాకు పూర్తిగా తెలియక పోయినా గొప్ప గొప్ప మహా ఋషులు, మా పూర్వీకుడు వ్యాసుడు కూడా చెప్పాడు కాబట్టి మీరు చెప్పినది అంతా సత్యము అని నమ్ముతున్నాను. అనీ కాసేపు కీర్తించిన తరువాత అర్జునుడు అసలు సందేహం బయట పెట్టాడు. "కృష్ణా! నాకు ఒక చిన్న సందేహం. అదేమిటంటే.... ఇంతకూ తమరి అసలు స్వరూపము ఏమిటి? తమరి గురించి కనీసం దేవతలకన్నా తెలుసా! దేవతలకే తెలియకపోతే, రాక్షసులకు అసలే తెలియదు. ఇంక మానవ మాత్రులకు మాకేం తెలుస్తుంది." అని మెల్లగా అడిగాడు.

## 15. స్వయమేవాత్మనాత్మానం వేత్థ త్వం పురుషోత్తమ।
## భూతభావన భూతేశ దేవ దేవ జగత్పతే॥

ఓ పురుషోత్తమా! ఓ దేవదేవా! జగత్పతే! నీవు సకల జీవ రాసులను సృష్టిస్తున్నావు. పోషిస్తున్నావు, నియమిస్తున్నావు. మీ చేత సృష్టించ బడ్డ వాళ్లము మేము. మీ గురించి మీకే తెలుసు. మీ గురించి మీరు చెప్పకపోతే మాకేం తెలుస్తుంది చెప్పండి. మన తల్లి తండ్రుల నుండి మనంపుట్టాము. వారి గురించి వారే చెప్పాలి. వారు చెప్పక పోతే మన తల్లి తండ్రుల గురించి మనకు తెలిసే అవకాశమే లేదు. తల్లి తండ్రులు లేకపోతే ఇతరులన్నా చెప్పాలి. ఇక్కడ ఇతరులు

అంటే మహాఋషులు, యోగులు, పరమాత్మ గురించి తెలిసినవారు, సనకాదులు మొదలగు వారు. శ్రీకృష్ణుడు పరమాత్మ అని అర్జునుడు గ్రహించాడు కాబట్టి, ఆయన విభూతుల గురించి చెప్పమని నేరుగా ఆయననే అడుగుతున్నాడు.

## 16. వక్తు మర్హస్యశేషేణ దివ్యాహ్యాత్మ విభూతయః। యాభిర్విభూతిర్లోకానిమాంస్త్వం వ్యాప్య తిష్ఠసి॥

మీరు ఈ లోకం అంతా వ్యాపించి ఉన్నారు అని ఇదివరకు మీరే చెప్పారు. కాని తమరు ఈ లోకంలో ఎవరిలో, ఏ విధంగా, ఏ యే విభూతులచేత వ్యాపించి ఉన్నారు. అలా అని చెప్పి అతి సామాన్యమైన విభూతులగురించి కాదు. నాకు తెలియనివి, ప్రముఖమైనవి, దివ్యమైనవి అయిన మీ విభూతుల గురించి మాకు తెలియజేయండి. ఈ లోకంలో మీరు పూర్తిగా వ్యాపించినా, ఏయే వస్తువులలో ప్రముఖంగా తిష్ఠవేసి ఉన్నారో, ఆ విభూతులను గురించి తెలియజేయండి. వీలుంటే ఏదీ వదలకుండా, మిగలకుండా చెప్పండి.

ఈ విషయాలు మీకు తప్ప మరొకరికి తెలియవు. తెలిసే అవకాశం కూడా లేదు. తమరి గురించి నాకు తెలియచేయడానికి మీరే అర్హులు.

## 17. కథం విద్యామహం యోగింస్త్వాం సదా పరిచిన్తయన్। కేషు కేషు చ భావేషు చిన్త్యో2సి భగవన్మయా॥

తాను ఈ విధంగా ఎందుకు అడుగుతున్నాడో దానికి కారణం కూడా చెప్పాడు అర్జునుడు. ఓ కృష్ణా! ఈ విధంగా అడిగి మిమ్ములను ఇబ్బంది పెట్టాలని కాదు. మీరు ధ్యాన యోగం గురించి చెప్పారు. ధ్యానయోగంలో ధ్యానం చేయాలంటే దేని గురించి ధ్యానం చేయాలి? మిమ్ములను ఏ యేరూపాలలో ధ్యానించాలి, పూజించాలి, అర్చించాలి. దానికి నాకు ఏదో ఒక ఆధారం, ఆలంబనం కావాలి కదా. ఏదో ఒక విగ్రహమో, భావనో ఉండాలి కదా! అంతటా ఉన్న మిమ్ములను తెలుసుకోవడం ఎలాగ! మీరు ఏయే వస్తువులలో, జీవరాసులలో ప్రముఖంగా ఉన్నారో ఎలా తెలుసుకోవడం. ఈ విషయాలు చెప్పడానికి మీరే సమర్థులు. కాబట్టి మీ యోగ మహిమను మీ విభూతులను, సవిస్తరంగా తెలియజేయండి. అవి తెలుసుకుంటే, నేను ఆయా మానవులను జంతువులను వస్తువులను విగ్రహాలను చూచినపుడు మీరు వాటిలో ఉన్నారన్న భావన కలుగుతుంది. క్రమక్రమంగా నా మనసు వాటి మీద లగ్నం అవుతుంది. దాని ఫలితంగా నాకు ఆత్మజ్ఞానము, పరమాత్మజ్ఞానము కలుగుతుంది.

18. విత్తరేణాత్మనో యోగం విభూతిం చ జనార్దన।
భూయః కథయ తృప్తిర్హి శృణ్వతో నాస్తి మే2మృతమ్॥

కాబట్టి ఓ జనార్దనా! మీయొక్క విభూతుల గురించి, యోగము గురించి అంటే మీ యొక్క వ్యక్త అవ్యక్త స్వరూపాల గురించి సవిస్తరంగా, ఏదీ వదిలిపెట్టకుండా, నాకు తెలియజేయండి. ఈ విషయాలన్నీ ఇది వరకే చెప్పాను కదా, మరలా చెప్పడం దేనికి అని ఉపేక్షించవద్దు. మరలా మరలా నాకు తెలియజేయండి. మీ నోటి నుండి వచ్చే అమృతోపమానములైన మాటలను ఎంత విన్నా తనివితీరడం లేదు. తృప్తికలగడం లేదు. అని అన్నాడు అర్జునుడు. అర్జునుడి మాటలు విన్న కృష్ణుడు అర్జునుడితో ఇలా అన్నాడు.

శ్రీభగవానువాచ:

19.హన్త తే కథ యిష్యామి దివ్యా హ్యాత్మవిభూతయః।
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ నాస్త్యన్తో విస్తరస్యమే॥

అర్జునుడు అడిగిన దానికి కృష్ణుడు ఈ విధంగా సమాధానం చెప్పాడు. ఓ కురువంశములో శ్రేష్ఠుడైనవాడా! నీవు అడిగావు కాబట్టి, నా విభూతులను ప్రాధాన్యక్రమంలో నీకు వివరిస్తాను. ఎందుకంటే నా విభూతులకు అంతులేదు. అన్నిటి గురించి చెప్పడం కుదరదు కదా!

"అర్జునా! నీకు ఇదివరకే చెప్పాను. నేను సర్వవ్యాపిని అనీ, ఆది అంతము లేని వాడను, సమస్తలోకములు నాలోనే ఉన్నాయనీ అనీ చెప్పాను కదా! అలాగే నా విభూతులు కూడా అంతము లేనివి. అనంతమైనవి. దివ్యమైనవి. అన్నీ వివరంగా చెప్పడానికి ఇక్కడ సాధ్యం కాదు. కాని, నువ్వు అడిగావు కాబట్టి నా విభూతులలో ముఖ్యమైనవి, వాటి వాటి ప్రాధాన్యత క్రమాన్ని బట్టి క్రమపద్ధతిలో చెబుతాను శ్రద్ధగా విను.

20. అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః।
అహమాదిశ్చ మధ్యం చ భూతానామన్త ఏవ చ॥

ఓ గుడాకేశా! (తమోగుణమును, అలసత్వమును జయించిన వాడా!) ఇది వరకు చెప్పినట్టు, నేను ఈ చరాచర జగత్తులో ఉన్న భూతములలో ఆత్మస్వరూపుడుగా నిలిచి ఉన్నాను. ఈ సకల

ప్రాణుల యొక్క పుట్టుక, పోషణ, మరణము అన్నీ నేనే అయిఉన్నాను. నేను తప్ప మరొకటి ఉంటూ ఏటీలేదు.

"అర్జునా! నేను ఇదివరకే చెప్పాను కదా! సర్వభూతములలో ఆత్మ స్వరూపుడుగా నేనే ఉన్నాను. సమస్త ప్రాణుల యొక్క పుట్టుక, స్థితి, అంతము కూడా నేనే కదా. ఇంక చెప్పేదేముంది." అని ముందుగానే విభూతియోగం పూర్తిగా నాలుగు ముక్కలలో ముగించాడు. భగవానుడికి తన గురించి తాను చెప్పుకోవడం పరిపాటి. తన గురించి ఈ మానవులు ఎప్పటికైనా తెలుసుకుంటారేమో అని ఆయన ఆశ. కాని వింటున్న అర్జునుడికి కొంతైనా తెలిసిందేమో కానీ, మనందరమూ ఎప్పటికీ తెలుసుకోలేము అన్న సంగతి కూడా ఆయనకు బాగా తెలుసు అందుకే మరలా మరలా చెబుతున్నాడు.

ప్రతి జీవికి ఒక దేహము అందులో మనోబుద్ధిఅహంకారాలు, వాటిని సాక్షిగా చూస్తున్న ఆత్మ ఉంటాయి. ఆ ఆత్మ స్వరూపుడనే నేనే. ఆ ఆత్మ ప్రాపంచిక విషయములలో లీనం అయితే జీవాత్మ అవుతుంది. కాబట్టి జీవాత్మ ఆత్మ ఒక్కటే. వేరుకాదు. కాబట్టి మనం అందరం మన మనసును, చిత్తమును ప్రాపంచిక విషయముల నుండి లోపలకు మళ్లించి ఆత్మయం దు నిలపాలి. అప్పుడే మనకు ఆత్మజ్ఞానం కలుగుతుంది. ఆత్మ పరమాత్మలో లీనం అవుతుంది.

కాబట్టి ఎవరు కూడా పరమాత్మదృష్టిలో తక్కువ కాదు. అందరూ ఆత్మస్వరూపులే. కాకపోతే ప్రతివ్యక్తి నేను ఈ శరీరం కాను, నేను ఆత్మస్వరూపుడను అనే జ్ఞానం పొందగలగాలి. నాలో పరమాత్మ ఆత్మ స్వరూపుడుగా ఉన్నాడు అనే ఆత్మవిశ్వాసం ప్రతి మానవుడూ పొందగలగాలి. అందరిలో పరమాత్మ ఉన్నాడు అనే భావన కలిగితే రాగద్వేషాలు ఉండవు. అందరికీ ఉపకారము చెయ్యాలనిపిస్తుంది. ఎవరూ ఎవరినీ ద్వేషించరు. ఇతరులకు చేసే సేవ, వారిలో ఉన్న ఆత్మలకు చేసే సేవ, అనే అనుభూతి కలుగుతుంది. (మానవ సేవే మాధవ సేవ) అప్పుడు ఎవరు కూడా పాప కార్యాలు చేయరు. సర్వభూతాయస్థిత: అంటే సకల భూతములలో ఆత్మ స్వరూపుడుగా స్థిరంగా ఉన్నాను అని అందరూ తెలుసుకోవాలి. అప్పుడే అందరూ అన్ని దు:ఖములకు దూరమై శాశ్వత ఆనందమును పొందగలరు. పరమ శాంతిని పొందగలరు. దీనికి కావాల్సింది ఒక్కటే. నేను ఆత్మస్వరూపాన్ని. ఈ శరీరం కాదు అని తెలుసుకోవడం. "నేను" అంటే ఆత్మ స్వరూపము.
"నేను ఉన్నాను" అంటే నేను శరీరముగా ఉన్నాను. ప్రతివాడూ "నేను ఉన్నాను" అనే స్థితి నుండి "నేను" స్థితికి చేరుకోవాలి. అదే ఆత్మజ్ఞానము.

మరి ఈ విభూతులు ఏమిటి అని ప్రశ్నించుకుంటే, పరమాత్మ నుండి ప్రకృతి ఆవిర్భవించింది. మరలా ఆయనలో లీనం అవుతుంది. ఈ ప్రకృతిలో జరిగే సృష్టి, స్థితి, లయములు ఆయన వలననే జరుగుతున్నాయి. సమస్త జీవరాసులను సృష్టించి వాటిలో ప్రవేశించి, వాటిని

పోషించి, మరలా లయం చేస్తున్నాడు. ఇదీ ఒక లీలా మాత్రంగా జరుగుతూ ఉంది. ఇది ఒక నియమము. పరమాత్మ అన్నిటిలోనూ, అన్ని జీవరాసులలోనూ ఆత్మస్వరూపుడుగా ఉన్నాడు. అక్కడ ఉన్నాడు ఇక్కడ లేడు అన్నది లేదు. కాకపోతే ప్రతి ప్రాణిలోనూ ఆత్మస్వరూపుడుగా ఉన్న పరమాత్మను తెలుసుకోడానికి అందరం ప్రయత్నించాలి. తాను వేటి వేటిలో ప్రకృష్టంగా ఉన్నాడో తన విభూతులు వేటి వేటిలో ప్రముఖంగా ఉన్నాయో తెలియజేస్తున్నాడు కృష్ణుడు.

ఈ చెప్పడం కూడా మనందరికీ అర్థం అయ్యేరీతిలో, మనకు తెలిసిన విషయాల గురించి దేవతా మూర్తులు, ఋషులు, మానవులు, జంతువులు, పక్షులు, కదలని వస్తువులు, కదిలే వస్తువులు అన్నిటిలో నా విభూతులు ఉన్నాయి, ఈ జగత్తు అంతా ఈశ్వర మయం అనే విషయాన్ని తెలియజేస్తాడు కృష్ణుడు. కాబట్టి మనం ఈ జగత్తు అంతా ఈశ్వరభావన, పరమాత్మభావన కలిగి ఉండాలంటే ఈ శ్లోకాలను శ్రద్ధగా చదివి అర్థంచేసుకోడానికి ప్రయత్నం చేయాలి. అప్పుడే మనకు ఆత్మజ్ఞానం కలుగుతుంది. తద్వారా మోక్షం పొందడానికి అర్హత కలుగుతుంది.

### 21. ఆదిత్యానామహం విష్ణుర్జ్యోతిషాం రవిరంశుమాన్।
### మరీచిర్మరుతామస్మి నక్షత్రాణామహం శశీ॥

ఇక్కడినుండి శ్రీకృష్ణ పరమాత్మ తన విభూతులను వర్ణిస్తున్నాడు. ఆదిత్యులలో విష్ణువును నేను. ప్రకాశించే వారిలో సూర్యుడను, ఆ సూర్యుడి కిరణములను నేను. మరుత్తులలో మరీచిని నేను. నక్షత్రములలో చంద్రుడను నేను.

మనకు పూర్వము వైదిక దేవతామూర్తులు అంటే వేదములలో చెప్పబడిన దేవతలు ఉండేవారు. వారు 33 మంది. ద్వాదశ ఆదిత్యులు 12, ఏకాదశ రుద్రులు 11, అష్టవసువులు 8, ఒక ఇంద్రుడు, వీరందరిమీదా ప్రజాపతి. మొత్తం 33 మంది.

కశ్యప ప్రజాపతికి ఇద్దరూ భార్యలు. దితి, అదితి. దితి కుమారులను దైత్యులు అని అంటారు. అదితి కుమారులు ఆదిత్యులు. ఈ ఆదిత్యులు పన్నెండు మంది అని చెప్పుకున్నాము కదా! వారి పేర్లు. 1.ధాత, 2.మిత్రుడు, 3. అర్యముడు, 4.శక్రుడు, 5. వరుణుడు, 6.అంశువు, 7.భగుడు, 8.వివస్వంతుడు, 9.పూషుడు, 10.సవిత 11.త్వష్ట 12. విష్ణువు. ఈ పన్నెండు మంది సూర్యుని రూపాలు. ఒక్కొక్క నెల ఒక్కొక్క రూపంతో ఉంటాడు. అందుకే ద్వాదశ ఆదిత్యులు అని అన్నారు. ఈ 12మంది అదిత్యులలో విష్ణుస్వరూపమును నేను. విష్ణువు స్థితికారుడు. సూర్యుడు విష్ణువు రూపంలో మనకు జవసత్వాలను, ఆరోగ్యాన్ని, ప్రసాదిస్తున్నాడు. అందుకే ఆదిత్యులలో విష్ణువును నేను అని అన్నాడు కృష్ణుడు.

మరుత్తులు ఏడుగురు. 1. ఆవహ, 2.ప్రవహ, 3.నివహ, 4.పరాహ, 5. ఉద్వహ, 6. సంవహ, 7. పరివహ. భాగవత పురాణంలో ఈ మరుద్గణములగురించి ఒక కథ కూడా ఉంది. కశ్యపునికి ఇద్దరు భార్యలు. దితి, అదితి. అదితి కుమారులు ఇంద్రుడు మొదలగు దేవతలు. దితి కుమారులు హిరణ్యకశిపుడు మొదలగు దైత్యులు. ఇంద్రుడు విష్ణువు సాయంతో తన కుమారులను చంపించాడని కోపంగా ఉంది దితి. తనకు ఇంద్రుడిని చంపే కుమారుడిని ప్రసాదించమని కోరింది దితి. భార్యమాట కాదనలేక ఆ వరం ఇచ్చాడు కానీ కొన్ని నిబంధనలు పెట్టాడు. గర్భంతో ఉండగా ఆ నిబంధనలు అతిక్రమిస్తే, ఆ పుట్టే కుమారుడు ఇంద్రుడికి మిత్రుడు అవుతాడు అని అన్నాడు. దితి సరే అంది. ఇది తెలిసిన ఇంద్రుడు పినతల్లి దితి వద్దకు వచ్చాడు. ఆమెకు సేవలు చేస్తున్నాడు. దితి కాదనలేకపోయింది. దితి ఒక రోజు ఒక నిబంధన అతిక్రమించింది. ఇదే తగిన సమయం అనుకున్నాడు ఇంద్రుడు. దితి గర్భంలో ప్రవేశించాడు. లోపల ఉన్న పిండాన్ని ఏడు భాగాలుగా నరికాడు. ఆ పిండాలు ఏడుస్తున్నాయి. ఏడవకండి ఏడవకండి అంటూ మరలా ఒక్కొక్క భాగాన్ని ఏడుగా నరికాడు. మొత్తం నలభైతొమ్మిది భాగాలు అయ్యాయి. వారంతా మమ్మల్ని ఎందుకు నరికావు మేమేం అపకారం చేసాము అని ఇంద్రుని నిలదీసారు. మీరు నన్ను చంపడానికే పుడుతున్నారు కదా!అని అన్నాడు ఇంద్రుడు. మేము నిన్ను ఎందుకు చంపుతాము. మేమంతా నీకు మిత్రులుగా ఉంటాము అని అన్నారు వారు. అయితేమంచిదే. మీరు దితికుమారులు దైత్యులు అయినా మిమ్ములను దేవతా గణములలో చేర్చుకుంటాను, మీకు దేవత్వం ప్రసాదిస్తాను అని అన్నాడు ఇంద్రుడు. తరువాత 49 భాగాలుగా చేయబడిన మరుత్తులు, ఇంద్రుడు, దితి గర్భం నుండి బయటకు వచ్చారు. నేను ఒక్క కుమారుడిని అడిగితే ఇంతమంది ఎలా వచ్చారు అని ఆశ్చర్యపోయింది దితి. జరిగిన విషయం అంతా చెప్పి క్షమించమనికోరాడు ఇంద్రుడు. తన కుమారులు దేవతా గణములు అయినందుకు సంతోషించింది దితి. అప్పటి నుండి వారు వాయువుకు అధిష్ఠాన దేవతలుగా, మరుత్తులుగా ప్రసిద్ధికెక్కారు. ఈ మరుత్తులు 49 మంది ఏడు గణాలుగా విభజింపబడ్డారు. వారినే మరుద్గణములు (వాతశక్తులు) అని అంటారు. ఈ 49 మనలో జీవశక్తిని ప్రసారం చేసే నాడులు అని కూడా అంటారు. ఈ నాడులలో ప్రవహించే జీవశక్తిని మరీచి అంటారు. అందుకే మరుత్తులలో మరీచిని అంటే జీవశక్తిని నేను అని అన్నాడు కృష్ణుడు. ఇది భాగవతపురాణంలో ఉన్న మరుత్తుల కథ.

ప్రకాశించేవారిలో నేను సూర్యుడను అని అన్నాడు. మనకు సూర్యుడు చంద్రుడు ప్రత్యక్ష దైవాలు. సూర్యుడు పగలు ప్రకాశిస్తుంటాడు. తన కిరణాలతో వేడిని వెలుగును, ప్రాణశక్తిని జీవకోటికి ప్రసాదిస్తుంటాడు. అందుకే తన కిరణాలతో ఎక్కువ ప్రకాశాన్ని, వేడిని, వెలుగును ఇచ్చేవారిలో సూర్యుడను నేను అని అన్నాడు. అలాగే రాత్రిపూట చంద్రుడు, నక్షత్రాలు ప్రకాశిస్తుంటాయి. నక్షత్రాలు పరిమాణంలో పెద్దవి అయినా, భూమికి కోటాను కోట్ల కాంతి సంవత్సరాల దూరంలో ఉండటం చేత, మిణుకు మిణుకు మంటూ ఉంటాయి. కాని చంద్రుడు మాత్రం, భూమికి దగ్గరగా

ఉండటం చేత, పెద్ద బింబంగా కనపడుతూ, తన మీద పడ్డ సూర్య కాంతిని, వెన్నెల రూపంలో ప్రతిఫలింపచేస్తున్నాడు. చంద్రుడు తన కాంతితో ఓషధులకు, పంటలకు జీవం పోస్తుంటాడు. అందుకే రాత్రిపూట ఎన్ని నక్షత్రాలు ఉన్నా వాటిలో ఎక్కువ ప్రకాశం ఇచ్చేది చంద్రుడు. అందుకే రాత్రి పూట ప్రకాశించే వాటిలో చంద్రుడిని నేను అంటున్నాడు కృష్ణుడు.

## 22. వేదానాం సామవేదోऽస్మి దేవానామస్మి వాసవః।
## ఇన్ద్రియాణాం మనశ్చాస్మి భూతానామస్మి చేతనా॥

వేదములు నాలుగు. కొంతమంది త్రయీ విద్య అంటే వేదములు మూడంటారు. నాలుగు వేదములు ఏవంటే ఋగ్వేదము యజుర్వేదము సామవేదము అథర్వణ వేదము. ఈ నాలుగు వేదములలో సామవేదము నేను అంటున్నాడు. మొట్టమొదట వేదములు అన్నీ ఒకటిగా ఉండేవి. వ్యాసుల వారు ఒకటిగాఉన్న వేదమును విభజించారు. దేవతా స్తోత్రములు, చరిత్రలు, శ్లోకములు గా ఉన్న భాగములను విడదీసి ఋగ్వేదము గా పేరు పెట్టాడు. ఆ శ్లోకములనే ఋక్కులు అని అంటారు. తరువాత, యజ్ఞములు, యాగములు, అవి చేసే విధానములు, వాటి వివరములు, యజ్ఞములు ఎవరు చేయాలి, దానికి ఏమేం కావాలి, యజ్ఞకుండములు ఎన్ని ఉండాలి, ఎన్ని ఇటుకలు పెట్టాలి, వాటిపొడవు వెడల్పు, ఇలాగా యజ్ఞములు యాగములు క్రతువులు వీటికి సంబంధించిన వివరములు ఇంకా వీటికి సంబంధించిన ఇతర వివరములతో కూడి, ఎక్కువగా గద్యభాగముతో ఉండే వేదభాగమునకు యజుర్వేదము అని పేరు పెట్టారు. తరువాత ఈ రెండు వేదములలో కఠినంగా కాకుండా, సౌమ్యంగా, పాడుకోతగ్గవిగా ఉన్న భాగములను సామవేదము అని అన్నారు. ఇవి కాకుండా మిగిలిన భాగములు అన్నీ కూడా అధర్వణవేదములో చేర్చారు. సాధారణంగా సత్వగుణం ప్రధానం కాబట్టి, సాత్వికంగా పాడుకోతగిన వేదభాగము సామవేదము. మిగిలిన వేదములు పారాయణ చేస్తాము. సామవేదం గానం చేస్తాము. అందుకే సామగానము అంటారు. పైగా వినసొంపుగా ఉంటుంది. పైగా ఈ సామవేదములో ఋగ్వేదము, యజుర్వేదములోని ముఖ్యభాగములు, ఇంకా కొన్ని ఇతరములు ఉన్నాయి. కాబట్టి సామవేదము చదివితే అన్నీ చదివినట్టే అనే అభిప్రాయం కూడా ఉండి ఉండవచ్చు. అందుకే సామవేదము అన్నిటి కన్నా ఉత్తమమైనది అన్నాడు పరమాత్మ.

మనం ముక్కోటి దేవతలు అని అంటుంటాము. కాని దేవతలు 33 మంది మాత్రమే. వారే దేవతా గణములు. ఈ దేవతా గణములకు అధిపతి ఇంద్రుడు.(వీటి గురించి వివరణ పైన ఇచ్చాను.) విష్ణువును ఉపేంద్రుడు అని కూడా అంటారు. ఇంద్రుడు లోకపాలకులలో ఒకడు. ఒక మన్వంతరములో విష్ణువు ఇంద్రుడుగా కూడా ఉన్నాడు.

మనకు ఉన్న ఇంద్రియములు 10. మనో బుద్ధి అహంకారములు 3. వీటిలో మనసును నేను. ఇంద్రియములు ఒకే విధంగా పనిచేస్తాయి. కాని మనసు ఈ ఇంద్రియములను శాసిస్తుంది. ఆయా పనులు చేయమని సంకల్పిస్తుంది. పైగా ఇంద్రియములు స్థూలములు. వాటి కదలికలు పరిమితము. కాని మనసు అమితమైన వేగం కలది. ఈ క్షణం ఇక్కడ ఉంటే మరోక్షణం వేల మైళ్లదూరంలో ఉంటుంది. కాబట్టి ఇంద్రియములకన్నిటికీ మనసు గొప్పది కాబట్టి ఆ మనసును కూడా నేనే అని అంటున్నాడు.

తరువాత ఈ సకల జీవరాసులలో అంతర్లీనంగా ఉండి. ఆ జీవరాసులను నడిపిస్తున్న చైతన్యస్వరూపమును నేను. అంటే ఆత్మస్వరూపుడను నేను. శరీరము జడము. లోపల చైతన్యము లేకపోతే అవిపనిచేయలేవు. మనిషిలోని చైతన్యం లేకపోతే అవి చచ్చిపోతాయి. మనిషి చనిపోయినతరువాత ఇంద్రియములు అన్నీ ఉంటాయి. కాని కదలకుండా పడి ఉంటాయి. ఏవీ పని చేయవు. (కొడుకు, కూతురు, భర్త, భార్య, ప్రేయసి, ప్రియుడు, ఇలా మనం ఎంతగా ప్రేమించేవారినైనా, ఆ చైతన్యం లేకపోతే, శరీరాన్ని ఇంట్లో ఉంచుకోము. కాల్చేస్తాము. కాబట్టి శరీరములో చైతన్యము ముఖ్యమైనది.) అన్ని జీవరాసులలో అంతర్లీనంగా ఉంటే ఆ చైతన్యము నేను అంటున్నాడు కృష్ణుడు.

## 23. రుద్రాణాం శంకరశ్చాస్మి విత్తేశో యక్షరక్షసామ్।
## వసూనాం పావకశ్చాస్మి మేరుశ్శిఖరిణామహమ్॥

ఏకాదశ రుద్రులు అంటే 11 మంది. వారు 1.హరుడు 2.బహురూపుడు 3.త్ర్యంబకుడు, 4.అపరాజితుడు 5. వృషాకపి 6.శంభువు, 7. కపర్ది, 8. రైవతుడు 9.మృగవ్యాధుడు 10. శర్వుడు 11.కపాలి. వీరిలో శంకరుడను నేను. అంటే హరుడు అని అర్ధము. శం అంటే శుభములు కరుడు కలిగించేవాడు. ఇక్కడ శుభములు అంటే ప్రాపంచిక సుఖములు అని కాదు అర్థం. దు:ఖపూరితమైన ఈ శరీరము నుండి విముక్తి కలిగించేవాడు. దు:ఖాలయమైన ఈ జన్మనుండి విముక్తి కలిగించేవాడు. అందుకే ఆయనను శంకరుడు అని అన్నారు.

ధనవంతులలో కుబేరుడు. ఆయన యక్షులకు, రక్షసులకు అధిపతి. రావణునికి సోదరుడు. కుబేరుడు యక్షుడు. రావణుడు అసురుడు. కల్పాంతంలో బ్రహ్మకు రాత్రి అయింది. సృష్టి అంతా తనలోకి లాక్కున్నాడు. మరలా విష్ణునాభిలోకి వెళ్లిపోయాడు. అప్పుడు ఈ లోకం అంతా జలమయం అయింది. ఆ జలాలను రక్షించడానికి కొంతమంది ప్రాణులను సృష్టించాడు బ్రహ్మ. కాని వారు బ్రహ్మమీదనే తిరగబడ్డారు. తమకు వెంటనే ఆహారం కావాలని గోలచేసారు. వీరిని మంచి మాటలతో అనునయించాడు బ్రహ్మ. ఈ జలాలను రక్షించండి అని ఆదేశించాడు.

వారిలో ఆకలితో ఉన్న కొందరు రక్షిస్తాం అని అరిచారు. అంతగా ఆకలి లేని మరి కొందరు మేము ఈ జలాలను పూజిస్తాం అని అరిచారు. అప్పుడు బ్రహ్మగారు, రక్షిస్తాం అని అరిచిన వారిని రాక్షసులు అనీ, పూజిస్తాం అని అరిచినవారిని యక్షులు అని నామకరణం చేసాడు. తమోగుణం ఎక్కువగా ఉన్న వాళ్లను యక్షరాక్షసులు అని అన్నారు. వీళ్లు రెండు విధములైన జాతులుగా మనం అర్థం చేసుకోవచ్చు. మన మానవులలో మాదిరే యక్షులలో, రాక్షసులలో మంచి వాళ్లు, చెడ్డవాళ్లు, దుర్మార్గులు ఉన్నారు. కుబేరుడు యక్షులకు అధిపతి. రాక్షసులందరూ కుబేరుడి తమ్ముడైన రావణుడి పక్షాన చేరారు. ఈ కథ మీకు ఉత్తర రామాయణంలో కనిపిస్తుంది. రాక్షసులలో కొంతమంది అంటే దయ, జాలి, కనికరం, కరుణ,ప్రేమ,అభిమానము లేకుండా క్రూరంగా ప్రవర్తించేవాళ్లు. ఇటువంటి వాళ్లను ఈ రోజుల్లోకూడా రాక్షసులు అని మనం అంటూ ఉంటాము. అంటే రాక్షసులు అంటే క్రూరులు అని ముద్రపడింది.

వసువులు ఎనిమిది మంది. వారిని అష్టవసువులు అని అంటారు. 1. ధరుడు, 2.ధ్రువుడు 3.సోముడు 4.అహుడు 5.అనిలుడు 6. అనలుడు 7.ప్రత్యూషుడు 8. ప్రభాసుడు.(వీరిలో ఆఖరి వాడు ప్రభాసుడు. ఇతడు ద్వాపర యుగంలో గంగా దేవికి కుమారుడుగా జన్మించాడు. భీష్ముడుగా ప్రసిద్ధికెక్కాడు.) వీరిలో పావకుడు అంటే అనలుడు నేను. అనలుడు అంటే అగ్ని. అగ్ని పంచభూతములలో ఒకడు. ఆకాశము నుండి వాయువు. వాయువు నుండి అగ్ని పుట్టాయి. ఆకాశము, వాయువు కంటికి కనపడవు. పంచభూతములలో మొట్ట మొదట కనపడినది అగ్ని. అందుకే అగ్నికి అంత ప్రాధాన్యము. అగ్నికి హవ్యవాహనుడు అని కూడా పేరు. యజ్ఞములుచేసేటప్పుడు అగ్నిని వేలుస్తారు. ఆ అగ్నిలో వేసే ఆహుతులను అగ్ని తీసుకుపోయి అందరి దేవతలకు అందజేస్తాడు. అగ్నికి ప్రతిరూపమే సూర్యుడు. అందుకే వేడి, వెలుతురు ఇచ్చేవాటిలో అగ్ని, సూర్యుడు, ముఖ్యమైన వారు. పూర్వము ప్రతి ఇంట్లో అగ్నిహోత్రము ఆరకుండా వెలుగుతూ ఉండేది. కుశలప్రశ్నలు వేసేటప్పుడు మీఇంట్లో అగ్నులు బాగా వెలుగుతున్నాయా అని అడగడం మనం పురాణాలలో చదువుతూ ఉంటాము. ఇప్పటికీ కొంతమంది (పార్శీలు అనుకుంటాను) అగ్నినే వారి ఇష్టదైవంగా పూజిస్తారు. ఆ అగ్నిని నేను అంటున్నాడు కృష్ణుడు.

తరువాత పర్వతశిఖరములలో అంటే ఎత్తైన శిఖరములలో మేరు పర్వతము నేను. ఈ మేరుపర్వతము ఎక్కడ ఉన్నది అనడం ఒక వివాదాంశము. హిమాలయాలలో, టిబెట్ దగ్గర ఉందని కొంతమంది, ఉత్తరధృవము దగ్గర ఉందని కొంతమంది, దక్షిణ ఆఫ్రికాలో భూమధ్యరేఖ మీద ఉందని కొంత మంది అంటుంటారు. ఎందుకంటే మన పురాణాల ప్రకారం సూర్యుడు మేరు పర్వతం చుట్టు ప్రదక్షిణం చేస్తుంటాడు అని ఉంది. హిమాలయాలలో ఉంటే అది కుదరదు. కాబట్టి ఇంకెక్కడో ఉండి ఉండాలి. ఆ మేరుపర్వత శిఖరము నేను అని అన్నాడు కృష్ణుడు.

## 24. పురోధసాం చ ముఖ్యం మాం విద్ధి పార్థ బృహస్పతిమ్।
## సేనానీనామహం స్కన్దస్సరసామస్మి సాగరః॥

ఓ పార్థా! ప్రతి పనిని ముందు ఉండి నడిపించేవాడు పురోహితుడు. ఆ పురోహితులలో దేవపురోహితుడు అయిన బృహస్పతిని నేను. అని అన్నాడు పరమాత్మ. పురోహితుడు అతి ముఖ్యమైన పాత్ర వహిస్తాడు. మానవులను మంచి మార్గంలో నడిపిస్తాడు. ఒకసారి పాండవులు అరణ్యవాసంలో ఉన్నపుడు, పాండవులకు, ఒక గంధర్వుడికి మాటా మాటా పెరిగింది. మేమెవరో తెలుసా పాండుపుత్రులము, పాండవులము అని అన్నాడు అర్జునుడు. దానికి ఆ గంధర్వుడు ఆ విషయం నాకు ఎలా తెలుస్తుంది. మీరు ఇలా ఒంటరిగా రావడం తప్పు. మీకు ఒక పురోహితుడు ఉండాలి. ఆయన ముందు ఉండి మిమ్మల్ని నడిపిస్తాడు. మీ గురించి మా వంటి వారికి తెలియజేస్తాడు. కాబట్టి ముందు మీరు ఒక పురోహితుడిని నియమించుకోండి మీకు శుభం కలుగుతుంది అని హితవు చెప్పాడు. అప్పుడు పాండవులు ధౌమ్యుని తమ పురోహితునిగా పెట్టుకున్నారు. పురోహితునికి అంత ప్రాముఖ్యంఉంది. అటువంటి పురోహితులలో దేవ పురోహితుడు బ్రహస్పతి గొప్పవాడు. ఒకసారి ఇంద్రుడికి గర్వం తలకెక్కి, బృహస్పతి దేవసభలోకి ప్రవేశిస్తే, ఆయనను గౌరవించలేదు. దానికిఫలితంగా ఇంద్రుడు ఎన్నో కష్టాలు అనుభవించాడు. వృత్రుడుని చంపి ఇంద్ర పదవి పోగొట్టుకొని, వేయి సంవత్సరములు ప్రవాసంలో గడిపాడు. పురోహితుడి గొప్పతనం అటువంటిది అని మనకు తెలియజేస్తున్నాడు కృష్ణుడు.

సేనానాయకులలో కుమారస్వామిని నేను. ఆయన దేవసేనలకు అధిపతి. జలాశయములలో సాగరమును అంటే సముద్రము నేను. సగర కుమారులచేత తవ్వబడినది కాబట్టి దానికి సాగరము అని పేరు వచ్చింది. వాళ్లెందుకు తవ్వారు అంటే వారి తండ్రి సగరుడు అనే చక్రవర్తి అశ్వమేధయాగము చేస్తుంటే, ఇంద్రుడు ఆ యాగాశ్వమును దొంగిలించి, పాతాళంలో ఉన్న కపిలముని ఆశ్రమంలో దాచి పెట్టాడు. ఈ సంగతితెలిసి సగరుని కుమారులు 60,000 మంది భూమిని తవ్వడం మొదలు పెట్టారు. ఆ ప్రకారంగా తవ్వితే అక్కడ నీరు నిండి సాగరం అయింది. సగర కుమారులు తవ్వడం వలన ఏర్పడినది కాబట్టి దానికి సాగరం అని పేరు వచ్చింది. ఆ సాగరం నేను అని అంటున్నాడు పరమాత్మ.

## 25. మహర్షీణాం భృగురహం గిరామస్మ్యేకమక్షరమ్।
## యజ్ఞానాం జపయజ్ఞోऽస్మి స్థావరాణాం హిమాలయః॥

మహర్షులలో భృగువు ను నేను. మహర్షులు వేరు సప్తఋషులు వేరు. సప్తఋషులు ప్రతి మన్వంతరానికి మారి పోతుంటారు. కాని మహర్షులుమారరు. భృగువు, వ్యాసుడు మొదలగు

వారు మహాఋషులు. ఆ మహాఋషులలో భృగువును నేను అంటున్నాడు పరమాత్మ. ఎందుకంటే త్రిమూర్తులను కూడా పరీక్షించకలిగిన సామర్ధ్యం కలవాడు భృగువు.

ఒకసారి సరస్వతీనదీ తీరంలో మహాఋషులు అందరూ యజ్ఞం చేస్తున్నారు. ఆ సమయంలో యజ్ఞఫలాన్నిఎవరికి ఇవ్వాలి అనే ప్రశ్న తలెత్తింది. శుద్ధసత్వగుణ సంపన్నునికి ఇవ్వాలి అని అనుకున్నారు. కాని త్రిమూర్తులలో  శుద్ధసత్వగుణ సంపన్నుడు ఎవరు అనే ప్రశ్న వచ్చింది. అందరిలో కల్లా పెద్దవాడు గొప్పవాడు అయిన భృగు మహర్షిని పిలిచి త్రిమూర్తులలో శుద్ధ సత్వగుణ సంపన్నుడు ఎవరో తెలుసుకొని రమ్మన్నారు. భృగువు ముందు సత్యలోకానికి వెళ్లాడు. అక్కడ బ్రహ్మగారు సృష్టికార్యంలో నిమగ్నం అయి ఉండి భృగువు రాకను గమనించలేదు. బ్రహ్మ రజోగుణ ప్రధానుడు అని గ్రహించి, భృగువుకు కోపం వచ్చి వెళ్లిపోయాడు. తరువాత పరమశివుని వద్దకు వెళ్లాడు. ఆయన తన ప్రమథగణములతో నృత్యం చేస్తున్నాడు.భృగువు రాకను గమనించలేదు.  ఈ తామసగుణప్రవృత్తి కల శివుడు పనికిరాడని వైకుంఠమునకు వెళ్లాడు. అక్కడ మహావిష్ణువు శేషపాన్పుమీద యోగనిద్రలో ఉన్నాడు. భృగువు కోపం తారస్థాయికి చేరుకుంది. మహావిష్ణువు వక్షస్థలం మీద కాలితో తన్నాడు. వెంటనే విష్ణువు లేచాడు. భృగువు కాళ్ల మీద పడ్డాడు. తన వక్షస్థలం తన్నినందుకు భృగువు కాలు నొప్పి పుట్టిందేమో అని ఆయన కాలు పిసుకుతున్నాడు. ఆహా శుద్ధసత్వగుణ సంపన్నుడు అంటే శ్రీమహావిష్ణువు అని తేల్చుకొని ఆ విషయం మహాఋషులకు చెప్పాడు. అంతటి వాడు భృగువు. ఆ భృగువును నేనే అంటున్నాడు పరమాత్మ.

మనం మాట్లాడే మాటలలో ఓంకారము నేనే. కాబట్టి అన్ని మంత్రములలో ఓంకారము ముఖ్యమైనది అంటారు దానినే ప్రణవము, ప్రణవనాదము అని అంటారు. పంచాక్షరి, అష్టాక్షరి, ద్వాదశాక్షరి ఉన్నాయి. కాని ఓంకారము ఏకాక్షరము. ఓం ఇతి ఏకాక్షరం బ్రహ్మ అని మనం చెప్పుకుంటాము. ఓం కారమే పరబ్రహ్మ స్వరూపము. దానిని ఉచ్ఛరిస్తే చాలు అన్ని మంత్రములు ఉచ్ఛరించినట్టే. ప్రతి మంత్రము ముందు ఓంకారము జపిస్తాము. ఓం యొక్క ప్రాశస్త్యము ఉపనిషత్తులలో చక్కగా వివరింపబడి ఉంది. దానినే ప్రణవము అని కూడా అంటారు. దేనినైనా నేను అంగీకరించాను అని చెప్పడానికి ఓం అంటే చాలు అని పెద్దలు చెబుతారు. అటువంటి ప్రాశస్త్యము కల ఒకే ఒక అక్షరము అంటే ఏకాక్షరము అయిన ఓంకారము నేను అంటున్నాడు పరమాత్మ.

యజ్ఞములలో జప యజ్ఞము నేను అంటున్నాడు. జపము అంటే మీకు ఇష్టం వచ్చిన నామమును దీక్షతో, ఏకాగ్రతలో జపించడం. ఓంకారము ను కూడా జపించవచ్చును. కాకపోతే జపము అంటే ఏదో మాల తిప్పడంకాకుండా దీక్షతో ఏకాగ్రతతో భక్తితో శ్రద్ధతో చేయాలి. అప్పుడే అది జపం అంటారు. మరి ఇన్ని యజ్ఞములు యాగములు ఉండగా జపయజ్ఞము అని ఎందుకన్నారు అంటే ఈ జపయజ్ఞము సులభంగాచేయవచ్చు దీనికి దేశము, కాలము పరిమితి లేదు. ధనం

అవసరం లేదు. ఎటువంటి సంభారములు అవసరం లేదు. అశ్వమేధయాగం చెయ్యాలంటే ఒక అశ్వం కావాలి. అందరినీ జయించాలి. జీవహింస చేయాలి. కేవలం క్షత్రియులు, రాజులే చేయగలరు. అలాగే యజ్ఞములలో అగ్నిహోత్రం, ఋత్విక్కులు, సంభారాలు, ఊపస్తంభాలు, జీవాలు, జీవహింస ఎన్నోకావాలి. ఎంతో మందిని పిలవాలి. ధనం కావాలి. కాని జపం చేయడానికి ఇవేమీ అక్కరలేదు. శుభ్రమైన చోట కూర్చుని, ప్రశాంతంగా జపం చేసుకోవచ్చు. ఎవరైనా చేయవచ్చు. దీనికి కుల,జాతి ప్రసక్తి లేదు. ఆడమగ భేదం లేదు. అన్నిటికి మించి ఎటువంటి ధనం అవసరం లేదు. మరొక మనిషి సాయం అవసరం లేదు. ఎవరికి వారు చేయతగ్గది జపం. దానికి ఏకాగ్రమైన మనసు ఉంటే చాలు. అందుకే యజ్ఞములలో కెల్లా జపయజ్ఞము ఉత్తమము అని అన్నాడు పరమాత్మ.

కదల కుండా ఉండే వాటిలో హిమాలయమును నేను. రాళ్లు రప్పలు కొండలు గుట్టలు, పర్వతములు అన్నీ కదలకుండా ఉండేవే. వాటిలో హిమాలయం నేను అంటున్నాడు పరమాత్మ. ప్రపంచంలో ఇన్ని కొండలు పర్వతాలు ఉండగా కేవలం హిమాలయాలు ఎందుకు అన్నారు అంటే ఎవరెస్టు శిఖరం ప్రపచంలో కెల్లా ఎత్తైనది అని మనందరికీ తెలుసు. పైగా హిమాలయాలలో పరమశివుడు ఉంటాడు అని ప్రతీతి. హిమాలయాలు మంచుతో కప్పబడి చల్లగా ఉంటాయి. గంగానది హిమాలయాలలో పుట్టి ప్రవహిస్తూ ఉంది. అది జీవనది. ఇన్ని గుణములు కలది కాబట్టి కదలని వాటిలో హిమాలయములు గొప్పవి అని అన్నాడు పరమాత్మ.

26. అశ్వత్థ: సర్వవృక్షాణాం దేవర్షీణాం చ నారద:।
గన్ధర్వాణాం చిత్రరథ: సిద్ధానాం కపిలో ముని:॥

వృక్షములు ప్రకృతిలో అగ్రభాగాన ఉన్నాయి. అవి ప్రకృతిని రక్షిస్తున్నాయి. మానవులతో సహా సకలజీవజాతులకు కావాల్సిన ఆహారము, (ధాన్యములు, ఆకులు, కాయలు, పండ్లు), నీడ ఇచ్చి రక్షిస్తున్నాయి. వృక్షములు చిన్నవి పెద్దవి ఇంకాపెద్దవి ఉన్నాయి. ఈ వృక్షములలో కల్లా రావి చెట్టు... దానినే అశ్వత్థ వృక్షము అని కూడా అంటారు. అశ్వత్థవృక్షము వృక్షములలో గొప్పది అని అంటారు. ఈ వృక్షము మూలము అంటే వేరులో విష్ణువు, కాండములో కేశవుడు, శాఖలలో నారాయణుడు, ఆకులలో శ్రీహరి, ఫలములలో అచ్యుతుడు ఉన్నాడని స్కాందపురాణంలో చెప్పబడింది. ఇది పూజనీయమైనవృక్షము. రావిచెట్టుకు వేపచెట్టుకు పెళ్లిచేయడం గ్రామీణులలో ఒక ఆచారంగా వస్తూ ఉంది. ఈ చెట్టుకు ఆకులు ఎక్కువ. ఎక్కువ ఆక్సిజన్ విడుదల చేస్తుంది. ఊరిలో ఒక రావిచెట్టు ఉంటే ఆ ఊరికంతా ఆక్సిజన్ లభిస్తుంది అని అంటారు. ప్రళయ కాలంలో పరమాత్మ రావి ఆకు మీద శయనించి ఉంటాడు అని మన పురాణాలు చెబుతున్నాయి. రావి పుల్లలతో హోమం చేస్తారు. బ్రహ్మచారి పట్టుకునే దండము రావి కొమ్మ. ఈ ప్రకారంగా మన దైనందిన జీవితంలో రావి చెట్టు అత్యంత ప్రముఖ పాత్ర వహిస్తుంది. రావి చెట్టులో త్రిమూర్తులు నివసిస్తూ ఉంటారు

అని కొంతమంది అంటారు. ఈకారణంగా వృక్షములలో కెల్లా రావి చెట్టు నేనే అని అంటున్నాడు పరమాత్మ.

అలాగే దేవ ఋషులలో నారదుడు గొప్పవాడు. మిగిలిన ఋషులు వారి మానాన వారు తపస్సు చేసుకుంటుంటారు. కాని నారదుడు అన్నిలోకాలు తిరుగుతూ నారాయణనామ స్మరణ చేస్తూ భూలోకంలో భక్తిని పెంపొందింపచేస్తున్నాడు. దీని అర్థం మనకు తెలిసిన విషయాలను మనలోనే ఉంచుకోకుండా అందరికీ చెప్పడం, వారిలో భక్తి ప్రమత్తులను పెంపొందించడం, ప్రతి మానవుడి కర్తవ్యం అని నారదుడు గొప్పవాడు అని చెప్పడంలో అర్థం. అంతే కాకుండా అన్ని పురాణాలలో నారద పాత్ర కనిపిస్తుంది. నారదుడు లేని పురాణం లేదు. విష్ణుపురాణంలో శివుడు ఉండడు. శివ పురాణంలో విష్ణువు ఉండడు. అన్ని పురాణాలలో నారదుడు ఉంటాడు. కాబట్టి నారదునికి అంతప్రాముఖ్యం ఉంది. మూడులోకాలలో జ్ఞానాన్ని పంచిపెట్టే వాడు నారదుడు. అంతే కానీ మన సినిమాలలో చూపించినట్టు నారదుడు కలహభోజనుడు కాదు. జోకర్ కాదు. నారదుడు మహాజ్ఞాని నారదుడు. మహాఋషులలో నారదుడను నేనే అంటున్నాడు పరమాత్మ.

తరువాత గంధర్వులలో చిత్రరథుడు గొప్పవాడు. ఈ చిత్రరథుడు ఒక గంధర్వుడు. గంధర్వులు అంటే దేవతా గణములలో నాట్యము, సంగీతము, చిత్రలేఖనము మొదలగు లలిత కళలు అభ్యసించి, వాటిలో నిష్ణాతులైనవారు. అటువంటి గంధర్వులలో చిత్రరథుడు గొప్పవాడు అని చెప్పాడు కృష్ణపరమాత్మ. ఈ చిత్రరథుడు మనకు మహాభారతము అరణ్యపర్వములో కనిపిస్తాడు.

అలాగే మునులలో కపిలుడు గొప్పవాడు. వీరందరూ నారాయణుని అంశలే. కపిల మహర్షి కర్దమ ప్రజాపతి దేవహూతి అనే దంపతులకు జన్మించిన పరమాత్మ అవతారము. ఆయన సాంఖ్య సిద్ధాంతమును, ఆత్మజ్ఞానమును తన తల్లి దేవహూతికి బోధించాడు. సాంఖ్య సిద్ధాంతము అంటే ఈ విశ్వం ఎలా ఆవిర్భవించింది ఎన్ని తత్వాలు ఉన్నాయి అని తెలియచెప్పే శాస్త్రము. దానిని ప్రతిపాదించిన వాడు కపిల మహర్షి. (కొంత మంది సాంఖ్య సిద్ధాంతమును ప్రతిపాదించిన కపిలుడు వేరు, దేవహూతి కుమారుడు కపిలుడు వేరు అని అంటారు.) ఈ కపిల మహర్షి సిద్దులలో గొప్పవాడు. సిద్ధుడు అంటే మానవాతీత శక్తులను పొందిన వాడు. అష్టసిద్ధులు అని మీరు వినేఉంటారు. అణిమ, గరిమ, మహిమ మొదలైనవి. ఈ సిద్ధులు పొందిన వారిని సిద్ధయోగులు అంటారు. కేవలం సిద్ధులు అయినంత మాత్రాన ఆత్మజ్ఞానం సిద్ధించదు. ఆత్మజ్ఞానం సిద్ధించే ప్రక్రియలో ఈ సిద్ధులు కూడా అతడికి వస్తాయి. కాని సాధకుడు వాటిని గురించి పట్టించుకోడు. ఆత్మజ్ఞానం కొరకు ప్రయత్నం చేస్తాడు. ఏవో కొన్ని సిద్ధులు రాగానే ఆగి పోయి, వాటిని ప్రదర్శిస్తూ, తాను సిద్ధయోగిని అని ప్రజలను మభ్యపెడితే, అతను ఆత్మజ్ఞాని కాలేడు. . ఆ ప్రకారంగా ఆత్మజ్ఞానం సిద్ధించిన సిద్ధయోగులలో కపిలుడు గొప్పవాడు అని చెప్పాడు పరమాత్మ.

## 27. ఉచ్చైశ్శ్రవసమశ్వానాం విద్ధి మామమృతోద్భవమ్।
## ఐరావతం గజేన్ద్రాణాం నరాణాం నరాధిపమ్॥

దేవదానవులు మంథరపర్వతమును కవ్వముగానూ, కూర్మమును కుదురుగానూ, వాసుకి అనే సర్పమును తాడుగానూ చేసుకొని పాలసముద్రమును చిలుకుతుంటే ముందు హాలాహలము అనే విషం వచ్చింది. అంటే కష్టాలు వచ్చాయి. తరువాత అనేక సిరిసంపదలకు ఆలవాలమైన లక్ష్మి ఉద్భవించింది. హాలాహలము అనే కష్టాలను శివుడు, సిరిసంపదలను విష్ణువు తీసుకున్నారు. ఆఖరున అమృతము వచ్చింది. ఆ అమృతముతోపాటు ఒక తెల్లని గుర్రము కూడా వచ్చింది. దాని పేరు ఉచ్చైశ్రవము. అది దేవతా అశ్వము. ఆ అశ్వము అంశ నేనే అన్నాడు పరమాత్మ. అదే ప్రకారంగా అమృతముతో పాటు మరొక జీవి కూడా ఉద్భవించింది. దానిపేరు ఐరావతము అనే తెల్లఏనుగు. అది దేవేంద్రుడి వాహనము అయింది. ఆ ఏనుగు కూడా దైవాంశ కలది కాబట్టి ఏనుగులలో ఐరావతమును నేను.

మరి దీనిని కథగానే అర్థం చేసుకుంటే కథ మాత్రమే అర్థం అవుతుంది. అలా కాకుండా మన మనసే ఒక పాలసముద్రము. దానిని మనం ధ్యానం అనే కవ్వంతో మథించాలి. దానికి కూర్మావతారం అనే పరమాత్మ సాయం కావాలి. అంటే దేవుని మీద భక్తి,శ్రద్ధ ఉండాలి. అప్పుడు ముందు అనేక అవాంతరాలు వస్తాయి. ధ్యానం సాగదు. ఎన్నోకష్టాలు, ఇబ్బందులు. అవే హాలాహలము అనే విషము. ఆ విషాన్ని శివుడు తాగాడు. మనం కూడా ఆపరమాత్మను ప్రార్థించి, ఆయనను శరణు వేడి, ఆ కష్టాలను అధిగమించాలి. తరువాత సిరిసంపదల రూపంలో, సిద్ధుల రూపంలోఎన్నో ప్రలోభాలు కలుగుతాయి. వాటికి లోనుకాకూడదు. ఇవన్నీ అధిగమిస్తే తుదకు ఆత్మజ్ఞానము అనే అమృతం దొరుకుతుంది. ఈ అమృతం కొరకు అందరం ప్రయత్నించాలి. క్షీరసాగర మధనం కథను ఈవిధంగా అర్థం చేసుకోవాలి.

ఇంక మానవులలో రాజు సాక్షాత్తు విష్ణు స్వరూపుడు అంటారు. అంటే రాజు అయిన వాడు ధర్మంగా న్యాయంగా నిష్పక్షపాతంగా పరిపాలిస్తాడు. నా విష్ణు: పృథివి పతి: అని ఆర్యోక్తి. అంటే విష్ణు అంశ లేనిది రాజుకాలేడు అని. కాబట్టి ధర్మంగా పరిపాలించేవారు అందరు రాజులు సాక్షాత్తు విష్ణు స్వరూపులే. మరి అధర్మంగా పరిపాలించే రాజులు, మంత్రులు ఉంటారు కదా! వాళ్ల సంగతి ఏమిటి అంటే దానికీ ఒక ఆర్యోక్తి ఉంది. "రాజ్యాంతే నరకం ధృవం" అంటే అధర్మపాలన చేసే వారి కోసం నరకం ఎదురు చూస్తూ ఉంటుంది.

## 28. ఆయుధానామహం వజ్రం ధేనూనామస్మి కామధుక్
## ప్రజనశ్చాస్మి కందర్ప: సర్పాణామస్మి వాసుకి:॥

మానవులకు, దేవతలకు, ఎన్నో ఆయుధాలు ఉన్నాయి. అవి అన్నీ లోహముతో తయారు చేయబడతాయి. కాని ఇంద్రుడు ధరించిన వజ్రాయుధము దధీచి అనే మహాఋషి వెన్నెముకతో తయారు చేయబడింది. చాలా కఠినమయినది. నారాయణ కవచము అనే మంత్రశక్తి కలది. అటువంటి వజ్రాయుధము కూడా నా అంశయే అన్నాడు పరమాత్మ.

దీనికి ఒక కథ ఉంది. వృత్రుడు అనే అసురుడిని సంహరించడానికి ఇంద్రుడికి ఒక శక్తిమంతమైన ఆయుధము కావలసి వచ్చింది. ఇంద్రుడు, దేవతలు అందరూ కలిసి దధీచి అనే మహాఋషిని, తపస్సంపన్నుడిని ప్రార్థించారు. ఆయన లోకకల్యాణార్థము ప్రాణత్యాగం చేసి, తన వెన్నెముకను దేవతలకు ఇచ్చాడు. ఆ వెన్నెముకతో విశ్వకర్మ వజ్రముతో సమానమైన ఆయుధమును తయారు చేసాడు. అదే వజ్రాయుధము. ఆ వజ్రాయుధము సాయముతో ఇంద్రుడు వృత్రుని సంహరించాడు. ఆ శక్తిమంతమైన, తపోశక్తికల, వజ్రాయుధమును నేను అంటున్నాడు పరమాత్మ.

తరువాత ధేనువులలో కామధేనువు నేను అని అన్నాడు. ఈ కామధేనువు కూడా క్షీరసాగర మథనసమయంలో అమృతముతో పాటు ఆవిర్భవించింది. కామ ధేనువు అంటే ఆవు. ఆవు మనకు అమృతం లాంటి పాలు ఇస్తుంది. దాని నుండి పెరుగు వెన్న వస్తుంది. యజ్ఞములలో హోమములో హవిస్సులుగా వేసే నెయ్యి వస్తుంది. ఆవు మూత్రము, ఆవు పేడ నేలను శుద్ధిచేయడానికి పనికివస్తాయి. గోవును తల్లిగా అంటే గోమాతగా పూజించేవారు. గోవులకు ప్రత్యేకంగా గోలోకము అని ఒకటి సృష్టించాడు బ్రహ్మ. అంతటి పవిత్రమైనది గోవు. అడిగిందల్లా ఇచ్చే ఆ గోవును నేను అన్నాడు పరమాత్మ. ఈ కామధేనువు ఎవరోకాదు. మన మనసులో ఉండే సంకల్పబలం. విల్ పవర్. మంచి మనసుతో మంచి సంకల్పం చేస్తే ఏదైనా సిద్ధిస్తుంది. కోరినవి అన్నీ సమకూరుతాయి. కాబట్టి కామధేనువు అంటే అడిగిందల్లా ఇచ్చేది అని కాకుండా మన మనసు చేసే సంకల్పముల యొక్క బలం. ధార్మిక సంకల్పబలం అని అర్థం చేసుకోవాలి.

తరువాత సంతానోత్పత్తికి కారణమైన మన్మధుడిని నేను అని అన్నాడు పరమాత్మ. పురాతన కాలంలో పురుషులు అందరూ భగవధ్యానంలో తపస్సులో మునిగిపోయేవాళ్లు. స్త్రీలు కూడా వారికి సేవలు చేస్తూ కాలం గడిపేవారు. సృష్టి జరిగేది కాదు. అందుకోసం బ్రహ్మ మన్మధుడిని సృష్టించాడు. మన్మధుడు అనేది ఒక కామ భావన. మనం దానికి రూపం ఇచ్చాము. ఆ కామభావనను పురుషులలో స్త్రీలలో ప్రేరేపించి వారిని సంతానోత్పత్తికి సుముఖులను చేసాడు. ధర్మ బద్ధంగా

సంతానం కలగడానికి అవసరమైన కామభావనకు ప్రతీక అయిన మన్మధుడిని నేను. నా వలననే ఈ సృష్టి జరుగుతూ ఉంది. అంతేకానీ పరకాంతలను కోరేది మన్మధ భావన కాదు. అందుకే కేవలము శారీరక సుఖం కోసం కాకుండా, మంచి సంతానం కోసం మాత్రమే భార్యతో సంగమించే వారిని నిత్యబ్రహ్మచారులు అని అన్నారు.

మన్మధుడు అంటే కేవలం కామసంబంధమైన కోరికలకు వాటి ద్వారా సృష్టి జరగడానికి ప్రతీక అని కాకుండా ఈ బాహ్య ప్రపంచంలో దేనినైనా సృష్టించడానికి మూలము అని కూడా అర్థం చేసుకోవచ్చు. సృష్టి అంటే కేవలం మానవ, జంతుసృష్టి అనేకాదు. కొత్త కొత్త వస్తువులను కనుక్కోవడం కూడా సృష్టి కిందికే వస్తుంది. కాకపోతే అది మానవసృష్టి. ఈ విధంగా కొత్త వాటిని కనుక్కోవడం, సృష్టించడం అనే కోరికనే మన్మధభావన అని అనవచ్చు. కాకపోతే మనం కేవలం కామభావనలనే మన్మధభావనలు అని రూఢి అభిప్రాయంతో ఉన్నాము. కాబట్టి ధర్మబద్ధమైన సంకల్పములు, కోరికలు అన్నీ మన్మధభావనలే. మానవులలో ఉన్న ఆ క్రియేటివ్ థాట్, క్రియేటివ్ పవర్ నేను అంటున్నాడు పరమాత్మ.

సర్పములలో వాసుకిని నేను అన్నాడు. ఇదివరకే చెప్పుకున్నాము. వాసుకి, అనంతుడు, తక్షకుడు, కర్కోటకుడు మొదలగు సర్పజాతులు అన్నీ కద్రువ సంతానము. కశ్యప ప్రజాపతి సృష్టి. వారిలో వాసుకి అనబడే వాడిని నేను. ఎందుకంటే సాగర మధనం జరిగినపుడు పరమాత్మ కూర్మావతారం ధరిస్తే, ఆయన వీపున ఉన్న మంధర పర్వతమునకు చుట్టుకొని కవ్వం చిలికినట్టు సముద్రాన్ని మథించిన వాడు వాసుకి. అంతటి గొప్ప కార్యం చేసాడు కాబట్టి వాసుకిని కూడా తన అంశగా అభివర్ణించాడు పరమాత్మ. దీనిని మనకు అన్వయించుకుంటే సర్పము అంటే విషసర్పము అని అర్థము. సముద్ర మధనం చేస్తుంటే వాసుకి కక్కిన విషమే ఈ హాలాహలము. మనలో కలిగే దుష్టభావనల ఫలితమే హాలాహలము.

మానవ జాతి అభివృద్ధికి, ఆత్మజ్ఞాన సముపార్జనకు అవరోధం లాంటిది, విషంలాంటిది అహంకారము. ఆ అహంకారము అనే విషం మనలో ప్రవేశిస్తే, అధ:పతనం తప్పదు. కాని ఈ అహంకారమే పరమశివుడికి ఆభరణము. అంటే వాసుకి ఈశ్వరుడి మెడలోఉన్న పాము. ఈశ్వరుడు త్రిగుణాతీతుడు కాబట్టి అహంకారము ఆయనకు అలంకారము. కాని మూడు గుణములకు లోబడిన మనకు అహంకారము హాలాహలము వంటిది. కాబట్టి ఆ అహంకారమును అదుపులో పెట్టుకోవడం మనందరి కర్తవ్యం. ఏదో కొంత నేర్చుకున్నాము కదా అనీ, పెద్ద పదవి వచ్చింది కదా అని అహంకరించి ఇష్టం వచ్చినట్టు ప్రవర్తిస్తే పతనం తప్పదు.

## 29. అనన్తశ్చాస్మి నాగానాం వరుణో యాదసామహమ్।
## పితౄణామర్యమా చాస్మి యమస్సంయమతామహమ్॥

నాగులలో అనంతుడు నేను.. నాగులు కూడా సర్పజాతులలో ఒకటి. సర్పములకు విషంఉంటుంది. నాగులకు విషం ఉండదు. అంతే తేడా. పైశ్లోకంలో వాసుకిని సర్పము అని అన్నాడు. ఆ వాసుకిని మంథర పర్వతమునకు చుట్టి పాలసముద్రం చిలికితే అందులో నుండి ముందు విషం వచ్చింది. వాసుకి సర్పము, సర్పానికి విషం ఉంటుంది. వాసుకిని మంథర పర్వతానికి చుట్టి లాగడంవలన,ఆ బాధ తట్టుకోలేక వాసుకి విషం చిమ్మాడు. అదేహాలాహలము అనికొంత మంది అంటారు. అందుకనే వాసుకిని సర్పము అనీ, అనంతుడిని నాగము అని అన్నారు అని వారి వాదన. కాని వీరందరూ కద్రువ సంతానము అని పురాణాలు చెబుతున్నాయి. స్థూలంగా చెప్పాలంటే సర్పములకు విషం ఉంటుంది. నాగులకు విషం ఉండదు. సర్పములకు ఒకేతల ఉంటుంది. నాగులకు అనేక తలలుఉంటాయి అని పెద్దలు చెబుతారు. ఆ నాగులలో అనంతుడు ఉత్తముడు. ఆయననే ఆదిశేషుడు అనికూడా అంటారు. ఇతడు ఈ భూమిని తన వేయి పడగలమీద మోస్తున్నాడు. విష్ణువు వైకుంఠములో పాలసముద్రంలో ఈ అనంతుడి మీద శయనించి ఉంటాడు అని మనకు తెలుసు. అందుకే ఆయన పేరు అనంతశయనుడు అని అంటారు. ఆదిశేషు అంటే ఆది అంతము ఉన్నవి అన్నీ నశించిపోయినా, ఆఖరుకు మిగిలి ఉంటే తత్వము. అదే పరమాత్మ తత్వము. అందుకే అనంతము అంటే ఆది, అంతము లేనిది. ఈ అనంతుడే రామావతారంలో లక్ష్మణుడు గానూ, కృష్ణావతారంలో బలరాముడు గానూ జన్మించారు. అంటే ఎల్లప్పుడూ పరమాత్మను అంటి పెట్టుకొని ఉంటారు. మనం వాసుకి అనంతుడి గురించి చెప్పుకున్నాము. తక్షకుడు కర్కోటకుడు కూడా సర్పాలే. వీరు మంచి కార్యాలు ఏమీ చేయలేదు. చేసినవి అన్నీ వెధవ పనులే. కాబట్టి వీరి గురించి ప్రస్తావించలేదు పరమాత్మ. సర్పములు చెడ్డవి అయినా వారు మంచి పనులు చేస్తే వారి హృదయం మంచిది అయితే వారు కూడా తన అంశలే అంటున్నాడు పరమాత్మ.

జలదేవతలు అంటే మనకు జలమును ప్రసాదించేవాళ్లు. మనము గంగ, యమున, సరస్వతి, కృష్ణ,గోదావరి నర్మద మొదలగు నదులను దేవతా స్వరూపాలుగా పూజిస్తున్నాము. సముద్రుడిని కూడా పూజిస్తాము. కాని ఇవి అన్నీ జలాశయాలు. వీటికి జలం రావాలంటే వరుణుడి అనుగ్రహం ఉండాలి. అందుకే ఆ వరుణుడిలో నా అంశ ఉంది. నా విభూతితోనే సకాలంలో వర్షాలు కురుస్తున్నాయి. అని అన్నాడు పరమాత్మ.

తరువాత పితృదేవతలలో అర్యముడిని నేను అన్నాడు. అదితి కుమారులు ఆదిత్యులు అని చెప్పుకున్నాము కదా. ఆ ఆదిత్యులలో అర్యముడు కూడా ఒకడు వీడు పితరులు ఉండే లోకానికి అధిపతి. పితృదేవతలను నియమిస్తుంటాడు. శరీరం ఉంటే మానవులు. శరీరం లేకపోతే

పితృదేవతలు. కిందటి శ్లోకంలో నరాణాం చ నరాధిపమ్ అంటే నరులలో నరాధిపుడిని అంటే రాజును నేను అన్నాడు. నరులను నియమించే దానికి రాజు ఎలాగో పితృదేవతలను పరిపాలించడానికి అర్యముడు అలాగా. మనం పితృదేవతలకు తర్పణాలు,పిండప్రదానం చేస్తుంటాము. ఇవన్నీ ముందు అర్యముడికి చేరుతాయి. ఆ అర్యముడు ఆ యా పితృదేవతలకు ఈ తర్పణాలు, పిండప్రదానాలు వాటి ఫలితాలను అందచేస్తాడు.

కొంత మంది వితండ వాదులు, చచ్చినవాడు ఎక్కడో పుట్టిఉంటాడు, వాడికి మనం తద్దినాలు, పిండప్రదానాలు చేయడం ఏమిటి నాన్సెన్సు అని అంటుంటారు. చనిపోయిన తరువాత మిగిలి ఉన్న సూక్ష్మదేహానికి ఈ రోజులు, నెలలు, సంవత్సరాలు వర్తించవు. కాబట్టి మరలా జన్మఎత్తడానికి ఇంతకాలము పడుతుంది అని చెప్పలేము. రెండవది మనం విడిచే తర్పణాలు, పెట్టే పిండాలు, సూక్ష్మరూపంలో పితృదేవతలకు అందుతాయి. వారు మరోజన్మ ఎత్తినా, వారికి తగిన సమయంలో ఆహార రూపంలో అందుతూ ఉంటుంది. (ఒక రోజు తినడానికి ఏమీ దొరక్క ఆకలితో అల్లాడుతుంటే, ఎవరో ఒకరు వచ్చి ఇంత ఆహారం ఇవ్వడం మనలో చాలామందికి అనుభవమే. అది ఎలా వచ్చింది అంటే ఇలాగే.) ఈ వ్యవస్థను అంతా నియమించేది అర్యముడు. అందుకని ఆ అర్యముడు కూడా నా విభూతి అని అన్నాడు పరమాత్మ.

తరువాత వాడు యముడు. చచ్చిన వాళ్లంతా ముందు అర్యముడి దగ్గరకు వెళతారు. వారు చేసిన పాపపుణ్యములను బట్టి వారి వారి పూర్వజన్మ వాసనలను బట్టి వారిని స్వర్గానికి నరకానికి పంపుతాడు. నరకాధి పతి యముడు. యముని సంయముడు అని అన్నారు. అంటే అందరినీ నియమించేవాడు. నియమించడం అంటే కంట్రోల్ చేయడం, తగువిధంగా శిక్షించడం అని కూడా అర్థం. స్వర్గాధిపతి ఇంద్రుడు నేనే అని ఇది వరకే చెప్పాడు. ఇప్పుడు నరకాధి పతి యముడు కూడా నా అంశలో వాడే అని అంటున్నాడు. కాబట్టి చావు పుట్టుకల మధ్య మనం పరమాత్మ అధీనంలో ఉంటాము. పుట్టగానే మన ప్రతాపం చూపిస్తాము.

### 30.ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం కాల: కలయతామహమ్।
### మృగాణాం చ మృగేన్ద్రో2హం వైనతేయశ్చ పక్షిణామ్॥

దైత్యులలో ప్రహ్లాదుడు నేనే. దితి కుమారులు దైత్యులు అని చెప్పుకున్నాము కదా. ఆ దైత్యుల వంశములో పుట్టిన వాడు ప్రహ్లాదుడు. దైత్య వంశములో పుట్టి కూడా భగవద్భక్తిని అలవరచుకున్నాడు. సనాతన ధర్మం ఆచరించే వంశంలో పుట్టి, ఋషిగా మారడం వేరు. ప్రతికూల పరిస్థితులలో పుట్టి కూడా భగవంతుని చేరుకోవడం వేరు. రావణుడు బ్రాహ్మణ వంశంలో పుట్టి కూడా, శివభక్తుడు అయి ఉండి కూడా, అతని ప్రవర్తన మంచిది కాకపోవడం వలన, రాముడి

చేతిలో మరణించాడు. కాని ప్రహ్లాదుడు దైత్యుడు అయి ఉండి కూడా పరమభాగవతోత్తముడుగా పరిగణింపబడ్డాడు.

భారతంలో ఒక కథ ఉంది. ధర్మవ్యాధుడు అనే వాడు మాంసము అమ్ముకొని జీవించేవాడు. అతని వద్ద ధర్మములు తెలుసుకోడానికి కౌశికుడు అనే బ్రాహ్మణుడు వచ్చాడు. ధర్మవ్యాదుని వద్ద నుండి ధర్మోపదేశం పొందాడు. కాబట్టి పుట్టుక ప్రధానం కాదు, ధర్మాచరణ, ప్రవర్తన, గుణము, శీలము ప్రధానము అని మనంతెలుసుకోవాలి.

ప్రహ్లాదుని తండ్రి హిరణ్యకశిపుడు విష్ణు ద్వేషి. కుమారుడు ప్రహ్లాదుడు విష్ణు భక్తుడు. పోనీలే వాడి దోవ వాడిది అని అనుకోలేదు తండ్రి. తన దోవలోకి తెచ్చుకోవడానికి విశ్వ ప్రయత్నం చేసాడు. కాని ప్రహ్లాదుడు తన భక్తి వదలలేదు. ఆఖరుకు కుమారుని  చంపడానికి కూడా వివిధ ప్రయత్నాలు చేసాడు తండ్రి. బాలుడైన ప్రహ్లాదుడు ధైర్యం వదలలేదు. అటువంటి వారి యోగక్షేమములు నేను చూచుకుంటాను అని ప్రతిజ్ఞ చేసాడు పరమాత్మ. తన భక్తుడు అయిన ప్రహ్లాదుడు హిరణ్యకశిపుని చేతిలో కష్టాలుపడటం చూచి సహించలేకపోయాడు. నరసింహావతారం ధరించాడు. తండ్రి అయిన హిరణ్యకశిపుని సంహరించాడు. తన భక్తుడు ప్రహ్లాదుని కాపాడాడు. అంతటి ఘన చరిత్ర కలిగిన వాడు ప్రహ్లాదుడు. కాబట్టి ప్రహ్లాదుడు తన అంశలోని వాడు అని ప్రకటించాడు పరమాత్మ.

పరమాత్మ కాలస్వరూపుడు అని భాగవతం చెబుతూ ఉంది. నడిచే కాలము పరమాత్మ. అసలు కాలం అంటే ఏమిటి; ఎలా లెక్కిస్తారు. భూమి తన చుట్టు తాను తిరగడంతో రోజులు, సూర్యుడి చుట్టు తిరగడంతో సంవత్సరాలు, చంద్రుడి గమనం బట్టి నెలలు లెక్కిస్తున్నాము. దీనినేకాలమానము అంటాము. ఇది కాలమానమే కానీ కాలం కాదు. భూమి మీద ఉంటే కాల గమనం తెలుస్తుంది. అదే భూమిని విడిచి పెడితే (ఏదో ఒక ఉపగ్రహంలో ఉంటే) అప్పుడు కాల గమనం ఎలా ఉంటుంది. అప్పుడు కూడా భూమి మీద జరిగేకాలమానం ప్రకారం ఇన్నాళ్లు పాటు ఉపగ్రహంలో ఉన్నారు అని లెక్కగడతారు. కాబట్టి కాల గమనం మనం ఎక్కడ ఉంటే ఆ పరిస్థితులను బట్టి ఉంటుంది. చలనం బట్టి కాలం లెక్కగట్టాలి. చలనం లేని చోట కాలం లేదు. మరణించడాన్ని కాలధర్మము అని అంటారు. అంటే కాలము యొక్క ధర్మము మరణము. కాలము తీరగానే మరణం వస్తుంది. ఇది తప్పదు. ఈ మరణం దాకా మనం చేసే పనులు, మన ప్రవర్తన, మన గుణగణాలు, కర్మలు అన్నీ సూక్ష్మరూపంలో భద్రపరచి, కాలం తీరి మరణించగానే మన సూక్ష్మదేహం వెంట ఆ పుణ్య, పాప వాసనలను అంటించి పంపుతుంది. ఆ కాలమును నేనే. అందుకే పరమాత్మను కాలస్వరూపుడు అని అన్నారు. ఆయన అధీనంలో కాలము ఉంటుంది కాబట్టి కాలమునకు అతీతుడు అని కూడా అన్నారు.

మృగములలో సింహము నేనే. మృగములు అడవులలో స్వేచ్ఛగా సంచరిస్తుంటాయి. పశువులు మానవుల మధ్య మానవుల అధీనంలో ఉంటాయి. పాశమునకు కట్టుబడి ఉండేది పశువు. పాశముతో కట్టబడనిది మృగము. అటువంటి మృగములలో రాజు సింహము. సింహమునకు ఉన్న హుందాతనము ఏ మృగమున కు లేదు. రాజసం చూపిస్తుంది. మృగములకు రాజుగా ఉంటుంది.అందుకే దానిని మృగరాజు అని అన్నారు. పైగా నరసింహావతారంలో సగం సింహంగా పరమాత్మ అవతరించాడు. మానవులకు రాజు విష్ణుస్వరూపుడు అయితే మృగములలో రాజైన సింహము విష్ణుస్వరూపము. అది నేనే అంటున్నాడు పరమాత్మ.

పక్షులలో గరుడుడు నేనేఅంటున్నాడు. ఈ గరుడుడు వినత కుమారుడు. ఈయన అన్నగారు అనూరుడు. ఆయన సూర్యునికి రథసారథి. గరుడుడు విష్ణువుకు వాహనము. వైష్ణవులు ఈయనను గరుడాళ్వార్ అని అత్యంత భక్తితో పిల్చుకుంటారు. ఇంతకు ముందు శ్లోకంలో అనంతుడు అంటే విష్ణుమూర్తి స్థావరం నేనే అన్నాడు. ఇప్పుడు విష్ణుమూర్తి వాహనం నేనే అంటున్నాడు. పాములు, పక్షులు, మృగములు కూడా నేనే, నేను పడుకునే పాన్పు, ఎక్కేవాహనము అన్నీ నేనే. నేను కానిదీ ఏదీ లేదు. అని తాను సర్వాంతర్యామి, తాను లేని చోటు లేదు అని తెలియజేస్తున్నాడు పరమాత్మ. అంతే కాదు సర్వేసర్వత్రా వ్యాపించి ఉన్న కాలమును కూడా నేనే. అన్నీ నా విభూతులే అంటున్నాడు పరమాత్మ.

## 31. పవన: పవతామస్మి రామశ్శస్త్ర భృతామహమ్।
## ఝషాణామ్ మకరశ్చాస్మి స్రోతసామస్మి జాహ్నవీ.

జీవుల లోపలా బయటా సంచరిస్తున్న వాయువును నేను అంటే జీవులకు చైతన్యమును కలిగించే వాయువును నేను. ఈ వాయువు అన్నిటినీ పవిత్రం చేస్తుంది. ఆర బెడుతుంది. బాగు చేస్తుంది. మడికట్టుకోవాలంటే బట్టలను తడిపి ఆరవేస్తే, ఎండ లేకపోయినా, గాలికి ఆరి పోతాయి. మయల బట్టలు పవిత్రం అవుతాయి. అలాగే ఏ వస్తువు అయినా గాలికి ఆరబెడితో అది పవిత్రం అవుతుంది. ఎండ, అగ్ని కూడా కొన్ని కొన్ని వస్తువులను పవిత్రం చేస్తాయి. ఆ పవిత్రం చేసే వాటిలో పవన: అంటే గాలిని నేను. మనం ప్రాణవాయువు అనే స్వచ్ఛమైన గాలిని పీల్చుకొని లోపల మలినములను బయటకు తోసేస్తాము. శుభ్రమైన గాలి పీలిస్తే మనసుకు హాయిగా ఉంటుంది. అందుకే కొండ ప్రాంతాలకు, ఉద్యానవనాలకు విహారానికి వెళుతుంటారు. అక్కడ దొరికే పరిశు ద్ధమైన గాలి మనలను కూడా పరిశుద్ధులను చేస్తుంది.

పవతామ్ అంటే కదిలేది, వేగము కలది అనే అర్థం కూడా ఉంది. గాలికి వేగంగాగానీ, నెమ్మదిగా కానీ కదిలే గుణం ఉంది. ఆ గాలి మనలో నెమ్మదిగా ఒక పద్ధతి ప్రకారం కదులుతూ ఉన్నంత కాలం మనలో చైతన్య శక్తి ఉంటుంది. ఆ గాలి కదలడం ఆగిపోతే మనలను కదిలించడానికి నలుగురు కావాలి. కాబట్టి గాలికి కదిలే గుణం ఉంది అని తెలుస్తూ ఉంది. కదిలే గుణం ఉంది కాబట్టి అది ఒక చోట ఉండదు. నిరంతరం కదులుతూ ఉంటుంది. నెమ్మదిగా కదులుతూ ఆహ్లాదాన్ని కలిగించగలదు. వేగంగా కదిలి తుఫానులను విలయమును సృష్టించగలదు. అటువంటి వేగవంతమైన కదలిక కల వాటిలోనూ, అన్నిటినీ పవిత్రం చేసేవాటిలోనూ పవనమును నేను అని అన్నాడు పరమాత్మ.

వీరులలో రాముడు నేను. అంటే తానే రామావతారము అని చెప్పాడు. శస్త్రభృతాం ....... శస్త్రములు అంటే ఆయుధములను ధరించే వారిలో నేను శ్రీరామచంద్రుడిని అని అన్నాడు. రాముడిని మనం కోదండ రాముడు అని పిలుస్తాము. కోదండము అంటే ధనుస్సు. కోదండము ధరించిన వాడు కోదండరాముడు. కృష్ణుడిని చక్రధారి అంటాము అంటే చక్రమును ధరించిన వాడు. కాని రాముడు శస్త్రమును ధరించింది కేవలం ధర్మరక్షణార్థము. ధర్మమును రక్షించడానికి. అమాయకులను కాపాడడానికి, దుర్మార్గులను శిక్షించడానికి మాత్రమే రాముడు కోదండమును ధరించాడు. శ్రీకృష్ణుడు కూడా ఒకే ఒక సారి అంటే శిశుపాలుడిని వధించడానికి మాత్రమే చక్రం ధరించాడు. (కాని ఈ రోజుల్లో అందరూ తమను తాము రక్షించకోడానికి, ఆ ముసుగులో తమకు శత్రువులైన వారిని అంతమొందించడానికి, శస్త్రములను (తుపాకులు,పిస్టల్సు) ధరిస్తున్నారు.) కేవలం ధర్మరక్షణార్థము శస్త్రమును ధరించిన రాముడిని నేనే అంటున్నాడు పరమాత్మ.

మన భూగోళముమీద భూభాగము నాలుగవ వంతు మాత్రమే. మిగిలిన మూడు భాగములు నీటితో నిండిన అఖాతములు, సముద్రములు, మహాసముద్రములు, ఈ అనంత జలరాసిలో భూమి మీద ఉన్న తిరిగే జీవరాసులకన్నా ఎన్నోరెట్లు ఎక్కువ జీవరాసులు ఉన్నాయి. అవన్నీ జలములలో సంచరిస్తూ ఉంటాయి. వాటిని జలచరములు అంటారు. ఆ జలచరములలో మకరమును అంటే మొసలిని నేను. మకరమునకు ఉన్న ప్రత్యేకత ఏమిటంటే అది భూమి మీదా ఉండగలదు. జలములో ఉండగలదు. కాని జలములోనే దానికి ఎక్కువ బలము. అందుకే జలచరములలో ఉన్న జీవరాసులలో శ్రేష్టమైనది అయిన మకరమును నేను అని అన్నాడు. గజేంద్రమోక్షములో మకరమును సంహరించి దానికి మోక్షము ప్రసాదించాడు అనే కథ మనకు భాగవతములో ఉంది.

ప్రవహించే వాటిలో జాహ్నవిని నేను. సముద్రములు ప్రవహించవు. చెరువులు, కుంటలు ప్రవహించవు. కాని నదులు మాత్రమే ప్రవహిస్తుంటాయి. అందుకే నదులు ఎల్లప్పుడూ పవిత్రంగాఉంటాయి. ఆ నదులలో జాహ్నవిని నేను అంటున్నాడు పరమాత్మ. జాహ్నవి అంటే

జహ్నుమహర్షికుమార్తె అని అర్థం. భగీరథుడు గంగను భూమికి తీసుకువచ్చే క్రమంలో, ఆయన ముందు నడుస్తుంటే వెనుక గంగానది అమితమైన వేగంతో ప్రవహిస్తూ వస్తూ ఉంది. దారిలో జహ్నుమహర్షి ఆశ్రమం ఉంది. ఈ గంగానది వేగానికి ఆ ఆశ్రమం కొట్టుకుపోయింది. ఇది చూచిన జహ్నువుకు కోపం వచ్చింది. ఆ గంగానదిని ఔపోసన పట్టేసాడు. అంటే తాగేసాడు. వెనుక చడీచప్పుడు లేకపోయేటప్పటికి, భగీరథుడు వెనక్కు తిరిగిచూస్తే గంగానది లేదు. విషయం అర్థం అయిన భగీరథుడు జహ్నుమహర్షిని గంగను వదలమని ప్రార్థించాడు. భగీరథుని ప్రార్థన మన్నించి గంగను తన చెవిలోనుండి వదిలాడు. జహ్నుమహర్షినుండి ఉద్భవించింది కాబట్టి గంగానదికి జాహ్నవి అని పేరువచ్చింది. ఆ జాహ్నవిని నేను అని అంటున్నాడు. అందుకే మనం కూడా అన్నినదులలో కల్లా గంగానదిని అత్యంత పుణ్యనదిగా భావించి పూజిస్తాము. వారణాసి, హరిద్వారములలో నిత్యం అన్ని ఘాట్లలో గంగాపూజలను నిర్వహించడం మనం చూస్తూ ఉంటాము.

## 32. సర్గాణామాదిరన్తశ్చ మధ్యం చైవాహమర్జున।
## అధ్యాత్మవిద్యా విద్యానాం వాద: ప్రవదతామహమ్॥

ఈ సృష్టి యొక్క ఆది, మధ్య, అంతము నేనే. ఈ సృష్టి ఎప్పుడు ఎన్ని కోట్ల కోట్ల సంవత్సరాల ముందు మొదలయిందో ఎవరికీ తెలియదు. ఎప్పుడు అంతం అవుతుందో ఎవరికీ తెలియదు. పోనీ ఈ సృష్టి ఎలా నడుస్తూ ఉందో, రేపు ఏం జరుగుతుందో ఎవరికీ తెలియదు. అంటే భూత,భవిష్యత్,వర్తమానములు ఎవరికీ తెలియవు. ఎందుకంటే అది నేనే. నా నుండి వచ్చిన వాళ్లకు నా గురించి తెలుసుకునే అవకాశం లేదు. టార్చిలైట్ కాంతి సూటిగా ముందుకు ప్రసరిస్తుంది కానీ వెనక్కుతిరిగి తాను ఎక్కడనుండి వచ్చిందో తెలుసుకోలేదు. ఈ సృష్టి అంతా నేనే కాబట్టి నాకు ఆది,అంతము లేదు. ఈ సృష్టికి ముందు నేనుఉన్నాను. సృష్టి అంతా లయం అయిన తరువాత కూడా నేను ఉంటాను. కాబట్టి, ఈ సృష్టి గురించి నాకు మాత్రమే తెలుసు. నాచే సృష్టింపబడిన వాటికి నా గురించి తెలియదు.

అన్ని విద్యలలో ఆధ్యాత్మిక విద్య ఉత్తమమైనది. మిగిలిన విద్యలు అన్నీ కేవలం ఉదర పోషణార్థమే. అవన్నీ బాహ్య ప్రపంచానికి సంబంధించినవి. కాని ఆధ్యాత్మిక విద్య నీ గురించినీవు తెలుసుకోవడానికి ఉపకరించే విద్య. సాధారణంగా మనం ఎవరి దగ్గరకన్నా వెళ్లినపుడు, నేను ఫలానా అని మనకు తల్లి తండ్రులుపెట్టిన పేరు, పుట్టిన ఊరు, చదివిన చదువు, చేస్తున్న ఉద్యోగం గురించి, ఏ పని మీద వచ్చామో అవన్నీ చెప్పుకుంటాము. కానీ నేను ఎవరు, ఈ లోకానికి ఎందుకు వచ్చాను, ఏం చేస్తున్నాను, ఈ లోకం విడిచిన తరువాత ఎక్కడికి పోతాను. అంటే నీ గురించి నీవు తెలుసుకోవడం లాంటిది. మనం ఈ విషయాలను గురించి అస్సలు ఆలోచించము. వాటి గురించి చెప్పేదే ఆధ్యాత్మిక విద్య. ప్రాపంచిక విద్యలు మనకుసుఖాలను, వాటి వెంట దు:ఖాలను

రెండింటినీ కలుగజేస్తాయి. కాని  ఈ ఆధ్యాత్మిక విద్య మనకు పరమ శాంతి సుఖము ప్రసాదిస్తుంది. ప్రాపంచిక విద్యలు అన్నీ "నేనే ఈ దేహము" అనే ప్రాతిపదికమీద పని చేస్తాయి. ఆధ్యాత్మిక విద్య "నీవు ఈ శరీరము కాదు నీవు వేరు ఈ శరీరము వేరు", అనే ప్రాతిపదిక మీద పని చేస్తాయి. ప్రాపంచికవిద్యలు ఎన్ని నేర్చుకున్నా, ఎన్ని డిగ్రీలు సంపాదించినా ఇంకా కొన్ని మిగిలే ఉంటాయి. కాని ఆద్యాత్మిక విద్యకు డిగ్రీలతో సంబంధం లేదు. ఆత్మజ్ఞానము ముఖ్యము. నీగురించి నీవు తెలుసుకుంటే ఇంక తెలుసుకోవలసింది ఏమీ ఉండదు అని బోధిస్తుంది.  ఇన్నిఉత్తమలక్షణాలు కలిగి ఉంది కాబట్టి ఈ అధ్యాత్మవిద్య నేనే అని అంటున్నాడు కృష్ణపరమాత్మ..

ప్రతి విషయానికి అవును, కాదు, అంటే వాదము ప్రతి వాదము అనేవి ఉంటాయి. అప్పుడే అసలు నిజం తేలుతుంది. అందుకే నేతి (న ఇతి... నేతి అంటే ఇది కాదు)సిద్ధాంతము వచ్చింది. పరమాత్మను తెలుసుకోవడానికి ఇది కాదు ఇది కాదు అని అన్నిటినీ పరిహరిస్తూ పోతే తుదకు మిగిలేది పరమాత్మ. అది నేను అంటున్నాడు. వాదమునే సంవాదము అని కూడా అంటారు. భగవద్గీత కూడా కృష్ణార్జున సంవాదము. అంటే తనకు తెలియని విషయాలను అర్జునుడు అడిగితే, ఆ విషయాలను లోతుగా చర్చించి, విశదపరిచి చెప్పడం. దీనిని వాదము, సంవాదము అని అంటారు. అంటే ఒక విషయాన్ని లోతుగా విశ్లేషించడం, దాని అంతం దాకా ఆలోచించడం. ఈ సంవాదము మనిషిలో జ్ఞానప్రకాశాన్ని కలుగజేస్తుంది. ప్రతివాదము మనిషిలో వ్యతిరేక భావాన్ని కలుగజేస్తుంది. కాబట్టి వాదించేవారిలో వాదనా శక్తిని నేను అని అంటున్నాడు పరమాత్మ.

ఈ వాదాలు మూడు రకాలు అని చెబుతారు. ఒక విషయాన్ని ఉన్నది ఉన్నట్టు చెప్పడం, విశ్లేషించి, విశదపరిచి చెప్పడం, అర్థం అయ్యేటట్టు చెప్పడం  వాదము. ఆ వాదమును ఖండిస్తూ, తన వాదమును మాత్రమే వినిపించడం  ప్రతివాదము. అంటే ఎల్లప్పుడూ ఎదుటి వాడు చెప్పింది తప్పు, తాను చెప్పింది మాత్రమే ఒప్పు అని వాదించడం ప్రతి వాదము. ఎదుటి వాడు, మంచి చెప్పినా, చెడు చెప్పినా,  ఏం చెప్పినా,  దానిని ఖండిస్తూ,  ఇతరులు చెప్పింది తప్పు, ఇతరులు చెడ్డవాళ్లు, వాళ్లకు ఏమీ తెలియదు, తనకు మాత్రమే అంతా తెలుసు, తాను చెప్పిందే ఒప్పు  అని ఏ విధమైన ఆధారాలు లేకుండా వాదించడం వితండ వాదము అని అంటారు. పరమాత్మ ఈ ప్రతివాద, వితండ వాదం  జోలికిపోవడం లేదు. కేవలం సంవాదములో  ఉన్న వాదనాశక్తిని నేను అంటున్నాడు.

## 33. అక్షరాణామకారోఽస్మి ద్వన్ద్వః సామాసికస్య చ।
## అహమేవాక్షయః కాలో ధాతాహం విశ్వతోముఖః॥

చదువులకు తల్లి సరస్వతి. చదువును తల్లిగానూ, దేవతగానూ మనం పూజిస్తాము. ఇతర మతాలలో అది లేదు. కేవలం ఉదరపోషణార్థమే చదువు. ఈ చదువుకు మూలం అక్షరములు. ఆ అక్షరములలో మొదటి అక్షరం అ. అ తో మొదలయ్యే వాటిని అచ్చులు అని అంటారు. అవి మూల అక్షరాలు. హల్లులు ఈ అచ్చులతో కూడితేనే పూర్ణమైన అక్షరాలు అవుతున్నాయి. (క్+ అ= క)కాని ఇంగ్లీషులో అ బదులు ఎ ఉంది. కాని వెంటనే బి అంటారు. దాని తరువాత సి అంటారు. అలా ఎందుకంటారో ఎవరికీ తెలియదు. అదే ఇంగ్లీషులో ఒవల్సు అని ఉన్నాయి. ఈ ఒవల్సు మన అఆలను పోలి ఉన్నాయి. కాబట్టి ఏ భాషలో చూచినా, ప్రతి అక్షరంతో అ కలిస్తేనే అది పూర్ణమైన అక్షరం అవుతుంది. అటువంటి అక్షరములలో అకారము నేను అంటే అకారముతో మొదలయ్యే అచ్చులను నేను. ఎందుకంటే ప్రతి పదము అకారము మొదలగు అచ్చులతోనే అంతం అవుతాయి. అచ్చుతో కూడనిది అక్షరం సంపూర్ణం కాదు. అందుకని అక్షరములకు ప్రాణసమానమైన "అ" కారము నేను అంటున్నాడు పరమాత్మ.

అక్షరాల కూర్పుతో కూడేది పదం. ఆ పదములు కొన్నిటిని సమాసములు అని అంటారు. ఈ సమాసములలో ద్వంద్వము అంటే ద్వంద్వసమాసము నేను అంటున్నాడు. సుఖ దు:ఖములు, రాగద్వేషములు, జయాపజయములు, లాభాలాభములు, మంచి చెడు ఇవన్నీ ద్వంద్వములు. అంటే రెండుపదాలను విడి విడిగా చెప్పడం కన్నా కలిపి చెప్పడం. ఈ ద్వంద్వములను అతిక్రమిస్తే గానీ పరమాత్మ దర్శనం కాదు. కలపడం అంటేయోగము అని కూడా అనవచ్చు. మన మనస్సును ఆత్మలో కలపడం. అదే మోక్షానికి మార్గము. కాబట్టి అన్ని సమాసములలో ద్వంద్వసమాసము నేను అని అన్నాడు పరమాత్మ.

అంతే కాదు, కాలస్వరూపుడను నేను అంటున్నాడు. ఈ కాలమునకు నాశనము లేదు. అలాగని మార్పు లేదు. మనం కాలానుగుణంగా మార్పు చెందుతున్నాము. కేవలము కదలిక వలనపుట్టేది కాలము. కదలిక లేకపోతే కాలము లేదు. కాలమునకు ఆది అంతము లేదు. అది అనంతము, అవిచ్ఛిన్నము. పరమాత్మ కూడా అనంతుడే. అటువంటి కాలస్వరూపుడను నేను. విశ్వతోముఖము అయిన పరబ్రహ్మతత్వమును నేను అని అన్నాడు. అంటే ఈ అనంత విశ్వమును నేను. ఈ అనంత విశ్వము అంతా నేను నిండి ఉన్నాను. నాలోనే ఈ అనంత విశ్వము ఉంది. అటువంటి పరబ్రహ్మస్వరూపము నేను అని అన్నాడు. దీనిని వ్యక్తపరచడానికే తరువాతి అధ్యాయములో అర్జునుడికి విశ్వరూప సందర్శనము చేసాడు పరమాత్మ.

## 34.మృత్యుస్సర్వహరశ్చాహముద్భవశ్చ భవిష్యతామ్।
## కీర్తిశ్శ్రీర్వాక్చ నారీణాం స్మృతిర్మేధా ధృతి: క్షమా॥

ఈ ప్రపంచంలో ఒకదానిని మరొకటి హరిస్తూ ఉంటుంది. అంటే నాశనం చేస్తూ ఉంటుంది. ఒక జీవి మరొక జీవికి ఆహారం అవుతుంది. ఒకడు మరొకడిని చంపుతాడు. ఒక వస్తువు మరొక వస్తువును నాశనం చేస్తుంది. చెదలు కలపను కొరుక్కు తింటాయి. తుప్పు ఇనుమును తింటుంది. కొన్ని వస్తువులు గాలి తగలగానే మండిపోతాయి. ఇలాగా ప్రతిజీవికీ మార్పు,నాశనము తప్పదు. ఈ ప్రక్రియ లేకపోతే ఉన్నవి పోవడం, లేనివి రావడం జరగదు. పుట్టినవి పుట్టినట్టు అన్నీ ఇక్కడే ఉంటే పుట్టబోయే వాటికి స్థానం ఉండదు. ఆ హరించే శక్తులలో మృత్యువును నేనే. పుట్టిన ప్రతిజీవి మృత్యువును కౌగలించుకోక తప్పదు. అంటే జాతస్యహి ధృవో మృత్యువు. అటువంటి మృత్యువు నేను. మన ఆధ్యాత్మిక సిద్ధాంతం ప్రకారం పుట్టుక తరువాత మృత్యువు ఎంత సత్యమో మరణించిన తరువాత పుట్టుక కూడా అంతే నిజం. అంటే చావు పుట్టుక నేనే. నాచేతిలోనే ఉన్నాయి.

ఉన్నదానిని హరించే శక్తులలో మృత్యువును నేను అని చెబుతూ, రాబోయే వాటికి సృష్టికర్తను నేనే. రాబోయే వాటికి స్థానం కల్పించడానికి ఉన్నవాటిని హరిస్తుంటాను. తద్వారా సృష్టిలయములు నిరంతరంగా జరుగుతుంటాయి. మనం ఈ సృష్టిలోని సమస్త జీవరాసుల జనన మరణాలను చూస్తే, ఒక రైసుమిల్లు గుర్తుకొస్తుంది. పైన ధాన్యం పోస్తుంటారు. కింది నుండి బియ్యం వస్తుంటాయి. వచ్చే బియ్యం పుట్టుక అయితే, పోసే ధాన్యం మరణం అని అనవచ్చు ఈ పుట్టుక,చావు నిరంతరం జరుగుతూ ఉంటుంది. ఈ చావుపుట్టుకల ప్రక్రియకు అధిపతిని నేను అంటే బ్రహ్మ, విష్ణు, శివరూపాలలో సృష్టి స్థితి లయములను చేస్తున్న తత్వము నేను అని పరమాత్మ స్పష్టంగా చెబుతుంటే, మనం శైవులు, వైష్ణవులు అని కొట్టుకుచస్తున్నాము. మనలో ఉన్న ఈ అజ్ఞానం పోవడానికే భగవద్గీతను బోధించాడు పరమాత్మ.

ఈ శ్లోకంలో స్త్రీల వైభవాన్ని గురించి వివరిస్తున్నాడు. స్త్రీలకు సహజంగా లక్ష్మీకళ ఉంటుంది. అందుకే ఆడువారిని లక్ష్మీదేవితో సమానము అంటారు. మంచి ఇల్లాలి వలననే మగాడికి, ఆయన ద్వారా ఆమెకు కీర్తి ప్రతిష్ఠ పేరు ప్రఖ్యాతులు వస్తాయి. స్త్రీలలో ఉన్న జ్ఞాపక శక్తి, మేధా శక్తి ధైర్య శక్తి, గ్రహణ శక్తి, వాక్ శక్తి అంటే విద్యాబుద్ధులు, క్షమాగుణము అన్నీ నేనే. స్త్రీలలో ఉన్న సుగుణములు అన్నీ ఇక్కడ కీర్తించాడు పరమాత్మ. అవి అన్నీ తన విభూతివలననే కలుగుతున్నాయి అంటున్నాడు. ఈ శ్లోకానికి మరొక విశేషార్థముకూడా ఉంది. మనకు మొట్టమొదటి మనువు స్వాయంభువ మనువు. ఆయన భార్య శతరూప, వారి కుమార్తె పేరు ప్రసూతి (అంటే ప్రసవ శక్తి). ఆమెకు పుట్టిన సంతానము పేర్లు కీర్తి, మేధ, ధృతి, స్మృతి, క్షమ. అంటే సుఖప్రసవం కలిగితే కలిగే

సంతానమునకు పైలక్షణాలు కలుగుతాయి. ఇంక లక్ష్మీదేవి సాక్షాత్తు నారాయణుని భార్య. వాగ్దేవి అంటే సరస్వతి బ్రహ్మదేవుని భార్య. అంటే దేవతలలో కూడా స్త్రీలు ఉన్నారు. పరమశివుని భార్య శక్తి. అంటే మనకు విద్య, సంపద,శక్తి వీటికి ప్రతీకలు సరస్వతీ,లక్ష్మీ,పార్వతులు. వారే మనకు కీర్తిని, ధనము, ఐశ్వర్యమును, వాక్కును, మంచి బుద్ధిని, ధృతిని(పట్టుదల), తెలివితేటలను, జ్ఞాపకశక్తిని, క్షమాశక్తి(ఓర్పు, ఓరిమి), ధైర్యాన్ని ఇచ్చే దేవతాశక్తులు, స్త్రీదేవతా శక్తులు. శక్తిని మనం స్త్రీస్వరూపిణిగా పూజిస్తుంటాము. అలాగే లక్ష్మీదేవిని ఎనిమిది లక్ష్ములుగానూ, పార్వతీదేవిని నవరాత్రులలో తొమ్మిదిరూపాలలో పూజిస్తుంటాము. ఈ శక్తిస్వరూపాలు అన్నీ వేరు వేరు కాదు అన్నీ నేనే, అన్ని నా విభూతులే అని అంటున్నాడు పరమాత్మ.

## 35. బృహత్సామ తథా సామ్నాం గాయత్రీ ఛందసామహమ్।
## మాసానాం మార్గశీర్షో2హం ఋతూనాం కుసుమాకరః॥

వేదములలో సామవేదము నేనే అన్న పరమాత్మ ఆ సామవేదములో బృహత్సామము అనే మంత్రము గొప్పది అంటున్నాడు. అంటే సామములో బృహత్తరమైనది. అంటే పేద్దది అని కాదు. భగవంతుని కీర్తించేది, భగవంతుని మహత్తును గురించి చెప్పేది అని అర్థం. అందుకే ఆ మంత్రమునకు బృహత్ సామము అని పేరు. సంస్కృతములో ఎన్నోఛందస్సులు ఉన్నాయి. ఛందస్సులు అంటే వేదమంత్రములు అనీ, ఆ వేదమంత్రములు చెప్పబడిన మీటర్ అంటే నడక అని కూడా చెబుతారు. ఆ ఛందస్సులలో గాయత్రి ఛందస్సు నేనే. అంటే గాయత్రి మంత్రము పరమాత్మను గురించి చెప్పేది. వేదములలో సారం అంతా గాయత్రీ మంత్రములో నిక్షిప్తం అయి ఉంది. అందుకే సంధ్యావందనములో గాయత్రీజపం చేస్తుంటారు. ఈ గాయత్రీ మంత్రమును ఉపనయన కాలంలో వటువు తన తండ్రిని తనకు సవితాదేవతా మంత్రమును ఉపదేశించమని అడుగుతాడు. అప్పుడు కుమారుడికి తండ్రి గాయత్రీ ఛందస్సులో ఉన్న సవితాదేవతా మంత్రమును ఉపదేశిస్తాడు. దానినే బ్రహ్మోపదేశము అని అంటారు. అంటే బ్రహ్మను గురించి ఉపదేశించడం. గాయత్రీ మంత్రం బ్రహ్మను గురించి తెలియజేస్తుంది. బ్రహ్మ వేద స్వరూపుడు. మూడు వేదములలో సారమును తీసి మూడు పంక్తులలో ఈ గాయత్రీ మంత్రములో నిక్షిప్తం చేసారు. తరువాతి కాలంలో విశ్వామిత్రుడు ఈ గాయత్రీ మంత్రమును వ్యాప్తిలోకి తీసుకువచ్చాడు.

అసలు ఈ మంత్రం సవిత అనే దేవతను ఉద్దేశించిన మంత్రమే. అందుకే సవితా మంత్రము అని అంటారు. కానీ ఈ మంత్రము గాయత్రి ఛందస్సులో ఉండటం వలన గాయత్రీమంత్రము అనే పేరు సార్ధకమయింది. గాయత్రి ఛందస్సు అంటే ఈ మంత్రములో మూడు పంక్తులు ఉంటాయి. పంక్తికి ఎనిమిది అక్షరాలు ఉంటాయి. మొత్తం 24 అక్షరాలు ఉంటాయి. ఈ విధమైన ఛందస్సును గాయత్రీ ఛందస్సు అంటారు. ఇదే విధంగా సంస్కృతంలో అనుష్టుప్ ఛందస్సు,

మొదలగు ఛందస్సులు ఉన్నాయి. వాటిలో గాయత్రీ ఛందస్సు ఒకటి.

మాసములలో మార్గశీర్షమాసము నేనే. ఇది వరకు రోజులలో సంవత్సరము చైత్రమాసంతో కాకుండా మార్గశిరమాసంతో మొదలయ్యేది. ఇది మహాభారతంలో అనుశాసనిక పర్వంలో వివరించబడింది. ఆనాటి కాలగణన ప్రకారము మార్గశిరమాసముతో సంవత్సరము మొదలవుతుంది. అంటే దాదాపు డిసంబరు మధ్యలో నుండి మన సంవత్సరము మొదలయ్యేది. పవిత్రమైన ధనుర్మాసము, వైకుంఠ ద్వారము తెరవడం ఈ మాసంలోనే మొదలవుతాయి. ఇది ఎలాగాఅంటే......... మానవ సంవత్సరము, దివ్య సంవత్సరము అని మీరు వినే ఉంటారు. మానవ సంవత్సరము అంటే 365 రోజులు. భూమి సూర్యుని చుట్టు ఒకసారి తిరిగే కాలము. ఇది మనకు ఒక సంవత్సరము అయితే దేవతలకు ఒక రోజు. అందుకనే సంవత్సరానికి ఒక రోజు పితృదేవతలకు శ్రాద్ధకర్మలు చేసి ఆహారం పెడితే, వారికి రోజూ ఆహారం పెట్టినట్టే. మరి దేవతలకు ఈ రోజు ఎప్పుడు మొదలవుతుంది అంటే మార్గశీర్షమాసంతో మొదలవుతుంది. అంటే దేవతలకు మార్గశీర్షమాసంతో వారికి బ్రాహ్మీముహూర్తం మొదలవుతుంది. ఉత్తరాయణ పుణ్యకాలంలో అంటే జనవరి 14 నుండి రోజు మొదలవుతుంది. అందుకే ఈ నెలలో అంటే డిసంబరు 15 నుండి, జనవరి 14 దాకా, మనం అందరం దేవతల మాదిరి తెల్లవారుజామునే లేచి నగర సంకీర్తనం చేస్తాము. వాకిట్లో ముగ్గులు వేసి సంక్రాంతి లక్ష్మిని ఆహ్వానిస్తాము. గొబ్బెమ్మలు పెడతాము. అందరి ఇళ్లలో పండుగ వాతావరణం నెలకొని ఉంటుంది.

అందుకే కొన్ని ప్రాంతాలలో దీనిని పండుగ నెల అని కూడా అంటారు. ఈ పండగనెల డిసెంబరు 15తో మొదలయి జనవరి 14తో ముగుస్తుంది. కొత్త బియ్యం, కొత్త బెల్లం, పాలు, నెయ్యి వీటితో పొంగలి వండటం, సూర్యభగవానునికి నివేదించడం చేస్తారు. ఇంకొక విశేషము ఏమిటంటే మార్గశిర మాసంలో వానలు పడటం దాదాపు ఆగిపోతాయి. పంటలు పండి పంటచేతికి వస్తుంది. అందరి ఇళ్లలో ధాన్య లక్ష్మి కళకళలాడుతూ ఉంటుంది. వాల్మీకి రామాయణంలో కూడా మార్గశిర మాస ప్రాధాన్యము గురించి వాల్మీకి మహర్షి వర్ణించాడు. గీతాజయంతి అంటే గీత చెప్పినరోజు అంటే మార్గశిర శుద్ధ ఏకాదశి కూడా ఈమాసంలోనే వస్తుంది. అవధూత దత్తాత్రేయుల వారు కూడామార్గశిర మాసంలో జన్మించారని చెబుతారు. ఏసుక్రీస్తు జననం కూడా (డిసెంబర్ 25) ఈ మాసములోనే జరిగింది. మార్గశిర మాసంలో అటు చలి ఉండదు, ఇటు వానలు ఉండవు. వాతావరణం ఆహ్లాదంగా ఉంటుంది. ఇన్ని మంచి లక్షణములు ఉన్న మార్గశిర మాసము నేనే అంటున్నాడు పరమాత్మ.

ఆఖరుగా ఋతువులలో వసంత ఋతువు నేనే అంటున్నాడు. వసంత ఋతువు గురించి మనకందరికీ బాగా తెలుసు. చెట్లు చిగురిస్తాయి. పూలు పూస్తాయి. వాతావరణం ఆహ్లాదంగా ఉంటుంది. శ్రీరాముడు ఇదే మాసంలో జన్మించాడు, ఇదే మాసంలో సీతాదేవిని

వివాహం చేసుకున్నాడు. ఎక్కువగా విష్ణుసంబంధమైన ఉత్సవాలు, తిరునాళ్లలు, వసంత నవరాత్రులు ఇదే ఋతువులో జరుగుతాయి. (శరదృతువు ప్రారంభంలో వచ్చేవి శరన్నవరాత్రులు అయితే వసంత ఋతువు ప్రారంభంలో వచ్చేవి వసంత నవరాత్రులు). కాబట్టి ఋతువులలో వసంత ఋతువు శోభాయమానమైనది కాబట్టి అది నేనే అంటున్నాడు పరమాత్మ.

36. ద్యూతం ఛలయతామస్మి తేజస్తేజస్వినామహమ్।
జయోఽస్మి వ్యవసాయోస్మి సత్త్వం సత్త్వవతామహమ్॥

ఇక్కడ ఒక ఛలోక్తి విసిరాడు పరమాత్మ. ఇతరులను వంచించే క్రీడలు, మోసపూరితమైన క్రీడలు, మానవులను తమ తమ స్థాయిల నుండి దిగజార్చే క్రీడలు, మనిషిని అధ:పాతాళానికి తొక్కే క్రీడలు లోకంలో చాలా ఉన్నాయి. వాటిలో జూదక్రీడ ఒకటి. ఆ జూదక్రీడను నేను అని అన్నాడు పరమాత్మ. జూదములో రకాలు ఉన్నాయి. కేవలము వినోదం కొరకు ఆడే జూదం వేరు. చిన్ని చిన్ని పందేలు వేసుకొని సరదాగా ఆడుకునే జూదం వేరు. కక్షలు కార్పణ్యాలు మనసులోపెట్టుకొని పైకి నవ్వుతూ ఆడే జూదం వేరు. కేవలం జూదమే వృత్తిగా పెట్టుకొని అందులో నైపుణ్యం సంపాదించి ఆడేజూదం వేదు. ఆ వృత్తినైపుణ్యానికి మోసం కలిపి, ఎదుటి వారిని మోసం చేస్తూ తాను గెలుస్తూ, ఇతరులను పూర్తిగా నాశనం చేసే జూదం వేరు. ఇన్నిరకాల జూదాలు ఉన్నాయి. మొదట సరదాగా మొదలుపెట్టి తరువాత నిండా మునిగిపోతారు. ఉన్నదంతా పోగొట్టుకుంటారు. దానికి మోసం కూడా తోడయితే ఇంక చెప్పేదేముంది. అందులో ఆఖరుది అయిన మోసంతో కూడిన వృత్తినైపుణ్యంతో ప్రకాశించే జూదం నేను అని అన్నాడు పరమాత్మ.

ఇక్కడ కృష్ణుడు కేవలం జూదమును గురించే ఎందుకుచెప్పాడు. ఎందుకంటే అదే ద్యూతంలో ఓడి పోయాడు ధర్మరాజు. దాని వలననే భారత యుద్ధం సంభవించింది. పాచికలను పక్కనే పెట్టుకొని పడుకొనేవాడు, పాచికలే లోకంగా జీవించిన వాడు శకుని. భార్యతో సరదాగా జూదం ఆడేవాడు ధర్మరాజు. ఒక ప్రొఫెషనల్‌తో ఒక అమెచ్యూర్ పోటీ పడితే, ఆ ప్రొఫెషనలిజానికి మోసం తోడయితే ఎలా ఉంటుంది. ఎదుటి వాడికి ఓటమి తప్పదు. ఈ విషయం ధర్మరాజుకు తెలుసు. తెలిసి తెలిసీ రాజ్యసర్వస్వమును, తమ్ములను, భార్యను ఒడ్డి ఓడి పోవడం ధర్మరాజు తెలివితక్కువతనం. అందుకే మోసపూరిత క్రీడలలో ఒకటైన జూదం, అనే ఉపమానాన్ని వాడాడు పరమాత్మ. అంతే కానీ, జూదం ఆడమని కానీ, జూదాన్ని ప్రోత్సహించడం కానీ, జూదంలో మోసం చేయమని కానీ చెప్పలేదు. కేవలం జూదం, అందులో అంతర్లీనంగా ఉన్న మోసశక్తిని, మానవుని దిగజార్చేశక్తిని కూడా నేనే అని అన్నాడు. ఒక గదిలో లైట్ వెలుగుతూ ఉంటుంది. ఆ వెలుగులో మంచి కార్యములు చేయవచ్చు. పేకాట ఆడి ఉన్నదంతా పోగొట్టుకోవచ్చు. మర్డర్లు, దొంగతనాలు చేయవచ్చు. చేసే కార్యం ఏదయినా వెలుగు మాత్రం ఒకటే. అన్నిటికీ సమానమే. అందుకే జూదము

కూడా నేనే. దానిని సరదాకే పరిమితం చేస్తావో, జీవితం నాశనం చేసుకుంటావో ఎలా ఉపయోగిస్తావో అది నీ ఇష్టం అని నర్మగర్భంగా చెప్పాడు పరమాత్మ.

ఏ పని చేయడానికైనా తెలివి తేటలు, నైపుణ్యం, చాతుర్యం ఉండాలి. అవి లేకపోతే ఆ పనులు రాణించవు. మంచి పనులు, లోకోపకారానికి పనికివచ్చే పనులు చేయడానికి కానీ, అలాగే జూదం, మోసం మొదలగు దుర్మార్గాలు చేయడానికి కానీ ఈ తెలివి, నైపుణ్యం, చాతుర్యం ఉండాలి. అవి నేనే అంటున్నాడు పరమాత్మ. కాని, ఆ తెలివిని, నైపుణ్యాన్ని, చాతుర్యాన్ని సక్రమంగా వినియోగించుకోవాలో, దుర్వినియోగం చేసుకోవాలో నిర్ణయించుకోవలసింది మానవుడే.

కాని కృష్ణుని బోధనలను అర్థం చేసుకోకుండా, ఏమండీ పరమాత్మజూదంలో కూడా ఉన్నాడు కదా, ఆ జూదం ఆడితే తప్పేంటి అని అడిగేవాళ్లు ఉన్నారు. మరి పరమాత్మ విభూతులు ఎన్నో ఉన్నాయి. వాటిలో అన్నిటిలో నీవు ఉన్నావా! అని ముందు ఎవరికి వారు ప్రశ్నించుకోవాలి. ఎందుకంటే దీని పక్కనే మరొక ఉపమానం కూడా ఉంది. తేజస్సు కలవారిలో ఉన్న తేజస్సును నేను అని కూడా అన్నాడు. మనవి తేజోవంతమైన ముఖాలా, జిడ్డుముఖాలా ముందు ఆలోచించాలి. మనలో అసలు తేజస్సు బుద్ధి కుశలత, నేర్పు ఉన్నాయా ఆలోచించాలి. ఇవేమీ ఆలోచించకుండా, కృష్ణుడు జూదంలో కూడా ఉన్నాడు అందుకని జూదం ఆడతాను అని అనడం శుద్ధఅవివేకము.

ఇక్కడ మరొక భావం గురించి కూడా చెప్పాడు కృష్ణుడు. తేజస్సు కల వారిలో తేజస్సును నేనే అన్నాడు. తేజస్సు అంటే తెలివితేటలు, బుద్ధి కుశలత, నేర్పు, ఎదుటి వాడి మీద గెలిచే సామర్థ్యం. ఇవన్నీ నేనే. అంటే జూదంలో కూడా ఉన్న కుశలత, నేర్పుఅన్నీ నేనే. ఆ నేర్పు ధర్మరాజులో లేదు, ఒక్క మొండి తనం తప్ప. శకునితో ఆడే నేర్పు తనకు ఉందా, లేదా అని యుధిష్ఠిరుడు ఆలోచించలేదు. బుద్ధికుశలతను విచక్షణను ప్రదర్శించలేదు. తనకు అంతా తెలుసు అనే అహం. మొండి తనం. తాను చేసేదంతా ధర్మము అనే గర్వం ఇవి పుష్కలంగా ధర్మరాజులో ఉన్నాయి. అందుకే శకునితో జూదం ఆడాడు. చిత్తుగా ఓడాడు. ఫలితం అనుభవించాడు. అందుకే బుద్ధికుశలతకు విచక్షణకు నేర్పుకు మారు పేరైన తేజస్సును నేను అంటున్నాడు పరమాత్మ.

జయాన్ని, ఆ జయం కలగాలంటే దానికి చేసే ప్రయత్నం నేనే. ఏపని చేయాలన్నా దానికి తగిన ప్రయత్నం ఉండాలి. నిశ్చయాత్మక బుద్ధిఉండాలి. కల్లోలితమైన మనసు ఉండకూడదు. అప్పుడు ఆ ప్రయత్నంలో దైవసాయం కూడా ఉంటుంది. ఆ ప్రయత్నం సఫలీకృతం అవుతుంది. ఎటువంటి ప్రయత్నం చేయకుండా, చేతులుముడుచుకొని కూర్చుంటే ఏ పనీ కాదు కదా, సోమరితనం అలవడుతుంది. అందుకే చేసే ప్రతి పనికీ తగిన ప్రయత్నం నేను అయి ఉన్నాను అని అంటున్నాడు పరమాత్మ.

పైగా సాత్వికులలో ఉండే సత్వగుణమును నేనే అంటున్నాడు. సత్త్వగుణము, రజోగుణము, తమోగుణము ప్రకృతి లక్షణములు. వాటిలో సత్వగుణము సాత్వికుల లక్షణము. అదే నేను అంటున్నాడు పరమాత్మ.

## 37. వృష్ణీనాం వాసుదేవో2స్మి పాణ్డవానాం ధనంజయః।
## మునీనామప్యహం వ్యాస: కవీనాముశనాకవి:॥

ఇన్నిచెప్పాడు ఇంతకూ ఈ కృష్ణునిలో కూడా పరమాత్మ ఉన్నాడా, ఉంటే ఆ సంగతి చెప్పడే అని అర్జునునికి సందేహం రావచ్చు అని ఊహించి ఈ శ్లోకంలో తన గురించి తాను చెప్పుకున్నాడు. వృష్ణివంశీయులలో వాసుదేవుడను నేనే. అంటే కృష్ణావతారము నేను అని అన్నాడు. ఇన్ని అవతారాలు ఉంటే కేవలం కృష్ణావతారం గురించే ఎందుకు చెప్పవలసి వచ్చింది అంటే ఇందులో కేవలం దుష్ట శిక్షణే కాకుండా, ధర్మసంస్థాపన కొరకు, రాబోయే కలియుగంలో మానవులు ధర్మమును సక్రమంగా ఆచరించడానికి భగవద్గీతను కూడా ఉపదేశించాడు. ఈ ఉపదేశము ఇంక ఏ అవతారములోనూ జరగలేదు. అందుకే కృష్ణావతారమునకు అంత విశిష్టత. ఈ భగవద్గీతకు ఎంతటి గౌరవం లభించింది అంటే ప్రస్థాన త్రయంలో స్థానం లభించింది. ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు, భగవద్గీత ఈ మూడింటినీ ప్రస్థానత్రయం అంటారు.

తరువాత, నాలోనే కాదు నీ లో కూడా పరమాత్మ అంశ ఉంది అని పాండవులలో అర్జునుడను నేను అని అన్నాడు. పాండవులు ఇంత మందిఉండగా కేవలం అర్జునుడికే ఎందుకుచెప్పవలసి వచ్చింది అనే విషయం మనకందరికీ తెలుసు. యుద్ధభూమిలో మోహరించి ఉన్న తాతలు, తండ్రులు, గురువులు, ఆచార్యులు, కుమారులు మొదలగు వారిని చూచి విషాదం చెంది, కృష్ణుని గురువుగా భావించి, తనకు కర్తవ్యోపదేశము చేయమని కోరాడు అర్జునుడు. ఇతర పాండవులకు ఆ అవకాశం కలుగలేదు. పైగా ఉపనిషత్తుల సారము, యోగవిద్యాసారము బ్రహ్మవిద్య అయిన భగవద్గీతలో అర్జునుడు భాగస్వామి అయ్యాడు. అనితర సాధ్యము అయిన విశ్వరూపమును తన జ్ఞాననేత్రముతో చూచే భాగ్యము ఒక్క అర్జునుడికే దక్కింది. కృష్ణార్జునులు నరనారాయణులు అని పురాణాలే చెబుతున్నాయి. అందుకే అర్జునుడిలో కూడాపరమాత్మ అంశ ఉంది అని అన్నాడు కృష్ణుడు.

మరి భగవద్గీతను కృష్ణుడు చెప్పాడు. అర్జునుడు విన్నాడు. ఈ విషయం లోకానికి ఎలా తెలిసేది. ఎవరు తెలియజెప్పారు అంటే వ్యాసుడు అని అందరికీ తెలుసు. మహాభారతము అనే ఇతిహాసములో భగవద్గీతను మణిహారంలో పతకంలాగా ఇమిడ్చి గ్రంధస్థం చేసి, అక్షర రూపంలో మనకు అందించిన వాడు మానవాళికి మహోపకారం చేసిన వాడు వ్యాసుడు. కృష్ణుడు జగద్గురువు

అయితే వ్యాసుడు మనకందరికీ గురువు. గురుపరంపరలో అగ్రగణ్యుడు. ఆయనలో భగవదంశ ఉంది కాబట్టే ఆయనను వ్యాసభగవానుడు అని గౌరవంగా పిలుచుకుంటాము. అంతే కాదు ఇందాక మనం చెప్పుకున్న ప్రస్థాన త్రయంలో రెండింటిని వ్యాసుడే రచించాడు. ఒకటి భగవద్గీత, రెండవది బ్రహ్మసూత్రాలు. పరమాత్మ అంశ, అనుగ్రహం లేనిదే ఇంతటి మహత్కార్యం ఎవరికీ సాధ్యంకాదు. అంతే కాదు ఒకటిగా ఉన్న వేదమును మూడుగా విభజించి, సులభతరం చేసి, తన శిష్యుల ద్వారా, అందరూ అధ్యయనం చేయడానికి వీలుగా, మానవాళికి అందించిన మహానుభావుడు వేదవ్యాసుడు. ఆ విధంగా కూడా వ్యాసుని భగవానుడిగా పరమాత్మ అవతారంగా మనం భావిస్తాము. అందుకే వ్యాసుడు కూడా పరమాత్మ అంశ అని అన్నాడు కృష్ణుడు.

తరువాత జ్ఞానవంతులలో శుక్రాచార్యుడను నేనే. శుక్రాచార్యుడు భృగువు వంశములోని వాడు. ఇంతకు ముందే దేవ గురువు బృహస్పతి పరమాత్మ అంశగా చెప్పుకున్నాము. ఇప్పుడు రాక్షస గురువు శుక్రాచార్యుని కూడా పరమాత్మ అంశగా చెప్పుకుంటున్నాము. గురువు అంటే జ్ఞానమును కలిగించేవాడు. ఎవరికి గురువు అయినా గురువు బ్రహ్మస్వరూపుడు.
"గురుఃబ్రహ్మ గురుః విష్ణుః గురుః దేవో మహేశ్వరః గురుః సాక్షాత్ పరం బ్రహ్మ తస్మై శ్రీ గురవేనమః"అనడం మనకు తెలుసుకదా. గురువు ఎవరికైనా గురువే. ఆయన పరమాత్మ స్వరూపమే.

38. దణ్డో దమయతామస్మి నీతిరస్మి జిగీషతామ్।
మౌనం చైవాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతామహమ్॥

ఉపాయములలోదండోపాయము ఆఖరుది. ఏ ఉపాయానికి లొంగకపోతే దండోపాయమే తరుణోపాయము. క్రమశిక్షణలో ఉండాలంటే దండోపాయమే శరణ్యము. క్రమశిక్షణ ఉల్లంఘిస్తే శిక్షపడుతుంది అనే భయం ఉంటేనే ఎవరైనా క్రమశిక్షణలో ఉంటారు. అ శిక్షలు ఎందుకు వేస్తారు. వాడి మీదకోపంతో, ద్వేషంతో కాదు. వాడిని మంచి మార్గంలో పెట్టడానికి. వాడిలో క్రమశిక్షణను తిరిగి పెంపొందించడానికి. అందుకని దండించువారిలో దండనా శక్తి నేను అంటున్నాడు.

జయించే వారిలో నీతిగా, ధర్మంగా జయించాలి అన్న భావన, నేనే అంటున్నాడు పరమాత్మ. మానవులలో ఉన్న యుక్తి, శక్తి, లౌక్యము నేనే అంటున్నాడు. ఎదుటి వాడి మీద ఎటువంటి క్రమశిక్షణా చర్యతీసుకున్నా, అది నీతిగాచేయాలి. ధర్మంగాచేయాలి. ఎదుటి వాడిని శిక్షించే విధంగా కాకుండా, అతడిని సన్మార్గంలో నడిపించే విధానంలో చేయాలి. అప్పుడు సాధించిన విజయమే ఆనందాన్ని ఇస్తుంది. అధర్మంగా అవినీతితో, హింసతో సాధించిన విజయము దుఃఖానికి కారణం అవుతుంది. మహాభారతయుద్ధంలో విజయం సిద్ధించినా, ధర్మరాజుకు సంతోషం కలుగలేదు.

ఇంతటి హింసతో కూడిన విజయం, నా అన్న వాళ్లను అందరినీ పోగొట్టుకొని పొందిన విజయం ఎటువంటి సంతోషాన్ని ఆనందాన్ని కలుగజేయదు అని భావించాడు ధర్మరాజు. కాబట్టి నీతిగా, నిజాయితీగా ధర్మంగా పొందిన విజయమే విజయము అని అన్నాడు పరమాత్మ.

అలాగే రహస్యాలు కాపాడాలి అంటే మౌనంగా ఉండటమే శ్రేయస్కరము. విషయాలను రహస్యంగా ఉంచడానికి అవలంబించే సాధనములలో మౌనము గొప్పది. ఎక్కువగా మాట్లాడేవాడి నోట్లో రహస్యం దాగదు. జ్ఞానము భగవత్ స్వరూపము. జ్ఞానము కలిగిన వాడు భగవంతునితో సమానము. జ్ఞానము కల వారిలో జ్ఞాన శక్తి నేనే అని అంటున్నాడు. కేవలము నాకు జ్ఞానము ఉంది నేను జ్ఞానిని, జ్ఞానవంతుడను అని అనుకోవడంతో సరిపోదు. అహం బ్రహ్మాస్మి అనే భావన కలిగి ఉండాలి. ఎందుకంటే జ్ఞానము పరమాత్మ స్వరూపము.

39. యచ్చాపి సర్వభూతానాం బీజం తదహమర్జున।
న తదస్తి వినా యత్స్యాన్మయా భూతం చరాచరమ్॥

40. నాన్తోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరన్తప।
ఏష తూద్దేశత: ప్రోక్తో విభూతేర్విస్తరో మయా॥

ఇప్పుడు అసలు విషయానికి వచ్చాడు కృష్ణుడు. ఇంత ఎందుకయ్యా. ఈచరాచర జగత్తులో ఉన్న సకల భూతములలో బీజరూపముగా ఉన్న వాడను నేనే అని అంటున్నాడు. బీజమే పరమాత్మ అంటే అన్ని జీవరాసులలో ఆత్మ స్వరూపుడుగా వెలుగుతున్న వాడు పరమాత్మ. అందులో ఉన్నాడు ఇందులో లేడు అన్న ప్రశ్నే లేదు. ఈ అచర (అంటే కదలనివి) చర (కదిలేవి) అయిన సమస్త భూతములలో, ఈ ప్రపంచములో ఉన్న అన్ని వస్తువులకు మూలకారణము నేను. నేను లేనిది అంటూ ఏదీ లేదు. మట్టి లేనిది కుండ లేదు. బంగారము లేనిది ఆభరణము లేదు. నేను లేకుండా ఈ లోకం లేదు. నేను అన్నింటిలో ఉన్నాను. అనంతమైన నా విభూతులలో కొన్ని విభూతులను మాత్రం నీకు వివరించాను. ఎందుకంటే నా విభూతులకు అంతం లేదు. అవి అనంతమైనవి. చెప్పుకుంటూ పోతే ఎప్పటికీ తరగదు.

## 41. యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవ వా।
## తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోऽంశ సమ్భవమ్॥

ఓ అర్జునా! ఎవరిలోనైతే విశేషమైన జ్ఞానము, ఐశ్వర్యము, బుద్ధి, ప్రకాశము, తెలివి, చురుకుదనము, శక్తి, ఉత్సాహము, ఉంటుందో ఆయా వస్తువులలో, ఆయా జంతువులు, పక్షులు, ప్రాణులలో, అలాగే మనుషులలో నా అంశ నా విభూతి ఉంటుంది అని తెలుసుకో అని చెప్పాడు పరమాత్మ. కొంతమందిలో అసాధారణ శక్తి ప్రజ్ఞ, ధారణా శక్తి ఉండటం మనం చూస్తూ ఉంటాము. వారిలో పరమాత్మ అంశ ఉంది అని అర్థం. కాని కొంత మంది ఆ అంశను దుర్వినియోగం చేస్తుంటారు.

ఇటీవల ఒక అమ్మాయి 3 ఏళ్ల పాప, ఆమెలో ఐన్‌స్టీన్ ఐక్యూ కన్నా ఎక్కువ ఐక్యూ ఉందని గుర్తించారు. ఎంత మందో స్వాతంత్ర్యసమరయోధులు ఉన్నా, వారిలో గాంధీ గారు గొప్పవాడయ్యాడు. ఎందుకంటే గాంధీగారిలో ఒక నిబద్ధత, నిశ్చయాత్మక బుద్ధి ఉన్నాయి. మనకు ఉపయోగపడే వస్తువులను కనిపెట్టిన మహానుభావులు ఎందరో ఉన్నారు. కొందరిలో పరిశోధనా శక్తి, మరి కొందరిలో ఉపన్యాసశక్తి, మరి కొందరిలో రాసే శక్తి, ఇంకా మరి కొందరిలో చదవడం, రాయడం, ఉపన్యసించడం ఈ మూడు శక్తులు పుష్కలంగా ఉంటాయి. వారందరిలో పరమాత్మ యొక్క కొద్దిపాటి అంశ ఉండబట్టే వారు తమలోని విశేషమైన ప్రజ్ఞపాటవాలు ప్రదర్శించగలిగారు. లోకోపకారం చేయగలిగారు. ఎందరో టెన్నిస్ ప్లేయర్లు ఉన్నా సానియాలో ఉన్న చురుకుదనం, ఎంతమంది క్రికెటర్లు ఉన్నా గవాస్కర్, టెండూల్కర్‌లో ఉన్న శక్తి సామర్థ్యం, ఇవి అన్నీ దైవదత్తాలే. దైవాంశలే. ప్రతివాడిలో ఈ దైవాంశ ఉంటుంది. కొంతమందిలో బహిర్గతం అవుతుంది. తగిన ప్రోత్సాహం లభించక అవకాశాలు లేక కొంతమందిలో అంతర్గతంగా ఉంటుంది కానీ బహిర్గతం కాదు. కొంత మందికి అటువంటి దైవాంశలు లభించినా దానిని దుర్వినియోగం చేయడమో, పోగొట్టుకోవడమో చేస్తుంటారు, కానీ సద్వినియోగం చేసుకోరు. తమలోని తెలివిని, ప్రజ్ఞను, పరిశోధనా శక్తిని లోకోపకారానికి కాకుండా లోకవినాశనానికి ఉపయోగించేవారిని మనం చూస్తూనే ఉన్నాము. అంతా వారి పూర్వజన్మకర్మానుసారం జరుగుతూ ఉంటుంది.

పరమాత్మయొక్క కొద్దిపాటి అంశతోనే ప్రాణులలో ఇంతటి శక్తి సామర్థ్యాలు, ప్రజ్ఞాపాటవాలు వెల్లివిరుస్తుంటే, ఇంక పరమాత్మయొక్క పూర్తి అంశ ఎంత ఉంటుందో ఊహించనలవి కాదు. ఆ మహత్తరమైన శక్తి ఊహకందనిది. అటువంటి అత్యంత శక్తిమంతుడైన పరమాత్మను వదిలిపెట్టి మనము పరిమిత శక్తి కలిగిన ఈ ప్రాపంచిక విషయములు, వాటిని మనకు ఇచ్చేవారి గురించి పాకులాడు తుంటాము.

## 42. అథవా బహునైతేన కిం జ్ఞాతేన తవార్జున।
## విష్టభ్యాహమిదం కృత్స్న మేకాంశేన స్థితోజగత్॥

అర్జునా! నీకు ఇంతకు ముందే చెప్పాను. నేను అన్నిటా వ్యాపించి ఉన్నాను. సకల జీవరాసులలో ఉన్నాను అని చెప్పాను. ఈ అనంత విశ్వం అంతా నా చైతన్యము వ్యాపించి ఉందని చెప్పాను. నేను అందరిలో ఆత్మస్వరూపుడుగా వెలుగుతున్నాను అని కూడా చెప్పాను. దానితో తృప్తి చెందక నా విభూతుల గురించి అడిగావు. నా ముఖ్యమైన విభూతుల గురించి వివరంగా చెప్పాను. ఇలా చెప్పుకుంటూ పోతే ఎన్ని చెప్పినా ఇంకా మిగిలే ఉంటాయి.. కాబట్టి ఇలా చెప్పుకుంటూ పోవడం వలన ఏమీ ప్రయోజనం లేదు. కాబట్టి ఒక్కటి తెలుసుకో. నాలోని ఒక్క అంశ మాత్రమే ఈ జగత్తు అంతా వ్యాపించి ఉంది. నేను లేని చోటు లేదు. అంతటా ఉన్నాను. అందరిలోనూ ఉన్నాను. అంతా నాలోనే ఉంది. ఈ విషయం తెలుసుకుంటే చాలు. ఇంక తెలుసుకోవలసింది ఏమీ ఉండదు.

దీనిని మనం లౌకికంగా అర్థం చేసుకుంటే, మనం చెప్పుకునే ఈ పరమాత్మ తత్వము ఒక్క హిందూ మతానికి కాదు అన్ని మతాలకు వర్తిస్తుంది. ఆ పరమాత్మలోని ఒక చిన్ని అంశ మాత్రమే ఈ దృశ్యప్రపంచము. మనకు తెలియని ప్రపంచము, విశ్వం ఎంతో ఉంది. మనం భూమికి ఉపగ్రహమైన చంద్రుని మీద మాత్రమే కాలుమోపాము. భూమితో పాటు ఉన్న ఇతర గ్రహాల గురించి మనకు ఏమీ తెలియదు. అటువంటిది, సూర్యుడి లాంటి ఇతర నక్షత్రాల గురించి, ఆ నక్షత్రాల చుట్టు తిరుగుతున్న గ్రహాల గురించి, అటువంటి నక్షత్రాలు కోటాను కోట్లు ఉన్న ఈ పాలపుంత గురించి, ఇటువంటి పాలపుంతలు కోటాను కోట్లు ఉన్న ఈ అనంత విశ్వం గురించి, ఈ పాలపుంతలన్నీ వేగంగా ప్రయాణిస్తూ, నిరంతరం విస్తరిస్తున్న ఈ అంతరిక్షం గురించి మనకు ఏం తెలుసు? కాబట్టి మనకు తెలిసింది ఆవగింజలో అర్ధభాగం కూడా లేదు. అందుకే ఇదంతా నాలోని ఏకాంశ అంటే ఒక అంశ మాత్రమే అన్నాడు పరమాత్మ. కాబట్టి, వీటి జోలికి పోకుండా, ఈ అంతరిక్షం నిండా పరమాత్మ విభూతి వ్యాపించి ఉంది అని తెలుసుకుంటే సరిపోతుంది అని పరమాత్మ బోధ. ఇంతటితో భగవద్గీతలో విభూతి యోగము పూర్తిఅయింది.

**ఉపనిషత్తులయొక్క, బ్రహ్మవిద్యయొక్క,**
**యోగశాస్త్రము యొక్క సారమయిన భగవద్గీతలో,**
**విభూతి యోగము అను పదవ అధ్యాయము సంపూర్ణము.**
**ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.**

# భగవద్గీత

## పదకొండవ అధ్యాయము

# విశ్వరూపసందర్శన యోగము

ఈ అధ్యాయంలో పరమాత్మ అర్జునుడికి విశ్వం యొక్క అనంతమైన రూపాన్ని చూపించాడు. చూపించాడు అనడం కన్నా చూచినట్టు భ్రమకలిగించాడు అనడం సమంజసం. విశ్వం అంతా తన లోనే ఉందని చెప్పాడు. విశ్వమే తన రూపముగా కలవాడు కాబట్టి పరమాత్మకు విశ్వరూపుడు అని పేరు. కాని మనం పరమాత్మను సాకారంగా, మన భావాలకు అనుగుణంగా వివిధ రూపాలలో, అదీ మనం ఏ రూపంతో ఉన్నామో ఆ యా రూపాలలో పూజిస్తున్నాము. కాబట్టి పరమాత్మకు కూడా మన మాదిరి కాళ్లు చేతులు, తల మొండెము ఉన్నాయి ఊహించుకుంటాము. కాని పరమాత్మ నిరాకారుడు. మరి విశ్వరూపుడు, నిరాకారుడు, అయిన పరమాత్మను చూడటం ఎలాగ. ఎలా సంభవము అర్జునుడు ఎలా చూడగలిగాడు అన్న ప్రశ్న మనలో ఉదయిస్తుంది.

అర్జునుడికి (మనందరి మాదిరి) కేవలం మనిషి ఆకారాలు మాత్రమే తెలుసు. అందుకని నాలోనే ఈ అనంత విశ్వాన్ని చూడు అని అన్నాడు పరమాత్మ. అదీ కూడా జ్ఞాననేత్రంతో చూడు అన్నాడు. మన మామూలు కళ్లు కొంత దూరం మాత్రమే చూడగలవు. ఒక వైపు మాత్రమే చూడగలవు. వెనుక వైపుకు చూడలేవు. కళ్లు మూసుకుంటే అమెరికా కూడా మన కళ్ల ముందు ఉంటుంది. అదే సూత్రాన్ని పాటించాడు పరమాత్మ. మరి ఈ జ్ఞాన నేత్రం ఎక్కడ ఉంటుంది. ఎలా ఉంటుంది అంటే అదే మూడో నేత్రము. మనో నేత్రము అని అంటారు. మామూలు కళ్లు మూసుకుంటే మనోనేత్రము తెరుచుకుంటుంది. ఆ మనో నేత్రంతోటే మనం కలలో ఎన్నో విషయాలను చూడగలుగుతున్నాము.

నిద్రలో మాత్రమే కల వస్తుంది. మెలుకువగా ఉండి మనో నేత్రం తెరుచుకోవాలంటే ధ్యానం ఒకటే మార్గము. అదీ నిర్మలమైన మనసుతో అచంచలమైన బుద్ధితో ఏకాగ్రమైనచిత్తంతో ధ్యానం చేయాలి. అప్పుడే జ్ఞాన నేత్రం, దివ్య చక్షువు తెరుచుకుంటుంది. ఈ అనంత విశ్వాన్ని చూడడం సాధ్యం అవుతుంది. దివ్య దృష్టి అంటే ఈ అనంత విశ్వంలోని ప్రతి జీవిని, ప్రతి వస్తువును దివ్యంగా, పరమాత్మ స్వరూపంగా భావించగలగడం. దీనికి జ్ఞానం కావాలి. ఆ జ్ఞానం వేదములు, శాస్త్రములు, ఉపనిషత్తులు, పురాణాలు, చదవడం వలన లభిస్తుంది. ఎందుకంటే అమెరికా ఎలా ఉంటుందో

ఒక సారి చూస్తే, తరువాత ఎప్పుడు కళ్లు మూసుకున్నా అమెరికా మన ఉహాలోకంలో కనిపిస్తుంది. అసలు అమెరికా చూడని వాడికి అది సాధ్యం కాదు. అసలు విశ్వం ఎలా ఉంటుందో, దాని స్వరూప, స్వభావాలు ఏమిటో తెలియకుండా దానిని మనోనేత్రంతో చూడ్డం సాధ్యం కాదు కదా! అందుకని విశ్వరూపదర్శనం ముందు విభూతియోగమును చెప్పాడు పరమాత్మ.

పరమాత్మ విశ్వరూపం చూడాలంటే దానికి మానసికంగా సిద్ధం కావాలి. దానినే దివ్యచక్షువు మనో నేత్రము అని పెద్దలు చెప్పారు. ఈ దివ్యచక్షువుతో చూడ్డం అంటే పరమాత్మను ఏదో ఒక రూపంలో అంటే నిత్యం మనం పూజించే విగ్రహ రూపాలు.... విష్ణువు, శివుడు, రాముడు, కృష్ణుడు, ఆంజనేయుడు, కుమారస్వామి, సాయిబాబా..... ఇలా కాకుండా పరమాత్మ విశ్వం అంతా నిండి ఉన్నాడు అనే దివ్యమైన భావనతో చూడ్డం. ఆ భావనతోనే అర్జునుడు తన మనోనేత్రంతో, దివ్యచక్షువులతో పరమాత్మ యొక్క విశ్వరూపాన్ని సందర్శించాడు. ఇంక శ్రీకృష్ణపరమాత్మ చెప్పిన విశ్వరూప దర్శనయోగం లోకి ప్రవేశిద్దాము.

అర్జున ఉవాచ:

### 1. మదనుగ్రహాయ పరమం గుహ్యమధ్యాత్మ సంజ్ఞితమ్।
### యత్త్వయోక్తం వచస్తేన మోహోఽయం విగతో మమ॥

ఓ కృష్ణా! నా మీద నీకు ఉన్న అనుగ్రహంతో పరమమైనదీ, అత్యంత రహస్యమైనది, అధ్యాత్మము అనే పేరు కలది అయిన విద్యను నాకు బోధించావు. నీవు చేసిన బోధనలతో నా లో ఉన్న అజ్ఞానము పూర్తిగా తొలగి పోయింది. నాలోని మోహము నశించింది.

అర్జునుడు సగటు మనిషికి ప్రతీక. నా మీద ఉన్న అనురాగంతో దయతో నన్ను అనుగ్రహించడానికి నాకు ఎన్నో విషయాలు చెప్పావు. పరమమైన రహస్యాలు కూడా చెప్పావు.అందుకే పరమం గుహ్యం అంటున్నాడు. కిందటి అధ్యాయంలో కృష్ణుడు ఇది విద్యలలో కెల్లా గొప్పది, చాలా రహస్యమైనది అని అన్నాడు. అందుకనే ఇక్కడ అర్జునుడు చాలా గొప్పదైన, రహస్యమైన అధ్యాత్మము అనే పేరు గల విద్యను నాకు చెప్పావు. నీవు చెప్పినది అంతా శ్రద్ధగా విన్నాను. దీనితో నా అజ్ఞానం నశించింది. నాలోని మోహం తొలగి పోయింది. నాకు జ్ఞానం వచ్చింది. అని అన్నాడు.

ఈ శ్లోకంలో వాడిన “ఆధ్యాత్మ విద్య” అనే పదాన్ని చూద్దాం. ఈ ప్రపంచంలో మనం ఎన్నో విద్యలు నేర్చుకుంటున్నాము. ధనం సంపాదించడానికి మానసిక వికాసానికి వినోదానికి, మనసుకు ఆహ్లాదం కలగడానికి ఎన్నో విద్యలు ఉన్నాయి. ఈ విద్యలు, వాటి వలన కలిగే ఆనందం,

సుఖం, శాంతి అన్ని పరిమితాలు. కాని ఆధ్యాత్మ విద్య మాత్రం నిరంతర సుఖాన్ని ఆనందాన్ని ఇస్తుంది. మానవులను జనన మరణ దు:ఖము నుండి బయటపడేస్తుంది.

నా మీద ఉన్న అనుగ్రహంతో నాకు ఈ అద్భుతమైన ఆధ్యాత్మ విద్యను బోధించావు. అని అన్నాడు అర్జునుడు. అంటే అర్జునుడు కృష్ణుని తన బంధువే అని కాకుండా అధ్యాత్మగురువుగా, పరమాత్మస్వరూపునిగా అంగీకరించాడు. ఆయన బోధనలను విన్నాడు. జీర్ణం చేసుకున్నాడు. ఇప్పటిదాకా ఈ యుద్ధంలో నా తాతలు, తండ్రులు, గురువులు, బంధువులు ఉన్నారు వారినందరినీ నేనే చంపాలి దాని వలన కులక్షయం అవుతుంది, వర్ణసంకరం కలుగుతుంది అనే అజ్ఞానాన్ని, మోహాన్ని పోగొట్టుకున్నాడు. ఈ దేహము నేను కాదు. నేను వేరు, దేహము వేరు. దేహానికి జనన మరణాలు ఉన్నాయి కానీ దేహములో ఉన్న ఆత్మకు కాదు. ఆత్మకు చావుపుట్టుకలు, వృద్ధిక్షయములు లేవు అనే జ్ఞానాన్ని తెలుసుకున్నాడు.

అర్జునుడు ఇంకో మాట కూడా అన్నాడు. ఇదంతా ఏదో నీ గొప్ప చెప్పుకోడానికి కాదు. నా మీద నీకు ఉన్న పరిపూర్ణఅనుగ్రహం వలన నాకు చెప్పావు అని ఎంతో వినయంగా అన్నాడు. గురువు పట్ల అటువంటి వినయం శిష్యుడికి ఉండాలి. ఎందుకంటే కృష్ణుడు ఈ అధ్యాత్మ అనే పేరు గల బోధ చేయక ముందు అర్జునుడు తీవ్రమైన మానసిక సంక్షోభంలో ఉన్నాడు. అతనిలో ఆలోచించే శక్తి నశించింది. చేతిలో గాండీవం కూడా పట్టుకోలేని పరిస్థితి. ఒళ్లంతా చెమటలు పడుతున్నాయి. ఏం చేయాలో ఏం చేయకూడదో తెలియని అయోమయ స్థితిలో ఉన్నాడు. ఇప్పుడు ఆ స్థితి తొలగి పోయింది. కృష్ణుడు చెప్పిన పరమమైన మాటలతో అత్యంత రహస్యమైన బోధనలతో అర్జునుడిలోని మోహం నశించింది. దాని ఫలితంగా జ్ఞానోదయం అయింది.

## 2. భవాప్యయౌహి భూతానాం శ్రుతౌ విస్తరశోమయా।
## త్వత్త: కమలపత్రాక్ష మాహాత్మ్యమపి చావ్యయమ్॥

తామర రేకుల వంటి కన్నులు కల ఓకృష్ణా! నీ వలన జీవరాసుల యొక్క ఉత్పత్తి, వినాశము వీటి గురించి, అవ్యయమైన నీ యొక్క మహత్తు గురించి, నేను సవిస్తరంగా విన్నాను. మీరు విస్తారంగా చెప్పడం వలన నాకు చక్కగా అర్థం అయింది. నేను పూర్తిగా అర్థం చేసుకోగలిగాను. దీని వలన నాకు జ్ఞానం కలిగింది అని అంటున్నాడు అర్జునుడు.

3. ఏవమేతద్యథా22త్థ త్వమాత్మానం పరమేశ్వర।
ద్రష్టుమిచ్ఛామి తే రూపమైశ్వరం పురుషోత్తమ॥

ఓ పురుషోత్తమా! నీ గురించి నీవు చెప్పినది అంతా యదార్థము అని నేను నమ్ముతున్నాను. కాని కేవలం వినడమే కాదు చూడాలని కూడా ఉంది. నీ అనంతమైన అద్భుతమైన విశ్వరూపమును చూడాలని కోరికగా ఉంది పరమేశ్వరా! నాకు చూపించవా!

ఇప్పుడుఅర్జునుడు అసలు విషయం బయటపెట్టాడు. అందుకని ముందు కృష్ణుని ఓ పరమేశ్వరా! పురుషోత్తమా! అని సంబోధించాడు. ఓ పురుషోత్తమా! నీ గురించి అంటే పరమాత్మ తత్వము గురించి నీవు చెప్పినది అంతా నేను విన్నాను. విన్నది నమ్మాను. బాగానే ఉంది. కాని విన్నదంతా ఒక సారి చూపిస్తే సరి పోతుంది కదా. ఒక సారి చూస్తే గానీ పూర్తి నమ్మకం విశ్వాసం కలగదు కదా! అని అంటున్నాడు అర్జునుడు.

మనకు సాక్ష్యాలు రెండు రకాలు. ప్రత్యక్ష సాక్ష్యం పరోక్ష సాక్ష్యం. ప్రత్యక్ష సాక్ష్యం అంటే ఎదురుగా చూసి తెలుసుకోవడం. పరోక్ష సాక్ష్యం అంటే ఎవరో చెప్పినది విని దానిని చెప్పడం. ఇప్పటిదాకా కృష్ణుని నోటి వెంట ఎన్నోవిషయాలు విన్నాడు. నమ్మాను అంటున్నాడు. కాని ఒకమూల ఏదో అనుమానం. ఇవన్నీ నిజమా కాదా అని. అందుకనే నువ్వు చెప్పిన విషయాలు కాస్త చూపించవయ్యా అంటున్నాడు. అంటే ఆడియో వెర్షన్ విన్నాను. విజువల్సుకూడా చూపిస్తే పూర్తి నమ్మకం కలుగుతుంది అని చెప్పకనే చెబుతున్నాడు అర్జునుడు.

మనం కూడా అంతే కదా కళ్లతో చూస్తేనే గానీ దేనినీ నమ్మం. అదే అంటున్నాడు అర్జునుడు. ఈ విషయాన్ని మరోవిధంగా కూడా అర్థం చేసుకోవచ్చు. ఇప్పటి దాకా అర్జునుడు భౌతిక ప్రపంచాన్నే చూచాడు. కళ్లకు కనపడేదే చూచాడు. నమ్మాడు. ఇప్పుడు కృష్ణుడు అధ్యాత్మ బోధనలు చేసాడు. ఆ అద్యాత్మబోధనలకు సంబంధించిన విషయాలు అర్జునుడు చూడలేదు. కాబట్టి అర్థం కావడం లేదు. అందుకని ఓ పరమేశ్వరా! నీ ఐశ్వర్యవంతమైన విభూతులతో కూడిన రూపాన్ని చూడదలచుకున్నాను. అది కూడా చూస్తే నేను విన్నదానికి చూచిన దానికి చక్కగా సమన్వయం కుదురుతుంది. కాబట్టి నీ అధ్యాత్మ సంబంధమైన రూపమును నాకు చూడాలని ఉంది అని వేడుకున్నాడు అర్జునుడు.

4. మన్యసే యది తచ్ఛక్యం మయా ద్రష్టుమితి ప్రభో।
యోగేశ్వర తతో మే త్వం దర్శయాత్మాన మవ్యయమ్॥

అర్జునుడు మరొక మాట కూడా అంటున్నాడు. కృష్ణా! ఏదో నేను అడిగాను కదా అని అనంతమైన విశ్వం యొక్క రూపం చూపక్కర్లేదు. నాకు ఈ విశ్వం యొక్క స్వరూపాన్ని చూడటానికి అర్హత ఉంటేనే చూపించు. లేకపోతే లేదు. నీ ఇష్టం అని అన్నాడు. అంటే నాకు నీ మీద నమ్మకం లేక కాదు నిన్ను అడిగింది. ఈ విశ్వ యొక్క రూపం ఎలా ఉందో వినడానికి నాకు అర్హత ఉంది కాబట్టి చెప్పావు మరి చూడడానికి అర్హత ఉంటే చూపించు అని వినమ్రంగా అడిగాడు. చెప్పిన వాడు చూపించ కుండా ఉంటాడా అని మనసులో అనుకొని ఉంటాడు. అందుకే యోగేశ్వరా! అని సంబోధించాడు. భౌతికం కాని అనంతమైన విశ్వాన్ని సందర్శించడం యోగం వలననే సాధ్యం అవుతుంది. దానికి గురువు అనుగ్రహం కావాలి. చూడడానికి తగిన అర్హత కూడా ఉండాలి.

అందుకే అర్జునుడు వినమ్రంగా అన్నాడు. ఓ యోగేశ్వరా! అంటే యోగాభ్యాసం చేసే వారికి అందరికీ ప్రభువైన వాడా, నాశనము, మార్పులేని నీ విశ్వరూపాన్ని నాకు చూపించు. అదీ నాకు ఆ విశ్వరూపాన్ని చూడటానికి అర్హత ఉంది నీకు అనిపిస్తేనే చూపించు. ఎందుకంటే ఈ కొద్దిసమయంలో నేను యోగుల మాదిరి యోగాభ్యాసం చేయలేను. ఇప్పటి దాకా అటువంటి యోగాభ్యాసాలు నేను చేయలేదు. కాబట్టి నాకు అలౌకికమైన నీ విశ్వరూపం చూడడానికి అర్హత ఉందో లేదో నాకు తెలియదు. నాకు అటువంటి అర్హత ఉంది అని నీవు అనుకుంటే, లేక ఏకారణం చేతనయినా నాకు ఆ అర్హత లేకపోయినా, తమరి అనుగ్రహంతో తాత్కాలికంగా అటువంటి అర్హతను నాకు కల్పించి, నీ అనంతమైన విశ్వరూపాన్ని నాకు చూపించండి అని వేడుకున్నాడు అర్జునుడు.

శ్రీభగవానువాచ:

5. పశ్య మే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశః।
నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీనిచ॥

6. పశ్యాదిత్యాన్ వసూన్ రుద్రానశ్వినౌ మరుతస్తథా।
బహూన్యదృష్టపూర్వాణి పశ్యాశ్చర్యాణి భారత॥

7. ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య సచరాచరమ్।
మమ దేహే గుడాకేశ యచ్చాన్యద్ద్రష్టు మిచ్ఛసి॥

8. న తు మాం శక్యసే ద్రష్టుమనేనైవ స్వచక్షుషా
దివ్యం దదామి తే చక్షు: పశ్య మే యోగమైశ్వరమ్॥

అర్జునా! చూడవయ్యా! వందల, వేల కోట్ల ఉన్న నా రూపాలను చూడు. అవి నానా రకములైన రూపములతో, రంగులతో ఆకారములతో లెక్కపెట్టలేనంతగా ఉన్న ఈ అనంత విశ్వాన్ని చూడు. ద్వాదశఆదిత్యులను, అష్టవసువులను, ఏకాదశ రుద్రులను, ఇద్దరు అశ్వినీ దేవతలను, నలభైతొమ్మిది మంది మరుత్తులను మొదలగు దేవతా గణములను చూడు. వీళ్లని నీవు ఎప్పుడూచూచి ఉండవు. ఇటువంటి ఆశ్చర్యకరమైన వాటిని చూడు.

కాని ఇవన్నీ చూడటానికి నీకు మామూలు కళ్లు చాలవు. దివ్యచక్షువులు కావాలి. ఇక్కడ దివ్యచక్షువులు అంటే పరమాత్మ ఉద్దేశం మనోనేత్రము. జ్ఞాన నేత్రము. అంటే నీ మనసును ఈ అనంత విశ్వమును చూడటానికి సిద్ధం చెయ్యి. నీలో ఉన్న భక్తి, శ్రద్ధ ఏకాగ్రత, ఇప్పటి వరకు నీవు పరమాత్మగురించి తెలుసుకున్న విషయాల పట్ల సరిఅయిన అవగాహన, వీటిని అన్నిటినీ కలిపితేనే కాని ఈ విశ్వాన్ని చూడలేవు. ఇప్పటికి ఇప్పుడు నీకు ఆ స్థితి సిద్ధించే అవకాశం లేదు. కాబట్టి ఆ స్థితిని అంటే ఆ దివ్యదృష్టిని నీకు నేను తాత్కాలికంగా ప్రసాదిస్తాను. ఆ దివ్యదృష్టిప్రభావంతో నీవు ఈ అనంత విశ్వాన్ని దర్శించవచ్చు. అని అన్నాడు. ఎందుకంటే, కృష్ణుడు అర్జునుడికి పూర్తిగా దివ్యదృష్టి ప్రసాదిస్తే తరువాత యుద్ధం చేయడానికి కష్టం అవుతుంది కాబట్టి తాత్కాలికంగా ప్రసాదించాడు. (దీనిని తాత్కాలిక హిప్నటైజేషన్ అని అనుకోవచ్చేమో)

ఇప్పుడు విశ్వరూపం గురించి వివరిస్తున్నాడు. ఈ విశ్వంలోఉన్న అన్ని రూపాలలో నేనే కనిపిస్తున్నాను చూడు. వందలకోట్ల వేలకోట్లరూపాలలో కనిపిస్తున్నాను చూడు. నానావిధములైన రూపాలలో కనిపిస్తున్నాను చూడు. ఒక జీవికి మరొక జీవికి పోలికే లేదు. ఒక మనిషికి మరొక మనిషికి పోలికే లేదు. అటువంటి రూపాలను చూడు. లెక్కబెట్టడానికి శక్యం కాని నా రూపాలను చూడు. ఆ రూపాలుకూడా అనేకములైన వివిధములైన వర్ణములతో, రంగులతో కనిపిస్తున్నాయి చూడు. అన్నిరకములైన దివ్యరూపములను చూడు. పన్నెండు మంది ఆదిత్యులు, అష్టవసువులు, ఏకాదశ రుద్రులు, అశ్వినులు, మరుత్తులు, ఇంకా అనేకములైన దివ్యరూపాలను చూడు.

ఇప్పుడు మనం వీటిని పరిశీలిద్దాము. మొదట ఈ విశ్వం అంటే ఈ భూమి మీద ఉన్న జీవరాసులు, పదార్థాలు, వస్తువులు, రకరకాల రంగులలో, రూపాలలో, లెకపెట్టలేనన్ని కనిపిస్తున్నాయి. అంటే మొట్ట మొదట భూమిగురించి చెప్పాడు. విశ్వం అంటే ఒక్క భూమి కాదు కదా! అందుకే సూర్యుడి గురించి చెప్పాడు. ద్వాదశ ఆదిత్యుల గురించి చెప్పాడు. (ద్వాదశ ఆదిత్యులు అంటే 12 మంది సూర్యుళ్లు ఉంటారని కాదు. ఒకే సూర్యుడు పన్నెండు నెలలలో పన్నెండు స్థానాలలో ఉంటాడు. అప్పుడు మనకు వాతావరణం పన్నెండు విధాలుగా మారుతూ ఉంటుంది. ఆ పన్నెండు స్థానాలలో ఉన్న సూర్యుడిని పన్నెండు పేర్లతో పిలుస్తారు. వారినే ద్వాదశ ఆదిత్యులు అని అంటారని పెద్దలు చెబుతారు. స్థూలంగా చెప్పుకోవాలంటే ఓ అర్జునా! ఈ విశ్వంలో సూర్యుని గమనాన్ని కూడా చూడు అని అర్థం.) తరువాత దేవతా గణాలు అయిన వసువులు, మరుత్తులు, అశ్వినుల గురించి చెప్పాడు. అంటే కనపడే జీవరాసులే కాకుండా, సూక్ష్మశరీరంతో ఉన్న జీవరాసులు కూడా ఉన్నాయి వాటిని కూడా చూడు. అర్జునా! ఈ భూమి ఒక్కటే కాదు భూమి లాంటి గ్రహాలు, సూర్యుడి లాంటి నక్షత్రాలు కోటాను కోట్లు ఉన్నాయి. వాటి అన్నిటిలో నేను ఉన్నాను అని చెప్పాడు.

వీళ్లనందరినీ నీవు ఇంతకు ముందు చూచి ఉండవు. వీళ్లను చూస్తుంటే నీకు ఆశ్చర్యం కలుగుతుంది. అటువంటి వారిని నీ మనోనేత్రంతో దర్శించు. ఈ సమస్త జగత్తును నాలో చూడు. అంటే ఆరడుగుల కృష్ణుని రూపంలోకాదు. కృష్ణుడు నీలమేఘచ్ఛాయ కలవాడు. ఆకాశం కూడా నీలంగా ఉంటుంది. ఆకాశం అనంతం. కృష్ణుడు కూడా అనంతుడు. అందుకే ఈ అనంతమైన విశ్వాన్ని అనంతుడనైన నాలో చూడు అని అర్థం చేసుకోవాలి. సమస్త చరాచర ప్రపంచమును అంటే కదిలేవి కదలనివి ఉన్న ఈ విశ్వాన్ని చూడు.

వీటినే కాదు ఇంకా నీవు వేటి వేటి ని చూడదలచుకున్నావో (అంటే నేను చెప్పినవే కాదు, ఏయే విషయాలు నీ మనసులో మెదులుతున్నాయో, ఇప్పటి వరకూ నీవు వేటి వేటిని చూడలేదో) వాటి నన్నిటినీ చూడు. నీవు నా శరీరాన్ని చూస్తున్నావు కాబట్టి, ఈ అనంత విశ్వాన్ని నా శరీరాకృతిలో చూడు. అని అన్నాడు పరమాత్మ. అంటే అర్జునుడి ఎదురుగా కృష్ణుడు మానవాకృతిలో కనిపిస్తున్నాడు కాబట్టి ఈ అనంత విశ్వం అంతా ఆయనలో ఉన్నట్టే కనిపిస్తూ ఉంది. ఆభావనతోనే చూస్తున్నాడు అర్జునుడు.

ఇంతకు ముందు శ్లోకాలలో ఈ జగత్తు అంతా పరమాణువుల మయం. ఈ అనంత విశ్వం ఒక పరమాణువు నుండి ఆవిర్భవించింది. అది నేనే కాబట్టి నాలోనే నా శరీరాకృతిలోనే ఈ అనంత విశ్వాన్ని దర్శించు అని అన్నాడు కృష్ణుడు. మనకు మూడు విశ్వాలు ఉన్నాయి. ఒకటి మనకు కనపడే స్థూల విశ్వం. రెండవది మనం కళ్లు మూసుకుంటే కనపడే సూక్ష్మవిశ్వం. అదే స్వప్నావస్థ. తరువాత సుషుప్తిలో కనపడే ఆత్మ తత్వము. అది అనంతము. ఇవి అన్నీ కూడా నాలోనే ఉన్నాయి. అంటే పరమాత్మ సమిష్టి రూపము. అవధులు లేని రూపము. ఆది అంతము లేని రూపము.

కాని అర్జునుడి సౌలభ్యం కోసరం దానిని తన శరీరాకృతిలో చూడమంటున్నాడు.

మనం కూడా ఈ విశ్వరూప దర్శనం చేస్తే, మనం మన ఇల్లు, మన ధన ధాన్యములు, పదవులు, సంపదలు, వాటి వల్ల వచ్చే అహంకారము అన్నీ అత్యంత స్వల్పంగా కనిపిస్తాయి. ఎలాగంటే మనం ఒక గీత అనుకుంటే మన పరిధిలో అదే పెద్ద గీత అనుకుంటాము. మన ముందు విశ్వరూప సందర్శనము అనే పెద్దగీతకనపడితే, మనం అత్యంత చిన్నవాళ్లుగా అయిపోతాము. మనం గురించి మనం తెలుసుకోవాలంటే ఈ విశ్వరూప సందర్శనం చాలా ముఖ్యం. అందుకే, నువ్వేదో అందరినీ చంపుతాను దాని వలన వర్ణ సంకరం వస్తుంది, పాపం వస్తుంది అంటున్నావు కదా, ఈ విశ్వంలో జరుగుతున్న .జనన మరణాలతో పోలిస్తేనువ్వెంత, నువ్వు చేయబోయే ఈ యుద్ధంఎంత అది తెలుసుకో అని అంటున్నావు పరమాత్మ.

వెంటనే ఇంకొక మాట కూడా అన్నాడు పరమాత్మ. అర్జునా! నీ కళ్లు పరిమితమైనవి. కేవలం నీ ఎదురుగా ఉన్న వాటిని అదీ కొద్దిదూరంలో ఉన్న వాటిని మాత్రమే చూడగలవు. నీ వెనుక ఉన్న వాటిని చూడలేవు. అటువంటిది నా దివ్యరూపమును ఎలా చూడగలవు. అందుకే నీకు దివ్య చక్షువులు అంటే దివ్యమైన నేత్రములను ఇస్తున్నాను. వాటితో ఈ విశ్వరూపమును చూడు. అనిఅంటున్నాడు.

మనకు సాధారణంగా ఈ ప్రపంచంలోని వస్తువులు అన్నీ 2డి 3డి లో కనిపిస్తాయి. వాటినే మనం చూడగలం. అవే ఎప్పటికీ ఉంటాయి అనుకుంటూ ఉంటాము. అవీ కొద్దిదూరం మాత్రమే కనిపిస్తాయి. మన వెనుక ఉన్నవి మనకు కనిపించవు. ఇదీ మన పరిమితి. ఇటువంటి పరిమితి కలిగిన చూపు ఉన్న మనం ఈ అనంత విశ్వాన్ని ఎలా చూడగలము. దానికే దివ్య నేత్రములు ఇచ్చాను అన్నాడు. అంటే మూడో నేత్రము అంటే మనో నేత్రము. ఈ మనో నేత్రంతో మనం ఎన్నో వస్తువులను చూస్తాము. అంటే కళ్లుమూసుకుంటే మనం అమెరికాకు అమలాపురానికి ఒకేసారి వెళ్లగలం. రష్యాలో ఉన్న మన బంధువులను అరక్షణంలో చూడగలం. అంటే మనం వాటిని ఇంతకు ముందేచూచి ఉండాలి లేక వాటి గురించి విని ఉండాలి. కృష్ణుడు విభూతి యోగంలో అన్నిటి గురించి చూచాయగా చెప్పాడు. విభూతి యోగంలో చెప్పిన వాటి విజువల్సు ఇప్పుడు చూపిస్తున్నాడు. కాబట్టి ఉభయ సేనల మధ్యలో కృష్ణుడు, అర్జునుడు రథం మీద నిలబడి ఉన్నారు. అర్జునుడి మనసులో ఈ అనంత విశ్వం క్షణం సేపు కనిపించింది. అదే విశ్వరూప సందర్శనం.

కృష్ణుడు అర్జునుడికి దివ్యదృష్టి ఇచ్చాడు అని చెప్పుకున్నాము. మనకు కూడా ఈ దివ్యదృష్టి ఏమిటో తెలుసు. లాబొరేటరీలలో మైక్రోస్కోప్ అనే పరికరం ఉంటుంది. మన కంటికి కనిపించని సూక్ష్మజీవులను వైరస్ లును ఆ పరికరం మన కంటికి స్పష్టంగా చూపిస్తుంది. అదే బైనాక్యులర్సుతో చూస్తే, దూరంగా ఉండి మన కంటికి చూపుకు అందని వాటిని మనకు చూపిస్తూ

ఉంది. ఈ వస్తువులతో శాస్త్రజ్ఞుడు చూచినా, ధనికుడు ధచూచినా, దరిద్రుడు చూచినా ఒకే విధంగా చూపిస్తాయి. కాని ఇవి కూడా ఒక పరిమితికి లోబడి ఉంటాయి. అపరిమితమైన ఈ అనంత విశ్వాన్ని మనకు చూపించగలిగేది దివ్యదృష్టి ఒక్కటే. దానిని మనో నేత్రము అంటారు. ఆ దివ్యదృష్టి మనకు ధ్యానంలో లభిస్తుంది. బైనాక్యులర్సుతో కానీ మైక్రోస్కోప్‌తో గానీ ఎవరు చూచినా వారికి సూక్ష్మవస్తువులు, దూరంలో ఉన్న వస్తువులు ఎలా కనిపిస్తాయో అలాగే ఏకాగ్రతతో, ధ్యానం చేస్తే మనకూ విశ్వరూపం కనపడుతుంది. దానినే అర్జునుడికి ఇచ్చాడు పరమాత్మ. కాకపోతే మనము బయట ప్రపంచంలో ఉన్న వస్తువులను చూడటానికి చూపించే ఆసక్తి ఆత్మ సందర్శనానికి, విశ్వరూప సందర్శనానికీ చూపించము. అర్జునుడు ఆ ఆసక్తి చూపించాడు. అంతే తేడా.

ఇప్పుడు ఏం జరుగుతూ ఉంది. అర్జునుడు కళ్లు మూసుకొని కృష్ణుడు ప్రసాదించిన దివ్యదృష్టితో అనంతమైన ఈ విశ్వం యొక్క దివ్యమైన రూపాన్ని దర్శిస్తున్నాడు. కాని అక్కడ మరోమనిషి కూడా ఉన్నాడు. ఆయనే సంజయుడు. అర్జునుడి మనోభావాలను చూచే శక్తి కల పంజయుడు, అర్జునుడితో పాటు, వ్యాసుని అనుగ్రహంతో సంజయుడు కూడా విశ్వరూపాన్ని దర్శించాడు. తాను చూచిన విశ్వరూపం గురించి ధృతరాష్ట్రునికి చెప్పాడు సంజయుడు.

సంజయ ఉవాచ:

9. ఏవముక్త్వా తతో రాజన్ మహాయోగేశ్వరో హరిః।
దర్శయామాస పార్థాయ పరమం రూపమైశ్వరమ్॥

చాలా సేపు తరువాత సంజయుడి ప్రస్తావన వచ్చింది కాబట్టి ఒక సారి మనం సంజయుని గురించి గుర్తుచేసుకోవాలి. సంజయుడు ధృతరాష్ట్రునికి ఆంతరంగికుడు. ఆప్తుడు. ధృతరాష్ట్రుడు భారత యుద్ధం చూడాలనుకోలేదు. ఎందుకంటే ధృతరాష్ట్రుడు పుట్టుకతో గుడ్డివాడు. వ్యాసుడు అతనికి దృష్టి ప్రసాదించినా, ఆయన అందరినీ చూచినా, ఎవరు తన కుమారులో ఎవరు పాండుకుమారులో, ఎవరు కర్ణుడో ఎవరు ఇతర రాజులో గుర్తుపట్టలేడు. కేవలం ధ్వనితోనే అతడు మనషులను గుర్తుపట్టగలడు. కాబట్టి ధృతరాష్ట్రుడు జరుగుతున్న యుద్ధమును చూచీ ప్రయోజనం లేదు. అందుకని కేవలం యుద్ధవిశేషాలను మాత్రమే వినాలనుకున్నాడు. ఆయన కోరికను తీర్చాడు వ్యాసుడు. కాబట్టి సంజయునికి దివ్యదృష్టి ఇతరుల మనసులలోని ఆలోచనలను కూడా తెలుసుకొనే శక్తి ఇచ్చాడు. దానితో సంజయుడు మొదటి పది రోజులు అంటే భీష్ముడు అంపశయ్యమీద పడిపోయేవరకు భారత యుద్ధం చూచి ధృతరాష్ట్రుని వద్దకు వచ్చి ఆ యుద్ధ విశేషాలను ధృతరాష్ట్రునికి చెబుతున్నాడు. అందులో భాగమే ఈ భగవద్గీత. అర్జునుడు తన దివ్యనేత్రంతో అంటే మనో నేత్రంతో ఏమేమి చూచాడో ధృతరాష్ట్రునికి చెబుతున్నాడు సంజయుడు.

(ఇక్కడ చాలా మంది మరొక విధంగా చెబుతారు. సంజయుడు హస్తినలో ధృతరాష్ట్రుని వద్ద ఉండి, అన్నిటినీ తన మనోనేత్రంతో దర్శించి ధృతరాష్ట్రునికి ప్రత్యక్షప్రసారం చేస్తున్నాడు అనీ రన్నింగ్ కామెటరీ చెబుతున్నాడు అనీ చెబుతారు. ఇటీవల వచ్చిన మహాభారత్ సీరియల్ లో కూడా ఇలాగే ఉంది. కాని మూలభారతంలో కానీ తిక్కనగారి భారతంలో కానీ అలా లేదు.)

ధృతరాష్ట్ర మహారాజుతో సంజయుడు ఇలా అంటున్నాడు. ఓ ధృతరాష్ట్ర మహా రాజా! మహాయోగీశ్వరేశ్వరుడు అయిన కృష్ణుడు ఈ అనంత విశ్వము యొక్క రూపమును స్వభావములను అర్జునుడి మనో నేత్రానికి చూపించాడు. ఇక్కడ మహాయోగేశ్వరేశ్వరుడు అని వాడాడు. కృష్ణుడు మహాయోగి. యోగులు అష్టసిద్ధులు పొందిన వారు. ఆ యోగులలో కల్లా గొప్ప యోగి కృష్ణుడు. కాబట్టి కృష్ణుడు అర్జునుని మనస్సును తన స్వాధీనంలోకి తెచ్చుకొని తాను విభూతి యోగంలో చెప్పిన విషయాలన్నీ, ఇంకా ఇతర విషయాలన్నీ అర్జునుని మనో నేత్రానికి గోచరింపచేసాడు. బయట వారికి మాత్రం అర్జునుడు కృష్ణుడు రథం మీద ఏదో మాట్లాడు కుంటున్నారు అని మాత్రమే తెలుసు. వ్యాసుడు ఇచ్చిన శక్తి ద్వారా సంజయుడు, తన మనస్సుతో, అర్జునుని మనస్సు ద్వారా, అనంతమైన అద్వితీయము అయిన ఈ విశ్వరూపాన్ని చూడగలిగాడు. సంజయుడు మాత్రమే అర్జునుని మనోభావాలను కూడా తెలుసుకోగలిగాడు. ఆ కారణంగా సంజయుడు అర్జునుని మనోభావాలను ధృతరాష్ట్రునితో ఇలా చెబుతున్నాడు.

10. అనేక వక్త్రనయన మనేకాద్భుతదర్శనమ్।
అనేకదివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధమ్॥
11. దివ్యమాల్యామ్బరధరం దివ్యగన్ధానులేపనమ్।
సర్వాశ్చర్యమయం దేవమనన్తం విశ్వతోముఖమ్॥

అప్పటి దాకా అర్జునుడు కృష్ణుని చూచాడు. ఒంటినిండా ఆభరణాలు ధరించి ఉన్నాడు. ఒంటి నిండా గంధము మొదలగు మైపూతలు పూసుకొని ఉన్నాడు. పూల మాల ధరించి ఉన్నాడు. అంతలోనే ఆ రూపం కాస్తా దివ్యంగా మారి పోయింది. విశ్వం అంతా తానే అయిపోయాడు. లెక్కలేనన్ని తలలు, వాటికి కళ్లు, చేతులు, కాళ్లు, శరీరాలు కనపడ్డాయి. అంటే అర్థం కేవలం కృష్ణుడికే వేలు, లక్షల తలలు, చేతులు ఉన్నాయని కాదు. మన బొమ్మలలో, సినిమాలలో, సీరియల్సులో కృష్ణుడు నిలబడి ఉన్నట్టు, ఆయనకు అనేక తలలు, ముఖాలు, చేతులు ఉన్నట్టు చూపిస్తారు. కాని ఒకే మొండెం ఉంటుంది. రెండు కాళ్లు ఉంటాయి. అది ఎలాసాధ్యం అని ఎవరూ గ్రహించరు. కాబట్టి విశ్వరూపాన్ని అలా అర్థం చేసుకోకూడదు. ఈ అనంత విశ్వంలో ఉన్న సకల

జీవరాసులు, మృగములు, పక్షులు, మానవులు ఇంకా అనేకానేకములైన ప్రాణులను చూచాడు. వాటితోపాటు యుద్ధములో నిలిచిఉన్న 18 అక్షౌహిణీల సైన్యము, ఆ సైనికులు వాళ్ల చేతులలో ఉన్న అనేకానేక ఆయుధాలు చూచాడు.

అంటే అందరూ పరమాత్మ స్వరూపంగా కనపడుతున్నారు. అందరిలో పరమాత్మ ఉన్నాడు. ఆ పరమాత్మలో అందరూ ఉన్నారు అనే భావన కలిగింది అర్జునుడికి. అది ఒక అద్భుతం. అంటే ఇదివరకు ఎన్నడూ భావించనిది. అప్పటిదాకా అర్జునుడు అందరినీ వేరు వేరుగా భావిస్తున్నాడు. ఈయన నా తాత, ఈయన నా గురువు, వారు నా బంధువులు, వీరు నా స్నేహితులు, అవి ఏనుగులు, గుర్రములు, వివిధ మృగజాతులు అనే భావనలో ఉన్నాడు. ఇప్పుడు ఆ భావన పోయి అంతా పరమాత్మ మయం అనే భావన కలిగింది అర్జునుడికి. అదే భావన సంజయుడికీ కలిగింది. ఇంకా దివ్యమైన ఆభరణములు ధరించి ఉండటం చూచాడు. అంటే ఒకే వ్యక్తి అన్ని ఆభరణములు ధరించాడని కాదు. ఈ లౌకిక ప్రపంచంలో ఉన్న వారు ఎన్నోఆభరణములు ధరిస్తారు. ఆ ఆభరణ విభూతి కూడా నేనే అని అర్థం. యద్భావం తద్భవతి అని అంటుంటాము కదా. అలాగే అప్పటిదాకా అర్జునుడు 18 అక్షౌహిణీల సైన్యము వాళ్ల చేతులలో యుద్ధం చేయడానికి ఎత్తిన ఆయుధాలను చూచాడు. ఇప్పుడు కూడా అదేభావనతో తాను భావించిన వారి చేతులలో అనేకానేక ఆయుధములను చూస్తున్నాడు అర్జునుడు. అర్జునుడు క్షత్రియుడు. అలాగే ఇతరులు కూడా పూలమాలలు, బంగారు మాలలు, పట్టువస్త్రములు, ఎవరి తాహతుకు తగ్గట్టు వస్త్రధారణ చేసుకుంటారు. ఒళ్లంతా చందనము మొదలగు మైపూతలు పూసుకుంటారు. ఈ ఐశ్వర్యం అంతా ఆ పరమాత్మలో చూస్తున్నాడు. అన్నీ పరమాత్మ మయం అనే అనుభూతిని పొందుతున్నాడు అర్జునుడు. ఆ ప్రకారంగా పరమాత్మ విశ్వమే తన ముఖంగా కలిగి ఉన్నాడు. అనంతుడై ఉన్నాడు. ఇదంతా అర్జునుడికి ఎంతో ఆశ్చర్యాన్ని కలిగిస్తూ ఉంది అని సంజయుడు ధృతరాష్ట్రుడు కి వివరిస్తున్నాడు.

12. దివి సూర్యసహస్రస్య భవేద్యుగపదుత్థితా।
యది భాస్సదృశీ సా స్యాద్భాసస్తస్య మహాత్మనః॥

కళ్లతో చూడలేనంత కాంతి, కళ్లుమిరుమిట్లుగొలిపింది. అది ఎంతటి కాంతి అంటే వేలాది సూర్యులు ఒక్కసారిగా కనబడితే ఎంత కాంతి ఉంటుందో అంత కాంతి. ఇక్కడ ఒక విషయం గమనించండి. మన శాస్త్రజ్ఞులు చెప్పిన ప్రకారం మన సూర్యుడు ఒకమధ్యతరగతి నక్షత్రం. ఇటువంటి సూర్యుడి వంటి నక్షత్రాలు ఈ పాలపుంతలో కోట్లాది ఉన్నాయి. ఇటువంటి పాలపుంతలు అనంత విశ్వంలో కోట్లాది ఉన్నాయి. అంటే సూర్యుడి వంటి నక్షత్రాలు అనంత విశ్వంలో కోటానుకోట్లు ఉన్నాయి అవన్నీ ఒక్కసారి చూచేసరికి అర్జునుడి కళ్లు బైర్లుకమ్మాయి. మనం మన కంటితో ఒక సూర్యుడినే సరిగా చూడలేము. అన్ని కోట్ల సూర్యులనుఎలా చూడగలము. కాబట్టి అర్జునుడు తన

మనోనేత్రంతోనే ఈ అనంత విశ్వాన్ని దర్శించాడు అని తెలుస్తూ ఉంది. ఆ విషయాన్ని సంజయుడు విపులంగా చెప్పాడు.

కాని ఈ విషయం ధృతరాష్ట్రుడికి అర్థం అయి ఉండదు. ఎందుకంటే ఆయన సూర్యుడినే చూడలేదు. కేవలం వేడిని అనుభవించాడు. మరి వేలాది సూర్యులు ఎలా ఉంటారో ఆయనకు ఎలా తెలుస్తుంది. ఒక సూర్యుడి తాపమే తట్టుకోలేకపోతుంటే ఇంక వేలాది సూర్యుల తాపం ఎలా ఉంటుందో ఊహించుకొని ఆశ్చర్యపోయాడు ధృతరాష్ట్రుడు.

## 13. తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్తమనేకధా।
## అపశ్యద్దేవదేవస్య శరీరే పాణ్డవస్తదా॥

ఓ ధృతరాష్ట్ర మహారాజా! అప్పటి దాకా అర్జునుడు కృష్ణుని మానవాకృతిలో మాత్రమే చూచాడు. అంటే అర్జునుడి ఎదురుగా కృష్ణుడు నిలబడి ఉన్నాడు. ఇప్పుడు ఈ సకల జగత్తును ఒకే చోట అదీ కృష్ణుడిరూపంలో చూచాడు. అప్పటి దాకా ఈ శరీరాలను వేరు వేరుగా వేరు వేరు పేర్లతో రూపాలతో చూచిన అర్జునుడు, ఈ జగత్తులో ఉన్న సకల జీవరాసులను ఏకస్థం ఒకే ముద్దగా, ఒకేచోట, ఒకే వ్యక్తిలో చూడగలిగాడు. అదీ కృష్ణుని స్వరూపంలో చూడగలిగాడు. కృష్ణుడు నీలమేఘచ్ఛాయ కలవాడు. ఆకాశముకూడా నీలమే. అంటే కృష్ణుడు అంటే మనకు కనిపించే స్వరూపం కాదు అనంతమైన విశ్వము. ఆ విశ్వాన్ని దర్శించాడు అర్జునుడు. అర్జునుడికి అద్వైత సిద్ధి కలిగింది. ఈ ప్రపంచం అంతా మనం చూస్తున్నట్టు వేరు వేరు కాదు. అంతా పరమాత్మ స్వరూపమే. ఒకే పరమాత్మ అనేక రూపాలతో ప్రకటింపబడుతున్నాడు అనే జ్ఞానం అర్జునుడికి కలిగింది.

## 14. తత: స విస్మయావిష్టో హృష్టరోమా ధనంజయ:।
## ప్రణమ్య శిరసా దేవం కృతాఞ్జలిరభాషత॥

అనంతమైన ఈ విశ్వరూపాన్ని తన జ్ఞాననేత్రంతో దర్శించిన అర్జునుడి మనోభావాలు ఎలా ఉన్నాయి. అతనిలో ఎటువంటి అనుభూతి, ఉద్విగ్నత కలిగాయి అనే విషయాన్ని సంజయుడు ధృతరాష్ట్రుడికి వివరిస్తున్నాడు. ధృతరాష్ట్ర మహారాజా! ఆ ప్రకారంగా విశ్వంలో ఉన్న చరాచర జీవరాసులను ఒకే చోట దర్శించిన అర్జునుడికి ఆశ్చర్యం కలిగింది. అతని రోమాలు నిక్కబొడుచుకున్నాయి. ఒళ్లంతా గగుర్పాటుకు లోనయింది. తల వంచి కృష్ణుడికి భక్తితో నమస్కరించాడు. అర్జునుడి నోటి నుండి ఏవేవో మాటలు వెలువడ్డాయి. అవేంటివో చెబుతాను విను. అని సంజయుడు ధృతరాష్ట్రునితో అన్నాడు.

శ్రీకృష్ణుడు అర్జునునితో విశ్వరూపం చూడమని చెప్పిన తరువాత ఏమీ మాట్లాడలేదు. తన మనోనేత్రంతో విశ్వరూపాన్ని దర్శించిన అర్జునుడి ఒళ్లుగగుర్పొడిచి, చెమటలుపట్టి, ఆశ్చర్యంతో నోటమాట రాలేదు. అర్జునుడి మానసికస్థితిని, శారీరక స్థితిని మనకు ఎవరుచెప్పాలి. అందుకే సంజయుడు 9నుండి 14వ శ్లోకం దాకా అర్జునుడి మానసిక స్థితిని, శారీరక స్థితిని గురించి ధృతరాష్ట్రునకు చెబుతున్నట్టుగా వ్యాసుడు మనకు చెప్పాడు. ఇప్పుడు అర్జునుడు మాట్లాడుతున్నాడు. ఏం మాట్లాడుతున్నాడో తరువాతి శ్లోకాల నుండి మనం చూద్దాం.

అర్జున ఉవాచ:

## 15.పశ్యామి దేవాంస్తవ దేవ దేహే సర్వాంస్తథా భూతవిశేషసఙ్ఘాన్।
## బ్రహ్మాణమీశం కమలాసనస్థ మృషీంశ్చ సర్వానురగాంశ్చ దివ్యాన్॥

(జాగ్రత్తగా గమనించండి. ఈ శ్లోకం నుండి అర్జునుడు తాను చూచిన వాటిని వర్ణిస్తున్నాడు. ఆ గగుర్పాటు, ఆశ్చర్యం, ఉద్విగ్నత అర్జునుడి గొంతులో కనపడుతుంది. వాటిని మనకు తెలియ చెప్పడానికి ఛందస్సు అంటే శ్లోకం రాసే మీటర్ మారుతుంది. మీటర్ అంటే ఛందస్సు. ఇప్పటి దాకా ప్రతి శ్లోకపాదంలో 16 అక్షరాలు ఉన్నాయి. ఇక్కడినుండి 23 అక్షరాలు ఉన్నాయి. కాళిదాసు కూడా అమ్మవారు ప్రత్యక్షం కాగానే మాణిక్యవీణాముపలాలయన్తీం అంటూ ఇదే మీటర్‌లో స్తోత్రం చేసాడు.)

అర్జునుడు విశ్వరూపాన్ని చూచి ఆశ్చర్యపోయాడు అని తెలుసుకున్నాము. మనం కూడా ప్రతిదినం విశ్వరూపాన్ని చూడటం లేదా! ఆలోచించండి. మనం 70, 80 ఏళ్లు జీవిస్తున్నాము. ఇంత కాలం పాటు మనలో రక్తాన్ని పంపింగ్ చేసే వ్యవస్థ, గుండె లయబద్ధంగా కొట్టుకునే వ్యవస్థ, ఆహారం జీర్ణం అయ్యేవ్యవస్థ, ఎల్లప్పుడూ శరీరంలో 98.4 ఉష్ణోగ్రత నిలకడగా ఉండే వ్యవస్థ ఎవరు కల్పించారు. మనలో ఏదైనా కరెంటు ఉత్పత్తిచేసే వ్యవస్థ ఉందా! లేకపోతే ఇవన్నీఎలా నడుస్తున్నాయి. ఇదంతా ఆశ్చర్యం కాదా! మనం ఎప్పుడన్నా పొద్దున్నే నిద్రలేచి సూర్యుడిని చూచామా. సూర్యుడు రాక ముందు జరిగే ఉషోదయంలో ఆకాశంలో మారే రంగులు చూచామా! ఆ ఆనందాన్ని ఆశ్చర్యంతో తిలకించామా! సూర్యుడు అలా అలా నెమ్మది నెమ్మదిగా తన కిరణ కాంతులు విరజిమ్ముతూ పైపైకి రావడం చూచామా! ఇదంతా ఆశ్చర్యం కాదా! ఎండాకాలంలో మహాసముద్రాలలో ఉన్న నీరు ఆవిరి అయి మేఘాల రూపంలో నిలువ వుండి, వర్షాకాలంరాగానే జోరున వాన రూపంలో కురవడం విచిత్రం కాదా! ఇదంతా ఒక నియతి ప్రకారం జరగడం లేదా! మానవుడు మరణించగానే, ఆయన దేహములో ఉన్న గాలి గాలిలో, పదార్థం మట్టిలో కలిసిపోయి, ఆ మట్టిలో నుండి మొక్క

మొలిచి, అందులో ధాన్యం పండి, ఆ ధాన్యం మనం తిని, తిన్నది రక్తంగా మారి, ఆ రక్తం వీర్యంగా మారి, ఆ వీర్యం స్త్రీ శరీరంలో ప్రవేశించి అండంగా,పిండంగా మారి, మరలా శరీరంగా బయటకు రావడం ఆశ్చర్యం కాదా! ఇదంతామనం ఎప్పుడన్నా నిశితంగా గమనించామా! నేల మీద పాకే గుమ్మడి తీగకు, కాయపెద్దది గానూ, పెద్దదిగా విశాలంగా విస్తరించి ఉన్న మర్రిచెట్టుకు కాయ చిన్నది గానూ పెట్టడం కంటికి కనిపించని ఆ పరమాత్మ నియతి కాదా! ఎందుకంటే మర్రికాయలు గుమ్మడి కాయంత పెద్దవిగాఉంటే, ఆ చెట్టు కింద నీడలో విశ్రాంతిగా పడుకున్న వారి మీదపడితే వారు చావరా! ఇది గ్రహించిన ఆ విశ్వచైతన్య శక్తిని గురించి ఎప్పుడన్నా ఆలోచించామా! ఇవి అన్నీ మనకు రోజూ కనపడే ఆశ్చర్యకరమైన అంశాలే. కాని మనలో ఉన్న అహంకారము, నేను నాది అనే స్వార్ధము వీటి ని సరి అయిన కోణంలో చూడనివ్వదు, వీటిగురించి ఆలోచించనివ్వదు.ఎవరన్నా స్వామీజి గాలి లోనుండి విభూతి, నోట్లోనుండి శివలింగం తీస్తే, ఆయనను కీర్తిస్తాము. ఆయన వెంట పడతాము. ఉన్నదంతా ఆయనకు భక్తితో దోచిపెడతాము. ఆయన దర్శనం కోసం పడిగాపులు కాస్తాము. కాని ఎన్నడు కూడా మన కళ్లఎదురుగా కనిపించే పరమాత్మ విశ్వరూపాన్ని చూడటానికి ఎటువంటి ప్రయత్నమూ చెయ్యము.

కాబట్టి ప్రకృతిని ఆస్వాదించండి. ప్రకృతిలోని అద్భుతాలను వీక్షించండి. పరమాత్మయొక్క అద్భుతమైన విభూతులను దర్శించండి. అందరిలో పరమాత్మ ఆత్మస్వరూపుడుగా ఉన్నా డు అనే భావన కలిగి ఉండండి. అందరినీ సమానంగా ఆదరించండి. కులాలు, మతాలు, ప్రాంతాల పేరుతో మనుషుల మధ్య భేదభావం విడిచిపెట్టండి. అప్పుడు మన పరిధిలో మనం కూడా ఈ విశ్వరూపాన్ని సందర్శించ గలుగుతాము.

ఇప్పుడు అర్జునుడికి విశ్వరూపం చూచి ఆశ్చర్యం కలిగింది. ఎందుకని? మనం పది మందిని ఒక చోట చూస్తే ఏమీ అనిపించదు. కాని అదే వేలు, లక్షల మందిని ఒకే చోట చూస్తే ఆశ్చర్యంలో నోరెళ్లబెడతాము. చిన్ని చిన్ని వస్తువులను చూచిన పసివాడికి జూకు తీసుకొని పోయి అక్కడ ఏనుగును చూపిస్తే ఆశ్చర్యపోతాడు. అమ్మో ఇంత పెద్ద జంతువా అని ఆశ్చర్యపోతాడు. అలాగే అర్జునుడికి ఈ విశ్వంలో ఉన్న జీవరాసులు అన్నిటినీ ఒకేచోట ఒకే సారి చూచేటప్పటికి ఆశ్చర్యం, గగుర్పాటు కలిగింది.

కృష్ణా! చూస్తున్నాను. దేవతలు రాక్షసులు, సైనికులు, చరాచర జీవరాసులు, సకల భూతములు అందరూ నీలోనే కనిపిస్తున్నారు. ప్రకృతి అనే తామర పుష్పం మీద కూర్చుని ఉన్న బ్రహ్మ కూడా నీలోనే కనపడుతున్నాడు. ఆయన సృష్టించిన సమస్త జీవరాసులు నీలోనే కనపడుతున్నాయి. అరుగో! సమస్త ఋషిగణాలు, సర్పగణాలు నీలోనే చూడగలుగుతున్నాను. అని అంటున్నాడు అర్జునుడు.

అర్జునుడు చూడ్డం ఏమిటి? అర్జునుడికి ఇవన్నీ కళ్లెదురుగా కనిపిస్తున్నాయా! అని మీకు సందేహం రావచ్చు. ఇక్కడ "చూడటం" అంటే ఇవన్నీ ఇలా ఉన్నాయి అని తెలుసుకోవడం. మానసికంగా అనుభవించడం. హైదరాబాదులో ఉండి కళ్లు మూసుకుంటే, మనం ఇది వరకు చూసిన అమెరికా మన కళ్లముందు కనపడుతుంది. నిజంగా కనపడిందా అంటే లేదు. కేవలం మానసిక చర్య. అలాగే అంతకు ముందు విభూతి యోగంలో చెప్పబడిన విషయాలను తన మనో నేత్రంలో అర్జునుడు దర్శించాడు అని వ్యాసులవారు మనకు తెలియజేస్తున్నారు.

16. అనేక బాహూదరవక్త్రనేత్రం పశ్యామి త్వాం సర్వతోఽనన్తరూపమ్।
నాన్తం న మధ్యం న పునస్తవాదిం పశ్యామి విశ్వేశ్వర విశ్వరూప॥
17.కిరీటినం గదినం చక్రిణం చ తేజోరాశిం సర్వతో దీప్తిమన్తమ్।
పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం సమన్తా ద్దీప్తానలార్కద్యుతి మప్రమేయమ్॥

ఇప్పుడు ఇంకొంచెం క్లియర్‌గా కనపడుతూ ఉంది. అప్పటి వరకూ రెండు చేతులు రెండు కాళ్లతో ఉన్న కృష్ణుడు ఇప్పుడు అనేక మైన చేతులు, కాళ్లు, ఉదరములు, తలలు, కిరీటములు, కళ్లు, అసలు ఆ రూపానికి అంతం ఉందా లేదా అన్నట్టు కనపడుతూ ఉంది. అంతటా విస్తరించి ఉంది. నాకు మొదలు, మధ్య, అంతము అసలు కనపడటం లేదు అని అన్నాడు.

ఈ శ్లోకం అర్థం జాగ్రత్తగా పరిశీలిస్తే ఒక విషయం అర్థం అవుతుంది. ఈ విశ్వం అంతా అనంతకోటి జీవరాసులతో నిండి ఉంది. అన్నింటిలో పరమాత్మ చైతన్యస్వరూపుడుగా ఉన్నాడు. ఈ జీవరాసులే అర్జునుడికి అనేకములైన తలలు, వాటికి కిరీటములు, కాళ్లు ఉదరములు గదలు, చక్రములు, ఆయుధములు కళ్లు ఇలా కనపడుతున్నాయి. అందరూ కాంతి స్వరూపాలుగా కనపడుతున్నారు. ప్రకాశ వంతంగా ఉన్నారు. మండే నిప్పులాగా ఉన్నారు. అంతకు ముందు కృష్ణుడినే చూస్తున్నాడు కాబట్టి ఇవన్నీ కృష్ణుడి మాదిరిగానే కనపడుతున్నాయి. ఇప్పటికి కృష్ణుడంటే సాక్షాత్తు పరమాత్మ స్వరూపుడు అని అర్జునుడికి అర్థం అయింది. అందుకే అర్జునుడు కృష్ణుడిని విశ్వరూపా! విశ్వేశ్వరా! అనిసంబోధించాడు.

ఈ అనంత విశ్వము నీ రూపముగా కలవాడా, ఈ అనంత విశ్వమునకు ఈశ్వరుడవు అయిన వాడా! అని భక్తితో పిలిచాడు. అర్జునుడి మనసులో యుద్ధభూమి, అందులో కిరీటములు, కవచములు ధరించి నిలబడి ఉన్న సేనానాయకులు, గదలు, ఖడ్గములు ఇంకా ఇతర ఆయుధములు ధరించి ఉన్న సైనికులు, వారి రూపాలు గాఢంగా నాటుకొని ఉన్నాయి.

అందుకని అర్జునుడికి అందరి తలల మీదా కిరీటములు, శిరస్త్రాణములు, చేతులలో గదలు, చక్రములు కనపడుతున్నాయి. చక్రము కేవలం కృష్ణుడి ఆయుధమే కాదు. అది ఒక విసిరే ఆయుధము. మామూలు ఆయుధముల లాగే అది కూడా ఒక ఆయుధము. అర్జునుడు తన మనోనేత్రంతో చూచే అందరి తలల మీదా కిరీటాలు, చేతులలో గదలు, చక్రములు కనపడుతున్నాయి. ఆ అనంతమైన విశ్వరూపము దివ్యమైన కాంతితో ప్రకాశిస్తూ ఉంది. తేజస్సుఅంతా ఒక చోట రాసిపోసినట్టు దేదీప్యమానంగా వెలిగిపోతూ ఉంది. ఒకరు ఇద్దరు కాదు అందరూ అన్నిచోట్లా అత్యంత దీప్తితో ప్రకాశిస్తున్నారు. ఎటు చూచినా ప్రకాశం తప్ప మరొకటి కనపడటం లేదు. అటువంటి విశ్వరూపాన్ని చూస్తున్నాడు అర్జునుడు.

ఇంకా ఓ కృష్ణా! నీ విశ్వరూపం చూడటానికి అలవి కాకుండా ఉంది. కళ్లు మిరుమిట్లుగొలుపుతూ ఉంది. భగభగమండే అగ్ని మాదిరి, ప్రకాశిస్తున్న సూర్యుడి మాదిరి, అంతటా నిండి ఉన్న కాంతి పుంజముల మాదిరి కనపడుతూ ఉంది. ఈ కాంతి ఇలా ఉంటుంది అని చెప్పడానికి వీలులేదు. దేనితో పోల్చడానికి వీలులేదు. అంటే ఇదివరకు ఇటువంటి కాంతిని చూచి ఉంటే ఆ మాదిరి ఉంది అని చెప్పవచ్చు. అర్జునుడు మొట్టమొదటి సారి అనంతమైన విశ్వరూపాన్ని వీక్షిస్తున్నాడు కాబట్టి ఆయనకు అప్రమేయంగా కనపడుతూ ఉంది. విశ్వరూపాన్ని చూస్తున్న అర్జునుడి మనోభావనలు ఇలా ఉన్నాయి.

## 18. త్వమక్షరం పరమం వేదితవ్యం త్వమస్య విశ్వస్య పరం నిధానమ్।
## త్వమవ్యయశ్శాశ్వతధర్మగోప్తా సనాతనస్త్వం పురుషో మతో మే॥

ఆ విశ్వరూపాన్ని చూస్తున్న అర్జునుడు తనమనసులో మెదిలే భావాలను కృష్ణుడికి ఈ విధంగా తెలియజేస్తున్నాడు. కృష్ణా! నీవుసామాన్యుడివి కావు. సాక్షాత్తు పరబ్రహ్మస్వరూపుడవు, నాశము లేని వాడివి. అందరిచేతా తెలుసుకోతగ్గవాడివి. నీవే ఈ జగత్తు కంతా ఆధారము. ఈ జగత్తు లో ధర్మం నీ వలననే నిలిచి ఉంది. కృష్ణా! నువ్వు ఈనాటి వాడివి కావు పురాణ పురుషుడవు. అని అంటున్నాడు అర్జునుడు.

ఇక్కడ మనం ఒక విషయం గమనించాలి. ఇప్పటి దాకా అర్జునుడు కృష్ణుడి యొక్క విశ్వరూపాన్ని కళ్లకు కట్టినట్టు వర్ణించాడు. అంటే భౌతికంగా ఎలా ఉంటుందో వర్ణించాడు. ఇప్పుడు పరమాత్మయొక్క నిర్గుణ తత్వాన్ని వర్ణిస్తున్నాడు. అందరూ తెలుసుకోదగిన అక్షరపరబ్రహ్మతత్వము నీవే. నీ గురించి తెలుసుకుంటే ఇంక తెలుసుకోతగినది ఈ విశ్వంలో ఏమీ మిగలదు. అంతే కాదు ఈ అనంత విశ్వానికి నీవే పరమమైన ఆధారము.

(ఈ విశ్వంలో ఎన్నో గెలాక్సీలు, ఆ గెలాక్సీలలో, కోట్లకొలది నక్షత్రాలు, వాటి చుట్టు గ్రహాలు, ఇంకా ఉల్కలు, తోకచుక్కలు ఇంకా ఇంకా ఎన్నో ఉన్నాయి. ఇవి అన్నీ ఈ అంతరిక్షంలో వేలాడుతున్నాయి. వీటికి అన్నిటికీ ఆధారం స్పేస్. దానినే విశ్వాధారం గగన సదృశం అని అన్నారు.)

నీవు లేనిదే ఈ విశ్వం లేదు. ఈ విశ్వం అంతా నీలో ఉంది. నీవే ఈ విశ్వం అంతటా నిండి ఉన్నావు. నీకు ఎటువంటి మార్పుకానీ, నాశము కానీ లేదు. అవ్యయుడవు. శాశ్వతుడవు. కాలమునకు అతీతుడవు. ఈ అనంత విశ్వం అంతా నీ నియతి మీదనే నడుస్తూ ఉంది. పరస్పర ఆకర్షణ శక్తి లాంటి ధర్మములన్నీ నీ వలననే నియమం ప్రకారం ప్రవర్తిల్లుతున్నాయి. ఈ ఆకర్షణశక్తి మొదలగు ధర్మాలు అన్నీ ఇప్పటివి కావు. సనాతనమైనవి. ఎప్పటినుండో ఉన్నాయి. (ఉదాహరణకు న్యూటన్ చెట్టు మీది నుండి కింద పడ్డ ఆపిల్ పండును గమనించి, భూమికి ఆకర్షణ శక్తి ఉంది అని కనుక్కున్నాడు అని అంటారు. అంటే అంతకు ముందు భూమికి ఆకర్షణ శక్తి లేదా అంటే ఉంది. ఎప్పటి నుండో ఉంది. అది సనాతన మైనది. భూమి పుట్టినప్పటి నుండి ఉంది. కాని అలాంటి శక్తి ఉంది అని న్యూటన్ తన మేధస్సుతో ఆలోచించి మనకు తెలియజేసాడు. అంతే.)

ఓ కృష్ణా! అవన్నీ నీ విభూతులే. నీ శక్తులే. నా మతంలో అంటే నా ఉద్దేశంలో నీవు ఇప్పటి వాడివి కావు. పురాణ పురుషుడవు.

## 19.అనాది మధ్యాన్తమనన్తవీర్య మనన్తబాహుం శశిసూర్యనేత్రమ్।
## పశ్యామి త్వాం దీప్తహుతాశవక్త్రం స్వతేజసా విశ్వమిదం తపన్తమ్॥

ఓ విశ్వరూపా! నీకు ఆది, మధ్యము, అంతము కనిపించడం లేదు. ఈ విశ్వం అంతటా నీవే నిండి ఉన్నావు. నీవు లేని చోటు లేదు. నీ శక్తి అనంతము. అపారము. నీకు లెక్కలేనన్ని చేతులు ఉన్నాయి. నీ కళ్లు సూర్య చంద్రుల మాదిరి ప్రకాశిస్తున్నాయి. నీ శక్తి వలననే సూర్యుడు చంద్రుడు వెలుగుతున్నారు. నీ ముఖం అగ్నిమాదిరి ప్రకాశిస్తూ ఉంది. నీ తేజస్సుతో ఈ లోకములను తపింపచేస్తున్నావు. సమస్త ప్రాణికోటికి చైతన్య శక్తిని ప్రసాదిస్తున్నావు.

సాధారణంగా వాక్కును అగ్నితో పోలుస్తారు. సత్పురుషులనుండి వచ్చే మాట అగ్నితో సమానము. అటువంటి వాక్కు నీ నోటి నుండి వస్తుంది కాబట్టి నీ నోరు, ఆ నోరు కల నీముఖం కూడా అగ్ని వలె మండుతూ ఉంది. అగ్నిలో ఏమి వేసినా అది భస్మం అయిపోతుంది. అందుకే అగ్నిని సర్వభక్షకుడు అని అన్నారు. అలాగే మనం ఏది నోట్లో వేసుకున్నా అది జఠరాగ్నిలో పడి భస్మం అయి పోతుంది. శక్తిగా మారి పోతుంది. అందుకే నోటిని అగ్నితోపోలుస్తారు. మన ఒక్కనోరు అలా

ఉంటే ఈ అనంత విశ్వంలో ఉన్న నోళ్లు అన్నీ కలిస్తే ఎటువంటి అగ్నిపుడుతుంది. అందుకే విశ్వరూపం లో ఉన్న నోరు, ముఖం అగ్నిలా మండుతూ ఉంది అన్న విభూతిని దర్శించాడు అర్జునుడు.

ఓ దేవా! నీ ముఖం నుండి ప్రజ్వరిల్లే అగ్ని వలన ఈ అనంత విశ్వం అంతా తపింపబడుతూ ఉంది. వేడి పుడుతూ ఉంది. ఇంతకు ముందు, కళ్లు సూర్యుడు, చంద్రుడు అని అన్నారు. ముఖం అగ్ని అన్నారు. ఇటువంటి ముఖంలోనుండి పుట్టే వేడి వలన లోకాలు తపిస్తున్నాయి అని దర్శించాడు అర్జునుడు. అంటే ఈ లోకాలకు కావలసిన వేడి వెలుగు చైతన్య శక్తి పరమాత్మ వలననే వస్తున్నాయి అని అర్జునుడు భావించాడు.

## 20.ద్యావాపృథివ్యోరిదమన్తరం హి వ్యాప్తం త్వయైకేన దిశశ్చ సర్వా:।
## దృష్ట్వాద్భుతం రూపముగ్రం తవేదం లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్॥

ఓ మహాత్మా! భూమి, ఆకాశము, అంతరిక్షము, ఎనిమిది దిక్కుల మధ్యభాగములో నీవే, నీవు ఒక్కడివే వ్యాపించి ఉన్నావు. నీవులేని ప్రదేశము లేదు. నీ రూపం ఉగ్రంగా, భయంకరంగా ఉంది. ఆశ్చర్యం కలుగుతూ ఉంది. నీ విశ్వరూపాన్ని చూచి నేనే కాదు మూడులోకాలు భయంతో గడగడవణుకుతున్నాయి. భయంతో కంపించి పోతున్నాయి.

ఇక్కడి నుండి అర్జునుడితో భయం మొదలయింది. వీరుడు, పరాక్రమవంతుడు, అత్యుత్తమ ధనుర్ధారి అయిన తాను ఒక్కడే భయపడితే బాగుండదని, నేనే కాదు మూడులోకాలు నీ భయంకరమైన ఉగ్రమైన రూపం చూచి గడగడలాడుతున్నాయి అని అన్నాడు అర్జునుడు.

ఈ శ్లోకంలో ఏకేన అని వాడారు. అంటే నీవు ఒక్కడివే అంటే పరమాత్మస్వరూపుడవు, విశ్వచైతన్యానివి, అంతటా వ్యాపించి ఉన్నావు అని అర్థం. కాని మనం ఏం చేస్తున్నాము. దేవతల మధ్య భేదాలు అంతరాలు కల్పించి, ఆ దేవుడికి మహిమలు ఉన్నాయి, ఈ దేవుడిని కొలిస్తే అనుకున్నది అనుకున్నట్టు జరుగుతుంది అంటూ రోజుకో దేవుడిని పూజిస్తున్నాము. మతాల పేరిట విద్వేషాలను రెచ్చగొడుతున్నాము. ఎవరు ఏ దేవుడిని, ఏ దేవతను పూజించినా అంతటా నిండి ఉన్నది ఏకైక శక్తి ఆ పరమాత్మ ఒక్కడే అనే జ్ఞానం సంపాదించడం అత్యవసరం.

21. అమీ హి త్వాం సురసఙ్ఘా విశన్తి కేచిద్భీతాః ప్రాఞ్జలయో గృణన్తి।
స్వస్తీత్యుక్త్వా మహర్షి సిద్ధసఙ్ఘాః స్తువన్తి త్వాం స్తుతిభిః పుష్కలాభిః॥

అప్పటి దాకా శ్రీకృష్ణుని శరీరంలో అనంత విశ్వాన్ని దర్శించాడు అర్జునుడు. ఇప్పుడు ఇంకొంచెం వివరంగా చూస్తున్నాడు. మొట్ట మొదట ఋషులను, మునులను చూచాడు.

ఓదేవా! నీ పక్కన నిలబడి ఋషిగణములు ప్రపంచ శాంతి సౌభాగ్యాల కొరకు నిన్ను స్తోత్రం చేస్తున్నాయి. (ఋషులకు స్వార్థం ఉండదు. వారు ఎప్పుడూ లోక కల్యాణం కోరుకుంటూ ఉంటారు. అందరూ బాగుండాలని పరమాత్మను ప్రార్థిస్తారు. అందుకని వారికి ఎవరిని చూచినా, ఏది చూచినా ఎటువంటి భయము ఉండదు.) ఓ దేవా! దేవతా గణములు నీ శరీరం లోపలకు బయటకు వస్తూ పోతూ ఉన్నారు. అంటే ఈ దేవతాగణములు అన్నీ ఆయనలోనే ఉన్నాయి. ఆయనలోనే చరిస్తున్నాయి. వారికి భయం లేదు. ఎందుకంటే వారు ఆ పరమాత్మలోనే ఉన్నారు కాబట్టి. ఆయనలోనే సాయుజ్యం పొందిన వారికి దైవత్వం సిద్ధిస్తుంది. అలాంటి వారు పరమాత్మలోనే చరిస్తున్నారు.

(ఎప్పుడూ మంత్రి గారి పక్కనే ఉన్న ఆయన పి.ఏ ఆయనను చూచి భయపడడు. ఆయనతో ఏదో పని ఉండి వచ్చినవాడు భయం భయంగా ఆయనకు వంగి వంగి దండాలు పెడుతూ వస్తాడు.లోపల భయంతో వణికిపోతుంటాడు. అలాగే సినిమాలో దయ్యం వేషం వేసిన వాడికి ఎటువంటి భయం ఉండదు. కాని ఆ సినిమా చూసిన వాడు భయంతో వణికిపోతాడు. )

మరి కొందరు భయంతో వణికిపోతూ చేతులు జోడించి నిన్ను స్తుతిస్తున్నారు (అంటే మానవులు అనుకోవచ్చు. ఎందుకంటే మానవులు దేవుడి మీద భక్తితో కాదు భయంతో చేతులు జోడించి ప్రార్థిస్తారు. చెంపలు వేసుకుంటారు. మరి కొందరు ఏవేవో కోరికలతో దేవుడిని స్తుతిస్తారు.) కాబట్టి ఋషులు, దేవతాగణములు, ఇంకా పరిణతి చెందని మానవులు వారి వారి స్థాయిలను బట్టి కొందరు భయంతోనూ, మరి కొందరు భయం లేకుండా, మరి కొందరు లోక కల్యాణం కోరి నిన్ను స్తుతిస్తున్నారు.

22. రుద్రాదిత్యా వసవో యే చ సాధ్యా విశ్వే2శ్వినౌ మరుతశ్చోష్మపాశ్చ।
గన్ధర్వయక్షాసురసిద్ధసఙ్ఘా వీక్షన్తే త్వాం విస్మితాశ్చైవ సర్వే॥

ఇక్కడి నుండి గమనించండి. విభూతి యోగంలో కృష్ణుడు ఎవరెవరి గురించి చెప్పాడో వారందరూ అర్జునుడికి కృష్ణునిలో కనిపిస్తున్నారు. వారెవరు అంటే ఏకాదశరుద్రులు, ద్వాదశ ఆదిత్యులు, అష్ట వసువులు,సాధ్యులు, విశ్వేదేవతలు, అశ్వినులు, పితృదేవతలు, గంధర్వులు, యక్షులు, రాక్షసులు, సిద్ధులు అందరూ పరమాత్మ వంక ఆశ్చర్యంగా ఒక అద్భుతాన్ని చూచినట్టు చూడటం చూచాడు అర్జునుడు. కృష్ణుడు అర్జునుడికి వీరిందరి గురించి విభూతి యోగంలో విపులంగా చెప్పాడు. ఇప్పుడు వారందరినీ ప్రత్యక్షంగా చూపించాడు. ఆ కారణం చేతనే అర్జునుడు వీరందరినీ గుర్తుపట్టగలిగాడు.

నేటి విద్యాభ్యాసంలో కూడా ముందు ఒక విషయాన్ని గురించి విపులంగా చెప్పి అది చక్కగా అర్థం కావడానికి ప్రత్యక్షంగా అంటే ప్రయోగశాలలో ప్రయోగాత్మకంగా చూపించడం నేటి విద్యావిధానము. ఈ విద్యావిధానము పురాతనకాలంలో కూడా గురువులు అనుసరించారు అనడానికి ఇదే ఉదాహరణ. శ్రీకృష్ణుడు జగద్గురువు కాబట్టి ఇదే విధానాన్ని అనుసరించాడు. వీళ్లందరినీ చూచిన తరువాత మెల్ల మెల్లగా అర్జునుడిలో భయం మొదలయింది.

23. రూపం మహత్తే బహువక్త్రనేత్రం మహాబాహో
బహుబాహూరుపాదమ్।
బహూదరం బహుదంష్ట్రాకరాలం దృష్ట్వా లోకా:
ప్రవ్యథితా స్తథా2హమ్॥

వాళ్లతో పాటు అర్జునుడు కూడా ఆ విరాట్ స్వరూపం వంక చూచాడు. ఒక్కసారిగా భయపడ్డాడు. ఒళ్లు కంపించింది. అర్జునుడు చూచినరూపం ఎలా ఉందంటే అనేక ముఖాలు, కళ్లు, పాదములు, ఉదరములు, నోటిలోనుండి బయటకు వచ్చిన కోరల్లాంటి పళ్లు, భయంకరంగా ఉంది. అప్పటి వరకు రాచరికపు దుస్తులలో ఉన్న మానవులనుచూచిన అర్జునుడికి ఆ భయంకర రూపం శరీరంలో భయం కలిగించింది.

"ఓ మహాబాహో! కృష్ణా! లెక్కలేనన్నిముఖాలు, కళ్లు,కాళ్లు,చేతులు, శరీరాలు, ఆ కోరల్లాంటి పళ్లు, ఇవన్నీ చూస్తుంటే, నేనే కాదు మూడులోకాలలో ఉన్న వాళ్లు కూడా

భయపడుతున్నారు. నాకు కనిపించే దేవతాగణాలుకూడా భయంతో వణికిపోతున్నారు. వాళ్లతో పాటునేను కూడా భయంతో గజగజవణికిపోతున్నాను కృష్ణా! అని అన్నాడు. అప్పటిదాకా దూరం నుండి కనపడ్డ విశ్వరూపం ఇప్పుడు దగ్గరగా కనపడుతూఉంది. కళ్లు, ముఖం, కోరల్లాంటిపళ్లు భయంకరంగా కనపడుతున్నాయి. అర్థరాత్రి హారర్ సినిమా చూస్తే శరీరం ఎలా వణుకుతుంది. అలా వణికిపోతున్నాడు అర్జునుడు. వీరాధివీరుడు,అమిత పరాక్రమవంతుడు అయిన తాను భయంతో వణుకుతున్నాను అని అనడం కొంచెం అభిజాత్యము అనిపించిందేమో, నేనేకాదయ్యా! ఆదిత్యులు, రుద్రులు, గంధర్వులు మొదలగు దేవతాగణాలు అందరూ నీ భయంకర రూపం చూచి వణుకుతున్నారు. వారితోపాటునేను కూడా అంటూ అర్జునుడు తనను తాను సమర్థించుకున్నట్టు చమత్కరించారు వ్యాసులవారు.

అసలు భయం ఎందుకు కలుగుతుంది. మనకు ఇష్టం లేనిది చూచినపుడు, మనకు ఇష్టం లేనిది జరుగుతుంది అని అనుకున్నప్పుడు భయం కలుగుతుంది. అన్నిటినీ సమంగా చూచేవాడికి భయం అనేది ఉండదు. ఒకటి ఇష్టం మరొకటి అయిష్టం అన్న వాడికే భయం. తనకు కావాల్సింది రాదేమో అన్న భయం. తనకు ఇష్టం లేనిది కనపడ్డా భయపడతాడు మానవుడు. అర్జునుడు కూడా అదే సరిస్థితిలో ఉన్నాడు. అప్పటి వరకు మామూలు మానవులను, అందమైన ముఖాలను, సైనికుల ముఖాలను, బంధువులు స్నేహితుల ముఖాలు చూచిన అర్జునుడికి తన మనసుకు నచ్చని భయంకరమైన రూపాలు కనపడుతుంటే తట్టుకోలేక భయం మొదలయింది.

24. నభ: స్పృశం దీప్తమనేక వర్ణం వ్యాత్తాననం దీప్తవిశాలనేత్రమ్।
దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితాన్తరాత్మా ధృతిం న విన్దామి శమం చ విష్ణో॥

25. దంష్ట్రాకరాలాని చ తే ముఖాని దృష్ట్వైవ కాలానల సన్నిభాని।
దిశో న జానే న లభే చ శర్మ ప్రసీద దేవేశ జగన్నివాస॥

మానవ శరీరం ఒకే రంగులో ఉండదు. నలుపు,చామనచాయ, తెల్లటి తెలుపు, ఎరుపు, ఎరుపు నలుపు కలిసిన రంగు ఇలా వివిధరకాలుగాఉంటుంది. అలాగే జీవరాసులు కూడా అనేక వర్ణాలలోఉంటాయి. చెట్లు, మొక్కలు, వాటికి పూచిన పూలు వివిధ వర్ణములలో ఉంటాయని తెలుసు. అందుకే అర్జునుడు విరాట్ స్వరూపంలో ఈ అనంత విశ్వం అంతా అనేక చిత్రవిచిత్రమైన రంగుల్లో ఉందిఅని అంటున్నాడు. పైగా ఆ ఆకారానికి పైన ఆకాశం హద్దుగా కనపడుతూ ఉంది. దానికి ఆది అంతము లేదు. మనం కూడా ఆకాశాన్ని అంటే పర్వతాలనుచూస్తుంటాము. ఆ పర్వతాల మీదకు వెళితే మేఘాలు మన మీదుగా పోతూఉండటం మనం చూస్తుంటాము. పర్వత శిఖరాల

మీది నుండి చూస్తే, ఆకాశం ఇంకా ఎత్తుగా ఉన్నట్టు కనపడుతుంది. అటువంటి పర్వతములు వేనకువేలు ఆకాశాన్నంటుతూ కనపడుతున్నాయి. ఈ అనంతమైన విశ్వరూపం సూర్యుని వెలుగుతో సమానంగా ప్రకాశిస్తూ కళ్లకు మిరుమిట్లుగొలుపుతూ ఉంది.

అర్జునుడు ఇంకొంచెం దగ్గరనుండి చూస్తుంటే అనేకమైన నోళ్లు తెరుచుకొని పళ్లు బయట పెట్టి వికృతంగా కనపడుతున్నాయి. లెక్కలేనన్నికళ్లు విశాలంగా తెరుచుకొని నిప్పులు కక్కుతున్నాయి. ఇప్పుడు అర్జునుడికి భయం ఒళ్లంతా పాకింది. కృష్ణా! నీ కోరలతో ఉన్న ముఖం, నిప్పులు కక్కే నీ కళ్లు, చూచి నాకు భయంగా ఉంది నేను తట్టుకోలేక పోతున్నాను. నా మనసులో ఎన్నడూ ఎరగని భయం ప్రవేశించింది. నా ధైర్యం సన్నగిల్లింది. అని భయంతో అరిచాడు అర్జునుడు.(మనం కూడా భయంకరమైన కల వచ్చినపుడు పెద్దగా అరుస్తాము. కాని ఆ శబ్దం మన నోటినుండి బయటకు రాదు. కాని అరిచినట్టు భ్రమ కలుగుతుంది.)

ఇప్పటి వరకు అర్జునుడు సుందరమైన దృశ్యాలను, అందమైన స్త్రీమూర్తులను చూచాడు కానీ ఇటువంటి భయంకరమైన రూపాలను చూడలేదు. అందుకని భయంతో వణికిపోతూ ఓ దేవ దేవా! కాస్త ఆగవయ్యా. నువ్వేమిటి? ఈ రూపం ఏమిటి? నువ్వు ఎలా ఉంటావో చూపించవయ్యా అంటే ఇదేమిటి ఇంత వికృత రూపం చూపిస్తున్నావు. ఇంక చాలు గానీ నీ జగన్మోహనమైన అసలు రూపం చూపించు." అని వేడుకున్నాడు. అర్జునుడి అరుపులు అరణ్యరోదనలు అయ్యాయి. పరమాత్మతన విశ్వరూపాన్ని ఉపసంహరించలేదు. మరలా అర్జునుడు ఇలాఅన్నాడు.

"ఓ దేవదేవా! కోరలతో భయంకరమైన నీ నోరు, ప్రళయాగ్నులువెదజల్లుతున్న నీ ముఖం చూస్తుంటే నాకు దిక్కుతోచడం లేదు. సుఖము, శాంతి ఎగిరిపోయాయి. ప్రస్తుతం భయం ఒళ్లంతా ఆవరించింది. కాస్త నా యందు దయయుంచి నీ ప్రసన్నమైన రూపంలోకి రావయ్యా అని వేడుకున్నాడు అర్జునుడు. అడగడం నీ వంతు, వద్దనడం నీ వంతేనా అని అనుకున్నాడేమో కృష్ణపరమాత్మ తన విశ్వరూపాన్ని ఇంకొంచెం విపులంగా అర్జునుడి మనస్సులో గోచరింపజేసాడు.

### 26.అమీచ త్వాం ధృతరాష్ట్రస్యపుత్రా: సర్వే సహైవావనిపాలసఙ్ఘై:।
### భీష్మో ద్రోణస్సూతపుత్ర స్తథా2సౌ సహాస్మదీయైరపి యోధముఖ్యై:।

## 27.వక్త్రాణి తే త్వరమాణా విశన్తి దంష్ట్రా కరాలాని భయానకాని।
## కేచిద్విలగ్నా దశనాన్తరేషు సందృశ్యన్తే చూర్ణితైరుత్తమాఙ్గై:॥

భయంకరమైన కోరలు, నిప్పులుకక్కే కళ్లు, ప్రళయాగ్ని మాదిరి మండుతున్న ముఖాన్నిచూచి ధైర్యం సన్నగిల్లి, సుఖశాంతులు మంటగలిసి భయంతో వణికిపోతున్న అర్జునుడికి ఇంతలో మరొక దృశ్యం కనపడింది. వామ్మో అనుకున్నాడు అర్జునుడు. ఆ దృశ్యం ఎలా ఉందంటే సుయోధనుడు మొదలగు ధృతరాష్ట్రుని కుమారులు అందరూ క్యూ కట్టి ఆ విరాట్ స్వరూపం నోట్లోకి వెళుతున్నారు. వారితో పాటు, ఎవరినైతే తాను చంపకూడదు, మహాపాపం అనుకుంటున్నాడో, ఆ తాతగారు భీష్ముడు, గురువుగారు ద్రోణుడు, కూడా కాలము అనే మండుతున్న ఆ నోట్లోకి వెళు తున్నారు. వారితోపాటు తన శత్రువు కర్ణుడు కూడా ఆ కాలాగ్ని లోకి వెళుతూ ఉండటం చూచాడు అర్జునుడు. వారే కాదు, యుద్ధం చేయడానికి వచ్చిన, ఇరుసైన్యములలో ఉన్న సమస్త రాజులు, సైనికులు తెరుచుకొని ఉన్న ఆ విరాట్ స్వరూపంలో నోట్లోకి వెళ్లిపోతున్నారు. ఇంకొంచెం పరిశీలనగా చూస్తే తమ పక్షాన ఉన్న రాజులు, తమ సేనాధి పతులు, సైనికులు కూడా అలా అలా ఆ విరాట్ స్వరూపం నోట్లో పడి నుగ్గు నుగ్గు అవుతున్నారు.

మరి కొంత మంది ఆ విరాట్ స్వరూపం నోటిలోని కోరల మధ్య చిక్కుకొని వేళ్లాడుతున్నారు. వాళ్ల శరీరాలు లోపల తలలు బయటకు వేలాడుతున్నాయి.
( అంటే మరణయాతన అనుభవిస్తున్నారు. మనలో కూడా కొంతమంది సులభంగా చావరు. కోమాలో ఉంటారు. నరకయాతన అనుభవిస్తారు. గొంతులో గుర గుర. మాటరాదు. చెప్పాలనుకుంటారు. చెప్పలేరు. కళ్లు తేలేస్తారు కానీ ప్రాణం పోదు. మృత్యువు కోరల్లో చిక్కుకొని వేలాడటం అంటే ఇదేనేమో! ఆలోచించండి. ).

ఈ విరాట్ స్వరూపం నోట్లో పడి అందరూ నుగ్గు నుగ్గు అవుతున్నారు. (మరణిస్తున్నారు). ఇక్కడ మనం ఒకటి గమనించాలి. కాల స్వరూపుడైన పరమాత్మకు అంతా వర్తమానమే. కాలమును లెక్కించే మనకు గడచిన కాలము, రాబోవు కాలము అంటూ ఉంటాయి. కాబట్టి మనకు భవిష్యత్తులో జరిగే సంఘటనలు కూడా పరమాత్మకు ఇప్పుడు జరుగుతున్నట్టు అనిపిస్తాయి. అందుకే అర్జునుడికి ఇంకాసేపట్లో మొదలు కాబోయే భారత యుద్ధంలో జరిగే మారణహోమం కళ్లకు కట్టినట్టు కనిపిస్తూ ఉంది. తాను చంపక పోయినా వీరంతా చస్తారు అన్న కృష్ణుడు చెప్పిన సత్యాన్ని కళ్లారా చూస్తున్నాడు అర్జునుడు. రాబోయే కాలంలో భీష్ముడు, ద్రోణుడు, దుర్యోధనుడు మొదలగు కురు వీరులు కాలపురుషుడి నోట్లోకి ప్రవేశిస్తారు. కాబట్టి ఎవరూ శాశ్వతంగా ఈ లోకంలో నిలిచి ఉండరు. పోయేవారు పోతే గానీ, వచ్చే వారికి చోటు ఉండదు. పుట్టిన ప్రతిజీవీ మరణించక తప్పదు. అని తెలుసుకున్నాడు అర్జునుడు.

అలాగే మనం కూడా ఈ కనపడేది అంతా నిజం కాదు, ఒకనాటికి నశించిపోయేదే, భార్యా సంతానము బంధుమిత్రులు, సంపదలు నశించిపోయేవే అనే సత్యాన్ని తెలుసుకోవాలి. ఇదే విషయాన్ని పరమాత్మ తన విశ్వరూపం ద్వారా ప్రకటిస్తున్నాడు. అలాగే ఈ ప్రపంచంలో కనపడే ప్రతి వస్తువు మార్పు చెందుతుంది, నశించి పోతుంది అని అనుకుంటే, వాటి మీద అనవసరమైన ఆసక్తిని వదులుకుంటాము. ఎంతవరకు అవసరమో అంతవరకే ఆసక్తిని చూపిస్తూ మిగిలిన సమయాన్ని పరమపదం పొందడానికి వినియోగిస్తాము అదే ఈ శ్లోకం మనకు తెలియజేస్తుంది.

అంటే దీని అర్థం.....రాబోయే కాలం తలచుకొని ఇప్పటి నుండి భయపడి మంచం పట్టమని కాదు. ఈ దృశ్యమాన ప్రపంచం యొక్క అసలు నిజం తెలుసుకోవాలి. మన కళ్లముందు అందరూ చనిపోతున్నా, మనం మాత్రం శాశ్వతంగా ఉంటాము అనే భావన చాలా మందికి ఉంటుంది. దానిని వదులుకోవాలి. కనపడేదంతా నిజం అనుకొని అనవసరమైన అపోహలు, అనురాగాలు, రాగద్వేషాలు పెంచుకోవద్దని బోధిస్తున్నాడు పరమాత్మ. ఈ యుద్ధం చేస్తే తాత, తండ్రులు, అన్నదమ్ములు, గురువులు బంధువులు అందరూ చనిపోతారు, ఈ యుద్ధం లేకపోతే వాళ్లంతా బతికిఉంటారు అనే భావన అర్జునుడిలో ఉంది. కాని తాను ఎవరినైతే చంపకూడదు అని అనుకున్నాడో వారందరూ కాలము అనే భయంకరమైన నోట్లోకి వెళ్లిపోవడం, కోరల మధ్య నలిగిపోవడం చూచి తట్టుకోలేకపోయాడు అర్జునుడు. అందుకే అర్జునుడికి భయంతో శరీరం కంపించింది.

ఇదంతా అర్జునుడి అవగాహనా లోపం. మనలో కూడా ఈ అవగాహన లేకపోవడం వలననే మనకందరికీ మరణం అంటే భయం. కేవలం జరిగేదాన్ని మాత్రమే చూస్తూ భవిష్యత్తు మీద ఆశలు పెంచుకోవడం అజ్ఞానుల లక్షణం. జరిగిన దానిని జరగబోయేదానిని సమానంగా చూడగలగడమే జ్ఞానదృష్టి. మన ఎదురుగా అందరూ చనిపోతున్నా మనం మాత్రం శాశ్వతంగా ఉండాలనుకోవడం అవివేకము. అందరూ ఒకనాటికి పోయేవాళ్లమే అని మరణాన్నికూడా సంతోషంగా ఆహ్వానించడం వివేకుల లక్షణం. ఎప్పుడో వచ్చే మరణానికి భయపడకుండా, అప్పటిదాకా అనునిత్యం భగవంతుని సేవలో గడపడం, నిష్కామకర్మలు చేయడం, సమాజసేవచేయడం, ఇతరులకు చేతనైనంత ఉపకారంచేయడం విజ్ఞులలక్షణం.

28. యథా నదీనాం బహవో2మ్బువేగా స్సముద్రమేవాభిముఖా ద్రవన్తి
తథా తవామీ నరలోకవీరా విశన్తి వక్త్రాణ్యభివిజ్వలన్తి॥

29.యథా ప్రదీప్తం జ్వలనం పతఙ్గా విశన్తి నాశాయ సమృద్ధవేగా।
తథైవ నాశాయ విశన్తి లోకా స్తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః॥

ఇంత భయంలో కూడా అర్జునుడి చేత రెండు ఉపమానాలు చెప్పించాడు వ్యాసుడు. అర్జునుడు చూస్తున్న ఆ దృశ్యం ఎలా ఉందంటే వానాకాలంలో ఉధృతంగా వానలుకురిసిన తరువాత నదులు, వాటి ఉపనదులు, ఏర్లు, కాలువలు, చెరువులు ఇంకా ఇతరములైన జలాశయాలు అన్నీ కలిసి సముద్రంలో కలవడానికి ఉరుకులుపరుగుల మీద విపరీతమైన వేగంతో పరుగెత్తినట్టు, ఈ నరలోకంలో ఉన్న సమస్త జీవరాసులు అన్నీ కాలపురుషుడి మండుతున్న నోట్లోకి పరుగుపెడుతున్నాయి. అలాగే మిడతలన్నీ దండుగా బయలుదేరి, మండుతున్న అగ్ని చుట్టు తిరుగుతూ అందులో పడి మాడి పోయినట్టు జీవరాసులన్నీ కాలపురుషుని నోట్లో పడుతున్నాయి. అంటే అర్జునుడి ముందు నిలబడి ఉన్న 18 అక్షౌహిణీల సైన్యము, అందులోని రాజులు, సామంతులు, సైనికాధికారులు, కాల్బలము, అశ్వికదళము, గజదళము ఏ ఒక్కటి మిగలకుండా అన్నీ కాలపురుషుని నోట్లోకి వెళ్లిపోతున్నాయి. వారందరూ పుట్టారు కాబట్టి చావక తప్పదు. అలాగే నీ తాతలు, తండ్రులు, అన్నదమ్ములు, బంధువులు, స్నేహితులు అందరూ పుట్టారు కాబట్టి చావక తప్పదు. వీరే కాదు, మూడులోకాలలో పుట్టిన ప్రతి ప్రాణి కూడా చావక తప్పదు.

(ప్రభుత్వ ఉద్యోగంలో చేరిన ప్రతి వ్యక్తి రిటైర్ మెంట్ కాక తప్పదు. కాకపోతే ఆ రిటైర్ మెంట్ తేదీ మనకు తెలుస్తుంది. జీవితం నుండి రిటైర్ అయ్యే తేదీ మనకు తెలియదు. దానిని అతి రహస్యంగా ఉంచాడు పరమాత్మ. ఈ రెండింటికీ అంతే తేడా)

కాబట్టి చావబోయే వారి గురించి ఎవరూ చింతించనవసరం లేదు అని తన విశ్వరూప సందర్శనం ద్వారా బోధించాడుపరమాత్మ. ఇంత భయానక దృశ్యంలో ఉపమానాలు అవసరమా అని మీరు అనుకోవచ్చు. అందుకే ఇది మానసికంగా అర్జునుడు అనుభవిస్తున్న స్థితి. ఒక కలమాదిరి చూస్తున్నాడు. మానవులకు ఒక దృశ్యాన్ని మరొక దృశ్యంతో పోల్చుకోవడం సహజం. ఆ సహజత్వాన్ని ఇక్కడ ప్రతిబింబించాడు వ్యాసుడు.

దానికి తోడు, ఈ జనన మరణాల గురించి మనం రోజూ చూచే ఉపమానం ఒకటి చెప్పుకోవచ్చు. ఇప్పుడు అధునాతన రైసుమిల్లులు వచ్చాయి కానీ ఇదివరకు చిన్న రైసుమిల్లులు

ఉండేవి. ఆ రైసుమిల్లుకు పైన ఉన్న పళ్లెంలాంటి దానిలో ధాన్యం పోస్తుంటారు. కింద ఉన్న గొట్టంలో నుండి బియ్యం వస్తుంటాయి. ఈ అనంత విశ్వంలో కోటాను కోట్ల జీవరాసులు అనుక్షణం పుడుతుంటాయి. మరణిస్తుంటాయి. వాటినన్నిటినీ లెక్క కడితే, కింద వచ్చే బియ్యం పుట్టుకలు గానూ, పైన పోసే ధాన్యం మరణాలు గానూ కనిపిస్తాయి. మనం నూరేళ్లు జీవిస్తాము కాబట్టి మనకు ఈ వేగం కనపడదు. భూమి ఎంతో వేగంతో తన చుట్టు తాను తిరుగుతూ ఉంటుంది. కాని మనకు తెలియదు. అలాగే ఇది కూడా.

ఈ శ్లోకాలలో వ్యాసులవారు కేవలం మరణాల గురించే వర్ణించారు. మరి ఈ మరణం నుండి తప్పించుకోడం ఎలాగా అంటేమరణం లేనిచోటికి వెళ్లడమే. పొగ నుండి తప్పించుకోవాలంటే పొగలేని చోటికి ఎలా వెళతామో అలాగే జనన మరణాల నుండి విముక్తి పొందడానికి అవి లేని చోటికి వెళ్లడమే. అది ఎక్కడుంది? ఆది అంతము లేని వాడి దగ్గర ఉంది. ఆయనే పరమాత్మ. ఆ పరమాత్మను ఆశ్రయించడమే మానవుల తక్షణ కర్తవ్యము. ఆ పరమాత్మను ఆశ్రయించడానికిమార్గం ఏమిటి అంటే మనం ఎవరో మనం తెలుసుకోవడమే. మనం ఈ శరీరం కాదు. ఆత్మ స్వరూపులం. మనకు పుట్టుక, మరణం లేదు. చావు పుట్టుకలు కేవలం దేహానికి మాత్రమే. మనకు కాదు అని తెలుసుకోవడమే. ఈ విషయం అర్థం అయితే, ఎవరికీ మృత్యువు అంటే భయం ఉండదు. అదే అమృతత్వము.

## 30. లేలిహ్యసే గ్రసమానస్సమన్తాల్లోకాన్ సమగ్రాన్ వదనైర్జ్వలద్భి:।
## తేజోభిరాపూర్వ జగత్సమగ్రం భాసస్తవోగ్రా: ప్రతపన్తి విష్ణో॥

తాను ఊహించుకుంటున్న ఉపమానాలతో ఆ దృశ్యం మరింత భయానకంగా కనిపించింది అర్జునుడికి. తన అన్నయ్య భీముడు లాంటి వాడు, విస్తరి నిండా భోజన పదార్థాలు వడ్డించుకొని, అన్నిటినీ రుచి చూస్తూ ఎలా ఆరగిస్తుంటాడో, నాలుకతో పెదాలను నాక్కుంటూ, పళ్ల సందున ఇరుక్కున్న పదార్థాలను నాలుకతో నోట్లోకి లాక్కుంటూ, పెదాలతో చప్పరిస్తూ ఎలా తింటుంటాడో, అదే మాదిరి తన ఎదుట కనిపిస్తున్న భయంకర రూపం ఈ లోకాలలో ఉన్న సమస్త జీవరాసులను ఆరగిస్తున్నట్టు భ్రమచెందాడు అర్జునుడు.

కృష్ణా! ఏంటిది! ఈ జనం ఏంటి! అన్నిలోకాలు నీ నోట్లోకి జొరబడటం ఏమిటి? ఈ జీవరాసులను అంతా నీవు నమిలి మింగెయ్యడం ఏమిటి?అలా నములుతూ మింగుతూ ఉంటే, నీ పళ్లలో చిక్కుకున్న వాటిని నీవు ఆత్రంగా నాలుకతో లోపలకు లాక్కోవడం, నీ పెదాలను చప్పరించడం, నాకేయడం ఇదంతా ఏమిటి? అంతా విచిత్రంగా ఉందే! పైగా నీ ఉగ్రమైన శరీర కాంతితో ఈ లోకం అంతా తపించి పోతూఉంది. ఎవరూ ఈ వేడిమికి వెలుతురుకు తట్టుకోలేకపోతున్నారు.

(ఎండాకాలంలో ఎండవేడికి తట్టుకోలేక వడదెబ్బ తినేవాళ్ళు, చనిపోయేవాళ్లు మనం చూస్తూనే ఉన్నాము. ఇలాగే ఎండవేడిమికి తట్టుకోలేక ఎన్నోజీవరాసులు మరణిస్తుంటాయి. కాలము అనేది ఈ విధంగా ప్రాణులను హరిస్తూ ఉంటుంది. అర్జునుడు కూడా ఆ భయంకర మైన కాలస్వరూపాన్ని చూచి ఒక అద్భుతమైన ఆకారం అందరినీ నమిలి మింగుతున్నట్టు, పళ్లసందున పడిన వాళ్లను నాలుకతో లోపలకు లాక్కుంటున్నట్టు ఊహించుకుంటున్నాడు.)

ఇటువంటి రూపం చూసిన వారికి ఎవరికైనా ఒక సందేహం వస్తుంది. దేవుడు కరుణామయుడా లేక క్రూరుడా! లేకపోతే ఈ వినాశనం ఏమిటి? ఈ క్రూరత్వం ఏమిటి? అని సందేహం కలుగుతుంది. అది క్రూరత్వం కాదు. పరమాత్మ దయ, కరుణ. కాలం తీరిన వారు మరణిస్తే కదా కొత్త వారికి చోటు, ఆహారం దొరికేది. అలాగే వృద్ధాప్యంతో రోగాలతో బాధపడే వారికి పరమాత్మ విముక్తి కల్పిస్తున్నాడు. కాలం తీరిన జీవ రాసులను అలాగే తనలోకి లాక్కుంటున్నాడు. కొత్తవారు రావడానికి అవకాశం కల్పిస్తున్నాడు. ఇలా అనుకుంటే పరమాత్మ మన మీద దయ చూపించి మరణం అనే వరాన్ని మానవులకు ప్రసాదిస్తున్నాడు అని అనుకోవాలి.

(70 దాటిన తరువాత, వృద్ధాప్యంతో, రోగాలతో బాధపడుతూ, ఈ లోకం నుండి ఎంత త్వరగా వెళ్లిపోతే అంత మంచిది అని ఎంతోమంది అనుకుంటూ ఉంటారు. ఈ భారీ శరీరాన్ని మోయలేక, రోగాలతో బాధలు పడలేక, తొందరగా చావు వస్తే బాగుండు అని కోరుకునే వాళ్లు ఎంతోమంది. మరి పరమాత్మ వారందరికీ మరణం ప్రసాదించి, వారిని బాధలనుండి విముక్తులను చేస్తున్నాడు కదా! కొత్తగా పుట్టే వారికి చోటు కల్పిస్తున్నాడు కదా! ఇలా భావిస్తే దేవుడు కరుణామయుడే కదా! ఆలోచించండి.)

## 31. ఆఖ్యాహి మే కో భవానుగ్రరూపో నమో2స్తు తే దేవవర ప్రసీద।
## విజ్ఞాతుమిచ్ఛామి భవన్తమాద్యం నహి ప్రజానామి తవ ప్రవృత్తిమ్॥

ఇంతటి ఉగ్రరూపం కలవాడివి నీవు ఎవరో నాకు తెలియడం లేదు. కాస్త వివరంగా చెప్పు. అసలు నీవు ఎవరో, నీ ప్రవృత్తి ఏమిటో నాకు ఏమి తెలియడం లేదు. ఆది అంతము లేని నీ గురించి తెలుసుకోవాలని ఉంది. నా మీద అనుగ్రహించి నాకు ప్రసన్నుడవు కా! నీ గురించి నాకు తెలియజెయ్యి అని ప్రార్థించాడు అర్జునుడు.

ఇప్పటివరకూ అర్జునుడు నాణేనికి ఒక వైపే చూచాడు. దేవుడు, పరమాత్మ అంటే

దయామయుడు, కరుణామూర్తి అని అర్జునుడికి తెలుసు కానీ ఇక్కడ కనపడేది అంతా వ్యతిరేకంగాఉంది. ఇక్కడ తనకు పరమాత్మ కాలస్వరూపుడుగా అందరినీ నాశనం చేసేవాడుగా ఉగ్రరూపంతో కనపడుతున్నాడు. ఇప్పుడు అర్జునుడికి సందేహం కలిగింది. ఇంతకూ నువ్వు మా కృష్ణుడివేనా! కృష్ణుడివి అయితే నీకు మనోహరమైనరూపం ఉండాలి కానీ ఈ ఉగ్రరూపం ఏమిటి? సకల జీవజాతులను నమలడం, తినడం, నాకడం ఏమిటి? నువ్వు మా కృష్ణుడివి కాకపోతే ఇంతటి భయానకమైన, ఉగ్రమైన రూపం కల మీరు ఎవరు? ఈ అవతారం ఏమిటి? ఇంత భయంకరంగా ఎందుకున్నావు? ఎంత ఆలోచించినా నువ్వు ఎవరో అర్థం కావడం లేదు? నీకో నమస్కారం. ఆది అంతాలు లేని నువ్వు ఎవరో చెప్పు? అయ్యా మహానుభావా! తమరి ప్రవృత్తి ఏమిటో నాకు చెప్పండి. తమరు ఈ ప్రకారం అందరినీ అంతం చేయడమేనా, లోకాలను అనుగ్రహంతో చూడటం కూడాఉందా! నాకు ఏమీ అర్థం కావడం లేదు. నన్ను అనుగ్రహించి నాకు తెలియజేయండి!" అని భయంతో వణికిపోతూ వేడుకున్నాడు అర్జునుడు. ఇప్పటికి ఈ ట్రీట్ మెంట్ చాలనుకున్నాడు కృష్ణుడు. అర్జునుడితో ఇలా అంటున్నాడు.

శ్రీభగవానువాచ:

## 32.కాలోఽస్మి లోకక్షయకృత్ప్రవృద్ధో లోకాన్ సమాహర్తుమిహ ప్రవృత్తః।
## ఋతేఽపి త్వా నభవిష్యన్తి సర్వే యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః॥

అర్జునుడు అడిగిన ప్రశ్నలకు శ్రీకృష్ణుడు ఈ విధంగా సమాధానం చెప్పాడు.

ఓ అర్జునా! నేను కాలస్వరూపుడిని ఇదివరకే చెప్పాను కదా. జీవులను లయం చేయడం కాలము యొక్క ధర్మం. ఆ ధర్మమే నేను నిర్వర్తిస్తున్నాను. దానినే కాలధర్మం అంటారు. (మామూలుగా ఎవరైనా మరణిస్తే ఆయన కాలం చేసాడు, కాలధర్మం చెందాడు అని అంటూ ఉంటాము కదా!) జీవుడు పుట్టినప్పుడే వాడి మృత్యువు నిర్ణయింపబడుతుంది. కాలం తీరగానే కాల ధర్మం ప్రకారం మృత్యువు నోటపడక తప్పదు. ఆ కార్యక్రమం నా అధీనంలో జరుగుతూ ఉంటుంది. దీనికి భీష్ముడు, ద్రోణుడు, సుయోధనుడు, ఇతర కురు వీరులు, కురుసైన్యము, మీ సైన్యము ఎవరూ అతీతులు కారు. నీవు యుద్ధం చేయకపోయినా, నీవు చంపక పోయినా వీరంతా ఎప్పుడోఒకప్పుడు చావక తప్పదు. ఎవరూ ఈ లోకంలో శాశ్వతంగాఉండరు. ఈ విషయాన్నే నీవు నీ మనోనేత్రంతో ప్రత్యక్షంగా చూచావు కాబట్టి నీలో ఉన్న సందేహాలను విడిచిపెట్టు. యుద్ధం చెయ్యి. కీర్తిని పొందు. అదే నీకు మిగిలేది. వీరు ఎవ్వరూ మిగలరు. వీరందరూ కాలానుగుణంగా చావవలసిన వారే. ఈ యుద్ధంలో నీ చేతిలో కాకపోయినా ఒకరి చేతిలో ఒకరు చావక తప్పదు. నీవు కేవలం నిమిత్తమాత్రుడవు.అనే భావాన్నిబోధించాడు కృష్ణుడు.

మరి కాలం కేవలం లయకారకమేనా అంటే కాదు అని చెప్పాలి. కాలానుగుణంగా జీవులు పుడుతుంటాయి, మరణిస్తుంటాయి. సృష్టి లయం రెండూ కాలస్వరూపాలే. ఈరెండుకలిపి కాలము అని అనవచ్చు. భూతకాలంలో అంటే జరిగిపోయిన కాలంలో పుట్టినవాళ్లు, రాబోయేకాలంలో మరణిస్తారు. ఆ పుట్టిన సమయం, మరణించే సమయం మధ్య ఉన్న కాలం మాత్రమే వర్తమానం అవుతుంది. అందుకే పల్లెలలో ఏమీ చదువుకోని వాళ్లు "ఇవ్వాళ చస్తే రేపటికిరెండు. ఏంటట!" అని మరణాన్ని చాలా తేలికగా తీసుకుంటారు. అన్నీతెలిసిన వాళ్లే మరణానికి భయపడుతుంటారు. కాని మరణం అనేది ఒక వరం అనీ, అది కాలముయొక్క ధర్మం అనీ, అందుకే దానిని కాలధర్మం అని అంటారనీ తెలుసుకున్న వాడే జ్ఞాని.

మరి ఇదివరకు పరమాత్మ అన్నారు ఇప్పుడు కాలము అంటున్నారు ఇది ఎలా అర్థం చేసుకోవాలి అనే సందేహం రావచ్చు. బంగారం కొట్టుకు వెళ్లాము. అక్కడ వివిధములైన ఆభరణాలు ఉన్నాయి. కొన్ని మెడకు వేసుకునేవి, కొన్ని నడుముకు పెట్టుకునేవి. కొన్ని వేళ్లకు పెట్టుకునేవి. కాని ఈ ఆభరణములలో ఉన్న మూల పదార్థము అంతా బంగారమే కాని మరొకటి కాదు. అలాగే పరమాత్మ ఒక్కడే. అది పారమార్థిక సత్యము. కాని వ్యవహారంలో ఆ పరమాత్మ కాలముగా చెప్పబడుతున్నాడు. సృష్టి, స్థితి లయములను నిర్వర్తిస్తున్నాడు. దీనినే వ్యావహారిక సత్యము. ఆభరణములు వ్యావహారిక సత్యం అయితే, ఆ ఆభరణములలో నిండి ఉన్న బంగారము పారమార్థిక సత్యము.

కాబట్టి వ్యావహారిక దృష్ట్యా, పుట్టడం, పెరగడం, వివాహము, పిల్లలు, బంధువులు, సుఖసంతోషాలు, వ్యాధులు, ముసలితనము, మరణము ఇవన్నీ తప్పవు. ఇవన్నీ ప్రతివాడూ అనుభవించాల్సిందే. అవతార పురుషులు కూడా తప్పించుకోడానికి వీలులేదు. ఇది అందరూ తప్పకుండా అంగీకరించవలసిన సత్యము. ఇవన్నీ ప్రతి వాడిజీవితంలో తప్పించుకోలేని పరిణామాలు. అదే పారమార్థిక సత్యం ప్రకారం చూస్తే, పుట్టుక, పెరగడం, మరణం ఇవన్నీ మిథ్య. కేవలం నాటకం. నేను శరీరం కాదు, ఆత్మ స్వరూపాన్ని అని తెలుసుకోవాలి. ఒక నియతి ప్రకారం ఇదంతా జరుగుతూ ఉంది. అందరం పరమాత్మ స్వరూపులమే అని తెలుసుకోవడమే జ్ఞానము. ఇలా అర్థం చేసుకుంటే పరమాత్మ కాలస్వరూపుడు అనే విషయం చక్కగా అర్థం అవుతుంది.

## 33.తస్మాత్త్వముత్తిష్ఠ యశోలభస్వ జిత్వాశత్రూన్ భుఙ్క్ష్వరాజ్యం సమృద్ధమ్।

మయైవైతే నిహతా: పూర్వమేవ నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్॥

కాబట్టి ఓ అర్జునా! లే! లేచి నిలబడు. యుద్ధం చెయ్యి. యుద్ధం లో నీ శత్రువులను జయించు. అనంతమైన కీర్తిప్రతిష్ఠలు సంపాదించు. ఎదురులేని రాజ్యాధికారాన్ని అనుభవించు. మరలా చెబుతున్నాను. నీ తాతలు, తండ్రులు, అన్నదమ్ములు, బంధువులు, స్నేహితులు అంతా పుట్టగానే వారి మరణం నిశ్చయం అయింది. అందరూ ఈ యుద్ధం లో చావాలని నిర్ణయింపబడింది. దానిని నీవు తప్పించలేవు. వీరిని నీవు చంపకపోయినా, ఈ యుద్ధం ఆగదు. ఈ యుద్ధంలో వీరందరూ ఒకరిని ఒకరు చంపుకుంటారు. నీవు వీరినందరినీ చంపడం కేవలం నిమిత్తమాత్రమే. నీవు కేవలం నిమిత్త మాత్రుడవు. కాలమే వీరిని అందరినీ చంపుతుంది. అది కాలధర్మం అని బోధించాడు కృష్ణుడు.

యుద్ధం అయిన తరువాత కృష్ణుడి మాటలు అక్షరసత్యములు అయ్యాయి. యుద్ధం పూర్తి అయిన తరువాత పంచపాండవులు, కృష్ణుడు, సాత్యకి, కృపాచార్యుడు, అశ్వత్థామ, కృతవర్మ, యుయుధానుడు ఇంకా కొంత మంది మాత్రమే మిగిలారు. ఇరుపక్షాలలో ఉన్న 18 అక్షౌహిణీల సైన్యం మరణించారు.

ఈ శ్లోకంలోఒక పదం వాడారు వ్యాసుల వారు. “నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్” అంటే “ఓ అర్జునా! నీవు కేవలం నిమిత్తమాత్రుడవు.” ఈ పదానికి విపరీత అర్థాలు తీస్తారు చాలామంది. మనం అందరం కేవలం నిమిత్తమాత్రులము. అంతా పరమాత్ముడి చేతిలో ఉంది. శివుని ఆజ్ఞలేనిదే చీమ అయినా కుట్టదు, నారు పోసినవాడు నీరుపోయక పోతాడా అనే శుష్కవేదాంతాలు చెబుతూ సోమరుల మాదిరి ఏ పనీ చేయకుండా తిరుగుతుంటారు. ఏ పనీ చేయరు. బద్ధకం, సోమరితనం, నిష్క్రియాపరత్వము, అంతా పరమాత్మ చూసుకుంటాడులే అన్న అలసత్వం వీరి ముఖ్యగుణాలు. మరి కొంత మంది అంతా విధిలీల అంటూ వీరు చేసే అపభ్రంశపు పనులన్నీ విధిమీద తోసేస్తారు. ఇటువంటి వారంతా వేదాంతాన్ని శాస్త్రాలను తమకు అనుకూలంగా మలుచుకుంటున్నారు తప్ప వీరికి శాస్త్రజ్ఞానం లవలేశంకూడా ఉండదు.

నిమిత్తమాత్రం అంటే ఆ అర్థంలో తీసుకోకూడదు. మన కర్తవ్యం మనం నిర్వర్తించాలి. ఫలితం కోసం ఆశించకూడదు. ఏ ఫలితం వచ్చినా ఈశ్వర ప్రసాదంగా స్వీకరించాలి. ఒక సారి విఫలమైతో మరలా మరలా ప్రయత్నించాలి కానీ నిరాశ నిస్పృహలకు లోనుకాకూడదు. కర్తవ్య నిష్ఠ ముఖ్యము. ఏ పని చేసినా, మనసు మాత్రం భగవధ్యానంలో ముడిపడి ఉండాలి. అటువంటప్పుడు నీవు అధర్మకార్యాలు చేసే ప్రసక్తిలేదు. తెలియకుండా, పొరపాటున చేసినా, ఆ కర్మలకు చెందిన పాపపుణ్యాలు నీకు అంటవు. నీవు చేసిన ప్రతి మంచి పనికి తగిన ఫలితం తప్పకుండా లభిస్తుంది. ఆ పదాలను మనం ఇలా అర్థం చేసుకోవాలి.

## 34.ద్రోణం చ భీష్మం చ జయద్రథం చ కర్ణం తథా2న్యానపి యోధవీరాన్।
## మయా హతాంస్త్వం జహి మా వ్యథిష్ఠా యుధ్యస్వ జేతాసి రణే సపత్నాన్॥

ఇప్పటి వరకు అందరి విషయం చెప్పి ఇప్పుడు ప్రత్యేకంగా భీష్మ,ద్రోణుల గురించి చెబుతున్నాడు. ఓ అర్జునా! ఈ ద్రోణుడు, భీష్ముడు, సైంధవుడు, కర్ణుడు వీరంతా కూడా కాలానుగుణంగా ఈ యుద్ధంలో చస్తారు. నీవు యుద్ధం చేసినా, చేయకపోయినా ఇది తప్పదు. ఎవరూ మిగలరు. నీవు క్షత్రియుడవు కాబట్టి, యుద్ధం చేయడం నీ ధర్మం కాబట్టి, నీ ధర్మం నీవు నెరవేర్చు. యుద్ధం చేసి ఆ పని పూర్తి చెయ్యి. యుద్ధం చేస్తే నా వాళ్లందరూ చస్తారు అనే భయం, దిగులు వదిలిపెట్టు. ఎలాంటి భయము లేకుండా లే. లేచి యుద్ధం చెయ్యి. ఈ యుద్ధంలో విజయం నీదే. శత్రువులనందరినీ జయించి ధర్మసంస్థాపన చెయ్యి అని కర్తవ్యబోధ చేసాడు కృష్ణుడు.

ఇక్కడ మనకు అంటే మనబోటి సామాన్యులకు ఒక సందేహము కలుగుతుంది. యుద్ధం ఇంకా మొదలవలేదు. భీష్ముడు, ద్రోణుడు, సైంధవుడు అంతా జీవించి ఉన్నారు. మరి వీరంతా ఇదివరకే చచ్చిపోయారు అంటాడేమిటి అని మనకు సందేహము రావడం సహజం. పరమాత్మ అంటే కాలపురుషునికి కాలం అంటూ లేదు. అంతా వర్తమానమే. జరిగినది, జరుగుతున్నది జరగబోయేది ఎదుట స్పష్టంగా కనపడుతూఉంటుంది. ఆ దృశ్యాన్నే అర్జునుడికి చూపించాడు కృష్ణుడు. మనం కూడా ఈ సత్యాన్ని గ్రహించాలి. మనం అంతా క్యూలో ఉన్నాము. కాకపోతే వాడు నేడు, రేపు మనం అన్న సత్యాన్ని గ్రహించగలిగితే, ఈ ఆవేశాలు, రాగద్వేషాలు, అనుబంధాలు అనేవి ఉండవు. ఉన్నా పరిమితంగా ఉంటాయి.

ఈ శ్లోకంలో మరొక మాట అన్నాడు కృష్ణుడు. మావ్యథిష్ఠా: అంటే భయపడవలదు. ఈలోకంలో ఎవరికైనా భయాన్ని మించిన శత్రువు లేదు. ధైర్యాన్ని మించిన మిత్రుడు లేడు. ఎంతటి వాడికైనా ఉన్నది పోతుందేమో అనే భయం, రావలసింది రాదేమోనన్న భయం, నేనెప్పుడుపోతానో అన్న భయం పట్టి పీడిస్తూ ఉంటుంది. ధైర్యం అంటే ఏమీ లేదు. భయం లేని స్థితి ధైర్యము. దీపం ఉన్న చోట చీకటి ఉండదు. ధైర్యం ఉన్న చోట భయం ఉండదు. ఈ భయం లేకపోతే మానవుడు అజేయుడు అవుతాడు. కాబట్టి మనం దేనికీ భయపడకూడదు అనే సత్యాన్ని బోధించాడు కృష్ణుడు.

ఆఖరున కృష్ణుడు మరొక మాట కూడా అన్నాడు. "రణే సపత్నాన్ జేతాసి" అంటే ఈయుద్ధంలో నీవు అందరినీ గెలుస్తావు. విజయం నీదే. కేవలం నిమిత్తమాత్రంగా యుద్ధం చెయ్యి. అని అన్నాడు. మొత్తం మూడు మాచ్‌లు ఆడాలి అనుకుందాము. అందులో రెండు మాచ్‌లు ఒక జట్టు గెలిచింది. మూడో మాచ్ కేవలం లాంఛనంగా ఆడతారు. అలాగే పరమాత్మ గెలుపు ముందే

నిశ్చయం చేసాడు. నీవే గెలుస్తావు అనే విషయం చెప్పాడు. అర్జునుడిని కేవలం నిమిత్తమాత్రంగా యుద్ధం చేయమన్నాడు. కృష్ణుడు సైలెంట్ అయ్యాడు. అర్జునుడు ఆలోచిస్తున్నాడు. వీరి ఇద్దరి మనోభావాలు తెలుసుకున్న సంజయుడు ఇలా అన్నాడు.

సంజయ ఉవాచ:

## 35. ఏతచ్ఛ్రుత్వా వచనం కేశవస్య కృతాఞ్జలిర్వేపమాన: కిరీటి। నమస్కృత్వా భూయ ఏవాహ కృష్ణం సగద్గదం భీతభీత: ప్రణమ్య॥

ధృతరాష్ట్ర మహారాజా! భగవానుని మాటలు విన్న అర్జునుడు చేతులు జోడించాడు. అతని శరీరం భయంతో వణికిపోతూ ఉంది. వంగి వంగి మాటి మాటికి నమస్కారాలు చేస్తున్నాడు. గొంతు బొంగురు పోయింది. భయంతో నోటమాట రావడం లేదు. అలాగే మాటపెగుల్చుకొని కృష్ణుడితో ఇలా అన్నాడు.

కృష్ణుడు, అర్జునుడు ఏమీ మాట్లాడనప్పుడు వారిద్దరినీ చూస్తూ, వారి మనోభావాలను తెలుసుకుంటూ, తాను చూచినవి, తెలుసుకొన్నవి యథాతథంగా ధృతరాష్ట్రుడికి విన్నవించుకుంటున్న సంజయుడు మధ్య మధ్యలో మాట్లాడటం మనం చూస్తూనేఉన్నాము. అదే విధంగా కృష్ణుడు తన అనంతమైన విశ్వరూపాన్ని అర్జునుడి మనోనేత్రానికి గోచరించజేసి, మరలా అర్జునుడిని తన ధర్మమైన యుద్ధము చేయమని ప్రోత్సహించి ఊరుకున్నాడు. అప్పటి దాకా అర్జునుడు కృష్ణుడి మండుతున్న భయంకరమైన నోట్లోకి అందరూ ప్రవేశించడం, ఆయన అందరినీ నమలడం, తప్పించుకున్న వారిని నాలుకతో నోట్లోకి లాక్కోవడం అన్నీ చూచి, పరమాత్మను ఒక విధ్వంసకారుడిగా, లయకారుడిగా, అందరినీ చంపే వాడిగానే అర్థం చేసుకున్నాడు. కాని ఆఖరున కృష్ణుడు చేసిన బోధను విని, పరమాత్మ కేవలం జీవుల కర్మఫలములను ఇచ్చే వాడు, ఎవరెవరి కర్మఫలముల కొద్దీ వారు పుట్టడం చావడం జరుగుతూ ఉంది, పరమాత్మ కేవలం నిమిత్తమాత్రుడు, ఆయనకు ఏమీ పట్టదు, కాలము తన ధర్మం తాను నెరవేరుస్తూ ఉంది, కాలపురుషుడుగా పరమాత్మ కాల ధర్మములను నెరవేరుస్తున్నాడు అని అర్థం చేసుకున్నాడు. పరమాత్మకు పూర్తిగా శరణాగతుడు అయ్యాడు. నీవే తప్ప నిత:పరంబెరుగ అనే స్థితికి వచ్చాడు.

కాని అర్జునుడికి ఆ విశ్వరూపాన్ని చూచిన భయం ఇంకా పోలేదు. శరీరం వణుకుతూ ఉంది. భయంతో కంపించి పోతున్నాడు. ఆ ప్రకారంగా భయంతో వణికిపోతూ ఉన్న

అర్జునుడు చేతులు జోడించి ఇలా అన్నాడు అని సంజయుడు ధృతరాష్ట్రుడికి చెప్పాడు.

అర్జున ఉవాచ:

36. స్థానే హృషీకేశ తవ ప్రకీర్త్యా జగత్ప్రహృష్యత్యనురజ్యతే చ।
రక్షాంసి భీతాని దిశో ద్రవన్తి సర్వేనమస్యన్తి చ సిద్ధసఙ్ఘా:॥

హృషీకేశా! నీ నామమును పలకడం చేత నీ మహత్తును స్తుతించడం చేత, ఈ జగమంతా ఆనందంతో నిండి పోయింది. నీవు చేస్తున్న దుష్ట శిక్షణ, శిష్ట రక్షణతో అందరూ చాలా ప్రీతిని పొందారు. దుర్మార్గులైన రాక్షసులు నీకు భయపడి నలుదిక్కులకు పారిపోతున్నారు. పుణ్యాత్ములైన సిద్ధులు సాధ్యులు మొదలగు దేవతాగణములు నీకు నమస్కరిస్తున్నాయి.

. ఇక్కడ సిద్దులు మహాఋషులు నిన్ను ధ్యానిస్తున్నారు. నీకు భయపడిన రాక్షసులు నలుదిక్కులకు పారిపోతున్నారు. ఇదంతా అర్జునుడు చూస్తున్నాడు. అంటే మంచి వారికి భగవంతుని నమ్ముకున్న వారికి, భక్తులకు భయం అంటూ ఉండదు. వారు దేనికీ చివరకు మృత్యువుకు కూడా భయపడరు. పరమాత్మను చూచిన ఆనందంలో మైమరచిపోతారు. మహదానందభరితులు అవుతారు. వారి ఆనందానికి అవధులు ఉండవు. అటువంటి వారిని సిద్ధసంఘాలు అని అన్నాడు వ్యాసులవారు. మన పరిభాషలో కేవలం పరమాత్మనే నమ్ముకొని, మనసును ఆత్మలో లీనంచేసి పరమాత్మను శరణాగతి పొందిన వారు. ఏ పని చేస్తున్నా, ఏ వ్యవహారంలో మునిగి ఉన్నా పరమాత్మను మరువని వారు, నిష్కామ కర్మలు చేసే వారు, కర్తృత్వభావన లేనివారు ఇటువంటి వారు నీ విశ్వరూపాన్ని చూచి మైమరచి పోయి నీ గురించి స్తోత్రం చేస్తుంటారు.

కాని దుర్మార్గులకు అంటే చెడ్డ పనులు చేసేవారికి భయం ఎక్కువ. తాము పట్టుబడతామేమో అని ఎప్పుడూ భయపడుతుంటారు. అందరికంటే వారే చావుకు ఎక్కువ భయపడతారు. చావుకు దూరంగా పారిపోతుంటారు. ఇంకా ఈ దేహంతో సుఖాలు అనుభవించాలని కోరుకొనే వాళ్లు, దంభాచారము కలవారు, రాగద్వేషములు కలవారు, వల్లమాలిన కోరికలు కోరుకుంటూ, అవి తీరకపోతే కోపం తెచ్చుకొనే వాళ్లు, ఇటువంటి వారు మృత్యువుకు ఎక్కువగా భయపడతారు. దీనినే ఆసురీ సంపద అంటారు. మనం ఆసురీ సంపదను వదిలి దైవీ సంపదను ఆశ్రయిస్తే, మనకు మృత్యుభయం ఉండదు. తప్పించుకోలేని మృత్యువును సంతోషంగా ఆహ్వానిస్తాము. అవసాన దశలో కూడా భగవంతుని స్మరిస్తూ ఉత్తమలోకాలు పొందుతాము.

(90 ఏళ్ల వాడు కూడా చావును తప్పించుకోడానికి ఖరీదైన హాస్పిటల్ లో చేరి

ఆక్సిజన్, వెంటిలేటర్ పెట్టించుకొని సాధ్యమైనంతవరకు చావుకు దూరంగా పారిపోతుంటాడు కానీ తుదకు మృత్యువు నోట్లో పడక తప్పదు. ఇది అనునిత్యం మనం చూస్తూ ఉన్న సత్యం. ఇవన్నీ తెలిసికూడా అందరం చావు అమంగళమనీ, చావుకు దూరంగా పారిపోవడానికి ప్రయత్నం చేస్తుంటాము. అదే మాయ.)

ఈ శ్లోకంలో రాక్షసులు భయంతో పారిపోతున్నారు అని అన్నారు వ్యాసులవారు. అంటూ దుర్మార్గులు పరమాత్మ సన్నిధిలో నిలువలేరు. ఎక్కడ పవిత్రత ఉంటుందో అక్కడ దుర్మార్గము ఉండదు. ఎక్కడ వెలుగు ఉంటుందో అక్కడ చీకటి ఉండదు. ఎవరి మనస్సు నిర్మలంగా ఉంటుందో అటువంటి వారిలో కోపము, అసూయ, ద్వేషము మొదలగు ఆసురీ భావాలకు చోటు ఉండదు. అవన్నీ పారిపోతాయి. అందుకే వీటిని అరిషడ్వర్గములు(కామము, కోపము, లోభము, మోహము, మదము, మాత్సర్యము) అంటే ఆరుగురు శత్రువులు అని అన్నారు. మనసు నిర్మలంగా ఉంటే ఈ శత్రువులు పారిపోతారు. మనసు మలినంగా ఉంటే, పవిత్రంగా లేకుంటే ఈ శత్రువులు ఒకరు వెంబడి ఒకరు వచ్చి మనమనసులో తిష్ట వేస్తారు. మనలను అధ:పాతాళానికి తోసేస్తారు. ఆ కారణం చేతనే భయంకరమైన విశ్వరూపం చూచి రాక్షసులు పారిపోతున్నారు అని అన్నారు వ్యాసులవారు.

## 37. కస్మాచ్చ తే న నమేరన్మహాత్మన్ గరీయసే బ్రహ్మణోऽప్యాదికర్త్రే।
## అనంత దేవేశ జగన్నివాస త్వమక్షరం సదసత్తత్పరం యత్॥

ఓ మహాత్మా! ఆది అంతములు లేని వాడా! దేవదేవా! ఈ జగత్తునకే ఆశ్రయుడైన వాడా! సత్ కు అసత్‌కు పరమమైన, అక్షరమైన (నాశనము లేని), పరబ్రహ్మస్వరూపము కల వాడా! బ్రహ్మకన్నా ముందునుండి ఉన్నవాడా! నీవు అందరి కంటే గొప్పవాడవు. అటువంటి నీవు ఎదురుగా కనపడితే, నీ విశ్వరూపం చూపిస్తుంటే, సిద్ధసంఘాలే కాదు, నేనే కాదు, ఎవరైనా సరే నీకు నమస్కరించకుండా ఎలా ఉండగలరు.

ఈ శ్లోకంలో పరమాత్మ దివ్యమైన లక్షణాలను మరొక్కసారి కీర్తించాడు అర్జునుడు. పరమాత్మ అందరికంటే శ్రేష్ఠమైనవాడు, ఆది పురుషుడు, బ్రహ్మకంటే ముందు ఉన్నవాడు, ఆది అంతము లేని వాడు, దేవతలకు అధిపతి, ఈ సమస్త జగత్తుకు ఆశ్రయమైనవాడు. నాశనము, మార్పులేని వాడు. సత్ అసత్తుకు అతీతమైన వాడు అంటే ఇక్కడ కార్య కారణములకు అతీతమైన వాడు అని అర్థం. ఇవన్నీ పరమాత్మ లక్షణాలు. ఇన్ని లక్షణాలు కల పరమాత్మ మనో నేత్రం ఎదురుగా సాక్షాత్కరిస్తే ఎవరైనా నమస్కరించకుండా ఎలా ఉండగలరు! అంటే అందరూ నమస్కారాలు చేస్తారు అని భావము.

38. త్వమాదిదేవ: పురుష: పురాణ స్త్వమస్య విశ్వస్య పరం నిధానమ్।
వేత్తా2పి వేద్యం చ పరం చ ధామ త్వయా తతం విశ్వమనన్తరూప॥

పరమాత్మ దివ్యరూపాన్ని చూచి ఉద్వేగాన్ని ఆపుకోలేకపోతున్నాడు అర్జునుడు. ఇంకా పరమాత్మ వైదుష్యాన్ని ఇలా వర్ణిస్తున్నాడు. నీవు ఆది దేవుడివి. పురాణ పురుషుడవు. ఈఅనంత విశ్వానికి ఆధారభూతుడవు. నీకు అన్నీ తెలుసు. నీకు తెలియనిది ఏదీ లేదు. నిన్ను తెలుసుకోవడమే చాలా కష్టం. కాని నీ గురించి తెలుసుకోవడమే అందరి కర్తవ్యము. అందరూ కావాలని కోరుకొనే పరమ పదము నీవే. నీవుఈ అనంత విశ్వం అంతా వ్యాపించి ఉన్నావు. అని కీర్తించాడు.

39. వాయుర్యమో2గ్నిర్వరుణశ్శశాఙ్క: ప్రజాపతిస్త్వం ప్రపితామహశ్చ।
నమోనమస్తే2స్తు సహస్రకృత్వ: పునశ్చ భూయో2పి నమోనమస్తే॥

అర్జునుడు తనలో చెలరేగుతున్న ఉద్వేగాన్ని ఆపుకోలేకపోతున్నాడు. ఇన్నిరోజులు తనతో కలిసి మెలిసి తిరిగిన కృష్ణుడు ఒక్కసారిగా తన విశ్వరూపాన్ని తన మనోనేత్రానికి దర్శింపచేస్తే తట్టుకోలేక పోతున్నాడు. ఇంకా ఇలా ఆయనను స్తోత్రం చేస్తున్నాడు.

ఓ దేవా! నీవే వాయువు. వాయు రూపంలో సమస్తజీవులకు ప్రాణవాయువును అందిస్తూ, వారి మనుగడకు కారణం అవుతున్నావు. అలాగే యముడి రూపంలో వారిని లయం చేస్తున్నావు. అందరి శరీరాలలోనూ, బయటా అగ్ని రూపంలో ఉండి మానవులకు, సకల జీవరాసులకు జీవాన్ని, ఆహారాన్ని సమకూరుస్తున్నది తమరే. నీటిని ఆవిరిగా మార్చి, వర్షరూపంలో స్వచ్ఛమైన నీటిని అందిస్తున్నది తమరే. వరుణుడి రూపంలో వర్షాలు కురిపిస్తూ పంటలు పండిస్తూ అందరికీ ఆహారాన్ని సమకూరుస్తున్నారు. చంద్రుడుగా చల్లని వెన్నెలలు కురిపిస్తూ మనసులకు ఆహ్లాదం కలిగిస్తున్నది మీరే. ప్రజాపతుల రూపంలో ఈ సమస్త సృష్టిని నిర్వహిస్తున్నది మీరు. వారి తండ్రి బ్రహ్మ. ఆయనకు తండ్రి అయిన విష్ణువు అన్నీ మీరే. అట్టి నీకు మరలా మరలా నమస్కరిస్తున్నాను. వేనకు వేలసార్లు నమస్కరిస్తున్నాను. మరలా మరలా నమస్కరిస్తున్నాను.

40.నమ: పురస్తాదథ పృష్ఠతస్తే నమో2స్తు తే సర్వత ఏవ సర్వ।
అనన్తవీర్యామితవిక్రమస్త్వం సర్వం సమాప్నోషి తతో2సి సర్వ:॥

అర్జునుడు అంతటితో ఆగలేదు. తనలో రేగిన ఉద్విగ్నతను తట్టుకోలేక పోతున్నాడు. అనంతమైన వీరత్వము, సామర్థ్యము, పరాక్రమము కలిగి, అంతటా వ్యాపించి ఉన్న సకలము తానే అయి ఉన్న పరమాత్మను చూచిన తరువాత, తను, తన హస్తినాపురము, ఈ 18 అక్షౌహిణీల సైన్యము అంతా చిన్ని ఆటబొమ్మలలాగా కనపడసాగాయి. అందుకే ఆయన చుట్టు తిరిగి ప్రదక్షిణపూర్వక నమస్కారం చేస్తున్నాడు. ఓ కృష్ణా! నీకు ప్రదక్షణ పూర్వకంగా నమస్కరిస్తున్నాను. నీకు ముందు, వెనుక, పక్కల, అన్ని వైపుల నుండి నమస్కరిస్తున్నాను. నీ వీర్యము అనంతము. నీ విక్రమము అమితము. నీవు అంతటా వ్యాపించి ఉన్నావు. అట్టినీకు నమస్కారము.

అర్జునుడిది మానవ శక్తి. అక్కడ చేరిన భీష్ముడు మొదలగు ప్రముఖులు, 18 అక్షౌహిణీల సైన్యము వీరిది మానవ శక్తి. ఆ శక్తి అంతా స్థూల శరీరం నుండి వచ్చింది. కాని పరమాత్మ శక్తి అనంతము, అపారము. మానవ శక్తికి పరిమితులు ఉన్నాయి. పరమాత్మ శక్తికి పరిమితులు లేవు. మానవుడు ముందు చూచి యుద్ధం చేయగలడు. కాని పరమాత్మకు అన్నివైపులా కళ్లే. అన్ని వైపులా చూడగలడు. ముందు వెనుక, చుట్టుపక్కల అన్ని వైపులా తానే అయిఉన్నాడు. అట్టి పరమాత్మస్వరూపమైన విశ్వరూపుడు అయిన కృష్ణునికి ముందు వెనుక, చుట్టుపక్కల తిరిగి భక్తిపూర్వకంగా నమస్కరించాడు అర్జునుడు.

## 41. సఖేతి మత్వా ప్రసభం యదుక్తం హే కృష్ణ హే యాదవ హే సఖేతి
## అజానతా మహిమానం తవేదం మయా ప్రమాదాత్ప్రణయేన వాపి.॥

ఇప్పుడు అర్జునుడికి ఇదివరకు జరిగినవి అన్నీ గుర్తుకు వస్తున్నాయి. కృష్ణార్జునులు బావా బావమరుదులు. సరసాలు ఆడుకునేవాళ్లు. కలిసి తిరిగేవాళ్లు. కలిసి భోజనం చేసే వాళ్లు. ఏమోయ్ కృష్ణా! అంటే ఏమోయ్ అర్జునా! అని పిల్చుకునేవాళ్లు. మరి ఇంతటి విశ్వరూపుడిని అనంతుడిని అంతటా నిండి ఉన్న వాడిని నేను అలా అన్నానా అని, కిరీటం తీసి, తల గోక్కుంటూ ఇలా అన్నాడు.

"ఓ కృష్ణా! నీవెవరో తెలియక, నీ మహిమలు విభూతులు అర్థం చేసుకోలేక, నాలో ఉన్న అజ్ఞానం చేత., ప్రమాద వశాత్తు అంటే పొరపాటున, ఓయ్ కృష్ణా! హే యాదవా! హే మిత్రమా! అని హేళనగా పిలిచి ఉంటాను. నీతో పక్కనకూర్చుని భోజనం చేసాను. నీతో కలిసి విహరించాను. నీతో కలిసి నిద్రించాను. మనం ఇద్దరం ఒంటరిగా ఉన్నప్పుడు చనువు కొద్దీ నిన్ను హేళనగా మాట్లాడాను. అప్పుడప్పుడు అందరి ఎదుటా నిన్ను యాదవుడవని నిర్లక్ష్యంగా మాట్లాడాను. ఆ అవమానాలన్నీ కేవలం పరిహాసం కోసమే కానీ వేరుకాదు. పైచెప్పినవన్నీ నేను చేసిన అపరాధాలు

అని నీవు అనుకుంటే నన్ను క్షమించు. అని వేడుకున్నాడు.

ఇంతటి మహాపురుషుడిని నేను చులకనగా చూచాను అన్న అపరాధ భావన అర్జునుడిలో కలిగింది. దానికి తీవ్రంగా పశ్చాత్తాప పడుతున్నాడు అర్జునుడు. కృష్ణుడికి పదే పదే నమస్కరిస్తూ తను తెలియకుండా ఏమైనా తప్పుచేసి ఉంటే క్షమించమని వేడుకుంటున్నాడు. ఆ మాటలన్నీ కూడా స్నేహంలో భాగంగా కించిత్ గర్వంతో మాట్లాడిన మాటలనీ వేరుగా తలచవద్దనీ ప్రార్థించాడు. తమరు కూడా విలక్షణంగా కాకుండా, మా మాదిరి మాలో కలిసిపోయి ఉండటం వలన ఆ పొరపాటు, ప్రమాదవశాత్తు, నా తెలియనితనం వలన జరిగింది కానీ వేరు కాదు అని తనకు తాను నచ్చచెప్పుకున్నాడు అర్జునుడు.

ఓ దేవా! మీరు అప్రమేయులు. ప్రాపంచికమైన నిందాస్తుతులతో తమరికి ఎటువంటి ప్రమేయం ఉండదు. కాబట్టి నేను పరిహాసానికి అన్న మాటలు పట్టించుకోకుండా నన్ను దయతో క్షమించండి. అని వేడుకున్నాడు.

( దీని వలన మనకు తెలిసింది ఏమిటంటే, గొప్పవాళ్లు, ఆత్మతత్వం తెలిసిన వాళ్లు ఎవరూ తమను గురించి తాము గొప్పలు చెప్పుకోరు. అంతే కాకుండా తమ దగ్గరకు వచ్చిన వాళ్లను కూడా తమతో సమానంగా చూస్తారు. తమను ఎవరైనా హేళనగా మాట్లాడినా పట్టించుకోరు. ఎలాగంటే, కృష్ణుడు కూడా అర్జునుడితో ఎప్పుడూ తన గురించి చెప్పుకోలేదు. ఒక సామాన్య మానవుడి లాగానే ప్రవర్తించాడు. ఇప్పుడు కూడా అర్జునుడు యుద్ధం చేయనని ధనుర్బాణాలు పక్కన బెట్టి, చతికిలబడ్డాడు కాబట్టి, ఆయనను యుద్ధం చేయడానికి సంసిద్ధం చేయడానికి, తప్పని సరి పరిస్థితుల్లో విశ్వరూపం చూపించవలసి వచ్చింది.

అలాకాకుండా, ఎవరైనా తమను తాము గొప్పవాళ్లమనీ, అన్నీ తెలిసిన వాళ్లమనీ మహిమలు కలవాళ్లమనీ ప్రకటించుకుంటే, వారికి ఆత్మజ్ఞానం లేదని, వారికి ఆత్మతత్వం తెలియదనీ మనం అనుకోవలసి వస్తుంది. ఎందుకంటే ఇలాంటి వారు మనకు ఎంతో మంది కనపడతారు. వారి చుట్టు వేలాది మంది భక్తులు తిరుగుతుంటారు. అంత మాత్రం చేత, వారి హంగు, ఆర్భాటం చూచి వారు గొప్పవారు, ఆత్మజ్ఞానం కలవారు అని అనుకోవడం పొరపాటు. )

## 42. యచ్చాపహాసార్థమసత్కృతో2సి విహారశయ్యాసనభోజనేషు।
## ఏకో2థవాప్యచ్యుత తత్సమక్షం తత్క్షామయే త్వామహమప్రమేయమ్॥

కృష్ణుడితో చనువుగా తిరిగినపుడు, అర్జునుడికి తాను చేసిన పనులు, ఆయనతో హాస్యానికి అన్నమాటలు అన్నీ ఒకటొకటిగా గుర్తుకొస్తున్నాయి.అవన్నీ తలచుకుంటుంటే, ఇవన్నీ నేనే అన్నానా! ఈ కృష్ణుడిని, ఈ విశ్వరూపుడిని నేను అలా అన్నానా! అని ఆశ్చర్యపోతున్నాడు. అందుకే మనస్ఫూర్తిగా క్షమాపణ వేడుకుంటున్నాడు.

"ఓ కృష్ణా! నీవు ఎవరో, నీ అసలు స్వరూపం ఏమిటో, నీ విభూతులు ఏమిటో తెలియక, కేవలం అజ్ఞానంతో, తెలియని తనంతో, నీవు నాకు బావవు అనీ, సఖుడవు అనీ నీ పట్ల నాకు ఉన్న చనువుతో, పొరపాటుగా, ఏమేమో అన్నాను. మనం ఇద్దరం భోజనం చేసేటప్పుడు, విహారం చేసేటప్పుడు, ఇద్దరం పక్కపక్కనే కూర్చుని ముచ్చట్లు చెప్పుకుంటున్నప్పుడూ, నీవూ నేను ఒంటరిగా ఉన్నప్పుడూ, నీవు పది మందిలో ఉన్నప్పుడూ, నీ గురించి హేళనగా, పరిహాసంగా, చులకనగా మాట్లాడి ఉంటాను. అప్పుడప్పుడు నీ గురించి పదిమందిలో అవమానకరంగా కూడా మాట్లాడి ఉంటాను. ఓ కృష్ణా! అవన్నీ నేను తెలియని తనంతో, చనువుతో మాట్లాడిన మాటలే కానీ వేరు కావు. అప్పుడు నీ గురించి, నీ విభూతుల గురించి తెలియక అలా అని ఉంటాను. అవన్నీ నీవు పెద్దమనసుతో క్షమించు. జరిగిన దానికి నేను పశ్చాత్తాప పడుతున్నాను. బాధతో కుమిలిపోతున్నాను. భయంతో వణికిపోతున్నాను అని తన మనసులో బాధను వ్యక్తీకరించాడు అర్జునుడు. ఇంకా ఇలా అంటున్నాడు.

## 43.పితా2సి లోకస్య చరాచరస్య త్వమస్య పూజ్యస్య గురుర్గరీయాన్।
## న త్వత్సమో2స్త్యభ్యధిక: కుతో2న్యో లోకత్రయే2ప్యప్రతిమప్రభావ.॥

ఓ కృష్ణా! తమరు మా మధ్య ఒక సామాన్య మానవుడి మాదిరి తిరిగిన్పటికీ, నీవు ఈ లోకములో ఉన్న చరాచర భూతజాలమునకు, సకల ప్రాణులకు తండ్రి వంటి వాడివి. అంతే కాదు అత్యంత పూజనీయులు మీరే. ఈ మూడులోకములకు తమరే పరమ శ్రేష్ఠుడు అయిన గురువు అయి ఉన్నారు. ఎందుకంటే తమరికి తమరే గురువు. తమకు గురువు అంటూ ఎవరూ లేరు. ఈ మూడులోకములలో నీతో సమానమైన , నీ కంటే అధికమైన ప్రతిభాపాటవాలు, ప్రభావము కలవారు ఎవరూ లేరు.

## 44. తస్మాత్ప్రణమ్య ప్రణిధాయ కాయం ప్రసాదయే త్వామహమీశ మీడ్యమ్।
## పితేవ పుత్రస్య సఖేవ సఖ్యు: ప్రియ: ప్రియాయార్హసి దేవ సోఢుమ్॥

ఈ లోకమునకు తండ్రి, గురువు, దైవము, పూజనీయులు అన్నీ మీరే కాబట్టి నన్ను కూడా, తప్పుచేసిన కుమారుని తండ్రి క్షమించినట్టు, స్నేహితుని అపరాధమును మరొక స్నేహితుడు క్షమించినట్టు, ప్రియురాలి వాచాలత్వమును ప్రియుడు క్షమించినట్టు, నువ్వు కూడా నా తప్పులను అన్నిటినీ క్షమించు. నీకు సాష్టాంగ నమస్కారం చేస్తున్నాను. నా తప్పులను మన్నించు. ప్రణిధాయ కాయం అంటే నాశరీరాన్ని భూమి మీద పడవేసి నీకు నమస్కరిస్తున్నాను అంటే సాష్టాంగ నమస్కారం చేస్తున్నాను.

సాష్టాంగ నమస్కారం పూర్తి శరణాగతికి గుర్తు. అహంకారములను విడిచిపెట్టి నీవే తప్ప నిత: పరం బెరుగ అనే రీతిలో నమస్కరించడం. ఆ నమస్కారం కూడా కృష్ణుడిని సకల జగత్తుకు ఈశ్వరుడిగానూ, అందరిచేతా ప్రస్తుతింప తగినవాడుగానూ గుర్తించి సాష్టాంగ పడి నమస్కరిస్తున్నాడు

ఇప్పుడు అర్జునుడికి కృష్ణుడి మాటల మీద బోధనల మీదా పూర్తి నమ్మకం కలిగింది. అందుకే సాష్టాంగ నమస్కారం చేసాడు. సాష్టాంగ నమస్కారము అంటే శరీరంలో ఉండే ఎనిమిది అంగములు భూమికి తగలేటట్టు బోర్లాపడుకొని నమస్కరించడం. తల, గుండె, రెండు చేతులు, రెండు తొడలు, రెండు పాదములు, ఇవి భూమిని తాకుతూ నమస్కరించడం సాష్టాంగ నమస్కారము అని అంటారు.

## 46.అదృష్టపూర్వం హృషితో2స్మి దృష్ట్వా భయేన చ ప్రవ్యథితం మనోమే। తదేవ మే దర్శయ దేవ రూపం ప్రసీద దేవేశ జగన్నివాస॥

తన మనో నేత్రానికి గోచరిస్తున్న భయంకరమైన విశ్వరూపమును చూడలేక పోతున్నాడు అర్జునుడు. ఎంత తొందరగా మామూలు రూపం వస్తే అంత బాగుండు అనుకుంటున్నాడు. అదే పైకి అన్నాడు. అత్యంత భయంకరము అయిన నీ విశ్వరూపం చూచి భయపడ్డాను అంటే కృష్ణుడు తనను పిరికివాడు అనుకొనే ప్రమాదం ఉంది. అందుకని కృష్ణా! నీవు చూపించిన ఈ విశ్వరూపం “అదృష్ట పూర్వం” అంటే ఇంతకు ముందు ఎప్పుడూచూడలేదు. ఇదే ప్రథమం. నాకు చాలా ఆశ్చర్యంగానూ, ఆనందంగానూ ఉంది. ఏదో తెలియని దివ్యానుభూతి, ఇంతకు ముందు అనుభవించని అనుభూతి కలిగింది. కానీ ఎక్కడో ఒక మూల చెప్పలేని భరించలేని భయం కూడా ఉంది. మనసంతా ఆందోళనగా ఉంది. కాబట్టి ఓ దేవదేవా! జగన్నివాసా! నా మీద దయ ఉంచి ఇంతకు ముందు రూపంతో కనపడవయ్యా! అని ప్రార్థించాడు. ఇంతకు ముందు తాను చూసిన రూపం ఎలా ఉంటుందో తరువాతి శ్లోకంలో వివరించాడు అర్జునుడు.

## 46. కిరీటినం గదినం చక్రహస్త మిచ్ఛామి త్వాం ద్రష్టుమహం తథైవ।
## తేనైవ రూపేణ చతుర్భుజేన సహస్రబాహో భవ విశ్వమూర్తే॥

ఓ కృష్ణా! ఈ అనంత విశ్వం అంతా నిండి, విశ్వమే నీ రూపముగా కల ఓ విశ్వమూర్తీ! ఓ సహస్రబాహో! ఇంక చాలయ్యా! నేను నీ రూపాన్ని చూడలేకపోతున్నాను. ఈ భయంకరమైన కాలపురుషుని అవతారం చాలించి, నీ విశ్వరూపాన్ని ఉపసంహరించి, ఇదివరకటి మాదిరి, ఎంచక్కా పట్టు పీతాంబరాలు, వన మాలలు, కిరీటము, గద, చక్రము, నెమలి పింఛము, ముఖానచిరునవ్వు సౌమ్యంగా ఉన్న మునుపటి ఆ రూపం ధరించు. అని వేడుకున్నాడు.

ఇక్కడ ఒక విషయం ఉంది. చతుర్భుజం అని వాడారు వ్యాసులవారు. కాని ఇంతకు ముందు ఎక్కడా కృష్ణుడు నాలుగు చేతులలో అర్జునుడికి కనపడినట్టు లేదు. కాకపోతే అర్జునుడి మనసులో ఒక ఊహ మెదిలి ఉండవచ్చు అనేకములైన చేతులు, కాళ్లు, తలలు, కళ్లు ఆయుధములు భయంకరమైన నోరు ఆ నోటిలోకి అందరూ క్యూకట్టి వెళ్లడం, దీనికన్నా నాలుగుభుజాలతో ఉన్న రూపం బాగుంటుంది కదా అని అనుకొని ఉండవచ్చు. ఇది అప్పటి అర్జునుడి మానసికస్థితి కాని వేరుకాదు. అసలు కృష్ణుని యొక్క అర్జునుని యొక్క శారీరక స్థితిలో ఏ మార్పూలేదు. కేవలం అర్జునుడు మానసిక నేత్రంతోనే ఇవన్నీ చూస్తున్నాడు అని అర్థం చేసుకోవాలి.

దీనిని మరొక విధంగాకూడా శాస్త్రకారులు విశ్లేషించారు. అర్జునుడు అప్పటి వరకు కృష్ణుడిని మామూలు మనిషిగానే భావించాడు. కృష్ణుడికి అందరిమాదిరి రెండు కాళ్లు, రెండు చేతులు, ఒక తల ఉన్నాయి. కాని అదే కృష్ణుడు తన మనోఫలకం మీద అనేకములైన వేనకు వేల చేతులతో కాళ్లతో ఉదరములతో భయంకరమైన ముఖముతో కాలస్వరూపుడుగా కనపడుతున్నాడు. ఆ రూపాన్ని చూడలేకపోతున్నాడు. కృష్ణుడు సాక్షాత్తు విష్ణుస్వరూపము అంటే సర్వవ్యాపిత్వము కలవాడు అని తెలుసుకున్న అర్జునుడు కృష్ణుడిని తన విశ్వరూపం ఉపసంహరించి తాను చూడటానికి అలవాటుపడ్డ విష్ణువు రూపమైన చతుర్భుజములు, శంఖుచక్రములు, గద, కిరీటము, వీటితో కూడిన మంగళకరమైన విష్ణురూపాన్ని ధరించమని కోరాడు. అంటే “విశ్వరూపం” నుండి “విష్ణురూపం”లోకి మారమని కోరాడు. తన మనస్సులో కృష్ణుడిని విష్ణువు అవతారంగా కనిపించాలని కోరుకున్నాడు. కాని, అర్జునుడు కళ్లు తెరిస్తే రథం తోలుతున్న మామూలు కృష్ణుడే కనపడతాడు. ఇలా అనుకుంటే ఈ సందర్భానికి సరిగా సరిపోతుంది అని శాస్త్రకారులు వ్యాఖ్యానించారు.

ఇంతే కాకుండా, విష్ణుసహస్రనామాలలో మొట్టమొదటి నామం విశ్వం అంటే

విశ్వాకారుడు. తరువాతి పదం విష్ణు: అంటే విష్ణు స్వరూపుడు. అందుకే అర్జునుడు, కాల స్వరూపుడైన విశ్వరూపుడుని మంగళ కరమైన విష్ణు స్వరూపుడుగా కనపడమని కోరాడు అని రాసారు. కాని కృష్ణుడు మాత్రం చేతిలో చర్నాకోలతో, రథం నొగల మీద కూర్చుని కనిపించాడు. అర్జునుడు కళ్లు తెరవగానే కనిపించిన రూపం అది. అంటే కృష్ణుడి రూపంలో ఏమీ మార్పు లేదు. విశ్వాకారుడుగానూ, కాలస్వరూపుడుగానూ కనిపించడం కేవలం అర్జునుడి మనస్సులో ఏర్పడిన భావన మాత్రమే అని అర్థం చేసుకోవాలి.

శ్రీ భగవానువాచ:

## 47. మయా ప్రసన్నేన తవార్జునేదం రూపం పరం దర్శిత మాత్మయోగాత్।
## తేజోమయం విశ్వమనన్త మాద్యం యన్మే త్వదన్యేన న దృష్టపూర్వమ్॥

ఇప్పటికి ఇది చాలు అని అనుకున్నాడు కృష్ణుడు. ఇంకా ఎక్కువ అయితే అర్జునుడు యుద్ధ రంగం నుండి భయంతో పారిపోయే ప్రమాదం కూడా ఉంది. అందుకని ఇలా అంటున్నాడు.

"అర్జునా! అమిత తేజస్సుతో కూడినది, అనంతమయినది, ఆది అంతము లేనిది, ఈ విశ్వం అంతా తానే అయినదీ, ఇప్పటి వరకు నీవు తప్ప ఇంక ఎవరూ చూడనిదీ, పరమము అయిన ఈ విశ్వరూపమును నీవు ఇదివరకు చూడలేదని నాకు తెలుసు. అయినా నీవు కావాలి అని అడిగావు కాబట్టి నీమీద ఉన్న ప్రసన్నతతో, వాత్సల్యంతో, నా యోగశక్తి వలన నీ మనోనేత్రానికి విశ్వరూపాన్ని గోచరింపచేసాను.

ఓఅర్జునా! నీవు ఇప్పటి వరకు ఇటువంటి రూపాన్ని చూడలేదు కాబట్టి నీకు భయం వేసింది. కానీ నా యీ రూపం భయంకరమైనది కాదు. మీరంతారోజూ చూస్తున్నదే! కాని ఒకే సారి చూచావు కాబట్టి భయంతో వణికిపోయావు. నా ఈ విశ్వరూపము ఎంతో తేజోమయము. అత్యంత తేజోవంతమైనది. ఆది అంతములు లేనిది. విశ్వాన్ని అంతా ఒకేచోట చూడగలిగేది. ఈ ప్రపంచంలో ఉన్న అన్ని వస్తువుల కన్నా విలక్షణమైనది. అటువంటి రూపాన్ని నీ మీద నాకు ఉన్న ప్రేమ వాత్సల్యముచేత నా యోగశక్తితో నీకు చూపించాను. అదీ నీవు కోరితేనే చూపించాను. అని అన్నాడు కృష్ణుడు.

ఇక్కడ మయాప్రసన్నేన అంటే నాకు నీ మీద ఉన్న ప్రసన్నతతో, వాత్సల్యంతో నీ మనోఫలకం మీద చూపించాను అని అన్నాడు కృష్ణుడు. మనకు కూడా ఆ పరమాత్మ అసలు స్వరూపం తెలుసుకోవాలంటే ఆయన కరుణ, ప్రేమ, వాత్సల్యం కావాలి. దానికోసం మనం ఆయనను

నిరంతరం ఏకాగ్రతతో ధ్యానించాలి. అంతే కానీ అర్జునుడికి కనిపించిన విశ్వరూపం నాకెందుకు కనిపించదు అని వితండవాదం చేయకూడదు.

## 48.న వేదయజ్ఞాధ్యయనైర్న దానై ర్న చ క్రియాభిర్న తపోభిరుగ్రైః। ఏవం రూపశ్శక్య అహం నృలోకే ద్రష్టుం త్వదన్యేన కురు ప్రవీర॥

అర్జునా! నీకు తెలుసోలేదో నీవు చూచిన ఈ రూపం ఇదివరకు మానవులు ఎవరూచూడలేదు. చూచే అవకాశమే లేదు. నువ్వు కోరావు కాబట్టి. నువ్వు నాకు ప్రియబంధువు, మిత్రుడవు కాబట్టి నీకు చూపించాను. వేదములు అధ్యయనము చేసినా, దానధర్మాలు చేసినా, ఉగ్రమైన తపస్సు చేసినా, వాళ్లకు ఈ విశ్వరూపం గురించి జ్ఞానం కలుగుతుందేమోకానీ, చూడటం సాధ్యం కాదు. జ్ఞానము దానికి తోడు విజ్ఞానము, భక్తి, వైరాగ్యము కలిగితే కానీ ఈ విశ్వరూపం చూడటం సాధ్యం కాదు. నీకు ఆ స్థితి ఇంకా రాకపోయినా నా యోగమహిమ వలన నీవు చూడగలిగావు.

(అమెరికా గురించి పుస్తకాలలో చదవడం వేరు. ఇంటర్ నెట్ లో చూడటం వేరు. అమెరికా పోయి ప్రత్యక్షంగా చూడటం వేరు. అలాగే పరమాత్మ యొక్క విశ్వరూపం గురించి శాస్త్రములలో చదివి తెలుసుకోవడం వేరు. ధ్యాన,సమాధులలో నిమగ్నమై మనోనేత్రంతో దర్శించడం వేరు.)

చాలా మంది ఈ శ్లోకాన్ని పొరపాటుగా అర్థం చేసుకొనే అవకాశం ఉంది. ఎలాగంటే వేదములు అధ్యయనం చేయడం, దానధర్మాలు చేయడం, తపస్సు చేయడం, యజ్ఞయాగములు చేయడం ఇవన్నీ వృథానా అని అనిపించవచ్చు. కాని అలా అర్థం చేసుకోకూడదు. అందరూ అన్నీ చేయలేరు. ఎవరి శక్తిని బట్టి వారు చేస్తారు. కాబట్టి అన్నీ మంచివే. ఆచరించతగ్గవే. వీటికి తోడు భక్తి, ఏకాగ్రత, నిష్కామకర్మాచరణ ఇవన్నీ కూడా అత్యావశ్యకములు. తుదకు వైరాగ్యము. సంపూర్ణ శరణాగతి. అప్పుడే మనకు పరమాత్మయొక్క విశ్వరూపాన్ని దర్శించే అర్హత కలుగుతుంది. కాబట్టి ఆ గమ్యం చేరుకోడానికి దానధర్మాలు, వేదాధ్యయనము, తపస్సు, యజ్ఞయాగాదులు ఉపకరిస్తాయి. కాబట్టి  అన్నీ చేయతగ్గవే. ఏదీ ఎక్కువ కాదు. ఏదీ తక్కువ కాదు. అని అర్థం చేసుకోవాలి.

## 49. మాతే వ్యథా మా చ విమూఢ భావో దృష్ట్వా రూపం ఘోర మీదృఙ్మమేదమ్

వ్యపేతభీః ప్రీతమనాః పునస్త్వం
తదేవ మే రూపమిదం ప్రపశ్య॥

అర్జునా! నీవు ఎందుకు భయపడుతున్నావు. నీ మనస్సు ఎందుకు వికలమయింది. నీవు వీరుడవు, భయం అంటే నీకు తెలియదు కదా! కాబట్టి భయపడకు. నా వంక ప్రసన్నంగా చూడు. నీవు కోరినట్టు నా పూర్వరూపము నీకు కనపడుతుంది. నీ మామూలు కళ్లు తెరిచి నా వంక చూడు అని అన్నాడు.

పులిని ఆడించేవాడికి పులి అంటే భయం ఉండదు. కాని చూచేవాళ్లకు చచ్చేంత భయంఉంటుంది. అలాగే తానే అనంతమైన విశ్వం తానే అయిన కృష్ణుడికి విశ్వరూపం అంటే భయం ఉండదు. కాని అర్జునుడు ఆ విశ్వరూపం, కాలస్వరూపం, భయానకమైన ఆ రూపం చూచి వణికిపోతున్నాడు. రక్తం మనం ఎప్పుడూచూడం. అది ఒక్కసారిగా గాయం నుండి కారుతుంటే కొంత మంది స్పృహ తప్పిపడిపోతారు. అంటే ఎప్పుడూ చూడనిది చూస్తే భయం,సంభ్రమం కలగుతుంది. అర్జునుడు కూడా ఇటువంటి విశ్వరూపాన్ని ఒక్కసారిగా తన మనోఫలకం మీద చూచేటప్పటికి భయ విహ్వలుడు అయ్యా. అప్పుడు కృష్ణుడు అన్నాడు.

ఓ అర్జునా! ఎందుకయ్యా భయపడుతున్నావు. ఈ విశ్వరూపాన్ని నీవు రోజూ చూస్తున్నదే. కాకపోతే నీకు ఇష్టం లేని విషయాలను, నీవు కోరుకోని విషయాలను నీ మనసు అంగీకరించని విషయాలను ఒక్కసారిగా నాలో చూచేసరికి నీకు భయం, విమూఢ భావన కలిగింది. ఆ భయాన్ని, విమూఢ భావాలను విడిచిపెట్టు. స్వస్థత చెందు. నీ కళ్లు తెరిచి నా పూర్వరూపాన్ని చూడు." అని అన్నాడు కృష్ణుడు.

(రక్తం చూడటం మనకు ఇష్టంలేదు. మరణం చూడటం మనకు ఇష్టం లేదు. అలాగా అర్జునుడికి భీష్మ,ద్రోణులు చావడం ఇష్టం లేదు. కాని అటువంటి వారు మృత్యుముఖంలోకి వెళ్లడం చూచి తట్టుకోలేకపోయాడు. అలాగే తన కళ్లెదుట ఉన్న 18 అక్షౌహిణీల అపారమైన సైన్యం అంతా మృత్యుముఖంలోకి చొరబడడం చూచి భయంతో కంపించిపోయాడు. ఎందుకంటే ఇవేవీ అర్జునుడికి ఇష్టం లేదు. అర్జునుడి మనసు అంగీకరించదు. మనకు కూడా చెడు కల వస్తే పెద్దగా అరిచి లేచి కూర్చుంటాము. అర్జునుడి పరిస్థితి అలాగే ఉంది. కానీ కృష్ణుడు వీటి కంతటికీ అతీతుడు. భయం అంటే తెలియని వాడు. అందుకే అర్జునుడిని "భయపడవద్దు, నీవంటి వీరులు ప్రతిదానికీ భయపడటం మూఢత్వం అవుతుంది. ఆ మూఢత్వాన్ని వదిలిపెట్టు అని బోధించాడు కృష్ణుడు).

కృష్ణుడు తన పూర్వరూపంలో ఏ విధంగా కనిపించాడు.. అర్జునుడు ఏ రూపం

చూచాడు అనే విషయాన్ని మనకు చెప్పాల్సింది ఒక్క సంజయుడు మాత్రమే. అందుకే సంజయుడు ఇలా అంటున్నాడు.

సంజయ ఉవాచ:

## 50.ఇత్యర్జునం వాసుదేవస్తథోక్త్వా స్వకం రూపం దర్శయామాస భూయః।
## ఆశ్వాసయామాస చ భీతమేనం భూత్వా పునస్సౌమ్యవపుర్మహాత్మా॥

ఓ ధృతరాష్ట్రమహారాజా! ఈ విధంగా కృష్ణుడు చెప్పగా అర్జునుడు కళ్లు తెరిచాడు. చుట్టు చూచాడు. ఎదురుగా అపారమైన కౌరవ సేనలు, భీష్మ,ద్రోణ,కృప,అశ్వత్థామ,కర్ణులు తమవైపు యుద్ధానికి వచ్చిన అపారమైన సైన్యాలు, కోలాహలం కనపడింది. కృష్ణుడు చిరునవ్వుతో చేతిలో గుర్రాలను తోలే చర్నాకోలతో, తనదైన సౌమ్యరూపంతో, తన ఎదురుగా నిలబడి ఉండటం చూచాడు అర్జునుడు. అమ్మయ్య అందరూ ప్రస్తుతానికి బతికే ఉన్నారు. ఎవరూచావలేదు అని పరవశించి పోయాడు అర్జునుడు. సౌమ్యమైన తన పూర్వరూపంతో అర్జునుడి ఎదురుగా నిలబడ్డ కృష్ణుడు అర్జునుని బుజం తట్టి భయంలేదని ఓదార్చాడు.

ఇక్కడ ఒక విషయంమనం గమనించాలి. కృష్ణుడు ఎప్పుడూ ఒకే రూపంతో ఉన్నాడు. కేవలం అర్జునుడు తన మనోనేత్రంతో ఈ అనంతమైన విశ్వం యొక్క రూపాన్నిదర్శించాడు. మరలా కళ్లు తెరవగానే కృష్ణుడు మామూలుగానే కనపడ్డాడు. అంతే గానీ మన సినిమాలలో చూపించినట్టు ఆకాశం అంత ఎత్తు ఉన్న కృష్ణుడు మామూలుగా ఆరడుగుల ఎత్తుకు దిగిపోయాడు అని కాదు. కృష్ణుడు అప్పుడు ఇప్పుడు ఎప్పుడూ ఒకే రూపం. కేవలం అర్జునుడి మనోదృష్టిభేదం మాత్రమే విశ్వరూప సందర్శనము

మనం కూడా ఈ విశ్వరూపాన్ని సందర్శించవచ్చు కాకపోతే ఉన్నది ఉన్నట్టు, నిజాన్ని నిజంగానూ అంగీకరించగలగాలి. అత్యంత సహజమైన మరణాన్ని చూచి భయపడకూడదు. పుట్టుక ఎంత సహజమో మరణం కూడా అంతే సహజం అని భావించాలి. సుఖ దు:ఖాలు వస్తూపోతూ ఉంటాయి అనీ, పొంగిపోవడం, కుంగి పోవడం చేయకూడదు అనీ, భావించాలి. అందరిలో పరమాత్మ ఆత్మస్వరూపుడుగా ఉన్నాడు అని భావించి, అందరినీ సమానంగా చూడాలి. ఎవరి మీదా విరోధము, ద్వేషము పనికిరాదు అని అనుకోవాలి. వల్లమాలిన కోరికలు మనలను అధ:పాతాళానికి నెడతాయి కాబట్టి కోరికలను అదుపులో పెట్టుకోవాలి. అనే విషయాన్ని తెలుసుకోవాలి. ఈషణ త్రయం అంటే భార్య, సంతానము, ధనము వీటిమీద మమకారం పరిమితంగా ఉండాలి

కానీ అవే జీవితంగా బతకకూడదు. వీటిని అన్నిటినీ ఉన్నవి ఉన్నట్టుగా దర్శించడమే విశ్వరూపం. కానీ, ఇవన్నీ మనకు ఇష్టం ఉండవు. వీటిని చూడటానికి, కనీసం భావించడానికి కూడా మన మనసు అంగీకరించదు. అందుకని మనకు విశ్వరూపం కనిపించదు.

అర్జున ఉవాచ:

### 51. దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన।
### ఇదానీమస్మి సంవృత్తస్సచేతాః ప్రకృతిం గతః॥

అర్జునుడు కళ్లు తెరిచాడు. ఎదురుగా కృష్ణుడు కనపడ్డాడు. అమ్మయ్య అనుకున్నాడు. చుట్టు సైన్యము, ఎదురుగా తన తాత, గురువులు, బంధువులు కనపడ్డారు. మరలా అర్జునుడిలో మమకారము, నావారు, పరాయివారు అనేభేదభావము ప్రవేశించాయి. దానికి సూచనగానే వ్యాసుల వారు ఛందస్సును కూడా మార్చాడు. 23 అక్షరాల ఛందస్సు 16అక్షరాలకు మారి పోయింది.

అమ్మయ్య! కృష్ణా మరలా మనిషి రూపంలో కనిపించావా! ఇప్పుడు నా మనసు కుదుట పడింది. నా పూర్వస్థితిని పొందాను. ఇదయ్యా నీ రూపం అంటే. ఇలా ఉండాలి నువ్వు ఎల్లప్పుడూ చక్కగా చిరునవ్వు నవ్వుతూ ఉండాలి అని అన్నాడు. అంటే అర్జునుడు కళ్లు తెరిచేటప్పటికి అతని కళ్లముందు కృష్ణుడు చేతిలో చర్నాకోలతో చిరునవ్వుతో కనిపించాడు. అమ్మయ్య అనుకున్నాడు. భయం పోయి స్వస్థత చెందాడు అర్జునుడు.

ఇంతకు ముందు 46వ శ్లోకంలో నాలుగు భుజములతో శంఖు చక్రములతో, గదతో దర్శనం ఇవ్వండి అని కోరాడు అర్జునుడు. కాని కృష్ణుడు అలా కనపడలేదు. కేవలం సాధారణ కృష్ణుడిగా, చేతిలో చర్నాకోలతో కనపడ్డాడు. ఆ సమయంలో అర్జునుడి ఊహల్లో కృష్ణుడు విష్ణుస్వరూపుడు. కాని అలా కనపడడం కృష్ణుడికి ఇష్టం లేదు. అందుకనే మామూలు మానవుడిగా కనిపించాడు. దీనిని బట్టి మనం అర్థం చేసుకోవలసింది ఈ నామములు, రూపములు మనం కల్పించుకున్నవే. విశ్వం అంతా పరమాత్మ నిండి ఉన్నాడు. అందుకే విశ్వం అంతా నేనే అనే భావనతో విశ్వరూపం చూపించాడు. కాని, మనం, మన సౌలభ్యం కోసం పరమాత్మను శివుడు, విష్ణువు, రాముడు, దేవీ ఇలా వివిధ రూపాలలో కొలుస్తున్నాము. ఇది ప్రాథమిక దశ అని గుర్తుపెట్టుకుంటే చాలు. ప్రాథమిక దశ నుండి మనం అందరం ఒక్కొక్క మెట్టు ఎక్కుతూ, పరమాత్మను "విశ్వాకారం గగన సదృశం" అనే భావనలో చూడగలగాలి.

అర్జునుడి పరిస్థితి చూచి కృష్ణుడు ఇలా అన్నాడు.

శ్రీభగవానువాచ:

52. సుదుర్దర్శమిదం రూపం దృష్టవానసి యన్మమ
దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శనకాఙ్క్షిణః॥

ఓ అర్జునా! ఇప్పటి దాకా నీ మనోనేత్రంతో నీవు చూచిన విశ్వరూపం చూడటానికి చాలా దుర్లభమైనది. ఆ విశ్వరూపం చూడటం అందరికీ సాధ్యం కాదు. దేవతలు కూడా అనునిత్యమూ ఈ విశ్వరూపాన్ని చూడటానికి కోరుకుంటూ ఉంటారు. ఇక్కడ దేవతలు అంటే మంచి వారు. యోగులు. సాధకులు. కాని వారికి కూడా పరమాత్మ విశ్వరూపం సాధ్యం కావడం లేదు. ఎందుకంటే వారు తమ మనసును అదుపులో పెట్టుకోలేకపోతున్నారు. కోరికలను తగ్గించుకోలేకపోతున్నారు. తమకు ఇష్టంలేని వాటిని అంగీకరించలేకపోతున్నారు. అందుచేత వారు ఎన్ని దానాలు,యాగాలు చేసినా నా అసలైన విశ్వరూపాన్ని చూడలేకపోతున్నారు అని తరువాతి శ్లోకంలో వివరిస్తున్నాడు కృష్ణుడు.

53. నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా।
శక్యఏవం విధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా॥

ఇంతకు ముందు 48వ శ్లోకంలో చెప్పిన విషయాన్ని మరలా చెబుతున్నాడు కృష్ణుడు. "ఓ అర్జునా! ఇప్పటి దాకా నీ మనో నేత్రంతో నువ్వుచూచిన నా విశ్వరూపం సాధారణ మానవులకు సాధ్యం కాదు. కేవలం వేదములు అధ్యయనం చేసినంత మాత్రాన, దాన ధర్మములు, యజ్ఞయాగములు చేసినంత మాత్రాన తపస్సు చేసినంత మాత్రాన, సాధ్యం కాదు." అని మరలా ఉ ద్ఘాటించాడు కృష్ణుడు.

వేదాధ్యయనము, శాస్త్రములు చదవడం వాటివలన జ్ఞానం వస్తుంది కానీ విజ్ఞానం రాదు. కాబట్టి మేము వేదములు శాస్త్రములు పురాణములు చదివాము, అర్థం చేసుకున్నాము, మేము ఇన్ని దానధర్మములు చేసాము,తపస్సులు చేసాము అంటే కుదరదు. వీటి వలన మానసిక నేత్రము తెరుచుకోదు అని పరమాత్మ స్పష్టంగా చెబుతున్నాడు. కాకపోతే వాటి వలన పుణ్యం వస్తుంది. స్వర్గలోక ప్రాప్తికలుగుతుంది. స్వర్గసుఖాలు అనుభవిస్తారు. క్షీణేపుణ్యేమర్త్యలోకం విశంతి. ఆర్జించుకున్న పుణ్యం అయిపోగానే మరలా జననం, మరణం. ఈ జనన మరణ చక్రంలో తిరుగుతూ ఉంటారు. మరి ఈ విశ్వరూపం ఎలా కనపడుతుంది అనే విషయం తరువాతి శ్లోకంలో వివరిస్తున్నాడు

కృష్ణపరమాత్మ.

## 54. భక్త్యా త్వనన్యయా శక్య అహమేవం విధోఽర్జున।
## జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరన్తప॥

ఓ అర్జునా! ఈ విశ్వరూపమును నా మీద అనన్యమైన ఏకాగ్రమైన భక్తితో మాత్రమే తెలుసుకోగలరు. నన్ను నన్నుగా చూడటానికి, యదార్థంగా తెలుసుకోడానికి, అద్భుతమైన నా విశ్వరూపాన్ని చూడటానికి కేవలం భక్తితో మాత్రమే శక్యం అవుతుంది.

ఇంతకు ముందు శ్లోకంలో వేదాధ్యయనము వలనా, ఘోర తపస్సుల వలనా, దాన ధర్మాలు చేయడం వలనా, యజ్ఞయాగములు చేయడం వలనా పరమాత్మయొక్క విశ్వరూపం చూడటం కానీ, దాని గురించి తెలుసుకోవడం కానీ సాధ్యం కాదు అని చెప్పి ఈ చివరి రెండు శ్లోకాలలో ఎవరికైతే అనన్య మైన భక్తి, ఏకాగ్ర చిత్తము ఉంటాయో వారే తమ మనో నేత్రము ద్వారా నా విశ్వరూపము చూడగలరు అని చెప్పి ఈ అధ్యాయమును ముగించాడు వ్యాసులవారు.

ఇక్కడ అనన్య భక్తి అని వాడారు. భక్తి రెండురకాలు. ఒకటి సకామ భక్తి. రెండవది నిష్కామ భక్తి. ధనం కొరకు, ప్రాపంచిక సుఖాలను కోరుతూ పరమాత్మమీద భక్తి కలిగి ఉండటం సకామభక్తి. రెండవది నిష్కామభక్తి అంటే ఏ కోరికలు లేని భక్తి అని అర్థం. అంటే కేవలం ఈశ్వరుని కొరకే, ఈశ్వరుని పొందడం కోసమే భక్తి కలిగి ఉండటం. అన్యములు అంటే ఇతరములైన వాటి కొరకు కాకుండా కేవలం పరమాత్మనుపొందడం కోసమే భక్తి కలిగి ఉండటం. దీనినే అనన్యభక్తి అంటారు. అనన్య భక్తి అంటే ప్రాపంచిక విషయముల మీదనుండి మనస్సును మరల్చి పరమాత్మ యందు నిలపాలి. పరమాత్మ యందు ఆసక్తి, భక్తి కలిగి ఉండాలి. ఆ భక్తిచెదిరి పోకూడదు. చంచలంగా ఉండకూడదు. ఒక్క పరమాత్మమీద తప్ప ఇతరముల మీద ఆసక్తి అనురక్తి ఉండకూడదు.

అందరికీ భగవంతుడి మీద భక్తి ఉంటుంది. ఆ భక్తి అతడు కోరుకునే కోరికలు ఆ కోరికలు తీరడం బట్టి ఆధారపడి ఉంటుంది. అటువంటి భక్తి కల వాళ్లు దేవుళ్లను మారుస్తూ ఉంటారు. అది కేవలం సకామ భక్తి అనిపించుకుంటుంది. అంటే కేవలం తన కోరికలుతీరడం కోసమే పరమాత్మ మీద భక్తి కలిగి ఉండటం. . ఈ రోజు ఉండి రేపు లేని భక్తి అసలు భక్తి కాదు. గురువారం రోజు సాయిబాబా గుడి ముందర చాంతాడంత క్యూ ఉంటుంది. మరునాడు ఎవరూ ఉండరు. అది భక్తి కాదు. సాధారణ మానవులకు ఉన్న ప్రేమ, భక్తి అధిక భాగం భార్య బిడ్డలమీదా సంపదల మీదా, పదవులమీదా, మిగిలింది దేవుడికి పంచబడి ఉంటుంది. అది ఏకాగ్రభక్తి, అనన్య భక్తి కాదు. అందుకే మనకు మామూలు దృష్టి కూడా సరిగా ఉండదు. ఇంక దివ్య దృష్టి ఎలా

ఉంటుంది.

రెండవ పాదంలో పరమాత్మ జ్ఞాతుం, ద్రష్టుం, ప్రవేష్టుం అనే మూడు పదాలు వాడాడు. అంటే నన్ను తెలిసికొనడానికి కానీ, నన్ను చూడటానికి కానీ, నాలో ప్రవేశించడానికి కానీ అనన్యభక్తి ఉండాలి. ఏకాగ్రచిత్తము కలిగి ఉండాలి అని స్పష్టంగా తెలియజేసాడు. ఇదంతా అభ్యాసము వలనా, ధ్యానము వలనా కలుగుతుంది తప్ప వేరే విధంగా కలిగే వీలు లేదు. కాబట్టి కేవలం అభ్యాసము,సాధన, ధ్యానము చేతనే పరమాత్మను గురించి తెలుసుకోగలము. పరమాత్మలో లీనం కావడానికి ఇదే ఉత్తమమైన మార్గము. అప్పుడు భక్తుడికి, భగవంతుడికి భేదంఉండదు. ఇద్దరూ ఒకటే. అహం బ్రహ్మోస్మి అనే అద్వైతం అర్థం అవుతుంది. వీటినే సామీప్యము అంటే భగవంతునికి దగ్గరగా వెళ్లడం, సారూప్యము అంటే తానే భగవంతుడు అనే భావన కలగడం, మూడవది సాయుజ్యం పూర్తిగా భగవంతునిలో కలిసిపోవడం. ఈ మూడు స్థితులు కేవలం ఏకాగ్రభక్తితోనే ఒకటివెంట ఒకటి ప్రాప్తిస్తాయి.

వేదములు, శాస్త్రములు చదవడం వలన కేవలం పరమాత్మను గురించి పరమాత్మ తత్వమును గురించి తెలుసుకోవడమే కానీ వేరు కాదు. దానినే జ్ఞానము అంటారు. దీనినే పరమాత్మ జ్ఞాతుమ్ అని అన్నారు. తరువాత తాను ఆర్జించిన జ్ఞానము విజ్ఞానముగా మారాలి. సంపాదించిన జ్ఞానమును సాధనచేయాలి. అప్పుడు పరమాత్మ యొక్క అసలురూపమును అంటే విశ్వరూపమును దర్శించగలడు. దీనినే ద్రష్టుమ్ అని చెప్పారు వ్యాసుల వారు. పరమాత్మ యొక్క విశ్వరూప దర్శనం అయిన తరువాత పరమాత్మలో ప్రవేశించాలి. దానినే ప్రవేష్టుమ్ అని అన్నారు. ఇదే జీవన్ముక్తుని దశ. దీనినే మోక్షము అని కూడా అంటారు.

అందరూ వేదములు, శాస్త్రములు చదవలేరు. అందరూ దానధర్మములు, యజ్ఞయాగములు చేయలేరు. ఎందుకంటే అందరివద్దా అంత ధనం ఉండదు. పరమాత్మయందు ఏకాగ్రభక్తికి ఎటువంటి ధనము, బలము అవసరం లేదు. కాబట్టి పామరులు, చదువురాని వారు వేదశాస్త్రములు చదవలేనివారు, దానధర్మములు చేయలేని వారు కూడా ఏకాగ్రభక్తి కలిగి ఉంటే, వారు చేసే సాధన ద్వారా వారికి పరమాత్మను తెలుసుకోడానికి, ఆయనను చూడడానికీ, ఆయనలో ప్రవేశించడానికి అర్హత లభించే అవకాశం ఉంది.

## 55. మత్కర్మకృన్మత్పరమో మద్భక్తస్సఙ్గవర్జితః।
## నిర్వైరస్సర్వభూతేషు యస్స మామేతి పాణ్డవ॥

ఇది ఈ అధ్యాయంలో ఆఖరు శ్లోకము. ఈ శ్లోకము కేవలము అర్జునుడి కొరకే కాకుండా మనందరి కొరకు చెప్పాడు పరమాత్మ.

ఎవరైతే నా కొరకే (కేవలం దైవసంబంధమైన) కర్మలు చేస్తాడో, ఆ కర్మలను నాకే అర్పిస్తాడో, నన్నే ఏకాగ్రచిత్తంతో నమ్ముతాడో, నా యందు అనన్య భక్తి కలిగి ఉంటాడో, ఈ ప్రపంచంలో కనపడే సకల పదార్థముల మీద ఆసక్తి అనురాగము విడిచిపెడతాడో, అంటే రాగద్వేషములు వదిలిపెడతాడో, సకల జీవరాసులలో నన్ను చూస్తాడో, అన్ని జీవరాసులమీద ద్వేషం లేకుండా, సమంగా ఆదరిస్తాడో, అతడు నన్ను చూడడానికీ, నన్ను పొందడానికీ అర్హుడు. అని ప్రకటించాడు పరమాత్మ.

ఈ శ్లోకం పైశ్లోకానికి వివరణ. కిందటి శ్లోకంలో కేవలం అనన్యమైన భక్తి కలవాడికే ఈ విశ్వరూపదర్శనం లభిస్తుంది అంతే కానీ కేవలం కర్మకాండలు మాత్రమే చేస్తే చాలదు అని బోధించాడు. ఆ శ్లోకానికి కొనసాగింపుగా ఈ శ్లోకంలో అనన్య భక్తుడికి ఉండవలసిన లక్షణాలు వివరించాడు. ఈ శ్లోకంతో విశ్వరూప సందర్శన యోగం సంపూర్ణం అవుతుంది. తరువాతి అధ్యాయము భక్తి యోగము. ఒకవిధంగా ఈ శ్లోకం తరువాతి అధ్యాయం అయిన భక్తియోగమునకు నాంది. రాబోయే అధ్యాయంలో తాను ఏమి చెప్పబోతున్నాడో సూచన ప్రాయంగా ఈ శ్లోకంలో చెప్పాడు వ్యాసులవారు.

భక్తి అంటే ఏమిటి? అనే ప్రశ్న మన అందరిలోనూ ఉదయిస్తుంది. ప్రతిరోజూ దేవాలయానికి వెళ్లడం, ప్రదక్షిణాలు చేయడం, ఆ ప్రదక్షిణాలు ఎన్నో లెక్కపెట్టుకోవడం మీదనే మనసు పెట్టడం, దేవుడి పూజలు చేయడం, హారతులు ఇవ్వడం, దేవుడికి చేసిన అలంకారాల గురించి చర్చించుకోవడం, దేవుడికి ఆభరణాలు బహూకరించడం, భగవంతుడిని లెక్కలేనన్ని కోరికలుకోరడం, ఆ కోరికలు తీరిస్తే తలనీలాలు ఇస్తాను, హుండీలో కానుకలు వేస్తాను, ఆభరణాలు కిరీటాలు చేయిస్తాను అని మొక్కుకోవడం, ఆ కోరికలు తీరేంతవరకు మొక్కులు తీర్చకపోవడం. ఒకవేళ ఎంతకూ తీరకపోతే మరొక దేవుడిని నమ్ముకోవడం పుణ్యక్షేత్రాలు దర్శించడం, ఎక్కడికి పోయినా మనసు ఇంటి మీదనే పెట్టడం, రోజుకుపదిసార్లు ఇంటికి ఫోనుచేసి మాట్లాడటం, పుణ్యనదులలో స్నానాలు చేయడం, తాము చేసిన తీర్థయాత్రల గురించి పదిమందికీ గొప్పగా చెప్పుకోవడం, మనమధ్యనే ఉన్న దేవుళ్లను నమ్ముకోవడం, వారి మహిమలను గొప్పగా కీర్తించడం, వారే ప్రత్యక్షదైవాలుగా నమ్మడం, వారి దర్శనం కోసం పడిగాపులు కాయడం .... ప్రస్తుత కాలంలో మనం భక్తి అనుకుంటున్నది ఇదే.

ఈ లక్షణాలన్నీ అన్నీ కానీ కొన్ని కానీ ప్రతి వ్యక్తిలోనూఉంటాయి. కాని భక్తి ఇది కాదు

అని మనం తెలుసుకోవాలి. భక్తి అనేది మనం చేసే పనుల వలన వ్యక్తం అయ్యేది కాదు. అసలైన భక్తి  మనసులో నుండి పుడుతుంది. మనసంతా నిండి ఉంటుంది. అటువంటి ఆధ్యాత్మిక సాధన పేరు భక్తి. ఈ భక్తి వ్యావహారికంగా ఏ దేవుడి మీదనైనా ఉండవచ్చు. రాముడు, కృష్ణుడు, ఆంజనేయుడు, శ్రీవేంకటేశ్వరుడు శివుడు సాయిబాబా, దేవి, దుర్గ,  ఎవరైనా కావచ్చు. కాని అది చంచలంగా ఉండకూడదు. ఏకాగ్రంగా, నిశ్చలంగా ఉండాలి.

ఈ భక్తి మూడు రకాలు. మొదటికి కర్మప్రధానమైన భక్తి. చేసే ప్రతిపనినీ పరమాత్మకు అర్పించడం. ఆ కర్మఫలాన్ని పరమాత్మ ప్రసాదంగా స్వీకరించడం. ఒక విధంగా చెప్పాలంటే ఈ పని నేను చేసాను, ఈ ఫలం నాకు వచ్చింది అనే అహంకారాన్ని వదిలిపెట్టడం. ఈ ప్రకారం చేస్తుంటే మన మనసు నిర్మలం అవుతుంది. నిరంతర శాంతి లభిస్తుంది. క్రమక్రమంగా ఈ కర్మప్రధానమైన భక్తి ఉపాసనా ప్రధానమైన భక్తిగా మారుతుంది. మనం మార్చక్కరలేదు. దానంతట అదే మారుతుంది. ఇది భక్తిలో రెండవది. ఈ ఉపాసనా భక్తి అంటే మనసులో నిరంతరం పరమాత్మను ధ్యానించడం. మనసంతా ఈశ్వర మయం చేయడం. అంతా రామమయం ఈ జగమంతా రామమయం అనే స్థితికి వస్తారు. దీనినే ధ్యానము అని అంటారు. ఇది మానసికంగా జరగాలి. మనం ఏపని చేస్తున్నా మనసును పరమాత్మ మీద లగ్నం చేయాలి. ఈ భక్తి తరువాతి స్థితి జ్ఞానము లభిస్తుంది. అంటే పైనచెప్పబడిన రెండు భక్తులకు తగిన ఫలితం లభిస్తుంది. పరమాత్మ గురించిన అసలైన జ్ఞానం లభిస్తుంది. పరమాత్మ ఎక్కడో ఒక చోటలేడు. ఈ విశ్వం అంతా నిండి ఉన్నాడు. ఇందుగలడు అందులేడనే సందేహం మనసులో నుండి తొలగి పోతుంది. చక్రి సర్వోపగతుండు అనే జ్ఞానం కలుగుతుంది. ఆత్మస్వరూపుడుగా మనలోనూ, సకల ప్రాణులలోనూ ఉన్నాడు అనే ఆధ్యాత్మిక జ్ఞానం కలుగుతుంది. ఈ స్థితిలో ఉన్న భక్తులు వేదములు, శాస్త్రములు అధ్యయనం చేయడం మొదలుపెడతారు. అది చేయలేని వాళ్లు గురువులు పెద్దలు చెప్పిన మాటలుఉపన్యాసాల ద్వారా వింటారు. వీటినే జ్ఞానయజ్ఞము అని అంటారు.

భక్తిని ఈ విధంగా అర్థం చేసుకోవాలి. కాని చాలా మంది పండితులు మొదటి రెండు పద్ధతులు వదిలిపెట్టి జ్ఞానసముపార్జనే ముఖ్యం అని వేదాధ్యయనము, శాస్త్ర అధ్యయనము చేస్తుంటారు. ఇలా చేయడం పునాది లేకుండా భవనం కట్టడం లాంటిది. మనం చదువులో కూడా మొదట అక్షరాలు నేర్చుకుంటాము, తరువాత ప్రాధమిక విద్య, ఆ తరువాత మాధ్యమిక విద్య, ఉన్నత విద్య, తరువాత పట్టభద్రులం ఆ తరువాత ఏదో ఒక శాస్త్రంలో పరిపూర్ణజ్ఞానం. ఇలా ఒకటి వెంట ఒకటి అభ్యసిస్తాము. అలాగే జ్ఞానం రావాలంటే మొదటి రెండు మెట్లు దాటాలి. అప్పుడే పరమాత్మ గురించిన జ్ఞానం అలవడుతుంది.

ఈ మూడు రకములైన భక్తిలోనూ ఏకాగ్రత, శ్రద్ధ, అచంచలమైన మనస్సు ముఖ్యం.

ఈ శ్లోకంలో యః అని అన్నారు. అంటే ఎవరైతే అని అర్థం. ఈ శ్లోకంలో చెప్పబడిన

లక్షణములను ఎవరైనా కలిగి ఉండవచ్చు ఆ గుణములు కలిగిన వాడు ఎవరైనా సరే విద్వాంసుడైనా, చదువురాని వాడైనా, ధనవంతుడైనా పేదవాడైనా పురుషుడు అయినా స్త్రీ అయినా, జాతి, కుల, ప్రాంతీయ భేదం లేకుండా, ఎవరైనా సరే అతడికి ఆత్మ జ్ఞానం కలుగుతుంది. పరమాత్మ సాక్షాత్కారం కలుగుతుంది. అని హామీ ఇచ్చారు వ్యాసులవారు.

భక్తికి మొదటి మెట్టు మత్కర్మకృత్ అంటే ఎల్లప్పుడూ మంచి పనులు, సత్కర్మలు, దైవసంబంధమైన కార్యములు చేయాలి. అవి పూజలు కావచ్చు వ్రతాలు కావచ్చు, యాగములు యజ్ఞములు కావచ్చు రోజువారీ కార్యక్రమాలు కావచ్చు, ఏవైనా ఏకాగ్రభక్తి, శ్రద్ధతో చేయాలి. ఆ కర్మలను పరమాత్మకు అర్పించాలి. అంటే ఏ పరిస్థితులలో కూడా చెడ్డ పనులు, దుర్మార్గమైన పనులు చేయకూడదు. మనస్సును నిర్మలంగా ఉంచుకోవాలి. చిత్తశుద్ధి కలిగిఉండాలి. ఏపని చేసినా దానిని పరమాత్మకు అర్పిస్తే ఆ పని పునీతము అవుతుంది. మనం అరటి పండ్లుకొంటాము. వాటిని ఎవరికి ఇచ్చినా వారు ఆ పండ్లను తింటారు. కాని అవే పండ్లను పరమాత్మకు అర్పించి, నివేదించి ఎవరికి ఇచ్చినా వారు వాటిని భగవంతుని ప్రసాదంగా భావించి, కళ్లకు అద్దుకొని భక్తితో సేవిస్తారు. అలాగే మనం చేసే ప్రతిపనినీ భగవదర్పణం చేస్తే ఆ కర్మ పవిత్రతను సంతరించుకుంటుంది.

తరువాత మత్పరమ: అంటే ప్రతి వాడి లక్ష్యం భగవంతుని చేరుకోవడమే. వేరే లక్ష్యం ఉండకూడదు. సాధారణంగా మానవులు ధన సంపాదన, పదవుల సంపాదన, మంచి కుటుంబం ఇవే లక్ష్యంగా పెట్టుకుంటారు. కాని అవన్నీ అసద్వస్తువులు, నిజం కావు, శాశ్వతం కావు, ఇవ్వాళ ఉండి రేపు పోయేవే అని తెలుసుకోవాలి. కేవలం పరమాత్మ ఒక్కడే సత్ పదార్థము అనే జ్ఞానం కలిగి ఉండాలి. పరమాత్మ చేరుకోవడమే లక్ష్యంగా పెట్టుకోవాలి. ఈ జనన మరణ చక్రం నుండి విముక్తిపొందడమే లక్ష్యంగా పెట్టుకోవాలి. దీనినే ముముక్షత్వం అంటారు. ఆత్మజ్ఞానం కలగడం అంటారు. ఇదే భగవంతుని ఎడల మనకు ఉన్న భక్తి. ఆ భక్తి ఎలాఉండాలి.

మద్భక్త: నామీద అనన్య భక్తి కలిగి ఉండాలి. అనన్య అంటేనే ఏకాగ్రభక్తి అని అర్థము. ఏ దేవుడిని కొలిచినా ఆ దేవుడు పరమాత్మ స్వరూపమే అని భావించాలి. దేవతలలో భేదభావము కలిగి ఉండకూడదు. ఏవేవో కోరికలు తీరడానికి భక్తి కలిగి ఉండకూడదు. నిష్కామ భక్తి కలిగి ఉండాలి.

సంగ వర్జిత: ఇతరములైన అంటే పరమాత్మ తక్క ఇతరములైన ప్రాపంచిక విషయముల మీద ఆసక్తి వదిలిపెట్టాలి. అంటే ప్రాపంచిక విషయములు, ప్రాపంచిక సుఖముల మీద ఆసక్తి క్రమక్రమంగా తగ్గించుకోవాలి. తామరాకు మీద నీటి బొట్టులా ప్రపంచంలో

సంచరించాలి. దీనినే సంగరాహిత్యము అంటారు. అంతే కానీ భార్యపిల్లలను వదిలేసి హిమాలయాలకుపోవడం కాదు. మన ఇంటినే ఒక ఆశ్రమంగామార్చుకోవాలి. “అతి” వదిలిపెట్టాలి. భార్యపిల్లల మీదా, ధనం, ఆస్తుల మీదా ఎంతవరకు ఆసక్తి ఉండాలో అంతవరకే ఉండాలి. “నేను లేకపోతే వీళ్లంతా ఏమైపోతారో” అనే భావన పూర్తిగా విడిచిపెట్టాలి.

ఇదేమీ కష్టం కాదు. ఇదంతా మన భావనలో ఉంది. ఈ చరాచర జగత్తు ఇందులో ఉండే ఐశ్వర్యాలు అన్నీ పరమాత్మకు చెందినవి. మనం కేవలం అనుభవిస్తున్నాము. ఈ భూమి మీద జీవించే హక్కును నూరుసంవత్సరాల పాటు లీజుకు తీసుకొని అనుభవిస్తున్నాము. అంతేకాని, ఈ భూమి మీద మనకు అసలైన హక్కు ఏమీ లేదు అనే భావన ఉండాలి. కాని మనం అందరం దానికి విరుద్ధంగా ప్రవర్తిస్తున్నాము. “ఈ భూమి నాది. ఈ ఇల్లు నాది. అంతే కాదు పక్కవాడిది కూడా నాదే. ఇదంతా నాదే. నేను సంపాదించాను. నాది కాకపోయినా నేను లాక్కుంటాను. నన్ను అడిగేవాడెవడు.” ఈ భావనలతో ఉంటున్నాము. ఇదంతా, మనది కాని దానికి మనం ఆశపడటమే అవుతుంది. కాబట్టి మనం ప్రతి దాని మీదా అతిగా పోకుండా ఉంటే చాలు అదే సంగరాహిత్యమునకు దారి తీస్తుంది.

కాని ప్రస్తుతం ఉన్న పరిస్థితి ఏమిటంటే చాలామంది ధనం, ఆస్తులు, భార్య, పిల్లలమీద ఉన్న అటాచ్ మెంటే కాకుండా ఇతరుల ధనం, ఆస్తులు, మనుషుల మీద కూడా అటాచ్ మెంట్ పెంచుకుంటున్నారు. ఇదే భూకబ్జాలకు, మానభంగాలకు, దోపిడీలకు దారి తీస్తుంది. కాబట్టి ప్రతివ్యక్తి తనవి అన్న వాటి మీద ఉన్న అటాచ్ మెంట్ తగ్గించుకుంటూ ఇతరుల వాటి మీద ఉన్న అటాచ్ మెంట్పూర్తిగా తగ్గించుకోవాలి. అప్పుడే సంగరాహిత్యం కలుగుతుంది. అంతేకానీ, లోకంలో జనాన్ని దోచుకుంటూ అందులో కొంత భాగంతో దేవుడికి బంగారు కిరీటాలు చేయిస్తే పాపం పెరుగుతుందే కానీ, పుణ్యం రాదు, భక్తి అసలే పెరగదు. కాబట్టి తన ధనం, ఆస్తులు, బంధువుల మీదకానీ ఇతరుల వాటి మీద కానీ రాగం ఉండకూడదు. సంగం ఉండకూడదు. అన్ని రకములైన సంగములను వదిలిపెట్టాలి.

నిర్వైస్సర్వభూతేషు అంటే సాటి మానవుల పట్ల, సాటి జంతువులు పక్షుల పట్ల భూతదయ కలిగి ఉండాలి. పైన చెప్పిన వాక్యంలో రాగం ఉండకూడదు అని అన్నారు. ఈ వాక్యంలో ఇతరుల పట్ల ద్వేషభావం ఉండకూడదు అని అంటున్నారు. అంటే రాగద్వేషములను పూర్తిగా వదిలిపెట్టాలి. అటు రాగం వైపు కాకుండా, ఇటు ద్వేషం వైపు కాకుండా మధ్యలో ఉండాలి అని అర్థం. దీనినే పరిణతి చెందిన బుద్ధి అని కానీ, వైరాగ్యం అని కానీ అనవచ్చు. వైరాగ్యం అంటే కేవలం రాగము లేకపోవడమే కాదు. ద్వేషం కూడా లేని స్థితి. రాగద్వేషాలకు మధ్య ఉన్న స్థితి. భాగవతము దశమస్కంధములో ఒక అమూల్యమైన పద్యం ఉంది. “నితాంత అపార భూతదయయును తాపస మందార నాకు దయసేయగదే” అని రాసాడు పోతన. అటువంటి

అంతము లేని, అపారమైన భూతదయ ప్రతివారూ కలిగి ఉండాలి. జీవ హింసను మానాలి. ఇతరులను శారీరకంగా గానీ మానసికంగా గానీ హింసపెట్టకూడదు. సాటి జంతువులను వేటపేరుతో హింసించడం, ఆహారం కోసం చంపకూడదు. చాలామంది దేవతలకు ప్రీతిగా జంతుబలులు ఇవ్వడం మనకు తెలుసు. సాటి ప్రాణిని హింసిస్తే ఏ దేవుడు, ఏ దేవతా సంతోషించడు. ఒక పక్క హింసను పాటిస్తూ, మరొక పక్క వేదాధ్యయనము, పూజలు, ఆరాధనలు చేసినందు వలన ప్రయోజనం లేదు. అందుకే యజ్ఞయాగాదులలో జంతు హింసను నిషేధించారు. దాని వలననే బౌద్ధము జైనము ఎక్కువగా పామర జనులలో ప్రాచుర్యము పొందాయి.

యః సః మామ్ ఏతి అంటే ఎవరైతే అటువంటి భక్తి వైరాగ్యము కలిగి ఉంటాడో, అటువంటి వాడు, నన్ను పొందుతాడు. కాబట్టి విశ్వరూప సందర్శనము కావాలి, భగవంతుని గురించి తెలుసుకోవాలి, భగవద్దర్శనం కావాలి అంటే పైన చెప్పబడిన లక్షణములు కల ఏకాగ్రమైన భక్తి వైరాగ్యము కలిగి ఉండాలి అని కృష్ణుడు అర్జునుడికి బోధించడంతో ఈ అధ్యాయము పరిసమాప్తి అయింది.

ఈ ఒక్క శ్లోకమును సరిగా అర్థం చేసుకొని ఆచరిస్తే చాలు, పరమాత్మ సాక్షాత్కారం సులభమౌతుంది అని మనం అందరం తెలుసుకోవాలి. దీనితో విశ్వరూప సందర్శనయోగం సంపూర్ణం అయింది.

ఇక్కడితో 11 అధ్యాయాలు పూర్తి అయ్యాయి. మొట్ట మొదట అర్జునుడికి విషాదము కలిగింది. తరువాత కృష్ణుడిని గురువుగా చేసుకొని తత్వము ఉపదేశించమని అడిగాడు. కృష్ణుడు సాంఖ్యయోగము, జ్ఞానము విజ్ఞానయోగము, కర్మయోగము, కర్మసన్యాసము, ఆత్మసంయమనము మొదలగు యోగములు బోధించాడు. అర్జునుడికి ఏమీ బోధ పడలేదు. నీ విభూతులు ఏవి అని అడిగాడు. పరమాత్మ ముఖ్యమైన తన విభూతులు చెప్పిన తరువాత అవి ఎలా ఉంటాయో చూపించమని అడిగాడు. కృష్ణుడు విశ్వరూపాన్ని చూపించాడు. అర్జునుడికి మాటల వలన అర్థం కానిది చూస్తే అర్థం అయింది. కృష్ణుని అసలు స్వరూపం తెలుసుకున్నాడు. అనంత విశ్వాన్ని మనోనేత్రంతో దర్శించగలిగాడు. కృష్ణుని ముందు సాష్టాంగ పడ్డాడు.

అర్జునుడికి జ్ఞానోదయంఅయిందని తెలుసుకున్నాడు కృష్ణుడు. తరువాతి నాలుగు అధ్యాయాలలో అంటే 12,13,14,15 అధ్యాయాలు చెప్పి గీతను ముగించాడు. ముందు భక్తి యోగం గురించి చెప్పాడు. పరమాత్మను సాకారంగా, నిరాకారంగా ఎలా పూజించాలి. ఎలా సాధన చెయ్యాలి. భక్తి అంటే ఏమిటి. భక్తుల లక్షణాలు ఏమిటి అనే విషయాలు చెప్పాడు. తరువాత శరీరము (క్షేత్రము) శరీరంలో ఉండే ఆత్మ (క్షేత్రజ్ఞుడు) వీరిరువురి గురించి చెప్పాడు. అంటే ఏమీ లేదు ప్రకృతి, పురుషుడు వీళ్ల గురించి చెప్పాడు. ఆ తరువాతి అధ్యాయంలో ఆత్మ, శరీరము, వీరిరువురి

మధ్యఅ డ్డుగోడగా ఉన్న  మూడుగుణములతో కూడిన ప్రకృతి. దాని లక్షణాలు చెప్పాడు. 15వ అధ్యాయంలో ఈ మూడుగుణములు దాటి పరమాత్మను ఎలా చేరుకోవాలి అంటే పురుషోత్తమ ప్రాప్తి గురించి చెప్పి గీతను ముగించాడు. తరువాత 16,17,18 అధ్యాయాలలో భగవద్గీత మొత్తం సింహావలోకనం చేసారు అంటే సమ్మరీ అన్నమాట.

**ఉపనిషత్తులయొక్క, బ్రహ్మవిద్యయొక్క,**

**యోగశాస్త్రము యొక్క సారమయిన భగవద్గీతలో,**

**విశ్వరూప సందర్శన యోగము అను పదకొండవ అధ్యాయము**

**సంపూర్ణము.**

**ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.**

# భగవద్గీత

## పన్నెండవ అధ్యాయము

# భక్తి యోగము

భక్తి అంటే ఏమిటి? అది ఎన్ని రకాలు? భక్తిని ఏ విధంగా ఆచరించాలి? భక్తి కలిగి ఉంటే ఏం ఫలితం లభిస్తుంది? అనే విషయాలను ఈ అధ్యాయంలో వివరించాడు కృష్ణ పరమాత్మ. భక్తి అంటే మనం అనుదినం ఆచరించేది నిజమైన భక్తి కాదు అనికూడా మనకు ఈ అధ్యాయం తెలియజేస్తుంది. భక్తి అంటే ఒక వస్తువు కాదు. ఏదో ఒక సాధన కాదు. వేదములలో, ఉపనిషత్తులలో చెప్పబడిన సమస్త విషయముల యొక్క సంకలనమే భక్తి. భక్తి అంటే సకల ఆధ్యాత్మిక సాధనలయొక్క సమగ్ర స్వరూపము. ఉపనిషత్తులలో చెప్పబడిన కర్మ, ఉపాసన, జ్ఞానముల యొక్క సమాహార స్వరూపమే భక్తి. దానినే భక్తి అని అంటారు.

వివరంగా చెప్పాలంటే...... ధర్మంగా, న్యాయంగా, ఇతరులను కష్టపెట్టకుండా, ఇతరుల మనసు నొప్పించకుండా ధనం, ఆస్తి, మనకు కావలసిన వస్తువులను సంపాదించుకోవడం; మనలో కలిగే సంకల్పాలను, కోరికలను ధర్మబద్ధంగా, న్యాయబద్ధంగా తీర్చుకోవడం; ఇతరులకు ఉపకారం చేస్తే పుణ్యం వస్తుంది, ఇతరులకు అపకారం చేస్తే పాపం వస్తుంది, అనే భావన కలిగి ఉండటం; పరమాత్మను ఏదో ఒక రూపంలో గానీ, ఏ రూపంలేకుండా గానీ శ్రద్ధతో ఉపాసించడం; మనసును ఎల్లప్పుడూ నిశ్చలంగా; నిర్మలంగా ఉంచుకోవడం; అటువంటి నిర్మలమైన, నిశ్చలమైన మనసును, ఏ పని చేస్తున్నా పరమాత్మయందు నిలిపి ఉంచడం; మనం చేసే పనులను అన్నిటినీ నిష్కామంగా, నేను చేస్తున్నాను అనే కర్తృత్వభావన లేకుండా చేయడం; ఆ పనులు చేసినందువలన లభించే ఫలితాలను అన్నిటినీ పరమాత్మకు అర్పించడం; ఆ ఫలితాలను భగవంతుని ప్రసాదంగా స్వీకరించడం; ఈ భావనలను అన్నీ కలిపితే దీనినే భక్తి అని అంటారు.

ఈ భక్తిని అందరూ ఆచరించవచ్చు. ఇందులో ఆడ, మగ, కర్మయోగులు, జ్ఞానయోగులు అందరూ అర్హులే. ఈ భక్తికి మొదటి మెట్టు ధర్మబద్ధంగా, న్యాయబద్ధంగా, ఇతరుల మనస్సుకు, శరీరానికి కష్టం కలుగకుండా, కర్మలు చేయడం, తద్వారా కోరికలు తీర్చుకోవడం. మనం చేసే ప్రతి పనికీ ఏదో ఒక ఫలితం కలుగుతుంది. ఆ ఫలితాన్ని పరమాత్మకు అర్పించడం. దానిని పరమాత్మ ప్రసాదంగా స్వీకరించడం. అంటే నిరంతరం ప్రాపంచిక విషయాలలో

మునిగితేలేవాడిని కూడా భక్తి మార్గంవైపుకు తీసుకెళ్లడమే తొలిమెట్టు.

ప్రాపంచిక విషయములలోనే మునిగితేలడం, కోరికలు తీర్చుకోవడం తప్పుకాదు, అవే జీవితం అనుకోవడం, అవి తప్ప వేరే లోకం లేదనుకోవడం తప్పు. ఆ మెట్టు నుండి పైమెట్టుకు ఎక్కడానికి ప్రయత్నించాలి కానీ తొలిమెట్టు మీదనే ఉండిపోకూడదు. ఒకటో క్లాసు పుస్తకంలో రంగురంగుల బొమ్మలు ఉన్నాయి, కథలు ఉన్నాయి కాబట్టి అక్కడే ఉండిపోము కదా! రెండవ క్లాసునుండి పిజి దాకా చదువుతాము. అలాగే భక్తిలో కూడా ఒకమెట్టు దాటి రెండవ మెట్టు ఎక్కాలి. మనం చేసే అన్ని కర్మలను అంటే అది చదువు కావచ్చు, ఉద్యోగం కావచ్చు, వ్యాపారం కావచ్చు ఏదైనా కావచ్చు, ఆ కర్మలను నిష్కామంగా అంటే మంచి మనసుతో, చిత్తశుద్ధితో, ఫలితం మీద ఆసక్తిలేకుండా, కర్తృత్వభావన లేకుండా, పరోపకార బుద్ధితో చేయడం. ఇది రెండవ మెట్టు. ఈ మెట్టు ఎక్కడం వలన మనలో ఇదంతా నేనే చేస్తున్నాను, నావలననే ఈ పనులన్నీ జరుగుతున్నాయి, నేను చెయ్యబట్టే ఇంత మంచి ఫలితాలు వచ్చాయి, ఇవన్నీ నేనే అనుభవించాలి అనే అహంకారము, స్వార్థబుద్ధి నశిస్తుంది. నేను కేవలం నిమిత్తమాత్రుడిని అనే భావన కలుగుతుంది. నేను ఈ పని చేయడానికి, ఈ ఫలితం సాధించడానికి నేను ఒక్కడినే కారకుడిని కాదు. ఎంతోమంది, ఎన్నోవిషయాలు అనుకూలిస్తేనే ఈ కార్యం సిద్ధించింది అనే భావన మనలో కలుగుతుంది. ఆ భావన రాగానే, ఈ ఫలితం నాది కాదు అందరిదీ, కాబట్టి ఈ ఫలితం అందరికీ చెందుతుంది అని ఆ ఫలితాన్ని అందరికీ పంచి పెట్టడానికి ప్రయత్నం చేస్తాడు. దీనినే పరోపకార బుద్ధి అని అంటారు.

మనం ఈ రెండు మెట్టు మీదనే ఆగిపోకూడదు. ఎందుకంటే ఈ రెండు మెట్లు కేవలం బాహ్యప్రపంచానికి సంబంధించినవి. కేవలం ప్రాపంచిక విషయములకు సంబంధించినవి. అంటే ప్రవృత్తి మార్గానికి సంబంధించినవి. నివృత్తి మార్గం కూడా ఒకటి ఉంది. ప్రవృత్తి మార్గం నుండి నివృత్తి మార్గం వైపుకు మళ్లాలి. ఎందుకంటే భక్తి యొక్క గమ్యం ఆత్మజ్ఞానం సంపాదించడం. జనన మరణ చక్రం నుండి విడివడడం. మోక్షంపొందడం. ఇవన్నీ జరగాలంటే కేవలం బాహ్యముఖంగానే ఉంటే చాలదు. అంతర్ముఖుడు కూడా కావాలి. తానెవరో తాను తెలుసుకోవాలి. తాను ఈ శరీరం కాదు తాను ఆత్మస్వరూపుడు అనితెలుసుకోవాలి. పరమాత్మ ఆత్మస్వరూపుడుగా నాలో ఉన్నాడు అని తెలుసుకోవాలి. అంటేఆత్మజ్ఞానం సంపాదించాలి.

ఆత్మజ్ఞానం బయటనుండి లభించేది కాదు. ప్రాపంచిక విషయాలలో మునిగి తేలుతుంటే ఆత్మజ్ఞానం లభించదు. అంతర్ముఖుడు అయితేనే ఆత్మజ్ఞానం సిద్ధిస్తుంది. ఇది ధ్యానం వలన మాత్రమే సాధ్యమౌతుంది. . ఇది భక్తిలో మూడవ మెట్టు. ఈ ధ్యానం నిరంతరం అభ్యాసం చేయాలి. దీనినే అభ్యాసయోగం అని కూడా అంటారు. ఈ ధ్యానం భగవంతుని యొక్క ఏదో ఒక రూపాన్ని తన మనసుకు నచ్చిన రూపాన్ని ఎదురుగా పెట్టుకొని చేయడం. మొదట ఏదో ఒక

రూపాన్ని మనసులో పెట్టుకొని ధ్యానం చేస్తూ, క్రమక్రమంగా ఈ విశ్వం అంతటా పరమాత్మ నిండి ఉన్నాడు అనే భావనతో ధ్యానం చేయాలి. అప్పుడు అతని మనసు ఆత్మయందు నిరంతరం లగ్నం అయి ఉంటుంది.

దీని తరువాతి మెట్టు జ్ఞాన సముపార్జన. ఇప్పటి వరకు జ్ఞానం సంపాదించడానికి తగిన అర్హత సంపాదించాము. ఇంత వరకు అభ్యాసము చేస్తేనే కానీ మనకు వేదములు, శాస్త్రములు వాటిలోని విశేషాలు, అంతరార్థాలు అర్థం కావు. వేదాధ్యయనము, శాస్త్రపరిజ్ఞానము సంపాదించాలి అంటే ఈ ప్రాథమిక పరిజ్ఞానం అవసరం. అందుకే మెట్టుమెట్టుగా పైకి ఎదగాలి. ఇప్పుడు వేదములను, శాస్త్రములను, శ్రవణం, మననం, నిధిధ్యాసనం అనే మూడు ప్రక్రియల ద్వారా తెలుసుకోడానికి ప్రయత్నం చేయాలి. శ్రవణం అంటేకేవలం వినడమే కాదు. శ్రద్ధతో చదవడం కూడా. చక్కగా శ్రద్ధతో అధ్యయనం చేయడం. వాటి గురించి లోతుగా తెలుసుకోవడం. మననం అంటే తెలుసుకున్న దానిని జీర్ణం చేసుకోవడం. ఏవైనా సందేహాలు కలిగితే పెద్దలను గురువులను అడిగి నివృత్తిచేసుకోవడం. అప్పుడు వేదములు, శాస్త్రములు వాటిలో ఉంటే మూలతత్వము పూర్తిగా అర్థం అవుతాయి. అప్పుడు మనకు జ్ఞానం కలుగుతుంది. ఇవన్నీ కలిపి భక్తి అని అంటారు.

వ్యాసుల వారు వేదాలు నాలుగుగా విభజించారు. వేదాలలో సారం అంతా భారత, భాగవతాలుగా రాసారు. ఉపనిషత్తులలో సారం అంతా భగవద్గీతలో నింపారు. ఇవి సాధారణ మానవులకు అర్థం కావని, ఎవరికి భావాలకు అనుకూలంగా వారి వారికి , చిన్ని చిన్ని కథల రూపంలో పురాణాలు రచించారు. కాల క్రమేణా ఆ పురాణాలు కూడా చదవడానికి మానవులకు సమయం చిక్కదేమో అనే సందేహం కలిగింది వ్యాసుల వారికి అందుకే వేదాలు, ఉపనిషత్తు, పురాణాల సారం అంతా ముచ్చటగా మూడుముక్కలలో చెప్పారు. అదే.... "పరోపకారాయ పుణ్యాయ పాపాయ పరపీడనం". ఇతరులకు ఉపకారం చేస్తే పుణ్యం వస్తుంది. ఇతరులను పీడిస్తే పాపం వస్తుంది. ఈ సూక్తిని నిజజీవితంలో పాటిస్తే చాలు, వాడు పరమాత్మను ఏ రూపంలో పూజించినా, వాడికి ముక్తి లభిస్తుంది. దీనినే భక్తి అని కూడా అనవచ్చు.

అంతే కానీప్రతిరోజూ దేవాలయానికి వెళ్లడం, పూజలు చేయించడం, అర్చకుడు ఆ పూజలు చేసేటప్పుడు మనం లోకాభిరామాయణం మాట్లాడుకోవడం, మన గోత్రానామాలతో పూజలు జరిపించమని డబ్బుకట్టి, మన పనులు చూసుకోవడం, ఇదే భక్తి అనుకుంటుంటాము. ఇవన్నీ భక్తిలో భాగాలే కానీ ఇదే భక్తి అనిపించుకోదు. ఎందుకంటే వీటిలో శ్రద్ధ అనే భావన లోపించింది. శ్రద్ధతోకూడినదే భక్తి అనే విషయం తెలుసుకోవాలి. అందుకే శ్రద్ధాభక్తులు అని అంటారు. కాబట్టి కోరికలతో కూడిన కర్మలు చేయడంతో ఆరంభం అయిన భక్తి, ఈ జగమంతా పరమాత్మ మయం ఆ పరమాత్మను నేను అయి ఉన్నాను(అహం బ్రహ్మాస్మి) అనే స్థితి వరకు తీసుకొని వెళుతుంది.

ఈ భక్తివలన ఉపయోగము ఏమిటి అంటే మోక్షానికి మార్గం సులభం చేస్తుంది. ఆత్మజ్ఞానం కలుగుతుంది. అటువంటి భక్తి గురించి తెలియజేసే యోగము....భక్తియోగము అనే పేరుగల ఈ అధ్యాయాన్ని ప్రారంభించాడు కృష్ణ పరమాత్మ.

ఇంతకు ముందు అధ్యాయములలో కృష్ణపరమాత్మ మనకు ఎన్నోవిషయాలు బోధించాడు. వాటిలో సగుణోపాసన, అంటే పరమాత్మను ఏదో ఒక ఆకారంలో పూజించడం, నిర్గుణోపాసన అంటే పరమాత్మను అక్షరము, అవ్యక్తము అయిన పరబ్రహ్మస్వరూపంగా భావించి పూజించడం ముఖ్యమైనవి. ఇప్పుడు అర్జునుడికి ఒక సందేహం వచ్చింది. పరమాత్మను ఏదో ఒక ఆకారంతో పూజించాలా లేక నిరాకారంగా పూజించాలా, పరమాత్మ సగుణాకారుడా, నిర్గుణాకారుడా! పరమాత్మకు ఏదో ఒక రూపం ఉందా లేక అసలురూపమే లేదా! అనేది ఆ సందేహం. ఆ సందేహాన్ని ఇక్కడ అడుగుతున్నాడు.

## అర్జున ఉవాచ:

## 1.ఏవం సతతయుక్తా యే భక్తాస్త్వాం పర్యుపాసతే।
## యే చాప్యక్షరమవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః॥

ఏ భక్తులైతే సతతము నీ యందే మనసు నిలిపి నిన్ను ఏదో ఒక ఆకారంతో విగ్రహ రూపంలో ఉపాసిస్తున్నారో, వారు యోగమును బాగా తెలిసిన వారా; లేక అక్షరము, అవ్యక్తము అయిన పరబ్రహ్మమును ధ్యానించేవారు యోగవిత్తములా? వీరిలో ఎవరు శ్రేష్టులు నాకు వివరించండి.

కృష్ణా! నువ్వునాకు ఎన్నో ఆకారములతో గూడిన నీ విశ్వరూపాన్ని చూపించావు. చూచాను. మరి ఇదివరకు నిన్ను నిరాకారంగా పూజించమని చెప్పావు. ఇప్పుడు సాకారంగా నీ విశ్వరూపాన్ని నాకు చూపించావు. ఇంతకూ నీ భక్తులు నిన్ను ఏదో ఒక ఆకారంతో పూజిస్తున్నారా లేక ఏ ఆకారమూ లేకుండా నిరాకారంగా పూజిస్తున్నారా ఈ రెండింటిలో ఏది మంచిది? ఇలా చేసేవారిలో ఎవరు గొప్పవాళ్లు నాకు చెప్పు అనిఅడిగాడు. అంటే అర్జునుడు సగుణోపాసన గొప్పదా నిర్గుణోపాసన గొప్పదా వీటి మధ్య ఉన్న తేడా ఏమిటి? ఏ విధంగా నిన్ను ఉపాసించేవాళ్లు గొప్ప వాళ్లు అని అడిగాడు.

కొంచెం ఆలోచిస్తే ఈ ప్రశ్న వింతగా కనిపిస్తుంది. ఎందుకంటే ఏది గొప్పది ఏది గొప్పది కాదు అని చెప్పడం రెండు సమాన ధర్మములు కలిగిన వస్తువుల మధ్యనే సంభవిస్తుంది. పైన చెప్పబడిన విషయాలను బట్టి చూస్తే ఇవి రెండుమెట్లు. మొదటి మెట్టు ఎక్కిన తరువాత రెండో మెట్టు ఎక్కాలి. అంటే మొదట సగుణోపాసన చేసి తరువాత నిర్గుణోపాసనకు చేరుకోవాలి. అంతే కానీ నేరుగా నిర్గుణా పాసన చేయడం కుదరదు. అలాగని కేవలం సగుణోపాసనలోనే ఉండి పోకూడదు. మొదటి అంతస్తు ఎక్కిన తరువాత రెండో అంతస్తుకు ఎక్కుతాము కానీ ఏకంగా నిచ్చెన వేసుకోని లేక తాడు ద్వారా రెండో అంతస్తుకు ఎక్కడానికి ప్రయత్నిస్తే, జారి, కిందపడి, నడుము విరుగుతుంది.

(ఇతర మతాలకు హిందూమతానికి అదే తేడా! ఇతర మతాలలో మొదటి నుండి ఏ ఆకారమూ లేని పరమాత్మను ఉపాసిస్తారు. మనం మొదట ఏదో ఒక ఆకారంతో విగ్రహ రూపంలో కానీ, లింగ రూపంలో కానీ దేవాలయాలలో ప్రతిష్ఠించి, పూజించి, క్రమక్రమంగా నిర్గుణోపాసన వైపుకు మళ్లుతాము. ఇక్కడ వచ్చిన చిక్కు ఏమిటంటే మనం మొదటి మెట్టు మీదనే ఉండిపోతున్నాము. అంటే విగ్రహాలు, దేవాలయాలు, వాటికి అలంకారాలు, పూజలు, నివేదనలు, అవి మేమేచేయించామని గొప్పలు, వీటి దగ్గరే అంటే మొదటి మెట్టుమీదనే ఆగిపోతున్నాము. రెండో మెట్టు ఎక్కడానికి కనీసం ప్రయత్నంకూడా చేయడం లేదు.)

అందుకే ఈ ప్రశ్నకు పరమాత్మ చక్కటి సమాధానం చెబుతున్నాడు.

## శ్రీభగవానువాచ:

## 2. మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే। శ్రద్ధయా పరయోపేతా స్తేమే యుక్తతమా మతాః॥

ఎవరైతే నా యందే మనస్సును నిలిపి అత్యంత శ్రద్ధతో కూడుకున్నవారై నిరంతరము నన్ను ఉపాసిస్తుంటారో, అటువంటి వారు యుక్తతములు అంటే ఉత్తమ ఉపాసకులు అని నా యొక్క అభిప్రాయము.

అర్జునా! ఎవరైతే తమ ఏకాగ్రమైన మనస్సు నా యందు (అంటే సగుణాకారంలో ఉన్న నాయందు) లగ్నం చేస్తారో, నన్ను నిరంతరము అంటే ప్రతిరోజూ అత్యంత శ్రద్ధతో, భక్తితో, ధ్యానిస్తారో, ఉపాసిస్తారో, వారే యుక్తతములు అంటే ఉత్తమమైన వారు అని నాయొక్క మతము అంటే అభిప్రాయము. అని చెప్పాడు.

ఇక్కడ మూడు నిబంధనలు ఉన్నాయి. ఒకటి మనస్సును పరమాత్మయందు నిలపడం. రెండు. నిరంతరం పరమాత్మనే చింతించడం. మూడవది. ఆ దైవ చింతన మీద శ్రద్ధ కలిగి ఉండటం. అంటే నేను పూజించేది కేవలం రాతి విగ్రహం కాదు. ఈ రాతి విగ్రహంలో పరమాత్మ ఆవాహన చేయబడి, ప్రతిష్ఠింపబడి ఉన్నాడు. ఈ విగ్రహం పరమాత్మ స్వరూపమే కానీ విగ్రహం కాదు. విగ్రహ రూపంలో ఉన్న పరమాత్మ అనే భావన, శ్రద్ధ, నమ్మకం కలిగిఉండాలి. ఇది సగుణోపాసన చేసేటప్పుడు ఉండవలసిన లక్షణాలు.

కాని మనం చేసే సగుణోపాసన అంతా శ్రద్ధ,భక్తి లేని ఉపాసన. ఏ పూజ చేసినా పదిమందిని పిలవడం, పూజలో,వ్రతంలో కూర్చున్నా, పిలిచిన వాళ్లంతా వచ్చారా లేదా, వచ్చిన వాళ్లకు కాఫీ టిఫిన్లు ఇచ్చారా లేదా, భోజన ఏర్పాట్లు అవుతున్నాయాలేదా వీటిమీదనే దృష్టి తప్ప చేసే పూజ మీదా, వ్రతం మీదా శ్రద్ధ భక్తి ఉండటం లేదు. కాబట్టి నిత్యం నా మీద మనసును లగ్నం చేసి, నన్ను శ్రద్ధాభక్తులతో ఉపాసించేవారు యుక్తతములు అని నా అభిప్రాయము అని తన మొదటి అభిప్రాయాన్ని వెలిబుచ్చాడు కృష్ణ పరమాత్మ.

3. యేత్వక్షరమనిర్దేశ్యమవ్యక్తం పర్యుపాసతే।
సర్వత్రగమచిన్త్యం చ కూటస్థమచలం ధ్రువమ్॥
4. సంనియమ్యేన్ద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః।
తే ప్రాప్నువన్తి మామేవ సర్వభూతహితే రతాః॥

ఇక్కడ రెండు శ్లోకాలు ఉన్నాయి. మొదటి శ్లోకంలో కృష్ణపరమాత్మ తన నిర్గుణ పరబ్రహ్మ స్వరూపాన్ని గురించి చెప్పాడు. అక్షరం అంటే క్షరము లేనిది. నాశనము కానీ మార్పులేనిది. అనిర్దేశ్యం అంటే ఇలా ఉంటుంది అని చెప్పడానికి వీలులేనిది. అంటే ఏ ఆకారము లేనిది. అవ్యక్తం అంటే కళ్లతో చూడలేనిది, చెవులతో దాని గురించి వినలేనిదీ, చేతులలో తాకలేనిది అంటే ఎవరికీ వ్యక్తము కానిది. అచింత్యం అంటే మనసులో ఊహించలేనిది అంటే ఎటువంటి ఊహలకు అందనిది. సర్వత్రగమం అంటే ఈ అనంతమైన విశ్వం అంతా వ్యాపించి ఉన్నది. పరమాత్మలేనిచోటు లేనిది. కూటస్థం అంటే కదలనిది అని అర్థం. కూటము అంటే కంసాలి, కమ్మరి వాడిదగ్గర ఉండే ఇనపదిమ్మ. దాని మీద వేడి చేసిన బంగారం కానీ, ఇనము కానీ పెట్టి సుత్తితో కొట్టి కావాల్సిన ఆకారంలోనికి మలుస్తారు.కాని ఆ దిమ్మ మాత్రం కదలదు. ఆత్మస్వరూపుడైన పరమాత్మ కూడా వివిధరూపాలతో పేర్లతో ప్రకృతిలో ప్రకటితం అవుతున్నా, తాను మాత్రం ఏమీ అంటకుండా నిశ్చలంగా ఉంటాడు. అందుకే కూటస్థం అచలం అని అన్నారు. ధ్రువమ్ అంటే ఎప్పటికీ నిలిచి ఉండేది.

ఒకప్పుడు ఉంది ఇప్పుడు లేదు అని కాకుండా సర్వకాలసర్వావస్థలయందు ఉండేది. ఇదీ పరమాత్మయొక్క నిరాకార తత్వము.

మరి దీనిని ఉపాసించే వాళ్లు ఎలా ఉండాలి అంటే......వారు తమ ఇంద్రియములను అదుపులో పెట్టుకోవాలి. ఇంద్రియములు ఎల్లప్పుడూ బాహ్యప్రపంచంలో ఇష్టం వచ్చినట్టు సంచరిస్తూ ఉంటాయి. తాము చూచిన వస్తువుల వంక, వినిన విషయాల వంక, తాకిన మనుషుల వంక మనసును లాగుతుంటాయి. మనసు, ఇంద్రియములు, బాహ్యప్రపంచములో విచ్చలవిడిగా విహరిస్తుంటే, నిర్గుణపరబ్రహ్మను ఉపాసించడం సాధ్యం కాదు. అందుకని ముందుగా ఇంద్రియములను, మనసును అదుపులో పెట్టుకోవాలి అని సూచించారు.

తరువాత సర్వత్ర సమబుద్ధయ: అంటే అందరిపట్ల సమత్వం కలిగి ఉండాలి. సంపదల వల్ల గానీ, విద్య వల్ల కానీ, కులం వలన కానీ అసమానతలు చూపకూడదు. ఒకరు ఎక్కువ, మరొకరు తక్కువ అనే భేదభావం ఉండకూడదు. ఎవరిమీదా, దేని మీదా అయిష్టం ప్రదర్శించ కూడదు. దేనివలనా మనసును అల్లకల్లోలపరచకూడదు. రాగద్వేషములమధ్య సమత్వం కలిగి ఉండాలి. అటు రాగం గానీ ఇటు ద్వేషం కానీ ప్రదర్శించకూడదు.

సర్వభూతహితేరతా: అంటే నితాంత అపార భూతదయ కలిగి ఉండాలి. సకలభూతముల హితమును కోరుకోవాలి. ఇతరులను ద్వేషించకూడదు. ఇతరుల మనసుకు శరీరానికి కష్టం నష్టం కలిగించకూడదు. ఎల్లప్పుడూ అందరూ సుఖంగా సంతోషంగా ఉండాలని కోరుకోవాలి. అందుకే శాంతి మంత్రంలో మూడుసార్లు ఓం శాంతి: ఓం శాంతి: ఓం శాంతి: అని అంటారు. అంటే నేను శాంతిగా ఉండాలి. నీవు శాంతిగా ఉండాలి. మనం అందరం శాంతిగా ఉండాలి అని లోకహితాన్ని కోరుకుంటారు.

పై లక్షణములు కలిగిన వారు, ఏ ఆకారము లేనిదీ, చలనము లేనిదీ అంటే స్థిరమైనదీ, ఈఅనంత విశ్వం అంతా వ్యాపించి ఉన్నదీ, నాశనము మార్పులేనిదీ అయిన నా స్వస్వరూపమును ధ్యానిస్తే, అటువంటి వారు నన్నే పొందుతారు. అని కృష్ణపరమాత్మ చెప్పాడు.

ఇంద్రియ నిగ్రహము, అందరి పట్ల సమ భావము, సకల జీవరాసులను ప్రేమించడం,ఎవరి మీదా ద్వేషం లేకపోవడం. అవి బాహ్యంగా అందరూ ఆచరించవలసిన విషయములు. ఇంక నిర్గుణోపాసకులు అనిర్వచనీయమైనటువంటిది, ఇంద్రియములకు కనపడనిదీ, మనసుతో ఆలోచించడానికి కూడా వీలు కానిదీ, ఎటువంటి వికారములు లేనిదీ, దేనికీ చలించనిది, మార్పులేనిది, నాశనము లేనిదీ, నిత్యము సత్యము అయినదీ, ఈ అనంత

విశ్వం అంతా వ్యాపించి ఉన్నదీ అయిన నిర్గుణ పరబ్రహ్మమును ధ్యానిస్తారు.

పైన చెప్పబడిన విధానము నిర్గుణోపాసనకు సంబంధించినది. కాబట్టి పరమాత్మను ఏదో ఒక ఆకారంతోనూ అంటే సాకారంగానూ, ఏ ఆకారము లేకుండానూ అంటే నిరాకారంగానూ ధ్యానించవచ్చు. కాకపోతే శ్రద్ధ, నిర్మలమైన మనస్సు, అనన్యభక్తి, ఏకాగ్రత ముఖ్యం. ఇవి ఉండాలంటే ఇంద్రియ నిగ్రహము, మనో నిగ్రహము ముఖ్యం. ఇవి రావాలంటే నిష్కామ కర్మ, సంగము లేకుండా ఉండటం, అన్ని కర్మలను పరమాత్మ పరంగా, ఇతరుల హితం కోరి చేయడం, కర్మఫలములను పరమాత్మకు అర్పించడం ముఖ్యం. అందుకే ఈ శ్లోకంలో సం నియమ్య చక్కగా ఇంద్రియములను, మనస్సును నియమించాలి అని అన్నాడు.

సర్వత్ర సమబుద్ధయ: అంటే సకల జీవరాసుల యెడల సమబుద్ధికలిగి ఉండటం. మనం సాటి మనషుల మధ్య, ఆరాధించే దేవతల మధ్య భేదభావం చూపిస్తున్నాము. అది మానుకోవాలి. సర్వభూతహితే రతే:అంటే సకల జీవరాసుల యొక్క హితం కోరాలి. మనం సాటి మానవులకు ఉపకారం చేయకపోతే మానె అపకారం చేయకుండా ఉంటే చాలు అనే స్థితిలో ఉన్నాము. మనుషులు మధ్య, కులాల మధ్య, మతాల మధ్య, ప్రాంతాల మధ్య విభేదాలు, వైషమ్యాలు, ముందు ఇవి పోవాలి. అప్పుడే సర్వభూతహితమును గురించి ఆలోచించవచ్చు. బాహ్యంగా ఈ లక్షణాలు కలిగి ఉంటేనే నిరాకారుడు, అక్షరపరబ్రహ్మస్వరూపుడు, నిశ్చలుడు, అవ్యయుడు అయిన పరమాత్మను ధ్యానించడానికి అర్హుడు. అటువంటి వారు నిస్సంశయంగా పరమాత్మను పొందుతారు.

రెండవ శ్లోకంలో సగుణోపాసన గురించి చెప్పి, సగుణోపాసన చేసేవాళ్లు యుక్తతములు అంటే మంచి వాళ్లు, యుక్తులు అని అన్నాడు. మూడు నాలుగు శ్లోకాలలో నిర్గుణోపాసన గురించి చెప్పి నిర్గుణోపాసన చేసేవాళ్లు నన్నే పొందుతారు అని అంటున్నాడు. ఇది ఎలా ఉందంటే రవ్వదోశ రుచిగా ఉంటుంది కాని మసాలా దోశ తింటే కడుపు నిండుతుంది అన్నట్టు ఉంది. మనకు దోశ రుచిగా ఉండాలి, కడుపు నిండాలి. ముందు నాలుకకు రుచిగా తగలాలి. తరువాత ఆ దోశ కడుపులోకి పోయిన తరువాత కడుపూ నిండాలి. కాబట్టి మనం అందరం ముందు సగుణోపాసనతో మొదలు పెట్టి అందులో రుచిని ఆస్వాదించి, యుక్తతములు అయిన తరువాత, నిర్గుణోపాసన అవలంబించి కడుపు నింపుకోవాలి అంటే పరమాత్మను పొందడానికి ప్రయత్నం చేయాలి. కాబట్టి ఒకటి దాని వెంట ఒకటి చేయాలి కానీ ఏదో ఒకదానినే పట్టుకొని వేళ్లాడకూడదు.

5. క్లేశోఽధికతరస్తేషామవ్యక్తాసక్తచేతసామ్।
అవ్యక్తా హి గతిర్దు:ఖం దేహవద్భిరవాప్యతే॥

ఈశ్లోకంలో నిర్గుణోపాసన ఎంత కష్టమో వివరిస్తున్నాడు పరమాత్మ. ఎందుకంటే అది అవ్యక్తము. అంటే కంటికి కనపడదు. ఊహిద్దాము అంటే ఊహలకు అందదు. ఆలోచిద్దామంటే మనసుకు అందదు. మరి దేని గురించి ధ్యానం చేయాలి. అదే చాలా కష్టం అంటున్నాడు పరమాత్మ. ముఖ్యంగా ఈ దేహమే నేను, నేనే ఈదేహము, అనే దేహాభిమానము కలవారు, అహంకారము కలవారికి నిర్గుణోపాసన చాలా కష్టము. ఎందుకంటే నిర్గుణోపాసనకు దేహాభిమానమునకు పొసగదు. ఏ ఆకారమూ మనసులో నిలపకుండా ధ్యానంలో కూర్చుంటే, ఈ దేహం, ఈ దేహంతో చేసే పనులు, ఈ దేహంతో ఇతర దేహములతో ఉన్న అనుబంధం, ఆసక్తి, అన్నీ గుర్తుకు వస్తాయి. కాబట్టి దేహాభిమానం కలవాడు నిర్గుణోపాసనచేస్తే దాని వలన సుఖం లభించకపోగా అంతులేని దు:ఖం లభిస్తుంది. కాబట్టి దేహాభిమానం కల వాడికి నిర్గుణోపాసన సాధ్యం కాదు.

కాబట్టి నిర్గుణోపాసన చేయాలంటే దేహాభిమానము ఉండకూడదు. ప్రాపంచిక విషయముల మీద ఆసక్తి ఉండకూడదు. దేహాభిమానము కలిగి ఉండి, ఇంద్రియ నిగ్రహము, మనో నిగ్రహము లేని వారికి నిర్గుణోపాసన సాధ్యం కాదు. అందుకే ప్రారంభంలోనే నిర్గుణోపాసనతో మొదలెట్టకుండా, ముందు సగుణోపాసన చేస్తూ, దేహాభిమానమును, అహంకారమును, అసూయాద్వేషములను క్రమక్రమంగా విడిచిపెట్టాలి. అప్పుడే నిర్గుణోపాసన సాధ్యం అవుతుంది.

ఆ కారణం చేత, మొట్ట మొదట ప్రతి వాడూ సగుణోపాసనతో ప్రారంభించాలి. అందుకే మనకు దేవాలయ వ్యవస్థను ఏర్పాటు చేసారు. రోజంతా ప్రాపంచిక విషయాలు, కామభోగాలతో గడిపినా, కొంచెం సేపు అయినా దేవాలయానికి వెళ్లి, అక్కడ దేవుడు ఉన్నాడు అనే భావనతో ప్రశాంత చిత్తంతో భగవంతుని ధ్యానం చేయడానికి వీలు కల్పించారు. కానినేడు దేవాలయాలు ఆర్భాటాలకు, ధన సంపాదనకు నిలయాలయ్యాయి. ప్రశాంతత కరువయింది. దైవదర్శనం కూడా ధనం ఇచ్చి చేయాల్సిన పరిస్థితి ఏర్పడింది. పరమ పవిత్రమైన భక్తిభావన ఫక్తు వ్యాపారంగా మార్చేసారు.

(ఈ నాడు తిరుమలలో కూడా రోజుకు ఇన్ని వేలమందికి దర్శనభాగ్యం కల్పిస్తున్నాము అని ఆర్భాటంగా ప్రకటించుకుంటున్నారే కానీ, భక్తులు నిర్మల మైన భక్తితో ప్రశాంతంగా దగ్గరగా నిలబడి దైవదర్శనం చేసుకుంటున్నారా లేదా అని పట్టించుకునే నాథుడే కరువయ్యాడు. బ్లాకులో టిక్కట్లు కొని స్వామి వారికి సేవలు చేస్తున్నారు. దాని గురించి ఆర్భాటంగా చెప్పుకుంటున్నారు. అధికారాన్ని అహంకారాన్ని అడ్డంపెట్టుకొని దేవుడి ముందు కూడా తమ డాబూ దర్పం

చూపించుకుంటున్నారు. పవిత్రమైన దైవ సన్నిధిలో భక్తితో ఉండాల్సింది పోయి, మీడియా వారికి ఇంటర్వ్యూలు ఇస్తూ రాజకీయాలు వల్లెవేస్తున్నారు. మన అజ్ఞానం చూచి తిరుమల దేవుడు చిరునవ్వునవ్వుకుంటున్నాడు.)

ఇదంతా పక్కన పెడితే, ప్రతి ఒక్కరూ సగుణోపాసన చేస్తూ, దేహాభిమానమును ప్రాపంచిక విషయముల మీద ఆసక్తిని క్రమక్రమంగా తగ్గించుకొని, నిర్గుణోపాసన వైపుకు మళ్లాలి. నిర్గుణోపాసనకు పునాది సగుణోపాసన. దేహాభిమానము ఉంటే భగవంతుని మీద చిత్తము నిలువదు అనే సత్యాన్ని గ్రహించాలి.

నిర్గుణోపాసన కఠినము, దు:ఖతరము ఎవరికీ! దాని గురించి సరి అయిన అవగాహన లేని వాడికి. నిర్గుణోపాసన అంటే చక్కని అవగాహన ఉండి, దానికి తగిన పరిస్థితులు కల్పించుకున్నవాడికి అంటే దేహాభిమానమును, అసూయాద్వేషములను వదిలి, వైరాగ్యమును పొంది, నిష్కామకర్మలు చేస్తూ, ఆ కర్మలను, కర్మఫలములను పరమాత్మకు అర్పిస్తూ, ఆ కర్మఫలములను పరమాత్మ ప్రసాదంగా స్వీకరించేవాడికి, పరమాత్మ ఎక్కడో ఒక చోట లేడు ఈ ప్రపంచం అంతా నిండి ఉన్నాడు, ప్రతిజీవిలో ఆత్మస్వరూపుడుగా ఉన్నాడు అని తెలుసుకున్న వాడికి, నిర్గుణోపాసన చాలా సులభం అవుతుంది.

కాబట్టి మొట్ట మొదట దేవుడు ఉన్నాడు అని నమ్మి, దేవాలయాలకు వెళుతూ, సగుణోపాసన చేస్తూ, అక్కడే ఆగి పోకుండా నిర్గుణోపాసన వైపుకు మళ్లి, ధ్యానం చేయాలి. మంచి గురువును ఆశ్రయించి వారి వద్ద శాస్త్ర అధ్యయనం చేసి, జ్ఞానం సంపాదించి చివరకు మోక్షం పొందాలి. అంతేకానీ మొట్ట మొదటనే నిర్గుణోపాసన అని మొదలెట్టి దు:ఖాల పాలవకూడదు అని కృష్ణపరమాత్మ బోధించాడు.

6. యే తు సర్వాణి కర్మాణి మయిసన్న్యస్య మత్పరా:।
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయన్త ఉపాసతే॥

7. తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్।
భవామి న చిరాత్పార్థ యయ్యావేశితచేతసామ్॥

ఎవరైతే సమస్త కర్మలను నా యందు ఉంచి, నన్నే పరమగతిగా భావిస్తారో, ఏకాగ్రమైన మనసుతో నన్ను ధ్యానిస్తారో, నా యందే తమ చిత్తమును లగ్నం చేస్తారో, ఈ యోగము

తప్ప మరే ఇతర యోగములను అనుష్ఠించరో, ఎల్లప్పుడూ నాగురించి చింతిస్తూ నన్ను ఉపాసిస్తారో, అటువంటి వారిని నేను ఈ మృత్యువుతో సమానమైన ఈ  సంసారము అనే  సముద్రము నుండి అతి త్వరలో ఉద్ధరిస్తాను. బయట పడవేస్తాను. ఏ మాత్రం ఆలస్యం చేయను.

ఈ రెండు శ్లోకములలో పరమాత్మ మృత్యువుతో సమానమైన  సంసారసాగరము గురించి దానినుండి ఉద్ధరింపబడే మార్గం గురించి వివరించాడు. సంసారము అంటే మృత్యువుతో సమానము. సంసారము ఒక సముద్రము వంటిది. దారి తెన్నూ తెలియదు. ఎంత ఈదినా ఒడ్డు చేరలేము. అటువంటి సంసారము అనే సాగరంలో పడి దిక్కుతోచని వారిని నేను ఉద్ధరిస్తాను అని అంటున్నాడు పరమాత్మ. దానికి మనం చేయాల్సిన పనులు కూడా వివరించాడు.

మానవుడు చేసే అన్ని కర్మలు నాకే అర్పించమన్నాడు.
వాటితో ఏ సంబంధము పెట్టుకోవద్దు అని అన్నాడు.
నేను తప్ప మరొక మార్గము లేదు అని భావించమన్నాడు.
అనన్యమైన భక్తి కలిగి ఉండాలన్నాడు
ఏకాగ్రమైన చిత్తంతో నన్ను ఉపాసించాలి అని అన్నాడు.
నీ మనసును ఆత్మలో చక్కగా ప్రతిష్ఠించమన్నాడు.

ఇలా చేస్తే ఈ సంసారము గురించి ఏ మాత్రము భయపడనక్కరలేదు. ఆ సంసారసాగరము నుండి నేను ఉద్ధరిస్తానుఅని హామీ ఇస్తున్నాడు. ఈ సౌలభ్యం ఏదో ఒక ఉన్నత కులములో పుట్టిన వారికే అని రిజర్వేషన్లు పెట్టలేదు.  యే తు అంటే పరమాత్మను ఆశ్రయించిన అందరికీ, కుల,మత ప్రాంత భేదము లేకుండా, స్త్రీ పురుష,  ధనిక పేద, భేదము లేకుండా, పండితుడు పామరుడు అనే తేడా లేకుండా అందరికీ అందుబాటులో ఉంది అని అంటున్నాడు పరమాత్మ.

సర్వాణి కర్మాణి అంటే ఏదో ఒకటిరెండు కర్మలు కాకుండా తాను చేసే సమస్త కర్మలను కృష్ణార్పణం అంటూ పరమాత్మకు సమర్పించాలి. అంటే కర్తృత్వభావన లేకుండా, నేనే ఇదంతా చేస్తున్నాను అనే అహంభావం లేకుండా కర్మలు చేయాలి. అంటే దీని అర్థం చేయాల్సిన వెధవపనులు అన్నీ చేసేసి చివరకు కృష్ణార్పణం అంటేసరిపోదు. ఏ కర్మ అయినా చేసే ముందు చక్కగా ఆలోచించి చేయాలి. ఇది ధర్మసమ్మతమా, న్యాయసమ్మతమా, ఇది నాకు తగినదా లేదా, ఈ కర్మ వలన ఇతరులకు ఏమైనా హాని కలుగుతుందా, నష్టం కలుగుతుందా! ఇవన్నీ ఆలోచించిన తరువాతనే కర్మ చేయాలి. ఆ కర్మలకు ఏ ఫలితం వచ్చినా అది భగవంతుని ప్రసాదంగా స్వీకరించాలి.

అనన్యేనైవ యోగేన అంటే ఇదేదోకొత్త యోగం అని కాదు. రోజుకో దేవుడు చొప్పున, తాము కోరుకునే కోరికలను బట్టి దేవుళ్లను మార్చకుండా, ఏదో ఒక దేవుడిని పరమాత్మ స్వరూపంగా భావించి నిష్కామంగా భక్తి శ్రద్ధలతో ఉపాసించాలి.

మయ్యావేశిత చేతసామ్ అంటే నీ మనసును సదా నాయందు లగ్నం చెయ్యి. మనం రోజువారి పనులు చేసుకుంటూఉంటాము. అవి ధర్మసమ్మతంగా న్యాయసమ్మతంగా చేయాలి. ఆ పనులు చేసేటప్పుడు కూడా మనసును నాయందు లగ్నం చేయాలి అని అంటున్నాడు పరమాత్మ. ఎందుకంటే ప్రపంచంలో సంచరించేటప్పుడు, కర్మలు చేసేటప్పుడు, లోభం కానీ మోహం కానీ నిన్ను అంటకుండా ఉండేటందుకు ఎల్లప్పుడూ నన్నే ధ్యానిస్తూ, నా యందుమనసు లగ్నం చేయాలి.

మాం ధ్యాయన్త ఉపాసతే అంటే నన్నే ధ్యానిస్తూ ఉపాసించాలి. కేవలం ఉపాసన సరిపోదు. దానికి తోడు ఏకాగ్రమైన మనసుతో ధ్యానం కూడా చేయాలి. పరమాత్మను గురించి తెలుసుకొని ధ్యానంచేయాలి. ఏవేవో కోరికలను మనసులో పెట్టుకొని అవి తీరడానికి ధ్యానం ఉపాసన చేయకూడదు.

“మత్పరా:” అంటే నా యందే నీ మనస్సు ఎల్లప్పుడూ లగ్నం చేయాలి. ఏ పని చేస్తున్నా అంటే అది చదువు కానీ, వ్యాపారం కానీ, రాజకీయం కానీ, ఉద్యోగం కానీ ఏది చేస్తున్నాసరే. మనసు మాత్రం పరమాత్మ మీద నిలిచి ఉండాలి.

మృత్యుసంసాగరాత్ .. మనం సంసారాన్ని సాగరం అంటుంటాము. సంసారం సాగరం దు:ఖం అనే నానుడి మనలో ఉంది. ఇక్కడ ఈ సంసార సాగరాన్ని మృత్యువుతో పోల్చారు. సాగరంలో ఎన్నో జలచరాలు, తిమింగిలాలు, సొరచేపలు లాంటి భయంకరమైన జలచరాలు ఉంటాయి. కాబట్టి ఈ సంసార సాగరంలో ఈదుతున్న మానవుడు దు:ఖాలు, రోగాలు ముసలితనము అనే ఈ జలచరాల నోటబడి మరణించక తప్పదు. పైన చెప్పిన విధంగా చేస్తే ఏం ఫలితం వస్తుంది అంటే, పైన చెప్పిన విధంగా ధర్మబద్ధంగా కర్మలు చేసే వారిని, కర్మఫలములను పరమాత్మకు అర్పించిన వారిని, మనసు నా యందు లగ్నం చేసిన వారిని, నన్ను ధ్యానించేవారిని, “సముద్ధర్తా” అంటే మృత్యువు అనేసంసార సాగరం నుండి వారిని నేను పైకి లేవనెత్తుతాను. ఈ జనన మరణ చక్రం నుండి బయుడపడవేస్తాను. అంటే మాటి మాటికీ మృత్యువు లేకుండా చేస్తాను. మోక్షం ఇస్తాను. అదీ ఎప్పుడోకాదు....
“న చిరాత్” అతి తొందరలోనే, నీవు సగుణోసాసన నుండి, నిర్గుణోపాసనకు మళ్లి, శాస్త్రములను అధ్యయనం చేసి, జ్ఞానం సంపాదించి నా గురించి తెలుసుకున్న మరుక్షణం నీకు మోక్షం ఇస్తాను అని హామీ ఇచ్చాడు పరమాత్మ. మానవుడికి ఇంతకన్నా ఏం కావాలి చెప్పండి.

## 8. మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ।
## నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః॥

కాబట్టి ఓ అర్జునా! ముందు నీ మనసు నా యందు నిలుపు. నీ బుద్ధిని నా యందు లగ్నం చెయ్యి. అప్పుడు నువ్వు నా వెంటనే ఉంటావు. నా దగ్గరే ఉంటావు. ఇందులో ఎటువంటి సందేహము లేదు.

దీనికి పరమాత్మ చక్కని సులభమైన మార్గం కూడా చెప్పాడు. ముందు నీ మనస్సును నా యందు అంటే ఆత్మయందు స్థిరంగా నిలుపు. తరువాత నీ బుద్ధి కూడా నా యందే నిలుపు. అంటే మనస్సును, బుద్ధిని ఆత్మయందు లగ్నం చెయ్యి. మనో,బుద్ధి,అహంకారాలలో, రెండు ఆత్మయందు లగ్నం అయితే. మూడవది అయిన అహంకారము దానంతట అదే నశిస్తుంది. ఇప్పుడు జీవుడు పూర్తిగా ఆత్మస్వరూపుడు అవుతాడు.

ఇప్పుడు మనకు ఒక సందేహం వస్తుంది. మనస్సును ఆత్మయందు నిలిపితే చాలదా బుద్ధికూడానా అని అనుమానం రావచ్చు. మనసు ప్రాపంచిక విషయాలలో లగ్నం అయి పనిచేస్తుంది. బుద్ధి మనసు చేసే ఆలోచనలను నిర్ధారిస్తుంది.

ఉదాహరణకు కంప్యూటర్ లో రెండు మెమొరీలు ఉంటాయి. ఒకటి రామ్. అంటే తాత్కాలికమైనది. మనం ఓపన్ చేసిన ప్రతి విషయం అందులో తాత్కాలికంగా కనపడుతుంది. మనం ఏం చెబితే అది చేస్తుంది. దానినే మనము మనసు అనవచ్చు. రెండవది హార్డు డిస్క్. మనం సంపాదించినది అంటే డౌన్ లోడ్ చేసింది అంతా తనలో నిక్షిప్తం చేసుకుంటుంది. మనం కావాలనుకున్నప్పుడు మనకు అందుబాటులో ఉంటుంది. అలాగే మనం చదువుకున్న చదువు, సంస్కారము, మన అనుభవాలు, మన లక్షణాలు అన్నీ బుద్ధి అనే హార్డుడిస్కులో నిక్షిప్తం అయి ఉంటాయి. అవసరం వచ్చినపుడు మనసు బుద్ధిని సంప్రదించి నిర్ణయాలు తీసుకుంటుంది. కంప్యూటర్ లో రామ్, హార్డు డిస్కు రెండూ బాగుంటేనే కానీ కంప్యూటర్ సక్రమంగా పనిచేయదు. అలాగే మానవునికి మనసు, బుద్ధి రెండూ ముఖ్యమైనవే. అందుకని కేవలం మనసును నిగ్రహిస్తే లాభం లేదు. మనో బుద్ధులను రెండింటినీ ప్రాపంచిక విషయముల నుండి ఇవతలకు లాగి ఆత్మయందు ప్రవేశపెట్టాలి. అప్పుడు మనస్సు బుద్ధి ఆత్మయందు లీనమౌతాయి. పరమ శాంతిని సుఖాన్ని పొందుతాయి. అదే మోక్షానికి దారి.

ఒక వేళ ఇవన్నీ మనకు సాధ్యం కాదు అని ఎవరైనా అనుకుంటే వారికి ఒక షార్ట్ కట్ కూడా చెప్పాడు పరమాత్మ. దీనికి సగుణోపాసనకు సంబంధం ఉంది. దీనిని తెలుసుకుంటే

నిజమైన భక్తి అంటే ఏమిటో మనకు అర్థం అవుతుంది. సగుణో పాసన అంటే మన మనసుకు నచ్చిన దేవుడిని దేవతను విగ్రహ రూపంలో పూజించడం. కాని ఆ పూజ చేసేటప్పుడు దాని మీద మనసు పెట్టి, ఆ విగ్రహం మీద మనసు లగ్నం చేసి పూజచేయడం. అంతే కానీ ఆ విగ్రహాలకు ఏమేం అలంకారాలు చేసామా, ఏమేం నివేదనలు సమర్పించామా అని కాదు. ఆ విగ్రహాన్ని చెక్కిన శిల్పి ఆ విగ్రహాలకు ఏమేం అలంకారాలు ఉండాలో అవన్నీ చెక్కేఉంటాడు. మనం కొత్తగా చేయాల్సిన పని లేదు. కేవలం మన మనసును అర్పిస్తే చాలు. కేవలం మనసును అర్పిస్తే సరిపోతుందా అంటే చాలదు అంటున్నాడు పరమాత్మ. నీ విచక్షణా బుద్ధిని కూడా నాయందు ఉంచాలి. అంటే మన మనసు కేవలం ఆ విగ్రహాన్నే కాకుండా, ఆ విగ్రహం వెనుక ఉన్న పరమాత్మ తత్వాన్ని అర్థం చేసుకోవాలి. రాముడిని, కృష్ణుడిని, శివుడిని, అమ్మవారిని ఆంజనేయుడిని, నరసింహస్వామిని ఎవరిని, ఏ విగ్రహాన్ని పూజించినా, అవి కేవలం విగ్రహాలు కాదు, ఈ విగ్రహాల వెనుక అంతటా వ్యాపించి ఉన్న పరమాత్మ తత్వం ఉంది. ఈ విగ్రహాలు కేవలం నాకు ఆలంబన మాత్రమే. నా మనసు నిలువడానికి ఉపకరణాలు మాత్రమే. నేను మాత్రం అ విగ్రహాల వెనుక ఉన్న పరమాత్మ తత్వాన్ని పూజిస్తున్నాను అనే విచక్షణా బుద్ధిని కలిగి ఉండాలి. దానినే బుద్ధిని కూడా పరమాత్మలోఉంచడం.

ఇప్పుడు సాధకుడు పరమాత్మను సాకారంగా పూజిస్తున్నా, మనసులో బుద్ధిలో నిరాకారుడైన పరమాత్మను పూజించినట్టు లెక్క. ఈ విధంగా ఎవరైనా నా యందు తమ మనస్సును, బుద్ధిని ఆత్మయందు ఉంచితే, వారు ఎల్లప్పుడూ నా దగ్గరే ఉంటారు. నాయందే ఉంటారు. నాలోనే ఉంటారు. ఇందులో ఎటువంటి సందేహానికి తావు లేదు అని ఘంటాపథంగా చెప్పాడు పరమాత్మ.

ఇందులో న సంశయ: అని వాడాడు. ఈ పదం ప్రతిసారి వాడుతున్నాడు. ఎందుకంటే అర్జునుడు, మానవులు అందరూ ఎప్పుడో ఏదో ఒక సందేహంతో బాధపడుతుంటారు. సంశయాల పుట్ట మానవుడు. కాబట్టి సందేహం వద్దు నా మాట నమ్మండి అని పరమాత్మ మాటి మాటికీ బోధిస్తున్నాడు.

## 9. అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరమ్।
## అభ్యాసయోగేన తతో మామిచ్ఛాప్తుం ధనఞ్జయ॥

ఓ అర్జునా! ఒక వేళ నీ మనోబుద్ధులను అంటే నీ చిత్తమును నా యందు స్థిరముగా నిలపడానికి శక్తిలేతే, దానికి తగిన అభ్యాసం చేసి సాధించు.

అర్జునా! ఒక వేళ నీవు నీ మనసును, బుద్ధిని (రెండింటినీ కలిపి చిత్తం అంటారు) నా యందు అంటే ఆత్మయందు లగ్నం చేయడం నీకు చేతకాలేదు అని అనుకో. అప్పుడు రెండో మార్గం కూడా ఉంది అని అంటున్నాడు పరమాత్మ. ఎవరికీ మొదటినుంచీ ఏది అలవడదు. అభ్యాసం చేయాలి. పాఠం కూడా ఒక సారి చదివితే రాదు. ప్రతిరోజూ చదవాలి. ఏ పని కూడా ఒక సారి చేస్తే అన్నీ తప్పులు చేస్తాము. చెయ్యగా చెయ్యగా అది అలవాటు అవుతుంది. చెడ్డ అలవాట్లను తొందరగా నేర్చుకునే మనం మంచిని అంత తొందరగా గ్రహించలేము. అందుకని పరమాత్మ మనసును, బుద్ధిని ఆత్మలో నిలపడం అనే ప్రక్రియను అభ్యాసంతోనే సాధించాలి అని బోధించాడు. అందుకే ఇంతకు ముందే అభ్యాసమును ఒక యోగంగా పరిచయం చేసాడు పరమాత్మ.

అభ్యాసం చేయాలంటే ముందు మనలో ఆ కోరిక పుట్టాలి. అందుకే మామిచ్ఛాప్తుం అని అన్నాడు పరమాత్మ. నన్ను పూజించాలి, ధ్యానించాలి, నన్నే పొందాలి అనే కోరిక ముందు నీలో పుట్టాలి. అప్పుడే ఎన్ని పనులు ఉన్నా, అవన్నీపక్కన బెట్టి అభ్యాసం చేస్తావు. మొదట్లో కొంచెం కష్టంగానే ఉంటుంది. ఏదీ ఒకసారి చేస్తే రాదు. పట్టు వదలకుండా నిరంతరం చేయాలి. మరలా మరలా చేయాలి. దానినే నిరంతర అభ్యాసము అని అంటారు. అసలు కోరికే లేకపోతే బలవంతంగా కూర్చున్నా నీ మనసు దేవుడి మీద నిలువదు. దాని ఇష్టం వచ్చినట్టు తిరుగుతూఉంటుంది. కాబట్టి పరమాత్మను పూజించాలి, ఉపాసించాలి, ధ్యానించాలి అనే కోరిక బలంగా మనసులో కలగాలి. అప్పుడే నిరంతర సాధన అభ్యాసం సాధ్యం అవుతుంది.

ఉదాహరణకు సాయంత్రం 6 గంటలకు ఒక అభిమాని యొక్క అభిమాన హీరో కానీ హీరోయిన్ కానీ సినిమా టివిలో వస్తోంది అనుకుందాము. రెండురోజుల ముందే ఆ విషయం తెలిసిన ఆ అభిమాని తన అభిమాన హీరో సినిమా టివిలో చూడాలనే కోరిక గాఢంగా పెంచుకుంటాడు. ఆ సమయంలో తనకు ఉన్న అన్ని అతి ముఖ్యమైన పనులను మానుకోవడమో వాయిదా వేసుకోవడమో చేసుకుంటాడు. 5.30 కే టివి ముందుకూర్చుంటాడు. రిమోట్ ఎవరికీ ఇవ్వడు. 6 గంటలకు సినిమా మొదలవగానే పొంగి పోతాడు. అర్థం పర్థం లేని అన్ని ప్రకటనలను ఓపిగ్గా భరిస్తూ సినిమా చూపి పరమానందం పొందుతాడు. ఇదంతా ఎందువలన జరిగింది. ఆ సినిమాను టివిలో చూడాలని కోరిక గాఢంగా అతని మనసులో పాతుకుపోవడం వలన.

అలాగే పరమాత్మను పూజించాలి, ఉపాసించాలి, ధ్యానించాలి అనే కోరిక గాఢంగా ఉంటే, మనసు నిలువక ఏంచేస్తుంది. ఆ గాఢమైన కోరికకు నిరంతర అభ్యాసం తోడైతే పరమాత్మ అతని వెంటే ఉంటాడు. కాని ఇదంతా సాధారణ మానవులకు సాధ్యం కావడం లేదు. ఎందుకంటే, వారు ప్రతిరోజూ ఎన్నో పనులలో మునిగి తేలుతుంటారు. పనికిమాలిన విషయాలు ఎన్నో చర్చిస్తుంటారు. అర్థంపర్థం లేని సీరియళ్లు, సినిమాలు పదే పదే చూస్తుంటారు. కాని దేవుడి ముందు కూర్చోడానికి “తీరిక దొరకడం లేదండీ” అని అంటుంటారు. ఇది మనం సాధారణంగా

వినే మాట. తీరిక లేక కాదు. అలా కూర్చోవడానికి మనసు అంగీకరించక, అటువంటి కోరిక లేక, అంటే బాగుంటుంది. వీళ్లే ప్రతి రోజూ బాగా అలంకరించుకొని దేవాలయాలకు వెళతారు. పూజలు చేయిస్తారు. మేము ఆ పూజలు చేయించాం, ఈ ప్రసాదాలు పంచాము అని గొప్పలు చెప్పుకుంటారు. తాము గొప్ప భక్తులము అని అందరూ అనుకోవాలని వారి తాపత్రయం. కాని తాము ఉద్ధరింపబడాలని అనుకోరు. ఇందుకే భగవంతుడు ఈ శ్లోకం చెప్పాడు.

మనం వృధాగా గడిపే సమయంలో కొంచెం సమయం అయినా భగవధ్యానంలో గడపాలి అనే కోరిక కలిగితే, ఆ కోరికకు అనుగుణంగా తగిన అభ్యాసం చేస్తే, మరుజన్మకు మంచి మార్గం వేసుకోవచ్చు అని అర్జునుడి ద్వారా మనకు ఉపదేశించాడు. ఎంత సేపు కూర్చున్నా మనసు భగవంతుని యందు నిలవడం లేదు, మనసు పరి పరి విధాల పోతూ ఉంటుంది అనే వారికి ఈ శ్లోకం చక్కని పాఠం.

## 10. అభ్యాసే2ప్యసమర్థో2సి మత్కర్మపరమో భవ।
## మదర్థమపి కర్మాణి కుర్వన్ సిద్ధిమవాప్స్యసి॥

పై శ్లోకంలో చెప్పిన విధంగా ఏవిధమైన అభ్యాసం చేయడానికి నీవు అసమర్థుడవైతే, నాకు సంబంధించిన కర్మలనే ఆచరించు. ఆ కర్మలన్నీ నా కొరకే ఆచరించు. అలా చేసినా కూడా నీవు నన్ను పొందగలవు.

పైవిధంగా అభ్యాసం చేయలేని వాళ్లు, చేయడానికి ఇష్టపడని వాళ్లు, అంటే కనీసం రోజుకు 10 నిమిషాలు కూడా భగవంతుని నిర్మలమైన మనసుతో ధ్యానం చేయడానికి మనసు అంగీకరించని వాళ్లు ఎంతో మంది ఉన్నారు. ఆ పదినిమిషాలు మాత్రం ప్రాపంచికసుఖాలు ఎందుకు వదులుకోవాలి అని కొందరంటే మరి కొందరు. ఆ పది నిమిషాలలో పది రూపాయలో, పది వేలో, పది లక్షలో సంపాదించాలని తాపత్రయపడుతుంటారు. అటు వంటి వారి గురించి పరమాత్మ మరొక మెట్టు కిందికి దిగాడు.

నీవు అభ్యాసం చేయడానికి, ధ్యానం చేయడానికి నీవు అసమర్థుడివి అయితే, నీకు చేతకాకపోతే, నీ మనసు అంగీకరించకపోతే, దాని కోసం చింతించకు. నిరాశపడిపోకు. నా జీవితం ఇంతే అంటూ చేతులుముడుచుకొని కూర్చోకు. మరొక పని చెయ్యి. నీవు ప్రతి రోజూ ఏమేమి కర్మలను చేస్తావో ఆ కర్మలే చెయ్యి. తప్పులేదు. కాని ఆ కర్మలన్నీ నా పరంగా చెయ్యి. నా కొరకు చేస్తున్నాను అనుకుంటూ చెయ్యి. న్యాయంగా, ధర్మంగా చెయ్యి. నీవు చేసే పనినే దైవంగా భావించి చెయ్యి. అది కూడా ఉపాసనగా మారుతుంది. ధనం సంపాదిస్తున్నాను అనుకుంటే

ధర్మంగా సంపాదించు. మరొకరి ధనం దోచుకోకు. ఇతరులను కష్టపెట్టి, హింసించి ధనం సంపాదించకు. అలాగే వ్యాపారాలు ధర్మబద్ధంగా చెయ్యి. న్యాయంగా నీకు రావాల్సిన లాభం తీసుకో. ఉద్యోగస్తులుకూడా తాము చేసే ఉద్యోగం ప్రజాసేవకోసం చేస్తున్నామనీ, అదిదైవకార్యం అనీ శ్రద్ధతో చేస్తే అది కూడా భగవతారాధనే అవుతుంది. అలాగే వివాహమాడిన ధర్మపత్నిని, అర్ధాంగిని తన సహధర్మచారిణిగా భావించి, ఆమెను తప్ప, ఇతర స్త్రీలను కన్నెత్తి కూడా చూడకుండా, చేసే ప్రతి కార్యము పరమాత్మ కొరకే, ధర్మబద్ధంగా, న్యాయపరంగా చేస్తే అది కూడా భగవంతుని ఉపాసనే అవుతుంది.

ఇంకా చేతనయితే ఇతరులకు ఉపయోగపడే కార్యాలు చేయాలి. (రాజకీయ నాయకుల కర్తవ్యం సమాజానికి సేవచేయడం. సమాజానికి ఉపయోగపడే పనులు చేయడం. కాని ఈ నాటి రాజకీయ నాయకులు వారికి ఉపయోగపడే పనులు, వారికి లాభించే పనులే చేసుకుంటూ సమాజాన్ని ఉద్ధరిస్తున్నామని చెప్పుకుంటున్నారు. నరకానికి దారి వెతుక్కుంటున్నారు.) నీవు చేసే పూజలు, వ్రతములు, భజనలు అన్నీ శ్రద్ధతో భక్తితో చెయ్యి. ధర్మంగా సంపాదించిన ధనంతో చెయ్యి. (దర్జాగా సమాజాన్ని దోచుకొని భగవంతునికి బంగారు కిరీటాలు చేయిస్తే జైలుకు అంటే నరకానికి పోతారు.) కాబట్టి న్యాయంగా ధర్మంగా సంపాదించిన ధనంతో దైవకార్యాలు, సమాజశ్రేయస్సుకు పనికివచ్చే కార్యాలు నా పరంగా నా కోసం చెయ్యి. ఒక్కమాటలోచెప్పాలంటే నిష్కామ కర్మ, ఇతరులకు ఉపయోగపడే కర్మలు పరమాత్మపరంగా చెయ్యాలి. ఆ ఫలితాలను పరమాత్మకు అర్పించి, తరువాత వాటిని భగవంతుని ప్రసాదంగా స్వీకరించాలి. అప్పుడు కూడా ముక్తి లభించే అవకాశం ఉంది అంటున్నాడు పరమాత్మ.

## 11. అథైతదప్యశక్తో2సి కర్తుం మద్యోగమాశ్రిత:।
## సర్వకర్మఫలత్యాగం తత: కురు యతాత్మవాన్॥

నా గురించి స్మరణ, ధ్యానం, నిష్కామకర్మ, ఇవన్నీ ఆచరించడానికి కూడా సాధ్యం కాకపోతే, శక్తి, సమర్థత లేకపోతే, అప్పుడుకూడా నీవు నా యందు మనస్సు నిలిపి, నీవు చేసే సమస్త కర్మల యొక్క ఫలములను నాకు అర్పిస్తే చాలు.

పైశ్లోకంలో చెప్పిన విధంగా కూడా చేయడం నాకు చేత కాదు. నా వల్ల కాదు అని అనుకుంటే మరొక మార్గం కూడా చెబుతున్నాడు పరమాత్మ. కనీసం నా యందు నీ మనస్సు లగ్నం చెయ్యి. నీవు ఏ పని చేసినా ఆ కర్మఫలమును నాకు అర్పించు. భగవదార్పణం చెయ్యి. అంటే ఉదయం లేచి నప్పటి నుండి రాత్రి పడుకోబోయే వరకు ఎన్నో పనులు చేస్తుంటాము. ఆపనులు చేసేటప్పుడు నన్ను స్మరించుకో. ఈ పనులు నేను చేయడం లేదు. పరమాత్మ చేయిస్తున్నాడు. నేను

నిమిత్తమాత్రుడను అన్నీ ఆ పరమాత్మకు అర్పిస్తున్నాను. నేను చేసే అన్ని కర్మలు, వాటిఫలితములు నావి కావు ఆ పరమాత్మకు చెందుతాయి అని అనుకోవాలి. కేవలంఅనుకోవడమే. చేసినపనికి ఫలితం మనకు ఎదురుగా కనిపిస్తూనే ఉంటుంది. కాకపోతే ఆ ఫలితాలను మనం పరమాత్ముని ప్రసాదంగా స్వీకరిస్తాము. అప్పుడు మనలోని అహంకారం నశిస్తుంది. ఇదంతా పరమాత్మ అనుగ్రహం అనే భావన కలుగుతుంది. ఈశ్వరార్పణ బుద్ధి, ఈశ్వర ప్రసాద బుద్ధి కలుగుతుంది. మనకు ఏ లాభం కలిగినా, ఏ నష్టం కలిగినా, ఇదంతా ఆ పరమాత్మ ప్రసాదము అని స్వీకరిస్తే, ఆ ఫలితము గురించిన ఆసక్తి, చింత ఉండవు. మనసు నిర్మలంగా, ప్రశాంతంగా ఉంటుంది. అప్పుడు మనసులో చికాకు పరిచే ఆలోచనలు, భావనలు అన్నీ క్రమేణా అదృశ్యం అవుతాయి. దైవీసంబంధమైన ఆలోచనలే కలుగుతుంటాయి. ఇదే మోక్షానికి తొలిమెట్టు. అంటే నర్సరీ క్లాసు. అందుకే పరమాత్మ మనలను నర్సరీ నుండి ఆరంభించమంటున్నాడు. ఈ మెట్టు ఎక్కగలిగితే, మిగిలిన మెట్లు ఎక్కడం కొంచెం సులభం అవుతుంది. దీనినే సర్వకర్మఫలత్యాగం అని పేరుపెట్టాడు పరమాత్మ.

ఇక్కడ కొంత మంది విపరీతార్థాలు తీస్తారు. అసాంఘిక కార్యక్రమాలు, ప్రజలకు హాని కలిగించే కార్యక్రమాలు చేసి, అన్నీ ఆ భగవంతుడే చేయిస్తున్నాడు నేను నిమిత్రమాత్రుడిని అని అనుకుంటే అది పొరపాటే. పరమాత్మచెప్పింది కేవలం ధర్మ బద్ధంగా, న్యాయపరంగా ఉండే పనులు కానీ అసాంఘికమైన పనులు కావు. మనం చెడ్డ పదార్థాలు, తినకూడని పదార్థాలు దేవుడికి నివేదన పెట్టం కదా! అలాగే చేయకూడని పనులు చేసి ఆ కర్మల ఫలితాన్ని పరమాత్మకు అర్పించకూడదు. కేవలం న్యాయంగా, ధర్మంగా చేసిన పనుల యొక్క ఫలితాలను మాత్రమే పరమాత్మకు అర్పించాలి. కాబట్టి మనం ఏ పని చేసినా రామార్పణం, కృష్ణార్పణం, భగవదార్పణం అంటూ చేస్తే ఆ యా కర్మల ఫలితాలుమనకు అంటుకోవు.

ఈ అర్పణం ఎలా చెయ్యాలి అంటే యతాత్మవాన్ అంటే నాయందు మనసు పెట్టి అర్పణ చెయ్యి అంటున్నాడు. ఏదో మాటవరసకు కృష్ణార్పణం అంటే సరిపోదు. మనసా, వాచా, కర్మణా నీ కర్మఫలములను నాకు సమర్పించు. నాకు సమర్పించిన వాటిని తిరిగి నా ప్రసాదంగా స్వీకరించు. అప్పుడే నీ మనసు కూడా నిర్మలంగా ఉంటుంది అని అంటున్నాడు పరమాత్మ.

ఎవరెవరు వారి వారి మనస్తత్వాలకు తగ్గట్టు వారు పనులు చేసుకుంటున్నా, ఆ యా పనులు భగవదర్పితం చేస్తే చాలు దీనినే సర్వకర్మఫలత్యాగం అంటున్నాడు. ఆయా కర్మల వలన కలిగే ఫలితములను ఇవి నావు కావు భగవంతునివి అని వాటి మీద ఆసక్తి చూపించకూడదు. కాని ఇదంతా నేను చేస్తున్నాను. ఈ ఫలితములను నేనే అనుభవించాలి అనే భావన కలిగిన వారు తాము చేసిన కర్మ ఫలములను ఓ పట్టాన వదిలిపెట్టరు. దానికి నిరంతర సాధన కావాలి. ఓర్పుకావాలి. అందుకే యతాత్మవాన్ అంటే మనస్ఫూర్తిగా ప్రయత్నించాలి. అలా చేస్తే సాధించలేని కార్యము ఏదీ లేదు.

## 12. శ్రేయో హి జ్ఞానమభ్యాసాత్ జ్ఞానాధ్యానం విశిష్యతే।
## ధ్యానాత్కర్మఫలత్యాగస్త్యాగస్త్యాగాచ్ఛాన్తిరనన్తరమ్॥

అభ్యాసము కంటే జ్ఞానము గొప్పది. జ్ఞానము కంటే ధ్యానము గొప్పది. ధ్యానము కంటే కర్మఫలత్యాగము గొప్పది. కర్మఫలత్యాగము చేస్తే పరమ శాంతి చేకూరుతుంది.

ఈ శ్లోకంలో పైన చెప్పబడిన మెట్లకు తర తమ భేదములు వర్ణిస్తున్నాడు పరమాత్మ. అభ్యాసంతో ఏద్దైనా సాధించ వచ్చు అని చెప్పాడు. కాని అభ్యాసాని కంటే వేదములు శాస్త్రములు పురాణములు చదివి జ్ఞానము సంపాదించడం ముఖ్యం. జ్ఞానము సంపాదించి ఆ జ్ఞానమును అభ్యాసం చేయాలి. వేదములు, శాస్త్రములు పురాణములు చదివి జ్ఞానము సంపాదించడం కంటే, ప్రతిరోజూ ధ్యానం చేయడం ఉత్తమం. ధ్యానం చేస్తే మనసు, ఇంద్రియములు అదుపులో ఉంటాయి. ఈ ధ్యానం చేయడం కన్నా చేసిన కర్మల ఫలములను వదిలిపెట్టడం ఉత్తమం. ఎందుకంటే ఈ కర్మల ఫలితములు నావి కావు, ఈ కర్మలు అన్నీ పరమాత్మ పరంగా చేస్తున్నాను. ఈ కర్మలఫలితములు పరమాత్మవే అని భావిస్తే మనస్సు ప్రశాంతంగా నిర్మలంగా ఉంటుంది. ధ్యానం చేస్తున్న ఆ కాసేపు మనసు నిర్మలంగాఉంటుంది. అదే విధంగా కర్మలు చేస్తూ ఆ కర్మల ఫలములను పరమాత్మకు అర్పిస్తూ, వాటిని పరమాత్మ ప్రసాదంగా స్వీకరిస్తే, నిరంతరము ఆనందము, నిర్మలత్వము, ప్రశాంతత అనుభవించవచ్చు. ఎందుకంటే అందులో ఉండే ఆనందము, ప్రశాంతత ఇంక దేనిలో ఉండవు.

అంటే మనము మొట్ట మొదట నేర్చుకున్న నిష్కామ యోగానికి వచ్చాము. నిష్కామ యోగము, కర్మఫల త్యాగము అన్నిటి కన్నా గొప్పవి. తరువాత స్థానాలలో ధ్యానము, విజ్ఞానము, జ్ఞానము, అభ్యాసము వస్తాయి. వీటి కన్నిటికీ నిర్మలమైన మనస్సు చిత్త శుద్ధి ముఖ్యము. ఆ చిత్త శుద్ధి నిష్కామ కర్మ, కర్మఫల త్యాగము వలననే సిద్ధిస్తాయి. దానివలన మనస్సుకు ప్రశాంతత చేకూరుతుంది. అందుకే కర్మఫలత్యాగము అన్నిటికీ పునాదిలాంటిది. పునాది బలంగా ఉంటేనే కట్టడం నిలబడుతుంది. అలాగే కర్మఫలత్యాగంతో ఆరంభిస్తే, దానికి పైన ఉన్నవన్నీ వాటంతట అవే సిద్ధిస్తాయి అని అంటున్నాడు పరమాత్మ.

ఇప్పటివరకు మనం ఈ శ్లోకానికి పైన కనపడే అర్థం తెలుసుకున్నాము. కాని ఇలా అర్థం చేసుకుంటే ఈ శ్లోకానికి విపరీతార్థాలు గోచరిస్తాయి. ఎందుకంటే పై శ్లోకాలలో జ్ఞానము అన్నిటి కన్నా గొప్పది అనీ, కర్మఫలత్యాగము ఏదీ వీలుకాకపోతే ఆఖరుగా ఆచరించతగ్గది అని చెప్పారు. ఇప్పుడు ఈ శ్లోకంలో కర్మఫలత్యాగాన్ని అత్యంత శ్రేష్ఠంగా చెప్పారు. ఇవి ఒకదానికి ఒకటి విరుద్ధంగా కనిపిస్తున్నాయి.

ఇలా చెప్పడంలో ఉన్న విశేషం ఏమిటంటే, మనం ఏద్దైనా ఒక వస్తువును గురించి చెప్పవలసి వచ్చినపుడు దానిని గురించి గొప్పగా చెప్పడం మనకు అలవాటు. బట్టల షాపుకు వెళితే షాపువాడు చీరలు చూపిస్తాడు. "అమ్మా ఈ చీర చాలా మంచిది. నేత మంచిది. కలరు పోదు దీనిని తీసుకోండి" అంటాడు. మీరు ఆ చీర పక్కన పెట్టి మరొక చీర తీసుకుంటే దాని గురించి ఇంకా గొప్పగా చెబుతాడు. అలా మీరు ఏ చీర తీసుకున్నా దాని గురించి ఇంకా ఇంకా గొప్పగా చెబుతాడు. అంటే వాడి ఉద్దేశ్యం మీరు ఏదో ఒక చీర కొనాలని కానీ, మిగిలిన చీరలు గొప్పవి కాదు అని కాదు.

అలాగే ఇక్కడ ఒకదానికంటే ఒకటి గొప్పవి అని చెబుతూ, కర్మఫలత్యాగం గొప్పది అని చెప్పడంలో అర్థం కనీసం మీచేత ఈ కర్మఫలత్యాగము అన్నా ఆచరింపచేయాలని వ్యాసుల వారి ఉద్దేశం. అంతేకానీ జ్ఞానము, ధ్యానము, అభ్యాసము, కన్నా కర్మఫలత్యాగము గొప్పది అని కాదు. దేనికదే గొప్పది. కాకపోతే మనం ఆచరించడానికి కర్మఫలత్యాగము సులభంగా ఉంటుంది కాబట్టి, దాని కంటే ఇంకా కింద ఆచరించవలసినది ఏదీ లేదు కాబట్టి, దాని గురించి గొప్పగా చెబితే అందరూ దానిని ఆచరించి పైమెట్టు ఎక్కడానికి ప్రయత్నం చేస్తారు కాబట్టి, కర్మఫలత్యాగాన్ని అన్నిటికన్నా శ్రేష్టమైనదిగా చెప్పాడు. ఈ శ్లోకాన్ని అలా అర్థం చేసుకోవాలి కానీ ఉన్నది ఉన్నట్టు చదువుకుంటే విపరీతార్థాలు, పరస్పరవిరుద్ధఅర్థాలు వచ్చే అవకాశం ఉంది.

ఇక్కడి నుండి భక్తుల యొక్క గుణములు లక్షణాల గురించి చెబుతున్నాడు పరమాత్మ.

**13. అద్వేష్టా సర్వభూతానాం మైత్ర: కరుణ ఏవచ।**
**నిర్మమో నిరహంకార: సమ దు:ఖసుఖ: క్షమీ॥**

**14. సంతుష్టస్సతతం యోగీ యతాత్మా ధృఢనిశ్చయ:।**
**మయ్యర్పిత మనోబుద్ధిర్యో మద్భక్తస్స మే ప్రియ:॥**

సకల భూతజాలముల యందు ద్వేషము లేకుండా, స్నేహముతోనూ, కరుణతోనూ సంచరించేవాడు, అహంకారము, మమకారము లేనివాడు, సుఖమును, దు:ఖమును సమంగా భావించేవాడు, ఓర్పుకలవాడు, ఉన్నదానితో తృప్తి చెందేవాడు, మనో నిగ్రహము కలవాడు, ఎల్లప్పుడూ తన మనస్సును ఆత్మయందు కలిపి ఉంచేవాడు, పరమాత్మ పట్ల ధృఢమైన నిశ్చయాత్మక బుద్ధి కలవాడు, చంచలమైన బుద్ధిలేనివాడు, అటువంటి అచంచలమైన, నిశ్చయాత్మక బుద్ధిని నాకు

అర్పించేవాడు, నిరంతరము నా యందు భక్తి కలవాడు, అటువంటి వాడు నాకు అత్యంత ప్రియమైన వాడు.

ఈ శ్లోకాలకు పైపైన అర్థం చూస్తే, పరమాత్మకు కొంతమంది మీద పక్షపాతం ఉన్నట్టు అనిపిస్తుంది. కాని నిజానికి పరమాత్మ ఎవరి పట్ల ప్రేమ, ద్వేషములు లేవు. ఈ విషయాన్ని తొమ్మిదవ అధ్యాయములోనే చెప్పాడు. "న మే ద్వేష్యో2స్తి నప్రియ:" అంటే నాకు ద్వేషింప తగ్గవాడు కానీ, ప్రియుడు కానీ లేడు. అందరూనాకు సమానమే. అని అన్నాడు. ఇంతకు ముందు శ్లోకాలలో తనను చేరుకోడానికి ఎవరికి ఏ మార్గము అనువైనదో, ఆయా మార్గములను వారికి సూచించాడు. ఏమీతెలియని వాడు, శాస్త్రజ్ఞానము లేని వాడు కూడా తాను చేసే సకామ కర్మలన్నీ తనకు అర్పిస్తే, వాడికి మోక్షం ప్రసాదిస్తాను అని అభయం ఇచ్చాడు.

ఈ శ్లోకాలలో తన భక్తునికి ఏమే లక్షణాలు ఉండాలో చక్కగా వివరించాడు. ఇది ఒక గీటురాయి వంటిది. ప్రతివాడూ తనకు ఈ లక్షణాలు ఉన్నాయా లేవా అని పరీక్షించుకోవాలి. లేకపోతే అలవరచుకోవాలి. క్రమక్రమంగా పరమాత్మకు చేరువ కావాలి. అందుకు ఈ శ్లోకాలు ఉపయోగపడతాయి అంతే కానీ పరమాత్మ పక్షపాతి అని భావించడానికి కాదు.

మొట్టమొదటి లక్షణం ఎవరిమీదా ద్వేషము ఉండకూడదు. ద్వేషము అనేది అగ్ని లాంటిది. నిప్పు ఎవరి దగ్గర ఉంటుందో, దేని దగ్గర ఉంటుందో దానిని దహించివేస్తుంది. అలాగే ద్వేషం ఎవరిలో ఉంటుందో అది వారిని దహించి వేస్తుంది. అంటే ద్వేషం కలిగి ఉండటం అంటే భస్మాసురుడు మాదిరి ఎవరి నెత్తిమీద వారే చెయ్యిపెట్టుకొని భస్మం కావడం అన్నమాట. మనసునిండా ద్వేషం ఉన్నవాడికి పరమాత్మ మీద భక్తి నిలువదు. మనస్సు చంచలంగా ఉంటుంది. లోపల ఉన్న పగ ద్వేషం ఎలా తీర్చుకోవాలా అని నిరంతరం ఆలోచిస్తూ ఉంటుంది. ఎదుటి వాడి మీద ద్వేషంతో మనసు రగిలిపోతూ చివరకు బలహీనమౌతుంది. దేని మీదా మనసు నిలువదు. భగవంతుని మీద అసలే నిలువదు. పూజకు కూర్చున్నా, ధ్యానంలో కూర్చున్నా, తాను ద్వేషించే వారి మీద ఎలా పగ తీర్చుకోవాలో ఆలోచిస్తుంటాడు కానీ, ధ్యానంలో మనసు నిలుపలేడు.

ఇక్కడ మరొక విషయం కూడా ఆలోచించాలి. అందరిలో పరమాత్మ ఆత్మస్వరూపుడుగా ఉన్నాడని మనం తెలుసుకున్నాము. అటువంటప్పుడు, మీరు ద్వేషించే వ్యక్తులలో కూడా పరమాత్మ ఆత్మస్వరూపుడుగా ఉన్నాడు కదా! అంటే మనం ఎదుటి వాడిని ద్వేషిస్తున్నాము అంటే అతనిలో ఆత్మస్వరూపుడుగా ఉన్న పరమాత్మ ను ద్వేషిస్తున్నాము అన్న మాట. కాబట్టి ద్వేషము అసలు ఉండకూడదు. ప్రతివాడు ద్వేషం వదిలిపెట్టాలి. అందుకే "అద్వేష్టా సర్వభూతానాం" అని మొట్ట మొదటి పదంగా వాడారు వ్యాసులవారు.

ఇక్కడ అందరికీ ఒక సందేహం వస్తుంది. మనం ఎవరినీ ద్వేషించకూడదు. కాని మనలను ఎవరైనా ద్వేషిస్తే ఏం చేయాలి. అటువంటి వారి పట్ల ద్వేషం లేని దండోపాయం ప్రయోగించాలి. తండ్రి బిడ్డను దండించినట్టు, టీచర్ స్టూడెంటును దండించినట్టు. తండ్రికి, టీచర్ కు ద్వేషభావం ఉండదు. కేవలం తన సంతానము, శిష్యులు బాగుపడాలనే కోరిక తప్ప. అలాగనీ అమితమైన ప్రేమ ఉండకూడదు. అనురాగ మమకారాలు మితంగాఉండాలి.

ఎవరి మీదా కోపము, ద్వేషము లేకపోతే, స్నేహము, కరుణ వాటంతట అవే కలుగుతాయి. స్నేహానికి గుర్తు ద్వేషం లేకపోవడమే. అందుకనే పరమాత్మ రెండూ చెప్పాడు. స్నేహితుడి లక్షణాలు ఏవంటే తాను ఏదైనా తప్పుపని, చేయకూడని పని, పాపపు పనిచేస్తుంటే నిర్మొహమాటంగా నివారించేవాడే నిజమైన స్నేహితుడు. ఏదైనా మంచి పని చేస్తుంటే ప్రోత్సహించేవాడు, స్నేహితుడి రహస్యాలను కడుపులోనే దాచుకునేవాడు, స్నేహితుడి మంచి గుణాలను అందరికీ చెప్పేవాడు, అవసరం వచ్చినపుడు ముఖం చాటెయ్యకుండా, స్నేహితుడి కష్టాలను పంచుకునేవాడు, ఇటువంటి గుణములు కలిగిన వాడిని మంచి మిత్రుడు అని అన్నారు. ప్రతివాడూ అటువంటి స్నేహమును కలిగి ఉండాలి.

తరువాతది కరుణ. అంటే ఇతరుల కష్టసుఖాలు తనవిగా భావించడం, సానుభూతి చూపడం చేతనయితే సాయంచేయడం. దీనినే కరుణ చూపడం అంటారు. తరువాతవి అహంకార మమకారాలు. అహంకారము అంటే ఇది నా శరీరము, ఇది నా మనసు, నా బుద్ధికి తోచినట్టు చేస్తానుఅని అనుకోవడమే అహంకారము. నేను, నాది, ఇవన్నీ నావి, వీళ్లంతా నావాళ్లు అని అనుకోవడం మమకారం యొక్క లక్షణం. నేను, నా వాళ్లు, నా ఆస్తి, నా ధనము, నా ఇల్లు. ఇవి నేను సంపాదించాను. ఇవి పోతే నేను బతకలేను అనడమే అహంకార మమకారాలకు గుర్తు.

ఈ శరీరం పంచభూతాల కలయిక. అందులో ఉన్న మనసు, బుద్ధి నా ప్రారబ్ధం నుండి పుట్టినవి. కాబట్టి ఇవేవీ నావు కావు. నేను పుట్టిన తరువాత నేను సంపాదించాను అని అనుకుంటున్న స్థిర, చర, ఆస్తులు అన్నీ నేను పుట్టక ముందు కూడా ఉన్నాయి. నేను మరణించిన తరువాత కూడా అవి ఇక్కడే ఉంటాయి. ఏవీ నా వెంటరావు.అనే భావన ఉంటే అహంకారము, మమకారము నశిస్తుంది. జననం, మరణం, మధ్యలో ఉన్న కాలంలోనే ఈ అహంకార మహకారాలు మనిషిని ఆవరించి ఉంటాయి. వీటివలన కలిగే వాసనలు తరువాతి జన్మకు కారణం అవుతాయి. అందుకే ఈ అహంకార మమకారాలు ఉండకూడదు అని పరమాత్మ చెప్పాడు. ఒక వేళ ఉన్నా మితంగా ఉండాలి కానీ అతిగాఉండకూడదు. దానినే సాత్వికాహంకారము అని అంటారు.

నేను లేకపోతే ఈ ప్రపంచమే లేదు, అంతా నా వలననే జరుగుతూ ఉంది, ఇదంతా నాది, వీళ్లంతా నా వాళ్లు, అనే ఈ భావాలను పరిమితంగా ఉంచుకోవాలి. ఈ విశ్వంలోని అన్ని సంపదలు పరమాత్మవే. వాటిని నా జీవితకాల పర్యంతం అనుభవించడానికి మాత్రమేనాకు హక్కు ఉంది. మరణించేటప్పుడు ఏవీ నా వెంటరావు అనే భావన కలిగి ఉండాలి. ఇలా అహంకార మమకారాలు మితంగా, అదుపులో ఉంటే, సుఖ దు:ఖములను సమంగా చూడటం అలవాటు అవుతూ ఉంది.

సుఖములను, దు:ఖములను సమంగా చూడాలి అంటే సుఖం కలిగి నపుడు పొంగి పోయి గంతులు వేసి, సంబరాలు జరుపుకొని, ఊరేగింపులు చేసుకొని, మర్నాడు అట్టే అదంటే నాకు అస్సలు ఇష్టం లేదు అని అనకూడదు. అలాగే దు:ఖం వచ్చినపుడు కుంగి పోయి మంచంపట్టకూడదు. ఒకడికి సుఖము మరొకరికి దు:ఖంగాపరిణమిస్తుంది. ఒకడు ఒక కారును వదుల్చుకోడానికి అమ్ముతాడు. ఆకారును మరొకడు సుఖపడడానికి కొనుక్కుంటాడు. తరువాత దాని మరమ్మతులకు డబ్బు పెట్టలేక దు:ఖం అనుభవిస్తాడు. కాబట్టి జీవితం సుఖదు:ఖాల సమ్మేళనం అని గ్రహించి, సుఖదు:ఖములను సమానంగా అనుభవించాలి.

క్షమ, ఓర్పు కలిగి ఉండాలి. ప్రతిదానికీ ఆవేశపడిపోకూడదు. నిదానం, నెమ్మది అలవాటు చేసుకోవాలి. జీవితంలో సుఖం వచ్చినా, దు:ఖం వచ్చినా ఇది భగవంతుని ప్రసాదము, నా మంచికే వచ్చింది అని ఆనందంగా అంగీకరించాలి. దీనినే క్షమ అని అంటారు. మనసులోచెలరేగే తాత్కాలికమైన కోపతాపాలకు, ఆవేశకావేషాలకు అడ్డుకట్ట వేయడమే క్షమ. విజ్ఞత ప్రదర్శించడమే క్షమ. తాత్కాలికంగా ఈ లక్షణాలు అలవాటు చేసుకోవడం కొంచెం కష్టం అనిపించినా, దీర్ఘకాలంలో లాభిస్తాయి.

ఎల్లప్పుడూ తృప్తి, సంతుష్టి కలిగి ఉండాలి. ఉన్నదానితో తృప్తి పడాలి. లేని దానికోసం ఆరాట పడకూడదు. ఈ రోజు లక్షరూపాయలు వస్తే తృప్తి పడతాము. మర్నాడే మరొక లక్షకొరకు ఆరాటపడతాము. అలా కాకుండా నిరంతరము మనకు ఉన్నది చాలు. మనకు ప్రాప్తం ఉంటే వస్తుంది లేకపోతే లేదు అనే భావన కలిగి ఉండాలి. అలాగే తనకు ఉన్న దానిని దాచుకొని, లేని దాని కోసం పాకులాడకుండా, తనకుఉన్న దానిని నలుగురితో పంచుకునేవాడు కూడా తృప్తి చెందినవాడుఅని చెప్పవచ్చు. అటువంటి వాడు ఎంత సంపాదించినా, దానిని తన సాటి వారి కోసమే సంపాదిస్తాడు తప్ప తనకోసం కాదు. అంతేకానీ వచ్చిన లాభాలన్నీ తన విలాసాలకు ఉపయోగించుకొని, ఆ లాభాలకు కారకులైన కార్మికుల పొట్టగొట్టే వాడు ఎప్పుడూతృప్తిని పొందలేడు. తీవ్రమైన అశాంతితో బాధపడుతుంటాడు.

యతాత్మా అంటే తన మనస్సు తన స్వాధీనంలో ఉన్న వాడు. మనసు చెప్పింది తాను వినకుండా, తాను చెప్పింది మనసు వినేటట్టు చేసుకునేవాడు.

నిశ్చయాత్మక బుద్ధి కలిగి ఉండాలి. చంచల మైన మనస్సు ఉండకూడదు. అనుకున్నది అనుకున్నట్టు చేయగలిగే నిశ్చల తత్వం కలిగి ఉండాలి. అది ప్రాపంచిక విషయమైనా కావచ్చుఅంటే వ్యాపారము, విద్య, రాజకీయము ఏదైనా కావచ్చు నిశ్చయాత్మక బుద్ధి, ఇచ్చిన మాటకు కట్టుబడి ఉండటం అవసరం. అవసరానికి తగ్గట్టు మాట మార్చకూడదు. అవసరానికి తగ్గట్టు దేవుళ్లను మార్చకూడదు. వేదములను, శాస్త్రములను నమ్మాలి. దేవుడు ఉన్నాడా లేడా అనే చంచలత్వం పనికిరాదు. అలాకాకుండా చంచలస్వభావముతో ఉంటే ఈ మాయ మింగేస్తుంది. అధ:పాతాళానికి తొక్కేస్తుంది.

తరువాతది మయ్యర్పిత మనో బుద్ధి: అంటే మనస్సు, బుద్ధి పరమాత్మకు అర్పించాలి. అంటే మనసులోనూ బుద్ధిలోనూ చెలరేగే కోరికలను, భావాలను, ఉద్వేగాలను, పరమాత్మ పరం చేయాలి. పరమాత్మ పరంగా కర్మలు చేయాలి. అప్పుడు ఆకర్మఫలములు అతనికి అంటవు. అతని మనసు, బుద్ధి నిర్మలంగా ఉంటుంది. ఇదివరకే చెప్పుకున్నాము. మనోబుద్ధులను ఆత్మయందు సమ్యక్ న్యాసము అంటే చక్కగా ఉంచాలి. దానినే సంన్యాసము అంటారు. అప్పుడు మనో బుద్ధులు నిర్మలంగా, స్థిరంగా ఉంటాయి. అవి స్థిరంగా ఉంటే ఇంద్రియాలు మాట వింటాయి. పరమాత్మ యందు భక్తి అచంచలంగా నిలుస్తుంది.

ఇటువంటి లక్షణములు కలిగిన వాడే నా భక్తుడు. నాకు అత్యంత ప్రియుడు. అతడి యోగక్షేమాలు నేను ఎల్లప్పుడూ గమనిస్తూ ఉంటాను అని పరమాత్మ మనకు హామీ ఇస్తున్నాడు. మనం చేయవలసిందల్లా పైన చెప్పబడిన రెండు శ్లోకాలలో ఉన్న లక్షణాలు అలవరచుకోవడమే. అదే మన కర్తవ్యము.

## 15. యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ యః।
## హర్షామర్షభయోద్వేగైర్ముక్తో యస్స చ మే ప్రియః॥

ఎవని వలన ఇతర మానవులు కానీ, జంతుజాలము కానీ, భయమును, ఉద్విగ్నతను పొందరో, ఎవరైతే ఇతర మానవుల వలన కానీ, సకల జంతుజాలముల వలన కానీ భయమును, ఉద్విగ్నతను పొందరో, ఎవరైతే సంతోషమును, దు:ఖమును, భయమును, ఉద్వేగమును, మనోవ్యాకులతను విడిచిపెడతారో, అటువంటి వారు నాకు చాలా ఇష్టులు.

శారీరకంగా ఉండే బాధలు ఒకరకమైతే మానసికంగా కలిగే బాధలు మరొక రకం. అందులో భయం చాలా భయంకరమైనది. అందుకే మానవునికి మొదటి శత్రువు భయము అంటారు. కొంత మంది అన్నిటికీ భయపడుతుంటారు. లేనిపోనివి ఊహించుకొని భయంతో వణికి పోతుంటారు. ఈ భయం ప్రాపంచిక విషయములలోనే కాదు దేవుని విషయంలో కూడా ఉంటుంది. ఆ దేవుడికి పూలు పెట్టాము ఈ దేవుడికి పెట్టకపోతే ఆయనకుకోపం వస్తుందేమో. ఈయనకు హారతి ఇచ్చాము ఆయనకు ఇవ్వకపోతే ఎలాగా! ఈ గుడికి వెళ్లాము ఆ గుడికి వెళ్లకపోతే ఏమౌతుందో ఏమో! ఏం చేస్తే ఏ దేవుడికి కోపం వస్తుందో అని అను నిత్యం భయపడుతుంటారు కొందరు. ఏ పని చేస్తే ఏమౌతుందో అని భయంతో హడలిపోతుంటాడు. ఇవన్నీ అనవసర భయాలు, పరమాత్మకు కోపతాపాలు, ఇష్టాఇష్టాలు ఉండవు అని తెలుసుకోవడమే జ్ఞానము. ఆ జ్ఞానం కలిగిన నాడు పరమాత్మ అంటే భయం ఉండదు. అందుకే పరమాత్మ, ఇతరుల వల్ల ఎవడైతే భయం లేకుండా ఉంటాడో, వాడే నా భక్తుడు అని అన్నాడు. అంటే ఈ దుర్గుణము అయిన భయాన్ని ముందు వదిలిపెట్టాలి అని అర్థం. మనం అన్యాయంగా, అక్రమంగా, అధర్మం గా ప్రవర్తించనపుడు ఎవరికీ భయపడనవసరం లేదు అనే నిశ్చయాత్మక బుద్ధి కలిగి ఉండాలి.

అలాగే ఎవరినీ మనం భయానికి లోను చేయకూడదు. ఎవరినీ భయపెట్టకూడదు. తన వాక్కుతో గానీ, శరీరంతో గానీ ఇతరులను భయందోళనలకు గురి చేయకూడదు. శారీరకంగా కానీ, మానసికంగా కానీ ఇతరులను అకారణంగా హింసించకూడదు. అందరి మీదా అనవసరమైన అధికారం చలాయించకూడదు. అందరూ నాకు భయపడుతూ ఉండాలి, అందరూ నాకు లోబడి ఉండాలి. అందరూ నా చెప్పుచేతల్లో ఉండాలి అనే భావనతో ఉండకూడదు. ఒకవేళ అటువంటి భావనలు ఉంటే, వాటిని మనసులో నుండి తుడిచివెయ్యాలి. కాబట్టి మనం ఒకరికి భయపడ కూడదు, మనం మరొకరిని భయపెట్టకూడదు.

సంతోషము, దు:ఖము, కోపము, భయము, ఉద్వేగము ఇవి మనసు లక్షణాలు. ఇవి మనలో ఒక్కోసమయంలో ఒక్కోవిధంగా విజృంభిస్తుంటాయి. వాటిని అదుపులో పెట్టుకోవాలి. క్రమక్రమంగా వాటికి స్పందించడం మానుకోవాలి. సంతోషం ఎక్కువయినా, దు:ఖము ఎక్కువయినా కష్టమే. ఆ సమయంలో మనలో ఉన్న విచక్షణా శక్తి పని చేయదు. ఆనందం అవధులు దాటినా, దు:ఖము ముంచుకొచ్చినా ఒక్కోసారి గుండె ఆగిపోవడం కూడా జరుగుతుంది. కాబట్టి అటువంటి భావోద్వేగాలు కలిగినపుడు ఎలాంటి స్పందన లేకకుండా సమభావనతో ఉండటం అలవాటు చేసుకోవాలి. అటువంటి వాడే నాకు ఇష్టమైన వాడు అని అంటున్నాడు పరమాత్మ.

కొంత మంది మనలను ఎదురుగా పొగుడుతుంటారు. పక్కనే తిడుతుంటారు. కొంత మంది వాళ్ల కార్యాలు సాధించుకోడానికి పొగుడుతుంటారు. మరి కొంత మంది ఒకరోజు పొగుడుతారు మర్నాడే తిడతారు. ఈ సంవత్సరం లాభం వస్తుంది. మరు సంవత్సరం నష్టం వస్తుంది. ఏ కాలానికి తగ్గట్టుగా ఆయాజబ్బులు వస్తుంటాయి. ఇవి అన్నీ సర్వసాధారణం అనుకొని చిరునవ్వుతో ఓపికగా భరించాలి. అంతే తప్ప విపరీతంగా స్పందించకూడదు.

అలాగే అసూయ. ఇది ఇంకా భయంకరమైన జబ్బు. ఎదుటి వాటి ఉన్నతిని ఓర్వలేకపోవడం. అసూయ పడటం. ద్వేషం పెంచుకోవడం. ఇది ఘోరమైన పతనానికి దారి తీస్తుంది. ఎవడినీ క్షణం సేపు ప్రశాంతంగా ఉండనివ్వదు. మనసును అల్లకల్లోలం చేస్తుంది. దీనినే అమర్షణ అని కూడా అంటారు. ఈ అసూయాద్వేషాలను కూడా ప్రతి వాడూ సమూలంగా నాశనం చేయాలి. సాటి వారిని ప్రేమించడం, ఆదరించడం, ఎదుటి వారిలో ఉన్న గొప్పతనాన్ని గౌరవించడం నేర్చుకోవాలి. ఇలా ఉన్న వాడు నాకు అత్యంత ప్రియుడు అని అన్నాడు పరమాత్మ.

క్లుప్తంగా చెప్పాలంటే మనం ఇతరులతో వ్యవహరించేటప్పుడు మృదువైన మనసుతో వ్యవహరించాలి. ఇతరుల మనసుకు కానీ, శరీరానికి కానీ కష్ట,నష్టములు కలిగించకూడదు. ఇతరులు మనతో వ్యవహరించేటప్పుడు, రాయిలాగా కఠినంగా ఉండాలి. ఇతరుల వలన మనకు కష్టనష్టములు కలిగినా. దేనికీ చలించకూడదు. నిర్వికారంగా ఉండాలి. ఏది లభించినా పరమాత్మ ప్రసాదంగా స్వీకరించాలి. ఇటువంటి వాడు నాకు అత్యంత ప్రియుడు అని అన్నాడు పరమాత్మ.

ఇది అర్జునుడికి కృష్ణుడు చేసే బోధ మాత్రమే కాదు. కలియుగంలో ఉన్న మానవులకు పరమాత్మ చెప్పే జీవితపాఠం. ఇలా ఉంటే సుఖంగా ఉంటావు. లేకపోతే నిరంతరం దు:ఖముల పాలవుతావు అని ఘంటాపథంగా చెబుతున్నాడు.

## 16. అనపేక్ష శ్శుచిర్దక్ష ఉదాసీనో గత వ్యథ:।
## సర్వారమ్భపరిత్యాగీ యో మద్భక్తస్స మే ప్రియ:॥

అపేక్ష లేని వాడు, మనస్సు, శరీరము పరిశుభ్రంగా నిర్మలంగా ఉంచుకునేవాడు, తనలోని వ్యధలు అన్నీ విడిచిపెట్టినవాడు, కోరికలతోకూడిన, కర్తృత్వభావనతో కూడిన, నిషిద్ధమైన చేయకూడని కర్మలను అన్నిటినీ వదిలిపెట్టినవాడు, అటువంటి వాడు నాకు అత్యంత ప్రియుడు.

అపేక్ష అంటే కోరిక. అనపేక్ష అంటే కోరికలు లేక పోవడం. దేనిమీదా ఆధారపడక పోవడం. పూర్తిగా కోరికలు లేకపోతే దేని మీదా ఆధారపడకపోతే ఎలా జీవితం గడపడం అని అనుకోవచ్చు. జీవితానికి అవసరమైన వరకు ఉంటే పర్వాలేదు. అన్నీనాకే కావాలి, ఇదంతా నాది, అందరూ నాకు దక్కాలి. అది లేకపోతే నాకు జీవితమే లేదు, నాకు దక్కనిది ఇంకెవరికీ దక్కడానికి వీలులేదు ఇటువంటి కోరికలు అనర్థం కలిగిస్తాయి. కాబట్టి కోరికలను అదుపులో ఉంచుకోవాలి. లేకపోతే మనసు, అందులో నుండి పుట్టిన కోరికలు, మానవులను మాయలో పడేస్తాయి. మానవులు కేవలం పరమాత్మ మీదనే ఆధారపడాలి కానీ ఇతర ప్రాపంచిక విషయాల మీద కాదు. ఎందుకంటే ప్రాపంచికమైన ఏ వస్తువూ ఎవరికీ శాశ్వతమైన ఆనందాన్ని, సంతోషాన్ని ఇవ్వలేదు. మొదట్లో సంతోషాన్ని ఇచ్చినా చివరకు నిరాశ, దు:ఖమే మిగులుతుంది. కాబట్టి శారీరక ఆనందం కొరకు, మానసిక ఆనందం కొరకు దేని మీదా ఆధారపడకూడదు. ఎందుకంటే అవి చివరకు దు:ఖాన్ని మిగులుస్తాయి కాబట్టి.

శుచి అంటే శుభ్రత. చాదస్తంగా మడి కట్టుకోవడం కాదు. శుభ్రంగా ఉండటం. అదీ కూడా బాహ్య అభ్యంతర శ్శుచి అన్నారు. బాహ్యము అంటే శరీరము, అభ్యంతరము అంటే మనసు...ఈ రెండూ శుభ్రంగా నిర్మలంగా ఉంచుకోవాలి. శరీరానికి మూడుసార్లు స్నానం చేసి, మూడు సార్లు బట్టలు మార్చి, శరీరం నిండా సుగంధ వాసనలతో ఘుమఘుమలాడుతూ, మనసులో చెడు ఆలోచనలు, దుర్మార్గపు ఆలోచలను కలిగి ఉంటే దానిని శుచి అనరు. అంటే శరీరం శుభ్రంగా ఉండి మనసు మలినంగా ఉన్నా, దుర్మార్గపు ఆలోచనలతో నిండి ఉన్నా దానిని శుచి అనరు. కాబట్టి, శుభ్రమైన శరీరంతో నిర్మలమైన, నిష్కల్మషమైన మనస్సుతో ధార్మిక జీవనం గడపాలి. మనసుతో ధార్మికంగా ఆలోచించాలి. పవిత్రంగా ఉంచుకోవాలి. అప్పుడే శుచి అనే పదానికి అర్థం తెలుస్తుంది అని బోధించాడు పరమాత్మ.

తరువాత దక్షత కలిగి ఉండాలి. సమర్థత కలిగి ఉండాలి. ఉత్సాహం కలిగిఉండాలి. అంతే కానీ ఈసురోమంటూ, నిర్వీర్యంగా ఉండకూడదు. ఈ పని నా వల్ల కాదులే, ఇదంతా అయ్యేపని కాదు అనే భావనలు మనసులో రానీయకూడదు. ఎటువంటి విపత్కర పరిస్థితులు వచ్చినా సమర్థంగా దక్షతతో ఎదుర్కొనే సామర్థ్యం కలిగి ఉండాలి. సాధనచేయడానికి కూర్చున్నప్పుడు కూడా మనసు నిలువదు అటు ఇటు పోతూ ఉంటుంది. అలా అని నిరుత్సాహపడకుండా ఆ మనసును మరలా మరలా మన అధీనంలోకి తెచ్చుకోవాలి. దీనినే అభ్యాసయోగంగా పరమాత్మ ఇదివరకే చెప్పాడు. కాబట్టి ఇటు ప్రాపంచిక వ్యవహారాలలోగానీ, ఆధ్యాత్మిక చింతనలో కానీ దక్షత అత్యంత ఆవశ్యకము.

ఉదాసీనత అంటే ప్రతి దానికీ ఊగిపోకుండా రెచ్చిపోకుండా, ఎప్పుడూ ఒకే పక్షం వైపు మాట్లాడకుండా, తటస్థంగా ఉండాలి. దేని మీదా ఎక్కువ ఆసక్తి ఉండకూడదు. అలాగని నిరాసక్తంగా ఉండకూడదు. మధ్యస్థంగా తటస్థంగా ఉండాలి. ఎవరినీ సమర్థించకూడదు అలాగనీ

ద్వేషించకూడదు. అందరికీ మంచి జరగాలని కోరుకోవాలి. అంటే ఎవరి మీదా పక్షపాతాన్ని ప్రదర్శించకూడదు. తటస్థంగా ఉండాలి.

ఇది రాజకీయనాయకులకు ఎక్కువగా అవసరం. కొంతమంది దేనికీ స్పందించకుండా కేవలం ప్రజాక్షేమం కోసమే పనిచేస్తుంటారు. వారు, వారి మనసులు నిర్మలంగా ఉంటాయి. మరి కొంత మంది తన వర్గం, తనకులం, తన ప్రాంతం ప్రజలకు, అదీ తనకు ఓటు వేసి గెలిపించిన వారికి మాత్రమే మేలు చేస్తారు. మిగిలిన వారికి అది చేస్తాం ఇది చేస్తాం, మేం అధికారంలోకి వస్తే అన్నీ ఉచితంగా ఇస్తాం, అందరినీ ఆకాశంలో కూర్చోబెడతాం, అందరికీ ఉద్యోగాలు ఇస్తాం అని మాయమాటలు చెబుతుంటారు. ఈ వాగ్దానాలు విన్న వాళ్లు నవ్వుకుంటారు. వాళ్లను నమ్మరు. కాబట్టి ఇటువంటి పక్షపాత బుద్ధి లేకుండా ఎల్లప్పుడూ తటస్థంగా ఉండటం నేర్చుకోవాలి. పక్షపాత బుద్ధి మానవుని సంకుచిత మనస్తత్వము కలవాడిగా చేస్తుంది. ముఖ్యంగా ఆధ్యాత్మికంగా ఎదగతలచుకున్న వాళ్లు ఈ పక్షపాత బుద్ధిని, సంకుచితత్వాన్ని వదిలిపెట్టాలి. అందరిలో ఉన్న పరమాత్మ ఒక్కడే, పరమాత్మ దృష్టిలో అందరూ ఒక్కటే, తేడా లేదు అనే భావన కలిగి ఉండాలి. కేవలం ప్రజాక్షేమం కోసం పనిచేస్తూ తటస్థంగా ఉండేవారు నాకు ప్రియులు అన్నాడు పరమాత్మ.

గతవ్యథ: ...........వ్యథ అంటే దిగులు, దు:ఖము, నిర్వేదము. ఇవి ఎల్లప్పుడూ మానవుని అంటిపెట్టుకొని ఉంటాయి. ఎప్పుడూ దేనికో ఒక దానికి దిగులు. అది పెరిగితే దు:ఖం. నష్టం వస్తుందేమో అని దిగులు, నష్టం రాగానే దు:ఖం. ఈ పని మనవల్లకాదులే అనే నిర్వేదం. ఈ లక్షణాలు ఉన్న వాడు మంచి నిర్ణయాలు తీసుకోలేడు. వీటిని లేకుండాచేయడం ఎవరికీ సాధ్యంకాదు. ఇవి సత్వ,రజస్తమోగుణములు ఉన్న ప్రతి వాడికీ ఉంటాయి. కాబట్టి వాటిని ఓర్పుతో సహించడం నేర్చుకోవాలి. దిగులు, దు:ఖము వచ్చినా వాటిని విడిచిపెట్టాలి. రాని దానికి దిగులు, వచ్చిన దానిని ఎలా కాపాడుకోవాలా అనే దు:ఖము పనికి రాదు. సుఖాలు దు:ఖాలు వస్తుంటాయి పోతుంటాయి వీటిని ఆనందంగా అనుభవించడమే మానవ కర్తవ్యం అనే జ్ఞానం కలిగిన వాడికి ఇదంతా ఒక ఆటలాగా అనిపిస్తుంది. కాబట్టి మనం అందరం సుఖదు:ఖాలు, వ్యధలు అన్నిటినీ సమంగా అనుభవించాలి. అసలు వాటి గురించి పట్టించుకోకూడదు. అప్పుడే మనస్సు నిర్మలంగా ఉంటుంది.

సర్వారమ్భపరిత్యాగీ అంటే చాలా మంది ఏ పనీ మొదలు పెట్టకూడదు. అసలు పని మొదలు పెట్టడం అనేది విడిచిపెట్టాలి. ఈ శ్లోకాన్ని ఇలా అర్థం చేసుకున్నవాళ్లు ఏ పనీ ఆరంభించకుండా అంటే మొదలుపెట్టకుండా, సోమరులు అవుతారు కాని సాధకులు కాలేరు. ఆరంభ: అంటే ఏపని అయినా మొదలు పెట్టడం అంటే నేను చేస్తున్నాను అనే కర్తృత్వభావనతో మొదలుపెట్టడం. ఈ కర్తృత్వభావన లేకుండా ఈ పని నేను పరమాత్మ పరంగా చేస్తున్నాను అనే భావనతో చేయడం ఆరంభ పరిత్యాగము అని చెప్పవచ్చు. అప్పుడు ఆ పని మనకు ఎటువంటి

బంధనములు కలిగించదు.

మనలను బంధించే కర్మలు అంటే మనకు బంధనాలు కలిగించే పనులు అని అర్థం చెప్పుకోవచ్చు. ఇదివరకే మనము నిష్కామ కర్మగురించి కర్తృత్వభావన లేని కర్మ, విహిత కర్మ ల గురించి తెలుసుకున్నాము. అన్ని కర్మలను వదలాలి అంటే విహితములు కానివి, ప్రజాహితమునకు విఘాతము కలిగించేవి, బంధనములను కలిగించేవి, నిషిద్ధకర్మలను వదలాలి. కేవలము దేహము నిలవడానికి అనువైన కర్మలనే చేయాలి ఎందుకంటే కర్మచేయనిది ఏ మనిషీ జీవించలేడు. ఆసక్తి లేకుండా, బంధనములు కలగకుండా, అన్ని కర్మలను, వాటి ఫలములను పరమాత్మకు అర్పిస్తూ ఏ కర్మ చేసినా ఆ కర్మ చేయనట్టే అని ఇదివరకే మనం తెలుసుకున్నాము. దాని గురించే ఇక్కడ చెబుతున్నాడు పరమాత్మ. కాబట్టి కామ్యకర్మలు, కర్తృత్వభావనతో చేసే కర్మలు, నిషిద్ధకర్మలు...వీటిని వదిలిపెట్టడమే సర్వారంభపరిత్యాగము అలాచేసిన వారు నాకు అత్యంత ప్రియులు అంటున్నాడు పరమాత్మ.

## 17. యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి।
## శుభాశుభ పరిత్యాగీ భక్తిమాన్ యస్స మే ప్రియః॥

సంతోషము వచ్చినపుడు పొంగిపోని వాడు, దు:ఖము వచ్చినపుడు కుంగిపోని వాడు, శోకము లేని వాడు, శుభమును, అశుభమును వదిలినవాడు నాకు ప్రియుడు.

అతి పనికి రాదు. అతిగా స్పందించకూడదు. అన్నిటినీ సమానంగా చూడాలి. అనేది ఈ శ్లోకం అర్థం. సుఖము, దు:ఖము, రాగము, ద్వేషము, కోరికలు, శుభాలు, అశుభాలు ఇవన్నీ కూడా సమపాళ్లలో ఉన్నాయి. ఏవీ ఎక్కువ లేవు. శరీర నిర్వహణకు కావాల్సినమేరకే ఉన్నాయి అని అర్థం చేసుకోవాలి. అంటే దేనికీ అతిగా స్పందించకుండా మనస్సును నిర్మలంగా ధృఢంగా నిశ్చయాత్మక బుద్ధి కలిగి ఉన్నవాడు అని అర్థం. ప్రతి చిన్న విషయానికి సంతోషించేవాడు, వెంటనే దు:ఖించేవాడు, చలించి పోయేవాడు, ప్రపంచం మొత్తం నా మీద పగపట్టింది అనుకునేవాడు, చీటికి మాటికి దు:ఖించేవాడు నాకు ఇష్టం లేదు.

ఇక్కడ ఒక విషయం గమనించాలి. శుభాశుభ పరిత్యాగీ అన్నారు. అశుభాలు వదలాలి మరి శుభాలుకూడా వదలాలా అని సందేహం రావచ్చు. పరిత్యాగీ అంటేపూర్తిగా వదిలిపెట్టినవాడు కాదు అని అర్థం. వీటిని సమానంగా భావించేవాడు. ఇక్కడ భక్తుని గురించి చెబుతున్నాడు. ఆ భక్తిలో పరకాష్ఠ గురించి చెబుతున్నాడు. జ్ఞాని, జీవన్ముక్తుడు, పరమ భక్తుడు ఎలా ఉండాలి అనే విషయం చెబుతున్నాడు. మామూలు మానవులు కూడా సంతోషము దు:ఖము సమానంగా

భావించాలి అని చెప్పారు కదా. ఇది అలాగే. ద్వంద్వములను వదిలిపెట్టాలి, వాతావరణంలో మార్పులను, సంతోషాన్ని దు:ఖాన్ని, హర్షమును, శోకమును, శుభము అశుభము వీటిని సమానంగా చూడాలి. అంటే ఏ సంకల్పమూ లేని నిశ్చలస్థితిలోకి రావాలి. మనకు శుభకార్యాలు పుట్టుక, బారసాల, వివాహము. అశుభకార్యాలు చావు, దానికి సంబంధించిన కర్మకాండలు. ఇవి అన్నీ కాలము యొక్క ధర్మాలు. వీటిని సమానంగా భావించాలి అని పరమాత్మ బోధిస్తున్నాడు.

18. సమశ్శత్రౌ చ మిత్రే చ తథా మానావమానయో:।
శీతోష్ణసుఖదు:ఖేషు సమస్సఙ్గవివర్జిత:॥
19. తుల్యనిన్దాస్తుతిర్మౌనీ సంతుష్టో యేనకేనచిత్।
అనికేత: స్థిరమతిర్భక్తిమాన్మే ప్రియో నర:॥

మిత్రులను, శత్రువులను, మానము, అవమానము,శీతోష్ణములు, సుఖదు:ఖములు, స్తుతులు, నిందలు, సమానంగా భావించేవాడు, ఎల్లప్పుడూ మౌనంగా ఉండేవాడు, ఉన్నదానితో సంతుష్టిచెందేవాడు, ప్రాపంచిక విషయములలో అధికంగా ఆసక్తిలేనివాడు, గృహముల యందు ఆసక్తి, అనురక్తి లేనివాడు, నిశ్చయాత్మకమైన బుద్ధి కలవాడు, పరమాత్మయందు భక్తి శ్రద్ధలు కలవాడు, ఇటువంటి సాధకుడు నాకు ప్రియమైనవాడు.

ఈ రెండు శ్లోకాలలో ఐదు విధములైన ద్వంద్వముల గురించి చెప్పాడు. శత్రువులు మిత్రులు, మానావమానములు, శీతోష్ణములు, సుఖదు:ఖములు, నిందాస్తుతులు. వీటిని సమంగా చూడటం నేర్చుకోవాలి. సాత్వికస్వభావం కల భక్తుడికి శత్రువులు ఎవరుంటారు అని అనుకోకూడదు. మంచి వెంబడి చెడ్డ ఎప్పుడూ ఉంటుంది. రాముడి తో రావణుడు, సుయోధనుడితో ధర్మరాజు, ఇలాగా బుద్ధుడికి, క్రీస్తుకు కూడా శత్రువులు ఉండటం మనం చదువుకున్నాము. సాధకుడు అయిన వాడు శత్రువులను, మిత్రులను సమానంగా ఆదరించాలి. అలాగే మనలను సన్మానించినా, అవమానించినా వాటిని సమంగా భావించాలి కానీ సన్మానించిన వాడిని ఆదరించి, సన్మానించని వాడిని, అవమానించినవాడిని తిట్టకూడదు. ఎందుకంటే ఈ మానావమానములు కూడా మనసును చికాకు పరుస్తాయి. పరమాత్మ యందు మనసును స్థిరంగా నిలపవు.

సాధారణంగా ఎవరైనా మనకు అవమానము చేస్తే వారి మీద ద్వేషం పెంచుకుంటాము. కోపంతోఊగిపోతుంటాము. ఆ అవమానానికి ప్రతీకారం తీర్చుకోడానికి ఎదురు చూస్తుంటాము. సుయోధనుడికి మయసభలో జరిగిన అవమానము మహాభారత యుద్ధానికి

దారి తీసింది. 18 అక్షౌహిణీల సైన్యం సర్వనాశనం అయింది. అలాగే మనకు ఎవరైనా సన్మానం చేస్తే, సన్మానాలకు అలవాటు పడి, ఎవరైనా సన్మానాలు చేయకపోతారా అని ఎదురు చూస్తుంటాము. సన్మానం చేయని వాడిని ద్వేషిస్తాము. నాకు ఏం తక్కువని నాకు సన్మానం చేయడం లేదు అని కుంగిపోతాము. అంతే కాకుండా ఎన్నోసన్మానాలు చేయించుకొని ఎంతో ఎత్తుకు ఎదిగిన వ్యక్తి ఏ చిన్న పొరపాటు చేసినా, ఒక్కసారిగా అధ:పాతాళానికి చేరుకుంటాడు. కాబట్టి మానము, అవమానము రెండు కూడా మనసును అల్లకల్లోలపరుస్తాయి కాబట్టి సన్మానించినా, అవమానించినా చిరునవ్వుతో స్వీకరించి, వాటివలన కలిగిన ఫలాలను పరమాత్మకు అర్పించడం విడిచిపెట్టడం శ్రేయస్కరము.

కాలానుగుణంగా వచ్చే ఎండలను, వానలను, చలిని తట్టుకోగలగాలి కాని తిట్టుకోకూడదు. అవి వస్తూ పోతుంటాయి. ప్రతి సంవత్సరము వచ్చేవాటికి దు:ఖించడం అనవసరం. వాటిని ఆనందంగా అనుభవించడం నేర్చుకోవాలి. అలాగే సుఖము దు:ఖము ఒక దాని వెంట ఒకటి వస్తుంటాయి పోతుంటాయి. అవి చక్రంలాంటివి. సుఖం కిందికి వస్తే దు:ఖము పైకి వస్తుంది. అదే దు:ఖము కిందికి వస్తే, సుఖం పైకి వస్తుంది. జీవిత చక్రం తిరుగుతూ ఉంటే సుఖదు:ఖాలు పైకి కిందికీ తిరుగుతూ ఉంటాయి. అవి వాటి ధర్మము. కాబట్టి సుఖం వచ్చినపుడు పొంగి పోకుండా, దు:ఖం వచ్చినపుడు కుంగి పోకుండా, రెండింటినీ సమానంగా స్వీకరించడం నేర్చుకోవాలి.

తరువాతది సమస్సంగ వివర్జిత: అంటే ఎంతమందిలో ఉన్నా, మన వ్యక్తిత్వం మరిచిపోకూడదు. అనవసరమైన సంగమము అంటే అటాచ్‌మెంట్ పెట్టుకోకూడదు. ఎదుటి వాడు చేస్తున్నాడు అని మనం వాడిని ఫాలో అవకూడదు. మనం ఎవరో మన స్థితి ఏమిటో తెలుసుకొని ప్రవర్తించాలి. మనస్సు ఎల్లప్పుడూ పరమాత్మయందు లగ్నం అయి ఉండాలి కానీ ప్రాపంచిక విషయాలలో కాదు. ప్రపంచంలో తిరుగుతున్నా, ప్రాపంచిక విషయాలతో అటాచ్ మెంట్ పెట్టుకోకుండా, పరమాత్మతోనే అటాచ్ మెంటు పెట్టుకోవాలి. దానినే నిస్సంగత్వం అంటారు.

రెండవ శ్లోకంలో కూడా మరి కొన్ని ద్వంద్వాలను గురించి చెప్పారు. తుల్య నిందా స్తుతి ర్మౌనీ అంటే మనలను నిందించిన వాడిని, పొగిడిన వాడిని సమానంగా ఆదరించడం నేర్చుకోవాలి. మనలను పొగిడాడు కదా అని వాడిని అందలం ఎక్కిస్తే రేపు వాడే ఆ పొగిడిన నోటితోనే తిట్టే అవకాశం ఉంది.
(ఈ నాటి రాజకీయాల్లో ఇది సర్వసాధారణం అయి పోయింది. ఈ రోజు ఈ పార్టీలో ఉన్నవాడు, ఎదుటిపార్టీవారిని తిట్టిపోస్తాడు. మరుసంవత్సరం వీడు ఎదుటి పార్టీలో చేరి, తాను అంతకు ముందు పొగిడిన వారిని తిట్టిపోస్తాడు. ఇది మనం రోజూ చూస్తూనే ఉన్నాము.)

కొంత మంది ఎవరు ఏ చిన్న మాట అన్నా తట్టుకోలేరు. అల్లల్లాడి పోతారు. దానినే మాటి మాటికీ తలచుకుంటూ వ్యధచెందుతారు. పది మందితోచెప్పుకొని బాధపడతారు. ఈ నిందా స్తుతులు మనసును అల్లకల్లోలం చేస్తాయి. ప్రశాంతంగా ఉండనివ్వవు. అటువంటి వారికి మనోబలం ఉండదు. ఏ కొంచెం పొగిడినా ఉబ్బితబ్బిబ్బుఅవుతారు, ఏ కొంచెం తిట్టినా అంతులేని బాధకు లోనవుతారు. ఆ కారణం చేత, ఈ పరిస్థితులలో మనోవికారమును, మానసిక అలజడిని చెందకూడదు. ప్రశాంతంగా ఉండాలి.

అన్నిటికన్నా ముందు ప్రతి వాడూ ఆత్మవిమర్శ చేసుకోవాలి. నేను చేసే పనులు న్యాయబద్ధంగా, ధర్మబద్ధంగా ఉన్నాయా లేవా అని. న్యాయంగా, ధర్మంగా పనులు చేస్తుంటే ఎవరు పొగిడినా తిట్టినా పట్టించుకోనవసరం లేదు. మీలో తప్పుఉంటే దానిని ఆనందంగా స్వీకరించి దానిని సరిదిద్దుకోడానికి ప్రయత్నించండి. అంతేకానీ మనం తప్పుచేస్తున్నా పొగిడేవాడు, ఏ తప్పు చేయకపోయినా తిట్టే వాడు, వీరిని పట్టించుకోనవసరం లేదు. కిందటి శ్లోకంలో చెప్పబడిన మానావమానములు శారీరకములు అంటే శరీరంతో చేసే పనులు. నిందాస్తుతులు వాచికములు అంటే నోటితో చేసే పనులు. వీటికి అతీతంగా ఉండాలంటే మౌనమే శ్రేయస్కరము, ఎంత ఎక్కువ మాట్లాడితే అంత అనుబంధం కలుగుతుంది. మాటకు మాట పెరుగుతుంది. అనవసరమైన వాగ్వివాదాలకు దారి తీస్తుంది. కాబట్టి పైకి అవసరమైనంత వరకే మాట్లాడుతూ, లోపల పరమాత్మను స్మరించుకోవడం శ్రేయస్కరము.

సంతుష్టో యేనకేనచిత్ అంటే దొరికినదానితో, ఉన్నదానితో పరమాత్మ ఇచ్చిన దానితో తృప్తిపడి సుఖంగా జీవించడం. దాని అర్థం లేని దాని కొరకు పాకులాడకూడదు. ఉన్నదానితో తృప్తిచెందాలి. ఎందుకంటే తృప్తి అనేది మానవ జీవితంలో అత్యంత ముఖ్యమైన లక్షణము. అంతేకాని, నాకు అది ఉంటేనే తృప్తిగా ఉంటుంది. దీనితో నాకు తృప్తికలుగదు. నాకు అదే కావాలి అని అనకూడదు. ఎందుకంటే ఏది కావాలో అది దొరికినతరువాత, దానితో కూడా తృప్తి కలుగదు. ఇంకోటి కావాలనిపిస్తుంది. అది దొరికితే మరొకటి. దీని కంతటికీమూలం తృప్తి లేకపోవడం. ఉన్నదానితో తృప్తిచెందకపోవడం. తృప్తి లేనివాడికి జీవితంలో సుఖసంతోషాలు ఉండవు. ఎప్పుడూ ఏదో కావాలని బాధపడుతుంటాడు. కాబట్టి ఉన్నదానితో తృప్తిచెందాలి అనిపరమాత్మ బోధ.

అనికేత: అంటే ఉన్న ఇల్లు వదిలిపెట్టి చెట్టు కింద కాపురంపెట్టమని కాదు. ఇంటిమీద అనవసరమైన ఆసక్తి పెంచుకోవద్దని అర్థం. కొంత మందికి తమ ఇల్లు అంటే వల్లమాలిన మమకారం. ఎప్పుడూ ఏవేవో మరమ్మతులు చేయిస్తూనే ఉంటారు. ఏ మాత్రం చిన్నపగులు కనిపించినా విలవిలలాడిపోతారు. ఆ ఇంట్లో ఉండేది నలుగురు అయినా, వంద పడకగదుల ఇల్లు కట్టుకుంటారు. మరికొందరు ఒక ఇంటితో తృప్తిపడరు. ఊరికో ఇల్లు కడతారు లేక కొంటారు. వాటిని అద్దెలకు ఇస్తారు. అద్దె రాకపోయినా, ఇల్లు ఖాళీచేయకపోయినా కోర్టుల చుట్టు తిరుగుతారు. కాబట్టి

అవసరమైనంత వరకే ఇంటిని ఏర్పరచుకోవాలి. ఆ ఇంటిని శుభ్రంగా ఉంచుకోవాలి. ఆ ఇంటి మీద అనవసరమైన ఆసక్తి అనురాగము బంధము పెంచుకోకూడదు. ఇవన్నీ ఈశ్వరునికి చెందినవి. నేను కేవలం అనుభవిస్తున్నాను అనే భావనతో ఉండాలి అని పరమాత్మ బోధిస్తున్నాడు.

స్థిరమతి: అంటే ఎల్లప్పుడు మనసు, బుద్ధి స్థిరంగా ఉంచుకోవాలి. ఒక నిర్ణయం తీసుకుంటే దానికి కట్టుబడి ఉండాలి. ఏదో ఒక ఇష్టదేవతను పూజించాలి. ఒకే గురువును సేవించాలి. ఒకే పరంపరను అనుసరించాలి. అంతే కానీ మనకు ఇష్టం ఉన్నప్పుడు ఒక దేవత, ఇష్టం లేనపుడు, మన కోరికలు తీరనపుడు మరొక దేవత ఇలా స్థిరత్వంలేకుండా ఉండకూడదు. కాబట్టి బయట ప్రపంచంలో తిరిగేటప్పుడు కానీ, పూజలు, భగవతారాధన చేసేటప్పుడుకానీ, స్థిరమైన బుద్ధి కలిగి ఉండాలి. చంచలత్వము పనికి రాదు. ఈ చంచలత్వము పోయి స్థిరత్వము రావాలంటే మన మనస్సును అటు ఇటు పోనీయకుండా, ఆత్మలో లగ్నం చేయాలి. అప్పుడే స్థిరత్వం కలుగుతుంది. కాబట్టి బయట ప్రపంచంలో ఏ వృత్తి, ఏ పని చేస్తున్నా, మనసు మాత్రం పరమాత్మయందు లగ్నం చేయాలి. అప్పుడే మనసు నిర్మలంగా ప్రశాంతంగా ఉంటుంది. ఇవన్నీ కూడా నర: అంటే ఈ విశ్వంలోని నరులందరికీ వర్తిస్తుంది అని పరమాత్మ బోధించాడు.

ఈ అధ్యాయంలో అంటే భక్తియోగంలో భక్తుల గురించి, వారికి ఉండవలసిన లక్షణముల గురించి వివరించాడు. వాటిని ఒక్కసారి పరిశీలిద్దాము.
(అనుసరణ: శ్రీశ్రీశ్రీ విద్యాప్రకాశానందగిరి స్వామి వారి పాదపద్మములకు నమస్కరిస్తూ వారి గీతామకరందం నుండి.)

1. ఎవరినీ ద్వేషించకూడదు.
2.అందరితో స్నేహంగా ఉండాలి.
3.అతి మమకారము పనికిరాదు
4.అహంకారము అసలు పనికిరాదు
5.అందరి పట్ల కరుణ దయ కలిగి ఉండాలి.
6.సుఖదు:ఖములు సమంగా చూడాలి.
7.అన్ని సందర్భములలో ఓర్పుకలిగి ఉండాలి.
8.ఎప్పుడూ సంతోషంగా, సంతుష్టిగా ఉండాలి.
9. మనసును అదుపులో ఉంచుకోవాలి.
10.చంచల స్వభావం కాకుండా ధృఢమైన నిశ్చయం కలిగి ఉండాలి.
11.మనసును, బుద్ధిని ఆత్మలో ఉంచాలి.
12.భయం అనేది వదిలిపెట్టాలి. తాను ఎవరికీ భయపడకూడదు. ఇతరులను భయపెట్టకూడదు
13.కోపం వదిలిపెట్టాలి. ఎక్కువ ఆనందము, ఎక్కువగా భయపడకూడదు.
14. దేని మీదా ఎక్కువగా మమకారము, అపేక్ష కలిగి ఉండకూడదు.

15.ఎల్లప్పుడూ శరీరమును, మనసును శుభ్రంగా ఉంచుకోవాలి.

16.ప్రతి కార్యమును శ్రద్ధతో సమర్థతతో చేయాలి. చెయ్యాల్సివచ్చిందే అని చేయకూడదు.

17.దేని మీదా అత్యధికమైన ప్రేమ, పక్షపాతము చూపకుండా తటస్థంగా ఉండాలి.

18. మనసును ప్రశాంతంగా ఉంచుకోవాలి. ఏ వ్యాకులతా చెందకూడదు

19. ఏ పని చేసినా ఫలితం ఆశించకుండా చేయాలి. ఆ ఫలితమును పరమాత్మకు అర్పించాలి.

20. తనకు సుఖం కలిగి నపుడు పొంగి పోయి నా అంతవాడు లేడనకూడదు

21. ఇతరులమీద ఎట్టి పరిస్తితుల మీద అసూయ పడకూడదు. ద్వేషించకూడదు.

22. అన్ని కాలాలలో చిరునవ్వుతో ఉండాలి. ఏడుస్తూ ఉండకూడదు

23. కోరికలను అదుపులో ఉంచుకోవాలి. కోరికలను విడిచిపెడితే మరి మంచిది.

24. శుభము, అశుభము రెండింటినీ సమానంగా అనుభవించాలి.

25.శత్రువులను, మిత్రులను సమానంగాఆదరించాలి.

26. మానము అవమానము రెండింటినీ చిరునవ్వుతో భరించాలి. ఒకప్పుడు పొంగి పోవడం మరుక్షణం కుంగి పోవడం పనికిరాదు

27. అనవసరమైన విషయాలలో ఆసక్తిని వదిలిపెట్టాలి.

29. కాలానుగుణంగా వచ్చే ఎండ చలి వర్షము వీటిని సమత్వభావంతో భరించాలి.

30. ఎవరు మనలను నిందించినా, పొగిడినా చిరునవ్వుతో స్వీకరించాలి కానీ ఎగిరి గంతేయకూడదు. కిందపడి దొర్లకూడదు

31.సాధ్యమైనంత వరకు మౌనంగా ఉండటం నేర్చుకోవాలి. గడగడ వాగకూడదు.

32. ఏదిదొరికితే దానితో తృప్తి చెందాలి. లేని దాని కోసం పాకులాడకూడదు

33. ఉన్న ఇంటిని శుభ్రంగా ఉంచుకోవాలి. ఇంకా పెద్ద ఇల్లు లేదని బాధపడకూడదు.ఇదంతా భగవంతున ప్రసాదము నేనే కేవలం అనుభవిస్తున్నానుఅనే భావన కలిగిఉండాలి.

34. ఎల్లప్పుడూ స్థిరమైన బుద్ధి కలిగి ఉండాటి.చంచలత్వము పనికిరాదు.

35. ఈ అనంత విశ్వానికి అధిపతి అయిన పరమాత్మ ఎడల భక్తి కలిగి ఉండాలి.

ఇవి కేవలం భక్తులకే కాదు సాధారణమానవులుకూడా ఆచరించవలసిన లక్షణములు. భక్తులు ప్రతిరోజూ పరమాత్మను పూజిస్తారు. దానికి పత్రం, పుష్పం, ఫలం, తోయం సరిపోతాయి అని చెప్పాడుపరమాత్మ. శంకరాచార్యుల వారు భక్తుడు భగవంతునికి ఏ పుష్పాలతో పూజించాలి అనే విషయం ఒక శ్లోకంలో చెప్పాడు.

అహింసా ప్రథమం పుష్పం, పుష్పమిన్ద్రియ నిగ్రహ:
సర్వభూత దయాపుష్పం క్షమా పుష్పం విశేషత:
శాన్తిపుష్పం తప: పుష్ప: ధ్యానపుష్పం తథైవచ
సత్య మష్టవిధం పుష్పం విష్ణో: ప్రీతికరం భవేత్

అహింస, ఇంద్రియ నిగ్రహము, సర్వభూతదయ, క్షమ, శాంతి, తపస్సు, ధ్యానము, సత్యము ఈ ఎనిమిది పుష్పములతో మనం పరమాత్మను పూజించాలి అని అన్నాడు. కాబట్టి మనం వీటిలో ఏవో కొన్ని పుష్పాలను సంపాదించడానికి, ఆ పుష్పాలతోనే పరమాత్మను పూజించడానికి ప్రయత్నం చేద్దాము.

## 20. యే తు ధర్మ్యామృతమిదం యథోక్తం పర్యుపాసతే।
## శ్రద్ధదానా మత్పరమా భక్తాస్తే2తీవమే ప్రియా:॥

అర్జునా! ఎవరైతే శ్రద్ధాభక్తులతో పైన చెప్పబడిన లక్షణములతో నన్ను సేవిస్తారో, నా యందు శ్రద్ధ, భక్తి కలిగి ఉంటారో, నన్నే పరమ గతిగా నమ్ముతారో, అమృతముతో సమానమైన భాగవత ధర్మమును పైన చెప్పబడిన విధంగా అనుసరిస్తారో, వారే నాకు భక్తులు. ఇష్టులు.
ఈ శ్లోకం ఈ అధ్యాయయానికి ముగింపు ఫలశ్రుతి. ఈ అధ్యాయంలో చెప్పబడిన లక్షణములు కలిగిన భక్తుడు పొందే ఫలితములను గురించి చెప్పాడు పరమాత్మ.
వారు అత్యంత ప్రీతి పాత్రులు అవుతారు.

ధర్మ్యామృతం అంటే పైన చెప్పబడిన ధర్మములు అమృత ముతో సమానములు. ఈ ధర్మములు అన్నీ వేదములు, ఉపనిషత్తులు, శాస్త్రములలో చెప్పబడిన విషయములకు అనుగుణంగా ఉన్నాయి కానీ వ్యతిరేకంగా లేవు. అందుకే వీటిని అమృతముతో సమానమైన ధర్మములు అని అన్నారు. ఈ ధర్మములను ఆచరిస్తే జనన మరణ చక్రం నుండి తప్పించుకోవచ్చు. ఆ కారణం చేతకూడా ఈ ధర్మములను అమృతముతో సమానము అని అన్నారు. ఈ ధర్మములను ఆచరించిన ఎవరూ మృత్యువుకు భయపడడు.

ఈ ధర్మములను ఎలా ఆచరించాలి అంటే యథోక్తం అంటే చెప్పినది చెప్పినట్టు ఎటువంటి మార్పులు చేర్పులు లేకుండా ఆచరించాలి. 'అలా కాదండీ ఇలా చేస్తే ఎలా ఉంటుంది' అనే కుశంకలు లేవదీయకూడదు. చెప్పినది చెప్పినట్టు చేయాలి. కాకపోతే, అన్నీ అందరూ ఆచరించలేరు కాబట్టి, ఎవరి శక్తి సామర్థ్యాలను బట్టి వారు ఆచరిస్తే, దానికి తగిన ఫలితం తప్పకుండా లభిస్తుంది.

కాకపోతే ఇవన్నీ భక్తి శ్రద్ధలతో ఆచరించాలి. అప్పుడే పైన చెప్పబడిన ఫలితములు దక్కుతాయి అని చెప్పాడు పరమాత్మ. అంతే కాదు, మత్పర: అనే పదం కూడా వాడాడు. అంటే నన్నే పరమావధిగా నమ్మిన వారే నా భక్తులు అంటూ తే అతీవ మే ప్రియా: అంటే ఈ ధర్మములు

ఆచరించినవారు నన్నే పరమావధిగా నమ్మినవారు,  నాకు అత్యంత ప్రియులు అని అన్నాడు కృష్ణుడు.

గీతలో పూర్తిగా భక్తి, శ్రద్ధ ఈ రెండు పదాలు ఎక్కువగా వాడబడ్డాయి. సద్గురు సాయిబాబా కూడా శ్రద్ధ సహనం గురించి చెప్పాడు. మనం దైనందినజీవితంలో కూడా శ్రద్ధపెట్టకుండా సహనం లేకుండా  ఏ పని చేసినా ఆ పని సఫలం కాదు. శ్రద్ధతో చదివే విద్యార్ధిని ఉపాధ్యాయుడు సాటి విద్యార్ధులు గౌరవిస్తారు. శ్రద్ధతో  ఓర్పుతో పనిచేసే కార్మికుడిని కానీ, ఉద్యోగిని కానీ అధికారిని కానీ యజమాని ఎక్కువగా గౌరవిస్తాడు. ఆ గౌరవమే అమృతముతో సమానము. కాబట్టి ఏ పని చేసినా శ్రద్ధ భక్తి ముఖ్యం. అదే ఈ శ్లోకంలో చెప్పాడు పరమాత్మ.

**ఉపనిషత్తులయొక్క, బ్రహ్మవిద్యయొక్క,**
**యోగశాస్త్రము యొక్క సారమయిన భగవద్గీతలో,**
**భక్తి యోగము అను పన్నెండవ అధ్యాయము సంపూర్ణము.**
**ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.**

# భగవద్గీత

## పదమూడవ అధ్యాయము

## క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగము.

ఈ అధ్యాయంలో రెండు పదాలు మనలను పలకరిస్తాయి. క్షేత్రము అంటే శరీరము. క్షేత్రజ్ఞుడు అంటే శరీరములో ఉండే ఆత్మస్వరూపము. త్రిగుణములతో కూడిన మనోబుద్ధి అహంకారాలతో, పూర్వజన్మ వాసనలతో, ప్రాపంచిక విషయములతో కూడిన సూక్ష్మశరీరం స్థూలశరీరంలో ప్రవేశించి, ఈ శరీరానికి చైతన్యం ప్రసాదిస్తున్న ఆత్మస్వరూపంతో సంగమం చెందుతుంది. అప్పుడు ఆత్మ జీవాత్మగా మారుతుంది. ఈ శరీరంలో ఉన్న జీవాత్మ ఈ శరీరమే తాను అనుకుంటున్నాడు. తానే అన్నీ చేస్తున్నాను అనే కర్తృత్వభావన అహంకారము కలిగి ఉంటాడు. అదే మాయ, అజ్ఞానము. ఈ మాయలో, అజ్ఞానంలో పడి పోయి నిరంతరము సుఖములు, దు:ఖములు అనుభవిస్తున్నాడు. ఈ శరీరము, పంచభూతములు అనగా గాలి, నీరు, అగ్ని, ఆకాశము, భూమి వీటితో ఏర్పడింది. ఇది అందరికీ తెలుసు. ఈ శరీరానికి స్వతాహాగా చైతన్యం లేదు. జడము. ఆ పరమాత్మ ఆత్మస్వరూపుడుగా ప్రతి శరీరానికి చైతన్యం కలిగిస్తున్నాడు. అందుకే ఆత్మ శాశ్వతము, శరీరం అశాశ్వతము నశించిపోయేది. క్షేత్రమునకు క్షేత్రజ్ఞుడికి ఉన్న భేదం ఇదే. ఇంక ఈ అధ్యాయంలోకి ప్రవేశిద్దాము.

కిందటి భక్తియోగము అనే అధ్యాయములో, కృష్ణుడు అర్జునుడికి, భక్తి, భక్తుడు, భక్తుడికి ఉండవలసిన లక్షణాలు చెప్పాడు. అప్పుడు అర్జునుడు కృష్ణుని ఒక ప్రశ్నఅడిగాడు.

### 1. ప్రకృతిం పురుషం చైవ క్షేత్రం క్షేత్రజ్ఞ మేవచ।
### ఏతద్వేదితుమిచ్ఛామి జ్ఞానం జ్ఞేయం చ కేశవ॥

కృష్ణా! నీవు ఇది వరకు ప్రకృతి అనీ, పురుషుడు అనీ, క్షేత్రము, క్షేత్రజ్ఞుడు అనీ జ్ఞానము(తెలుసుకొన్నది) అనీ, జ్ఞేయము (తెలుసుకోదగినది), వీటి గురించి చెప్పావు. నాకు ఏమీ అర్థంకాలేదు. మరలా వివరంగా చెప్పవా అని అడిగాడు.

ఈ ఆరు పదాలు వేదాంతంలో అక్కడక్కడ కనపడేసాంకేతిక పదాలు. ఈ ఆరుపదాలను అర్జునుడు చిన్నప్పటి నుండి వింటూనే ఉన్నాడు. ఇప్పుడుకూడా కృష్ణునినోటి గుండా

విని ఉన్నాడు. కాని వాటి గురించి అర్జునుడికి పరిపూర్ణమైన అవగాహన లేదు. అందుకని వీటిగురించి చెప్పమని కృష్ణుడిని అడిగాడు. దానికి కృష్ణుడు ఈ విధంగా సమాధానం చెప్పాడు.

భగవద్గీతలో 700 శ్లోకాలు ఉన్నాయి. కొంత మంది 701 శ్లోకాలు ఉన్నాయి అని అంటారు. ఆ 701వ శ్లోకమే ఈ శ్లోకము. చాలా మంది వ్యాఖ్యాతలు ఈ శ్లోకానికి వ్యాఖ్య రాయలేదు. జగద్గురువులు శ్రీ శంకరాచార్యులవారు కూడా ఈ శ్లోకానికి వ్యాఖ్యరాయలేదని పెద్దలు చెబుతారు. భగవద్గీత పూర్తిగా కృష్ణార్జున సంవాదము. అర్జునుడు ప్రశ్న అడిగితే కృష్ణుడుసమాధానాలు చెప్పడం. ఈ అధ్యాయంలో, ఈ శ్లోకం తీసేస్తే, అర్జునుడు ప్రశ్న అడగకుండానే కృష్ణుడు సమాధానం చెప్పినట్టు అవుతుంది కాబట్టి ఈ శ్లోకం అవసరమయింది. కాబట్టి వివాదాల జోలికి పోకుండా, ఈ శ్లోకాన్ని కూడా మనం చదువుకోవడం వలన ఎలాంటి నష్టంలేదు.

## 2. ఇదం శరీరం కౌన్తేయ క్షేత్రమిత్యభిధీయతే।
## ఏతద్యో వేత్తి తం ప్రాహు: క్షేత్రజ్ఞ ఇతి తద్విద:॥

ఓ కుంతీ పుత్రుడవైన కౌంతేయా! ఈ స్థూలశరీరము క్షేత్రము అని చెప్పబడుతూ ఉంది. ఇది శరీరము అని ఎవరు తెలుసుకుంటున్నాడో అతడే క్షేత్రజ్ఞుడు అని ఈ రెండింటి గురించి తెలిసినవారు చెబుతుంటారు.

ఇదం అనే పదంతో ఈ శ్లోకం మొదలయింది. ఇదం అంటే ఇది. చూడబడేది. నేను ఈ పుస్తకం చూస్తున్నాను అంటే నీవు వేరు పుస్తకం వేరు. చూచేవాడు వేరు చూడబడేది వేరు. ఇదం అంటే చూడబడేది. చూడబడేది అంతా క్షేత్రమే. చూచేవాడు తప్ప మిగిలింది అంతా క్షేత్రమే. ఈ ప్రకృతి అంతా క్షేత్రమే. ఈ భూమి, గ్రహాలు, గెలాక్సీలు అన్నీ క్షేత్రమే. ఇదం అంటే ఇది అనే పదానికి సమాధానంగా వచ్చే ప్రతి పదార్థము క్షేత్రమే. తెలుసుకునే వాడు తప్ప మిగిలింది అంతా "క్షేత్రమ్ ఇతి అభిధీయతే" అంటే క్షేత్రము అని చెప్పబడుతూ ఉంది. కాని, మనం ఈ శరీరమే నేను, నేనే ఈ క్షేత్రము అనే భావనలో ఉన్నాము కాబట్టి, ఇదం శరీరం అంటే ఈ శరీరము అనే క్షేత్రము అని కృష్ణుడు చెప్పాడు.

ఇదం శరీరం అంటే ఏ శరీరం మనచేత చూడబడుతూ ఉందో దానిని క్షేత్రము అని అంటారు. క్షీణించే గుణం కలది క్షేత్రము. క్షీణించడం అంటే మార్పుచెందడం అని కూడా చెప్పవచ్చు. క్షీణత అంటే ఏమిటి? కలుసుకున్నవి విడిపోవడం. ఈ శరీరాన్నే తీసుకుంటే ఇది పంచభూతములుఅయిన నీరు, గాలి, అగ్ని, ఆకాశము, భూమి అంటే పదార్థము వీటితో కలిసి శరీరంగా రూపుదిద్దుకుంది. మరణించగానే ఈపంచభూతములు వేటికి అవి విడిపోతాయి. తమ

పూర్వస్థితికి చేరుకుంటాయి. దీనినే శరీరం పంచభూతములలో కలిసిపోయింది అంటాము. శరీరమును దేహము అని కూడా అంటారు. దేహము అంటే దహనయోగ్యమైనది. ఆఖరుకు దహింపబడేది. అంతే కాకుండా ఈ దేహము శారీరక, మానసిక రోగములతో నిరంతరం దహింపబడుతూ ఉంటుంది కాబట్టి దీనిని దేహము అని అంటారు.

క్షేత్రము అంటే భూమి, పొలము అని కూడా అర్థం. భూమిలో గింజలు పాతిపెడితే మొక్కలు వచ్చి, ఆ మొక్కలు మరి కొన్ని గింజలను ఉత్పత్తి చేస్తాయి. అలాగే ఈ శరీరంలో కూడా వీర్యం అనే గింజల సాయంతో మరొక శరీరం తయారవుతుంది. ఆ కారణం చేత కూడా ఈ శరీరాన్ని క్షేత్రము అని అంటారు. కాబట్టి, ఈ శరీరంతో సహా మనం చూచే పదార్థాలు అన్నీ క్షీణించే గుణం, మార్పుచెందే గుణం, దహనయోగ్యమైన గుణాలు కలవే. కాబట్టి చూడబడేది, క్షీణత కలిగినది క్షేత్రము.

చూడబడేది క్షేత్రము అయితే చూచేది ఎవరు. క్షీణించేది క్షేత్రము అయితే క్షీణించకుండా ఉండేది ఎవరు? డ్రైవింగ్ చేసేవాడిని డ్రైవర్ అంటాము. అలాగే ఈ క్షేత్రమును చూచేవాడిని, ఇది క్షేత్రము అని తెలుసుకునేవాడిని క్షేత్రజ్ఞుడు అని అంటారు. సాధారణంగా నా శరీరము, నా చెయ్యి, నా కాలు, నా పొట్ట, నా గుండె అని అంటూ ఉంటాము. ఈ మాదిరిగా ఈ శరీరాన్ని అవయవాలను చూచేవాడు గుర్తించేవాడు ఎవరో ఒకరు ఉండాలి కదా. ఆయనే, ఆ తత్వమే, ఆ చైతన్యమే క్షేత్రజ్ఞుడు. దానికి క్షీణత లేదు. క్షీణత లేని వాడు క్షేత్రజ్ఞుడు. కాని చూచేవాడు వేరు, చూడబడేది వేరు, రెండూ ఒకటి కాదు, అని తెలిసికూడా మనం మాత్రం రెండూ ఒకటే అనుకుంటున్నాము. అంటే ఈ శరీరమే నేను అనుకుంటున్నాము. అదే అజ్ఞానము.

అందుకనే కృష్ణుడు అంటున్నాడు......ఓ అర్జునా! నీవు నేను, భీష్ముడు, సుయోధనుడు రాజులు సైనికులు వీరందరూ నీకు శరీరాలుగా కనపడుతున్నారు. ఈ శరీరాలనే క్షేత్రములు అని అంటారు. క్షేత్రములో విత్తనములు నాటితే మొక్క మొలిచి మరొక క్షేత్రం తయారవుతుంది. ఇదే సృష్టి. అలాగే ఈ క్షేత్రములో ఉంటూ ఈ క్షేత్రమును తెలుసుకునేవాడు క్షేత్రజ్ఞుడు అంటే ఆత్మ. నిజానికి శరీరానికి చేతనత్వము లేదు. ఎందుకంటే ప్రాణం పోయిన తరువాత శరీరంలో అన్ని అవయవాలు ఉన్నా అది కదలలేదు. పైగా మరుసటి రోజుకు కుళ్లిపోతుంది. ఈ శరీరము క్షేత్రము అయితే దీనిలో ఉన్న చైతన్యస్వరూపమే క్షేత్రజ్ఞుడు. శరీరం నిద్రపోయినా, క్షేత్రజ్ఞుడు మేలుకొనే ఉంటాడు. (కరెంటు లేకపోతే ఎన్ని ఏసిలు ఫాన్లు లైట్లు ఉన్నా ప్రయోజనం లేదు. అలాగే లోపల చైతన్యం లేకపోతే అతడు ఎంత గొప్పవాడైనా అధికారి అయినా నాయకుడు అయినా ప్రయోజనం లేదు. లోపల ఉన్న చైతన్యం ఒకటే అయినా మనం శరీరానికే ప్రాధాన్యం ఇస్తున్నాము. అదే అజ్ఞానము.)

3. క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత।
క్షేత్రక్షేత్రజ్ఞయోర్ జ్ఞానం యత్తజ్ఞానం మతం మమ॥

చూడబడేవి అన్నీ క్షేత్రాలే. సమస్తక్షేత్రములు నా చేత చూడబడుతున్నాయి. అన్ని క్షేత్రములలో నేనే ఉన్నాను. ఈ క్షేత్రము క్షేత్రజ్ఞుడు గురించిన జ్ఞానమే నిజమైన జ్ఞానము. దానిని మించిన జ్ఞానము మరొకటి లేదు.

ఈ శ్లోకంలో కృష్ణుడు జీవాత్మ పరమాత్మ ఒకటే వేరు కాదు అనే తత్వాన్ని బోధించాడు. ఈ వివిధములైన క్షేత్రములను ఎవరైతే సాక్షీభూతంగా చూస్తుంటాడో ఆయనే పరమాత్మ. అందరిలో ఆత్మస్వరూపుడుగా వెలుగుతున్నాడు. ఆ ఆత్మ ప్రాపంచిక విషయాలతో చేరి జీవాత్మగా రూపాంతరం చెందుతుంది. ఇదే సత్యము. దీనిని మించిన జ్ఞానము మరొకటి లేదు. ప్రాపంచికమైన ఎన్ని జ్ఞానములు కలిగినా అవి అన్నీ ఈ జ్ఞానముతో సమానం కాదు. ఈ జ్ఞానం కలిగిన నాడు మానవుడు దేనికీ భయపడడు. చివరకు మృత్యువుకు కూడా భయపడడు. మృత్యువును సంతోషంగా ఆహ్వానిస్తాడు. ఇదే నా మతము. మా యొక్క నిశ్చితమైన అభిప్రాయము అని చెప్పాడు కృష్ణుడు. ఈ విషయాన్ని ఇంకొంచెం వివరంగా తెలుసుకుందాము.

ఈ అనంత విశ్వంలో ఎన్నో క్షేత్రాలు ఉన్నాయి. వాటిలో జీవులు కూడా ఉన్నాయి. ఆ జీవులకు వివిధ ఆకృతులతో రకరకాల శరీరాలు ఉన్నాయి. ఆ శరీరాలలో నేను క్షేత్రజ్ఞుడుగా ఉన్నాను. క్షేత్రమునకు, క్షేత్రజ్ఞునకు మధ్య ఉన్న సంబంధము దానికి సంబంధించిన జ్ఞానము ఏదైతే ఉందో అదే నిజమైన జ్ఞానము.

ప్రతి క్షేత్రములోనూ అంటే ప్రతి శరీరములోనూ పరమాత్మ ఆత్మస్వరూపుడుగా, చైతన్య శక్తిగా, శరీరం చేసే పనులకు సాక్షిగా వెలుగుతున్నాడు. కాకపోతే ప్రాపంచిక విషయములతో కలిసి జీవాత్మగా పిలువబడుతున్నాడు. జీవాత్మ, ఆత్మ, పరమాత్మ అన్నీ ఒకటే. అన్ని శరీరములలో పరమాత్మ ఉన్నాడు. పరమాత్మ కొరకు ఎక్కడో వెదుకనవసరం లేదు. "ఇందు గల డందు లేడని సందేహము వలదు, చక్రి సర్వోపగతుండు" అని భాగవతంలో పోతనగారు చెప్పారు. మనందరం ఈ సత్యాన్ని తెలుసుకోవాలి. ఈ సత్యం తెలుసుకుంటే మనకు నిరంతరం ఆనందము శాంతి చేకూరుతుంది. ఈ సుఖాలు దు:ఖాలు అన్నీ శరీరానికే కాని నాకు కాదు అనే జ్ఞానం అలవరచుకోవాలి. కేవలం ఆధ్యాత్మ విద్య వలననే ఈ జ్ఞానం కలుగుతుంది కానీ వేరే ఏ విద్య వలన కలుగదు.

మమ మతమ్ అంటే ఇదే నా అభిప్రాయము అని పరమాత్మ ఖచ్చితంగా చెప్పాడు. ఇక్కడ మరొక మాట కూడా అన్నాడు. సర్వక్షేత్రేషు అని వాడాడు. అంటే అన్ని క్షేత్రములలో నేను క్షేత్రజ్ఞుడుగా ఉన్నాను. అంటే కేవలం బ్రాహ్మణులు, స్వామీజీలు, సన్యాసులు, మఠాధిపతులు, వీళ్ల శరీరాలలోనే కాదు అన్ని కులాలు, మతాలు, జాతుల, ధనిక, పేద శరీరాలలో స్త్రీ పురుష భేదం లేకుండా పరమాత్మ ఉన్నాడు. కాని మన అజ్ఞానంతో మనమే తెలుసుకోడం లేదు. మనుషుల మధ్య భేదభావం ఏర్పరచుకుంటున్నాము.

ఈ జ్ఞానం లేకపోతే, ఈ విషయాలు తెలుసుకోకపోతే ఏమవుతుంది, కొంపలు మునుగుతాయా! అనే ప్రశ్నకూడా తలెత్తుతుంది. దానికి ఒకటే సమాధానం. నేనే ఈ శరీరము అనే అజ్ఞానంలో ఉన్నంత వరకూ, మనం ద్వంద్వాలకు లోనవుతాము. మనసు నిరంతరం కల్లోలంగా ఉంటుంది. సంతోషం వచ్చినా, దు:ఖం వచ్చినా తట్టుకోలేము. అమితమైన ఉద్వేగానికి లోనవుతాము. బిపి పెరుగుతుంది. ఏ పని సరిగా చేయలేము. ప్రతిదానికీ తలపట్టుకు కూర్చుంటాము. అందరితో తగాదాలు. ప్రశాంత జీవనం కరువవుతుంది. అన్నీ ఉన్నా ఏమీ లేనట్టే ఉంటాడు. తీవ్రమైన అసంతృప్తి. దానితో జీవితం దుర్భరం అవుతుంది. కాబట్టి శరీర పటుత్వం ఉండగానే, ముసలితనం, మరణం రాకముందే ఈ ఆత్మతత్వమును తెలుసుకొని ప్రశాంత జీవనం గడపడానికి ప్రయత్నించండి.

ఈ శ్లోకం తత్వమసి అనే మహావాక్యానికి వ్యాఖ్యానము అనిపెద్దలు చెబుతారు. చిన్ని ఉదాహరణతో దీనిని అర్థం చేసుకోడానికి ప్రయత్నం చేద్దాము. మహాసముద్రము ఉంది. అందులో అలలు ఉన్నాయి. కొన్ని చిన్న అలలు. కొన్ని పెద్ద అలలు. అలలో నీరు ఉంది. సముద్రములో నీరు ఉంది. అలజడి కలిగినపుడు అలలు లేస్తాయి. లేకపోతే ప్రశాంతంగా ఉంటాయి. మహాసముద్రము అన్నా, అల అన్నా మూలపదార్థము నీరే. పరమాత్మ అంటే అఖండ చైతన్యము వివిధ రూపములలో ఉన్న శరీరములలో ఆత్మస్వరూపంగా ఉంటుంది. ఆ ఆత్మ స్వరూపము ప్రాపంచిక విషయాలలో చేరి జీవాత్మగా మారి అలల మాదిరి ఎగిసిపడుతుంటుంది. కాని మూలపదార్థము మాత్రము ఒక్కటే. అదే విశ్వచైతన్యము.

## 4. తత్ క్షేత్రం యచ్చ యాదృక్చ యద్వికారి యతశ్చ యత్।
## స చ యో యత్ప్రభావశ్చ తత్సమాసేన మే శృణు॥

పైన చెప్పబడిన క్షేత్రము అంటే ఏమిటో, ఎలా ఉంటుందో, ఏయే వికారములు కలిగి ఉంటుందో, దేని నుండి పుట్టిందో, ఎవరిచేత చూడబడుతూ ఉందో, క్షేత్రమును చూస్తున్న క్షేత్రజ్ఞుడు ఎవరో, అతని ప్రభావము ఏమిటో, ఆ విషయాలన్నీ క్లుప్తంగా చెబుతాను శ్రద్ధగా విను.

క్షేత్రము, క్షేత్రజ్ఞుడు అనే మాటలు విన్నాము. ఇప్పుడు ఆ క్షేత్రం అంటే ఏమిటి, శరీరాన్నే క్షేత్రం అంటారా, ఇంకా వేటినైనా క్షేత్రములు అంటారా! క్షేత్రము అనబడేది ఎలా ఉంటుంది, దాని స్వరూప, స్వభావములు ఏమిటి? అది ఎటువంటి గుణములు వికారములు కలిగి ఉంటుంది, ఎక్కడి నుండి పుడుతుంది, దాని పుట్టుకకు కారణం ఏమిటి? ఇతరములైన వాటిమీద దాని ప్రభావం ఎలా ఉంటుంది; ఇకపోతే ఈ క్షేత్రమును చూస్తున్న క్షేత్రజ్ఞుడు ఎవరు? ఆయన ప్రభావము, వైభవము, విభూతి ఏమిటి? అనేవిషయములు అన్నీ వివరంగా చెబుతున్నాను విను అంటున్నాడు పరమాత్మ.

## 5. ఋషిభిర్బహుధా గీతం ఛన్దోభిర్వివిధైః పృథక్।
## బ్రహ్మసూత్రపదై శ్చైవ హేతుమద్భిర్వినిశ్చితైః॥

క్షేత్రము, క్షేత్రజ్ఞులకు సంబంధించిన ఈ జ్ఞానము ఋషుల చేత అనేక విధములు గానూ, వేరువేరుగానూ, వివిధములైన వేదసూత్రముల చేతనూ ప్రతిపాదింపబడినది. ఈ జ్ఞానము హేతువాదమునకు, తర్కమునకు నిలిచినది. ఈ విషయము బ్రహ్మసూత్ర వాక్యములచేతకూడా నిశ్చయింపబడినది.

క్షేత్రము, క్షేత్రజ్ఞుడు, వీరి గురించి ఋషులు అనేక విధాలుగా వర్ణించారు. వేదములు, శాస్త్రములు కూడా వేరు వేరుగా విశ్లేషించాయి. వ్యాసుడు బ్రహ్మసూత్రాలు రాసాడు. వాటి ల్లో కూడా ఈ క్షేత్రము క్షేత్రజ్ఞుడి గురించి వివరంగా చెప్పబడింది.

ఇక్కడ ముగ్గురి గురించి ప్రస్తావించాడు పరమాత్మ. ఒకటి ఋషులు. ఋషులు అంటే ఇంద్రియములను మనసును నిగ్రహించినవాళ్లు. ఆత్మతత్వమును తెలుసుకున్నవాళ్లు. అటువంటి వాళ్లు చెప్పినదానిని ప్రమాణంగా స్వీకరించవచ్చు. రెండవది వేదములు. వేదములు కూడా చాలా మంది ఋషులు ముఖతా తమ శిష్యులకు బోధించారు. వేదవాక్యములు కూడా మనకు ప్రమాణాలు. ఈ వేదములు ఈ విషయం గురించి వేరు వేరుగా, వివిధములుగా విశ్లేషించింది. అలాగే వ్యాసమహర్షి పరమాత్మ గురించి బ్రహ్మసూత్రాలు రచించాడు. అథాతో బ్రహ్మ జిజ్ఞాసా అనే సూత్రంతో బ్రహ్మ సూత్రాలు ప్రారంభం అవుతాయి. ఇవి కూడా పరమాత్మ స్వరూపాన్ని గురించి చెప్పాయి. అందుకే ఈమూడు ప్రమాణాలను స్వీకరించాడు కృష్ణుడు.

అంతే కాదు విమర్శకులు కూడా ఉంటారు. వారు ప్రతి విషయాన్నీ తర్కిస్తారు. హేతువాదంతో పరిశీలిస్తారు. ప్రతిదానికీ కారణాలు వెదుకుతారు. ఏ విషయమైనా కాల పరీక్షకు నిలబడినదా! లేదా! అనే విషయాన్ని కూడా ఆలోచిస్తారు. అటువంటి హేతువాదుల చేత కూడా

ఇది నిరూపింపబడింది. ఈ క్షేత్రము, క్షేత్రజ్ఞుడుగురించిన జ్ఞానము అంతటి ఉత్కృష్టమైనది అని కృష్ణుడు దాని యొక్క ప్రభావం గురించి చెప్పాడు.

కృష్ణుడు, ఈ విషయం తాను చెప్పాడు కాబట్టి, ఇది గొప్పది, దీనిని నమ్ము అని అనడం లేదు. అర్జునుడిని కానీ, మనలను కానీ నమ్మించే ప్రయత్నం చేయడం లేదు. ఈ విషయం వేదముల చేత, ఋషులచేతా, శాస్త్రముల చేతా బ్రహ్మసూత్రముల చేతా ప్రతిపాదింపబడినది కాబట్టి గొప్పది అయింది కానీ కేవలం నేను చెబుతున్నాను అని కాదు అని వినయంగా చెప్పాడు కృష్ణుడు.

6. మహాభూతాన్యహఙ్కారో బుద్ధిరవ్యక్తమేవ చ।
ఇన్ద్రియాణి దశైకం చ పఞ్చ చేన్ద్రియగోచరాః॥
7. ఇచ్ఛాద్వేష స్సుఖం దు:ఖం సఙ్ఘాతశ్చేతనా ధృతిః।
ఏతత్ క్షేత్రం సమాసేన సవికార ముదాహృతమ్॥

ఐదుమహాభూతములు (భూమి,నీరు,అగ్ని,గాలి,ఆకాశము), అహంకారము, బుద్ధి, అవ్యక్తము అంటే మూలప్రకృతి, పది ఇంద్రియములు, మనస్సు, ఐదు తన్మాత్రలు (శబ్ద, స్పర్శ, రస, రూప,గంధము), కోరికలు, ద్వేషము, సుఖము,దు:ఖము, శరీరము, అందులో ఉన్న చేతనా శక్తి, ధైర్యము, ఇవన్నీ కలిస్తే దానిని క్షేత్రము అని అంటారు.

ఇప్పుడు క్షేత్రం గురించి చెబుతున్నాడు పరమాత్మ. ఇంతకు ముందు రెండవ శ్లోకంలో ఇదం శరీరం క్షేత్రమ్ ఇత్యభిధీయతే అంటే ఈ శరీరమునే క్షేత్రము అని పిలుస్తారు అని అన్నాడు. ఇప్పుడు ఆ క్షేత్రమును విస్తృత పరిచాడు. క్షేత్రము అంటే కేవలము కనిపించే ఈ శరీరమే కాదు ఈ క్షేత్రము పంచభూతములతో ఏర్పడింది. ఈ క్షేత్రములో పంచభూతములు, పంచతన్మాత్రలు (శబ్ద,స్పర్శ,రూప,రస,గంధములు), పదిఇంద్రియములు, బుద్ధి, మనసు, అహంకారము, ప్రకృతి, ఈ ఇరవైనాలుగు తత్వములు కలిసి క్షేత్రము అని అంటారు. తరువాత సవికార: అంటే ఈ క్షేత్రములో ఉన్న పదార్థములు ఒకదానితో ఒకటి కలిసినపుడు వికారములు కలుగుతాయి. అవే కోరికలు, ద్వేషములు, సుఖము, దు:ఖము, తెలివి(జ్ఞానము), మనస్సులో చేసే సంకల్పాలు, ధైర్యము అనే వికారములతో కూడినదే ఈ క్షేత్రము.

క్షేత్రము అంటే మన శరీరమే కాదు బయట కనిపించే ప్రకృతి కూడా క్షేత్రమే. అందులో నుండే ఈ జీవులు అన్నీ పుడుతున్నాయి పెరుగుతున్నాయి. ఈ శరీరాలు అన్నీ ప్రకృతిలో భాగమే. శరీరంలో ఉండే మనసు, బుద్ధి, అహంకారము వలన కలిగే వికారములు అనగా

సుఖదు:ఖము, ఇవన్నీ కూడా క్షేత్రము యొక్క లక్షణాలే. ఈ క్షేత్రము ఎల్లప్పుడూ ఏదో ఒక వికారముతో కూడి ఉంటుంది. వివిధ వికారములకు లోనవుతూ ఉంటుంది. కాని ఈ క్షేత్రములో ఉండే క్షేత్రజ్ఞుడు మాత్రము నిర్వికారుడు. ఆ క్షేత్రజ్ఞుడు ఈ వికారములతోకూడిన క్షేత్రమును సాక్షిగా చూస్తుంటాడు కానీ ఆయనకు క్షేత్రములో ఉన్న వికారములు ఏవీ అంటవు.

ఈ రెండు శ్లోకాలకు ఆచార్య ప్రేమ్ సిద్ధార్థగారు తమ గీతోపన్యాసములలో అద్భుతమైన వివరణ ఇచ్చారు. వారికి పాదాభివందనం చేస్తూ, వారు ఇచ్చిన వివరణను స్థూలంగా తెలుసు కుందాము.

ఇప్పటి వరకు వ్యాసుల వారు క్షేత్రము అంటే కేవలం శరీరం అని చెప్పి, ఈ శ్లోకాలలో క్షేత్రము అనే పదాన్ని మరింత విస్తృతపరిచారు. మనం చూసే ఈ జగత్తును శాస్త్రకారులు కొన్ని తత్వాలుగా విభజించారు. వైశేషిక దర్శనము 12 తత్వాలుగా విభజించింది. న్యాయదర్శనము 16 తత్వాలుగా విభజించింది. కపిల మహాముని యొక్క సాంఖ్యములో 24 తత్వాలుగా ప్రతిపాదింప బడింది. ఈ ప్రకారంగా విభజింపబడినప్పటికీ వేదాంతము యొక్క ముఖ్య ప్రయోజనము జీవుడు ఈశ్వరుడు, వీరి ఐక్యము. కాబట్టి ఎన్ని తత్వాలు ప్రతిపాదింపబడ్డా, ముఖ్యమైన ఉద్దేశ్యము జీవేశ్వరైక్యము. కాబట్టి ఎన్ని తత్వాలుగా విభజింపబడ్డా, దాని వలన ఎటువంటి నష్టము లేదు. తత్వాలు ఎన్ని ఉన్నా ఉద్దేశం ఒక్కటే. కాబట్టి వేదాంతము సాంఖ్యయోగంలో కపిలముని ప్రతిపాదించిన 24 తత్వాలనే ప్రమాణంగా స్వీకరించింది.

సాంఖ్యం ప్రకారము పరమాత్మ, ప్రకృతి రెండూ ఉన్నాయి. రెండూ స్వతంత్రంగా ఉన్నాయి. కాని వేదాంతము మాత్రం ప్రకృతి పరమాత్మ మీద ఆధారపడిఉంది అని అంటుంది. పరమాత్మ అవ్యయుడు. నాశము లేని వాడు. ఈ పరమాత్మ నుండి మూలప్రకృతి ఆవిర్భవించింది. దానినే మహత్ తత్వము అని అంటారు. దీనినే కాస్మిక్ ఇంటెలిజన్స్ అని అంటారు. ఏ పని చేయడానికైనా దానికి సంబంధించిన బుద్ధి,తెలివి,నైపుణ్యం ఉండాలి. ఈ మహత్ తత్వములోనుండి అహంకారము వచ్చింది. ఈ బుద్ధి తెలివి ఎప్పుడు ఆవిర్భవించాయో వెంటనే దానికి సంబంధించిన "నేను" ఇగో అనే తత్వము కూడా పుడుతుంది. దానినే అహంకారము అంటారు. ఈ అహంకారము ప్రకృతి అంతా విస్తరించింది. తరువాత మహాభూతములు ఐదు ఏర్పడ్డాయి. మహాభూతములు అంటే సూక్ష్మరూపంలో ఉన్న పంచభూతములు. వీటి నుండి పది ఇంద్రియములు, మనస్సు సూక్ష్మరూపంలో ఏర్పడ్డాయి. అంటే సూక్ష్మరూపంలో మొత్తం 18 తత్వాలు ఏర్పడ్డాయి. తరువాత ఈ స్థూల జగత్తు ఏర్పడింది. అంటే ఇప్పుడుమనం చూస్తున్న భూమి, అగ్ని, వాయువు, నీరు, ఆకాశము ఏర్పడ్డాయి. అంటే ఇరవై మూడుఅయ్యాయి. ప్రకృతి ఒకటి. మొత్తం ఇరవైనాలుగు తత్వాలు. వీటినే కపిల మహర్షి తన సాంఖ్యంలో ప్రతిపాదించారు. ఇప్పుడు మనం శ్లోకాన్ని చదువుదాము.

అవ్యక్తం అంటే ప్రకృతి. బుద్ధి అంటే కాస్మిక్ ఇంటెలిజెన్స్ అంటే మహత్ తత్వము. తరువాత అహంకారము. (ఈ అహంకారము మూడు రకాలు. సాత్వికాహంకారము, రాజస అహంకారము, తామస అహంకారము). మహాభూతాని అంటే పంచభూతాలు సూక్ష్మరూపంలో ఉండటం. మహా అంటే అత్యంత పెద్దది అలాగే అత్యంత సూక్ష్మమైనది. అణువు కంటే పరమాణువు సూక్ష్మమైనది. కాని దానిని పరమ అంటే అన్నిటికన్నా గొప్పది అని అన్నారు. తరువాత పది ఇంద్రియములు అంటే ఐదు జ్ఞానేంద్రియములు, ఐదు కర్మేంద్రియములు, తరువాత మనసు. తరువాత పంచ ఇంద్రియ గోచరా: అంటే ఇంద్రియములకు కనపడే పంచభూతములు అంటే భూమి,గాలి,నీరు,అగ్ని,ఆకాశము. ఇందాక చెప్పిన సూక్ష్మరూపంలో ఉన్న పంచభూతములు కాలానుగుణంగా స్థూల రూపం ధరించాయి. ఇవన్నీ కలిపి క్షేత్రము అని అంటారు.

పరమాత్మ మొట్టమొదట ఇదం శరీరం క్షేత్రమిత్యభిధీయతే అంటే ఈ దేహమునే క్షేత్రము అంటారు అని మొదలు పెట్టి, తుదకుపరమాత్మ తత్వము తప్ప మిగిలిన 24 తత్వములు అంతా కలిపి క్షేత్రము అని అంటారు అని అన్నాడు. మనం ఏ పదార్థము, వస్తువు, జీవి, తత్వమును తీసుకున్నా అవన్నీ కూడా ఈ 24 తత్వాలలో ఇమిడిపోతాయి. ఇవి కాక మరొకటి ఉండే అవకాశములేదు. వీటిని చూచేవాడు క్షేత్రజ్ఞుడు అంటే పరమాత్మ.

ఈ 24 తత్వాలు ఊరికే ఉండవు కదా. ఒకదానితో ఒకటి కలుస్తూ విడిపోతుంటాయి. ఆ సంయోగ వియోగముల వలన కలిగే పరిణామాలే వికారములు అని అంటారు. ఉదాహరణకు మనం ఏ పని చేయాలన్నా పది ఇంద్రియములతోకూడిన శరీరము, దానిలో సూక్ష్మంగా ఉన్న మనస్సు, బుద్ధి, అహంకారము పనిచేస్తాయి. దీనినే సంఘాతము అని అంటారు. కాని దీని వెంట చేతన అనే పదం ఒకటి వాడారు. చేతన అంటే చైతన్యము. మనం పరమాత్మను చైతన్యస్వరూపుడు అని అన్నాము. కాని ఈ చైతన్యము అంటే ఏమిటి? మనసు కూడా ఒక ఇంద్రియము అని చెప్పుకున్నాము కాకపోతే ఇంద్రియములు కనపడతాయి. మనసు కనపడదు. అంతే తేడా.

ఈ మనసుకు ఒక ప్రత్యేక లక్షణము ఉంది. ప్రతిబింబించే లక్షణం. (రిఫ్లెక్టింగ్ మీడియా). మనసు అద్దం లాంటిది. అద్దంలో మన ప్రతిబింబం కనపడినట్టు, అది ప్రతి విషయాన్ని ప్రతిబింబిస్తుంది. అలాగే మన గదిలోకి సూర్యుని వెలుగు పడుతుంది. ఆ వెలుగులో అద్దం పెడితే అద్దం ఎదురుగా ఉన్న గోడమీద సూర్య కాంతి ప్రసరించి గదినిండా వెలుగు నింపుతుంది. కాని అది ప్రతిబింబ కాంతి మాత్రమే సూర్యుని కాంతి కాదు. అదే అద్దం చీకట్లో ప్రకాశించదు. ఏ వెలుగునూ ప్రతిబింబించదు. కాబట్టి సూర్యకాంతిని అద్దం ప్రతిబింబిస్తూ ఉంది. అదే ప్రకారంగా ఆత్మ యొక్క చైతన్యాన్ని ఈ మనసు ప్రతిబింబిస్తూ ఉంటుంది. మనసు కూడా ఆత్మలాగా ప్రకాశిస్తూ ఉంటుంది. ఉదాహరణకు సూర్యుని వెలుగు చంద్రుని మీద పడి మనకు కాంతిలో కూడిన వెన్నెల వస్తుంది.కాని చంద్రుని నుండి వచ్చే వెన్నెల కాంతి సూర్యకాంతికాదు. అందుకే చంద్రుడిని మనసుతో

పోలుస్తారు. రెండూ ప్రతిబింబించేవి అని అర్థం.

కేనోపనిషత్ లో మొట్టమొదటి శ్లోకం ఈ విషయాన్నే ప్రతిపాదిస్తుంది. "కేనేషితం పతతి ప్రేషితం మన:" ఎవరి ప్రేరణ చేత ఎవని చేత ప్రేరేపింపబడి మనసు కదులుతూ ఉంటుందో, మనోవేగంతో ప్రయాణిస్తూ ఉంటుందో, అతడే విశ్వచైతన్యము. విశ్వచైతన్యము ప్రతి జీవిలోనూ ఆత్మచైతన్యంగా ప్రకాశిస్తూ ఉంది. కాబట్టి మనసు ఆత్మచైతన్యము యొక్క ప్రతిబింబము. మరి ఈ ప్రతిబింబము ఎక్కడ ఉంది. సూర్యుడు అంతరిక్షంలో ఉన్నాడు. అద్దంలో ఉన్న సూర్యుడు భూమి మీద ఉన్న మన ఇంట్లో ఉన్న అద్దంలోఉన్నాడు. అలాగే ఈ చైతన్య ప్రతిబింబం మన శరీరంలో ఉన్న మనసులో ఉంది. అంతే కానీ ఆత్మలో లేదు. అంటే ఈ ప్రతిబింబ చైతన్యము క్షేత్రమే కాని క్షేత్రజ్ఞుడు కాదు. అందుకని "చేతనా" అని క్షేత్రము గురించి దాని వికారాలను వివరించే శ్లోకంలో చెప్పాడు వ్యాసులవారు.

తరువాత వికారములు గురించి చెప్పారు. అవే.... ఇచ్ఛాద్వేషస్సుఖందు:ఖం. ఈ ప్రతిబింబిత చైతన్యం కలిగిన మనస్సు బయట ప్రపంచంలో తిరుగుతూ ఉన్నపుడు ఇది కావాలి అది వద్దు, ఇది నాకు ఇష్టం, అది నాకు అయిష్టం అనే వికారాలు సహజంగా కలుగుతుంటాయి. ఇష్టం అయినవి లభించినపుడు సుఖం, ఇష్టం లేనివి లభించినపుడు దు:ఖం కలగటం కూడా అత్యంత సహజం. అందుకని ఇచ్ఛాద్వేషాలు, సుఖదు:ఖాలు మనసు నుండి పుట్టిన వికారాలు.

ఈ శ్లోకంలో చెప్పబడిన ఆఖరి వికారము ధృతి. దానినే సంకల్పశక్తి. మనం ఒక వస్తువు కావాలని దాని వెంటపడతాము. దానిని పొందడానికి సంకల్పం చేస్తాము అంటే గాఢంగా కోరుకుంటాము. మనకు ఇష్టం లేని వస్తువు నుండిదూరంగా పారిపోవాలని కోరుకుంటాము. అంటే పూజ చేసేటప్పుడు సంకల్పంలో చూడండి. నాకు అది కావాలి ఇది కావాలి అని కోరుకుంటాము. దు:ఖములు నివారణకావాలి, కష్టాలు తొలగి పోవాలి అని కోరుకుంటాము. ఈ సంకల్పశక్తినే ధృతి అని అంటాము. ఈ ధృతి కూడా ఇచ్ఛాద్వేషములతో అనుసంధానం అయి ఉంటుంది. ఈ వికారాలు అన్నీకూడా క్షేత్రము యొక్కవికారాలే.

ఏ తత్ క్షేత్రం సవికారం ఉదాహృతమ్ అంటే ఆ క్షేత్రము ఈ వికారములు అన్నిటితోకూడినది అని చెప్పబడింది అని వ్యాసుల వారు క్షేత్రముగురించి "సమాసేన" అంటే సంగ్రహంగా వివరించారు. ఈ సందర్భంలో ఆచార్య ప్రేమ్ సిద్ధార్థగారు ఒక విషయం చెప్పారు. అది కూడా మీకు వివరిస్తాను.

ఈ క్షేత్రంలో ఎన్నో పదార్థాలు ఉన్నాయి. ఉదాహరణకు బంగారము. అది భూమిలో మట్టిరూపంలో ఉంది. దానిని వెలికితీసి శుద్ధిచేసి బంగారంగా చేసి దానితో వివిధములైన ఆభరణములను ఆకర్షణీయంగా తయారు చేస్తారు. అవన్నీ షాపులో ఉంటాయి. ఇప్పటి వరకు అవి పదార్థాలే. వాటిని చూసి అవి నాకు కావాలి, నాకు చెందాలి, నా దగ్గరే ఉండాలి అనే సంకల్పం కలిగితే అప్పుడు అవి విషయములు అవుతాయి. విషయము అంటే బంధనము కలిగించేది. ఎలాగంటే... ప్రపంచంలో దొరికే పదార్థాలను పొందాలనే కోరిక పుడుతుంది. వాటి వెంట మనసు పరుగెడుతుంది. వాటిని సంపాదిస్తుంది. తన స్వంతం చేసుకుంటుంది. అప్పుడు ఆ విషయాల వలన బంధం కలుగుతుంది. ఆ బంధాలే వాసనలు. ఈ వాసనలు గాఢంగా పరిణమించి మరుజన్మకు కారణమౌతాయి.

ఇది ఒక్క బంగారానికే కాదు, భూమి, ధనం, ఇల్లు, పదవి, స్త్రీ , సంతానము, బంధువులు, మిత్రులు.....వివిధములైన సుఖములను ఇచ్చే వస్తుసముదాయము.....మొదలైనవి అన్నీ ఈ విషయాల కిందికి వస్తాయి. అందుకే వీటిని విషయవాంఛలు అని అన్నారు. వీటినుండి దూరంగా ఉండటమే వైరాగ్యము. దానినే మనం అలవరచుకోవాలి.

## 8. అమానిత్వమదమ్భిత్వమహింసా క్షాన్తిరార్జవమ్।
## ఆచార్యోపాసనం శౌచం స్థైర్యమాత్మవినిగ్రహః॥

తనను తాను సన్మానించుకోకుండా ఉండటం, డంబములు పలుకకుండా ఉండటం. ఇతరుల శరీరము కానీ, మనసును కానీ హింసించకుండా ఉండటం, సహనము అంటే ఓర్పు కలిగి ఉండటం, మంచి ప్రవర్తన కలిగి ఉండటం, గురువులను పూజించడం, గౌరవించడం, శరీరమును, మనసును, శుచిగా, నిర్మలంగా ఉంచుకోవడం, భగవంతుని యందు స్థిరమైన బుద్ధి కలిగి ఉండటం, ఆత్మ వినిగ్రహము అంటే మన మీద మనకు నియంత్రణ కలిగి ఉండటం అంటే స్వీయ క్రమశిక్షణ, స్వీయనియంత్రణ కలిగి ఉండటం.

రెండవ శ్లోకంలో ఈ శరీరమే క్షేత్రము చెప్పాడు. ఆ క్షేత్రమును చూస్తున్నవాడు క్షేత్రజ్ఞుడు అని అన్నాడు. ఆ క్షేత్రజ్ఞుడు మనలను చూస్తుంటే ఆయనను మనంచూడటం ఎలాగా! అనే ప్రశ్న వస్తుంది. క్షేత్రజ్ఞుడిని చూడాలంటే మనకు ముందు ఆక్షేత్రజ్ఞుడిని గురించిన జ్ఞానం కావాలి. ఆ జ్ఞానం రావాలంటే దానికి కొన్ని అర్హతలు ఉండాలి. ఆ అర్హతల గురించి 8 వ శ్లోకం

నుండి 12వ శ్లోకం దాకా వివరించారు వ్యాసుల వారు. అందులో మొదటి శ్లోకం అయిన 8వ శ్లోకం మనం చదువుకుంటున్నాము.

ఈ శ్లోకంలో మానవునికి ఉండవలసిన కొన్ని లక్షణములు, అర్హతల గురించి చెబుతున్నాడు పరమాత్మ. వీటిలో చేయ తగినవి, చేయ కూడనివి, కూడా ఉన్నాయి. వాటి గురించి తెలుసుకుందాము. పరమాత్మ దీనినే జ్ఞానము అని అన్నాడు. అంటే మానవుడు తన జీవితంలో తప్పకుండా తెలుసుకొని ఆచరించదగ్గ విషయాలు అని అర్థం.

1. మానిత్వం అంటే తనను తాను గొప్పగా ఊహించుకోవడం. తన గురించి తాను గొప్పలు చెప్పుకోవడం. తనంత వాడు లేడని గర్వించడం. తనకు లేని గుణాలు ఆపాదించుకొని తనను తాను పొగుడుకోవడం. ఇవన్నీ మానిత్వం కిందికి వస్తాయి. కొంత మంది ధనం ఇచ్చి పొగిడించుకుంటుంటారు. సన్మానాలు చేయించుకుంటూఉంటారు. ఇది కొంత కాలానికి ఒకవ్యసనంగా మారుతుంది. ఈ రోజు నన్ను ఎవరూ పొగడటం లేదేం. ఈ నడుమ నాకు ఎవరూ సన్మానం చేయడం లేదేం అని బాధపడే స్థితికి చేరుకుంటారు. మరి కొంత మంది పిలువకపోయినా, అడిగి పిలిపించుకొని, సభలకు వెళ్లి దండలు వేయించుకుంటారు. అలా జరగని రోజున ఏదో పోగొట్టుకున్నట్టు విలవిలలాడి పోతారు. కొంత కాలానికి  అదొక మనోవ్యధగా మారే అవకాశం ఉంది. ఇటువంటి మనోవ్యధ ఉన్న వాడు దైవ చింతనకు, ధ్యానము చేయడానికి పనికిరాడు. దైవచింతన, ధ్యానం, భక్తి లేకపోతే జ్ఞానం లభించదు.  అందుకే ఈ లక్షణం ఉండకూడదు అని అమానిత్వం అంటే మానిత్వం పనికిరాదు అని చెప్పారు వ్యాసులవారు.

అదంభిత్వం అంటే దంభములేకపోవడం. పైనచెప్పబడిన “మానిత్వం” మానసికమైన స్థితి అయితే ఈ దంభము ఆమానిత్వమును బయటకు ప్రకటించే స్థితి. తన వాక్కుచేత గానీ, చేతల చేత కానీ తన గొప్పతనాన్ని ఇతరులకుచాటుకోవడం. అంటే  అంతా నేనే చేసాను అని గొప్పలు చెప్పుకోవడం, నిరాడంబరంగా చేయవలసిన పనులు కూడా ఆర్భాటంగా చేయడం.

(భక్తిశ్రద్ధలతో చేయవలసిన వ్రతాలు, పూజలు, పడి పూజలు ఆర్భాటంగా, ఫ్లెక్సీలతో ప్రచారం చేసి, ఛానల్సులో చూపించి, రాజకీయనాయకులను పిలిపించి, నిర్వహించడం కూడా ఈ దంభము కిందికేవస్తుంది. చాలామంది చేసే పూజలు, వ్రతాలలో భక్తి, శ్రద్ధ తప్ప అన్నీ ఉ ంటున్నాయి.).

ఇటువంటి వారు తమ వేషభాషలలో ప్రత్యేకత కోసం పాకులాడుతుంటారు. (ఒంటి నిండా రుద్రాక్షలు, ఐదువేళ్లకు వివిధ దేవతల ఉంగరాలు, నుదుటిమీద పెద్దగా నామాలు, విభూతిరేఖలు, వీటితో అందరూ నన్నే చూడాలి అని తహతహలాడుతుంటారు). ఈ తరహా వ్యక్తులకు భక్తి,శ్రద్ధ ఉండే అవకాశము లేదు. తన గురించి తాను ఆలోచించే వాడు దేవుని గురించి ఆలోచించడు. కాబట్టి అదంభత్వం అలవరచుకోవాలని వ్యాసులవారు సూచించారు.

అహింస. అహింస అంటే కేవలం శారీరకంగా హింసించడమే కాదు. మాటలతో హింసించడం, మనసును గాయపరచడం కూడా హింసకిందికే వస్తుంది. కాబట్టి శరీరంతో కానీ, వాక్కుతో గానీ, మానసికంగా కానీ ఎవరినీ హింసించకూడదు. శారీరకమైన గాయాలు కొంత కాలానికి మానిపోతాయి. కాని మానసిక గాయం ఎన్నటికీ మానిపోదు. చాలా మంది తమ సుఖం కోసం వినోదం కోసం ఇతర ప్రాణులను వేటపేరుతో చంపడం చూస్తుంటాము. వేటాడేటప్పుడు ఆ ప్రాణి ప్రాణభయంతో పరుగెడుతూ ఉంటుంది. ఆ పరిస్థితిలో మనం ఉంటే ఎంత బాధపడతామో ఒక్కసారి ఆలోచించాలి. అప్పుడు వేట అంటే అసహ్యం వేస్తుంది. మనం ఒక మాట అంటే ఎదుటి వాడి మనసు ఎంత బాధపడుతుందో ఆలోచించి మాట్లాడాలి. సాధ్యమైనంత వరకు చెట్టుచేమలకు కూడా హింసచేయకూడదు. అందుకే ఎండినచెట్లునే కలప కోసం ఉపయోగించమంటారు.

మనం చేసే హింస అంతా మన ఖాతాలో జమఅవుతూ ఉంటుంది. సమయం వచ్చినపుడు మనం చేసిన హింస మనకే తగులుతుంది. అందుకే పతంజలి యోగశాస్త్రములో ఈ అహింసను ప్రధానంగా సూచించారు. అహింసా పరమోధర్మ: అని ఆర్యోక్తి. కాబట్టి అహింసను ఒక వ్రతంగా, ధర్మంగా ఆచరించాలి.

ఓర్పు కలిగి ఉండటం. దీనినే సహనం అని కూడా అంటారు. తితిక్ష అని వేదాంత పరిభాషలో అంటారు. ఓర్పు అనేది మనసుకు సంబంధించినది. ప్రతి దానికీ రియాక్ట్ అవకూడదు. కొంచెం ఆలోచించి రియాక్ట్ అవవలసిన దానికే రియాక్ట్ అవ్వాలి. అంటే ఓర్పు కలిగి ఉండాలి. కొంత మంది కేవలం తమ వాళ్ల వద్దనుండి ఫోన్ రాకపోతేనే అల్లల్లాడి పోతారు. ఇల్లంతా అల్లకల్లోలం చేస్తారు. మావాడు మూడురోజులయింది ఫోనుచేసి అని కనిపించినవాడికల్లా చెబుతారు. ఇంతకూ ఏమీ ఉండదు. వాడు ఏదో టూరు వెళ్లిఉంటాడు. అటువంటి వారికి మనోనిగ్రహ శక్తి చాలా తక్కువగా ఉంటుంది. కాబట్టి ఓర్పుతో ఉండటం అలవాటుచేసుకోవాలి.

ఓర్పులేకుండా ప్రవర్తిస్తే ఏమవుతుంది. ఏమీ కాదు. నీ మనసు ఎప్పుడూ అల్లకల్లోలంగాఉంటుంది. సరి అయిన నిర్ణయం తీసుకోలేవు. ఓర్పు, సహనము ఎందుకు అవసరం అని మీరు అనవచ్చు, జీవితం మన చేతుల్లో లేదు. జరిగేది జరుగుతూ ఉంటుంది. అది తెలిసి కూడా ప్రతి దానికీ హైరానపడటం ఎందుకు అని మనలను మనం ప్రశ్నించుకోవాలి. తొందరపాటు

తగ్గించుకొని,  కాస్త ఓర్పు వహిస్తే పరిస్థితులు అన్నీచక్కబడతాయి. అందుకే జ్ఞానికి, సాధకుడికి ఓర్పు అవసరం.

ఆర్జవం అంటే మంచి ప్రవర్తన కలిగి ఉండటం. జీవితాన్ని ధర్మబద్ధంగా, శాంతియుతంగా, ఎవరికీ హానిచేయకుండా గడపడం. మన వల్ల ఎవరూ కష్టపడకూడదు. నష్టపోకూడదు అనే భావన కలిగిఉండటం. మనం ఏపని చేసినా మనసా, వాచా, కర్మణా ఒకటి గానే చేయాలి. ఒకటి ఆలోచించి, మరొకటి చేస్తానని చెప్పి, ఇంకొకటి చేయడం మంచి ప్రవర్తన అనిపించుకోదు. ఇచ్చిన మాట నిలబెట్టుకోవడం అత్యంత ముఖ్యం. దానితో పాటు సమయ పాలన, క్రమశిక్షణ కూడా పాటించాలి. ఇవన్నీ కూడా మంచి ప్రవర్తన ఉన్నదానికి లక్షణాలు.  బలి,శిబి,హరిశ్చంద్రుడు ఆడిన మాట నిలబెట్టుకోవడానికి తమ ప్రాణాలు పోయినా లెక్కచేయలేదు. వారిని ఆదర్శంగా తీసుకోవాలి.

ఆచార్య ఉపాసనమ్ అంటే గురువులను పూజించాలి. గురువు అనుగ్రహము, దైవానుగ్రహము లేనిది ఏమీ సాధించలేము.  గురువు మనకు జ్ఞానబోధ చేస్తాడు. మనం గురువును గౌరవిస్తున్నాము అంటే ఆయన మనకు బోధించే జ్ఞానమును గౌరవిస్తున్నాము. గురువు అంటే కేవలం గురువు శరీరం కాదు. ఆయనలో ఉండే విద్య,జ్ఞానము, బోధించే శక్తి, మనలను మంచివారుగా తీర్చిదిద్దే తత్వము. వీటిని గౌరవిస్తున్నాము. గురువు మీద భక్తి, శ్రద్ధ,గౌరవము ఉంటేనే ఆయన చేసిన బోధనల మీద మనకు నమ్మకం కలుగుతుంది. వాటినినేర్చుకుంటాము.  ఆచరిస్తాము.

శౌచమ్ అంటే పరిశుభ్రంగా ఉండటం. శారీరకంగానూ మానసికంగానూ పరిశుభ్రంగా ఉండాలి. శరీరం ఎంత శుభ్రంగా ఉన్నా మనసులో కల్మషం ఉంటే ఏమీ ప్రయోజనం లేదు. అలాగే మాట్లాడే మాట కూడా పరిశుభ్రంగా ఉండాలి. నీచమైన భాష మాట్లాడకూడదు. ఇతరులకు కంటగింపుగా ఉండే మాటలు మాట్లాడకూడదు. మృదువుగా, ప్రియంగా మాట్లాడాలి. దానినే మృదుభాషణ అని అంటారు.

స్థైర్యం  అంటే స్థిరమైన బుద్ధి కలిగి ఉండటం. ఇది దేవుని పట్ల చాలా ముఖ్యమైనది. చంచలత్వము పనికిరాదు. ఇటువంటి వాళ్లు ఎక్కువగా ఊహల్లో తేలుతుంటారు. ఇది మనవల్లకాదు, అది అలా జరగదు, ఇలా చేస్తే అది జరిగిఉండేది అని ఊహల్లో చంచల స్వభావాలు కలిగిఉంటారు. ఈ దేవుడిని కొలిస్తే అనుకున్నది అనుకున్నట్టు జరిగి ఉండేది. అనవసరంగా ఈ దేవుడి చుట్టు తిరిగాను. అని అనుకుంటూఉంటాడు. జరిగేది జరుగుతుంది, మన ప్రారబ్ధకర్మను దేవుడు కూడా మార్చలేడు అనే వాస్తవిక జ్ఞానం ఉండదు. ప్రతి దానికీ మానసికమైన అడ్డంకులు సృష్టించుకుంటూ ఉంటారు. వాటి వలన ఏం ప్రయోజనం లేకపోగా అనవసరమైన మానసిక ఆందోళన మిగులుతుంది. కాబట్టి మానసిక స్థైర్యం ముఖ్యం.

ఆత్మ వినిగ్రహః అంటే స్వీయనియంత్రణ. ఎవరికి వారు నియంత్రించుకోవడం. ఎవరో ఏదో చెప్పారని చేయడం కాకుండా, తనకు తానుగా ఆలోచించి నిర్ణయాలు తీసుకోవాలి. బంధుమిత్రులు, ఆచార్యులు, శ్రేయోభిలాషులుచెప్పినవి అన్నీ విని, వాటినిఅర్థం చేసుకొని, వాటిని మన మనసుకు శరీరానికి అనుకూలమైనవి అయితేనే ఆచరించాలి. దానినే స్వీయనియంత్రణ అని అంటారు. లేకపోతే "నువ్వు చెప్పావు కాబట్టి నేను చేసాను కాని ఇలా తగలడింది" అంటూ బాధపడాలి, ఇతరులను బాధపెట్టాలి.

ఇవే కాకుండా ఇంకా కొన్ని విషయాలు చెబుతున్నాడు వ్యాసులవారు.

## 9. ఇన్ద్రియార్థేషు వైరాగ్యమనహంకార ఏవ చ।
## జన్మమృత్యుజరావ్యాధిదుఃఖదోషానుదర్శనమ్॥

ఇంద్రియార్థేషు వైరాగ్యం అంటే ఇంద్రియములు అనుభవించే విషయములలో రాగమును తగ్గించుకోవాలి. వైరాగ్యమును అంటే విరాగిత్వమును పెంచుకోవాలి. ఇంద్రియ విషయములను అనుభవించాలి కానీ మితంగా అనుభవించాలి. అదే జీవితంగా ఉండకూడదు. వినోదం కోసం సినిమా చూడాలి. కాని సినిమాను మన డ్రాయింగురూము దాకా తీసుకొచ్చి దాని గురించి వాడి వేడి చర్చలు చేయకూడదు. అలాగే ధనసంపాదన కూడా జీవితం గడవడానికి ఉపయోగపడాలి కానీ, ధనసంపాదనే జీవితం కాకూడదు. చూసిందల్లా నాకు కావాలి అని కోరుకోవడం, దాని కొరకు అక్రమాలు చేయడం పనికిరాదు. అది మనకు అవసరమా, మనకు పనికి వస్తుందా, అనే విషయం ముందు విచారించాలి. అతి సర్వత్ర వర్జయేత్. ఏదీ అతిగా ఉండకూడదు. వైరాగ్యం అంటే కాశీ, హరిద్వార్, హిమాచలానికి పారిపోవడం కాదు. ఏదీ చేయకుండా చేతులు ముడుచుకొని కూర్చోవడం కాదు. బాహ్య ప్రపంచంలో తిరుగుతున్నప్పుడు ఇంద్రియాలు మనలను తీవ్రంగా ప్రలోభ పెడతాయి. వాటి ప్రలోభాలకు లోను కాకపోవడమే వైరాగ్యం. ఏది చేయాలో, ఏది అవసరమో, ఏది ధర్మబద్ధమో, ఏది ఉపయుక్తమో దానిని చేయడం. అతిని వదిలిపెట్టడం. దానినే వైరాగ్యం అంటారు.

అనహంకారః .. ఎల్లప్పుడూ నేను, ఇదంతా నేను చేస్తున్నాను, నా కన్నా గొప్పవాడు లేడు అనడమే అహంకారము. అంటే ప్రతివిషయంలోనూ తన ప్రమేయం ఉందని, తన గురించి తాను చెప్పుకోవడం. ప్రతి విషయం తన వల్లనే జరిగింది, తాను లేకపోతే ఏదీ జరగదు అని అనుకోవడం, అలా అని అందరితో చెప్పుకోవడం. అందరూ తన గురించే మాట్లాడుకోవాలి అని అనుకోవడం, అలా చెయ్యమని అందరినీ అడగడం ఇవన్నీ అహంకారం కిందికి వస్తాయి. ఈ "నేను" అనే తత్వాన్ని అదుపులో ఉంచుకోవడమే అనహంకారము.

జన్మ మృత్యు జరా వ్యాధి దు:ఖదోషానుదర్శనమ్.....అంటే పుట్టుక చావు, రోగము ముసలి తనము వీటి గురించి భయపడటం మానుకోవాలి. వీటి వలన దు:ఖాలు వస్తాయి. అవి తప్పవు. కాని, వాటిని సంతోషంగా స్వీకరించాలి కానీ దు:ఖపడకూడదు. వాటి గురించి మాటి మాటి కీ తలచుకుంటూ కుంగి పోకూడదు. అంటే శరీరమీద మమకారము, ప్రేమ ఎక్కువగా ఉండకూడదు. కాస్త బిపి షుగర్ పెరిగినా కంగారు పడిపోవడం, నల్ల వెంట్రుక తెల్లబడగానే లోకమంతా మునిగిపోయినట్టు తల్లడిల్లి పోవడం, నాకూ చావు వస్తుంది అని ఇప్పటి నుండి భయపడటం ఇవన్నీ అర్థం లేని భయాలు. రోగాలు, ముసలితనం, చావు ఇవన్నీ మనం వద్దనుకున్నా రాక మానవు. వాటి కోసం భయపడటం వృధా.

ఈ శరీరము ప్రపంచంలో తిరగడానికి మాత్రమే ఉపయోగపడుతుంది, అది ఒక వాహనం మాత్రమే, అదే జీవితం కాదు అనే భావన కలిగి ఉండాలి. కేవలం దైవధ్యానము వలననే శరీరం గురించిన భయం తొలగిపోతుంది. అలాకాకుండా కేవలం దేహమే నేను నేనే ఈదేహము అనే భావనతో ఉంటే జీవితమంతా అన్యాయము, అధర్మం చేస్తూనే ఉంటాడు. ఎన్నటికీ అతడు జ్ఞాని, సాధకుడు కాలేడు. దేహాన్ని పట్టుకునే వేలాడుతుంటాడు.చివరకు మరణసమయంలో కూడా ఈ దేహం వదిలిపెట్టాల్సివచ్చిందే అని తీవ్రంగా బాధపడుతూ మరణిస్తాడు.

## 10. అసక్తి రనభిష్వఙ్గ: పుత్రదారగృహాదిషు।
## నిత్యం చ సమచిత్తత్వమిష్టానిష్టోపపత్తిషు॥

భార్య, సంతానము, ఇల్లు, సంపదలు, పదవులు మొదలగువాటి మీద అనవసరమైన వ్యామోహం వదలిపెట్టాలి. అవి లేకపోతే బతకలేను అనే భావన వదిలిపెట్టాలి. ఇష్టము, అయిష్టములను వదిలిపెట్టాలి. సుఖము దు:ఖము సంభవించినపుడు సమత్వభావము కలిగి ఉండాలి. అన్నిటిపట్ల, అందరిపట్ల సమభావన కలిగి ఉండాలి.

ఇక్కడ అసక్తి అనేపదం వాడారు. మనం ఈ ప్రాపంచిక విషయాలకు దూరంగా వెళ్లి పోవచ్చు. కాని మన మనసు మాత్రం వాటియందే విహరిస్తూ ఉంటుంది. పూజచేయడానికి దేవుడి ముందు కూర్చున్నా, ధ్యానం చేయడానికి కళ్లు మూసుకున్నా, అవయవాలు పనిచేయక పోయినా మనసు మాత్రం దేవుడి మీద నిలువదు. అన్ని పనికిమాలిన విషయాలు అప్పుడే గుర్తుకు వస్తాయి. కాబట్టి ముందు మనసును అదుపులో ఉంచుకోవాలి.

ఈ మనసును ఎవరి పట్ల, దేని పట్ల అదుపులో ఉంచుకోవాలి అంటే అభిష్వంగ: అంటే తీవ్రమైన అనుబంధం కలిగిన వారి పట్ల మనసును అదుపులో ఉంచుకోవాలి. అవి మనుషులు కావచ్చు వస్తువులు కావచ్చు. వాటికి కొన్ని ఉదాహరణలు చెప్పారు. మానవుడు పుట్టిన తరువాత మొట్ట మొదటగా అతని లేక ఆమె జీవితంలోకి ప్రవేశించేది భర్త లేక భార్య, ఆ ఇద్దరు కలిస్తే కలిగేది సంతానము. మరి వీరికి ఉండటానికి ఒక ఇల్లు కావాలి. పోషణకు ధనం కావాలి. ఆ ధనం పొందడానికి ఉద్యోగము,ఆస్తి, పదవి, ఎవరి స్తోమతను బట్టి వారికి, కావాలి. అందుకే పుత్ర,దార,గృహము మొదలైనవి అని అన్నారు. సంతానము,భార్య,ఇల్లు మొదలైనవి. వీటి కోసం నిరంతరం ఆరాటపడటం, అవిలేకపోతే బతకలేను అనే మమకారం పెంచుకోవడం, వాటి కోసం వెంపర్లాడటం, అవేనేను అని వాటిలో లీనం కావడం పనికిరాదు.

వరసగా కొడుకులు పుడితే కూతురు లేదే అని బాధ, అందరూ కూతుళ్లు పుడితే కొడుకులు లేరే అని బాధ, కొడుక్కు ఉద్యోగం రాకపోయినా, కూతురికి పెళ్లికాకపోయినా, భార్యపుట్టింటికి పోయి నాలుగు రోజులు ఆలస్యం చేసినా, ఉన్న ఇల్లు పాతది అయిపోయినా, కొత్త ఇల్లు కొనడానికి స్తోమత లేకపోయినా, చేసేది ఉన్నత ఉద్యోగం అయినా, ఇంకా పెద్ద ఉద్యోగం రాలేదే అని బాధ, ఇలా చెప్పుకుంటూ పోతే బాధలకు కొరత ఉండదు. కాబట్టి సంతానము, భార్య, ఉద్యోగం, సంపదలు ఇవన్నీ తాత్కాలికంగా సంతోషాన్ని కలిగించినా, చివరకు బాధలతోనే ముగుస్తాయి. కాబట్టి, వీటి మీద ఆసక్తి పరిమితంగా ఉండాలి కానీ అపరిమితంగా ఉండకూడదు. అదే సకల బాధలకు కారణము.

ఇంకా కొంతమంది నేను చచ్చినా పర్లేదు నా ఆస్తి, ధనం పోవడానికి ఇష్టపడను. అని అంటుంటారు. అంటే ప్రాణాల కన్నా తాను సంపాదించిన ధనం, ఆస్తి, పదవి వీటి మీద వ్యామోహం పెంచుకుంటారు. దేని మీద అయినా గాఢంగా ప్రేమ, అనురాగము, అనురక్తి, అపేక్ష ఉంటాయో, ఏ కారణం చేతనైనా వాటి నుండి వియోగం కలిగితే, అంతకు రెట్టింపు దు:ఖం కలుగుతుంది. కాబట్టి తీవ్రమైన గాఢమైన ప్రేమ అనురక్తి దు:ఖానికి దారి తీస్తుంది అని తెలుసుకోవాలి. ఈ లక్షణాలు ఉన్నవారు భక్తికి, సాధనకు పనికి రారు. అంటే ప్రేమ, అనురాగము ఉండకూడదా అంటే ఉండాలి కానీ ఒక పరిధిలో, ఒక మోతాదులో ఉండాలి. హద్దులు దాటకుండా ఉండాలి. మనఅధీనంలో ఉండాలి. ఏదీ తీవ్రంగా ఉండకూడదు. కాబట్టి అసక్తి, అనభిష్వంగము, అలవరచుకోవాలి.

మన దైనందిన జీవితంలో మనకు తరచుగా మనకు ఇష్టమైన వారు, ఇష్టమైన వస్తువులు తారసపడుతుంటాయి. అలాగే మనకు ఇష్టం లేని వారు, ఇష్టంలేని వస్తువులు కూడా పలకరిస్తుంటాయి. ఈ రెండింటి పట్ల సమభావన కలిగి ఉండాలి. ఇష్టం వచ్చినవి అతిగా తినడం వలన ఎలా అజీర్తి చేస్తుందో, అలాగే ఇష్టం వచ్చిన వారితో ఎక్కువగా అనుబంధం పెట్టుకుంటే

అంటే ప్రమాదం కలుగుతుంది. కాబట్టి ఇష్టము, అనిష్టము రెండింటినీ సమంగా చూడాలి.

నిత్యం చ సమచిత్తత్వమ్ అంటే అను నిత్యమూ అన్నిటి పట్ల, అందరి పట్ల సమభావం కలిగి ఉండాలి. ఎవరి మీదా ద్వేషభావము ఉండకూడదు. ఇది ధ్యానము, దైవ చింతన వలననే సాధ్యం అవుతుంది. ఇష్టము, అనిష్టము, సుఖము దు:ఖము, లాభము నష్టము వస్తూ పోతుంటాయి కాబట్టి కంగారు పడకూడదు. సమంగా చూడాలి అనే భావన అలవరచుకోవాలి.
(మనం సాధారణంగా ఇష్టము, అయిష్టము అంటుంటాము. కాని అనిష్టమే సరి అయిన పదం. కాని మనం అనిష్టము అనే పదాన్ని దరిద్రము అనే దానికి బదులుగా వాడుతుంటాము.)

## 11. మయి చానన్య యోగేన భక్తిరవ్యభిచారిణీ।
## వివిక్తదేశ సేవిత్వమరతిర్జనసంసది॥

భక్తిరవ్యభిచారిణి .....పరమాత్మ ఎడల అనన్య భక్తి కలిగి ఉండాలి. అంటే నిష్కామ భక్తి. ఒకే భగవంతుని స్వరూపం మీద భక్తి. ఏకాగ్రభక్తి, అచంచలమైన భక్తి. దీనినే అనన్య భక్తి అంటారు. ఈ అనన్య భక్తిని ఇంకొంచెం ఘాటుగా చెప్పారు. భక్తి అనేది అవ్యభిచారిణిగా ఉండాలి. ఈ పదం మనకు కొంచెం అభ్యంతరకరంగా అనిపించవచ్చు ఎందుకంటే వ్యభిచారిణి అనే పదం మనం కేవలం ఒకే మగాడితో అంటే కట్టుకున్న భర్తతో కాకుండా స్వేచ్ఛగా తిరిగే స్త్రీలకు మాత్రమే వాడుతుంటాము. తనది కాని దాని మీద వ్యామోహం ఉంటే అది వ్యభిచారమే అవుతుంది. కేవలం ఒక స్వరూపం కల పరమాత్మ మీదనే భక్తి ఉంటే దానిని అవ్యభిచారిణి భక్తి అంటారు. దానినే ఏకాంత భక్తి అనన్య భక్తి అని కూడా అంటారు. ఒకరోజు ఒక దేవుడిని, మరొక రోజు మరొక దేవుడిని పూజించడం కాదు. అవసరం వచ్చినపుడు దేవుడిని తలుచుకోవడం, మొక్కులు మొక్కడం భక్తి కాదు. ఆ కోరిక తీరిన తరువాత, ఆపదలు పోయిన తరువాత, వేల్పులమొక్కులు వెయ్యేళ్లు అని వల్లిస్తూ దేవుడిని మరిచిపోవడం, భక్తి అనిపించుకోదు. నిరంతరం పరమాత్మ యందు మనసును నిలపడమే, లగ్నం చేయడమే అనన్య, అవ్యభిచారిణీ భక్తి అంటారు. ఈ అనన్యభక్తి వివేకము, వైరాగ్యము వలననే వస్తుంది కానీ అప్పుడప్పుడు ఆర్భాటంగా పూజలు వ్రతాలు చేస్తే రాదు.

వివిక్తదేశ సేవిత్వం అంటే సాధ్యమైనంత వరకు ఏకాంతంగా ఉండటానికి ప్రయత్నించాలి. ఈ రోజుల్లో అది సాధ్యం కాదు కాబట్టి పది మందిలో ఉన్నా మానసికంగా ఒంటరిగా ఉన్నట్టు భావించాలి. అనవసర విషయాలలో తలదూర్చకుండా, అనవసరమైన సంభాషణలు చేయకుండా ఉండాలి. ఒంటరిగా ఎందుకు ఉండమన్నారంటే, ఒంటరిగా ఉన్నప్పుడు, ఇతరులు పక్కన లేనపుడు మనం ఎవరో మనకు తెలుస్తుంది. ఆత్మావలోకనం చేసుకుంటాము. ప్రవృత్తి మార్గం నుండి నివృత్తి మార్గంలోకి మళ్లుతాము. వివిక్తదేశ సేవిత్వమ్ అంటే ధ్యానము సాధన

జనం మధ్య కాకుండా ఏకాంతంలో చేయాలి అని కూడా అర్థం చేసుకోవచ్చు. జనం మధ్యలో చేస్తే ఏకాగ్రత ఉండదు. అందుకే దేవుడి గృహం ప్రత్యేకంగా ఉండాలి. అందులో ఎటువంటి అంతరాయం ఉండకూడదు.

జనసంసది అరతి: అంటే ఎక్కువగా జన సమ్మర్దము కలిగిన ప్రదేశముల యందు ఉండకూడదు. సాధ్యమైనంత వరకు అటువంటి ప్రదేశములను వదిలిపెట్టాలి. ఒక వేళ వారి మధ్య ఉన్నా వారిలో కలవకుండా ఏకాంతంగా ఉంటూ వారి సంభాషణలు వింటూ ఉండండి. వారి మాదిరి ఆవేశకావేషాలకు లోనుకాకండి. వారి మాటలను బట్టి, వారందరి మనస్తత్వాలు మీకు అర్థం అవుతాయి. అంతే కానీ మీరూ వారితో చేరితో అందరిలో ఒకటైపోతారు. ఇది సాధకుడికి మంచిది కాదు. దీనికి విరుగుడు ఒకటి ఉంది. అదే సత్సంగము. మంచి వారితో స్నేహము, వారి సాంగత్యము. దీని వలన మనలో ఉన్నజ్ఞానం ఇంకా ఇంకా పెరుగుతుంది.

## 12. అధ్యాత్మజ్ఞాననిత్యత్వం తత్త్వజ్ఞానార్థ దర్శనమ్।
## ఏతజ్ఞానమితి ప్రోక్తమజ్ఞానం యదతోఽన్యథా॥

అధ్యాత్మ జ్ఞాన నిత్యత్వమ్ అంటే నిత్యము దేవుని గురించి తలచుకోవాలి. ఏపని చేస్తున్నా దేవుని గురించిన స్మృతి కలిగి ఉండాటి. తత్త్వజ్ఞానార్థ దర్శనమ్ ఈ తత్వజ్ఞానము చెబితే అర్థం కాదు అనుభవం ద్వారానే తెలుసుకోవాలి అని పరమాత్మ చెప్పి మరొక మాట కూడా అన్నాడు. పైన చెప్పినవి అన్నీ జ్ఞానము అంటే అందరూ తెలుసుకోతగ్గ విషయాలు. ఈ విషయాలన్నీ జ్ఞానము అని పిలువబడతాయి. ఇవి కాకుండా వీటికి వ్యతిరేక విషయములు అన్నీ అజ్ఞానము అవివేకము అని పిలువబడతాయి అని అన్నాడు.

మనం అందరం తత్వము, దానికి సంబంధించిన జ్ఞానము సంపాదించడానికి ప్రయత్నం చేస్తాము. గీత చదువుతాము, శాస్త్రములు చదువుతాము. జ్ఞానం సంపాదిస్తాము. దాని వలన ఏం లాభం వస్తుంది ఈ తత్వజ్ఞానము వలన మనం ఎంత ఉన్నతికి ఎదగ గలిగాము. ఏమి సాధించాము. సాధనలో ఎంత ముందుకుపోయాము అని నిరంతరం మనలను మనం చెక్ చేసుకోవాలి. దానినే తత్త్వ జ్ఞాన దర్శనం అంటే తత్వజ్ఞానమును దర్శించాలి.

ఏదో తీరిక ఉన్నప్పుడు భగవద్గీతను విందాము. మనకు కుదిరినపుడు ధ్యానం చేద్దాము అనే వాళ్లే ఎక్కువ. వారికి నిర్దిష్టమైన గమ్యం ఉండదు. ఏదో యాంత్రికంగా చేస్తూ ఉంటారు. సాధారణంగా ఎవడు ఎందుకు ఏమి చేస్తుంటాడో వాడికే తెలియదు. గీతా ప్రవచనాలకు, సత్సంగాలకు వెళుతుంటాడు. ఏదో మంచి జరుగుతుందని ఆశిస్తాడు. గమ్యం గురించి ఆలోచించడు.

ఎందుకు ఆలోచించరు అంటే ఆ గమ్యం చేరిన తరువాత వారికి కలిగే ఆత్మానందము గురించి ప్రశాంతత గురించి అలౌకికమైన సుఖం గురించి వారికి తెలియదు. అందుకని వారు ఆ గమ్యంగురించి ఆలోచించరు. ఆ ప్రకారంగా గమ్యంలేకుండా చేసే పనుల వలన ప్రయోజనము లేదు. ఆత్మదర్శనము అనే గమ్యాన్ని చేరడానికి చేసే సాధన తగిన ఫలితాన్ని ఇస్తుంది.

కాబట్టి ఆత్మదర్శనం కోసం నిరంతరం పరితపించాలి. ఏదో ఒకరోజు చేసి పది రోజులు మానెయ్యకూడదు. అనునిత్యం చేయాలి. ప్రతి రోజూ చేయాలి. సత్సంగము, శాస్త్రఅధ్యయనము, వేదాంతవిషయాల శ్రవణము, ధ్యానసాధన ఇవి నిరంతరము చేస్తూ ఉండాలి.

ఇప్పుడు కృష్ణపరమాత్మ ఈ జ్ఞానబోధను ముగిస్తూ అర్జునా! ఇప్పటి వరకు నేను చెప్పిన ఇరవై లక్షణములు అన్నీ జ్ఞానము అని అంటారు. ఈ ఇరవై లక్షణములు తప్ప మిగిలినవి అన్నీ అజ్ఞానము అని చెప్పబడతాయి. అని అన్నాడు పరమాత్మ. జ్ఞానం అంటే ఏమిటి అన్న అర్జునుడి ప్రశ్నకు జవాబుగా ఈ 20 లక్షణాలను చెప్పాడు పరమాత్మ. ఈ 20లక్షణాలు అంటే ఏమిటో ఒకసారి మనం సింహావలోకనం చేసుకుందాము.

1.తన్నుతానుపొగడుకొనకపోవడం

2.డంబము, దర్పము లేకుండా ఉండటం.

3.ఇతరులను మానసికంగా కానీ, శారీరకంగా కానీ హింసించకపోవడం, జీవహింస చేయకపోవడం.

4.ఓర్పుకలిగి ఉండుట

5.ఋజుప్రవర్తన కలిగి ఉండుట

6.గురువులనుసేవించుట

7.శారీరక, మానసిక శుద్ధి కలిగి ఉండుట

8.సన్మార్గంలోస్థిరంగా ఉండుట

9.మనస్సును నిగ్రహించుట.

10.ఇంద్రియములు ఆకర్షించేవిషయముల యందు విరక్తి కలిగి ఉండుట

11.అహంకారము లేకుండుట.

12.జనన, మరణ, వార్ధక్య, రోగముల గురించి దు:ఖము లేకుండుట. వాటి గురించి మాటి మాటికీ తలచుకుంటూ దు:ఖము చెందకుండుట.

13. భార్య,సంతానము,ఇల్లు,మొదలగు వాటియందు అపరిమితమైన ఆసక్తి లేకుండుట.

14.భార్య,సంతానము,ఇల్లు,ఆస్తులు ఇవే లోకంగా ఉండకూడదు.

15.ఇష్టము, అనిష్టము(అయిష్టము) వీటి యందుసమబుద్ధి కలిగి ఉండటం

16.పరమాత్మ యందు అనన్య,ఏకాంత భక్తి కలిగి ఉండటం.

17.సాధ్యమైనంత వరకు ఏకాంతముగా ఉండటం.

18.నిరంతరం మనసు పరమాత్మయందు నిలిపి ఉంచడం

19.ఎల్లప్పుడూ అధ్యాత్మజ్ఞానము కొరకు సాధన చేయడం, పరితపించడం.

20. ఈ అధ్యాత్మజ్ఞానము యొక్క గమ్యము తెలుసుకొని, దాని కొరకు నిరంతర సాధన చేయడం. గమ్యం చేరుకోవడం.

ఈ ఇరవైలక్షణాల గురించి తెలుసుకోవడమేజ్ఞానము. ఇవి తప్పమిగిలినవి అజ్ఞానము అని పరమాత్మ ఈ ఐదు శ్లోకాలలో బోధించాడు.

## 13. జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యజ్ఞాత్వా2మృతమశ్నుతే।
## అనాదిమత్పరం బ్రహ్మ న సత్తన్నాసదుచ్యతే॥

ఏది తెలియదగినదో, దేనిని తెలుసుకొని అమృతత్వాన్ని అంటే మోక్షమును పొందుతున్నాడో, దాని గురించి అంటే ఆ జ్ఞేయము గురించి నేను చెబుతున్నాను. అది తెలుసు కోకుండా బ్రహ్మజ్ఞానము గురించి తెలియదు. అంటే బ్రహ్మజ్ఞానము ఉందని గానీ, లేదని గానీ ఇదమిత్థంగా చెప్పలేము. కాబట్టి దీనిని తెలుసుకోవడం అవసరము.

అర్జునుడు మొదటి శ్లోకంలో జ్ఞానము అంటే ఏమిటి జ్ఞేయము అంటే ఏమిటి అని అడిగాడు. జ్ఞానము దాని లక్షణముల గురించి పైన చెప్పిన ఐదు శ్లోకాలలో వివరించాడు పరమాత్మ. ఇప్పుడు జ్ఞేయము గురించి చెబుతున్నాడు. జ్ఞేయము అంటే బాగా తెలుసుకోతగ్గది. అంటే ఏది తెలుసుకుంటే ఇంక తెలుసుకోవలసింది ఏమీ ఉండదో అదే జ్ఞేయము. అదే ఆత్మజ్ఞానము, బ్రహ్మజ్ఞానము, బ్రహ్మస్వరూపము, మోక్షానికి దారి. ఈ బ్రహ్మస్వరూపానికి ఆది అంతము లేదు. దీనికి ఏదైనా రూపం ఉందా అంటే అది కంటికి కనపడదు. మనసుకు, ఊహకు అందదు. కనపడనిది, వినపడనిది, ఉహించడానికి వీలు లేనిది, అసలు లేదా అంటే సర్వత్రా నిండి ఉన్నది.. ఇటువంటి లక్షణములు కలిగిన ఈ బ్రహ్మపదార్థము గురించి తెలుసుకోడానికి నిరంతరము ప్రయత్నం చేయాలి. దానికి మార్గము సత్సంగము. దుర్జన సాంగత్యం వదలడం. సగుణాకారంగా పరమాత్మను పూజించడం. తరువాత నిర్గుణ పరబ్రహ్మను ధ్యానించడం. దానిని చేరుకోవడం. దానిని మించినది మరొకటి లేదు. దానిని తెలుసుకుంటే అమృత స్థితిని పొందుతాడు.

దాని గురించి పరమాత్మ చెబుతున్నాడు. పరబ్రహ్మమే జ్ఞేయము అని అంటారు. ఆ పరబ్రహ్మ గురించి తెలుసుకున్నవాడు మోక్షమును పొందుతాడు. ఈ పరం బ్రహ్మ ఎలా ఉంటాడు అంటే సత్యం (ఎల్లప్పుడూ ఉండేవాడు) జ్ఞానం (అన్నీ తెలిసిన వాడు) అనంతం ( అంతము లేని వాడు) అనాది (ఆది అంటే మొదలు కూడా లేనివాడు. ఎక్కడ పుట్టిందో ఎక్కడ అంతం అవుతుందో

తెలియదు) ఇది సత్ పదార్థము కాదు, అలా అని అసత్ పదార్థము కాదు. అంటే ఇది దేనికీ కారణము కాదు. కార్యము కాదు. కార్య కారణములకు అతీతమైనది. ఇదీ పరబ్రహ్మస్వరూపము. ఈ పరబ్రహ్మస్వరూపమును తెలుసుకుంటే ఇంక తెలుసుకోవలసినది అంటే ఏమీ మిగలదు. అంటే పరబ్రహ్మను గురించి తెలుసుకుంటే అన్నీ తెలుసుకున్నట్టే. అని చెప్పి కృష్ణ పరమాత్మ దీని గురించి తరువాతి శ్లోకాలలో ఇంకా వివరంగా తెలియజేస్తున్నాడు.

### 14. సర్వత: పాణిపాదం తత్సర్వతో2క్షి శిరోముఖమ్।
### సర్వత: శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి॥

అది (ఆ పరబ్రహ్మము) అన్నిచోట్లా తన చేతులతో, కాళ్లతో, తలలతో, ముఖములతో, శరీరముతో, చెవులతో, ఈ లోకమంతా ఆవృతము అంటే వ్యాపించి ఉన్నది.

ఈ శ్లోకంలో ఆ పరబ్రహ్మతత్వమును వివరిస్తున్నాడు. దీనినే మనకు విభూతి యోగంలో వివరించాడు, విశ్వరూపసందర్శములో చూపించాడు. "ఇందుకలడు అందులేడు అని సందేహము వలదు చక్రి సర్వోపగతుండు" అని పోతన గారు తేటతెలుగులో చెప్పారు. అదే విషయాన్ని ఇక్కడ క్లుప్తంగా మరలా చెబుతున్నాడు.

ఆయనకు ఈ లోకమంతా కళ్లు, చేతులు, కాళ్లు, చెవులు, పొట్ట. ఈ అనంత విశ్వం అంతటా నిండి ఉన్నాడు. అంటే మనం ఏం చేసినా సదా సాక్షీభూతంగా చూస్తుంటాడు. మనం చేసే పనులు ఎవరూ చూడటం లేదు అని అనుకుంటే అది పొరపాటు. ఆ పరమాత్మ అందరినీ సదా గమనిస్తుంటాడు. మనం పుణ్య కార్యం చేసినా, పాప కార్యం చేసినా అది ఆ పరమాత్మ కంటపడుతూనే ఉంటుంది. ఎందుకంటే పరమాత్మ సర్వవ్యాపి. "ఇందుగలడందులేడని సందేహము వలదు. చక్రి సర్వోపగతుండు" అందుకే "సర్వమావృత్య తిష్ఠతి" అంటే అంతా ఆవరించి కూర్చుని ఉన్నాడు. ఆయన లేని చోటు లేదు. అంటే పరబ్రహ్మ అంటే ఎక్కడో వైకుంఠంలోనూ, కైలాసంలోనో, కాశీలోనో కాదు....అక్కడా ఉన్నాడు.... అంతటా ఉన్నాడు. ఆయనను తెలుసుకోవడమే మన కర్తవ్యము.

ఈ ప్రకృతిలో మనము అనేక మంది మనుషులను, జంతువులను, పక్షులను, వస్తువులను చూస్తుంటాము. ఆ మనుషులకు, జంతువులకు, పక్షులకు, వృక్షములకు, వస్తువులకు రకరకాల పేర్లు, ఆకారాలు, లక్షణాలు ఉన్నాయని మనకు తెలుసు. కాని అవన్నీ కేవలం పంచభూతములతో కూడినవే. ఆకారాలు మాత్రం వేరువేరుగా ఉంటాయి. ఆ ఆకారాలకు కూడా వివిధములైన లక్షణాలు, వికారాలు ఉంటాయి. పాముకు కోపం, కుక్కకు విశ్వాసం. పులికి క్రూరత్వం, సింహానికి రాజసం. మనిషికి అన్ని లక్షణాలు ఉంటాయి. కొన్ని చెట్లు పొట్టిగాఉంటాయి. మరి కొన్ని

పొడుగ్గా ఉంటాయి. మరికొన్ని మైళ్లకొద్దీ విస్తరించి ఉంటాయి. ఈ ప్రకారంగా వివిధ రూపాలతో, వివిధ పేర్లతో, లక్షణాలతో ఉంటాయి. కాని వీటిలో ఉన్న పదార్ధము అంతా పాంచభౌతికమే. అంటే పదార్ధము, గాలి, నీరు, వేడి, ఆకాశము(అంటే శరీరములో ఉన్న ఖాళీ స్పేస్) వీటితో కూడినదే ఈ ఆకారము. బంగారు గొలుసు అంటే గొలుసు అనేది రూపమే కానీ అందులో ఉండేది బంగారము. అది కరిగిస్తే బంగారం అవుతుంది. గొలుసు అనే రూపం ఉండదు.

అదే ప్రకారంగా ఈ లోకంలో ఉన్న వస్తువులు అన్నీ వేరువేరుగా, వేరు వేరు పేర్లతో, ఆకారాలతో కనిపించినా వాటి మూలకం ఒకటే. విశ్వచైతన్యము. దానిలో మార్పులేదు. వస్తువులు కనిపిస్తాయి కానీ మూలకాలు కనిపించవు. మనం అందరం మనకు కనిపించేవాటిని, వినిపించేవాటిని, తాకగలిగే వాటిని మాత్రమే అనుభవించ గలము. అంటే కనిపించని, వినిపించని, తాకలేని వాటిని అనుభవించలేము. ఇది ప్రాధమిక సూత్రము.

మనకు కనిపించే వన్నీ నశించి పోతాయి లేక మార్పుచెందుతాయి. ఎందుకంటే ఇవన్నీ పదార్ధాలు. లక్షణాలు కలిగి ఉన్నాయి. కాని నశించనిది మార్పులేనిది, ఆకారము లేనిది ఏది అంటే దానినే సత్ పదార్ధము అంటారు. దానినే పరబ్రహ్మ అని కూడా అంటారు. ఇది వేదాంతశాస్త్రము మనకు చెబుతుంది. ఈ రోజుల్లో ప్రతి వస్తువుకు, వాటి మూలకాలు వెదుక్కుంటూ పోతే మన శాస్త్రజ్ఞులు పరమాణువు దగ్గర ఆగి పోయారు. పరమాణువు ఎవరూ చూడలేరు. దాని కన్నా సూక్ష్మమైన దానిని ఇంకా కనుక్కుంటూనేఉన్నారు. ఎందుకంటే అదిఅవ్యక్తము, అగోచరము, కంటితో చూడలేము. చేతితో తాకలేము. అంటే మనకు ఉన్న పది ఇంద్రియములతో దీనిని ఇలా ఉంటుంది అని భావించలేము. కేవలము దాని ఫలితములను మాత్రం చూడగలము. దీనినే వేదాంతములో పరబ్రహ్మము అని అన్నారు.

కాని ఈ లోకంలో, ప్రపంచంలో మనకు అన్నీ ఏవేవో రూపాలతో, పేర్లతో, లక్షణాలతో కనపడుతున్నాయి. ఎందుకంటే పుట్టిన ప్రతి మనిషీ కర్మచేయక తప్పదు. ఆ కర్మలు చేయాలంటే వివిధరూపాలలో వస్తువులు, ప్రాణులు కావాలి. కట్టుకోడానికి వస్త్రము కావాలి. వస్త్రము పత్తితో తయారయింది అని పత్తిని కట్టుకోలేము కదా. కాబట్టి ఒక రూపం, దానికి ఒక పేరు కావాలి. అందుకే నిరాకారుడు, అవ్యక్తము, పరబ్రహ్మస్వరూపము అయిన పరమాత్మ ఈలోకంలో అన్ని పనులు నిర్వర్తించడానికి వివిధరూపములతో, వివిధ నామములతో ప్రకటితం అవుతున్నాడు. దానినే విశ్వరూపము అంటే విశ్వమే తన రూపముగా కలవాడు అని అంటున్నాము.

మనం మానవులం కాబట్టి మనకు శరీరము, దానిలో అవయవాలు ఉన్నాయి కాబట్టి ఆ అవయవాలు అంటే చేతులు, కాళ్లు, పొట్ట, ముఖము, తల మొదలగునవి అన్నీ ఆ విశ్వరూపమే. ఆ బ్రహ్మమే. సర్వత: అంటే అంతటా బ్రహ్మము తప్ప మరొకటి లేదు. ఇది ఎక్కడ ఉంది

అంటే “సర్వమావృత్య తిష్ఠతి” అంటే ఈ సమస్తలోకములను ఆవరించి ఉన్నది. ఇది లేని చోటు లేదు  అని ఈ శ్లోకం మనకు బోధిస్తుంది.

కాబట్టి మనం ఏ పని చేసినా, దానిని పరమాత్మ పరంగా చేయాలి కానీ, కనిపించే శరీరాల పరంగా, వాటి నామరూప పరంగా చేయకూడదు. మనంచూసే ప్రతి వస్తువులో, ప్రతి పనిలో పరమాత్మ ఉన్నాడు అని గ్రహించాలి.  అందుకే రామదాసు “అంతా రామమయం, ఈ జగమంతారామమయం” అని ఎలుగెత్తి చాటాడు. “బ్రహ్మమొక్కటే, పరబ్రహ్మమొక్కటే” అని ఆలాపించాడు అన్నమయ్య. కాబట్టి మనం అంతా ఆ పరబ్రహ్మస్వరూపాలే అయినప్పటికీ, ఆ దేవుడిలోనే ఉన్నప్పటికీ,  మనం అనునిత్యం దేవుడిని వెతుకుతూనే ఉన్నాము. అక్కడ ఉన్నాడు, ఇక్కడ ఉన్నాడు అని పరుగులుపెడుతున్నాము. కాని మనలోనూ, ఇతరులలోనూ  ఆత్మస్వరూపంగా వెలుగుతున్న పరమాత్మను దర్శించలేకపోతున్నాము. కొంత మందితో స్నేహము మరి కొందరితో ద్వేషము పెంచుకుంటున్నాము.  అదే అజ్ఞానము.

మనం ఈ లోకాన్ని, ప్రపంచాన్ని, అందులో ఉన్న వస్తువులను, ప్రాణులను అంతా పరబ్రహ్మస్వరూపమేఅనే దృష్టితో చూడాలి కానీ, వాటివాటి పేర్లతో, రూపాలతో చూడకూడదు అని శాస్త్రం చెబుతూ ఉంది. ఇలా చేయాలంటే మనలో ఉన్న అజ్ఞానం అనే అంధకారం  అంతరించాలి. జ్ఞానజ్యోతి వెలగాలి. దీని కొరకు మనం అందరం ప్రయత్నం చేయాలి.

### 15. సర్వేన్ద్రియగుణాభాసం సర్వేన్ద్రియవివర్జితమ్।
### అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృచ॥

పై శ్లోకములో చెప్పబడిన పరబ్రహ్మము, మనలో ఉన్న అన్ని ఇంద్రియములను, వాటి గుణములను ప్రకాశింపచేస్తుంది. కాని ఆ పరబ్రహ్మకు ఏ ఇంద్రియములు లేవు. ఆ పరబ్రహ్మకు దేని మీదా ఆసక్తి లేదు. కాని అన్నిటినీ చేస్తూ ఉంటుంది, భరిస్తూ ఉంటుంది. ఆ పరబ్రహ్మకు ఏ గుణములు లేవు కానీ అన్ని గుణములను అనుభవిస్తూ ఉంటుంది.

.

మనకు ఇంద్రియాలు ఉన్నాయి. వాటిగి గుణాలు ఉన్నాయి. అంటే కళ్లకు చూచే శక్తి, గుణము. చెవులకు వినేశక్తి, గుణము. కాని,  మనలో ఉన్న అన్ని ఇంద్రియములకు చేతనా శక్తిని, ప్రకాశ శక్తిని కలిగించేది ఆ పరబ్రహ్మయే. ఒక వస్తువు ఉంది అని తెలియజేసేది కన్ను, వినబడే వస్తువు   ఉంది అని తెలియజేసేది చెవి, వాసన వస్తున్న వస్తువు ఉంది అని తెలియజేసేది ముక్కు. తాను తాకిన వస్తువు ఉంది అని తెలియజేసేది చర్మము. నాలుకతో రుచిచూసి ఇది ఫలానా అని చెప్పేది నోరు. కాని ఇవి వేటి పని అవి చేస్తాయి కానీఒక దాని పని మరొకటిచేయవు. కాని వీటి

అన్నిటిలో అంతర్లీనంగా "ఇది ఉంది" అనే జ్ఞానమును కలుగజేసేది దాని వెనుక ఉన్న ప్రకాశము. అదే పరబ్రహ్మము. ఎలాగంటే ఒక పవర్‌ఫుల్ టార్చిని వెలిగిస్తే దాని కాంతి చాలా దూరంవరకు పడుతుంది. దానికి చెయ్యి అడ్డం పెడితే చెయ్యి కనిపిస్తుంది. బుక్ అడ్డం వస్తే బుక్‌కనిపిస్తుంది. ఏది అడ్డం లేకపోతే ఏదీ కనిపించదు. అని చెప్పి కాంతి లేదా అంటే ఉంది. అది ప్రసరిస్తూ ఉంటుంది. తనకు అడ్డం వచ్చిన వాటిని ప్రకాశింపచేస్తుంటుంది. అలాగే పరబ్రహ్మకూడా అన్ని జీవులలో వాటి అవయవాలద్వారా ప్రకాశిస్తూఉంటాడు. ఇంద్రియములద్వారా ప్రకటితమౌతూ ఉంటాడు. అవయవాలు లేకపోయినా ప్రకాశిస్తూఉంటాడు. ప్రాణి మరణిస్తే ఇంద్రియములు ఉంటాయి కానీ ఏ పనీ చేయలేవు. కాని వాటిని ప్రకాశింపచేసే పరబ్రహ్మ మాత్రం ఉంటాడు. అదే నిత్యము సత్యము.
(టివి పనిచేయదు. అంటే కరెంటు లేదని కాదు. టివి చెడిపోయింది అని అర్థం. అలాగే ఇంద్రియములు పని చేయనంత మాత్రాన పరబ్రహ్మ లేడని కాదు. అంతటా ఉన్నాడు. దేవుడు లేడు. ఉంటే చూపించు అనడం అజ్ఞానం.)

అన్ని ఇంద్రియములకు తన ప్రకాశాన్ని ఇస్తూ ఆ వస్తువులు ఉన్నాయి అని జ్ఞానమును కలుగజేస్తున్న ఆ పరబ్రహ్మ కేవలం ఇంద్రియముల ద్వారా ప్రకటితమౌతుంటాడు కానీ ఏ ఇంద్రియములలో తాను ఉండడు. ఆ ఇంద్రియములు చేసే పనులకు అంటుకోడు. ఇంతకు ముందు చెప్పినట్టు టార్చివెలుగులో బుక్ కనపడుతుంది. బుక్ అడ్డం తీస్తే బుక్ కనపడదు. బీమ్ ఉంటుంది కానీ కనపడదు. ఇప్పుడు కుర్చి అడ్డం వస్తే కుర్చి కనపడుతుంది. ఈ ప్రకారంగా అడ్డం వచ్చిన వాటిని ప్రకాశింపచేస్తూ, అడ్డం లేనివాటి గురించి పట్టించుకోకుండా, నిరంతరం ప్రకాశిస్తూ ఉండేది పరబ్రహ్మము. అందుకే అసక్తం అంటే ఏదీ పట్టనట్టు ఉంటాడు.

తరువాత సర్వభృ చ్చైవ అంటే ఈ లోకములు అన్నిటినీ తానే భరిస్తుంటాడు. అన్నిటికీ తానే ఆధారము. కాని దేని గురించి పట్టించుకోడు. అందుకే విష్ణువును "విశ్వాధారం, గగన సదృశం" అంటారు. అంటే పరబ్రహ్మ గగనముతో అంటే ఆకాశముతో అంటేస్పేస్ మాదిరి ఉంటాడు. ఈ స్పేస్‌లో అన్నీ ఉన్నాయి. అంటే ఈ లోకములను అన్నిటినీ ధరించి ఉన్నాడు, భరిస్తున్నాడు అని అర్థం చేసుకోవచ్చు.

ఈ నాటి కాస్మాలజీ కూడా ఈ అనంత విశ్వం అంటే నక్షత్రాలు, గ్రహాలు పాలపుంతలు అన్నీ విపరీతమైన వేగంతో అనంత విశ్వంలోకి దూసుకుపోతున్నాయి. దానినే విస్తరిస్తున్న విశ్వం (ఎక్స్పాండింగ్ యూనివర్స్) అని అన్నారు. ఆ విశ్వానికి ఆధారమే పరమాత్మ. అందుకే విశ్వాధారం, గగన సదృశం అని అన్నారు. ఈ విశ్వంలో అన్నీ ఉన్నా దేనికీ అంటుకోకుండా అసక్తంగా ఉంటాడు.

ఈ ప్రకృతి అంతటా మూడు గుణములు అంటేసత్వగుణము, రజో గుణము, తమోగుణములతో నిండి ఉన్నాయి. మన శరీరంలో కూడా ఈ మూడు గుణాలు ఉన్నాయి. ఈ మూడు గుణాలకు అనుగుణంగానే ఇంద్రియములు పని చేస్తున్నాయి. ఆ ఇంద్రియములు చేసే పనులకు పరమాత్మ శక్తిని, ప్రకాశాన్ని ఇస్తున్నాడు. అన్ని గుణాల్లో తాను ఉన్నా , తాను మాత్రం నిర్గుణంగా అంటే ఏ గుణములు అంటకుండా ఉంటాడు. అంటే ఈ సత్వరజస్తమోగుణములు తనలో నుండి వచ్చినా, వాటిలో తాను లేడు. అంటే మూడుగుణములు ఆయనలో నుండి వచ్చినవే కాని ఆ గుణములలో తాను లేడు. జీవరాసులు అన్నిటిలో ఈ మూడు గుణములు ఉన్నాయి. ఆగుణములను బట్టి అవి ప్రవర్తిస్తుంటాయి. వాటి కర్మఫలములను అనుభవిస్తుంటాయి. కాని ఆ గుణముల ప్రవర్తనకు, వాటి వలన కలిగే ఫలములకు పరమాత్మ బాధ్యుడు కాడు. ఎలాగంటే, లైటు వెలుగులో మంచి పని చేసినా, చెడ్డపని చేసినా, లైటుకు ఎలాంటి బాధ్యత లేదు. కేవలం సాక్షిగా చూస్తుంటుంది.

## 16. బహిరన్తశ్చ భూతానామచరం చరమేవ చ।
## సూక్ష్మత్వాత్తదవిజ్ఞేయం దూరస్థం చాన్తికే చ తత్॥

ఈ పరబ్రహ్మము జీవరాసులలో లోపల ఆత్మ స్వరూపంగా వెలుగుతుంటాడు. బయట పరమాత్మ స్వరూపంగా ప్రకాశిస్తుంటాడు. కదిలే వాటిలో, కదలని వాటిలో పరమాణు రూపంలో, సూక్ష్మరూపంలో ఉంటాడు. (అన్ని వస్తువులు పరమాణువులతో కూడినవి అని నేటి శాస్త్రజ్ఞులు నిరూపించారు). అతి సూక్ష్మంగా ఉండటం వలన మామూలు కళ్లతో చూడటానికి వీలులేదు. ఆ పరమాత్మ స్వరూపము తెలియని వారికి దూరంగా ఉంటాడు. తెలిసిన వారికి దగ్గరగా ఉంటాడు. ఆయనకుఈ ప్రాకృతమైన కాలము, దూరము వర్తించవు. ఎందుకంటే అంతటా నిండి ఉన్నాడు ..."ఇందుకలడందులేడని సందేహము వలదు" నమ్మిన వాడికి, భక్తి ఉన్నవాడికి అంతటాఉన్నాడు. నమ్మని వాడికి భక్తి లేని వాడికి ఎక్కడా లేడు. ఈ పరబ్రహ్మ అంతటా ఉన్నాడు... ప్రతి జీవిలో ఆత్మస్వరూపుడుగా ఉన్నాడు. దీనిని తెలుసుకోవడమే జ్ఞానము.

దీనినే మనం నారాయణ సూక్తంలో చదువుకుంటాము. "అంతర్బహిశ్చ తత్ సర్వం వ్యాప్తనారాయణ స్థిత:" లోపలా బయటా, సర్వే సర్వత్రా, నారాయణుడే స్థిరంగా వ్యాప్తిచెంది ఉన్నాడు. ఇక్కడ నారాయణుడు అంటే పరమాత్మ అని అర్థం. లోపలా బయటా అంతటా ఉండే వాడికి శేషపాన్పు, దాని మీద పవళించడం, ఆయనకు ఏకాంత సేవలు ఎలా ఉంటాయి అని ఆలోచిస్తే, ప్రాధమిక దశలో మొదటి మెట్టు మీద ఉన్నప్పుడు ఇవన్నీ కావాలి. దేవుడు అనే రూపం కావాలి. దాని మీద దృష్టి కేంద్రీకృతం అవ్వాలి. క్రమక్రమంగా పైకి ఎదగాలి. నిర్గుణోపాసనవైపుకు

మళ్లాలి. కాని దురదృష్టవశాత్తు మానవులంతా అక్కడే అంటే మొదటి మెట్టు మీదనే ఉండిపోతున్నారు. పైకి ఎదగడం లేదు.

అచరం చరమేవచ అంటే కదులుతుంది కాని కదలదు. సూర్యకాంతిలో మనము, వస్తువులు, అన్నీ కదులుతున్నాయి. కాని సూర్యకాంతి కదలడం లేదు. కాని కదులుతున్నట్టు భ్రమకలిగిస్తూ ఉంది. అలాగే ఆత్మచైతన్యం కదలడం లేదు. మనలను కదిలిస్తూ ఉంది. మనచేత అన్నీ పనులు చేయిస్తూ ఉంది. నేనే ఈ శరీరము,ఈ శరీరమే నేను అని అనుకునే మనం మాత్రం అన్నీ కదులుతున్నట్టు భ్రమపడుతున్నాము.

ఇంకా సులభంగా అర్థం కావాలంటే మరొక ఉదాహరణచెప్పుకోవచ్చు. సూర్యుడు కదలడం లేదు. భూమి తన చుట్టు తాను తిరుగుతూ సూర్యుడి చుట్టు తిరుగుతూ ఉంది. అంటే కదిలేది భూమి, కదలనిది సూర్యుడు. కాని మనం సూర్యోదయం, మధ్యాహ్నం, సూర్యాస్తమయం అంటే సూర్యుడు కదులుతున్నట్టు భ్రమచెందుతున్నాము. ఆయనకు ఒక రథం ఉందనీ ఆ రథం మీద ప్రయాణం చేస్తుంటాడనీ నమ్ముతుంటాము. ఇదంతా మనకు వేదాంతం అర్థం కావడానికి చెప్పే కథలు కానీ నిజానికి సూర్యుడు స్థిరంగా ఉన్నాడు.

దూరస్థం చ అన్తికేచ తత్ అంటే ఈ చైతన్యం దూరంగానూ దగ్గరగానూ ఉంది. అంటే ఈ చైతన్యం అనంత విశ్వం అంతా వ్యాపించి ఉంది. మనలోనూ ఉంది. తెలిసిన వాడికి తనలోనే ఆత్మస్వరూపంగా పరమాత్మ ఉన్నాడు. తెలియనివాడికి దూరంగా ఎక్కడో ఉన్నాడు అని అన్నిచోట్లా వెదుకుతుంటాడు. దీనిని ఏమీ తెలియని అమాయకులైన పల్లెటూరి వాళ్లు చెప్పే సామెత సరిగా వర్తిస్తుంది. “చంకలో మేకపిల్లను పెట్టుకొని, ఆ మేకపిల్లకోసం ఊరంతా వెదికాడట.” మనలోనే ఉన్న పరమాత్మ కోసం ఎక్కడెక్కడో వెదకడం ఇలాంటిదే!

సూక్ష్మత్వాత్ అవిజ్ఞేయం అంటే ఈ పరమాత్మ తత్వము, విశ్వచైతన్యం అత్యంత సూక్ష్మం అవడం వలన ఎవరి చేతా తెలియబడటం లేదు. ఇది తెలుసుకోడానికి మన కళ్లు చాలవు. మూడవ కన్ను కావాలి. అదే జ్ఞాన నేత్రము. శివుడి మూడో కన్ను ఇదే. జ్ఞాన నేత్రం. జ్ఞానము అనే ఈ నేత్రంతోనే పరమాత్మ స్వరూపాన్ని తెలుసుకోగలము.

## 17.అవిభక్తం చ భూతేషు విభక్తమివ చ స్థితమ్।
## భూతభర్తృ చ తజ్జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ॥

నిజానికి పరమాత్మ అన్ని ప్రాణులలో విడివిడిగా లేడు. పరమాత్మ స్వరూపాన్ని విభజించి చూడలేము. కాని అన్ని ప్రాణులలో విడి విడిగా చైతన్య స్వరూపంగా ఉన్నాడు కాబట్టి విభజించి చూడాల్సివస్తుంది. ఈ ప్రకారంగా పరమాత్మను ఆత్మస్వరూపుడుగా వేరు వేరుగా విభజించి చూడటం కేవలం మన అవిద్య వలననే కాని వేరు కాదు. ఒకే సూర్యుడు సముద్రములోనూ, నదిలోనూ, చెరువులోనూ, మన ఇంట్లో ఉన్న కుండలోనూ ఒకే రూపంతో ప్రతిఫలిస్తున్నాడు. సూర్యుడు ఒకడే కాని అన్ని చోట్లా ప్రతిఫలిస్తుంటాడు. అన్నిటినీ ప్రకాశింపజేస్తుంటాడు.

ఇంకొక ఉదాహరణ చెప్పాలంటే మన ఇంట్లో గాసు ఉంది. అది సిలిండరులో ఉంది. కాని అదే గాసు గొట్టం ద్వారా స్టవ్ బర్నర్‌లోకి పోయి వందలకొద్ది రంధ్రాలద్వారా విడి విడిగా వేడి వెలుగు రూపంలో బయటకు వస్తూ ఉంది. కాని గాసు ఒకటే. అలాగే పరమాత్మ కూడా ఒకటే అయినప్పటికీ ఆత్మస్వరూపంగా అన్నిజీవరాసులలోనూ స్థిరంగా ఉంటున్నాడు. ప్రకాశిస్తున్నాడు. మనకు శక్తిని ఇస్తున్నాడు. అంతేకాదు, ఆ పరబ్రహ్మమే సకల జీవరాసుల సృష్టికి, స్థితికి, లయకు కారకుడు. ఈ మూడు పనులు బ్రహ్మ విష్ణు మహేశ్వరుల రూపంలో చేస్తుంటాడు. కాని వారు వేరు కాదు. మన అజ్ఞానం వలన వారిని వేరు వేరుగా చూస్తున్నాము. అంతా ఆపరబ్రహ్మమే అని తెలుసుకోవడం జ్ఞానం, బ్రహ్మ విష్ణు మహేశ్వరులు, వేరు అనడం అజ్ఞానం.

ప్రాణులు, జీవరాసులే కాకుండా ఆకాశంలో వెలిగే సూర్య చంద్రులు, నక్షత్రములు, చీకటి వెలుగులు, కూడా ఆ పరబ్రహ్మ స్వరూపమే. అంటే మనం మన అజ్ఞానంతో కేవలం ఈ భూమికి మాత్రమే పరిమితం అవుతామేమో అని అనంత విశ్వం అంతా పరబ్రహ్మ స్వరూపము అంటున్నాడు పరమాత్మ.

## 18. జ్యోతిషామపి తజ్జ్యోతిస్తమస: పరముచ్యతే।
## జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్॥

ఈ అనంత విశ్వములో ప్రకాశించే అన్ని వస్తువులకు ప్రకాశాన్ని ఇచ్చేది, తమస్సు కంటే వేరైనది, కేవలం జ్ఞాన స్వరూపము అయినదీ, ప్రతి ఒక్కరూ తెలియతగినదీ, జ్ఞానమునకు గమ్యము అయినదీ అంటే జ్ఞానముచే పొందతగినదీ, సకల ప్రాణుల హృదయములలో ఆత్మస్వరూపంగా వెలుగుతున్నది అని ఈ పరబ్రహ్మ చెప్పబడుతూఉంది.

ఈ అనంత విశ్వంలో నక్షత్రాలు ప్రకాశిస్తున్నాయి. సూర్యుడు కూడా ఒక నక్షత్రమే అని మనకు తెలుసు. ఈ నక్షత్రాలు అన్నీ స్వయంప్రకాశాలు. తమకు తాముగా ప్రకాశిస్తున్నాయి. ఈ నక్షత్రాలు వెలుగును ప్రతిఫలిస్తూ ఆ నక్షత్రాల చుట్టు ఉన్న గ్రహాలు, ఉపగ్రహాలు ప్రకాశిస్తున్నాయి. వాటి వెలుగులో మనం ఈ ప్రపంచాన్ని చూస్తున్నాము. ఇవే కాకుండా అగ్ని, విద్యుత్తు కూడా ప్రకాశిస్తుంది. వీటి అన్నిటికీ ఆ ప్రకాశాన్ని, వెలిగే తత్వాన్ని ఇచ్చినది ఎవరు అంటే సమాధానం ఆ పరబ్రహ్మమే. అందుకే "జ్యోతిషామపి తత్ జ్యోతి:" అంటే ఈఅనంత విశ్వంలో, వెలుగునిచ్చే అన్ని వస్తువులకు వెలుగును ఇచ్చేది, జ్యోతి రూపంలో ఉండేది, అని అర్థం.

వెలుగు ఉన్నచోట చీకటి ఉండదు. కటిక చీకటిలో చిన్న దీపం పెడితే చీకటి పటాపంచలయిపోతుంది. అంటే చీకటి కంటే వేరైనది. చీకటిని పారదోలేది వెలుగు ఒక్కటే. జ్ఞాన జ్యోతి వెలిగితే, అజ్ఞానము అనే అంధకారము దానంతట అదేపోతుంది. ఆ భావాన్నే ఇక్కడ ప్రకటించాడు పరమాత్మ. ఈ పరబ్రహ్మ తత్వమును తెలుసుకోవడమే జ్ఞానము అని అంటారు. ఈ జ్ఞానము అందరూ తెలుసుకోదగినది. పొంద తగినది. దీనినే జ్ఞేయము అని కూడా అంటారు. జ్ఞేయము అంటే తెలియతగినది. జ్ఞానం ఇష్టం ఉంటే తెలుసుకోవచ్చు లేకపోతే లేదు. కాని ప్రతి వ్యక్తితెలియతగినది అంటే జ్ఞేయవస్తువు ఈ పరబ్రహ్మము.

జ్ఞానం కలిగి ఉండి, తెలుసుకోదగినది తెలుసుకుంటే లాభం ఏమిటి అంటే ఆ పరబ్రహ్మను పొందడమే. అదే జ్ఞానము యొక్క గమ్యము. ఏదితెలుసుకుంటే ఇంక తెలుసుకోవలసింది ఉండదో అదే పరబ్రహ్మతత్వము. అది తెలుసుకుంటే ముక్తి దానంతట అదే లభిస్తుంది ఎందుకంటే ఈ జ్ఞానమునకు, జ్ఞేయమునకు గమ్యం అదే కాబట్టి. మరి ఈ పరబ్రహ్మతత్వము ఎక్కడ ఉంది అంటే "హృది సర్వస్య విష్ఠితమ్"... ఎక్కడో లేదు అందరి హృదయాలలో నిలిచి ఉంది అని చెప్పాడు పరమాత్మ. పరబ్రహ్మ ఎక్కడో ఉన్నాడు అని వెదకనవసరం లేదు. ప్రతి వారి హృదయములలో ఉన్నాడు కానీ ఆ బ్రహ్మను గురించిన జ్ఞానమే మనకు లేదు. మనం ఈ శరీరమే నేను అనుకుంటున్నాము. అహంకారంతో బతుకుతున్నాము. అదే అజ్ఞానము.

ఇప్పుడు పైన చెప్పబడిన 4 శ్లోకాలలో ఉన్న కొన్ని పదాలకు వివరంగా అర్థం తెలుసుకుందాము.

అసక్తమ్ అంటే ఏ మాత్రమూ ఆసక్తి లేనిది. అంటే ఆత్మస్వరూపంగా క్షేత్రంలో ఉన్నా, ఆ క్షేత్రం చేసే పనుల మీద ఎటువంటి ఆసక్తి చూపనిది.

బహిరన్తశ్చభూతానామ్= భగవంతుడు ఎక్కడ ఉన్నాడు అంటే లోపలా అంటే సమస్తప్రాణి కోటి హృదయాలలోనూ, బయటా అంటే ఈ అనంత విశ్వం అంతటా ఉన్నాడు. అంటే జీవుల లోపల

ఆత్మగా, బయట పరమాత్మగా ఉన్నాడు.

ఆచరం చర మేవచ= అంటే పరమాత్మకు కదలిక ఉన్నది కదలిక లేదు. ఈ ద్వంద్వాలను ఎలా సమన్వయం చేయాలి అంటే డబ్బానిండా బియ్యం పోసి గట్టిగా మూత పెడితే లోపల ఏమీ కదలదు. కదిలినట్టు అనిపించదు. అదే కొంచెం వెలితిగాఉంటే లోపల బియ్యం కదులుతుంది. ఈ విశ్వం అంతటా నిండి ఉన్న పరమాత్మకు కదలిక లేదు. కాని ప్రకృతి రూపంలో, ప్రాణుల రూపంలో కదిలినట్టు అనిపిస్తున్నాడు. అంతటా నిండి ఉన్న దానికి కదలిక ఏముంటుంది.

సూక్ష్మత్వాత్తదవిజ్ఞేయమ్

పరబ్రహ్మమూ అతి సూక్ష్మము అంటే పరమాణుస్వరూపము. మామూలు కంటికి కనపడదు. అలాగే ఈ శరీరం కూడా స్థూల శరీరము, సూక్ష్మశరీరము అని రెండుగా ఉంటాయి. జాగ్రదావస్థలో స్థూలశరీరము, స్వప్నావస్థలో సూక్ష్మశరీరము ప్రవర్తిస్తుంటాయి. ఈ సూక్ష్మశరీరము నుండి వాసనలను పూర్తిగా నాశనం చేస్తే అదే పరమాత్మ అవుతుంది. దీనిని అనుభవించవలసినదే కాని కనపడదు. ఈ రెండింటిలోనూ పరబ్రహ్మ స్వరూపము నిక్షిప్తమై ఉంది.

దూరస్థంచ అన్తికేనచ అంటే దూరంగా ఉన్నాడు అతి దగ్గరగా ఉన్నాడు. దూరము దగ్గర అనేవి అక్కడకు ఇక్కడకు మధ్య దూరమును సూచిస్తుంది. అప్పుడు ఇప్పుడు అనేది కాలము సూచిస్తుంది. పరబ్రహ్మకు కాలము దూరము లేవు. అంతటా ఉన్న వాడికి, అన్ని కాలములలో ఉన్న వాడికి, కాలము దూరము ప్రసక్తి లేదు. విశ్వం అంతటా నిండి అతి దూరంగా ఉన్న పరమాత్మ అందరి హృదయాలలో అతి దగ్గరగా ఉన్నాడు.

అవిభక్తం చ భూతేషు విభక్తమివ చ స్థితమ్

పరమాత్మ ఒక్కడే. నిత్యుడు. ఎల్లప్పుడూ ఉండేవాడు. ఆయనను విభజించడానికి వీలులేదు. కాని ఆత్మస్వరూపుడుగా అన్ని జీవరాసులలో ఉన్నాడు. పరమాత్మ స్వరూపమూ పూర్ణమే జీవరాసులలో ఉన్న ఆత్మ పూర్ణమే. ఎందుకంటే పూర్ణములో నుండి మరొక పూర్ణము వచ్చింది.మరలా ఈ పూర్ణము ఆ పూర్ణములో కలిసిపోతుంది. కాబట్టి అంతా పూర్ణమే అవిభాజ్యమే. సూర్యుడు ఒక్కడే అయినా వివిధ జలములలో విడివిడిగా ప్రకాశించినట్టు, పరమాత్మ కూడా వివిధ శరీరములలో ఆత్మస్వరూపుడుగా గోచరిస్తాడు. కాబట్టి అవిభక్తుడుగానూ విభక్తుడుగానూ మనకు గోచరిస్తాడు పరమాత్మ.

భూతభర్తృచ గ్రసిష్ణు పరమాత్మ ఒక్కడే. సృష్టించే టప్పుడు బ్రహ్మ, పోషించేటప్పుడు విష్ణువు, లయం చేసేటప్పుడు శివుడు. కాని మనం అజ్ఞానంతో వారిని వేరు వేరుగా అనుకుంటూఉంటాము.

తమసః పర ముచ్చతే అంటే ఈ ప్రకృతి త్రిగుణాత్మకము. ఈ మూడు గుణములలో ఉన్న హెచ్చుతగ్గుల వలన మనకు అంతా మాయగా కనిపిస్తుంది. దానినే తమస్సు అంటారు. ఈ మాయకు అవతల ఉండే వాడు అనగా పరమైన వాడు పరమాత్మ. పరమాత్మకు జీవాత్మకు మధ్య మూడుగుణములతో కూడిన మాయ అనే తెర అడ్డుగా ఉంది. ఈ మాయను దాటి మాయకు అవతల ఉన్న పరమాత్మను దర్శించాలి. అదే సాధకుడి లక్ష్యం.

జ్ఞానం జ్ఞేయం జ్ఞాన గమ్యం

జ్ఞానము తెలుసుకోవలసినవి. జ్ఞేయము అంటే తెలుసుకోతగినది. మనం ఎన్ని తెలుసుకున్నా అసలు తెలుసుకోదగినది ఏదో దానిని తెలుసుకోలేకపోతున్నాము. కాని జ్ఞానమునకు అంటే తెలుసుకోవలసిన వాటి గమ్యం జ్ఞేయమే అంటే తెలుసుకోదగినది తెలుసుకోవడమే.

హృది సర్వస్య విష్టితమ్ అంటే ఈ పరబ్రహ్మ తత్వము ఎక్కడో లేదు అందరి హృదయములలో అదిష్ఠానంగా ఉన్నాడు. కాని మనమే తెలుసుకోలేకపోతున్నాము. పిపీలికాది బ్రహ్మ పర్యంతము అన్ని జీవరాసులలో ఆత్మస్వరూపుడుగా ఉన్నాడు. ఆ పరబ్రహ్మస్వరూపాన్ని దర్శించడానికి అందరికీ హక్కు ఉంది. ఆ హక్కును ఎవరూ వినియోగించుకోవడంలేదు. ఎందుకంటే బయట ప్రపంచంలో ఉన్న వాటికి ఇచ్చిన ప్రాధాన్యత, వాటి మీదున్న మమకారము, లోపల ఉన్న ఆత్మస్వరూపుడి మీద లేకపోవడమే.

## 19. ఇతి క్షేత్రం తథా జ్ఞానం జ్ఞేయం చోక్తం సమాసతః।
## మద్భక్త ఏతద్విజ్ఞాయ మద్భావాయోపపద్యతే॥

అర్జునా! నీకు ఇప్పటి దాకా క్షేత్రము, క్షేత్రజ్ఞుడు, జ్ఞానము, జ్ఞేయము వీటి గురించి క్లుప్తంగా చెప్పాను. నా భక్తులు వీటి గురించి తెలుసుకొని, నా దగ్గరకు చేరుకోడానికి అర్హుడు అవుతున్నాడు.

జ్ఞానం ఎంత సంపాదించినా, తెలుసుకోవలసింది తెలుసుకోలేకపోతే ఆ జ్ఞానం వృధా. తెలుసుకోవలసింది తెలుసుకోవాలంటే దానికి భక్తి ముఖ్యం. అందుకే మద్భక్త అని వాడాడు. అంటే నా భక్తుడు మాత్రమే నా గురించి తెలుసుకోగలడు అని భావము. ముందు భక్తి అనే పుష్పము పూస్తుంది. అందులో నుండి జ్ఞానము అనే ఫలము పండుతుంది. కాబట్టి పరమాత్మను చేరుకోవాలంటే గురువు మీద, పరమాత్మ మీద, అచంచలమైన భక్తి, విశ్వాసము, కలిగి ఉండాలి. జపము, తపస్సు, కీర్తన, వీటితో భగవంతుని ఆరాధించాలి. అప్పుడు భక్తునికి మంచి బుద్ధి పుడుతుంది. మనస్సు

చెడు మార్గం నుండి మంచి మార్గంలోకి మళ్లుతుంది. అప్పుడు గురువు దగ్గర నుండి, శాస్త్రములు పురాణముల నుండి, జ్ఞానము సంపాదిస్తాడు. తరువాత తెలుసుకోవలసిన పరమాత్మ గురించి తెలుసుకుంటాడు. అదే ముక్తికి మార్గము.

దీని కంతా మూలము భక్తి, శ్రద్ధ, నిరంతర అభ్యాసము. కొంత మంది మేము భక్తులము. మాకు ఈ జ్ఞానంతో సంబంధము లేదు. మా భక్తే మమ్ములను ఉద్ధరిస్తుంది అని అంటుంటారు. అది సరికాదు అని పరమాత్మ స్పష్టంగా చెబుతున్నాడు. భక్తి అనేది మొదటి మెట్టు. జ్ఞానము సంపాదించడం రెండవ మెట్టు. తెలుసుకోవలసినది తెలుసుకోవడం అంటే పరబ్రహ్మతత్వం గురించి తెలుసుకోవడం మూడవ మెట్టు. అంతే కానీ మొదటి మెట్టు మీదనే ఉండి మాకు అంతా తెలుసు అనడం అజ్ఞానం. కాబట్టి మొదట భగవంతుని మీద భక్తి, శ్రద్ధ అలవరచుకోవాలి. తరువాత భగవంతుని గురించి జ్ఞానం సంపాదించాలి. తరువాత భగవంతుని గురించి తెలుసుకోవాలి. ఈ మెట్లు అన్నీ ఒకటి వెంబడి ఒకటి ఎక్కిన నా భక్తులు "మద్భావాయ ఉపపద్యతే" చివరకు నా భావమును అంటే నన్నే పొందుతారు అంటే జనన మరణ చక్రము నుండి విముక్తి పొందుతారు అనిపరమాత్మ మనకు హామీ ఇస్తున్నాడు.

ఇప్పటి వరకు అర్జునుడు అడిగిన ఆరు అంశములలో నాలుగు అంశముల గురించి పరమాత్మ క్లుప్తంగా వివరించాడు. ఆఖరు రెండు అంశములు అంటే ప్రకృతి పురుషుడు గురించి వివరిస్తున్నాడు.

### 20. ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి।
### వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతి సంభవాన్॥

అర్జునా! ప్రకృతి, పురుషుడు అనే ఈ రెండూ ఎప్పటి నుండో ఉన్నాయి. వీటికి అంతము లేదు. అంతే కాదు, ఈ వికారములు, గుణములు, ప్రకృతి నుండి సంభవిస్తున్నాయి.

ప్రకృతి పురుషుడు ఇప్పటి వాళ్లు కాదు. అనాది నుండి ఉన్నారు. ఈ రెండు పరమాత్మ నుండి ఉద్భవించినవే. పార్వతి ప్రకృతి అయితే శివుడు పురుషుడు. అదే అర్ధనారీశ్వర తత్వము. లక్ష్మి ప్రకృతి అయితే విష్ణువు పురుషుడు. అందుకే అమ్మవారు అయ్యవారి వక్షస్థలమును అలంకరించింది. సరస్వతి ప్రకృతి అయితే బ్రహ్మ పురుషుడు అందుకే సరస్వతి బ్రహ్మ నాలుకమీదనే ఉంది. లౌక్యంగా చూస్తే, భర్త పురుషుడు అయితే భార్య ప్రకృతి. అందుకే ఆమె అర్ధాంగి, సహధర్మచారిణి అంటారు. ఈ ప్రకారంగా ప్రకృతి పురుషులు ఒకటే. వేరు కాదు. వారు అనాది నుండి ఉన్నారు. మనస్సు, బుద్ధి, అహంకారము అనే వికారాలు, సత్వ, రజస్తమోగుణాలు ప్రకృతికి అంటే ప్రకృతిలో

సహజంగా ఏర్పడ్డాయి. ప్రకృతిలో నుండి పుట్టాయి. ప్రకృతిలోనే ఉన్నాయి. వీటి కలయిక నుండి వచ్చినవే మాయ, సంసారము, బంధనములు. ఇవి కూడా అనాది నుండి ఉన్నాయి. ఈనాటివి కావు.

ఈ వికారముల వలన ప్రకృతి నిరంతరం మార్పుకు లోనవుతూ ఉంటుంది. కాని పురుషునకు ఈ వికారములు, గుణములు లేవు. అంటవు. నిర్గుణుడు, నిరాకారుడు. పురుషుడు చైతన్య శక్తి. ప్రకృతి అచేతనము. అచేతనమైన ప్రకృతిలో ఈ వికారాలు, గుణములు అనాది నుండి ఉన్నాయి. మనం నిద్రపోయాము. కల వచ్చింది. ఎప్పటి దాకా మెలుకువగా ఉన్నాము, ఎప్పుడు నిద్రపట్టింది, ఎప్పుడు కల వచ్చింది. అనే విషయాలు మనం ఎలా చెప్పలేమో అలాగే ఈ వికారాలు, గుణాలు క్షేత్రములో ఎప్పుడు, ఎలా పుట్టాయో చెప్పలేము. ఈ వికారాలు, గుణాలు కేవలము ప్రకృతికి సంబంధించినవి. పురుషునికి కాదు. పురుషుడు అంటే ఆత్మ. శుద్ధమైనది.

ప్రకృతిలో ఉన్న కామము, క్రోధము, మోహము మొదలగు వికారాలకు, రజస్ తమోగుణాలకు లోనైతే ఆత్మ జీవాత్మ అవుతుంది. జీవాత్మ తన చుట్టు సంసారము అనే సాలెగూడు తనకు తానే నిర్మించుకుంటాడు. ఆ వికారాలు, గుణాలు అంతం అయితే కానీ జీవాత్మ, తన నిజస్వరూపమును పొంది పరమాత్మలో లీనం కాలేడు. అదే ముక్తి. దీనికి ఒకటే మార్గము. నేను వేరు ఈ శరీరము వేరు అని అనుకోవడం. ఏ వికారములకు స్పందించకపోవడం. గుణములకు అతీతంగా ఉండటం. స్థిరచిత్తము కలిగి ఉండటం.

### 21. కార్యకరణ కర్తృత్వే హేతు: ప్రకృతిరుచ్యతే।
### పురుషస్సుఖదు:ఖానాం భోక్తృత్వే హేతురుచ్యతే॥

కార్యమును, కరణమును కలుగచేయడానికి ఈ ప్రకృతే కారణము. . కార్యముల వలన కలిగే సుఖదు:ఖములను అనుభవించడానికి పురుషుడే కారణము అని చెప్పబడుతున్నాడు.

ఇదివరకు శ్లోకంలో ప్రకృతి పురుషుడు అని చెప్పుకున్నాము. ఈ పురుషుడు ప్రకృతిలో లీనం అయి ఎన్నో కార్యములు చేస్తుంటాడు. ఆ కార్యములు చేయడానికి ఏవేవో కారణాలు ఉంటాయి. ఇది సహజం. ఈ కార్యములకు, వాటి కారణములకు మూలము ఈ ప్రకృతి. ఈ ప్రకృతిలో ఉన్న వస్తువుల కోసం ఏవేవో పనులు చేస్తుంటాడు పురుషుడు. ఆ పనులు చేయడం వల్ల సుఖము దు:ఖము కలుగుతుంటాయి. పురుషుడు అనే జీవాత్మ ఆ సుఖ దు:ఖములను అనుభవిస్తున్నట్టు భ్రమచెందుతుంటాడు. నిజానికి సుఖము, దు:ఖము అనేవి లేవు. అవి కేవలం మానసిక స్పందనలు

మాత్రమే. కార్యమునకు, కారణమునకు మూలము ప్రకృతి, వాటి వలన కలిగే సుఖదు:ఖములకు మూలము పురుషుడు. నిజానికి పురుషునికి ఎటువంటి సుఖదు:ఖములు, వికారములు లేవు. కాని ప్రకృతిలో ఉండి కార్యములు చేయడం వలన, ఆ కార్యముల వలనకలిగేసుఖదు:ఖములను జడమైన ప్రకృతి అనుభవించలేదు కాబట్టి, ఆ కార్యములు చేస్తున్న పురుషుడు సుఖదు:ఖములు అనుభవిస్తున్నట్టు కనిపిస్తున్నాడు కానీ పురుషుడికి ఏ వికారములు అంటవు.

22. పురుష: ప్రకృతిస్థో హి భుఙ్క్తే ప్రకృతిజాన్ గుణాన్।
కారణం గుణసఙ్గోఽస్య సదసద్యోనిజన్మసు॥

ప్రకృతిలో సంచరిస్తున్న పురుషుడు ప్రకృతిలోని గుణములను, వాటి వలన కలిగేసుఖదు:ఖాలను అనుభవిస్తున్నాడు. పురుషుడు ఆయాగుణములతో చేరి కర్మలు చేయడం వలననే మంచి,చెడు జన్మలు వస్తున్నాయి.

ఈ పురుషుడు అను నిత్యము ప్రకృతి గుణములలో, వికారములలో మునిగి తేలుతుంటాడు. జీవుడిగా మారి వాటిని అనుభవిస్తుంటాడు. వాటి వలన వచ్చే సుఖదు:ఖములను పొందుతూ ఉంటాడు. గుణములతో కూడిన కర్మల వలన వాసనలు ఏర్పడతాయి. ఆ వాసనల ప్రభావంతోనే మంచి చెడ్డ జన్మలు జీవుడు పొందుతుంటాడు. ఈ జనన మరణ చక్రంలో తిరుగుతుంటాడు. కాబట్టి పురుషుడు ఈ ప్రకృతిలోని వికారములతో గుణములతో సంయోగం చెందడం వలననే అతని బంధనములకు కారణం అవుతున్నాయి. అతనికి ఉత్తమ, నీచ జన్మలు కలుగుతున్నాయి.

జీవాత్మ అసలు రూపము పరిశుద్ధమైన ఆత్మ స్వరూపము. కాని ఆ ఆత్మ ప్రకృతిలోని రజస్తమోగుణములతో, కామ,క్రోధ,మోహ మొదలగు వికారములతో మలినమై జీవాత్మగా మారి, నేను అనే అహంకారాన్ని సంతరించుకుంటుంది. " నేను ఇదంతా చేస్తున్నాను, ఇదంతా నా వలననే జరుగుతూ ఉంది" అని అనుకుంటూ కర్మలు చేస్తూ ఉంది. వాటి వలన కలిగే సుఖదు:ఖములను అనుభవిస్తూ ఉంది. వాసనలు మూటగట్టుకుంటూ ఉంది. అవే మరుజన్మకు హేతువు అవుతున్నాయి.

ఈ పరిస్థితులలో మానవుడు తన విజ్ఞత ఉపయోగించి ఈ సంసారము నుండి బయట పడాలి. జనన మరణ చక్రానికి పునాది రజస్తమోగుణములతో కలియడం, కామ, క్రోధ,లోభములు అనే వికారములు పొందడం. వీటిని అరికట్టగలిగితే ముక్తి దానంతట అదే వస్తుంది.

ముందుగా ప్రాపంచికవిషయముల యందు, విషయ వాంఛల యందు ఆసక్తి తగ్గించుకోవాలి. ముందు దానికి ప్రయత్నం చేయాలి.

పురుషుడు ఈ శరీరంలో చేరక ముందు నిర్గుణుడు. నిరాకారుడు. శరీరంలో చేరాక ఒక ఆకారం పేరు వచ్చింది. దానితో నేను అనే అహంకారం వచ్చింది. తరువాత మూడు గుణాలు వచ్చి చేరాయి. ఆ మూడు గుణాలకు అనుగుణంగా మనసు బుద్ధి ఎన్నోసంకల్పాలు చేస్తూ, బయట ప్రపంచంలో తిరుగుతూ శరీరంతో అనేకములైన కర్మలు చేస్తూ ఉంది. ఆ కర్మఫలములను అనుభవిస్తూ ఉంది. ఈ స్థితిలో శరీరంలో ఉన్న ఆత్మస్వరూపమైన చైతన్యాన్ని జీవాత్మ అని అంటారు.

నిజానికి ఆత్మకు ఎటువంటి వికారములు, గుణములు లేవు. అనుభవాలు లేవు.కాని సత్వ,రజస్తమోగుణములు కలయిక వలన మనసు బుద్ధి అహంకారాలతో చేరి, శరీరంతో పనులు చేయడం వలన సుఖదు:ఖాలు వస్తున్నాయి అని అనుకుంటూ ఉంటాడు. మానసికంగా శారీరకంగా అనుభవిస్తుంటాడు. కాబట్టి ఈ సుఖదు:ఖాలు రాగద్వేషాలు ఎలా వచ్చాయి అంటే స్వచ్ఛమైన ఆత్మస్వరూపము మూడుగుణములతో కలవడం వలననే వచ్చాయి. మరి దానికి ఫలితం ఏమిటి అంటే పునర్జన్మ. జన్మ తరువాత జన్మ. మాటి మాటికీ పుట్టడం చావడం. మరలా పుట్టడం. పోనీ ఈ జన్మలు మంచివా అంటే ఎప్పుడూమంచి జన్మలు రావు కదా! ఈగ, దోమ, పాము, కాకి, ఎప్పుడూ భయంతో వణికిపోయే జంతువుల జన్మ, దెబ్బలుతినే జన్మ, రోగాలతో కుంగి కృశించిపోయే జన్మ, ఇలాంటి జన్మలుకూడా వస్తుంటాయి. మరి దీనికి మార్గం లేదా అంటే ఉంది. చాలా సింపుల్. మనలో ఉన్న ఈ శరీరమే నేను అనే అజ్ఞానాన్ని, అహంకారాన్ని పోగొట్టుకోవడమే. మూడు గుణాలలో కలవకుండా, మమేకం కాకుండా, తాదాత్మ్యం చెందకుండా ఉండటమే. ప్రతిదానికీ అతిగా స్పందించకకుండా ఉండటమే. ఈసంసార చక్రంలో ఉన్నా అంటీ ముట్టనట్టు తామరాకు మీది నీటి బొట్టులా ఉండటమే.

## 23. ఉపద్రష్టానుమన్తా చ భర్తా భోక్తా మహేశ్వర:।
## పరమాత్మేతి చాప్యుక్తో దేహే2స్మిన్ పురుష: పర:॥

పరమాత్మ పురుషుడుగా ఈ దేహంలో ఉన్నప్పటికీ, ఆ పురుషుడు వేరు, దేహము వేరు అనీ, మనో బుద్ధి అహంకారాలతో ఈ దేహం చేసే పనులను కేవలం సాక్షిగా చూస్తున్నాడనీ, మనసుతో, శరీరంతో ఏపని చేసినా పట్టించుకోడనీ, భరిస్తుంటాడనీ, ఆ కర్మల ఫలములను అనుభవిస్తుంటాడనీ, చెప్పబడింది.

అన్నిటి కన్నా ముందు మనం గ్రహించాల్సిన విషయం పరమాత్మ ఆత్మస్వరూపంగా ఈ శరీరంలో ఉన్నాడు. అంటే ఈ శరీరం వేరు. శరీరంలో ఉండే పురుషుడు వేరు. పురుషుడు పరమాత్మ యొక్క అంశ. పరమాత్మ యొక్క అంశ ఆత్మస్వరూపంగా అన్ని శరీరములలో ఉంటున్నాడు. మనం చేసేపనులు అన్నీ సాక్షీభూతంగా చూస్తున్నాడు. ఎలా అంటే "మనకు ఏమీ తెలియదు" అన్న విషయం మనకు తెలుసు. అలాగే "నాకు అన్నీ తెలుసు" అన్న విషయం కూడా కొంతమందికి తెలుసు. అలాగే "నాకు నొప్పిగాఉంది, నాకు కష్టంగా ఉంది, నాకు హాయిగా ఉంది, నాకు సుఖంగా ఉంది, నాకు తృప్తిగా ఉంది" ఈ విషయాలన్నీ కూడా నాకు తెలుసు. ఇంతకూ ఈ "నేను" అన్నది ఎవరు? ఇలా అన్నీ తెలుసుకుంటున్నది ఎవరు? అదే మనలో ఉన్న ఆత్మస్వరూపము. ఈ "నేను" గురించి తెలుసుకోవడమే జ్ఞానము. అందరిలో ఉన్న ఈ ఆత్మస్వరూపము మనం చేసే పనులు, అనుభవాలు అన్నిటినీ సాక్షిగా చూస్తూ, వాటిని అన్నిటినీ ఆమోదిస్తుంది. ఏదీ కాదనదు.

ఇదివరకు మనం చెప్పుకున్నాము సూర్యుడి కాంతిలో మనం ఏం చేసినా అంటే మంచి పని చేసినా, చెడు పని చేసినా ఆ కాంతి కాదనదు. అన్నిటికీ సమానంగా ప్రకాశాన్ని ఇస్తుంది. అలాగేమనలో ఉన్న చైతన్యస్వరూపం అయిన ఆత్మకూడా మనం ఏ చేసినా ఆమోదిస్తుంది కానీ కాదు అని అనదు. ఈ ఆత్మస్వరూపము ఎవరో కాదు. ఆ మహేశ్వరుడే, మహాచైతన్యమే, పరమాత్మ స్వరూపమే అందరి శరీరాలలో ఆత్మస్వరూపంగా ఉన్నాడు అని చెప్పబడింది, అని కృష్ణుడు అర్జునునికి ఆత్మతత్వాన్ని గురించి బోధించాడు.

## 24. యం ఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణై: సహ।
## సర్వథా వర్తమానోఽపి న స భూయోఽభిజాయతే॥

ఎవరైతే ఈ ప్రకృతి గురించి పురుషుని గురించిన యదార్థమైన జ్ఞానమును పొందుతున్నాడో, అతడు ఈ ప్రకృతిలో ఏ విధంగా ప్రవర్తించినా, అతడికి జనన మరణములు లేవు.

పురుషుని గురించి ప్రకృతిని గురించి అంటే క్షేత్రము, క్షేత్రజ్ఞుని గురించి ఎవరు తెలుసుకుంటారో, ఆత్మ అంటే ఏమిటో, ఆ ఆత్మ జీవాత్మగా ఎలా మారిందో, అలాగే ప్రకృతిలో ఉన్న వికారముల గురించి గుణముల గురించి ఎవరు తెలుసుకుంటారో, వారు ఏ విధమైన జీవన విధానమును అనుసరించినా, ఈ జనన మరణ చక్రము నుండి విడివడతారు.

జనన మరణ చక్రము నుండి బయట పడి మోక్షము పొందడానికి మార్గం చెప్పాడు కృష్ణుడు. పురుషుడు అంటే ఎవరు? ప్రకృతి అంటే ఏమిటి? ప్రకృతి గుణములు ఏమిటి? ఆ గుణములతో కూడి పరిశుద్ధమైన ఆత్మ ఎలా జీవాత్మగా మారింది. ముందు వీటిని గురించి

విచారించాలి. వాటికి కారణములను వెదకాలి. ప్రకృతి సహజమైన రజస్తమోగుణములను, కామ,క్రోధ, లోభ,మోహములు అనే వికారములను వదిలిపెట్టాలి. ఆత్మస్వరూపమును తెలుసుకోవాలి. బంధనముల నుండి విడివడాలి. వాసనలను పోగొట్టుకోవాలి. అటువంటి వాడు ముక్తుడు అవుతాడు. అతడు బ్రహ్మచర్యము, గృహస్థ, వానప్రస్థ, సన్యాస ఆశ్రమములు వేటిలో ఉన్నా, అతడు ముక్తుడు అవుతాడు. అతడు ఒక భర్తగా, భార్యగా, తండ్రిగా, తల్లిగా, అన్నదమ్ములుగా, అక్క చెల్లెళ్లుగా, ఇంకా ఇతర బంధుత్వాలతో పిలువబడుతున్నా, ప్రపంచంలో తిరుగుతూ ప్రజాసేవ చేస్తున్నా, ఆధ్యాత్మికతలో మునిగి ఉన్నా, ఏ వర్ణాశ్రమధర్మం నిర్వర్తిస్తున్నా అతడుమోక్షమును పొందుతాడు.

ఎందుకంటే, ఆత్మ, అనాత్మ విచారము కలవాడు నిషిద్ధమైన పనులు ఏమీ చేయడు. నిష్కామంగా, కర్తృత్వభావన లేకుండా పనులు చేస్తాడు. అందుకే అతనికి ఆ కర్మ ఫలితములు అంటవు. కర్మఫలములు లేకపోతే వాసనలు అంటవు. వాసనలు లేకపోతే మరుజన్మలేదు. అంటే కేవలం బ్రహ్మచారులు, సన్యాసులే ముక్తి సంపాదిస్తారు అనడం సరి కాదు. గృహస్థులు కూడా పై మార్గములు అనుసరించి ముక్తిపొందవచ్చును.

ఈ శ్లోకంతో అర్జునుడు అడిగిన ఆరు ప్రశ్నలకు అంటే క్షేత్రము, క్షేత్రజ్ఞుడు, జ్ఞానము, జ్ఞేయము, ప్రకృతి, పురుషుడు ఈ ఆరింటికి, కృష్ణపరమాత్మ సమాధానాలు చెప్పినట్టు అయింది.

## 25. ధ్యానేనాత్మని పశ్యన్తి కేచిదాత్మానమాత్మనా।
## అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే॥

తనలోనే ఉన్న ఆత్మస్వరూపమును కొంత మంది పరిశుద్ధమైన మనసుతో ధ్యానముయోగము చేత చూడగలుగుతున్నారు. మరి కొందరు సాంఖ్యయోగమును, ఇంకా మరి కొందరు కర్మయోగము చేత చూడగలుగుతున్నారు.

పరమాత్మను దర్శించడానికి ఉన్న మార్గముల గురించి చెబుతున్నాడు కృష్ణుడు. కొందరు ధ్యానమార్గమును అవలంబిస్తారు. మరి కొందరు జ్ఞాన మార్గమును అవలంబిస్తారు. మరి కొందరు నిష్కామ కర్మతో కూడిన కర్మయోగమును అవలంబిస్తారు. మరి కొందరు భక్తియోగమును అవలంబిస్తారు. మానవులు వారి వారి గుణములను బట్టి, ప్రవృత్తులను బట్టి, సంస్కారములను బట్టి ఒక్కోమార్గమును అవలంబిస్తారు. ఏ మార్గము అవలంబించినా భక్తి,శ్రద్ధ, ఏకాగ్రత, చిత్తశుద్ధి ముఖ్యము. అవి ఉంటే ఏ మార్గము అవలంబించినా ఒకటే. అవి లేనిదే ఏ మార్గము అవలంబించినా ఏమీ ప్రయోజనము లేదు.

ఈ శ్లోకంలో ఆత్మని, ఆత్మానమ్, ఆత్మనా అని ఆత్మను మూడు విధాలుగా మూడు అర్థాలతో వాడారు వ్యాసులవారు. మొదటి ఆత్మనా అంటే తనలో తాను అని అర్థం. అంటే పరిశు ద్ధమైన మనస్సుతో అని కూడా అర్థము. ఆత్మకు మనసు అని కూడా అర్థం చెబుతారు. రెండవది...ఆత్మానమ్ అంటే ఆత్మను అంటే ఆత్మస్వరూపుడైన పరమాత్మను అనిఅర్థం. ఆ ఆత్మ ఎక్కడ ఉంది అంటే ఆత్మని.... అంటే తనలోనే, తన శరీరంలోనే పరమాత్మ ఆత్మస్వరూపుడుగా ఉన్న ఆత్మను పరిశుద్ధమైన మనసుతోనే చూడగలడు. ఇలా చూడటానికి శాస్త్రజ్ఞానం కావాలి. గురువుల అనుగ్రహంతో పరమాత్మ స్వరూపం ఏమిటో ముందు తెలుసుకోవాలి. ఈ ఆత్మజ్ఞానం రావడానికి ఐదు మార్గాలు ఉన్నాయి.

1. కర్మలు చేయడం. నిష్కామ కర్మలు, కర్తృత్వభావన లేకుండా కర్మలు చేయడం. దీనితో మనలో ఉన్న చెడ్డ వాసనలు తొలగి పోతాయి. కాని కర్మలు చేస్తుంటే మనసు అలజడి చెందుతుంది. దానికి రెండవ సాధన....

2. ఎదురుగా తన ఇష్టదైవము యొక్క మూర్తిని పెట్టుకొని ఉపాసించడం. పూజలు, వ్రతాలు చేయడం. దీని వలన మనసు పరమాత్మను పూజిస్తూ, చింతిస్తూ, ప్రశాంతత పొందుతుంది. దాని తరువాత మూడవ సాధన......

3. జ్ఞానం సంపాదించాలి. దానికి శాస్త్రములు చదవాలి. వినాలి, అర్థం చేసుకోవాలి. దీని వలన పరమాత్మను గురించిన జ్ఞానం కలుగుతుంది.

4. మననం. విన్న తరువాత, విన్న దాన్ని గురించి మననం చేయాలి. ఆలోచించాలి. అర్థం చేసుకోవాలి. దాని గురించి విచారించాలి. విన్న దాన్ని ఒంటపట్టించుకోవాలి. దాని వలన పరమాత్మ గురించి మనలో ఉన్న అజ్ఞానము, సంశయము తొలగి పోతుంది. పరమాత్మ గురించి మనలో ఉన్న అన్ని సందేహాలు పటాపంచలు అవుతాయి. ఆత్మ జ్ఞానం కలుగుతుంది.

5. ఇప్పుడు పరమాత్మను గురించి ధ్యానం చేయాలి. దానినే నిధిధ్యాసన అని అంటారు. ఆ ధ్యానంలో తనలో ఉన్న పరమాత్మను తాను దర్శిస్తాడు. అప్పుడు అతనిలో ఉన్న అన్నివిధములైన అడ్డంకులు, విపరీతభావనలు తొలగిపోతాయి. ఇతరత్రములైన దేని గురించీ ఆలోచించడు. తనలో తాను పరమానందాన్ని పరమ శాంతిని పొందుతాడు.

మరి ఈ మెట్లు అన్నీ ఒకటొకటిగా ఎక్కాలా అన్నీ ఒకే సారి ఎక్కవచ్చా, లేక ఒకటిదాటి మరొకటి ఎక్కవచ్చా అంటే అదివారి వారి పూర్వజన్మలలో వారు ఆర్జించిన పుణ్యఫలములను బట్టి ఆధారపడి ఉంటుంది. అందుకే రెండవ పాదంలో కృష్ణ పరమాత్మ ఈ విధంగా చెప్పారు. కొంత మంది కర్మయోగంతో మొదలుపెడతారు. మరి కొందరు, కిందటి జన్మలో కర్మయోగంలో పరిణతి చెంది ఉండటం వలన, జ్ఞానయోగంతో అంటే సాంఖ్యముతో మొదలు పెడతారు. మరి కొందరు

వీటిగురించి అందకు ముందు జన్మలలో పరిణతి చెంది ఉండటం వలన, నేరుగా ధ్యానయోగాన్ని అవలంబిస్తారు. మరి పూర్వజన్మలలో ఏమీ చేయని వాళ్లు ఏం చేస్తారో తరువాతి శ్లోకంలో వివరించారు.

26. అన్యే త్వేవ మజానన్తః శ్రుత్వాఽన్యేభ్య ఉపాసతే।
తేఽపి చాతి తరన్త్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః॥

పైన చెప్పిన వాళ్లు కాకుండా ఇంకా చాలా మంది ఉంటారు. వారికి ధ్యాన, జ్ఞాన, కర్మ మార్గములు తెలియవు. వారికి స్వతాహాగా జ్ఞానము ఉండదు. వారికి వేదాంత శ్రవణం మీద ఆసక్తి ఎక్కువగా ఉంటుంది. కేవలం ఇతరులు చెప్పినవి వింటూ ఉంటారు. వాటిని ఆచరిస్తుంటారు. పరమాత్మను ఏదో ఒక రూపంలో ఉపాసిస్తుంటారు. అటువంటి వారు కూడా ఆయా మార్గములను శ్రద్ధతో భక్తితో, ఏకాగ్రతతో అవలంబిస్తే, పరమాత్మను ఉపాసిస్తే, ముక్తిని పొందగలరు.

కాబట్టి మాకు ధ్యాన,జ్ఞాన,కర్మయోగముల గురించి తెలియదు, మాకు చదవడం రాదు, సంస్కృతము అసలే రాదు. వేదాలు శాస్త్రములు చదవలేము! ఎలాగ! అనే చింత అక్కర లేదు. ఎక్కడ వేదాంతము, ఉపనిషత్తులు, భగవద్గీత చెబుతుంటే అక్కడకు పోయి వినాలి. శ్రద్ధతో వినాలి. చెప్పేవాళ్లు కూడా, తమకు ఉన్న వేదాత పరిజ్ఞానాన్ని ఎవరికీ అర్థం కాని గ్రాంథిక భాషలో ఒలకపొయ్యకుండా, అందరికీ అర్థం అయ్యే భాషలో అంటే వినే వారి మాతృభాషలో, అదీ చిన్ని చిన్ని పదాలతో వివరించాలి. అంతే కాని తమకు అంతా వచ్చు కదా అని, తమ పాండిత్యం అంతా వినే వారి ముందు ఒలకబోస్తే, ఆ వినే వాడు, ఏదీ అర్థం కాక, మర్నాటి నుండి రావడం మానేస్తాడు. కాబట్టి అన్నీ తెలిసిన వాడు కూడా, వినే వారి స్థాయికి దిగి వచ్చి, వారికి అర్థం అయ్యేరీతిలో బోధించాలి.

ఉదాహరణకు......ఇంజనీరింగ్, మెడిసిన్ పుస్తకాలు మార్కెట్‌లో చాలా ఉంటాయి. అవి కొనుక్కొని చదివితే సరిపోతుంది కదా! కానీ విద్యార్థులు వేలకు వేలు ఫీజులు కట్టి కాలేజీలలో చేరుతున్నారు. కారణం, ప్రొఫెసర్లు చెప్పేది విని అర్థం చేసుకోడానికి. ఆ ప్రొఫెసర్లు కూడా, విద్యార్థులకు అర్థం అయ్యేరీతిలో, సులభ శైలిలో బోధించాలి. కాబట్టి, వేదాంతమైనా, ప్రాపంచిక విద్యలైనా, గురు శిష్య సంబంధంతోనే వృద్ధి చెందుతాయి.

ఈ విధంగా గురువుగారు చెప్పిన దానిని శ్రద్ధతో విన్న తరువాత ఏం చేయాలి. విన్న దానిని, ఇంటికి పోయి ఏకాంతంగా కూర్చుని, మననం చేయాలి. అర్థం చేసుకోవాలి. అర్థం

చేసుకున్న దానిని ఆచరించాలి. మంచి గురువు దగ్గర పరమాత్మను ఎలా ఉపాసించాలి అనే విషయం తెలుసుకొని, పరమాత్మను భక్తి, శ్రద్ధలతో, ఏకాగ్రచిత్తంతో ఉపాసిస్తే, వారు కూడా ముక్తికి అర్హులు.

ఇక్కడ మృత్యుం అతి తరన్తి ఏవ అంటే మృత్యువును తప్పకుండా దాటగలరు అంటే అటువంటి వారికి ఆత్మను గురించి జ్ఞానం కలగడం వలన మృత్యుభయం ఉండదు. మృత్యువు అంటే భయపడరు. జనన మరణ చక్రము నుండి విడివడతారు. పునర్జన్మ ఉండదు అని అర్థం.

## 27. యావత్సంజాయతే కించిత్సత్త్వం స్థావరజఙ్గమమ్
## క్షేత్రక్షేత్రజ్ఞసంయోగాత్తద్విద్ధి భరతర్షభ॥

అర్జునా! ఈ ప్రకృతిలో ఎన్నో జీవరాసులు, పదార్థములు, కనిపించేవి, కనిపించనివి, కదిలేవి, కదలనివి అనేకములైనవి ఉన్నాయి. అవి అన్నీ కూడా ప్రకృతి పురుషులు అంటే క్షేత్రము క్షేత్రజ్ఞుల సంగమంతోనే పుడుతున్నాయి.

ఈ ప్రపంచములో మనకు కనపడే, కనపడని కదిలే, కదలని, అన్ని జీవరాసులు, పదార్థములు అన్నీ కూడా ప్రకృతి పురుషుల సంగమంతోనే ఏర్పడ్డాయి. ప్రకృతి జడము అయితే పురుషుడు చైతన్యము. దీనినే అర్ధనారీశ్వరతత్వము అని మనం అంటాము. శివుడు పురుషుడు పార్వతి ప్రకృతి. అందుకే ఆమెను పర్వతరాజపుత్రి అని అన్నారు. అలాగే విష్ణువు పురుషుడు అయితే లక్ష్మి ప్రకృతి. ఆమె కూడా సముద్రములో నుండి పుట్టింది. అలాగే వివాహ బంధంతో ముడిపడిన భార్య, భర్త ఒకటి అయితే సృష్టి జరుగుతుంది. ప్రకృతి పురుషుల కలయికే ఈ సమస్త సృష్టి. అందరిలో పరమాత్మ ఉన్నాడు. ఆయన ప్రమేయం లేనిదే సృష్టి జరగదు. పరమాత్మ ప్రకృతి వీటి సంయోగమే సృష్టి.

జీవరాసులు నాలుగు విధములుగా పుడుతున్నాయి. (1)ఉదరములోనే శిశువుగా మారి,(2) గుడ్డునుండి, (3)విత్తనము నుండి, (4) స్వేదము(చెమట) నుండి పుడుతున్నాయి. వీటి అన్నిటిలోనూ ఈ ప్రకృతి, పురుషుడు ఉన్నారు. ఆ సత్యాన్నే ఈ శ్లోకంలో వివరించారు వ్యాసులవారు. కాని ఈ సత్యం ఎవరూ గుర్తించడం లేదు. జడమైన ప్రకృతినే అంటే ఈ శరీరాన్నే నేను అనే అహంకారంలో ఉన్నాము. "నాకు అంతా తెలుసు, నాకంటే మించిన వాడు లేడు, ఈ ఇల్లు నాది, ఈ స్థలము నాది, ఈ భూమి నాది, వీళ్లంతా నా వాళ్లు," అంటూ శరీరాన్నే పురుషుడుగా భావిస్తున్నాము. అదే అజ్ఞానము.

ఈ శరీరము ప్రకృతి, అంటే జడము, దీని లోపల చైతన్యము అనే పురుషుడు ఉన్నాడు. ఆయన గురించి తెలుసుకోవాలి అనే సత్యం అందరూ తెలుసుకోవాలి. అదే సరి అయిన జ్ఞానం.

## 28. సమం సర్వేషు భూతేషు తిష్ఠన్తం పరమేశ్వరమ్।
## వినశ్యత్స్వవినశ్యన్తం య: పశ్యతి స పశ్యతి॥

సకల జీవరాసులలోనూ పరమాత్మ ఆత్మస్వరూపుడుగా చైతన్య స్వరూపుడుగా, సమంగా, ఎటువంటి భేదభావం లేకుండా వెలుగుతున్నాడు. ఆయాజీవరాసుల దేహములు నశించిననూ వారిలో ఉన్న ఆత్మస్వరూపము నశించదు. ఈ సత్యమును ఎవరు తెలుసుకుంటారో, వారే పరమాత్మ తత్వమును బాగా తెలుసుకున్న వారు.

కాబట్టి అన్ని జీవరాసులను సమంగా చూడవలసిన, ఆదరించవలసిన బాధ్యత మనది. దేహము వేరు. లోపల ఉన్న చైతన్యము వేరు. దేహము నశించినా అందులో ఉన్న చైతన్యము నశించదు. ఈ సత్యము తెలుసుకున్న వాడు ఈ ప్రకృతిని దాని స్వస్వరూపంతో చూడగలడు. లేకపోతే మాయలో పడి పోయి కనిపించేవన్నీ నిజాలు అనుకొని, వాటి వెంట పరుగుపెడుతుంటాడు. సుఖదు:ఖములకు లోనవుతుంటాడు.

ఈ శ్లోకంలో "వినశ్యత్స్వవినశ్యన్తం" అని వాడాడు అంటే అంటే ఈదేహము నశించినను లోపల ఉన్న చైతన్యం నశించదు. అంటే కనిపించే ఈ ప్రకృతి అందులోని వస్తువులు, వాటిలో ఒకటైన శరీరము నశించేదే. మార్పు చెందేదే. ఏదీ శాశ్వతము కాదు. లోపల ఉన్న ఆత్మ ఒక్కటే శాశ్వతము. అది నశించదు. మార్పుచెందదు. పైగా "సమం తిష్టంతి" అంటే సమంగా, ఏ విధమైన భేదభావం లేకుండా అందరిలోనూ తిష్ఠవేసుకొని ఉన్నాడు. ఎవరూ అంటే "పరమేశ్వరమ్" అంటే పరమాత్మ, విశ్వచైతన్యము.

ప్రతి వాడూ ఈ విషయం తెలుసుకోవాలి. అటువంటివాడే ప్రకృతిని దాని అసలైన రూపంలో చూడగలడు. ఆ సత్యాన్నిచూడడానికి మామూలు కళ్లు చాలవు. జ్ఞాన నేత్రం కావాలి. కాబట్టి మనం అందరం జ్ఞానం సంపాదించి, జ్ఞాననేత్రంతో ఈ ప్రకృతి అసలు స్వరూపాన్ని చూడగలగాలి. ఆ జ్ఞానం, జ్ఞాననేత్రం లేని నాడు ప్రతివాడూ తన కళ్లతో ప్రకృతిని తన ఇష్టం వచ్చినట్టు చూస్తాడు. ఇష్టమైనది ఇష్టంగా, ఇష్టం లేనిది అయిష్టంగా చూస్తాడు. రాగద్వేషాలుపెంచుకుంటాడు. అజ్ఞానము అనే అంధకారంలో పడి పోతాడు. కళ్లున్న గుడ్డివాడు అవుతాడు. దానినే అజ్ఞానము అని అంటారు. ఆ అజ్ఞానము అనే అంధత్వం నుండి బయటపడి జ్ఞానం వైపుకు పయనించాలి. జ్ఞాననేత్రంతో ఈ ప్రకృతిని దాని నిజస్వరూపంతో చూడగలగాలి. అదే సరి అయిన దృష్టి.

## 29. సమం పశ్యన్హి సర్వత్ర సమవస్థిత మీశ్వరమ్।
## న హినస్త్యాత్మనా22త్మానం తతో యాతి పరాంగతిమ్॥

సకల ప్రాణికోటిలో సమంగా వ్యాపించి ఉన్న పరమాత్మను చక్కగా తెలుసుకుంటూ, తనలో ఉన్న ఆత్మ అందరిలో ఉన్న ఆత్మ ఒకటే, వేరు కాదు అన్న జ్ఞానం కలిగిన డాడు, తనను తాను హింసించుకోడు. ఇతరులను కూడా ఎటువంటి హింసకు లోనుచేయడు. అతడే పరమ గతిని పొందుతాడు.

మనం పరమాత్మను ఈ లోకంలో సర్వత్ర అంటే అంతటా, సమం అంటే సమంగా, పశ్యన్తి చూడగలగాలి. అంటే పరమాత్మ అన్ని జీవరాసులలోనూ సమంగా నిండి ఉన్నాడు. ఒకరిలో ఎక్కువ ఒకరిలో తక్కువ లేడు. రాజులోనూ, బంటులోనూ, ధనికుడిలోనూ పేదవాడిలోనూ సమంగా ఉన్నాడు. సర్వత్ర అంటే అన్ని .జీవరాసులు, అన్ని పదార్థములు, మనం చేసే అన్ని పనులలో కూడా పరమాత్మ చైతన్యస్వరూపంగా ఉన్నాడు. ఈ విషయం తెలియని మానవులు ఎదుటి వారిని మానసికంగా శారీరకంగా హింసిస్తున్నారు. అవమానిస్తున్నారు, చంపుతున్నారు. తద్వారా తాను బాధలు పడుతున్నాడు. సుఖదు:ఖాలు మానావ మానాలు అనుభవిస్తున్నాడు. అంటే తనలో ఉన్న ఆత్మను హింసించుకుంటూ, ఎదుటి వారిలో ఉన్న ఆత్మను కూడా హింసిస్తున్నాడు.

(లౌకికంగా చూస్తే ..... హత్యలు చేసిన వాళ్లు జైలుకు వెళుతున్నారు. చిన్ని చిన్ని కారణాలకు ఆత్మహత్య చేసుకొని తనను తాను చంపుకుంటున్నారు. భార్యను చంపి తానుకూడా ఆత్మహత్య చేసుకున్న వారిని ఎంతో మందిని చూస్తున్నాము. ఎందుకు చంపుతున్నాడో, ఎందుకు చస్తున్నాడో వాడికే తెలియదు. మరి కొంత మంది కట్నం కొరకు కోడళ్లను చంపి, జైలుకు పోయి, అవమానాలు పాలై, శిక్షలు తప్పించుకోడానికి ఉన్న ఆస్తులను అమ్ముకుంటున్నారు. అంటే ఇతరులను హింసించి, తమను తాను కూడా హింసించుకుంటున్నారు. అదే అజ్ఞానము. ఈ అజ్ఞానంలో నుండి బయట పడాలంటే అందరిలో ఉన్న ఆత్మస్వరూపము ఒకటే అని తెలుసుకోవాలి. అదే జ్ఞానము. దానిని ఆచరణలో పెట్టడమే విజ్ఞానము).

ఆధ్యాత్మికంగా చూస్తే, ఎవరైతే తనలోనే ఉన్న ఆత్మస్వరూపాన్ని గురించి తెలుసుకోలేడో, వాడి ఆత్మను వాడు హింసించుకున్నట్టే. ఎందుకంటే వాడి ఆత్మగురించి వాడికి తెలియదు. ఈ దేహమే నేను అనుకుంటున్నాడు. ఇతరులను హింసిస్తూ వారి దేహానికి మనసుకు బాధకలిగిస్తున్నాడు. తన దేహానికి, మనసుకు కలిగే బాధలు అన్నీ ఆత్మ చేత అనుభవింపచేస్తున్నాడు. అంటే తనను తాను హింసించుకుంటున్నాడు.

కాని, ఆత్మతత్వము తెలుసుకొన్నవాడు దేహాభిమానమును వదిలిపెడతాడు. భేదబుద్ధిని పాటించడు. అందరినీ సమానంగా చూస్తాడు. అటువంటప్పుడు తాను సుఖంగా, శాంతిగా ఉంటాడు. ఇతరులను శాంతిగా ఉంచుతాడు. అందరూ శాంతిగా ఉంటారు. కాబట్టి ప్రకృతి, పురుషుల గురించి సరి అయిన అవగాహన ఉన్నవాడు, ప్రకృతికి భయపడడు. మృత్యువుకు భయపడడు. పరమ గతిని పొందుతాడు.

## 30. ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః।
## యః పశ్యతి తథా22త్మానమకర్తారం స పశ్యతి.

ఈ కర్మలన్నీ ప్రకృతి చేస్తూ ఉంది, తాను చేయడం లేదు, ఈ కర్మలకు నేను అంటే నాలో ఉన్న ఆత్మ కర్త కాదు అని ఎవరు తెలుసుకుంటారో, అటువంటి వాడు ఆత్మను గురించి తెలుసుకున్నవాడు అవుతాడు.

మనం ఈ ప్రకృతిలో సంచరిస్తున్నాము. మన మనసుతో, ఇంద్రియములతో కర్మలు చేస్తున్నాము. అంటే శరీరంతో చేస్తున్నాము. అలా చేసే టప్పుడు నేనే ఈ శరీరము అనే కర్తృత్వభావనతో చేస్తున్నాము. కర్తృత్వభావన ఉన్నప్పుడు భోక్తృత్వ భావన కూడా అంటి పెట్టుకొని ఉంటుంది. అంటే ఆ కర్మల ఫలములను సుఖము దుఃఖము అనే రూపములలో అనుభవిస్తుంటాడు.

ఇప్పుడు మీరు అనవచ్చు. ఇందులో తప్పేముంది. సుఖము, దుఃఖము, లాభము, నష్టము ఇవన్నీ మామూలే కదా. అనుభవిస్తే పోలేదా అని అనుకోవచ్చు. వినడానికి బాగానే ఉంటుంది. కాని ఈ సుఖదుఃఖ నిష్పత్తి మనం అనుకున్నట్టు ఈక్వల్ గా ఉండదు. కొస్త సుఖం, మరింత దుఃఖం. మధ్యలో కొస్తంత సుఖం. అనంతమైన దుఃఖం. పదిరూపాయలు వచ్చాయని సంతోషించేలోపల పది వందలు పోయాయనే దుఃఖం వెంటనే ఉంటుంది. ఉన్నది పోయింది, ఆపైన వచ్చింది పోయింది అనే సామెత నిజం అవుతుంది. సంపన్న కుటుంబంలో పుట్టినా, అడ్డమైన అక్రమాలు చేసి, ప్రజాధనం దోచుకొని, జైలుకెళ్లిన వాళ్లను మనం చూస్తూనే ఉన్నాము. కాబట్టి సుఖదుఃఖాలు మనం అనుకున్నట్టు రావు.

కాబట్టి మానవుడు చేసిన కర్మల ఫలితంగా పునర్జన్మ లభిస్తుంది. జన్మవెంట జన్మ వస్తూ ఉంటుంది. ఆ జన్మలు కూడా మనం అనుకున్నట్టు రావు. వాటిష్టం వచ్చినట్టు వస్తాయి. వచ్చిన జన్మను అనుభవించడమే మానవ కర్తవ్యం.

అలా కాకుండా, ఈ కర్మలన్నీ ప్రకృతి చేస్తూ ఉంది. ప్రకృతిలోని గుణముల చేత చేయబడుతున్నాయి, మానవునిలో ఉన్న మూడుగుణములు, బయట ప్రకృతిలో ఉన్న మూడు గుణములతో కలిసి అనేక కర్మలకు కారణం అవుతున్నాయి. కాని, ఈ కర్మలకు ఆత్మస్వరూపుడుగా ఉన్న పురుషునికి ఎటువంటి సంబంధము లేదు. ఆయన కేవలము సాక్షి. అనే భావన తో బయట ప్రపంచంలో విహరిస్తుంటే కర్మబంధనములు ఉండవు. అలా కాకుండా, "ఈ దేహమే నేను, అంతా నేనే చేస్తున్నాను, కర్మఫలములు నేనే అనుభవిస్తున్నాను" అనే భావనతో కర్మలు చేస్తే, ఆ కర్మల బంధనములు జీవాత్మకు అంటుకుంటాయి. అవే మరుజన్మకు కారణం అవుతాయి.

ఈసత్యం తెలుసుకున్న వాడే నిజంగా ఆత్మ తత్వమును తెలుసుకున్న వాడు. ఆత్మసాక్షాత్కారం పొందిన వాడు. మిగిలిన వారు నేత్రములు ఉన్నా గుడ్డివారి కింద సమానమే. ఎందుకంటే వారు అసలు నిజాన్ని చూడలేకపోతున్నారు. అంతా నేనే చేస్తున్నాను అంతా నావల్లే జరుగుతూ ఉంది అనే భ్రమలో, మాయలో పడి కొట్టుకుంటున్నారు. దీనికి కావాల్సింది జ్ఞాన నేత్రము. ఆ జ్ఞాన నేత్రముతో చూడగలిగిన నాడు మానవునికి ఈ ప్రపంచం అంతా ఒక మాయగా, మిధ్యగా కలలో కనపడే దృశ్యం గా కనపడుతుంది.

## 31. యదా భూతపృథగ్భావమేకస్థమనుపశ్యతి।
## తత ఏవ చ విస్తారం బ్రహ్మ సంపద్యతే తదా॥

మన కళ్లకు కనిపించే ఈ స్థూల విశ్వము అంతా ఒకే పరమాత్మయందు, ఆ పరమాత్మయందు ఈ స్థూలవిశ్వాన్ని ఎవడైతే చూడగలుగుతున్నాడో, వాడు పరబ్రహ్మ గురించిన జ్ఞానమును పొందుచున్నాడు.

మనకు ఈ ప్రకృతిలో మూడు రకాల క్షేత్రాలు కనపడతాయి. ఒకటి కొండలు గుట్టలు పర్వతాలు. ఇవి కదలవు. ఎందుకంటే వీటిలో ఉన్న పరమాణువులు అన్నీ ఘనీభవించి ఉంటాయి. అందుకని కదలలేవు. వీటి ప్రకృతిసిద్ధమైన పెరుగుదల మనకళ్లకు కనిపించదు. అలాగే చెట్లు. ఇవి పెరగడం మనకు కనిపిస్తుంది. కాని కదలలేవు. విత్తనంలోనుండి మొక్క, పెద్దది అయి చెట్టు, మహావృక్షం అవుతుంది. ఇది కూడా అనేక పరమాణువుల సముదాయమే. గాలి, నీరు. గాలి కనిపించదు. నీరు కనిపిస్తుంది. తనకు తానుగా కదులుతుంది. నీటిలో ఉన్న పరమాణువులు ఘనీభవించినపుడు మంచుగడ్డగా మారి కదలలేవు. మానవులు, జంతువులు, పక్షులు, పాకేజంతువులు అన్నీ కూడా కదిలేవే. ఇవి కూడా అనేకానేక పరమాణువుల సముదాయంతో ఏర్పడతాయి. కాని లోపల చైతన్యం ఉన్నంత వరకు కదులుతాయి. ఆ చైతన్యం ఆగిపోతే కదలలేవు. (ఎన్నోపనులు చేయగలిగే మానవుడు కూడా లోపల ఉన్న చైతన్యం ఆగిపోతే కదలలేడు.)

అంటే కదిలేవి కదలనివి అన్నిటిలో కూడా పరమాణు రూపంలో పరమాత్మ చైతన్యం ఉంది. ఆ పరమాణువు నుండే ఈ అనంత విశ్వం ఆవిర్భవించింది. (బిగ్‌బాంగ్ థియరీ). దీనికి మరొక ఉదాహరణ ఏమిటంటే ఆకాశం అంటే స్పేస్ ఉంది. ఆ స్పేస్‌లోనే ఈ భూమి, దానితో పాటు అన్ని గ్రహాలు, సూర్యుడు, సూర్యుని మాదిరిఉన్న కోట్లాది నక్షత్రాలు, ఇవి అన్నీ కలిగి ఉన్న గెలాక్సీలు అంటేపాలపుంతలు, ఇవన్నీ కూడా ఈ స్పేస్‌లో ఉన్నాయి. అదే స్పేస్ మనలో కూడా ఉంది. మన ఊపిరితిత్తులలో స్పేస్ లేకపోతే గాలి లోపలకు పోదు. జీర్ణాశయంలో స్పేస్ లేకపోతే ఆహారం లోపలకు పోదు. గదిలో స్పేస్‌లేకపోతే మనం నడవలేము. తిరగలేము. కాబట్టి ఈ స్పేస్ మనలోపలా ఉంది, బయటా ఉంది, అంతటా ఉంది. ఈ అనంత విశ్వం అంతటా ఉంది. ఇంకొంచెం పైన ఆలోచిస్తే, ఆ స్పేస్‌లోనే మనం ఉన్నాము. అంటే స్పేస్ సర్వత్రా నిండి ఉంది. ఆ స్పేస్‌లోనే ఈ అనంత విశ్వం తిరుగుతూ, పరుగెడుతూ ఉంది.

ఈ తత్వాన్ని పరమాత్మకు అన్వయించుకుంటే, పరమాత్మ అనే విశ్వచైతన్యం (కాస్మిక్ ఇంటలిజెన్స్) అంతటా విస్తరించి ఉంది. అదే విశ్వచైతన్యం మనలో ఆత్మస్వరూపంగా ఉంది. ఇంకా ఆలోచిస్తే. ఈ విశ్వచైతన్యంలోనే మనం ఉన్నాము. శరీరం ఉన్నప్పుడు ఇదే చైతన్యం శరీరంలో ఉంది. శరీరం పడిపోగానే విశ్వచైతన్యంలో కలిసిపోయింది. అంటే ఈ అనంతమైన విశ్వచైతన్యంలో నుండి చరాచర జీవరాసులు పుడుతున్నాయి, మరలా ఆ చైతన్యంలో లీనం అయిపోతున్నాయి. కేవలం ఈ శరీరం ధరించినపుడే పేరు, ఆకారంతో ప్రకటింపబడుతున్నాము. ఇదే విషయాన్ని ఈ శ్లోకంలో ప్రతిపాదించారు వ్యాసులవారు. కాబట్టి అన్నిటిలో పరమాత్మను, పరమాత్మలో అన్నిటినీ చూచే వాడు "బ్రహ్మ సంపద్యతే" అంటే బ్రహ్మను పొందుతున్నాడు.

మన విషయానికి వస్తే, మనం పేరును బట్టి, ఊరును బట్టి, ప్రాంతాన్ని బట్టి, కులాన్ని బట్టి, పదవులను బట్టి మానవులను విభజిస్తున్నాము. అది తప్పు . అందరిలో పరమాత్మ ఉన్నాడు. అందరినీ సమానంగా ఆదరించాలి.ఈ విషయం తెలుసుకుంటే బ్రహ్మగురించి తెలిసినట్టే. మరి ఈ విషయం ఎలా తెలుస్తుంది అంటే 'అనుపశ్యతి' అంటే శాస్త్రములు చదవడం వలన, అధ్యయనం చేయడం వలన, గురువుల వలన వినడం వలనా తెలుస్తుంది. కాబట్టి గురుసేవ, సత్సంగము చాలా ముఖ్యము. ఎల్లప్పుడూ ప్రాపంచిక విషయములలో మునిగితేలుతుంటే ఈ జ్ఞానం కలిగే అవకాశం లేదు.

## 32. అనాదిత్వాన్నిర్గుణత్వాత్పరమాత్మాయ మవ్యయః।
## శరీరస్థో2పి కౌన్తేయ న కరోతి న లిప్యతే॥

మనం తెలుసుకోవాలి అనుకుంటున్న బ్రహ్మ ఎలాంటి వాడు అంటే, ఆ బ్రహ్మతత్వానికి మొదలు లేదు, ఆఖరు లేదు, సత్వ,రజస్తమోగుణములు లేవు, అవ్యయుడు అంటే నాశము లేని వాడు. ఈ బ్రహ్మతత్వము మన లోపలా ఉంది, బయటా ఉంది. మనలోపల ఉన్న బ్రహ్మ ఏమీ చేయడు. మనం చేసే కర్మలను కేవలం సాక్షిగా చూస్తుంటాడు. ఆ కర్మలు గానీ, ఆ కర్మఫలములు కానీ ఆ బ్రహ్మకు అంటవు.

ఈ పరమాణు స్వరూపుడు అయిన పరమాత్మ అంటే క్షేత్రజ్ఞునకు ఆది లేదు అంతము లేదు. ఆయనకు ఈ క్షేత్రములో ఉన్న ఏ గుణములు అంటవు. ఆ క్షేత్రజ్ఞుడు నిరంతరము ఈ క్షేత్రములో ఉన్నా, క్షేత్రము యొక్క గుణములు, వాసనలు ఆయనకు అంటవు. శరీరస్థో2పి అంటే పరమాత్మ ఆత్మస్వరూపుడుగా అందరి శరీరములలో ఉన్నాడు. ఎక్కడో దూరంగా లేడు. మనం లోపల ఉన్న పరమాత్మను వదిలి, ఆయన కోసం ఎక్కడెక్కడో తిరుగుతున్నాము. అందుకే దేహమే ఒక దేవాలయం అని అంటారు. ఆ దేహములో ఉన్న ఆత్మస్వరూపమే దేవుడు. ఆ దేవుడు ఏమీ చేయడు. మనం ఏమి చేసినా చూస్తూ ఉంటాడు. మనం చేసే కర్మలు దాని ఫలములు ఏవీ ఆయనకు అంటుకోవు.

## 33. యథా సర్వగతం సౌక్ష్మ్యాదాకాశం నోపలిప్యతే।
## సర్వత్రావస్థితో దేహే తథా22త్మా నోపలిప్యతే॥

ఎలాగైతే సర్వేసర్వత్రా నిండి, సూక్ష్మంగా ఉన్న ఆకాశము దేనికీ అంటుకోదో, దేనిచేతా అంటబడదో, అలాగే ఈ శరీరము అంతటా, అన్ని శరీరములలోనూ వ్యాపించి ఉన్న ఈ చైతన్యస్వరూపుడు అయిన పరమాత్మ, దేనికీ అంటుకోడు, దేని చేతా అంటబడడు.

పై శ్లోకములలో చెప్పబడిన విషయాలు అర్జునుడికి, తద్వారా మనకూ సులభంగా అర్థం కావడానికి ఒక ఉపమానం ఇస్తున్నాడు వ్యాసులవారు. పరమాత్మను ఆకాశంతో పోల్చాడు. మనం విష్ణువును ప్రార్థించేటప్పుడు "విశ్వాకారం గగనసదృశం" అని అంటాము. అంటే సర్వవ్యాపి అయిన విష్ణువు, విశ్వమే ఆకారముగా కలవాడు. గగనముఅంటే ఆకాశముతో సమానమైనవాడు అని అర్థము అందుకే పరమాత్మను ఆకాశంతో పోల్చారు వ్యాసులవారు.

ఆకాశం అంటే శూన్యము. అది మనకు కనపడదు. సూక్ష్మంగా ఉంటుంది. కాని అది అంతటా ఆవరించి ఉంటుంది. మన శరీరంలో కూడా ఆకాశం ఉంది. ఏ వస్తువుకైనా అవకాశం ఇచ్చేది ఆకాశము. మనలో ఉన్నఊపిరితిత్తులు గాలి రావడానికి పోవడానికి అవకాశం ఇస్తాయి. అలాగేమన జీర్ణకోశము ఆహారము, నీరు కు చోటుఇస్తాయి. మన శరీరం కూడా ఈ ఆకాశంలో కొంత చోటు అంటే 6 అడుగు లు ఎత్తు, 2 అడుగుల పొడుగు, 2 అడుగులవెడల్పు కలిగిన స్పేస్ ఆక్రమించి ఉన్నాము. ఈ గ్రహాలు, నక్షత్రాలు, పాలపుంతలు అన్నీ కూడా ఈ అనంతాకాశంలో కొంతమేర ఆక్రమించి ఉన్నాయి. అంటే ఆకాశం మన లోపలా బయటా అంతా నిండి ఉంది.

ఎలా అయితే ఆకాశం ఈ విశ్వంఅంతా నిండి ఉందో అలాగే పరమాత్మ కూడా పరమాణు రూపంలో అంతటా, అంటే మన శరీరం అంతటా, శరీరం బయటా నిండి ఉన్నాడు. ఈ ఆకాశంలో ఉన్న ఈ నక్షత్రాలు, గ్రహాలు, తోకచుక్కలు, ఉల్కలు వీటి నుండి వచ్చే ఏ పదార్థము కానీ, దుమ్ము, అణుధూళి, ఆకాశానికి ఏమాత్రం అంటుకోదు. అలాగే ఈ అనంత విశ్వం అంతటా, మనశరీరం అంతటా నిండి ఉన్న ఆ పరమాత్మ దేనికీ అంటుకోడు. ఏమీ చేయడు. ముఖ్యంగా ఈ క్షేత్రములో ఉన్న మూడు గుణముల ప్రభావము, దోషములు, మనం అనుభవించే సుఖము దుఃఖము, జనన మరణములు, మానావ మానములు, శీతోష్ణములు ఆయనకు అంటవు. కేవలం అంతటా ఉన్నాడు అంతే.

కాకపోతే మనమే...మన అజ్ఞానం వలన..... మనం చేసే పనులన్నీ నేనే చేసాను అనుకుంటూ అన్నీ జీవాత్మకు అంటగడుతున్నాము. కాబట్టి మనం అందరం ఈ దేహమే ఒక దేవాలయం అందులో ఉన్న వాడు పరమాత్మ అని తెలుసుకొని ఎటువంటి చెడ్డపనులు, దుర్మార్గాలు చేయకుండా, పాపపు పనులు చేయడానికి సంకల్పించకుండా, నిష్కామ కర్మలు చేయాలి. వారు ఏ కులము, మతము, జాతి, ఆడ, మగ ఎవరైనా సరే అందరిలో పరమాత్మ నిండి ఉన్నాడు అని అనుకోవాలి. ఆ పరమాత్మను దర్శించడానికి ప్రయత్నించాలి. దాని కొరకు జ్ఞానం సంపాదించాలి. అప్పుడు జ్ఞాననేత్రంతో పరమాత్మను దర్శించగలము.

## 34. యథా ప్రకాశయత్యేక: కృత్స్నం లోకమిమం రవి:।
## క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత॥

ఎలాగైతే సూర్యుడు ఒక్కడే ఈ భూమండలాన్ని ఇతర గ్రహమండలాలను, చంద్రుడు మొదలగు ఉపగ్రహాలను ప్రకాశింపచేస్తున్నాడో, అలాగే సకల జీవరాసుల క్షేత్రములలో ఆత్మస్వరూపుడుగా ఉన్న పరమాత్మ, సమస్తక్షేత్రములను ప్రకాశింపచేస్తున్నాడు.

వ్యాసులవారు కిందటి శ్లోకంలో ఆకాశం గురించి చెప్పాడు. ఈ శ్లోకంలో సూర్యుని ప్రకాశము గురించి చెబుతున్నాడు. ఆకాశం సూక్ష్మము అంటే మనకు కనపడదు. సూర్యుడు స్థూలము అంటే మనకు ప్రత్యక్షంగా కనపడుతుంటాడు. కనపడని వాటి గురించి చెబితే మనం నమ్మం. అందుకని కనపడే సూర్యుని కూడా ఒక ఉదాహరణగా చెబుతున్నాడు. సూర్యుడు నిరంతరము వెలుగుతూ తన ప్రకాశంతో లోకాలను వెలుగులతో నింపుతుంటాడు. భూమి తిరగడం వలన మనకు రాత్రి పగలు ఏర్పడుతున్నాయి. అంటే రాత్రిపూట సూర్యుడు లేడని కాదు. సూర్యుడు ఎప్పుడూ వెలుగుతూనే ఉంటాడు. సూర్యుడు బయట ఉండి నిరంతరం ప్రకాశిస్తూ ఈ క్షేత్రములను ప్రకాశింపచేస్తున్నాడు. అలాగే మన లోపల ఉన్న ఆత్మస్వరూపుడు అయిన పరమాత్మ కూడా మన దేహములో ఉన్న మనస్సు, బుద్ధి, ఇంద్రియములలో చేతనాశక్తిగా ప్రకాశిస్తున్నాడు. ఎలాగైతే సూర్యుడు గంగాజలంలోనూ, మురికి నీటిలోనూ, పవిత్ర స్థలములలోనూ, అపవిత్రస్థలములలోనూ సమానంగా తన వెలుగును ప్రసరింపజేస్తూ కూడా, దేనికీ అంటకుండా ఉంటాడో, అలాగే పరమాత్మ ఆత్మ స్వరూపుడుగా అందరి శరీరములలో అంటే సన్మార్గులు, దుర్మార్గులు, జంతువులు, పక్షులు మొదలగు జీవరాసులలో ప్రకాశిస్తున్నా దేనికీ అంటుకోడు. సూర్యుడు ఎలాగా అయితే ఈ లోకములో ఉన్న జరిగే సమస్త కార్యములను సాక్షిగా చూస్తున్నాడో అలాగే మనలో ఉన్న ఆత్మ కూడా మనం చేసే పనులను సాక్షీభూతంగా చూస్తూ ఉంటుంది.

కాబట్టి మనకు బయట ఒక సాక్షి, లోపల ఒక సాక్షి ఇద్దరు సాక్షులు ఉన్నారు. ఎవరూ చూడటం లేదని మనం ఏపని చేసినా, ఈ ఇద్దరూ చూస్తుంటారు. కాబట్టి మనం అందరం, ఎవరూ చూడ్డం లేదు కదా అని, అడ్డమైన పనులు చేయకుండా, చాలా జాగ్రత్తగా ఉండాలి. అందుకే సూర్యుడిని లోకసాక్షి, ఆత్మను మనస్సాక్షి అని అంటారు.

## 35. క్షేత్రక్షేత్రజ్ఞయోరేవమన్తరం జ్ఞానచక్షుసా।
## భూతప్రకృతిమోక్షం చ యే విదుర్యాన్తి తే పరమ్॥

ఓ అర్జునా! ఎవరైతే క్షేత్రము క్షేత్రజ్ఞుడు వీటి మధ్య ఉన్న భేదమును తన జ్ఞాననేత్రములచే తెలుసుకుంటాడో, ఎవరైతే మన కళ్లకు కనపడే ఈ ప్రకృతి అనబడే మాయ నుండి అంటే అజ్ఞానము నుండి విముక్తుడు అవుతున్నాడో, అటువంటి వాడు పరమాత్మ పదమును పొందుచున్నాడు. ఈ అధ్యాయంలో ఇది ఆఖరి శ్లోకం. ఈ అధ్యాయములో క్షేత్రము క్షేత్రజ్ఞుడు వారి మధ్యఉన్న భేదము గురించి చెప్పాడు. ఈ భేదమును కేవలం జ్ఞానదృష్టి తోనే తెలుసుకోగలరు. అందుకే ఈ శ్లోకంలో జ్ఞానచక్షుసా అని చెప్పారు. ఎవరైతే జ్ఞాన నేత్రములతో క్షేత్రము క్షేత్రజ్ఞుని మధ్య ఉన్న భేదమును తెలుసుకుంటారో, ఈ క్షేత్రము అంటే ఈ ప్రకృతి అనీ, దాని స్వభావము మాయ

అనీ తెలుసుకొని, దాని నుండి అంటే ఆ ప్రకృతి అనబడే మాయ నుండి విముక్తి పొందుతారో, వారు పరమ పదాన్ని పొందుతారు.

క్షేత్రము క్షేత్రజ్ఞుడు వీరి మధ్య భేదములు తెలుసుకోవాలంటే జ్ఞానము కావాలి. జ్ఞానం కావాలంటే శాస్త్రపరిజ్ఞానము, గురువు అనుగ్రహము ఉండాలి. జ్ఞానం కలిగితే జ్ఞాన నేత్రం తెరుచుకుంటుంది. అప్పుడు మనం క్షేత్రము అంటే ఏమిటి? క్షేత్రజ్ఞుడు ఎవరు? అనే విషయముల గురించి తెలుసుకోగలము. అది తెలుసుకున్న తరువాత మానవులు సకల జీవ రాసులు, ఈ క్షేత్రము నుండి అంటే వ్యక్త, అవ్యక్త రూపములతో మనకు గోచరిస్తున్న, మనలను నిరంతరం మాయలో భ్రమలో పడేస్తున్న, ఈ మాయా ప్రకృతి నుండి విడవడి పరమ పదము చేరుకుంటారు. మోక్షము పొందుతారు. ఇక్కడ మోక్షము అంటే ఈ ప్రకృతి మాయ నుండి విడి వడటం. అంటే ఈ ప్రకృతికి ఎటువంటి అస్తిత్వము లేదు. ఈ ప్రకృతి అంతా పరమాత్మ యొక్క చైతన్యం చేతనే ప్రకాశిస్తూ ఉంది; ఈ ప్రకృతికి స్వయం ప్రకాశము లేదు; ఈ ప్రకృతి అంతా మాయ; అని తెలుసుకోవడమే మోక్షము. అంటూ పరమాత్మను చేరుకోవడం.

కాబట్టి, మాటి మాటికీ నాకు ఇంకా మోక్షం రాలేదు, నాకు మోక్షం ఎప్పుడొస్తుంది అని చింతించకుండా ముందు జ్ఞానం సంపాదించాలి. జ్ఞానం కావాలంటే దేవుని మీద, గురువు మీద భక్తి ఉండాలి. శాస్త్రములను చదవాలి. వినాలి. ఆచరించాలి. భక్తితో భగవంతుని సగుణంగా గానీ, నిర్గుణంగా గానీ ఉపాసించాలి. నిష్కామ కర్మలు చేయాలి. పరోపకారం చెయ్యాలి. నేను నాది అనే అహంకారం విడిచిపెట్టాలి. అంతా నేనే చేస్తున్నాను అనే కర్తృత్వ భావన విడిచిపెట్టాలి. ఈ అధ్యాయంలో చెప్పబడిన భక్తుని లక్షణములు కలిగి ఉండాలి. అప్పుడే జ్ఞానం కలుగుతుంది. జ్ఞానం పొందడానికి కుల,జాతి,ప్రాంత భేదం లేదు. ఆడమగ వివక్ష లేదు. ఉన్నతకులము తక్కువ కులము అనే భేదం లేదు. అందరూ అర్హులే అని పరమాత్మ బోధించాడు. మనం చెయ్యాల్సిందల్లా ఈ అధ్యాయంలో చెప్పబడిన 35 గుణములలో కనీసం కొన్నింటినైనా అలవరచుకొని, భక్తితో భగవంతుని ఉపాసించి జ్ఞానం సంపాదించాలి. అప్పుడే జ్ఞాననేత్రం తెరుచుకుంటుంది. ఆ జ్ఞాన నేత్రంతో ప్రకృతి పురుషుల మధ్య భేదం తెలుసుకుంటాము. ఈ ప్రకృతి అంతా మాయ అని తెలుసుకుంటాము. ప్రాపంచిక విషయాలు, విషయవాంఛలు విడిచిపెట్టి పరమ పదం పొందుతాము. ఇంతటితో క్షేత్రక్షేత్రజ్ఞవిభాగ యోగము సంపూర్ణము.

ఉపనిషత్తులయొక్క, బ్రహ్మవిద్యయొక్క,

యోగశాస్త్రము యొక్క సారమయిన భగవద్గీతలో,

క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగము అను పదమూడవ అధ్యాయము సంపూర్ణము.

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# భగవద్గీత

## పదునాలుగవ అధ్యాయము

## గుణత్రయ విభాగ యోగము.

కిందటి అధ్యాయంలో కృష్ణ పరమాత్మ చూచేవాడు, చూడబడేది అనే రెండు తత్త్వాల గురించి వివరించాడు. చూచేవాడు క్షేత్రజ్ఞుడు, చూడబడేది క్షేత్రము. క్షేత్రజ్ఞుడు నిరాకారుడు, నిర్గుణుడు. క్షేత్రము సాకారము, గుణములు కలిగినది అని చెప్పాడు. ఈ గుణములు అంటే ఏమిటి? అవి ఏవి? అని అర్జునుడు అడగకముందే, ఈ అధ్యాయంలో కృష్ణ పరమాత్మ అర్జునుడికి సత్వ, రజస్, తమోగుణముల గురించి వివరించాడు. ఈ గుణముల గురించి ఇదివరకు అధ్యాయాలలో కొంతవరకు చెప్పాడు పరమాత్మ. అర్జునుడికి, మనకు ఆ విషయాలన్నీ గుర్తుఉన్నాయో లేవో అని, ఈ అధ్యాయంలో మూడు గుణముల గురించి మరింత వివరంగా చెబుతున్నాడు.

ప్రకృతిలోనూ, ఆ ప్రకృతిలో భాగమైన జీవరాసులలోనూ, ఆ జీవరాసులలో ఉత్తమజన్మగల మానవులలోనూ మూడు గుణములు ఉన్నాయి. ఈ మూడుగుణముల కలయికతోనే ఈ శరీరాలు ఏర్పడ్డాయి. వాటిని సత్వ, రజస్, తమోగుణములు అని అంటారు. శరీరం కనపడుతుంది కానీ, శరీరంలో ఉన్న గుణములు కనపడవు. అంతర్లీనంగా ఉంటాయి. మానవులు ఈ మూడు గుణముల కలయిక వలన కలిగే ప్రభావంతో ఎన్నో కర్మలు చేస్తుంటారు. కర్మ ఫలములు, ఆ ఫలముల ద్వారా కలిగే బంధనములు పొందుతుంటారు. వాటి ఫలితంగా పునర్జన్మలు ప్రాప్తిస్తాయి. జనన మరణ చక్రంలో తిరుగుతుంటారు. ఈ అధ్యాయంలోపరమాత్మ ఈ మూడు గుణములగురించి వివరించాడు.

భగవానుచ:

**1. పరం భూయ: ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞానముత్తమమ్।**
**యజ్ఞాత్వా మునయస్సర్వే పరాం సిద్ధిమితో గతా:॥**

దేనిని తెలుసుకొని మునులు ఈ సంసారము అనే సాగరము నుండి విడివడి పరమ గతిని పొందుతున్నారో, అట్టి పరమమైన, జ్ఞానములలో కెల్లా ఉత్తమమైన జ్ఞానము గురించి నీకు ఇది వరకే చక్కగా చెప్పాను. కాని మరలా చెబుతున్నాను.

మునులు, ఋషులు, పండితులు అందరూ, వేదములు, పురాణములు, శాస్త్రములు చదివి జ్ఞానం సంపాదిస్తారు. ఆ జ్ఞానములలో కెల్లా ఉత్తమమైన జ్ఞానం ఏమిటంటే పరమాత్మను గురించి తెలుసుకోవడం. ఆ జ్ఞానం గురించి తెలుసుకొని మునులు మోక్షం పొందారు. ఆ జ్ఞానం గురించి కృష్ణుడు అర్జునుడికి ఇదివరకే చెప్పాడు. మరలా చెబుతాను విను అంటున్నాడు.

జ్ఞానానాం జ్ఞానముత్తమమ్ అంటే పరమాత్మను గురించిన జ్ఞానము మనం ఆర్జించే ప్రాపంచిక విషయముల గురించి పొందే జ్ఞానములలో కెల్లా ఉత్తమమైన జ్ఞానము.

యత్ జ్ఞాత్వా సర్వే మునయ: పరాం సిద్ధిం.... ఇటువంటి ఉత్తమమైన జ్ఞానము పొందిన దానికి ఫలితం పరమ గతిని పొందడం. ఇదేదో ఊరికే చెప్పడం కాదు, ఇది వరకు కాలంలో మునులు అందరూ కూడా, జాతి, వర్ణ, కుల వివక్ష లేకుండా, పరమాత్మకుసంబంధించిన ఈ ఉత్తమజ్ఞానమును సంపాదించి ఉత్తమగతులను పొందారు అని పరమాత్మ వివరించాడు.

ఈ శ్లోకంలో "పరం" "ఉత్తమమ్" అని రెండు పదాలు వాడారు. నిజానికి రెండింటి అర్థం ఒకటే. కాని చిన్న తేడా ఉంది. పరం అంటే విషయం దృష్ట్యా ఆ గుణముల గురించిన జ్ఞానము పరమమైనది. ఈ గుణముల గురించి తెలుసుకోవడం వలన కలిగే ఫలితం చాలా ఉత్తమమైనది. కాబట్టి పరమమైన ఈ జ్ఞానమును పొందితే, ఉత్తమమైన ఫలితములను ఇస్తుంది అని మనం అర్థం చేసుకోవాలి.

ఇక్కడ మునయ: అంటే మునులు అని సాధారణ అర్థం. మునులు అంటే మనకు తెలిసినంత వరకు, కాషాయాలు, దండకమండలాలు, నెత్తిన జుట్టు ముడి, ఇవన్నీ గోచరిస్తాయి. కాని ముని అంటే సాధ్యమైనంత వరకుమౌనంగా ఉండేవాడు. ఇంద్రియములను, మనసును నిగ్రహించిన వాడు, స్థిరనివాసము లేని వాడు, ప్రాపంచిక విషయములలో ఆసక్తి లేని వాడు, ఎల్లప్పుడూ పరమాత్మను తప్ప మరొకటి తలవని వాడు. సమాజశ్రేయస్సుకొరకు పాటుపడేవాడు.... ఇవీ మునికి ఉండవలసిన ముఖ్యలక్షణాలు. ఇటువంటి మునులు జ్ఞానములలో కెల్లా ఉత్తమమైన, పరమైన ఈ జ్ఞానమును పొంది, పరమగతిని పొందారు. అంటే మరణానంతరం పరమ గతిని పొందడం కాదు. జీవించి ఉండగానే ముక్తిని పొందారు అంటే జీవన్ముక్త స్థితిని పొందారు. అటువంటి ఆ ఉత్తమమైన జ్ఞానము గురించి నీకు మరలా చెబుతున్నాను అంటున్నాడు పరమాత్మ.

## 2. ఇదం జ్ఞాన ముపాశ్రిత్య మమ సాధర్మ్యమాగతాః।
## సర్గే2పి నోపజాయన్తే ప్రళయే న వ్యథన్తి చ॥

ఓ అర్జునా! పైన చెప్పబడిన జ్ఞానమును ఉపాసించి మనులు నా స్వరూపమును (సారూప్యస్థితిని) పొందారు. అటువంటి వారు జనన మరణముల నుండి విముక్తి పొందారు.

ఈ జ్ఞానాన్ని ఉపాసిస్తే జరిగే పరిణామాలు, ఫలితాల గురించి కూడా చెబుతున్నాడు పరమాత్మ.

మొదటిది.... వారు తనలో ఐక్యం అవుతారు.

రెండవది... కల్పాంతంలో సృష్టి జరిగినపుడు అంతకు ముందు కల్పంలో ఉన్న జీవరాసులు అన్నీ మరలా పుడతాయి. కాని వీరు మాత్రం పుట్టరు. ఒకసారి నాలో ఐక్యం అయిన వాళ్లు, కల్పాంతంలో వచ్చే ప్రళయంలో కూడా నశింపరు.

ఇక్కడ ఐక్యం కావడం అంటే ఏమిటి.

మమ సాధర్మ్యమాగతాః... అంటే అటువంటి మునులు తనయొక్క ధర్మములనే పొందుతారు. అంటే పరమాత్మకు ఎటువంటి ధర్మములు ఉన్నాయో ఆ ధర్మములనే పొందుతారు. భగవంతునికి సత్వరజస్తమోగుణములు అంటవు. అలాగే ముక్తి పొందిన జీవునికి కూడా ఈ గుణములు అంటవు. గుణములకు అతీతంగా ఉంటాడు. గుణములు లేనపుడు బంధనములు లేవు. జనన మరణములు లేవు. అంటే జ్ఞానవంతులైన మునులు జీవించి ఉండగానే ముక్తిని పొంది, జీవన్ముక్తులు అవుతారు. దేహం శాశ్వతం కాదు కాబట్టి ఎటువంటి వారైనా ఈ శరీరం వదలక తప్పదు. ఈ జీవన్ముక్తులు కూడా శరీరం విడిచిపెట్టిన తరువాత పరమాత్మలో ఐక్యం అవుతారు. వారికి పునర్జన్మ ఉండదు.

సాధారణంగా కల్పాంతంలో ఈ సృష్టిలో ఉన్న జీవులన్నీ మరణిస్తాయి. మరలా సృష్టి మొదలు కాగానే అన్నీ జన్మిస్తాయి. పరమాత్మలో సాయుజ్యం పొందిన వారికి ఇటువంటి జనన మరణాలు ఉండవు. దీని కంతా మూలం ఆత్మజ్ఞానం కలగడం. దాని కొరకు అందరూ ప్రయత్నించాలి.

## 3. మమ యోనిర్మహద్బ్రహ్మ తస్మిన్గర్భం దధామ్యహమ్।
## సమ్భవస్సర్వభూతానాం తతో భవతి భారత॥

ఓ అర్జునా! ఈ మహతత్త్వము అంటే మూలప్రకృతి చాలా గొప్పది. అది నానుండి ఆవిర్భవించింది. సర్వభూతములకు ఉత్పత్తిస్థానము ఈ మూలప్రకృతి. మూలప్రకృతి గర్భంలో

చైతన్యరూపంలో  బీజము నేనే ఉంచాను. ఆ కారణం చేత సకల భూతములు ఉత్పత్తి అవుతున్నాయి.

సకల జీవరాసులు మూలప్రకృతిలో నుండి పుడతాయి. అందుకే ప్రకృతిని మహాయోని అని అన్నారు. సర్వభూతములకు ఉత్పత్తిస్థానము మూల ప్రకృతి. ఈ మూల ప్రకృతిలో పురుషుడు బీజరూపంలో ఉంటాడు. ఈ బీజమే జీవం పోసుకొని రూపం ధరిస్తుంది. కొంత కాలం బతికి మరలా బీజరూపంగా మారి పోతుంది. అంటే ఈ ప్రకృతిలో చైతన్యం బీజరూపంలో ప్రవేశిస్తుంది.

(స్త్రీకూడా ప్రకృతి స్వరూపిణి. ఆమెలో పురుషుడు, వీర్యము అనే బీజరూపంలో ప్రవేశిస్తాడు. ఆ బీజము స్త్రీలోని శోణితముతో కలిసి అండం అవుతుంది. ఆ అండం చైతన్యవంతమవుతుంది. అండం పిండంగా మారి, శిశువుగా పంచభూతాత్మకమైన శరీరం సంతరించుకుంటుంది. ఆ శరీరంలో నుండి చైతన్యం పోగానే శవం అవుతుంది. పంచభూతములలో కలిసిపోతుంది.)

కాబట్టి ప్రకృతి పురుషుల కలయిక వలననే ఈ సృష్టి సంభవించింది. పురుషుడు బీజము అయితే ప్రకృతి క్షేత్రము. జీవరాసులకు అన్నిటికీ బీజము పరమాత్మ. కాబట్టి అందరూ సమానమే. దీనినే వేదాంత పరంగా చెప్పుకోవాలంటే పరాప్రకృతి, అపరాప్రకృతి సంయోగమే సృష్టి. అచేతనమైన ప్రకృతిలో పరమాత్మ తన చేతనత్వాన్ని ఉంచడం వలన మన కంటికి కనపడే సృష్టిజరుగుతూ ఉంది. అందులో కొన్ని కదులుతున్నాయి. కొన్ని కదలడం లేదు. కొన్ని ఆలోచిస్తున్నాయి. కొన్ని ఆలోచించడం లేదు. కాని అన్ని జీవరాసులు తమ తమ సహజగుణాలతో జీవిస్తున్నాయి (ఒక్క మానవుడు తప్ప అని మనం అనుకోవాలి. ఎందుకంటే మానవుడు తన సహజగుణం అయిన మానవత్వం మరిచిపోయి పశువుగా, రాక్షసుడుగా ప్రవర్తించడం మొదలుపెట్టాడు. అది మనం చూస్తూనే ఉన్నాము. ఎందుకు ఇలా జరుగుతోంది అనేది ఈ అధ్యాయంలో తెలుసుకుందాము.)

## 4. సర్వయోనిషు కౌంతేయ। మూర్తయస్సమ్భవన్తియాః। తాసాం బ్రహ్మ మహద్యోని రహం బీజప్రద: పితా॥

ఓ అర్జునా! ఈ ప్రకృతి ఒక మహాయోని అంటే సకల జీవులకు ఉత్పత్తిస్థానము అని అనుకుంటే, ఆ ప్రకృతిలో నుండి   సమస్త జీవరాసులు వివిధములైన శరీరములతో, ఆకారాలతో, పేర్లతో  పుడుతున్నాయి.  ఆయా జీవరాసులకు జన్మనిచ్చేది తల్లి అయితే బీజము ఉంచేవాడు తండ్రి. అంటే ఈ అనంత విశ్వానికి మూల ప్రకృతి తల్లి అయితే పరమాత్మ తండ్రి. ఈ ప్రకృతి పురుషుల సంయోగమే అనంత సృష్టి. అందుకే పార్వతీ పరమేశ్వరులను ఆది దంపతులు అని అంటారు. ఈ సమస్త జగత్తుకు వారే తల్లి తండ్రి.

## 5. సత్త్వ రజస్తమ ఇతి గుణా: ప్రకృతి సమ్భవా:।
## నిబధ్నన్తి మహాబాహో। దేహే దేహినమవ్యయమ్॥

ఇప్పటి దాకా ఈ సృష్టి ఎలా జరుగుతుంది అని చెప్పిన కృష్ణుడు, ఇక్కడి నుండి ఈ అధ్యాయంలో చెప్పదలచుకున్న అసలు విషయం చెప్పడం ప్రారంభం చేసాడు.

ఓ అర్జునా! ఈ ప్రకృతిలోనుండి మూడు గుణములు ఆవిర్భవించాయి. ఆ గుణములే సత్త్వగుణము, రజోగుణము, తమోగుణము. ఈ మూడు గుణములు దేహములో ఉన్న ఆత్మస్వరూపాన్ని కప్పి ఉంచుతున్నాయి. ఈ మూడు గుణముల ప్రభావము వలననే పరిశుద్ధమైన ఆత్మ దేహముతో కలిపి జీవాత్మగా మారుతూ ఉంది. ఆ కారణం చేత జీవాత్మ ప్రాపంచిక విషయములలో లీనమౌతూ ఉంది. ఈ దేహములో బంధింపబడుతూ ఉంది. బంధనములకు గురి అవుతూ ఉంది.

దీని బట్టి మనకు అర్థం అయింది ఏమిటంటే.... సత్త్వరజస్తమోగుణములు ప్రకృతిలో నుండి పుట్టాయి. ఆ ప్రకృతి పరమాత్మలో నుండి వచ్చింది. ఆ ప్రకృతిలోకి పరమాత్మ బీజంగా ప్రవేశిస్తున్నాడు. ఆత్మస్వరూపుడుగా శరీరంలో ఉంటున్నాడు. ఆ ఆత్మ ప్రకృతిలో ఉన్న మూడు గుణములతో కలిసి జీవాత్మగా మారి ప్రాపంచిక విషయములలో లీనమై బంధనములలో చిక్కుకొని, వాసనలకు లోనై జనన మరణములు పొందుతూ ఉంది. ఎప్పుడైతే జీవుడు ఈ వాసనలను, బంధనములను వదిలించుకొని తన నిజస్వరూపమైన ఆత్మస్వరూపమును పొందుతాడో, అప్పుడు పరమాత్మలో లీనం అవుతాడు. అప్పుడు ఈ జనన మరణ చక్రమునుండి విముక్తి పొందుతాడు. ఇదీ స్థూలంగా జీవుల జన్మరహస్యము.

కాబట్టి మూడుగుణములు ప్రకృతిలో ఉన్నాయి కానీ పురుషునిలో లేవు. పురుషుడు గుణాతీతుడు. కానీ జీవుడు తన యదార్థస్వరూపమైన ఆత్మ స్వరూపమును మరిచిపోయి, మూడుగుణముల ప్రభావానికి లోనై, వాటితో మమేకమై, తానేదేహము, దేహమే తానుఅనుకుంటూ, సంసార బంధనములలో చిక్కుకుంటున్నాడు. ఈ మూడుగుణములలో ఏ ఒక్కగుణముతో ప్రభావితుడైనా, అతడు ప్రకృతి అనబడే మాయకు లోబడి ఉంటాడు. మూడు గుణములు వదిలిపెడితేనే కానీ, మాయను ఛేదించలేడు. కాబట్టి ఈ జీవుని బంధించేవి ఈ మూడు గుణములు అని తెలుస్తూ ఉంది.

గుణము అంటే రెండు అర్థాలు ఉన్నాయి. ఒకటి ప్రాణియొక్క స్వభావము. రెండు తాడు. ఈ సాత్విక, రాజసిక, తామసిక గుణములు అంటే స్వభావాలు జీవులను బంధిస్తాయి.

తాడు కూడా శరీరాన్ని బంధిస్తుంది. అందుకే గుణమునకు బంధించే స్వభావం ఉంది కాబట్టి, తాడు అని కూడా అర్థం చెబుతారు.

ఈ శ్లోకంలో దేహే దేహినమవ్యయమ్ అని వాడారు. అంటే దేహములో ఉండే దేహి అంటే ఆత్మ నాశరహితుడు. మార్పులేని వాడు. దేహము నశించినా తాను నశించడు. ఈ గుణములు అన్నీ దేహానికే గానీ దేహికి కావు. కానీ, గుణములతో కలిసిన ఆత్మ, ఆ గుణముల ప్రభావం చేత, దేహి అయిన ఆత్మ, జీవాత్మగా మారుతున్నాడు. దేహముతో చేరి తానే దేహము అనుకొని ప్రాపంచిక విషయములలో మునిగితేలుతున్నాడు.

దీనికి చిన్న ఉదాహరణ చెప్పుకోవాలంటే మీరు గిన్నె స్టవ్‌మీద పెట్టి నీళ్లు పోసారు. ముందు గిన్నె వేడెక్కింది. తరువాత నీళ్లు వేడెక్కాయి. నీటి యొక్క అసలు గుణం చల్లగా ఉండటం. అగ్నియొక్క సహజ గుణం వేడి. నీరు, అగ్నితో చేరి వేడెక్కాయి. అంటే నీరు తన సహజ గుణం అయిన చల్లదనాన్ని పోగొట్టుకొని, అగ్ని ప్రభావంతో వేడెక్కాయి. కాసేపాగి చల్లారి పోతాయి అంటే నీళ్లు మరలా తన సహజ గుణంలోకి మారి పోతాయి.

అలాగే, జడములైన మన శరీరము, మనస్సు, బుద్ధి కూడా, లోపల ఉన్న ఆత్మ అనే చైతన్యాన్ని అరువు తీసుకొని చేతనత్వాన్ని పొందుతాయి. శరీరంలో పటుత్వం ఉన్నంతవరకు ఆ చేతనత్వం ఉంటుంది. తరువాత చేతనత్వం పోతుంది. శరీరం శవంగా మారుతుంది. అంటే శరీరం తన సహజ గుణం అయిన జడత్వాన్ని పొందుతుంది. ఈ చేతనత్వం మన శరీరంలో ఉన్నంత కాలం, శరీరము, మనస్సు, బుద్ధి ఈ ప్రకృతిలో విహరిస్తూ ఉంటుంది. వాటితో పాటు చేతనత్వంకూడా విహరిస్తూ ఉంటుంది. అన్నీ తానే అనుకుంటూ భ్రమచెందుతూ ఉంటుంది. మనం దానినే అహంకారము అని పిలుచుకుంటాము. క్లుప్తంగా చెప్పాలంటే ఆత్మ చైతన్యం, జడమైన శరీరము,మనస్సు,బుద్ధి వీటితో కలిస్తే, అహంకారం పుడుతుంది. ఈ అహంకారము మూడు గుణములతో ప్రభావితమై, బంధనాలకు కారణం అవుతుంది. ఇదంతా కలిపి సంసారం అని కూడా అని అంటారు. మనలో ఉన్న జ్ఞానం ఉపయోగించి, ఈ మూడు గుణాలను తెలివిగా, వివేకంతో వాడుకుంటే ఈ గుణాలు మనలను బంధించవు. అలా కాకుండా, మనం ఆ గుణాల ప్రభావంలో పడి, వాటి వశంలో ఉంటే, అవి బంధనాలు కలుగచేస్తాయి. అవే మరుజన్మకు కారణం అవుతాయి.

## 6. తత్ర సత్త్వం నిర్మలత్వా త్ప్రకాశకమనామయమ్।
## సుఖసఙ్గేన బధ్నాతి జ్ఞానసఙ్గేన చానఘ॥

ఓ అర్జునా! ఈ మూడుగుణములు అంటే సత్త్వ,రజస్,తమోగుణములలో, సత్త్వగుణము స్వచ్ఛమైనది. నిర్మలమైనది. ప్రకాశ వంతమైనది. ఎటువంటి ఒడిదుడుకులు, ఉపద్రవములు లేనిది.

ప్రకృతిలో మూడుగుణాలు ఒకదానితో ఒకటి కలిసి ఉన్నాయి. ఒకే గుణం ఉన్న జీవి ఉండదు. అలా ఎందుకు అంటే, ఏ పని చేయడానికైనా రజోగుణము కావాలి. పని చేసి అలసి పోతే విశ్రాంతి తీసుకోవడానికి, నిద్రపోవడానికి తమోగుణము కావాలి. కాబట్టి పరమ సాత్వికగుణము కలవాడికైనా, రజోగుణము, తమోగుణము లేకపోతే జీవితం సాగదు. కాకపోతే సత్వగుణము ఎక్కువగా, రజస్తమోగుణములు కొద్దిపాళ్లలో ఉన్న వారిని శుద్ధసత్వగుణ సంపన్నుడు అని అంటారు.

ఇంక సత్వగుణము కలిగిన వాడి లక్షణాల గురించి చెబుతున్నాడు కృష్ణుడు. సత్వగుణము కలిగిన వాడు ప్రకాశవంతంగా, నిర్మలంగా ఉంటాడు. అంటే మంచి తెలితేటలతో వెలిగి పోతుంటాడు. సోమరి తనం ఉండదు. విషయగ్రహణ శక్తి, ధారణ శక్తి అంటే జ్ఞాపక శక్తి ఎక్కువగా ఉంటుంది. మనసు నిర్మలంగా ఉంటుంది. చెడు ఆలోచనలు ఉండవు. సాత్వికుడి మనస్సు ఎటువంటి వికారములకు, ఒడిదుడుకులకు, ఒత్తిళ్లకు లోను కాదు. ఎల్లప్పుడూ ప్రశాంతంగా సమత్వ బుద్ధి కలిగి ఉంటుంది.

కాని, ఈ సత్వగుణముతో పాటు మానవ సహజమైన కించిత్ అహంకారము కూడా చేరుతుంది. దీనినే సాత్వికాహంకారము అని అంటారు. ఇటువంటి సత్వగుణము కూడా సాత్వికమైన విషయములలో బడి, చిన్న చిన్న ఇంద్రియ సుఖములకు ఆశపడి, బంధనములు పొందుతూ ఉంది. నేను పండితుడను, నేను పరమ భక్తుడను, నేను జ్ఞానిని, నాకంతా తెలుసు, దేవుడు నాకు కనపడతాడు, నాతో మాట్లాడతాడు, నేను పరమయోగిని ఇవన్నీ సాత్వికమైన అహంకారాలు. చాలా మంది స్వామీజిలు ఇలాంటి మాటలు అనడం మనం చూస్తున్నాం. వింటున్నాం. ఇలా అనుకోవడం వలన మానసికంగా సాత్వికమైన సుఖం అనుభవిస్తాడు. అది కూడా బంధనములు కలుగజేస్తుంది. కాబట్టి మోక్షం పొందాలంటే, జీవన్ముక్తుడు కావాలంటే, ఈ సాత్వికాహంకారము కూడా పనికిరాదు. ఇది కూడా దాటాలి. అప్పుడే పరమాత్మలో సాయుజ్యం పొందడానికి మార్గం ఏర్పడుతుంది.

7. రజో రాగాత్మకం విద్ధి తృష్ణా సఙ్గసముద్భవమ్।
తన్నిబధ్నాతి కౌన్తేయ! కర్మసఙ్గేన దేహినమ్॥

ఓ కుంతీకుమారా! రజోగుణము ప్రాపంచిక విషయములమీద రాగము అంటే ఆసక్తి ని కోరికలను కలుగజేస్తుంది. అంటే రజోగుణము నుండి తృష్ణ, కోరికలు పుడతాయి. ఆ కోరికలు తీరడానికి వివిధములైన కర్మలు చేస్తారు. ఆ కర్మలు ఏదో ఒక ఫలితాన్ని ఇస్తాయి. ఆ కర్మఫలములు దేహములో ఉన్న జీవాత్మను బంధిస్తాయి. కాబట్టి రజోగుణము బంధనములు కలుగజేస్తుంది.

ఇంక రజోగుణము గురించి చెబుతున్నాడు కృష్ణుడు. మనం ఈ ప్రపంచంలో ఎన్నో వస్తువులను చూస్తుంటాము. ఎన్నో విషయముల గురించి వింటుంటాము. ఎంతో మందిని తాకుతుంటాము. దీని వలన ప్రాపంచిక విషయముల మీద తృష్ణ, ఆసక్తి, ప్రేమ, ప్రీతి కలగడమే కాకుండా, అవి అన్నీ నాకు కావాలని, నాకే కావాలని కోరికలు పుడతాయి. ఇదే రజోగుణ లక్షణము. దీనినే తృష్ణ అంటారు. తృష్ణ అంటే కోరికకు పరాకాష్ట. ముందు ఆసక్తి కలుగుతుంది. అది కోరికగా మారి, గాఢమై తృష్ణగా మారుతుంది. ఆ తృష్ణను తీర్చుకోడానికి ఎన్నో కర్మలు చేస్తాడు. ఆ కర్మలు జీవుని బంధిస్తాయి. క్లుప్తంగా చెప్పుకోవాలంటే కోరిక గాఢమైతే తృష్ణ పెరుగుతుంది. కోరుకున్నది దొరికితే దాని మీద సంగమము, అభిమానము పెరుగుతాయి. దొరికింది చేజారిపోతుందేమో అని భయం కూడా కలుగుతుంది. ఇవే బంధనములకు కారణం అవుతాయి.

పోనీ ఏమీలేని వాళ్లు కోరుకోవడంలో అర్థం ఉంది. అన్నీ ఉన్న వాళ్లు కూడా చూచినది అంతా తనకే కావాలనే తృష్ణ పెంచుకుంటారు. అది దొరకక పోతే అల్లల్లాడి పోతారు. అన్నీ ఉన్నవాళ్ల పిల్లలు కార్ల దొంగతనాలు, చిల్లర దొంగతనాలు చేయడం మనం వింటున్నాము. ఇంకొంత మంది ఉన్నదానితో తృప్తి చెందరు. తమకు, తమ సంతానానికి, వారికి పుట్టబోయే సంతానానికి కూడా ఇప్పుడే సంపాదిస్తుంటారు. తను లేకపోతే వీళ్లంతా ఏమైపోతారో అని దిగులుపడుతుంటారు. కాబట్టి సంపదలు ఉన్నాయా లేవా, ఉంటే ఎంత సంపద ఉంది అని కాదు ముఖ్యం. మానవునిలో రజోగుణము ఎక్కువగా ఉండటం; ప్రతిదీ కావాలని కోరికలను పెంచుకోవడం; ఆ కోరికలకు అంతులేకపోవడం; ప్రధానం.

కోరికలు ఉండటం తప్పుకాదు. శృతిమించిన కోరికలు, తృష్ణగా మారి బంధనాలను కలుగజేస్తాయి. అవి తీరకపోతే బతకలేను అనే తృష్ణను పెంచుతాయి. పోనీ అన్ని కోరికలు తీరి, అనుకున్నవి అనుకున్నట్టు జరిగితే భగవద్గీత చదవనక్కరలేదు. కాని తీరిన కోరిక ఒకటి అయితే తీరని కోరికలు వెయ్యి. ఒక కోరిక తీరగానే పది కోరికలు పుట్టుకొస్తాయి. కాబట్టి రజోగుణము

వలన బంధనములు కలుగుతాయి అనీ, తద్వారా నిరంతర దు:ఖమే కానీ సుఖము లేదు అని తెలుసుకోవాలి అని చెప్పాడు కృష్ణుడు.

## 8. తమ స్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినామ్।
## ప్రమాదాలస్యనిద్రాభిస్తన్నిబధ్నాతి భారత॥

అర్జునా! ఈ తమోగుణము అజ్ఞానము లోనుండి పుడుతుంది. ఇది సకల జీవరాసులకు మోహమును కలుగజేస్తుంది. ఈ తమోగుణము, పరాకుగా ఉండటం, నిర్లక్ష్యము, సోమరితనము, నిద్ర మొదలగు లక్షణములతో కూడి ఉంటుంది.

ఇంక తమోగుణము గురించి చెబుతున్నాడు కృష్ణుడు. మానవులలో అజ్ఞానం సహజంగా ఉంటుంది. లేని దానిని ఉన్నట్టుగా భ్రమచెందడమే అజ్ఞానము. తాడును చూచి పాము అనుకొని భయపడటమే అజ్ఞానము. రోజూ ఎంతో మంది మరణిస్తున్నా తాను మాత్రం శాశ్వతంగా ఉంటాను అని అనుకోవడమే అజ్ఞానం. సుఖం వెంట దు:ఖం వస్తుందని తెలిసినా, సుఖం వచ్చినపుడు ఎగిరి గంతేయడం,దు:ఖం వచ్చినపుడు కుంగి పోవడమే అజ్ఞానము. ఈ ప్రపంచంలో ఉన్న అన్ని వస్తువులు శాశ్వతములు కావు, మార్పుచెందేవి, నశించేవి అని తెలిసి కూడా వాటి కోసం వెంపర్లాడటం అజ్ఞానం. ఈ అజ్ఞానం లోనుండి పుట్టిందే తమోగుణము.

ఈ తమోగుణము ప్రాపంచిక వస్తువుల మీద మోహం కలుగచేస్తుంది. ఇది లేకపోతే నేను బతకలేను అనే భ్రాంతిని కలుగజేస్తుంది. ఆలోచనా శక్తిని, విచక్షణా జ్ఞానాన్ని నశింపచేస్తుంది. మొండితనాన్ని మూర్ఖత్వాన్ని పెంచుతుంది. ఈ తమోగుణ లక్షణములు ఏవంటే ఎప్పుడూ పరధ్యానంగా ఉండటం, ఏ పని మీదా శ్రద్ధలేకపోవడం, ప్రతి పనినీ తరువాత చేయవచ్చు అని అనుకోవడం, ఏ పనీ చేయకపోవడం, సోమరితనం, ఎప్పుడూ నిద్రపోవడానికే సుముఖత చూపడం, అనవసరమైనవాటి మీద ఆసక్తి కలిగి ఉండటం ఇవన్నీ తమోగుణ లక్షణాలు. ఈ అజ్ఞానంలో నుండి పుట్టిన తమోగుణంతో కూడిన వారు సంసార బంధనములలో సులభంగా చిక్కుకుంటారు. సూర్యుని దట్టమైన మేఘములు కప్పినట్టు, మానవునిలో ఉన్న జ్ఞానమును ఈ తమోగుణము కప్పివేస్తుంది.

సర్వదేహినామ్ అన్నాడు కృష్ణుడు అంటే ఈ తమోగుణము అనే మోహము సకల దేహధారులను ఆవహించి ఉంటుంది. ఎవరిలో తమోగుణము ప్రధానంగా ఉంది అని తెలుసుకోవాలంటే వారిలో ఉన్న ముఖ్యమైన కొన్ని లక్షణాలు పరిశీలించాలి.

ఎవరిలో సోమరితనము, ఎప్పుడూ మత్తులో ఉండటం, ఎల్లప్పుడూ నిద్రపోవడానికి ప్రయత్నించడం, అజాగ్రత్త, బద్ధకము, మొదలగు లక్షణములు ఎక్కువగా ఉంటాయో అతడు తమోగుణముతో బాధపడుతున్నాడు అని అర్థం. కాబట్టి ఈ తమోగుణమును మనందరం తొలగించుకోవడానికి ప్రయత్నించాలి.

## 9. సత్త్వం సుఖే సఞ్జయతి రజ: కర్మణి భారత।
## జ్ఞానమావృత్య తు తమ: ప్రమాదే సఞ్జయత్యుత॥

ఓ అర్జునా! సత్త్వగుణము సుఖమును ఇస్తుంది. రజోగుణము కర్మలు చేయడంలో ఆసక్తి కలుగజేస్తుంది. తమోగుణము మనలో ఉన్న జ్ఞానమును కప్పివేసి, నిర్లక్ష్యమును, సోమరితనమును కలుగజేస్తుంది.

పైన చెప్పబడిన ఈ మూడు గుణాలు వేటిలో ప్రవర్తిస్తుంటాయి అనే విషయం ఈ శ్లోకంలో వివరించాడు.

సత్త్వగుణము సుఖం కలుగజేస్తుంది.

రజోగుణము ఏదో ఒక పని చేయాలని కోరుకుంటుంది.

తమోగుణము ఏ పనీ చేయకుండా ఉండటానికి, ఒకవేళ చేసినా పొరపాటుగా చేయడానికి, తనలో ఉన్న జ్ఞానాన్ని కప్పిపెట్టి, అజ్ఞానంలో ప్రవర్తించడానికీ కోరుకుంటుంది.

ఈ విషయంలో రామకృష్ణపరమహంసగారి వ్యాఖ్యలను మనం తెలుసుకుందాము.

సత్వగుణం అంటే ఒక దీపం మీద స్వచ్ఛమైనగాజు చిమ్నీ పెట్టడం. అంటే తనలో ఉన్న జ్ఞానం అన్ని వైపులా ప్రసరింపచేయడం.

రజోగుణము అంటే ఒకదీపం మీద కంతలు ఉన్నగంప బోర్లించడం. అంటే తనలో ఉన్న జ్ఞానాన్ని కొద్ది కొద్దిగా బయటకు వేగంగా కర్మల రూపంలో ప్రసరింపచేయడం.

తమోగుణము అంటే ఒకదీపం మీద కుండ బోర్లిచడం అంటే తనలో ఉన్న జ్ఞానాన్ని పూర్తిగా కప్పిపెట్టి, అజ్ఞానంలో మునిగిపోవడం. చేయకూడని పనులు చేయడం.

ఈమూడు గుణములు బంధనములను కలిగించేవే. ఎందుకంటే ఈ మూడు గుణములు కలిగిన మానవుడు వాటికి దాసుడు అయి పోతాడు. వాటిలో మునిగి పోతాడు. తనను తాను బంధించుకుంటాడు. అవిలేకపోతే బతకలేను అనే స్థితికి వస్తాడు. కాబట్టి ఏదీ అతి పనికిరాదు. అంటీముట్టనట్టు ఉండాలి. తామరాకుమీదనీటి బొట్టులాగా ప్రవర్తించాలి. దేనికీ లొంగి

పోకూడదు. ఏ గుణముతోనూ బంధింపబడకూడదు అని బోధించాడు పరమాత్మ.

## 10. రజస్తమశ్చాభిభూయ సత్త్వం భవతి భారత।
## రజస్సత్త్వం తమశ్చైవ తమస్సత్త్వం రజస్తథా॥

ఓ అర్జునా! సత్త్వగుణము రజోగుణమును, తమోగుణమును అణిచివేస్తుంది. అలాగే రజోగుణము, సత్త్వ,తమోగుణములను అణిచివేస్తుంది. ఆఖరున తమోగుణము, సత్త్వ, రజోగుణములను అణిచివేస్తుంది.

ఈ ప్రకృతిలో ఉన్న ప్రతి వస్తువులో అంటే కదలనివి(పర్వతములు, కొండలు, గుట్టలు,రాళ్లు), కదలకుండా కదిలేవి (చెట్లు, మొక్కలు, వృక్షములు), కదిలేవి (నాలుగు కాళ్ల, రెండు కాళ్ల, అనేక కాళ్ల జంతువులు, మనుషులు), మూడు గుణములు అంటే సత్వ,రజస్ తమోగుణములు ఉన్నాయి అని తెలుసుకున్నాము.

ఉదాహరణకు, పర్వతములు, కొండలు, గుట్టలు,రాళ్లు. ఇవి కదలవు. వీటిలో తమోగుణము 98 శాతం ఉంటే రజోగుణము 1 శాతం, సత్త్వ గుణము 1 శాతం ఉంటుంది.

రెండవ రకం వృక్షములు, చెట్లు, మొక్కలు. అవి కదలవు కానీ నీటినిపీల్చుకుంటాయి, శ్వాసిస్తాయి. వాటి ఆకులు వివిధగుణములు కలిగి ఉంటాయి, కొన్ని మొక్కలు అయితే తన దగ్గరకు వచ్చిన జంతువులను తనలోకి లాక్కుంటాయి, కొన్ని తాకితే ముడుచు కుంటాయి. కొన్ని స్పందిస్తాయి. మొక్కలు పుట్టడం, పెరగడం, పెద్దవి కావడంమన కళ్లముందే జరుగుతుంది. కాని కదలలేవు. వీటిలో తమోగుణము 50శాతము, రజోగుణము 45 శాతము, సత్వగుణము 5 శాతం ఉంటుంది.

ఇంక జీవజాతులు, రెండు కాళ్ల మనుషులు, నాలుగు ఇంకా అనేక కాళ్లతో నడిచే జంతువులు. వీరిలో వారి వారి ప్రవృత్తులను బట్టి మూడుగుణాల నిష్పత్తి మారుతూ ఉంటుంది. జంతువులలో వాటి స్వభావాన్ని బట్టి గుణాలు ఒకేసారి మారతాయి. కాని మానవుడికి వయసు పెరిగే కొద్దీ పరిసరాలకు అనుగుణంగా, కాలానికి అనుగుణంగా, వారి వారి గుణాలు మారుతుంటాయి. కొంతమంది సాత్వికులు అవుతారు,మరి కొంత మంది రజోగుణ ప్రధానులు అవుతారు,మరి కొంత మంది తమోగుణ ప్రధానులు అవుతారు.

అది ఎలాగంటే......ఈ మూడు గుణములు పైన చెప్పబడిన వాటిలో ఒకే విధంగా, ఒకే మోతాదులో ఉండవు. హెచ్చుతగ్గులుగా ఉంటాయి. సత్వగుణము మోతాదు ఎక్కువగా ఉంటే,

అది మిగిలిన రజస్, తమోగుణములను అణగదొక్కుతుంది. సత్వగుణము మాత్రమే ప్రధానంగా ప్రకటితమౌతుంది. అదే రజోగుణము ఎక్కువగాఉంటే అది సత్త్వ,తమోగుణములను అణగదొక్కి తాను మాత్రమే ఎక్కువగా ప్రకటితమౌతుంది. అలాగే తమోగుణము ఎక్కువగా ఉన్నప్పుడు అది సత్వ,రజోగుణములను అణగదొక్కుతుంది. ఈ విధంగా ఒక్కొక్క పదార్థములో ఒక్కోగుణము ఎక్కువగా ఉంటుంది. కొందరిలో రెండుగుణాలు ఎక్కువ ఒక గుణము తక్కువగా ఉంటుంది. ఈ విధంగా ఈ మూడుగుణములు వివిధములైన పాళ్లలో బంధనములను కలుగజేస్తుంటాయి.

అంతే కాదు. ప్రతిరోజూ ప్రకృతిలో ఈ గుణాలు మారుతుంటాయి. సాధారణంగా మానవులలో ఉదయం 4 నుండి 8 వరకు సత్వగుణము ప్రధానంగా ఉంటుంది. అందుకే ఆ సమయంలోనే స్నానం, సంధ్య, హెూమం, పూజ చేయాలని చెప్పారు. ఎండ ఎక్కేకొద్దీ రజోగుణము ఎక్కువగా ఉంటుంది. అందుకని ఆ సమయంలో ఎవరెవరికి నిర్దేశింపబడిన కర్మలు వారు చేయాలి. సూర్యుడు అస్తమించగానే, తమోగుణము ప్రధానంగా ఉంటుంది. కాబట్టి నిద్రపోవాలని చెప్పారు.

(కాని మనం ఏం చేస్తున్నాము! ధన సంపాదన కొరకు, రాత్రిళ్లు పని చేస్తూ, పగలు కునికిపాట్లు పడుతున్నాము. కొంతమంది, విలాసాలతో రాత్రి 1 గంటదాకా క్లబ్బులు పబ్బులలో గడుపుతూ నిశాచరుల మాదిరి ప్రకృతి విరుద్ధంగా ప్రవర్తిస్తున్నారు.)

కాబట్టి వివేకి అయినవాడు ఏ గుణమునకు బంధితుడు కాకూడదు. అన్నీ సమానంగా, పరిమితంగా అనుభవించాలి. దేనికీ అడిక్ట్ కాకూడదు. అతి, విపరీతధోరణి పనికిరాదు. శాస్త్రఅధ్యయనం చేయాలి. ఇష్టదైవాన్ని ఉపాసించాలి, ధ్యానం చేయాలి. జీవనానికి ఏదో ఒక ఉద్యోగం, వ్యాపారం, ధర్మబద్దంగా, న్యాయబద్ధంగా, శ్రద్ధతో చేయాలి. అవసరము ఉన్నంత వరకే సంపాదించాలి. జీవితం ఆనందంగా గడపాలి. అంతేకానీ ఏదో ఒక గుణమునకు కట్టుబడి పోకూడదు. నిరంతరం సుఖ దు:ఖాలకు లోనుకాకూడదు.

## 11. సర్వద్వారేషు దేహేऽస్మిన్ప్రకాశ ఉపజాయతే।
## జ్ఞానం యదా తదా విద్యా ద్వివృద్ధం సత్త్వమిత్యుత॥

ఎవని శరీరంలో అయితే అన్ని జ్ఞాన ఇంద్రియములు జ్ఞానంతో ప్రకాశిస్తూ ఉంటాయో, అతనిలో సత్త్వగుణము ఎక్కువగా ఉన్నట్టు తెలుసుకోవాలి.

జీవులలో ప్రత్యేకించి మానవులలో, వారు చేసే పనులను బట్టి, వారి ప్రవర్తనను బట్టి, వారు తినే ఆహారమును బట్టి, మాట్లాడే పద్ధతిని బట్టి, వారి నడతను బట్టి, వారిలో ఏ గుణములు

ఎక్కువగా ఉన్నాయో మనము తెలుసుకోగలము.

జీవుల దేహములలో నవ రంధ్రములు ఉన్నాయి. అవే జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు. మనం జ్ఞానేద్రియములతో బయట ప్రపంచంలో ఉన్న విషయములను గ్రహిస్తూ ఉంటాము. వాటిని మనలో ఉన్న బుద్ధితో విశ్లేషించి, మనసుకు అందిస్తే, అది కర్మేంద్రియముల ద్వారా కర్మలు చేయిస్తుంది. ఎవరిలో అయితే జ్ఞానం ఎక్కువగా ఉండి ఆ జ్ఞానము జ్ఞానేంద్రియములద్వారా ప్రకాశిస్తూ ఉంటుందో, ప్రకటితమౌతూ ఉంటుందో, అటువంటి వాడిలో సత్వగుణము ఎక్కువగా ఉన్నట్టు తెలుసుకోవాలి.

వివరంగా చెప్పాలంటే సత్వగుణము ఎక్కువగా ఉన్నప్పుడు అతడి చర్యలు సాత్వికముగా, ప్రకాశవంతంగా, అందరూ మెచ్చుకునే విధంగా ఉంటాయి. అతని మాటలు మధురంగా ఉంటాయి. అతడు సాత్వికమైన ఆహారమునే తింటాడు. మంచి గ్రంధములను చదువుతాడు. అతని ఆలోచనలు ఉత్తమంగా, పదిమందికి ఉపయోగపడే విధంగా, సాత్వికంగా ఉంటాయి. అతడు ఎల్లప్పుడు ఉన్నతమైన ఆశయాలతో, భావాలతో ఉంటాడు. అతడి బుద్ధి చాలా చురుకుగా పనిచేస్తుంది. కర్పూరం అగ్ని దగ్గరకు రాగానే అంటుకున్నట్టు, సత్వగుణ సంపన్నుడు అలా చెబితే ఇలా గ్రహిస్తాడు. అతని ముఖంలో ప్రశాంతత, జ్ఞాన ప్రకాశము కనపడుతుంది. ఏపని చేసినా ఓర్పుతో, శ్రద్ధతో చేస్తాడు. అతని వలన ఎవరికీ అపకారం జరగదు. అందరితో సఖ్యంగా ఉంటాడు. అందరిచేతా గౌరవింపబడుతుంటాడు. అటువంటివ్యక్తి సత్వగుణ సంపన్నుడు అని మనం గుర్తించవచ్చును.

## 12. లోభ: ప్రవృత్తి రారమ్భ: కర్మణామశమ: సస్పృహా।
## రజస్యేతాని జాయన్తే వివృద్ధే భరతర్షభ॥

ఓ అర్జునా! ఎవరిలో అయితే రజోగుణము ఎక్కువగా ఉంటుందో, వారిలో లోభత్వము, ప్రతి పనీ చేయాలనే ఉత్సాహము, ఉద్రేకము, ఎల్లప్పుడూ అశాంతితో ఉండటం, అన్నీ తనకే కావాలనే ఆశ ఎక్కువగా ఉండటం, ఈ లక్షణాలు ఎక్కువగా ఉంటాయి.

ఇంక రజోగుణము ఎక్కువగా ఉన్న వారి లక్షణముల గురించి చెప్పాడు పరమాత్మ. ఇతడు ప్రతి పనీ చేయాలని ఉత్సాహపడుతుంటాడు. దేనినీ వదిలిపెట్టడు. ఎక్కువగా తనకు అవసరంలేని, పనికిరాని పనులు చేస్తుంటాడు. ఎప్పుడూ ఏదో ఒక విషయం గురించి ఆలోచిస్తూ బాధపడుతుంటాడు. అతనికి మనసుకు శాంతి కరువవుతుంది. ఎప్పుడూ ఏవేవో కోరికలు కోరుకుంటూ, ఆ కోరికలు తీరడానికి ఏదో ఒక పని చేయాలని ఉత్సాహంగా ఉంటాడు. ఆ

ఉత్సాహంలో నిషిద్ధకర్మలు అంటే చేయకూడని పనులు, చేయరాని పనులు కూడా చేస్తుంటాడు. ఆ పని సఫలం అయితే అంతా తన మహిమ వల్ల జరిగింది అని అనుకొని అపరిమితంగా సంతోషిస్తాడు. ఆ పని సఫలం కాకపోతే, నెపం తన శత్రువుల మీదికో, లేక విధి, దేవుడి మీదకో నెట్టి, అత్యంత దు:ఖము అనుభవిస్తాడు. దాని వలన అతనికి మనశ్శాంతి ఉండదు.

ఇటువంటి రజోగుణ సంపన్నుడికి, లోభము, ఆశ ఎక్కువగా ఉంటుంది. ఓర్పు అసలే ఉండదు. చిన్న ఆలస్యాన్ని కూడా భరించలేడు. తనకు ఎదురు చెబితే సహించలేడు. అన్నివస్తువులు తనకే కావాలనే ఆశ, అత్యాశ ఉంటుంది. తనకు ఉన్నది ఎవరికీ ఇవ్వడానికి ఇష్టపడడు. ఉన్నది పోతుందేమో అనే లోభత్వం, లేనిది కావాలని ఆశ ఈ రెండింటితో సతమతమౌతుంటాడు. ఎన్ని ఉన్నా, శాంతి సుఖం లేకుండా భారంగా బతుకుతుంటాడు.

## 13. అప్రకాశో2ప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవ చ।
## తమస్యేతాని జాయన్తే వివృద్ధే కురునన్దన॥

ఓ అర్జునా! తమోగుణము ఎక్కువగా ఉన్న వాడికి వివేకము, బుద్ధి పనిచేయవు, మందబుద్ధిగా ఉంటాడు. ఏ పని చేయడానికి ఇష్టపడడు. సోమరితనమునకు అలవాటు పడతాడు. ఎప్పుడూ పరధ్యానంగా ఉంటాడు. పొరపాట్లు చేస్తుంటాడు. మూర్ఖంగా ప్రవర్తిస్తుంటాడు. వాడికి తెలియదు, ఒకరు చెబితే వినడు. ఇవీ తామసగుణ లక్షణములు.

తమోగుణము ఎక్కువగా ఉన్న వారిలో అజ్ఞానము, అవివేకము, అవిద్య ఎక్కువగా ఉంటాయి. వారి ముఖంలో తేజస్సు ఉండదు. వాడిపోయిన ముఖంతో ఉంటారు. ఎప్పుడో ఏదో పోగొట్టుకున్న వారి మాదిరి ముఖం పెడతారు. వారు మనసు, ఇంద్రియములు, చెప్పినట్టు చేస్తారు. బుద్ధి చెప్పినట్టు వినరు. ఎక్కువగా సోమరితనము ఉంటుంది. ఎవరి మాటా వినరు. తమకు తోచింది చేస్తారు. ఏ మాత్రం జాగ్రత్తలు తీసుకోరు. అజాగ్రత్తగా ఉంటారు. ప్రమాదాలు కొనితెచ్చుకుంటారు. మూర్ఖంగా, మూఢంగా ప్రవర్తిస్తారు. అన్నీ తమకే తెలుసనే అపోహలో ఉంటారు. ఉన్నది లేనట్టు, లేనిది ఉన్నట్టు భ్రమలో ఉంటారు. పొరపాట్లు చేస్తుంటారు. పరధ్యానంగా ఉంటారు. చూచిన ప్రతి వస్తువు మీదా మోహం పెంచుకుంటారు. అది నాకు కావాలనే మూర్ఖపు పట్టుదలతో ఉంటారు.

## 14. యదా సత్త్వే ప్రవృద్ధే తు ప్రళయం యాతి దేహభృత్।
## తదోత్తమవిదాం లోకా నమలాన్ప్రతిపద్యతే॥

మరణించే సమయంలో ఎవరిలో అయితే సత్వగుణము ఎక్కువగా ఉంటుందో, ఆ దేహములో ఉన్న సూక్ష్మదేహము (జీవాత్మ) మరణించిన తరువాత, యోగులు, వేదవిదులు, జ్ఞానులు పొందే ఉత్తమములు, పరిశుద్ధములు అయిన లోకములు పొందుతుంది.

ఇప్పటి వరకు మూడుగుణములు కలవారు ఎలా ఉంటారో తెలుసుకున్నాము. మరణ కాలంలో మానవుడు సత్వగుణసంపన్నుడుగా ఉంటే, మరుజన్మలో ఉత్తమ లోకములను పొందుతాడు. మరు జన్మ ఉత్తమమైన జన్మ లభిస్తుంది. అంటే చనిపోయేటప్పుడు ఏ గుణము ఉచ్ఛస్థితిలో ఉంటుందో ఆ గుణమునకు అనువైన లోకములను పొందుతారు. సత్వగుణ సంపన్నులకు ఉత్తమ లోకములు, ఉత్తమ జన్మ వస్తుందని చెప్పుకున్నాము.

అంటే, కేవలం చని పోయే ముందు సాత్వికంగా ఉంటే సరిపోదు. జీవితాంతం సత్వగుణ సంపన్నుడుగా ఉండాలి. అప్పుడే చనిపోయే ముందు కూడా సత్వగుణ సంపన్నుడుగా ఉంటాడు. అలా కాకుండా మరణ సమయంలో కూడా ఆస్తి పాస్తుల గురించి, బంధువుల గురించి ఆలోచిస్తుంటే, తాను జీవితంలో చేయలేని పనుల గురించి తలచుకుంటుంటే, అతనిలో సత్త్వగుణం ఏ కోశానా కనిపించదు.

సత్వ గుణం అభివృద్ధి చెందడానికి ఏంచేయాలంటే, ముందు చిత్తములో నుండి రజోగుణము, తమోగుణములను తొలగించాలి. అప్పుడు సత్వగుణము కోసం సాధన చేయాలి. జీవితంలో నిష్కామ కర్మలు, కర్తృత్వ భావనలేని కర్మలు, పుణ్యకార్యములు, పరోపకారం చేస్తే అంత్యకాలంలో కూడా అటువంటి సాత్వికభావనలే కలుగుతాయి. అంతేకానీ, జీవితాంతం రజోగుణము, తమోగుణములో ఉండి, అంత్యకాలంలో నారాయణా అన్నా, కృష్ణా అన్నా ఏమీ ప్రయోజనము లేదు. ఆఖరు రోజుల్లో సత్వగుణము ఏర్పడటం చాలా కష్టము.

## 15. రజసి ప్రళయం గత్వా కర్మసఙ్గిషు జాయతే।
## తథాప్రలీనస్తమసి మూఢయోనిషు జాయతే॥

అదే విధంగా, అంత్యకాలంలో రజోగుణము ప్రధానంగా ఉన్న వారు ఎక్కువగా కర్మలు చేసే అవకాశము ఉన్న జన్మలు ఎత్తుతారు. అలాగే మరణ సమయంలో తామస ప్రవృత్తి

కలిగిన వారు, మరుజన్మలో మూఢుడు అవివేకి, అజ్ఞానిగానో లేక అటువంటి లక్షణములు కల జంతువుగానో, పక్షిగానో పుడతాడు.

సత్వగుణము ఎక్కువగా ఉంటే పుణ్యలోకాలు వస్తాయి అని చెప్పారు పరమాత్మ. ఇప్పుడు రజోగుణము, తమోగుణము ఎక్కువగా ఉన్నప్పుడు మరణిస్తేవారికి జనన మరణ చక్రము తప్పదు అని అన్నారు. అంటే తాముచేసిన కర్మలకు ఫలము మానవులుగా పుట్టి మాత్రమే అనుభవించాలి. మరోమార్గంలేదు. కాబట్టి రజోగుణము ఎక్కువగా ఉన్న వారు కర్మలయందు ఎక్కువగా ఆసక్తి ఉన్న వారి గృహములలో జన్మిస్తారు. కాని తమోగుణము ఎక్కువగా ఉన్న వారు మూఢయోనులు అంటే ఏమాత్రం బుద్ధి, జ్ఞానం, ఆలోచన లేని వారి ఇంట్లో జన్మిస్తారు. అది మానవజన్మ కావచ్చు, మృగ, పశు, పక్షి, కీటక జన్మలు కావచ్చు. ఎందుకంటే వాటికి ఆలోచనా శక్తి ఉండదు. ఏది తోస్తే అది చేసెయ్యడమే. వాటి వాటి సహజలక్షణముల బట్టి ప్రవర్తిస్తుంటాయి. వాటికి మంచి పనులు చేసే స్వతంత్రత, బుద్ధి, జ్ఞానము ఉండదు. రజస్తమోగుణములలో జీవితాంతం పడిఉన్న వారు, మరణించిన తరువాత వారి వారి గుణములకు తగ్గ యోనులలో పుడుతూ చస్తూ ఉంటారు. కాబట్టి జీవితాంతం సత్వగుణమును అలవరచుకోవడమే మంచిది.

## 16.కర్మణస్సుకృతస్యాహు స్సాత్త్వికం నిర్మలం ఫలమ్।
## రజసస్తు ఫలం దు:ఖ మజ్ఞానం తమస: ఫలమ్॥

సత్వగుణముతో ఉన్న వారు చేసే సాత్వికమైన కర్మలకు నిర్మలమైన ఫలము లభిస్తుంది. రజోగుణముతో ఉన్న వారు చేసే రాజసమైన కర్మలకు దు:ఖము కలుగుతుంది. తమోగుణముతో కూడిన తామస కర్మలు చేసే వారికి అజ్ఞానము, అవివేకము ఎక్కువవుతుంది.

పై శ్లోకంలో మానవుడు మరణించిన తరువాత కలిగే ఫలితముల గురించి జన్మల గురించి చెప్పారు. ఈ శ్లోకంలో జీవితాంతం ఈ మూడుగుణములు కలిగిన వాళ్లకు ఈ లోకంలోనే, జీవించి ఉండగానే, ఏమేమి ఫలములు కలుగుతాయో క్లుప్తంగా చెప్పాడు కృష్ణుడు. సత్త్వగుణ ప్రధానమైన కర్మలు చేస్తే సుఖము, శాంతి కలుగుతాయి. రజోగుణ ప్రధానమైన కర్మలు చేస్తే మొదట్లో సుఖం కలిగినా, చివరకు అది దు:ఖంతో ముగుస్తుంది. తమోగుణప్రధాన కర్మలు చేస్తే మోహంకలుగుతుంది. ప్రతి దానినీ తప్పుగా అర్థం చేసుకోవడం, విపరీతార్థాలు తీయడం చేస్తుంటారు. వారిలో అజ్ఞానం, అవివేకము పెరుగుతుంది. ఆలోచనా శక్తి నశిస్తుంది.

ఈ లోకంలో ప్రతి ఒక్కరికీ సుఖ పడాలనే కోరిక ఉంటుంది. సుఖపడటానికి మార్గాలు ఎన్నో ఉన్నాయి. ఎవరూ దు:ఖపడాలని కోరుకోరు. కాబట్టి ఏ యే పనులు చేస్తే

సుఖంకలుగుతుందో ఆయాపనులనే చేయాలి. దు:ఖం కలిగించే పనులు చేయకూడదు. కేవలం సాత్విక కర్మల చేతనే సుఖం కలుగుతుంది. రజోగుణము తమోగుణము ప్రధానంగా ఉన్న కర్మలు చేస్తే దు:ఖము అజ్ఞానము మోహము కలుగుతాయి. కాబట్టి వాటిని వదిలిపెట్టి సాత్విక కర్మలవైపు అడుగులు వేయాలి.

రజోగుణము వలన దు:ఖం ఎందుకు వస్తుంది అంటే కామము, క్రోధము రజోగుణ ప్రధానములు. ఈ రెండూ మొదట్లో సుఖాన్ని ఇచ్చినా చివరకు దు:ఖం కలిగిస్తాయి. ఇంక తమోగుణము వలన మోహం కలుగుతుంది. అన్నీ తప్పుడు నిర్ణయాలు తీసుకుంటాము. దాని వలన హాని కలుగుతుంది. కాబట్టి భక్తులు ఈ రెండు గుణములను వదిలిపెట్టాలి.

## 17.సత్త్వాత్సఞ్జాయతే జ్ఞానం రజసో లోభ ఏవచ।
## ప్రమాదమోహౌ తమసో భవతో2జ్ఞానమేవచ॥

సత్వగుణము వలన జ్ఞానము, రజోగుణము వలన లోభము, తామస గుణముతో మోహము, భ్రమ, నిర్లక్ష్యము, అజాగ్రత్త, ప్రమాదము మొదలైన లక్షణములు కలుగుతాయి.

సాధారణంగా నెమ్మదిగా, ప్రశాంతంగా ఉండే వారు కూడా వారికి నచ్చని విషయం జరిగితే తాత్కాలికంగా కోప పడతారు. ఆ కోపంలో ఏంచేస్తున్నామో తెలియదు. ఏమేమో చేస్తారు. తరువాత బాధపడతారు. నాకు సాధారణంగా కోపం రాదు కానీ, ఏదో అప్పుడప్పుడు కోపం వస్తుందండి అని తమకు తాము సర్దిచెప్పుకుంటారు. అలా అప్పుడప్పుడుకోపం వచ్చి వచ్చి అదే అలవాటుగా మారే ప్రమాదం ఉందని పరమాత్మ మాటి మాటికీ మనలను హెచ్చరిస్తున్నాడు.

అయ్యా! సత్వగుణం కలిగి ఉండండి. జ్ఞానం సంపాదించండి. పరమాత్మను గురించి తెలుసుకోండి. రజోగుణములో పడి లోభత్వమునకు గురి కాకండి అని మాటి మాటికీ చెబుతున్నాడు పరమాత్మ. ఎంతటి సత్వగుణ సంపన్నుడికైనా లోభత్వము కాస్తంత ఉంటుంది. తనకు లభించిన జ్ఞానం, విద్య ఇతరులకుచెప్పకపోవడం కూడా లోభత్వమే. తనకు ఉన్న ధనం నాది అని దాచుకోవడం, అంతా నాకే కావాలి అని అనుకోవడం ఎంతటి లోభత్వమో అలాగే తాను ఆర్జించిన విద్య, జ్ఞానము తనలో దాచుకోవడం కూడా అంతే లోభత్వము. ఈ లోభత్వానికికూడా మనం గురికాకూడదు.

ఇంక అన్నిటి కంటే ప్రమాదమైనది తామసము. అమితమైన నిర్లక్ష్యము. ప్రతి దానినీ తప్పుగా అర్థం చేసుకోవడం. ఏ పనీ సక్రమంగా చేయకపోవడం. సోమరి తనం. మాదక ద్రవ్యాలకు అలవాటు పడటం. ఎప్పుడూ మత్తుగా ఉండటం. ఇవి ఒక సారి అంటుకుంటే వదలవు.

ఉదాహరణకు.... ఆఫీసులకు ఆలస్యంగా వెళ్లేవారు, వెళ్లిన తరువాతకూడా పని చేయకుండా కబుర్లతో కాలక్షేపం చేసేవారు, నిద్రపోయేవారు, కాంటీన్లలో కాలక్షేపం చేసేవారు, "వీడు ఇచ్చే జీతానికి ఈ పని చాల్లే" అని నిర్లక్ష్యంగా పనిచేసేవారు, ఈ కోవలోకి వస్తారు. వీళ్లంతా చివరకు కష్టాల్లో చిక్కుకుంటారు. అందుకే ఈ గుణాల గురించిమాటి మాటికీ మనలను జాగృత పరుస్తున్నాడు పరమాత్మ.

## 18. ఊర్ధ్వం గచ్ఛన్తి సత్త్వస్థా మధ్యేతిష్ఠన్తి రాజసా। జఘన్యగుణవృత్తిస్థా అధోగచ్ఛన్తి తామసా:॥

ఈ మూడుగుణముల వారు మరణించిన తరువాత ఏయే లోకములకు పోతారు అని వివరించాడు పరమాత్మ. సత్వగుణ ప్రధానులు ఊర్ధ్వలోకములకు వెళుతారు. రజోగుణము కలవారు మధ్యలో ఉన్న మానవలోకంలో ఉంటారు. తామస గుణము కలవారు అధోలోకములకు వెళతారు.

మనకు పైన ఏడు లోకాలు కింద ఏడు లోకాలు ఉన్నాయి అని చెబుతారు. భూలోకము మనది. భువర్లోకము. సువర్లోకము, మహర్లోకము, జన లోకము, తపోలోకము, సత్యలోకము. మొదటి మూడు లోకములనుండి ఆపై మూడు లోకములకు మహర్లోకము ద్వారము వంటిది. సత్వగుణ ప్రధానులు మరణానంతరము ఈ లోకములకు వెళతారు. రజోగుణ ప్రధానులు స్వర్గందాకా వెళతారు. యజ్ఞయాగములు, తపస్సు, చేసి స్వర్గలోక సుఖాలు పొంది మరలా మానవులుగా పుడతారు. తమోగుణ ప్రధానులు అధోలోకములకు వెళతారు. అధోగతి అంటే వారి వారి ప్రవృత్తులకు తగ్గట్టు పశు,పక్ష్యాదులుగానూ, లేక దు:ఖభరితమైన జీవనంతో కూడిన మానవులుగానూ జన్మిస్తారు.

కేవలం మానవులకే అన్వయించుకుంటే, ఊర్ధ్వం గచ్ఛన్తి అంటే సత్వగుణ సంపన్నుడు జీవితంలో పైపైకి ఎదుగుతాడు. జ్ఞాని అవుతాడు. అందరిచేతా గౌరవింపబడతాడు. పదిమంది చేత మన్ననలు పొందుతాడు. రెండవ వాడు మధ్యేతిష్ఠన్తి అంటే రజోగుణము కలవాడు అటు జ్ఞాని కాలేడు ఇటు పతనం పొందలేడు. మధ్యస్తంగా ఉంటాడు. అన్నీ ఉంటాయి కాని ఏమీ లేని వాడి మాదిరి ఎల్లప్పుడూ ఇంకా ఇంకా కావాలని కోరుకుంటూఉంటాడు. దాని కోసం నిరంతరం ప్రయత్నిస్తుంటాడు. జీవితంలో శాంతిసుఖం ఉండవు. ఇంక మూడవవాడు జఘన్యగుణవృత్తిస్థా అంటేవాడి గుణాలు అన్నీ నీచమైనవే. ఏమీ పని చేయడు. అప్పనంగా రాత్రికి రాత్రి కోటీశ్వరుడు ఐపోవాలనుకుంటాడు. దాని కోసం చేయరాని పనులు చేస్తాడు. అధోగచ్ఛన్తి అంటే అధోగతి పాలవుతాడు.

భూమినిరసాత్మకంగా అంటే సస్యశ్యామలం చేస్తున్నాను. ఓషధులను పండిస్తున్నాను.

కేవలం వెలుగు ఉంటే సరిపోదు కదా. వాటిని అనుభవించడానికి జీవరాసులు ఉండాలి కదా. అందుకని పరమాత్మ సూర్యునియొక్క యొక్క తేజస్సు, కాంతి, వేడి రూపంలో, ఈ భూమిలో ప్రవేశించి, జీవరాసులు పుట్టడానికి తగిన బలమును, శక్తిని ఇస్తున్నాడు. జీవరాసులు అన్నీ ఈ భూమి మీద బతకడానికి, తిరగడానికి వారికి ఆహార రూపంలో తగిన శక్తిని ఇస్తున్నాడు. రసాత్మకుడు అయిన చంద్రుడిరూపంలో కిరణములను భూమి మీద ప్రసరింపజేసి, భూమి మీద ఓషధులను, వివిధ రకములైన ధాన్యములను పండించడానికి తగిన ఓజస్సును(బలము, శక్తి) ఇస్తున్నాడు.

ఇప్పటి దాకా అన్నిటిలోనూ నేను ఉన్నాను అంటూ ఇప్పుడుకొంచెం విపులంగా ప్రాణికోటికి శక్తి, బలము నేనే ఇస్తున్నాను. వాటికి ఆహారము నేనే సమకూరుస్తున్నాను. అని అంటున్నాడు. నేటి విజ్ఞాన శాస్త్రం కూడా సూర్యుడే సమస్త జీవకోటికి ప్రాణ శక్తిని ప్రసాదిస్తున్నాడు అని నిరూపించింది. సూర్యుడు లేకపోతే ఈ జీవకోటి మనుగడ సాధ్యం కాదు. సూర్యరశ్మిలో డి విటమిన్ పుష్కలంగా ఉందని మనకు తెలుసు. అలాగే రాత్రి పూట చంద్రుడు ప్రకాశిస్తూ, మన పంటలకు, ఓషధులకు అవసరమైన శక్తిని, బలాన్ని ఇస్తున్నాడు. శరీరానికి, మనసుకు, సంతోషాన్ని ఆహ్లాదాన్ని, కలుగజేస్తున్నాడు.

సూర్యుడు చంద్రుడు, అగ్ని బాహ్య ప్రపంచంలో మనకు ఎలా ఉపయోగపడతారో తెలియజెప్పాడు కృష్ణుడు. ఇంక ఆంతరంగికంగా అంటే మన శరీరం లోపల, అగ్ని ఏ రూపంలో ఈ జీవకోటికి ఎలా ఉపయోగపడతాడో తరువాతి శ్లోకంలో వివరించాడు కృష్ణుడు.

## 14. అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రిత:।
## ప్రాణాపాన సమాయుక్త: పచామ్యన్నం చతుర్విధమ్॥

ఓ అర్జునా! నేను వైశ్వానరుడుఅనే అగ్ని రూపంలో ప్రాణుల శరీరంలో ఉంటూ, వారి శరీరాలకు కావలసిన వేడిని ఇస్తూ, వారుతిన్న నాలుగు విధములైన ఆహారములను

పచనంచేస్తున్నాను అంటే జీర్ణం చేస్తున్నాను.

సూర్యుడి వెలుగు, చంద్రుడి వెలుగు అన్నీ బయట ప్రపంచాన్ని చూడటానికి పనికి వస్తాయి. ఆహారధాన్యాలను ఓషధులను పండిస్తాయి. మూడవది అగ్ని. ఈ అగ్ని రెండు విధాలు. మొదటిది బయట ఉండే అగ్ని. రెండవది అన్ని వస్తువులలో, పదార్థాలలో, భావాలలో అంతర్లీనంగా ఉండే అగ్ని. ప్రతి వస్తువులో అగ్ని అంతర్లీనంగా ఉంటుంది. రెండు వస్తువులు రుద్దుకుంటే వేడి పుడుతుంది. రాయి, ఇనుము లాంటివి రాచుకుంటే అగ్నికణాలు పుడతాయి. అలాగే భావాలలో కూడా అగ్ని ఉంటుంది. కామాగ్ని, కోపాగ్ని అని కూడా అంటుంటాము.

ప్రస్తుతం కృష్ణుడు శరీరంలో అంతర్లీనంగా ఉంటే శరీర ఉష్ణోగ్రత, కడుపులో ఉండే జఠరాగ్నిని గురించి చెబుతున్నాడు. ప్రతి శరీరంలో కూడా పరిమితంగా ఉష్ణోగ్రత ఉంటుంది. మానవ శరీరంలో 98.4 డిగ్రీల ఉష్ణోగ్రత నిలకడగా ఉంటుంది. అది హెచ్చినా, తగ్గినా ప్రమాదమే. అలాగే జీవరాసులు, మానవులు అన్నీ తాము ప్రాణాలతో ఉండటానికి ఏదో ఒక ఆహారం తినాలి. తిన్న ఆహారం జీర్ణం కావాలి కదా. అది ఎలా జరుగుతుందో ఈ శ్లోకంలో వివరిస్తున్నాడు పరమాత్మ.

బయటే కాదు నేను జీవరాసులలో లోపల కూడా అగ్ని రూపంలో ఉంటాను. దానినే వైశ్వానరుడు అంటారు. అదే జఠరాగ్ని. ఈ జఠరాగ్ని మనం తిన్న నాలుగు రకాల ఆహారములను జీర్ణం చేస్తుంది. ఆ జఠరాగ్ని రూపంలో ఉన్న అగ్నిని నేనే అంటున్నాడు పరమాత్మ. అందుకే "ప్రాణినాం దేహమాశ్రిత:" అన్నాడు. అంటే ప్రతి ప్రాణి దేహములో జఠరాగ్ని రూపంలో నేనే ఉన్నాను.

పచామ్యన్నం చతుర్విధం అంటే నాలుగు రకములైన ఆహార పదార్థములను పచనం చేస్తున్నాను. అన్నం అంటే ఆహారము. కేవలము వరి అన్నమే కాదు. బియ్యముతో గానీ మరి ఏ ఇతర ధాన్యములతో గానీ పప్పు పదార్థములతోగానీ నాలుగు రకములైన ఆహార పదార్థములను తయారు చేస్తారు. వాటినే భక్ష్యములు, భోజ్యములు, లేహ్యములు, చోష్యములు. భక్ష్యములు అంటే గట్టిగా ఉండి కొరికి నమిలి తినే పదార్థములు. కూరలు, పిండి వంటలు. భోజ్యములు అంటే నాలుకతో చప్పరించేవి. మెత్తగా ఉండేవి. లేహ్యములు అంటే నాలుక మీద వేసుకొని లొట్టలేసేవి. పచ్చళ్లు, హల్వాలు మొదలగు పల్చటి,మెత్తటి పదార్థాలు. చోష్యములు అంటే పానీయాలు. నోటితో జుర్రుకునే పల్చటి పదార్థాలు, వివిధరకములైన పానీయాలు. మనం రోజూ తినేవి అన్నీ ఈ నాలుగింటిలో ఏదో ఒక రకమునకు చెందినవి అయి ఉంటావి. ఈ ఆహార పదార్థములను మనం నోటితో తింటాము. అవి గొంతు గుండా జీర్ణాశయములోకి వెళతాయి. ఇక్కడ ఒక విషయం మనం గుర్తుపెట్టుకోవాలి. గొంతు దాకా మన ఇష్టం. ఏది తినాలి ఏది తినకూడదు అని మనం నిర్ణయించుకుంటాము. ఒక సారి గొంతుదిగితే తరువాత వైశ్వానరుడి ఇష్టం. నువ్వు పాయసం తిన్నా, విషం తిన్నా తన పని తాను చేసుకుపోతాడు. ఆ వైశ్వానరుడే జఠరాగ్ని. మనం తిన్న అన్ని

పదార్థాలను వివిధ రసములతో కలిపి జీర్ణం చేసే అగ్ని లాంటి శక్తి. దానినే జీర్ణశక్తి అని కూడా అంటారు.

ఇక్కడ మరొక విషయం కూడా చెప్పాడు కృష్ణుడు. "ప్రాణాపాన సమాయుక్త:" అంటే ప్రాణము, అపానముతో కూడినది. లోపల ఉండే జఠరాగ్ని బాగా ప్రజ్వరిల్లాలంటే గాలి కావాలి కదా. అదే మనం పీల్చే గాలి, వదిలే గాలి. ఉచ్ఛ్వాస నిశ్వాసముల ద్వారా ప్రాణవాయువును పీల్చి వదులుతుంటాము. ఈ ప్రాణవాయువు లోపల ఉన్న అగ్నికి శక్తిని ఇస్తుంది. ఆ శక్తి వలన జఠరాగ్ని మనం తిన్న నాలుగు విధములైన ఆహార పదార్థములను జీర్ణం చేస్తుంది.

అందుకే అన్నం తినేటప్పుడు ఒక మంత్రం చదువుతారు. ముందు గాయత్రి మంత్రం చదువుతారు. తరువాత "అమృతమస్తు" అని తను తినబోయేఆహారం అమృతంతో సమానం కావాలి అని సంకల్పిస్తాడు. తరువాత "ఓం ప్రాణాయస్వాహా, అపానాయస్వాహా, వ్యానాయస్వాహా, ఉదానాయస్వాహా, సమానాయ స్వాహా అని తరువాత ఓం పరబ్రహ్మణే నమ:" అంటూ భగవంతుడిని తలంచుకొని భోజనం ప్రారంభిస్తాడు. ఈ ఆహారం అంతా ఆ పరబ్రహ్మ స్వరూపము (అన్నం పరబ్రహ్మ స్వరూపము) ఆయనకు నమస్కారము. నాఆహారమును సక్రమంగా జీర్ణం చేసి నాకు శక్తిని ప్రసాదించు అని సంకల్పించి భోజనానికి ఉపక్రమిస్తాడు. ఈ శాస్త్రీయ విధానము అంతా ఈ శ్లోకంలో వివరించాడు పరమాత్మ.

## 15. సర్వస్య చాహం హృది సన్నివిష్టో మత్త: స్మృతిర్జ్ఞాన మపోహనంచ।<br>వేదైశ్చ సర్వైరహమేవ వేద్యో వేదాన్తకృద్వేదవిదేవ చాహమ్॥

ఓ అర్జునా! నేను అందరి హృదయాలలో ఆత్మస్వరూపుడుగా ఉన్నాను. నా వలననే మానవులకు జ్ఞాపక శక్తి, జ్ఞాన శక్తి, ధారణ శక్తి, మరిచిపోయే శక్తి కలుగుతున్నాయి. నాకు వేదములు తెలుసు. నేను వేదస్వరూపుడను. వేదముల గురించి తెలిసిన వాడను కూడా నేనే.

పైన చెప్పబడిన శ్లోకంలో, మనం తిన్న ఆహారం జీర్ణం అయి ఎలా మనకు శక్తిని ఇస్తుంది అనే విషయం చెప్పిన తరువాత ఆ శక్తి ఎలా పని చేస్తుంది అనే విషయాన్ని ఈ శ్లోకంలో వివరిస్తున్నాడు.

మనం తిన్న ఆహారం వలన వచ్చిన శక్తి మనకు స్మృతి అంటే జ్ఞాపక శక్తి, ధారణా శక్తి, అవగాహనా, ఆలోచనా శక్తిని ఇస్తుంది. అలాగే అపోహనం అంటే మరచిపోయే శక్తిని కూడా

ఇస్తుంది. అపోహ అని వాడాడు పరమాత్మ. అపోహలు అని మనం వింటూ ఉంటాము. విషయాలను తప్పుగా అర్ధం చేసుకోవడం. అంటే మనం తినే ఆహారాన్ని బట్టి మనకు చురుకుదనం, జ్ఞాపకశక్తి కలుగుతాయి అలాగే అపోహలు, మతిమరుపు, చదివింది జ్ఞాపకం లేకపోవడం కలుగుతాయి. వీటి కంతా కారణం మన హృదయం లోపల ఉండి మనలో చైతన్య శక్తిని కలుగచేస్తున్న పరమాత్మ.

ఇది ఏ ఒక్కరికో ఏ జాతికో కులానికో ధనికులకో, అగ్రవర్ణాల వారికో పరిమితం కాదు. "సర్వస్య" అంటున్నాడు. అంటే అందరికీ సమానంగా వర్తిస్తుంది. బ్రాహ్మణులకే తెలివితేటలు ఉంటాయి. ఒక ప్రాంతం వారికే తెలివి తేటలు ఉంటాయి అని అనుకోవడం పొరపాటు. అది మనం చూపే వివక్షత. తినే ఆహారం, వాతావరణం, పరిసరాలు, పూర్వజన్మవాసనలు, మనోనిర్మలత్వం, ధార్మిక భావనలు, ధార్మిక జీవనం అన్నిటినీ మించి దైవబలం ఇవన్నీ ఒకవ్యక్తి యొక్క తెలివిని, ధారణా శక్తిని, మతి మరుపును నిర్ణయిస్తాయి. మనలను పరమాత్మ మన హృదయం లో ఉండి చూస్తున్నాడు. అనే విషయాన్ని మనం నిరంతరం గుర్తుపెట్టుకోవాలి. అప్పుడే ఎటువంటి అకృత్యాలకు పాలుపడే అవకాశం ఉండదు. జ్ఞాపక శక్తి, ధారణా శక్తి, జ్ఞాన శక్తి, మతిమరుపు, అపోహలు, ఇవన్నీ మనోవికారాలు. మనం తినే ఆహారాన్ని బట్టి ఇవి మనకు సంక్రమిస్తాయి.

వీటి వలన ఏం జరుగుతుంది అంటే తెలుసుకోదగిన వాటిని తెలుసుకుంటాము. వేదము అంటే తెలుసుకోతగినది. ఆ వేదములలో తెలుసుకోదగినది పరమాత్మ స్వరూపము. అదినేనే అంటున్నాడు. వేదములు చదువుకున్నందుకు ఫలితం పరమాత్మ తత్వమును గురించి తెలుసుకోవడం. ఎందు కంటే పరమాత్మ నుండి పుట్టిన వేదములు పరమాత్మను గురించి పరమాత్మ స్వరూపమును గురించి తెలియజేస్తాయి.

పరమాత్మను గురించి పరమాత్మ తత్వమును గురించి వేదములకు బాగా తెలుసు. వేదములను కేవలం యాంత్రికంగా వల్లెవేయకుండా వాటిలో దాగి ఉన్న అసలు అర్ధాన్ని తెలుసుకోడానికి ప్రయత్నం చేయాలి. అప్పుడే వేదవిదుడు, వేద పండితుడు అనే మాట సార్ధకం అవుతుంది. "వేదాన్తకృత్" అంటే ఈ వేదములు నా చేత సృష్టింపబడినవి అంటే నిరాకారుడైన పరమాత్మ సాకారుడై వచ్చి రాసాడు అని కాదు. పరమాత్మ అందరి హృదయాలలో ఉన్నాడు అని ఇప్పుడే చెప్పుకున్నాము. ఋగ్వేదములో మొదటి అనువాకము మధుచ్ఛందసుడు అనే ఋషి చెప్పాడు. తరువాత లిపిబద్ధం అయింది. ఋగ్వేద ఋషులు తాము సమాధిలో ఉన్నపుడు పరమాత్మ కృపతో కలిగిన జ్ఞానం ద్వారా తెలుసుకున్న విషయాలను, జ్ఞాపకం పెట్టుకొని, తమ శిష్యులకు చెప్పారు. గురుశిష్య పరంపరగా వేదములు తరతరాలుగా ఒకరి నుండి ఒకరికి మౌఖికంగా అందించబడ్డాయి. అందుకే ఈ శ్లోకంలో "వేదాంతకృత్" అంటే ఈ వేదములు, వేదాంతములు అంటే ఉపనిషత్తులు మొదలైన వాటిని గొప్పవారైన మహా ఋషుల యొక్క స్మృతిపథం లోకి ప్రవేశపెట్టి, వారిచేత పలికించిన వాడిని నేనే. ఆ మహాఋషుల యొక్క జ్ఞాపక శక్తిని, ధారణా శక్తిని, ఆలోచనా శక్తిని,

పరిశీలనా శక్తిని నేనే. వేదస్వరూపాన్నినేనే అంతేకాదు, ఈ వేదములను సృష్టించిన వాడిని నేను, ఆ వేదములను ఎరిగిన వాడిని కూడా నేనే అని కృష్ణుడు ఇక్కడ చెప్పాడు. కాబట్టి, సర్వం పరమాత్మ మయం అని తెలుసుకుంటే చాలు. అందుకే వేదములు అపౌరుషేయములు, పరమాత్మచే సృష్టించబడ్డాయి అని పెద్దలు అంటారు.

## 16. ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ।
## క్షరస్సర్వాణి భూతాని కూటస్థో2క్షర ఉచ్యతే॥

ఈ లోకములో ఇద్దరుపురుషులు ఉన్నారు. వారు క్షరుడు, అక్షరుడు. దేహాభిమానము కలవాడిని క్షరుడు అంటారు. దేహములో ఉన్న ఆత్మ స్వరూపాన్ని అక్షరుడు అని అంటారు.

ఈ అధ్యాయము పేరు పురుషోత్తమ యోగము అని అంటారు. అసలు పురుషోత్తములు ఎవరు అనే విషయాన్ని గురించి ఇక్కడి నుండి వివరించాడు కృష్ణపరమాత్మ. ఆ విషయాల గురించి ఇప్పుడు మనం తెలుసుకుందాము.

మనకు కనిపించే ప్రకృతి గురించి మనకుతెలుసు. మన శరీరం కూడా ఆ ప్రకృతిలో ఒక భాగము. ఈ ప్రకృతి ఒక్కోసారి కనపడకుండా పోతుంది. ఈ రోజు ఉన్న చెట్టు కొన్నాళ్ల తరువాత కనిపించదు. ఈ రోజు ఉన్న శరీరము కొంత కాలము తరువాత కనిపించదు. అంటే మార్పు చెందుతుంది. కనపడకుండా పోతుంది. దానినే అవ్యక్తము, కంటికి కనిపించదు అని అంటారు. అంటే మరొక రూపంలోకిమారి పోతుంది. దీనినే మనం నశించడం అని కూడా అంటుంటాము. నశించడం అంటేకనపడకుండా పోవడం, మరొక రూపంలో ఉండటం.

ఉదాహరణకు మొదట చిన్న బీజంగా ఉన్నది నేలలో పాతితే మొక్క, మాను అయి పెద్దవృక్షము అవుతుంది. దానినుండి అనేక బీజములు పుడతాయి. తరువాత చెట్టు ఎండి పోయి, నశించినా అంటే కనపడకుండా పోయినా, బీజరూపంలో నిక్షిప్తము అయి ఉంటుంది. మనకు కంటికి కనిపించే ప్రకృతిని, మార్పుచెందే ప్రకృతిని క్షరము అనీ, అవ్యక్తముగా, బీజరూపంలో, సూక్ష్మరూపంలో ఉన్న ప్రకృతిని అక్షరము అని అనుకోవాలి. ఈ క్షర, అక్షరముల వెనుక చైతన్యం ఒకటి ఉంది. ఆ చైతన్యమే వీటిఅన్నిటికీ జీవశక్తిని, చేతనత్వమును ఇస్తుంది. దానినే పురుషోత్తముడు పరమాత్మ అని అంటారు. వ్యక్తము, అవ్యక్తము అయిన ప్రకృతికి చేతనత్వము లేదు. జడము. ఉదాహరణకు మనకు కళ్లు, ముక్కు, చెవులు ఉన్నా, లోపల జీవశక్తి, చేతనత్వము లేకపోతే అవి ఉన్నా పనిచేయవు. దానినే మరణము అని అంటారు. కాబట్టి ఈ ప్రకృతి అంతా జడము. జీవము లేనిది. దానికి చేతనత్వాన్ని, జీవాన్ని ప్రసాదించేవాడు పురుషోత్తముడు, పరమాత్మ, విశ్వచైతన్యము.

ఉదాహరణకు సూర్యుడుతన వెలుగును చంద్రుడిమీద ప్రసరిస్తే, ఆ ప్రతిబింబ కాంతిలో మనం ఈ విశ్వాన్ని చూస్తున్నాము. సూర్యుడి కాంతి లేకపోతే చంద్రుడు జడము. అలాగే పరమాత్మ యొక్క చైతన్యముతోనే ఈ జడమైన క్షర అక్షర ప్రకృతి చైతన్యవంతము అవుతూ ఉంది. ఈ విషయాన్నే ఈ శ్లోకంలో వివరించాడు పరమాత్మ.

లోకంలో క్షర, అక్షర అనే ఇద్దరు పురుషులు ఉన్నారు. ఈ లోకంలో ఉన్న చరాచర భూతకోటి అంటే వ్యక్త పదార్థము (కంటికి కనపడే పదార్థము) అంతా క్షర పురుషుడు అయితే, వాటిలో అంతర్లీనంగా, అవ్యక్తంగా (కంటికి కనపడకుండా) ఉన్న అవ్యక్త పదార్థము అక్షర పురుషుడు అని అంటారు. ఈ రెండింటికీ జీవశక్తినిఅంటే కదిలే శక్తిని ఇచ్చేదే విశ్వచైతన్యము. దానినే పురుషోత్తముడు, భగవంతుడు, పరమాత్మ అని మనం పిలుచుకుంటున్నాము.

## 17. ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః।
## యో లోకత్రయమావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః॥

ఎవరైతే ఈ మూడులోకములలో చైతన్యరూపుడుగా ప్రవేశించి, అంతటా నిండి ఉన్నాడో, ఈ లోకములను భరిస్తున్నాడో, అటువంటి అవ్యయుడు, సకల జగత్తుకు ఈశ్వరుడు, క్షర, అక్షరముల కంటే వేరైనవాడు, అయిన పురుషుడిని పురుషోత్తముడు, పరమాత్మ అని చెప్పబడతాడు.

పై శ్లోకములో చెప్పబడిన క్షరము, అక్షరముల కంటే అన్యమైనది అంటే వేరైనది మరొకటి ఉంది. దానినే ఉత్తమ పురుషుడు, పరమాత్మ అని అంటారు. ఈ పరమాత్మ తత్వము మూడు లోకములలో ఆవరించి, నిండి ఉంటుంది. అన్ని లోకములకు చైతన్యశక్తిని ప్రసాదిస్తూ, వాటిని భరిస్తూ ఉంటుంది. ఆ పురుషోత్తముడిని, పరమాత్మను విశ్వచైతన్యము అంటారు. ఈ పరమాత్మ తత్వము అవ్యయము అంటే నాశము, మార్పులేనిది. ఎప్పటికీ నిలిచి ఉండేది. దేనిమీదా ఆధారపడనిదీ, స్వతంత్రప్రతిపత్తి కలది. అని పరమాత్మ లక్షణములనువివరించాడు కృష్ణభగవానుడు.

## 18. యస్మాత్క్షర మతీతో2హ మక్షరాదపి చోత్తమః।
## అతో2స్మిలోకే వేదే చ ప్రథిత: పురుషోత్తమః॥

క్షరపురుషుడు కంటే అతీతుడు, అక్షర పురుషుడు కంటే ఉత్తముడు, అయినందు వలన నేను మూడులోకములలోనూ, వేదములలోనూ పురుషోత్తముడుగా ప్రశిద్ధి చెందాను. అంటే మూడులోకములలో ఉన్న బుద్ధిమంతులు, వేదములు అధ్యయనం చేసి జ్ఞానమును ఆర్జించిన జ్ఞానులు, నన్ను పురుషోత్తముడు అని అంటారు.

ఇక్కడ నేను అంటే కృష్ణుడు అని కాదు. కృష్ణుడి శరీరము కూడా క్షరమే. కాని కృష్ణుడి లో ఉన్న ఆత్మస్వరూపము, చైతన్యము పురుషోత్తమ స్వరూపము. మనలో కూడా పరమాత్మ ఆత్మస్వరూపుడుగాఉన్నాడు. ఆ విషయం కృష్ణుడు తెలుసుకున్నాడు. మనకు తెలియదు. ఈవిషయం తెలియాలంటే మనకు బుద్ధి జ్ఞానము కలగాలి. దానికి వేదాధ్యయనము, శాస్త్రపఠనము, గురుకృప ముఖ్యము.

## 19. యోమామేవమసమ్మూఢో జానాతి పురుషోత్తమమ్।
## స సర్వవిద్భజతి మాం సర్వభావేన భారత॥

ఎవరైతే జ్ఞానవంతుడై నన్ను పురుషోత్తముడు అని తెలుసుకుంటాడో, అతడు సమస్తమును తెలిసినవాడు. అతడికి తెలియాల్సినది అంటూ ఏమీ ఉండదు. అతడు నన్ను నిర్మలమైన మనస్సుతో భజిస్తాడు, ఆరాధిస్తాడు.

ఈ శ్లోకంలో ఒక విచిత్రమైన పదం వాడారు. "అసమ్మూఢ:" మూఢుడు అంటే మనకు తెలుసు మూర్ఖుడు. వాడికి తెలియదు. ఒకరు చెబితే వినడు. తనకు ఏం తోస్తే అది చేస్తాడు. అన్నీ తప్పుడు నిర్ణయాలు తీసుకుంటాడు. సరి అయిన మార్గంలో నడవడు. తాను నమ్మిందే సిద్ధాంతం, తాను చెప్పిందే వేదంఅంటాడు. వీడి పేరు మూఢుడు. మూర్ఖుడు. ఈ మూఢులలో గొప్ప వాడు సమ్మూఢుడు. అంటే ఈ లక్షణాలన్నీ పరాకాష్ఠకు చేరుకున్న వాడు. ఈ లక్షణాలు లేని వాడు అసమ్మూఢుడు. అంటే మంచి వాడు అని అర్థం. ఆ మాత్రం దానికి మంచి వాడు అని చెప్పవచ్చుకదా అని సందేహం రావచ్చు. మనకు ఎటువంటి లక్షణాలు ఉండకూడదో ముందు చెప్పి, అవి లేని వాడు మంచి వాడు అని చెప్పడం వ్యాసులవారి ప్రత్యేకత.

అటువంటి అసమ్మూఢులు అంటే జ్ఞానులు, అన్నీ తెలిసిన వారు, నన్ను పురుషోత్తముడుగా తెలుసుకుంటారు. దేహము వేరు తాను వేరు అనుకుంటారు. ఆత్మజ్ఞానము పూర్తిగా కలిగి ఉంటారు. అటువంటి వారికి ఇంక తెలుసుకోదగ్గది ఏమీ ఉండదు. అటువంటి వారు నిర్మలమైన, నిష్కల్మషమైన, స్థిరమై, అచంచలమైన మనస్సుతో నన్ను పూజిస్తారు, ఉపాసిస్తారు. అందుకే "సర్వభావేన" అని అన్నారు. అంటే ఈ ప్రపంచం అంతా పరమాత్మ మయం, సర్వం ఆ పరమాత్మయే, అణువణువు పరమాత్మ స్వరూపమే అనే భావనతో ఏకాగ్రచిత్తంతో ఉపాసిస్తారు. వారికి బయట ప్రపంచం లో దొరికే వస్తువుల మీద ఎటువంటి ఆసక్తి ఉండదు. ఒక వేళ ఉన్నా పరిమితంగా కావలసినంతవరకే ఉంటుంది. బాహ్యప్రపంచములో దొరికే పదార్థములు, వస్తువులు అన్నీ అశాశ్వతములు అని తెలుసుకుంటాడు. అప్పుడు అతని మనసు ఆత్మయందు స్థిరమై ఉంటుంది. మనస్సు ఎల్లప్పుడూ పరమాత్మనే ధ్యానిస్తూ ఉంటుంది. అతనికిమరొక ఆలోచన ఉండదు.

ఈ స్థితికి రావాలంటే ప్రతి మానవుడు క్షరము, అక్షరము, పరమాత్మ (పురుషోత్తముడు) వీరి గురించిన జ్ఞానము క్షుణ్ణంగా కలిగిఉండాలి. అదే ప్రపంచములో ఉన్న విద్యలకెల్లా గొప్ప విద్య. ఏకీకృతమైన భావముతో పరమాత్మను ధ్యానించాలి. మరే ఇతర భావమును మనసులోకి రానీయకూడదు. పరమాత్మమీద పరిపూర్ణమైన, అనన్యమైన, ఏకాగ్రమైన భక్తి విశ్వాసము కలిగి ఉండాలి. భక్తి, భావము, ఒకటి గా ఉండాలి. పరమాత్మ యందు భక్తి, ప్రాపంచిక విషయాల మీద భావానురక్తి కలిగి ఉండకూడదు. దానిని అనన్య భక్తి ఏకాగ్రభక్తి అనరు. ఇదిఒకరోజులో సాధ్యమయ్యేపని కాదు. నిరంతర అభ్యాసము సాధన అవసరము. దానిని మనం ఈరోజునుండే మొదలుపెట్టాలి. ప్రయత్నం చేయాలి. ఈ జన్మలో కాకపోయినా తరువాత జన్మలలోనైన ఫలిస్తుంది అని పరమాత్మ స్వరూపుడు అయిన కృష్ణుడు మనకు హామీ ఇస్తున్నాడు.

## 20. ఇతిగుహ్యతమం శాస్త్ర మిదముక్తం మయా2నఘ।
## ఏతద్బుద్ధ్వా బుద్ధిమాన్ స్యాత్కృతకృత్యశ్చ భారత॥

ఓ అర్జునా! ఇప్పటి దాకా నీకు నేను చెప్పిన శాస్త్రము అతి రహస్యము. నీ మీద నాకు ఉన్న వాత్సల్యముతో నేను నీకు ఉపదేశించాను. ఈ శాస్త్రములో చెప్పబడిన విషయాలన్నీ తెలుసుకొని, అర్థం చేసుకొని, ఆకళింపు చేసుకొని, ప్రవర్తించు. నీకు జ్ఞానం లభిస్తుంది. సమస్తకార్యములలో నీవు కృతకృత్యుడవు అవుతావు. అని పరమాత్మ గీతాశాస్త్రమును ముగించాడు.

ఈ గీతాశాస్త్రము అతి రహస్యము అని అన్నాడు కృష్ణుడు. అంటే ఇది అందరికీ సామాన్యంగా అర్థం కాదు. చాలా కష్టతరమైనది. లోతుగా పరిశీలిస్తేనే గానీ మనసుకు ఎక్కదు. ఈ గీతను అర్జునుడికే ఎందుకుచెప్పాడు.

"కృష్ణా! నాకు దిక్కుతోచడం లేదు, ఏమి చెయ్యాలో అర్థం కావడం లేదు, నన్ను నీ శిష్యుడిగా స్వీకరించి  నాకు ఉత్తమమైన మార్గము ఉపదేశించు" అని రెండవ అధ్యాయంలో అర్జునుడు అడిగాడు కాబట్టి చెప్పాడు.

ఈ శ్లోకంలో అర్జునుడిని కృష్ణుడు "అనఘా!" అంటే ఏ పాపము అంటని వాడా! అని సంబోధించాడు. నీలో కేవలం విషాదము అంకురించిందే కానీ నీకు  ఏపాపము అంటలేదు కాబట్టి నీకు ఈ గీతాబోధ చేసాను అని అన్నాడు  పరమాత్మ. ఈ గీతాశాస్త్రము గురించి తెలుసుకున్న వాడు జ్ఞానవంతుడు అంటే ఆత్మజ్ఞానము కలవాడు అవుతాడు. రెండది కృతకృత్యుడు అవుతాడు. ఈ గీతను వినినందువలన, అర్థం చేసుకున్నందువలన, ఆత్మ, పరమాత్మ వీటి స్వరూపములు స్వభావముల గురించిన జ్ఞానం కలుగుతుంది. పరమాత్మను ఎలా చేరుకోవాలి అన్న విషయం అర్థం అవుతుంది. దానికి మార్గం ఏమిటో బోధపడుతుంది. పరమాత్మను చేరుకోవడానికి ఏయే అవరోధాలు ఉన్నాయో వాటిని ఎలా దాటాలో కూడా తెలుసుకోగలుడుతాడు. బ్రహ్మ జ్ఞానమును పొందుతాడు.

ఇంక "కృతకృత్యుడు" అంటే పైవన్నీ తెలుసుకోవడంలో కృత చక్కగా చేయబడిన కర్మలు కలవాడు అవుతాడు అంటే ఏ ఆత్మజ్ఞానం పొందడానికి ఈ భగవద్గీతను అధ్యయనం చేసాడో, ఆ పనిలో కృతకృత్యుడు అవుతాడు. దాని ఫలితమును చక్కగా పొందగలుగుతాడు. కాబట్టి నీవు కూడా ఈ గీతను చక్కగా, శ్రద్ధతో, భక్తితో, ఒక శిష్యుడిగా విన్నావు కాబట్టి నీకు బుద్ధి, జ్ఞానము కలుగుతుంది. నీవు సకల కార్యములలో కృతకృత్యుడివి అవుతావు. నీలోని విషాదము అంతరిస్తుంది. నీ కర్తవ్యమును నీవు నిర్వర్తిస్తావు. నీ స్వభావము అయిన క్షత్రియధర్మమును పాటించి యుద్ధం చేస్తావు. అని పరమాత్మ గీతను ముగించాడు.

ఒక విధంగా చూస్తే,  ఈ అధ్యాయంతో భగవద్గీత పూర్తిఅయింది. కానీ తరువాతి మూడు అధ్యాయాలలో కొన్ని వివరణలు ఇచ్చాడు. దైవీ సంపద, ఆసురీ సంపదలను గురించి, మూడు రకములైన శ్రద్ధల గురించి, మోక్షము అంటే ఏమిటి, సన్యాసము అంటే ఏమిటి వాటి వివరణలు ఇచ్చాడు. ఇవి అన్నీ ఈ 15 అధ్యాయాలలో చెప్పినవే అయినా వాటిని ఇంకా వివరంగా చెప్పాడు.

మనలో ఉన్న దైవీ సంపదలను పెంపొందించుకొని, ఆసురి సంపదలను

విడిచిపెట్టాలంటే వాటి గురించి తెలుసుకోవాలి కదా! అలాగే పరమాత్మమీద భక్తి కలిగి ఉండాలంటే శ్రద్ధ అవసరము. ఆ శ్రద్ధ, దాని రకాల గురించి తెలుసుకోవాలి కదా! అలాగే మోక్షము, సన్యాసము అనే పదాలు ఈ 15 అధ్యాయాలలో వాడబడ్డాయి కాని వాటి అర్థం తెలుసుకోవాలి కదా! అందుకని 16,17,18 ఈ మూడు అధ్యాయాలలో వాటి గురించి ఇంకా ఈ 15 అధ్యాయాలలో చెప్పకుండా మిగిలిన వాటి గురించి చక్కగా వివరించారు. వాటి గురించి కూడా మనం తెలుసుకోడానికి ప్రయత్నం చేద్దాం.

ఉపనిషత్తులయొక్క, బ్రహ్మవిద్యయొక్క,

యోగశాస్త్రము యొక్క సారమయిన భగవద్గీతలో, పదునైదవ అధ్యాయము

పురుషోత్తమప్రాప్తి యోగము సంపూర్ణము.

ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# భగవద్గీత

## పదహారవ అధ్యాయము.

# దైవాసుర సంపద్విభాగ యోగము

ఈ ప్రపంచంలో పుట్టిన ప్రతి వాడికీ తనజీవిత కాలంలో ఏదో ఒకటి సాధించాలని ఉంటుంది. దానినే జీవిత లక్ష్యము అని అంటారు. కాని చాలా మంది ఏ లక్ష్యము లేకుండా జీవితాన్ని వ్యర్థంగా గడిపేస్తుంటారు. జీవితంలో వచ్చేఒడి దుడుకులను తట్టుకునే శక్తి లేక మత్తుపదార్థాలను ఆశ్రయిస్తుంటారు. మరి కొంత మంది తాము చేరాల్సిన లక్ష్యాన్ని నిర్దేశించుకొని దానికి అనుగుణంగా తమ జీవన విధానాన్ని మలుచుకుంటారు.

ఉదాహరణకు మనం ఎవరం? ఎక్కడి నుండి వచ్చాము? ఏం చేస్తున్నాము? ఎక్కడకు వెళతాము? అనే ప్రశ్నలు వేసుకుంటే దానికి లక్ష్యము ఆధ్యాత్మికత అవుతుంది. ఈ ఆధ్యాత్మికతను సంపాదించాలంటే మనం ఎటువంటి జీవన విధానాన్ని అనుసరించాలో కృష్ణపరమాత్మ ఈ అధ్యాయంలో సూచించాడు. జీవితంలో చేయవలసినవి, చేయకూడనివి అన్నిటినీ మనకు వివరంగా చెప్పాడు. వాటికి సంపదలు అని పేరుపెట్టాడు.

మనకు ఎన్నో రకములైన సంపదలు ఉన్నాయి. సంపద అంటే సంపన్నంగా ఉండటం. అంటే దేనికీ కొదవ లేకుండా ఉండటం. అన్ని చక్కగా అమరి ఉండటం. అన్నీ మనకు ఉన్నాయి, దేనికీ మరొకరిమీద ఆధారపడనవసరం లేదు అని అనుకోవడం. ఈ లోకంలో ధనము, ఆస్తులు, భార్యపిల్లలు, బంధువులు, పదవులు ఇవన్నీ సంపదలే. కాని ఇవి లౌకికమైనవి. ఈ ప్రపంచంలో మాత్రమే ఉపయోగపడేవి. వీటి వలన సుఖము దు:ఖము రెండూ కలుగుతాయి.

దైవీ సంపద వలన కేవలం సుఖం మాత్రమే కలుగుతుంది. దైవీ సంపద అంటే ముఖ్యంగా జ్ఞాన సంపద. సద్గుణములు కలిగి ఉండటం. ఉన్నదానితో తృప్తిపడటం, లేని దాని కొరకు పాకులాడకపోవడం, అనవసరమైన విషయాల గురించి ఆలోచించకపోవడం, మంచి శీలము కలిగి ఉండటం. అలాగే ఆసురీ సంపద అంటే దుర్గుణములు, రాక్షసత్వము, క్రూరత్వము. హింసాప్రవృత్తి. మత్తు పదార్థములు సేవించడం, ప్రతి దానినీ ద్వేషించడం, అమితమైన కోరికలు కలిగి ఉండటం, అవి తీరకపోతే కోపస్వభావం కలిగి ఉండటం, ఆ కోపంలో అందరినీ మానసికంగా, శారీరకంగా హింసించడం, అలా చేయడం ద్వారా వికృతమైన మానసిక ఆనందాన్ని పొందడం..... ఇలాంటివి.

వీటి గురించి వివరంగా తెలుసుకుంటే, వేటిని అవలంబించాలో వేటిని విడిచి పెట్టాలో చక్కగా తెలుస్తుంది. అందుకే దీనిని దైవాసుర సంపద్విభాగ యోగము అని అన్నారు.

శ్రీ భగవానువాచ:

1. అభయం సత్త్వ సంశుద్ధిర్జ్ఞానయోగవ్యవస్థితి:।
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయస్తప ఆర్జవమ్।।

2. అహింసా సత్యమక్రోధస్త్యాగశ్శాన్తిరపైశునమ్।
దయా భూతేష్వలోలత్వం మార్దవ: హ్రీరచాపలమ్।।

3. తేజ: క్షమా ధృతిశ్శౌచమద్రోహో నాతిమానితా।
భవన్తి సమ్పదం దైవీ మభిజాతస్య భారత।।

ఈ మూడు శ్లోకాలలో దైవీసంపదలు అంటే ఏవి అనే విషయం విపులంగా చెప్పాడు పరమాత్మ.

1.భయం లేక పోవడం. నిర్భయంగా ఉండటం.
2.సాత్వికగుణములు కలిగి ఉండటం. మనసు నిర్మలంగా ఉండటం.
3.ఎల్లప్పుడూ జ్ఞాన సముపార్జన కొరకు ప్రయత్నించడం.
4.ఇంద్రియములను నిగ్రహించడం
5.మనస్సును నిగ్రహించడం. మనసును దాని ఇష్టం వచ్చినట్టు అటు ఇటు పోనీయకుండా కట్టడి చేయడం
6.మంచి పనులు చేయడం, ఇతరులకు పనికొచ్చే పనులు, ఇతరులకు హాని చేయని పనులు, దైవకార్యములు చేయడం.
7. వేదములు, శాస్త్రములు, పురాణములు, చదవడం, వినడం, వాటిలో ఉన్న మంచి విషయములను అవగాహన చేసుకోవడం, ఆచరించడం.
8.చేసే ప్రతి పనీ ఒక తపస్సు లాగా, శ్రద్ధతో, ఏకాగ్రతతో చేయడం.
9. ఏ విషయం ఆలోచించినా, సంకల్పించినా, మాట్లాడినా, ఏ పని చేసినా, కపటం లేకుండా ఉండటం. లోపల ఒకటీ బయట ఒకటీ మాట్లాడకపోవడం. ఒకరిని మోసం చేయాలనే

బుద్ధిలేకపోవడం.

10.సాధ్యమైనంత వరకు సాటి మానవులను మానసికంగా, శారీరకంగా హింసించకపోవడం. ఇతర ప్రాణులకు హాని కలిగించకపోవడం. కేవలం మన వినోదానికి ఇతర ప్రాణులను హింసించకూడదు.

11. ఎల్లప్పుడూనిజమే చెప్పడం. అబద్ధం చెప్పకపోవడం.

12.కోపమును విడిచిపెట్టడం. కోపం అందరికీ సర్వసాధారణం కాని దానిని విడిచిపెట్టాలి. కోపం రాకుండా చూసుకోవాలి.

13. ఉన్నంతలో ఇతరులకు పెట్టడం. తన స్వార్థం కంటే ఇతరుల మేలు గురించి ఆలోచించడం. త్యాగబుద్ధి కలిగి ఉండటం.

14.ఎప్పుడూ శాంతంగా ఉండటం. ఎటువంటి అలజడీ లేకుండా ఉండటం. చిరునవ్వు నవ్వుతూ ఉండటం. ఇతరులను ఆదరంగా పలకరించడం.(కర్టసీ కాస్ట్స్ నథింగ్)

15. ఇతరుల మీద చాడీలు చెప్పకుండా ఉండటం. ఇతరులను అనవసరంగా విమర్శించడకుండా ఉండటం. ఇతరులలో ఏవైనా లోపాలు ఉంటే వాటిని ఏకాంతంగా చెప్పడం. పది మందిలో అవమానించకపోవడం.

16. దయా గుణము కలిగి ఉండటం. సాటి మానవుల మీద, సాటి ప్రాణుల మీద దయ కరుణ జాలి కలిగి ఉండటం. వాటిని మానసికంగా శారీరకంగా హింసించకపోవడం.

17. విషయ వాంఛల యందు లోలత్వము లేకపోవడం. స్త్రీవాంఛలుకానీ, ధనము మీద అధికమైన వాంఛ కానీ, పదవీ వ్యామోహం కానీ లేకపోవడం. వాటి కోసం అకృత్యాలు, అఘాయిత్యాలు చేయడం. ప్రాపంచిక విషయముల యందు, విషయ వాంఛల యందు ఆసక్తి లేకపోవడం. వాటి కొరకు మనసు నిరంతరం చలించకపోవడం.

18. మృదువుగా మాట్లాడటం, మృదువుగా ప్రవర్తించడం, మాటల్లో కానీ చేతల్లో గానీ క్రూరత్వము లేకపోవడం.

19. దుర్మార్గమైన పనులు, చెడ్డ పనులు, అసాంఘిక కార్యములు చేయాల్సివస్తే సిగ్గుపడి వాటికి దూరంగా ఉండటం. అపరాధభావానికి (గిల్టీమైండ్‌కు) దూరంగా ఉండటం.

20.చంచల స్వభావం లేకపోవడం. మనస్సు స్థిరంగా ఉంచుకోవడం. అదా ఇదా ఏది అంటూ ఊగిసలాడకపోవడం. నిశ్చయాత్మక బుద్ధి కలిగి ఉండటం. ఏదైనా చేసేముందు ఒకటికి రెండు సార్లు ఆలోచించి నిర్ణయం తీసుకోవడం. తీసుకున్న నిర్ణయానికి కట్టుబడి ఉండటం.

21. అసాధారణ ప్రతిభ, ప్రజ్ఞాపాటవాలు కలిగి ఉండటం. ఇతరులలో లేని శక్తులు కలిగి ఉండటం.

22. కష్టాలలో కానీ సుఖాలలో కానీ ఓర్పు వహించడం. ఊరికే ఆవేశ పడకపోవడం. కష్టకాలంలో ఓర్పు వహించడం. తొందరపాటు నిర్ణయాలు తీసుకోకపోవడం. అవసరమైనప్పుడు వేచి చూచే ధోరణి అవలంబించడం.

23. ధైర్యంగా ముందుకు నడవడం. అన్ని విషయాలలో ధైర్యం ప్రదర్శించడం. పిరికితనాన్ని పారదోలడం. తాను ధర్మము అనుకున్న విషయాన్ని ధైర్యంగా చెప్పడం. (సుయోధన సభలో ఆ పని

వికర్ణుడు చేసాడు. భీష్ముడు చేయలేకపోయాడు).

24. శరీరమును, మనస్సును నిర్మలంగా శుభ్రంగా ఉంచుకోవడం. ప్రతిరోజూ స్నానం చేస్తే శరీరం శుభ్రపడుతుంది. చెడుఆలోచనలు రానీయక పోతే చెడు తలంపులు లేకపోతే మనసు శుభ్రంగా ఉంటుంది.

25. ఎవరికీ ద్రోహం చేయకపోవడం, ద్రోహం తలపెట్టకపోవడం. ఎవరికీ అపకారం చేయకపోవడం. ఇతరుల భార్యలను, సంతానాన్ని, ధనమును, ఆస్తులను ఆక్రమించాలని, అపహరించాలనే చెడు బుద్ధి లేకపోవడం.

26. నేనే గొప్పవాడిని, నన్ను అందరూ పూజించాలి, గౌరవించాలి అనే అహంకారము, గర్వం లేకపోవడం. ఇతరుల పట్ల వినయంగా విధేయతగా ఉండటం.

పైగుణములు అన్నీ దైవీ సంపదను పెంపొందింపజేస్తాయి. ఈ గుణాలు ఉంటే దైవము మన దగ్గర ఉన్నట్టే. అన్ని సంపదలు ఉన్నట్టే అని భావించాలి.
వీటిలో ముఖ్యమైన వాటి గురించి కాస్త వివరంగా తెలుసుకుందాము.

మొట్ట మొదటి సంపద "అభయం". అన్ని దుర్గుణాలకు భయమే పునాది. ఒక్కవిషయం చెప్పుకోవాలంటే నేడు తమను తాము భక్తులు అని చెప్పుకొనే వారిలో, దేవుని మీద భక్తి కంటే భయం ఎక్కువ. దేవుడికి కోపం వస్తుందేమో, శపిస్తాడేమోఅని పూజలు చేస్తారు కానీ భక్తితో కాదు. భగవంతుని మీద భక్తి శ్రద్ధలతో పూజించే వాళ్లు కొద్దిమందే. భగవంతుని తత్వం తెలిస్తే కానీ ఆ భయం పోదు. మనం సత్వగుణ ప్రధానులము అయినప్పుడు, దైవీ సంపద మన దగ్గర ఉన్నప్పుడు ఎవరికీ భయపడనవసరం లేదు. ముందు మనసులో నుండి ఈ భయాన్ని పోగొట్టాలి. మనలోని భయం పోవాలంటే మన మీద మనకు విశ్వాసం ఉండాలి, మనం చేసే పనుల మీద, మనం పూజించే దైవము మీద మనకు విశ్వాసం, నమ్మకం ఉండాలి. తాను చేసే పని న్యాయము, ధర్మము అని నమ్మిన వాడు దేనికీ ఎవరికీ భయపడడు. ధైర్యంగా ఉంటాడు. అందుకే ధైర్మలక్ష్మి అని కూడా అన్నారు. ధైర్యము అంటే భయం లేకపోవడం ఒక సంపద. అప్పుడు మిగిలిన సుగుణాలు వాటంతట అవే లభిస్తాయి. అందుకే భగవంతుడు మనకు అభయం ఇచ్చాడు అని అంటూ ఉంటారు. అంటే మనలోని భయాన్ని పారదోలేది భగవంతుని మీద అచంచలమైన విశ్వాసం, నమ్మకం, భగవంతుని స్మరించడం, ధ్యానించడం, పూజించడం.

"సత్వసంశుద్ధి" అంటే చిత్తము,అంత: కరణ ఎల్లప్పుడూ నిర్మలంగా ఉండాలి. చెడు ఆలోచనలు రాకూడదు. మనసు మలినం కాకూడదు. మన మనసు ఎల్లప్పుడూ మకిల పట్టని అద్దంలాగా మెరుస్తూ ఉండాలి. అప్పుడు మన స్వస్వరూపం మనకు చక్కగా స్పష్టంగా కనపడుతుంది. మనం సాధారణంగా మన శరీరాన్ని మాత్రమే ప్రతిరోజూ నానారకములైన సోపులతో రుద్ది రుద్ది శుభ్రం చేస్తుంటాము. శరీరానికి అంటుకున్న మలినాలను పోగొట్టుకుంటాము. శరీరం మాదిరే మనసుకు,

అంత:కరణకు కూడా కొన్ని మలినాలు అంటుకొని ఉంటాయి. అవే కోపము, ద్వేషము, మోహము మొదలైనవి. వీటి వలన అంత:కరణ మలినంగా ఉంటుంది.  వీటిని కూడా పోగొట్టుకుంటే కానీ అంత:కరణము శుద్ధంగా ఉండదు. కాబట్టి  శరీరంతో పాటు అంత:కరణ కూడా శుభ్రంగా ఉండాలి. దానినే సత్వ సంశుద్ధి అని అంటారు.

"జ్ఞానయోగవ్యవస్థితి:" ఈ గీతలో జ్ఞానయోగానికి ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చారు.  ఆత్మజ్ఞానం కలిగి ఉండటమే జ్ఞానయోగము ప్రాధాన్యత. ఏ యోగము అవలంబించినా చివరకు జ్ఞానయోగంతోనే పూర్తి అవుతాయి. అటువంటి జ్ఞానయోగము కూడా దైవీసంపదలో భాగమే. ప్రతి వ్యక్తి జ్ఞానము సంపాదించాలి అనే ధృఢమైన సంకల్పము కలిగి ఉండాలి. ఎన్ని అవాంతరాలు వచ్చినా, ఎవరు హేళనచేసినా తన సంకల్పము నుండి వెనుతిరగకూడదు. మనలో చాలా మందికి భగవద్గీత చదవడం, గీతాజ్ఞానయజ్ఞాలకు వెళ్లడం అనేవి 60 ఏళ్లతరువాత చెయ్యాలి. ఇప్పుడే కాదు. 60 దాకా జీవితాన్ని ఎంజాయి చెయ్యాలి అనే తప్పుడు భావన ఉంది. అటువంటి వాళ్లు జ్ఞానయోగ మార్గంలో వెళ్లే వాళ్లను నిరుత్సాహపరుస్తుంటారు. అటువంటి వాటిని కూడా లెక్కపెట్టకుండా తాను నమ్మిన ఆధ్యాత్మిక మార్గంలో నడవాలనే ధృఢమైన సంకల్పం కలిగి ఉండాలి.

"దానం". దానం అంటే మనకు ఉన్న దానిని ఇతరులతో పంచుకోవడం. ఈదానం వలన మనలో ఉన్న లోభము అనే దుర్గుణము నశిస్తుంది. పరోపకార బుద్ధి పెంపొందుతుంది. దానము అంటే లోభత్వము, పిసినారితనం లేకపోవడమే.  ఈ దానాలు చాలా ఉన్నాయి. భూదానము, ధన దానము, అన్నదానము, జలదానము, శ్రమదానము, విద్యాదానము, జ్ఞానదానము. ఇవి అన్నీ దానాలే. వీటిలో ఏ ఒక్కటి ఆచరించినా అది దైవీసంపదలో భాగమే.ఈ దానం, మనము తెలిసో తెలియకో చేసిన పాపాలకు ప్రాయశ్చిత్తంగా కూడా ఉపకరిస్తుంది. వీటినే  దశ దానాలు అని కేవలం యాంత్రికంగా చేస్తుంటారు.

దానం అనేది ఎదుటి వారికి ఏది అవసరమో దానిని గుర్తించి దానం చేయాలి కానీ చెయ్యాలి కాబట్టి చేసాము  అని ఇవ్వకూడని వారికి దానం చేస్తే అంటే అది అపాత్రదానం అవుతుంది. అలా కాకుండా ఎదుటి వారి అవసరాన్ని గుర్తించి, చేయతగ్గవారికే దానం చేయాలి. అలా దానం చేయకుండా లోభత్వంతో కూడబెట్టుకుంటే మరణకాలంలో అన్నీ వదిలిపెట్టి వెళ్లిపోవాలి. ఈ శరీరం కానీ, శరీరంతో సంపాదించిన సంపదలు  కూడా మనతో రావు అని తెలుసుకొని లోభత్వం తగ్గించుకొని దానగుణం పెంపొందించుకోవాలి.

మరి ఈ దానగుణం ఎలా అలవరచు కోవాలి అంటే ముందు మనం మన ఇంట్లో మనకు అవసరం లేని వస్తువులను, ఇతరులకు అవసరము అయ్యేవస్తువులను దానంచేయాలి. ఆ విధంగా దానగుణం అలవాటు అవుతుంది. క్రమక్రమంగా మనకు అవసరమయ్యే వస్తువులు

కూడా, మన దగ్గర ఎక్కువగా ఉంటే, అవి ఇతరులకు అవసరమయ్యేవి అయితే, ఆ వస్తువులను దానం చేయడం అలవాటు అవుతుంది. తరువాత ఇతరుల అవసరాలను గుర్తించి మనకు ఉన్నదానిలో కొంతభాగం ఇతరులకు దానం చేయడం అలవాటు అవుతుంది. ఈ ప్రకారంగా దానగుణం దినదినప్రవర్థమానమౌతుంది.

"దమము" అంటే ఇంద్రియ నిగ్రహము. నిగ్రహము అంటే ఇంద్రియములను అణిచిపెట్టడం కాదు. జ్ఞానేంద్రియములను, కర్మేంద్రియములను నియంత్రించడం. చూచిన ప్రతి వస్తువు మీదికి మనసు పోవడం, అదే కావాలని కోరుకోవడం. తాకిన ప్రతిదీ నాకే స్వంతం కావాలనుకోవడం పనికిరాదు. ఇంద్రియ నిగ్రహము లేనిదే ఏ పనీ సాధ్యం కాదు. మనము నిర్దేశించుకున్న లక్ష్యసాధనము అనుగుణంగా మన ఇంద్రియములను ఒక క్రమపద్ధతిలో పనిచేయించడం, ఇంద్రియ నిగ్రహం అంటారు కానీ ఇంద్రియములను అణిచిపెడితే అవి మరింతగా విజృంభిస్తాయి.

"యజ్ఞములు" అంటే తపోయజ్ఞము, యోగయజ్ఞము, జ్ఞాన యజ్ఞము, స్వాధ్యాయ యజ్ఞము, మన ఇంటిలో చేసే నిత్య పూజ, దేవతార్చన మొదలైనవి. కాని ఏవి చేసినా భక్తి, శ్రద్ధతో, ఏకాగ్రతతో చేయాలి. అంతే కాదు మనం ఏ వృత్తిలో ఉన్నా, ఆ వృత్తిని దైవంగా భావించి న్యాయంగా, ధర్మంగా, ఏకాగ్రతతో చేయాలి. వీటిలో ఏది ఆచరించినా అది దైవీసంపదయే.

"స్వాధ్యాయము" అంటే వేదములు, పురాణములు, శాస్త్రములు ఉపనిషత్తులు భగవద్గీత బ్రహ్మసూత్రములు, యోగవాసిష్టము, భారత, భాగవత,రామాయణ గ్రంధములు వీటిని చదివి, అర్థం చేసుకొని ఆకళింపుచేసుకోవడం. వాటి అర్థాలు తెలియకపోతే మంచి గురువును ఆశ్రయించి తెలుసుకోవడం. పైన చెప్పినవి అన్నీ కాకపోయినా వీటిలో ఏ ఒక్కటి చదివినా సరిపోతుంది. అదీ దైవీసంపదగానే మనకు లభిస్తుంది.

"తప:" అంటే శారీరక, వాచిక, మానసిక తపస్సులు. అంతే గానీ అడవులలో ముక్కు మూసుకొని, తల్లకిందులుగా తపస్సు చేయడం కాదు. మనకు నచ్చినపని ఏకాగ్రతతో చేయాలి. ఏ పని చేసినా, ఏమాట మాట్లాడినా, ఏమి ఆలోచించినా ఒక తపస్సులాగా, నిశ్చలంగా, ఏకాగ్రతతో చెయ్యాలి. అది చదువు కావచ్చు, ఉద్యోగం కావచ్చు, వ్యాపారం కావచ్చు, వృత్తి కావచ్చు. ఏది చేసినా ఒక తపస్సులాగా చేయాలి. అంతే కాదు, మన శరీరం కొన్ని అలవాట్లకు, కొన్ని సుఖాలకు అలవాటు పడిఉంటుంది. ఆ అలవాట్లకు సుఖాలకు శరీరాన్ని కొంత కాలం దూరంగా ఉంచటం, శరీరాన్ని నియంత్రించడం కూడా ఒక తపస్సు. ఉదాహరణకు అయ్యప్ప దీక్ష, శివదీక్ష, అమ్మవారి దీక్ష, మహాశివరాత్రి, ఏకాదశి ఉపవాసాలు, కార్తీకమాసంలో నక్తాలు ఇవన్నీ మన శరీరానికి కొంచెం కష్టం కలిగించినా, మన జీవన విధానాన్ని క్రమబద్ధీకరిస్తాయి. వీటినన్నిటినీ తపస్సుగానే భావించి ఆచరించాలి.

"ఆర్జవం" అంటే శరీరము, వాక్కు, మనస్సు వీటితో ఒకే విధంగా ప్రవర్తించడం. అంటే అనుకునేది ఒకటి, చెప్పేది ఒకటీ, చేసేది ఒకటీ కాకూడదు. దీనినే త్రికరణ శుద్ధి అంటారు. త్రికరణములు అంటే శరీరము, వాక్కు, మనస్సు. వీటిని క్రమశిక్షణలో ఉంచాలి. వాటిని తమ ఇష్టం వచ్చినట్టు ప్రవర్తించనీయకూడదు.

"అహింస" అంటే కేవలం జీవహింస మాత్రమే కాదు. ఎదుటి వారిని, ఇతర జీవములను మానసికంగా కానీ, శారీరకంగా కానీ హింసించకూడదు. ఒక జంతువు మరొక జంతువుకు ఆహారంగా సమకూర్చాడు పరమాత్మ. కాబట్టి జంతువులకు తప్పులేదు. కాని మానవుడు తెలిసి తెలిసీ ఏ కారణమూ లేకుండా ఇతరులను హింసించడం చాలా తప్పు. ప్రస్తుతం సమాజంలో జరుగుతున్న వేధింపులు అంటే పెళ్లికాకముందు ప్రేమ పేరుతో వేధించడం, పెళ్లి అయిన తరువాత భార్యాబిడ్డలను రకరకాల కారణాలతో, మానసికంగా, శారీరకంగా వేధించడం హింస కిందికే వస్తాయి. దీని వలన ఏ లాభమూ ఉండదు కానీ మనసులో ద్వేషము, క్రూరత్వము పెరుగుతాయి.

"సత్యం" అంటే తెలిసింది చెప్పడం. తెలియనిదానిని చెప్పకపోవడం. సాధ్యమైనంతవరకు సత్యం చెప్పడానికి ప్రయత్నంచేయాలి.. శుక్రనీతిని అడ్డం పెట్టుకొని అసత్యాలు పలకడం చేయకూడదు. దేవుడి మీద ప్రమాణం చేసి కూడా అబద్ధాలు చెప్పేవారిని మనం చూస్తూనే ఉన్నాము. అది దైవీ సంపద కాదు. ఆసురీ సంపద. కాబట్టి ఎల్లప్పుడూ నిజమే చెప్పడం అలవాటు చేసుకోవాలి. కాని మనం పిల్లలకు బాల్యం నుంచే చిన్న చిన్న అబద్ధాలు చెప్పమని అలవాటుచేస్తుంటాము. పక్కింటామె వస్తుంటే, "ఒరేయ్ ఆ సోది మేళం వస్తూ ఉంది కానీ నేను లేనని చెప్పు" అని తల్లి కొడుక్కు చెప్పడం మనం వింటున్నాము. అలాగే తండ్రి కూడా తనకు ఇష్టం లేని వారు వస్తుంటే, "ఎవరన్నా అడిగితే నేను లేనని చెప్పు" అని అంటుంటాడు. ఈ చిన్ని చిన్ని విషయాలలో పిల్లలకు చిన్నప్పటి నుండి అబద్ధాలు చెప్పడం అలవాటు మనమే చేస్తున్నామా అనిపిస్తుంది.

"అక్రోధము" అంటే కోపం లేకుండా ఉండటం. కోపం అనే గుణము చాలా చెడ్డ లక్షణం. కోపం అనేది ఆసురీ సంపద. కోపం లేకపోవడం దైవీ సంపద. అన్ని అనర్థాలకు మూలం కోపం. కోపావేశంలో ఏం చేస్తాడో వాడికే తెలియదు. "క్రోధాత్ భవతి సమ్మోహః" అని మనం చదువుకున్నాము. కోపం వలన కలిగే అనర్థాలు గీతలో చక్కగా చెప్పారు. ఈ కోపము రజోగుణ ప్రధానము. కోపం వస్తే ఒళ్లు మరిచిపోతాము. కోపావేశంలో ఏం చేస్తున్నామో తెలియదు. కొంతమంది రాక్షసుల్లా మారిపోతారు. చేయకూడని పనులు చేస్తారు. కాబట్టి కోపం లేకపోవడం దైవీసంపద అని అన్నారు. కాని కోపం అనేది ప్రతివాడికీ సహజ లక్షణం కాబట్టి దానిని సాధ్యమైనంతవరకు నియంత్రించుకోవాలి. కోపావేశాన్ని తగ్గించుకోవాలి. విచక్షణాజ్ఞానాన్ని ఉపయోగించాలి. వచ్చిన కోపాన్ని తెలివిగా ఉపయోగించుకో గలగాలి. కోపం మన అధీనంలో ఉండాలి కానీ, కోపానికి మనం వశులం కాకూడదు. ఇది సాధ్యం కావాలంటే ఒకటే మార్గము.

ధ్యానము. సత్సాంగత్యము. వీటి వలన కోపం చాలావరకు నియంత్రింపబడుతుంది.

"త్యాగము". దీనినే సన్యాసము, వైరాగ్యము అని కూడా అంటారు. త్యాగములలో కల్లా కర్మఫలమును త్యాగం చేయడం ఉత్తమం. ప్రాపంచిక విషయములయందు, విషయవాంఛల యందు ఆసక్తిని త్యాగం చేయడం, దుర్గుణములను త్యాగం చేయడం, ఇవే అసలైన త్యాగాలు. బాహ్యంగా చూస్తే పరోపకార బుద్ధిని కలిగి ఉండటం.

"శాంతి". అంటే ఎల్లప్పుడూ శాంతంగా, సుఖంగా ఉండటం. మనస్సును నిర్మలంగా, ఎటువంటి కల్లోలం లేకుండా ఉంచుకోవడం. మనలో కలిగే వివిధభావాలను నియంత్రించుకోవడం. దీని వలన శాంతి కలుగుతుంది. అంతే కాకుండా చేయాల్సిన పనులను, చేయతగిన పనులను సక్రమంగా, సంపూర్ణంగా చేయడం. అలా చేయకపోతే మనసులో ఏదో వెలితి, అశాంతి కలుగుతుంది. కాబట్టి మనం చేయాల్సిన పనులను సక్రమంగా న్యాయబద్ధంగా ధర్మబద్ధంగా చేయడం కూడా శాంతికి మూలం.

మనం సహజంగా ఆనంద స్వరూపులం. శాంతస్వరూపులం. కాని మన జీవితాలలోకి దు:ఖాలను, అశాంతిని తెచ్చిపెట్టుకుంటున్నాము. అంటే ఆసురీ సంపదలను ఆహ్వానిస్తున్నాము. అనేకములైన సంకల్పాలతో, కోరికలతో మనసును అల్లకల్లోలం చేసుకుంటున్నాము. చేయ వలసిన పనులు చేయకపోవడం, చేయకూడని పనులు చేయడం వలన మనలో ఉన్న శాంతిని పోగొట్టుకుంటున్నాము. అలా కాకుండా మనసును ఆత్మయందు లగ్నం చేస్తే శాంతి దానంతట అదే కలుగుతుంది.

"అపైశునమ్" అంటే ఇతరులను విమర్శించడం, ఇతరులలో ఉన్న లోపాలను ఎత్తి చూపడం. ఎదుటి వారి మనసును నిరంతరం బాధపెట్టడం. ఒక వేలు ఇతరులవైపు చూపితే తక్కిన వేళ్లు మన వైపు చూస్తున్నాయి అని తెలుసుకోవాలి. అనవసరంగా తెలిసీ తెలియకుండా ఇతరులను దూషించడం, విమర్శించడం, నిందించడం ఆసురీలక్షణము. ఎదుటి వారిలోని మంచి గుణములను చూడాలి. దుర్గుణములను వారికే విడిచిపెట్టాలి. అంతే కానీ విమర్శించకూడదు. ఆత్మస్తుతి, పరనింద రెండింటినీ వదిలిపెట్టాలి.

"దయాభూతేషు" అంటే సాటిమానవుల ఎడల, సాటి ప్రాణుల ఎడల దయ, జాలి, కరుణ కలిగి ఉండాలి. "నితాంత అపార భూత దయయును తాపస మందార నాకు దయసేయగదే" అనిపోతన గారు భాగవతంలో రాసారు. కాబట్టి సకల భూతముల యందు దయ, కరుణ కలిగి ఉండాలి. ఆ దయాగుణాన్ని ప్రసాదించమని పరమాత్మను ప్రార్థించాలి. అందరిలో పరమాత్మను చూడగలిగిన నాడు ఎవరూ ఎవరికీ అపకారం చేయరు. అప్పుడే సర్వమానవసౌభ్రాతృత్వము వర్ధిల్లుతుంది.

“అలోలత్వమ్” అంటే ఇంద్రియలోలత్వం, విషయలోలత్వం, స్త్రీలోలత్వం, ఇవన్నీ దీని కిందికే వస్తాయి. ఒక్కమాటలో చెప్పాలంటే చూసిందల్లా నాది, నాకు కావాలి అని అనుకోవడం. దాని కోసం వెంపర్లాడటం. దీనికి మూలం మనస్సు. ముందు మనస్సును అదుపులో పెట్టుకుంటే ఈ లోలత్వం, చాంచల్యం ఉండదు. లోలత్వం వలన విచక్షణాజ్ఞానము నశిస్తుంది. మానసిక ఆందోళన ఎక్కువ అవుతుంది. ఏ పనీ సక్రమంగా చేయలేడు. జీవితంలో నిరాశ నిస్పృహలకు లోనవుతాడు.

“మార్దవమ్” అంటే మృదువుగా మాట్లాడటం. నెమ్మదిగా మృదువుగా మాట్లాడటం. కటువుగా కొట్టినట్టు మాట్లాడకపోవడం. వినయంగా, విధేయతలలో ఉండటం. “టంగ్ ఈజ్ అవర్ ఎనిమీ” అన్న సూక్తి మనం వింటూనే ఉంటాము. “నోరు మంచిదయితే ఊరు మంచిది అవుతుంది” అని ఏమీ చదువుకోని వారు కూడా అంటుంటారు. ఆ విషయాన్నే ఇక్కడ చెప్పారు. వారే గొప్ప వేదాంతులు.

“హ్రీ:” అంటే సిగ్గుపడటం. గిల్టీ మైండ్. తప్పు పని చేసినపుడు పడే సిగ్గు. మనం బాగుపడలేదనే సిగ్గు. ఆధ్యాత్మికంగా మనకన్నా గొప్పవారిని, ఉన్నత స్థితిలో ఉన్న వారిని చూచి, మనం ఎందుకు ఇంత అధోగతిలో ఉన్నామా అని పడే సిగ్గు. ఇటువంటిసిగ్గు మంచిది కానీ అకారణంగా ప్రతిదానికీ సిగ్గుపడటం అవాంఛనీయం.

“అచాపలమ్” అంటే చంచలత్వము లేకుండా ఉండటం. ఇది మనసుకు సంబంధించినది. ఇది రజోగుణ ప్రధానము. చెప్పిన మాట మీద నిలబడకపోవడం, ఆడిన మాట తప్పడం కూడా దీని కిందికే వస్తుంది. ప్రాపంచిక విషయములలో గానీ, దైవసంబంధమైన విషయములలో గానీ చంచలత్వము లేకపోవడం. మనస్సును దైవము నుండి మరల్చకపోవడం అలవాటు చేసుకోవాలి. ఇది కూడా దైవీసంపద కిందికే వస్తుంది.

“తేజ:” అంటే ముఖం ఎప్పుడూమాడినట్టు ఉండకుండా తేటగా తేజస్సుతో కళకళలాడుతూ ఉండటం. ఈ తేజస్సు మనం ముఖంలోనే కాదు, దేహం అంతటా, మనం చేసే అన్నిపనులలోనూ కనిపించాలి. మనం ఏ పని చేసినా అదిమనకు తేజస్సును, శక్తిని, ధైర్యాన్ని, ధృడత్వాన్ని కలిగించేదిగా ఉండాలి. దైవీ సంపద కలిగిన వాళ్ల ముఖాలలో ఎప్పుడూ చిరునవ్వు ఒక విధమైన తేజస్సు కనిపిస్తుంది. ఎప్పుడూ ఈసురోమంటూ ఉండకూడదు. అందుకే “ఈసురోమని మనుషులుంటే దేశమేగతి బాగుపడునోయ్” అని అన్నారు మహాకవి.

“క్షమా” అంటే ఓర్పు. తొందరపాటు నిర్ణయాలు తీసుకోకుండా ఓర్పు సహనం కలిగి ఉండటం. భవిష్యత్తులో ఏం జరుగుతుందో ఏమో అంటూ తెగ ఆరాటపడిపోకూడదు. ఏం జరిగినా మన మంచికే అనే భావన కలిగి ఉండాలి. “పేషన్స్ పేస్” అని మనం వింటూ ఉంటాము. జరుగుతున్న దానిని మనం ఆపలేము. కాకపోతే దాని తీవ్రతను తగ్గించుకోగలము. మంచి వచ్చినా, చెడు

వచ్చినా సమభావనతో స్వీకరించడం, అలాగే జరగబోయే దాని గురించి ఆందోళన చెందక పోవడం కూడా ఈ లక్షణం కిందికే వస్తుంది. కొంత మంది తమ భవిష్యత్తు ఎలా ఉంటుందో అనే విషయంలో తీవ్రంగా ఆందోళన చెందుతుంటారు. జాతకాలు, హస్తసాముద్రికాలు చూపించు కుంటారు. వాళ్లు ఏదో చెబుతారు. దాని గురించి తీవ్రంగా ఆందోళన చెందుతుంటారు. ఇది మంచిది కాదు. మరు క్షణం ఏం జరుగుతుందో ఎవరూచెప్పలేరు అనే విషయాన్ని అందరూ గ్రహించాలి. ఏది వచ్చినా పరమాత్మ ప్రసాదంగా స్వీకరించాలి. దీనినే క్షమ అని అంటారు. ఈ క్షమాగుణము మనకు ధ్యానం చేయడం వలన అలవడుతుంది.

"ధృతి" అంటే ధైర్యము, ఏ విషయమైనా మధ్యలో వదలకుండా, చివరవరకు సాధించాలనే పట్టుదల కలిగి ఉండటం. ఆత్మజ్ఞానము కలిగిన వాడు దేనికీ భయపడడు. మనకు అత్యంత భయంకరమైన సంఘటన చావు, రోగము, ముసలితనము. ఆత్మజ్ఞానము కలవాడు వీటికి దేనికీ భయపడడు. అవి కూడా అత్యంత సహజమైనవి అనుకుంటాడు. "విధి నా మొహాన అలా రాసాడు, నేనేం చేయలేను, నాకేమీ చేతకాదు" అనే నిరుత్సాహంతో ఉండకూడదు. ప్రతి దానినీ దైవంమీదికీ, విధి మీదికీ నెట్టకూడదు. మన కర్తవ్యం మనం ధర్మంగా నిర్వర్తిద్దాము. లాభనష్టాలను, సుఖదు:ఖాలను ధైర్యంతో సమానంగా చూడగలగడం అలవాటు చేసుకుందాము అనే భావనతో ఉండాలి. అందుకే ధృతి కూడా దైవీసంపద. ఈ ధృతికి ఉదాహరణలే భగీరథ ప్రయత్నంతో జరిగిన గంగావతరణం. అత్యంత పట్టుదలతో జరిగిన క్షీరసాగర మధనం. హాలాహలం పుట్టినా మానకుండా అమృతం వచ్చేదాకా సముద్రాన్ని మధించారు దేవదానవులు. ఇవి ధృతికి నిదర్శనాలు.

"శౌచం" అంటే శుభ్రత. మనం కేవలం మన శరీరాలను శుభ్రంగా, ఘుమఘుమ లాడేట్టు ఉంచుకుంటాము.శరీరానికి అనేక అలంకారాలు చేసుకుంటాము. మనసు మాత్రం మలినంగానే ఉంటుంది. మనసును మామూలు నీటితో కడగలేము. మనసు పరమాత్మచింతనతోనూ, ధ్యానంతోనూ, సత్సంగాలతోనూ శుభ్రం అవుతుంది. కాబట్టి మనం శరీర శుభ్రతే కాకుండా మానసిక శుభ్రత మీద కూడా శ్రద్ధవహించాలి.

"అద్రోహ:" ఎవరికీ ద్రోహం చేయకపోవడం. అంటే హింస గురించి మనసులో కూడా తలవకపోవడం. కొంత మంది బయటకు తమ శరీరాలతో ఎవరికీ ఏమీ హింసచేయనట్టు కనపడుతూ ఉంటారు. కాని మనసులో నిరంతరం ఇతరులకు అపకారము, హింస తలపెడుతూ, అవి ఎలా అమలు చేయాలనే ఆలోచిస్తుంటారు. పైకి నవ్వుతూనే లోలోపల ఎదుటివారి వినాశనానికి పథకాలు వేస్తుంటారు. ద్రోహాలలో పరాకాష్ఠ నమ్మకద్రోహం ఇది సామాన్యులకు చేతకాదు. వ్యాపారాలలో, రాజకీయాలలో ఎక్కువగా జరుగుతుంటుంది. నమ్మితేనే కదా ద్రోహం చేసేది. నమ్మకపోతే ఎలా ద్రోహం చేస్తాము అని తెలివిగా మాట్లాడే వాళ్లున్నారు. తప్పుచేయడం కన్నా చేసిన తప్పును సమర్థించుకోవడం ఇంకా తప్పు. మోసం, ద్రోహం అన్నదమ్ములు. ఈ అన్నదమ్ములను

మనసులో నుండి పారద్రోలాలి. అప్పుడే మనసుకు శాంతి.

"న అతి మానితా" అంటే తనను తాను పొగుడుకోవడం. ఆత్మస్తుతి పరనింద మంచివి కావు అని అంటారు కదా. తనను తాను పొగుడుకోవడం ఇతరులను తిట్టడం వంటిదే. ఎవరూ తనను పట్టించుకోవడంలేదు, తనకు సన్మానాలుచేయడం లేదు తనను గౌరవించడం లేదు అని బాధపడేవాళ్లు ఎంతో మంది ఉన్నారు. దీనినే సాత్వికాహంకారము అంటారు. అది కూడా పోతే గానీ దైవీసంపద సిద్ధించదు.

ఈ 26 గుణములు దైవీసంపదలు అని చెప్పాడు పరమాత్మ. ఎవరైతే క్రితం జన్మలో జ్ఞానమును సంపాదిస్తారో, వారు మరుజన్మలో దైవీసంపదలతో పుడతారు. వారికి పైన చెప్పబడిన దైవీ సంబంధమైన గుణాలు ఉంటాయి.

వాటిని మరొక్కసారి మననం చేసుకుందాము.

1.భయం లేకపోవడం

2.సత్వగుణం కలిగి ఉండటం. మనస్సు నిర్మలంగా ఉంచుకోవడం

3.జ్ఞానమును సంపాదించడం

4. విద్యాదానము, జ్ఞానదానము భూదానము అన్నదానము మొదలగు దానములు శక్తికొద్దీ చేయడం

5. ఇంద్రియనిగ్రహము

6.జ్ఞాన యజ్ఞము చేయడం

7.పురాణములు శాస్త్రములు చదవడం

8.ప్రతిపనీ ఒక తపస్సులాగా చేయడం

9.మంచి ప్రవర్తన

10.అహింస వ్రతమునుపాటించడం. అహింసా పరమోధర్మ:

11.సత్యము పలకడం..సత్యమేవ జయతే.

12.కోపము విడిచిపెట్టడం

13. దుర్గుణములను త్యాగము చేయడం

14.ప్రశాంతంగా ఉండటం

15.ఇతరులను విమర్శించకుండాఉండటం

16.భూతదయ కలిగిఉండటం

17.ఇంద్రియలోలత్వము స్త్రీలోలత్వము లేకుండా ఉండటం

18.మృదువుగా మాట్లాడటం

19.చెడ్డ పనులు చేసినపుడు సిగ్గుపడటం

20.చిత్తచాంచల్యము వదిలిపెట్టడం
21.ముఖంలో మనస్సులో తేజస్సు కలిగి ఉండటం
22.ఓర్పుకలిగి ఉండటం
23.అన్నివేళలలో ధైర్యంగా ఉండటం
24. శరీరము మనస్సు శుచిగా ఉంచుకోవడం
25.ద్రోహబుద్ధి లేకుండా ఉండటం
26.స్వాభిమానము వదిలిపెట్టడం.

ఈ గుణములను దైవీసంపదగా పరిగణించారు.

4. దమ్భో దర్పో2భిమానశ్చ క్రోధ: పారుష్య మేవ చ।
అజ్ఞానం చాభిజాతస్య పార్థ సమ్పదమాసురీమ్॥

దంభము, దర్పము, అభిమానము, కోపము, పరుషము, అజ్ఞానము, ఇవన్నీ మానవుడికి పుట్టగానే సంక్రమించే గుణాలు. ఇవి ఆసురీ సంపదలు.

దేవుని మీద భక్తి శ్రద్ధ, ఏకాగ్రత కలిగిన వారు దైవీసంపదలను ఎలాగా గొప్పగా భావిస్తారో, ఆసురీ సంపదలను దుర్మార్గులు, దుష్టులు, దురాచారులు, తమ సంపదలుగా భావిస్తారు. అవి ఉన్నందుకు మురిసిపోతారు. అత్యంత ప్రీతిగా అనుసరిస్తారు. అవి ఆసురీ సంపదలు అన్న విషయం వారికి తెలియదు. అదే అజ్ఞానము. సుగుణములు 26 ఉంటే దుర్గుణాలు 6 మాత్రమే ఉన్నాయి. కడివెడు పాలకు ఒక్క విషపు చుక్కచాలు ఆ పాలు అన్నీ విషపూరితం కావడానికి. ఎన్ని సుగుణాలు ఉన్నా ఒక్క దుర్గుణం చాలు అతడిని అధ:పాతాళానికినెట్టడానికి. (పత్రిమహాశయుడు చేసిన ఒకేఒక చేష్ట వలన(కొంతమంది స్త్రీలను అందరిముందూ ముఖ్యంగా మీడియా ముందు, వాటేసుకోవడం వలన) అతడు జీవితమంతా ఆర్జించిన కీర్తి ప్రతిష్టలు తుడిచిపెట్టుకొని పోయాయి.) మనలో ఎన్ని సుగుణాలు ఉన్నాయా అని కాదు ఎన్ని దుర్గుణాలను బయటకు నెట్టేసామా అనేది ముఖ్యం. మంచి మిత్రులు ఎంతమందిఉన్నా పరవాలేదు. దుర్మార్గుడు ఒక్కడున్నా చాలు. జీవితం సర్వనాశనం అవుతుంది.

ఈ ఆసురీ సంపదలో మొట్ట మొదటిది దంభము. అంటే కపటము, మోసము, వేషముతో మోసంచేయడం. కాషాయములు ధరించి, సన్యాసి ముసుగులో అన్ని అకృత్యాలు చేయడం. తమకు అన్నీ తెలుసు అని నమ్మించడం. తనను తాను పొగుడుకోవడం. ఇతరులచేత పొగిడించుకోవడానికి తాపత్రయ పడటం. తనకు అన్నీ తెలుసు అని గర్వించడం. తాను చేసే ప్రతి

పనీ ఆర్భాటంగా చేయడం. తనకు ఉన్న సంపదలను, విద్యలను అందరిముందు ప్రదర్శించడానికి ఆరాటపడటం.

దర్పము అంటే ఒక విధమైన గర్వము. వల్లమాలిన అహంకారము. నన్ను మించిన వాడు లేడు అని గర్వించడం. విద్యాగర్వము, అధికార గర్వము, ధనవంతుడు అనే గర్వము, నాకే అంతా తెలుసు అనే అహంకారంతో ఎదుటి వారిని కించపరుస్తూ, తీసిపారేసినట్టు మాట్లాడటం వీటిలోముఖ్యమైనవి.

అభిమానము. సుయోధనుడు అభిమానమే ధనముగ కలవాడు అంటే అభిమానధనుడు అంటారు. ఇది కొంతవరకు మంచిదే కానీ, శ్రుతి మించితే పాతాళానికి తొక్కుతుంది. అహంకారమునకు ప్రతిబింబము అభిమానము. చాలామంది ఇదేదో గొప్పగుణంగా భావిస్తారు. కాని అది పరిమితులు దాటకూడదు అని గ్రహించాలి.

కోపము దీని గురించి గీతలో చాలాసార్లు మనకు వివరించారు. అభిమానము ఎక్కడ ఉంటుందో కోపం అక్కడే ఉంటుంది. తన గొప్పతనాన్ని గుర్తించని వాడి మీద కోపం రావడం సహజం. ఆ కోపం విపరీత పరిణామాలకు దారితీస్తుంది. కోపం వలన సమ్మోహము అంటే ఏం చేస్తున్నాడో, ఏ మాట్లాడుతున్నాడో తెలియని స్థితి. దానివలన స్మృ తి పోతుంది, బుద్ధి నశిస్తుంది, తరువాత సర్వనాశనము కలుగుతుంది. అందుకే దీనిని ఆసురీ సంపద అన్నారు.

పరుషత్వము అంటే కాఠిన్యము. కొంతమందికి ఇది అలవాటు. ఏం మాట్లాడినా మొహం మీద కొట్టినట్టు మాట్లాడటం. పరుషంగా మాట్లాడటం. ఎదుటి వారిని గౌరవించకపోవడం. నిర్లక్ష్యభావన. దీని వలన ఎన్నో ఇబ్బందులు వస్తాయి. చాలా మంది అటువంటి వారిని తప్పించుకు తిరుగుతారు. కొంతమంది దానిని గొప్ప సుగుణంగా భావిస్తారు. "నేను ఉన్నది ఉన్నట్టు మొహాన అడిగేస్తాను. మనసులో ఉంచుకోను" అని గొప్పగా చెప్పుకుంటూ ఉంటారు. మరి కొంత మంది పైకి తియ్యగా మాట్లాడతారు. లోపల గోతులు తీస్తుంటారు. మాట కాఠిన్య మే కాదు మనసు కాఠిన్యంకూడా ఆసురీ సంపదలో భాగమే.

ఆఖరుది అజ్ఞానము, అవివేకము. ప్రతిదానినీ తప్పుగా అర్థం చేసుకోవడం. తెలియకపోయినా తెలిసినట్టు నటించడం. తాను చెప్పిందే వేదం అని మూర్ఖంగా వాదించడం. ప్రాపంచిక విషయములే శాశ్వతసుఖాలు ఇస్తాయని నమ్మడం. ఆ భ్రమలో పడి ఎప్పుడూ చేయకూడని పనులు చేయడం. ఇదే అవివేకము. ఇది కూడా ఆసురీ సంపదే.

ఎవరైతే ఆసురీ సంపదతో పుడతారో వారిలో పైన చెప్పిన గుణాలు కనిపిస్తాయి. ఈ గుణాలు ఎవరిలో ఉంటే వారిలో ఆసురీ సంపద పుష్కలంగాఉన్నట్టు అనుకోవాలి. తమలో ఉన్న

గుణాలను ఎవరికి వారు బేరీజు వేసుకొని, తమలో పై చెప్పిన గుణాలు ఉంటే వాటిని వదల్చుకొని, ఆసురీ సంపదల నుండి బయటపడటానికి ప్రయత్నం చేయాలి.

## 5. దైవీ సమ్పద్విమోక్షాయ నిబన్ధాయాసురీ మతా।
## మాశుచస్సమ్పదం దైవీ మభిజాతోఽసి పాణ్డవ॥

ఎవరైతే దైవీ సంపదలను కలిగి ఉంటారో, వారు ఈ సంసార బంధనముల నుండి విడివడతారు. ఎవరైతే ఆసురీ సంపదలను కలిగి ఉంటారో వారు సంసార బంధనములలో అధికంగా చిక్కుకుంటారు. కాని అర్జునా! నీవు దైవీసంపదతో పుట్టావు. కాబట్టి నీకు ఈ సంసార బంధనములు అంటకు. నీవు శోకించడం తగదు.

ఆసురీ సంపద, దైవీ సంపదల గురించి చెప్పిన తరువాత, వాటి ఫలితాలను గురించి కూడా చెప్పాడు పరమాత్మ. దైవీసంపద కలిగిన వారు ఈ సంసార బంధనముల నుండి విముక్తి పొందుతారు. అలాగే ఆసురీ సంపద కలిగిన వారు సంసార బంధనములను నానాటికీ వృద్ధిచేసుకుంటూ, జనన మరణ చక్రములో తిరుగుతూ ఉంటారు. ఓ అర్జునా! నీవు దైవీ సంపద కలవాడవు. నీకు తప్పక మోక్షం వస్తుంది. నీవు నీ కర్తవ్య కర్మలను నిర్వర్తించు. నీకు ఎటువంటి పాపము రాదు. అనిఅభయం ఇచ్చాడు కృష్ణుడు.

ఏదైనా ఒక పనిచేయబోయేముందు ఆ పనియొక్క స్వభావము ఆ పని చేస్తే లాభం వస్తుందా నష్టం వస్తుందా, ఆపనివలన మనకేమైనా సుఖం కానీ దు:ఖం కానీ కలుగుతుందా అని ఆలోచిస్తాము. అందుకే ఈ దైవీసంపదలు, ఆసురీ సంపదలు మనం సంపాదించుకుంటే వాటి వలన కలగబోయే ఫలితములను చాలా క్లుప్తంగా చెప్పాడు. దైవీ సంపదలు కలిగి ఉంటే సంసార బంధనముల నుండి విముక్తి కలుగుతుంది. ఆసురీ సంపదలు కలిగిఉంటే బంధనములు ఇంకా పెరుగుతాయి కానీ వాటి నుండి విముక్తి కలగదు.

ఏదో నేరానికి ఒకడికి జైలు శిక్ష పడింది. అతడు జైల్లో మంచి ప్రవర్తన కలిగి ఉంటే, అతనికి శిక్షాకాలంలో రిమిషన్ లభిస్తుంది. అలా కాకుండా జైల్లో కూడా తగాదాలు పెట్టుకుంటూ, నేరాలు చేస్తుంటే, అతని శిక్షాకాలం పెరుగుతుంది. ఇదీఅంతే. ఈ సంసారం ఒక జైలు లాంటిది. ఇందులో నుండి బయట పడాలంటే రిమిషన్ సంపాదించుకోవాలంటే, దైవీ సంపదలను సంపాదించుకోవాలి. అప్పుడే ఈ సంసారము అనే జైలు నుండి తొందరగా విముక్తి కలుగుతుంది. అలా కాకుండా ఆసురీ సంపదలను ఆశ్రయిస్తే విముక్తి కలగకపోగా, మరింతగా ఈ సంసార బంధనములలో కూరుకుపోతాము. ఎన్నటికీ విముక్తి కలగదు.

మాశుచ: అంటే నీవు దు:ఖించవద్దు అని అంటున్నాడు. అంటే మనల నందరినీ దు:ఖించవద్దు అని ఊరడిస్తూ, మనకు మంచి మార్గములను బోధించాడు పరమాత్మ.. చెడు మార్గముల గురించి కూడా చెప్పి వాటి జోలికి వెళ్ల వద్దు అని కూడా హెచ్చరిస్తున్నాడు. ఇప్పుడు అర్జునుడితో ఇలా అన్నాడు.

అర్జునా! నీవు దైవీ సంపత్తితో పుట్టావు. నీకు తప్పక బంధ విముక్తి కలుగుతుంది. నీవు ఏ మాత్రం దిగులు పడకు అని బోధించాడు పరమాత్మ. అంటే మనమందరమూ దు:ఖముల నుండి విముక్తి పొందాలంటే దైవీసంపదలను సంపాదించుకోవడం కంటే వేరే మార్గంలేదు. మనం అందరం ఏవేవో సంపదలు కలిగి ఉంటాం. ధన సంపద, ధాన్య సంపద, ఆస్తి సంపద, విద్యా సంపద, పదవీ సంపద ఇలా ఎన్నో. కాని మనకు దైవీ సంపద కూడా ఉందా అని ఆలోచించుకోవాలి. లేకపోతే దానిని సంపాదించడానికి ప్రయత్నం చేయాలి. అది ప్రతి వాడి కర్తవ్యం అని గీతాబోధ.

6. ద్వౌ భూతసర్గౌ లోకే2స్మిన్ దైవ ఆసుర ఏవ చ।
దైవో విస్తరశ: ప్రోక్త: ఆసురం పార్థ మే శృణు॥

ఓ పార్థా! ఈ అనంత సృష్టిలో ఉన్న ప్రాణులు రెండు రకాలు. ఒకరు దైవీ సంపద కలవారు. మరొకరు ఆసురీ సంపద కలవారు. నీకు దైవీసంపద గురించి వివరంగా చెప్పాను. కాని ఆసురీసంపద గురించి క్లుప్తంగాచెప్పాను. ఇప్పుడు ఆసురీ సంపద గురించి వివరంగా, విస్తారంగా చెబుతాను.

పైన దైవీసంపద లక్షణములు ఆసురీ సంపద లక్షణములను వివరించిన పరమాత్మ కొంచెం వివరాలలోకి వెళుతున్నాడు. ప్రకృతిలో సహజంగా ఉన్న మూడు గుణముల హెచ్చుతగ్గుల ప్రభావంతో సృష్టి జరుగుతూ ఉంది. ఈ సృష్టిలోనే ఈ దైవీసంపద, ఆసురీ సంపద నిక్షిప్తం అయి ఉన్నాయి. అందుకని జీవులు పుట్టుకతోనే ఈ సంపదలను తమవెంట కలిగి ఉంటారు. అందుకే ప్రాణులను దైవసంబంధమైన గుణములు కల ప్రాణులు, ఆసురీ సంబంధమైన గుణములు కలిగిన ప్రాణులు అని రెండు రకాలుగా విభజించారు. కృష్ణపరమాత్మ ఇప్పటికే దైవీసంపద గురించి సవిస్తరంగా చెప్పాడు. ఇప్పుడు ఆసురీసంపద గురించి చెప్పబోతున్నాడు.

ఇది విన్న తరువాత, మనం అందరం కూడా ఈ సృష్టిలో భాగం కాబట్టి మనలో సహజంగా ఉన్న సత్త్వ, రజస్, తమోగుణ, స్వభావములను మనకు మనం విశ్లేషించుకొని మనలో దైవీసంపద ఎక్కువగా ఉందా లేక ఆసురీ సంపద ఎక్కువగా ఉందా అని బేరీజు వేసుకొని దానికి

అనుగుణంగా మన జీవిత విధానమును మార్చుకోవాలి. అంతే కానీ ఏదో జీవితం గడిపేస్తున్నాములే, రోజు గడిచిపోతూ ఉంది అని జీవితం గడపకూడదు.

## 7. ప్రవృత్తిం చ నివృత్తించ జనా న విదురాసురాః।
## న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే॥

ఆసురీసంపద కలవారు ప్రవృత్తి మార్గము అంటే ఏమిటి, నివృత్తి మార్గము అంటే ఏమిటి అనే విషయాలగురించి ఏమాత్రం తెలుసుకోరు. వారిలో శుచి, శుభ్రత, ఆచారము, సత్యము పలకడం వంటి లక్షణాలు మచ్చుకైనా కనిపించవు.

మన గురించి మనం తెలుసుకెవాలంటే, మనలను మనం విశ్లేషించుకోవాలంటే మనకు కొన్ని ప్రమాణాలు కావాలి. వాటి గురించి ఇక్కడ చెబుతున్నాడు. ఆసురీ స్వభావం కల వారిలో ఉన్న లక్షణాల గురించి చెబుతున్నాడు. బియ్యంలో రాళ్లు మట్టి బెడ్డలు ఉంటాయి. వాటిని వేరు చేస్తే మంచి బియ్యంతో అన్నం వండుకోవచ్చు. అలాగే ముందు మనలో ఉన్న ఆసురీ లక్షణాలను తొలగించుకుంటే మిగిలినవి దైవీ లక్షణాలే కదా! అందుకని ముందు ఆసురీ లక్షణాలను వివరిస్తున్నాడు పరమాత్మ.

మానవుడు పుట్టుకతోనే జ్ఞాని కాడు. మొదట అజ్ఞానిగానేఉంటాడు. కేవలం భౌతిక పదార్థాలు మాత్రమే కావాలంటాడు. కడుపునిండా తినడం, కావాల్సినవి అడగడం, తృప్తిగా ఆడుకోవడం. ఆనందంగా ఉండటం. బాల్యం, కౌమారం అలా గడిచిపోతుంది. 20 ఏళ్లు దాటగానే యవ్వనంలో ప్రవేశిస్తాడు. విచక్షణా జ్ఞానం కలుగుతుంది. ఏమి చెయ్యాలో ఏమి చెయ్యకూడదో, వాటి పరిణామాలు ఏమిటో తెలుసుకునే శక్తి వస్తుంది. అప్పుడు వారికి శాస్త్ర అధ్యయనం మంచి మార్గం గురించి, ధర్మం ఏమిటో, అధర్మం ఏమిటో, ఏది చెయ్యాలో. ఏది చెయ్యకూడదో బోధిస్తుంది.

కాని ఆసురీ సంపద కలవారు శాస్త్ర అధ్యయనం జోలికిపోరు. అటువంటి వారు ధర్మమార్గంలో నడవరు. పోనీ వారికి అధర్మమార్గం, దాని వలన వచ్చే దుష్పరిణామాలు తెలుసా అంటే అవీ తెలియవు. వారికి అటు ధర్మ మార్గం గురించి గానీ, ఇటు అధర్మమార్గం గురించి గానీ ఏమీ తెలియదు. అంటే ఏమి చెయ్యాలో, ఏమి చెయ్యకూడదో తెలియదు. కేవలం వారికి ఏది తోస్తే అది చేస్తారు. కేవలం ధన సంపాదనే వారి మతం. పోనీ ఆ ధనం అనుభవిస్తారా అంటే అదీ

లేదు. ఇంకా ఇంకా సంపాదించి కూడబెట్టడంలోనే వారి జీవితం గడిచిపోతుంది.

మరి కొందరికి శారీరక పరిశుభ్రత, మనస్సు నిర్మలంగాఉంచుకోవడం, మంచి ప్రవర్తన ఉండవు. వాటి గురించి అస్సలు పట్టించుకోరు. ఆచార వ్యవహారాలుగురించి అస్సలు తెలియదు. తాము ఆచరించిందే ఆచారం అంటారు. మొండిగా వాదిస్తారు. నిజానిజాలు తెలుసుకోలేరు. తెలుసుకోవాలన్న ఆసక్తి కూడా ఉండదు. మూర్ఖత్వము మూఢత్వం వారి సంపద. నిర్లక్ష్యం వారి మార్గము. ఈ ప్రపంచంలో సత్యవస్తువు ఏది అసత్య వస్తువు ఏది అనే పరిజ్ఞానం ఏమాత్రం ఉండదు. దాని గురించి ఆలోచించరు. పైగా వితండ వాదన చేస్తాడు. "దేవుడు అంతటా ఉన్నాడు కదా ఇంక దేవాలయానికి వెళ్లడం ఎందుకు, ఈ పూజలు పునస్కారాలు ఎందుకు" అని వాదిస్తాడు. "నిన్నమళ్లారాదు. రేపేంటో తెలియదు ఈ రోజు తింటే చాలు. ఇదే సత్యం" అనే మూఢనమ్మకంతో ఉంటారు.

## 8. అసత్యమప్రతిష్ఠం తే జగదాహురనీశ్వరమ్।
## అపరస్పరసమ్భూతం కిమన్యత్కామహైతుకమ్॥

ఆసురీ సంపద కలవారు ఈశ్వరుడు అనేవాడు లేడు, ఈ ప్రపంచం అంతా అసత్యం, కేవలం స్త్రీపురుషసంయోగము వలన కలిగేసుఖమే సత్యము, ఇది తప్పఈ ప్రపంచంలో మరొక సుఖమైనది లేదు అని నమ్ముతారు.

ఆసురీ సంపద ఉన్న వాళ్లు దేనినీ నమ్మరు. వేదములను, శాస్త్రములను అసలే నమ్మరు. వేదప్రమాణాలను అంగీకరించరు. ఇంకా కొంచెం ముందుకు పోయి "ఆనాటి వాళ్ల వారికి తోచింది, వాళ్లకు అనుకూలంగా, వారు రాసారు. అదంతా మనం నమ్మాలా!" అని వితండ వాదం చేస్తారు. అటువంటివారికి ధర్మం ఏమిటో అధర్మం ఏమిటో తెలియదు. వాటి గురించి తెలియజెప్పే శాస్త్రములను వారు అధ్యయనం చేయరు. తమకు అనుకూలంగా ఉండే అధర్మం వైపు మొగ్గుచూపుతుంటారు.

ఇదంతా పరమాత్మ సృష్టి అని నమ్మరు. అంతా యాదాలాపంగా జరుగుతూ ఉంది అనుకుంటారు. ప్రకృతి దానంతట అదే పరిణామ సిద్ధాంతం ప్రకారం ఆవిర్భవించింది అనీ, ఈ సృష్టికి ఎవరూ కారకులు కారనీ, అంతా యాదృచ్ఛికంగా జరుగుతుందనీ నమ్ముతారు. ధర్మం అధర్మం పాపం పుణ్యం ఏవీ లేవని నమ్ముతారు. పుట్టుక చావు యాదృచ్ఛికమే కానీ ఎవరూ కారకులు కారు. ఈశ్వరుడు లేడు. కేవలం ధనం మాత్రమే ఉంది. ధనమూలం ఇదం జగత్ అని నమ్ముతారు. స్త్రీపురుషుల మధ్య ఉండేది కోరిక, కామము తప్ప వేరు కాదు. స్త్రీపురుషులు కలిస్తే పిల్లలుపుడుతున్నారు.

కాలం తీరగానే పోతున్నారు. ఈ జగత్తు ఏర్పడటానికి ఈ సృష్టి జరగడానికి దేవుడు కానీ, వేరు ఎవరూ కారణం కాదు. కేవలం కామము, కోర్కె, కామసంబంధమైన స్త్రీపురుషసంయోగ ప్రక్రియ ఇవే ఈ జగత్తు ఏర్పడటానికి కారణాలు. ఈ జగత్తు వేలకోట్ల సంవత్సరాల నుండి ఈ విధమైన సంయోగం ద్వారా పరిణామం చెందుతూ ఉంది అని నమ్ముతారు. వీళ్లు కేవలం భౌతిక సుఖములకు, శారీరక సుఖములకు, కామ కోరికలు తీర్చుకోడానికే ప్రాధాన్యం ఇస్తారు. పాపం పుణ్యం గురించి ఆలోచించరు. తమకు ఏది తోస్తే అది చేస్తారు. దీనినే చార్వాక మతం అని అంటారు.

(చారు వాకము ...... "చారు" అంటే చక్కగా, చెవులకు, మనసుకు ఇంపుగా, మనకు ఇష్టమైన రీతిలో, "వాకము" అంటే చెప్పబడినది. జీవితం అంతా సుఖ సంతోషాలతో అనుభవించు. అవసరమైతే అప్పుచేసి అయినా అనుభవించు. అప్పుఇచ్చినవాడు తనకు ఎక్కువైతేనే కదా నీకు ఇచ్చాడు కాబట్టి ఆ అప్పు నీవు తీర్చనవసరం లేదు. అవసరం అయితే అప్పు తీసుకోలేదు అని చెప్పు. దాని వలన పాపం రాదు. ఎందుకంటే పాపపుణ్యాలు అంటూ లేవు. నరకం అనేది ఏదీ లేదు. చచ్చిన తరువాత శరీరం బూడిద అయి పోతుంది. ఈ మతం వారిని చార్వాకులు అని అంటారు.)
వీరిలో ఆసురీ స్వభావం ఎక్కువ అని తెలుసుకోవాలి.

9. ఏతాం దృష్టి మవష్టభ్య నష్టాత్మానో2ల్పబుద్ధయః।
ప్రభవన్త్యుగ్రకర్మాణః క్షయాయజగతో2హితాః॥

వీరిని నాస్తికులు అని అంటారు. న అస్తి ఏమీ లేదు. అంటే దేవుడు లేడు వేదములు లేవు. వేదప్రమాణములు లేవు. కనపడేదే నమ్మాలి. కనపడనిది ఏదీ లేదు అని నమ్ముతారు. వారి మనస్సు కామకోరికలతో కలుషితమై ఉంటుంది. వారికి విశాల మైన భావాలు, విశాల బుద్ధి ఉండదు. సంకుచిత్వం, లోభగుణము వారి లక్షణాలు. అటు వంటి వారు తమ స్వార్థం కోసం ఎటువంటి క్రూరకార్యములకు ఐనా వెనుదీయరు.

ఈ నాటి చదువులు భౌతికశాస్త్రజ్ఞానాన్ని, దాని వలన వచ్చే ధనాన్ని సమ కూరుస్తున్నాయి కానీ సంస్కారాన్ని ఇవ్వడం లేదు. పైగా అహంకారాన్ని పెంచుతూ ఉంది. తమ ఆధిక్యతను నిరూపించుకోవడానికి తోడ్పడుతూ ఉంది. అటువంటి వారికి ధనము, భౌతిక సుఖములు తప్ప వేరే ఏమీ అక్కరలేదు. ఇటువంటి వారు "నష్టాత్మనః" అంటే తమ తమ మనస్సులను కలుషితం చేసుకుంటున్నారు. తమను తాము వంచించుకుంటున్నారు, నాశనం చేసుకుంటున్నారు. "అల్పబుద్ధయః" అంటే ఇటువంటి వారికి బుద్ధి, విచక్షణా జ్ఞానము పనిచేయదు. తమకు ఏది తోస్తే అదే మంచిది. ఎవరి మాటా వినరు. ఇటువంటి వారు తమను తాము నాశనం చేసుకోవడమే కాకుండా తమ క్రూర కర్మలవలన, తీవ్ర వాదాలు, ఉగ్రవాదాల వలన సమాజాన్ని కూడా నాశనం

చేస్తారు. సమాజానికి ఒక సమస్యగా పరిణమిస్తారు.

ఆఖరున పరమాత్మ ఒక మాట అన్నాడు. "క్షయాయ జగతో2హితా:" ఇటువంటి వారి ఉగ్రవాద, తీవ్రవాద కర్మల వలన జగత్తుకు కీడు జరుగుతుంది. అని అన్నాడు పరమాత్మ. ఈ నాటి శాస్త్ర పరిజ్ఞానము, శాస్త్ర పరిశోధనలు, అన్నీ ప్రపంచ వినాశనానికే గానీ, ప్రపంచ సౌభాగ్యానికి ఏ మాత్రం ఉపయోగపడటం లేదు అని అందరూ మొత్తుకుంటున్నారు. మేము కనిపెట్టిన బాంబువేస్తే ఇన్ని వందల మైళ్లు సర్వనాశనం అవుతుందని ఒక దేశం అంటే అదేం కాదు మే కనిపెట్టిన బాంబువేస్తే అంతకు రెట్టింపు మేరనాశనం అవుతుందని వినాశకర బాంబులను సృష్టిస్తున్నారు. ఆటంబాంబులు, హైడ్రోజన్ బాంబులు, రసాయన బాంబులు, క్షిపణులు, తుపాకులు, ఇలా రకరకాల మారణాయుధాలు ఒకరిని మించి ఒకరు కనుక్కుంటున్నారు. ఒకరిని ఒకరు చంపుకుంటున్నారు. మారణ హెూమం సృష్టిస్తున్నారు. తాము ఆర్జించిన విజ్ఞానాన్ని ప్రజల సౌభాగ్యానికి బదులు, ప్రపంచ వినాశనానికి ఉపయోగిస్తున్నారు. ఈ నాడు ప్రపంచాన్ని పట్టి పీడిస్తున్న భయాలు రెండే రెండు. ఒకటి ఉగ్రవాదము రెండు యుద్ధ భయం.

( ప్రపంచ దేశాలన్నీ ఒక చోట కూర్చుని మనలో మనం తగవులాడుకోకూడదు యుద్ధాలు చేసుకోకూడదు అని నిర్ణయంతీసుకొని తమ తమ సైన్యానికి అయ్యే ఖర్చు నామమాత్రంగా పెట్టుకోగలిగితే, ప్రస్తుతం సైన్యాలకు, మారణాయుధాలకు పెట్టే ఖర్చు, మానవుల ఆహార అవసరాలను తీర్చడానికి ఉపయోగించగలిగితే, ప్రపంచంలో ఆకలి అనేది ఉండదు. కాని ఆపని ఎవరూ చెయ్యరు. ఎందుకంటే వాళ్ల ఆసురిక ప్రవృత్తి మారదు కాబట్టి. ఈ విషయాన్ని వేల సంవత్సరాల కిందట వ్యాసుడు చెప్పాడు.)

## 10. కామమాశ్రిత్య దుష్పూరం దమ్భమానమదాన్వితా:।
## మోహాద్గృహీత్వా2సద్గ్రాహా న్ప్రవర్తన్తే2శుచివ్రతా:॥

కొంత మందికి విపరీతమైన కామ సంబంధమైన, స్త్రీ సంబంధమైన కోరికలు ఉంటాయి. అవి అగ్నిలో నెయ్యి పోస్తే ఎలా భగభగమండుతుందో అలా నిరంతరం పెరుగుతూ పోతుంటాయి. ఎన్నటికీ చల్లారవు. వారికి ఎంత ధనం, ఆస్తులు సంపాదించినా, ఎన్ని కోరికలు తీరినా తృప్తి అనేది ఉండదు. ఇంకా కోరికలు మిగిలే ఉంటాయి. కొత్త కొత్త విపరీతమైన కోరికలు పుట్టుకొస్తాయి. అటువంటి వారు న్యాయస్థానం వేసే శిక్షలకు భయపడరు. తమ కోరికలు, కామ వాంఛలు తీర్చుకోవడమే వారికి ముఖ్యం. వారికి వివాహేతర సంబంధాలు, అక్రమ సంబంధాలు అంటేనే ఎక్కువ ఇష్టం. వారి కోరికలు తీర్చుకోడానికి దంభము అంటే మాయమాటలు చెబుతారు. అబద్ధాలు చెబుతారు. లేని పోని ఆశలు కల్పిస్తారు. కల్లబొల్లి కబుర్లు చెప్పి స్త్రీలను వశం చేసుకుంటారు.

అనుభవించి వదిలేస్తారు.

వీరికి అభిమానము ఎక్కువ. అదేమిటని అడిగితే అడిగినవారి మీదికి దాడికి దిగుతారు. వీరికి మదం కూడా ఎక్కువే. తమకు ఎదురు ఎవరూ లేరనే ధీమాగా ఉంటారు. వీరికి ధనమదము, అధికార మదము ఎక్కువగా ఉంటుంది. తాము ఏమి చేసినా చెల్లుతుంది అనే అహంకారంతో ఉంటారు. వీరిలో మోహం ఎక్కువ. తాము చేస్తున్నది తప్పు, నేరం అని తెలుసుకోలేని మోహంలో పడి ఉంటారు. ఎవరు చెప్పినా వినరు. ధనం ఉంటే చాలు అన్ని సమకూరుతాయి, ఏదైనా ధనంతో కొనవచ్చు అనే భ్రాంతిలో ఉంటారు. వీరికి మంచివారి సహవాసము గిట్టదు. ఎప్పుడూ దుర్మార్గుల సహవాసం చేస్తుంటారు. వీరికి తమ మాట నెగ్గాలనే పట్టుదల ఎక్కువ. తమ మాట నెగ్గించుకోవడానికి ఎంతకైనా తెగిస్తారు. ఎల్లప్పుడూ నీచమైన, అసాంఘికమైన పనులు చేస్తుంటారు. వీరంతా ఆసురీసంపద ఎక్కువగా కలిగిన వారు అని గుర్తించవచ్చు.

11.చిన్తామపరిమేయాం చ ప్రళయాన్తాముపాశ్రితాః।
కామోపభోగపరమా ఏతావదితి నిశ్చితాః॥
12.ఆశాపాశశతైర్బద్ధాః కామక్రోధపరాయణాః।
ఈహన్తే కామభోగార్థ మన్యాయేనార్థసఞ్చయాన్॥

మానవులకు మరణమే ప్రళయము. ప్రళయాన్తా అంటే మరణించే దాకా అని అర్థం. "పుట్టుకతో వచ్చిన బుద్ధి పుడకలతో కానీ పోదు" అన్న సామెత ఇలాంటి వారి పట్ల బాగా వర్తిస్తుంది. వీరిలో పూర్వజన్మవాసనల వలన కలిగిన ఈ స్త్రీలోలత్వము, కామవాంఛ, విషయవాంఛ, అపరిమితంగా ధనం సంపాదించడం, కోరికలు తీర్చుకోవడం, తీవ్రంగా ఉంటుంది. ఈ కోరికలు వారికి మరణించినదాకా ఉంటాయి. అటువంటి వారు జీవితాంతం తమ కోరికలు తీరలేదే అని బాధపడుతూనే ఉంటారు. వయసుమీదపడ్డా వారికి ధనం మీద ఆశ, కోరికలు తీర్చుకోవాలనే కాంక్ష పోదు.

ఉదాహరణకు 50 దాటిన వారు కూడా అమాయుకులైన చిన్న పిల్లల మీద అత్యాచార ప్రయత్నాలు చేయడం మనం వింటూనే ఉన్నాము. వీరికి తమ కామము, స్త్రీ వాంఛలు తీర్చుకోవడమే ముఖ్యము. దానివలన వచ్చే పరిణామాలను గురించి ఆలోచించరు. అటువంటి వారికి లోకంలో స్త్రీసుఖమును మించిన సుఖం, స్వర్గం మరొకటి లేదని గాఢంగా నమ్ముతుంటారు. ఏ స్త్రీని చూచినా వారికి ఆమెను అనుభవించాలనే కోరిక తప్పమరోఆలోచన కలుగదు. ఇటువంటి వాడు వందల కొద్దీ ఆశాపాశములలో అంటే ఆశలు అనే బంధనములలో చిక్కుకొని నిరంతరము ఆ ఆశలు తీరక దు:ఖిస్తుంటారు. వీరికి కామ వాంఛలతో పాటు, కోపము కూడా ఎక్కువే. తమ

కామ కోరికలు తీరకపోతే కోపంతో ఊగి పోతారు. ఆ కోపంలో ఎన్నోఅనర్థాలకు పాల్పడతారు. మంచి చెడు మరిచిపోతారు.

వీరికి ఉన్న ధనం అంతా వారి స్త్రీవాంఛలు, కామ కోరికలు తీర్చుకోడానికే ఖర్చుపెడతారు. చాలక పోతే ఇంకా ఇంకా సంపాదిస్తారు. ఆ ధనం సంపాదించడానికి ఎటువంటి అన్యాయము, అక్రమము, అధర్మమునకైనా పాల్పడతారు. ఇతరులను మోసం చేస్తారు. అక్రమంగా, అధర్మంగా ధనం సంపాదించడం, ఆస్తులు కూడబెట్టుకోవడం, కామసంబంధమైన కోరికలు తీర్చుకోవడం ఇదే వారికి దైనందిన కార్యక్రమం. చావు ఒకటే వారి కామవాంఛలకు ముగింపు. చచ్చేదాకా వారిలో ఉన్న కామ చింతన, కామవాంఛలు చావవు. “చితి” వాడిని చావు తరువాత దహిస్తే, “చింత” వాడిని బతికి ఉండగానే ప్రతి దినం దహిస్తూ ఉంటుంది.

పై లక్షణములు కలిగి ఉన్న వారిని మనము ఆసురీ సంపద కలిగిన వారిగా గుర్తించవచ్చును.

13.ఇదమద్య మయా లబ్ధ మిమం ప్రాప్స్యేమనోరథమ్।
ఇదమస్తీదమపి మే భవిష్యతి పునర్ధనమ్॥
14.అసౌ మయా హతశ్శత్రుర్హనిష్యే చాపరానపి।
ఈశ్వరోऽహమహం భోగీ సిద్ధోऽహం బలవాన్సుఖీ॥
15.ఆఢ్యోऽభిజనవానస్మి కోऽన్యోऽస్తిసదృశో మయా।
యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్యజ్ఞానవిమోహితా:॥
16.అనేక చిత్త విభ్రాన్తా మోహజాలసమావృతా:।
ప్రసక్తా: కామభోగేషు పతన్తి నరకేऽశుచౌ॥

ఈ ఆసురీ సంపద కలవారికి ఉన్న ఆలోచనలు, వారి ఆలోచనా విధానం ఎలా ఉంటుందో వాటి గురించి చెబుతున్నాడు పరమాత్మ.

ఆసురీ సంపద ఎక్కువగా ఉన్న వాడిలో ధన సంపాదన గురించి గానీ, ఆస్తులు కూడబెట్టడం గురించి గానీ, పదవిని సంపాదించడానికి కానీ, ఒక స్త్రీని లోబరచుకొని అనుభవించే కోరికగానీ, ముందు ఏదో ఒక కోరిక మొలకెత్తుతుంది. దాని కోసం నానా పాట్లు పడతాడు. వాడి

కోరిక నెరవేరుతుంది. అమ్మయ్య ఈ కోరిక తీరింది అని సంతోష పడతాడు. అటువంటి కోరికలే మరికొన్ని మొలకెత్తుతాయి. వాటిని తీర్చుకోడానికి ప్రణాళికలు వేస్తుంటాడు. ఒక కోరిక తీరితే మరొకటి. అది తీరితే మరొకటి. ఇలా పుట్టగొడుగుల్లా పుట్టే కోరికలను తీర్చుకోడానికి నిరంతరం సతమతమౌతుంటాడు.

ఇలాంటి వాడికి తృప్తి అనేది ఉండదు. కొంత ధనం సంపాదిస్తాడు. దానితో తృప్తి చెందడు. ఇంకా ఇంకా కావాలంటాడు. ఎక్కువ ధనం సంపాదించడానికి అక్రమ మార్గాలు, అవినీతి మార్గాలు తొక్కుతాడు. అలాంటి వారికి శత్రువులు కూడా ఎక్కువే ఉంటారు. తన మాట వినని వారి మీద, తన దారికి అడ్డు వచ్చేవారి మీదా, శత్రుత్వము పెంచుకుంటాడు. వారిని చంపడానికి ప్రయత్నం చేస్తాడు. చంపుతాడు. అమ్మయ్య ఈరోజు వీడిని చంపాను అని సంతోషిస్తాడు. వీడే కాదు ఇంకా నా శత్రువులను అందరినీ చంపాలి అనుకుంటాడు. అలా చంపుతూనే ఉంటాడు. చంపే కొద్దీ శత్రువులు పెరుగుతూనే ఉంటారు. వారినీ చంపుతూనే ఉంటాడు. తుదకు వారి చేతిలోనే చంపబడతాడు. అలా అంతమౌతుంది వాడి జీవితం.

ఇక్కడ చంపడం అంటే అణగతొక్కడం అని కూడా అర్థం చెప్పుకోవచ్చు. ఇలాగా తన శత్రువులను అందరినీ అణగతొక్కి కానీ, చంపి కానీ, నేనే అందరికంటే గొప్ప వాడిని, నా కన్నా గొప్పవాడు లేడు అని విర్రవీగుతాడు. జీవితంలో అన్నీ అనుభవించాలి అని అనుకుంటాడు. తినడం, తాగడం, కంటికి కనిపించిన వారిని అనుభవించడం. ఇదే జీవితం అనుకుంటాడు. ఆఖరుకు తాను ఏ శత్రువులను అణగతొక్కాడో వారి చేతిలోనే అంతం అవుతాడు. రౌడీలు, గూండాలు, ఫాక్షనిస్టుల జీవితాలే దీనికి ఉదాహరణ.

ఈ ఆసురీ సంపద మరొక విధంగా కూడా విజృంభిస్తుంది. అదే పదవీ కాంక్ష. చిన్న పదవితో ఆరంభిస్తాడు. దానితో తృప్తి చెందడు. ముఖ్యమంత్రి అవుదామనీ, అందరినీ పరిపాలిద్దామనీ కోరిక పుడుతుంది. ప్రజాసేవ అనే ముసుగులో అధర్మంగా ప్రవర్తిస్తాడు. ఎన్నో అకృత్యాలు చేస్తాడు. నేను అందరికీ ప్రభువును. అందరూ నామాట వినాలి అనే అహంకారం ప్రదర్శిస్తాడు. ఎవరి మాటా వినడు. ఉన్నత పదవి వలన వచ్చే ధన సంపాదన, భోగములు అనుభవించడం ఇవే అతని లక్ష్యం. నామాటకు ఎదురు లేదు అనే అహంకారంతో విర్రవీగుతుంటాడు. నేను అనుకున్నది జరగాల్సిందే అన్న మూర్ఖత్వంలో ఉంటాడు. అందరి కంటే నాకు ఎక్కువ ధన బలం, అంగ బలం, పదవీ బలం ఉంది, నాకు ఎవరూ ఎదురు చెప్పకూడదు, అంతా నేను చెప్పినట్టే జరగాలి అనే మదం, అహంకారం ప్రదర్శిస్తుంటారు. అందరి కన్నా నేనే గొప్పవాడిని, నేనే ఈశ్వరుడిని, నామాట అందరూ వినాలి. అన్ని సుఖాలు, భోగాలు నేనే అనుభవించాలి, అందరూ నా కాళ్ల దగ్గరపడి ఉండాలి అనే అహంకారంతో ఉంటాడు.

ఇదంతా ఒక ఎత్తు అయితే నేను గొప్ప కులంలో పుట్టాను, మా వంశం గొప్పది, తక్కిన వారంతా నా కన్నా తక్కువ కులంలో పుట్టారు అన్న అహంకారం, తన కన్నా తక్కువ కులం వారిని నీచంగా చూడటం, అంటరాని వారిగా చూడటం ఇది కూడా ఆసురీ ప్రవృత్తిలో భాగమే. ఈ కులాల కుమ్ములాట, కులాల పేరిల మనుషులను విభజించడం, మారణ హోమాలు సృష్టించడం, ఇతర దేశాలలో కూడా ఉన్నా, భారతదేశంలోనే కొంచెం ఎక్కువ.

ఇంకా మరి కొందరు ఉన్నారు. మాది అగ్రకులం, మేము ఎన్నో యజ్ఞాలు యాగాలు చేసాము., ఎన్నోదాన ధర్మాలు చేసాము, పుణ్యకార్యాలు చేసాము., మేము కాబట్టి అవన్నీ చేసాము, మాతో సరిసమానవాళ్లు ఎవరూ లేరు అంటూ గర్వంతో విర్రవీగుతుంటారు. కొద్దిగా దానం చేసినా, ఎక్కువగా ప్రచారం చేసుకుంటారు. ఇతరుల చేత పొగిడించుకోడానికి ఆరాటపడుతుంటారు.

ఇంకా కొంతమందికి తమ భార్య, సంతానము, బంధువులు వీరే సర్వస్వము. వారి కోసం ఏమైనా చేస్తారు. వారి మోహంలో పడి పోతారు. నేను లేకపోతే వీళ్లంతా ఏమైపోతారు అనే మోహం ఆవరించి ఉంటుంది. వీరంతా ఆసురీ సంపద కలవారు. వీరంతా నరకములో పడి పోతారు అని కృష్ణుడు చెప్పాడు.

ఈ లక్షణాలు మనలో ఉంటే వాటిని వెంటనే పోగొట్టుకోడానికి ప్రయత్నం చేయాలి. ఎందుకంటే ఈ లక్షణాలు అన్నీ మనలో తెలిసో తెలియకో పాతుకుపోతాయి. వాటిని గుర్తించి నిర్మూలించాలి. లేకపోతే నరకములో పడక తప్పదు. ఈ లక్షణాలు కేవలం అజ్ఞానం వలన కలుగుతాయి. ధనం, సంపదలు, పదవులు, స్త్రీలు, వీరి వలన సుఖాలు కలుగుతాయి. ఆ సుఖాలు అనుభవించవచ్చు అనే భ్రమలోఈ ఆసురీ సంపదకు లోబడుతున్నారు. ఈ సుఖాలు అన్నీ దు:ఖాలుగా పరిణమిస్తాయి అని, తీరని మనోవ్యధను కలిగిస్తాయనీ, మనశ్శాంతి లేకుండా చేస్తాయనీ తెలుసుకోలేకపోతున్నారు. ఇటువంటి వారు అనుభవించే రాజసమైన సుఖములు, తామస సుఖములు తుదకు దు:ఖములుగా పరిణమిస్తాయి.

అలాగే సాత్విక అహంకారము కూడా విడిచిపెట్టాలి. నేను యజ్ఞాలు చేసాను, యాగాలు చేసాను, దానాలు చేసాను అని ప్రచారం చేసుకోవడంకూడా ఆసురీ లక్షణమే. అది ఆర్భాటము, డంబాచారమే కానీ వేరు కాదు. వారు చేసిన యజ్ఞాలు యాగాలు ఏవేవో కోరికలతో చేసినవి, కేవలం పదిమంది తమగురించి చెప్పుకోడానికి చేసినవే కానీ, సమాజం కోసం చేసినవికాదు. వాటి ద్వారా పేరు సంపాదించి గొప్పవాళ్లు అనిపించుకోవాలనే ఆశ తప్ప వేరు కాదు. వాటి వలన పతనమే కానీ ఉన్నతి లభించదు. కాబట్టి మానవులకు ఎంత ధనము, కీర్తి, పదవి, ఐశ్వర్యము ఉన్నా చిత్తశుద్ధి లేకపోతే, గర్వము, అహంకారము తొలగకపోతే, అవి ఆసురీ సంపదలే. వారికి నరక ప్రాప్తి తప్పదు అని హెచ్చరిస్తున్నాడు పరమాత్మ.

(ఇక్కడ నరకము అంటే నరకముతో సమానమైన జీవితము అని అర్థం. అన్నీ ఉన్నా అందరూ ఉన్నా, ఏమీ లేని వాడి వలె ఎవరూ లేని వారి వలె, ఒంటరిగా బతకడం. నిరంతరం నిరాశ, నిస్పృహలతో రోగాలతో భయం భయంగా అశాంతిగా బతకడం. దుర్భర దారిద్ర్యంతో జీవించడం. అందరిచేతా ఛీత్కరింపబడుతూ బతకడం. ఇవన్నీ నరకప్రాయమైన జీవితాలే.)

17.ఆత్మసమ్భావితాః స్తబ్ధా ధనమానమదాన్వితాః।
యజన్తే నామయజ్ఞైస్తే దమ్భేనాऽవిధిపూర్వకమ్॥

18. అహంకారం బలం దర్పం కామం క్రోధం చ సంశ్రితాః।
మామాత్మపరదేహేషు ప్రద్విషన్తోऽభ్యసూయకాః॥

కొంత మంది యజ్ఞములు, యాగములు, పూజలు, వ్రతాలు చేస్తుంటారు. వారి సంగతి ఏమిటి. అది దైవీ సంపదా లేక ఆసురీసంపదా అని సందేహం అందరికీ వస్తుంది. దానికి సమాధానం ఇస్తున్నాడు పరమాత్మ. వేదములలో యజ్ఞములు, యాగములు, క్రతువులు, వ్రతములు, సాకారముతో వివిధ దేవతా పూజలు, పూజా విధానములు చెప్పబడ్డాయి. కాని ఇవన్నీ ఎలా చేయాలి ఎలా చేయకూడదు. ఈ రోజుల్లో జనులు పైన చెప్పబడిన వాటిని గొప్పకోసమో, పేరు కోసమో, ఏదో ఒక కోరిక తీరడం కోసమో, లేక భగవంతుడు మీద భయంతోనూ, లేక స్వర్గంవస్తుంది అనే ఆశతోనో, కోరుకున్న పదవికోసమో చేస్తున్నారు కాని దేవుని మీద భక్తి, శ్రద్ధతో, ఎటువంటి ఫలాపేక్ష లేకుండా చేయడం లేదు. వీళ్లు ఎటువంటి వాళ్లు అంటే...............

"ఆత్మ సంభావితాః" అంటే తమను తాము పొగుడుకొనే వాళ్లు. నేను ఆ యజ్ఞం చేసాను ఈ యాగం చేసాను అని ప్రచారం కోసం, గొప్ప కోసం, పేరు కోసం చేసేవాళ్లు.

"స్తబ్ధాః" అంటే స్తబ్ధులుగా ఉండే వారు. ఏ మాత్రం వినయ విధేయతలు లేని వారు. వీరికి ఇతరుల ఎడల గౌరవం ఉండదు తమకు ధనం ఉంటే ఏమన్నా చేస్తాము అన్న గర్వం తప్ప.

"ధన, మాన, మదన్వితాః" అంటే తాము ధనవంతులము, గొప్పవాళ్లము, గొప్పకులంలో పుట్టాము, తమకు మానము, అభిమానము ఎక్కువ, అంటూ మదించి ఉంటారు. ధన మదము, అధికార మదముతో కళ్లు మూసుకుపోయి ఉంటాయి. ఎవరినీ లెక్కచేయరు.

ఇటువంటి వారికి అహంకారము, బలము, దర్పము ఎక్కువగానే ఉంటాయి. బలము అంటే శారీరక బలమే కాదు. ధన బలము, అంగ బలము, పదవీ బలము ఇవన్నీ బలాలే. వీటి వలన నాకు ఎవ్వరూ సాటిరారు, నామాటకు ఎదురు లేదు అనే అహంకారము పుడుతుంది. ఇవన్నీ ఉంటే దర్పము అంటే హోదా, ఎవరినీ లెక్క చేయని తనము, గర్వము, తల ఎగరేయడం, ఇటువంటి లక్షణాలు వస్తాయి. వాళ్లకు పైచూపే గానీ కింద ఉన్న వారు కనపడరు.

ఇటువంటి వారికి తమను ఎవరైనా కాదంటే, ఎదురు చెబితే వెంటనే కోపం వస్తుంది. ఆ కోపంలో ఏం చేస్తారో వారికే తెలియదు. వారికి మరొక లక్షణం కూడా ఉంటుంది. కామము. తాము కోరిందల్లా, తలచిందల్లా జరగాలనే మూర్ఖత్వము. తాము ఏది కావాలన్నా, ఎవరు కావాలన్నా వాళ్ల తన కాళ్లముందుకు రావాల్సిందే.

ఇటువంటి వారు కేవలము పేరు ప్రతిష్టలకోసము, గొప్ప కోసమూ, కోరిన కోరికలు తీరడం కోసమూ యజ్ఞాలు యాగాలు క్రతువులు, పూజలు, వ్రతాలు చేస్తుంటారు. పైగా తమ ఇష్టం వచ్చినట్టు చేస్తారు. వేదాలలో చెప్పిన ప్రమాణాలు పాటించరు. తమ పేరు కోసమే పాకులాడతారు. ఉపనయనాలలో కానీ, వివాహాలలో కానీ, సత్యనారాయణ వ్రతములలో కానీ, ఎంత ఆర్భాటంగా చేస్తున్నాము, ఎంత గొప్పగా భోజనాలు పెట్టాము, ఎన్నిఐటమ్స్ పెట్టాము, ఏర్పాట్లు ఎంత ఘనంగా చేసాము అనే వాటి మీద ఉన్న శ్రద్ధ, పురోహితుడు చదివే మంత్రాల అర్థం ఏమిటి వాటిని మనం ఎలా ఆచరించాలి అని కానీ, మనం ఏ దేవుడిని పూజిస్తున్నామో ఆ దేవుడి మీద భక్తి కానీ, శ్రద్ధ కానీ ఉండదు. దీనినే అవిధిపూర్వకమ్ అని అన్నారు కృష్ణపరమాత్మ.

(దేవాలయాలలో ఉత్సవాలు జరిగేటప్పుడు, ఫలానా ఆయన వచ్చేదాకా మొదటి పూజ చేయ కూడదు, హారతి ఇవ్వకూడదు, తొలిప్రసాదం ఆయనకే ఇవ్వాలి, ఆయనకే శాలువా కప్పాలి, దండ వేయాలి, ఇటువంటి ఆచారాలు పాటిస్తుంటారు. అంటే వారికి దేవుడి కన్నా వ్యక్తులే ముఖ్యం అన్నమాట. వీరందరూ పైన చెప్పబడిన కోవలోకి వస్తారు.)

ఇటువంటివారికి ఆత్మజ్ఞానము కానీ, పరమాత్మ తత్వము కానీ అస్సలు తెలియదు. తెలుసుకోవాలనే కోరిక కూడా ఉండదు. వారు ఎల్లప్పుడూ ఈ శరీరమే తాను, తానే ఈ శరీరము అనుకుంటూ ఉంటారు. తన శరీరములోగానీ, ఇతరుల శరీరములో గానీ నిగూఢంగా ఉన్న పరమాత్మను గురించి తెలుసుకోరు. వీరికి అసూయా ద్వేషములు ఎక్కువ. సాటి వారు తమకన్నా గొప్ప యజ్ఞము యాగము చేస్తే ఓర్వలేరు. ఇటువంటి వారు దేవుడిని కూడా దూషిస్తుంటారు. దైవాన్ని ద్వేషిస్తుంటారు. అంటే ఎదుటివారిలో ఉన్న ఆత్మస్వరూపుడైన పరమాత్మను కూడా ద్వేషిస్తారు.

ఈ శ్లోకంతో ఆసురి సంపద కలవారి లిస్తుపూర్తి అయింది. ఈ ఆసురీసంపదలు ఎవరిలో ఉన్నా, వారు ధనవంతులు, విద్యావంతులు,కులవంతులు, అధికారవంతులు, సౌందర్యవంతులు, బలవంతులు అయినా వారిలో ఇటువంటి ఆసురీ సంపద ఉంటే వారికి ఎటువంటి ప్రయోజనము లేదు. వారు మానవులు అయినా, దేవతలు అయినా, అసురులే. కాబట్టి దేవతలు, అసురులు ఎక్కడో లేరు. మనలోనే ఉన్నారు. మనలో ఉన్న దైవీ సంపదలను, ఆసురీ సంపదలను బట్టి వారిని దేవతలు, అసురులు అని విభజించవచ్చు. అంతే కానీ, దేవతలు కిరీటాలు, పట్టు బట్టలు ధరించి ఉండరు అలాగే అసురులు కొమ్ములు, కోరలు కలిగి ఉండరు. మనలోనే దేవతలు, అసురులు ఉన్నారు. కాబట్టి ఎవరికి వారు ఆత్మ పరిశోధన చేసుకొని తమలో ఉన్న ఆసురీ సంపదలను తొలగించుకొని దైవీ సంపదలను పెంపొందించుకోవాలి. ఒక్క ఆసురీ సంపద మనసులో ఉన్నా అది వృద్ధి చెందుతుంది. కాబట్టి ఆసురీ సంపదలను సమూలంగా నాశనం చేయాలి.

ఇందుకు చక్కటి ఉదాహరణ. మనం ఏదైనా పూజచేసే ముందు గంట వాయించి ఈ మంత్రం చదువుతాము.

"ఆగమార్థం తు దేవానాం గమనార్థం తు రక్షసామ్"

అంటే "ఓ పరమాత్మా! ఓ దేవా! దైవీగుణములు నాలోకి రావడానికి, ఆసురీ గుణములు బయటకు పోవడానికీ ఈ గంట మోగిస్తున్నాను. ఈ ఘంటానాదంతో నాలోని ఆసురీ గుణములు బయటకు పోవాలి." అని అర్థం. అంటే ఆ పూజ చేసే కాసేపు అయినా మనలో చెడ్డ ఆలోచనలు, చెడ్డ గుణాలు ఉండకూడదు. వాటిని బయటకుపారదోలాలి అని భావన.

## 19. తానహం ద్విషత: క్రూరా న్సంసారేషు నరాధమాన్।
## క్షిపామ్యజస్ర మశుభా నాసురీష్వేవ యోనిషు॥

పైన చెప్పబడిన ఆసురీ సంపద కలవారి పట్ల భగవంతుని విధానం ఎలా ఉంటుంది అని ఈ శ్లోకంలో చెబుతున్నాడు.

"ద్విషత:" అంటే భేదబుద్ధి కలవారు. ఇతరులలో ఉన్న ఆత్మస్వరూపుడైన పరమాత్మను ద్వేషించేవారు అంటే ఇతరులను తక్కువగా చూడటం, భేదబుద్ధితో చూడటం, కించపరచడం, కోపించడం, ద్వేషించడం, పరమాత్మను ద్వేషించినట్టే. ఇంకా ఇతరుల పట్ల, ఇతర ప్రాణుల పట్ల క్రూరంగా అమానుషంగా ప్రవర్తించేవాళ్లు, పాప కార్యములు చేసే వాళ్లు, పాప కార్యములు చేయవలె అనే చింతన కలవాళ్లు, అంటే ఇతరులకు హాని చేసేవాళ్లు, అటువంటి ఊహలు, సంకల్పములు కల వాళ్లు, ఇటువంటి వాళ్లు నరాధములు. అంటే నరులలో అధములు అని చెప్పాడు కృష్ణుడు.

ఇంకా "అశుభాన్" అంటే వీరి ముఖం చూస్తేనే అశుభం కలుగుతుంది అని ఈసడించుకున్నారు పరమాత్మ. ఎందుకంటే ఇటువంటి వారికి శుభాలు, శుభకార్యాలు అంటే గిట్టవు. ఎల్లప్పుడూ ఇతరులకు అశుభం జరగాలని కోరుకుంటూ ఉంటారు. ఇటువంటి వారంటే 'నాకు' అంటే పరమాత్మకు ఏ మాత్రం ఇష్టం లేదు. ఇటువంటి వారిని ఎల్లప్పుడూ సంసారము అనే సముద్రంలో పడవేస్తాను. లేకపోతే ఆసురీ యోనులలో పుట్టిస్తాను. అంటే వారి వారి కర్మఫలాలను బట్టి వారికి పశువులు, పక్షులు, వృక్షములు మొదలగు జన్మలు కలుగుతాయి. కాబట్టి పైన చెప్పబడిన వారంటే పరమాత్మకు ఏమాత్రం ఇష్టం లేదు. వారు ఎన్ని యజ్ఞాలు యాగాలు వ్రతాలు దానాలు చేసినా లాభం లేదు.

పరమాత్ముని నియమం ఏమిటంటే మంచి పనులు చేసేవారికే మంచి జన్మలు, మంచి గతులు, చెడు పనులు చేసే వారికి నీచజన్మలు, చెడు గతులు వస్తాయి. ఇది ఈ విశ్వంలో ఉన్న నియమము. దీనిని ఎవరూ దాటలేరు.

మనసులో క్రూరత్వము, చెడ్డగుణములు, ఆసురీ సంపదలు పెట్టుకొని ఎన్ని యజ్ఞయాగములు, వ్రతాలు, దానాలు చేసినా ఏమీ లాభం లేదు. ఆసురీ సంపద కలవారిని నరాధములు అని అన్నాడు అంటే నరులలో అధములు అని అర్థం. అందుకే "పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం" అన్నాడు. సాధువులు అంటే దైవీ సంపద కలవారు. దుష్కృతులు అంటే ఆసురీ సంపద కలవారు. ఇటువంటి వారిని సంసారములలో పడవేస్తాను అని అంటున్నాడు అంటే ఈ సంసారము, బంధనములు, ధనము, ఐశ్వర్యము, ఆస్తులు, భార్యాబిడ్డలు వీటి మీద వల్లమాలిన అభిమానము అన్నీ దు:ఖములనే తెచ్చిపెడతాయి అని భావన.

ఈ రోజుల్లో చాలా మంది ఈ సంసారబంధనాలతో విసిగిపోయి, "నాకు ఈ బాధలు ఎన్నాళ్లు. ఎన్నాళ్లు ఈ సంసార బాధలు పడాలి." అని అనుకునేవాళ్లు ఎంతోమంది ఉన్నారు. తాము ఎంతో అభిమానించే పిల్లలు వృద్ధాప్యంలో ధనసంపాదన కోసం, తమ మానాన తమను వదిలి విదేశాలకు ఎగిరిపోతే ఆ వృద్ధుల ఒంటరితనము, బాధ వర్ణనాతీతము. అలాగే ఎదిగి వచ్చిన ఆడపిల్లలకు పెళ్లికాకపోతే, వయసువచ్చిన కొడుకులు సంపాదన లేకుండా తల్లి తండ్రులను వేధిస్తుంటే, తిని, తిరుగుతుంటే, ఆ గృహస్థు పడేబాధ చెప్పనలవి కాదు. "తిండి పెట్టలేని వాడివి మమ్మల్ని ఎందుకు కన్నావు" అని సంతానము ఎదురుప్రశ్నిస్తే కుమిలిపోవడం ఆ గృహస్థువంతు. ఇదే సంసారము. ఉన్న ధనంచాలక ఇంకా కావాలని ఏవేవో వ్యాపారాలు చేసి నష్టబోయి, అప్పులవాళ్ల బాధలు పడలేక ఆత్మహత్యలు చేసుకోవడమే సంసారము. లేనిగొప్పలకు పోయి, పరువు ప్రతిష్టలకు పోయి, తమ సంతానం తమను కాదని వేరే వివాహాలు చేసుకుంటే, ఆ అవమానం తట్టుకోలేక హత్యలకు, ఆత్మహత్యలకు పాల్పడ్డమే సంసారం. ఇవన్నీ బాధలే. నరకాలే. అనుభవించేవాళ్లకే తెలుస్తాయి. అలాగే మొగుడు తాగితందనాలాడుతూ భార్యాబిడ్డలను పట్టించుకోకపోతే, ఆ అభాగ్యులు పస్తులతో

పడి ఉండటంకూడా సంసారమే. మొగుడు పెట్టే చిత్రహింసలు భరించలేక వాడిని చంపి జైలుకెళ్లడమో లేక తాను, తన పిల్లలతో కూడా ఆత్మహత్య చేసుకోవడమో ఇది కూడా సంసారమే. అందుకే సంసారం సాగరం దు:ఖం అని అన్నారు. ఆసురీ సంపద కలవారిని ఈ సంసారకూపంలో పడవేస్తాను అని అన్నాడు పరమాత్మ. కాబట్టి మనకు వచ్చే కష్టాలు, మనం అనుభవించే బాధలు అన్నీ మన స్వయంకృత అపరాధాలే కానీ వేరు కావు అని గ్రహించాలి.

మరి ఈ సంసారకష్టాలు ఎంతకాలం అంటే "అజస్రమ్" అని అన్నారు పరమాత్మ అంటే మాటి మాటికీ ఆసురీయోనులలో పడవేస్తాను. మానవులలో ఆసురీ సంపదలు ఉన్నంత వరకు ఈ సంసారము, వాటి వలన కలిగే దు:ఖాలు, కష్టాలు తప్పవు. కాబట్టి మానవులలో ఆసురీ సంపదలు తొలగి పోయేవరకూ వారు దైవీ సంపద అలవరచుకొనే వరకు సంసారము తప్పదు. కాబట్టి మానవుల ప్రథమ కర్తవ్యం... తమలో ఉన్న ఆసురీ లక్షణాలను వదిలిపెట్టి దైవీ సంపదలను సంపాదించుకోవాలి అని పరమాత్మ బోధించాడు.

## 20. ఆసురీం యోనిమాపన్నా మూఢా జన్మనిజన్మని।
## మామప్రాప్యైవ కౌన్తేయ! తతో యాన్త్యధమాం గతిమ్॥

ఈ నీచ జన్మలు ఎన్నిసార్లు ఎత్తాలి అంటే జన్మ జన్మలకు అని అన్నారు. మూఢులు, మూర్ఖులు అజ్ఞానంతో పాపాలు చేసి ఆసురీ సంపదలను సంపాదించుకొని, నరక ప్రాయమైన సంసారమును, పశుపక్ష్యాది జన్మలను పొందుతారు అని చెప్పుకున్నాము. ఈ సంసారము, నీచ జన్మలు వారి ఆసురీ సంపదలు కలిగిపోయేదాకా మరలా మరలా వస్తుంటాయి. వారి ఆత్మ పరిశు ద్ధం కాగానే వారికి విముక్తి కలుగుతుంది. కాబట్టి ఈ సంసారంలో ఉండి కూడా మనస్సును దైవం యందు లగ్నం చేస్తే, ఆసురీ సంపదలు కొన్ని అన్నా తగ్గుతాయి. అలా కాకుండా ఈ సంసారంలో పడి ఇంకా ఇంకా ఆసురీ సంపదలను పోగుచేసుకుంటే వారికి ఎన్నటికీ సుఖమైన జన్మరాదు. ఈ సంసార సాగరంలో మునుగుతూ తేలుతూ బాధలు దు:ఖాలు అనుభవిస్తూ, "ఏనాడు ఏ పాపం చేసామో... ఈ నాడు అనుభవిస్తున్నాము" అనుకుంటూ జన్మలు ఎత్తుతూ ఉంటారు. వారికి ఆత్మజ్ఞానము, పురుషోత్తమ ప్రాప్తి ఎన్నటికీ కలుగదు.

## 21. త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః।
## కామః క్రోధస్తథా లోభస్తస్మా దేతత్త్రయం త్యజేత్॥

కోరికలు, అవి తీరకపోతే వచ్చే కోపము, అంతా నాకే కావాలనే లోభము, ఈ మూడు వికారములు నరకమునకు ద్వారముల వంటివి. మానవుని ఈ మూడు గుణాలు సర్వనాశనం చేస్తాయి. కాబట్టి ప్రతిమానవుడు ఈమూడు గుణములను వదిలిపెట్టాలి.

ఈ శ్లోకంలో పరమాత్మ " స్వర్గం..... మేడ్ ఈజీ" అనే సులభమైన పధకాన్ని గురించి వివరించాడు. ప్రతి మానవునిలో మూడు వికారాలుఉన్నాయి. అవే కోపము, కోరికలు, లోభము. ముందు కోరిక కలుగుతుంది. అది తీరకపోతే కోపం వస్తుంది. కోరిక తీరితే తీరిన కోరికతో కలిగిన లాభం మరొకడికి చెందకూడదు అనే లోభం కలుగుతుంది. ఈ మూడు వికారాలు ఒకదానితో ఒకటి పెనవేసుకొని ఉంటాయి. ఈ మూడు వికారాలు మానవుని నరకానికి ద్వారాల వంటివి.

ఇక్కడ నరకం అంటే దుఃఖము, తీరని వేదన, బాధ. "నరకం చూపిస్తున్నావురా బాబూ!" అనడం మనం వింటూనే ఉంటాము. వివిధ రకములైన దుఃఖములకు, బాధలకు, వేదనలకు మూలం ఈ కోరికలు, కోపము, లోభము. ఈ మూడింటినీ మనం కంట్రోల్ చేసుకోగలిగితే, కష్టాలు, దుఃఖాల బారిన పడకుండా సుఖంగా ప్రశాంత జీవనం గడపవచ్చు. అటువంటి వారికి భూలోకమే స్వర్గం అవుతుంది. దానినే భూతల స్వర్గము అని అంటారు. సుఖం సులభంగా దొరకాలంటే ఇంతకంటే మరొక మార్గం లేదు. అలా కాకుండా ఎప్పుడూ కోరికలతో, కోపంతో, లోభంతో సతమతమయ్యేవాడికి నిత్యం నరకం కనపడుతుంది. భూలోక నరకం అంటే ఇదేనేమో. కాబట్టి స్వర్గ నరకాలు ఇక్కడే ఉన్నాయి అని అనుకుంటే, కామ,క్రోధ,లోభాలు అనే నరక ద్వారాలు శాశ్వతంగా మూసి వేసి, సత్వగుణము అనే స్వర్గద్వారాన్ని తెరిచిపెట్టుకోవడం అందరి మానవుల కర్తవ్యం.

కాబట్టి "మా బతుకులు ఇంతే, మేము బాగుపడము, ఏనాడు చేసిన పాపమో ఈ నాడు అనుభవిస్తున్నాము" అనుకుంటూ బాధపడేకంటే మనలో ఉన్న కామ, క్రోధలోభములు అనే దుర్గుణాలు వదిలిపెడితే, సుఖం దానంతట అదే అత్యంత సులభంగా మనలను వరిస్తుంది. ఇది ఎవరికి వారు ఆలోచించుకోవలసిన విషయం. మనకు స్వర్గసుఖాలు కావాలో, నరక ద్వారాలో తెరవాలో మన చేతిలో ఉంది అంటున్నాడు పరమాత్మ.

## 22. ఏతైర్విముక్తః కౌన్తేయ! తమోద్వారైస్త్రిభిర్నరః।
## ఆచరత్యాత్మన శ్శ్రేయ స్తతో యాతి పరాం గతిమ్॥

ఓ అర్జునా! ఈ మూడు నరక ద్వారములను మూసి వేసిన వాడు, వాటి నుండి విముక్తిని పొందినవాడు, తనకు తాను మేలు చేసుకుంటున్నాడు. తనకు తాను మేలు చేసుకుంటూ, ఉత్తమగతులను పొందగలుగుతున్నాడు.

పై శ్లోకంలో కామ,క్రోధ,లోభాలు నరకద్వారాలు అని చెప్పిన పరమాత్మ ఈ శ్లోకంలో, మన మనసులలో ఆ నరక ద్వారాలు తెరిచి ఉన్నంత వరకు ఎవరూ బాగు పడడు. వాడికి పురోగతి లేదు. ఉన్నతి లేదు. నిరంతరము దుఃఖముతో బాధపడుతుంటాడు. కాబట్టి కామ,క్రోధ,లోభములను విడిచిపెట్టాలి. వాటిని విడిచిపెడితే ఎవడికి వాడు తనకు మేలు చేసుకున్నట్టు. దాని వలన పరమ గతి కూడా కలుగుతుంది.

కామ, క్రోధ, లోభములు అనే ఈ వికారములను విడిచిపెట్టి నందు వలన రెండు లాభాలు ఉన్నాయి. ఒకటి కోరికలను, కోపమును, లోభమును విడిచిపెడితే ఈ లోకంలో ప్రతి రోజూ కష్టములు లేకుండా ప్రశాంతంగా ఉండవచ్చు. అంటే తక్షణ లాభం కలుగుతుంది. దీర్ఘకాలంలోకూడా లాభం కలుగుతుంది ఎలాగంటే, కోరికలను, వదిలిపెడితే మంచి కర్మలు, నిష్కామ కర్మలు చేయవచ్చు. కోపం వదిలిపెడితే మనసు ప్రశాంతంగా ఉంటుంది. దేవుని మీద అచంచలమైన భక్తి కలుగుతుంది. లోభం లేకపోతే స్వార్థం తగ్గి, ఇతరులకు ఉపకారం చేయాలనే తలంపు పెరుగుతుంది. వీటి వలన మంచి వాసనలు కలుగుతాయి. దానివలన మరు జన్మలో మంచి జన్మ వస్తుంది. ఈ ప్రకారంగా వాసనలు తగ్గించుకుంటే ఆత్మ పరిశుద్ధమయి తుదకు జనన మరణ చక్రము నుండి విముక్తి లభిస్తుంది. అదే పరమాత్మలో సాయుజ్యం పొందడం. కాబట్టి ఈ కామ,క్రోధ,లోభములను వదిలిపెట్టడం ద్వారా స్వల్పకాలిక, దీర్ఘకాలిక లాభాలు ఉన్నాయి అని పరమాత్మ తెలియజేస్తున్నాడు.

ఇదంతా ఎవరో వచ్చి చేసేది కాదు. ధనం ఇచ్చి నెత్తిన చేతులు పెట్టించుకుంటే వచ్చేది కాదు. ఎవరికి వారు చేసుకోవాలి. ఎవరిని వారు బాగుపరచుకోవాలి. ఎవరి శ్రేయస్సు వారేచూసుకోవాలి. ఎవరూ ఎవరినీ ఉద్ధరించరు అని పరమాత్మ నిర్మొహమాటంగా, నిర్ద్వద్వంగా ప్రకటించాడు. ఇంక నిర్ణయం మనది, మనందరిదీ!

## 23. యశ్శాస్త్రవిధిముత్స్సృజ్య వర్తతే కామకారత:।
## న స సిద్ధిమావాప్నోతి న సుఖం న పరాం గతిమ్॥

వేదములలోనూ, శాస్త్రములలోనూ చెప్పబడిన విషయములను కాదని, ఎవరైతే తమ ఇష్టం వచ్చినట్టు ప్రవర్తిస్తారో, అటువంటి వారికి ఏ పని చేసినా సిద్ధి కలుగదు. వారికి సుఖం లభించదు. ఉత్తమ గతులు కలుగవు.

కామ,క్రోధ,మోహములను విడిచిపెడితే మోక్షం వస్తుంది అని చెప్పాడు కదా. మరి చెయ్యకూడని పని కూడా ఒకటి చెప్పాడు ఈ శ్లోకంలో. వేదములు, శాస్త్రములు మనకు కొన్ని విధి నిషేధములు ఏర్పరిచాయి. మానవులు చేయవలసిన విధులు, చేయకూడని విధులు అంటే నిషేధింప బడ్డ విధులు. చేయవలసిన విధులు చేయకుండా, చేయకూడని విధులు చేస్తుంటే వాడికి మోక్షం అనేది ఎప్పటికీ లభించదు. అంటే శాస్త్రమును పాటించకుండా, తన ఇష్టం వచ్చినట్టు ప్రవర్తిస్తే వాడికి మోక్షం లభించదు.

ఉదాహరణకు మానవులలో స్త్రీవాంఛలను అదుపు చేయడానికి వివాహము అనే సంస్కారమును పెట్టారు. కాని నేను వివాహంచేసుకోను నా ఇష్టం వచ్చినట్టు ప్రవర్తిస్తాను అంటే శాస్త్రవిధిని ఉల్లంఘించినట్టే కదా. అలాగే ధర్మంగా, న్యాయంగా ధనం సంపాదించమన్నారు. అలాకాకుండా నా ఇష్టం వచ్చినట్టు అన్యాయంగా, అక్రమంగా, లోకుల నోళ్లు కొట్టి ధనం సంపాదిస్తాను అంటే శాస్త్ర విధిని పాటించనట్టే. అలాగే వేదములలో శాస్త్రములలో చెప్పిన విధంగా యజ్ఞములు యాగములు వ్రతాలు పూజలు చేయాలి. అలా కాకుండా నా ఇష్టం వచ్చినట్టు యాగాలు యజ్ఞాలు చేస్తాను. అంటే అశాస్త్రీయంగా యాగాలు పూజలు చేసినట్టే. దీని వలన వీరికి ఎటువంటి ఫలితము కలగకపోగా పాపం చుట్టుకుంటుంది.

మానవుల శ్రేయస్సును దృష్టిలో పెట్టుకొని వారి జీవన విధానాన్ని సక్రమ మార్గంలో నడవడానికి వేదాలలో, శాస్త్రాలలో విధి నిషేధాలు పొందుపరిచారు. వాటిని ప్రశ్నించే జ్ఞానం, అనుభవం మనకు లేదు. వాటిని పాటించడమే మన విధి. అలా పాటించకపోతే సుఖం కలుగదు కదా, దు:ఖం కలుగుతుంది.  పరమగతులు లభించవు అని కృష్ణుడు ఈ శ్లోకంలో వివరించాడు.

## 24. తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ।
## జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తుమిహార్హసి॥

అంతా బాగానే ఉంది మానవులు ఏం చెయ్యాలో ఏం చెయ్యకూడదో ఎలా తెలిసేది అని అడిగితే దానికి సమాధానమే ఈ శ్లోకం. మానవులు తన జీవిత కాలంలో ఏమి చెయ్యాలో, ఏమి చెయ్యకూడదో నిర్ణయించేది వేదములు, శాస్త్రములు. అవే అందరికీ ప్రమాణములు. కాబట్టి ఈ బాహ్యప్రపంచంలో ఏ పని చేయాలన్నా ఎలా చేయాలన్నా, వాటికి వేదములు, శాస్త్రములలో చెప్పబడిన ప్రమాణములను అనుసరించి చేయాలి కానీ తమ ఇష్టం వచ్చినట్టు చేయకూడదు.

కాబట్టి మానవులు ఏం చేయాలో, ఏం చేయకూడదో నిర్ణయించడానికి వేదములు శాస్త్రములే ప్రమాణములు. వాటి ప్రకారం మనం ప్రవర్తించాలే గానీ మన ఇష్టం వచ్చినట్టు ఆచార వ్యవహారములను మార్చరాదు. మన తెలివితేటలు ప్రదర్శించకూడదు. దాని వలన నష్టమే కానీ లాభం లేదు.

(ప్రభుత్వాలు ఎలా నడవాలి, ఏం చెయ్యాలి, ఏం చెయ్యకూడదు అనేది నిర్ణయించేది ఆ ప్రభుత్వం ఏర్పరచుకున్న రాజ్యాంగము. ఏ చట్టం చేసినా రాజ్యాంగానికి లోబడే చేయాలి కానీ నాకు అధికారం ఉంది కదా అని ఇష్టం వచ్చినట్టు ఉన్న చట్టాలు మార్చడం, రాజ్యాంగ వ్యతిరేక చట్టాలు చేయకూడదు. చేస్తే ఏమవుతుందో, మన జీవిత కాలంలో మనందరం చూసిన, అనుభవించిన, ఎమర్జెన్సీ యే చక్కని ఉదాహరణ).

యజ్ఞాలు ఎలా చేయాలి, యజ్ఞ కుండం ఎంత పొడుగు, వెడల్పు ఉండాలి, ఎంత మంది ఋత్విక్కులు ఉండాలి, ఎవరు ఏ పని చేయాలి, ఏయే వస్తువులు హోమంలో వేయాలి, ఇవన్నీ నిర్దిష్టంగా వేదాలలో శాస్త్రాలలో చెప్పారు. అలా కాదు మేము ఆవకాయలతో, మిరపకాయలతో హోమాలు చేస్తాము అంటే దాని అర్థం మీరే ఆలోచించుకోవాలి. భగవంతునికి నివేదన చేయాల్సినవి పత్రం, పుష్పం, ఫలం, తోయం అని స్పష్టంగా చెప్పారు. కాదు మేము మద్యం మాంసం నివేదిస్తాము, జంతు బలులు నర బలులు ఇస్తాము అంటే అవి శాస్త్రవిరుద్ధములు అని తెలుసుకోవాలి. ఇవి కేవలం ఉదాహరణలుమాత్రమే. ఈ ప్రకారంగా ఎవరికి తోచినట్టు వారు పూజావిధానాలను, ఉపాసనలను, అర్చనలను మార్చేస్తున్నారు. తెలిస్తే శాస్త్ర విధానాలను బట్టి చేయాలి. తెలియకపోతే శాస్త్రములు చదివి తెలుసుకోవాలి, చదివిన వారి వద్ద నేర్చుకోవాలి. అంతే కాని, "అంతా నాకు తెలుసు..నా ఇష్టం వచ్చినట్టు చేస్తాను" అనడం మూర్ఖత్వం. అది పనికిరాదు అంటున్నాడు పరమాత్మ.

వేదములు, శాస్త్రములు మనకు అందించిన మహాఋషుల స్థాయి, వారు చెప్పిన దాన్ని కాదనే అర్హతా, విమర్శించే పరిజ్ఞానము మనకు లేదు. కాబట్టి వారు చెప్పిన వాటిని ఆచరించడమే మన కర్తవ్యం. అందుకే పరమాత్మ "జ్ఞాత్వా శాస్త్ర విధానోక్తం" అంటే కర్మలు చేసేముందు వాటికి సంబంధించిన శాస్త్రములు, విధివిధానముల గురించిన జ్ఞానం మనకు తెలిసి ఉండాలి. "కర్మ కర్తు మిహార్హసి" అంటే కర్మలు చేయాలి కానీ ఆ కర్మలు శాస్త్రములో చెప్పబడిన విధి విధానాలను అనుసరించి చేయాలి కానీ ఇష్టం వచ్చినట్టు చేయకూడదు అని స్పష్టంగా చెబుతూ ఈ అధ్యాయం ముగించాడు పరమాత్మ.

ఉపనిషత్తులయొక్క, బ్రహ్మవిద్యయొక్క,
యోగశాస్త్రము యొక్క సారమయిన భగవద్గీతలో, పదునారవ అధ్యాయము
దైవాసుర సంపద్విభాగ యోగము సంపూర్ణము.
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# భగవద్గీత

## పదునేడవ అధ్యాయము

# శ్రద్ధాత్రయ విభాగ యోగము

భక్తి, శ్రద్ధ అని మీరు భగవద్గీతలో తరచూ వింటూ ఉన్నారు. ఒక పనిని ఏకాగ్రతతో, ఆ పని నెరవేరాలి అనే ఏకైక లక్ష్యంతో చేయడం శ్రద్ధ అని స్థూలంగాచెప్పుకోవచ్చు. మనలో ఉన్న మూడు గుణముల మాదిరి ఈ శ్రద్ధ కూడా మూడు భాగాలు. సాత్విక శ్రద్ధ, రాజసిక శ్రద్ధ, తామసిక శ్రద్ధ. ఈ అధ్యాయంలో శ్రద్ధ గురించే కాకుండా ఇంకా ఇతర విషయాల గురించి కూడా చక్కగా వివరించాడు పరమాత్మ. మనం ఏపని చేసినా శాస్త్రములో చెప్పబడిన ప్రకారం చేయాలి. శ్రద్ధతో, భక్తి చేయాలి. ఈ రెండూ ఉంటేనే ఆ కార్యం సఫలం అవుతుంది. కేవలం అమితమైన శ్రద్ధతో శాస్త్రవిరుద్ధంగా, సంఘవిద్రోహకర కార్యాలు చేస్తే అటువంటి శ్రద్ధను ఏమంటారు? ఇదే ప్రశ్నను అర్జునుడు అడుగుతున్నాడు.

అర్జున ఉవాచ:

**1. యే శాస్త్రవిధిముత్సృజ్య యజన్తే శ్రద్ధయాఽన్వితాః।**
**తేషాం నిష్ఠాతు కా కృష్ణ సత్త్వమాహో రజస్తమః॥**

ఓ కృష్ణా! ఎవరైతే శాస్త్రవిధివిధానములను విడిచిపెట్టి, కేవలం శ్రద్ధతో, నిష్ఠతో, కార్యదీక్షతో, వారి ఇష్టం వచ్చిన విధానంలో కర్మలు, పూజలు, యజ్ఞములు,వ్రతములు చేస్తారో, అవి సాత్త్వకమా, రాజసికమా లేక తామసికమా? వాటిని ఏమంటారు? అని అడిగాడు.

కృష్ణా! లోకంలో మానవులు ఎన్నో యజ్ఞయాగములు, పూజలు, వ్రతాలు, వేదములు, శాస్త్రములలో చెప్పిన మాదిరి, భక్తి శ్రద్ధలతో, నిష్ఠతో చేస్తుంటారు. కాని కొంత మందికి వేదములతో కానీ, శాస్త్రములతో కానీ పరిచయం ఉండదు. వారికి శాస్త్రములు చదివే అవకాశం, శాస్త్రములలో చెప్పబడిన విధివిధానములు తెలుసుకునే తెలివితేటలు ఉండవు. కారణం ఆ భాష రాకపోవడమో, చదివే అవకాశం లేకపోవడమో, శాస్త్రములు వారికి అందుబాటులో లేకపోవడమో, లేక నిర్లక్ష్యమో ఏదైనా కారణం కావచ్చు. అటువంటి వారు శాస్త్రములలో చెప్పబడిన విధి విధానముల ప్రకారం కాకుండా, శాస్త్రములో చెప్పబడిన విధివిధానములను వదలిపెట్టి, తమకు తెలిసిన ఆచార వ్యవహారములను బట్టి, (లేక పురోహితులు చెప్పినట్టు) అమితమైన శ్రద్ధ,భక్తి, నిష్టలతో చేస్తుంటారు. అటువంటి వారి శ్రద్ధ ఎటువంటిది. దానిని ఏమంటారు? వారి శ్రద్ధ, నిష్ఠ, సత్వమా, రజస్సా,

తమస్సా. అటువంటి వారు శ్రదా&ధ భక్తులతో చేసిన యజ&ఞయాగములు, పూజలు ఫలితాన్ని ఇస్తాయా. లేక అవి అన్నీ నిష్ఫలములేనా. వాటికి ఎటువంటి ఫలితం లభించదా! దీనిని గురించి వివరించవలసింది అని అడిగాడు అర్జునుడు. దానికి కృష్ణుడు ఈ విధంగా సమాధానం చెప్పాడు.

శ్రీ భగవానువాచ:

## 2. త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా।
## సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు॥

అర్జునా! జీవులలో శ్రద్ధ స్వభావ సిద్ధంగా వస్తుంది. పుట్టుకతోనే వస్తుంది. కాని వారి వారి పూర్వజన్మ వాసనలను బట్టి ఆ శ్రద్ధ సాత్వికంగానూ, రాజసికంగానూ, తామసికం గానూ పరిణామం చెందుతుంది. వాటినే సాత్విక శ్రద్ధ, రాజసిక శ్రద్ధ, తామసిక శ్రద్ధ అంటారు.

ప్రతి వాడికీ పుట్టగానే జ్ఞానం రాదు. అందరూ అజ్ఞానులుగానే పుడతారు. అటువంటి వాడికి, శ్రద్ధ అనేది వాడి వాడి స్వభావాన్ని బట్టి వస్తుంది. శ్రద్ధ మనలో స్వభావ సిద్ధంగా ఉంటుంది కానీ ఒకరు చెబితే వచ్చేది కాదు. అదీ పుట్టుకతో రావాలి గానీ, శాస్త్రములు చదివి, నేర్చుకుంటే వచ్చేది కాదు. ఒకడు అమిత నిర్లక్ష్యంగాఉంటాడు. దూకుడుగా ఉంటాడు. ఎవరు చెప్పినా వినడు. మరొకడు అమితమైన వినయ విధేయతలతో ఉంటాడు. అటువంటి వారిని మనం చూస్తూ ఉంటాము. ఇది స్వతాహాగా వచ్చే గుణము అంటున్నాడు పరమాత్మ.

మానవుడు ఎటువంటి శ్రద్ధ కలవాడో వాడి పూర్వజన్మ సంస్కారము నిర్ణయిస్తుంది. దాని ప్రకారమే ప్రవర్తిస్తాడు. అటువంటి శ్రద్ధలు మూడు రకాలుగా విభజింపబడ్డాయి. వాటిని సాత్త్విక, రాజస, తామసిక శ్రద్ధలు అని అంటారు.

## 3. సత్త్వాను రూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత।
## శ్రద్ధామయో2యం పురుషో యో యచ్ఛ్రద్ధస్స ఏవ సః॥

ఓ అర్జునా! ప్రతిజీవికీ తన పూర్వజన్మసంస్కారముల ననుసరించి, వారి వారి అంత:కరణను అనుసరించి శ్రద్ధ ఉంటుంది. అటువంటి వాడిలో ఉన్న శ్రద్ధయే వాడి యొక్క స్వరూపము. వాడి వాడి అంత:కరణను బట్టి ఎటువంటి శ్రద్ధ ఉంటుందో, వాడి జీవితాంతం అటువంటి శ్రద్ధనే కలిగి ఉంటాడు.

ప్రతి మానవుడిలోనూ మనస్సు, బుద్ధి,అహంకారము, చిత్తము అనేవి ఉంటాయి. ఈ నాలుగు కలిపి అంత:కరణ అంటారు. ఈ అంత:కరణ ప్రతి జీవిలోనూ వాడి వాడి పూర్వజన్మ సంస్కారము వలన ఏర్పడుతుంది. ఆ అంత:కరణను అనుసరించే వాడి జీవన విధానం నడుస్తుంటుంది. ఎవడు తన పూర్వ జన్మనుండి ఎటువంటి శ్రద్ధను, సంస్కారమును తెచ్చుకుంటాడో, జీవితాంతం అటువంటి శ్రద్ధనే కలిగి ఉంటాడు.

(మనలో ఒక ఆచారం ఉంది. పసిబిడ్డ అన్న ప్రాశన రోజున వాడిని బోర్లాపడుకోబెట్టి, ఎదురుగా వివిధములైన వస్తువులు, అంటే పుస్తకము, కత్తి, ధనము, బంగారము, తినేవస్తువులు, మొదలైనవి పెట్టి వాడు దేనిని పట్టుకుంటాడో గమనిస్తారు. వాడు ఏ వస్తువును పట్టుకుంటే వాడి స్వభావం అటువంటిది అని నిర్ణయిస్తారు. కాబట్టి మానవుడికి ఏ విషయం మీద శ్రద్ధ ఉంటుందో వాడి పుట్టుక, అంత:కరణ, నిర్ణయిస్తుంది, వాడి జీవితం అలాగేసాగుతుంది అనే విషయాన్ని ఈ ఆచారం వలన మనకు తెలుస్తుంది.)

మరి వాడు మారతాడా, వాడిలో పుట్టుకతో వచ్చిన శ్రద్ధ కాలానుగుణంగా మారుతుందా! మారే అవకాశం ఉందా! అనేది తరువాతి శ్లోకాలలో వివరించాడు పరమాత్మ.

### 4.యజన్తే సాత్వికా దేవాన్ యక్షరక్షాంసి రాజసా:।
### ప్రేతాన్ భూతగణాంశ్చాన్యే యజన్తే తామసా జనా:॥

సాత్వికమైన శ్రద్ధ కలిగిన వారు సత్వగుణముతో కూడిన దేవతలను పూజిస్తారు. రజోగుణము కలవారు యక్షులను, రాక్షసులను (అంటే తీవ్రమైన, భయంకరమైన రూపములు, స్వభావం కలిగిన మూర్తులను) పూజిస్తారు. తమోగుణము కలిగిన వారు భూత, ప్రేత, పిశాచ గణములను పూజిస్తారు.

మానవులను వారి ప్రవర్తనను బట్టి వారి శ్రద్ధనిర్ణయించవచ్చు. ఈ శ్రద్ద అనేది పైకి కనిపించదు. అంతర్గతంగా ఉంటుంది. వారి వారి స్వభావము, వారి నడత, వారి ఆహారము, వారి మాట తీరు, వారు చదివే గ్రంథములు, వారు పూజించే దేవతా మూర్తులు, వారి వారి పూజావిధానాలు, వారు ఏయేకోరికలతో ఆ పూజలు చేస్తున్నారు, ఇటువంటివి వారి శ్రద్ధను తెలియజేస్తాయి.

ఇక్కడ కృష్ణపరమాత్మ మానవులు పూజించే దేవతలు, వారి పూజావిధానం, పూజలు చేస్తూ వారు కోరుకునే కోరికలతీరు, వీటిని ఉదాహరణగా తీసుకున్నాడు. సాధారణంగా మన

పెద్దలు, దేవతామూర్తులను మూడురకాలుగా విభజించారు. కానీ, శాస్త్రముల ప్రకారము అందరూ సత్వగుణ ప్రధానులైన దేవతలనే పూజించాలి అని బోధించారు. వీరు రాముడు, కృష్ణుడు, శివుడు, విష్ణువు, లక్ష్మి, సరస్వతి ఈ ప్రకారంగా సాత్వికమైన ఆకారములు కలిగి, మానవుని సత్వగుణ ప్రధానమైన కోరికలు తీర్చి, వారిని ఉత్తమగతులకు తీసుకొని వెళ్లే దేవతామూర్తులు. వీరు చేసే యజ్ఞాలు,యాగాలు, పూజలు, వ్రతాలు సాధారణంగా లోకకల్యాణార్థము ఉంటాయి. కాబట్టి సత్వగుణము కలవారు, సాత్వికమైన దేవతా మూర్తులను పూజిస్తారు లోక కల్యాణమును కోరి పూజిస్తారు.

తరువాత రాజస గుణము కలవారు యక్షులు, రాక్షసులను పూజిస్తారు. ఈ దేవతా మూర్తులు కేవలం తమ ప్రాపంచిక సంబంధమైన కోరికలు తీర్చుకోడానికే ఉపాసింపబడతారు. ఉదాహరణకు యక్షులకు అధిపతి కుబేరుడు. అంటే ధనమునకు అధిపతి. ధనం దానితో తీరే కోరికల కొరకు చాలా మంది కుబేరుడిని, ధనమునకు అధిపతి అయిన ధనలక్ష్మిని పూజిస్తారు. వీరిలో స్వార్థం ఎక్కువ. వీరు చేసే పూజలు లోకకల్యాణం కొరకు కాకుండా తనకు లాభం కలగడం కొరకే చేస్తారు. సాధారణంగా ఈ నాటి మానవులుచేసే పూజలన్నీ ఈ కోవకే చెందుతాయి. మనం సంకల్పంలో "ధన,ధాన్య,పుత్ర,పౌత్రాభి వృద్ధ్యర్థం, ఇష్టకామ్యార్థసిద్ధ్యర్థం" అని చెప్పుకుంటాము. అంటే అన్నీ నాకే కావాలి అనే స్వార్థభావనతోనే పూజలు, వ్రతాలు చేస్తుటాము. అలాగే కొంతమంది రాక్షస ప్రవృత్తి కలిగిన దేవతా మూర్తులను కూడా పూజిస్తారు. కాళి, చండి, భైరవి మొదలగు దేవతా మూర్తులు. ఇంకా గ్రామదేవతలు. వీరి కోరికలు ఇతరులకు హాని కలిగించే విధంగా ఉంటాయి. లోక వినాశం కొరకు శ్రద్ధతో పూజలు చేస్తారు. ఆయాదేవతలకు జంతు బలులు,నరబలులు సమర్పిస్తారు.

ఇంక తామసిక గుణం కలవారికి సాత్విక దేవతలు అంటే ఇష్టం ఉండదు. వారు భూత, ప్రేత, పిశాచములను పూజిస్తారు. తమకు లాభము, దాంతోపాటు ఇతరులకు నష్టము కలిగే విధంగా పూజలు చేస్తారు. మరి కొంత మంది తమకు లాభం కలగకపోయినా పరవాలేదు, ఇతరులు బాధపడాలి, నష్టపోవాలి అనేఉద్దేశంతో ఇటువంటి తామసిక పూజలు చేస్తుంటారు. (నరబలులు ఇస్తే లంకెబిందెలు దొరుకుతాయనీ, శవపూజలు చేస్తే మంచి పదవులు లభిస్తాయనీ, చేతబడులు చేస్తే ఇతరులకు కీడు కలుగుతుందనీ, ఇతరుల నాశనం కోరి చేసే భూత, ప్రేత ఆవాహనలు, ఆభిచారిక హోమాలు ఇవన్నీ తామసిక క్రియలకు ఉదాహరణలు.)

సాత్విక దేవతా పూజలు, నివేదనలు సాత్వికంగా, వేదములలో, శాస్త్రములలో చెప్పిన మాదిరి సంప్రదాయ బద్ధంగా, ఉంటాయి. అలాగే రాజసిక దేవతా పూజలు భక్తి లేకుండా, కేవలం ఆర్భాటాలతో, గొప్ప పేరు రావాలని చేసే ఏర్పాట్లతో ఉంటాయి. తామసిక దేవతా పూజలు వేద,శాస్త్రములకు విరుద్ధంగా ఉంటాయి. చీకటి ప్రదేశాలలో, శ్మశానాలలో రహస్యంగా జరుగుతాయి.

ఇటువంటి పూజలలో నరబలులు, జంతుబలులు ఎక్కువగా ఉంటాయి. కాబట్టి, ఆయాదేవతలను బట్టి మానవుల కోరికలు, పూజావిధానములు, నివేదనలు మారుతుంటాయి.

## 5. అశాస్త్ర విహితం ఘోరం తప్యన్తే యే తపోజనా:।
## దమ్భాహఙ్కారసంయుక్తా: కామరాగబలాన్వితా:॥

వారు చేసే పూజా విధానాలు శాస్త్రప్రకారం ఉండవు. వారికి అనుకూలంగా, వారి ఇష్టం వచ్చినట్టు చేస్తారు. ఘోరమైన, కఠోర మైన తపస్సులు చేస్తుంటారు. వారు చేసే కార్యములు, కర్మలు అహంకారము, దంభము అంటే గొప్పదనంతో కూడి ఉంటాయి. అంతే కాదు ఏవేవో కోరికలు కోరుతూ ఆ కోరికలు తీరడానికే కర్మలు చేస్తుంటారు. అందుకే వారి కర్మలలో అంతా తమకు కావాలనే కాంక్షతో తమ బలపరాక్రమాలను ప్రదర్శిస్తూ కర్మలు చేస్తుంటారు.

రాజసిక, తామసిక ప్రవృత్తి కలవారు చేసే పనులు అన్నీ తమ యొక్క అవసరాలకు తగినట్టు, తమయొక్క అనుకూలతకు తగినట్టు చేస్తుంటారు కానీ శాస్త్రవిధి ప్రకారం చేయడానికి ఇష్టపడరు. వారు తపస్సులు, పూజలు భయానకంగా, జుగుప్సాకరంగా ఉంటాయి. ఇంకా కొంత మంది తమ గొప్ప తనం, తమకు ఉన్న సంపదలను, హోదాను ప్రదర్శించుకోడానికి, అహంకారంతో పూజలు,వ్రతాలు చేస్తుంటారు కానీ భక్తితో కాదు. వారు చేసే పూజలు, తపస్సులు అన్నీ కోరికలతో, బంధనాలతో నిండి ఉంటాయి. పురాణాలలో రాక్షసులు ఘోరమైన తపస్సులు చేస్తుంటారు. దేవుడు ప్రత్యక్షం కాగానే లోకంలో దేనివలనా చావు రాకుండా వరం కోరుకుంటాడు. లేకపోతే ఎవరూ తనకు ఎదురు లేకుండా వరం కోరుకుంటాడు. ఆ వరాలు పొందినతరువాత తమ బల పరాక్రమాలను ప్రదర్శిస్తూ, హింసకు పాల్పడతారు. మరి కొందరు తమకు వరాలిచ్చిన దేవుడి మీద చెయ్యి పెట్టి భస్మం చేయాలని ప్రయత్నిస్తారు. ఇటువంటి వారు అసురసంపద కలిగి ఉంటారు. కాని వీరెవ్వరూ బాగుపడినట్టు లేదు. వారి వారి వరాల ప్రభావంతోనే వారు నాశనం అయ్యారు కానీ ఉత్తమ గతులు పొందలేదు.

## 6.కర్శయన్తశ్శరీరస్థం భూతగ్రామమచేతస:।
## మాంచైవాన్తశ్శరీరస్థం తాన్విద్ధ్యాసుర నిశ్చయాన్॥

కొంత మంది కఠోర ఉపవాసములతోనూ, నియమాలతోనూ, పంచభూతములతో తయారైనవారి శరీరాన్ని, శరీరంలో అంతర్గతంగా ఉన్న పంచతన్మాత్రలను బాధపెడుతుంటారు. దాని వలన వారి వారి శరీరములలో ఉన్న నా అంశతో కూడిన జీవాత్మ కూడా బాధపడుతుంది.

ఇటువంటి వారికి సాత్వికమైన పద్ధతులు తెలియవు. ఈ కఠోర ఉపవాసాలు, కఠిన నియమాలు, మడులు, అశౌచాలు, అర్థం లేని ఆచారాలు ఏ శాస్త్రములోనూ చెప్పబడలేదు. కాని మానవులు తమలో ఉన్న దురహంకారంతోనూ, తమ కోరికలు తీరాలనే ఉబలాటంతోనూ, ప్రాపంచిక వస్తువుల మీద ఉన్న ఆసక్తితోనూ, తమ మాటే చెల్లుబాటు అవుతుందనే నమ్మకంతోనూ, అధికారంతోనూ, అన్నిటికీ మించి అవివేకంతోనూ, శాస్త్రములలో విధింపబడనివి, చెప్పబడనివి, తమకు, ఇతరులకు బాధను కలిగించేవి అయిన ఆచారములను, నియమములను, తపస్సులను, యజ్ఞయాగములను ఆచరిస్తున్నారు.

అటువంటి వారిని పరమాత్మ అచేతస: అంటే తెలివితక్కువ వారు అని అంటున్నాడు. ఇటువంటి వారు చేసే కఠినమైన ఉపవాసాల వలన వారే కాకుండా, వారిలో అంతర్గతంగా ఉన్న ఆత్మస్వరూపుడైన పరమాత్మకూడా క్షోభిస్తున్నాడు. అంటే దీని అర్థం మనలో ఉన్న చైతన్య శక్తి తగ్గిపోతుంది. పని చేయదు. శరీరం శుష్కించి పోతుంది. ప్రతి దేహములో అంతర్గతంగా వైశ్వానర అగ్ని రూపంలో ఉన్న పరమాత్మకు పచనం చేయడానికి ఆహారం దొరకదు. జీర్ణవ్యవస్థ దెబ్బతింటుంది. అటువంటి వారి శ్రద్ధ సంపద ఆసురీ ప్రవృత్తి కలిగి ఉంటుంది.

ఈ రెండు శ్లోకాలను మరింత వివరంగా తెలుసుకుందాము.

అశాస్త్ర విహితమ్ అంటే శాస్త్రములలో చెప్పబడని ఆచారాలు, విధులు, వ్యవహారాలు. వాటిని ఎవరూ ఆచరించకూడదు. శాస్త్రములను తెలుసుకొని ఆచరించాలి. లేకపోతే శాస్త్రములను క్షుణ్ణంగా అధ్యయనం చేసిన వారిని అడిగి తెలుసుకొని ఆచరించాలి. అలా కాకుండా ఎవరికి తోచినట్టు వారు ఘోరంగా తపస్సు చేయడం, భయంకర మైన క్రియలతో తపస్సు చేయడం, తామస క్రియలు ఇవన్నీ శాస్త్రము అంగీకరించదు. అటువంటి శాస్త్రవిరుద్ధమైన క్రియలు ఆసురీ సంపదలు.

"తప్యన్తే యే తపోజనా:" అంటే తపస్సు అంటే ఏకాగ్రతతో భగవంతుని ధ్యానించడం. మనసులోని మాలిన్యము పోగొట్టుకోవడం. అంతే కానీ శరీరాన్ని క్షీణింపచేయడం కాదు. ఘోరమైన ఉపవాసాలతో శరీరాన్ని క్షీణింపచేయడం, తాను బాధపడి ఇతరులను బాధపెట్టడం, లోకానికి ఉపద్రవం కలిగించే తపస్సులు చేయడం ఆసురీ లక్షణములు. పురాణములలో ఇటువంటి తపస్సులు రావణుడు, కుంభకర్ణుడు, హిరణ్యకశిపుడు, భస్మాసురుడు చేసారు.

"కామరాగబలాన్వితా:" అంటే బలం అంటే శారీరక బలమే కాదు. దైవబలం కూడా ఉండాలి. కానిచాలా మంది క్షుద్రదేవతలను ఆరాధించి శక్తులను పొందుతుంటారు. వారికి దేవుడు అంటే పడదు. కేవలం తమ కోరికలు తీరడానికి, ఇతరులకు అపకారం కలిగించడానికి, క్షుద్రశక్తులను ఆశ్రయిస్తారు. అది కూడా ఆసురీ సంపద కిందికి వస్తుంది. దీనితో వారు లోకాలను

మోసం చేస్తారు. ఇతరులను కూడా క్షుద్రశక్తులు నమ్మేట్టు చేస్తారు. అప్పుడు దైవము మీద నమ్మకం నశిస్తుంది. అటువంటి వారికి వారి కామ కోరికలు తీరడమే ముఖ్యము. అటువంటి వారు ఆసురీ ప్రవృత్తి కలవారు.

"కర్శయన్త: శరీరస్థం భూతగ్రామమ్" అంటే శరీరములో ఉండే పంచభూతములు అంటే ఇంద్రియములు. కఠిన ఉపవాసములతో, శరీరానికి కావలసిన ఆహారం ఇవ్వకుండా శుష్కింప చేయడం, బాధపెట్టడం ఆసురీ లక్షణము. ఆరోగ్యం కాపాడుకోవడానికి ఆయుర్వేద శాస్త్రములో చెప్పబడినట్టు క్రమపద్ధతిలో ఉపవాసములు ఆమోదయోగ్యము కానీ అది మితిమీరకూడదు. అప్పుడు శరీరం శుష్కిస్తుంది. కొంత మంది మేము ఆ ఉపవాసాలు చేసాము కఠిన ఉపవాసాలుచేసాము, రోజూ ఏదో ఒక దేవుడికి ఉపవాసం ఉంటాము అని గొప్పలు చెప్పుకోడానికి ఉపవాసాలు చేస్తారు. రోజూ తినేదాని కంటే ఎక్కువ తింటారు. ఇదీ మంచిది కాదు. శరీరపోషణకు ఎంత ఆహారం ఇవ్వాలో అంత ఆహారం ఇవ్వడం దైవీసంపద. దానికి భిన్నంగా చేయడం ఆసురీ సంపద.

"మాం చేవాన్త: శరీరస్థమ్" అంటే ప్రతి జీవి శరీరంలో పరమాత్మ ఆత్మస్వరూపుడుగా ఉన్నాడు. ఆయనే ప్రాపంచిక విషయములలో కలిసి జీవాత్మగా ఉన్నాడు అని చెప్పుకున్నాము. శరీరానికి కావలసిన మితమైన ఆహారం ఇవ్వకపోవడం వలన లోపల ఉన్న జీవాత్మ అంటే ఆత్మారాముడు కూడా క్షోభపడతాడు. అంటే మనం దైవాన్ని కూడా బాధపెట్టినట్టు లెక్క. కాబట్టి, ఇతరులు తమను మెచ్చుకోవాలని, డాంబికంతో, అహంకారంతో, ఏవేవో కోరికలతో శాస్త్రవిరుద్ధంగా చేసే కఠోర ఉపవాసములతో, ఇంద్రియములను, లోపల ఉన్న ఆత్మారాముడిని శుష్కింపచేయడం కూడా ఆసురీస్వభావమే.

## 7. ఆహార స్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియ:।
## యజ్ఞస్తపస్తథా దానం తేషాం భేదమిమం శృణు॥

మానవులందరికీ వారు తినే ఆహారం, చేసే యజ్ఞములు, తపస్సులు, దానములు మూడు విధములుగా ఇష్టాన్ని కలిగిస్తాయి. వాటిలో ఉన్న భేదములను గురించి వివరిస్తాను శ్రద్ధగా విను అని అంటున్నాడు కృష్ణుడు. ఎందుకంటే, మానవుల యొక్క ప్రవృత్తి, వారు తినే ఆహారం, వారు చేసే పనులు, ఆ పనులు ఎంత శ్రద్ధగా, ఓర్పుతో చేస్తారో దానిని బట్టి, వారు ఇతరులతో వ్యవహరించే తీరును బట్టి, వారి దాన గుణమును బట్టి నిర్ణయింపబడుతుంది.

మనం తినే ఆహారం కూడా మూడు విధములుగా ఉంటుంది. శరీరం నిలపడానికి,

ఆరోగ్యంగా ఉండటానికి, మితాహారము ముఖ్యము. అసలు తినకపోవడం, అతిగా తినడం రెండూ పనికిరావు.

మానవులు అసంకల్పంగా ఒకదానిని, సంకల్పంతో మరొకదానిని శరీరంలోపలికి తీసుకుంటారు. మన ప్రమేయం లేకుండా లోపలకు వెళ్లేది, బయటకు వచ్చేది వాయువు. లోపలకు వెళ్లేది ప్రాణవాయువు అయితే బయటకు వచ్చేది కార్బన్‌డయాక్సైడ్. ఈ ప్రక్రియ మన ప్రమేయం లేకుండానే జరుగుతుంది. కాని ఈ ప్రక్రియను ఒక క్రమంలో చేయాలని వేదం, శాస్త్రములు సూచించాయి. దానినే ప్రాణాయామం అంటారు. ప్రాణాయామం అంటే మన ఇష్టంవచ్చినట్టు గాలిని పీల్చి వదలకుండా, ఒక క్రమ పద్ధతిలో పీల్చివదలడం వలన శరీరం ఆరోగ్యంగా ఉంటుంది. జీవన ప్రమాణం పెరుగుతుంది అని శాస్త్రములు చెబుతున్నాయి.

ఈ శ్వాస ప్రక్రియ మన ప్రమేయం లేకుండా జరుగుతుంటే, మన ప్రమేయం తో జరిగేది మరొకటి ఉంది. అది జీర్ణప్రక్రియ. దీనికి మనం నోటి గుండా ఆహారం తీసుకుంటాము. ఆ ఆహారం జీర్ణాశయంలోపలికి వెళ్లి, జీర్ణం అయి, శరీరం అంతటా శక్తి రూపంలో వ్యాపిస్తుంది. ఈ ఆహారం తీసుకోవడం కూడా ఇష్టం వచ్చినట్టు, ఇష్టం వచ్చినంత కాకుండా, ఒక క్రమపద్ధతిలో తీసుకుంటే శరీరం ఆరోగ్యంగా ఉంటుంది. మనం తీసుకునే ఆహారాన్ని మూడువిధాలుగా విభజించారు. మొదటిది సాత్వికాహారము. అది ఎలా ఉండాలి అనే విషయాన్ని ఈ కింది శ్లోకంలో తెలియజేస్తున్నాడు కృష్ణ పరమాత్మ.

8. ఆయుస్సత్త్వబలారోగ్య సుఖప్రీతివివర్ధనాః।
రస్యాస్స్నిగ్ధాః స్థిరా హృద్యా ఆహారాస్సాత్త్విక ప్రియాః॥

మానవునికి ఆయుష్షును, బలమును, ఆరోగ్యమును, సుఖాన్ని, ప్రీతిని కలిగించేది, రసాస్వాదనము కలిగించేది, రుచికలది, శరీరానికి బలం కలిగించేది, చూడటానికి ఆహ్లాదకరంగాఉండేది, ఇటువంటి ఆహారాన్ని సత్త్వగుణము ప్రధానంగా ఉండేవారు ఎక్కువగా ఇష్టపడతారు.

ఈ శ్లోకంలో సత్వగుణము ఎక్కువగా కలవారు ఎటువంటి ఆహారమును ఇష్టపడతారో వివరింపబడింది. మనం తినే ఆహారం చూడ్డానికి ఆహ్లాదకరంగా ఉండాలి. శుచి, శుభ్రత కలిగి ఉండాలి. ఎక్కడ బడితే అక్కడ తినకూడదు. అపరి శుభ్రంగా ఉన్న చోట తయారు చేసే ఆహార పదార్థాలను తినకూడదు. నాలుకకు రుచిగా ఉండాలి. తినే ఆహారం కడుపు నింపేదిగా, ఆకలి తీరేదిగా ఉండాలి. ఆ ఆహారం తేలికగా జీర్ణం అయ్యేదిగా ఉండాలి. ఆహారం

జీర్ణం అయిన తరువాత శరీరానికి బలం కలిగించేదిగా  ఉండాలి. మనకు ఆరోగ్యాన్ని కలిగించాలి. తిన్న తరువాత ఎటువంటి జీర్ణకోశవ్యాధులకు దారి తీయకుండా, సుఖంగా ఉండాలి.  ఇటువంటి ఆహారమును సాత్వికాహారము అని అంటారు. ఇటువంటి ఆహారము రుచిగా ఉండటానికి కొంచెంగా చమురు పదార్ధములు కలిగి  ఉంటుంది. అంటే ఆహార పదార్థాలు తయారు చేసేటప్పుడు కానీ, లేక తినేటప్పుడు కానీ, రుచికి కొంచెంగా ఘృతము అంటే నెయ్యి వేసుకోవాలి.  ఇటువంటి ఆహారముతో కలిగే బలము శరీరము నందు స్థిరంగా నిలిచి ఉంటుంది. ఇటువంటి సాత్వికాహారము కంటికి, నోటికి ఇంపుగా ఉంటుంది. మధురంగా ఉండాలి.  మనసుకు కూడా ఆహ్లాదం కలిగిస్తుంది. ఇటువంటి ఆహారము సత్త్వగుణం కలిగిన వారికి అత్యంత ప్రియమైనది.

## 9. కట్వామ్ల లవణాత్యుష్ణతీక్ష్ణరూక్షవిదాహినం।
## ఆహారా రాజసస్యేష్టా దు:ఖశోకామయప్రదా:॥

చేదుగా, పుల్లగా, ఉప్పగా, కారంగా, బాగా వేడిగా ఉండి తిన్న తరువాత బాగా దాహం వేసేవి, శరీరానికి అజీర్తి, కడుపులో మంట, ఆరాటం మొదలగు దు:ఖములను,  బాధలను కలిగించేవి అయిన ఆహారం  రజోగుణము కలవారు ఎక్కువగా ఇష్టపడతారు.

మనం తినే ఆహారము కానీ పానీయము కానీ చేదుగా ఉండకూడదు. (చేదుగా ఉండే పానీయాల గురించి అందరికీ తెలుసు. వివరణ అనవసరం.) తినే ఆహారం  ఎక్కువ పులుపు, కారము ఉండకూడదు. ఎక్కువ ఉప్పగా ఉంటే శరీరానికి రక్తపోటు ఎక్కువకావడం వంటి హాని చేస్తుంది. రుచి కొరకు కొద్దిగా నెయ్యి ఉండాలి కానీ అతిగా ఉండకూడదు. (మనభాషలో చెప్పుకోవాలంటే నూనెలో వేయించే పదార్థములు, నూనెలో మునిగే పదార్థములు).  ఎక్కువ కారము తింటే కడుపులో మంట వస్తుంది. పులుపు ఎక్కువ ఉంటే ఆహారం జీర్ణం కాదు. ఇవే కాకుండా కొన్ని పదార్థాలు తింటే మనస్సు కూడా ప్రభావితము అవుతుంది. వ్యాకులంగా ఉంటుంది. కొంత మందికి ఏ పదార్థము అయినా వేడి వేడిగా నోరు కాలిపోయేటట్టు ఉండాలి లేకపోతే అత్యంతచల్లగా, జిల్లుమంటూ ఉండాలి.  ఇటువంటి ఆహారము రజోగుణము కలవారు తింటారు. (దీనినే ప్రస్తుత భాషలో స్పైసీ అనీ,  చిల్ల్డ్  అనీ, ముద్దుగా పిల్చుకుంటారు.)

రాజసాహారములో మధురమైన రుచి తప్ప అన్ని రుచులు ఉంటాయి. ఆ రుచులు కూడా అతిగా అంటే ఎక్కువగా, మోతాదును మించి ఉంటాయి. ఈ రాజసాహారము తినేటప్పుడు తాగే టప్పుడు నోటికి ఇష్టంగా, రుచిగా, ప్రీతిగా ఉంటుంది. (లిక్కర్ అమిత చేదుగా ఉంటుంది. అందులో కారంగా, పుల్లగా, ఘాటుగా ఉంటే ఆవకాయను చప్పరిస్తుంటారు. తరువాత నూనెలో వేయించబడిన మాంసం ఆరగిస్తారు. అదే రాజస ప్రవృత్తి కలవారికి ఎంతో ఇష్టం.) కాని, తిన్న

తరువాత దాని ప్రభావము శరీరం మీదా మనసు మీద తీవ్రంగా ఉంటుంది. ఎక్కువ దాహం వేస్తుంది. కడుపులో మంటగా ఉంటుంది. దు:ఖమును, మనోవ్యాకులతను కలుగచేస్తుంది.

రజోగుణ ప్రధానమైన ఆహారము తింటే శరీరం ఎక్కువగా చురుకుగా ఉంటుంది. ధైర్యము, స్థైర్యము బాగా ఉంటుంది. ఏదో ఒకటి చేయాలని మనసు ఉరకలు వేస్తుంటుంది. కాని సాత్వికమైన ధ్యానము కుదరదు. శరీరం సహకరించదు. మనసు నిశ్చలంగా ఉండదు. ఆ రాజసాహారము ఆరోగ్యమునకు కూడా హానికరము. వ్యాధులు రావడానికి ఇటువంటి ఆహారము మూలకారణం అవుతుంది. కాబట్టి ఆత్మజ్ఞానము పొందాలి అనుకునే వారు, ఆత్మజ్ఞానము పొందిన వారు, సాత్వికులు ఇటువంటి ఆహారమునకు దూరంగా ఉండాలి. ఇది మనుషులకే కాదు జంతువులకు కూడా వర్తిస్తుంది. శాఖాహారులైన ఆవు, మేక సాత్వికంగా ఉంటాయి. కాని మాంసాహారం తినే సింహము, పులి చంచల స్వభావంతో, చురుకుగా, క్రూరంగా ఉండటం మనం చూస్తున్నాము.

## 10. యాతయామం గతరసం పూతి పర్యుషితం చ యత్।
## ఉచ్ఛిష్టమపి చామేధ్యం భోజనం తామసప్రియమ్॥

ఆరు గంటల ముందు వండిన ఆహారము (జంక్ ఫుడ్), ఉడికీ ఉడకని ఆహారము, రుచి లేని ఆహారము, దుర్వాసన వేస్తున్న ఆహారము, చెడిపోయిన ఆహారము (అంటే పులిసిపోయిన ఆహారము) ఒకరు తినగా మిగిలిన ఆహారము(ఎంగిలి చేసినది), పరిశుభ్రతలేని ఆహారము, దేవునికి నివేదించని ఆహారము, ఇటువంటి ఆహారపదార్థములను తామస గుణము కల వారు ఎక్కువ ఇష్టపడతారు.

ఇప్పుడు తామసగుణ సంపన్నులు ఎటువంటి ఆహారం ఇష్టపడతారు లేక ఎటువంటి ఆహారం తీసుకుంటే తామస గుణము అభివృద్ధి చెందుతుంది అనే విషయం చెబుతున్నాడు పరమాత్మ.

వండిన తరువాత 6 గంటలు దాటిన పదార్థములు చెడిపోతాయి. బాగా ఉడకని పదార్థములు కూడా 6 గంటలు దాటిన తరువాత చెడిపోతాయి. వాటిలో ఉన్న సారం, పోషక పదార్థాలు నశించి పోతాయి. వాటి నుండి పులిసిన వాసన వస్తుంది. చెడి పోతుంది. పాచిపోతుంది. తినడానికి పనికిరాదు. ఇదే కాకుండా ఒకరు ఎంగిలి మరొకరు తినడం. పరిశుభ్రంగా లేని చోట తినడం. పులిసిపోయిన పదార్థాలు. పానీయాలు. ఆఖరున అమేధ్యం అని అన్నారు. అంటే భగవంతునికి నివేదించనివి, అని అర్థం. భగవంతునికి నివేదిస్తే అది ప్రసాదముఅవుతుంది,పవిత్రంఅవుతుంది. అలాకాకుండా ఉంటే అది కేవలం తినే పదార్థమే అవుతుంది కానీ పవిత్రత ఉండదు. ఇవన్నీ

కూడా తామస ప్రవృత్తి కలవారు తినే ఆహారము. ఇటువంటి పదార్థాలు తింటే శరీరానికి హాని చేస్తాయి. వ్యాధులు వస్తాయి. (ఈ నాటికి అన్వయించుకుంటే దుర్గంధము వచ్చే పదార్థములు అంటే మొలాసిస్. దానిని పులియబెడితే భరించరాని దుర్గంధము వస్తుంది. దానిని కాచి వడగడితే లిక్కర్ తయారవుతుంది. అది మత్తు కలిగిస్తుంది. అటువంటిది తామసులకు ఇష్టము. అదేమాదిరి హుక్కా, మత్తు కలిగించే సిగరెట్ వీటిని ఒకరు నోట్లోనుండి మరొకరు తీసుకొని పీలుస్తుంటారు, మత్తులో తేలిపోతుంటారు.)

ఇప్పుడు మానవులు తాము తీసుకొనే ఆహారాన్ని బట్టి తాము ఏ గుణమునకు చెందిన వారో ఎవరికి వారు తెలుసుకోవాలి. తాము అప్పటి వరకు తామసాహారం తీసుకుంటుంటే దానిని పూర్తిగా మాని వెయ్యాలి. రాజసాహారం తీసుకుంటుంటే, ఒక్కసారిగా మానలేరు కాబట్టి క్రమక్రమంగా తగ్గించుకుంటూ, సాత్వికాహారం వైపు మళ్లాలి. అప్పుడే వారిలో పరమాత్మయందు భక్తి శ్రద్ధ సాత్వికత పరోపకారగుణము వర్ధిల్లుతాయి.

ఇప్పటి వరకు ఆహారముల గురించి చెప్పిన పరమాత్మ ఇప్పుడు యజ్ఞముల గురించి చెబుతున్నాడు .

## 11. అఫలా కాంక్షిభిర్యజ్ఞో విధిదృష్టో య ఇజ్యతే।
## యష్టవ్యమేవేతి మనస్సమాధాయ స సాత్త్వికః॥

మన మనస్సుకు "ఇది చేయతగినయజ్ఞము" అని అంగీకరింపబడినది, శాస్త్రసమ్మతమైనది, విధివిధానములతో కూడినది, ఏ ఫలమును ఆశించి చేయనిది అయిన యజ్ఞమును సాత్విక యజ్ఞము అని అంటారు.

యజ్ఞము అంటే కేవలము హెూమకుండములో నేయి, సమిధలు, హెూమద్రవ్యములు వేల్చడమే కాదు. శ్రద్ధతో మనం చేసే ప్రతి పనీ యజ్ఞమే. మనం ఏదైనా ఒక పని చేసేముందు అది మంచిదా కాదా, శాస్త్ర సమ్మతమా కాదా (ఈ రోజుల్లో అయితే అది చట్టము, న్యాయమునకు, నీతికి,సాంఘిక నియాలకు లోబడి ఉందా లేక చట్ట విరుద్ధము, న్యాయవిరుద్ధము, అవినీతితో కూడినదా, అసాంఘికమైనదా అని గమనించాలి) ఇది ఒకరు చెబితే తెలిసేది కాదు. ఎవరికి వారు తమ మనస్సును సమాధాన పరచుకోవాలి. అందుకే "మనస్సమాధాయ" అని అన్నాడు. మన మనస్సుకు మనం చేయబోయే పని మంచిది, న్యాయమైనది, ధర్మబద్ధము అని తెలియాలి. అప్పుడే ఆ పని చేయాలి.

రెండవ నియమము మనం చేసే ప్రతి పనీ ఏదో ఒక ఫలాన్ని ఆశించి చేయకూడదు. నిష్కామంగా చేయాలి. దీనినే సాత్విక యజ్ఞము అని అంటారు. ఉదాహరణకు ఏ ఫలమును ఆశించకుండా పూజలు, వ్రతములు చేయడం, దైవకార్యములు చేయడం, పరోపకారమునకు పనికి వచ్చే పనులుచేయడం, ధ్యానం చేయడం, వేదములలో, శాస్త్రములలో చెప్పబడిన పంచ మహాయజ్ఞములు చేయడం.

పంచ మహా యజ్ఞములు అంటే..................

1.పితృ యజ్ఞము(మనకుజన్మనిచ్చిన తల్లి తండ్రులకు వారు బతికి ఉండగా సేవచేయడం, వారు మరణిస్తే వారికి జలతర్పణాలు,పిండప్రదానం చేయడం),

2.దేవ యజ్ఞము(ప్రతిరోజూ దేవతామూర్తులను పూజించడం, ఆరాధించడం, నివేదనలు సమర్పించి, ఆ ప్రసాదమును భుజించడం),

3.భూత యజ్ఞము(సాటి ప్రాణులకు ఆహారం ఇవ్వడం),

4.ఋషి యజ్ఞము(మనకు వేదములను, శాస్త్రములను అందించిన పూర్వకాలపు ఋషులను స్మరించుకోవడం),

5.అతిథి యజ్ఞము(అనుకోకుండా ఇంటికి వచ్చిన వారికి ఆహారము పెట్టడం),

ఇంకా సత్సంగములు, జ్ఞానయజ్ఞము మొదలైనవి.

ఇవి అన్నీ సాత్విక యజ్ఞములు అనిపించుకుంటాయి.

## 12. అభిసన్ధాయ తు ఫలం దమ్భార్థమపి చైవయత్।
## ఇజ్యతే భరతశ్రేష్ట తం యజ్ఞం విద్ధి రాజసమ్॥

ఏదో ఒక ఫలితమును ఆశించి చేసేది, ఆడంబరంతో ఆర్భాటంగా చేసేది, చుట్టు ఉన్నవారు మెచ్చుకోడానికి చేసేది, ఇటువంటి యజ్ఞములను రాజస యజ్ఞములు అని అంటారు.

రాజస ప్రవృత్తి కలవారు ఊరికే ఏ పనీ చేయరు. వారు ఏపని చేసినా దానికి తగిన ప్రతిఫలం ఉంటేనే గానీ చేయరు. (నాకేంటి? అనే తత్వము). దీనినే సకామ కర్మ, కామ్య కర్మ అని అంటారు. రాజసులు ఏపని చేసినా దర్పంతో పది మందీ మెచ్చుకోవాలని ఆడంబరంగా చేస్తారు. ఆర్భాటంగా చేస్తారు. పేరు కోసం చేస్తారు. దానివలన ఏదో ఒక లాభం ఆశించి చేస్తారు. దీనినే రాజస యజ్ఞం అని అంటారు. ఈ రోజుల్లో చాలా మంది ఇలాగే చేస్తున్నారు. మనం చేసే ఏ పూజకానీ, వ్రతంకానీ, “ఇష్టకామ్యార్థ సిద్ధ్యర్థం” అంటే “నాకు ఇష్టమైన కోరికలు సిద్ధించేదానికి” అని చెప్పి చేస్తున్నారు కానీ పరోపకారం ఆశించి కానీ, లోకకల్యాణార్థం కానీ, పరమాత్మ కొరకు

కానీ, చేయడంలేదు. ఎంతో పవిత్రంగా, నిరాడంబరంగా, భక్తి శ్రద్ధలతో చేయాల్సిన సత్యనారాయణ వ్రతాలు, అయ్యప్పస్వామి వారి పడి పూజలు కూడా ఎంతో ఆర్భాటంగా, పేరు ప్రతిష్టలను ఆశించి, రాజకీయ నాయకులను, పారిశ్రామిక వేత్తలను ఆహ్వానించి, వారికి స్వాగతం బానర్లు, పెద్ద పెద్ద ఫ్లెక్సీలు పెట్టి, ఫోటోలు, విడియోలు తీయించి, గొప్పదనం కోసం చేయడం దీనికి చక్కని ఉదాహరణ. ఇవన్నీ రాజస ప్రవృత్తి కలవారు చేస్తారు.

## 13. విధిహీనమసృష్టాన్నం మన్త్రహీనమదక్షిణమ్।
## శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే॥

వేదములలో, శాస్త్రములలో చెప్పబడిన విధి విధానములను అనుసరించకుండా, అన్నదానము లేకుండా, చేసిన బ్రాహ్మణులకు దక్షిణలు ఇవ్వకుండా, ఎటువంటి శ్రద్ధ, భక్తి లేకుండా చేసే యజ్ఞాలు తామస యజ్ఞములు అని అంటారు.

దేవతలకు ప్రీతిగా చేసేవి, లోక కల్యాణార్థము చేసేవి యజ్ఞములు, యాగములు, క్రతువులు, వ్రతములు, పూజలు, అభిషేకములు. పితృదేవతలకు ప్రీతిగాచేసేవి శ్రాద్ధ కర్మలు, కర్మకాండలు. ఏవి చేసినా, వాటిని శ్రద్ధగా చేయాలి. బ్రాహ్మణులు రావడం, పూజలు చేయించడం, అందరకూ భోజనాలు పెట్టడం విధిగా చేయాలి. చేయించిన బ్రాహ్మణులకు దక్షిణలు ఇవ్వాలి (ఎందుకంటే వారి జీవనాధారం అదే కాబట్టి.) వేదములలో చెప్పబడిన విధి విధానములను పాటించకుండా, శాస్త్రములలో చెప్పబడిన మంత్రములను ఉచ్ఛరించకుండా, అన్నదానం లేకుండా, కేవలం స్వలాభం కోసం చేసే యజ్ఞ యాగములు, క్షుద్రపూజలు, శ్రాద్ధకర్మలు అన్నీ తామస యజ్ఞములు.

చాలా మంది పితృ దేవతలకు జలతర్పణములు, పిండప్రదానములు చేస్తారు. భోజనాలు పెడతారు. కాని చేయించిన బ్రాహ్మణులకు దక్షిణ ఇచ్చేటప్పుడు ఇంత ఇవ్వాల్సివచ్చిందే అని బాధపడుతూ ఇస్తారు. కాని బ్రాహ్మణులు వాటి మీద బతుకుతారు. అదే వారి జీవనోపాధి అని ఆలోచించరు. మనం నెలంతా పనిచేసి జీతం తీసుకున్నట్టు వాళ్లు ఏ రోజుకారోజు మన చేత కర్మక్రతువులు జరిపించి దక్షిణల రూపంలో వారి పారితోషికం తీసుకుంటారు. (ఈ రోజుల్లో అదీ వ్యాపారమైపోయిందనుకోండి అది వేరుసంగతి.) కానీ వేదములలో, శాస్త్రములలో చెప్పబడిన విధివిధానముల ప్రకారం, మంత్రసహితంగా, యజ్ఞయాగములు, వ్రతములు, పూజలు, కర్మక్రతువులు శ్రద్ధతో చేయడం, బంధుమిత్రులకు, భోజనాలు పెట్టడం, చేయించిన బ్రాహ్మణులకు దక్షిణలు ఇవ్వడం గృహస్థ ధర్మం. ఇవేమీ లేకుండా కేవలం కర్మకాండలతోనే సరిపెట్టడం తామస యజ్ఞము అని అంటారు. అంతకు మించి వీరు చేసే పూజలలో, క్రతువులలో శ్రద్ధ, భక్తి, తప్ప అన్నీ హంగులు,

ఆర్భాటాలు ఉంటాయి. మాంత్రికులు, తాంత్రికులు చేసే క్షుద్రపూజలు, శవపూజలు, శ్మశానాలలో జరిగే చేతబడులు ఈ కోవకు వస్తాయి.

ఇప్పుడు తపస్సు గురించి వివరిస్తున్నాడు పరమాత్మ.

14. దేవ ద్విజ గురు ప్రాజ్ఞ పూజనం శౌచమార్జవమ్।
బ్రహ్మచర్యమహింసా చ శారీరం తప ఉచ్ఛ్యతే॥

దేవతలను, బ్రాహ్మణులను, గురువులను, ప్రాజ్ఞులను పూజించడం, మానసికంగానూ, శారీరకంగానూ శుచిగా ఉండటం, చక్కని ప్రవర్తన కలిగి ఉండటం, బ్రహ్మచర్యమును, అహింసను పాటించడం, వీటిని శారీరక తపస్సులు అని అంటారు.

తపస్సు అంటే ఏకాగ్ర దృష్టితో, నిర్మలమైన మనసుతో, అత్యంత శ్రద్ధాభక్తులతో చేసే ఏ పని అయినా తపస్సు అని అంటారు. తపస్సులు మూడు రకాలు. మామూలుగా మూడు గుణములతో అన్ని విభజిస్తుంటారు. అంటే సాత్విక,రాజసిక,తామసిక లక్షణాలతో విభాజన జరుగుతుంది. ఇక్కడ మాత్రం శారీరక, వాచక, మానసిక అనే కరణములు అంటే ఉపకరణములతో చేయడం. దీనినే త్రికరణములు అంటారు. త్రికరణములు అంటే శరీరము, వాక్కు, మనస్సు వీటిని బట్టి తపస్సులను మూడుగా విభజించారు. ఇందులో మొదటిది శరీరంతో చేసే తపస్సు. రెండవది వాచికంగా అంటే మాట్లాడే మాటలతో చేసే తపస్సు, మూడవది మానసికంగా చేసే తపస్సు. ఇప్పుడు మనం శారీరక తపస్సు గురించి తెలుసుకుందాము.

దేవతలను పూజించడం ఆరాధించడం. అభిషేకాలు చేయడం. హారతులు ఇవ్వడం. నివేదనలు సమర్పించడం. మానవులు సాధారణంగా తమోగుణ ప్రధానంగా ఉంటారు. (ఉదయం 9 కానీ నిద్రలేవరు). ఆ తమోగుణాన్ని మనలో నుండి పారద్రోలడానికి ఈ ప్రక్రియను నిర్దేశించారు. ఇప్పుడు దేవాలయాలు చిన్నవిగా ఉన్నాయి కానీ పూర్వకాలంలో దేవాలయాలు విశాలంగా ఉండేవి. ఒకసారి ప్రదక్షిణం చేస్తే కిలోమీటరు అవుతుంది. అందుకని ఉదయమే లేచి స్నానం చేసి, దేవాలయానికి వెళ్లడం, ప్రదక్షిణలు చేయడం, పరమాత్మను దర్శించుకోవడం, పూజించడం, ప్రసాదం తీసుకోవడం ఒక తపస్సుగా చేయమన్నారు. ఈ తపస్సు మనలోఉన్న తమోగుణ ప్రభావాన్ని తొలగిస్తుంది. పరమాత్మ పట్ల భక్తి పెరుగుతుంది.

తరువాత తపస్సు.... బ్రాహ్మణులను, బ్రహ్మజ్ఞానము కలవారిని పూజించడం, ఆదరించడం, సత్కరించడం. గురువులను గౌరవించడం, పూజించడం. శరీరమును ఎల్లప్పుడూ

పరిశుభ్రంగా ఉంచుకోవడం, ఎటువంటి కపట స్వభావము,కుటిలత్వము లేకుండా, మంచి ప్రవర్తన కలిగి ఉండటం, అనుకున్నది చెప్పడం, చెప్పింది చేయడం, బ్రహ్మచర్య వ్రతమును పాటించడం. ఇతరుల మనసుకు కానీ, శరీరానికి కానీ ఎటువంటి హింసచేయకపోవడం. ఇవన్నీ శారీరక తపస్సులు అని అంటారు. వీటిని వివరంగా తెలుసుకుందాము.

1. దేవ, ద్విజ, గురు, ప్రాజ్ఞ పూజనం. అంటే దేవతలను, పెద్దలను, బ్రాహ్మణులను, గురువులను, పండితులనుపూజించడం శారీరక తపస్సు. పెద్దలను పూజిస్తే ఆదరిస్తే గౌరవిస్తే మనలను మనం గౌరవించుకున్నట్టే. గురువులను, పండితులను పూజిస్తే వారు మనకు చక్కని మార్గాన్ని చూపుతారు. దేవతలు, పెద్దలు, గురువులు, ఆశీర్వాదములు ఉంటే జీవితం సాఫీగా గడిచిపోతుంది. వారిలో ఉన్న అహంకారము, గర్వము నశించిపోతాయి. కోపం తగ్గిపోతుంది. భగవంతుని చేరుకోవాలనుకొనే వారికి ఈ శారీరక తపస్సు ఎంతో ముఖ్యం. ఇక్కడ ద్విజుడు అనే పదం వాడారు. ద్విజ అంటే రెండో జన్మ. ప్రతివాడూ పుట్టగానే ఏ వర్ణానికి చెందడు. 7,9,11, ఏట ఉపనయనం చేసుకుంటే వాడు ద్విజుడు అవుతాడు. ద్విజులు అంటే కేవలం బ్రాహ్మణులే కాదు ఉపనయనం యజ్ఞోపవీతధారణ జరిగిన ఎవరైనా ద్విజులే. ఉపనయనం ఒక సంస్కారం. తంతు కాదు. ఈ నాడు ఉపనయనం పెళ్లికి ముందు ఒక తంతు లాగా జరిపిస్తున్నారు.

తరువాతది శౌచమ్ అంటే కేవలం శరీర శుభ్రతే కాదు మనస్సు కూడా నిర్మలంగా పరిశుభ్రంగా ఉంచుకోవాలి. చెడుభావనలు, మలినమైన ఆలోచనలు మనసులోకి రానీయకూడదు.

తరువాతది ఆర్జవమ్ అంటే మంచి ప్రవర్తన. కపటం, కుటిలత్వము పనికిరాదు. కపటపు ఆలోచనలు, దుర్మార్గపు ఆలోచనలు దూరంగా నెట్టేయాలి. దీనినే పాజిటివ్ తింకింగ్ అంటారు. ఎప్పుడూ మంచిగా ఆలోచించాలి. మంచి గా ప్రవర్తించాలి.

తరువాతది బ్రహ్మచర్యం. ఈ పదానికి మనకు ఒక రూఢి అర్థం ఉంది. పెళ్లికాని వాడు బ్రహ్మచారి. వాడు ఎంతమందితో తిరిగినా వాడిని బ్రహ్మచారి అంటారు. అది తప్పుభావన. బ్రహ్మయందు అంటే ఆత్మయందు చరించేవాడు, ఆత్మజ్ఞానముకలవాడు బ్రహ్మచారి. మరొక అర్థం చెప్పుకోవాలంటే గురువు దగ్గర విద్యనేర్చుకునేటప్పుడు పాటించేది బ్రహ్మచర్యము. గృహస్థుకూడా బ్రహ్మచర్యనిష్ఠను పాటించవచ్చును. కేవలం తాను శాస్త్రోక్తంగా వివాహమాడిన భార్యను తప్ప పరాయి స్త్రీని కన్నెత్తికూడా చూడని గృహస్థును కూడా బ్రహ్మచారి అనవచ్చు. కాబట్టి కపట బ్రహ్మచర్యంకాకుండా నిజమైన బ్రహ్మచర్యమునుపాటించాలి.

తరువాతది ఆఖరుది అహింస. అంటే సాటి మానవులను, ప్రాణులను హింసించకపోవడం. అహింస అంటే శారీరక హింసయే కాదు మానసిక హింసకూడా హింస కిందికే వస్తుంది. ఇతరుల మనసుకు

కష్టం కలిగించే మాటలు మాట్లాడడం కూడా హింస కిందికే వస్తుంది. కాబట్టి ఎదుటి వారి శరీరానికి కానీ, మనస్సుకు కానీ హింస కలిగించకుండా ప్రవర్తించడం అహింస. ఈ లక్షణాలు ఉంటే దానిని శారీరక తపస్సు అంటారు.

## 15. అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్।
## స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే॥

ఉద్వేగము లేకుండా మాట్లాడటం, నిజం చెప్పడం, ఎదుటి వారికి ప్రియము, హితము కలిగించే మాటలు మాట్లాడటం, వేదములు, శాస్త్రములు చదవడం, తాను చదువుతూ ఇతరులకు చెప్పడం, ఇటువంటి వాక్కుకు సంబంధించన వాటిని వాచిక తపస్సు అని అంటారు.

శరీరంలో ఉండే కర్మేంద్రియములతో పనులు చేస్తే, నోటితో మాట్లాడతాము. ఆ మాటలు కూడా ఒక తపస్సులాంటిదే. మన సంస్కృతిలో వాక్కును సరస్వతీ స్వరూపం అన్నారు. అందుకే వాగ్దేవి అని సరస్వతికి పేరు. ఈ వాక్కు రూపంలో సరస్వతీ దేవి ప్రతి వాడి నాలుక మీద నివసించి ఉంటుంది. అటువంటి సరస్వతీదేవి రూపమైన వాక్కును ఉపయోగించేటప్పుడు మనం ఎంతో శ్రద్ధవహించాలి. పవిత్రమైన వాక్ శక్తిని మనం సక్రమంగా ఉపయోగించుకోవాలి. దుర్వినియోగం చేయకూడదు. అసభ్యంగా మాట్లాడకూడదు. ఇతరులకు బాధ కలిగించే మాటలు మాట్లాడకూడదు. అందుకే వాక్కును బాణంతో పోల్చారు. వాక్బాణాలు అని అన్నారు. ఒక దివ్యాస్త్రమును ప్రయోగించిన తరువాత ఉపసంహారం చేయవచ్చేమో గానీ, ఒకసారిమాట బయటకు వస్తే దానిని వెనక్కు తీసుకోలేము. ఏదైనా ఆయుధంతో శరీరానికి గాయం అయితే కొన్నిరోజులకు తగ్గిపోతుంది కానీ పరుషమైన వాక్కులతో మనసును గాయపరిస్తే, ఆ గాయం ఎన్నటికీ మానదు అని అంటారు. వాక్కు అంత శక్తివంతమైనది. దానిని సక్రమంగా ఉపయోగించుకోవడం మన అందరి బాధ్యత.

అది ఎలాగంటే...... ఉద్వేగం లేకుండా మాట్టాడటం. పరుషంగా మాట్లాడకపోవడం. ఇతరుల మనసును బాధపెట్టకుండా మాట్లాడటం. ఎల్లప్పుడూ సత్యం పలకడం అంటే తెలిసిన విషయాలే మాట్లాడాలి. తెలియని విషయాలు తెలిసినట్టు మాట్లాడకూడదు. ఎదుటివారికి ప్రియం కలిగించే మాటలు మాట్లాడటం. అంటే మనం మాట్లాడే మాటలు ఎదుటి వారికి ప్రియంగా హితవుగా అనిపించాలి కానీ ఇబ్బందిపెట్టేవిగా ఉండకూడదు. కొన్నిసందర్భాలలో, చెప్పకూడనివి, మనసుకు బాధకలిగించేవి చెప్పవలసివచ్చినపుడు, అవి చెప్పేముందు కొన్ని మంచి విషయాలు చెప్పి, తరువాత మెల్లమెల్లగా అసలు విషయాలను చెప్పాలి. అప్పుడు వినేవాడికి అంతగా బాధ అనిపించదు. పైగా నా మంచి కోరి చెప్పాడు అని అనుకుంటాడు. వేదములు, శాస్త్రములు, పురాణములలో విషయాలు, ఉపనిషత్తులు, భగవద్గీత, భారత, భాగవత, రామాయణాల గురించి మాట్లాడటం, చదివి

వినిపించడం, వ్యాఖ్యానించడం. ఇవన్నీ కూడా వాచిక తపస్సు కిందికి వస్తాయి. మనసులో చెడు తలంపుపెట్టుకొని బయటకు ప్రియంగా మాట్లాడటం వాచిక తపస్సు కాదు. ధ్యానం చేయడం శారీరక తపస్సు అయితే శాస్త్రగ్రంధములలో విషయాలు చదవడం, ఇతరులకు చెప్పడం వాచిక తపస్సు. పురాణాలను, శాస్త్రాలను తమకు తోచినట్టు వక్రీకరించి చెప్పడం వాచిక తపస్సు కాదు.

16. మన: ప్రసాదస్సౌమ్యత్వం మౌనమాత్మవినిగ్రహ:।
భావసంశుద్ధిరిత్యేత త్తపో మానసముచ్చతే॥

మనస్సును ఎల్లప్పుడూ నిర్మలంగా ఉంచుకోవడం, సౌమ్యంగా ఉండటం, ఎక్కువగా మాట్లాడకుండా మౌనంగా ఉండటం, ఆత్మను అటు ఇటు పోనీయకుండా అదుపులో పెట్టుకోవడం, ఎల్లప్పుడుమనలో కలిగే భావాలను పరిశుద్ధంగా ఉంచుకోవడం, ఇవిఅన్నీకూడా మానసిక తపస్సులు అని చెప్పబడ్డాయి.

ఈ శ్లోకంలో పరమాత్మ మానసిక తపస్సు అంటే ఏమిటో చెబుతున్నాడు. మానవులు శారీరక తపస్సు, వాచక తపస్సును ముందు ఆచరించి తరువాత మానసిక తపస్సును ఆచరించాలి. అంతే కానీ ముందే మానసిక తపస్సును ఆచరించడం మొదలుపెడితే, అతడికి వైఫల్యం తప్పదు. ఎందుకంటే శరీరం, వాక్కు మన అధీనంలో ఉంటాయి. వాటిని మనం కంట్రోల్ చెయ్యవచ్చు. కాని మనస్సు మన అధీనంలోఉండదు. కాబట్టి మానసిక తపస్సు పైరెండు తపస్సులతో పోలిస్తే కష్టమైనది.

మానసిక తపస్సు అంటే మనస్సును ఎల్లప్పుడూ అలజడి లేకుండా, ఒడిదుడుకులు లేకుండా, వత్తిడి లేకుండా, నిర్మలంగా, నిశ్చలంగా, ప్రశాంతంగా ఉంచుకోవడం. చాలా మంది భవిష్యత్తు గురించి ఏం జరుగుతుందో ఏమో అని ఎప్పుడూ ఆందోళన పడుతుంటారు. అది మంచిది కాదు. జరిగేది జరుగుతుంది. దానికి అనవసరమైన ఆందోళన చెంది మనసును, శరీరాన్ని దు:ఖమయం చేసుకోకూడదు. ముఖం ఎప్పుడూ ప్రసన్నంగా ఉంచుకోవడం (ఫేస్ ఈజ్ ది ఇన్డెక్స్ ఆఫ్ మైన్డ్). మనసులో ఎలాంటి క్రూరభావనలకు చెడు తలంపులకు చోటు ఇవ్వకపోవడం, ఎల్లప్పుడూ దైవధ్యానం చేయడం, మనస్సును నిగ్రహించడం, ఇతరులకు హాని చేయాలని, ఇతరులను మోసంచేయాలనే తలంపు లేకపోవడం, ఇవన్నీ మానసిక తపస్సులు అనిఅంటారు.

అందుకే మొట్ట మొదట మన: ప్రసాద: అని వాడారు. అంటే మనస్సు తేటగా, నిర్మలంగా, ప్రశాంతంగా, ఎటువంటి కలతలు లేకుండా, ఉంచుకోవాలి. మనసులో రజోగుణము, తమోగుణము ఉంటే మనసు అలజడిగా ఉంటుంది. మత్తుగా ఉంటుంది. కాబట్టి ఆ లక్షణాలు తగ్గించుకోవాలి.

మనస్సును సత్వగుణంతో నింపాలి. అప్పుడు మనసు ప్రశాంతంగా ఉండే అవకాశం ఉంది. అంతకు ముందే మనసు అలజడిగానూ మకిలపట్టి ఉంటే ఏం చేయాలి. దానికి ఒకటే మందు. భగవంతుని గురించి ధ్యానం చేయడం. ఓంకారం జపించడం. అన్ని మానసిక వ్యాధులకు ఇదేమందు. మానసికంగా అలజడి, చాంచల్యము, అల్లకల్లోలం ఉంటే భగవంతుని ధ్యానం చేయాలి. మనసుకు ఈ అలజడి చాంచల్యము కలగకుండా ఉండాలంటే ఒకటేమార్గము. సౌమ్యత్వం, మౌనం, ఆత్మనిగ్రహం. అంటే మనస్సును సౌమ్యంగా ఉంచుకోవాలి. మౌనంగా ఉండాలి. ఆత్మను నిగ్రహించుకోవాలి. మనస్సు ఎల్లప్పుడూ సౌమ్యంగా కరుకుదనం, కపటం లేకుండా నిర్మలంగా నిష్కల్మషంగా ఉంటే మానసిక అలజడి ఉండదు.

తరువాత మనకో విచిత్రమైన సామెత ఉంది. ఊరుకున్నంత ఉత్తమం బోడిగుండంత సుఖం లేదు అని పామరులు కూడా అంటుంటారు. అంటేసాధ్యమైనంత వరకు మౌనంగా ఉండాలి అనవసర సంభాషణలు చేయకూడదు. వాగ్వివాదాలు, విభేదాలు కలిగించే ప్రసంగాలు, వివాదాస్పదమైన మాటలు మాట్లాడకూడదు. కుదిరితే నాలుగు మంచి మాటలు మాట్లాడాలి. లేకపోతే మౌనంగా ఉండాలి. అప్పుడే మనసు ప్రశాంతంగా ఉండే అవకాశం ఉంది.

ఆత్మ నిగ్రహ: అన్నారు ఇక్కడ ఆత్మ అంటే మనసు అని అర్థం. మనసును అటు ఇటు పోనీయకుండా నిగ్రహించుకోవాలి. ఇంద్రియాలను అదుపు చేయవచ్చు. ఒకచోట కుదురుగా కూర్చుంటే ఇంద్రియాలు అదుపులో ఉంటాయి. కాని మనసు తన ఇష్టం వచ్చినట్టు అటు ఇటు పరుగెడుతూ ఉంటుంది. దానిని కూడా అదుపులో పెట్టుకుంటే ఎటువంటి అలజడి ఉండదు.

ఆఖరుగా భావసంశుద్ధి అని అన్నారు. మనసులో నిరంతరం భావప్రకంపనలు కలుగుతుంటాయి. ఆ భావాలను కూడా అదుపులో పెట్టుకోవాలి. ఎల్లప్పుడూ మనసులో మంచి భావాలను నిర్మలమైన భావాలు కలిగి ఉండాలి. ఇతరులకు హాని కలిగించే భావాలు, సంకల్పాలు చేయకూడదు. ఎందుకంటే సంకల్పం ఆలోచనగా మారుతుంది. ఆలోచన కార్యంగా మారుతుంది. ఆ కార్యం ఏదో ఒక ఫలితం ఇస్తుంది. సుఖం కలిగితే ఆనందం దు:ఖం కలిగితే నిరాశ నిస్పృహ మిగులుతాయి. మనసు అల్లకల్లోలం అవుతుంది. కాబట్టి ముందుగా మన భావాలను నిర్మలంగా ఉంచుకుంటే, తదుపరి పరిణామాలు మనకు బంధనాలు కలిగించవు.

ఈ ప్రకారంగా నిర్మలత్వము, ప్రసన్నత్వము, ఆత్మనిగ్రహము, భావ సంశుద్ధి వీటినే మానసిక తపస్సు అని అంటారు.

ఇప్పటి వరకు శారీరక, వాచిక, మానసిక తపస్సులు గురించి చెప్పి, ఇప్పుడు మూడు గుణములతో కూడిన మూడు రకములైన తపస్సుల గురించి వివరించాడు పరమాత్మ. వాటిని

సాత్త్వక, రాజసిక, తామసిక తపస్సు అని అంటారు. వాటి గురించి రాబోయే శ్లోకాలలో తెలుసుకుందాము.

## 17. శ్రద్ధగా పరయా తప్తం తపస్తత్ త్రివిధం నరైః।
## అఫలాకాంక్షిభిర్యుక్తై స్సాత్త్వకం పరిరక్షతే॥

మానవుల చేత, ఫలాపేక్ష లేకుండా, అమితమైన శ్రద్ధతో, నిశ్చలమైన మనస్సుతో, చేయబడే శారీరక, వాచిక, మానసిక తపస్సులను సాత్త్వక తపస్సు అని అంటారు.

పైన శారీరక, వాచిక, మానసిక తపస్సులను గురించి చెప్పాడు. ఈ తపస్సులను శ్రద్ధతో, భక్తితో, ఎటువంటి ఫలాపేక్ష లేకుండా, నిలకడ కలిగిన మనసుతో, దైవీభావంతో ఆచరిస్తే, ఈ మూడు రకములైన తపస్సులను సాత్విక తపస్సు అని అంటారు. అంటే తపస్సులలో కూడా మూడు రకాలు ఉన్నాయి. అవి సాత్విక, రాజసిక, తామసిక తపస్సులు. అందులో సాత్విక తపస్సు మూడు రకాలు. అవే శారీరక, వాచిక, మానసిక తపస్సు. ఈ సాత్విక తపస్సుకు ఉండవలసిన లక్షణాలు ఏవంటే ఏ పని చేసినా శ్రద్ధతో చేయాలి. ఫలాపేక్ష లేకుండా చేయాలి. నిర్మలమైన మనస్సుతో చేయాలి. అప్పుడు అది సాత్విక తపస్సు అవుతుంది. మరి ఈ సాత్విక తపస్సు ఎవరు చేయాలి అంటే నరైః అని అన్నాడు. నరులు అంటే కేవలం పురుషులే కాదు, మానవులు అందరూ, స్త్రీలు, పురుషులు, కులము జాతి భేదం లేకుండా చేయవచ్చు. ఎటువంటి ఆంక్షలు లేవు. ఇది మగవాళ్లే చేయాలి ఆడవాళ్లు చేయకూడదు అని కొంత మంది తమ స్వంత భావాలు ప్రకటిస్తుంటారు. కాని పరమాత్మ మాత్రం మానవులలో ఎటువంటి భేదబుద్ధి ప్రకటించలేదు అనే విషయాన్ని మనం గమనించాలి. కాబట్టి ఈ తపస్సులను ఎవరైనా ఆచరించవచ్చు.

## 18. సత్కారమానపూజార్థం తపో దమ్భేనచైవ యత్।
## క్రియతే తదిహ ప్రోక్తం రాజసం చలమధ్రువమ్॥

ఏ మానవులైతే, ఇతరులచేత సత్కారములు పొందాలి, గౌరవింపబడాలి, పూజింపబడాలి అనే భావనలతో, కేవలం తమ గొప్ప కోసం, తమకు పేరు ప్రతిష్ఠలు రావాలి అనే భావనలతో, పైన చెప్పబడిన శారీరక, వాచిక, మానసిక తపస్సులు చేస్తారో, ఆ తపస్సును రాజసిక తపస్సు అని అంటారు. అటువంటి తపస్సులు చేస్తే వచ్చే ఫలితములు క్షణికములు, చలించే స్వభావం కలిగిఉంటాయి. కలకాలం నిలిచి ఉండవు.

ఇప్పుడు రాజసిక తపస్సు గురించి చెబుతున్నాడు పరమాత్మ. ఈ రాజసిక తపస్సు చేసేవాళ్లు, ఏపని చేసినా దాని వలన తమకేం లాభం, తమకు ఎంత పేరు వస్తుంది, తమకు ఎటువంటి సత్కారం జరుగుతుంది అని ఆలోచిస్తారు. తమకు లాభం లేని పని ఏదీ చెయ్యరు. ఏ పని చేసినా అడంబరంగా, డాంబికంగా, తమ గురించి అందరూ చెప్పుకునేటట్టు చేస్తారు. ఆ యా పనులు చేసేటప్పుడు కూడా మనస్సు చంచలంగా ఉంటుంది. ఆ పని అయిందా, వీళ్లు వచ్చారా, అందరికీ సక్రమంగా మర్యాదలు జరుగుతున్నాయా, పిలిచిన వాళ్లు అందరూ వచ్చారా, వచ్చిన వాళ్లు ఏమేం కానుకలు తెచ్చారు, దీని వల్ల నాకెంత పేరు, ప్రతిష్ఠ పెరుగుతాయి.... అనే ఆలోచనలతో సతమతమౌతుంటారు. దీనినే రాజసిక తపస్సు అని అంటారు.

ఇటువంటి భావనలతోనే పెద్ద పెద్ద పీఠాధి పతులు, స్వామీజిలు పూజలు, వ్రతాలు, యాగాలు, యజ్ఞాలు చేయడం మనం చూస్తూనే ఉన్నాము. ఇటువంటి వారికి కావలసింది ప్రచారము, గొప్పదనము, డాంబికము. వీరు చేసే తపస్సులో నిర్మలత్వము, నిశ్చలత్వము ఉండదు. భగవంతుని మీద భక్తి, శ్రద్ధ ఉండవు. వీరి దగ్గరకు వచ్చే వారిలో కూడా ఆడంబరాలు, తమకు ఉన్న వస్తువులను, నగలను, ఖరీదైన దుస్తులను ఇతరుల ముందు ప్రదర్శించడం జరుగుతుంది. ఈ విధంగా ఆడంబరంగానూ, గొప్పదనం కోసం చేసే పనులు కలకాలం నిలువవు. ఈ రోజు సన్మానం పొందిన చోటే కొంత కాలం తరువాత అవమానం పొందవలసి వస్తుంది. ఈరోజు పొగిడిన వాళ్లు రేపే మన చాటున నిందించే అవకాశం ఉంది. ఈ నాడు కూడా స్వామీజీల మీద, వారి ధనము, ఆస్తులకు సంబంధించిన ఎన్నో పుకార్లు మనం వింటూనే ఉన్నాము. కాబట్టి ఇటువంటి రాజసిక తపస్సుల వలన కలిగే ఫలితములు చంచలములు, క్షణికములు, ధ్రువంగా నిలబడవు అని బోధించాడు పరమాత్మ.

## 19. మూఢగ్రాహేణాత్మనో యత్పీడయా క్రియతే తపః। పరస్యోత్సాదనార్థం వా తత్తామసముదాహృతమ్॥

మూర్ఖమైన పట్టుదలతో, తన శరీరమును బాధపెట్టి, కష్టపెట్టి, చేసే తపస్సులు, లేక ఇతరులకు హాని కలిగించాలనే ఉద్దేశ్యంతో చేసే తపస్సులు, పూజలు, యజ్ఞములు అన్నీ కూడా తామసిక తపస్సులు అని అంటారు.

ఇప్పుడు తామసిక తపస్సు గురించి చెబుతున్నాడు. ఈ తపస్సులో మూర్ఖత్వం, మూఢత్వం, అహంకారం కనపడుతుంది. తమకు తోచిందే వేదం, తాము చెప్పిందే ఆచరించాలి అనే మూర్ఖత్వం. వీళ్లు ఏపని చేసినా తమను తాము బాధించుకోవడమో, ఇతరులను బాధించడమో

చేస్తుంటారు. ఇటువంటి వారు కఠినమైన ఉపవాసాలు ఉండి శరీరాన్ని బాధపెట్టుకుంటారు. పంచాగ్నుల మధ్య తపస్సు చేస్తారు. గడగడవణికే చలిలో జోరున కురిసే వానలలో నిలబడి తపస్సు చేస్తారు. వీరినే హఠయోగులు, అఘోరీలు అని పిలుస్తుంటారు. ఈవిషయాలు వేదాలలో గానీ, ఉపనిషత్తులలోగానీ చెప్పబడలేదు కానీ వారు నమ్ముతారు. వారు నమ్మిందే వేదం గా పరిగణిస్తారు. వీళ్లలో మరొక లక్షణం కూడా ఉంది. ఇతరుల నాశనం కోరి పూజలు, యాగాలు చేస్తారు. క్షుద్రపూజలు, అభిచారిక హెూమాలు, చేతబడులు, దీని కిందికే వస్తాయి. దీనికి తమకు అన్నిచోట్లా విజయం కావాలని చేస్తున్నాము అని అంటారు. చేసేవాడికి విజయం సిద్ధించాలంటే ఎదుటి వాడు ఓడిపోవాలి, నాశనం కావాలి. అదే వీరి లక్ష్యం.

ఈ తామసిక తపస్సులలో దైవచింతన అసలే ఉండదు. కేవలం తంత్రము, తాంత్రికవిద్యలే ప్రముఖ పాత్ర వహిస్తాయి. కాబట్టి తామసిక తపస్సు లు, చేసే వారికే కాక, ఎదుటి వారికి కూడా హాని కలిగిస్తాయి. పురాణాలలో చూస్తే ఇటువంటి తపస్సులుచేసిన రాక్షసులు, భగవంతుడు ప్రత్యక్షం అయితే మోక్షం కోరుకోరు. తమకు చావు లేకుండా వరం కోరుకున్నారు. త్రిలోకాధిపత్యం కోరుకుంటారు. తాను ఎవరిమీద చెయ్యిపెడితే వారు భస్మం కావాలని కోరుకుంటారు. అంటే ఆవరాలు తనకు లాభించేవిగానూ, ఇతరులకు నష్టం కలిగించేవిగానూ ఉండాలి. తుదకు ఆ వరాల ప్రభావంతో వారే నాశనంఅయినట్టు మనకు పురాణాలు చెబుతున్నాయి.

## 20. దాతవ్యమితి యద్దానం దీయతే2నుపకారిణే। దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్త్వికం స్మృతమ్॥

దానము చేయవలెను అనే కోరికతో, పుణ్యక్షేత్రములోగానీ, పర్వదినములలో కానీ, ఆ దానము తీసుకోడానికి యోగ్యుడైన వానికి, అతనినుండి ఏ ఉపకారము ఆశించకుండా చేసే దానమును సాత్త్విక దానముఅని అంటారు.

ఈ శ్లోకంలో దానాల గురించి చెబుతున్నాడు పరమాత్మ. దానం అంటే ఏమిటి? తనకు ఉన్న దానిని ఇతరులతో పంచుకోవడం. తన జీవనానికి సరిపడా ధనం ఉంచుకొని మిగిలినది ఇతరులకు ఇవ్వడం. దీని వలన మనిషిలో ఉన్న లోభగుణం నశిస్తుంది. పరపీడనం పోయి పరోపకార గుణం అలవడుతుంది. పైగా ఒకరిదగ్గరే ఎక్కువ ధనం ఉంటే అది అతనికి భారంగా పరిణమిస్తుంది. దానిని దాచుకోవడానికి నానాఅవస్థలు పడుతుంటాడు. అతని ధనానికే కాదు, ప్రాణానికి కూడా ముప్పు ఏర్పడుతుంది. తద్వారా మనశ్శాంతిని కోల్పోతాడు. కానీ, దానం వలన ఆ అవస్థలనుండి బయటపడతాడు.

ఈ దానాలు కూడా మూడు రకాలు. అవే సాత్విక, రాజసిక, తామసిక దానాలు. అందులో మొదటిది సాత్విక దానము. ఈ దానము దేశ, కాల, పాత్రను బట్టి చేయాలి. పుణ్య క్షేత్రములలో, పర్వదినముల యందు చేయాలి. యోగ్యుడు అయిన వాడికే దానం చేయాలి. దానం చేసిన తరువాత ఎవరికైతే దానం చేసాడో వాడి నుండి ప్రత్యుపకారం కోరకూడదు అది దానం అనిపించుకోదు. కర్ణుడు చేసిన దానం అటువంటిదే. కర్ణుడు ఇంద్రుడికి తన కవచ కుండలములు ఇచ్చి దానికి ప్రతిగా ఇంద్రుడి వద్దనుండి శక్తి అనే ఆయుధమును తీసుకున్నాడు. అది దానం అనిపించుకోదు.

"దాతవ్యం ఇతి" అంటే దానం చేయడం నా ధర్మం. నేను దానం చేయాలి అని నిశ్చయించుకోవడం. పేరు ప్రతిష్ఠల కోసం ఒకరి మెప్పుకోసం దానం చేయకూడదు. దానం చేయడం తన కర్తవ్యం అని చేయాలి. తాను దానం చేయడం వలన ఇతరులను ఉద్ధరించాను అని అనుకోకూడదు. దానం చేయడం వలన తనను తాను ఉద్ధరించుకుంటున్నాను అని అనుకోవాలి. అదే సాత్వికదానము.

"అనుపకారిణే" అంటే ఇతరులు తనకు ప్రత్యుపకారం చేస్తారు అనే బుద్ధితో దానం చేయకూడదు. పేదవారికి, శక్తిలేని వారికి, వికలాంగులకు, దరిద్రులకు దానం చేయాలి. ఎందుకంటే వారు దానం స్వీకరిస్తారు కానీ, వారికి ప్రత్యుపకారం చేసే శక్తి ఉండదు.

దానం ఎక్కడ చేయాలి అంటే పుణ్యక్షేత్రములలో దానం చేయడం ఉత్తమం. కాలే అంటే పుణ్యకాలముల యందు అంటే గ్రహణ సమయంలో, శ్రాద్ధ సమయంలో, సంక్రాంతి లేక మహాలయము మొదలగు పితృ దేవతలను అర్చించే సమయంలో దానం చేయడం ఉత్తమం. పాత్రే అంటే మనం దానం ఎవరికి ఇస్తామో వారు ఆ దానం తీసుకోడానికి అర్హులు అయి ఉండాలి. తాము చేసిన దానమును దుర్వినియోగం చేసేవారికి దానం చేయకూడదు. ఈ ప్రకారం చేసిన దానములు సాత్విక దానములు అని అంటారు.

## 21. యత్తు ప్రత్యుపకారార్థం ఫలముద్దిశ్య వా పునః।
## దీయతే చ పరిక్లిష్టం తద్దానం రాజసం స్మృతం॥

తాను చేసిన దానానికి ప్రత్యుపకారం కోరి చేసే దానము, లేక తాను చేసే దానానికి తగిన ప్రతిఫలం కోరి చేసే దానము, ఈ దానం చెయ్యాల్సివచ్చిందే అనుకుంటూ మనసును బాధపెట్టుకుంటూ చేసేదానము, రాజసదానము అని అంటారు.

ఇప్పుడు రాజస దానం గురించి చెబుతున్నాడు. ఈ రాజస దానమునకు మూడు లక్షణాలు ఉన్నాయి. మొదటిది ప్రత్యుపకారం ఆశించి దానం చేయడం. అంటే ఈ రోజుల్లో మనం వాడే క్విడ్ ప్రోకో. నేను నీకు ఇది ఇస్తే నువ్వు నాకు ఏది ఇస్తావు. అంటే ఇతరుల నుండి ప్రత్యుపకారం ఆశించి దానం చేయడం రాజస దానము. ఏదో ఒక ఫలము ఆశించి దానం చేయడం. అంటే దానం చేస్తే పుణ్యం వస్తుంది. స్వర్గలోక సుఖాలు అనుభవించవచ్చు. మోక్షం వస్తుంది. మరుజన్మలో కూడా ధనవంతుడిగా పుడతాను ఇటువంటి ఫలములను ఆశించి దానం చేయడం. ఇది కూడా రాజస దానం అనిపించుకుంటుంది. మూడవది తనకు ఇష్టం లేకుండా బలవంతాన చేయాల్సివచ్చిందే అని దానం చేయడం. తనకు ఇష్టం అయిన ధనం పోతుందే అని బాధతో, తనకు ఇష్టం వచ్చిన వస్తువును దానం చేస్తున్నాను అనే బాధతో, అయ్యో ఇంత ఖరీదైన బట్టలు వస్తువులు దానం ఇస్తున్నాను అనే చింతతో దానం చేయడం కూడా రాజసదానమే. పుణ్యం కావాలంటే దానం చేయండి అని పురోహితులు చెబుతారు. వారి బలవంతం మీద తనకు ఇష్టంలేక పోయినా అయిష్టంగా దానం చేయడం. ఇవన్నీ రాజస దానాలు.

## 22. అదేశకాలే యద్దాన మపాత్రేభ్యశ్చ దీయతే।
## అసత్కృతమవజ్ఞాతం తత్తామస ముదాహృతమ్॥

దానం చేసే ప్రదేశముతోకానీ, దానం చేసే కాలముతో కానీ నిమిత్తం లేకుండా, ఎక్కడబడితే అక్కడ, ఎప్పుడు బడితే అప్పుడు, ఎవరు కనపడితే వారికి, ఏ పనికి అడిగితే ఆ పనికి, ఏవస్తువంటే ఆ వస్తువు, మర్యాదలేకుండా, తిడుతూ, దూషిస్తూ, చేసే దానమును తామసిక దానము అని అంటారు.

ఇంక తామస దానాలు అంటే దేశ కాల పాత్రతను మరిచి దానం చేయడం. ఎక్కడపడితే అక్కడ దానాలు చేయడం, దానం స్వీకరించడానికి అర్హతలేనివారికి, దానం చేయడం. మద్యం తాగే వారికి బార్‌లో మద్యం దానం చేయడం, మద్యం బిల్లు కట్టడానికి ధనసాయం చేయడం, క్లబ్బులో పేకాట ఆడే వాడికి ధనసాయం చేయడం, దానం చేసే టప్పుడు చీత్కార భావంతో చేయడం. "ఊ ...తీసుకోండి... వెళ్లండి.... తరువాత వాళ్లు రండి..." అంటూ వాళ్ల చేతుల్లో విసిరి వేస్తూ దానం చేయడం. అంటే మనసులో ఇష్టం లేకపోయినా బలవంతాన దానం చేయడం. ధనాన్ని దానం తీసుకొనే వారి మొహాన విసిరి కొట్టడం. "దరిద్రుడికి దానంగా ఇచ్చాను అని అనుకొంటాను" అని విసుగ్గా పలకడం. "అయ్యోనా ధనం అంతా వృధాగా పోతోందే " అని అనుకుంటూ బాధపడుతూ దానం చేయడం. ఏ మాత్రం మర్యాద లేకుండా దానం చేయడం. ఒక గుంపు మీదికి నాణేలు, నోట్లు విసిరి వేయడం, వారు ఆ ధనం కొరకు ఎగబడి, తొక్కిసలాడుతుంటే చూచి నవ్వుకోవడం, ఇవన్నీ తామస దానాలు అని అంటారు. వీటి వలన ఎటువంటి ఫలము,

పుణ్యం రాకపోగా పాపం చుట్టుకుంటుంది.

అసలే దాన గుణం లేని లోభుల సంగతి పక్కనబెడితే, సాత్విక, రాజసిక, తామసిక గుణములు కలిగిన వారిలో దానం గుణం ఉంది. కాని వారి వారి గుణములకు అనుసరించి దానాలు చేస్తుంటారు. ఈగుణములు కలిగిన వారు, తామసిక దానం నుండి రాజసిక దానానికి, రాజసిక దానం నుండి సాత్త్వక దానానికి ఎదగాలి. అప్పుడు జీవితంలో ఉన్నతి లభిస్తుంది.

ఒకే ముక్కలో చెప్పాలంటే మన వద్ద దానం తీసుకునే వాడు సాక్షాత్తు విష్ణుస్వరూపుడు అనే భావనతో దానం చేయాలి. అందుకే పరమాత్మ వామనుడిగా అవతరించి దానం స్వీకరించాడు.

## 23. ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణస్త్రివిధ: స్మృత:।
## బ్రాహ్మణాస్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితా: పురా॥

బ్రహ్మను ఓం అనీ, తత్ అనీ, సత్ అనీ మూడు విధములుగా నిర్ణయిస్తారు. ఈ మూడు పేర్లతోనే పూర్వము బ్రాహ్మణులను, వేదములను, అందులో చెప్పబడిన యజ్ఞవిధులను నామరూపములతో నిర్వచించారు.

ఇక్కడ మరొక విషయం ప్రతిపాదిస్తున్నాడు పరమాత్మ. ఓం కారమును ప్రణవం అని అంటారు. సృష్టిలో మొట్టమొదటి శబ్దం ఓంకారము. ఓం కారమునే బ్రహ్మ అని అంటారు. "ఓం ఇతి ఏకాక్షరం బ్రహ్మ" అని సంధ్యావందనంలో చెప్పకుంటాము. ప్రతి పదమునకు ముందు ఓం అని చేరుస్తారు. అష్టోత్తరములో కానీ, సహస్రనామములలో గానీ, ఓం ముందు ఉంటుంది. ఈ ఓం కారము వలననే వేదములు, సమస్త వాఙ్మయము ఏర్పడింది. యజ్ఞములలో ఓంకారము అత్యంత ప్రాధాన్యమయింది. పరబ్రహ్మ స్వరూపమునకు పేరు లేదు, రూపము లేదు. కాని పరబ్రహ్మను ధ్యానించాలంటే ఏదో ఒక శబ్దము కానీ, రూపము కానీ ఉండాలి కదా. అందుకే ప్రణవం పుట్టింది. అదే ఓంకారము. అకార, ఉకార, మకారాలు కలిస్తే ఓంకారము. తరువాతవి తత్ సత్ ఈ మూడు మంత్రముల ద్వారా పరబ్రహ్మను ధ్యానించేవారు పూర్వపు ఋషులు. ఓం తత్ సత్ అనేవి పరబ్రహ్మకు ప్రతీకలు.
"తస్యవాచక: ప్రణవ:" ఆ పరమాత్మయొక్క నామమే ఓంకారము
"తజ్జపస్తదర్థభావనమ్" ఓంకారమును జపిస్తూ దాని అర్థమును మనసులో భావించాలి.
(పతంజలి)"

ఓం అంటే మనలను పోషించేది, రక్షించేది అని కూడా అర్థం. అదే పరబ్రహ్మ స్వరూపము. తత్ అంటే "అది" అన్నిటి కన్నా దూరంగా, వేరుగా, అగోచరమైనది, రూపములేనిది.

అందుకని దానిని తెలుసుకోవడానికి మనం శబ్దమునే ప్రమాణంగా స్వీకరిస్తాము. ఆ శబ్దమే ఓం. తత్ అంటే ఆ ఓం కారము సత్ అంటే ఉన్నది. అదే సత్యమైనది. నిత్యమైనది. నాశము లేనిది. మార్పులేనిది. ఈ ఓం తత్ సత్ అనే ప్రణవ మంత్రమును మొట్ట మొదట బ్రహ్మగారు ఆవిష్కరించారు. ఆ ప్రణవమును ఉపాసిస్తూ పర బ్రహ్మను గురించి తెలుసుకున్న వారిని బ్రాహ్మణులు అంటారు. అంతేకానీ పుట్టుకతో ఎవరూ బ్రాహ్మణులు కారు. అటువంటి బ్రాహ్మణులు, అధ్యయనం చేయడానికి వేదములు, ఆ వేదములలో చెప్పబడిన ప్రకారము చేయవలసిన క్రియలు అంటే యజ్ఞములు, ఆవిష్కరింపబడ్డాయి. కేవలము దేవతలకు సంబంధించిన స్తోత్రములు, యజ్ఞయాగములు మొదలగు కర్మకాండలు వీటి గురించి చెప్పబడిన వేదభాగమును వేదపూర్వము అనీ, పరమాత్మ గురించి ఆత్మతత్త్వమును గురించి చెప్పబడిన వేదభాగమును వేదాంతము అంటే ఉపనిషత్తులు అనీ చెప్పబడ్డాయి.

మనం ఎన్నో పుణ్యకర్మలు, యజ్ఞయాగములు వ్రతములు చేస్తుంటాము. వాటిలో మనకు తెలియకుండా ఎన్నో లోపాలు తప్పులు జరుగుతుంటాయి. ఉచ్ఛారణ దోషాలు ఉంటాయి. అవన్నీ కూడా ఈ ఓం తత్సత్ అనే మంత్రంతో పటాపంచలయిపోతాయి. ఏ దోషమూ అంటదు. అందుకే ఏ కార్యక్రమం అయినా ఓం తత్సత్ అనే మంత్రంతో పూర్తి చేస్తాము. కాని ఈ మంత్రమును కేవలం యాంత్రికంగా కాకుండా అర్థం తెలుసుకొని అంటే పరమాత్మను మనసులో భావిస్తూ ఆ మంత్రము పరమాత్మ, పరబ్రహ్మ స్వరూపమే అని భావిస్తే, ఆ మంత్రము ఎక్కువ శక్తిమంతంగా పనిచేస్తుంది.

వేద మంత్రములు ఉచ్ఛరించేటప్పుడు, యజ్ఞయాగములు చేసేటప్పుడు ప్రతి మంత్రం ముందు ఓం కారము జపిస్తారు. అందువలన ఈ బీజాక్షరములను ఓంకారము అంటే ఏకాక్షర మంత్రంగా ఋషులు మనకు అందజేసారు. ఏ మంత్రము జపించలేని వారు ఓంకారమును జపిస్తే చాలు. ఓమ్ అంటే పరబ్రహ్మ స్వరూపము. తత్ అంటే ఆ పరబ్రహ్మ స్వరూపమే, సత్ సత్యమైనది, నిత్యమైనది. నాశము, మార్పులేనిది. పరబ్రహ్మము తప్ప మిగిలినది అంతా నాశనం అయ్యేదే మార్పుచెందేదే. ఈ ఓంతత్సత్ అనే పదం నుండి బ్రహ్మ సత్యం జగన్మిధ్య అనే సూక్తి ఆవిర్భవించింది. కాబట్టి మానవులందరూ ఓంతత్సత్ అనే మంత్రమును జపిస్తూ, దాని అర్థం తెలుసుకొని, పరమాత్మ ఒక్కడే సత్యము మిగిలినది అంతా అసత్యము, మిథ్య, ఈ రోజు ఉండి రేపు ఉండకుండా పోయేదే అనే సత్యమును గ్రహిస్తూ ఈ ప్రాపంచిక విషయముల మీద ఆసక్తిని, అనుబంధాన్ని తగ్గించుకోవాలి.

## 24. తస్మాదోమిత్యుదాహృత్య యజ్ఞదానతపఃక్రియాః।
## ప్రవర్తన్తే విధానోక్తా స్సతతం బ్రహ్మవాదినామ్॥

ఆ కారణం చేత వేదముల గురించి బాగా తెలుసుకున్న వారు, శాస్త్రములలో చెప్పబడిన యజ్ఞములు, దానములు, తపస్సులు మొదలగు క్రియలను ప్రారంభించేటప్పుడు, ఓం అనే అక్షరంతోనే మొదలుపెడతారు.

పైశ్లోకంలో చెప్పిన కారణాల వలన వేదముల యందు విశ్వాసము కలవారు, వేదములను బాగా తెలిసిన వారు అధ్యయనం చేసినవారు, వేదముల యొక్క నిజమైన అర్థము ఎరిగిన వారు, శాస్త్రములను, పురాణములను బాగా చదివి అర్థం చేసుకున్నవారు, యజ్ఞములు, దానములు, తపస్సు చేసేటప్పుడు మొట్ట మొదట ఈ ఓంకారమును ఉచ్ఛరిస్తుంటారు. పూర్తి అయిన తరువాత ఓం తత్సత్ అనే మంత్రంతో ముగిస్తారు. ఓంకారంతో మొదలు పెట్టి ఓం తత్సత్ తో ముగిస్తే ఆ క్రియ పరమ పవిత్రం అవుతుంది. ఫలవంతం అవుతుంది. ఎందుకంటే ఆ మంత్రమును అర్థం చేసుకుంటూ జపించడం వలన ఇది అంతా పరమాత్మ మయం, నాది ఏదీ లేదు అనే భావన ప్రతివాడిలోనూ కలుగుతుంది.

(సాధారణంగా, ఈరోజుల్లో అక్షరాభ్యాసం అంటే ఎబిసిడి అనే అక్షరాలతో మొదలుపెడుతున్నారు. కాని కొంత మంది ఓం నమః శివాయ సిధం నమః అనే అక్షరాలతో మొదలు పెడుతున్నారు. అంటే పసిపిల్లవాడికి ఓం అనే అక్షరాన్ని పసితనంలోనే పరిచయం చేస్తున్నారు. ప్రతి వ్యక్తి తన చదువును ఓం అనే అక్షరంతో మొదలుపెడుతున్నాడు. )

## 25. తదిత్యనభిసన్ధాయ ఫలం యజ్ఞతపః క్రియాః।
## దానక్రియాశ్చ వివిధాః క్రియన్తే మోక్షకాంక్షిభిః॥

ఈ తత్ అనే అక్షరమును పలుకుతూ మోక్షమును పొందాలనుకునే సాధకులు, యజ్ఞములను, తపస్సును, దానములను మొదలగు క్రియలను ఎటువంటి ప్రతిఫలాపేక్ష లేకుండా చేస్తున్నారు.

ఓం కారము తరువాత వచ్చే పదం తత్ అంటే అది, ఆ పరబ్రహ్మ తత్వము. ఈ పదం ఉచ్ఛరించి నందువలన మానవులు ఎల్లప్పుడూ ఆ పరమాత్మ, పరబ్రహ్మ ఉనికిని జ్ఞాపకం

చేసుకుంటూఉంటారు. పరమాత్మ ఉన్నాడు. ఆ పరమాత్మయే అందరిలోనూ ఆత్మతత్వంగా వెలుగుతున్నాడు. ఆ చైతన్యమే ఈ లోకములను నడిపిస్తూ ఉంది అనే సత్యాన్ని తెలుసుకుంటాడు. మనది అంటూ ఏదీ లేదు. అంతా ఆ పరమాత్మయే, పరమాత్మ స్వరూపమే అనే సత్యాన్ని తెలుసుకుంటాడు. అటువంటి వాడిని ముముక్షువు అంటారు. ఆ ముముక్షువులు ఏ యజ్ఞం చేసినా, యాగం చేసినా క్రతువు, వ్రతం చేసినా, దాన ధర్మాలు చేసినా, అవి తాను చేస్తున్నాను అని అహంకరించక, దాని ఫలము కొరకు పాకులాడకుండా, ఆ ఫలాలను పరమాత్మకు అర్పిస్తారు. అంతా భగవదార్పణం చేస్తారు. అప్పుడు వారికి ఎటువంటి బంధనములు అంటవు. దీనికంతా మూలం తత్ అంటే ఆ పరబ్రహ్మ స్వరూపమును నిరంతరం మనసులో ధ్యానించడమే. కాబట్టి గీతలో పరమాత్మ కర్మలను వదలమని చెప్పలేదు. అన్నిరకములైన కర్మలను చేస్తూ, కర్తృత్వ భావన లేకుండా చేయాలి. ఏ ఫలితము కోరకుండా చేయాలి. ఆకర్మ ఫలితములను భగవంతునికి అర్పించాలి. ఇదే మోక్షమునకు మార్గము.

## 26. సద్భావే సాధుభావే చ సదిత్యేతత్ప్రయుజ్యతే।
## ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ యుజ్యతే॥

ఓ పార్థా! ఈ సత్ అనే పదము "ఉన్నది" అనే అర్థంలో సద్భావంలో, సాధుభావంలో వాడబడుతూ ఉంది. అదేమాదిరి, ప్రశస్తమైన కర్మలు అంటే సాత్విక కర్మలు, మంచి కర్మలు చేయడంలో ఈ సత్ అనే శబ్దము ప్రయోగింపబడుతూ ఉంది.

కిందటి శ్లోకాలలో ఓం అనే అక్షరం బ్రహ్మను సూచిస్తుంది. తత్ అనే పదం "ఆ బ్రహ్మ" అనే అర్థంలో వాడబడింది. ఆఖరు పదం "సత్" అంటే అది సత్యము. నిత్యము, అవ్యయము. ఈ సత్ అనే పదము పరమాత్మ, విశ్వచైతన్యము, పరబ్రహ్మ అనే వాడు ఒకడు ఉన్నాడు అని మనకు రూఢిగా తెలియజేస్తూ ఉంది. ఈ సత్ అనే పదము మంచి భావనకు, సాధు భావనకు ప్రతీక. మంచి, సాధు అనే పదాలకు పర్యాయపదముగా వాడబడుతూ ఉంది. ఉదాహరణకు సత్ ఆచారము సదాచారము, సత్ ప్రవర్తన సత్ప్రవర్తన, సత్ సాంగత్యము, సత్ సంగము, సత్ గుణము, సత్ పురుషుడు. ఈ ప్రకారంగా ఈ 'సత్' అనే శబ్దము, "మంచిది" అనే పదానికి, "సాధు" అనే పదానికి పర్యాయపదంగా వాడబడుతూ ఉంది. అలాగే మంచి కర్మలకు కూడా సత్ కర్మ, సత్ గోష్టి అని వాడుతూ ఉంటారు.

## 27. యజ్ఞే తపసి దానే చ స్థితిస్సదితి చోచ్యతే।
## కర్మచైవ తదర్థీయం సదిత్యేవాభిధీయతే॥

ఈ సత్‌అనే పదము యజ్ఞములలోనూ, తపస్సునందు, దానముల యందు, కూడా వాడబడుతూ ఉంది. భగవంతుని ప్రీతి కొరకు చేసే అన్ని కర్మలు సత్కర్మలు అని ఈ సత్ అనే పదం ముందు చేర్చి పిలువబడుతున్నాయి.

యజ్ఞములు, తపస్సు, దానములు, ఇంకా భగవంతుని కొరకు చేసే ఏ కార్యమైనా ఒక నిష్ఠతో, శ్రద్ధతో,నిశ్చలమైన మనస్సుతో చేయాలి. ఆ నిష్ఠనే సత్ అని కూడా అంటారు. అందుకే వాటిని సత్కర్మలు అని అంటారు. ఎటువంటి నిష్ఠ లేకుండా, యాదాలాపంగా, శ్రద్ధాభక్తులు లేకుండా, ఏదోఒక ఫలితాన్ని కోరి చేసే యజ్ఞము, తపస్సు, దానము, పూజ కేవలం సాధారణ కర్మలు గానే మిగిలిపోతాయి కానీ సత్ కర్మలు కావు. ఆ కర్మలలో దైవత్వము ఉండదు. ఏదో చేయాలని చేయడం అవుతుంది.

సత్ అంటే నిత్యము సత్యము అవ్యయము అనే పరబ్రహ్మ స్వరూపము అని తెలుసుకున్నాము కదా. దీనికి ఆకారము లేదు అని తెలుసుకున్నాము కదా. మరి ఈ పరబ్రహ్మ స్వరూపము ఏ విధంగా ప్రకటితమౌతుంది అంటే యజ్ఞములలోనూ, యాగములలోనూ, తపస్సులోనూ, దానములలోనూ ఇంక పరమాత్మను ఉద్దేశించి చేసే అన్ని కర్మలలోనూ సత్ రూపంలో ప్రకటితమౌతుంది. మరి ఈ కర్మలు అన్నీ ఎలా చేయాలి అనే విషయం ఈ అధ్యాయం లోనే చెప్పాడు పరమాత్మ. యజ్ఞములు, తపస్సు, శ్రద్ధ, దానములు ఎన్ని రకాలో అవి ఎలా చేయాలో, ఎలా చేయకూడదో ఈ అధ్యాయంలో వివరించాడు. పరమాత్మను ఉద్దేశించి చేసే కర్మలు అన్నీ సాత్వికంగా, వేదవిహితంగా ఉంటేనే, చిత్త శుద్ధితోనూ, నిష్కామంగానూ, ఫలాపేక్షరహితంగానూ, చేస్తేనే, అవి మోక్షమార్గాన్ని చూపుతాయి..

ఏకర్మ చేసినా భగవంతుని మీద భక్తి, శ్రద్ధ, ముఖ్యము. అన్ని కర్మలు భగవంతుని పరంగానే చేయాలి. అహంకారము, కర్తృత్వభావన ఉండకూడదు. అన్ని కర్మల ఫలములను భగవదార్పణం చేయాలి. అప్పుడు ఆ కర్మలన్నీ సత్కర్మలు అవుతాయి. దైవత్వము సంతరించుకుంటాయి. లేకపోతే అవి అన్నీ స్వార్థంతో యాంత్రికంగా చేసే కర్మలుగానే మిగిలిపోతాయి. బంధనములకు కారణం అవుతాయి. కాబట్టి ఆ పరబ్రహ్మ కొరకు చేసే అన్ని కర్మలు, ఆ కర్మల చేయడానికి ఉ పకరించే అన్ని రకములైన కర్మలు అన్ని సత్ కర్మలు అని పిలువబడతాయి.

28. అశ్రద్ధయా హుతం దత్తం తపస్తప్తం కృతం చ యత్।
అసదిత్యుచ్యతే పార్థ న చ తత్ప్రేత్య నో ఇహ॥

ఓ పార్థా! అశ్రద్ధతో చేయబడే హోమము కానీ, దానము కానీ, తపస్సు కానీ, ఇతర కర్మలు కానీ, సత్ పరిధిలోకి రావు. అవన్నీ అసత్తులు అని చెప్పబడతాయి. అటువంటి కర్మలు ఈ లోకములో కానీ, పరలోకములోకానీ ఎటువంటి ఫలితములను, సుఖములను ఇవ్వలేవు.

ఇప్పటిదాకా చెప్పింది మరిచిపోతామేమో అని మరొకసారి గుర్తుచేస్తున్నాడు పరమాత్మ. ఎటువంటి శ్రద్ధ లేకుండా, భక్తి లేకుండా, పరమాత్మ భావన లేకుండా, కేవలం స్వలాభాపేక్షతో, యాంత్రికంగా చేసే యజ్ఞములు కానీ, యాగములు కానీ, దానములు కానీ, వ్రతాలు, పూజలు కానీ, అవన్నీ అసత్ అంటే అసత్యములు అనిపించుకుంటాయి. అటువంటి కర్మలు చేసీ చేయనట్టే. ఆ కర్మలు ఎందుకూ పనికిరాకపోగా బంధనములు కలుగచేస్తాయి. ఇటువంటి కర్మలు ఈ లోకంలో కానీ, పరలోకంలో గానీ ఎటువంటి మంచిఫలితములను ఇవ్వవు. ఇటువంటి కర్మలు చేసీ ఒకటే, చెయ్యకా ఒకటే. కాబట్టి ఏ పని చేసినా సాత్వికమైన శ్రద్ధ, భక్తి ముఖ్యము అనీ మరొక సారి ఘంటాపథంగా చెప్పాడు పరమాత్మ. శ్రద్ధ, భక్తి లేకుండా చేసే పనులు, కేవలం యాంత్రికంగా ఇతరుల మెప్పు కొరకు, పేరుప్రతిష్ఠల కొరకు చేసే పనులు, అసత్తులు కాబట్టి ఎందుకూ పనికి రావు,అవి ఇహలోక సుఖాలను కానీ, పరలోక సుఖాలను కానీ ఇవ్వవు. అటువంటి కర్మలు చేయడం వృథా అంటూ ఈ అధ్యాయమును ముగించాడు కృష్ణ పరమాత్మ.

ఉపనిషత్తులయొక్క, బ్రహ్మవిద్యయొక్క,
యోగశాస్త్రము యొక్క సారమయిన భగవద్గీతలో, పదునేడవ అధ్యాయము
శ్రద్ధాత్రయ విభాగ యోగము సంపూర్ణము.
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.

# భగవద్గీత

## పదునెనిమిదవ అధ్యాయము

# మోక్ష సన్యాస యోగము

ఇది గీతలో ఆఖరు అధ్యాయము ఈ అధ్యాయములో పరమాత్మ మోక్షము, సన్యాసము వీటి గురించి వివరిస్తున్నాడు. అందుకే దీనిని మోక్ష, సన్యాస, యోగము అని పేరు. దీనికి ఒక విధంగా అర్థం చెప్పుకోవచ్చు. మోక్షము కావాలి అని అనుకోవడం కూడా ఒక కోరిక. సాత్వికమైన కోరిక. ఆ కోరిక కూడా వదిలిపెట్టాలి. పూర్తిగా నిర్గుణత్వము పొందాలి. పరమాత్మ నిర్గుణులు కాబట్టి, నిర్గుణత్వము పొందిన వారే పరమాత్మను చేరుకోగలరు.

భగవద్గీత మొదటి అధ్యాయములో ఈ గీత, ఎవరు, ఎవరికి, ఏ సందర్భములో, ఏ కారణంచేత, ఏ ప్రకారంగా, చెప్పవలసివచ్చింది అనే విషయం తెలియజేసారు. రెండవ అధ్యాయంలో ఈ గీతలో ఏయే విషయములు చెప్పబడ్డాయి అనే విషయ సూచిక ఇవ్వబడింది. మూడు నుండి 15 వ అధ్యాయము వరకు గీత చెప్పబడింది. 16,17 అధ్యాయాలలో గీతలో చెప్పబడిన కొన్ని పదాలకు వివరణ అనుబంధాలుగా ఇవ్వబడ్డాయి. 18 అధ్యాయములో గీతలో చెప్పబడిన విషయాలన్నీ సంగ్రహంగా (సమ్మరీగా) ఇవ్వబడ్డాయి. గీతయొక్క సారం అంతా ఈ 18వ అధ్యాయంలో చెప్పబడింది.

అంతే కాకుండా, ఈ భగవద్గీతలో వ్యాసుల వారు కర్మ, భక్తి, జ్ఞానయోగముల గురించి, జీవుడు, పరమాత్మ, జీవుడు పరమాత్మలో ఎలా ఐక్యం అవుతాడు అనే వాటి గురించి, మానవ ప్రయత్నము, పరమాత్మ అనుగ్రహము, ఆ అనుగ్రహం కావాలంటే మనం చేయాల్సిన క్రియలు, మొదలగు వాటిగురించి తెలియజేసారు. తరువాత ఓం తత్సత్ అనే మహా వాక్యం గురించి వివరించారు. మానవ ప్రయత్నం, దైవానుగ్రహము, ఈ రెండు కావాలంటే మానవ విలువలు పాటించడం వీటి గురించి కూడా తెలియజేసారు. ఈ ఆఖరు అధ్యాయంలో పైన చెప్పబడిన వాటి గురించి మరలా ఒక సారి సంగ్రహంగా తెలియజేసారు. ఈ అధ్యాయం అర్జునుడు కృష్ణుడికి వేసే ప్రశ్నతో ఆరంభం అవుతుంది.

అర్జున ఉవాచ:

1. సన్న్యాసస్య మహాబాహో తత్త్వమిచ్ఛామి వేదితుమ్।
త్యాగస్య చ హృషీకేశ! పృథక్కేశి నిషూదన॥

ఇక్కడ అర్జునుడు "ఓ హృషీకేశా!" అని సంబోధించి ఇలా అడుగుతున్నాడు. హృషీకములు అంటే ఇంద్రియములకు అధిపతి అయినవాడా! "కేశి నిషూదన!" కేశి అనే రాక్షసుని చంపిన వాడా! కృష్ణా! నువ్వు సన్న్యాసము, త్యాగము అనే రెండు మాటలు చెప్పావు కదా. అవేమిటి? వాటి అర్థం ఏమిటి? వాడి తత్వములు ఏమిటి?వాటిని ఎవరు, ఎప్పుడు, ఎలా ఆచరించాలి? ఈ విషయాలుకూడా చెప్పు అని అడిగాడు అర్జునుడు.

ఈ రెండు విషయాలు కృష్ణుడు అర్జునుడికి ఇదివరకేచెప్పి ఉన్నాడు. ఈ రెండు విషయాలే కాకుండా ఇంకా ఎన్నోవిషయాలు చెప్పాడు. కాని అర్జునుడు ఈ రెండు మాటల అర్థాల గురించి మాత్రమే అడిగాడు. అంటే అర్జునుడికి మొదటి నుండి యుద్ధం మానేయాలని కోరిక బలంగా ఉంది. యుద్ధం మానేసి వెనక్కుతిరిగి పోవాలి. అంటే తన క్షత్రియ ధర్మాన్ని త్యాగం చేయాలి. వదిలిపెట్టాలి. ఇదే అర్జునుడి మనసులో గాఢంగా పాతుకుపోయిన విషయం. అందుకని ఈ రెండు విషయాల గురించిమాత్రమే మరలా అర్జునుడు అడిగాడు. అర్జునుడి ఆంతర్యం గ్రహించిన కృష్ణుడు, ఈరెండు విషయాలే కాకుండా, తాను చెప్పిన ఆధ్యాత్మిక విషయాలు అన్నీ ఈ అధ్యాయంలో ఒక సారి పునశ్చరణ చేసాడు. అంటే మరలా గీతను అంతా సంగ్రహంగా చెప్పాడు.

(ఈ రోజుల్లో కూడా సంసార బాధలు, కుటుంబ బాధలు తట్టుకోలేక, బంధాలు, అనుబంధాలు తెంచుకొని ఇల్లు వదిలి పారిపోయిన వాళ్లు ఉన్నారు. అప్పుల బాధలు పడలేక ఆత్మహత్యలు చేసుకుంటున్న వాళ్ల గురించి వింటున్నాము. లేకపోతే ఐపి పెట్టి కనపడకుండాపోవడం చేస్తున్నారు. అంటే కష్టాలను ఎదుర్కోడం మానేసి, పిరికిపందల్లా తమ కష్టాల నుండి సుదూర

తీరాలకు పారిపోతున్నారు. ప్రస్తుతం అర్జునుని విషాదం నేటి సంసారబాధలకు ప్రతీక. అందుకే అర్జునుడు ఈ విషాదము నుండి పారిపోవాలని మనసులో గాఢంగా నమ్ముకున్నాడు. కాబట్టి కృష్ణుని ఈ రెండు విషయాలు మాత్రమే అడిగాడు.)

ఈ శ్లోకంలో వ్యాసుల వారు మూడు సంబోధనలు వాడారు. మహాబాహో!అంటే గొప్పవైన భుజములు కలవాడా! 2.హృషీకేశ!ఇంద్రియములకు అధిపతిఅయిన వాడా! 3. కేశి నిషూదన! కేశి అనే రాక్షసుని చంపిన వాడా! అర్జునుడు అడిగిన ప్రశ్నలకు అర్థం ఈ మూడు సంబోధనలలోనే ఇమిడ్చాడు వ్యాసులవారు.

మహాబాహో! అంటే కేవలం బాహుబలం, పరాక్రమము ఉంటే ప్రయోజనం లేదు. మనోబలం కూడా ఉండాలి. ఆ మనోబలంతో ఇంద్రియములను అదుపులో పెట్టుకోవాలి. అప్పుడు ఏ విషాదము ఉండదు. సన్యాసముతో పని లేదు. ఏ త్యాగము చేయనవసరం లేదు. నీవు నీ లోపల ఉన్న ఇంద్రియములు అనే శత్రువులను జయించకుండా విషాదం పొందితే ప్రయోజనం లేదు. అన్నిటి కన్నా ముందు నీలో ఉన్న అహంకారము, అవివేకము అనే రాక్షసుని జయించు. అప్పుడు నీ కర్తవ్యమునీకు బోధపడుతుంది. అందరినీ నీవే చంపుతానని అహంకరించకు. వీళ్లంతా వారి వారి పూర్వజన్మలలో చేసుకున్న కర్మలను బట్టి ఇప్పుడు కాకపోయినా ఎప్పుడో ఒకప్పుడు మరణించడం తప్పదు. అందరూ నీ చేత చంపబడతారు అనే అజ్ఞానం వదిలిపెట్టు. నీవు కేవలం నిమిత్తమాత్రుడవు. అనే విషయాలను ఈ సంబోధనల ద్వారా సూచించారు వ్యాసులవారు.

శ్రీభగవానువాచ:

2. కామ్యానాం కర్మణా న్యాసం సన్న్యాసం కవయో విదుః।
సర్వకర్మఫలత్యాగం ప్రాహుస్త్యాగం విచక్షణాః॥

కామ్యకర్మలను వదిలిపెట్టడమే సన్యాసము అని కొందరు పండితులు అంటారు. మరి కొందరు పండితులు తాముచేసిన అన్ని కర్మల యొక్క ఫలములను త్యాగము చేయడం త్యాగము అని అంటారు.

మానవులు ఏదో ఒక ఫలమును ఆశించి కర్మలు చేస్తుంటారు. ఏ పూజచేసినా, వ్రతం చేసినా సంకల్పంలో ఇష్టకామ్యార్థ సిధ్యర్థం అని మనం చెబుతుంటాము. కాబట్టి, మానవుడు ఎల్లప్పుడు ఏదో ఒక కోరిక కోరుకుంటారు. ఆ కోరిక తీరడానికి పరమాత్మను ఉపాసిస్తాడు. అనేక కర్మలు చేస్తాడు. ఆ కోరికలతో కూడిన కర్మలను అన్నిటినీ వదిలిపెట్టడం సన్యాసము అని కొంతమంది అంటారు.

మానవులు  ఏ కర్మ చేసినా ఏదో ఒక ఫలమును కోరి చేస్తుంటారు అని చెప్పుకున్నాము కదా! కామ్య కర్మలు చేస్తూ, ఆ కర్మలయొక్క ఫలములను త్యాగం చేయడం కూడా త్యాగము అని కొంతమంది పండితులు చెబుతారు.  మరి కొందరు ఇలా చెబుతారు.  మానవుడు ఫలము కోరి చేసినా, కోరకుండా చేసినా, ప్రతి కర్మకు ఏదో ఒక ఫలితం వస్తుంది. అది మంచి ఫలితం కావచ్చు చెడ్డ ఫలితం కావచ్చు. కాబట్టి మానవుడు తాను చేసే అన్ని కర్మల ఫలములను వదిలిపెట్టడాన్ని త్యాగము అని మరి కొంత మంది అంటారు. కాబట్టి సన్యాసము అంటే అడవులకు పోవడం కాదు. తాను ఏద్దైనా కోరికతో కర్మ చేయాలనుకుంటే ఆ కోరికలతో కూడిన కర్మలను వదిలిపెట్టడం సన్యాసము అని కొంతమంది వాదిస్తే,  తాను ఏ కర్మచేసినా ఆకర్మఫలమును వదిలిపెట్టడం త్యాగమనీ  మరి కొంత మంది వాదన.

కర్మల గురించి ఇదివరలో చెప్పబడినప్పటికీ ఇక్కడమరొక సారి జ్ఞాపకం చేసుకుందాము. కర్మలు ఐదు రకాలు.

1. విహిత కర్మలు అంటే వేదములలో శాస్త్రములలో చెప్పబడిన కర్మలు. అవి మనకు ఇష్టం ఉన్నా లేకపోయినా తప్పకుండా చేయాలి.

2. నిషిద్ధ కర్మలు. వేదములు, శాస్త్రములు నిషేధించిన కర్మలు. అవి మనకు ఇష్టం ఉన్నా చేయకూడదు.

3. కామ్య కర్మలు. ఏదో ఒక కోరిక కోరుకొని, ఆ కోరిక తీరడం కోసం, ఏదో ఒక ఫలాన్ని ఆశించి కర్మలు చేయడం.

4.ప్రాయశ్చిత కర్మలు అంటే తెలియకుండా చేసిన పాపాలకు, దోషాలకు ప్రాయశ్చిత్తం చేసుకునే కర్మలు.

5.నిత్య, నైమిత్తి క కర్మలు. అంటే నిత్యం చేయవలసిన సంధ్యావందనం, అగ్నిహోత్రము మొదలైనవి. ఏదో ఒక నిమిత్తం గురించి అంటే ఉపనయనం, వివాహం, పర్వదినాలలో చేయవలసినకర్మలు, పూజలు, వ్రతాలు.

ఈ ఐదు కర్మలగురించి పండితుల అభిప్రాయాలను  వివరించారు వ్యాసులవారు.

మొదటిది 1,5 అంటే చేయవలసిన కర్మలు, నిత్యనైమిత్తిక కర్మలు తప్ప మిగిలిన కర్మలు చేయకుండా ఉండటం సన్యాసము అని కొంత మంది పండితులు అంటారు. ఇంకా కొంత మంది పండితులు ఏమంటారంటే...పైన చెప్పిన 1,5 కర్మలమొక్క ఫలములను త్యాగం చేయడమే త్యాగము అని అంటారు అని వ్యాసుల వారు వివరించారు.

## 3. త్యాజ్యం దోషవదిత్యేకే కర్మ ప్రాహుర్మనీషిణః।
## యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్యమితి చాపరే॥

మరి కొందరు పండితులు ఏంటారంటే.....అసలు కర్మలు చేయడమే దోషము కాబట్టి అన్ని కర్మలను వదిలిపెట్టాలి అని అంటారు. కాని మరి కొంత మందిపండితులు, అలాకాదు. అన్ని కర్మలను వదలడం మంచిది కాదు. యజ్ఞము, దానము, తపస్సు మొదలగు కర్మలను వదిలిపెట్టకూడదు అని అంటారు.

వ్యాసుల వారు ఈ శ్లోకంలో మరి కొంత మంది పండితులు, బాగా తెలిసిన వారి యొక్క అభిప్రాయం కూడా వివరించారు. ఆయన ఏమంటారంటే, కోరికలతో చేసే కర్మలే కాదు, ఏ కర్మచేసినా దానికి పాపమో పుణ్యమో ఏదో ఒకటి వస్తుంది, అందుకని అది దోషభూయిష్టం కాబట్టి కర్మలను అన్నిటినీ వదిలిపెట్టడం మంచిది అని అంటారు. మరి కొంతమంది పండితుల వాదన ఏమిటంటే, అది ఎలా కుదురుతుంది, యజ్ఞము, యాగము, వ్రతములు, దానములు, తపస్సు మొదలగు దేవతలను ఆరాధించే కర్మలను ఎలా విడిచిపెడతాము, వాటిని వదిలిపెట్టకూడదు అని వాదిస్తారు.

కర్మలు మనం మనసుతో సంకల్పిస్తాము. ఇంద్రియములతో చేస్తాము. ఈ కర్మలను లోపల ఉన్న ఆత్మ సాక్షిగా చూస్తుంటుంది. ఈ కర్మల వలన వాసనలు అంటుకుంటాయి. కాబట్టి అసలు కర్మలే చేయకపోతే బంధనములు, వాసనలు ఉండవు కదా, మోక్షం వస్తుంది కదా అని కొందరు వాదిస్తుంటారు. మరి కొంత మంది రోజూ ఏదో ఒక కర్మ చేయాలి కదా లేకపోతే జీవితం గడవదు కదా! మంచి మార్గంలో నడవాలంటే దేవతారాధన, యజ్ఞయాగాలు చేయాలి కదా! అవీ కర్మలే కదా! కాబట్టి అసలు కర్మలు చేయకుండా ఉండటం సాధ్యంకాదు కదా అని మరి కొందరు వాదిస్తారు. అని వ్యాసుల వారు ఇరుపక్షాల వాదనలను మనకు చెప్పారు.

శ్రీకృష్ణుడు అర్జునుడితో ఆ కాలంలో కర్మల గురించి పండితులు, వేదాంతులు, చేసే వాదలన గురించి చెప్పి, తన నిశ్చయాన్ని గురించి కూడా చెబుతున్నాడు.

## 4. నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరతసత్తమ!
## త్యాగో హి పురుష వ్యాఘ్ర త్రివిధస్సమ్ప్రకీర్తితః॥

ఓ అర్జునా! విభిన్నవాదనలతో కూడిన కర్మత్యాగము, కర్మఫలత్యాగము వీటి గురించి నా నిశ్చయమును కూడా విను. ఈ త్యాగము అనేది మూడు విధములుగా చెప్పబడింది.

ఓ అర్జునా! కర్మల గురించి కర్మలను వదిలిపెట్టడం గురించి, నా నిశ్చయాన్ని విను. అని అన్నాడు. కాబట్టి మనం పరమాత్మ చెప్పి విషయాన్నే ఆచరించాలి. పండితులు, వేదాంతులు, బాగా చదువుకున్నవారు తమకు తోచింది చెబుతారు. వాటి కన్నా పరమాత్మ గీతలో చెప్పిందే మనకు ముఖ్యం. కృష్ణుడు ముందు త్యాగం గురించి చెబుతున్నాడు..

అర్జునుడు సన్యాసము, త్యాగము అనే రెండు విషయాలు అడిగాడు. కాని కృష్ణుడు త్యాగము అనే పదం గురించి మాత్రమే వివరణ ఇస్తున్నాడు. అంటే సన్యాసము, త్యాగము రెండూ ఒకటే. వేరు కాదు. సన్యాసమే త్యాగము, త్యాగమే సన్యాసము. ఈ రెండింటిలో ఉన్న భావము తనకు ఉన్న దానిని విడిచిపెట్టడమే. కాబట్టి ముందు త్యాగము గురించి వివరణ ఇస్తున్నాడు పరమాత్మ. అంటే సన్యాసము గురించి కూడా చెబుతున్నాడు అని మనం భావించాలి.

ఓ అర్జునా! ఈ త్యాగము మూడు విధములుగా చెప్పబడింది అని త్యాగములో ఉన్న విభాగాల గురించి తరువాతి శ్లోకాలలో వివరించాడు పరమాత్మ.

## 5. యజ్ఞదానతపఃకర్మ న త్యాజ్యం కార్యమేవ తత్।
## యజ్ఞోదానం తపశ్చైవ పావనాని మనీషిణామ్॥

వివేకవంతులు అయిన మానవులు యజ్ఞము, దానము, తపస్సు మొదలగు పుణ్యకార్యములు, దైవ కార్యములు ఎన్నటికీ విడిచిపెట్టకూడదు. ఎందుకంటే యజ్ఞము, దానము, తపస్సు మొదలైన దైవ కార్యములు వివేకవంతులైన మానవులను పునీతులుగా, పవిత్రులుగా చేస్తాయి.

మానవులకు యజ్ఞములు, యాగములు చేయడం, తపస్సుచేయడం, దానం చేయడం ముఖ్యమైన పనులు. చేయతగిన కర్మలు. వాటిని ఏ పరిస్థితులలోనూ విడిచిపెట్టకూడదు. అవి అన్నీ చేయతగ్గ కర్మలే. జ్ఞానులు కూడా వీటిని ఆచరించాలి. ఎందుకంటే యజ్ఞములు, తపస్సు, దానములు మనస్సుకు పవిత్రతను, శాంతిని, చిత్తశుద్ధిని చేకూరుస్తాయి. అలా కాకుండా ఏ పనిచేసినా దానికి ఫలితం వస్తుంది. ఫలితం వలన బంధనం కలుగుతుంది కాబట్టి ఏ పనీ చేయకూడదు అని చెప్పడం దారుణం. ఈ సిద్ధాంతం మనుషులను సోమరులుగా తయారు చేస్తుంది. కాబట్టి గృహస్థుకానీ, జ్ఞాని కానీ తనకు విధించిన కర్మలను చేయక తప్పదు. నాకు అంతా తెలుసు, నేను ఏమీ చేయకపోయినా దోషంలేదు అని ఏమీ చేయకుండా ఉండకూడదు.

కాకపోతే యజ్ఞ,దాన,తపస్సులు, నిష్కామంగా, ఎటువంటి ఫలితం ఆశించకుండా చేయాలి. వచ్చిన ఫలితమును పరమేశ్వరునకు అర్పించాలి. ఇలా చేయాలి కానీ, నేను పండితుడిని, తెలివికలవాడిని, జ్ఞానిని,నేను ఏ కర్మలు చేయకూడదు అని అనడం తప్పు అని పరమాత్మ అన్నాడు.

ఈ శ్లోకంలో " మనీషిణామ్" అంటే బుద్ధిమంతులు, పండితులు, సన్మార్గులు అయిన మనుషులు అని అర్థం. వారి శరీరములను, మనసులను పావనం చేసే, పవిత్రం చేసే పరమ పవిత్రములైన యజ్ఞములు, యాగములు, దానము, తపస్సు, పూజలు వదలరాదు అని భావము. కాబట్టి యజ్ఞయాగములు, దానము, తపస్సు, పూజలు, వ్రతాలు అన్నీ కూడా ఎటువంటి ఫలాపేక్ష లేకుండా చేయాలి.

ఇక్కడ అందరికీ ఒక సందేహం కలుగుతుంది. సన్యాసులు అన్నీ వదిలి వేయాలి కదా. మరి ఇలా యజ్ఞాలు, యాగాలు, తపస్సు, దానములు చేయమని పరమాత్మ చెప్పడం ఏమిటి? అని అనుకోవచ్చు. ఇక్కడ మనుషులు రెండు రకాలు. యోగారూఢులు. జ్ఞానసంపన్నులు. వీరికి ఏమీ అక్కర లేదు. ఏమీ చేయనక్కరలేదు. జీవన్ముక్తులు. ఇటువంటి స్థితికి చేరుకున్న తరువాత ఈ యాగములు, తపస్సు, దానములు ఏమీ చేయనక్కరలేదు. కానీ అర్జునుడికి కానీ, మన లాంటి వారికి కానీ ఇంకా పరిపూర్ణమైన జ్ఞానము రాలేదు. మనం ఇంకా యోగారూఢులము కాము. కాబట్టి మనకు యజ్ఞయాగములు, దానములు తపస్సు చేయాల్సిన అవసరం ఉంది. ఎందుకంటే ఇవి మన మనస్సును పవిత్రం చేస్తాయి. యోగారూఢస్థితికి చేరుకోవడానికి, మనస్సు నిర్మలం కావడానికి ఇవి మార్గాలు. అందుకని యజ్ఞ,దాన,తపస్సులు అందరూ చేయాలి అని ఈ శ్లోకంలో వివరించాడు పరమాత్మ.

## 6. ఏతాన్యపి తు కర్మాణి సఙ్గం త్యక్త్వా ఫలానిచ।
## కర్తవ్యానీతి మే పార్థ! నిశ్చితం మతముత్తమమ్॥

ఓ అర్జునా! పైన చెప్పబడిన యజ్ఞ,దాన,తపస్సులు అనే కర్తవ్య కర్మలను ఎటువంటి ఆసక్తి లేకుండా, వాటి వలన వచ్చేఫలములను వదిలిపెట్టి, చేయవచ్చును. ఇదే నాయొక్క నిశ్చితమైన, ఉత్తమమైన అభిప్రాయము.

సంగం త్యక్త్వా అంటే ఎటువంటి సంగము లేకుండా యజ్ఞయాగములు, దాన తపస్సులు, ఇవి నేను చేయతగినవి, ఇవి నా కర్తవ్యము అనే భావనతో చేయాలి. అంతే కాదు "ఫలాని చ" అంటే ఎటువంటి ఫలితములను ఆశించకుండా చేయాలి.

"నిశ్చితం మతముత్తమమ్" ఇది నా యొక్క ఉత్తమమైన నిశ్చితమైన అభిప్రాయము అని ఖండితంగా చెప్పాడుపరమాత్మ.

మానవులు సాధారణంగా ఏదో ఒక దేవతను ఉద్దేశించి, ఏదో ఒక ఫలమును కోరి, పేరు ప్రతిష్ఠల కోసం, నేను ఈ యజ్ఞము చేస్తున్నాను అనే అహంకారంతో, ఆడంబరంగా, యజ్ఞయాగములు చేస్తుంటారు. ఇటువంటి యజ్ఞయాగములు ఎందుకూ పనికి రావు. అలా చేయడం వలన వాటి పవిత్రత తగ్గిపోతుంది. అవి పరమాత్మకు ఇష్టం ఉండదు. కాబట్టి ముందు కర్తృత్వభావన వదలాలి. అంటే "నేను చేస్తున్నాను, నేను కాబట్టి చేస్తున్నాను. నేను తప్ప ఇంకెవరూ చేయలేరు" అనే అహంకార భావన వదిలిపెట్టాలి. ఇవి చేయడం నా కర్తవ్యము. ఇవి నేను చేయాలి కాబట్టి చేస్తున్నాను అనే భావనతో చేయాలి. చేసే వాటి మీద శ్రద్ధ ఉండాలి కానీ ఆసక్తి వదలాలి. వాటి మీద వచ్చే ఫలితముల మీద ఆసక్తి ఉండకూడదు. ఏది చేసినా పరమాత్మ పరంగా చేయాలి. పేరు ప్రతిష్ఠల కొరకు పాకులాడకూడదు. అటువంటి యజ్ఞయాగములు పరమాత్మకు ప్రీతిని కలిగిస్తాయి. అప్పుడే అవి చేసినందుకు సార్థకత. ఇది నా యొక్క నిశ్చితమైన అభిప్రాయము అని చెప్పాడు పరమాత్మ.

ఇప్పుడు పరమాత్మయొక్క నిశ్చితమైన అభిప్రాయం స్పష్టంగా తెలుస్తూ ఉంది. ప్రతి వాడూ తాను చేయవలసిన కర్మలు, అంటే, వేదములలో శాస్త్రములలో చెప్పబడిన విహిత కర్మలు, నిత్య, నైమిత్తిక కర్మలను తప్పకుండా చేయాలి. ఎట్టి పరిస్థితులలోనూ కర్మలు చేయడం మానకూడదు. కాకపోతే ఆ కర్మలను శ్రద్ధాభక్తులతో చేయాలి కానీ ఏదో చేయాలి కాబట్టి చేస్తున్నాము అని యాంత్రికంగా చేయకూడదు. అంతేకాదు, ఆ కర్మలను ఎటువంటి సంగము అంటే అటాచ్ మెంట్ లేకుండా చేయాలి. ఏదో ఒక ఫలితమును లాభమును ఆశించి చేయకూడదు. ఫలాపేక్ష లేకుండా చేయాలి. ఆ చేసిన కర్మల వలన ఏదైనా ఫలితం వస్తే ఇది నాది కాదు పరమాత్మది అనే భావనతో భగవదార్పణం చేయాలి. ఈ ప్రకారం చేస్తే ప్రతి మానవుడు సుఖ,శాంతులతో జీవిస్తాడు. తుదకు ఉత్తమ గతులు పొందుతాడు.

(ఈ రోజుల్లో అక్కడక్కడా కొన్ని పూజలు, వ్రతాలు యాంత్రికంగానే జరుగుతున్నాయి. మమ అనుకొని పూల పళ్లెం తాకుతారు. పూజ పూజారి చేస్తాడు. చేయించే వ్యక్తికి దేవుడి మీద ధ్యాస ఉండదు. మూలవిరాట్టుకు చేసే అలంకారాలను చూస్తుంటాడు లేకపోతే దిక్కులు చూస్తుంటాడు. అలాగే వ్రతాలు చేసేటప్పుడుకూడా యాంత్రికంగానే చేస్తుంటాము. చేసే వ్రతంమీద భక్తి,శ్రద్ధ ఉండవు. అందరు ఆహూతులు వచ్చారా లేదా అనే విషయం మీదనే శ్రద్ధవహిస్తారు. అలాగే దానాలు కూడా యాంత్రికంగా, ఏదో ఒక ఫలితమును ఆశించి చేస్తుంటారు. ఈ ప్రకారంగా యాంత్రికంగా చేసే

పూజలు, వ్రతాలు, దానాలు వృథా.
"చిత్తశుద్ధిలేని శివపూజలేలరా!" అని వేమన గారు ఏనాడో చెప్పారు కదా!)

## 7. నియతస్య తు సన్న్యాస: కర్మణో నోపపద్యతే।
## మోహాత్తస్య పరిత్యాగ స్తామస: పరికీర్తిత:॥

వేదములలో, శాస్త్రములలో చెప్పబడిన విహిత కర్మలు, నిత్య,నైమిత్తిక కర్మలను ఎట్టి పరిస్థితులలోనూ వదలడం ఉచితం కాదు. తమలో ఉన్న అజ్ఞానం చేత గానీ, ఎవరో చెప్పారని కానీ, వేద,శాస్త్రములలో చెప్పబడిన కర్మలను వదిలిపెట్టడం తామసగుణము తో కూడిన త్యాగము అని చెప్పబడుతుంది.

కాబట్టి కర్మలు చేయాలి. అవి వేద శాస్త్ర విహితము అయి ఉండాలి. సంగము ఫలాపేక్ష లేకుండా ఉండాలి. అలా చెయ్యాలి కానీ, అసలే కర్మలు చేయకూడదు అని చెప్పడం సరి కాదు. కర్మసన్న్యాసము మంచిది కాదు. కర్మలు చేయకుండా సోమరిగా ఉండటం తామస లక్షణము. కాబట్టిపరమాత్మ ఆంతర్యం ఏమంటే వేదములలో శాస్త్రములలో చెప్పబడిన కర్మలను మానవులు తప్పకుండా ఆచరించాలి. కర్మలు చేయడం ఎవరూ మానకూడదు. కర్మసన్న్యాసము మంచిది కాదు. కర్మలను వదిలి పారిపోకూడదు. అలా కర్మలు చేయకుండా ఉండటం, పారి పోవడం, వారిలో ఉన్న మోహం వలన, అజ్ఞానము వలన అవివేకము వలన జరుగుతుంది. కాబట్టి మానవులు, భక్తులు, వేదశాస్త్ర పరిజ్ఞానము కలిగి ఉండాలి. వారికి తెలియని విషయములను గురువుల వద్ద, పెద్దల వద్ద అడిగి తెలుసుకోవాలి. కర్తవ్య కర్మలను సక్రమంగా నిర్వర్తించాలి. సోమరిగా ఉండ కూడదు. ఏపనీ చేయకుండా ఉండటం, అన్ని కర్మలను వదిలిపెట్టడం తామసత్యాగము, తామస సన్న్యాసము. కాబట్టి మనం కూడా మోహంలో అజ్ఞానంలో పడకుండా మనం చేయాల్సిన పనులను సక్రమంగా నిర్వర్తించాలి. కాకపోతే ఆ కర్మలను నిష్కామంగా, కర్తృత్వభావన లేకుండా చేయాలి.

(ప్రతివాడూ చేయవలసిన నియత కర్మలలో తల్లితండ్రుల సేవ, భార్యబిడ్డలను పోషించడం ముఖ్యమైనవి. తల్లితండ్రులను పంచుకునే కొడుకులు, వారు తమకు భారము అయ్యారని వృద్ధాశ్రమాలలో వదిలేవాళ్లు, పెద్ద చదువులు చదవగానే, తల్లితండ్రులను వారిమానానికి వారిని వదిలి, విదేశాలకు ఎగిరిపోయేవాళ్లు, ఎక్కువ కట్నం కోసం ఉన్న భార్యను, బిడ్డలను వదిలే వాళ్లు ఈ సమాజంలో ఉన్నారు. కొంతమంది, తమకు ఉన్న అపరిమితమైన ధనంతో, తాము చేసిన పాపాలుపోవడానికి, పూజలు, వ్రతాలు, దానధర్మాలు ఘనంగా చేస్తుంటారు, చేయిస్తుంటారు.. అజ్ఞానం చేత, మోహం చేత, చేయవలసిన నియత కర్మలను వదిలిపెట్టి, సన్న్యాసం పుచ్చుకుంటే, ఆ సన్న్యాసము తామస సన్న్యాసము. అది వృధా!)

## 8. దు:ఖమిత్యేవ యత్కర్మ కాయక్లేశభయాత్త్యజేత్।
## స కృత్వా రాజసం త్యాగంనైవ త్యాగఫలం లభేత్॥

ధనం వ్యయం అవుతుందనో, శారీరక శ్రమ కలుగుతుందనో, ఆకర్మచేస్తే జరగకూడనిది ఏదైనా జరుగుతుందేమో అనే భయం చేతనో, దాని వలన సుఖం ఉండదనో, తీవ్రమైనదు:ఖం కలుగుతుందనో, ఇటువంటి ఆలోచనలతో, తాము చేయవలసిన కర్మలను చేయకుండా విడిచిపెడితే అంటే కర్మసన్యాసము చేస్తే, ఆ త్యాగము రాజస త్యాగము అనిపించుకుంటుంది. అటువంటి త్యాగమునకు కూడా ఎటువంటి ఫలము లభించదు.

కర్మలలో సులభమైనవి, కష్టమైనవి ఉంటాయి. ఆ కర్మలుచేయడానికి ఎక్కువ ధనం కావాల్సివస్తుంది. అంగబలం అర్థబలం కావాలి. శరీరానికి శ్రమ కలుగుతుంది. కొంత మంది ఉంటారు. వారికి శాస్త్ర జ్ఞానము ఉంటుంది. వివేకము ఉంటుంది. వారికి ధనం ఉంటుంది. అంగబలం ఉంటుంది. ఏయేవిహిత కర్మలు చేయాలో అన్నీ తెలుసు. కాని, ధనం ఖర్చుపెట్టడానికి, శ్రమపడటానికి ఇష్టపడరు. అటువంటి వారు, అమ్మో అంత ఖర్చా అంత కష్టపడాలా, మనవల్లకాదు బాబూ అని అనుకుంటూ వాటిని చేయడం మానేస్తారు. పైగా కర్మసన్యాసము అని పేరుపెడతారు. ఇటువంటి త్యాగమును రాజస త్యాగము అని అంటారు. తామస త్యాగి తన అజ్ఞానం, అవివేకము వలన అసలు కర్మలే చేయడం లేదు. పైగా తనకు అన్నీ తెలసని ప్రగలా&భలు పలుకుతుంటాడు. ఇతరులకు యజ్ఞ, దాన, తపస్సులు చేయమని బోధనలు చేస్తుంటాడు. తను మాత్రం ఏమీ చేయడు. రాజస త్యాగి ఇవన్నీ నేను చెయ్యాలా ఇంత కష్ట పడాలా ఇంత ధనం వ్యయం చెయ్యాలా అని అనుకుంటూ చేయవలసిన కర్మలు మానేస్తున్నాడు. కాబట్టి, రాజస, తామస త్యాగులు చివరకు తాము చేయవలసిన కర్మలు, చేయతగిన కర్మలు, తమకు నిర్దేశింపబడిన కర్మలు, తమ కర్తవ్య కర్మలు కూడా చేయకుండా సోమరులుగా మారుతున్నారు.

ఏ పని అయినా మొదట్లో కష్టంగానే ఉంటుంది. అలవాటు అయితే సుఖంగా ఉంటుంది. ఉదాహరణకు అయ్యప్పస్వామి వారి దీక్ష మొదట్లో చాలా కష్టం. తెల్లవారుజామున చన్నీటి స్నానం, దీక్ష వస్త్రాలు, ఒంటిపూజభోజనం, ప్రతిరోజూ పూజ అర్చన, పడి పూజ, చెప్పులు లేకుండా నడవడం, సంసారానికి దూరంగా ఉండటం ఇవన్నీ మొదట్లో చాలా కష్టం. పది రోజులు గడిస్తే అదే చాలా సుఖంగా ఉంటుంది. అందుకనే ఆరంభించరు నీచమానవులు అనే సూక్తి వచ్చింది. మొదలు పెట్టకముందే అమ్మో ఇది నా వల్ల అవుతుందా అని గుండెలు బాదుకుంటే ఏపనీ చేయలేడు. ఆ తత్వంకలవాళ్లు తమకు అన్నీ తెలుసనీ, తాము ఏమీ చేయనవసరం లేదనీ, వేదాంతాన్ని అడ్డం పెట్టుకొని ఉపన్యాసాలు ఇస్తూ, తాము చేయాల్సిన కర్మలు త్యాగం చేస్తుంటారు.

వీరు రాజస త్యాగులు. పని ఎగ్గొట్టడానికి అన్ని మార్గాలు వెదుకుతుంటారు. అటువంటి వారికి వారు చేసిన త్యాగానికి తగిన ఫలం లభించదు. పైగా భద్ధకం సోమరితనం పుష్కలంగా లభిస్తుంది.

## 9. కార్యమిత్యేవ యత్కర్మ నియతం క్రియతే2ర్జున।
## సఙ్గం త్యక్త్వా ఫలం చైవ స త్యాగస్సాత్త్వికో మతః॥

ఎవరైతే వేదములలో, శాస్త్రములలో చెప్పబడిన విహిత కర్మలను, చేయదగిన కర్మలను, చేస్తూ కూడా, ఆ కర్మలమీద అభిమానమును, ఆ కర్మలు చేస్తే లభించే ఫలములను త్యాగం చేస్తారో, అట్టి త్యాగమును సాత్త్వక త్యాగము అని నా అభిప్రాయము.

సాత్వికులు కర్మలు చేస్తారు. శాస్త్రవిహితమైన కర్మలు మాత్రమే చేస్తారు. తాము చేయతగిన కర్మలను మాత్రమేచేస్తారు. తనకు ఆ కర్మ చేయడానికి యోగ్యత ఉందా అని ఆలోచిస్తారు. యోగ్యత ఉంటేనే చేస్తారు. కాని ఆకర్మలను వాటి మీద ఎటువంటి, ఆసక్తితో అటాచ్‌మెంట్ తో చేయరు. ఆ కర్మలు చేస్తే తమ గురించి అందరూ అనుకోవాలనే పేరు కోసమో, కీర్తి కోసమో, గొప్ప కోసమో, చెయ్యరు. ఏదో ఒక ఫలితాన్ని ఆశించి చెయ్యరు. ఆ కర్మ చేయాలి కాబట్టి చేస్తారు. ఆ కర్మ ఇతరులకు మేలు కలిగించాలనే సంకల్పంతో చేస్తారు. లోక కల్యాణార్థము చేస్తారు. ఆ కర్మల వలన వచ్చిన ఫలితాన్ని పరమాత్మకు అర్పిస్తారు. తాము నిశ్చింతగా ఉంటారు. అటువంటి సాత్వికులు చేసేది కర్మఫల త్యాగము. వారు కర్మలను త్యాగం చేయడం లేదు. ఆ కర్మల వలన కలిగే ఫలములను మాత్రమే త్యాగం చేస్తున్నారు. కాబట్టి, చేయవలసిన పనులను త్యాగంచేయడం సన్యాసం కాదు. చేయవలసిన పనులు ఎటువంటి అటాచ్‌మెంట్ లేకుండా చేస్తూ, ఆ కర్మల వలన వచ్చేఫలములను త్యాగం చేయడం నిజమైన సన్యాసము. కాని, రాజస తామసికులు కర్మలనే త్యాగం చేస్తున్నారు. అదే సన్యాసం అనుకుంటున్నారు. అది శాస్త్రసమ్మతం కాదు.

## 10. న ద్వేష్ట్యకుశలం కర్మ కుశలేనానుషజ్జతే।
## త్యాగీ సత్త్వసమావిష్టో మేధావీ ఛిన్నసంశయః॥

సత్త్వగుణ సంపన్నుడు, వేదములు, శాస్త్రములు అధ్యయనంచేసినవాడు, పరమాత్మ తత్త్వము నందు ఎటువంటి సందేహము లేని వాడు, అయిన సాత్త్వక త్యాగి, సుఖాలను కలిగించే కర్మలను ప్రేమించడు, అటువంటి కర్మల యందు ఆసక్తుడు కాదు అలాగని దు:ఖమును, కష్టమును కలిగించే కర్మలను ద్వేషించడు. అన్ని కర్మలనుసమానంగా చూస్తాడు.

ఈ కర్మఫలత్యాగి అయిన సాత్వికుడు ఎలా ఉంటాడో, ఎలా ఉండాలో ఈ శ్లోకంలో వివరిస్తున్నాడు. అతడు సత్వగుణ సంపన్నుడు. మేధావి. అతడికి పరమాత్మ గురించి కానీ, వేద,శాస్త్రముల గురించి కానీ, అందులో చెప్పబడ్డ కర్మల గురించి కానీ ఎటువంటి సందేహములు ఉండవు. చేయవలసిన కర్మలలో కొన్ని సుఖములను కలిగించే కర్మలుఉంటాయి. మరి కొన్ని కష్టమును దు:ఖమును కలిగించే కర్మలు ఉంటాయి. సాత్వికుడు ఈ రెండు కర్మలను సమానంగా చూస్తాడు. సుఖకరమైన కర్మలయందు ప్రేమ, ఆసక్తి కలిగి ఉండటం, దు:ఖకరమైన కర్మలను ద్వేషించడం చేయడు.

మనందరికి ఒక వింత లక్షణం ఉంటుంది. మనకు ఇష్టం లేని దానిని ద్వేషిస్తాము. ఎవరన్నా మనకు ఇష్టం లేకపోతే వాడితో మాట్లాడము. వాడిని ద్వేషిస్తాము. వాడి మీద పగ పడతాము. ఎవరిమీదనైనా మనకు ఇష్టం కలిగితే, వారిని రాసుకొని పూసుకొని తిరుగుతాము. జంటగా మెలుగుతాము. అలాగే ఇష్టమైన పనులను కావాలని నెత్తిన వేసుకొని చేస్తాము. ఇష్టంలేని పనుల జోలికి కూడా పోము.

ఉదాహరణకు చదువు చెప్పించడానికి తల్లితండ్రులు, వారి ప్రేమ, ధనము కావాలి. కాని వారిని వృద్ధాప్యలో పోషించడానికి వారిపట్ల ప్రేమ ఉండదు. పెళ్లిచేసుకొనే వరకు కాబోయే భార్య మీద అంతులేని ప్రేమ చూపించడం, పెళ్లి అయిన తరువాత, ఆ ప్రేమద్వేషంగా మారడం. భార్యాబిడ్డలను వదలడానికి కారణాలు వెదకడం. విడాకుల కోర్టుకు పరుగులు పెట్టడం. అప్పు తీసుకునేవరకు అప్పుఇచ్చేవాడిని దేవుడిగా కొలవడం, తిరిగి అప్పు తీర్చే సమయానికి వాడి మీద ద్వేషం పెంచుకోవడం, అప్పుతీర్చకుండా నానా అగచాట్లు పెట్టడం. తీసుకొన్న అప్పు ఎగ్గొట్టడం. నెలాఖరున జీతం తీసుకునేటప్పుడు ఎంతో ఇష్టంగా తీసుకోవడం, నెలమొత్తం ఈ ఉద్యోగం చేయాల్సివచ్చిందే అంటూ బాధపడుతూ, అయిష్టంగా చేయడం. తాను విధిగా చేయాల్సిన పనులకు, జీతం కాక, అదనంగా ధనం స్వీకరించడం, ఆ చేయకూడని పని చేయడంలో ఆనందం పొందడం. ఇవన్నీ రాజస తామస లక్షణాలు.

కాని సాత్వికుడు అటువంటి పనులు చేయడు. తనకు ఇష్టం లేని వారిని ద్వేషించడు. వారిపట్ల ఉదాసీనంగా ఉంటాడు. పగ,ద్వేషం,పెంచుకోడు. అంతే కాదు, తనకు ఇష్టమైన వాటి మీద కూడా ఎక్కువ మమకారము కలిగి ఉండడు. అన్నింటా సమానంగా ఉంటాడు. శుభమును అశుభమును సమానంగా చూస్తాడు. ఏ పని చేసినా నిష్కామంగా, ఎటువంటి సంగమం లేకుండా చేస్తాడు. తాను చేసిన పనులకు మంచి ఫలితం వచ్చినా, చెడు ఫలితం వచ్చినా చలించడు. అన్నీ భగవదార్పణం చేసి నిశ్చలంగా ఉంటాడు. అతడే సాత్వికత్యాగి. అటువంటి సాత్విక త్యాగి మేధావి అవుతాడు. వివేకిఅవుతాడు. సత్సంగాలకు వెళతాడు. వేదాంతమును అధ్యయనం చేస్తాడు. శ్రవణం, మననం, నిధిధ్యాసనంలో నిమగ్నం అవుతాడు. అతడికి పరమాత్మ పట్లగానీ, శాస్త్రముల పట్ల గానీ,

ఎటువంటి సందేహములు, సంశయములు ఉండవు. అతని మనసు నిర్మలంగా, నిశ్చలంగా ఉంటుంది. సరిఅయిన నిర్ణయాలు తీసుకోగలిగిన సమర్థత కలిగి ఉంటాడు. జనన మరణ చక్రం నుండి విడివడతాడు. చివరకు మోక్ష ప్రాప్తిపొందుతాడు.

## 11. న హి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషత:।
## యస్తు కర్మఫల త్యాగీ స త్యాగీత్యభిధీయతే॥

దేహముతో ఉన్న వాడికి కర్మలు చేయకుండా ఉండటం సాధ్యం కాదు. అతడు కర్మలను పూర్తిగా విడిచిపెట్టలేడు. కాని అతడు కర్మఫలములను విడిచిపెట్టగలడు. అటువంటి వాడు త్యాగి అని పిలువబడతాడు.

ఈ దేహమును ధరించిన ఎవరికైనా, తన దేహమును పోషించుకోడానికి రక్షించుకోడానికి ఏదో ఒక కర్మ చేయక తప్పదు. కర్మలు చేయకుండా పూర్తిగా విడిచిపెట్టడం ఎవరికీ సాధ్యం కాదు. కర్మలను విడిచిపెట్టడం సాధ్యం కాదు కానీ, ఆ కర్మలు చేయడం వలన లభించే ఫలములను విడిచిపెట్టడం ఎవరికైనా సాధ్యం అవుతుంది. కాబట్టి కర్మలు చేస్తూ, ఆ కర్మఫలములను విడిచి పెట్టడం ఉత్తమము. అదే సత్త్వగుణ సంపన్నుడు ఆచరిస్తాడు.

కానీ రాజస తామస త్యాగులు ఏదో ఒక నెపంతో తాము చేయవలసిన విహిత కర్మలను చేయకుండా తప్పించుకుంటున్నారు. వారు చేసేది త్యాగం కాదు. తప్పించుకోవడం. దీనినే ఎగ్గొట్టడం, దాటవేయడం అని అంటారు. కాని నిజమైన త్యాగి ఎవరంటే సత్వగుణము కలిగిన వాడు. అతడు కర్మలు చేస్తాడు. నిష్కామంగా చేస్తాడు. ఆ కర్మలఫలితములను తాను ఉంచుకోడు, అనుభవించడు. పరమాత్మకు త్యాగం చేస్తాడు. అతడు నిజమైన త్యాగి. అప్పుడు ఆ కర్మలు, కర్మఫలములు అతనికి బంధనములను కలిగించవు. కేవలం తనకు ఉన్న దానిలో ఇతరులకు ఇవ్వడం త్యాగం అనిపించుకోదు. అదీ ఉన్నదంతా ఇవ్వడు. కొంత మాత్రమే ఇస్తాడు. తాను గొప్ప త్యాగిని అని పేరు సంపాదిస్తాడు. కాని సాత్వికుడు తాను చేసిన ప్రతి కర్మయొక్క ఫలితాన్ని త్యాగం చేస్తాడు. కాని ఏ పేరు ఆశించడు. అతడే నిజమైన త్యాగి.

## 12. అనిష్టమిష్టం మిశ్రం చ త్రివిధం కర్మణ: ఫలమ్।
## భవత్యత్యాగినాం ప్రేత్య న తు సన్యాసినాం క్వచిత్॥

ఏదైనా కర్మ చేస్తే దానికి మూడు విధములైన ఫలములు లభిస్తాయి. ఒకటి సుఖము,

రెండు దు:ఖము, మూడు రెండింటి కలయిక అంటే కాస్త సుఖము, కాస్త దు:ఖము. ఈ ఫలములు బతికిఉండగాకానీ, మరణానంతరము కానీ అనుభవింపక తప్పదు. కాని కర్మఫలములను త్యాగం చేసిన వాడికి ఈ సుఖదు:ఖములు ఉండవు.

ఇక్కడ మరొక విషయం ప్రతిపాదిస్తున్నాడు పరమాత్మ. దేహము వచ్చిన తరువాత ఏదో ఒక కర్మ చేయక తప్పదు. ఆ కర్మకు ఫలం రాక తప్పదు. ఆ కర్మఫలం ఒకప్పుడు సుఖంగా పరిణమిస్తుంది. ఒకప్పుడు దు:ఖంగా పరిణమిస్తుంది. మరొకప్పుడు సుఖము దు:ఖము రెండూ కలుగుతాయి.

ఉదాహరణకు పెళ్లిభోజనానికి పిలిచారు. 150 ఐటములు అక్కడ ఉన్నాయి. అన్నీ నోరూరించేవే. తింటేసుఖంగా, సంతోషంగా తృప్తిగా ఉంటాయి. అన్నీ తినేసాము. అజీర్తి పట్టుకుంది. డాక్టరుకు 200 మందులు 300 వెరసి 500 నష్టం. వారం రోజులు శారీరక బాధ. ఇదే సుఖదు:ఖాల కలయిక. సాత్త్వికుడు తన ఎదుట ఎన్ని ఆహార పదార్థాలు ఉన్నా, రోజూ తాను ఎంత తిని జీర్ణం చేసుకోగలడో అంతే తింటాడు. సుఖంగా ఉంటాడు. రాజస, తామస ప్రవృత్తి కలవారు, ఇవన్నీ రేపు దొరుకుతాయా అనుకుంటూ అన్నీ ఇష్టంగా, సుఖంగా తినేస్తారు. తరువాత అజీర్ణంతో బాధపడతారు.

ఎంతో ఖర్చుపెట్టి కోరిన కట్నంఇచ్చి కూతురికి వివాహం చేస్తారు. సంవత్సరం తిరక్కముందే విడాకుల నోటీసు వస్తుంది. మొదట సుఖం. తరువాత దు:ఖం. కూతురికి వివాహం అయిందని సంతోషించాలో, విడాకుల నోటీసు తీసుకొని ఏడవాలో అర్థం కాదు. ఒక్కోసారి ఒకే పని సుఖదు:ఖాలు రెండింటినీ కలిగిస్తుంటుంది. కాబట్టి ఈ కర్మల యొక్కఫలములు అన్నీ సుఖములు, దు:ఖములు, సుఖదు:ఖములు కలిగిస్తాయి. ఈ జన్మలో అన్నీ అనుభవించలేము కదా. కొన్ని సుఖాలు, కొన్ని దు:ఖాలు మిగిలిపోతాయి. వాటిని అనుభవించడానికి మరొక దేహం కావాలి. అందుకని, ఇవి మరుజన్మకు కారణం అవుతాయి. ఇంకో జన్మ ఎత్తి, మరొక దేహం పొంది ఈ సుఖ దు:ఖములను, పాపపుణ్యములను అనుభవించాలి. అందుకే పల్లెటూళ్లలో ఏమీ తెలియని వాళ్లు కూడా "ఏ జన్మలో ఏం చేసాడో.....ఏనాటి పాపఫలమో... ఈ నాడు, ఈ జన్మలో అనుభవిస్తున్నాడు" అని చక్కని వేదాంతం చెబుతారు.

మరి దీనికి మరో మార్గం లేదా అంటే ఉంది. ఈ కర్మఫలములను ఇక్కడే ఎప్పటి కప్పుడు, కృష్ణార్పణం అంటూ త్యాగం చేస్తే ఎటువంటి బంధనములు ఉండవు. సుఖంగా ఉంటాడు. మరుజన్మ అంటూ లేకుండా జన్మరాహిత్యం పొందుతాడు. కాబట్టి నిష్కామంగా, ఎటువంటి ఫలాపేక్షలేకుండా కర్మలు చేయడం, ఆ కర్మఫలములను పరమాత్మకు అర్పించడం, మనస్సును నిర్మలంగా ఉంచుకోవడం, అన్నిటి కంటే ఉత్తమం .

ఈ శ్లోకంతో అర్జునుడు అడిగిన ప్రశ్నకు సమాధానం ఇవ్వడం పూర్తి అయింది. కాని ఇంకా అర్జునుడు దిక్కులు చూస్తూనే ఉన్నాడు. గాండీవం తీసుకొని యుద్ధానికి సిద్ధం కాలేదు. ఇది గమనించిన కృష్ణుడు, అర్జునుడికి కాస్తంత జ్ఞానం కూడా బోధిద్దామని, మరలా జ్ఞాన యోగం చెప్పడం మొదలెట్టాడు. అంటే ఈ అధ్యాయము భగవద్గీత రివిజన్ అనుకుంటే, కర్మయోగం రివిజన్ పూర్తి అయింది. జ్ఞాన యోగం రివిజన్ మొదలెట్టాడు కృష్ణుడు.

## 13. పఞ్చైతాని మహాబాహో! కారణాని నిబోధ మే।
## సాఙ్ఖ్యే కృతాన్తే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మాణామ్॥

ఓ అర్జునా! మనం చేసే అన్ని కర్మలు సిద్ధి పొందాలంటే, మంచి ఫలితములను ఇవ్వాలంటే, సాంఖ్యే కృతాంతే అంటే వేదముల చివరలో చెప్పబడిన వేదాంతశాస్త్రములలో ఐదు కారణములు చెప్పబడ్డాయి. అవి ఏమిటో వివరిస్తాను విను.

దేహధారి అంటే దేహమును ధరించిన ప్రతివ్యక్తి ప్రకృతి పురుషుల కలయిక అని మనం నేర్చుకున్నాము. ప్రకృతి అంటే ఈ శరీరము ఇది జడము. ఇందులో ఉన్న చైతన్యము పురుషుడు. ఈ ప్రకృతి, పురుషుడు కలిస్తేనే దేహం చైతన్యవంతం అవుతుంది. అన్ని పనులు చేయగలుగుతాము. ఉదాహరణకు కరెంటు ఉంది. దానికి పాజిటివ్ నెగటివ్ ఉంటాయి. రెండూ కలిస్తేనే బల్బు వెలుగుతుంది. ఫాన్ తిరుగుతుంది. ఫ్రిజ్‌పని చేస్తుంది. కాబట్టి మనం అంతా పురుషుడు అంటే పాజిటివ్ కరెంట్, ప్రకృతి అంటే నెగటివ్ కరెంట్ మిశ్రమం అని గ్రహించాలి.

కాని సామాన్యంగా మానవులు, ఈ దేహమే చైతన్యం, చైతన్యం అంటే వేరే లేదు అని అనుకుంటూ ఉంటారు. (పాజిటివ్ వదిలేసి నెగటివ్ ను పట్టుకొని పాకులాడుతుంటారు) దానినే శరీర అభిమానము, అహంకారము అంటారు. అటువంటివారు, ఏ పని చేసినా, ఇదంతా నా వలననే జరుగుతూ ఉంది. అంతా నేనే చేస్తున్నాను. నేను లేకపోతే ఏదీ జరగదు. అని గొప్పలు, ప్రగల్భాలు పలుకుతుంటారు. కాని ఏ పని చేయాలన్నా, ఆ పని సఫలం కావాలన్నా, దానికి ఐదు కారణాలు ఉంటాయి. అంతే కానీ సక్రమంగా జరిగితే నా మహిమ, చెడితే నీ ఖర్మ అంటూ ప్రగల్భాలు పలకకూడదు. ఏ విధమైన కర్మలు అయినా జరగడానికి, ఆ కర్మలు ఫలప్రదం కావడానికి ఐదు సాధనాలు వేదాంతశాస్త్రంలో చెప్పబడింది. ఏ కర్మ నెరవేరడానికైనా, ఈ ఐదు సాధనాలు ముఖ్యం. అవేమిటో తరువాతి శ్లోకంలో చెప్పాడు పరమాత్మ.

ఇక్కడ "కృతాంత" అని వాడారు. కృతము అంటే చేయవలసిన కర్మలు. అవన్నీ వేదములలో చెప్పబడ్డాయి. కృతాంతము అంటే వేదముల అంతమున అంటే చివర చెప్పబడినవి. వాటినే వేదాంతములు లేక ఉపనిషత్తులు అని అంటారు. వేదాంతము లేక ఉపనిషత్తులు జ్ఞాన కాండను గూర్చి వివరించాయి. ఈ కింద చెప్పబడిన ఐదు సాధనములు ఉపనిషత్తులలో చెప్పబడ్డాయి అని వ్యాసుల వారు వివరించారు.

## 14. అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధమ్।
## వివిధాశ్చ పృథక్చేష్టా దైవం చైవాత్ర పఞ్చమమ్॥

శరీరము, కర్మచేసేవాడు, శరీరములో ఉన్న ఇంద్రియములు (అంటే 5 జ్ఞానేంద్రియములు, 5 కర్మేంద్రియములు, మనస్సు బుద్ధి), చేయబడే వివిధములైన పనులు, ఆఖరున దైవసాయము. ఏ పని చేయడానికైనా, నెరవేరడానికైనా ఈ ఐదు ముఖ్యము.

కరణములు అంటే పరికరములు, పనిముట్లు. ఏ పనిచేయడానికైనా కొన్ని పనిముట్లు కావాలి. మన శరీరంలో ఉండే పనిముట్లు కాళ్లు, చేతులు, మొదలగు ఇంద్రియములు. అధిష్ఠానం అంటే ప్రకృతి. మనలో ఉన్న ప్రకృతి పదార్థము మన శరీరము. దైవం అంటే పరమాత్మ. దానినే ఇంకా విధి, కాలము అని కూడా అంటాము.

మనందరము పంచకోశప్రక్రియ అనే మాటను వినేవుంటారు. పంచకోశములు అంటే ఐదు కోశములు. కోశము అంటే సంచి అని మామూలు అర్థము. వీటినే అన్నమయ కోశము, ప్రాణమయ కోశము, మనోమయకోశము, విజ్ఞానమయ కోశము, ఆనంద మయ కోశము. ఇందులో మొదటిది అన్నమయ కోశము అంటే అన్నముతో (ఆహారముతో) పోషింపబడేది ఈ శరీరము. కేవలం శరీరం ఉంటే చాలదు. ఎందుకంటే శరీరము జడము. కాబట్టి అందులో ప్రాణం ఉండాలి. ఆ ప్రాణములు ఐదు. ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమాన. ఈ ఐదు ప్రాణములు, వాయువుల రూపంలో మనకు శక్తిని, చలనాన్నికలిగిస్తున్నాయి. ఆ ప్రాణం పోతే శరీరం అచేతనమౌతుంది. దానిని కాల్చడమో, పూడ్చడమో చేస్తారు. ఇంక మూడవది మనోమయము.ఈ చైతన్యవంతము అయిన శరీరాన్ని నడిపించడానికి ఒక శక్తి కావాలి. అదే మనస్సు. శరీరం చేయవలసిన పనులను నిర్దేశిస్తుంది మనస్సు. ఈ మనస్సు చేసేపనులు మంచివా, చెడ్డవా,చేయదగినవా, కాదా అనినిర్ణయించే శక్తి ఒకటి ఉండాలి. అదే మనలో ఉన్నవిచక్షణా బుద్ధి. దానినే విజ్ఞానము అని అంటారు. అదే విజ్ఞానమయకోశము. శరీరము, మనస్సు, బుద్ధి మూడు కలిసి చేసే పనుల వలన కలిగే వికారమే ఆనందము. దానిని మనం మనలో ఉన్న అజ్ఞానం వలన ఆనందం అనుకుంటాము. కాని నిజంగా అది ఆనందం కాదు. అజ్ఞానంతో కూడిన ఆనందం కాబట్టి దానిని ఆనందమయ

కోశముఅని అన్నారు.

మన శరీరములు మూడు విధములుగా ఉంటాయి. ఒకటి స్థూల శరీరము. అంటే మన కంటికి కనపడే శరీరము. దీనినే అన్నమయ కోశము అని అనవచ్చు. రెండవది సూక్ష్మశరీరము అంటే మనలో ఉన్న ప్రాణము, మనస్సు, బుద్ధి (ఈ మూడింటిని కలిపి అహంకారము అని అంటారు). ఈ మూడు కలిసి సూక్ష్మశరీరము అవుతుంది. అంటే ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశముల సమ్మేళనము. ఇంక మూడవది. వీటి వలన కలిగే ఆనందము. అదే కారణ శరీరము. ఈ శరీరం రావడానికి కారణమైన ఆనందస్వరూపము. దానినే ఆనంద మయ కోశము అని అంటారు. ఈ పంచకోశ ప్రక్రియను ఆధారం చేసుకొని శరీరంతో చేసే పనులకు ఐదు కారణములు ఉన్నాయి అని వివరిస్తున్నాడు పరమాత్మ. అవేమిటో ఈ శ్లోకాన్ని చదివి తెలుసుకుందాము.

## 15. శరీరవాఙ్మనోభిర్య త్కర్మ ప్రారభతే నర:।
## న్యాయ్యం వా విపరీతం వా పఞ్చైతే తస్యహేతవ:॥

నరులు ఏ పని చేయాలన్నా, శరీరము, వాక్కు, మనస్సు (వీటినే త్రికరణములు అనిఅంటారు), వీటితో చేసే అన్ని రకములైన న్యాయమైన, అన్యాయమైన (చేయవలసిన, చేయకూడని) పనులకు, పైన చెప్పబడిన ఐదు, కారణములు అయి ఉన్నాయి.

మానవుడు ఏపని చేయాలన్నా, ఆపని న్యాయమైనదైనా, అన్యాయమైనదైనా, చట్టబద్ధమైనా, చట్ట విరుద్ధమైనా, శాస్త్రవిహితమైనా, శాస్త్ర విరుద్ధమైనా, ఏ కార్యమైనా, దానిని ముందు మనసుతో సంకల్పించాలి. బుద్ధితో మంచి చెడు విచారించాలి. వాటిని ఈ శరీరంలో ఉన్న ఇంద్రియములలో చేయాలి. కాబట్టి మనస్సుతో, వాక్కుతో, శరీరముతో చేసే ఏ పనికైనా పై శ్లోకములో చెప్పబడిన ఐదు కారణములు తప్పని సరిగా ఉంటాయి.

ఈశ్లోకంలో నర: అని వాడారు. నర: అంటే మానవుడు. విచక్షణా జ్ఞానం ఉన్న మానవుడు. అటువంటివాడే మనో, వాక్కు, శరీరములతోకర్మలు, కావాలని, చేయాలని సంకల్పించి, చేయగలుగుతాడు. కాని జంతువులు, పక్షులు మొదలైనవి తమకు తోచినవి, తమకుసహజమైనవి అయిన చేష్టలు చేస్తాయి. వాటిని కర్మలు అనరు. చేష్టలు అని అంటారు. అందుకని 18 లోపు పిల్లలు చేసే పనులను పిల్లచేష్టలు అని అంటారు. 18 లోపు పిల్లలకు విచక్షణా జ్ఞానం అంతగా ఉండదు. అందుకే 18 లోపు పిల్లలు చేసే ఒప్పందాలకు (కాంట్రాక్టులకు), అమ్మకాలకు, కొనుగోళ్లకు, విలువలేదు, అవి చెల్లవు అని న్యాయశాస్త్రముచెబుతుంది. అందుకే నరులు అంటే మానవులుచేసే

కర్మలకు పాప పుణ్యములు బంధనములు కలుగుతాయి. జంతువులు మొదలగునవి చేసే చేష్టలకు పాపము పుణ్యము బంధనములు లేవు. కేవలం అవి తమ పురాకృత పుణ్యపాపములను అనుభవిస్తుంటాయి. ఈ నరులు అంటే మానవులు న్యాయంగా కానీ, దానికి విపరీతంగా గానీఅంటే అన్యాయంగా కానీ, తమ మనసుతో చేసే సంకల్పములకు, నోటితో పలికే మాటలకు, చేతులు కాళ్లుతో చేసే కర్మలకు, పైన చెప్పబడిన ఐదు, కారణాలు అవుతాయి.

## 16. తత్రైవం సతి కార్తార మాత్మానం కేవలం తు యః। పశ్యత్యకృత బుద్ధిత్వా న్న స పశ్యతి దుర్మతిః॥

ఈ ఐదుకారణాలతో చేసే కర్మల విషయం పక్కనబెడితే, ఎవరైతే అజ్ఞానంతో, అవివేకంతో, శాస్త్రజ్ఞానము, బుద్ధి లేకుండా అన్ని కర్మలు నేనేచేస్తున్నాను, అన్నీ నా వలననే జరుగుతున్నాయి అని అనుకుంటూ ఉంటాడో, అటువంటి అవివేకి, కర్మల యొక్క, దేహము, ఆత్మలయొక్క నిజమైన స్వభావము గురించితెలుసుకోలేడు.

కాబట్టి ఏ పని చేసినా మనలో ఉండే జీవాత్మ కర్త కాదు. జీవాత్మ కేవలం సాక్షి మాత్రమే. చేసే పనులు చూస్తూ ఉంటుంది. పైన చెప్పిన ఐదు కూడితేనే ఏపని అయినా నెరవేరుతుంది. ఆత్మస్వరూపాన్ని కర్మల స్వభావాన్ని సరిగా అర్థం చేసుకోలేని మానవులు, ఈ శరీరమే ఆత్మ అనుకుంటూ, అంతా నేనే చేసాను అనుకుంటూ, అంతా నా మహిమ అంటూ ఉంటారు. వారికి ఆత్మజ్ఞానం లేదు. శాస్త్ర పరిజ్ఞానం అసలేఉండదు. అవివేకంతో అలా మాట్లాడుతుంటారు. అందుకే అకృత బుద్ధిత్వాత్, దుర్మతి అని అన్నారు. అంటే స్థిరమైన బుద్ధి లేని వాడు. పరిపక్వత చెందిన బుద్ధి లేని వాడు. దుర్మతి అంటే వాడికి మతి ఉంది కానీ అది కలుషితమయినది. నిజాన్నిచూడలేకపోతోంది. నేనే అన్నిటికి కారణము అనే భ్రమలో ఉంది. అటువంటి దుర్మతులు ఆత్మస్వరూపమును చూడలేరు. నిజం ఏదో తెలుసుకోలేరు. నేనే ఈ శరీరము, అన్ని పనులు నా వలననే జరుగుతున్నాయి అనే మూఢత్వములో ఉంటారు.

ఆత్మానం కేవలం అంటే ఈ ఆత్మకు ఏ కర్మచేయాలని కానీ, ఆ కర్మఫలమును అనుభవించాలని కానీ లేదు. ఆత్మ శుద్ధ సత్వ చైతన్య స్వరూపము. దానికి ఏదీఅంటదు. ఉదాహరణ ఇంతకు ముందేచెప్పుకున్నాము. సూర్యకాంతి మంచి వస్తువు మీదా, చెడ్డ వస్తువు మీదా, సత్కార్యములుచేయడానికి, దుర్మార్గాలు చెయ్యడానికీ అన్నిటికీ తన కాంతిని ప్రసరింపచేస్తుంది. కానీ ఆ కార్యములు కానీ, వాటి ఫలితములు కానీ సూర్యకాంతికి అంటుకోవు. అది ఎప్పుడూ స్వచ్ఛంగా, నిర్మలంగా ఉంటుంది. అలాగే మనలో ఉన్న ఆత్మస్వరూపం కూడా మనం చేసే ఏ కర్మలకు బాధ్యుడు కాదు, ఆ కర్మఫలములు ఆత్మకు అంటుకోవు.

దీనికి వ్యతిరేకంగా ఆలోచించేవాడు దుర్మతి అని అన్నాడు పరమాత్మ. మరి నరుడు ఇలా వ్యతిరేకంగా ఎందుకు ఆలోచిస్తున్నాడు అంటే దానికి ఒకటే సమాధానం అకృత బుద్ధి. వాడికి బుద్ధి ఉంది కానీ అది పరిపక్వత చెందలేదు. అందుకని "స న పశ్యతి" అంటే ఇటువంటి దుర్మతి నిజాన్ని నిజంగా చూడలేడు. దానికి విరుద్ధంగా చూస్తాడు. నేను వేరు శరీరం వేరు అని అనుకోడు. నేనే ఈ శరీరం, అన్నీ నేనే చేస్తున్నాను, అన్నీ నా వలననే జరుగుతున్నాయి అనే అహంకారంతో ఉంటాడు. వీడు కళ్లు ఉండి కూడా గుడ్డివాడు. మరి ఈ దుర్మతి బుద్ధి పరిపక్వత చెందాలంటే గురువును ఆశ్రయించాలి. శాస్త్రములను చదవాలి, అర్థం చేసుకోవాలి. ఇది ఒకటే మార్గము.

## 17. యస్యనాహఙ్కృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే।
## హత్వా2పి స ఇమాంల్లోకా న్న హన్తి న నిబధ్యతే॥

ఎవరికైతే ఇటువంటి అహంకార భావన (అంతా నేనే చేస్తున్నాను, అంతా నా వలననే జరుగుతూ ఉంది అనే భావన) లేకుండా ఉంటుందో, ఎవరి బుద్ధికి కర్మఫలముల యందు ఆసక్తి ఉండదో, అటువంటి వాడు, ఈ లోకంలో చంపడం లాంటి పనులు చేసినా, అతనికి ఆ కర్మఫలములు, బంధనములు అంటవు.

(ఈ శ్లోకం కేవలం అర్జునుడిని ఉద్దేశించి చెప్పాడు కృష్ణుడు. నేను ఈయుద్ధము చేస్తున్నాను, అందరినీ చంపుతున్నాను అనే భావన లేకుండా, ఇది క్షత్రియ ధర్మము అని యుద్ధం చేస్తే, ఆ యుద్ధంలో ఎవరినైనా చంపితే, ఆ పాపము, పాపఫలము నీకు అంటవు అని అర్థం కానీ, ఈ శ్లోకం చదివి మర్డర్ చేసి, నేనుచేయలేదు, నా చెయ్యి, ఆ చేతిలో ఉన్న కత్తి చేసింది అంటే కుదరదు.)

మరి కృష్ణుడు ఇలా ఎందుకు చెప్పాడు అని అందరికీ సందేహం రావచ్చు. కృష్ణుడు భగవద్గీత చెప్పే సమయంలో ఎదురుగా సైన్యాలు మోహరించి ఉన్నాయి. వారితో యద్ధం చేయడం అర్జునుడి కర్తవ్యం. యుద్ధం చేస్తే వారు చస్తారు. ఆ సందర్భంలో అర్జునుడికి ఎదురుగా ఉన్న సైన్యాన్ని చూపించి కృష్ణుడు అలా చెప్పి ఉండవచ్చు. దానినే సాధారణ జనం, తాము ఏయే వృత్తులు చేస్తున్నారో వారి వారి కర్తవ్య కర్మలకు అన్వయించుకోవచ్చు. అంతే కానీ, ఎవరిని చంపినా ఏమీ కాదు అనే వితండ వాదం చేయకూడదు.

అంతా నేనే చేస్తున్నాను అనే అహంకారము, కర్తృత్వభావన లేకుండా, ఏ పని చేసినా ఆ కర్మయొక్క ఫలితములు అతనికి అంటవు. అతనికి ఆ కర్మవలన కలిగే బంధనములు బాధించవు. ఓ అర్జునా! నీవు కూడా ఇటువంటి బుద్ధికలిగి ఉండాలి. నేను ఈ యుద్ధము చేస్తున్నాను, నేను వీరి నందరినీ చంపుతున్నాను, వీరంతా నా చేతిలో చస్తున్నారు, అనే భావన వదిలిపెట్టి యుద్ధం చెయ్యి. అప్పుడు నీవు ఈయుద్ధములో ఎంతమందిని చంపినా, నీవు ఎవరినీ చంపనట్టే. ఈ యుద్ధం వలన కలిగే పాపములు నీకు అంటవు. ఎందుకంటే నీ విద్యుక్తధర్మము నీవు నిర్వర్తిస్తున్నావు కాబట్టి. అంటే లౌకికంగా చూస్తే ఈ యుద్ధం రావడానికి ఇందులో జనం చావడానికి నీవు ఒక్కడివే కారణం కాదు. ఎన్నోకారణాలు. అంతా నా వల్లే జరుగుతుంది అనుకోవడం నీ అజ్ఞానము. అందుకని లేచి యుద్ధం చెయ్యి అని కృష్ణుడు అర్జునుడికి ఓ చురక అంటించాడు.

ఆధ్యాత్మికంగా చూస్తే, ఈ విశ్వాన్ని పరమాత్మ స్వరూపంగా చూచేవాడికి, అందరిలో ఆత్మస్వరూపుడుగా పరమాత్మ ఉన్నాడు అని భావించేవాడికి, నేను ఇదంతా చేస్తున్నాను అన్న అహంకారము, కర్తృత్వ భావన లేని వానికి, దేనితోనూ సంగము పెట్టుకోని వాడికి, తాను వేరు ఈ శరీరము, మనస్సు, బుద్ధి అహంకారము వేరు అని అనుకొనేవాడికి, తాను ఆత్మస్వరూపుడిని అని భావించేవాడికి, ఏ బంధనము కలుగదు. తనలో ఉన్న ఆత్మ సైనికులలో ఉన్న ఆత్మ ఒకటే అయినపుడు, చంపేవాడు ఎవడు చచ్చేవాడు ఎవడు. ఎవరూ చంపరు, చావరు, ఈ శరీరం అనిత్యము ఇప్పుడు కాకపోయినా ఎప్పుడో ఒకప్పుడు పోతుంది. కాబట్టినేను చంపుతున్నాను అని అనుకోవడం అవివేకము.

కాని ఈ సూత్రము అందరికీ వర్తించదు. యుద్ధమే తన విద్యుక్తధర్మము అయిన అర్జునుడు లాంటి వారికి వర్తిస్తుంది కానీ ఈ సూత్రము హత్యలు, దోపిడీలు, మానభంగాలు చేసేవారికి వర్తించదు. సైనికులకు, పోలీసులకు, న్యాయాధికారులకు, ఉరితీసే తలారులకు మాత్రమే వర్తిస్తుంది. ఎందుకంటే వారు స్వలాభం కోసం, తాము చేస్తున్నాము అనే కర్తృత్వభావంతో చేయడం లేదు. అది తమ విధినిర్వహణ కాబట్టి చేస్తున్నారు. ఈ శ్లోకాన్ని ఈ విధంగా అర్థం చేసుకోవాలి కానీ కృష్ణుడు అందరినీ చంపమని లైసెన్సుఇచ్చాడు, ఎవరినీ చంపినా చంపనట్టే అని నేరాలకు పాల్పడకూడదు.

మానవునిలో పరమాత్మ ఆత్మస్వరూపుడుగా ఉన్నాడు. దేహము, ఇంద్రియములు, మనో, బుద్ధి, అహంకారములు వేరుగా ఉన్నాయి. నేను ఆత్మస్వరూపుడను అని అనుకునేవాడికి ఈ ఇంద్రియములతో చేసే పనులతో సంబంధము లేదు. అతడు చేసే కర్మలు గానీ, కర్మఫలములు గానీ అతనికి అంటవు. ఏ పని చేసినా దాని వలన కలిగే ఫలితముల మూలంగా వచ్చే పుణ్యము, పాపము కేవలము మానవునికి ఆ పని మీద ఉన్న ఆసక్తి, అనుబంధము, సంగము, నేనే చేస్తున్నాను అనే కర్తృత్వభావన, వీటి వలన వచ్చినదే. ఇవి లేకపోతే, ఆ కర్మవలన కలిగే పాపపుణ్యములు,

సుఖదు:ఖములు ఆ మానవునికి అంటవు.

అర్జునుడు క్షత్రియుడు. దుష్టశిక్షణ అతని ధర్మము. యుద్ధం చేయడం అతని ప్రవృత్తి. కర్తవ్యము. పైగా ఈ యుద్ధము రావడానికి అర్జునుడు కారణం కాదు. సుయోధనుని లోభత్వము, శకుని కుటిలత్వము, ధృతరాష్ట్రుని పుత్రప్రేమ, రాజ్యము పట్ల భీష్మునికి ఉన్న నిబద్ధత, దుష్టులైన రాజులందరూ దుర్యోధనుని పక్షాన చేరడం, పాండవులను మోసంతో జయించి, వారి రాజ్యం అపహరించి, వారిని అవమానించి, అడవులపాలు చేయడం, పాండవులలో 13 ఏళ్లపాటు రగిలిన పగ, ప్రతీకారము, ఇవన్నీ కారణాలు.

పాండవులు వారి మానాన ఇంద్రప్రస్థము పరిపాలించుకుంటే ఈ యుద్ధం రాదు. ఎందుకూ పనికిరాని ఖాండవ ప్రస్థమును ఇంద్రప్రస్థముగా మార్చి, రాజసూయయాగం చేసి సుఖంగా ఉన్న పాండవులను చూచి దుర్యోధనుడు వారి మీద ద్వేషము పగ పెంచుకోకపోతే ఈ యుద్ధం రాదు. అంతా నాకే కావాలి, నా కంటే ఎవరూ అధికంగా ఉండకూడదు అనే లోభత్వము దుర్యోధనునిలో లేకపోతే ఈ యుద్ధం రాదు.
కొడుకులు ఏం చేసినా గుడ్డిగా ధృతరాష్ట్రుడు తల ఊపకపోతే ఈ యుద్ధం రాదు.
నేను హస్తినాపురమునకు రక్షకుడను మాత్రమే ఏం జరిగినా నాకు సంబంధంలేదు అనే నిర్లిప్తత భీష్మునికి లేకుంటే, తన కళ్ల ఎదుట జరుగుతున్న అన్యాయాలను, అక్రమాలను భీష్ముడు వారించి ఉంటే ఈ యుద్ధం రాదు.
ధర్మరాజులో ద్యూతవ్యసనం లేకపోతే ఈ యుద్ధం రాదు.
శకుని తన చావు తెలివితేటలు ఉపయోగించి, పాండవుల సర్వస్వము అపహరించి ఉండకపోతే వారిని అడవులకు పంపకపోతే ఈ యుద్ధంరాదు.
కనీసం కృష్ణుడి మాటలు విని, పాండవులకు 5 ఊళ్లు ఇచ్చినా ఈ యుద్ధం రాదు.

యుద్ధం రావడానికి ఇన్ని కారణాలు. ఇవన్నీ వివిధవ్యక్తుల మనో, బుద్ధి, అహంకారాల వలన కలిగినవే కానీ, కేవలం అర్జునుడి వలన కాదు. కాబట్టి అర్జునుడు ఇదంతా నా వలననే జరుగుతూ ఉంది అనడం కేవలం అతని అవివేకము అని కృష్ణుడు చెప్పాడు.

## 18. జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా।
## కరణం కర్మకర్తేతి త్రివిధ: కర్మసఙ్గ్రహ:॥

ఏ కర్మచేయడానికైనా ప్రేరణకావాలి. ఆ ప్రేరణకు తెలివి, తెలుసుకోదగిన వస్తువు, ఆ వస్తువును తెలుసుకునేవాడూ ఈ మూడూ అవసరము. అలాగే కర్మ చేసే వాడు, ఆ కర్మ చేయడానికి

కావలసిన పరికరము, కర్మ చేయడం అనే కార్యము, ఈ మూడూ ఆ కర్మకు ఆధారములు.

ఏ పని చేయడానికైనా ఆ పనిగురించి తెలిసిఉండాలి. తరువాత ఆ పని చేయాలి. ప్రతి పనికీ ఈ రెండూ ముఖ్యము. చేయబోయే పని గురించి ఏమీ తెలియకుండా ఏ పనీ చేయలేము. చేయకూడదు కూడా. కాబట్టి ఏ పని చేయాలన్నా, చేయకూడదు అనుకున్నా, చేయబోయే పని గురించిన జ్ఞానము అవసరము. మొదటిది జ్ఞానం అంటే ఒక వస్తువును గురించి గానీ, వ్యక్తిని గురించికానీ, చేయబోయే పనిని గురించికానీ తెలుసుకోవడం, వాటిగురించిన జ్ఞానం కలిగి ఉండటం. రెండవది జ్ఞేయం అంటే తెలుసుకోబడే వస్తువు, వ్యక్తి, పని. మూడవది పరిజ్ఞాతా అంటే తెలుసుకునే వాడు. ఈ మూడు ఏ కర్మచేయడానికైనా ప్రేరణ అవుతారు. కర్మ చేయడానికి ప్రేరేపిస్తారు. అంటే ఈ మూడింటి వలన మనసులో ఆపని చేయాలని సంకల్పం కలుగుతుంది. సంకల్పం కలగగానే సరిపోదు. ఆ కర్మ చేయాలి. కర్మచేయాలంటే కూడా మూడు ఉండాలి. కర్మచేసేవాడు, దేని కోసం చేస్తున్నామో అది, ఆ కర్మచేయడానికి అవసరమైన వస్తువులు. ఈ మూడూ ఉంటేనే కానీ ఆ కర్మ చేయడం పూర్తికాదు.

## 19. జ్ఞానం కర్మ చ కర్తాచ త్రిధైవ గుణ భేదతః।
## ప్రోచ్యతే గుణసఙ్ఖ్యానే యథావచ్ఛృణు తాన్యపి॥

కర్మ చేయ డానికి కావలసిన తెలివి లేక జ్ఞానము, కర్మచేసేవాడు, చేయాల్సిన కర్మ. ఈ మూడు సాంఖ్యశాస్త్రములో చెప్పబడిన విధంగా మానవుల యొక్క సత్వ,రజస్తమోగుణముల మీద ఆధారపడి ఉంటాయి. వీటి గురించి వివరంగా చెబుతాను శ్రద్ధగావిను అని అంటున్నాడు కృష్ణ పరమాత్మ.

## 20. సర్వభూతేషు యేనైకం భావమవ్యయమీక్షతే।
## అవిభక్తం విభక్తేషు తజ్జ్ఞానం విద్ధిసాత్త్వికమ్॥

ఏ పని చేయడానికైనా ముందు జ్ఞానము వివేకము కావాలి. అది మూడురకాలు. సాత్త్విక జ్ఞానము, రాజసిక జ్ఞానము, తామసిక జ్ఞానము. ముందు కృష్ణుడు సాత్త్విక జ్ఞానము గురించి చెబుతున్నాడు.

స్థూలంగా చెప్పాలంటే నేను వేరు, శరీరము వేరు అనే జ్ఞానము సాత్త్విక జ్ఞానము. సమస్తచరాచరజీవరాసులలో ఆత్మస్వరూపంలో భగవంతుడు ఉన్నాడు. ఈ శరీరములు మాత్రమే

వేరుగా ఉన్నాయి. శరీరం నశిస్తుంది కానీ ఆత్మస్వరూపము నశించదు అది అవ్యయము. వీటినే ఆత్మజ్ఞానము, అసలైన జ్ఞానము అని అంటారు. దానినే సాత్విక జ్ఞానము అని పిలుస్తారు.

అంటే ఈ జ్ఞానము మనకు లేదా అంటే, మనకూ ఉంది. కాని ఆచరించము. అందరికీ అన్నీ తెలుసు కానీ ఏమి తెలియదు. విన్నంత సేపూ తెలిసినట్టే ఉంటుంది. పక్కకుతిరగాగే నేను వేరు నువ్వు వేరు, వాడంటే నాకు ఇష్టం, వీడంటే ఇష్టం లేదు అనే అజ్ఞానంలో పడతాము. దానికి కారణం మనం చూడటానికి కేవలం మన కళ్లను మాత్రమే ఉపయోగిస్తాము. జ్ఞాననేత్రమును ఉపయోగించము. అందుకే ఈ జగత్తులో ఉండే జీవరాసులు పదార్థములు, వేరు వేరుగా వివిధ ఆకారములతో, పేర్లతో కనపడుతున్నాయి. మానవులు వీటి బయట స్వరూపమును మాత్రమే చూస్తారు కానీ లోపల ఉన్న ఆత్మస్వరూపమును చూడరు. అదే అజ్ఞానము.

సర్వభూతేషు యేనైకం అంటే అన్నిభూతములు ఒకటే. అన్నిటిలో ఉన్న ఆత్మ ఒకటే. ఆ విషయం తెలియడమే అసలైన జ్ఞానము. దానిని ఆచరించడమే విజ్ఞానము. సముద్రములో అలలు ఉన్నాయి. అలలు అన్నీ సముద్రములోనే ఉన్నాయి. అలలను కాకుండా సముద్రమును అందులో ఉన్న అనంత జలరాసిని చూడాలి. అలాగే రకరకాలైన బంగారు ఆభరణములను వాటి అందాన్ని కాకుండా అందులో ఉన్న బంగారము నాణ్యతను చూడాలి. రకరకాలైన కుండలను కాకుండా వాటిలో ఉన్న మట్టిని చూడాలి. రకరకాల ఆకారములతో, పేర్లతో ఉన్న మనుషులను కాకుండా వారిలో ఉన్న ఆత్మస్వరూపాన్ని చూడాలి. అదే అసలైన జ్ఞానము.

ప్రపంచములోని వస్తువులు, ప్రాణులు వివిధములు. ఆత్మ ఒకటే

ప్రపంచములోని వస్తువులు, ప్రాణులు నాశనమౌతాయి. ఆత్మకు నాశము లేదు.

ప్రపంచములోని వస్తువులు, ప్రాణులు వేరు వేరుగా కనపడుతున్నాయి. ఆత్మ ఒకటే.

ఈ జ్ఞానం మనం అలవరచుకోవాలి. కాని మనం ఇతర జ్ఞానములు అంటే సంగీత జ్ఞానము, సాహిత్యజ్ఞానము, వివిధములైన శాస్త్రముల జ్ఞానము, (ఇంజనీరింగ్ మెడికల్, పరిపాలన, వగైరా), రాజకీయజ్ఞానము, వ్యాపారజ్ఞానము, మోసం చేసే జ్ఞానము ఇంకా ఇతర జ్ఞానములు సంపాదించడానికి ఉత్సాహము చూపుతాము కానీ ఆత్మజ్ఞానము సంపాదించడానికి ఎటువంటి ఉత్సాహము చూపము. దానిని సాత్విక జ్ఞానము, అసలైన జ్ఞానము, తెలుసుకోవలసిన జ్ఞానము, అని అన్నాడు కృష్ణుడు. ఒకమాటలో చెప్పాలంటే పైపైన కనపడే రూపాలకు, పేర్లకు మురిసిపోకుండా లోపల ఉన్న ఆత్మస్వరూపాన్ని దర్శించాలి అని భావము. ముక్కోటి దేవతల స్వరూపాలలో ఉన్న పరమాత్మ ఒక్కడే అని తెలుసుకోవాలి. అదే సాత్త్విక జ్ఞానము.

## 21. పృథక్త్వేన తు యజ్ఞ్జానం నానాభావాన్పృథగ్విధాన్।
## వేత్తి సర్వేషు భూతేషు తజ్ఞ్జానం విద్ధి రాజసమ్॥

ఏ జ్ఞానముతో అయితే మానవులు ఈ లోకములో ఉన్న సమస్త జీవరాసులను వేరు వేరు గా భావిస్తున్నారో, అట్టి జ్ఞానమును రాజస జ్ఞానము అని అంటారు.

ఇప్పుడు రాజస జ్ఞానము గురించి చెబుతున్నాడు కృష్ణుడు. అన్నిజీవరాసులలో పరమాత్మ ఆత్మస్వరూపుడుగా ఉన్నాడు అన్నది సాత్విక జ్ఞానము అయితే, ఈ ప్రాణులను, మానవులను, జీవరాసులను వేరు వేరుగా, వేరు వేరు పేర్లతో, రూపములతో ఉన్నారు అని తెలుసుకోవడం రాజస జ్ఞానము. అంటే ఈ ప్రకృతిని ఏకత్వ భావంతో కాకుండా భేదభావముతో చూడటం. మానవులను, దేవుళ్లను, దేవతలను వేరు వేరుగా చూడటం. వాడు వేరు వీడు వేరు, ఆ దేవుడు వేరు ఈ దేవుడు వేరు, ఆ దేవుడికి ఎక్కువ మహిమలు ఉన్నాయి ఈ దేవుడికి అన్ని మహిమలు లేవు, ఆ స్వామీజీ చాలా పవర్‌ఫుల్ ఈ స్వామీజీ ఏమి లాభం లేదు ఈ ప్రకారంగా మనుషులను, దేవతలను, దేవుళ్లను, వేరువేరుగా చేసి చూడటం రాజస జ్ఞానము. ఈ రాజస జ్ఞానము కలిగిన వారికి దేవుడి మీద, పునర్జన్మ మీద, పుణ్యము, పాపము, స్వర్గము, నరకము, మోక్షము..వీటి మీద నమ్మకం ఉంటుంది. కాని వాటిని మూర్ఖంగా నమ్ముతారు. ఎవరు చెప్పినా నమ్మేస్తారు. ఆ విధంగా ఆచరిస్తారు. దాదాపు ప్రస్తుతము ఉన్న మానవ లోకం అంతా దీని కిందికే వస్తారు. ఇటువంటి వారు భయంతోనో, భక్తితోనో భగవంతుడిని పూజిస్తారు, ఆరాధిస్తారు కానీ, వారి వారి ప్రవృత్తులను బట్టి వేరు వేరుగా ఆరాధిస్తారు. (అహింసా పరమోధర్మః అని తెలిసి కూడా, ఈనాటికి కూడా అమ్మవారికి కోళ్లు, మేకలు లాంటి జంతువులను బలి ఇవ్వడం ద్వారా కొలవడం ఆచారంగా ఉంది.).

ఇటువంటి రాజస జ్ఞానం కలవారు మనుషులను, దేవుళ్లను వేరు వేరుగా చూస్తారు. నేను వేరు నీవు వేరు, ఇతడు అంటే నాకు ఇష్టం, అతడు అంటేనాకు ద్వేషం అనే భావనలతో ఉంటారు. తమలోఉన్న భేదభావమును దేవుళ్లకు కూడా అంటగడతారు. మనకు ఉన్న అన్ని అవలక్షణాలను దేవతలకు, దేవుళ్లకు ఆపాదిస్తారు. (ఆంజనేయస్వామికి, కుమార స్వామికి, వినాయకుడికి ఇద్దరేసి భార్యలను కల్పించుకున్నాము.) ఈ వేరువేరుగా చూడటం. భేదభావంతో చూడటం రాజస జ్ఞానము అని అంటారు.

## 22. యత్తు కృత్స్నవదేకస్మి న్కార్యేసక్తమహైతుకమ్।
## అతత్త్వార్థవదల్పం చ తత్తామసముదాహృతమ్॥

కంటికి కనపడేదే నమ్ముతాను, కంటికి కనపడనిది నమ్మను, నేను నమ్మిందే వేదం, ఇతరులు చెప్పేది నేను నమ్మను, నాకు తోచిందే చేస్తాను, దానికి తగిన కారణం ఉన్నా లేకపోయినా, అది వేదములలో, శాస్త్రములలో ఉన్నా, లేకపోయినా, పట్టించుకోను, నేనునమ్మిన దానికి ఏ ప్రమాణము, తత్త్వము, తర్కము అవసరంలేదు, అనే అల్పమైన మూఢత్వము తో కూడిన జ్ఞానమును తామసిక జ్ఞానము అని అంటారు.

ఇప్పుడు తామస జ్ఞానము అంటే ఏమిటి అని వివరిస్తున్నాడు కృష్ణపరమాత్మ. తామసులు తాము చెప్పిందే వేదం అంటారు. ఎవరి మాటా వినరు. తాము దేనిని పూజిస్తే అదే దేవుడు. ఆ విగ్రహమే దేవుడు. వారు చేసే పనులకు కారణం ఉండదు. ఈ విగ్రహాన్నే ఎందుకు పూజించాలి అంటే వారికి తెలియదు. పూజించాలి అంతే అని వాదిస్తారు. కారణం చెప్పలేరు. వారికి సత్యవస్తువునకు అంటే పరమాత్మకు, అసత్య వస్తువుకు అంటే ప్రపంచంలో మనకు కళ్లకు కనపడే వస్తువులకు తేడా తెలియదు. తాము చూచిందే నిజం అనుకుంటారు. తాము కొలిచే దేవతలు కొద్దిఫలితం ఇస్తాయనీ, పరమాత్మను కొలిస్తే అనంతమైన సుఖము సంతోషము శాంతి కలుగుతాయనీ వారికి తెలియదు. చెప్పినా వినరు. వారికి వ్యక్తిపూజ ఎక్కువ. అదే సర్వస్వము అని అనుకుంటారు. శరీరమే నేను నేనే శరీరము అనుకుంటాడు. ఇంకా కొంత మంది దేవుడు లేడు అని వాదిస్తారు. విగ్రహాలను పూజించరు. ఈ రోజు సుఖంగా గడిస్తే చాలు అని అనుకుంటారు. శారీరక సుఖాలకే ప్రాధాన్యం ఇస్తారు. ఇటువంటి జ్ఞానము తామస జ్ఞానము అని అంటారు.

ఈ తామస జ్ఞానము కలవారిని మనము భౌతిక వాదులు అని అనవచ్చు. వీరికి కంటికి కనపడేదే సత్యం. మిగిలినది అసత్యం. తల్లి తండ్రుల కలయికవల్ల ఈ శరీరంపుట్టింది. శరీరం కామ సుఖాలను అనుభవిస్తుంది. దానికి కావలసిన ధనం సంపాదిస్తుంది. కాలంతీరగానే పోతుంది. అంతే ఇంకేమీ లేవు అనే అల్పజ్ఞానము కలిగి ఉంటారు. వీరికి వేదాంత జ్ఞానము, శాస్త్ర జ్ఞానము అవసరంలేదు. తమకు తెలిసిందే వేదం, ప్రమాణం అనుకుంటారు. ఈ దేహమే పరమార్థము అనుకుంటారు. దేవుడు ఏడీ ఉంటే కనపడడా, కనపడని దేవుడిని ఉన్నాడని ఎలా నమ్ముతాము అనే వితండ వాదము చేస్తారు. ఇటువంటి వారు మనకు అక్కడక్కడా కనపడుతుంటారు. వీరినే చార్వాకులు అనికూడా అంటారు. (చారు అంటే ప్రియమైన, మృదుమధురమైన, వినడానికి ఇంపుగా ఉండే, వాక్ అంటే వాక్కులు, మాటలు మాట్లాడేవారు అని అర్థం. వీరు మాట్లాడే మాటలు, చెప్పే విషయాలు భౌతిక వాదులకు వినసొంపుగా, వీనుల విందుగా ఉంటాయి.) వారిలో కూడా అపరిమితమైన తెలివి, జ్ఞానము ఉన్నాయి. కాని దానిని తామస జ్ఞానము అని అంటారు.

## 23. నియతం సఙ్గరహిత మరాగద్వేషత: కృతమ్।
## అఫలప్రేప్సునా కర్మ యత్తత్సాత్త్వికముచ్యతే॥

శాస్త్రవిహితమైనది, ఎటువంటి సంగము లేనిది అంటే నేను చేస్తున్నాను అనే కర్తృత్వభావన లేనిది, రాగద్వేషములకు అతీతమైనది, ఎటువంటి ప్రతిఫలమును కోరనిది అయిన కర్మను సాత్త్వక కర్మ అని అంటారు.

కృష్ణ పరమాత్మ, 19వ శ్లోకంలో జ్ఞానము, కర్మ, కర్త వీటి గురించి చెప్పాడు. తరువాత జ్ఞానము మూడు రకాలనీ, సాత్విక, రాజసిక, తామసిక జ్ఞానములు అని చెప్పాడు. ఇప్పుడు రెండవది అయిన కర్మ గురించి చెబుతున్నాడు. మొదటిది సాత్విక కర్మ. శాస్త్రములలో చెప్పబడిన కర్మ, వేదవిహితమైన కర్మ, పెద్దలు ఆమోదించిన కర్మ, ఎటువంటి ఫలితమును ఆశించని కర్మ, చేసే పని మీద ఆసక్తి లేకుండా చేసే కర్మ, అభిమానము, రాగద్వేషములు లేని కర్మ, శ్రద్ధ,భక్తుతో చేసే కర్మ, అటువంటి కర్మను సాత్విక కర్మ అని అంటారు.

నియతం అంటే సక్రమంగా నియమించబడినకర్మ అంటే న్యాయబద్ధమైన ధర్మబద్ధమైన శాస్త్రవిహితమైన, సంఘమునకు మేలు చేసే కర్మ. మాకు తోచింది మేము చేస్తాము అని మూర్ఖత్వానికి పోకుండా, పెద్దలు ఎంతో అనుభవం మీద చెప్పిన కర్మలను ఆచరించడం మేలు.

ఉదాహరణకు.... ప్రతిరోజూ ఒక గంట సేపు నియమంగా చదవ మంటారు పెద్దలు. పిల్లలు వినరు. పరీక్షల ముందు రాత్రిళ్లు మేలుకొని పుస్తకాలతోకుస్తీపడతారు. కంప్యూటర్ లో కూడా ఒక కీ తరువాత మరొక కీ నొక్కితే అనుకున్న ఫలితం వస్తుంది కానీ అన్ని కీస్ ఒకేసారి నొక్కితే సిస్టమ్ జామ్ అవుతుంది. అన్ని పుస్తకాలు ఒకేసారి చదివితే ఏదీ జ్ఞాపకం ఉండదు. అందుకని పెద్దల మాట వినాలి. ఇది ఒక చిన్న ఉదాహరణ.

ఆ కర్మ కూడా నేను చేస్తున్నాను అనే అహంకారంతో కాకుండా ఇది నా విద్యుక్తధర్మము అనే భావనతో చేయాలి. ఈ కర్మలు మన ఇష్టాఇష్టాలతో కాకుండా, శాస్త్రము, పెద్దలు గురువులు చెప్పినట్టు ఆచరించాలి. రాగద్వేషములను విడిచిపెట్టాలి. (షుగర్ ఉన్న వాడు, డాక్టర్ తినకూడదు అన్నా, నాకు ఇష్టం అని సీతాఫలాలు, సపోటాలు తింటే ఏమవుతుంది.) ఆఖరుది ముఖ్యమైనది అయిన ఫలాపేక్ష లేకుండా చేయడం. ఏదో ఫలితంవస్తుందని ఒక పని చేస్తే, అనుకున్న ఫలితం రాకపోతే దు:ఖమే మిగులుతుంది. ఉదాహరణకు....లక్షరూపాయలు లాభం వస్తుందని ఒక వ్యాపారం

మొదలెడితే, అందులో యాభైవేల రూపాయల లాభం మాత్రమే వస్తే అసంతృప్తి, ఆవేదన మిగులుతాయి. అలాకాకుండా ధర్మంగా వ్యాపారం చేయడం నా ధర్మం అని అనుకొని, ఎంత లాభం వచ్చినా భగవంతుడు ఇంతే ఇచ్చాడు అని సంతోషంగా స్వీకరించడం, నష్టం వచ్చినా సంతోషంగా స్వీకరించడం, మరలా నష్టం రాకుండా ప్రయత్నించడం, లాభం వచ్చినా, నష్టం వచ్చినా అది పరమాత్మ ప్రసాదంగా స్వీకరించడం....ఈవిధమైన ఆలోచనా విధానం ఉంటే అంతా సంతోషమే, దు:ఖానికి తావు ఉండదు. అలాగే మనం చేసే పూజలు, వ్రతాలు, ధ్యానం, తపస్సు, పుణ్యకార్యాలు, దానధర్మాలు, ఏవేవో కోరికలు నెరవేరడానికి కాకుండా, భగవంతుని మీద భక్తి,శ్రద్ధలతో చేస్తే మనసుకు శాంతి కలుగుతుంది. అంతే కాని, ఏదో కోరిక పెట్టుకొని పూజలు చేసి అవి నెరవేరకపోతే దు:ఖపడటం అవుతుంది. కాబట్టి ఏ కర్మ చేసినా శాస్త్ర సమ్మతంగా, గురువులు పెద్దలు చెప్పినట్టు, కర్తృత్వభావన లేకుండా, ఫలరహితంగా చేస్తే వీటిని సాత్త్విక కర్మలు అని అంటారు.

## 24. యత్తు కామేప్సునా కర్మ సాహఙ్కారేణ వా పున:।
## క్రియతే బహులాయాసం తద్రాజసముదాహృతమ్॥

ఫలాపేక్ష కలవాని చేత, అహంకారము కలవాడిచేత, అధిక వ్యయ ప్రయాసలకు ఓర్చి చేయబడే కర్మ రాజస కర్మ అని అంటారు. రాజస కర్మ అనేది సాత్విక కర్మకు విరుద్ధమైనది. ఏదో ఒక కోరికతో, ఏదో ఒక ఫలితం ఆశించి చేసే కర్మ, నేను చేస్తున్నాను అని పది మందికీ తెలిసేటట్టు చేసే కర్మ. ప్రతి పనీ ఆయాసపడుతూ శ్రమ పడుతూ, ఎంతో ధనం అనవసరంగా వ్యయం చేస్తూ, అయ్యో ఇంత ఖర్చుఅయిందేమిటా అని బాధపడుతూ, చేసే కర్మ రాజస కర్మ.
రాజస కర్మలలో ఆడంబరం, ఆర్భాటం, అందరికీ తెలియాలనే తాపత్రయం, తనకు పేరు రావాలనే ఆరాటం, అంతా నేనే చేస్తున్నాను అనే అహంకారము, తనగురించిపది మంది చెప్పుకోవాలనే ఆకాంక్ష చిన్న పనికి కూడా అనవసరంగా హైరాన, ఆరాట పడిపోవడం, ఈ పని సక్రమంగా అవుతుందా లేదా అనే టెన్షన్, ఇంత ధనం ఖర్చుఅవుతుందేమిటా అనే దిగులు, పైకి చిరునవ్వు, ఇదీ రాజస కర్మ లక్షణం. రాజస కర్మలలో భక్తి, శ్రద్ధ తప్ప అన్ని ఉంటాయి.

## 25. అనుబన్ధం క్షయం హింసా మనపేక్ష్యచ పౌరుషమ్।
## మోహాదారభ్యతే కర్మ యత్తత్తామసముచ్చతే॥

మనం ఏమి కర్మ చేయబోతున్నాము, దాని వలన కలిగే సుఖదు:ఖాలు, లాభనష్టాలు, ఈ కర్మ హింసతో కూడుకున్నదా లేదా! ఇవి ఏవీ ఆలోచించకపోవడం, ఏది తోస్తే

ఎలా తోస్తే అలా చేసెయ్యడం, అసలు తాను ఆ కర్మ చేయగలడా లేదా, తనకు ఆ శక్తి యుక్తులు ఉన్నాయా లేదా అని చూడకుండా, ఏ మాత్రం వివేకం లేకుండా కర్మలుమొదలు పెట్టడం, సగంలో ఆపేయడం, మరలా మరొకటి మొదలు పెట్టడం, వీటిని తామస కర్మలు అంటారు.

ఇటువంటి వారు ముందు వెనక ఆలోచించరు. దాని వలన కలగబోయే కష్టనష్టముల గురించి విచారించరు. తాను చేసే పనుల వలన సంఘానికి, దేశానికి ప్రపంచానికి కలిగే వినాశం గురించి ఆలోచించరు. ఉదాహరణకు ఏ కారణమూ లేకుండా, తమ ఉనికిని అందరికీ తెలియజేయాలనే స్వార్ధంతో ఉద్యమాలు చేయడం, ఆ ఉద్యమం తాను చేయగలడా లేదా, తనకు ఆ సామర్ధ్యం ఉందా లేదా, ఆ ఉద్యమాల పర్యవసానం ఏమిటా! అని ఆలోచన లేకుండా, ఉద్యమాలు ప్రారంభించడం, ఆఉద్యమాలు హింసకు దారితీస్తాయని ఆలోచించక పోవడం, ఆఉద్యమాలు ఎటువంటి ఫలితాలను ఇవ్వకపోగా, దుష్ఫలితాలను మిగిలిస్తే, మరొక ఉద్యమాన్ని చేపట్టడం, ఒక విధమైన మోహంలో మూర్ఖంగా పనులు చేయడం, తన స్వార్థం కొరకు పనులు చేయడం, నేను బాగుంటే చాలు, ఇతరులు ఏమైనా నాకు పట్టదు అని అనుకుంటూ తనకు తోచినట్టు తన ఇష్టానుసారం కర్మలు చేయడం. ఇవన్నీ తామసిక కర్మలు అని అంటారు.

### 26. ముక్తసఙ్గోऽనహంవాదీ ధృత్యుత్సాహసమన్వితః।
### సిద్ధ్యసిద్ధ్యోర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే॥

చేసే పని మీద ఆసక్తి, సంగము లేని వాడు, ఈ పని నేను చేస్తున్నాను అనే అహంకారము లేని వాడు, ఏ పని అయినా ధైర్యము, ఉత్సాహముతో చేసేవాడు, తాను చేసిన కార్యము సిద్ధించినా, సిద్ధించకపోయినా ఎటువంటి వికారము చెందని వాడు, ఇటువంటి కర్తను సాత్త్వికి కర్త అని చెప్పబడతాడు.

పైశ్లోకంలో కర్మల గురించి చెప్పాడు. ఈ శ్లోకం నుండి ఆ కర్మచేసే కర్త గురించి చెబుతున్నారు. మరలా కర్తగురించి చెప్పాలా, సాత్త్విక కర్మచేసే వాడు సాత్త్విక కర్త అవుతాడు కదా అనిమీరు అనుకోవచ్చు. ఇక్కడొక చిన్న సూక్ష్మముఉంది. అది ఏంటంటే, చేసేది సాత్త్వికి కర్మ కావచ్చు, కాని ఆ కర్మ చేసే కర్త కూడా సాత్త్వికుడు అయి ఉండాలి. లేకపోతే అది సాత్త్విక కర్మ అనిపించుకోదు. ఉదాహరణకు శరీరంతో సాత్త్విక కర్మలు చేస్తూ, మనసులో రాజస భావాలు, తామస భావాలు కలిగి ఉంటే, దాని వలన లాభం ఏమిటి. ఇది ఎలా ఉంటుందంటే, పైకి మెడలో రుద్రాక్షలు వేసుకొని ప్రతి రోజూ దేవాలయాలకు వెళుతూ, యజ్ఞయాగాలు చేయిస్తూ, దాన ధర్మాలు చేస్తూ, మనసులో మాత్రము ప్రజలను దోచుకొని అంతకు రెట్టింపు ధనం సంపాదించాలి అనే బుద్ధి ఉంటే, అతడు సాత్త్విక కర్త కాడు. మానవులకు ఇటువంటి అతి తెలివితేటలు ఉంటాయనే,

పరమాత్మ సాత్త్వక కర్త ఎలా ఉండాలి అని కూడా స్పష్టంగా చెబుతున్నాడు.

కర్మలు సాత్త్వక, రాజసిక, తామసిక కర్మలుగా ఉన్నట్టే, ఎవరు ఏపని చేసినా, ఆ పని చేసే కర్త కూడా మూడు విధాలుగా ఉంటాడు. సాత్విక కర్త, రాజసికకర్త, తామసిక కర్త. ఇప్పుడు సాత్విక కర్త అంటే ఎవరో తెలుసుకుందాము. ఎవరు ఏ కర్మ చేసినా దానిని నుండి ఫలితం ఆశించి చేయకూడదు. ఆ కర్మకు పూర్తిగా అంకితం అయి పోకూడదు. ఆ కర్మ అలవాటుగా మారకూడదు. ఆ కర్మచేయడం తన విద్యుక్త ధర్మం కాబట్టి ఆ కర్మ చేస్తున్నాను అని అనుకోవాలి. అప్పుడే విహిత కర్మలు చేయగలుగుతాడు. ఆ కర్మ నేనే చేస్తున్నాను, నేను కాబట్టి ఈ పని చేయగలుగుతున్నాను, నేను చేసాను కాబట్టి ఇంత మంచి ఫలితం వచ్చింది అనే అహంకారము కర్తృత్వభావన ఉండకూడదు. ఇటువంటి వాడు, ఏ కర్మచేసినా ధైర్యంగా పట్టుదలతో చేస్తాడు. ఏపనిలో అయినా ముందుకు దూసుకుపోతాడు. చేస్తానో చేయలేనేమో అనే అధైర్యం మనసులోకి రానీయడు. కొన్ని కార్యాలు ఫలిస్తాయి. మరి కొన్ని ఫలించవు. చేసిన అన్ని కర్మలు ఫలించాలని లేదు. దేశ,కాల,విధినిర్ణయాన్ని బట్టి ఫలితాలు వస్తుంటాయి. కాబట్టి తాను చేసిన కర్మ ఫలించినపుడు ఎగిరి గంతేయడం, ఫలించనపుడు కుంగిపోవడం వంటి వికారములకు సాత్త్వక కర్త లోనుకాడు. తాను చేసినపని ఫలించినా, ఫలించకపోయినా, చలించడు. నిర్వికారంగా సంతోషంగా ఉంటాడు. ఇటువంటి వారిని సాత్వికకర్తలు అని అంటారు.

కాబట్టి ఎవరు ఏ కర్మ చేసినా దానితో అనుబంధం పెంచుకోకపోవడం, అహంభావము, కర్తృత్వ భావన లేకుండ చేయడం, ధైర్యంగా చేయడం, ఎటువంటి విపత్కరపరిస్థితులలో కూడా చలించకుండా ఉండటం, నిరుత్సాహపడకకుండా ఉండటం, ఆఖరుగా ఏ ఫలితం వచ్చినా ఆనందంతో స్వీకరించడం. వచ్చిన ఫలితాన్ని పరమాత్మకు అర్పించడం సాత్త్వక కర్త చేసే పనులు.

సాధారణంగా అందరూ ఏవేవో పనులు మొదలు పెడతారు. మధ్యలో మానేస్తారు. మొదలు పెట్టినప్పుడు ఉన్న ఉత్సాహం, ధైర్యం జారి పోతాయి. అందుకే ఏ పనికైనా ధైర్యంతో ఉత్సాహంతో ముందుకుపోయే గుణం ముఖ్యం. ఆ ధైర్యం, ఉత్సాహం ఎప్పుడు వస్తుందంటే తాను చేయబోయే కర్మ, ధర్మము,న్యాయము, చట్టబద్ధము అయితే ధైర్యం ఉత్సాహం దానంతట అదే వస్తుంది. అలా కాకుండా సంఘవ్యతిరేక కార్యకలాపాలకు పాల్పడుతుంటే పోలీసులు, నిఘా వర్గాలు పట్టుకుంటారేమో అనే అధైర్యంతో అభద్రతా భావంతో భయంతో ఉంటారు. అంతే కాకుండా మనసు నిర్మలంగా ఉంటే ధైర్యము ఉత్సాహము వాటంతటఅవే వస్తాయి. అన్నిటి కన్నా కార్యశీలత్వము నిబద్ధత ముఖ్యము. ఎవరు ఏపని చేసినా శ్రద్ధతో ఫలితం మీద ఆశ, ఆసక్తి లేకుండా చేయాలి. ఈ పని జరగకపోతే నా పరువుపోతుంది, నేను బతకడం దండగ అనే భావనతో చేయకూడదు. అయితే అవుతుంది లేకపోతే లేదు నా ప్రయత్నం నేను చేస్తాను అనే భావనతో చేయాలి. మంచి

వచ్చినా చెడు వచ్చినా ఫలితం పరమాత్మకు అర్పించాలి. అప్పుడే ఆ కర్త మనస్సు ప్రశాంతంగా ఉంటుంది. ఇటువంటి వారిని సాత్విక కర్తలు అని అంటారు.

ఈ శ్లోకంలో ముక్త సంగ: అని వాడారు. అంటే ఈ సాత్త్విక కర్మలు చేయడం సంగం నుండి ముక్తి పొందడానికి అని అర్థం. ఇది కొంత విపరీతంగా కనపడుతుంది. కర్మలు చేస్తే వాటి మీద సంగం అంటే అటాచ్‌మెంట్ పెరుగుతుంది కానీ ముక్తి ఎలా వస్తుంది అని మనం అనుకోవచ్చు. విమానము ఎగిరే ముందు నేల మీద పరుగెడుతుంది. ఎందుకు. నేలను వదిలి నింగికి ఎగరడానికి కావలసిన శక్తిని సమకూర్చుకోవడానికి. అలాగే సాత్త్విక కర్త కూడా కర్తవ్య కర్మలు చేస్తూ, వాటి నుండి విడివడి పరమాత్మను చేరుకోవడానికి తగిన శక్తిని పుంజుకోవడానికి ప్రయత్నం చేస్తాడు. అందుకే సాత్త్వ్వక కర్మలు చేయడం సాత్త్వ్వక కర్తకు అవసరం.

## 27. రాగీ కర్మఫలప్రేప్సు ర్లుబ్ధో హింసాత్మకోఽశుచి:।
## హర్షశోకాన్విత: కర్తా రాజస: పరికీర్తిత:॥

చేసే పని మీద అమితమైన ఆసక్తి, అనురాగము కలవాడు, తాను చేసే పనికి మంచి ఫలితము రావాలని కోరుకునేవాడు, తనకు వచ్చిన దానిని దాచుకునే లోభత్వము కలవాడు, హింస చేసి అయినా కార్యముసాధించాలి అనుకునేవాడు, తాను చేసే పని మంచిది, నిర్మలము, శుభ్రము, ధార్మికము కాకపోయినా ఆచరించేవాడు, తాను చేసిన పని సఫలం అయితే ఆనందించి, విఫలం అయితే తీవ్రమైన దు:ఖమునకు లోనయ్యేవాడు, అటువంటి కర్తను రాజస కర్త అని అంటారు.

ఇంక రాజస కర్త ఎలా ఉంటాడు అనే విషయం వివరిస్తున్నాడు కృష్ణ పరమాత్మ. రాజస కర్త ఏ పని చేసినా, దాని మీద విపరీతమైన ఆసక్తితో దానికి అంటుకుపోయి చేస్తాడు. ఆ పని తప్ప వేరే లోకం ఉండదు. దానికి మంచి ఫలితం ఎప్పుడెప్పుడు వస్తుందా ఆ ఫలితాన్ని అనుభవిద్దామా అని ఎదురు చూస్తుంటాడు. రాత్రికి రాత్రి కోటీశ్వరులు అయిపోవాలనే కలలు కంటుంటాడు..అటువంటి వాడు తనకు తెలియకుండానే లోభి అవుతాడు. వచ్చింది దాచుకోవడమే కానీ ఎవరికీ ఇవ్వడం తెలియదు. రోజుకు కోటి సంపాదించడానికి వీలయ్యే కర్మలు చేస్తూ, ఆ కర్మలు చేయడానికి ఎంతటి హింసకైనా తెగించే మనస్తత్వము కలిగి ఉంటాడు. తనకు వచ్చిన లాభమును తనకే అట్టిపెట్టుకునే స్వార్థము, అంతా నాకే కావాలి, ఇతరులకు చిల్లిగవ్వకూడా ఇవ్వను అనే లోభత్వము కలిగి ఉంటాడు. అన్యాయము, అధర్మము, చట్టవిరుద్ధము అయిన కర్మలు చేస్తూనే ఉంటాడు. తాను చేసిన కర్మ ఫలించినపుడు సంతోషము, చెడినపుడు దు:ఖము అనుభవించడం... అతడికి అలవాటు. ఇటువంటి కర్తలను రాజసిక కర్తలు అని అంటారు.

అంటే సాత్విక కర్మలకుపూర్తిగా వ్యతిరేకమైనవి రాజసిక కర్మలు అని అర్థం. సాత్విక కర్మలు ఎటువంటి బంధనములు కలుగజేయవు. రాజసిక కర్మలు బంధనాలు కలుగచేస్తాయి. రాజసిక కర్మలు హింసాత్మకంగా ఉంటాయి. రాజసిక కర్మలు చేసేవాడికి మనసు మలినంగా ఉంటుంది.. పైకి శుచిగా ఉన్నటు కనిపించినా, ధర్మమార్గంలో నడుస్తున్నట్టు కనిపించినా, అతడి మనసు మాత్రం మలినంగా, హింసాత్మకంగా ఉంటుంది. ఇటువంటి కర్మలు చేసే రాజసిక కర్తలు ఏరోజుకారోజు ఎంత లాభం వచ్చింది అనే లెక్కలలో మునిగితేలుతుంటారు. ఒక్కరోజు లాభం తక్కువ వచ్చినా తెగ బాధపడిపోతారు. మర్నాడు రెట్టింపు లాభం సంపాదించాలని తాపత్రయపడతారు. సంపాదించనది ఎవరికీ ఇవ్వరు. ఇటువంటి వారిని రాజసిక కర్తలు అని అంటారు.

## 28. అయుక్త: ప్రాకృత: స్తబ్ధ శ్శఠో నైష్కృతికోఽలస:। విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే॥

మనస్సు, వాక్కు, కర్మ ఒకదానితో ఒకటి సంబంధం లేని వాడు, చంచలమైన మనస్సుకలవాడు, తనను తాను నిగ్రహించుకోలేని వాడు, ప్రాపంచిక విషయముల యందు ఆసక్తి కలవాడు, ఎల్లప్పుడూ స్తబ్ధుగా, ఇతరుల పట్ల వినయ విధేయతలు లేని వాడు, ఇతరులను మోసం చేసే ఆలోచనకల వాడు, తాను చెడ్డ పనులు చేయడమే కాకుండా, ఇతరులు చేసే మంచి పనులను పాడుచేసేవాడు, సోమరి తనము కలవాడు, ఎప్పుడూ ఏదో పోగొట్టుకున్నట్టు దిగులుగా ఉండేవాడు, చిటికలో అయ్యేపనిని, చాంతాడంత పొడిగించేవాడు, ఇటువంటి లక్షణములు కలవాడిని తామసిక కర్త అని చెప్పబడతాడు.

తామసిక కర్తకు మనోనిగ్రహము ఉండదు. ఇంద్రియ నిగ్రహము అసలే ఉండదు. ఒకటి మనసులో అనుకుంటాడు, మరొకటి మాట్లాడతాడు, ఈ రెండింటికీ సంబంధం లేకుండా పనులు చేస్తాడు. అంత:కరణ శుద్ధి ఉండదు. ఎవరినీ లెక్కచేయడు. శాస్త్రములను, పెద్దల మాటలను పట్టించుకోడు. వాళ్లు చెప్పేది ఏమిటి? వాళ్లు చెప్పినట్టు నేను ఎందుకు చేయాలి? అనే అహంకారంతో ఉంటాడు. ఎవరిమాటా లెక్కచేయడు. తనకు తోచింది చేస్తాడు. ఎప్పుడూ ఎవరిని మోసం చేద్దామా, ఎవరి కొంప ముంచుదామా అని చూస్తుంటాడు. వారు అనుకునేదొకటి, చెప్పేదొకటి చేసేదొకటి. నమ్మకం అనే మాటకు అర్థం తెలియదు. ఎవరినీ నమ్మడు. తనను తానే నమ్మడు. తాను బాగుపడితే చాలు, ఎదుటి వారు ఏమైనా పర్వాలేదు అనే భావనతో ఉంటాడు. ఎదుటి వారిని ఇబ్బంది పెట్టడానికి, వారి పనులను చెడగొట్టడానికి తాను కర్మలుచేస్తుంటాడు.

ఇంకా కొంత మంది తామస కర్తలకు సోమరి తనంతో పనులు వాయిదా వేయడం అలవాటు. ఒకవేళ వాడు ఏ పని చేసినా అందులో సోమరి తనమే కనపడుతుంది కానీ నైపుణ్యం

కనపడదు. ఏదో చేసామంటే చేసాము అని పని ముగిస్తాడు. ఏ పనీ తెగనివ్వడు. సాగదీస్తుంటాడు. ఒక రోజులో అయ్యేపని పదిరోజులు సాగదీస్తాడు. అది కూడా సక్రమంగా పూర్తి చేయడు. ఎప్పుడూ ఏదో పోగొట్టుకున్న వాడి మాదిరి దిగులుగా ఈసురోమంటూ ఉంటాడు. వాడిని చూస్తే, చూచేవాళ్ల కు కూడా నీరసం వస్తుంది. అలా ఉంటారు. తామస కర్త ప్రాకృతుడు అంటే ఎప్పుడూ ప్రాపంచిక విషయాల కోసం పాకులాడుతుంటాడు. దేవుడు దైవం అనే చింతన అసలే ఉండదు. ఇవన్నీ తామస కర్త లక్షణాలు.

క్లుప్తంగా చెప్పాలంటే......తామసికుడు

నైష్కృతిక: అంటే ఇతరుల పనులు చెడగొడుతుంటాడు. ఇతరులను మోసం చేస్తాడు. నమ్మకద్రోహం చేస్తాడు. తన సుఖం కోసం ఇతరులకు కీడు చేస్తాడు. తనకు లాభం రాకపోయినా, తాను చెడ్డా పర్వాలేదు, ఎదుటి వాడు బాగుపడకూడదు అనే భావన కలవాడు.

అలస: సోమరి తనం ఎక్కువగా ఉన్నవాడు.

విషాదీ అంటే ఎప్పుడు ఏదో పోగొట్టుకున్నవాడి మాదిరి దిగాలుగా ఉండేవాడు.

దీర్ఘసూత్రి అంటే సాగదీసేవాడు. గోటితో పోయేదానిని గొడ్డలి దాకా తెచ్చేవాడు. ప్రతి పనీ వాయిదాలు వేసేవాడు. ఏ పనీ తెగనీయడు. నానుస్తాడు.

(దీనికి రాజకీయ నాయకులను ఉదాహరణగా చెప్పుకోవచ్చు. వారు సమస్యలను ఎన్నటికీ పరిష్కరించరు. అలా నానుస్తుంటారు. ఎల్లప్పుడూ సమస్యలతో సతమతమౌతుంటారు. ఏదైనా పదవి ఇస్తే ఇంకా పెద్దపదవి రాలేదని ఏడుపు, ఉన్న పదవి ఊడితే దానికీ ఏడుపు.)

ఇటువంటి వారిని తామస కర్తలు అని గుర్తించవచ్చు.

## 29. బుద్ధేర్భేదం ధృతేశ్చైవ గుణతస్త్రివిధం శృణు।
## ప్రోచ్యమానమశేషేణ పృథక్త్వేన ధనఞ్జయ॥

సత్త్వ,రజస్,తమోగుణములను బట్టి మానవుల బుద్ధిని, ధృతిని, ధైర్యమును మూడు విధములుగా విభజించారు. ఓ ధనంజయా! వాటి గురించి కూడా చెబుతాను శ్రద్ధగా విను.

ఏదైనాఒక పని చేయాలంటే ఒక నిశ్చయాత్మక బుద్ధి ఉండాలి. ఆపని చేయాలని నిశ్చయించుకోవాలి. నిశ్చయించుకున్న పనిని సక్రమంగా అమలు పరిచే సామర్ధ్యం కావాలి. ఇవి కేవలం మానవుడికి దేవుడు ఇచ్చిన వరం. కాని చాలా మంది తమ బుద్ధిని ఉపయోగించకుండా, హడావుడిగా కానీ, యాంత్రికంగా కానీ, నిర్ణయాలు తీసుకుంటారు. వాటిని సక్రమంగా అమలు చేయలేరు. అందుకని ఏ పనీ సక్రమంగా నెరవేరదు. మంచి ఫలితాలను

ఇవ్వదు. కాని మానవుడిలో ఉన్న బుద్ధి కూడా వారివారి సత్త్వ, రజస్తమోగుణములను బట్టి మూడు విధములుగా విభజింపబడింది. వాటి గురించి వివరిస్తున్నాడు కృష్ణపరమాత్మ.

## 30. ప్రవృత్తిం చ నివృత్తించ కార్యాకార్యే భయాభయే।
## బన్ధం మోక్షం చ యా వేత్తి బుద్ధిస్సా పార్థ! సాత్త్వికీ॥

ఏ బుద్ధి అయితే ప్రవృత్తి మార్గము, నివృత్తి మార్గము, చేయదగిన పని, చేయదగని పని, భయము, భయము లేకుండా ఉండటం, బంధము మోక్షము, వీటి మధ్యఉన్న భేదము, తారతమ్యము గురించి బాగా తెలుసుకుంటుందో అటువంటి బుద్ధిని సాత్త్విక బుద్ధి అని అంటారు.

మన శరీరం ఒక రథం అయితే, అందులో జీవాత్మ కూర్చుని ఉంటుంది.ఆరథాన్ని సక్రమంగా నడిపే వాడు సారథి. ఆ సారథే మనలో ఉన్న బుద్ధి. ఆ రథానికి కట్టిన గుర్రాలు మనసు. గుర్రాలను సారథి ఎలా కంట్రోల్ చేస్తాడో, బుద్ధి కూడా మనసును కంట్రోల్ చేస్తుంటుంది. ఒక్కోసారి మనసు బుద్ధి మాట వినదు కూడా. అది వేరు సంగతి. ఈ బుద్ధి కూడా మూడు రకాలు. అందులో సాత్త్విక బుద్ధి మొదటిది.

మనకు ప్రవృత్తి ధర్మము నివృత్తి ధర్మము అనే రెండు ధర్మాలు ఉన్నాయి. ప్రవృత్తి ధర్మము అంటేకర్మమార్గము, ప్రాపంచిక విషయములు, విషయ వాంఛలు, స్త్రీవాంఛ, ధనము ఆస్తి మీద కోరిక, సంసారములో మునిగిపోవడం ఇది ప్రవృత్తి మార్గము. నివృత్తి మార్గము అంటే జ్ఞానమార్గము, ప్రాపంచిక విషయములలో ఆసక్తి లేకుండా, సంసారముతో ఎక్కువ అనుబంధం లేకుండా, పరమాత్మ గురించి ఆలోచించడం, చేయవలసిన పనులను మాత్రమే చేయడం, చేయకూడని పనుల జోలికి పోకపోవడం, సుఖదు:ఖములను సమానంగా చూడటం, భయం లేకపోవడం అంటే మనకు ఏది భయాన్ని కలిగిస్తుందో తెలుసుకొని దానికి నివారణ కనిపెట్టడం, తద్వారా, భయం లేకుండా ఉండటం, భయం కలిగించే విషయాల జోలికి పోకపోవడం, సకల ప్రాణులలో పరమాత్మ ఆత్మస్వరూపుడుగా ఉన్నాడు అనే జ్ఞానం కలిగి ఉండటం, ఏ కర్మ చేస్తే బంధనములు కలుగుతాయి, ఏ కర్మలు చేస్తే బంధనములు కలుగవు అనే విషయాలను తెలుసుకోవడం, పూర్వజన్మ వాసనలను, బంధనాలను తొలగించుకొని పరమాత్మను చేరుకునే మార్గము నివృత్తి మార్గము. దీనినే ధర్మమార్గము అని అంటారు. ప్రవృత్తి మార్గము, నివృత్తి మార్గము మధ్య ఉన్న భేదమును బాగా గ్రహించిన వాడు, తెలుసుకున్న వాడు సాత్త్విక బుద్ధి కలవాడు.

ఒక విధంగా చెప్పాలంటే సాత్త్వక బుద్ధి కలవాడు ఏది మంచి ఏది చెడు అనే విచక్షణా బుద్ధి కలిగి ఉంటాడు. ఏ పని చేయాలి ఏ పని చేయకూడదు అని బాగా తెలుసుకుంటాడు. దేనికి, ఎప్పుడు భయపడాలి, ఏ సమయంలో ధైర్యంగా ఉండాలి అనే విషయాన్ని బాగా తెలిసిన వాడు. కొంతమంది ప్రతి దానికీ భయపడుతూ, టెన్షన్ పడుతుంటారు. భయపడకూడని వాటికి కూడా విపరీతంగా భయపడుతుంటారు. అలా భయపడటం వలన ప్రయోజనంలేదు, పరమాత్మను ఆశ్రయిస్తే ఎవరికీ భయపడనవసరం లేదు, ఎటువంటి భయానికి తావుండదు అని తెలుసుకున్న వాడు సాత్త్వక బుద్ధి కలవాడు.

ఈ ప్రపంచంలో మానవులు అనేక కర్మలు చేస్తుంటారు. వాటికి ఏవేవో ఫలితాలు వస్తుంటాయి. ఆ ఫలితాలు బంధాలను కలుగజేస్తుంటాయి. కాని కర్మలు చేస్తూ కూడా ఆయా కర్మఫలములను వదిలిన వాడికి అంటే కర్మఫలములను పరమాత్మకు అర్పించిన వాడికి, ఎటువంటి బంధనములు అంటవు. ఈ బంధమోక్షముల గురించి తెలిసిన వాడు సాత్త్వక బుద్ధి కలవాడు.

## 31. యయా ధర్మమధర్మం చ కార్యం చాఽకార్య మేవ చ।
## అయథావత్ప్రజానాతి బుద్ధిస్సా పార్థ! రాజసి॥

ధర్మము, అధర్మము, చేయతగినది, చేయకూడనిది, మొదలగు ద్వంద్వాలను ఉన్నదానిని ఉన్నట్టుగా కాకుండా, ఉన్నది లేనట్టు, లేనిదానిని ఉన్నట్టుగా ఊహించుకోవడం, తదనుగుణంగా ప్రవర్తించడం, ఇటువంటి వాడిని రాజస బుద్ధి కలవాడు అని అంటారు.

మానవుడు అనునిత్యం చేసే కర్మలు రకరకాలుగా ఉంటాయి. వాటిలో ధర్మము ఏది? అధర్మము ఏది? ఏది ఆచరించాలి? ఏది ఆచరించకూడదు? ఏది కర్తవ్యము, ఏది అకర్తవ్యము? అనే విషయములను మన వేదములు శాస్త్రములు రాసిన ఋషులు, మునులు, ఆచార వ్యవహారములను ఏర్పరిచిన పెద్దవాళ్లు మనకు స్పష్టపరిచారు. అవి ఆచరించడమే మన ధర్మం. కాని కొంతమంది తమ స్వంత తెలివితేటలతో ఈ ధర్మాలను, కర్తవ్యాలను, ఆచార వ్యవహారాలను తప్పుగా అర్థం చేసుకుంటారు. వాటిని తమ ఇష్టం వచ్చినట్టు మార్చివేస్తారు. తాము చెప్పిందే వేదం అంటారు. అదే ఆచారం అంటారు. వారి ఘనతను, గొప్పతనాన్ని నిరూపించు కోవడానికి ప్రయత్నిస్తారు. ధర్మాధర్మాలను, కార్యాకార్యాలను తాము సంపాదించిన జ్ఞానాన్ని, తమకు ఉన్న విచక్షణా బుద్ధి ఉపయోగించి నిర్ణయించరు.

సాధారణంగా, తాను ఏ పనిచేస్తే ఆ పని ఇతరులకు అపకారంగా పరిణమిస్తుందో ఆపని చేయకపోవడం, ఇతరుల మనసుకు, శరీరానికి ఆహ్లాదం కలిగించే పనులు చేయడం...ఇది

ప్రతిమానవుడు చేయవలసిన పని. కాని  రాజస బుద్ధి కలవాడు వీటి గురించి తెలుసుకోడానికి ప్రయత్నించడు. అన్నీపొరపాటుగా అర్థం చేసుకుంటారు. వీడికిపూర్తిగా ఏది తెలియదు. శాస్త్రఆలు చదివి తెలుసుకోడానికి ప్రయత్నించడు. మిడిమిడి జ్ఞానంతో ఉంటాడు.  తాము నమ్మినదే వేదం అంటారు.  అటువంటి వారి బుద్ధి రాజస బుద్ధి. ప్రతి విషయాన్ని వారు తప్పుగా అర్థం చేసుకుంటారు. నిజాన్ని గ్రహించలేరు. అలానే ఎందుకు చేయాలి ఇలా ఎందుకు చేయకూడదు అనే తర్కాన్ని లేవదీస్తారు. ప్రతిదానికీ వాదిస్తారు. తాము అనుకున్నది అందరిచేతా నమ్మిస్తారు, ఆచరింపచేస్తారు. వీరిది రాజస బుద్ధి.

(హిరణ్యకశిపుడు తానే దేవుడు అనీ యజ్ఞయాగాలు తనను ఉద్దేశించి చేయమనీ ఆదేశించాడు. తాను పలికిందే వేదం అని శాసించాడు. దేవుడు ఎక్కడ ఉన్నాడు. ఉండే చూపించు అని కుమారుడిని అడిగాడు. అటువంటి హిరణ్యకశిపుడు లాంటి వారు  చరిత్రలో చాలా మంది కనపడతారు. వారే నిరంకుశ పాలకులు. నేడు కూడా కొంతమంది పాలకులు ఆ కోవకు చెందుతారు. అటువంటి వారు అర్థాంతరంగా పోయారు, పోతారు అనేది జగద్విదితం.)

## 32.    అధర్మం ధర్మమితి యా మన్యతే తమసా22వృతా।
## సర్వార్థాన్విపరీతాంశ్చ బుద్ధిస్సా పార్థ! తామసీ॥

ఓ అర్జునా! మానవునిలో ఉన్న బుద్ధి, విచక్షణా జ్ఞానము, అజ్ఞానంతో అవివేకంతో కప్పబడి ఉంటుంది. దానిని తామస బుద్ధి అని అంటారు. అటువంటి తామస బుద్ధికి అధర్మం ధర్మంగా కనపడుతుంది. ప్రపంచంలో కనపడే అన్ని విషయాలు విపరీతంగా కనిపిస్తాయి.

తామసుల బుద్ధి విపరీతంగా ఉంటుంది. వారు అన్నిటికీ వ్యతిరేకంగా ప్రవర్తిస్తారు. అధర్మాన్ని ధర్మం అంటారు.  చెడును మంచి  అంటారు. సమిధలతో, సుగంధ ద్రవ్యాలతో హోమం చేయాలి అంటే అలా కాదు కారు పుట్టించే మిరపకాయలతో ఎందుకు హోమం చేయకూడదు అని అంటారు. వారు అన్నిటినీ వ్యతిరేకంగా, విరుద్ధంగా అర్థం చేసుకుంటారు. నిటారుగా కూర్చుని కుండలినీ శక్తిని పైపైకి తీసుకెళ్లాల్సింది బదులు తల్లకిందులుగా తపస్సు చేస్తారు. ఇక్కడ సర్వార్థాన్ అని అన్నారు. అంటే వారు అన్ని విషయాలను, అన్ని పదార్థాలను, అన్ని కార్యాలను విరుద్ధంగా, విపరీత బుద్ధితో తల్లకిందులుగా చేస్తారు.  ఈ శరీరము వేరు, లోపల ఉన్న ఆత్మవేరు అని శాస్త్రములు చెబితే, అలా కాదు శరీరమే శాశ్వతము, ఈ లోకములో లభించే సుఖములే శాశ్వతములు, ఆ సుఖాలు అనుభవించడానికే ఈ శరీరము అని శాస్త్ర విరుద్ధంగా వాదిస్తారు. ఆ సిద్ధాంతాన్నే ఆచరిస్తారు. దు:ఖములు కలిగించే విషయవాంఛలు వారికి అత్యంత సుఖమును కలిగిస్తాయి. అందరూ పూజించే దేవతలను, దైవాలను వారు ద్వేషిస్తారు. క్షుద్రదేవతలను పూజిస్తారు. మోక్షమునకు

అవరోధములైన స్త్రీలోలత్వము, మదిరా పానము వారికి అత్యంత ప్రీతికరము. ఇటువంటి వారు బాగా చదువుకున్న వారు, శారీరక బలం కలిగినవారు, ధనవంతులు, పండితులు అయి ఉంటారు కానీ వారి బుద్ధి మాత్రము తామసిక బుద్ధి. ఈ తామసికుల బుద్ధిని అవివేకము ఆవరించి ఉంటుంది. అవివేకమును పారదోలితే, తామసిక బుద్ధి రాజసిక బుద్ధిగా, ఆ తరువాత సాత్విక బుద్ధిగా మారే అవకాశం ఉంది.

## 33. ధృత్యా యయా ధారయతే మన: ప్రాణేన్ద్రియ క్రియా:। యోగేనావ్యభిచారిణ్యా ధృతిస్సా పార్థ! సాత్త్వికీ॥

ఎవరైతే చలించని క్రియాశీలత్వముతో,మనోధైర్యముతో, తన మనస్సును, ప్రాణములను, ఇంద్రియములను తన యోగసాధనతో సక్రమంగా నియమించగలుగుతున్నాడో, అతడి ధృతి సాత్త్వికము అనిపించుకుంటుంది.

29 వ శ్లోకంలో బుద్ధి, ధైర్యము వీటి గురించి చెబుతూ తరువాత బుద్ధి మూడు రకాలు అని చెప్పాడు పరమాత్మ. ఇప్పుడు ధృతి, ధైర్యం, పట్టుదల, ఆత్మస్థైర్యము, క్రియాశీలత్వము గురించి చెబుతున్నాడు. మనస్సు చలించ కుండా ఉండటం. ఏదో ఒక దాని మీద ఏకాగ్రతతో లగ్నం అయిఉండటం. స్థిరమైన బుద్ధి కలిగి ఉండటం, యోగ సాధన చేత మనస్సును ఇంద్రియములను నిగ్రహించిన వాడు వాటిని తన అధీనంలో ఉంచుకున్నవాడు, చిత్తమును ఏకాగ్రంగా ఉంచకలిగేవాడు, ఎటువంటి విపత్కర పరిస్థితులలో కూడా మనస్సును చలించచేయని వాడు, అటువంటి వాడు సాత్వికమైన ధైర్యము, పట్టుదల కలవాడు.

మనకు ధైర్యం రకరకాలుగా ఉంటుంది. కొంత మంది యుద్ధంలో ధైర్యం ప్రదర్శిస్తారు, కొంత మంది అర్థరాత్రి శ్మశానాలలో ధైర్యంగా ఏ భయమూ లేకుండా తిరుగుతుంటారు. మరి కొంతమంది ఒంటరిగా ధైర్యంగా ప్రయాణాలు చేస్తారు. కొంత మంది ధైర్యంగా సముద్రాలు ఈదుతారు, పర్వతాలను ఎక్కుతారు, ఈ ప్రకారంగా వివిధరీతులలో ధైర్యాన్ని ప్రదర్శిస్తారు. అనుకున్న పనిని పట్టుదలతో సాధిస్తారు. అన్నిటి కన్నా గొప్పది సాత్వికమైన పట్టుదల, ధైర్యము, క్రియాశీలత. సర్వకాల సర్వావస్థలయందు చిత్తము చలించకుండా ఉండటం. ఇంద్రియములను, మనస్సును నిగ్రహించడం, తన చెప్పుచేతల్లో పెట్టుకోవడం, అనుకున్న లక్ష్యం వైపు నడిపించడం, మనసును ప్రాపంచిక విషయముల నుండి వెనక్కులాగి భగవంతుని వైపు మళ్లించడం. ఎల్లప్పుడూ చిరునవ్వుతో ఉండగలగడం. ఇవన్నీ నెరవేరాలంటే యోగసాధనముఖ్యం. ఏకాగ్ర చిత్తంతో ధ్యానము చెయడం వలన ఇవి అన్నీ సాధ్యం అవుతాయి. దీనిని సాత్త్వక ధృతి, పట్టుదల, క్రియాశీలత అంటారు. ఇటువంటి వారికి భయం ఆమడ దూరంలో ఉంటుంది. దేనినైనా పట్టుదలతో, దక్షతతో

సాధించగలుగుతారు.

ఈ శ్లోకంలో ఒక పదం వాడారు. అవ్యభిచారిణ్యా. వ్యభిచరించడం అంటే మనకు ఒకటే రూఢి అర్థం. భర్త కానీ, భార్య కానీ, ఇతరులతో సంబంధం పెట్టుకోవడం. ఆడకానీ, మగ కానీ, తన ఇష్టం వచ్చినట్టు కామ వాంఛలు తీర్చుకోవడం. కాని ఇక్కడ అర్థం అది కాదు. మనసును, బుద్ధి ని ఏకాగ్రంగా నిలపడం. అటు ఇటు పోనివ్వకపోవడం. చంచలంగా లేకుండా నిశ్చలంగా ఉంచడం. దీనికే అవ్యభిచారిణ్యా అంటే చలించని బుద్ధి అని అర్థం చెప్పుకోవాలి.

## 34. యయా తు ధర్మకామార్థా న్ధృత్యా ధారయతేఽర్జున।
## ప్రసఙ్గేన ఫలాకాంక్షీ ధృతిస్సాపార్థ! రాజసీ॥

పైనచెప్పబడిన సాత్త్విక ధృతి,ధైర్యము,పట్టుదలతో ఏకార్యము చేసినా, ఆ కార్యము తన స్వార్థము కొరకు, స్వలాభము కొరకు చేస్తే అట్టి ధృతి,ధైర్యము,పట్టుదల రాజసముతో కూడి ఉంటుంది.

సాత్త్విక ధృతికి స్వార్థం జోడిస్తే, ఫలమును అపేక్షించి ఆ కార్యము చేస్తే, రాజసధైర్యం అయ్యేఅవకాశం ఉంది. ఇతను కూడా అన్ని యజ్ఞములు యాగములు పూజలు వ్రతాలు చేస్తాడు కాని అవన్నీ ఏదో ఒక కోరిక తీరడానికి మాత్రమే చేస్తాడు కానీ తన ఆధ్యాత్మిక ఉన్నతి కోసం చేయడు. రాజస ధైర్యం ఎలాంటిది అంటే ధనం సంపాదించడంలో చాలా ధైర్యంగా, పట్టుదలతో ఉండటం. కాని ఆ ధనం సంపాదించడానికి అధర్మం, అన్యాయము కూడా ధైర్యంతో ఆచరించడం, తన కోరికలు తీర్చుకోవడంలో ధైర్యంగా వ్యవహరించడం, ఏది ఏమైనా సరే నా కోరిక తీరాలి అనేపట్టు దల ధైర్యం ప్రదర్శించడం, చేస్తుంటాడు. ఈ విధంగా ఆర్జించిన ధనంతో కొంత భాగం యజ్ఞయాగములకు, పూజలు, వ్రతాలు చేయడానికి ఖర్చుచేస్తాడు.

ఇక్కడ ప్రసఙ్గేన అనే పదం వాడారు. సఙ్గము అంటేనే గాఢమైన బంధము, అనుబంధము, అటాచ్‌మెంటు. దానికి ప్ర చేర్చారు. అంటే ప్రగాఢమైన అనుబంధము అన్నమాట. ప్రాపంచిక సుఖములు పొందడంలోనూ, ఏ మార్గంలో ఐనా సరే ధనం సంపాదించడంలోనూ, తనకు లాభించే ఏ పని చేయడంలోగానీ, అమితమైన ధైర్యాన్ని, ఆసక్తిని, అనుబంధాన్ని ప్రదర్శించడం రాజసిక ధృతి, ధైర్యం అంటారు.

35. యయా స్వప్నం భయం శోకం విషాదం మదమేవచ।
న విముఞ్చతి దుర్మేధా ధృతిస్సా పార్థ! తామసీ॥

ఓ అర్జునా! తామస బుద్ధి కలవాడికి నిద్ర ఆనిద్రలో కలలు కంటుంటాడు, భయము, శోకము, విషాదము, మదము, ఇవి ఎక్కువగా ఉంటాయి. ఎట్టి పరిస్థితులలో కూడా ఈ లక్షణాలను విడువకుండా కాపాడుకుంటూ ఉంటాడు.

ఇంక తామసిక ధైర్యం అంటే అన్నీ అవలక్షణాలే. తమో గుణం కలవాడికి ధైర్యం ఉంటుంది. కాని నిద్రకు దాసుడు. నిద్రలో కలలు కంటుంటాడు. కలలో ధైర్యం ప్రదర్శిస్తాడు. నిజ జీవితంలో ధైర్యంగా ఉన్నాను అని అనుకుంటాడు. తన కన్నా ధైర్యవంతుడు లేడు అని ప్రగల్భాలు పలుకుతాడు. కాని లోపల పిరికితనం మెండుగా ఉంటుంది. ప్రతిదానికీ భయపడతాడు వణికిపోతాడు. ఏ పని మొదలుపెట్టాలన్నా ఈ పని అవుతుందో కాదో ఏమవుతుందో అని భయపడుతుంటాడు. అటువంటి వాడు తనలో ధైర్యం నింపడానికి కొరకు మాదక ద్రవ్యాలు, తాగుడు లాంటి వాటికి అలవాటు పడతాడు. తాగితే ధైర్యం వస్తుంది అనే అపోహలో ఉంటాడు. ఇటువంటి వాడు "కీడెంచి మేలెంచాలి" అనే దిక్కుమాలిన, పనికిరాని సామెతను పట్టుకొని పాకులాడుతుంటాడు. భయం వీరి లక్షణం. ఇంకా ఇటువంటి వాళ్లు ఎప్పుడూ ఏదో కావాలి అన్న కోరిక, రావలసింది రాలేదే అన్న దిగులు, ఏదైనా చేయలనే విపరీతమైన భావన, ఏమీ చెయ్యలేని పిరికితనం, ఇవన్నీ తామస పట్టుదల అంటారు. ఇటువంటి వారు ఎల్లప్పుడూ దు:ఖము, విషాదము లోమునిగి పోయి ఉంటారు. వీరిలో ఉత్సాహము అనే లక్షణము లేశమాత్రం కూడా ఉండరు. నిరాశ, నిస్పృహ వీరి స్వంతం. ఏ చిన్న వ్యతిరేకత జరిగినా ధైర్యంతో ఎదుర్కోవడం మానేసి విపరీతంగా కుంగి పోతుంటారు. ఇది మన వల్ల కాదులే అనే నిరాశలో ఉంటారు.

ఈ శ్లోకంలో దుర్మేధా అంటే ఇటువంటి వారి మేధస్సు దుర్మార్గాలతో నిండి ఉంటుంది. వక్రమార్గంలో నడుస్తుంది. చెయ్యకూడని పనులలోపట్టుదలగా ఉంటాడు. గర్వం మదం ఎక్కువగా ఉంటుంది. పెంకిగా ఉంటారు. నేను చదవను, నేను చెప్పిన మాట వినను, చెప్పిన పని చెయ్యను, నేను స్కూలుకు, కాలేజీకి పోను, నా ఇష్టం వచ్చినట్టు చేస్తాను, ఈ విషయాలలో పట్టుదలగా ఉంటాడు.

ఇంకా చాలా మంది ఎప్పుడూ నిద్రను ఆశ్రయిస్తారు లేకపోతే తాత్కాలిక నిద్ర అంటే మత్తును ఆశ్రయిస్తారు. ఆ నిద్రలో,మత్తులో చిత్రవిచిత్రమైనకలలు కంటూ ఆనందం పొందుతుంటారు. ఆ కలలో ధైర్య సాహసాలు ప్రదర్శిస్తారు. ఇటువంటి వారి ధైర్యము తామస ధైర్యము అంటారు. నిజానికి ఇది ధైర్యం కాదు. కాని తామసులు తమకు తాము ధైర్యవంతులమని జబ్బలు

చరుచుకుంటారు. ఉదాహరణకు బాగా తాగిన వాడు సరిగ్గా మత్తులో ఉన్న వాడు, నిలబడ లేకపోయినా హేయ్ హో హూ అంటూ రంకెలు వేస్తూ, పాడుస్తూ, కరుస్తూ అని అరుస్తూ అంతలోనే దబ్బున పడిపోతాడు. ఇటువంటిదే తామస ధైర్యం.

ఇటువంటి తామస ధృతి కలవాడు ఎల్లప్పుడూ ఈ అవలక్షణాలను గట్టిగా పట్టుకొని ఉంటాడు. వాటిని ఎటువంటి పరిస్థితులలోనూ వదిలిపెట్టడు.

## 36. సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ।
## అభ్యాసాద్రమతే యత్ర దు:ఖాన్తం చ నిగచ్ఛతి॥

ఓ అర్జునా! ఈ లోకంలో ఎల్లప్పుడూ దు:ఖము విషాదము కష్టములే కాదు సుఖాలు కూడా ఉన్నాయి. ఆ సుఖాలు ఎక్కువయి, ఒక వేళ ఆ సుఖాలు తొలగిపోతే కలిగే దు:ఖాలు కూడా ఉన్నాయి. ఆ సుఖాలు కూడా మూడు విధాలుగా విభజింపబడ్డాయి. వాటి గురించి వివరిస్తాను జాగ్రత్తగా విను.

సుఖం మానవుని సహజ గుణం. మానవుడు సాత్విక కర్మల చేత సుఖాన్ని పొందుతాడు. అప్పటి కే ఉన్న దు:ఖములను పోగొట్టుకుంటాడు. ఇదీ మానవుని కర్తవ్యము. కాని మానవులు తమ అజ్ఞానం వలనా, తాము చేసే రాజస, తామస కర్మల వలన దు:ఖములను కొని తెచ్చుకుంటున్నారు. రాజస గుణం కలవాడికి వాడు చేసే కర్మల వలన సుఖం లభిస్తుంది. తామస గుణం కలవాడికి, నిద్రలో, నిద్రలాంటి మత్తులో సుఖం లభిస్తుంది. కాబట్టి మానవులు అనుభవించే సుఖము ఎలా వస్తుంది అంటే వాళ్లు చేసే పనుల వలన వస్తుంది. అందుకే మానవులు అందరూ “నేను సుఖంగా ఉన్నాను” అనే భావన ఎల్లప్పుడూ కలిగి ఉండాలి. దీనినే పాజిటివ్ తింకింగ్ అని అంటారు. దానికి అవసరమయ్యేది అధ్యాత్మ విద్య. దానిని అభ్యాసం చేస్తే నిరంతరం సుఖం కలుగుతుంది. సుఖాలను పొందడం దు:ఖాలను పోగొట్టుకోవడం మన చేతిలో ఉంది. అది కేవలం అభ్యాసం వలననే వస్తుంది కానీ మాటల వలన రాదు.

తినడం కొంత మందికి సుఖం ఇస్తుంది. కాని ఏది తినాలి అనేది మన చేతుల్లో ఉంది. మితంగా తింటే సుఖం. ఎక్కువగా తింటే దు:ఖం. నీరు తాగితే దాహం తీరి సుఖం ఇస్తుంది. కాని తాగకూడనివి తాగితే దాహం ఎక్కువ అవుతుంది. మత్తు వస్తుంది. ఇంకా ఎక్కువ తాగితే కక్కేస్తాడు. తరువాత అనారోగ్యం కలుగుతుంది. కాబట్టి ఇవన్నీ మన అలవాట్లు. ఈ అలవాట్లు మంచివి అయితే పరవాలేదు. కాని చెడ్డవి అయితే దు:ఖం తెచ్చిపెడతాయి.

ఒకే వస్తువు, ఒకే పరిస్థితి, ఒకడికి సుఖం కలిగిస్తే మరొకడికి దు:ఖం కలిగిస్తుంది. ఆంధ్రాలో పుట్టిన వాడికి ఆవకాయ రుచిగా ఉంటే, నార్త్‌లో పుట్టిన వాడికి నోరుమండుతుంది. ఇక్కడ అన్నం, సాంబార్, రసం, ఇత్యాది రుచిగా ఉంటే, నార్త్‌లో వాడికి రొట్టె, కూర రుచిగా ఉంటుంది. కాబట్టి దేనికైనా నాలుక అలవాటు పడాలి. ఇంకొంచెం లౌక్యంగా చెప్పుకోవాలంటే కొంత మంది మగాళ్లకు, కట్టుకున్న భార్య తప్ప, ఇతర స్త్రీలంతా అందంగానే ఉంటారు. ఒకడు ఒక కారు అమ్ముతుంటే ఆనందం. అదే కారును కొనుక్కున్న వాడికి ఆనందం. అమ్మిన వాడికి ఆ కారు రేటు పెరిగితే దు:ఖం. కొన్న వాడికి అదే కారు ఇంకా తక్కువగా వస్తుందంటే దు:ఖం. ఇలా సుఖదు:ఖాలు ఒకటి వెంబడి వస్తుంటాయి పోతుంటాయి. వీటికి అంతులేదు. వీటిని సహించడమే సాత్విక లక్షణం.

పరమాత్మ ఇక్కడ ఒక పదం వాడాడు. దు:ఖాన్తం చ నిగచ్ఛతి. ఎవడు ఏ పని చేసినా, సుఖపడటానికే చేస్తాడు కానీ దు:ఖ పడటానికి చెయ్యడు. పైగా ఉన్న దు:ఖాలను పోగొట్టుకోవడానికి ప్రయాస పడతాడు. అంటే దు:ఖం అంతం అయితే సుఖం దానంతట అదే వస్తుంది. అది మానవ సహజం. కాని తన అవివేకం వలన ఉన్న సుఖాలు రాకపోగా, కొత్త దు:ఖాలు వచ్చిపడుతున్నాయి. ఒక్కోసారిఈ దు:ఖాలకు అంతం లేదా అని పిస్తుంది. ఇప్పుడు మనం కొన్ని ప్రశ్నలు వేసుకోవాలి.

దు:ఖమునకు అంతం ఎప్పుడు

దు:ఖము లేని చోటు ఎక్కడ ఉంది.

దు:ఖములు ఎక్కడ అంతం అవుతాయి.

శాశ్వత సుఖం ఎక్కడ దొరుకుతుంది.

శాశ్వత సుఖం ఏం చేస్తే లభిస్తుంది. ఎవరి వలన లభిస్తుంది.

ఈ ప్రపంచంలో దొరికే వస్తువులతో, అనుభవించే విషయ వాంఛలతో సుఖం దొరుకుతుందా!

ఈ ప్రశ్నలకు అన్నిటనికీ ఒకటే జవాబు. సుఖము దు:ఖము ఎక్కడో లేవు. మనలోనే ఉన్నాయి. మనం భావనలో ఉంది. మనం చేసే కర్మలలో ఉంది. మనలను మనం సంస్కరించుకుంటే శాశ్వత సుఖం దానంతట అదే వస్తుంది. సుఖం కోసం ఎక్కడా వెదకవలసిన పని లేదు. అందుకే సుఖం కావాలంటే అభ్యాసం చేయాలి,మంచి అలవాట్లు చేసుకోవాలి అని అన్నాడు పరమాత్మ. మానవులు సహజంగా అనుభవించే సుఖములలో కూడా మూడు రకాలు ఉన్నాయని పరమాత్మ చెబుతున్నాడు.

## 37. యత్తదగ్రే విషమివ పరిణామేఽమృతోపమమ్।
## తత్సుఖం సాత్త్వికం ప్రోక్త మాత్మబుద్ధిప్రసాదజమ్॥

మొదట్లో అత్యంత కష్టంగా ఉండి, విషము మాదిరి తోచి, తరువాత అనంతమైన అమృతముతో సమానమైన సుఖము, తనలో ఉన్న సాత్త్వక బుద్ధి వలన కలిగే సుఖం..వీటిని సాత్విక సుఖము అని అంటారు.

అధ్యాత్మ సాధన నుండి మొదలు పెడదాము. ముందు ప్రాణాయామము, భక్తి, శ్రద్ధ, సాత్వికాహారము, మంచి నియమాలు అన్నీ చాలా కష్టంగా ఉంటాయి. తుదకు అదే అనంతమైన అమృత తుల్యమైన సుఖాన్ని ఇస్తాయి. ఆ సుఖం ఎక్కడి నుండో రాదు. మనలో ఉన్న సాత్త్వక బుద్ధి వలన వస్తుంది. కాబట్టి సాధన మొదట్లో కష్టంగా ఉందని మానకుండా నిరంతరం కొనసాగించాలి. విషమివ అని అన్నారు కానీ విషం అనలేదు. మొదట్లో విషం మాదిరి తోస్తుంది. అంటే చాలా కష్టంగా ఉంటుంది. దానికి భయపడకూడదు. ఈ ఆత్మ సాధనకు మన పూర్వజన్మవాసనలు అనేక విఘ్నాలు కలుగచేస్తాయి. మనసును అటు ఇటు మళ్లిస్తాయి. వాటికి లొంగకుండా సాధన చేస్తే అనంతమైన సుఖం మీ సొంతం అవుతుంది.

ఏదైనా వ్యాధి వచ్చింది. చేదు మందు, సూది మందు, ఆపరేషన్ ఇవన్నీ చేస్తారు. వాటికి భయపడి పారిపోతే రోగం ముదురుతుంది. ముందు ఇవన్నీ కష్టంగా ఉన్నా, తుదకు జీవితాంతం సుఖాన్ని కలుగచేస్తాయి. అలాగే విద్యార్థులు సంవత్సరం అంతా నియమం ప్రకారం చదవడం మొదట్లో కష్టంగానే ఉంటుంది. కాని తుదకు పరీక్షలలో మంచి మార్కులు వచ్చి సంతోషాన్ని కలుగచేస్తాయి. అలాగే అధ్యాపకుడు సంవత్సరం అంతా కష్టపడి పాఠాలు చెబితే, జీవితాంతం ఆ విద్యార్థులు ఆ ఉపాధ్యాయుని దేవునిలాగా పూజిస్తారు. దీనితో విద్యార్థులకు విద్య వస్తుంది. ఉపాధ్యాయునికి గౌరవం లభిస్తుంది. అలాగే ఉద్యోగి రోజంతాకష్టపడి పని చేస్తే, ఆ ఉద్యోగికి పై అధికారి మెప్పు, జీతంలో పెరుగుదల, పదోన్నతి లభిస్తాయి. ఇవన్నీ మొదట్లో కష్టంగా ఉంటాయి. అంతంలో సుఖాన్ని కలుగచేస్తాయి.

దీనికి మంచి ఉదాహరణ మనకు భాగవతంలో ఉంది. దేవతలు దానవులు పాలసముద్రమును మథించారు. ముందు హాలాహలం అంటే విషం పుట్టింది. కాని వారు అధైర్యపడలేదు. ఆ విషాన్ని మహాశివుడు సేవించాడు. దేవదానవులు వారి కృషి కొనసాగించారు. అమృతం పుట్టింది. మనలో ఉన్న మంచి చెడు దేవతలు దానవులు.వాటిమధ్య జరిగే ఘర్షణ

పాలసముద్రం చిలకడం. ముందు కష్టాలు వస్తాయి. ఓపికగా భరించాలి. కష్టాలను భగవంతునికి అర్పించాలి. తుదకు అనంతమైన సుఖం లభిస్తుంది. మనం చేసే కృషిని మంధర పర్వతం కింద ఉన్న కూర్మావతారంలో ఉన్న పరమాత్మ పర్యవేక్షించినట్టు, మనలో అంతర్లీనంగా ఉన్న ఆత్మస్వరూపుడు పర్యవేక్షిస్తుంటాడు. ఈ భావనతో సాధన చేస్తే, సాత్విక సుఖం లభిస్తుంది. అందుకే ఈ శ్లోకంలో విషము, అమృతము అనే పదాలు వాడారు. క్షీరసాగర మధనంలో మొదట పుట్టింది విషం, తరువాత పుట్టింది అమృతం అని సూచన ప్రాయంగా చెప్పాడు కృష్ణుడు. కాబట్టి సుఖ దు:ఖములు ఎక్కడో లేవు. మనలోనే ఉన్నాయి. సుఖం నిర్మలమైన మనసులో ఉంటే, దు:ఖం మలినమైన మనసులో ఉంటుంది. అందుకే వసిష్ఠ మహర్షి శ్రీరామ చంద్రునికి మోక్షం గురించి చెబుతూ ఇలా అన్నాడు.

న మోక్షో నభస: పృష్ఠే పాతాలే నచ భూతలే
మోక్షోహి చేతో విమలం సమ్యగ్జ్ఞా నవిబోధితం.

మోక్షం ఆకాశంలో కానీ, ఆకాశం అవతల కానీ, పాతాళంలో కానీ, లేక భూలోకంలోకానీ ఎక్కడా లేదు. నీయొక్క విమలమైన జ్ఞానంలో ఉంది. నీ సాత్త్వికమైన మనసులో ఉంది. నీవు ఇతరులకు మంచి చేస్తే నీ మనసు ఆనందంతో నిండి పోతుంది. నీవుఇతరులకు చెడు చేస్తే నీ మనసు గిల్టి ఫీల్ అవుతుంది. కాబట్టి విమలమైన జ్ఞానమే సుఖానికి మొదటి మెట్టు. ఈ జ్ఞానం సంపాదించడం మొదట్లోచాలా కష్టంగా ఉంటుంది. దీనికి ధ్యానము, శాస్త్రములు చదవడం, నిష్కామకర్మ, కర్మఫలత్యాగము పాటించాలి. ఇవన్నీ మొదట్లో కష్టమే. కానీ ఆఖరుకు ఇవన్నీ అమృతముతో సమానమైన ఆనందం కలుగజేస్తాయి. అప్పుడే మనలో ఉన్న దు:ఖమును అంతం ఔతుంది. ఇటువంటి సుఖమును సాత్త్వక సుఖము అని అంటారు.

## 38. విషయేన్ద్రియసంయోగా ద్యత్తదగ్రే ऽమృతోపమమ్।
## పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్॥

విషయవాంఛలతోనూ, ఇంద్రియ సంయోగముతోనూ కలిగే సుఖములు మొదట్లో చాలా హాయిగా, ఆనందంగా, అమృతముతో సమానంగా ఉంటాయి కాని వాటి పరిణామాలు మాత్రం అత్యంత దు:ఖమును కలిగిస్తాయి. అవే సుఖములు విషము మాదిరి కనిపిస్తాయి. వీటిని రాజస సుఖములు అని అంటారు.

తరువాత రాజస సుఖమును గురించి వివరిస్తున్నాడు పరమాత్మ.

రాజస సుఖము ధనము, ఆస్తి, పదవి, హెూదా రావడం వలనా, ఇంద్రియముల

సంయోగము అంటే కలయిక వలన, ప్రాపంచిక సుఖముల కొరకు చేసే పనుల వలన కలుగుతుంది. ఆ సుఖంమొదట చాలా సుఖంగా ఆనందంగా ఇష్టంగా అమృతంతో సమానంగా, ఇంకా కావాలి అనేటట్టు ఉంటుంది. తుదకు ఆ సుఖమే అనంతమైన దు:ఖంగా, విషంగా పరిణమిస్తుంది.

దీనికి సులభమైన ఉదాహరణ: మొదటి లడ్డు తింటే తియ్యగా, రుచిగా ఉంటుంది. రెండవది కొంచెం రుచి తక్కువగా ఉంటుంది. ఐదవ లడ్డు వెగటు పుట్టిస్తుంది. తరువాత లడ్డు విషంగా తోస్తుంది. రోగం తెస్తుంది. దు:ఖంగా పరిణమిస్తుంది. చేపలు పట్టేవాడు గాలానికి ఎర కట్టి నీటిలోపల వదులుతాడు. గాలానికి కట్టిన ఎరను చూచిన చేప, ఆ ఎర చాలా రుచిగా ఉంటుంది అని ఆ ఎరను పట్టుకోబోయి గాలానికి తగులుకొని ప్రాణాలు విడుస్తుంది. కాబట్టి చూచినది, విన్నదీ, తాకినదీ నిజముకాదు, వాటి వల్ల వచ్చే సుఖం తాత్కాలికమే. అదే తుదకు విషంగా పరిణమిస్తుంది.

పుట్టగానే భార్య భర్త విడి విడిగా ఉంటారు. కాల వశాత్తు వివాహం జరిగి వారు కలుస్తారు. కొంత కాలం తరువాత, మరణం వారిని విడదీస్తుంది. ఎవరో ఒకరు ఒంటరిగా మిగిలిపోతారు. తరువాత వారు కూడా పోతారు. అలాగే సంతానము. పుట్టిన తరువాత కొంత కాలం తల్లితండ్రులతో ఉంటారు. తరువాత ఎవరికి వారు రెక్కలొచ్చిన పక్షుల్లా ఎగిరిపోతారు.కాబట్టి వివాహం వలన కలిగే సుఖం, సంతానం వలన కలిగే సుఖం కూడా తాత్కాలికమే. శాశ్వతం కాదు. ఇంక ధనము, పదవి, హెూదా గురించి చెప్పనవసరం లేదు. అవి మరీ తాత్కాలికము.

అలాగే విషయ సుఖములు కూడా తాత్కాలికమైనవి, మొదట్లో స్వర్గసుఖాలను మరిపిస్తాయి. కాని క్షణికమైనవి. అవయవముల కలయికతో లభించే సుఖం అవయవములు విడిపోతే అంతం అవుతుంది. మొదట్లో అమృతం లాగా తోచిన సుఖం తుదకు విషప్రాయం అవుతుంది. దీనినే రాజస సుఖం అంటారు. ఈ సుఖం పాలమాదిరి కనిపించే విషం. చాలా ప్రమాదకరం. కాబట్టి ప్రాపంచిక విషయముల వలన కలిగే సుఖములు తుదకు దు:ఖంతో అంతం అవుతాయని తెలిసి సాధకులు చాలా జాగ్రత్తగా ఉండాలి. రాజస సుఖం మనలను మోసం చేస్తుందనీ, పైపై మెరుగులు తక్షణ సుఖాలనుచూచి మోసపోవద్దనీ మనకు తెలియజేస్తున్నాడు కృష్ణపరమాత్మ.

ఇక్కడ మనం ఒక విషయం గమనించాలి. సాత్విక సుఖం మొదట్లో విషం మాదిరి ఉండి, తుదకు అమృతంగా పరిణమిస్తుంది, అలాగే రాజస సుఖం మొదట్లో అమృతం మాదిరి ఉండి తుదకు విషంగా పరిణమిస్తుంది. ఏ సుఖం కోరుకోవాలో మన ఇష్టానికి వదిలేసాడు పరమాత్మ.

## 39. యదగ్రే చానుబన్ధేచ సుఖం మోహనమాత్మనః।
## నిద్రాలస్యప్రమాదోత్థం తత్తామసముదాహృతమ్॥

ఇంక, తామస సుఖం సోమరితనం, అలసత్వము, నిర్లక్ష్యము, మత్తు పదార్థాలు సేవించడం, నిద్ర వీటి వలన కలుగుతుంది. ఈ తామస సుఖం మొదటి నుండి చివరి దాకా మనిషిని అజ్ఞానంలో మత్తులో ఉంచుతుంది. మోహాన్ని కలుగజేస్తుంది.

సుఖాలలో నిద్రా సుఖం,సోమరిగా ఉండటంలో సుఖం, తినికూర్చోడంలో ఉన్న సుఖం, ఇతరులను విమర్శించడంలో సుఖం, తనకు అంతా తెలుసు అనుకొని భ్రమపడటంలో ఉన్న సుఖం ఈ సుఖాలన్నీ తామస సుఖాలు. కొంత మంది కూర్చునే నిద్రపోతారు. బస్సులో నిద్ర, ఆఫీసులో నిద్ర, స్కూలులో నిద్ర. ఇటువంటి వారి ప్రవృత్తి తామసము. ఇది ఒక రకమైన మోహము. వీరు ఏ పనీ సక్రమంగా చేయలేరు. ఒక వేళ చేసినా ఏ మాత్రం శ్రద్ధలేకుండా, అమితమైననిర్లక్ష్యంతో చేస్తారు లేకపోతే సగంలో ఆపేస్తారు. వాయిదాలు వేస్తారు. ఆఫీసులలో కూడా అధికారి ఇటువంటి వారికి పనులుచెప్పడు. చెబితే చెడగొడతాడని భయం. చేసే వాడికే అన్ని పనులు అప్పగిస్తారు. అందుకని ఈ తామసికుడు సుఖంగా నిద్రపోతాడు. లేకపోతే ఇయర్ ఫోన్‌లో పాటలు వింటూ, కాంటీన్లలో కాలక్షేపం చేస్తుంటాడు. సాత్త్వక, రాజసికుల మాదిరి వీడూ సుఖపడతాడు కానీ ఇటువంటి సుఖం తామససుఖం అంటారు. వీరి జీవితంలో పురోగతి ఉండదు. ఎక్కడవేసిన గొంగళి అక్కడే అన్న సామెత మాదిరి ఉంటారు. నిద్రగొట్టుముఖాలు, సోమరిపోతులు అనే పేరు తెచ్చుకుంటారు. ఎవరేమన్నా పట్టించుకోరు. మనలను కాదులే అని తుడిచేసుకుంటారు. వీరి జీవితం వ్యర్థము గా గడిచిపోతుంది.

ఇప్పుడు అందరికీ ఒక సందేహము వస్తుంది. భార్యతో సుఖాలు అనుభవించకూడదా! నిద్రపోకూడదా! కోరిన వస్తువులను కొనుక్కొని సంతోషించకూడదా! అని అనుకుంటారు. అన్ని సుఖాలు అనుభవించాల్సిందే. అందులో తప్పులేదు. ఏ పని ఎప్పుడు ఎలా ఏ విధంగా చేయాలో అలా చేయాలి కానీ అదేపనిగా అదే పని చేయకూడదు. అతి సర్వత్ర వర్జయేత్. ఏదైనా చూచినా, వినినా, తాకినా, అది మనకు అవసరమా అనవసరమా అని బుద్ధితో ఆలోచించి ఆ వస్తువును పొందాలికానీ, చూచిందల్లా నాది కావాలి అని అనుకోవడం మూర్ఖత్వం. ప్రతివాడికీ స్త్రీపురుషసంయోగం వలన కలిగే సుఖం అందించాలని, తద్వారా సృష్టి కార్యమును కొనసాగించాలనీ, వివాహ వ్యవస్థను పెట్టారు. ఏకపత్నీవ్రతమును ఆచరించమని మనకురామాయణ మహాకావ్యాన్ని అందించారు వాల్మీకి. పరస్త్రీ వ్యామోహము వినాశనానికి దారితీస్తుంది అని రావణుని పాత్ర ద్వారా తెలియజేసారు. కులస్త్రీని అవమానిస్తే కులక్షయం అవుతుందని సుయోధనుని పాత్రద్వారా తెలియజేసాడు వ్యాసుడు. తాను పరిపాలించవలసిన గాంధార రాజ్యమును వదిలిపెట్టి,

హస్తినలో తిష్టవేసి, సోమరిలా తింటూ, కుయుక్తులుపన్నుతూ, ఇతరులకు హాని చేస్తూ తామసంలో మునిగిపోయి తుదకు సర్వనాశనానికి దారితీసిన పరిణామాలను శకుని పాత్రద్వారా తెలియజేసాడు వ్యాసుడు. కాబట్టి అన్నీ అవసరమే కానీ ఎంత మేరకు అవసరమో అంతవరకే అనుభవించాలి. విచక్షణా బుద్ధిని కలిగి ఉండాలి. ఆహార, నిద్రా మైథునాలే పరమార్థంగా భావించకుండా, భగవద్ధ్యానము, దైవచింతన, సత్సంగము, గురుసేవ, పరోపకారము, నిష్కామ కర్మ, నిరహంకారము, నిర్మోహత్వము ఇవి కూడా పరమార్థాలుగా భావించాలి. ఇదే గీతాబోధ.

## 40. న తదస్తి పృథివ్యాం వా దివి దేవేషు వా పునః।
## సత్త్వం ప్రకృతిజైర్ముక్తం యదేభిస్స్యాత్త్రిభిర్గుణైః॥

సత్వ,రజస్తమోగుణములు ప్రకృతి అంతా నిండి ఉన్నాయి. ఈ మూడు గుణములతో కూడి ఉండని పదార్థము, విషయము భూలోకములో కానీ, దేవలోకములో కానీ, మానవులలో గానీ, దేవతలో కానీ లేదు. (మానవులు దేవతలు అందరూ సత్వ,రజస్తమోగుణములకు వశవర్తులై ఉన్నారు.)

అర్జునా! ఈ ప్రకృతి సత్వ,రజస్తమోగుణముల కలయిక. ఈ ప్రకృతిలో ఉన్న అన్ని జీవులలో వస్తువులలో, చరాచర ప్రాణులలో ఈ మూడు గుణములు ఉన్నాయి. ఈ మూడుగుణములు లేని వారు దేవతలలోగానీ, మానవులలోగానీ, భూలోకములో కానీ, స్వర్గలోకములో కానీ, ఎక్కడా లేరు. అందరిలోనూ ఈ మూడు గుణాలు నిండి ఉన్నాయి. ఒక్క పరమాత్మ మాత్రమే త్రిగుణాతీతుడు. మనం కూడా గుణాతీత స్థితికి చేరుకుంటే, పరమాత్మలో లీనం అవుతాము.

మనకు వంశపారంపర్యంగా కొన్ని వ్యాధులు, లక్షణాలు వస్తుంటాయి. తండ్రి నుండి కానీ, తల్లి నుండి కానీ షుగర్, బిపి సంతానానికి సంక్రమించడం సర్వసాధారణం. అలాగే ప్రకృతిజైః అని వాడారు అంటే ఈ మూడుగుణాలు ప్రకృతిలో నుండి పుట్టాయి. మనందరికీ ప్రకృతి తల్లి, తండ్రి. కాబట్టి ప్రకృతిలో నుండి పుట్టిన అందరిలోనూ ఈ మూడు గుణాలు అంతర్గతంగా తమ ప్రభావాన్ని చూపుతుంటాయి అని తెలుసుకోవాలి. కాబట్టి అందరిలోనూ అంటే మంచి వారిలోనూ, చెడ్డ వారిలోనూ, మధ్యేమార్గంగా ఉండేవారిలోనూ ఈ మూడుగుణాలుఉంటాయి. ఈ మూడు గుణాలు లేని వాడు, లేని జీవి, జంతుజాలము, పశుపక్ష్యాదులు, వృక్షజాలము, మూడులోకాలలో ఎవరూ లేరు, ఏదీ లేదు. కాబట్టి ఆ మూడుగుణాలను వివేకంతో, విజ్ఞతలో, బుద్ధిని, విచక్షణను ఉపయోగించి వాడుకోవాలి కాని వాటి ప్రభావానికి లోనుకాకూడదు. సత్త్వగుణము ఎక్కువగానూ, రాజస,తమోగుణములను వాటి వాటి మోతాదులోనూ ఉంచుకుంటే జీవితం సుఖమయం

అవుతుంది.

41. బ్రాహ్మణ క్షత్రియ విశాం శూద్రాణాం చ పరన్తప।
కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవైర్గుణైః॥

అర్జునా! మానవులు అందరూ బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు అనే నాలుగు వర్ణాలుగా విభజింపబడ్డారు. వారి వారి స్వభావములను అనుసరించి, గుణములను అనుసరించి వారికి కర్తవ్య కర్మలు విధింపబడ్డాయి. ఇదే విషయాన్ని 4వ అధ్యాయము 13వ శ్లోకంలో ఈ విధంగా చెప్పారు. "చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణ కర్మ విభాగశః" ఇక్కడ కూడా అదే భావాన్ని చెబుతున్నాడు.

ఇక్కడు రెండు విషయాలు ఉన్నాయి. ఒకటి స్వభావము అంటే పూర్వజన్మ వాసనలతో స్వభావం ఏర్పడుతుంది. ఆ స్వభావమే ఈ జన్మలో అతని గుణమును నిర్ణయిస్తుంది. ఆ గుణములను బట్టి అతని వర్ణం నిర్ణయింపబడుతుంది. అంతేకానీ ఎవరికీ పుట్టుకతోనే వారి వర్ణము అంటే కులము నిర్ణయించబడదు. మనం అజ్ఞానంతో మూర్ఖంగా మానవుల మధ్య అంతరాలు అడ్డుగోడలు ఏర్పరచుకున్నాము. బలీయమైన కులవ్యవస్థను నిర్మించుకున్నాము. పుట్టుకతో వచ్చేది కులం అనే మూఢనమ్మకంతో ఉన్నాము. అది భగవంతుడు సమ్మతించడు. భగవంతుని దృష్టిలో అందరూ సమానమే. ఎవరూ ఎక్కువ కాదు. ఎవరూ తక్కువ కాదు. అందరికీ మోక్షము పొందే హక్కు ఉంది.

ఇప్పుడు నాటి వర్ణవ్యవస్థగురించి వివరంగా తెలుసుకుందాము. ఎవరిని బ్రాహ్మణులు అంటారో, ఎవరికి క్షత్రియులు అంటారో, ఎవరిని వైశ్యులు అంటారో, ఎవరిని శూద్రులు అంటారో ఇక్కడ వివరంగా చెప్పాడు పరమాత్మ. ఈ గుణములు కలవారు, ఆయా కర్మలు చేసేవారు మాత్రమే, ఆయా వర్ణములకు చెందినవారు అని తెలుసుకోవాలి కానీ పుట్టుకతో కాదు. పుట్టుకతో వర్ణము, కులము నిర్ణయింప బడటం తరువాత కాలంలో కలిగిన పరిణామము. ఆ పరిణామము ప్రస్తుత కాలంలో వికృతరూపం దాల్చింది.

## 42. శమో దమ స్తపశ్శౌచం క్షాన్తి రార్జవమేవ చ।
## జ్ఞానం విజ్ఞానమా స్తిక్యం బ్రాహ్మం కర్మ స్వభావజమ్॥

ఇంద్రియములను నిగ్రహించడం, మనస్సును అదుపులో పెట్టుకోవడం, తపస్సు చేయడం అంటే అనుకున్న పనిని ఒక తపస్సు లాగా శ్రద్ధాభక్తులతో చేయగలగాలి, శరీరాన్ని, మనసును పరిశుభ్రంగా ఉంచుకోవడం, తన జీవనానికి కావలసిన వరకే సంపాదించుకోవాలి కాని ఎక్కువ సంపదలు, సుఖాల జోలికి పోకూడదు. శరీరమును, మనస్సును శుచిగా ఉంచుకోవడం, ఓర్పువహించడం, కపటం లేకుండా, సక్రమమైన ప్రవర్తన కలిగి ఉండటం, త్రికరణ శుద్ధి కలిగి ఉండాలి అంటే మనసులో అనుకున్నది, మాటలతో చెప్పేది, చేతలతో చేసేది ఒకే విధంగా ఉండాలి. నిరంతరం వేదములను, శాస్త్రములను అధ్యయనం చేయడం, తద్వారా జ్ఞానం సంపాదించడం, సంపాదించిన జ్ఞానమును అనుభవంలోకి తెచ్చుకొని, ఇతరులకు మార్గదర్శకం చేయడం, దేవుడిని నమ్మడం, వేదముల మీద, శాస్త్రముల మీద నమ్మకం కలిగి వాటిని నిరంతరం అధ్యయనం చేయడం, గురువు గారి యందు భక్తి కలిగి ఉండటం, ఇవి అన్నీ బ్రాహ్మణులు ఆచరించవలసిన కర్మలు. ఈ కర్మలన్నీ బ్రాహ్మణునికి స్వభావ సిద్ధంగా పుట్టినవి. ఈ కర్మలు ఆచరిస్తేనే అతడిని బ్రాహ్మణుడు అని అంటారు.

స్థూలంగా చెప్పాలంటే వేదములను, శాస్త్రములను అధ్యయనం చేయడం, వాటిని ఆచరించడం, వాటిని శిష్యులకు బోధించడం, ఆ విధంగా వేదవిజ్ఞానాన్ని గురుశిష్య పరంపరగా, తల్లితండ్రులు తమ కుమారులకు ఇచ్చే వారసత్వసంపదగా తరతరాలుగా వ్యాప్తిచెందించడం, మానవులను ధర్మమార్గంలో నడిపించడం....దీనినే బ్రాహ్మణ కర్మలు అని అంటారు. ఇవి చేయని వాడు పుట్టుకతో బ్రాహ్మణుడు అయినా, కర్మరీత్యా, స్వభావ రీత్యా బ్రాహ్మణుడు కాడు అనే విషయం చెప్పనక్కరలేదు.

## 43. శౌర్యం తేజో ధృతిర్దాక్ష్యం యుద్ధేచాప్యపలాయనమ్।
## దానమీశ్వరభావశ్చ క్షాత్రం కర్మ స్వభావజమ్॥

ధైర్య,శౌర్య,పరాక్రమాలు కలిగి ఉండటం, తేజస్సు కలిగి ఉండటం, ఎదుటి వాడితో పోరాడే సామర్థ్యం కలిగి ఉండటం, అందరినీ పాలించే సామర్థ్యం, అందరినీ అదుపులో పెట్టగలిగే నేర్పు, శాసించగల స్థైర్యం కలిగి ఉండటం, అమితమైన పట్టుదల కలిగిఉండటం, పిరికితనం, యుద్ధంలో పారిపోయే బుద్ధి లేకుండా ఉండటం, పేదలకు, అర్హులకు దానధర్మాలు చేయడం,

పరిపాలనా దక్షత, న్యాయశాస్త్ర నైపుణ్యము కలిగి ఉండటం, ఇవన్నీ క్షత్రియ ధర్మాలు. ఈ లక్షణాలు ఉన్నవాడు ఎవరైనా క్షత్రియుడే. బ్రాహ్మణుడు తన బుద్ధిని ఉపయోగిస్తే, క్షత్రియుడు తన శరీరాన్ని, బుద్ధిని రెండింటినీ ఉపయోగిస్తాడు. బ్రాహ్మణుడు మంత్రిగా మంత్రాంగం చేస్తే, క్షత్రియుడు తన క్షాత్రంతో దానిని సమర్థవంతంగా ఆచరిస్తాడు. అందుకే ముందు నుండి బ్రాహ్మణ, క్షత్రియులకు అవినాభావ సంబంధం ఉంది.

దేశాలకు మధ్య జరిగే యుద్ధాలలో సైనికులుపాల్గొంటారు. ధైర్యంతో పోరాడతారు. కాని, మనలో కూడా ప్రతిరోజూ మంచి చెడులకు మధ్య, ఇది చెయ్యాలా, అది చెయ్యాలా, అవునా కాదా....అనే సమస్యలు.... ఈ విరుద్ధభావాల మధ్య నిరంతరం అంతర్యుద్ధం జరుగుతూనే ఉంటుంది. కొంత మంది భయపడి పిరికి వాళ్ల లాగా ఆత్మహత్యలు చేసుకుంటారు. మరి కొందరు ఎటువంటిసమస్యను అయినా ధైర్యంగా ఎదుర్కొంటారు. మరి కొందరు సమస్యలకు భయపడి పారి పోతారు. దైనందిన సమస్యలను ఎదుర్కోడంలో ప్రతివాడూ క్షత్రియగుణమును ప్రదర్శించాలి. వాడే క్షత్రియ స్వభావము కలవాడు. పిరికితనంతో ఆత్మహత్యలకు పాల్పడితే వాడికి క్షత్రియ స్వభావము లేనట్టే. అంతే కాకుండా క్షత్రియ స్వభావాలలో పరిపాలన, న్యాయనిర్ణయం ముఖ్యమైనవి. ఒక విధంగాచెప్పుకోవాలంటే ఈ పరిపాలన, న్యాయవ్యవస్థలో కూడా అవినీతి వేళ్లూనుకు పోయింది. అధికారంలో ఉన్న రాజకీయనాయకులు, కార్యదర్శి స్థాయి అధికారులు కూడా అవినీతికి పాల్పడుతున్నారు. న్యాయవ్యవస్థకూడా అప్పుడప్పుడు ఈ అవినీతి ఊబిలో చిక్కుకుపోతూ ఉంది. ఇటువంటి వారిని క్షత్రియస్వభావం కలవారు అని అనలేము. క్షత్రియుడి మూలస్వభావము అవినీతి రహిత జీవనము, నిస్వార్థపరత్వము, నిష్పక్షపాతము. ఇవి లేకపోతే అతడు క్షత్రియుడు కాలేడు. మూర్తీభవించిన ధర్మస్వరూపుడు కాబట్టే యమధర్మరాజును సమవర్తి అని అన్నారు. కాని మన సినిమాలు ఆయనను ఎలా చిత్రీకరిస్తున్నారో చూస్తే మనం సిగ్గుపడాలి.

## 44. కృషి, గోరక్షవాణిజ్యం వైశ్యం కర్మస్వభావజమ్।
## పరిచర్యాత్మకం కర్మశూద్రస్యాపి స్వభావజమ్॥

వ్యవసాయం చేయడం, పంటలు పండించడం, వాణిజ్యము, వ్యాపారము నిర్వహించడం, గోవులను మొదలగు పాడిజంతువులను రక్షించడం, వైశ్యుల స్వభావములు. అలాగే ఇతరులను సేవించడం, వారికి సేవలందించడం తగిన ప్రతిఫలం పుచ్చుకోవడం అంటే బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య లక్షణములు కలవారికి సహాయకులుగా ఉండటం,వారి వారి వృత్తులలో సహాయపడటం. ఇవి శూద్రుల లక్షణములు. అంటే ప్రజలకు సేవచేసే అన్ని పనులు (పబ్లిక్ సర్వీసెస్) శూద్రుల లక్షణములు. శూద్రలక్షణములు కూడా అత్యంత ప్రాముఖ్యతను సంతరించుకున్నాయి.

వారిని తక్కువ స్థాయి లక్షణములు కల వారిగా చూడటం అవివేకము.

భగవద్గీత చెప్పబడిన రోజుల్లో వ్యవసాయము మానవుల ముఖ్యవృత్తి, ఆదాయ వనరు. దాని వలన ఆహారం లభ్యంఅవుతుంది. అందుకే ఈ పనిని మూడవ వర్ణానికి చెందిన వైశ్యులకు అప్పగించారు. పంటలు పండించడం ముఖ్యవృత్తి అయితే, భూమిని దున్నడానికి ఇతర వ్యవసాయ పనులకు గోవులు, ఎద్దులు అవసరం. అందుకని గోరక్షణ, పశుసంపదను కూడా వారికి అప్పగించారు. మరి ఈ రెండింటి వలన వచ్చే ఆదాయాన్ని అందరికీ పంచాలి కదా! అందుకని వ్యాపారం చేయాలి. తనకు ఉన్న దానిని ఇతరులకు ఇచ్చి వారి వద్ద ఉన్న దానిని తాను తీసుకోవడం వ్యాపారం. పూర్వపు రోజుల్లో వినిమయ వ్యాపారం అంటే బార్టర్ సిస్టమ్ ఉండేది. తరువాత నాణేలు ధనం అమలులోకి వచ్చిన తరువాత వస్తువులు ధనం ఇచ్చి కొనుక్కోవడం మొదలయింది. ఈ వ్యవహారం అంతా వైశ్యులు చూచేవారు. మరి ఈ పనులు చేయడానికి సహాయకులు కావాలి. అందుకని నాలుగవ కులం శూద్రకులం ఏర్పరిచారు. వారు ప్రజాసేవ చేస్తుంటారు. దానికి ప్రతిఫలం పుచ్చుకుంటారు. ఈ విధంగా వర్ణవ్యవస్థ ఏర్పడింది.

ఇప్పుడు మనం ఈ వర్ణ వ్యవస్థను ఒక సారి పరిశీలిద్దాము. మానవులందరికీ ఒకే విధమైన శక్తి యుక్తులుఉండవు. కాబట్టి ఏ స్వభావము, ఏ లక్షణము కల వారికి ఆయా పనులు అప్పగించారు. దానినే వర్ణవ్యవస్థ అని అన్నారు. ఆలోచనా శక్తి కలిగి, స్వార్థబుద్ధి లేని వానికి బ్రాహ్మణ కర్మలు అప్పచెప్పారు. కండబలం, శౌర్యప్రతాపాలు ఉండి, పరిపాలనా సామర్థ్యం కలిగి స్వార్ధబుద్ధి కొంచెంగా కల వారికి క్షత్రియ కర్మలు అప్పగించారు. ఆలోచనాశక్తి, స్వార్ధపరత్వము, వ్యాపార,వాణిజ్యములలో దక్షతకలిగిన వారికి వైశ్య కర్మలు అప్పగించారు. అంతగా ఆలోచించే శక్తి లేని వారికి, చెప్పిన పని చేయగలిగిన వారికి, పైమూడు వర్ణముల వారికి సహాయకులుగా నియమించారు. వీరిలో ఏ ఒక్క వ్యవస్థ సక్రమంగా పని చేయకపోయినా సమాజం దెబ్బతింటుంది. కాబట్టి అందరూ గొప్పవారే. అందరూ సమాజానికి అవసరమే. ఈ ప్రకారంగా వారి వారి శక్తిసామర్థ్యములను బట్టి నిర్ణయింపబడిన వర్ణవ్యవస్థ, కాలక్రమేణా కులవ్యవస్థగా మార్పుచెంది, మానవుల మధ్య అడ్డుగోడలు ఏర్పరచింది. ఆతరువాత గుణములను బట్టి చేయవలసిన కర్మలు, స్వార్థం ప్రబలిపోయి, ధనము, ప్రతిఫలమే ప్రధానంగా రూపొందాయి. డాక్టర్ల కులం, లాయర్ల కులం, ఇంజనీర్ల కులం, సాఫ్ట్‌వేర్ కులం, రాజకీయ కులం ఇలాగా ధనము, పదవి, హెూదా, ఇవే ప్రధాన లక్ష్యాలుగా రూపొందాయి. పుట్టుకతో వచ్చిన కులాలు రిజర్వేషన్లరూపంలో మనుషుల మధ్య భేదభావాలు, భావోద్వేగాలు, ద్వేషాలు రెచ్చగొట్టడానికి మాత్రమే ఉపయోగపడుతున్నాయి. ఇది ఈ నాటి వ్యవస్థ.

## 45. స్వే స్వే కర్మణ్యభిరత: సంసిద్ధిం లభతే నర:।
## స్వకర్మనిరత: సిద్ధిం యథా విందతి తచ్ఛృణు॥

ఎవరైతే తనయొక్క స్వభావసిద్ధంగా, తనకు ఆసక్తి కల కర్మలను నిర్వర్తిస్తాడో, అతడు తాను చేసే కర్మలలో సిద్ధిని, సఫలతను పొందుతున్నాడు. ఈ ప్రకారంగా తన స్వభావానికి అనుగుణంగా తనకు ఆసక్తి కల కర్మలను ఎవరైతే ఆచరిస్తాడో, అతడు జ్ఞాన సిద్ధిని కూడా పొందుతాడు. తాను చేసే కర్మలలో సిద్ధి ఎలా పొందాలో వివరంగా చెబుతాను శ్రద్ధగా విను అని అంటున్నాడు కృష్ణుడు.

పై విధంగా ఎవరి గుణములను బట్టి వారి కర్మలను నిర్ణయించారు అని చెప్పి, ఎవరికి నిర్ణయింపబడిన కర్మలను, ఆసక్తితో, శ్రద్ధతో, వారు సక్రమంగా నిర్వర్తిస్తే, వారికి జ్ఞానము దానంతట అదే లభిస్తుంది. స్వకర్మలను నిర్వర్తించే వారికి జ్ఞానయోగము ఎలా సిద్ధిస్తుందో వివరిస్తాను అంటున్నాడు పరమాత్మ. ఇక్కడ చెప్పని విషయం ఒకటి ఉంది. అందరూ వారి వారికి విధింపబడిన కర్తవ్య కర్మలను సక్రమంగా, శ్రద్ధగా, భక్తితో చేయాలి. ఆ కర్మఫలములను పరమాత్మకు అర్పించాలి. అప్పుడు వారికి జ్ఞానము సునాయాసంగా లభిస్తుంది. జ్ఞానం కలిగితే మోక్షమార్గము సులభంగా లభిస్తుంది. అది ఎలాగా అనే విషయం ఇక్కడ వివరించాడు పరమాత్మ. అర్జునుడు క్షత్రియుడు. క్షత్రియ స్వభావం కలవాడు. క్షత్రియ లక్షణములు కలవాడు. క్షత్రియ ధర్మము ధర్మయుద్ధం చేయడం. ధర్మాన్ని రక్షించడం. దుష్టులను శిక్షించడం. ప్రజలను రక్షించడం. అందుకే అర్జునుడిని క్షాత్రధర్మం అయిన యుద్ధం చేయమంటున్నాడు కృష్ణుడు.

## 46. యత: ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతమ్।
## స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవ:॥

ఎవరి వలన ఈ చరాచర భూతములకు సృష్టి, స్థితి, లయములు కలుగుతున్నాయో, ఎవరు ఈ అనంత విశ్వం అంతా వ్యాపించి ఉన్నాడో, అట్టి చైతన్యస్వరూపుడైన పరమాత్మను ప్రతి మానవుడు తనకు విధించిన కర్మలను నిర్వర్తించడం వలన ఆరాధిస్తున్నాడు. జ్ఞాన సిద్ధిని పొందుతున్నాడు.

ఈ శ్లోకంలో పనియే దైవము, వర్క్ ఈజ్ వర్షిప్ అనే సిద్ధాంతాన్ని వివరిస్తున్నాడు కృష్ణుడు. ఈ అనంత విశ్వం పరమాత్మ వలన సృష్టించబడింది. పోషించబడుతూ ఉంది. లయించబడుతూ ఉంది. కాబట్టి చరాచర జీవరాసులకు ఆధారము ఆ పరమాత్మ. ఈ ప్రకృతి

ఇందులో ఉన్న జీవులు జడములు. అందులో పరమాత్మ తన చైతన్యాన్ని ప్రవేశపట్టి నందువలననే ఈ సృష్టిక్రమం నడుస్తూ ఉంది. ఉదాహరణకు పురుషుడు తన వీర్యం ద్వారా జీవాన్ని ఇస్తాడు. స్త్రీ శరీరాన్ని ఇస్తుంది. స్త్రీపురుషుల సంయోగంతో అండం, పిండం తయారవుతుంది. ఆ పిండంలో పరమాత్మ చైతన్య రూపుడుగా చేరితే అది చైతన్యవంతమవుతుంది. అలాగే ఈ జీవరాసులన్నీ కూడా సృష్టింపబడుతున్నాయి. కాబట్టి ఆ పరమాత్మయే మనందరికీ ఆరాధ్యుడు. యేన సర్వమిదం తతమ్‌అంటే ఎవనిచేత ఈ ప్రపంచము వ్యాపింపబడి ఉన్నదో అంటే పరమాత్మ అంతటా వ్యాపించి ఉన్నాడు. విష్ణు అనే పదానికి సర్వవ్యాపి అని అర్థం. "చక్రి సర్వోపగతుండు" అని పోతన గారు చెప్పారు. పరమాత్మ లేని చోటు లేదు. కాని మన మామూలు కళ్లకు కనపడదు. కేవలం జ్ఞాననేత్రంతో మాత్రమే పరమాత్మను చూడగలము. ఆ పరమాత్మయే మనం చేసే పనులన్నీ సాక్షీభూతంగా చూస్తున్నాడు.

ఈ శ్లోకంలో మరొక చక్కనిపదం వాడాడు. "స్వకర్మణా తమభ్యర్చ్య" అంటే కర్మల వలన కూడా మోక్షము పొందగలడు అని భావన. పుట్టిన ప్రతివ్యక్తి కర్మచేయక తప్పదు. కర్మ చేస్తే బంధనములు అంటుకుంటాయి. మరి ఎలాగా అంటే కర్మను కర్మగా కాకుండా ఒక యోగంగా చేయాలి. అంటే ఏ కర్మ చేసినా శ్రద్ధతో చేయాలి కానీ కర్తృత్వభావన అంటే నేను ఈ కర్మ చేస్తున్నాను అనే భావన లేకుండా చేయాలి. ఏదో ఫలాన్ని ఆశించి చేయకూడదు.మనం చేసే ప్రతి కర్మను ఒక పూజలాగా, తపస్సులాగా చేయాలి (వర్క్ ఈజ్ వర్షిప్). అంటే నిరంతరం మనస్సు దేవుని మీద లగ్నం అయి ఉండాలి. ఆ విధంగా కర్మ చేసినందు వలన వచ్చిన ఫలం అంటే మంచి ఫలం అయినా, చెడ్డ ఫలం అయినా, ఈశ్వరార్పణం చేయాలి. ఆ కర్మఫలాన్ని ఈశ్వరుడి ప్రసాదంగా స్వీకరించాలి. అప్పుడు ఆ కర్మచేసినందు వలన కానీ, ఆ కర్మఫలము వలన కానీ, ఎటువంటి బంధనములు కలుగవు. నా కర్తవ్యం నేను చేసాను. ఫలితం పరమాత్ముడిది అని అనుకుంటే ఏ సుఖదు:ఖాలు, బంధనములు ఉండవు.

కాబట్టి, ఎవరి పని వాళ్లు సక్రమంగా శ్రద్ధతో, నిష్ఠతో, ధర్మబద్ధంగా, న్యాయబద్ధంగా, నిస్వార్థంగా చేసుకుంటూ పరమాత్మను స్మరించుకుంటూ, వారు చేసిన కర్మల యొక్క ఫలితముల మీద ఆసక్తి లేకుండా, వాటిని పరమాత్మ అర్పణ చేస్తే, వారుకూడా మోక్షమును పొందుతారు. అటువంటి వారు వేదములు శాస్త్రములు చదవనక్కరలేదు. జ్ఞానము దానంతట అదే వస్తుంది. ఫలం కోరి, ఆ ఫలాన్ని అనుభవించడానికే కర్మ చేస్తే, దాని వలన ప్రయోజనము లేదు. కాబట్టి మన పనులు మనం చేసుకుంటూ కూడా మోక్షమును పొందవచ్చు అని ఇక్కడ పరమాత్మ నిరూపించాడు. ఎలాగంటే మనం చేసే కర్మలో భగవంతుని చూడాలి. మనం చేసే కర్మను ఒక పూజగా తపస్సుగా చేయాలి. శ్రద్ధాభక్తులతో చేయాలి. నిష్కామంగా చేయాలి. ఫలితం ఆశించి చేయకూడదు. వచ్చిన ఫలితాన్ని పరమాత్మకు అర్పించాలి. ఈ ప్రకారంగా చేస్తే ఆ కర్మఫలములు అతనికి అంటవు. పూర్వజన్మవాసనలు కూడా నాశనం అయి పోతాయి. కాబట్టి కర్మచేయడం

తప్పుకాదు. దానిని సరి అయిన రీతిలో చేయకపోవడమే తప్పు. స్వకర్మణా తాను చేసే కర్మలతోనే, తమభ్యర్చ్య అంటే భగవంతుని అర్చించవచ్చును. ఇందాక చెప్పిన వర్క్ ఈజ్ వర్షిప్ అనే ఇంగ్లీషు మాటకు ఇది సరైన వివరణ.

"సిద్ధిం విన్దతి మానవ:" అంటే మానవులు కర్మలు చేయడం వలన కర్మ ఫలితములనే కాకుండా మోక్షమును కూడా పొందుతారు అని పరమాత్మ చెప్పాడు. కాబట్టి మనం కర్మలు చేస్తూనే ఆ కర్మల ద్వారా పరమాత్మను ఆరాధిస్తూ మోక్షమును పొందాలి.

## 47. శ్రేయాన్స్వధర్మోవిగుణ: పరధర్మాత్స్వనుష్ఠితాత్। స్వభావనియతం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్॥

తనకు నిర్దేశింపబడిన ధర్మము అంటే స్వధర్మము గుణములేనిదిగా కనపడినప్పటికినీ, కష్టతరమైనప్పటికినీ, ఇతర ధర్మములు ఎంత మంచివిగా కనపడినప్పటికిన్నీ, పరధర్మము కంటే స్వధర్మము శ్రేష్టమైనదే అవుతుంది. స్వధర్మాన్ని పాటిస్తే ఎటువంటి పాపము అంటదు.

(ఇదే శ్లోకం మీకు మూడవ అధ్యాయం 35వ శ్లోకంగా కనిపిస్తుంది. ఆ శ్లోకాన్నే పదాలు మార్చి అదే భావాన్ని ఇక్కడ తెలియజేసారు వ్యాసుల వారు.)

ప్రతి మానవుడికి ఒక ధర్మం, కర్తవ్యం ఉంటుంది. జంతువులకు కూడా ధర్మం ఉంటుంది. కుక్క విశ్వాసము. అది దాని ధర్మము. దాని ధర్మాన్ని అది ఎన్నటికీ విడిచిపెట్టదు. కాని మనిషి విశ్వాస ఘాతకం, నమ్మకద్రోహం చేయడంలో ఉన్నత ప్రమాణాలు నెలకొల్పాడు. క్రూర జంతువులకు క్రూరత్వం వాటి ధర్మం. ఆ క్రూరత్వాన్ని మానవుడు పుణికిపుచ్చుకున్నాడు. క్రూర జంతువులను మించి పోయాడు. పిల్లి తన తోటి పిల్లిని చంపదు. పులి సాటి పులిని చంపదు. కాని మానవుడు తన తోటి మానవుని చంపుతున్నాడు. అంటే మానవునికి తన స్వధర్మం కంటే పరధర్మం మీద మక్కువ ఎక్కువ. మానవ ధర్మం మానవత్వం. అందరినీ సమానంగా తన మాదిరి చూడటం. ఇది చాలా కష్టం. అందుకే మానవుడు అందరినీ భేదబుద్ధితోనే చూస్తున్నాడు. అంటే మానవులు ఎవరి ధర్మం వారు పాటించడం లేదు. పరధర్మాన్ని పాటిస్తున్నారు.

స్వధర్మం ఆచరించడం చాలా కష్టం. కాబట్టి స్వధర్మం పనికిరాదు అని అవివేకంతో అనుకుంటూ ఉంటారు. పరధర్మం చాలా మంచిది అని భావిస్తుంటారు. ఎలాగంటే విద్యార్థి ధర్మం పాఠశాలకు వెళ్లి కాలేజీకి వెళ్లి చదువుకోవడం. చదువుకున్న పాఠాలు రాత్రి వల్లెవేయడం. ఇది

చాలా కష్టం. కాని స్కూలుకాలేజీ ఎగ్గొట్టి తిరగడం పరధర్మం, అది చాలా సుఖం. అలాగే ఉపాధ్యాయులు, ఉద్యోగస్తులు తమ తమ విద్యుక్త ధర్మమును వదిలిపెట్టి స్వలాభం కోసం రాజకీయాలలో, ఇతర వ్యాపకాలలో పాల్గొంటున్నారు. రాజకీయ నాయకులకు ప్రజాసేవ ధర్మము. కాని వారు తమ ధర్మాన్ని వదిలిపెట్టి పరధర్మాన్ని ఆశ్రయిస్తున్నారు. ఇంకా చెప్పాలంటే తాము ఎక్కడి నుండి వచ్చామో తెలుసుకోవడం స్వధర్మం. అంటే నేను ఎవరు? కోహం? నేను వేరు దేహము వేరు అని తెలుసుకోవడం. నిష్కామ కర్మలు చేయడం. భగవంతుని సేవించడం. ఈ జనన మరణ చక్రం నుండి విముక్తి పొందడం ఇది స్వధర్మం. ఇది చాలా కష్టం. నేనే ఈ శరీరము. ఇదంతా నాది, ఈ ప్రాపంచిక సుఖములు అనుభవిస్తాను, ఆస్తులు, భార్యాబిడ్డలు, బంధుమిత్రులే నా సర్వస్వం అనడం పరధర్మం. ఇది చాలా సుఖంగా ఆనందంగా ఉంటుంది.

ఆఖరుగా ఒక్కమాట. ప్రతి వ్యక్తికీ వివాహ బంధం ఉంటుంది. భార్య ను సహధర్మచారిణి గా చూడటం భర్త ధర్మం. భార్యను వదిలిపెట్టి ఇతర స్త్రీల మీద వ్యామోహం పెంచుకోవడం పరధర్మం. ఇదే సూత్రం స్త్రీలకు కూడా వర్తిస్తుంది. భార్య, భర్తలు ఎవరి ధర్మం వారు నిర్వర్తిస్తే, ఈ నేరాలు ఘోరాలకు ఆస్కారమే ఉండదు అని గ్రహించాలి. రాముడు స్వధర్మాన్ని పాటించాడు. పోగొట్టుకున్న రాజ్యాన్ని తిరిగి పొందగలిగాడు. రావణుడు పరధర్మాన్ని ఆశ్రయించాడు. ఇతరుల సొత్తుకు ఆశించాడు. ఉన్న రాజ్యం పోయింది. తుదకు ప్రాణం కూడా పోయింది. ఇదే మంచి ఉదాహరణ.

ఎవరైతే కొంచెం కష్టమైనా స్వధర్మాన్ని పాటిస్తూ, పరధర్మం జోలికి పోకుండా ఉంటే, అతడికి ఎటువంటి పాపము అంటదు. ఆధ్యాత్మికంగా చెప్పుకోవాలంటే స్వధర్మము అంటే ఆత్మధర్మము. ఆత్మజ్ఞానం సంపాదించడం. అలా కాకుండా ధనసంపాదనే ధ్యేయంగా, ప్రపంచ జ్ఞానం మాత్రమే సంపాదించడం పరధర్మం.

## 48. సహజం కర్మ కౌన్తేయ! సదోషమపి న త్యజేత్। సర్వారమ్భా హి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః॥

ఓ అర్జునా! మానవులకు తమ స్వభావసిద్ధమైన కర్మ దోషములో కూడినది అయినను, స్వధర్మమును వదలకూడదు. ఎలాగంటే అగ్ని ఎంతటి ప్రకాశాన్ని ఇస్తున్నా, అగ్ని పొగ తో కప్పబడి ఉన్నట్టు, ఈ లోకంలో చేయబడే ప్రతి కర్మకూడా ఏదో ఒక దోషముతో కప్పబడి ఉంది.

కర్మల గురించి మరి కొంచెం వివరంగా చెబుతున్నాడు పరమాత్మ. పరిశుద్ధమైన కర్మ అంటూ ఏదీ లేదు. అన్ని కర్మలు మూడుగుణముల హెచ్చుతగ్గులతో కప్పబడి ఉంటాయి. కాబట్టి ప్రతి కర్మలోనూ ఏదో ఒక దోషం ఉండనే ఉంటుంది. అగ్ని పవిత్రమైనది. ప్రకాశాన్ని ఇస్తుంది.

వెలుగును ఇస్తుంది. కానీ అగ్నిపక్కనే పొగ కూడా ఉంటుంది. పొగ ఉందని చెప్పి అగ్నిని వదిలిపెట్టలేము కదా. అలాగే ప్రతి కర్మలో వాటి గుణముల భేదములను అనుసరించి ఏదో ఒక దోషం ఉండనే ఉంటుంది. ఏదో దోషం ఉందని చెప్పి ఆయా కర్మలు చేయకుండా ఉండకూడదు. ఆ దోషములను వదిలిపెట్టి కర్మలు చేయాలి కానీ ఏదో దోషం ఉందని మొత్తం కర్మనే వదలడం మంచిది కాదు. నిష్కామంగా, ఫలాపేక్ష లేకుండా చేస్తే, కర్మఫలములను భగవంతుడికి అర్పిస్తే, ఆ కర్మలలో దోషం ఉన్నా, ఆ కర్మల వాసనలు అంటవు. ఇక్కడ కర్మ అంటే విహిత కర్మ అంటే చేయదగిన కర్మ అని అర్థం. చేయకూడని కర్మల గురించి ఇక్కడ చెప్పడం లేదు. చేయదగిన కర్మలలో గుణభేదము వలన దోషములు ఉన్నా, వాటిని పరమాత్మ పరంగా చేస్తే, వాటి వాసనలు మనకు అంటవు అని చెబుతున్నాడు పరమాత్మ.

ఇంకొంచెం వివరంగా చెప్పాలంటే, మనం దైనందిన జీవితంలో మనకు తెలియకుండా జీవహింస చేస్తుంటాము. కాళ్ల కిందపడి ఎన్నోజీవులు మరణిస్తుంటాయి. అందుకే దానికి ప్రాయశ్చిత్తంగా పంచ మహాయజ్ఞములు చేయమన్నారు. 1.బ్రహ్మయజ్ఞము (దేవతలను ఆరాధించడం, శాస్త్రములు చదవడం, వినడం), 2.పితృయజ్ఞము అంటే పితృదేవతలను ఆరాధించడం, జలతర్పణములు, పిండప్రదానములు చేయడం,3. దేవ యజ్ఞము అంటే సకల దేవతారాధన, హెూమములు చేయడం, పూజలు, వ్రతాలు చేయడం, 4. భూతయజ్ఞము అంటే సాటి ప్రాణులకు ఆహారం పెట్టడం, 5. మనుష్య యజ్ఞము అంటే బ్రాహ్మణులకు, అతిధులకు, పేదవారికి భోజనం పెట్టి తృప్తి పరచడం. వీటి వలన మనకు తెలియకుండా చేసిన పాపములు నశించిపోతాయి.

## 49. అసక్తి బుద్ధిస్సర్వత్ర జితాత్మావిగతస్పృహః।
## నైష్కర్మ్యసిద్ధిం పరమాం సన్న్యాసేనాధిగచ్ఛతి॥

అన్ని విషయములయందు ఎటువంటి ఆసక్తి, బంధము లేకుండా ఉండే బుద్ధి కలవాడు, మనస్సును జయించిన వాడు, కోరికలు, ఆశ, తృష్ణలేని వాడు, నిష్కామ కర్మలు ఆచరించేవాడు, తానుచేసిన కర్మల ఫలములను త్యాగం చేయడం ద్వారా ఆత్మజ్ఞానమును తెలుసుకోగలడు. పరమ పదమును పొందగలడు.

పరమాత్మ ఇప్పటి వరకు కర్మలు వాటి రకములు అవి ఎలా చేయాలి అనే విషయం చర్చించి ఇక్కడి నుండి జ్ఞానయోగం గురించి చెబుతున్నాడు.

ఎవరికైతే 1.దేనియందు ఆసక్తి లేకుండా ఉంటుందో, 2. ఎవరు మనస్సును జయించగలడో, 3. ఎవరికైతే కోరిక, ఆశ లేకుండా ఉంటుందో..... ఈ మూడు గుణములు కలిగి ఉంటే జ్ఞానం వస్తుంది. అప్పుడు అతడికి నైష్కర్మ్య సిద్ధి లభిస్తుంది. అంటే మోక్షము లభిస్తుంది. అంటే ఆత్మజ్ఞానము కలగడం. పరమాత్మలో ఐక్యం కావడం. ఈ స్థితి కలగడానికి అన్నిటినీ త్యాగం చేయాలి. మూడుగుణములు, వాటి వలన కలిగే వికారములను త్యాగం చేయాలి. కర్మఫలములను త్యాగం చేయాలి. విషయ వాంఛలను, ఆశాపాశములను త్యాగం చేయాలి. అప్పుడే పరమ గతి లభిస్తుంది.

ఇక్కడ సర్వత్ర అని అన్నారు. అంటే ఏదో కొన్నివిషయముల మీద కాకుండా ఏ కర్మచేసినా, అన్ని కర్మలను కర్త ృత్వభావన లేకుండా, ఆసక్తి అంటే అటాచ్ మెంట్ లేకుండా చేయాలి. అన్ని ఎందుకులే కొన్నిటి మీద ఆసక్తి కలిగి ఉందాము అని అనుకుంటే, ఆ కొన్ని కర్మలు బంధనములు కలిగించే అవకాశం ఉంది. కాబట్టి అన్ని కర్మలు నిరాసక్తంగా చేయాలి కాని శ్రద్ధతో చేయాలి.

జితాత్మా అంటే మనసును జయించడం. అది చాలా కష్టం. మనసు మాట వినదు అనే సామెత. అటు ఇటు పరుగెత్తే మనస్సును అదుపులోపెట్టుకోగలగాలి. దైవధ్యానంలో కూర్చున్నా మనసు పనికిమాలిన విషయాల వెంట పరుగెడుతూ ఉంటుంది. హిమాలయాలకు వెళ్లినా, మనసు మాత్రం మన ఇంటి చుట్టు తిరుగుతూ ఉంటుంది. కాబట్టి మనసును అదుపులో ఉంచుకోవడం చాలా ముఖ్యం.

విగతస్పృహ: అంటే చూచిందల్లా, విన్నదల్లా, తాకినదల్లా నాకు కావాలి అనే కోరిక లేకుండా ఉండటం. దీనికి ఇంద్రియ నిగ్రహం కావాలి. ఏ వస్తువు చూచినా అది మంచిదా, చెడ్డదా, మనకు అవసరమా, అనవసరమా, అని ఆలోచించి బుద్ధిని సంప్రదించి, విచక్షణను ఉపయోగించి తరువాత కర్మచేయాలి అంతే కానీ చూచిందల్లా కావాలి అని కోరుకోవడం పనికిరాదు.

నైష్కర్మ్యసిద్ధిమ్ అంటే నిష్కామ కర్మలు చేయడం వలన కలిగేస్థితి. ఆత్మజ్ఞానము. ఆత్మను గురించి తెలుసుకోవడం. బంధనములు తెగిపోవడం. ఇటువంటి స్థితి కలుగుతుంది. ఈ స్థితి పరమాం అంటే అన్నిటి కంటే శ్రేష్ఠమైనది. పరమమైనది. ఇంతకంటే గొప్పదైనస్థితి మరొకటి లేదు.

## 50. సిద్ధిం ప్రాప్తో యథా బ్రహ్మ తథా22ప్నోతి నిబోధమే।
## సమాసేనైవ కౌన్తేయ! నిష్ఠా జ్ఞానస్య యా పరా॥

ఓ కౌంతేయా! నిష్కామ యోగం ఆచరించి, దాని ద్వారా జ్ఞాన, విజ్ఞానములను నిష్ఠతో ఆర్జించి, ఎలాగైతే పరమగతిని పొందుతున్నారో అలాగే కేవలం జ్ఞానయోగంతో కూడా పరమగతిని పొందగలరు. అది ఎలాగో నీకు క్లుప్తంగా చెబుతాను శ్రద్ధగా విను.

ఇప్పటి వరకు మనం జ్ఞాన యోగము, కర్మయోగము గురించి తెలుసుకున్నాము. జ్ఞానయోగమును, కర్మయోగమును అనుసరించి మోక్షము పొందవచ్చు అని తెలుసుకున్నాము. అందులో జ్ఞానయోగము గురించి మరలా సంక్షిప్తంగా చెబుతాను అంటున్నాడు పరమాత్మ. ఈ కింది మూడు శ్లోకములు గీతా సారము అని చెప్పబడ్డాయి. జ్ఞానము మనకు మూడు విధాలుగా కలుగుతుంది. శాస్త్రములు గురుముఖతా వినడం వలన, విన్నది మననం చేయడం వలనా, ఆ మననం చేసినది ధ్యానం మొదలగు వాటితో ఆచరించడం వలన కలుగుతుంది. అంటే ధ్యానం వలన మన మనసులో బుద్ధిలో ఉన్న విపరీత భావనలను తొలగించుకొని మనసును, బుద్ధిని నిర్మలంగా ఉంచుకోవడం. ఈ మూడు జ్ఞానమార్గానికి సోపానాలు. ఇందులో ఏది లోపించినా జ్ఞానం కలుగదు.

ఈ శ్లోకంలో నిష్ఠా జ్ఞానస్య అని అన్నారు వ్యాసులవారు. అంటే జ్ఞాన నిష్ఠ. కేవలం శాస్త్రములు చదివి జ్ఞానం సంపాదించి నందువలన సరిపోదు. ఈ జ్ఞానము అణువు అణువునా జీర్ణించుకుపోవాలి. మనకు ఏదైనా సమస్య వచ్చినపుడు ఆ జ్ఞానం ఉపయోగపడాలి. అలా యోగ పడని జ్ఞానం వృధా.

ఉదాహరణకు మనకు బాంకులో పది లక్షలు ఉన్నాయి. జేబులో వెయ్యిరూపాయల నోట్లు ఉన్నాయి. కాని దా హం వేస్తే నీరు కొనుక్కోవడానికి 20 రూపాయలు లేవు. ప్రాణం పోతోంది. అప్పుడు ఎవడో మనకు కాసిని నీళ్లు ఇచ్చాడు లేక 20 రూపాయలు ఇచ్చాడు. అదే నిజమైన ధనం. కాబట్టి అవసరానికి ఉపయోగపడని ధనము, జ్ఞానము ఉన్నా లేనట్టే. కాబట్టి జ్ఞానాన్ని అణువుఅణువునా పదిలపరచుకొని దానిని అనునిత్యము ఉపయోగిస్తుంటే, పరమ పదము చేరుకోవచ్చు. అది ఎలాగో సంగ్రహంగా చెబుతాను అని అంటున్నాడు కృష్ణుడు.

51. బుద్ధ్యావిశుద్ధయా యుక్తో ధృత్యా౽౽త్మానం నియమ్య చ।
శబ్దాదీన్విషయాం స్త్యక్త్వా రాగద్వేషౌ వ్యుదస్యచ॥

ఈ కింది మూడు శ్లోకములు గీతాసారము. ఈ మూడు శ్లోకములలో చెప్పబడిన సాధనసంపత్తిని మనం స్వంతం చేసుకోవాలి. ఇవి కనుక పాటిస్తే పరమపదము సులభంగా పొందవచ్చు. 51వ శ్లోకం చూద్దాము.

బుద్ధ్యా విశుద్ధయా యుక్తో అంటే శాస్త్రములను వినడం ద్వారా, మననం చేయడం ద్వారా బుద్ధిని బాగా శుద్ధి చేసుకోవాలి. అప్పటికే చేరి ఉన్న మలినములను కడిగి వేయాలి. అది మంచిదా ఇది మంచిదా, అది చేయాలా, ఇది చేయాలా, ఆ దేవుడు గొప్పవాడా ఈ దేవుడికి మహిమలు ఉన్నాయా అనే సందేహాలను సమూలంగా తుడిచిపెట్టాలి. మనస్సును నిర్మలంగా ఉంచుకోవాలి. ఇక్కడ బుద్ధి అంటే మనసు అని కూడా అర్థం. నిర్మలమైన మనసు కలిగి ఉండాలి. మనసు మకిలపట్టని అద్దంలాగా ఉండాలి. అప్పుడే మన యొక్క నిజస్వరూపమును మనం చూడగలము. ధృత్యా ఆత్మానం నియమ్యచ. ఇది ఎలా కలుగుతుంది అంటే మనసును మన అధీనంలో ఉంచుకుంటే కలుగుతుంది. అంటే ధైర్యంతో మనసును స్వాధీనం చేసుకోవాలి. సింహాన్ని లొంగదీసుకోవాలంటే ధైర్యం ఉండాలి. మనసు సింహం కంటే బలం అయినది. కాబట్టి మనసును లొంగదీసుకోడానికి తగిన ధైర్యం కలిగి ఉండాలి. మన మనసుకు శాస్త్రముల యొక్క, వాటిని అధ్యయనం చేస్తే వచ్చే ఫలితాలను గురించి తెలియజేసి, మనసును బుద్ధిని సమాధాన పరచాలి. అప్పుడే మనసు, బుద్ధి మనం చెప్పినట్టు వింటాయి. అలా సమాధాన పరచడానికి ముందు మనకు ధైర్యం కావాలి. సందేహాలు పనికిరావు.

శబ్దాదీన్విషయాంస్త్యక్త్వా అంటే శబ్ద,స్పర్శ,రూప,రస,గంధములు అనే పంచ తన్మాత్రలను విషయ వాంఛలను స్త్యక్త్వా అంటే విడిచిపెట్టాలి. వాటి వెంట మనసు పరుగెడుతూ ఉంటుంది. మనసుతోపాటు ఇంద్రియములు పరుగెడుతూ ఉంటాయి. వాటిని ఆపాలి. మనసును బుద్ధిని వాటి నుండి వెనక్కుమళ్లించి, అంతర్ముఖం చేయాలి. లేక పోతే ఒకటి చూస్తూ (ఎవరెవరు వస్తున్నారో పోతున్నారో చూస్తూ), ఒకటి వింటూ(తన గురించి ఎవరెవరు ఏంమేం అనుకుంటున్నారో అని ఒక చెవి అటుపెట్టి వింటూ), మరొకటి తాకుతూ, (కేవలం పురోహితుడు ఇచ్చిన పూలను తాకి మమ అనుకొని, తరువాత ఇంటి వచ్చిన అతిధులకు షేక్‌హాండ్ ఇచ్చి పలకరిస్తూ) వీటి మీద మనసుపెట్టి, దేవుడి ముందుకూర్చుని పూజచేస్తే ఏం ఫలితం ఉంటుంది.

రాగద్వేషౌ వ్యుదస్యచ అంటే రాగద్వేషములను వదిలిపెట్టాలి. కనీసం పూజచేసే కొద్ది సేపు అయినా, ధ్యానం చేసే కాసేపు అయినా, రాగద్వేషములను వదిలిపెట్టాలి. అది కావాలి ఇది వద్దు అనే బుద్ధిని

త్యాగం చేయాలి. మనసులో నుండి వెళ్లగొట్టాలి. అప్పుడే మనశ్శాంతి గా ఉంటుంది. కాని మనం ఏ పూజ చేసినా ఏవేవో కోరికలు తీరడానికే పూజలు చేస్తుంటాము. ఇష్టకామ్యార్థ సిద్ధ్యర్థం అనకుండా ఏ పూజా చేయము. ఇంకా కొంతమంది మహానుభావులు తమకు లాభం లేకపోయినా పర్వాలేదు, పక్కవాడికి నష్టం కలగాలి అనే కోరికతో పూజలు చేస్తుంటారు. మనం కోరుకున్న కోరికలు తీరకపోతే మనసు విపరీతంగా కలత చెందుతుంది. బుద్ధి చలిస్తుంది. ఈ దేవుడు లాభం లేదు మరొక దేవుడిని పూజించాలి అని మరొక దేవాలయానికి వెళతాము. రాగద్వేషాలతో ఏ దేవాలయానికి వెళ్లినా ఒకటే అని తెలుసుకోలేము. వీటి వలన జ్ఞానం రాదు సరికదా అజ్ఞానం మరింతగా పెరుగుతుంది. కాబట్టి ఇష్టము, అయిష్టము అనే రెండు పదాలు వదిలి పూజచేసే కాసేపు నిర్మల మైన మనస్సుతో దేవుడిని అర్చిస్తేనే జ్ఞానం కలిగే అవకాశం ఉంది.

## 52.వివిక్తసేవీ లఘ్వాశీ యతవాక్కాయమానసః।
## ధ్యానయోగపరోనిత్యం వైరాగ్యం సముపాశ్రితః॥

వివిక్తసేవీ అంటే రణగొణధ్వనుల మధ్య కాకుండా ఏకాంతంలో ఉండటానికి ప్రయత్నించాలి. ఇంటిలోనే ధ్యానమునకు ఒక ఏకాంత ప్రదేశమును ఏర్పాటుచేసుకోవాలి. గలగలమాట్లాడకుండా, అవసరమైనంత వరకు మాట్లాడుతూ ఎక్కువకాలం మౌనంగా ఉండాలి. కాని మనం సత్యనారాయణవ్రతం చేసుకుంటుంటే అంతా హడావిడే. వచ్చేవాళ్లు పోయేవాళ్లు, వంటలు, టిఫిన్లు, అందరికీ అందాయో లేదో అన్న టెన్షన్. పురోహితుడు తన మానాన తాను పూజచేస్తుంటాడు. చేసేవాళ్లు యాంత్రికంగా పూజచేస్తుంటారే కానీ మనసు ఇతర విషయముల మీద ఉంటుంది.

(ఈ కాలంలో ప్రతి మనషి మనసును చికాకు పరిచే సాధనం ఒకటి ఉంది. అదే సెల్ ఫోన్. చాలామందికి అది చేతిలో లేనిదే తోచదు. ధ్యానం, పూజ, వ్రతం చేసేటప్పుడు కూడా అది పక్కన ఉండాల్సిందే. మనిషి ఏకాగ్రతను చెడగొట్ట డానికి దానిని మించిన సాధనం మరొకటి లేదు. అందుకని పూజకు ముందు దాని పీక నొక్కడం అత్యంత ఆవశ్యకము.)

కాబట్టి, పూజ,వ్రతం చేస్తున్న గంటసేపూ మనసు ప్రశాంతంగా, ఏకాంతంగా, ఎటువంటి అలజడిలేకుండా ఉంచుకోవాలి. మౌనంగా మనసు పరమాత్మయందు లగ్నం చేయాలి. పూజ తప్ప మరొక ధ్యాస ఉండకూడదు. ఇది అంతా జరగాలంటే ఏకాంతం చాలా ముఖ్యం. పూజ గది ఒక మూలగా ఏకాంత ప్రదేశంలో ఉండాలి. ఎటువంటి రణగొణ ధ్వనులు లేకుండా, ఎవరూ చికాకుపరచకుండా ధ్యానం చేసుకోగలగాలి.

లఘ్వాశీ అంటే మితంగా భోజనం చేయాలి. తగినంతవరకే తినాలి. అధికంగా తిన్నా, అసలు తినకపోయినా ఆరోగ్యం చెడుతుంది. మనం తినే ఆహారం మన మీద దాని ప్రభావం చూపుతుంది. పూటుగా కడుపునిండా టిఫిన్ చేసి పూజకు కూర్చుంటే నిద్రవస్తుంది. అందుకే ఏదైనా పూజలు, వ్రతాలు చేసేటప్పుడు, వ్రతం చేసుకొని, భక్తితో ప్రసాదం స్వీకరించే వరకు ఏమీ తినకూడదు అని చెబుతారు. దాహం వేస్తే ఆచమనం పేరుతో కాస్త జలం పుచ్చుకోవచ్చు. ఉపవాసాల పేరుతో రోజూ తినే దానికంటే ఎక్కువ టిఫిన్లు లాగించడం దీనికిందికే వస్తుంది. కాబట్టి మితభోజనం ఆరోగ్యానికి, మానసిక వికాసానికి, భగవంతుడి మీద మనసు నిలవడానికి ఉపయోగపడుతుంది. ఆ తినే ఆహారం కూడా సాత్విక ఆహారం అయితే సాత్విక లక్షణాలు వస్తాయి. మనసు సత్త్వగుణ సంపన్నం అవుతుంది. కాబట్టి సాధ్యమైనంత వరకు సాత్వికాహారం సేవించాలి. అదీ మితంగా సేవించాలి.

యతవాక్కాయ మానసః అంటే మాటను, ఇంద్రియములను, మనసును మన అదుపులో ఉంచుకోవాలి. దీనినే త్రికరణ శుద్ధి అంటారు. మనసులో భావన, మాట్లాడే మాట, చేసే పని ఒకటి గా ఉండాలి. ఒకటి అనుకొని, మరొకటి చెప్పి, ఈ రెండింకి విరుద్ధంగా మరొకటి చేయకూడదు. అలాగే ఇష్టం వచ్చినట్టు మాట్లాడటం, ఇష్టం వచ్చిన పనులు చేయడం మంచిది కాదు. ఈ రెండింటికీ మనసు మూలకారణం. మనసును కూడా అదుపుచేయాలి.

వైరాగ్యంసముపాశ్రితః రాగమును అంటే కోరికలను వదిలిపెట్టడమే వైరాగ్యము. ఆ వైరాగ్యాన్ని బాగా అవలంబించాలి. ఎక్కడా సడలింపు ఉండకూడదు. అనవసరపుకోరికలను మనసులోకి రానీయకూడదు. వైరాగ్యం అంటే పెళ్లాం బిడ్డలను వదిలి హిమాలయాలకు వెళ్లడం కాదు. ఎందుకంటే రిషీకేష్‌లో ఉన్నా మనసు ఇంటి మీద ఉంటే ఏమీ ప్రయోజనం లేదు. అందుకని మనసును, ఇంద్రియములను అదుపులో ఉంచుకోవడం వైరాగ్యానికి లక్షణం. ఏది అవసరమో ఏది అవసరం లేదో తెలుసుకోగలగాలి. అనవసరమైన వాటి మీద విపరీతమైన ఆసక్తి అనురాగము మమత పెంచుకోకూడదు. అనవసరమైన వాటి కొరకు బాధపడకూడదు. దేని మీద ఎంతవరకు అనుబంధం పెంచుకోవాలో అంతే చేయాలి. తృప్తిగా జీవించాలి. అసంతృప్తిని మనసులోకి రానీయకూడదు. దీనినే వైరాగ్యం అంటారు.

ధ్యానయోగపరోనిత్యం అంటే ప్రతిదినము కొంచెం సేపు అయినా ధ్యానం చేయాలి. ప్రతిదినం ఎలా ఆహారం తీసుకుంటామో అలాగే ప్రతిదినం ధ్యానం చేయాలి. అది ఒక అలవాటుగా చేసుకోవాలి. ఆ కాసేపు అయినా మనసు, శరీరం మన అధీనంలో ఉంటుంది. అలా చేస్తూ ఉంటే సాత్విక చింతన, భగవంతుని యందు భక్తి అలవడతాయి.

## 53. అహఙ్కారం బలం దర్పం కామం క్రోధం పరిగ్రహమ్।
## విముచ్య నిర్మమశ్శాన్తో బ్రహ్మభూయాయ కల్పతే॥

అహంకారము, బలము, దర్పము, కామము(కోరికలు), కోపము, ఇతరుల వస్తువులను లాక్కోవడం, అందరిమీదా వల్లమాలిన మమకారము వీటి అన్నిటినీ సమూలంగా వదిలిపెట్టాలి.(వీటి గురించి ఎన్నోసార్లు చెప్పుకున్నాము.) వీటిలో ఏ ఒక్కటి కూడా ఉండకూడదు. అప్పుడే అతని మనసు ప్రశాంతంగా ఉంటుంది. ఇవన్నీ నియమబద్ధంగా పాటిస్తే బ్రహ్మభూయాయ కల్పతే అంటే పరబ్రహ్మ స్వరూపమును పొందడానికి అంటే మోక్షము పొందడానికి అర్హుడు అవుతాడు.

ముందు నేను అనే అహంకారము పుడుతుంది. అంటే ఈ శరీరమే నేను అనే భావన. ఇది మనిషిపుట్టగానే అంకురిస్తుంది. ఇది బాగా ముదిరి నేనే చేస్తున్నాను, ఇది నాది, ఇదంతా నాది అనే భావన బలపడుతుంది. ఈశరీరం నాది అన్నప్పుడు శరీరం మీద మమకారం పెరుగుతుంది. శరీరాన్ని బలంగా తయారు చేసుకుంటాడు. (వ్యాయామాలు, ఆసనాలు, సుగంధ ద్రవ్యాలు, అలంకరణలు). అంతే కాదు ఇదంతా నా చేతి మీద నడవాలి, నా ఆజ్ఞలేనిదే ఎవరూ ఏమీ చేయకూడదు, అంతా నాకు లోబడి ఉండాలి, నామాటే నెగ్గాలి అనే తత్త్వం బలానికి పరాకాష్ట. శరీరం బాగా బలపడినపుడు పొగరు కూడా పెగురుతుంది. చూచిందల్లా నాది కావాలి అనే మనస్తత్వం పెరుగుతుంది. ఎవర్నీ లెక్కచేయడు. పెద్ద చిన్న తేడాలేదు. తలవంచని వీరుడు అవుతాడు.

అప్పుడే వల్లమాలిన కోరికలు మనసులో పుడతాయి. అది నాకు కావాలి. నాకు దక్కనిది ఎవరికీ దక్కకూడదు అనే దురభిమానం పెరుగుతుంది. అనుకున్నవి అన్నీ తీరవు కదా! ఆ కోరికలు తీరనపుడు కోపం పెరుగుతుంది. ఒళ్లుతెలియని కోపం వస్తుంది. ఆ కోపంలో ఏమి చేస్తున్నాడో తెలియదు. తాను కోరుకున్న వస్తువు మీదా, మనిషి మీదా మమకారం అంతకంతకు ఎక్కువ అవుతుంది. ఎదుటి వాడి నుండి తాను కోరుకున్న వస్తువును బలవంతంగా లాక్కుంటాడు. లేదా కోరుకున్న వస్తువులను ఏదో విధంగా పోగుచేస్తాడు. పనికిమాలిన వస్తువుల మీద మమకారం పెంచుకుంటాడు. వాటిని రక్షించడం కోసం తాపత్రయ పడతాడు.

(కొన్ని ఉదాహరణలు: అనేక అడ్డదారులు తొక్కి అమితమైన ధనం సంపాదిస్తాడు. పోగుచేస్తాడు. పన్ను కట్టడానికి ఇష్టం ఉండదు. ఆ నల్ల ధనం దాయడానికి నానా తంటాలు పడతాడు. బస్తాలలో కుక్కి అటకమీద పెడతాడు. అనుక్షణం భయంతో వణుకుతుంటాడు. చివరకు ఆ ధనం దొంగలపాలవుతుంది. కోటానుకోట్లు నల్లధనం సంపాదించిన వారి సంగతి మనం చూస్తూనే ఉన్నాం. ఇంకా చెప్పాలంటే అవసరం లేకపోయినా ఒకడు కారు కొంటాడు. దానిని

కడగడం, శుభ్రంగా ఉంచడం దానికి ఏ చిన్న గీతపడినా విలవిలలాడిపోవడం. దీనితో అతడికి దేవుడి ముందు కూర్చోడానికి టైము దొరకదు. మరొకడు అవసరం లేకపోయినా రాష్ట్రం అంతా తిరిగి భూములు కొంటాడు. వాటిని రక్షించుకోలేక నానాతంటాలు పడతాడు. వాటిని ఎవరన్నా ఆక్రమిస్తే కోర్టులచుట్టు పోలీసు స్టేషన్ల చుట్టు తిరుగుతుంటాడు. దైవధ్యానానికి తీరికలేదండీ అని అంటుంటాడు. అలా కాకుండా, ఎంతవరకు అవసరమో అంతే సంపాదించుకుంటే మనశ్శాంతి ఉంటుంది.)

వీటన్నిటి ఫలితంగా మనశ్శాంతిని కోల్పోతాడు. ఈ లక్షణాలు అన్నీ మానవునికి శాపాలుగా పరిణమిస్తాయి. దు:ఖాలకు కారణం అవుతాయి. కాబట్టి ఈ లక్షణాలు అన్నీ సమూలంగా తుడిచిపెట్టాలి. ఒక్కటి కూడా మిగల్చకూడదు. (సంపాదించిన ధనం, ఆస్తులు, పదవులు ఏవీ తన వెంటరావు అనే జ్ఞానం కలగాలి) అప్పుడే పరమ పదానికి అర్హుడు అవుతాడు. నివృత్తి మార్గం వైపు అడుగులు వేస్తాడు. బ్రహ్మమార్గంలో ప్రయాణం చేస్తాడు. అలాకాకుండా, జీవితంలో అహంకారం (అంటే ఈ దేహమే నేను, నేనే ఈ దేహము అనే భావన) మొదలు మమకారం(ఇదంతా నాది, ఇవి లేకపోతే నేను బతకలేను అనే భావన) దాకా ప్రయాణిస్తే, చివరకు అధ:పతనం తప్పదు. ఏ మార్గం ఎంచుకోవాలో మన ఇష్టానికే వదిలేసాడు పరమాత్మ.

## 54.బ్రహ్మభూత: ప్రసన్నాత్మా న శోచతి న కాంక్షతి।
## సమస్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్॥

పైశ్లోకంలో చెప్పిన అవలక్షణాలు అన్నీ వదిలిపెట్టి బ్రహ్మజ్ఞానమును పొందిన వాడు ఎల్లప్పుడూ ప్రశాంతమైన మనస్సు కలిగి ఉంటాడు. దేనికీ దు:ఖించడు. దేనిని కోరుకోడు. అన్ని వస్తువులను సమదృష్టితో చూస్తాడు. అన్ని ప్రాణులలో పరమాత్మను దర్శిస్తాడు. అప్పుడు అతని భక్తి పరాకాష్టకు చేరుకుంటుంది.

పరమాత్మ భక్తిని పొందిన వాడి పరిస్థితి ఏంటి అని చెబుతున్నాడు. ఒక సారి పరమాత్మ యొక్క పరమమైన భక్తి తత్వమును పొందితే అతనిని సుఖములు దు:ఖములు బంధించవు. అతడు దేని కొరకు దు:ఖించడు. ఏదీ కావాలని కోరుకోడు. ఉన్నదానితో తృప్తిగా జీవిస్తాడు. అతని మనసు ప్రశాంతంగా ఉంటుంది. అతనికి ఏ కోరికా ఉండదు. అన్ని ప్రాణులను సమంగా చూస్తాడు. పరమాత్మయందు నిర్మలమైన భక్తిని కలిగి ఉంటాడు. అంటే ఇవి జీవన్ముక్తుని లక్షణములు. ఈ శరీరములో ఉండి కూడా పరమాత్మలో ఐక్యం అయిన వాడు. మనసును ఆత్మలో స్థిరంగా ఉంచిన వాడు. ప్రాపంచిక విషయముల యందు ఎటువంటి ఆసక్తి, అనురక్తి, మమకారము

లేని వాడు. అతడికి దు:ఖము సుఖము అంటే ఏమిటో తెలియదు. అంతా సమానంగానే ఉంటుంది. మనస్సు నిర్మలంగా నిశ్చలంగా స్థిరంగా ఉంటుంది. నీచ జంతువులలోనూ ఉత్తమ మైన మానవులలోనూ పరమాత్మను దర్శిస్తాడు. మనం చూచే ప్రపంచం అంతా మనసుతో కల్పించబడినది అని తెలుసుకుంటాడు. అతడికి కోరదగ్గది, పొందతగ్గది అంటూ ఏమీ ఉండదు. సంతృప్తుడు అవుతాడు. ఇది భక్తిలో పరాకాష్ట. అందుకే మద్భక్తిం లభతే పరామ్ అంటే నా యొక్క పరమమైన భక్తి లభిస్తుంది. పరమ భక్తి అంటే శంకరాచార్యులవారు ఈవిధంగా చెప్పారు. "స్వస్వరూపానుసంధానం భక్తి రిత్యభిధీయతే" అంటే తన యొక్క స్వస్వరూపమును తెలుసుకోవడమే, ఆత్మతత్వమును అనుసంధానము చేసుకోవడమే పరమమైన భక్తి. అనన్యమైన భక్తి. అదే జ్ఞానము. అది తెలిస్తే ఇంక తెలుసుకోదగ్గది అంటూ వేరే ఉండదు.

## 55. భక్త్యా మామభిజానాతి యావాన్యశ్చాస్మితత్త్వత:।
## తతోమాం తత్త్వతోజ్ఞాత్వా విశతే తదనన్తరమ్॥

ఓ అర్జునా! కేవలం భక్తి మార్గం వలననే మానవుడు ముందు తన గురించి తాను తెలుసుకుంటాడు. తరువాత నేను ఎవరో, నేను ఎంతటి వాడినో తెలుసుకుంటాడు. నా గురించి కూడా తెలుసుకొన్న మానవుడు తుదకు నన్నే పొందుతున్నాడు.

పరమమైన భక్తి కలిగిన తరువాతి పరిణామాలు తెలియజేస్తున్నాడు పరమాత్మ. భక్తియోగంలో సిద్ధి పొందిన తరువాత మానవుడు తాను ఎవరో ముందు తెలుసుకుంటాడు. తరువాత పరమాత్మ ఎవరో, ఆయన తత్వం ఏమిటో, ఆయన ఎంతటి వాడో, ఎటువంటి వాడో మొదలు విషయాలు తెలుస్తాయి. పరమాత్మ యొక్క నిజస్వరూపమును తెలుసుకొనిన తరువాత పరమాత్మలో ఐక్యం అవుతున్నాడు. ఐక్యం కావడం అంటే మన సినిమాలలో చూపించినట్టు, మనలో నుండి ఒక వెలుగు వచ్చి ఆయనలో కలిసిపోతుందని కాదు. నేను వేరు, పరమాత్మ వేరు కాదు, నేను పరమాత్మ ఒకటే అనే బుద్ధి కలిగి ఉంటాడు. అహం బ్రహ్మాస్మి (నేను బ్రహ్మను అయి ఉన్నాను) అనే నిజాన్ని తెలుసుకుంటాడు.

కిందటి శ్లోకంలో పరమ భక్తి వలన జ్ఞానం దానంతట అదే కలుగుతుంది అని చెప్పారు. కాబట్టి భక్తి, జ్ఞానము ఒకదానితో ఒకటి సంబంధము కలిగి ఉంటాయి. ముందు భక్తి కలిగితే దానితో జ్ఞానం కూడా వస్తుంది. పరమాత్మయందు భక్తి కలిగి ఉండటం అందరికీ సాధ్యమే. కాబట్టి పరమాత్మ గీతలో భక్తియోగానికి ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చాడు. జాతి, కుల భేదము లేకుండా అందరూ పరమాత్మ ఎడల భక్తి కలిగి ఉండవచ్చును. దేవుడి గురించి అందరికీ తెలుసు. కాని

పరమాత్మ యదార్థ స్వరూపము అందరికీ తెలియదు. కేవలం భక్తి వలననే అది సాధ్యం అవుతుంది. పరమాత్మ గురించి తెలుసుకున్న తరువాత తానే పరమాత్మ అవుతున్నాడు. పరమాత్మలో లీనం అవుతున్నాడు. పరమాత్మలో ఐక్యం అవుతున్నాడు. ఈ శరీరము నేను కాదు, నేను పరమాత్మ స్వరూపము, నాకు పరమాత్మకు భేదం లేదు అనే స్థితికి చేరుకుంటాడు. అందుకే అనంతరమ్ అనే పదం వాడారు. భక్తి, జ్ఞానం కలిగినతరువాత పరమాత్మ తత్వమును తెలుసుకున్న తరువాతనే పరమాత్మలో ఐక్యం కావడం సంభవిస్తుంది.

## 56. సర్వకర్మాణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః। మత్ప్రసాదాదవాప్నోతి శాశ్వతం పదమవ్యయమ్॥

మానవుడు తనకు శాస్త్రము విధించిన అన్ని కర్మలను ఎల్లప్పుడూ ఆచరిస్తూ ఉండాలి. కాని ఆ కర్మలు చేసేటప్పుడు నన్నే ఆశ్రయించుకొని ఉండాలి. ఆ ప్రకారంగా కర్మలు చేస్తే, నా అనుగ్రహము వలన తుదకు శాశ్వతమైన పరమ పదమును పొందుతాడు.

ఇప్పటి దాకా జ్ఞానము భక్తి గురించి చెప్పిన పరమాత్మ కర్మల గురించి కూడా చెబుతున్నాడు. ఇంతకు ముందు పరమాత్మ కర్మలు స్వధర్మనిష్టతో చేయాలి అని అన్నాడు. ఇప్పుడు ఆ స్వధర్మనిష్టకు భక్తి కూడా తోడవ్వాలి. భగవంతుని మీద భక్తి లేనిదే ఏ కర్మ కూడా సఫలం కాదు అని భక్తికి ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చాడు.

మానవుడు కర్మలు చేయక తప్పదు. ఏదో ఒక కర్మ చేయాలి. అందుకే మానవులు తమకు నిర్దేశించిన కర్మలను, స్వధర్మపరమయిన కర్మలను ఆచరిస్తూ కూడా, ఎల్లప్పుడూ పరమాత్మయందు మనసును లగ్నం చేసి, పరమాత్మయందు భక్తి కలిగి ఉండాలి. భక్తితో కూడిన కర్మ మాత్రమే కర్మయోగము అవుతుంది. కేవలం యాంత్రికంగా చేసే కర్మలు, శుష్క కర్మలు అవుతాయి కానీ కర్మయోగము అనిపించుకోవు. అందుకే ఇక్కడ రెండు నిబంధనలు పెట్టారు. ఒకటి ఏ పని చేసినా పరమాత్మను ఆశ్రయించుకొని చేయాలి. పరమాత్మ పరంగా చేయాలి. కర్తృత్వభావన లేకుండా చేయాలి. ఫలితం ఆశించకుండా చేయాలి. అందుకే మద్వ్యపాశ్రయః అన్నారు.

తరువాత మత్ ప్రసాదాత్ అంటే నా అనుగ్రహం కూడా ఉండాలి. భగవంతుని అనుగ్రహం ఎప్పుడు లభిస్తుంది. ఆయనను ఆశ్రయించుకొని ఉన్నప్పుడు. కాబట్టి భగవంతుని ఆశ్రయించడం, ఆయన అనుగ్రహానికి పాత్రులు కావడం ముఖ్యం. అప్పుడు అతడు ఏ కర్మ చేసినా అతనికి ఆ కర్మ బంధనములు అంటవు. సుఖదు:ఖములు ఉండవు. మనస్సు ప్రశాంతంగా ఉంటుంది. ఏ పని చేసినా లోపల భగవన్నామ స్మరణ చేస్తుంటాడు. అటువంటి వాడికి పునర్జన్మ

ఉండదు. పరమాత్మలో ఐక్యం అవుతాడు. కాబట్టి ఏ కర్మ చేసినా దైవమును స్మరించుకుంటూ చేయాలి. కర్మలను కర్మఫలములను ఈశ్వరార్పణ చేయాలి. ఏ పని సఫలం కావాలన్నా దానికి భగవంతుని అనుగ్రహం తప్పదు. మనకు ఏది లభించినా దానిని భగవంతుని ప్రసాదంగానే భావించాలి కానీ అంతా నా మహిమ వలననే జరిగింది అనుకోవడం అజ్ఞానం.

కాబట్టి ఏ కర్మ చేసినా భగవంతుని తల్చుకుంటూ, భగవంతుని పరంగా చేస్తూ, దాని వలన వచ్చే ఫలితాలను భగవంతునికి అర్పిస్తే, ఎల్లప్పుడూ పరమాత్మను ఆశ్రయించుకొని ఉంటే, ఆ కర్మలు, కర్మలు చేయగా వచ్చిన కర్మఫలములు అతనిని బంధించవు. అటువంటి వాడికి శాశ్వతమైన, ఎప్పటికీ నాశనము లేని, పరమ పదము అంటే మోక్షము లభిస్తుంది.

## 57. చేతసా సర్వకర్మాణి మయి సన్న్యస్య మత్పరః।
## బుద్ధియోగముపాశ్రిత్య మచ్చిత్తస్సతతం భవ॥

ఓ అర్జునా! నీవు వివేకవంతుడవై నీవు చేసేసమస్త కర్మలను నా పరంగా చేస్తూ, ఆ కర్మఫలములను నాకే అర్పిస్తూ, బుద్ధియోగమును ఆశ్రయించి, ఏకాగ్రమైన నీ మనస్సును ఆత్మయందు లగ్నం చెయ్యి.

కర్మయోగము అవలంబించే వాళ్లకు మరొక మార్గము కూడా చెప్పాడు పరమాత్మ. మనం చేసే సమస్త కర్మలను బుద్ధిని ఉపయోగించి మంచివో చెడ్డవో తెలుసుకొని చేయాలి. తరువాత వాటి ఫలములను అవి మంచి ఫలితములైనా చెడ్డ ఫలితములైనా పరమాత్మకు అర్పించాలి. మనకంటూ ఏమీ ఉంచుకోకూడదు. తరువాత పరమాత్మను నిరంతరం ఏకాగ్ర మైన మనస్సుతో స్మరించాలి. ధ్యానించాలి. పూజించాలి. అర్చించాలి. ఏ పని చేస్తున్నా మనసులో పరమాత్మ ను స్మరించుకుంటూ ఉండాలి. దానికి ఒక కాలము, స్థలము అంటూ లేదు. ఎక్కడైనా ఎప్పుడైనా మనసులో రామనామ స్మరణ, ఓం నమశ్శివాయ, ఓం నమోభగవతే వాసుదేవాయ, ఓం నమో వేంకటేశాయ అలా మీ ఇష్టం వచ్చిన నామం స్మరించికుంటూ ఉండాలి. ఏదీ పలకలేని వాళ్లు ఓం కారం అనుకున్నా చాలు. ఇదంతా వినడానికి చాలా సులభంగా ఉన్నా ఆచరణలో పెట్టడానికి మన మనసుఒప్పదు. అభ్యాసం చేస్తే ఇది సాధ్యమే.

ఈ విధానాన్ని కొంచెం లోతుగా పరిశీలిద్దాము. చేతసా అంటే చిత్తము నిర్మలంగా ఉండాలి. చేయబోయే పని మంచిదా చెడ్డదా అని ఆలోచించాలి. చక్కని నిర్ణయం తీసుకోవాలి. దానికి బుద్ధియోగం కావాలి. అంటే ఆత్మను గురించి తెలుసుకోవడం. నేను ఆత్మస్వరూపుడను.

నేను ఈ శరీరం కాదు, ఈ పనులు నేను చేయడం లేదు అనే విషయం తెలుసుకోవాలి. అప్పుడు చేసే పనుల మీద అమితమైన ఆసక్తి ఉండదు. ఆ కర్మల ఫలముల మీదా ఆసక్తి ఉండదు. సన్న్యస్య అంటే నాకే అర్పించాలి. కర్మఫలములను పరమాత్మకు అర్పించాలి. అప్పుడు మనకంటూ ఏమీ ఉండదు. వాటి గురించి చింత ఉండదు. మనసు ప్రశాంతంగా ఉంటుంది.

ప్రశాంతంగా ఉన్న మనసుతో ఏం చేయాలి అంటే మచ్చిత్తస్సతతం భవ ఎప్పుడూ నీ చిత్తమును నా యందే లగ్నం చెయ్యి. నీ మనసును ఆత్మయందు నిలుపు. నా నామమును స్మరించు. అదీ ఎప్పుడో ఒకప్పుడు కాదు. సతతం అంటే ఎల్లప్పుడూ. స్నానం చేసి మడి కట్టుకొని చేద్దాం అని కాదు. మానసిక పూజకు కావలసింది శరీర శుభ్రత కాదు. మానసిక నిర్మలత్వం. మనసు నిర్మలంగా ఉంటే అదే చాలు. పరమాత్మను ధ్యానించుకోవచ్చు. అంటే ప్రాపంచిక విషయాలను, భార్యాపిల్లలను వదిలి వెయ్యమని కాదు. ప్రాపంచిక విషయాలలోనూ, సంసారంలోనూ సంచరిస్తూ, ఎక్కువ ఆసక్తిని, మమత, మమకారాలను తగ్గించుకొని, ఎల్లప్పుడూ పరమాత్మయందు మనస్సు లగ్నం చేసి అన్నిపనులు చేయాలి.

ఇక్కడ ఒక సందేహం వస్తుంది. మనం లౌకికమైన ఉద్యోగాలు, వ్యాపారాలు, రాజకీయాలు, చేసుకుంటూ ఎల్లప్పుడూ పరమాత్మను స్మరించుకోవడం సాధ్యమా! ఉదాహరణకు ఇంటి పనులు చేసుకునే తల్లి, బిడ్డను ఉయ్యాలలో పడుకోబెడుతుంది. ఇంటి పనులు చేసుకుంటూ ఉంటుంది. బిడ్డ అటు ఇటు కదిలినా ఏమాత్రం అలికిడి అయినా వెంటనే ఉయ్యాల దగ్గరకు వెళు తుంది. అంటే తల్లి ఇంట్లో అన్ని పనులు చేసుకుంటూ ఉన్నా, తన మనసు మాత్రం బిడ్డ మీదనే లగ్నం చేస్తుంది. అలాగే మనం కూడా ఈ ప్రాపంచిక విషయాలలో తిరుగుతున్నా, పరమాత్మను మాత్రం నిరంతరం స్మరించుకుంటూ ఉండాలి. ఈ పని చేయడానికి మనకు అంటూ ఒక లక్ష్యం ఉండాలి. మత్పర: అంటే నీ లక్ష్యం పరమాత్మలో ఐక్యం కావడమే. అదే మానవుని అంతిమ లక్ష్యము అయి ఉండాలి. అప్పుడే ఈ జనన మరణ చక్రం నుండి విముక్తి కలుగుతుంది. మోక్షప్రాప్తి కలుగుతుంది.

## 58. మచ్చిత్తస్సర్వదుర్గాణి మత్ప్రసాదాత్తరిష్యసి।
## అథ చేత్త్వమహఙ్కారాన్న శ్రోష్యసి వినఙ్క్ష్యసి॥

ఓ అర్జునా! నీవు నీ చిత్తమును నా యందు (ఆత్మయందు) ఉంచితే, నా అనుగ్రహము చేత, సంసారములో ఉన్న సమస్తదు:ఖములను దాటి, నన్నే పొందగలవు. లేకపోతే నీవు నీ అహంకారము వదలకపోతే, అనవసరంగా చెడిపోతావు.

ఈ శ్లోకంలో రెండు మార్గాలు సూచించాడు పరమాత్మ. ఒకటి ప్రవృత్తి మార్గము. రెండవది నివృత్తి మార్గము. నివృత్తి మార్గమును ముందు సూచించాడు. ప్రవృత్తి మార్గము దాటి నివృత్తి మార్గములోని ప్రవేశించాలి. దానికి ఎన్నో అడ్డంకులు ఉన్నాయి. అందుకని ఇక్కడ సర్వదుర్గాణి అనేపదం వాడారు. దుర్గములు అంటే దాటడానికి చాలా కష్టమైనవి. ఎన్నోఅడ్డంకులు ఉంటాయి. కందకములు వాటిలో మొసళ్లు, దుర్గము పైన ఫిరంగులు సైనికులు. అలాగే ఈ సంసారము, బంధనములు, కోరికలు, అనుబంధాలు ఇవన్నీ దాటడానికి కష్టమైన దుర్గములు అని భావన. అర్జునుడు క్షత్రియుడు, ఆయనకు కోటలు, దుర్గములు అన్నీ పరిచయమైన విషయములు. అందుకని దుర్గములు అనే పదం వాడారు వ్యాసులవారు.

మరి ఈ సంసారము అనే దుర్గములను దాటాలంటే ఒకే ఒక మార్గము మనస్సును అంటే చిత్తమును ఆత్మలో నిలపడం. అప్పుడు పరమాత్మ అనుగ్రహం మన మీద ప్రసరిస్తుంది. అప్పుడు ఈ సంసారము అనే దుర్గములను దాటడానికి వీలవుతుంది. అలా కాకుండా కేవలం ప్రవృత్తి మార్గంలోనే ఉంటే ఏమవుతుందో కూడా చెప్పాడు. మానవులకు అహంకారము సహజంగా ఉంటుంది. అది సాత్విక, రాజసిక, తామసిక అహంకారాల రూపంలో ఉంటుంది. ఆ అహంకారం కళ్లను కప్పేస్తుంది. నిజం తెలుసుకోలేడు. అప్పుడు ఈ మాటలు తలకెక్కవు. తన ఇష్టం వచ్చినట్టు ప్రవర్తిస్తాడు. అటువంటి వారు వినంక్ష్యసి అంటే చెడిపోతారు. వారిని ఎవరూ బాగుపరచలేరు.

ప్రతి వాడూ తనకు ఎప్పుడూ సుఖాలు కావాలనే కోరుకుంటాడు. దు:ఖాలు అస్సలు రాకూడదు అనుకుంటాడు. కాని దానికి కావలసిన సాధన మాత్రం చెయ్యడు. కష్టాలలో పడతాడు. ఎల్లప్పుడూ సుఖంగా ఉండాలంటే చేయాల్సింది ఒక్కటే. మన మనస్సును ఈ ప్రాపంచిక విషయాలనుండి మరల్చి పరమాత్మవైపు మళ్లించడం. ఆత్మలో నిలపడం. అటువంటి వారి మీద భగవంతుని అనుగ్రహం దానంతట అదే కలుగుతుంది. ఆయన కరుణ అనుగ్రహం మన మీద ప్రసరించడానికి మనం వజ్రకిరీటాలు, బంగారు ఆభరణాలు వగైరా ఏమీ ఆయనకు చేయించనవసరం లేదు. కేవలం భక్తి ఉంటే చాలు. భక్తితో అర్పించిన తులసీ దళం కానీ, మారేడు దళంకానీ, పారిజాతపుష్పం కానీ, మీకు అందుబాటులో ఉన్న ఫలం కానీ, ఇవేమీ దొరక్కపోతే చెంబు నీళ్లు కానీ అర్పిస్తే చాలు. పరమాత్మ పరమానందభరితుడు అవుతాడు. అటువంటి వాడికి దు:ఖమే ఉండదు. అటువంటి వాడికి కష్టం కలిగినపుడు, ఆపద కలిగినపుడు, పరమాత్మ ఏదో ఒక రూపంలో వచ్చి సాయపడతాడు. అతడిని ఆ కష్టం నుండి బయట పడవేస్తాడు. వాడు ఎవరో కూడామీకు తెలిసి ఉండదు. అటువంటి వాడు వచ్చి మీకు సాయం చేస్తాడు.

ఇది ఎలా జరుగుతుంది అంటే సంసారము అనే దుర్గమును దాటడం వలన. మామూలు దుర్గాలు అయితే సైన్యాలతో జయించ వచ్చు. సంసారము అనే దుర్గము మాత్రం పరమాత్మ అనుగ్రహం లేనిది ఛేదించలేము. కురుక్షేత్ర యుద్ధంలో కూడా కృష్ణుని అనుగ్రహంతోనే అర్జునుడు

అందరినీ జయించి విజయుడు అయ్యాడు. సుందర కాండలో కూడా ఆంజనేయస్వామి, ఎంత వెతికినా సీత కనపడక, నిరాశ చెంది, అశోక వనం ఎదురుగా కూర్చుని, ఇంక నావల్లకాదు, ఆత్మహత్యే శరణ్యము అని తలచుకుంటూ, తన మనస్సు రాముని యందు నిలిపితే, అప్పుడు ఎదురుగా ఉన్న అశోక వనం అందులో ఉన్న సీత కనపడ్డారు. కాబట్టి ఎంతటి వారికైనా, ఈ సంసారము అనే దుర్గము నుండి, అందులో అనుక్షణం ఎదురయ్యే ఎదురు దెబ్బల నుండి బయట పడాలంటే పరమాత్మఅనుగ్రహం కావాలి. ఈ విషయం చాలా మందికి తెలియదు. తెలిసినా నమ్మరు. పట్టించుకోరు. దానికి కారణం వారిలో ఉన్న అహంకారము. ధనమదము, అధికార గర్వము. అటువంటి వారు తుదకు కష్టముల పాలై చెడిపోతారు. ఎప్పుడూ ప్రవృత్తి మార్గంలోనే ఉంటూ, నివృత్తి మార్గం మరిచిపోతారు.

## 59. యద్యహఙ్కారమాశ్రిత్య నయోత్స్య ఇతి మన్యసే।
## మిథ్యైష వ్యవసాయ స్తే ప్రకృతిస్త్వాం నియోక్ష్యతి॥

ఓ అర్జునా! నీలో ఉన్న అహంకారం చేత "నా ఇష్టం నేను ఈ యుద్ధము చేయను" అని మూర్ఖంగా అనుకుంటే, ఆ సంకల్పం కూడా ఎందుకూ పనికిరాకుండా పోతుంది. నీలో ఉన్న క్షత్రియుడు, క్షత్రియ స్వభావము నిన్ను యుద్ధం చేయకుండా ఉండనివ్వదు. నీవు అశక్తుడవు.

ఇక్కడ కృష్ణుడు జరగబోయే పరిణామం గురించి చెబుతున్నాడు. ఓ అర్జునా! నేను ఈ యుద్ధం చేయను అనే నీ సంకల్పం కూడా వ్యర్థమే. నీవు ఈ రోజు తాత్కాలికంగా యుద్ధం నుండి వైదొలగినా, ఈ యుద్ధం ఆగదు. కాని నీలో ఉన్న క్షత్రియ స్వభావము, నిన్ను ఊరుకోనివ్వదు. నిన్ను యుద్ధానికి పురికొల్పుతుంది. అప్పుడు నువ్వు ఇటు యుద్ధం చేస్తావు. అటు అపకీర్తిని మూటగట్టుకుంటావు. కాబట్టి, ఈ యుద్ధం నేనే చేస్తున్నాను అన్న అహంకారము వదిలిపెట్టు. ఎందుకంటే యుద్ధము క్షత్రియ ధర్మము. నీ ధర్మం నీవు నిర్వర్తించు. ఫలితము గురించి ఆలోచించకు అది నీ చేతుల్లోలేదు. నేను యుద్ధం చేయను సన్యాసం తీసుకుంటాను అన్న నీ మాటలు ఎందుకూ పనికిరావు. నీవు ఒక్కడు యుద్ధం చేయకపోతే యుద్ధం ఆగదు. నీ ప్రయత్నం వృథా అవుతుంది. మొదటి రోజుయుద్ధం మానివేసినా, నీలో ఉన్న క్షత్రియ స్వభావము నిన్ను యుద్ధమునకు పురికొల్పుతుంది. ఆ రాజస ప్రవృత్తిని నీవు తప్పించుకోలేవు. కాబట్టి ఈ వృథా ప్రయాస మాని యుద్ధం చెయ్యి.

## 60. స్వభావజేన కౌన్తేయ! నిబద్ధస్స్వేన కర్మణా।
## కర్తుం నేచ్ఛసి యన్మోహా త్కరిష్యస్యవశోऽపి తత్॥

ఓ కుంతీపుత్రా! నీ పూర్వజన్మ సంస్కారము వలన నీవు క్షత్రియుడుగా జన్మించావు. క్షాత్రము నీ సహజ గుణము. యుద్ధం చేయడం నీ క్షాత్ర ధర్మము. నీవు నీ క్షాత్ర కర్మలచేత, క్షాత్ర ధర్మము చేత, నీ పూర్వజన్మ సంస్కారము చేత నీవు బంధింపబడి ఉన్నావు. కానీ నీలో కలిగిన తాత్కాలిక అవివేకము వలన నీవు యుద్ధం చేయడానికి ఇష్టపడటం లేదు. అయినప్పటికీ, నీవు యుద్ధం చేయకుండా తప్పించుకోలేవు. నీలో ఉన్న నీ క్షాత్రగుణము నీచేత యుద్ధం చేయిస్తుంది. అని ఒక హెచ్చరిక చేసాడు.

అర్జునా! నీకో విషయం తెలుసో లేదో! జాగ్రత్తగా విను. నీ పూర్వజన్మ వాసనల వలన నీవు క్షత్రియుడుగా జన్మించావు. క్షాత్రమే నీ స్వభావము. పూర్వజన్మవాసనలను తప్పించుకోవడం నీ తరం కాదు. ఎందుకంటే ఆ వాసనలతో నీవు బంధింపబడ్డావు. కాని తాత్కాలికమైన అజ్ఞానము, అవివేకము వాటి వలన కలిగిన మోహము నీతో "నేను యుద్ధము చేయను, సన్యాసం పుచ్చుకుంటాను, అడుక్కుతింటాను" అన్న మాటలు పలికిస్తూ ఉంది.ఆ మోహాన్ని విడిచిపెట్టు నీ స్వభావ సిద్ధమైన గుణం అయిన యుద్ధం చేయడానికి సమాయత్తం కా! ఇంకాసేపట్లో మొదలయ్యే యుద్ధం చూస్తే, నీలో అంతర్గతంగా ఉన్న నీ క్షాత్రస్వభావము నీ చేత యుద్ధం చేయిస్తుంది. పూర్వజన్మవాసనల నుండి పుట్టిన నీ స్వభావాన్ని నీవు జయించలేవు. కాబట్టి నీ స్వభావసిద్ధమైన కర్మను నీవు చెయ్యి. ఫలితం పరమాత్మకు అర్పించు. అప్పుడు నీకు ఏ దోషమూ అంటదు.

ఇక్కడ మనం ఒక్క విషయం గమనించాలి. అర్జునుడు క్షత్రియుడు. అతని స్వభావము యుద్ధం చేయడం ధర్మం రక్షించడం. ఇక్కడ కృష్ణుడు అర్జునుడిని ధర్మయుద్ధం చేయమంటున్నాడు. అది అతని స్వభావం అంటున్నాడు. అలాగే మనకూ పూర్వజన్మవాసనలు ఉంటాయి. వాటికి అనుగుణంగానే మనం ప్రవర్తిస్తుంటాము. పూర్వజన్మవాసనలు చెడ్డవి దుర్మార్గమైనవి అయితే దుర్మార్గులు అవుతారు. వారి సాహచర్యంలోనే ఉంటారు. కాని ఈ జన్మలో పురుషప్రయత్నం ద్వారా వాటిని దాటవచ్చు. దుర్మార్గులు సన్మార్గులు కావచ్చు. పూర్వజన్మవాసనలు సాత్వికంగా ఉన్నా, ఈ జన్మలో దుర్మార్గుల సాహచర్యం వలన దుర్మార్గులుగా మారే అవకాశం ఉంది. అటువంటి అవకాశానికి మనం తావు ఇవ్వకూడదు. మానవ ప్రయత్నంతో, పరమాత్మ అనుగ్రహంతో వాటిని అధిగమించవచ్చు. కాబట్టి పూర్వజన్మవాసనలు, ఈ జన్మలో చేసే ప్రయత్నాలు వీటికి తోడు పరమాత్మ అనుగ్రహం, వీటిని సమన్వయం చేసుకుంటూ జీవితం సాగించాలి.

## 61. ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశే2ర్జున! తిష్ఠతి।
## భ్రామయన్సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా॥

ఓ అర్జునా! ఈశ్వరుడు సకల చరాచర భూతముల యొక్క హృదయములలో తిష్ఠవేసుకొని ఉన్నాడు. అంతే కాదు సకల ప్రాణి కోటిని, తన మాయచేత, యంత్రము తిప్పేవాడు, యంత్రమును తిప్పినట్టు మనలను నియంత్రిస్తున్నాడు.

ఈశ్వరుడు సర్వభూతములలో అంటే సకల జీవరాసుల హృదయములలో ఆత్మస్వరూపుడుగా నిలిచి ఉన్నాడు. కాని ఆయనను ఎవరూ తెలుసుకోలేకపోతున్నారు. అదే మాయ. సకల జీవరాసులను తన చేతనాశక్తితో నియంత్రిస్తున్నాడు. తన ఇష్టం వచ్చినట్టు ఆడిస్తున్నాడు. అందుకే జగన్నాటకం అని అన్నారు. ఈ జగన్నాటకంలో మనం అంతా పాత్రధారులం. జగన్నాటక సూత్రధారి ఆ పరమేశ్వరుడు. మనం మన ఇష్టం వచ్చినట్టు నటించే స్వేచ్ఛ ఇచ్చాడు పరమాత్మ. ఆ స్వేచ్ఛను సద్వినియోగం చేసుకుంటే బాగుపడతాము. అలా కాకుండా మాయలో పడి పరమాత్మ ఇచ్చిన స్వేచ్ఛను దుర్వినియోగం చేసుకుంటేచెడిపోతాము. కాని మనం మన స్వేచ్ఛను ఎలా ఉపయోగిస్తున్నామో మనలో ఉండి సాక్షీభూతంగా చూస్తూ ఉంటాడు పరమాత్మ. అందుకే హృద్దేశే అంటే హృదయము అనే ప్రదేశములో ఉన్నాడు. కాని కార్డియాలజిస్టులకు కనిపించడం లేదేమి అని మీరు అనవచ్చు. ఇక్కడ హృదయము అంటే అంత:కరణ. శరీరము, అందులో అవయవములు మనకు కనిపిస్తాయి. కాని మనస్సు, బుద్ధి, అహంకారము, అంత:కరణ కనిపించవు. కనిపించని వాటిలో కనిపించకుండా ఆత్మస్వరూపుడుగా ఉన్నాడు పరమాత్మ. చంకలో బిడ్డను పెట్టుకొని-ఊరంతా వెదికింది ఒక తల్లి అనే సామెత మనకు తెలుసు. అది ఎంతో వేదాంత తత్వముతో కూడుకున్నసామెత. మన హృదయములలో ఉన్న పరమాత్మను తెలుసుకోలేక దేవుడు అక్కడ ఉన్నాడు, ఇక్కడ ఉన్నాడు, ఇక్కడే ఉన్నాడు అనే భ్రమలో తిరుగుతుంటాము. కాని, లోపల ఉన్న పరమాత్మను మాత్రము చూడము. భగవంతుడు సత్యలోకంలో కానీ, వైకుంఠములో కానీ, కైలాసములో కానీ, స్వర్గములో కానీ లేడు. మన హృదయములలో ఉన్నాడు అని తెలుసుకోవడమే గీతాసారము. అదీ కూడా కేవలం మంచి వారి హృదయములలోనే కాదు సర్వభూతానామ్ అందరి హృదయములలో అని చెప్పాడు. గొప్పవాడు, పేదవాడు, గొప్పకులం వాడు, నిమ్నజాతివాడు, జంతువులు, పక్షులు, జలచరములు అనే భేదం లేకుండా అన్నిటిలోనూ ఉన్నాడు. అందుకే పరమాత్మ తన అవతారములలో మత్స్య,కూర్మ, వరాహ, నరసింహ అవతారములను చేర్చాడు.

ఈ అనంత విశ్వమే ఒక యంత్రం ఆ యంత్రం నడవడానికి శక్తిని ఇచ్చేవాడు పరమాత్మ. ఆ యంత్రములో ఉన్న ఒక చక్రమునకు అంటుకున్న జీవులం మనం. ఆ చక్రంతో పాటు గిరా గిరా తిరుగుతుంటాము. ఆ చక్రమే సంసారము. ఆ చక్రం మీది నుండి బయట పడాలంటే ఆ

చక్రం తిప్పేవాడే దిక్కు. అంటే ఆ పరమాత్మయే దిక్కు. ఆయన తలచుకుంటే మనలను అతి జాగ్రత్తగా ఆ చక్రం మీది నుండి తీసి తన ఒడిలో కూర్చోపెట్టుకుంటాడు. మరి ఈ యంత్రమును మాయ అంటే అజ్ఞానము ఆవరించి ఉంటుంది. ఆ యంత్రాన్ని, అందులో చక్రాలు తిరగడానికి శక్తినిచ్చేవాడు పరమాత్మ కాబట్టి ఆ మాయ ఆయనకు అంటదు. చక్రంతో పాటు తిరుగుతున్న మనకు అంటుతుంది. ఇదే రహస్యము.

## 62. తమేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత।
## తత్ప్రసాదాత్పరాం శాన్తిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్॥

కాబట్టి ఓ అర్జునా! నీలో కలిగిన సకల భావముల యందు నీవు ఆ ఈశ్వరుని శరణు పొందు. ఆ ఈశ్వరుని అనుగ్రహంతో, నీ మనసుకు శాంతి కలుగుతుంది. శాశ్వతమైన పరమపదమును పొందగలవు.

ఓ అర్జునా! నీవు నీలో కలిగిన సమస్త భావజాలము నుండి శాంతి పొందాలంటే, తమ్ ఏవ శరణం గచ్ఛ అంటే నీ హృదయంలో ఆత్మస్వరూపుడుగా ఉన్నాడే ఆ పరమాత్మను శరణు వేడు. ఊరికే శరణు వేడటం కాదు. సర్వభావేన అన్ని భావములతోటి శరణు వేడు. సంపూర్ణమైన, నిర్మలమైన మనస్సుతో, అహంకారమును వదిలిపెట్టి శరణు వేడాలి. అంతేకానీ స్వామీ నన్ను రక్షించు అని దండం పెట్టడం కాదు. పైపైదండాలు, సగం మనస్సుతో ధ్యానించడం కుదరదు. సంపూర్ణ శరణాగతి కావాలి. ఇతర చింతలు మనసులోనుండి తీసివేసి పరమాత్మనే మనసులో నిలుపుకోవాలి. మనసును ఆత్మలో లగ్నం చేయాలి. అప్పుడుఆ పరమాత్మ మన యోగక్షేమాలు అన్నీ చూసుకుంటాడు. అప్పుడు ఈశ్వరుని అధీనంలో ఉన్న మాయ పక్కకు తప్పుకుంటుంది. ఆ మాయ మనలను ఏమీ చేయలేదు. పరమాత్మను శరణు జొచ్చితే ఈ మాయ మన జోలికి రాదు. అప్పుడు ఏం జరుగుతుంది. ఆ పరమాత్మ అనుగ్రహము కలిగితే, ఆయనను శరణు జొచ్చితే, ఆయన ఆశ్రయంలో ఉంటే మనకు కలిగేది పరమ శాంతి. పరమ సుఖం. తరువాత శాశ్వతమైన మోక్షము దక్కుతుంది. సంసార బంధనములు అన్నీ తొలగి పోతాయి. జనన మరణ చక్రం నుండి విముక్తి లభిస్తుంది.

కాబట్టి హృదయ పూర్వకంగా ఆ పరమాత్మ శరణు జొచ్చాలి. ఆయన శరణాగతి లభిస్తే ఈ మాయ మనలను ఏమీచేయలేదు. ఆయన ఆశ్రయం మనకు లభిస్తుంది. సర్వోత్తమ శాంతి, సుఖము లభిస్తాయి. అదే మోక్షము. అందుకే పరాం శాన్తిమ్ అని వాడారు. పరమ శాంతి లభిస్తుంది అని అన్నారు. ఆ శాంతి, సుఖము, ప్రాపంచిక సుఖముల మాదిరి ఈ రోజు ఉండి రేపు పోయేది కాదు. శాశ్వతమ్ అంటే ఎప్పటికీ ఉంటుంది. కాలముతో దానికి సంబంధము లేదు.

ఎల్లకాలములలో నిలిచి ఉంటుంది. అంటే శాశ్వతంగా పరమాత్మలో లీనం అవుతాము అని భావన.

## 63. ఇతితే జ్ఞానమాఖ్యాతం గుహ్యాద్గుహ్యతరం మయా।
## విమృశ్యైత దశేషేణ యథేచ్ఛసి తథా కురు॥

అర్జునా! ఇప్పటి వరకు నేను నీకు బోధించినది అతి రహస్యమైన జ్ఞానము. నీవు దీనిని సంపూర్ణంగా విమర్శ చేసుకొని, ఆలోచించుకొని, ఆచరించతగ్గది అని నీవు అనుకుంటే, ఆచరించు. లేకపోతే నీకు ఏది ఇష్టమో అదే చెయ్యి.

అర్జునా! ఇప్పటి వరకు నేను నీకు అతి రహస్యము అయిన జ్ఞానమును నీకు ఉపదేశించాను. నీవు శ్రద్ధగా విన్నావు. ఏదో నేను చెప్పాను అని కాకుండా, మా బావ కృష్ణుడు చెప్పాడు ఒకసారి చేసి చూద్దాం అని కాకుండా, నేను చెప్పిన విషయాలు బాగా ఆలోచించు. నీలో నీవు విమర్శ చేసుకో. ఆ తరువాత నీకు ఏది మంచిది, ఏది ఉచితం అని తోస్తే దానిని ఆచరించు. నేను చెప్పాను కాబట్టి దీనిని ఆచరించాలి అని బలవంతం లేదు. అంతా నీ ఇష్టం నీకు ఇష్టం లేకపోతే చేయవద్దు. నీ ఇష్టం వచ్చిన మార్గంలో వెళ్లవచ్చు. అని అన్నాడు పరమాత్మ.

ఈ శ్లోకంలో మూడు విశేషాలు ఉన్నాయి. తాను చేసిన బోధ ఎటువంటిది అనిముందు చెప్పాడు. అర్జునా దీనిని జ్ఞానము అని పిలుస్తారు. ఈ జ్ఞానము అతి రహస్యమైనది. అందరికీ అందుబాటులో లేనిది. గుహ్యమైనది. ఇది ఉపనిషత్తులసారము. యోగవిద్య. బ్రహ్మ విద్య. ఆత్మజ్ఞానము. అర్హులైన వారికే ఉపదేశించాలి. నీవు అర్హుడవు అని తలంచి నేను నీకు ఉపదేశించాను. దీనిని సద్వినియోగ పరచుకొనేబాధ్యతనీదే అని అర్జునుడి పరంగా మనందరికీ చెప్పాడు కృష్ణుడు.

విమృశ్యైతదశేషేణ అంటే నేను నీకు అన్ని విషయాలు ఏమీ మిగల్చకుండా చెప్పాను. వీటిని నీవు కేవలం వింటే సరి పోదు. వాటిని తిరిగి మననం చేసుకో. అవి సరి అయినవా లేదా అనిసంపూర్ణంగా విచారించి, విమర్శ చేసుకో!. మనందరం కూడా భగవద్గీతలో చెప్పబడిన జ్ఞానము తమకు ఎంత వరకు ఆచరణయోగ్యము అని ఎవరికి వారు ఆత్మవిమర్శచేసుకోవాలి. తమలో ఉన్న లోపాలు తెలుసుకోవాలి. ఆ లోపాలు పోగొట్టుకోడానికి గీత ఎంత వరకు ఉపయోగపడుతుంది అని విచారించాలి.

పూర్వకాలంలో గురువులు తాము చెప్పింది మాత్రమే చేయాలి అని శిష్యులను నిర్బంధించరు. వారు బోధిస్తారు. దానిని శిష్యుడు తన స్వంత తెలివితేటలతో, సంస్కారముతో

పరిశీలించి విచారించి ముందు వెనుకలు తెలుసుకొని, వాటిలో తనకు నచ్చిన దానిని ఆచరించే స్వేచ్ఛ గురువులు శిష్యులకు ఇచ్చారు. అదే కృష్ణుడు ఈ శ్లోకంలో చెప్పాడు.

ఓ అర్జునా! నేను చెప్పాననీ, నా మీద భక్తితో, విశ్వాసంతో, గురుత్వభావంతో, నేను చెప్పినదంతా కళ్లుమూసుకొని చెయ్యమని చెప్పడం లేదు. నీ స్వంత తెలివితో నేను చెప్పిన దాని గురించి ఆలోచించు. నీలో నీవు విమర్శ చేసుకో. నేను చెప్పిన వాటిలో నీకు ఆచరణయోగ్యం అయినవి గ్రహించు అనే స్వేచ్ఛను ఇచ్చాడు పరమాత్మ.

కాబట్టి చెప్పేవాడికే కాదు, వినే వాడికికూడా స్వంత తెలివి తేటలు, ఆత్మ విమర్శచేసుకునే జ్ఞానము, ఉంటేనే అతడి బుద్ధి కూడా వికసిస్తుంది. కృష్ణుని జగద్గురువు అన్నారు. నిజమైన గురువు ఏం చెయ్యాలో అదే చేసాడు. శిష్యుడు గురువు దగ్గరకు తనకు తెలియని విషయాలు తెలుసుకోడానికి వస్తాడు. గురువు శిష్యునికి తనకు తెలిసిన విషయాలు అన్నీ చెప్పి తనంత వాడిని చేస్తాడు. తరువాత వదిలేస్తాడు. తాను తెలుసుకున్న విషయాలను ఆచరించడం ఆచరించకపోవడం శిష్యుని విచక్షణకు వదిలేస్తాడు. ఇది అసలైన గురువులక్షణం.

కాని ఈ రోజుల్లో గురువులు అందరూ, నేను చెబుతున్నాను నువ్వు చెయ్యి అని ఆజ్ఞాపించే వాళ్లేగానీ, నాకు తోచింది నేను చెప్పాను, నీ బుద్ధికి తోచినట్టు నువ్వు చెయ్యి అనే వాళ్లు తక్కువ. ఇది నేటి విద్యార్థులకు బాగా వర్తిస్తుంది. ఈ రోజుల్లో అంతా రెడీమేడ్ గైడ్లు, మేడ్ ఈజీలు క్వశ్చన్ బాంకులు వచ్చాయి. క్లాసులో పాఠాలు వినేవాళ్లు టెక్స్ట్ బుక్ చదివేవాళ్లే లేరు. బట్టీయం వేయడం తప్ప, చదివి అర్థం చేసుకుని స్వంతంగా రాసే శక్తి ఎవరికీ లేదు. సబ్జెక్టు అర్థం కావడం లేదు. టీచర్లు కూడా విద్యార్థులను గైడ్లు చదవడానికి, క్వశ్చన్ బాంకుల మీద ఆధారపడటానికి ప్రోత్సహిస్తున్నారు. తాను చెప్పింది విని అర్థం చేసుకున్నాడా లేదా అని ఏ గురువు ఆలోచించడంలేదు. గురువులు అందరూ కృష్ణుడు మాదిరిగా తమ శిష్యులను స్వంతంగా ఆలోచించే విధంగా తయారు చేయాలి కానీ తాము చెప్పింది యథాతథంగా అనుకరించే వారిని కాదు. అప్పుడే నిజమైన విద్య శిష్యుడికి లభిస్తుంది.

అశేషణ అనే పదం వాడారు. విచారించమంటే ఏదో మొక్కుబడిగా కాకుండా సంపూర్ణంగా విశ్లేషించాలి. పరిపూర్ణంగా అధ్యయనం చేయాలి. అన్ని ప్రమాణాలను అనుసరించాలి.

కృష్ణుడు ఆఖరున చెప్పిన మాట

యథేచ్ఛసి తథాకురు. నేను చెప్పింది విని, నీకుగా నువ్వు ఆలోచించుకున్న తరువాత నీ ఇష్టం వచ్చినట్టు చెయ్యి. బలవంతం లేదు. నీకు ఏది ఉచితం అనిపిస్తే దానిని ఆచరించు.

కృష్ణుడు భారం అంతా అర్జునుడి మీద వేసాడు. తన మీద ఏమీ పెట్టుకోలేదు. అర్జునుడికి సంపూర్ణమైన స్వేచ్ఛ ఇచ్చాడు. ఇదే కృష్ణుడు ఆచరించిన నిష్కామకర్మ. 700 శ్లోకాలు అనర్గళంగా చెప్పిన తరువాత, అయ్యో ఇంతసేపు కంఠశోష పెట్టుకున్నాను, అర్జునుడు ఆచరిస్తాడో లేదో, వీడితో ఆచరించేటట్టు చేయాలి అని అనుకోకుండా ఫలితాన్ని అర్జునుడికే వదిలివేసాడు. కృష్ణుడు తన పని తాను చేసాడు. అర్జునుడికి జ్ఞానబోధ చేసాడు. తన పని పూర్తి అయింది. దానికి ఫలితం ఆశించలేదు. ఇదే కర్తవ్యనిర్వహణ,నిష్కామ కర్మ.

నిజానికి అర్జునుడితో యుద్ధం చేయించాలనేది కృష్ణుడికోరిక. కాని అర్జునుడిని యుద్ధం చేయమని బలవంతం చేయలేదు. నీ ఇష్టం అన్నాడు. చేస్తే చెయ్యి లేకపోతే లేదు అని ఛాయిస్ అర్జునుడికే వదిలేసాడు. తాను ప్రశాంతంగా ఉన్నాడు. అలా కాకుండా ఇంతసేపు గొంతు నొప్పేటట్టు చెప్పాను. నువ్వు యుద్ధం చేయాలి అని బలవంతం చేయలేదు. తమ మాట నెగ్గాలనీ, తమ పట్టుదల నెరవేరాలనీ, లేకపోతే అది చేస్తా ఇది చేస్తా అని బెదించే వాళ్లకు ఇది ఒక గుణపాఠం. మీరు చెప్పాల్సింది చెప్పారు. చేయాల్సింది చేసారు. దానిని మర్చిపోయి ప్రశాంతంగా ఉండటం ఉత్తమం. దాని గురించే ఆలోచించి మనసు పాడు చేసుకుంటే దు:ఖమే మిగులుతుంది. తల్లితండ్రులు గురువులు తమ సంతానానికి, శిష్యులకు మంచి మార్గము సూచిస్తారు. ఆ మార్గం మంచిదా కాదా అనే వివేచన చేసి ఆ మార్గంలో నడవడం, నడవకపోవడం వారి ఇష్టం.

(అని కృష్ణుడు భగవద్గీతను ముగించి అర్జునుడి ముఖంలోకి చూచాడు. ఇదేంటి అప్పడే అయిపోయిందా. ఇంతకూ నేను యుద్ధం చేయాలా వద్దా అనే విషయం తేల్చకుండా నీ ఇష్టం వచ్చినట్టు చేయమంటాడేంటి ఈయన అనే భావనతో కృష్ణుడు ముఖంలోకి చూచినట్టున్నాడు అర్జునుడు. అందుకని మరలా కృష్ణుడు చిరునవ్వుతో కాస్త ముక్తాయింపుగా క్లుప్తంగా రెండు శ్లోకాలు చెప్పాడు. ఈ రెండు శ్లోకాలు భగవద్గీత సారము. భగవద్గీత మొత్తం చదవకపోయినా, ఈ రెండు శ్లోకాలు(65,66 శ్లోకాలు) చదివి అర్థం చేసుకుంటే భగవద్గీత సాంతం అర్థం అయినట్టే.)

## 64. సర్వగుహ్యతమం భూయ శ్శృణుమే పరమం వచ:।
## ఇష్టోఽసి మే దృఢమితి తతో వక్ష్యామి తే హితమ్॥

ఓ అర్జునా! ఇప్పుడు నేను నీ చెప్పిన మాటలన్నీ రహస్యములలో కెల్లా రహస్యమైనవి. చాలా శ్రేష్ఠమైనవి. అందరూ ఆచరించతగ్గవి. కాని వీటి పట్ల నీకు సరిగా అవగాహన కలిగినట్టు లేదు. అందుకని క్లుప్తంగా రెండు శ్లోకాలలో చెబుతాను విను. నేను నీకు ఇదంతా ఊరికే చెప్పలేదు. నీవు నాకు పరమ ఇష్టుడవు. పైగా మార్గం చూపమని అర్థించావు. అందుకని చెప్పాను. నీ మేలుకోరి మరలా చెబుతాను శ్రద్ధగా విను.

కృష్ణుడు మరలా భగవద్గీత లక్షణాల గురించి చెబుతున్నాడు. ఇది అన్ని రహస్యములలో కల్లా పరమ రహస్యము. సర్వశ్రేష్టము. అటువంటి ఆత్మజ్ఞానమును నీకు మరలా మరలా చెప్పాను. నీవు శ్రద్ధగా విన్నావు. నాకు చాలా సంతోషం అయింది. ఇదంతా నేను నీ మేలు కోరి చెప్పాను. నీకు కీడు చెయ్యాలని చెప్పలేదు. నీవు నాకు బంధువే కాదు. అత్యంత ప్రీతి పాత్రుడవు. ఇప్పుడు శిష్యుడవు. నీవు బాగుపడటమే నాకు కావాలి. కాబట్టి నేను చెప్పింది చెయ్యి. యుద్ధం నీ కర్తవ్యం. నీ కర్తవ్యం నెరవేర్చు.

గురువుకు శిష్యుని మీద ఇటువంటి వాత్సల్యం ఉండాలి. శిష్యుడు బాగు కోరాలి. శిష్యుడి మీద ప్రేమను పెంచుకోవాలి. మంచి బోధన చేయాలి. వారు బాగుపడటానికి దోహద పడాలి. (కాపీలు కొట్టమని అక్రమాలు చేసి లంచాలు ఇచ్చి అడ్డదారుల్లో రాంకులు తెచ్చుకోమని ప్రోత్సహించకూడదు. ప్రస్తుతం జరిగేది అదే కదా!) శిష్యుడు కూడా గురూపదేశమును చక్కగాపాటించాలి. అప్పుడే గురుశిష్య సంబంధము చక్కగా వర్ధిల్లుతుంది.

వక్ష్యామి తే హితమ్ అంటే నీ మేలు కోరి చెబుతున్నాను. నీ హితము కోరి చెబుతున్నాను. శిష్యుని హితము కోరడం గురువు కర్తవ్యము అని అంతర్గతంగా బోధిస్తున్నాడు పరమాత్మ. ఈ శ్లోకం గురుశిష్యుల మధ్య అనుబంధాన్ని, ప్రేమను, వాత్సల్యాన్ని, గురువుయొక్క కర్తవ్యాన్ని, బాధ్యతను సూచిస్తూ ఉంది అని చెప్పడంలో సందేహము లేదు.

## 65. మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు।<br>మామేవైష్యసి సత్యం తే ప్రతి జానే ప్రియో2సి మే॥

ఓ అర్జునా! నీవు నాకు ఇష్టుడవు కాబట్టి మరలా చెబుతున్నాను. నాయందు మనసు నిల్పి, (ధ్యానంలో మనసును ఆత్మకు అనుసంధానం చేసి), నామీద భక్తి కలిగి, (ఎల్లప్పుడూ ఏ పని చేసినా మనసు భగవంతుని మీద లగ్నం చేసి), నన్ను ఆరాధిస్తే (శక్తి మేరకు సగుణోపాసన, పూజలు చేస్తే), నాకు నమస్కరిస్తే (ప్రతి జీవిలోనూ ఆత్మను దర్శిస్తూ, మనిషి శరీరానికి కాకుండా, శరీరంలో ఉన్న ఆత్మకు నమస్కరిస్తే), అటువంటి వాడు నన్నే పొందుతాడు. ఇది యదార్థము. ఎటువంటి సందేహము లేదు. ఈ విషయం నేను ప్రతిజ్ఞచేసి చెబుతున్నాను.

గీతలో ఉన్న అత్యుత్తమ శ్లోకాలలో ఈ శ్లోకము దీని తరువాతి శ్లోకము అగ్రభాగాన నిలుస్తాయి. . శ్రీకృష్ణుడు అర్జునుడి ద్వారా మానవాళికి, మూడులోకాలకు పరమాత్మ ఇచ్చే సందేశము ఇదే!

(ఇదే శ్లోకము మనకు రాజవిద్యారాజగుహ్యాయోగములో చిట్టచివరి శ్లోకము.

34.మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు।
మామేవైష్యసి యుక్త్వైవమాత్మానం మత్పరాయణః॥

చివరి మాటల్లో కొంచెం తేడా తప్ప ఆ శ్లోకం, ఈ శ్లోకం రెండూ ఒకటే. టీచరు పరీక్షల ముందు ఇంపార్టెంటు క్వశ్చన్ చెప్పినట్టు కృష్ణపరమాత్మ ఈ శ్లోకం చిన్న మాటల మార్పుతో మరలా చెప్పాడు. ఈ శ్లోకాన్ని మనం మరింత శ్రద్ధతో అర్థం చేసుకోవడానికి ప్రయత్నం చేద్దాము.)

ఈ శ్లోకం ఇంతకు ముందు చెప్పబడిన కర్మయోగ సారము.
మొదటి పాదములో మనం ఏమి చెయ్యాలో, రెండవపాదంలో దాని వలన ఏం ఫలం కలుగుతుందో వివరించాడు వ్యాసుడు.

మన్మనాః= ముందు దేవుడిమీద ఆసక్తి చూపించు. దేవుడిని సగుణాకారంతో ఆరాధించు. క్రమక్రమంగా నీ మనసు నా యందు నిలుపు. అంటే నీ మనసును ఆత్మకు అనుసంధానించు. ఆత్మయందు ఉంచు. ఇదంతా ఒక రోజులో జరిగే పని కాదు. క్రమక్రమంగా జరగాలి. అదే సం న్యాసము, చక్కగా ఉంచడం. చక్కగా కలపడం. ఇంకా..........
మద్భక్తో= నా యందు అంటే పరమాత్మయందు భక్తి కలిగి ఉండు. ఏ పని చేస్తున్నా, మనసు నా మీదనే ఉంచు.
మద్యాజీ= ఎల్లప్పుడూ పరమాత్మను సగుణోపాసన ద్వారా ఆరాధించు, పూజించు, భజించు
నమస్కురు= నమస్కరించు. అంటే నీలోని ఆత్మస్వరూపానికి నమస్కరించు. ఇందులో మరొక అర్థం కూడా ఉంది. సకల జీవ రాసులలో పరమాత్మ ఆత్మస్వరూపుడుగా ఉన్నాడు. కాబట్టి అందరూ ఆరాధ్యులే. కేవలం శరీరానికి కాకుండా అందరిలో ఉన్న ఆత్మస్వరూపానికి నమస్కరించు. అందరికీ భక్తితో నమస్కరించు.
ఇలా చేస్తే......
మామే వైష్యసి= అప్పుడు నన్నే పొందగలవు. నేను ఎవరో తెలుసుకోగలవు. అంటే ఆత్మ సాక్షాత్కారం అవుతుంది.
మే= నాకు
ప్రియ అసి= అప్పుడు నీవు నాకు ఇష్టుడవు అవుతావు.
సత్యం= ఇది అందరూ తెలుసుకోదగిన, తెలుసుకోవలసిన, తెలుసుకొని ఆచరించవలసిన సత్యము.
ప్రతిజానే= ఇదే నా ప్రతిజ్ఞ.

ఇంతకన్నా ఎవరు మాత్రం ఏం చెబుతారు చెప్పండి. ఏ అధికారి దగ్గరకో, మంత్రి గారి దగ్గరకో, ముఖ్యమంత్రి దగ్గరకో, ప్రధాన మంత్రి దగ్గరకో పోతే వాళ్లు కూడా చూద్దాంలే అంటారు కానీ ఖచ్చితంగా చెప్పరు. కాని ఇక్కడ పరమాత్మ నీవు ఈ పని చేస్తే నేను నిన్ను నా వాడిగా చేసుకుంటాను అని ప్రతిజ్ఞచేస్తున్నాడు. దానికి చెయ్యాల్సింది కూడా చాలా సులభం.

నిరంతర ధార్మిక జీవనం గడపడం. ఏ పని చేసినా ధర్మంగా, న్యాయంగా, ఇతరులకు హాని కలగకుండా చేయాలి. తరువాత శాస్త్రములను అధ్యయనం చేయాలి. అదీ వీలుకాకపోతే వినాలి. అర్థం చేసుకోవాలి. తద్వారా పరమాత్మ గురించిన అసలైన జ్ఞానం సంపాదించాలి. తరువాత ప్రపంచంలో మనకు కావాల్సిన వస్తువులను సంపాదించడం ఎలా లక్ష్యంగా పెట్టుకుంటామో అలాగే పరమాత్మను పొందడం కూడా ఒక లక్ష్యంగా పెట్టుకోవాలి. క్రమక్రమంగా అన్ని లక్ష్యాలను వదిలిపెట్టి, పరమాత్మనుపొందడమే ఏకైక లక్ష్యంగా పెట్టుకోవాలి. తరువాత నేనే పరమాత్మ స్వరూపుడను అహం బ్రహ్మాస్మి అనే స్థితికి చేరుకోవాలి.

ఈ స్థితికి చేరుకోవాలంటే ముందు కర్మయోగపరమైన సులభమైన మార్గాలు చెబుతున్నాడు పరమాత్మ.

1. ఆత్మలో మనసును నిలపడం, లగ్నం చేయడం. దీనికి ప్రాధమికంగా పరమాత్మయందు ఆసక్తి, అనురక్తి కలగాలి. శరీరాన్ని, మనసును నిగ్రహించి ధ్యానం చేయడం. దీనికి అవసరమైనది మనకు ఇష్టమైన అర్చామూర్తిని ఎదురుగా పెట్టుకొని పూజించడం.
2. ఏ పని చేస్తున్నా (అది చదువు, ఉద్యోగం, వ్యాపారం, రాజకీయం ఏదైనా కావచ్చు) దేవుడి మీద భక్తి శ్రద్ధ కలిగి ఉండటం
3.దేవుడిని ఏకాగ్ర భక్తితో, అనన్య భక్తితో, ఇతర చింతనలు లేకుండా, పూజించడం, ఆరాధించడం.
4.సకల జీవరాసులలో ఆత్మస్వరూపుడుగా, చైతన్య స్వరూపుడుగా ఉన్న పరమాత్మకు నమస్కరించడం.
ఈ పనులు సక్రమంగా చేస్తే పరమాత్మ భక్తుడి వశం అవుతాడు. ఇది పరమాత్మ చేస్తున్న వాగ్దానం. కాబట్టి మానవుల కర్తవ్యం మనసును ప్రాపంచిక విషయాల నుండి, విషయ వాంఛల నుండి మరల్చి ఆత్మయందు ఉంచాలి. ఇదే కష్టం. మిగిలిన విషయాలు అన్నీ సులభమే. కాకపోతే ఏకాగ్రభక్తి ముఖ్యం. మోక్షం మేడ్ ఈజీ చేసాడు పరమాత్మ. మనం అనుసరించడమే తరువాయి.

(ఈ శ్లోకం కర్మయోగమును సూచిస్తుంది. మనం ఏం చేయాలి. ఏం చేస్తే ఏం ఫలితం కలుగుతుంది. అది ఎటువంటి ఫలితము అనే విషయాల్ని క్లుప్తంగా చెప్పాడు. తరువాతి శ్లోకము కర్మయోగము ఆచరించిన తరువాత కలిగే జ్ఞానయోగమును సూచిస్తుంది.)

## 66.సర్వధర్మాన్పరిత్యజ్య మామేకం శరణం వ్రజ।
## అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః॥

సర్వధర్మములను వదిలిపెట్టి, నన్ను (పరమాత్మను) ఏకాగ్రభక్తితో, శరణుజొచ్చు. నేను (పరమాత్మ) నిన్నుసకలపాపముల నుండి విముక్తుడిని చేస్తాను నీకు మోక్షమును ప్రసాదిస్తాను. నువ్వు శోకించవద్దు. ఈ శ్లోకంలో జ్ఞానము అనే పదం వాడకుండా జ్ఞాన యోగం గురించి బోధించాడు పరమాత్మ.

రెండవ అధ్యాయము 11వ శ్లోకంతో కృష్ణుడు గీతాబోధ మొదలు పెట్టాడు. ఆ శ్లోకంలో ఆఖరి పదం నానుశోచంతి అంటే శోకము చెందకు. 18 అధ్యాయము 66వశ్లోకంతో గీత పూర్తి అవుతుంది. అందులో ఆఖరి పదం మా శుచ: శోకించకు అని అర్థం. అంటే మానవుల సహజ లక్షణం సుఖంగా ఉండటం. మానవులందరూ శివ స్వరూపులు. శివ అంటే ఆనందము. మనం అందరం ఆనందస్వరూపులం.  శోకం మన లక్షణం కాదు. మనం అనవసరంగా శోకమును తెచ్చిపెట్టుకుంటున్నాము. అని భావన.  ధర్మంగా, న్యాయంగా మానవ ప్రయత్నం చేస్తూ, మిగిలిన భారం అంతా భగవంతుని మీద వేసి, మనం సుఖంగా ఉండాలి. ప్రశాంతంగా ఉండాలి. మనసులో కల్మషం ఉండకూడదు అని గీతాసారము. పల్లెటూళ్లలో ఏమీ చదువుకోని వాళ్లు, పామరులుకూడా "దేవుడి మీద భారం వేసి నిశ్చింతగా ఉంటే అంతా ఆయనే చూచుకుంటాడు" అని అనడం "స్వామీ! అంతా నీదే భారం. నాదేం లేదు" అనడం మనం వింటున్నాము. గీతాసారం అంతా ఏమీ చదువుకోని ఆ పామరులు రెండు ముక్కల్లో చెబుతుంటే ఆశ్చర్యం వేస్తుంది.

గీతలో ఈ శ్లోకము పైశ్లోకము అత్యంత ప్రాధాన్యమైనవి. ఈ రెండు శ్లోకాలు అర్థం అయితే గీత మొత్తం అర్థం అయినట్టే. ఈ శ్లోకంలో మొదటి రెండు పదాలు సరిగా అర్థం చేసుకోకపోతే విపరీత అర్థాలు గోచరిస్తాయి. నీవు ఏ పనీ చేయకు. నీ ధర్మాలు అన్నీ వదిలిపెట్టు. నా దగ్గర కూర్చుని పూజించు భజనచెయ్యి. నీకు మోక్షం ఇస్తాను అని పై అర్థం. పని చేయకుండా ఏ వ్యక్తి ఉండలేడు. అది సాధ్యం కాదు అన్న కృష్ణుడు ఈ మాటలు ఎందుకు చెబుతాడు. పైగా అర్జునుడికి నీ స్వధర్మము అయిన క్షాత్రధర్మము ఆచరించు యుద్ధం చెయ్యి అన్నవాడు అన్ని ధర్మాలు వదిలిపెట్టు అని ఎందుకు చెబుతాడు. కాబట్టి ఈ మాటలకు పైపైన అర్థం తీసుకోకుండా లోతుగా అధ్యయనం చేయాలి.

సర్వధర్మాన్ పరిత్యజ్య అంటే ఏ పనీ చేయకుండా సోమరిగా కూర్చోవడం కాదు. మానవులకు కొన్ని ధర్మాలుఉన్నాయి. వాటిని మానవులు ఆచరించాలి. వాటినే నిత్య, నైమిత్తిక కర్మలు అంటారు. నిత్య కర్మలు అంటే ప్రతిరోజూ చేసేవి. స్నానం, సంధ్యావందనం, పూజ,

వేద,శాస్త్రములు చదవడం. నైమిత్తిక కర్మలు అంటే ఏదో ఒకనిమిత్తంతో చేయాల్సినవి. పుట్టగానే జాతక కర్మలు, ఉపనయనము. మరణిస్తే అంత్యక్రియలు, మాసికములు, ఆబ్దికములు ఇలాంటివి. జీవన్ముక్తుడు అయిన తరువాత ఇవి చేయకపోయినా పర్వాలేదు. కాని సామాన్య మానవుడు ఇవన్నీ చేయాలి. అయితే కేవలం ఇవి ఆచరిస్తేనే మోక్షం రాదు. ఈ నిత్యనైమిత్తిక కర్మల కంటే భగవంతుని మీద అనన్య భక్తి, ఏకాగ్రబుద్ధి కలిగి ఉండటం ఉత్తమము. భగవంతుని మీద ఏకాగ్రబుద్ధి, శ్రద్ధ, మనో నిగ్రహము, ఇంద్రియ నిగ్రహము సాధిస్తే, నిత్య నైమిత్తిక కర్మలు చేయకపోయినా పర్వాలేదు అని అర్థం. కాబట్టి మనం సర్వధర్మాన్ పరిత్యజ్య అంటే పరమాత్మ సోమరితనాన్ని ప్రోత్సహిస్తున్నాడు అని అనుకోకూడదు. ఏ కర్మ చేసినా దానిని నేను చేస్తున్నాను అనే అహంకారము, కర్తృత్వభావన లేకుండా చేయాలి. అప్పుడు ఆ కర్మల బంధనములు అంటవు. ఆ కర్మలు చేసినా చేయనట్టే లెక్క.ఈ విధంగా సర్వధర్మాన్ పరిత్యజ్య అనే పదాలు అర్థం చేసుకోవాలి.

కాని మనం మాత్రం అదే చేస్తున్నాము. అంతా నేను చేస్తున్నాను. అంతా నావలననే జరుగుతూ ఉంది అనే భావనతో ఉన్నాము. గుడికి పోయి టెంకాయ కొట్టి, అరటి పళ్లు పెట్టి, దేవుడిని అంతులేని వరాలు కోరుతుంటాము. నారు పోసిన వాడు నీరు పోయకపోతాడా అనే శుష్కవేదాంతాన్ని పట్టుకొని వేలాడుతున్నాము. కర్తవ్య కర్మలను మరిచిపోతున్నాము. అదే మన అజ్ఞానము. గజేంద్రుడు కూడా తాను మొసలితో పోరాడి పోరాడి అలసిపోయి, తన కర్తవ్యమును నెరవేర్చి, అప్పుడు "నీవే తప్ప నిత:పరం బెరుగ" అంటూ పరమాత్మకు శరణాగతుడయ్యాడు. అంతేకానీ, మొసలి తన కాలు పట్టుకోగానే దేవుడా నన్ను రక్షించు అని మొరపెట్టుకోలేదు. విద్యార్థులు కూడా సంవత్సరం అంతా చదవకుండా, అడ్డమైన తిరుగుళ్లు తిరిగి, పరీక్షలు నెల రోజులు ఉండగా, పుస్తకాలు ముందేసుకొని కూర్చోవడం, ఆలయాల చుట్టు తిరగడం, కర్తవ్యనిష్ఠ అనిపించుకోదు. సంవత్సరం అంతా క్రమం తప్పకుండా స్కూలుకుపోయి, మాస్టారు చెప్పిన పాఠాలు శ్రద్ధగా విని, రాత్రి వాటిని మననం చేసుకుంటూ, పరీక్షల సమయంలో భగవంతుని మీద మనసు లగ్నం చేస్తే, పరీక్షలు రాస్తే, పరమాత్మ కూడా అతనికి సాయం చేస్తాడు, చదివినవి గుర్తుకు వస్తాయి. చక్కని ఫలితాలు వస్తాయి. కాబట్టి మనం కూడా ముందు మన కర్తవ్యమును శ్రద్ధతో, నిష్ఠతో నెరవేర్చాలి. ఫలితం భగవంతునికి వదిలిపెట్టి నిశ్చింతగా ఉండాలి.

సర్వధర్మాన్ పరిత్యజ్య అంటే మరొక అర్థం కూడా చెప్పుకోవచ్చు. మనకు రెండు మార్గాలు ఉన్నాయని చెప్పుకున్నాము కదా. ఒకటి ప్రవృత్తి మార్గము రెండు నివృత్తి మార్గము. సర్వధర్మములు అంటే ప్రవృత్తి మార్గములో లభించేవి. ప్రాపంచిక విషయములు, విషయవాంఛలు, బంధు మిత్రులు. ఆస్తి,ధనము, బంధనములు. ఇవన్నీ వదలాలి. ఊరికే వదిలితే సరిపోదు. పరమాత్మను శరణు వేడాలి. నీవే తప్ప నిత: పరం బెరుగ అనే స్థాయికి చేరుకోవాలి. అప్పుడు మనం ఏం చేసినా ఆ పాపం మనకు అంటదు. అంటే అకృత్యములు చేయమని కాదు. ఆ స్థాయికి చేరుకున్నవాడు దుర్మార్గములు, అకృత్యములు చేయనే చేయడు. పరమాత్మను పట్టుకున్నవాడికి

చిన్న చిన్న ధర్మములు, పూజలు, వ్రతములు చేసి ప్రయోజనము లేదు. గంగానది పక్కన ఉన్న వాడికి బావి నీళ్లతో పనిలేదు. అందుకే సన్యాసులు ఏమీ చేయరు. కేవలము పరమాత్మను మనసులో నిలుపుకొని ధ్యానిస్తుంటారు. కాని మనం సన్యాసులం కాదు కదా. సంసారంలో ఉన్నాము. కాబట్టి మనం కర్మలు చేయాలి తప్పదు. కర్మలు చేయకుండా ఒక్క క్షణం కూడా ఉండలేము అని ఇదివరకే చెప్పబడింది. ఆ కారణం చేత ఇక్కడ సర్వధర్మాన్ పరిత్యజ్య అంటే సర్వధర్మములను ఆచరిస్తూనే, వాటిని నేను చేయడం లేదు, అన్ని ప్రకృతిసిద్ధంగా జరుగుతున్నాయి, నేను కేవలం సాక్షిగా చూస్తున్నాను అనే భావన అలవరచుకోవాలి. నేను చేస్తున్నాను అనే కర్తృత్వభావన వదిలిపెట్టాలి. ఎందుకంటే ఆత్మ వేరు శరీరం వేరు. మనసు, బుద్ధి, అహంకారాలు, శరీరము ఇవే పనులు చేసేది. గుణా గుణేషు వర్తంతే అని ఇదివరకే చెప్పబడింది. అంటే మనలో ఉన్న సత్వ, రజస్తమోగుణములు, బయట ప్రకృతిలో ఉన్న రజస్తమోగుణములతో చేరి, ప్రవర్తిస్తున్నాయి. దాని వలన కర్మలు జరుగుతున్నాయి.

ఉదాహరణకు సత్వగుణం కలిగిన అందమైన వస్తువునుకానీ, పూవును కానీ చూచి మనలో ఉన్న సత్వగుణము దానిని చూడమనీ, దాని దగ్గరకు వెళ్లమని సూచిస్తుంది. అప్పుడు మనం దాని దగ్గరకు వెళతాము. కాని రజోగుణము, తమోగుణము కలిగిన పామును, పులిని చూచి మనలో ఉన్న రజస్తమోగుణములు, దానిని చంపు లేకపోతే పరుగెత్తు అని సూచిస్తుంది. వెంటనే మనం ధైర్యం ఉంటే కత్తో, కర్రో తీసుకుంటాము లేకపోతే పరుగు లంకించుకుంటాము. ఇవన్నీ ఆత్మ కేవలం సాక్షి మాదిరి చూస్తూఉంటుంది. కాబట్టి మనం స్వధర్మనిష్ట కలిగి ఉండాలి. కర్మలు చేయాలి కానీ అవన్నీ మనలో ఉన్న గుణముల ప్రభావంతో, ప్రకృతిసిద్ధంగా జరుగుతున్నాయి కానీ వాటిని నేనే చేస్తున్నాను అని అనుకోకూడదు. నేను వేరు శరీరం వేరు అనే జ్ఞానాన్ని కలిగి ఉండాలి. ఈ విషయాలను తెలుసుకోవాలి అంటే ఆత్మజ్ఞానం కలిగి ఉండాలి అనే అర్థాన్ని ఈ సర్వధర్మాన్ పరిత్యజ్య అనే పదాలు స్ఫురింపజేస్తున్నాయి.

మామేకమ్ అంటే పరమాత్మను ఒక్కడినే శరణు వేడాలి. అనన్య భక్తి కలిగి ఉండాలి. మనసు చంచలం కాకూడదు. చెట్టుకు మొదట్లో నీరుపోస్తే చిటారు కొమ్మకు కూడా చేరినట్టు, పరమాత్మను ఏకాగ్రబుద్ధితో పూజించి ధ్యానిస్తే, అన్ని దేవతలను పూజించినట్టే. అన్నిధర్మములు ఆచరించినట్టే, అన్ని కర్మలు చేసినట్టే. "ఆకాశాత్పతితం తోయం యథాగచ్ఛతి సాగరం సర్వదేవ నమస్కార: కేశవం ప్రతిగచ్ఛతి" అంటే ఆకాశంనుండి భూమి మీద పడిన నీరు నానావిధాలుగా సముద్రం చేరినట్టు, మనం ఎంత మంది దేవతలను, దేవుళ్లను వివిధ రకాలుగా పూజించినా, అవి అన్ని కూడా ఆ పరమేశ్వరునికే చెందుతాయి. అందుకే మామ్ ఏకం అని వాడారు. ఇక్కడ ఏకం అంటే నన్నే పూజించు అని కాదు. అన్ని దేవతా స్వరూపాలు ఆయన రూపాలే. "ఏకమేవా అద్వితీయం బ్రహ్మ" ...బ్రహ్మము ఒక్కటే ఇద్దరు కాదు....అనే స్థితికి చేరుకోవాలి. దేవుళ్ల మధ్య భేదభావమును వదిలిపెట్టాలి.

దానికి ఫలితం ఏమిటి అంటే "అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి"అంటే మానవులు తమ సమస్తపాపముల నుండి విముక్తులు అవుతారు. సంసార బంధనముల నుండి, ప్రాపంచిక విషయముల నుండి, విషయ వాంఛల నుండి ముక్తి కలుగుతుంది. ఆ బాధ్యత ఆయన తీసుకుంటాడు. మనం చేయాల్సింది చేస్తే ఆయన చేయాల్సింది చేస్తాడు. మనం ఏమీ చేయకుండా అంతా దేవుడే చూచుకుంటాడు అని అనుకోవడం సోమరితనానికి దారి తీస్తుంది. కృష్ణుడు అర్జునుని తన కర్తవ్యమును నెరవేర్చమన్నాడే కానీ సోమరిగా కూర్చోమనలేదు.

ఆఖరున "మాశుచ:" అంటే అర్జునా శోకించకయ్యా నాకు ఏడవడం అంటే పడదు అని అన్నాడు కృష్ణుడు. ఇందాక చెప్పినట్టు సంతోషంగా ఉండటం మానవుల లక్షణం. దు:ఖములు మనం తెచ్చిపెట్టుకుంటాము. అర్జునుడు కూడా జరగనివి, జరగబోయేవి ఏవేవో ఊహించుకొని బాధపడుతున్నాడు. అవి వదిలిపెట్టు. భారం నా మీద వేసి యుద్ధం చెయ్యి. నీ ధర్మం నెరవేర్చు. నీకు ఏ పాపము అంటదు అని బోధించాడు కృష్ణుడు.

## 67. ఇదం తే నా తపస్కాయ నా భక్తాయ కదాచన।
## న చా2శుశ్రూషనే వాచ్యం న చ మాం యో2భ్యసూయతి॥

ఓ అర్జునా! ఇప్పుడు నేను నీకు బోధించిన ఈ గీతాశాస్త్రమును, తపస్సు, భక్తి, వినడంలో ఆసక్తి, లేని వారికీ, దైవము యందు నమ్మకములేకుండా దైవదూషణ చేసేవారికి ఎప్పుడూ బోధించకూడదు.

ఈ హెచ్చరిక ఈనాడు మనందరికీ పరమాత్మ చేసిన హెచ్చరిక. ఈ గీతను ఎవరికి బోధించాలి, గీతను వినడానికి ఎవరు అర్హులు అనే విషయం ఇక్కడ వివరంగా చెప్పాడు కృష్ణుడు. గీతను వినడానికి మొట్టమొదటి అర్హత తపస్సు. అంటే అడవులకు పోయి తపస్సు చేయడం కాదు. గృహస్థు గా ఉంటూనే ధర్మచింతన, క్రమశిక్షణ కలిగిన జీవితం గడిపేవారు అని అర్థం. క్రమశిక్షణ, ధర్మ ఆచరణ లేనివారికి భగవద్గీత చెబితే వాడు దానిని తప్పుగా అర్థం చేసుకునే అవకాశం ఉంది. తరువాతి లక్షణం. భక్తి. దైవభక్తి లేని వారికి, ఏకాగ్రతలేని వారికి, చెప్పకూడదు. మనం కృష్ణుడిని దేవుడిగా పూజిస్తున్నాము. అందుకే శ్రీకృష్ణుడిని భగవాన్ అని సంబోధిస్తున్నాము. అటువంటిది దేవుడి మీద భక్తి లేని వాడికి భగవద్గీత చెప్పడం చెవిటి వాడి ముందు శంఖం ఊదడం లాంటిది. వాడు వినడు. పక్కన ఉన్న వాడిని విననివ్వడు. అటువంటి వారికి చెప్పకూడదు. తరువాత లక్షణం పరధ్యానంగా ఉండటం. గీతాజ్ఞాన యజ్ఞానికి వస్తారు. కూర్చుంటారు. మనసు ఎటో పోతుంటుంది. ఏం చెబుతున్నారో తెలియదు. పక్కన ఉన్న వాడిని ఇంకా ఎంతసేపురా ఈ సోది అని అంటుంటాడు.

అంటే వీడికి వినడం ఇష్టం లేదు. కాబట్టి, వినడం ఇష్టం లేని వారికీ, దైవమును పూజించని వారికీ, దైవమును దూషించేవారికి చెప్పకూడదు. చెప్పీ ప్రయోజనములేదు.

ఎందుకంటే, పై చెప్పిన లక్షణములు కలవారు "గీతలో ఏముంది. మనకు తెలిసిందే కదా! మనకు తెలియంది ఏముంది" అనే మూర్ఖత్వంతో ఉంటారు. వారికి తెలియదు ఒకరు చెబితే వినరు. వారు బాగా చదువుకున్న విద్వాంసులు కావచ్చు. ప్రాపంచిక విద్యలు ఎన్నో నేర్చి ఉండవచ్చు. ఎన్నో డిగ్రీలు సంపాదించి ఉండవచ్చు. అటువంటి వారు తమ గొప్పతనాన్ని ఇతరుల ముందు ప్రదర్శించుకోవాలనే ఆతురతగా ఉంటారు కాని సత్యము అసత్యము వీటి మధ్య ఉన్న భేదములు తెలుసుకోలేని, తెలుసుకోవడానికి ఇష్టంలేని మూర్ఖులు. వారికి తెలియదు ఒకరు చెబితే వినరు. తమకు తెలిసిందే సత్యం అని నమ్ముతారు. అటువంటి వారు గీతను సరిగా అర్థం చేసుకోలేరు.

మనసు నిర్మలంగా లేకపోతే ఏమి చెప్పినా తలకు ఎక్కదు. బుద్ధి నిలవదు. గీతను వింటూనే ఉంటాడు మనసు మాత్రం ప్రాపంచిక విషయముల వెంట పరుగెడుతూ ఉంటుంది. అటువంటి వారికి చెప్పడం వృధా. తపస్సు అంటే అడవులలోకిపోయి ముక్కుమూసుకొని కూర్చోవడం కాదు. ఈ ప్రాపంచిక విషయముల నుండి, సంసార బంధనములనుండి ఎలా విడివడాలా అనే తపన చెందడం. క్రమశిక్షణ కలిగి ఉండటం. చేసే పని యందు ఏకాగ్రత కలిగి ఉండటం. అదే తపస్సు.

దీని తరువాత మరొక దుర్గుణం గురించి కూడా చెప్పారు వ్యాసులవారు. అభ్యసూయతి అంటే దుర్బుద్ధి, అసూయ ఉండకూడదు. ఈ లక్షణాలు ఉన్న వాళ్లు కూడా భగవద్గీతను శ్రద్ధగా చదువుతారు, వింటారు. కాని వీరికి భగవంతుని మీద, ఆయన చెప్పిన గీత మీద నమ్మకం ఉండదు. గీతలో ఏమేమి అసందర్భాలు, తప్పులు, అవాచ్యాలు ఉన్నాయా అని వెదుకుతారు. ప్రతిదీ సందేహిస్తారు. విమర్శనాత్మక దృష్టితో చూస్తారు. గీతలో ఉన్న 700 శ్లోకాలు శ్రీకృష్ణుడు చెప్పలేదు. వీటిలో కొన్ని తరువాత కలిపారు అంటూ తమకు ఇష్టం లేని శ్లోకాలను తీసేసి కొత్త గీతను తయారు చేస్తారు. ఇంకా కొంత మంది గీతలో చెప్పిన విషయాలు అన్నిటికీ కారణాలు చూపించమంటారు. తుదకు గీత అంతా ట్రాష్ అని కొట్టిపారేస్తారు. ఇటువంటి మనస్తత్వము కలవారికి కూడా గీతను చెప్పకూడదు.

మరి ఈ గీత ఎటువంటి వారికి చెప్పాలి అంటే గీతయందు, పరమాత్మయందు భక్తి, శ్రద్ధ కలిగి ఉండాలి. ఏ పని చేసినా ఒక తపస్సులాగా చేసేవారయి ఉండాలి. చేసే పని మీద ఏగాగ్రత కలిగి ఉండాలి. అన్నిటి కన్నా ముఖ్యంగా గీతను వినడంలో ఆసక్తి, అందులో ఏముందో తెలుసుకోవాలనే జిజ్ఞాస కలిగి ఉండాలి. ఇటువంటి వారికి గీతను బోధించవచ్చు. ఆడ, మగ, ధనిక, పేద, ఉన్నత కులము, నీచకులము, విద్యావంతులు, విద్యాగంధము లేని వారు, అనే తేడా

లేకుండా పై లక్షణములు ఉన్న వారికి గీతను బోధించాలి. అటువంటి వారు గీతను సరిగా అర్థం చేసుకోగలరు అని పరమాత్మ అభిప్రాయము. గీతను వినడానికి కావాల్సిన యోగ్యతలను, అటువంటి యోగ్యతలను ప్రతి వ్యక్తి పెంపొందించుకోవలసిన ఆవశ్యకతను, ఈ శ్లోకంలో చక్కగా వివరించారు వ్యాసులవారు.

## 68. య ఇమం పరమం గుహ్యం మద్భక్తేష్వభిధాస్యతి।
## భక్తిం మయి పరాం కృత్వా మామేవైష్యత్యసంశయః॥

ఈ పరమ రహస్యమైన గీతా శాస్త్రమును ఎవరైతే ఇతరులకు చెబుతారో వారు నా యందు భక్తిని కలిగి ఉండాలి. గీత గురించి గానీ, పరమాత్మను గురించి గానీ, ఆత్మతత్వమును గురించి గానీ అతనికి ఎటువంటి సందేహములు ఉండకూడదు. అప్పుడే అతడు గీతను ఇతరులకు బోధించగలడు. గీతను ఇతరులకు బోధించిన దానికి ఫలితంగా అతడు నన్నే పొందగలడు. గీత మీద అవగాహన లేకుండా, పరమాత్మ ఎడల విశ్వాసం లేకుండా గీతను ఎవరూ ఇతరులకు బోధించలేరు. కాబట్టి గీతను వినేవాళ్లే కాదు, గీతను బోధించే వాళ్లు కూడా కొన్ని నియమములను కలిగి ఉండాలి.

పురాతన కాలం నుండి అనేక మంది గీతాచార్యులు గీతకు ఎన్నోభాష్యాలు రాసారు. వివరణలు రాసారు. వాఖ్యలు రాసారు. జ్ఞాన యజ్ఞముల పేరిట ఎంతో మందికి గీతను బోధిస్తున్నారు. అందరికి గీతతో పరిచయం కలిగిస్తున్నారు. 'మన గురించి చెబుతున్న శాస్త్రము..... గీత అనే పేరుతో ఒకటి ఉన్నది' అనే జ్ఞానాన్ని అందరికీ కలిగిస్తున్నారు. దీనిని జ్ఞాన యజ్ఞము, జ్ఞానదానముగా పరిగణించవచ్చు. గీతా జ్ఞానయజ్ఞములను, గీతా జ్ఞాన దానమును, గీతను ఒక తపస్సుగా భావించే వీరందరూ ఆ పరమాత్మకు అత్యంత ప్రియులు. అటువంటి గీతాచార్యులు ఎటువంటి సంశయము లేకుండా తుదకు పరమాత్మనే పొందగలరు. అంటే గీతా జ్ఞానమును ఇతరులకు పంచి పెడితే అతడికి మోక్షము లభిస్తుంది. ఇది వ్యాసుల వారు గీతాచార్యులకు ఇచ్చిన వాగ్దానం.

కాకపోతే, గీతను ఇతరులకు బోధించే ముందు, ఆ బోధించే వారికి గీతయందు, గీత చెప్పిన శ్రీకృష్ణుని యందు పరమమైన భక్తి కలిగి ఉండాలి. భక్తి లేని వాడు భక్తియోగాన్ని ఎలా బోధించగలడు. కాబట్టి గీతాచార్యులు అందరూ ముందు గీతను భక్తి, శ్రద్ధలతో చదివి, అర్థం చేసుకొని, మననం చేసి, ఆచరించి, తమ అనుభవాలను ఇతరులతో పంచుకోవాలి. వారి హృదయాలకు హత్తుకునేటట్టు చెప్పగలిగి ఉండాలి. అంతే కానీ కేవలం పెద్దవారు రాసిన భాష్యములను చదివి వినిపించడం గీతాబోధ కాదు. అటువంటి వారు చివరకు నన్నే పొందుతారు అని గీతాచార్యులవారు మనకు వాగ్దానం చేస్తున్నారు.

## 69. న చ తస్మాన్మనుష్యేషు కశ్చిన్మే ప్రియకృత్తమః।
## భవితా న చ మే తస్మా దన్య: ప్రియతరో భువి॥

గీతను ఇతరులకు భక్తితో బోధించే వారు మాత్రమే నాకు అత్యంత ప్రియులు, వారి కంటే నాకు ప్రియమును కూర్చువారు ఈ భూమి మీద మరొకరు లేరు అని భగవానుడు ఇక్కడ చెబుతున్నాడు. అంటే పరమాత్మ అనుగ్రహం పొందాలంటే, గీతను చదవడం గానీ, అధ్యనం చేయడం కానీ, అర్థం చేసుకొని బోధించడం కానీ చేయాలి. అప్పుడే మనకు ఆత్మజ్ఞానం కలుగుతుంది. ఆత్మజ్ఞానం కలిగితే మోక్షం వస్తుంది. అప్పుడే వారు పరమాత్మకు అత్యంత ప్రియులు అవుతారు. ఇంతకన్నా ప్రియులు ఈ భూలోకంలో ఇకముందుకూడా ఉండబోరు. అంటే ఏ పని చేసినా ఇంతకంటే ప్రియమైన పని మరొకటి లేదు అని అన్నాడు పరమాత్మ.

మానవులు పరమాత్మకు ప్రియమైన పూజలు, వ్రతాలు, యాగాలు, యజ్ఞాలు, దానాలు, ధర్మాలు,పుణ్యక్షేత్ర దర్శనాలు చేస్తుంటారు. వాటన్నిటితో పాటు, గీతను చదవడం, ఇతరులకు చెప్పడం ఉత్తమము. అటువంటి వారు నాకు ఇష్టులు అంటున్నాడు కృష్ణుడు. గీతా సారమును ఎవరికి వారు తమలోనే అట్టిపెట్టుకోకుండా ఇతరులకు కూడా పంచిపెట్టాలనీ అందరికీ ఆత్మజ్ఞానము గురించి తెలియజెప్పాలనీ కృష్ణుని అభిమతము. ఇటువంటి వారికన్నా నాకు అత్యంత ప్రియుడు భూలోకంలో ఇప్పుడేకాదు, భవిష్యత్తులో కూడా మరొకడు ఉండబోడు అని చెప్పాడు పరమాత్మ. వీటి అర్థం ఒకటే గీతను శ్రద్ధగా సరిగా చదివి, అర్థం చేసుకొన్నా, తాను అర్థం చేసుకున్న విషయాలను ఇతరులకు భోధించినా, అతడికి ఆత్మజ్ఞానం కలుగుతుంది. తాను వేరు శరీరం వేరు, తాను ఆత్మస్వరూపుడు అనేజ్ఞానం కలుగుతుంది. తద్వారా పునర్జన్మనుండి విముక్తి కలుగుతుంది. ఇదే గీతా సారము.

## 70. అధ్యేష్యతే చ య ఇమం ధర్మ్యం సంవాదమావయోః।
## జ్ఞానయజ్ఞేన తేనాహ మిష్టస్స్యామితి మే మతిః॥

ఎవరైతే మన ఇద్దరి మధ్య జరిగిన ఈ సంవాదమును శ్రద్ధతో అధ్యయనం చేస్తారో, దానినే జ్ఞాన యజ్ఞము అని అంటారు. ఈ జ్ఞాన యజ్ఞము చేత నేను ఆరాధింపబడతాను. ఇదే నా నిశ్చయము.

భగవంతుని ఆరాధించడం అనేక రకాలుగా జరుగుతూ ఉంటుంది. భగవంతుని భక్తి శ్రద్ధలతో ఆవాహన చేయడం, అలంకరించడం, పూజించడం, ఆరాధించడం, నివేదనలు అర్పించడం, ఊరేగింపులు చేయడం, దేవాలయాలు కట్టించడం, ఉత్సవాలు జరిపించడం (సగుణోపాసన) అనేకరకాలుగా చేస్తుంటారు. మరి కొంత మంది నిర్గుణోపాసన అంటే నిరాకారుడు నిర్గుణుడు అయిన పరమాత్మను శాస్త్రములు చదవడం, అర్థం చేసుకోవడం, ఆచరించడం, ధ్యానము చేయడం, తద్వారా ఆత్మజ్ఞానమును పొందడం, మొదలగు ప్రక్రియల ద్వారా ఆరాధిస్తుంటారు.

కాని ఈ కృష్ణార్జున సంవాదము ఉపనిషత్తుల సారము. యోగ శాస్త్రము. బ్రహ్మవిద్య. ఈ మూడు కలిపి చిలికి వడబోస్తే వచ్చిన సారము గీత. ఈ గీతను చదవడం, అధ్యయనం చేయడం ద్వారా జ్ఞానము సంపాదించవచ్చు దీనినే గీతా జ్ఞాన యజ్ఞము అని అంటారు. గీతా జ్ఞాన యజ్ఞము చేయడం, అంటే గీతను భక్తి శ్రద్ధలతో చదవడం, అధ్యయనం చేయడం, ఇతరులకు చెప్పడం ఇవి అన్నీ భగవతారాధనలలో అత్యుత్తమమైనవి. అదే నాకు చాలా ఇష్టమైనది అని కృష్ణుడు గట్టిగా నొక్కి చెప్పాడు. గీతను ఇతరులకు చెప్పేముందు అతడు బాగా అధ్యయనం చేయాలి. గీతా సారం తెలుసుకోవాలి. జీర్ణించుకోవాలి. అప్పుడే ఇతరులకు బోధించగలడు. గీతను ఇతరులకు చెప్పడమే భగవంతుని ఆరాధన. గీతను చదవడం, అర్థం చేసుకోవడం, ఇతరులకు చెప్పడం ఈ మూడు ప్రక్రియలు భగవంతుని పూజించడం ఆరాధించడంతో సమానము. దాని వలన తనకు తాను మేలు చేసుకుంటాడు ఇతరులకు మేలుచేసినవాడవుతాడు.

ఈ గీతా జ్ఞాన యజ్ఞములో జ్ఞానమే హెూమాగ్ని. గీతను బోధించేవాడు యాజ్ఞికుడు. గీతను వినేవాడు యజమాని. యజమానిలో ఉన్న అజ్ఞానమే ఆహుతులు. అతని అహంకారమే బలిపశువు. ఈ గీతాజ్ఞానయజ్ఞములో యజమానిలో పేరుకుపోయిన అజ్ఞానము అనే ఆహుతులను అగ్నిలో వేసి హుతం చేస్తున్నాడు. అహంకారము అనే పశువును బలి ఇస్తున్నాడు. ఆ యజ్ఞం చేయడం ద్వారా జ్ఞానము అనే ఫలాన్ని పొందుతున్నాడు. ఇదే గీతాజ్ఞానయజ్ఞము. గీతలో భక్తి,జ్ఞాన,వైరాగ్యాల గురించి ముఖ్యంగా చెప్పబడ్డాయి. గీతను చదివినా ఇతరులకు చెప్పినా ఈ మూడుగుణాలు కొంచెం కొంచెం అయినా వంటబడతాయి. ఇది ఎవరో చెప్పిన మాట కాదు. కృష్ణుడే ఇది నా నిశ్చయము అని ఉద్ఘాటించాడు. కాబట్టి గీతా పఠనం, గీతా బోధన పరమాత్మకు ఇష్టం అని మనకు తెలుస్తూ ఉంది.

## 71. శ్రద్ధావాననసూయశ్చ శృణుయాదపి యో నరః।
## సోఽపి ముక్తశ్శుభాన్ లోకా న్ప్రాప్నుయాత్పుణ్యకర్మణామ్॥

గీతను చదివిన వాడు, గీతను అధ్యయనం చేసిన వాడు, తాను బాగా అధ్యయనం చేసిన గీతను ఇతరులకు చెప్పివాడు పరమాత్మకు ఇష్టులు అన్నారు. కాని విన్నవారి సంగతి ఏమిటి అనే సందేహం వస్తుంది. వారి గురించి ఈ శ్లోకంలోచెప్పాడు కృష్ణుడు.

ఎవరైతే ఈ గీతాశాస్త్రమును శ్రద్ధాభక్తులతో గీతా శాస్త్రము మీద నమ్మకంతో, ఇతరుల మీద అసూయా ద్వేషములు లేకుండా వింటాడో అతడు పుణ్యములు చేసిన వారు ఏ లోకములను పొందుతారో, ఆ లోకములు పొందుతాడు. కానీ దానికీ ఒక అర్హత పెట్టాడు. గీతను వింటేనేచాలదు. గీత మీదా గీతలో చెప్పబడిన విషయాల మీదా నమ్మకం ఉండాలి. ఆ ఏదో చెప్పాడు ఏదో విన్నాము అనే విధంగా ఉండకూడదు. అన్నిటి కన్నా ముఖ్యమైనది నమ్మకం. నమ్మకం లేకపోతే ఈ శాస్త్రము సరిగా అర్థంకాదు. మనసుకుపట్టదు. కాబట్టి గీతమీద, గీతలో చెప్పబడిన విషయాల సంపూర్ణ నమ్మకం ఉంచి వినాలి. గీతను వినిన తరువాత అతడిలో ఉన్న అసూయాద్వేషాలు పోవాలి. అందుకే శ్రద్ధావాన్ అనసూయశ్చ అని వాడారు. శ్రద్ధతో వినాలి. విన్నదానికి ఫలితం ఇతరుల మీద అసూయాద్వేషాలు నశించాలి. అప్పుడే అతడు తాను చేసిన పాపముల నుండి విముక్తుడు అవుతాడు. పుణ్యలోకాలు పొందుతాడు. కాబట్టి ఊరికే వింటే ప్రయోజనం లేదు. శ్రద్ధతో వినాలి. విన్నదానికి ఫలితం మనలో ఉన్న అసూయాద్వేషాలు నశించాలి అనిపరమాత్మ అభిప్రాయము. నాకు చదువురాదు, గీతను చదవడంరాదు, చదివినా అర్థం కాదు అని ఎవరూ నిరుత్సాహపడనవసరం లేదు. గీతను శ్రద్ధతో వింటే చాలు. అసూయాద్వేషాలను మనసులోనుండి పారదోలితే చాలు, వారి పాపాలు నశించి, వారికికూడా పుణ్యలోకాలు వస్తాయి అని అన్నాడు పరమాత్మ.

## 72. కచ్చిదేతచ్ఛ్రుతం పార్థ! త్వయైకాగ్రేణ చేతసా।
## కచ్చిదజ్ఞానసమ్మోహః ప్రణష్టస్తే ధనఞ్జయ॥

ఇప్పటి దాకా అర్జునుడికి గీతను బోధించిన కృష్ణుడు ఈ కింది ప్రశ్న వేసాడు. ఓ అర్జునా! ఇప్పటి దాకా నేను చెప్పింది ఏకాగ్రమైన మనసుతో విన్నావు కదా! ఏమైనా అర్థం అయిందా! ఒంటబట్టిందా! మొట్ట మొదట నీలో పుట్టిన నీ అజ్ఞానము నశించిందా! నేను అందరినీ చంపుతున్నాను అన్న మోహం పోయిందా! నీ భ్రమలు అన్నీ తొలగి పోయాయా! అని అడిగాడు.

ఏకాగ్రచిత్తంతో విన్నావా అని అడగడంలో పరమాత్మ ఉద్దేశం, తరువాతి తరాల వారు ఈ గీతను వినేటప్పుడు ఏకాగ్రచిత్తంతో వినాలి. మనసు ఎక్కడో పెట్టుకొని శరీరం గీతాప్రవచనం జరిగే చోట ఉంచకూడదు. ఆ మాటకొస్తే గీతాప్రవచనమే కాదు ఏ పని చేసినా, పూజ, వ్రతము చేసినా ఏకాగ్రచిత్తంలో చేయాలి అనే విషయాన్ని అర్జునుడిని అడగడం ద్వారా మనకు తెలియజేస్తున్నాడు. ఏపని చేసినా ఏకాగ్రచిత్తంతో, మనసు పెట్టి చేయాలి కానీ అన్యమనస్కంగా చేయకూడదు. ధ్యానం చేసేటప్పుడు కానీ, వినేటప్పుడు కానీ, చదివేటప్పుడు కానీ, దేని గురించైనా విచారణ చేసేటప్పుడు కానీ, మనస్సు నిలిపి చేయాలి. ఏకాగ్ర చిత్తంతో చేయాలి. చంచల మైన మనస్సు ఉండకూడదు. కొంత మంది ఉపన్యాసాలకు వస్తారు. నిద్రపోతుంటారు. అందుకే హరికథలలో మధ్య మధ్యలో హరినామస్మరణ చేయిస్తుంటారు. చిత్తం ఏకాగ్రంగా, నిలకడగా ఉంటే చదివేది, విన్నది అర్థం అవుతుంది. చక్కని నిర్ణయాలు తీసుకోగలము. దాని వలన జ్ఞానం కలుగుతుంది. అజ్ఞానం నశిస్తుంది.

మనం గీతను చదవడం, వినడం, అధ్యయనం చేయడం, పూజలు, వ్రతాలు చేయడం అన్నీ కూడా మన లోపల ఉన్న అజ్ఞానాన్ని నాశనం చేసుకోడానికే. ప్రవృతి మార్గంలో నుండి నివృతి మార్గంలోకి మళ్లడానికే. అదే ఇక్కడ అన్నాడు కృష్ణుడు. ఈ గీతా శాస్త్రము విన్న తరువాత నీలోని అజ్ఞానము మోహము భ్రమలు నశించాయా అని అడిగాడు. గీతను విన్నదానికి, చదివినదానికీ, పూజలు, వ్రతాలు చేసినదానికి ఫలితం మనలో ఉన్న అజ్ఞానం కొంచెం అయినా నశించాలి. భ్రమలు కొన్ని అయినా తొలగి పోవాలి. వాస్తవాలు తెలియాలి. అది లేకపోతే కేవలం ఆ చెవితో విని ఈ చెవితో వదిలేసినట్టు అవుతుంది.

ఈ శ్లోకంలో అర్జునుడిని సంబోధనకూడా దానికి తగ్గట్టుగానే ఉంది. ధనంజయ అంటే రాజసూయయాగములో అందరి రాజులను జయించి ధనరాసులను సంపాదించాడు. అలాగే ఇప్పుడు కూడా నీ లో ఉన్న కామ క్రోధములను, మోహమును జయించి, జ్ఞానము అనే ధనమును సంపాదించావా అని అడిగాడు కృష్ణుడు.

## అర్జున ఉవాచ:

## 73. నష్టోమోహ: స్మృతిర్లబ్ధా త్వత్ప్రసాదాన్మయా2చ్యుత!
## స్థితో2స్తి గతసన్దేహ: కరిష్యే వచనం తవ॥

అచ్యుతా! నీ అనుగ్రహము వలన నా లోని మోహము నశించినది. నాకు స్మృతి కలిగినది. నాలోని సందేహములు అన్నీ తొలగి పోయాయి. నీవు ఏం చెబితే అది చేస్తాను.

కృష్ణుడు అడిగిన ప్రశ్నకు అర్జునుడు ముచ్చటగా మూడు ముక్కలలో సమాధానం చెప్పాడు. అర్జునుడి సమాధానం "నష్టో" అనే క్రియా పదంతో మొదలయింది. హనుమంతుడు లంకలో సీతను చూచి వచ్చిన తరువాత రామునితో ఇదే విధంగా "చూచితి సీతను" అని "చూచితి" అనే క్రియా పదంతో మొదలు పెట్టాడు. అంటే తాను చేసిన కార్యాన్ని, పొందిన అనుభూతిని మొట్టమొదటి పదంలోనే స్పష్టం చేయడం. ఇక్కడ కూడా అర్జునుడు నష్టో అంటే నష్టం అయింది అని గట్టిగా అన్నాడు. తరువాత మోహ: అని అన్నాడు. అంటే నాలో ఉన్న మోహము, అజ్ఞానము పూర్తిగా నశించి పోయింది అని అర్థం. అంటే నాకు జ్ఞానోదయం అయింది. ఎలా అంటే వెలుగు రేఖలు రాగానే చీకటి దానంతట అదే పోతుంది. చీకటి అంటూ ప్రత్యేకంగా ఏమీ ఉండదు. వెలుగు లేకపోవడమే చీకటి. అంధకారము. మనం అందరం జ్ఞానస్వరూపులము, ఆనంద స్వరూపులము. కాకపోతే మనకు మనమే ఆ జ్ఞానానికి ఆనందానికి మసిపూసుకున్నాము.ఆ మసి తుడిచేసుకుంటే, జ్ఞానం ప్రకాశిస్తుంది. అదే మాట ఇక్కడ అన్నాడు అర్జునుడు. నాలోని అజ్ఞానం నశించింది అని అన్నాడు.

మరి ఆ అజ్ఞానం ఎలా నశించింది అనే దానికి సమాధానం పక్కనే అన్నాడు. "త్వత్ప్రసాదాన్మయా2చ్యుత" అంటే నీ అనుగ్రహం వలన నా అజ్ఞానము నశించింది అని అర్థం. మనలో ఉన్న అజ్ఞానం పోవడానికి భగవంతుని అనుగ్రహం తప్పక ఉండాలి. లోకాలను ఆవరించిన అంధకారం తొలగాలంటే సూర్యోదయం కావాలి. అలాగే మనలో ఉన్న అజ్ఞానం నశించాలంటే మనకు పరమాత్మ అనుగ్రహం ఉండాలి. అప్పుడు ఏమవుతుంది. సందేహాలు నశించి పోతాయి. ఎంత ఎక్కువ చదివితే అన్ని ఎక్కువ సందేహాలు వస్తాయి. ఏమీ చదువుకోని వాళ్లు పరమాత్మను గుడ్డిగా నమ్ముతారు. ఆయనకు ఆత్మార్పణం చేసుకుంటారు. దానికి ఉదాహరణ గోకులంలో గోపికలు. వారికి చదువురాదు. వారికి కృష్ణుడి గురించి ఎటువంటి సందేహములు లేవు. దానిని మూఢభక్తి అని అందరూ ఎగతాళి చేస్తారు. సందేహాలు కలిగిన జ్ఞానము కన్నా ఎటువంటి సందేహములు లేని మూఢభక్తి మేలు కదా! అందుకే అర్జునుడు నాలో ఉన్న సందేహాలు అన్నీ తొలగి పోయాయి అని గట్టిగా ఉద్ఘాటించాడు.

ఇంక ఆఖరుది. "కరిష్యే వచనం తవ." అంటే కృష్ణా! నీవు చెప్పినట్టు చేస్తాను అని అన్నాడు. అంటే సంపూర్ణ శరణాగతి. నీవే తప్ప నిత:పరం బెరుగ అనే స్థితి. మనం కూడా క్రమక్రమంగా ఆ స్థితికి చేరుకోవాలి. దానికి మూడు మెట్లు. ఒకటి మనలో ఉన్న అజ్ఞానం పోవాలి. రెండు మనలో ఉన్న సందేహాలను విడిచి పెట్టాలి. మూడు పరమాత్మను సంపూర్ణ శరణాగతి పొందాలి. ఈ మూడు ఆచరిస్తే మనకు అనంత మైన సుఖము శాంతి కలుగుతాయి. ఏ చింతా ఉండదు.

గీతను కేవలంవినడమే కాదు ఆచరించాలి అనుభవంలోకి తెచ్చుకోవాలి అని అంతర్లీనంగా చెప్పాడు వ్యాసుడు. కృష్ణుడు చెప్పాడు అర్జునుడు విన్నాడు అని కాకుండా వెంటనే ఫలితంకూడా ప్రకటించాడు. అంటే అర్జునుడు గీతను ఆచరణలో పెట్టాడు. తనలో అజ్ఞానం పోయిందన్నాడు. నీకు పూర్తిగా శరణాగతిఅన్నాడు.నీవు చెప్పినట్టు చేస్తాను అని అన్నాడు. మనం కూడా గీతను విన్న దానికి ఫలితం దానిని ఆచరణలో పెట్టాలి. అజ్ఞానం తొలగించుకోవాలి. పరమాత్మను ఏకాగ్రబుద్ధితో నమ్మాలి. కేవలం కోరికల కోసమే పరమాత్మను పూజించకూడదు. దేవుళ్లను మార్చకూడదు. దేవుళ్ల మధ్య భేదము చూపించకూడదు. ఇష్టదైవాన్ని నమ్మాలి. ఆయనకు శరణాగతి కావాలి. అప్పుడే సుఖము శాంతి లభిస్తాయి.

ఇంకొంచెం వివరంగా ఈ శ్లోకాన్ని అర్థం చేసుకుందాము.

"నష్టో మోహం స్మృతి ర్లబ్ధా" అంటే మోహం పోయింది. పూర్వజ్ఞానం వచ్చింది. అంటే మనకు స్వత: సిద్ధంగా జ్ఞానం ఉంది. అది మోహంతో మూసుకుపోయింది. సంసారము, ప్రాపంచిక విషయాలు, విషయ వాంఛలు అనే ఈ మోహం తొలగి పోతే మనలో ఉన్న అజ్ఞానము అనే చీకటి తొలగిపోతే, జ్ఞానజ్యోతి ప్రకాశిస్తుంది. ముందు మనం ఆ పని చేయాలి. మనలో ఉన్న అజ్ఞానాన్ని తొలగించుకోవాలి. మనసుకు పట్టిన మకిలను తుడిచేసుకోవాలి.

ఈసందర్భంలో జగద్గురు శంకరాచార్యులవారి ఆత్మబోధలోని శ్లోకం గుర్తుకు తెచ్చుకుందాము
ఆత్మా తు సతతం ప్రాప్తో హ్యప్రాప్తవదవిద్యయా
తన్నాశే ప్రాప్తవద్భాతి స్వకంఠా భరణం యథా
మనలో ఆత్మ ఎల్లప్పుడూ ఉంది. కాని మనలో ఉన్న అవిద్య వలన ఆత్మను గుర్తించలేకపోతున్నాము. శరీరమే నేను అనుకుంటున్నాము. శరీరమే నేను అనే అవిద్య తొలగిపోతే, మెడలో ఉన్న కంఠహారం కనపడినట్టు మనకు ఆత్మ సాక్షాత్కారం అవుతుంది.

కాబట్టి పరమాత్మ అన్ని జీవరాసులలో ఆత్మస్వరూపుడుగా ఉన్నాడు. కాని మనలో జన్మజన్మల నుండి పేరుకుపోయిన అజ్ఞానం వలన మనం ఆత్మను గుర్తించడం లేదు. గీత, గురువు మొదలగువారు ప్రసరించే వెలుగు సాయంతో అజ్ఞానం అనే అంధకారాన్ని తొలగించుకొని ఆత్మసాక్షాత్కారం చేసుకోవాలి. దానికి మనకు కావాల్సింది "త్వత్ప్రసాదాత్" గురువుల యొక్క, పరమాత్మ యొక్క అనుగ్రహం కావాలి. అజ్ఞానము అనే మాయను దాటడానికి గురువు చుక్కాని లాంటి వాడు. మనకు సరి అయిన దారి చూపిస్తాడు.(గురువు, శిక్షకుడు, టీచర్ వీటిని మనం ఒకే అర్థంలో వాడుతుంటాము. కాని వాటి అర్థాలు వేరు. గురువు అంటే తన శిష్యుడిని చీకటిలో నుండి వెలుగులోకి నడిపించేవాడు. జ్ఞానదాత. శిక్షకుడు అంటే కేవలం శిక్షణ ఇచ్చేవాడు. టీచర్ అంటే బోధించేవాడు. శిక్షకుడు, బోధకుడు కేవలం తమ పనులు తాము నిర్వర్తిస్తుంటారు. శిష్యుని

గురించి పట్టించుకోరు. కాని గురువు అలా కాదు. తన శిష్యుని వేలుపట్టుకొని చీకటిలో నుండి వెలుగులోకి నడిపిస్తాడు.)

శ్రీకృష్ణుడు సాక్షాత్తు పరమాత్మ స్వరూపుడు అయినా గర్గుడు, సాందీపుడు మొదలగు గురువుల వద్ద విద్య నేర్చుకున్నాడు. మనకు అంతా తెలుసు అనుకోవడం పొరపాటు. గురువును ఆశ్రయించి తెలియనివి తెలుసుకోవడం విజ్ఞుల లక్షణం. దాని వలన కలిగే లాభం "గతసందేహః" అంటే మనలో ఉన్న సందేహాలు తొలగి పోతాయి. మనలో కలిగే సందేహాలను తీర్చేసమర్థత ఉన్న వాడు గురువు ఒక్కడే. కాబట్టి సమర్థుడైన గురువును ఆశ్రయించడం ప్రతివాడి కర్తవ్యం.

ఆఖరు వాక్యం కరిష్యే వచనం తవ అంటే నీవు చెప్పినట్టు చేస్తాను. పరమాత్మ చెప్పినట్టు చేస్తాను. అని అర్థం. అంటే నేను చేస్తున్నాను, అంతా నా వల్లే జరుగుతూఉంది అనే అహంకారము, కర్తృత్వభావన వదిలిపెట్టి, శరణాగతి పొందడం. ఇదే మానవుని అంతిమ లక్ష్యం.

(ఇక్కడ ఒక్క విషయం మనం గుర్తుపెట్టుకోవాలి. అర్జునుడు గత సందేహః అని అన్నాడు. అంటే నా సందేహాలు, అనుమానాలు, అపోహలు అన్నీ తొలగి పోయాయి అని అర్థం. మహాత్మా గాంధీ గారు తనకు ఏ విషయంలో ఏసందేహం వచ్చినా నేను గీతను చదువుతాను. నా సందేహాలకు సమాధానం దొరుకుతుంది అని చెప్పారు. ఇది నేటి కాలానికి కూడా వర్తిస్తుంది అని ఇటీవల వచ్చిన హిందీ సినిమా ఓ మైగాడ్ అనే సినిమాలో నిరూపించారు. అందులో ఒకడు పరమాత్మ మీద నష్ట పరిహారం కొరకు దావా వేస్తాడు. దేవుడి వలననే అతనికి నష్టం జరిగింది అని నిరూపించమంటుంది కోర్టు. భగవద్గీతలో అతనికి సమాధానం దొరికింది. ఇది కేవలం వినోదానికి ఉపయోగించుకున్నా, మనకు ఈ నాడు కలిగే సందేహాలు అన్నిటికి కాకపోయినా కనీసం కొన్నింటికైనా గీతలో సమాధానాలు దొరుకుతాయి అని నిస్సందేహంగా చెప్పవచ్చు.)

ఇంతటితో కృష్ణార్జున సంవాదం పూర్తి అయింది. అమ్మయ్య తన పనిపూర్తి అయింది అని కృష్ణుడు రథం తోలడానికి నొగల మీద కూర్చున్నాడు. యుద్ధం చేయడానికి అర్జునుడు రథం మీద పెట్టిన గాండీవం చేతులోకి తీసుకున్నాడు. అమ్ముల పొది సరి చూసుకున్నాడు. యుద్ధానికి సన్నద్ధం అయ్యాడు. ఇంక వారి మధ్య మాటలు లేవు. ఇంక మాట్లాడాల్సింది సంజయుడు. ఇక్కడి నుండి తరువాతి ఐదుశ్లోకాలలో సంజయుడు తాను పొందిన అనుభవం, అనుభూతి ధృతరాష్ట్రుడితో చెబుతున్నాడు.

## సంజయ ఉవాచ:

## 74. ఇత్యహం వాసుదేవస్య పార్థస్య చ మహాత్మనః।
## సంవాదమిమమశ్రౌష మద్భుతం రోమహర్షణమ్॥

ఓ ధృతరాష్ట్ర మహారాజా! ఈ ప్రకారంగా నేను వాసుదేవుడు, పార్థుడు మధ్య జరిగిన, అద్భుతమైన, రోమాంచితమైన, సంభాషణములను విన్నాను.

ఒక్క సారి గుర్తుచేసుకోండి. వ్యాసుల వారు యుద్ధం జరుగబోతోంది అని తెలిసి తన కుమారుడు ధృతరాష్ట్రుని వద్దకు వచ్చాడు. యుద్ధం చూడాలని ఉందా అని అడిగాడు. ధృతరాష్ట్రుడు నవ్వి నేను పుట్టు గుడ్డిని, నా కుమారులనే గుర్తుపట్టలేను. కాబట్టి చూడటం వ్యర్థం అని అన్నాడు. అప్పుడు వ్యాసుడు సంజయునికి అద్భుత శక్తులు ప్రసాదించి, యుద్ధభూమికి పోయి, అక్కడ జరిగే విశేషములు అన్నీ స్వయంగా చూచి, అవన్నీ వివరంగా ధృతరాష్ట్రునికి చెప్పమన్నాడు. వ్యాసుని ఆదేశాల మేరకు సంజయుడు యుద్ధభూమికి వెళ్లాడు. యుద్ధ భూమిని పరికించాడు. కృష్ణార్జున సంవాదం కూడా విన్నాడు. అతని శరీరంపులకించి పోయింది. కృష్ణుడు చూపించిన విశ్వరూపం చూచి ఆశ్చర్యపోయాడు. అంతటి మహద్భాగ్యం తనకు కలిగించినందుకు వ్యాసులవారికి మనసులోనే ప్రణామాలు అర్పించాడు. తరువాత పది రోజుల యుద్ధం చూచాడు. భీష్ముల వారు అంపశయ్య మీద పడిపోవడం చూచాడు. వెంటనే ధృతరాష్ట్రుని వద్దకు వచ్చాడు. యుద్ధం మొదలు అయినప్పటి నుండి పదిరోజులు వరకు జరిగిన విషయాలు అన్నీ చెప్పాడు. ఆ చెప్పడంలో భాగంగానే భగవంతుడు అయిన కృష్ణుడు అర్జునుడికి చెప్పిన గీతను ధృతరాష్ట్రుడికి చెప్పాడు.

ఈ విధంగా మొట్ట మొదట కృష్ణుని ముఖతా గీతను అర్జునుడు, ఆయనతో పాటు సంజయుడు ఇద్దరూ విన్నారు. కాకపోతే అర్జునుడు అప్పుడప్పుడు ప్రశ్నలు వేసాడు. సంజయుడు శ్రోతగానే మిగిలిపోయాడు. మూడవ శ్రోత ధృతరాష్ట్రుడు. తరువాత సర్పయాగ సందర్భంగా వైశంపాయనుని ద్వారా, మహాభారత శ్రవణంలో భాగంగా, జనమేజయుడు మొదలగువారు విన్నారు. ఆఖరుగా నైమిశారణ్యంలో సత్రయాగ సందర్భంలో సూత పౌరాణికుని ద్వారా శౌనకుడు మొదలగు మహామనులు విన్నారు. ఆ విధంగా గీత ప్రపంచానికి అందుబాటులోకి వచ్చింది.

ఇక్కడ రెండు విశేషణాలు చెప్పాడు వ్యాసుడు. అద్భుతం, రోమహర్షణం. కృష్ణుని నోటి వెంట గీతా ప్రవాహాన్ని కంటుంటే, వింటుంటే, ఒక మహాద్భుతాన్ని చూస్తున్నట్టు, వింటున్నట్టు గోచరించింది. కొన్ని సన్నివేశాలలో వెంట్రుకలు నిక్కబొడుచుకున్నాయి అని అన్నాడు సంజయుడు. గీత అనేది ఒక అద్భుతమైన ఆశ్చర్యకరమైన సంవాదము. అద్భుతము అంటే భూత కాలంలో అంటే జరిగిపోయిన కాలంలో ఎప్పుడూ జరగనిది అంటే ఇదివరలో ఎక్కడా కని, విని, ఎరుగనిది అని

అర్థం. అంటే మన ప్రపంచ సాహిత్యములో ఇటువంటి సంభాషణా రూపమైన ఆధ్యాత్మిక జ్ఞానము ఎక్కడా లేదు. ఇది ప్రపంచ సాహిత్యవేత్తలు అందరూ ముక్తకంఠంతో ఒప్పుకున్న సత్యం. అందుకే గీతను ప్రపంచ భాషలు అన్నింటిలోనూ అనువదించారు. గీతలాంటి గ్రంధము నభూతో నభవిష్యతి. ఇటువంటి సంభాణ ఇదివరకు లేదు. ఇక ముందు ఉండబోదు అని అర్థము. ఇది వ్యాసుడు మానవాళికి అందించిన గొప్ప అమృతభాండము. ఎక్కువ ఆనందం కలిగినపుడు, ఎక్కువ భయం కలిగినపుడు, ఎక్కువ ఆశ్చర్యం కలిగినపుడు మనకు శరీరం మీద వెంట్రుకలు నిక్కపొడుచు కుంటాయి. అది అత్యంత సహజం. గీతలో కూడా ఆనందము, అద్భుతము, ఆశ్చర్యము, భయము కలిగించే విషయాలు ఉన్నాయి. ఉదాహరణకు విశ్వరూప సందర్శనయోగంలో అర్జునుడు భయపడ్డాడు. కాబట్టి మనం కూడా గీతను వింటుంటే మనకు కూడా ఒళ్లు గగుర్పొడవాలి. వెంట్రుకలు నిక్కపొడుచుకోవాలి. ఏకాగ్రతతో గీతను విన్నదానికి గుర్తు అదే.

## 75. వ్యాసప్రసాదాచ్ఛ్రుతవా నేతద్గుహ్యతమం పరమ్।<br>యోగం యోగేశ్వరాత్కృష్ణాత్సాక్షాత్కథయతస్స్వయమ్॥

ఇదంతా ఎలా జరిగింది అంటే “నేను చూచాను కాబట్టి నీకు చెప్పగలిగాను” అని సంజయుడు జబ్బలు చరుచుకోలేదు. వినయంగా ఇదంతా వ్యాసుల వారి ప్రసాదము, అనుగ్రహము. ఇదంతా వ్యాసమహర్షి దయవలన జరిగింది. అని వ్యాసుల వారికి సంజయుడు మనసులోనే ప్రణామాలు అర్పించాడు. వ్యాసుని అనుగ్రహంతో సంజయుడు అర్జునుడు, కృష్ణుడి మనసులలో దూరి, అత్యంత రహస్యమైన వారి సంభాషణను విన్నాడు. ఎందుకంటే సంజయుడు కృష్ణుడు అర్జునుడు మనసులలో మెదిలే భావాలు కూడా చెప్పగలిగాడు. కేవలం అర్జునుడు మనోనేత్రంతో దర్శించిన విశ్వరూపమును కూడా సంజయుడు వర్ణించగలిగాడు. ఇదంతా వ్యాసుని అనుగ్రహమే. పైగా ఈ యోగ శాస్త్రమును యుద్ధ రంగంలో, అర్జునుని రథం మీద, కృష్ణార్జునుల పక్కనే ఉండి గీత అనే యోగశాస్త్రమును విన్నాను అని అన్నాడు. ఇంతటి మహత్తరమైన సంభాషణను విన్న వాడు సంజయుడు ఒక్కడే. అందుకే మహాభారతంలో ఒక్క సంజయుడికే ఆ అదృష్టం లభించింది.

సంజయుడు కేవలం సారథి మాత్రమే. ధృతరాష్ట్రుడికి అంతరంగికుడు. భారతంలోఎటువంటి ప్రాధాన్యత లేని పాత్ర. ఎక్కడో తప్ప ఎక్కడా ప్రముఖంగా కనిపించదు. అటువంటి పాత్రకు కూడా విశిష్టత కల్పించిన ఘనత వ్యాసునిది. వ్యాసుని రచనా వైదుష్యం అంత గొప్పది. ఇక్కడ ఇంకొక విశేషం కూడా ఉంది. “సాక్షాత్ కృష్ణాత్ కథయత: స్వయం” అంటే సాక్షాత్తు కృష్ణుడు అర్జునుడితో చెప్పిన మాటలు నేను స్వయంగా విన్నాను. సంజయుడు తాను

ప్రత్యక్షంగా చూచినది విన్నది ధృతరాష్ట్రుడికి చెప్పాడు. ఇందులో కృష్ణుని మాటలు అర్జునుని మాటలు యథాతథంగా ఉన్నాయి. ఎటువంటి కల్పనలు లేవు. ఇది ప్రత్యక్ష ప్రమాణము. సాక్షాత్తు పరమాత్మ అంశ అయిన కృష్ణుని వాక్కునుండి జాలువారిన అమృతధార గీత. ఆ గీత యథా తథంగా మనకు అందింది. ఆ కారణం చేతనే గీత ప్రపంచ వ్యాప్తంగా చదవబడుతూ ఉంది. ఆచరింపబడుతూ ఉంది.

## 76. రాజన్సంస్మృత్య సంస్మృత్య సంవాదమిమమద్భుతమ్।
## కేశవార్జునయోః పుణ్యం హృష్యామి చ ముహుర్ముహుః॥

ఓ ధృతరాష్ట్ర మహారాజా! అద్భుతము, పుణ్యప్రదము అయిన ఈ కృష్ణార్జున సంవాదమును మాటి మాటి కీ తలచుకుంటూ స్మరణకు తెచ్చుకుంటూ మహదానందాన్ని అనుభవిస్తున్నాను.

గీతను విన్న తరువాత సంజయుని మానసిక స్థితిని ఇక్కడ వివరిస్తున్నాడు వ్యాసుడు. పరమ అద్భుతము, అత్యంత పుణ్యప్రదము, ఇతరులకు లభ్యం కానిది అయిన ఆ కృష్ణార్జున సంవాదమును విన్న సంజయుడు, ఆ సంవాదమును మరలా మరలా తలచుకుంటూ పులకించి పోయాడు. అతని మనసంతా ఆనందంతో నిండి పోయింది. అర్జునుడితో పాటు సంజయుని లో ఉన్న అజ్ఞానం కూడా తొలగి పోయింది. అతనికి మనసు కూడా ఆత్మతో అనుసంధానం అయింది. అనిర్వచనీయమైన ఆనందానుభూతిని పొందగలిగాడు. ఏదో విన్నాములే అని మరిచిపోకుండా, మాటి మాటికీ తలచుకుంటూ, స్మృతిలోకి తెచ్చుకుంటూ ఆనందిస్తున్నాడు. పొంగిపోతున్నాడు. ఆ ఆనంద పారవశ్యంలో తేలిపోతున్నాడు.

గీతను విన్న మనకు కూడా అటువంటి అనుభూతి కలగాలి అని వ్యాసుని ఉద్దేశ్యము. ఇక్కడ సంస్మృత్య సంస్మృత్య అంటూ రెండు సార్లు చెప్పాడు. అంటే తాను విన్న గీతను మరలా మరలా మననం చేసుకుంటున్నాడు. మనం కూడా గీతను ఒక సారి విని వదిలేస్తే సరిపోదు దానిని నిరంతరం మననం చేసుకుంటూ ఉండాలి. ఏ రోజు చదివింది, విన్నది ఆ రోజు సాయంత్రం ఒంటరిగా ఏకాంతంగా కూర్చుని పునశ్చరణ చేసుకోవాలి. మననం చేసుకోవాలి. కనీసం ఒక్క శ్లోకమైనా ఆచరణలో పెట్టగలగాలి. దానికి నిరంతర స్మరణ, మననం ముఖ్యం. మాటి మాటి కీ స్మరించుకోవాలి. మనసుకు పట్టించుకోవాలి. ఆచరించడానికి ప్రయత్నించాలి. అదే వ్యాసుడు మనకు సంజయుని ద్వారా చేసిన బోధ. (ఈ ప్రక్రియ విద్యార్థులకు బాగా ఉపయోగపడుతుంది. క్లాసులో ఏరోజు చెప్పిన పాఠాలు ఆ రోజు సాయంత్రం చదివి, అర్థం చేసుకుంటూ మననం చేసుకుంటే, ఫస్టుక్లాసు ఖాయంగా వస్తుంది అనడం ఎలాంటి సందేహం లేదు.)

దీనికి మనం ఏమీ శ్రమ పడనవసరం లేదు. ఉదయమే నిద్రలేచి కాలకృత్యములు తీర్చుకొని గీతను చేతబట్టుకొని ఏదో ఒక పేజీ తీసి అందులో ఏదో ఒక శ్లోకమును చదివి అర్థం చేసుకొని ఆరోజు దానిని మనకు శక్తి ఉంటే ఆచరణలో పెట్టడానికి ప్రయత్నం చేయాలి. దీని కంతా పదినిముషాలు పడుతుంది. 24 గంటలలో పది నిమిషాలు మనం వెచ్చించగలిగితే జీవితంలో మనశ్శాంతి లభిస్తుంది.సుఖంగా ఉంటుంది అనడంలో సందేహము లేదు.

## 77. తచ్చ సంస్మృత్య సంస్మృత్య రూపమత్యద్భుతం హరేః।
## విస్మయో మే మహాన్ రాజన్! హృష్యామి చ పునః పునః॥

ఓ ధృతరాష్ట్ర మహారాజా! నేను విన్న కృష్ణార్జున సంవాదంలో అత్యంత ముఖ్యమైనది విశ్వరూప సందర్శనము. అది ఒక అద్భుతమైన అనుభూతి. ఆ సన్నివేశాన్ని మరలా మరలా తలచుకుంటూ, తలచిందే మరలా తలచుకుంటూ, ఆశ్చర్యానుభూతికి, విస్మయానికి, సంతోషానికి లోనవుతున్నాను.

గీత అంతా ఒకటి. అందులో విశ్వరూప సందర్శనము పరమాద్భుతము. అద్భుతములో పరమాద్భుతము అని అంటున్నాడు సంజయుడు కళ్లు మూసినా తెరిచినా అదే స్మరణకు వస్తూంది అంటున్నాడు సంజయుడు. తలచితలచి పులకాంకితుడు అవుతున్నాడు. సంజయుని మనసంతా నిర్మలంగా ఉంది. అందుకే ఆనందంతో నిండి పోయింది. దివ్యమైన అనుభూతితో శరీరం ఆనందంలో ఓలలాడింది. ఇలా ఉంటుంది అని చెప్పలేని ఆనందం అది. పునః పునః హృష్యామిచ అంటే మరలా మరలా తలచుకొని తలచుకొని ఆనందం పొందుతున్నాను అని సంజయుడు చెబుతున్నాడు.

మనం అందరం కూడా విశ్వరూపాన్ని దర్శించాము. మనకూ ఆ ఆనందం కలగాలి. కలగడం లేదూ అంటే మనం గీతను మనసారా ఆస్వాదించలేదు అని అర్థం. అందుకే గీతను ఒకసారి వింటే చాలదు మరలా మరలా వినాలి. చదవాలి. అధ్యయనం చేయాలి. ఆవిషయమే సంజయుడు ధృతరాష్ట్రుడికి చెప్పాడు. సంజయుడికి కలిగిన ఆత్మానుభూతి సంజయుని ముఖతా గీతను విన్న ధృతరాష్ట్రుడికి కలగలేదు. ఎందుకు అంటే సంజయుని మనసు నిర్మలంగా, నిష్కల్మషంగా ఉంది కాని ధృతరాష్ట్రుడికి సంసార బంధనములు, పుత్రవ్యామోహము, విపరీతమైన రాజ్యకాంక్ష, అతని మనసును కలుషితం చేసాయి. అవి ఓ పట్టాన పోవడం లేదు. అందుకే సంజయునికి కలిగిన అనుభూతి ధృతరాష్ట్రునికి కలగలేదు. కలిగి ఉంటే వ్యాసుడు చెప్పిఉండేవాడు.

## 78. యత్రయోగేశ్వర: కృష్ణో యత్ర పార్థో ధనుర్ధర:।
## తత్ర శ్రీర్విజయో భూతి ర్ధ్రువా నీతిర్మతిర్మమ॥

ఎక్కడ యోగేశ్వరుడైన కృష్ణుడు, ఎక్కడ ధనుర్ధారి అయిన అర్జునుడు ఉంటారో, అక్కడ విజయము, శ్రేయస్సు, సంపదలు, ఐశ్వర్యము, వాటితో పాటు ధర్మము, నీతి, ధృఢంగా, స్థిరంగా ఉంటాయని నా అభిప్రాయము అని సంజయుడు ధృతరాష్ట్రునితో చెప్పాడు.

దీని అర్థం, కృష్ణార్జునులు పాండవుల పక్షంలో ఉన్నారు, ఆ కారణం చేత పాండవులు ఈ యుద్ధంలో విజయం సాధిస్తారు. వారికి రాజ్యము, రాజ్యసంపదలు, శ్రేయస్సు కలుగుతాయి. వారి వెంటనే ధర్మము, నీతి ఉంటాయి. ఇది నా అభిప్రాయము అని సంజయుడు యుద్ధపరాణామాలను ముందే ఊహించి చెప్పాడు. దీనికి బాహ్యమైన కారణం కూడా ఉంది. కౌరవ పక్షాన వారికి వెన్నుదన్ను అయిన భీష్ములవారు పది రోజుల యుద్ధం చేసి పడి పోయారు. దానితో పాండవులు సగం విజయం సాధించినట్టు. మిగిలిన సగం విజయం పాండవుల స్వంతం అవుతుంది ఎందుకంటే ధర్మం, యోగేశ్వరుడు అయిన కృష్ణుడు, ధనుర్ధారి అయిన అర్జునుడు వారి పక్షాన ఉన్నారు. నీ కొడుకులు ఈ యుద్ధంలో గెలుస్తారు అన్నది ఒట్టి మాట. ఇంత వరకు నీవు నీ కుమారుడు సుయోధనుడు యుద్ధంలో గెలుస్తాడు. రాజ్యాధికారం పొందుతాడు. చక్రవర్తి అవుతాడు అనే అపోహలో ఉన్నావు. అది నిజం కాదు. అలా ఎన్నటికీ జరగదు. నీ కుమారులు అధర్మపరులు కాబట్టి ఈ యుద్ధంలో వారికి పరాజయము కలగక తప్పదు. ధర్మరాజు చక్రవర్తి కావడం తథ్యం. ఇదీ సంజయుల వారి ఆఖరి మాటలు.

ఇది గీతలో ఆఖరు శ్లోకము అద్భుతమైన శ్లోకము. అర్థవంతమైన శ్లోకము. అర్జునుడు ధనుస్సు ధరించి ఉన్నాడు. కృష్ణుడు యోగేశ్వరుడు. యోగులకు ఈశ్వరుడు. యోగమును అభ్యసించిన వాడు. యోగమునే ఆయుధముగా కలవాడు. ధనుస్సుతో బయట ఉండే శత్రువులను నాశనం చేయవచ్చు. కాని యోగముతో అంత:శ్శత్రువులను చంపవచ్చు. ఆ ఆయుధము కృష్ణుని వద్ద ఉంది. బాహ్య శత్రువులను నాశనం చేసే ఆయుధం ధనుస్సు అయితే, అంత:శత్రువులను చంపే ఆయుధం యోగము. ఈ రెండు ఒకచోట ఉంటే కలిగే ఫలితం "తత్ర శ్రీ విజయోభూతి" అక్కడ విజయం, ఐశ్వర్యము, సంపద లభిస్తుంది. అంటే బాహ్యశత్రువులు, అంత: శత్రువులు నశిస్తే మోక్షము, పరమశాంతి అనే విజయం ఐశ్వర్యము లభిస్తుంది. కాబట్టి కృష్ణార్జునులు ఉన్న చోట బాహ్యవిజయము అంతర్విజయము తప్పకుండా లభిస్తాయి. అనంత ఐశ్వర్యములు లభిస్తాయి. పరమ శాంతి సుఖము లభిస్తాయి.

ఇక్కడ యత్ర యత్ర అని వాడారు. అంటే ఎక్కడైతే అని అర్థం. ఎక్కడ అనే దానికి సమాధానం సగుణారాధన పూజామందిరంలో పటం పెట్టుకోవడం వాటికి భక్తి శ్రద్ధలతో పూజాదికాలు నిర్వర్తించడం. బాహ్యంగా కృష్ణార్జునులను వారి ప్రతిమలను పూజిస్తుంటే ఆ ప్రదేశంలో పవిత్రత, శాంతి నెలకొంటాయి. వాటి తోపాటు, ప్రతి మానవుని మనస్సులో అర్జునుడు, కృష్ణుడు ప్రతిష్టింపబడాలి. ఎందుకంటే ఈ లోకంలో ప్రతి వాడికీ సంతోషం కావాలి, విజయం కావాలి. శాంతి కావాలి. ఇవన్నీ లభించాలంటే, ముందు మనలో ఉన్న దుర్మార్గపు ఆలోచనలు నశించాలి. మనలో ఉన్న అంత: శత్రువులు (కామ,క్రోధ, లోభ, మోహ, మద,మాత్సర్యాలు) నశిస్తే కానీ సాధ్యం కాదు. దానికి ఆయుధం కావాలి. లోపల ఉన్న శత్రువులను జయించాలంటే యోగము అనే అయుధం కావాలి. దానికి అధిపతి కృష్ణుడు. ఆయన యోగేశ్వరేశ్వరుడు. కృష్ణుడు ఎక్కడ ఉంటే అక్కడ ధర్మం ఉంటుంది. అర్జునుడు ఎక్కడ ఉంటాడో అక్కడ అధర్మం నాశనం అవుతుంది. కాబట్టి కృష్ణార్జునులు ఎక్కడ ఉంటే అక్కడ విజయం ఐశ్వర్యం, సుఖము, శాంతి లభిస్తుంది.

కృష్ణుడు జ్ఞాన యోగమునకు ప్రతీక అందుకే యోగేశ్వరుడు అని అన్నారు వ్యాసుల వారు. అర్జునుడు కర్మయోగానికి ప్రతీక. అందుకే ధనుర్ధర: అని అన్నారు. ముందు కర్మయోగము ఆచరించి, దాని ద్వారా జ్ఞానమును సంపాదించాలి. ఆత్మజ్ఞానము పొందాలి. దీని పరిణామము ధ్రువా నీతి అంటే నీతి ధృవంగా వర్ధిల్లుతుంది. పరమ శాంతి కలుగుతుంది. కాబట్టి అందరూ కృష్ణార్జునులను పూజాగృహములోనే కాదు, మనసులో కూడా నిలుపుకొని గీతను ప్రతి నిత్యమూ అధ్యయనం చేసి, స్మరించుకుంటూ, మననం చేసుకుంటూ ఆచరిస్తే, వారికి అనంత ఐశ్వర్యం, పరమశాంతి లభిస్తాయి అని గీతాసారము. దీనితో భగవద్గీత సంపూర్ణము.

శ్రీ మహాభారతం మధ్యలో ఆణిముత్యంలా భాసిల్లుతున్న,
ఉపనిషత్తుల సారమైన బ్రహ్మ విద్య, యోగశాస్త్రము,
శ్రీ కృష్ణార్జున సంవాద రూపంలో మనకు వ్యాసుల వారు అందించిన
భగవద్గీతలో, మోక్షసన్యాస యోగము అను పదునెనిమిదవ అధ్యాయము సంపూర్ణము.
ఇంతటితో భగవద్గీత సర్వం సంపూర్ణము.
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓంతత్సత్

శాంతి మంత్రము
ఓం సర్వేషాం స్వస్తిర్భవతు సర్వేషాం శాంతిర్భవతు
ఓం సర్వేషాం పూర్ణం భవతు సర్వేషాం మంగళం భవతు

సర్వేభవంతు సుఖిన: సర్వేసంతు నిరామయా:
సర్వేభద్రాణి పశ్యంతు మాకశ్చిత్ దు:ఖభాగ్భవేత్

ఓం అసతోమా సద్గమయ తమసోమా జ్యోతిర్గమయ
ఓం మృత్యోర్మా అమృతం గమయ.

ఓం పూర్ణమద: పూర్ణమిదం పూర్ణాత్ పూర్ణముదచ్యతే
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవా అవశిష్యతే

ఓం సహనావవతు సహనౌభునక్తు సహవీర్యం కరవావహై
తేజస్వినా వధీతమస్తు మా విద్విషావహై
ఓం శాన్తి: శాన్తి: శాన్తి:

శ్రీకృష్ణపరమాత్మ అనుగ్రహంతో నా చే నిర్వహించబడిన ఈ గీతాజ్ఞానయజ్ఞంలో
నిరంతరం నా వెంట ఉండి నన్ను నడిపించిన
భక్తిపేజెస్ అధినేత  శ్రీ కె.వి.రాఘవరావు గారికి
నా మన: పూర్వక ప్రణామాలు అర్పించుకుంటున్నాను.
మీ విధేయుడు
యం.వి.సుబ్రహ్మణ్యం.
ఓం తత్సత్ ఓం తత్సత్ ఓం తత్సత్.